చతుర్వేదాంతర్గత

# ఉపనిషత్ ఉద్యానవనము 4

(మంగళ శ్లోక - తాత్పర్య - అధ్యయన సమేతంగా)

సంపుటి-4 సామవేదాంతర్గత (7) అథర్వణవేదాంతర్గత (14)

- 21 ఉపనిషత్తులు -

చతుర్వేదాంతర్గత

# ఉపనిషత్ ఉద్యానవనము

(మంగళశ్లోక - తాత్పర్య - అధ్యయన సమేతంగా)

సంపుటి - 4 సామవేదాంతర్గత (7), అథర్వణవేదాంతర్గత (14)

- "21" ఉపనిషత్తులు -

అధ్యయన విద్యార్థి

**- యేలేశ్వరపు హనుమ రామకృష్ణ**


ప్రథమ ముద్రణ : **20-7-2017**

ప్రతులు : 1000

వెల : 500/-

పబ్లిషర్ మరియు ప్రతులకు

**శ్రీమతి యేలేశ్వరపు కనకదుర్గ**

D.No. 2/8, Siva Temple Street,
Kuchipudi - 521 136 Krishna Dist. A.P. India
Cell : 92479 25278 Land : 08671 - 251164

Cover Page Designedy By
**M/s. Aravinda Graphics,** Eluru
Cell : 98486 44882

***DTP & Printed By*** and ***also For copies***

**BRUNDAVANAM SAI KUMAR**
Hasitha Graphics & Printers
Rose Gardens, Eluru-1 W.G. Dist
Cell : 97042 75472

# నివేదన

మహామహోపాధ్యాయ **డా॥ సముద్రాల లక్ష్మణయ్య,** తిరుపతి

**“ఏదియును లేనిదేమి జన్మము? వేదాంత విద్యచే వివేకి గావలెను”** అని అన్నమాచార్యులవారు ఎలుగెత్తి గానం చేస్తూ ప్రబోధిస్తున్నారు. ఎనుబది నాల్గు లక్షల జీవరాసులలో మానవునిది శ్రేష్ఠతమమైన జన్మ. అట్టి జన్మను పశుపక్ష్యాదులవలె కేవలం ఆహార నిద్రాదులతో గడపి ప్రయోజనమేమి?

ఏమి చేస్తే మన జన్మ నిజంగా సార్థకమవుతుంది? – అన్న ప్రశ్నకు అన్నమయ్య జన్మ సార్థకం కావడానికి, **వేదాంత విద్యా వివేకాన్ని ఆర్జించాలి** అని సమాధానం చెబుతున్నారు. ఆ వివేకమొక్కటే మనుజ జన్మను ఫలవంతం చేస్తుంది. తెలియబడే సమస్తమునకు ఆవలగల **“తెలుసుకుంటూ ఉన్న వానిని”** గురించి చెప్పేదే **“వేదాంత విద్య”.**

‘వేదోఽఖిలో ధర్మమూలం’ అన్నట్లు సనాతన ధర్మానికి మూలం వేదమే. అది **కర్మ–ఉపాసనా–జ్ఞాన** కాండలని మూడు విభాగాలు కల్గి యున్నది. వేదముయొక్క చివరి భాగమే వేదాంతం (వేద + అంతం). అదే జ్ఞానకాండ. కర్మలు, ఉపాసనలు జ్ఞానంలోనే పర్యవసిస్తాయి. **‘జ్ఞానాదేవ చ కైవల్యం’** – అన్నట్లు మోక్షం జ్ఞానంతోనే సిద్ధిస్తుంది. వేదాంత భాగాలే ఉపనిషత్తులుగా ప్రసిద్ధి పొందాయి. ఆత్మ జ్ఞాన ప్రదాయకాలు ఈ ఉపనిషత్తులే.

సంసార బీజాన్ని నశింపజేయునదనీ, మోక్షాపేక్ష గలవారికి పరబ్రహ్మ ప్రాప్తిని కలిగించేదనీ, జన్మ జరా రోగాదులైన అనర్థాలను తొలగించునదనీ, పరమ శ్రేయస్సుకు నిధానమైనదనీ భాష్యకర్తలు **‘ఉపనిషత్’** పదాన్ని పలువిధాలుగా వివరించి యున్నారు.

ఉపనిషత్తులు బ్రహ్మవిద్యను బోధిస్తాయి. **“ఆత్మవిద్య, అధ్యాత్మవిద్య, పరావిద్య, ఉపనిషద్విద్య”** అని బ్రహ్మవిద్యను నానావిధాల వ్యవహరించడం కద్దు.

గీతలో భగవంతుడు **‘అధ్యాత్మవిద్య విద్యానాం’ – ‘విద్యలలో నేను అధ్యాత్మ విద్యను’** అని బ్రహ్మవిద్య తన స్వరూపమని పేర్కొన్నారు. కూటికొరకు కోటివిద్యలుండవచ్చు. కాని ఆత్మ జ్ఞాన ప్రాప్తి కొరకు ఉపనిషద్విద్య ఒక్కటే ఉన్నది.

**శ్లో॥ అన్య విద్యా పరిజ్ఞానం అల్పప్రాప్తికరం నృణామ్।**
**బ్రహ్మవిద్యా పరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరం భవేత్॥**

ఇతర విద్యలకు సంబంధించిన జ్ఞానం పరిమితమైన ప్రయోజనము మాత్రమే కల్గిస్తుంది. బ్రహ్మవిద్యా పరిజ్ఞానం బ్రహ్మ ప్రాప్తిని ప్రసాదిస్తుంది. మన పూర్వర్షులు బ్రహ్మ విద్యా సంప్రదాయకర్తలుగా ప్రశస్తి పొందారు. ప్రజలకు అందుబాటులో లేకుండాపోయిన బ్రహ్మవిద్యనే భగవంతుడు అర్జునునికి కురుక్షేత్రంలో భగవద్గీత రూపంలో బోధించారు. అందుకే గీత ఉపనిషత్సారంగా వినుతికెక్కింది.

బ్రహ్మ మన ఇంద్రియాలను బహిర్ముఖముగా సృష్టించారు. అందువల్ల మనం బాహ్య విషయాలను చూస్తామే కాని అంతర్ముఖంగా చూడము. కాని, **కశ్చిత్ ధీరః –** ధీరులైన ఏ కొందరో మహనీయులు అంతర్ముఖులై, ఆత్మదర్శనం పొంది అమృతత్వ ప్రాప్తికి అర్హులవుతారు. జీవన్ముక్తులు వారే. మానవ జన్మకు ముఖ్య ప్రయోజనమదే.

“చంద్రలోకంలోనో, మరొక గ్రహాంతర్భాగాననో ఏమున్నది?” – అని శాస్త్రజ్ఞులు పరిశీలిస్తున్నారు. కాని, ఆమాత్రంచేత – అలా పరిశీలించే జీవుడెవరో తెలుసుకోరు. అలాంటి ఆత్మానాత్మ పరిజ్ఞానాన్ని ప్రసాదించేవి ఉపనిషత్తులే.

**“కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి”, –** అన్నట్లు – ఆత్మజ్ఞానం కలిగితే ఇతర విజ్ఞానాలన్నీ కరతలామలకాలవుతాయి. ఆ విజ్ఞానం ఉపనిషత్తుల ద్వారానే సాధ్యం.

మనిషికి అన్నింటికంటే ప్రియమైన వస్తువు ఎవరు? **తనకు తానే.** అదే ఆత్మ. “ఆత్మావారే ద్రష్టవ్యః శ్రోతవ్యః” ఇత్యాదిగా ఆత్మ దర్శన – శ్రవణ – మనన – నిదిధ్యాసనలు చేయాలని ఉపనిషత్తులు బోధిస్తున్నాయి. ఒకడు మరొకనితో ఇలా అన్నాడు – **“నిన్ను గూర్చి నేటి వార్తా పత్రికలో ఏదో వ్రాశారు?”** అది ఆ రెండవవాడు విన్నాడు. అంతే॥ ఆ పత్రికలో తన్ను గూర్చి ఏమి వ్రాశారో తెలుసుకొనే వరకూ విశ్రమించడు. వ్యక్తికి తన మీద గల ప్రేమ అలాంటిది మరి. ఉపనిషత్తులు జీవుని సహజమైన, నిజమైన స్వరూపాన్ని తెలిపే గ్రంథాలు. ఈ కారణంచేత వాటిపై మనిషికి మక్కువ ఎక్కువగా ఉంటుంది, ఉండాలి కూడా. అందువల్లనే పాశ్చాత్యులు కూడా అనేకులు ప్రపంచ సాహిత్యంలో సాటిలేని మేటి గ్రంథరాశిగా ఉపనిషత్తులను కొనియాడారు.

కాల క్రమంలో అనేక ఉపనిషత్తులు వేద శాఖలతో పాటు లుప్తమైపోయాయి. ముక్తికోపనిషత్తు 108 ఉపనిషత్తులను పేర్కొన్నది. ఆ 108 ఉపనిషత్తులు, ఇంకాకొన్ని ఆరణ్యకాలలోని ఉపనిషత్ పేరుగల పాఠ్యాంశాలు లభిస్తూ ఉన్నాయి. కానీ అవన్నీ చాలామందికి అందుబాటులో లేవు. అందులోను పది ఉపనిషత్తులు మిక్కిలి ప్రసిద్ధాలు. వాటికి మన త్రిమతాచార్యులు శంకర – రామనుజ – మధ్వులు భాష్యాలు వ్రాసి ఉన్నారు.

ఒక ప్రక్క భౌతిక విజ్ఞానం విస్తరిస్తున్నా కూడా మరొకప్రక్క నేడు ఆధ్యాత్మిక జ్ఞానంపై కూడా జనులకు ప్రీతి ఎక్కువ అవుతుండడం చూస్తున్నాము. మానవుడు సుఖం అపేక్షిస్తాడు. 'అశాంతస్య కుతస్సుఖమ్'? – అని గీతాచార్యులన్నట్లు శాంతిలేని వానికి సుఖమెక్కడిది? శాంతి కలగాలంటే ఉపనిషత్తులు ప్రతిపాదించిన యోగ–భక్తి జ్ఞాన సాధనలను అనుష్ఠించాలి. ఇందుకై అందరికీ ఉపనిషద్విజ్ఞానం అవసరమైయున్నది.

ఆత్మ స్వరూప నిరూపణకు ఉపనిషత్తులు మనోరంజకమైన కథలను సాధనంగా పరిగ్రహించాయి. కఠోపనిషత్తులో నచికేతుని కథ పరమ రమణీయంగా చిత్రింపబడింది. అట్టి కథలనెన్నింటినో ఉపనిషత్సారస్వతంలో చూడవచ్చు.

-----

ఇక ప్రస్తుత గ్రంథాన్ని గురించి నాలుగు మాటలు. శ్రీ యేలేశ్వరపు హనుమ రామకృష్ణ గారు రూపొందించిన ఈ చతుర్వేదాంతర్గత – **"ఉపనిషత్–ఉద్యానవనం"** అన్న గ్రంథంలో నాలుగు వేదాలకు చెందిన 108 ఉపనిషత్తులు మంగళశ్లోకములన్నీ తాత్పర్యములు (మరియు) విస్తృతమైన వివరణతో సమకూర్చబడి ఉన్నాయి. ఇప్పటివరకు (వర్తమాన 4వ సంపుటముతో సహా) నాలుగు బృహత్సంపుటాలుగా 89 ఉపనిషత్తులు పుస్తకరూపంగా వచ్చినాయి. **మొదటి సంపుటములో** ఋగ్వేదమునకు చెందిన 10, శుక్ల యజుర్వేదమునకు చెందిన (19లో) 18 ఉపనిషత్తులు, **రెండవ సంపుటములో** కృష్ణ యజుర్వేదములోని 22 ఉపనిషత్తులు, **మూడవ సంపుటములో** కృష్ణ యజుర్వేదములోని 10 ఉపనిషత్తులు, సామవేదములోని 8 ఉపనిషత్తులు, **నాలుగవ సంపుటములో** సామవేదములో '7' ఉపనిషత్తులు, అథర్వణవేదములోని 14 ఉపనిషత్తులు సంగ్రథనం చేయబడి, అనుస్యూతముగా ఒకచోట కూర్పబడి అందించబడుచున్నాయి. 108 ఉపనిషత్తులే కాకుండా యజుర్వేద ఆరణ్యక విభాగంలోని 'నారాయణ యాజ్ఞీక ఖిలోపనిషత్తు'ను రెండవ సంపుటి – ప్రారంభంలో శ్లోక తాత్పర్యాలు అందించారు.

*ఐదవ సంపుటములో బృహదారణ్యకముతోబాటు సామవేదములోని '6' ఉపనిషత్తులు, ఆరవ సంపుటములో ఛాందోగ్యోపనిషత్‌తోపాటు మిగిలిన 11 ఉపనిషత్తులు తేబోతున్నట్లు వ్యాఖ్యాత తెలియజేస్తున్నారు.*

మూల **గ్రంథం**, దానికి **తాత్పర్యం**, ఆపైన **అధ్యయనపూర్వకమైన వివరణ** వారి ఉపనిషత్ ఉద్యానవములో ఇస్తూ ఉన్నారు. **అతి విపులంగా కొనసాగిన ఈ రచన శ్రీ రామకృష్ణ గారి జ్ఞానదీక్షకూ, ధర్మనిష్ఠకూ, ధార్మిక సాహిత్య సేవకూ చక్కని నిదర్శనమై యున్నది.**

శ్రీ రామకృష్ణగారు జన్మతః ఆధ్యాత్మిక సంస్కార సంపన్నులు. వారు శ్రీ మలయాళస్వామి వారి శిష్యులు. శ్రీ విద్యా ప్రకాశానంద స్వామి వారిని తమ ఆధ్యాత్మిక గురువుగా గ్రహించారు. ఆ స్వామి ప్రచారం చేసిన 'యోగవాసిష్ఠ గ్రంథమును' **'వసిష్ఠరామ సంవాదం'** అన్న పేరుతో సమగ్రంగా, సరళ సుందరంగా సవివరణపూర్వకంగా నాలుగు సంపుటాలుగా అనువదించారు. ఇప్పుడా గ్రంథం శ్రీ రామకృష్ణ మఠం, Domalaguda, Hyderabad - 500027 వారి ప్రచురణలలో ఒకటిగా ప్రచారం పొందుచున్నది.

ఇప్పుడు 108 ఉపనిషత్తులను ఎడతెగని దీక్ష బూని వివరించి జిజ్ఞాసువులైన పాఠకులకు మహోపకారం కావిస్తున్నారు–అనునది నా నిశ్చితాభిప్రాయం. ఎందుకంటే వైదిక సంస్కృతంలో ఉన్న ఉపనిషత్తులు ప్రాంతీయభాషలలో తగిన వ్యాఖ్య లేకుంటే సామాన్య ప్రజానీకానికి అందుబాటులోకి రావు. వాటిని తగు వివరణ ద్వారా ఆంధ్ర పాఠకులకు చేరువగా తెచ్చిన శ్రీ హనుమ రామకృష్ణగారు వందనీయులు. ఎంతగానో అభినందనీయులు. వారు ధన్యులు.

**'కశ్చిద్ధీరః'** అన్నట్లు ఏ ఒకానొక ధీరునికో తప్ప ఈ మహోద్యమానికి పూనుకొని కృతకృత్యుడు కావడం సాధారణులకు సాధ్యం కాదు. **'ఉద్యోగినం పురుష సింహముపైతి లక్ష్మీః'** అన్నట్లు సతత ప్రయత్నశీలురైన శ్రీ రామకృష్ణ గారు విజయలక్ష్మీ కృపా కటాక్షములకు పాత్రులయ్యారు. శ్రోతకు తన ఆత్మోన్నత్యము ఉపనిషత్‌వాణి పూర్వకంగా గుర్తుచేయటంలో సఫలీకృతులగుచున్నారు.

విద్యా సంస్థలూ, గ్రంథాలయాలూ, జిజ్ఞాసువులు ఈ సంపుటాలను శ్రద్ధతో పఠించి ఆత్మ విజ్ఞాన సంపన్నులు కాగలరని ఆశిస్తున్నాను. శ్రీ రామకృష్ణ గారిని అనుగ్రహించవలసినదిగా ఏడుకొండలస్వామి వారిని మనసారా వేడుకొంటున్నాను.

**– సముద్రాల లక్ష్మణయ్య**

## చతుర్వేదాంతర్గత

# ఉపనిషత్ ఉద్యానవనము

## 4వ సంపుటి

## ముందుగా మనవి

**సామవేదాంతర్గత:** మైత్రేయ, మైత్రేయణ్యు, యోగచూడామణి, వజ్రసూచిక, రుద్రాక్ష జాబాల, సన్న్యాస, సావిత్ర్యుపనిషత్తులు (7).

**అథర్వణవేదాంతర్గత :** అథర్వశిఖ, అథర్వశిర, అన్నపూర్ణ, ఆత్మ, కృష్ణ, గోపాలతాపినీ, గణపతి, గరుడ, దత్తాత్రేయ, దేవి, పరబ్రహ్మ, మాండుక్య, ముండక – ఉపనిషత్తులు (14).

**ఉప** – దగ్గిరగా తీసుకొనిపోయి, **నిషత్** – చూచుకో – అని చెప్పుచూ **కూర్చోబెట్టేవి.**

> స్వస్వరూపమును ఏమరచి, జాగ్రత్ స్వప్నములలో సంచారములు చేస్తూ, **"ఇవి స్వయం కల్పిత మాత్రములే"** – అనునది ఏమరచినట్టి మనలను **"అమృత-అఖండ-నిత్య"** సత్యమగు **స్వస్వరూపానందము**నకు దగ్గరగాజేర్చి **చూపించేవి.**

మనిషి – శ్రేష్ఠమైన మనీషము (బుద్ధి)గల జీవి. మనకు భౌతికంగా కనిపించే జీవజాతులన్నిటిలో, (మనకు తెలిసినంత వరకు) – మనిషి అత్యధికమైన తెలివిగల జీవి. 'అ-క్ష' వరకు గల అక్షరములను నోరు-దవడ కదులుస్తూ 'వాయువు'ను ఉపయోగించి శబ్దము చేయగలడు. ఆ శబ్దీకరణము నుండి అనేక పలుకులు, అక్షరములు, మాటలు, భాషలు, లిపి, విస్తారమగు వాఙ్మయములు ఏర్పడుచున్నాయి.

మానవుడు అనేక ప్రకృతి రహస్యాలు కనిపెట్టి, వాటినన్నిటినీ తన జీవితమునకు సానుకూల్యముగా చేసుకుంటున్నాడు. తనకన్నా శారీరకంగా అధిక బలము కలిగిన – అల్ప బలము కలిగిన అనేక తదితర – జీవులను 'దాసోఽహమ్' చేసుకొని పెత్తనము చలాయిస్తూ ఉన్నాడు.

బుద్ధియొక్క సునిశితముచే నేలపైన, గాలిలోను, అనేక పరిశోధనలు చేస్తున్నాడు. గణిత, భౌతిక, రసాయనిక శాస్త్రములలో దినదినము పురోభివృద్ధి సాధిస్తున్నాడు. రేడియో, టి.వి., కంప్యూటర్, నెట్‌వర్క్ సిస్టమ్ – అనేక నూతన విశేషాలను కనిపెట్టి ఉపయోగించుకుంటున్నాడు. ఆకాశంలో నక్షత్ర మండలములను పరిశోధిస్తూ ఉన్నాడు. యాంత్రికంగా విశ్వ విశ్వాంతరాలలో ప్రయాణములు చేస్తున్నాడు. అణువులోను, పరమాణువులోను నిక్షిప్తమైన విశ్వశక్తులను పరిశీలించి, బయటకు తెస్తున్నాడు.

మరొకవైపు నుండి "ఈ జగత్తు ఏమిటి? ఇక్కడి చావు-పుట్టుకలు ఏవిధమైనవి? ఎవరు కారణం? ఈ ప్రకృతిలో ఏ ఏ సూక్ష్మతత్త్వాలు (Divine intelligence) ప్రవర్తిస్తున్నాయి?" – అని పరిశీలిస్తూనే ఉన్నాడు. **"దైవము"** అను ఒక అనిర్వచనీయమైన దివ్యశక్తి ఈ జగద్దృశ్య వ్యవహారములకు ఆధారముగా భావిస్తూ, ఉపాసిస్తూ ప్రయోజనములు పొందుచున్నాడు. బుద్ధిని మరింతగా సారించి అంతరంగ (మనస్సు-బుద్ధి-చిత్తము (ఇష్టము) – అహంకారము) – బహిరంగములకు (కనబడేవి, వినబడేవి) గల సంబంధమేమిటో పరిశీలించ నారంభించుచున్నాడు. మంచి-చెడు, న్యాయ-అన్యాయములు, ఉచితము-అనుచితములు మొదలైనవాటిని గుర్తించవలసిన అగత్యమును అంగీకరిస్తూ ఉన్నాడు.

ఎందరో ప్రవక్తలు. వారు జనావళికి మార్గదర్శకులై దైవమునకు, మానవునికి గల సంబంధముల విశ్లేషణములు. దైవము గురించిన వివిధములైన అర్చనలు. ప్రేమ, దానము, త్యాగము, భక్తి, జ్ఞానము, యోగము, కర్మయోగమువంటి అనేక శ్రేయములు.

కాల క్రమేణా అనేక మతములు. జన్మ-జీవన్-మరణ-పునర్జన్మ-జన్మరాహిత్యముల గురించిన అనేక వాద-ఉపవాదములు. అద్వైత-ద్వైత-విశిష్టాద్వైత సిద్ధాంతములు. ఇంతా జరుగుచున్నాకూడా, మరొకవైపు-హింస, స్వార్థము, దోచుకోవటము, మొదలైన దుర్వ్యసనములు కూడా ఉండినవై ఉంటున్నాయి.

మతములన్నీ మానవుని కొరకే ఉన్నాయి. అశాంతి, ప్రేమ, ఐకమత్యము, మొదలైన దైవీ సంపత్తిని ఎలుగెత్తి ప్రభోధిస్తున్నాయి. మానవుడు మతములకంటే మునుముందుగానే ఉన్నాడు. అయినప్పటికీ **"మా మతమే గొప్పది, మీది కాదు"** అంటూ వాదులాటలు. కీచులాటలు. మతముల పేరుతో పరస్పర ద్వేషములు. ఒకే మత ప్రవక్త చెప్పిన సిద్ధాంతములను రెండు-మూడు రీతులుగా విశ్లేషించుచూ, రెండు-మూడు ఉపమతములు. శైవము-వైష్ణవము, మహాయానము-హీనయానము, సున్నీ-సియాలు, కాథలిక్-ప్రొటెస్టెంట్లు - వంటి మతాంతర్గతమైన అనేక దర్శనములు. సైద్ధాంతీకంగా కాకుండా కేవలము వేరువేరు మత-మతాంతర్గత విభాగముల పేర్లతో సంఘర్షణలు. పరస్పరము తమ-ఉపమతముల పేరుతో హింసించుకోవటము. మా జాతి - మా కులము - మా దేశము - మా ప్రాంతము - మా భాషవారు - కానివారు - ఇటువంటి భావములతో మరల మరల సంఘర్షణలు. క్రొత్త క్రొత్త మతముల స్థాపన. మత సామరస్యము గుర్తు చేస్తూ మరల కొందరు అవతార పురుషులు, ప్రవక్తలు, బోధకులు (సాయిబాబా వంటి వారు) రావటము. బోధించటము. ఈవిధంగా మతమనో, దేశమనో, రాజ్యమనో - ఏదో ఒక పేరుతో శాంతి - హింసల మధ్యగా అనేక చారిత్రక సంఘటనలు.

ఇవన్నీ జరిగాయి. జరుగుచూనే ఉన్నాయి. బహుశః జరుగబోతూ ఉంటాయేమో కూడా! అయితే అందరూ కోరుకొనేది శాంతితో కూడిన ఆనందము.

- ఒక ప్రక్క ఈ మానవుని అనేక రోగముల బారి నుండి రక్షించే వైద్యశాస్త్రము.
- మరొక ప్రక్క మానవ వినాశనమునకు దారితీస్తూ, జాత్యహంకార ప్రదర్శనము కొరకై మారణాయుధములు.

గ్రీకు మొదలై అనేక నాగరికతల విప్లవములు. ప్రవృద్ధి. నశించి పోవటము (Raise and fall of many Civilizations).

***<u>ఇదంతా ఇట్లా ఉండగా,</u>***

వేల సంవత్సరముల కాలంగా **(1) "తెలుసుకోబడుచున్నదాని గురించి, (2) తెలుసుకొంటూ ఉన్నవాని గురించి"** ప్రపంచంలో అనేకచోట్ల గొప్ప గొప్ప అధ్యయనములు. గురు-శిష్య పరంపరలు. అవన్నీ **"వేదములు"** అను శబ్దముచే చెప్పబడటము. వ్యాస మహర్షి తన శిష్యుల సహాయముతో ప్రపంచములోని వేదములన్నీ తెచ్చి, సంస్కృత భాషలోనికి తెచ్చి (సంస్కరించి), విభాగించి-వేదవ్యాస మహర్షిగా లోక ప్రసిద్ధులు అయ్యారు.

తరతి శోకం ఆత్మవిత్। ఆత్మజ్ఞానమొక్కటే ప్రపంచశాంతి ప్రసాదించగల పరమ-ఔషధము. అది మనుష్యులందరికీ, జీవులందరికీ సంబంధించినది.

❖❖❖

మనము భౌతిక - రసాయనిక - యాంత్రిక - శారీరక శాస్త్రాలలో ఎంతో పురోభివృద్ధి గాంచుచున్నాము. అటువంటి వైజ్ఞానిక శాస్త్రములకు సంబంధించని, పారలౌకికమైన కొన్ని ముఖ్యమైన ప్రశ్నలు మానవుని అధ్యయనము కొరకై వచ్చి కూర్చునియే ఉంటున్నాయి. అధ్యయనము చేయబడి, గ్రంథస్తమైనాయి కూడా!

1. ఈ శరీరము నాకు రాకముందు నేను ఉన్నానా?
2. మనమంతా ఎక్కడినుండి వచ్చి ఇక్కడ ఈ భౌతిక శరీరములో ప్రవేశిస్తున్నాము?
3. 'జన్మ' అనగా ఏమి? 'మరణము' ఏవిధమైన సందర్భము?
4. మరణానంతరము ఎక్కడికి పోతున్నాము?
5. జన్మించటానికి ముందుగాను, మరణించిన తరువాత నేను ఉంటున్నానా? ఉంటే ఏ రూపంలో?
6. ఆలోచనలు, భావములు, అభిప్రాయములు, వివేకము, ఇష్టము - మొదలైనవి శరీరములో ఒకచోట ఏర్పడి, శరీరమునకు సంబంధించినవై, శరీరముతోనే నశిస్తున్నాయా? (లేక) శరీరానంతరం కొనసాగుచున్నాయా?

   శరీరి (One who is using the Body) కి అవన్నీ సంబంధించినవై, శరీరము నశించినా కూడా, సూక్ష్మరూపంగాను, కళాత్మకంగాను 'శరీరి'ని వెంటనంటి ఉంటున్నాయా? (Eg. A great cricketer's Batting art does not exist in the cricket Bat but exists in the Batsman's artistic wrist operation) else.

7. ఇప్పుడు పుట్టాము. పెరుగుచున్నాము. మంచిదే. మరణించిన తరువాత? మరల పుట్టుతామా? పునర్జన్మ ఉన్నదా? ఒకవేళ పునర్జన్మ లేకుంటే, ఈ జన్మ ఎట్లా వచ్చినట్లు?

8. పునర్జన్మ ఉంటే, మరల మానవుడుగానే పుట్టుతామా? (లేక) మనలో కొందరు జంతువుల జన్మలు, మరికొందరు ఇంతకన్నా ఉత్తమమైన జన్మలు కూడా ఎత్తుతారా? ఏఏ కారణములచేత? అసలు జన్మలు ఉన్నాయా? (లేక) మొదలే మన 'భ్రమ' మాత్రమేనా?

9. అట్టి ఉత్తరోత్తర జన్మలు నిర్ణయించేది ఎవరికివారే తామేనా? (లేక) దైవము-అనబడు మరొకరా? మంచి-చెడు కర్మలా? భావ ఉద్రేకములా? నవగ్రహములా? ఆత్మకు సంబంధించి జ్ఞాన అజ్ఞానములా? లేక మనస్సా?

10. "నేను" అనునది ఈ భౌతిక శరీరమునకు మాత్రమే ముడిపడి ఉన్నదా? (లేక) **"వాహకుడు - వాహనము** (Driver-Vehicle)**"** వలె - శరీరమునకు వేరుగా ఏర్పడినదై ఉన్నదా?

11. పుట్టకముందు 'నేను' అనేది ఉన్నదా? ఉంటే - ఆ 'నేను' ఎట్టిది? మెలకువగా ఉన్న 'నేను' ఎవరు? కల కంటూ ఉన్నప్పుడు 'నేను' ఎవరు? గాఢ నిద్రలో ఉన్నప్పుడు 'నేను' ఎవరు? దేహానంతరము 'నేను' ఎవరు? 'నేను' అనునది రూప రహితమా? రూప సహితమా? జగత్ సహితమా? జగత్ రహితమా? జగదతీతమా? జగత్ - అంతర్గతమా? అసలు 'నేను' అనునది ఉన్నదా? లేదా?

12. నాయొక్క వాస్తవ రూపము ఇక్కడి దేహ-దృశ్యములలో అంతర్గతమై, పరిమితమై ఉన్నదా? (లేక) వీటిచే పరిమితము కాకుండా వీటికి వేరై, **అపరిమితమై** ఉన్నదా?

13. జన్మించటానికి కారణమేమిటి? సందర్భాశయములకు వేరై, ముఖ్యాశయము మరొకటేదైనా ఉన్నదా? సందర్భాశయములకు - పరమ (ముఖ్య) ఆశయమునకు ఏమి సంబంధము? (What is the inter - relatedness between incidental objectives and that of Life objective? what is the LIfe - objective (or) main objective (or) main purpose of life?

14. ప్రతి జీవునికి 'మరణము' అనేది ఒకటి ఉన్నది. కనుక ఈ జగద్దృశ్యము మనకు, మనము ఈ జగద్దృశ్యమునకు శాశ్వతమైన సంబంధ-అనుబంధములు కలిగిలేమని అందరికీ తెలిసిన విషయమే. (It is merely an incidental context but not permanent relationship as such).

    అట్టి ఈ సందర్భము (మరియు) సంబంధము ప్రపంచమునకు చెందినదా? వ్యక్తిగతంగా మనకు చెందినదా? ఉభయములకు చెందినదా? ఈ మొత్తము ప్రహసనము కలలో వ్యవహారము వంటిదా? ఇక్కడ ఏది నిజము? ఏది కల్పన?

    మరణించిన తరువాత 'నేను'కు చెందిన ఏ ఏ విశేషములు రహితమౌతాయి? ఏఏ విశేషములు వెంటనంటియే ఉంటాయి? (సహితమౌతాయి?)

    - వాటిని విడదీసి చూడవలసిన అవసరమున్నదా?

    - దేహానంతరము నేను సుఖినై ఉండటానికి ఇప్పుడు చేయవలసినదేమిటి? తెలుసుకోవలసినది ఏమిటి? పాటించవలసినవి ఏవేవైనా ఉన్నాయా?

15. వర్తమానములోని ఆశయాలు, అభిరుచులు, అభిప్రాయములు, అవివేక-వివేకములు, ఆవేశములు - మొదలైనవన్నీ (మనో సంబంధమైనవన్నీ) మరణానంతరము 'లేనివే' అవుతాయా? (లేక) ఏదైనా సూక్ష్మరూపములలో ("సంస్కారములు", "వాసనలు" అని చెప్పునవిగా) శేషించి ఉండి, కొనసాగుతాయా? కొనసాగితే తిరిగి అవి ఎట్లా ప్రదర్శనమౌతాయి?

16. వర్తమానంలో అనుభవమగుచున్న సుఖ-దుఃఖములు (Happyness and Worry) దేహపతనానంతరము కొనసాగుతాయా? కొనసాగితే, ఏరూపంగా? ఎప్పటి వరకు? ఎంత వరకు?

17. "బంధము - ముక్తి - మోక్షము - కైవల్యము" అనబడేవన్నీ ఎవరికివారికే స్వయం కల్పితమా? (లేక) 'దైవము' అను తత్త్వము చేత బంధ - మోక్షములు నిర్ణయించబడి, - జీవుడిచే పొందబడుచున్నాయా? మోక్షము స్వకీయ ప్రయత్నమా? (లేక) గురు ఆశీర్వాదమా? (లేక) దైవ కృపయా? (లేక) వివేకమును తగినంతగా నిద్రలేపుట చేతనా?

18. ఇప్పటి రక్త సంబంధములు (బంధువులు) గురు – శిష్య, ప్రియ – అప్రియ, ఉచ్చ – నీచ భావావేశములు మరణానంతరము ఉంటున్నాయా? లేకుండా పోతున్నాయా? ఉంటే ఏ రూపము దాల్చుచున్నాయి? లేకుండాపోతూ ఉంటే ఎక్కడికి పోతున్నాయి? నేను స్వతంత్రుడనా? పారతంత్రుడనా! (At last, am I independent or dependent? Am I being ruled by some body else?). దీనికంతటికీ కర్త ఎవరు? భోక్త ఎవరు? ఎందుకు ఇదంతా?

| ఈఈ ప్రశ్నలు వాటికి సమాధానములు మనకు అవసరమా? అనవసరమా? |
|---|
| ఈ ప్రశ్నలకు సమాధానములు ఉన్నాయా? ఉంటే ఎట్లా లభిస్తాయి? |

పై విషయాలు వేదములోని కర్మ–ఉపాసన–జ్ఞాన విభాగములలో 'మూడవది' (చివరిది) అగు ఉపనిషత్తులచేత చర్చించబడి, విచారణగాను, (అనుభవముగా అవటానికి) యోగాభ్యాసములుగాను వివరించబడ్డాయి. అవియే బుద్ధ శంకర రామానుజ మధ్వ మొదలైన ఆచార్యులచే సిద్ధాంతీకరణ పూర్వకంగా ప్రవచించబడ్డాయి. రామయాణ భారత భాగవతాది గ్రంథములలో, ఇంకా వాఙ్మయముగా, అష్టావక్రగీత మొదలైన అనేక చోట్ల విస్తారముగాను, క్లుప్తముగాను చెప్పబడుచూనే ఉన్నాయి. భగవద్గీత ఉపనిషత్తుల సారమే – అని చెప్పబడుతోంది. అవన్నీ "వేదాంత శాస్త్రము", లేక "తత్త్వశాస్త్రము"గా ప్రసిద్ధమై విశదీకరించబడుచున్నాయి.

## చతుర్వేదములు

**'వేదము': శబ్దార్థము=** తెలియబడుచున్నదాని (That being known) గురించి – "తెలుసుకోవలసిన విధి–విధానము" (The way it should be knowes) – వేదము.

= **తెలియబడే దానినంతటినీ ఉపయోగించుకొని – "తెలుసుకొనుచున్న** వానిని (The kower) **గురించి"** తెలుసుకోవటము – వేదము. శాస్త్రీయ ప్రవచనము – వేదము.

= నన్ను గురించి నేను తెలుసుకోవలసినది వేదము. నాకు తెలియజేయునది – వేదము.

**వేదాంతుడు** = "తెలుసుకొనుదానికి **ఆవల గల** తెలుసుకుంటూ ఉన్నట్టి వాడు". తెలుసుకునేవాని గురించి తెలియజేసే శాస్త్రము – **వేదాంత శాస్త్రము.**

| **(1) ఋగ్వేదము** | **(2) యజుర్వేదము** | **(3) సామవేదము** | **(4) అథర్వణవేదము** |
|---|---|---|---|
| పరమాత్మ గురించిన తాత్త్విక వర్ణనం ప్రాధాన్యము గల ఋక్కులు కలిగి ఉన్నట్టిది.<br>ఋక్ – స్వానుభవముగు తత్త్వజ్ఞుల / ఋషుల 'ఆత్మ' గురించిన స్తుతుల – ప్రాధాన్యముగా కలిగి ఉన్నట్టిది. | యజ్ఞ యాగములకు సంబంధించి మంత్ర–తంత్ర విధానముల ప్రాధాన్యము కలిగినట్టిది. | పరమాత్మ గురించిన గానము ప్రాధాన్యముగా కలిగి ఉన్నట్టిది. | ప్రకృతి తత్త్వముల గురించిన విశేషములు ప్రాధాన్యముగా కలిగి ఉన్నట్టిది. |

**అన్నిటిలోను యజ్ఞ, యాగ, క్రతు – ఉపనిషత్ మొదలైన విశేషములు కూడా ఉండి ఉంటున్నాయి.**

## చతుర్వేదములలోని విభాగములు

| | |
|---|---|
| **(1) కర్మ విభాగము (భౌతిక)–(సంహిత)** | యజ్ఞ యాగ నియమ నిష్ఠ తపో వివరణలు కలిగినట్టిది. |
| **(2) ఉపాసనా విభాగము (మానసిక)–(బ్రాహ్మణములు)** | పరమాత్మ ప్రథమ పురుషగా అభివర్ణితము |
| **(3) జ్ఞాన విభాగము (బుద్ధితో ఎరుగవలసినది) –(ఉపనిషత్తులు)** | ఆత్మ గురించిన వివరణాత్మక బోధ.<br>పరమాత్మ ఉత్తమ–(సోఽహమ్) మధ్యమ–(తత్త్వమ్) పురుషలుగా అభివర్ణితము. **'నేను', నీవు అఖండమగు ఆత్మస్వరూపులమే–** అను పరమార్థమును నిరూపించునవి. |
| **(4) అరణ్యకములు** | బోధనా నిధి – విధాన ప్రాధాన్యములు. |

## ఉపనిషత్తులు

- వేదములలోని జ్ఞాన విభాగము.
- వేదాంతము – వేద విభాగములలో చివరిది. తత్త్వ విభాగము.
- **"నీవు అదే (తత్త్వమసి)"** అని చెప్పు విభాగము. పరమాత్మతో సామీప్యమునకు జేర్చునది కాబట్టి ఉపనిషత్తులు–అనబడుచున్నాయి.
- 108 ఉపనిషత్తులకుగాని, వేదమంత్రములకుగాని వాటికి 'రచయిత' పేరు ఎక్కడా ఉండవు. 'బోధించబడినవి' అనే అర్థంతో – 'శ్రుతులు' అనబడుచున్నాయి. **ఋషుల స్వానుభవములుగా (ఋతములుగా) అభివర్ణితములు.**

## భారతీయ తత్త్వ శాస్త్రము – శబ్దములు

తత్త్వ శాస్త్రములో (ఉపనిషత్ వాఙ్మయములు) వాడిన శబ్దాలు పురాణములలో వేరొక అర్థముతో వాడబడగా, అవి అట్టి అర్థముచే లౌకికమై ప్రసిద్ధికెక్కాయి. ఉపనిషత్తులలో వాడబడిన ఉద్దేశ్యము 'వేరు' అయి ఉండగా – అది ఏమరువబడుతోంది. అట్టి కొన్ని వేదాంతశాస్త్ర శబ్దాలు ఇక్కడ మనము గుర్తు చేసుకొంటున్నాము.

అంతర్యామి – బహిర్యామి
బంధము – మోక్షము
జన్మ – జన్మ రాహిత్యము
యజ్ఞము – యోగము – జ్ఞానము
పురుషుడు – స్త్రీ
తత్త్వము – బ్రహ్మము – పరబ్రహ్మము
జీవుడు – ఈశ్వరుడు
కేవలుడు – కైవల్యము
ఇహము – పరము,
మృతము – అమృతము
చాతుర్వర్ణ్యములు
చతుర్విధ ఆశ్రమములు

*ఈఈ శబ్దములన్నీ ఆయా ప్రత్యేకమైన అర్థముతో వేదాంత వాఙ్మయము (ఉపనిషత్తులు) ప్రయోగించబడ్డాయి.*

*వేరువేరు చోట్ల వేరు వేరు ఉద్దేశ్యములు, అర్థములు కలిగి ఉంటున్నాయి.*

*ఇవి వ్యష్ఠిగతంగాను, విశ్వాగతంగాను విశేషమైన అర్థములతో ఉపయోగించబడుచున్నాయి.*

ఇవన్నీ ఉపనిషత్తులలోను, పురాణములలోను ఏ ఏ అర్థముతో వాడబడుచున్నాయో, అది గమనించటము వేదాంత శాస్త్ర అధ్యయమునకు ముందుగా 'అవసరము'– అని అనిపిస్తూ ఉంటుంది. (ఇవన్నీ 'విరుక్తము' అను శాస్త్ర విభాగంలో విశదీకరించబడుచున్నాయి).

ఇక, ఉపనిషత్తులు – వాటిని అధ్యయన పూర్వకంగా చదువుచున్నవాని యొక్క నిత్యము, సత్యము, కేవలము, సర్వాతీతము అగు 'ఆత్మ' గురించి వివరిస్తున్నాయి. అంతేగాని, రచయిత గురించియో (లేక) ఒక వ్యక్తి గురించియో ప్రధానముగా చెప్పబడటము లేదు. అందుచేతనే కాబోలు, – ఉపనిషత్తులకు రచయితగా ఎవ్వరూ చెప్పబడటం లేదు.

- **"నీవే జాగ్రత్ స్వప్న సుషుప్తులకు ఆధారుడవై, వాటిని నీ మహిమగా కలిగి ఉన్నావు"** – అని గుర్తు చేస్తున్నాయి.
- **"నీవు వాటిపై ఆధారపడి లేవు. అవి నీ కల్పిత లీల (లేక) క్రీడ మాత్రమే"** – అను గుర్తు విని, స్వానుభవము చేసుకున్నప్పుడు, అది **"ఆత్మ స్వాతంత్ర్యము"** అనబడుతోంది. అది **'మోక్షము'** యొక్క అర్థముగా వివరించబడుతోంది.

**<u>త్రిమూర్తిత్వము</u>**

1. దేహములోని **"నేను"**.
2. దేహము నాదైన **"నేను"**.
3. అనుభవమగుచున్న సమస్తమునకు (పూదండలో దారమువలె) అంతర్యామి అయి ఉన్న **"నేను"**.

*ఈ మూడు స్వస్వరూపాత్మయొక్క **"మూర్తిత్రయము"** అనబడుతోంది. శివుని బిరుదు అగు త్రిమూర్తి' అని వర్ణించబడుచున్నది.*

*ప్రతి జీవుడు **"త్రిమూర్తి స్వరూపుడే"**। **<u>శివతత్త్వమ్। శివోఽహమ్।</u>***

## ఉపనిషత్తులు ఎవ్వరికైనా అర్థమౌతాయా?
## అందరికి తప్పక అర్థమౌతాయి.

అవును. ఎవ్వరికైనా అర్థమౌతాయి. ఎందుకంటే అవి చెప్పుచున్నది మనలోని ప్రతి ఒక్కరికి చెందినట్టి - నిత్య సత్యమైనది, జగద్దృశ్యమునకు ఆవలిదైనట్టిది, సహజము అగు **ఆత్మస్వరూపము.** (One's own true, ever active and the beyond the World "SELF"). అయితే, **"జాగ్రత్ స్వప్న సుషుప్తి జన్మ - పునర్జన్మలచే పరిమితముగానట్టి నన్ను నేను తెలుసుకోవాలి"** - అను ఉత్సాహముతో కూడిన సంసిద్ధత తగినంతగా ఉండాలి. ఏవిద్యకైనా అభిరుచి, ఉత్సాహము, పట్టుదల, సాహసము ఉండాలి కదా. లేకుంటే ఎట్లా లభిస్తుంది?

### ఒక దృష్టాంతము.

ఒక పెద్ద మనిషి వద్దకు వచ్చి, ఆ ప్రక్కింటాయన **"బాబు గారూ! మీ గురించి ఈ రోజు వార్తా పత్రికలలో అనేక విషయాలు వ్రాశారే! సంతోషము. మీకు అభినందనలు"** - అని చెప్పి వెళ్ళిపోయారు.

అప్పుడు ఆ పెద్దమనిషి అన్ని పనులు ప్రక్కకు పెట్టి **"ఓహో! నా గురించి వార్తా పత్రికలో వ్రాశారా! ఏమని వ్రాశారు?"** ... అని ఆ పత్రిక చూడాలని, అది లభించే చోటికి పరుగులు ఎత్తసాగాడు.

ఎందుకు? తనకు తాను అతి ప్రియము కాబట్టి. (బ్రః॥శ్రీ॥ సముద్రాల లక్ష్మణయ్య గారు వారి "నివేదన"లో ఉదహరించిన దృష్టాంతము).

**ఆత్మనస్తు కామాయ, సర్వమిదం ప్రియం భవతి।**

ఉపనిషత్తులు మనయొక్క ఆత్మ సౌందర్యము, ఔన్నత్యముల (The beauty and divinity of one's own Absolute Self) గురించి చెప్పుతూ ఉంటే, ఆ సమాచారము ఎందుకు మనకు అర్థము కాదు? ఎందుకు ఆనందము కాదు? (Why is it not interesting to us?) అందుచేత ఉపనిషత్తులు అధ్యయనము చేయటము ఎవ్వరికైనా ఆనందకరమే। సాధ్యమే। సులభమే। శ్రద్ధ, ఆసక్తి, గురుభక్తి ఉండాలేగాని, ఉపనిషత్తుల అధ్యయనమునకు సమస్త జనులు అర్హులే.

-----

### పౌరాణిక విశేషాలు

ఈ 4వ సంపుటిలో ఆయా బోధిస్తున్న - శ్రవణము చేస్తున్న మహర్షుల, మునీశ్వరుల గురించిన పౌరాణిక గ్రంథ విశేషములు పురాణములలోను, ఇతిహాసములలోను కనిపిస్తున్నాయి. వాటిలో మనము నేర్చుకోవలసిన కొన్ని విశేషాలు నాకు కనిపిస్తూ వస్తున్నాయి. అందుచేత వారి పౌరాణిక జీవిత విశేషములు అక్కడక్కడ అందిస్తున్నాను.

అందుకుగాను ఈ క్రింది పుస్తకములోని విశేషాలు చదివి, ఆయా ఉపనిషత్తుల అధ్యయన విభాగములో మునుముందుగా (సంక్షిప్తంగా) వివరణ చేసుకుంటున్నాము. ఇందుకుగాను నేను పరిశీలిస్తున్న గ్రంథములలో కొన్ని ముఖ్యమైనవి ఇక్కడ ఉదహరిస్తున్నాను.

**1. పురాణ నామ చంద్రిక** — బ్రహ్మశ్రీ యెనమండ్ర వెంకట రామయ్యగారు (1879).
పునః ముద్రణ 1994 - ప్రాచి పబ్లికేషన్స్, వివేక్ నగర్, హైదరాబాద్.

**2. పూర్వగాథా లహరి** — కృతికర్త - శ్రీ వేమూరి శ్రీనివాసరావు గారు (1986).
వెంకట్రామా అండ్ కో (విజయవాడ - ఏలూరు - హైదరాబాద్).

**3. శబ్దార్థ చంద్రిక** — మూల గ్రంథకర్త - శ్రీ మహంకాళి సుబ్బారాయుడు గారు.
పరిష్కర్త - శ్రీ వేదం లక్ష్మీనారాయణ శాస్త్రి గారు.
అనుబంధకర్త - శ్రీ శిష్టి లక్ష్మీ సత్యనారాయణ శర్మగారు (2011).
రోహిణి పబ్లికేషర్స్ - విజయవాడ / రాజమండ్రి.

పై గ్రంథములను రచించిన, ప్రచురించిన వారి సేవ మహత్తరమైనది. వారందరికి కృతజ్ఞుడను. పై పుస్తకములు Govt. Degree College Library, Movva (Krishna Dist.) నుండి నేను అడగగానే శ్రమకోర్చి వెతికి అందజేసిన డా॥ అడప కేదారి M.A. (Telugu) Ph.D., (Lecturer in Telugu - Govt. Degree College, Movva) గారికి, వారి సతీమణి శ్రీమతి శైలజ గారికి నా కృతజ్ఞతలు. శుభాశీస్సులు.

# గురు నమస్కారము

గురుదేవులగు

శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామి వారికి (శుకబ్రహ్మాశ్రమము - శ్రీకాళహస్తి)

శ్రీశ్రీశ్రీ మళయాళస్వామి వారికి (వ్యాసాశ్రమము - యేర్పేడు)

శ్రీశ్రీశ్రీ యేలేశ్వరపు రామకృష్ణయ్య గారికి (హరిదాసు, కూచిపూడి - అస్మత్ పితామహులు)

ఇంకా ఎందరో మార్గదర్శకులు. వారందరికీ నమో నమో నమో నమః।

**కృతజ్ఞతలు** - మాతృ పితృదేవతలు శ్రీ ఆదిలక్ష్మి కామేశ్వరమ్మ, లక్ష్మీనారాయణ దంపతులకు పాదాభివందనము. శ్రీమతి కనకదుర్గను జీవిత భాగస్వామిగా ప్రసాదించిన జగన్మాతకు నమస్కారములు. వారి తోడు **'అమూల్యము'.**

# కృతి సమర్పణ

ఎవ్వరైతే....,

- ఈ సమస్త జగత్తుకు ఆధారుడై, సమస్తము తానే అయి ఉన్నారో,
- ప్రపంచములోని మతములన్నీ ఏ సర్వాత్మకుడగు పరమాత్మయొక్క తత్త్వమును ఎలుగెత్తి గానము చేయుచున్నాయో, ఎవరిగురించి సమస్త ఋషులు, మునులు, ప్రవక్తలు, గురువులు **శృణ్వన్తి మన్వే। "అదిగో! చూడండి"** - అని గొంతెత్తి ఘోషిస్తున్నారో,
- ఏ తత్త్వ పురుషుని గురించి గురుదేవులగు ఆచార్యులు స్వానుభవమును రంగరించి **"అదియే నీవు - తత్త్వమసి"** అని విడమర్చి చెప్పుచుండగా, శ్రవణము చేస్తున్న మనమంతా **'సోఽహమ్'** భావమును వృద్ధి చేసుకుంటున్నామో,
- ఏ అమృత స్వరూపుని గురించి తత్త్వవేత్తలు ఆత్మానందభరితులై యుక్తి యుక్తం చెప్పుచుండగా, వేదాంతర్గతమగు 'ఉపనిషత్' వాఙ్మయము శ్రవణముచేసినవారిచే శ్రుతులుగా మనందరికీ ప్రసాదించబడిందో,
- శివుడు, విష్ణువు, నారాయణుడు, పద్మభువుడు, రాముడు, కృష్ణుడు, లలిత, అల్లా, యహోవా, బుద్ధదేవ, మౌల సాయి, మహావీర, నానక్, అమ్మ ఈవిధంగా ఏ "అనంతుడు ఆద్యంత రహితుడు" అగు పరమాత్మ **అసంఖ్యాక నామరూపములుగా** ప్రపంచములోని జనులందరిచే ఉపాసించబడుచూ, ఆరాధించబడుచూ, - ప్రేమించబడుచూ ఉన్నారో,
- గురువులు-ఏ కేవలానంద ఆత్మ పురుషుని తమ శిష్యులలో దర్శిస్తూ, శిష్యులకు తత్త్వబోధ చేస్తూ ఉండగా, **శిష్యులు - తమయందే, వేంచేసియున్న ఆపరమాత్మ తమకు అభిన్నమని తెలుసుకొని బ్రహ్మానందభరితులగుచున్నారో,**
- ఏ పరాత్పరుడు ఒక చీమ నుండి సృష్టికర్త అగు బ్రహ్మ దేవుని వరకు మనందరి దృశ్యానుభవములకు ఆవల గల మన బుద్ధికి సాక్షి అయి వెలుగొందుచున్నారో, (యా బ్రహ్మాది పిపిలీకాంత తనుషుః ప్రోక్తా జగత్ సాక్షిణా)।
- ఏ పరంధాముడు అనేకమంది ధ్యాత-వక్త-రచయితల స్వరూపుడై ఉపనిషత్తు వాఙ్మయమును, వ్యాఖ్యానములను తరతరాలుగా అందిస్తూ మానవాళికి ఇప్పటికే మహోపకారము చేసి ఉన్నారో,
- ఏ మహత్ అహంకారుడు సమస్త జీవులలో "నేను - నేను" అను ప్రదర్శనముతో ఈ విశ్వ దృశ్యములు అసంఖ్యాక రీతులుగా ఆస్వాదించుచూ, నన్ను తన మాయతో భ్రమింపజేస్తూ, ఇంతలోనే నేను శరణు వేడుచుండగా సర్వ స్వరూపుడై నా బుద్ధికి అనుభవుడగుచున్నారో,

❧ ఏ తురీయ స్వరూపుడు మహర్షుల స్వరూపుడై ఈ బుద్ధిని ప్రేరేపిస్తూ, సమస్త పాఠక దేవతల స్వరూపుడై నన్ను ఈ మహత్తరమైన **'ఉపనిషత్ ఉద్యాన వనము'** అను మహా యజ్ఞమును నిర్వర్తింపజేస్తూ, నాపై అనుగ్రహముతో నాయొక్క **"జన్మ జన్మల అజ్ఞానాంధకారము"** అనే నిబిడాంధకారము (చిమ్మచీకటిని) తొలగిస్తూ ఉన్నారో...,

❧ ఎవరిని గురించి వేదోపనిషత్తులు విస్తారంగా చెప్పియుండి కూడా "మేము చెప్పలేము కూడా" - అని వెనుతిరిగి నమస్కరిస్తున్నాయో...,

**అట్టి జగత్ స్వరూపునికి, జగదతీతునికి, జగదానందునికి, జగత్ సంమోహ మోహినీ స్వరూపునికి, అవాక్ మాన గోచరునికి నమస్కరిస్తూ, సమస్తము ఆ పరాత్పరునికి, పరంధామునికి, "లోకకళ్యామగు గాక!" అని మనన పూర్వకంగా సమర్పిస్తున్నాను.**

ఉపనిషత్ మంగళశ్లోకములు, సంధులు విడదీసి వ్రాయటములో తమవంతు సహకారము అందిస్తున్న -

❖ శ్రీమతి కావూరి లక్ష్మీ సరస్వతికి, వారి పతిదేవుడు నా తమ్ముడు శ్రీ కావూరి పూర్ణచంద్ర శర్మ (కూచిపూడి)కి

❖ శ్రీమతి మల్లాది సుభద్రకు, వారి పతిదేవుడు నా తమ్ముడు శ్రీ రాజేంద్ర ప్రసాద్ (లబ్బీపేట, విజయవాడ)కు,

❖ ఇ-మెయిల్ Texts ప్రింటింగ్‌లో హృదయపూర్వక సహకారము అందిస్తున్న - నా బావమరిది శ్రీ భాగవతుల శరత్‌చంద్ర (శర్మాస్ స్టూడియో, కూచిపూడి)కు, వారి సతీమణి శ్రీమతి శిరీషకు,

❖ ప్రూఫ్ రీడింగ్‌లో సహకారములు అందిస్తున్న బావగారు శ్రీ పసుమర్తి నారాయణమూర్తి (విద్యాప్రవీణ) - కూచిపూడి, వారి సతీమణి, మా చెల్లెలు శ్రీమతి సీతారామలక్ష్మికి

శుభాశీస్సులు। శుభాకాంక్షలు। వీరందరికి ఆ చంద్రార్కం వంశాభివృద్ధిరస్తు। భక్తి జ్ఞాన వైరాగ్య సిద్ధిరస్తు। వేదమాత కరుణా కటాక్ష వీక్షణ ప్రాప్తిరస్తు।

ఎందరో ఈ యజ్ఞములో ఆర్థికంగా పాలుపంచుకొంటున్నారు. వారందరికి వేదమాత చల్లటి చూపు ప్రసరించును గాక! తమ వంతు ఆర్థిక సహకారము అందిస్తున్న "ఆంధ్రాబ్యాంక్" సంస్థకు, సివిల్‌సప్లైస్ కార్పోరేషన్ వారికి సర్వదా దిగ్విజయమగు గాక!

ఎంతో నేర్పు - ఓర్పులతో డి.టి.పి. ముద్రణలలో పరిశ్రమిస్తున్న చిరంజీవి బృందావనం సాయికుమార్, హసితా గ్రాఫిక్స్ అండ్ ప్రింటర్స్ - ఏలూరు, కవర్ పేజి సుందరంగా తీర్చిదిద్దుతున్న చిరంజీవి పి. సుబ్రహ్మణ్యం, అరవింద గ్రాఫిక్స్ - ఏలూరు వీరిరువురికి శుభాశీస్సులు. ఈ కార్యక్రమము ద్విగిజయంగా కొనసాగటానికి చి॥ బి. సాయికుమార్‌ను ఋషిపుంగవులు నాకు తోడుగా ప్రసాదించారు. ఈ మహత్తర అవకాశమును మా ఇద్దరికి ప్రసాదించిన పరమేశ్వరునికి - శరణు। శరణు।

**శివార్పణమస్తు। శ్రీమన్నారాయణార్పణమస్తు। శ్రీకృష్ణార్పణమస్తు।**
**ఆత్మార్పణమస్తు। ఓం తత్ సత్ బ్రహ్మార్పణమస్తు।**
**ఓం శాంతిః। శ్శాంతిః। శ్శాంతిః॥**

**భగవత్ భక్తజన-యోగజన-జ్ఞానజన-చరణ కమలోపాసకుడు - అధ్యయన విద్యార్థి**

**యేలేశ్వరపు హనుమ రామకృష్ణ** B.Com., C.A.I.I.B.,
(Retd, Chief Manager - Andhra Bank)
D.No. 2/8, "Sri Vasista Rama Nilayam", Siva Temple Street, **Kuchipudi - 521 136** Krishna Dist. A.P. India
Cell : 9247105392, 7981610804 Land : 08671 - 251164
e-mail: yhrk2525@gmail.com Website: www.yhramakrishna.com

# ⌘—— విషయ సూచిక ——⌘

## సంపుటి - 1

ఋగ్వేదాంతర్గత



శుక్లయజుర్వేదాంతర్గత

# ⌘ విషయ సూచిక ⌘

## సంపుటి - 2

**కృష్ణయజుర్వేదాంతర్గత-అనుష్ఠాన పాఠము**



**కృష్ణయజుర్వేదాంతర్గత-ఉపనిషత్తులు (22)**

# విషయ సూచిక

## సంపుటి - 3

### కృష్ణయజుర్వేదాంతర్గత-ఉపనిషత్తులు (10)



### సామవేదాంతర్గత-ఉపనిషత్తులు (8)

# ⌘ విషయ సూచిక ⌘

## సంపుటి - 4

### సామవేదాంతర్గత-ఉపనిషత్తులు (7)



### అథర్వణవేదాంతర్గత-ఉపనిషత్తులు (14)

## సుషమ్ననాడి
## సప్తభూమికలు / చక్రములు / స్థానములు




7. సహస్రారము
కపాలమునుండి ఊర్ధ్వప్రదేశము వరకు
బ్రహ్మరంధ్రము / సుషిరగము
కపాల ఊర్ధ్వ స్థాన బిందువు

6. ఆజ్ఞా చక్రము / 'భ్రూ'మధ్య స్థానము

5. విశుద్ధ భూమిక / చక్రము
కంఠ స్థానము

4. అనాహత భూమిక / చక్రము
హృదయ స్థానము

3. మణిపూరక భూమిక / చక్రము / కమలము - నాభి స్థానము

2. స్వాధిష్ఠాన భూమిక / చక్రము / కమలము. మూలాధారమునకు బెత్తెడు పైవైపుగా /ఉపరిగా

1. మూలాధార భూమిక / చక్రము / కమలము, గుదమునకు కించిత్ పైవైపుగా



ఇడ-సుషమ్న-పింగళ

7. సహస్రారము
బ్రహ్మరంధ్రమునకు ఊర్ధ్వము, బీజాక్షరము = 'ఓం', విశ్వాకాశము/దహరాకాశము; 'ఓం' ఝుంకారనాదము; దేవత = పరబ్రహ్మము, సహస్రదళములు; శ్వాసలు = 1000.
బ్రహ్మరంధ్రమునకు (ఆవల) బాహ్యము = నాలో దేహము / జగత్తు,
బ్రహ్మరంధ్రమునకు ఈవల='దేహములో/జగత్తులో "నేను"

6. ఆజ్ఞా
భ్రూమధ్య ప్రదేశము, బీజాక్షరము = 'హ్రీం', మహా ప్రకృతి స్థానము; అబ్ధినాదము (తరంగముల ఘర్షణ శబ్దము); కెంపు వర్ణము; దళములు = '2', శ్వాసలు = 1000.

5. విశుద్ధ
కంఠప్రదేశము, బీజాక్షరము = 'హం', ఆకాశస్థానము; మేఘనాదము; స్ఫటిక వర్ణము; దళములు = '16', శ్వాసలు = 1000. దేవత = ఈశ్వరుడు/బిందువు.

4. అనాహత
హృదయ ప్రదేశము, బీజాక్షరము = 'యం', వాయు స్థానము; శంఖారావము; బంగారు వర్ణము; దళములు = '12', శ్వాసలు = 6000. దేవత = రుద్రుడు

3. మణిపూరక
నాభిప్రదేశము, బీజాక్షరము = 'రం', అగ్ని స్థానము; వేణునాదము; నీల వర్ణము; దళములు = '10', శ్వాసలు = 6000. దేవత = త్రినేత్రుడు

2. స్వాధిష్ఠాన
మూలాధారము-నాభిలమధ్య, బీజాక్షరము = 'వం', జల స్థానము; వీణానాదము; పీత వర్ణము; దళములు = '6', శ్వాసలు = 6000. దేవత = బ్రహ్మ

1. మూలాధారము
గుదమునకు పైవైపుగా, బీజాక్షరము = 'క్లీం', పృథివీ స్థానము; కింకిణీనాదము; కుంకుమ వర్ణము; దళములు = '4', శ్వాసలు = 600. దేవత = గణపతి



శ్లో॥ ఓమ్ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరబ్రహ్మా తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో॥ అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరం ।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం,
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్!
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం,
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥

---

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యాం పరిపాలయంతాం।
న్యాయేన మార్గేణ మహీం మేహేశాః।
గోబ్రాహ్మణేభ్యాః శుభమస్తు నిత్యం।
లోకాః సమస్తాః సుఖినో భవన్తు।।

ఓం అసతో మా సద్గమయ ।
తమసో మా జ్యోతిర్గమయ ।
మృత్యోర్మా అమృతంగమయ ॥

ఓమ్ సహనావవతు । సహ నౌ భునక్తు! సహ వీర్యం కరవావహై ।
తేజస్వినావధీతమస్తు । మావిద్విషావహైః ॥

ఓమ్ పూర్ణమదః। పూర్ణమిదం। పూర్ణాత్పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ, పూర్ణమేవావశిష్యతే ॥

శ్లో॥ సర్వేఽత్ర సుఖినస్సంతు సర్వేసంతు నిరామయా ।
సర్వే భద్రాని పశ్యంతు । మా కశ్చిత్ దుఃఖభాక్ భవేత్ ॥

శ్లో॥ కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ ।
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణాస్సంతు నిర్భయాః ॥

శ్లో॥ అపుత్రాః పుత్రిణస్సంతు, పుత్రిణస్సంతు పౌత్రిణః
అధనాస్సధనాస్సంతు, జీవంతు శరదాంశతమ్॥

శ్లో॥ దుర్జనో సజ్జనో భూయాత్! సజ్జనః శాంతిమాప్నుయాత్ ।
శాంతోముక్తేత బంధేభ్యో! ముక్తశ్చ అన్యాం విమోచయాత్ ॥

ఓమ్ మంగళం గురుదేవాయ మహనీయ గుణాత్మనే ।
సర్వలోక శరణ్యాయ సాధురూపాయ మంగళం ।
చారు లీలావతారాయ శ్రీ రామకృష్ణాయ మంగళం ॥
వైకుంఠ పురవాసాయ లక్ష్మీనాథాయ మంగళమ్ ॥
మంగళం శ్రీ కురుక్షేత్ర రణక్షోణి విహారిణే ॥

ఓం ద్యౌః శాంతిః! అంతరిక్షమ్ శాంతిః! పృథివీ శాంతిః!
ఆపః శాంతిః! ఓషధయః శాంతిః! వనస్పతయః శాంతిః!
విశ్వే దేవాః శాంతిః! బ్రహ్మ శాంతిః! సర్వం శాంతిః!
శాంతిరేవ శాంతిః! సామా శాంతిరేధి!

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః

ఓమ్ సర్వేషాం స్వస్తి ర్భవతు! ఓమ్ సర్వేషాం శాంతిర్భవతు ।
ఓమ్ సర్వేషాం పూర్ణం భవతు ॥
ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

- ధర్మస్య విజయోఽస్తు - అధర్మస్య నాశోస్తు ।
- ప్రాణిసు సద్భావనాఽస్తు - విశ్వస్య కళ్యాణమస్తు।
- సర్వేజనాః సుఖినోభవంతు - సమస్త సన్మంగళాని సన్తు।
- అసతోమా సద్గమయ - తమసోమా జ్యోతిర్గమయ।
- మృత్యోర్మా అమృతంగమయ.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

❁❁❁

### వేదోపనిషత్ - అంతర్గత

# శాంతి - మంగళ శ్లోకములు

ఓం

**1.** శివనామ ని(వి)భావితే
అంతరంగే, మహతి జ్యోతిషి
మాననీమయాஉర్ధే
దురితాని అపయాన్తి దూరదూరే
ముహురాయాన్తి
మహాన్తి మంగళాని॥

ఏ **పరమశివము** మహత్తరమై - అఖండజ్యోతి ప్రకాశ స్వరూపమై సర్వజీవుల హృదయాంతరంగములలో సదా వెలుగొందుచున్నదో- అట్టి పరమార్థమగు **శివ బ్రహ్మమును** స్తుతించుచున్నాము.

- మేము ఆరాధించు తత్త్వము మాయొక్క సర్వ దురితములను మా నుండి తొలగించును గాక!

**- మహత్తరము, మంగళ ప్రదము అగు పరబ్రహ్మ స్థానమునకు మమ్ములను తిరిగి చేర్చును గాక!**

---

**2.** స్మృతే సకల కల్యాణ భాజనం
యత్ర జాయతే
పురుషస్యమ్ అజమ్,
నిత్యమ్ వ్రజామి శరణమ్।
హరిః ఓం॥

సర్వ శుభములను చేకూర్చు కళ్యాణ భాజనుడు, జన్మరహితుడు, నిత్యుడు - అగు ఏ పరమ పురుషుని స్మృతులన్నీ గానం చేస్తూ చూపుచున్నాయో,... **అట్టి ఓం కార స్వరూప శ్రీహరియగు విష్ణు భగవానుని మమ్ములను మాయనుండి దాటించుటకై శరణు వేడుచున్నాము.**

---

**3.** ఓం వాక్ మే మనసి ప్రతిష్ఠితా।
మనో మే వాచి ప్రతిష్ఠితమ్।
ఆవిః ఆవీః మ(మే) ఏధి
వేదస్య మ (మే) ఆణీస్థః।
శ్రుతం మే మా ప్రహాసీః।
అనేన అధీతేన,
అహో రాత్రాన్ సందధామి।
ఋతమ్ వదిష్యామి।
సత్యమ్ వదిష్యామి।
తత్ మాం అవతు ।
తత్ వక్తారమ్ అవతు।
అవతు మాం।
అవతు వక్తారమ్॥
ఓం శాంతిః శాంతిః శాంతిః॥

**ఓం కార పరబ్రహ్మమును స్మరించుచున్నాము.**

నా వాక్కు - నేను పలుకు పలుకులు నా మనస్సునందు సుస్థిరమై, ప్రతిష్ఠితమై ఉండును గాక!

నాయొక్క మనస్సు వాక్కునందు నెలకొని, ప్రతిష్ఠితమగును గాక! **మనస్సు ఒక తీరుగా, వాక్కు మరొక తీరుగా ప్రవర్తనము కలిగి ఉండకుండును గాక!**

ఓ పరంజ్యోతి స్వరూప పరమాత్మా! నా అజ్ఞానాంధకారమును పోగొట్టుటకై విజ్ఞాన దీపమును వెలిగించండి! మా మనో-వాక్కులు విజ్ఞానము కొరకై సమర్థమగును గాక!

మేము గురువుల నుండి, గ్రంథములనుండి ఎరుగుచున్నదంతా మాయందు సుస్పష్టము- సుస్థిరము అగును గాక!

వినుచున్నదంతా యథా - అర్థసహితంగా బుద్ధి-హృదయములలో ప్రవేశించి వికసించి ఉండును గాక!

అనేక రీతులుగా అధ్యయనము చేస్తున్న ఆత్మతత్త్వ విశేషాలు మేము రాత్రింబవళ్ళు - ఎల్లప్పుడు బుద్ధితో 'అవగతము' తో కూడుకొని అనుసంధానము చేయుచుండెదము గాక! ఋక్కులు (వేదోపనిషత్తులు, వేదవేత్తలు, ఆత్మవేత్తలు) చెప్పుచున్న ఋతమునే పలికెదము గాక! యథార్థమునే పలికెదము గాక! 'సత్' స్వరూపమగు చిదానంద పరబ్రహ్మము గురించియే చెప్పుకొను చుండెదము గాక!

**సర్వరక్షకుడగు ఆ పరబ్రహ్మ భగవానుడు** - నాకు, (వక్తారుడై నాకు బ్రహ్మ తత్త్వమును బోధిస్తున్న) గురుజనులకు కూడా - సదా రక్షకుడై ఉండును గాక!

నాకు, ఆచార్యవర్యులకు సర్వదా సర్వ సమృద్ధములు ప్రసాదిస్తూ... పరిపోషించుచుండును గాక!

**ఆధి - ఆత్మిక, ఆధి - దైవిక, ఆధి - భౌతిక త్రితాపములు ప్రశాంతమగు ఆత్మయందు ఆత్మత్వము పొంది సశాంతించును గాక!**

| | | |
|---|---|---|
| **4.** | **ఓం పూర్ణమ్ అదః।**<br>**పూర్ణమ్ ఇదమ్।**<br>**పూర్ణాత్ పూర్ణమ్ ఉదచ్యతే।**<br>**పూర్ణస్య పూర్ణమ్ ఆదాయ,**<br>**పూర్ణమేవ అవశిష్యతే॥**<br>**ఓం శాన్తి శాన్తి శాన్తిః॥** | 'పరాత్పర' స్వరూపమగు ఆ బ్రహ్మము సర్వదా (సర్వకాల - అవస్థలయందు) సదా పూర్ణము. (The Experiencer of the Experiencer is complete by **HIM** self).<br>'ఇహాత్మ' స్వరూప విభాగ విశేషములగు జీవాత్మ (The Experiencer) - జగత్తు (All that being experienced) లు కూడా పూర్ణమే!<br>పూర్ణమగు 'పరాత్మ' నుండియే పూర్ణమగు 'ఇహాత్మ' (జలంలో తరంగముల వలె) బయల్వెడలి సంప్రదర్శితమగుచున్నది.<br>(మట్టి నుండి కుండలు, బంగారము నుండి ఆభరణములు, జలము నుండి తరంగములు బయల్వెడలుచున్నప్పటికీ మట్టి - బంగారము - జలము సర్వదా యథాతథమై యున్న విధంగా) ....,<br>.... పూర్ణమగు పరమాత్మ నుండి జాగ్రత్ - స్వప్న - సుషుప్తి అనుభవి స్వరూపుడగు జీవాత్మ బయల్వెడలి, సంప్రదర్శితుడగుచూ ఉన్నారు.<br>(సర్వజీవుల) స్వస్వరూపమగు పరమాత్మ (లేక) పరబ్రహ్మము సర్వదా యథాతథమే! పూర్ణమే!<br>**భ్రమాత్మకములగు తాపత్రయములు అట్టి ఓంకార పరబ్రహ్మమునందు సశాంతించునవై ఉండును గాక!** |
| **5.** | హరిః ఓం॥<br>సహ నా(నౌ) అవతు<br>సహ నౌ భునక్తు।<br>సహ వీర్యం కరవావహై।<br>తేజస్వినా (నౌ)<br>అధీతమ్ అస్తు।<br>మా విద్విషావ హై॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః॥ | **ఓంకార సర్వాత్మ స్వరూపుడగు శ్రీహరికి నమస్కరిస్తున్నాము.**<br>శిష్య - ఆచార్యులమగు మనమిరువురము సర్వజగద్రక్షకుడగు ఆ పరమాత్మచే సదా **సంరక్షించబడెదము** గాక!<br>సర్వజీవ పరిపోషకుడగు ఆ పరంధాముడు శిష్య - ఆచార్యులమగు మన ఇరువురిని **పరిపోషించును** గాక!<br>(గురు శిష్యులమగు) మనము ఇరువురము **ధైర్య - ఉత్సాహ - సాహసములచే వీర్యవంతులమై బ్రహ్మతత్త్వ - అధ్యయనమునందు పరిశ్రమించెదము గాక!** నిర్వర్తించెదము గాక! ఆ పరబ్రహ్మతత్త్వము మనపట్ల తేజోవంతమై స(సు)-ఫలప్రదమగును గాక!<br>(శిష్యునకు వినటము రాదు - ఆచార్యులకు చెప్పటము రాదు - ఇత్యాది) అల్ప భావములకు లోనై శిష్య - ఆచార్యులమగు మనమిరువరము పరస్పరము ద్వేషించుకొనకుండెదము గాక! ప్రేమించుకొనెదము గాక! మన ఇరువురి మధ్య ఆప్యాయత - ప్రపత్తులు వెల్లివిరియును గాక!<br>**దృశ్య - ద్రష్ట - దర్శన త్రయములు ఆత్మరూపమునందు సశాంతించినవగును గాక!** |
| **6.** | ఓం<br>శం నో మిత్రః। శం వరుణః।<br>శం నో భవతు అర్యమా।<br>శం న ఇంద్రో బృహస్పతిః।<br>శం నో విష్ణుః ఉరుక్రమః॥<br>నమో బ్రహ్మణే।<br>నమస్తే వాయో।<br>త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాఽసి।<br>త్వాం ఏవ ప్రత్యక్షం బ్రహ్మ-<br>అవాదిష్యామ్। (బ్రహ్మవదిష్యామి)। | (పంచ ప్రాణములలోని 'ప్రాణము'నకు, 'పగలు'కు అభిమాన దేవతయగు) **మిత్ర భగవానుడు....,**<br>- ('అపానము'నకు, 'రాత్రి కాలము'నకు అభిమాన దేవతయగు) **వరుణ భగవానుడు...,**<br>- (దృష్టితత్త్వాభిమాని, పితృలోకములో శ్రేష్ఠుడు అగు) **అర్యమభగవానుడు...,**<br>- (త్రిలోకములలోని / ఈ దేహములోని ఇంద్రియ తత్త్వముల అభిమాని, అధి దేవత అగు) ..... **ఇంద్రభగవానుడు...,**<br>- (దేవతలకు గురువు, బుద్ధ్యభిమాన దేవత అగు) **బృహస్పతి భగవానుడు....,**<br>- (త్రివిక్రమావతారంలో త్రిపాదములతో భూమి - ఆకాశములను, అహంకార తత్త్వమును కొలచి వేసిన) ఉరుక్రమ బిరుదాంకితుడగు **విష్ణు భగవానుడు మాకు శుభములను, మనో ప్రశాంతతలను ప్రసాదించును గాక!** |

| | | |
|---|---|---|
| | **ఋతం అవాదిష్యామ్। (ఋతం వదిష్యామి)।**<br>**సత్యం అవాదిష్యామ్। (సత్యం వదిష్యామి)।**<br>**తత్ మామ్ ఆవీత్। (తన్మా మవతు)।**<br>**తత్ వక్తారమ్ ఆవీత్। (తద్వక్తారమవతు)।**<br>**ఆవీత్ (అవతు) మాం।**<br>**ఆవీత్ (అవతు) వక్తారమ్।**<br>**ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥** | ఓ వాయు భగవాన్! ప్రాణస్వరూపా! ప్రాణేశ్వరా! సర్వ స్వరూపము - సర్వసాక్షి అగు పరబ్రహ్మమా! సర్వాత్మకుడా! ఆత్మదేవా! సర్వస్థితుడవగు మీకు భక్తి పూర్వకంగా నమస్కరిస్తున్నాము.<br>మిమ్ములను 'ప్రత్యక్ష బ్రహ్మము'గా (దృశ్యజగత్తును/విశ్వేశ్వరుడుగా) దర్శించుచున్నాము. స్తుతించుచున్నాము.<br>ఋగ్వేదములోని ఋక్కులచే, సర్వవేదములచే అభివర్ణించబడుచున్న 'ఋతము' అగు పరమాత్మను స్తుతించుచున్నాము.<br>'సత్' స్వరూప పరబ్రహ్మము గురించిన సత్యమును స్తుతించుచున్నాము.<br>అట్టి పరబ్రహ్మము నన్ను, నాకు తత్త్వజ్ఞానము బోధిస్తున్న ఆచార్యుల వారిని సదా రక్షించును గాక! ఉభయులను కాపాడును గాక!<br>**భూః భువర్ సువర్ త్రిలోక సర్వభేదములు నిర్మల పరబ్రహ్మ స్వరూపమునందు సశాంతించినవగు గాక!** |
| **7.** | ఓం<br>**అహం వృక్షస్య రేః ఇవ।**<br>**కీర్తిః పృష్ఠం గిరేః ఇవ।**<br>**ఊర్ధ్వ పవిత్రో వాజినీవ,**<br>**'స్వమ్' అమృతమస్మి।**<br>**ద్రవిణగ్ం సవర్చసమ్,**<br>**సుమేధాః అమృతో అక్షితః।**<br>**ఇతి త్రిశంకోః వేద అనువచనమ్॥**<br>**ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥** | ఈ 'సంసారము' అను వృక్షమునకు 'ఆధారము' అయి ఉన్న 'రేః' - చైతన్య స్ఫూర్తి నేనే!<br>పర్వతముయొక్క శిఖరాగ్రమువలె నా 'కీర్తి'యే వేద-ఉపనిషత్ వాఙ్మయ పర్వత శిఖరముపై ప్రకాశమానమై యున్నది.<br>ఊర్ధ్వ పవిత్రత (ఘనత)గా సర్వత్రా ఉన్నది - నాలోని నేనైన ఆత్మయే! ఆకాశంలో ఎల్లప్పుడూ ప్రకాశించే సూర్యునికి ఉదయాస్తమయములు లేని తీరుగా నేను స్వయముగా... **జన్మ - మృత్యువులకు చెందనట్టి, సంబంధించనట్టి 'అమృత స్వరూపుడను' అయియే ఉన్నాను.**<br>ఈ దృశ్యమంతా నాకు సంపద అయినట్టి బ్రహ్మ వర్చస్సుచే సృష్టికళా విశేష సమన్వితుడను.<br>ఇదంతా నా చిదానందము! ఎరుకరూపము. వేదో వీక్షణము! బుద్ధి ప్రదర్శన చమత్కారము! ఇక నేనో మార్పు చేర్పులకు ఆవల, దృష్టికి ఆవల ... కేవల దృక్-అమృత-ఆనంద స్వరూపుడను!<br>ఇతి త్రిశంకు మహర్షి ప్రవచిస్తూ బోధించు వేద ప్రమాణముతో కూడిన అనువచనము. **దృశ్య - జీవ - ఈశ్వర భేదమంతా ఆత్మానందమునందు సశాంతించినవగును గాక!** |
| **8.** | ఓం<br>**యః (యం) ఛందసాం**<br>**ఋషభో విశ్వరూపః,**<br>**ఛందోభ్యో అధి అమృతాత్**<br>**సంబభూవ,**<br>**స మే ఇన్ద్రో మేధయా స్పృణోతు।**<br>**అమృతస్య దేవ ధారణో భూయాసమ్।**<br>**శరీరమ్ మే విచర్షణమ్।**<br>**జిహ్వా మే మధు మత్తమా।**<br>**కర్ణాభ్యాం భూరి విశ్రువమ్।**<br>**బ్రహ్మణః కోశోసి**<br>**మేధయా పిహితః।** | ఏ ప్రణవ నాదమును వేదములు ప్రప్రథమంగా పలుకుచున్నాయో, ఈ విశ్వమంతా ఎద్దానికి తన రూపమే అయి ఉన్నదో...,<br>ఏ 'ఓం' కారము అమృత రూపమై, ఆత్మరూపమై వేద వాఙ్మయము నుండి ప్రవచన - నిర్వచన రూపంగా ప్రకటించబడుచున్నదో...,<br>అట్టి మహత్తర ఆత్మ తత్త్వము నా ఇంద్రియములను, మేధస్సును (బుద్ధిని) విజ్ఞానరూపమై స్పృశించును గాక!<br>నేను ఇంద్రుడంతటి మేధస్సు కలిగియుండెదను గాక! ఓ ఆత్మదేవా! నేను అమృతరూపమగు బ్రహ్మజ్ఞాన 'ధారణ' పొందినవాడను అయ్యెదను గాక!<br>ఈ నా శరీరము బ్రహ్మతత్త్వము యొక్క శ్రవణ - మనన - నిదిధ్యాసల నిమిత్తమై అర్హము, ఆరోగ్యవంతము, ప్రజ్ఞాసమన్వితము అయి ఉండును గాక!<br>నా ఈ నాలుక - బ్రహ్మతత్త్వ విశేషాలను పలుకు మాధుర్యము కలిగి ఉండును గాక!<br>ఈ నా చెవులు ఆచార్యుల వద్ద నుండి బ్రహ్మతత్త్వ ప్రవచన వాక్యములు విరివిగా వినుటకు యోగ్యమై ఉండును గాక!<br>సంసార రూపములైనట్టి పంచకోశములకు సంబంధించిన బుద్ధిచే, మాయందు అంతరంగమున అనునిత్య ప్రకాశమైయున్న **పరబ్రహ్మము** కప్పబడినదై ఉన్నది. |

| | |
|---|---|
| శ్రుతం మే గోపాయ॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః॥ | ఓ ఆత్మ దేవా! మీ గురించి వినుచున్న మాటలచే (గురువాక్యములచే - వేదాంత సిద్ధాంతములచే), మీరు వినబడుచున్నవారై మమ్ములను గోపాయ - కాపాడండి! **మా యొక్క స్థూల - సూక్ష్మ - కారణ దేహములు ఆత్మ రూపము సంతరించుకొని, ఆత్మగా సశాంతించునవై ఉండును గాక!** |
| **9.** ఓం<br>ఆప్యాయన్తు మమ అంగాని<br>వాక్ ప్రాణః చక్షుః శ్రోత్రమ్ అథో బలమ్<br>ఇంద్రియాణి చ సర్వాణి।<br>సర్వమ్ బ్రహ్మ – ఔపనిషదమ్। (బ్రహ్మోపనిషదో)<br>మా అహమ్ బ్రహ్మ నిరాకుర్యామ్।<br>మా మా బ్రహ్మ నిరాకరోత్।<br>అనిరాకరణమ్ అస్తు।<br>అనిరాకరణమ్ మే అస్తు<br>తత్ ఆత్మని నిరతే<br>య ఉపనిషత్సు ధర్మాః,<br>తే మయి సన్తు।<br>తే మయి సన్తు॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః॥ | ఓంకార సంజ్ఞా సర్వతత్త్వ స్వరూపుడవగు ఓ పరమాత్మా! ఇది మా విన్నపము! వినండి. ఉపనిషత్తులచే చేతులెత్తి ప్రకటించబడుచున్న **బ్రహ్మము (లేక) సర్వాత్మకుడగు** పరమాత్మ మా యొక్క సర్వ అంగములను, వాక్కును, ప్రాణమును, కళ్ళను, చెవులను (కాళ్ళు-చేతులు, నడతలు, పనులు, మాటలు, శక్తి, చూపు, వినుచున్నవి - వీటన్నిటినీ) - బ్రహ్మోపాసనకై ఆప్యాయము, మధురము చేసి, సిద్ధము చేయును గాక!<br>- బ్రహ్మము (బ్రహ్మజ్ఞానము) నన్ను నిరాకరించకుండును గాక!<br>- నేను బ్రహ్మజ్ఞానమును నిరాకరించకుండుదును గాక! బ్రహ్మము - మేము పరస్పరము ఆదరణ, ఆప్యాయత కలిగి ఉండెదము గాక!<br>ఉపనిషత్తులు చెప్పు ఆత్మ ధర్మము గురించిన సమాచారము - విశేషముల అధ్యయనమునందు మేము నిరతులమై ఉండెదము గాక!<br>అట్టి పరబ్రహ్మము మమ్మ కాపాడును గాక! రక్షించును గాక!<br>**భూత - వర్తమాన - భవిష్యత్ త్రికాల కల్పనా విశేషమైనట్టిదంతా ఆత్మ స్వరూపమై, ఆత్మయందు లయించి - 'శాంత - ఆత్మత్వము'ను సంతరించుకొనును గాక!** |
| **10.** ఓం<br>భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః।<br>భద్రం పశ్యేమ అక్షభిః యజత్రాః।<br>స్థిరైః అంగైః తుష్టువాగ్ంసః తనూభిః।<br>వ్యసేమ దేవ హితం యత్ ఆయుః।<br>స్వస్తి నః ఇంద్రః వృద్ధశ్రవాః।<br>స్వస్తి నః పూషా విశ్వవేదాః।<br>స్వస్తి నః తార్క్ష్యో అరిష్టనేమిః।<br>స్వస్తి నః బృహస్పతిః దదాతు॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః॥<br>భద్రం మే అపివాతాయ మనః॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః॥ | ఓ దేవతలారా! మీరు ప్రసాదించిన ఈ చెవులతో మేము భద్రమగు (శుభ ప్రదమగు) దాని గురించియే (బ్రహ్మ తత్త్వమునే) వినుచుండెదము గాక! యజన (యజ్ఞ - యాగ - యోగ ప్రయత్న) శీలురమగు మేము భద్రమైన దానినే (సర్వము బ్రహ్మముగా) చూచుచుండెదము గాక!<br>బలము - కలిగియున్న అంగములతో ఆరోగ్యవంతము అగు శరీరముతో - దేవతలచే ప్రసాదించబడిన ఆయుష్షును దేవతల హితముగా (దేవతలకు ప్రియముగా) - గడుపుచుండెదము గాక!<br>ఔన్నత్యముతో కూడిన వినికిడిగల, లోకాధిపతి అగు **ఇంద్ర భగవానుడు,** విశ్వతత్త్వము ఎరిగిన **సూర్యభగవానుడు,** దోషములను తొలగించి మమ్ములను పవిత్రులుగా తీర్చిదిద్దుదురు గాక! బుద్ధి కుశలుడగు **బృహస్పతి భగవానుడు** మాకు అనుగ్రహమును ప్రసాదించెదరు గాక! మాకు స్వస్థత కలుగజేయుదురు గాక!<br>మా మనస్సులకు ప్రాణేశ్వరులగు వాయు దేవులవారు శుభము, భద్రము కలుగజేయుదురు గాక! **ఓం శాంతిః శాంతిః శాంతిః॥** |
| **11.** యో బ్రహ్మాణమ్ విదధాతి పూర్వమ్,<br>యోవై వేదాంశ్చ ప్రహిణోతి, తస్మై<br>తగ్ం అహమ్ ఆత్మబుద్ధి ప్రకాశమ్,<br>ముముక్షుర్వై శరణమ్<br>అహమ్ ప్రపద్యే॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః॥ | - ఏ పరబ్రహ్మము ఈ జగత్తుకు మునుముందే ఉన్నదై, ఈ జగత్ రూపముగా విస్తరించినదై ఉన్నదో,<br>- ఏది వేద - ఉపనిషత్తులచే 'తత్త్వమ్' శాస్త్రముగా స్తుతించబడుచున్నదో,<br>**- అట్టి ఆత్మ నా బుద్ధికి ప్రకాశమానమగుటకై...,**<br>**ముముక్షువునై ఆచార్యులను, బ్రహ్మజ్ఞులను, వేదాంత శాస్త్రమును శరణు వేడుచున్నాను.**<br>**సర్వము శాంతాత్మయందు సశాంతించును గాక!** |

శ్లో॥ ఓం మంగళమ్ గురుదేవాయ మహనీయ గుణాత్మనే
సర్వలోక శరణ్యాయ సాధురూపాయ మంగళమ్॥
ఓం శాంతిః శాంతిః శాంతిః॥

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 9 మైత్రాయణ్యుపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ వైరాగ్యోత్థ భక్తియుక్త
బ్రహ్మమాత్ర ప్రబోధతః
యత్ పదం మునయో యాన్తి
తత్ త్రైపదమ్ అహం మహః॥



వైరాగ్య – భక్తియుక్త ప్రబోధముగాను, బ్రహ్మ సూత్ర (జ్ఞాన) యుక్తంగాను ఏది మునులు పొందుచున్నారో– అట్టి త్రైపద మహత్ అగు 'అహమ్' తత్త్వమే–మనందరి మహదాశయము. అట్టి పరమాత్మకు నమస్కారము.

## ప్రథమ ప్రపాఠకః – జ్ఞానమేవ గతిః

**1.** ఓం।
బృహద్రథో హ వై నామ రాజా।
రాజ్యే జ్యేష్ఠం పుత్రం నిధాపయిత్వా
"ఇదం అశాశ్వతమ్" మన్యమానః శరీరమ్,
వైరాగ్యమ్ ఉపేతో, అరణ్యం నిర్జగామ।

<u>'ఓం' కార స్వరూపుడగు పరమాత్మకు నమస్కరిస్తున్నాము.</u>

బృహద్రథుడు అనే ఆయన ఇక్ష్వాకు వంశ ప్రభువు. ఆయన **"ఈ శరీరము శాశ్వతము కాదు కదా! శేషించిన ఆయుష్షును మోక్ష మార్గములో సద్వినియోగము చేసుకోవాలి"** - అని భావించారు. పెద్ద కుమారుని పట్టాభిషిక్తుని చేశారు. వైరాగ్య భావాలతో విరాగి అయి సర్వము త్యజించి ఏకాంతవాస రూపమైన అరణ్యావాసము ఆశ్రయించారు. *(సూర్యుని పుత్రుడైన నిమి తనయుడు. ఈయన కుమారుడు సుదాసుడు - భాగవతము).*

---

స తత్ర పరమం తప ఆస్థాయ
ఆదిత్యమ్ ఈక్షమాణ ఊర్ధ్వబాహుః తిష్ఠత,
అంతే సహస్రస్య।

ఒకానొక ప్రశాంత నిర్జన ప్రదేశములో తపస్సు ప్రారంభించారు. హృదయంలో ఆదిత్యుని (సూర్యభగవానుని) ప్రతిక్షేపించుకొని ఊర్ధ్వ బాహువులతో అనేక సంవత్సరముల సుదీర్ఘకాలము ఓర్పుగా తపస్సు కొనసాగించారు. *(సహస్రాంత సూర్యోపాసన చేయసాగారు).*

---

మునేః అంతికం ఆజగామ,
అగ్నిరివ అధూమకః తేజసా, నిర్దహత్ ఇవ,
ఆత్మవిత్ భగవాన్ శాకాయన్యః॥

ఒకానొక రోజు సూర్యభగవానుని సంకల్పముచే మహా తేజో సంపన్ను డగు శాకాయన్య మునీంద్రులవారు బృహద్రథ మహారాజుకు ఎదురుగా ప్రత్యక్షమైనారు. ఆయన పొగలేని అగ్నియొక్క తేజస్సుతో వెలుగొందు చున్నారు.

---

"ఉత్తిష్ఠోత్తిష్ఠ! వరం వృణీష్వ"। .... ఇతి–
రాజానమ్ అబ్రవీత్।
స తస్మై నమస్కృత్య –ఉవాచ॥

<u>భగవంతుడగు శాకాయన్యులు</u>

"ఓ బృహద్రథా! లేవయ్యా! లే! నీ తపస్సు ఫలించింది. ఏమి వరం కావాలో కోరుకో, నాయనా!" - అని రాజుతో పలికారు.

బృహద్రథమహారాజు ఆ మధురమైన ఆప్యాయతతో కూడిన శాఖాయన్య మహర్షుల వారి మాటలు విని తపస్సు చాలించి కనులు తెరచారు. భక్తితో మహర్షికి పాదాభివందనము, పాదపూజ సమర్పించారు. రెండు చేతులు జోడించి నమస్కరించారు.

---

"భగవన్! న అహమ్ ఆత్మవిత్।
త్వమ్ తత్త్వవిత్।
శృణుమో వయం స త్వమ్ (సత్వన్) నో బ్రూహి" ఇతి॥

**బృహద్రథ మహారాజు:** భగవన్! మహర్షీ! నేను ఆత్మవేత్తను (ఆత్మ గురించి తెలుసుకున్న వాడిని) కాను. తమరో, తత్త్వవేత్త! ఆత్మయొక్క తత్త్వమేమిటో దయతో నాకు వినిపించండి! బోధించండి!

| | |
|---|---|
| "ఏతత్ వృత్తం పురస్తాత్ అశక్యం।<br>మా పృచ్ఛ ప్రశ్నమ్, ఇక్ష్వాకాన్।<br>అన్యాన్ కామాన్ వృణీష్వ!" - ఇతి॥ | **శాకాయన్య మహర్షి:** ఓ ఇక్ష్వాకా! నీవు ఆత్మతత్త్వము గురించా, అడుగుచున్నావు? అది మొదలే చెప్పటానికి అశక్యమైన విషయము. అది వద్దులే। ఇంకేదైనా వరము కోరుకోవయ్యా। ఇస్తాను. |
| (బృహద్రథో) - శాకాయన్యస్య చరణాః<br>అభిస్పృశ్యమానో రాజేమాం గాథాం జగాద॥ | **బృహద్రథ మహారాజు:** శాకాయన్యుల వారి పాద పద్మములను కళ్లకు అద్దుకొని, ఇక వరము విషయంగా ఇట్లా విన్నవించుకోసాగారు. |
| **2.** బృహదథౌ - వాచ:<br>భగవన్! అస్థి। చర్మ - స్నాయు మజ్జా<br>మాంస-శుక్ర - శోణిత - శ్లేష్మ - అశ్రు దూషితే,<br>విణ్మూత్ర వాత పిత్త కఫ సంఘాతే,<br>దుర్గంధే, నిస్సారే<br>అస్మిం శరీరే కిం కామ భోగైః? | భగవన్! ఈ శరీర సుఖము కోసమై ఏదైనా కోరుకోమంటున్నారా? ఇది స్వతఃగా లేని వస్తువు. బొమికలు, చర్మము, నరములు, క్రొవ్వులతో తయారైన ఒక తోలు బొమ్మ! శుక్రము, శోణితము, శ్లేష్మము, కన్నీరు.... ఇటువంటి దోష పూరితమైన పదార్థాలన్నీ తనయందు కలిగి ఉన్నట్టిది. మలము, మూత్రము, వాత-పిత్త- కఫములచే దుర్గంధ భూయిష్టమైనది. వాస్తవానికి సారమైన వస్తువు అంటూ ఈ దేహములో ఏదీ లేదు. అటువంటి ఈ అల్పవస్తువగు భౌతిక దేహము యొక్క కామ ఉప భోగములు కోరుకొని ఏమి లాభము? ఏమి ఆనందము? |
| **3.** కామ-క్రోధ-లోభ-మోహ-భయ-విషాద-<br>ఈర్ష్య-ఇష్ట వియోగ-అనిష్టనం ప్రయోగ,<br>క్షుత్-పిపాసా-జరా-మృత్యు-రోగ-శోకాద్యైః<br>అభిహతే, అస్మిన్ శరీరే కిం కామ ఉప భోగైః? | ఇంకా వినండి. ఈ దేహమును వెంటనంటి అనేక మనో వికారాలు. కామము, క్రోధము, లోభము, మోహము, భయము, విషాదము, ఈర్ష్య.<br>- ఇష్టమైనవాళ్ళు దూరంగా ఎక్కడో ఉండటముతో విరహము.<br>- అయిష్టమైన వాళ్ళతో స్నేహ బంధుత్వాలు అనివార్యం కావటంతో విషాదము,<br>- ఆకలి, దాహము, ముసలితనము, మృత్యువు, రోగము, శోకము... ఇటువంటి కామ-ఉపభోగ విషయాలతో ఈ దేహము జీవితాంతము తాడనము పొందుతూనే ఉంటోంది. |
| **4.** సర్వం చ ఇదమ్ క్షరియిష్ణు పశ్యామో,<br>యథే మే దంశ-మశక ఆదయః।<br>తృణవత్ నశ్యత, యో<br>ఉద్భూత - ప్రధ్వంసినః॥ | ఏదేది నాదని అనిపిస్తోందో,... అదంతా కూడా నశించటం అనివార్యము. ఇది కనబడుచూనే ఉన్నది కదా!<br>ఉదాహరణకు ఈగలు, దోమలు రోజూ పుడుచున్నాయి. అక్కడ-ఇక్కడ వ్రాలుచున్నాయి. ఇంతలోనే నశిస్తున్నాయి. ఈ దేహాలన్నీ ఇట్టిట్టిరైనవే కదా! ఇవన్నీ నేలపై గడ్డిమొక్కలు మొలచినట్లు పుట్టుచున్నాయి. నశిస్తున్నాయి. |
| **5.** అధ కిం ఏతైర్వా పరే అన్యే-<br>మహా ధనుర్ధరాః చక్రవర్తినః కేచిత్ -<br>సుద్యుమ్న, ఇంద్రద్యుమ్న, కువలయాశ్వ,<br>యౌవనాశ్వ, వధ్రియాశ్వ, అశ్వపతిః<br>శశిబిందుః, హరిశ్చంద్రో, అంబరీషో<br>అననుక్తః,-స్వయాతి, యయాతిః,<br>అనరణ్యో, అక్షసేన ఆదయో, | ఈ దేహ సంబంధ-సంపద బాంధవ్యములను అజ్ఞానముచేతనే నమ్ముకొని ఆయుష్షు వృధా చేసుకుంటున్నామే! విజ్ఞులు, మహాధనుర్ధారులు, గొప్ప రాజ్యములు ఏలినవారు అగు - కొందరి విషయము వేరుగా ఉన్నది.<br>సుద్యుమ్నుడు, ఇంద్రద్యుమ్నుడు, కువలయాశ్వుడు, యౌవనాశ్వుడు, వధ్రియాశ్వుడు, అశ్వపతి, శశిబిందు, హరిశ్చంద్రుడు, అంబరీషుడు, అనునక్తుడు, స్వయాతి, యయాతి, అనరణ్యుడు, అక్షసేనుడు మొ॥న వారంతా, (అట్లాగే) మరుత్తు, భరతుడు మొదలుగా గల మహనీయులంతా కూడా..., ఏమి చేసారో తమకు తెలిసిందే కదా! |

**అథ మరుత్, భరత ప్రభృతయో**
**రాజానో మిషతో (సూక్ష్మబుద్ధితో)**
**బంధువర్గస్య, మహతీం శ్రియం**
**త్యక్త్వా అస్మాత్ లోకాత్**
**అముం లోకం ప్రయాంతి।**

.... వారి వారి బంధువర్గమంతా అట్లా చూస్తూ ఉండగానే, గొప్ప గొప్ప సంపదలను - లోక విషయాలను త్యజించి, చివరికి ఏకాంత వాసాన్ని పరతత్త్వము కొరకై ఆశ్రయించారు కదా!

వారెవ్వరూ కూడా ప్రాపంచిక విశేషములగు ధన-జన-వస్తు-వాహన-మహా రాజ్యాధిపత్యాదులను పట్టుకొని వ్రేలాడుచూ ఉండలేదే।

---

**6. అథ కిమ్ ఏతైర్వా పరే అన్యే**
**గంధర్వ - అసుర - యక్ష -**
**రాక్షస - భూత గణ - పిశాచ-ఉరగ**
**గ్రహాదీనాం నిరోధనం పశ్యామః?**

**"ముందుగా ఇహ విషయాలు - పరతత్త్వానికి అప్పుడే ఏం తొందర?"** అని రోజులు గడపడం ఉచితమా? ఎప్పుడు జీవితంలో ఏమి జరుగుతుందో ఎవ్వరికి తెలుసు? గంధర్వ-యక్ష, రాక్షస-భూత, పిశాచ-సర్ప-గ్రహ వీక్షణల వలన జీవులకు అనేక నిరోధములు, విఘ్నములు కలగటం అందరమూ చూస్తున్న విషయమే!

---

**7. అథ కిమ్ ఏతై తు-**
**వన్యానాం శోషణం మహార్ణవానాం-**
**శిఖరిణాం ప్రపతనం। ధృవస్య ప్రచలనమ్।**
**అస్థానం వా తరూణాం। నిమజ్జనం పృథివ్యాః।**
**స్థానాత్ అపసరణం సురాణం।**

అసలు ఇక్కడ శాశ్వతమైనదంటూ ఏమున్నది, చెప్పండి?

గొప్ప వనములు ఎండిపోతున్నాయి. ప్రసిద్ధ పర్వతాలు నేల కూలుచున్నాయి. సముద్రాలే ఇంకిపోతున్నాయి.

ఎత్తైన శిఖరాలు కృంగిపోతున్నాయి, మట్టిలో కలిసిపోతున్నాయి. అత్యంత ధృవంగా కనిపించేవి కూడా కాలగతిచే వీగిపోతున్నాయి.

గొప్ప వృక్షాలు ఎప్పుడో తమ స్థానం కోల్పోతున్నాయి. విశాల భూ ప్రదేశాలు సముద్రాలలో కలిసిపోతున్నాయి.

దేవతలంతటివారు స్థానభ్రంశం పొందుచున్నారు.

---

**సో అహమ్ ఇతి ఏతస్మిం తు**
**సంసారే కిం కామోపభోగైర్యైః**
**ఏవ ఆశ్రితస్య అసకృత్**
**ఇహ ఆవర్తనం దృశ్యత?**
**ఇతి ఉద్ధర్తుం అర్హసి। ఇతి।।**

ఇటువంటి క్షణమొకరీతిగా కనిపించే సంసారములో అహంకారముతో ప్రవేశించి, నేను ఏవేవో కావాలనే కోరిక కలిగి సంచరించటం, అసత్ కార్యక్రమములలో నిమగ్నమవటం, ఈ దృశ్య విషయాలు నమ్మి ఉండటం ఎంతవరకు శాశ్వత ప్రయోజనం? ఇందులో ఏమి సుఖం? "ఈ దృశ్య వ్యవహారముల నుండి ఎట్లారా ఉద్ధరణ?".... అనునదే ఉచితం కదా!

---

**అంధ-ఉదపానస్థో 'భేక' ఇవ**
**అహమ్ అస్మిన్ తు సంసారే, భగవన్!**
**త్వన్నోగతిః। త్వన్నోగతిః। ఇతి।।**
**(త్వమ్ నో గతిః।। ఇతి।।**

నూతిలో బ్రతికే కప్పవలె మావన్నీ కూడా అల్ప విషయ సంబంధమైన ఆశయాలు, నిరీక్షణలూను. వీటిలో నేను ఎన్నో జన్మలుగా చిక్కుకున్నాను. స్వామీ! ఇప్పుడు మీరే గతి! మీరే నన్ను ఆత్మ జ్ఞాన సమాచారము ప్రసాదించి కాపాడాలి!

# ద్వితీయ ప్రపాఠకః-జడ దేహములో చైతన్య పురుషుని మహిమ

**1. అథ భగవాన్ శాకాయన్య సుప్రీతో,**
**అబ్రవీత్ రాజానం :**
**మహారాజ! బృహద్రథ।**
**ఇక్ష్వాకు వంశ ధ్వజ శీర్ష।**
**ఆత్మజ్ఞః! కృతకృత్యః త్వమ్।**
**'మరుత్' నామ్నో విశ్రుతో అసి! ఇతి॥**

బృహద్రథ మహారాజు పలికిన విజ్ఞాన పూరితమైన వైరాగ్య వాక్యములు విని శాకాయన్య మహర్షి సుప్రీతులైనారు. రాజుతో ఇట్లా పలుకసాగారు.

**శాకాయన్య మహర్షి :** ఓ మహారాజా! బృహద్రథా! ఇక్ష్వాకు వంశమునకు ధ్వజ శీర్షము వంటివాడా! ఆత్మజ్ఞా! ఎందుకు మనము పుట్టామో అది నీవు సాధించినట్లేనయ్యా! కృతకృత్యుడవు! 'మరుత్తు' అనే పేరుతో లోక ప్రసిద్ధుడవు. ఇక క్రొత్తగా చెప్పవలసినది ఏమున్నది?

---

**(బృహద్రథౌవాచ)**
**అయం వావ-ఖలు "ఆత్మా తే, కతమో; భగవాన్! వర్ణ్య"। ఇతి॥**
**తగ్ం హోవాచ ॥ ఇతి**

**బృహద్రథ మహారాజు :** అయ్యా! ఆత్మ అనగా ఏమిటి? ఎవరు? ... హే భగవన్! ఈ విషయమే వర్ణించి నాకు దయామయులై బోధించ ప్రార్థన.

అప్పుడు శాకాయన్య మహర్షి "సరే" - అని పలుకుచు 'ఆత్మ' గురించిన విశేషములను ఇట్లు చెప్పటం ప్రారంభించారు.

---

**2. (భగవాన్ శాకాయన్యోవాచ।)**
**య ఏషో బాహ్య - అవష్టంభనేవ ఊర్ధ్వమ్ ఉత్క్రాంతో,**
**వ్యథమానో - అవ్యథమానః తమః**
**ప్రణుదతి (స్తుతించబడునది)**
**ఏష ఆత్మేతి। ఆహ।**

**భగవంతుడగు శాకాయన్య మహర్షి :** ఈ ఇంద్రియ సంబంధమైన బాహ్య విషయాలన్నీ అనేక వ్యథలకి దారి తీస్తున్నాయి కదా! అట్టి ఈ బాహ్యేంద్రియములను, వాటి వాటి విషయములను దాటివేసి (లేక) నిర్వీర్యము - నిరోధము చేసివేసి, ఊర్ధ్వముగాను, ఇంద్రియములకు ఆవలగాను (పరముగాను) ఉన్నట్టి సర్వ వ్యథల చరమ స్థానమును చేరగా అనుభవమయ్యేదే ఆత్మ. **అదే భగవంతునికి సంబంధించిన అనుభూతి స్థానము.**

---

**భగవాన్। అథ య ఏష సంప్రసాదో**
**అస్మాత్ శరీరాత్ సముత్థాయ పరంజ్యోతిః ఉప సంపద్య**
**స్వేన రూపేణ అభినిష్పద్యత**
**ఏష ఆత్మేతి హోవాచ।**
**ఏతత్ అమృతమ్, అభయమ్। ఏతత్ బ్రహ్మేతి॥**

ఇంద్రియ సంబంధమైన తమస్సు (చీకటి) ను జయించి, నిర్మలమైన బుద్ధి కలవాడై, ఈ శరీరమును అధిగమించి దాటివేసి... "శరీరి" అను పరంజ్యోతి స్వరూపముగా సంతరించుకోవటమే ఆత్మత్వము. ఈ జీవుడు తన నిజరూపముగాగల స్థితియే ఆత్మ. అది అమృత స్వరూపము. అభయ స్థానము. (బ్రహ్మమే తానవటము).

---

**3. అథ ఖలు ఇయమ్**
**బ్రహ్మవిద్యా - సర్వోపనిషత్ విద్యావా**
**రాజన్! అస్మాకం భగవతా మైత్రేయేణ వ్యాఖ్యాతా..!**
**అహమ్ తే కథయిష్యామి ఇతి యథా॥**

ఇంద్రియ - ఇంద్రియార్థ విషయాలకు ఆవల కేవల సాక్షియగు ఆత్మ స్థానము అనునిత్యానుభవము అయి ఉండటమే **బ్రహ్మ విద్య, ఉపనిషత్ విద్య** కూడా!

ఓ రాజా! ఒకప్పుడు మా గురు దేవుడగు, భగవంతుడగు మైత్రేయుల వారు ఆత్మతత్త్వానుభవము గురించి విశదీకరించి, వ్యాఖ్యానిస్తూ బోధించటం జరిగింది. ఇప్పుడు నీకు ఆ విషయాలే చెప్పబోవు చున్నానయ్యా!

---

**అపహత పాప్మానస్తిగ్మ తేజస**
**ఊర్ధ్వ రేతసో వాలఖిల్యా ఇతి శ్రూయంతే,**
**అథ ఏతే ప్రజా ప్రజాపతిం అబ్రువన్॥**

ఉత్తమ తపస్సుచే పాప-అల్ప దృష్టులను త్యజించి - అధిగమించినవారు, సుతీక్ష్ణ దివ్య తేజో సంపన్నులు, ఊర్ధ్వ రేతస్కులు (తేజో కిరణములతో సహస్రారమును అధిగమించినవారు) అయినట్టి **వాలఖిల్యమునులు.** ఆ మునీశర్వరులు ఒకసారి ప్రజాపతియగు బ్రహ్మ దేవుని దర్శించారు. మహనీయులెప్పుడూ మహత్తరమైన విషయమునే సంభాషించు కుంటారు కదా! ఆ మునీశ్వరులు కూడా బ్రహ్మదేవులవారిని ఇట్లు ప్రశ్నించారు.

**“భగవన్! శకటమివ అచేతనం ఇదం శరీరమ్।**
**కస్య ఏష ఖలు వ ఈదృశో**
**మహిమా అతీంద్రియ భూతస్య**
**యేన ఏతత్ విధ్ధమ్ ఇదమ్**
**చేతనవత్ ప్రతిష్ఠాపితమ్? ప్రచోదయితాస్య?**
**కో భగవన్! ఏతత్?**
**అస్మాకం బ్రూహి!” ఇతి॥**

“హే భగవన్! ప్రజాపతీ! ఆత్మజ్ఞాన నిష్ఠతో ఒక ప్రశ్నను తమ ముందు ఉంచుచున్నాము. ఒక బండి (శకటము) తనకు తానుగా కదలదు కదా! అట్లాగే ఈ శరీరము స్వతఃగా జడము, అచేతనము. అట్టి ఈ జడవస్తువగు భౌతిక దేహము ఎవరియొక్క అతీంద్రియమైన మహిమచేత చేతనమువలె కదలగలుగుతోంది? దీనియొక్క ప్రేరకుడు- కదల్చుచున్నవాడు ఎవ్వడు? ఎవరి తెలివిచే ఇది ప్రవర్తిస్తోంది? ఈ విషయము మాకు చెప్పవలసినదిగా ప్రార్థిస్తున్నాము.

---

**<u>తాన్ హోవాచ :</u>**

**4. యో హ ఖలు వాచోపరి సః శ్రూయతే, స వా ఏష**
**శుద్ధః। పూతః। శూన్యః। శాంతో।**
**అప్రాణో। అనీశాత్మా। అనంతో**
**అక్షయః। స్థిరః। శాశ్వతో। అజః। స్వతంత్రః।**
**స్వే మహిమ్ని తిష్ఠతి అనేన ఇదం**
**శరీరమ్ చేతనవత్ ప్రతిష్ఠాపితం**
**ప్రచోదయితా చ। ఏషో అస్య ఇతి॥**

**ప్రజాపతి :** ఏ పరమాత్మ ఇచ్ఛా రహితులై, వాక్కుకు - శబ్దములకు అవిషయమై, వాటికి ఉత్పత్తి స్థానమైయున్నారో, ఏ మహాత్ముడు పరమశు ద్ధుడు, పవిత్రుడు, విషయశూన్యుడు, శాంత స్వరూపుడు, (ప్రాణము కూడా కానట్టి) ప్రాణేశ్వరుడు, ఏదీ కానట్టి అనీశాత్ముడు, అనంతుడు, (క్షయమనునదే లేనట్టి) అక్షయుడు, అచంచలుడు (స్థిరుడు), శాశ్వతుడు, (జన్మరహితుడు) కాబట్టి అజుడు, (దేనిచేతను బద్ధుడు కానట్టి), స్వతంత్రుడు అయి ఉన్నారో..., **అట్టి అఖండాత్ముని చైతన్య మహిమచేతనే ఈ జడ భౌతిక దేహాలు చేతనములవలె ప్రదర్శితము అగుచున్నాయి.**

---

**<u>తే హ ఊచుః :</u>**

**“భగవన్! కథమ్ అనేన ఈదృశేన**
**అనిచ్ఛేన ఏతత్ విధమ్**
**ఇదమ్ చేతనవత్ ప్రతిష్ఠాపితమ్?**
**ప్రచోదయితా చ ఏషో అస్య ఇతి (కథమితి)?**

**వాలఖిల్యమునులు :** అట్లాగా స్వామి! హే భగవన్! అయితే మరొక సందేహము. అట్టి పరమాత్మ స్వతఃగా **ఇచ్ఛారహితుడు** కదా! ఇచ్ఛా రహితుడగు ఆయనచే ఎందుకు ఈ జడ దేహములు చేతనములుగా ప్రతిష్ఠాపితము అగుచున్నాయి? ఏ కారణముగా పరమాత్మచే **ఈ దేహములు ప్రచోదనమగుచున్నాయి?** కదిలే దేహములను కదిల్చే పరమాత్మ ఏమి ఉద్దేశ్యించి కదల్చుచున్నారు?

---

**<u>తాన్ హో వాచ :</u>**

**5. సవా ఏష సూక్ష్మో, అగ్రాహ్యో, అదృశ్యః**
**పురుష సంజ్ఞో, బుద్ధి పూర్వమ్**
**ఇహ ఏవ ఆవర్తతే అంశేన**
**సుషుప్తస్య ఏవ బుద్ధి పూర్వం నిబోధయతి।**

**ప్రజాపతి :** ఆ చైతన్య స్వరూపుడగు పరమాత్మ **సూక్ష్మాతి సూక్ష్ముడు.** ఇంద్రియములచే గ్రహించబడేవాడు, గమనించబడేవాడు కాదు. దృశ్యముగా ఉన్నవాడు కాదు. **అదృశ్యుడు. పురుషుడు** అనే పేరుతో చెప్పబడేవాడు. **ఈ జాగ్రత్ స్వప్న సుషుప్తులు, జన్మ-కర్మలు ఆతని పురుషకారమే.**

ఆయన బుద్ధి పూర్వకముగా దేహములందు తన చేతన శక్తిచే ఈ దేహములను సచేతనము చేస్తున్నారు. ఆతని అంశయే గాఢ నిద్రలో ఉన్నవానిని బుద్ధి పూర్వకముగా నిద్రలేపుచున్నది.

---

**అథ యోహ ఖలు వా వ ఏతాస్య అంశో**
**అయం యత్ చేతనమాత్రః**
**ప్రతి పూరుషం – క్షేత్రజ్ఞః**
**సంకల్ప–అధ్యవసాయ–అభిమాన లింగః**
**ప్రజాపతిః విశ్వాక్షః తేన చేతనేన**
**ఇదం శరీరమ్ చేతనవత్ ప్రతిష్ఠాపితమ్।**
**ప్రచోదయితా చ ఏష ఏషో అస్య ॥ఇతి॥**

అట్టి పరమాత్మయొక్క చేతనాంశయే సచేతనమై ప్రతి జీవునియందు క్షేత్రజ్ఞుడుగా ప్రకాశిస్తూ...,

సంకల్పము (Vizualization/Ideation),
అధ్యవసాయము (Workmanship),
అభిమానము (Sense of Belongingness),
లింగము (Form of self),గా...

**ప్రదర్శనమగుచున్నది.**

సర్వాత్మకుడగు ఆయనయే।

- **ప్రజాపతి** (సృష్టికి కర్త).
- **విశ్వాక్షుడు** విశ్వమును తన చూపుయందు కలిగి ఉండి అనుభూతిగా పొందుచూ దర్శించువాడు

ఆయన యొక్క చేతనత్వమే ఈ జడశరీరములను చేతన వంతముగా ప్రచోదనము చేయుచున్నది! ఇదంతా ఆ మహాత్ముని సంప్రదర్శనలే!

**తేహో వాచ : (తేహోచు) :**
**"భగవన్! ఈ దృశస్య కథమ్**
**అంశేన వర్తనమ్"? – ఇతి॥**
**తాన్ హో వాచ!**

**వాలఖిల్య మునులు** : భగవన్! అట్టి పరమాత్మ అంశరూపుడై అచేతన దేహములను ఎట్లా, ఎందుకు కదల్చుచున్నారు? "కదల్చువాడు" .... కదిలే దేహములను ఎట్లు ఎందుకు ధరిస్తున్నారు? జీవాత్మాంశ కలిగి ఉండటములో పరమాత్మకు అగత్యము ఏమైనా ఉన్నదా?

**6.** **(ఇతి హో వాచ)**
**ప్రజాపతిర్వా ఏషో అగ్రే తిష్ఠత।**
**స న "ఆరమత ఏకః"–**
**స ఆత్మానమ్ అభిధ్యాయన్**
**బహ్వీః ప్రజా అసృజత్।**
**తా అస్మైవా అప్రబుద్ధా స్థాణురివ**
**తిష్ఠమానా అపశ్యత।**
**స నా రమత।**

**ప్రజాపతి** : నాయనా! ఆత్మ భగవానుడే ప్రజాపతి. ఈ దేహములను వాటి అనుభవములకు మునుముందే ఉన్నట్టి కేవల చైతన్య స్ఫూర్తి. నిర్విషయుడు. అనేకత్వమనునదే లేనివాడు. ఏక స్వరూపుడు. అట్టివాడు- **"స్థాణువువలె ఏక స్వరూపుడై ఉండటము నాకు రమ్యము కాదు. సరదాగా లేదు!!"** అని తలచారు. అప్పుడు అ మహదాత్ముడు తన ఆత్మను ధ్యానించుచు వివిధ నామ-రూపాలును ఆ ధ్యానమునుండి కల్పించుకున్నారు. వారందరు అప్రబుద్ధులుగాను, కొయ్య-రాయిలాగా స్థాణువులుగా కనిపించారు. అది కూడా ఆయనకు ఆనందం కలిగించలేదు.

**సో అమన్యత, ఏతాసాం ప్రతిబోధనాయ**
**అభ్యంతరం ప్రవిశానీత్**
**అథ స వాయుమ్ ఇవ ఆత్మానం**
**కృత్వ అభ్యంతరం ప్రావిశత్।**

అప్పుడు ఆయన **"నాచే క్రీడగా కల్పించబడిన ఈ తోలుబొమ్మ భౌతిక దేహములకు సంచలనము ఉండుటకై ప్రబోధ స్వరూపుడనై ప్రవేశించెదను గాక"** ... అని తలంచారు!

తనను తాను వాయు చలనశక్తి స్వరూపుడుగా తీర్చిదిద్దుకొని ఆ కల్పిత వివిధ భౌతిక రూపములతో కదలిక - వాయుచలనతత్త్వంగా ప్రవేశించారు.

**స ఏకో న అవిశత్।**
**స పంచధా ఆత్మానం ప్రవిభజ్య ఉచ్యతే యః**
**ప్రాణో–అపానః–సమాన–ఉదానో–వ్యాన ॥ఇతి॥**

గాలి రూపముగా మాత్రమే ప్రవేశించలేదు. తాను ధారణ చేసిన ఆ వాయు రూపము 5 విధములుగా వివర్తించుకున్నారు. **ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము అను ఐదురీతులుగా చలనము ప్రదర్శించసాగారు.**

**7.** **అథ యో అయమ్ ఊర్ధ్వమ్ ఉత్క్రామతి–ఇతి**
**ఏష వావ స "ప్రాణో"।**
**అథ యో అయం అవాఞ్చం సంక్రామతి**
**ఏష వావ సో "అపానో"।**
**అథ యో యం సవిష్ఠమ్ అన్నధాతుమ్**
**అపానే స్థాపయతి।**
**అణిష్ఠం చ అంగే–అంగే సమున్నయతి,**
**ఏష వావ స "సమానో"।**

ఊర్ధ్వమునకు (పైవైపుగా) ఉత్క్రామించునది (ప్రవహించునది) - **'ప్రాణము'**.

క్రిందవైపుగా ప్రసరించుచున్న ప్రాణ (వాయు) ప్రసరణము- **'అపానము'**.

అన్న ధాతువును శరీరములో స్థాపింపజేసి దేహము యొక్క పుష్టిని కలిగించునది ఈ **అపాన ప్రాణ వాయువు.**

దేహములోని అంగాంగముల యొక్క అణువణువు అన్నధాతువును (అన్న రసమును), జేర్చునది - **"సమాన ప్రాణవాయువు"**. (ఉత్తేజ పరచునది).

**అథ యో అయం పీతాశితమ్ ఉద్గిరతి,**
**నిగిరతీతి చ ఏష వావ స "ఉదానో"।**
**అథ ఏన ఏతాః సిరాః అనువ్యాప్తా**
**ఏష వావ స "వ్యానః"॥**

ఈ దేహి త్రాగినదానిని, తిన్న దానిని క్రింద వైపుగాను, పైవైపుగాను కదలుస్తూ పంపుచున్నట్టిది - **'ఉదాన ప్రాణవాయువు'**.

అన్న రసమును, ధమనులకు, సిరలకు ఏ శక్తి అనువ్యాప్తపరుస్తోందో, నర-నరములకు తీసుకొని పోవుచున్నదో..., అది- **"వ్యాన ప్రాణవాయువు"**.

**8.** **అథ ఉపాంశుః అంతర్యామిః**
**అభిభవతి, అంతర్యామమ్ ఉపాంశుమ్**
**ఏతయోః అంతరాళే చ ఔష్ణ్యం**
**ప్రాస్రవత్ యత్, ఔష్ణ్యం స "పురుషో"।**

అటుపై ఇంకా కూడా,

1) అంతర్యామి (The Author for the Experiencing) 2) ఉపాంశువు (Supporting Factor) అయి ఈ ఉభయములుగా పరమాత్మ అగుచున్నారు. ఈ రెండింటి అంతరంగా ఔష్ణ్యము (తేజో రూపము) ప్రసరించుచున్నది. అట్టి ఔష్ణ్య రూపుడే **"పురుషుడు"**.

| | |
|---|---|
| **అథ యః పురుషః సో**<br>**అగ్నిః (తు) వైశ్వానరోఽపి అన్యత్రాపి ఉక్తమ్।** | ఆ ఔష్ణ్య స్వరూపమే జీవాత్మ. అతడే అగ్ని. దేహములోని అగ్ని స్వరూపమగు వైశ్వానరుడు ఆయనకు వేరైనవాడు కూడా. ఇదే ఇంకొక రీతిగా చెప్పబడింది. |
| **అయమ్ అగ్నిః వైశ్వానరో**<br>**యో అయమ్ అంతః పురుషే**<br>**యేన ఇదం అన్నం పచ్యతే**<br>**యత్ ఇదమ్ అద్యతే, (ఇదమద్యతే)** | 1) ఎవ్వనిచే అన్నము తినబడుచున్నదో...,<br>2) అన్నము దేహములో పచనము చేయబడుచున్నదో...,<br>ఆతడే అంతఃపురుషుడు, వైశ్వానరుడు కూడా! ఆ జీవాత్మ యొక్క దేహములోని ఉనికి "ఘోష" శబ్దముగా వినబడుచూ ఉంటోంది! |
| **తస్య ఏష ఘోషో భవతి।**<br>**యత్ ఏతత్ కర్ణావపిధాయ శృణోతి,**<br>**స యత్ ఉత్క్రమిష్యన్ భవతి,**<br>**న ఏనం ఘోషం శృణోతి॥** | చెవులు మూసుకొని ఉన్నప్పుడు వినబడే పురుషుని యొక్క (జీవాత్మ యొక్క) ఉనికి శబ్దమే-ఆ 'ఘోష'. ఈ జీవుడు ఎప్పుడు ఈ దేహమును త్యజించుచున్నాడో, అప్పుడు ప్రాణవాయు చల సంబంధమైన ఘోష ఆ భౌతికదేహము నుండి ఇక వినబడటం ఉండదు. |
| **9.** **స వా ఏష పంచధా ఆత్మానం**<br>**ప్రవిభజ్య నిహితో గుహాయాం-**<br>**(1) మనో మయః (2) ప్రాణ శరీరో (3) 'భా' రూప**<br>**(4) సత్య సంకల్ప (5) ఆత్మ - ఇతి॥** | ఆ పరమాత్మ తనను తాను 'ఐదు' విధములుగా విభజించి జీవుని (జీవుల) హృదయగుహలో ఉంచుచున్నారు.<br>1) మనోమయము 2) ప్రాణశరీరము 3) భాస (వెలిగించు) రూపము 4) సత్య సంకల్పము 5) ఆత్మ. |
| **స వా ఏషో అస్య హృదంతరే**<br>**తిష్ఠత్ 'న కృతార్థో' అమన్యతా।**<br>**అర్థాత్ న అశ్నామి ఇత్యతః**<br>**స్వానీమాని భిత్వా ఉదితః**<br>**పంచభీ రశ్మిభిః విషయాన్ 'అత్తి' ఇతి**<br>**బుద్ధీంద్రియాణి యాని ఇమాని**<br>**ఏతాని అస్య రశ్మయః।** | **"హృదయాంతరములో ఈ ఐదు రూపాలు స్థాపించాను. అయితే కూడా ఈమాత్రముచే కృతార్థుడను (తృప్తుడను) కాదు"** - అని పరమాత్మ తలచారు. "పంచ ఇంద్రియార్థములను (శబ్ద స్పర్శ రూప రస గంధముల) అనుభవించినప్పుడే కదా కృతార్థుడను!" .... అనే ఇచ్ఛ పొందారు. పంచ రూపములను భేదించుకొని పంచ కిరణములతో పంచ విషయములను అనుభవించ దలచారు.<br>- పంచ బుద్ధీంద్రియములే జ్ఞానేంద్రియములు. అవియే ఆయన యొక్క కిరణములు. చూపు-వినికిడి-స్పర్శ-రుచి-వాసనలే-ఆత్మయొక్క దేహములోని కిరణములు. |
| **కర్మేంద్రియాణి అస్య హయా।**<br>**రథః శరీరమ్।**<br>**మనో నియంతా।** | పంచ కర్మేంద్రియములు ఆత్మచే నిర్మించబడిన గుర్రములు. ఇవన్నీ పనిచేసే శరీరము - రథము!<br>మనస్సు ఈ దేహ రథము యొక్క నియంత (లేక) సారధి. |
| **ప్రకృతమయో అస్య ప్రతోదనేన ఖలు (వ) ఈరితం**<br>**పరిభ్రమతి। ఇదం శరీరం చక్రమివ-**<br>**మృతేచ, న ఇదం శరీరం**<br>**చేతనవత్ ప్రతిష్ఠాపితం**<br>**ప్రచోదయితాచ ఏషో అస్యేతి॥** | ప్రకృతమయమగు మనస్సు (ఆలోచన)- అనే తోలుకర్రతో ప్రేరేపించబడి ఈ శరీరము - ఆట స్థలములో త్రోయబడే చక్రము వలె - పరిభ్రమిస్తోంది.<br>తోయబడిన ఇనుప చక్రము కొంతసేపు పరిభ్రమించి ఆగిపోతుంది, పడిపోతుంది చూచారా? ఆ రీతిగా, చేతన వస్తువువలె దృశ్యములో పరిభ్రమిస్తున్న ఈ శరీరము మరణము యొక్క సంభవముచే అచేతనమై పడిపోతోంది. కనుక ఈ ఈ భౌతిక దేహమునకు మనస్సే ప్రేరకుడు. మనస్సుకో, ఆత్మ ప్రేరకుడు. |
| **10.** **స వా ఏష ఆత్మేతి యదో వశం నీత ఇవ**<br>**సితాసితైః కర్మఫలైః**<br>**అభిభూయమాన ఇవ**<br>**ప్రతి శరీరం చరతి।** | ఒక ఆశ్చర్యకరమైన విషయం. **పరాత్మ**-మనస్సుకు-దేహమునకు కర్తయే అయి ఉండి కూడా తాను మనస్సుకు - శరీరమునకు వశము అయినవాని వలె అగుచున్నాడు. శుభ-అశుభ కర్మలచే పీడింపబడుచున్నట్లు అగుపించటం, అనిపించటం జరుగుతోంది. అఖండమగు ఆత్మ వేరు వేరు దేహములలో వేరు వేరు రీతులలో కర్మ-జ్ఞాన సంబంధమై నిబద్ధము అగుచున్నట్లు చూడబడుతోంది. |

| | |
|---|---|
| **అవ్యక్తత్వాత్, సూక్ష్మత్వాత్,<br>అదృశ్యత్వాత్, అగ్రాహ్యత్వాత్,<br>నిర్మమత్వాత్ చ<br>అనవస్థో, అకర్తా..-<br>"కర్తేవావ స్థితః"॥** | వాస్తవానికి ఆత్మ...,<br>**అవ్యక్తము, సూక్ష్మము, అదృశ్యము, అగ్రాహ్యము, మమకార రహితము, అవస్థాత్రయ రహితము, అకర్త** అయి ఉండి కూడా...., దేహ-మనో-బుద్ధి-చిత్త-అహంకారాదుల కార్యక్రమములకు కర్తృత్వము పొందుచున్నదానివలె స్థితి పొంది ఉంటోంది. |
| **11.** సవా ఏష శుద్ధః, స్థిరో, అచలశ్చ,<br>**అలేపో, అవ్యగ్రో, నిస్పృహః,<br>ప్రేక్షకవత్ అవస్థితః**॥ | సర్వ దేహులలోని (దేహములలోని) సర్వదా బాహ్య-అభ్యంతరములలో వేంచేసియున్న దేహి రూపుడగు పరమాత్మ యొక్క స్వరూపము-<br>- శుద్ధము, స్థిరము.<br>- అచలము. దేనిచేతనూ అంటబడనట్టి అలేపము. అసంగము.<br>- దేనిచేత కూడా వ్యగ్రత పొందనట్టిది. జాగ్రత్ స్వప్న సుషుప్తులకు ఆవల నిస్పృహాయై ఉన్నట్టిది.<br>ఇంకా కూడా, -<br>నాటకము చూస్తున్న ప్రేక్షకుని వలె కేవల సాక్షిగా అవస్థితమై ఉన్నట్టిది. |
| **స్వ స్వచరితభుక్ గుణమయేన, పటే న,<br>ఆత్మానమ్ అంతర్ధాయ అవస్థిత॥<br>ఇత్యవస్థిత॥ ఇతి॥**<br><br>**ఇతి ద్వితీయ పాఠకః॥** | అట్టి ఆత్మ తనచే రచించుకొనబడిన ఊహా చరితమును తానే జన్మ-కర్మల రూపముగా ఆస్వాదిస్తున్నది. గుణమయము అనే రూపము గల అంగవస్త్రముతో తనను తానే ఆచ్ఛాదనముగా కప్పుకున్నట్టిది అగుచున్నది.<br>ఆత్మ ఈవిధంగా అందరిలోను, అందరుగాను అవస్థితమై యున్నది.<br>ఓ బృహద్రథా!<br>నీవు సర్వదా అట్టి ఆత్మస్వరూపుడవే అయి ఉన్నావు.<br>***తత్త్వమసి॥***<br>**ఇతి ద్వితీయ పాఠకః॥** |

# తృతీయ ప్రపాఠకః

| | |
|---|---|
| **1. తే హ ఊచు :**<br>**భగవన్! అద్యైవమ్ అపి ఆత్మనో**<br>**మహిమానం సూచయతి।** | **వాలఖిల్య మునీశ్వరులు** : భగవన్! హే ప్రజాపతీ! మీరు చెప్పే విషయములన్నీ కూడా ఇప్పటికే నేనై ఉన్న **"ఆత్మ మహామహితాత్మ మైనది"** .... అనియే సూచిస్తున్నాయి కదా! |
| **అన్యోవ అపరః (కిం)?**<br>**కో అయమ్ ఆత్మా? - యో అయం**<br>**సితాసితైః కర్మఫలైః**<br>**అభిభూయమానః**<br>**సత్-అసత్ యోనిం ఆపద్యత,**<br>**ఇతి అవాచీం వ ఊర్ధ్వాం వా గతిం**<br>**ద్వంద్వైః అభిభూయమానః పరిభ్రమతీతి**<br>**కతమ ఏష? ఇతి॥**<br>**తాన్ హెూ వాచ।** | మరి ఆత్మకు మరొక అపరమగు ఆత్మ ఉన్నదా? (పరమాత్మకు చెందినదై 'జీవాత్మ' అనబడునది వేరుగా ఉన్నదా?) ఏ ఆత్మ శుభాశుభ కర్మఫలముల చేత పీడింపబడుచున్నదో, సత్-అసత్ జన్మలను పొందటం జరుగుతోందో, ఊర్ధ్వ - అధోగతులచే (సుఖ దుఃఖ) ద్వంద్వములచే బాధింపబడుతూ పరిభ్రమిస్తోందో.... ఆ రెండవ ఆత్మ ఎవరు? ఎక్కడి నుండి వచ్చియున్నది? "ఇహాత్మ" (లేక) "భూతాత్మ" (లేక) "జీవాత్మ" - అనునది ఉన్నదా? ఒకవేళ వేరుగా ఉంటే, ఎట్టిదై ఉన్నది? నాకు వేరైనదా? ఎక్కడి నుండి జనించి, ఇక్కడకు వచ్చి చేరుతోంది? అట్టి 'జీవాత్మ' (లేక) భూతాత్మ యొక్క కార్యక్రమములు, వాస్తవ స్వరూపము ఎట్టివి? |
| **2. అస్తి ఖలు అన్యో అపరో భూతాత్మా, యోయం**<br>**సితాసితైః, కర్మఫలైః అభిభూయమానః**<br>**సత్-అసత్ యోనిమ్ ఆపద్యత,**<br>**ఇతి, అవాచీం వ ఊర్ధ్వామ్ గతిం**<br>**ద్వంద్వైః అభిభూయమానః పరిభ్రమతి।**<br>**ఇతి అస్య ఉపవ్యాఖ్యానం:॥** | **ప్రజాపతి :** అవును! రెండవదగు అపరమగు 'భూతాత్మ' అని చెప్పబడేది ఉన్నది. **ఏ భూతాత్మ** అయితే శుభాశుభ కర్మ ఫలాలచే బంధించ బడుతోందో, సత్-అసత్ దేహములలో (లేక) యోనులలో మజిలీలతో కూడిన సుదీర్ఘ ప్రయాణాలు నిర్వర్తిస్తోందో,<br>ఊర్ధ్వ - అధో మార్గములలో వెట్టితో కూడిన బాటసారివలె సంచారాలు సలుపుతోందో, అనేక ద్వంద్వములను మూటలుగా మోస్తూ కట్టుబడి పరిభ్రమిస్తోందో - అదియే జీవాత్మ (లేక) ఇహాత్మ. అట్టి భూతాత్మ గురించి వివరించుకుందాము. "భూత + ఆత్మ" ... అను దానిలో **భూతము** అనగా? |
| **→ పంచతన్మాత్రాణి 'భూత' శబ్దేన ఉచ్యంతే।**<br>**→ పంచమహా భూతాని 'భూత' శబ్దేన ఉచ్యంతే।** | - శబ్ద - స్పర్శ - రూప - రస - గంధములనే పంచతన్మాత్రలను **'భూత'** శబ్దముచే ఉద్దేశ్యించబడుతోంది.<br>అట్లాగే - భూ - జల - అగ్ని - వాయు - ఆకాశములనబడే పంచ మహాభూతములను కూడా **'భూత'** శబ్ద-ఉద్దేశ్యము! |
| **అథ తేషాం యః సమవాయః శరీరమ్ ఉక్తమ్।**<br>**అథ యో హ ఖలు వావ 'శరీరమ్' ఇత్యుక్తమ్-**<br>**స 'భూతాత్మ' ఇతి ఉక్తమ్।** | పంచ తన్మాత్రల + పంచ మహాభూతముల సమవాయమే (లేక ఇవన్నీ మేళవించబడిన రూపమే) ... శరీరము అనే పేరుతో చెప్పబడుతోంది.<br>ఏది ఇక్కడ **'శరీరము'** అని చెప్పుకుంటున్నామో అదియే **'భూతాత్మ'** అని కూడా - చెప్పబడుతోంది. |
| **అథ అస్తి తస్య ఆత్మా బిందురివ పుష్కర ఇతి।**<br>**స వా ఏషో అభిభూతః।**<br>**ప్రాకృతైః గుణైః ఇతి అతో**<br>**అభిభూత్వాత్ సంమూఢత్వమ్**<br>**ప్రయాత్య, సమ్మూఢత్వాత్ ఆత్మస్థం**<br>**ప్రభుం, భగవంతం, కారయితారం-** | తామరాకుయందు జల బిందువు ఉంటుంది చూచావా? ఆవిధంగా భూతాత్మ యందు పరమాత్మ ఉంటోంది.<br>భూతాత్మ ప్రకృతి సంబంధమైన ప్రాకృత గుణములచే పీడింపబడుచూ సమ్మూఢత్వము పొందుచున్నది.<br>అట్టి సమ్మూఢత్వము కారణంచేత ఈ భూతాత్మ (జీవాత్మ)- తన ఆత్మస్థుడు, తన ప్రభువు, భగవంతుడు, సర్వ పంచ జ్ఞాన-కర్మేంద్రియ ములకు కారయిత (నిర్వర్తింప జేయువాడు-నియమించువాడు)- అగు పరాత్మను (తనలోని ఆవలి **'శాశ్వత-సహజ'** స్వరూపమును) దర్శించలేక |

**న అపశ్యత్ గుణౌఘైః తప్యమానః**
**కలుషీకృతశ్చ, అస్థిరః, చంచలో,**
**లోలుప్యమానః -స స్పృహో, వ్యగ్రశ్చ,**
**అభిమానిత్వం ప్రయాత।**

పోతున్నాడు. గమనించలేకపోతున్నాడు. ఫలితం? త్రిగుణములచే తపించబడుచు, కలుషీకృతుడై, దోష భూయిష్టుడై, అస్థిరుడై, చంచలుడై, ఆశ-కోరికలకు బద్ధుడై, జ్ఞానవీక్షణ స్పృహ లేనివాడై, వ్యగ్రుడై, దేహ దురభిమానియై ఉంటున్నాడు.

---

**"<u>ఇతి అహమ్-స మమ</u>" - ఇదమ్**
**ఇత్యేవమ్**
**మన్యమనో, ... నిబధ్నాత్**
**ఆత్మన ఆత్మానమ్ జాలేనేవ ఖచరః,**
**కృతస్య అనుఫలైః అభిభూయమానః పరిభ్రమతి ॥ఇతి॥**

**"ఇది నేను. అది నాది. ఇది ఇంతే"** అని తలచుచు తన ఆత్మకు తానే బంధము ఆపాదించుకొంటున్నాడు. వలలో (జాలము)లో చిక్కుకున్న పక్షివలె అనేక **కర్మ పరంపరలు**. వాటివాటి **ఫలములు**. ఫలముల కారణంగా నిర్వర్తించవలసి వస్తున్న ఉత్తరోత్తర **కర్మలయందు** కట్టుబడి- ఈవిధంగా- **సంసారారణ్యములో కుంటుకుంటూ పరిభ్రమిస్తున్నాడు.**

---

**3. <u>అథ అన్యత్ర అపి ఉక్తమ్॥</u>**
**యః కర్తా, సో అయంవై 'భూతాత్మా'।**
**కరణైః కారయిత-అంతః పురుషో।**

**ఇంకా కూడా ఇట్లా అని శాస్త్రములు వేరు వేరుచోట్ల చెప్పుచూనే ఉన్నాయి.**

**"కర్మలకు కర్తను నేనే!"** అని భావించుచూ, సర్వాంతర్యామిని ఏమరచువాడే **భూతాత్మ**. ఈ భూతాత్మయే **'అంతః పురుషుడు'** కూడా!

---

**అథ యథా అగ్నినా అయః పిండోవా**
**అభిభూతః కర్తృభిః హన్యమానో నానాత్వమ్ ఉపైతి।**
**ఏవం వావ ఖలు అసౌ భూతాత్మా అంతః పురుషేణ**
**అభిభూతో గుణైః హన్యమానో నానాత్వమ్ ఉపైతి।**

అగ్నితో కాలిన ఇనుపగోళమును కమ్మరిచే గుణపపు సుత్తిచే మోదినప్పుడు అనేక ముక్కలుగా అగుచున్నది కదా!

అట్లాగే, అంతఃపురుష రూపుడగు ఈ భూతాత్మకూడా 'త్రిగుణములు' అనే కమ్మరి ఉలి (సుత్తి)తో కొట్టబడి నానా ప్రకారములుగా అగుచున్నది.

---

**అథ యత్ త్రిగుణం చతురశీతి లక్ష (84 లక్షల)**
**యోని పరిణతమ్, భూత గణమ్ ఏతద్వై**
**నానాత్వ స్వరూపం**
**తాని హవా ఇమాని గుణాని పురుషేణ ఈరితాని।**

త్రిగుణముల నానావిధములైన సమ్మేళనమే సృష్టిలోని 84 లక్షల జీవజాతులు (భూతాత్మగణము).

ఈ త్రిగుణ సమ్మేళణములు భూతాత్మచే ప్రేరేపించబడినవై 84 లక్షల జీవ జాతులలో (ఈ భూతాత్మ లేక పురుషుడు లేక జీవుడు)-చక్ర యంత్రమును ఎక్కినవానివలె - సంచారములు చేస్తున్నాడు.

---

**చక్రమివ చక్రిణేతి ।**
**అథ యథాయః పిండే హన్యమానే**
**న అగ్నిః అభిభూయతి,**
**ఏవం న అభిభూయతి। అసౌ పురుషో-**
**అభిభూయతి అయం భూతాత్మా**
**ఉప సంశ్లిష్టత్వాత్ ॥ఇతి॥**

**అయితే, ఇక్కడ ఒక ముఖ్య విషయం గమనించండి!**

కాలుచున్న ఇనుప గుండు అగ్ని గోళమును కమ్మరి సుత్తితో మోదుచున్నప్పుడు ఇనుపగుండు అనేక ముక్కలుగా (84 లక్షల జీవ జాతులవలె) అగుచుండవచ్చు గాక! కానీ అగ్ని ఖండములుగా అగుచున్నదా? లేదు. అగ్నికి అనేకత్వము ఉండదు. అట్లాగే...,

భూతాత్మ 84 లక్షల విధములైన జీవజాతి ఉపాధులలో గుణముల ప్రభావంచే చక్రభ్రమణము వలె సంచరించ వచ్చును గాక! కానీ **పరమ పురుషుడగు ఆత్మకు ఖండత్వమనునదే ఉండదు.**

కేవలస్వరూపుడగు పరాత్మ సర్వదా అఖండమే. స్వయం కల్పితమాత్రుడగు భూతాత్మ మాత్రమే జన్మ-కర్మ బాధలన్నీ పొందటం జరుగుతోంది!

---

**4. <u>అథ అన్యత్రాపి ఉక్తమ్।</u>**
**శరీరమ్ ఇదమ్ మైథునాత్ ఏవ ఉద్భూతమ్।**
**సంవిత్ అపేతం, నిరయ ఏవ।**
**మూత్రద్వారేణ నిష్క్రాంతమ్।**
**అస్థిభిః చితం।**
**మాంసేన అనులిప్తం।**

**ఇదే (వేదాంత శాస్త్రములో) ఇంకా ఈ రీతిగా కూడా చెప్పబడుతోంది!**

ఈ భౌతిక దేహము మైధునము (స్త్రీ-పురుషుల కలయికచే) పుట్టుచున్నది. ఇది జడము. అనగా, జ్ఞాన రహితమైనది. నరకప్రాయమైనది. మూత్ర ద్వారము నుండి వెలువడినట్టిది. ఎముకల గూడు, మాంసమయము అయి, చర్మముచే కప్పబడి ఉంటోంది.

మల-మూత్రములు, పిత్తము, కఫము, చీము, మజ్జ, మేదస్సు, క్రొవ్వు

**చర్మణావ బద్ధమ్।**
**విణ్మూత్ర-పిత్త-కఫ-మజ్జా-మేదో వసాభిః,**
**అన్యైశ్చ మలైః బహుభిః పరిపూర్ణం**
**కోశ ఇవ ధనేన ॥ఇతి॥**

మొదలుగా అనేక రకములైన మాలిన్యములతో నిండియున్నది. ఇది కాక **ఒక ధనాగారము వలె అనేక పదార్థములు కలిగి ఉన్నట్టిది!**

---

**5. అథ అన్యత్రాపి ఉక్తమ్।**
**సంమోహో, భయం, విషాదో, నిద్రా, తంద్రీ, వ్రణో,**
**జరా, శోకః, క్షుత్పిపాసా, కార్పణ్యం, క్రోధో, నాస్తిక్యమ్,**
**అజ్ఞానం, మాత్సర్యం, నైష్కారుణ్యం,**
**మూఢత్వం, నిర్వ్రీడత్వం, నికృతత్వం,**
**ఉద్ధతత్వమ్, అసమత్వమ్**
**ఇతి తామసాన్వితః॥**

**ఇంకా కూడా ఇందులో ప్రత్యక్షమై ఉంటున్న త్రిగుణములు మొదలైనవాటి గురించి ఇట్లా గమనించబడుతోంది.**

**ఈ దేహములోని తామసగుణములు :**

**సంమోహత్వము,** (Illusion and Misconception), **భయము, విషాదము, నిద్ర, బద్ధకము (సోమరితనము), పుండ్లు, వార్ధక్యము, శోకము, ఆకలి, దాహము,** (కొందరి గురించి) **దిగులు (మరికొందరిపై) కోపము,** (మరణానంతరము నేను ఉండను. దైవము లేదు - అనే) **నాస్తిక్యము, అజ్ఞానము, మత్సరము,** (కొందరిపై జాలి - అనే) **కారుణ్యము, మూఢత్వము, నిర్లజ్జ, నీచత్వము,** (నేను అంతటివాడిని కదా - అనే) **గర్వము,** (వారు వేరు - వీరు వేరు అనే) **అసమత్వము** మొదలైనవి.

---

**తృష్ణా, స్నేహో, రాగో, లోభో,**
**హింసా, రతిః, దృష్టిః, వ్యాపృతత్వం,**
**ఈర్ష్యా, కామమ్, అస్థిరత్వమ్,**
**చంచలత్వమ్, జిగీషా, అర్థోపార్జనమ్,**
**మిత్రానుగ్రహణమ్, పరిగ్రహ, అవలంబో,**
**అనిష్టేషు ఇంద్రియార్థేషు ద్విష్టిః,**
**ఇష్టేషు అభిష్వంగ। -**
**ఇతి రాజసాన్వితైః॥**

**ఇందులోని రాజస గుణములు:**

(ఇంకేదో ఇంకా పొందాలి, కావాలి - అనే) **తృష్ణ,** (వారు పరాయివారు - అనే) **అస్నేహము,** (వీరు మా వారు - అనే) **రాగము,** (ఉన్నది పోతుందేమోననే) లోభము, (ఇతరులను బాధించటము - అనే) **హింస,** విషయములలో రమించాలనే **కామ దృష్టి,** (క్షణమొక ఆలోచన చేసే) **వ్యాపృతత్వము, ఈర్ష్య (లేనిదేమో లభించటంలేదనే), కామము,** (పట్టుకున్నది వదలలేని) అవస్థిత్వము, చంచలత్వము, పరుల సంపద, పర స్త్రీ వ్యామోహ రూపమైన **జిగీష,** ధన **సంపాదనపై ధ్యాస,** స్నేహితులనుకొన్నవారిపై అనుగ్రహము, జాలి, (దగ్గిరకు చేరినవారిపట్ల అవలంబించే) **ఆవేశము,** ("వారికి నేనే ఆలంబనము, నాపై ఆధారపడి ఉన్నారే! తరువాత ఏమౌతారు?" అను) **మమకారము,** (అయిష్టమైన ఇంద్రియార్థముల పట్ల) **ద్వేషము,** (ఇష్టమైన విషయము లందు) **ఆసక్తి....** ఇవన్నీ **రాజసాన్వితమైనవి!**

---

**(ఇతి రాజసాన్వితైః।)**
**పరిపూర్ణ, ఏతైః అభిభూత ఇతి,**
**అయం భూతాత్మా। తస్మాత్**
**నానా రూపాణి ఆప్నోతి ఇతి॥**
**ఆప్నోతి ఇతి॥**

ఇటువంటి తామస-రాజస గుణములచే హృదయమంతా నిండి ఆక్రమించుకొనబడినవాడై, వాటిచే ఈ భూతాత్మ కప్పబడినవాడై ఉంటున్నాడు. తత్ఫలితం? నానా రూపాలను (84 లక్షల జీవజాతుల రూపాలను) పొందటం ఒక చక్రభ్రమణము వలె జరుగుతోంది! చర్విత చరణంగా అనేక జన్మలు ఎత్తుచున్నాడు.

ఒక దేహము తరువాత మరొకర దేహములోనికి - ప్రవేశ నిష్క్రమణములు అవిశ్రాంతంగా చేస్తూ, చేస్తూపోతున్నాడు.

# చతుర్థ ప్రపాఠకః – ఆత్మ ఏవ ఇదగ్ం సర్వమ్

**1. తే హ ఖలు అథ, ఊర్ధ్వరేతసో అతివిస్మితా।**
**అభి సమేత్య ఊచుః :**
**"భగవన్ నమస్తే! త్వన్ నః శాధి। (త్వన్నోశ్శాధిః)।**
**త్వమ్ అస్మాకమ్ గతిః। అన్యా న విద్యత। ఇతి।।**
**అస్య కో విధిః భూతాత్మనో**
**యేన ఇదమ్ హిత్వాత్**
**ఆత్మన్యేవ సాయుజ్యమ్ ఉపైతి"?**
**తాన్ హెూ వాచ:**

ఇదంతా విని ఊర్ధ్వరేతస్కులు, తపో సంపన్నులగు వాలఖిల్య మునులు విస్మితులైనారు! ఆశ్చర్యం పొందారు! భూతాత్మ పొందే సంసార చక్ర భ్రమణమునకు 'భయము' పొందారు.

వారు ప్రజాపతితో ఇట్లా పలుకసాగారు.

**వాలఖిల్య మునీశ్వరులు:** హే ప్రజాపతీ। బ్రహ్మ భగవన్! మీకు నమస్కరిస్తున్నాము. శరణు వేడుచున్నాము. 'కిం కర్తవ్యమ్?' గురించి మీరు మమ్ములను ఆజ్ఞాపించండి! మీరే మాకు గతి! మాకు వేరే దిక్కు లేదు.

ఈ విషయం మాకు చెప్పండి. ఈ జన్మ-కర్మల చక్రముల చిక్కుకున్న భూతాత్మయొక్క గతి ఏమిటి? భూతాత్మగా మాగతి ఇంతేనా? ఈ భూతాత్మకు ఎట్లా, దేనిచేత ఈ తామసిక-రాజసిక గుణఫలములు తొలగగలవు? సంసార చక్రాంతర్గత భ్రమణమును వదలి ఆత్మ సాయుజ్యము మేము పొందేది ఎట్లా?

ఈ ప్రశ్న విని ప్రజాపతి ఇట్లా సమాధానము ఇవ్వసాగారు.

---

**2. అథ అన్యత్రాపి ఉక్తమ్!**
**మహానదీషు ఊర్మయ ఇవ నివర్తకమ్!**
**అస్య యత్ పురాకృతం సముద్ర వేలేవ దుర్నివార్యమ్।**
**అన్య మృత్యోః ఆగమనమ్।**
**సత్ – అసత్ ఫలమ్ అయైర్హి**
**పాశైః పశురివ బద్ధమ్।**

**ఇదియే అనేకచోట్ల కూడా చర్చించబడింది, వివరించబడింది సుమా!**

ఈ భూతాత్మ సంసారములో సంచరిస్తూ తనయొక్క పర స్వరూపమును ఏమరచి ఉంటున్నాడు. స్మరించటం లేదు.

మహా నదిలో తరంగము నదీ జలంలోనే చిక్కుకుని ఒడ్డుకు చేరని విధంగా...,

ఈ భూతాత్మ పూర్వకర్మలు-ఫలములు అనే మహా సముద్రములో చిక్కుకుని ఉంటున్నాడు. కర్మఫలములు, కర్మలు ఆతనిపట్ల ఆగక దుర్నివార్యం అగుచున్నాయి.

**ఒకవైపు మృత్యువుయొక్క ఆగమనము, మరొకవైపు సత్-అసత్ కర్మఫలములు పాశములై ఈ జీవాత్మ (లేక) భూతాత్మను పశువువలె బంధించి ఉంచుచున్నాయి.**

---

**బంధనస్థ ఏవ అస్వాతంత్ర్యం।**
**యమ విషయస్థ ఇవ బహుభయావస్థమ్।**
**మదిరోన్మత్త ఇవ మోహ మదిరోన్మత్తమ్।**
**పాప్మనా గృహీత ఇవ భ్రమ్యమాణం।**
**మహా–ఉరగ దష్ట ఇవ విషయ దష్టమ్।**

అనేక బంధనములలో ఇరుకుకొన్నవాడై, అస్వాతంత్రుడై, యముని దృష్టిలో పడినవాడై బహు భయావస్థలో ఉండి ఉంటున్నాడు.

కల్లు త్రాగి మత్తెక్కినవాని వలె దృశ్య విషయ-మత్తుడై దృశ్యములో ఆనందం కోసం వెతకుచున్నాడు.

పాప దేవతకు పట్టుబడినవానివలె అనేక భ్రమలలో తిరుగాడుచున్నాడు.

గొప్ప విష సర్పము (పాము) కరచిన వానివలె అనేక విపత్తులలో మ్రగ్గుచున్నాడు.

---

**మహాంధకార ఇవ రాగాంధమ్।**
**ఇంద్రజాలమ్ ఇవ మాయామయమ్।**
**స్వప్న ఇవ మిథ్యా దర్శనమ్।**
**కదళీగర్భ ఇవ అసారమ్!**

మహాంధకారములో చిక్కుకొన్నవానివలె **'రాగము'చే కళ్ళు మూసుకొనిపోయి** ఉంటున్నాడు.

**ఇంద్రజాలము** వలె మాయామయమైన విశేషాలెన్నిటికో పట్టుబడి ఉంటున్నాడు.

**కల కంటున్నవాని వలె** మిథ్యా విషయాలన్నీ సత్యము వలె దర్శిస్తున్నాడు.

అరటి చెట్టు కాండము మధ్యలో ఏమీ ఉండనట్టు, హృదయంలో నిస్సారుడై ఉంటున్నాడు.

నట ఇవ క్షణ వేషమ్!
చిత్ర భిత్తిరివ మిథ్యామనోరమమ్।
ఇతి అథ ఉక్తమ్। (ఇత్యథోక్తమ్)॥
శబ్ద-స్పర్శాదయో యే అర్థా
అనర్థా ఇవ తే స్థితాః।
యేషామ్ సక్తస్తు భూతాత్మా
న స్మరేత్ చ పరంపదమ్॥

నటునివలె క్షణమొక వేషం వేస్తున్నాడు. గోడమీద చిత్రించిన సరస్సులో దాహం తీర్చే నీళ్ళుంటాయా? అట్లా తీరని మిథ్యా మనోరథములు ఆశ్రయిస్తున్నాడు. అర్థరహితములు, అనర్థములు కూడా - అయినట్టి శబ్ద స్పర్శ రూప రస గంధములకు ఏవేవో అర్థములను కల్పించుకొని వాటియందు మునిగి తేలుచున్నాడు.

ఈవిధంగా శబ్ద స్పర్శాదులందు ఆసక్తత కల్పించుకొనియున్న ఈ భూతాత్మ తన ఆస్థి (His own Property) యగు **'పరమపదము'**ను గుర్తించటము లేదు. స్మరించటము లేదు.

---

3. అయం వావ ఖలు అస్య ప్రతివిధిః భూతాత్మనో।
- యత్ ఏవ విద్యాధిగమః-
- స్వధర్మస్య అనుసరణమ్।
- స్వ ఆశ్రమేషు ఏవ అనుక్రమణమ్।

స్వధర్మ ఏవ సర్వం ధత్తే స్తంభశాఖే
చేతరాణ్యనేన "ఊర్ధ్వభాగ్" భవతి।
(భగవద్గీత శ్రేయోహి జ్ఞానం అభ్యాసాత్।
జ్ఞానాత్ ధ్యానం విశిష్యతే।
ధ్యానాత్ కర్మఫల త్యాగః।
త్యాగాత్ శాంతిః అనంతరమ్॥)

ఇదీ పరిస్థితి! ఇప్పుడు ఈ భూతాత్మయొక్క సంసారారణ్య బంధస్థితికి ప్రతివిధి (Counter Action) ఏమిటి? విచారణ చేద్దాము.

1) ఆత్మతత్త్వ విచారణ. ఆత్మ విద్యను అభ్యసించటము.

2) స్వధర్మమును శ్రద్ధగా నిర్వర్తించటము. స్వ ఆశ్రమ సంబంధమైన శాస్త్ర ప్రవచిత విధి విధానములను అనుకరించటము.

3) ప్రాణాయామాది యోగోపాయములు.

స్వధర్మము (విహితమైనట్టి ధర్మము) అనే స్థంభమును గట్టిగా పట్టుకోవాలి. అప్పుడు కర్మపరంపరల అరణ్యము నుండి ఆ స్వధర్మమే (ధర్మో రక్షతి రక్షితః) - ఈ భూతాత్మను ఊర్ధ్వమునకు తేగలదు. (కర్మఫలత్యాగము).

---

అన్యథా, అధః పతతి।
ఏష స్వధర్మ అభిభూతో యో వేదేషు
న స్వధర్మాతిక్రమేణ అశ్రమీ భవతి।
ఆశ్రమేషు ఏవ అవస్థితః "తపస్వీచేత్" ఉచ్యత।
ఏతదపి ఉక్తం।

అట్లా కాకుండా, జన్మ పొందినందుకు కృతజ్ఞత అయినట్టి స్వధర్మము ఏమరచబడిందా, ఇక అధఃపతనము (అల్ప జన్మలు) తప్పేవి కావు.

(1) ఏదేది వేదములచే, వేద వాక్కులచే 'విహితము' (చెయ్యాలి) అని చెప్పబడుచూ వస్తోందో, అది నిర్వహించటము. (2) నిషేధమైన కర్మలు నిర్వర్తించకపోవటము-ఇదియే స్వధర్మము. స్వధర్మమును అతిక్రమిస్తే, అట్టివాడు అనాశ్రమి, మార్గము తప్పువాడు అగుచున్నాడు.

ఏ ఆశ్రమ వాసి అయితే, ఆ ఆశ్రమ ధర్మములను శ్రద్ధ-భక్తులతో స్వ ధర్మముగా నిర్వర్తించాలి. నిర్వర్తిస్తూ ఉంటే **"ఆశ్రమి-ఆశ్రమ తపస్వి"** అగునని చెప్పకోబడుచున్నాడు. (మనుధర్మము, భారత రామాయణ భాగవతములు - మొదలైనవి విధినిషేధములను విస్తారంగా నిర్వచించి చెప్పుచున్నాయి).

---

న అతపస్కస్య ఆత్మజ్ఞానాధిగమః।
కర్మశుద్ధిర్వ ఇత్యేవం హి ఆహ।
"<u>తపసా</u> ప్రాప్యతే <u>సత్త్వమ్</u>।
సత్త్వాత్ సంప్రాప్యతే <u>మనః</u>।
మనసా ప్రాప్యతే తు ఆత్మా హి।
ఆత్మా ఆప్త్వా న నివర్తత॥ ॥ఇతి॥

**స్వధర్మ నిరతి తపస్సే అవుతుంది.**

- అతపస్కుడు (తపస్సు లేనివాడు) ఆత్మజ్ఞానమునకు అర్హుడు కాలేడు.
- **కర్మ** - బుద్ధియొక్క శుద్ధి కొరకే శాస్త్రములచే, తత్త్వజ్ఞులచే మొ॥ వాటిచే ఉద్దేశ్యించ బడుతోంది. చెప్పబడుతోంది.
- తపస్సుచే బుద్ధి రజో-తమములను వదలి సత్త్వస్థితి పొందుతుంది. సాత్త్వికమైన భావాలు బలపడతాయి.
- సత్త్వ స్థితిచే మనస్సు నిర్మలమౌతుంది.
- నిర్మలమైన మనస్సుకు ఆత్మయొక్క అనుభవము ప్రాప్తించ గలదు.

**ఆత్మానుభవముచే అన్ని దుఃఖదోషములు, జన్మ-కర్మ బంధాలు వాటికవే నివర్తిస్తాయి.** తొలగుతాయి. ఆత్మ జ్ఞానముచే **'పునరావృత్తి దోషము'** - కడిగివేయబడగలదు.

<u>(అత్రైతే శ్లోకా భవంతి।)</u>

**4. యథా నిరింధనో వహ్నిః స్వయోనా ఉపశామ్యతి,**
**తథా వృత్తిక్షయాత్ చిత్తం స్వయోనా ఉపశామ్యతి।**
**స్వయోనా ఉపశాంతస్య మనసః సత్యగామినః।**
**ఇంద్రియార్థా విమూఢస్యాత్ అనృతాః, కర్మవశానుగాః।**

ఇదియే మహనీయులచే గానము చేయబడుతోంది. ఇంకా ఇట్లా చెప్పబడుతోంది.

ఏవిధంగా అయితే కట్టెలు (ఇంధనము) తరిగిపోతూ ఉండగా, - అగ్ని స్వయంగా ఉపశమిస్తుందో..., ఆ రీతిగానే,

దృశ్య సంబంధమైన వృత్తులు (ఇంద్రియార్థములకు సంబంధించిన ఆవేశ పూరిత ఆలోచనలు) తొలగుచుండగా చిత్తము తనకు తానే క్షయిస్తూ వస్తుంది.

అసత్యములగు ఇంద్రియార్థములను వదలి, సత్యము-నిత్యము అయిన ఆత్మపట్ల శ్రద్ధ - ఆసక్తి పెంపొందించుకొంటుంటే, ఆ సత్యకామి పట్ల - చిత్తము (లేక) మనస్సు తేలికగా ఉపశాంతించగలదు.

అసత్యము, సందర్భ పరిమిత మాత్రము అగు ఇంద్రియార్థముల విషయముల పట్ల ఆశ-నిరాశల విమూఢత్వముచేత కర్మబంధము కొనసాగగలదు. పెంపొందగలదు. కనుక జాగరూకులై ఉండాలి.

---

**<u>చిత్తమేవ హి సంసారః। తత్ ప్రయత్నేన శోధయేత్।</u>**
**యత్ చిత్తః తన్మయో భవతి, గుహ్యమ్ ఏతత్ సనాతనమ్।**

నాయనలారా! చిత్తము యొక్క రూపము? **ఇష్టము.** అట్టి చిత్తమే సంసారము. ఈ జీవునికి చిత్తమునకు వేరైన సంసారమంటూ ఏదీ లేదు. అందుచేత ఈ చిత్తమును అనుక్షణం శోధిస్తూ ఇద్దానిలోనించి ఇంద్రియార్థ సమాచారములపట్ల అభిలాషను తొలగించి ఆత్మ సమాచారముతో నింపాలి. చిత్తము ఎటువెళ్ళుతూ ఉంటే అది తానే ఆయా ఆయా అనుభవముయే సమస్త దృశ్యానుభవములుగా, జగదనుభవముగా అవుతుంది. ఇదియే చిత్తము గురించిన సనాతన సత్యము. (స్వకీయ ఇష్ట - అభిలాషలే జగదనుభవముయొక్క రహస్యమైన రూపము)

---

**చిత్తస్య హి ప్రసాదేన హంతి కర్మ శుభాశుభమ్।**

ఈ చిత్తము నిర్మలము అవుతూ ఉంటే, ఇక శుభాశుభములతో కూడిన కర్మలు, వాటి వలన కలిగే బంధములు వాటికవే తొలగగలవు.

---

**ప్రసన్నాత్మా ఆత్మని స్థిత్వా, సుఖమ్ అవ్యయమ్ అశ్నుతే।**

చిత్తము ఇంద్రియార్థ దోషములను తొలగించుకొని ఆత్మభావనయందు స్థితి పొందుతూ ఉంటే ఏ సుఖము ఈ జీవుడు పొందగలడో, అది 'అవ్యయ సుఖము'. (చిత్త కల్పిత సుఖమో? వ్యయము కాబోయే సుఖము).

---

**సమాసక్తం యథా చిత్తమ్ జంతోః విషయగోచరే,**
**యత్ ఏవమ్ బ్రహ్మణస్యాత్**
**తత్ కో న ముచ్యేత బంధనాత్?**

ఈ చిత్తము ఏ రీతిగా ఇంద్రియ గోచరములందు (విషయములందు) ఆసక్తి పొంది లగ్నమౌతోందో...,

అదే రీతిగా ఆ చిత్తము బ్రహ్మమునందు లగ్నమౌతూ ఉంటేనో? ఏమౌతుంది? ఇక ఆతనికి జన్మ-కర్మల సంసార బంధము నుండి విముక్తి ఎందుకు లభించదు? తప్పక లభిస్తుంది.

మననము చేత 'మనస్సు', ఇష్టముచేత చిత్తము ఏర్పడుచున్నాయి.

---

**మనో హి ద్వివిధమ్ ప్రోక్తమ్।**
**<u>శుద్ధంచ</u> <u>అశుద్ధ</u> మేవ చ।**
**అశుద్ధమ్ → కామ సంకల్పమ్।**
**శుద్ధమ్ → కామ వివర్జితమ్।।**

ఈ మనస్సు (లేక చిత్తము) రెండు రీతులుగా ఉండటం జరుగుతోంది. 1) శుద్ధము 2) అశుద్ధము.

- కామ సంకల్పములచేత - అశుద్ధ చిత్తము (లేక) అనిర్మలమైన మనస్సు,
- కామ సంకల్పములు త్యజించటం చేత - శుద్ధ చిత్తము (లేక) నిర్మలమైన మనస్సు- నిర్మితమౌతున్నాయి.

---

**లయ-విక్షేప రహితమ్, మనః కృత్వా సునిశ్చలమ్, -**
**యదా యాతి "అమనీ" భావమ్,**
**తదా తత్ 'పరమమ్ పదమ్'।।**

ఎప్పుడైతే (ఆత్మ సమాచారము-ఆత్మధ్యాస-సమాత్మ భావనలచే) మనస్సు నిశ్చలము, విక్షేప రహితము అవుతుందో- అప్పుడు "అమనీ (విషయాతీత) భావము" పొందుచున్నది. ఇక అప్పుడు అదియే **పరమపదము!**

| |
|---|
| తావత్ ఏవ నిరోద్ధవ్యమ్<br>హృది యావత్ క్షయం గతమ్।<br>ఏతత్ జ్ఞానం చ – మోక్షం చ ।<br>శేషాస్తు గ్రంథ విస్తరాః॥ |

హృదయములో జగత్ (లేక) దృశ్య భావావేశముల దోషము ఉన్నంత వరకు, స్వధర్మము-ఆశ్రమ ధర్మము మొ॥న వాటిచే చిత్తమును నిరోధించే ప్రయత్నాలు కొనసాగవలసిందే! ఇదియే జ్ఞానము (ఆత్మ భావనయే), మోక్షము కూడా. ఈ విషయమే అనేక గ్రంథములలో విస్తారంగా చెప్పబడింది. (అనగా, "మోక్షమునకు కర్మయోగము, భక్తి, క్రియా యోగాభ్యాసముల" మిశ్రమము - మార్గము).

---

సమాధి నిర్ధూత మలస్య చేతసో
నివేశితస్య ఆత్మని యత్ సుఖం భవేత్,
న శక్యతే వర్ణయితుం గిరా।
తదా స్వయమ్ తత్ అంతఃకరణేన గృహ్యతే।

**"ఆత్మోపమ్యేవ సర్వత్ర"** అను సమాధి యొక్క అభ్యాసముచే బుద్ధి, మల, ఆవరణ రహితమై ఆత్మయందు నియోగము-నిశ్చలము అవుతుంది. అప్పుడు లభించు ఆత్మసుఖము మనము మాటలలో వర్ణించుకో గలిగేది కాదు. అది స్వయముగా స్వీయ అంతఃకరణమునకు అనుభవమయ్యేది. **ఆత్మ సుఖము అనుభవించేవారికే తెలుస్తుంది.**

---

ఆపః అప్సు, అగ్నిః అగ్నౌ వా
వ్యోమ్ని వ్యోమ న లక్షయేత్,
ఏవమ్ అతర్గతం చిత్తమ్
పురుషః ప్రతిముచ్యతే।

నీరు నీరులోను, అగ్ని అగ్నిలోను, ఆకాశము ఆకాశములోను ఎట్లు స్వభావసిద్ధంగానే అభేదమై కలిసి పోతాయో, ఆరీతిగా బాహ్య విషయముల నుండి మరలినట్టి, అంతర్గతమైనట్టి - ఈ చిత్తముకూడా (సర్వాంతర్యామి, సర్వతత్త్వ స్వరూపుడు అగు) **పరమపురుషుని యందు ఏకము అగుచున్నది.**

| |
|---|
| మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః।<br>బంధాయ విషయాసక్తమ్।<br>ముక్తైః నిర్విషయమ్ స్మృతమ్ ॥ఇతి॥ |

ఈ భూతాత్మ స్వతఃగా ఆత్మ స్వరూపుడే కదా! మరి ఆత్మకు బంధమెక్కడినుంచి వస్తోంది? లేదు. ఆత్మకు బంధమనే ప్రసక్తియే లేదు. మనస్సే (లేక) విషయములపట్ల ఆసక్తియే - ఈ జీవుని పట్ల బంధము. నిర్విషయత్వమే - ముక్తి. (మనన రూపమైనట్టి) మనస్సే బంధ-మోక్షములకు కారణము.

అథ యథేయం కౌత్సాయనీ స్తుతిః।

ఇంతకు మించి బంధము లేదు. ముక్తీ లేదు.

ఓ వాలఖిల్య మునులారా! పుత్రులారా! ఇప్పుడు "కౌత్సాయినీస్తుతి" అను బ్రహ్మతత్త్వ జ్ఞానగానము - స్మరిస్తున్నాము. వినండి.

---

త్వమ్ బ్రహ్మా। త్వం చ వై విష్ణుః।
త్వమ్ రుద్రః। త్వమ్ ప్రజాపతిః।
త్వమ్ అగ్నిః వరుణో వాయుః।
త్వమ్ ఇంద్రః। త్వమ్ నిశాకరః।
త్వమ్ మనుః। త్వమ్ యమశ్చ।
త్వమ్ పృథివీ। త్వమ్ అథ అచ్యుతః।

## కౌత్సాయనీస్తుతి-తత్త్వమసి

**ఓ జీవుడా!**

**నీవే బ్రహ్మవు!** నీచే అనుభవముగా పొందుచున్నదంతా నీవే కల్పించుకొంటున్నావు. నీవే సర్వత్రా ఏర్పడి ఉన్నావు కాబట్టి **నీవే విష్ణువువు!** సర్వము ప్రకాశింపజేయుచున్నది, లయింపజేసుకొంటున్నది నీవే కాబట్టి నీవే **రుద్రుడవు!** నీవే సమస్త జీవులు ధారణచేయు ప్రజాపతివి! అగ్నివి! వరుణుడవు! వాయువు. నీవే ఇంద్రుడవు! చంద్రుడవు! నీవే మనువువు! నీవే యముడవు! నీవే పృథివివి! నీవే అచ్యుతుడవు! చ్యుతి రహితుడవు!

---

'స్వా' – అర్థే, స్వా-భావికే అర్థే చ
బహుధా తిష్ఠసే దివి।
విశ్వేశ్వర నమస్తుభ్యం, విశ్వాత్మా, విశ్వకర్మ కృత్।
విశ్వభుగ్। విశ్వమాయః త్వమ్।
విశ్వక్రీడా రతి ప్రభుః।
నమః శాంతాత్మనే తుభ్యమ్।
నమో గుహ్యతమాయ చ।

**నీ క్రీడగా నీ కొరకై నీవే స్వాభావికంగా స్వభావ ప్రదర్శనము నిర్వర్తిస్తూ-ఆకాశములో అనేకత్వము వహిస్తున్నావు!**

విశ్వేశ్వరుడవు! ఈ విశ్వమునకు ఆత్మవు! విశ్వకర్మ నిర్వర్తించువాడవు! నీకు నమస్కరిస్తున్నాను.

ఈ విశ్వమును ఆస్వాదించువాడవు! ఈ విశ్వమాయ నీకు చెందినదే! "విశ్వము" అనే క్రీడయందు రమించేదీ నీవే! ఈ విశ్వమునకు ప్రభువువు కూడా నీవే. తత్త్వమసి। తత్త్వమసి।

ఓ శాంతాత్మస్వరూపా! నమస్తుభ్యమ్! నమో నమః!

| | |
|---|---|
| అచింత్యాయ । అప్రమేయాయ।<br>అనాది నిధనాయ చ ॥ఇతి॥ | రహస్యములలో కెల్లా **రహస్యము** నీవే! బాహ్యముగా కనిపించేది భ్రమ. సమస్తమునకు ఆధారమైయున్నదే నీలోని **రహస్యము.** మనస్సుతో కూడా దర్శించలేనిది నీ రూపము **అచింత్యము.** నీ స్వరూపము గుణములకు- దేహములకు- సందర్భములకు సంబంధించినది కాదు. కనుకనే **అప్రమేయము! ఆద్యంత రహిత స్వరూపుడవు! అనాదినిధనుడవు!** |
| **5.** తమో వా ఇదమ్ ఏకమ్ ఆస।<br>తత్ పశ్చాత్ తత్పరేణ ఈరితమ్।<br>విషయత్వం ప్రయాతి। ఏతత్ వై రజసో రూపమ్।<br>తత్ రజః ఖలు ఈరితం విషయత్వం ప్రయాతి<br>ఏతత్ వై తమసో రూపమ్।<br>తత్ తమః ఖలు ఈరితమ్॥ | మొట్టమొదట 'తమము' ఉన్నది. అది ఒకప్పుడు (తరువాత) అద్దానికి వేరైన దానిచే ప్రేరేపించబడి విషయత్వమును పొందుచున్నది. ప్రేరేపించబడునదే **'తమము'.** ప్రేరేపిస్తున్నది **'రజము'.**<br>రజోగుణముచే ప్రేరేపించబడి విషయత్వమంతా వచ్చిపడుతోంది. రజోగుణము తమస్సుచే ప్రేరేపించబడి తమస్సుగా కూడా అగుచున్నది. ఈవిధంగా తమో రజములు పరస్పరము సహకారి కారణములు. |
| తమసః సంప్రాస్రవత్ ఇత్యేతత్ వై<br>సత్త్వస్య రూపమ్।<br>తత్ సత్త్వమేవ ఈరితమ్।<br>తతో రసః సంప్రాస్రవత్<br>సో అంశో అయం యత్ చేతనమాత్రః।<br>ప్రతిపూరుషమ్ 'క్షేత్రజ్ఞః' । | ఆ తమస్సు సత్త్వముచే ప్రేరేపించబడినప్పుడు సత్త్వరూపముగా ఉన్నది.<br>**తమస్సు** → రజోగుణముచే ప్రేరేపించబడి → **రజము।**<br>**తమస్సు** → తమస్సుచే ప్రేరేపించబడి → **తమము।**<br>(తమము సత్త్వముచే ప్రేరేపించబడి **సత్త్వముగా** అగుచున్నది).<br>ఆత్మయొక్క చేతనావిన్యాసమే రస స్వరూపమై ప్రతి జీవునియందు 'క్షేత్రజ్ఞుడు' గా అగుచున్నది. **సంకల్పము, అధ్యవసాయము (క్రియాశీలము), అభిమానముల చిహ్నమే 'క్షేత్రజ్ఞుడు'.** |
| సంకల్ప-అధ్యవసాయాభిమాన లింగః।<br>ప్రజాపతిః తస్య ప్రోక్తా।<br>అగ్ర్యాః తనవో బ్రహ్మా, రుద్రో, విష్ణుః ఇతి।<br>అథ యో హ ఖలు వావ,<br>అస్య రాజసో అంశో అసౌ<br>స యో అయం బ్రహ్మా।<br>అథ యో హ ఖలు వావ,<br>అస్య తామసాంశో అసౌ<br>స యో అయం రుద్రో।<br>అథ యో హ ఖలు వావ<br>అస్య సాత్త్వికాంశో అసౌ<br>సయో అయమ్ విష్ణుః।<br>స వా ఏష ఏకధా, త్రిధా<br>భూతో అష్టధా, ఏకాదశధా, ద్వాదశధా<br>పరిమితధా చ ఉద్భూత। | ప్రప్రథమముగా ఉన్నది పరమాత్మయే. ఆయనయే (అనేకములైన సంకల్ప రూపములు - అనునవిగా) - అగుచున్నారు. అదియే 'ప్రజాపతిత్వము' - అని చెప్పబడుతోంది.<br>※ ఆ ప్రజాపతియొక్క శ్రేష్ఠమైన శరీరములే త్రిమూర్తులు అయినట్టి- బ్రహ్మ- విష్ణు-రుద్రులు.<br>※ ఆత్మయే అన్నిటియందు అన్నీగా (బంగారమే ఆభరణములవలె) అగుచున్నది.<br>※ ఆత్మయొక్క రాజసాంశయే బ్రహ్మదేవుడు - సృష్టికర్త.<br>※ అద్దాని తామసాంశ 'రుద్రుడు' రూపమును దాల్చుచున్నది. అద్దాని సాత్త్వికాంశయే విష్ణువు.<br>ఆత్మ సర్వదా 'ఏకము' అయి ఉండియే,<br>※ త్రివిధములుగాను,<br>※ అష్టవిధ ప్రకృతిగాను...,<br>※ ఏకాదశ (11) అంశలుగాను (ఏకాదశ రుద్రులుగాను),<br>※ అపరిమితమైన అంశములుగాను -<br>ఉద్భూతమగుచున్నది! |
| ఉద్భూతత్వాత్ భూతేషు చరతి ప్రతిష్ఠా-<br>సర్వ భూతానామ్ అధిపతిః బభూవ ॥ఇతి॥<br>అసావాత్ ఆత్మా అంతర్బహిశ్చాం -<br>తత్ బహిశ్చ॥ | అట్లా ఉద్భూతము పొంది (రూపము దాల్చి) **సర్వభూత జాలములు గాను, భూతజాలములందును** సంచరించుచున్నది!<br>సర్వ భూతజాలములకు ఆత్మయే అధిపతికూడా!<br>ఆత్మయే.....,<br>❀ ఈ సృష్టికి మూలము అయి ఉన్నది.<br>❀ ప్రతి ఒక్క జీవునికి అంతర్-బహిశ్చరూపమై ఉన్నది!<br>**ఆత్మ ఏవ ఇదగ్ం సర్వమ్॥** |

# పఞ్చమః ప్రపాఠకః – సర్వం ఖల్విదమ్ బ్రహ్మ

ప్రజాపతౌవాచ:

1. ద్విధా వా ఏష ఆత్మానం భిభర్త్యయం।
యః ప్రాణో యశ్చ ఆసావత్ ఆదిత్యో।

**ప్రజాపతి :** ఆత్మ తన ప్రకృతియొక్క తత్త్వమును రెండు రీతులుగా భరించుచున్నది. (లేక- ధరించుచున్నది)

1) ప్రాణశక్తి 2) ఆసావాదిత్యుడు.

---

అథ ద్వావా ఏతావ అస్తాం పంచధా నామ।
అంతర్-బహిశ్చ అహో-రాత్రే
తౌ వ్యావర్తతే అసౌవా ఆదిత్యో।
బహిరాత్మ అంతరాత్మా ప్రాణో। బహిరాత్మ గత్య
అంతరాత్మా న అనుమీయతే।
గతిః ఇతి ఏవం హి ఆహ।

ఈ రెండూకూడా ఐదువిధములుగా అగుచున్నది.

వెలుగు-చీకటిగా, పగలు-రాత్రి ఇవియే ఆదిత్యుని (ఆత్మసూర్యుని) బహిరాత్మ-అంతరాత్మలు!

బహి-రంతరాత్మ ప్రాణస్వరూపమై బాహ్యముగా-(బయటికి)గా వచ్చినది, (ప్రదర్శనమగుచున్నదిగా) - అగుచున్నది. ఆత్మయే అంతరాత్మను బహిరాత్మగా ఆస్వాదించుచున్నది. ఇదియే ఆత్మయొక్క **"స్థితి నుండి గతి"....** గా వర్ణించబడుతోంది!

---

యః కశ్చిత్ విద్వాన్ అపహత పాప్మా
అధ్యక్షో అవదాత మనాః
తన్నిష్ఠ, అవృత్త చక్షుః
సో అంతరాత్మా ఆగత్య...,
బహిరాత్మనో అనుమీయతే।

ఒకానొక విద్వాంసుడు పాప-అల్ప దృష్టులను తొలగించుకొనుచున్నాడు. నియామక సామర్థ్యము సంపాదించుకొని సమస్త ఇంద్రియములను అధ్యక్షత్వము వహించినవాడగుచూ, స్వచ్ఛమైన మనస్సుతో, ఆత్మయే నిష్ఠగా కలవాడై దృష్టిని బాహ్యము నుండి అంతరంగములోనికి త్రిప్పుచున్నాడు. బాహ్యత్వాన్ని అధిగమించి అంతరాత్మను చేరుకుంటున్నాడు. సమస్తమును ఆత్మకు ('నేను'-కు) అనన్యముగా సందర్శించుచున్నాడు.

---

గతిః ఇత్యేవం హి ఆహ–
అథయ ఏషో అంతరాదిత్యే
హిరణ్మయః పురుషో
యః పశ్యతి మాం హిరణ్యవత్,
స ఏషో అంతరే హృత్ పుష్కర ఏవ
ఆశ్రితో అన్నమత్తి॥

వెలుపల - అంతరమునగల సమస్తమును ఆత్మయొక్క స్థితి-గతిగా గమనించుచున్నాడు.

(1) ఆదిత్యునియందు హిరణ్మయ పురుషునిగాను,

(2) సృష్టికర్తనగు నన్ను హిరణ్మయముగాను,

(సృష్టిని హిరణ్మయముగాను) చూచువాడు ఆత్మదర్శనం చేస్తున్నాడు.

ఆతడు హృత్ పుష్కరమును (ఆత్మయందు హృత్కళను) ఆశ్రయించినవాడై ఈ **ఇంద్రియ విషయ రూపమును అన్నముగా (లేక) బ్రహ్మముగా** సందర్శించుచున్నాడు. (అన్నమ్ బ్రహ్మ).

---

2. అథ య ఏషో అంతరే
హృత్ పుష్కర ఏవ ఆశ్రితో అన్నమ్ అత్తి।
స ఏషో అగ్నిః।
దివి శ్రితస్సౌరః
కాలాఖ్యో అదృశ్యః సర్వభూతాన్ అన్నమత్తి।
కః పుష్కరః? కిమ్ అయమ్ వేదమ్ వావ
– తత్ పుష్కరమ్ యో అయమ్ ఆకాశో॥
అస్య ఇమాః చతస్రో దిశశ్చ,
చతస్ర ఉపదిశః సంస్థా...,
అయమ్ అర్వాక్ అగ్నిః,
పరత ఏతౌ ప్రాణాదిత్యా వేతా ఉపాసీత
'ఓం' ఇతి అక్షరేణ, వ్యాహృతీభిః–సావిత్ర్యా చ ॥ఇతి॥

ఏ ఆత్మ స్వరూపుడైతే తనలోపల హృదయ పుష్కరమునందు ఆశ్రయించి అన్నభోక్తగా (దృశ్య భోక్తగా) ఉన్నాడో.... ఆత్మస్వరూపుడై ఉన్నాడో..., ఆతడే అగ్ని స్వరూపుడుగా కూడా ఉన్నారు. - ఆతడే **ఆకాశమును ఆశ్రయించి, సూర్యస్వరూపుడై, కాలమును రచిస్తూ, కాలస్వరూపుడై, అదృశ్యస్వరూపముగా 'సర్వభూత జాలములు' అనే అన్నము భుజిస్తున్నాడు.**

అట్టి పుష్కరము (తీర్థప్రదేశము) ఏది? అద్దానికి తెలియబడుచున్నదేది? ఆకాశమే ఆ పుష్కరము. (లేక) తెలియబడేదంతా పుష్కరమే। అదియే ఆత్మాకాశము।

తెలుసుకొనువాడు - తెలియబడేది - "ఆత్మయే" (పుష్కరమే)।

కనుక, స్వస్వరూపాత్మయే నాలుగు దిక్కులలోను నాలుగు ఉప దిక్కులలోను నిండి ఉన్నట్లు,

క్రింద అగ్నిరూపంగా ఉన్నట్లు, పైన ప్రాణ-ఆదిత్యులుగాను ఉన్నట్లుగా - ఉపాసించాలి.

సర్వత్రా సమస్తమును ఆత్మగా ఉపాసించటమే **ఆత్మోపాసన.**

ఆత్మను

- 'ఓం' అను అక్షరముతోను,
- భూ-భువః-సువః .... అను వ్యాహృతులతోను, సావిత్రీ-గాయత్రీ చందస్సుల శబ్దార్థములతోను ఉపాసించెదరు గాక!

**3.** ద్వే వావ బ్రహ్మణో రూపే
మూర్తం చ, అమూర్తం చ।
అథ యత్ మూర్తం-తత్ అసత్యమ్।
యత్ అమూర్తం-తత్ సత్యమ్। తత్ బ్రహ్మ।
యత్ బ్రహ్మ, తత్ జ్యోతిః।
యత్ జ్యోతిః, స ఆదిత్యః।
స వా ఏష 'ఓం' ఇతి ఏతత్ ఆత్మా!

### మూర్తామూర్తములు

బ్రహ్మము రెండు రూపములు కలిగి ఉంటోంది.

1) మూర్తము (సాకారము) 2) అమూర్తము (నిరాకారము).

- ఏది ఆకార సహితమై మూర్తివంతముగా కనిపిస్తోందో - అది అసత్యము. (లేక) కల్పిత మాత్రము. భావనా కల్పితము.
- ఏది అమూర్తము - ఆకార రహితము అయి ఉన్నదో, అదియే సత్యము! అదియే బ్రహ్మము. కదిలేది అసత్యము. కదిలించేది బ్రహ్మము!

ఏది బ్రహ్మమో, అది జ్యోతి స్వరూపము కూడా! ఏది జ్యోతి స్వరూపమో, అదే ఆదిత్యుడు!

ఆ ఆదిత్యుడే 'ఓం' సంజ్ఞచే చెప్పబడుచున్న 'ఆత్మ'. ఆత్మ పురుషుడు.

---

త్రేధ ఆత్మానం వ్యకురుత।
'ఓం' ఇతి త్రిస్రోమాత్రా ఏతాభిః
సర్వమ్ ఇదమ్
ఓతమ్ - ప్రోతమ్ చ ఏవ।
అస్మిన్ నిత్యేవం హి ఏహి
ఏతత్ వా ఆదిత్య।
"ఓం" ఇత్యేవం ధ్యాయం,
తథా ఆత్మానమ్ యుంజీత ॥ఇతి॥

ఆ ఆత్మ పురుషుడు (ఓంకార స్వరూపుడు) తనను మూడు రీతులుగా విభజించుకుంటున్నాడు. (త్రి-మాత్రలు).

**'ఓం'....** ఇతి = అ + ఉ + మ → మూడు మాత్రలు కలిగి ఉన్నట్టిది.

అట్టి ఓంకారమునందే (కేవలాత్మయందే) ఈ సర్వము (14 లోకాలు, జాగ్రత్ స్వప్న సుషుప్తులు) ఓత-ప్రోతమై ఉన్నాయి.

అట్టి ఆదిత్యుడే నిత్యుడు. మిగతాదంతా అనిత్యము. అట్టి ఆదిత్యుని (మొట్టమొదటే ఉండి ఉన్న ఆత్మను) 'ఓం'కార నాదముతో, అర్థభావములతో ఉపాసించాలి. ధ్యానించాలి.

అప్పుడు ఆత్మయే పొందబడుచున్నది. (సమస్తము స్వస్వరూపాత్మగా అనుభవము కాగలదు).

---

**4.** అథ అన్యత్రా అపి ఉక్తమ్।
అథ ఖలు య ఉద్గీథః, స ప్రణవో।
యః ప్రణవః స ఉద్గీథః।

ఇదియే వేరు వేరుచోట్ల వేరువేరు రీతులుగా చెప్పబడుతోంది కూడా!

**ఉద్గీథము** - సామవేద ప్రణవనాదము, - స్వరము

ఏది ఉద్గీథమో (స్వరమో) అదియే ప్రణవము! ఏది ప్రణవమో అదియే ఉద్గీథము! (గీథ = పాట, సంగీతము. సామవేదగానము - ప్రణవము = ఓం)

---

ఇతి అసావాదిత్య ఉద్గీథ। ఏష ప్రణవ।
ఇత్యేవం హి ఆహ ఉద్గీథః-
ప్రణవాఖ్యం। ప్రణేతారం నామ రూపం।
విగత నిద్రం। విజరం। అవిమృత్యుం।
పునః పంచధా జ్ఞేయం।
నిహితం గుహాయామ్ ॥ఇతి॥

ఏది ఉద్గీథమో అదే అసావాదిత్యుడు (ప్రశంసనీయుడగు మొట్టమొదటి తత్త్వము-ఆదిత్యుడు). ఏది అసావాదిత్యుడో,.... ఆతడే ప్రణవము!

ఇదియే (ఆత్మయే) ఉద్గీథ గానము.

ప్రణవాఖ్యుని, ప్రణేతారును (Manifester) , నామరూపిని, నిద్రారహితుని, జరలేని వానిని, మృత్యువు లేనివానిని తిరిగి ''ఆత్మపురుషుడు'' అంటున్నాము. ఆయననే - **"పంచ (5) విధములుగా జ్ఞేయుడు (తెలియబడుచున్నాడు)"** అని చెప్పుచున్నారు. హృదయ గుహలో నివసించు ఆత్మయొక్క ప్రదర్శనమే పంచవిధములుగా తెలుసుకొనెదరు గాక।

---

ఏవం హి ఆహ-ఊర్ధ్వ మూలమ్ వా
ఆ బ్రహ్మ శాఖా। ఆకాశః-వాయుః-అగ్నిః-
ఉదక-భూమ్యాదయ 'ఏకేన' అత్తమ్ ఏతత్ బ్రహ్మ।
తత్ తస్యై తత్తే యత్
అసావాదిత్య 'ఓం' ఇతి
ఏతత్ అక్షరస్య చ
ఏతత్ అస్మాత్ 'ఓం' ఇతి
అనేనైతత్ ఉపాసీత అజస్రమ్

ఆత్మయే ఊర్ధ్వమూల స్వరూపుడు। సర్వమునకు ఆది।

ఆ బ్రహ్మము అనే శాశ్వత మహావృక్షపు శాఖలే ఆకాశము, వాయువు, అగ్ని, ఉదకము, భూమి కూడా. ఐదుగా కనిపిస్తూ కూడా ఏక స్వరూపము అయి ఉన్నదే బ్రహ్మము!

'ఓం' అనే అక్షరమే ఆసావాదిత్య స్వరూపము!

అట్టి అక్షర పరబ్రహ్మమే 'ఓం' అయి ఉన్నది. అక్షరమగు ఆత్మను 'ఓం'గా ఉపాసించాలి.

అనేకముగా కనిపిస్తున్నప్పటికీ ఏకమే అయి ఉన్న, ఏక రస స్వరూపుడై వున్న 'ఓం' యొక్క సంజ్ఞార్థమును భావన చేస్తూ, అనుకుంటూ

| | |
|---|---|
| ఇతి ఏకో రసం అబోధయాత।<br>ఇత్యేవం హి య హి (ఇహ)<br>ఏతదేవ 'అక్షరమ్' పుణ్యమ్।<br>ఏతత్ ఏవ అక్షరమ్ జ్ఞాత్వా....,<br><u>యో యత్ ఇచ్ఛతి తస్య తత్</u>॥ | ఉపాసించాలి. అనేకముగా కనిపిస్తూ ఉన్నదంతా, ఒక్కటిగా అనిపిస్తూ ఉండాలి.<br>అట్టి అక్షర సర్వస్వరూప ఉపాసనయే సర్వ పుణ్య కార్యముల ఆచరణ ఫలము.<br>అట్టి ఆ అక్షరము ఎవ్వరు తెలుసుకొంటారో, వారు ఏది ఎట్లు ఇచ్ఛగిస్తే అది అట్లే అవగలదు. లభించగలదు. |
| **5.** <u>అథ అన్యత్రాపి ఉక్తమ్</u>।<br>స్వ నయతి ఏషా అస్య తనూర్యా 'ఓం' ఇతి<br>స్త్రీ పుం నపుంసకమ్ ఇతి।<br>లింగవత్ ఏషా – | **ఇదే ఆయా వివిధ రీతులుగా చెప్పబడుతోంది కూడా!**<br>స్వశరీరము ఓంకార స్వరూపమే - అనికూడా గానము చేయబడుతోంది. **గానవతి। స్వరూపము।**<br>అక్షరము ఓంకార స్వరూపమే ఈ స్త్రీ-పురుష-నపుంసక లింగ రూపములన్నీ కూడా. **రూపవతి, లింగవతి స్వరూపము.** |
| అథ అగ్నిః–వాయుః–ఆదిత్యః ఇతి భాస్వతి। (।ఇతి।)<br>ఏషా అథ బ్రహ్మా–రుద్రో–విష్ణుః ఇతి అధిపతిః ।ఇతి।<br>ఏష అథ గార్హపత్యో, దక్షిణాగ్నిః,<br>ఆహవనీయ – ఇతి ముఖవత్।<br>ఏష అథ ఋక్–యజుః–సామేతి విజానాత్।<br>ఏష అథ భూః భువః సువః ఇతి లోకవత్। | అగ్ని-వాయువు-సూర్యుడుగా భాసిస్తున్నది కూడా అదే! **భాసవతి!**<br>బ్రహ్మ-విష్ణు-రుద్ర తత్త్వములకు అధిపతి ఓంకార రూప పరబ్రహ్మమే। **త్రిమూర్తి రూపిని. అధిపతి స్వరూపము.**<br>అద్దాని ముఖముచే గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని ఆహవనీయాగ్ని మొదలైన అగ్నులు! **అగ్నిపతి స్వరూపము।**<br>ఋక్-యజు-సామవేదముల సారము. అవి ఆరాధిస్తున్నది, వర్ణిస్తున్నది-ఉపాసనగా ప్రతిపాదిస్తున్నది కూడా... ఆ ఓంకారమే. **వేదవతి-స్వరూపము।**<br>ఆ పరతత్త్వమే భూ-భువర్-సువర్ లోక దేవత. **లోకవతి స్వరూపము।** |
| ఏష అథ భూతం భవ్యం భవిష్యత్ ఇతి <u>కాలవత్</u>।<br>ఏష అథ ప్రాణో అగ్నిః సూర్య ఇతి <u>ప్రతాపవత్</u>।<br>ఏష అథ అన్నమ్ ఆపః చంద్రమా <u>ఇత్యాఆప్యాయనవత్</u>।<br>ఏష అథ బుద్ధిః మనో అహంకార ఇతి <u>చేతనవత్</u>।<br>ఏష అథ ప్రాణో అపానో వ్యాన ఇతి ప్రాణవత్ ఏకే త్యజామి॥ | భూత-వర్తమాన-భవిష్యత్ రూప **కాలవతి** కూడా అదే!<br>అద్దాని ప్రతాపమే ప్రాణశక్తి, అగ్ని, సూర్య శక్తి కూడా! **ప్రతాపవతి** అదియే!<br>అన్నము, జలము, చంద్రుని రూపముగా పోషవతి! ఆప్యాయవతి।<br>పరబ్రహ్మమే బుద్ధి-మనో-అహంకారములుగా **చేతనవతి.**<br>ప్రాణ-అపాన-వ్యాన రూపములుగా **ప్రాణవతి.** |
| ఇతి ఉక్తైః తాహహ ప్రస్తోత అర్పితా భవతి।<br>ఇత్యేవం హ్యాహి ఏతత్ <u>వై</u><br>సత్యకామ పరం చ – అపరం చ –<br>యత్ 'ఓం' ఏతత్ అక్షరమ్ ఇతి॥ | ఈవిధంగా, ఏకముగు బ్రహ్మమే **గానవతి, రూపవతి, భాసవతి, త్రిమూర్తివతి, అగ్నివతి, వేదవతి, లోకవతి, కాలవతి, ప్రతాపవతి, ఆప్యాయవతి, చేతనవతి, ప్రాణవతి** కూడా!<br>ఆత్మ ఒక్కటే **"ప్రస్తోతము (ఋత్విజుడు) - అర్పితము (నేయి)"** కూడా అయి ఉంటున్నది.<br>ఈ ఓంకారోపాసము - సత్యకామము, పరము, అపరముగా కూడా! (ఇహములో-పరములో కూడా) కోరుకొన్నది ప్రసాదించ గలిగినది. అదియే ఓంకార అక్షరోపాసన - అయి ఉన్నది. |
| <u>ఓం భూర్భువస్సువః</u><br>**6.** అథ వ్యాత్తం వా ఇదమ్ ఆసీత్ సత్యం ప్రజాపతిః।<br>తపః తప్త్వా, అనువ్యాహరత్ 'భూర్భువస్సువః' ఇతి॥<br>ఏషా హ అథ ప్రజాపతేః స్థవిష్ఠా తనూర్వా లోకపత ఇతి। | **<u>వ్యాప్తి</u> –** ప్రజాపతి సృష్టి యొక్క వ్యాప్తి కొరకై తపస్సు చేస్తూ "భూర్భువ స్సః"... అని ఉచ్చరించారు!<br>ఆ స్వరమే ప్రజాపతి యొక్క లోకపతిత్వము. లోకతనువు. ఆయన తపో స్వరమే ఈ లోకముల రూపము. |
| 'స్వః' ఇతి అస్యాః శిరోః। నాభిః భువో।<br>భూః పాదా। ఆదిత్యః చక్షుః।<br>ఆయత్తః పురుషస్య, | స్వర్లోకము "ఆయన శిరస్సు". భువర్లోకము ఆయన యొక్క నాభి (బొడ్డు). భూలోకము ఆయన పాదములు. ఆదిత్యుడు ఆయన చక్షువులు. ఆ మహత్పురుషునికి పంచతన్మాత్రలే (శబ్ద స్పర్శ రూప రస గంధములే) |

**మహతో మాత్రాః చక్షుషా హి, అయం మాత్రాః చరతి।**
**సత్యం వై చక్షుః అక్షిణి ఉపస్థితో హి**
**పురుషః స సర్వార్థేషు వదతి।**

చెవులు, చర్మము, కళ్లు, నాలుక, ముక్కులు ఆయన పంచతన్మాత్రలలో చరించుచున్నారు. చూచేది ఆయనయే. చూడబడేది ఆయనయే.
సత్యమే (సత్ స్వరూపమే) ఆయన కన్నులు. మన కళ్ళముందు ఉపస్థితుడై ఉన్నవాడు ఆయనయే. సర్వార్థములు ఆయన పలుకులు.

---

**ఏతస్మాత్ 'భూర్భువస్సువః' ఇతి ఉపాసీత।**
**అన్నం హి ప్రజాపతిః।**
**విశ్వాత్మా-విశ్వచక్షురివ ఉపాసితో భవతి।**
**ఇత్యేవం హి యా హైషా వై ప్రజాపతిః విశ్వభృత్ తనూః**
**ఏతస్యామ్ ఇదం సర్వమ్ అంతర్హితమ్।**

కనుక ఆయనను **"భూర్భువస్సువః"** అను మంత్రములో త్రిలోక స్వరూపుడుగా ఉపాసించుచున్నాము.

అన్నము పరబ్రహ్మ స్వరూపము. అనుభవమగుచున్నదంతా అన్న స్వరూపము. అన్నమే ప్రజాపతి!

ఆయనను విశ్వాత్ముడు గాను, ఈ విశ్వమంతా చక్షువులు కలవాడు గాను మనలచే ఉపాసించబడుచున్నారు. ప్రేమించబడుచున్నారు.

అనుభవమయ్యేదంతా విశ్వభృత్ (భరించువాడు) అగు ఆ ప్రజాపతియొక్క శరీరమే.

ప్రజాపతి యొక్క దేహమునందే ఈ కనబడేదంతా అంతర్హితమై యున్నది. బహిర్-ప్రదర్శనమైకూడా ఉన్నది.

---

**అస్మింశ్చ సర్వస్మిన్ ఏష అంతర్హిత ఇతి,**
**తస్మాత్ ఏష ఉపాసీత ఇతి॥**

(నవలలో ప్రతి సంఘటన రచయితయొక్క రచనయే అయినట్లుగా) ప్రపంచములోని అణువణువునందు ఆ ప్రజాపతియే అంతర్హితమై యున్నారు. అందుచేత ఆ పరమాత్మయగు ప్రజాపతిని - **సర్వమునందు అంతర్హిత స్వరూపునిగాను, ఈ సర్వము ఆయనయందు అంతర్హితమై ఉన్నట్లు గాను,** ఉపాసించబడును గాక. ఇష్టపడబడును గాక. దర్శించబడును గాక!

---

**7. 'తత్ సవితుః వరేణ్యమ్' ఇతి।**
**అసౌ వా ఆదిత్యః సవితా।**
**స వా ఏవం ప్రవరణాయ ఆత్మకామేన**
**ఇత్యాహుః బ్రహ్మవాదినో।**

బ్రహ్మవాదులు **"తత్ సవితుః వరేణ్యమ్"** అని పలుకుచున్నారు.
ఆదిత్యుడే (మొట్టమొదట గల ఆత్మ స్వరూపమే) సవిత్తు. (సత్-విత్-తత్)
ఆయన యొక్క ఆత్మ కామముచేతనే ఈ జగద్దృశ్యము అనుభూత రూపము అగుచున్నది.... అని బ్రహ్మవాదులు చూస్తున్నారు. సర్వము బ్రహ్మముగా, ఆప్త కామముగా గమనిస్తున్నారు!

---

**అథ "భర్గో దేవస్య ధీమహి" – ఇతి సవితా వై**
**తే అవస్థితా। యోఽస్య భర్గః**
**కం సంచింతయామి – ఇత్యాహుః**
**బ్రహ్మవాదినో।**
**అథ 'ధియోయోనః ప్రచోదయాత్'**
**ఇతి బుద్ధయో వై।**
**ధియ స్తాయో అస్మాకమ్,**
**'ప్రచోదయాత్' ఇతి ఆహుః బ్రహ్మవాదినో!**

**'భర్గోదేవుని ధీ (బుద్ధి) మహిమను చింతిస్తున్నాను'** - ఆతడు సవితా తేజోరూపుడు.

**'భర్గః'** అని ఎవరిని చింతించాలని బ్రహ్మవేత్తల ఉద్దేశ్యము?

ధియోయనః ప్రచోదయాత్! ధియో... అనగా? **"బుద్ధులు"**. బుద్ధినే ప్రార్థిస్తున్నాము. భర్గో దేవుడు బుద్ధి స్వరూపుడే.

మాయొక్క బుద్ధులు-**"ప్రచోదయాత్-ప్రేరేపించుగాక"** - అనునదే ప్రార్థన. **"ఆత్మబుద్ధిని ప్రేరేపించునుగాక! ప్రయోజనముగా సత్యము దర్శించగలము"**అని ఉపాసించాలి. ఇదియే బ్రహ్మవేత్తల ఉద్దేశ్యము.

---

**అథ 'భర్గ' ఇతి యో హ వా**
**అస్మిన్ ఆదిత్యే నిహితః తారకే అక్షిణి చ।**
**ఏష భర్గాఖ్యోభా "అభిర్గతిః అస్య హి ఇతి భర్గో।"**
**భర్జతివ ఏష భర్గః।**

**భర్గుడు**

**భర్గః** - అనగా ఆదిత్యునియందు కంటిలో కనుపాపవలె ఉన్నవాడు. కంటిలో ఉన్న 'చూపు' కిరణ స్వరూపుడు! (The vitality of seeing).

**కిరణములతో కూడుకొని గమనము కలవాడు కాబట్టి భర్గుడు!**

| | |
|---|---|
| **ఇతి రుద్రో బ్రహ్మావాదినో**<br>**అథ భర్గ ఇతి–**<br>**భాసయతి ఇమాన్ లోకాన్ ఇతి।**<br>**రంజయతి ఇమాని భూతాని।** | సర్వులను భయపెట్టి సమస్తము నిర్వర్తింపజేయువాడు కాబట్టి భర్గుడు! ఉపసంహార రూపమగుటచే భర్గుడే 'రుద్రుడు'... అని బ్రహ్మావాదుల వ్యాఖ్యానము।<br>ఈ లోకములకు భాసింపజేయువాడు, ప్రకాశింపజేయువాడు కాబట్టి భర్గుడు। రుద్రుడు।<br>రంజింపజేయువాడు కాబట్టి రుద్రుడు! భర్గుడు! |
| **'గచ్ఛత' ఇతి, గచ్ఛతి అస్మిన్।**<br>**న ఆగచ్ఛతి అస్యా ఇమాః (ప్రజాః) తస్మాత్,**<br>**భారకత్వాత్ భర్గః।**<br>**శత్రూన్ తు సూయమానత్వాత్ సూర్యః।** | ప్రజలు ఈయనవైపుగానే వచ్చుచున్నారు కాబట్టి అందరూ ఎటువైపు వెళ్ళుచున్నారో... ఆయనయే భర్గుడు!<br>భారము కలవాడు కాబట్టి **భర్గుడు.**<br>శత్రువులను జయింపజేయువాడు **సూర్యుడు.**<br>సూర్యుడే **భర్గుడు.** |
| **సవనాత్ సవితా।**<br>**ఆదానాత్ ఆదిత్యః।**<br>**పవనాత్ పావమానో।**<br>**అథ యో అథాయనాత్ ఆదిత్యః।**<br>**ఇత్యేవం హి ఆ హ ఖలు॥**<br>**ఆత్మని ఆత్మా అమృతాఖ్యః।** | **సవితః** - ప్రజలను కనుచున్నవాడు కాబట్టి సవిత. ఇంకా కూడా ఆయనయే -<br>☙ సర్వము గ్రహించువాడు కాబట్టి **ఆదిత్యుడు.**<br>☙ పవిత్రముగా చేయువాడు కాబట్టి **పావనుడు.**<br>☙ సర్వమునకు స్థానము కల్పించువాడు కాబట్టి - అథాయనాత్ ఆదిత్యః!<br>ఈ రీతిగా నిర్వచించి వివరించబడుతోంది. |
| **చేతా–మంతా–గంతా–స్రష్టా – ఆనందయితా –**<br>**కర్తా–వక్తా – రసయితా–ఆఘ్రాతా స్పర్శయితా చ।**<br>**విభు విగ్రహే సన్నివిష్టా ఇత్యేవం హి ఆహ।**<br>**అథ యత్ర ద్వైతీ భూతమ్ విజ్ఞానం**<br>**తత్ర హి శృణోతి। పశ్యతి। జిఘ్రతీతి।**<br>**రసయతి। ఏచ ఏవ స్పర్శయతి।**<br>**సర్వమ్ ఆత్మా జానీతేతి।** | ఆత్మ ఆత్మకు మధురము. అమృతము. ఆత్మయే **చేతా** (నిర్వర్తించువాడు). **మంతా** (మననము చేయువాడు), **గంతా** (పొందువాడు), **స్రష్టా** (సృష్టించువాడు), **ఆనందయితా** (ఆనందించువాడు), **కర్తా** (సర్వమునకు కర్త), **వక్తా** (చెప్పువాడు), **రసయితా** (తన కల్పనకు తానే రసజ్ఞుడు), ఆఘ్రాతా (వాసన చూచువాడు), స్పర్శయిత కూడా। విభు స్వరూపుడై వేంచేసి ఉన్నవాడు. ద్వైతీభూతుడైనప్పుడు వింటున్నవాడు, చూస్తున్నవాడు మొదలైనవన్నీగా అగుచున్నాడు. ఆత్మను తెలుసుకొనుచున్నవాడు కూడా - ఆయనయే. |
| **యత్ర అద్వైతీభూతం,**<br>**విజ్ఞానం కార్య–కారణ నిర్ముక్తం,**<br>**అనిర్వచనమ్, అనౌపమ్యమ్, నిరుపాఖ్యమ్**<br>**– కిం తత్ అంగ వాచ్యమ్?** | → ఏదైతే ఈ జీవుడు - జగత్తు అనువాటికి ద్వితీయము కాదో, **అద్వైతము అయి ఉన్నదో,**<br>→ విజ్ఞాకార్య స్వరూపమో,<br>→ కేవల విజ్ఞాన స్వరూపమో,<br>→ అనిర్వచనీయమో, ఉపమానములతో చెప్పలేమో,<br>→ కార్యకారణ నిర్ముక్తమో - నిర్వచించలేమో,<br>(అద్వైతంగా ఉన్నప్పుడు) అట్టి ఆత్మను ఏమని వర్ణించగలము? చెప్పశక్యమయ్యేదికాదు! |
| **8. ఏష హి ఖలు ఆత్మా...,**<br>**ఈశానః శంభుః, భవో రుద్రః ప్రజాపతిః విశ్వసృక్,**<br>**హిరణ్యగర్భః సత్యం ప్రాణో** | నీయందు - నాయందు సర్వాధారుడై ఉన్న ఆతడే ఆత్మ. ఆత్మయే ఈశానుడు, శంభుడు, రుద్రుడు, ప్రజాపతి, విశ్వసృష్టిరూపుడు, హిరణ్యగర్భుడు, సత్యుడు, ప్రాణస్వరూపుడు. పరమహంస. శాసించువాడు. విష్ణువు. నారాయణుడు. అర్కుడు (సూర్యుడు). సవిత! |

**హంసః శాస్తా విష్ణుః నారాయణో అర్కః సవితా**
**దాతా సమ్రాట్ ఇంద్ర ఇందుః ఇతి।**
**య ఏష తపతి,**
**అగ్నినా, పిహితః సహస్రాక్షేణ హిరణ్మయేన ఆనందే।**

దాత! సామ్రాట్! ఇంద్రుడు! చంద్రుడు!

**ఇవన్నీ ఆత్మయే. ఆత్మభగవానుడే సర్వమును తపింపజేయువాడు కూడా.**

అగ్నిచేతను, సహస్రాక్షుని చేతను, హిరణ్మయముచేతను తన ఆనంద స్వరూపము కప్పబడి ఉన్నవాడు.

---

**న ఏష వావ విజిజ్ఞాసితవ్యో అన్వేష్టవ్యః**
**సర్వ భూతేభ్యో అభయం దత్వా, అరణ్యం గత్వా,**
**అథ బహిః కృత ఇంద్రియార్థాన్ స్వశరీరాత్ ఉపలభతే।**

అట్టి స్వస్వరూప పరమాత్మయే జిజ్ఞాసితవ్యుడు. జిజ్ఞాస కలిగి ఉండ వలసినవాడు.

ఆత్మగురించే అన్వేషించాలి! సర్వజీవులకు అభయ ప్రదాత ఆయనయే! ఆత్మకు వేరుగా మరొక అభయ ప్రదాత లేడు.

అరణ్యము (ఏకాంతము)నకు వెళ్ళి ఇంద్రియార్ధములను బహిష్కరించి, స్వశరీరమునందే ఆత్మను వెతికి దర్శించాలి! ఓ వాలఖాల్యమునులారా! ఓ సమస్త జీవులారా! ఆయన స్వశరీరమునందే ఉపలభ్యుడు. ఆత్మ భగవానుని కోసం బయట వెతికి ఏమి లాభం?

---

**అథైనమ్ (అథ ఏనమ్) ఇతి విశ్వరూపమ్।**
**హరిణమ్। జాతవేదసమ్। పరాయణమ్।**
**జ్యోతిః ఏకమ్ తపంతమ్।**
**సహస్ర రశ్మిః శతథా వర్తమానః**
**ప్రాణః ప్రజానామ్ ఉదయతి–ఏష సూర్యః॥**

ఆయనయే విశ్వరూపుడు! హరిణుడు (సర్వ స్థితి-గతులు ఆయనవే). జాతవేదసుడు. అగ్ని రూపుడు. అందరు పారాయణముచేయవలసిన వాడు. అఖండజ్యోతి స్వరూపుడు. సర్వము తపింపజేయువాడు. వేలాది కిరణములతో వందలాది చోట్ల వర్తించువాడు. ప్రజలందరికి ప్రాణప్రదుడు. సర్వ జీవులలో సర్వదా ఉదయిస్తున్నది ఆత్మ సూర్యుడు!

ఆయనను స్వ-శరీరమునందే వెతికి, గుర్తించండి (Please search and find "PARAMATHMA" in you yourselves.)

***<u>ఇతి మైత్రాయణ్యుపనిషత్</u>***
***<u>ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః</u>***

***<u>ఇతి మైత్రాయణ్యుపనిషత్</u>***
***<u>ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః</u>***

**సామవేదాంతర్గత**

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 9 మైత్రాయణ్యుపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము

**మం.శ్లో॥ మైత్రాయణీ కౌషీతకీ**
**బృహజ్జాబాల తాపనీ।**
**కాలాగ్ని రుద్ర మైత్రేయీ**
**సుబాల క్షురి మంత్రికా॥**



**ఏతత్**
**ఉపనిషత్**
**మాతరమ్**
**నమామ్యహమ్॥**

***ఈ ఉపనిషత్‌లో ప్రస్తావనకు వచ్చియున్న కొందరు పురాణ పురుషుల గురించిన సంగ్రహ విశేషాలు.***

**1. సుద్యుమ్నుడు (భాగవతము):** ఈయన వైవస్వతుని కుమారుడు. మొదట స్త్రీగా జన్మించి వసిష్ఠ మహర్షి అనుగ్రహముచే పురుషరూపము పొందారు. రాజయ్యారు. ఈయన నగరము "ప్రతిష్ఠా నగరము". అయితే, ఒకసారి నాట్యము చేస్తూ పార్వతీ పరమేశ్వరులు విహరిస్తున్న "కుమారవనము" (శరవనము)నకు వెళ్ళారు. ఏకాంతము భంగపరచిన కారణంగా పార్వతీదేవిచే శపించబడి తిరిగి స్త్రీ రూపము పొందారు. ఆ తరువాత చంద్రుని కుమారుడైన బుధుని ప్రేమించి వివాహము చేసుకొని పురూరవుని (షట్చక్రవర్తులలో ఒకరు) కుమారునిగా పొందారు.

తాను స్త్రీ అవటము భరించలేక కొంతకాలము తరువాత తిరిగి వసిష్ఠుని ప్రార్థించారు. ప్రేమ హృదయుడగు వసిష్ఠుడు తనను పురుషత్వము కొరకై అర్థిస్తున్న సుద్యుమ్నుడు – పురుషత్వము పొందటానికై శంకరుని ప్రార్థించారు. అప్పుడు శంకరుడు **"పార్వతీ దేవి శాపము – వసిష్ఠుని శిష్య వాత్సల్యము"** – ఈ రెండింటికి భంగము కాకుండా **"ఒక నెల స్త్రీ గాను మరొక నెల పురుషుడుగాను ఉండే తీరు"**గా అనుగ్రహించారు. అప్పుడు సుద్యుమ్నుడు తిరగి ప్రతిష్ఠా నగరము వచ్చి రాజుగా రాజ్యము ఏలసాగారు.

ఆ తరువాత సుద్యుమ్ననకు ఉత్కలుడు, గయుడు, విమలుడు అనే ముగ్గురు కుమారులు కలిగారు. వార్థక్యము పొడచూపగానే, ఒక శుభదినాన రాజ్య భారమును పురూరవునికి అప్పజెప్పి, సర్వ సంపదలు త్యజించి సుద్యుమ్నుడు తపస్సుకై వనములు ప్రవేశించారు.

**2. ఇంద్రద్యుమ్నుడు (బ్రహ్మపురాణము) :** అవంతీపుర రాజు. అనేక సంపదలతో కూడి రాజ్యమును ఏలారు. కొంత కాలమైన తరువాత **"ఈ రాజ్యము నాకు శాశ్వతము కాదు. నాకు నేనే శాశ్వతము. అట్టి స్వస్వరూపానుభవము పట్ల సర్వ సంశయములు తొలగటానికై సాధనకు ఉపక్రమించాలి"** అని తలచారు. రాజభోగములన్నీ త్యజించారు. "మనో నిగ్రహము కొరకై 'విగ్రహము' కావాలి" అని బోధింపబడినవాడై, భగవత్ప్రతిమను సంపాదించటానికి స్థిర సంకల్పముతో దక్షిణాపథమునకు వచ్చారు.

ఒక ప్రదేశంలో ఆసీనులై విష్ణు భగవానుని ధ్యానించసాగారు. ఒకరోజు విష్ణువు ఇంద్రద్యుమ్నుని కలలో కనిపించారు. **"స్వామీ! నాకు భగవత్ ప్రతిమను సంపాదించే ఉపాయము చెప్పండి"** – అని విష్ణు దేవుని ఇంద్రద్యుమ్నుడు అభ్యర్థించారు. అప్పుడు విష్ణువు ఆతనికి అందుకు ఉపాయము (మార్గము) సూచించారు.

కలలో కనిపించి విష్ణువు దైవ ప్రతిమ పొందటానికి చెప్పిన ఉపాయములను విని, నిదురలేచిన తరువాత ఆ ఇంద్రద్యుమ్నుడు సముద్రతీరము చేరాడు. అక్కడ గల ఒక అశ్వత్థ వృక్షము (రావిచెట్టు) క్రింద విప్ర వేషములో ఉన్న ఇద్దరు కనిపించారు. "అయ్యలారా! దయతో నాకు మీరు బ్రహ్మ – విష్ణు – మహేశ్వరుల ప్రతిమలను నిర్మించి ఇవ్వండి" అని ఇంద్రద్యుమ్నుడు ఆ ఇద్దరు విప్రులను బ్రతిమలాడారు. ఆ ఇద్దరిలో ఒకరు విశ్వకర్మ. ఆ విశ్వకర్మ ఇంద్రద్యుమ్నుడు కోరిన ప్రకారము త్రిమూర్తుల (బ్రహ్మ విష్ణు మహేశ్వరుల) విగ్రహములు తయారు చేసి ఇచ్చారు. అవి దివ్య మంగళముగా ప్రకాసిస్తూ ఉన్నాయి. ఇక అక్కడి నుండి ఆ విగ్రహములను ప్రతిరోజు పూజించసాగారు.

క్రమంగా ఇంద్రద్యుమ్నునిలో వివేకము, బ్రహ్మజ్ఞానము వికసించ సాగాయి. తనకు విగ్రహమును చేసి ఇచ్చిన వారు భగవత్ స్వరూపులుగా భావించుచూ పూజ కొనసాగించారు.

ఆవిధంగా విగ్రహములు పూజిస్తూ, ఆత్మతత్త్వమును స్వాభావికము, అనునిత్యము చేసుకొన్నారు. కొన్నాళ్ళ తరువాత సన్న్యసించి, సిద్ధిని పొందారు.

**3. యౌవనాశ్వుడు (భాగవతము):** విష్ణు భక్తుడు, ద్వాదశవ్రత సిద్ధుడు అగు అంబరీషుని కుమారుడు. యౌవనాశ్వుడు 'ఆత్మ విద్యయే జీవితము' అని గ్రహించినవారై, రాజ్యమును కుమారుడగు హరితునికి బాధ్యతగా ఇచ్చివేసి దంపత సమేతంగా గురు ఆశ్రమంచేరారు. గురు సేవ చేస్తూ, బ్రహ్మ విద్యను అభ్యసించి పునీతులైనారు. ( మాంధాతృ గోత్రమువారికి అంబరీషుడు, యౌవనాశ్వుడు, హరీతుడు – 'ప్రవర'లో చెప్పబడు త్రి–ఋషులు).

**4. కువలయాశ్వుడు (మార్కండేయ పురాణము):** ఈయన శత్రుజిత్తు కుమారుడు. జన్మించినప్పుడు పెట్టిన పేరు 'ఋతధ్వజుడు'. కాశీ రాజ్యము పాలించిన వారిలో ఒకరు. తత్త్వ శాస్త్రమును, వేద శాస్త్రమును చక్కగా ఎరిగిన మహనీయుడుగా ప్రసిద్ధుడు. గొప్ప తత్త్వవేత్త.

గాలవుడు అనే ముని ఏకాంతంగా కాశీరాజ్యములోని ఒకానొక ప్రదేశములో తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. ఒక రాక్షసుడు తన వినోదము కొరకై ఎగతాళిగా అనేక రూపములలో వచ్చి గాలవుని తపస్సుకు భంగముకలిగిస్తూ ఉండేవాడు. గాలవుడు తన తపో శక్తితో ఆ దనుజుని శిక్షించగలడు. కానీ ఈవిధంగా తలచాడు.

**"దుష్ట శిక్షణ శిష్ట రక్షణ రాజు పని కదా! ఇందుకొరకై నా తపోశక్తిని నేనెందుకు వృధా చేసుకోవాలి? అంతగా అయితే, రాజు యొక్క పాలనా సామర్థ్యము కొరకై ఉత్తమ ఉపకరణమును నా తపస్సుచే నిర్మించి – రాజుకే ఇస్తాను. అది దేశమునకు శ్రేయోదాయకము అగును గాక!"**

ఈవిధంగా తలచి గాలవముని ఒకచోట ఆశీనులై, ప్రశాంతముగా ఆకాశమువైపు చూచారు. అప్పుడు ఆకాశము నుండి ఆకాశవాణి మూడు లోకములలో సంచరించగల ఒక గుఱ్ఱమును పంపి, "ఓ గాలవమునీ! మీరు అనుకున్నది యుక్తి యుక్తము. నేను ఇస్తున్న ఈ కువలయాశ్వమును కాశీరాజు కుమారుడైన ఋతధ్వజరాజకుమారునికి ఇవ్వండి. ఈ కువలయాశ్వము త్రిలోకములలో సంచరించగలదు" – అని సూచించింది.

గాలవముని ఆ గుఱ్ఱమును 'గర్గుడు' అనే వ్యక్తిచే రాజకుమారుడగు ఋతధ్వజునికి పంపి "రాక్షసుని సంహరించండి" – అను మునివాక్యము అందించారు. అప్పటి నుండి ఋతధ్వజుడు **'కువలయాశ్వుడు'**గా కూడా నామధేయుడైనారు.

ఆ గుఱ్ఱమును వాహనంగా చేసుకొని కువలయాశ్వుడు గాలవమునిని బాధిస్తున్న రాక్షసుని శిక్షించటానికై ఆతని వెంటబడ్డాడు. ఆ రాక్షసుడు "వరాహము (పంది)" రూపము దాల్చి, ఒకచోట భూమిపై గల ఒక బొరియలో దూరాడు. ఆ బొరియలోకి కువలయాశ్వమును అధిరోహించిన కువలయాశ్వుడు (ఋతధ్వజుడు) తాను కూడా ప్రవేశించారు. అక్కడ ఆతనికి అతి లావణ్యవంతులగు ఇద్దరు స్త్రీలు కనిపించారు. వారు కుండల, మదాలసలు. కుండల ఋతధ్వజుని గుర్తించి, ఇట్లా పలికింది.

**కుండల:** ఓ ఋతధ్వజా! నేను **పుష్కరశాలి** అనువాని భార్యను. ఈమె నా చెల్లెలు మదాలస. మా ఇద్దరినీ 'పాతాళకేతుడు' అనే రాక్షసుడు తన మాయచే బలాత్కారంగా తెచ్చి ఈ బిలములో దాచాడు. మా ఇద్దరినీ రక్షించండి. నా సోదరి మదాలసను మీరు ధర్మపత్నిగా స్వీకరించండి.

స్వధర్మ నిరతుడగు కువలయాశ్వుడు పాతాళకేతుని యుద్ధములో సంహరించి, ఇరువురు స్త్రీలను చెరవిడిపించి మదాలసను ధర్మపత్నిగా స్వీకరించారు.

పాతాళకేతు సోదరుడు తాళకేతువు. ఆతడు ఋతధ్వజునిపై తన అన్నను చంపినందుకు పగతీర్చుకోదలచాడు. అయితే పరాక్రమముచే ఆతని ముందు తాను నిలువలేనని తెలుసు. అవకాశం కోసం వేచిచూడసాగాడు.

కువలయాశ్వుడు ఒకరోజు జదనపదములను రక్షించటానికై గుఱ్ఱము ఎక్కి సంచరిస్తూ ఉన్నారు. తాళకేతువు ఒక ముని రూపము దాల్చి కువలయాశ్వుని సమీపించి, "ఓ కువలయాశ్వా! ఋతధ్వజా! కాశీ రాజ్యము ఏలువారలలో ఉత్తమ ధర్మ నిరత శ్రేష్ఠా! నేను ఒక క్రతువును తలబెట్టాను. అందుకు సహాయంగా మీ కంఠహారము నాకు ఇవ్వండి" – అని కోరాడు.

వెంటనే కువలయాశ్వుడు తాను ధరించియున్న కంఠహారాన్ని క్రతు నిర్వహణను ఉద్దేశ్యించి తాళకేతువుకు సంతోషంగా (మునిగా భావించి) ఇచ్చివేశారు.

కంఠహారము దానంగా పొందిన తాళకేతువు, "ఓ కువలయాశ్వా! ఋతధ్వజా! మీరు ఇక్కడే ఉండండి. నేను స్నానం చేసి వచ్చి ఆశీర్వదిస్తాను" – అని పలికి రాజుని ఒకచోట కూర్చోమని, తాను మాత్రం రాక్షస మాయను ఉపయోగించి నిముషముకాలములో రాజు యొక్క నగరము (కాశీనగరము) ప్రవేశించాడు. అంతఃపుర ద్వారము వద్ద – "ఓ కాశీరాజ ప్రజలారా! ఓ అంతఃపుర జనులారా! మీ రాజు హతుడు అయ్యాడు. ఇదిగో,... గుర్తు ఈ కంఠహారము".... అని వారలకు ఇచ్చి అక్కడి నుండి వెళ్ళిపోయాడు. ఆ వార్త విని, కంఠహారము కళ్లతో చూచిన మదాలస వెంటనే భర్తపై మనస్సు నిలపి ప్రాణము విడచింది. నగరమంతా శోక సాగరమయింది.

కొన్ని రోజులకు కువలయాశ్వుడు నగరం చేరాడు. ఆతనిని చూచి ప్రజలంతా విస్మయము, సంతోషము పొందారు. జరిగినదంతా తెలుసుకొని, "ఇదంతా రాక్షసమాయ కదా!"... అని గమనించారు. ఋతధ్వజుడు ముదాలస మరణించినదని తెలుసుకొని విరక్తి చెందాడు. ఇక రాజ్య విషయాలు పట్టించుకోకుండా ఏకాంతంగా దుఃఖిస్తూ ఉండిపోయారు. అది గమనించిన ఆతని స్నేహితులగు నాగేంద్రుని పుత్రులు (నాగకుమారులు) తమ తండ్రి నాగరాజుకు తెలిపారు. ఆ నాగరాజు పేరు అశ్వతరుడు.

నాగరాజు అశ్వతరుడు – కువలయాశ్వుని (ఋత్వధ్వజుని) సమీపించి "ఓ ఋతధ్వజా! నీవు మహారాజువు. జ్ఞానివి. మహాపరాక్రమ వంతుడవు. ప్రజలందరికీ అత్యంత ప్రియమైన రాజువు. ప్రయత్నిస్తే సిద్ధించలేనిది ఏదీ ఉండదని నీకు తెలుసు.

నీవు సరస్వతీ దేవి భక్తుడవు. ఆ చల్లటి తల్లిని ప్రార్థించి 'శివస్తుతి'ని గానం చేయనారభించు. శివుని నీ ప్రార్థనతో మెప్పించు. ఆయన మెచ్చితే మదాలస తిరిగి జీవించవచ్చు.

ఆ మాటలు విని, కువలయాశ్వుడు దుఃఖమును విడచిపెట్టి, వివేకమును నిదురలేపి, ఉపాసనాశీలుడైనారు. ముందుగా సరస్వతీ సహస్రమును పఠించి, ఇక అప్పుడు శివుని స్తుతించసాగారు. శివుడు ఆ స్తుతులకు సంతోషించి **"నీ భార్య తిరిగి జన్మించి నిన్ను సమీపించును గాక!"** అని అనుగ్రహించారు.

మరణించిన మదాలస నాగరాజు అశ్వతరునికి పుత్రికగా జన్మించింది. అశ్వతరుడు తన కుమార్తెను కువలయాశ్వునికి ఇచ్చి వివాహం చేసారు.

ఆ తరువాత కాలక్రమేణా మదాలస – కువలయాస్వ దంపతులకు విక్రాంతుడు, సుబాహువు, శత్రుమర్దనుడు, అలర్కుడు అనే నలుగురు కుమారులు కలిగారు.

ఆ తరువాత కువలయాశ్వ బిరుదాంకితుడగు ఋతధ్వజుడు సంసారభావములన్నీ జయించి సర్వాంతర్యామియగు పరమాత్మతో మమేకమగు మోక్షమార్గాశయుడయ్యారు. పెద్ద కుమారుని రాజ్యాభిషిక్తులను చేసి మదాలసా సమేతుడై వానప్రస్థాశ్రమము స్వీకరించారు.

**అశ్వపతి (భారతము మరియు ఛాందోగ్యోపనిషత్) :** ఈయన కేకయ దేశపు రాజు. ఈయన కుమార్తె కైకేయి. కుమారుడు యధాజిత్తు. ఒకసారి అశ్వపతి గొప్ప యజ్ఞము తలబెట్టారు. యజ్ఞము ప్రారంభమవటానికి ముందు ముగ్గురు బ్రాహ్మణులు అశ్వపతి యొక్క అంతఃపురము ప్రకాశించారు.

**కేకయరాజు అశ్వపతి :** ఓ ఉద్దాలక, ప్రాచీనశాల, సత్యయజ్ఞ – ఉత్తమ బ్రాహ్మణోత్తములారా! ఈ యజ్ఞప్రారంభ శుభ ఘడియలలో బ్రహ్మ తేజో విలాసులగు మీ రాక – ఈ యజ్ఞవాటికను, యజ్ఞ కార్యక్రమమును పరమ పవిత్రము చేస్తున్నాయి. మీకు సుస్వాగతము. ఇప్పుడు అధికంగా కాలము లేదు కాబట్టి మీకు ధనము, గోవులు మొదలైన వాటిని సమర్పించుకొని, మేము యజ్ఞ గృహములో ప్రవేశిస్తాము. దయచేసి స్వీకరించండి.

**బ్రాహ్మణులు :** ఓ అశ్వపతీ! కేకయ రాజ్య రాజపుంగవా! మీ ధనముతో మాకు పనిలేదు.

**అశ్వపతి :** మరి? ఏమి మీ ఆజ్ఞ? ధనము స్వీకరించ తిరస్కరిస్తున్నారా? మీకు సమర్పించుటకు నాకు అర్హత లేదని గాని భావిస్తున్నారా? ఓ సద్బ్రాహ్మణులారా! నేను సమర్పిస్తున్న ధనము దోషమైనదేమీ కాదు. నేను వ్యక్తిగతంగా శ్రమించి ప్రోగుచేసిన స్వార్జిత ధనమునే సమర్పిస్తున్నాను. మా రాజ్యములో దొంగలుగాని, దాత కాని ధనవంతుడు గాని, అధికారి అయి కూడా యజ్ఞము చేయనివాడుగాని లేరు. స్వైరిణి (పర పురుష సహవాసము చేయు స్త్రీ) గాని, స్వైరి (పరస్త్రీ సహవాసము చేయు పురుషుడు)గాని లేరు. అప్పుడు మీకు నేను సమర్పించు ధనము స్వీకరించటానికి అభ్యంతరమేమి? నేను ఇచ్చు ధనము సరిపోదని శంకిస్తున్నారా ఏమి? అట్లా అయితే, మీరు ఈ యజ్ఞము అయ్యేదాకా ఇక్కడే ఉండండి. ఈ యజ్ఞ కార్యము కొరకు నియమించబడిన ఋత్విక్కులతో సమానంగా మీకు ధనము మొదలైనవి సమర్పించగలను.

**బ్రాహ్మణులు :** బ్రహ్మజ్ఞా! అశ్వపతీ! మేము ధనముకొరకై రాలేదు. బ్రహ్మము యొక్క స్వరూపము గురించి మీ వద్ద శ్రవణము చేయటానికి విద్యార్థులమై అధ్యయన దృష్టితో సమిత్పాణులముగా వచ్చాము.

అది విని అశ్వపతి అందుకు అంగీకరించి యజ్ఞ కార్యక్రమ విరామ సమయములలో ఆత్మతత్త్వమును బోధించసాగారు.

ఈవిధంగా కేకయ దేశపు రాజు అశ్వపతి రాజ్యము పాలిస్తూ, యజ్ఞ–యాగాదులు నిర్వర్తిస్తూ కూడా ఆత్మ జ్ఞాన దీక్షను ఏక్షణమందు విడువక రాజ్యపాలన చేసారు. సరి అయిన సమయంలో రాజ్యము కొడుకులకు ఇచ్చివేసి వానప్రస్థము ఆశ్రయించారు.

**శశిబిందు (భారతము):** ఈయన యదు మహారాజు కుమారులలో రెండవవాడగు 'క్రోష్టు' వంశజుడగు చిత్రరథుని కుమారుడు. ఈయనకు అనేక మంది భార్యలు, పుత్రులు ఉన్నారు. ఆయన కుమారులలో ముఖ్యులు ఆరుగురు.

1. పృథుశ్రవుడు 2. పృథుదాసుడు 3. పృథుకీర్తి 4. పృథు జయుడు 5. పృథుకర్ముడు 6. పృథుయశుడు.

ఈయన "చతుర్దశ మహారత్నుడు" అయిన చక్రవర్తిగా లోక ప్రసిద్ధుడు.

### చతుర్దశ మహారత్న వివరణ

> **చక్రం రథో మణిః ఖడ్గం చర్మ రత్నంచ పంచమమ్।**
> **కేతుః నిధిశ్చ సప్తైవ ప్రాణహీనాని చక్షతే।**
> **భార్యా పురోహితశ్చ అవసే సేనానీ రథ కృచ్చయః।**
> **పత్యశ్వకల భాశ్చేతి ప్రాణినః సప్త కీర్తితః।**

ఆ తరువాత ఈయన తాను పాలిస్తున్న మహా సామ్రాజ్యమును, పుత్ర–మిత్ర ఇత్యాదులను తృణప్రాయంగా త్యజించి వానప్రస్థుడై ఆత్మతత్త్వ జ్ఞాని అయినారు.

**హరిశ్చంద్రుడు (భాగవతము) :** సూర్య వంశపు రాజు. త్రిశంకుని కుమారుడు. నారదుని బోధను అనుసరించి వరుణ వ్రతము ఆచరించారు. పుట్టిన కుమారుని వరుణునికి యాగ పశువుగా ఇవ్వటానికి అంగీకరించి రోహితాస్యుడు అనే కుమారుని పొందారు. ఇంద్రునిచే బోధించబడి రోహితాస్యుడు (1) పుణ్య కథలను వినడం (2) పుణ్య నదులలో స్నానము చేయసాగాడు.

ఆ తరువాత హరిశ్చంద్రుడు–రోహితాస్యునికి బదులుగా అజీగర్తుని మధ్య పుత్రుడగు శునశ్శేపుని యాగపశువుగా చేసి వరుణుని ఉద్దేశ్యించి "పురుషమేధ యాగము" ప్రారంభించారు.

ఆ యాగమునకు హోత **విశ్వామిత్రుడు**. ఆధ్వర్యుడు **భృగువు**. సామగానము చేయువారు వశిష్ఠుడు. ఆ యాగమునకు మెచ్చి ఇంద్రుడు బంగారు రథమును ప్రసాదించారు. విశ్వామిత్రుడు అత్యంత ప్రీతుడై ముఖ్య జ్ఞానము బోధించారు. వరుణుడు సంతోషించి హరిశ్చంద్రుని కోరికపై శునశ్శేపునికి తిరిగి జీవితము ప్రసాదించారు.

**హరిశ్చంద్రుడు (మార్కండేయపురాణము) :** ఇంద్రసభలో జరిగిన "సత్యము" గురించిన ఒక చర్చలో వసిష్ఠుడు హరిశ్చంద్రుని గురించి స్తుతించిన "సత్యనిరతి" గురించి విశ్వామిత్రుడు, – "మీరు హరిశ్చంద్ర పురోహితులు కాబట్టి అట్లా అంటున్నారు. నేను అబద్ధము ఆడించగలను" అని ప్రతిజ్ఞ–పందెము పలికారు.

ఆ తరువాత విశ్వామిత్రుడు హరిశ్చంద్రునివద్ద విశేష ధనము యాగ నిర్వహణ కొరకై దానముగా అర్థించి, స్వీకరించారు. "ధనము తరువాత తీసుకొనిపోతాను" – అని చెప్పి వెళ్లిపోయారు.

జంతువుల నుండి గ్రామ పజల – పంటల రక్షణకై వేటకు వెళ్లిన హరిశ్చంద్రుని సమక్షంలో విశ్రాంతి సమయములో – విశ్వామిత్ర కల్పితమగు మాతంగ కన్యల నృత్యము చేసారు. అది మెచ్చి హరిశ్చంద్రుడు ఆభరణములు బహుమానముగా ఇవ్వబోయారు. ఆ మాతంగ కన్యలు అది నిరాకరించి **"మీతో మేము పొందు కోరుకుంటున్నాము. మమ్ములను పెళ్ళి చేసుకోండి"** – అని కోరారు. ఏకపత్నీవ్రతస్తుడు అగు హరిశ్చంద్రుడు వారికి బుద్ధి చెప్పి పంపివేశారు. ఆ కన్యలు పొందుకై (వివాహమునకై) తిరస్కరించబడ్డారని వారినుండి విన్న విశ్వామిత్రుడు కోపగించగా, హరిశ్చంద్రుడు **"నేను రాజ్యమునైనా మీకు సమర్పిస్తాను గాని నా ఏకపత్నీవ్రతము త్యజించను"** – అని పలికారు.

అప్పుడు విశ్వామిత్రుడు **"ఓహో! అట్లాగా! అయితే నీ సమస్త రాజ్యము నాకు ఇచ్చివేయి"** – అని అనగానే హరిశ్చంద్రుడు నిస్సందేహముగా, సంతోషముగా రాజ్యమును దానము చేసి, అయోధ్యారాజ్యము నుండి భార్య చంద్రమతి, కుమారుడు రోహితాస్యునితో బయలుదేరారు.

అప్పుడు విశ్వామిత్రుడు "నాకు దానము ఇచ్చిన ధనము మాట ఏమిటి?" అని ప్రశ్నించారు. "రాజ్యమంతా దానము చేసాను కదా! మీకు దానమిచ్చిన ధనము మీకు ఇవ్వటానికి నెల గడువు ఇవ్వండి!" – అని పలికాడు. అప్పుడు హరిశ్చంద్రుని వెంట విశ్వామిత్రుడు బాకీ వసూలుకై తన శిష్యుడు నక్షత్రకుని పంపారు. చివరికి కాశీనగరంలో తన భార్య చంద్రమతిని అమ్మి తనను తాను కూడా అమ్ముకొని బాకీ చెల్లించారు. ఆ తరువాత కాటికాపరిగా,–మరణించిన కుమారుని కాటి సుంకము విషయములోకూడా తన ధర్మము వీడలేదు. సాధ్వీమణి అగు భార్య చంద్రమతి శిరస్సు ఖండించటానికి వెనుకాడలేదు. ఆయన ఖడ్గము పూలదండగా మారింది.

- సత్యము ఆత్మయే।
- ఇదంతా మాయమయ జగత్తు।
- ఇది నిత్యమనుకున్నంతకాలము రాజు కింకరుడౌతాడు, కింకరుడు రాజు – అవుతాడు.

అని ప్రపంచానికి చాటిచెప్పి సత్యమును వీడక దిగ్విజయుడైనాడు. విశ్వామిత్రుడు అనుకున్న ప్రకారము తన తపస్సులో సగము ఫలము హరిశ్చంద్రునికి ధారపోశాడు. శంకర భగవానుడు ఆయన కుమారుడు రోహితాస్యుని పునరుజ్జీవింప జేసారు.

"ఆధ్యాత్మిక సత్యము ముందు ఈ జగత్ సంపద - ఆపదలు దిగదుడుపే" - అని హరిశ్చంద్ర-విశ్వామిత్ర-వసిష్ఠులు లోకములకు నిరూపించి చూపారు.

**అంబరీషుడు (భాగవతము) :** నాభాగుని కుమారుడు. విష్ణు భక్తుడు. చక్రవర్తి. ద్వాదశీ వ్రతము నిర్వర్తిస్తూ ఉండగా దుర్వాసుడు అభ్యాగతి అయి వచ్చారు. స్నాన-సంధ్యా వందనములు ముగించుకొని రమ్మన్నారు. ద్వాదశ గడియలు గడచిపోకముందు జలము త్రాగినందుకు దుర్వాసుడు ఇచ్చిన శాపములను విష్ణుభగవానుడు తాను స్వీకరించారు.

మత్స్య-కూర్మ-వరాహ-నారసింహ-వామన-పరశురామ-దశరధరామ-బలరామ-బౌద్ధ-కల్కి శాపములు తాను స్వీకరించారు.

ఆ తరువాత విష్ణుచక్రము దుర్వాస మహర్షి వెంటబడగా, త్రిమూర్తులు కూడా ఆ దుర్వాసుని రక్షించటానికి 'అశక్తత' ప్రకటించారు. చివరికి విష్ణుచక్ర ఘాతము నుండి దుర్వాసుని అంబరీషుడు తన భక్తి-ప్రపత్తులచే రక్షించారు. భక్తి-సత్యముల ఔన్నత్యము, ఆత్మతత్త్వ ధ్యానముల మహత్తర ప్రభావము లోకాలకు అంబరీషుడు నిరూపించి చూపారు. అంబరీషుడు మట్టిని బంగారమును సమదృష్టితో చూచు భక్తి-జ్ఞాన యోగములను లోకమునకు సోదాహరణ - దృష్టాంతముగా బోధనచే లోకపావనులైనారు.

**యయాతి (భారతము) :** చంద్రవంశపు రాజు. నహుషునికి, ప్రియంవదకు కలిగిన ఆరుగురు కుమారులలో ఒకడు. నహుషుని తరువాత మహారాజు. శుక్రాచార్యుల కుమార్తె దేవయానను, ఆమె చెలికత్తె శర్మిష్ఠను వివాహము చేసుకొన్నారు.

దేవయాన వలన - యదువు, తర్వసులను, శర్మిష్ఠ వలన - ద్రుహ్యుడు, అనువు, పూరుడులను - కుమారులుగా పొందారు. దేవయాని తండ్రి శుక్రాచార్యులచే (దేవయాని యొక్క చెలికత్తె శర్మిష్ఠతో దాంపత్యము పొందినందుకు) - "నీవు వృద్ధుడవుగా ఉండెదవు గాక" - అని శపించబడ్డారు. శాప విమోచనముగా "నీ కుమారులలో ఒక్కడు ఎవడైనా నీ వార్ధక్యము అంగీకరించి స్వీకరిస్తే మరల యౌవనవంతుడవు కాగలవు" అని శుక్రాచార్యులు వరమిచ్చారు. ఆఖరి పిల్లవాడు పూరుడు మాత్రమే వార్ధక్యము స్వీకరించి తన యౌవనము తండ్రికి ఇవ్వటానికి ఒప్పుకున్నాడు.

ఆ యౌవనము అనుభవించిన తరువాత తిరిగి యౌవనము పూరునికి తిరిగి ఇచ్చి తన వార్ధక్యము తిరిగి తీసుకొన్నారు. పూరుని తన తరువాత చక్రవర్తిగా అభిషేకించారు.

**"నజాతు కామః కామానామ్ ఉపభోగేన శామ్యతే।"**

*కోరికలు ఎంతగా సిద్ధించినా కోరికలు తీరవు. అగ్నిలో ఆజ్యము పోసినప్పుడువలె పెరుగుతూనే ఉంటాయి. కోరికలు కోరుకోవటం విరమించటము మాత్రమే ఉపాయము.*

అని సమస్త జనులకు పాఠ్యాంశముగా ఎలుగెత్తి చెప్పినవారు యయాతి.

**అనరణ్యుడు (రామాయణము) :** సూర్యవంశపు రాజు. రావణుడు రాజు లందరికి మీదకు యుద్ధానికి వెళ్లినప్పుడు వారంతా భయపడుతూ ఉండేవారు. కానీ అనరణ్యుడు మాత్రము అయోధ్యపై దండయాత్రకు వచ్చిన రావణునితో యుద్ధము చేసి ఓడిపోయారు. రావణుడు హేళన చేస్తూ అనరణ్యుని శిరస్సు ఖండించారు.

**అప్పుడు అరణ్యుని శిరస్సు ఇట్లా పలికింది.**

*ఓ రావణా! ఇదంతా నీ ప్రతాపము - అని అనుకోకు. విధి చిద్విలాసము. నాటకములో సంఘటనలన్నీ "రచయిత కల్పితము. సత్యము కాదు"... అనునది ఏ తీరైనదో, ఈ జగత్ సంఘటనలన్నీ అటువంటివే! సూర్యవంశములో పుట్టబోవు శ్రీరాముడు అనువాని చేతిలో నీవు సంహరించబడగలవు. అయితే అది కూడా జగన్నాటక చమత్కారమే! కనుక దేహాహంకారమును జయించి, ఆత్మాహంకారమును ఆశ్రయించు।" - అని సూచించారు. రావణుడు ఆ మహత్ వాక్యములను తెలిసికూడా, పెద్దగా పట్టించుకోలేదు.*

## వాలఖిల్యులు

**బ్రహ్మవైవర్త పురాణము :** బ్రహ్మదేవుని పుత్రులు. బ్రహ్మదేవుడు పార్వతీ పరమేశ్వర కళ్యానము చూడటానికి వెళ్లారు. పీటమీద కుర్చుని ఉన్న పార్వతీ పరమేశ్వరుల మహత్తర సౌందర్యము చూస్తూ ఉండగా బ్రహ్మకు "రేతః పతనము" అయింది. ఆ రేతస్సు నుండి వాలఖిల్యులు జన్మించారు.

**బ్రహ్మ పురాణము :** బ్రహ్మ ఒక రోజు స్వర్గలోకమునకు వెళ్లటం జరిగింది. అప్పుడు రంభ మొదలైన అప్సరసలు ఎదురుగా వచ్చారు వారిని చూడగానే బ్రహ్మదేవునికి దైవ విలాసంగా రేతఃపతనము అయింది. దానిని ఆయన కాలితో కప్పి ఉంచారు. రేతస్సుతో ఇసుక రేణువులు కలిసాయి. అందులోంచి వాలఖిల్యులు జన్మించారు.

**బ్రహ్మాండ పురాణము :** 'క్రతువు' అణు మునియొక్క కుమారులు. వీరి తల్లి సన్నతి (క్రియ). వీరు నిత్య బ్రహ్మాణాకారులు ఊర్ధ్వ రేతస్కులు. వీరు సూర్యుని సప్తాశ్వరథములో ప్రవేశించి సంచరిస్తూ ఉంటారు.

**భారతము :** వాలఖిల్యులు అంగుష్ఠ (బొటనవ్రేలు) ప్రమాణము గల దేహము కలవారు. వారు ఒక సందర్భములో కశ్యప ప్రజాపతి పుత్ర కామేష్టి యాగము చేస్తూ ఉండగా ఆ యాగమును సేవించదలచినవారై పుష్పములను తెస్తూ పుష్పముయొక్క బరువు వలన వణుకుచుండసాగారు. ఆవిధంగా వాలఖిల్యులు స్వల్పపు బరువునకే వణకటం చూచిన ఇంద్రుడు ఎగతాళిగా నవ్వారు. సిగ్గుపడి దోషము పొందిన వాలఖిల్యులు "ఈ కశ్యప ప్రజాపతి చేస్తున్న **'పుత్రకామేష్టి'** ఫలంగా జనించే పుత్రుడు రెండవ ఇంద్రుడు కాగలడు!" – అని పలికారు. అది విని భయపడిన ఇంద్రుడు కశ్యప ప్రజాపతిని సమీపించి "ప్రజాపతీ! రక్షించండి" – అని అర్థించారు. ప్రజాపతి చిరునవ్వు నవ్వి, "పుట్టబోయేవాడు ఖగేంద్రుడు. విష్ణు భక్తుడు. విష్ణు భగవానుని వాహనుడు. లోక కళ్యాణమూర్తి. కాబట్టి నీకు వచ్చిన భయమేమీ లేదు లేః!" – అని ఓదార్చారు.

## కౌత్సుడు

**రఘువంశము :** వీరు వరతంతు మునీశ్వరుని శిష్యుడు. విద్య నేర్చిన తరువాత ఒకరోజు తన గురు దేవుని సమీపించారు.

**కౌత్సుడు :** గురుదేవా! వరతంతు మునివర్యా! తమరు "గురుదక్షిణ" ఆజ్ఞాపించమని వేడుకొంటున్నాను.

**వరతంతు ముని :** అవసరము లేదు నాయనా! నేను నేర్పిన విద్యను సద్వినియోగం చేయి. లోక కళ్యాణమునకై ఉపయోగించు. నాకు అంతే చాలు.

**కౌత్సుడు :** అట్లా కాదు స్వామీ! మీరు నావద్ద గురుదక్షిణ తప్పక స్వీకరించాలి. మీరు నాకు 14 విద్యలు నేర్పియున్నారు కదా!

**వరతంతు ముని :** అయితే నీ ఇష్టము. నీకు నేర్పిన 14 విద్యలకు 14 కోట్ల సువర్ణ నాణెములు ఇవ్వవచ్చును.

అప్పుడు కౌత్సుడు గురుదక్షిణ ఇవ్వటానికై సిద్ధపడి రఘుమహారాజును ఆశ్రయించారు. కానీ అప్పటికే 'విశ్వజిత్' యాగము నిర్వర్తించిన రఘుమహారాజు సమస్త ధనము దానము ఇచ్చివేసి ఉన్నారు. తన తగ్గిర ధనము లేనికారణంగా కౌత్సునకు మట్టి పాత్రలో కాళ్లు కడిగి మట్టిపాత్రతో త్రాగు జలము ఇచ్చారు. "అయ్యో! నేను వచ్చిన పని వాకిట్లోనే నెరవేరనిది అయిందికదా!" అని కౌత్సుడు అనుకోసాగారు. రఘుమహారాజు ప్రశ్నించి కౌత్సుకుని రాక వెనుకగల ఉద్దేశ్యము తెలుసుకొని "రెండు రోజులు వేచి ఉండండి" – అని అభ్యర్థించారు. ఆ తరువాత కుబేరునివద్ద ధనము సంపాదించి, గురుదక్షిణ చెల్లించుకోవటానికి కౌత్సుకునికి ఆతడు అడిగిన ధనము సమర్పించారు. ఇవన్నీ పురాణ విశేషాలు.

**ఇక మనము మైత్రాయణ్యుపనిషత్ అధ్యయనములో ప్రవేశిస్తున్నాము.**

# ప్రధమ ప్రపాఠకః-వైరాగ్యము-జ్ఞానావస్యకత

'ఓం' ఆనంద స్వరూపుడగు పరమాత్మకు నమస్కరిస్తూ...

– – –

ఇక్ష్వాకు వంశములో జన్మించినట్టి **బృహద్రథుడు** అనే మహారాజు. ఈయన సత్యవ్రతుడు. మహాధీరుడు. ప్రజ్ఞాశాలి. ప్రజలను కన్నబిడ్డలవలె ప్రేమిస్తూ బహుకాలము రాజ్యమును పరిపాలించారు. అనేక యజ్ఞ-యాగాలు నిర్వర్తించారు.

ఒకరోజు ఆయన ఉద్యానవనములో విహరిస్తూ చల్లని వెన్నెలలో ఒక మహావృక్షము క్రింద ఏకాంతంగా ఆశీనులైనారు. ఆయనలో వైరాగ్య భావాలు ఉదయించసాగాయి.

*ఆహా! ఈ నా భౌతిక శరీరము శాశ్వతమా? కానేకాదు. ఇది ఏదోరోజు నన్ను విడిచి తన త్రోవ తాను చూచుకోవడం అనివార్యము. ఈ దేహముతో బాటే ఈ రాజ్యసంపద, ధన-జన-నారీ సంపద, పుత్ర -మిత్ర-బంధు జనాది సంబంధాలు నా నుండి విడివడనున్నాయి. ఈ సిరి-సంపదలను చూచుకుంటూ ఆయుష్షు మొత్తం గడపివేయటము తెలివితక్కువయే. అందుచేత ఇక శేషించిన ఆయుష్షును మోక్షమార్గములో తపస్సు చేస్తూ సద్వినియోగపరచుకోవటమే ఉచితము, మానవ జన్మకు ప్రయోజనము, సద్వినియోగము.*

... ఇట్లా ఆలోచించసాగారు.

ఆ మరునాడే రాజసభను సమావేశపరచారు. ప్రజల అంగీకారము పొంది తన పెద్దకుమారుడు సుదాసునకు (భాగవతము) మహారాజుగా పట్టాభిషిక్తుని చేశారు. విరాగిఅయి, సర్వమును అప్పటికప్పుడే త్యజించి అరణ్యవాసమును ఆశ్రయించారు. ఒక ఏకాంత -ప్రశాంత -నిర్జన ప్రదేశములో ఆశ్రమము నిర్మించుకొని తపస్సు చేయటం ప్రారంభించారు. హృదయములో ఇష్టదైవమగు సూర్యభగవానుని ప్రతిష్ఠించుకొని, ఊర్ధ్వంగా చేతులు ఎత్తి ఓర్పుతో సుదీర్ఘ కాలము తపస్సు చేయసాగారు. సహస్రారమునకు ఆవల (శిరస్సుపైన బ్రహ్మరంధ్రమునకు ఊర్ధ్వముగా 12 అం॥ల ఆవలి స్థానములో) బుద్ధిని కలిపి సూర్యోపాసన చేయసాగారు.

ఒకానొకరోజు...,

పొగ-కట్టెలు లేని అగ్నివలె వెలుగొందుచు, మహాతేజోసంపన్నులగు శ్రీ శాకాయన్యమహర్షి సూర్యభగవానుని సంకల్పానుసారం బృహద్రథ మహారాజుకు ఎదురుగా ప్రత్యక్షమైనారు.

**శాకాయన్యమహర్షి:** ఓ బృహద్రథ మహారాజా! నీ తపస్సుకు, శ్రద్ధకు, భక్తికి సవిత్రు మండల మధ్యవర్తియగు సూర్యనారాయణులు మెచ్చారయ్యా! ఇక తపస్సు చాలించు! ఉత్తిష్ఠ! ఉత్తిష్ఠ! ఏమి కోరి తపస్సు చేస్తున్నావో... నిరభ్యంతరంగా కోరుకో! వరము రూపముగా సిద్ధింపజేస్తాను!

**బృహద్రథుడు :** దివ్యతేజస్సుతో సంపన్నులై వెలుగొందుచున్న ఓ శాకాయన్య మహర్షీ! నాయీ భక్తి పూర్వక ప్రదక్షిణ నమస్కారములు, పాదాభివందనములు స్వీకరించ ప్రార్థన! మీ దర్శనముచే నేను పునీతుణ్ణి అయ్యాను!

హే భగవన్! నేను ఆత్మవేత్తను కాదు. "ఆత్మ అనగా ఏమి? ఎట్టిది? ఏది ఉపాసిస్తే ఆత్మ సాక్షాత్కారమౌతుంది?" ... ఈ ఈ విషయాలు తెలుసుకోవలెననే ఉత్సుకత మాత్రము కలవాడిని.

ఇక మీరో! సూర్యలోకవాసులు. బ్రహ్మజ్ఞులు. ఆత్మవేత్తగా మునిలోకప్రసిద్ధులు. ఈనాడు నాకు సుదినము. ఆదిత్య భగవానుని కరుణచే మహామహనీయులగు మీ దర్శనమైనది. మహాపురుషుల దర్శనము మహత్తరమైన ప్రయోజనము ప్రసాదిస్తుంది కదా! మహాపురుష సంశ్రయము (ఆశ్రయము) దైవానుగ్రహంగా మీ రూపముగా నాకు ప్రసాదించబడుతోంది.

అందుచేత "సత్యస్వరూపమగు ఆత్మ" గురించి బోధించవలసినదిగా మిమ్ములను అర్థిస్తున్నాను.

**శాకాయన్యులు :** నాయనా! ఇక్ష్వాకా! అవాక్ మానసగోచరమగు ఆత్మయొక్క వృత్తాంతమును వాక్కుతో చెప్పటం సులభమా? కాదు. అశక్యము కూడా. నీవు ఆత్మ గురించి విశేషములు అడగటం నాకు ఆశ్చర్యము కలుగజేస్తోంది! లోకములలోని స్థితిగతుల సంబంధమైన

సిరి–సంపదలను వరంగా కోవటమే లోకరీతి. ఆత్మజ్ఞాన సమాచారాన్ని వరంగా కోరుకోవటం లోకరీతి కాదు. అందుచేత ఆత్మజ్ఞాన విషయం అట్లా ఉంచి, మరింకేదైనా వరం కోరుకోవయ్యా! **అన్యాత్మామాన్ వృణీష్వ!**

బృహద్రథ మహారాజు లేచి శాకాయన్య మహర్షి యొక్క పాదపద్మములకు మరల సాష్టాంగ దండప్రణామము ఆచరించారు. వారి చరణములను పుష్పములతో పూజించారు. పాదములు కడిగి జలమును శిరస్సుపై చల్లుకొన్నారు.

**బృహద్రథ మహారాజు :** హే భగవాన్! శాకాయన్య మహర్షీ! మీరు కూడా ఈ భౌతిక శరీర సుఖము కొరకై వరము కోరుకోమంటున్నారా స్వామీ? ఈ దేహము ఎటువంటిదో మీకు తెలియనిదా? కాదు.

**భగవన్! చర్మ, అస్థి, స్నాయు మజ్జా మాంస శుక్ర శోణిత శ్లేష్మ అశ్రు దూషితే, విణ్మూత్ర వాత పిత్త కఫ–సంఘాతే, దుర్గంధే, నిస్సారే – అస్మిం శరీరే కిం కామోపభోగైః?**

ఇది బొమికలు – చర్మము–నరములు – క్రొవ్వులను ఒకచోటికి చేర్చబడి ప్రకృతిచే మిశ్రమముగా తయారు చేయబడినట్టి ఒక తోలుబొమ్మ. జడము. జడమే అయి ఉండి కూడా ఈ భౌతిక దేహము మాకు అనేక బంధములను, దుఃఖములను కలుగజేస్తోందే!

> *ఇది శుక్రము (రేతస్సు) –శోణితము–శ్లేష్మము–కన్నీరు ఇటువంటి అనేక దోషపూరితమైన పదార్థములన్నీ తన యందు కలిగియున్నట్టిది. మలము, మూత్రము, వాత–పిత్త–కఫములచే బహు దుర్గంధభూయిష్టమైనట్టిది.* ***"ఇది–ఇందులో సారభూతమైన వస్తువు"...*** *అని ప్రకటించుకోగలిగినదంటూ ఈ భౌతికదేహములో ఏదీ లేదు. అటువంటి ఈ భౌతిక వస్తువు వంటి దేహమును ఉపయోగించి, ఇందుకొరకై ఏవో భౌతిక పదార్థములను సముపార్జించి, ... ఆ సంఘాతము (Association)చే పొందగలిగే కామోపభోగముల వలన ఏమి ఆనందము? ఏమి లాభము? ఎంతవరకు ప్రయోజనకరం? నాకేమీ ఏ మాత్రమూ కనిపించటమే లేదు!*

హే మహర్షీ!

ఇంకా వినండి. నాయొక్క ఆలోచనలేమిటో వినిపిస్తాను.

అనేక మనోసంబంధమైన దోషాలు ఈ దేహమును వెంటనంటి ఉంటున్నాయి.

- ఏదో, ఇంకేదో కావాలి కదా?.. అనే **కామము.**
- కోరుకొన్నది పొందటములో అడ్డుపడుచున్నారని ఎవరెవరి మీదో **కోపము, క్రోధము.**
- " 'నాది' అనుకొన్నది మరెవ్వరైనా లాక్కుపోతారేమో? కోల్పోతానేమో? పోగొట్టుకుంటానేమో? నావి మరెవ్వరికైనా ఇవ్వవలసి వస్తుందేమో"... అనే **లోభము.**
- నామ–రూపములకు ఆకర్షితులమై సత్యము–నిత్యము పరిశీలించలేనట్టి **మోహము.**
- "ఎప్పుడు ఏది ఎట్లా కానున్నదో? ఎవరి వలన ఏమి ప్రమాదమో?"... అనే రూపము గల **భయము.**
- హృదయంలో అనేకచోట్ల గూళ్లు కట్టుకున్నట్టి – ఎందుకోకూడా చెప్పుకోలేని–**విషాదము**. ఏవేవో **దిగుళ్లు.**
- కొందరంటే ఇష్టపడటం. వాళ్లు దూరమగుచున్నప్పుడు చెప్పరాని **వేదన.**
- మరికొందరంటే అయిష్టము. వాళ్ళు దగ్గిరకు వస్తూ ఉంటే, ఏదో చెప్పరాని **విసుగు, నిస్సహాయత.**

ఇవి కాక..,

ఆకలి, దాహము, వార్ధక్యము, మృత్యువు, రోగము, శోకము – ఇటువంటి అనేక విషయాలతో శరీరము అనుక్షణము తాడనము పొందుతూ ఉన్నది. ఇదీ ఇక్కడి పరిస్థితి. ఇటువంటి అనేక దోషములతో కూడిన ఈ భౌతిక శరీరమును సుఖపరచటానికై ఏవైనా దృశ్యసంబంధమైన కామోపభోగములు కోరుకొని ఏమి ప్రయోజనము? ఏమీ ప్రయోజనము లేదని నా నిశ్చితాభిప్రాయము.

ఇంకా కూడా చెప్పాలంటే...,

ఏదేది ఇప్పటికి "నాదే కదా!" అని అనిపిస్తోందో, ఏదేది ఆయా ప్రయత్నములలో – ప్రయాసలతో సంపాదించుకోబోతామో... అవన్నీ కూడా కాలగతిచే నశించటము అనివార్యమేకదా! మృత్యువుతో అన్నీ ముగుస్తాయి మరి. ఈగలు– దోమలు రోజూ పుడుచున్నాయి.

అక్కడ-ఇక్కడ వ్రాలుచున్నాయి. ఒకటి-రెండు రోజులలో నశిస్తున్నాయి. ఈ దేహాలన్నీ అతీరైనవేకాక మరేమున్నది? ఇవన్నీ కాలగతిచే గడ్డిపోచలవలె పుట్టుకొస్తున్నాయి. కాసేపు ప్రకృతిలో తైతక్కలాడుచున్నాయి. మరల కాలగతిచే నశిస్తున్నాయి. ఇంతలోనే క్రొత్తక్రొత్త దేహాలు పుట్టుకొస్తున్నాయి.

ఇక అల్పజీవులమగు మాగతి చూడండి! ఈ భౌతిక దేహపరమైన సంబంధ-సంపద-సందర్భ బంధుమిత్ర కళత్రాది వ్యవహారములను ఆశ్రయించి, జీవితకాలమంతా నమ్మి ఉంటున్నాము. ఆత్మజ్ఞాన విహీనంగా **ఆయుష్షు** - అనే అవకాశమును వృధా చేసుకుంటున్నాము. నిరుపయోగ పరచుకుంటున్నాం. దుర్వినియోగ పరచుకొంటున్నాము కూడా. ఇదంతా మా పట్ల అజ్ఞానకారణంగా దౌర్భాగ్యమే అగుచున్నది.

ఇక, మరికొందరు. వారు-మహాధనుర్ధారులు, గొప్ప సంపదలకు - మహాసామ్రాజ్యములకు అధిపతులై కూడా, ఆత్మజ్ఞానము కొరకై వాటిని తృణప్రాయంగా త్యజించి, సత్య-జ్ఞానములను ఆశ్రయించి ఉన్నారు. అట్టి ఎందరో మహనీయులు, మహాశయులు కూడా ఉన్నారు కదా! దృష్టాంతంగా...,

సుద్యుమ్నుడు; ఇంద్రద్యుమ్నుడు; కువలయాశ్వుడు, యౌవనాశ్వుడు; వధ్రియాశ్వుడు; అశ్వపతి; శశిబిందుడు; హరిశ్చంద్రుడు; అంబరీషుడు; అననుక్తుడు; స్వయాతి; యయాతి; అనరణ్యుడు; అక్షసేనుడు; మరుత్తు; భరతుడు →

మొదలైన మహామహనీయులు తమ బంధువర్గం చూస్తూ ఉండగా... సూక్ష్మ బుద్ధితో, **మహతీం శ్రియం విహాయ** - గొప్ప గొప్ప సంపదలన్నీ పాము కుబసమువలె త్యజించారు. వారు పరతత్త్వము కొరకై అరణ్యవాసమును, ఏకాంతవాసమును ఆశ్రయించినట్లుగా చరిత్రలను చదివాము. (వీరిలో కొందరి పౌరాణిక విశేషాలు పేజి 23 నుండి 29 వరకు చెప్పుకున్నాము).

**"ముందుగా ఎదురుగా ఉన్న భౌతిక సంపదలను అనుభవించటం కొనసాగిద్దాం. ఆ తరువాత ఎప్పుడో జ్ఞాన సంపద విషయానికి వద్దాములే"** - అని తలచటము తెలివిగల వాక్యము కానే కాదు. "తొందరలేదు" అని అనుకుంటూ ఆత్మవిచారణకు ఉపక్రమించకుండా రోజులు గడిచిపోతూ ఉంటే, మేము పట్టీ-పట్టనట్లుగా చూస్తూ ఉండటం ఉచితమా? ఏ మాత్రం కాదు! ఎందుకంటారా? ఈ జీవితంలో ఎప్పుడు ఏది ఎట్లు జరుగుతుందో, ఏది ఏ మలుపు తిరుగుతుందో ఏమి చెప్పగలం? ఎవరికి తెలుసు? గంధర్వుల వలన, యక్షుల వలన, రాక్షసులవలన, భూతగణముల వలన, పిశాచముల వలన, సర్పముల వలన, గ్రహవీక్షణల వలన అనేక నిరోధములు, విఘ్నములు జీవితకాలంలో కలుగుతూ ఉంటాయి కూడా కదా!.

అసలు ఇక్కడ **'ఇది శాశ్వతము'** అని నిశ్చయంగా చెప్పుకోగలిగినది ఏమున్నదో చెప్పండి!

- సుందర పుష్ప లతలతో కూడిన గొప్పగొప్ప వనములు కొంతకాలానికి ఎండి ఎడారులగుచున్నాయి.
- ఎత్తైన పర్వతాలు నేలకూలుచున్నాయి.
- సముద్రాలే ఇంకిపోయి ఇసుక ఎడారులుగా అగుచున్నాయి.
- సమున్నత శిఖరాలు కొంతకాలానికి భూమిలోకి కృంగిపోయి కనబడకుండాపోతున్నాయి.
- దృఢంగా కనిపించే ధృవతార వంటివి కూడా అధృవమై, అదృశ్యమైపోతున్నాయి.
- విశాల ప్రదేశమును ఆక్రమించిన మహావృక్షములు ఒక్క క్షణంలో గాలి - వానకు నేలపై ఒరిగిపోతున్నాయి.
- సుందరమైన నగరములు, ప్రసిద్ధమైన విశాల భూప్రదేశములు ఒక భూకంపముతో నామ రూపాలు కోల్పోతున్నాయి. సముద్ర జలంలో కొట్టుకుపోతున్నాయి.
- దేవతలంతటివారు కాలగతిచే స్వస్థానాలు కోల్పోతున్నారు. స్థానభ్రంశము పొందుచున్నారు!

క్షణమొక రీతిగా కనిపించే ఈ మనోకల్పనా రూపమగు దృశ్యప్రపంచములో ఏవేవో పొందాలని ఆకాంక్షించటము, పొందినవాటిని లెక్కించుకుంటూ సంతోషించటము - **ఎంత తెలివి తక్కువతనము**? (What a Foolishness??)

- అసత్ కార్యక్రములలో ఆవేశపూరితముగా నిమగ్నమై ఆయుష్షును వెచ్చించటము,
- ఈ దృశ్య విషయాలు వాస్తవమని, శాశ్వతమని నమ్మి ఉండటము..,

.... వీటన్నిటి వలన ఏమి ప్రయోజనము? ఇందులో లాభించగల సుఖము ఏమున్నది? ఎంతమాత్రమైనది? ఎంతకాలం వెంటనంటి ఉంటుంది?

"ఈ దృశ్యవ్యవహారములను నమ్ముకొని, అనేక ఆవేశ-కావేశ-ఆశ-నిరాశ-నిస్పృహలతో రోజులు గడుపుచూ, వీటి యందు పీకల దాకా మమతానురాగులమై ఇరుక్కున్న మేము వీటి నుండి ఎలా బయటపడతామూ..?" అనునదే ఇప్పటి అతి ముఖ్యమైన సమస్య మాకు. అట్టి మార్గమునకై ప్రయత్నించటమే ఉచితం కదా!

ఇప్పటి మా స్థితిగతులు, ఆలోచన-ఆవేదనలు **"చీకటి నూతిలో చిక్కుకున్న కప్ప"** వలె ఉన్నాయి. ఈ ఇంద్రియ వ్యవహారములలో మేము అనేక జన్మలుగా బద్ధులమై సంచరిస్తున్నాము.

స్వామీ! ఇప్పుడు మీరే నాకు గతి! మీరు అందించే ఆత్మ సమాచారమే నాకు దివ్యౌషధము. ఆత్మజ్ఞాన సమాచారము ప్రసాదించి మీరు నన్ను కాపాడవలసినదిగా పునీతుని చేయవలసిందిగా.. మరల వేడుకుంటున్నాను.

- - -

## ద్వితీయ ప్రపాఠకః-ఆత్మ నిత్య శుద్ధము. బంధము కల్పితము

బృహద్రథమహారాజు చెప్పుకుంటూ వస్తున్న సాత్త్విక వైరాగ్య భావాలు విన్న శ్రీశాకాయన్య మహర్షి బహు సుప్రీతులైనారు.

**శాకాయన్య మహర్షి:** మహారాజా! బృహద్రథా! ఇక్ష్వాకువంశ శ్రేష్ఠా! మీ వంశమునకు ధ్వజశీర్షము వంటివాడా! ఆత్మజ్ఞానీ! జీవుడు మానవ జన్మను ఏ ఆశయముతో పొందుచున్నాడో అట్టి సత్ఫలమును నీవు సిద్ధింపజేసుకొన్నట్లేనయ్యా! కృతకృత్యుడవయ్యావు. 'మరుత్తు' (వాయు విజయుడు) - అను బిరుదుకు సార్ధక నామధేయుడవు! ఇంక క్రొత్తగా నీవు తెలుసుకొనవలసినదేమున్నది? అయినా, అడుగు. తెలిసినంత వరకు చెప్తుతాను. ఏఏ విశేషాలు విందామనుకుంటున్నావు?

**బృహద్రథమహారాజు:** మహర్షీ! ఆత్మ అనగా ఏమి? ఎవ్వరు? ఎక్కడిది? అద్దాని ప్రభావము ఎట్టిది? మాకు బంధము ఎందుకు వచ్చిపడుతోంది? ఎట్లా తొలగగలదు? ఈఈ విషయాలు, తదితరమైన సంబంధిత విశేషాలతోసహా బోధించవలసినదిగా మిమ్ములను శరణువేడుతూ అర్థిస్తున్నాను.

**శాకాయన్య మహర్షి :** ఈ జీవుని పట్ల ఆతని యొక్క ఇంద్రియ సంబంధమైన బాహ్య విషయాలు అనేక వ్యధలకు, బంధనములకు, అల్పమైన-పరిమితమైన అవగాహనలకు దారితీస్తున్నాయి కదా! **అట్టి ఇంద్రియార్ధములు బాహ్య విషయముల నుండి ఉపసంహరించబడాలి. మనస్సుతో సహా అంతరమున (లేక) ఊర్ధ్వస్థానమున ఉన్న ఆత్మవైపుగా నియమించబడాలి.** ఈ విధంగా సర్వప్రాపంచక విషయ-వ్యవహారములకు ఆవల (చరమ) స్థానముగా - {వ్యధ- అవ్యధలను (Worries or Non-worryies)లను దాటిపోగా} శేషించే కేవల 'స్థానము' ఉన్నది. దాని గురించి బ్రహ్మజ్ఞులచే **"సర్వతత్త్వ స్వరూపముగా, సర్వాత్మస్వరూపము"**గా స్తుతించబడుతోంది. అది ప్రపంచ రహిత, విషయరహితమగు నిర్మలబుద్ధికి మాత్రమే అనుభవమౌతోంది. అట్టి స్థితిలో నిర్మల మనస్సుకు (సర్వప్రాపంచక వ్యధలను స్వల్ప విషయములుగా చూడగల దృష్టికి) ఏది అనుభవమౌతోందో...

⌘ **ఏష ఆత్మేతి!...** అదియే 'ఆత్మ' అని పిలువబడుతోంది!

⌘ **ఏష ఆహ భగవాన్।**..... ఆ సర్వ శేష్య మనో అనుభవమే భగవంతుడు - భగదనుభవము అని కూడా పిలుస్తున్నారు.

మరొక రీతిగా చెప్పుకోవాలంటే...,

**ఎవ్వరి బుద్ధి అయితే..**, నిర్మలమై - శరీరత్వమును, ఇంద్రియత్వమును, మనో-బుద్ధ్యత్వమును అధిగమించివేసినదై...,

... సర్వజీవాత్మజ్యోతులకు వెలుగైయున్న, వెలిగించుచున్నదైయున్న **"పరంజ్యోతి స్వరూపము"** ను సమీపించి, సమస్తము తానే అయి చెన్నొందుచున్నదో..., అదియే **"ఆత్మ".**

సర్వ హృదయాలలో వెలుగొందుచున్న పరంజ్యోతి స్వరూపమే తానై ఏది ప్రకాశిస్తూ ఉంటోందో...,

- అట్టి స్వబుద్ధికి అనుభమయ్యేదే ఆత్మ యొక్క **సహజ-స్వరూపము.**
- అది మార్పు-చేర్పులచే స్పృశించబడనట్టి **అమృత స్వరూపం.**

- భయ–ఉద్వేగములను అధిగమించినట్టి **అభయ స్థానము.**
- అదియే **'బ్రహ్మము'** కూడా అయి ఉన్నది.

అట్టి అమృతరూపము, అభయస్థానము, బ్రహ్మము అగు ఆత్మ గురించి విశదపరచే విద్యయే...,

⌘ ఆత్మ విద్య। బ్రహ్మవిద్య।

⌘ సర్వోపనిషత్ విద్య కూడా।

ఓ బృహద్రథ మహారాజా! అట్టి ఆత్మ విద్య ఇప్పుడు నేను నీకు నా భావనగానో, అనుభూతిగానో, నేను కనిపెట్టినదిగానో – చెప్పవలసిన పని లేదు. అది మహనీయులకు తపోఫలముగా స్వీయానుభవమై, గురు–శిష్య పరంపరంగా బోధింపబడుచూ వస్తున్నదే! ఇతిహాస–పురాణములలోను, వేద–ఉపనిషత్తులలోను గ్రంథస్థమైనట్టిదే.

అందుచేత అస్మత్ సద్గురువు, భగవత్ స్వరూపులు అగు శ్రీమైత్రేయమహర్షి – శిష్యులమగు మాకు ఏది వ్యాఖ్యానిస్తూ బోధించారో, ఆ పరతతత్త్వము గురించిన ఆ విశేషాలనే ఇప్పుడు నీతో ముచ్చటిస్తున్నాను. చెప్పబోవుచున్నాను. శ్రద్ధగా వినుచుండెదవు గాక!

శ్రీమైత్రేయమహర్షి మాకు, ఆత్మ విద్య గురించి నీవలెనే మేము అడిగిన ప్రశ్నలకు సమాధానంగా...,

**వాలఖిల్యాది మునులకు...,**
**ప్రజాపతి యగు బ్రహ్మదేవునికి**

మధ్య జరిగిన సంవాదమును ఈ విధంగా వినిపించారు.

⌘ ⌘ ⌘

బ్రహ్మమాసపుత్రులగు వాలఖిల్యమునులు లోకసంచారాలు చేస్తూ ఒకానొక సమయంలో **"భగవంతుడు, ప్రజాపతి, సృష్టికర్త"** యగు బ్రహ్మదేవుని దర్శనార్థమై బ్రహ్మలోకమునకు వెళ్లటం జరిగింది. వారు బ్రహ్మదేవుని దర్శించి నిర్మల హృదయపుష్పాలతో శ్రీసరస్వతీ సమేతులైన బ్రహ్మదేవుని పూజించారు. వేద వచనములతో స్తోత్రములు సమర్పించారు. పరమాత్మయగు బ్రహ్మదేవుడు వారి పూజలకు, భక్తితో కూడిన వేదవాఙ్మయయుక్తమైన స్తోత్రములకు ఎంతో సంతోషించారు.

**శ్రీ ప్రజాపతి :** బిడ్డలారా! మీ భక్తి – ప్రపత్తులు నాకు ఎంతో సంతోషమును కలుగజేస్తున్నాయి. మీ అభీష్టములు సిద్ధింపజేయు ఉత్సాహము నాకు కలిగింది. ఏమికావాలో, వరములు కోరుకోండి!

**వాలఖిల్యమునులు :** తండ్రీ! ప్రజాపతీ! ఆత్మజ్ఞానార్తులమై మిమ్ములను దర్శించవచ్చాము. మిమ్ములను శరణువేడుచున్నాము.

హే భగవాన్! ఒకానొక చోట ఒక కొయ్యలచే నిర్మితమైన శకటము (బండి) ఉన్నది! అది తనంతట తానుగా ఒకచోట నుండి మరొకచోటికి కదలగలుగుతుందా? లేదు. అది జడముకదా! అది అక్కడి నుండి మరొక చోటికి వెళ్లటానికి సచేతనుడగు **'కదల్చువాడు'** కావాలికదా!

అట్లాగే...,

ఆ శకటము (బండి)వలెనే ఈ భౌతికదేహము జడము. జడమైన వస్తువు తనకు తానుగా ఎట్లా కదలుతుంది? కదలలేదు! ఇప్పుడు మా ప్రశ్న వినండి!

*– ఏ అతీంద్రియ (ఇంద్రియాతీత) చేతన తత్త్వము యొక్క మహిమచే ఈ జడమగు భౌతికదేహము చేతనము వలె ప్రతిష్ఠితమై ఉంటోంది? ఎవ్వాని తెలివిచే ఈ దేహము తెలివిని పొందినదానివలె, తానే తెలివి గలదానివలె ప్రచోదనము పొందుచున్నది?*

కదిలే దేహములను కదల్చుచున్న ఇంద్రియాతీత చేతన శక్తి ఏది? ఎట్టిది? (లేక) ఎవరిది?

ఈ విషయము గురించి సవిస్తరంగా మాకు బోధించండి.

ఇదియే మీ నుండి మేము అభ్యర్థించే వరము.

**ప్రజాపతి :** పుత్రులారా! అడగవలసినదియే, తెలుసుకొని తీరవలసినదే మీరు అడిగారు. చాలా సంతోషము. చెప్పుచున్నాను. వినండి!

⌘ ⌘ ⌘

సర్వ దృశ్యములకు ఆవల(పరముగా) ఒకానొక పరతత్త్వచైతన్య పురుషుడు ఉన్నారు. ఆయననే **'పరమాత్మ'** అని, **'పరబ్రహ్మము'** అని పిలుస్తున్నాము. ఆయన వాస్తవానికి వాక్‌కు ఆవల ఉన్నవారు. అవాక్-మానస గోచరుడు. అయితే నిర్మల బుద్ధికి అనుభవమగువాడు. వేదోపనిషత్తులచే ప్రవచించబడుచున్నవారు. ఆయన ఎట్టివారంటారా?

**శుద్ధుడు** → విషయములన్నిటికీ ఆవల, వేటిచేతనూ స్పృశించబడనివాడు. కేవలుడు. కాబట్టి **పరమశుద్ధుడు!**

**పూతుడు** → పవిత్రుడు. ఈ దేహ - మనో - బుద్ధి - చిత్త - అహంకార దోషములచే కించిత్ కూడా స్పృశించబడనివాడు. అస్పృశ్యుడు. అందుచేత **పరమపవిత్రుడు.**

**శూన్యుడు** → ఆయన యందు లోకములు, లోకాంతర్గత విశేషములు లేనేలేవు. **విషయ శూన్యుడు!**

**శాంతో** → సర్వము సశాంతించగా కూడా శేషించి ఉన్నవాడు. సర్వజగత్-దృశ్యములకు మునుముందుగానే ఉన్నవాడు. **పరమశాంతుడు.** ఆ పరమపురుషుని యొక్క 'పరమశాంతత్వము'నకు విఘాతము కలిగించగలిగేది - ఎక్కడా ఏదీ ఏమాత్రము లేదు.

**అప్రాణో** → ప్రాణశక్తి ఆయన నుండి వెలువడుచున్నదై, ఆయనకు చెందినదై ఉన్నది. ప్రాణశక్తికి మునుముందే ఉన్నవాడు. ఆయన యొక్క సంకల్పశక్తి నుండి ప్రాణశక్తి ప్రదర్శితమౌతోంది. కనుక **అప్రాణస్వరూపుడు.** ప్రాణశక్తి తనదై, అద్దానికి మునుముందే ఉన్నట్టివాడు.

**అనీశాత్మా** → ఆయనను నియమించునది మరేదీ లేదు. సర్వదా యథాతథుడై ఉన్నాడేగాని, ఏ రూపము గాను అగుచుండుట లేదు. అందువలన **అనియమితుడు! అనీశుడు. ఆత్మభగవానుని నియమించు ఈసుడు మరొకడెవడూ లేడు.**

**అనంతో** → ఈ లోకాలకు, లోకాంతర్గతమైన దేహాలకు ' ఇది మొదలు- ఇది చివర' అనునది ఉండవచ్చుగాక! వీటి నియామకుడు, వీటి సంకల్పుడు అగు ఆ పరమాత్మకు ఆదిగాని, అంతముగాని లేదు. కనుక **అనంతుడు** (Infinite). **దేశ - కాల - దేహాదులచే ముగియటమనేదే లేనివాడు.**

**అక్షయః** → ఈ సృష్టిలో కనిపించే ప్రతి వస్తువు కాలముచే పుడుతోంది. కాలముచే క్షయిస్తోంది. పరమాత్మయో? కాలఃకాలుడు. కాలనియామకుడు. కాలముచే బద్ధుడు కానట్టివాడు. **వృద్ధి-క్షయములు లేనట్టివాడు! అక్షయుడు.**

**స్థిరః** → ఆయన మరొక రూపము పొందడు. మరొక చోటికి పోయి -వచ్చువాడు కాదు. **సుస్థిరుడు.**

శాశ్వతో → ఆతడు ఎప్పుడో ఉండి, ఇప్పటికి లేక, మరెప్పుడో ముందుముందు ఉండువాడు కాదు. ఇప్పుడు - అప్పుడు - ఎప్పుడూ ఉండియే ఉండు నిత్యసత్ స్వరూపుడు. ఎల్లప్పుడు ఉండువాడు. కనబడేదంతా అశాశ్వతము. కాని ఆయన మాత్రమే **శాశ్వతము. శాశ్వతోఽ యమ్ పురాణో!**

**అజః** → ఆయన జన్మలకంటే మునుముందే ఉన్నట్టివాడు. ఆయన సమక్షంలో జన్మలు। అంతేగాని జన్మలచే ప్రారంభమగువాడు కాదు. జన్మలు లేనప్పుడు కూడా ఆయన ఉన్నారు. కనుక **అజుడు. జననమే లేనివాడు.**

**స్వతంత్రః** → ఆయన సంకల్పిస్తే లోకాలు. ఆయనయొక్క సంకల్పము ఉపశమిస్తే లోకాలు ఉపశమిస్తాయి. లోకాలు ఆయనపై ఆధారపడి ఉన్నాయి. అట్లాగే దేహాలు కూడా. ఆయన దేనిపై ఆధారపడి లేడు. ఆయనను నియమించునదేదీ లేదు. **కాబట్టి సర్వస్వతంత్రుడు.** (He is independent by himself in all beings with his equal presence).

ఓ వాలఖిల్యమునులారా! మీరు అడిగిన ప్రశ్నకు ఇంకా కూడా సమాధానము వినండి.

ఇప్పటివరకు మనము చెప్పుకున్న విశేషములతో కూడిన పరమాత్మ యొక్క మహిమయే ఈ సమస్త దేహములలో వేంచేసియున్నది. ఆయన యొక్క చిత్ చైతన్యశక్తిచేతనే స్వతఃగా జడమగు భౌతికదేహములు చేతనవంతమువలె ప్రతిష్ఠితమై ప్రబోధము పొందుచూ ప్రవర్తిస్తున్నాయి. కదిలే దేహములు వాటికవే కదలటము లేదు. కదిలించే పరమాత్మచైతన్యము యొక్క ప్రభావముచేతనే ఈ దేహములు కదలుచున్నాయి. ఆయన 'అహమ్' రూపుడై సర్వదేహుల బాహ్య-అభ్యంతరములలో వేంచేసి ఉంటున్నాడు కాబట్టే-ఈ భౌతిక దేహాలు తైతెక్కలాడుచున్నాయి.

**వాలఖిల్యమునులు :** అట్లాగా స్వామీ? అయితే, **మాది మరొక సంశయము.**

ఆ పరమాత్మ శుద్ధచైతన్యస్వరూపుడు, నిర్విషయుడు కదా! 'నాకు ఇది కావాలి' అను రూపము గల ఇచ్ఛయే అవసరము లేనివారు. అనిచ్ఛున్నుడగు ఆయన ఏకారణముచేత ఈ జడదేహములను చేతనవంతముగా చేస్తున్నారు. వీటిని చేతనముగా ప్రతిష్ఠాపితము చేయవలసిన అవసరము ఆయనకేమున్నది? ఏ ప్రయోజనము ఆశించి ఆయన భౌతికదేహములను ప్రబోధనముగా (Inspiring, operative) చేస్తున్నారు?

దయతో ఈ విషయము వివరించండి! విశదపరచండి!

**ప్రజాపతి :** అవును. ఆ పరమాత్మ →

**సూక్ష్మా :** స్థూలుడు కాదు. ఇంద్రియములకు, ఆలోచనారూపమైన మనస్సుకు అవిషయుడు. అభౌతికస్వరూపుడు. **సూక్ష్ముడు.** (Very subtle).

**అగ్రాహ్యో :** అవిషయుడు కాబట్టి గ్రహించుటకు శక్యముకానివాడు. 'ఇది' అని ఆయనను మాటలతో పరిమితము చేసి చెప్పలేము. వర్ణించనలవికాదు. ఒకడు ఒక దృశ్యమును గ్రహించి, మరొకరికి చెప్పవచ్చునేమోకానీ, ఆత్మ అట్లా గ్రహించబడునది కాదు!

**అదృశ్యః :** కంటికి కనబడేదీ, చెవులకు వినబడేదీ **కానివాడు.** దృశ్యములోనివాడుకాదు. అందుచేత **అదృశ్యుడు.**

**పురుష సంజ్ఞో :** అయితే ఈ కనబడేదంతా ఆయన యొక్క సంకల్ప నిర్మితమే! దీనికంతటికీ పురుషకారము ఆయనకు చెందిందే! (He is the worker of the universe). అందుకని ఆయన గురించి "పురుషుడు - పరమ పురుషుడు" అను సంజ్ఞలతో చెప్పుకుంటూ ఉంటారు.

అట్టి సూక్ష్ముడు, అగ్రాహ్యుడు, అదృశ్యుడు, పురుష సంజ్ఞాస్వరూపుడు అగు పరమాత్మ యొక్క స్వకీయ బుద్ధి ప్రేరేపణయే ఈ సమస్త భౌతిక దేహాలు కూడా. ఆయన యొక్క అంశయే బుద్ధిపూర్వకంగా ఈ సర్వజడదేహాలలో ప్రేరణ-ప్రబోధన స్వరూపమై వెలయుచున్నది.

ఆ ఆత్మ భగవానుడే - ఒకానొకప్పుడు తనకై తానే తనయందు **'అన్యము'** అను (ఊహా-భావనా నిర్మిత) తోటను, **'అనుభవి'** అనే తోటమాలిని, **అనుభవములు** అను పుష్పలతలను నిర్మించుకొని వినోద-విషాములన్నీ పొందుచూ, తనయందు తానే విహరిస్తున్నారు. తనను తానే ఏమరచినప్పుడు - బద్ధుడు కూడా అగుచున్నారు. కారణము? **"అనిర్వచనీయమగు వినోదము"** - అనియే సమాధానము.

దృష్టాంతానికి..,

ఒకడు నిద్రిస్తూ కలకంటున్నాడు. ఆ కలలో బుద్ధిపూర్వకంగా అనేక నామరూపాలను, జనులను కల్పించుకొనుచున్నాడు. వారి వలన ప్రేమ-భయము-ఇష్టా యిష్టములు... ఇవన్నీ ఆస్వాదిస్తున్నాడు. ఎందుకు? ఏమీ చెప్పలేము. అట్లాగే, పరమాత్మ తన చేతన శక్తి యొక్క అంశచే బుద్ధిపూర్వకంగా (మరియు) అకారణంగా ఈ దేహములను సచేతనము చేస్తున్నారు.

ఆయనయొక్క చేతనాంశయే గాఢనిద్రలో ఉన్నవానిని నిద్రలేపి మెలుకువకు తెచ్చి, తదనంతర అనుభవములను ఆతని ముందుంచుచున్నది.

కల కనువాడు కలలో తనయొక్క స్వప్న చైతన్యాంశచే తనకు వేరైనట్లుగా కనిపించే / అనిపించే నామ రూపాలను కల్పించుకొని, వాటిని భావనారసపూర్వకంగా సచేతనముగా చేస్తున్నాడు. (ప్రేమ-కోపము ఇత్యాదులు కలిగి ఉండేట్లు చేసి), "ఇది నా ఊహాకల్పన" - అనునది ఏమరచి "ఇప్పటికిది నిజం" అను తీరుగా ఆస్వాదిస్తున్నాడు!! ఎందుకు? స్వకీయక్రీడ-లీల అనవలె!

పరమాత్మ యొక్క ఇహలోక జడదేహ సచేతన క్రియావిశేషములు కూడా అట్టివే. ఇదంతా అకారణము, క్రీడావిశేషము... అనవచ్చునేమో! కనుక ఈ కనబడేదంతా పరమాత్మ యొక్క అంశయే. **ఆయన వాస్తవానికి సదా నిష్క్రియుడు.**

**వాలఖిల్యమునులు :** హే భగవాన్! ఈ కనబడేదంతా ఆ పరమాత్మ యొక్క అంశకు సంబంధించిన చైతన్యవిశేషమే అని అంటున్నారు కదా! ఆయన చేతనాంశ ఈ భౌతిక దేహములలో ఏ రీతిగా ప్రవేశించి వీటిని చేతనముగా చేస్తోంది?

**ప్రజాపతి :** ఆ ఆత్మ భగవానుడు ప్రజాపతి (The maker of all beings)గా అగుచున్నారు. ఆయన ఈ సర్వ జీవాత్మలకు, దేహనిర్మాణములకు మునుముందే (సత్‌స్వరూపులై) ఉండి ఉన్నారు!

**ప్రజాపతిర్వా ఏష అగ్రే తిష్ఠత్।** మొట్టమొదటగా (At the basic begining) ఆయన ఏకస్వరూపులై ఉన్నారు. అద్వితీయులు. అనగా ఆయనకు ద్వితీయము అనునది లేకుండినది. "ఈ జీవాత్మ-జగత్-జగదనుభవములు" మొదలైనవేవీ లేవు.

అట్టి ఏక-అద్వితీయ-స్వయమానందస్వరూపులే అయినప్పటికీ.. **"నేను ఒక్కటిగా మాత్రమే ఉండటము సంతోషముగా లేదు. స రమత ఏకః!"** అని తలచారు. నిద్రించువాడు తాను ఒక్కడే అయి ఉండి, **"ఊరికే నిద్రిస్తే ఏమి వినోదము? నా స్వప్న చైతన్యమును ప్రేరేపించి స్వప్నములో - నా స్వప్నచైతన్యమునకు అభిన్నమైన-అనేక హావ-భావ ప్రదర్శనములతో కూడిన నామరూపు దృశ్యములు కల్పించుకొని వినోదిస్తాను"**... అని తలచి స్వప్న దృశ్యమును కల్పించుకుంటున్నాడు కదా! ఎందుకు?

**అకారణం.** అదే రీతిగా ప్రజాపతి కూడా తన యొక్క కల్పనాచైతన్యమును ప్రేరేపించి అనేక రూపములను (ప్రజలను) కల్పించుకొనుచున్నారు. సృష్టించుకొనుచున్నారు.

అప్పుడు...,

ఆ రూపములన్నీ అప్రబుద్ధులై (స్వీయ బుద్ధి వికాసము లేనివై, కొయ్యబొమ్మలవలె, రాతి విగ్రహముల వలె స్థాణువులై) ఉన్నాయి.

**స నా రమత!** అట్టి అప్రబుద్ధమైనట్టి స్థాణు రూపముల కల్పన ఆ ప్రజాపతికి ఆనందము కలిగించనే లేదు. అందుచేత **"ఈ జడరూపములు తమకు తాముగా కదిలే చైతన్యత్వము (ప్రాణము) కలిగి ఉంటే** (If these forms have their own independent life force to move by themselve, it would be more playful)... **మరింత వినోదము కదా!"**... అని తలచారు. వాటినన్నిటి యందు **- స వాయుమివ ఆత్మానం కృత్వా।** వాయువు బూరలలో ప్రవేశించు తీరుగా, ఆ పరమాత్మ ప్రాణాత్మ స్వరూపులై ఆ భౌతిక రూపముల అభ్యంతరమున ప్రవేశించారు.

అట్లా ప్రాణవాయు రూపంగా ప్రవేశిస్తున్నప్పుడు 'ఒక్క' రూపంగా ప్రవేశించలేదు. మరి? **పంచధా ఆత్మానం ప్రవిభజ్య -** ఆత్మరూపమగు వాయువును ఐదు విధములుగా విభజించుకొని ప్రవేశించటం జరిగింది. (1) ప్రాణము (2) అపానము (3) సమానము (4) ఉదానము (5) వ్యానము... అను ఐదు రూపాయలు అవధరించసాగారు.

**(1) ప్రాణము : యో అయమ్ ఊర్ధ్వమ్ ఉత్క్రామతి ఇతి ఏషవావ-స 'ప్రాణో।...** ఊర్ధ్వముగా ప్రసరించు (లేక) ప్రవహించు వాయుశక్తి ప్రసరణము. బయటి నుండి (ముక్కు పుటములకు 12 అంగుళముల దూరము నుండి) దేహములోనికి తెచ్చుకు రాబడుచున్న వాయు **'ప్రసరణము' - 'ప్రాణము' అనబడుతోంది. ఇది ఊర్ధ్వమార్గంగా ప్రయాణించు ధర్మము కలిగి ఉన్నట్టిది.**

**(2) అపానము : యో అయం అవాఇ్చమ్ సంక్రామతి ఏషవావ-స అపానో।..** ఆ ఆధారమార్గంగా (క్రింద వైపుగా) ప్రసరించు ప్రాణ ప్రసరణ శక్తి. **యోయం స్థవిష్ఠమ్ అన్నధాతుమ్ అపానే స్థాపయతి।** ఈ అపానవాయువు అన్నధాతువును శరీరములో మిక్కిలి స్థూలముగా స్థాపింపజేసి దేహమునందు పుష్టిని (కండర పుష్టి, మాంస పుష్టి మొ॥వి) కలుగజేయు ప్రాణశక్తి ప్రసరణము. (స్థవిష్ఠమ్ = చాలా స్థూలముగా).

**(3) సమానము : యత్ అణిష్ఠంచ అంగే-అంగే సమున్నయతి ఏష వావ 'సమానో'।** - దేహములోని అంగాంగములకు, అణువణువుకు అన్నధాతువును, అన్నరసమును జేరవేయుచున్నట్టి ప్రాణశక్తియే **'సమానము'.**

**(4) ఉదానము : యో అయం పీతాశితమ్ ఉద్గిరతి-నిగిరతీతి చ-ఏషవావ, స 'ఉదానో'।** ఈ భౌతికదేహము తాగినదానిని, తినిన దానిని ఆయా సందర్భములను అనుసరించి క్రిందవైపుగా గాని, పై వైపుగాగాని కదలుస్తూ పంపుచున్నట్టి ప్రాణవాయుశక్తి - **'ఉదానము'।**

**(5) వ్యాన : యేన ఏతాః సిరాః అనువ్యాప్తా, ఏషవావ స 'వ్యానః'।** రక్త ప్రసరణము జరుగుచున్న ధమనులను - సిరలను, ఆశ్రయించి, నరనరములు అనువ్యాప్తమై, అన్నరసమును మూలమూలాలకు తీసుకొని పోవుచున్నట్టిది - **'వ్యానము'.**

ఈ విధముగానే కాకుండా, ఆ పరమాత్మ మరి రెండు ముఖ్యరూపాలుగా ఆత్మస్వరూపుడై ప్రవేశిస్తున్నారు.

(1) అంతర్యామి (రచయిత) (2) ఉపాంశువు (పాత్ర)

ఆ రెండిటి మధ్య తాపము రూపమైన ఔష్ణ్యము (విజ్ఞాన తేజస్సు, అనుభూతి) - కల్పించబడినదై ప్రవర్తిస్తోంది.

ఆ ఔష్ణ్యరూపము......... → అగ్ని, జఠరాగ్ని
అగ్ని............... → వైశ్వానరుడు

ఆ అంతఃపురుషుడే వైశ్వానరుడు। అట్టి వైశ్వానరాగ్ని వలననే దేహములో (ప్రవేశించిన అన్నము (ఆహారము) పచనమై రసరూపమగుచున్నది

**ఇంకొక రీతిగా :-**

(1) ఎవ్వనిచే అన్నము తినబడుచున్నదో, ఆతడు.

(2) ఎవ్వనిచే దేహములో (ప్రవేశించిన అన్నము పచనము చేయబడుచున్నదో,... ఆతడు. (వైశ్వానరుడు).

ఈ ఉభయులు ఆత్మయొక్క అంశయగు అంతఃపురుషుని (క్రియా(క్రమ విన్యాసాలే!

(ఆత్మాంశయగు) అంతఃపురుషుని (లేక) జీవాత్మ యొక్క ఉనికి "ఉమ్‌మ్‌మ్" అను ఘోష (Sound wave)గా ఉంటుంది. చెవులు మూసుకొన్నప్పుడు వినిపించే ఆఘోష జీవాత్మ యొక్క ఉనికిని సూచిస్తుంది. ఆ జీవాత్మ ఈ దేహమును విడచి బహిర్గతుడు అయినప్పుడు ఆ ఘోష దేహమునందు వినిపించదు. అనగా జీవాత్మ చైతన్యము దేహము నుండి బహిర్గతమైతే,... ఈ భౌతికశరీరము ఒక జడమగు మాంసపు ముద్ద వంటిది మా(త్రమే!

అంశాత్ముడై ఈ దేహమునందు (ప్రవేశించినట్టి పరమాత్మ తనను తాను ఐదు రీతులుగా (పంచ అంశలుగా) విభజించుకొని దేహమునందు ఉనికిని కొనసాగిస్తున్నారు.

(1) మనోమయము (Thinking factor)

(2) (ప్రాణశరీరము (Energy factor)

(3) భావరూపము (Knowing / enlightening factor. Thinking and feeling Factor)

(4) సత్యసంకల్పము (Factor of making conclusions viz., "This is true" and "that is not" etc.,)

(5) జీవాత్మ [Possesive (viz., "This is mine") - Factor]

ఇవన్నీ గా ఈ దేహములో అవతరించిన తరువాత కూడా పరమాత్మకు తృప్తి కలుగలేదు. **"ఈ ఐదు రూపాలు స్థాపించుకున్నాను. బాగానే ఉన్నది. అయినా కూడా నేను కృతార్థుడను, కృతకృత్యుడను కాను"**... అని పరమాత్మకు అనిపించసాగింది. **"ఇవన్నీ ఉంటే ఏం లాభం? ఏమున్నదంట? వినటం, స్పర్శానుభవము, చూడటం, రుచి, వాసన అనబడే ఇం(ద్రియార్థాల అనుభవము ఉంటే కదా, నాకు వేడుక!"**.. అని తలచారు. తన నుండి బయల్వెడలే పంచకిరణములను పంచ ఇం(ద్రియార్థములుగా రూపం ఇచ్చుకోసాగారు. ఇవే ఆత్మయొక్క పంచబుద్ధీం(ద్రియకిరణ జాలములు. (వినికిడి, స్పర్శ, చూపు, రుచి, వాసనలు).

- ఈ శరీరమే → రథము.
- పంచ జ్ఞానేం(ద్రియములు → ఆత్మ యొక్క బుద్ధీం(ద్రియ కిరణములు.
- పంచకర్మేం(ద్రియములు → గుఱ్ఱములు.
- మనస్సు → ఇద్దాని నియంత.
- జీవాత్మ → రథికుడు.

ఈ శరీర రథము (1) ఆ పరమాత్మయొక్క సాక్షిత్వమునందు (2) జీవాత్మ యొక్క స్వకీయ కల్పిత-(ప్రకృతి యందు చ(క్రములోని ఉపచ(క్రము వలె పరి(భ్రమిస్తోంది. తిరుగాడుతోంది.

'మరణము'చే ((ప్రాణశక్తి యొక్క బహిర్గతము కారణంగా) ఇక ఈ భౌతిక శరీరము అచేతనమగుచున్నది. ఇందులోని ఆత్మాంశయగు (ప్రాణశక్తియొక్క (ప్రచోదత్వము ఉపశమించినదగుచున్నది. అయితే (ప్రాణశక్తి ఆత్మాంశను వెంటనంటియే ఉంటోంది!

## ***ఇక్కడ ఒక ఆశ్చర్యమైన విశేషము!***

పరమాత్మ వాస్తవానికి దేహమునకు, జ్ఞానేం(ద్రియములకు, కర్మేం(ద్రియములకు, వైశ్వనరాగ్నితత్త్వమునకు, మనో-(ప్రాణ-భాస-సత్యసంకల్ప-జీవాత్మలకు యజమాని. ఇవన్నీ పరాత్మయొక్క అంశా (ప్రదర్శనములే. ఇట్లయి ఉండి కూడా...,

- పరమాత్మ మనో శరీరములకు వశుడైన వానివలె (As if sold away to the Physical Body) (స్మారకము-తెలివి-స్మృతి లేనివాని వలె) (ప్రవర్తిస్తున్నారు.

- శుభాశుభకర్మలచే పీడింపబడుచున్న వానివలె అగుపించుచున్నారు. (As if bound by Acts and their Eventualities)
- వేరు వేరు దేహములలో ఖండుడు అయినట్లు అగుచున్నారు! (As if Partitioned as many multiple Physical Forms)

వాస్తవానికి ఆత్మ ధర్మములు – దేహధర్మములకు వేఱై, అప్రమేయమై ఉన్నాయి.

| ఆత్మయొక్క ధర్మములు | దేహముయొక్క ధర్మములు |
|---|---|
| **అవ్యక్తము** (Non-manifesting) | **వ్యక్తీకరణ అగుచున్నట్టిది.** (That being manifested) |
| **సూక్ష్మము** (Subtle) | **స్థూలము** (Solid) |
| **అదృశ్యము** (Beyond the scenary) | **దృశ్యాంతర్గతము** (Part of the Scenary) |
| **అగ్రాహ్యము** (Beyond the experience of Eyes, Ear etc) | **ఇంద్రియములకు గ్రాహ్యము.** (Within the experience of Eyes, Ears etc) |
| **మమకార రహితము** (Has no sense of belonging) | **మమకార సహితము.** (Has the sense of belonging) |
| **జాగ్రత్-స్వప్న-సుషుప్త అవస్థాత్రయ రహితము**(Beyond the states like awaking etc) | **అవస్థాత్రయ సహితము.** (Within the states of Awakening etc) |
| **అకర్త – అభోక్త** (No Sense of subject or object) | **కర్తృత్వ – భోక్తృత్వ భావ సమన్వితము.** (Has the Sense of subject and object) |

ఈ విధంగా ఆత్మ సర్వదా సర్వదృశ్యాంతర్గత విశేషాలకు విలక్షణమై ఉన్నది. అవ్యక్తము – సూక్ష్మము– అదృశ్యము – అగ్రాహ్యము – నిర్మమము – అనవస్థ– అకర్త అయి ఉన్నది. అయితే, అదంతా ఏ మరచి, **కర్తృత్వ – భోక్తృత్వములచే పరిమితము వలె అనుభూతి పొందుచున్నది!** [స్వప్నము చూచేవాడు తన యొక్క (స్వప్నమునకు బయట ఉన్నట్టి) జాగ్రత్ స్థితిని ఏమరచుచున్న విధంగా].

తన యొక్క క్రీడావిశేష సంబంధమైన (లేక) 'రమించెదనుగాక' అను రూపమైన **ఇచ్ఛతే అనేకత్వమును కల్పించుకొనుచున్న** ఆత్మ వాస్తవానికి –

- శుద్ధము. స్థిరము. అచలము. అలేపము (పూతపూయబడనిది), అవ్యగ్రము. (తొట్రుపాటులేనిది). నిస్పృహము (Non-avocation).
- దేహమునందు కేవలము ప్రేక్షకుని (As a over - seeing spectator) వలె అవస్థితమై ఉన్నది. సత్యము ఇదే. **ఆత్మయే సత్యము. తదితరమైనదంతా కల్పన!** అయితే కూడా...,

ఆత్మ తన వినోదము కొరకై తానే రచించుకొన్న ఊహాచరితములను (Visual Sequences) తనకు తానే జన్మ–కర్మ పరంపరల రూపంగా రచించుకొని పొందుచున్నది. నాటకము చూస్తున్నవాడు నాటకములోని సంగతి. సందర్భము, సంఘటనలకు సుఖ దుఃఖములు పొందుచూ ప్రవర్తిస్తాడు చూచారా? ఆత్మ కూడా తన కల్పనలో ప్రవేశించి...,

- గుణమయములగు అనేక అంగ వస్త్రములతో తనను తానే ఆచ్ఛాదనమువలె కప్పుకొని,
- దేహ–దేహాంతరములుగా అనేకత్వానుభవము **(Experiene of multiple phases facts)** - ఒక ప్రవాహమువలె పొందుతూ పోవుచున్నది?

ఈ విధంగా దృశ్య విభాగమునందు అవస్థితమైయున్న స్వస్వరూపాత్మ – తాను అప్రత్యక్షమైనట్లుగాను అంతర్ధానమైనట్లుగాను **ఏమరపు చేత అనుభూతము పొందుచున్నది.**

**కనబడని 'నేను' ఎల్లప్పుడూ ఉన్నట్టిది. కనబడే 'నాది' మొదలే లేనట్టిది.**

– – –

# తృతీయ ప్రపాఠకః – 'ఆత్మ' – అద్వితీయమా? ద్వితీయ సమన్వితమా?

**వాలఖిల్యమునులు** : హే భగవాన్! ప్రజాపతీ! మీరు చెప్పుచున్న ఆయా విశేషాలను అనుసరించి, **"ఆత్మ మహామహితాన్వితమైనది"**.. అనియే సూచించబడుచున్నది. ఇంతలోనే **"ఆత్మ అనేకమును కల్పించుకొని, అందులో ప్రవేశించి, స్వకీయ కల్పనామాత్రమగు ఇంద్రియ విషయములలో చిక్కుకొంటోంది"** అనికూడా మీరు చెప్పుచున్నారు. ఆత్మ సర్వదా **శుద్ధము, స్థిరము, అచలము, నిర్మలము, అవ్యగ్రము, కేవలప్రేక్షక రూపము** అని కూడా మీరు వ్యాఖ్యానిస్తున్నారు.

ఇప్పుడీ విషయం చెప్పండి! ఆత్మ అద్వితీయమా? ద్విత్వముతో కూడినదా?

జగత్తు – జీవాత్మ – పరమాత్మలు – '3' వేరువేరైన విశేషాలా?

సమస్త లోకములను తనయందు కల్పించు సామర్థ్యము గల **మొదటి ఆత్మ ఎవరు?** కర్మఫలబంధములందు, దేహమునకు సంబంధించిన జన్మ–జరా–మృత్యువులందు చిక్కుకుని పరిభ్రమిస్తున్న ఆ **రెండవ ఆత్మ ఎవరు?** ఏది శుభాశుభకర్మ ఫలబంధములచే పీడింపబడుతోందో, సత్–అసత్ జన్మలను చర్విత చర్వణంగా అనివార్యమై పొందుతోందో, ద్వంద్వములచే బాధింపబడుచూ పరుగులు తీస్తోందో, పరిభ్రమిస్తోందో, అట్టి ఆ రెండవ ఆత్మ ఎక్కడి నుండి, ఎవరి ప్రోద్బలంచేత బయలుదేరుతోంది? ఆ రెండవ ఆత్మ మొదటి ఆత్మకు బంధము ఎందుకు కలిగిస్తోంది?

**ప్రజాపతి :** విను. కేవలాత్మ యొక్క ఒకానొక అంశయే– అయినట్టి "భూతాత్మ" అనునది స్వయం – కల్పితమై దృశ్యమునందు ప్రదర్శనమటం జరుగుతోంది. అద్దాని గురించి మనం ఇప్పుడు వివరించుకుందాము.

(1) అంశ తనదైన ఆత్మ (2) అంశరూపాత్మ (భూతాత్మ) – అను రెండిటికీ సంబంధించిన 'ఆత్మ' ఒక్కటే!

❋ **దేహ–దేహాంతరములు :** పాంచభౌతిక దేహములను ఆశ్రయిస్తూ ఈ భూతాత్మ ఒక సుదీర్ఘ బాటసారి వలె ప్రయాణములు – మజిలీలు కొనసాగిస్తూ పోతోంది. (ఒకడు ఒక వాహనములో కొందరితో ప్రయాణిస్తూ, ఇంతలోనే ఆ వాహనము దిగి, మరొక వాహనములో వేరేవారితో ప్రయాణిస్తూ సుదీర్ఘయానము చేస్తున్న మహాప్రయాణీకుని వలె) – ఇక్కడ భూతాత్మపట్ల దేహ–దేహాంతరములు ఒకదాని తరువాత మరొకటి ప్రవర్తమానమగుచున్నాయి.

(Just like getting down from one bus and getting into another bus in a very long journey. The mutual relationships are just like that of various co-travellars that one comes accross in each of the bus travels.) ఈ పరస్పరమైన సంబంధముల రాక–పోకలు అనుభవిస్తూ "జీవాత్మ" అనబడు ఈ భూతాత్మ దేహ–దేహాంతర ప్రయాణములు కొనసాగిస్తోంది!

❋ శుభాశుభకర్మలను నిర్వర్తించటం, వాటికి ఫలితంగా కొన్ని జన్మలు, ఆ జన్మలలో మరికొన్ని కర్మల నిర్వహణ, వాటి ఫలితంగా మరికొన్ని జన్మలు........,

కర్మలు
|
కర్మ ఫలములు → ❑ జన్మలు ❑ కర్మలు ❑ కర్మ ఫలములు → ❑ జన్మలు ❑ కర్మలు ❑ కర్మఫలములు →

... ఈ విధంగా భూతాత్మయొక్క దేహ–దేహాంతర ప్రయాణాలు కొనసాగుచున్నాయి. ఈ దేహము గతిస్తోంది. మరల ఇంకొక దేహము ఎక్కడినుంచో వచ్చి ఈ జీవునిపట్ల చిగురిస్తోంది.

❑ ఈ భూతాత్మ ఊర్ధ్వ–అధోమార్గములలో వెఱ్ఱి ఎక్కిన బాటసారివలె దృశ్యములో సంచారాలు సలుపుతోంది.

❑ అట్లా సంచరించేటప్పుడు అనేక ద్వంద్వములను మూటలు–మూటలుగా కట్టుకొని నెత్తి మీద మోస్తూ ఉన్నది.

**భూత+ఆత్మ** = పాంచభౌతిక రూపాభిమాని. అట్టి భూతాత్మ గురించి మరికొంత వివరించుకొందాము.

**భూత... అనగా?**

| | |
|---|---|
| **పంచ <u>తన్మాత్రాణి</u> 'భూత' శబ్దేన ఉచ్యంతే।** | శబ్ద–స్పర్శ–రూప–రస–గంధములనబడే పంచతన్మాత్రల పట్ల తీవ్ర ధ్యాస కలిగి ఉండటము, కొనసాగించటము – ఇక్కడ 'భూత' అను శబ్దము యొక్క ఉద్దేశ్యము. |
| **పంచ <u>మహాభూతాని</u> 'భూత' శబ్దేన ఉచ్యంతే।** | భూమి(Solid forms), జలము/రసము; అగ్ని(heat); వాయువు (చలనము); ఆకాశము(place) ... ఇవి కూడా 'భూత' శబ్దోద్దేశ్యమే. |

**యో సమవాయః -స శరీరమ్ ఉక్తమ్!** పంచతన్మాత్రల+ పంచభూతముల సమవాయువు (మేళవింపు)యే **'శరీరము'**

**యో శరీరమ్ - స 'భూతాత్మ' ఇత్యుక్తమ్** అట్టి శరీరమునే **'భూతాత్మ (లేక జీవాత్మ)'** అని ఇక్కడ చెప్పుకుంటున్నాము.

ఇక భూతాత్మకు → ప్రత్యగాత్మకు (పరమాత్మకు) గల సంబంధం ఏమిటి? వినండి.



తామరాకుపై నీటి బిందువు!

**అథ అస్తి తస్య ఆత్మా బిందురివ పుష్కర ఇతి!** తామరాకుపై జల బిందువు ఉన్నట్లు,.. **భూతాత్మయందు పరమాత్మ ఉంటోంది.**

→ జల బిందువు తామరాకుచే పీల్చబడదు.

→ తామరాకుని జలబిందువు స్పృశించదు.

→ తామరాకు యొక్క రంగు జలబిందువుకు అంటదు.

→ జలబిందువు యొక్క తడి (wetness) తామరాకు పొందదు.

→ తామరాకు-జలబిందువు కలిసియే ఉన్నప్పటికీ వేరువేరుగానే ఉంటాయి. ఒక దానితో మరొక దానికి ఏ దృష్ట్యా కూడా సంబంధమే లేదు!

**భూతాత్మ** ప్రకృతి సంబంధమైన ప్రాకృతగుణములచే పీడించబడుచూ సమ్మూఢత్వము పొందుచున్నాడు. అట్టి సమ్మూఢత్వము కారణముగా తాను ఎద్దానికి 'అంశ'యే అయి ఉన్నాడో, అట్టి పరమాత్మ ను దర్శించటమూ లేదు. గుర్తించటమూ లేదు.

**పరమాత్మ →** ఆత్మస్థుడు। భూతాత్మకు ప్రభువు। భగవంతుడు। (సమస్తము వెలిగించువాడు। కర్మేంద్రియ-జ్ఞానేంద్రియముల నియామకుడు (నియమించువాడు). గుణాతీతుడు। నిర్మలుడు। జ్ఞానస్వరూపుడు। అభిమానరహితుడు। **(జన్మలు నావైన "నేను")।** **తామరాకుపై జలబిందువు వంటివాడు.**

**భూతాత్మ →** త్రిగుణములచే తపించువాడు। కలుషీకృతుడు। దోషభూయిష్టుడు। చంచలుడు। ఆశాబద్ధుడు। జ్ఞానవీక్షణ స్పృహ లేనివాడు. అనేక లోక విషయములచే వ్యగ్రుడు! (worried) దేహాభిమాని। దృశ్యాభిమాని। "ఇది నేను - అది నాది - నేను ఇంతే!" అని తలచుచు తన ఆత్మకు తానే బంధము అవిచారణచే ఆపాదించుకొనుచున్నట్టివాడు. **(జన్మలలోని "నేను")।** **తామరాకు వంటిది.**

**పరమాత్మ →** **నిత్యముక్తుడు.**

**భూతాత్మయో →** **నిత్యబద్ధుడు.** వలలో చిక్కుకున్న పక్షివలె దృశ్యముతో కల్పించుకున్న సంబంధములందు చిక్కి...

→ అనేక కర్మపరంపరలు, వాటి ఫలములు (కర్మఫలములు)

→ ఆ కర్మఫలములు అనుభవించు సమయంలో అనివార్యము అగుచున్న మరికొన్ని కర్మపరంపరలు

... ఈ విధంగా సంసారారణ్యములో చిక్కుకొని బంధములను త్రెంచుకోలేక ఆక్రోశిస్తున్నాడు.

సంసారారణ్యములో పరిభ్రమిస్తున్నాడు. అనేక ఉపాధులలో ప్రవేశిస్తున్నాడు. నిష్క్రమిస్తున్నాడు.

***పరమాత్మ నిత్యముక్తుడై ఉండగా..., భూతాత్మ నిత్యబద్ధుడై ఉంటున్నాడు.***

**ఇంకా ఈ భూతాత్మ యొక్క స్థితి ఏమిటో వినండి.**

- **"నేను కర్మలను కర్తను"** అను కర్తృత్వ-భోక్తృత్వ భావికుడు - భూతాత్మ.
- అట్టి భూతాత్మయే **దేహములోని అంతఃపురుషుడు.**

**పరమాత్మకు** → బంధము లేదు. మోక్షము లేదు. జన్మ లేదు. కర్మలేదు.

**భూతాత్మయో** → బంధము, జన్మ-కర్మ-వ్యవహారాదులు నిత్యము, అనుక్షణికంగా పొందుచున్నాడు.

అగ్నితో ఎఱ్ఱగా కాలిన ఇనుపగుండును కమ్మరి ఉక్కుబండతో మోదినప్పుడు ఆ గుండు ముక్కలు ముక్కలుగా అగుచున్నది కదా!

అట్లాగే.. ఈ భూతాత్మ..., త్రిగుణముల యొక్క (సత్వ-రజో-తమోగుణముల యొక్క) అనేక విధములై సమ్మేళనములచే - **చతురశీతి లక్షయోని పరిణతం।** 84 లక్షల జీవజాతులలోఉపాధులను పొందుచూ పోవుచున్నాడు.

చక్ర యంత్రమును ఎక్కిన వానివలె జన్మపరంపరలతో క్రిందికి-పైకి తిరుగాడుచున్నాడు.

***ఇక్కడ ఒక చమత్కారము గమనించబడు గాక! ఇందాక తీసుకున్న దృష్టాంతమే మరల చెప్పుకుందాము.***

> **యథా యః పిండే హన్యమానే న అగ్నిః అభిభూయతి,**
> **- ఏవం న అభిభూయతి అసౌ పురుషో।**
> **- అభిభూయతి అయం భూతాత్మ ఉపసంశ్లిష్టత్వాత్ - ఇతి॥**

కమ్మరి బండ సుత్తితో ఎర్రగా కాలిన ఇనుపగుండును మోదుతూ ఉంటే, ఆ ఇనుపగుండు అనేక చిన్న ముక్కలై అటూ-ఇటూ పడతాయి. ఖండఖండములౌతాయి. అయితే, **అగ్ని ఖండ-ఖండములుగా అవుతోందా? లేనేలేదు.**

అట్లాగే, **భూతాత్మ** పురుషుడు - దృశ్యవ్యాపకము కారణంగాను, శుభాశుభకర్మలచేతను, త్రి-గుణముల చేతను ప్రేరితుడై అనేక భౌతిక దేహ పరంపరలలో (అనేక జీవజాతులలో) ప్రవేశ-నిష్క్రమణలను నిర్వర్తించుచుండవచ్చుగాక!

పరమాత్మపురుషుడు - (... ఇనుపగుండును కాల్చు అగ్నివలెనే) జన్మకర్మల చేతను, సుకృత-దుష్కృత-కర్మల చేతను స్పృశించబడనివాడై, పరమశాంతుడై, సర్వమునకు పరమై, కేవల ప్రేక్షకుడై, అకారణకారణుడై, సర్వత్రా ప్రకాశమానుడై వెలుగొందుచున్నాడు.

కనుక...,

భూతాత్మగా బంధము ఉన్నప్పుడు కూడా..., పురుషునిగా (లేక) పరాత్మగా మీకు (ఆత్మగా) బంధము లేదు! ఎవ్వరూ కలిగించనూ లేరు. (1) ఆత్మకు బంధము ఉండజాలదు. (2) మీరు సహజంగా ఆత్మస్వరూపులే.

-----

ఓ వాలఖిల్యాది మునివర్యులారా!

- ఈ భౌతికదేహము మైథునముచే (స్త్రీ-పురుషదేహముల కలయికచే) పుట్టుచున్నది.
- ఇది జడము. ఇద్దానికి స్వతఃసిద్ధమైన జ్ఞానము లేదు-జడమైన దానికి స్వకీయ భావమేముంటుంది? కనుక భౌతిక శరీరమునకు బంధముగాని, మోక్షముగాని ఉండవు.
- అనేక బాధలు ఇందులో దాగి ఉండటం చేత, ఇది నరకప్రాయమైనది.
- దీని ఉత్పత్తి ఎట్టిది? మూత్రద్వారము నుండి బయల్వెడలినట్టిది.
- ఇది - అనేక బొమికలు ఒకచోట గూడువలె కూర్చబడినట్టి - ఎముకల గూడు!
- మాంసమయము.
- 'చర్మము' అనే మూట-వస్త్రముచే కప్పబడి ఉన్నట్టిది.
- మలము, మూత్రము, పిత్తము, కఫము, చీము, నెత్తురు, మేదస్సు, క్రొవ్వు... మొదలైన అనేకమైన మలిన పదార్థములతో కూడి ఉన్నట్టిది.
- ఇవేకాకుండా ఒక ధనాగారమువలె ఆయుధాగారము వలె ఏవేవో పదార్థజాలములతో నిండి ఉన్నట్టిది.

ఇంకా ఇంకా కూడా...,

ఇందులో తామసగుణదోషములు, రాజసగుణదోషములు మనో అంతర్గతంగా దాగి ఉన్నాయి.

### తామసగుణములు (గుణదోషములు)

సంమోహనత్వము (Illusion) : భయము (Fear); విషాదము (Meloncholy/ Dissatisfaction); నిద్ర (Drowsy); తంద్రీ (Relatedness); వ్రణములు Pains); జరా (Old age); శోకము (Worry); క్షుత్ (Hunger); పిపాస (Thirst); కార్పణ్యము (Pessimism about related others); క్రోధము (Revenge sense); నాస్తిక్యము (Athiesm); అజ్ఞానము (ignorence): మాత్సర్యము (Cruelty); నైష్కారుణ్యము (Non Sympathetic).

**మూఢత్వము:** ( **'నేను ఎవరు'** – గురించిన జిజ్ఞాస ఉండకపోవటము. పరిమితమైన పరిధులలో ఉండిపోవటము.

**మూర్ఖత్వము:** పట్టుకొన్నది అవిచారణతో వదలకపోవటము. వదల లేకపోవటము;

**నిర్లజ్జత్వము / నిర్వ్రీడత్వము:** నిర్లజ్జ."ఎవ్వరేమన్నానుకొన్నా సరే. నేను ఇట్లాగే ఉంటాను"– అనే మొండితనము;

**నికృతత్వము :** నీచమైన భావపరంపరలు. (ఇంకా కూడా) పని చేయాలని తెలుసు, కానీ చేయబుద్ధి కాకపోవటము. ధర్మమని తెలుసు. చేయబుద్ధి కాకపోవటము. అధర్మమని తెలుసు. విరమించ బుద్ధి కాకపోవటము, బద్ధకము (Lazyness, inactive, morose).

**ఉద్ధతత్వము :** అనేక విషయములతో, సహజనులతో బంధము కలిగి ఉండటము.

**అసమత్వము** : వాళ్ళు – వీళ్ళు, ఐనవాళ్లు–కానివారు, తక్కువవారు–ఎక్కువవారు... ఈ రీతిగా సమత్వబుద్ధి కోల్పోవటము– ఇవన్నీ **'తామసాన్వితములు'**.

***ఇవన్నీ కూడా ఈ దేహమునందు (ఇంద్రియ – ఇంద్రియార్థ – మనో – బుద్ధి – చిత్త – అహంకార స్థానములలో) దాగి, పేరుకొనియున్న తామస సంబంధమైన గుణముల ముఠా. ఇవి ఈ జీవునికి బంధమై, తన యొక్క సహజము, కేవలము అగు పరస్వరూపానుభవమునకు అడ్డుగోడలై ఉంటున్నాయి.***

### రాజసిక గుణములు (గుణదోషములు)

**తృష్ణ** → "పొందినవి తక్కువ, చాలదు. ఇంకేదో, ఏదేదో పొందాలి! పొందాలసిందే".. అనే **దాహము.** (Greedy)

**అస్నేహో** → "వీరు పరాయివాళ్లు. వీరితప్పులు ఇవి. వారు శత్రువులు" – మొదలైన **అస్నేహ–శత్రుభావాలు.** (Enimity)

**రాగో** → బంధు జనముపట్ల, వస్తువుల పట్ల "నావి – నావే" అనే వ్యామోహము. **"ఇవి లేనిదే నేను ఉండలేను. నాకు ఉండాలి. నాకే ఉండాలి! పోకూడదు"** ... అనే భావావేశము. (Attachment)

**లోభో** → దాచుకొని అర్హులైనవారితో కూడా పంచుకోకపోవటము. (లోభి తన వస్తువును చెడితే పారవేస్తాడేగాని, బాగున్నప్పుడు పంచుకోడు. దానము చేయడు). (Miserly)

**హింసా** → మాటలతో – చేతలతో ఇతరులను బాధించటము. ఇతరులకు కష్టము – బాధ కలిగించటానికి వెనుకాడకపోవటం. ఇతరుల కష్ట–నష్టములకు ప్రోద్బలమవటం. ఇతరులను బాధపెట్టటం. తన మాట – చేతల వలన ఇతరులకు కలిగే కష్ట–నష్టములు గమనించకయే పోవటము. (Violence, teasing)

**రతిదృష్టిః** → వాస్తవానికి మనోకల్పిత భ్రమయే మూలముగా కలిగి ఉన్నట్టి అనేక దృశ్య వ్యవహారములలో "ఇంకా ఏదో రమించాలి" అనే దృష్టి. నామ–రూపములు, సంబంధ–అనుబంధ–బాంధవ్యములు, సంపద – ఆపదలకు పరిమితమై, ఆత్మ–జ్ఞాన జిజ్ఞాస లేకుండినట్టి దృష్టి. తీవ్ర శృంగారభావావేశములు. (Craving for Enjoyments)

**వ్యాపృతత్వం**→ వ్యాపార దృష్టి – 'లాభము పొందాలి, లభించాలి' అనే ఆత్రుత. (Thirst to go on earning)

**ఈర్ష్య** → ఇతరుల పట్ల అసూయ. నిష్కారణమైన ద్వేషభావాలు, దురభిప్రాయాలు. తప్పులు ఎంచే స్వభావము. "ఆతనికి అంత ఎందుకుండాలి! నాలాగా బాధలు పడాలి"... అనే భావోద్రేకం. (Hatred)

**కామమ్** → అనుక్షణం అసంఖ్యాకంగా కోరికలు కలిగి ఉండటము.
- ఇంద్రియ నిగ్రహము లేకపోవటము.
- ఇంద్రియ విషయముల పట్ల ఆవేశపూరితంగా ఆకర్షించబడటము.
- "ఇంకా చాలా చాలా కావాలి. ఇకప్పుడు–ఆత్మగురించి" – అని తలంచుచూ, వర్తమానమును ఇంద్రియార్థములకు పరిమితము చేసివేసి ఉండిపోవటము. (Desires and expectations from worldly scenery).

**అవస్థితత్వమ్ →** ఒక స్థితిని అభిప్రాయమును పట్టుకొని, ఇక దానిని వదలలేకపోవటము. లౌకిక విషయాలతో అవస్థిత్వము. ఆత్మశాస్త్ర విచారణలలో అనవస్థిత్వము. (Getting Attatched deeply in some Assumptions and Pressumptions).

**చంచలత్వము→** అనుక్షణం మారే అభిప్రాయాలు. అనేక విషయాల మధ్యగా విషయ లోలుత్వబుద్ధి. ఊరికే ఉండక కాలుకాలిన పిల్లిలాగా మనో సంచారాలు చేయటము. పురాణాలు వింటూ పురుళ్ల గురించి చెప్పుకోవటము. (Distraction and restless thoughts).

**జిగీష →** అతిశయము. ఆత్మస్తుతి-పరనింద. ఏదో ఏదో పొందాలనే తపన తదితరులను తక్కువగా చేసి చూడటము. (Superiority complex).

**అర్థోపార్జనము →** "ఇంకా ఎట్లా ధనము సంపాదించాలిరా?" అనే ఆరాటము (Craving for Properties).

**మిత్రానుగ్రహణము →** 'తన బంధువులు – మిత్రులు' అనుకున్నవారి పట్ల తప్పులు చాలాచిన్నవిగాని, ఒప్పులు గొప్పగొప్పవిగాను భావించటం. వారికై ఏమైనా సరే చేయాలని అనుకోవటం. వారినే పరిగ్రహించటం. వెంటబడటం.. అవలంభనము "నా వారు మరి! ఏమౌతారో?" అని ఆవేదన. అమిత్రులపట్ల తిరస్కార బుద్ధి. (Bothering about relatives etc)

**పరిగ్రహావలంబో→** కొన్ని వస్తువులు పరిగ్రహించి, వాటిని వదలక, వాటి వెంటే ఉండు ఆవేశము. వదలలేనంత ఇష్టము. (Too much relatednes towards the liked people).

**అవిష్టేషు ఇంద్రియార్థేషు ద్విష్టి →** తనకు ఇష్టములేని వారి పట్ల, కొన్ని కొన్ని ఇంద్రియార్థముల పట్ల ద్వేషము పెంపొందించుకొని ఉండటము.

**ఇష్టేషు అభిష్వంగః→** ఇష్టమైనవారిని, విషయములను పట్టుకొని వదలలేకపోవటము. ఇష్టాయిష్టములమధ్యగా ఇరుకుకొని ఉండటము.

**ఇవన్నీ దేహమునందు దాగి ఉన్న రాజసిక గుణదోషములు.** ఇవి కూడా ఈ జీవుని యొక్క ఆత్మ సందర్శనమునకు అడ్డుగా నిలుస్తూ, సంసారారణ్యము నుండి బయల్వెడలనీయుట లేదు.

❖ ❖ ❖

మనము ఇప్పుడు చెప్పుకొన్న గుణసంబంధమైన అభ్యాసాలు ఈ భూతాత్మ (జీవాత్మ) యొక్క హృదయమును అనేక ఉపాధి పరంపరా రూపముగా ఆక్రమించుకొని ఉండటం జరుగుతోంది. అవన్నీ-ఆతని ఆత్మావగాహనను, ఆత్మభావనను, ఆత్మదర్శనమును, ఆత్మానుభూతులను కప్పి ఉంచుచున్నాయి. అడ్డుగా ఉంటున్నాయి. ఆతడు తన ఆత్మను స్మరించటమే లేదు! "నేను ఎవరు? ఈ ప్రపంచము ఎట్టిది? దీనితో ఏ సంబంధము ఉచితము? ఏ సంబంధము అనుచితము? ఏది దుఃఖ-బంధప్రదము?"- అని ప్రశ్నించుకోవటమే లేదు.

ఫలితం?

ఈ భూతాత్మ 84 లక్షల నానావిధ యోనుల రూపాలను పొందటం, ఈ దృశ్యచక్రములో చర్వితచర్వణంగా మహాపరిభ్రమణము సుదీర్ఘంగా కొనసాగించటము జరుగుతోంది.

❖ ❖ ❖

# చతుర్థప్రపాఠకః-సంసార ఉపశమన మార్గములు

ఇదంతా వింటున్నటి

- ఊర్ధ్వరేతస్కులు..., - తపో బలసంపన్నులు...,

అగు వాలఖిల్యమునులు విస్మితులైనారు. ఆశ్చర్యచకితులైనారు. తమలో తమ గురించిన భయమును పొందారు.

**వాలఖిల్యమునులు :** హే భగవాన్! మీకు మరల మరల హృదయపూర్వకముగా నమస్కరిస్తున్నాము! ప్రణిపాతులమగుచున్నాము! శరణు వేడుచున్నాము!

మీరు చెప్పిన భూతాత్మయొక్క మనోగతమైనట్టి రజో-తమోగుణ దోషములన్నీ కలిగియుండటం చేతనే కాబోలు, మేము **సహజరూపమగు స్వాత్మమహిమ**ను గ్రహించలేకపోతున్నాము, ఏ మాత్రము సమీపించలేకపోతున్నాము.

అయ్యా! ఇప్పుడు మీరేమాకు గతి! దిక్కు! మమ్ములను రక్షించండి! ఆజ్ఞాపించండి!

**అస్మాకం గతిః అన్యా న విద్యత ఇతి!** మా భూతాత్మత్వము యొక్క సంసారారణ్య సంచారవేదనముల గతి ఇంతేనా? వేరే గతి లేదా? ఇప్పుడు మేము ఆశ్రయించవలసిన ఉపాయము లేమిటి? మాకు దృశ్యముతో బంధము తొలిగేది ఎట్లా?

**అస్య కో విధిః భూతాత్మనో యేన ఇదం హిత్వా, ఆత్మన్యేవ సాయుజ్యమ్ ఉపైతి?** మా యొక్క భూతాత్మ సంబంధమైన తామసిక-రాజసిక గుణాభ్యాసములను వదలించుకొనే మార్గమేమిటి? సంసార చక్రపరిభ్రమణము నుండి బహిర్గతులమై ఆత్మయందు సాయుజ్యము పొందేది ఎట్లా? మాకు మార్గము అనుగ్రహించండి.

**ప్రజాపతి :** వాలఖిల్యముని శ్రేష్ఠులారా! బ్రహ్మజ్ఞులచే వేదాంతశాస్త్రములో సిద్ధాంతీకరించబడిన కొన్ని మార్గవిశేషాలు ఇప్పుడు ప్రస్తావిస్తున్నాను. మీరంతా శ్రద్ధగా వినండి!

మహానదిలోని తరంగాలు ఒడ్డును అధిగమించలేక నదీజలంలోనే చిక్కుకొని, ఈ చివరి నుండి ఆ చివర వరకు సంచరిస్తూ ఉంటాయి చూచారా! ఆ విధంగా ఈ భూతాత్మ జన్మ-కర్మల మహాసాగరంలో చిక్కుకొని బయల్వెడలలేకపోతున్నాడు.

కర్మ-జన్మల పరంపర ఈ జీవాత్మ పట్ల అనివార్యము - దుర్నివార్యము అగుచున్నది.

- ఒకవైపు సత్-అసత్ కర్మ పరంపరలు. కర్మఫలముల వలన ఫలదీకరిస్తున్న ఉత్తరోత్తర-అనివార్య కర్మ సంబంధములు.
- మరొకవైపు ఈ భూతాత్మ పెంపొందించుకొంటున్న **రాగము. "ఇవి నాకు చెందినవి. నేను వీటికి చెందినవాడిని"**... అనే మనో అభ్యాసము. అవి దూరమగుచున్న సందర్భములలో పట్టరాని దుఃఖము. దుఃఖముతో పుట్టుచు, దుఃఖముతోనే చావటము (Dieing with Meloncholy and worry)
- ఇంకొకవైపు భౌతికదేహపరిణామములగు వ్యాధి-జరా-మరణములు.
- వేరొక వైపు రజో-తమోగుణ సంబంధమైన అనేక మనోవ్యాధులు, మానసిక రుగ్మతలు. బుద్ధి దోషములు, చిత్త-అపశ్రుతులు.

వీటన్నిటి మధ్య ఈ భూతాత్మ త్రాళ్ళతో కట్టుబడిన పశువువలె అనేక బంధనములు పొందినవాడై ఉంటున్నాడు.

**పశురివ బద్ధం! బంధనః తస్యైవ అస్వాతంత్ర్యమ్!** - అస్వాతంత్రుడై దిక్కుతోచక అనేక దిగుళ్ళతో మ్రగ్గుచున్నాడు. పైకి మాత్రం ఏవేవో వ్యవహారాలు కల్పించుకొని "మేము బాగే! మీరు బాగున్నారా?"... అని చెప్పుకుంటూ కాలము వెళ్లబుచ్చుచున్నాడు.

**యమ విషయస్థ ఇవ, బహు భయావస్థమ్!** మృత్యువు అనే పిల్లి వెంటనంటి ఉన్న ఎలుక వలె, - యముని (మృత్యుదేవత) దృష్టిలో పడియే ఉన్నవాడై బహు భయావస్థలలో ఉంటున్నాడు.

**మదిరోన్మత్తయివ మోహ మదిరోన్మత్తమ్!** కల్లు పీకలదాకా త్రాగి మత్తెక్కి ఉన్నవాడి స్థితి వలె - **"దృశ్య విషయములు - పరస్పర సంబంధ- అనుబంధములు"**... అనే మత్తుతో జగత్తులో ఏదో ఆనందము పొందాలని ఈ భూతాత్మ నిస్సారమగు ఈ దృశ్య ప్రపంచంలో దేని దేనికోసమో వెతుకుచున్నాడు. ఇక ఇక్కడ మోదము లభిస్తోందా? గుప్పెడు సుఖాలుంటే, గంపెడు ఆదుర్దాలు, మోపెడంత దుఃఖాలు, వగైరా!

**పాప్మనా గృహీత ఇవ భ్రామ్యమాణమ్! :** క్రూరమైన వృద్ధ మాంత్రికురాలికో, ఏదో పాప యక్షిణికో పట్టుబడినవానివలె అనేక భ్రమపరంపరలలో తిరుగాడుచున్నాడు - భ్రామ్యమానుడై ఉంటున్నాడు!

**మహా ఉరగ ద్రష్ట ఇవ విషయ దష్టమ్ :** విషపు పాము కరచినప్పటివానివలె విషయములచే బాధించబడుచున్నాడు. విష పాముచే కాటుకు దగ్గిరగా ఉన్నవానివలె- **"ఏవైనా విపత్తులు వచ్చి మానెత్తి మీద పడతాయేమో? మరి ఏమి జరుగుతుందో, ఏమో?"**.. అని తలచుచు లోలోన ఏవేవో బాధలు, భయములు, వేదనలు కలిగి ఉంటున్నాడేగాని, **"అమ్మయ్య! ఇక నుంచి ఎప్పటికీ నాకు ఏదిగులూ లేదు"**.. అని ప్రశాంత పడలేకపోతున్నాడు.

**మహాంధకార ఇవ రాగాంధమ్! :** ఒకడు కరకర ఆకలి వేయటం చేత మెళుకువ వచ్చి నిదుర లేచాడు. కానీ ఆతడు తెలియనిచోట గాడాంధకారములో చిక్కుకున్ని ఉన్నాడు. ఏవైనా తినే పదార్థాల కోసము, పానీయము కోసము కటికచీకటిలో తడిమితడిమి వెతుచుండటం

ప్రారంభించాడు. ఆతనికి చేతికేమీ తినగలిగినవి దొరకటం లేదు. ఏమీ కనబడటము లేదు. ఎటువైపుగా కదలాలో తెలియటము లేదు.. పరిస్థితి ఎట్లా ఉంటుంది?

ఈ భూతాత్మ కూడా, "ఇవి నాకు ప్రియము! వీరు నావారు. కనుక ప్రియులు.. ఇవి–ఇవన్నీ ఎట్లాగైనా నాకే ఉండాలి. వీటికి–వీరికి ఏవైనా ఇబ్బందులు ఉంటే, అవన్నీ నావే!" అను **'రాగము'** అనే అంధకారములో ప్రవేశించి ఉంటున్నాడు. **అతిచంచలమగు దృశ్యవిషయముల పట్ల రాగము కలవానికి మనోనిశ్చలత ఎక్కడిది?** అనునిత్యము మనస్సు చంచలమే అవుతోంది. చంచలమగు మనస్సుకారణంగా తన యొక్క ఆత్మస్వరూపము పట్ల నిశ్చయము ఏర్పడటం లేదు. ఎందుకంటే, – మనస్సంతా రాగాంధకారముతో నిండి ఉంటోంది.

**ఇంద్రజాలమివ మాయామయమ్‌।** : ఇంద్రజాలము చూస్తున్నవారు,... అందులో కల్పించి చూపబడేవన్నీ 'నిజమే' అన్నట్లుగా చూస్తూ ఆశ్చర్యచకితుడవటం, వినోదించటం చేస్తూ ఉంటాడుకదా! ఈ భూతాత్మ కూడా **"తాను చదువుచున్న కథలోని సంఘటనలు"** వంటి ఈ దృశ్యాంతర్గమైన సందర్భములను చూచి, వీటిని నమ్మి ఉంటున్నాడు. ఫలితం? తన యొక్క దివ్యమైన ఆత్మత్వము వైపు దృష్టి – అవగాహనలను సారించటమే లేదు! (He is not extending his looks towards his own <u>**devine**</u> self)

**స్వప్న ఇవ మిథ్యా దర్శనమ్‌।** : ఒకడు తన గుడిసెలోపడుకొని నిద్రలేచి, అటూ – ఇటూ చూచి ఏడవటం ప్రారంభించాడు. ఆ ప్రక్కవారు **"ఏమిటి? ఎందుకు ఏడుస్తున్నావ్? ఏమైంది?"**.. అని అడిగారు. ఇక నిద్రలేచిన ఆయన చెప్పుకోవటం ప్రారంభించాడు.

**"నాకు కలిగిన నష్టం గురించి ఏడుస్తున్నాను. రాత్రి నిదురించానా! కలలో నాకు ఒక గొప్ప భవనము ఉన్నది. ఆ భవనములో నేను హుందాగా పచార్లు చేస్తున్నాను. ఇంతలో మెలుకువ వచ్చింది. చూస్తే, తిరిగి ఈ పూరి గుడిసెలో ఉన్నాను. అనగా, ఆ కలలోని భవనమును పోగొట్టుకొన్నానా? లేదా? పోగొట్టుకొన్నాను. అందుకే ఇప్పుడు ఏడుస్తున్నాను!"** అని వాపోయాడుట.

ఈ విధంగా స్వప్న సంఘటనల వలె **"మిథ్యామాత్రమే!"** అయి ఉన్న అనేక దృశ్యాంతర్గతమైన విషయాలను, విశేషాలను చూస్తూ ఆయుష్షు గడుపుచున్నాడు. **"ఆత్మస్వరూపుడనగు నా యొక్క సహజ తత్త్వము ఇట్టిది కదా!"..** అని గమనించటమే లేదు! భ్రమలయందే మ్రగ్గుచున్నాడు. మాయామయుడై రాత్రి – పగలు గడుపుచున్నాడు.

**కదలీగర్భ ఇవ అసారమ్‌।** : అరటి చెట్టు కాండమును ఒలుచుకొంటూ పోతే, లోపల చివరిగా మరొక విలువైనదేదైనా ఉంటుందా? ఉండదు కదా! అట్లాగే, ఈ సంసారములో సారమైనవస్తువేదీ ఉండదు. అసార–నిస్సార సంసార భ్రమచే ఈ భూతాత్మ తన యొక్క ఆత్మత్వముపై దృష్టి నిలుపుకోలేకపోతున్నాడు. అపారమైన సంసారములో సుఖములకై వెతుకుచూ,... ఫలితంగా దుఃఖములనే పొందుచూ ఆయుష్షు వృథాగా గడుపుచున్నాడు.

**నట ఇవ క్షణ వేషమ్‌।** : ఒక నటుడు వేరువేరు నాటకములలో వేరు–వేరు పాత్రలను నిర్వర్తిస్తూ ఉన్నట్లుగా ఈ భూతాత్మ వేరువేరు ఉపాధులలో వేరువేరు దృశ్యకథన సన్నివేశములలో పాల్గొనుచూ, దేహ–దేహానంతర పరంపరలలో మునిగి తేలుచున్నాడే గాని, అప్రమేయమగు ఆత్మను ఎరుగుచుండుటలేదు.

**చిత్ర భిత్తరివ మిథ్యా మనోరమమ్ :** ఒక గొప్పచిత్రకారుడు రంగుకుంచెలతో చిత్రించిన సౌందర్యరాసియగు అప్సరసను చూచి, ఒక రాజకుమారుడు ప్రేమించగా, ఆ రాజకుమారునికి "అయ్యా! ఆ చిత్రము (Painting)లోని సుందర స్త్రీ నా చిత్రకళానైపుణ్యమేగాని, అటువంటి సుందరి ఎక్కడా లేదు"... అని ఆ మిత్రుడగు చిత్రకారుడు వివరించి చెప్పవలసి వచ్చింది.

ఆ తీరుగా గోడపై రంగులతో చిత్రించిన కళాఖండములోని దృశ్యము వలె ఈ దృశ్యమంతా మనోకల్పనావిలాసమే. మిథ్యామనోరథ కల్పితమే! ***ఈ దృశ్య ప్రపంచానుభవములో కనిపించే అర్థములన్నీ అనర్థములే.***

ఈ జీవుడు ద్రష్ట అయి– దర్శించుచూ, భావావేశముచే తన్మయమగుచున్న సంసారదృశ్య భ్రమ గురించి ఆత్మజ్ఞులచే "ఇది ఇటువంటిది సుమా!" సుస్పష్టపరచబడుచూనే ఉన్నది.

ఈ భూతాత్మ శబ్ద–స్పర్శ–రూప–రస–గంధ విషయ– విశేషాలను చిలవలు–పలవలుగా మనోకల్పన చేసుకొనుచున్నాడు. అనర్థములైన అర్థములు కల్పించుకొని, వాటియందు స్థితి పొందినవాడై ఉంటున్నాడు. **(శబ్ద స్పర్శాదయో యే అర్థా, అనర్థా ఇవ తే స్థితాః)!**

**యేషామ్ సక్తస్తు భూతాత్మ న స్మరేత్ చ పరంపదమ్!** ఇటువంటి ఆయా అనేక విషయ-విశేష-సంబంధ-అనుబంధ- బాంధవ్య-ఆశ-నిరాశల మధ్యలో చిక్కుకున్న భూతాత్మ పరమపదమును స్మరించుటయే లేదు! **"నా సహజ నిత్య - సత్యస్వరూపము ఏమై ఉన్నది?"** అనేది తెలుసుకోవాలని ప్రయత్నించటమే లేదు. ప్రయత్నములేనివానికి ఏదైనా కానీ, ఎట్లా సిద్ధిస్తుంది?

\- - -

ఓ వాలఖిల్యాది మునులారా! మీరంతా భూతాత్మ యొక్క స్థితి ఏమిటో, గతి ఏరీతిగా ఉంటోందో.., ఆయా విశేషాలు విన్నారుకదా! ఇప్పుడు మనము "ఈ భూతాత్మస్థితికి ప్రతివిధి (How to counter)" - అనే విషయమును పరిశీలిద్దాము.

(1) ఆత్మ విద్యను అభ్యసించటము. **ఆత్మతత్త్వ విచారణ.** (ముముక్షుత్వ-తత్త్వాధ్యయనములు)

(2) శ్రద్ధ-ఉపాసనాభావములతో **యోగాభ్యాసము - భక్తిగుణముల ఆశ్రయము.**

(3) స్వ - ఆశ్రమ సంబంధమైన (బ్రహ్మచర్య-గృహస్త-వానప్రస్త-సన్న్యాస ఆశ్రమములకు చెందిన) కర్మలను, ధర్మములను శాస్త్రములు సూచించు విధంగా **ఉపాసన- సమర్పణ** భావముతో నిర్వర్తించటము. (కర్మయోగము)

## స్వ ధర్మాచరణము

.... ఈ విధంగా 'వి హిత ధర్మనిర్వహణ' (Attentively attending to allotted activities / functions) అనే స్థంభమును (ధర్మ స్థంభమును) సమర్పితభావముతో, ఉపాసనా భావముతో, శ్రద్ధగా పట్టుకోవాలి.

**"ఎందుకు నా ధర్మము నేను నిర్వర్తించటము?"..** అనే విషయంలో ఉత్తమ సమాధానబుద్ధి పెంపొందించుకున్న భూతాత్మ (లేక జీవుడు) ధన్యుడే। ఎందుకంటే, ఉపాసనాభావంగా స్వధర్మము నిర్వర్తిస్తూ ఈ సంసార మహాసముద్రము నుండి బహిర్గతుడు కాగలడు. **"విద్యుక్త ధర్మము నన్ను సంసారగతి నుండి రక్షించగలరు (రక్షతి రక్షితః). నన్ను సముద్ధరించటానికి ఇవ్వబడిన ఉపాయము"** అని అనుకోబడుగాక! లేదా? **అన్యధా అధః పతతి!** స్వధర్మము పట్ల బద్ధకించినా (లేక) ఉపాసనగా కాకుండా దృశ్యములో పొందవలసిన ప్రయోజనముగా భావించినా కూడా, ఆతడు చేస్తున్న కర్మ-బంధములు కలిగించగలదు. దోష-దుష్ట కర్మలచే దుఃఖము, బంధనము, భయము కలిగించు స్థితిగతుల వలన అధఃపతనము అనివార్యము.

**స్వధర్మము అనగా? - ఏష 'స్వధర్మ' అభిహితో యో వేదేషు!** ఏది వేదములచే **'ధర్మము'**గా చెప్పబడుచున్నదో, అది స్వధర్మముగా స్వీకరించబడు గాక! మను ధర్మము, భారత-రామాయణాది పురాణములు, లోక శ్రేయోభిలాషులగు ఆర్యులు, పెద్దలు - **"ఇది చేయండి, ఇది చేయకూడదు. ఇది తప్పక నిర్వర్తించాలి. ఇది అనుసరించండి"** - అని చెప్పునది ఆశ్రయించటచమే **"ధర్మము"**।

ఎవరు ఏ (బ్రహ్మచారి - గృహస్థ - ఉద్యోగ - వ్యాపారి ఇత్యాది) ఆశ్రమములో ఉంటే, ఆ ఆశ్రమ ధర్మముగా ఏదేది చెప్పబడిందో.., అది శ్రద్ధతో, సమర్పిత-ఉపాసనా భావములతో నిర్వర్తించువాడు **'తపస్వి'**యే సుమా! **ఆశ్రమేషు ఏవ అవస్థితః త 'తపస్వీ చేత్' ఇతి ఉచ్యతే!** అది నిర్వర్తించటమే శుభప్రదము. (కర్మణా జాయతే భక్తిః। భక్తిః జ్ఞానం అజాయతే। జ్ఞానాత్ ప్రజాయతే ముక్తిః। - ఇతి శాస్త్రేషు నిర్ణయః।। - అని ఆర్యవాక్యము).

**న అతపస్కస్య ఆత్మజ్ఞానాధిగమః!** అతపస్కుడు (తపోధనము సంపాదించుకోనివాడు) ఆత్మ జ్ఞానమునకు అర్హుడు కాలేకపోవుచున్నాడు. 'కర్మ' అనునది బుద్ధి యొక్క శుద్ధికొరకే ఉద్దేశ్యించ బడుతోంది. **కర్మః శుద్ధిర్వ ఇత్యేవం హి ఆహ!** కర్మయోగికి తనయొక్క సమర్పిత కర్మలే తపస్సు.

**తపసా ప్రాప్యతే సత్త్వమ్** - 'విద్యుక్త ధర్మనిర్వహణ' మొ।।న రూపముగా తపస్సు నిర్వర్తించటము చేత రాజసిక-తామసిక గుణములు సన్నగిల్లి, క్రమంగా సాత్వికగుణములు అభ్యాసంగా (As a habit) అవగలవు.

**సత్త్వాత్ సంప్రాప్యతే మనః!** సాత్విక గుణముల అభ్యాసముచే మనస్సు నిర్మలము అవగలదు.

**మనసా ప్రాప్యతే ఆత్మ!** నిర్మలమైన మనస్సు **జగదత్వమును** వదలి **ఆత్మత్వమును** సంతరించుకోగలదు. నిర్మలమైన మనస్సుకు ఆత్మ యొక్క స్థానము, ఆత్మయొక్క సహజ స్వభావము, ఆత్మతో అభిన్న-అద్వైతత్వము క్రమంగా అనుభవము కాగలదు.

**ఆత్మా ఆప్త్వా న నివర్తతే!** 'ఆత్మ'ను తెలుసుకొని, ఆత్మత్వము నందు ప్రవేశించిన తరువాత, ఇక అట్టివాడు మరల సంసారమున పడడు. చేతిలోని మధురపదార్థమును వదలి, బాట ప్రక్కన గల చేదు-మురికి పదార్థములను ఎవడు కోరుకుంటాడు? ఈ విషయమే వివిధ మహనీయులచేత (వివిధ మత గురువులచేత) వివిధ రీతులుగా, వివిధ సిద్ధాంతముల రూపంగా గానం చేయబడుతోంది. బోధించబడుతోంది.

## చిత్త వృత్తులు - ఉపశమనము

ఏ విధంగా అయితే ఇంధనము తరుగుచూ ఉండగా అగ్ని స్వయముగా ఉపశాంతిస్తుందో, అదే రీతిగా **వృత్తులు (Avocations) క్షయిస్తూ ఉండగా చిత్తము, స్వయముగా ఉపశాంతిస్తూ రాగలదు.**

ఎవరైతే సత్యము (That which is permanent and ever-lasting) వైపే దృష్టి-ధ్యాసలను కొనసాగిస్తూ ఉంటాడో,... అట్టి సత్యకామి యొక్క మనస్సు తనకు తానే ఉపశమించగలదు. నిర్మలమై, నిత్య నిర్మలమగు ఆత్మతో **'మమేకము'** పొందగలదు.

***<u>బిడ్డలారా! ఒక ముఖ్య విషయము జాగ్రత్తగా గమనిస్తూ, గుర్తుపెట్టుకొని ఉండండి.</u>***

**చిత్తమేవహి సంసారః। తత్ ప్రయత్నేన శోధయేత్।** చిత్తమే 'సంసారము' అయి ఉన్నది. చిత్తమునకు వేరుగా సంసారము అనునది ఎక్కడా ఏదీ లేదు. అందుచేత ఈ భూతాత్మ (లేక) జీవుడు **"నా చిత్తము ఎట్లున్నది? వేటి వేటిపై వ్రాలి ఆశ, కామము, దుఃఖము కొనసాగిస్తోంది?"..** అనే విషయం ఎల్లప్పుడూ శోధన చేసుకుంటూ (keep on overseeing and examining) ఉండాలి. చిత్తమునందు ఇంద్రియార్థములయినటువంటి శబ్ద-స్పర్శ-రూప-రస-గంధ సంబంధమైన (లోక సంబంధమైన) సమాచారములను తగ్గిస్తూ, ఆత్మశాస్త్ర సంబంధమైన సమాచారమును అధికాధికం చేసుకుంటూ రావాలి!

ఈ చిత్తమునకు ఒకానొక ధర్మమున్నది. **యత్ చిత్తః తన్మయో భవతి।** చిత్తము దేనిని ఆశ్రయిస్తే, అది తానే అగుచూ వస్తుంది. చిత్తముయొక్క - ఆశ్రయములే ఈ జీవునిపట్ల ఆయా - తదనంతర రూపములుగా రూపుదిద్దుకుంటూ ఉంటాయి. అట్టి ఈ చిత్తమును → **గుహ్యమ్ ఏతత్ సనాతనమ్।** పరమ రహస్యము, సనాతనము అగు - ఆత్మవైపే ఎక్కుపెట్టబడి, నడుపబడిందా..., ***అప్పుడు ఈ చిత్తము సనాతనమగు ఆత్మరూపము సంతరించుకోగలదు। అత్ర అస్య న సందేహః॥***

చిత్తము నిర్మలమౌతూ ఉండగా క్రమంగా శుభ-అశుభ కర్మల ద్వంద్వ మోహ వ్యవహారములు నశించుచూ రాగలవు. అట్టి నిర్మలచిత్తము సులభముగా ఆత్మయందు స్థితి పొందగలదు. ఆత్మయందు స్థితింపబడిన చిత్తము అవ్యయమగు ఆనందమును పొందగలదు.

ఈ చిత్తము ఎదురుగా కనిపిస్తున్న విషయములవైపుగా ఏరీతిగా ప్రసరిస్తూ ఉంటోందో, అదే రీతిగా ఇది బ్రహ్మము వైపుగా ప్రసరించటం ప్రారంభించిందనుకో, → ఇక అట్టివాడు (విషయములు ఏమాత్రము బంధము కాబట్టి) **బంధ విముక్తుడు ఎందుకుకాడు?** తప్పక అవుతాడు! శుద్ధమనస్సు స్వయముగా బంధముక్తి పొందగలదు.

## మనో ద్వివిధం ప్రోక్తమ్

ఈ మనస్సు రెండు విధములుగా ఉండటం జరుగుతోంది. (1) శుద్ధము (2) అశుద్ధము.

| | | |
|---|---|---|
| అశుద్ధమ్ | → | **కామ సంకల్పమ్!** |
| శుద్ధమ్ | → | **కామ వివర్జితమ్!** |

అందుచే ఓ వాలఖిల్యాది మునులారా! **"ఈ మనస్సు ఎందుకు అశుద్ధముగా అగుచున్నది?"..** అను విషయము ఎవరికివారే జాగ్రత్తగా గమనించాలి. అందుకు ముఖ్యంగా రెండు మూలకారణాలు చెప్పబడుచున్నాయి.

- క్రీడ చూస్తున్నవాడు ఆ క్రీడ (Game eg. Football, Cricket etc.,) లోని సంఘటనలలో లీనమై ఉత్సాహ-నిరుత్సాహములు పొందుచూ, చిట్టచివరకు అలసిపోయి నిస్తేజమై పోతాడు చూచారా? అదే రీతిగా ఈ మనస్సు దృశ్య విషయములు-సంగతి సందర్భ సంఘటనలలో అనుక్షణము పాల్గొనుచూ దుర్బలమైపోతోంది. క్రమంగా బుద్ధి - చిత్తములను కూడా అవివేకముచే నింపి ఉంచుతోంది.

**<u>ఆత్మయే సనాతన (ఆది) స్వరూపముగా గల ఈ జీవుడు</u>** →

- వినోదముగా దృశ్యమును కల్పించుకొని,
- క్రమంగా ఇష్టాయిష్టములను పెంపొందించుకొని,

- సుఖ దుఃఖములను స్వీయ నిర్వచనముల ద్వారా నిర్మించుకొని,
- వాటియందు క్రమంగా తానే ప్రవేశించి,
- **"నేను ఇప్పుడు బద్ధుడను! నన్ను ఎవరైనా వచ్చి విముక్తునిగా చేయండి!"**.. అని పలుకుచున్నాడు.

కథ చదువుచూ, అందులో లీనమైనవాడు, అట్టి కథా గమనములోని హర్ష-విషాద కల్పనలను తన అనుభూతులుగా మలచుకొను విధంగా ఈ జీవుడు ఇంద్రియ విషయ రూపమగు దృశ్యములలో మగ్నుడు అగుచున్నాడు. విక్షేపము, 'లయము' అనే మనోదోషములను తనయందు ప్రవృద్ధి చేసుకొంటున్నాడు. (Distraction and Immersing)

***ఈ మనస్సు క్షణమొక విధంగా ఉంటోంది. ఇష్టమైనవారితో ఒకతీరుగా, అయిష్టమైనవారితో మరొక తీరుగా। తనకొక నీతి మరొకరికి మరొకటి. ఎదుటివారి గుణములను ఎంచటం! తన తప్పులు గమనించకయే పోవటము - ఈ రీతిగా ఏకాగ్రతయే ఉండటం లేదు. ఇంకెక్కడి అప్రమేయ - స్వస్వరూపానుభవం?***

ఎప్పుడైతే తన యొక్క భూతాత్మత్వమును స్వధర్మోపాసనాభావముల చేతను, భక్తి-జ్ఞాన-వైరాగ్యములచేతను, యోగాభ్యాసము మొ॥వాటి చేతను (1) మనో మల-విక్షేపరహితము, (2) బుద్ధి సునిశ్చలము - చేస్తూ ఉంటాడో, ఇకప్పుడు **అమనీభావము** (లేక) **నిర్మలభావము** (లేక) **దృశ్యాతీత భావము** సంతరించుకొంటూ, ఆ యోగి **పరమపద స్థానము** చేరుచున్నాడు.

ఎంతెంతవరకైతే హృదయములో అనేకత్వరూపమైన ఇంద్రియార్థ వ్యవహార విశేషాలు క్షయిస్తూ ఉంటాయో, అంతంత వరకు **ఏకము-అఖండము** అగు **ఆత్మభావన** పెంపొందుతూ వస్తుంది. **ఇదియే జ్ఞానము. ఇదియే మోక్షము - ఏతత్ జ్ఞానంచ మోక్షంచ।**

ఇక తదితర సమాచారమంతా - ఈ విషయముయొక్క గ్రంథ విస్తరణయే! **శేషాస్తు గ్రంథవిస్తరాః!**

సమ + అధి → సమత్వము యొక్క సముపార్జనము.

సమాధి = తన ఆత్మను సర్వ జీవజాలమునందు, సర్వ జీవజాలమును తన ఆత్మయందు స్వాభావిక సందర్శనము. (Seeing All-pervading, All-equal Divinity in all beings and adoring)

సమాధి యొక్క అభ్యాసముచే చిత్తము యొక్క మలములు (దోషములు) తొలగిపోవుచుండగా, అట్టి చిత్తము **ఆత్మనివేదనము** పొందుచున్నది. ఆత్మత్వమునకు అర్పితమగుచూ వస్తుంది. అట్టి ఆత్మ సమర్పితమైన నిర్మలచిత్తము వలన ఎట్టి సుఖానుభావము కలుగుతుందో, అది అనుభవైకవేద్యము మాత్రమే! మాటలతో మనము వర్ణించి చెప్పుకోగలిగినది కాదు! నిర్మలమైన చిత్తము ప్రసాదించగల సుఖము నిర్మలాంతః కరణునకే అర్థం కాగలదు! నిర్మలాంతకరణమునకే నిర్మల చిత్తప్రభావమగు ఆత్మసుఖము యొక్క ఔన్నత్యము, సౌందర్యము అవగాహనం అవుతోంది.

→ నీరు నీటిలోను,

→ అగ్ని అగ్నిలోను,

→ ఆకాశము ఆకాశములోను

కలిసిపోయినప్పుడు ఏ విధంగా భేదము, ఇక కనబడదో,....

ఆరీతిగా <u>**"ఆత్మ దృష్టి"**</u> (లేక) విషయములు అంతర్హితమైనప్పటి <u>**"అంతర్గత చిత్తము"**</u> (బాహ్య విషయముల నుండి మరలి) - **పరమ పురుషునియందు** (ఆత్మయందు) **అభేదము సంతరించుకోగలదు.**

-----

**వాలఖిల్యాది మునులు :** స్వతఃగా ఆత్మస్వరూపుడే అగు ఈ భూతాత్మకు (లేక జీవునికి) అసలు దేనివలన ఎందుచేత 'బంధము' అనునది కలుగటం, 'మోక్షము' అనేది ఆవస్యకమవటం జరుగుతోంది?

**ప్రజాపతి :** ఆత్మకు ఎప్పుడూ బంధము లేదు. అది నిత్యస్వాతంత్ర్య స్వరూపము. ఇక దేహము విషయానికి వస్తే.. ఇది స్వతఃగా జడము. జడమైన వస్తువుకు బంధమేమిటి? మోక్షమేమిటి? అందుచేత...,

**మం॥ శ్లో॥ మన ఏవ మనుష్యాణాం కారణం బంధ-మోక్షయోః ।**
**బంధాయ విషయాసక్తమ్। ముక్తైః నిర్విషయమ్ స్మృతమ్॥**

ఎవ్వరికైనా కూడా..., మనస్సే బంధము! మనస్సే మోక్షము! **మనస్సు అనగా? దృశ్యము గురించిన మననము యొక్క ఘనీభూతరూపమే మనస్సు. ఇంతకుమించి మనస్సుకు వేరే రూపమేదీ లేదు.**

మనస్సు విషయాసక్తి సహితమై ఉండటమే **బంధము.** విషయాసక్తి రహితమై ఉంటే,... అదియే **మోక్షము.**

ఇప్పుడిక మీకు ఒక మహనీయుని తత్త్వానుభవ గానమును వినిపిస్తున్నాను.

*కౌత్సాయని స్తుతి - గురువుచే స్తోత్రము! (గురువు శిష్యుని ఉద్దేశించి స్వస్వరూప బోధనకై వినిపిస్తున్న "తత్త్వమసి" స్తుతి.)*

ఓ ప్రియ మిత్రమా! శిష్య భగవన్! "ఆత్మ" అను మహత్తర విశేషము గురించి చెపుతున్నాను విను.

**నీవే ఆత్మ స్వరూపుడవయ్యా! తత్త్వమసి!**

*మంత్రము -* **త్వం బ్రహ్మా। త్వం చ వై విష్ణుః। త్వం రుద్రః। త్వం ప్రజాపతిః।**
**త్వం అగ్నిః వరుణో వాయుః। త్వం ఇంద్రః। త్వం నిశాకరః।**
**త్వం మనుః। త్వం యమశ్చ। త్వం పృథివీ। త్వం అథ అచ్యుతః।**

నీవే బ్రహ్మదేవుడవు. నీవే విష్ణువువు! నీవే రుద్రుడవు! నీవే ప్రజాపతివి! అగ్నివి। వరుణుడవు! వాయువువు! ఇంద్రుడవు! చంద్రుడవు! మనువువు! పృథివివి! అచ్యుతుడవు కూడా। నీవే **బ్రహ్మము**వు. ఉన్న సత్యము ఇదే!

**స్వార్థే స్వాభావిక అర్థే చ బహుధా తిష్ఠసే దివి।** నీ వినోదము కొరకై నీ స్వభావమును ప్రేరేపించి నీకు నీవే ఇంద్రియార్థములను కల్పించుకొని, ద్రష్ట-దృశ్యము-ద్రష్టత్వములను కల్పించుకొంటున్నావయ్యా! నిర్విషయాకాశములో విషయ సృష్టి రూపమున నీకు కనిపిస్తున్నది నీ యొక్క స్వయంకృత కల్పనయే! ఇదంతా నీవే కూడా! నీలోనే సర్వము ఉన్నది. నీవు కానిది ఏదీ లేదు. ఓ పరమాత్మా! ఇదంతా నీ దివ్యరూపమే!

*మంత్రము -* **విశ్వేశ్వర నమస్తుభ్యం। విశ్వాత్మా। విశ్వకర్మ కృత్।**
**విశ్వభుగ్ విశ్వమాయాస్త్వం, విశ్వక్రీడా రతి ప్రభుః॥**

విశ్వమునకు ఈశ్వరుడవగు నీ ఆత్మ స్వరూపమునకు నమస్కరిస్తున్నాను! నీవు ఈ విశ్వమునకు ఆత్మవు! **విశ్వాత్ముడవు!** ఈ విశ్వమును నిర్మించే విశ్వకర్మవు (Engineer and Architect of the universe)! **విశ్వకర్మ కృత్!** ఈ విశ్వము యొక్క ఆస్వాదుడవు (Enjoyer of this creation for which you yourself are the worker of the universe)! **విశ్వభుక్!**

ఈ విశ్వమనునది నీ యొక్క మాయయే! **విశ్వమాయాః త్వమ్!** ఈ విశ్వము అనే క్రీడారతికి ప్రభువువు నీవే!

*మంత్రము -* **నమశ్శాంతాత్మనే తుభ్యం। నమో గుహ్య తమాయ చ।**
**అచింత్యాయ। అప్రమేయాయ। అనాది నిధనాయ చ। ఇతి॥**

శాంతాతత్మ స్వరూపుడవగు నీకు నమస్కరిస్తున్నాను!

రహస్యములకెల్ల రహస్యమైనట్టి నీకు.. **నమో నమః!**

అచింత్యుడవు! దేనికీ సంబంధించినవాడవు! అప్రమేయుడవు! ఆద్యంత రహితడవు! సర్వమునకు స్థానమైన ఆత్మస్వరూపుడవు! నమస్తే! తే నమః! నమో నమః! ఓ పరమాత్మా! పరంధామా! పరమేశ్వరా! 'శిష్యుడు'గా నా దగ్గిరకు వచ్చి సంభాషిస్తున్న పరతత్త్వమా! నీకు నమస్కారము.

## త్రిగుణ-ఆవిర్భావము

**వాలఖిల్యాది మునులు:** స్వామీ! సద్గురూ! ప్రజాపతీ! ఈ సత్య-రజో-తమోగుణ విశేషముల గురించి మాకు వివరించి చెప్పమని ప్రార్థన!

**ప్రజాపతి :** అన్నిటికీ ఆత్మయే-**ప్రప్రథమము, తదనంతరము, వర్తమానము, భవిష్యత్-అనునిత్య సత్యము-కూడా అయి ఉన్నది.**

అట్టి ఆత్మను ఆత్మయొక్క స్వకీయ కల్పిత గుణములు ఆశ్రయించటం జరుగుతోంది. ఇద్దాని గురించిన కొన్ని విశేషాలు వినండి!

మొట్టమొదట **తమము** మాత్రమే ఉండినది. (మొదటగా విషయములేవీ లేవు కాబట్టి, అట్టి **"స్వస్వరూపకేవలము"**ను **"తమము"** అని అంటున్నారు).

అది ఏకమై ఉండిఉన్నది. అట్టి **తమము** ఒకప్పుడు అద్దానికి వేరైన (స్వరూపముగా వేరై, స్వభావముగా వేరుకానట్టి) దానిచే ప్రేరేపణ (Inspiration) పొందినదై **'విషయత్వము'**ను పొందటం జరుగుచున్నది! అట్టి "ప్రేరేపణ" (Inspiration, Inclination) యే **'రజము'**.

ప్రేరేపించబడునది → **తమము**
ప్రేరేపించుచున్నట్టిది → **రజము**

తమము ప్రేరేపించబడి రజముగా విషయ రూపముగా అగుచున్నది. రెండూ కూడా ఆత్మయొక్క చమత్కార విశేషములే.

ఆ తమము మరొకప్పుడు సాత్త్వికము (Positiveness)చే ప్రేరేపించబడటం చేత 'సత్త్వము' రూపమును దాల్చుచున్నది.

తమము – రజముచే → రజోరూపము,
సత్త్వముచే → సత్వరూపము – దాల్చుచున్నది.

ఇది ఇలా ఉండగా..., **తత్ సత్త్వమేవ ఈరితం తతో 'రసః' సంప్రా స్రవత్సో అంశో–అయం–యత్ చేతన మాత్రతః।** ఆత్మయందు ఆత్మకు అభిన్నమైనట్టి, చేతన రూపము (A form of Inclination) –ఆత్మయొక్క రసస్వరూపమగు అంశగా బయల్వెడలుతోంది.

ఆ చేతన రూపము యొక్క అంశయే సర్వదేహములలో 'క్షేత్రజ్ఞుడు'గా **– అంశోఽయమ్ యత్ చేతన మాత్రః, ప్రతిపూరుషమ్ క్షేత్రజ్ఞం॰, సంకల్ప అధ్యవసాయ మాత్ర లింగః। – "సంకల్పనము– అనుభూతి – ప్రయత్నము"** ల రూపాలుగా వేంచేసిఉన్నది. ఆత్మయే ఈ రీతిగా 'ప్రజాపతి' అని చెప్పబడుచున్నది. ఆ ప్రజాపతి యొక్క శ్రేష్ఠమైన శరీరమే బ్రహ్మ–విష్ణు–రుద్ర రూపములుగా (సృష్టి – స్థితి – లయ అభిమానములుగా) మొట్టమొదట ప్రదర్శితమగుచున్నది.

- ఆత్మ యొక్క (పరమ పురుషుని యొక్క) – రాజస అంశమే **బ్రహ్మ।**
- తామసాంశయే **రుద్రుడు।**
- సాత్త్వికాంశయే **విష్ణువు।**

ఆత్మ సర్వదా ఏకమే। ఆత్మ 'అన్యము', 'అనేకము' అయ్యే ప్రసక్తియే లేదు. అట్లు అయిఉండియే...,

- త్రివిధములుగాను (సత్త్వ–రజో–తమోగుణ రూపములుగాను, త్రిమూర్తులుగాను),
- ఏకాదశముగాను (ఏకాదశ రుద్ర తత్త్వములుగాను), [ పౌరాణికంగా బ్రహ్మమానస పుత్రులు (1) అజుడు, (2) ఏకపాదుడు (3) అహిర్బుధ్న్యుడు (4) హరుడు (5) శంభుడు (6) త్ర్యంబకుడు (7) అపరాజితుడు (8) ఈశానుడు (9) త్రిభువనుడు (10) త్వష్ట (11) రుద్రుడు ].
  (విష్ణు భగవానుని ద్వాదశధారణలు – భాగవతము)
- ద్వాదశముగాను (ద్వాదశ ఆదిత్యులుగాను),

[ (1) చైత్రమాసమున – **<u>ధాత</u>** (2) వైశాఖ మాసమున – **<u>అర్యముడు</u>** (3) జ్యేష్ఠమాసమున – మిత్రుడు (4) ఆషాఢమాసమును – **<u>వరుణుడు</u>** (5) శ్రావణమాసమున – **<u>ఇంద్రుడు</u>** (6) భాద్రపదమాసమున – **<u>వివస్వంతుడు</u>** (7) ఆశ్వయుజమాసమున – **<u>త్వష్ట</u>** (8) కార్తీకమాసమున – **<u>విష్ణువు</u>** (9) మార్గశిరమాసమున – **<u>తర్యముడు</u>** (10) పుష్యమాసమున – **<u>భగుడు</u>** (11) మాఘమాసమున – **<u>పూషుడు</u>** (12) ఫాల్గుణమాసమున – **<u>క్రతువు</u>** ].

(ఏకాదశ రుద్ర ద్వాదశాత్యుల గురించిన కొన్ని పౌరాణిక విశేషాలు (పేజి 61, 62లో ఇవ్వబడినవి). ఆత్మ అపరిమిత రూపములుగా ఉద్భూతము పొందినదై (రూపములను దాల్చినదై),

- **సర్వభూతజాలములందును,**
- **సర్వభూతజాలములుగాను –**

ఉద్భూతత్వముచే చరించుచున్నది. **ఈ విధంగా సర్వభూతజాలములకు అధిపతి ఆత్మయే!**

ఆత్మభగవానుడే సమస్త జీవులకు 'అంతర్యామి' అయి....

- ఈ సృష్టి రూపముగాను,

- సృష్టిలోని ప్రతిజీవుని యొక్క అంతర్ - బహిశ్చ రూపము గాను →

పరివేష్ఠించియున్నారు. ప్రకాశించుచున్నారు. **ఆసావత్ ఆత్మా అంతరశ్చ। బహిశ్చ।**

## పఞ్చమః ప్రపాఠకః - ఇదగ్ం సర్వం 'ఓం'కారమేవ।

సమస్తమునకు 'పరము', సమస్తమునకు 'ఆది' (That which, the 'Beyond' aswell as the 'Begining') అయినట్టి పరతత్త్వము-సమస్త దేహములలో **రెండు** విధములైన రూపములను ధరించి ఈ దేహములను భరించచు, ధారణ చేయుచున్నది.

(1) ప్రాణశక్తి (2) అసావదాత్యుడు

ఈ రెండు కూడా మరల ఐదు విధములుగా (పంచ ప్రాణములుగా) అగుచున్నది.

- పగలు-రాత్రి → ఆదిత్యుని బహిరాత్మ-అంతరాత్మలు.

ప్రాణము అంతరాత్మ. అద్దాని 'గతి' బహిరాత్మ.

ఆకాశసూర్యుని-చీకటి-వెలుగుల వలె భూతాత్మ యొక్క అంతరంగము-బాహ్య రూపములుగా ఆదిత్యుడు రూపుదాల్చుచున్నాడు.

అంతరాత్మ తన యొక్క అంతరాత్మత్వము నుండి ప్రాణస్వరూపముగా బయల్వెడలి **ఇంద్రియజగత్ రూపమును తన యొక్క బహిరాత్మ స్వరూపముగా (ఈ విశ్వమును) ఆస్వాదించుచున్నది.** ఈ **"దృశ్యము"** → (1) ద్రష్ట యొక్క (2) దృక్ (Witness) స్వరూపుని యొక్క → **స్వయంకృత కల్పనలే!**

ఆత్మ → 'సాక్షి' (లేక) దృక్ స్వరూపి అయి, తన యొక్క ప్రాణశక్తి ప్రభావము చేత తన అంతరంగమున (లేక) స్వహృదయమున తానే బాహ్య రూపమువలె జాగ్రత్-స్వప్న-సుషుప్తులుగా కల్పన చేసుకొనుచున్నది. వాటికి ద్రష్ట అగుచున్నది. తానే వేడుకగా, వాటి యందు అనుభవపరంపరలను కల్పించుకొనుచున్నది. తానే వాటియందు (స్వప్న ద్రష్ట స్వప్నమునందు వలె) చిక్కుకొని ఉంటున్నది. **"నేను బద్ధుడను! నా దుఃఖాలు పోయేదెట్లా?"** అని దిగులుపడుచున్నది.

అనగా...,

ఈ జీవుడు ఆత్మ స్థితి నుండి స్వయంకృతకల్పనలో బాహ్యగతిని అనుభవిస్తున్నాడు.

ఆత్మయే ఆత్మయందు ఆత్మలో, "ఆత్మరూప వివిధ కల్పనలు" చేసుకొని ఆత్మతో ఆస్వాదిస్తోంది.

ఇదంతా ఇట్లా జరుగుచుండగా..,

**మం॥శ్లో॥** - **యః కశ్చిత్ విద్వాన్ అపహత పాప్మా, అధ్యక్షో అవదాత మనాః తన్నిష్ఠ,**
**ఆవృత్త చక్షుః - సో అంతరాత్మా ఆగత్య బహిరాత్మనో అనుమీయతే॥**

ఈ అనేక భూతాత్మలలో ఒకానొకడు ఆత్మ గురించి జ్ఞానము కొరకై జ్ఞాన తపస్సు ఆశ్రయిస్తున్నాడు. **"ఇదంతా ఏమై ఉన్నది?"..** అనే ప్రశ్నకు ఉత్తమబుద్ధితో పరిశీలించనారంభిస్తున్నాడు.

శాస్త్రములు ప్రవచిస్తున్న **భక్తియోగ-క్రియా యోగ- సర్వసమర్పణయోగ-కర్మయోగ-జ్ఞాన యోగ** సాధనల ద్వారా బుద్ధిని సునిశితము, నిశ్చలము, విస్తారము, నిర్మలము చేసుకొంటూ **"వివేకి, విజ్ఞాని, పండితుడు, విద్వాంసుడు"** అగుచున్నాడు. అట్టి విద్వాంసుడు క్రమంగా మనోగతమైన పాపదృష్టులను తొలగించుకొన నారంభిస్తున్నాడు.

**"జాగ్రత్-స్వప్న-సుషుప్తులలో నేను చిక్కుకోవటం లేదు. వాస్తవానికి అవి నా అధ్యక్షతలో నాయందు రూపుదిద్దుకొని, నా సంకల్పానుసారం ప్రవర్తిస్తూ, నా యందే లయిస్తున్నాయి** - అని గమనించుచున్నాడు.

**"నేను ప్రకృతికి బద్ధుడనుకాదు. ప్రకృతియే స్వీయ సంకల్పానుసారము నా నుండి నా యందే బయల్వెడలుచున్నదగుచున్నది"** .. అను అవగాహనను, భావమును, బుద్ధిని సునిశ్చితము చేసుకోసాగుచున్నాడు.

- ఆత్మయందే – **తన్నిష్ఠః** – నిష్ఠను కలిగి ఉండి, క్రమంగా ఎదురుగా కనబడే దృశ్యమును ఆత్మభావనచే, ఆత్మకు అభిన్నమైనదిగా దర్శించటం అభ్యాసం చేయసాగుచున్నాడు.

**ఆ వృత్త చక్షుః, సో అంతరాత్మా ఆగత్య..., బహిరాత్మనో అనుమీయతే!** దృష్టిని మనోబుద్ధిచిత్త అహంకారముల నుండి మరల్చుచున్నాడు. **"తనలోను, సర్వులలోను ఆత్మను, ఆత్మయే తానుగాను, సర్వులు గాను"** దర్శించే దృష్టిని ప్రవృద్ధము చేసుకుంటున్నాడు. బహిరాత్మత్వమును త్యజించివేస్తున్నాడు. **"నాకు బాహ్యమనేది ఏదీ లేదు. ఈ సర్వము మమాత్మ స్వరూపమునకు అభిన్నము"**... అనునది సునిశ్చితము చేసుకుంటున్నాడు. **"ఇదంతా నా అనుమతి చేతనే ఈ రూపమగు కల్పనగా ఏర్పడుచున్నది"** – అనురూపముగా స్వీయ స్వాతంత్ర్యమును గమనిస్తున్నాడు.

- **స్థితి:** ఇది ఆత్మ యొక్క 'స్థితి'!
- **గతి:** ప్రకృతి, దేహమనోబుద్ధి చిత్త అహంకారములు, దృశ్య జగత్తు ఇవన్నీ జలంలోని తరంగాల వలె ఆత్మయందలి, ఆత్మకు అభిన్నమైన **'గతి'**!...

**అనునది సునిశ్చలముగా అవధరించుచున్నాడు!**

ఈ విధమై స్వయత్నముతో అంతరముననే వేంచేసియున్న అంతరాదిత్యుడు, హిరణ్మయ పురుషుడు అగు ఆత్మ యొక్క సాక్షాత్కారమును సిద్ధింపజేసుకొంటున్నాడు. ఆత్మ సందర్శనము చేయనారంభిస్తున్నాడు. హృదయసరోవరములోని సహస్రదళ (కిరణ) ప్రకాశమానమగు ఆత్మ పద్మమును ఆశ్రయించినవాడై **"అన్నమ్ బ్రహ్మ-అహమ్ బ్రహ్మ-భోక్తా చ బ్రహ్మ"** అను

→ ఇంద్రియాహార రూపమగు పంచేంద్రియార్థ ఆహారమును (ప్రకృతిని) ఆత్మయొక్క ఆహారముగా, ఆహార్యముగా దర్శించటం)

→ 'అహమ్ బ్రహ్మ'।

→ సర్వులు బ్రహ్మమే (తత్త్వమ్)॥

– అను స్వస్థానమును చేరుచున్నాడు. **అన్నమత్తి.** బ్రహ్మమే తానై బ్రహ్మత్వము సముపార్జించుకుంటున్నాడు. సర్వము నిత్య-నూతన హృదయాంతర్గతముగా **అన్నమ్- (బ్రహ్మము)**గా ఆస్వాదిస్తున్నాడు.

నాయనలారా! ఈ కనబడేదంతా ఆత్మయే. ఆత్మకు భిన్నంగా ఎక్కడా ఏదీ లేదు. ఇదంతా ఉన్నది మీయొక్క హృదయ పుష్కరము (తీర్థప్రదేశము) నందే। హృదయపట్టణమునందే।

మీ హృదయాకాశములో ప్రకాశిస్తున్న **"ఆత్మపద్మ"** పుష్పకాంతి వీచికలే ఈ దృశ్యాంతర్గతమైన సర్వముగా, మీరుగా, నేనుగా, సర్వులుగా వెలుగొందుచున్నాయి. అట్టి పరాత్పర స్వరూపమగు **ఇహపరాత్మ**యే...,

→ "అగ్ని" – రూపముగాను,

→ ఆకాశములో సంచరించే "సూర్యుడు" – రూపముగాను,

→ "ఆకాశము" రూపముగాను, వేంచేసి ఉన్నది. అంతేకాకుండా,

ఇక్కడి తూర్పు-పడమర-ఉత్తరము-దక్షిణము, ఆయా **"దిక్కులుగా-దిక్కులలో"** మనకు కనిపిస్తున్నదంతా ఆత్మస్వరూపమే। ఆత్మ చమత్కారమే! ఆత్మ విన్యాసమే! ఉపదిశలగు ఆగ్నేయము, నైరృతి, వాయువ్యము, ఈశాన్యము.. అంతా ఆత్మ రూపమే!

– అగ్ని ఏ శక్తి చేత ప్రజ్వలించబడుతోందో ... అది ఆత్మయొక్క కళావిన్యాసమే!

ప్రాణము – ప్రాణేశ్వరుడు (ఆదిత్యుడు) కూడా ఆత్మయే! ఆత్మయే ప్రాణరూపంగా సర్వదేహాలలో వేంచేసియున్నది.

**– 'ఓం' అను అక్షరము, వ్యాహృతి (వచనము, పలుకు).**

**– గాయ[త్రీ-సావి[త్రీ-సరస్వతి (గాయత్ రతి ఇతి, సత్-విత్ రతి ఇతి, సత్-రసవతి-ఇతి)**

... ఇవన్నీ ఆత్మయే!

ఆత్మ సర్వదా సర్వమునకు అనన్యముకదా! అందుచేత ఏదేది మీకు అన్యముగా అగుపిస్తోందో,... అదంతా మీకు 'అనన్యము' అయి అనుభూతమగు గాక । – **ఇతి మంగళశాసనమ్।।**

**ద్వేవావ [బహ్మణోరూపే –**

[బహ్మము రెండు రూపములుగా విన్యాసము సలుపుతోంది।

(1) మూర్తము (సాకారము) (form) (2) అమూర్తము (నిరాకారము) (formless)

**అథ యత్ మూర్తమ్, తత్ అసత్యమ్।**
**యత్ అమూర్తమ్, తత్ సత్యమ్। తత్ [బహ్మ।**

- ఏది మూర్తమో (With Form), అది మనోకల్పనచే పొందబడేది మా[తమే. స్వీయ ఊహ జోడించగా అనుభవమయ్యేది. కనుక నామ-రూపాలు సత్యము కాదు. **అసత్యము.** వ్యవహారరీత్యా (Contextually, Relatively) ఉన్నట్లు కనిపిస్తూనే, – సహజముగా ఆత్మకు భేదమై లేదు. లేనేలేదు.
- ఏది అమూర్తమో, నిరాకారమో అది **సత్యము.** దేహానికి ఆకారము ఉన్నది? 'దేహి'కి ఆకారమేమున్నది? (one who is using the physical body is formless. The user is always true). (That which is appearing with Form - is a mind illusion).
- ఏది సత్యమో అదియే **[బహ్మము.**
- ఏది [బహ్మమో అది తేజోరూపము. **జ్యోతిస్వరూపము.**
- ఏది జ్యోతి (తేజో) స్వరూపమో అదియే ఆదిత్యుడు (**ఆది** = that which is existant at the basic begining i.e., even before thoughts and bodies started taking form).
- ఏది ఆదిత్యుడో అదియే 'ఓం' కారము యొక్క అర్థము, తాత్పర్యము కూడా!
- ఏది ఓంకారమో అదియే 'ఆత్మ'!
- ఏది ఆత్మయో – అదియే "నీవు". నీవైన ఆత్మయే "నేను"।

అట్టి ఆత్మ [తివిధ రూపములగు జా[గత్-స్వప్న-సుషుప్తులను, తదంతర్గత జగత్తులను ధారణ చేస్తోంది! ధరిస్తోంది। **అ+ఉ+మ= 'ఓం'కారము.** (1) (అ = కేవలమగు 'నేను'. (2) ఉ = అనుభవరూపముగా ఉన్న 'నేను'. (3) మ = "అనుభవి" రూపమైయున్న 'నేను'. (4) అర్థమా[త = సమస్తము అగుచు, సమస్తమునకు వేరై ఉన్న "నేను"।)

ఈ సర్వము ఆత్మయే! ఆత్మస్వరూపమే!

బంగారపు ఉంగరములో బంగారముగా ఉన్నది, ఉంగరము (ఆభరణము)గా ఉన్నది... రెండూ కూడా బంగారులోహమే కదా! బంగారమే ఉంగరము ఓతము (Made up of) - [పోతము (Made as) కదా!

అట్లాగే..,

**ఓంకార సంజ్ఞార్థమగు మనందరియొక్క అఖండమగు ఆత్మయే, [బహ్మమే, జ్యోతి స్వరూపమే – సత్యము**. బాహ్య అంతరంగములలో ఈ సర్వము నందు ఓతము (Made up of) –[పోతము (Made as)గా ఉన్నది ఆత్మయే అని గమనించండి!

***ఆత్మయే నిత్యము. సత్యమైనది మా[తమే నిత్యము. మిగతాదో? అనిత్యము। అసత్యము। (న తు సత్యమిహ అణ్వపి)***

-----

అట్టి ఆత్మను 'ఓం' అను శబ్దోచ్చారణచే ధ్యానించండి!

ఓంకార ధ్యానముచే ఆత్మయే పొందబడగలదు. **"నేను సహజముగా ఆత్మస్వరూపుడను"** అనబడునది ఆస్వాదించబడగలదు!

ఇదియే తత్త్వ సారము! తత్త్వశాస్త్రప్రవచనము. వేదమహావాక్యార్థము కూడా.

ఇదియే మరొక విధముగా ఇట్లా చెప్పబడింది–

- ఏది నాదమో (లేక) ఉద్గీథమో (స్వరమో ఉంcccc) అదియే ప్రణవము.
- ఏది ప్రణవమో అదియే స్వరము (నాదము)/ఉద్గీథము.

  (గీథ = పాట "సంగీతము". ఉద్గీథము = సామవేదవిభాగము, ప్రణవము, శబ్దార్థములతో కూడిన ప్రదర్శనము).
- అదియే ఆసావాదిత్యుడు (ప్రశంశనీయుడైనట్టి ఆదిత్యుడు). ఆది స్వస్వరూపుడు. స్వర్వరూపుడు.
- ఏది ఆదిత్యుడో ఆతడే ప్రణవము, నాదము, ఉద్గీథము.
- ఆ ప్రణవాత్మకుని ప్రణీతమే (The song of self)యే నామరూపాత్మకమైన ఇదంతా కూడా!
- అట్టి ఆదిత్యుడు (లేక) ఆది పురుషుడు (లేక) స్వస్వరూపాత్మ →

  **విగత నిద్రం!** → నిద్రారహితము (Ever Awakened).

  **విజరం!** → జన్మ–వార్ధక్యాదులు లేనిది.

  **అవిమృత్యుమ్!** → మృత్యువుకు అవిషయము.

ఆత్మపురుషుడే పంచవిధములుగా (దేహ–మనో–బుద్ధి–చిత్త–అహంకారాలుగా), (దృశ్యము – దేహము – ప్రాణము – జీవాత్మ–ఈశ్వరుడు) తెలియబడుచున్నాడు. ఇవన్నీ ఆత్మపురుషుని వివిధ రూపములుగా తెలుసుకొనబడును గాక!

ఆత్మయే ఊర్ధ్వమూలమ్! సర్వమునకు మూలము (Basis).

బ్రహ్మము అనే ఆ ఆత్మ యొక్క శాఖలు → ఆకాశము, వాయువు, అగ్ని, ఉదకము, భూమి. **ఏకమగు బ్రహ్మమే అనేకముగా రూపములు దాల్చుచున్నది.**

ఆ 'ఓం' కారామే ఆదిత్యస్వరూపము, అక్షరము. అనేకముగా కనిపిస్తూ ఏకరూపమై ఉన్నట్టిది. ఆత్మజ్ఞులకు ఏకముగానే అనిపిస్తూ ఉన్నట్టిది.

అట్టి 'ఓం' లేక ఆదిపురుషునే ధ్యానము చేయాలి.

సర్వము ఓంకారరూపముగా భావన చేయాలి. ఉపాసించాలి.

**ఏతదేవ అక్షరమ్ పుణ్యమ్।** అట్టి అక్షర పరబ్రహ్మోపాసనచే అన్ని పుణ్యాలు వాటికవే లభిస్తాయి. **ఏతదేవ అక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్యతత్।** బ్రహ్మమును ఉపాసించువాడు ఇచ్ఛగించినది పొందగలడు!

స్వస్వరూపమే ఓంకారము. స్వదేహము 'ఓం'కారమును భజించు మందిరము.

- ఈ స్త్రీ, పురుష, నపుంసక, స్థాణు, రూపాలన్నీ ఓంకార స్వరూపమే.
- **భాసతే ఇతి భాస్కరః!** ఈ అగ్ని–వాయు–సూర్యుడు రూపముగా భాసిస్తున్నది ఆది పురుషుడే. ఓంకారమే. ఆత్మపురుషుడే భాస్కరుడు.
- బ్రహ్మ–విష్ణు–రుద్రరూపములకు, తత్త్వములకు అధిపతి – **ఓంకారమే।**
- అద్దాని ముఖములే గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని మొ॥వి.
- ఋక్–సామ–యజుర్వేదములు వల్లిస్తున్నది, గానము చేస్తున్నది – ఓంకారమునే। (లేక) ఆత్మనే।
- ఆత్మయే **'లోకవతి'** అయి భూ–భువర్–సువర్ ఇత్యాది లోకరూపముల రూపముగా అనుభూతమగుచున్నది.

ఆత్మయే **కాలరూపమున** – భూత, వర్తమాన, భవిష్యత్ రూపముగా సంప్రదర్శనమగుచున్నది.

ఆత్మయే (ఓంకారమే) ప్రాణ-అగ్ని-సూర్య రూపములుగా కనిపిస్తోంది.

ఆత్మ యొక్క ఆప్యాయతయే అన్నము, జలము, చంద్రుని రూపములు.

మనో-బుద్ధి-చిత్త-అహంకారములు వస్తుతః జడములు. అవన్నీ కూడా చేతనముల వలె ప్రవర్తిస్తున్నది-ఆత్మయొక్క చైతన్యత్వము చేతనే!

ఆత్మయే **'ప్రాణవతి'** అయి, ప్రాణ-అపాన-వ్యాన-ఉదాన సమానరూపములుగా సమస్త దేహములను సముత్తేజపరుస్తోంది.

ఈ విధంగా ఏకమగు బ్రహ్మమే.., **ఓంకారము.** ఆత్మయే బ్రహ్మగానము. ఉద్గీథము, రూపవతి. భాసవతి. త్రిమూర్తవతి. అగ్నివతి. వేదవతి. లోకవతి. కాలవతి. ప్రతాపవతి. ఆప్యాయవతి. చేతనవతి. ప్రాణవతి.

**నీ రూపము నా రూపము: సర్వుల సహజరూపము కూడా – బ్రహ్మయే।**

ఆత్మయే ప్రస్తోత (ఋత్విజుడు, వేదగానము చేయువాడు), అర్పితము (గానము, సమర్పించబడునది) కూడా. దేహి, దేహము, దృశ్యము కూడా ఆత్మయే!

***ఇట్లు భావించటమే ఓంకారోపాసన!***

**ఏతద్వై సత్యకామ పరంచ – అపరంచ-యత్ 'ఓం' ఇతి ఏతత్ అక్షరమ్ – ఇతి।**

ఓంకారోపాసకుడగు సత్యకామునకు ఆత్మయే పర-అపరరూపములుగా అనుభూతమగుచున్నది!

ఓంకారమే (ఆత్మయే) అక్షరము! మార్పు-చేర్పులు లేనిది!

తదితరమైనదంతా క్షరము. మార్పు చెందు స్వభావము కలిగి ఉన్నట్టిది. స్వతఃగా ఉన్నది కాదు. కల్పిత సందర్భములకు చెందినది మాత్రమే.

## I. ఓం। భూర్భువస్సువః।

ఆత్మయే ప్రజాపతి. ఆయన సృష్టికి పూర్వమే ఉన్నట్టివారు.

కర్త → కర్మకు మునుముందే ఉండి ఉండాలి కదా!

అట్టి ఆత్మభగవానునికి (ప్రజాపతికి) **"ఏకమగు నేను అనేకమును కల్పించుకొని ఆస్వాదించెదనుగాక!"...** అనే ఉత్సుకత కలిగింది. అప్పుడు తపస్సు చేయనారంభించి (తపనను ఆశ్రయించినవారై) "భూ-భువ-స్సువః"... అని ఉచ్చరించారు (అనువ్యాహరన్). ఆ స్వరమే లోక తనువు. స్వరకర్తయే లోకపతి.

→ లోకపతి ఆత్మయే. ప్రజాపతి కూడా ఆతడే.

→ లోకతనువు – ఆత్మపురుషుని తనువే.

| | | |
|---|---|---|
| స్వర్లోకము | ... | ఆ లోకపురుషుని శిరస్సు. (అనుభవి). |
| భూలోకము | ... | ఆయన పాదములు (అనుభవమగుచున్నది). |
| భువర్లోకము | ... | ఆయన నాభి (అనుభవము, అనుభూతి). |
| ఆదిత్యుడు (సూర్యుడు) | ... | ఆయన చక్షువులు. (అనుభవియొక్క మునుముందే గల **"ఆదిత్య స్వరూపము"**). |
| దేహియే | ... | ఆ పురుషుడు. |
| పంచతన్మాత్రలు | ... | ఆయన దృష్టి సారిస్తున్న ప్రదేశాలు. ఆయన సంచరించే స్థానాలు. (శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములు) |
| సత్యము (సత్‌భావన) | ... | ఆయన దృష్టి. |
| చూపు | ... | ఆయన ఉనికి స్థానము! |

అందుచేత ఆ పరమాత్మను "భూర్భువస్సువః" అను వ్యాహృతి గాయత్రీ మంత్రముయొక్క అంతర్విభాగమై, ప్రాజ్ఞులచే ఉపాసించబడుతోంది!

ఆస్వాదించబడేదంతా **'అన్నమ్'** అను శబ్దముచే ఉద్దేశ్యించబడుతోంది. ఊహ ఊహించువాని రూపమేకదా!

అట్లాగే అన్నమే ప్రజాపతి.

ఆ పరమాత్మను...,

- అన్నమ్ (అనుభవించబడుచున్నదంతా)।
- ప్రజాపతి।
- విశ్వాత్మా।
- విశ్వచక్షుః।

అని ఉపాసించబడుగాక। **తద్వారా ఉపాసించువాడు సర్వము తానే అగుచున్నాడు.**

ఈ కనబడేదంతా ప్రజాపతి యొక్క తనువుగా భావించాలి.

ఈ సర్వమునందు ప్రజాపతి హృదయాంతరంగుడై, తనయందే ఈ సర్వము కలవాడై.., బంగారు ఆభరణములోని బంగారము వలె, అంతర్హితుడై ఉన్నారు.

ఇదంతా ప్రజాపతి (ఆత్మ) యందే ఉన్నది.

ఆత్మయే... ఇద్దాని అంతర్లీన తత్త్వము.
ఆత్మయే... ఇదంతా.

ఈ విధంగా పరమాత్మను ఉపాసించాలి. అప్పుడు ఆ జీవునికి తన పరమాత్మత్వము తనయందే, క్రమంగా నిత్యానుభూతము కాగలదు.

## II. "తత్ సవితుః వరేణ్యమ్"

**– ఇత్యసౌ వా ఆదిత్యః సవా ఏవం ప్రవరణాయ ఆత్మకామేన – ఇత్యాహుః బ్రహ్మవాదినో।**

బ్రహ్మమును నిర్వచించు బ్రహ్మవాదులు **"ఇదంతా స్తోత్రము చేయతగినవాడు, ఆరాధనకు అర్హరులగు ఆ సవితృ పరమాత్మయే"** అని చేతులెత్తి గానం చేస్తున్నారు. (సవితృ = సత్ + విత్ + ఋత్)

- మొట్టమొదటే ఉన్నట్టి ఆదిత్యుడే సవితుడు.
- సత్+విత్. ఉనికి + ఎరుక స్వరూపుడే సవితుడు. (కేవల సత్ – కేవల విత్‌యే ఈ జీవుని సహజ స్వరూపము).
- ఆ సవితృడు, సత్–చిదానందుడు అగు "**ఆత్మదేవుని ఆత్మకామము** (own wish)" చేతనే ఈ జగద్దృశ్యము సంకల్పితమౌతోంది. కవియొక్క కవనము వలె, ఆత్మ యొక్క అనుభూత రూపమే ఇదంతా!
- సవనాత్ సవితా → ప్రజలను కనుచున్నాడు కనుక సవిత!

... అని బ్రహ్మవాదులు నిర్వచిస్తున్నారు.

కనుక,

నిర్వికారము – నిరంజనము అగు ఓంకార స్వరూపుడనగు నేను.....,

- ◆ భూః (సంచారః పదయోః), భువర్ (హృదయ భావనతో) సువర్ (శిరో–బుద్ధి) తో కూడి,
- ◆ ఆత్మకాముడనై,
- ◆ జగదృశ్యమును, ద్వితీయత్వమును,
- ◆ స్వీయానుభూతిగా –

→ ఆస్వాదిస్తున్నాను.....

అను అవగాహనతో వరేణ్యుడగు సవితృ దేవతోపాసన చేయుచుండెదరు గాక।

## III. ధియో యోనః ప్రచోదయాత్

**– ఇతి బుద్ధయోవై ధియస్తాయో అస్మాకం ప్రచోదయాత్ – ఇతి ఆహు బ్రహ్మావాదినో।**

– మా యొక్క బుద్ధిని ప్రబోధపరచుగాక!

– **మమ్ములను ఉత్సాహవంతులుగాను, సాహసవంతులుగాను సంసిద్ధము చేసి, "పరమార్థము" కొరకై సవితృడు (సూర్యుడు)** మా బుద్ధిని ప్రేరేపించునుగాక" – అని ఆత్మ ధ్యానముతో ఉపాసన చేసెదరుగాక।

నః → మా యొక్క (అస్మాకమ్)

ధియో → బుద్ధిని (ధియస్తాయో)

ప్రచోదయాత్ → ప్రేరేపించునుగాక!

ఆ ప్రేరేపణచే మా బుద్ధితో సత్యమును దర్శించటము,

చూచి తెలుసుకోవటం, తెలుసుకొని ప్రవేశించటము,

ప్రవేశించి తదభిన్నంగా, తన్మయముగా అవటం...,

***ఇదియే గాయత్రీ మంత్రము యొక్క పరమార్థమగు ఫలశ్రుతి విభాగము।***

## IV. భర్గోదేవస్య

**అథ 'భర్గ' ఇతియో హ వా అస్మిన్ అదిత్యే నిహితః।**

**అస్మిన్ అక్షిణిచ నిహితః తారకేవ భర్గః।** కంటిలో చూపు రూపమున దాగి ఉన్నవాడే భర్గుడు. 'భర్గోదేవస్య' అనునప్పుడు

– నా కళ్ళచో చూపు (చూచే) శక్తి స్వరూపము – అని ఉపాసించుచున్నాము.

" ఓ కంటిలోని దృష్టి శక్తి స్వరూపుడా! భర్గుడా! భర్గోదేవస్య!" – అని గానము చేయుచున్నాము.

**ఏష భర్గాఖ్యో భా–భిర్గతిః అస్యహి – ఇతి భర్గో!** కనులు – అనే ఉపకరణము నుండి 'చూపు' అనే శక్తి స్వరూపముగా బహిర్గతుడై దృశ్యము నందు గమనము కలవాడు కాబట్టి 'భర్గుడు'... అని గానం చేయబడుచున్నాడు!

**భర్జతి వైష 'భర్గః' ఇతి।** 'దృశ్యము' అను తేజోరూపముగా కనులకు (దృష్టికి) ఎదురుగా కనిపించువాడు కాబట్టి భర్గుడు.

సర్వమును **'ఎరుక'** రూపముగా వెలిగించుచున్నట్టివాడు. కనుక **భర్గుడు.**

అనగా, ఆత్మను..,

→ కనులలో వేంచేసి ఉన్న 'దృక్–చూచువాడు' అనే **కారణరూపంగాను,**

→ 'చూపు' అను రూపముగా బహిర్గతమగుచున్న ప్రేరణ రూపముగాను,

→ 'దృశ్యము' అను **కార్యరూపముగాను,**

ఉపాసించటమే ఆత్మోపాసన! 'భర్గోదేవస్య'.. అని ఉచ్చరించేడప్పుడు – **"చూచువాడుగా, చూపుగా, చూడబడునదిగా ఏర్పడి ఉన్న ఓ భర్గోదేవా!"** అను వర్ణనను మననము చేస్తున్నాము.

ఉపసంహార రూపుడు కూడా అయి ఉండటం చేత భర్గుడే రుద్రుడు కూడా! **"ఇతి రుద్రో, అథ భర్గ ఇతి" బ్రహ్మావాదినః। –** అని బ్రహ్మావాదులు 'భర్గః' శబ్దమును వ్యాఖ్యానిస్తున్నారు!

**భర్గ – ఇతి భాసయతి ఇమాన్ లోకాన్ భర్గః । –** ఈ లోకములన్నిటినీ భాసింపజేయుచుండటము చేత, భావమును, భావార్థములను, దృశ్యమునకు ప్రసాదిస్తూ ఉండటం చేత (బుద్ధి స్వరూపులై దృశ్యమును అనుభవముగా మరల్చుచుండటము చేత) "భర్గుడు".

**భర్గ–ఇతి భాసయితి ఇమాన్ లోకాన్ । –** ఈ లోకములన్నీ భాసింపజేయువాడు – భర్గుడు.

**రంజయతి ఇమాని భూతాని। –** ఈ జీవులందరికీ దృశ్యముగా అనుభూతమగుచు, సర్వులను ఆనందింపజేయటము చేత "భర్గుడు" → **అని కూడా 'భర్గోదేవస్య' అని అంటున్నప్పుడు భావన.**

**గచ్ఛఇతి గచ్ఛాతా ఇమాః ప్రజాః యస్మిన్** → మీరు, నేను, సర్వజీవులు ఎందు నుండి బయల్వెడులుచున్నారో... ఆయనయే భర్గుడు.

**న ఆగచ్ఛతి ఇమాః ప్రజాః** → ఎందులో ఉండి, ఏ మాత్రము వేరుగా అవటం లేదో, బయటకు.. వెళ్లటం లేదో... ఆతడే భర్గుడు.

**భారకత్వాత్ భర్గః** → సర్వమును భరించువాడు కాబట్టి భర్గుడు.

***భర్గుడే సూర్యుడు, ఆదిత్యుడు, పావనుడు సవనుడు కూడా!*** జీవులలో 'నేను' భావన రూపుడుగా ప్రత్యక్షమై ఉన్నవారు–కాబట్టి భర్గుడు.

## సూర్యః

**శత్రూన్ తు సూయమానత్వాత్.. సూర్యః!** సవిత్రు దేవత యొక్క ప్రత్యక్ష రూపమే సూర్యుడు. **'అజ్ఞానము'** అనే దుఃఖ–బంధ భావనాకారకమగు అంతశ్శత్రువును జయింపజేస్తారు కనుక సూర్యుడు.

**ఈ అవగాహనతో కూడిన మనస్సుతో సూర్యోపాసన చేస్తున్నాము.!**

**సవనాత్ సవితా** → సవన–స్వరూపుడు (యజ్ఞ పురుషుడు) అగుటచే సవితుడు. తనకు వేరైనదంతా తానే స్వీయకృతంగా చూస్తున్నారు కనుక సవితుడు!

**ఆదానాత్ ఆదిత్యః** → సర్వమును గ్రహిస్తున్నారు కనుక ఆదిత్యుడు.

**పవనాత్ పావమానో** → సర్వము పవిత్రము చేస్తూ ప్రసరిస్తున్నారు కాబట్టి పావమానుడు.

**అథయో ఆధాయనాత్ ఆదిత్యః** → సర్వమునకు ఆధారము – స్థానము కల్పించువాడు అవటం చేత కూడా ఆదిత్యుడు.

**ఈ రీతిగా గాయత్రీమంత్రార్థము వివరించబడుతోంది. ఇట్టి అవగాహన బుద్ధియందు ప్రేరేపించుకుంటూ సావిత్రీ (సవిత్రు–సత్+విత్+ఋత్) సరస్వతీ (సత్–రసత్) స్వరూప గాయత్రీ మంత్రమును ఉచ్ఛారణతో కూడుకొనిన ఉపాసన నిర్వర్తిస్తూ రాగా, ఆత్మత్వము అనుభూతము కాగలదు.**

❖ ❖ ❖

ఆత్మకు ఆత్మయే వాస్తవానికి మధురము. తదితరమైనదేదీ శాశ్వతంగా మాధుర్యము కాదు! ఆత్మ అమృతస్వరూపము!

ఆత్మయే

చేతా → చేతనాస్వరూపము.

మంతా → మననము చేయువాని స్వస్వరూపము.

గంతా → మననముచే పొందబడునది ఆత్మయే.

స్రష్టా → జగత్ కల్పన నిర్వస్తున్నది ఆత్మయే.

ఆనందయతా → ఆత్మ ఆనంద స్వరూపమై, తన ఆనందము కొరకే స్రష్టా (సృష్టికర్త) ఇత్యాదులుగా అగుచున్నది.

కర్తా → సర్వమునకు కర్త ఆత్మయే.

వక్తా → పలుకులన్నీ పలుకుచున్నది (The speaker behind speach) – **ఆత్మయే.**

రసయితా → జలంలో రుచిలాగా ఈ సర్వమునకు రసస్వరూపము ఆత్మయే.

ఆఘ్రాతా → వాసన చూస్తూ ఆస్వాదిస్తున్నది ఆత్మయే.

విభుః → సర్వమునకు యజమాని (Owner) విభుడు ఆత్మయే.

విగ్రహే → విగ్రహస్వరూపుడు, నామరూపాత్మకుడు ఆత్మయే. సమస్త విశ్వము తన శరీరముగా కలవాడు.

సన్నివిష్టా → ఆత్మయే సర్వదా సర్వత్ర సర్వమునందు సర్వముగా వేంచేసి ఉన్నవారు. సామీప్యముచే సమస్తమును చేతన పరచువారు. సర్వత్రా ఆసీనుడై ఉన్నవారు.

ఈ రీతిగా గాయత్రీ మంత్ర మననము ద్వారా ఆత్మోపాసన ఉద్దేశ్యించబడుతోంది!

❖❖❖

**ఏకమగు ఆత్మ సర్వదా ఏకమే. అనేకముగా అగుట లేదు. ద్వైతముగా కనబడునదంతా ఏకమగు ఆత్మయే.**

ద్వైతముగా కనబడుచున్నప్పుడు ద్వంద్వముగా (రెండుగా) అనిపిస్తోంది.

→ వింటున్నవాడు - వినబడునది.

→ చూస్తున్నవాడు - చూడబడుచున్నది,

→ విజ్ఞాని - విజ్ఞానము.

గా కనబడుతోంది!

ద్వైతీభూతుడైనప్పుడు → ఆత్మ గురించే విజ్ఞాతవ్యమ్!

ఆత్మ అనిర్వచనీయము. అనౌపమ్యము (ఉపమానములచే చెప్పబడజాలనిది). కార్య-కారణరహితము. నిరూపించి చూపబడ జాలనిది (నిరుపాఖ్యమ్!).

మరి ఇంక **మాటలతో** ఏమని చెప్పగలము?

## కిం తత్ అంగవాచ్యమ్?

ఓ వాలఖిల్యాది మునులారా! మీయందు, నాయందు, సర్వజీవులయందు, స్థాణువులయందు, పంచభూతములయందు, సర్వమునందు - (కథాగమనమునకు ఆ కథా రచయిత వలె) ఆధారభూతుడై ఉన్నవాడే ఆత్మ. ఆత్మయే ఈ సర్వము. ఈ సర్వము ఆత్మకు అభిన్నము.

ఆత్మయే ఈశానుడు. శంభుడు. రుద్రుడు. ప్రజాపతి. విశ్వసృష్టిస్వరూపుడు. హిరణ్యగర్భుడు. సత్యుడు. నిత్యుడు. ప్రాణస్వరూపుడు. - ప్రాక్ స్వరూపుడు। పరమహంస। సోహఽమ్-హంసోఽహమ్। శాస్త। సర్వమును శాశించువాడు।

విష్ణువు। నారాయణుడు। అర్కుడు (సూర్యుడు)। సవిత। దాత। విధాత। సామ్రాట్। ఇంద్రుడు। చంద్రుడు కూడా।

ఇవన్నీ తాను కాకుండానే యథాస్థానములో ఉంటూనే, ఇవన్నీ తానే అయినవాడే ఆత్మ. ఆత్మయే రమ్యము. గమ్యము.

**య ఏష తపతి।** సర్వమును తపింపజేస్తున్నవాడే ఆత్మ.

ఆత్మపురుషుడు తనను తానే తన యొక్క ఆనంద స్వరూపమును అగ్ని చేతను, సహస్రాక్షుడగు ఇంద్రుని (లేక ఇంద్రియ కార్యక్రమముల యజమాని) రూపము చేతను, హిరణ్మయము (సృష్టి కర్తృత్వము) రూపము చేతను కప్పి ఉంచుకొని జీవుని వలె వ్యవహరిస్తున్నారు.

అట్టి స్వస్వరూపాత్మ స్వరూపమే మనమందరము. ఇదే సర్వదా ఎరుగవలసినది. **విజ్ఞాసితవ్యో।**

సర్వదా వెతకవలసినది ఆత్మకొరకే. **అన్వేషితవ్యః।**

**సర్వభూతే భ్యో అభయం దత్వా।** ఆత్మయే, ఆత్మాన్వేషణయే, ఆత్మజ్ఞానమే, ఆత్మతో అద్వితీయత్వమే → సర్వజీవులకు అభయము ప్రసాదించగలిగిన స్థానము.

## మరల గుర్తు చేస్తున్నాను.

అరణ్యమునకు (ఏకాంతమునకు) వెళ్ళండి. వెళ్లి ఇంద్రియార్థములన్నీ మీకు సంబంధించని బాహ్యవస్తువులుగా చూస్తూ ఉండండి.

చివరికి ఆ ఆత్మను మీ శరీరము నందే అన్వేషించి (వెతికి) విశ్లేషించి బుద్ధితో పట్టుకోండి. సమస్తము స్వస్వరూపాత్మ యందే దర్శించండి.

మీ ఆత్మయే (ఆత్మపురుషుడే)

→ ఈ విశ్వము యొక్క రూపము.

→ సర్వస్థితి-గతులు ఆయన యొక్క సంపదయే. ఆయనకు చెందినవే.

ఆత్మదేవుడే జాతవేదసుడు. అగ్ని స్వరూపుడు. పరాయణుడు. అందరు పారాయణము చేస్తున్నది ఆయననే.

ఈ కనబడే జీవులంతా జ్యోతిరూపాలయి ఉండగా, **"ఆత్మ భగవానుడు అఖండజ్యోతి స్వరూపుడు"** - అని భావిస్తూ గ్రహించండి!

ఒక దీపముతో అగ్ని (జ్యోతి) ఆద్యంతాలు పొందదుకదా! అట్లాగే, **ఆత్మ దేహముతో ఆద్యంతాలు పొందదు.** సర్వమును తపింపజేయువాడు ఆ ఆదిపురుషుడగు ఆత్మజ్యోతి స్వరూపుడే.

వేలాది కిరణములతో (జీవాత్మలుగా) వందలాది చోట్ల వర్తిస్తున్నవాడు. సర్వజీవులకు ప్రాణప్రదుడు.

సర్వజీవులలో సర్వదా ఉదయిస్తున్నది, నిత్యోదయుడై ఉన్నది - ఆ ఆత్మ సూర్యుడే.

తత్ స్వస్వరూప-సర్వస్వరూప-నిత్యసత్య- అప్రమేయ ఆత్మ భగవానునికి నమస్కరిస్తున్నాను.

గురుదేవులగు మైత్రేయులవారి వద్ద శ్రవణం చేసియున్న శ్రీశాకాయన్య మహర్షి వివరించి చెప్పిన, శ్రీ మైత్రాయ మహర్షి ప్రవచితమైన - "ప్రజాపతి-వాలఖిల్యాది మునుల సంవాదము" విని ఇక్ష్వాకు వంశజ్ఞుడగు బృహద్రథమహారాజు పరమానంద భరితులైనారు. స్వస్వరూపమగు ఆత్మ ఎట్టిదో ఎరిగినవారై ఆత్మసాక్షాత్కారం ఆస్వాదించసాగారు.

అట్టి స్వస్వరూప ఆత్మమహిమను సుస్పష్టపరచినట్టి సద్గురు వరేణ్యులగు శ్రీ శాకాయన్య మహర్షులవారికి చరణాలను కృతజ్ఞతతో స్పృశించి కళ్ళకు అద్దుకుంటున్నాము.

## ఏకాదశరుద్రులు

**మార్కండేయ పురాణము : బ్రహ్మ వైవర్త పురాణము :** సృష్టిని నిర్వర్తించటానికై బ్రహ్మ - తన మనస్సునుండి జనింపజేసిన బ్రహ్మమానసపుత్రులకు సనకుడు, సనందుడు, సనత్కుమారుడు, సనస్సుజాతుడు మొదలైనవారు - ఒకప్పుడు ఊర్ధ్వరేతస్కులై, సృష్టికార్యము నిర్వర్తించటమును నిరాకరించసాగారు. అప్పుడు బ్రహ్మకు కోపమువచ్చింది. సృష్టి కొనసాగటానికై తానే తన లలాటమునుండి స్త్రీ-పురుషరూపములు దాల్చారు. అప్పుడు ఆ బ్రహ్మదేవుని లలాటమునుండి ఏకాదశరుద్రులు జన్మించారు.

(1) మహత్తుడు (2) మహాత్మ (3) మతిమంతుడు (4) భీషణుడు (5) భయంకరుడు (6) ఋతధ్వజుడు (7) ఊర్ధకేశుడు (8) పింగళాక్షుడు (9) రుచి (10) శుచి (11) కాలాగ్ని రుద్రుడు.

### వీరు ఏకాదశ రుద్రులు

**భారతము :** సురభికి మార్తాండునివలన జనించిన ఏకాదశరుద్రులు (1) అజపాదుడు (2) అహిర్బుధ్న్యుడు (3) త్ర్యంబకుడు (4) వృషాకపి (5) శంభుడు (6) జపాలి (7) రైవతుడు (8) హరుడు (9) బహురూపుడు (10) ఉగ్రుడు (11) విశ్వరూపుడు.

## ద్వాదశ ఆదిత్యులు

**భాగవతము :** శ్రీమన్నారాయణ స్వరూపుడైన సూర్యుడు సర్వదా ఏకస్వరూపుడే. కాల-దేశ - క్రియ మొదలైన భేదముల దృష్ట్యా అనేక క్రమములను ఋషులు వర్ణించారు. ఒక్కొక్క మాసములో సూర్యుడు ఒక్కొక్క పేరుతో ఉపాసించబడుచూ ఉంటారు,

| మాసము | సూర్యుని నామధారణ | అప్పటి సూర్యుని పరిజనము |
|---|---|---|
| 1. చైత్రము | ధాత | కృతస్థలి, హేతి, వాసుకి, రథకృత్తు, పులస్త్యుడు, తుంబురుడు. |
| 2. వైశాఖము | అర్యముడు | పులహుడు, భోజుడు, ప్రహేలి, పూజికస్థలి, నారదుడు, కంజనీరుడు. |
| 3. జ్యేష్ఠము | మిత్రుడు | అత్రి, పౌరుషేయుడు,తక్షకుడు, మేనక, హాహా, రథస్వనుడు. |
| 4. ఆషాఢము | వరుణుడు | వసిష్ఠుడు, రంభ, సహజన్యుడు, హూహువు, శుక్రుడు, చిత్రస్వనుడు. |
| 5. శ్రావణము | ఇంద్రుడు | విశ్వావసువు, శ్రోత, ఏలాపుత్రుడు, అంగీరసుడు, ప్రమ్లోచి, చర్ముడు. |
| 6. భాద్రపదము | వివస్వంతుడు | ఉగ్రసేనుడు, వ్యాఘ్రుడు, ఆసారణుడు, భృగువు, అనుమ్లోజుడు, శంఖపాలుడు. |
| 7. ఆశ్వయుజము | త్వష్ట (ఋచీక తనయుడు) | కంబళాశ్వుడు, తిలోత్తమ, బ్రహ్మోపేతుడు, శతజిత్తు, ధృతరాష్ట్రుడు, ఇషంభరుడు. |
| 8. కార్తీకము | విష్ణువు | అశ్వతరుడు, రంభ, సూర్యవర్చసుడు, సత్యజిత్తు, విశ్వామిత్రుడు, మఘోపేతుడు. |
| 9. మార్గశిరము | తర్యముడు | కశ్యపుడు, తార్క్ష్యుడు, ఋతసేనుడు, ఊర్వశి, విద్యుచ్ఛతువు, మహాశంఖుడు. |
| 10. పుష్యము | భగుడు | స్ఫూర్జుడు, అరిష్టనేమి, ఊర్ణుడు, ఆయువు, కర్కోటకుడు, పూర్వజిత్తి. |
| 11. మాఘము | పూషుడు | ధనంజయుడు, వాతుడు, సుషేణుడు, సురుచి, ఘృతాచి, గౌతముడు. |
| 12. ఫాల్గుణము | క్రతువు | వర్యసుడు, భరద్వాజుడు, పర్జన్యుడు, సేనజిత్తు, విశ్వుడు, ఐరావతుడు. |

**ఇతి మైత్రాయణ్యుపనిషత్**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

**సామవేదాంతర్గత**

# 10 మైత్రేయోపనిషత్

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ శ్రుత్వా ఆచార్య ఉపదేశేన
మునయో యత్ పదం యయుః
తత్ స్వానుభూతి సంసిద్ధం
స్వమాత్రం బ్రహ్మభావయే॥



**(జగద్దృశ్యములో చేయవలసినదేదో చేస్తూ, ఆపై ఇక మౌనము వహించి..., నిత్య సత్యమగు ఆత్మతత్త్వము నందు కనులు తెరచి జాగరూకులై ఉంటున్నట్టి)- మునులు చేతులెత్తి - శ్రుతుల, ఆచార్యుల ప్రవచనముల సాక్షిగా ఏ పదము చూపుచున్నారో, అట్టి 'పరమపదము' యొక్క సిద్ధిచే, "బ్రహ్మమే నేను" అను అనునిత్య భావనకు - మనము చేరెదము గాక! అందుకొరకై శివభగవానుని శరణువేడుచున్నాము.**

## ప్రథమోధ్యాయః - బృహద్రథ వైరాగ్యము

| | |
|---|---|
| 1. ఓమ్॥<br>బృహద్రథో వై నామ రాజా, -<br>రాజ్యే జ్యేష్ఠం పుత్రం నిధాపయిత్వా, -<br>"ఇదమ్ అశాశ్వతం మన్యమానః శరీరం,<br>వైరాగ్యమ్ ఉపేతో, అరణ్యం నిర్జగామ॥ | ఓంకార రూప పరమాత్మకు నమస్కరిస్తున్నాము.<br>ఇక్ష్వాకు వంశజుడైన బృహద్రధుడు అనే రాజు ఉండేవారు. ఆయన ఒక సమయంలో తన పెద్దకుమారుని రాజుగా చేసి, రాజరికాన్ని త్యజించారు. "ఈ దేహము శాశ్వతం కానే కాదు కదా! ఇది కాస్త బాగున్నప్పుడే సద్వినియోగం చేసుకోవాలి"....అని తలచారు. విరాగియై అరణ్యావాసము స్వీకరించారు. (వానప్రస్థాశ్రమము ఆశ్రయించారు). |
| స తత్ర పరమం తప ఆస్థాయ ఆదిత్యమ్<br>ఈక్షమాణ, ఊర్ధ్వబాహుః తిష్ఠత్। అన్తే సహస్రస్య॥<br>మునిః అంతికమ్ ఆజగామ<br>అగ్నిరివా ధూమకః తేజసా నిర్దహన్-ఇవ -<br>ఆత్మవిత్ భగవాన్ శాకాయన్యః॥ | తపస్సు ప్రారంభించారు. దృష్టిని - ధ్యాసను భక్తితో సూర్యభగవానునిపై నిలిపి చేతులు ఎత్తి ఉంచి బుద్ధిని 'సహస్రారము'నందు నిలిపి ఏకాగ్రతతో తపస్సు చేయసాగారు. (సహస్రారము = శిరస్సుపై బ్రహ్మరంధ్రము నుండి 12 అంగుళాలు వరకు ఊర్ధ్వంగా)<br>ఒకరోజు అగ్ని, పొగలేని వెలుగువలె తేజో విలాసుడై వెలుగొందుచు - ఆత్మవేత్త, భగవంతుడు అగు శాకాయన్యుడు బృహద్రథుని ఆయన ముందు ప్రత్యక్షమైనారు. |
| "ఉత్తిష్ఠ! ఉత్తిష్ఠ! వరం వృణీస్వ - ఇతి।<br>రాజానమ్ అబ్రవీత్, తస్మై నమస్కృత్యో వాచ :-<br>"భగవన్! న అహం ఆత్మవిత్। త్వమ్ తత్త్వవిత్।<br>శృణుమో వయం సత్వం నో బ్రూహి। ఇతి।<br>"ఏతత్ వృత్తం పురస్తాత్ అశక్యం।<br>మా పృచ్ఛ ప్రశ్నమ్, ఐక్ష్వాకాన్!<br>అన్యాన్ కామాన్ వృణీష్వ!" - ఇతి। | **"నాయనా! లే! లెమ్ము! నీకు ఏమి వరము కావాలో కోరుకో!"** అని అన్నారు. ఆ బృహద్రథుడు "హే భగవాన్! నేను బ్రహ్మవేత్తను కాను. మీరో, పరబ్రహ్మమును సాక్షాత్కరించుకొని యున్న తత్త్వవేత్త. నాకు తత్త్వజ్ఞానమును ప్రసాదించండి"...అని ప్రార్థించారు.<br>ఆ మహనీయుడగు శాకాయన్యుడు రాజుతో, "ఓ ఇక్ష్వాకు వంశ సంజాతా! నీవు అడిగిన ఆత్మతత్త్వజ్ఞాన సమాచారము సంక్లిష్టమైనది. బోధించటానికి అశక్యమైనది కూడా. అది మాత్రం అడగకు. ఇంకేదైనా వరం కోరుకో! ఇస్తాను" - అని పలికారు. |
| శాకాయన్యస్య చరణాః అభిమృశ్యమాణోః<br>రాజే మాం గాథాం జగాద। (ఏజే మాం గాథాం జగాద్)<br>(ఇంతవరకు ఇట్లే మైత్రాయణ్యుపనిషత్‌లోకూడా) | అప్పుడు ఆ రాజు మహనీయుడగు శాకాయన్యుని పాదాలు రెండు చేతులతో పట్టుకొని నమస్కరిస్తూ ఈ విధంగా అభ్యర్థన చేశారు. |

**2. (ఇంక్ష్వాకువంశ ప్రభవో బృహద్రథో వాచ!)**
**ఆథ కిమ్ ఏతైర్వా అన్యానాం?**
**శోషణం మహార్ణవానాం।**
**శిఖరిణాం ప్రపతనం।**
**ధ్రువస్య ప్రచలనం।**

**శ్రీ బృహద్రథుడు**

మహాత్మా! బ్రహ్మవిద్యకు వేరైన విషయాలవలన ప్రయోజనం ఏముంటుంది చెప్పండి? ఈ దృశ్యములో శాశ్వతమైనదేమున్నది? మహాసముద్రాలే ఒకప్పటికి ఇంకిపోతున్నాయి. పెద్ద పెద్ద పర్వతాలు నేలకూలుతున్నాయి. కాలగతికి ధ్రువతార వంటివి కూడా చలనం పొందుతోంది. మరొక కాలంలో మటుమాయమైపోతోంది.

**స్థానం వా తరూణాం।**
**నిమజ్జనం పృథివ్యాః।**
**స్థానాత్ అపసరణం సురాణాం।**

సువిశాలమైన మహావృక్షాలు ఒక్క గాలివానకు నేలకూలి స్థానం కోల్పోవుచున్నాయి. ఈ భూమియే ఇంకొకప్పటికి సముద్రంలో మునిగిపోతోంది.

దేవతలంతటివారు స్థానాలు కోల్పోయి కాలప్రవాహంలో కొట్టుకుపోతున్నారు. ఇక మా మానవ దేహములు, మా ఈ భౌతిక సంపదల గురించి చెప్పేదేమున్నది? ఇక నేను మాత్రం వర్తమాన దృశ్యంలో శాశ్వతమా? కాలవిధికి, కాల ప్రవాహానికి కొట్టుకుపోక తప్పదు కదా!

**సోఽహమ్ ఇతి ఏతత్ విధే,**
**అస్మిన్ సంసారే కిం కామోపభోగైః?**
**ఏరైవ (ఏత్యైః ఏవ) ఆశ్రితస్య**
**అసకృత్ ఉపా వర్తనం దృశ్యత। –**
**ఇతి ఉద్ధర్తుమ్ అర్హసీతి।**
**(ఇతి) "అంధ–ఉదపానస్థో భేక" ఇవ**
**అహమ్ అస్మిన్ సంసారే।**
**భగవన్! త్వమ్ నో గతిః। ఇతి॥**

ఈ ఎదురుగా కనిపించే సంసారములో ఎవ్వరైతే కామ ఉప-భోగములను ఆశ్రయిస్తారో వారంతా అసత్ కృతములైనట్టి, కల్పితమాత్రములైనట్టి స్థితులను, పునరావృత్తులను పొందుచూ దృశ్య మండలంలో చిక్కుకుంటున్నారు. పునః పునః అనేక జన్మలు పొందుచున్నారు.

నేను సంసారములో నూతిలో కప్పవలె చిక్కుకున్నవాడను. దిక్కుతోచకున్నాను. అందుచేత మీరే నాకు గతి. ఈ సంసార సాగరము నుండి ఆత్మజ్ఞాన సమాచారముతో నన్ను సముద్ధరించండి! నాపై కరుణ వహించండి!

**3. భగవన్! శరీరమ్ ఇదం**
**మైథునాత్ ఏవ ఉద్భూతం।**
**సంవిత్ వ్యపేతం నిరయ ఏవ।**
**మూత్ర ద్వారేణ నిష్క్రాన్తమ్।**

హే భగవాన్! ఇంకా వినండి. దేనిని చూచుకొని కామభోగములు కోరుకుంటామో అట్టి ఈ భౌతిక దేహం స్త్రీ-పురుష మైథునముచే శుక్ల-శోణితముల కలయికచే ఉత్పన్నమౌతోంది. ఇది జడమైనదేగాని స్వయంగా చైతన్యవంతముకాదు. ఇది దుఃఖకారణమే గాని సుఖ వస్తువు కాదు. ఏ-ఈ దేహమునకు దాసులమై జీవితం అనే అవకాశమును వృథా చేసుకుంటున్నామో,...అట్టి ఇది మూత్ర ద్వారమునుండి వెలువడి భూమిపైకి వచ్చింది.

**అస్థిభిః చితం। మాంసేన అనులిప్తం।**
**చర్మణావబద్ధం। విణ్మూత్ర, వాత పిత్త కఫ మజ్జా మేదో**
**వస అభిరత్, అన్యైశ్చ మలైః**
**బహుభిః పరిపూర్ణమ్।**
**ఏతా దృశే శరీరే వర్తమానస్య,**
**భగవన్! త్వం నో గతిః। 'ఇతి'॥**

లోపల ఎముకలు. అవి మాంసముతో కప్పబడి, చర్మముచే అలకబడి ఉన్నాయి. లోపల మూల మూలలుగ మూత్రము, మలము. ఇంతే కాకుండా వాతము పిత్తము కఫములతో నిండి ఉంటోంది. ఇంకా రక్తము, మాంసము వంటి అనేక పదార్థాలు. ఇదీ, ఈ దేహముయొక్క నిర్మాణము. అటువంటి ఈ అనేక మురికి పదార్థములతో నిండి ఉన్న దేహముపై మమకారము - అభిమానములతో బద్ధుడనైన నాకు మీరేగతి! మీరు ప్రవచించి బోధించే ఆత్మ విద్య మాత్రమే మందు. కనుక నాపై కనికరించండి.

**4. అథ భగవాన్ శాకాయన్యః సుప్రీతో, అబ్రవీత్ రాజానం**
**మహారాజా! బృహద్రథ! ఇక్ష్వాకువంశధ్వజ!**
**శీర్ష ఆత్మజ్ఞః, కృతకృత్యః త్వమ్।**
**'మరుత్' – నామ్నో విశ్రుతో అసీత్।**
**అయం ఖలు(వ) ఆత్మాతే, కతమో, భగవాన్! వర్ణ్య ఇతి!**
**తం హోవాచ :**

**ఆ వాక్యములు విని భగవంతుడగు శాకాయన్యుడు చాలా సంతోషించారు.** సుప్రీతుడైనారు. ఇట్లా పలకసాగారు.

"హే మహారాజన్! బృహద్రథా! ఇక్ష్వాకు కుల రథమునకు ధ్వజము వంటి వాడా! ఆత్మజ్ఞాన వివేకీ! నీవు కృతకృత్యుడవయ్యా! మరుత్తు అనే పేరుతో లోకప్రసిద్ధుడవుకదా! నీవు ఇప్పటికే ఆత్మతత్త్వము తెలిసినవాడివే కనుక ఈ రీతిగా అడిగావు. **భగవంతుడగు పరమాత్మను వర్ణించి చెప్పగలమా?** లేదు. అయినా కూడా కొన్ని విశేషాలు చెప్పుకుందాము!" - అంటూ ఇంకా ఇట్లా చెప్పసాగారు. (మరుత్ = వాయువును జయించినవాడు).

<u>పరమపదము - ఏమరుపు</u>

**5. శబ్ద స్పర్శ మయా యే అర్థా**
**అనర్థా ఇవ తే (ఇవమే)స్థితాః।**
**యేషాం సక్తస్తు భూతాత్మా।**
**న స్మరేత్ చ పరం పదమ్॥**

ఈ జగత్ దృశ్యముయొక్క మూల పదార్థములగు శబ్ద-స్పర్శ-రూప- రస - గంధముల 'విషయములు' - అను తన్మాత్రలు గొప్ప అర్థములుగా పైకి కనిపిస్తూ ఉండవచ్చు గాక! వాస్తవానికి అవన్నీ అనర్థములే అయి ఉన్నాయి. ఈ జీవుడు అట్టి **పంచతన్మాత్రలయందు ఆసక్తి పెంపొందించుకున్న వాడై,** వాటికి ఆవలగల **ఆత్మస్థానమును స్మరించటం లేదు.** గమనించటం లేదయ్యా!

---

<u>తపస్సు - ఆత్మానుభూతి</u>

**6. తపసా ప్రాప్యతే సత్త్వమ్।**
**సత్త్వాత్ సంప్రాప్యతే మనః।**
**మనసా ప్రాప్యతే హి ఆత్మా।**
**హి ఆత్మ అపత్త్యా నివర్తతే॥**

**తపస్సుచే ఆత్మానుభూతి:** అట్టి తన్మాత్రలపట్ల తపనను 'ఆత్మజ్ఞానముపట్ల తపన' అనే తపస్సుగా మలచుకున్నామా, అప్పుడు రజో తమో గుణములు అల్పమగుచు, సత్త్వగుణము పెంపొందగలదు. సాత్త్విక గుణాభ్యాసంచేత మనస్సు నిర్మలమౌతుంది. నిర్మలమైన మనస్సుకు ఆత్మ అనుభవం కాగలదు. **'ఆత్మాఽహమ్'** అను మనోదర్శనముచే సర్వసంసార ఆపదలు వాటికవే తోకముడుస్తాయి. నివర్తమౌతాయి.

---

**7. <u>యథా</u> నిరింధనో వహ్నిః**
**స్వయమేవ ఉపశామ్యతి,**
**<u>తథా</u> వృత్తి క్షయాత్ చిత్తం**
**స్వయమేవ ఉపశామ్యతి॥**

ఏ విధంగా అయితే ఇంధనము లేనప్పుడు అగ్ని తనకుతానే ఉపశమిస్తుందో....,

ఆవిధంగా ఇంద్రియములకు విషయములైనట్టి ఈ జగద్దృశ్య వృత్తులు (Avocations) క్షయిస్తూ ఉండగా, చిత్తము తనకు తానే శమించగలదు.

---

**8. స్వయమేవ ఉపశాన్తస్య**
**మనసః సత్యగామినః।**
**ఇంద్రియార్థ విమూఢస్యాత్**
**అనృతాః కర్మవశానుగాః॥**

ఎప్పుడైతే విషయసంబంధమైన ఆలోచనల రూపమైన మనస్సు శమిస్తుందో అప్పుడు సత్యము, సత్యమార్గము బుద్ధికి అనుభూతమగుచూ ఉంటుంది. కర్మలవశంగా అనుభవమై సత్యమువలె కనిపించే ఇంద్రియార్థముల (శబ్ద స్పర్శ రూప రస గంధముల) విమూఢత్వము త్యజించువానికి సత్యదృష్టిచే **"కర్మవశంగా కనబడే సర్వ పదార్థములు మిథ్యయే కదా!"**... అని తెలియవస్తోంది.

---

**9. చిత్తమేవ హి సంసారః। తత్ ప్రయత్నేన శోధయేత్।**
**యత్ చిత్తః తత్మయో భవతి గుహ్యమ్ ఏతత్ సనాతనమ్॥**

**చిత్తమే సంసారము** అయి ఉన్నది. అట్టి చిత్తమును ఉత్తమ ప్రయత్నముతో శోధించి నిర్విషయము చేయాలి. అప్పుడా నిర్మల చిత్తము **రహస్యము - సనాతనము అగు చిత్ ఆత్మ స్వరూపమై ప్రకాశించగలదు.**

---

**10. చిత్తస్య హి ప్రసాదేన**
**హంతి కర్మ శుభాశుభమ్।**
**ప్రసన్నాత్మ ఆత్మని స్థిత్వా**
**సుఖమ్ అవ్యయమ్ అశ్నుతే॥**

కర్మలయొక్క శుభ - అశుభ ద్వంద్వ భ్రమ (లేక) మోహమును నిర్మలమైన చిత్తము మాత్రమే త్యజించి వేయగలుగుతుంది. అప్పుడు ఆ చిత్తము ఆత్మయందు ప్రతిష్ఠితమై, ఇక ఆపై అవ్యయము, విక్షేపరహితము అగు ఆత్మ సుఖమును పొందగలదు.

---

**11. సమాసక్తం యథా చిత్తం**
**జంతోః విషయ గోచరం**
**యత్ ఏవం బ్రహ్మణిస్యాత్,**
**తత్ కో న ముచ్యేత బంధనాత్?**

ఈ చిత్తము అజ్ఞానకారణంగా ఏవిధంగా విషయములలో లగ్నం అవుతుందో, అదే చిత్తము ఆత్మజ్ఞానము సంపాదించుకొని పరబ్రహ్మము నందు సంలగ్నమగుచున్నప్పుడు, ఇక అట్టి వాడెవ్వడు సంసారబంధము నుండి విముక్తుడవడు? తప్పక బంధ విముక్తుడు కాగలడు.

---

**12. హృత్ పుండరీక మధ్యేతు భావయేత్ పరమేశ్వరమ్।**
**సాక్షిణం బుద్ధివృత్తస్య పరమ ప్రేమ గోచరమ్॥**

అట్టి పరబ్రహ్మము (లేక) పరమాత్మ ఉన్నట్టి స్థానము ఏది? ఎక్కడ? ఆతడు సర్వబుద్ధి వృత్తులకు కేవలము సాక్షియై, పరమ ప్రేమాస్పదుడై **హృదయ పద్మమునందే సర్వదా వేంచేసిఉన్నారు.** కనుక, అట్టి పరమేశ్వరుని హృదయమునందే భావనచేయాలి. అనునిత్యం సందర్శించాలి.

---

**13. అగోచరం మనో వాచామ్ అవధూతాది సంప్లవమ్।**
**సత్తా మాత్ర ప్రకాశైక స్వభావం భావనా గతిమ్॥**

అట్టి హృదయాంతర్యామి-మనస్సుకు, వాక్కుకు అగోచరుడు. ఈ మనస్సు - వాక్కు మొదలైనవన్నీ పరమాత్మయొక్క విన్యాసము. సమస్త దుఃఖములు అట్టి పరమేశ్వర దర్శనముచే ఎటో కొట్టుకుపోతాయి. ఆయన మనందరిలో భావాతీతుడై, స్వస్వభావుడై, **'అందరిలో అందరుగా'** విరాజిల్లుచున్నారు.

**14. అహేయమ్ - అనుపాదేయమ్**
**అసామాన్య విశేషణమ్!**
**ధ్రువం స్తిమిత గంభీరం**
**న తేజో, న తమః తతమ్।**
**నిర్వికల్పం నిరాభాసం**
**నిర్వాణమయ సంవిదమ్ (సత్-విత్-మ్)॥**

పరమాత్మకు ఏదీ వదలవలసినదీ లేదు. స్వీకరించవలసినదీ లేదు.

ఆ పరమాత్మ మనలోని ప్రతి ఒక్కరిలో సమముగా వేంచేసి ఉన్నారు. మనచే త్యజించబడక, స్వీకరించబడక ఉన్నారు. అట్టి పరమాత్మను ఎవ్వరూ పట్టుకొననూ లేరు. వదలి పెట్టనూ లేరు. తమ స్వస్వరూపమును ఎవరు మాత్రం వదలి ఉండగలరు? స్వస్వరూపము దర్శిస్తున్నప్పుడు మోక్షార్థి అయి కనిపించే 'జీవుడు' ఎక్కడుంటాడు? అప్పుడిక పట్టుకోవలసినవాడు మాత్రం ఎక్కడ?

ఆత్మ - దృశ్యములోని ఒక సామాన్య విశేషము వంటిది కాదు.

**అద్దానిని (అట్టి ఆత్మపురుషుని) : -**

- ధ్రువమైనదిగా, - స్తిమితమైనదిగా , - గంభీరమైనదిగా, - తేజస్సుకు - చీకటికి సాక్షిగా, - కల్పనా రహితునిగా, నిర్వికల్పునిగా, - నిరాభాసునిగా, అభాసరహితునిగా, - (కదలనిగాలివలె) నిర్వాణస్వరూపునిగా, దృశ్యసాక్షిగా, - సంవిత్ స్వరూపునిగా తెలుసుకొని-ధ్యానించెదము గాక!

---

**15. నిత్యశ్శుద్ధో బుద్ధ - ముక్త స్వభావః।**
**సత్యః సూక్ష్మః సవిభుశ్చ అద్వితీయః**
**ఆనందాబ్ధిర్యః పరః సోఽహమస్మి**
**ప్రత్యక్ ధాతుః! న అత్ర సంశీతిరస్తి॥**

**చిత్తము శమించగా శేషించే చిత్‌రూప పరమేశ్వరస్థానము ఎటువంటిదంటే:**

నిత్యమైనది. శుద్ధము. బుద్ధము. స్వభావతః నిత్యముక్తము. కేవలసత్ స్వరూపము. సూక్ష్మము. సర్వమునకు నియామకము. అద్వితీయము. ఆనందసాగర సదృశము. సర్వమునకు వేరైనది. పరము. ప్రత్యక్ (కేవల) బోధ స్వరూపము. **అట్టి పరస్వరూపమే నేను. అదియే నీ - నా వాస్తవ పరతత్త్వ సత్యస్వరూపమై ఉన్నదయ్యా! అట్టి ఆత్మయందు సుఖాసీనులయ్యెదము గాక। ఆత్మనుండి ఎవరూ అన్యత్వము పొందటములేదు.**

---

**16. ఆనందం అంతః నిజమ్ ఆశ్రయంతమ్**
**ఆశా పిశాచీమ్ అవమానయంతమ్।**
**ఆలోకయంతం జగత్ ఇంద్రజాలం**
**ఆపత్ కథం మాం ప్రవిశేత్ అసంగమ్?**

అట్టి ఆనంద నిజాంతర్గత నిజస్వరూపముచే ఆశ్రయించబడి ఉన్నవాడను.

ఆశాపిశాచము రా యత్నిస్తే - అవమానించి త్రోలివేయువాడను.

ఈ లోకములను, జగత్తులను ఇంద్రజాలమువలె వినోదంగా దర్శించుసాక్షిని. అట్టి అసంగ - అప్రమేయ ఆత్మస్వరూపుడనగు నన్ను - కలలోని విషయములవంటి - దృశ్యసంబంధమైన ఆపదలు ఎట్లా సమీపిస్తాయి చెప్పు? లేనేలేదు.

---

**17. వర్ణాశ్రమ ఆచారయుతా విమూఢాః**
**కర్మానుసారేణ ఫలం లభంతే।**
**వర్ణాది ధర్మం హి పరిత్యజంతః**
**స్వానందతృప్తాః పురుషా భవంతి॥**

ఎవ్వరైతే వర్ణాశ్రమ ఆచారములే అత్యంత ప్రాధాన్యముగాను, అంతిమాశయముగాను భావిస్తారో, - వారు **మూఢులే** అగుచున్నారు. అట్టివారు కర్మానుసారంగా కొన్ని కాలబద్ధమైన ఫలములను మాత్రమే పొందుచున్నారు. ఎవ్వరైతే **వర్ణాశ్రమ ఆచారములను అధిగమించి స్వస్వరూపాత్మానందమే మహదాశయముగా కలిగి ఉంటారో, - వారు పరమ పురుషులుగా** రూపొందుచున్నారు. (రూపుదిద్దుకొనుచున్నారు).

---

**18. వర్ణాశ్రమం సావయవం స్వరూపమ్**
**ఆద్యంతయుక్తం హి అతికృచ్ఛ్రమాత్రం**
**పుత్రాది దేహేషు అభిమాన శూన్యం**
**భూత్వా, వసేత్ సౌఖ్యతమ ఏహి అనన్తే॥**
**(సౌఖ్యతమేవహి అనన్తే॥)**

అందుచేత, విధి - నిషేధముల పరిమితైయుండే వర్ణాశ్రమ, ఆచారములు సావయవరూపమని, దేహసంబంధితమైనవని, అనేక శ్రమతో కూడి అల్పప్రయోజనకారకములని గమనించెదరు గాక! "**నా బంధువులు - నాపుత్రులు - నా కుటుంబము - నా జాతి - నాకులము - నా ప్రదేశము**"...ఇటువంటి దేహాభిమానములను హృదయములో ఎవరైతే రహితం చేసుకుంటారో, అట్టివారు శాశ్వతమగు మహదానందమునందు స్థానము పొందగలుగుచున్నారు.

## ద్వితీయోధ్యాయః - (మైత్రేయ - పరమేశ్వర సంవాదము)

**1. అధ భగవాన్ మైత్రేయః**
**కైలాసం జగామ।**
**తం గత్వా - ఉవాచ:**
**భో, భగవన్!**
**"పరమతత్త్వ రహస్యమ్ అనుబ్రూహి!" ఇతి॥1॥**

ఒకప్పుడు భగవానుడగు మైత్రేయ మహర్షి కైలాసమునకు వెళ్ళారు. శివదర్శనం చేసుకున్నారు. జగద్గురువు, జగదీశ్వరుడు అగు శ్రీ శివభగవానునితో ఇట్లా అభ్యర్థించారు.

**"హే పరమాత్మా! భగవన్! సర్వేశ్వరా! నాకు దయతో పరతత్త్వము బోధించవేడుకుంటున్నాను స్వామీ! జీవుడనగు నాకు ఆత్మతత్త్వభావన" బోధించండి.**

**కరుణామయులగు మహాదేవులు శ్రీమైత్రేయులవారికి ఈ విధంగా బ్రహ్మతత్త్వాన్ని ప్రబోధించసాగారు.**

---

**స హో వాచ మహాదేవః:**

**2. దేహో దేవాలయః ప్రోక్తః।**
**స జీవః కేవలః శివః।**
**త్యజేత్ అజ్ఞాన నిర్మాల్యమ్**
**'సోఽహమ్' భావేన పూజయేత్॥**

**మహాదేవోవాచ:** నాయనా! మైత్రేయా! నీ శ్రద్ధాసక్తులకు మెచ్చానయ్యా! విను.

పరమాత్మ ఎక్కడున్నాడు? బ్రహ్మలోకంలోనా? కైలాసంలోనా? లేక వేరే లోకంలోనా? కాదు. **ఈ దేహమే దేవాలయము.** ఈ దేహములోని జీవుడే స్వతఃగా, కేవలము **శివుడేనయ్యా!** పూజ చేసేముందు నిన్నటి నిర్మాల్యము తొలగిస్తాముకదా! అట్లాగే **'అజ్ఞానము'** అనే నిర్మాల్యమును తొలగించి 'సోఽహమ్-శివోఽహమ్' భావనతో స్వదేహములోని ఆత్మదేవుని పూజించాలి.

---

**3. అభేద దర్శనం జ్ఞానం।**
**ధ్యానం నిర్విషయమ్ మనః।**
**స్నానం మనోమల త్యాగః।**
**శౌచం ఇంద్రియ నిగ్రహః।**

జ్ఞానము = సర్వే - సర్వత్రా సమదర్శనం. అభేదదర్శనము.
ధ్యానము = మనస్సును దృశ్య - లోక విషయములను అంతరమున రహితం చేయటం.
స్నానము = మనస్సు నుండి (కామ-క్రోధ-లోభ-మద-మాత్సర్య దోషములనే) మలమును తొలగిస్తూ శుభ్రం చేయడం.
శౌచము = ఇంద్రియములను విషయ - విషయవాసలనుండి నిగ్రహించటం. శుచి అయిన భావములతో మాత్రమే ఈ ఇంద్రియములను నియమించటము.

---

**4. బ్రహ్మామృతం పిబేత్,**
**భైక్ష్యం ఆచరేత్ దేహరక్షణే।**
**వసేత్ ఏకాంతికో భూత్వా చ,**
**ఏకాంతే ద్వైత వర్జితే॥**

**పానీయము** = 'బ్రహ్మతత్త్వజ్ఞానము' అనే రసమును త్రాగుచూ ఉండటము.

**భైక్ష్యం** = పరతత్త్వమును గురించిన సాధన కొరకై ఉపకరించే ఈ దేహమును రక్షించుకొనే యత్నములే భిక్షాటన.

**వాసము** = అనన్యభావనచే ఏకాంతం ఉండేదే నివసించవలసిన గృహము.

**ఏకాంతము = 'పరమాత్మయే ఈ సర్వదృశ్య రూపముగా కనబడుచున్నారు. ఇదంతా సహజముగా ఏకమే అయి ఉండి, అజ్ఞాన దృష్టిచే భిన్నంగా కనబడుతోంది'** - అనునదే ద్వైతత్యాగరూప **'ఏకాంతము'**.

---

**5. ఇత్యేవమ్ ఆచరేత్ ధీమాన్**
**స ఏవమ్ ముక్తిమ్ ఆప్నుయాత్।**
**జాతం-మృతం ఇదం దేహమ్**
**- మాతా - పితృ మలాత్మకమ్॥**

తల్లి - తండ్రుల దేహములనుండి బయల్వెడలే మలముతో పోల్చతగిన ఈ భౌతిక దేహములు రావవచ్చు - ఉండవచ్చు. పోవచ్చుగాక! ఈ దేహాంతర్గతుడగు జీవుని (లేక) దేహిని శివస్వరూపంగా (పైన చెప్పిన రీతిలో) దర్శిస్తూ ఉపాసించువారు **'ముక్తి'**ని తప్పకుండా పొందగలరు.

---

**6. సుఖ-దుఃఖాలయ అమేధ్యం**
**స్పృష్ట్వా స్నానం విధీయతే।**
**ధాతుబద్ధం మహారోగం**
**పాపమందిరమ్ అధ్రువమ్॥**

**ఈ పాంచభౌతిక దేహము :**

- సుఖదుఃఖములకు ఆలయము. తావు.
- అనేక దోషములతో కూడి, అపవిత్రమై ఉన్నది.
- చర్మము - మాంసము - మజ్జ - చీము - క్రొవ్వు - బొమికలు... ఇటువంటి

అపవిత్రమైన వస్తువుల సమూహము. సప్తధాతు నిర్మితము.
- గొప్ప రోగములకు ఆలవాలము.
- అనేక పాప విషయములకు మందిరము.

అందుచేత, ఈ భౌతిక దేహమును దేహాత్మభావనతో స్పృశిస్తే, వెంటనే మనో **మలనిర్మూలన స్నానం** చేస్తూ ఉండాలి. "సమస్త శరీరము శరీరములోని 'శరీరి'ని అఖండాత్మగా మననము చేయటము" - అనే ఔషధం సేవించాలి.

---

**7.** వికారాకార విస్తీర్ణం
స్పృష్ట్వా స్నానం విధీయతే।
నవద్వారం మలస్రావం
సదా కాలే స్వభావజమ్॥

అనేక వికారములతో నిర్మితమైన ఈ పాంచభౌతిక దేహమును "ఇదియే ఆత్మ" అను భావనతో స్పృశిస్తే, అందుకు ప్రాయశ్చిత్తముగా మలత్యాగ స్నానం చేయాలి. ఎందుకంటే ఈ శరీరము నవద్వారాలనుండి దుర్గంధ వస్తువులను స్రవింపజేసే స్వభావంగలది. కాలంతో పుట్టి, కాలంతో నశించేది. దేహసాక్షిని (దేహిని) వదలి భౌతికదేహంతో సంబంధం కలిగి ఉండటం మధురపదార్థం వదలి మలమును స్పృశించటము వంటిది.

---

**8.** దుర్గంధం దుర్మలోపేతం
స్పృష్ట్వా స్నానం విధీయతే।
మాతృ సూతక సంబంధం
సూతకే సహ జాయతే।

ఈ భౌతిక దేహములను చూచి, "నా భార్య - నా భర్త - నా పుత్రుడు" మొ॥ భావాలతో స్పృశించటం కూడదు. **శివభావంతోనే చూడాలి.** ఇది దుర్వాసనలతోను, దుర్మలములతోను కూడి ఉన్నది కదా! అందుకే స్పృశించగానే శివభావనా జలముతో స్నానం చేయాలి.

**అందుకే దేహము పుట్టినప్పుడు 'మాతృసూతకసంబంధము'** అనే పురిటి స్నానము నియమించడింది.

---

**9.** మృతసూతక జం దేహం
స్పృష్ట్వా స్నానం విధీయతే।
'అహమ్-మమ' ఇతి విణ్మాత్ర
లేప గంధాది మోచనమ్॥

పుట్టినప్పుడు - మరణించినప్పుడు కూడా అందుకే **'స్నానం చేయాలి'** అని - విధించబడింది.

జనన-మరణ సందర్భాలలో స్నానం - "నేను ఈ దేహమును ఇదినాది"...అనే అహమ్+మమ వ్యర్థ పదార్థాలతో ఏర్పడే మలముయొక్క పూత నుండి **'శివము'** అనే పరిశుభ్రస్నానంతో పరిశుద్ధపరచుకోవాలి-అను సూచకార్థము.

---

**10.** "శుద్ధశౌచమ్" ఇతి ప్రోక్తం
మృత్ – జల అభ్యాంతు 'లౌకికం'।
చిత్తశుద్ధికరం – శౌచం, వాసనాత్రయ నాశనం।
జ్ఞాన – వైరాగ్య మృత్తో యైః
క్షాళనాత్ 'శౌచమ్' ఉచ్యతే॥

శారీరక మట్టి - జలముతో మలమును తొలగించుకోవటానికి జనులు స్నానం చేస్తున్నారు. మంచిదే. అయితే ఇది భౌతిక శుద్ధి-శుచి కొరకు మాత్రమే!

అట్లాగే చిత్తమును ముఖ్యంగా శుద్ధి చేసుకోవాలి. ఎందుకు? "లోకవాసన-దేహవాసన - శాస్త్రవాసన"....అనబడే వాసనాత్రయ మలము తొలగటానికై - "జ్ఞానము - వైరాగ్యము" అనబడే మట్టి - జలములలో చిత్తమును క్షాళనముచేయటమే 'శౌచము' అయి ఉన్నది.

---

**11.** 'అద్వైత భావనా' భైక్ష్యం।
అభక్ష్యం 'ద్వైతభావనం'।
గురు, శాస్త్రోక్త భావేన
భిక్షోః భైక్ష్యం విధీయతే॥

'అద్వైతభావన'యే ఈ జీవునికి నిజమైన ఆహారము (భిక్ష).

'ద్వైతభావనయే తినగూడని (నిషిద్ధమగు) పదార్థము.

సద్గురువులు - సత్ శాస్త్రములు అందించే ఆప్తవాక్యముల భావనయే ఈ జీవభిక్షకునకు నిజమైన భిక్ష-ఆహారము. **'తత్త్వమ్-సోఽహమ్'** భావనయే జీవుడు పొందవలసిన నిజమైన భిక్ష. ('భి' = అంధకార, 'క్ష' = క్షయము).

---

**12.** విద్వాన్ స్వదేశమ్ ఉత్సృజ్య
సన్న్యాసానంతరం సతః
కారాగార వినిర్ముక్తః
చోరవత్ దూరతో వసేత్॥

ఒక గజదొంగ కారాగారంలో శిక్ష అనుభవించిన తరువాత చక్కటి బుద్ధితో (శిక్షానంతరం) ఆ కారాగారము నుండి వెలువడి, ఇక దూరంగా చక్కటి ప్రదేశంలో నివసిస్తాడేగాని, కారాగారానికి దగ్గిరగాగాని, లోనగాని ఉండాలని అనుకుంటాడా? లేదు.

అట్లాగే..., విద్వాంసుడైనవాడు ఆత్మజ్ఞానం సంపాదించుకున్న తరువాత **'నేను-నాది'** అనే కారాగారము త్యజించి 'సన్న్యాసము' అనే దూరప్రదేశంలో నివసిస్తాడు. (కారాగారము = Prison).

| | |
|---|---|
| **13.** అహంకార సుతం,<br>విత్త భ్రాతరం,<br>మోహ మందిరం,<br>ఆశా పత్నీం,<br>– త్యజేత్ యావత్,<br>తావత్ ముక్తో న సంశయః॥ | సన్న్యసించవలసినది దేనిని? భౌతికమగు భార్యాపుత్ర సోదర ఇత్యాదులనా? ఊహూ! కాదు. అవన్నీ సాధనకొరకేగాని, అసలైన సన్న్యాసము కాదు. మరి?<br>- **'అహంకారము'** అనే **కొడుకును.**<br>- **'ధనము-సంపద'** గురించి మోహము అనే **సోదరుని.**<br>- **'ఆశ'** అనే **భార్యను.**<br>వీటిని వాటి వాటి మూలములతో సహా త్యజించి ఉండాలి. వాటిని ఎంతెంతవరకు త్యజిస్తే, అంతంతవరకు 'ముక్తి' (Relief) చోటుచేసుకో గలదు. ఇందులో సందేహమే లేదు! |
| **14.** మృతా మోహమయీ మాతా।<br>జాతో బోధమయః సుతః।<br>సూతక ద్వయ సంప్రాప్తౌ<br>కథం సంధ్యామ్ ఉపాస్మహే? | సర్వము స్వస్వరూపాత్మగా దర్శించటం సమారంభమైతే, ఇక శాస్త్ర సాధనల ప్రయోజనము సిద్ధించినట్లే! **"సాధనలయొక్క అంతిమఫలం ఏమిటి?"**... అనునది పరిశీలిస్తే, **"సాధనముల ఆవశ్యకత ఇక లేకపోవటము. స్వాభావికంగానే సర్వత్రా స్వస్వరూపాత్మ దర్శనము"**- అయి ఉన్నది.<br>అట్టి ఆత్మసాక్షాత్కారము సముపార్జించుకొన్న దివ్యాత్మదర్శిని ఒక బాటసారి, "ఏమయ్యా! నీవు సంధ్యావందనము మొ॥ని నిర్వర్తించుచున్నట్లు కనబడటం లేదేం?" అని ప్రశ్నిస్తే, ఆ ఆత్మతత్త్వవిజ్ఞాని ఈ విధంగా సమాధానం చెప్పుచున్నారు.<br>- **"మోహము అనే మాత చనిపోయిందయ్యా! అందుచేత, "మైల".**<br>- **'భోదమయి-బోధరూపాత్మ-అనే పుత్రుడు పుట్టాడు అందుచేత పురుడు। ఈ విధంగా సూతకద్వయం ప్రాప్తించాయి. మరి సంధ్యోపాసన చేయలేను గదా!"** |
| **15.** హృదాకాశే చిత్ – ఆదిత్యః<br>సదా భాసతి భాసతి!<br>న అస్తమేతి న చ ఉదేతి।<br>కథం సంధ్యాం ఉపాస్మహే? | ఆ బ్రహ్మానంద ఆస్వాది ఇంకా ఇట్లా అంటున్నారయ్యా!<br>సంధ్యావనందనము "సూర్యోదయ-సూర్యాస్తమయ" సంధ్యాసమయాలలో కదా చేయవలసినది! అయితే<br>- నా హృదయాకాశములో చిద్ ఆదిత్య సూర్యుడు నిత్యోదయుడై భాసిస్తున్నారు. ఉదయాస్తమయములు లేక, - ఎల్లప్పుడు ప్రకాశిస్తున్నాడు. ఆ చిదానంద సూర్యుడుఅస్తమించటమూలేదు. ఉదయించటము లేదాయె! సంధ్యోపాసన ఎట్లా చేయాలి మరి? |
| **16.** "ఏకమేవ అద్వితీయం" – (బ్రహ్మ)<br>యత్ గురోః వాక్యేన నిశ్చితం,<br>ఏతత్ దేశాన్తమ్ ఇత్యుక్తం!<br>న మఠం। న వనాంతరమ్। | ఈ జీవుడు ఏకాంతము చేరితేనే ముక్తి. అనగా....? గురువాక్యమైనట్టి **'బ్రహ్మము సర్వదా ఏకము. అద్వితీయము. నీవు బ్రహ్మమే అయి ఉన్నావు'**....అనే మహావాక్యార్థమును సునిశ్చితం చేసుకోవటమే ఏకాంతము (లేక) దేశాంతరము. అంతేగాని ఇల్లు వదలి మఠము చేరటము కాదు. ఊరు వదలటమూ కాదు, అడవిలో ప్రవేశించటమూ కాదు, మరి! |
| **17.** అసంశయవతాం ముక్తిః।<br>సంశయావిష్ట చేతసామ్–<br>న ముక్తిః జన్మ జన్మాంతే।<br>తస్మాత్ విశ్వాసమ్ ఆప్నుయాత్॥ | (1) తత్త్వమ్ = నీవుగా కనిపించేదంతా ఆ బ్రహ్మమే!<br>(2) సోఽహమ్ = నేను బ్రహ్మమే!<br>ఈ ఉభయ మహావాక్యార్థముల విషయములో సర్వసందేహాలు తొలగిపోవటమే **ముక్తి.** బుద్ధి సందేహరహితం అయ్యేవరకు ఎన్ని జన్మలెత్తినా ముక్తి లభించే ప్రసక్తే లేదు. అందుచేత అట్టి స్వస్వరూపబ్రహ్మమునందు **విశ్వాసము** సంపాదించుకోవాలి. |
| **18.** కర్మత్యాగాత్ న సంన్యాసో।<br>న ప్రేష – ఉచ్చారణేన తు।<br>సంధౌ జీవ – ఆత్మనోః ఐక్యం<br>'సంన్యాసః' పరికీర్తితః॥ | కర్మలను త్యజించినంత మాత్రం చేత అది "సత్+న్యాసము = సన్న్యాసము" కాదు. సన్న్యాసము గురించి గొప్ప మాటలు చెప్పుకోవటము సన్న్యాసము కాదు. 'సన్న్యాసం మయా" అని ఉచ్చరించినంతమాత్రంచేత సన్న్యాసము రాదు. **ఈ జీవాత్మను పరమాత్మయందు ఐక్యము చేసి సందర్శించటమే సన్న్యాసము.** |

| శ్లోకము | అర్థము |
|---|---|
| **19.** **వమన-ఆహారవత్ యస్య<br>భాతి సర్వ ఈషణాదిషు,<br>తస్య అధికారః సంన్యాసే<br>త్యక్త దేహాభిమానినః॥** | ఒకడు తాను కక్కిన కూడును తింటానికి ఇష్టపడతాడా? లేదుకదా! ఆ విధంగా బ్రహ్మవేత్త - సర్వప్రాపంచకమైన అభిలాష-కోరికలపట్ల **"ఇవన్నీ నేను కక్కిన కూడువలె నానుండి బయల్వెడలుచున్నాయి. ఇవి నేనెందుకు స్వీకరించాలి"** అను దృష్టితో చూస్తాడు. అట్టివాడు దేహాభిమానము త్యజించినవాడై **'సన్న్యాసి'** అగుటకు సాధికారుడు అగుచున్నాడు. |
| **20.** **యదా మనసి వైరాగ్యం<br>జాతం సర్వేషు వస్తుషు,<br>తదైవ సన్న్యసేత్ విద్వాన్।<br>అన్యథా పతితో భావేత్॥** | ఎప్పుడైతే సర్వదృశ్య వస్తు-విషయ-వ్యవహారములపట్ల పూర్ణముగా వైరాగ్యము (Non Fondness) జనిస్తుందో, అప్పుడు ఆతడు (ఏ ఆశ్రమములో ఉన్నప్పటికీ) సన్న్యాసియే అగుచున్నాడు. అట్టి సమగ్ర - సంపూర్ణ వైరాగ్యము కలుగకపోయిందా...అప్పుడిక (బాహ్యమున సన్న్యాసము స్వీకరించి యున్నప్పటికీ) పతనము అనివార్యము. |
| **21.** **ద్రవ్యార్థమ్, అన్న-వస్త్రార్థం<br>యః ప్రతిష్ఠార్థమ్ ఏవ వా<br>సన్న్యసేత్-ఉభయభ్రష్టః।<br>స ముక్తిం నాప్తుమ్ అర్హతి॥** | ఎవ్వరైనా ద్రవ్యము లభిస్తుంది కదా అనియో, అన్న - వస్త్రముల కొరకో, శిష్యులు లభిస్తారనో, గొప్ప పేరు ప్రతిష్ఠలను దృష్టిలో పెట్టుకొనియో-భౌతికంగా సన్న్యసించాలని అనుకుంటున్నాడో, (లేక) కర్మ సన్న్యాసము స్వీకరిస్తాడో,- అట్టివాడు- కర్మావకాశములను సద్వినియోగము చేసుకోలేక, జ్ఞానమార్గము పట్టుబడక - **"ఉభయభ్రష్టుడు"** అగుచున్నాడు. ఆతడు ముక్తికి అర్హుడు కాలేక పోవుచున్నాడు. |
| **22.** **ఉత్తమా - <u>తత్త్వ చింతా</u> చ।<br>మధ్యమం <u>శాస్త్ర చింతనమ్</u>।<br>అధమా <u>మంత్రచింతా చ</u>।<br><u>తీర్థభ్రాంతిః</u> అధమాధమా॥** | **తత్త్వచింతన** → అన్నిటికంటే ఉత్తమోత్తమం.<br>**శాస్త్ర చింతన** → మధ్యమము.<br>**మంత్ర చింతన** → అధమము.<br>**తీర్థభ్రాంతి** (తీర్థయాత్ర చేసి ఆత్మను ఎరగాలనుకోవటం) → అధమాధమం. |
| **23.** **అనుభూతిం వినా మూఢో<br>వృథా బ్రహ్మణి మోదతే।<br>ప్రతిబింబిత శాఖాగ్ర<br>ఫలాస్వాదన మోదవత్॥** | ఏకమగు పరమాత్మయే ఈ అనేక నామ-రూపాత్మకమగు జగత్ రూపంగా కనిపిస్తున్నారు. (ఆ తీరుగా) **"పరమాత్మగా అనిపించటము"** అనే రూపముగల అనుభూతిని ప్రవృద్ధం చేసుకోకుండా బ్రహ్మము గురించి విని, మాట్లాడి, చదివి, ఆ మాత్రానికి **"బ్రహ్మము అర్థమైయ్యిందిలే"**....అని అనుకుంటే ఏమిలాభం? ఒక పళ్ళవృక్షము యొక్క నీళ్లలో కనిపించే ఛాయలో (Shadow in the water) నుండి పళ్ళు కోసుకోగలమా? నీడాకారము చూచి **"నేను పళ్ళను ఆస్వాదిస్తున్నాను"** అని అనుకుంటే అప్పుడు పళ్ళు తిన్నట్లు అవుతుందా? అవదు కదా! |
| **24.** **న త్యజేత్ యతిః ముక్తో<br>యో మాధూకర - మాతరం,<br>వైరాగ్య - జనకం, శ్రద్ధా - కళత్రం,<br>జ్ఞాన - నందనమ్॥** | ఏ యతి (లేక సన్న్యాసి అయితే) <u>భిక్షాటణము</u> అనే తల్లిని, <u>వైరాగ్యము</u> అనే తండ్రిని, <u>శ్రద్ధ</u> అనే భార్యను, <u>జ్ఞానము</u> అనే ఆనందమును విడువడో....అట్టివాడు 'ముక్తుడు' అగుచున్నాడు. సన్న్యాసాశ్రమము స్వీకరించినా కూడా, - అవి మరచిపోతే నిత్య సన్న్యాసి కాడు. ఆశ్రమ సన్న్యాసి మాత్రమే. (బిక్షాటనము = "అంతా కూడా పరమాత్మచే ప్రసాదించబడినదే" - అను భావన) |
| **25.** **ధనవృద్ధా, వయో వృద్ధా<br>విద్యావృద్ధాః తథైవ చ<br>తే సర్వే జ్ఞాన వృద్ధస్య<br>కింకరాః శిష్య కింకరాః॥** | **ధనవృద్ధుడు** (గొప్పసంపదగలవాడు), **వయోవృద్ధుడు** (పెద్దవయస్సు గలవాడు), **విద్యావృద్ధుడు** (గొప్పగొప్ప చదువులు Qualifications గలవాడు),..... ఇటువంటి వారంతా కూడా - **ఆత్మజ్ఞానవృద్ధునికి,** ఆతని సేవకులకు సేవకులవంటివారు అగుచున్నారు. |

**26. మన్మాయయా (మత్ మాయయా) మోహిత చేతసో**
**మామ్ ఆత్మానమ్ ఆపూర్ణమ్,**
**అలబ్ధవంతః।**
**పరం విదగ్ధ ఉదరపూరణాయ**
**భ్రమంతి కాకా ఇవ సూరయోఽపి!**

**మైత్రేయ మహర్షి :** హే పరమశివా! శాస్త్రజ్ఞానముచే ముక్తి లభించగలదు కదా!
**పరమశివుడు :** ఓ మైత్రేయ మహర్షీ! ఒక కాకి రోజంతాకూడా ఆహారము కొరకే ఆయా ప్రదేశాలు చుట్టివస్తూ ఉంటుంది. చూచారా? కొంతమంది శాస్త్రసమాచారము చే శూరులు అయి ఉండి కూడా, నాయొక్క మాయచే మోహితుడై, మోహ-బుద్ధికలవారగుచున్నారు. తమయందలి అస్మత్ శివాత్మస్వరూపము యొక్క అనుభవమును సుస్థిరీకరించుకోక, - ధన-జన-అధికార-సభాగౌరవ-ఉదరపోషణములకు మాత్రమే 'జీవించటము' వలన లభించిన సమయమంతా గడిపివేస్తున్నారు. సమస్త జీవులలో సర్వదా వేంచేసియున్న నన్ను దర్శించటము లేదు.
- అపూర్ణముగా ఉండిపోతున్నారు.
- "ఇంకా ఎప్పటికో లభించవలసినది" - అని తలచుచూ, శివత్వము పొందనివారై కాలమును వృధా చేసుకుంటున్నారు.

---

**27. పాషాణ – లోహ – మణి – మృణ్మయ విగ్రహేషు**
**పూజా – పునర్జనన భోగకరీ ముముక్షోః।**
**తస్మాత్ యతిః 'స్వహృదయార్చనమేవ' కుర్యాత్।**
**బాహ్యార్చనమ్ పరిహరేత్**
**అపునః భవాయ॥**

ఓ మైత్రేయో! కొందరు ముముక్షువులు రాయి - లోహము - మణి - మట్టిలలో తయారుచేసుకొన్న విగ్రహములను పూజించటానికై పరిమితులగుచున్నారు. అది పునర్జన్మల భోగములను పొడిగించుకుంటూనే పోవుచున్నదయ్యా!
అందుచేత...

యతి (లేక) యోగి (లేక) సన్న్యాసి (లేక) ముముక్షువు ఏమి చెయ్యాలంటావా? క్రమంగా 'బాహ్యార్చన'ను ఉపయోగించుకుంటూ అద్దానిని అధిగమిస్తూ, స్వహృదయము లోను - సర్వ హృదయాలలోను సర్వదా - సదా వేంచేసి యున్న శివతత్త్వమును తెలుసుకొని, గమనించి, దర్శించి ఉపాసించి అట్టి శివత్వము సిద్ధించుకోవాలి. జీవ స్వరూపమును అధిగమించి- 'శివస్వరూపులు' కావాలి.

---

**28. అంతఃపూర్ణో – బహిః పూర్ణో**
**పూర్ణకుంభ ఇవ అర్ణవే॥**
**అంతఃశూన్యో – బహిః శూన్యః**
**శూన్య కుంభ ఇవ అంబరే॥**

ఒకడు సముద్ర జలంలో బిందెను నింపి ఉంచితే బిందెలోపల - బయట సముద్రజలమునిండుగా ఉన్నట్లుగా, ఆత్మ సదా పూర్ణము. ఒక ఖాళీ బిందెయొక్క లోపల వెలుపల ఆకాశమే (Space) ఉండి ఉన్నట్లుగా- ఆత్మ సదా శూన్యము కూడా।
ఆత్మదర్శి బయట లోపల కూడా **"పూర్ణుడై, శూన్యుడై"** ప్రకాశమానుడగు చున్నాడు.

---

**29. మా భవ గ్రాహ్యభావాత్మా।**
**గ్రాహకాత్మా చ మా భవ।**
**భావనామ్ అఖిలాం త్యక్త్వా**
**యత్ శిష్టం(చిత్తం) తన్మయోభవ॥**

ఓ మైత్రేయ మహానుభావన్!
నీవు గ్రహించబడు వస్తువు కావద్దు. గ్రహించువాడవు కావద్దు! సర్వభావ - అభావములను దాటివేసి, ఆవల ఏది శేషించియున్నదో అట్టి ఆదిశేషశయనుడివి కమ్ము. తన్మయో భవ! ఆ శేషించి యున్నట్టిది నీవేగా అయి ఉండుము! ఇదియే శివతత్త్వానుభవం!

---

**30. ద్రష్టృ దర్శన దృశ్యాని**
**త్యక్త్వా వాసనయా సహ।**
**దర్శన ప్రథమా భాసమ్**
**ఆత్మానం కేవలం భజ॥**

**"చూచువాడు - చూడటము - చూడబడునది".** ('త్రిపుటి') అనబడే ఈ మూడిటిని వాటివాటి సంబంధమైన సంస్కార - వాసనలతో సహా అధిగమించివేసి, కేవల దృక్ - ప్రకాశరూపమగు ఆత్మ రూపమును ఉపాసిస్తూ, తన్మయుడవై ప్రకాశించుము.

---

**31. సంశాంత సర్వ సంకల్పా**
**యా శిలావత్ అవస్థితిః,**
**జాగ్రత్ – నిద్రా వినిర్ముక్తా**
**సా స్వరూపస్థితిః పరా– ॥**
**॥ఇతి॥**

సర్వ సంకల్పములు సశాంతించినవి అగుచుండగా; ఏ జాగ్రత్-స్వప్న-సుషుప్తులకు ఆవల ఉన్నట్టి శిలా శాంత అవస్థితి కలదో, - అట్టి 'పరే-ఆవల' స్వరూపస్థితి యందు సుస్థిరుడవై ఉండెదరు గాక!

**అని జగద్గురువగు మహాదేవుడు మైత్రేయ మహర్షికి ఆత్మ జ్ఞానమును విశదపరచారు.**

# తృతీయోధ్యాయః - స్వస్వరూప సందర్శన గానము

**1. అహమస్మి పరశ్చాస్మి।**
**బ్రహ్మాస్మి ప్రభవోస్మి అహమ్।**
**సర్వలోక గురుశ్చ అస్మి।**
**సర్వలోకేఽ స్మి।**
**సోఽ స్మ్యహమ్।।**

**శాకాయన్యమహర్షి : ఓ బృహద్రథా!**
**శ్రోతయొక్క స్వసహజాత్మరూప ధ్యానము-గానము ఏమిటో విను**
**నేనే నాలోని నేనై నేనుగా ప్రకాశిస్తున్నాను.**
సర్వమునకు పరమై (వేరై) **ఆవల, ఉండి ఉన్నది కూడా నేనే।**
బ్రహ్మము అని చెప్పబడుచున్నది నేనే! 'బ్రహ్మము' అయి ఉన్న నేనే ఈ **సమస్త జగత్తులుగా ప్రభవిస్తూ ఉన్నాను.**
సర్వము ప్రకాశింపజేస్తున్న పరబ్రహ్మము నేను. 'నేను' అని అనుకోవటానికి మునుముందే ఉన్నది నేనే।
సర్వలోకములలోని మహత్తరమైన వస్తువైన, సర్వలోకముల రూపముగా సందర్శించబడుచున్న ఆ ఆత్మ నేనే! నేను ఆత్మస్వరూపుడను!

---

**2. అహమేవాస్మి సిద్ధోఽ స్మి।**
**శుద్ధోఽ స్మి పరమోఽ స్మ్యహమ్।**
**అహమస్మి సదా సోఽ స్మి।**
**నిత్యోఽ స్మి విమలోఽ స్మ్యహమ్।।**

- నేనై యున్న నేనును నేనే!
- ఈ దృశ్యమును, దృష్టిని, మనో చిత్తములను, అహంకారమును నా కొరకై నేనే సిద్ధించుకొనుచున్నాను. **కనుక సిద్ధుడను.**
- అయినా కూడా సర్వదా సర్వమునకు ఆవల పరిశుద్ధుడనై ఉన్నాను. మలరహితుడను.
- నేనే సదా అన్నీ అయి, ఆవల కూడా నిండి ఉన్నాను. **సదా శివుడను.**
- నిత్యుడను. కాలనియామకుడనేగాని, కాలబద్ధుడను గాను. సదా **నిర్మలుడను. నిర్విషయుడను.**

---

**3. విజ్ఞానోఽ స్మి విశేషోఽ స్మి।**
**సోమోఽ స్మి సకలోఽ స్మ్యహమ్।**
**శుభోఽ స్మి। శోకహీనోఽ స్మి।**
**చైతన్యోఽ స్మి। సమోఽ స్మ్యహమ్।।**

తెలుసుకునేవాడిని నేనే! తెలియబడే విశేషమంతా కూడా నేనే! ఉభయము నాయొక్క **"సమగ్రరూపము"** లోని రెండు విశేషములు. సోమరాజు (జీవుడు), ఆ జీవునికి అనుభవము అయ్యే సమస్తము కూడా నేనే.
సర్వశుభంకరుడను! ఎట్టి వేదనలు లేనివాడను! శోకహీనుడను।
సర్వులతో సమస్వరూపమగు ఆత్మచైతన్యమే నా స్వరూపము!

---

**4. మానావమాన హీనోఽ స్మి।**
**నిర్గుణోఽ స్మి శివోఽ స్మ్యహమ్।**
**ద్వైత - అద్వైత విహీనోఽ స్మి**
**ద్వంద్వహీనోఽ స్మి। సోఽ స్మ్యహమ్।।**

నాకు మాన - అవమానములు రెండూ లేవు. ఆత్మస్వరూపుడనగు నేను గౌరవ-అగౌరవములచే క్రొత్తగా పొందేది లేదు. ఉన్నది పోగొట్టుకొనేది లేదు.
నిర్గుణుడను। సదాశివుడను। సర్వశుభంకరుడను।
నాకు వేరైనది ఎక్కడా ఏదీ లేదు। వేరుకానిదీ లేదు. ద్వంద్వహీనుడను. సర్వము నేనైన నేనే నేను। ఏదీ అవక, వేరై ఉన్న వాడను కూడా।

---

**5. భావ-అభావ విహీనోఽ స్మి।**
**భాసాహీనోఽ స్మి భాస్మ్యహమ్।**
**శూన్య అశూన్య ప్రభావోఽ స్మి।**
**శోభన - అశోభనోస్మ్యహమ్।।**

భావించువాడినగు నేను భావ - అభావములకు మునుముందే ఉన్నాను. భావన నాది గాని నేను కాదు. అందుచేత భావాభావ విహీనుడను.
నేను భాసించువాడను కాను. కానీ ఈ దేహ - దృశ్య - భావాదులుగా భాసిస్తున్నది, భాసింపజేస్తున్నది నేనే! నా ప్రకాశవిశేషాలే మనోబుద్ధి చిత్తాహంకారాలు కూడా!
ఇక్కడి శూన్యము అశూన్యములు నా ప్రభావములే! శోభ-అశోభ కూడా నాదే। నేనే।
ఈ సమస్తముగా శోభిస్తూ ఉన్నది నేనే।
నాకు అన్యమైనదేదీగా నేను శోభించటము లేదుకూడా.
ఈ సమస్తమునకు నేను అనన్యుడను.

**6.** తుల్య –అతుల్య విహీనోఽస్మి
నిత్య శుద్ధః సదా శివః।
సర్వ–అసర్వ విహీనోఽస్మి।
సాత్త్వికోఽస్మి సదాఽస్మ్యహమ్॥

నేను అయినదీ లేదు. నేను కానిది లేదు. నాతో సమానమైనదీ లేదు. నాకు సమానము కానిదీ లేదు.

- నిత్యశుద్ధుడను. జీవాత్మగా ఉన్న పరమాత్మను. 'పరమాత్మయే' అయి ఉన్న జీవాత్మను. సదాశివుడను!

నాకు సర్వము లేదు! అసర్వము లేదు! శుద్ధసాత్త్వికుడను! సదా సత్స్వరూపుడను!

---

**7.** ఏకసంఖ్యా విహీనోఽస్మి।
ద్విసంఖ్యావాన్ అహం న చ।
సత్ – అసత్ భేద హీనోఽస్మి।
సంకల్ప రహితోఽస్మ్యహమ్॥

నాకు ఏకము లేదు! రెండు అనునది లేదు. నాకు రెండవది లేదు. '2' సంఖ్యను కాను! జీవాత్మ-పరమాత్మలనబడే రెండు ధర్మములు నాకు లేవు. ఉభయత్రా ఏకస్వరూపుడను.

నాకు ఉనికి - లేమి అనే సత్ - అసత్ భేదము లేదు. సర్వసంకల్పములకు మునుముందే ఉన్నవాడను! కనుక నేను **సంకల్పరహితుడను. సంకల్పాతీతుడను. సంకల్పములకు 'సాక్షి'ని. సంకల్పములకు జననస్థానమును.**

---

**8.** నానాత్వభేద హీనోఽస్మి।
హి అఖండానంద విగ్రహః।
న అహమస్మి। న చ అన్యోఽస్మి।
దేహాది రహితోఽస్మ్యహమ్॥

ఏకమగు పరబ్రహ్మమే స్వస్వరూపంగా కలిగి ఉండటంచేత నేను ఆత్మ-అనాత్మ భేదమనుదే లేనివాడను. అఖండరూపుడను.

(అహమ్ భానకు ఉత్పత్తి స్థానము - సాక్షి అగుటచే) నేను అహమ్ స్వరూపమునుకాను. వేరైన అన్యస్వరూపుడనుకాను, కేవలస్వరూపుడనగు నేను దేహము మొ॥వి లేనివాడను. అవన్నీ నాకు ఉపకరణములు.

---

**9.** ఆశ్రయ ఆయాశ్రయ హీనోఽస్మి।
ఆధార రహితోఽస్మి అహమ్।
బంధ–మోక్షాది హీనోఽస్మి।
శుద్ధబ్రహ్మాస్మి సోఽస్మ్యహమ్॥

నన్ను ఆశ్రయించినదీ లేదు. ఆశ్రయించనిదీ లేదు. నాకు ఆధారమంటూ మరొకటేదీ లేనివాడను. నాకు బంధము లేదు. కాబట్టి మోక్షమనబడేది కూడా లేదు. సదా **శుద్ధ బ్రహ్మమే నేను!**

---

**10.** చిత్తాది సర్వహీనోఽస్మి।
పరమోఽస్మి। పరాత్–పరః।
సదా విచార రూపోఽస్మి।
నిర్విచారోఽస్మి సోఽస్మ్యహమ్॥

నాకు మనో-బుద్ధి-చిత్త-అహంకారాలు అనబడేవేవీ లేవు. వాటన్నిటినీ ఆవల ఉన్నవాడిని. ఆవలకు కూడా వేరై ఉన్నవాడను. 'పరము'నకు కూడా పరమై ఉన్నవాడిని. (I am the beyond to even beyond)

చిదానంద రూపుడను. అందుచేత విచారణా స్వరూపుడను అయి కూడా, - సదా నిర్విచారస్వరూపుడన. విచారణకు ఆవల ఉన్నవాడను.

---

**11.** 'అ' కార 'ఉ' కార రూపోఽస్మి
'మ' కారోఽస్మి సనాతనః
ధ్యాతృ–ధ్యాన విహీనోఽస్మి
ధ్యేయహీనోఽస్మి సోఽస్మ్యహమ్॥

'అ'కార 'ఉ'కార రూపమగు పరమాత్మను నేనే! పరస్వరూపుడను.

'మ' కారమగు సనాతన 'ఇహ' స్వరూపుడను కూడా! అయితే ధ్యానము చేయువాడు, ధ్యానము (Thinker Thought)- రెండు లేనివాడను. ధ్యానము చేయబడు విషయ వ్యవహారములు నాకు లేవు! సోఽహమ్। అదియే నేను.

---

**12.** సర్వపూర్ణ స్వరూపోఽస్మి।
సత్–చిత్–ఆనంద లక్షణః।
సర్వతీర్థ స్వరూపోఽస్మి।
పరమాత్మాస్మి అహం శివః॥

ఈ సర్వమును నిండియున్న పూర్ణస్వరూపుడను. సత్-చిత్-ఆనందములు నా స్వరూపముయొక్క లక్షణములు (qualities). సర్వతీర్థములు నా స్వరూపమే. నేనే సర్వ తీర్థములలో ఆరాధించబడుచున్నాను. పరమాత్మను। శివస్వరూపుడను। లక్ష్య-అలక్ష్యములు లేని వాడను! నాశనమంటూ లేనట్టి నిత్యానుభవ స్వరూపుడను.

---

**13.** లక్ష్య–అలక్ష్య విహీనోఽస్మి।
లయహీన రసోఽస్మ్యహమ్।
మాతృ–మాన విహీనోఽస్మి।
మేయ హీనః (అమేయమ్) శివోఽస్మ్యహమ్॥

ప్రమాతృ-ప్రమాణములు లేనివాడను. నిరూపించబడేది - నిరూపణలు లేనివాడను. అమేయుడను. నాకు వేరై మరొకటేదీ ఎక్కడా లేనట్టి **శివానందస్వరూపుడను. అప్రమేయుడను.**

| | |
|---|---|
| **14.** **న జగత్ సర్వ ద్రష్టాస్మి।**<br>**నేత్రాది రహితోఽ స్మ్యహమ్।**<br>**ప్రవృద్ధోఽ స్మి। ప్రబుద్ధోఽ స్మి।**<br>**ప్రసన్నోఽ స్మి। పరోఽ స్మ్యహమ్॥** | నేను జగత్తును కాను. జగద్రష్టనుకాను. ఆ ద్రష్టను భావనచే కల్పించుకొను చున్నట్టి దృక్ స్వరూపుడు. నేత్రములు మొదలైన ఇంద్రియములకు పరిమితుడనుగాను. అవన్నీ లేనప్పుడుకూడా ఉన్నవాడను. సర్వత్రా ప్రవృద్ధి పొందుచున్నది నేనే! ప్రబోధస్వరూపుడను. నిత్యానంద స్వరూపుడు. సర్వమునకు పరమై, సర్వము ఆనందము కొరకై కల్పించుకొనుచున్న వాడను! |
| **15.** **సర్వేంద్రియ విహీనోఽ స్మి-**<br>**సర్వ కర్మకృత్ అపి అహమ్।**<br>**సర్వవేదాంత తృప్తోఽ స్మి।**<br>**సర్వదా సులభోఽ స్మ్యహమ్॥** | సర్వకర్మలు నిర్వర్తిస్తూ ఉన్నది నేనే అయి ఉండి కూడా, ఇంద్రియ రహితుడను. తెలియబడేదంతా తెలుసుకొంటూ ఆనందించువాడను. సర్వసులభుడను! సమస్తజీవులను తెలిసియే ఉన్నవాడను. 'నేను' తెలియనివారు ఎవ్వరుంటారు? ఎవ్వరూ ఉండరు? |
| **16.** **ముదిత - అముదితాభ్యోఽ స్మి।**<br>**సర్వ మౌన ఫలోఽ స్మ్యహమ్।**<br>**నిత్య చిన్మాత్ర రూపోఽ స్మి।**<br>**సదా సత్-చిత్ మయోఽ స్మ్యహమ్॥** | ఆనందించువాడను, ఆనందాతీతుడను కూడా. సర్వ విషయములపట్ల మౌనము వహించినప్పుడు కూడా శేషించి ఉన్నవాడను. జాగ్రత్. స్వప్న - సుషుప్తులు నా ఎరుక యొక్క విన్యాసములే. కనుక **నిత్య చిన్మాత్ర రూపుడను.** సదా సత్ - చిత్ మయుడనై ఉంటున్నాను! |
| **17.** **యత్ కించిదపి హీనోఽ స్మి।**<br>**స్వల్పమపి అవినాస్మ్యహమ్।**<br>**హృదయ గ్రంథి హీనోఽ స్మి।**<br>**హృదయాంభోజ మధ్యగః॥** | 'నాది' అనునది ఎక్కడా ఏదీ లేనివాడను. స్వల్పమై ఉన్నది, హీనమై ఉన్నది కూడా నేనే.<br>వినాశనము అనునదే లేనివాడను. నాకు హృదయగ్రంథులు (సంతోషము-దుఃఖము- ఆవేశము-ఆశయము ఇత్యాదులు) లేనివాడను. అయితే హృదయ కమలమధ్యగతుడనై ఉన్నది నేనే! |
| **18.** **షడ్వికార (షట్ వికార) విహీనోఽ స్మి**<br>**షట్ కోశరహితోఽ స్మ్యహమ్।**<br>**అరి షట్ వర్గ ముక్తోఽ స్మి।**<br>**అంతరాత్ అంతరోఽ స్మ్యహమ్॥** | - నాకు షట్ వికారములు లేవు. ఆశ్రయించటము, జన్మించటము, బాల్యము, యౌవనము, వార్థక్యము, మరణము - అను వికారములు నాకు లేవు.<br>- అన్నమయ-ప్రాణమయ-మనోమయ - విజ్ఞానమయ - ఆనందమయ ఆనందాతీతమయ షట్ కోశములు కూడా నాకు లేవు.<br>- కామ - క్రోధ - లోభ - మోహ - మద - మాత్సర్యములచే స్పృశించబడని కేవలీ రూపుడను!<br>- హృదయ - అంతరారంతర చైతన్య స్వరూపుడను! |
| **19.** **దేశ కాల విముక్తోఽ స్మి।**<br>**దిగంబర సుఖోఽ స్మ్యహమ్।**<br>**నాస్తి బంధ విముక్తోఽ స్మి।**<br>**'న'కార రహితోఽ స్మ్యహమ్॥** | - నేను దేశ - కాలములచే బద్ధము కానట్టి ఆత్మస్వరూపుడను!<br>- సర్వదిక్ ఆకాశస్వరూపుడను! సుఖ స్వరూపుడను.<br>- బంధముగాని ముక్తిగాని లేనివాడను.<br>- 'లేను' అనేది లేనట్టి స్వరూపుడను. నేను ఉండని క్షణముగాని, కాలము గాని - లేదు. 'నరత్వము' అనునదిగా అగువాడనుకాను. |
| **20.** **అఖండాకాశ రూపోఽ స్మి-హి**<br>**అఖండాకారమస్మి అహమ్।**<br>**ప్రపంచముక్త చిత్తోఽ స్మి।**<br>**ప్రపంచ రహితోఽ స్మ్యహమ్॥** | అఖండాకాశ స్వరూపుడను. అఖండాకార రూపుడను, ప్రపంచమే లేనట్టి చిత్తము కలవాడను. నాకు ప్రపంచమనునదే లేదు. చిదానంద స్వరూపుడను. |
| **21.** **సర్వప్రకాశ రూపోఽ స్మి।**<br>**చిన్మాత్ర జ్యోతిరస్మ్యహమ్।**<br>**కాలత్రయ విముక్తోఽ స్మి।**<br>**కామాది రహితోఽ స్మ్యహమ్॥** | సర్వమును ప్రకాశింపజేయు స్వరూపుడను. అన్నిటినీ 'ఎరుక' అనే దీపముతో వెలుతురు ప్రసరింపజేసే చిన్మాత్రజ్యోతి స్వరూపుడను. త్రికాలాబాధ్యుడు. భూత-వర్తమాన-భవిష్యత్‌లకు ఆవల ఉన్నవాడను. నాకు కామము-కావలసినది అంటూ ఏదీ లేదు. వదలవలసినదీ లేదు, పట్టించుకోవలసినదీ లేదు. |

**22. కాయికాది విముక్తోఽస్మి**
**నిర్గుణః కేవలోఽస్మ్యహమ్।**
**ముక్తి హీనోఽస్మి, ముక్తోఽస్మి।**
**మోక్షహీనోఽస్మి అహం సదా।**

ఈ భౌతిక శరీరముల విషయానికివస్తే, - **ఇవి నాకుఎప్పుడూ లేవు.** కనుక నిత్యదేహ విముక్తుడను. **విదేహుడను.**

గుణములకు మునుముందే నేనున్నాను. అట్టి గుణాతీతుడగు నేను సదా నిర్గుణడను। కేవల స్వరూపుడను. నాకు బంధమే లేదు. నిత్యముక్తుడను. కనుక ముక్తి యొక్క ఆవశ్యకత ఏముంటుంది? బంధము లేనివానికి మోక్షమేముంటుంది? కనుక ముక్తి - మోక్షములకు నేను విషయమే కాను.

---

**23. సత్య – అసత్యాది హీనోఽస్మి**
**సన్మాత్రాన్నాస్మ్యహం సదా**
**(సత్ మాత్రాత్ న అస్మి అహం సదా)**
**గంతవ్య దేశ హీనోఽస్మి**
**గమనాది వివర్జితః॥**

సత్య-అసత్యములకు అతీతుడైనవాడను. స్వప్నములో సత్యమేమున్నది? స్వప్నము తనదైనవాడు - స్వప్నమునకు అతీతుడే కదా!

కేవల సత్ స్వరూపుడను. సత్ (ఉనికి)కి కూడా ఆవలివాడను. (సత్ మాత్రాతీతుడను).

నేను ఒకచోట నుండి మరొకచోటికి వెళ్ళువాడను కాదు! రాక-పోకలు లేనివాడను. (I am always there where I am ever)

---

**24. సర్వదా సమరూపోఽస్మి।**
**శాంతోఽస్మి పురుషోత్తమః।**
**<u>ఏవం స్వానుభవో యస్య</u>**
**<u>'సోఽహమ్' అస్మి న సంశయః॥</u>**

సర్వదా సమరూపుడను। ఏకరూపుడను। పరమశాంతుడను. పురుషోత్తముడను. ఉత్తమ పురుషను ('I' at its absolute). స్వానుభవం చేత నేను అదియే! ఆత్మయే! పరమాత్మయే! ఈ సమస్తము నేనే। నేను కానిది ఏదీ లేదు. క్రొత్తగా కావలసినదీ లేదు.

**నాగురించిన సందేహమేదీ నాకు లేదు.**

---

**<u>ఫలశృతి</u>**

యః శృణోతి సకృద్వాపి (సకృత్ వ అపి)
<u>బ్రహ్మైవ భవతి స్వయం।</u>
<u>బ్రహ్మైవ భవతి స్వయం॥</u>

**<u>ఇతి మైత్రేయోపనిషత్।</u>**
**<u>ఓం శాంతిః శాంతిః శాంతిః॥</u>**

**<u>ఫలశృతి</u>**

ఎవ్వరీ బ్రహ్మతత్త్వ గానము శ్రద్ధగా వింటారో వారు స్వయముగా బ్రహ్మమే అగుచున్నారు.

'నేను బ్రహ్మమే' అని గమనించి, ఆస్వాదిస్తున్నారు.

***<u>ఇతి మైత్రేయోపనిషత్ ।</u>***
***<u>ఓం శాంతిః శాంతిః శాంతిః॥</u>***

# మైత్రేయోపనిషత్ - నేనెవరై ఉన్నాను? "స్వస్వరూపాత్మ పూజ"

ఓం అహమస్మి - పరశ్చాస్మి।
బ్రహ్మాస్మి।
ప్రభవోస్మ్యహమ్।
సర్వలోక। గురుశ్చాస్మి।
సర్వలోకేఽస్మి
సోఽస్మ్యహమ్। 6

అహమేవాస్మి।
సిద్ధోఽస్మి।
శుద్ధోఽస్మి।
పరమోస్మ్యహమ్।
అహమస్మి।
సదా సోఽస్మి।
నిత్యోఽస్మి।
విమలోస్మ్యహమ్। 14

విజ్ఞానోఽస్మి।
విశేషోఽస్మి।
సోమోఽస్మి।
సకలోస్మ్యహమ్।
శుభోఽస్మి।
శోకహీనోఽస్మి।
చైతన్యోఽస్మి।
సమోఽస్మ్యహమ్। 22

మానావమాన హీనోఽస్మి।
నిర్గుణోఽస్మి ।
శివోఽస్మ్యహమ్ ।
ద్వైతాద్వైత విహీనోఽస్మి ।
ద్వంద్వ హీనోఽస్మి ।
సోఽస్మ్యహమ్। 28

భావాభావవిహీనోఽస్మి ।
భాసాహీనోఽస్మి ।
భాస్మ్యహమ్ ।
శూన్యాశూన్య ప్రభావోఽస్మి।
శోభనాశోభనోస్మ్యహమ్। 34

తుల్యాతుల్య విహీనోఽస్మి
నిత్యశుద్ధః సదాశివః ।
సర్వాసర్వ విహీనోఽస్మి ।
సాత్త్వికోఽస్మి ।
సదాఽస్మ్యహమ్ । 38

ఏకసంఖ్యావిహీనోఽస్మి ।
ద్విసంఖ్యావాన్ అహమ్ న చ ।
సదసద్భేద హీనోఽస్మి ।
సంకల్పరహితోఽస్మ్యహమ్ । 42

నానాత్వభేద హీనోఽస్మి
(హి) అఖండానంద విగ్రహః
నాఽహమస్మి-న చ అన్యోఽస్మి।
దేహాది రహితోఽస్మ్యహమ్।। 46

ఆశ్రయ-అనాశ్రయ హీనోఽస్మి।
ఆధారరహితోఽస్మ్యహమ్।
బంధమోక్షాది హీనోఽస్మి।
శుద్ధబ్రహ్మాస్మి-సోఽస్మ్యహమ్ ॥ 50

చిత్తాది సర్వహీనోఽస్మి।
పరమోఽస్మి పరాత్పరః।
సదా విచారరూపోఽస్మి।
నిర్విచారోఽస్మి సోఽస్మ్యహమ్ ॥54

'అ' కార 'ఉ' కార రూపోఽస్మి।
'మ' కారోఽస్మి సనాతనః।
ధ్యాతృ-ధ్యాన విహీనోఽస్మి।
ధ్యేయహీనోఽస్మి-సోఽస్మ్యహమ్।। 58

సర్వపూర్ణ స్వరూపోఽస్మి।
సచ్చిదానంద లక్షణః।
సర్వతీర్థ స్వరూపోఽస్మి।
పరమాత్మాస్మ్యహం శివః।
లక్ష్యాలక్ష్య విహీనోఽస్మి।
లయహీనరసోఽస్మ్యహమ్।
మాతృ మాన విహీనోఽస్మి।
మేయహీనః-శివోఽస్మ్యహమ్ 66

న జగత్సర్వద్రష్టాఽస్మి।
నేత్రాది రహితోస్మ్యహమ్।
ప్రవృద్ధోఽస్మి ప్రబుద్ధోఽస్మి।
ప్రసన్నోఽస్మి పరోస్మ్యఽహమ్॥ **70**

సర్వేంద్రియవిహీనోఽస్మి।
సర్వకర్మ కృదప్యహమ్।
సర్వవేదాంతతృప్తోఽస్మి।
సర్వదా సులభోస్మ్యహమ్॥ **74**

ముదితాముదితాభ్యోఽస్మి।
సర్వమౌనఫలోఽస్మ్యహమ్।
నిత్యచిన్మాత్రరూపోఽస్మి।
సదా సచ్చిన్మయోఽస్మ్యహమ్॥ **78**

యత్కించిదపి హీనోఽస్మి।
స్వల్పమప్యవినాస్మ్యహమ్।
హృదయ గ్రంథి హీనోఽస్మి।
హృదయాంభోజ మధ్యగః॥ **82**

షడ్వికారవిహీనోఽస్మి।
షట్కోశరహితోఽస్మ్యహమ్।
అరిషడ్వర్గముక్తోఽస్మి।
అంతరాత్ అంతరోస్మ్యహమ్॥ **86**

దేశకాల విముక్తోఽస్మి।
దిగంబరసుఖోఽస్మ్యహమ్।
నాస్తి బంధవిముక్తోఽస్మి।
నకార రహితోఽస్మ్యహమ్॥ **90**

అఖండాకాశరూపోఽస్మి।
(హి) అఖండాకారమస్మ్యహమ్।
ప్రపంచముక్త చిత్తోఽస్మి।
ప్రపంచరహితోఽస్మ్యహమ్॥ **94**

సర్వప్రకాశ రూపోఽస్మి।
చిన్మాత్రజ్యోతిరస్మ్యహమ్।
కాలత్రయవిముక్తోఽస్మి।
కామాది రహితోఽస్మ్యహమ్॥ **98**

కాయికాది విముక్తోఽస్మి।
నిర్గుణః కేవలోస్మ్యహమ్।
ముక్తిహీనోఽస్మి ముక్తోఽస్మి।
మోక్షహీనోఽస్మ్యహమ్ సదా॥ **102**

సత్యాసత్యాది హీనోఽస్మి।
సన్మాత్రాన్నాస్మ్యహం సదా।
గంతవ్యదేశ హీనోఽస్మి।
గమనాది వివర్జితః। **106**

సర్వదా సమరూపోఽస్మి
శాంతోఽస్మి పురుషోత్తమః॥ **108**

---

ఫలశ్రుతి

ఏవం స్వానుభవో యస్య
సోఽహమస్మి న సంశయః॥

---

యః శృణోతి సకృద్వాపి
బ్రహ్మైవ భవతి స్వయమ్।
బ్రహ్మైవ భవతి స్వయమ్॥

---

<u>ఇత్యుపనిషత్</u>

<u>మైత్రేయోపనిషత్ సమాప్తా।</u>

<u>ఉపనిషత్ మాతాభ్యాం నమః॥</u>

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 10 మైత్రేయోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



### బృహద్రథుడు - పౌరాణిక విశేషాలు

**వర్తమాన ఉపనిషత్ : ఇక్ష్వాకు వంశపు రాజు.**

**భారతము** : బృహద్రథుడు ఉపరిచరవసువు కుమారుడు.

**భాగవతము** : దోమపాదుని వంశమువాడు. 'పృథులాక్షుడు' అను రాజుకు కుమారుడు. ఈయన కుమారుడు కుశాగ్రుడు.

**భాగవతము** : ఒకరాజు. ఇతని కుమారుడు పురంజయుడు.

**భాగవతము** : అశోకుని వంశమువాడైన శతధన్వుని కుమారుడు.

**భాగవతము** : దూర్వుని పుత్రుడైన నిమి తనయుడు. ఇతని కుమారుడు సుదాసుడు.

**భారతము** : బృహద్రథుడు మగధరాజు. ఈతని పత్నులు కాశీరాజు కుమార్తెలు అయిన "గవల, వార"లు. చాలా కాలం సంతానము లేకపోవటము వలన అనేక వ్రతములు నిర్వర్తించారు.

ఒక సందర్భములో చూత వృక్షము క్రింద తపస్సు చేసుకుంటున్న కౌశికమునిని పుత్రసంతానము కొరకై అభ్యర్థించారు. అప్పుడు ఆ ముని నేలపై వ్రాలిన ఒక మామిడి పండును మంత్రించి "ఈ ఫలము వలన నీకు ఒక కుమారుడు కలుగగలడు" – అని దీవించారు. అప్పుడు బృహద్రథుడు మామిడి పండును ఇద్దరు భార్యలకు ఇచ్చారు. వారు ఆ పండును సగముగా చీల్చి ఉభయులు తిన్నారు. 10 నెలల శిశువు జనించారు. ఆ వికృతరూపులను 'దాది' చేత గృహద్వారము వద్ద పారవేయించారు.

జర అనే రాక్షసి "ఇది నాకు బలిగా ఇస్తున్నారు" – అని భావించి రెండు శరీర భాగములను నొక్కిబట్టి అదుమగా, ఒక మగ శిశువు రూపు దిద్దుకొన్నది. ఆ శిశువు బరువు మోయలేక జర ఎటో వెళ్ళిపోయింది. ఆ శిశువు బిగ్గరగా ఏడువగా ఒక ముసలి దాది ఆ శిశువును తల్లులకు చేర్చి – 'జర' చేసిన 'సంధము' వివరించింది. ఆతడే జరాసంధుడు.

ఆ జరాసంధుడు 'జర' అనే రాక్షసి పేరుతో ప్రతి సంవత్సరము ఉత్సవము జరిపించేవాడు. జరాసంధుడు పెద్ద అయిన తరువాత బృహద్రథుడు వానప్రస్థమునకై తపోవనమునకు వెళ్లారు.

## శాకల్య మహర్షి గురించి - పౌరాణిక విశేషాలు

**బ్రహ్మాండ పురాణము** : శాకల్యుడు ఒక ఋషి. 'పరశువు' అనే రాక్షసుడు ఒక బ్రాహ్మణుని రూపముగా వచ్చి, శాకల్యుని ఆశ్రమమునకు ఎదురుగా నిలచెను. "ఒక శాకల్య మహర్షీ! నాకు భిక్ష!" .... అని అరచాడు. మహర్షి ఎంతగా అన్నము పెట్టినను "ఇది చాలదు. నాకు ఇంకా ఆకలి" అని అరవసాగాడు.

**శాకల్య ఋషి** : ఎవరు నీవు?

**పరశువు** : నేను ఒక రాక్షసుడను. అతిథిగా వచ్చాను. నాకు ఆకలి ఇంకా తీరలేదు. నిన్ను కూడా తింటాను.

**శాకల్య ఋషి** : నేను ఆత్మతత్త్వోపాసకుడను. నన్ను తినటము నీకు సాధ్యమయే పని కాదు. నా దగ్గిర ఉన్న ఆహారమంతా నీకు ఇచ్చివేస్తాను. అతిథిగా స్వీకరించి వెళ్ళిపో. నన్ను బ్రహ్మాది దేవతలు ఎప్పుడూ రక్షిస్తూ ఉంటున్నారు కాబట్టి ఇంతకు మించి నీకు కూడా త్రోవలేదు కూడా.

అయినాసరే ఆ పరశువు రాక్షసుడు శాకల్యఋషిని మ్రింగటానికి దగ్గరకు వెళ్ళాడు. అప్పుడు ఋషి వేయి తలలతో, రెండువేల చేతులతో కనిపించారు.

**పరశు రాక్షసుడు** : ఓ ఋషిపుంగవా! మీరు సామాన్యులు కారని నేను ఒప్పుకొంటున్నాను. నన్ను క్షమించండి. దయతో నాకు భిక్ష ప్రసాదించండి.

**శాకల్య ఋషి** : ఓ పరశూ! అందుకు ఉపాయము చెపుతాను. గౌతమీ నదీ తీరానికి వెళ్లి స్నానంచేసి అక్కడ సరస్వతీ దేవిని ప్రార్థించు. ఆ జగజ్జనని నీకు "జ్ఞానము" అనే అమృతాహారమును ప్రసాదించగలదు

**భాగతము** : శాకల్య ఋషి 'సౌభరి' అను బ్రహ్మజ్ఞాని యొక్క కుమారుడు. తాను ఋగ్వేదమును అమూలాగ్రము అధ్యయనము చేసి, ఐదువిధములుగా విభజించి తన శిష్యులైనట్టి - వాత్స్యుడు, మౌద్గల్యుడు, శాలీయుడు, గోముఖుడు, శిఖరుడు - అను వారలకు ఉపదేశించాడు. వీరు 'జాతకర్ణి' అను వానికి ఉపదేశించారు. ఇందలి శాకాయన్య మహర్షి శాకల్యులవారే అయిఉండవచ్చు - అని కొందరు పురాణశాస్త్రవేత్తల అభిప్రాయము.

## మైత్రేయ మహర్షి గురించి - పౌరాణిక విశేషాలు

**భాగవతము** : వనవాసము చేస్తున్న పాండవులను చూచిన మైత్రేయమహర్షికి మనస్సు ద్రవించింది. వెంటనే హస్తినాపురము వచ్చి ధృతరాష్ట్ర మహారాజును దర్శించారు. ధృతరాష్ట్రుడు "నా కుమారులను ఆశీర్వదించండి" - అని అడిగారు. అప్పుడు మైత్రేయుడు "ఓ మహారాజా! ధృతరాష్ట్రా! పాండవులు నిర్మల హృదయులు. మంచివారితో శత్రుత్వము సర్వదా అనర్థదాయకము. మీరు మీ కుమారుడు దుర్యోధనుని క్షేమము నిజముగా కోరితే, - పాండవులతో స్నేహమును ఆశ్రయించండి".

అది విని దుర్యోధనుడు పక పకా నవ్వాడు.

**మహర్షి** : ఓ ధృతరాష్ట్ర మహారాజా! శ్రీకృష్ణుడు ధర్మ పక్షపాతి. ఆయన పాండవులకు తోడుగా ఉన్నంతవరకు మీరంతా వారిని ఏమీ చేయలేరు. మీరు, మీ ప్రజలు సుఖంగా ఉండతలచుకొంటే, మీ దుర్మార్గపు యోచనలనుండి విరమించండి.

ఆ మాటలు విని దుర్యోధనుడు - ఎగతాళిగా గేలిచేస్తూ చేతివ్రేళ్ళు చూపించి, తొడలు సడలించాడు.

మైత్రేయ మహర్షికి ఆ ఎకసెక్కము చూచి కోపం వచ్చింది. "ఓ దుర్యోధనా! భీముని గదతో నీ తొడలు విఱుగగలవు. 'కిమీరుడు' అనే రాక్షసుని భీముడు సంహరించటము చూచాను. కనుక జాగరూకులై ఉండండి.

అప్పుడు ధృతరాష్ట్రుడు, "మహర్షీ! దయతో మీ శాపము ఉపసంహరించండి!" అని బ్రతిమలాడాడు.

**మహర్షి** : నేను శపించటము లేదు. సూచిస్తున్నాను. అంతే. ఇప్పటికైనా బుద్ధి కలిగి ఉంటే, మీ దుర్యోధనునికి మంచిది.

**ఆ తరువాత శ్రీకృష్ణుని ఆజ్ఞను అనుసరించి విదురునికి ధర్మముగురించి, తత్త్వము గురించి బోధించారు.**

**ఇక మనము ఉపనిషత్ అధ్యయనములో ప్రవేసిస్తున్నాము.**

-----

# మైత్రేయోపనిషత్ ప్రారంభము
# ప్రథమోధ్యాయః - బృహద్రథ వైరాగ్యము

**'ఓం' ఓం సంజ్ఞార్థ స్వరూపుడగు పరమాత్మకు నమస్కరిస్తూ....!**

ఇక్ష్వాకు వంశములో బృహద్రథుడు అనే మహారాజు ఉండేవారు. ఆయన మహాప్రాజ్ఞుడు. ధర్మనిరతుడు. ప్రజారంజకంగా ప్రజలను పాలిస్తూ ఉండేవారు.

అనేక సంవత్సరాలు ఆయన పాలనలో ప్రజలు సుఖ శాంతులతో, ఐశ్వర్య ఆనందములతో ఉండేవారు. ఆయన ఉత్తమ రాజుగా లోకప్రసిద్ధుడైనారు. **(స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతమ్।)**

ఒకానొక సమయంలో....

ఆ మహారాజు ఇట్లా ఆలోచించసాగారు. - **"ఈ దేహము శాశ్వతమా? కాదు కదా! ఈ రాజ్యాధికారములు, ఇంద్రియానందము, పదవులు, పేరు ప్రతిష్ఠలు...ఇవన్నీ భ్రమాత్మకము. అశాశ్వతము. కాలబద్ధము. ఎప్పటికోఅప్పటికి జీవుడనగు నేను దేహముతో బాటే అన్నీ వదలవలసినదే కదా! అందుచేత నేను ఇక ఇప్పుడే ఇవన్నీ త్యజించెదనుగాక! వానప్రస్థాశ్రమమును ఆశ్రయించి శేష జీవితకాల అవకాశమును సద్వినియోగపరచుకోవటమే సముచితము. శాశ్వతమైన వస్తువును ఆశ్రయించటానికి ఇంకా కూడా అశ్రద్ధ పనికిరాదు. ఎందుకంటే వార్థక్యము - మరణము సంభవించేవరకు ఇంద్రి విషయములలో ముగ్ధుడనై గడపటము పరమునకు అపోహసదృశమే అవుతుంది. ఈ ఇంద్రియములు, ఇంద్రియ విషయములతో కూడిన దేహము నన్ను విడువకముందే, నేను దీనిని మనస్సుతో విడచినవాడవవటము అభ్యసించెదను గాక।"**

క్రమంగా ఆయన తీవ్రమైన వైరాగ్యమును ఆశ్రయించసాగారు. వైరాగ్యభావాలు రూపుదిద్దుకోగానే ఆ బృహద్రథ మహారాజు పెద్దకుమారుని (సుదాసుని) పిలచి, మహారాజుగా అభిషేకం జరిపించారు.

- విరాగి అయి అరణ్యవాసము స్వీకరించారు.
- గొప్పతపస్సు అత్యంత శ్రద్ధతో ప్రారంభించారు.
- దృష్టిని - ధ్యాసను ఇష్టదైవమగు సూర్య భగవానునిపై నిలిపి, రెండు చేతులు ఎత్తి ఉంచి సహస్రారమునకు ఆవల బుద్ధిని నిలిపి సుదీర్ఘ కాలము ఏకాగ్రతగా తపస్సు - ధ్యానము కొనసాగించారు.

ఒకానొకరోజు సూర్యలోకమునుండి సూర్యభగవానుని సంకల్పమును అనుసరించి సూర్యలోక వాసుడు, లబ్ధప్రతిష్ఠుడు, భగవంతుడు అగు శాకాయన్యుడు బృహద్రథ మహారాజు సమక్షంలో ప్రత్యక్షమైనారు. ఆయన అగ్ని - పొగలేని గొప్ప తేజస్సుతో వెలుగొందుచున్నారు. ఆత్మజ్ఞానముచే మహాప్రకాశవంతులై, ధగధగాయమానంగా దివ్యకాంతులతో, జ్ఞాన తేజస్కులై ప్రకాశిస్తున్నారు.

**శాకాయన్యులు** : నాయనా! బృహద్రథా! ఉత్తిష్ఠ! ఉత్తిష్ఠ! నీ భక్తి శ్రద్ధలతో కూడిన ధ్యానమునకు మెచ్చాము. చాలా ఆనందము. నీకు ఏమి వరము కావాలో కోరుకో. నెరవేర్చటానికి సంతోషముగా సిద్ధమై ఉన్నాము.

**బృహద్రథ మహారాజు** : హే భగవాన్! మీ దర్శన భాగ్యము లభించినందుకు నాకు చాలా ఆనందము, సంతోషము. నా ఈ ప్రదక్షిణ పూర్వక సాష్టాంగదండ ప్రమాణములు దయతో స్వీకరించండి! ఈ (భౌతిక) పుష్పములు (మరియు) నా హృదయ పుష్పము మీ పాదపద్మములను అలంకరించునుగాక! మహాత్మా! మీరు బ్రహ్మజ్ఞానులై తేజోమయంగా కనిపిస్తున్నారు. పరబ్రహ్మమును సాక్షాత్కరించుకొన్న మహనీయులగు మిమ్ములను లోకసంబంధమైన కోరికలు తీర్చమని వరమడగటం అర్థరహితమైన విషయం కదా!

స్వామీ! నేను అల్పజ్ఞుడిని. ఆత్మజ్ఞాని కాదు. అజ్ఞానినై తేజో విహీనుడనై దేహ దేహాంతరాలు గడవుచున్నవాడను. తత్త్వవేత్తను కాదు. ఇక మీరో? పరబ్రహ్మతత్త్వమును సాక్షాత్కరించుకొన్న మహామహనీయులుగా లోక-పురాణ గాథా ప్రసిద్ధులు. అందుచేత మీ యొక్క దర్శనమే మహత్ భాగ్యము. **నాకు తత్త్వజ్ఞానమును విశదీకరించమని, ప్రసాదించమని వినమ్రుడనై మీకు నమస్కరిస్తూ అభ్యర్థిస్తున్నాను.**

**శాకాయన్యులు** : ఓ ఇక్ష్వాకువంశ సంజాతా। బృహద్రథా! "తత్త్వజ్ఞానము" అనేది చాలా సంక్లిష్టము కదయ్యా! చెప్పే వానికిగాని, వినేవానికిగాని ఆ సమాచారము (బ్రహ్మవిద్య) ఏమైన సులభమైన విషయమా? కానేకాదయ్యా! అశక్యమైనదని అనవచ్చుకూడా! అందుచేత తత్త్వజ్ఞానమును ప్రసాదించటమనే విషయం ప్రక్కకుపెట్టి, మరింకేదైనా వరము అడుగు. తప్పకుండా ప్రసాదిస్తాను. ఇష్టదైవము ప్రత్యక్షమైనప్పుడు ఏవైనా సంపద, స్థితి వంటివి అడగటమే లోకాచారము. అంతేగాని, తత్త్వజ్ఞానము వరముగా ప్రసాదించటము లోకాచారము కాదు కదా!

⌘

మహాత్ముడగు శాకాయన్యుని వాక్యములు విన్న బృహద్రథుడు లేచి నిలుచుని వారిని సమీపించారు. స్వామి పాదాలు స్పృశించి భక్తితో రెండు కళ్ళకు హత్తుకున్నారు.

**బృహద్రథుడు :** హే బ్రహ్మజ్ఞా! సర్వజ్ఞా! మీరు సర్వము ఎరిగినవారు. ఆత్మతత్త్వజ్ఞానము సంపాదించుకోకుండా ఇక తదితరమైనవి – ఈ దృశ్యములో – ఏది పొందితే మాత్రం ఏమి ప్రయోజనం? అసలు, ఇక్కడ ఈ 14 లోకాలలో శాశ్వతమైనది, పొందికూడా ఆ తరువాత ఎటువంటి దుఃఖము కలిగించనిది – అంటూ ఏదైనా ఉన్నదా? లేదు. ఈ అశాశ్వత – దుఃఖమయ జగత్తులో ఏదో పొందితే మాత్రం శాశ్వతానందము ఎట్లా లభిస్తుంది చెప్పండి స్వామీ!

ఇక్కడ 14 లోకాలలో కూడా నశించనిదేదీ నాకు కనిపించటంలేదు. కాలముతో వచ్చి కాలముతో పోయేవే ఇక్కడివన్నీ కూడా!

- సువిశాలమై, అత్యంత భీకరంగా తరంగములు కలిగియుండి, అసంఖ్యాక జీవజాలమునకు ఆలవాలమైయుండే మహాసముద్రాలే ఒకప్పటికి ఇంకిపోతున్నాయి. ఇసుక ఎడారులుగా మారిపోతున్నాయి.
- గొప్పగొప్ప పర్వతాలు....మరొకప్పటికి నేలకూలుచున్నాయి.
- 'ధ్రువమైనవి' అని అనుకుంటున్నవి, నమ్ముచున్నవి,....అన్నీ కూడా కాలగతిచే అధ్రువమైపోతున్నాయి. ప్రచలనం పొందుచున్నాయి. మూలంతో సహా కదలిపోయి, దూరంగా విసరబడిన గులకరాయివలె అదృశ్యమైపోతున్నాయి.
- విశాల స్థానమును ఆక్రమించుకొని, అత్యంత స్థిరంగా కనిపిస్తున్న మహావృక్షాలు–ఒకానొకరోజు కొద్దిసమయం వీచే పెనుగాలికి వ్రేళ్లతో సహా పెకలించబడి ఆవలకు త్రోయబడుచున్నాయి.
- సుందరము – సువిశాలము అనుకున్న ఒక గొప్ప భూప్రదేశము సముద్రజలముచే ముంచివేయబడుతోంది. ఇప్పుడు మహాపట్టణంగా విరాజిల్లుచూ మహతాట్టహాసంగా అనేక ఆర్భాటములతో కనబడే ఒక భూప్రాంతము–మరొకప్పుడెప్పుడో చూచినప్పుడు స్మశానమై కనిపిస్తోంది!

– మహామహా దేవతలంతటివారు ఇంకొకప్పటికి వారి వారి స్థానాలు కోల్పోవుచున్నారు. ఇక మానవశరీరము ధరించిన మా బోటి వాళ్ళ గురించి వేరే చెప్పేదేమున్నది? ఈ శరీరముతో మేము పొంది అనుభవించే వస్తు సముదాయము యొక్క, సంపదల యొక్క దారి–తెన్ను ఇంకేమి చెప్పాలి? వీటిని సంపాదించి ఇవి నమ్ముకొని ఉండటమా? ఏమైనా ప్రయోజనం ఉన్నదా? లేదు.

హే మహనీయా!

ఇదంతా ఇట్లా ఉండగా, ఇక సంసార బద్ధ జీవులమగు మా గతిని చూడండి. ఇందులో పైపై మెరుపులతో, తళుకు బెళుకులతో కనిపించే అనేక సంసార కామ ఉప భోగముల ధ్యాసలను ఆశ్రయించి, వాటితో సంబంధము పెంపొందించుకొని ఉంటున్నాము. అనేక 'అసకృత్' అయినట్టి, అర్థంపర్థంలేని కార్యక్రమములలో మానసికంగా ఇరుక్కొని జన్మజన్మలు వృథాచేసుకొంటున్నాము. అతి దీనులమై, ఏమీ తెలియనివారమై కట్టుకొయ్యకు కట్టబడిన పశువువలె బద్ధులమై ఉంటున్నాము. హృదయంలో అజ్ఞానముచేత పేరుకొని ఉన్న అనేక దిగుళ్ళు, వేదనలు, భ్రమలు మమ్ములను బహు దుఃఖితులుగా చేస్తున్నాయి. ఇదీ మాగతి! ఇక విదితవేద్యులగు మీవంటి ఆత్మజ్ఞానప్రజ్ఞాదురంధురులు కాకపోతే మమ్మెవరు కాపాడుతారు!

ఒక కప్ప ఇరుకైన చీకటి నూతిలో ఇరుక్కొని బయటకు రాలేక ఆహారము మొదలగునవి పొందక ఆక్రోశిస్తుంది చూచారా! మా గతి కూడా అట్లా ఉన్నది. **అంధోపానస్థో భేక ఇవ।** చీకటి నూతిలోని కప్ప నీళ్లలో తిరుగుతూ "ఆఁ అంతా ఇంతే।" అని అనుకుంటుంది. మేము ఈ ఇంద్రియార్థములు అనే మురికినీళ్లున్నట్టి 'అజ్ఞానము' అనే చీకటి నూతిలో బెకబెకలాడుచూ దేహ దేహాంతరాలు గడుపుతూ వస్తున్నాము. జన్మ జరా మృత్యు 'చక్రము'లో ఇరుక్కొని అంతరాంతరాలలో ఆక్రోశిస్తున్నాము.

ఓ మహామహనీయా! భవరోగమునకు ప్రముఖవైద్యులు (Great Doctor) అగు తమరు నన్ను ఈ సంసార లంపటము నుండి సముద్ధరించటానికై వేడుకుంటున్నాను. మీరే నాకు గతి!

హే భగవాన్! ఇంద్రియార్థములను ప్రదర్శించే ఉపకరణయంత్రమువంటి ఈ పాంచభౌతిక శరీరము స్త్రీ – పురుషుల కలయికను ఉపాదాన (Like an instrument) కారణంగా కలిగియుండి రూపుదిద్దుకుంటోంది. శుక్ల శోణితముల కలయికచే ప్రకృతి చమత్కారంచేత ఏర్పడుతోంది. ఇది జడవస్తువేగాని చేతన వస్తువు కాదు. చేతనరూపుడగు జీవాత్మ దీనిలో ప్రవేశించి సచేతనం చేస్తున్నాడు.

ఈ విధంగా (శుక్ల–శోణితములకలయికచే) రూపుదిద్దుకుంటున్న జడ దేహము ఇంద్రియములు పెంపొందించుకుంటూ కొన్ని నెలలు తరువాత స్త్రీ యొక్క మూత్రద్వారమునుండి దృశ్య ప్రపంచంలోకి వెలువడుతోంది. ఈ దేహ నిర్మాణం గురించి మరికొంత పరిశీలిస్తూ వస్తే...,

- ఎముకలచే గూడువలె అమరిక కలిగి ఉన్నట్టిది. (Nest of Bones)
- 'మాంసము' అనే పేడవంటి పదార్థముతో ఆ బొమికలు అలకబడినది. (The Bones are covered and patched by Mutton)
- చర్మముచే కప్పబడినదగుచున్నది. (Enpacked with skin).

**ఇక ఇందులో పదార్థాలేమిటంటారా?**

జలము. మూత్రము. వాత – పిత్త – కఫ – మజ్జ – మేద – మాంసము – క్రొవ్వు మొదలైన అనేక మల(మురికి) పదార్థములు.
– ఇటువంటి అనేక వేరువేరైన ఏవేవో పదార్థములు. ఈ విధమైన అనేక పదార్థములతో ప్రకృతిచే నిర్మించబడిన ఈ భౌతిక దేహమును జీవాత్మనగు నేను దయ్యమువంటి మనస్సుతో కూడినవాడనై ఆశ్రయించి ఇందులో ఇప్పుడు చిక్కుకొని ఉన్నాను. బంధంలో చిక్కుబడ్డాను. **"ఈ దేహము నాకు సంబంధించినది. ఈ దేహమునకు నేను సంబంధించినవాడను. ఇది లేనిదే, నేను లేను. దీని హాని – వృద్ధులు నావే! నాకు చెందినవే!"** – అని తలుస్తూ సంసార బద్ధుడనయ్యాను. ఇట్లా జీవులమగు మేము ఎన్ని దేహాలలో సంచరించామో తెలియదు.

స్వామీ! మీరే నాకు గతి. దిక్కు. నాకు ఇప్పుడు ఆత్మస్వరూపమును విశదీకరించే తత్త్వజ్ఞానము ఉపదేశించండి. ఇంతకుమించి మీనుండి కించిత్ కూడా ఏదీ ఆశించటం లేదు.

❖ ❖ ❖

మహాత్ముడగు శాకాయన్యుడు బృహద్రథుడు చెప్పుచున్న విశేషాలన్నీ ప్రశాంతంగా విన్నారు. సుప్రీతులైనారు. చాలా సంతోషము పొందారు. ఇక ఇట్లా సంభాషించసాగారు.

❖ ❖ ❖

**శాకాయన్యులు :** మహారాజన్! బృహద్రథా! ఇక్ష్వాకు వంశమునకు ధ్వజమువంటివాడా! ఆత్మజ్ఞాన సమన్వితమైన బుద్ధిమంతులలో శ్రేష్ఠుడా!

***<u>నీవు ఉత్తమమైన అవగాహనతో చెప్పిన వైరాగ్య సంపన్నమైన వివేక వాక్యాలు సత్యము, సుందరము కూడా.</u>***

నీవు పొందవలసినది పొందావు! కృతకృత్యుడవు! అందుచేతనే మరుత్ (మహాబుద్ధిగలవాడు) అను పేరుతో లోకప్రసిద్ధుడవు! నీవు అడిగిన వేదాంత సారమైనట్టి ఆత్మతత్త్వము మహత్తరమైనదే. అయితే **'పరమాత్మ యొక్క మహిమ ఇట్టిది'** అని మనం నిర్వచించలేము. వర్ణించలేము. అయినా కూడా మహనీయుల ప్రవచనములగు తత్త్వజ్ఞానవిశేషాలను సత్సంగ పూర్వకంగా చెప్పుకుందాము. సరే, ఇక విను. (మరుత్ = వాయువును జయించినవాడు).

అవునయ్యా! స్వతఃగా పరమాత్మస్వరూపుడే అగు జీవాత్మ ఈ భౌతిక దేహములో చైతన్యరూపుడై ప్రవేశిస్తున్నాడు. శబ్ద–స్పర్శ–రూప–రస–గంధములనే పంచ ఇంద్రియార్థములను ఉపయోగిస్తూ విషయములలో స్వయముగా ప్రవేశించుచున్నాడు. అంతటితో ఆగక, తన్మయుడై వాటియందు సక్తతచే (because of attachment), **"నేను దేహపరిమితుడను"** అనే భావసంబంధమైన చిక్కుముడిలో చిక్కుకుంటున్నాడు. దుఃఖితుడు, బద్ధుడు అగుచున్నాడు. వేదన–రోదనలను కొనసాగిస్తూ దేహాలను త్యజిస్తున్నాడు. ఆతనిపట్ల క్రొత్త దేహాలు వచ్చిపడుచున్నాయి. నీవు చెప్పినట్లే ఈతని అజ్ఞాన నిర్మితమైన స్వకల్పిత దుఃఖపరంపరలకు అంతు పొంతు ఉండటంలేదన్న మాట వాస్తవమే.

**బృహద్రథుడు :** స్వామీ! మరిప్పుడేమి చేయాలి? త్రోవ ఏది? ఔషధము ఏమిటి?

**శాకాయన్యులు :** బుద్ధియొక్క దోషములు తొలగాలి. అందుకు మార్గముగా శాస్త్రములు, మోక్షశాస్త్రజ్ఞులగు అనుభవజ్ఞులు తపస్సును ఔషధంగా సూచిస్తున్నారు. **అట్టి తపస్సు చేతనే నీవు సంసారదోషమేమిటో సుస్పష్టంగా గమనించగలిగావు.** అజ్ఞానంచే జనిస్తున్న సంసార దోషముయొక్క విన్యాసమేమిటో నీవు బహుచక్కగా గుర్తించావయ్యా! సర్వ ఆపదలు అజ్ఞానముచే రూపుదిద్దుకుంటున్నాయి.

- శ్రద్ధతోకూడిన తపస్సు – ధ్యానములచే **సత్త్వగుణము** ప్రవృద్ధమై అవుతోంది.
- సత్త్వగుణముచే **ఉత్తమము – సునిశితము – నిర్మలము** అగు మనస్సు రూపుదిద్దుకుంటోంది.
- నిర్మల మనస్సు యొక్క అవగాహనచే **ఆత్మతత్త్వము** సువిదితమౌతోంది.
- ఆత్మజ్ఞానము **అనుభవముగా** రూపుదిద్దుకుంటూ ఉండగా సర్వ ఆపదలు వాటికవే తొలగుచున్నాయి. నివర్తమౌచున్నాయి.

## సంసారము

**వృత్తి - Avocation:** అస్సలు ఈ సంసారము యొక్క మూల రూపమేమిటి? దృశ్యమునకు సంబంధించిన ఇంద్రియ విషయములు, సందర్భములు, సంఘటనలు – మొదలైనవాటితో ఏర్పడిన మనోసంబంధము. వీటి వీటియొక్క మననము కారణంగా ఏర్పడే అనురాగము వలన ఏర్పడే మనోబంధము. అది **'కామము'** రూపమును దాల్చటమే సంసారము. ధ్యాస (Feeling) అభ్యావశంచేత వృత్తి (Avocation)గా మారటం జరుగుతోంది. ఈ జీవుడు తనకు తానే అనేక వృత్తులను ఆశ్రయించుటచేత **'దేహము, నామరూపములు'** మొదలగునవి వాటితో అవినాభావ సంబంధము ఏర్పడుచున్నదై ఉంటోంది. (Thinking - Feeling - Avocation - Habit, Dependence, etc)

**వృత్తుల సమూహము యొక్క పెత్తనమును 'చిత్తము' అని పిలుస్తున్నాము.**

ఇంద్రియ విషయముల **'మననము'** లేకపోతేనో? **'చిత్తము'** అనునదే నిలువజాలదు. రూపము పోగొట్టుకొని 'న–రూపి', 'లేనిది' కాగలదు.

**ఏవిధంగా అయితే....,**

– ఇంధనము లేనప్పుడు {ఉదా: కుంపటి లేక పొయ్యి నుండి) బొగ్గులను (లేక) కట్టెలను తొలగిస్తున్నప్పుడు} అగ్ని తనకు తానే శమిస్తుందో,

**ఆవిధంగానే...**

వృత్తులు (Thoughts attached with Avocational feelings and Emotions) తగ్గుతూ క్షయిస్తూ ఉండగా క్రమంగా చిత్తము కూడా తనకు తానే ఉపశమించగలదు.

**బృహద్రథుడు :** మహాత్మా! జీవులమగు మేము కర్మ బద్ధులము కదా! కర్మ–కర్మఫల–పునః కర్మల చక్రంలో ఇరుక్కుని జన్మ–పునర్జన్మ పరంపరలను పొందుచున్న మేము కర్మబంధమునుండి విముక్తులమయ్యేది ఎట్లా?

**శాకాయన్యుడు :** 'శరీర యంత్ర విభాగములు' వంటి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు – అనబడే ఇంద్రియార్థములను ఉపయోగిస్తున్నప్పుడు **"వీటికి నేను పరిమితుడనే కదా!"**...అనే **విమూఢభావనను** విడువనివానికి మాత్రమే కర్మ–బంధము కాగలదు. జడము, అసత్యము అగు కర్మ–కర్మఫలములలో మనస్సే వెళ్ళి చిక్కుకుంటోంది. అట్టి మనస్సు జయించబడాలి సుమా! ఎప్పుడైతే సత్యమగు ఆత్మగురించి విచారణ ప్రారంభించి **"సర్వసాక్షి, కేవలము – అగు ఆత్మయే నా స్వరూపము, స్వభావము కూడా కదా!"....** అను అవగాహన – అనుభవము పెంపొందించుకుంటూ ఉంటావో,..... అప్పుడిక 'మనస్సు' అనునది స్వయముగా ఉపశాంతించ ప్రారంభిస్తుంది.

ఎందుకంటే స్వప్నముతో సమానమైనట్టి దృశ్య వస్తు – విషయ – సందర్భ – సంఘటన – బాంధవ్యములు మొదలగువాటి గురించి (– "ఇవన్నీ నిజమే। భవమే। ఉన్నాయి" – అని) **మననమే మనస్సు** యొక్క **స్వరూపమైయున్నది!**

సత్యమగు ఆత్మను గురించిన **"మననము, సందర్శనము, మమేకము"**చే మనస్సు శాంతించక ఏంచేస్తుంది?

## చిత్తమును → చిత్ వైపుగా...,

ఓ బిడ్డా! బృహద్రథా! 'అసత్తు, కల్పితమాత్రము' – అగు విషయములపట్ల కొన్ని జన్మములుగా పెంపొందించుకొనియున్న 'ఇష్టము'నే 'చిత్తము' అని పిలుస్తున్నారు. **చిత్తమేవ హి సంసారః!** చిత్తమే సంసారము. అట్టి చిత్తముయొక్క ఆశ్రయాలు ఏమిటో అద్దాని కదలికలు ఎటువైపో కొంచము నీకు నీవే శోధించాలి సుమా! దేనిదేనిపట్ల (ఏ ఏ సంబంధ – అనుబంధ–సంపద–పేరు ప్రతిష్టలు మొ॥న వాటి పట్ల) చిత్తము ఆకర్షితమగుచూ ఉన్నదో,....అదంతా కూడా వాస్తవానికి ఆ చిత్తము తనపై తానే ఆ రీతిగా ఆరోపించుకొనుచున్నది. (లేక) తన్మయమగుచున్నది. సనాతనమగు రహస్యము ఏమిటంటే **చిత్తముయొక్క ఆత్మపట్ల ప్రత్యారోపణయే సంసారానుభవము.** ఇంతకు మించి 'సంసారము' అనుదానికి వేరైన రూపము లేదు. ఉనికీ లేదు.

- చిత్తము కల్పించుకొంటున్న **సంబంధము, విభ్రమము, చాంచల్యము**ల చేతనే సంసారము ఏర్పడుచున్నది.
- చిత్తముయొక్క ఏకాగ్రత–చాంచల్య రాహిత్యముచేత సంసారము (దీపము వెలిగించినప్పటి చీకటిలాగా) తొలగిపోవటం జరుగగలదు.

చిత్తము నిర్విషయమై, నిర్మలమైనప్పుడు, ఇక ఆ నిర్మల చిత్తము శుభాశుభకర్మల ప్రహసనమును జయించివేయగలదు. వాటినన్నిటినీ ఈ జీవునిపట్ల రహితం చేసివేయగలదు. అట్టి నిర్మల ప్రసన్న చిత్తము స్థిరీకరించుకున్న వానియొక్క సుఖము నాశనము లేనిది. నిర్మల – నిశ్చల చిత్తము బ్రహ్మానంద స్వరూపమే! **(తేషాం సుఖం శాశ్వతమ్। నేతరేషామ్)।**

**బృహద్రథుడు** : అట్టి ఈ చిత్తము రహితమయ్యేది ఎట్లా? ఏ రీతిగా?

## చిత్తమును ఎక్కడ సంలగ్నం చేయాలి?

**శాకాయన్యుడు** : అజ్ఞానముచే ఈ జీవుని చిత్తము దృశ్య విషయములందు సంలగ్నమౌతోంది కదా! అది నీవూ గమనించావు. అయితే, అదే చిత్తము తనయొక్క 'ప్రియత్వము–ఇష్టము' అనే స్వభావముతో పరబ్రహ్మమునందు సంలగ్నమైనప్పుడో? –

- అదియే మోక్షము!
- అదియే ముక్తి।

**యద్యేవం బ్రహ్మణిస్యాత్ (సమాసక్తం) తత్ కో న ముచ్యేత బంధనాత్?**

పరతత్త్వ దర్శనమునందు ఎవరిచిత్తము సంలగ్నమౌతుందో,... ఇక అట్టివాడు బంధమునుండి విముక్తుడు ఎందుకు కాడు? తప్పక అవుతాడు.

## కిం తత్ బ్రహ్మ?

ఇంతకీ, ప్రేమాస్పదుడగు పరమాత్మయొక్క స్థానమేది? ఆయనను ఎక్కడ పట్టుకోవాలి? విను, చెప్పుతాను. మొట్టమొదట "ఆయన నాయొక్క సహజమగు **స్వస్వరూపుడు, సహజీవులందరియొక్క సహజ స్వరూపుడు** కదా!" – అనునది గమనించు. స్వ–సర్వ పురుషుడుగా భావించి ఉపాసించు. **"పరమాత్మకు అన్యముగా ఎక్కడ ఏది కనిపించినా అదంతా కథలోని కథనమువలె సందర్భ కల్పితము"** – అను నిశ్చయమును పెంపొందించుకో.

***ఆ పరమేశ్వరుని మన హృదయ పుష్పములోనే సర్వదా భావన చేసి, హృదయమునందే ఉపాసించాలి!***

పరమాత్మను దర్శించటము ఎక్కడ? బుద్ధి వృత్తులలో కాదు. బుద్ధికి సాక్షిగా, సర్వ దేహములలోని కేవలీ స్వరూపునిగా, సర్వుల ప్రేమాస్పద స్వరూపునిగా గుర్తించబడు గాక! స్వహృదయేశ్వరుడుగా, సర్వుల సహజ – వాస్తవ స్వరూపుడుగా, సర్వము తానైనవాడుగా, సర్వమునకు వేరైన సాక్షిగా – పరమేశ్వరుని భావించాలి. ప్రేమ, భావనలతో **పూజించాలి. సందర్శించాలి**. మనస్సు తన్మయం కావాలి! **"ఆ పరమేశ్వరుడు నాయందే, 'నేను' అనుభావనకు ముందేగల 'నేను' అయి ఉన్నారు"** – అనునది సిద్ధించుకోవాలి.

**బృహదృథుడు : <u>పరమాత్మయొక్క ఏ ఏ లక్షణములు మననం చేస్తూ అర్థం చేసుకోవాలి?</u>**

**శాకాయన్య మహర్షి :** వినండి.

**(1) బుద్ధి వృత్తులకు సాక్షి :** స్వస్వరూపుడగు ఆత్మభగవానుని సంకల్పానుసారమే ఈ బుద్ధివృత్తులు ప్రదర్శితమగుచున్నాయి. ఆయన బుద్ధికి మునుముందే ఉన్నారు. ఎల్లప్పుడు బుద్ధికి సాక్షిగా ఉన్నారు. **"నటుడు నటించే పాత్రయొక్క పాత్ర సంబంధమైన (నాటకములోని)**

**బుద్ధికి వేరుగా, సాక్షిగా – ఆ కళాకారుని నిజ సహజస్వరూపము** (Original Personality) **ఉన్నట్లే, మన పరమాత్మ స్వరూపము బుద్ధికి (జగన్నాటకంలో కలిగిఉంటున్న బుద్ధివృత్తులకు) సర్వదా వేరే!"**.... అని గమనించెదవుగాక। పరమాత్మత్వము బుద్ధికి సాక్షియై, బుద్ధికి ఉత్పత్తి స్థానమై యున్నది.

**(2) మనో అగోచరం :** ఆత్మ యొక్క అప్రమేయ – నిత్యత్వములు స్వరూపము మనస్సుకు కూడా విషయం కాదు. మనస్సుకు ఇంద్రియార్థాలు మాత్రమే విషయములు అవగలవు. ఆ మన పరస్వరూపము మనస్సుకు కూడా (లేక ఆలోచనలకు కూడా) ఉత్పత్తి స్థానము.

**ఆలోచనలు చేయువాడు ఆలోచనలకు వేరుగా, ఆలోచనలకు సాక్షిగా ఉంటాడు కదా!**

అట్టి ఆత్మకొరకై ఆలోచనలలో వెతకి ఏం లాభం? అయితే,

→ **ఆలోచనల సహాయంతో బుద్ధికి సాక్షిగా ఉన్న ఆత్మభావనను తప్పక ఆశ్రయించవచ్చు.**

అంతేగాని ఆత్మ ఆలోచనలకు ఒకానొక విషయమై ఉండలేదు. అందుకే **పరమాత్మ మనస్సుకు అగోచరము** – అని చెప్పబడుచున్నారు.

**(3) వాచా అగోచరము :** వాక్కు (మాటల)తో ఒకళ్లు చెప్పగలిగేది కాదు. చెప్పితే మరొకరి ఆ మాటలచే 'ఇది కదా!' అని విని అనుభవంగా పొందేది కూడా కాదు. "వాక్కుకు పరమాత్మయే ఉత్పత్తి స్థానము. అద్దానికి యజమాని'...అని గమనించాలి. అయితే, గురుబోధనలను, శాస్త్రములు సూచించే సాధనలను ఒక ఉపకరణముగా ఉపయోగించి, మనో–బుద్ధి–చిత్తములను పరమాత్మత్వము వైపుగా నడిపించి–తద్వారా పరమాత్మ భావనను సముపార్జించుకొనెదరు గాక।

(అందుకొరకే వేద–వేదాంతవాఙ్మయము ముముక్షువులకు అందించబడుతోంది).

**(4) అవధూతాది సంప్లవం :** సర్వ దుఃఖములకు ఆత్మవిచారణ ఆత్మాహమ్ మననమే ఉపాయం, సాధనము కూడా! సర్వ సంసార దోష నివారణి – ఆత్మభావనయే! **అవధూతము:** మేఘములు తొలగగా సూర్యుని కాంతి సర్వత్రా కనబడురీతిగా – భ్రమ తొలగగానే, ఆత్మయొక్క నిత్య–సత్యానుభవము సిద్ధించుచున్నది. **(అట్టి సిద్ధపురుషుడే అవధూత).**

**(5) సత్తామాత్రము :** 'నేను ఉన్నాను' అను ఏ భావన ఉన్నదో అట్టి "కేవల సత్తామాత్రము పరమాత్మ సర్వరూపమే। – అని ఉపాసించబడుగాక! ఆత్మ **"కేవల సత్"** స్వరూపము.

**(6) ప్రకాశైక స్వభావం :** తదితరమైన సర్వమును ప్రకాశింపజేయుచున్నది ఆత్మయే! ఎక్కడైనా – ఏదైనా తెలియ వస్తోందంటే, **'ఆత్మయే అట్లు ప్రకాశింపజేస్తోంది', 'ఆత్మయే ప్రకాశమానమగుచున్నది'** అని భావించు.

**(7) భావనాతిగమ్ :** అది భావాతీతము. భావనలకు సాక్షి. భావనకు మునుముందే ఉన్నది. **అంతేకాదు. భావనకు ఉనికిని, చలనమును ప్రసాదిస్తున్నది – కేవలచిత్ స్వరూపమగు పరమాత్మయే. భావనలన్నీ ఆత్మయందే జనించి, లయిస్తున్నాయి. కాబట్టి – 'భావనాగతి' అనబడుతోంది.**

**(8) అహేయమ్ – అనుపాధేయమ్ :** మన స్వస్వరూపమే పరమాత్మ కదా! ప్రతిఒక్క జీవుని సహజస్వరూపమగు "పరమ్ (ఆవల) ఆత్మ"....ను ఎవరుమాత్రం వదలేది ఎట్లా! జాగ్రత్–స్వప్న–సుషుప్తులలో, దేహ–దేహాంతరములలో,.. అన్ని సందర్భములలో వెంటనంటియే ఉండేది–ఆత్మ. ఎవ్వరూ ఎప్పుడూ దానిని వదలటమే లేదు. కనుక పరమాత్మను **"అహేయమ్" (వదలలేనిది)**గా గ్రహించు.

ఎల్లప్పుడు వెంటనుండియే, తనకు అభిన్నమై ఉన్న దానిని క్రొత్తగా స్వీకరించటమనేది మాత్రము ఎక్కడున్నది? కనుక అది **"అనుపాదేయమ్"** కూడా! అది క్రొత్తగా స్వీకరించబడేదీ కాదు. ఆత్మ సమస్తమునకు అనన్యము కాబట్టి – దేనినీ స్వీకరించునది కాదు కూడా.

**9. అసామాన్యమ్ విశేషణమ్ :** ఆత్మతో సమానమైన 'సామాన్యమైనది' ఏదీ ఎక్కడా లేదు.

- మొట్టమొదట సామాన్యమగు ఇంద్రియ విషయములను ప్రక్కకు పెట్టుకుంటూ 'ఆత్మ' అనే విశేషమును గుర్తించే ప్రయత్నాలు చేస్తాము. "న ఇతి న ఇతి"..., "ఇది కాదు – ఇది కాదు"....అంటూ ఆత్మకొరకై వెతకనారంభిస్తాము. సామాన్యంలో విశేషము కొరకై చూడప్రయత్నిస్తాం.

- ఇక ఆ తరువాత, ఆత్మయొక్క తత్త్వమును పరిశీలిస్తూ... **"తదేవ ఇదగ్ం సర్వమ్" "తత్-త్వమ్"**.... అను తత్త్వార్థాన్ని సమీపిస్తూ, **"ఇదంతా అదే"**..... అనే అవగాహన రూపుదిద్దుకుంటోంది. అందుచేత పరమాత్మ సామాన్యము కాదు. విశేషము కాదు.

**(సామాన్యములో విశేషమును దర్శించి ఆ) విశేషములో సామాన్యమును లయింపజేస్తాం (లేక) సమన్వయించుకుంటాము...** అని గమనించు.

**10. ధ్రువమ్ : స్థిమితమ్ : గంభీరమ్ :**

- దేహము మొ॥వి రావచ్చు. పోవచ్చు. కాని ఆత్మ ఎక్కడికీ వెళ్ళటం లేదు. ఎక్కడినుండీ రావటమూ లేదు. ఎట్టి చలనము లేదు. కనుక ఆత్మ సర్వదా **ధృవము.**
- మనస్సు పొందే చంచలనాదులు ఆత్మకు లేవు. ఆత్మ సర్వదా సుస్థిరమైనదిగా, స్థిమితమైనది.
- **గంభీరమ్**: విషయములచే, సందర్భ – సంబంధములచే, మనో – బుద్ధుల మార్పు – చేర్పులచే, దేహముల రాక – పోకలచే స్పృశించబడేది కాదు. ఆత్మ కేవల సాక్షియై, **పరమ గంభీరమై** విరాజిల్లుతోంది.

**11. న తేజో – న తమః తతమ్** : పరమాత్మ తేజోరూపము కాదు. చీకటి రూపము కాదు. తేజస్సుకు తేజస్సును ప్రసాదించేది. చీకటికి సాక్షి. తేజో-తమస్సులు ఉన్నప్పుడు – లేనప్పుడు కూడా నీయొక్క-నాయొక్క **పరమాత్మత్వము** (The self beyond all) యథాతథమై విరాజిల్లుతోందయ్యా! కనుక అది **తేజో రూపము కాదు. చీకటి రూపము కాదు!**

**12. నిర్వికల్పము: "దృశ్యమునుండి-దృష్టిని-దృక్ స్వరూపమునకు మరల్చేయత్నమే"** యోగోపాసన, ఆత్మోపాసన కూడా! అట్టి ఆత్మ జగత్ కల్పన లేనట్టిది. కనుక **నిర్వికల్పము.** ఆత్మయే జగత్తును తనయందు ఆపాదించుకొనుచున్నప్పుడు **సవికల్పము.** స్వతఃగా ఆత్మ **నిర్వికల్పము.**

**13. నిరాభాసమ్** : నీళ్లలో కనిపించే చంద్రబింబమును చూచి "చంద్రుడు నీళ్లలో ప్రతిబింబించటానికి కర్త".... అని కర్తృత్వం ఆపాదిస్తామా? లేదు. అట్లాగే "పరమాత్మ జీవాత్మగా ప్రతిబింబిస్తున్నాడు" – అనబడే **"ఆభాస (Reflactive) ధర్మాన్ని"** ఆత్మకు ఆపాదించలేము. కనుక ఆత్మ **నిరాభాసము.**

**14. నిర్వాణమయమ్ : సంవిదమ్** : అంతే కాదు. ఆత్మను నిర్మల – ప్రశాంత స్వరూపము. అందుచేత సత్ – విత్ (ఉనికి – ఎరుక) కేవలీరూపంగాను ధ్యానించాలి.

**ఆత్మ నిత్యము – అనునిత్యము** కూడా! సర్వము ఎరిగియే ఉన్నది కాబట్టి నిత్యబుద్ధము. ఆత్మ దేనిచేతనూ బంధము పొందేది కాదు. కల కనేవాడు కలలోని విషయాలకు బద్ధుడౌతాడా? లేదు. అట్లాగే, ఆత్మ **నిత్యముక్తము**. ఆత్మకు వేరైనదంతా కల్పితము, **భావనామాత్రము.** ఆత్మయో, **నిత్యసత్యము.** అత్యంత **సూక్ష్మము**. కాబట్టి ఇంద్రియ – మనస్సులకు అవిషయమై ఉంటోంది. ఆత్మచేతనే దేహి-దేహ, మనో- బుద్ధి, చిత్త-అహంకారాలు, దృశ్యభావాలు **చైతన్యవంతమౌతున్నాయి.** కనుక ఆత్మయే **సర్వనియామకము. స యేవ విభుశ్చ!**

స్వప్నము తనదైన స్వప్నద్రష్టకు వేరై స్వప్నంలో ఏదీ ఉండదు కదా! అందుచేత **ఆత్మ అద్వితీయము**. ఆత్మకు ద్వితీయమై వేరే ఏదీ లేదు! ఆత్మ ఆనంద సాగరమునకు ఆవల పరమైయున్నది. ఆనందము ఆత్మది. అంతేగాని ఆత్మ ఆనందరూపమగుటలేదు. ఆత్మ సర్వమునకు వేరై, ప్రత్యేకమై, మనోబుద్ధులకు సాక్షియై సర్వమును చైతన్యపరుస్తోంది కనుక..... **'ప్రత్యగాత్మ" "ప్రత్యక్ చైతన్యము"** గా అభివర్ణించబడుతోంది.

## సోఽ హమస్మి। తదేవత్వమ్।

## ఆత్మ అనబడునది నేనే! నీ స్వరూపము ఆత్మయే!

మనమందరము ఆత్మవంతులము. ఆత్మస్వరూపులము. అద్వితీయాత్మానంద స్వరూపము. అఖండాత్ములము.

**నాలోని నేనైన నేను :** నాయందు నేనే ఆనందమును సర్వదా ఆశ్రయించి ఉంటున్నవాడను. నాకు లోకములలో పొందవలసినదంటూ ఏదీ లేదు. "స్వప్నములో నేను ఏదైనా పొందితే బాగుండును"..... అని అనుకొని ఎవ్వరూ నిద్రించటంలేదు కదా! ఆత్మ గురించి తెలుసుకొని, ఇక ఆశించవలసినదంటూ నాకు ఎక్కడా ఏదీ లేదు. కనుక అజ్ఞానదశలో నన్ను సమీపించిన 'ఆశ' అనే పిశాచిని అవమానించి జ్ఞానదండము చూపించి వెళ్ళగొట్టివేస్తున్నాను.

**స్వీయకల్పన : నిరాశ్రయుడను. ఈ జగత్తులు అనే ఇంద్రజాలానికి ఇంద్రజాలికుడిని నేనే!** ఈ సమస్తమునకు విడిగా ఉంటూ, - మౌనంగా అవలోకిస్తూ ఉన్నది కూడా నేనే. సర్వదా కేవల దృక్ స్వరూపుడను.

(1) ఇది నాకల్పన. (2) దీనికంతటికీ **కేవల సాక్షిని.** (3) సమస్త కల్పనలకు మునుముందే ఉన్నట్టి **"కేవల స్వరూపుడను".**

**అసంగమహమ్** : నాకు దేనితోను సంగము (Attachment) మొదలే లేదు. ఏదీ నాకు సంబంధించినది కాదు. నేను దేనికీ సంబంధించిన వాడను కాను. దుస్తుల కంటే నేను వేరే అయి ఉన్నట్లుగా, దేహ-మనో-బుద్ధి...ఇత్యాదులకంటే నేను వేరైనవాడను.

**ఆపత్కథం మాం ప్రవిశేత్?** ఒకని కలలో కనబడిన ఒక వస్తువో, విషయమో,-ఆ కల తనదైన వానిని బంధించగలదా? కలలోని ఒక ఆపద కల తనదైనవానికి - ఆపద కలిగించగలదా? లేదుకదా! అట్లాగే జాగ్రత్ కూడా సర్వమునకు అసంగుడనైన నన్ను ఏ ఆపద ఏమీ చేయజాలదు. స్పృశించనైనా లేదు.

ఎందుకంటే 'ఆత్మ' అనే స్వగ్రామంలో (లేక) నాకు చెందిన ఉద్యానవనములో జాగ్రత్-స్వప్న-సుషుప్తులు నాకు నేనై నిర్మించుకొని ఆడుకొనే క్రీడా మైదానాలు - అని అంతరమున ఎరిగియే ఉంటున్నాను.

## వర్ణాశ్రమ ఆచారాలు ఎవరికి?

దేహాత్మ భావన (నేను దేహమును - అనే భావన) కలిగియుండి దృశ్యముపై నమ్మికగల బుద్ధితో కొనసాగించువారికొరకై వర్ణము - వర్ణాశ్రమ ఆచారాలు, నియమములు చెప్పబడుచున్నాయి. అవి సాధనలోని విభాగములుగా మాత్రమే ఉండగలవు. అంతేగాని సిద్ధి అను ఆత్మస్థానములో చోటు ఉండదు.

"ఆత్మాహమ్" భావనచే బ్రహ్మచారి - గృహస్థ - వానప్రస్థ - సన్న్యాస ఆశ్రమాచారాలతో సంబంధమేముంటుంది?

దేహాభిమానమును దాటివేసినప్పుడు, ఇక కర్మ - కర్మఫలములతో పనేముంటుంది? అట్టివానికి ఆశ్రమాచారాలు నిర్వర్తిస్తే క్రొత్తగా వచ్చేదేముంటుంది? (వర్ణాశ్రమాచారాలు లోక సానుకూల్యత కొరకు మాత్రమేగాని, ఆత్మకు చెందినవి, సంబంధించినవి కావు.)

ఎవ్వరైతే...

> *లోక సంబంధమైన వర్ణాశ్రమ ధర్మాలను, ఆచారాలను లోకం దృష్ట్యా ప్రదర్శిస్తున్నప్పటికీ, **ఆత్మభావన దృష్ట్యా** 'లేనివి'గా గమనించి, పరిత్యజించినవాడై ఉంటున్నాడో....,*

అట్టివాడు స్వానంద సంతృప్తుడై ఉంటున్నాడు. **"సర్వదా సర్వత్రా సర్వస్వరూపంగా సిద్ధించియే ఉన్న ఆత్మచే నేను సంతృప్తుడనుకదా!"** అని భావించుచూ, పరిపూర్ణపురుషుడై జగత్తులో పాల్గొనుచున్నాడు.

అందుచేత ఓ బృహద్రథా!

వర్ణాశ్రమ ధర్మ విశేషాలన్నీ ప్రాపంచకమైనవి. భౌతిక దేహముతో నిర్వర్తించేవి. ఆత్మయో, - దేహమును అధిగమించి, దేహమును ఉపకరణంగా ఉపయోగించేది కదా! అటువంటి సావయవస్వరూపము, సందర్భమాత్రసత్యము, ఆద్యంతయుక్తము అగు విషయాలన్నీ, అధిగమించినవాడవై ఉండుము. **పుత్రులు, తదితర బంధువులు, రాజ్యము, భౌతికంగా ఎదురుగా కనిపించే స్వరూప స్వభావములు** - ఇత్యాది సర్వ అభిమానములను త్యజించివేయి. దాటివేయి. **'జ్ఞానము పొందాలి। అజ్ఞానిని'** అనురూపముగల అభిమానమును కూడా త్యజించు. అనంతమగు ఆత్మయందు నిష్ఠుడవై ఉండెదవు గాక!

పరమాత్మనిరతుడవై, మిగిలినవన్నీ - **" రాజుగారు పిలిపించగా, పట్టణానికి వెళ్ళుచున్న బాటసారికి త్రోవలో కనిపించే జంతుకళేబరములను ఆతడు చూచీ - చూడనట్లు ఉండటము"** వలె స్వల్ప విషయాలుగా భావించు.

ఆత్మయందే భావనను సునిశ్చితము, సునిశ్చలము చేసుకో! **"నాతో సహా ఈ సర్వము నిత్యము అగు కేవల - అఖండ ఆత్మస్వరూపమే!'**....అని అర్థం చేసుకుంటూ, భావిస్తూ **ఆ ఆత్మయే నీవై ఉండుము.**

ఓ బృహద్రథా। ఈ సందర్భంలో శ్రీమైత్రేయ మహర్షికి, పరమాత్మయగు శివ భగవానునికి జరిగిన తత్త్వశాస్త్ర విశేషములతో కూడిన ఒకానొక గొప్ప సంవాదము నాకు గుర్తుకు వస్తోంది.

అద్దానిని ప్రస్తావిస్తున్నాను. విను.

⌘⌘⌘

## ద్వితీయోధ్యాయః - మైత్రేయ పరమేశ్వర సంవాదము

ఒకానొకప్పుడు మహత్తర తపస్సంపన్నుడు, ఉత్తమ గుణైశ్వరుడు అగు శ్రీ మైత్రేయమహర్షి కైలాసమునకు వెళ్ళటం జరిగింది. పరమానంద రూపుడు, లోకకళ్యాణమూర్తి, భక్తవత్సలుడు, భక్త సులభుడు అగు మహాదేవుని దర్శనం చేసుకున్నారు.

ప్రేమగా ఆహ్వానిస్తూ శ్రీమన్ మహాదేవుడు మైత్రేయ మహర్షిని కుశలం అడిగారు. **"బిడ్డా! ఏమి కావాలో కోరుకో నాయనా! నీ పరాప్రేమకు మెచ్చానయ్యా"।** - అని చిరునవ్వు చిందిస్తూ పలికాడు.

**శ్రీ మైత్రేయమహర్షి** : ఆనంద స్వరూపా! భక్తవత్సలా! పరమేశ్వరా! శివానందలహరీ స్వరూపా! సర్వతత్త్వ స్వరూపుడవగు మీ దర్శనముచే నేను ధన్యుణ్ణి. నాకింకేమి కావాలి? అజ్ఞులమగు మాకు ఎల్లప్పుడూ మీ పాదారవింద భజనయే చాలు.

స్వామి! మేము పరతత్త్వానుభవము సిద్ధించని అజ్ఞులము. అందుచేత మీకొక విన్నపము.

పరమాత్మయొక్క తత్త్వ రహస్యమును నాపై కరుణతో బోధించవలసినదిగా మిమ్ములను వేడుకుంటున్నాను.

**మహాదేవుడు :** మైత్రేయమహర్షీ! ఆధ్యాత్మవిద్య పట్ల నీకు గల శ్రద్ధకు మెచ్చుకుంటున్నాను. లోక సంబంధమైనవేవీ కోరుకోకపోవటము నాకు సంతోషము. కొన్ని ముఖ్యమైన విశేషాలు మనము సంభాషించుకుందాము.

పరమాత్మ ఎక్కడ ఉన్నారు? ఆకాశంలోనా? భూమిపై మరెక్కడన్నానా? వేరే విష్ణు-శివ ఇత్యాది లోకములలోనా? ఎక్కడ వెతకాలి? బిడ్డా। ఈ దేహములోనే ఆయన కొరకు వెతకాలయ్యా।

**శ్లో॥ దేహో దేవాలయమ్ ప్రోక్తః।**
**స జీవో కేవలః శివః॥**

ఈ దేహమే దేవాలయము. ఈ దేహములో నివాసముంటున్న జీవుడు సదా శివుడే! అటువంటి సర్వాంతర హృదయస్తుడగు శివుడినే ఈ జీవుడు ఉపాసించటము నిజమైన పరమాత్మోపాసన. కనుక బాహ్య (లేక) అన్య - ఉపాసన - సంపూర్ణము, సమగ్రము అయిన ఉపాసన అవదు. **అందుచేత**:

గుడిలో శివలింగాన్ని పూజించేముందు నిర్మాల్యము తొలగించి, అప్పుడు పరమభక్తితో పూజిస్తారు కదా! ఆ రీతిగా,

**త్యజేత్ అజ్ఞాన నిర్మాల్యం, 'సోఽహం' భావేన పూజయేత్॥**

- 'అజ్ఞానము' అనే మాలిన్యమును తొలగించుకొంటూ...
- 'సోఽహమ్' భావనతో - ఈ అందరిలో ఆత్మస్వరూపుడై వెలయుచున్న పరమాత్మను నేనే - అను మననములో, ఆ స్వస్వరూపాత్మశివుని పూజించాలి!

**జ్ఞానము** : "వారు వేరు, వీరు వేరు, మేము వేరు, ఇప్పుడు వేరు, మరొక్కప్పుడు వేరు" - ఈ రీతి అయిన భేద దర్శనమంతా అజ్ఞానము. **సర్వభూతస్థమ్ ఆత్మానమ్। సర్వ భూతాని చ ఆత్మని। *"అందరిలో నేనైన 'నేను'। నాలోని అందరు అయి ఉన్న నేను।"*** అను *అభేద దర్శనమే జ్ఞానము.*

**ధ్యానము** : విషయముల నుండి మనస్సును, చిత్తమును వెనుకకు మరల్చి, నిర్విషయము చేస్తూ, బుద్ధితో ఆత్మభావనను సర్వత్రా అనుసంధానము చేయటమే ధ్యానము యొక్క విధానము, ఉద్దేశ్యము, ఆశయము, లక్ష్యము కూడా!

**స్నానము** : మనోబుద్ధి చిత్తములలో ఏర్పడియున్న మల - ఆవరణ-విక్షేప దోషములను తొలగించి నిర్మలమైన ఆత్మదృష్టిని సముపార్జించుకోవటం.

**శౌచము** : విచ్చలవిడిగా విషయముల వెంట - సంఘటన - సందర్భముల వెంటా పరుగులు తీస్తున్న ఇంద్రియములను నిగ్రహించి సమదర్శనమును అభ్యసింపజేయటం. శుచి అయిన భావములను, అభిప్రాయములను వృద్ధి చేసుకోవటము. అశుచి అయిన అరిషట్వర్గ భావములను తొలగించుకోవటము.

**పానము** (Drinking) : బ్రహ్మతత్త్వమును గ్రోలటము. **బ్రహ్మామృతాత్ పిబేత్।**

**ఆహారము** : దేహరక్షణ కొరకు మాత్రమే ఆహారము. **భైక్షమ్ ఆచరేత్ దేహ రక్షణే।**

**వాసగృహం** : పరమాత్మతో ఏకాంతమే వాసస్థలము. **వసేత్ ఏకాన్తికో భూత్వా చ।**

**ఏకాంతము** : ద్వైతమును విసర్జించి ఏకత్వమును దృష్టియందు నిలుపుచూ నిశ్చలం చేయటం. అనేకంగా కనిపిస్తున్నప్పటికీ ఏకముగా అనిపించటానికి ప్రయత్నించటమే ఏకాంతయోగము. **ఏకాంతే ద్వైత వర్జితమ్।**

## ఈ భౌతిక దేహము – దేహాత్మభావన :

పై విధమైన మార్గములో ఈ జీవుడు ప్రయత్నిస్తూ ఉండటం ఆవశ్యకం. ఇకప్పుడు, **"మాతృ–పితృ మలాత్మకమైన చావు – పుట్టుకలతో కూడిన ఈ దేహమే నేను"**....అనే భ్రమాత్మకమైన బంధము నుండి తప్పక విముక్తుడవగలడు. కనుక, **"ఈ దేహముయొక్క రాక–పోకలకు, ఈవల–ఆవల ఉన్నట్టివాడిని కదా"** అని భావించు.

ఈ పాంచభౌతిక దేహముతో తన్మయమగుచు, ఇద్దాని సంబంధ – బాంధవ్యములే మహత్తరమని తలచుచు, దేహసుఖములే ముఖ్యాశయముగా జీవించువానిపట్ల – ఈ 'జీవితము' అనే అవకాశము వ్యర్థం అగుచున్నదయ్యా! మునుముందుగా ఈ దేహము ఎట్టిదో, తానెట్టివాడో ఈతడు గమనించకపోతే, విభాగించకపోతే – సంసార దుఃఖము ఎన్ని వేల జన్మలెత్తినా తొలగదు.

ఈ జీవుడు స్వతఃగా శివానంద స్వరూపుడని (స జీవో కేవల శ్శివః) అని చెప్పుకున్నాము కదా! ఇక ఈ పాంచభౌతిక దేహము విషయానికి వస్తే...

ఇది అల్ప సుఖములకు – అనేక దుఃఖములకు ఆలవాలము, ఆలయము (సుఖ–దుఃఖాలయమ్).

**అమేధ్యమ్ :** మేధ్యము (పవిత్రము) కానిది. రోగము – బాధ – వార్ధక్యము, మరణము ఇత్యాది అనేక దోషములతో కూడుకొనియున్నట్టిది.

**ధాతుబద్ధమ్ :** చర్మము – మాంసము – మజ్జ – చీము – నెత్తురు – క్రొవ్వు – బొమికలు ఇటువంటి అనేక వేరు వేరు ధర్మములు గల పదార్థములతో (సప్తధాతువులతో) నిర్మితమైనది.

**మహారోగమ్ :** ఇందులో భయంకరమైన రోగములు **"మేము ఎప్పుడు ప్రకోపిద్దామా?"** అని వేచి ఉన్నాయి. దాగుకొని ఉన్నాయి. అవన్నీ ఈ దేహమును శిథిలపరచటానికి ఉవ్విళ్ళూరుచున్నాయి. దాగుడుమూతలాడుచున్నాయి.

**పాపమందిరమ్ :** ఇందులో ఇంద్రియములు అనేక ఆవేశ – కావేశములను, పాపదృష్టులను ప్రకోపింపజేసే ప్రయత్నంలో సర్వదా నిమగ్నమై ఉంటున్నాయి.

**అధ్రువమ్ :** ఇందులో దృఢమైనది, చెడనిది అంటూ ఏ ఒక్కటీ లేదు. అందుచేత ఈ భౌతిక దేహమును "ఇది నేను. నాది. ఇది నాకు చెందినది. నేను దీనికి చెందినవాడను".....అని ఎప్పుడైనా అనిపిస్తే ప్రాజ్ఞులు... – **"ఇందులో ఏది శాశ్వతము?"** అని ప్రశ్నించుకుంటూనే ఉంటారు.

***విజ్ఞులు దేహాత్మ భావనను స్పృశించినందుకుగాను మనోమల స్నానం చేస్తూ ఉంటారు.***

భౌతిక భావనతో **'స్పృశిస్తే స్నానం చేయండి'** అని శాస్త్రములు – శాస్త్రజ్ఞులు సాధకులకు విధిస్తున్నారు (సకృత్ గీతాంబసి స్నానం...మొ॥వి) భగవత్ ధ్యాన – గాన – తపో – సత్సంగాలే స్నాన జలము.

ఇంకా విను.

– ఈ దేహము అనేక వికారములతో కూడి ఉంటోంది.

– దీనికి '9' ద్వారాలు (నవద్వార పురము).

– ఆ '9' ద్వారముల నుండి అనేక దుర్గంధ వస్తువులు స్రవిస్తూ ఉంటాయి.

– ఇదంతా కాలబద్ధము. కాలస్వభావజం. ఎప్పుడు ఏమౌతుందో ఏమీ చెప్పలేము. ఇట్టి ఈ దేహము కలకాలం మనగలదని అజ్ఞులే (తెలివి తక్కువవాళ్ళే) నమ్ముకొని ఉంటారేమో గాని.... విజ్ఞులు కాదు. వారు దీనియొక్క స్థితిగతులను గురించి ఏమాత్రము నమ్మి ఉండరు. ముందుగానే దీనియొక్క అనివార్య వినాశనము గురించి గ్రహించియే ఉంటారు. అటువంటి భౌతిక దేహమును 'అహమస్మి' అను భావంతో స్పృశిస్తే, 'స్నానం' విధించబడింది.

**తోలు బొమ్మలాట వంటిదే ఈ దృశ్యాంతర్గత భౌతిక దేహములు.**

ఇంకా చెప్పుకోవాలంటే....

ఈ దేహము అనేక దుర్గంధములతో కూడినది. దుర్మలములు కలిగినదై ఉన్నది. పిల్లవాడు పుట్టగానే 'మాతృసూతకము' అనే పురుటి దోషమును (ఇంటిపేరందరి వారికీ) నియమించారు. అట్లాగే మరణమప్పుడు కూడా (ఆ ఇంటి పేరు వారికి) 'మైల' అనుదానిని శాస్త్రములు విధిస్తున్నాయి.

**"అహమ్-మమ"** అనే విణ్మూత్రమును (మూత్ర-మలములను) శుభ్రం చేసుకోవాలి. **"ఆత్మతత్త్వ విచారణ"** అనే మోచనాగంధము (washing powder/soap)తో స్పృశదోష స్నానం తప్పక నిర్వర్తించాలి సుమా!

**మైత్రేయ మహర్షి :** (జనులలో కొందరు వంట - పూజ - సంధ్యావందన - ప్రాణాయమాది సందర్భములలో స్నానము - మడి - ఆచారము - (పొడిబట్టలతో ఉన్నప్పుడు) ఇతరులను తాకితే మరల స్నానము - మడిబట్టలు....ఇటువంటి) ఆచారముల ఉద్దేశ్యము. **"స్పృష్ట్వా స్నానం విధీయతే"**....అనునదే అయి ఉన్నదా, ప్రభూ!

**మహాదేవుడు:** శుద్ధము-శౌచకము-మృత్ స్నానం (మట్టితో రుద్దుకొని, సబ్బుతో రుద్దుకుని చేయు స్నానము)...ఇవన్నీ కూడా లౌకిక -లోక సంబంధమైన విషయాలు మాత్రమే! అవి శాస్త్ర ముఖ్యోద్దేశమని అనిపించుకోవు. **చిత్తశుద్ధియే నేను సూచిస్తున్న స్పృష్ట్వా స్నానము సుమా!**

**చిత్తశుద్ధికరం శౌచము** : చిత్తములో రజోగుణముచే (సాధనాసమయంలో కూడా) రూపుదిద్దుకొనే - లోకవాసన, దేహవాసన, శాస్త్రవాసన అనబడే వాసనాత్రయము నుండి (చిత్తమును) పరిశుద్ధిచేసుకోవటం!

**ఏ మట్టి (మృత్ -) తో చిత్తస్నానం చేయాలి? చిత్తశౌచము** : జ్ఞాన - వైరాగ్యములు అనబడే మృత్తికతో (శుభ్ర భస్మము)తో చిత్తమును శుచి చేసుకోవాలి! **జ్ఞాన - వైరాగ్య మృత్తోయైః క్షాళనాత్ 'శౌచమ్' ఉచ్యతే।**

**అద్వైతభావనా బైక్ష్యమ్ - ఆహారము** : అద్వైత భావనయే - ఆరోగ్యము కొరకు స్వీకరించతగ్గ ఆహారము. **"ఏకైక పరమాత్మయే ఈ సమస్త రూపాలుగా కనబడుచున్నారు"** అను అద్వైతభావనను మననం చేస్తూ ఈ ద్వైత ప్రపంచంలో జీవించాలి. అనేకంగా కనిపిస్తూ ఒకటిగా అనిపించటమే **'అద్వైతభావన'. ("భి" = అంధకారము, మాయ, అజ్ఞానము. "క్షం" = క్షయింపజేసుకోవటము)**

**అభక్ష్యమ్ ద్వైతభావనా :**

| | |
|---|---|
| - నేను వేరు - నీవు వేరు. | భక్తుడు వేరు - ఇష్టదైవము వేరు. |
| - ఇప్పుడు వేరు - మరొకప్పుడు వేరు. | దృశ్యము వేరు - ద్రష్ట వేరు. |
| - దేహమున్నప్పుడు వేరు - లేనప్పుడు వేరు. | యోగాభ్యాసి వేరు - భక్తి మార్గము వేరు. |
| - జీవాత్మ వేరు - పరమాత్మ వేరు. | యోగి వేరు - జ్ఞాని వేరు. |
| - జ్ఞాని వేరు - అజ్ఞాని వేరు. | భక్తి వేరు - జ్ఞానము వేరు. |
| - పండితుడు వేరు - పామరుడు వేరు. | భవుడు వేరు - భావము వేరు. |

ఇటువంటి ద్వైతభావనలు **అభైక్ష్యము.** అపథ్యము. చిత్తమునకు అనారోగ్యము, అశుద్ధి కలిగించే ఆహారము.

ఈవిధంగా ముముక్షువు...

| - స్వీకరించవలసినవి, ఉపాదేయము | - స్వీకరించకూడనివి. హేయము |
|---|---|

బుద్ధితో గమనించాలి సుమా! అట్టి సందర్భాలలో స్వబుద్ధి సరిపోనప్పుడు...,

**(1) గురువాక్య-పాఠ్యాంశములను అధ్యయనము చేయటము (2) శాస్త్రములచే ప్రకటించబడుచున్న (తత్త్వమ్-సోఽహమ్-త్వమేవాహమ్-జీవోబ్రహ్మేతి నా పరః - అయమాత్మా బ్రహ్మ ఇత్యాది) మహా వాక్యార్థములను హృదయంలోను, బుద్ధిలోను మననపూర్వకంగా గుర్తుపెట్టుకొనియే సాధనలు, చేయటము (3) శాస్త్రములు సూచిస్తున్న యోగాభ్యాసము మొ॥వి నిర్వర్తించబడును గాక.**

...ఈ ఈ భావనలు, ప్రయత్నములు సదా, సర్వ సందర్భాలలోను ఆశ్రయించి ఉండాలి.

**<u>చిత్తశుద్ధికై సర్వము సన్న్యసించాలి</u>**

ఒక దొంగ పట్టుబడి అసాధారణముగా శిక్షను అనుభవిస్తూ చాలాకాలం గడిపాడనుకో! ఆతడు శిక్ష పూర్తి చేసుకొని కారాగారము నుండి (జైలునుండి) విడివడి, ఇక ఆకారాగారానికి అతిదూరంగా ఉంటాడు కదా!

అట్లాగే....,

కొందరు స్వదేశమును త్యజించివేసి సన్న్యాసాశ్రమము స్వీకరిస్తున్నారు. సర్వము సన్న్యసించి ఇతఃపూర్వపు ప్రదేశములకు సుదూరంగా ఉంటున్నారు. అయితే....ఆతడు సన్న్యసిస్తున్నది ఎవరిని? భౌతికమైన భార్య – సోదరులు – కొడుకులు...ఇవియేనా?

అయితే ఇవన్నీ ఉండవచ్చుగాక! (లేక) ఉండకపోవచ్చుగాక! అసలు వదలవలసినవి ఇవికాదు. మరి? ఓ జనులారా!

- **అహంకారము** అనే కొడుకును.
- **సంపదపై ధ్యాస** – అనే ఆశరూప సోదరుణ్ణి.
- **ఈ కనబడేవి సత్యము – శాశ్వతము – సదా వెంటనంటి ఉంటాయి. ఇక్కడ నా వారు – కాని వారు** ఉన్నారు – అనే మోహరూప మందిరమును.
- ఏదో ఆశించటం. సంపద. పదవి – ప్రతిష్ఠలపట్ల ధ్యాస. "వారు అట్లా ఉండాలి – వీరు ఇట్లా ఉండాలి, వారు అటువంటి వారు – వీరు ఇటువంటి వారు" అనే – అనే **కామరూప భార్యను.**

వీటిని బుద్ధితో చిత్తమునుండి సన్న్యసించాలి! **"ఓ అహంకారము, ఆశ, మోహము, కామము– ఇత్యాది పరిచయిస్తులారా! ఇక మీరు ఆ ప్రక్కకు తొలగండి! నేను మడి కట్టుకుంటున్నాను"**........అనే జాగరూకతతో కూడిన కేక వేయాలి.

**శ్రీ మైత్రేయమహర్షి** : స్వామీ! చిత్తశుద్ధి శాస్త్రములు నిర్దేశిస్తున్నట్టి సంధ్యావందనము – పూజ మొ॥వి ఎంతో ఆవశ్యకం కదా! లేకుంటే బుద్ధి నిర్మలం కాదేమో! అట్టి అనుదిన సంధ్యోపాసన చేయలేని వారికి **"చిత్త నిర్మలత్వం, సోఽహమ్ రూపమైనట్టి ఆత్మభావన"** లభించదు – అని కొందరి అభిప్రాయం.

**శ్రీ మహాదేవుడు** : నాయనా! మైత్రేయా! నీవు అడిగిన **"సంధ్యోపాసన అనివార్యంగా అత్యావశ్యకము"** అనే అభిప్రాయాన్ని విశ్లేషిస్తూ వివరించే ఒక దృష్టాంత సంఘటనను విను.

**<u>ఒకానొకప్పుడు బ్రహ్మమే తానై ఆస్వాదిస్తున్న ఒకానొక బ్రహ్మతత్త్వజ్ఞుని ఎవరో ఇట్లా ప్రశ్నించారు.</u>**

"అయ్యా! మేము తత్త్వదర్శులము, ఆత్మమేవాహంభావమును పునికిపుచ్చుకొన్న వారము అవ్వాలి కదా! అందుకు మేము ఉదయం – సాయంకాలము క్రమం తప్పకుండా సంధ్యావందనము, బ్రాహ్మీ–ప్రదోషకాలంలో నిర్వర్తిస్తున్నాము. మరి మీమాట ఏమిటో చెప్పండి?"

అప్పుడు ఆ మహనీయుడగు బ్రహ్మానందానుభవుడు ఈ విధంగా తమాషాగా సమాధానం చెప్పుచున్నారు.

"వేదమాత సాధనములను సోఽహమ్ బ్రహ్మీస్థితి కొరకై చెప్పుచున్నమాట నిజమే. అయితే, –

అయ్యలారా....!

– "నాకు అజ్ఞానమునకు జన్మస్థానం అయినట్టి 'మోహము' అనే తల్లి మరణించింది.

– 'భోధమయి' అయినట్టి గొప్ప కుమారుడు నాకు వెనువెంటనే పుట్టటం జరిగింది.

ఈ విధంగా మోహనాశనముచే **'మైల'**, ఆత్మ బోధ జనించటం చేత **'పురుడు'** – ఒకేసారి నాకు వచ్చి పడ్డాయి. సూతకద్వయం ప్రాప్తించింది. మరిక బ్రాహ్మీముహూర్తం లోను, సాయం ప్రదేశకాలములోను సంధ్య మొదలైన ఆయా ఉపాసనలు ఎట్లా నిర్వర్తించటం చెప్పండి?"

సర్వము స్వస్వరూపాత్మగా సందర్శించటం సమారంభమయి, నిశ్చలమయిందా, ఇక త్రిగుణరూపమగు శాస్త్ర ప్రవచిత సాధనలు తమ యొక్క ఉద్దేశ్యము (Purpose) నెరవేర్చినట్లే అవుతోంది. (శాస్త్రానపి సంత్యజ్యతి). సర్వము స్వస్వరూపముగా దర్శిస్తూ, **"ఈ సర్వభూతములు నేనై – సర్వసాక్షిగా వేరై"** అనే స్థితిని సంపాదించుకున్న వానికి సంధ్యావందనము, తదితర ఆత్మధ్యాన సాధనలు నిర్వర్తించవలసినదిగా నియమం చెప్పేపని ఏముంటుంది? సర్వత్రా ఆత్మ దర్శనమై, అటుపై **ఆత్మదర్శనమే – ఆత్మ ధ్యానము అగుచున్నది.**

**“నా హృదయాకాశములో చిత్ సూర్యుడు కేవలానుభవరూపుడై అనునిత్యంగా సర్వకాలములందు ప్రకాశిస్తున్నారు. అట్టి సత్-చిదాకాశ సూర్యుడు ఏ మాత్రము ఉదయించటము లేదు. అస్తమించటము లేదు. మరి ఉషోదయ - సాయంకాల సంధ్యావందనములు ఎట్లా చేయటం?”**

అని బ్రాహ్మీస్థితిని సముపార్జించుకున్న **“మలరహిత చిత్త సమన్వితుడు, నిర్మల హృదయుడు”** అయినట్టి యోగి పలికితే - మరి ఆ పలుకులు యుక్తియుక్తమే అవుతాయి కదా!

**దేశాన్తం** : ఈ గృహము - సంపదలు - సంబంధములు వదలి దూరంగా ఉన్నవానికే మోక్షము. దూరంగా ఉండటమంటే ఇల్లు - పెళ్లాం - పిల్లలను వదలి ఆశ్రమంలోనో, మఠములోనో, అడవిలోనో నివసించటమా? కాదు కాదు.

**“ఇక్కడ అనేకంగా కనిపించేదంతా భ్రమ - ఇదంతా ఏకమగు ఆత్మయే!”**
**అనేకంగా కనిపిస్తూ ఉన్నదంతా ఏకముగా అనిపిస్తూ ఉండటమే - యోగము।**

అనే గురు మహావాక్యములపట్ల గురిపెంపొందించుకోవటం, నిశ్చితమవటం (Becoming wel determined) – ఇదియే **“దేశాన్తరము”!**

గురువెందుకంటావా! స్వస్వరూపాత్మపై గల సందేహాలను పూర్తిగా తొలగించుకోవటానికై గురువాక్యములపై విశ్వాసముంచి, తద్వారా ఆత్మవిశ్వాసమును సముపార్జించుకోవాలి. ఎందుకంటే...,

ముక్తియొక్క రూపము స్వస్వరూపము గురించిన సందేహాలన్నీ తొలగటము. **(జ్ఞాన స్సంఛ్ఛిన్న సంశయః).**

ఆత్మస్వరూపము (స్వస్వరూపము) పట్ల సందేహాలు కొనసాగుచున్నాయా, ...ఇక అప్పుడు జన్మ - జన్మలకు కూడా ముక్తి లభించదు. అట్టి సందేహములు తొలగే వరకు సాధన వదలరాదు.

# సన్న్యాసము

కర్మలు మానివేసినంతమాత్రంచేత అది సన్న్యాసము అవదు. లేక, గొప్ప భాషావాక్యాలు, మాటలు చెప్పగలగటం సన్న్యాము కాదు. మరి?

**సంథౌ జీవాత్మనో ఐక్యం!** “ఈ జీవుడు బ్రహ్మమే! శివుడే జీవుడుగా కనిపిస్తున్నాడు. జీవుడే శివుడు అయి ఉన్నాడు” ఇటువంటి ‘జీవ బ్రహ్మైక్యము’యొక్క అనుసంధానమే - **సన్న్యాసము** (సత్-న్యాసము-సత్‌ను స్వీకరించటము, అసత్‌ను త్యజించటం)అయి ఉన్నది.

❖

**శ్రీ మైత్రేయమహర్షి** : స్వామీ! పరమేశ్వరా! మేము అనేక జన్మలుగా దృశ్యవిషయములందు అభిలాష, అభిమానము, ఆవేశపూరితమైన అభినివేశము కలిగియున్నాము. ఎంత చదివినా, విన్నా కూడా సంసార దృష్టులను తొలగించుకోలేకపోతున్నాము. ఉపాయం చెప్పండి. త్రోవ చూపండి. ‘సన్న్యాసము’ అను దాని గురించి మరికొంత వివరించండి.

**శ్రీమహాదేవుడు :**

- **‘దృశ్య సంబంధమైన సర్వము మనస్సుతో త్యజించటము, సత్‌ను మాత్రమే మనస్సుతో దృష్టియందు ఆశ్రయించి ఉండటము’** అనునవే నిజమైన సన్న్యాసము.
- దేహమునకు సంబంధించిన సర్వ అభిమానములను త్యజించి...,
- సమస్త విషయభోగముల పట్ల, సర్వ బార్య-పుత్ర-ధన-ప్రతిష్ఠ-మాన-ఆవేశ ఇత్యాది ఈషణములపట్ల (సంబంధిత భావములపట్ల) **కక్కినకూడు**వలె ఆశించనివాడై ఎవ్వడుంటున్నాడో, అట్టివాడు ‘సన్న్యాసి’ అని చెప్పబడటానికి అర్హుడు.

సర్వవస్తువుల పట్ల, విషయములపట్ల - సంబంధములపట్ల విరాగి అయి ఉండటమే సన్న్యాసము. ఆతడే ఆత్మవిద్యను ఎరిగి విద్వాంసుడు. కేవలము సన్న్యాసాశ్రమము స్వీకరించినంత మాత్రంచేత నిత్య సన్న్యాసి కాజాలడు సుమా!

ధనము ఆశించో, అన్న - వస్త్రముల కొరకో, పేరు - ప్రతిష్ఠలను ఉద్దేశ్యించో,... సన్న్యాసాశ్రమము స్వీకరించువారు, సన్న్యాసము కొనసాగించువారు - అటు గృహస్థాశ్రమములోను, ఇటు సన్న్యాసాశ్రమములోను పొందవలసిన ఉత్తమమైనదేదీ పొందక ఉభయభ్రష్టులు అవగలరు. **ముక్తిని కరతలామలకం చేసుకోలేకపోతారు.** మరొక్క ముఖ్యమైన విషయం గమనించెదవు గాక।

**I. తత్త్వచింతన ఉత్తమోత్తమం।**

**'త్వమ్ తత్ అసి'** అను జీవాత్మను పరమాత్మయొక్క చిద్విలాసమైన అంశగా నిరూపించే తత్త్వ శాస్త్రము, తత్త్వ చింతన, తత్త్వ భావన, 'త్వమ్'ను తత్ పరమాత్మగా ఉపాసనా భావము కలిగి ఉండటము – ఇవన్నీ కూడా అధ్యాత్మ విద్యకు మకుటము వంటిది! సమున్నతమైనది! రాజవిద్య! **"జీవాత్మ నాయొక్క (మయాకల్పితమైన) జగన్నాటకములోని మయారచితమైన పాత్రగా సందర్భసత్యము. నాయొక్క తదితరులయొక్క సహజ సత్యము "ఆత్మస్వరూపమే"।** ... అనే సద్గురు వాక్యబోధ, వేదాంత వాఙ్మయసారము. అందుకుకావలసిన వివేక విజ్ఞానములు అన్నిటికంటే ఉత్తమము. ఆత్మదర్శన భావమునకు దారితీసి, నిశ్చలము చేయు మార్గమునే **'తత్త్వచింతన'** అంటున్నాము. తత్త్వభావనను అనుసరించే ఒకడు 'సోఽహమ్'ను సిద్ధించుకోగలడు.

**II. మధ్యమమ్ శాస్త్ర చింతనమ్।**

శాస్త్ర – పౌరాణిక విశేషాలు, చారిత్రక విషయాలు అధ్యయనము. వాటియొక్క అంతిమ ఆశయము తత్త్వచింతనయే – అందుకొరకై నిష్ఠలు, నియమములు, యోగాభ్యాసములు మొదలైనవన్నీ – 'మధ్యమములు'.

**III. అథమా మంత్ర చింతా చ।**

విధి – విధానములతో కూడిన మంత్రముల మననములు, వ్రతవిధానములు మొదలైనవి మరికొంత క్రింది అడుగు.

**IV. తీర్థభ్రాంతిః అథమాథమః।**

"తీర్థములు సేవించటం, ఎక్కడో సుదూరంగా ఉన్న ప్రదేశాలను బహుకాలం అనేకసార్లు చుట్టివస్తేగాని పరమాత్మను సుస్థిరీకరించుకోలేమేమోనని తలచటము – ఇది ఆధ్యాత్మిక సంబంధమైన మరికొంత క్రింద స్థితి.

అన్నిటికన్నా అతి ముఖ్యమైనది అనుభూతి.

**ఆత్మయే నేను!** **ఇదంతా ఆత్మయే!** **నేనే ఇదంతా!**

అను ఆత్మానుభూతి సునిశ్చితము, సునిశ్చలము, సుస్థిరము, అనునిత్యము, అచంచలము అవటానికే తదితరమైన సర్వయత్నములు కూడా! కేవలము ఆత్మతత్త్వ వివరణ సంబంధమైన భాష – సాహిత్యమునకు పరిమితమై, ఆత్మానుభవమునకు బుద్ధిని సిద్ధంచేసుకోకపోతే ఏమిలాభమయ్యా? బ్రహ్మముగురించి ఉపమానములను – ఉపమేయములను, వర్ణనలను, సాహిత్యమును పరిశీలిస్తూ **"సర్వులలోని సత్యమగు కేవల సాక్షిని నేనే! స్వస్వరూపము, స్వస్వభావము అగు పరమాత్మయే – నా వాస్తవతత్త్వము"** – అను మార్గముగా అడుగులు వేయకపోతే ఎట్లా?

**ఆత్మగురించి తెలుసుకొంటూ, సంభాషిస్తూ కూడా "ఇదంతా మమాత్మానంద స్వరూపమే" – అను అభ్యాసమును ఆశ్రయించకపోతేనో?**

"ఒకానొకచోట జలంలో ఫలములతో కూడిన వృక్షము ప్రతిబింబిస్తున్నాయి. ఆ జలంలో ప్రతిబింబించే ఫలములను చూస్తూ, వాటి రుచిగురించి ఊహిస్తూ, పైనగల ఫలవృక్షపు ఫలమును కోసుకోకపోవటం వంటిది.

అనుభూతి చేత మాత్రమే, బ్రాహ్మీ స్థితి సిద్ధిస్తుంది. బ్రాహ్మీ స్థితి సిద్ధించినప్పుడే – బ్రహ్మజ్ఞానము యొక్క నిజమైన ప్రయోజనము జీవుడు పొందినట్లు అవుతుంది.

**శ్రీ మైత్రేయ మహర్షి** : మమాత్మస్వరూపుడనగు మహాదేవా! జగద్గురూ! సర్వశుభంకరా! ఆధ్యాత్మయానంలో ఈ భౌతికదేహమున్నంతవరకు యతి వదలకూడనివి దయతో వివరించి చెప్పండి.

**మహాదేవుడు** : నాయనా! మైత్రేయమహర్షీ! యతి, ముక్తుడైనవాడు దేహమున్నంతవరకు కూడా...

(1) **భిక్షాటన** (మదూకరము) అనే తల్లిని, → (భి) అజ్ఞానము (క్ష) తొలగించగల ఉపాయములు, అభ్యాసములు)

(2) **వైరాగ్యము** (మధుకరము) అనే తండ్రిని, → (దేనిపట్ల రాగము కలిగి ఉండకపోవటము).

(3) **శ్రద్ధ** అనే భార్యను, → (ఆత్మ జ్ఞాన మార్గములగు భక్తి–యోగాభ్యాసములపట్ల శ్రద్ధ కలిగి ఉండటము).

(4) జ్ఞానము అనే కుమారుని (జ్ఞాన సమాచారమును, అధ్యయనములను సర్వత్రా అమృతమగు ఆత్మను దర్శించు దృష్టి వీడకపోవటము).

వీటిని విడుచుటయే లేదు. విడువడు. విడువకూడదు. కనుక, మధూకర మాతరం, వైరాగ్య జనకం, శ్రద్ధా కళత్రం, జ్ఞాననందనమ్ – న త్యజేత్। న త్యజేత్। జ్ఞానసమాచారము 'వినాలి' – అని అనుకోవాలేగాని, "ఆఁ! ఇవన్నీ నాకు తెలుసులే" – అని ఊరుకోకూడదు.

## జ్ఞానవానేన బలవాన్

జ్ఞానవంతుడే బలవాన్! జ్ఞానిదే జీవితము! జ్ఞానియే సుఖవంతుడు. సర్వలౌకిక సంపదలు ఆత్మజ్ఞానసంపదముందు తీసికట్టే!

**మం॥ శ్లో॥ ధనవృద్ధా వయోవృద్ధా విద్యావృద్ధా తథైవ చ**
**తే సర్వ జ్ఞానవృద్ధస్య కింకరాః శిష్య కింకరాః**

**(1) ధనవృద్ధుడు (2) వయస్సుచే వృద్ధుడు (3) విద్యావృద్ధుడు** .....ఈ ముగ్గురూ కూడా జ్ఞానవృద్ధునికి – ఆతని శిష్యునికి కూడా కింకరులై (సేవకులై) ఉంటారయ్యా. అందుచేత ఈ జీవుడు శ్రద్ధతో సర్వదా ఆత్మజ్ఞానము సముపార్జించుకొనే మార్గములో నిత్యయత్నపరుడై ఉండటమే అత్యంతికంగా శుభప్రదము.

✠ ✠ ✠

**శ్రీ మైత్రేయ మహర్షి** : స్వామీ! జీవులమగు మేము ధనసంపద, గొప్ప ఆయుష్షు, పేరు – ప్రతిష్టలు .....ఇటువంటివే ఆశయముగా కలిగి ఉంటున్నామేగాని, ఆత్మజ్ఞానము విషయంలో, "తర్వాత చూద్దాంలే!".....అని అశ్రద్ధ వహిస్తున్నామే! అవకాశముల కోసం ప్రయత్నించకపోగా, ఎక్కడైనా అవకాశాలు లభించినా మేము సద్వినియోగం చేసుకోవటం లేదు. ఎంత చిత్రం?

**మహాదేవుడు** : బిడ్డా! నీవు చెప్పినది నిజమేనయ్యా! జీవులలో అధికులు ఆత్మతత్త్వముపై శ్రద్ధలేకపోవటంచేత నా మాయచే మోహితులగుచున్నారు. భ్రమతో కప్పబడిన బుద్ధికలవారై జీవిస్తున్నారు. అపూర్ణులై, వారియొక్క ఆత్మస్వరూపుడనైయున్న నన్ను పొందక, సంసారారణ్యంలో దేశ ద్రిమ్మరులవలె దేహదేహాంతరములలో సంచారాలు చేస్తున్నారు. అనేక భ్రమలను తమ చిత్తము నిండా కలిగినవారై ఉంటున్నారు. తెలివితేటల విషయంలో శూరులే అయి ఉండి కూడా..., ఒక కాకి ఆహారం కోసం...రోజంతా అనేకచోట్ల తిరుగాడుచూ ఉంటున్నట్లుగా ఈ నిస్సార సంసారాణ్యములో తిరుగాడుచున్నారు. (అందుచేతనే అవతారమూర్తులయొక్క రాక అవసరమౌతోంది)

ఈ జీవులలో కొందరు తమ యొక్క ఇహ స్వరూపమును మాత్రము చూచుకుంటున్నారేగాని, తమ పరస్వరూపమేమిటో గమనించక, పొందక **"దేహములు (జన్మలు)"** అనే అవకాశములను బూడిద చేసుకుంటున్నారు. భ్రమలో ఉండిపోతున్నారు.

***అయితే, తెలివైన, శ్రద్ధగల విద్యార్థికి చదువుకోవటానికి ఏవీ అడ్డంకులు కావు. అట్లాగే నీవు ఆత్మజ్ఞానము పొందటానికి ఏవీ అడ్డంకులు కావని గుర్తుచేస్తున్నాను.***

**శ్రీ మైత్రేయ మహర్షి** : స్వామీ! సర్వాత్మకుడు – స్వస్వరూపుడు అగు పరమాత్మను పాషాణ – లోహ ఇత్యాది విగ్రహ రూపముగా కల్పించుకొని ఉపాశించటం శాస్త్రములచే (ఆగమశాస్త్రము మొదలైనవాటిచే) సూచించబడుచున్నది కదా? అవి అవసరమేనా?

**శ్రీ మహాదేవుడు** : అవును. బుద్ధియొక్క ఏకాగ్రత కొరకై పాషాణ – రాయి – మణి – మట్టి ఇటువంటి వాటితో నిర్మితమైన విగ్రహారాధన శాస్త్రములు సూచిస్తున్నాయి. సాధకులకు మార్గము చూపుచున్నాయి.

అయితే,

**నిగ్రహము కోసమే విగ్రహము సుమా!** ఇది దృష్టియందు కలిగి ఉండియే,– క్రమంగా పరిమిత దృష్టిని అధిగమించి ఆత్మతత్త్వము గురించిన వివేకదృష్టికై సంసిద్ధమయ్యెదరు గాక।

**శ్లో॥ పాషాణ – లోహ – మణి – మృణ్మయ విగ్రహేషు**
**పూజా పునర్జనన భోగకరీ ముముక్షోః॥**

పాషాణము, లోహము, మణి, మట్టి – ఇటువంటి వాటితో తయారైన విగ్రహముల పూజ, పరిమితమైన దృష్టిని దాటకపోతే, అవన్నీ ముముక్షువుపట్ల పునర్జన్మలను కొనసాగించే కారణములను వృద్ధిచేయగలవు సుమా! "నేను ఈ రూపముగా పూజిస్తున్న ఈ నా ఇష్టదైవము సర్వాత్మకుడు, సర్వతత్త్వస్వరూపుడు కూడా" అను ఎరుకను వృద్ధిపరచుకోవాలి. ఏ మరువరాదు.

బుద్ధియొక్క నిర్మలత్వము, మహదాశయముయొక్క సునిశ్చయత్వములను సాధించటానికై శిల్ప – శిలా – సాకార పూజ తప్పక ప్రయోజనకారియే. సాధన లేకపోతే 'జన్మరాహిత్యము' అనే స్థితి లభించదు. అయితే అవి (ఆశయ శుద్ధి లేనపుడు, సర్వాత్మక భావన ఆశ్రయించనప్పుడు) పునర్జన్మ హేతువులే మరి.

## స్వహృదయార్చన

**"తస్మాత్ యతిః స్వహృదయార్చనమేవ కుర్యాత్" - బాహ్యార్చనం పరిహరేత్ అపునర్భవాయ।**

అందుచేత దృశ్యాతీతస్థానము సంపాదించుకొనగోరు యోగి (యతి) చివరికి తన హృదయమునందు సర్వదా వేంచేసియేయున్న సర్వజగత్స్వరూపుడగు ఆత్మదేవునే (స్వాత్మనే) పూజించుచున్నాడు. ఆయనను సర్వాత్మకులుగాను, సర్వతత్త్వ స్వరూపుడుగాను ఆరాధిస్తున్నాడు. **బాహ్య అర్చనలను దాటిన దృష్టిచే పునఃజన్మ రహితమగు ఆత్మస్థానము చేరుచున్నాడు.**

## పూర్ణము - శూన్యము

అట్టి స్వస్వరూపము - సర్వ స్వరూపము అయి ఉన్న ఆత్మ ఎక్కడ వేంచేసి ఉన్నది? దేహములోనా? బాహ్యములోనా? ఆకాశంలోనా? మరెక్కడన్నానా? విను, చెప్పుచున్నాను.

**పూర్ణకుంభము : అంతఃపూర్ణో బహిఃపూర్ణో పూర్ణకుంభ ఇవ అర్ణవే!** : ఒక కుండను సముద్ర జలంలో ముంచి ఉంచామనుకో! ఇప్పుడు జలము ఎక్కడున్నది? ఆ కుండయొక్క లోన-బయట కూడా ఉన్నది కదా! అట్లాగే ఆత్మ మనయొక్క బాహ్య - అంతరములలో అంతా నిండి ఉన్నట్లుగా గమనించు. ఉపాసించు. ఆస్వాదించు. **పరమాత్మ పూర్ణస్వరూపుడు.**

**శూన్యకుంభము: అంతః శూన్యో - బహిః శూన్యః శూన్య కుంభ ఇవ అంబరే!** : ఒకచోట ఒక ఖాళీ కుండ ఉన్నది. లోపల ఏమీ లేదు. శూన్యాకాశమే ఉన్నది. మరి ఆ కుండయొక్క బయట? శూన్యాకాశమే! **పరమాత్మ శూన్య స్వరూపుడు కూడా।**

అట్లాగే ఆత్మ సదా బయట - లోన నిర్విషయ చిదానందముగా సదా వెలుగొందుచున్నది.

## భావాతీతమ్ - త్రిగుణరహితమ్।

**శ్రీ మైత్రేయ మహర్షి** : అట్టి పూర్ణము- శూన్యము కూడా అయి ఉన్న ఆత్మను గ్రహించటం ఎట్లా? (How to pick up?) ఆత్మదేవుని అనుగ్రహం పొందటం ఎట్లా?

**శ్రీ మహాదేవుడు :** ఓ మహర్షీ! దృశ్యములో ఏదైనా గ్రహించాలంటే ఇంద్రియములు నియమితము అవాలి. అయితే, ఆత్మ ఇంద్రియములచే గ్రహించబడు వస్తువు వంటిది కాదు. కాబట్టి బాహ్యమున దేనిచేతనూ **గ్రహించబడువాడవు కావద్దు!**

అట్లాగే బాహ్యమునుండి ఏదీ **గ్రహించువాడవు కూడా కావద్దు.** సర్వ దృశ్య భావములను త్యజించివేయి. దాటివేయి. భావనలు నీవి. అంతేగాని భావనలలోని అంతర్విభాగము అగుచుండటము లేదు.

- భావాతీతుడవు। త్రిగుణముల సాక్షివి। భావములకంటే మునుముందే ఉన్నట్టివాడవు.

- భావములన్నీ వదలి, సర్వ భావములకు ఆవల, భావించటానికి మునుముందుగా ఏ నీ స్వరూపము ఉన్నదో....అట్టి (భావములు త్యజించగా ఇంకనూ శేషించి ఉండే భావనారాయణుడవై), **భావముల కేవల సాక్షిగా** ఉండి ఉండుము! అదియే ఆత్మోపాసన, ఆత్మతాదాత్మ్యము, ఆత్మానుభవము కూడా. అట్లాగే,- సర్వ సహజీవులను భావాతీతమగు ఆత్మస్వరూపముగా భావన చేయి.

**శ్లో॥ ద్రష్టృ దర్శన దృశ్యాని త్యక్త్వా వాసనయా సహ**
**దర్శన ప్రథమాభాసమ్ ఆత్మానం కేవలం భజ॥**

- **ద్రష్ట - దర్శనము - దృశ్యము** (Perceiver - perception - That being perceived)
- **చూచువాడు - చూడటం - చూడబడునది.** (Sear, Seeing, That being seen)
- **అనుభవి - అనుభవము - అనుభవించబడునది.** (Experiencer, Experiencing, That being Experienced)

- అనబడే త్రిపుటిని, వాటి వాటి వాసనలను బుద్ధికుశలతతో త్యజించివేయి. కేవల **దృక్** స్వరూపుడవై, అట్టి **"దృక్స్వరూప స్వ-స్వభావ ఆత్మను నేను"** అను అవగాహన - అనుభూతితో తన్మయుడవై ఉండుము. తత్ స్వరూపుడవై ప్రకాశించుము. సర్వ సంకల్పములను సశాంతింపజేసినవాడవై ఉండుము. **జాగ్రత్ - స్వప్న - సుషుప్తులకు సాక్షి, ఆ మూడిటికి సంబంధించనిది** అయినట్టి స్వరూపమునందు ఒక **కదలని శిల**లాగా నిశ్చలుడవై ఉండుము. అట్టి పరమశాంత ఆత్మస్వరూపము నీవే అయి వెల్లివిరియుము!

**ఆత్మను అనుసంధానము సిద్ధించుకున్న 'శివోఽహమ్' భావియొక్క ఆత్మదర్శన గానం ఏవిధంగా ఉంటుందో...ఇప్పుడు విను!**

⌘⌘⌘

# తృతీయోధ్యాయః

# ఆత్మానందగానము

ఆహా! ఏమి అస్మత్ ఆత్మస్వరూపము యొక్క మహిమ **అహమస్మి పరశ్చాస్మి!** పరస్వరూపుడనగు నేను – ఇహ స్వరూపము ధరించువాడనై స్వయంకల్పిత జాగ్రత్ – స్వప్న – సుషుప్తులలో విలాసంగా సంచారాలు చేస్తున్నాను కదా! నేనే నాలోని నేనై, సర్వముగా ప్రకాశిస్తున్నాను. ఈ సర్వమునకు పరమై కూడా విరాజిల్లుచున్నాను. సత్యమును ప్రకాశింపజేస్తున్నాను కూడా!

**బ్రహ్మాస్మి!** బ్రహ్మము అని పిలువబడుచు, సర్వముగా ప్రభవిస్తున్నది నేనే! ఈ 14లోకములలో అత్యంత ఉత్కృష్టము – మహనీయము అగు గురు (The Finest) స్వరూపుడను. **గురుశ్చాఽస్మి।** సర్వలోకములు నా స్వరూపమే! సర్వలోకముల కల్పన, సందర్శన – ఇదంతా నా యొక్క విన్యాసమే! ఆ బ్రహ్మము ఆత్మ అనబడేది నేనే! **సోఽహమ్! సోఽహమ్!**

ఈ దేహములో అత్యంత శ్రేష్ఠము అయి ఉన్న ఆత్మగా 'గురు' (The most superior part) స్వరూపుడను.

**అహమస్మి సదా సోఽహమ్! సోఽస్మి!॥**

నేను కానిదంటూ ఎక్కడా ఏదీ లేదు. ఇక్కడా – అక్కడా – ఇప్పుడు – అప్పుడు నేనే సర్వమై ఉన్నాను. సర్వమునకు వేరై కూడా ఉన్నాను. **అహమేవాఽస్మి!** ఒక కథలో పాత్రలు, సంఘటనలు, సందర్భములు మొదలైనవేవీ ఆ కథారచయితకు వేరై ఉండవు కదా! కానీ రచయిత కథలో కనిపించడు. ఈ జగదనుభవమంతా నా రచనయే।

**సిద్ధోఽస్మి :**

ఏదీ కూడా నాకొరకు మరొకరెవరో సిద్ధింపజేయటం లేదు! ఈ దృశ్య భావములను, దృశ్యమును, ద్రష్టత్వమును, జాగ్రత్–స్వప్న – సుషుప్తులను నా వినోదముకొరకు నేనే నేనై సిద్ధింపజేసుకుంటున్నాను. **సిద్ధోఽస్మి!** సమస్తమును సిద్ధించుకుంటున్నది నేనే కనుక– ***సిద్ధపురుషుడను.***

**శుద్ధోఽస్మి :**

నేను నాచే సిద్ధింపజేసుకుంటున్నట్టి దేనిచేతను స్పృశించబడటంలేదు. నిత్యనిర్మలుడను.

సర్వదా సర్వమునకు వేరై ఆవల ఉన్నవాడను. **పరమోఽస్మ్యహమ్!**

**సదాసోఽస్మి :**

భూత – వర్తమాన భవిష్యత్ త్రికాలములలో సర్వదా ఉండువాడను. సర్వమునకు ఆవల ఉన్నది మరొకరెవరో కాదు! నేనే! **అహమస్మి సదా సోఽస్మి ।** ***సదా "సత్ (ఉనికి)" – స్వరూపుడను.***

**నిత్యోఽస్మి :**

నేను ఒకప్పుడు ఉండి, మరొకప్పుడు లేనివాడను కాను. ఎల్లప్పుడు ఉండియే ఉన్నాను. ఉండియే ఉంటాను.

**విమలోఽస్మి :**

నాకు జన్మ – కర్మ – సత్త్వ – రజో – తమో గుణ ఇత్యాది దోషాలేవీ అంటవు. కథ రాసేవాని కథలోని పాత్రల గుణాలు అంటుతాయా? లేదు. అందుచేత **విమలోస్మ్యఽహమ్! నిత్యనిర్మలుడను.**

**విజ్ఞానోఽస్మి :**

తెలియబడేదంతా "అనుభవము" రూపంగా తెలుసుకుంటున్నది నేనే! నాకు మరొకరెవ్వరో తెలియపరచటం లేదు.

**విశేషోఽస్మి :**

సర్వ విశేషములు నేనే। సామాన్యంగా కనిపిస్తున్న దానిలో విశేషమైనవాడను. విశేషములోనే సామాన్యమంతా కలిగియున్నవాడను।

**సోమోఽస్మి ।** (స + ఉమ = ప్ర–కృ–తి = ప్రకృత్యహమ్)

సత్‌చిత్‌ఆనందస్వరూపుడను. నేనే ప్రకృతిగా విరాజిల్లుచున్నాను.

ప్రదర్శనము – **కృత**ము – **తి**రోగమనము – అను మూడిటితో కనబడేదంతా **'నేనే'।** **<u>ప్రకృతి</u> నా విన్యాసమే।**

**సకలోఽస్మి :**

సకలముగా భాసిస్తున్నది నేనే! స్వప్నంలో కనిపించేదంతా స్వప్నము తన దైనవాని ఊహా చమత్కారమే కదా! అందుచేత సర్వముగా నాచే పొందబడుచున్న జాగ్రత్ – స్వప్న – సుషుప్తిల అంతర్గతాలన్నీ నేనే! **సకలోస్మ్యఽహమ్!** "ద్రష్ట–దర్శనము–దృశ్యము" – గా కనిపించేదంతా **"నాలోని నేనైన నేనే".**

**శుభోఽస్మి :**

అంతా నావారే! నేనే! సర్వశుభ స్వరూపుడను! 'శుభమ్' అంటూ అంతటిని ప్రారంభిస్తున్నది – ముగిస్తున్నది కూడా నేనే! అందుచేత సర్వ శుభంకరుడను. శంకరుడను.

**శోకహీనోఽస్మి ।**

అంతా నా కల్పనయే! కల తనదైన తనకు కలలోని తాను పొందుచున్న సుఖ – దుఃఖములకు ఏమి సంబంధము? ఏమీ లేదు. జీవాత్మగా పొందుచున్న శోకములకు ఆ జీవాత్మను కల్పించుకుంటున్న నాకు ఏమి సంబంధము? ఏమీ లేదు. **శోకహీనోఽస్మి!** నవలలో ఒక పాత్ర దుఃఖము పొందితే, అది ఆ నవలా రచయిత పొందినట్లు అవదు కదా! ఈ దృశ్యమంతా రచిస్తున్న ఆత్మనగు నాకు జగద్దుఃఖములు లేవు.

**చైతన్యోఽస్మి ।**

ఈ దేహము కదులుతోంది కదా! నేను దేహత్వమునకు వేరై, ఈ దేహములను కదల్చువాడను. ఆలోచనలను కల్పించుకొని, వాటిని కదల్చువాడను. సర్వ జగత్ – జన్మ – జీవన – మరణ భావములను చలింపజేయువాడను. చైతన్య స్వరూపుడను. ఇక్కడ దేహ మనో బుద్ధి చిత్త అహంకారాదులు స్వయముగా అచేతనమే అయి ఉండగా వాటిని చేతనము చేయుచున్న **చైతన్యపురుషుడను** నేనే।

**సమోఽస్మి ।**

నేను దేహములో మాత్రమే కాక, సమస్త జీవులలో సమస్వరూపుడనై ఉన్నవాడను. సర్వ సముడను! సర్వమునందు సమముగా వేంచేసియున్న ఆత్మస్వరూపుడను, సమమ్ సర్వేషు భూతేషు తిష్ఠంతమ్। మార్పు – చేర్పులు లేని వాడను. సర్వదా ఏకరీతిగా – సమముగా ఉండువాడను. నాయొక్క సమ–ఆత్మస్వరూపమునందే సమస్తము ప్రతిబింబిస్తోంది.

**మానావమాన హీనోఽస్మి।**

నాచే కల్పించబడి, నాకు వినోదముగా అగుచున్న కథలో కనిపించువారి వలన నాకు గౌరవాగౌరవములు ఏమున్నది?

నేను కల్పించిన ఒక కథలోని కొన్ని పాత్రలు వచ్చి నన్ను గౌరవించటమేమున్నది? గౌరవించకపోవటమేమున్నది? అగౌరవించటమేమున్నది?

**నాచే గౌరవించబడుచున్న జగత్ దృశ్యములన్నీ నాయొక్క స్వకీయ కల్పనా భావ చమత్కారములే!**

నాయొక్క భావనా కల్పితంగా, నాచే రూపము ఇవ్వబడుచున్న ఈ జగత్ విశేషములు వచ్చి నన్ను సన్మానించటమేమిటి? అసన్మానించటమేమున్నది?

అందుచేత నాకు మానముగాని, అవమానముగాని మొదలే లేవు.

**నిర్గుణోఽస్మి ।**

నేను గుణసంబంధితుడినా! లేదు. నాయొక్క ప్రకృతి – (1) (ప్ర) ప్రకాశము, (2) (కృతి) – కృతము, (తి) తిమిరము / మోహము–అను మూడు గుణములు కలిగి ఉన్నది. అయితే, నేనుంటే గుణములకు ఉనికి. (అంతేకాని), గుణములచేత నాకు ఉనికి కాదు. గుణములు నావి. నేను గుణములుగా అవను. గుణిస్వరూపుడు. గుణములకంటే మునుముందే ఉన్నట్టి కేవల సత్ స్వరూపుడను. అందుచేత నిర్గుణుడను.

**శివోఽస్మి :**

**(శివాత్ పరతరం నాస్తి।)** సర్వము శివ స్వరూపమేనని సిద్ధాంతీకరించబడుతోంది. కాబట్టి నేను – నీవుతో సహా సర్వము సహజంగా సర్వాంతర్యామి, సర్వ తత్త్వస్వరూపుడు – అగు శివస్వరూపమే। **చిదానందరూపమ్।** శివోఽహమ్! సర్వము శివమయమే అయి

ఉండగా, నేను శివతత్త్వమునకు వేరుగా ఎట్లా ఉంటాను? కాబట్టి **శివోఽస్మ్యహమ్!** 'శివుడు' అని శాస్త్రములచే సువిస్తారంగా వర్ణించబడుచున్నది, వేదములచే స్తుతించబడుచున్నది – **నాయొక్క కేవల స్వరూపమునే। (జీవో శివః)।**

**ద్వైతాద్వైత విహీనోఽస్మి :**

ఏకమగు ఆత్మయే అనేకముగా కనిపిస్తోంది. విజ్ఞానదృష్టిగలవారికి, పరమపవిత్రమగు హృదయముగలవారికి – **"అనేకముగా కనిపిస్తూ ఏకముగా అనిపిస్తోంది!** అదియే అక్షరమగు సత్యము. ఏకమై సర్వత్రా సర్వదా ఆత్మయే వెల్లివిరియుచుండగా ద్వైతమేమిటి? అద్వైతమేమిటి? ఇక వాదోపవాదములతో ఏమి పని? ద్వైతము నేనే। అద్వైతము నేనే। జీవుడను నేనే! శివ–పరతత్త్వమును నేనే! **ద్వైత – అద్వైత విహీనోఽస్మి!**

**ద్వంద్వ హీనోఽస్మి :**

నటుడు నాటకంలో నటిస్తూ (1) పాత్ర (2) పాత్రధారుడుగా – **ఒక్కటిగా** ఉన్నట్లే, జీవాత్మ – పరమాత్మ స్వరూపుడనై నేనే ఉన్నాను. పాత్రధారుడే పాత్రగా కనిపిస్తున్నాడు. పరమాత్మకు వేరై జీవాత్మత్వము నాకు లేదు. **ద్వంద్వహీనోఽస్మి!** కేవలాత్మయే నేనై ఉన్నాను. ఇక నాకు తదితర సమాచారములతో క్రొత్తగా పనియేమున్నది? **సోఽహమస్మ్యహమ్!**

**భావాభావ విహీనోఽస్మి :**

భావన చేయునది నేనే! కనుక భావనకంటే ముందే భావించువానిగా నేను ఉన్నాను. భావన చేయునప్పుడుకూడా భావములకు అతీతుడనై ఉన్నాను. నా నుండి భావన ఉత్పన్నమగుచున్నది. కనుక భావనలకు ఆవల ఉన్నవాడను.

**భాసా హీనోఽస్మి :**

జాగ్రత్ – స్వప్న – సుషుప్తులను క్రీడినై, – **క్రీడా స్థలములుగా కల్పించుకొనుచున్నవాడను.** అంతేగాని ఆ మూడు నన్ను భాసింపజేయటం లేదు. నన్ను భాసింపజేయునది, ప్రకాశింపజేయునది మరొకటేదీ లేదు. **సమస్తమును భాసింపజేయునది నాయొక్క భాసా తేజస్సే।** అట్టి ఆత్మ తేజో రూపుడనగు నన్ను తన వెలుగులో చూపగల మరొకటి ఏదీ లేదు. సూర్యునికి తన వెలుగులో తనను చూపటానికి దీపము ఎందుకు?

**భాస్యోఽహమ్ :**

స్వయం ప్రకాశకుడను. నాచేతనే సర్వము సర్వదా సర్వత్రా ప్రకాశింపజేయబడుచున్నది. కేవలమగు తేజోరూపుడను. ఏ వెలుగులో (ఎరుకలో) సమస్తము కనిపిస్తోందో, – ఆ వెలుగు (ఎరుక) నా ఆత్మ తేజస్సే.

**శూన్యాశూన్య ప్రభావోఽస్మి :**

జాగ్రత్ – స్వప్న – సుషుప్తులనే తెరలపై విషయముల చిత్రీకరణచేయుచున్నది, ఆ విషయచిత్రీకరణకు విరమిస్తున్నది, కూడా నేనే! ఈ రీతిగా విషయములను, విషయరాహిత్యమునకు సాక్షినై ఆ రెండిటిని ప్రకాశింపజేయువాడనై ఉన్నాను. శూన్యము – అశూన్యము నా కల్పనా చమత్కారములే! (నాటకములోని సంఘటనలు – ఉన్న మాట నిజమే। నాకటమంతా కల్పన కాబట్టి, లేనిమాట కూడా నిజమే. ఈ విధంగా శూన్య–పూర్ణ స్వరూపుడను).

**శోభనా శోభనోఽస్మి అహమ్।**

ఇది బాగున్నది – బాగుకాదు; ఇది అందమైనది – ఇది కాదు; వీరు ఇట్టివారు – వారు అట్టివారు కాదు...ఇత్యాదులన్నీ నాయొక్క స్వకీయ నిర్వచన – అవగాహన – అభిప్రాయములను అనుసరించే రూపుదిద్దుకుంటున్నాయి. కనుక 'శోభ – అశోభ' అనునదంతా నాలీలా విన్యాసమే! నేనే శోభించుదానిగాను, శోభించనిదానిగాను కూడా ఏర్పడినవాడనై ఉన్నాను.

**తుల్య–అతుల్య విహీనోఽస్మి ।**

నాకు వేరుగా అగుచున్నది ఏదీ లేదు. నేను దేనికీ వేరుకాదు.

నాకు సమానమైనది ఏదీ లేదు. సమానము కానిదీ ఏదీ లేదు.

కలలో కనిపించేవన్నీ నానుండియే। అయితే కలలో ఏ ఒక్కటీ నేను కాదు. జాగ్రత్ కూడా స్వప్నము వంటిదే! కనుక జాగ్రత్‌లో కూడా నేను కానిదేదీ నాకు అనుభవంగాదు. జాగ్రత్ సాక్షినే కాబట్టి జాగ్రత్‌లో ఏదీ నేనవటం లేదు.

**నిత్యశుద్ధోఽస్మి ।**

కథా రచయిత కథలో ఏ సంఘటనచేతనూ స్పృశించబడడు. కలలోని మంచి – చెడులను కల కంటున్నవానిపై ఆరోపిస్తామా? లేదు. నాటక పాత్రయొక్క మంచి చెడులు ఆ నటుని వ్యక్తిత్వమునకు సంబంధించినవి కావు కదా! జగత్‌ద్రష్ట – జగత్ దృశ్యముల సదోష – నిర్దోషములచే స్పృశించబడని కేవల దృక్‌స్వరూపుడను. కనుక నిత్యశుద్ధ స్వరూపుడను.

**సదాశివోఽస్మి ।**

నా శివస్వరూపమునకు ఏ సమయములోనూ కూడా ఏ లోటూ లేదు. నేను అజ్ఞానినై అనేక జన్మలలో రాక – పోకలు నిర్వర్తించవచ్చుగాక! లేదా, మరికొన్ని జన్మలలో సుజ్ఞానినై జన్మ – కర్మలకు ఆవల గల ముక్త స్వరూపమును ఆస్వాదిస్తూ ఉండవచ్చు గాక! నాకు జ్ఞాన విషయాలు తెలియవచ్చు గాక! లేదా, తెలియకపోవచ్చును గాక! నేను సర్వదా సహజ శివస్వరూపుడనే అయి ఉన్నాను. (జీవోబ్రహ్మేతి నాపరః) **(సదాశివుడు = ఈ జీవుడు ఎల్లప్పుడు శివానంద స్వరూపుడే।)**

**సర్వాసర్వవిహీనోఽస్మి ।**

"సర్వభూతములు తానై – సర్వసాక్షి అనగా వేరై" అనికదా,..... ఆత్మగురించిన ఆత్మజ్ఞుల గానము! నా కలలో కనిపించేదంతా నేనే! కానీ నా కలలో నేను ఏదీ కాదు. నాయొక్క నాటక రచనలో పాత్రలయొక్క భావ – ఆవేశాలన్నీ నావే! కానీ నాయందు ఆ పాత్రల ఆవేశ కావేశాలు లేనే లేవు. అట్లాగే – అనుభవమయ్యే ఈ సర్వము నేనే! అయినా కూడా ఈ సర్వములో లేను. **సర్వమునకు సాక్షినై, వేరుగా సర్వత్రా ఏర్పడి ఉన్నాను.**

**సాత్త్వికోఽస్మి ।**

'నేను లేను' అనునది నాకు ఉండనే ఉండదు. సదా సత్ స్వరూపుడను. శుద్ధసత్త్వ స్వరూపుడను. ఎల్లప్పుడు ఉనికిని కలిగి ఉంటున్న వాడిని కాబట్టి ఎప్పటికీ నేను నేనే! నాలోని నేనైన నేను సర్వదా యథాతథము. **సదాఽస్మ్యహమ్!**

**ఏక సంఖ్యా విహీనోఽస్మి ।**

నేను సర్వదా ఏకమేగాని అనేకము కాదు. అయితే, నేనున్నచోట... నాకు అభిన్నమైనట్టి నాయొక్క ప్రకృతి (లేక స్వభావము) నన్ను ఆశ్రయించియే ఉంటుంది. బంగారమునకు 'ఇది' అనే ఆకారము ఏదీ లేకపోయినప్పటికీ, ఏదో ఒక ఆకారము కలిగియే ఉండటం స్వభావమే కదా! అఖండుడనగు నన్ను నాయొక్క ప్రకృతి స్వభావసిద్ధంగా నన్ను ఆశ్రయించినదై ఉంటోంది.

ఈ విధంగా...

- నేనున్నచోట నా యొక్క స్వభావము (ప్రకృతి) – **భావన,**
- ఆ స్వభావమును ఆశ్రయించి **త్రిగుణములు**;
- ఆ త్రిగుణములచే నిర్మితమైన మనో – బుద్ధి – చిత్త – అహంకారములు,
- చిత్తముయొక్క ఉపకరణములైనట్టి శబ్ద–స్పర్శ–రూప–రస–గంధములు అనబడే ఇంద్రియార్థములు; కామ క్రోధ–లోభాదులు,
- ఆ ఇంద్రియార్థములను – తదితరములను ప్రదర్శించుకోవటానికి భౌతిక భావనారూపమైన దేహములు,
- ఆ దేహములలో అంతర్విభాగములైనట్టి పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు,
- బుద్ధి యొక్క దశలనబడే జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు,
- ఆ జాగ్రత్–స్వప్న–సుషుప్తులలో నా ఊహ–భావనా కల్పితమైన ఇంద్రియార్థ సంబంధమైన దృశ్య ప్రపంచాలు వస్తూ పోతూ ఉంటాయి. ఊహా నిర్మితమై ఎప్పటికప్పుడు తరంగముల రాకపోకలవలె వచ్చిపోయే జగత్ పరంపరలు ఇవన్నీ నన్ను వెంటనంటి కొనసాగుచూనే ఉంటాయి.

ఇవన్నీ అస్మత్ సంకల్పశక్తిని, ఊహాశక్తిని ఆశ్రయించినవై ఉంటున్నాయి. నేను ఈ రీతిగా నాయొక్క **ఇచ్ఛ, జ్ఞాన, క్రియలను – జాగ్రత్ – స్వప్న – సుషుప్తి రూపములుగా** నాయందే కల్పించుకుంటున్నాను. మరొకప్పుడు ఉపశమింపజేస్తున్నాను. సర్వదా ఏకస్వరూపుడను అయి ఉండి కూడా....ఏక సంఖ్యామాత్రుడనై ఉండను.

**అనంతుడనై, సమస్తము నాయందు ఇముడ్చుకున్నవాడినై ఉంటాను.**

**<u>న చ అహమ్ ద్విసంఖ్యావాన్</u>**

ప్రకృతి (లేక, స్వభావము) నాయొక్క స్వయంకల్పితభావనా వైచిత్ర్యమే కదా! నా ఊహ – భావన నాకు వేరైనవా? కావు. ఈ జాగ్రత్ – స్వప్న – సుషుప్తి స్థానములు నా భావనయే. కాబట్టి ఊహ నాకు వేరైనది కాదు. నేను ఈ విధంగా అద్వితీయుణ్ణి! **(మత్తః పరతరమ్‌నాన్యత్ కించిదస్తి).** నేను నేనుగా ఉండి **"అనుభవములు పొందే నేను"**ను కల్పించుకొని తదితర కల్పనలన్నీ నాకు నేనుగా ఆస్వాదిస్తున్నాను. నాకు వేరైనది ఏదీ ఎక్కడా లేకపోవటంచేత **<u>ద్విసంఖ్యావాన్ అహం న చ। ఒకే సంఖ్య వాడిని. రెండవ సంఖ్యయే లేనివాడను.</u>**

**<u>సత్ – అసత్ భేద హీనోఽస్మి</u>**

కేవల సత్ స్వరూపుడనగు నేను నా స్వస్వరూపమునందే ద్వితీయమైన స్వభావము, ప్రకృతి మొ॥వి కల్పించుకొని ఉబుసుపోకగా, అస్మత్ చిద్విలాసమంతా కల్పించుకొంటున్నాను.

- నన్ను "సత్ స్వరూపుడు" అని,
- నా కల్పిత – భావ – ఊహ సర్వ కల్పనా విశేషములను కథలోని ఒకానొక వ్యక్తివలె 'అసత్' అని

వేదాంతశాస్త్రము అభివర్ణిస్తున్నది. వాస్తవానికి నాకు సత్తు లేదు. అసత్తు లేదు. కేవలీ స్వరూపుడనై, త్రిగుణములకు – త్రి అవస్థలకు సాక్షిస్వరూపుడనై, కారణ – కారణుడనై వెల్లివిరుస్తున్నవాడను. నేను వేరు, నా కల్పన వేరు–అనునదీ ఎప్పుడూ లేదు. అందుచేత, నా వాస్తవ స్వరూపముయొక్క సమక్షములో సత్–అసత్ భేదములు లేవు.

**సంకల్ప రహితోఽస్మ్యహమ్**

సంకల్పములన్నీ (All Assumptions along with Presumptions) నావి. అనగా, సంకల్పములన్నిటికి మునుముందే – సంకల్పములకు అవల కేవల చైతన్యస్వరూపుడనై నేనున్నాను. నాయొక్క లీలా వినోదమే సంకల్పములు.

అంతేకాదు!

సంకల్పములు నానుండి ప్రదర్శితమగుచున్న సందర్భాలలో కూడా **నేను నేనుగానే ఉన్నాను.** సంకల్పముల రూపముగా గాని, సంకల్పముల మధ్యకుగాని దిగి వచ్చుటలేదు. నా సహజ స్వస్వరూపము సంకల్పరహితమైనదే.

నిత్యోదిత చైతన్య స్వరూపుడనై సంకల్పములను, భావనలను, దేహాదులను చైతన్యపరచువాడను. (I am the Instigator and Inspirer of the whole worldly Scenario)

**నానాత్వభేదహీనోఽస్మి :**

నా కలలో అనేకులు కనిపిస్తున్నప్పటికీ నేను ఆ వేరు వేరైన రూపములన్నిగా అగుచున్నానా? లేదు. ఆ రీతిగానే నేను ఏకమగు బ్రహ్మమే స్వరూపముగా కలిగి ఉన్నాను. (ఏకమేవాద్వితీయం బ్రహ్మ। జీవో బ్రహ్మైఽతి నా పరః అని) వేద వాఙ్మయము, ఆత్మజ్ఞుల ఆప్తవాక్యములు ఎలుగెత్తి గానం చేస్తున్నాయి. **నాకు 'నానాత్వము' అనే దోషమే స్పృశించదు.** జాగ్రత్ – స్వప్న – సుషుప్తుల సందర్భాలలోను, దేహముల రాక – పోకల సంఘటనలప్పుడు నేను ఒకే తీరుగా ఉన్నాను. మార్పు చేర్పులు ఏమాత్రము స్పృశించని **పరబ్రహ్మమే నా యొక్క సహజరూపము.** అట్టి బ్రహ్మమునకు నానాత్వము ఎన్నడూ లేదు.

**(హి) అఖండానంద విగ్రహః।**

ఇదంతా నా ఆనందైశ్వర్య స్వరూపమే. 'నేను వేరు – జగత్తు వేరు – పరమాత్మ వేరు – తదితరములు వేరు'....ఇదంతా **<u>"స్వప్న సందర్భములోని జాగ్రత్ యొక్క ఏమరపు"</u>** వలె–నా **అజ్ఞాన విభాగము** నుండి **క్రీడా వినోదం**గా – 'జాగ్రత్'లో స్వస్వరూపముయొక్క 'ఏమరపు' అయి – ప్రదర్శనమౌతోంది.

స్వప్న సందర్భపు మైమరుపువలన జాగ్రత్‌ను ఎవ్వడూ పోగొట్టుకోవటంలేదు కదా! అట్లాగే అజ్ఞానముచే (కొన్ని కొన్ని జన్మలుగా దృశ్యముతో తన్మయ రూపమైన మైమరపు – ఆత్మత్వము యొక్క ఏమరపు మాత్రం చేత) **ఆత్మస్వరూప లక్షణములైనట్టి "అఖండత్వము. అప్రమేయత్వము"**లకు వచ్చే లోటేమీ లేదు. ఆత్మస్వరూపుడనగు నేను జ్ఞాన, అజ్ఞాన– ఇత్యాది సర్వసందర్భాలలోను అఖండుడనే (Indivisible as different Forms).

**నాఽహమస్మి** : 'నేను' అను అహమ్ భావము **నాది.** అంతే గాని అహమ్ భావము – **నేను కాదు. "జాగ్రత్‌లో నేను – స్వప్నంలో నేను – సుషుప్తిలో నేను"** ఇవి 'నేను' అనేది నాయొక్క నా సంప్రదర్శనలు మాత్రమే! వాటికి వేరైన చైతన్యస్వరూపుడను. నేను జగదృశ్యములోని **'నేను'**కు అతీతుడనైనవాడను. నాటకంలోని "పాత్రయొక్క **'నేను'** – స్వరూప, స్వభావాలకంటే ఆ నటుడు బాహ్యంగా "వేరైన "నేను" కలవాడై ఉన్నట్లుగానే – ఈ "జాగ్రత్" లో కనిపించే 'నేను' – కు ఆవలిస్వరూపుడను. ఈ జాగ్రత్‌లోని 'నేను'చే నాయొక్క సహజమగు స్వస్వరూపమునకు చెందిన 'నేను' తొలగించబడటములేదు. **దాచివేయబడటము లేదు.**

'అహమ్' భావన ఎక్కడ ఉత్పత్తి అవుతోందో అట్టి కేవలీతత్త్వమును. అహంభావనమునకు సాక్షిని కూడా। కనుక **నాఽహమస్మి.**

**న చ అన్యోఽస్మి ।**

నేను వేరైన మరొకటేదీ కాదు. వేరైన అన్య స్వరూపుడను కాను. నాకు నేనై, నేనుగా ఇక్కడే ఇప్పుడే ఉన్నాను. సర్వదా ఇక్కడ – ఇప్పుడు....అనువాటితో కూడుకొనియే ఉన్నాను. మరెక్కడివాడినో కాను.

**దేహాది రహితోఽస్మ్యహమ్।**

ఈ భౌతిక దేహము నేను ఉపయోగిస్తున్న ఒకానొక ఉపకరణము వంటిది.

అట్లాగే ఇంద్రియాలు – ఇంద్రియార్థములు కూడా. మనో బుద్ధి చిత్త అహంకారాలు కూడా నాకు ఉపకరణముల వంటివే.

జన్మ–జన్మాంతరములు కూడా అటువంటివే। ఉపయోగించుకొనువాడు ఉపయోగించబడే వస్తువు కంటే సర్వదా వేరే కదా!

అందుచేతనే "పరమాత్మ – పరస్వరూపము" అని – ఆత్మశాస్త్రముచే చెప్పబడుచున్నాను. దేహాదులు నాకు లేవు. వాటికంటే విశేషమైనవాడిని. **(పరమ్ → ఆవల – నేనైన నేను).**

**ఆశ్రయ – అనాశ్రయ హీనోఽస్మి।**

నేను ఈ దేహ – మనో – బుద్ధి మొ॥వి ఆశ్రయించుకొని ఉన్నవాడిని కాదు. నేను దేనినీ ఆశ్రయించినవాడినై లేను. వాటికన్నిటికీ వేరై (పరమై) ఉన్నాను.

అట్లాగే, నేను ఆశ్రయించనిదేనికీ ఉనికి లేదు. నాకు ఆశ్రయము లేదు. అనాశ్రయము లేదు.

**ఆధారరహితోస్మ్యహమ్।**

నేను దేనిపైనా ఆధారపడి లేను. స్వయంకృతుడను. స్వయం సంకల్పుడను. స్వయం స్వరూపుడను. నాకు మరొకటేదీ ఆశ్రయము కాదు.

**బంధ–మోక్షాది హీనోఽస్మి।**

కల తనదైనవాడు కలలో చిక్కుకున్నట్లుగా అవుతుందా? లేదు. నటుడు నాటకంలోని పాత్రయొక్క స్వభావముచే బంధితుడా? లేదు. గృహస్థ – ఆశ్రమములో ఉన్నంతమాత్రంచేత, ఒకడు ఆ ఆశ్రమముచేత బంధితుడా? సంబంధితుడా? రెండూ లేదు. విషయ భావనలచే బంధము, (విషయ – అభావనచే) మోక్షము మనస్సుకేగాని, ఆత్మకు కాదు. నేను సర్వదా స్వతఃగా ఆత్మస్వరూపుడను. **నాకు బంధము లేదు. మోక్షము లేదు. ఆశ్రమములు లేవు. జీవేశ్వర ద్వంద్వము లేదు.**

**శుద్ధబ్రహ్మాస్మి సోఽస్మ్యహమ్।**

కేవలమగు శుద్ధబ్రహ్మమే నేను. తత్త్వశాస్త్రము "తత్ త్వమ్. నీవు అదియే! నీవే అది" అని బ్రహ్మము గురించిన విశేషంగా నాకు చెప్పుచూనే ఉన్నది. సిద్ధాంతీకరిస్తున్నది కూడా. అహమ్ బ్రహ్మోఽస్మి! బ్రహ్మము కాకుండా నాకు వేరైన రూపమేదీ లేదు. **సోఽస్మ్యహమ్।**

**చిత్తాది సర్వహీనోఽస్మి**

ఒకడు వస్త్రము (చొక్కా) ధరిస్తే అది ఆతని దేహభాగమౌతుందా? లేదు కదా! ఈ మనో – బుద్ధి – చిత్త – అహంకారములు నేను ధరించు వస్త్రములు వంటివి మాత్రమే! ఈ అంతరంగ చతుష్టయమునకు వేరై ఉన్నవాడను. అవి ఉన్నప్పుడు – లేనప్పుడు కూడా

నేను ఉన్నాను. వాటిపై నేను ఆధారపడి ఉన్నవాడను కాను. కేవల సత్ స్వరూపుడను. చిదానంద రూపుడను. నేను ఉన్నాను కాబట్టి – అవన్నీ ఉనికిని సంతరించుకుంటున్నాయి.

**పరమోఽస్మి।**

- కల తనదైనవాడు, కలకు వేరుగా ఉండి ఉన్నట్లుగా...,
- నవల వ్రాయుచున్నవాడు నవలోని కథకు, కథనమునకు వేరై ఉన్నట్లుగా...,
- నటించు కళాకారుడు నాటకపాత్రకు వేరై ఉన్నట్లుగా...,
- చూచుచున్నవాడు చూడబడే సర్వమునకు వేరై ఉన్నట్లుగా..,
- భావించువాడు – భావములన్నిటికీ వేరై ఉన్నవాడగుచున్నట్లుగా...,
- వాత్సల్యము చూపువాడు వాత్సల్యమునకు వేరైనట్టి ఉనికి కలిగి ఉన్నట్లుగా...,

నేను దేహ – జన్మ – మృత్యు – ఇంద్రియార్థ – అంతరంగ చతుష్టయములతో సహా సర్వ అనుభవ – అనుభూతులకు **ఆవల ఉన్నాను.** పరస్వరూపుడును! పరమై (Away) ఉన్నాను.

**పరాత్ పరః।**

జీవుడుగా నాకు **"ఈవల–ఆవల, బాహ్యము – అంతరము, జీవత్వము – పరత్వము"** – అనే ద్వంద్వములు ఉండి ఉండవచ్చు గాక. అదంతా సందర్భ మాత్రము. సర్వ సహజీవులలో వేంచేసియున్న సర్వాత్మయే నా స్వరూపము. **ఇహ పరముల కావల పరాత్పరత్వము నాయొక్క సహజస్వభావము.**

**సదా విచారరూపోఽస్మి ।**

చిత్ (ఎరుక – ఎరుగుట) – ఆత్మస్వరూపుడగు నాయొక్క నిత్యోదితమైన విలక్షణమైన నిత్యలక్షణము. ఎరుకచే ఆనందించువాడను. చిదానందస్వరూపుడను. విచారణ అస్మత్ బుద్ధి స్వరూపము. ఆలోచన–భావన సర్వదా నా ఆనందవినోదమే.

**నిర్విచారోఽస్మి ।**

విచారణ (బుద్ధి) కన్నా ముందున్నవాడను. సర్వ ఆలోచనల ఆవల ఆలోచించువాని రూపము నాదై ఉన్న వాడను. ఆలోచనలు చేయునప్పుడు – ఆలోచనలు లేనప్పుడు కూడా **నిత్యోదిత ఆత్మతోజోరూపుడనుగా** నేను ఉండనే ఉన్నాను. ఈ విధంగా ఆలోచనలకు సంబంధించనివాడను. **సోఽస్మ్యహమ్।**

**'అ' కార 'ఉ' కార రూపోఽస్మి 'మ' కారోఽస్మి సనాతనః।**

నేనుంటే జన్మలు – కర్మలు. అంతేగాని, జన్మకర్మలుంటే నేను కాదు. జన్మ – కర్మల మధ్యలోనివాడను కాను. జన్మ – కర్మలచే ఉనికి గలవాడనుగాను. **జన్మల ప్రారంభమునకు ముందే నేనున్నాను** కనుక **'సనాతనపురుషుడు'** అని చెప్పబడుచున్నాను. అట్టి నన్ను వేదములు 'ఓం' అను సంజ్ఞతో పిలుస్తున్నాయి. **"అ ఉ మ ఓం"। (దేహే జాతేన జాతోఽసి। దేహే నష్టే న నశ్యసి।)**

**అ** = సత్; ఉనికి; జాగ్రత్; పరమాత్మ ।

**ఉ** = చిత్; ఎరుక; స్వప్నము; జగత్తు।

**మ** = ఆనందము; అనుభవి; సుషుప్తి; జీవాత్మ।

**అ** = కేవలాత్మ; ఉమ; ప్రకృతి।

**అ** = పరస్వరూపం. ఉమ = ఇహస్వరూపము

**ధ్యాతృ – ధ్యాన – ధ్యేయ హీనోఽస్మి।**

ధ్యాని = ధ్యాస ప్రదర్శించువాడు (Perceiver).

ధ్యానము = ధ్యాస (Perception).

ధ్యేయము = ధ్యానించబడు విషయములు (Objects of Perception).

ఈ త్రిపుటికి ముందే ఉన్నాను. ఈ త్రిపుటి లేనప్పుడు కూడా నేనున్నాను.

కనుక త్రిపుటికి అతీతుడను. త్రిపుటియొక్క సాక్షిగా, త్రిపుటీరహితుణ్ణి.

**సర్వ పూర్ణ స్వరూపో௨స్మి।**

**"ఇంకా మరొకస్థితియో, ఆశ్రమమో, సాధనయో పొందితేగాని నేను పూర్ణుడును కాను!"** అనునది నాకు కించిత్ కూడా ఏదీ లేదు. ఆత్మస్వరూపముచే నేను సర్వదా పూర్ణుడను. "నాటకంలోని నా పాత్రకు నాటకంలో ఏదో లభిస్తేగాని ఆ పాత్రగా నటిస్తున్న నాకు క్రొత్తగా ఏదో లభించదు" ....అని అనము కదా!

**అకార – మకార – ఉకార** స్వరూపుడనై "పరమాత్మ – జీవాత్మ – జగత్" స్వరూపములను ధారణచేస్తూనే, ఆ సర్వమునకు ఆవల కేవలాత్మస్వరూపుడనై, నిర్విషయుడనై ప్రకాశిస్తున్నాను. **'ఓం' కారరూపుడను.**

ఒకప్పుడు **"జగదృశ్యములు"** అనబడే క్రీడగా విషయములు కల్పించుకుంటూ, మరొకప్పుడు కల్పనలను నాయొక్క సర్వదా ప్రశాంతాత్మ స్వరూపములోనికి ఉపశమింపజేస్తూ ఉన్నట్టివాడను.

స్వీయకల్పనా విహార స్థానములగు నాయొక్క జాగ్రత్ – స్వప్న – సుషుప్తులలో నేను ఏదో క్రొత్తగా పొందితే పూర్ణుడను, పొందక పోతే అపూర్ణుడను అవుతానా? లేదు.

నేను స్వతఃగానే పూర్ణుడను. క్రొత్తగా పొందవలసినది ఏదీ లేదు. కోల్పోయేదీ లేదు. ఈ రీతిగా **సర్వపూర్ణ స్వరూపో௨స్మి**

**సచ్చిదానంద లక్షణః।**

సర్వదా శివస్వరూపుడను, (లేక) ఆత్మయే సత్య – నిత్య స్వరూపముగా కలవాడను – అగు నాకు '3' విలక్షణములైన లక్షణములు ఉన్నాయి. ఇది వేదాంతశాస్త్రము (లేక) తత్త్వశాస్త్రము యొక్క ఒకానొక ముఖ్యమైన పాఠ్యాంశము.

**(1) సత్ లక్షణుడను :** 'ఉనికి' (సత్) నాయొక్క ఒక ముఖ్య లక్షణము (లేక) సహజ స్వభావము. **'నేను ఉన్నాను'** అనునదే సత్ స్వభావము యొక్క బాహ్యాభావనా ప్రదర్శనము. 'నేనులేను' అని ఎవ్వరూ అనలేరు కదా! ఒకవేళ 'నేను లేను' అంటే, ఒకానొకచోట లేనివాడైనప్పటికీ, మరొకచోట ఉండి ఉండాలి కదా!

- జాగ్రత్‌కు సాక్షియై నేనున్నాను. జాగ్రత్ నాదై నేనున్నాను. జాగ్రత్‌గా ఉన్నాను – జాగ్రత్‌లో నేనున్నాను.
- స్వప్నమునకు సాక్షియై నేనున్నాను. స్వప్నము నాదై నేనున్నాను. స్వప్నముగా ఉన్నాను. స్వప్నములో నేనున్నాను.
- సుషుప్తికి సాక్షియై నేనున్నాను. సుషుప్తి నాదై నేనున్నాను. సుషుప్తిగా ఉన్నాను. సుషుప్తిలో నేనున్నాను.
- గుణములకు సాక్షియై నేనున్నాను. గుణములు నావై నేనున్నాను. గుణములుగా ఉన్నాను. గుణములలో నేనున్నాను.
- దేహమునకు సాక్షియై నేనున్నాను. దేహము నాదై నేనున్నాను. దేహముగా నేనున్నాను. దేహములో నేనున్నాను.
- సర్వసంబంధములకు సాక్షియై నేనున్నాను. సర్వ సంబంధములు నావే అయి నేను ఉన్నాను. సర్వ సంబంధములుగా ఉన్నాను. సర్వసంబంధముల మధ్యగా నేనున్నాను.
- జన్మ – మృత్యువుల సాక్షియై నేనున్నాను – జన్మ – మృత్యువులు నావే అయి నేనున్నాను. జన్మ–మృత్యువులుగా ఉన్నాను. జన్మ మృత్యువుల ఈవల – ఆవల నేనున్నాను

**కేవల (లేక) శుద్ధ సత్ ఆత్మకు అభిన్నమే నేను।**

ఈ విధమైన అకార – ఉకార – మకారార్థములుగా చెప్పబడే త్రిపుటీవర్ణనములో

నేనున్నాను।
నేనున్నాను।
నేనున్నాను।

అని అంటున్నాము కదా! ఆ **'ఉన్నాను'** అనునదే నాయొక్క **సత్ స్వరూపము.** అట్టి సత్ లక్షణము ఆత్మస్వరూపుడనగు నన్ను **"దేహము ఉన్నప్పుడు, దేహము పోతున్నప్పుడు, దేహము పోయిన తరువాత, క్రొత్త దేహము వచ్చిన తరువాత"** కూడా – నన్ను విడుచుట లేదు.

నేను 'సత్' అనబడే ఆ ఉనికిని, (లేక) **'ఉన్నాను'** అనే లక్షణమును విడవబోవుటలేదు. ఈ రీతిగా **అహమ్ సదా సత్ లక్షణ సమన్వితమస్మి!**

**(2) చిత్‌లక్షణుడను :** నేను ఎక్కడుంటే అక్కడ నాయొక్క **'ఎరుక–తెలుసుకొనుట'** అనే లక్షణము వెంటనంటియే ఉంటుంది. అంతేకాదు. నేను ఏది ఎట్లు తెలుసుకొంటూ ఉంటే, అది అట్లే నాకు అనుభూతమౌతుంది.

'ఎరుక' అనే లక్షణము = చిత్ (Absolute Knowing).

నేను చిత్ లక్షణున్ని. ఇదియే నా **"చిత్ శక్తి"**.

దేనిని నేను 'ఇది ఇష్టము' అని తెలుసుకుంటానో, అది నాకు ఇష్టమైనది అగుచున్నది. ఏది 'ఇష్టము కాదు' అని అనుకుంటానో, అది అట్లే అయిష్టమైనది, అప్రియమైనది అగుచున్నది. **(యత్ భావం, తత్ భవతి).**

**కేవలచిత్** = శుద్ధచిత్

**చిత్ విలాసము** = ఎరుక + ఎరుగబడే విషయాలు. తదితరముగా ఉంటున్నదంతా కూడా!

ఈ జాగ్రత్ - స్వప్న - సుషుప్తులు, దేహముల రాక - పోకలు, మనో- బుద్ధి - చిత్త - అహంకారాలు, 14 లోకముల భావనా చమత్కారాలు, బంధ-మోక్షములు- **ఇవన్నీ నాయొక్క చిద్విలాసమే.** నా ఎరుకచే కల్పించబడుచున్నవే. **నేను ఏది ఎరుగుచూ ఉన్నానో అది అస్మత్ ఆత్మ ప్రభావము చేత ఉనికిని పొందుచున్నది.**

నాయొక్క ఒకానొక ఎరుకయే (One of my styles of knowing) **ఈ ఈ కనబడుచున్న నాయొక్క జాగ్రత్. ఇక జాగ్రత్ నన్ను బంధించటమెక్కడిది?** అట్లే ఈ దృశ్యమంతా అస్మత్ చిత్ విలాసమే! **నాయొక్క చిత్ లక్షణము నాకు భూషణమేగాని బంధము కాదు.** ఆత్మస్వరూపుడనగు నన్ను ఈ శుద్ధ చిత్ లక్షణము విడువదు. నేనూ అద్దానిని విడువను.

సత్ - చిత్ స్వరూపుడనై సర్వత్రా వేంచేసి ఉండటమే నా విన్యాసము! నాలో నేనే సత్ - చిత్ స్వరూపుడనై ఉంటూ ఉన్నాను.

**అహమ్ సదా సర్వదా చిత్ లక్షణ సమన్వితమస్మి।**

**(3). ఆనంద లక్షణుడను** : నేనెక్కడుంటే అక్కడ 'అనుభూతి' (Experiencing) ఉంటుంది. ఈ జ్ఞాన - అజ్ఞానములు, జీవేశ్వర ద్విత్వము, సంబంధ - అనుబంధ - బాంధవ్యముల రాకపోకలు, దేహ - దేహాంతర, లోక - లోకాంతర ప్రయాణచమత్కారాలు, ....ఇవన్నీ నా ఆనంద విభాగములే! (Such is my pleasure)

సుఖ-దుఃఖములు, బంధమోక్షములు కూడా **"ఆనందము"** అనే స్వకీయ లక్షణముచే కల్పించబడే క్రీడా - లీలా వినోదాలే!

**- నాకు ఆనందము కాబట్టే దుఃఖములను కూడా ఆస్వాదిస్తున్నాను.** నాకు నేనే కల్పించుకొనుచున్న ఊహానిర్మితమగు 'కల'లో సుఖ-దుఃఖాలు, భయ-అభయాలు మొ॥వన్నీ కల్పించుకోవటమే ఇందుకు దృష్టాంతము.

జన్మ - కర్మ - బంధము - మోక్షము - జీవత్వము - ఈశ్వరత్వము - ఇదంతా నా ఆనందస్వరూపమే!

సత్ - చిత్‌లు కూడా కేవలుడనగు నన్ను ఆనందింపజేయటానికే ఉన్నాయి.

నా దృష్టికి కనిపించే దృశ్యమ-దర్శనము-ద్రష్ట.... ఇవన్నీ నా ఆనందము కొరకై నాకు నేనుగా కల్పించుకొనుచున్నవే! అందుకే వేదాంతశాస్త్రము 'ఆనందోబ్రహ్మ' అని గానం చేస్తూ ఆనందస్వరూపునిగా గమనించి అభివర్ణిస్తున్నాయి. **అహమస్మి ఆనందలక్షణ సమన్వితమ్!**

**సర్వతీర్థ స్వరూపోఽస్మి।**

ఎక్కడ ఎవ్వరు ఏ రూపముగా, ఏ లక్షణములను ప్రతిపాదిస్తూ పూజిస్తూ ఉన్నారో,...అదంతా ఆత్మోపాసనయే అయి ఉన్నది. ఈ విధంగా సర్వ పూజాస్థానములలో పరమాత్మతత్త్వమే ఆరాధించబడటంచేతను, నేను సహజముగా ఆత్మస్వరూపుడనే అయి ఉండటంచేతను **- నేను సర్వ తీర్థ స్వరూపుడనగుచున్నాను.** ఇంద్రలోకంలో ఇంద్రుని, కైలాసంలో శివుణ్ణి, విష్ణులోకంలో విష్ణువును, ఆశ్రమములలో గురువులను, దేవాలయాలల త్రిమూర్తులను - అవతారమూర్తులను ఆరాధించేవారంతా ఆత్మారాధకులే! ఆత్మారాధనయే అంతర్లీన గానము. నేనో, ఆత్మ స్వరూపుడను. అందుచేత నేను సర్వతీర్థస్వరూపుడను.

**<u>పరమాత్మాస్మ్యహమ్ శివః।</u>**

సర్వమునకు ఆవల సర్వశుభంకరమగు శివ స్వరూపుడనై ప్రకాశిస్తున్నాను. భావములకు **ఆవల**, జన్మల ప్రహసనములకు **ఆవల**, జ్ఞాన - అజ్ఞానములకు, బంధ - మోక్షములకు **ఆవల "నిత్య ప్రకాశము - స్వయం ప్రకాశకము"** అగు ఆత్మయే నా స్వరూపము. అందరు అస్మత్ ఆత్మస్వరూపమే కాబట్టి అందరూ నాకు ప్రేమాస్పదులే. ఇదంతా నాకు ప్రేమాస్పదమే! నేను జీవునికి సాక్షియగు శివస్వరూపుడను. నాకు వేరైనట్టిది లేదు కాబట్టి అంతా నా ఆనందస్వరూపమే. శివానందలహరీ చమత్కారమే ఇదంతా. అందుకే వేదములు, పురాణములు....కూడా....

- తత్త్వజ్ఞానము - నీవు ఆ తత్ స్వరూపమే।
- శివతత్త్వజ్ఞానము - నీవు తత్ శివ స్వరూపమే।

– అని ఎలుగెత్తి అస్మత్ ఆత్మస్వరూపమును గానం చేస్తూ ఉంటే, నేను ఆస్వాదించకపోతే ఎట్లా? ఈ రీతిగా **పరమాత్మాస్మ్యహమ్ శివః। శివోఽహము! చిదానందరూపం, శివోఽహమ్!**

**లక్ష్య – అలక్ష్యవిహీనోఽస్మి।**

ఈ 14 లోకాలలో కూడా ఎక్కడా నాదైనదేదీ లేదు. నాది కానిదీ లేదు. నవల వ్రాసిన రచయితకు **"ఈ పాత్రలు గొప్పవి. ఇవి కావు. ఇవంటే నాకు ఇష్టం. అవంటే నాకు ఇష్టం లేదు"**...అనునదేదీ ఉండదు కదా! ఈ జగత్తంతా ఆత్మస్వరూపము అయి ఉండగా ఇందులో కొన్నిటిపై నమ్మకము, మరికొన్నిటిపై అపనమ్మకము ఏమి ఉంటుంది? నేను పట్టించుకోవలసినదీ లేదు. పట్టించుకోకూడనిది లేదు. ఐనవాళ్లు లేరు. కానివాళ్లు లేరు. నాదేమీ లేదు. నాది కానిదేదీ లేదు.

**ఈ జగత్తులన్నీ నాలోనూ లేవు. కానీ నాకు వేరుగానూ లేవు. నేను పొందవలసినదేదీ లేదు. పొందకూడనిదీ లేదు.** స్వప్నంలో కనిపించే రూపాల యొక్క లక్షణాలు నావికావు. నావి కాకపోలేదు కూడా. **"ఇది నేను పొందాలి. కనుక నా లక్ష్యము"** అనునదీ లేదు. **"ఇది తొలగాలి కనుక అలక్ష్యము"** అనునది కూడా లేదు.

**లయహీన రసోఽస్మ్యహమ్।**

***నేను ఎందులోనో లయించి, ఆపై లేకుండా పోవటమనునదేదీ లేదు.***

నేను సర్వదా బ్రహ్మమే అయి ఉండగా, **"బ్రహ్మమునందు నేను లయించబోవుచున్నాను"** అనునది ఎక్కడున్నది?

తరంగము సర్వదా జలమే అయి ఉండగా (యో ఆపః మాం యతనం వేద) – "జలములో తరంగము లయించింది" ...అనే ప్రసక్తి ఎక్కడిది?

నాశనము అనునది ఆత్మకు లేదు. నేను ఆత్మస్వరూపుడను.

ఈ దేహము మొదలైనవి రావచ్చుగాక! పోవచ్చుగాక! నేను ఆత్మగా సాక్షినై ఉన్నాను. ఆత్మయగు నేను ఆత్మయందు లయించటమనే సంగతియే లేదు. నేను సదా ఆత్మరసస్వరూపుడను. సదా శివస్వరూపుడను. మరొక దానిలో లయించటము అనునది లేదు.

మట్టి బొమ్మ సర్వదా మట్టియే! మట్టి మట్టిలో కలవటమనేదెక్కడున్నది? **'జీవాత్మ' అనునది నాయందలి తరంగముల చమత్కారము.**

**మాతృ–మాన విహీనోఽస్మి। (ప్రమాతృ–ప్రమాణములు లేనివాడను).**

ఆత్మస్వరూపుడుగా నాతో సమానమైనదిగాని, పోల్చతగినదిగాని ఏదీ లేదు. ఆత్మస్వరూపము గురించి చెప్పే శాస్త్రములు అనేక ప్రమాణములు (Examples, Comparisons) తీసుకొని ఆత్మశాస్త్ర వాఙ్మయమును అందిస్తున్నాయి. అవన్నీ ఆత్మగురించి చెప్పటానికి ఉపయోగపడే ఉపకరణములవంటివి మాత్రమే. నాకు ప్రమాతృ (నిర్వచించబడేది) – ప్రమాణము (నిర్వచించటానికి ఉపయోగించగల సోదాహరణలు) ఏవీ లేవు. సర్వస్వరూపమగు ఆత్మగా నాకు నేనే సాటి! కథలోని ఏ దృష్టాంతము రచయిత ఎట్టివాడో చెప్పలేదు కదా. కలలోని ఏ వస్తువు స్వప్నము తనదైన వాని గురించి, **'ఇట్టివాడు'** అని చెప్పగలుగుతుంది? అందుచేత నాకు ప్రమాతృ (చెప్పబడేది) – ప్రమాణములు లేవు.

**మేయహీనః శివోఽస్మ్యహమ్।**

ఆత్మస్వరూపుడనుగా నాతో సమానమైనది ఎక్కడా ఏదీ లేదు. నేను అమేయుడను. కలలో ఏ ఒక్కటీ కల తనదైన వానితో సమానమైన వస్తువు కాదు కదా! **అనేక కలలు కంటున్నవానితోను – ఒక కలలోని ఒక వస్తువుతోను – ఎట్లా ముడిపెట్టగలం?** ఈ దృశ్య జగత్‌లో ఆత్మస్వరూపుడనగు నాకు సమానము – అని చెప్పగలిగినదేదీ లేదు. సర్వము మంగళప్రదము చేయువాడను. చైతన్యవంతముగా చేయువాడను. శివస్వరూపుడను.

సర్వమునకు వేరై, సర్వము నేనే అయి, **సర్వ తత్త్వాత్మకుడనై** ఉన్న నాతో ఏది సరిసమానము? **శివోఽస్మ్యహమ్! అహమ్ అమేయమ్!**

**న జగత్ సర్వ ద్రష్టాఽస్మి।**

కేవలాత్మ స్వరూపుడనగు నేను – ఒక రాజు గారు సామంత రాజును నియమించువిధంగా – ద్రష్టను, ఆతని ద్రష్టత్వమును, దృశ్యమును నియోగించుకుంటున్నాను. సామంతరాజు మహారాజు తరపున పాలన చేయవచ్చుగాక! కానీ సామంతరాజు మహారాజు అవుతాడా? అవడు. నేను నియమించుకొనే ద్రష్ట – ద్రష్టత్వములకు మునుముందే అప్రమేయుడనై, వేరై ఉన్నాను. అందుచేత నేను ద్రష్టమాత్రముగా అవటము లేదు. ఆ ద్రష్ట యొక్క అనుభవరూపమగు జగత్‌దృశ్యము నేను కాదు. కల్పన నాది కావచ్చునేమో!

అంతేగాని నేను కల్పనగా అవుతానా? అవను. **న జగత్ సర్వ ద్రష్టాస్మి!** నేను దేనినీ చూచువానిగా అగుటలేదు. **సర్వదా కేవల 'దృక్' స్వరూపుడనై ఉన్నాను!**

**నేత్రాది రహితోఽస్మ్యహమ్।**

ఈ కళ్ళు – చెవులు – ముక్కు – నోరు ఇత్యాది ఇంద్రియములన్నీ నేను ఉపయోగిస్తున్న వస్తువులు. ఈ దేహ – మనో – బుద్ధి – చిత్త – అహంకారాలు కూడా ఉపయోగించబడే సామాగ్రి మాత్రమే. ఇంటి యజమాని ఇంటిలోని ఒక బల్లతోనో, కుర్చీతోనో సమానము కాదు. అటువంటివాడు కాదు కదా! ఇంటి యజమానికి – ఇంటిలోని గోడలు, సామాను, కిటికీ, వంట పాత్రలు మొదలైనవాటికీ సంబంధముగాని – సారూప్యము గాని ఏనాడూ లేదు. ఉండదు. ఈ కర్మేంద్రియములు – జ్ఞానేంద్రియములు, వాటివాటి విషయములు. ఇవన్నీ **"ఆత్మ స్వరూపుడను – యజమానిని"** అగు నావంటివెట్లా అవుతాయి? నేను వేరైనట్టి పరస్వరూపుడును! పరమాత్మను!

**ప్రవృద్ధోఽస్మి। ప్రబుద్ధోఽస్మి।**

సర్వే సర్వత్రా ప్రబోధ స్వరూపుడను. ప్రవృద్ధ స్వరూపుడను. నాయొక్క ప్రవృద్ధ చమత్కారమే ఈ దృశ్యరూపజగత్తులు. సర్వము నాయందే నా చేతనే, నా కల్పనచే, భావనచే – లీలా వినోదంగా ప్రవృద్ధి పొందటం జరుగుతోంది.

**ప్రసన్నోఽస్మి – పరోస్మ్యహమ్।**

నాచే కల్పించబడే ఇదంతా నా క్రీడా – లీలా వినోదము మాత్రమే. ఇదంతా నా విలాసము. చిద్విలాసము. 14 లోకాల కల్పన, వాటిలో సంచారము, సుఖ దుఃఖ–బంధ మోక్షములు....అంతా లీలా వినోదమే! **సర్వదా సర్వమునకు ఆవల ఉన్నట్టి ఆనందమే నా స్వరూపము.** సదానంద స్వరూపుడను. నిత్యానందుడను. జీవాత్మను–జీవమును–దేహములను కల్పించుకోవటం–ఉపసంహరించటం ... ఇదంతా నా వినోదము. సరదా। ఆనందేహేల। ఊహానందము। భావనాక్రీడ। స్వకీయ చమత్కారవిశేషము!

**సర్వేంద్రియ విహీనోఽస్మి, సర్వకర్మ కృత్ అపి – అహమ్।**

ఈ ఇంద్రియార్థములను, తద్వారా ఈ ఇంద్రియములను ఉపయోగిస్తూ అనేక దేహములలో సంచరిస్తూ అనేక కార్యక్రమములను నిర్వర్తిస్తూ ఉండవచ్చు గాక! (లేక) మరొకప్పుడు ఏమి ఉపయోగించక ఉండకుండవచ్చు కూడా గాక! ఇంద్రియార్థములుగాని, ఇంద్రియములుగాని....వీటన్నిటికీ, ఈఈ జన్మ – కర్మలతో సహా సర్వము నాకు వేరుగా ఉన్నాయి. కల్పన నాది కావచ్చేమోగాని, నేను కల్పనను గాను. ఇంద్రియములు లేనప్పుడు కూడా నేనున్నాను. నా సహజాత్మానంద స్వరూపమునకు ఇంద్రియాలు లేవు. వాటి ఆవశ్యకత లేదు.

**సర్వవేదాంత తృప్తోఽస్మి।**

వేదాంత వాఙ్మయము అస్మత్ ఆత్మయొక్క మహనీయత్వమును "శృణ్వంతి విశ్వే, అమృతస్యపుత్రః"...అంటూ ఎలుగెత్తిగానం చేస్తోంది.

వేదము = తెలియబడునది

వేదాంతము = తెలియబడేదంతటికీ ఆవల గల – తెలుసుకొనుచున్నవాడు।

వేదాంత శాస్త్రము = సర్వము ఎరుగుచున్న కేవల చిత్ స్వరూపుడునగు నా ఔన్నత్యము తెలియజేయు శాస్త్రము.

నేను – నాకు కనబడే తదితరులు – అందరము అఖండాత్మ స్వరూపులం.

సద్గురువులు తత్త్వశాస్త్ర పాఠ్యాంశముగా చెప్పుచున్న ఆత్మౌన్నత్యమును శ్రవణం చేస్తూ అత్యంత తృప్తుడను అగుచున్నాను. నేను నా తృప్తి కొరకై మరొక బాహ్య వస్తువును ఆశ్రయించవలసిన అగత్యమేమున్నది? సద్గురువులగు మహనీయులచే అందించబడుచున్న 'ఆత్మ' గురించిన సమాచారముచే తృప్తోస్మి! సంతృప్తోస్మి! **సర్వదా సర్వ వేదాంత తృప్తోఽస్మి!**

**సులభోఽస్మ్యహమ్।**

ఆత్మగా ప్రతి ఒక్కరికి సులభసాధ్యుడను. వారి అతి సామీప్యమగు స్వస్వరూపమే నేనై ఉన్నాను. ఆత్మానుభవము అత్యంత సులభమేగాని, కఠినము కానేకాదు. సర్వ సహజీవులలో నేను ఆత్మ స్వరూపుడనై వేంచేసియే ఉన్నాను. అందుచేత అందరికీ సులభుడనేగాని, దుర్లభుడను కాను. అర్థంకానివాడను కాను. ఆత్మ అందరియొక్క సహజరూపమే అయి ఉన్నది. అద్దానిని క్రొత్తగా పొందవలసిన అవసరమేలేదు. నేను అందరికి సులభుడను. అందరూ నాకు సులభులే! (All are understandable and simple to me and I am understandable and simple to all).

**ముదిత – అముదితాభ్యోఽస్మి।**

సంతోషము నా చమత్కారమే! దుఃఖము కూడా నా చమత్కారమే! ఆనందము నా స్వరూపము. నా స్థానము ఆనందాతీతమైనది కూడా! ఆనందమునకు ఆవల కేవల సాక్షినై ఉన్నాను. అన్నమయ – ప్రాణమయ – మనోమయ – విజ్ఞానమయ – ఆనందమయ కోశములకు ఆవల ఆత్మేశ్వరుడనై ఉన్నవాడను. పంచకోశములు నా విన్యాసమే. సర్వము కల్పించుకొని ఆనందించువాడను కాబట్టి 'ముదితుడను'. ఆనందమునకు ముందే సాక్షిగా సత్–చిత్ స్వరూపుడను కాబట్టి **అముదితుడను కూడా।**

**సర్వమౌనఫలోఽస్మ్యహం।**

సర్వమును తిరస్కరించి వాటిపట్ల నిర్విషయత్వము వహించినప్పటికీ కూడా. **అప్పటికీ నేను శేషించియే ఉంటాను.** సర్వ విషయములపట్ల నా మనస్సు అవిషయరూపమైన మౌనము వహించినప్పుడు, అట్టి మౌనభావముయొక్క ఫలమును నేనే అయిఉన్నాను. సర్వము తిరస్కరించబడగా కూడా, నేను శేషించి ఉంటాను. **(నేతి నేతేతి వాక్యేన). (ఆది శేషోఽస్మి అహమ్)**

**నిత్యచిన్మాత్రరూపోఽస్మి।**

సర్వవేళలా కేవల చిన్మాత్రరూపుడను.

– సుఖ దుఃఖాలనుగాని, (ఇంకా) దేహమునుగాని, దేహముయొక్క రాకపోకలుగాని తెలుసుకొంటున్నట్టి 'తెలివి' స్వరూపుడను. **కేవల చిత్ స్వరూపుడను.**

నాటకము వ్రాసేవాడు నాటకములోని సంఘటనలకు బద్ధుడు అవుతాడా? కాదు. అట్లాగే, 'ఎరుక' అనబడే శుద్ధచిత్స్వరూపుడనగు నాకు నాచే తెలియబడునది బంధము ఎట్లా కలుగజేయగలదు? లేదు. జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు కూడా తెలుసుకొనుచున్నవాడను. నాయొక్క చిన్మాత్రస్వరూపంతో స్వయంకల్పితమైనట్టి జాగ్రత్ – స్వప్న – సుషుప్తులను నింపి ఉంచువాడను.

**సత్–చిత్మయోఽస్మ్యహమ్।**

ఉనికి + ఎరుక
సత్ + చిత్ | మయుడవై ఉన్నవాడను!

కేవల – సత్ :: కేవల – చిత్ స్వరూపుడను. జగత్ రచన – జగత్ వీక్షణ – జగత్ ఆస్వాదన చేయువాడను! నాయొక్క భావ – అభావనలను అనుసరించి జగత్ సృష్టి – జగత్ లయములు జరుగుచున్నాయి. ఈ దృశ్యమంతా నాయొక్క సత్–చిత్మయ ఆనంద స్వరూపమే! నేను సర్వదా సచ్చిన్మయుడను!

**యత్కించిదపి హీనోఽస్మి।**

నాది – నేను అనునవి కించిత్ కూడా లేనట్టివాడను. స్వల్పముగాని, అధికముగాని కానివాడను.

**స్వల్పమపి – అవినాస్మ్యహం।**

అత్యంత సూక్ష్ముడను. నాశనమనునది కించిత్ కూడా ఏ విషయముచేతనూ లేనివాడను. నాకు తదితరమైనదంతా మార్పు – చేర్పులో వినాశనమో పొందవచ్చు గాక! నేను వినాశనము లేనివాడను. అనగా, సర్వదా యథాతథము (As it is)గా ఉండువాడను. దేహము నశిస్తున్నప్పుడు కూడా నేను నశించటము లేదు. ఎప్పటివలెనే యథాతథుడను అయ్యే ఉంటున్నాను. నేను ఉపయోగిస్తున్న వస్తువు అయినట్టి దేహము మాత్రమే నశించినదగుచున్నది.

**హృదయగ్రంథిహీనోఽస్మి – హృదయాంభోజ మధ్యగః।**

హృదయములోని చైతన్యరూపుడను. హృదయ–అంతర్గతుడను. సమస్త జగత్తు హృదయస్థానముగా కలవాడను.

**అంతర్ – హృదయ అభ్యాంతరంగ హృదయాంతరంగుడను.**

అటువంటి నాకు అహంకారము, మమకారము, ఆవేశము, సంబంధ అనుబంధములు – ఇత్యాది **హృదయ గ్రంథులు లేవు. సర్వమునకు అతీతుడను.**

**షడ్వికార విహీనోఽస్మి।**

నాకు **"దేహభావాశ్రయము, దేహప్రవేశము, బాల్యము, యౌవనము, వార్థక్యము, మరణము"** అని చెప్పబడే '6' వికారములు లేవు. నేను ధరించే వస్త్రముయొక్క రంగు – రూపు నాకు చెందినవి కావు కదా! దేహ వికారములు దృశ్యములోనివి. నేను దృశ్యము –

ద్రష్టలకు సాక్షినగు కేవల దృక్ స్వరూపుడను. అసత్తు (మొదలే లేనిది) అగు ఈ భౌతిక దేహము నాయొక్క 'సత్–ఉనికి' చేతనత్వములపై ఆధారపడి ఉనికిపొందుచూ ఉన్నది. **అంతేగాని నేను దేహములో అంతర్విభాగమును కాను. దేహముపై ఆధారపడినవాడను కాను.** పరమై ఉన్నవాడను. పరస్వరూపుడను. అప్రమేయుడను.

**షట్ కోశ రహితోస్మ్యహమ్।**

అన్నమయకోశము – ప్రాణమయకోశము

మనోమయకోశము – విజ్ఞానమయకోశము

ఆనందమయకోశము – జీవాత్మ

ఇవన్నీ కూడా నాలోని నేనైన నేను యొక్క వివిధ స్వయంకల్పిత విశేషాలు. ఒకానొకడు – గృహయజమాని, భర్త, తండ్రి, ఉద్యోగి, మిత్రుడు, శిష్యుడు, గురువు – ఇవన్నీ తానే అయిఉండి కూడా, **వాటన్నిటికీ వేరై ఉన్నాడు కదా!**

అట్లాగే...

షట్ కోశములు నాయొక్క విభిన్న స్థానములలోని నాయొక్క **'ఉనికి'కి వ్యవహారనామములే.** అట్టి షట్ కోశములకు వేరైన **చిదానంద స్ఫూర్తిని** – నేను. అన్నిటికీ చైతన్యమును ప్రసాదిస్తున్న శుద్ధచైతన్య స్వరూపుడను. చిదానందఘనుడను. కారణకారణుడను. షట్కోశములు నాచేత స్ఫూర్తిని పొంది వ్యవహరిస్తున్నాయేగాని, – **అవి నేనుకాదు.**

**అరిషట్వర్గ ముక్తోఽస్మి।**

నాయొక్క పర–స్వరూపము **నిత్యముక్తము.** (Ever Relieved sans any Bondages) కామ–క్రోధ–లోభ–మోహ–మద–మాత్సర్యములు – ఇవన్నీ మనోలక్షణాలు. ఆత్మ లక్షణాలు కావు. ఆత్మకు చెందినవి కావు. ఆత్మపరమై లేవు.

నాచే కల్పితమైన **మనస్సు – దృశ్యభావనల** దాంపత్యమునుండి ఈ అరిషట్వర్గములు సందర్భోచితంగా బయల్వెడలుచుండవచ్చుగాక!. కానీ నేను సాక్షిని. సర్వదా కేవల సాక్షిని. మనస్సుయొక్క సంచలనములను చిద్విలాసంగా, లీలావినోదంగా చూస్తూ ఉన్నట్టివాడను. ఆ మనస్సుయొక్క దృశ్యమననమునకు కూడా ఆవల ఉన్నట్టివాడను. మనస్సు (మననము) దృశ్యభావన – దృశ్యముల సంయోగముచే రూపుదిద్దుకొనే అరిషట్వర్గములకు కూడా మౌన సాక్షిని. వాటి చేతగాని, వాటికిగాని **బంధించబడినవాడిని కాను.** మనో–జగత్–అరిషట్ వర్గములన్నీ కూడా నన్ను స్పృశించలేవు. నాయొక్క **సత్చిదానందత్వము**నకుగాని, **అప్రమేయత్వము**నకుగాని, **నిశ్చలతత్వము**నకుగాని, **నిర్మలత్వము**నకుగాని ఎట్టి దోషము కలిగించలేవు. నేను సర్వదా అరిషట్వర్గములకు అతీతుడను. **నిత్యముక్త స్వరూపుడను.**

**అంతరాత్–అంతరోఽస్మ్యహమ్।**

అంతరాంతర స్వరూపుడను.

- దృశ్యము।
- ఆ దృశ్యము ఇంద్రియార్థములలో ।
- ఇంద్రియార్థములు మనస్సులో।
- మనస్సు జీవాత్మలో।
- జీవాత్మ పరమాత్మలో।

అట్టి నిత్యోదిత చైతన్యాత్మస్వరూప పరమాత్మయగు నాయందే సర్వము సర్వమునందు నేను.

**'సర్వుల హృదయాంతరంగమునందు కట్టెలు లేని అగ్ని యొక్క కేవలీ తేజస్సువలె వెలుగొందుచున్నవాడను.**

హృదస్థుడనై, కూటస్థుడనై ప్రకాశించువాడను.

**దేశకాల విముక్తోఽస్మి।**

నిత్యాత్మ స్వరూపుడనగు నాకు దేశ కాలములు లేవు. (I am beyond Time and place), (కాలః కాల ప్రసన్నానామ్ కాలః కిన్ను కరిష్యతి?). ఆత్మాత్ ఆకాశమ్। నా ఆత్మస్వరూపమునుండియే – ఆకాశము, తదితరములు (పంచభూతములు) స్వకీయ **మాయావిశేషము**గా వెలువడుచున్నాయి.

ఈ రీతిగా దేశకాలాతీతుడను. దేశకాలముల కల్పనకు కారణకారణుడను. సర్వమునకు ఉపాదాన కారణుడను (The Main cause and reason). **అంతేగాని, దేశకాలబద్ధుడను కాను!**

**దిగంబర సుఖోఽస్మ్యహమ్।**

ఆకాశమునందలి సర్వదిక్కులలోను నాయొక్క **"ఆత్మస్వరూపము"** అనే రసము నిండియున్నది. సర్వత్రా సుఖస్వరూపుడనైఉన్నాను. సర్వ సుఖస్వరూపమగు ఆత్మయే స్వరూపముగాగల నాకు అందరూ ప్రియమైనవారే. అందుచేత ఒకడు తన కుమారుని క్షేమము స్వభావసిద్ధంగానే కోరుకుంటున్నట్టుగా, నేను స్వస్వరూపాత్మ స్వరూపులగు అందరి సుఖ – క్షేమములను కోరుకుంటూ ఉండటంలోనే నాకు ఆనందము. సర్వులు నాకు ఆత్మబంధువులే. (ఇంకా కూడా), **మమాత్మానందస్వరూపులే.**

**నాస్తి – బంధ విముక్తోఽస్మి।**

నాకు బంధమే లేదు. కాబట్టి 'ముక్తి' కూడా లేదు. ఒకవేళ ఉన్నాకూడా, ఆ బంధముక్తులు – మనోపరిమితమైనవి మాత్రమే గాని 'ఆత్మ'నగు నాకు చెందినవి కాదు. ఆత్మ ఎల్లప్పుడు **శుద్ధచైతన్యస్వరూపము**, సదా **పరము, అసంగము** కూడా.

జగన్నాటకములోని పాత్రధారణవంటి ఇహస్వరూపమునకు (లేక నాయొక్క 'జీవుడు' అనే పాత్రకు) జగన్నాటకమును అనుసరించి ఉంటుంది కాబట్టి – ముక్తి ఉండదు. ఆవలగల నాపరస్వరూపమునకు బంధము లేదు.

**జీవాత్మగా నిత్యబద్ధుడనైనప్పటికీ, పరమాత్మగా నిత్యముక్తుడను.**

**నకార రహితోఽస్మ్యహమ్।**

**'న'కార రహితుడు. 'అభావము' అనునదే లేనివాడను. 'నేను లేను' అనునదే ఉండనివాడను.** జీవాహంకార అతీతుడను. 'నేను' లేకపోవటమనునదే లేదు. నాయొక్క ఉనికి (సత్‌రూపము) ఆధారరహితమైనది. దానికి మరొక ఆధారమేదీ లేదు. నేనున్నాను కాబట్టే జాగ్రత్ – స్వప్న – సుషుప్త – జన్మ – పునర్జన్మ ఇత్యాదులు ఉన్నాయి. అవన్నీ ఒకప్పుడుండి మరొకప్పుడు ఉండవు.

జీవాహంకారమునకు సాక్షిని.

**ఒకప్పుడు ఉండి – మరొకప్పుడు లేకపోవటమంటూ ఆత్మగా నాకు మొదలే లేదు.**

**ఒకప్పుడు ఉండి మరొకప్పుడు లేకపోయేవన్నీ కూడా – "మొదలే లేనట్టివి"**

**అఖండాకాశ రూపోఽస్మి।**

ఆత్మ ఎల్లప్పుడు ఏకము. అఖండము. ఏ క్షణమందును అనేకము అవటం లేదు. ఖండము అవటం లేదు. ఆకాశము (space) – ఈ ఊరి ఆకాశము–ఆ ఊరి ఆకాశము...ఈ విధంగా అవటం లేదు కదా। అట్లాగే, ఆత్మయే వాస్తవస్వరూపముగల నేను సర్వదా అఖండమే!

**అఖండాకారమస్మ్యహమ్।**

స్వప్నములో స్వప్నద్రష్టయే అనేక రూపములుగా అయి స్వప్నమును ఆస్వాదిస్తున్నాడు కదా! అట్లాగే జాగ్రత్ – స్వప్న – సుషుప్తులలో అఖండాకారుడనై కూడా అనేక రూపములుగా కనిపిస్తున్నాను. **ఆత్మస్వరూపుడనగు నేనే అన్ని రూపములుగా ఉండి ఉన్నాను.**

**ప్రపంచముక్త చిత్తోఽస్మి।**

చిత్తమే ప్రపంచానుభవమును కల్పించుకొంటోంది. చిత్తమే ప్రపంచము. అయితే చిత్తమే ప్రపంచభావన చేయనప్పుడు **శుద్ధచిత్తస్వరూపమైయున్నది. 'చిత్'యే శుద్ధ చిత్తము యొక్క వాస్తవమైన స్వరూపము.**

**"శుద్ధ చిత్తము"** అనగా? ఈ చిత్తము దర్పణము (అద్దము) వంటిది. దర్పణమునకు, అందులో ప్రతిబింబించే దృశ్యమునకు సంబంధమేమున్నది? వాస్తవానికి దర్పణములో వస్తుజాలమే లేదు. అట్లాగే చిత్తమునకు – అందులో ప్రతిబింబించే జగత్తులకు సంబంధమే లేదు. విషయరహితమగు చిత్తము చిత్ రూపమే. **అట్టి కేవల చిత్‌స్వరూపుడనగు నాకు ప్రపంచబంధము అనునది ఎన్నడూ లేదు.**

అద్దము తనయందు ప్రతిబింబించే, ప్రతిబింబమాత్ర దృశ్యములచే బంధింపబడుచున్నదా? లేదు. అద్దంలో ఏమీ ఉండనట్టే నా చిత్తము స్వతఃగా చూచినప్పుడు (దర్పణములో వస్తువులు ఉండనట్లుగా) ప్రపంచరహితమే!

**ప్రపంచ రహితోఽస్మ్యహమ్।**

కేవలాత్మ స్వరూపుడనగు నేను ప్రపంచమును కల్పించుకొనుచున్నాను. ఆదిపురుషుడనై – నేను ప్రపంచము లేనప్పుడు కూడా నేనున్నాను. ఈ లోకములు మొదలైన దృశ్య వ్యవహారమంతా లయించినప్పటికీ శేషించువాడను. ఆదిశేషుడను, సర్వశేష్యుడను, వాస్తవానికి నాకు ప్రపంచములు లేవు. ప్రపంచరాహిత్యము లేదు. ప్రపంచ పరిధులలోనికి వచ్చువాడను కాను.

**సర్వ ప్రకాశ రూపోఽ స్మి।**

నా ఒకానొక భావనయే జగదనుభవము. భావనయే లేకుంటే జగత్తనే అనుభవమే ఉండదు. నేనుంటే **జాగ్రత్.** నేనుంటే **స్వప్నము.** నేనుంటే **సుషుప్తి.** స్వప్నములో కనిపించేదంతా ప్రదర్శిస్తున్నది, ప్రకాశింపజేస్తున్నది ఎవ్వరు? స్వప్నద్రష్టయే.

జాగ్రత్ – స్వప్న – సుషుప్త పురుషులు నానుండే బయల్వెడలుచున్నారు. సర్వమును ప్రకాశింపజేయునది ఆత్మస్వరూపుడనగు నేనే!

**చిన్మాత్రజ్యోతి రస్మ్యహమ్।**

నాయొక్క చిన్మాత్రము (Pure Absolute Awareness) అనే వెలుగుచేతనే సర్వమును ప్రకాశమానమగుచున్నది. తెలుసుకొనువాని (The knower) చిత్ శక్తిచేతనే తెలియబడేదంతా ఉనికి పొందుచున్నది. సుందరమగు భావన గురించి భావించడం చేతనే– ఆ విధంగా నిర్వచిస్తున్నప్పుడు–ఆ వస్తువుపట్ల **'సౌందర్యము'** అనేది ఉనికిని పొందుచున్నది. అంతేగాని వస్తువులో సౌందర్యము లేదు. **భావన చేయువాడు లేనప్పుడు అనుభూతికి ఉనికి ఎక్కడిది?**

నేను కేవల చిన్మాత్రజ్యోతిస్వరూపుడనై (దీపపు వెలుగు ఉన్నప్పుడే వస్తువుల ఆకారాదులు కనిపిస్తున్నట్లుగా) అనుభవములను, అనుభూతులను వెలిగించుచున్నాను. అనుభవములకు విషయములుగా తీర్చిదిద్దుచున్నాను.

**ఆ విధంగా సర్వము ఉద్దీపింపజేసే చిన్మాత్ర జ్యోతిస్వరూపుడను.**

**కాలత్రయ విముక్తోఽ స్మి।**

భూత–వర్తమాన–భవిష్యత్‌లందు నేను ఆత్మగా ఏకరూపుడను. దేహాలు – భావాలు – అభిప్రాయాలు – సంబంధాలు – అనుబంధాలు – బాంధవ్యాలు – ఇష్టాలు – అయిష్టాలు...ఇవన్నీ మార్పు చెందుతూనే ఉంటాయి. ఇవన్నీ ఎవరియొక్క అనుభవాలో, అట్టి సొంతదారుడనగు – "నేను" – (ఆత్మగా) మార్పు చెందటమే లేదు. సర్వము కాలబద్ధమే.

**కాని ఆత్మ – కాలఃకాలము. కాలమును నియమించునది. కాలముచే బంధించబడనిది. కాలముయొక్క పరిధిలోకి రానట్టిది.**

(1) ఈ దేహభావమే రాకముందు,

(2) దేహముయొక్క రాకచేతను,

(3) ఈ దేహమునకు చెందిన దైనందిక సంఘటనలైనట్టి బాల్య – యౌవన – వార్ధక్యములచేతను,

(4) మరణ–పునర్జన్మ సందర్భములచేతను,

**ఆత్మస్వరూపుడనగు నేను మార్పుచేర్పులు పొందటమేలేదు.** (I always stay and remain as what I am).

కళ్ళకు కదిలే శరీరము కనిపిస్తోంది. కదిల్చే చైతన్యమో? అగుపించటంలేదు. ఒక వస్తువును కదల్చువాడు ఆ వస్తువుకంటే మునుముందే ఉన్నట్లుగా,....కాలమునకు కాలాంతర్గతమైన విశేషములకు ఆవల **'కేవలద్రష్ట'**నై నేను ఉన్నాను. ఈ రీతిగా నేను కాలబద్ధుడనుకాదు. కాల నియామకుడను! అనిర్వచనీయమగు మమాత్మ స్వరూపమునుండి అనిర్వచనీయంగా (ఉత్పత్తిభావనచే) కాలము జనించి, (లయభావనచే) కాలము లయిస్తోంది. (కాలోఽ స్మి లోక క్షయ కృత్ ప్రవృద్ధో – భగవద్గీతాచార్యులవారు)

**కామాది రహితో స్మ్యహమ్।**

తదితర సర్వము కాలబద్ధము. ఆత్మస్వరూపుడనగు నేను మాత్రమే కాలమునకు పరము. కామక్రోధాదులు కాలమునకు – కలవంటి జగత్ దృశ్యమునకు పరిమితమైనట్టివి. మనస్సు కామ క్రోధ లోభాదులు పొందవచ్చుగాక! నేను మనస్సుకు ఉత్పత్తి స్థానమై–పరమై ఉన్నాను. ఆత్మస్వరూపుడుగా నాకు కామాదులు లేవు. వస్త్రధర్మాలు వస్త్రధారునకు చెందనట్లే, మనోధర్మాలు నన్ను స్పృశించవు. అందుచేత ఆత్మస్వరూపుడనగు నాకు – కామాదులు లేవు.

స్వప్నము తనదైనవానికి స్వప్న వస్తువులలో కొన్ని కొన్నిటిని తన వెంట జాగ్రత్‌లోనికి తెచ్చుకురావాలనే 'కామము' మొదలైనవి ఎందుకుంటాయి? నిదురలేస్తే అన్నీ పోతాయి కదా!

**కాయికాది విముక్తోఽ స్మి।**

స్థూల–సూక్ష్మ దేహముల (The physical Body and The Feelings Body) కంటే విశిష్టమైన ఆత్మస్వరూపుడను. స్థూల –సూక్ష్మములచే బద్ధుడను కానట్టివాడను. అవి రెండు నాకు (నాటకపాత్రయొక్క బాహ్య–అలంకారములవలె) అంగవస్త్రముల వంటివి! నేను సర్వదా దేహ–మనో–బుద్ధి–స్థూల–సూక్ష్మాదులకంటే విశిష్టమైనవాడిని. వాటికి నేను బద్ధుడనుకాను. అతీతుడను. వాటి బంధము నాకు ఎప్పుడూ లేదు.

నా వలన కాయము (దేహము) ఉనికిని సంపాదించుకొని ఉంటోంది. అంతేగాని – దేహము వలన నేను ఉనికిని పొందువాడను గాను.

**నిర్గుణః కేవలోఽ స్మ్యహమ్।**

త్రిగుణములు ప్రకృతికి సంబంధించినవి. ప్రకృతికి ఆవల **"పరమ పురుష – నిత్య చైతన్యస్వరూపుడను"** అగు నేనున్నాను. స్వభావము స్వభావిని ఆశ్రయించి ఉంటుంది కదా! 'గుణి'స్వరూపుడనగు నేను త్రిగుణములకు (సత్త్వ–రజో–తమో గుణములకు) ముందే, గుణముల ప్రారంభం కానప్పుడే ఉండి ఉన్నాను. అందుచేత నిర్గుణుడను. గుణములు ఉన్నప్పుడు కూడా గుణములకు ఆవల ఉన్నాను. అనగా అప్పుడు కూడా నేను నిర్గుణుడనే కదా। సర్వదా నిర్గుణుడనే. గుణములు నాకు ఆభరణములవంటివి మాత్రమే!

**ముక్తిహీనోఽ స్మి ముక్తోఽ స్మి, మోక్షహీనోఽ స్మ్యహం సదా।**

ముక్తి అనగా ఎట్టి బంధము ఉండకపోవటమే, బాధలుతొలగితే బంధము లేదు కదా!

ఒకానొక కళాకారుడున్నాడు. ఒక నాటకంలో ఒక పాత్రలో నటిస్తూ ఉన్నాడు. ఆ పాత్రలో ఆతనికి – (అధిక సంతానము, పేదరికము, భార్య పడుచున్న ఆరోగ్య సంబంధమైన బాధలు అవి చూచి దిగులు, అల్లుడు స్వార్థపూరిత స్వభావము...ఇటువంటి) అనేక బాధలు. ఆ పాత్ర బాధలు అనుభవిస్తూ ఉన్నది. బాధల నుండి ఇప్పుడు, ఆ వ్యక్తికి ముక్తి కావాలి.

నాటకంలోని పాత్రకు ఆ బాధలన్నీ పోతే ఆతనికి ముక్తియా?

అసలు పాత్రగా ఆతడు అవటమే లేదే. పాత్రయొక్క కష్టాలు ఆతనివి ఎట్లా అవుతాయి? కావు. ఆతనికి వాటితో సంబంధమేలేదు. అవన్నీ కల్పితమగు నాటకములోనివేగాని, **పాత్రధారుని వ్యక్తిగతమైనవి కావు. నాటకగతమైనవి మాత్రమే.**

- నాటకంలోని పాత్రయొక్క కష్టాలు ఎప్పటికన్నా పోతాయా? లేదా?–అనునది కథారచనను అనుసరించి ఉంటుంది. అంతేగాని ప్రేక్షకులలో కొంతమందో (లేక) ఆ పాత్రధారుడో "ఇవి తొలగాలి" అని అనుకుంటే పోయేవి కావు.
- ఆ నటునికి వ్యక్తిగతంగా నాటక పాత్ర యొక్క కష్టాలతో సంబంధం లేదు. అవి వ్యక్తిగతంగా ఆతనివి కావు. కాబట్టి ఆతనికి పాత్రయొక్క కష్టాల నుండి ముక్తి లభించటమనే ప్రసక్తియే లేదు.

ఇప్పుడు ఈ దృష్టాంతం సహాయంతో జీవాత్మ – పరమాత్మల బంధ – మోక్షాలగురించి పరిశీలిస్తున్నాము.

**ఇహాత్మ** (Position in this world)

- 'జీవాత్మ' అనునది 'జగత్' అనే నాటకంలో నాయొక్క పాత్ర వంటిది.
- ఆ పాత్రలో – ఆ పాత్రగా కనిపిస్తున్నది, హావ–భావాలు వ్యక్తీకరిస్తున్నది–నేనే. **ఇది నాయొక్క జీవాత్మత్వము. (లేక) జగత్ సందర్భ సంబంధమైన "ఇహ స్వరూపము".**

  **పరాత్మ ;**
- జగత్ నాటకానికి సంబంధించని (కళాకారుడు వంటి), జగత్తులో లేనట్టి, జగత్తుకు – ఇహ స్వరూపమునకు సంబంధించని నా వ్యక్తిగత స్వరూపము అయి ఉన్నది. అది నాయొక్క **'పరస్వరూపము'.** అదియే **'పరమాత్మ'**గాను, **'పరాత్మ'**గాను, **'నిత్యముక్తాత్మ'** గాను చెప్పబడుతోంది.
- అది జగత్ నాటకంలోనిది కాదు. ఆవల సాక్షిగా ఉన్నది. నా నటనకు ఆధారము – ప్రేరణగా ఉన్నది. పరాత్మ–కేవలసాక్షి.

**పరాత్ పరాత్మ / పరాత్పరుడు। =** ఈ జీవాత్మ సంబంధమైన దేహమే కాకుండా సర్వుల అంతర్యామిగా ఉన్నట్టి నాయొక్క ఉనికి (My presence in what all and whom ever I am seeing).

ఇప్పుడు 'ముక్తి' యొక్క ఆవశ్యకత ఎవరికి?

**బంధము జీవాత్మకా? జగత్తులోని నా పాత్ర రూపానికా? నాయొక్క పరాత్పర స్వరూపమునకా?**

**(అందరిలో ఏర్పడియున్న నేనైన నేనుకా?)**

- 'బంధము' అంటే – ఇష్టం లేనిది జరుగుచూ ఉండటము. ఇష్టము ఉన్నది జరుగుచుండకపోవటము కదా!
- నాటకంలోని నా పాత్ర రచయితయొక్క నాటక రచనా విధానంగా ఉంటున్నట్లే, జగత్ రచనా విధానమును అనుసరించి జగత్ నాటకంలోని నా పాత్ర. అది నా ఇష్టాఇష్టాలను అనుసరించి ఉండదు.

  "నాకు ఇష్టంగా లేవు కాబట్టి ఈ జగన్నాటక సంఘటనలు నాకు బంధమౌతున్నాయి" అనునది భ్రమయే!

- ఇష్టముంటే కష్టముండదు.
- ఇష్టము లేకపోతేనే కష్టము.
- కష్టము లేదనుకుంటే బంధముండదు.

**'బంధవిముక్తి' (లేక) 'మోక్షము'నకు ఉపాయము**

చేయవలసి వస్తున్నవి – చేయాలనుకొని కూడా చేయలేకపోతున్నవి, పొందుచున్నవి – పొందనివి, ఇష్టమనిపించేవి – ఇష్టము కాదనిపించేవి...ఇవన్నీ జగత్ స్వరూప భగవానునికి సమర్పిస్తూ, –

- చేయవలసినది చేస్తూ....,
- జరుగుచున్నది చూస్తూ....,
- మౌనంగా చూస్తూ....,
- అతీతంగా హాయిగా ఉండటం అభ్యసిస్తూ ఉన్నవానికి **ఇక జీవాత్మత్వము బంధమనిపించదు.**

## బంధము అసలు ఎవరికి?

**బంధము జగత్తు కావల పరమై పరమాత్మగా చెప్పబడే మన–రూపానికా?**

మన పరస్వరూపము (నాటక దీపమువలె) సర్వదా సాక్షియే కదా! అట్టి కేవలీ స్వరూపమునకు జగద్విషయములతో బంధమేముంటుంది.

I. నాయొక్క జీవాత్మత్వము అనే నాటకపాత్ర జగన్నాటకమును అనుసరించియే ఉంటుంది గాని, జీవునిగా నా ఇచ్ఛానుసారము ఉండదు. కనుక బంధము తొలగదు. **జీవాత్మత్వమునకు 'ముక్తి' అనే ప్రసక్తి లేదు. "జీవాత్మగా నిత్యబద్ధుడను".**

II. నాయొక్క పరస్వరూపము (లేక) పరమాత్మత్వము సర్వదా జగదనుభవములకు ఆవల కేవల సాక్షియై ఉన్నది! కాబట్టి **నా పరతత్త్వమునకు 'బంధము' అనే ప్రసక్తి లేదు. "పరమాత్మగా నిత్యముక్తుడను".**

III. ఈ సర్వము నేనే అయినట్టి నా పరాత్ పరస్వరూపము. – **"సర్వభూతములు నావై – సర్వ సాక్షి అనగా 'నేను వేరై'** ఉంటోంది. కాబట్టి బంధ – ముక్తులు నాకు లీలావినోదమే। క్రీడా సంగతులు మాత్రమే।

**ముక్తి హీనోఽస్మి = జీవుడుగా నాకు ముక్తి ఉండదు.**

**ముక్తోఽస్మి = పరస్వరూపుడుగా నిత్యముక్తుడను.**

**మోక్షహీనోఽస్మ్యహం సదా = బంధముక్తులు నాకు లేవు. ఇహ – పరముల ఆవల నిత్యోదిత చైతన్యరూపుడను నేను. ఇక నాకు మోక్షమెక్కడిది? ఎవరినుండి? ఎవరినుండి–దేనికి మోక్షము కావాలో అదీ నేనే।**

**సత్య–అసత్యాది హీనోఽస్మి।**

నేను – నా కల్పన ఒక్కచోటే – కలిసియే ఉంటాము.

సత్యమ్ = యమ్ సత్।

అసత్యమ్ = యమ్ అసత్।

నేను ఏది సత్యమనుకుంటే అది నాకు సత్యమౌతుంది.

నేను ఏది అసత్యమనుకుంటే అది నాకు అసత్యమౌతుంది.

(యత్ భావమ్–తత్ భవతి), అనగా సత్యాసత్యములు నేను అనుకోవటాన్ని అనుసరించి ఉంటున్నాయి. అనుకునే నేనో?

ఆ ఉభయభావాలను భావించువాడుగా ఉన్నాను. ఆవల ఉన్న నా స్వరూపమునకు సత్య – అసత్యములు లేవు.

కలగంటున్న నేను....

- కలకు వేరై ఉన్నాను.
- కల నాదే కాబట్టి కలగా కనిపించేదంతా నేనే కూడా.
- అంతానేనే అయిఉండగా...ఇక ఏది నేను కాదు?

నాకు సత్యమగు పరము లేదు. అసత్యకల్పన వంటి జీవాత్మత్వము లేదు. అన్నీ నేనే అయి, ఏదీ నేను కానివాడనై ఉన్నాను. ఇందుచేత **సత్యాసత్యాది హీనోఽస్మి!**

<u>**సన్మాత్రాన్నాస్మ్యహం సదా। (సత్ మాత్రాత్ న అస్మి అహమ్ సదా)।**</u>

'నేను ఉన్నాను' అను నా భావనయే సన్మాత్ర భావన! 'ఉన్నాను' అను గమనికకు ముందే నేను ఉండి తీరాలి. కాబట్టి సన్మాత్ర **(సత్-ఉనికియొక్క) భావనకు మునుముందే ఉన్నట్టి నేను సన్మాత్రభావనకు కూడా అతీతుడను. ఆవల ఉన్నట్టివాడను. ఆదిస్వరూపుడను.** సన్మాత్రము (సత్‌భావన) కూడా నేను కాదు. సత్-చిత్-ఆనందములు నా లక్షణములు అని మాత్రమే అనవచ్చు. నేను సర్వలక్షణ విలక్షణుడను! ఈ రీతిగా **సన్మాత్రాత్ న అస్మి అహమ్।** నేను ఉన్నచోట సత్ అనే విశేష లక్షణము స్వాభావికమై ఉండి ఉంటోంది. అంతే.

<u>**గంతవ్య దేశ హీనోఽస్మి।**</u>

ఆత్మాత్ ఆకాశమ్! ఆకాశాత్ వాయుః ఇత్యాదిః । ఆత్మస్వరూపుడనగు నానుండి ఆకాశము (Space) బయల్వెడలుతోంది. ఆకాశము యొక్క రూపమే "ఇక్కడ - అక్కడ". ఇక నానుండి బయలుదేరిన 'కాలము'నకు చెందినవి - "ఇప్పుడు, అప్పుడు" మొ॥నవి.

**దేశకాలములు ఆత్మస్వరూపుడనగు నానుండియే బయల్వెడలుచున్నాయి.**

నానుండి బయల్వెడలే ఆకాశములో, నాయందే ఉన్నట్టి ఆకాశములో - నేను ఒక చోటి నుండి మరొక చోటికి వెళ్ళటమేమున్నది?

"నేను నా కలలో పల్లె నుండి పట్టణము (From a village to a Town) వెళ్ళాను" అని అంటాననుకోండి. వాస్తవానికి కలంతా నాదే అయి ఉండగా నేను కలలో ఒక చోటునుండి మరొకచోటికి పోవుటమేముంటుంది?

జాగ్రత్ - స్వప్న - సుషుప్తులు ఆత్మస్వరూపుడనగు నా భావనా - ఊహా చమత్కారమే. నేను సర్వదా ఉన్నచోటే ఉంటాను. ఈ దేహము యొక్క ప్రయాణాల చేతగాని, దేహముయొక్క రాకపోకలచేతగాని (జీవన్మరణములచేతగాని), మనో-బుద్ధి-చిత్త-అహంకారముల ఉత్పత్తి-లయముల చేతగాని నేను నాకు వేరైన మరొక చోటికి రాను. **నేను ఎక్కడ ఉన్నానో సర్వదా అక్కడే ఉన్నాను.** నాకు 'రాక లేదు - పోక' లేదు. **అహం గమనాది వర్జితః**

<u>**సర్వదా సమరూపోఽస్మి।**</u>

నేను సర్వదా కేవలాత్మ స్వరూపుడను. "ఒకచోట సూర్యుడు ఉదయిస్తున్నారు. కాబట్టి అక్కడ నుండి సూర్యుడు తేజస్సు పొందుచున్నారు"- అని అంటావా? "సూర్యుడు ఇక్కడ అస్తమించటం చేత ఇక్కడ తేజస్సు కోల్పోవుచున్నారు" - అని కూడా అనము కదా!

ఒకప్పుడు ఆత్మజ్ఞానము ఏమరచి అనేక జన్మలలో ఆయా సంఘటనలు - సందర్భములు సత్యమేనని అనుకోవచ్చుగాక! మరొకప్పుడు జ్ఞాన దృష్టితో చూడవచ్చుగాక! **నేను ఆత్మస్వరూపుడను కానిది ఎన్నడూ లేదు. సర్వదా ఆత్మ తేజోభానుడను. సూర్యుడను.**

- దేహముయొక్క రాకపోకలచే, గుణముల ఉనికిచే - లేమిచే...(ఇత్యాదులచే) **నా ఆత్మస్వరూపమునకు ఏ హానీ లేదు.**
- బాల్య - యౌవన - వార్ధక్యాల వలనగాని, మృత్యు - పునర్జన్మల చేతగాని నా ఆత్మస్వరూపము మార్పు చేర్పులు చెందటంలేదు.
- కర్మలవలనగాని, పాప - పుణ్యములవలనగాని మార్పు చెందువాడను గాను!

*నాకు ఎక్కువ తక్కువలు లేవు.*

*నాకు వేరుగా ఎక్కువ వారు లేరు. తక్కువ వారు లేరు.*

*జాగ్రత్ - స్వప్న - సుషుప్తులలో కూడా నేను ఏకరూపుడను.*

***"నేను దుఃఖితుడను। నేను పాపిని। నేను అల్పుడను।"*** అనుకుంటున్నప్పుడు కూడా నేను సమస్వరూపుడనే. **సర్వదా సమరూపోఽస్మి!** నిన్న - ఈరోజు - రేపు - జన్మ - జన్మాంతరాలలోను - జ్ఞాన, అజ్ఞాన సందర్భాలలోను నేను నేనే। సర్వదా సమస్వరూపిని.

సూర్యుడికి, ఆయన తేజస్సుకు వాస్తవానికి ఉదయ, అస్తమయములు లేనట్లే - **నాయొక్క ఆత్మ తేజో విలాసమునకు ఉదయస్తమయములు లేవు.**

**శాంతోఽస్మి।**

నిశ్చలజలంలో జలమునకు **అభిన్నమే** అయినట్టి చంచల తరంగాలు బయల్వెడలుచున్నాయి. అయినప్పటికీ తరంగము జలమే. తరంగముల ప్రదర్శనముచే జలము పొందేదేమున్నది? కోల్పోయేదేమున్నది? జలముయొక్క యథాతథత్వమునకు 'హాని' ఏమున్నది.

> నిశ్చల ఆత్మ స్వరూపుడనగు నా నుండి చంచల జగత్ భావములు – జగత్తులు, దేహభావములు – దేహములు బయల్వెడలుచున్నాయి. అయినంతమాత్రం చేత పరమశాంతస్వరూపుడనగు నాకు పోయేదీ లేదు. వచ్చేది లేదు. **నా పరమశాంతత్వము చెదరటం లేదు.** ఈ దృశ్యమంతా లేని – పోని కథ వంటిది. **(లేనిది, పోనిది)**
>
> లేదు → వాస్తవానికి లేదు.
>
> పోదు → పోయేదీ కాదు. వాస్తవానికి ఉంటే కదా…పోవటానికి?

నేను సర్వదా పరమశాంతమగు ఆత్మస్వరూపుడనే. సదా – సర్వత్రా నా శాంతాత్మత్వమునకు భంగము లేదు. లోటు లేదు. **శాంతోఽస్మి।**

**పురుషోత్తమః। ఉత్తమ పురుషః।**

నేను ఉత్తమ పురుష (First Person. I) ను. నేనేదీ కాకుండానే, అంతా నేనే అయి ఉన్నాను. స్వప్నమంతా స్వప్నద్రష్ట రూపమే కదా! ఈ జాగ్రత్ అంతా నాకు అభిన్నము। నేనే। నేను కానిదేదీ లేదు. ఉండదు. 14 లోకములుగా, లోకేశులుగా, లోకస్థులుగా ఉంటూ అవేమీ లేనివాడనైయున్నాను. జీవాత్మ–పరమాత్మలకు ఆవల పురుషోత్తముడనై, అన్నిటికి కారణకారణుడనై ఉన్నాను. ఉంటాను! **పురుషోత్తమస్మి।**

**పరమ శివౌ వాచ**

**ఏవం స్వానుభవో యస్య....** పైన చెప్పుకున్న వివరాలు విశేషాలు ఎవ్వరికి స్వానుభవమే అగుచున్నాయో

**అదీ నేను। సోఽహమస్మి। అదియే నీవు! అదియే నీవు। తత్త్వమసి।**

సర్వము స్వానుభవము ఎవ్వరికో – ఎవ్వరిదో అట్టి నేను **"బ్రహ్మము"** అని వేదవాఙ్మయముచే చెప్పబడుచున్నాను.

బ్రహ్మమేవాఽస్మి। పర–బ్రహ్మమేవాఽస్మి। సదా శివోఽస్మి।

తదేవ త్వమ్। త్వమేవాఽహమ్।

"ఇతి – శివభావన" – అని పరమ శివభగవానుడు మైత్రేయ మహర్షికి బోధించారు.

ఈవిధంగా బృహద్రథునకు సూర్యలోకవాసి అగు శాకాయన్య మహర్షి బోధించారు.

---

ఇది అధ్యయనము – శ్రవణము – చేయువాడు బ్రహ్మమే తానగుచున్నాడు.

పరమాత్మయే అయి ప్రకాశిస్తున్నాడు. ఆనందిస్తున్నాడు!

**ఇతి మైత్రేయోపనిషత్**

**ఓం శాంతిః। శాంతిః। శాంతిః।**

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 11 యోగచూడామణ్యుపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ మూలాధారాది షట్ చక్ర
సహస్రార ఉపరి స్థితమ్।
యోగ జ్ఞాన ఏక ఫలకమ్
రామచంద్ర పదం భజే॥



- మూలాధారము మొదలుకొని-(స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా అనబడు) షట్ (6) చక్రముల యందును,
- సహస్రారమునకు పై భాగమునందును నిండి ఉన్నట్టిది,
- యోగాభ్యాసము యొక్క జ్ఞానాభ్యాసముయొక్క ఏకైక అంతిమ ఫలమైనట్టిది అగు "శ్రీ ఆత్మారామపదము"ను భజించుచున్నాము.

**1.** ఓం। యోగ చూడామణిం వక్ష్యే
యోగినాం హితకామ్యయా,
కైవల్య సిద్ధిదం, గూఢం,
సేవితం యోగవిత్తమైః॥

**'ఓం' - అఖండాత్మదేవాయ నమః॥**

యోగాభ్యాసుల హితమును ఉద్దేశ్యిస్తూ వారి కైవల్యసిద్ధి కొరకై- యోగ వేత్తలచే, యోగవిద్యా శ్రేష్ఠులచే గూఢముగా (రహస్యముగా) సేవించబడు **"యోగచూడామణి"**ని - చెప్పుకొనుచున్నాము.

---

"ఆసనం", "ప్రాణ సంరోధః", "ప్రత్యాహారశ్చ",
"ధారణా", "ధ్యానం", "సమాధిః" -
ఏతాని యోగ అంగాని భవంతి షట్(6)॥

యోగము యొక్క 'షట్' (6) అంగములు
(1) ఆసనము (2) ప్రాణసంరోధము (ప్రాణ నిరోధము, ప్రాణాయామము) (3) ప్రత్యాహారము (4) ధారణ (5) ధ్యానము (6) సమాధి

---

"సుఖాసనం"

ఏకం "సిద్ధాసనం" ప్రోక్తం। ద్వితీయమ్ "కమలాసనమ్"।
షట్చక్రమ్ షోడశాధారం, త్రిలక్ష్యమ్ వ్యోమ పంచకమ్॥

(1) సిద్ధాసనము (2) పద్మాసనము (3) (మూలాధారము మొదలైన) షట్ చక్రములు (4) షోడశ {16} ఆధారములు (5) త్రిలక్ష్యము (6) (భూతాకాశము మొదలైన) వ్యోమపంచకము వీటి గురించు సవివరంగా యోగశాస్త్రాభ్యాసి ముందుగా తెలుసుకోవాలి.

---

**2.** స్వదేహే యో న జానాతి
తస్య సిద్ధిః కథమ్ భవేత్?

(పై విశేషములతో కూడిన) ఈ తన దేహము యొక్క తత్త్వము అధ్యయనము చేసి గ్రహించకపోతే, అట్టివాడు సిద్ధిని ఎట్లా పొందగలడు? అందుచేత మునుముందుగా తన దేహముయొక్క తత్త్వమును అధ్యయనము చేయాలి.

---

చతుర్దళం (4) స్యాత్ ఆధారమ్। (మూలాధారము)
స్వాధిష్ఠానమ్ చ (స్వాధిష్ఠానము)
షట్(6) దళమ్।
నాభౌ దశదళం (10) పద్మం। (మణిపూరకము)
హృదయమ్ ద్వాదశాకరమ్(12)। (అనాహతము)
షోడశారం(16) విశుద్ధాఖ్యం। (విశుద్ధము)
భ్రూమధ్యే ద్విదళం(2) తథా॥ (ఆజ్ఞా)

**చక్రములు - పద్మదళములు**

**మూలాధారములో**→'4' దళముల పద్మము.
**స్వాధిష్ఠానములో**→'6' దళములు.
నాభి స్థానములోని **మణిపూరకములో**→10 దళములు.
హృదయస్థానములోని **అనాహత చక్రములో**→12 దళములు.
కంఠములోని **విశుద్ధచక్రములో**→16 దళములు.
భ్రూమధ్యములోని **ఆజ్ఞాచక్రములో**→'2' దళములు.

సహస్రదళ సంఖ్యాతం బ్రహ్మరంధ్రే మహాపథి।
"ఆధారం" ప్రథమం చక్రం।
స్వాధిష్ఠానం ద్వితీయకమ్।
యోని స్థానం ద్వయోః మధ్యే
కామరూపం నిగద్యతే। కామాఖ్యం చ
గుదస్థానే పంకజం తు చతుర్దళమ్।
తత్ మధ్యే ప్రోచ్యతే యోనిః
కామాఖ్యా సిద్ధ వందితా।
తస్య మధ్యే మహాలింగం
పశ్చిమ అభిముఖం స్థితమ్।

మూలాధారము నుండి-శిరో కపాలముయొక్క ఉపరిగాగల బిందు స్థానము వరకు (బ్రహ్మరంధ్రమువరకు) గల మార్గము మహాపథి (లేక) మహామార్గము అనబడు చున్నది. అట్టి మార్గములో చిట్ట చివర గల బ్రహ్మరంధ్రము → '1000' దళములు కలిగి ఉన్నది.

**కామాఖ్యము (మూలాధారము)**

మొదటి చక్రము **'ఆధార చక్రము'**. రెండవది - **స్వాధిష్ఠానచక్రము** ఆ రెండింటి మధ్య **యోనిస్థానము కామరూపము**గా చెప్పబడుచున్నది. 'కామాఖ్యము' అని పిలుబడుచూ గుదస్థానములో 4 దళముల పద్మము (ఆధారములో) ఏర్పడియున్నది.

గుదస్థానమున (పురీష (లేక) మనల విసర్జన స్థానమున) గల మూలాధార చక్రము మధ్య గల ఆకాశమే **"కామాఖ్యము"**. ఈ యోని స్థానము నిత్యము సిద్ధులచే నమస్కరించ బడుచున్నట్టిది. అట్టి 'యోని'కి మధ్యగా పశ్చిమము (West)నకు అభిముఖంగా **"మహాలింగము"** ఉన్నది.

---

నాభౌ తు మణివత్ బింబం
యో జానాతి స యోగవిత్॥

నాభిస్థానములో **మణివంటి బింబము (మణిపూరకము)**ను ఎవ్వరు తెలుసుకొనుచున్నాడో.., ఆతడే యోగవేత్త.

---

తప్తచామీకరా భాసం తటిల్లేఖ ఇవ విస్ఫురత్।
త్రికోణం తత్ పురం(తత్పురం) వహ్నేః
అధో మేఢ్రాత్ ప్రతిష్ఠితమ్। సమాధౌ
పరమం జ్యోతిః అనంతం విశ్వతోముఖమ్॥

తప్త చామీకరము (మేలిమి బంగారము) వలె - మెరుపు తీగవలె ప్రకాశిస్తూ ఉన్నట్టిది, Δ త్రికోణ ఆధారము గలిగి అగ్ని జ్యోతివలె ప్రకాశించునది అగు **స్వాధిష్ఠాన చక్రము** → మేఢ్రము (లింగస్థానము) నకు కొంచము దిగువగా ఉన్నది. ఇది సమాధియందు పరంజ్యోతి స్వరూపమై అనంత విశ్వతోముఖముగా అనుభవమగుచున్నది.

---

తస్మిన్ దృష్టే మహాయోగో
యాతాయాతో (యాత-అయాతో) న విద్యతే।
'స్వ'శబ్దేన భవేత్ ప్రాణః
"స్వాధిష్ఠానం" తథా ఆశ్రయః
స్వాధిష్ఠాన ఆశ్రయాత్ అస్మాత్
"మేఢ్రమ్" ఏవ అభిధీయతే॥
(మేఢ్రము = మేహనము, మగగురి, మూత్ర విసర్జన సామీప్య స్థానము)

అట్టి స్వాధిష్ఠాన చక్రమును గమనించువాడు మహా యోగి.

**"స్వస్వరూపమునకు అధిష్ఠానము"** అనతగు భావాత్మకమగు స్వ-అధిష్ఠాన చక్రము యొక్క దర్శనము చేయు యోగి - రాక-పోకల పరిధులను (నేను పుట్టువాడను - చచ్చువాడును అను పరిమితములను) అధిగమించి ఉంటాడు.

స్వ=అనగా ప్రాణశక్తి. ప్రాణశక్తి ఇక్కడ 'స్వమ్' అను శబ్దము పలుకుచూ ఉండటంచేత **స్వాధిష్ఠానమని**, అద్దానికి ఆశ్రయస్థానము 'మేఢ్రము' అని ప్రసిద్ధమై యున్నది.

---

3. తంతునా మణివత్ ప్రోతో
యో అత్ర కందః సుషుమ్నయా,
తత్ నాభిమండలే చక్రం ప్రోచ్యతే "మణిపూరకమ్"।

'సుషుమ్ననాడి'చే దారమువలె, కందము నందు ఓత-ప్రోతమై నిర్మితము కాబట్టి, అట్టి నాభిమండల చక్రము - **'మణిపూరకము'**గా చెప్పబడుచున్నది.

---

ద్వాదశారే మహాచక్రే
పుణ్య-పాపవివర్జితే, తావత్ జీవో
భ్రమతి ఏవం యావత్ తత్త్వం న విందతి।

ఎంతవరకైతే ఈ జీవుడు ఆత్మతత్త్వమును ఏరుగక, స్వస్వరూప జ్ఞానమును ఏమరచినవాడై ఉంటాడో, ... పుణ్య-పాప ద్వంద్వములను దాటివేయడో,... అంతంత వరకు హృదయములో గల ద్వాదశ దళములు గల (12) మహాచక్రములో గల ఆయా దళములలో తిరుగాడుచూనే ఉంటాడు.

---

ఊర్ధ్వం మేఢ్రాత్ అధో నాభేః
కందే యోనిః ఖగ అండవత్॥
తత్ర నాడ్యః సముత్పన్నాః
సహస్రాణాం ద్వి సప్తతిః (72000)।
తేషు నాడీ సహస్రేషు, ద్విసప్తతిః(72) ఉదాహృతా॥

మేఢ్రమునకు (పొత్తికడుపు క్రిందిభాగమునకు) ఉపరిగా నాభికి క్రిందుగా - పక్షిగ్రుడ్డు ఆకారములో 'యోని' ఉన్నది.

అట్టి నాభి నుండి 72000 నాడులు జనించి శరీరమంతా మూలమూలలుగా విస్తరించు ఉన్నది.

వాటిలో 72 నాడులు ప్రధానమైనవి.

ప్రధానాః ప్రాణవాహిన్యో
భూయః తాసు దశ స్మృతాః॥

వాటిలో ప్రాణశక్తి వాహకములుగా '10' అతిముఖ్యనాడులుగా చెప్పబడుచున్నాయి.

---

4. ఇడా చ పింగళా చ ఏవ
సుషుమ్నా చ తృతీయగా,
గాంధారీ హస్తిజిహ్వా చ
పూషా చ ఏవ యశస్వినీ, అలంబుసా
కుహూః చ ఏవ, శంఖినీ దశమీ స్మృతా।
ఏతత్ నాడీ మహాచక్రమ్ జ్ఞాతవ్యం యోగిభిః సదా।
ఇడా వామే స్థితా భాగే। దక్షిణే పింగళా స్థితా।
సుషుమ్నా మధ్య దేశే తు। గాంధారీ వామ చక్షుషి।
దక్షిణే హస్తిజిహ్వా చ। పూషా కర్ణే చ దక్షిణే॥
యశస్వినీ వామకర్ణే చ।

**దశనాడులు:**

(1) ఇడా (2) పింగళా (3) సుషుమ్నా (4) గాంధారి (5) హస్తిజిహ్వా (6) పూషా (7) యశస్వినీ (8) అలంబుసా (9) కుహూ (10) శంఖినీ-నాడులు.

ఈ 10 నాడులు యోగాభ్యాసిచే సర్వదా తెలుసుకోబడవలసినవి.

ఎడమ వైపుగా "ఇడా నాడి". కుడివైపుగా "పింగళా నాడి"।

మధ్యగా "సుషుమ్నా నాడి". ఎడమకంటిలో "గాంధారీ నాడి"।

కుడికంటిలో "హస్తిజిహ్వా నాడి". కుడి చెవిలో "పూషా నాడి"।

ఎడమచెవిలో "యశస్వినీ". ముఖములో "అలంబుసా నాడి"।

---

ఆననే చ అపి అలంబుసా।
కుహూః చ లింగదేశే తు।
మూలస్థానేతు శంఖినీ॥

లింగప్రదేశంలో 'కుహూ నాడి'.
మూలస్థానములో 'శంఖినీ నాడి'.

యోగులకు నిత్యము ఈ 10 నాడులు ఉపాసనా ప్రాంతములుగా (స్థానములుగా) అగుచున్నాయి. ఈఈ స్థానములలో బుద్ధిని నిలిపి కొంత కొంతసేపు ఉపాసన చేస్తున్నారు.

---

5. ఏవం ద్వారం సమాశ్రిత్య
తిష్ఠంతే నాడయః క్రమాత్।
ఇడా పింగళ సౌషుమ్నాః
ప్రాణమార్గాశ్చ సంస్థితాః।
సతతం ప్రాణవాహిన్యః
"సోమ–సూర్య–అగ్ని" దేవతాః।

ఈ విధంగా దేహములోని ద్వారములను ఆశ్రయించి క్రమరీతిగా నాడులు ప్రాణశక్తి ప్రసరిస్తూ ఉన్నట్టి త్రోవలో తిష్ఠితమై ఉన్నాయి.

(1) ఇడా (2) పింగళా (3) సుషుమ్నా - ఈ మూడు నాడులు (ప్రాణప్రసరణ మార్గములో) సంస్థితమైఉన్నాయి. ఇవి ఎల్లవేళలా ప్రాణశక్తిని వహించునవి, వాహకములు, ముఖ్యాశ్రయములు కూడా.

అట్టి ఇడ, పింగళ, సుషుమ్నలకు దివ్య రూపులగు దేవతలు → చంద్ర, సూర్య, అగ్నిలు, (ఈ మూడింటిని అభిమాన దేహములుగా గల అధిష్ఠాన దేవతలు)

---

ప్రాణ అపాన సమానాఖ్యా
వ్యాన ఉదానౌ చ వాయవః

**ప్రాణశక్తి ప్రసరణ రూపమగు పంచప్రాణములు :**

**(1) ప్రాణము (2) అపానము (3) వ్యానము (4) ఉదానము (5) సమానము.**

---

నాగః కూర్మో అథ కృకరో దేవదత్తో, ధనంజయః।
హృది ప్రాణః స్థితో, నిత్యమ్ అపానో గుదిమండలే।
సమానో నాభిదేశే తు। ఉదానః కంఠ మధ్యగః।
వ్యానః సర్వ శరీరే తు, ప్రధానాః పంచవాయవః।

**పంచ ఉపప్రాణములు:**

**(1) నాగ (2 కూర్మ (3) కృకర (4) దేవదత్త (5) ధనంజయ**

**పంచప్రాణ విశేష స్థానములు**

| | |
|---|---|
| ప్రాణమునకు | **హృదయము** |
| అపానమునకు | **గుదము** |
| సమానమునకు | **నాభి** |
| ఉదానమునకు | **కంఠమధ్య** |
| వ్యానమునకు | **దేహమంతా** |

**"ప్రాణాయ స్వాహా। అపానాయ స్వాహా। సమనాయ స్వాహా। ఉదానాయ స్వాహా। వ్యానాయ స్వాహా" - అను ప్రాణోపాసనా సందర్భములో ఆయా స్థానములందు బుద్ధితో యోగులు ప్రాణోపాసన చేస్తున్నారు. ఆ తీరుగానే ప్రాణదేవతా ఉపాసన చేయబడుచున్నది.**

ఇవన్నీ ప్రధానముగా ఆయా స్థానములు కలిగి ఉన్నాయి.

| | |
|---|---|
| ఉద్గారే 'నాగ' ఆఖ్యాతః। 'కూర్మ' ఉన్మీలనే తథా।<br>కృకరః క్షుత్కరో జ్ఞేయో। దేవదత్తో విజృంభణే।<br>న జహాతి మృతంవ అపి సర్వవ్యాపీ ధనంజయః॥<br>ఏతే నాడీషు సర్వాసు భ్రమంతే జీవ జంతవః। | వ్యర్థపదార్థములను బయటకు త్రోయునది **నాగము**, (కక్కు మొదలైన వాటి ద్వారా).<br>కళ్ళు తెరుచుటకు ... **కూర్మము**.<br>తుమ్ములకు ... **కృకరము**.<br>ఆవలింతలకు .... దేవదత్తము - ప్రవర్తనమగుచున్నాయి.<br>**సర్వత్రా వ్యాపించియున్న 'ధనంజయము' - ఈ జీవుడు మరణించిన తరువాత కూడా వెంటనంటియే ఉంటుంది.**<br>ఈ నాడులన్నీ జీవుని శరీరమంతా అనేక కదలికలతో తిరుగాడుచూ ఉంటాయి. |
| ఆక్షిప్తో భుజదండేన యథా చలతి కందుకః,<br>ప్రాణ అపాన సమాక్షిప్తః<br>తథా జీవో న తిష్ఠతి। | భుజములతో, చేతులతో విసరబడుచూ ఉన్న బంతి ఏ విధంగా అయితే ఒకచోట నిలువనే నిలవదో, ఆ విధంగా ప్రాణ-అపానములచే తాడనము పొందుచూ ఈ జీవుడు ఎక్కడా ఒక చోట నిలచుటయే లేదు. |
| ప్రాణ అపాన వశో జీవో హి<br>అథశ్చ-ఊర్ధ్వం చ ధావతి। వామ దక్షిణ<br>మార్గాభ్యాం చంచలత్వాత్ న దృశ్యతే।<br>రజ్జు బద్ధో యథా శ్యేనో గతోఽపి<br>ఆకృష్యతే పునః। గుణ బద్ధః<br>తథా జీవః ప్రాణ అపానేన కర్షతి। | ప్రాణ అపానములకు వశుడై ఈ జీవుడు పైకి, క్రిందకు, ఎడమ, కుడి వైపుగాను మార్గములలో సంచారములు చేస్తూ ఒకచోట కనిపించటమే లేదు. దేహములో ఎల్లప్పుడు చంచల స్వభావుడై ఉంటున్నాడు.<br>ఏ విధంగా అయితే త్రాడుచేత కాలు కట్టబడి, నిలువు స్థంభమునకు బంధిపబడిన డేగ పైకి ఎగిరినా కూడా, వెంటనే క్రిందకు త్రాడుచే లాగబడుతోందో, ఆ విధంగా ఈ జీవుడు గుణములకు బద్ధుడై ప్రాణ-అపానములచే దృశ్యమువైపుగా ఆకర్షించ బడుచున్నాడు. |
| ప్రాణ-అపాన వశో జీవః హి<br>అథశ్చ ఊర్ధ్వం చ ధావతి।<br>అపానః కర్షతి ప్రాణం,<br>ప్రాణో అపానం చ కర్షతి।<br>ఊర్ధ్వ-అధః సంస్థితాః ఏతౌ (సంస్థితావేతౌ)<br>యో జానాతి, స యోగవిత్॥ | ప్రాణ-అపానములకు వశుడై ఈ జీవుడు దేహములో పైకి క్రిందకు తిరుగాడుచున్నాడు.<br>ప్రాణము అపానమును, అపానము ప్రాణమును పరస్పరము ఆకర్షించుకొంటూ లాగుకుంటూ త్రోసుకుంటూ ఉన్నాయి. అట్టి ఊర్ధ్వ అధో ప్రాణస్థితులను గుర్తించి, గమనించువాడే **'యోగవేత్త'**. వాటియొక్క స్వాధీన సంబంధమైన అభ్యాసముచే మనస్సు వశమవగలదు. |
| **6.** 'హ' కారేణ → బహిః యాతి।<br>'స' కారేణ ← విశేత్ పునః।<br>"హం స హం స" ఇతి అముం మంత్రం<br>జీవో జపతి సర్వదా।<br>షట్ శతాని దివా రాత్రం సహస్రాణి<br>ఏకవింశతిః (21600) – ఏతత్ సంఖ్యాన్వితం<br>మంత్రం జీవో జపతి సర్వదా। | ఈ జీవుడు ప్రాణశక్తియుతంగా ఎల్లప్పుడూ **'హ'కారముతో** దేహము నుండి బయటకు వెళ్ళుచున్నాడు. **'స'కారముతో** తిరిగి లోనికి వచ్చుచున్నాడు. (స= సర్వాత్మకత్వము. హ = జీవాత్మకత్వము)<br>ఈ విధంగా ఈ జీవుడు 'హంస-హంస (సోఽహం)' అనే మంత్రమును (మననమును) అసంకల్పితంగా సర్వదా జపించుచూనే ఉన్నాడు. (కేవలము - సందర్భముల మధ్యగా తిరుగాడుచున్నాడు)<br>ప్రతిరోజు రాత్రి - పగలు కలిపి '21600' సార్లు సర్వదా (హంస) జపమును (అసంకల్పితంగా) నిర్వర్తిస్తూ ఉన్నాడు. |
| అజపా నామ గాయత్రీ<br>యోగినాం మోక్షదా సదా।<br>అస్యాః అసంకల్పమాత్రేణ<br>సర్వపాపైః ప్రముచ్యతే।<br>అనయా సదృశీ విద్యా<br>అనయా సదృశో జపః<br>అనయా సదృశం జ్ఞానం<br>న భూతం న భవిష్యతి॥ | **అజపా గాయత్రి :** (శ్వాసను మౌనముగా గమనించటమే అజపాగాయత్రి)<br>(అట్టి) అజపాగాయత్రి యోగులకు మోక్షప్రదమగుచున్నది. (మౌనమును) సంకల్పములను వదలి, 'మౌనము'ను కించిత్ ధారణ చేస్తూ ఉన్నంత మాత్రం చేతనే, (లేక అసంకల్పమాత్రంచేత) అది సర్వ పాపములనుండి ఈ జీవుని ఉద్ధరించగలదు. 'అట్టి శ్వాసపై ధ్యాస'తో సమానమైన విద్యగాని, జపముగాని, జ్ఞానముగాని భూతభవిష్యత్తులలో మరొకటి లేదు.<br>('స'శ్వాస→కేవల పరమాత్మత్వము<br>'హ' 'శ్వాస'→సందర్భమాత్రమగు జీవాత్మతత్త్వము<br>(స హం → హం స, సోఽహమ్) (ఉభయములలోని ఏకతత్త్వము) |

**7. కుండలిన్యాం సముద్భూతా**
**గాయత్రీ ప్రాణధారిణీ, ప్రాణవిద్యా**
**మహావిద్యా। యస్తాం వేద, స వేదవిత్।**

'కుండలిని'యందు జనిస్తూ, సమస్త దేహములలో గాయత్రీ-ప్రాణధారిణి అగుచున్న ప్రాణ-ఈశ్వర తత్త్వ విశేషమగు **'ప్రాణవిద్య'**యే మహావిద్య. అది ఎరిగినవాడే వేదహృదయము ఎరిగినవాడు.

---

**కంద ఊర్ధ్వే కుండలినీ శక్తిః, అష్టధా కుండలాకృతిః**
**బ్రహ్మద్వార ముఖం నిత్యం**
**ముఖేన ఆచ్ఛాద్య తిష్ఠతి।**

కందమునకు (పొత్తి కడుపుకు క్రిందగా మాంసపు ముద్దవలె ఉన్నచోటుకు) పైభాగంలో కుండలీశక్తి కుండలాకృతి (కుండలము ఆకారంగా '∞' ఆకారముగా) ఉన్నది. ఆ శక్తి ముఖముతో శిరస్సుపై గల బ్రహ్మద్వార ముఖమును నిత్యము ఆచ్ఛాదించినదై ఉన్నది.

---

**యేన ద్వారేణ గంతవ్యం**
**బ్రహ్మద్వారం అనామయమ్।**
**ముఖేన ఆచ్ఛాద్య తత్ ద్వారం**
**ప్రసుప్తా పరమేశ్వరీ॥**
**ప్రబుద్ధా వహ్నియోగేన**
**మనసా మరుతా సహ॥**

యే ద్వారము తెరచుటచే అనామయమగు బ్రహ్మభావనయందు ప్రవేశము పొందబడగలమో, అట్టి శిరస్సుకు ఉపరిస్థానముగల **"బ్రహ్మద్వారము"** పరమేశ్వరి స్వరూపిణి యగు "కుండలిని"చే ఆచ్ఛాదించబడియున్నది.

అట్టి ఆచ్ఛాదనము (1) మనస్సు (2) వాయు సంయమనములచే ప్రబోధించబడగలదు. మనస్సు వాయువులతో కుండలిని యొక్క బ్రహ్మరంధ్ర ఆచ్ఛాదనా విచ్ఛేదనమే **"వహ్నియోగము"**.

---

**8. సూచీవత్ గాత్రమ్ ఆదాయ**
**వ్రజతి ఊర్ధ్వం సుషుమ్నయా।**
**ఉత్పాటయేత్ కవాటం తు,**
**యథా కుంచికయా గృహమ్॥**
**కుండలిన్యా తథాయోగీ, మోక్షద్వారం ప్రభేదయేత్॥**

ఒక సూది వస్త్రములోకి ప్రవేశించువిధంగా **'కుండలినీశక్తి'**ని సుషుమ్న నాడిలో ప్రవేశింపజేయాలి. తాళము చెవితో తలుపులు తెరియువిధంగా సుషుమ్ననాడియొక్క చివరిగా గల (బ్రహ్మరంధ్ర) కవాటమును తెరువాలి. యోగి దేహములోని **కుండలినీ శక్తిని యోగాభ్యాసముచే** నిద్రలేపాలి. **మోక్ష ద్వారమును ఛేదించాలి. (అనగా- "జీవాత్మవ్యష్టిత్వము"ను తెగనరికి - సర్వాత్మక మగు) ఆత్మాకాశమునందు** ప్రవేశించి, **ఆత్మస్వరూపుడై విహరించాలి. ఇదియే 'మహదాశయము'.**

---

**కృత్వా సంపుటితౌ కరౌ**
**దృఢతరం బధ్వా తు పద్మాసనమ్,**
**గాఢం వక్షసి సన్నిధాయ చుబుకం**
**ధ్యానం చ తత్ చేష్టితమ్॥**

**కుండలినీ ఉత్తిష్ఠ - సాధన :** రెండు చేతులను సంపుటితం చేసి (కలిపి ఉంచి) దృఢముగా పద్మాసనమును ధరించి,
- గడ్డమును (చుబుకమును) వక్ష స్థలము (గుండె)పై గట్టిగా తాకించి ఉంచి,
- తక్కిన ప్రాపంచక విషయయోచనలను నిరోధించి,
-తత్ స్వరూపమగు, సర్వ చేష్టితమగు (సమస్తమును కదలించుచున్నది-అగు **"పరతత్త్వము"**ను ధ్యానించు అభ్యాసమును ఆశ్రయించెదరు గాక।

---

**వారం వారం అపానం ఊర్ధ్వం**
**అనిలం, ప్రోచ్చారితం పూరితం,**
**ముంచన్ ప్రాణమ్ ఉపైతి బోధమ్**
**అతులం, శక్తి ప్రభావాత్ నరః।**

మరల మరల క్రిందికి ప్రసరించుచున్న అపానవాయువును పూరక ప్రాణాయామముతో పైకిలాగుచూ, ప్రాణమును క్రిందకు లాగుచుండగా, ప్రాణ-అపానముల సమాన ధారణచే ఆ యోగి శక్తివంతుడగుచున్నాడు. ఆతనియందు ఆత్మజ్ఞానము స్వయముగా బోధకమవగలదు.

---

**అంగానాం మర్దనం కృత్వా,**
**శ్రమ సంజాత వారిణా।**
**కట్వ, ఆమ్ల లవణ త్యాగీ, క్షీర భోజనమ్ ఆచరేత్॥**

యోగాభ్యాస శ్రమచే జనించిన చెమట తేజోశక్తి సంపన్నము కాబట్టి, అద్దానిని ఆయా శరీరపు ప్రదేశాలలో, (జనించిన చోటే) మర్దనము చేయాలి.
యోగసాధన చేస్తూ ఉన్నప్పుడు ఉప్పు, పులుపు కారము వదలి అధికంగా క్షీరాన్నం (పాలు) స్వీకరించాలి.

---

**బ్రహ్మచారీ, మితాహారో యోగీ**
**యోగపరాయణః ।**
**అబ్దాత్ ఊర్ధ్వం భవేత్ సిద్ధో।**
**న అత్ర కార్యా విచారణా॥**

జగత్‌ధ్యానము త్యజిస్తూ, బ్రహ్మమును ధ్యానించుచూ జగత్తును బ్రహ్మముగా దర్శించటమును, అభ్యసించుచూ, అధ్యయనము చేయుచూ మితాహారి అయి యోగాభ్యాసము చేయుచున్నవాడు ఒక సంవత్సర కాలము దాటగానే ఆత్మత్వము (ఆత్మయొక్క సమగ్రత్వము) సిద్ధించుకోగలడు. ఇందులో "అవునా?" - అని ప్రశ్న చేయవలసింది ఏమీ లేదుకూడా. (ఇది నిశ్చయము). (No Doubt)

సుస్నిగ్ధ మధుర ఆహారః, చతుర్థాంశ వివర్జితః
భుంజతే శివ సంప్రీత్యా -
"మితాహారః" స ఉచ్యతే॥

**మితాహారము : (1) సాత్వికమైనది :** పాలు, మజ్జిగ, ఫలమువంటి తేలికగా అరుగునవి, మధురమైనవి మితముగా తీసుకోబడునవి - మితాహారము **(2) చతుర్థాంశ (4వ వంతు) వివర్జితము:** పొట్టలో 2 వంతులు ఘనాహారము, 1వ వంతు జలము,- మిగతా ఒక వంతు ఖాళీ (3) భగవదర్పితమైన ఆహారము (4) శివప్రీతి అగు న్యాయార్జితాహారము - ఇవి మితాహార లక్షణములు".

---

కంద ఊర్ధ్వే కుండలీ శక్తిః అష్టధా
కుండల ఆకృతిః "∞"
బంధనాయ చ మూఢానాం।
యోగినాం మోక్షదా సదా॥

కుండలిని : మూలాధారములోని కందము (మాంస నిర్మిత విభాగము) అష్టాకృతిగా కుండలీ శక్తి. "8" (కుండలిని = Absoulte Form of Enthusiasm Inclination and Inspiration) - **(అష్టవిధ ప్రకృతి రూపము).**

అట్టి కుండలీశక్తి మూఢులకు బంధముగా అగుచున్నది. యోగులకో.. మోక్షప్రదాత. (యోగాభ్యాసము ప్రారంభించటానికి (స్త్రీకి పుట్టినిల్లువలె) ప్రియమైన స్థానము)

---

మహాముద్రా నభోముద్రా
ఓడ్యాణం చ జలంధరమ్,
మూలబంధం చ యో వేత్తి,
స యోగీ ముక్తి భాజనమ్॥

**ముద్రలు :**

**(1) మహాముద్ర (2) నభోముద్ర (3) ఓడ్యాణము (4) జాలంధరము (5) మూలబంధము**-వీటిగురించి ఎరిగియున్న యోగి పట్ల ముక్తి సులభతరమగుచున్నది. ఆతడు సమస్త బంధములనుండి తేలికగా విముక్తుడగుచున్నాడు.

---

**9.** పార్ష్ణి ఘాతేన సంపీడ్య
యోనిమ్ ఆకుంచయేత్ దృఢమ్।
అపానమ్ ఊర్ధ్వం ఆకృష్య
మూల బంధో విధీయతే॥

**మూల బంధము**

(1). (ఎడమ) కాలి మడమ యొక్క వెనుకభాగంతో యోనిస్థానమును (గుద స్థానమును) దృఢముగా నొక్కిబట్టి,

(2). అపానవాయువును ఊర్ధ్వముగా ఆకర్షించటము -

- ఇది **'మూలబంధము'** అనబడుచున్నది.

---

అపాన ప్రాణయోః ఐక్యం క్షయాత్
మూత్ర పురీషయోః॥

ప్రాణ-అపానములు యోగాభ్యాసముచే ఏకస్థానమునకు తీసుకురాబడి, అవి రెండూ ఐక్యమవటమును ధారణ చేయబడుచుండగా,.. మూత్ర పురీషములు సాధారణమవుతాయి. (అనారోగ్యముకలుగజేయనివౌతాయి).

---

యువా భవతి వృద్ధోఽపి
సతతం మూల బంధనాత్।
ఓడ్యాణం కురుతే యస్మాత్ అవిశ్రాతం మహాఖగః,
ఓడ్డియాణం తత్ ఏవ స్యాత్
మృత్యు మాతంగ కేసరీ॥

దైనందికంగా **'మూలబంధనము'** అభ్యాసించు యోగాభ్యాసి వృద్ధుడైనప్పుడు కూడా యువకునివలె ఉత్సాహము కలిగి ఉంటాడు.

**ఓడ్యాణ బంధము (లేక) ఉడ్డియాణము** : ఎల్లప్పుడు **"ఉడ్డియాణ యోగాభ్యాసము"** నిర్వర్తించు యోగాభ్యాసి పక్షివలె ఎగురుతూ 'సముత్సాహి' అయి ఉంటాడు. అట్టి ఓడియాణము- మృత్యువు అనే ఏనుగుకు సింహ స్వప్నము వంటిది. మృత్యువు జయించబడగలదు.

---

**10.** ఉదరాత్ "పశ్చిమం తాణం" అధో నాభేః నిగద్యతే॥
ఓడ్యాణం ఉదరే బంధః
తత్ర బంధో విధీయతే।
బధ్నాతి హి శిరోజాతం
అధోగామి నభో జలమ్।
తతో జాలంధరో బంధః
కంఠ దుఃఖౌఘ నాశనః॥
జాలంధరే కృతే బంధే, కంఠ సంకోచ లక్షణే,

ఉదరము (కడుపు)కు పశ్చిమంగా, నాభి (బొడ్డుకు) దిగువగా ఉన్న ప్రదేశమును 'తానము' అని అంటారు. తానములోవాయు బంధనము - ఓడ్యాణము (లేక) ఉడ్డీయాణము.

'ఓడ్యాణము' అనబడేది ముఖ్యంగా ఉదరము (పొట్ట)నకు సంబంధించిన బంధము. పొట్టలో కుంభకధారణ (లేక) బంధమును అభ్యసించటము. (తానములో దృష్టిని నిలుపుతూ, పొట్టలో కుంభకము చేయు అభ్యాసము)

**జాలంధర బంధము:**

- శిరస్సునందు జలించు (ప్రవహిస్తూ ఉన్నట్టి) ఆకాశ జలమును కంఠమునందు బంధించి ఉంచు యోగప్రక్రియ.

- కంఠమును సంకోచింపజేయు లక్షణ సమన్వితము.

---

న పీయూషం పతతి అగ్నౌ
న చ వాయుః ప్రధావతి॥

ఇట్టి 'జాలంధర బంధము"చే ఇక అగ్నియందు పీయూషము పతనము పొందదు. వాయు చాంచల్యము ఉండదు. (ఆత్మానుభవము పంచభూతములలోకి జారదు. మనస్సు చాంచల్యము కలిగి ఉండదు)

| | |
|---|---|
| కపాల కుహరే జిహ్వా ప్రవిష్టా విపరీతగా,<br>భ్రువోః అంతర్గతా దృష్టిః<br>ముద్రా భవతి ఖేచరీ॥ | **ఖేచరీముద్ర**<br>(1) నాలుకను మడచి - కపాల కుహరము (The Inward end) అయినట్టి కొండనాలుక రంధ్రమునకు -తాకించటము.<br>(2) భ్రూమధ్యగా దృష్టిని నిలిపిఉంచటము= **ఇది ఖేచరీముద్ర.** |
| న రోగో, మరణం తస్య,<br>న నిద్రా న క్షుధా తృషా,<br>న చ మూర్ఛా భవేత్ తస్య-<br>యో ముద్రాం వేత్తి "ఖేచరీమ్"॥ | **'ఖేచరీముద్ర'** ఎరిగి అభ్యసించు యోగిని రోగము, మరణము, నిద్ర ఆకలి, దాహము, మూర్ఛ మొదలైన దోషములు స్పృశించవు. (ఆతని పట్ల దేహముల రాక-పోకలు, కూడా మాసిన వస్త్రమువదలి, నూతన వస్త్రము ధరించటము వంటిది - అవగలదు) |
| **11.** పీడ్యతే న చ రోగేణ, లిప్యతే న చ కర్మభిః।<br>బాధ్యతే న చ కేన అపి, యో ముద్రాం వేత్తి 'ఖేచరీ'మ్।<br>చిత్తం చరతి ఖే యస్మాత్ జిహ్వా చరతి ఖే యతః<br>తేన ఇయం ఖేచరీ ముద్రా, సర్వ సిద్ధ నమస్కృతా॥ | ఖేచరీముద్ర ఎరిగిన యోగిని రోగములు పీడించవు. కర్మదోషములు ఆతనిని స్పృశించవు. దేనిచేతనూ ఆతడు బాధించబడజాలడు.<br>దేనిచేత చిత్తము → ఆత్మాకాశమునందు, జిహ్వ → భూతాత్మా - భూతభావనాకాశమునందు - చరిస్తాయో, అద్దానిని **"ఖే(ఆకాశమునందు) చరీ (చరించునది)"** = ఖేచరీముద్ర అంటారు.<br>అది సిద్ధించుకొన్నవాడు సిద్ధులందరిచే కూడా నమస్కరించబడుచున్నాడు. |
| బిందుమూల శరీరాణి సిరా<br>యత్ర ప్రతిష్ఠితాః, భావయంతి<br>శరీరాణి, ఆపాద తల మస్తకమ్।<br>ఖేచర్యా ముద్రితమ్ యేన<br>వివరం లంబికా ఊర్ధ్వతః॥ | శరీరము నందు ఏది బిందుమూలమో, దేనియందు సిరలు (నాడులు) ప్రతిష్ఠితమైయున్నాయో, అట్టి కేవలమగు ఆత్మ చైతన్యమును - పాదము నుండి శిరస్సు వరకు - భావన చేయటమే **ఖేచరీముద్ర.** అది **"నాలుక చివరతో కొండనాలుక స్పృశించటము"** అను **"లంబికా ఊర్ధ్వ"** వివరణను సాధనగా చెప్పబడుతోంది. |
| న తస్య క్షీయతే బిందుః<br>కామిన్య ఆలింగితస్య చ<br>యావత్ బిందుః స్థితో దేహే<br>తావత్ మృత్యుభయం కుతః? | అట్టి లంబినీ ఊర్ధ్వ వివరణ యోగముద్రచే<br>-కామినీ **(సంసార/దృశ్య)** ఆలింగనముచే (ఆశ్రయించు కారణంగా) బిందుక్షయము **(స్వస్వరూపము యొక్క ఏమరపు)** ఉండదు.<br>- దేహమునందు ఎంతవరకైె బిందువు స్థితమై ఉంటుందో అంతవరకు మృత్యుభయము ఏముంటుంది? ఉండదు. జన్మ-మృత్యువులకు విషయమే కానట్టి 'స్వస్వరూపము' అనుభూతమవగలదు. |
| యావత్ బద్ధా నభో ముద్రా<br>తావత్ బిందుః న గచ్ఛతి।<br>జ్వలితః అపి (జ్వలితోఽపి) యథా బిందుః<br>సంప్రాప్తశ్చ హుతాశనమ్,<br>వ్రజతి ఊర్ధ్వం గతః శక్త్యా<br>నిరుద్ధో యోనిముద్రయా।<br>స పునః ద్వివిధో బిందుః<br>పాండరో, లోహితః తథా। | నభో ముద్రా (ఖేచరీముద్రాబంధము) అభ్యసించు యోగి బిందువు నుండి (ఆత్మభావన నుండి) దృశ్యములోనికి పతనముకాడు. అగ్నిలోపడినా కూడా దహ్యము కాడు.<br>యోని ముద్రచే - బిందువు - అగ్నిలో పడినప్పటికీ, అగ్నియందు కాలుచున్నప్పటికీ 'ఊర్ధ్వగతి' యందే కొనసాగగలడు. (అఖండమగు ఆత్మభావన ఆతనిపట్ల కొనసాగగలదు)<br>అట్టి బిందువు రెండు విధములు<br>(1) **పాండరము** (తెలుపు) **(Self)** (2) **లోహితము** (ఎరుపు) **(Self Related)**<br>**"I"** **"My"** |
| పాండరం 'శుక్లం' ఇతి – ఆహుః।<br>లోహితాఖ్యం 'మహారజః'॥<br>సిందూర వ్రాత సంకాశం, రవిస్థాన స్థితం రజః।<br>శశిస్థాన స్థితం శుక్లం।<br>తయోః ఐక్యం సుదుర్లభం॥ | పాండరము 'శుక్లము' అని, లోహితము అని, "మహారజము" అని చెప్పబడుచున్నాయి. [(1) Functioner (2) Functioning]<br>రవిస్థానమునందు సిందూరపు రంగుతో సమానమైన రజము సంస్థితము.<br>-శశిస్థానము నందు శుక్లము సంస్థితమైనది. ఈ రవిస్థానము-శశి స్థానము ('I' and 'My'] యొక్క ఐక్యత సుదుర్లభమైనది. |

| | |
|---|---|
| బిందుః → బ్రహ్మా। రజః→ శక్తిః।<br>బిందుః → ఇందూ। రజో → రవిః।<br>ఉభయోః సంగమాత్ ఏవ ప్రాప్యతే **పరమం పదమ్**॥ | బిందువు → బ్రహ్మము; రజము → శక్తి<br>బిందు → చంద్రుడు ; రజము → రవి।<br>(బింద → శక్తిమంతుడు రజము → శక్తి)<br>ఈ రెండింటి సంగమము చేతనే **"పరమపదము"** ప్రాప్తించగలదు. |
| వాయునా శక్తి జాతేన ప్రేరితం చ<br>యథా రజః, యాతి బిందుః - 'సత్' ఏకత్వం<br>(సదైకత్వం) భవేత్ దివ్య వపుః తదా॥ | "శక్తి" చేత జనించిన వాయువు వలన ప్రేరితమై<br>'రజస్సు' → బిందువుతో ఐక్యము పొందుచున్నది. శక్తి → 'సత్'తో ఏకత్వము పొందుచున్నది.<br>అట్టి సత్-చిత్ (ఉనికి-ఎరుక)ల ఏకత్వముచే దివ్యశరీరము అనుభవమగుచున్నది. |
| శుక్లం చంద్రేణ సంయుక్తం।<br>రజః సూర్యేణ సంగతమ్।<br>తయోః సమరస ఏకత్వం<br>యో జానాతి, స <u>యోగవిత్</u> ॥ | శుక్లము చంద్రునితో సంయుక్తము (కలిసిపోయి) ఉంటోంది. రజస్సు సూర్యునితో సంగతము అయి ఉంటోంది. వీటి యొక్క (శుక్ల రజస్సుల యొక్క, **"శక్తిమంతుడు- శక్తి"**ల యొక్క) **సమరస - ఏకత్వము** ఎవ్వరు ఎరిగి ఉంటారో, ఆతడే **యోగవేత్త.** |
| శోధనం నాడి జాలస్య,<br>చాలనం చంద్ర సూర్యయోః,<br>రసానాం శోషణం చ ఏవ-<br>"మహాముద్రా" అభిధీయతే॥ | **<u>మహాముద్ర</u>**<br>(1) శోధన : నాడీ జలము యొక్క శోధనము (ఇండ పింగళ సుషుమ్న మొదలైననాడుల గమనిక, కుంభక ప్రాణాయామము)<br>(2) చాలన : చంద్ర - సూర్యుల చాలనము { పురుషకారము-పురుషుల చాలనము - (లేక), ప్రకృతి-పురుషుల చాలనము}<br>(3) శోషణ: రసముల శోషణము. (జగద్దృశ్యముపట్ల ధ్యాస యొక్క ఉపసంహారము)<br>ఈ **శోధన-చాలన-శోషణముల** సమన్వయా విశేషమే **"మహాముద్ర"**। |
| **12.** వక్షో న్యస్త హనుః నిపీడ్య సుచిరం<br>యోనిం చ వామ-అంఘ్రిణా।<br>హస్తాభ్యాం అనుధారయన్ ప్రసరితం<br>పాదం తథా దక్షిణమ్।<br>అపూర్య శ్వసనేన కుక్షియుగళం<br>బధ్వా శనై రేచయేత్। | **<u>సుమతీ మహాముద్ర</u>**<br>(1) హనువును (గడ్డము భాగమును / చుబకమును) వక్షస్థలముపై నొక్కి ఉంచటము<br>(2) ఎడమకాలి మడమతో యోనిని (మూలధార ప్రాంతమును) నొక్కి ఉంచటము<br>(3) కుడికాలిని (దక్షిణపాదమును) చాపి చేతులతో పట్టుకొని ఉండటము<br>(4) కుక్షి (పొట్ట)లో గాలిపీల్చి - నింపి ఉంచటము.<br>(5) నెమ్మదిగా పొట్టలో గాలిని వదలుచూ (రేచకము చేస్తూ) ఖాళీ చేయుటము. ఇతి **సు-మహతీ ముద్ర।** |
| ఏతత్ వ్యాధి వినాశనీ, <u>సు-మహతీ</u><br><u>ముద్రా</u> నృణాం కథ్యతే॥<br>చంద్రాంశేన సమభ్యస్య,<br>సూర్య-అంశేన అభ్యసేత్ పునః।<br>యా తుల్యా తు భవేత్ సంఖ్యా,<br>తతో ముద్రాం విసర్జయేత్॥ | ఇదియే **"మహాముద్ర"** (లేక **"మహతీముద్ర"**) విధానముగా అనబడు చున్నది. ఇది శరీరములోని సర్వవ్యాధులను తొలగించగలదు.<br>(ఎడమ ముక్కు పుటముతో గాలి పీల్చటం, కుడి పుటముతో వదలటం)<br>(కుడి ముక్కుపుటముతో గాలి పీల్చటము, ఎడమ పుటముతో వదలటం)<br>చంద్రాంశతో మొట్టమొదటి అభ్యసించాలి. మరల సూర్యాంశతో అభ్యసించాలి. ఎప్పుడైతే **సంఖ్యాసమము** అగుచున్నదో, అప్పుడిక 'ముద్ర'ను విడచి వేయాలి. (ఇది గురుముఖతః అభ్యసించాలి) |
| **13.** నహి పథ్యం అపథ్యం వా,<br>రసాః సర్వే అపి నీరసాః,<br>అతిభుక్తం విషం ఘోరం<br>పీయూషం ఇవ జీర్యతే॥<br>క్షయ, కుష్ఠ, గుదావర్త, గుల్మా<br>జీర్ణ పురోగమాః,<br>తస్య రోగాః క్షయం యాంతి | ఇట్టి **'మహాముద్ర'** లేక **'మహతీముద్ర'** అభ్యాసించు యోగి పట్ల<br>→ పథ్యము, అపథ్యము (తినవలసినవి, తినకూడనివి). అనునవి ఇక ఉండవు.<br>→ రసము - నీరసము.. రెండూ ఉండవు.<br>అతిగా భుజించినా, ఘోరమైన విషము స్వీకరించినా.. అవన్నీ పీయూషము (అమృతము) వలె జీర్ణము కాగలవు.<br>**మహాముద్ర అభ్యసిస్తూ ఉన్న యోగాభ్యాసికి**<br>- క్షయ, కుష్ఠు, గుదావర్తము (మొల్లలు), గుల్మము (పొత్తి కడుపు దోషములు), అజీర్ణము మొదలైన రోగములు తొలగిపోతాయి. |

| | |
|---|---|
| **మహాముద్రాం తు యో అభ్యసేత్।<br>కథితా ఇయం (కథితేయం) మహాముద్రా<br>మహాసిద్ధికరీ నృణామ్। గోపనీయా** | మహాసిద్ధిని ప్రసాదించునట్టి ఈ మహాముద్రాయోగ విద్యను రహస్యముగా ఉంచాలి. శిష్యుడై అభ్యర్థిస్తేనే ఇవ్వాలి. అంతేగాని ఎవ్వరికైనా భక్తి , గురు శుశ్రూష-పట్టుదలలు పరిశీలించకుండా ఇవ్వరాదు. |
| **ప్రయత్నేన। న దేయా యస్య కస్య చిత్॥**<br>**పద్మాసనం సమారుహ్య,<br>సమకాయ శిరోధరః,<br>నాసాగ్రదృష్టిః ఏకాంతే<br>జపేత్ "ఓం" కారమ్ అవ్యయమ్॥** | **'ఓం' కారోపాసన**<br>-పద్మాసనమును ధరించి,<br>- శరీరమును, తలను నిఠారుగా ధరించి,<br>- దృష్టిని ముక్కుకు అగ్రభాగంలో (అజ్ఞాచక్రస్థానంలో) నిలిపి,<br>- ఏకాంతంగా<br>-అవ్యయమగు (మార్పు చేర్పులు ఉండనట్టి) ఓంకార (ఆత్మ) తత్త్వమును జపము చేయాలి. ధ్యానించాలి. |
| **14. 'ఓం' నిత్యం శుద్ధం బుద్ధం<br>నిర్వికల్పం నిరంజనం,<br>నిరాఖ్యాతం, అనాదినిధనం,<br>ఏకం, తురీయం,<br>యత్ భూతం భవత్ భవిష్యత్ పరివర్తమానం,<br>సర్వదా నవచ్ఛిన్నం (సర్వదానవచ్ఛిన్నం) పరంబ్రహ్మ।<br>తస్మాత్ జ్ఞాతా పరాశక్తిః<br>స్వయం జ్యోతిరాత్మికా।** | **ఓంకార ధ్యానము అనగా?**<br>పరబ్రహ్మము - గురించియే। స్వస్వరూపము, సర్వస్వరూపము అగు పరబ్రహ్మము ఎట్టిది?<br>☙ త్రికాలములలో **నిత్యమైనది.**<br>☙ **శుద్ధమైనది. కేవల బుద్ధి స్వరూపము.**<br>☙ సవికల్పములకు (సర్వవిశేష కల్పనలకు) సాక్షి కాబట్టి **నిర్వికల్పము.**<br>☙ మనోబుద్ధిచిత్త అహంకారములకు సంబంధించిన ఏ దోషము అంటదు కాబట్టి **నిరంజనము.**<br>☙ మాటలచే వర్ణించలేము. **నిరాఖ్యాతము.**<br>☙ **ఆద్యంతములు లేనిది. అనాది నిధనము.**<br>☙ **ఏకము.** జాగ్రత్ స్వప్న సుషుప్తులకు ఆవలిది. **తురీయము.**<br>☙ భూత వర్తమాన భవిష్యత్తులలో (త్రికాలములలో) **విభాగము కానట్టిది. కాలాతీతము**<br>☙ **ఈ జీవుని ఇహస్వరూపమునకు ఆవలిది. పరాశక్తి స్వరూపము.**<br>☙ **స్వయం జ్యోతి - ఆత్మజ్యోతి స్వరూపము.** |
| **ఆత్మన ఆకాశః సంభూతః।<br>ఆకాశాత్ వాయుః।<br>వాయోః అగ్నిః।<br>అగ్నేః ఆపః। అద్భ్యః పృథివీ।** | **ఇదంతా ఆత్మనుండే**<br>→ స్వస్వరూపమగు ఆత్మ నుండి **'ఆకాశము'** సంభవిస్తోంది. (Space)<br>→ ఆకాశము నుండి **వాయువు** (Vepour).<br>→ వాయువు నుండి **అగ్ని** (Heat).<br>→ అగ్ని నుండి **జలము** (Liquid).<br>→ జలము నుండి **పృథివి** (Solid). |
| **తేషాం పంచభూతానాం పతయః<br>పంచ, సదాశివ ఈశ్వర రుద్ర విష్ణు<br>బ్రహ్మణశ్చ ఇతి।<br>తేషాం బ్రహ్మ విష్ణు<br>రుద్రాశ్చ ఉత్పత్తి స్థితి లయ కర్తారః॥** | ఆత్మనుండియే బయల్వెడలుచున్న -<br>అట్టి పంచభూతములకు భూతపతులు- ఐదుగురు<br>**(1) సదాశివ (2) ఈశ్వర (3) రుద్ర (4)విష్ణు (5) బ్రహ్మ**<br>వారిలో బ్రహ్మ, విష్ణు, రుద్రులు ఉత్పత్తి -స్థితి-లయములకు కర్తలై ఉంటున్నారు. |
| **రాజసో బ్రహ్మ। సాత్త్వికో విష్ణుః<br>- తామసో రుద్ర ఇతి।<br>ఏతే త్రయో గుణయుక్తాః॥** | బ్రహ్మదేవుడు - రాజసుడు<br>విష్ణువు - సాత్త్వికుడు<br>రుద్రుడు - తామసుడు<br>ఈవిధంగా ఈ ముగ్గురు గుణయుక్తులు (సగుణులు). |

| | |
|---|---|
| బ్రహ్మా దేవానాం ప్రథమః సంబభూవ।<br>ధాతా చ సృష్టౌ । విష్ణుశ్చ స్థితౌ।<br>రుద్రశ్చ నాశే। భోగాయ చ ఇంద్రః।<br>– ప్రథమజా బభూవుః॥ | మొట్టమొదట దేవతలందరిలో ప్రప్రథముడుగా సృష్టి సంకల్పి, సృష్టికి అధిదేవత అగు బ్రహ్మ (బ్రహ్మదేవుడు) (ధాత) సంభవించుచున్నారు.<br>**"సృష్టి" కొరకై ధాత, "స్థితి" కొరకు విష్ణువు, "నాశనము" (లయము) కొరకు రుద్రుడు, అనుభవము (లేక) భోగము కొరకు ఇంద్రుడు ముందుగా సంప్రదర్శనమగుచున్నారు.** |
| ఏతేషాం బ్రహ్మణో, లోకాత్ ఏవ<br>(దేవ) తిర్యక్ నర స్థావరాశ్చ జాయంతే।<br>తేషాం మనుష్యాదీనాం<br>పంచభూత సమవాయః శరీరం | వీరిలో బ్రహ్మదేవుని బ్రహ్మలోకము నుండి దేవతలు, తిర్యక్ (జంతువులు), నరులు, స్థావరములు..ఇవన్నీ బయల్వెడలుచున్నాయి. (14 లోకములు ప్రదర్శనమగుచున్నాయి)<br>మనుష్యులు మొదలైన వారందరియొక్క శరీరములు పంచభూతసముదాయములు. (పంచభూతముల కలయికచే నిర్మితములు). |
| జ్ఞాన కర్మ ఇంద్రియైః, జ్ఞాన విషయైః,<br>ప్రాణ – ఆది పంచవాయు, మనో బుద్ధి<br>చిత్త అహంకారైః, స్థూల కలితైః<br>సోఽ అపి "స్థూలప్రకృతిః" ఇతి ఉచ్యతే॥ | **స్థూలప్రకృతి :** జ్ఞానేంద్రియములు, జ్ఞానవిషయములు, కర్మేంద్రియములు, కర్మవిషయములు, పంచప్రాణములు, మనో బుద్ధి చిత్త అహంకారములు - ఇవన్నీ కలిపి **"స్థూలప్రకృతి"** అని పిలువబడుతోంది. |
| **15.** జ్ఞాన కర్మ ఇంద్రియైః–జ్ఞాన విషయైః<br>ప్రాణ ఆది పంచావాయు<br>మనో బుద్ధిభిశ్చ సూక్ష్మస్థోఽపి<br>"లింగమ్" ఏవ ఇతి ఉచ్యతే॥<br>గుణత్రయ యుక్తం కారణమ్।<br>సర్వేషామ్ ఏవం త్రీణి శరీరాణి – వర్తంతే। | **సూక్ష్మ ప్రకృతి :** ఈ జ్ఞాన-కర్మేంద్రియములు, జ్ఞానవిషయములు, పంచప్రాణములతో **మనో-బుద్ధులు** ఏకమైతే → "సూక్ష్మస్థుడు" లేక "లింగము" (లేక లింగ శరీరము) అని చెప్పబడుతోంది.<br>**కారణ శరీరము :** (సత్వ రజో తమో) త్రిగుణములతో కూడినది- **కారణ శరీరము.**<br>ఈవిధంగా సర్వదేహాత్మలకు స్థూల-లింగ-కారణ శరీరములు రూపు దిద్దుకొని ఉంటున్నాయి. జీవులందరు (జీవించువారందరు) ఈ స్థూల-సూక్ష్మ-కారణ 'త్రి' శరీరములు కలిగి ఉంటున్నారు. |
| <u>జాగ్రత్ స్వప్న సుషుప్తి</u><br><u>తుర్యాశ్చ</u> ఇతి అవస్థాః చతస్రః।<br>తాసాం అవస్థానాం అధిపతయః చత్వారః పురుషాః॥ | **చతురవస్థలు :** (1)జాగ్రత్తు (2) స్వప్నము (3) సుషుప్తి (4) తుర్యము ఈ నాలుగు అవస్థలకు నలుగురు **పురుషులు** అధిపతులై ఉన్నారు.<br>వారు (1) విశ్వుడు (2) తైజసుడు (3) ప్రాజ్ఞుడు, (4) తురీయుడు. |
| **16.** విశ్వ తైజస ప్రాజ్ఞ ఆత్మానః<br>(ప్రాజ్ఞాత్మానః) చ ఇతి।<br>విశ్వోహి స్థూల భుక్ నిత్యం।<br>తైజసః ప్రవివిక్త భుక్॥<br>ఆనంద భుక్తథా ప్రాజ్ఞః।<br>"సర్వసాక్షీ" – ఇతి అతః పరమ్। | విశ్వుడు → స్థూలానుభవుడు (స్థూల పురుషకారము).<br>తేజసుడు → అంతరమున ఏకాంతమునందు స్వప్న-దృశ్యానుభవుడు (స్వప్న పురుషకారము).<br>ప్రాజ్ఞుడు→ విషయ రహిత, మనో రహిత- ఆనంద అనుభూతి అనుభవుడు (సుషుప్త పురుషకారము).<br>అతఃపరుడగు ఆత్మ → సర్వమునకు సాక్షి (జాగ్రత్ స్వప్న సుషుప్తులకు పరమైనవాడు). |
| ప్రణవః సర్వదా తిష్ఠేతి<br>సర్వ జీవేషు భోగతః।<br>అభిరామస్తు సర్వాసు హి, అవస్థాసు హి అధోముఖః।<br>'అ'కార 'ఉ'కారో 'మ'కారాశ్చ ఇతి। | ప్రణవము (పరమాత్మ) సర్వదా సర్వజీవులను తన అనుభూతిగా భోగముగా కలిగిఉంటోంది.<br>(లోకో రమయతేతి రామమ్) - **అభిరామమునకు అన్ని అవస్థలు అధోముఖమై ఉంటున్నాయి.**<br>ప్రణవము (ఓం) 'అ'కార 'ఉ' కార 'మ'కారముల సంపుటి. |
| త్రయో వర్ణాః, త్రయో వేదాః,<br>త్రయో లోకాః, త్రయో గుణాః,<br>త్రీణి అక్షరాణి, త్రయః స్వరాః<br>ఏవ ప్రణవః ప్రకాశతే॥ | **<u>ప్రణవాంశలు</u>**<br>3 (త్రి)వర్ణములు, '3' వేదములు, '3'లోకములు, '3' గుణములు, '3' అక్షరములు, '3' స్వరములు - ఇవన్నీ ప్రణవము నందు ప్రణవాంశలుగా ప్రకాశమానమై ఉంటున్నాయి. |

**17.** 'అ' కారో జాగ్రతీ నేత్రే వర్తతే సర్వజంతుషు।
'ఉ' కారః కంఠతః స్వప్నే ।
'మ' కారో హృది సుప్తితః॥

→'అ'కారము - 'జాగ్రత్' అవస్థ. సర్వదేహులకు **నేత్రమునందు** వర్తించుచున్నది.

→'ఉ'కారము స్వప్నావస్థ. **కంఠ ప్రదేశములో** అవస్థితము,

→'మ'కారము సుషుప్త్యవస్థ. **హృదయ ప్రదేశమున** ఉంటోంది.

---

విరాట్ విశ్వ స్థూలశ్చ 'అ' కారః॥
హిరణ్యగర్భః తైజసః, సూక్ష్మశ్చ 'ఉ'కారః॥
కారణ అవ్యాకృత ప్రాజ్ఞశ్చ 'మ' కారః ॥

'అ'కారము - విరాట్ విశ్వస్థూలము.
'ఉ'కారము - విరాట్ సూక్ష్మము. తైజస సూక్ష్మము. హిరణ్యగర్భము.
'మ'కారము : కారణ- అవ్యాకృతము. విశ్వప్రాజ్ఞము.

---

'అ' కారో రాజసో-రక్తో,
"బ్రహ్మ చేతన' ఉచ్యతే।
'ఉ' కారః సాత్త్వికః శుక్లో
'విష్ణుః' ఇతి అభిధీయతే।
'మ' కారః తామసః కృష్ణో,
రుద్రశ్చ ('రుద్రః' చ) ఇతి తథా ఉచ్యతే॥

అకారము → రాజసము, రక్తము (ఎరుపు). **బ్రహ్మ చేతనము.**
ఉకారము → సాత్త్వికము (తెలుపు). **విష్ణుచేతనము. (విష్ణువు)**
మకారము → తామసము. కృష్ణము (నలుపు). **రుద్రచేతనము. (రుద్రుడు).**

---

ప్రణవాత్ ప్రభవో బ్రహ్మ।
ప్రణవాత్ ప్రభవో హరిః।
ప్రణవాత్ ప్రభవో రుద్రః।
ప్రణవో హి పరో భవేత్॥

ప్రణవము నుండియే బ్రహ్మ, హరి, రుద్రుడు ప్రభవించుచున్నారు. ప్రణవమే పరబ్రహ్మము.
ప్రణవమే సమస్తమునకు **పర (లేక) కేవల స్వరూపము.**
(ప్రణవమే ఈ జీవుని సమగ్ర - సహజ - వాస్తవ స్వస్వరూపము).

---

'అ' కారే లీయతే బ్రహ్మ హి।
'ఉ' కారే లీయతే హరిః।
'మ' కారే లీయతే రుద్రః।
ప్రణవో హి ప్రకాశతే।

'అ' కారమునందు బ్రహ్మ లీనమగుచున్నారు.
'ఉ'కారము నందు హరి లీనమగుచున్నారు.
'మ'కారమునందు రుద్రుడు లీనమగుచున్నారు.
ప్రణవమే సర్వత్రా ప్రకాశమానమైయున్నది. (అది ఎందులోను లీనము కానట్టిది).

---

జ్ఞానినామ్ ఊర్ధ్వభాగో అభూత్।
అజ్ఞానే స్యాత్ అధోముఖః।
ఏవం వై ప్రణవః తిష్ఠేత్-
యస్తం(యః తం) వేద, స వేదవిత్॥

అట్టి ప్రణవమే ఆత్మజ్ఞానులకు ఊర్ధ్వభాగమునందు, (ఆత్మగాను), అజ్ఞానులకు అధోముఖంగాను (జగద్దృశ్యముగాను) అనుభవమగుచున్నది.
పరము, ఇహముగా - ఉభయముగా ఉన్నది ప్రణవమే. అట్టి ప్రణవము గురించి ఎరిగినవాడే వేదవేత్త. వేదములను ఎరిగినవాడు.

---

**18.** అనాహత స్వరూపేణ జ్ఞానినాం
ఊర్ధ్వగో భవేత్। తైలధారాం ఇవ
అ(వి)చ్ఛిన్నం దీర్ఘఘంటా నినాదవత్;
ప్రణవస్య ధ్వనిః తద్వత్
తత్ అగ్రం 'బ్రహ్మ' చ ఉచ్యతే ॥

**జ్ఞానుల ఆత్మీయ దృష్టి:**

జ్ఞానుల దృష్టి అనునిత్య స్వానుభవము - అనాహత స్వరూపముగా ఊర్ధ్వగతమై ఉంటోంది.
అవిచ్ఛినమగు తైలధార వలె, దీర్ఘంగా మ్రోగేగంట యొక్క నినాదమువలె, సుదీర్ఘ ప్రణవనాదమువలె, జ్ఞానులయొక్క బ్రాహ్మీదృష్టి, బ్రాహ్మీ అనుభూతి -సర్వదా, సర్వత్రా, సర్వ స్థితిగతులందు కొనసాగునదై ఉంటోంది.

---

జ్యోతిర్మయం ("జ్యోతిః"మయం) తత్ అగ్రంస్యాత్
అవాచ్యం బుద్ధి సూక్ష్మతః ।
దదృశుః యే (దదృశుర్యే) మహాత్మానో, యః తం వేద
స వేదవిత్ (యస్తం వేద స వేదవిత్।)॥

**అగ్రమున బ్రహ్మము ప్రకాశమానమైయున్నది.** అగ్రము-జ్యోతిర్మయము. అవాచ్యము. సూక్ష్మమగు బుద్ధికి అనుభవమగునది. తత్ బుద్ధికి అనుభవైక వేద్యము. ఏ మహాత్ముడు అట్టి పరబ్రహ్మమును బాహ్య - అభ్యంతరములలో అవిచ్ఛిన్నంగా అనుక్షణికంగా దర్శిస్తూ ఉంటాడో, అట్టివాడే వేదవేద్యుడు. వేదవేత్త. విదిత వేద్యుడు.

జాగ్రత్ నేత్రద్వయోః మధ్యే
"హంస" ఏవ ప్రకాశతే।
'స' కారః ఖేచరీ ప్రోక్తః, 'త్వం' పదం చ ఇతి నిశ్చితమ్।
'హ' కారః పరమేశః స్యాత్ -
'తత్' పదం చ ఇతి నిశ్చితమ్।
'స' కారో ధ్యాయతే జంతుః
'హ' కారో హి భవేత్ ధ్రువమ్॥

జాగ్రత్ అవస్థలో భ్రుకుటిప్రదేశములో, రెండునేత్రముల మధ్యగా (ఇహ-పర స్వరూపి అగు) 'హంస' ప్రకాశమానమైఉన్నది.

'స' కారమును-ఖేచరి! 'స' కార ఆకాశంలో 'త్వమ్' పదము.

'హ' కారము - పరమేశ్వరుడు! 'హ' కార ఆకాశంలో 'తత్' పదము.

**'హంస' అన్నప్పుడు 'త్వమ్-తత్' గూఢార్థము. నిశ్చయార్థము.**

'స' (సత్) కారమును ధ్యానము చేస్తూ జీవుడు 'తత్' రూపమగు 'హ'కార రూప పరబ్రహ్మమును 'స' కార బ్రహ్మముగా ధ్రువము చేసుకొనుచున్నాడు.

---

**19.** ఇంద్రియైః బధ్యతే జీవ।
ఆత్మా చ ఏవ న బధ్యతే॥
మమత్వేన భవేత్ జీవో।
నిర్మమత్వేన కేవలః॥

ఈజీవుడు → ఇంద్రియముల భావనచే బంధము పొందుచున్నాడు.
→ 'ఆత్మ' భావనచేత విముక్తుడు (బంధరహితుడు) అగుచున్నాడు.

**'కైవల్యము'నకు త్రోవ**

'నాది' అను మమత్వముచే జీవుడు అగుచున్నాడు. నిర్మమత్వముచే (సర్వము తత్ పురుషునికి చెందినదిగా దర్శించుటచే) **కేవలాత్మానంద స్వరూపుడగుచున్నాడు. కేవలుడగుచున్నాడు. (ఇదియే కైవల్యము).**

---

భూః భువః సువః (స్వః) ఇమే లోకాః।
సోమ సూర్య అగ్ని దేవతాః।
యస్య మాత్రాసు తిష్ఠంతి,
తత్ పరంజ్యోతిః – 'ఓం' ఇతి।

'ఓం' అనుసంజ్ఞార్థమగు పరమాత్మయొక్క మాత్రలే(అంశలే) భూ, భువర్ సువర్ లోకములు. సోమ సూర్య అగ్ని దేవతలు. **తత్‌పరం జ్యోతి యొక్క ప్రదర్శనమే అవన్నీ కూడా!** ***(ఇవి = మనో-బుద్ధి-చిత్త ప్రదర్శనములుగా కూడా చెప్పబడుచున్నాయి).***

క్రియా ఇచ్ఛా తథా జ్ఞానం – బ్రాహ్మీ రౌద్రీ చ వైష్ణవీ।
త్రిధా మాత్రా స్థితిః యత్ర,
తత్ "పరంజ్యోతిః ఓం" ఇతి।
వచసా తత్ జపేత్ నిత్యం।
వపుషా తత్ సమ్ అభ్యసేత్ (సమభ్యసేత్)॥

క్రియా ఇచ్ఛా జ్ఞానములు, వాటి అధిదేవతలగు బ్రాహ్మి (సరస్వతి), రౌద్రీ (పార్వతి) వైష్ణవి (లక్ష్మి).. ఇవన్నీ కూడా ఎద్దానియందు మాత్రలుగా సంస్థితమైయున్నాయో... అదియే పరంజ్యోతి స్వరూపమగు **'ఓం'.**

వాక్కుతో 'ఓం' అని ధ్యానిస్తూ, మనోవాక్కులచే ఎలుగెత్తి పలుకుచూ, బుద్ధితో సమస్తముగా విస్తరణము అగుచున్న పరతత్త్వమును ఉపాసించాలి. అభ్యసించాలి.

---

**20.** మనసా తత్ జపేత్ నిత్యం
"తత్ పరంజ్యోతిః ఓం" – ఇతి॥
శుచిర్వాపి ('శుచిః వా అపి), అశుచిః వా అపి,
యో జపేత్ ప్రణవం సదా, స న లిప్యతి
పాపేన, పద్మపత్రమ్ ఇవ అంభసా॥

మనస్సుతో నిత్యము జ్యోతికే జ్యోతి అయి ఉన్న **"పరంజ్యోతి"**ని అనునిత్యంగా అనుక్షణికంగా జపించాలి. **'ఓం'**ను ధ్యానించాలి.

శుచిఅయినా, అశుచి అయినా కూడా ఎవ్వరైతే అట్టి ప్రణవమును అర్థపూర్వకంగా సదా జపిస్తారో, అట్టివారు- పద్మపత్రము జలముచే స్పృశించబడని విధంగా కర్మల దోషములచే స్పృశించబడరు.

చలే వాతే, → చలో బిందుః।
నిశ్చలే నిశ్చలో భవేత్ । యోగీ స్థాణుత్వం
ఆప్నోతి తతో వాయుం నిరుంధయేత్॥

వాయువు చలిస్తూ ఉంటే బిందువు (The Concentration) కూడా చలిస్తూ ఉంటుంది. వాయువు నిశ్చలము పొందితే బిందువు కూడా నిశ్చలమవ గలదు. యోగి వాయు నిరోధన యోగాభ్యాసముచే స్థాణుత్వము పొందు చున్నాడు. (ప్రాణ కదలికలచే చిత్తము కదలికలు పొందుతుంది. ప్రాణ నిశ్చలతచే చిత్తము నిశ్చలమవగలదు).

---

యావత్ వాయుః స్థిరో – దేహే,
తావత్ జీవో న ముంచతి। మరణం తస్య
నిష్క్రాంతిః, తతో వాయుం నిరుంధయేత్।
యావత్ బద్ధో మరుత్ దేహే, తావత్ జీవో న ముంచతి।
యావత్ దృష్టిః భ్రువోః మధ్యే, తావత్ కాలం భయం కుతః?

ప్రాణ నిశ్చలతచే చిత్తము కూడా నిశ్చలమౌతుంది. వాయువు ఎంతవరకైతే దేహములో స్థిరముగా ఉంటుందో, అంతవరకు ఈ జీవునికి మరణము ఉండదు. విషయములలో మునగడు. నిష్క్రాంతి (తేజోరాహిత్యము) ఉండదు. అందుచేత వాయు నిరోధ - అభ్యాసముచేయాలి. దేహములో వాయువు బద్ధమైనంతవరకు జీవుడు దేహభావములో మునుగడు.

భ్రూమధ్యగా ఆకాశములో దృష్టిని నిలుపుచున్నంత వరకు ఆయోగికి కాలముచే వచ్చిపోయే మార్పు - చేర్పులచే భయము ఏముంటుంది? ఉండదు. (ఆతని సమక్షంలో దేహములు వస్తూ, పోతూ ఉంటాయి).

అల్పకాల భయాత్ బ్రహ్మా ప్రాణాయామ పరో భవేత్।
యోగినో మునయశ్చ ఏవ
తతః ప్రాణం నిరుంధయేత్।
షట్ వింశత్ (26) అంగులీ హంసః
ప్రయాణం కురుతే బహిః॥

సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు కూడా అవాంతర ప్రళయమువంటి ఆయా - ప్రళయ కాలభయముల సందర్భంలో ప్రాణాయామపరుడై ఉంటారు.

అందుచేత మునులు, యోగులు సంసార భయము దృష్ట్యా పాణనిరోధ - అభ్యాసులు అయి ఉంటున్నారు.

హంస (శ్వాస) బయట 26 అంగులముల దూరము ప్రయాణం చేసి వస్తూ ఉంటుంది.

---

**21.** వామ దక్షిణ మార్గేణ ప్రాణాయామో విధీయతే।
శుద్ధిం ఏతి యదా సర్వం నాడీచక్రం మలాకులమ్।
తదైవ జాయతే యోగీ ప్రాణ సంగ్రహణ క్షమః
బద్ధ పద్మాసనో యోగీ ప్రాణం చంద్రేణ పూరయేత్।
ధారయేత్ వా యథాశక్త్యా భూయః సూర్యేణ రేచయేత్॥

ఎడమ (ఇడ) - కుడి (పింగళ) నాడీమార్గములలో "ప్రాణాయామ ప్రక్రియ" నిర్వహణ జరుగుచూ ఉన్నది.

మలాకులమైనట్టి సర్వనాడీ చక్రము పరిశుద్ధమయినప్పుడే యోగి ప్రాణ సంగ్రహణమునకు, (ప్రాణధారణ, జయములకు) సమర్ధుడగుచున్నాడు.

యోగాభ్యాసి పద్మాసనమును ధరించి, ఇకప్పుడు చంద్రనాడి (ఇడనాడి)లో ప్రాణమును (వాయువును) పూరించాలి. శక్తికొలది ధారణ చేసి (కుంభకమును చేసి) సూర్యనాడి ద్వారా రేచకము (పింగళానాడి ద్వారా వదలటము) చేయాలి.

---

అమృత-ఉదధి సంకాశం, గోక్షీర ధవళ
ఉపమమ్, - ధ్యాత్వా చాంద్రమసం
బింబం ప్రాణాయామే సుఖీ భవేత్॥

ఆ విధంగా ప్రాణాయామము చేయుచూ ఉన్నప్పుడు - అమృత సముద్రముతోను, ఆవుపాలతోను సమానమైన - **తెల్లటి పూర్ణచంద్ర బింబమును** భావన చేస్తూ, ధ్యానము చేస్తూ ఉండగా, అట్టి యోగి సుఖవంతుడు కాగలడు.

---

**22.** స్ఫురత్ ప్రజ్వలనం జ్వాలా
పూజ్యమ్ ఆదిత్య మండలమ్
ధ్యాత్వా హృది స్థితం యోగీ
ప్రాణాయామే సుఖీ భవేత్॥

అట్లాగే, ప్రాణాయామము చేస్తూ ఉన్నప్పుడు :

**- ప్రకాశించు ప్రజ్వలన జ్వాల కలిగినట్టిది, జ్వాలచే పూరణమైది-**

అగు **'ఆదిత్యమండలము'**ను హృదయములో ధ్యానము చేస్తూ ఉంటే కూడా అట్టి ప్రాణాయామము సుఖవంతము కాగలదు.

---

ప్రాణం చేత్ ఇడయా పిబేత్,
నియమితం భూయో అన్యయా
రేచయేత్। పీత్వా పింగళయా
సమీరణం అధో బధ్వా, త్యజేత్ వా యయా।

నియమితంగా (In a Systematic Procedure and Timing) ప్రాణమును ఇడానాడిచే త్రాగుచూ, కుంభకము చేసి పింగళానాడి ద్వారా విడవాలి. ఈవిధంగా వాయువును బంధించటము, విడువటము నిర్వర్తించాలి.

---

(యయా) సూర్యా చంద్రమసోః
అనేన విధినా బిందు ద్వయం ధ్యాయతః।
శుద్ధా నాడి గణా భవంతి యమినో, మాస ద్వయాత్ ఊర్ధ్వతః॥
యథా ఇష్ట ధారణం వాయోః అనలస్య
ప్రదీపనమ్, నాభీ వ్యక్తకర ఆరోగ్యం జాయతే నాడిశోధనాత్॥

ఈ విధానంగా సూర్య-చంద్రుల యొక్క బిందు ద్వయమును ధ్యానం చేస్తూ ఉండగా రెండు నెలలు దాటేసరికి **నాడీగణమంతా పరిశుద్ధమగుచున్నది.** ఇష్టము అయినంత కాలము ప్రాణధారణ చేయటమువలన (1) అనలమును (అగ్నిని) ప్రదీపనము చేయుటము (2) నాడీశోధనము

ఈ రెండు ప్రయోజనములు సిద్ధించగలవు.

---

**23.** ప్రాణో యావత్‌స్థితో దేహే
అపానం తు నిరోధయేత్।
ఏక శ్వాసమయీ మాత్రా
ఊర్ధ్వ అధో-గగనే స్థితిః।
రేచకః పూరకః చ ఏవ (పూరకశ్చైవ)
కుంభకః ప్రణవాత్మకః॥

ఎంతెంతవరకు ప్రాణము స్థితింపజేయుబడుచున్నదో, అంత సమయము అపానము యొక్క అధోగమనమును నిరోధించబడుచూ కూడా నిర్వర్తించబడుచున్నది.

మాత్ర= ఒకసారి గాలిని పీల్చి, వెంటనే బయటకు వదలునంతటి సమయము-ఊర్ధ్వ-అధోగమనయాన సమయము.

(1)రేచకము (2) పూరకము, (3) కుంభకము. ఈ '3' కూడా ప్రణవాత్మకమైనవి. అంతేగాని కేవలం వాయు 'ఆత్మకమైనవి, దేహాత్మకమైనవి-కావు. "కేవలాత్మకమైనవి" - అని యోగాభ్యాసి ఏమరువకుండా, గుర్తుపెట్టుకొని ఉండాలి. (మనో మనాత్మకమైనవి).

| | |
|---|---|
| ప్రాణాయామో భవేత్ ఏవం<br>మాత్రా ద్వాదశ(12) సంయుతః।<br>మాత్రా ద్వాదశ సంయుక్తౌ దివాకర నిశాకరౌ।<br>దోషజాలం అబధ్నంతౌ<br>జ్ఞాతవ్యౌ యోగిభిః సదా॥ | ఈవిధంగా ప్రాణాయామము :<br>**పూరకము** ఇడాపూరకం-12 మాత్రలు<br>పింగళా పూరకం - 12 మాత్రలు<br>పూరకములు ఉభయము (ఇడ,పింగళ)<br>12 మాత్రల కాలము నిర్వర్తించటం చేత లభించు బంధరాహిత్యమును యోగిపుంగవులు ఎరిగి ప్రకటించుచున్నారు. |
| పూరకం ద్వాదశం(12) కుర్యాత్।<br>కుంభకం షోడశం(16) భవేత్।<br>రేచకం దశ (10) చ ఓంకారః<br>"ప్రాణాయామః" స ఉచ్యతే॥ | పూరకము = 12 ఓంకారములు (లేక 'మాత్రలు')<br>కుంభకము = 16 ఓంకారములు<br>రేచకము = 10 ఓంకారములు<br>ఇది ఒక ప్రాణాయామము. (మాత్ర = 1 'ఓం'కారము) |
| అధమే ద్వాదశ మాత్రా। (12)<br>మధ్యమే ద్విగుణా (x 2) మాత్రా। (24)<br>ఉత్తమే త్రిగుణా (x 3) ప్రోక్తా - (36)<br>"ప్రాణాయామస్య" నిర్ణయః | **ప్రాణాయామ కాలము (కుంభక కాలము)** :<br>అధముగా 12 మాత్రలు<br>మధ్యమముగా 12 × 2 = 24 మాత్రలు<br>ఉత్తమముగా = 12×3= మాత్రలు<br>ఇది ప్రాణాయామ నిర్ణయము<br>మొదట 12 మాత్రలతో ప్రారంభమై '36' మాత్రల కాలమునకు అభ్యాసవశంగా విస్తరణమౌతూ వస్తుంది. |
| అధమే స్వేద జననం।<br>కంపో భవతి మధ్యమే।<br>ఉత్తమే స్థానం ఆప్నోతి<br>తతో వాయుం నిరుంధయేత్॥ | **ప్రాణయామకాలంలో శరీరంలో కనిపించే విశేషాలు** : -<br>మొదట (అధమము)-చెమట పుట్టడము<br>తరువాత (మధ్యమము)-కంపము<br>ఉత్తరోత్తర- **" స్థాన నిశ్చలత్వము"**. (చాంచల్యము తొలగటము)<br>→ అటుపై వాయు నిశ్చలము క్రమబద్ధముగా జరుగగలదు. |
| 24. బద్ధ పద్మాసనో యోగీ,<br>నమస్కృత్య గురుం శివమ్,<br>నాసాగ్ర దృష్టిః ఏకాకీ<br>ప్రాణాయామం సమభ్యసేత్॥ | **యోగాభ్యాసము**<br>- పద్మాసనము ధరించి,<br>-గురుదేవుల వారికి, శివభగవానునికి నమస్కరించి,<br>- ఏకాకి అయి (ఏకాంత స్థానములో),<br>- ముక్కుకుపైభాగమున (నాసాగ్రముగా) దృష్టిని ఏకాగ్రం చేసి,<br>-ప్రాణాయామమును చక్కగా అభ్యసించాలి. |
| ద్వారాణాం నవ సంనిరుధ్య మరుతం<br>బధ్వా ధృఢాం ధారణాం,<br>నీత్వా కాలం అపాన వహ్ని సహితం<br>శక్త్యా సమం చాలితమ్॥<br>ఆత్మ ధ్యానయుతస్తు అనేన విధినా<br>విన్యస్య మూర్ధ్ని స్థిరం, -<br>యావత్ తిష్ఠతి, తావత్ ఏవ-మహతాం,<br>సంగో న సంస్తూయతే॥ | - దేహములోని నవద్వారములను **నిశ్చలప్రాణాభ్యాసము**తో నిరోధించి,<br>- వాయువును ధృఢముగా **ధారణ చేస్తూ,**<br>- అపాన వాయువును (బయటకు వెళ్ళుచున్న వాయువును)శక్తితో **వెనుకకు మరల్చి, కాలమునకు సాక్షి అయి,** (కాలమును ఆరీతిగా జయించి),<br>-శిరస్సును నితారుగా ధారణ చేసి,<br>- ఆత్మ ధ్యానతత్పరుడై ఎంతవరకు యోగాభ్యాసి అయి ఉంటాడో, ఆత్మకు అన్యమైనదేదీ సంస్తుతింపనివాడై ఉంటాడో, - అంతంతవరకు **మహదత్వమగు కేవలాత్మతో సంగము పొందుచున్నాడు.**<br>**దృశ్యముతో సంగము తిరస్కరించువాడై ఉంటున్నాడు.** |

**25.** ప్రాణాయామో భవేత్ ఏవం
పాతక ఇంధన పావకః।
భవ ఉదధి మహాసేతుః।
→ ప్రోచ్యతే యోగిభిః సదా॥

ఈవిధంగా ప్రాణాయామము గురించి →
'పాతకములు' అనే ఇంధనమునకు అగ్నివంటిదని, భవసాగరమునకు గొప్ప వంతెన వంటిదని - యోగిపుంగవుల ఆత్మహిత, ఆత్మతత్త్వ వాక్యములుగా ప్రకటించుచున్నారు.

---

ఆసనేన రుజం హంతి।
ప్రాణాయామేన పాతకమ్।
వికారం మానసం యోగీ
ప్రత్యాహారేణ ముంచతి॥

యోగాభ్యాసి →
→ 'ఆసనము'చే దేహరోగములను శమింపజేసుకొనుచున్నాడు.
→ 'ప్రాణాయామము'చే ఇతఃపూర్వపు పాతకములను శుద్ధి చేసుకొనుచున్నాడు.
→ప్రత్యాహారముచే మానసిక వికారములను, రుగ్మతలను తొలగించుకొనుచున్నాడు.

---

ధారణాభిః మనోధైర్యం
యాతి చైతన్యం అద్భుతమ్।
సమాధౌ మోక్షం ఆప్నోతి,
త్యక్త్వా కర్మ శుభాశుభమ్॥

- ధారణచే మనోధైర్యమును సిద్ధించుకొనుచున్నాడు. అద్భుతమగు చైతన్యముతో స్వభావసిద్ధుడగుచున్నాడు. 'సమాధి'యొక్క అభ్యాసముచే కర్మలకు సంబంధించిన శుభాశుభఫలముల పరిధిని దాటి **'మోక్షము'** సిద్ధించుకొనుచున్నాడు.
సర్వత్రా స్వస్వరూపానందరూపమగు సమాధియే సమస్తమునకు పరాకాష్ఠ.

---

ప్రాణాయామ - ద్విషట్కేన (2×6=12)
"ప్రత్యాహారః" ప్రకీర్తితః। ప్రత్యాహార
ద్విషట్కేన (2×6=12) జాయతే "ధారణా" శుభా॥

2×6=12 → ప్రాణాయమములు ఒక **'ప్రత్యాహారము'** అని పరికీర్తింప బడుతోంది. ప్రత్యాహారములు (2×6=12) చే **'ధారణ'** అగుచున్నది. (12 ప్రత్యాహారములు = ఒక ధారణ)

---

**26.** ధారణా ద్వాదశ (12) ప్రోక్తం
"ధ్యానం" యోగ విశారదైః॥
ధ్యాన ద్వాదశకేనైవ (12)
"సమాధిః" అభిధీయతే।
యత్ సమాధౌ పరంజ్యోతిః - అనంతం
విశ్వతోముఖమ్, తస్మిన్ దృష్టే
క్రియా కర్మ యాత- అయాతో న విద్యతే॥

12 ధారణములు - ఒక **'ధ్యానము'** అగుచున్నది - అని యోగ విశారదులు చెప్పుచున్నారు.

12 ధ్యానములు - **'సమాధి'** అనబడుచున్నది.

'సమాధి' యందు - **పరంజ్యోతి స్వరూపము** (సర్వజ్యోతిలలో సమరూపమగు తేజోరూపము), **అనంత విశ్వములను తన ముఖముగా కలిగియున్నది,** అగు-ఏ కేవల పరబ్రహ్మము స్వస్వరూపముగా స్వానుభవమవుచున్నదో, .. అద్దాని దర్శనముచే క్రియ-కర్మల రాకపోకల యొక్క పరిమితులు దాటివేయబడుచున్నాయి.

---

సంబద్ధాసన మేఢ్రం అంఘ్రియుగళం
కర్ణ అక్షి నాసాపుట ద్వారాన్
అంగుళిభిః-నియమ్యపవనం,
వక్త్రేణ వా పూరితమ్।
బధ్వా వక్షసి బహు అపాన (బహ్వపాన) సహితం
మూర్ధ్నిస్థితం ధారయేత్॥

సంబద్ధాసనముగా **పద్మాసనము (లేక) సుఖాసనము** ధారణ చేసి...,
- మేఢ్రమును (గుహ్యమునకు క్రిందస్థానము) రెండు పాదములను తాకించి
- చెవులు, కళ్ళు, ముక్కుపుటముల ద్వారములను (స్వాభావకుంభకంగా) నియమించి
- నోటితో వాయువును పూరించి,
- వక్షస్థలమును (రొమ్ము ప్రదేశమును) కుంభక వాయువుతో బంధించి,
- బహు అపానసహితంగా మూర్ధ్ని స్థానమునందు (In the foreface) ప్రాణము ధారణ చేయబడుటచే - ప్రాణముతోబాటే మనోబుద్ధులు నిశ్చలము కాగలవు.

---

ఏవం యాతి విశేష తత్త్వ సమతాం
యోగీశ్వరః తన్మయః।
గగనం పవనే ప్రాప్తే ధ్వనిః ఉత్పద్యతే మహాన్।
ఘంటాదీనాం ప్రవాద్యానాం నాదసిద్ధిః ఉదీరితా।
ప్రాణాయామేన యుక్తేన సర్వరోగ క్షయో భవేత్॥

ఈ విధంగా యోగాభ్యాసము చేయుచున్న యోగి అఖండ - ఏకత్వమును పొందుచున్నాడు. తత్త్వ సమత్వమును పొంది, యోగీశ్వరుడై ఆత్మత్వము సిద్ధించుకొంటున్నాడు. తన్మయుడగుచున్నాడు.

వాయువు శిరో ఆకాశమును పొందగానే మహాన్ధ్వని జనిస్తున్నది. అది గంటానాదము వంటిది. అట్టి యుక్తమగు ప్రాణాయామముచే సర్వరోగములు క్షయించుచున్నాయి.

| | |
|---|---|
| ప్రాణాయామ వియుక్తేభ్యః సర్వరోగ సముద్భవః।<br>హిక్కా కాసః తథా శ్వాసః శిరః కర్ణ అక్షి వేదనాః<br>భవంతి వివిధా రోగాః<br>పవన వ్యత్యయ క్రమాత్। | ప్రాణాయామము యొక్క అభ్యాసము లేకపోవుటచేతనే దేహములో అనేక రోగములు ఉద్భవించటము జరుగుతోంది.<br>హిక్కలు (ఎక్కిళ్ళు), కాసలు (గొంతుజీరలు), శ్వాస సమస్యలు, చెవుల-కళ్ళ వేదనములు, తలనొప్పి, పార్శ్వంనొప్పి మొదలైన అనేక రోగములు శరీరములో వాయుచలనము యొక్క అసంబద్ధతచేతనే జరుగుచున్నాయి. |
| యథా సింహో గజో వ్యాఘ్రో<br>భవేత్ వశ్యః శనైః శనైః,<br>తథా ఏవ (తథైవ)<br>సేవితో వాయుః।<br>అన్యథా హంతి సాధకమ్।। | ఏవిధంగా అయితే నెమ్మది నెమ్మది అభ్యాస పద్ధతులచే సింహము, ఏనుగు, పులి మొదలైనవి మానవులకు వశమై ప్రవర్తిస్తున్నాయో, అదేవిధంగా ప్రాణాయోగాభ్యాసికి వాయువు, వాయు సంచలనమునకు ఆవలి ప్రాణశక్తి గూడా వశమగుచున్నాయి.<br>వాయువు వశము కానప్పుడు (సాధన లేనప్పుడు) ఆ వాయువే ఈ జీవునిపట్ల అనేక హతములకు కారణము అగుచున్నది. |
| **27.** యుక్తం యుక్తం త్యజేత్ వాయుం,<br>యుక్తం యుక్తం ప్రపూరయేత్।<br>యుక్తం యుక్తం ప్రబధ్నీయాత్<br>ఏవం సిద్ధిమ్ అవాప్నుయాత్। | ఒక పద్ధతిగా, ప్రశాంతంగా, (ఆవేశం లేకుండా, మరీ వేగంగా కాకుండా) సమయమును పాటిస్తూ, వాయువును **"రేచకము (వదలటము), పూరకము (నింపటము), కుంభకము (నింపటము), పునః రేచకము"** చేయుటచే అది 'సిద్ధి'కి దారితీయగలదు. సహజ కుంభక సిద్ధించే చిత్తము 'చిత్'తో ఏకమవగలదు. |
| చరతాం చక్షుః ఆదీనాం<br>విషయేషు యథాక్రమమ్,<br>తత్ ప్రత్యాహరణం తేషాం<br>"ప్రత్యాహారః" స ఉచ్యతే। | విషయముల నుండి కళ్ళు, చెవులు, నోరు మొదలైన ఇంద్రియములను ఒక క్రమపద్ధతిగా వెనుకకు మరలి, ఆత్మ ధ్యాసకలిగి ఉండటమే **"ప్రత్యాహారము"** అగుచున్నది. |
| యథా తృతీయ కాలేతు<br>రవిః ప్రత్యాహరేత్ ప్రభామ్,<br>తృతీయ అంగ స్థితో యోగీ<br>వికారం మానసం హరేత్।। | సూర్యుడు తృతీయ కాలంలో (సాయంకాలము) తనయొక్క **"వస్తువులపై కాంతి ప్రసరణము" అను ప్రక్రియను** వెనుకకు మరల్చుకొనువిధంగా, యోగి కూడా **"తృతీయాంగస్థితుడు"** - అయి తన మనస్సు యొక్క వికారములన్నీ క్రమంగా వెనుకకు మరల్చి వేయుచున్నాడు.<br>క్రమంగా సమస్తమైన అన్యానుభవములను ఆత్మయందు **'అనన్యము'**గా చేసి వేయుచున్నాడు. |
| ***యోగ చూడామణ్యుపనిషత్ సమాప్తా।।***<br>***ఓం శాంతిః। శాంతిః। శాంతిః*** | ***ఇతి యోగ చూడామణ్యుపనిషత్ సమాప్తా।।***<br>***ఓం శాంతిః। శాంతిః। శాంతిః*** |

సామవేదాంతర్గత

# 11 యోగచూడామణ్యుపనిషత్

## అధ్యయన పుష్పము

*(ఇందులోని విశేష యోగాభ్యాస విశేషములు గురుముఖతః నేర్చుకొనబడును*



*'మూలాధారము' మొదలైన షట్ చక్రములలోను, కపాలమునకు ఊర్ధ్వముగా గల బ్రహ్మ రంధ్రమును దాటి, ఉపరిగా సహస్రారము వరకు కూడా ఆక్రమించి ఉన్నట్టిది, యోగ-జ్ఞానముల అంతిమసారము అయినట్టి - ఆత్మారాముని ధ్యానము చేయుచున్నాము.*

## తత్త్వజ్ఞాన సంపన్నులగు గురువర్యులవారి ప్రవచనము

కేవలాత్మానంద - సహజానంద- బ్రహ్మానంద స్వరూపులు, **"బ్రహ్మతత్త్వ" అధ్యయనులు అగు ప్రియశిష్యులారా! శ్రోతలారా!**

ఈరోజు మనము యోగులకు హితకామ్యము అగు "యోగచూడామణి" అనే పాఠ్యాంశమును చెప్పుకొంటున్నాము. ఇది యోగవేత్తలచే రహస్యముగా సేవించబడుచూ **"కైవల్యసిద్ధి"** ప్రసాదించునదిగా యోగ-తత్త్వ శాస్త్రవాఙ్మయములో సుప్రసిద్ధము.

### షట్ యోగాంగములు

(1) ఆసనము (2) ప్రాణసంరోధము (ప్రాణాయామము) (3) ప్రత్యాహారము (4) ధారణ (5) ధ్యానము (6) సమాధి - ఇవి యోగాభ్యాసమునకై ఆరు అంగములు అయి ఉన్నాయి.

**యోగాభ్యాసమునకు సంసిద్ధుడు అగుచున్నవాడు ముందుగా కొన్ని అతిముఖ్యమైన ఈఈ విశేషాలను సశాస్త్రీయంగాను, గురుముఖతఃగా సుస్పష్టంగా ఎరిగినవాడై ఉండాలి.**

### మహదాశయము

**సిద్ధాసనము - అంతరార్థము :** "యోగాభ్యాసముచే నేను సిద్ధించుకోవలసినదిగా ఏదై ఉన్నది?".. అనునది సుస్పష్టపరచుకోవాలి. **"ఈ దృశ్యము, జాగ్రత్ స్వప్న సుషుప్తులు, దేహముల రాకపోకలు, లోకవ్యవహారములు - ఇవన్నీ క్రీడగా, లీలగా సిద్ధింపజేసుకొనుచున్న ఆత్మయే నాయొక్క సహజ స్వరూపము, స్వభావము కదా!"** - అనునది అనునిత్యంగా స్వాభావికం కావటమే సిద్ధాసన తత్త్వార్థము. ఇట్టి మహదాశయమును జ్ఞాపకముగా పదిలపరచుకోవాలి. **"భూతకాశ-చిత్తాకాశములకులకు ఆవల చిదాకాశ స్వరూపుడను కదా!" - అను స్వాభావికానుభవమే నాయొక్క ముఖ్యాశయము"..** అను అవగాహనను సుస్పష్టీకరించుకొని ఉండటమే **సిద్ధాసనము యొక్క పరమార్థముగా ఆధ్యాత్మిక నిర్వచనము.**

జాగ్రత్ స్వప్న సుషుప్తులు ఆత్మస్వరూపుడుగా నేనే సిద్ధించుకొనుచున్నాను" అను ఆసీన స్థితియే సిద్ధాసనము.

**కమలాసనము :** బుద్ధియొక్క మహత్తర అవగాహన కొరకు, మనస్సు యొక్క నిశ్చలత కొరకు - **"పద్మాసనము"** ధారణ చేయుటము - శుభప్రదమగు అభ్యాసము. యోగాభ్యాసమునకై ఇష్టమైన ఆసనము ఆశ్రయించబడు గాక।

**(3) షట్ చక్రములు :** ఈ భౌతిక మానవ దేహముతో ఆరు(6) ప్రదేశములు. "శక్తి కేంద్రీకృత – శక్తి ప్రసరణ" స్థానములు. అవి వెన్నెముక యందు/ వెన్నెముకను ఆశ్రయించి ఉన్నాయి. ఇవన్నీ యోగవిద్యాప్రావీణ్యులచే శాస్త్రీకరించబడి చెప్పబడుచున్నాయి.

## షట్చక్రములు

**యోగదండము**




**(1) మూలాధార చక్రము :** గుదస్థానము : **పృథివి.** 4 దళములు.

**(2) స్వాధిష్ఠానచక్రము :** పొత్తికడుపు – **జలము.** మేఢ్రము. 6 దళములు.

**(3) మణిపూరక చక్రము :** బొడ్డు ప్రదేశము. **అగ్ని.** 10 దళములు.

**(4) అనాహత చక్రము:** హృదయ ప్రదేశము. **వాయువు.** 12 దళములు.

**(5) విశుద్ధచక్రము:** కంఠ ప్రదేశము. **ఆకాశము.** 16 దళములు.

**(6) ఆజ్ఞాచక్రము :** భృకుటి ప్రదేశము. **మహాప్రకృతి.** 2 దళములు.

(తదితర ఉపనిషత్తుల నుండి ఇక్కడ సూచనగా కొంచెముగా చెప్పుకోబడుచున్నది)

ఈ షట్చక్రముల గురించి యోగాభ్యాసి శ్రద్ధగా శ్రవణము, అధ్యయనము చేయటము ఆవస్యకము. వాటి వాటియందు బుద్ధిని, ధ్యాసను నిలిపి ఉంచటము **"షట్చక్రోపాసన"**.

**(4) షోడశాధారము :** పంచప్రాణములకు, పంచ జ్ఞానేంద్రియములకు, పంచ కర్మేంద్రియములకు అనుభవి అగు జీవాత్మకు – కారణమగుచున్నట్టిది. (ఇంకా కూడా) – **జీవునికి** ఆధారమైయున్నట్టిది. ప్రేరణ రూపమైయున్నట్టిది. అటువంటి కారణకారణమైయున్నట్టిదగు **"ఆత్మ"** యొక్క ఉనికిని ***గమనించటము.***

**(5) త్రిలక్ష్యము :** జాగ్రత్–స్వప్న–సుషుప్తులను లక్షణముగా యుండి, (లక్ష్యరూపమై) సంచార ప్రదర్శనముగా కలిగియున్న "ఆత్మ" యొక్క గమనిక.

**(6) వ్యోమ పంచకము :** ప్రాణ అపాన సమాన ఉదాన అపాన వాయు ప్రవర్తనముల (కదలికల)కు ఆవలగల "కదలించుతత్త్వము" – యొక్క గమనిక.

ఇవన్నీ కూడా స్వదేహములోని ఆయా ఆయా పరిశీలనార్థమైన విశేషములు.

**స్వదేహే యో న జానాతి, తస్య సిద్ధిః కథమ్ భవేత్?** ఇవన్నీ ఎవ్వడు స్వదేహమునందే గమనించడో అట్టివానికి సిద్ధి ఎట్లా కలుగుతుంది?

**ఇంకా షట్ చక్రముల గురించిన ఎరుగవలసిన విశేషములు**

(1) మొదటిది – **ఆధార చక్రము**, '4' దళములు (2) రెండవది – **స్వాధిష్ఠాన చక్రము**, '6' దళములు

**ఆ రెండింటి మధ్యగా :** యోని స్థానము. **కామరూపము. కామాఖ్యము.** గుదస్థానము (పురీష విసర్జన స్థానములో 4 దళములు గల పద్మము, **తన్మధ్యే ప్రోచ్యతే యోనిః।** దాని మధ్యగా కామాఖ్యమైనట్టి యోని ఉన్నది.

అట్టి యోని మధ్యగా పశ్చిమంగా (Towards West) ఎడమవైపుగా అభిముఖమై 'మహాలింగము'. అద్దాని నాభియందు మణివంటి బింబము. అట్టి మణిబింబమును ఎరిగినవాడు యోగవేత్త. **నాభే తు మణివత్ బింబమ్ యో జానాతి, స యోగవిత్।**

## స్వాధిష్ఠానము

మేఢ్రమునకు (పురుష లింగమునకు) దిగువగా త్రి–కోణంగా మేలిమి బంగారపు – మెరుపు తీగవలె ప్రకాశించునట్టి తేజస్సు. ఆ తేజస్సు విశ్వతోముఖమైయున్నది. అది విశ్వమంతా నిండి అనంతమైయున్నది. అది సమాధియొక్క సహజ తేజోరూపము.

అద్దాని దర్శనము సమాధియందు సుసాధ్యము. అట్టి దర్శనము మహాయోగము. అద్దానికి **'రావటము, పోవటము'** - అనునదేదీ లేదు. సమస్తమునకు తానే అయి ఉన్న అద్దానికి రాకపోకలు ఎట్లా ఆపాదించగలం? అట్టి స్వాధిష్ఠాన చక్రమును ఉపాసనచే స్వానుభవముగా చేసుకొని అధిష్ఠించువాడు దేహముచే పుట్టడు-చావడు. ఇది మూలాధారమునకు, మేఢ్రము (మాంసపుముద్ద విభాగము)నకు ఉపరిగా స్థానము కలిగియున్నది.

స్వ = స్వశక్తిరూపమగు ప్రాణము. అధిష్ఠానము = ఆక్రమించినదై ఉన్నట్టిది.

ప్రాణమునకు ఆశ్రయము కాబట్టి - స్వాధిష్ఠానము. ఇదియే **'మేఢ్రము'** అని మేఢ్రాంతర్గత తేజస్సు అని కూడా పిలువబడుచున్నది.

**మణిపూరకము : తంతునా మణివత్ ప్రోతో యో అత్ర కందః సుషుమ్నయా, తత్ నాభిమండలే చక్రం ప్రోచ్యతే మణిపూరకమ్॥** నాభిమండలము (బొడ్డు ప్రదేశం)లో - దారముచే 'మణి' వలె-గ్రుచ్చబడి ఉండటం చేత ఇది **'మణిపూరకచక్రము'** - అని పిలువబడుచున్నది. ఈ మణిపూరక చక్రము - ఎక్కడైతే కందము (మాంసపు చతురస్రము), సుషుమ్నా నాడి ఏర్పడి ఉన్నాయో - అట్టి నాభి (బొడ్డు) మండలములో మణివలె ఏర్పడి ఉన్నది. యోగులు ఇది గమనించుచూ అభివర్ణిస్తున్నారు.

## ద్వాదశార మహాచక్ర- అంతరమున భ్రమణము

(స్వతఃగా పుణ్య-పాప ద్వంద్వాతీతుడగు) ఈ జీవుడు 'తత్త్వము' (త్వమ్‌గా కనబడుచున్నది తత్ రూప పరమాత్మయే) అని ఎరుగనంతకాలము ఇక్కడి **"ద్వాదశార మహాచక్రము"**లో పుణ్యపాపములతో (ద్వంద్వములతో) సంబంధము కలిగియుండి - తిరుగాడుతూనే ఉంటాడు.

## నాడులు - నాడీ మహాచక్రము

**ఊర్ధ్వం మేఢ్రాత్, అధో నాభేః కందే యోనిః ఖగాండవత్, -** మేఢ్రమునకు ↑ ఊర్ధ్వంగా.. బొడ్డుకు ↓ క్రిందగా గల 'కందము' నందు పక్షిగ్రుడ్డు ఆకారము వంటి **'యోని'** ఉన్నది. అట్టి ఆ యోని నుండి 72000 నాడులు బయల్వెడలుచూ, దేహమంతా విస్తరించి ఉంటున్నాయి. అందులో 72 నాడులు ప్రధాన నాడులు. (తదితరమైనవి ఉపనాడులు). ఆ 72 నాడులలో- **ప్రాణవాహిన్యో భూయః తాసు దశస్మృతాః॥** వాటిలో ప్రాణశక్తి వాహకములుగా 10 ముఖ్యమైన నాడుల గురించి యోగశాస్త్రము విశదీకరించటం జరుగుతోంది. (మేఢ్రము = మేహనము - మగగురి, మూత్రవిసర్జనము, పురుషలింగము)

(1) ఇడ (2) పింగళ (3) సుషుమ్న (4) గాంధారి (5) హస్తి జిహ్వ (6) పూష (7) యశస్విని (8) అలంబుస (9) కుహు (10) శంఖినీ -

ఈ 10 నాడులతో కూడిన చక్రమును **'నాడీమహాచక్రము'** అంటారు. అట్టి నాడీ మహాచక్రమును యోగి ఎరుగుచున్నాడు. వాటి స్థితి, కార్యనిర్వహణల గురించి సంక్షిప్తంగా వివరించుకుంటున్నాము.

## నాడీ సంస్థితము / నాడీ ద్వారములు

**ఇడ** = శరీర మధ్య భాగపు ఎడమ వైపుగాను, **పింగళ** = కుడివైపుగాను, **సుషుమ్న** = మధ్య ప్రదేశముగాను సంస్థితమై ఉన్నాయి.

**గాంధారి** = ఎడమ కంటిలోను, **హస్తిజిహ్వ** = కుడికంటిలోను, **యశస్విని** = ఎడమ చెవిలోను, **పూష** = కుడిచెవిలోను, **అలంబుస** = ముఖమునందు, **కుహు**=లింగప్రదేశములోను, **శంఖిని** = మూలస్థానమునందు - చిట్ట చివ్వరి ద్వారములుగా కలిగియున్నాయి.

**ఇడ పింగళ సుషుమ్న నాడులు :** పైన చెప్పుకున్న 10 నాడులలో, - ఇడ, పింగళ, సుషుమ్ననాడులు అతి ముఖ్యమైనవి. ఈ మూడు ప్రాణమార్గమున సంస్థితమై ఎల్లప్పుడు ప్రాణవాహిన్యములై (ప్రాణవాహకములుగా) ఉన్నాయి.

**వీటిని వ్యక్తీకరిస్తూ, వ్యవహరిస్తూ ఉన్నట్టి దివ్యప్రజ్ఞలు (లేక) దేవతలు :**

ఇడకు - **సోమ (చంద్రుడు).** పింగళకు - **సూర్యుడు.** సుషుమ్నకు - **అగ్ని.**

## ప్రాణశక్తి చలనము

**ప్రాణశక్తి** → అనుక్షణం **ఇడ పింగళ సుషుమ్న** లను ముఖ్య వాహకములుగా కలిగియుండి ఆపాదమస్తకమూ దేహమంతటా సంచలనశీలమైయున్నది. అట్టి వివిధ రీతులైన సంచలన ధర్మములను అనుసరించి పంచప్రాణ-పంచ ఉపప్రాణములుగా యోగశాస్త్రములచే విశదీకరించబడుచున్నాయి.

**పంచప్రాణముల శరీరాంతర్గత ప్రధాన (విశేష) స్థానములు**

**(1) ప్రాణము :** హృదయమునందు నిత్యము (కేంద్రీకృతమైన) స్థితి కలిగియున్నది.

**(2) అపానము :** గుద(మల విసర్జక) ప్రదేశములో కేంద్రీకృత సంస్థితము.

**(3) సమానము :** నాభిప్రదేశములో ముఖ్యస్థానము

**(4) ఉదానము :** కంఠస్థానము నందు ముఖ్యముగా ప్రవర్తనము కలిగియున్నది.

**(5) వ్యానము :** శరీరమంతటా ఏర్పడినదై ఉన్నది

***ఇవి ప్రధాన పంచ వాయువులు.***

## పంచ ఉపప్రాణ సంచలనములు

**(1) 'నాగ' ఉద్గారే ఆఖ్యాతః :** శరీరములోని వ్యర్థవాయువులను, వ్యర్థ ద్రవములను (ఇత్యాదులు) 'కక్కు' వంటి త్రోపులతో బయటకు వెడలుగొట్టు ఉపవాయువు.

**(2) కూర్మ : ఉన్మీలనే తథా :** కనులు తెరచు, మూయు క్రియావిశేషమునకు కారణమగుచున్న ఉపప్రాణము.

**(3) కృకరః : క్షుత్కరో జ్ఞేయో :** ఆకలి దప్పికలను ప్రేరేపిస్తూ, తుమ్ము వంటి క్రియా నిర్వహణమునకు కారణము.

**(4) దేవదత్త : విజృంభతే :** వాయు బుడగలను శాసించునది. ఆయా ప్రదేశములలో సందర్భానుసారంగా విజృంభణమును నిర్వర్తిస్తూ శరీరమును పరిరక్షిస్తూ ఉన్నట్టిది.

**(5) ధనంజయము :** ఈ ఉపప్రాణవాయువు సర్వదా జీవుని శరీరమునందు అంతటా ప్రవర్తిల్లుచూ, ఈ జీవుడు దేహమును త్యజించిన తరువాత కూడా వెంటనంటియే ఉండునట్టి ప్రాణశక్తి. సర్వవ్యాపక స్వభావము కలిగి ఉన్నట్టిది. **న జహాతి మృతం వాపి। సర్వ వ్యాపీ ధనంజయః॥**

ఈ పంచ ఉపప్రాణవాయువులు 72000 నాడులతో ఈ శరీరమునకు ప్రాణాధారములై తిరుగాడుచున్నాయి.

### జీవుని పరుగులాటలు

ఇక ప్రజ్ఞాస్వరూపుడగు జీవుడు చేస్తూ ఉన్నది ఏమిటి? సమస్త నాడులలో 'ప్రజ్ఞ' ( Awareness Consciousness) అను వాహనమును (Vehicle) వెంటనిడుకొని పరుగులిడుచూ ఉన్నాడు. **అక్షిప్తో భుజదండేన యథా చలతి కందుకః, ప్రాణాపాన సమాక్షిప్తః తథా జీవో న తిష్ఠతి।** రెండు చేతులతో విసరబడుచూ ఉన్న బంతిలాగా ఈ జీవుడు ప్రాణ-అపానములచే తాడనము పొందుచూ దేహములో పైకి క్రిందకు పరుగులు తీస్తున్నాడు. ఎక్కడా ఒకచోట నిలకడ కలిగియుండుటయే లేదు.

అనగా,.. **ప్రాణాపాన వశోజీవో హి అధశ్చ ఊర్ధ్వంచ ధావతి। వామ దక్షిణ మార్గాభ్యాం చంచలత్వాత్ న దృశ్యతే!** "ఈ జీవుడు శరీరములో ఎక్కడ మనకు లభించగలడు?".. అని వెతకబోతే, ఈతడు ప్రాణ-అపానములకు వశుడై పైకి క్రిందికి వేగముగా చలనములు కలిగి ఉంటూ ఉన్నాడు. ఎడమ-కుడి మార్గములలో (ఇడ-పింగళల) వెంట తిరుగాడుచూ చంచలుడై ఎక్కడా ఒక్కచోట నిశ్చలుడు అవటమే లేదు.

*ఎందుచేత?*

ఈ జీవుడు గుణబద్ధుడు అగుచుండుటచేత త్రిగుణములచే ప్రచోదితుడగుచూ, **"గుణి – గుణములకు వేరైన జీవుడు"** గా స్వానుభవమునకు **లభించటమే లేదు.** త్రిగుణములతో కలగాపులగమై ఉంటున్నాడు.

**శ్లో॥ రజ్జుబద్ధో యథా శ్యేనో గతో ప్రాకృష్యతే పునః**
**గుణబద్ధః తథా జీవః ప్రాణాపానేన కర్షతి॥**
**ప్రాణ అపాన వశో జీవః హి అధశ్చ ఊర్ధ్వం చ ధావతి।**



ఒక పొడవైన త్రాడుచే కట్టుకొయ్యకు కాలు ముడి కట్టబడిన పక్షి పైకి ఎగరబోతూ ఇంతలోనే క్రిందకి పడిపోతూ (ఎగిరి ఎగిరి అలసిపోతూ) ఉన్న తీరుగా.., త్రిగుణములకు బద్ధుడైన ఈ జీవుడు కూడా తన ప్రాణ-అపానములు **"ఆకర్షణ"** అనే త్రాడుచే కట్టుబడినవాడై, వాటికి వశుడై క్రిందకు, పైకి తిరుగాడుచున్నాడు.

| *ఎవ్వడైతే ప్రాణ-అపానములకు ఆవల స్థానమునందు తనయొక్క చిత్తము - ప్రజ్ఞలను సంస్థితము చేసి, ప్రాణము యొక్క అపాన - ఆకర్షణను, అపానము యొక్క ప్రాణ-ఆకర్షణను ఎరిగి, సాక్షియై గమనిస్తూ.. ఆ **"ప్రాణాపాన పరస్పరాకర్షణ"**ను ప్రాణయోగాభ్యాసము యొక్క సహాయముచే **వినోదముగా చూస్తూ,** తాను విడిగా ఉండియే దర్శిస్తూ ఉంటాడో, అట్టివాడే **'యోగవిత్'** లేక **"యోగవేత్త".** ప్రాణ-అపానముల సమరసాభ్యాసమే ప్రాణాయామము.* |
|---|

## "హంస - హంస"।

**శ్లో॥ 'హ' కారేణ బహిర్యాతి। 'స' కారేణ విశేత్ పునః**
**'హంస హంస' ఇతి అముం మంత్రం జీవో జపతి సర్వదా॥**

'హ' అంటూ ఈ జీవుడు ప్రాణముల వెంటగా బయటకు (దృశ్యము అనబడే అన్యమునకు) వెళ్ళుచున్నాడు.

'స' అంటూ తిరిగి అనన్యములోనికి ప్రవేశించుచున్నాడు. ఈ విధంగా జీవుడు ఎల్లప్పుడు రోజుకు 21600 సార్లు తన ప్రాణశక్తి యొక్క వెంటబడుచూ, హంస జపం చేయుచున్నాడు.

(ఇది **'తత్'** పరమాత్మత్వము నుండి **'ఇహ'** జీవాత్మత్వమునకు, (ఇహ) జీవాత్మత్వము నుండి (తత్) పరమాత్మత్వమునకు (స)-స్వాభావికంగా జరుగుచున్న అజపా జపము).

### అజపా గాయత్రి (సోऽహమ్) (స ⇄ హ)

'హ'... **'సహజము'** (లేక) కేవల స్వస్వరూపము నుండి **'సందర్భము'** లోనికి ప్రవేశము (Entering into an Incident).

'స'.. తిరిగి **'సందర్భము'** నుండి సహజమగు **సత్ స్వరూపములో** (తనయొక్క కేవల రూపమునకు) పునః ప్రవేశము.

ఇట్టి భావనచే 'హంస' జప విధానమును గమనిస్తూ ఉండటము - **అజపాగాయత్రి.**

"సహజ-సత్" → సందర్భ - 'హమ్' (From Original State → to Zone of Events and incidents)

"సందర్భ-హమ్" → సహజ-'సత్' (From Zone of Events and Incidents → to original State)

అను **గమనిక** రూపమగు **అజపాగాయత్రి** ఈ జీవుని పట్ల (తత్ యోగాభ్యాసి పట్ల) మోక్షప్రదాత.

**హమ్-సోऽహమ్**

| **"సత్ - సత్" → అహం-సత్।**<br>**స-సత్ → హ-సత్।**<br>**"స" (సహజము) → "హ" (సందర్భము)।**<br>**"పరమాత్మత్వము → జీవాత్మత్వము"।** |
|---|

ఈ యానము ప్రతి జీవుని పట్ల స్వాభావికంగా జరుగుచూ ఉంటున్నట్టిదే!

**యోగాభ్యాసము → (1) గమనిక-(2) భావనల రూపమైనది. "సంకల్పము (హ) - సంకల్పించువాడు. (స)"**... లకు సంబంధించినది. అట్టి 'హంస' 'హంస' భావనాపూర్వక {సంకల్పిత(క) స్మరణచే} ఈ జీవుడు సర్వపాపముల నుండి విముక్తుడు కాగలడు.

**శ్లో॥ అస్యాః సంకల్ప మాత్రేణ సర్వ పాపైః ప్రముచ్యతే।**
**అనయా సదృశీ విద్యా, అనయా సదృశో జపః,**
**అనయా సదృశం జ్ఞానం న భూతం న భవిష్యతి॥**

అట్టి అజపాగాయత్రికి సంబంధించిన పర - ఇహ
కేవల-సందర్భ
సహజ-ఆపాదిత

"హంసో-సోऽహమ్" జ్ఞానముతో సమానమైనట్టిది-**మరింకేది ఇతఃపూర్వము ఉండి ఉండలేదు. ఇక ఉండబోదు.**

# కుండలిని - కుండలినీ సముద్భూత గాయత్రి

**శ్లో॥ కుండలిన్యాం సముద్భూతా గాయత్రీ ప్రాణధారణీ**
**"ప్రాణ విద్యా", "మహా విద్యా" యస్తాం వేద స వేదవిత్॥**

**'కుండలినీ మహాశక్తి'** యందు జనించిన ప్రాణమును ధారణ చేయు **'గాయత్రీ ప్రాణ విద్య'** లేక **"గాయత్రీ ప్రాణ మహావిద్య"**ను ఏ యోగి ఎరిగి యుంటాడో ఆతడే వేదవేత్త. తెలుసుకోవలసినది తెలుసుకొనియున్నవాడు.

గుద స్థానంలోగల కోడిగ్రుడ్డు ఆకార మాంస విభాగమగు "కందము"నకు ఊర్ధ్వముగా కుండలము ఆకృతిగా అష్టధా (8) ఆకారముగా కుండలినీ శక్తి ప్రకాశమానమై ఉన్నది.




**శ్లో॥ కంద ఊర్ధ్వే కుండలీశక్తిః అష్టధా కుండలాకృతిః।**
**బ్రహ్మద్వార ముఖం నిత్యం ముఖేన ఆచ్ఛాద్య తిష్ఠతి॥**

**(కుండలిని = అష్టవిధ ప్రకృతి = దృశ్య, దేహ, మనో, బుద్ధి, చిత్త, అహంకార, జీవాత్మ, ఈశ్వరాత్మలు)**

అట్టి అష్టధా (8) ఆకారము కలిగియున్న కుండలినీశక్తి తన ముఖముతో బ్రహ్మద్వారము (లేక) బ్రహ్మ రంధ్రము యొక్క ముఖమును ఆచ్ఛాదించినదై తిష్ఠించియున్నది. ఈజీవుడు ప్రయాణించవలసిన **బ్రహ్మమార్గము** ఇదియే.

**యేన ద్వారేణ గంతవ్యం బ్రహ్మద్వారమ్ అనామయమ్।** ఈ జీవుడు ఏ ద్వారమున వెళ్ళుచూ **దేహాత్మత్వము**ను అధిగమించి **విశ్వాత్మత్వము**తో మమేకము అగుటకు మార్గమై ఉన్నదో...అదియే **"బ్రహ్మద్వారము".**

కుండలినీ శక్తియే **"పరమేశ్వరి, జగదంబ, ప్రకృతి, ఉమ"** ఇత్యాది పేర్లతో యోగవాఙ్మయములో చెప్పబడుచూ ఉన్నది. (Inclination, Inspiration, Enthusiasm).

పరతత్వానుభవమునకై ఈ జీవుడు అనామయమైన (నిర్విషయ / విషయాతీతరూపమైన) ద్వారమును సమీపించాలి. కానీ అట్టి కుండలినీదేని (లేక) పరమేశ్వరి (లేక ఇచ్ఛాశక్తి) దేహమునందు (మూలాధారమునందు) కునుకులిడుచున్నది. (ఇంద్రియ దృశ్య ధ్యాసకు పరిమితమై, ఆత్మతత్త్వము విషయమై ఏమరపు కలిగినదై ఉంటోంది). (The intelectual is immersed in and confined to what is being heared, touched, seen, tasted, smelt etc., here and now. " The SELF beyond all" - is not being taken into account)

అనగా..,

| ***ఇచ్ఛజ్ఞాన క్రియాస్వరూపిణియగు ధ్యాస దృశ్యముచే ఆకర్షించబడి, సర్వాత్మకమగు స్వస్వరూపమును గమనించనిదై ఉన్నది.*** |
|---|

ఇప్పుడు **"వహ్నియోగము"** అనే వైతాళికము (Awakening)చే, **వాయుప్రేరణ (ప్రాణాయామము) ద్వారా మనస్సుతో ఇచ్ఛాశక్తి రూపమగు కుండలినీదేవిని ప్రబుద్ధము** (Enthusiastic, Enlightened, Awakening, Active) **చేయాలి. సందర్భపరిమితత్వము నుండి కేవలము-అపరిమితము-అప్రమేయము" అగు స్వస్వరూపానుభవము వైపుగా ఉత్తేజపరచాలి.**

ఒక సూచి (సన్నటి లోహపు తీగ)ను సన్నటి గొట్టములో ఈ చివర నుండి ఆ చివర వరకు చేతితో శక్తిని ఉపయోగించి తోసుకువస్తాము కదా!

ఆవిధంగా

- ఈ శరీరము - గొట్టము
- కుండలిని - లోహపు తీగ (సూచి)
- సుషుమ్న - లోగొట్టము / బ్రహ్మమార్గము

ఈ శరీరములో ప్రాణాయామజనిత **'వహ్నియోగము'** అనే శక్తితో కుండలినీ శక్తిని దేహమునకు మధ్యగా గల సుషుమ్ననాడిలో ప్రవేశింపజేసి, (గొట్టము యొక్క అటు చివర వంటి) శిరస్సుకు ఉపరిభాగమున గల అతి సూక్ష్మమగు బ్రహ్మద్వారము (లేక) బ్రహ్మరంధ్రమునకు చేర్చాలి. **సూచీవత్ గాత్రమ్ ఆదాయ వ్రజతి ఊర్ధ్వం సుషుమ్నయా, ఉత్పాటయేత్ కవాటం తు యథా కుంచికయా గృహమ్။** తాళం వేసి ఉన్న ఇంటిలో ప్రవేశించటము కొరకై తాళము చెవితో తాళము తీసి తెలుపులు తెరచిలోనికి వెళ్లుతాము కదా! యోగి "కుండలీన ఊర్ధ్వయాన యోగాభ్యాసము"చే - ఈ క్రిందివిధంగా యోగపథమును 'సాధన' చేయును గాక। (అభ్యాసి అగును గాక).

- సుషుమ్న నాడి అనే ద్వారమును సమీపించి....,
- ప్రాణ -అపానములు అనబడే - వ్రేళ్లను ఉపయోగిస్తూ..,
- కుండలిని అనే తాళపు చెవితో..,
- బ్రహ్మద్వారము (లేక) బ్రహ్మరంధ్రము అనే మూసియున్న సన్నటి ద్వారమును (లేక) బ్రహ్మరంధ్రమును తెరచి..,
- **'సహస్రారము'** అనే - విశ్వమంతా తనకు అంతర్గతమైయున్న - తనయొక్క **స్వస్వరూపాత్మాకాశము**లో ప్రవేశించి,
- **ఆత్మాకాశమునందు విశ్వాత్మకుడై విహరించుచుండును గాక।**

## <u>మోక్షమార్గ ప్రవేశమునకై యోగసాధన</u> :

- **కృత్వా సంపుటితౌ కరౌ** → రెండు చేతులను సంపుటితముచేసి,
- **దృఢతరం బధ్వాతు పద్మాసనం** → దృఢముగా పద్మాసనము ధరించి,
- **గాఢం వక్షసి సన్నిధాయ చుబుకం** → చుబుకమును (గడ్డమును) వక్షస్థలము (Heart) పై తాకించి ఉంచి,
- **ధ్యానం చ తత్ చేష్టితమ్** → మనో కదలికలను ధ్యానంచే పరమాత్మయందు నిలిపి,
- **వారంవారం అపానమ్ ఊర్ధ్వమ్** → అపానవాయువును పైకిలాగుచూ,
- **అనిలం ప్రోచ్చారితమ్, పూరితమ్** → వాయువుచే పరిపోషించబడుచు, పూరింపబడుచు,
- **ముంచన్ ప్రాణమ్** → ప్రాణశక్తి ఆత్మయందు మునుగునది అగుచుండగా,
- **ఉపైతి బోధమ్ అతులం శక్తి ప్రభావాత్ నరః।** → ప్రాణశక్తి ప్రభావము పొందినదై, జీవునికి మహత్తర ఆత్మానుభవము ప్రసాదించగలదు.

ఈ విధంగా ప్రాణ-అపాన ఏకస్వరూపమగు ప్రాణయోగ అభ్యాసము చేస్తూ ఉండగా, అట్టి యోగాభ్యాసికి **"ప్రాణ-అపాన సమరసము"** చేత జనించిన శక్తి, భావన వలన → బోధ రూపమగు **విస్తృత ఆత్మజ్ఞానము** సులభమై లభించగలదు.

## <u>*యోగాభ్యాసి దృష్టిలో ఉంచుకోవలసిన కొన్ని విశేషములు*</u>

**(1) అంగానాం మర్దనం కృత్వా, శ్రమసంజాత వారిణా** : యోగాభ్యాస శ్రమచే జనించిన చెమటను ఆ అంగములకే మర్దించటము చేత యోగతేజస్సు శరీరమునందు అంతర్గతమై ఉండగలదు.

**(2) కట్వ ఆమ్ల లవణ త్యాగీ :** కారము, పులుపు, ఉప్పు తగ్గించాలి. అప్పుడు యోగాభ్యాసము ప్రవృద్ధమగుచు, సమరసత్వము త్వరగా పరిపుష్టి పొందగలదు.

**(3) క్షీరభోజనమ్ ఆచరేత్ :** పాలు, పాలతో అన్నము అధికముగా తీసుకొంటూ ఉంటే, అది యోగాభ్యాసమునకు మరింత సానుకూల్యము.

**(4) బ్రహ్మచారీ :** యోగాభ్యాసి బ్రహ్మమును గురించిన సమాచారము అధ్యయనము చేస్తూ ఉండాలి. **"సమస్తము సర్వదా బ్రహ్మమే"** – అను దృఢభావనను సర్వ స్థితి – గతులలోను అభ్యాసము చేస్తూ ఉండాలి. **"సమస్తము బ్రహ్మమే కదా!"** – అని ఆయా అన్ని సందర్భములలో అనుకుంటూ, అనుకుంటూ ఉండటమే **'బ్రహ్మము' అను 'ఆచారము'.**

**(5) మితాహారీ :** మితాహారుడై ఉండాలి. ఇంద్రియములకు విషయములే ఆహారము. ఇంద్రియములను మితముగా (As Limited as is Just necessary) విషయ స్వీకారము నందు వినియోగించాలి.

ఈ విధంగా యోగపారాయణుడు (Practisioner of Yoga) అయి ఉండగా, **ఒక సంవత్సర కాలం దాటగానే అట్టివాడు సిద్ధిని పొందగలడు.** ఇందులో అనుమానించవలసినది లేదు.

### *మితాహారము అనగా?*

**సుస్నిగ్ధమధురాహారము:**

**(1) సాత్వికము** – మధురమైన కమ్మటి ఆహారము (కారము, ఉప్పు, లవణము, ఆమ్లములు తక్కువగా)

**(2) చతుర్ధాంశ వివర్జితము :** పొట్టలో రెండు వంతులు (1/2) ఘనాహారముతోను, నాలుగవ వంతు(1/4) జలముతోను నింపుచూ,.. **శేషించిన నాలుగవ వంతు (1/4) విభాగము వాయువు యొక్క సంచలనమునకై ఖాళీగా ఉంచటము.**

**(3) శివ సంప్రీత్యము :** అది న్యాయార్జితమైన ఆహారమై ఉండుగాక. ఆహారము ప్రసాదించు పరమాత్మకు కృతజ్ఞతగా, తనకు లభించిన ఆహారములోని కొంతభాగము తదితర ఆహారాణ్వేషులగు జీవులకు, జీవరాసులకు సమర్పించటము.

**ఈ ఈ లక్షణములు కలిగిఉంటే, అది 'మితాహారము' అనబడుతోంది.**

## కుండలినీ శక్తి

మలవిసర్జకావయవమునకు కించిత్ ఊర్ధ్వంగా (పై వైపుగా) కుండల ఆకృతిగా అష్టవిధంగా "8" ఉన్నది. **ఇది జీవునికి బంధము.** ఎందుకంటే దృశ్యము పట్ల ఇచ్ఛా – జ్ఞాన–క్రియా తత్త్వమే కుండలినీ శక్తి కాబట్టి. **అయితే ఇది మోక్ష ప్రదాత కూడా!**

**బంధనాయ చ మూఢానాం। యోగినాం మోక్షదా సదా!** మూఢులకు కుండలనీశక్తియే బంధము.. **యోగాభ్యాసులకో, ఇది మోక్షదాయకము.**

## ముద్రలు / బంధనములు

**యోగాభ్యాసి దృష్టిలో పెట్టుకోవలసియున్న ముద్రలు (లేక) బంధనములు: (1) మూలబంధము (2) ఓడ్యాణము (3) జాలంధరము (4) ఖేచరీ (లేక) నభోముద్ర (5) మహాముద్ర.** వీటి వివరణలు చెప్పుకుందాము. (ఇవన్నీ కూడా అర్థం చేసుకొని, గురుముఖతః అభ్యసించి నిర్వర్తించబడు గాక! అందుకు యోగ గురువులను ఆశ్రయించాలి).

### మూలబంధము :

**పార్ష్ణి ఘాతేన సంపీడ్య యోనిమ్ ఆకుంచయేత్ దృఢమ్** = యోని ప్రదేశమును (ఎడమ) కాలి మడమ యొక్క చివరతో దృఢంగా ముదుచుచూ,

**అపానమ్ ఊర్ధ్వమ్ ఆకృష్య "మూలబంధో" విధీయతే॥** అపానవాయువును మూలాధారమార్గము నుండి వెనుకకు మరల్చి – ధారణ చేసి ఉండటము – **"మూలబంధము"** – అంటారు.

'మూలబంధము' యొక్క అభ్యాసము నందు ఏర్పడు ప్రాణ–అపానముల ఐక్యతా (సమస్థాన) అభ్యాసముచే →

- మూత్ర – పురీష (Pissing & Toilet) దోషములు తొలగిపోతాయి.
- సతత మూలబంధనాభ్యాసముచే వృద్ధుడు కూడా యౌవనోత్సాహవంతుడై ఉండగలడు. ఉరకలు వేయు ఆనందము కలిగి ఉండగలడు.

## ఓడ్యాణ బంధము:

ఏ యోగి ఓడ్యాణ బంధము ఎల్లప్పుడూ ధారణ చేస్తూ ఉంటాడో అట్టివాడు పెద్దపక్షి యొక్క ఆకాశ విహారము వలె తేలికైన శరీరము కలవాడగుచున్నాడు. ఈ బంధము 'మృత్యువు'అనే ఏనుగుకు సింహము వంటిది.

**ఉదరాత్ పశ్చిమం తానం అధో నాభేః నిగద్యతే।** – కడుపు (Stomach)కు దిగువగా, పశ్చిమము వైపుగా, నాభికి కొంచెము క్రిందుగా గల ప్రదేశమును 'తానము' అంటారు.

**ఓడ్యాణమ్ ఉదరే బంధమ్।** 'ఓడ్యాణము' అనునది (ధ్యాసను ఆజ్ఞాచక్ర ప్రదేశములో నిలిపి, రెండు ముక్కు పుటములతో వేగముగా గాలిని పీల్చి), ఉదరములో (పొట్టలో) నిర్వర్తించే కుంభకప్రాణాయామము. అందుకే ఆపేరు వచ్చింది. (పొట్టలో కుంభము తరువాత, క్రమంగా నెమ్మదిగా రెండు ముక్కు పుటములతో గాలిని **'రేచకము'** చేయాలి (విడువాలి). (బుద్ధిని హృదయస్థానంలో గాని, ఆజ్ఞాచక్ర స్థానంలోని నిలుపుతూ ఉండాలి).

## జాలంధర బంధము :

**బధ్నాతి హి శిరోజాతమ్ అధోగామి నభోజలమ్–తతో జాలంధరో బంధః ॥** శిరస్సులో క్షణక్షణము ఎల్లప్పుడు జనిస్తున్న జలమును శిరోస్థానములో 'మనోకుంభకము'చే గమనించి, బంధించి అట్టి జలమును అధోముఖం చేసి, కంఠస్థానము వరకు తీసుకురావటము. ఇట్టి బంధము ***'జాలంధరము'*** అని పిలువబడుతోంది. కంఠమును సంకోచింపజేసి శిరోజలమును బంధించటము– అను ఈ అభ్యాసములో కంఠప్రదేశ–ముఖ ప్రదేశములలోని సమస్త దోషములు తొలగుతాయి. కంఠసంకోచ ప్రక్రియచే పీయూషము (సంకోచము)చే అగ్నియందు పతనము పొందదు. (అమృతత్వ భావన బాధించబడదు). దేహములోని ఆయా ప్రదేశములలో ఏర్పడగల వాయువు యొక్క అపక్రమములు తొలగుతాయి.

## నభో ముద్ర (లేక) ఖేచరీ ముద్ర

ఈ ఖేచరీ ముద్రయందు రెండు మెట్లతో కూడిన అభ్యాసములు. (ఒకేసారి అభ్యాసము చేయబడవలసినవి).

**(1) కపాల కుహరే జిహ్వా ప్రతిష్టా విపరీతగా–** బ్రహ్మ రంధ్రముయొక్క ఈవలి చివర, కపాల కుహరము – అయినట్టి కొండనాలుక చిట్టచివరకు – నాలుకను క్రమక్రమాభ్యాసంగా మడచి, నాలుక యొక్క చిట్టచివరతో కొండనాలుక రంధ్రమును స్పృశించటము.

**(2) భ్రువోః అంతర్గతా దృష్టిః–** భ్రూమధ్యలోని (భృకుటి మధ్యగా / కనుబొమ్మల మధ్య ప్రదేశములోని) ఆకాశములో దృష్టిని నిలిపి ఉంచటము.

**(ఇతి) ముద్రాభవతి ఖేచరీ।** – ఇది **'ఖేచరీముద్ర'** – అనబడుతోంది. ఈ ఖేచరీ ముద్రవలన రోగములు సమీపించవు. **మరణ సందర్భములో ప్రజ్ఞ (తెలివి) కొనసాగుచూ, మరణము జయించబడగలదు.** అమృతత్త్వము సిద్ధించగలదు. ఖేచరీ ముద్ర యొక్క ధారణస్థితి సిద్ధించుకొనువానికి ఆకలి దప్పికలు బాధించవు. 'మూర్ఛదశ'కు లోను కాడు. అట్టివాడు శారీరక –మానసిక రుగ్మతల చేతగాని, కర్మలచేతగాని, మరింక దేనిచేతగాని బాధించబడడు. **పీడ్యతే న చ రోగేణ, లిప్యతే న చ కర్మభిః। బాధ్యతే న చ కేనాపి, యో ముద్రాం వేత్తి ఖేచరీ।**

అంతేకాదు. చిత్తము భ్రూమధ్య–అంతర్గతాకాశమునందు, జిహ్వ (నాలుక) కపాల కుహర స్థానమునందు ప్రవేశించుటను సిద్ధించుకొన్న యోగులు సిద్ధులచేత కూడా నమస్కరించబడుచూ ఉంటారు.

శరీరభావన ఖేచరీ అభ్యాసముచే బిందుమూలమునందు సిరా (శ్రేష్ఠము) రూపమై ప్రతిష్ఠితిమగుచున్నది. శరీరమంతా ఆపాదమస్తకము ఆత్మాకాశభావనచే ఆక్రమించుకొనటము జరుగగలదు. ఇట్టి లంబికా ఊర్ధ్వ యోగముచే బిందువు క్షీణించదు. ("ధ్యానము, పూజ"– చేయువాడు ఆ ధ్యాస నుండి చ్యుతి పొందడు). సమస్తము సర్వదా ఆత్మబిందువునందు దర్శించు స్థితి నుండి బుద్ధి చెలించదు. కామినీ ఆలింగనముచే (**ప్రాపంచకమైన విషయములతో తత్పరమగుటచే**) కూడా ఆత్మసాక్షాత్కార ఏకాగ్రత క్షణము కూడా విరామము పొందదు. అట్టి బిందుస్థానమునందు(ఆత్మభావన యందు) దేహము స్థితి పొందుచుండగా, ఆ యోగి అమృతస్వరూప–స్వభావుడు అగుచున్నాడు. ఆతనికిక మృత్యు భయముండదు. మృత్యువు కూడా ఆతని పట్ల **"నిద్రపోయి–లేవటమువంటి సాధారణ విషయము"** వలె అగుచున్నది. (బిందువు = నిర్విషయ కేవలాత్మ. జగత్తు బిందువులచే నిర్మితము)

**ఈ నభోముద్ర ధారణ కొనసాగునంతవరకు - ఆయోగి పట్ల** అగ్నిచే జ్వలించబడుచున్నప్పుడు కూడా బిందుసంప్రాప్తి (ఆత్మధ్యాస) కొనసాగుచూనే ఉండగలదు.

యోనిముద్రచే ప్రాప్తించు యోగశక్తిచేత జీవుడు **అధోగతి నుండి** (ఆజ్ఞాచక్ర స్థానమునకు క్రిందకు పోవుగతి, '↓' పంచేంద్రియ విషయగతి - నుండి) **ఊర్ధ్వగతిని** (ఆజ్ఞాచక్రము నుండి మస్తకాకాశము, బ్రహ్మరంధ్రము, సహస్రారము వైపు గతిని '↑'), సముపార్జించుకొనుచున్నాడు.

## మహాముద్ర

**బిందుస్థానము**: ఈ బిందుస్థానము రెండు విధములైనవిగా ఉంటున్నది.

**(1) పాండరము :** ఇది 'శుక్లము' సంబంధమైనది. శశిస్థానము చంద్రతత్త్వము / స్థానము.

**(2) లోహితము :** మహారజరూపము. **సిందూర వ్రాతసంకాశం రవిస్థానం స్థితం రజః।** ఎర్రటి (సిందూర)సముదాయ సమానము. స్థానము - రవి (సూర్య) తత్త్వము / స్థానము.

**బిందుః ఇందూ, రజో రవిః॥**

> **శ్లో॥ బిందుః బ్రహ్మా-రజః శక్తిః। బిందు ఇందుః రజోరవిః**
> **ఉభయోః సంగమాత్ ఏవ ప్రాప్యతే <u>పరమం పదమ్</u>॥**

ఈ చంద్ర సూర్యుల తత్త్వమగు శుక్ల-రజముల కలయికయే **(పురుష-ప్రకృతుల పరస్పర అద్వితీయత్వమే) పరమపదము.** ఈ **రవిస్థాన స్థితమైన రజము - శశిస్థానస్థితమైన శుక్లము**ల ఐక్యత బహు దుర్లభము. **అదియే పరమపదము.** ఇహ-పరములు, సందర్భ-సహజములు, జీవాత్మ-పరమాత్మలు ఏకతత్త్వముగా సంతరించుకోవటమే - **"రజో-బిందు ఏకత్వము".**

> **శ్లో॥ వాయునా శక్తి జాతేన ప్రేరితం చ యథా రజః,**
> **యాతి బిందుః సదైకత్వం భవేత్ దివ్య వపుః తదా॥**

'శక్తి' చేత జనించిన వాయువుచే 'రజస్సు' ప్రేరితమయినదై, 'బిందువు'తో ఐక్యమై, తత్ఫలితంగా దివ్యదేహము రూపుదిద్దుకొనుచున్నది. ప్రాణాయామముచే కుండలినీ శక్తి ప్రేరితమై ఈ జీవుడు శివత్వము సంతరించుకొనే ఉపకరణముగా అగుచున్నది.

ప్రాణాభ్యాసముచే జనించిన యోగశక్తి ప్రేరితమై - **"నాది"** అనురూపమగు ప్రకృతి- 'నేను' అను బిందువు నందు ఐక్యమొందుచున్నది. ఆ యోగి భౌతిక - మనో-బుద్ధి-చిత్తరూపములను అధిగమించి **కేవలాత్మానంద-దివ్యశరీరుడు, అఖండానంద ఆత్మదేహుడు** అగుచున్నాడు.

> **శ్లో॥ శుక్లం చంద్రేణ సంయుక్తం, రజః సూర్యేణ సంగతమ్**
> **తయోః "సమరస ఏకత్వం" - యోజానాతి, స యోగవిత్॥**

| చంద్రునితో కలిసిన శుక్లము | సూర్యునితో కలిసిన రజము |
|---|---|
| **పురుషుడు / అనుభవి** | **పురుషకారము / అనుభవము** |

**ఈ ఉభయముల సమరస ఏకత్వము ఎరిగినవాడే వేదవేద్యుడు.**

**అట్టివాని ఇహ-పరములు <u>"పరాత్పరత్వము"</u>నందు 'ఏకత్వము' పొందగలవు.**

**"మహాముద్ర" అనగా? →**

(1) నాడీజాలము యొక్క **"శోధనము" (ప్రాణాయామము, షట్చక్రములలోను, నవరంధ్రములలోను సహజ కుంభకము మొదలైనవి)**

(2) చంద్రసూర్యుల **"చాలనము" (ద్రష్ట - దర్శనముల ఏకత్వము)**

(3) రసముల **"శోషణము" (నవరసములను ఆత్మపురుషుని విశేషణములుగా సందర్శనము)**

**ఈ <u>(1) శోధన (2) చాలన (3) శోషణ</u> - త్రయమే "మహాముద్ర".**

## శోధనము

**శ్లో॥ వక్షో న్యస్త హనుః నిపీడ్య సుచిరం, యోనిం చ వామాంఘ్రిణా,**
**హస్తాభ్యామ్ అనుధారయన్ ప్రసరితం, పాదం తథా దక్షిణమ్,**
**ఆపూర్య శ్వసనేన కుక్షియుగళం బధ్వా శనైః రేచయేత్॥**

- గడ్డమును వక్షస్థలముపై ఇష్టముగా ఆనించిఉంచి,
- ఎడమకాలి మడమ (వెనుక) భాగంతో యోని ప్రదేశమును నొక్కి ఉంచి,
- కుడికాలిని ముందుకు సూటిగా చాపి ఉంచి,
- చాపిన కుడికాలిని చేతి వ్రేళ్లతో పట్టుకొని ఉండి,
- శ్వాసించుగాలిని కుక్షియగళములో (పొట్టలో) పూరించి, బంధించి (కుంభకముచేసి) ఉంచి,
- మెల్లగా ఆ వాయువును వదలాలి (రేచకము చేయాలి).

ఇది నాడీజాల శోధనము. ఇది బుద్ధిమంతులగు యోగులు అభ్యసించు ముద్రావిశేషము (లేక) యోగాభ్యాసము.

'చంద్రాంశ'తో (ఇడతో) ఒకసారి, 'సూర్యాంశ'తో (పింగళతో) మరొకసారి రేచక–పూరక–కుంభక–పునఃరేచక ప్రాణాయామము అభ్యాసము చేయాలి. ఈవిధంగా అభ్యసిస్తూ ఉండగా రేచక పూరక కుంభక పునఃరేచక సమయము సమము (స్వాభావికము) అగుచున్నది. **యా తుల్యా తు భవేత్ సంఖ్యా తతో ముద్రాం విసర్జయేత్॥** సంఖ్యా సమత్వము సిద్ధించిన తరువాత ఇక పైన చెప్పిన ముద్రతో పని ఉండదు. ఆ ముద్రను విసర్జించివేయాలి. (స్వాభావికత సిద్ధించిన తరువాత ఇక విధి విధానములతో పని ఉండదు).

***ఇట్టి మహాముద్ర అభ్యసించే యోగికి →***

- ఇది తినాలి (పథ్యము) – ఇది తిన కూడదు (అపథ్యము) అను నియమ – నిష్టలతో పని ఉండదు.
- రసము – నీరసము మొ॥వి అట్టి యోగాభ్యాసి పట్ల ఉండజాలవు.
- ఆతని పట్ల–అతి ఆహారము జీర్ణమవగలదు. (ఇంద్రియ విషయములందు, ప్రాపంచక వ్యవహారములందు పుంఖానుపుంఖ సంబంధ – అనుబంధ– బాంధవ్యములందు పాల్గొనవలసి రావటము) – అత్యంత సులభంగా, స్వాభవికంగా (స్వస్వరూపభావన యందు) లయమవగలవు. ఘోరమైన విషము కూడా ఆతని పట్ల అమృతతుల్యమగుచున్నది.

ఇంకా కూడా 'మహాముద్ర'ను అభ్యసించువారి పట్ల – క్షయ, కుష్ఠు, గుదావర్తము (గుదములో మంట, మొల్లలు, మొ॥), గుల్మము (హృదయమునకు ఎడమ భాగములో ఉండు పచ్చని మాంస ఖండములో దోషములు), అజీర్ణము మొదలైన వ్యాధులన్నీ తొలగిపోగలవు.

యోగులకు సర్వసిద్ధికరమగు ఈ 'మహాముద్ర'ను గురుముఖతః నేర్చుకుని శ్రద్ధగా ఉపాసించాలి. తాను అభ్యసిస్తూ అర్హత ఉన్న వారికి సూచించాలి. అయితే రహస్యంగా ఉంచాలి. క్రోధ లోభ మద మాత్సర్యములు కలవారికి బోధించరాదు. **శిష్యత్వ, సేవకత్వ సుగుణముల, లోకక్షేమఆశయముల** అర్హత చూడకుండా ప్రసాదించకూడదు.

# ఓంకారోపాసన

ప్రియ యోగాభ్యాసులారా! శ్రోతలారా! శిష్యజనులారా! ఇప్పటివరకు ఆయా ముద్రల గురించి, వాటి అభ్యాస ప్రయోజనముల గురించి ఆయా కొన్ని విశేషాలు చెప్పుకుంటూ వస్తున్నాము కదా!

ఇప్పుడు 'ఓంకారము' యొక్క **సులభమగు** ఒక **ఉపాసన** గురించి ధ్యానాభ్యాసరతులను దృష్టిలో పెట్టుకొని చెప్పుకుంటున్నాము.

**శ్లో॥ పద్మాసనం సమారుహ్య సమకాయ – శిరో ధరః।**
**నాసాగ్రదృష్టిః ఏకాంతే జపేత్ 'ఓం' కారమ్ – అవ్యయమ్॥**

- పద్మాసనము ధరించి,
- శరీరమును శిరస్సును మెడను నిలువుగా ధారణ చేసి,
- ముక్కుకు పై భాగమున గల కనుబొమ్మల మధ్య గల ఆజ్ఞాచక్రాకాశములో దృష్టిని నిలిపి,
- ఆత్మకు అన్యమైన సమస్త విషయములను వదలి, ఏకాత్మకమగు స్థాన-భావనలతో అవ్యయమగు (పెరుగట - తరుగుట, మార్పు-చేర్పు ధర్మములు కించిత్ కూడా ఏ మాత్రము లేనట్టి) ఆత్మకు సంజ్ఞ - అక్షరార్ధము అగు **'ఓం' కారమును జపించాలి.**

**'ఓం' అనగా?**

- ఏది త్రికాలములో **నిత్యమైయున్నదో, సత్యమైయున్నదో,**
- ఎద్దానికి దృశ్య-దేహ-మనో-బుద్ధి-చిత్త-అహంకారములు ఏ మాత్రము స్పృశించక తాను సర్వదా **"శుద్ధము"** అయి ఉన్నదో..,
- ఏది కేవలబుద్ధి స్వరూపమై **'బుద్ధము'** అనబడుచున్నదో..,
- సమస్త కల్పనలకు ఆవల సర్వదా **నిర్వికల్పమై**యున్నదో...,
- దోష రహితమగుటచే **నిరంజనమో,**
- మాటలతో నిర్వచించి చెప్పజాలము కాబట్టి **నిరాఖ్యాతమో,**
- దేహాదులవలె ఆది- అంతము లేనట్టిది కాబట్టి **అనాది నిధనమో,**
- సర్వదా అఖండమై, ఏకమై, **అక్షరమై యున్నదో..,**
- ఏది భూత-వర్తమాన - భవిష్యత్తుల రూపమును దాల్చుచూ ఒక నటుడు పాత్రలు వహిస్తున్నట్లు ప్రవర్తిల్లునదై ఉన్నదో,
- సర్వదా **అవిచ్ఛిన్నమై** కేవల రూపంగా ప్రకాశమానమైయున్నదో..,
- సమస్తమునకు ఆవల **పరబ్రహ్మమై** సమస్తమును ప్రకాశింపజేయుచున్నదో.

– అదియే **'ఓంకారము'** యొక్క **తాత్పర్యార్థము**. అదియే **'పరాశక్తి'** అని, స్వయం **జ్యోతిరాత్మకమని** గమనిస్తూ, **ఓంకారోపాసన ఆశ్రయించబడు గాక!**

## ఆత్మ నుండి సృష్టి

పరాశక్తి. స్వయం జ్యోతిస్వరూపము. శ్రోత - వ్యాఖ్యాతల **సహజ - కేవల స్వస్వరూపము** అయినట్టిది. **ఆత్మ నుండే ఈ సమస్త దృశ్య వ్యవహారము బయల్వెడలుచు, ప్రవర్తనశీలమై, తిరిగి (జలంలో తరంగములవలె) ఆత్మ యందే అనన్యరూపంగా సశాంతించుచున్నది.**

**ఆత్మన → ఆకాశాత్ సంభూతః** – జలములో సంచలనమువలె – ఆత్మ నుండి అవకాశ స్వరూపమగు **'ఆకాశము'** సంభూతమగుచున్నది.

ఆకాశము నుండి → **వాయువు**, వాయువు నుండి **అగ్ని**, అగ్ని నుండి → **ఆపః** (జలము/ద్రవము), ఆపః నుండి **పృధివి** (స్థూలము) – ప్రదర్శనమగుచున్నాయి.

అట్టి పంచభూతములకు అధిపతులు ఐదుగురు.

**(1) సదాశివ (2) ఈశ్వర (3) రుద్ర (4) విష్ణు (5) బ్రహ్మ.**

**బ్రహ్మ విష్ణు రుద్రులు** → ఉత్పత్తి స్థితి లయ కర్తలు

**బ్రహ్మ** – రాజస గుణ ప్రధానుడు. **విష్ణువు** – సాత్విక గుణ ప్రధానుడు. **రుద్రుడు** – తామస గుణ ప్రధానుడు.

త్రిమూర్తులు ఈ విధంగా త్రిగుణ ప్రదర్శనయుక్తులై ఉన్నారు. దేవతలకు మునుముందుగా – ప్రధమంగా సృష్ట్యభిమాని అగు బ్రహ్మదేవుడు సంభవించుచున్నారు.

సృష్టియందు → **ధాతః** (బ్రహ్మ), స్థితి యందు → **విష్ణువు,** నాశనము నందు → **రుద్రుడు,** భోగమునందు **ఇంద్రుడు – సమస్తమును ముందుగా** సంప్రదర్శనమగుచున్నారు.

## స్థూల ప్రకృతి

వీరిలో బ్రహ్మదేవుని సృష్టి సంకల్పము నుండి లోకములు, దేవ - జంతు - నర - స్థావరములు మొదలైనవి జనించుచున్నాయి. వీరిలో మనుష్యులు మొదలై దేహములలో -

- పంచజ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు,
- పంచ ప్రాణములు, మనోబుద్ధి - చిత్త అహంకారములు →

- ఇవన్నీ స్థూలముగా కల్పించబడుచున్నాయి. ఇది **"స్థూల ప్రకృతి"** అనబడుచున్నది.

## లింగము

వీటిలో జ్ఞాన కర్మేంద్రియ సంబంధమైన జ్ఞాన విషయములు, **'ప్రాణము'** మొదలైన ప్రాణ పంచకము, మనోబుద్ధులు సూక్ష్మరూపములై ఉంటున్నాయి. అట్టి సూక్ష్మ విశేష సముదాయము - **'లింగము'** అని చెప్పబడుతోంది.

(ఉదా : **చూడబడునది → స్థూలము. చూపు → సూక్ష్మము. వినబడునది → స్థూలము. వినటము → సూక్ష్మము.**

## కారణము

సత్వ రజో తమో త్రిగుణములు **'కారణ శరీరము'** అనబడుచున్నాయి. ఈ విధంగా ఈ జీవుని పట్ల (1) స్థూల శరీరము (2) సూక్ష్మశరీరము (3) కారణ శరీరము అని పిలువబడు మూడు శరీరములు ఏర్పడుచున్నాయి. అవన్నీ ఒకే సమయ సందర్భములలో ప్రవర్తనశీలమై ఉంటున్నాయి.

**అవస్థలు** - (1) జాగ్రత్ (2) స్వప్న (3) సుషుప్తి (4) తురీయము

## అవస్థల యొక్క అధిపత / అభిమాన - పురుషకారములు / పురుషులు

**(1) జాగ్రత్ → విశ్వపురుషుడు. → విశ్వోహి స్థూలభుక్ నిత్యమ్।** స్థూల తత్త్వాభిమాని - విశ్వుడు.

**(2) స్వప్నము → తేజస పురుషుడు → తైజసః ప్రవివిక్త భుక్ ।** ఏకాంత కల్పనకు సంబంధించినట్టి **"రహస్య భుక్"-తేజసుడు.**

**(3) సుషుప్తి → ప్రాజ్ఞ పురుషుడు → ఆనంద భుక్ తథా ప్రాజ్ఞః।** 'ఆనందానుభవుడు' - ప్రాజ్ఞుడు.

**(4) తురీయము → తురీయ పురుషుడు → 'సర్వసాక్షి' ఇతి అతః పరః।** జాగ్రత్ స్వప్నసుషుప్తులకు వేరై, వాటివాటికి కేవల సాక్షి అయినట్టి పురుషకారము - **తురీయము.**

**ప్రణవము :** → సర్వబాహ్యముల అనుభవ రూపములుగా, అంతరంగ సమస్త తత్త్వములుగా ప్రతిష్ఠితమైయున్న పరమార్థము. **ప్రణవః సర్వదా తిష్ఠేత్ సర్వ జీవేషు భోగతః॥** (The Totality of self + Self related experiencing details here and ever put together is "PRANAVAM"). స్థూల, సూక్ష్మ, కారణ తురీయ పురుషులను నాలుగు ముఖములుగా కలిగియున్న కేవలాత్మకు సంజ్ఞ - ('చతుర్ముఖబ్రహ్మ'గా పౌరాణిక నామధేయము)

అభిరామము (ఆత్మారామము) అదోముఖమై సర్వత్రా ద్రష్ట - దర్శన దృశ్య రూపములతో సహా (జాగ్రత్-స్వప్న సుషుప్తి-తురీయ) సర్వ అవస్థల యందు అవస్థితమైయున్నది..

| | | |
|---|---|---|
| **అ : ఉ : మ :** | - | ప్రణవాంతర్గత త్రయము. త్రయోవర్ణములు |
| **ఋక్ యజు సామ** | - | త్రయీ వేదములు |
| **భూ భువర్ సువర్** | - | త్రయీ లోకములు |
| **రజో సత్త్వ తమో** | - | త్రిగుణములు |

ఇంకా మూడు అక్షరములు, మూడు స్వరములు (మంద్రము - మధ్యమ - ఉచ్ఛస్వరము), జ్ఞాతృ - జ్ఞాన - జ్ఞేయములు

ఈ ఈ సర్వముగా, సమగ్రంగా చెప్పబడు సంజ్ఞాక్షరము 'ఓం'కారము. ఆత్మకు కూడా 'సంజ్ఞ'.

**'అ'కారో జాగ్రతి నేత్రే వర్తతే సర్వజంతుషు।**

<u>వ్యష్టిపూర్వకంగా :</u>

**'అ'కారము** – జాగ్రత్. సర్వజీవుల నేత్ర స్థానము నందు (కళ్ళలో) వర్తించునదై ఉంటోంది.

**'ఉ'కారము** – స్వప్నము – కంఠస్థాన వర్తనము.

**'మ'కారము** – సుషుప్తి– హృదయ స్థానము.

<u>సమిష్టి పూర్వకంగా</u>

విరాట్ – స్థూలాకారము – **'అ' కారము.**

హిరణ్యగర్భః – తైజస – సూక్ష్మము – **'ఉ' కారము.**

కారణ అవ్యాకృతము – ప్రాజ్ఞః – **'మ' కారము.**

<u>ఇంకా కూడా...,</u>

**'అ' కారము** – రాజస. వర్ణము = **రక్తము. బ్రహ్మ చేతనము.**

**'ఉ' కారము** – సాత్త్విక. వర్ణము = **తెలుపు. విష్ణు చేతనము.**

**'మ' కారము** – తామస. వర్ణము = **కృష్ణము (నలుపు). రుద్ర చేతనము.**

సర్వము **ప్రణవము** నందే ప్రభవించి **ప్రణవము** నందే లయించుచున్నది.

<u>ప్రణవము నందే</u> →

బ్రహ్మ హరి రుద్రులు ప్రభవించుచూ.., ప్రణవ (లేక) పర స్వరూపులై ఉండి (జలమునందు తరంగములవలె) తిరిగి ప్రణవమునందే సశాంతిస్తున్నారు.

బ్రహ్మ – 'అ'కారము నందు, విష్ణువు – 'ఉ' కారమునందు, రుద్రుడు – 'మ' కారమునందు లీనమగుచున్నారు. సర్వే సర్వత్రా ప్రణవమే సమస్తముగా ప్రకాశమానమైయున్నది.

**ఉన్నది బ్రహ్మమే। బ్రహ్మమునకు అన్యముగా ఎప్పుడూ కూడా, ఎక్కడా కూడా ఏదీ లేదు. అదియే ప్రణవము.**
**అట్టి ప్రణవము = 'జ్ఞానినామ్ ఊర్ధ్వభాగో అభూత్। అజ్ఞానే స్యాత్ అధోముఖః"**

→ **జ్ఞానులకు** ఊర్ధ్వభాగమున అనుభవమగుచున్నది. (ఆజ్ఞాచక్రమునందు, అక్కడి నుండి **బ్రహ్మద్వారము (లేక) బ్రహ్మరంధ్రము** వరకు, బ్రహ్మరంధ్రమునకు ఉపరిగా సహస్రారమునందు – ఆత్మగా అనుభవమగుచున్నది). ↑

→ **అజ్ఞానులకు** అధోముఖముగా ఆజ్ఞాచక్రమునకు క్రింద వైపుగా అనుభవమగుచున్నది. ఇంద్రియ ద్వారముల యందు ఇంద్రియ ప్రజ్ఞలుగాను, ఇంద్రియములుగాను, బయల్వెడలి, అవి వ్రాలుచున్న విషయముల రూపంగా, అనుభవమగుచున్నది. ↓

అట్టి బాహ్య – అభ్యంతర స్థితమైయున్న బ్రహ్మము నందు సుతిష్ఠితుడు (Well - placed) అయి, సర్వత్రా సందర్శనము చేస్తూ, **అట్టి స్వస్వరూప – సమస్త స్వరూప ఏక అఖండ బ్రహ్మమును తనకు అనన్యముగా ఎరిగినవాడే వేదవేత్త।**

**ఊర్ధ్వగామి – ప్రణవము**



దేహములోని షట్‌చక్రములతో కూడిన (బ్రహ్మదండము - అని పిలువబడు) వెన్నెముక యందు అంతటా గల **అనాహతము (హృదయచక్రము) నందు ప్రణవము ఊర్ధ్వగామి** (Upwardly moving) గా ఉంటుంది. అట్టి ప్రణవము యొక్క ధ్వని దీర్ఘ ఘంటానినాదము (టంగ్... టంగ్) వలెను, అవిచ్ఛిన్నమగు తైలధారవలెను, ధ్యాసకు అనునిత్యమై, అనుక్షణికమై ఉంటుంది. **ప్రణవస్య ధ్వనిః తద్వత్ అగ్రం బ్రహ్మ చ ఉచ్యతే।**

అట్టి ప్రణవనాదమునకు ఆవల (అగ్రముగా) పరమార్థమై ఏర్పడియున్న (సమస్తమును కదిలించే - శబ్దీకరించే) చైతన్యమే 'బ్రహ్మము' అనబడుచున్నది. అట్టి నాదమును అగ్రముగా గల బ్రహ్మము →

- **జ్యోతిర్మయము.** సమస్తము తన యొక్క వెలుగుచే (By Virtue of its Enlightenment and Entertainment) నింపివేయుచున్నట్టిది.
- సూక్ష్మమగు బుద్ధికి మాత్రమే అనుభవరూపము. నోటితో 'ఇది' అని నిర్వచించజాలనిది. **అవాచ్యము.**

ఏ మహాత్ములు అద్దానిని ఎరిగినవారై ఉన్నారో వారే విదితవేద్యులు. అట్టి 'బ్రహ్మము'ను వేదవేత్తలు - "అహమ్,త్వమ్,జగత్" అనే వాటికి స్వస్వరూప బ్రహ్మమే మూలపదార్థము వంటిదిగా - అనునిత్యానుభవులై ఉంటున్నారు. ఇది - సమస్త ఆభరణములకు బంగారమే మూలపదార్థముగా అవటము వంటిది.

**హంస (సోఽహమ్) : జాగ్రత్ నేత్ర ద్వయోర్మధ్యే హంసయేవ ప్రకాశతే।** జాగ్రత్ నేత్రముల రెండింటి మధ్యగా ప్రకాశించుచున్నది హంసయే (ఆత్మయే)।

'స'కారము (సత్-ఉనికి యొక్క కేవలానుభవము) - 'ఖేచరీ' అనబడుచున్నది. "ఉన్నదంతా సత్‌స్వరూప పరబ్రహ్మమే. 'త్వమ్'గా సూచితమయ్యేదంతా (నీవు- నీవు అనబడుచూ ఉన్నదంతా) 'తత్' స్వరూపమే" - అను నిశ్చయమే - **'సదోపాసన'**.

(**ఖః** = ఆత్మాకాశము. **చరీ** = అట్టి ఆత్మయందు చరింపజేయు ముద్ర).

**'హ'కారము = 'హ' కారార్థమే జీవుడు. 'స'కారార్థమే పరమేశ్వరుడు. 'తత్' యే త్వమ్. 'త్వమ్'యే తత్।**

'స'కారమును (జీవాత్మను) తత్ బ్రహ్మముగా (తత్ త్వమ్‌గా) ధ్యానించువాడు. - సోఽహమ్ (అహమ్ తదేవ) స్థానమును సిద్ధించుకొనుచున్నాడు.

అనగా : **"నీవు బ్రహ్మమే"** అను సర్వకాల సర్వావస్థల అభ్యాసముచే **"నేను బ్రహ్మమే"** అనునది సిద్ధించుకొనబడుచున్నది.

(తత్ = త్వమ్ - **సాధన.** సోఽహమ్ = **సిద్ధి**)

-----

## "బంధము" అనునది ఎట్లా రూపము పొందుతోంది?

**ఇంద్రియైః బధ్యతే జీవః। ఆత్మాచ ఏవ న బధ్యతే॥** ఇంద్రియ వ్యాపారములు నిర్వర్తించుచుండగా, ఇంద్రియ విషయముల పట్ల ఏర్పడిన అనుబంధ - సంబంధ-బాంధవ్యములచేతనే జీవునకు **"నేను బద్ధుడను"** అని అనిపించటం జరుగుతోంది. జీవుడు స్వతఃగా ఆత్మ (తత్) స్వరూపుడే. ఆత్మగా ఈజీవునికి బంధ మెక్కడిది? లేనే లేదు.

| **సందర్భమాత్రమగు జీవాత్మగా ముక్తి లేదు.**<br>**కేవలమగు ఆత్మగా బంధము లేదు.** |
|---|

జీవాత్మ = పరమాత్మ పట్ల కల్పితము, సందర్భ పరిమితము మాత్రమే! (ఆకాశంలో సూర్యుడువంటి వాడు - **'పరమాత్మ'**. జలంలో ప్రతిబింబిచే సూర్యుడువంటివాడు - **'జీవాత్మ'.**

## జీవుడు - కేవలుడు

**(అహమిత్యేవ బంధాయ। నాహమిత్యేవ మోక్షయే।)** "ఇది నాది. నాకు చెందినది. నేను చేస్తున్నాను. నాకు సంబంధించినది. వీరు నావారు. నేను వీరికి చెందినవాడను" - అనునదే **"మమత్వము".**

**మమత్వేన భవేత్ జీవో। నిర్మమత్వేన కేవలః॥** మమత్వము చేతనే (పరమాత్మ స్వరూపుడై కూడా) ఈతడు జీవుడు అగుచున్నాడు.

**"మమకారము"** అనే భ్రమ తొలగిందా, ఇక ఈ జీవుడు కేవల స్వరూపుడై, **"కైవల్యము"** సిద్ధించుకొనుచున్నాడు. **"నాది" అనునది ప్రక్కకు పెట్టి చూస్తే, ఈ "నేను" (లేక నీవు) బ్రహ్మము కాని క్షణమే లేదు.**

**ఓంకార 'సంజ్ఞ'యగు కేవలాత్మ (లేక) స్వస్వరూపాత్మ యొక్క అంశలు (లేక) మాత్రలు :** ఈ భౌతికమగు భూలోకము, మనో నిర్మితమగు భువర్లోకము, దివ్య-దేవతాంశలగు సువర్లోకము, (అట్లాగే) సోమ సూర్య అగ్ని దేవతలు... ఇవన్నీ ఎద్దాని యొక్క అంశలు / మాత్రలు అయిఉన్నదో, **అట్టి ఓంకారార్ధ పరమాత్మయే ఇదంతా.**

[ ఓం = Exhibitor of matter **(భూ)** + Thought **(భువః** + Thinker **(సువః)** ]

అట్లాగే,

క్రియ-ఇచ్ఛ - జ్ఞానములు, వాటివాటి అధి దేవతలగు బ్రాహ్మీ, రౌద్రీ, వైష్ణవీ జగన్మాతలు - ఈ మూడు రీతులైన మాత్రాస్థితిస్థానము ఎచ్చట ఏర్పడిఉన్నవో,.. అదియే పరంజ్యోతి స్వరూపమగు **'ఓం'.**

## జపము - నమస్కారము

**వచసా తత్ జపేత్ నిత్యం। వపుషా తత్ సమభ్యసేత్।** నిత్యము వాక్కుతో అట్టి పరంజ్యోతి స్వరూపమునకు నమస్కరించాలి. **అక్షరరూపమగు 'ఓం'నే భావనాపూర్వకంగా జపించాలి. శరీరముతో సేవించాలి. సమస్తమును ఓంకార స్వరూపులుగా భావనచే భావించాలి. "సమస్తము సర్వదా 'ఓం' కారపరబ్రహ్మ స్వరూపమే కదా"** అను నిశ్చలమగు నిశ్చయమును ఆశ్రయించి ఉండాలి. **ఏకమగు ఆత్మ (ఓం)యే అనేకముగా ప్రదర్శనమగుచూ, సర్వదా తన ఏకాత్మత్వము వీడకయే ఉన్నది** - అనునదే ఓంకారోపాసన।

***- మనస్సుతో అట్టి పరంజ్యోతి స్వరూపమగు 'ఓం'నే మననము చేస్తూ ఉండాలి.***

## అస్పృశ్యత

ఈ విధంగా ఎవ్వడైతే - శుచిగా గాని, అశుచిగాగాని ఎల్లప్పుడు అట్టి ప్రణవమును జపిస్తూ ఉంటాడో,.. అట్టివాడు తామరాకును నీరు అంటని విధంగా పాపపుణ్య ద్వంద్వములచే స్పృశించబడడు.

⌘ వాయువు చలిస్తూ ఉంటే, బిందువు (ఏకాగ్రమగు ఆత్మ భావన)కూడా చంచలము అయిపోతూ ఉంటుంది.

⌘ (ప్రాణ - అపానముల ఏకస్థాన ధారణా - అభ్యాసముచే) వాయు నిశ్చలత్వముచే బిందువు (ఆత్మభావనా ఏకాగ్రత) కూడా నిశ్చలమవగలదు.

⌘ వాయు నిరోధ అభ్యాసముచే (ప్రాణాయామ అభ్యాసముచే, కుంభకాభ్యాసముచే) యోగి ఆత్మనిశ్చలరూపమగు స్థాణుత్వము పొందుచున్నాడు.

ఎంతెంతవరకు ప్రాణ-అపాన సమరసాభ్యాసముచే వాయువు దేహములో నిశ్చలమగుచున్నదో, అంతంత వరకు ఆ యోగి దృశ్య వ్యవహారములలో తన్మయుడై మునుగడు. వాయు నిరోధము సిద్ధించుకొన్నవాడు - దేహముల రాకపోకలతో సహా ఈ సమస్తమునకు అతీతుడౌతాడు. ఆతనికి మరణ పరిమితత్వము ఆపాదితమాత్రమే అవుతుంది. ఆతని పట్ల దేహముల రాకపోకలు - "వస్త్రధారణ, విసర్జన" వంటివిగా - దర్శితమగుచున్నాయి. వాయువు దేహము నందు బంధించినంత సమయము జీవుడు సంసార భ్రమలందుపడడు. భ్రూమధ్య గల అంతరాకాశములో దృష్టిని నిలిపినంత కాలము ఇక ఆ యోగికి సంసార- దృశ్య సంబంధమైన భయమేముంటుంది? ఉండదు. ఈ దృశ్యమంతా ఆతనికి **"ఎవరో కళాకారుడు నా వినోదముకై కల్పిస్తూ ఉన్నది"** - అని అనిపించగలదు.

సృష్టికర్త అగు బ్రహ్మదేవుడంతటివాడు కూడా అల్పకాలభయములు (అవాంతర ప్రళయములు) కలుగు సందర్భములో. ప్రాణాయామపరుడై, "వేరుగా ఉండి, మౌనముగా చూస్తూ ఉండటము" - ను అభ్యసిస్తున్నాడు. **అల్పకాలభయాత్ బ్రహ్మా, ప్రాణాయామ పరో భవేత్।** కాబట్టి యోగులు, మునులు కూడా ప్రాణాయామపరులై ఉండటము ఆవస్యకము. అది **"సాక్షీభావ యోగసిద్ధి"** - ప్రసాదించగలదు.

– హంస (రేచక రూపంగా) 24 అంగుళముల దూరము బహిర్గతంగా ప్రయాణము ఏస్తూ ఉంటోంది.

వామ (ఇడ) – దక్షిణ (పింగళ) మార్గంగా రేచక – పూరక – కుంభక – పునఃరేచకరూపములగు ప్రాణాయామ ద్వయము యోగాభ్యాసముగా చెప్పబడుతోంది.

సామాన్యస్థితో నాడీ చక్రములో అనేక అపరిశుద్ధ పదార్ధములు (లోక వ్యావహారిక క్రియల కారణంగా – ఏర్పడే భావాభావములు) గూడు కట్టుకొని ఉంటున్నాయి. ఈ విధంగా అనేక మలములచే 'మలాకులము' అయినట్టి నాడీ చక్రము – ప్రాణాయామముచే పరిశుద్ధము అగుచూ ఉండగా, ఆ యోగి ప్రాణములను స్వకీయ శక్తిరూపముగా దర్శించు సామర్థ్యమును పొందటము జరుగగలదు. ప్రాణశక్తితో ప్రకాశించుచూనే, జన్మ-కర్మల పట్ల **"స్వాతంత్రుడు"** అగుచున్నాడు.

# ప్రాణాయామద్వయము

**మొదట బద్ధ పద్మాసనము ధరించును గాక।**

(1) **చంద్రనాడీ – ఇడా కుంభకము –** కుడి ముక్కు పుటమును కుడిచేతి బొటనవేలుతో బిగించి, ఎడమ ముక్కు పుటము ద్వారా గాలిని పూరకం చేసి, చంద్రనాడి (ఇడానాడి)లో పూరించి, యథాశక్తిగా కుంభకము చేసి.. ఆ తరువాత సూర్యనాడి ద్వారా వదలాలి (రేచకం చేయాలి). ఇది 'ప్రాణాయామద్వయము'లో మొదటిది.

(2) **సూర్యనాడీ – పింగళా కుంభకము –** ఆ తరువాత పింగళనాడిలో పూరక – కుంభకము ఇడద్వారా రేచకము. ఇది ప్రాణాయామ ద్వయములో రెండవది.

ఈ విధంగా **"ద్వివిధ ఇడా పింగళ నాడీ ప్రాణాయామము"** చేస్తున్నప్పుడు – ధ్యానోపాయములు –

| | |
|---|---|
| ***చంద్రనాడీ కుంభకము చేస్తున్న సమయములో*** | ఆవుపాల రంగుతో సమానమైనట్టి చంద్రబింబమును ధ్యానించుటచే సుఖవంతుడు కాగలడు. |
| ***సూర్యనాడీ(పింగళనాడీ) కుంభకము ధారణ చేస్తూ ఉన్నప్పుడు*** | ప్రకాశించుచున్న సూర్యమండలమును ధ్యానించుచూ ఉండటం చేత అట్టి ప్రాణాయామము సుఖవంతము కాగలదు. |

→ **ప్రాణంచేత్ ఇడయా పిబేత్ నియమితమ్।** ప్రాణశక్తిని నియమితముగా ఇడానాడీ ద్వారా త్రాగి,
→ **భూయో అన్యయా రేచయేత్** → పింగళనాడితో రేచకము చేయాలి (వదలాలి).
**మరల పింగళనాడితో ప్రాణశక్తిని పీల్చి, ఇడనాడిలో రేచకము చేయాలి (వదలాలి).**

ఈ విధంగా సూర్య-చంద్రమసముల బిందు ద్వయమును ధ్యానము చేయు యోగాభ్యాసి యొక్క నాడీ చక్రము 2 నెలలు దాటగానే దోషములన్నీ పోయి శుద్ధము కాగలదు.

# ధారణ – ప్రదీపన – శోధనములు

ఈ విధంగా(1) ఇష్టమనిపించినంత (కష్టము అనిపించనంత) సమయము **వాయు ధారణము చేయటము,**

(2) ప్రాణ – అపానముల సంయోగముచే జనించు **అగ్నిని ప్రజ్వలింపజేయుటము (ప్రదీపనము).**

(3) **నాడీ శోధనము..**

ఈ యోగాభ్యాసములచే నాదము అభివ్యక్తమగుచూ, శరీరమంతా ఆరోగ్యముగా ఉండగలదు.

→ **ప్రాణోయావత్ స్థితో దేహే అపానంతు నిరోధయేత్॥** దేహములో ప్రాణము (లోపలికి వస్తున్న వాయు) స్థిరమై ఉన్నంత సేపు, అపానమును (బయటకు వెళ్లుచున్న వాయువును) నిరోధిస్తూ అపానమును వెనుకకు మరల్చి ప్రాణముతో పరస్పర ఏకస్థాన సంయోగము చేస్తూ ఉండాలి.

**మాత్రా** = ఒక శ్వాస (గాలి పీల్చి, వదలునంత సమయము) – **ఏకశ్వాసమయీ 'మాత్రా'** (1) ఒకసారి గాలి పీల్చి – వదలు సమయము (2) చిటికవేయునంత కాలము.

**రేచక –పూరక కుంభకములు** – (1) వదలటము, (2) పీల్చి నింపటము (3) ధారణ చేయటము (4) పునఃవదలటము

**ప్రణవాత్మకమైన = ప్రాణాయామము** – "ఓం" అని ఉచ్చారణ చేస్తూ గాలిపీల్చి – కుంభించి – వదలటము.

**శ్లో॥ మాత్రా ద్వాదశ సంయుక్తౌ దివాకర – నిశాకరౌ**
**దోషజాలమ్ అబధ్నంతే జ్ఞాతవ్యౌ యోగిభిః సదా॥**

(1) దివాకర (పింగళా పూరక కుంభక ఇడా రేచకము) (2) నిశాకర (ఇడా పూరక కుంభ పింగళా రేచకము)

ఈ ఉభయము 12 × 2 మాత్రల కాలముగా చేస్తూ ఉండగా దోషములన్నీ తొలగుతాయి. కాల నిర్ణయ యోగాభ్యాసమునకు ముందుగా ఈ ఈ ప్రణవాత్మకమై 12 మాత్రల ప్రాణాయామము చేయటమును యోగులు తెలుసుకొని అభ్యసిస్తూ ఉండాలి.

**ఆ తరువాత దీర్ఘకాల ప్రాణాయామమునకు ఉపక్రమించవచ్చు.**

***యోగాభ్యాస ప్రాణాయామము ఈ క్రింది విధంగా శ్రద్ధగా అభ్యాసము చేయాలి.***

పూరకము = 12 'ఓం'కారములు (లేక మాత్రలు)

కుంభకము = '16' ఓంకారములు (లేక మాత్రలు)

రేచకము = '10' ఓంకారములు (లేక మాత్రలు)

***ప్రాణాయామములో – 'కుంభక' కాలము.***

**అధమ** – దిగువ తరగతి – 12 మాత్రలు

**మధ్యమ** – మధ్య రకము – 12×2=24 మాత్రలు

**ఉత్తమ** – ఉత్తమము – 12×3=36 మాత్రలు

అని ప్రాణాయామ విధి గురించిన నిర్ణయము.

***ప్రాణాయామములో ప్రారంభ – ఉత్తరోత్తర గుర్తులు :***

**అధమే** – స్వేద (చమట) జననము (Sweating).

**మధ్యమే** – కంపన (Shrivering).

**ఉత్తమమ్** – స్థానసిద్ధి.

**తతో వాయుం నిరుంధయేత్ ।** ఈవిధంగా వాయువును నిరోధించటము చేయాలి.

## ప్రాణాయామ విధి – విధానములు

→ మొట్టమొదట **'పద్మాసనము'** ధరించాలి. (లేక సుఖాసనము అవధరించాలి).

→ గురుదేవులకు, సర్వాత్మకుడు, సర్వ శుభంకరుడు అగు శివ భగవానునికి నమస్కరించాలి. ప్రశాంతముగా కొన్ని క్షణములు గడపాలి.

→ ముక్కుకు పైభాగంగా (ఉపరిగా గల – ఆజ్ఞాచక్రాకాశములో) దృష్టిని నిలపాలి.

→ అప్పుడిక పైన చెప్పిన విధంగా ప్రాణాయామభ్యాసమును నిర్వర్తించాలి.

→ నవద్వారములలో ('2' కళ్లు, '2' చెవులు, ముక్కు, గుదము, శిశ్నము, బ్రహ్మరంధ్రము) **"వాయు కుంభకము"**ను భావిస్తూ ప్రాణాయామము నిర్వర్తిస్తూ ఉండాలి.

→ అపానమును ఊర్ధ్వమునకు లాగుచూ, అపాన వహ్ని సహితమైన శక్తితో కూడి కాలమును జయిస్తూ **"కాలంఃకాలుడు, కాలనియామకుడు"** – అగు **కేవలాత్మ శివ భగవానుని** ధ్యానించాలి.

→ క్రమంగా కుండలినీ శక్తిని చాలనం చేస్తూ సుషుమ్నా ప్రవేశము చేయించి, ఆజ్ఞాచక్రము వరకు నడిపించి, మూర్ధ్ని స్థానములో కుంభకమును అభ్యసిస్తూ ఉండాలి.

**యావత్ తిష్ఠతి, తావత్ ఏవ మహతాం సంగో న సంస్తూయతే।** ఎంతవరకు మూర్ధ్ని స్థానములో ప్రాణాయామ విధిగా యోగాభ్యాసి తిష్ఠించినవాడై ఉంటాడో అట్టిమహాత్మునకు **'సంగము'** (Attachment) అనే దోషము ఉండదు. (ఆజ్ఞాచక్రము సమస్త ఇంద్రియములకు ఆవలగా ఉన్న యోగభావనాకాశము)

ఈ విధంగా ప్రాణాయామము..,

→ **పాతక – ఇంధనేన పావకః। – 'పాపములు'** అనే కట్టెలకు **అగ్ని.**

→ **'భవము' అనే (భవ) సాగరమునకు మహాసేతువు। భవోదధి మహాసేతుః।। (భవరోగము = "ఈ దృశ్యము నిజమే" – అను స్వతఃగా – 'నాస్తి' వస్తువుపై నమ్మకము, 'అస్తి' భావన).**

- **ఆసనముచే** (పద్మాసనము మొ।।వాటిచే) రోగములు పోతాయి.
- **ప్రాణాయామముచే** పాతకములు తొలగుతాయి.
- **ప్రత్యాహారముచే** మనోవికారములు సమసిపోతాయి.
- **ధారణచే** మనోధైర్యం రూపుదిద్దుకొంటుంది. అద్భుతమైన ఉత్సాహ–సాహస– ధైర్య – బుద్ధి–శక్తి –పరాక్రమ సమన్వితమైన చైతన్యము సముత్సాహమై ప్రకాశమానమౌతుంది.
- **సమాధిచే** – శుభాశుభకర్మలన్నీ త్యజించబడగా మోక్షము కరతలామలకము కాగలదు.

**"జీవాత్మ నా యొక్క కల్పన. అద్దానికి ముక్తిని ఇవ్వవలసిన అవసరం లేదు. పరమాత్మగా నేను నిత్యముక్తుడను"** – అను ధారణ అనునిత్యమౌతుంది.

### ప్రాణాయామ – ప్రత్యాహార – ధారణ – ధ్యాన – సమాధులు

- **ప్రాణాయామ ద్విషట్కము** (6×2 ప్రాణాయామములు)→ **'ప్రత్యాహారము'** అగుచున్నది.
- 12 ప్రత్యాహారములు → శుభప్రదమగు **'ధారణ'** అగుచున్నది.
- 12 ధారణలు → (ఒక) **ధ్యానముతో** సమానము.
- 12 ధ్యానములు → **'సమాధి'** అని అనబడుచున్నది.

**శ్లో।। యత్ సమాధౌ పరంజ్యోతిః అనంతం విశ్వతోముఖమ్**
**తస్మిన్ దృష్టే క్రియాకర్మ యాతాయాతో న విద్యతే।।**

అట్టి 'సమాధి' యందు అనంతము, విశ్వతోముఖము అగు పరంజ్యోతి (పరమాత్మత్వము) సందర్శనమగుచున్నది. అట్టి **"స్వస్వరూపాత్మ పరంజ్యోతి"** సందర్శనముచే సమస్త క్రియాకర్మల యొక్క యాత – ఆయాతములన్నీ (కష్ట–సుఖభావములన్నీ) మొదలంట్లా తొలగిపోతాయి.

## హృదయాకాశ స్వాభావిక కుంభక సిద్ధి

- సుఖాసనమును అభ్యాసపూర్వంగా (సంబంధాసనము) ధరించి,
- మేఢ్రమును (మూలాధార ఉపరిభాగమును) అంఘ్రియుగళము (పాదద్వయము)తో బంధించి, చెవులు – కళ్ళు– ముక్కు పుట ద్వారములను అంగుళులచే (వ్రేళ్ళచే) నియమించి కుంభకము ఆచరిస్తూ,
- నోటితో వాయును పూరించి,
- రొమ్ము వద్ద గాలిని కుంభించి,
- బహు – అపాన సహితంగా (క్రిందకు పోవు వాయువును పైకి లాగుచు) శిరస్సును ధారణ చేయటము.

ఈ విధంగా యోగసాధన చేయుచుండగా, ఆత్మతో ఆత్మగా తన్మయుడగుచూ, ఆ జీవుడు విశేషమైన **"తత్త్వ సమత్వము"** సిద్ధించుకొని **'యోగీశ్వరుడు'** కాగలడు.

### నాద సిద్ధి

వాయువు శిరో ఆకాశమును ప్రవేశించుచుండగా మహత్తరమైన 'ధ్వని' ఉత్పతన్నమగుచున్నది. అది గంట మొదలైనవి వాయించు ధ్వని వంటిది. అట్టి గంటానాదము వినబడటము 'నాదసిద్ధి' అని అనబడుచున్నది.

## ప్రాణాయామ ప్రయోజనములు :

ప్రాణాయామ అభ్యాసముచే సర్వరోగములు క్షయించగలవు. ప్రాణాయామాభ్యాసము ఆశ్రయించకపోతే సర్వరోగములకు చోటు ఇస్తున్నట్లే అవుతుంది. ఎక్కిళ్ళు, గొంతు గరగర, శ్వాస సమస్యలు, తలపోటు, పార్శ్వంనొప్పి, చెవి పోటు మొదలైన అనేక శారీరక వ్యాధులన్నీ వాయు వ్యత్యాసము వల్లనే (శరీరములో వాయు ప్రసరణ ఆయా ప్రదేశములలో అధికంగానో, అల్పంగానో జరుగుటచేతనే) ఏర్పడుచున్నాయి. ప్రాణాయామ యోగాభ్యాసముచే వాయువు దేహమంతా సమత్వము పొందినదై, అనేక వ్యాధులు దరిజేరకుండా చేయగలదు.

సింహము, ఏనుగు, పులి, పాము మొదలైన జంతువులను తెలివిగా, మెల్లగా, విధి విధానంగా ప్రయత్నిస్తే అవి మానవునికి వశమౌతున్నాయి. ఉపాయము తెలియకపోతేనో? అవి మానవునికి హాని కలుగజేస్తాయి. అదేవిధంగా, **విధి –విధానములతో కూడిన ప్రయత్నము** చే దేహములో సంచరించే పంచప్రాణములు ఈ జీవునికి వశమై సమస్త శుభములు కలుగజేస్తాయి. ఉపాయముతో కూడిన అభ్యాసము లేకపోతేనో? ఆ పంచప్రాణములే తమ యొక్క అపసర్గసంచారములచే దేహములో అనేక వ్యాధులు జనించటానికి కారణము కాగలవు.

ఈవిధంగా ప్రాణ **చలనముతో స్నేహమే 'ప్రాణాయామము' యొక్క ఉద్దేశ్యము.** అది క్రమంగా 'ప్రాణ–ఈశ్వరత్వము' ప్రసాదించగలదు.

### యుక్తం యుక్తం – రేచకమ్ – పూరకము – కుంభకమ్

*యోగాభ్యాసములో యుక్తియుక్తము (ఉపాయము, తెలివి) కలిగి ఉండాలి.*

**– యుక్తం యుక్తంగా త్యజేత్ వాయుః –** యుక్త యుక్తంగా మెల్లమెల్లగా వాయువును వదలుచూ ఉండాలి. యోగవేత్తలు చెప్పే విధంగా రేచకము చేయాలి. కొంచము కొంచముగా ప్రారంభించి, వృద్ధి చేసుకోవాలి. **సాధ్యమైనదే సాధన.**

**– యుక్తం యుక్తం ప్రపూరయేత్।** యుక్తయుక్తంగా ప్రపూరించాలి. పూరకము నిర్వర్తించాలి.

**– యుక్తం యుక్తం ప్రబధ్నీయాత్ ।** యుక్తం యుక్తంగా ప్రపూరణము (వాయు కుంభకము) నిర్వర్తించాలి.

అప్పుడు తప్పక యోగసిద్ధి లభించగలదు. **అంతేగాని హఠించి శరీరమును బాధించుకోవటము కూడదు.**

### ప్రత్యాహార – మహత్ భవమ్।

**ప్రత్యాహారము : చరతాం చక్షురాదీనాం విషయేషు యథా క్రమమ్, తత్ ప్రత్యాహరణం తేషామ్, "ప్రత్యాహారః" స ఉచ్యతే।**
ఈ కళ్లు మొదలైన ఇంద్రియములు ఎల్లప్పుడు అవిశ్రాంతంగా లౌకిక విషయాలవైపుగా ఆకర్షణ పొందినవై విశ్రాంతి – శాంతి లేకుండా ప్రవర్తిస్తూ ఉన్నాయి. అట్టి పంచేంద్రియములను దృశ్య వ్యవహారముల నుండి (ధ్యాస యుక్తంగా) వెనుకకు మరల్చి, ఆత్మతత్త్వజ్ఞానమార్గములో నియమించటమే **"ప్రత్యాహారము"** అని పిలువబడుచున్నది. ఏ విధంగా అయితే సాయంకాలం అయ్యేసరికి సూర్యకిరణాలు జగత్ పదార్థముల నుండి వెనుకకు మరలి, తిరిగి సూర్యగోళంలో యధాస్థానము పొందుచున్నాయో...,

అదేవిధంగా →

(ద్వంద్వమును అధిగమించినప్పటి) తృతీయకాలంలో ప్రత్యాహార – అభ్యాస ప్రభావం చేత మనస్సు విషయముల నుండి విరామము పొంది, సర్వ వికారములను త్యజించి, స్వస్థానమగు **ఆత్మయందు ప్రవేశించి రమించగలదు.**

**అట్టి ఆత్మత్వము ఈ జీవునియొక్క స్వాభావిక సత్యమే అయి ఉన్నది. అద్దాని అవ్యాజ, అనునిత్య, అచ్యుత, నిశ్చలానుభవమే "యోగము" యొక్క పరమ – పరమ లక్ష్యము.**

**ఆత్మౌపమ్యేవ సర్వత్ర సమం పస్యతి॥**

*ఇతి యోగచూడామణ్యుపనిషత్*
*ఓం శాంతిః। శాంతిః। శాంతిః।*

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 12 వజ్రసూచికోపనిషత్

## (లేక) వజ్రసూచ్యుపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ చిత్ సదానంద రూపాయ-సర్వ 'ధీ' వృత్తి సాక్షిణే।
నమో వేదాంత వేద్యాయ-బ్రహ్మణే, అనంతరూపిణే॥

శ్లో॥ యత్ జ్ఞానాత్ యాంతి మునయో-బ్రాహ్మణ్యమ్ పరమాద్భుతమ్,
తత్ త్రైపద బ్రహ్మతత్త్వమ్-అహమస్మి- ఇతి చింతయే॥

ఓ చిత్ - సదానందరూపా। సమస్త జీవుల బుద్ధి వృత్తుల సాక్షి స్వరూపా! వేదాంతవేద్యా! అనంతరూపా! పరబ్రహ్మమా! నమో నమః

" ఏ జాగ్రత్ స్వప్న సుషుప్తి త్రిపదములకు, త్రైలోక్యములకు ఆవలగల బ్రహ్మతత్త్వమును తమ తపో-ధ్యానములచే ఎరిగిన మునివరేణ్యులు అట్టి పరమాద్భుత తత్ స్థానముగా ప్రకటించుచున్నారో - అట్టి పరమాత్మతత్త్వమే నేనైయున్నాను"- అను అనుచింతన చేయుచుండెదముగాక।

**ఓం।**

**1. వజ్రసూచీం ప్రవక్ష్యామి-**
**శాస్త్రమ్ అజ్ఞాన భేదనమ్।**
**దూషణం జ్ఞాన హీనానాం।**
**భూషణం జ్ఞానచక్షుషామ్॥**

అజ్ఞానమును మొదలంట్లా ఛేదించగలిగినట్టిది, జ్ఞానహీనత్వము (జ్ఞానరాహిత్యము)ను దూషించి దులిపివేయునది, జ్ఞానచక్షువులు కలవారికి ఆభరణమై ప్రకాశించగలిగినది, ఆత్మజ్ఞాన ప్రతిపాదకము అయినట్టి వజ్రపు సూచిక (సూది)తో సమానమైన శాస్త్ర సమన్వయ విశేషము ఇప్పుడు చెప్పుకుంటున్నాము.

---

**2. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రా**
**ఇతి చత్వారో వర్ణాః।**
**తేషాం వర్ణానాం 'బ్రాహ్మణ' ఏవ ప్రధాన।**
**- ఇతి వేదవచనానురూపం।**
**- స్మృతిభిః అపి ఉక్తమ్। (అప్యుక్తమ్)।**
**తత్ర చోద్యమస్తి॥**

చతుర్వేదములు, స్మృతులు, పురాణములు ఈ విధంగా చెప్పుకొస్తున్నాయి.

వర్ణములు → **బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - శూద్రులనబడు నాలుగు విధములైనవని. వీటిలో బ్రాహ్మణవర్ణము ప్రధానమైనది.**

అట్టి వాక్యముయొక్క ఉద్దేశ్యమేమిటో అందులోని విశేషము ఎటువంటిదో - విచారణ చేయవలసినదై ఉన్నది.

---

**3. కోవాబ్రాహ్మణో నామ?**
**కిం జీవః?**
**కిం దేహః?**
**కిం జాతిః?**
**కిం జ్ఞానం?**
**కిం కర్మ?**
**కిం ధార్మికః? - ఇతి**

వేద-ఇతిహాస పురాణములలో చెప్పుచున్న **"బ్రాహ్మణుడు"** అనగా ఎవరు? ఎవరినిని ఆ పేరుతో చెప్పుతూ, 'ప్రధానుడు' అని అంటున్నారు?

- ఆతడు అందరివంటి జీవుడేనా? కాదా? ఏ జీవుడు 'బ్రాహ్మణుడు'గా అనబడుచున్నారా?

- దేహము దృష్ట్యా (జన్మతఃగా) బ్రాహ్మణుడుగా చెప్పబడుచున్నారు?

- జాతిచేత ఒకడు బ్రాహ్మణుడని వేద - స్మృతుల ఉద్దేశ్యమా?

- లేక ఒకని **'జ్ఞానము'**ను అనుసరించి ఆతడు 'బ్రాహ్మణ' నామధేయమునకు అర్హుడగుచున్నాడా?

కాక **"ఈ ఈ కర్మలు నిర్వర్తించు వారు బ్రాహ్మణులు. కర్మలచేత బ్రాహ్మణులగుచున్నారు?"**....అనునది వేద - స్మృతులు అభిప్రాయమా?

- అట్లా కాకుండా ఒకడు ఆచరించే దాన ధర్మమును అనుసరించి బ్రాహ్మణుడని నిర్వచనమా? (ధార్మికతను అనుసరించియా?)

**4. తత్ర ప్రథమో జీవో**
**'బ్రాహ్మణ' ఇతి చేత్, తత్ న।**
**అతీతాన్ ఆగతాన్ అనేక దేహానాం**
**జీవస్య ఏకరూపత్వాత్।**

జీవులలో జన్మానుసారము మొట్టమొదటగా పుట్టినవారు బ్రాహ్మణులా? కాదు. జీవులందరి జన్మలు ఒకతీరైనవే కదా।
'బ్రాహ్మణుడు' అనగా ఒక ప్రత్యేకమైన 'జీవుడు' అనునది సమాధానం కాదు. 'జీవులలో ఒక విభాగము' కాదు. జన్మతః వచ్చేది బ్రాహ్మణ్యము కాదు. దేహము దృష్ట్యా బ్రాహ్మణుడు ప్రత్యేకమైనవాడా? 'జన్మనా జాయతే శూద్రః' అని కదా స్మృతివాక్యము। అందుచేత 'బ్రాహ్మణుడు' - అనగా జీవులలో ఒక విశేషమైన దేహముకలవాడు కాదు.
అట్లాగే, ఒకానొక జీవునిపట్ల - గడచిపోయినట్టి, రాబోవునట్టి అనేక దేహములు జీవునికి సమానమైనవే గాని, **'ఒకదేహము బ్రాహ్మణ దేహము, మరొకటికాదు'** - అనునదేమీ 'దేహి'కి ఉండదు.

---

**ఏకస్యాపి కర్మవశాత్**
**అనేక దేహసంభవాత్**
**సర్వ శరీరాణాం జీవస్య**
**ఏకరూపత్వాత్ చ।**
**తస్మాత్ న జీవో 'బ్రాహ్మణ' ఇతి॥**

జీవుడు సర్వదా ఒక్కడే అయి కూడా కర్మవశంగా ఆతనిపట్ల అనేక దేహములు సంభవిస్తూ ఉంటున్నాయి. (వస్తూ-పోతూ ఉంటున్నాయి).
ఒక జీవుడు పొందే అన్ని దేహములలోను జీవుడు ఏకరూపుడేగాని, ఒక్కొక్కదేహములో ఒక్కొక్కరూపుడుగా (Different to Different) అవడుకదా! అందుచేత **"జీవులలో కొందరే బ్రాహ్మణులు"** అనలేము. అట్టి ఒక దేహమును ఉద్దేశ్యించి "జీవులలో మొట్టమొదటి విభాగము బ్రాహ్మణులు" - అన వీలు కాదు.

---

**5. <u>తర్హి దేహో 'బ్రాహ్మణ' ఇతి చేత్న।</u>**
**ఆచాండాలాది పర్యంతానాం**
**మనుష్యాణాం పాంచభౌతికత్వేన**
**దేహస్య ఏకరూపత్వాత్,**
**జరామరణ ధర్మ-అధర్మాది సామ్య దర్శనాత్,**

ఒకని "భౌతిక దేహమును అనుసరించి ఈ జీవుడు 'బ్రాహ్మణుడు' (లేక) బ్రాహ్మణ దేహమును ఇప్పుడు ధరించుచున్నాడు" - అని కూడా అనలేము.

చండాలుడుగా చెప్పబడువాడు మొదలుకొని, ఏ మనుష్య దేహమైనా కూడా పృథివి-జల-తేజో-వాయు-ఆకాశములనబడే పంచభూతముల చేతనే నిర్మించబడుచున్నది. (ఎవ్వరి భౌతిక దేహమైనప్పటికీ పాంచభౌతిక నిర్మాణమే). కాబట్టి దేహములన్నీ ఏకరూపములే. ఒక ముక్కు, రెండు కళ్లు మొ॥వి అందరికీ సమానమే కదా!

- భౌతిక దేహములన్నిటికీ జరామరణ - జన్మ కర్మ ధర్మములు ఒక తీరైనవే కదా!

---

**"బ్రాహ్మణః-స్వేతవర్ణః, క్షత్రియో - రక్తవర్ణః,**
**వైశ్యః - పీతవర్ణః, శూద్రః - కృష్ణవర్ణ" ...**
**ఇతి నియమ-అభావాత్।**

- "బ్రాహ్మణులంటే తెల్లగా ఉంటారు. క్షత్రియులు ఎర్రగా ఉంటారు. వైశ్యులు పసుపుపచ్చగా ఉంటారు. శూద్రులు నల్లగా ఉంటారు" అను నియమము ఏదీ శాస్త్రములచే, వేదములచే చెప్పబడటము లేదు. ప్రపంచములో అట్లా కనబడటము లేదు.

---

**పిత్రాది శరీర దహనే పుత్రాదీనాం**
**బ్రహ్మహత్యాది దోష(న) సంభవాచ్చ।**
**తస్మాత్ న దేహో**
**'బ్రాహ్మణ' ఇతి।**

ఒకవేళ పాంచ భౌతికదేహమునుబట్టి ఒకడు 'బ్రాహ్మణుడు' అని అనవలసి వస్తే, మరణానంతరము ఆయన దేహమును దహనము చేస్తున్నప్పుడు ఆ కుమారుడు మొదలైనవారికి **'బ్రహ్మహత్యాదోషము'** ఆపాదిస్తామా? అట్లా అంటుతోందా? లేదే! అందుచేత జన్మతఃగాని, భౌతికదేహమును అనుసరించిగాని - **"ఈతడు బ్రాహ్మణుడు. చాతుర్వర్ణ్యములలో శ్రేష్ఠుడు"**...అనేమాట కుదరదు.

---

**6. <u>తర్హి జాతిః బ్రాహ్మణ</u>**
**<u>ఇతి చేత్, తత్ న।</u>**
**తత్ర జాతి అంతర జంతుషు**
**అనేక జాతి సంభవాత్।**
**మహర్షయో బహవః సంతి।**
**ఋష్యశృంగో→ మృగః।**

'జాతి'ని బట్టి ఒకడు 'బ్రాహ్మణుడు' అని వేదముల ఉద్దేశ్యమా? కానే కాదు.

ఎందుకంటారా?

అన్ని జాతులలో బ్రాహ్మణులు ఉండవచ్చుకూడా।
ఒక జాతినుండి కాలక్రమేణా మరల అనేక జాతులు విస్తరించి లోక ప్రసిద్ధమై ఉన్నాయి. బ్రహ్మణునకు పుట్టినవాడు 'బ్రాహ్మణుడు' - అను జాతిక్రమవాక్యం లోక పరిభాష అవవచ్చుగాక। అది వేదనిర్వచనమునకు

కౌశికః → కుశాత్।
జంబూకో→ జంబుకాత్।
వాల్మీకో → వల్మీకాత్।
వ్యాసః → కైవర్తక న్యాయామ్।
శశపృష్ఠాత్ – గౌతమః।
వసిష్ఠ – ఊర్వశ్యామ్।
అగస్త్యః – కలశే జాత।

సరిపోదు. 'మహత్ ఋుత్' (పరమ సత్యమును) సిద్ధించుకున్న సుప్రసిద్ధులగు మహర్షుల జననముల గురించి అనేకవిధములైన చరిత్రలను పురాణములు అభివర్ణిస్తున్నాయి. వారందరు 'బ్రాహ్మణ' శబ్దముచే సగౌరవించబడుచున్నారు.

**ఉదాహరణకు :**

**ఋుష్యశృంగమహర్షి** - జింక గర్భము నుండి జన్మించారు.

**కౌశికమహర్షి** - దర్భలనుండి పుట్టారు.

**జంబూకమహర్షి** - జంబూకము (నక్క) గర్భము నుండి పుట్టారు.

**వాల్మీకి మహర్షి** - మొట్టమొదట 'రత్నాకరుడు' అను పేరుతో ఒక ఆటవిక జాతివాడై, ఆ తరువాత వల్మీకము (పుట్ట)నుండి బయల్వెడలారు.

**వ్యాసమహర్షి** - కైవర్తక (జాలరి) న్యాయముచే చేపలు పట్టు వృత్తిగల మత్స్యగంధి గర్భము నుండి జనించారు.

**గౌతమమహర్షి** - శశి పృష్ఠము నుండి (కుందేటి వీపునుండి) పుట్టారు.

**వసిష్ఠ మహర్షి** - ఊర్వశి (అనే శ్రీమన్నారాయణుని తొడ నుండి పుట్టిన) అప్సరసకు పుట్టారు.

**అగస్త్యమహర్షి** - కలశము (కుండ) నుండి జన్మించారు.

---

ఇతి శ్రుతత్వాత్।
ఏ తేషాం జాత్యా వినాపి అగ్రే,
జ్ఞాన ప్రతిపాదితా
ఋుషయో బహవః సంతి।
తస్మాత్ న జాతిః
బ్రాహ్మణ ఇతి॥

ఈ విధంగా శ్రుతులు ఏరులా - పారులా మహనీయుల జన్మలగురించి వర్ణించాయి. మరి జాతి భేదం చేత వారు బ్రాహ్మణులు కారా? అట్లా అన వీలు కాదు. వారు జాతి సంబంధరహితులు. కానీ **బ్రాహ్మణశబ్దమును పుణికిపుచ్చుకుని ఉన్నారు.**

వారందరూకూడా జన్మతః జాతిచేత బ్రాహ్మణులు కానప్పటికీ జ్ఞాన ప్రతిపాదనచే **పూజ్యులగు బ్రాహ్మణులుగా - చారిత్రకంగాను, పౌరాణికంగాను, ఐతిహాసికంగాను ఆరాధ్యులు.** ఇట్టి ఋుషుల చరిత్రలు ఈ తీరుగా ఇంకెన్నెన్నో. అందుచేత 'ఒకడు జాతి చేత బ్రాహ్మణుడు' - అన వీలు కాదు.

---

7. <u>తర్హి జ్ఞానం 'బ్రాహ్మణ' ఇతి చేత్, తత్ న।</u>
క్షత్రియ ఆదయోఽపి
పరమార్థదర్శినో అభిజ్ఞా
బహవః సంతి।
తస్మాత్ న జ్ఞానం 'బ్రాహ్మణ'
ఇతి।

"ఒకని వద్ద జ్ఞాన సమాచారము ఉన్నది. శాస్త్ర సారవిషయాలు ఆయనకు తెలుసు. జ్ఞానము చేత ఆతడు బ్రాహ్మణుడు" అని అందామా? అది కూడా అన వీలులేదు.

ఎందుకంటే శాస్త్రములు తెలిసినవారు, జ్ఞానసమాచారము కలిగి ఉన్నవారు జన్మతః బ్రాహ్మణులలోను, క్షత్రియులలోను, వైశ్యులలోను, శూద్రులలోను ఎందరో ఉన్నారు. పరమార్థ విజ్ఞానము కలవారు ఎందరు ఏ జాతిలో లేరు? (ఉదాహరణకు భారతములో కౌశిక బ్రాహ్మణునకు వ్యాధుడు బోధించిన "వ్యాధగీత") అయితే, వారిని (శాస్త్రములలో) **'బ్రాహ్మణులు'** అని అనరు. అందుచేత "జ్ఞానము చేత ఈతడు బ్రాహ్మణుడు" - అని కూడా సిద్ధాంతీకరించలేము.

---

8. తర్హి కర్మ బ్రాహ్మణ
ఇతి చేత్, తత్ న।
సర్వేషాం ప్రాణినాం
ప్రారబ్ధ – సంచిత – ఆగామి
కర్మ సాధర్మ్య దర్శనాత్।
కర్మాభి ప్రేరితాః ।

మరి "కర్మలను అనుసరించి ఈతడు బ్రాహ్మణుడు" అని అనగలమా? లేదు. అనలేము.

సమస్త ప్రాణులూ కూడా ప్రారబ్ధము - ఆగామి - సంచితములనబడే కర్మలు సాధర్మ్యములు (సంగతి - వ్యవహారములు) కలిగియే ఉంటున్నారు. త్రిగుణాత్మకంగా కర్మలు నిర్వర్తిస్తూనే ఉన్నారు. "బ్రాహ్మణునకు అట్టి త్రివిధ కర్మలు ఉండవు. క్షత్రియ వైశ్య సూద్రులకైతే ఉంటాయి" అనునదేమీలేదు. అసలు ఆగామి-సంచిత-ప్రారబ్ధ-ఇత్యాదులన్నీ ప్రకృతికి సంబంధించినవి గాని ఆత్మకు సంబంధించినవేకావు. ప్రకృతి చేత కర్మ

**సంతో జనాః క్రియాః కుర్వంతి।**
**ఇతి।**
**తస్మాత్ న కర్మ బ్రాహ్మణ ఇతి।**

ప్రేరితులై జీవులందరు కర్మలు నిర్వర్తిస్తూనే ఉన్నారు. (ప్రకృత్యైవ చ కర్మాణి క్రియ మానాని సర్వశః). అందుచేత **"కర్మలను అనుసరించి ఒకడు బ్రాహ్మణుడగుచున్నాడు" - అనునది చెప్పజాలము.** ఉపనయనముచే ద్విజుడు, వేదాధ్యయనముచే విప్రుడు - లోకసంబంధమైనవి మాత్రమే.

---

**9. తర్హి ధార్మికో బ్రాహ్మణ**
**ఇతి చేత్, తత్ న।**
**క్షత్రియ ఆదయో - హిరణ్య దాతారో**
**బహవః సంతి।**
**తస్మాత్ న ధార్మికో**
**'బ్రాహ్మణ' ఇతి॥**

ఒకడు ధర్మనిరతుడు, ధార్మికుడు అయితే అట్టివారిని 'బ్రాహ్మణుడు' అని అంటామా? అనలేము. ఎందుచేతనంటారేమో!

క్షత్రియులలో అనేకమంది (శిబి చక్రవర్తి, హరిశ్చంద్రుడు, కర్ణుడు మొదలైన వారు) బంగారము మొదలైన సంపదలు దానము చేసినవారు ఉన్నారు. చిన్న సందర్భములో తమకున్నదంతా సమర్పించివేసినవారు ఉన్నారు. ఆ మాత్రంచేత 'వారు బ్రాహ్మణులు' అగుచున్నారా? లేదు.

ఒకడు పరమధార్మికుడు అయినంత మాత్రంచేత 'బ్రాహ్మణుడు' అని వేద - స్మృతి - శ్రుతి వాఙ్మయముచే పిలువబడటములేదు.

---

**<u>తర్హి కోవా బ్రాహ్మణో నామ?</u>**

**మరి ఎవరిని 'బ్రాహ్మణుడు' అను శబ్దముచే మనము పిలువ గలుగుతాము? శబ్దార్థానికి ఎవరు సరిపోతారు? సరితూగుతారు?**

**10. యః కశ్చిత్ ఆత్మానమ్**
**అద్వితీయమ్।**
**జాతి గుణ క్రియా హీనం।**

**ఎవ్వడైతే (లేక) ఎవ్వరైనా సరే... స్వస్వరూపము గురించి - ఈవిధంగా- అనుకుంటాడో-ఆతడే 'బ్రాహ్మణుడు'.** ::

"ఈ సర్వము అఖండమగు ఆత్మయే. కనుక నేను, తదితరులు సర్వదా నిర్హేతుకంగా కేవలమగు ఆత్మ స్వరూపులము. జీవులంతా ఆత్మయే సహజమగు స్వస్వరూపముగా కలిగియున్నారు. 'ద్వితీయము' అనునది ఏనాడూ లేనేలేదు. ఉండ జాలదు కూడా" అని గ్రహించినవాడు బ్రాహ్మణుడు.

- దేహమునకు సంబంధించిన జాతి, కులము, మతము మొదలైనవిగాని, జగన్నాటకములోని జీవాత్మపాత్రకు సంబంధించిన సత్వ-రజో-తమోగుణములుగాని, క్రియా- అక్రియలుగాని ఆత్మగా నాకు కించిత్ కూడా లేనేలేవు - **అని నిస్సందేహముగా గమనించువాడు 'బ్రాహ్మణుడు'.**

---

**షట్ (6) ఊర్మి, షట్ (6) భావ**
**ఇత్యాది సర్వదోష రహితం।**
**సత్య - జ్ఞాన - ఆనంద - అనంత**
**స్వరూపం।**

"ఆకలి - దప్పిక - శోకము - మోహము - జర - మరణములనబడే షట్ (6) ఊర్ములు భౌతిక దేహసంబంధమైనవేగాని, ఆత్మగా నాకు సంబంధించినవి కావు. ఆత్మగా ఏ జీవునికి సంబంధించినవి కావు.

**- జన్మించాలనే ఆవేశము, పుట్టుక, బాల్యయవ్వన వార్ధక్యములు, వృద్ధి క్షయములు, మరణము** - అను భౌతిక ధర్మములు ఆత్మగా నాకు గాని, ఆత్మగా మరెవ్వరికిగాని సంబంధించినవికావు. అవి దేహ-మనో వికారములు:

సర్వదా సహజమగు ఆత్మస్వరూపులమైయున్నట్టి మనమంతా-**సత్య- జ్ఞాన - ఆనంద -అనంత స్వరూపులము - అను భావన కలవాడు బ్రాహ్మణుడు.**

---

**స్వయం నిర్వికల్పమ్।**
**అశేష కల్పాధారమ్।**
**అశేష భూత-అంతర్యామిత్వేన**
**వర్తమానమ్।**

"సర్వకల్పనలు ఎందులోంచి బయల్వెడలుచున్నాయో...అట్టి ఆత్మానంద స్వరూపుడను. సమస్త కల్పనలకు మునుముందే ఉన్నవాడను. సమస్తమునకు ఆధారుడను. ఆది కారణుడను. నిర్వికల్పుడను. అట్లాగే నీవు కూడా.

- కథలోని పాత్రల స్వరూప - స్వభావ - సంప్రవర్తనలన్నిటికీ కథా రచయితయే అంతర్యామి అయి ఉన్నతీరుగా, ఈ అశేష (సమస్త) భూతజాలమునకు అంతర్యామి అయి ప్రదర్శితమగుచున్నవాడను. ప్రతి ఒక్క జీవుని నిత్య సత్యము ఇట్టిదే"- **అను జ్ఞప్తి వీడని వాడు బ్రాహ్మణుడు.**

---

**అంతర్బహిశ్చ ఆకాశవత్**
**అనుస్యూతమ్।**
**అఖండానంద స్వభావమ్।**

- "ఏ విధంగా ఆకాశము సమస్త వస్తువులకు బాహ్య- అభ్యంతరములలో తెంపు లేకుండా వ్యాపించి ఉన్నదో, ఆ తీరుగా ఈ విశ్వమంతా బాహ్య - అభ్యంతరములలో ఆత్మాకాశస్వరూపమే విస్తరించి ఉన్నది.

- అఖండ - **ఆనంద స్వభావమగు ఆత్మానందమే ఇదంతా - అను అనుభూతి కలవాడు బ్రాహ్మణుడు.**

**అప్రమేయమ్। అనుభవైక వేద్యమ్।**
**అపరోక్షతయా భాసమానమ్।**
**కరతల-ఆమలకవత్ సాక్షాత్**
**అపరోక్షీ కృత్య, కృతార్థతయా।**

**నేను, నీవు, వారు, వీరు అట్టి చైతన్య స్వరూపులమే. మనమంతా కూడా**

❀ దృశ్యములో దేనితోనూ ఏ మాత్రము సంబంధము లేనివాడను. కల తనదైనవానికి కలలోని వస్తువులతో బంధమేమి? సంబంధమేమి? ఈవిధంగా - అప్రమేయులము.

❀ చెప్పటానికి, వినటానికి కూడా విషయులమే కాము. కేవలము అనుభవమునకు మాత్రమే లభించువారము.

కళ్ళకు ప్రత్యక్షమైనవారము కాము.పరోక్షముగా ఉన్నవారము కూడా కాము. మరి? అపరోక్ష జ్ఞానముచేత మాత్రమే బుద్ధికి అనునిత్యానుభవముగా భాసించువారము. తదితరమైనదంతా 'మనోచాపల్యసంగ్రహణము' మాత్రమే.

అట్టి సర్వాత్మకుడగు స్వస్వరూప అఖండ - అప్రమేయ పరమాత్మను - అరచేతిలో ఉంచిన ఉసిరికాయను చూచు విధంగా - చూస్తూ కృతార్థుడనై ఉంటున్నాను! **అపరోక్ష దర్శనముచే సర్వము సుస్పష్టపరచుకొన్నట్టి వాడను" - అను అనుభూతుడు - బ్రాహ్మణుడు.**

నేను, నీవు - జగత్తులు ఆత్మతత్త్వ స్వరూపమే!

ఈవిధంగా బ్రాహ్మణ నామధేయుడు - సమస్త సహజీవులను ఆత్మకు అనన్యంగాను, అఖండ స్వస్వరూపమునకు అభిన్నంగాను దర్శించుటచే - సర్వత్రా ఆత్మీయ దృష్టిని కలిగి ఉంటారు. **అట్టివాడే బ్రాహ్మణుడు.**

---

**కామ-రాగాది దోషరహితః।**
**శమ-దమాది సంపన్నో**
**భావ-మాత్సర్య తృష్ణ - ఆశా మోహాది రహితో।**
**<u>దంభ అహంకారాదిభిః</u>**
**అసంస్పృష్ట చేత ఆవర్తతే।**

**సర్వత్రా ఆత్మీయ దృష్టి గల ఆతడు :-**

❑ స్వభావంగానే కామము, రాగము మొదలైన దోషములు లేనట్టివాడు.

❑ శమ (అంతరింద్రియనిగ్రహము) దమ (బాహ్యేంద్రియ నిగ్రహ) సమన్వితుడు. మాత్సర్య తృష్ణా ఆశా మోహ రహితుడు.

❑ ఇంకా కూడా ఆత్మదృష్టియొక్క స్వాభావిక ప్రయోజనంగా దంభ, అహంకారము మొదలైన ఆసురీసంపత్తి రహితుడైనవాడు.

❑ జగత్ సంఘటనలచే స్పృశించబడజాలని సర్వాతీమగు నిర్మల బుద్ధి సమన్వితుడై వర్తించువాడై ఉంటాడు. **సర్వము స్వస్వరూపంగా సర్వదా సందర్శించువాడే బ్రాహ్మణుడు.**

---

**ఏవ ముక్త లక్షణో యః,**
**స ఏవ 'బ్రాహ్మణ'-**
**ఇతి =**
**శ్రుతి స్మృతి పురాణ**
**ఇతిహాసానామ్ అభిప్రాయః।**
**అన్యథా బ్రాహ్మణత్వ సిద్ధిః నాస్త్యేవ।**

ఇట్టి ఆత్మభావితమగు సద్గుణ - సదవగాహన - స్వాభావ సర్వాతీత లక్షణములు కలవాడే **'బ్రాహ్మణుడు'** అగుచున్నాడు. ఇదియే శ్రుతులు, స్మృతుల, పురాణముల, ఇతిహాసము ల, వేదముల 'బ్రాహ్మణ' శబ్దార్థముపట్ల అభిప్రాయము, ఉద్దేశ్యము అయి ఉన్నది.

బ్రహ్మీదృష్టిచే అనన్యమైన భావన-దృష్టి-అవగాహనలు లేనివానిపట్ల 'బ్రహ్మణత్వము' "సిద్ధింపనిదే" అగుచున్నది. **<u>బ్రాహ్మణత్వ సిద్ధిః నాస్త్యేవ॥</u>**

---

**11. సత్ చిత్ ఆనందమ్ ఆత్మానమ్,**
**అద్వితీయమ్ - బ్రహ్మ భావయేత్॥**
**ఆత్మానం సచ్చిదానందం**
**బ్రహ్మ భావయేత్॥ ॥ఇతి॥**
***<u>ఇతి వజ్ర సూచికోపనిషత్</u>***
***<u>(లేక) వజ్రసూచ్యుపనిషత్</u>***
***<u>ఓం శాంతిః శాంతిః శాంతిః॥</u>***

అట్టి బ్రాహ్మణత్వము సిద్ధించటానికి మార్గమేమిటి? పైన చెప్పిన సత్-చిత్-ఆనందరూపమగు ఆత్మయొక్క విశేషలక్షణముల అభ్యాసమే అందుకు ఉపాయం. "ఇదంతా సర్వదా మమాత్మానంద స్వరూపమే కదా!" - అను అనునిత్య (Always), అవ్యాజ (unconditional) పూర్వక మననమే మార్గము. సర్వత్రా బ్రహ్మము యొక్క సందర్శనమే బ్రాహ్మణత్వము.

4 వేదములలోను (శ్రుతులలోను), స్మృతులలోను (జీవిత విధానమును విశ్లేషించి, వివరించి, నిర్దేశించి చెప్పే పారాశర్య స్మృతి, మనుస్మృతి ఇత్యాదులందును), (రామాయణ, మహాభారత, భాగవతాది) ఇతిహాసములలోను, మత్స్య-కూర్మ ఇత్యాది వ్యాస విరచిత పురాణములలోను) - 'చత్వారోవర్ణానామ్ బ్రాహ్మణ ఏవ ప్రధానం' అని చెప్పుచున్నప్పుడు - బ్రాహ్మణుడు' అనగా **"యః కశ్చిత్ ఆత్మానమ్ అద్వితీయమ్"** మొదలురాగల పైన చెప్పిన రీతిగా బ్రహ్మమును దృష్టియందు స్థిరముగా నిలుపుకొన్న వారి గురించియే.

**<u>ఇతి వజ్ర సూచికోపనిషత్।</u>**

**<u>ఓం శాంతిః శాంతిః శాంతిః।</u>**

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 12 వజ్రసూచికోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము

**(బ్రహ్మాయతీతి బ్రాహ్మణః)**



**శ్రీ గురుభ్యో౦ నమః**

**శిష్యజనులు :** గురుదేవాయ! నమో నమః। హే పరమేశ్వర! నమో నమః। 'ఓం'కారాయ! నమో నమః। ప్రశాంత స్వరూపా। నమో నమః। మహాత్మా! ఆత్మతత్త్వజ్ఞానార్థినై సందేహనివృత్తి కొరకై, (జ్ఞానస్సంఛ్ఛిన్న సంశయః)... మీ పాదారవిందములను కళ్ల కద్దుకుంటూ, మిమ్ములను శరణు వేడుచున్నాను స్వామీ।

**గురుదేవుడు :** బిడ్డలారా! మమాత్మానంద కేవలీస్వరూపులారా! స్వాగతము. మీరు దేనిగురించి ముఖ్యముగా సందేహ నివృత్తికై అడగదలచుకొన్నారో, నిస్సంకోచంగా అడగండి. నేను ఎరిగినంతవరకు విశదీకరించుటకై సంసిద్ధుడనై ఉన్నాను. స్మృతి - శ్రుతి - పురాణార్థపూర్వకంగా, కరుణామూర్తియగు ఆ పరమాత్మ యొక్క కరుణా కటాక్ష వీక్షణను ఆశ్రయిస్తూ మనము చెప్పుకుందాము.

**శిష్యులు :** మహాత్మా! భగవన్! గురుదేవా! వేద ఇతిహాస పురాణాలలోను (మరియు) లోక ప్రసిద్ధమై కూడా చెప్పొందుచున్నట్టి - **"చాతుర్వర్ణ్యములలో బ్రాహ్మణ శ్రేష్ఠత్వము, బ్రాహ్మణ పూజనీయత్వము"** గురించి తాత్త్విక, ఆధ్యాత్మికార్థపూర్వకంగా మీవద్ద శ్రవణం చేయ అభిలషిస్తున్నాను. నా ఈ అభ్యర్ధన యుక్తియుక్తమైతే, **"బ్రాహ్మణులు దేవతలకు కూడా పూజనీయులు"** అనువాక్యములోని పరమార్థమును తత్త్వశాస్త్రీయంగా వివరించమని వేడుకొంటున్నాను.

**గురుదేవుడు :** చిరంజీవా! నీ ప్రశ్న సముచితము. తప్పక మనము విచారించాలిసిందే. (Yes. It is an aspect to be analysed and be understood with clarity).

వేదోపనిషదాత్మకంగా 'బ్రాహ్మణుడు' అను శబ్దమునకు ముఖ్యోద్దేశ్యము ముముక్షువులు తెలుసుకొని తీరవలసిందే. నీవు అడిగిన **"బ్రాహ్మణో పూజనీయం సదా"** అను విశేషము **"వజ్రసూచికము"** అను పేరుతో తత్త్వశాస్త్ర అంతర్విభాగంగా పూజనీయులగు తత్త్వజ్ఞులచే ప్రవచించబడుతోంది. అట్టి శాస్త్ర ప్రవచితమైన 'వజ్రసూచి' (వజ్రపు సూది) - అజ్ఞానమును తొలగించివేయగలదు. అల్పజ్ఞానము" - అనే దోషమునకు గొప్ప ఔషధము. మనము చెప్పుకోబోవుచున్న వజ్రసూచికా పాఠ్యాంశమును (లేక) పరమార్థమును జ్ఞాన చక్షువులు గల మహనీయులు ఎరిగియే ఉన్నవారై, తమకు భూషణముగా అలంకరించుకొంటున్నారయ్యా!

ఈ 'వజ్ర సూచి' (ఇంద్రుని వజ్రమువలె) అపార్థములను, అల్పార్థములను ఖండించివేసి,- **పరమార్థము** ప్రసాదించునది. అట్టి విశేషములు ఇప్పుడు చెప్పుకొంటున్నాము. శ్రద్ధగా శ్రవణము చేసెదరు గాక।

⌘

**'ఓం'కార పరమార్థ స్వరూపుడు, ఏక-అక్షరుడు అగు పరమాత్మకు చేతులెత్తి నమస్కరిస్తున్నాను.**

**చాతుర్వర్ణ్యములు :** చతుర్వేద – ఇతిహాస – పురాణ – స్మృతులచే నాలుగు వర్ణములు వివరించి చెప్పబడుచున్నాయి.

(1) బ్రాహ్మణ (2) క్షత్రియ (3) వైశ్య (4) శూద్ర.

శ్లో॥ **బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రా ఇతి చత్వారో వర్ణాః**

**"తేషాం వర్ణానాం బ్రాహ్మణ ఏవ ప్రధాన" – ఇతి వేదవచనానురూపమ్। స్మృతిభిః అపి యుక్తమ్।**

– 4 వర్ణములలో బ్రాహ్మణులు ప్రధమ స్థానము అలంకరించువారు – అని వేదవచనముల రూపంగాను, (మనుస్మృతి, పరాశరస్మృతి మొదలైన మహనీయుల ప్రవచితమగు) స్మృతులలోను, ఇతిహాస పురాణములలోను ఆయాచోట్ల అభివర్ణించబడుతోంది. ఇది మరికొంత వివరణగా తప్పక చెప్పుకోవలసియున్నది. (లేకుంటే జనులచే 'ఆచరణ'గా తగినంతగా సిద్ధించదు).

**– కోవా బ్రాహ్మణో నామ?** 'బ్రాహ్మణుడు' అనే పేరుతో 4 వేదములలోను, పురాణ – ఇతిహాసములలోను, స్మృతులలోను చెప్పుచున్నది ఎవరి గురించి?

- **కో జీవః?** జీవజాతులలో (లేక జనులలో) ఏ జాతివారిని **'బ్రాహ్మణులు'** అని అంటాము?
- ఎటువంటి **దేహములు కలవారు** బ్రాహ్మణులు?
- ఏ **గుణములు కలవారు** బ్రాహ్మణులు?
- ఏ **జ్ఞానముచే** బ్రాహ్మణులుగా గుర్తించబడగలరు?
- ఎట్టి **కర్మలు నిర్వర్తిస్తున్న** వారిని 'బ్రాహ్మణులు' అని ఉద్దేశ్యిస్తున్నారు?
- **ధార్మిక గుణముల** (దానగుణము)చే ఒకడు 'బ్రాహ్మణుడు' అనవచ్చునా?

'బ్రాహ్మణుడు' అనునది జీవులుగా సృష్టించబడువారిలో ఒక విభాగమా? ఒక తీరైన ప్రత్యేక దేహముగలవారా? లేక, అనేక జాతులలో ఒక జాతివారా? శాస్త్రజ్ఞానము, ఆత్మతత్త్వ జ్ఞానము శాస్త్రీయముగా తెలియుటచేత 'బ్రాహ్మణులు'గా నిర్వచించబడువారా? ఇంకేవైనా కర్మలను, ధార్మిక స్వభావములను అనుసరించి కొందరు బ్రాహ్మణులా? ఎవ్వరైనాసరే, సాధనచే 'బ్రాహ్మణ' – శబ్దమునకు అర్హులు కాగలరా? **ఈ విశేషాలు అధ్యాత్మ శాస్త్రార్థపూర్వకంగా వివరణ చేసుకుందాము.**

⌘

**ప్రధమో జీవో 'బ్రాహ్మణ' ఇతి తత్ చేత్ 'న'।** "సృష్ట్యభిమాని, సృష్టికర్త అగు ప్రజాపతి (బ్రహ్మదేవుడు) మొట్టమొదటగా బ్రాహ్మణులను సృష్టించారు" – అని అందామా? అది కుదిరే మాట కాదు. సమస్తము సృష్టిలోని సమస్వరూప విశేషమే కదా!

**'జీవుడు'** అనగా ఒక దేహము కాదు. **అతీతాన్ - ఆగత** అనేక **దేహానాం జీవస్య ఏకరూపత్వాత్।** ఈ జీవుని పట్ల అనేక దేహములు గడచిపోయినాయి. రాబోవుచున్నాయి. ఈ విధంగా వస్తూ పోతూ వుండే దేహాలన్నీ దృశ్యములోని కల్పిత విశేషాలే। సమానమైనవే। అటువంటప్పుడు "సృష్టిలో మొదటి దేహము బ్రాహ్మణుడు" అనునదేముంటుంది? 'జీవుడు' అనబడువాడు ఒక్కడే అయి ఉండి కూడా కర్మలవశంగా ఏవేవో దేహాలు వస్తూ ఉంటాయి. పోతూ ఉంటాయి, వాటిలో "మొదటిది బ్రాహ్మణ దేహము, తరువాతది కాదు" అనునదేమీ లేదు. జీవుడు సర్వదా ఏకస్వరూపుడే కదా! వచ్చి–పోయే దేహానుసారంగా జీవుడు మారడు. వచ్చే **పోయే దేహాలనుబట్టి జీవుడు ఒకప్పుడు బ్రాహ్మణుడు – మరొకప్పుడు కాదు"** – అనవీలుకాదు.

అందుచేత, **'బ్రాహ్మణుడు' 'ప్రథమజీవుడు'** అనునది కూడా యుక్తయుక్తం కాదు. **(సృష్టిలోని సమస్త విశేషములు ఒక్క క్షణమునందే సృష్టి కల్పనగా బయల్వెడలుచున్నాయి – అనేది వేద ప్రమాణవాక్యము)**

ఇక, పాంచభౌతికంగా కనిపించే **ఈ అసంఖ్యాక మానవ దేహములలో** కొన్ని **ప్రత్యేక జన్మలు (దేహములు) బ్రాహ్మణ దేహములు (లేక) బ్రాహ్మణ జన్మలు** – అని అందామా? **తర్హి దేహో 'బ్రాహ్మణ' ఇతి చేత్** న।

**ఆ విధంగా కూడా చెప్పలేము.**

ఎందుకంటే...

ఇంద్రియసుఖములే జీవిత పరమావధి (Main purpose) అని అనుకునేవాడు – "చండాలుడు" అనబడతాడు. అట్టి చండాలుడు మొదలుకొని – బ్రాహ్మణుల వరకు, శూద్రుడు అనబడువాడు మొదలుకొని – బ్రాహ్మణుల వరకు సాంఘికంగా సృష్టిలో కనిపించే మానవదేహములన్నీ కూడా తల్లి గర్భంలోంచే బయల్వెడలుచున్నవే. 'పంచభూతములు' అనే మట్టి, జలము, అగ్ని, వాయువు, ఆకాశముల సమ్మేళన పదార్థము(Raw-Material)లతోనే భౌతిక దేహములన్నీ నిర్మితమవుతున్నాయి. దేహముల దృష్ట్యా మానవదేహాలన్నీ కాళ్ళు – చేతులు – తల – కళ్లు – చెవులు...మొదలైనవన్నీ ఒకే మూసలో తయారగుచున్నవే. భౌతిక దేహాలన్నీ కూడా బాల్య – యౌవన – వార్థక్య – జరా – మరణ ధర్మములు కలిగి ఉన్నట్టివే. దేహమునుబట్టి బ్రాహ్మణుడు అవడు. అందరికీ ప్రకృతియే ఆహార ప్రదాత, జీవన ప్రదాత కూడా. అందుచే, జన్మానుసారంగా ఒకడు 'బ్రాహ్మణుడు' – అని పరమార్థంగా అనబడడు.

**రంగు బట్టి బ్రాహ్మణుడా?**

ఈ అసంఖ్యాక మానవ దేహాలలో కొన్ని తెల్లగాను(U.K), కొన్ని ఎర్రరంగు(India)గాను, కొన్ని పీతవర్ణముగాను (పసుపుపచ్చగాను) (Chinese), మరికొన్ని నల్ల రంగుగాను (Negros) కనిపిస్తూ ఉన్నాయి.

ఎవ్వరైనా –

| | | |
|---|---|---|
| బ్రాహ్మణులు | → | తెల్ల రంగు గాను, |
| క్షత్రియులు | → | రక్తవర్ణము (ఎరుపు) గాను, |
| వైశ్యులు | → | పసుపుచ్చ (పీతవర్ణము) గాను, |
| శూద్రులు | → | నల్ల రంగుగాను – |

ఉంటారని అనగలమా? ఇటువంటి రంగుల నియమమేదీ బ్రాహ్మణ – క్షత్రియాది చాతుర్వర్ణ్య విభాగములలో ఏమాత్రము కనిపించదు. శాస్త్రములు ఆ తీరుగా చెప్పటమూలేదు.

**'బ్రాహ్మణుడు' - అనునది శరీర సంబంధమైనది కాదు.**

ఒకవేళ 'శరీరము'ను అనుసరించి ఒకడు బ్రాహ్మణుడు అని అనవలసివస్తే, అప్పుడు,... **పిత్రాది శరీర దహనే బ్రహ్మహత్యాది దోష సంభవాచ్చ కిం?** మరణించినట్టి ఒక బ్రాహ్మణుని దేహమును దహనము చేసినప్పుడు, ఆ శవమును తగులబెట్టినట్టి పుత్రుడు మొదలైనవారందరికీ **"బ్రాహ్మణహత్యా దోషము"** అంటాలి మరి. ఆ విధంగా అంటుతుందా? అదేమీ లేదే। శాస్త్రములు ఆవిధంగా చెప్పటం లేదు కదా!

**తస్మాత్ దేహో న బ్రాహ్మణ ఇతి।** కాబట్టి జన్మను బట్టియో, దేహమునుబట్టియో, రంగునుబట్టియో ఒకానొకడు బ్రాహ్మణుడు కాదు. అది 'బ్రాహ్మణ' నిర్వచనము కానేకాదు.

<u>**మరి? ఒకడు 'జాతి' చేత బ్రాహ్మణుడు అవుతాడా?**</u> కానే కాదు. **తర్హి జాతిః బ్రాహ్మణ ఇతి చేత్, <u>తత్ న।</u>** ఈ భూమిమీద అనేక అనేక జాతులు, అట్టి జాతులలో అనేక అనేక ఉపజాతులు ఉన్నాయి. (ఉదా . బ్రాహ్మణులలో వైదీకులు, నియోగులు, పూజారులు మొదలైనవారు, కోమటులలో కోమటి, భేరీ కోమటి మొదలైనవారు). **మహనీయులు అన్ని జాతులలో ఉన్నారు.** ఆయా అన్ని జాతులలో మూర్ఖులు కూడా ఉంటారు. ఈ సందర్భంలో స్వానుభవమగు ఆత్మగురించిన 'ఋతము'ను గానం చేసిన అనేకమంది ఋషుల జన్మలగురించి పురాణాలలో వివరించిన విధానంగా ఏ ఋషి ఏ జాతివాడని అనగలం? జన్మతః దృష్ట్యా చూచినప్పుడు 'బ్రాహ్మణ' అనవీలు లేదు. కానీ, వారు 'బ్రాహ్మణప్రాజ్ఞులు'–అని పౌరాణికంగా వర్ణించబడుచున్నారు. కొన్ని దృష్టాంతాలు చెప్పుకుందాము.

**ఋష్య శృంగ మునీంద్రులు :** – వారు ఎక్కడ ఉంటే అక్కడ సకాలవర్షాలు, ప్రశాంత వాతావరణము స్వాభావికము అవుతాయి. ఆయన దశరథ మహారాజుకు అల్లుడు. వారిచే 'పుత్రకామేష్టి' చేయించిన పురాణ ప్రసిద్ధులు. లోక కళ్యాణమూర్తులు. అట్టి మహనీయులు, ఋష్యశృంగమహర్షి – జింక గర్భమునుండి జన్మించారు. విభాండకుడు అనే ముని నదిలో స్నానం చేస్తూ ఉండగా, – ఆకాశంలో 'ఊర్వసి'ని చూచారు. రేతః పతనము అయింది. ఒక జింక నీళ్లు త్రాగటానికి వచ్చి ఆ 'వీర్యము'ను త్రాగింది. ఆ జింక గర్భమున జన్మించిన శిశువును దివ్య దృష్టితో విభాండకుడు గుర్తించారు. ఆశ్రమమునకు తెచ్చి పెంచారు. ఆయనే ఋష్యశృంగుడు.

వారు ఏ జాతికి చెందుటచే 'బ్రాహ్మణుడు' అనబడగలరు? ఎట్లా యాజ్ఞీకుడు అయ్యారు? ఋత్విక్కు అయి ఎట్లా దశరథ మహారాజు చేసే 'పుత్రకామేష్టి' యాగమునకు ఋత్విక్ అయ్యారు? జన్మ దృష్ట్యా కాదు. తపోధ్యాన సంపద చేతనే – ఆయన 'బ్రాహ్మణ' శబ్దార్హుడు అయ్యారు.

**కౌశిక మహర్షి** : కుశముల నుండి (దర్భలనుండి) పుట్టారు.

**జంబూక మహర్షి** : జంబూకము (నక్క) గర్భము నుండి జన్మించారు.

**శ్రీ వాల్మీక మహర్షి** : వీరు రామాయణమును యోగవాసిష్ఠమును లోకమునకు అందించిన మహర్షి.

బ్రహ్మదేవుని శాపవశంగా బోయజాతివాడై ఉండి, 'రత్నాకరుడు' అను పేరుకలవారు. సప్తర్షులచే ప్రాపంచక బంధముల భ్రమ గురించి బోధించబడి, తపస్సు ప్రారంభించి – వల్మీకము (పుట్ట) నుండి బయల్వెడలారు. వీరికి జాతి ఎక్కడిది? కానీ, బ్రాహ్మణ శ్రేష్ఠులలో ఉత్తములగు బ్రహ్మర్షులైనారు. ఛందో నిబద్ధంగా సంస్కృతంలో కవనము సృష్టించిన మొదటికవి కాబట్టి, 'ఆదికవి' అని పిలువబడువారు.

## కృష్ణ ద్వైపాయన వేద వ్యాసమహర్షి

వసిష్ఠ వంశజుడగు పరాశర మహర్షికి మత్స్యరాజకుమార్తెయగు మత్స్యగంధికి (యోజనగంధికి) సద్యోగర్భంగా జనించిన వారు. (ద్వీపంలో జనించుటచే) **ద్వైపాయనుడు.** (నల్లగా ఉండటంచేత) **కృష్ణ మహర్షి.** (వేదములు విభజించి ప్రసాదించుటచే) వేదవ్యాసమహర్షి. **సత్యవతీపుత్రుడు.** (జాతియే బ్రాహ్మణత్వమును నిర్ణయించగలిగితే), – ఏ జాతి సూత్రానుసారంగా మత్స్యగంధి కుమారుడు వేదవ్యాసమహర్షి అయ్యారు? కైవర్తక న్యాయంచే తల్లి కన్నెత్వము చెడకుండా జనించినవారికి జాతి ఏమున్నది? 'బ్రాహ్మణుడు' అనునది తల్లి ననుసరించియా? తండ్రిని అనుసరించియా?

– మత్స్యగంధికి జనించుట చేత ఏ జాతి వారు?

– పరాశర మహర్షి కుమారుడు కాబట్టి ఏ జాతివారని అనాలి?

శ్రీ వ్యాసమహర్షి, లోక కళ్యాణార్థము వేద – వేదాంగముల విభజన, అష్టాదశ పురాణాలు, పంచమ వేదమగు భారతము, బ్రహ్మసూత్రములు మొదలైనవాటిని రచించిన మహనీయులు. లోకకళ్యాణమూర్తులు, చిరస్మరణీయులు, బ్రాహ్మణపూజార్హులు అయినారు.

**గౌతమ మహర్షి** : సగము ఈనిన గోవుకు ప్రదక్షణం చేసి భూప్రదక్షి ఫలముగా 'అహల్య'ను ధర్మపత్నిగా పొందినట్టివారు. ఈ దంపతుల కుమారుడు – శాతానీకుడు,

లోక కళ్యాణమూర్తి అయినట్టి గౌతమి (గోదావరి)నదిని ప్రసాదించిన గౌతమమహర్షి (ప్రచేతసుని మానసపుత్రుడుగా) కుందేటి వీపు (శశి పృష్ఠము) నుండి జనించారు. (బ్రహ్మవైవర్తి పురాణము) వారు జన్మతః ఏ జాతితో సంబంధముచే మహర్షి అయ్యారు? లోక సంబంధమైన 'జాతి'ని వారికి ఏమని ఆపాదించాలి?

**శ్రీ వసిష్ఠ మహర్షి** : నరనారాయణులు బదరికాశ్రమంలో తపస్సు చేస్తూ ఉండగా దేవతాస్త్రీలు వారి తపస్సు భంగము చేయటానికి యత్నించారు. నిశ్చలాత్ముడగు శ్రీ నారాయణస్వామి, "ఓ దేవతాస్త్రీలారా! మీ సౌందర్యమును చూచుకొని గర్విస్తూ మా తపస్సు పాడుచేయ యత్నిస్తున్నారా? ఇదిగో! ఇటుచూడండి"– అంటూ తన ఊరువు నుండి మహత్ సౌందర్యరాశి అగు ఒక కన్యను సృష్టించారు.

ఒకనాడు సూర్యుడు, వరుణుడు కలసి ఆకాశమార్గంలో కలసి వస్తూ ఉన్నారు. వారికి ఒకచోట ఊర్వసి కనిపించింది. ఆమెయొక్క సౌందర్యం చూడగానే వారిద్దరికి రేతః పతనము అయింది. అప్పుడు ఊర్వసి వారిరువురి వీర్యములను ఒక కుంభము (కుండ)లో భద్రపరచారు. ఆ కుంభము నుండి వసిష్ఠుడు, అగస్త్యుడు పుట్టారు. ఈవిధంగా వారిద్దరు కుంభ స్తంభవులు. శ్రీ వసిష్ఠమహర్షి సప్త ఋషులలో ఒకరు.

ఊరువు నుండి జనించిన ఊర్వశి వలన సూర్యుని రేతస్సు నుండి కుండలో కుమారుడుగా జన్మించిన బ్రహ్మణ్యులగు వసిష్ఠ మహర్షియొక్క జాతి ఏది? వీరు శ్రీరామచంద్రుని గురువులు. 16 సం॥ వయసుగల శ్రీరామునికి బోధరూపంగా యోగవాసిష్ఠ మహాగ్రంథము ప్రవచించినవారు. అట్టి ఆ మహనీయుడు బ్రహ్మణ్యుడగు బ్రాహ్మణుడు కారా?

**అగస్త్య మహర్షి** : ఆకాశంలో ఎత్తుగా ఎదిగి సూర్యమార్గమును నిరోధించిన వింధ్య పర్వతము అగస్త్యునికి తలవంచి నమస్కరించగా, ఆయన లోకకళ్యాణార్థమై **"నేను మరల తిరిగి వచ్చే వరకు తలవంచియే ఉండుము"** అని ఆజ్ఞాపించి తనకు అత్యంత ప్రియమైన 'కాశీ'ని వదలి వింధ్యను దాటి దక్షిణ దిశగా మలయాద్రిపై నివాసమును ఆశ్రయించిన త్యాగమూర్తి శ్రీ అగస్త్యమహర్షి. రామ–రావణయుద్ధ సందర్భములో శ్రీరామచంద్రమూర్తికి 'ఆదిత్యహృదయస్తుతి' అనుగ్రహించి పునః ప్రత్యుత్సాహపరచినట్టి మహనీయులు. అట్టి అగస్త్య

మహర్షి మట్టి కలశము నుండి జనించారు. వారిది 'ఇదీ జాతి' అని ఏమీ అని అనలేముకదా! మరి వారు బ్రాహ్మణ్యులు కాదా? (వీరు వరుణుని రేతస్సు నుండి ఊర్వసిచే కుండలో జన్మించినవారు).

అట్లాగే, సూత మహర్షి, శౌనకుడు మొదలైన పురాణ పురుషుల జన్మలు ఇట్టివే. (శౌనకుడు = శునకమునకు జన్మించినవాడు).

ఇవన్నీ శ్రుతులలోను, ఇతిహాస పురాణాలలోను చెప్పబడింది. ఇంతేకాకుండా మహత్తర జ్ఞానసంపన్నులగు ఎందరో మునీశ్వరులు, ఋషులు మొదలైనవారంతా అన్ని జాతులలోను ఉన్నారు. జాతియొక్క వివరణయే లేనట్టి మహనీయులగు ఆత్మజ్ఞులు మరెందరో ఉన్నారు.

అందుచేత ఎవ్వడూ జాతి చేత బ్రాహ్మణుడు అవడు. 'బ్రాహ్మణత్వము' అనునది జాత్యానుసారంగా చెప్పలేము. అది శ్రుతి, స్మృతి, పురాణముల ఉద్దేశ్యము కూడా కాదు.

## జ్ఞానమును అనుసరించి ఒకడు బ్రహ్మణుడు అని అంటామా? అదీ కుదరేమాటకాదు. ఎందుకంటే...

క్షత్రియులలో కూడా (జనకుడు, శిబిచక్రవర్తి, భగీరథుడు, బలిచక్రవర్తి, రఘుమహారాజు మొదలైన) అనేకమంది ఆత్మజ్ఞానులు ఉన్నారు. వారందరినీ 'బ్రాహ్మణ' శబ్దముతో పిలువరు. అట్లాగే వైశ్య – శూద్రులలో కూడా ఆత్మజ్ఞానులు ఎందరో (వ్యాధుడు మొ॥వారు) ఉన్నారు. అందుచేత శాస్త్ర జ్ఞానము కలిగియున్నమాత్రంచేత వారందరినీ 'బ్రాహ్మణ' శబ్దముతో చెప్పుకోబడటం లేదు కదా!

## కర్మ విశేషములను అనుసరించి

ఒకడు నిర్వర్తించు కర్మలను అనుసరించి ఒకనిని 'బ్రాహ్మణుడు' అని అనవచ్చునా? లేదు. ఎందువలన అంటే, ప్రాణులందరూ కూడా **ప్రారబ్ధ – ఆగామి – సంచిత కర్మలను అనుసరించి ఆయా కర్మల ప్రేరణను, సాధర్మ్యమును కలిగి ఉంటున్నారు.**

ఒకని సామర్థ్యము, పూర్వ అభ్యాసము మొదలైనవి దృష్టిలో పెట్టుకొని ఆతడు నిర్వర్తించవలసిన కర్మలు (ఉదాహరణకు ఒక సంస్థలో –In an organization) ఆతనిని నియమిస్తారు కదా! ఈ జీవులు నిర్వర్తించు కర్మలు పూర్వ సంస్కారములను అనుసరించి సృష్టి లేక ప్రకృతిచే నియమితమై ఉన్నాయి. ఈ జీవులు నిర్వర్తించే కర్మలన్నిటికీ ప్రేరణ ప్రకృతియే. **(ప్రకృత్యైవ చ కర్మాణి క్రియ మాణాని సర్వశః).**

సమస్త జీవులు ప్రకృతిచే ప్రేరితులైన కర్మలు నిర్వర్తిస్తున్నారు కాబట్టి ఒకడి కొన్నికొన్ని కర్మలను అనుసరించి 'బ్రాహ్మణ' అను శబ్దముతో ఎట్లా చెప్పుకోగలము? లోకరీతిగా చెప్పుకొనే చాతుర్వర్ణ్యములు సృష్టియొక్క సానుకూల్యము కొరకు సృష్టికల్పనలోని గుణ–కర్మవిభాగ విశేషములే. గుణములను అనుసరించి వారివారికి సృష్టిలోని అంతర్భాగముగా నియమితమైన కర్మలే. **(చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విశేషతః। తస్య కర్తారమపి, మాం అకర్తారమ్ విద్ధి – భగవద్గీత) (చాతుర్వర్ణములలోనివారికి వారి వారి నియమిత కర్మలను సమర్పణభావనలో నిర్వర్తించి, సమర్పించుటచే సిద్ధిపొందగలరని – గీతావాక్యము)**

అందుచేత ఒకడిని నియమితమైన కర్మలను అనుసరించి బ్రాహ్మణుడు అవజాలడు. **ఉపనయనముచే 'ద్విజుడు', వేదాధ్యయనముచే 'విప్రుడు' అగుచున్నారు.** అంతమాత్రంచేత వారు 'బ్రాహ్మణ' శబ్దములో చెప్పజాలము.

## ధార్మికో బ్రాహ్మణః కిం?

ఒకడు గొప్ప ధార్మికుడైతే (ధర్మపరుడైతే) 'బ్రాహ్మణుడు' అని అనబడుతోందా? లేదు. **తర్హి ధార్మికో బ్రాహ్మణ ఇతి చేత్, తత్ న।**

క్షత్రియులలోనూ (కర్ణుడు, శిబి చక్రవర్తి, సత్యహరిశ్చంద్రుడు, బలిచక్రవర్తి మొదలైన) ఎందరో ధార్మికులు ఉన్నారు. అట్లాగే వైశ్య సూద్రులలో కూడా ధార్మికులు ఉన్నారు. వారందరినీ 'బ్రాహ్మణులు' అని వేదములు, శ్రుతులు చెప్పటంలేదు. **క్షత్రియ ఆదయో హిరణ్య దాతారో బహవః సంతి।** వారందరు దానగుణము గల మహనీయులే అయినప్పటికి 'బ్రాహ్మణులు' అని అనజాలము.

## తర్హి కోవా బ్రాహ్మణః?

మరప్పుడు 'బ్రాహ్మణుడు' అని ఎవరిని అంటాము? ఏఏ విలక్షణ లక్షణములచే ఒకానొక జీవుని – బ్రాహ్మణములు, శ్రుతులు, స్మృతులు, పురాణములు, సంహితలు మొదలైనవి – **"బ్రాహ్మణుడు"** అని ఉద్దేశ్యిస్తున్నాయో,... **ఆయా లక్షణ విశేషములను ఇప్పుడు మనము చెప్పుకుంటున్నాము.**

⌘

# తత్త్వమ్ - సోఽహమ్ - తత్ సర్వమిదమ్

**అద్వితీయమ్:** – ఎవ్వడైతే తనను తాను అఖండమగు ఆత్మగా ఎరుగుచూ, అట్టి తనయొక్క కేవల–సహజ ఆత్మానందస్వరూపమునకు ద్వితీయమేలేదని, సర్వము సర్వులు – అట్టి ఆత్మయొక్క అద్వితీయ లీలా విలాసమేనని ఎరుగుచున్నాడో, ....అట్టివాడు **బ్రాహ్మణుడు.**

**అనన్యమ్** : – పరమాత్మకు అన్యమైనదేదీ లేదు (శివాత్ పరతరమ్ నాస్తి)। అట్టి పరమాత్మయే "నాతో సహా" – **"ఈ సమస్త రూపములలోను", "ఈ సమస్త రూపముగాను"** ఉన్నారు – అను భావనయే **అనన్య భావన** (లేక) అద్వితీయానుభవము.

**తత్ త్వమ్:** – 'నీవు'గా కనిపించేదంతా పరమాత్మయే । **సోఽహమ్** : – 'నేను'గా ప్రదర్శనమగుచున్నది కూడా పరమాత్మయే।

**"నీవు – నీది, నేను – నాది అనబడేదంతా సర్వాత్మకుడగు పరమాత్మకు చెందినదే"** అను ఎరుకచే సమస్తమును పరమాత్మను అద్వితీయంగా దర్శించువాడు బ్రాహ్మణుడు.

**జాతి గుణ క్రియా విహీనమ్ :** ఎవరి దృష్టిలో బ్రహ్మమునకు జాతి – గుణ – క్రియా – అల్ప – అధిక వ్యవహారములు వాస్తవానికి ఏమాత్రమూ కూడా ఉండజాలవో, వాటన్నిటికీ అతీతమైనట్టిది అగు ఆత్మయే సర్వత్రా ప్రదర్శనమగుచున్నట్లు స్వానుభవమగుచున్నదో – ఆతడు **బ్రాహ్మణుడు**. దేహమునకు సంబంధించిన జాతి–కుల–మతములు, స్వభావమునకు సంబంధించిన మంచి–చెడు–సత్త్వ రజో తమో గుణములు, క్రియా వ్యవహారములు – ఇవన్నీ జగన్నాటకములోని జీవాత్మ సంబంధించినవేగాని, (సందర్భమాత్ర సత్యములేగాని) **కేవలాత్మవు కావు** – అని ఎరిగి ఉన్నవాడు, సమస్త జీవులను బ్రాహ్మీభావనతోను – స్వస్వరూప–అనన్యముగాను దర్శించువాడు **'బ్రాహ్మణుడు'.**

***అస్మత్ స్వరూపము 'బ్రహ్మమే' అని ఎరిగి ఉన్నవాడు, 'తత్ త్వమేవ' అను దృష్టి కలవాడు బ్రాహ్మణుడు.***

**<u>షడూర్మి – షట్ భావం ఇత్యాది సర్వదోష రహితం।</u>**

సమస్త దేహములలోను సమముగా సిద్ధించినదైయున్న **ఆత్మ** → దేహమునకు చెందినట్టి షట్ ఊర్ములగు ఆకలి, దప్పిక, శోకము, మోహము, జర, మరణములచే స్పృశించబడనిది. అవన్నీ భౌతిక దేహమునకు సంబంధించినవి మాత్రమే. ఆత్మను స్పృశించవు. స్పృశించ లేవు కూడా।

**సర్వాత్మకమగు ఆత్మ –** దృశ్య – దేహ, అనురక్త–విరక్త, జ్ఞాన–అజ్ఞాన, జన్మ–జాతి, దేశ – కాల, జీవన్–మరణ షట్ (6) భావములచే స్పృశించబడనిదిగా గమనిస్తూ, గ్రహిస్తూ ఉండువాడు 'బ్రాహ్మణుడు'. ఆతడే శ్రుతి–స్మృతులను అనుసరించి **వందనీయుడు. పూజనీయుడు.** **'బ్రాహ్మణ ఏవ ప్రధాన'** అను వేదస్తుతికి ఉద్దేశ్యించబడుచున్నవాడు.

<u>సత్యజ్ఞాన ఆనంద అనంత స్వరూపమగు ఆత్మయే నా సహజ సత్యము/స్వరూపము/స్వభావము</u>

**సత్** : – జాగ్రత్ స్వప్న సుషుప్తులకు, దేహముల రాకపోకలకు ఆవల **సాక్షి** అయి, కేవల సత్ (ఉనికి) స్వరూపము – (సత్‌స్వరూపుడను)

**చిత్** : 'ఎరుక' అను లక్షణముచే 'ఎరుగువాడు – ఎరుగుబడునది'లను వెలిగించుచున్నట్టిది. (చిత్ స్వరూపుడను)

**ఆనందమ్** : అన్యమైనదంతా (జగత్తులు, దేహముల రాకపోకలు, బంధ–మోక్షములు మొదలైనవన్నీ కూడా) ఆత్మకు స్వకీయ ఆనందరూపము. (All else is the pleasure of the Absolute self)

**అనంతమ్** : ఆత్మ = దేహ మనో బుద్ధి చిత్త అహంకారభావములచేతగాని, జాగ్రత్ – స్వప్న – సుషుప్తులచేతగాని, పంచభూత దృశ్య ప్రపంచముచేతగాని పరిమితము కానట్టిది,

**– అట్టి ఎరుక, అవగాహన, అనుభూతి కలవాడు బ్రాహ్మణుడు.**

తనయొక్క, తదితర సమస్త జీవుల యొక్క **సర్వ కల్పనాతీత స్వస్వరూపము → సర్వదా సత్యజ్ఞానానంద అనంత ఆత్మస్వరూపమే –** అను **దృష్టి, నిశ్చలానుభూతి కలిగియున్నవాడు బ్రాహ్మణుడు.**

**స్వయం నిర్వికల్పం** : సమస్త జీవుల నిర్వికల్ప స్వరూపమే ఆత్మ. సంకల్ప – వికల్పముల కంటే మునుముందే ఉన్న ఆత్మయే జాగ్రత్‌లోను, స్వప్నములోను, దేహమున్నప్పుడు, దేహము లేనప్పుడు కూడా **జగదృశ్యముగా భాసిస్తోంది – అను ఎరుక బ్రాహ్మణుని స్వాభావిక లక్షణము.**

**అశేష కల్ప ఆధారమ్** : కల్పనలోనే **'జాగ్రత్, స్వప్న'** జగదనుభవమంతా ఇమిడి ఉన్నది. అట్టి కల్పనకు ఆధారమైనట్టిదే **'ఆత్మ'**. కాల కల్పనకు కూడా ఆవల ఉన్నట్టిది. కల్పన ఉన్నప్పుడు, లేనప్పుడు కూడా ఆ కల్పన చేయువాడు యథాతథము కదా! **ఆత్మ ఎల్లప్పుడు యథాతథము.**

**అశేష భూత - అంతర్యామిత్వేన వర్తమానమ్** : ఆత్మ ఇప్పుడే ఇక్కడే భూతజాలమంతా తన అనంత కల్పనా చమత్కారముగా కలిగినదై యున్నది. కథలోని పాత్రలన్నిటికీ రచయితయే అంతర్యామి అయినట్లుగా, ఆత్మ సమస్త దేహములలోను, సమస్త దృశ్యమునందు **<u>అంతర్యామి</u>** అయి ఉన్నది.

**అంతర్బహిశ్చ ఆకాశవత్ అనుస్యూతమ్** : ఆకాశము ఏ విధంగా ఒక వస్తువుయొక్క బయట – లోపల కూడా ఏర్పడినదైయున్నదో, ఆవిధంగా...,

→ అంతరమగు మనో బుద్ధి చిత్త (చేత) అహంకారములందు,

→ దేహములోని చూపు, వినికిడి, స్పర్శ, రుచి, వాసన మొదలైన ఇంద్రియ శక్తులందు,

→ బాహ్యమున ఇంద్రియ దృశ్య జగత్తునందు, –

సర్వత్రా ఆత్మయే విస్తరించినదైయున్నది. కల కనేవాని ఊహాచైతన్యమే కల అంతటా ఏర్పడినదై ఉన్నట్లు, **ఆత్మ చైతన్యమే సర్వే సర్వత్రా వెల్లివిరిసియున్నది. ఇట్టి "అచ్యుత దృష్టి, నిశ్చల బుద్ధియొక్క స్థితి" కలవాడే <u>బ్రాహ్మణుడు.</u>**

**అఖండానంద స్వభావమ్** : ఆత్మ స్వతఃగా స్వభావరీత్యా అఖండానంద స్వరూపము. జీవాత్మత్వము పరమాత్మయొక్క స్వకీయ లీలా కల్పనా వినోదము. "జీవాత్మ–దృశ్యము", "జీవాత్మ–దేహము", "జీవాత్మ–దేహి"లతో పరాత్మకు ఉన్న సంబంధము = "వినోదము కొరకు కథ చదువువాడు – కథలోని విశేషములు" అను ఈ రెండిటికి గల సంబంధము వంటిది మాత్రమే. "కల తనదైనవాడు – కలలోని విషయములు" ఈ ఉభయములకు గల సంబంధము వంటిదే।

జీవాత్మగా ఉన్నది పరమాత్మయే। పరమాత్మయే జీవాత్మగా కనిపిస్తున్నాడు. ఈ విధంగా ఏదైతే దృశ్య – దేహ జీవాత్మ – ఈశ్వరాత్మ – పరమాత్మగా **<u>కనిపిస్తూ</u>** ఉన్నా కూడా, తనకు **'ఏకముగా' అనిపించుచున్నదో – అట్టివాడే బ్రాహ్మణుడు.**

ఒక నటుడు **(1) కేవలుడుగా (2) నటనా చాతుర్యము కలవాడుగా, (3) నాటకంలో పాత్రగా** – ఒకే సమయంలో అఖండుడై ఉన్నట్లుగా, పరమాత్మ–జీవాత్మ–జగత్తులుగా విభాగము పొందకయే, అట్టి సమస్తము తనయొక్క అఖండస్వరూపముగా కలిగియున్నట్టిదే ఆత్మ. అట్టి ఆత్మ 'తానే' అయి ఉన్నవాడే **'బ్రాహ్మణుడు'.**

**అప్రమేయమ్** : నాటకంలో నటిస్తున్న ఒక నటునికి సంబంధించి, ఆ పాత్రయొక్క సుఖ – దుఃఖ, మాన–అవమాన, పాత్రప్రవేశ–నిష్క్రమణములతో ఆతనికి **నాటకీయ సంబంధమేకాని, సహజమగు ఎట్టి సంబంధము ఉండదుకదా! "ఈ దేహ–దేహిలతో సంబంధ బాంధవ్య అనుబంధములతో కూడిన మనో – చిత్త బుద్ధి అహంకార ప్రదర్శనలతో ఆత్మకు ఎట్టి సంబంధము లేదు"** అని ఎరిగి, **'త్వమ్'** పట్ల **ఆత్మదృష్టిని** ఏమరువనివాడు బ్రాహ్మణుడు. **"తత్ త్వమ్ (అదియే నీవు)"** యొక్క అభ్యాసముచే సోఽహమ్ (అదియే నేను) – అని సిద్ధింపజేసుకుంటున్నవాడు – **<u>బ్రాహ్మణుడు.</u>**

**అనుభవైక వేద్యమ్** : 'ఆత్మ ఇట్టిది' అని మాటలతో వర్ణించి చెప్పగలిగేది కాదు. (యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ). మరి ఆత్మను తెలుసుకొనేది ఎట్లా? అది తెలియబడేది కాదు, – **తెలుసుకుంటున్నదే ఆత్మకాబట్టి.** పోనీ ఆత్మ అనుభవమవదా? ఆత్మ అనుభవమునకు సర్వదా సిద్ధమే. అది అనుభవైక వేద్యమే. ఎవరికి వారికి వారియొక్క స్వానుభవము అగుచున్నదే. బుద్ధి (common sense) కు తెలియబడగలిగినట్టిదే।

**అపరోక్షతయా భాసమానమ్**

– ఇంద్రియములకు (కంటికి, చెవులకు మొదలైన వాటికి) విషయము కాదు కాబట్టి ఆత్మ–జగత్తులోని ఒక వస్తువువలె **'ప్రత్యక్షము'** కాదు.

– ఈ జీవునికి వేరై మరెక్కడో ఉన్నట్టిది కాదు కాబట్టి ఆత్మ **పరోక్షము** కూడా కాదు.

– ప్రతి జీవునికి ఎల్లప్పుడూ స్వానుభవమే కాబట్టి **అపరోక్షము.** ఈ విధంగా, **"ఆత్మ సర్వదా సర్వత్రా అపరోక్షమై భాసిస్తున్నది"** – అను అనుభవముచే (అపరోక్షానుభవముచే) ఈ జీవుడు **'బ్రాహ్మణుడు'** అగుచున్నాడు.

**కరతల-ఆమలకవత్ సాక్షాత్ అపరోక్షీ కృత్య కృతార్థతయా** : బ్రహ్మము (లేక) ఆత్మ ఎప్పుడో ఎక్కడో ఏవేవో సాధనల అనంతరము సిద్ధింపజేసుకోవలసి ఉన్నట్టిది కాదు. ఇప్పుడే ఇక్కడే 'సర్గము'ను (The Relatedness with contexts and incidents) జయించినవాడు పరబ్రహ్మమును అరచేతిలోని ఉసిరగపండువలే (కరతల ఆమలకమువలె) సాక్షాత్‌గా అపరోక్షి అయి దర్శించగలడు. **అట్టి కరతలామలక – సాక్షాత్ అపరోక్షిత్వము సిద్ధించుకొని కృతార్థుడైనవాడే (కృతకృత్యుడైనవాడే) బ్రాహ్మణుడు.**

**(స్వాభావతః)** కామ రాగాది దోషరహిత, శమ దమాది సంపన్నో, మాత్సర్య తృష్ణా ఆశా మోహాది రహితో - బ్రాహ్మణః।

**సర్వము స్వస్వరూపాత్మ**గా దర్శించువానికి (ఇంకా ఏదో పొందవలసి ఉన్నది –అనురూపముగల) **కామము,** లభించిన – లభించని వస్తు, విషయ–బంధుజనులపట్ల (వీరు నావారు, వారు కాదు అను రూపముగల) **రాగము–** స్వభావముగానే దూరంగా వెళ్ళిపోతాయి.

అంతర దృష్టిచే అట్టి కామ-క్రోధ-లోభ-మోహ-మద-మాత్సర్యములను జయించినవాడు, [**శమము** (అంతరింద్రియ నిగ్రహము)] **దమము** (బాహ్యేంద్రియ నిగ్రహము-ఇంద్రియములు బాహ్య విషయములపై వాలటము నిగ్రహించటమును) లను స్వాభావికము చేసుకొన్నవాడే బ్రాహ్మణుడు. ఏదో ఇంకా అనుభవించాలనే **తృష్ణ,** "నేను ఈతనికంటే గొప్పవాడిని కదా"-**అనే మాత్సర్యము, ఆశ నిరాశ దురాశ పేరాశలు,** సత్యమును ఏమరచి నామరూపక్రియా విశేషములచే **మోహితుడై ఉండటము**-వీటన్నిటిపై యుద్ధము ప్రకటించి, సర్వత్రా **ఆత్మభావనయందు లయింపజేయుచున్నవాడే బ్రాహ్మణుడు.** వాటినన్నిటినీ ఆతడు కల్పిత భ్రమవిశేషములుగా చూచువాడు బ్రాహ్మణుడు.

**దంభ అహంకారాదిభిః అసంస్పృష్ట చేతావర్తతే** : తనయొక్క **"అహం బ్రహ్మాస్మి - తత్ త్వమ్"** అను తేజస్సు హృదయమున అనుక్షణికమై ప్రకాశించుచుండగా -'దంభ - దర్ప, అభిమాన, క్రోధ, పారుష్య, అజ్ఞాన, ఆభిజాత్య"...మొదలైన అజ్ఞానాంధకార భ్రమలకు హృదయమున చోటు కించిత్ కూడా దొరకనివాడై ప్రకాశించువాడు **బ్రాహ్మణుడు.**

ఓ మమాత్మానంద స్వరూపా! బిడ్డా! శిష్యదేవా!

**ఏవ ముక్త లక్షణో యః స ఏవ బ్రాహ్మణః॥** మనము ఇప్పుడు చెప్పుకున్న 'ముక్తి లక్షణములు' ఎవరిపట్ల ఏర్పడినవై వెంటనంటి ఉంటాయో, ఆతడే **"బ్రాహ్మణుడు"** సుమా!

**'బ్రాహ్మణ'** అనునది బుద్ధియొక్క పరిపక్వతకు సంబంధించినదేగాని - బాహ్యలక్షణము కాదు. ఇదియే **బ్రాహ్మణుడు** అను పదము ఉపయోగించు సందర్భములలో బ్రాహ్మణములు, తదితర వేద విభాగములు, శ్రుతి స్మృతి పురాణ ఇతిహాసముల అభిప్రాయము కలిగినవై ఉంటున్నాయి. **ఇతి శ్రుతి స్మృతి పురాణ ఇతిహాసానామ్ అభిప్రాయః॥**

ఇక,

**అన్యథా బ్రాహ్మణత్వసిద్ధిః నాస్త్యేవ।** కేవలము శాస్త్ర విజ్ఞానము చేతనో, కర్మలచేతనో, జాతి చేతనో, జన్మ చేతనో, పాండిత్యము చేతనో, వేద పఠణముల చేతనో - ఒకడు (వేద-వేదాంగ-పురాణాదుల ఉద్దేశ్యములో) **'బ్రాహ్మణుడు'** అగుచుండటం లేదు.

**శిష్యులు** : హే సద్గురూ। భగవాన్। మహానుభావా। మీరు చెప్పుచున్నట్టి అట్టి **"బ్రాహ్మీ స్థితి సమన్వితమగు బ్రాహ్మణత్వ సిద్ధి"** లభించేది ఎట్లా? దయతో సెలవీయండి. దారి చూపండి. శాసించి ఆజ్ఞాపించండి.

**గురుదేవులవారు** : నాయనా! అసలు ఆత్మస్వరూపుడవగు నీకు ఈ బంధము ఎక్కడినుండి వచ్చిపడుతోంది? ఇంద్రియములకు విషయముల రూపంగా ఎదురగుచున్న విశేషములతో అనేకసార్లుగా ఏర్పరచుకొన్న **'భావనారూప సంబంధము'** అనే **వ్యసనము** చేతనే. అందుచేత,

అట్టి 'భావించటము' అను అభ్యాసమును ఉపకరణముగా చేసుకొని, **"అఖండము - అప్రమేయము - సర్వదా స్వస్వరూపము"** అగు బ్రాహ్మీభావనను ఆశ్రయించటం చేత - బ్రాహ్మీస్థితి సిద్ధించి, ఈ జీవుడు వేద - ఇతిహాస - పురాణ స్మృతుల ఉద్దేశ్య పరమార్థమగు 'బ్రాహ్మణ' నామధేయమునకు అర్హుడగుచున్నాడు.

అందుచేత -,

సత్‌చిత్ ఆనందమ్ ఆత్మానమ్ అద్వితీయమ్ బ్రహ్మ భావయేత్॥ త్వమ్‌గాను, ఈ జగత్తుగాను కనిపించేదంతా → సచ్చిదానంద **ఆత్మకు అద్వితీయమని, ఇదంతా ఆత్మయేనని** భావనను అభ్యాసపూర్వకంగా ఆశ్రయించువాడవై ఉండుము.

ఆత్మానం సచ్చిదానందం బ్రహ్మ భావయేత్ । **"మమాత్మ సచ్చిదానంద బ్రహ్మమే"**అని ఆత్మచే భావన చేయాలి.

**అనుకుంటూ, అనుకుంటూ ఉంటే** - తప్పక అనిపిస్తుంది.

ఆత్మ (In ones own absloute self) యందు ఈ సమస్త జగత్తును, జగత్తునందు అంతటా ఆత్మను భావించాలి.

**అట్టి బ్రాహ్మీదృష్టిని స్వాభావికము, అనుక్షణికము చేసుకొనెదవు గాక।**

*ఇతి వజ్రసూచికోపనిషత్ (లేక) వజ్రసూచ్యుపనిషత్*

*ఓం శాంతిః। శాంతిః। శాంతిః।*

సామవేదాంతర్గత

# 13 రుద్రాక్షజాబాలోపనిషత్

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ 'రుద్రాక్షోపనిషత్' వేద్యం మహారుద్రతయా ఉజ్జ్వలమ్
ప్రతియోగి వినిర్ముక్తం "శివమాత్రపదం" భజేత్॥

రుద్రోపనిషత్ - చెప్పుచున్న రహస్యతత్త్వమును ఎరిగినవారు క్రమంగా శివ తత్త్వమును ఎరిగినవారగుచున్నారు. ఉజ్వలమగు మహారుద్ర స్వరూపుడు, ఎదురుచెప్పుటకే (ప్రతియోగి) కుదరనట్టి వారు, పరకాష్ఠయగు "నిరూపిత పరమసత్యము" ను ప్రకటించువారు- అగు పరమశివుని 'శివమాత్రపదసిద్ధి కొరకై (శివోఽహమ్ సిద్ధికై) సేవించుచున్నాము.

"ఓం"

"ఓం ఇత్యేకాక్షరమ్ బ్రహ్మ"

1. అథ హి ఏనం కాలాగ్ని రుద్రం
భుసుండః ప్రపచ్ఛ :
"కథం రుద్రాక్షా ఉత్పత్తిః?
తత్ ధారణాత్ కిం ఫలం?" - ఇతి॥

ఒకానొక సందర్భములో వాయస - భుసుండులవారు జగద్గురువులగు **కాలాగ్నిరుద్ర భగవానుని** దర్శనం చేసుకొని ఈ విధంగా పరిప్రశ్నించారు. స్వామీ! రుద్రాక్షలు ఎట్లా పుట్టినాయి? అట్టి రుద్రాక్షధారణ - ఏ ఫలమును ప్రసాదించ గలదు? (రుద్రాక్ష = అనేకమైనదంతా ఏకమగు ఆత్మయందు **లయింపజేసి** దర్శించు దృష్టి. ఈవిధంగా రుద్రుడు లయకారుడు).

---

తం హో వాచ భగవాన్ కాలాగ్ని రుద్రః :
త్రిపుర వధార్థమ్ అహమ్
నిమీలితాక్షో అభవమ్।

**శ్రీ కాలాగ్ని రుద్ర భగవానుడు:** ఓ భుసుండా! వినండి. నేను ఒకప్పుడు దేవతల కష్టములు తొలగించటానికై, త్రిపురాసురుని సంహరించ సంకల్పించాను. కించిత్ కనులు మూసుకొన్నాను.

---

తేభ్యో జలబిందవో భూమౌ పతితాః,
తే 'రుద్రాక్షా' జాతాః, సర్వానుగ్రహార్థాయ।

అప్పుడు నా కనులనుండి **జలబిందువులు** భూమిపై రాలటం జరిగింది. ఆ జలబిందువులే సర్వజనులకు అనుగ్రహము ప్రసాదించే నిమిత్తమై **'రుద్రాక్షలు'**గా అయినాయి.

---

తేషాం నామోచ్చారణ మాత్రేణ
దశ గో ప్రదాన ఫలం।
దర్శన స్పర్శనాభ్యాం ద్విగుణ ఫలమ్।

అట్టి 'రుద్రాక్ష' నామమును ఉచ్చరించిన మాత్రముచేతనే ఈ జీవునకు పది గోవులను దానము చేసిన ఫలితము లభించగలదయ్యా!
అంతే కాదు. రుద్రాక్షలను దర్శించినంత, స్పృశించినంత మాత్రంచేతనే అంతకు ద్విగుణీకృతమైన ఫలము (Double the above) సిద్ధించగలదు.

---

అత ఊర్ధ్వం వక్తుం న శక్నోమి।
తత్ర ఏతే శ్లోకా భవంతి।

ఇక ఆపై - (పూజించటము, ధారణ చేయటము మొదలైనవాటి చేత) లభించుఫలము నేను కూడా నిర్వచించి చెప్పలేను. ఆయా విశేషములు శాస్త్రములచే శ్లోకరూపంగా గానము చేయబడుచూ ఉన్నది.

---

భుసుండౌ వాచ :
కస్మిగ్ం స్థితం తు? కిం న్నామ?
కథం వా ధార్యతే నరైః? కతి భేదముఖాని?
- అత్ర కైః మంత్రైః-
ధార్యతే కథమ్?

**భుసుండయోగీశ్వరుడు:**
- రుద్రాక్షలు ఎక్కడ స్థితి కలిగి ఉంటాయి?
- వాటికి ఏఏ పేర్లు ఉన్నాయి?
- జనులు ఏఏ విధాలుగా ధరిస్తూ ఉంటారు?
- ఏఏ ముఖభేదములున్నాయి?
- ఏఏ మంత్రములతో మనన పూర్వకంగా ఉపాసిస్తూ, ధారణ చేయాలి?

దయతో వివరించండి.

| కాలాగ్నిరుద్రౌవాచ : | శ్రీ కాలాగ్ని రుద్రభగవానుడు : |
|---|---|
| దివ్య వర్ష సహస్రాణి<br>చక్షుః ఉన్మీలితం మయా।<br>భూమాః అక్షి పుటాభ్యాం తు<br>పతితా జలబిందవః। | వేయి దివ్యసంవత్సరముల కాలము నేను చక్షురున్మీలితుడనై (కనులు మూసుకొని) ఒక్కసారిగా కనులు తెరచుటచే అక్షిపుటములనుండి (కనుకొలకుల నుండి) కన్నీటి బిందువులు జాలువారి భూమిపై పడటం జరిగింది. |
| తత్ర అశ్రుబిందవో జాతా మహారుద్రాక్ష వృక్షకాః।<br>స్థావరత్వమ్ అనుప్రాప్య భక్తానుగ్రహకారణాత్।<br>భక్తానాం ధారణాత్ పాపం<br>దివారాత్రి కృతగ్ం హరేత్। | ఆ అశ్రు బిందువులే భూమిపై మహారుద్ర వృక్షములుగా అయినాయి.<br>భక్తులను అనుగ్రహించుటకొరకై జలరూపమగు ఆ అశ్రుబిందువులు స్థావరములుగా రుద్రాక్ష వృక్షములు - అట్టి రుద్రాక్షల ధారణ-పగలు, రాత్రి చేసిన పాపములు హరించవేయ గలవు. |
| లక్షం తు దర్శనాత్ పుణ్యం,<br>కోటిః తత్ స్పర్శనాత్ భవేత్।<br>తస్య కోటి శతం పుణ్యం<br>లభతే ధారణాత్ నరః। | దర్శనమాత్రం చేత లక్ష జపము చేసిన పుణ్యము, స్పర్శమాత్రం చేత కోటి జపము చేసిన ఫలము లభించగలదు.<br>అంతేకాదు. నరుడు (మానవుడు) రుద్రాక్షలను ధారణ చేయుటచే శతకోటి జపముల పుణ్యము పొందుచున్నాడు. |
| లక్ష కోటి సహస్రాణి, లక్ష కోటి శతాని చ - తత్ జపాత్<br>లభ్యతే పుణ్యం నరో రుద్రాక్ష ధారణాత్।<br>ధాత్రీఫల (ఉసిరికాయంత)<br>ప్రమాణం యత్ -'శ్రేష్ఠమ్' ఏతత్ ఉదాహృతమ్। | రుద్రాక్షలను ధారణ చేసి జపం చేస్తే లక్ష కోటి వేల, లక్ష కోటి వందల సార్లు జపము చేసిన పుణ్యము లభించగలదు.<br>ఉసిరికాయంత ప్రమాణముగల రుద్రాక్షలు శ్రేష్ఠము, ఉత్తమము అని చెప్పబడుతోంది. |
| బదరీఫల (గంగరేగుపండు) మాత్రం తు<br>'మధ్యమం' ప్రోచ్యతే బుధైః।<br>అధమం చణమాత్రం (శనగ గింజంత) స్యాత్<br>ప్రక్రియైషా మయోచ్యతే। (ప్రక్రియ ఏషా మయ ఉచ్యతే।) | గంగరేగుపండంత ప్రమాణముగల రుద్రాక్ష మధ్యమమని బుధులచే తెలియజేయబడుతోంది.<br>శనగ గింజ ప్రమాణముగల రుద్రాక్ష అధమము.<br>ఇది ప్రక్రియా విధానంగా నాచే చెప్పబడింది. |
| బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః<br>శూద్రాశ్చ ఇతి శివాజ్ఞయా,<br>వృక్షాజాతాః పృథివ్యాంతు<br>తత్ జాతీయాః శుభాక్షకాః। (శుభ అక్షకాః)। | ఓ భుసుండ మహాశయా! ఇప్పుడు రుద్రాక్షల ప్రక్రియ గురించి చెప్పుచున్నాను. వినండి.<br>జనులలో విభాగములుగా చెప్పుకోబడుచున్నట్లే, రుద్రాక్ష వృక్ష జాతులు కూడా - "బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర" జాతుల రుద్రాక్ష వృక్షాలు ఉన్నాయి. వాటివాటి రుద్రాక్షలు కూడా చతుర్విధములు. |
| శ్వేతాస్తు బ్రాహ్మణా జ్ఞేయాః।<br>క్షత్రియా రక్తవర్ణకాః।<br>పీతా (పసుపుపచ్చ) వైశ్యాస్తు విజ్ఞేయాః।<br>కృష్ణాః (నలుపు) శూద్రా ఉదాహృతాః।। | తెల్లని రుద్రాక్షలు బ్రాహ్మణ రుద్రాక్షలు అని,<br>ఎర్రనివి క్షత్రియ రుద్రాక్షలు అని,<br>పసుపు పచ్చని వైశ్యజాతి రుద్రాక్షలు అని<br>నలుపు రుద్రాక్షలు శూద్ర రుద్రాక్షలు అని **చెప్పబడుతోంది.** |
| బ్రాహ్మణో బిభృయాత్ శ్వేతాన్।<br>రక్తాన్ రాజా తు ధారయేత్।<br>పీతాన్ వైశ్యస్తు బిభృయాత్।<br>కృష్ణాం శూద్రస్తు ధారయేత్।<br>సమాః స్నిగ్ధా దృఢాః స్థూలాః<br>కంటకైః సంయుతాః శుభాః। | అందుచేత...,<br>బ్రాహ్మణులు → తెల్ల రంగు రుద్రాక్షలను,<br>క్షత్రియులు → ఎర్రరంగు రుద్రాక్షలను,<br>వైశ్యులు → పసుపుపచ్చరంగు రుద్రాక్షలను,<br>శూద్రులు → కృష్ణ (నలుపు) రంగు రుద్రాక్షలను<br>ధారణ చేయుట శ్రేష్ఠము.<br>రుద్రాక్షలలో సమమైనవి, నునుపైనవి, గట్టిగా ఉన్నట్టివి, స్థూలంగా ఉండేవి, చిన్న కంటకములవలె (ముళ్లతో) ఉండేవి - ఇవి శుభప్రదము. |

| | |
|---|---|
| క్రిమిదష్టం ఛిన్న భిన్నం కంటకైః హీనమేవ చ।<br>వ్రణయుక్తమ్ అయుక్తం చ<br>షట్ రుద్రాక్షాణి వర్జయేత్॥ | పురుగులు కొరికగా చిల్లులు కలిగినవి, ముక్కలుగా ఛిన్నాభిన్నమైనట్టివి, పెద్దముల్లులు (కంటకములు) కలిగియున్నట్టివి, హీనమైన ఆకారములు కలిగియున్నట్టివి, వ్రణములతో గొగ్గిలిగొగ్గిలిగా ఉన్నట్టివి, నలువైపులా అసమమైన ఆకారములు కలిగియున్నట్టివి అగు రుద్రాక్షలు **వర్జించవలసినవి. ధరించరాదు.** |
| **3.** స్వయమేవ కృతద్వారం<br>రుద్రాక్షం స్యాత్ ఇహ 'ఉత్తమమ్'।<br>యత్తు పౌరుషయత్నేన<br>కృతం తత్ 'మధ్యమం' భవేత్। | స్వయముగా (మానవ ప్రయత్నం లేకుండా) ప్రకృతి సిద్ధంగా రంధ్రము కలిగియున్న రుద్రాక్షలు ఉత్తమమైనవి.<br>పురుష ప్రయత్నపూర్వకంగా రంధ్రము చేయబడినవి 'మధ్యమము' అగుచున్నాయి. |
| సమాన్ స్నిగ్ధాన్ దృఢాన్ స్థూలాన్<br>క్షౌమసూత్రేణ ధారయేత్।<br>సర్వ గాత్రేణ సౌమ్యేన<br>సామాన్యాని విచక్షణః॥ | సమమైనవి, సుతి మెత్తని - నునుపైనవి, దృఢమైనవి, స్థూలమైనవి - ఇటువంటి రుద్రాక్షలను పట్టుత్రాడుతోగ్రుచ్చి ధరించాలి.<br>సామాన్యంగా - విచక్షణశీలురగు పండితులు రుద్రాక్షమాలలను దేహమంతటా ధరిస్తూ ఉంటారు. |
| నికషే హేమరేఖాభా<br>యస్య రేఖా ప్రదృశ్యతే,<br>తత్ అక్షమ్ ఉత్తమమ్ విద్యాత్।<br>తత్ ధార్యం శివపూజకైః। | ఏ రుద్రాక్ష అయితే గీటురాయిపై గీసినపుడు బంగారపురంగు గీత కనబడటము జరుగుతుందో, అట్టి రుద్రాక్ష ఉత్తమమైనదిగా గ్రహించబడుతోంది. అట్టి అక్షతను శ్రేష్ఠముగా శివపూజ సందర్భము కొరకై ధరించబడుచున్నది. |
| శిఖాయాం ఏకరుద్రాక్షం।<br>త్రిశతం (300) శిరసా వహేత్।<br>షట్ త్రింశతం (36) గళే దధ్యాత్।<br>బాహ్వోః షోడశ - షోడశ (16,-16)।<br>మణిబంధే ద్వాదశైవ (12)। | శిఖయందు - ఒక రుద్రాక్షను<br>శిరస్సునందు - 300 రుద్రాక్షలు,<br>గళము (మెడ) యందు '36' రుద్రాక్షలు,<br>ఉభయ భుజములకు 16+16 రుద్రాక్షలు,<br>మణికట్టుకు '12' రుద్రాక్షలు, |
| స్కంధే పంచశతం (500) వహేత్।<br>అష్టోత్తర శతైః (108) మాలామ్, ఉపవీతం ప్రకల్పయేత్। | స్కందము (చంక, మూపుర) స్థానములలో '500' రుద్రాక్షలను, 108 రుద్రాక్షల మాలను ఉపవీతము (జందియము) వలె వేసుకోవాలి. |
| ద్విసరం త్రిసరం వాపి సరాణాం (పేటలు) పంచకం తథా।<br>సరాణాం సప్తకం వాపి బిభృయాత్ కంఠదేశతః।<br>మకుటే కుండలేచైవ, కర్ణికా హార కేఽపి వా<br>కేయూర కటకే సూత్రం కుక్షిబంధే విశేషతః।<br>సుప్తే పీతా సదా కాలం,<br>రుద్రాక్షం ధారయేత్ నరః। | కంఠమునకు రెండు (2) వరుసల (లేదా) మూడు (3) వరుసల (లేక) (5) వరుసల (లేక) ఏడు (7) పేటల మాలను ధరించెదరుగాక!<br>మకుటము (కిరీటము) నందు, కుండలము (చెవిప్రోగుల)యందు కర్ణిక (చెవికమ్మ)యందు, హారకము (గొలుసు) నందు, కేయూర (బాహు ఆభరణమునందు, కటక సూత్రమునందు), కుక్షి (పొట్ట) బంధమునందు రుద్రాక్షలు, వాటితో కూడిన సూత్రపు త్రాడుతో సర్వకాలములలో ధరించటము చేత - విశేషమైన ఫలితము లభించగలదు. |
| త్రిశతం తు అధమం।<br>పంచశతం మధ్యమమ్ ఉచ్యతే।<br>సహస్రం ఉత్తమం ప్రోక్తమ్<br>ఏవం భేదేన ధారయేత్। | **మొత్తము అన్నీ కలిపి -**<br>300 రుద్రాక్షల ధారణ - అధమము<br>500 రుద్రాక్షల ధారణ - మధ్యమము<br>1000 రుద్రాక్షల ధారణ - ఉత్తమము<br>ఈ భేదమును ఎరిగి ధారణ చేయబడును గాక। |

**శిరస 'ఈశాన' మంత్రేణ**
**కంఠే 'తత్పురుషేణ' తు।**
**"అఘోరేణ" గళే ధార్యం**
**తేనైన హృదయేఽపి చ॥**

శిరస్సుపై → **"ఈశానః"** మంత్రములో ధరించాలి.

శ్లో॥ ఈశానః సర్వ విద్యానామ్। ఈశ్వరః సర్వభూతానామ్।
బ్రహ్మ అధిపతిః। బ్రాహ్మణో అధిపతిః
బ్రహ్మే శివో మే అస్తు సదా శివోమ్॥ (శివ 'ఓం')

**"తత్పురుష"** మంత్రము గానం చేస్తూ కంఠమున రుద్రాక్షమాలతో అలంకరించుకోవాలి.

శ్లో॥ తత్పురుషాయ విద్మహే। మహా దేవాయ ధీమహి।
తన్నో రుద్రః ప్రచోదయాత్॥

గళమున (కుత్తుకయందు), హృదయమున రుద్రాక్షలు ధరించేడప్పుడు **అఘోరమంత్రము** గానము చేస్తూ ఉండాలి.

శ్లో॥ అఘోరేభ్యో, అథ ఘోరేభ్యో ఘోర ఘోరతరేభ్యః
సర్వేభ్యోః సర్వ శర్వేభ్యో నమస్తే అస్తు రుద్ర రూపేభ్యః॥

---

**4. 'అఘోర' బీజ మంత్రేణ కరయోః ధారయేత్ సుధీః।**
**పంచాశత్ (50) అక్షగ్రథితాన్**
**వ్యోమవ్యాప్యపి చ – ఉదరే।**
**పంచ బ్రహ్మభిః అంగైశ్చ త్రిమాలా పంచసప్త చ।**
**గ్రథిత్వా మూలమంత్రేణ, సర్వాణి అక్షాణి ధారయేత్।**

"అఘోర బీజమంత్రము" చదువుచూ చేతులకు రుద్రాక్షలు ధారణ చేయాలి.

50 అక్షములను (రుద్రాక్షలను) గ్రథితము (మాలగా కూర్చటము) చేయాలి. ఉదరము (పొట్ట) చుట్టూతా విస్తరించి ధరించాలి. పంచబ్రహ్మలను రుద్రాక్షపూర్వకంగాను, మూల మంత్రములతో గ్రథితం చేస్తూ - (కూర్చుచూ) ధరించాలి.

---

**అథ హి ఏనం భగవంతం**
**కాలాగ్నిరుద్రం భుసుండః పప్రచ్ఛ :**
**"రుద్రాక్షాణాం భేదేన**
**యత్ అక్షం?యత్ స్వరూపం? యత్ ఫలమ్ ఇతి?**
**తత్ స్వరూపం ముఖ యుక్తం,**
**అనిష్ట నిరసనం, కామాభీష్ట ఫలం**
**బ్రూహి" – ఇతి॥**

**భుసుండవాయసమహా యోగి :**
హే భగవాన్! కాలాగ్ని రుద్రదేవా!
- రుద్రాక్షలలో వివిధ భేదములు ఎట్టివి? ఏ రకములు ఉన్నాయి?
- ఏ జాతి రుద్రాక్ష ఏ స్వరూపం కలిగి ఉంటుంది? ఏ ఫలమును ప్రసాదించగలదు?
- వాటి ముఖ స్వరూపములు ఏమిటి? వాటి అనిష్ట - నిరసనము లైనవి ఏవి? అభీష్ట ఫలములను ఏవి ప్రసాదిస్తాయి? - ఈ వివరణలు దయచేసి చెప్పండి.

---

**సహోవాచ:**
**తత్రైతే శ్లోకా భవంతి।**
**మం.శ్లో॥ ఏకవక్త్రం తు రుద్రాక్షం**
**పరతత్త్వ స్వరూపకమ్।**
**తత్ ధారణాత్ పరే తత్త్వే**
**లీయతే విజితేంద్రియః॥**

కాలాగ్ని రుద్ర భగవానుడు : నాయనా! భుసుండా! మీరు అడిగిన విశేషాల గురించి వివరించే శాస్త్ర శ్లోకములు (వివరణలు) ఉన్నాయి.

**(1).** ఏకముఖరుద్రాక్ష : పరతత్త్వ స్వరూపకము. ఏకముఖ రుద్రాక్ష ధారణచే అట్టివాడు ఆత్మోపాసకుడై పరబ్రహ్మముతో మమేకత్వము సిద్ధించుకోగలడు. ఇంద్రియ దృశ్యమంతా జయించి వేయగలడు. ఆతనికి ఇంద్రియములు స్వాధీనమైనవై ఉంటాయి.

---

**ద్వి వక్త్రంతు, మునిశ్రేష్ఠ చ,**
**అర్ధనారీశ్వరాత్మకమ్।**
**ధారణాత్ అర్ధ నారీశః**
**ప్రీయతే తస్య నిత్యశః॥**

**(2).** ద్విముఖ రుద్రాక్ష : - అర్ధనారీస్వరూపము :
ఓ మునిశ్రేష్ఠా! ఈ ద్విముఖ రుద్రాక్షను ధరించినవాడు సమస్త జగత్ దృశ్యముపట్ల అతీతరూపమగు మౌన-ఈశ్వరత్వము, మునిశ్రేష్ఠత్వము సిద్ధించుకోగలడు.
ఇహ-పర, ప్రకృతి-పురుష, జీవ-బ్రహ్మ ఏకత్వరూపమగు అర్ధనారీశ్వ రాత్మకమైనది-అగు ద్విముఖ రుద్రాక్షయొక్క అనునిత్యధారణచే అర్ధ నారీశ్వరుడు ప్రీతిచెంది సమస్త ఇహ-పర సుఖములు ప్రసాదించగలరు.

| | |
|---|---|
| త్రిముఖంచ ఏవ రుద్రాక్షమ్<br>అగ్ని త్రయ స్వరూపకమ్।<br>తత్ ధారణాచ్చ హుత భుక్తస్య<br>తుష్యతి నిత్యదా॥ | **(3).** త్రిముఖ **(3)** రుద్రాక్ష : అగ్నిత్రయ స్వరూపమ్<br>త్రిముఖ రుద్రాక్ష - గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, అహవనీయాగ్ని స్వరూపము. అట్టి త్రిముఖరుద్రాక్ష ధారణచే హుతభుక్ అగు అగ్నిభగవానుడు ప్రీతిచెంది, సర్వశుభములు ప్రసాదించగలరు. |
| చతుర్ముఖం తు రుద్రాక్షం<br>చతుర్వక్త్ర స్వరూపకమ్।<br>తత్ ధారణాత్ చతుర్వక్త్రః<br>ప్రీయతే తస్య నిత్యదా॥ | **(4).** చతుర్ముఖ **(4)** రుద్రాక్ష - చతుర్ముఖబ్రహ్మ స్వరూపము<br>4 ముఖముల రుద్రాక్ష సృష్టికర్త అగు చతుర్ముఖ బ్రహ్మ స్వరూపము. చతుర్ముఖ రుద్రాక్ష నిత్యధారణచే బ్రహ్మభగవానుడు ప్రీతిచెంది సర్వ శుభ - సంపదలు ప్రసాదించగలరు. బ్రహ్మజ్ఞానము అనుగ్రహించగలరు. |
| పంచవక్త్రం తు రుద్రాక్షం<br>పంచ బ్రహ్మ స్వరూపకమ్।<br>పంచ వక్త్రః స్వయం బ్రహ్మ<br>పుంహత్యాం చ వ్యపోహతి॥ | **(5).** పంచముఖ **(5)** రుద్రాక్ష - పంచముఖ బ్రహ్మ / పంచముఖ శివ భగవానుని స్వరూపము<br>పంచముఖ రుద్రాక్ష ధారణచే పంచముఖుడగు శివదేవుడు ప్రీతిపొందిన వారై బ్రహ్మహత్య ఇత్యాది మహాపాపముల దోషములు కూడా తొలగించి, సర్వ శుభములు ప్రసాదించగలరు. |
| షడ్వక్త్రమ్అపి రుద్రాక్షం<br>కార్తికేయ అధి దైవతమ్।<br>తత్ ధారణాత్ మహాశ్రీః స్యాత్<br>మహత్ – ఆరోగ్యం ఉత్తమమ్॥ | **(6).** షట్ ముఖ **(6)** రుద్రాక్ష-షణ్ముఖ/కార్తికేయ/కుమారస్వామి స్వరూపము<br>ఆరు ముఖముల రుద్రాక్ష ధారణచే ఆ కార్తికేయ కరుణారస సాగరుని కరుణా కటాక్ష వీక్షణ లభించగలదు. మహత్ సిరిసంపదలు, మహత్తరమగు భౌతిక - మానసిక ఆధ్యాత్మి సంపదలు, ఉత్తమ ఆరోగ్యము లభించగలవు. |
| మతి విజ్ఞాన సంపత్తి<br>శుద్ధయే ధారయేత్ సుధీః।<br>'వినాయక అధిదైవం చ<br>ప్రవదంతి మనీషిణః॥ | షణ్ముఖ (6) రుద్రాక్షధారణచే అధికాధికంగా **ఉత్తమమైన బుద్ధి - విజ్ఞాన సంపత్తి, నిర్మలమైన మనో బుద్ధులు** లభించగలవు. అట్టివాడు సుధీః (ఉన్నతమైన, సునిశితమైన బుద్ధిసంపన్నుడు) కాగలడు. మహనీయులు **"షణ్ముఖ రుద్రాక్షకు అధి దేవత వినాయకస్వామి"** అని కూడా చెప్పుచూ ఉంటారు. అట్టి ధారణ 'వినాయకోపాసన' అగుచున్నది. |
| **5.** సప్తవక్త్రం తు రుద్రాక్షం<br>సప్తమాత్ర అధిదైవతమ్।<br>తత్ ధారణాత్ మహాశ్రీ స్యాత్<br>మహత్ – ఆరోగ్యం ఉత్తమమ్॥<br>మహతీ జ్ఞాన సంపత్తిః, శుచిః ధారణతః సదా॥ | **(7).** ఏడు **(7)** ముఖముల రుద్రాక్ష - సప్త మాతృకల అధిదేవతారూపము.<br>(**బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండి** అనబడు) సప్త మాతృకల దేవతా స్వరూపము. అట్టి ఏడు ముఖముల రుద్రాక్షను శుచిగా నిత్యము ధరించుటచేత - మహత్ సంపద, మహత్ ఆరోగ్యము, మహత్ జ్ఞాన సంపత్తి సిద్ధించగలదు. |
| అష్టవక్త్రం తు రుద్రాక్షమ్<br>అష్టమాత్ర – అధి దైవతమ్।<br>వసు–అష్టక ప్రియంచైవ<br>గంగాప్రీతికరం తథా।<br>తత్ ధారణాత్ ఇమే ప్రీతా<br>భవేయుః సత్యవాదినః॥ | **(8).** ఎనిమిది **(8)** ముఖముల రుద్రాక్ష అష్టమాత్ర అధిదేవతా స్వరూపము.<br>అష్ట వసువులకు (అవుడు, ధ్రువుడు, సోముడు, ఆధ్వరుడు, అనిలుడు, ప్రత్యూషుడు, అనలుడు, ప్రభాసులకు) - ప్రియమైనది. అష్టగంగలకు (గంగ, యమున, కృష్ణ, గోదావరి, సరస్వతి, నర్మద, సింధు, కావేరి)కి - ప్రీతికరము. ఎనిమిది ముఖముల రుద్రాక్ష ధరించటంచేత అట్టివారు అష్ట వసువులకు, అష్టగంగలకు ప్రీతికరము అవుతారు. సత్యవాదు లవగలరు. సత్యవాక్ - శుద్ధి పొందగలరు. |
| నవ వక్త్రం తు రుద్రాక్షం<br>నవశక్తి అధి దైవతమ్।<br>తస్య ధారణ మాత్రేణ<br>ప్రీయంతే నవశక్తయః॥ | **(9).** తొమ్మిది **(9)** ముఖముల రుద్రాక్ష నవశక్తి స్వరూప అధిదేవత.<br>ధారణమాత్రంచేత నవశక్తి దేవతలకు (నవావరణల అధిదేవతలకు (అట్టివాడు) ప్రీతిపాత్రుడగు చున్నాడు.<br>(దృశ్యాత్మ, జీవాత్మ, అంతరాత్మ, పరమాత్మ, నిర్మలాత్మ, శుద్ధాత్మ, జ్ఞానాత్మ, మహాత్మ, భూతాత్మలనబడే నవాత్మాంశల జ్ఞానము సిద్ధించగలదు) |

దశవక్త్రం తు రుద్రాక్షం
యమ దైవత్యమ్ ఈరితమ్।
దర్శనాత్ శాంతి జనకం
పాపానామ్। నాత్ర (న-అత్ర) సంశయః॥

**(10).** పది **(10)** ముఖముల రుద్రాక్ష "యమ-దైవత్యము" - గా చెప్పబడుతోంది. చూచినంత మాత్రం చేతనే సర్వ శారీరక మానసిక రుగ్మతలు తొలగుతాయి. ఇంద్రియ నిగ్రహము సిద్ధించగలదు. పరమశాంతి లభించగలదు. సందేహమే లేదు. యమ దేవునికి ప్రీతి అగుటచేత మృత్యుభయము ఉండదు. **అమృతత్వము స్వానుభవమవగలదు.**

---

ఏకాదశ ముఖం తు అక్షం, రుద్ర ఏకాదశ దైవకమ్।
తత్ ఇదం దైవతం ప్రాహుః, సదా సౌభాగ్య వర్ధనమ్॥

**(11).** ఏకాదశ **(11)** ముఖములు గల రుద్రాక్ష ఏకాదశ రుద్రదేవతా స్వరూపము. అట్టి రుద్రాక్ష ధారణ - సదా సౌభాగ్యమును, దివ్యత్వము ప్రసాదించునదిగా చెప్పబడుచున్నది.

---

రుద్రాక్షం ద్వాదశ ముఖం, మహావిష్ణు స్వరూపకమ్।
ద్వాదశ ఆదిత్యరూపం చ బిభర్తి ఏవ హి తత్పరః॥

**(12).** ద్వాదశ **(12)** ముఖములుగల రుద్రాక్ష మహావిష్ణు స్వరూపము. ద్వాదశ ఆదిత్యుల దివ్య తేజోరూపము. ఇది ధరించుటచే వారియొక్క ప్రీతి, కరుణ స్వాభావికమై ప్రాప్తించగలదు.

---

త్రయోదశ ముఖం చ అక్షం
కామదమ్ సిద్ధిదం శుభమ్।
తస్య ధారణ మాత్రేణ
కామదేవః ప్రసీదతి॥

**(13).** త్రయోదశ **(13)** ముఖములుగల రుద్రాక్షత - సర్వ కోరికలు తీర్చునది. సిద్ధి ప్రసాదించునది. శుభములు కలుగజేయునది.

ధారణమాత్రముచేత కామదేవత (కామేశ్వరుడు) సంతోషించి కోరుకొన్నవి ప్రసాదించగలరు. ఆత్మ - స్వతంత్రేచ్ఛచే పరిపూర్ణుడు కాగలడు.

---

చతుర్దశ ముఖం చ అక్షం
రుద్ర నేత్ర సముద్భవమ్।
సర్వ వ్యాధి హరం చ ఏవ
సర్వదా ఆరోగ్యమ్ ఆప్నుయాత్॥

**(14).** పదునాలుగు **(14)** ముఖముల (పలకల) రుద్రాక్ష రుద్రభగవానుని నేత్రముల నుండి ఉద్భవించినట్టిది. సర్వ మానసిక రుగ్మతలను, శారీరక వ్యాధులను తొలగించుచూ, సర్వదా శారీరక-మానసిక ఆరోగ్యము ప్రసాదించునట్టిది.

---

**6.** మద్యం మాంసం చ లశునం (ఉల్లి)
పలాండుం (వెల్లుల్లి) శిగ్రుం (గోంగూర) ఏవ చ
శ్లేష్మాత్మకం (కఫమ్ స్పర్శ),
విడ్వరాహమ్ (తాంబూల సేవనము)
అభక్ష్యం। వర్జయేత్ నరః।

ఓ భుసుండయోగీశ్వరా!

ఇప్పుడు రుద్రాక్ష ధారణయొక్క ఉత్తమ ప్రయోజనము సిద్ధించుటకై పాటించవలసిన నియమములు, విధి-నిషేధములు వినండి.

మద్యము, మాంసము, శిగ్రు (గోంగూర), కఫము అధికంచేసే ఆయా పదార్థములు, విడ్వరాహము (కిళ్ళీ మొదలైనవి) - అభక్ష్యముగా చెప్పబడుచున్నాయి. వాటిని సాధకుడు వదలి ఉండటము ఉచితము.

---

గ్రహణే విషువే చ ఏవమ్
అయనే, సంక్రమేఽపి చ,
దర్శేషు పూర్ణమాసే చ
పూర్ణేషు దివసేషు చ
రుద్రాక్ష ధారణాత్ సద్యః
సర్వ పాపైః ప్రముచ్యతే॥

గ్రహణ సమయమునందు, విషువత్ కాలము (రేయి-పగలు సమమైన ఉదయ-సాయంకాల ప్రదోషకాలములయందు), ఆయా (ఉత్తరాయన, పూర్వాయన) అయన పుణ్యాకాలములందు, సంక్రమణ కాలమునందు (సూర్యుడు మేష, వృషభ, కర్కాటక - మొదలైన) ఒక 'రాశి' నుండి మరొక 'రాశి'లో ప్రవేశించుకాలమునందు, దర్శ (అమావాస్య) - పౌర్ణమి రోజులలో, పూర్ణ దినములలో, (ఏకాదశి, దశమి, పంచమి, సప్తమి ఇత్యాది పరవడి రోజులలోను) **రుద్రాక్ష మాలధారణచే సర్వపాపములు తొలగగలవు. సద్యోముక్తి లభించగలదు.**

---

రుద్రాక్ష మూలం తత్ బ్రహ్మా
తత్ నాళం విష్ణురేవ చ।
తత్ ముఖం రుద్ర - ఇత్యాహుః।
తత్ బిందుః సర్వ దేవతా। ఇతి॥

**రుద్రాక్షయొక్క :**
మూలము - బ్రహ్మనివాసము.
నాళము - విష్ణు నివాసము.
ముఖము - రుద్రనివాసము.
అద్దాని బిందువు - సర్వ దేవతల నివాసము - అని విజ్ఞులు అభివర్ణిస్తున్నారు.

అథ కాలాగ్ని రుద్రం భగవంతం
సనత్కుమారః పప్రచ్ఛ :
అధీహి, భగవన్।
రుద్రాక్షధారణ విధిమ్ (బ్రూహి)।

ఒక సందర్భములో బ్రహ్మమానస పుత్రుడగు సనత్కుమారులవారు శ్రీ కాలాగ్ని రుద్రభగవానుని ఈ విధంగా అడగటం జరిగింది.

హే దేవాదిదేవా! రుద్ర భగవన్! నమస్తే! రుద్రాక్షధారణ యొక్క విధి విధానము గురించి వివరించి చెప్పండి.

---

తస్మిన్ సమయే నిదాఘు, జడభరత,
దత్తాత్రేయ, కాత్యాయన, భరద్వాజ, కపిల,
వసిష్ఠ, పిప్పలాదయశ్చ।
కాలాగ్నిరుద్రం పరిసమేత్య,
ఊచుః – అథ కాలాగ్నిరుద్రః :
కిమర్థం భవతామ్ ఆగమనమ్? ఇతి।

అదే సమయంలో మహనీయులగు నిదాఘు మహర్షి, జడభరతుడు, అత్రి - అనసూయలకు విష్ణు అంశగా పుట్టిన దత్తాత్రేయస్వామి, కాత్యాయనుడు, భరద్వాజ మహర్షి, కపిల మహర్షి, వసిష్ఠమహర్షి, పిప్పలాదమహర్షి - మొదలైనవారు ఆచోటికి వచ్చారు.

కాలాగ్ని రుద్రభగవానుడు : ఓ సప్తర్షి, పరమహంస మొదలైన మహనీయులారా! సుస్వాగతం. మీ రాకకు - ఏమిటి విశేషము? ఊరకరారు మహాత్ములు।

---

హోవాచ :
రుద్రాక్షధారణ విధిం వై
సర్వే శ్రోతుమ్ ఇచ్ఛామహ। ఇతి।।

**నిదాఘ మొదలైన మహర్షులు, పరమహంసలు :**

స్వామీ! కాలాగ్నిరుద్రదేవా! మీరు చెప్పుచున్న రుద్రాక్షధారణా విధి గురించి మేము కూడా వినాలనే ఇచ్ఛచే వచ్చాము.

---

అథ కాలాగ్నిరుద్రః ప్రోవాచ :
రుద్రస్య నయనాత్ ఉత్పన్నా
'రుద్రాక్షా' ఇతి లోకే ఖ్యాయంతే।
అథ సదాశివః సంహారకాలే, సంహారం కృత్వా,
సంహారాక్షం ముకుళీ కరోతి, తత్ నయనాత్ జాతా
'రుద్రాక్షా' – ఇతి ।।హోవాచ।।
తస్మాత్ రుద్రాక్షత్వమితి – "కాలాగ్ని రుద్రః" – ప్రోవాచ।।

**కాలాగ్ని రుద్ర భగవానుడు :**

బిడ్డలారా! వినండి. రుద్రుని కనులనుండి జాలువారుతూ జనించాయి కాబట్టి "రుద్రాక్షలు" అనే పేరుతో లోకప్రసిద్ధములు.

సదాశివుడు సృష్టియొక్క ఉపసంహరణ (లేక) సంహారకాలమునందు మూడవ నేత్రమగు 'సంహార అక్షము' మూసుకొనుచున్న సమయములో అట్టి -అప్పటి కనులనుండి జనించి జాలువారినవే రుద్రాక్షలు. రుద్ర నయనం నుండి, బయలుదేరుటచే 'రుద్రాక్షలు'. (రుద్రాక్షత్వము = అనేక భేదములతో కూడిన సమస్త దృశ్యమును 'ఆత్మగా భావించుట' యందు లయింపజేయటము-అనునది తాత్త్వికార్థము).

---

7. తత్ రుద్రాక్షే 'వాక్' విషయే
కృతే దశ గో ప్రదానేన
యత్ ఫలమ్ అవాప్నోతి,
తత్ ఫలమ్ అశ్నుతే।

"రుద్రాక్షలు - వాటి ఉత్పత్తి విశేషము - వాటి ధారణచే కలుగు సత్ప్రయోజనము" గురించి సత్సంగపూర్వకంగా సంభాషించుకొన్నంత మాత్రం చేతనే - 10 గోవులను ఆశ్రమములకో, విద్యాపీఠములకో దానము చేసిన సత్ఫలితము లభించగలదు.

---

స ఏష "భస్మజ్యోతి రుద్రాక్ష"
– ఇతి తత్ రుద్రాక్షం
కరేణ స్పృష్ట్వా ధారణ మాత్రేణ
ద్విసహస్ర గో-ప్రదానఫలం భవతి।

**- భస్మజ్యోతి రుద్రాక్షాయ నమో నమః** - ఈశానః సర్వవిద్యానాం....

**- భస్మజ్యోతి రుద్రాక్షాయ నమో నమః** - తత్పురుషాయ విద్మహే, మహాదేవాయధీమహి....

**- భస్మజ్యోతి రుద్రాయ నమో నమః** - అఘోరేభ్యో అథ ఘోరేభ్యో...

అని మంత్రోచ్చారణ చేస్తూ కరణములతో (రెండు అరచేతులు - చేతి పది (వ్రేళ్ళతో) స్పృశించి, కళ్లకు అద్దుకొని, ధారణ చేసినంతమాత్రంచేత రెండు వేల గోవులు దానము చేసిన ఉత్తమఫలము ఆ ధారణ చేసిన వానికి కలుగగలదు.

---

తత్ రుద్రాక్షే కర్ణయోః ధార్యమాణే
ఏకాదశ సహస్ర గో-ప్రదానఫలం భవతి।।
ఏకాదశ రుద్రత్వం చ
తత్ రుద్రాక్షే శిరసి ధార్యమాణే
కోటి గో-ప్రదానఫలం భవతి।

పవిత్రమగు రుద్రాక్షలను చెవులకు ధారణ చేయటం చేత పదకొండ వేల గోవుల దానఫలము దక్కుతుంది. ఏకాదశ రుద్రత్వము ప్రాప్తించగలదు.

ఎవ్వరైతే శిరస్సునందు రుద్రాక్షలు ధారణ చేస్తారో...అట్టివారికి కోటి గో-దానము చేసిన మహత్తర ఫలము లభించగలదు.

| | |
|---|---|
| ఏతేషాం స్థానానాం కర్ణయోః<br>ఫలం వక్తుం న శక్యమ్। ఇతి॥ హోవాచ॥ | దేహములోని ఆయా సమస్త స్థానములలో రుద్రాక్ష ధారణ చేయుటము వలన లభించు ఫలమును మాటలతో నిర్వచించి చెప్పజాలనిది. |
| య ఇమాం "రుద్రాక్షజాబాలోపనిషదం"<br>నిత్యమ్ అధీతే, బాలో వా, యువా వా వేద,<br>స 'మహాన్' భవతి।<br>స గురుః సర్వేషాం మంత్రాణాం, ఉపదేష్టా భవతి। | ఎవ్వరైతే ఈ **"రుద్రబాలోపనిషత్"**ను అధ్యయనం చేసి, పరమార్థమును గ్రహిస్తారో అట్టివారు బాలురైనా, యువకులైనా మరెవ్వరైనా కూడా **మహానుభావులు** కాగలరు. అట్టివారు మంత్రోపాసనలకు గురువులు, ఉపదేష్టలు (బోధకులు) అవగలరు. |
| ఏతైరేవ హోమం కుర్యాత్,<br>ఏతైరేవ అర్చనం తథా<br>రక్షోఘ్నం మృత్యు తారకం। | రుద్రాక్షమాల ధరించియే హోమము, అర్చన, ధారణ చేసెదరుగాక!<br>గురుప్రసాదంగా స్వీకరించబడిన రుద్రాక్ష దండ సర్వదోషములనుండి పాపములనుండి రక్షించునది, మృత్యువునుండి దాటించి వేయునది అగుచున్నది. బుద్ధికి ఏకాగ్రత ప్రసాదించగలదు. |
| గురుణా లబ్ధం కంఠే<br>బాహౌ శిఖాయాం వా<br>బధ్నీత సప్తద్వీపవతీ<br>భూమిః దక్షిణార్థం నావకల్పతే। | గురులబ్దమైన రుద్రాక్షమాలను కంఠమునకు బాహువులకు (చంక మొదలు వ్రేళ్ళవరకు ఉండుభాగమునందు, భుజముపై) శిఖ [శిగజుట్టు (లేక) పిలకస్థానము] నందు కట్టుకొనెదరుగాక. అట్టి గురువుకుగాని, ధారణ చేయించువానికి గాని స్పప్తద్వీపములతో కూడిన భూమిని దక్షిణగా ఇచ్చినా చాలదు. |
| తత్ శ్రద్ధయా యాం కాంచిత్<br>గాం దద్యాత్, సా దక్షిణా భవతి। | అయితే అట్టి గురువుకు, రుద్రాక్షమాలాధారణ అనుగ్రహించువానికి శ్రద్ధ - భక్తులతో ఒక గోవును ఇచ్చినా చాలు, అది గొప్ప దానఫలమై సిద్ధించగలదు. |
| య ఇమాం ఉపనిషదం బ్రాహ్మణః<br>సాయమ్ అధీయానో...<br>దివస కృతం పాపం నాశయతి।<br>మధ్యాహ్నే అధీయానః<br>షట్ (6) జన్మకృతం పాపం నాశయతి। | ఈ ఉపనిషత్తును అధ్యయనము చేయువాడు..., బ్రహ్మవిద్యా సమన్వితుడగు (బ్రాహ్మణములను ఎరుగుచున్న బ్రాహ్మణుడు) అవగలడు.<br>→ సాయంకాలము అధ్యయనోపాసన చేయుటచే పగలు చేసిన పాపదోషములు నశించగలవు.<br>→ మధ్యాహ్న సమయంలో అధ్యయనము చేస్తే ఆరు జన్మలలో చేసిన పాప కర్మల దోషములు తొలగిపోగలవు. |
| సాయం ప్రాతః ప్రయుంజానో<br>అనేక జన్మకృతం పాపం నాశయతి।<br>షట్ సహస్ర లక్ష గాయత్రీ జప ఫలం అవాప్నోతి। | సాయంకాలము, ప్రాతః (ఉదయ) కాలమునందు ఈ ఉపనిషత్తును ఉపాసిస్తే, అనేక జన్మలలో చేసిన పాపము నశిస్తుంది. ఆరువేల లక్షల గాయత్రీ జప ఫలము లభించగలదు. |
| బ్రహ్మహత్యా సురాపాన స్వర్ణ స్తేయ గురుదార గమన<br>తత్ సంయోగపాతకేభ్యః పూతో భవతి।<br>సర్వ తీర్థఫలమ్ అశ్నుతే।<br>పతిత సంభాషణాత్ పూతో భవతి। | బ్రహ్మ హత్య, సురాపానము, స్వర్ణము (బంగారము) దొంగిలించటము, గురుభార్యాగమనము- అటువంటి వారితో స్నేహము వలన కలిగే పాపములనుండి కూడా. పునీతుడు కాగలడు. సర్వపుణ్యా తీర్థములలోను స్నానము చేసిన ఫలము లభించగలదు.<br>దుష్ట సంభాషణ చేసిన దోషము నుండి పవిత్రుడు అవగలడు. |
| పంక్తి శత సహస్ర పావనో భవతి।<br>శివసాయుజ్యం అవాప్నోతి॥<br>న చ పునరావర్తతే। న చ పునరావర్తత-ఇతి॥<br>'ఓగ్ం' సత్యమ్॥ ఇతి ఉపనిషత్॥<br>*రుద్రాక్ష జాబాలోపనిషత్ సమప్తా॥*<br>*ఓం శాంతిః శాంతిః శాంతి॥* | ఈ రుద్రాక్షజాబాలోపనిషత్ అధ్యయనుడు, రుద్రాక్షలు ధరించువాడు ఉన్న చోటు, అట్టి వంద వేల (లక్ష) పంక్తులలోనివారు, ఇంకా, అట్టి రుద్రాక్షోపనిషత్ అధ్యయనులు, రుద్రాక్షధారులతో సహా - వీరంతా **శివసాయుజ్యము పొందగలరు. వారికి పునరావృత్తి దోషము ఉండదు. ఉండదు. ఇది సత్యము.**<br>***రుద్రాక్ష జాబాలోపనిషత్ సమాప్తా॥***<br>***ఓం శాంతిః శాంతిః శాంతిః॥*** |

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 13 రుద్రాక్షజాబాలోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



**రుద్రాక్షోపనిషత్ తత్త్వము ప్రసాదించు మహత్ ఉజ్వల ప్రకాశానంద స్వరూపుడు, ప్రతియోగి వినిర్ముక్తుడు, తిరస్కరించ వీలుగాని స్వస్వరూపాత్మ స్వరూపుడు అగు జగద్గురు రుద్రభగవానునికి మనసా వాచా కర్మణా నమస్కరిస్తున్నాము.**

చిరంజీవి, యోగతత్త్వవేత్త, వసిష్ఠమహర్షికి యోగవిద్యావిశేషాలు విశదీకరించినవారు, మేరు పర్వత నివాసి, బ్రహ్మజ్ఞానానందుడు, దేవతా సభలచే స్తుతించబడువాడు – అగు భుసుండ వాయస మహాయోగి ఒకానొక సందర్భములో లోకేశ్వరుడు, లోక గురువు అగు కాలాగ్ని రుద్ర భగవానుని దర్శించి, **"శివశంభో! హర హర శంభో!"** మొదలైన శివస్తుతులు సమర్పించారు. రుద్రదేవుడు సంతోషించినవారై ఇట్లు సంభాషించసాగారు.

⌘

**శ్రీ కాలాగ్ని రుద్ర భగవానుడు :** నాయనా! భుసుండమహాశయా! మీ శివతత్త్వ స్తోత్రములకు సంతోషించానయ్యా! మీరు స్వతఃగానే యోగజ్ఞులు, తత్త్వజ్ఞులు. మీ రాకకు ఆనందిస్తున్నాను. ఏమి మీ కోరిక? అడగవయ్యా! సిద్ధింపజేస్తాను.

**శ్రీ భుసుండ మహాశయుడు :** హే భగవన్! కాలాగ్నిరుద్ర దేవాది దేవా! **పునః పునః నమో నమః।** మీ దర్శనముతో నేను పునీతుడను. ఈ శుభవేళ ఒకానొక ముఖ్య విశేషమును లోక కల్యాణ మూర్తులగు మీవద్ద శ్రవణము చేయాలని సముత్సాహపడుచున్నాను.

స్వామీ! మీచేత లోక శుభంకరంగా, కరుణాకటాక్ష వీక్షణరూపంగా ప్రసాదించబడిన 'రుద్రాక్షలు' క్రియా–జ్ఞాన–భక్తి–శ్రద్ధా యోగాభ్యాసులకు, యోగసిద్ధులకు కూడా పవిత్రభావనల సిద్ధికొరకై ధారణాయోగ్యము కదా.

మీచే లోక కల్యాణము కొరకై ప్రసాదించబడుచున్న రుద్రాక్షలు సర్వ ముముక్షువులకు, ఆర్తో–జిజ్ఞాసు–అర్థార్థీ–జ్ఞానీ చతుర్విధ సుకృతులకు అత్యంత సహకారికము– అని లోక ప్రసిద్ధమైన విషయము. అట్టి పవిత్రమగు రుద్రాక్షల గురించి రుద్రాక్షోత్పత్తి స్థాన స్వరూపులగు మీరే వివరించెదరు గాక – అని మిమ్ములను అభ్యర్థిస్తున్నాను.

**కథం రుద్రాక్షోత్పత్తిః?** రుద్రాక్షలు ఎట్లా ఉత్పన్నమైనాయి?

**తత్ ధారణాత్ కిం ఫలం?** రుద్రాక్ష ధారణచే కలిగే ప్రయోజనములు ఏమిటి?

ఈ ఈ విశేషముల గురించి అనుగ్రహించండి.

**శ్రీ కాలాగ్ని రుద్ర భగవానుడు :** బిడ్డా! మహదాశయా! భుసుండ యోగీశ్వరా! వినండి. చెప్పుతాను.

⌘

ఒక సమయములో దేవతల అభ్యర్థనను అనుసరించి లోక కల్యాణార్థమై, భక్త–ఆర్తజన రక్షణార్థమై, దేవతల శ్రేయో కార్యక్రమముల దిగ్విజయార్థమై, జ్ఞానార్తిజన అధ్యయన సిద్ధ్యర్థమై – త్రిపురాసుర సంహారము చేయటానికి సంసిద్ధుడను అగుచున్నాను. ఆ సందర్భములో

– **అహం నిమీలితాక్షో భవంతః।** కించిత్ ధ్యానము కొరకై కనులు మూసుకున్నాను. అప్పుడు నా కనుల నుండి జల బిందువులు జాలువారి భూమిపై పడటము జరిగింది. **తేభ్యో జల బిందవో భూమౌ పతితాః – తే 'రుద్రాక్షా' జాతాః సర్వానుగ్రహార్థాయ।** ఆ జాలువారిన జలబిందువులు సర్వజనులను అనుగ్రహించు నిమిత్తమై రుద్రాక్షలుగా అయినాయి.

***అట్టి రుద్రాక్షలయొక్క.....,***

- నామము ఉచ్చరించినంత మాత్రముచేత – 10 గోవులు దానం చేసిన ఫలము.
- స్పర్శించినంత మాత్రంచేత – ద్విగుణీకృతమైన (Double the above) ఫలము.

ఇక ఆపై ధరించటము, పూజించటము ఇటువంటివాటి వలన కలుగు ఫలము మాటలతో చెప్పుకోలేము. ఈఈ విశేషముల గురించి

- **కస్మిగ్ం స్థితం తు?** – ఎక్కడినుండి వచ్చాయి?
- **కిన్నామ?** – వాటికి ఆ పేరు ఎట్లా వచ్చింది?
- **కథం వా ధార్యతే నరైః?** – మానవులు ఏ విధివిధానంగా ధారణ చేస్తున్నారు / చేయాలి?
- **కతి భేద ముఖాని?** – రుద్రాక్షలు ఏఏ ముఖ భేదములు కలిగి ఉంటున్నాయి?
- **అత్ర కైర్మంత్రైః ధార్యతే కథమ్?** – ఏఏ మంత్రయుక్తమగు ధ్యానముతో గానం చేస్తూ (పఠిస్తూ) ధారణ చేయాలి?

ఈఈ విశేషములన్నీ శాస్త్ర వాఙ్మయములచే, ఋషి–ముని పుంగవులచే గానము చేయబడుచూ, **శ్లోక పూర్వకంగా లోకములలో ప్రవచించబడుచున్నాయి.**

**భుసుండ యోగీశ్వరుడు :** స్వామీ! మీరు చెప్పుచున్న విశేషాలు శ్రోతగా నాకు ఎంతగానో ఆనందమును, జిజ్ఞాసను కలుగజేస్తున్నాయి. దయచేసి మరికొంత విశేషముగా **రుద్రాక్షోత్పత్తి,** తదితర ఆయా విషయములను నాకు బోధించ వేడుకొంటున్నాను.

**శ్రీ కాలాగ్ని రుద్ర భగవానుడు :** వినండి. వేయి దివ్య వర్షములు నేను కనులు మూసుకుని ఒక్కసారి కనులు తెరుస్తూ ఉండగా కనుల పుటములనుండి జల బిందువులు నేలపై పడినాయి. ఆ కన్నీటి బిందువులే భూమిపై స్థావరరూపము సంతరించుకొని రుద్రాక్ష మహా వృక్షములు అయినాయి. **భక్తానుగ్రహ కారణాత్।** భక్తులపై నాకు గల అవ్యాజమైన ప్రేమచేత, వారిని అనుగ్రహించుట కొరకే రుద్రాక్షతలను సంకల్పించాను.

- **భక్తానాం ధారణాత్ పాపం దివారాత్ర కృతగ్ం హరేత్।** ధారణ చేయటం చేత రాత్రి–పగలు చేసియున్న పాపములనుండి భక్తులను రక్షించగలదు. పాప దోషములును రుద్రాక్షలు నివారించి వేయగలదు.
- **లక్షం తు దర్శనాత్ పుణ్యం।** రుద్రాక్షలను దర్శించటం చేత లక్ష సంఖ్యగా జపము చేసిన పుణ్యము.
- **కోటిః తత్ స్పర్శనాత్ భవేత్।** స్పర్శించటంచేత కోటి – జపపుణ్యము.
- **తస్య ధారణాత్ నరః కోటి శతం పుణ్యం లభతే।** ధారణ చేయటంచేత, వచ్చే పుణ్యం కోటి–శత (వందకోట్ల) జప ఫలము.
- **తత్ జపాత్ లభతే పుణ్యం నరో రుద్రాక్ష ధారణాత్ – లక్షకోటి సహస్రాని – శతాని చ।** రుద్రాక్ష ధారణ చేసి జపము చేయటం చేత లభించే పుణ్యము లక్ష కోటి వేల, లక్ష కోటి వందల జపముతో సమానము.

**శ్రీ భుసుండ మహాయోగి :** స్వామీ! రుద్రాక్షల వేరు వేరు ప్రమాణముల ప్రాసస్త్యముల గురించి దయతో వివరించండి.

**శ్రీ కాలాగ్ని రుద్ర భగవానుడు :**

ధ్రాత్రీ (పెద్ద–ఉసిరిగ) ఫల ప్రమాణము గల రుద్రాక్ష – అత్యంత శ్రేష్ఠమైనది.

బదరీ (రేగు) ఫల ప్రమాణము గల రుద్రాక్ష – మధ్యమమైనది.

చణ (శనగ) ప్రమాణము గల రుద్రాక్ష – అధమము.

వాటి వాటి ప్రక్రియానుసారంగా నాచే ఆయా విశేషములుగా చెప్పబడినది – **ప్రక్రియా ఏషా మయా ఉచ్యతే।**

శ్వేత (తెలుపు) రంగు రుద్రాక్షలు – 'బ్రాహ్మణ' – బ్రాహ్మణులు ధారణ చేయునవి.

రక్త (ఎరుపు) రంగు రుద్రాక్షలు – 'రాజసిక (క్షత్రియ)' – రాజాతు ధారయేత్.

పీతాన్ (పసుపుపచ్చ) రంగు రుద్రాక్షలు – 'వైశ్య' – వైశ్యులు ధారణ చేయునవి.

కృష్ణాత్ (నలుపు) రంగు రుద్రాక్షలు – 'శూద్ర' – శూద్రులు ధారణ చేయునవిగా చెప్పబడుచున్నాయి.

**విధి : (ఉపయోగించవలసినవి)** : సమతలము కలిగినవి, స్నిగ్ధమైనవి (నునుపైనవి), దృఢమైనవి, స్థూలమైనవి, సమతులమైన కంటములు కలిగినవి **శుభప్రదము.**

***నిషేధము : క్రిములచే కొరకబడి చిల్లులు కలిగినట్టివి, ఛిన్నాభిన్నమైనట్టివి, పెద్ద ముళ్ళు (కంటకములు) రూపంగా తేలినట్టివి, హీనమైన – అసమతలమైన – వంకరటింకర – చిల్లులు గల ఆకారము కలిగినట్టివి, వ్రణయుక్తమైనవి, ఉబ్బుగా ఉన్నట్టివి, అయుక్తమైన ఆకారము కలిగినవి, షద్రుద్రాక్షాణి (అనేక చిల్లులతో కూడినవి) ఇటువంటివి ధరించ కూడనివి.***

- రుద్రాక్షలన్నిటిలోనూ–స్వయముగా ప్రకృతి కృతమైన ద్వారము (రంధ్రము) కలిగియున్న రుద్రాక్షలు మొదటగా **ఉత్తమమైనవి. స్వయమేవ కృతద్వారం రుద్రాక్షంస్య ఆది ఉత్తమమ్।**
- మానవ ప్రయత్నముద్వారా రంధ్రము చేయబడిన రుద్రాక్షలు **మధ్యమము** అగుచున్నాయి. **యత్తు పౌరుష యత్నేన కృతం తన్మధ్యమాం భవేత్।**

**రుద్రాక్ష–సూత్రము :** సమమైనవి, స్నిగ్ధమైనవి (నునుపైనవి), దృఢమైనవి, స్థూలమైనవి – పట్టుత్రాడుతో గ్రుచ్చి ధరించాలి.

శాస్త్ర విచక్షణాశీలురగు పండితులు తమ శరీరముయొక్క సర్వ భాగములందు రుద్రాక్ష సూత్రములను ధరిస్తూ ఉంటారు.

**ఉత్తమ జాతి రుద్రాక్షలు :** గీటురాయితో గీసినప్పుడు బంగారపు రంగు రేఖ వస్తూ ఉంటే, అట్టి రుద్రాక్షలు ఉత్తమోత్తమమైనవి. శివపూజ చేస్తున్న సందర్భములలో అట్టి రుద్రాక్షమాల ధరించటము అత్యంత త్వరితముగా ఫలప్రదము. ఇంకా కొన్ని కొన్ని రుద్రాక్షలు ఏఏ రీతిగా ధరించటము శాస్త్రీయమో, శుభప్రదమో చెప్పుకొందాము.

**శ్లో॥ శిఖాయాం ఏకరుద్రాక్షం। త్రిశతం శిరసా వహేత్।**
**షట్ త్రింశంతం గళే దధ్యాత్। బాహ్వోః షోడశ–షోడశ॥**

శిఖయందు **– ఒక రుద్రాక్ష,** శిరస్సునందు **– 300 రుద్రాక్షలు,** గళము (మెడ) యందు **– '36' రుద్రాక్షలు,** బాహువులలో **– 16–16** చొప్పున, మణి కట్టు ప్రదేశములో – '12' రుద్రాక్షలు, భుజస్కంధము – మూపులయందు '500' రుద్రాక్షలు, జందెముగా **– 108 రుద్రాక్షలమాలలు** ... ఈవిధంగా రుద్రాక్షలు ధరించటము శ్రేష్ఠము.

**కంఠమునకు –** '2' పేటలుగాని, 3 పేటలుగాని, 5 పేటలుగాని, 7 పేటలుగాని, రుద్రాక్షలమాలగా ధరించటము శుభప్రదము.

రుద్రాక్ష శాస్త్రీయము ఎరిగినవారు–మకుటము (కిరీటము)నందు, కుండలము (చెవిపోగు)నందు, కర్ణికా హారము (చెవుచుట్టుగాను), కేయూరమునందు (భుజకీర్తులుగా), కటకము (కణత ప్రదేశము) నందు, కడుపుచుట్టూ రుద్రాక్ష సూత్రములు ధరించుచూ ఉంటారు.

**నిద్రా సమయములప్పుడు కూడా ధారణ: సుప్తే పీతా సదా కాలం రుద్రాక్షం ధారయేత్ నరః।** నిద్రించునప్పుడుకూడా పసుపు పచ్చని రుద్రాక్షలు ధరించవచ్చును.

**<u>శరీరమంతా కలిపి సంఖ్యా పూర్వకంగా రుద్రాక్ష ధారణ – ప్రాసస్త్యత :–</u>**

300 రుద్రాక్షలు అధమమని,
500 రుద్రాక్షలు మధ్యమమని,
1000 రుద్రాక్షలు ఉత్తమమని, **చెప్పబడుతోంది.**

**<u>శిరసా "ఈశాన..." మంత్రేణ :–</u>**

**<u>శిరస్సునందు రుద్రాక్షలు ధరించేటప్పుడు చదువదగు మంత్ర / మంగళ శ్లోకము:–</u>**

**శ్లో॥ ఈశానస్సర్వ విద్యానాం, ఈశ్వర స్సర్వభూతానాం।**
**బ్రహ్మాధిపతిః। బ్రహ్మణోఽ ధిపతిః।**
**బ్రహ్మా శివో మే అస్తు సదాశివ 'ఓం'॥**

[సమస్త **విద్యలకు ఈశానుడు / అధిపతి.** సృష్టిలోని **సమస్త జీవులకు కూడా ఈశ్వరుడు/ప్రభువు. సృష్టికర్త – సృష్ట్యభిమాని** యగు బ్రహ్మదేవునకు కూడా **అధిపతి/యజమాని.** సమస్త వేదములకు/బ్రాహ్మణములకు అధిపతి / సంస్తుతింపబడువాడు. బ్రహ్మదేవుడు (హిరణ్యగర్భుడు) తానే అయినట్టివాడే **పరమశివుడు.** అట్టి ఆ స్వామి నాయొక్క (సహజమగు) ప్రణవస్వరూప (ఓంకార స్వరూప) సదా శివత్వము (శివోహమ్ తత్త్వమును) అనుగ్రహించెదరు గాక].

ఈవిధంగా మంగళ శ్లోకము ఉచ్చరిస్తూ, అర్థాని **మహదార్థము** మనోబుద్ధులతో భావిస్తూ, సంకల్పిస్తూ, ఆరాధనాపూర్వకంగా **శిరస్సు ప్రదేశంలో రుద్రాక్షధారణ** చేయాలి.

**<u>కంఠే 'తత్పురుషేణ' తు।</u>**

*కంఠప్రదేశమున రుద్రాక్షలు అలంకరించుకొనుచున్నప్పుడు చదువతగినన మంగళశ్లోక – మంత్రములు*

<u>సహస్రాక్ష మహాదేవ రుద్ర గాయత్రీ మంత్రము:</u>

శ్లో॥ తత్పురుషస్య విద్మహే సహస్రాక్ష మహాదేవస్య
ధీమహి। తన్నో రుద్రః ప్రచోదయాత్॥

**(తత్ పురుషాకార – పరమ పురుషుని మహిమను బుద్ధితో ఎరుగుటకై సహస్రనయనుడగు మహాదేవ భగవానుని ధ్యానించుచున్నాము. అట్టి తత్ నో రుద్రః – జ్ఞాన ప్రదాత యగు రుద్ర దేవాది దేవుడు మా బుద్ధులను – స్వస్వరూపాత్మ జ్ఞానార్థమై వికసింపజేసెదరు గాక!**

**మహాదేవ రుద్ర గాయత్రీ మహామంత్రము : తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి తన్నో రుద్రః ప్రచోదయాత్॥**

**(సాక్షాత్తు తత్పురుషుడై విరాజిల్లుచున్న పరమ పురుషుని మహిమ గురించి ఎరుగుటకై పరమేశ్వరుడగు మహాదేవుని (మనసా, బుద్ధ్యా) ధ్యానించుచున్నాము. (అట్టి మా యీ ధ్యానమును స్వీకరించి) ఆ రుద్రభగవానుడు "రుద్రోఽహమ్ – శివోఽహమ్ – తత్త్వము" కొరకై – మా బుద్ధులను ప్రేరేపించెదరు గాక")**

అను పారాయణముతో దేహ మనో బుద్ధ్యా త్రికరణశుద్ధిగా చేస్తూ ఆత్మ భగవానుని ధ్యానించెదరు గాక!

<u>కంఠ ప్రదేశములో</u>

**'అఘోరేణ' గళే ధార్యం, తేనైవ హృదయేఽపి చ।**
**'అఘోరబీజ' మంత్రేణ కరయోః ధారయేత్ సుధీః॥**

గళము (కంఠ ప్రదేశము)నందు, హృదయప్రదేశమునందు ధరిస్తున్నప్పుడు (మరియు) చేతులకు ధరిస్తున్నప్పుడు చదివే అఘోర బీజమంత్రము పఠించెదరు గాక.

**అఘోర బీజ మంత్రము:**

**అఘోరేభ్యోఽథ (అఘోరేభ్యః అథ) ఘోరేభ్యో ఘోరఘోర తరేభ్యః।**

**సర్వేభ్యస్సర్వ (సర్వేభ్యః సర్వ) శర్వేభ్యో! నమస్తే అస్తు రుద్ర రూపేభ్యః॥**

**(హే శర్వ భగవాన్! మీయొక్క "సూక్ష్మ–స్థూల–కారణ–కారణకారణ" ... 'సృష్టి–స్థితి–లయ–కేవల రుద్ర స్వరూపమునకు సర్వకాల సర్వావస్థలయందు నమస్కరిస్తున్నాను. ప్రణమిల్లుచున్నాను. ఉపవాసమును సమర్పించుకొనుచున్నాను) –** అని శబ్దార్థపూర్వకంగా మనసావాచా కర్మణా బుద్ధ్యా ఆరాధిస్తూ, ఉపాసిస్తూ, కంఠ ప్రదేశమునందు, హృదయ స్థానములోను, చేతులకు రుద్రాక్షమాలల ధారణ నిర్వర్తించెదరు గాక।

**పొట్టచుట్టూ : పంచాశత్ అక్ష గ్రథితాన్ వ్యోమ వ్యాపి చ ఉదరే।** 50 రుద్రాక్షలతో కూర్చబడిన మాలను పొట్ట–నడుము చుట్టూతా ధరించెదరు గాక।

**అంగాంగములకు : అంగైశ్చ పంచబ్రహ్మోభిః – త్రిమాలా పంచసప్త చ – గ్రథిత్వా మూలమంత్రేణ సర్వాణి అక్షాణి ధారయేత్॥**

అన్ని అంగములకు పంచబ్రహ్మ పూర్వకమైన (శబ్ద స్పర్శ రూప రస గంధ దేవతోపాసన పూర్వకంగా) **మూడు** వరుసలతో గాని **ఐదు** వరుసలతోగాని – **ఏడు** వరుసలతోగాని మూల మంత్ర సమన్వితంగా గ్రుచ్చుతూ, రుద్రాక్ష మాలలను తయారుచేసి, అంగాంగములకు ధారణ చేయుదురు గాక.

**వాయసభుసుండ మహాయోగి :** స్వామీ రుద్రాక్షల భేదమును అనుసరించి ఏదేది ఏఏ స్వరూపమైనది? ఏఏ ఫలములు సిద్ధింపజేస్తాయి? వాటి వాటి స్వరూపము గురించి, ముఖముల గురించి, అనిష్ట నిరసములు – కామాభీష్ట ఫలముల గురించి మాపై దయను అనుగ్రహిస్తూ వివరించమని అర్థిస్తున్నాను.

**కాలాగ్ని రుద్ర భగవానుడు :** బిడ్డా! ప్రియ భుసుండ యోగీశ్వరా! మీరు అడిగిన దాని గురించి శాస్త్రములచే శ్లోక పూర్వకంగా వివరించబడియే ఉన్నదయ్యా. వినండి. చెప్పుతాను.

**ఏక(1) ముఖ రుద్రాక్ష :**

> **శ్లో॥ ఏక వక్త్రం తు రుద్రాక్షం, పరతత్త్వ స్వరూపకమ్।**
> **తత్ ధారణాత్ పరే తత్త్వే లీయతే విజితేంద్రియః॥**

ఏక ముఖ రుద్రాక్ష (ఇహమునకు ఆవల – ఇహమునకు ఆధారమైనట్టి) – **పరతత్త్వ స్వరూపకమైనది.** సాక్షాత్ పరమాత్మయొక్క ప్రత్యక్ష రూప సంజ్ఞగా ఉపాసనకొరకై అభివర్ణించబడుచున్నది. ఏకముఖ రుద్రాక్షను తత్త్వభావోపాసనగా, (**'నీవుగా కనిపిస్తున్నది పరమాత్మయే'** – అని) భావించి ధారణ చేయువాడు ఇంద్రియములను – ఇంద్రియ దృశ్య వ్యవహారములను మొదలంట్లా అధిగమించి సాక్షాత్ పరతత్త్వమునందు లీనము పొందగలడు. తరంగము జలముతో ఏకత్వము పొందు తీరుగా, అట్టి ఏకముఖ రుద్రాక్ష ధారుడు **"సర్వాంతర్యామి – సర్వతత్త్వ స్వరూపుడు"** అగు పరమాత్మతో **'సోఽహమ్, తత్త్వమ్'**ను అతి త్వరగా సిద్ధించుకోగలడు.

**ద్వి (2) ముఖ రుద్రాక్ష : ద్వివక్త్రం తు మునిశ్రేష్ఠ! చ అర్థ–నారీశ్వరాత్మకమ్।** హే మునిశ్రేష్ఠా! భుసుండ మహాశయా! రెండు ముఖముల రుద్రాక్ష అర్ధనారీశ్వర స్వరూపము. **(తత్) ధారణాత్ అర్థనారీశః ప్రీయతే తస్య నిత్యసః।** నిత్యము ద్విముఖ రుద్రాక్షను ధరించుటచే **'అ–ఉమ', 'శివ–శివా', 'భవ–భవానీ', 'ఊహించువాడు – ఊహ', 'పురుష ప్రకృతి'** – జీవ–ఈశ్వరుల ఏక తత్త్వమగు అర్ధనారీశ్వర స్వామికి ప్రీతి కలుగజేయువాడగుచున్నాడు. 'అహమ్ – మమ', 'అహమ్–త్వమ్' ల ఏకత్వమును పొందుచూ అర్ధనారీశ్వర తత్త్వ సిద్ధుడు కాగలడు. అర్థనారీశ్వరుడు సంప్రీతుడగుచు సమస్త సంపదను ప్రసాదించుచున్నారు. **జీవాత్మ–పరమాత్మల అభేదత్వమే అర్ధనారీశ్వర తాత్త్వికార్థము.**

**త్రి (3) ముఖ రుద్రాక్ష : త్రిముఖం చ ఏవ రుద్రాక్షమ్ అగ్ని త్రయ స్వరూపకమ్।** మూడు ముఖముల రుద్రాక్ష అగ్ని త్రయ స్వరూపకము (యజ్ఞములోని **గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, అహవనీయాగ్ని; దృశ్య–ద్రష్ట–కేవల దృక్ 'త్రి–ప్రేరణాగ్ని'** స్వరూపములు. జీవాత్మ–ఈశ్వరుడు–పరమాత్మల సంజ్ఞా స్వరూపము). అట్టి త్రిముఖ రుద్రాక్ష – అనునిత్య ధారణచే – యజ్ఞ సమర్పణములగు హుతములను స్వీకరించు దివ్యస్వరూపుడగు అగ్ని భగవానుడు–ప్రీతి పొందగలరు. అట్టివాడు యజ్ఞాగ్నికి సమస్తము సర్వదా హుతము చేసినవాడగుచున్నాడు. భస్మభూషితాంగుడై సమస్త దృశ్యముపట్ల స్వస్వరూప భావనను సిద్ధించుకోగలడు.

**చతుర్ముఖ (4 ముఖములు) రుద్రాక్ష : చతుర్ముఖం తు రుద్రాక్షం చతుర్వక్త్ర స్వరూపకమ్।** నాలుగు ముఖములు గల రుద్రాక్ష చతుర్ముఖ బ్రహ్మయొక్క ప్రతి రూపము. **తత్ ధారణాత్ నిత్యదా తత్ చతుర్వక్త్రః ప్రీయతే।** అట్టి '4' ముఖముల రుద్రాక్షయొక్క నిత్య ధారణచే – సృష్టికర్త, సృష్ట్యాది స్వరూపుడు అగు జగత్ పితామహ చతుర్ముఖ బ్రహ్మ సంప్రీతుడగుచున్నాడు. (**చతుర్ముఖ** = స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ – **ముఖములు**)

**పంచ (5)ముఖ రుద్రాక్ష :** ఇది పంచబ్రహ్మ స్వరూపము. పంచముఖ రుద్రాక్ష ధారణచే **(సద్యోజాత, అఘోర, వామదేవ, తత్పురుష, ఈశాన)** పంచముఖుడగు **శివభగవానుడు** ప్రీతి పొందినవారగుచున్నారు. **పంచవక్త్రః స్వయం బ్రహ్మ। పుం హత్యాం చ వ్యపోహతి।** పంచముఖ రుద్రాక్ష ధారుడు స్వయం బ్రహము రూపానుభవుడు కాగలడు. పంచముఖుని కరుణచే బ్రహ్మహత్యా దోషముల వంటివి కూడా తొలగిపోగలవు.

**షడ్వక్త్ర రుద్రాక్ష ('6' ముఖముల రుద్రాక్ష) :** ఆరు ముఖముల రుద్రాక్షకు షణ్ముఖుడగు కార్తికేయ స్వామి అధిదేవత. షణ్ముఖ రుద్రాక్ష ధారణచే **మహాన్ సంపద, మహాన్ ఆరోగ్యము**, ఉత్తమమైన **'మతి'** లభించగలదు. జ్ఞాన 'విజ్ఞాన సంపద', **'శుద్ధమగు బుద్ధి', 'ధారణ',** విస్తారము – సునిశితము అగు **'ధీశక్తి'** లభించగలదు.[ కొందరు పురాణ ప్రావీణ్యులగు బుద్ధిమంతులు ఆరు ముఖముల రుద్రాక్ష వినాయకస్వామి స్వరూపము ఆరాధిస్తూ ఉంటారు. (గాణాపత్యులు)].

**సప్త (7) వక్త్ర (పలకల) రుద్రాక్ష : సప్త మాత్ర అధి–దైవతమ్।** సప్త మాతృకల అధిదైవతా స్వరూపము. '7' ముఖముల రుద్రాక్ష ధారణచే సమస్త సంపదలు, ఆయురారోగ్య ఐశ్వర్యములు, మహత్తరమగు జ్ఞానసంపత్తి, శుచి అయిన భావములు ఉత్తమమైన భావన–ధారణలు, అత్యున్నతమైన అవగాహనలు మొదలైనవన్నీ లభించగలవు.

(1) **(సప్త మాతృకలు** = బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండ)

(2) **(సప్తమాతృకలు** = (కాళి, కౌశిక, ఉద్ధత, హవిషే, శారిక, ఆర్య, వైధాత్రి. కుమారస్వామి వరప్రసాదంచేత 'బాలగ్రహములు'గా మానవులకు 16 సం॥ వయసు వరకు పాలించువారు. బలులచే తృప్తిపొందువారు – భారతము)

**అష్టముఖ (8) రుద్రాక్ష :** అష్టమాత్ర అధిదైవతము. ధారణచే అష్టవసు (మరియు) గంగాదేవీ ప్రీతికరము. అట్టి అష్టముఖ ధారణచే అష్టమాత్ర దేవతలకు, సత్యావాదులగు బ్రహ్మతత్త్వజ్ఞులకు ప్రీతిపాత్రుడు అగుచున్నాడు.

**(అష్టవసువులు** = అవుడు, ధృవుడు, సోముడు, అధ్వరుడు, అనిలుడు, ప్రత్యులుడు, అనలుడు, ప్రభాసుడు). **(అష్టగంగలు** = గంగ, యమున, కృష్ణ, గోదావరి, సరస్వతి, నర్మద, సింధువు, కావేరి)

**నవ (9) ముఖ రుద్రాక్ష :** నవశక్తి–అధిదేవతా స్వరూపము. నవగ్రహ ఉపాసనా అధిదైవతము. అట్టి '9' ముఖముల (వక్త్రముల) రుద్రాక్ష ధారణచే నవగ్రహ దేవతలకు, వారి ప్రత్యధి దేవతలకు ప్రీతిపాత్రుడు అగుచున్నాడు.

**(నవగ్రహములు** = సూర్య, చంద్ర, అంగారక, బుధ, గురు, శుక్ర, శని, రాహు, కేతువులు).

**(నవాత్మల** (1) దృశ్యాత్మ, (2) జీవాత్మ, (3) అంతరాత్మ, (4) పరమాత్మ, (5) నిర్మలాత్మ (6) శుద్ధాత్మ, (7) జ్ఞానాత్మ, (8) మహాత్మ, (9) భూతాత్మల జ్ఞానము సిద్ధించగలదు.

**దశ (10) వక్త్ర (ముఖముల) రుద్రాక్ష :** సమవర్తియగు యమభగవానుని దివ్య స్వరూపమునకు సంజ్ఞగా అభివర్ణితము. పంచముఖ రుద్రాక్షను దర్శించినంత మాత్రంచేతనే మనస్సుకు పరమ శాంతి లభించగలదు. **పాపభావములు** శమించగలవు. **దశవిధ పుణ్య భావములు** ప్రవృద్ధమవుతాయి.

**(దశవిధ పుణ్య కర్మలు** = పరోపకారము, గురుజనసేవ, దానము, ఆతిధ్యము, పావిత్ర్యము, మహోత్సవము, వ్రతము, పశు పాలనము, జగద్వృద్ధి, న్యాయాచరణము)

**ఏకాదశ (11) ముఖముల రుద్రాక్ష :** ఏకాదశ రుద్ర – దివ్యస్వరూపము. ఏకాదశముఖ రుద్రాక్ష ధారణ – సౌభాగ్య వర్ధనము. అల్పత్వము నుండి బయల్వెడలునట్లు చేసి దివ్యత్వము ప్రసాదించగలదు.

**ఏకాదశరుద్రులు (బ్రహ్మమానసపుత్రులు)** (1) అజుడు, (2) ఏకపాదుడు, (3) అహిర్బుధ్న్యుడు, (4) హరుడు, (5) శంభుడు, (6) త్ర్యంబకుడు, (7) అపరాజితుడు, (8) ఈశఆనుడు, (9) త్రుభువనుడు, (10) త్వష్ట (విశ్వకర్మ), (11) రుద్రుడు = **భారతము**)

**ద్వాదశ (12) ముఖ రుద్రాక్ష :** మహా విష్ణు స్వరూపకము. ఆదిత్యుని (సూర్యుని) ద్వాదశ (12) రూపములు. దివ్యత్వము కొరకై, తేజో విభవము కొరకై ధారణ చేయతగినట్టిది.

---

**అన్యపాఠము; (Another Puranic Discription)**

**(ద్వాదశాదిత్యులు :** అదితియందు కశ్యపునివలన కలిగిన 12 మంది సూర్యతేజోసంపన్నులు (1) ధాత, (2) మిత్రుడు, (3) అర్యముడు, (4) శుక్రుడు, (5) వరుణుడు, (6) అంశుమంతుడు, (7) భగుడు, (8) వివస్వంతుడు, (9) పూషుడు, (10) సవిత, (11) త్వష్ట, (12) విష్ణువు = **భారతము**).

---

**త్రయోదశ (13) ముఖ రుద్రాక్ష :** కోరిన కోరికలు తీర్చునట్టిది. సర్వ శుభములు సిద్ధింపజేయగలదు. ధారణ మాత్రం చేతనే కామ దేవుని (కామేశ్వరీ సహిత శివభగవానుని) కరుణకు అర్హము చేయునట్టిది.

**చతుర్దశ (14) ముఖ రుద్రాక్ష :** ఇది రుద్ర భగవానుని నేత్రముల నుండి జాలువారిన జల బిందువుల సాక్షాత్ స్వరూపముగా వర్ణించబడుతోంది. శివతత్త్వ జ్ఞానముయొక్క సామీప్య దృష్టి (శివోఽహమ్‌ను) ప్రసాదించగలదు.

⌘

**రుద్రాక్షమాల ధారణ** సర్వ వ్యాధులను హరించివేయగలదు. సర్వదా ఆరోగ్యమును ప్రసాదించగలదు.

**రుద్రాక్షమాల ధారణ చేస్తున్నప్పుడు విధి నిషేధములు :** మద్యమును (మత్తు పానీయములను) స్వీకరించరాదు.

**ఆహార నియమములు పాటించాలి :** మద్యము, మాంసము, ఉల్లిపాయ (లశునము), వెల్లుల్లి (పలాండుము), గోంగూర (శిగ్రు), తదితర శ్లేష్మమును వృద్ధిచేయు భక్ష్యముసు – **అభక్ష్యములు (తినరాదు)** అనునది నియమము.

**నూతన రుద్రాక్షమాల ధరించుటకు తగిన సమయములు :** గ్రహణ సమయము, విషువద్దినము, (సంధ్యా సమయము, (రాత్రి – పగలు సమమైన కాలము), గ్రహణ విడుపు దినము. ప్రత్యేక పవిత్రదినములగు శివరాత్రి, దేవీనవరాత్రి దినములు, కృత్తికా నక్షత్ర ప్రవేశ కార్తీక మాస పవిత్ర దినములు, వినాయక చవితి, శ్రీరామ నవమి, కృష్ణాష్టమి ఇత్యాది పర్వ దినములు, దక్షిణాయణ – ఉత్తరాయణ ప్రవేశ పుణ్యదినములు, నెల సంక్రమణ సమయములు, అమావాస్య–పౌర్ణమి దినములు, తిథి పూర్ణ దినములు – మొదలైనవి రుద్రాక్ష ధారణకు అధికంగా శుభప్రదము.

రుద్రాక్ష ధారణ సర్వ పాప **'దృష్టి – భావన'**లను తొలగించగలదు. ప్రారంభించిన మంత్రోపాసన త్వరగా సిద్ధించి, సద్యోముక్తిని (అఖండమగు, ఆత్మాహమ్ భావన, నిశ్చల స్వానుభవములను) ఇప్పటికిప్పుడే ప్రసాదించగలదు. సద్యోముక్తికి త్రోవ చూపగలదు.

## *రుద్రాక్ష యొక్క త్రిమూర్తి స్వరూపము*

**రుద్రాక్ష మూలం తత్ బ్రహ్మ।** – రుద్రాక్షయొక్క మూలమునందు సృష్టికర్త అగు **బ్రహ్మదేవుడు సంస్థితులు.**

**తత్ నాళం విష్ణురేవ చ।** – నాళము (మధ్య ప్రదేశము) **విష్ణు స్థానము.**

**తత్ ముఖమ్ రుద్ర।** – ముఖము **రుద్రస్థానము**

**తత్ బిందుః సర్వ దేవతా–ఇతి।** – బిందు స్థానము **సర్వదేవతా నిలయము. (సుషిరగ్ం సూక్ష్మం, తస్మిన్ సర్వమ్ ప్రతిష్ఠితమ్)।**

⌘

మరొక ఒకానొక సందర్భములో–**బ్రహ్మ మానస పుత్రుడు, యతీశ్వరుడు, యోగీశ్వరుడు అగు శ్రీ సనత్కుమారులవారు శ్రీ కాలాగ్ని రుద్ర భగవానుని** దర్శించి నమస్కరించారు. వారిరువురు రుద్రాక్ష తత్త్వము గురించి, మహత్త్వము గురించి అనేక విశేషములు సంభాషించుకొనుచున్నారు. చివరికి సనత్కుమారులవారు ఈవిధంగా అడగటం జరిగింది.

**సనత్కుమారుడు :** స్వామీ! జగద్గురూ! కరుణామూర్తియగు సర్వేశ్వరా! కాలాగ్ని రుద్రభగవన్! మరికొంతగా కూడా రుద్రాక్ష ధారణ విధి, మహత్త్వము వివరించండి. విద్యార్థినై శ్రవణము చేయటానికి అత్యుత్సాహపడుచున్నాను.

సనత్కుమారులవారు రుద్రమహాదేవుని ఆవిధంగా అడుగుచుండగా, ఆసమయంలో శివదర్శనానందము కొరకై కొందరు మహనీయులగు పరమహంసలు, ఋషిపుంగవులు, అవధూతలు ఆచోటికి వచ్చి శివ–పార్వతులకు త్రి ప్రదక్షిణ పూర్వక సాష్టాంగ దండప్రణామములు భక్తిపూర్వకంగా సమర్పించారు. వారు సర్వశ్రీ...

**నిదాఘుడు** – తేజోబిందూపనిషత్, బృహదారణ్యకోపనిషత్ మొదలైన ఉపనిషత్తులలో "తత్–త్వమ్" "సోఽహమ్"ల తత్త్వికార్థమునకు శ్రోత, వక్త అయినట్టి మహనీయుడు.

**జడ భరతుడు** – పూర్ణ జ్ఞాని! ఆత్మానుభవుడు అయి ఉండి కూడా కించిత్ ప్రియత్వముచే జింక మొదలైన ఉపాధులను గ్రామ సంచారమువలె చుట్టివచ్చిన దృష్టాంత సారూప్యులు (భారతము).

**దత్తాత్రేయులవారు** – అత్రి–అనసూయలకు శ్రీమన్నారాయణాంశగా జన్మించిన అవధూత. భక్తులకు సద్యోముక్తి జ్ఞాన ప్రదాత.

**కాత్యాయనుడు** – కాత్యాయనీ – యాజ్ఞవల్క్యుల పుత్రుడు. బ్రహ్మ జ్ఞాని.

**భారద్వాజుడు** – సప్తర్షులలో ఒకరు. బ్రహ్మజ్ఞుడు.

**కపిలుడు** – మాతృదేవతకు సాంఖ్యయోగము బోధించి, '108' శారీరక తత్త్వములను శాస్త్రీయంగా బోధించిన మహర్షి.

**వసిష్ఠ మహర్షి** – బ్రహ్మ మానస పుత్రుడు. సూర్యుని 'రేతఃపతనము' నుండి ఊర్వశీ మాతృత్వముతో కుండనుండి జన్మించినవారు. సప్తర్షులలో ఒకరు. శ్రీరామచంద్రునికి గురువు. యోగవాసిష్ఠ ప్రవక్త.

**పిప్పలాదుడు** – మహాతపో సంపన్నులు. మహర్షి. దధీచి మహర్షి కుమారుడు. పిప్పల వృక్షము క్రింద జన్మించారు. తండ్రి భౌతికదేహమును వజ్రాయుధము కొరకై దేవతలకు సమర్పించిన తరువాత, తల్లి లోపాముద్రకు జన్మించారు. తల్లి కూడా అగ్నిప్రవేశము చేయగా – పిప్పల వృక్ష దేవత (రావిచెట్టు) చంద్రుని నుండి అమృతము ఇచ్చి కాపాడింది.

ఈ ఈ మొదలైనవారంతా వచ్చి స్వామి శివభగవానునికి నమస్కరించి, స్వామి అనుజ్ఞతో వారి సమక్షంలో సుఖాశీనులైనారు.

**కాలాగ్ని రుద్రభగవానుడు** : – మహనీయులారా! బిడ్డలారా! **కిమర్థం భవత ఆగమనః?** మీరందరికి శుభము అగుగాక! ఏ కారణంగా మీరంతా ఇప్పుడు వచ్చారు?

**శ్రీ నిదాఘ మొదలైనవారు** : హే లోక శుభంకరా! నిత్యానంద స్వరూపా! మీరు మహనీయుడగు ఈ సనత్కుమారునికి రుద్రాక్ష ధారణ గురించి చెప్పుచున్నారు కదా! ఆయా విశేషాలకు మేము కూడా శ్రోతలమై, అట్టి రుద్రాక్షమాలా ధారణ మహత్త్వము గురించి వినుటకై వచ్చాము.

**శ్రీ కాలాగ్ని రుద్ర భగవానుడు** : (ఆయా అనేక విశేషాలు చెప్పుతూ ఈవిధంగా సమీక్షించసాగారు).

బిడ్డలారా! ఇంకా కూడా వినండి. రుద్రుని కనుల నుండి జాలు వారిన నీటి బిందువుల నుండి ఉత్పన్నమైనాయి కాబట్టి 'రుద్రాక్ష'లు అను పేరుతో లోక ప్రసిద్ధమైనాయి.

**("రుద్రాక్ష" – తాత్త్వికార్థము**

1. ఈ జగత్తును రుద్ర సంకల్ప–వికల్ప చమత్కారముగా దర్శించటము,
2. సస్వరూపాత్మయే రుద్ర ప్రత్యక్షరూపముగా భావించటము,
3. సమస్త జగత్తు రుద్రభూమిగాను, సర్వ భౌతికరూపములు రుద్రుని ఆశ్రయించిన భూత గణముగాను, సమస్త మనస్సులను రుద్రుని సేవించు పిశాచ గణముగాను ఎరిగి ఉండటము).

సర్వము కేవలాత్మయందు ఏకము – లయము చేయు కనులు (లేక) దృష్టి – అనునదే రుద్రాక్ష శబ్దార్థము. సదాశివుడు సంహార కాలములో, సంహార లీలను నిర్వర్తించటానికై కనుల నుండి జనించటంచేత **'రుద్రాక్షలు'** అనబడుచున్నాయి.

జాగ్రత్–స్వప్న–సుషుప్తుల వస్తుతః – రాహిత్యము (స్వతఃగా లేవు) అను తత్త్వార్థ దృష్టియే 'రుద్రాక్షత'।

ఇంకా, స్వామి ఆయా అనేక విశేషాలన్నీ విశదీకరిస్తూ బోధించుట జరిగింది.

## ఫలశ్రుతి

**కాలాగ్ని రుద్రభగవానుడు** : పవిత్రమగు రుద్రాక్షల గురించి సంభాషించుకున్నంత మాత్రంచేతనే పది గోవులు దానం చేసిన ఫలము సిద్ధించగలదు.

అట్టి 'భస్మజ్యోతి రుద్రాక్ష' అని గూడా పిలువబడు రుద్రాక్షను చేతితో స్పృశించటముచేతను, ధారణ మాత్రం చేతను – ద్విసహస్ర (2,000) గోవులను దానముచేసిన ఉత్తమఫలము ప్రాప్తించగలదు.

అట్టి రుద్రాక్షలను చెవులచుట్టూ ధారణ మాత్రంచేత ఏకాదశ సహస్ర (11,000) గో ప్రదాన ఫలము లభిస్తోంది. ఏకాదశ రుద్ర మహత్ స్థానము చేరుస్తోంది.

శిరస్సు చుట్టు రుద్రాక్ష ధారణచేత కోటి గోదాన ఫలము వచ్చి చేరగలదు. పై విధముగాను, కర్ణకుండలములుగాను రుద్రాక్ష ధారణచే లభించే ఫలము నేను మాటలతో అభివర్ణించి చెప్పలేను.

⌘

ఎవ్వనరైతే ఈ రుద్రాక్ష జాబాలోపనిషత్‌లో చెప్పుచున్న విశేషాలను నిత్యము అధ్యయనము చేస్తూ ఉంటారో, అట్టి రుద్రాక్ష తత్త్వమును ఎరిగినవారు - బాలురైనా, యువకులైనా కూడా (మరెవ్వరైనా కూడా).... మహత్తరమైన వేద విద్యను ఉపాసించినవారితో సమానులగుచున్నారు.

అట్టి అధ్యయనము చేసినవారు జ్ఞానబోధకు గురుస్థానమును, మంత్రోపదేశమునకు ఉపదేష్ట స్థానమును అలంకరించ గలరు.

రుద్రాక్షలు ధారణచేసియే హోమము చేయుదురు గాక.

పరమాత్మను అర్చించునప్పుడు రుద్రాక్ష ధారణ ధరించెదరు గాక!

ఉత్తమమైన రక్షణ కలుగజేయునది, మృత్యువునుండి తరింపజేయునది అగు రుద్రాక్షమాలను గురుముఖతః ఉపదేశపూర్వకంగా స్వీకరించబడు గాక.

అట్టి గురూపలబ్ధమైన రుద్రాక్షలను కళ్ళకు అద్దుకొని కంఠమునందు, భుజములపైన, శిఖ మొదలైనచోట భక్తి-శ్రద్ధలతో ధారణ చేయుదురు గాక।

అట్టి రుద్రాక్షమాలతో చేర్చి మంత్రోపాసన నేర్పినట్టి గురువు యొక్క ఋణము సప్త ద్వీపములను సమర్పించుకొనుటచేత కూడా తీరునది కాదు.

అయితే, అట్టి గురువుకు ఏకొంచమైనా గాని, ఒక్క గోవునైనాగాని సమర్పించినంత మాత్రముచేతనే గురువులు సంతోషించుచున్నారు. తృప్తి చెందుచున్నారు. భక్తితో ఏది సమర్పిస్తే అదియే మహనీయులగు గురువుల దృష్టిలో గొప్పదగు గురుదక్షిణ.

⌘

ఎవ్వరు ఈ ఉపనిషత్తును పారాయణ పూర్వకంగా పఠిస్తారో...,

- సాయంత్రపు పారాయణముచే పగలు చేసియున్న పాపము తొలగిపోగలదు.
- మధ్యాహ్న సమయములలో పారాయణము చేయటంచేత ఆరు (6) జన్మలలో చేసియున్న పాపమంతా నశించగలదు.
- ఉదయకాలములోను, సాయం సమయములందు-అధ్యయనము చేస్తూ ఉండగా అనేక జన్మలలో చేసియున్న పాపము భస్మమైపోగలదు. అంతేకాకుండా షట్ సహస్ర లక్షల (6000 లక్షల) గాయత్రీ జప ఫలము ప్రాప్తించగలదు.
- ఘోర మహాపాతకములగు బ్రహ్మహత్య, సురాపానము, బంగారము దొంగిలించిన దోషము, గురు దారా-గమనము, అట్టి పాప గుణములు కలవారితో సంయోగము (స్నేహ/సామీప్య)ములనబడే పంచమహాపాతకముల నుండి కూడా పునీతుడు అవగలడు.
- సర్వ తీర్థములు సందర్శించి పవిత్రత పొందగలడు.
- నీచమైన సంభాషణ నిర్వర్తించిన దోషము నుండి పవిత్రుడు కాగలడు.

అట్టివాడు ఏ పంక్తిలో ఉంటే, ఆ పంక్తిలోని జనులు (రుద్రాక్ష ధారణా ప్రభావముచేత) పునీతులు, పవిత్రులు అగుచున్నారు. రుద్రాక్ష ధారణ చేయువారి ఉనికి మాత్రంచేత వారి పరిసరములలోని వందల - వేల పంక్తులలోని జనులు నిర్మలత్వము సంతరించుకోగలరు.

రుద్రాక్ష ధరించినవాడు, ఆతని సమీప్య జనులు (శిష్యులు, బంధువులు మొదలైనవారు) **శివసాయుజ్యము పొందగలరు.**

అట్టివారు పునరావృత్తి-జన్మ జన్మాంతర చక్రము నుండి విడివడగలరు.

జన్మ కర్మల విషయంలో సర్వస్వతంత్రులై, స్వస్వరూపానందమునందు ప్రతిష్ఠితము కాగలరు.

**న చ పునరావర్తత ఇతి 'ఓగ్ం'॥**

**సత్యమితి**

*ఇతి రుద్రాక్షజాబాలోపనిషత్*
*ఓం శాంతిః శాంతిః శాంతిః*

సామవేదాంతర్గత

# 14 సన్న్యాసోపనిషత్

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ సన్న్యాసోపనిషత్ వేద్యం సన్న్యాసి పటలాశ్రయమ్,
సత్తా సామాన్య విభవం 'స్వమాత్రమ్' –ఇతి భావయేత్॥

యతి - సన్న్యాస పటలము (Group)లచే సర్వదా ఆశ్రయించబడునది అగు సత్తా సామాన్య విభవము (The Festivity of all -pervading equal presence) - ఎక్కడున్నది? - అది **"స్వస్వరూపమే"** - అను భావనా నిశ్చయము. ఈ సన్న్యాసోపనిషత్ అధ్యయనమునచే తెలియబడుచున్నది.

## ప్రథమోఽధ్యాయః

**1. ఓమ్। అథ అతః సన్న్యాసోపనిషదమ్ వ్యాఖ్యాస్యామో। – యో అనుక్రమేణ సన్న్యస్యతి, స సన్న్యస్తో భవతి।**

**ఓంకార ప్రణవ స్వరూప పరమాత్మకు నమస్కరిస్తూ...,**

ఇప్పుడిక మనము సన్న్యాసస్థితి యొక్క "ఉపనిషత్ విద్య" గురించి వ్యాఖ్యానించుకుంటున్నాము.

ఎవ్వడైతే {బ్రహ్మచర్య - గృహస్థ - వానప్రస్థ ఆశ్రమ అనుక్రమంగా (In its sequence)} సన్న్యాసాశ్రమం స్వీకరిస్తాడో, అట్టివాడు **'సన్న్యస్తుడు'** అగుచున్నాడు.

---

**కోఽయం 'సన్న్యాస' – ఉచ్యతే? కథం సన్న్యస్తో భవతి? య ఆత్మానం క్రియాభిః గుప్తం కరోతి।**

ఎవరు 'సన్న్యాసి' అని అనబడుచున్నారు? ఒకడు సన్న్యస్తుడు ఎట్లా అవుతాడు?

**ఎవ్వడైతే ఆత్మయొక్క తత్త్వమును, ఆత్మయొక్క సమస్త మహోకర్తృత్వమును రహస్యంగా హృదయమున పదిలపరచుకొని, జగత్ - దర్శనము చేస్తూ ఉంటాడో, అట్టివాడు, 'సన్న్యస్తుడు' - అగుచున్నాడు.**

ఈ "జగద్దృశ్యము' అను క్రియావిశేషమంతా- **ఆత్మయందే, ఆత్మగానే,** అనునిత్యంగా, ఎవడు సునిశ్చితుడై సందర్శిస్తూ ఉంటాడో - ఆతడే సత్‌న్యస్తుడు (లేక) సన్న్యస్తుడు..

---

**2. మాతరం, పితరం, భార్యాం పుత్రాన్, బంధూన్, అనుమోదయిత్వా, యే చ అస్య ఋత్విజః తాం(తు) సర్వాంశ్చ పూర్వవత్ వృణీత్వా "వైశ్వానర ఇష్టిం" నిర్వపేత్।**

**సన్న్యాస ఆశ్రమ స్వీకారం**

తల్లి తండ్రి భార్య పుత్ర బంధువుల యొక్క సంతోషపూర్వకమైన అనుమోదము (ఒప్పుకోలు - Acceptance) పొంది,

తనకు ఋత్విక్కులు (దేవజ్ఞులు, కుటుంబపెద్దలు, గురుతుల్యులు) ఎవరైనా ఉంటే, వారందరినీ పూర్వము వలెనే సమీపించి, సన్న్యాస-ఉద్దేశ్యము తెలియజేసి అనుజ్ఞపొంది,

**వైశ్వానర - ఇష్టి (యజ్ఞమును)** ఋత్విక్కుల సహాయంతో నిర్వర్తించాలి.

| | |
|---|---|
| సర్వస్వం దద్యాత్। <br> యజమానస్య గా। ఋత్విజః- <br> సర్వైః ప్రాత్రైః సమారోప్య, <br> యత్ ఆహవనీయే, గార్హపత్యేవ <br> అన్వాహార్య వచనే <br> సభ్యావసథ్యోశ్చ, ప్రాణ అపాన <br> వ్యాన ఉదాన సమానాం తు <br> సర్వేషు సమారోపయేత్। | సర్వస్వదానంగా తనకున్న సర్వస్వము (కుటుంబ సభ్యులకు, ఋత్విజులకు మొదలైనవారికి) సమర్పించివేయాలి. <br> యజమాని యొక్క గోవులను, ఋత్విజులకు ఇచ్చివేయాలి. సర్వపాత్రలను సమర్పణగా సమారోపణము చేయాలి. (విశ్వేశ్వరునికి చెందినవిగా భావించి విశ్వక్షేమమును ఉద్దేశ్యించి సమర్పించివేయాలి) <br> ఆహవనీయాగ్నియందు, గార్హపత్యాగ్నియందు "అన్వాహార్య" వేదప్రోక్త వచనములందు, సభ్య - అవసథ్యల యందు సమస్తము సమర్పించివేయాలి. <br> ప్రాణ - అపాన- వ్యాన - ఉదాన - సమానములను (పంచ ప్రాణములను) - అన్నిటినీ ప్రాణేశ్వర భగవానునియందు సమారోప్యము చేయాలి. **వాటివాటి తత్త్వములను ఆయా అధిదేవతలకు చెందినవిగా భావిస్తూ సమర్పించివేయాలి.** |
| స శిఖాన్ కేశాన్ విశృజ్య, <br> యజ్ఞోపవీతం ఛిత్వా, <br> పుత్రం దృష్ట్వా, <br> "త్వం బ్రహ్మ। త్వం యజ్ఞః। త్వం సర్వం।" <br> ఇతి అనుమంత్ర యేత్। <br> యది అపుత్రో భవతి, ఆత్మానమ్ ఏవ ఇమం ధ్యాత్వా | శిఖతో సహా కేశములను విసర్జించి వేయాలి. <br> యజ్ఞోపవీతమును త్రెంచివేయాలి. <br> పుత్రుని వైపు చూచి **"కుమారా! నీవే బ్రహ్మమువు. నీవే యజ్ఞమువు. నీవే ఆత్మరూపమగు సర్వము కూడా"**.. అని వివరణాత్మకమగు మంత్రములను మనసా, వాచా, బుద్ధ్యా అనుమంత్రణము (అనుష్ఠానము) చేయాలి. <br> ఒకవేళ ఆ యజమాని పుత్రులు లేనివాడైతే, తనను తానే చూచుకుంటూ "త్వమ్‌బ్రహ్మ" మొదలైన మంత్రములతో తనయొక్క జీవాత్మకు అనుమంత్రనము చేయాలి. |
| న వేక్షమాణః - ప్రాచీం, ఉదీచీం వా దిశం ప్రవ్రజేత్। <br> త్రిషు వర్ణేషు "భిక్ష" ఆచర్యం చరేత్। <br> పాణి పాత్రేణ అశనం కుర్యాత్, <br> ఔషధవత్ అశనం ఆచరేత్। <br> ఔషధవత్ అశనం ప్రాశ్నీయాత్। | ఇక ఏ మాత్రము వెనుతిరగకుండా ప్రాచీంవా (తూర్పు దిక్కుగా గాని) ఉదీచీ-వా(ఉత్తరదిక్కుగాగానీ) వెళ్లటము ప్రారంభించాలి (ప్రవ్రజేత్). <br> త్రి- వర్ణములలో భిక్షాటణం చేస్తూ 'చేయి'ని పాత్రగా చేసి ఆహారము భుజించాలి. అన్నమును రుచి, ఎక్కువ తక్కువల దృష్టి లేకుండా **'ఔషధము'** అను భావనతో భుజించాలి. (మందులాగా స్వీకరించాలి). |
| **3.** యథా లాభమ్ అశ్నీయాత్ - <br> ప్రాణసంధారణార్థం। <br> యథా మేదోవృద్ధిః న జాయతే। <br> కృశో భూత్వా - గ్రామ ఏకరాత్రం, నగరే పంచరాత్రం। <br> చతురో మాసాన్ వార్షికాన్ గ్రామే వా <br> నగరే వా అపి వసేత్। | యాదృచ్ఛికంగా లభించిన ఆహారమును ప్రాణసంధారణ కొరకు మాత్రమే స్వీకరించాలి. మేథోవృద్ధి (కండబలము) కొరకై ఉద్దేశ్యించరాదు. <br> ఎప్పటికప్పుడు వేరు ప్రదేశములలో సంచారుడై ఉండాలేగాని ఒక్కచోటనే ఉండి పోరాదు. <br> - గ్రామమైతే - ఒక్కరాత్రి మాత్రమే. <br> - నగరమైతే - ఐదురాత్రులు మాత్రమే. <br> -చాతుర్మాస్యముగా - సంవత్సరానికి (వర్షాకాలంలో) 4 మాసములు గ్రామములోగాని, నగరములోగాని ఉండవచ్చు. |
| పక్షావై మాసా ఇతి ద్వౌ మాసౌవా వసేత్। <br> విశీర్ణ వస్త్రం వల్కలం వా <br> ప్రతిగృహ్ణీయాత్। <br> న అన్యత్ ప్రతి గృహ్ణీయాత్। | - 4 నెలలు ఒక్కచోటే ఉండలేని సందర్భములలో 4 పక్షములు ($4 \times \frac{1}{2} = 2$ నెలల కాలము) **చాతుర్మాస్యవ్రతము** నిర్వర్తిస్తూ ఒక్కచోటే ఉండవచ్చు. <br> ముతక (విశీర్ణ) వస్త్రము గాని, నారబట్టలుగాని ప్రతిగ్రహించవచ్చు. (సిల్కు, పట్టువస్త్రములు స్వీకరించరాదు) |
| యది అశక్తో భవతి, క్లేశతః, తప్యతే తప ఇతి। <br> యోవా ఏవం క్రమేణ సత్ న్యస్యతి (సన్న్యస్యతి) <br> యోవా ఏవం పశ్యతి ॥ | అనారోగ్యము ఇత్యాదుల కారణంగా అశక్తుడై ఉన్నప్పుడు ఉన్నచోటనే సన్న్యాసధర్మములు, తపస్సు, సన్న్యాసదృష్టిని వీడనివాడై ఉండాలి. <br> **సన్న్యాసభావనము ముఖ్యము.** <br> ఈ విధంగా సన్న్యసించువాడు ఏ క్రమంగా సన్న్యసిస్తూ, ఏదేది ఎట్లా దర్శిస్తూ ఉంటాడో.. ఆ విశేషాలు చెప్పుకుంటున్నాము. |

| | |
|---|---|
| **కిం అస్య యజ్ఞోపవీతం? కాస్య శిఖా?**<br>**కథం వా అస్య ఉపస్పర్శనం? ఇతి।**<br>**తగ్ం హోవాచ :**<br>**ఇదం ఏవ అస్య తత్ యజ్ఞోపవీతం,**<br>**యత్ "ఆత్మధ్యానం"। విద్యా శిఖా।** | **శ్రోత / శిష్యుడు :** 'సన్న్యాసభావన' అనగా ఏమి? యజ్ఞోపవీతం, శిఖ త్యజించినట్టి ఆయనకు ఇక- **ఏది యజ్ఞోపవీతము? ఏది శిఖ? ఆతనికి ఉపస్పర్శనం (ఉపనిషదము) ఏది?**<br>**సద్గురువు ఋషి :** సన్న్యసించినవానికి →<br>ఆత్మభావన, ఆత్మధ్యానమే → **యజ్ఞోపవీతము.**<br>ఆత్మవిద్యయే → **శిఖ అనగా ఏమి? విను.** |
| **నిర్వైరః సర్వత్ర అవస్థితేః**<br>**కార్యం నిర్వర్తయన్।**<br>**ఉదర పాత్రేణ।**<br>**జల తీరే నికేతనమ్।** | ఆత్మభావన : దేనిపట్లా ఎటువంటి వ్యతిరిక్తము, ఎవ్వరిపట్లా కూడా విరోధిత్వము కలిగియుండకపోవటమే ఆతనికి కార్యము. "అందజరము ఏకమగు ఆత్మయే అయి ఉండగా, (నా చేతిపై నాకు కోపము ఉండనట్లే), ఎవ్వరిమీదా నాకు కోపం లేదు'' - అను ఆత్మధ్యానమునందు నిమ్మగ్నుడగుచూ, పొట్టను భిక్షపాత్రగా భావించువాడై, జలప్రదేశములగు తటాక నదీ తీరములే నివాస స్థానములుగా కలిగి ఉంటున్నారు. |
| **బ్రహ్మ వాదినో వదన్తి : అస్తమిత ఆదిత్యే,**<br>**కథం వా అస్య ఉపస్పర్శనం, ఇతి?**<br>**తాన్ హోవాచ:**<br>**యథా అహని తథా రాత్రౌ। న అస్య నక్తం, న దివా,**<br>**తత్ అపి ఏతత్ ఋషిణా ఉక్తం।**<br>**సకృత్ దివా హి ఏవ అస్మై భవతి।**<br>**య ఏవం విద్యాన్ ఏతేన ఆత్మానం సన్ధత్తే॥** | **బ్రహ్మవాదులు :** సూర్యుడు అస్తమించిన తరువాత సన్న్యస్తునికి ఉప-స్పర్శనము (సంధ్యావందన సంబంధమైన - ఆచమనము/బ్రహ్మోపాసన) ఉంటాయా? ఉంటే, - ఏతీరుగా చేస్తారు?<br>**ఋషి :** పగలు ఏ తీరుగా చేస్తారో, ఆ విధంగానే సన్న్యాసి ఆచమనము (బ్రహ్మోపాసన) రాత్రిపూట కూడా నిర్వర్తిస్తారు. ఆయనకు పగలు - రాత్రి భేదము ఉండదు. ఎల్లప్పుడూ 'పగలు' (Day time)తో సమానమే. స్వయముగా సూర్యునికిగాని, స్వయముగా ఆత్మసూర్యునికిగాని ఉదయాస్తమయములేమి ఉంటాయి? ఆతడు అనునిత్య-బ్రహ్మతత్త్వ ధ్యాని అయి ఉంటాడు.<br>ఆత్మతత్త్వము ఎరిగి ఆతడు సత్ - న్యాసి అయి ఎల్లప్పుడు ఆత్మతో అనుసంధానం కలిగియే చరిస్తూ ఉంటారు. |

## ద్వితీయోధ్యాయః - సన్న్యాసము - అర్హత, ఆశయము, సిద్ధి

| | |
|---|---|
| **1. ఓం। చత్వారింశత్ (40) సంస్కార సంపన్నః,**<br>**సర్వతో విరక్తః, చిత్త శుద్ధిమ్ ఏతి।**<br>**ఆశా, అసూయా, ఈర్ష్యా అహంకారం – దగ్ధ్వా,**<br>**సాధన చతుష్టయ సంపన్న ఏవ సన్న్యస్తుం అర్హతి॥** | 'ఓం'<br>**సన్న్యసించటానికి అర్హుడెవ్వడు?**<br>(భగవద్గీతలోని-భక్తి, క్షేత్ర-క్షేత్రజ్ఞ విభాగ, గుణత్రయ విభాగ యోగములలో ఉదహరించిన భక్తి-జ్ఞాన లక్షణములగు) ఆత్మ తత్త్వార్థ జ్ఞాన- స్వానుభవ సిద్ధి పూర్వకమైన '40' గా సంస్కార సంపదల సంపన్నుడు, ఇంద్రియ - దృశ్య సంబంధమైన సమస్త బాహ్య విషయముల పట్ల విరక్తుడై చిత్తశుద్ధి సముపార్జించుకున్నట్టివాడు, ఆశ - అసూయ - ఈర్ష్య - అహంకారములను మొదలంట్లా దగ్ధము చేసుకొని ఉన్నవాడు, (శమము, విచారణ, సత్సంగము (లేక) సాధు సంగము, సంతోషము అనబడు) సాధన చతుష్టయ సంపత్తి కలవాడు సన్న్యసించటానికి అర్హుడు. కోప-ఆవేశ- అసూయ అహంకారములు మొదలైనవి జయించువాడే నిజమైన సన్న్యాసి. ఆవేశముతో, నిరుత్సాహములతో సన్న్యసించటము సముచితము కాదు. |
| **సన్న్యాసే నిశ్చయం కృత్వా,**<br>**పునః న చ కరోతి యః, స కుర్యాత్**<br>**కృచ్ఛ్రమాత్రంతు, పునః సన్న్యస్తుం అర్హతి।** | ఒకానొకడు సన్న్యసించటానికి కృతనిశ్చయుడై, అంతా సిద్ధం చేసుకుని విధానాలన్నీ పాటించి, చివరి దాకా వచ్చి, ఏదో కారణంచేత విరమించుకోవటం జరిగితేనో? - అట్టివాడు మరొక సందర్భంలో నేరుగా పునఃసన్న్యాసమును కృచ్ఛ్రమాత్రంగా (ఇంతకు ముందే నిర్వర్తించిన) విధానాలన్నీ పాటించకుండా వాటికి కొనసాగింపుగా చేయవలసినవి నిర్వర్తించి స్వీకరించటానికి అర్హుడే. |
| **సన్న్యాసం పాతయేత్ యస్తు పతితం**<br>**న్యాసయేత్తు యః, సన్న్యాస విఘ్నకర్తా చ**<br>**త్రీని ఏతాన్ పతితాన్ విదుః । ఇతి।** | కానీ, సన్న్యాసాశ్రమము స్వీకరించిన తరువాత కొంత కాలానికి అట్టి 'న్యాసము' నుండి పతితుడైతే మాత్రం అట్టివాడు బ్రహ్మచారి - గృహస్థ - వానప్రస్థ -త్రి ఆశ్రమముల నుండి పతితుడు అయినట్లుగా చెప్పబడుతాడు. (అట్టివాడు - "పంచమస్థితికి దిగజారినవాడు, పంచముడు" అనబడుతాడు. |

**2.** అథ షండః పతితో అంగవికలః
స్త్రైణో బధిరో అర్భకో మూకః
పాషండః చక్రీ లింగీ కుష్ఠీ,
వైఖానస, హరద్విజౌ, భృతక అధ్యాపకః
శిపివిష్టో, అనగ్నికో, నాస్తికో,
వైరాగ్య రహితో – అపి
ఏతే సన్న్యాసాత్ అనర్హాః।
సన్యస్తా యద్యపి,
మహా వాక్యా ఉపదేశే న అధికారిణః॥

__సన్న్యాసాశ్రమ స్వీకరించటానికి అర్హులు కానివారెవ్వరు?__
షండుడు (నపుంసకుడు) (Eunuch),
పతితుడు (ఇతఃపూర్వము సన్న్యాసాశ్రమము స్వీకరించి పతితుడు అయినవాడు); అంగవికలుడు; (Physically Handicapped),
స్త్రైణుడు (స్త్రీ సంబంధమై లక్షణములు కలవాడు);
బధిరుడు (చెవిటివాడు),
అర్భకుడు (బాల్య- శారీరక లక్షణములు వీడనట్టివాడు);
మూకడు (మూగవాడు); (Dumb),
పాషండుడు (వేదప్రమాణములు అంగీకరించనివాడు, నియమములను విధానములను నమ్మనివాడు),
చక్రీ (విమర్శలకు, కొండెములు చెప్పుటకు పరిమితుడై యున్నవాడు)
లింగీ (లింగధారణ చేసినవాడు, ఒక మతమునకే పరిమితుడు)
కుష్ఠువ్యాధివాడు, వైఖానసుడు, (వానప్రస్థులలో ఒక తెగవాడు; ఒకానొక అర్చకవృత్తి వాడు), హరద్విజుడు (బ్రాహ్మణుడై ఉండి ధర్మములు విడచినవాడు), భృతకుడు (జీవనోపాధి కొరకై మాత్రమే ఉద్దేశ్యించువాడు); అధ్యాపకుడు; శిపివిష్టుడు (దీర్ఘరోగి), అగ్నికార్యములను గౌరవించని అనగ్నికుడు; నాస్తికుడు, వైరాగ్యము లేనివాడు - వీరు సన్న్యాసము స్వీకరించటానికి అనర్హులు.
ఒకవేళ సన్న్యసించినప్పటికీ కూడా, **వేద-మహావాక్యోపదేశము (తత్త్వమ్-సోహమ్) ఉపదేశించబడటానికి అధికారులు** (Deserved) **కాదు.** ('సేవ'కు, 'మంత్రోపాసన'కు మాత్రమే అర్హులు).

---

ఆరూఢపతితాపత్యం కునఖీశ్య అవదన్తకః
క్షయీ తథా అంగవికలో,
నైవ (న ఏవ) సన్న్యస్తుం అర్హతి॥

ఆరూఢ పతితుడు (సన్న్యసించి, ఆశ్రము త్యజించిన తిరిగి ఇంద్రియ విషయములలో పతితమైన వాడు), కుంటివాడు, పుచ్చిన గోళ్ళు - పుప్పిపళ్ళ రోగము కలవాడు, క్షయవ్యాధి బాధితుడు, అంగవైకల్యము కలవాడు **సన్న్యసించటానికి అర్హులు కాదు.**

---

సంప్రతి అవసితానాన్చ
మహా పాతకినాః తథా, వ్రాత్యానాం
అభీశస్తానాం సన్న్యాసం నైవ కారయేత్॥

సంప్రత్యవసితుడు (సంస్కారము లేనివాడు), (పంచ) **మహాపాతకులు** { 1. బంగారము దొంగిలించటము, 2. భ్రూణహత్య (బాలహంతక), 3. బ్రహ్మాత్య, 4. సురాపానము, 5. గురుపత్నీగమనము, మరియు ఇవి చేయువారితో స్నేహము చేయువారు}, **వ్రాత్యుడు** (ఉపనయనాది సంస్కారములు అనుసరించని ద్విజుడు), **అభిశస్తుడు** (ఇతరులకు హాని చేయు స్వభావము కలవాడు) - వీరు సన్న్యాసము ఇవ్వబడుటకు, సన్న్యసించటమునకు అర్హులు కారు. (సన్న్యాసదీక్ష ఇవ్వకూడదు).

---

**3.** వ్రత యజ్ఞ తపో దాన హోమ స్వాధ్యాయ వర్జితమ్,
సత్య శౌచ పరిభ్రష్టం సన్న్యాసం నైవ కారయేత్।
ఏతే న అర్హన్తి సన్న్యాసం ఆతురేణ వినా క్రమమ్।
"ఓం భూః స్వాహా" ఇతి శిఖాం ఉత్పాట్య,
యజ్ఞోపవీతం బహిః న నివసేత్ – యశో
బలం జ్ఞానం వైరాగ్యం మేధాం ప్రయచ్ఛేతి –
యజ్ఞోపవీతం ఛిత్వా,

వ్రతములు, యజ్ఞములు, తపస్సు, దానము, హోమము, స్వాధ్యాయము ఇవన్నీ వదలివేసి ఉన్నవాడు, సత్యము, శుచి అయిన ఆచారముల నుండి భ్రష్టుడైనవాడు, - ఇట్టివారు **"ఆతుర సన్న్యాసము"**నకు (మరణమునకు దగ్గరపడువారికి ఇచ్చు దీక్షకు) మాత్రమే అర్హులు. క్రమపూర్వకమైన సన్న్యాసదీక్షకు అర్హులు కాదు.
**"ఓం భూః స్వాహా!"** - అని పలుకుచూ శిఖను తీసి,
**"హే పరమాత్మా! యశస్సు, బలము, జ్ఞానము, వైరాగ్యము ప్రసాదించమని వేడుకొనుచున్నాను"** - అని యజ్ఞోపవీతమును త్రెంచి,
**"ఓం భూః స్వాహా భువస్స్వాహా। సువ స్వాహా"** అని పలుకుచూ వస్త్రములు,

| | |
|---|---|
| "ఓం భూః స్వాహా" ఇతి అప్సు వస్త్రం<br>కటిసూత్రం చ విసృజ్య, "సన్న్యస్తం మయా"<br>ఇతి త్రివారం అభిమంత్రయేత్॥ | మొలత్రాడు తీసి నీటిలో విడువాలి (విసర్జించాలి). **"సన్న్యస్తం మయా"** - అని '3'సార్లు అభిమంత్రణము (మంత్రముగ్ధంగా త్రికరణ శుద్ధిగా) చేయాలి. (ఇది-సన్న్యాస విధి విధానము జరుగుచున్నంతసేపు మననము చేస్తూ ఉంటారు). |
| సన్న్యాసినం ద్విజం దృష్ట్వా<br>స్థానాత్ చలతి భాస్కరః।<br>ఏష మే మణ్డలం భిత్వా<br>పరంబ్రహ్మ అధిగచ్ఛతి। | **ఫలశ్రుతి :** సన్న్యాసము స్వీకరించిన ద్విజుని చూస్తూ సర్వసాక్షి అగు సూర్యభగవానుడు **"ఆహా! సన్న్యాస ఆశ్రమము స్వీకరించిన ఈతడు నాకు పూజ్యుడు. ఈయన నా యొక్క సూర్యమండలమును ఛేదించి పరబ్రహ్మము నందు (లేక) బ్రహ్మలోకములో ప్రవేశించగలడు"** అని శుభాకాంక్ష వచనములు పలుకుచూ ఉంటారు. |
| షష్టిం కులాని అతీతాని<br>షష్టిం ఆగామికాని చ<br>కులాని ఉద్ధరతే ప్రాజ్ఞః,<br>"సన్న్యస్తం" ఇతి యో వదేత్। | ఎప్పుడైతే ఆతడు **"సన్న్యాసం మయా"** అని పలుకుతూ సన్న్యాసాశ్రమం స్వీకరిస్తారో, అట్టివాని ఇతఃపూర్వపు షష్ఠి (60) కులములు (తరములు), రాబోవు షష్టి (60) కులములు (తరములు) ఉద్ధరించబడతాయి. పవిత్రమౌతాయి. |
| యే చ సన్తానజా దోషా,<br>యే దోషా దేహ సంభవాః,<br>ప్రైషాగ్నిః నిర్–దహేత్ సర్వాం<br>తుషాగ్నిః ఇవ కాంచనమ్। | ఏ విధంగా అయితే తుషాగ్నిచే పుటము వేయబడినదై బంగారు ఖనిజము మలదోషములన్నీ త్యజించి ధగధగ బంగారు కాంతి-తేజస్సులతో ప్రకాశిస్తోందో, ఆ విధంగా దేహ పరిమిత భావము వలన, సంతానం వలన (సంతానము పట్ల మమకారము; సంకుచితమైన అనురాగములకు సంబంధించిన దోషకర్మల ప్రభావము మొదలైనవి) - ఇవన్నీ కూడా విధి విధానంగా "సన్న్యాసం మయా" అను సన్న్యాసస్వీకారముచే జనించే ప్రేషాగ్నిచే - తొలగిపోగలవు.<br>(సన్తానజ = సత్తును ఏమరచి అసత్ దృష్టితో ఏర్పడిన సంసార దోషము) - ఈ దోషము ప్రేషాగ్నిచే తొలగిపోగలదు).<br>**ప్రేషాగ్ని:** విషయములపట్ల ప్రియత్వము తొలగించి, ఆత్మత్వము పట్ల ప్రియత్వము కలిగించు అగ్ని. |
| "సఖా! మా గోపాయ!" ఇతి దణ్డం పరిగ్రహేత్. | పై విధంగా 'ఓంభూః' అని పలుకుచూ వస్త్రము, మొలత్రాడు జలమునకు సమర్పించి, **'సన్న్యాసం మయ'** అని పలుకుచూ, సూర్యభగవానునిచే బ్రహ్మలోకమునకు దారిచూపు శుభాకాంక్షలు పొందుచు) - **"సఖామా గోపాయ"** అని పలుకుచూ దణ్డమును పరిగ్రహించాలి. |
| **4.** దణ్డం తు వైణవం సౌమ్యం,<br>సత్వచం సమపర్వకమ్,<br>పుణ్యస్థల సముత్పన్నం<br>నానా కల్మష శోధితమ్,<br>అదగ్ధం, అహతం కీటైః, పర్వగ్రన్థి విరాజితమ్,<br>నాసాత్ అఘ్నం శిరః తుల్యం<br>భృవోర్వా అభిభృయాత్ యతిః। | **దణ్డము** : - వెదురుతో తయ్యారయినదై ఉండాలి. (లోహముతో తయ్యారైనది కాకూడదు)<br>చిల్లులు, ఎత్తు - పల్లములు లేకుండా సమముగా ఉన్నదై ఉండాలి.<br>- సమమైన కణుపులు కలిగినది, మంచి ప్రదేశంలో పుట్టినది, పురుగులు కొట్టనిది, అయి ఉండాలి. చీలికలు కలిగినది అవరాదు.<br>**దణ్డము** యొక్క ఎత్తు :<br>నేల నుండి- ముక్కు వరకు గాని, శిరస్సు వరకు గాని, భ్రూమధ్యము వరకుగాని పొడవు ఉన్నది - యతి ధరించును గాక। |
| దణ్డ ఆత్మనో అస్తు సంయోగః<br>సర్వధా తు విధీయతే,<br>న దణ్డేన వినా గచ్ఛేత్<br>ఇషు క్షేప త్రయం బుధః॥ | దణ్డమును ఎప్పుడూ తన దేహముతోబాటే, ఆత్మసమానంగా సంయోగము కలిగి యుండాలి. ఎల్లప్పుడు దేహముతో బాటే వెంటనంటి ఉండాలి. దణ్డము వెంటనంటి ఉండకుండా - ఇషుక్షేపత్రయ దూరము (బాణక్షేపత్రయము, 3 సార్లు బాణము విసరిన దూరము) ను బుధులు దాటి వెళ్లరు. |

జగత్ జీవనం, జీవనాధారభూతం,
<u>“మాతే మా మన్త్రయస్వ సర్వ సౌమ్య”</u>
ఇతి కమణ్డలుం పరిగృహ్య,
యోగ పట్టాభిషిక్తో భూత్వా,
యథాసుఖం విహరేత్॥

(దండము ఆత్మభావనకు సంజ్ఞ).

**(కమండలము = సన్న్యాసులు జలము కొరకై దగ్గిర ఉంచుకొను పాత్ర).**
**“మాతే! మా మన్త్రయస్వ సర్వ సౌమ్య”** - అను మంత్రము చదువుచూ జగత్ జీవనమునకు ప్రతీక (సంజ్ఞ)గా, జీవన సందర్భమునకు ఆధార భూతముగా కమండలమును గ్రహించాలి.

**“సౌమ్య స్వరూపుడవగు ఓ కమండలమా! నీవు నన్ను ఆమన్త్రుడుగా (ఆత్మను మననము చేయువాడుగా) తీర్చి దిద్దుము” -**

ఈ విధంగా కమండలమును సర్వదా చేబూని యోగాభ్యాసంతో - ఆత్మయోగ పట్టాభిషిక్తుడై ఈ దృశ్యములో యధాసుఖంగా, ప్రశాంతంగా, ఆత్మ జ్ఞానానందముగా విహరించును గాక।

---

త్యజ ధర్మం అధర్మం చ ఉభే।
సత్య - అనృతే త్యజ।
ఉభే సత్యానృతే త్యక్త్వా, యేన
త్యజసి - ‘తత్(హి)’ - త్యజ॥

ధర్మ-అధర్మ, సత్య-అనృత (అసత్య) ద్వంద్వములను వదలును గాక. దేనితో సమస్తము త్యజిస్తూ ఉన్నాడో అట్టి త్యాజ్య భావనను కూడా త్యజించును గాక। (“వదలాలి-వదలుచున్నాను” అనునది కూడా వదలివేయును గాక)।

ఈ విధంగా ధర్మాధర్మ సత్యానృత ద్వంద్వములను త్యజించి, ఆ తరువాత **‘త్యజిస్తున్నాను’** అనే త్యాజ్యభావము కూడా త్యజించి మౌనము వహించి ఉండాలి.

---

<u>వైరాగ్య సన్న్యాసీ, జ్ఞానసన్న్యాసీ</u>
<u>జ్ఞానవైరాగ్య సన్న్యాసీ, కర్మసన్న్యాసీ</u>
చ ఇతి చాతుర్విధ్యం ఉపాగతః
తత్ యథా ఇతి॥

## చాతుర్విధ సన్న్యాసి

సన్న్యసించి యున్నవారిని 4 విధములుగా విభజించి చెప్పుచున్నారు.

(1) వైరాగ్య సన్న్యాసి (2) జ్ఞాన సన్న్యాసి (3) జ్ఞాన వైరాగ్య సన్న్యాసి (4) కర్మసన్న్యాసి. అవి ఈ విధంగా వివరించబడుచున్నాయి.

---

<u>“చతుర్విధ సన్న్యాసీమ్”</u>

<u>వైరాగ్య సన్న్యాసి:</u>

5. దృష్టా అనుశ్రవిక విషయ వైతృష్ణ్యమ్ ఏత్య,
ప్రాక్ పుణ్య కర్మ విశేషాత్
సన్న్యస్తః - <u>వైరాగ్య సన్న్యాసీ॥</u>

<u>**4 విధములగు సన్న్యాసులు**</u>

**(1) వైరాగ్య సన్న్యాసి :** దృశ్య ప్రపంచంలో కనిపించుచున్నవి.

వినిపించుచున్నవి - ఇటువంటి సర్వ విషయములపై “ఇవన్నీ నిస్సారము నిష్ప్రయోజనము వచ్చిపోయేవేగాని ఉద్ధరించేవి కావు” - అని గమనించినవాడై, అట్టి సమస్త బాహ్య విషయములపై తృష్ణ (ఆశ) తొలగిపోగా, అనేక పూర్వజన్మల విశేషం చేత సన్న్యాసము స్వీకరించిన వానిని **‘వైరాగ్య సన్న్యాసి”** అని అంటారు.

---

<u>జ్ఞాన సన్న్యాసి:</u>
(2) శాస్త్ర జ్ఞానాత్ పాప-పుణ్యలోక
అనుభవ శ్రవణాత్, ప్రపంచ ఉపరతో
దేహవాసనాం, శాస్త్రవాసనాం, లోక వాసనాం
త్యక్త్వా, అవమానం మానం ఇవ
ప్రవృత్తిం సర్వం హేయం మత్వా;
సాధన చతుష్టయ సంపన్నో
యః సన్న్యస్యతి - స ఏవ <u>“జ్ఞాన సన్న్యాసీ”॥</u>

**(2) జ్ఞాన సన్న్యాసి :** పెద్దలు విజ్ఞులు వినిపిస్తున్న విశేషములచే శాస్త్రములను పరిశీలిస్తూ తద్వారా దేహానంతర పాప-పుణ్యలోకముల అనుభవము ఎటువంటిదో, కర్మ బంధముల పర్యవసానము ఏతీరైనదో గ్రహించిన వాడై,

- ప్రాపంచ విషయములన్నిటి నుండీ ఉపరతుడై (one who is with - drawing from all world related world - confined contextual Aspects), and (World related wishes and Fancies),

- తాను జన్మజన్మలుగా ప్రోగు చేసిపెట్టుకున్న దేహవాసనలు (Tendencis belonging to physical Bodies), శాస్త్రవాసనలు (Tendencies towards story, historical events, name and fame events of SASTRAS), లోకవాసనలు - ఇవన్నీ త్యజించినవాడై,

- మాన - అవమానములతో సహా సర్వ ప్రవృత్తులను ( Avocative

habits) - **"అవన్నీ నిరుపయోగమైనవి. వదలవలసినట్టివి"** అని భావించినవాడై-

{(1) ఇంద్రియ నిగ్రహరూప **శమము**, (2) శాస్త్రీయ - స్వకీయ విచారణ, (3) మహనీయులతో సంభాషణ రూప **సత్సంగము**, (4) అసంతృప్తులను జయించిన **సంతోషాభ్యాసము** - అనే} సాధన చతుష్టయ సంపత్తి సుసంపన్నుడై - **సన్న్యసించినవాడు జ్ఞానసన్న్యాసి.**

---

<u>జ్ఞాన వైరాగ్య సన్న్యాసి:</u>

**(3) క్రమేణ సర్వం అభ్యస్య సర్వం అనుభూయ జ్ఞాన వైరాగ్యభ్యాం స్వరూప అనుసంధానేవ దేహ మాత్రావశిష్టః సన్న్యస్య జాతరూపధరో భవతి, స "<u>జ్ఞాన వైరాగ్య సన్న్యాసీ</u>"॥**

**(3) జ్ఞానవైరాగ్య సన్న్యాసి** : పెద్దలు ప్రవచనములు వినుచూ, శాస్త్ర పరిశీలకుడై, ఉత్తరోత్తర గతులను - కర్మబంధములను స్వబుద్ధితో ఎరిగినవాడై, ప్రాపంచక విషయముల ఆకర్షణను జయించి, దేహ-శాస్త్ర - లోకవాసనలను విచారణ - ఉపాసనల ప్రభావంతో జయించి, సమస్త ద్వంద్వములను అధిగమించి, సాధన చతుష్టయమును ఆశ్రయించుచూ-క్రమేణా సర్వమును అధిగమించువాడు.

గురువులు - విజ్ఞులు - శాస్త్రములు చెప్పిన మార్గంలో ఆత్మానుభూతిని పొందుచూ జ్ఞానవైరాగ్యముల అభ్యాసముచే స్వస్వరూపానుసంధానముచే దేహమత్రావశిష్టము'' సిద్ధించుకొని, ఎప్పుడో సన్న్యాసము స్వీకరించి **'జాతరూపధరుడు'** అగువాడు - **జ్ఞాన వైరాగ్య సన్న్యాసి.**

---

<u>కర్మ సన్న్యాసి:</u>

**(4) బ్రహ్మచర్యం సమాప్య, గృహీ భూత్వా, వానప్రస్థాశ్రమమ్ ఏత్య, వైరాగ్య-అభావేపి ఆశ్రమ క్రమానుసారేణ యః సన్న్యస్యతి, స "<u>కర్మసన్న్యాసీ</u>" ఇతి॥**

**కర్మ సన్న్యాసి :** ఒకానొకడు **బ్రహ్మచర్యాశ్రమములో ప్రవేశించి,** ఆచార్యులను **సేవించి,** లోక- పార లౌకిక విద్యలను **అభ్యసించి, గుర్వాజ్ఞను అనుసరించి** - గృహస్థాశ్రమములో **ప్రవేశించి,** ఆయా సంతాన - వృత్తిధర్మ - లోకసేవ రూపములగు **గృహస్థాశ్రమ ధర్మములను ఒకప్పటికి ముగించుకొన్నవాడై, వాన ప్రస్థాశ్రమము** స్వీకరించినవాడై వైరాగ్య భావములు పొందకపోయినప్పటికీ - **ఆశ్రమ క్రమానుసారంగా** ఎవ్వరు సన్న్యసిస్తారో - అట్టివారు **"కర్మసన్న్యాసి".**

---

**స సన్న్యాసః షట్(6) విధో భవతి।**
**(1) కుటీచక (2) బహూదక (3) హంస**
**(4) పరమహంస (5) తురీయాతీత (6) అవధూతా-ఇతి॥**

అట్టి సన్న్యాసులు ఆరు (6) విధములైనవారుగా ఉండటము జరుగుతోంది.
(1) కుటీచక (2) బహూదక (3) హంస (4) పరమహంస
(5) తురీయాతీత (6) అవధూత.

---

<u>కుటీచక :</u>

**6. కుటీచకః శిఖా యజ్ఞోపవీతీ।**
**దణ్డ కమణ్డలు ధరః।**
**కౌపీన శాటీ కన్థాధరః।**
**పితృ మాతృ గురు ఆరాధన పరః।**
**పిఠర ఖని త్రశిక్య ఆది మాత్ర సాధనపర।**
**ఏకత్ర అన్నాదన పరః।**
**శ్వేత ఊర్ధ్వ పుణ్డ్రధారీ। త్రిదణ్డః।**

**(1) కుటీచక సన్న్యాసి :** - కుటీరమే (గృహమే) ఆశ్రమముగా భావించువాడై ఉంటారు. అనగా :-

- ❖ శిఖ - యజ్ఞోపవీతుడై (కలిగియే) ఉంటారు.
- ❖ దండ, కమండలు - కేన (గోచీ), శాటీ (దుప్పటి), కంధ (బొంత)లను ధరిస్తూ ఉంటారు.
- ❖ తల్లి-తండ్రి-గురువులను ఆరాధించువారై ఉంటారు. (గృహములోనో, ఆశ్రమములోనో ఉండి ఉంటారు)
- ❖ పీఠరము (కవ్వపుకోల, వంటి కుండ), ఖనిత్రము (త్రవ్వేడు సాధనము-గడ్డపార వంటిది), శిక్యము (ఉట్టి) - ఇవి మాత్రమే సాధన వస్తువులుగా కలిగి ఉంటారు.
- ❖ ఒక్క ప్రదేశములోనే భోజనము భుజించు నియము కలిగి ఉంటారు.
- ❖ తెల్లటి ఊర్ధ్వపుండ్రము (నిలువు బొట్టు) ధరించి ఉంటారు.
- ❖ త్రిదండధారి అయి ఉంటారు. **వీరు అందరిమధ్యగా ఉంటూనే, తనను తాను 'సన్న్యాసి'గా నిర్వచనం కలిగి ఉంటారు. వారికి ఈ జగత్తంతా ఆశ్రమమే. సేవా ధర్మములే - ఆశ్రమ ధర్మములు.**

<u>బహూదకః :</u>

**శిఖాది కన్థాధరః। త్రిపుణ్డ్రధారీ।**
**కుటీచకవత్ సర్వసమో,**
**మధుకర వృత్తీ। అష్టకబళాశీ॥**

**(2) బహూదక సన్న్యాసి** : శిఖ (పిలక) ధారుడు. బొంతను (కంథమును) ధరిస్తూ ఉంటారు. త్రిపుండ్రములను (నొసలు/నుదురు/ఫాల భాగముపై మూడు విభూతిరేఖలు) ధరించినవాడై ఉంటారు. లోకసంచారి అయి ఉంటారు. కుటీచక సన్న్యాసివలెనే సర్వత్రా సమభావము కలిగి ఉంటారు. - మధూకరము (భిక్షాటనము) చేస్తూ 8 ముద్దల ఆహారము మాత్రమే తీసుకుంటూ వుంటారు. **ఒక గృహమునకో, ఆశ్రమమునకో పరిమితులై ఉండరు.**

---

<u>హంసో:</u>

**జటాధారీ। త్రిపుణ్డ్రః, ఊర్ధ్వ పుణ్డ్రధారీ।**
**అసంక్లప్త మాధుకర అన్నాశీ కౌపీన ఖణ్డధారీ।**

**(3) హంస** : జటాజూటమును (పొడవైన జుట్టును) ధరించి ఉంటారు. త్రిపుండ్ర- ఊర్ధ్వ పుండ్రములను (త్రి ఊర్ధ్వ విభూతి రేఖలను) ధరించుచూ ఉంటారు. అసంక్లప్త (విశాలమైన) వీధులలో మధూకరము (భిక్షాటనము) చేస్తూ ఉంటారు. కౌపీన (గోచీ) ఖండమును ధరించువాడై ఉంటారు. ఈ **జగత్తును క్రీడవలె దర్శిస్తూ లోక సంచారులై ఉంటారు.**

---

<u>పరమహంసః</u>

**శిఖా యజ్ఞోపవీత రహితః।**
**పంచగృహేషు కరపాత్ర। ఏక కౌపీన ధారీ।**
**శాటీం ఏకాం ఏకం వైణవం దణ్డం।**
**ఏకశాటీధరో వా, భస్మోద్ధూళన-పరః। సర్వత్యాగీ।**

**(4) పరమహంస** : శిఖ (పిలక) - యజ్ఞోపవీతములు లేనివారై ఉంటారు. చేతులను భిక్షక పాత్రగా ధరించి ఐదు ఇళ్ళలో మాత్రమే భిక్షాటణము చేస్తూ ఉంటారు. ఏక కౌపీన ధారి (ఒక్క గోచీ), ఒక్క శాటీ (దుప్పటి) ధారి అయి ఉంటాడు. ఒక వెదురు దండము ధరించుచూ ఉంటాడు. ఒక్క శాటీ (దుప్పటి)ని ధరిస్తూనే, దేహమంతా భస్మము ధరించి ఉంటారు **మానసికంగా సర్వత్యాగి అయి ఉంటారు.**

---

<u>తురీయాతీతో :</u>

**గోముఖ వృత్త్యా ఫలాహారీ।**
**అన్నాహారీ చేత్ గృహత్రయే దేహమాత్ర అవశిష్టో।**
**దిగంబరః। కుణపవత్ శరీర వృత్తికః॥**

**(5) తురీయాతీతుడు** : గోముఖ వృత్తిచే ఫలాహారి. ఆకలి వేసినప్పుడు 3 ఇళ్ళలో మాత్రమే గోముఖముచే (డప్పు వాయిస్తూ) మధూకరం (భిక్షాటన) చే భిక్ష చేసి భుజిస్తూ, **ఈ భౌతిక దేహమును తనకు సంబంధించని వస్తువుగా కలవాడై** (దేహమాత్రాన శిష్టుడై) ఉంటాడు. దిగంబరుడై ఉంటాడు. కుణపము (మరణించినదానితో సమానము)గా ఈ స్వశరీరమును దర్శిస్తూ ఉంటాడు. **జగత్తంతా ఆతనికి స్వశరీరమై భాసిస్తూ ఉంటుంది.**

---

<u>అవధూత:</u>

7 **అవధూతస్తు అనియమః,**
**పతిత అభిశస్త విసర్జన పూర్వకం,**
**సర్వవర్ణేషు అజగర వృత్త్యా ఆహారపరః ।**
**స్వరూప అనుసన్ధాన పరః ॥**

**అవధూత** : ఒక కొండచిలువ (అజగరము) తాను ఆహారంకోసం ఎటూ సంచారం చేయకుండా, తాపత్రయపడకుండా అప్రయత్నంగా తన నోటి వద్దకు వచ్చిన దానిని తింటుంది కదా! అట్లాగే అవధూత కూడా పతితలను, అభిశస్తలను (ఇతరులపై నిందలు మోపు, హింసించు స్వభావులను) వదలి ఇక సర్వవర్ణముల వారు సమర్పించు ఆహారము తీసుకుంటూ ఉంటారు. సర్వదా ఆత్మస్వరూప అనుసంధానపరుడై ఉంటాడు. ఆతనికి అన్యమనునదే ఏదీ ఉండదు.

---

<u>సన్న్యాసుల స్వానుభవం</u>

**జగత్ తావత్ ఇదం నాహమ్ (న అహం) స వృక్ష**
**తృణ పర్వతమ్, యత్ బాహ్యం జడం -**
**అత్యన్తం, తత్స్యాం కథం అహం విభుః?**

**సన్న్యాసి - శబ్దార్థభావము : కోఽహమ్?**

"నేను బాహ్యమున జగత్తులో కళ్లకు కనిపించే చెట్టు, గడ్డి, పర్వతము వంటివాడినా? కానేకాదు. అవన్నీ జడము. నేనో? సర్వమును నియమించు విభుడను. చేతన స్వరూపుడను. సమస్తమును సచేతనముగా చేయుచున్న నేను - తమకు తాముగా ప్రవర్తించలేని చెట్టు, గడ్డి, రాయి, పర్వతము వంటి ఈ జడ జగత్తు ఎట్లా అవుతాను?" **నేను దృశ్య స్వరూపుడను కాను।**

---

**కాలేన అల్పేన విలయీ దేహో, <u>న-అహమ్</u>**
**<u>(నాహమ్) అచేతనః।</u> జడయా కర్ణ శష్కుల్యా**
**కల్పమానక్షణస్థయా,**
**శూన్యఆకృతిః, శూన్య భవః, <u>శబ్దో నాఽహం అచేతనః।</u>**

అచేతనమై (తనకు తానుగా ప్రవర్తించజాలనిదై), స్వల్పకాలములో నశించబోతూ, కొద్దిక్షణములు మాత్రమే నిలచిఉండే, కర్ణశష్కులితో (చెవిరంధ్రములలో) కల్పించబడిన **ఈ భౌతికంగా కనిపిస్తున్న చర్మపు చెవులు నేను కాదు.**

శూన్యమైన ఆకృతి కలిగియుండి, శూన్యము నుండి పుట్టుచూ అచేతనమైనట్టి 'శబ్దము' కూడా - **'నాహమ్'**। నేను కాదు.

---

**త్వచా క్షణ వినాశిన్యా ప్రాప్యో అప్రాప్యో అయం అన్యథా।**

క్షణములో జనించి - నశించే ధర్మము గల చర్మము ఉన్నప్పుడు, లేనప్పుడు కూడా-దీనికి నేను సర్వదా వేరై ఉన్నాను. చర్మము వలె నేను నశించిపోయేవాడినా? కానే కాదు. జడ పదార్థమును కాను. స్పర్శ నా స్వరూపము కాదు.

| | |
|---|---|
| చిత్ ప్రసాద ఉపలబ్ధ ఆత్మా – స్పర్శో.<br>నాహం (నాహమ్) అచేతనః।<br>లబ్ధ ఆత్మా జిహ్వయా మందో<br>లోలయా లోల సత్తయా।<br>స్వల్ప స్పన్దో, ద్రవ్య నిష్ఠో<br>రసో–న అహమ్ (నాహమ్) అచేతనః। | 'చిత్' నుండి (కేవలమగు ఎరుక రూపమునుండి) ఉపలబ్దము అగుచున్న (రూపము దిద్దుకొనుచున్న) స్పర్శ నేను కాను. జడమగు స్పర్శవలె అచేతనుడనా? కాను. స్వయం చిత్-చైతన్యమును.<br>మరి నేను రసము (లేక) రుచినా? నాలుకచే మందముగా పొందబడునది, నాలుకపై స్రవించు ద్రవముచే ఏర్పడునది, స్రవించు - స్రవించని స్వల్ప స్పందనచే-పాదార్థ స్పర్శ తోడవుచూ అనుభవముగా అగుచున్నది- అగు **'రసము'** (రుచి) నేను కాను. అది అచేతనము. నేను సచేతన స్వరూపుడను. **రసానుభవి**యే లేకపోతే రసానుభవమునకు ఉనికి ఎక్కడిది? |
| దృశ్య దర్శనయోః లీనం క్షయి, క్షణ వినాశినోః,<br>కేవలే – ద్రష్టరి క్షీణం<br>రూపం, న అహ(నాహమ్) అచేతనమ్। | ఇక నేను "ఈ రూపము" నా? కానే కాను. ఎందుకంటే ఈ రూపము' అనేది "దృశ్యము- దర్శించటము" అనే రెండు కలియు క్షణంలో ఒక మెరుపు వలె మెరిసి మరుక్షణం (ఆ రెండు విడిపోగానే)ఎటో మటుమాయ మగుచూ ఉంటోంది. పైగా 'రూపము' అనునది ద్రష్ట యొక్క 'వీక్షణము'పై ఆధారపడి అనభవమయ్యేది. ద్రష్ట ఒక స్త్రీని - శృంగార రూపము గానో, సోదరీ భావంగానో, మాతృభావంగానో, జగన్మాత భావంగానో భావిస్తూ ఉంటే - అట్లే ఆ రూపము అనుభవమయ్యేది. అనగా రూపము స్వతఃగా జడము. అచేతనమగు రూపము నేనెట్లా అవుతాను? అవను. |
| 8 నాసయా గన్ధ జడయా క్షయిణ్యా<br>పరికల్పితః, పేలవో నియత – ఆకారో,<br>గంధో, నాహమ్ అచేతనః। | ఈ ముక్కు యందు గంధము అనునది వాసన చూడబడు వస్తువుతో క్షణకాలం కలియుటచే ఏర్పడే పరికల్పితమైన అనుభవము. స్వీయ పరికల్పనచే మాత్రమే ఏర్పడునది.<br>నేను ఎప్పుడైనా పరధ్యానంగా ఉంటే ఒకపుష్పమునుండో, మరొక వస్తువునుండో వచ్చి ముక్కుకు చేరిన వాసన-నాకు గంధముగా అనుభవమే కాదు.<br>అనగా 'గంధము' అనేది పేలవమైన నియతాకారము కలిగినది. స్వతఃగా నాకు ఏర్పడగలిగేది కాదు. అట్టి అచేతనమగు గంధము 'నేను' కాదు. |
| **మరి నేను ఎవ్వరు?**<br>నిర్మమో। అమనస్కః। శాన్తో।<br>గత పంచ ఇంద్రియ భ్రమః।<br>"శుద్ధ చేతన ఏవ" అహం,<br>కల–అకలన వర్జితః।<br>చైత్య వర్జిత చిత్ మాత్రమ్<br>అహం ఏషో అవభాసకః॥ | **ఇక నేను ఎవరు? ఎట్టివాడను?**<br>"నాది" అనుకొనుటకు మునుముందే ఉన్నవాడమ కాబట్టి **నిర్మమోఽహమ్** (మమకార రహితుడను). ఆలోచనలు జడమైయుండగా, ఆలోచన చేయువాడుగా ముందుగానే ఉన్నాను కాబట్టి అమనస్కుడను. ఇంద్రియములను ఉపయోగించువాడను. అంతేగాని ఇంద్రియములకు విషయమైనవాడను కాను. ఇంద్రియ భ్రమలకు అతీతుడను. కల్పన - అకల్పనా రహితుడను. సర్వ చేతనములకు (ఆలోచనల - భౌతికమైన కదలికలకు) మునుముందు వాడను. శుద్ధ చేతన-చిత్ ఆనంద స్వరూపుడను. ఆలోచనలకు అవభాసకుడను. (వెలిగించువాడను). |
| స–బాహ్య అభ్యన్తర వ్యాపీ।<br>నిష్కళోఽహం నిరంజనః<br>నిర్వికల్ప చిత్ఆభాస<br>'ఏక ఆత్మ' అస్మి సర్వగః॥ (ఏకాత్మాస్మి సర్వగః)। | ఇక్కడి **దేహ-మనో-బుద్ధి-చిత్త అహంకార -దృశ్య** - మొదలైన సమస్తమునకు బాహ్య అభ్యంతరములలో వ్యాపించి ఉన్నట్టి చైత్యవర్జిత శుద్ధ 'చిత్' స్వరూపుడను. కళంక రహితుడను. నిర్మలుడను. నిరంజనుడను. 'అనేకత్వము' అనునదే లేనివాడను. **ఏకాత్మగా నిర్వికల్పచిత్ స్వరూపుడనై, అంతటా ఈ సమస్తముగా- ప్రతిబింబించుచున్నట్టివాడను.** |
| మయా ఏవ (మయైవ) చేతనేన ఇమే సర్వే<br>ఘట–పట ఆదయః, సూర్యాన్తా<br>అవభాస్యన్తే దీపేన ఏవ ఆత్మ తేజసా॥ | ఒక దీపము వెలుగుతూ ఉంటే ఆ వెలుగులో వస్తువులు వాటివాటి ఆకారాలతో సహా కనిపిస్తూ ఉంటాయికదా! అట్లాగే, నా యొక్క చైతన్య ఆత్మతేజస్సు యొక్క ప్రసరణ చేతనే కుండ, వస్త్రము దగ్గిరనుండి సూర్యగోళము వరకు సర్వజగత్ వస్తు సముదాయము వెలుగును పొందినవై, ప్రకాశమానమగుచున్నాయి. (Being enlightened) |

మయైవ (మయా ఏవ) ఏతాః స్ఫురన్తి ఇహ
విచిత్ర ఇంద్రియ వృత్తయః।
తేజసాన్తః ప్రకాశేన యథా, అగ్ని కణ పంఙ్క్తయః
అనన్త ఆనందసంభోగా పర ఉపశమశాలినీ,
శుద్ధేయం చిన్మయీ దృష్టిః జయతి అఖిల దృష్టిషు।

అగ్నిలోంచి అగ్నికణములు (విస్ఫులింగములు) బయల్వెడలుచూ ఉంటాయి కదా! అదేవిధంగా మమాత్మయొక్క అంతః ప్రకాశము నుండి ఈ చిత్ర-విచిత్ర శబ్ద స్పర్శ రూప రస గంధ ఇంద్రియ వృత్తులన్నీ (All Kinds of Avocations) బయల్వెడలుచున్నాయి.

అనంత- ఆనంద - సంభోగ స్వభావి అగు నా యొక్క ఈ చిన్మయీ దృష్టి సర్వ భోగములను తనయందు ఉపశమింపజేయగలుగునట్టిది. సమస్తమైన తదితర దృష్టులను కూడా నా యొక్క ఈ ఆత్మసందర్శన దృష్టి ఆక్రమించి, తనయందు లీనము చేసుకొనుచున్నది.

---

సర్వభావ-అన్తరస్థాయ చైత్యముక్త చిత్ ఆత్మనే,
ప్రత్యక్ చైతన్య రూపాయ, మహ్యం ఏవ నమోనమః॥

నా స్వరూపము సమస్త భావములకు అంతరమున తేజో విభవమై ఏర్పడి ఉన్నట్టిది. సర్వ కదలికలకు (చేతనములకు) ఆవల ముక్తాత్మగా ఉన్నట్టిది. సర్వము తానే అయి, సర్వమునకు వేరై ఉన్నట్టిది. కేవలాత్మ స్వరూపము అయినట్టి నాకు నేనే నమస్కరిస్తున్నాను. **మహ్యం ఏవ నమో నమః॥**

---

**9.** విచిత్రాః శక్తయః స్వచ్ఛాః
సమా యా నిర్వికారయా,
చితా క్రియన్తే సమయా
కల-అకలన ముక్తయా,
కాలత్రయమ్ ఉపేక్షిత్ర్యా
హీనాయాః చైత్య బంధనైః॥

నాయొక్క చిదాత్మ విచిత్రమైన శక్తితో కూడుకొని, స్వచ్ఛమై, నిర్వికారమై యుండియే, తన యొక్క మాయాశక్తిచే సారూప్యముతో కూడిన సందర్భములను కల్పించుకొని ఆస్వాదించుచున్నది. అట్టి చిత్తు కలన-అకలనములకు (మాయాకల్పన- అకల్పనములకు) అతీతమై, త్రికాలములను ఉపేక్షించినదై ఉంటోంది. చైత్య బంధము (తెలియబడుచున్నదానిచే తెచ్చిపెట్టుకొంటున్నబంధము)నకు వేరై, **అతీతమైయ్యే ఉంటోంది. నేను అపేక్షకు ఆవలగల ఉపేక్ష స్వరూపుడను.**

---

చితః చైత్యం ఉపేక్షిత్ర్యాః సమతైవ
అవశిష్యతే। సా హి వాచామ్
అగమ్యత్వాత్ అసత్తామ్ ఇవ శాశ్వతీమ్।

తెలియబడుచున్నదంతా ఉపేక్షిస్తూ ఉన్నదై చిత్తు సర్వదా సమ స్వరూపముగా శేషించియే ఉన్నది. అయితే అట్టి నిర్వికారము, స్వచ్ఛము అగు ఆత్మ-వాక్కుతో చెప్పజాలనిది. ఊహించుటకు అలవికాని విధంగా - తన వెంట 'అసత్తు'ను అనాదిగా కలిగియున్నది. శాశ్వతమగు ఆత్మ అశాశ్వతమగు అసత్తును సర్వదా వెంటనిడుకొనియే, (1) కేవలము (2) కల్పనలు' - అను విడరాని జంటగా ఏర్పడి ఉంటోంది.

---

నైరాత్మ్య సిద్ధాన్త దశాం ఉపయాత ఏవ శిష్యతే।
ఈహా-అనీహా మయైః,
అన్తః యాచితా వలితా మలైః।
సాచిత్ న ఉత్పాదితుం శక్తా,
పాశ బద్ధేన పక్షిణీ।
ఇచ్ఛా ద్వేష సముత్థేన
ద్వంద్వ మోహేన జన్తవః।

కేవలమగు ఆత్మ తనకు తానే విచిత్రంగా **"ఆత్మఎక్కడున్నది? లేదు. ఈ దృశ్య జగత్తే ఉన్నది" - అను రూపముగా నైరాత్మ సిద్ధాంతదశ ను తెచ్చిపెట్టుకొంటోంది.**

క్రమంగా "ఇవికావాలి - అవివద్దు" అనురూపములతో కూడిన 'ఈహా-అనీహ - మయములైన అన్తఃమలినములను పొందుచున్నది. వాటిచే కప్పబడు చున్నది. మహత్తరమగు చిత్తు - త్రాడుచే బంధింపబడి, ఆకాశములో ఎగరలేని పక్షివలె, ఇచ్ఛాద్వేష ద్వంద్వ మోహములను కల్పించుకొని అనేక జన్మ-జీవన్ - మరణ దశలను పొందుచూ అనేక జీవుల రూపమును పొందుచున్నది.

---

ధరా వివర మగ్నానాం కీటానాం సమతాం గతాః
**ఆత్మనే అస్తు నమో మహ్యం
అవిచ్ఛిన్న చిదాత్మనే॥**

భూమిపై ఆహారము కోసము పరుగులిడే కీటకముతో సమానము అగుచున్నది.

అయితే ఆత్మ సర్వదా యథాతథము. **సోఽహమ్ నమః। ఏ అవిచ్ఛిన్న చిదాత్మ అయితే సర్వదా "నేను" - అయి ఉన్నానో అట్టినాయొక్క కేవలాత్మ స్వరూపమునకు నమో నమః। నా సర్వాతీతాత్మకు నా నమస్కారములు।**

**పరామృష్టో౽స్మి। లబ్ధో౽స్మి।**
**ప్రోదితో౽స్మి అచిరాత్ అహమ్।**
**'ఉద్ధృతో౽స్మి'। వికల్పేభ్యో**
**యో౽స్మి సో౽స్మి నమోస్తుతే।**

**తుభ్యం మహ్యం అనన్తాయ।**
**మహ్యం తుభ్యం చిదాత్మనే (చిత్ ఆత్మనే)॥**

**సో౽హమ్ తత్త్వమ్ నమః।** విచారణ - వివేచన చేయువారికి నేను **పరస్వరూపుడనై** తెలియవచ్చువాడను. ఈ సమస్తము నాకు ఉపలబ్ధమైయే ఉండటం చేత **పూర్ణ-లబ్ధుడను.** (సమస్త దృశ్యము నాకు లాభించినదై యున్నది). అచిరకాలంలో ప్రయత్నశీలత్వముచే పూర్ణుడగు నేను పూర్ణత్వానుభవుడనై గమనిస్తున్నాను. సర్వత్రా ఉద్ధృతడను నేనే।

నాచేతనే ఉధృతంగా (like a speedy flow) సర్వే సర్వత్రా ఇదంతా 'పొందబడుచున్నది-నేను పొందుచూ ఉన్నది కూడా నన్నే'। సంకల్ప వికల్పములన్నీ నానుండే ఉద్ధృతమై వ్యక్తీకరణమగు చున్నాయి. నేను **మొట్టమొదట ఎవ్వడను (కేవలాత్ముడను) అయి ఉన్నానో, ఇప్పటికీ, ఎప్పటికీ అదియే అయిఉన్నాను.** సర్వదా ఏకము-అనంతము అగు ఆత్మపురుషుడను.

ఈ సమస్తముగా **ఉన్నది నేనే.** ఇది ఈవిధంగా దర్శిస్తూ ఉన్నది నేనే। దర్శించబడుచున్నది నేనే. దర్శనము నా విన్యాసమే.

**తత్ త్వమ్! అదియే నీవు। సో౽హమ్। నేనూ అదియే!**

నీవు నేను కూడా అనన్తస్వరూపులము.

నేను నీవు కూడా చిదాత్మ స్వరూపులము. అట్టి నేనైన నీకు, నీవైన నాకు నమస్కారము. నీవైన - నేనైన 'ఆత్మ'కు నమో నమః।

---

నమస్తుభ్యం పర ఈశాయ।
నమో మహ్యం శివాయ చ।
తిష్ఠన్ అపి హి న ఆసీనో।
గచ్ఛన్ అపి న గచ్ఛతి॥

ఏ పరము ఈ సమస్తముగా విస్తరించినదై ఉన్నదో - అట్టి పరేశ్వరుడవగు **సర్వదా-అయి ఉన్న నీకు నా నమస్కారము।**

ఈ సమస్త **"జీవుల సహజానంద స్వరూప శివుడను"** అగు **నాకు నా నమస్కారము.**

అంతటా ఏర్పడి ఉండికూడా ఎక్కడా కూర్చుని ఉండని, సర్వత్రా సంచారములు చేస్తూ కూడా ఎక్కడికీ వెళ్ళుచుండని నీ-నా ఏకాత్మకు నమస్కారము. **నీవు-నేను అఖండాత్మ స్వరూపులమే।**

---

**10.** "శాన్తో౽పి" వ్యవహారస్థః।
"కుర్వన్" అపి న లిప్యతే।
సులభశ్చ అయం అత్యన్తం,
సుజ్ఞేయశ్చ ఆప్తబంధువత్।
శరీర పద్మకుహరే సర్వేషాం ఏవ షట్పదః॥

**ఆత్మ** = పరమశాంతమైనప్పటికీ సమస్త వ్యవహారములందు వ్యవహరించునది. సమస్త కర్మలు నిర్వర్తిస్తూ కూడా, వాటి యొక్క శుభాశుభ ఫలములు అంటజాలనిది.

అట్టి, ఆత్మపురుష భగవానుడనగు నేను అన్యమైన విషయాల కంటే అత్యంత సులభ సాధ్యుడను. ఆత్మబంధువువలె తేలికగా తెలియబడువాడను. సమస్త జీవుల హృదయపద్మకుహరములో తుమ్మెద వలె సదా సంచరించువాడు. **అట్టి నేను 'ఆత్మ'నే గాని, 'దేహము'ను కాను.**

---

న మే భోగ స్థితౌ వాంఛా।
న మే భోగ విసర్జనే।
యదా యాతి, తదా యాతు।
యత్ ప్రయాతి, ప్రయాతు తత్।

అట్టి కేవలాత్మ స్వరూపుడనగు నాకు

- ఎటువంటి భోగస్థితులపై కూడా **"కావాలి। లేకుంటే ఎట్లా?"** అనే వాంఛ లేదు.
- అట్లాగే **"భోగములు విసర్జించాలి. అప్పటికి కానీ మోక్షములేదు"-** అనబడు విసర్జించాలనే అగత్యము కూడా లేదు. నాయొక్క మోక్షానుభవము కొరకై నేను ఏదీ వదలఖర్లేదు. పట్టుకోవలసిన పని లేదు.

ఈ (దేహ దృశ్య ఇత్యాదులతో సహా) ఏది వస్తే అట్లాగే రానీ! ఏది పోతే అది అట్లే పోనీ! నా యొక్క ఆత్మత్వమునకు లోటు ఏమున్నది?

---

మనసా మనసిః ఛిన్నే, నిరహంకారతాం గతే।
భావేన గళితే భావే, స్వస్థః తిష్ఠామి కేవలః।
నిర్భావం నిరహంకార నిర్మనస్కం అనీహితమ్
కేవల ఆనన్ద శుద్ధాత్మన్యేవ తిష్ఠతి మే రిపుః॥

మనస్సు చేత మనస్సు ఛిన్నమగుచుండగా, **అది నాపట్ల నిరహంకారత్వము స్వాభావికంగానే సంతరించుకుంటోంది.**

**భావముచే భావము భావరాహిత్యము పొందుచున్నది.** నేను సర్వదా సుస్వస్థత యందు తిష్ఠితుడను, కేవలుడను అయి ఉంటున్నాను.

నన్ను శత్రుభావముతో చూచువాడు ఎవరైనా ఉంటే,.. ఆతడు కూడా **"నిర్భావ-నిరహంకార - నిర్మనస్క- (కోరికలకు ఆవల) అనీహిత - కేవల**

| | |
|---|---|
| | **అనన్త శుద్ధాత్మత్వము"** నందే సు-తిష్ఠితుడు అయి ఉన్నాడు. ఆత్మగానే ఆతనిని సందర్శించుచున్నాను. **ఆతనితో సహా నాకు కనబడుచున్న సమస్త జీవులుకూడా "నాయందు నేనే" అయి ఉన్న నా రూపములే.** |
| **తృష్ణా రజ్జు గణం ఛిత్వా,<br>మత్ శరీరక పంజరాత్,<br>న జానే క్వ గత ఉడ్డీయ<br>నిరహంకార పక్షిణీ।** | పంజరము తెరువగానే అందులో బంధించబడిన పక్షి ఆ పంజరము నుండి బయల్వెడలి ఎటో ఎగిరిపోతుంది కదా! అట్లాగే నా-ఈ శరీరము నుండి 'అహంకారము' అనే పక్షి - 'తృష్ణ' అనే త్రాళ్ళను త్రెంచివేసుకొని, ఇక ఆపై నిరహంకారము సంతరించుకొని ఎటు ఎగిరిపోతోందో నాకే తెలియదు. నేను చెప్పలేకపోతున్నాను. |
| **"<u>జీవితం తస్య శోభతే</u>"<br>యస్య నాహంకృతో భావో,<br>బుద్ధిః యస్య న లిప్యతే,<br>యః సమః సర్వభూతేషు,<br><u>జీవితం తస్య శోభతే।</u>** | **"జీవితం తస్య శోభతే"**<br>**"నేను దేనికీ కర్తను కాదు"** అనునదే "నిరహం"భావన. ఎవ్వని యొక్క భావన **నిరహంకారమై** ఉంటుందో, ఎవ్వని బుద్ధి తన దోషములతో కూడిన **సమన్వయములను త్యజించి నిర్మలత్వము** సంతరించుకుంటుందో, ఎవ్వరి అనుభూతి సర్వజీవులందు **సమదృష్టిని** సముపార్జించుకుంటుందో- ఆతని జీవితమే శోభాయమానమై ఉంటుంది. |
| **11. యో అన్తః శీతలయా బుద్ధ్యా<br>రాగ ద్వేష విముక్తయా,<br>సాక్షివత్ పశ్యతి ఇదం హి,<br>జీవితం తస్య శోభతే।** | ఎవరి బుద్ధి అంతర్గతంగా **పరమశీతలత్వము** (peace and cool at its core) సంతరించుకొని, **రాగ-ద్వేష భావములను త్యజించినదై,** ఈ సమస్తమును **సాక్షిగా** చూడగలుగుచూ ఉంటుందో, ఆతని జీవితమే శోభించుచున్నదై ఉంటోంది. |
| **యేన సమ్యక్ పరిజ్ఞాయ<br>హేయ - ఉపాదేయమ్ ఉజ్ఝతా,<br>చిత్తస్య అన్తే అర్పితం చిత్తం జీవితం తస్య శోభతే।** | ఎవ్వని చిత్తమైతే హేయ-ఉపాదేయములను (వదలవలసినవి-పట్టుకోవలసినవి) వదలినదై సమ్యక్ పరిజ్ఞానముతో (Looking at Equality every where) - చిత్తమునకు **ఆవల ప్రకాశమగుచున్న చిత్‌కు సమర్పితమై** ఉంటోందో, అట్టివాని జీవితమే శోభాయమానము. |
| **గ్రాహ్య గ్రాహక సంబంధే క్షీణే, శాన్తిః ఉదేతి అలమ్,<br>స్థితిం అభ్యాగతా శాన్తిః, 'మోక్ష'- నామ్న అభిధీయతే।<br>భ్రష్ట బీజ ఉపమా భూయో జన్మ అంకుర వివర్జితా।<br>హృది జీవత్ విముక్తానాం శుద్ధా భవతి వాసనా।<br>పావనీ పరమోదారా శుద్ధ సత్త్వానుపాతినీ।<br>("శుద్ధ సత్త్వ" అనుపాతినీ।)** | "గ్రహించువాడు - గ్రహించబడునది" ఈ రెండింటి పరస్పర సంబంధము ఎవని పట్ల క్షీణించుచూ ఉంటుందో, అట్టివానికి స్వాభావికంగానే శాన్తి లభిస్తూ ఉంటుంది. అట్టి శాంతి సిద్ధించిన స్థితియే 'మోక్షము'- అను పేరుతో చెప్పబడుతోంది.<br>**"ఈ సమస్తము మమాత్మయే"** అను ధ్యాసచే - ఇదంతా ఆత్మగా అనన్య ధ్యానము చేయు యోగి యొక్క హృదయములో - వేయించబడిన బీజములలోని అంకురము వలె - పునః జన్మ బీజములు ఉండవు. పునర్జన్మ వాసనా రహిత హృదయము శుద్ధము, పావనము, పరమ ఉదారము, శుద్ధసత్త్వముగా రూపుదిద్దుకొంటోంది. |
| **ఆత్మధ్యానమయీ నిత్యా సుషుప్తిస్థ ఏవ తిష్ఠతి।<br>చేతనం చిత్తరిక్తం హి "<u>ప్రత్యక్ చేతనమ్</u>" ఉచ్యతే।** | **ఆత్మధ్యానమయి** - అయినట్టి **ఆత్మయోగి యొక్క చిత్తము**-సమస్త ప్రాపంచక విషయముల పట్ల నిత్యము సుషుప్తి (గాఢనిద్ర) కలిగిన వాని వలె ఉంటుంది.<br>**సమస్త ప్రాపంచక విషయములపట్ల 'మౌనము', ఆత్మ స్వరూపము పట్ల మాత్రమే 'ధ్యానము' కలిగి ఉంటుంది.** చిత్తరహితమైన (అతిరిక్తమైన) చేతనము (Funetioning) ను **"ప్రత్యక్ చేతనము"** - అని అంటారు. |
| **నిర్మనస్క స్వభావత్వాత్, న తత్ర కలన - అమలమ్,<br>సా సత్యతా, సా శివతా, సావస్థా పారమార్థికీ,<br>సర్వజ్ఞతా సా సంతృప్తిః నను యత్ర మనః క్షతమ్।** | అట్టి ప్రత్యేక చేతనము - స్వభావతః ఎట్టి కలనము (దోషము) లేకుండుటచే **'నిర్మనస్కము'** అగుచున్నది.<br>ఎక్కడైతే ఆత్మకు అన్యమైన మననము క్షయిస్తుందో,<br>→ అదియే సత్యత్వము. **సత్యము.**<br>→ అదియే శివత్వము. అదియే పరమార్థ సంబంధమైన అవస్థ.<br>→ అదియే స్వాభావికమగు సంతృప్తి రూపము. |

ప్రలపన్, విసృజన్ గృహ్ణన్,
ఉన్మిషన్ నిమిషన్ అపి,
నిరస్త మనన - ఆనన్దః
సంవిత్-మాత్ర పరో౽స్మి అహమ్॥

ప్రలాపములు ఆడుచున్నప్పుడు, (మాట్లాడుచున్నప్పుడు), దేనినైనా విసర్జించు చున్నప్పుడు, ఏదైనా గ్రహించుచున్నప్పుడు, కనులు మూయునపుడు, తెరచునప్పుడు కూడా - తరంగరహిత జలమువలె (అన్యత్వ మననము లయించినప్పుడు శేషించు) - సర్వదా నేను సంవిత్ (సత్-విత్) మాత్ర కేవలీ స్వరూపుడను.

---

12 మలం సంవేద్యం ఉత్సృజ్య,
మనో నిర్మూలయన్ పరమ్,
ఆశా పాశ మలం, ఛిత్త్వా
“సంవిత్ మాత్ర పరో౽స్మి అహమ్।”

**సత్-విత్‌మాత్ర నిరామయుడను**

మనస్సు యొక్క - (**“తెలియబడుచున్న అనేక భేదములతో కూడిన”** దృశ్య జగత్తు అనబడే) **“సంవేద్య మలము”**ను పూర్తిగా వదలి, ‘మనస్సు’ అనబడుదానినే నిర్మూలించుకొని, ఆశాపాశ దోషములను ఖండించి వేసుకొని-సంవిత్ మాత్రపరుడనై ఉంటున్నాను. నా సహజరూపమైన “కేవలమైన నేను”ను తిరిగి యథాతథంగా ధారణ చేయుచున్నాను.

---

అశుభాశుభ (శుభాశుభ) సంకల్పః
సంశాన్తో౽స్మి నిరామయః

శుభాశుభ సంకల్పములన్నీ తొలగగా, నా యొక్క **‘నిరామయత్వము’** యొక్క స్వానుభవము నందు **సశాంతించినవాడనై** ఉంటున్నాను.

---

నష్ట ఇష్ట-అనిష్ట కలనః సంవిత్ మాత్రపరో౽స్మి అహమ్।
ఆత్మతా పరతే త్యక్త్వా నిర్విభాగో జగత్ స్థితౌ,
వజ్ర స్తంభవత్ ఆత్మానం అవలంబ్య స్థిరోస్మి అహమ్।
నిర్మలాయాం నిరాశాయాం
స్వ సంవిత్తౌ స్థితో౽స్మ్యహమ్॥

“దీనివలన నష్టము. దానివలన లాభము”, “ఇది ఇష్టము-అది కాదు” - అను మురికిని శుభ్రము చేసుకొని సంవిత్ మాత్రపరుడనై ప్రకాశిస్తున్నాను.

“ఆత్మత్వము - ఆత్మకు వేరైనది” అనే భేదమంతా వదలి, జగత్ యొక్క ప్రదర్శనము నందు విభాగరహితుడనై, జగత్ ఆత్మనై ఉన్నాను. నిర్మలుడనై, ఆశలన్నీ జయించి ఉన్నవాడనై - ‘ఆత్మ’ను అవలంబించి వజ్రము స్తంభము వలె స్థిరుడనై ఉంటున్నాను.

---

ఈహితాని - అనీహితైః ముక్తో,
హేయ-ఉపాదేయ వర్జితః,
కదా అన్తస్తోషమ్ ఈష్యామి-
స్వ-ప్రకాశపదే స్థితః?

పైవిధంగా నేను ఎల్లప్పుడు అభ్యాసము చేస్తున్నాను. ఈ విధంగా అభ్యాసము చేయుచుండగా ఎప్పుడు నిశ్చల-నిశ్చయ పూర్ణానందు డనగుదునో కదా?

కోరుకునే-కోరుకోని వాటి నుండి విముక్తుడనై, - హేయ (విడవ వలసినవి) - ఉపాదేయములు (స్వీకరించవలసినవి) - అనే, వ్యవహారమంతా వర్జించిన వాడనై, స్వయంప్రకాశమునందు సంస్థితుడనై, **ఎప్పుడు అంతః సంతోషిని అవుతానో కదా?**

---

కథా ఉపశాన్త మనవో, ధరణీ ధర కోటరే,
సమేష్యామి శిలో సామ్యం, నిర్వికల్ప సమాధినా,
నిరంశ ధ్యాన విశ్రాంతిః మూకస్య మమ మస్తకే?

ఎప్పుడు కొండగుహలోని ఒక శిలవలె నా మనస్సు ఉపశాన్తిస్తుందో? రాజు కిరీటము చివర (సహస్రారము నందు) ప్రవేశించి నిర్వికల్ప సమాధి నిష్ఠుడనై అంశ రహితమగు ధ్యానము (కేవలధ్యానము)ను ఎప్పుడు సిద్ధించుకుంటానో? నేను పరమ ధ్యాన విశ్రాంతిని ఆశ్రయిస్తూ ఉండగా-

---

కదా తార్ణన్ కరిష్యన్తి
కులాయం వనపుత్రికాః,
సంకల్ప పాదపం తృష్ణా లతం ఛిత్త్వా వనోపమమ్,
వితతాం భువమ్ ఆసాద్య
విహరామి యథా సుఖమ్?

- జగత్తును ఏమరచుటచే నా తలపై ఎప్పుడు కొండ ఈగలు - (ఇది కదలిక లేని స్థలం కదా అని తలచి) - హాయిగా గూడుకట్టుకుంటాయో కదా!

‘సంకల్పము’ అను నా హృదయములోని వృక్షము, -ఎన్నడు ‘తృష్ణ’ అనే లతల సమూహముతో సహా ఖండించబడగా - హృదయ వనములో ఖాళీ అయిన ప్రదేశములో కేవలాత్మనుభవము నిర్ద్వంద్వంగా, నిర్వికారంగా ఎప్పుడు విస్తారమవుతుందో మరి? నా హృదయము ‘ప్రశాంతము’ తో విస్తారము పొందినదై నాకు నాకే విహార భూమిగా అవుతుందో కదా?

ఆత్మభూమియే నా స్వాభావికమగు పుట్టినిల్లు.

### సన్న్యాస స్వానుభవము

13 పదన్తదను యాతోఽస్మి
కేవలోఽస్మి జయామి అహమ్।
నిర్వాణోఽస్మి। నిరీహోఽస్మి। నిరంశోఽస్మి నిరీప్సితః॥

**సన్న్యాస స్వానుభవము**

ఈ సమస్త ఇంద్రియ విషయ ప్రపంచమును జన్మకర్మల వ్యవహారమును జయించి, త్యజించి,-దీనికి ఆవల గల పదన్తమును (My obsolute state beyond all) సర్వదా ఆశ్రయిస్తున్నాను. అనుయాయుడను అగుచున్నాను. భీకర కదలికలు త్యజించిన నిశ్చలవాయువు వలె - **నిర్వాణుడను।**

(సర్వకోరికలు జయించిన) **నిరీహుడను।** (జీవాత్మ, జగత్తులు మొదలైన అంశలు లేనట్టి) **నిరంశుడను.** (నెరవేరవలసినదేదీ క్రొత్తగా లేనట్టి) **నిరీప్సితుడను।**

---

### భిక్షకుడు

స్వచ్ఛత, ఊర్జితతా, సత్తా, హృద్యతా సత్యవాక్యతా,
ఆనందితా, ఉపశమతా, సదా ప్రముదితోదితా,
పూర్ణతా, ఉదారతా, సత్యా,
శాన్తి సత్తా సదా ఏకతా॥ -
ఇత్యేవం (ఇతి ఏవం) చింతయన్ భిక్షుః
స్వరూప స్థితిమంజసా,
నిర్వికల్ప స్వరూపజ్ఞో,
నిర్వికల్పో బభూవహ॥

**'భిక్షుకుడు' అనగా ఎవరు?**

ఈప్సితములు లేనివాడు, స్వచ్ఛమైన స్వభావము కలవాడు, వంకర- టింకర స్వభావము జయించిన మనోవాక్కాయములచే సూటి అయినవాడు ఊర్జితుడు (ఉత్సాహవంతుడు), జాగ్రత్- స్వప్నసుషుప్తల కంటే వేరైన ఉనికి గల సత్తా స్వభావుడు, హృదయమంతా **సోఽహమ్-తత్త్వమ్** మొదలైన సత్యవాక్కు నింపుకున్నవాడు, ఆత్మానందము సదా అభ్యసించువాడు, జగద్వ్యవహారమంతా తనయందు ఉపశమింప జేసుకొన్నవాడు, ఎల్లప్పుడు ప్రమోదము (ఆత్మభావనచే సంతృప్తి) కలిగియుండువాడు, పూర్ణత్వము - ఉదారత్వము పుణికిపుచ్చుకొని యున్నవాడు, సత్య - శాంతి - సత్తా స్వభావుడు, అనేకత్వమును అధిగమించి ఏకత్వము ఆశ్రయించువాడు → ఈఈ చింతనాభ్యాసములు **భిక్షుకస్వరూపస్థితి లక్షణములు.** భిక్షుకుడు అనగా - తన యొక్క నిర్వికల్ప స్వరూపమును ఎరిగినవాడై అట్టి స్వస్వరూపము నందు స్థిరనిశ్చలుడు అయి ఉండువాడు. **(భి = చీకటి, క్షకః = క్షయింపజేసుకొన్నవాడు).**

---

### ఆతుర సన్న్యాసము

ఆతురో- జీవతి చేత్, క్రమసన్న్యాసః కర్తవ్యః।

**ఆతురసన్న్యాసము**

"త్వరలో మరణము సమీపించవచ్చునేమో!" - అనే శంక వచ్చినప్పుడు - విధి విధానంగా కాకుండా, అప్పటికప్పుడు (జల సమర్పణ) సంజ్ఞారూపంగా సన్న్యాసము స్వీకరించవచ్చు. అది ఆతుర సన్న్యాసము. అట్టివారు తిరిగి ఆరోగ్యము పొంది జీవిస్తూ ఉంటే, మరల 'క్రమసన్న్యాసము" స్వీకరించటము చేతనే సన్న్యాసాశ్రమవాసి అవగలడు.

---

### యతి నియమములు

న శూద్ర స్త్రీ పతితా ఉదక్యా సంభాషణమ్।
న యతేః దేవ పూజన ఉత్సవ దర్శనమ్।
తస్మాన్ న సన్న్యాసం ఏషలోకః।

**యతి నియమములు**

అట్టి యతి - లోక సంబంధమైన ఆశయములు గల పురుష, స్త్రీ, పతిత, - రజస్వలలతో - లోక సంబంధమైన సంభాషణలు నిర్వర్తించరాదు.

దేవతా పూజలను, ఉత్సవ దర్శనములను చేయరు. **"లోకములో సన్న్యాసి ఉండదు. సన్న్యాసిలో లోకముండదు"** - అని చెప్పబడుతోంది.

---

ఆతుర కుటీచకయోః భూలోక, భువర్లోకౌ।
బహూదకస్య స్వర్గలోకః। హంసస్య తపోలోకః
పరమ హంసస్య సత్య లోకః।
తురీయ అతీత అవధూతయోః,
స్వాత్మన్యేవ (స్వ-ఆత్మని-ఏవ) కైవల్యమ్,
"స్వరూప అనుసంధానేన"
భ్రమర కీటక న్యాయవత్॥

- ఆతుర, కుటీచక సన్న్యాసులకు ఉత్తరోత్తరములు భూ-భువర్లోకములు.
-బహూదకులకు- స్వర్గలోకము.
- హంస యోగులకు తపోలోకము.
- పరమ హంసలకు సత్యలోకము.
- తురీయాతీత, అవధూతలకు స్వాత్మస్థానము.

→ ఈ విధంగా **'భ్రమర కీటకన్యాయము'** వలె స్వరూప అనుసంధానము వలన వీరందరికీ **కైవల్యము రూపుదిద్దుకొనుచున్నది.**

**14. స్వరూప అనుసంధాన వ్యతిరిక్త**
**అన్య శాస్త్ర అభ్యాసైః**
**ఉష్ట్ర కుంకుమ భారవత్ వ్యర్థతా।**

స్వరూప అనుసంధానమునకు వేరైన, వ్యతిరిక్తమైన అన్యశాస్త్ర అభ్యాసములు యతి - ఆశ్రయించడు.

అన్యోపాసనయందు పరిమితుడై ఉంటే (శాస్త్రజ్ఞానము ఆత్మానుభవమునకు దారితీయకుంటే) - అది **"ఒక గాడిద కుంకుమపువ్వును మోస్తూ కూడా, దాని సువాసన ఇత్యాది ప్రయోజనము ఆ గాడిద పొందలేకపోవటము"** - వంటిది.

---

**న యోగ శాస్త్ర ప్రవృత్తిః, న సాంఖ్య శాస్త్ర అభ్యాసో**
**న మంత్ర తంత్ర వ్యాపారో,**
**న ఇతర శాస్త్ర ప్రవృత్తిః యతేః అస్తి।**
**అస్తి చేత్, శవాలంకారవత్।**

యతియొక్క దృష్టిలో - యోగశాస్త్ర ప్రవృత్తి గాని, సాంఖ్యశాస్త్ర అభ్యాసము గాని, మంత్ర తంత్ర వ్యవహారములుగాని, (పరమాత్మను అన్యముగా వర్ణించు) అన్యశాస్త్ర పాండిత్య ప్రవృత్తులు గాని-**పరమాశయము కాదు.** ఒకవేళ 'అన్యముగా' చెప్పు (లేక) అనన్యమును ఏమరువజేయు విశేషములు తారసబడుట జరుగుతూ ఉంటే - అవన్నీ శరీరమునకు చేసే అలంకారముల వంటివే అను భావన కలిగి వారై ఉంటారు.

ఆత్మానుభవము సమక్షములో అవి పరిగణకు రానివిగా చూస్తారు.

---

**కర్మ ఆచార విద్యాదూరః।**
**న పరివ్రాట్ నామ సంకీర్తన పరః।**

**<u>పరివ్రాజకుడగు సన్న్యాసి యొక్క అభ్యాసము:</u>**

కర్మ-ఆచార-శాస్త్ర విద్యా పాండితీ ప్రకర్షణలకు దూరంగా ఉంటారు. పేరు ప్రతిష్ఠల పట్ల ధ్యాస కలిగి ఉండరు. అట్టి విశేషములను పొగడరు. సంకీర్తన చేయరు. సర్వత్రా సమస్వరూపమగు ఆత్మనే సంకీర్తిస్తూ ఉంటారు.

---

**యత్ యత్ కర్మ కరోతి,**
**తత్ తత్ ఫలం అనుభవతి।**
**ఏరణ్డ తైల ఫేనవత్ సర్వం పరిత్యజేత్।**

ఒకవేళ్ళ ఏమైనా కర్మకు కర్తృత్వము వహిస్తూ, నిర్వర్తిస్తూ ఉంటే, ఆ కర్మల ఫలముల అనుభవము అనివార్యము. అందుచేత ఆముదపు నురుగు వలె (కుంకుడికాయ నురుగును శరీరముపై రుద్దుకొని, ఆ తరువాత నీటితో శుభ్రముచేసి పరిత్యజించి వేస్తాము కదా! అట్లాగే) ఇక్కడి సమస్తమును యతి పరిత్యజించి ఉంటారు.

---

**న దేవతా ప్రసాద గ్రహణమ్।**
**న బాహ్యదేవ అభ్యర్చనం కుర్యాత్।**
**స్వ వ్యతిరిక్తం సర్వం త్యక్త్వా,**
**మధుకరవృత్య ఆహారం ఆహరన్,**
**కృశో-భూత్వా, మేదో వృద్ధిమ్ అకుర్వన్ విహరేత్॥**

**<u>యతికి - (సన్న్యాసికి) :-</u>**

- దేవతా ప్రసాద గ్రహణము, - బాహ్య దేవతార్చన - మొదలైన బాహ్య ఉపాసనలు తమ కొరకు నియమమై ఉండవు. అవన్నీ లోక కళ్యాన దృష్టితో నిర్వర్తిస్తారేగాని, తమ కొరకు కాదు. సర్వత్రా ఆత్మను, సర్వము ఆత్మయందు దర్శించటమే "అంతరోపాసన".

స్వస్వరూపమునకు వ్యతిరిక్తమైనదంతా త్యజించిన వాడై ఉంటాడు. మధుకర (భిక్షక) వృత్తిచే తనకు సరిపడునంతగా ఆహారము తెచ్చుకుంటారు. క్రొవ్వులు పెంచుకొనే అల్పాశయములు లేనివాడై విహరిస్తూ ఉంటారు.

---

**మాధుకరే కరపాత్రేణ అన్యపాత్రేణ వా కాలం నయేత్।**
**ఆత్మ సమ్మితం ఆహారం ఆహరేత్ ఆత్మవాన్ యతిః।**

భిక్షాటనము చేయుచున్నప్పుడు చేతినే పాత్రగా గాని, వేరైన ఒక పాత్రగాని కలిగియుండి కాలం వెళ్ళబుచ్చుతూ ఉంటారు.

ఆత్మవంతుడై యతి తనకు తిన-సరిపోవు ఆహారమే తెచ్చుకుంటాడు. దాచి దాచి ఉంచుకోవాలనే ఉద్దేశ్యము కలిగి ఉండడు.

---

**<u>ఆహారస్య చ భాగౌ ద్వౌ, తృతీయమ్ ఉదకస్య చ,</u>**
**<u>వాయోః సంచలనార్థాయ, చతుర్థం అవశేషయేత్॥</u>**

పొట్టలో రెండు భాగములను ఆహారముతోను, మూడవ భాగమును నీటితోను నింపాలి. మిగిలిన నాలుగవ భాగమును వాయు సంచారము యొక్క వసతి కొరకు 'ఖాళీ'గా ఉంచాలి.

---

**భైక్షేణ వర్తయేత్ నిత్యం**
**న ఏక అన్నాసీ భవేత్ క్వచిత్।**

సన్న్యాసి ఎల్లప్పుడూ భిక్షాటణంలోనే ఉంటూ ఒకే ఇంటిని ఆహారము (అన్నము) కొరకై ఆశ్రయించి ఉండకూడదు.

| | |
|---|---|
| **15** నిరీక్షంతే తు అనుద్విగ్నాః<br>**తత్ గృహం యత్నతో, వ్రజేత్।** | బిక్షాటనకు వెళ్లుచున్నప్పుడు - ఏగృహము వద్ద అయితే గృహిణి లేక గృహయజమాని అన్నము (ఆహారము) ప్రదానము చేయుటకై అనుద్వేగకరంగా నిరీక్షణ చేస్తూ ఉంటారో, ఆ ఇంటి వద్ద తప్పక, సయత్నపూర్వకంగా స్వీకరిస్తూ సాగిపోవాలి. |
| పంచ-సప్త గృహాణాన్తు బిక్షాం ఇచ్ఛేత్<br>క్రియావతామ్। గోదోహమాత్రం ఆకాంక్షేత్<br>నిష్క్రాన్తో న పునః, వ్రజేత్। | బిక్షాటన కొరకు రోజుకు 5 లేక 7 ఇళ్లను మాత్రమే ఎన్నుకోవాలి. ఆవు పాలు పితుగుటకు పట్టుకాలము మాత్రమే అక్కడ వేచి ఉండాలి. ఒక్కొక్క ఇంటి నుండి మరల ఇంకొక ఇంటికి వెళ్లుచూ, మరల వెనుతిరగరాదు. |
| నక్తాత్ వరశ్చ ఉపవాస। ఉపవాసాత్ అయాచితః।<br>అయాచితాత్ వరం భైక్షం। తస్మాత్ భైక్షేణ వర్తయేత్। | నక్తము(రాత్రియందు మాత్రమే భోజనము చేయటం) కంటే ఉపవాసము (పగలు మాత్రమే ఉపవాసము) మంచిది. **ఉపవాసము కంటే అయాచితము,** అయాచితము కంటే భైక్షము అధికమైనవి. అందుచేత భైక్షణము సన్న్యాసులకు వర్తనీయము. |
| నైవ (న ఏవ) సవ్య – అపసవ్యేన బిక్షాకాలే విశేత్ గృహాన్॥ | బిక్షాటనము చేయునప్పుడు సవ్యముగాను, మరల అపసవ్యముగాను గృహములలో ప్రవేశించరాదు. (ఒక్కసారి ముందుకు వెళ్లాలిగాని, ఒక త్రోవలోవెళ్లి తిరిగి అదే త్రోవలో వెనుకకు వచ్చి మరలి భిక్షాటనము చేయరాదు). |
| న అతిక్రామేత్ గృహం మోహాత్<br>యత్ర దోషో న విద్యతే।<br>శ్రోత్రియ (అపి) – అన్నం<br>నభిక్షేత శ్రద్ధా భక్తి బహిష్కృతమ్। | ఏ గృహములు దోషరహితమై ఉంటాయో, అట్టి గృహము దాటి (అతిక్రమించి) భిక్ష తీసుకోకుండా వెళ్లరాదు.<br>ఇక, శ్రద్ధాభక్తులు లేనప్పుడు - యజమాని శ్రోత్రియుడైనా కూడా, - ఆ ఇల్లు భిక్ష విషయంలో బహిష్కృతమే। |
| వ్రాత్యస్య అపి గృహే భక్షేత్ శ్రద్ధాభక్తి పురస్కృతే।<br><u>మాధూకరం</u> అసంక్లప్తం <u>ప్రాక్ప్రణీతం,</u><br><u>అయాచితమ్, తాత్కాలికం</u> చ<br><u>ఉపపన్నం</u> భైక్షం పంచవిధం స్మృతమ్। | ఇంటివారు లోకరీతిగా గొప్పగొప్ప కులమువారా? - అనునది ముఖ్యము కాదు. భిక్ష ఇచ్చుటలో శ్రద్ధా భక్తులుంటే ఆ ఇల్లు బిక్ష స్వీకరించుటకు అర్హమే. <u>భైక్షము 5 విధములు.</u><br>**(1)** మధూకరము **(2)** ప్రాక్ ప్రణీతము **(3)** అయాచితము<br>**(4)** తాత్కాలికము **(5)** ఉపపన్నము |
| **16** మనః సంకల్పరహితాన్, త్రీన్ గృహాన్<br>పంచ సప్తవా, మధుమక్షికవత్ కృత్వా<br>"మాధూకరమ్" ఇతి స్మృతమ్॥ | **(1) మాధూకరము :** మనస్సుతో ముందుగా సంకల్పించకుండానే '3' లేక '5' లేక '7' ఇళ్లకు తేనెటీగవలె వెళ్ళి భిక్షాటనము చేసి భిక్ష స్వీకరించటము - **"మాధూకరము"** - అని అనబడుతోంది. |
| ప్రాతఃకాలేచ పూర్వేద్యుః<br>యత్ భక్తైః ప్రార్థితం ముహుః<br>తత్ భైక్షం <u>"ప్రాక్ ప్రణీతం"</u> స్యాత్<br>చితిం కుర్వాత్ అథాపివా॥ | **(2) ప్రాక్ ప్రణీతము:** ప్రాతఃకాలము (ఉదయమున) గాని, ముందురోజుగాని ఎవ్వరైనా భక్తితో వచ్చి మాటిమాటికీ భిక్ష తీసుకోవలసినదిగా ప్రార్థిస్తూ ఉంటే ,ఆ విధంగా స్వీకరించే భిక్ష **'ప్రాక్ప్రణీతము'.** |
| భిక్షాటన సముద్యోగాత్ ఏన కేన నిమంత్రితమ్।<br>"అయాచితం"తు తత్ భైక్షం, భోక్తవ్యంచ ముముక్షుభిః॥ | **(3) అయాచితము :** భిక్షాటనమునకు బయలుదేరిన తరువాత, ఎవ్వరైనా **"అయ్యా! ఈ రోజు మా ఇంటనే భిక్ష స్వీకరించాలి-"**- అని నియంత్రిస్తూ ఉన్నప్పుడు స్వీకరిస్తే అది **అయాచితము.** ఇట్టిది ముముక్షువుల వద్దే స్వీకరించాలి. లౌకికమైన కోరికలు కలవారి వద్ద కాదు. |
| ఉపస్థానేన యత్ ప్రోక్తం భిక్షార్థం<br>బ్రాహ్మణేన తత్, "తాత్కాలికం" ఇతి<br>ఖ్యాతం భోక్తవ్యం యతిభిః తదా॥ | **(4) తాత్కాలికము :** సన్న్యాసిని ఎవ్వరైనా బ్రహ్మతత్త్వోపాసన గల వాడు (బ్రాహ్మణుడు) భిక్షకు రమ్మని ఆహ్వానించి సమర్పిస్తే, అది ఆ విధంగా యతికి భోక్తవ్యమే. ఇది **"తాత్కాలికము"** |

| | |
|---|---|
| సిద్ధం అన్నం యత్ ఆనీతం బ్రాహ్మణేన<br>మఠం ప్రతిః, "ఉపపన్నం" ఇతి ప్రాహుః<br>మునయో మోక్ష కాంక్షిణః॥ | **(5) ఉపపన్నము :** బ్రహ్మజ్ఞానాశయముతో, ఉపాసనభావనతో ఎవ్వరైనా అన్నము సిద్ధము చేసి, మనస్సుతో 'మోక్షకాంక్షి' అయి, ఈ సన్న్యాసి కూర్చుని ఉన్న మఠము లేక స్థానమునకు తెచ్చి సమర్పిస్తే, అది **'ఉపపన్నము'**. |
| చరేత్ మాధూకరం భైక్షం యతిః మ్లేచ్ఛ కులాత్ అపి।<br>ఏకాన్నం న తు భుంజీత బృహస్పతి సమాత్ అపి॥<br>(సమాదపి)। | భిక్షాటనకై 'మాధుకరము' చేయుచు యతి మ్లేచ్ఛకులములవారి గృహముల వద్ద కూడా భిక్షను గ్రహించవచ్చును.<br>అయితే 'ఏకాన్నము'ను (ఒకేచోట రెండవరోజు కూడా ఆహారమును) బృహస్పతితో సమానమైనవారి ఇంటిలో కూడా భిక్షగా గ్రహించరాదు. |
| యాచిత, అయాచితాభ్యాం చ,<br>భిక్షాభ్యాం కల్పయేత్ స్థితిమ్॥ | ఈ విధంగా యాచితమైనా, అయాచితమైనా కూడా - భిక్షకమార్గములోనే భిక్షను గ్రహించి సన్న్యాసి (యతి) దేహమును రక్షించుకోవాలి. |
| **17** న వాయుః స్పర్శదోషేణ।<br>న అగ్నిః దహన కర్మణా।<br>న ఆపో మూత్ర పురీషాభ్యాం।<br>న అన్నదోషేణ మస్కరీ।<br>విధూమే సన్ న ముసలే, వ్యంగారే,<br>భుక్తవత్ జనే, కాలే అపరాహ్ణ భూయిష్ఠే<br>భిక్షాచరణం ఆచరేత్।<br>అభిశస్తన్ చ పతితం పాషణ్డం దేవపూజకమ్<br>వర్జయిత్వా చరేత్ భైక్షం, సర్వవర్ణేషు చ ఆపది॥ | వాయువుకు స్పర్శదోషము ఉండదు. అగ్నికి దహనదోషము లేదు. జలమునకు మూత్ర-పురీషదోషము ఉండదు. అట్లాగే యతికి (సన్న్యాసికి) అన్నదోషము అంటదు.<br>ఇంటిలో ఇక పొగరానప్పుడు (వంట అయిన తరువాత), రోకటిపోటు లేనప్పుడు, నిప్పులు లేనప్పుడు, జనులు భుజించిన తరువాత, అపరాహ్ణ (మధ్యాహ్న - say 12 noon) సమయములోను భిక్షాచరణము నిర్వర్తించ వచ్చును.<br>అభిశస్తుని (పరనింద అను దురభ్యాసము కలవాని), పతితుని, పాషండుని, (దేవపూజ పట్ల తిరస్కారము కలవానిని) వదలి, తదితర గృహముల వద్ద భిక్షాచరణము చేయుదురుగాక। ఆపద సమయములో సర్వ వర్ణముల గృహములలో భైక్ష్యము చేయవచ్చును. |
| ఘృతం చ మూత్ర సదృశం।<br>మధుస్యాత్ సురయా సమమ్।<br>తైలం సూకర మూత్రం స్యాత్।<br>సూపం లశున సమ్మితమ్। | **యతికి →**<br>నెయ్యి - మూత్రముతో సమానము.<br>తేనె - సురాపానముతో సమానము.<br>తైలము - పంది మూత్రముతో సమానము.<br>సూపము - ( వండిన పప్పు) లశునముతో (వెల్లుల్లితో) సమానము. (త్యజించ తగినది). |
| మాషాపూపాది గోమాంసం।<br>క్షీరం మూత్ర సమం భవేత్।<br>తస్మాత్ సర్వప్రయత్నేన ఘృతాదీన్ వర్జయేత్ యతిః।<br>ఘృత సూపాది సంయుక్తం అన్నం నాద్యాత్ కదాచన। | గారెలు, అప్పములు మొదలైన పిండివంటలు, గో-జంతు మాంసముతో సమానము. పాలు మొదలైనవి మూత్రముతో సమానము. సర్వ ప్రయత్నముతో యతి నెయ్యిని తానుగా కోరుకోరాదు. నెయ్యి-పప్పు కలిపిన అన్నము ఎప్పుడూ కావాలని అనుకోరాదు. |
| పాత్రం అస్య భవేత్ పాణిః।<br>తేన నిత్యం స్థితిం నయేత్।<br>పాణి పాత్రః చరన్ యోగీ న అసకృత్ భైక్షమ్ ఆచరేత్। | యతికి చేతిలోని భిక్షక పాత్రయే అలంకారము. చేతిని భిక్షకపాత్రగా ధరించాలి. యోగి అసత్ (చేయరాని) పనులు చేస్తూ ఉన్నవారి వద్ద భైక్షకము ఆచరించరాదు. నిషేధములగు మాంసాదుల భైక్ష్యము చేయరాదు. |
| ఆస్యేన తు యత్ ఆహారం గోవత్<br>మృగయతే మునిః, తదా సమఃస్యాత్<br>సర్వేషు, సో అమృతత్వాయ కల్పత ఇతి। | గోవువలె (రుచి పట్టించుకోకుండా) ఆహారమును నోటితో తీసుకొను చుండటంచేత, అట్టి వాడు సర్వుల యందు సమస్వరూపుడై అమృతత్వమునకు అర్హుడగుచున్నాడు. |

| | |
|---|---|
| **18 ఆజ్యం రుధిరమివ త్యజేత్।<br>ఏకత్ర– అన్నం పలలం ఇవ।<br>గంధలేపనం అశుద్ధలేపనమ్ ఇవ।<br>క్షారం అంత్యజం ఇవ।** | → నెయ్యిని రక్తము వలె వదలాలి.<br>→ ఒకే ఇంటిలో అనేకసార్లు భోజనము మాంసభక్షణం వలె భావించాలి.<br>→ సుగంధ లేపనము - అశుద్ధ లేపనము వలె అనుకోవాలి.<br>→ క్షారము (కారము)ను - నీచము వలెను తలచాలి. |
| **వస్త్రం ఉచ్ఛిష్ట పాత్రం ఇవ।<br>అభ్యంగం స్త్రీ సంగం ఇవ।<br>మిత్ర ఆహ్లాదకం మూత్రం ఇవ।<br>స్పృహం గోమాంసం ఇవ।** | → నూతన వస్త్రములను - ఎంగిలి కంచమువలెను,<br>→ తలంటును - స్త్రీ సంగమమువలెను,<br>→ పూర్వాశ్రమస్నేహితులతో ఆహ్లాదములు (పాతఃకాలపు కబుర్లు) - మూత్రము వలెను,<br>→ లోకసంబంధమైన స్పృహలు, జ్ఞాపకములు, కోరికలు గోమాంసము వలెను అనుకోవాలి. |
| **జ్ఞాత చరదేశం చండాలవాటికామ్ ఇవ।<br>స్త్రియమ్ అహిం ఇవ। సువర్ణం కాలకూటమివ।<br>సభాస్థలం శ్మశానస్థలం ఇవ।<br>రాజధానీం కుంభీపాకం ఇవ।** | → ఇతః పూర్వాశ్రమములో పరిచయస్తులైయున్న వారి జ్ఞాతులైనవారి గ్రామ-పట్టణములను (పాత పరిచయములు ముందుకు వస్తూ ఉంటే) - చండాలవాటిక వలెను,<br>→ స్త్రీని అసభ్య దృష్టితో చూడటం పామును చూచినట్లు,<br>→ బంగారమును కాలకూటవిషము వలెను,<br>→ రాజకీయ విశేషములతోను, లోక విశేషములతో కూడిన సభాస్థలమును శ్మశానవాటిక వలెను దృష్టి కలిగి ఉండాలి.<br>→ రాజధానీ నగరమును కుంభీపాక నరకము వలెను, |
| **శవ పిండవత్ ఏకత్ర అన్నం।<br>న దేవత అర్చనం।<br>ప్రపంచ వృత్తిం పరిత్యజ్య<br>జీవన్ముక్తో భవేత్ (యతి)॥** | → ఏకత్రాన్నము (ఒకేచోట రోజులు రోజులుగా ఆహార స్వీకారము) శవపిండము వలెను **చూడాలి.**<br>దేవతల అర్చనము చేయరాదు. (అది అన్యమగు ప్రవృత్తి మార్గము కాబట్టి).<br>ఈ విధంగా ప్రపంచ వృత్తులను పరిత్యజిస్తూ ఉండగా అట్టి యోగి జీవన్ముక్తుడు అగుచున్నాడు. |
| **ఆసనం పాత్రలోపశ్చ సంచయః, శిష్య సంచయః।<br>దివాస్వాపో, వృథాలాపో –<br>యతేః బంధకరాణి 'షట్' ।<br>వర్షాభ్యో అన్యత్ర యత్ స్థానం<br>'ఆసనం' తత్ ఉదాహృతమ్॥** | (1) ఆసనము (2) పాత్రలోపము (3) సంచయము (4) శిష్యసంచయము (5) దివాస్వాపము (6) వృథాలాపము - ఈ 'ఆరు' కూడా యతికి ప్రతిబంధకములు.<br>**(1) ఆసన స్థానబంధకము :** వర్షాకాలము తప్పించి వేరే కాలములో ఒకేచోట "స్థానము - ఆసనము" కలిగి ఉండటము **మొదటి ప్రతిబంధకముగా** (ఆసన స్థాన బంధకముగా) పిలుస్తారు. (Attraction of the place) |
| **19 ఉక్తా లాబ్వాది పాత్రాణాం ఏకస్యాపి ఇహ సంగ్రహః<br>యతేః సవ్యవహారార్థం పాత్ర అలాభే,<br>అన్యపరిగ్రహః యతేః స వ్యవహారార్థం<br>"పాత్రలోపః" స ఉచ్యతే॥** | **(2) పాత్రలోపము :** శాస్త్రములలో చెప్పబడియున్న సన్న్యాసియొక్క (యతి యొక్క) భిక్షక పాత్ర శాస్త్రములలో చెప్పిన ఆనపకాయ బుర్ర మొదలైన (భిక్షక) పాత్రలు లభించనప్పుడు ఆ యతి వ్యావహారికమైన (ఇళ్ళలో ఉపయోగించే) పాత్రవాడవలసినప్పుడు - అది 'పాత్ర లోపము'. ఇది "షట్ యతి **ప్రతిబంధకములలో" రెండవది.** (Attraction of usables, Instruments) |
| **గృహీతస్యతు దండాదేః ద్వితీయస్య పరిగ్రహః<br>కాలాన్తర ఉపభోగార్థం<br>"సంచయః" పరికీర్తితః॥** | **(3) శిష్య సంచయము :** యతి (లేక) సన్న్యాసి శాస్త్ర సూచనానుసారంగా ఒక్క దండమునే కలిగి ఉంటారు. అయితే ఏదైనా ఇబ్బందిని దృష్టిలో పెట్టుకుని, "మరొక సమయంలో ఉపయోగిస్తుందేమోలే-" అని తలచి రెండవ దండమును చేతిలో కలిగి ఉండటము **మూడవ యతి- ప్రతిబంధకము.** దండము కనబడకపోవటము, శిధిలమవటము మొ॥వి సంచయబంధము. |

శు(శూషా లాభ పూజార్థం,
యశో౽ర్థం వా, పరిగ్రహః
శిష్యాణాం, న తు కారుణ్యాత్
"శిష్య సంగ్రహ" ఈరితః॥

**(4) శిష్య సంచయము / శిష్య సంగ్రహము:** కారుణ్యముతో, విద్యాబోధకొరకై, ఆత్మజ్ఞాన పాత్యాంశముల సుదీర్ఘ ప్రచారము కొరకై శిష్యులు ఆశ్రయించటము గాని, శిష్యులను సమీకరించటముగాని - తప్పుకాదు.

అట్లా కాకుండా,.. 'నన్ను సేవించాలి" అని, "నన్ను పూజించాలి" అని, "నా గురించి ప్రచారము చేయాలి"-అనే ఉద్దేశ్యముతో శిష్యులను సమీకరించటము - అనేది **నాలుగవ యతి ప్రతిబంధకము.**

---

విద్యా "దివా" ప్రకాశత్వాత్,
అవిద్యా "రాత్రిః" ఉచ్యతే।
విద్యాభ్యాసే ప్రమాదో యః
స "దివాస్వాప" ఉచ్యతే॥

**(5) దివాస్వాపము :**

ఆత్మవిద్యను - "పగటి వెలుగు" దివాప్రకాశము అంటారు.

అవిద్యను - "రాత్రి /చీకటి" అంటారు.

విద్యాభ్యాసము పట్ల ప్రమాదమే (ఏమరపు, అశ్రద్ధయే) - **దివాస్వాపము.** ఆధ్యాత్మిక సంబంధమైనవి, భిక్షక సంబంధమైన వాటి పట్ల బద్ధకము, **"తరువాత, తరువాత"**- అని అనుకోవటము లోక సమాచారములు సంభాషించుకోవటము - ఇదంతా **'దివాస్వాపము'.**

---

ఆధ్యాత్మికీం కథాం ముక్త్వా
భిక్షా వార్తాం వినా తథా,
అనుగ్రహం, పరిప్రశ్నం, "వృథాజల్పః", అస్య ఉచ్యతే॥

**(6) వృథాలాపము /వృథాజల్పము :** ఆధ్యాత్మిక ప్రసంగము, తత్త్వ జ్ఞాన సమాచారము కాకుండా కుశల ప్రశ్నలు, వారి గురించి - వీరి గురించి పరిప్రశ్నలు, క్షేమ సమాచారములు - ఇవన్నీ "వృథాజల్పము". **ఇది ఆరవ యతి ప్రతిబంధకము.**

---

ఏకాన్నం (ఏక అన్నం), మత (మద) మాత్సర్యం,
గన్ధ పుష్ప విభూషణమ్, తాంబూల .
అభ్యంజనే, క్రీడా భోగాకాంక్షా రసాయనమ్,

కత్థనం కుత్సనం స్వస్తి జ్యోతిశ్చక్రయ – విక్రయమ్,
క్రియా కర్మ వివాదశ్చ, గురు వాక్య విలంఘనమ్,
సన్ధిశ్చ విగ్రహో యానం మంచకం శుక్లవస్త్రకమ్.

**యతి త్యజించవలసినవి :** (ఒకేచోట నుండి భోజనము చేయుచూ రోజులు గడవటం రూపమగు) **ఏకాన్నము.** మత సంబంధమైన **మాత్సర్యము, మద మాత్సర్యములు.** గంధ-పుష్పముల **అలంకారము.** తాంబూల సేవనాభ్యాసములు. **అభ్యంజనములు** (అభ్యంగన లేక తలంటు స్నానములు). కాటుక మొదలైన **అలంకరా ధారణములు.** క్రీడలు. **భోగకాంక్షలు. రసాయన** (బలవర్ధక, మత్తు కలిగించే) **ఔషధ సేవనములు.** ఇతరులను **అసహ్యించుకోవటము. కుత్సితభావములు. ఆత్మస్తుతి - పరనిందలు. పరదూషణలు. దర్శనమునకు వచ్చువారికి లౌకికమైన ఆశీర్వాదములు. ధన లాభము పొందుట, ధనదృష్టితో స్వస్తి వాక్యములు. జ్యోతిశ్చక్రముల క్రయ విక్రయములు** (దేవుడి బొమ్మల విక్రయములు). క్రియ- కర్మల గురించి **వివాదములు** (అట్లాగే చేయాలి - ఇట్లా చేయకూడదు అను (వాదోపవాదములు). గురువు చెప్పు **ఆజ్ఞలను ఉల్లంఘించటము. పొట్లాటలు. సంధి.** ఒకరినొకరు **కలహించుకోవటము.** వాహనములు. మంచకము. తెల్లటి వస్త్రధారణము.

---

**20** శుక్లోత్సర్గో, దివాస్వాపో
భిక్షా ధారస్తు తైజసమ్, విషంచైవ, ఆయుధం బీజం
హింసాం తైక్ష్ణ్యంచ, మైథునం, –

శుక్ల ఉత్సర్గము, దివాస్వాపము, కొందరి భిక్షపై ఆధారపడి ఉండటము, తైజస - (స్వప్న కల్పిత విశేషములతో కూడిన) సంప్రదర్శనము. విషపు మాటలు. ఆయుధ ధారణము. హింస. దుఃఖ బీజములు అవగల వాక్కులు. మైధున భావములు.

***ఇవన్నీ సన్న్యాసి వదలి ఉండాలి.***

---

–త్యక్తం సన్న్యాసయోగేన గృహధర్మాదికం
వ్రతమ్, గోత్రాది చరణం సర్వం
పితృ– మాతృకులం, ధనమ్,
ప్రతిషిద్ధాని చ–ఏతాని,
సేవమానో వ్రజేత్ అధః।

ఇంకా సన్న్యాసయోగము చేత గృహస్త ధర్మములైనట్టి ధనసముపార్జన, ధనమును దాచటం మొదలైనవి విడువాలి. వ్రతములు, గోత్రముల మమకారము, తల్లిదండ్రుల సంబంధితమైన కులాహంకారము, ధనమును ఆశించటము, కులగోత్ర గర్వములు - ఇటువంటి గృహస్త ప్రసిద్ధమైన విశేషాలు సేవించటంచేత అట్టివాడు సన్న్యాసాశ్రమము నుండి అధఃపతితుడు అగుచున్నాడు.

| | |
|---|---|
| సుజీర్ణో అపి సుజీర్ణాసు విద్వాన్ స్త్రీషు న విశ్వసేత్।<br>సుజీర్ణాసు అపి కంథాసు సజ్జతే జీర్ణం అంబరమ్। | "నేను సుజీర్ణుడను. వృద్ధుడను. స్త్రీలతో భౌతికమైన సమీప్యత ఏమి తప్పు?" - అని తలచి, దేహసంబంధమైన సామీప్యతలను దరిచేరనీయ రాదు. జీర్ణమైన, చిరిగిపోయిన దుప్పటి కూడా బొంతలో వస్త్రము కాగలదు కదా. **"నేను స్త్రీ-పురుష భౌతిక - లౌకిక సంబంధాలకు దూరంగా ఉండటమే ఉచితం।"** - అని తలవాలి. |
| <u>స్థావరం, జంగమం, బీజం, తైజసం, విషం, ఆయుధమ్-</u><br>షట్(6) ఏతాని న గృహ్ణీయాత్ యతిః మూత్ర పురీష వత్।<br><u>నైవాత్</u> అధీత (ఉ)పాథేయం<br>యతిః కించిత్ అనాపది।<br>పక్వం ఆపత్సు గృహ్ణీయాత్ యావత్ అన్నం, న లభ్యతే।। | (1) స్థావరమైనది (2) జంగమమైనది (3) బీజము (4) తేజసము, (5) విషము (6) ఆయుధము - ఈ ఆరింటిని - యతి అయిన వాడు మూత్రమువలె గ్రహించి ఉండాలి. మూత్ర పురీషములను చూచు దృష్టితో చూడాలి. ("నావికావు. నేను వాటికి సంబంధించి లేను" - అని ఎరిగి ఉండాలి)<br>"త్రోవలో ఆపత్తు లేమైనా ఉంటాయేమో" అనుకుంటేనే మాత్రమే (త్రోవలో తినే ఆహారము) తీసుకొని వెళ్ళవచ్చు. అనగా ప్రయాణించేటప్పుడు ఆపత్తులేమీ ఉండవనుకుంటే మార్గంతో తినే ఉద్దేశ్యంతో ఆహారము తీసుకువెళ్ళరాదు. (త్రోవలో ఏమీ తినటానికి దొరకదనుకుంటే మాత్రం పక్వాహారం తీసుకువెళ్ళవచ్చు). |
| నీరుజశ్చ యువా చ ఏవ భిక్షుః<br>న అపనథే వసేత్। పరార్థం -న ప్రతి గ్రాహ్యం।<br>న దద్యాత్ చ కథం చ న।। | భిక్షకుడు తన వెంట నిరుజుని (ఎవరో తెలియనివాడు), రుజుమార్గము లేనివానిని, - ఈ ఇరువురిని కలిగి ఉండరాదు.<br>ఇతరులకోసం ఏదీ ప్రతిగ్రహించరాదు. దానము చేయరాదు. (He should neither receive nor give on behalf of others). |
| దైన్య భావాత్తు భూతానాం<br>సౌభగాయ యతిః చరేత్।<br>పక్వం వా, యది వా అపక్వం | యతి - ఇతరులతో ఉన్నప్పుడు 'నేను చిన్నవాడినే' అని నిగర్వ భావంతో ఉండాలేగాని, గర్వము, అధికారము ఇత్యాది భావాలతో కాదు. తదితర జనులకు శోభకలిగించేవాడుగా ఉండాలి. |
| యాచమానో। యతిశ్చ వ్రజేత్ అధః-<br>అన్నపానపరో భిక్షుః, వస్త్రాదీనాం ప్రతిగ్రహీ।। | "ఆహారము పక్వము అయినా (అన్నము, పిండివంట) లేక అపరిపక్వము (పళ్ళు, కాయలు) మొ।। యాచించి అయినా స్వీకరించవచ్చు.<br>"వస్త్రములు ఖరీదైన అన్నపానములు యాచించి తెచ్చుకుందాము" అనే ఉద్దేశ్యముతో యతి యాచనకై తిరుగాడరాదు. |
| ఆవికం వా, అనావికం వా,<br>తథా పట్టపటాన్ అపి,<br>ప్రతిగృహ్య యతిశ్చ ఏతాన్<br>పతత్యేవ। న సంశయః।। | అట్టి అన్నపానముల కొరకు యాచన దృష్టి, నూతన వస్త్రాదులు ఇతరుల నుండి పొందాలనే ఆశ-నిరాశలు కలిగి ఉండరాదు.<br>అన్నపానములను, క్రొత్తవైన కంబళములను, పట్టువస్త్రములను పొందాలనే భావావేశము గల యతి (లేక) భిక్షువు యోగమార్గము నుండి పతితుడు అవుతాడు. సంశయము లేదు. |
| **21** అద్వైతం నావం ఆశ్రిత్య<br>జీవన్ ముక్తత్వం ఆప్నుయాత్।<br>వాక్ దణ్డే-మౌనం ఆతిష్ఠేత్। | → 'అద్వైతనావ'ను ఆశ్రయించినవాడై యతి క్రమంగా 'ముక్తత్వము'ను పొందుచున్నారు.<br>'వాక్కు'ను దండముగా తీర్చిదిద్దుకోవటానికై 'మౌనము' నందు సుతిష్ఠితుడు అగుచున్నారు. |
| కాయ దణ్డేతు-అభోజనమ్।।<br>మానసే తు కృతే దణ్డే-ప్రాణాయామో విధీయతే।<br><u>కర్మణా బధ్యతే జన్తుః। విద్యయా చ విముచ్యతే।।</u> | ఈ భౌతిక దేహమును 'అద్వైత' మార్గమునకు 'దండము'గా (మహత్తర ఉపకరణముగా) ఉపకరించుటకై అభోజనము (ఉపవాసము)ను (ఇంద్రియములు శబ్ద స్పర్శ రూపాదుల నుండి విరామము పొంది ఉండటమును) అనుష్ఠించుచున్నారు.<br>మనస్సు (ఆలోచన)ను దండముగా చేసి ప్రాణాయమ యోగాభ్యాసము చేయుచున్నారు.<br>కర్మల చేత జీవుడు కర్మబద్ధుడు అగుచున్నాడు.<br>ఆత్మవిద్య చేత విముక్తుడు అగుచున్నాడు. |

| | |
|---|---|
| **తస్మాత్ కర్మ న కుర్వన్తి**<br>**యతయః పారదర్శినః।** | అందుచేత పారదర్శక స్వభావులగు యతులు సకామమైన (ఇంద్రియ సుఖ సంబంధమమైన) ఎట్టి కర్మలు నిర్వర్తించు స్వభావులు అయి ఉండరు. అకర్మనిష్ఠులుగానే ఉంటున్నారు. |
| **రథ్యాయాం బహువస్త్రాణి**<br>**భిక్షా సర్వత్ర లభ్యతే।**<br>**భూమిః శయ్యా అస్తి విస్తీర్ణా।**<br>**యతయః కేన దుఃఖితాః?** | "రథములు సంచరించు వీధులలో, దేహ రక్షణకై ఏవో వస్త్రాలు దొరుకుతాయి. ఈ ప్రకృతి ప్రసాదితమైన భూమి అంతా కూడా నాకు విశ్రమించటానికి ఉపయోగించగల శయ్యయే। ఇక నాకు -వస్త్రములు లేవే, విశ్రాంతికి ఇల్లు లేదేమి" - అనే దుఃఖమెందుకుంటుంది? ఉండనే ఉండదు - అను నిశ్చయము కలిగి ఉంటున్నారు. అశ - భయవర్జితులై ఉంటారు. |
| **ప్రపంచం అఖిలం యస్తు**<br>**జ్ఞానాగ్నౌ జుహుయాత్ యతిః** | యతి (సన్న్యాసి) దృష్టిలో ఈ ఎదురుగా ఇంద్రియములకు అగుపిస్తున్న పాంచభౌతిక ప్రపంచమంతా ఆత్మయే. జ్ఞానాగ్నియందు మొదలంట్లా దహించివేసి ఈ సమస్తమును స్వస్వరూపాత్మ భగవానుని తేజో విలాసముగా ఆయన దర్శించుచున్నారు. |
| **ఆత్మని అగ్నీం తు సమారోప్య**<br>**సోఽ గ్నిహోత్రీ మహాయతిః॥** | ఆత్మ (The Absolute Self) నందు అగ్ని యొక్క తేజోధర్మమును ఆరోపించి ఆ యతి **"అగ్ని హోత్రీ - మహా యతి"** స్వరూపుడు అగుచున్నాడు. జీవాత్మను బ్రహ్మాగ్నియందు సమర్పించి వేసినవారై ఉంటారు. |
| **ప్రవృత్తిః ద్వివిధా ప్రోక్తా**<br>**మార్జాలీ చ ఏవ, వానరీ॥** | **ద్వివిధా ప్రవృత్తిః**<br>ప్రవృత్తి రెండు విధములు.<br>(1) మార్జాలీ (Approach of Cat) ప్రవృత్తి.<br>(2) వానరీ (Approach of a Monkey) ప్రవృత్తి. |
| **జ్ఞాన - అభ్యాసవతా మోతుః**<br>**వానరీ భాక్త్వం ఏవచ॥**<br>**న అపృష్టః కస్య చిత్ బ్రూయాత్।**<br>**న చ అన్యాయేన చ పృచ్ఛతః॥** | జ్ఞాన అభ్యాసప్రవృత్తి మోతుః (మార్జాలీ)।<br>తదితరమైనదంతా వానరీ।<br>అడగనిదే ఎవ్వరికీ చెప్పకూడదు.<br>అన్యాయమైన నడవడిక గలవానికి, ఆతడు అడిగినవి కూడా చెప్పరాదు. |
| **జానన్ అపి హి మేధావీ**<br>**జడవత్ లోకం ఆచరేత్।** | మేధావి అయి, (ఆత్మగురించి) అంతా తెలిసియున్నప్పటికీ జడుడినివలె లోకంలో వ్యవహరించాలి। అర్హత ఉన్నచోట మాత్రమే నోరు విప్పాలి. |
| **సర్వేషాం ఏవ పాపానాం**<br>**సంఘాతే సముపస్థితే,**<br>**తారం ద్వాదశ సాహస్రం**<br>**అభ్యసేత్ ఛేదనం హి తత్॥** | 'సోఽహమ్' మంత్రార్థయోగ- జ్ఞానముల అభ్యాసము 12000 మార్లు అభ్యాస-మననముల వలన ఆ యోగి (యతి) యొక్క పాపములు గుట్టలు ఉన్నా, కూడా వాటి నుండి తరించగలడు. |
| **యస్తు ద్వాదశ సాహస్రం**<br>**ప్రణవం జపతే అన్వహమ్,**<br>**తస్య ద్వాదశ భిః మాసైః**<br>**పరంబ్రహ్మ ప్రకాశతే॥** | ఎవ్వరైతే ప్రణవమును పూర్ణార్థపూర్వకంగా 12000 సార్లు జపిస్తారో, అట్టివారి పట్ల 12 మాసములలో పరబ్రహ్మము ప్రకాశమానమవగలదు. |

**సన్న్యాసోపనిషత్ సమాప్తా**

**ఓం శాంతిః శాంతిః శాంతిః॥**

**ఇతి సన్న్యాసోపనిషత్**

**ఓం శాంతిః। శాంతిః। శాంతిః।**

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 14 సన్న్యాసోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



ఏ సత్తా సామాన్య విభవమును (All-equally placed All-Pervading "PRESENCE") సన్న్యాసపటలము (The Team of Sath - Nyasins) ఉపాసించుచున్నదో - అది సమస్త జీవుల స్వస్వరూపాత్మయే - అని భావిస్తూ ఆత్మోపాసనకు ఉపక్రమిస్తున్నాము.

సర్వతత్త్వస్వరూపుడు, సర్వాంతర్యామి, కేవలీ తత్త్వ స్వరూపుడు అగు సర్వాత్మ - భగవానుని వేదాక్షర సంజ్ఞయగు 'ఓం'గా ఉపాసిస్తూ, ఈ **సన్న్యాసోపనిషత్**ను అధ్యయనము నిర్వర్తించుకుంటున్నాము.

## 1వ అధ్యాయము - సన్న్యాస స్వీకరణము

ఇప్పుడిక మనము సన్న్యాసయోగము గురించి వ్యాఖ్యానించుకొనుచున్నాము.

తత్త్వమ్ (తత్ త్వమ్ అసి)ను ఉపాసించు మహదాశయుడు → బ్రహ్మచారి - గృహస్థ - వానప్రస్థానము క్రమంగా **"సన్న్యాస"** ఆశ్రమమును ఆశ్రయిస్తున్నాడు. **యో అనుక్రమేణ సన్న్యస్యతి సన్న్యాసో భవతి.** సమస్తము సన్న్యసించి, **"కేవలము, సర్వతత్త్వ స్వరూపము"** అగు 'ఆత్మ'ను ఆశ్రయిస్తున్నవాడే - **"సన్న్యాసి".**

- "సన్న్యాసము" అనగా ఏమి? **కోఽయం సన్న్యాస ఉచ్యతే?**
- ఒకానొకడు ఎప్పుడు **సన్న్యస్తుడు** అగుచున్నాడు? **కథం సన్న్యస్తో భవతి?**

**య ఆత్మానం క్రియాభిః గుప్తో భవతి।** ఎవ్వడైతే తన యొక్క, సకల జీవుల యొక్క సమస్త క్రియలను ఆత్మయందు **"గుప్తము (Secretly maintained)"** చేయుచున్నారో - అట్టివాడు **సన్న్యాసి। రహస్యమగు ఆత్మయందు అరహస్యమగు ఈ జగద్దృశ్యమును సందర్శించుచుండటమే సన్న్యాసము.**

## సన్న్యాసాశ్రమము స్వీకరించు విధానము

బుద్ధియొక్క సత్-న్యాసము (సత్-భావన, ఆత్మభావన) కొరకై 'సన్న్యాసవిధి' ఒక ఉపాయమగు ఉపాసనగా చెప్పబడుతోంది. సన్న్యాసాశ్రమము స్వీకరించ తలచినవాడు మొట్టమొదట తల్లి, తండ్రి, భార్య, పుత్రులు, బంధువులను ఒప్పించాలి. **అనుమోదము (Acceptance and Permission)** పొందాలి.

- వేదజ్ఞులగు ఋత్విక్కులను, కులగురువులను ఆశ్రయించి, వారి ఆశీర్వాదము అర్థించాలి.
- ఋత్విక్కులను ఆహ్వానించి **వైశ్వానరయజ్ఞమును, 'సర్వస్వ దానము'**ను నిర్వర్తించాలి. తనదిగా ఉన్న సమస్తమును సమర్పించివేయాలి.
- గోవులను ఇతఃపూర్వపు కులగురువులగు ఋత్విజులకు, తదితర సంపదలను గురు-భార్యాపుత్రాదిబంధువులకు ఇచ్చి వేయాలి.

- బాంధవ్యములను ఆయా మట్టి పాత్రలలో సమారోహన చేయాలి. (Let all Relationships be left in small pots indicatively).
- ఆహనీయాగ్నియందు, గార్హపత్యాగ్నియందు, అన్వాహార్య పచనము నందు, సభ్యావసథ్యములందు ఆయా వస్తువులన్నీ సమారోహణం (Sacrifice) చేయాలి. (సభ్యము = హోమరహితాగ్ని. అపసథము = గృహము) (సభ్యులకు, అక్కడికి రాని – మహనీయులైనవారికి వారి వారికి ఉపయోగించు వస్తు సముదాయమును సమర్పించాలి).
- (ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానములనబడే) పంచప్రాణములను కూడా పంచాగ్నులయందు సమారోహన చేయాలి.
- సమస్తమును సమస్తమునందు మంత్ర–తంత్ర పూర్వకంగా సమర్పిస్తూ సమారోహణం చేయాలి. (సమర్పించి వేయాలి). (సమర్పణ = నాది కాదు, పరమాత్మది – అను నిశ్చిత భావన).
- శిఖ (పిలక)తో సహా కేశములను వదలివేయాలి.
- యజ్ఞోపవీతమును త్రెంచివేయాలి.
- కుమారుని పిలచి, ఆతడు ఎదురుగా కూర్చుని ఉండగా

"పుత్రా!

**త్వం బ్రహ్మ। త్వం యజ్ఞః। త్వం సర్వమ్।** "నీవే బ్రహ్మము। నీవే యజ్ఞమువు। నీవే ఈ సర్వము!" అని అనుమంత్రణము చేయాలి. **"తత్త్వమ్" (YOU ARE THAT) భావనోపాసనకు ఇది ప్రారంభము.**

**"నీవు"గా కనిపించేదంతా కూడా తత్ స్వరూపకేవల–ఆత్మానంద ప్రదర్శనమే" = అను ఉపాసనయే సన్న్యాసాశ్రమ ముఖ్యోద్దేశ్యము.**

ఒకవేళ, అట్టి **'సన్న్యాసాశ్రభిమాని'**కి కుమారులు లేకపోతే? **యది అపుత్రోభవతి?, 'ఆత్మనమేవ' ఇమం ధ్యాత్వా –** తన యొక్క ఆత్మనే ఉద్దేశ్యించి, **'త్వమ్ బ్రహ్మేతి'** మంత్రమును ఉచ్చరించాలి.

ఈ విధంగా ఉచ్చారణ చేసిన తరువాత, ఇక వెనుకకు తిరిగి చూడకుండా, తూర్పువైపుగాగాని, ఉత్తరం వైపుగాగాని అక్కడి నుండి నడచుచూ బయల్వెడలాలి. **"అసత్ నుండి →'సర్వాత్మకమగు సత్ భావన' వైపుగా బుద్ధిని నడిపించుచున్నాను"** – అను ఉపాసనాభావనతో బయల్వెడాలి.

## భిక్ష

→ **త్రిషు వర్ణేసు భిక్షాచర్యం చరేత్।** మూడు వర్ణముల వారి ఇళ్లలోను భిక్షాటనము చేస్తూ ఉండవచ్చు.

→ రెండు చేతులను తెరచి అట్టి **'పాణిపాత్ర'** యందు ఆహారము భిక్షగా పొంది స్వీకరించాలి.

→ ఆహారమును 'ఆకలి' అనే వ్యాధికి ఔషధముగా భావించి ఔషధములాగా మాత్రమే స్వీకరించాలి.

→ ఆహారము ఎంత లభిస్తే అంతటితోనే ఆనందిస్తూ స్వీకరించాలి.

→ ఆహారమును ప్రాణములను నిలుపుకొనటానికి మాత్రమే ఉద్దేశ్యించాలి. అంతేగాని, 'రుచి' యొక్క భావనతో కాదు.

→ ఆహారమును క్రొవ్వుకొరకు, కండలు బాగా ఉండాలని ఉద్దేశ్యించకూడదు.

**సంచారము :** అట్టి సన్న్యాసి ఎక్కడా దీర్ఘకాలము నిలువరాదు.
గ్రామములో అయితే – 1 రాత్రి మాత్రమే
నగరములో – 5 రాత్రులు మాత్రమే।

**చాతుర్మాస్యము :**

→ సంవత్సరమునకు 4 మాసములు కాలము (వర్షాకాలంలో) గ్రామంలోగాని, నగరంలోగాని చాతుర్మాస్య వ్రతపూర్వకంగా నివాసము కలిగి ఉండటము యతి యొక్క అభ్యాస నియమము.

→ (లేదా) పక్షము (Half of the month i.e., 15 days) మాసముగా తీసుకొని '4 పక్షమాసము' (4x15 days = **2 నెలలు**) చాతుర్మాస్యము (చాతుర్పక్షమాసము) ను **'నివాసవ్రతము'**గా ఆచరించవచ్చును.

ఈ '4' లేక '2' మాసముల చాతుర్మాస్యమును సత్సంగము కొరకు, వేదాంత – శాస్త్ర అధ్యయనము కొరకు మాత్రమే వినియోగించాలి.

**వస్త్రధారణం : ద్విశీర్ణ వస్త్రం, వల్కలం వా ప్రగృహ్ణీయాత్। న అన్యత్।** ముతక బట్టలు (మందపు ఖాదీ వంటివి) గాని, నార బట్టలుగాని ధరించాలి. ఇతరములైనవి ధరించరాదు. ఒకవేళ ముతకబట్టలు, నారబట్టలు కట్టుకోవటానికి అశక్తుడైతే (అనగా) అట్టి

బట్టలు తపస్సు చేసుకోవటానికి అనుకూలంగా అనిపించకపోతే – **యది అశక్తోభవతి క్లేశతః తప్యతే తప ఇతి** – అప్పుడు ముందుగా అటువంటి బట్ట ధరించటం అలవాటు చేసుకొంటూ, సానుకూల్యము – అని అనిపించిన తరువాత, క్రమంగా తగిన సమయంలో సన్న్యసించాలి. **యోవా ఏవం క్రమేణ సన్న్యస్యతి యో ఏవం పశ్యతి।**

**శిష్యుడు : కిమ్ అస్య యజ్ఞోపవీతమ్? కాస్య శిఖా? కథం వా అస్య ఉపస్పర్శనమ్ ఇతి?** గురుదేవా! ఉపనయన సందర్భంలో యజ్ఞోపవీత ధారణ, శిఖ (పిలక), ఉపస్పర్శము (ఆచమనము) – ఇవన్నీ ఉంటాయి. మరి సన్న్యాసికి కూడా **"బ్రహ్మము యొక్క సమీప్య దర్శనము"** లేక **ఉపనయనమే** లక్ష్యము కదా. అటువంటప్పుడు యజ్ఞోపవీతము, శిఖ, ఆచమనములు సన్న్యాస విధానములో ఏమి ఉంటాయి?

(సన్న్యాసి విషయంలో యజ్ఞోపవీతము ఏది? శిఖ ఏది? ఉపస్పర్శనము (ఆచమనము) ఏమిటి?)

**గురుదేవులవారు :** ఆత్మస్వరూపా ! శిష్యా! విను చెప్తుతాను. **ఇదమేవ అస్యతత్ యజ్ఞోపవీతం యత్ ఆత్మధ్యానమ్।** సన్న్యాసి (లేక) యతికి అన్యధ్యానములను అధిగమించివేసి **"సర్వత్రా ఆత్మదర్శనారూపము, అనన్యచింతనా రూపము"** – అగు ఆత్మధ్యానమే యజ్ఞోపవీతము.

**విద్యా శిఖా ।** ఆత్మ గురించిన విద్యయే ఆతనికి **శిఖ.**

**ఉపస్పర్శనము: నిర్వైరః సర్వత్రా అవస్థితేః,– కార్యం నిర్వర్తయన్ ఉదరపాత్రేణ జలతీరే నికేతనమ్।** ఎక్కడ ఎట్లా ఉన్నా కూడా ఎవ్వరి పట్ల కించిత్‌గా కూడా **వైరభావము లేకుండటము,** (మరియు) **బ్రహ్మతత్త్వము యొక్క అధ్యయనము–** అనే కర్తవ్యము నిర్వర్తించుచూ, ఉదర పాత్ర (పొట్ట అనే పాత్ర) వెంటనిడుకొని నదీ తీరములలో నివాసము చేయటము – ఇదియే ఉపస్పర్శనము (ఆచమనము).

**బ్రహ్మవాదులు :** గురుదేవా! **అస్తమితి ఆదిత్యే కథువా అస్య ఉపస్పర్శనమ్ – ఇతి?** అయ్యా! సూర్యుడు అస్తమించిన తరువాత ఆయన ఆచమనం (నదీతీరంలో) చేస్తారా? ఆయనకు సంధ్యావందనాదులు ఉంటాయా?

**గురుదేవులవారు :** నాయనలారా! సన్న్యాస యోగికి – **యదా అహని, తథా రాత్రే। న అస్య నక్తం, న దివా।** – పగలు రాత్రి భేదముండదు. వారికి పగలు ఎటువంటిదో రాత్రి అటువంటిదే. సర్వకాల – సర్వావస్థలయందు **'ఆత్మధ్యానము'** నందు నిమగ్నుడై ఉంటాడు. అన్ని కాలములు ఆయనకు సంధ్యాకాలములే.

**తదపి ఏతత్ ఋషిణోక్తం।** ఇది సన్న్యాసస్తుల గురించి ఋషిప్రోక్తము. వారికి సర్వకాలములు పగలుతో సమానమే. సత్–న్యాసులగు సన్న్యాసుల గురించిన ఈ విశేషమును ఎరిగినవారు ఆత్మజ్ఞానము వైపుగా సులభముగా అనుసంధానము పొందగలరు.

## 2వ అధ్యాయము – సన్న్యాస సవివరణలు – అర్హత, ఆశయము, సిద్ధి –

**ఓం**

**శిష్యుడు :** గురు భగవన్! సన్న్యసించుటకు ఎవ్వరికి అర్హత ఉంటుంది?

**గురుదేవులవారు:** (అద్వేష్టా సర్వభూతానాం, మైత్రః కరుణ ఏవచ। అమానిత్వమ్ అదంభిత్వమ్, అహింసా క్షాంతి, ఆర్జవమ్। అభయం, సత్వసంశుద్ధిః, జ్ఞానయోగ వ్యవస్థితః – ఇత్యాది) (భగవద్గీత – 12, 13, 14, 16, 18 అధ్యాయములలో చెప్పబడిన) నలుబది ఉత్తమ సంస్కారములతో కూడుకొని ఉన్నవాడు సమస్త దృశ్య వ్యవహారముల పట్ల అనురక్తిని (attachment) జయించి విరక్తి పొంది ఉన్నవాడు, చిత్తశుద్ధిని పెంపొందించుకున్నవాడు – సన్న్యసించటానికి అర్హుడు. లోకసంబంధమైన కోరికలు, ఆశ, అసూయ, ఈర్ష్య అహంకారము.. ఇవన్నీ తపో–ధ్యాన–యోగాభ్యాస–జ్ఞానాగ్నులచే దగ్ధం చేసివేయాలి.

((1) ఇంద్రియ నిగ్రహరూపమగు **శమము** (Sense of mental withdrawl from worldly happenings)

(2) మహనీయులతో **సత్సంగము** ('సత్' – ఎప్పటికీ ఉండే దానితో సంగము. 'అసత్'తో అసంగము) అభ్యసిస్తూ,

(3) **విచారణ** (Application of common sense. The Approach of Analyzing) కు ఉపక్రమించి, ప్రాపంచక సమస్త విశేషములపట్ల నిత్యానిత్య వివేకము ఆశ్రయించటము.

(4) తృప్తిరూపమగు **సంతోషము** –

(శమము, సత్సంగము, విచారణ, సంతోషము అనబడు) సాధన చతుష్టయ (నాలుగింటి సముదాయ) సంపన్నుడే సన్న్యాసాశ్రమ స్వీకారమునకు ఉత్తమార్హుడు.

### నిశ్చయించుకొని కూడా, సన్న్యసించకపోతే...,

ఒకానొకడు సన్న్యసించటానికి నిర్ణయించుకొని, కుటుంబసభ్యుల అనుజ్ఞపొంది, కులగురువుల ఆశీర్వాదము పొంది, వైశ్వానరేష్టిని చేయుచూ... ఇటువంటి ఆయా సందర్భములలో ఒక సమయంలో ఏవో అవాంతరముల వలన సన్న్యసించు ఆలోచనను విరమించవలసి వస్తే? **సన్న్యాసే నిశ్చయా కృత్వా, పునః న కరోతి యః,** అట్టివాడు మరల సన్న్యసించాలని నిర్ణయించకుంటేనో? **స కుర్యాత్ కృచ్ఛ్ర మాత్రంతు పునః సన్న్యస్తుమ్ అర్హతి।** ఆతడు కృచ్ఛ్రమాత్రంగా (Eg. A function as a formality by inviting related people including Guru) - నిర్వర్తించి మరల సన్న్యాసము తీసుకొనవచ్చును. అనగా, ఇతఃపూర్వము నిర్వర్తించినంతవరకు – సన్న్యాస స్వీకారాగ్ని కార్యములు (వైశ్వానరేష్టి) మొ॥వి మరల నిర్వర్తించవలసిన పనిలేదు.

### త్రి–పతితులు

ఈ క్రింది ముగ్గురిని త్రి–పతితులు (Slip-Trio that fall down from the path of SANYASIN) - అని చెప్పబడుచున్నారు.

**(1) సన్న్యాసం పాతయేత్ యస్తు:** సన్న్యసించి, ఆ తరువాత సన్న్యాస నిష్ఠ–నియమములు పాటించనివాడు. తిరిగి సాంసారిక వ్యవహారములందు తలదూర్చి నిమగ్నుడగుచున్నవాడు. (Distraction and slipping into worldly Avocations). ఈతడు సన్న్యాసాశ్రమ విధుల నుండి భ్రష్టుడు అయినవాడు – అగుచున్నాడు.

**(2) పతితం న్యాసయేత్తుయః।** సన్న్యాసము స్వీకరించి కూడా ఆత్మన్యాసము (ఆత్మనిష్ఠ) ఆశ్రయించనివారు.

**(3) సన్న్యాస విఘ్నకర్తాచ।** ఎవరైనా సన్న్యాసాశ్రమాభిలాషులై ఉంటే, అట్టి సన్న్యాసాశ్రమ నిర్ణయము గల అర్హులు సన్న్యాసము తీసుకోనీయకుండా నిష్కారణంగా (కావాలని) విఘ్నములు కల్పించువారు.

## సన్న్యాసమునకు ఎవరు అనర్హులు?

**షండుడు (నపుంసకుడు). పతితుడు** ( బ్రహ్మచర్య – గృహస్థాశ్రమ ధర్మములు విడచి పతితుడైనవాడు), **అంగవికలుడు** (Physically Handicapped); **స్త్రైణుడు** (స్త్రీ స్వభావములు, లక్షణములు గల పురుషుడు); **బధిరుడు** (చెవిటివాడు); **అర్భకుడు** (బలహీనుడు); **మూగవాడు; పాషండుడు** (చెప్పితే విని కూడా ఏ మాత్రము తెలుసుకొనజాలని మూర్ఖుడు). చక్రీ – భుజముపై చక్రాంకణములు ముద్రించుకొన్నవాడు ( ఒక్క వైష్ణవమతమో, శైవమతమో మరేదైనా ఒక మతము తప్పించి మరే మాటలు వినటానికి విచారించటానికి సంసిద్ధుకాని స్వభావము అధికముగా కలవాడు); లింగధారణము చేసుకొన్నవాడు; కుష్టువ్యాధి పీడితుడు;

[చక్రీ = (చాడీలు చెప్పు, పరదూషణ చేయు అలవాటు విడువనివాడు)]

వైఖానసుడు (విష్ణు దేవాలయములో అర్చక వృత్తి నిర్వర్తించువారు);

**హరిద్విజే** (శ్రీహరిని ద్వేషించు స్వభావము కలవాడు);

భృతకుడు (రోజూ కూలిచేస్తూ కుటుంబభారము నిర్వర్తించువాడు);

అధ్యాపకుడు (వేదములు చదివింపజేస్తూ నేర్పుతూ ఉండే ఉపాధ్యాయుడు), శిపినిష్ఠుడు (వీరాభిమాని);

అనగ్నికుడు (అగ్నికార్యముల పట్ల దూషణబుద్ధి కలవాడు);

నాస్తికుడు (కనబడే ప్రపంచమునకు ఆధారమైయున్న భగవత్ సంబంధమైన చైతన్యతత్త్వము ఉన్నది – అనే అభిప్రాయమును తిరస్కరించువాడు);

ఆయా సంపద, పరస్పర సంబంధముల, లౌకికమైన వ్యవహారముల పట్ల అనురక్తి వదలలేనివాడు (విరక్తిని సముపార్జించుకోనివాడు)...,

***వీరంతా సన్న్యాసము స్వీకరించటానికి తగిన అర్హత పొందనివారవుతారు.***

→ ఒకవేళ్ళ వీరు **జీవన విధానము దృష్ట్వా సన్న్యాసము పుచ్చుకొన్నప్పటికి** ముందుకు వచ్చినప్పటికీ కూడా – **(సోఽహమ్, తత్ త్వమ్, జీవోబ్రహ్మేతి నాపరః అయామాత్మాబ్రహ్మ। సర్వం ఖిలు ఇదం బ్రహ్మ"** మొదలైన – పరతత్త్వమును సిద్ధాంతీకరిస్తూ వేద – ఉపనిషత్తులలో చెప్పబడిన) **మహావాక్యములను ఉపదేశించటానికి అర్హులు కాజాలరు.**

అట్లాగే,

ఆరూఢ పతితుడు (ఒకసారి సన్న్యసించి పతితుడైనవాడు), ఆతని సంతానము (కునఖీ); వ్యాధి చేత గోళ్ళు పిప్పిగోళ్లుగా అయినవాడు; దీర్ఘవ్యాధుల వలన పుప్పి పళ్లు గలవాడు; క్షయ మొదలైన ప్రాణాంతక రోగములచే బాధింపబడుచున్నవాడు; అంగవికలుడు (Physically handicapped)–***వీరంతా కూడా సన్న్యాసాశ్రమమునకు అర్హులు కాదు.*** (అయితే 'ఆతురసన్న్యాసము'నకు ఇవన్నీ అనర్హత కాదు).

దుష్ట స్త్రీ సంపర్కములో మునిగి తేలువారికి, పంచమహాపాతకములు చేసిన వారికి, వ్రాత్యులకు (ఉపనయము మొదలైన సంస్కారములు

నిర్వర్తించనివారికి), వారి పిల్లలకు, దుష్టప్రవర్తన కలిగియున్న సంస్కార హీనులకు, అభిశస్తులకు ( పరదూషణ చేస్తూ సంఘ బహిష్కారము పొందినవారికి).. సన్న్యాసముయొక్క అనుజ్ఞ (పూజ్యులగు గురువులు) ఇవ్వరు.

వ్రతము, యజ్ఞము, తపస్సు, దానము, హోమము, స్వాధ్యాయము. ఈఈ అభ్యాసములు లేకుండా వాటి పట్ల అగౌరము కలవారు, "సత్యము, శుచి" ఇటువంటి ఆశయముల నుండి భ్రష్టులైనవారు – **"సన్న్యాసము ఇవ్వకూడనివారు"** అని చెప్పబడుచున్నారు.

# ఆతుర సన్న్యాసము

కొన్ని సందర్భములలో మృత్యువును సమీపిస్తున్న ముముక్షువు **"సన్న్యాస స్వీకారేచ్ఛ"** – ప్రకటించునప్పుడు ఆతని బంధువులు నిర్వర్తింపజేయు 'సన్న్యాసము' – **ఆతుర సన్న్యాసము** అనబడుతోంది. పైన **సన్న్యాసదీక్షకు అనర్హులుగా** చెప్పబడిన వారందరు ఆతుర సన్న్యాసమునకు అర్హులే. **ఏతేన అర్హన్తి సన్న్యాసం ఆతురేణ వినా క్రమమ్।** ఆతుర సన్న్యాసమునకు సన్న్యాసాశ్రమ స్వీకారమునుకు చెప్పబడిన "బంధువుల – గురువుల అనుజ్ఞ, వైశ్వానరేష్టి, తూర్పు– ఉత్తర దిక్‌యానము" మొదలైన వాటితో అవసరము లేదు.

## సన్న్యసించుచూ ఆచరించవలసిన విధానములు

**శిఖాం ఉత్పాద్య। "ఓం భూః స్వాహా"** – అని పలుకుచూ ముందుగా శిఖ (పిలక)ను తొలగించివేయాలి.

**యజ్ఞోపవీతం ఛిత్వా :** బాహ్య ధారణా రూపమగు యజ్ఞోపవీతమును – **యశోబలం, జ్ఞానం, వైరాగ్యం మేధాం ప్రయచ్ఛ మే** – ఓ పరమాత్మా! ఇంతవరకు ఉపనయనార్ధము ధరించిన ఈ యజ్ఞోపవీతమును **సన్న్యాసాశ్రమ ప్రారంభ సంజ్ఞగా త్రెంచుచున్నాను. నా యొక్క నూతన ఆశ్రమంలో అడుగులిడుచుండగా, – యశోబలము, జ్ఞానము, వైరాగ్యము, మేథ ప్రసాదించవేడుకొనుచున్నాను. అనగా, భౌతికమైన యజ్ఞోపవీతమును విడుస్తున్నానేగాని, అంతరార్థమగు యశో–బల–జ్ఞాన–వైరాగ్య –మేధస్సులను కాదు"** అని భావన చేస్తూ యజ్ఞోపవీతమును త్రెంచాలి.

**వస్త్ర విసృజ్యమ్: "ఓం భూః స్వాహా"..** అని పలుకుచూ ఇదిగో – ఇతఃపూర్వపు నాగరిక కటిసూత్రమును (మొలత్రాడును), వస్త్రములను వరుణ భగవానునికి సమర్పిస్తున్నాను – అని చెప్పుచూ వస్త్రములను మొలత్రాడును జారవిడచుచూ **"సన్న్యస్తం మయా"** అని 3 సార్లు అభిమంత్రించాలి.

## భాస్కర భగవానుని – మంగళాశాసనము

సన్న్యాసము స్వీకరించిన ద్విజుని (ద్వితీయమగు ఆత్మతో ఏకత్వభావాన – సంసిద్ధుని)చూచి సూర్యమండలాధీసుడగు భాస్కర భగవానుడు తన యొక్క బ్రహ్మానందమును ప్రకటిస్తూ ఉంటారు. తన స్థానములో పులకితులగుచు :-

**'ఏషమే మండలం భిత్వా పరబ్రహ్మ – అధిగచ్ఛతి".** నాకు చేతులెత్తి నమస్కరిస్తున్న ఈ సన్న్యాస యోగాభ్యాసి దిగ్విజయుడై, నన్ను సమీపిస్తూ ఉండగా, నేను స్థానచలనము నిర్వర్తించి (సూర్యమండలము భేదించి 'పరబ్రహ్మము'ను చేరుటకు) మార్గమును చూపుతాను. **"బిడ్డా! సన్న్యాస యోగీ! సుస్వాగతం! నీ యొక్క పరాకాష్ఠ లక్ష్యము సిద్ధించుటకై నేను మార్గప్రసాదిని, మార్గదర్శిని అవుతాను"** – అని భాస్కరుడు మంగళాశాసనము పలుకుచున్నారు.

**"సన్న్యాసం మయా"** అని మూడుసార్లు పలుకుచూ.. సన్న్యాసించిన యోగి యొక్క '60' ఇతఃపూర్వపు తరములవారు, '60' మునుముందు తరములవారు సంసార కల్మష దోషముల నుండి విముక్తులై పవిత్రులు కాగలరు.

# దండము యొక్క పరిగ్రహణము

ఏ విధంగా అనేక దోషములతో కూడుకొనియున్న బంగారు ఖనిజము 'తుషాగ్ని' యందు కాల్చబడుచూ అట్టి దోషపూరితములగు అన్యలోహాణువులను త్యజించి ధగధగాయమానంగా ప్రకాశించి బంగారపు ముద్ద అగుచున్నదో.., ఆవిధంగా సన్న్యాసాశ్రమము జీవుని పవిత్రునిగా తీర్చిదిద్దగలదు.

**సన్న్యాసి "సఖా మా గోపాయ। ఆత్మ సఖుదా! రండి! రండి। నాకు రక్షకులు అవండి"** – అని త్రిదండమును చేత ధరించుచున్నాడు అట్టి ఆ సన్న్యాసయోగి యోగాగ్ని యొక్క ఆశ్రయముచే వెలుగొందగలడు.

**అట్టి దండము –** వెదురుతో తయారైనదై ఉండాలి. లోహముతో తయారు చేయునది నిషిద్ధము. ఆ దండము 'చిల్లులు, ఎత్తు పల్లములు' – కలిగినదై ఉండకూడదు. సమమైన కణుపులు కలిగి ఉండాలి.

పుణ్యస్థలములలో సముత్పన్నమైనదై (లేక) ఆశ్రమములవంటి పవిత్ర స్థలము నుండి తెచ్చినదై ఉండాలి. అంతేగాని శ్మశానవాటికలనుండి, అపరిశుభ్రప్రదేశముల నుండి తెచ్చినట్టిది అవకుండును గాక! అద్దానిని ఆచ్ఛాదించి యున్న దుమ్ము, ధూళి, పేడ వంటి కల్మష దోషములన్నీ తొలగించాలి. సహము కాలినది, చీలికగా విరిగియున్నది అయి ఉండరాదు.

### *దండము యొక్క ఎత్తు*

ఆ యతి / సన్న్యాసి నడుచునప్పుడు సానుకూల్యంగా పై భాగంలో లావుగా, క్రిందవైపు కొంత సన్నముగాను, చివ్వర చతురస్రాకారము కలిగి ఉండుగాక.

***పొడుగు (Length) :***

→ నేల నుండి నడుము ఎత్తు వరకుగాని,

→ నేల నుండి – ముక్కు స్థానము వరకుగాని,

→ నేల నుండి – భ్రూమధ్య స్థానము ఎత్తుగాని,

సన్న్యాసియొక్క సానుకూల్యతను, సౌకర్యమును అనుసరించి దండము పొడవు కలిగినదై ఉండును గాక।

**దణ్డ ఆత్మనోఽ ఉ స్తు సంయోగః సర్వధాతు విధీయతే॥** ఏ విధంగా ఆత్మ ఈ జీవుని సర్వదా వెంటనంటి ఉంటుందో.. ఆ తీరుగా సన్న్యాసి దండమును సర్వదా చేత ధరించి తన వెంటనే ఉండును గాక! దండము – సర్వతత్త్వ స్వరూపమగు ఆత్మయొక్క భావనకు **'సంజ్ఞ'.**

**"ఈ దండము (ఇక్కడి సమస్తము 'తానే' అయి, ఈ సమస్తమునకు 'వేరే కూడా' అయి ఉన్న) మమాత్మ స్వరూపముగాను, ఆత్మధ్యాన పరికరముగాను కూడా ధారణ చేస్తున్నాను"** – అని ఆ యతి భావన కలిగి ఉండును గాక! **న దణ్డేన వినా గచ్ఛేత్ ఇషుక్షేప త్రయం బుధః।** ఆ సన్న్యాసి దండము లేకుండా – బాణము విడచినప్పటి దూరమునకు – మూడంతలు (x3) మించి నడచి వెళ్లరాదు– అను నియమము కలిగి ఉండును గాక.

**కమండలువు / కమండలము:** (సన్న్యాసులు, బ్రహ్మచారులు జలముకొరకై ఉపయోగించు పాత్ర / కొమ్ము చెంబు వంటిది).

> **"జగత్ జీవనం, జీవన ఆధారభూతం,**
> **మాతే! మా మంత్రయస్వ సర్వసౌమ్య!"**

అను మంత్రమును పలుకుచూ కమండలమును జగత్ జీవనము (జగత్తులో అంతటా ప్రసరించియున్న జీవన (లేక) ప్రాణశక్తి గాను), సమస్త జీవుల జీవనాధారభూతంగాను ఉపాసించుచూ చేత ధరించాలి. సన్న్యాసి ఈ విధంగా యోగ కమండలువును చేతితో పరిగ్రహించి, యోగ పట్టాభిషిక్తుడై ఆత్మసుఖమును సునిశ్చలము, సునిశ్చితము చేసుకొనుచూ ఈ విశ్వ ఉద్యాన వనమునందు హాయిగా, సుఖముగా విహరించును గాక। ఈ దృశ్య ప్రపంచమును 'ఆత్మ' గురించిన అధ్యయన విద్యకొరకై ప్రసాదించబడిన విశ్వవిద్యాలయము (The universe is an university for studying about "SELF") గా భావించును గాక.

**<u>ఇక సాంఘికమైన సామాజికమైన విశేషములైనటువంటి:–</u>**

"ఇది ధర్మము. అది ధర్మము కాదు – అధర్మము ।
– ఇది సత్యము – అది అనృతము – అసత్యము।"
– వీరు మంచివారు. వారు కాదు. వీరు జ్ఞానులు. వారు అజ్ఞానులు"

– మొదలైన సాపేక్ష సంబంధమైన సంభాషణలను, వాదోపవాదములను, "మంచివారు – కానివారు; ధర్మపరులు – కానివారు; సత్యవంతులు – అసత్యవంతులు" ... ఇత్యాది భేద దృష్టులను సర్వాతీత దృష్టితో త్యజించి వేయునుగాక! అంతేకాదు. **యేన త్యజసి, తత్ త్యజ!** దేనితో **'ఇవన్నీ త్యజిస్తున్నాను'** అనే త్యాగమును నిర్వర్తిస్తున్నారో, అట్టి త్యాగాహంకారమును కూడా త్యజించి.. ఈ భూమిపై **"త్యాగత్యాగి"**యై బ్రహ్మానంద – **దండము**ను, **ప్రజ్ఞా కమండలువు**ను ధరించి ప్రశాంత చిత్తుడై సంచరించును గాక! "ఇదంతా నా ఆత్మయే"– అను భావనను పుణికిపుచ్చుకొని ఈ జగత్–ఉద్యానవనములో చిన్నపిల్లవానివలె క్రీడించును గాక।

## చతుర్విధ సన్న్యాసయోగులు

(1) వైరాగ్య సన్న్యాసి (2) జ్ఞాన సన్న్యాసి (3) జ్ఞాన వైరాగ్య సన్న్యాసి (4) కర్మ సన్న్యాసి

**(1)** <u>వైరాగ్య సన్న్యాసి</u> **: దృష్ట్వా అనుశ్రవిక విషయ వైతృష్ణ్యం ఏత్య, ప్రాక్ – పుణ్యకర్మవిశేషాత్ సన్న్యస్తః॥** ఒకానొకడు ఈ ప్రాపంచక విషయాలు చూచి చూచి, విని విని, ... ఇక వీటిపై రోత పుట్టి,... సమస్త సందపల పట్ల, సంబంధ అనుబంధ బాంధవ్యముల పట్ల – విరక్తి పొందుచున్నాడు. సమస్త దృశ్య విషయముల పట్ల తృష్ణారాహిత్యము పొందుచున్నాడు.

*"అబ్బ! ఎంతో చూచాను. తిన్నాను. త్రాగాను. జనులతో సంబంధములు అనుభవించాను.* ***(అహం మన్యేః అలమ్।).*** *ఇక చాలు! వీటి వలన నాకు ఉత్తమ ప్రయోజనమేదీ లేదు. చూచినదే చూస్తున్నాను. విన్నదే వింటున్నాను. చెప్పినదే చెప్పుచున్నాడు. ఈ దేహము క్రమంగా శిధిలము కాబోవుచున్న వస్తువేకదా! వీటిలో అభిరుచి పొంది ఉండవలసినది క్రొత్తగా ఏమున్నది?"*

**– అని ప్రశ్నించుకుంటున్నాడు.**
**– తర్కించుకుంటున్నాడు.**

వాటన్నిటిపట్ల అనురక్తిని మొదలంట్లా త్రెంచి వేసుకుంటున్నాడు.

(న జాతు కామః కామానామ్ ఉపభోగేన శామ్యతే – అని (భారతములో) యయాతి చక్రవర్తి ఎలుగెత్తి పలికినట్లు), ప్రాపంచక విషయములు పొందుచున్నకొలదీ ఇంకా పొందాలనే అనిపిస్తుంది. కాని, "చాలు, ఇంకా ఎందుకు?" అని అనిపించటము దైనందికమైన లౌకిక జీవితంలో అనిపించదు. మరి ఎప్పుడనిపిస్తుంది? **ప్రాక్ పుణ్యకర్మ విశేషాత్ సన్న్యస్తః।** జన్మ జన్మాంతరాలుగా నిర్వర్తించిన పుణ్యకర్మల ఫలితంగా మాత్రమే అది లభ్యమౌతుంది. అట్టివాడే **హృదయమందు రాగరాహిత్యము** (sans attachment) సిద్ధించుకొని **"వైరాగ్యసన్న్యాసి"**గా అగుచున్నాడు. సర్వత్రా విరాగి అయినవాడు స్వభావసిద్ధంగానే ఆత్మతో అనుసంధానము పొందుచున్నాడు.

**జ్ఞానసన్న్యాసి : శాస్త్ర జ్ఞానాత్ పాపుపుణ్యలోక అనుభవ శ్రవణాత్, ప్రపంచ ఉపరతో, దేహవాసనాం – శాస్త్రవాసనాం – లోకవాసనాం త్యక్త్వా, అవమానం మానమివ ప్రవృత్తిం సర్వం హేయం మత్వా, సాధన చతుష్టయ సంపన్నో–యః సన్న్యస్యతి।** ఒకానొకడు **"శాస్త్రములు విశదీకరిస్తున్న మహత్తరము, ఆత్యంతికము ఏమై ఉన్నది?"**..... అని శాస్త్రములు పరిశీలించటము ప్రారంభిస్తున్నాడు. ఇతిహాసములు, పురాణములు పుణ్యపాపకర్మల తదనంతర సుఖ–దుఃఖ పర్యవసానములగురించి ఏమి చెప్పుచున్నాయో....**వినుచున్నాడు.** సమస్త ద్వంద్వములను అధిగమించగా శేషించు ఆత్మగురించి **చదువుచున్నాడు. "ఈ దృశ్యముగా అనేక భేదములతో కనిపించేదంతా కాలముచేత జనిస్తోంది. కాలము చేత నశిస్తోంది. అందుచేత దీనికి పరిమితమై ఉండటమనేది మహదాశయమే కాదు. ఇదంతా సందర్భంగా సత్యమువలె కనిపిస్తోంది. సహజమగు సత్యము ఏమాత్రము కాదు"** – అని గ్రహించుచున్నాడు. **ఇక ప్రపంచము నుండి తనయొక్క ఇష్టముపట్ల, ఇష్టము – రూపమగు చిత్తముయొక్క ఉపశాంతికై** (withdrawl) **కై సంసిద్ధుడగుచున్నాడు.** క్రమంగా గురువాక్యములు మననము చేస్తూ, దేహముతో ఏర్పడుచున్న వాసనలు, శాస్త్ర పాండిత్యమునకు సంబంధించిన వాసనలు (Tendencies), లోకములోని జనులతోను – ప్రదేశములతోను – వస్తుసముదాయముతోను సంబంధితమైయున్న వాసనలను, ఉత్తమ – అధమలోకములకు సంబంధించిన అభినివేశములను – మొదలంట్లా త్యజించుచున్నాడు. **"మానము – అవమానము"**...ఇటువంటి ద్వంద్వభావములన్నీ **"మనోకల్పితమగు భ్రమయే కదా!"** – అని గమనించి వాటిని తిరస్కరించి వేయుచున్నాడు. క్రమంగా జయిస్తున్నాడు. అట్టి ప్రవృత్తులన్నీ హేయముగా చూడనారంభిస్తున్నాడు. **సాధనచతుష్టయసంపత్తి** (1) ఇంద్రియ నిగ్రహరూపమగు **శమము** (2) అధ్యయనరూపమగు **విచారణ** (3) పొందుచూ ఉన్నదానిపట్ల **తృప్తి (సంతోషము)** (4) మహనీయులతో సంగము రూపమగు **సంత్సంగము** లను ఆశ్రయిస్తున్నాడు. సాధన చతుష్టయ సుసంపన్నుడై (After fully practising Four facets) వెలయుచున్నాడు. అట్టియోగి శాస్త్రజ్ఞాన – విజ్ఞానసంపన్నుడై సన్న్యాసాశ్రమము స్వీకరించినప్పుడు ఆయన **'జ్ఞానసన్న్యాసి'** అని పిలువబడుచున్నారు.

**(3) జ్ఞానవైరాగ్య సన్న్యాసి : క్రమేణ సర్వమ్ అభ్యస్య సర్వం అనుభూయ జ్ఞానవైరాగ్యాభ్యాం స్వరూప–అనుసంధానేవ – 'దేహమాత్ర' అవశిష్టః సన్న్యస్య జాతరూపధరో భవతి – స "జ్ఞానవైరాగ్య సన్న్యాసీ"।।**

ఒకానొకడు –

- శాస్త్రములు చెప్పుచున్న 'తత్త్వజ్ఞానము' గురించి అభ్యాసము చేసినవాడై,
- క్రమంగా సర్వము అనుభూతిగా పొందినవాడై,
- జ్ఞాన – వైరాగ్యపూర్వకంగా ఆత్మస్వరూపానుసంధానము చేయుచూ,
- దేహత్వమును అధిగమించి 'దేహి' మాత్రుడుగా శేషించినవాడై, సర్వమును మనస్సుతో సన్న్యసించివేయుచున్నాడు.

అప్పుడే పుట్టిన బిడ్డవలె జగద్రహితుడై, కేరింతలు కొట్టుపిల్లవానివలె **జాతరూపధరుడు** అగుచున్న యోగి **జ్ఞానవైరాగ్య సన్న్యాసి**గా అనబడుచున్నాడు.

**4.** కర్మ సన్న్యాసి : **బ్రహ్మచర్యం సమాప్య, గృహీభూత్వా – వానప్రస్థాశ్రమమ్ ఏతి। అవైరాగ్యాభావే–పి, ఆశ్రమ క్రమానుసారేణ....సన్న్యాస్యతి యః –** ఒకానొకడు ఆశ్రమ క్రమానుసారంగా మొదట బ్రహ్మచర్యమును, తరువాత గృహస్థాశ్రమమును, ఆ తరువాత వానప్రస్థాశ్రమమును నిర్వర్తించి...అటుపై వరుసక్రమంగా (వైరాగ్యవంతుడు అవకయే) ఆత్మతత్త్వానుభూతికొరకై సన్న్యసిస్తే .... అది **కర్మ సన్న్యాసము** అగుచున్నది.

# షట్ (6) విధ సన్న్యాసులు - వారి బాహ్య లక్షణములు

(1) కుటీచక (2) బహూదక (3) హంస (4) పరమహంస (5) తురీయాతీత (6) అవధూత

**(1) కుటీచక సన్న్యాసి: శిఖాయజ్ఞోపవీతీ। దండ కమండలు ధరః। కౌపీన శాటీ కన్థా ధరః। పితృ మాతృ గుర్వారాధనపరః।**

కుటీరమును (ఇల్లును) విడువకయే సన్న్యసించువాడు. కుటీరమే ఈయనకు ఆశ్రమము. ఆశ్రమమే ఆతనికి కుటీరము కూడా. యజ్ఞోపవీతము, శిఖ (పిలక) ధరించియే ఉంటారు. అయితే దండము, కమండలము ధరించి ఉంటారు. గోచి, దుప్పటి, బొంత కలిగినవాడై ఉంటారు. తనయొక్క సేవలను అందిస్తూ తల్లి, తండ్రి, గురువులను సంతోషింపజేస్తూ పరిసేవకుడై ఉంటారు. ఆత్మను ఆరాధిస్తూ ఉంటారు. సర్వదా శ్రామికుడై ఉంటారు. కవ్వపుకోల, వంటకుండ, గడ్డపార, త్రవ్వకము, పారా, ఉట్టి - ఇటువంటి సేవక వస్తువులన్నీ ఈయనకు యోగ సాధనవస్తువులే. దేశ సంచారము కాకుండా ఒక్కచోటనే ఉండి అక్కడ మాత్రమే భోజనము సేవించు అభ్యాసము కలిగి ఉంటారు.

*ఈయన ముఖ్య బాహ్య లక్షణములు - మరల చెప్పుకుందాము.*

(i) శిఖా - యజ్ఞోపవీతి। దండ కమండలు ధరః।

(ii) కౌపీన శాటీ కంధారః।

(iii) పితృ-మాతృ-గురు ఆరాధనపరః।

(iv) శ్రమను చేస్తూ సమర్పించువాడు।

(v) ఏకత్రా అన్నాదనపరుడు. (అన్నము సమకూర్చువాడు, తయారు చేయువాడు).

(vi) శ్వేత (తెలుపు) ఊర్ధ్వ పుండ్రములను ధారణచేస్తూ ఉంటాడు. త్రిదండమును చేత ధరిస్తూ ఉంటారు.

(vii) **సర్వసమో।** సర్వత్రా సమభావుడై ఒకచోటనే ఉండి ఆశ్రమ జీవితం గడుపుతూ ఉంటారు. ఈతడు తాను ఎక్కడ ఉంటే అక్కడ, తన **'ఆశ్రమము'**గా భావిస్తూ ఉంటాడు.

## 2. బహూదక సన్న్యాసి

**శిఖాది కంధాధరః :** ఈయన కూడా శిఖ (పిలక), కంఠము (బొంత) మొదలైనవి ధరిస్తూ ఉంటారు.

**త్రిపుండ్ర ధారీ :** ఫాలభాగము చేతులు మొదలైన చోట్ల త్రిపుండ్రములను ధరిస్తూ ఉంటాడు.

**కుటీచకవత్ సర్వసమో।** కుటీచక సన్న్యాసివలెనే సర్వత్రా సమభావనచే సమస్తము ఆత్మగా దర్శించు **అభ్యాసి, స్వభావి** అయి ఉంటారు.

**మాధుకరీ :** భౌతిక దేహమును మాధుకర (భిక్షక) వృత్తిచే ఒక బాహ్య ఉపకరణముగా (రైతు ఆవును పోషించుతీరుగా) సన్న్యాసయోగ సాధనా లక్ష్యముతో పోషిస్తూ ఉంటారు. **లోకమునకు ఉపయోగించు ఒక వస్తువుకు కాపలాదారునివలె శరీరముపట్ల భావన కలిగి ఉంటారు.**

**మాధుకరవృత్యా అష్ట కబళాశీ :** భిక్షకుడై ఉంటాడు. ఎనిమిది కబళములు మాత్రమే - ఎనిమిది ఇళ్లలో మాధుకరముతో - 'పొట్ట' అనే యజ్ఞకుండమునకు (భిక్షాటనచే) సమర్పించు భావము కలిగి ఉంటారు.

## 3. హంస :

**జటాధరీ।** జడలు ధరించి ఉంటారు.

**త్రిపుండ్ర ఊర్ధ్వధారీ :** త్రిపుండ్రములను ధారణ చేస్తూ ఉంటారు. ఫాలభాగముపై ఊర్ధ్వ పుండ్రధారుడై ఉంటారు.

**అసంక్లప్త మాధుకరీ (అన్నాశీ) :** విశాలమైన వీధులలో మధుకరము (భిక్షాటనము) చేస్తూ లభించిన ఆహారమును స్వీకరించువారై ఉంటారు.

**కౌపీన-ఖండధారీ :** గోచీ, గొంగళి ధరించు వారై ఉంటారు.

### 4. పరమహంస

- **శిఖాయజ్ఞోపవీత రహితః** శిఖ, యజ్ఞోపవీతములను విడచివేసినవారై ఉంటారు.
- **పంచగృహేషు కరపాత్ర :** '5' ఇళ్లలో మాత్రమే రెండు చేతులతో ఆహారము భిక్షగా స్వీకరించువారై ఉంటారు.
- **ఏక కౌపీనధారీ** : ఏకకౌపీనమును, ఒకటే (బొంత/దుప్పటి), ఒక వైణవము (వెదురుదండమును) ధరిస్తూ ఉంటారు.
- అంగములందు చితాభస్మమును ధరించుచూ ఉంటారు. **భస్మోద్ధూళనపరః**
- **సర్వత్యాగీ।** ఈ దేహ దృశ్య-లోక-సాంఘిక సంబంధ-అనుబంధ-వ్యవహారములన్నీ మొదలంట్లా త్యజించినారై ఉంటారు.

### 5. తురీయాతీతుడు

గోముఖవృత్తిగా ఏది ఎక్కడ ఎంతవరకు లభిస్తే....అంతవరకే భుజించుచూ సంచరించువారు.

**గోముఖవృత్త్యా ఫలహారీ - అన్నాహారీ।**

- మూడు గృహములందు భిక్షాటన చేసి ఏది ఎంత వరకు లభిస్తే అంతవరకే స్వీకరించి ఈ మాంసమయదేహమును లోకవినోద-లోకకళ్యాణభావనలతో పోషించువారు.
- ఈ దేహమును భౌతికమైన ఒక బాహ్య వస్తువుగా చూచువారు.
- దిగంబరులై, దేహమాత్రావసిష్టులై ఉండువారు. (దిక్ + అంబరులు = ఈ 10 దిక్కులతో కూడిన దృశ్య ప్రపంచము తాను ఆత్మస్వరూపుడై ధరిస్తున్న వస్త్రముగా దర్శించువారు)
- ఈ శరీరమును శవమువలె ఒక మరణించిన (గతించిన) వస్తువుగా - **కృణపవత్** - చూచువారు. శరీరవృత్తులను త్యజించి ఉండువారు.

  ఒకడు ఏ రంగు వస్త్రము ధరించినా కూడా, కాళ్లు - చేతులు - చర్మము మొదలైన వాటితో కూడిన ఆతని శరీరము యొక్క సహజ ధర్మములు మారవు. అట్లాగే, నేను శరీరము ధరించినా కూడా సత్ - చిత్ - ఆనందస్వరూపమగు **'శరీరి'** ధర్మములు మారవు - అను ఎరుక కలిగి ఉంటాడు.

### 6. అవధూత

- వీరి గురించి చెప్పుకోగల ఎటువంటి నియమములు ఉండవు. **అనియమః**
- **పతిత అభిశస్త విసర్జన పూర్వకం సర్వవర్ణేషు అజగరవృత్త్యా ఆహార పరః** ఏవిధంగా కొండచిలువ ఉన్నచోటే ఉండి తనకు ప్రాప్తించిన ఆహారమును భుజిస్తుందో, అట్లాగే అవధూత (పతిత - అభిశక్తులు ఇతరులపై నిందలు మోపువారు, హింసించువారు కాకుండా ఉన్నట్టి) **సర్వవర్ణములవారి వద్ద** ఐచ్ఛికంగా లభించిన ఆహారము (భిక్ష)ను ప్రియముగా స్వీకరించుచూ ఉంటారు.

<u>స్వరూప అనుసంధానపరః</u>

- నా ఆత్మయే సర్వజీవుల యొక్క ఆత్మ అయి ఉన్నది **(మమత్మా సర్వభూతాత్మా)!**
- స్వప్న ద్రష్టయొక్క స్వీయ ఆత్మచైతన్యమే స్వప్నములో కనిపించుచున్న వారందరిలో నిండినదై ఉన్నతీరుగా, మమాత్మయే సర్వులయందు వేంచేసిదై, సంస్థితమై ఉన్నది. **(సర్వభూతస్థమ్ ఆత్మానమ్)** ఏది సర్వులయందు సమమగు ఆత్మగా వేంచేసి ఉన్నదో - అదియే నేను.
- ఈ ఎదురుగా కనబడుచున్నదంతా ఏర్పడియున్నది ఎందులో? ఎక్కడా? మమాత్మయందే! **(సర్వభూతాని చ ఆత్మని)**
- నాకు అనుభవమగుచున్న ఈ సమస్తముగా ప్రభవిస్తున్నది నేనే। ఇదంతా నాయందే ప్రభవిస్తోంది **(ఇదంతా నాయందే (ఆత్మయందే) ప్రకాశిస్తోంది. (అహం సర్వశ్చ ప్రభవో। మత్తః సర్వం ప్రవర్తతే। మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి। మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ - శ్రీమద్భగవద్గీత).**

... ఈ మొదలైన ఉపనిషత్ బోధలను పునికిపుచ్చుకున్నవాడై అవధూత సర్వదా **స్వస్వరూప - సహజస్వరూప ఆత్మానుసంధానుడై ఉంటాడు.** ఈ భౌతిక 'దేహము'ను అలంకారోపకరణముగా కలిగియుండి, క్రీడావినోదంగా దృశ్యంలో సంచరిస్తూ ఉంటారు.

వీరందరూ కూడా (కుటీచకుని నుండి-అవధూత వరకు) **ఈ భౌతికదేహమును జగద్దృశ్యమునకు చెందిన ఒక ఉపకరణముగాను, తాముఈ జగత్తంతా తన శరీరముగా కలవాడుగాను దర్శించువారై ఉంటున్నారు.**

## సన్న్యాసయోగుల (అవధూతల, పరమహంసల, తురీయాతీతుల) ఆత్మానంద గానము

## WHAT I AM NOT? - నేను ఏది అయి ఉండలేదు?

**జగత్ తావత్ ఇదం నాహం, స వృక్ష తృణ పర్వతమ్। యత్ బాహ్యం జడమ్ అత్యంతమ్- తత్స్యాం కథమ్ అహమ్ విభుమ్?, నేను ఈ బాహ్య జగత్తులోని వస్తువు వంటివాడిని కాను.**

ఈ దృశ్యము కనిపిస్తూ ఉన్నదిగాని, ఇందులో కనిపించే వృక్షములు, గడ్డిపరకలు, పర్వతములు వంటి ఒక వస్తువును **నేను కాదు**. ఈ దృశ్యములోని భౌతిక వ్యవహారమంతా అచేతనమగు జడము. ఇక నేనో? సచేతనమగు చైతన్యస్వరూపుడను. నిత్యచైతన్యుడగు నేను రాయి – రప్ప – వంటి అచేతనపదార్థమెట్లా అవుతాను? **వాటికి నేను భావనారూప – సంకల్ప సమన్వితుడగు విభువును.**

ఈ భౌతిక దేహము నేను కానే కాదు। **కాలేన అల్పేన విలయీ దేహో నాహం అచేతనః।** ఈ భౌతికదేహము స్వయముగా కదలలేదు. చూడలేదు. వినలేదు. అందుచేత అచేతనము. పైగా ఇది కొంతకాలం క్రింత కల్పించబడి, **మరికొద్దికాలంలో నశించబోయేది. చెవులు, కనులు, ముక్కు, గుదము, శిశ్నము, నోరు మొదలైన రంధ్రములతో కూడినదై,** ఒకప్పుడు ఏర్పడి, మరొకప్పుడు గుప్పెడు **బూడిదగా పరిణమించబోయే ఈ అచేతన దేహము నేనెట్లా అవుతాను? దీనిని ఉపయోగించి** – వినటము, చూడటము, మాట్లాడటము, రుచి, స్పర్శ...ఇవన్నీ **ఆస్వాదించే చేతనస్వరూపుడను.** ఈ దేహము కల్పనలోనిది. నేనో, కల్పించుకొనువాడను. అందుచేత ఈ భౌతికంగా కనిపించే దేహము నేను కాదు.

నేను శబ్దమునా? కాదు. **శూన్యాకృతిః శూన్యభవః శబ్దో నాహమ్ అచేతనః।** శూన్యమైన ఆకృతి కలిగి, శూన్యమునుండి జనించే "ఆహా! ఓహో! ఊహూ" ఇత్యాది సమస్తశబ్దములు నేనుకాదు. అవి శూన్యస్వరూపము. **పూర్ణస్వరూపుడనగు నానుండి బయల్వెడలే పలుకులు మాత్రమే!**

నేను స్పర్శ, చర్మము కాను। **త్వచా క్షణ వినాశిన్యా ప్రాప్యో-అప్రాప్యో అయం అన్యథా।** స్పర్శ ప్రాప్తించుచున్నప్పుడు, ప్రాప్తించనప్పుడు కూడా నేను ఉన్నాను. వాటి ప్రాప్తాప్రాప్తములు నాపై ఆధారపడిఉన్నాయి. వాటికి సర్వదా నేను వేరై ఉన్నాను. స్పర్శ అనేది నాయొక్క చిత్ – చైతన్యముచేత ప్రసాదించబడుచున్న స్వానుభవం. అంతేగాని, అది నేను కాదు.

రుచి నేను కాదు. **లబ్ధాత్మా జిహ్వయా మందో లోలయా, లోల సత్తయా, స్వల్ప స్యన్దో ద్రవ్యనిష్ఠో రసో నాఽహమ్।** చంచలమైన ఈ నాలుకచే గ్రహించబడుచూ, నాలుకపై మందముగా, స్వల్పంగా స్రవించుచూ, పదార్థస్పర్శచే రూపము పొందుచున్న 'రుచి' నేను కాదు. అది స్వయంగా ప్రవర్తించేది కాదు. జడము. అచేతనము. **నేను చేతన స్వరూపుడను. 'రుచి' అనే నిర్వచనము నాకు స్వాధీనమైనది. నేను దానికి స్వాధీనుడను కాను.**

మరి నేను ఈ దృశ్యమును ఆస్వాదిస్తూ ఉన్న ద్రష్టత్వ పరిమితుడనా? కానే కాదు. **దృశ్య దర్శనయోః లీనం క్షయి, క్షణ వినాశినోః కేవలో ద్రష్టరి క్షీణం రూపం నాహమ్ - అచేతనమ్॥** క్షణంలో ఏర్పడి, మరుక్షణంలో నశించే దృశ్య – దర్శనములను పొందుచున్న ద్రష్టనా? కాదు. ద్రష్టగా రూపుదిద్దుకోనప్పుడు (లేక) దృశ్యముతో సంబంధము పెట్టుకోనప్పుడు కూడా 'నేను' ఉన్నాను. అందుచేత ద్రష్టరూప పరిమితుడను కాను. 'ద్రష్ట'కు నియామకుడను. ద్రష్టను నా వినోదము కొరకు నేనే కల్పించుకొనువాడను. **'దృక్' స్వరూపుడను.** జగదభిమానియగు 'జీవాత్మ' – నాచే కల్పించబడుచూ, నాయొక్క ఒకానొక 'అంశ' – మాత్రమే అయి ఉన్నది. కనుక నేను 'ద్రష్ట'ను కూడా కాదు. మునుముందటివాడిని.

**నాసయా గన్ధ జడయా, క్షయిణా పరికల్పితః।** క్షణంలో పరికల్పించబడి, పేలవమైన నియతాకారము కలిగినది, అచేతనము అయిన **గన్ధము (సువాసన –దుర్వాసనలు) నేను కాదు.**

❖ ❖ ❖

## మరి నేను ఎవరు? WHO AND WHAT AM I? - ఏది అయి ఉన్నాను?

- **కల్పన – అకల్పనలకు వేరై** ఉన్నవాడిని.
- **నిర్మమో।** మమకార – అహంకారములకు ఆవలివాడిని.
- **అమనస్కః।** అమనస్కుడను. ఆలోచనలలోని వాడిని కాదు. ఆలోచనలకు వేరైనవాడిని.

- ఆలోచించువాడిని. ఆలోచనలకంటే మునుముందువాడిని. **ఆలోచనలన్నీ నా శాంతరూపమునుండి బయల్వెడలుచున్నాయి.**
- **పరమ శాంత స్వరూపుడను.**
- శబ్ద స్పర్శ రూప రస గంధ – పంచేంద్రియ – అనుభవైక విషయములగు భ్రమలకు **అతీతుడను.**
- **శుద్ధ చైతన్య స్వరూపుడను.**
- దేహ–మనో–బుద్ధి–చిత్త–అహంకార మొదలుగా గల సమస్త చైత్యములకు (తెలుసుకోబడేవాటన్నిటికీ) **ఆవలివాడిని.** చైత్యవర్జితుడను. **చైత్యవర్జిత కేవల చిన్మాత్రమే నేను.** సమస్తము నా చైతన్యస్ఫూర్తి యందు వెలుగొందుచుండగా, నన్ను వెలిగించునది మరింకొక్కటేదీ లేదు. (చైత్యము = రుకచే 'ఎరుగుచున్నవి'గా రూపము పొందినదంతా)
- బాహ్య (దృశ్య జగత్‌లో)– అంతరములలో (మనోబుద్ధి చిత్త అహంకారములలో) ఆయా సమస్త విశేషములుగా వ్యాపించియున్నది నేనే! మమాత్మయే। **అస్మత్ చిత్ – ఆనందస్వరూపమే।**
- మనో బుద్ధి దేహ దృశ్యముల దోషములచే స్పృశించబడువాడను కాను. **నిష్కళుడను. నిరంజనుడను. నిష్కళోఽహం నిరంజనః।**
- సమస్త కల్పనలు నాపట్ల **'లేనివే'** అవటంచేత నిర్వికల్పుడను. దర్పణములో ప్రతిబింబమువలె ఈ జగత్తు నా మనోదర్పణములోని ప్రతిబింబమే కాబట్టి **"చిదాభాసుడను"**
- ఏ ఏక అఖండాత్మ → సర్వగతమై సర్వత్రా వెలయుచున్నదో,.... అట్టి ఆత్మయే నా అనునిత్య స్వాభావిక స్వరూపము. నా ఆత్మయే సర్వదా సర్వత్రా సమస్త నామరూపాత్మకంగా వెలయుచున్నది **(సర్వగః).**
- ఇక్కడి కుండ, వస్త్రము మొదలైన జడముగా కనిపించేవన్నీ నాయొక్క చైతన్యస్వరూపము యొక్క సామీప్యతచేతనే చైతన్యవంతమై అగుపిస్తున్నాయి.
- నాయొక్క ఆత్మతేజస్సు చేతనే సూర్యబింబమునకు ఆవలగల సూర్యతేజస్సు – **బింబ, ప్రతిబింబములు**గా వెలుగొందుచున్నాయి!
- ఆత్మస్వరూపుడనగు నాచేతనే ఇక్కడి చిత్ర – విచిత్రములైన ఇంద్రియ వృత్తులన్నీ ప్రవర్తమానశీలమగుచున్నాయి. **మయ్యైవ ఏతాః స్ఫురన్తి ఇహ విచిత్ర ఇన్ద్రియ వృత్తయః।**
- అగ్నికణము అగ్నినుండి బయల్వెడలి ఆకాశములో వెలుగుతీరుగా అస్మత్ తేజో ప్రకాశముచేతనే ఈ జగత్తులు తేజో కణములై నానుండి బయల్వెడలి, నాయందే లయమౌచున్నాయి.
- **అనన్తానంద సంభోగా పర–ఉపశమశాలినీ।** నాయొక్క అనంతానంద సంభోగము నానుండే బయలుదేరి, నాయందే–నాచేతనే ఉపశమనము పొందుతోంది. నాయొక్క పరమశుద్ధమైయున్న **"చిన్మయదృష్టి"**చే తదితర జగద్దృష్టులన్నీ మొదలంట్లా జయించి వేయబడుచున్నాయి.

***ఏదైతే తనయొక్క "స్వకీయ సర్వభావముల అంతరము"న – 'తెలియబడేదంతా'*** *(All that being known)* ***తనయందు తన రూపముగా కలిగియున్నదో అదియే చిదాత్మ! అట్టి నాయొక్క ప్రత్యక్‌చైతన్య రూపమగు నాకు నేనే నమస్కరించుచున్నాను.***

*ప్రత్యక్ చైతన్యరూపాయ – మహ్యామేవ నమో నమః।*

## మాయ

అత్యంత వివిచిత్ర శక్తియుతము, స్వచ్ఛము, నిర్వికార–చిత్ స్వరూపము, సమయము యొక్క కలా (కల్పనా) – అకలనములు లేనట్టిది (Beyond the Time Factor) – అగు **'మాయ'** సర్వత్రా ప్రవర్తించుచున్నది. అట్టి త్రికాలరూపమగు చిత్–చైత్యముల (తెలుసుకొనునది – తెలియబడునది ల) పరస్పర సంబంధమే **"ఆత్మమాయ"**. **అట్టి త్రికాల రూప 'మాయ'ను అధిగమిస్తే సర్వత్రా సమరూపమగు ఆత్మయే స్వానుభవమై శేషించుచున్నది.**

### మాయ ఎట్టిది? 'జీవాత్మ'యొక్క చమత్కారమేమి?

'ఇట్టిది' అని చెప్పుటకు అగమ్యగోచరము. **వాచా అగమ్యగోచరా!** అట్టి అసత్తు "సత్తు"ను ఆశ్రయించి సత్తువలెనే శాశ్వతత్వము సంతరించుకుంటోంది. శాశ్వతమగు ఆత్మ కల్పితమగు మాయను ఆశ్రయించి నైరాత్మత్వము (ఆత్మలేనిదానివలెను, కల్పితమగు జగత్తు – దేహము మాత్రమే ఉన్నదానివలెను) – అనుభూతి రూపము పొందుచున్నది.

ఆవిధమైనట్టి ఆత్మకల్పితమగు **"మాయా రూపము (యా మా - స్వతఃగా లేనిది)"** - ఆత్మయొక్క తేజస్సు చేతనే ఉనికిని పొందుచున్నది. ఇక, దృశ్యాంతర్గతమగు 'జీవాత్మ' చేస్తున్నది ఏమిటి? తన కాలత్రయాతీత స్వరూపమును ఉపేక్షించి, ఇక్కడ లీలాచమత్కారముగా బంధనమును తెచ్చిపెట్టుకుంటోంది. **"ఇది కావాలి - అది కాకూడదు (ఈహ-అనీహ)"**లకు సంబంధించిన అంతరంగముతో తన నిర్మలమగు కేవల చిత్ స్వరూపమును కప్పి ఉంచుకుంటోంది. పాశములచేత బంధింపబడి పక్షివలె అగుచున్నది. తన చిత్‌స్వరూపము నుండి బయల్వెడలుచున్న జగత్ వ్యవహారమునందు తానే (జీవాత్మగా) చిక్కుకొనుచున్నది. భూమిపైన కలుగులో చిక్కుకున్న కీటకముతో సమానంగా ఈ దృశ్యమునందు **"కామమోహిత"** అయి ప్రవర్తిస్తోంది. అట్టి **'జీవాత్మత్వము'** అనేది - **అనేక నాటకములలో నటించే** గొప్ప నటునియొక్క ఒకానొక నాటకములో, ఒకానొక సందర్భములో నటిస్తూ ఉన్న ఒక పాత్రయొక్క ఆయా లక్షణముల వంటిది!

*ఈ జీవాత్మ నాయొక్క అంశమాత్రమే. జీవాత్మయొక్క బంధ - సంబంధ - అనుబంధ - బాంధవ్య - మోక్షములు మొదలైనవి కూడా జీవాత్మవలెనే నా పట్ల కల్పితము మాత్రమే. జీవాత్మకు బంధమున్నప్పుడు, లేనప్పుడు కూడా ఆ ఉభయములకు సంబంధము లేని* ***"కేవలాత్మ"****ను నేను.*

అట్టి నాయొక్క కేవలాత్మస్వరూపము గురించియే ఉపనిషత్ వాఙ్మయము చేత సవివరముగా పరామర్శించబడుచున్నది. సద్గురువుల, సచ్ఛాస్త్రముల పరిశీలనచే, శ్రవణముచే - సర్వదా సిద్ధించియే ఉన్న స్వ-స్వరూపము **పునః స్వానుభవముగా సిద్ధించుకోబడుచున్నది.** ఆత్మయే నాకు కేవల స్వరూపముగాను, తదితరమైనదంతా స్వీయకల్పనకు సంబంధించిన లీలా క్రీడా వినోద కల్పనగానూ - ప్రోదితమగుచున్నది. (స్వాభావికంగా నిరూపనము అగుచున్నది)

**ఉద్ధృతోఽస్మి। వికల్పోఽస్మి।**
**యోఽస్మి సోఽస్మి నమోస్తుతే॥**

అనునిత్యముగా ఉదితము (Ever-blossoming), నిత్యచేతనము (Always thrilingly active), వికల్పరహితము (Non-slipping to thoughts - level) అగు ఏ నా కేవలాత్మానంద స్వరూపము ఉన్నదో, అట్టినాయొక్క ఆత్మకు తే నమోస్తు! నమోస్తు తే! - అట్టి నిత్యోదిత వికల్పరహిత ఆత్మస్వరూపమే నాచే సర్వదా (దైవస్తుతి, ఇతరులపట్ల నమస్కార మర్యాదల ద్వారా) భక్తి - జ్ఞానములతో కూడి ఆయా ప్రయత్నములచే ఉపాసించబడుచున్నది.

[ **న** = పరస్వరూపము / కేవల స్వరూపము
**మః** = ఇహ స్వరూపము / సందర్భములోని స్వరూపము
**తే** = ఆ ఆపరస్వరూమగు నేనే - ఈ నా ఇహస్వరూపంగా కూడా ప్రదర్శనమగుచున్నాను.
ఈ 'నా' ఇహస్వరూపము పరస్వరూప ప్రదర్శనమే. - ఇతి 'నమస్తే'।]

**ఇదియే - సోఽహమ్**

ఇక్కడి "నేను - నా" స్థానంలో "నీవు-నీ"-లచే **'తత్‌త్వమ్'** సిద్ధించుచున్నది.

**తత్త్వమ్ - సోఽహమ్**

**ఇంకా కూడా 'సన్న్యాసి' యొక్క గానము ఈ విధంగా ఉంటోంది.**

అట్టి ఆత్మయే **'కేవల స్వరూపము'గా** గల నాకు నేనే నా నమస్కారము. ఓ 'నీవు'గా నాకు తారసబడుచున్న జీవాత్మ స్వరూపా! మిత్రమా! నీవు ఆత్మస్వరూపుడవేనయ్యా! మమాత్మ స్వరూపుడవుకూడా।

నేనెవడనో....నీవు అదియే! (అహమ్, త్వమ్ తదేవ।)।

నీవు ఎవడవో...నేను అదియే। (కస్త్వమ్, తదేవాఽహమ్।)।

**తుభ్యం మహ్యం అనన్తాయ** → నీవు - నేను కూడా సర్వదా ఆద్యంతములనునవే లేని అనంత - **అఖండాత్మ స్వరూపులము.**

**మహ్యం - తుభ్యం చిదాత్మనే** → అయ్యా! నేను నీవు కూడా కేవల - ఎరుక (Absolute knowing).....అగు చిదాత్మ స్వరూపులమే! నీకు నాకు **"తెలియబడేది వేరు వేరు"** కావచ్చుగాక। అంతమాత్రంచేత **"నీవు వేరు। నేను వేరు।"** గా అవుతామా? అవము. ఎందుకంటే "నీకు ఏది తెలియబడుతోంది? నాకు ఏది తెలియబడుతోంది?"... అను భేదమంతా సందర్భ సత్యము. కేవలచిత్ (కేవలమగు ఎరుక) దృష్ట్యా నాలోను, నీలోను కూడా ఉన్నది ఏకమగు 'ఎరుక' రూపమగు చిదాత్మయే!

**"ఏది తెలుసుకుంటున్నాము?"** - అనేది వేరువేరైనప్పటికీ తెలివి సర్వదా ఏకము - అఖండము కూడా!

**దృష్టాంతానికి :** “ఆ గదిలోని దీపపు తేజస్సులో (వెలుగు) ఏమేమి కనబడుచున్నాయి? ఈ గదిలోని దీపపు వెలుగులో ఏమేమి కన్పిస్తున్నాయి”.... అను ప్రశ్నలకు సమాధానము వేరువేరు కావచ్చు కానీ...వెలుగు దృష్ట్యానో? రెండు గదులలో వెలుగుచున్నది – ఒకే అగ్నియొక్క తేజస్సే కదా!

అట్లాగే,

- నాలోని ఎరుక – నీలోని ఎరుక వేరువేరు కాదు. ఒక్కటే!
- నాలోని **‘తెలుసుకొనువాడు’ – నీలోని ‘తెలుసుకొనువాడు’** వేరువేరు కాదు. ఒక్కటే।
- అట్టి ఏకముగా ఉన్న చిదాత్మకు నమస్కారము! **నమో నమః।**

అఖండమగు మమాత్మకే సర్వనమస్కారములు। (సర్వదేవ నమస్కారః కేశవమ్ ప్రతి గచ్ఛతి।)

**నమస్తుభ్యం పరేశాయ।** ‘నీవు’గా – ఆ పర – ఈశ్వరుడే కనిపిస్తున్నారు. పరేశ్వరుడవైయున్న ‘నీకు’ నా నమస్కారము.

**నమో మహ్యం శివాయ చ।** ‘శివోఽహమ్’ మహావాక్యముచే చెప్పబడు పరమసత్య వాక్యానుసారము ‘శివుడను’ అయి ఉన్న నాకు నా నమస్కారము. మన ఇరువురము కూడా...., **తిష్ఠన్నపి న ఆసీనో – గచ్ఛన్నపి న గచ్ఛతి॥** – ఈ జగత్ దృశ్యములో ఒకచోట (‘జీవాత్మ’ అని పిలువబడే అంశగా) కూర్చుని ఉన్నప్పటికీ,... మనము **ఎక్కడి నుండో ఇక్కడి వచ్చినవారము కాదు.**

**ఇక్కడ ఉండి మరెక్కడికో వెళ్ళువారము కాదు.** ఆత్మగా ఇప్పుడు ఎక్కడ ఉన్నామో...ఇతఃపూర్వం అక్కడే ఉన్నాము. ఆత్మస్థానమగు అక్కడి నుండి ఎక్కడికీ రాము. ఇక్కడి నుండీ అక్కడికి ఎక్కడికీ వెళ్ళము.

**శాన్తోఽపి వ్యవహారస్థః।** పరమ శాంత స్వరూపుమైయుండి కూడా ఆత్మ (మనందరి కేవల – కాలాతీత – కేవల సాక్షీ స్వరూపము)....సమస్త వ్యవహారములను (జాగ్రత్–స్వప్న–సుషుప్తులలోని సర్వ అనుభవములను, భూత–వర్తమాన–భవిష్యత్ సమస్త సందర్భములను, సత్య–రజో–తమో త్రిగుణ ప్రదర్శనములను, సకల సంబంధ – అనుబంధ – సంబంధ బాంధవ్యములను) – నిర్వర్తించుచున్నదే అయిఉంటోంది.

**ఆత్మ సర్వదా శాంతస్వరూపమైయుండియే సర్వ వ్యవహారశీలి కూడా.**

**కుర్వన్నపి న లిప్యతే :** సమస్తకర్మలు నిర్వర్తిస్తున్న కర్త అయి ఉండికూడా....వాటి వాటి కర్మదోషములు (సుకర్మ–దుష్కర్మ–నిష్కర్మ–అకర్మ దోషములు) ఆత్మను ఏమాత్రము అంటజాలవు. (గాలి సువాసనా – దుర్వాసనా పదార్థములపై ప్రసరిస్తూ ఉన్నప్పటికీ వాయువును ఆయా వాసనలు అంటవు కదా।)

ఆత్మభగవానుడు సమస్తమైన అన్య విషయములకంటే అత్యంత సులభుడు. ఆప్తబంధువువలె సర్వము ఎరిగినట్టివాడు. పద్మములో తుమ్మెద దాగి ఉండు విధంగా సమస్త దేహములలో వేంచేసియుండి, సమస్తమును ఆక్రమించుకొని ఉన్నట్టివారు. **నేను ఆత్మను.** ఈ సమస్తమును ఆక్రమించుకొనియున్నది నేనే. **నీవు ఆత్మవే। నీవే ఈ సమస్తము అయియే ఉన్నావు.**

**న మే భోగస్థితౌ వాంఛా న మే భోగ విసర్జనే॥** ఆత్మస్వరూపుడనగు నాకు **“ఇది ఇంకా భోగించువాడనై ఉండాలి”** – అనునది లేదు. సమస్తము ఆత్మయే అయి ఉండగా, అట్టి ఆత్మయే నేనై ఉండగా, – క్రొత్తగా పొందవలసినది ఏమున్నది? ఏవో భోగములను వదలవలసినది మాత్రము ఏముంటుంది? అట్లాగే, నేను ఏవో భోగములు విసర్జించటమనునదీ లేదు. నాకు వేరు కానిది నేనెట్లా విడుస్తాను?

**యదా యాతి తదా యాతు, యత్ ప్రయాతి ప్రయాతు తత్।** ఏది వస్తుందో అది వచ్చును గాక! ఏది పోవుచున్నదో అది పోవును గాక। **వచ్చేదీ – పోయేదీ నాలోనే। నాలోగాని, నాకుగాని వచ్చేది లేదు। పోయేది లేదు।** మనస్సుచే మనస్సు ఛిన్నము చేయబడుచుండగా నేను నిరహంకారుడను అగుచున్నాను. ‘భావించటము’ అనే అభ్యాసము దృశ్యానుభవమై పరిణమించుచున్నది. **అభావమును భావించటముచేత “కేవల స్వరూపము” అను స్వస్థతయందు తిష్ఠితుడను అగుచున్నాను.**

| | |
|---|---|
| భావములను కలిగి ఉంటూనే | నిర్భావుడనై, (లేక) భావాతీతుడనై, |
| ‘అహం’ను ధారణ చేస్తూనే | నిరహంకారుడనై, (లేక) అహంకారాది రహితుడనై, |
| ఆలోచనలు చేస్తూనే | నిర్మనస్కుడనై, (లేక) అమనస్కుడనై, |
| ఇష్ట అయిష్టములు ప్రదర్శిస్తూనే | నిరీహితుడనై, చిత్తరహితుడనై, |

ఉన్నాను. అట్టి నా సర్వాతీతత్వము సందర్భములను కలిగి ఉండి కూడా, సందర్భములకు వశమై ఉండదు.

నన్ను శత్రువుగా భావించువాడు, నేను శత్రువుగా భావించువాడు కూడా - నావలెనే సర్వదా కేవలాత్మానంద స్వరూపులమేగాని, కించిత్ కూడా అన్యము కాదు.

నీవు అనన్యుడవు. నేను అనన్యుడను. ఆతడు అనన్యుడు. **అనన్యమునకు మనమంతా అనన్యులము.**

నిరహంకారమనే పక్షి **'తృష్ణ'** అనే త్రాళ్ళను త్రెంచుకొని ఈ నా శరీరమునుండి బయల్వెడలి ఎటు ఎగిరిపోయిందో కూడా నేను చెప్పలేను. జ్యోతి (దీపము) వెలిగిన తరువాత, **"చీకటి ఎటుపోయింది?"** - అని ఎవరైనా అడిగితే, ఏమని చెప్పగలం?

ఆహా! ఆత్మగా నేను సర్వదా అకర్తను. అభోక్తను. ఈ జగద్దృశ్యములో జరుగుచున్నట్లుగా కనబడేదంతా నాటక కల్పనలోని వ్యవహారములవంటివి.

## జీవితం తస్య శోభతే

> శ్లో॥ యస్య నాహంకృతో భావో, బుద్ధిః యస్య న లిప్యతే
> యః సమః సర్వభూతేషు జీవితం తస్య శోభతే॥

ఎవ్వరి దృష్టిలో అయితే - తాను చేస్తున్న సమస్త కర్మలకు కర్త (ప్రకృతి లేక కల్పనయేగాని) తాను కాదని, (అట్లాగే) జగన్నాటక పాత్రలు అయినట్టి సర్వ తదితర జీవులకర్మలు ప్రకృతి చేతనే కథాచమత్కారమువలె కల్పితమగుచున్నాయని....
దృఢమైన, నిస్సందేహ పూర్వకమైన నిశ్చలమైన అవగాహన ఏర్పడినదై ఉంటుందో, - వారే **"నాహంకృత భావులు".**

### ఎవ్వరైతే -

- నాహంకృత భావ సమన్వితులో, వారి బుద్ధి - అహంకార - మమకార - దృశ్య వ్యసనముల దోషము పొందిఉండుటలేదో....,
- "సమస్త జీవులుగా ఉన్నది ఏకము-అఖండము అగు ఆత్మయే"...అను అనునిత్య-అప్రతిహత-అవిచ్ఛిన్న దృష్టి కలిగి ఉంటారో...
- **"సమమ్ సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్"** భావన ఏక్షణ మందు వదలకయే ఉంటారో...,

**అట్టివారి జీవితమే శోభాయమానమై ప్రకాశించుచున్నది.**

ఎవ్వరైతే అంతఃశీతలమగు బుద్ధితో రాగ-ద్వేషరహితులై, నిత్యముక్త స్వభావులై (నాకు మొదలే బంధము లేదు - అను భావనను స్వాభావికంగాను, అనుక్షణికంగాను సమభ్యసించువారై), ఇక్కడ ఇంద్రియములకు తారసబడుచున్న సమస్తమును సాక్షివలె దర్శిస్తూ ఉంటారో,... **వారి జీవితమే మహత్ - శోభప్రదము.**

ఈ దృశ్య ప్రపంచములో ప్రాస్వదృష్టి గలవారు - **"ఇవన్నీ వదలవలసిన (లేక) పోగొట్టుకోవలసిన చిట్టా. అవన్నీ ఆశ్రయించవలసిన** చిట్టా (Big Bist) **"** - అను దృష్టితో దృశ్యమునందు దేహసంబంధములు తీవ్ర భావావేశములు కలిగి ఉంటూ ఉన్నారు.

**వాస్తవానికి ఇక్కడ ఇంద్రియ ప్రపంచంగా కనిపించేదంతా కూడా "స్వప్నము తనదైనవాడు-స్వప్నదృశ్యము"....ల సంబంధము వంటిది.**

ఒకానొకడు కలకంటూ ఉండగా,.. ఆ కలలో పొందవలసినది ఏమున్నది? కలలో పోగొట్టుకొనవలసినది ఏముంటుంది? మెలకువరాగానే కల మొత్తం అదృశ్యమౌతుంది కదా! **యేన సమ్యక్ పరిజ్ఞాయ హేయ ఉపాదేయమ్ ఉజ్ఝితా, చిత్తస్య అన్తే అర్పితం చిత్తం,.. జీవితం తస్య శోభితే॥** ఎవ్వరైతే **సర్వత్రా సమముగా వేంచేసియున్న సత్‌స్వరూపాత్మ** యొక్క తత్త్వమును ఎరిగినవారై, ఇక్కడి **"పట్టు కోవలసినవి - వదలవలసినవి"** అను **ద్వంద్వ మోహములను** మొదలంట్లా **వదలినవారై,** "చిత్తము"ను చిత్తమునకు ఆవలగల చిత్‌స్థానమునందు (గంగార్పణమువలె) **అర్పించివేసి ఉంటారో, వారి జీవితమే శోభాయమానము.**

వారు "గ్రహించువాడు - గ్రహించబడునది"...అను రెండిటియొక్క పరస్పర సంబంధములకు "చాలు" (అలమ్) - అను ముగింపు పలికి పరమశాంతిని పొంది ఆస్వాదించగలరు. **సర్వసంబంధములు ఆత్మయందు (మంచుగడ్డ నీటియందువలె) సశాంతించినప్పటి దృఢ దృష్టి-స్వాభావికానుభవమవటమే "మోక్షము" అను శబ్దముతో చెప్పబడుచున్నది.**

అసలీ జీవునిపట్ల జన్మపరంపరల సంసారచక్రము ఎందుకు ఏర్పడి ఉంటోంది.

| ఇంద్రియ విషయముల ఆశ్రయము | వాటితో సంగము | కావాలి / కావద్దు అనే కామము | కోప-ఆవేశ-క్రోధములు | మోహము | ఆత్మజ్ఞాన విస్మృతి | బుద్ధి / అవగాహ యొక్క అల్పత్వము / దోషభూయిష్టము | సంసార చక్ర పరిభ్రమణములు |
|---|---|---|---|---|---|---|---|

**"ఇంద్రియ విషయాశ్రయము" అనే ప్రారంభము** నుండి క్రమంగా ఇష్టాఇష్టములు కారణంగా దేహ-మనోబుద్ధి-అహంకారముల ద్వారా

***"విషయధ్యానము" – "సంగము" – "కామము" – "క్రోధము" – "మోహము" స్మృతి విభ్రమము", "బుద్ధినాశనము" – జన్మల ప్రహసన ప్రవేశము – ఈవిధమైన అథఃపతనము సిద్ధిస్తోంది.***

**శుద్ధసత్త్వము :** ఎవరి హృదయములో **"విషయముల ధ్యానములు"** అనే అంకురములు **"ఆత్మధ్యానము" అనే** ఉష్ణముచే ఉడికించివేయబడతాయో, అప్పుడు ఆ భ్రష్ట బీజములో **"పునర్జన్మలు"** అనే అంకురములు తొలగిపోతాయి. దృశ్యబద్ధ జాడ్యము తొలగిన తరువాత కూడా శేషించియుండు వాసనలు (Tendencies) 'శుద్ధవాసనలు' అనబడుతాయి. అట్టి పావనము, పరమోదారము – అగు శుద్ధ వాసనలు శుద్ధసత్త్వస్థితికి జేర్చుచున్నాయి.

**అనునిత్యమగు ఆత్మధ్యానమయమైన వాసనలు** గలవాని స్థితి ఎట్టిది? ఆతనిది **'నిత్యసుషుప్త స్థితి'** అని పిలువబడుచున్నది. గాఢనిద్రలో ఉన్నవానికి ఏవిధంగా ఈ ప్రపంచముతో కించిత్ కూడా సంబంధము ఉండదో,... సన్న్యాసయోగి ఆ విధంగా జాగ్రత్‌లో కూడా **ఈ దృశ్య ప్రపంచముతో 'కించిత్' కూడా సంబంధము కలిగి ఉండడు.** చిరునవ్వు వీడకుండానే, **"అపరిచయస్తుల ఇంటిలో జరిగే పండగసందడి"** – వలె చూస్తాడు.

## ప్రత్యక్ చేతనము

**అప్పుడు ఆతడు చేతనుడై ఉంటాడా?** అచేతనుడు అయిఉంటాడా? **చేతనం చిత్తరిక్తం హి 'ప్రత్యక్ చేతనమ్' ఉచ్యతే।** ఎప్పుడైతే హావభావములను, సంకల్పములను కదల్చుచున్న చేతనశక్తి ఇష్టాఇష్టరూపమగు చిత్తపరిధులను దాటివేసి ఉంటుందో,....అదియే **'ప్రత్యక్ చేతనము'.** అదియే మనస్సుయొక్క పరిధులను అధిగమించినట్టి నిర్మనస్కస్వభావము. అట్టి ప్రత్యక్ చేతన సిద్ధునిపట్ల సంసార కలనము (దోషము) ప్రవర్తించజాలదు. ఎక్కడ **దృశ్యమననరూపమగు** మనస్సు **'కేవలమనస్సు'** రూపము సంతరించుకొని ఉంటుందో....,

→ అదియే 'సత్' రూపమగు **'సత్యస్థానము'.**
→ అదియే పరమార్థమగు **'శివస్థానము'.**
→ అదియే పారమార్థికమగు **"సర్వజ్ఞత్వము".**
→ అదియే కైవల్య (కేవల) రూపమగు **"నిజ స్థానము" కూడా।**

అట్టి కేవలీ మనస్సుయే సంతృప్తి, ప్రలపనము (సంభాషించటము), విసర్జనము, స్వీకరించటము, కనులు మూయటము – తెరవటము మొదలైనవన్నీ నిర్వర్తిస్తోంది. అది జాగ్రత్ రూపంగా ప్రభవిస్తోంది.

అటువంటి నిశ్చలరూపమగు – నిరస్త (కదలికలు అనునవే లేని) **"పరమానంద సంవిత్ మాత్ర పరస్వరూపుడను"** నేనై ఉన్నాను.

తెలియబడుదానికి సంబంధించిన సంవేద్యము (knowing the things) అనే మలము తొలగిపోగా, మనస్సు నిర్మూలించబడుచున్నది. (తొలగినది అగుచున్నది). 'ఆశించటము' అనే రూపముగల ఆశాపాశములన్నీ విచ్ఛేదనమవగా, **సంవిత్ (సత్-విత్) మాత్రపరుడను అయి ఉంటున్నాను.** శుభాశుభ సంకల్పములన్నీ తొలగిపోగా, నిరామయమగు సశాంతించినట్టి ఆత్మస్వరూపుడను అగుచున్నాను.

ఇష్ట-అయిష్ట కలనమంతా వినష్టమైపోగా సంవిన్మాత్రపరుడనై శేషిస్తున్నాను.

"ఆత్మత్వ-పరత్వ"భావనా ప్రయత్నములను కూడా త్యజించివేసి, జగత్ స్థితికి సంబంధించి నిర్విభాగుడనై (Having become no more as part of this material scenary) ఆనందిస్తున్నాను. సర్వాత్మకుడనై వజ్రస్తంభమువలె సర్వత్రా ఆక్రమించుకొని సంస్థితుడనై ఉంటున్నాను. **అప్పుడిక ఈ జగత్తు నాయొక్క "అనన్య-అంతర్విభాగము" – అగుచున్నది.** నిర్మలుడనై, సర్వ ఆశలు త్యజించినవాడనై (Sans all expectations from the world) **'స్వసంవిత్తు'** నందు సంప్రకాశమానుడను అగుచున్నాను.

## సన్న్యాసాశ్రమ పరమలక్ష్యము

### ఎప్పుడోకదా?.....?

- ఆహా! సమస్త కోరికలను వదలి, హేయ ఉపాదేయములను పూర్తిగా త్యజించివేసి, హృదయగుహయందలి స్వయంప్రకాశ రూపుడుగా ఎన్నడు సంస్థితుడను అవుతానో!
- నా ఈ మనస్సు నా హృదయమునందు సశాంతించినదై మౌనరూపమగు శిలవలె ఎప్పుడు నేను నిర్వికల్పసమాధియందు సామ్యము పొందుతానో!

- నిరంధ్యాన (ధ్యాసరహిత) తత్పరుడనై ఉండగా ఎప్పుడు అడవి ఈగలు నా నిశ్చల చిత్త – శిలపై వలె గడ్డిగూళ్ళు కట్టుకుంటాయో మరి!
- బాహ్యమున శవమువలెను, అంతరమున చైతన్యాత్మానంద సందర్శనునివలెను ఎన్నడు ఆస్వాదిస్తూ ఉంటానో!

  "సంకల్పము" అనే వనమును, 'తృష్ణ' అనే లతను ఛేదించి, విస్తారమైన 'ఆత్మానందము' అనే విస్తార ప్రదేశములో నేను హాయిగా, ప్రశాంతంగ విహరిస్తానో కదా?

**ఇహైవ :- ఈ ద్రష్ట – దర్శన – దృశ్యములకు ఆవలగల శాంతమగు పరమపదమును ఇక్కడే, ఇప్పుడే పొందెదను గాక!**

**తత్ అహమస్మి।** శాంతమగు ఆత్మయే నేను.

**పదన్తదను యాతోఽస్మి జయామ్యహమ్।** సమస్తమును జయించి పరమపదమును చేరినవాడనై, కేవలుడనై ప్రకాశించుచున్నాను.

నిశ్చలవాయురూప – **నిర్వాణుడను,** సర్వకోరికలు జయించిన **నిరీహుడను।** జీవాత్మ–ద్రష్ట–అనుభవి మొదలైన అంశలన్నీ దాటివేసిన **నిరంశుడను।** కోరికలన్నీ జయించిన **నిరీప్సితుడను।**

**స్వచ్ఛత, ఊర్జితత। (బల, ఉత్సాహత్వముల) సత్తా। హృద్యత। సత్యవాక్యతా। ఆనందితా।**

**ఉపశమతా। సదా ప్రముదిత। పూర్ణతా। ఉదారతా। సత్య శాంతిసత్త, ఏకతా॥**

ఈఈ భావములు స్వీకరించి అభ్యసిస్తూ నిర్వికల్ప స్వరూపజ్ఞుడను, నిర్వికల్ప స్వరూపానుభవుడను అగుదును గాక! క్రమంగా నిర్వకల్పస్వరూపుడనగుచున్నాను!

***ఈ విధంగా సన్న్యాసిస్వాభావికుడు సన్న్యాస యోగ జ్ఞాని అయి, ఆత్మస్వరూపుడై – ప్రకాశించుచున్నాడు.***

## సన్న్యాసాశ్రమ స్వీకారము – మరికొన్ని వివరణలు

సన్న్యాసాశ్రమము స్వీకరించువారు శాస్త్రములు చెప్పువిధానంగా (1) కుటుంబసభ్యుల అనుజ్ఞ (2) కులగురువుల అంగీకార ఆశీర్వాదములు (3) యేష్ఠి నియమములు – నిర్వర్తించి, అటుపై సన్న్యాసాశ్రమము స్వీకరించుచున్నారు.

## ఆతురసన్న్యాసము

**'మరణము సమీపముగా అనివార్యమేమో'** అను స్థితిలో విధివిధానములతో సంబంధము లేకుండా స్వీకరించు సన్న్యాసము **'ఆతురసన్న్యాసము'.** ఆతురో జీవిచేత్, క్రమసన్న్యాసః కర్తవ్యః। ఆతుర సన్న్యాసము స్వీకరించినవాడు మరల ఆరోగ్యవంతుడు దైవకృపచే జరిగినప్పుడు అట్టివాడు మరల విధివిధానపూర్వకంగా క్రమసన్న్యాసము స్వీకరించాలి.

## సన్న్యాసాశ్రమవాస సంబంధమైన కొన్ని నియమములు, కొన్ని నిషిద్ధములు

న శూద్రస్త్రీ – పతిత ఉదక్యా-సంభాషణమ్। శూద్రస్త్రీలతోను, పతితులతోను, రజస్వలాస్త్రీలతోను సంభాషించటము నిషిద్ధము.

**న యతిః దేవపూజన ఉత్సవ దర్శనమ్।** యతులు దేవపూజలు, ఉత్సవములు మొదలైనవాటిపై ఉత్సుకతగా ఉండరు. సర్వే సర్వత్రా పరమాత్మ సందర్శనపరులై ఉండటంచేత, వారికి పరమాత్మకు సంబంధించిన సంజ్ఞావిధానములతో ఆవశ్యకత ఉండదు. ఈ నియమముల దృష్ట్యా – **తస్మాత్ సన్న్యాసమ్** ఏష లోకః। – ఈ లోకములో సన్న్యాసము ఉండదు. (లోకసంబంధమైనది కాదు), లోకమును అధిగమించివేసినట్టిది.

**పైన చెప్పబడిన నియమ–నిష్ఠ–ఉపాసనా కలిగియున్నవాడు ఏ ఆశ్రమంలో ఉన్నా కూడా నిత్య సన్న్యాసియే।**

**(జ్ఞేయస్య "నిత్య సన్న్యాసీ"–యో న ద్వేష్టి, న కాంక్షతి। – భగవద్గీత).**

# కైవల్యస్థానములు

వివిధ సన్న్యాసులకు ఈ విధంగా కైవల్యస్థానములు చెప్పబడుచున్నది.

| | | |
|---|---|---|
| **ఆతుర, కుటీచక సన్న్యాసులకు** | - | భూలోకము, భువర్లోకము, |
| **బహూదక సన్న్యాసికి** | - | స్వర్గలోకము, |
| **హంసకు** | - | తపోలోకము, |
| **పరమహంసకు** | - | సత్యలోకము, |
| **తురీయాతీత, అవధూతలకు** | - | స్వాత్మస్థానము |

స్వరూపానుసంధానము దృష్ట్యా - భ్రమర-కీటకన్యాయానుసారము **కైవల్యస్థానము** సిద్ధించుచున్నది.

## ఆత్మానాం - అన్య శాస్త్రానామ్

**స్వరూపానుసంధాన వ్యతిరిక్త అన్యశాస్త్రాభ్యాసైః ఉష్ట్రకుంకుమ భారవత్ వ్యర్థతా।**

"స్వస్వరూపానుసంధానము"నకు వ్యతిరిక్తమైన అన్యశాస్త్రములు యతికి **"కుంకుమపువ్వుమోస్తున్న ఒంటెకు కుంకుమపువ్వు వాసన తెలియకపోవటము"** వంటిది. అనగా, **'తత్త్వమ్ - సోఽహమ్'**లను ప్రక్కకుపెట్టి అన్యదేవతారూపానుసంధానము **"నిస్సారము, అనుభవమునకు పనికిరానిది"** అగుచున్నది. అయితే, "వాటియొక్క అంతిమ లక్ష్యము సోఽహమ్ - తత్త్వమ్ భావనయే" అను ఎరుక వీడక నిర్వర్తించబడు గాక।

**న యోగశాస్త్ర ప్రవృత్తిః న సాంఖ్యశాస్త్ర అభ్యాసో, న మంత్ర-తంత్రవ్యాపారో యతేః అస్తి॥**

యతికి యోగశాస్త్రప్రవృత్తి, సాంఖ్యశాస్త్రాభ్యాసము, **మంత్ర తంత్ర ప్రవృత్తులు ఉండవు.** **అస్తిచేత్ శవాలంకారవత్।** ఒకవేళ్ళ యతి వాటిని కలిగిఉండవలసి వస్తే, అవన్నీ **"శవమునకు అలంకారము"** వంటివి మాత్రమే అను భావనయే కలిగి ఉంటారు.

సన్న్యాసి (కర్మలు నిర్వర్తిస్తూనే - కర్మాచరణపరుడై ఉండరు. అంతరమున ప్రాపంచక విద్యలకు దూరముగా ఉంటారు. బాహ్యమున "నాటకములోని పాత్ర లక్షణములు" వలె - ప్రాపంచక విద్యలను బాహ్యముననే వదలి ఉంటారు.

న పరివ్రాట్ నామ సంకీర్తన పరః। పరివ్రాట్టు **"నామ సంకీర్తనలు"** అను కర్మ విశేషములందు కర్తృత్వాది, అనివార్యాది భావనలు చేయువారై ఉండరు. **యత్‌యత్ కర్మ కరోతి, తత్ తత్ ఫలమ్ అనుభవతి।** ఎవ్వరైనా ఏ కర్మకు తాను కర్తృత్వమువహిస్తారో.....ఆ కర్మఫలము ఆతనికి తప్పక అనుభవమై తీరుతుంది. ఆముదపు నురుగుతో (లేక) కుంకుడికాయ నురుగుతో పాత్రలుతోమి కడిగివేస్తారు. నురుగును వదలి వేస్తారు కదా! ఆ తీరుగా సమస్తమును వదలి ఉంటారు. దేవతల (లౌకిక ప్రయోజనరూపములగు) ప్రసాదముల (Worldly Sanction) పట్ల వారు దృష్టి కలిగి ఉండరు. న **బాహ్యదేవాభ్యర్చనమ్ కుర్యాత్.** బాహ్యదేవతార్చనలు ఉద్దేశ్యించరు.

> స్వ వ్యతిరిక్తం సర్వం త్యక్త్వా, మధుకరవృత్త్యా ఆహారమ్
> ఆహరన్ కృశో భూత్వా మేదో వృద్ధిః అకుర్వన్ విహరేత్॥

"స్వస్వరూపానుసంధానము"నకు వ్యతిరిక్తమైన సమస్తము త్యజించి వేసి ఉంటారు. దేహమును జీవింపజేయునిమిత్తము మాత్రమే మాధూకరవృత్తి (భిక్షాటనము)చే ఆహారమును తెచ్చుకొని తింటూ జీవిస్తూ ఉంటారు. శరీరముయొక్క క్రొవ్వు వృద్ధికై పరిలక్షించక.... (ఆశయముగా కలిగి ఉండక), స్వప్నములో స్వప్నద్రష్టవలె ఈ జాగ్రత్ దృశ్యములో విహరిస్తూ ఉంటారు. అరచేతులనే మాధుకర (భిక్ష) పాత్రగా ధరించి (లేక) చేతికి పట్టినంత పాత్రను మాత్రమే కలిగి ఉండి భిక్షచే లభించిన ఆహారముతో కడుపునింపుకొంటూ కాలము గడుపుతూ ఉంటారు. ఆతని దృష్టి అంతా **"ఈ సమస్తము నా ఆత్మయొక్క సంప్రదర్శనా వైభవమే"** - అను భావన, అనుభూతులను **స్వాభావికము, అనుక్షణికము** చేసుకోవటమునందు మాత్రమే ప్రయత్నశీలమై, **నిమగ్నమై ఉంటుంది.**

## ఆహారము - ఉదరపోషణ

> శ్లో॥ ఆహారస్య చ భాగౌ ద్వౌ। తృతీయం ఉదకస్య చ।
> వాయోః సంచలనార్థాయ చతుర్థమ్ అవశేషయేత్॥

పొట్టలో 2 వంతులవరకు మాత్రమే ఘనాహారమతో నింపాలి. 1/4వ వంతు జలముచేత నింపాలి. మిగిలిన 1/4వ భాగము వాయువు నిరోధకములు (obstructions) లేకుండా ప్రసరించటానికై ఖాళీగా వదలాలి.

- భిక్షాటనము వలన లభించిన ఆహారమునే స్వీకరించాలి.
- న ఏక-అన్నాసీ భవేత్ క్వచిత్। ఒకే ఇంట్లో ఉండి ప్రతిరోజు ఆహారము స్వీకరిస్తూ ఉండకూడదు.
- అనుద్విగ్నంగా (కోప-తాపాలు లేకుండా) ఎవరు భిక్ష ఇవ్వాలని నిరీక్షిస్తూ ఉంటారో, అట్టివారి ఇళ్ళకు ప్రయత్నపూర్వకంగా వెళ్ళాలి.
- భిక్షకై '5' లేక '7' ఇళ్ళకు మాత్రమే రోజూ ఎన్నుకొని భిక్షపొందాలి.
- వెళ్ళిన ఇంటివద్ద ఆవు పాలు పితుకు కాలము మాత్రమే నిరీక్షించాలి.
- ఒక్కొక్క ఇంటికి వెళ్ళిన తరువాత మరల వెనుకకు తిరగరాదు. (ముందుకే పోతూ బిక్షాటనం చేయాలి. వెనుక ఇళ్ళకు మరల వెనుతిరిగి వెళ్ళరాదు)

- నక్తము (రాత్రిపూట భోజనము) కంటే ఉపవాసము (పగటి భోజనము - రాత్రి నిరాహారము) మంచిది.
- రోజంతా ఉపవాసము కంటే అయాచితంగా ఇవ్వబడినది స్వీకరించటము మంచిది.
- అయాచితము (అడగకుండా ఇవ్వబడేది) కంటే భిక్ష చేసి ఆహారము స్వీకరించటము మంచిది.

భిక్ష చేస్తూ ఉన్నప్పుడు సవ్యాపసవ్యమార్గంగా (ఒకసారి వీధిలో ఈ చివరి నుండి ఆ చివరికి, వెనువెంటనే ఆ చివరి నుండి ఈ చివరికి) భిక్షకై గృహములకు వెళ్ళరాదు.

**న అతిక్రమేత్ గృహం మోహాత్ యత్ర దోషో న విద్యతే।** ఏ ఇంటి వద్ద భిక్షాటనము దోషము కాదో, ( ఆ ఇంటివారు శ్రద్ధ-భక్తులు కలవారో), భిక్ష సమర్పించాలని అనుకుంటారో, అటువంటి ఇంటిని భిక్షను అడుగకుండా దాటివేయకూడదు. 'భిక్ష ఇవ్వాలి' అను ఉపాసన కలవారిని భిక్షస్వీకారం ద్వారా గౌరవించాలి.

**శ్రోత్రియాన్నం న భిక్షేత శ్రద్ధాభక్తి బహిష్కృతమ్।** వేదములు ఉపాసించు శ్రోత్రియుల ఇల్లు అయినప్పటికీ, ఆ ఇంటి సభ్యులకు శ్రద్ధ - భక్తిలేకపోతే, అట్టి ఇంటి వద్ద భిక్ష చేయరాదు. శాస్త్రములను, భిక్షకులను దూషించే స్వభావముగల ఇంటివద్ద భిక్ష అడుగరాదు.

వ్రాత్యులు (వేదములు ఎరుగనివాడు) అయినప్పటికీ, ఆ ఇంటివారు భిక్ష ఇచ్చుటలో శ్రద్ధ - భక్తి కలిగి ఉన్నవారైతే, అట్టివారి ఇంటి వద్ద 'భిక్ష' తప్పక అడిగి స్వీకరించాలి. పెద్దలను, విజ్ఞులను గౌరవించే వారి ఇంటిలో భిక్ష స్వీకరించి, అటువంటి సదభ్యాసములను ప్రోత్సాహపరచాలి.

**పంచవిధ భైక్షములు (భిక్షాటనలు)**- (1) మాధూకరము (2) ప్రాక్‌ప్రణీతము (3) అయాచితము (4) తాత్కాలికము (5) ఉపపన్నము.

**(1) మాధూకరభిక్ష :** అసంకల్పితంగాను యాదృచ్ఛికంగాను మూడు (లేక) ఐదు (లేక) ఏడు ఇళ్ళ వద్ద తేనెటీగవలె (with no pre-planning like a Honey Bee) భిక్ష చేయుటమును **'మాధూకర భిక్ష'** అని అంటారు.

**(2) ప్రాక్ ప్రణీత భిక్ష :** ముందురోజుగాని, ఆరోజు తెల్లవారగానేగాని ఎవ్వరైనా భక్తితో వచ్చి "అయ్యా! మా ఇంటికి భిక్షకు దయ చేయండి!"...అని మాటిమాటికీ ఆహ్వానిస్తే....అది **'ప్రాక్‌ప్రణీత భిక్ష'** అని పిలుస్తారు.

**(3) అయాచిత భిక్ష :** భిక్షాటణము చేస్తూ ఉండగా ఎవ్వరైన **"స్వామీ! దయచేయండి! ఈరోజుకు మా ఇంట్లో తప్పక భిక్ష స్వీకరించండి"....** అని నియంత్రించబడినప్పుడు అది అయాచిత భిక్ష. ఇటువంటి నిమంత్రితమైన భిక్ష ముముక్షువులై (మోక్షకాంక్షతో) ఆహ్వానిస్తేనే అంగీకరించాలి. అంతేగాని, లోకసంబంధమైన ఆశల, ఆశయముల కష్ట-సుఖముల ఉద్దేశ్యము కలవారి వద్ద 'అయాచిత భిక్ష' స్వీకరించరాదు.

**(4) తత్కాలిక భిక్ష :** ఆ యతి ఉన్న చోటికి వచ్చి బ్రహ్మజ్ఞానాశయముగల బ్రాహ్మణుడు (కులసంబంధము కాదు) **"భిక్షార్థము రండి"** - అని ప్రార్థన చేస్తే అది **తాత్కాలిక భిక్ష** అవుతుంది. యతి అందుకు అంగీకరించవచ్చు.

**(5) ఉపపన్న భిక్ష :** సిద్ధమైన అన్నము ఎవ్వరైనా మోక్షకాంక్ష అగు బ్రాహ్మణుడు (బ్రహ్మమును ఉపాసనగా కలవాడు) మఠము నుండి తెచ్చి సమర్పిస్తే అది **"ఉపపన్నము".**

యతి మాధూకర భిక్షమును మ్లేచ్ఛ కులము వారి వద్దనైనా భక్తి - శ్రద్ధలతో- సమర్పిస్తే తీసుకోవచ్చు. అయితే బృహస్పతి అంతటివాడు ఆహ్వానించినా కూడా, ఒకే ఇంటిలో (ఏకాన్నము - అనేక రోజులు) నివసించి ఆహారము (భిక్ష) స్వీకరించరాదు.

యతి యాచితముగా గాని, అయాచితముగా గాని భిక్షను దేహరక్షణ కొరకు మాత్రమే ఉద్దేశ్యించి స్వీకరించాలి.

వాయువు ఒక వస్తువును స్పృశించినప్పుడు కూడా ఆ వస్తువుయొక్క దుర్వాసన – సువాసనాది దోషములు వాయువును అంటవు.

అగ్ని ఒక వస్తువును దహిస్తున్నప్పుడు ఆ వస్తు దోషము అగ్నిని అంటజాలదు. జలము విషయములో – మూత్రము, పురీషము మొదలైన వాటి దోషములు జలమునకు అంటవు. **అట్లాగే, అన్నదోషము యతి (లేక) సన్న్యాసిని అంటదు.**

## భిక్షాటనము ఏ సమయంలో చేయాలి?

ఒక ఇంటిలో (విధూమే) పొగరానప్పుడు (వంట పూర్తి అయి ఉంటుందనుకున్న తరువాత), రోకటి పోటు లేనప్పుడు, నిప్పులు లేనప్పుడు, వారి బంధువులు భుజించిన తరువాత, అపరాహ్నము తరువాత (మధ్యాహ్నము 12 గం|| తరువాత) భిక్షాచరణము ఆచరించాలి.

**అభిశస్తుని** (హింస స్వభావము కారణంగా గ్రామ బహిష్కరణ పొందినవాని) **యొక్క, పతితునియొక్క, దేవతాపూజను వ్యతిరేకించు** పాషండులయొక్క – ఇళ్ళు వదలి, మరిక ఏ ఇంటి వద్దనైనా భిక్షాచరణము చేయవచ్చు. ఆపత్కాలంలో అన్ని వర్ణములవారి వద్ద భిక్ష స్వీకరించవచ్చు.

## <u>నిషేధ పదార్థ సూచనలు (కావాలని కోరుకోకూడనివి)</u>

- **ఘృతంచ మూత్ర సదృశం** – నెయ్యిని మూత్రముతో సమానంగా చూడాలి.
- **మధుస్యాత్ సురయా సమమ్** – తేనె సురాపానముతో సమానము.
- **తైలం సూకరమూత్రం చ** – నూనె పందిమూత్రముగా భావించాలి.
- **సూపము** – వెల్లుల్లి ఉమ్మి సదృశము
- **మాషాపూపాది గోమాంసం** – గారెలు, అప్పములు మొదలైన విశేష రుచి భక్ష్యములు గోమాంసంగా అనుకోబడు గాక.
- **క్షీరం మూత్రసమం భవేత్** – పాలు మూత్ర సమానము.

అందుచేత సర్వప్రయత్నములతో నెయ్యి మొదలైనవి యతి వదలినవాడై ఉండాలి (తానుగా కోరుకోకూడదు). పప్పు, నెయ్యిలతో కూడిన అన్నము "నాకు ఇష్టము" అని యతి వ్యసనపడరాదు. **అయాచితంగా వచ్చియున్న వాటికి ఈ నియమములు ఉండవు.**

యతికి అరచేయియే భిక్షకు పాత్ర. చేతితోనే భిక్ష పొందాలి. పాణి పాత్రతో తిరుగుచూ కూడా ఎక్కువసార్లు భిక్షమును ఆచరించకూడదు. ముని ఆవువలె నియమితముగా ఆహారము స్వీకరించాలి.

***<u>పై ఆచరణములచే ఆ యతి అమృతస్వరూపుడు అగుచున్నాడు...</u>***

## <u>నియమముల / నిషేధముల మరికొంత వివరణలు (తానుగా కోరుకో కూడనివి)।</u>

- నెయ్యిని రక్తమువలె త్యజించాలి. **ఆజ్యం రుధిరమివ త్యజేత్।**
- ఒకేచోట అనేకసార్లు అన్నము స్వీకరించటం మాంసమువలె అనుకోవాలి. **ఏకత్రా అన్నం పలలమివ।**
- గంధలేపనమును అశుద్ధలేపనముతో ఆతనికి సమానము.
- క్షారము (కారము)ను చండాలభావంతో చూడాలి.
- నాజూకైన వస్త్రములను ఉచ్ఛిష్టపాత్ర (ఎంగిలి కంచము)వలె అనుకోవాలి.
- అభ్యంగన స్నానములను కులట స్త్రీ సంగమముతో సమానమనుకోవాలి.
- స్నేహితులతో ప్రాపంచిక విషయముల ఆహ్లాదకర సంభాషణలు మూత్రముతో సమానంగా భావించాలి.
- వస్తుజాలముతో సంబంధము గోమాంసములతో సమానముగా చూడాలి.
- ఇతః పూర్వం లోక వ్యవహారరీత్యా తెలిసినవారి ప్రదేశములకు వెళ్ళి, వారితో పూర్వ విషయ సంభాషణ – చండాలవాటికలవలె అనుకోవాలి.
- స్త్రీలతో సరస–విరస సంభాషణలు – పాముతో సమానమనుకోవాలి.
- బంగారముతో సంబంధము కాలకూటవిషంగా దర్శించాలి.

- పదిరకాల కాలక్షేపములు, లోకేషణాజనులు ఉండే సభాస్థలమును శ్మశానంతో సమానంగా అనుకోవాలి.
- రాజధానిలో ఇంద్రియానందముల పరిచయాలు కుంభీపాక నరకంతో సమానమనుకోవాలి.
- ఏకత్రాన్నము (ఒకే ఇంట్లో రోజుల తరబడి భోజనము) శవ పిండముగా చూడాలి.

యతులు అన్యదేవతా సంబంధమైన దేవతార్చనపరులై ఉండరు. **(అనన్యోపాసకులై ఉంటారు).**

ఈ విధంగా ప్రపంచ వృత్తులను జయించినవారు "జీవన్ముక్తులు" అగుచున్నారు.

## యతికి తారసబడే (6) ప్రతిబంధకములు (బంధకరాణి షట్)

**యతి (లేక)** సన్న్యాస ఆశ్రమయోగికి ముఖ్యంగా '6' ప్రతిబంధకములు తారబడుతూ ఉంటాయి.

(1) ఆసన దోషము (2) పాత్రలోపము (3) సంచయము (4) శిష్యసంచయము (5) దివాస్వాపము (6) వృధాలాపము

**(1) ఆసన ప్రతిబంధకము:** వర్షాభ్యో-అన్యత్ర యత్ స్థానమ్ 'ఆసనమ్' తత్ ఉదాహృతమ్॥ జీవుడికి తానుండే పరిసరాలపట్ల మనోసంబంధమైన ప్రియత్వము ఏర్పడుచూ ఉంటుంది. యతి వర్షఋతువులో "చాతుర్మాస్యవ్రతం"గా 4 నెలల కాలము తప్ప తదితర సమయాలలో ఒకేచోట ఉండరాదు. ఒకవేళ ఒక ఇంటిలో గాని, గ్రామంలోగాని మరెక్కడైనాగాని దీర్ఘకాలము ఉండాలని అనిపిస్తూ ఉంటే, అది **ఆసన దోషము.**

**(2) పాత్రలోప ప్రతిబంధకము :** శాస్త్రములలో సన్న్యాసాశ్రమమునకు సూచించిన సొరకాయపాత్ర మొదలైనవి లభించకపోవటము, అన్యమైన (విలువైన పాత్ర) పరిగ్రహించవలసిన రావటము, శిథిలమైనవాటి స్థానములో సరిఅయినవి దొరకకపోవటము→ఇటువంటివి 'పాత్రలోపము' అనబడు ప్రతిబంధకము. **ఉక్త్వా లబ్ధాది పాత్రణా అలాభే అన్యపరిగ్రహః, యతేః స వ్యవహారార్థం "పాత్రలోపః" స ఉచ్యతే॥**

**(3) సంచయ ప్రతిబంధకము :** గ్రహించబడిన 'దండము' కాకుండా మరొక దండమును మరొక కాలములో ఉపయోగించుకోవాలని దాచిపెట్టుకోవటము – సంచయము. **గృహీతస్యతు దండాదేః ద్వితీయస్య పరిగ్రహః కాలాన్తర – ఉపభోగార్థం – "సంచయః" పరికీర్తితః॥** 'దాచిపెట్టుకోవటం' అనే లోభగుణమును యతి దరిజేరనీయడు.

**"పదార్థములను దాచుకొని తరువాత తిందాములే"** – అనునది **'సంచయప్రతిబంధకము'**గా చెప్పబడుతోంది.

**(4) శిష్య సంచయ ప్రతిబంధకము: శుశ్రూషాలాభ పూజార్థం యశో ఽర్థం వా పరిగ్రహః శిష్యాణాం, న తు కారుణ్యాత్ "శిష్యసంగ్రహ" ఈరితః॥** తనకు శూశ్రూష చేయుటకొరకుగాని, తనను పూజించటంకోసంగాని, తన యశస్సు గురించి ప్రచారము చేయటానికిగాని శిష్యులను చేర్చుకోవటము యతికి యోగమార్గములో ప్రతిబంధకముగా పరిణమించగలదు. అట్లా కాకుండా జ్ఞానబోధకొరకో, యోగాభ్యాసము కొరకో శిష్యులు ఆశ్రయించటము వలన అది ప్రతిబంధకము కాబోదు. శుభప్రదమే అయి, ఆ యతికి అది మోక్షసౌలభ్యము కాగలదు.

**(5) దివాస్వాప ప్రతిబంధకము:** విద్యా 'దివా' ప్రకాశత్వాత్। – పగలు ప్రకాశము 'విద్య' అని, అవిద్యా 'రాత్రిః' ఉచ్యతే । – రాత్రి –చీకటి 'అవిద్య' అని సంజ్ఞాపూర్వకంగా చెప్పబడుతోంది. విద్యాభ్యాసే ప్రమాదో యః స "దివాస్వాప"-ఉచ్యతే॥ విద్యయందు బద్ధకము చోటుచేసుకొనుచూ, అవిద్య యొక్క ప్రబలమును 'దివాస్వాపము' అనబడుచున్నది. ఆత్మ విద్యాభ్యాసమును ఏమరచి **"నేను అంతటివాడిని. నా ప్రత్యేకలు ఇటువంటివి"...అనే ఆత్మస్తుతి-పరనింద, ఆత్మవిద్యా ఏమరపును దివాస్వాప ప్రతిబంధకములుగా చెప్పుతారు.**

**(6) వృథాలాప ప్రతిబంధకము : (1) ఆత్మతత్త్వమునకు సంబంధించిన సమాచారము (2) భిక్షుకు సంబంధించిన శాస్త్ర నియమములు** – అతి ముఖ్యమగు ఈ రెండు యతిధర్మములను ప్రక్కకు పెట్టి..., అనుగ్రహమునకు సంబంధించిన సమాచారములు **"వారేమైనారు? వీరు ఎటువంటివారు?"** అను పరిప్రశ్నల గురించి తర్క వితర్కములు చేయటము....

ఇది **'వృథాజల్పము'** (లేక) వృథాలాపము అను ప్రతిబంధకముగా చెప్పబడుచున్నది.

## సన్న్యాసయోగాభ్యాసికి కూడనివి (లేక) విడువవలసినవి :

- ఏకాన్నము। ఒకేచోట భోజనము దీర్ఘకాలం స్వీకరించటం.
- మతమాత్సర్యం : "మా మతము గొప్పది. వారి మతము తక్కువది" – ఇటువంటి పరమతద్వేష – మాత్సర్యభావములు. తదితరుల అభిప్రాయములను దూషించే ప్రయత్నము సన్న్యాసులకు కూడదు.

- ❑ గంధ - పుష్ప సంబంధమైన లోకాకర్షణాహంకారములు, విభూషణములు.
- ❑ తాంబూల సేవనములు. అభ్యంగనములు. క్రీడాభోగకాంక్షలు. రసాయనములు.
- ❑ కత్థోనం (పరదూషణ), కుత్సితభావములు.
- ❑ స్వస్తి వచనము – ఆశీర్వాదముల వలన లభించే ధనవేడుకలు. జ్యోతిశ్చక్ర క్రయ విక్రయములు.
- ❑ క్రియాకర్మల సంబంధమైన వివాదములు. వాటికి సంబంధించిన వాదోపవాదములు.
- ❑ గురువులు చెప్పిన నియమ నిష్ఠలు పాటించకపోవటము.
- ❑ వ్యక్తుల మధ్యగల నివాదముల సంధి ప్రయత్నశీలత్వము.
- ❑ విగ్రహముల అమ్మకములు, ఊరేగింపులు.
- ❑ మంచము, అలంకార సంబంధమైన తెల్లటి వస్త్రములు.
- ❑ శుక్లోత్సర్గము. (శుక్లమును విడచు అభ్యాసములు).
- ❑ జ్ఞానమునకు సంబంధించని గుణదోషసంభాషణములు – **దివాస్వాపము.**
- ❑ భిక్ష గురించిన బాగోగుల దుష్టబీజములు (Seeds, that are harmful) కలిగి ఉండటము.
- ❑ కలలో కనిపించటము వంటి తైజస సమాచారములు.
- ❑ విషము, ఆయుధములు, బీజములు.
- ❑ హింసా ప్రవర్తనమములు. తీక్ష్ణముగా సామాన్య జనులను భయపెట్టే దేహాలంకారములు.

→ ఇవన్నీ సన్న్యాసయోగి వదలి, వాటికి దూరంగా ఉండాలి.

ఇంకా కూడా...

- గృహస్త ధర్మము సందర్భములో తాను చేసియున్న గొప్పకార్యముల అభివర్ణనము.
- గోత్రం గురించి, తల్లిదండ్రుల గురించి, ధన గృహ సంపదల గురించి చెప్పుకోవటము.
- లోక ప్రసిద్ధములైన వస్తువులను తెచ్చుకొని అలంకరించుకోవటము.

ఇటువంటివి సేవించటంచేత కూడా యతి అథః పతితుడు కాగలడు.

స్త్రీలతో యతి – (వారు యువతులైనా, ముసలివారైనా కూడా) – స్పర్శసంబంధము కలిగి ఉండరాదు. చిరిగిపోయినప్పటికీ ఖరీదైన వస్త్రములు, బొంతలుగా ఉండుతీరుగా, – స్పర్శలు ఇంద్రియాకర్షణలకు దారితీయగలవు.

(1) స్థావరములు (కదలనివి) (2) జంగములు (కదలు జీవదేహములు), (3) బీజములు (4) తైజసము (మత్తు ఇచ్చేవి) (5) దోష–దుష్ట సంభాషణలు (6) ఆయుధము – ఈ ఆరిటితో యతికి అవినాభావ సంబంధము పెట్టుకోరాదు. వాటిని మూత్ర–పురీషములతో సమానంగా చూడాలి.

ఆపత్తులు శంకించని సందర్భములలో యతి తనవెంట అన్నము మొదలైన తినుపదార్థములను వెంట తీసుకుపోరాదు. ఆపత్తుల సమయములలోను, త్రోవలో ఆహారము దొరకదనుకొన్నప్పుడు మాత్రము తీసుకొనిపోవచ్చును.

భిక్ష చేస్తున్నప్పుడు తనవెంట యువకులను, యువతులను, రోగము లేని వారిని వెంటనిడుకొని వెళ్ళరాదు.

"ఇతరులకోసము" అని తలచుచు వస్తువులు, పదార్థములు ప్రతిగ్రహించకూడదు. ఇవ్వనూకూడదు. ఇతరులకు భయము, కష్టము కలిగించరాదు. దైన్యభావముకలవారికి ధైర్యము కలిగించు ప్రవర్తనము కలిగియుండాలి. ఏరోజుకారోజు అవసరము లేనట్టి పక్వ – అపక్వ పదార్థములను యాచించటము, దాచటము...ఇవి యతిని అథఃపతనమువైపుగా దారితీయగలవు. యతి అన్నపానాదులకొరకే భిక్షాటన చేస్తూ, – కంబళములు, పట్టువస్త్రములు మొదలైన విలువైన వస్తువులు ఆశించటము, స్వీకరించటము యోగభ్రష్టత్వమునకు కారణముకాగలవు.

❑ ❑ ❑

## యతి - యత్నశీలత్వము

- అద్వైత నావను ఆశ్రయించి **జీవన్ముక్తుడు** అగుచున్నారు. (సమస్త జీవులను పరమాత్మ స్వరూపులుగా భావించు అభ్యాసమే- **అద్వైతనావ**)
- వాక్కును జయించటానికై **'మౌనము'**ను అభ్యసించుచున్నారు.
- శరీరమును నిగ్రహించటానికై **అభోజనమును (ఉపవాసమును)** ఆశ్రయిస్తున్నారు.
- మనస్సు అదుపు చేయటానికై **'ప్రాణాయామము'** నియమించుకొనుచున్నారు. (అభ్యసిస్తున్నారు)

**కర్మణా బధ్యతే జంతుః। విద్యయా చ విముచ్యతే॥** జీవులు కర్మలచేత బద్ధులగుచున్నారు. (ఆత్మ) విద్యచేత కర్మబంధములనుండి విడివడుచున్నారు.

**తస్మాత్ కర్మ న కుర్వన్తి యతయః పారదర్శనః॥** అందుచేత యతులు ఏ కర్మకు కూడా "నేను కర్తను" అను రూపంగా కర్తృత్వము వహించినవారై ఉండరు. కర్మసంబంధమేలేనివారై, పారదర్శకులై ఉంటారు. రహస్యంగా కర్మలు చేస్తున్నట్లు జనులను మభ్యపెట్టరాదు.

- వీధులలో చాలా వస్త్రములు దొరుకుతాయి.
- 'భిక్ష' అన్నిచోట్లా లభిస్తుంది.
- భూమిపై శయనించటానికి చోటు తక్కువ ఏమీ లేదు. విస్తీర్ణమైయున్నది.

మరి ఏదో లేదని ఎందుకు దుఃఖించటం?".......

అని యతులు భావన కలిగి ఉంటున్నారు. సమస్త ప్రపంచానుభవమును, ప్రపంచదర్శనమును యతి "ఆత్మజ్ఞానము"అనే అగ్నియందు హోమము చేయుచున్నారు. ఆత్మయందు యోగాగ్నిని, సమారోప్యము చేసి యతి "అగ్నిహోత్రి" గాను, 'మహాయతి'గాను అగుచున్నారు.

## ప్రవృత్తి

ప్రవృతి రెండు రకములని చెప్పబడుతోంది.

**(1)** మార్జాలీప్రవృత్తి **(2)** వానరీప్రవృత్తి

**మార్జాలీప్రవృత్తి**-జ్ఞానాభ్యాసముతో కూడినది (యోగ-ఇత్యాది అభ్యాసములు- "అంతిమ లక్ష్యము-జ్ఞానమే"-అని ఎరిగి నిర్వర్తించటము).

**వానరీ ప్రవృత్తి** - జ్ఞానాభ్యాసము లేకుండా చేయు అభ్యాసము [ అంతిమ లక్ష్యమగు - (సర్వభూతస్తం ఆత్మానం, సర్వభూతాని చ ఆత్మనివంటి) పరమాశయము గుర్తు పెట్టుకోకుండా యోగాభ్యాసములో మధ్యమధ్యగా (జ్యోతిదర్శనము మొదలైన) అనుభవములు, అనుభూతుల గురించి సంభాషించు స్థితి ].

ప్రవృత్తి యొక్క ఆశయము 'ఆత్మభావన' వైపుగా ఎక్కుపెట్టబడి ఉండాలి.

ఈ సన్న్యాసోపనిషత్‌లో చెప్పబడిన విషయములను **"అయ్యా! దయచేసి వివరించి చెప్పండి!"**...అని అడిగినవారికి మాత్రమే బోధించాలి. అన్యాయమార్గముగా (తప్పులు ఎన్నటానికి, చులకన చేయటానికి, అహంకారముతోను) అడిగితే, ఆ విధంగా అడిగినవారికి చెప్పనేకూడదు.

**జానన్ అపి మేధావీ జడవత్ లోకమ్ ఆచరేత్।** ఆత్మతత్త్వము తెలిసిన మేధావి అయి ఉండి కూడా, వినటానికై అడగనిచోట, శ్రోత శ్రవణమునకు తగినంతగా సంసిద్ధుడు కానిచోట) యతి ఆత్మగురించిన విశేషములను ఏమీ సంభాషించక, జడునివలె ఉండునుగాక।

ఎన్ని కష్టాలు వచ్చినా తారక (ఇష్టదైవముల) మంత్రమును విడువరాదు. 12000 సార్లు తారకమంత్రము జపించాలి.

ప్రణవమంత్రమును 12000 జపించువాడు పరబ్రహ్మమై ప్రకాశించగలడు.

ఇతి సన్న్యాసోపనిషత్
ఓం శాంతిః శాంతిః శాంతిః

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

**15**

# సావిత్ర్యుపనిషత్

## "గాయత్రీ బల-అతి బల" - ఉపాసన

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

ఓం।
సావిత్ర్యుపనిషత్ వేద్య, 'చిత్' సావిత్ర పదోజ్జ్వలమ్
ప్రతియోగి వినిర్ముక్తం రామచంద్రపదం భజే॥



**"కేవల చిత్"** అను 'సావిత్ర్య పదము'ను ప్రజ్వలము చేయుచు, "సావిత్ర్యుపనిషత్" చెప్పు మహత్తరార్థమును హృదయస్తము చేసుకొనగలుగుటకై శ్రీరామచంద్ర స్వామి పాదపద్మములను ఆశ్రయిస్తున్నాము.

**మం॥ శ్లో॥ ఓం భూర్భువస్సువః తత్సవితుః వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్॥**

తత్ 'ఓం'కారార్థ భర్గో దేవుడు భూ-భువర్-సువర్ త్రిలోకములను తన సత్-చిత్‌లచే వెలిగించుచున్నారు. వారి మహిమను స్తుతిస్తున్నాము. మా బుద్ధిని ప్రేరేపించెదరు గాక!

**శ్లో॥ ఓం సావిత్రీ, ఆత్మా, పాశుపతం, పరంబ్రహ్మ, అవధూతకమ్,**
**త్రిపురాతాపనం, దేవి, త్రిపురాకర భావనా॥**

పరబ్రహ్మతత్త్వమును ఎలుగెత్తి గానం చేస్తూ మమ్ములను క్రమంగా ఆత్మానుభూతియందు చేర్చగల నవోపనిషత్ ఉద్యాన వనదేవతలగు (1) సావిత్ర్యుపనిషత్ (సామవేద) (2) ఆత్మోపనిషత్ (అథర్వణవేద) (3) పాశుపత బ్రహ్మోపనిషత్ (అథర్వణ వేద) (4) పరంబ్రహ్మోపనిషత్ (అథర్వణవేద) (5) అవధూతోపనిషత్ (కృష్ణయజుర్వేద) (6) త్రిపురాతాపిన్యుపనిషత్ (ఋగ్వేద) (9) భావనోపనిషత్ (అథర్వణవేద) - నవోపనిషత్ పాఠ్యాంశ ప్రవచనములకు నమస్కరించుచున్నాము. వాటిసారమగు మిథునత్వము (పరస్పరత్వము/పరస్పర సంయోగత్వము) గురించి సమీక్షగా చెప్పుకుంటున్నాము.

**(యోని స్థానము = జనన స్థానము)**

| మంగళశ్లోకములు | తాత్పర్యము |
|---|---|
| ఓం।<br>1. కః సవితా?<br>కా సావిత్రీ? | 'సవితా' ఎవరు? సావిత్రి ఎవరు? (సవిత - పురుషుడు (పుం)<br>సావిత్రి - పురుషకారము (స్త్రీ)<br>సత్-చిత్-రతి- ఇతి "స్త్రీ"। ) |
| **అగ్నిరేవ సవితా! పృథివీ సావిత్రీ।** | అగ్నియే సవిత। పృథివి సావిత్రి। |
| **స యత్ర అగ్నిః తత్ పృథివీ।<br>యత్ర వా పృథివీ, తత్ర అగ్నిః।<br>తే ద్వే యోనిః। తత్ ఏకం మిథునమ్॥** | ఎక్కడ అగ్ని ఉంటే-అక్కడ పృథివి ఉంటుంది. ఎక్కడ పృథివి ఉంటుందో అక్కడ అగ్ని కూడా ఉండియే తీరుతుంది. పరస్పరము ఒకటికి మరొకటి యోనిస్థానంగా కలిగి ఉన్నాయి.<br>ఉభయము యోనియే। పరస్పరము జనన స్థానమే। ఏకము (ఐక్యత - ఒకటిగా అయిఉన్న) - **మిథునము** (కలయిక). (రెండుగా కనిపిస్తూ, ఒక్కటే అయి ఉన్నట్టివి.) |

| | |
|---|---|
| **2.** కః సవితా? కా సావిత్రీ?<br>**వరుణ ఏవ సవితా। ఆపః సావిత్రీ।**<br>**స యత్ర వరుణః తత్ ఆపో।**<br>**యత్ర వా ఆపః, తత్ వరుణః।**<br>**తే ద్వే యోనిః। తదేకం మిథునమ్॥** | సవిత ఎవరు? సావిత్రి ఎవరు?<br>వరుణుడే **సవిత**. జలము **సావిత్రి**. ఎక్కడ వరుణుడు ఉంటే - అక్కడ జలము. ఎక్కడ జలము ఉంటే అక్కడ వరుణుడు కూడా ఉంటారు. పరస్పరము యోనిస్థానములు(placed in) గా కలిగి ఉన్నాయి. అవి రెండుగా యోని. అయితే అవి రెండూ వస్తుతః మిథునము. ఏకము. ఒక్కటే. (మిథునము = బంగారము + ఆభరణముల ఏకత్వమువంటిది). |
| **3.** కః సవితా? కా సావిత్రీ?<br>**వాయురేవ సవితా। ఆకాశః సావిత్రీ।**<br>**యత్ర స వాయుః తత్ ఆకాశో।**<br>**యత్ర వా ఆకాశః, తత్ వాయుః।**<br>**తే ద్వే యోనిః। తదేకం మిథునమ్॥** | **గాలియే** (వాయువే) **సవిత.** ఆకాశము సావిత్రి. వాయువు ఎక్కడ ఉంటే అక్కడ ఆకాశము, ఎక్కడ ఆకాశము ఉంటే అక్కడ వాయువు ఉంటాయి.<br>వాయువుకు ఆకాశము స్థానము. వాయువులో ఆకాశము ఉండటంచేత వాయువునందు ఆకాశమునకు స్థానము.<br>రెండు పరస్పరం యోని. ఒకదానికి మరొకటి జననస్థానము. వాటి ఏకత్వము మిథునము. సంయోగ ఏకత్వమే 'సత్యము'. (మిథునము = జలము + తరంగముల ఏకత్వమువంటిది). |
| **4.** కః సవితా? కా సావిత్రీ?<br>**యజ్ఞ ఏవ సవితా। ఛన్దాంసి సావిత్రీ।**<br>**యత్ర యజ్ఞః తత్ ఛన్దాంసి।**<br>**యత్ర వా ఛన్దాంసి స యజ్ఞః।**<br>**తే ద్వే యోనిః। తదేకం మిథునమ్॥** | **యజ్ఞము** సవిత. **ఛందస్సులు (వేదములు)** సావిత్రి.<br>ఏది యజ్ఞమో, అది ఛందస్సే (వేదమే).<br>ఏది ఛందస్సులో (వేదములో) అది యజ్ఞమే. పరస్పరము యోని స్థానముగా (పుట్టినచోటుగా) ఉంటున్నాయి. ఈ రెండు యోని ద్వయం. ఆ రెండిటి ఏకత్వమే మిథునము. (భావికుడు-భావనల ఏకత్వము వంటిది). |
| **5.** కః సవితా? కా సావిత్రీ?<br>**స్తనయిత్నురేవ సవితా। విద్యుత్ సావిత్రీ।**<br>**స యత్ర స్తనయత్నుః తత్ విద్యుత్।**<br>**యత్ర వా విద్యుత్ తత్ స్తనయత్నుః**<br>**తే ద్వే యోనిః తదేకం మిథునమ్॥** | **(మబ్బు / ఉరుము)** - సవిత<br>**విద్యుత్తు (మెరుపు)** - సావిత్రి<br>ఎక్కడ మబ్బుయో అక్కడ మెఱుపు. ఎక్కడ మెఱుపో - అక్కడ మబ్బు.<br>మేఘ - మెఱుపుల ఒక దానికి మరొకటి యోని. (Zone of Birth) రెండు ఏక స్థానమును కలిగి, ఏకమే అయి ఉన్నాయి. (మిథునము = వ్యక్తి + వ్యక్తీకరణముల ఏకత్వము వంటిది). |
| **6.** కః సవితా? కా సావిత్రీ?<br>**ఆదిత్య ఏవ సవితా। ద్యౌ సావిత్రీ।**<br>**స యత్ర ఆదిత్యః తత్ ద్యౌః।**<br>**యత్ర వా ద్యౌః, తత్ ఆదిత్యః।**<br>**తే ద్వే యోనిః తదేకం మిథునమ్॥** | **ఆదిత్యుడు సవిత. తేజస్సు సావిత్రి.** ఎక్కడ ఆదిత్యుడుంటే అక్కడ తేజస్సు ఉంటుంది. ఎక్కడ తేజస్సు ఉంటే అక్కడ ఆదిత్యుని ఉనికి ఉన్నది.<br>ఆదిత్యుడు తేజోరూపుడు. తేజోలోకము ఆయనయొక్క జననస్థానము. తేజస్సుకు ఆదిత్యుడు జననస్థానం. ఆ ఇరువురు మిథునము (కలయిక)చే ఏకమే! పరస్పరము (ఒకటికి రెండవది) జనన స్థానము (Place of origin).<br>(మిథునము = గుణి + గుణముల ఏకత్వమువంటిది). |
| **7.** కః సవితా। కా సావిత్రీ।<br>**చంద్ర ఏవ సవితా। నక్షత్రాణి సావిత్రీ।**<br>**స యత్ర చంద్రః, తత్ నక్షత్రాణీ।**<br>**యత్ర వా నక్షత్రాణి, స చన్ద్రమాః।**<br>**తే ద్వే యోనిః తత్ ఏకం మిథునమ్॥** | **చంద్రుడు సవిత. నక్షత్ర మండలము సావిత్రి.**<br>ఎక్కడ చంద్రబింబమో - అక్కడ నక్షత్రములు. ఎక్కడ నక్షత్రములో అక్కడ చంద్రబింబము ఉంటాయి.<br>అవి ఒకదానికొకటి ఉత్పత్తి స్థానము (ఉనికి స్థానము). ఆ రెండు పరస్పరము సంయోగముచే ఏకమే. అట్టి ఏకత్వమే - సత్యము.<br>(మిథునము = ఆలోచించువాడు + ఆలోచనల ఏకత్వమువంటిది). |

| | |
|---|---|
| **8.** కః సవితా? కా సావిత్రీ?<br>'మన' ఏవ సవితా। 'వాక్' సావిత్రీ।<br>స యత్ర మనః తత్ వాక్।<br>యత్ర వా వాక్ తత్ మనః।<br>తే ద్వే యోనిః। తత్ ఏకం మిథునమ్॥ | **మనస్సే** సవిత. వాక్కు **సావిత్రి.**<br>- మనస్సు ఎక్కడున్నదో, అది వాక్ స్థానమే.<br>- ఎక్కడ వాక్కు ఏర్పడుచున్నదో, అది మనోస్థానమే.<br>మనోవాక్కులు పరస్పరము యోని (జనన) స్థానములుగా కలిగి ఉన్నాయి. అవి ఏకస్వరూపమగు జంటయే. (మిథునము = జీవి + జీవితముల ఏకత్వమువంటిది). |
| **9.** కః సవితా? కా సావిత్రీ?<br>పురుష ఏవ సవితా। స్త్రీ సావిత్రీ।<br>స యత్ర పురుషః, తత్ స్త్రీ।<br>యత్ర వా స్త్రీ, స పురుషః।<br>తే ద్వే యోనిః। తత్ ఏకం మిథునమ్॥ | **పురుషుడు** సవిత - **స్త్రీయే** సావిత్రి.<br>ఎక్కడ పురుషుడు ఉన్నాడో, అది స్త్రీ స్థానమే.<br>స్త్రీ ఎక్కడో - అది పురుష స్థానమే.<br>స్త్రీ-పరపురుషులు పరస్పరము జననస్థానములుగా కలిగియున్నారు. అట్టి స్త్రీ పురుషుల జంట ఏకస్వరూపులే. (స్త్రీ లేనిదే పురుషుడు జనించలేడు. పురుషుడు లేకుంటే స్త్రీ జన్మనీయలేదు). |
| **10.** తస్యా ఏవ ప్రథమః పాదో 'భూః'।<br>"తత్ సవితుః వరేణ్యం" -<br>ఇతి అగ్నిర్వై వరేణ్యమ్।<br>ఆపో వరేణ్యమ్।<br>చంద్రమా వరేణ్యమ్। | **తస్య (పరమాత్మయొక్క సవితుః యొక్క) ప్రథమ(1) పాదము.**<br>**" భూః తత్సవితుర్వరేణ్యమ్". అగ్ని - జల - చంద్రమసములు-'తత్' స్వరూపుడగు సవిత్రుదేవతయొక్క భూతత్త్వము** (Zone of Matter)<br>- 'తత్-పరమాత్మయే' అగ్ని-జల-చంద్రులుగా పూజింపదగినవారు. అగ్నియే - వరేణ్యము (స్తుతించబడుతోంది. సవిత్రుడే ఆపో (జలము)గా-వరేణ్యము (స్తుతించబడుతోంది)-(అగ్ని = ఉష్ణము).<br>చంద్రమసము - వరేణ్యము. - (చంద్రమసము = శీతాకాలము) వరేణ్యము. |
| తస్యా ఏవ ద్వితీయః పాదో।<br>భర్గమయో "భువో"।<br>'భర్గో దేవస్య ధీమహి'<br>ఇతి అగ్నిర్వై భర్గ।<br>ఆదిత్యో వై భర్గః<br>చంద్రమా వై భర్గః।<br>తస్యా ఏష తృతీయః పాదః - 'స్వః'।<br>"ధియో యో నః ప్రచోదయాత్।"<br>ఇతి స్త్రీ చ, ఏవ పురుషశ్చ, ప్రజనయతో।<br>యో వా ఏతాం సావిత్రీమ్ - ఏవం వేద,<br>న పునః మృత్యుం (పునర్మృత్యుం) జయతి॥ | **తత్ పరమాత్మ యొక్క ద్వితీయపాదము(2) భర్గమయమైనట్టి - "భువో"** (Zone of thought and Experiencing)<br>→ **భర్గో దేవస్య ధీమహి"**<br>అగ్ని - భర్గుడు (తేజోరూపుడు)<br>ఆదిత్యుడు - భర్గుడు<br>చంద్రుడు - భర్గుడు<br>**తత్-పరమాత్మయొక్క తృతీయ (3) పాదము - "స్వః"।** (**నేను** -The Sense of 'I')<br>→ "స్వః ధియో యోనః ప్రచోదయాత్"<br>అదియే పురుషుడు. అదియే స్త్రీ<br>ఆ రెండిటి సంయోగమే సావిత్రి<br>స్త్రీ - పురుష, ప్రకృతి-పురుష, దృశ్య - ద్రష్టల సంయోగ ఏకత్వమే 'సావిత్రీ' తత్త్వ తాత్పర్యార్థము.<br>ఎవరు ప్రకృతి - పురుషుల, జీవ - ఈశ్వరుల సంయోగ ఏకత్వమును (బంగారము-ఆభరణముల, జలము-తరంగముల అన్యోన్యత్వము, అనన్యత్వముల వలె) ఎరుగుచున్నారో - అట్టివారు మృత్యుపరిధులను అధిగమించి అమృత స్వరూపులగుచున్నారు. (అదియే సావిత్రీతత్త్వము) |
| **11.** "బల-అతిబలయోః" (బలాతిబలయోః)<br>విరాట్ పురుష ఋషిః।<br>గాయత్రీ దేవతా।<br>గాయత్రీ ఛందః।<br>'అ' కార 'ఉ' కార 'మ' కార బీజాద్యాః।<br>'క్షుధ' ఆది నిరసనే వినియోగః। | **"బల - అతిబల" (యోని=మిథున తత్త్వ స్థానమునకు)**<br>ఋషి → "విరాట్ పురుషుడు"<br>దేవత → "గాయత్రీ"<br>ఛందస్సు → "గాయత్రీ"<br>బీజాది - 'అ'కార 'ఉ'కార 'మ'కారములు.<br>క్షుద (ఆకలి దప్పిక) మొదలైన వాటి నిరసనయే వినియోగము. ఉద్దేశ్యము ఉపాసన (క్షుత్-పిపాసనలను జయించుటకై) షట్ అంగన్యాసము - షట్ కరన్యాసము. |

| | |
|---|---|
| "క్లాం" ఇత్యాది షడంగన్యాసః | "క్లాం" మొదలుకొని షడంగన్యాసము.<br>{ "క్లాం" "క్లీం" "క్లూం" "క్లైం" "క్లౌం" "క్లః" ఈ ఆరు అక్షరములతో<br>కరన్యాసము → అంగుష్ఠాభ్యానమః ఇత్యాది<br>అంగన్యాసము → హృదయాయనమః ఇత్యాది}. |
| **12. ధ్యానమ్** | **ధ్యానము** |
| అమృతకరతలార్ద్రౌ<br>సర్వసంజీవనాఢ్యాః, | - అమృతము వంటి ఆర్ద్రములైన కరతలములు (అఱ చేతులు) కలిగియున్నట్టిది, - జీవులను మృత్యువునుండి దాటించి **'సంజీవనము'** చేయునట్టిది, |
| అఘహరణ సుదక్షౌ<br>వేదసారే మయూఖే, | - జీవుల పాపములను హరింపజేయు దక్షత, సామర్థ్యము కలిగి ఉన్నట్టిది,<br>- వేదసార కిరణములను ప్రసరింపజేయునది |
| ప్రణవమయ వికారౌ<br>భాస్కరాకార దేహౌ, | - **'అ-ఉమ'** సమన్విత ప్రణవమయమైన నిరాకార-మహాకారమైనట్టిది, సూర్యదేహముతో ప్రజ్వరిల్లుచున్నట్టిది, |
| సతతమ్ అనుభవేఽహం<br>తౌ బల - అతిబలేశౌ॥ (బలాతీబలేశౌ॥) | అగు బల-అతిబల ఈశ్వరి ఎల్లప్పుడు నాకు అభయమై ఉండును గాక. |
| **13.** "ఓం హ్రీం" బలే। మహాదేవి। | *'ఓ హ్రీం బలే। మహాదేవి।-హ్రీం బలస్వరూపిణియగు సావిత్రీ-మహాదేవీ।* |
| "హ్రీం" మహాబలే। | *'హ్రీం' మహాబలే। - ఓం మహాబల స్వరూపిణీ।* |
| "క్లీం" చతుర్విధ పురుషార్థ సిద్ధిప్రదే। | *'క్లీం' చతుర్విధ పురుషార్థ సిద్ధి ప్రదే। - ధర్మ-అర్థ-కామ-మోక్ష పురుషార్థములను సిద్ధించుమాతా।* |
| 'తత్సవితుః' వరదాత్మికే। | *'తత్సవితుః' వరదాత్మికే। - తత్-సత్-విత్-ఆత్మభావన ప్రసాదించు దేవీ।* |
| "హ్రీం" వరేణ్యమ్। | *'హ్రీం' వరేణ్యమ్। - హ్రీం - పూజనీయమగుదానా।* |
| "భర్గో దేవస్య" వరదాత్మికే। | *'భర్గోదేవస్య'వరదాత్మికే।- తేజో రూపిణివై సమస్తము ప్రసాదించుదానా।* |
| "అతి బలే - సర్వదయామూర్తే। | ***అతిబలే। సర్వదయామూర్తే। -బలమునకే బలమువైయున్న దయామూర్తీ।*** |
| బలే సర్వ క్షుద్ర భ్రమా - ఉపనాశిని। | ***క్షుద్రమగు సమస్త భ్రమలను నశింపజేసి, బలమును ప్రసాదించు దేవదేవీ! - ఆకలి-దప్పిక-జగత్భ్రమలను ఉపశమింపజేయు తల్లీ।*** |
| "ధీమహి, ధియో యో నః" | **ధీమహి॥ ధియో యోనః  నీ మహిమను ధ్యానించుచున్నాము.** |
| జాతే ప్రచుర్యా | **జాతే ప్రచుర్యా  మా బుద్ధికి యోనిస్వరూపిణీ!** |
| ప్రచోదయాత్మికే। | **ప్రచోదయాత్మికే।  ప్రచోదనము ఉత్సాహము ప్రసాదించు దేవీ!** |
| ప్రణవశిరసాత్మికే | **ప్రణవశిరసాత్మికే  'ప్రణవము' (ఓం) అను వేదశిరస్సు అయిఉన్నమాతా!** |
| హుం ఫట్ స్వాహా। | **హుం ఫట్ స్వాహా॥  'హుం-ఫట్' బీజాక్షరములతో హవిస్సులను సమర్పిస్తున్నాము.** |
| ఏవం విద్వాన్ -<br>కృతకృత్యో భవతి॥ | ఈ విధంగా బల అతిబలదేవీతత్త్వమును ఎరిగినవాడు కృతకృత్యుడగు చున్నాడు. |
| సావిత్ర్యా ఏవ సలోకతాం జయతి॥ | సావిత్రీదేవీ సాలోక్యమును పొందుచున్నాడు.<br>సత్ - చిత్ ఆత్మభగవానునితో మమేకము పొందుచున్నాడు. |
| ***<u>ఇతి సావిత్ర్యుపనిషత్</u>*** | ***<u>ఇతి సావిత్ర్యుపనిషత్</u>*** |
| ***<u>ఓం శాంతిః శాంతిః శాంతిః॥</u>*** | ***<u>ఓం శాంతిః శాంతిః శాంతిః</u>*** |

సామవేదాంతర్గత

# 15 సావిత్ర్యుపనిషత్

## అధ్యయన పుష్పము



*ఓం సావిత్ర్యై నమః। గాయత్ర్యై నమః। సరస్వత్యై నమః।*

| ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యమ్<br>భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్॥ | *ఏ 'ఓం' కార పరమార్థమగు పరమాత్మ పూజనీయమగు తనయొక్క సత్ (ఉనికి) విత్ (ఎరుక), ఋత్ (సవితృ)లచే భూ (Matter) భువ (Thought) సువః (Thinker-Self) లను వెలిగించుచున్నారో, అట్టి తేజోరూపులగు భర్గో దేవుని ధీ-మహిమను స్తుతించుచున్నాను. మా బుద్ధిని ప్రచోదనము చేసెదరు గాక!* |
|---|---|

<u>ఓం భూర్భువస్సువః</u>

ఓం ప్రణవ దేవతా నమో నమః
భూః తత్సవితుర్వరేణ్యమ్।
భువోః -భర్గోదేవస్య ధీమహి
స్వః -ధియో యోనః ప్రచోదయాత్

**చిత్-సత్-ఋత్-వతీ। :: చిత్-సావిత్రీ = సావిత్రీ దేవ్యై నమో నమః। "చిదేవ సత్। సదేవ చిత్।"**

| **శ్లో॥ సావిత్ర్యాత్మా పాశుపతం పరబ్రహ్మావధూతకమ్<br>త్రిపురాతపనం దేవి త్రిపురాకర భావనా॥** | సావిత్ర్యుపనిషత్ ; ఆత్మోపనిషత్, పాశుపత బ్రహ్మోపనిషత్, పరబ్రహ్మోపనిషత్, అవధూతోపనిషత్; త్రిపురాతాపిన్యూపనిషత్, దేవీ ఉపనిషత్, భావనోపనిషత్‌లకు బ్రహ్మజ్ఞానమున కొరకై నవోపనిషత్ ఉద్యానవన దేవతలుగా ఉపాసిస్తున్నాము. నమస్కరిస్తున్నాము. |
|---|---|

| ( సవితుః = **కేవలుడగు** సత్ - విత్ పరమపురుషుడు - "సత్-విత్"<br>సావిత్రీ = **ప్రకృతి సమేతుడైన** పరమపురుషుడు)<br>(సవిత్రు - సావిత్రీ మిథునము) | ***సవితుః + సావిత్రీ = బంగారము + ఆభరణము, జలము + తరంగము, భావికుడు + భావన, వ్యక్తి + వ్యక్తీకరణము, జీవి + జీవితము, గుణి + గుణముల, పరమాత్మ + జీవాత్మల మిథునము. (పరస్పర అన్యోన్య అనన్యత్వములు).*** |
|---|---|

### సవిత ఎవరు? సావిత్రీ ఎవరు?

<u>**{సత్ + విత్-ఇతి-సవితః। తత్ సవిత యదా అనుభవ సమేతం - ఇతి సావిత్రీ॥}**</u>

**అగ్నిరేవ సవితా। పృథివీ సావిత్రీ :** అగ్ని సవిత అయితే, పృథివి సావిత్రీ. అగ్ని ఎక్కడ ఉన్నదో - అక్కడ పృథివి కూడా ఉంటోంది. ఎక్కడ పృథివి ఉన్నదో - అక్కడ అగ్ని ఉంటుంది. ఈ రెండు పరస్పర కారణమైయున్న జంట. <u>కనుక ఏకస్వరూపమే.</u> పరస్పర

మిథునము. [సంయోగము, సంభోగము, పరస్పరము యోని (జనన స్థానము) కూడా]. పరస్పరము అవిభాద్యమగు అనన్యత్వము కలిగి ఉంటున్నాయి.

**వరుణయేవ సవితా। ఆపః సావిత్రీ। స యత్ర వరుణః, తదా ఆపో।**
**యత్రవా ఆపః తత్ వరుణః। తే ద్వే యోనిః తదేకం మిథునమ్॥**

*ఎక్కడ వరుణదేవుడుంటే అక్కడ జలముంటుంది. ఎక్కడ జలముంటే అక్కడ వరుణుడు ఉంటారు. వారు ఇరువురు ఒకరికొకరు యోని (జనన) స్థానము. ఏక జంట స్వరూపులు. పరస్పర కార్య-కారణులు. పరస్పరము అభిన్నస్వరూపులు. ఆ మిథునము బంగారము - ఆభరణముల ఏకత్వము వంటిది.*

**వాయురేవ సవితా। ఆకాశః సావిత్రీ। యత్ర స వాయుః తదా ఆకాశో।**
**యత్ర వా ఆకాశః తత్ వాయుః। తే ద్వే యోనిః తదేకం మిథునమ్॥**

*వాయువు ఎక్కడుంటే అక్కడ ఆకాశము, ఆకాశము ఎక్కడుంటే అక్కడ వాయువు ఉండియే తీరుతాయి. ఆ ఉభయము ఒకదానికొకటి యోని స్థానము. ఆ రెండు జంటగా ఏకస్వరూపములు. ఆ మిథునము జలము-తరంగముల ఏకత్వము వంటిది.*

అట్లాగే...,

**"యజ్ఞము"** సవిత। **వేదములు** సావిత్రి।

**"మేఘములు (స్తనయత్ను)"** సవిత। మెఱుపులు (విద్యుత్తు) సావిత్రి।

**"ఆదిత్యుడు"** సవిత। **"ద్యౌ" (తేజస్సు)** (లేక) స్వర్గలోకము సావిత్రి

**"చంద్రమసము"** సవిత। **"నక్షత్ర"** సావిత్రి।

**"మనస్సు"** సవిత। **వాక్కు** సావిత్రి।

***ఇవన్నీ భావికుడు-భావన, వ్యక్తి-వ్యక్తీకరణము, గుణి-గుణములు, ఆలోచించువాడు-ఆలోచనలు, జీవి-జీవితములవలె మిథునము (పరస్పర అవినాభావ ఏకత్వము) వంటివి. ఒకటి రెండవది ఉనికి-జనన-సంచార-సయోగ స్థానము.***

*ఇవన్నీ కూడా మొదటిది. రెండవదానియందు, రెండవది మొదటి దానియందు యోనిగా (జనన స్థానముగా, నివాసముగా) కలిగి ఉన్నాయి. పరస్పరము యోని - మిథునము (కలయిక, ఏకత్వము) కలిగి ఉన్నాయి. ఈ విధంగా పరస్పరము అభేద రూపములు కూడా.*

## పురుషుడు - స్త్రీ:

పురుషుడు స్త్రీ నుండి జనించుచున్నాడు. స్త్రీ పురుషుని జననస్థానముగా కలిగి యున్నది. పరస్పరము యోని స్థానము కలవారై, జంటగా ఏకస్వరూపులై ఉన్నారు. పురుషుడెక్కడ ఉంటే, అక్కడ స్త్రీ ఉండియే తీరుతుంది. స్త్రీ ఎక్కడ ఉంటే అక్కడ పురుషుడు ఉండియే ఉంటారు. మిథునము (పరస్పరకలయిక)చే స్త్రీ - పురుష సంతానము.

## పురుషుడు - ప్రకృతి:

**ప్రకృతి నుండి పురుషుడు జనిస్తూ, పురుషునికి ప్రకృతి యోనిస్థానమగుచున్నది. పురుషుని నుండి ప్రకృతి జనిస్తూ పురుషుడు ప్రకృతికి యోని స్థానమగుచున్నాడు.** 'పురుష-ప్రకృతులు మిథునముగా (జంటగా) ఏకముగా పరస్పరము ఏర్పడినవారై, **-అవినాభావులై అభేదరూపులై ఉంటారు.** ప్రకృతి ఎక్కడుంటే అక్కడ పురుషుడు, పురుషుడు ఎక్కడ ఉంటే - అక్కడ ప్రకృతి → ఇరువురు ఉంటారు. ప్రకృతి - పురుషులు ఏకస్వరూపులే! ఉభయులు సర్వదా ఒకే రూపముతో సంప్రకాశమానులగుచున్నారు.

**ఈ మిథునమే పరమాత్మ-జీవాత్మల అన్యోన్యత్వము, అనన్యత్వము, అవినాభావత్వముల రూపమై కూడా ఏర్పడియున్నది.**

అట్టి పరస్పర స్త్రీ - పురుష (లేక) ప్రకృతి - పురుష అవినాభావ - ఏకస్వరూప స్వానుభవమునకై మహర్షులు గాయత్రీ మంత్రమును మూడు పాదములుగల ఏక-అక్షర ఓంకార సహితంగా మానవాళికి ఉపాసనగా ప్రసాదించుచున్నారు.

# గాయత్రీమంత్ర త్రిపాదములు

**(1) తస్యా ఏష ప్రథమ పాదః – (భూః** = Zone of Matter)

**"భూః" పాదో – "తత్ సవితుః వరేణ్యమ్"। భౌతికంగా కనిపిస్తున్న పరమాత్మయొక్క ప్రథమ పాదమునకు నమస్కారము.**

ఈ భౌతికంగా కనిపించేదంతా సావిత్రీ స్వరూపమై సత్‌విత్ స్వరూపుడగు సవిత్రుభగవానుని స్తుతియే.

**భూః వరేణ్యము ఇతి॥ :** భౌతికంగా కనిపించేదంతా ఆత్మ – భగవత్ స్తుతియే।

**అగ్నిర్వై వరేణ్యమ్ :** అగ్నిరూపముగా ఉన్నదంతా ఆ పరమాత్మయొక్క స్తోత్రమే। ఉపాసనారూపమే।

**చంద్రమా వరేణ్యమ్ :** ఓషధీ – వనస్పలను, ఆహారమును ప్రసాదించు చంద్రమా తత్త్వమంతా పరమేశ్వర భౌతికరూప వర్ణనములే. పుష్పములు, ఫలములు, ధాన్యములు, అపరములు – **అన్నీ పరమాత్మ రూప వర్ణనలే. పరమాత్మ–పరమేశ్వరీతత్త్వమే. సవితృ–సావిత్రీ అనన్యతత్త్వమే।**

**2. తస్యా ఏష ద్వితీయ పాదః – (భువః** = Zone of Thoughts, feelings and Experiencing)

**"భువః" భర్గమయో "భువో" "భర్గోదేవస్య" ధీమహి।**

**– వెలుతురుగా, కాంతిగా, తేజస్సుగా కనిపిస్తున్న పరమాత్మయొక్క ద్వితీయ పాదమునకు నమస్కారము.**

**అగ్నిర్వై భర్గః –** అగ్ని పరమాత్మయొక్క భర్గో దివ్య తేజో ప్రదర్శనము.

**భర్గ ఆదిత్యో వై –** సూర్యమండలము భర్గోదేవుని తేజో ప్రదర్శనము.

**చంద్రమావై భర్గః –** చంద్రమండలము సూర్యుడు వెలిగించు మండలముగా భర్గోదేవ ప్రత్యక్ష సంప్రదర్శనము.

ఈవిధంగా అవన్నీ భర్గోదేవుడగు పరమాత్మయొక్క **ధీస్వరూప మహిమలే.** ఆయనయొక్క **తేజో విలాసములే।**

**3. తస్యా ఏష తృతీయ పాదః – సమస్త జీవులలో 'అనుభవి'గా ప్రత్యక్షమైయున్న పరమాత్మయొక్క తృతీయపాదమునకు నమస్కారము.** (Matter of స్వః = Self. Zone of "Sense of SELF)

**"స్వ (సుః) – స్వర్ధియో (ధియో) యోనః ప్రచోదయాత్"**

స్త్రీ–పురుషుల నుండి ప్రదర్శితమగు ప్రజనితమంతా (జీవుల ఉత్పత్తి మొదలైనదంతా) సావిత్రీతత్త్వమే. ఈ విధంగా "ఓం"కారము – అఖండ – ఏక –అక్షర పరబ్రహ్మమే – సావిత్రీరూపము. అనగా →

**"భూః" సవితుః వరేణ్యమ్ – భౌతిక రూపములుగా,** (Matter)

**"భువో" భర్గో దేవస్య ధీమహి** – దివ్యమగు భర్గోదేవ **మహామనోస్వరూపముగా,** (Thought)

**"సువో" ధియోయోనః ప్రచోదయాత్ – మహాబుద్ధి స్వరూపమై,** సర్వజనన స్థానమై, **'అనుభవి' రూపమై** (Self/I)

సవిత్రు – సావిత్రి స్వరూపమై, ఈ సమస్తము విరాజిల్లుచున్నది. సర్వత్రా వెలయుచున్నది.

అట్టి సవిత్రు – సావిత్రి పాద – గాయత్రీమంత్ర ఏకాక్షర బ్రహ్మముయొక్క కేవలరూప మోక్షానుభవమునకై ఈ జీవుడు అల్ప – భేద దృశ్య దృష్టులను జయించు బలమును సముపార్జించాలి. **ఆ సమస్తము స్వస్వరూపాత్మగా భావించగలుగు అచంచల దృష్టియే–జీవనము, బలము, ఐశ్వర్యము కూడా.**

అందుకు మహర్షులు ముముక్షుల కొరకై మంత్రసమన్వితమైన **"బల–అతిబల"** ఉపాసన విద్యను ప్రసాదించుచున్నారు.

## "బల-అతిబల సావిత్రీ ఉపాసన" (ఇహ-స్థైర్య, / పర-ఆత్మ భావనలు)

**"బల-అతి" మహామంత్రయోః**

| | | |
|---|---|---|
| విరాట్ పురుష - ఋషిః। | → | ఈ విరాట్‌పురుష విశ్వస్వరూప పరమాత్మయే **'ఋషి'**. |
| గాయత్రీ - దేవతా। | → | గాయత్రీ జగన్మాతయే **'దేవత'.** |
| గాయత్రీ - ఛందః। | → | ఛందస్సు - **"గాయత్రీ".** |
| 'అ' కార 'ఉ'కార 'మ'కార (ఓం) - బీజాద్యః | → | "అ ఉ మ" - 'ఓం'కారము ఆదిబీజము. |
| క్షుదాద్యా నిరసనే - వినియోగః | → | ఆకలి, దప్పిక, కామక్రోధ మోహములు మొదలైన వాటిని జయించి, ఆత్మస్థానము చేరటము కొరకై వినియోగము. **దృశ్య ధ్యాసను అధిగమించి "ఆత్మధ్యాస" కొరకై మంత్రోపాసనా వినియోగము.** |

## "క్లాం" ఇత్యాది షడంగన్యాసః। షడక్షర న్యాసః

| **కరన్యాసము** | **అంగన్యాసము** |
|---|---|
| **"క్లాం"** అంగుష్ఠాభ్యాం నమః। | **"క్లాం"** హృదయాయనమః। |
| **"క్లీం"** తర్జనీభ్యాం నమః। | **"క్లీం"** శిరసే స్వాహా। |
| **"క్లూం"** మధ్యమాభ్యాం నమః। | **"క్లూం"** శిఖయాయ వషట్। |
| **"క్లైం"** అనామికాభ్యాం నమః। | **"క్లైం"** కవచాయహుమ్। |
| **"క్లౌం"** కనిష్ఠికాభ్యాం నమః। | **"క్లౌం"** నేత్రత్రయాయ వేషట్। |
| క్లః కరతలకర పృష్ఠాభ్యాం నమః | **"క్లః"** అస్త్రాయ 'ఫట్'। |

భూర్భువస్సు 'ఓం' - ఇతి దిగ్బంధః॥

## బలా-అతిబల సవితా-సావిత్రీ - ధ్యానము

మం॥ శ్లో॥ అమృత కరతల ఆర్ద్రౌ, సర్వ సంజీవనాఢ్యాః,
అఘహరణ సుదక్షౌ వేదసారే మయూఖే,
**ప్రణవమయ వికారౌ భాస్కరాకార దేహౌ**
**సతతమ్ అనుభవే అహమ్ తే బలా - అతిబలేశౌ॥**

అమృత మాధుర్యముతో కూడిన ఆర్ద్రమగు, కోమలమగు అరచేతులు కలిగియున్నట్టిది,

- సర్వజనులకు సంజీవనము (జీవనప్రదాత, పునరుజ్జీవ ప్రదాత) అయినట్టిది.

**"మృతత్వము"** నుండి రక్షించి **'అమృతత్వము'** ప్రసాదించునది,

- సర్వ పాపములను పోగొట్టగల మహత్ సామర్థ్యము కలిగి యున్నట్టిది,

- **("సోహఽమ్; తత్త్వమ్; త్వమేవాఽహమ్; అహమ్ బ్రహ్మాఽస్మి, అయమాత్మా బ్రహ్మ" ఇత్యాది) మహావాక్యార్థసారమును** కిరణములుగా కలిగి ఉన్నట్టిది...,

- **కేవలానంద - ఆత్మార్థ సూచకమగు ప్రణవార్థ విశేషాకారముగలది,**

- సర్వమును వెలిగించు **భాస్కరాకార తేజోదేహము** కలిగి ఉన్నట్టిది, **తేజస్వీస్వరూపిణి** - అయి,

**"బల - అతి బలేశ్వరి" అయినట్టి సవితా - సావిత్రీ దేవి** మాకు **సర్వే సర్వత్రా స్వానుభవమై, అనుక్షణికానుభూతిగా సిద్ధించును గాక।**

## బలాతిబల సవితః-సావిత్రీ ఉపాసనా - మూలమంత్రము

**ఓం హ్రీం క్లీం తత్సవితుః వరేణ్యం భర్గో దేవస్య ధీమహి।**
**ధియో యోనః ప్రచోదయాత్**

**ఓం హ్రీం బలే మహాదేవి।**
**హ్రీం మహాబలే।**
**క్లీం చతుర్విధ పురుషార్థ సిద్ధిప్రదే।**
**తత్సవితుః వరదాత్మికే।**
**హ్రీం వరేణ్యం।**
**భర్గో దేవస్య వరదాత్మికే।**
**అతిబలే। సర్వదయామూర్తే।**
**బలే। సర్వక్షుద్ర భ్రమ ఉపనాశిని।**
**ధీమహి। ధియోయో నః జాతే।**
**ప్రచుర్యా ప్రచోదయాత్మికే।**
**ప్రణవ శిరస్కాత్మికే।**
**హుం ఫట్ స్వాహా॥**

ఈ **"బలాతి బల సవితుః సావిత్రీ మహామంత్రము"**ను ఎరిగి, ఆరాధించి, ఉపాసించి సమాశ్రయించువాడు

సావిత్ర్యా ఏవ సలోకతాం జయతి।

సావిత్రీ మూలప్రకృతీదేవి కటాక్షము పొందినవాడై,

- లోకములను జయించి,
- లోకేశ్వరీ స్థానము సిద్ధించుకోగలడు.

**లోక జయము** - 
**1.** లోకములన్నీ నాలోనే ఉన్నాయి. (పర)
**2.** లోకములో నేనున్నాను. (ఇహ)
— ఉభయముల ఏకత్వము - మిథునము

ఇతి సావిత్ర్యుపనిషత్
*ఓం శాంతిః। శాంతిః। శాంతిః।*

అథర్వణవేదాంతర్గత

# 1 అథర్వశిఖోపనిషత్

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ 'ఓం' కారార్థతయా భాతం।
తుర్య 'ఓం' కార అగ్రభాసురమ్।
తుర్య తుర్య త్రిపాద్ రామం
స్వమాత్రం కలయే అన్వహమ్॥



'ఓం'కార పరమార్థ స్వరూపులు, ఈ జాగ్రత్-స్వప్న-సుషుప్తులకు ఆవల నాలుగవ (తురీయ) పురుషులైనట్టివారు, మూడిటియొక్క ప్రకాశక ఓంకార స్వరూపులు, - తురీయాతీత త్రిపదా సమన్వితులు - అగు రామచంద్ర పరమాత్మ సర్వదా స్వస్వరూపమాత్రులే। నాలో 'నేను'గా కనిపించుచున్నది - వారే। రామోఽహమస్మి। అహం రామః।

ఓం

**1.** అథ హి ఏనం (అథ హైనం)
పైప్పలాదో, అంగిరాః, సనత్కుమారశ్చ
అథర్వాణమ్ ఉవాచ:

ఒకానొక సందర్భంలో పైప్పలాదుడు, అంగీరసుడు, సనత్కుమారుడు - వీరంతా శిష్యభావముతో అథర్వ మునీశ్వరుని సమీపించి, నమస్కరించినవారై ఇట్లు ప్రశ్నించారు.

---

**2.** "భగవన్! కిమ్ ఆదౌ ప్రయుక్తం?
ధ్యానం, ధ్యాయితవ్యం?
కిం తత్ ధ్యానం?
కోవా ధ్యాతా?
కశ్చ ధ్యేయః?"

హే భగవన్! మొట్టమొదట ఏది ఉపయోగించబడి సృష్టికర్తచే ఇదంతా సృష్టించబడింది?
- 'ధ్యానము' అనగా ఏమి? ధ్యానింపతగినది ఏది?
- ధ్యానమునకు సాధనము ఏది?
- అసలీ ధ్యానించువాడెవ్వడు?
- ధ్యానింపబడునది ఎవ్వరు, ఏది? ధ్యాత-ధ్యేయముల పరస్పర సంబంధము ఎట్టిది?

---

**3.** స ఏభ్యో అథర్వా ప్రత్యువాచ :-
'ఓం' ఇతి ఏతత్ అక్షరం
ఆదౌ ప్రయుక్తమ్ -
ధ్యానమ్, ధ్యాయితవ్యమ్। ఇతి।

ఈ ప్రశ్నలు విని వారికి అథర్వమహర్షి ఈ విధంగా సమాధానం చెప్పసాగారు.
'ఓం' అని ఏది వేద శబ్ద ప్రతిపాదితమో, అట్టి ప్రణవాక్షరార్థమే మొట్టమొదటగా అక్షరమై, సర్వదా యథాతథమై ఉన్నది.
అట్టి ప్రణవాక్షరముయొక్క పరమార్థము గురించిన ధ్యాసయే ధ్యానము. ధ్యానింపవలసినది కూడా, అద్దాని అర్థముగా చెప్పబడేదే. ధ్యాత - ధ్యానము - ధ్యేయము (ధ్యానించ బడునది)ల ఏకరూపము (The line of Thinker, Thought and that basing thought) - ఓంకార సంజ్ఞ.

---

**4.** ఏతత్ అక్షరమ్ పరంబ్రహ్మ।
అస్య పాదాః చత్వారో ।
వేదాః చతుష్పాత్।
ఇదమ్ అక్షరమ్ పరంబ్రహ్మ॥

పరం బ్రహ్మమే 'ఓం' కార ప్రణవము యొక్క ఉద్దేశ్యార్థము.
ప్రణవముయొక్క నాలుగు పాదములు నాలుగు వేదములు.
నాలుగు పాదములతో కూడిన 'ఓం' అక్షరము పరబ్రహ్మ స్వరూపము.
**(అ + ఉ + మ + అర్ధమాత్ర)**

| | |
|---|---|
| **5. పూర్వ అస్య మాత్రా "పృథివిః"।** | **ప్రణవముయొక్క మొదటి మాత్ర - 'అ'కారము.** |
| **- 'అ' కారః।** | 'అ' కారమునకు భౌతికము → పృథివి (Solid). |
| **- స ఋగ్భిః।** | - ఋక్కులతో (మంత్రములతో) కూడి ఉన్నట్టి ఋగ్వేద రూపము. |
| **- ఋగ్వేదో। బ్రహ్మా।** | - అధి దేవత → బ్రహ్మ. |
| **- వసవో। గాయత్రీ।** | - పితృదేవతలు → అష్టవసువులు. |
| **- గార్హపత్యః।** | - ఛందస్సు → గాయత్రీ. |
| | - అగ్ని → గార్హపత్యాగ్ని (శ్రౌతాగ్నులలో / త్రేతాగ్నులలో మొదటిది). |
| **6. ద్వితీయ "అంతరిక్షగ్ం"।** | **ప్రణవముయొక్క రెండవ మాత్ర → 'ఉ'కారము** |
| **- స 'ఉ' కారః ।** | - ఇద్దాని భౌతికము→ అంతరిక్షము (ఆకాశము). |
| **- స యజుర్భిః, }** | - ఇది యజుస్సు (స్తోత్రములు)లతో కూడిన యజుర్వేద రూపము. |
| **- యజుర్వేదో। }** | - అధి దేవత → విష్ణువు. |
| **- విష్ణూ రుద్రాః।** | - పితృదేవతలు → ఏకాదశ రుద్రులు. |
| **- త్రిష్టుప్।** | - ఛందస్సు → త్రిష్టుప్. |
| **- దక్షిణాగ్నిః।** | - యజ్ఞాగ్ని → దక్షిణాగ్ని. (శ్రౌతాగ్నులలో / త్రేతాగ్నులలో రెండవది) |
| **7. తృతీయా "ద్యౌః"।** | **ప్రణవముయొక్క మూడవ మాత్ర → 'మ'కారము** |
| **- స 'మ' కారః।** | - ఇద్దాని భౌతికము → ద్యులోకము, స్వర్గము. |
| **- స సామభిః। }** | - ఇది సామగానములతో కూడిన సామవేద రూపము. |
| **- సామ వేదో। }** | - అధిదేవత → రుద్రుడు. |
| **- రుద్రా ఆదిత్యా।** | - పితృదేవతలు → ద్వాదశ ఆదిత్యులు. |
| **జగతీ।** | - ఛందస్సు → జగతీ. |
| **ఆహవనీయః।** | యజ్ఞాగ్ని → ఆహవనీయాగ్ని. (శ్రౌతాగ్నులలో / త్రేతాగ్నులలో మూడవది) |
| **8. యా అవసానే అస్య - "అర్థమాత్రా"** | **ప్రణవము యొక్క చివర - నాలుగవది 'అర్థ మాత్ర.'** |
| **- చతుర్థ - "అర్థమాత్రా"।** | - అద్దాని భౌతికము - సోమలోకము. |
| **- స సోమలోకః।** | - ఇది 'ఓం' కారోచ్చారణ-ఉపసంహారణ మౌనరూపము. |
| **- 'ఓం' కారః।** | - అథర్వణ మంత్రములతో కూడినది. అథర్వణ వేద రూపము. |
| **- స అథర్వణ మంత్రైః। }** | - యజ్ఞాగ్ని → సంవర్తకాగ్ని. (ప్రళయాగ్ని). |
| **- అథర్వ వేదః। }** | - ఇద్దాని విరాట్టు → మరుత్తులు. |
| **- సంవర్తకో అగ్నిః।** | - ఏక ఋషి - భాస్వతి. (సమస్తము భాసింపజేయునది) - అని పిలువబడుతోంది. |
| **మరుతో విరాడే కర్షిః భాస్వతీః స్మృతాః॥** | అకార - ఉకార - మకారముల చివర అతిసూక్ష్మమై ఉండే ఈ 'అర్థమాత్ర'యే నాదస్వరూపము. (మరియు) నాదోప-సంహార మౌన రూపము కూడా. |

| | |
|---|---|
| **9. ప్రథమా 'రక్తపీతా' –<br>మహత్, బ్రహ్మదైవత్యా।** | **'అ' శబ్ద ప్రథమమాత్ర యొక్క →**<br>రంగు → రక్తపీతా - ఎరుపు.<br>(మహత్) శక్తి → స్వర్ణకాంతివంతము.<br>అధిదేవత → మహత్ బ్రహ్మ. (ఈ సమస్తము తనయొక్క మహత్తుగా కలిగి ఉండుటకు ఆత్మకు 'సంజ్ఞ'). (బ్రహ్మ దైవత్వము). బ్రహ్మదేవుడు. |
| **ద్వితీయా 'విద్యుమతీ'–<br>కృష్ణా, విష్ణు దైవత్యా।** | **రెండవదగు 'ఉ' మాత్ర యొక్క →**<br>రంగు → నలుపు.<br>శక్తి → విద్యుత్ కాంతి.<br>అధిదేవత → శ్రీవిష్ణుమూర్తి (విష్ణు దైవత్వము) |
| **తృతీయా శుభ – అశుభా<br>శుక్లా,<br>రుద్రదైవత్యా।** | **మూడవదగు 'మ' మాత్ర యొక్క →**<br>రంగు → శుభాశుభములను ఏకము చేయు తెలుపు.<br>దాని శక్తి → శుక్ల (తెలుపు) వర్ణము.<br>అధిదేవత - రుద్రమూర్తి. (రుద్ర దైవత్వము). |
| **యావసానే। (య అవసానే)<br>అస్య చతుర్థ అర్ధమాత్రా।<br>సా విద్యుమతీ।<br>సర్వవర్ణా।<br>పురుష దైవత్యా ॥** | **నాలుగవదగు అర్ధమాత్రయొక్క →**<br>- కేవల శబ్దముగా చివరిలో పలుకబడునది.<br>- రంగు - విద్యుమతీ, లక్ష్మీదేవి.<br>శక్తి → అన్ని రంగులు కలసి ఉన్నట్టి సూర్యకాంతివర్ణము<br>అధిదేవత → జీవాత్మకు సాక్షి, నియామకుడు అగు పురుషుడు. (పురుష దైవత్యా). కేవల పురుషాకార స్వరూపము. |
| **10. స ఏష హి 'ఓం'కారః<br>– చతురక్షరః।<br>– చతుష్పాదః।<br>– చతుశ్శిరః।<br>– చతురర్ధమాత్రః।<br>– స్థూలమ్ ఏతత్ హ్రస్వ – దీర్ఘ – ప్లుత ఇతి।<br>ఓం (1) ఓం (2) ఓం (3) ఇతి॥** | నాయనలారా! ఇదియే మనము ధ్యానింపతగినది - ధ్యానింపవలసినది అగు 'ఓం'కారము. పైన చెప్పబడిన **బ్రహ్మ-విష్ణు-రుద్ర పరమ పురుష దైవత్యములు కలిపి ఓంకారము.**<br>- ఇది నాలుగు అక్షరములు కలిగి ఉన్నది (అ+ఉ+మ +అర్ధమాత్ర)<br>- నాలుగు శీర్షములు కలిగి ఉన్నట్టిది. (జాగ్రత్, స్వప్న, సుషుప్తి-తురీయములు).<br>- అద్దాని **సూక్ష్మము అర్ధమాత్ర.** (సర్వాంతర్యామి భావన).<br>- స్థూలమైనప్పుడు - శబ్ద ఉచ్చారణ<br>(1) హ్రస్వము (2) దీర్ఘము (3) ప్లుతము....అని చెప్పబడుతోంది.<br>(1) (2) (3) అంతా ఓంకార రూపమే! (ప్లుతము = సమముగా పోవునది. ఒకే ప్రవాహము). |
| **11. త్రి రుక్త్వా (త్రిః ఉక్త్వా)<br>చతుర్థః శాంత ఆత్మా ప్లుత<br>ప్రణవ ప్రయోగేన సమస్తమ్<br>'ఓం' ఇతి ప్రయుక్త, ఆత్మజ్యోతిః<br>సకృత్ ఆవర్తతే॥** | ఈ విధంగా త్రిమాత్రలు + చతుర్థ మాత్ర గల ప్రణవమును క్రమముగా ఉచ్చరిస్తూ ఉపాసించాలి. "ఆ.....ఉ......మ......మ్మ్......ఓం". నాలుగవసారి ఐదు మాత్రల ప్రణవోచ్చారణ ఉచ్చరించబడు గాక! అట్టి రీతిగా ఉచ్చరించు వానికి, ఉపాసించువానికి - "పరమ శాంతస్వరూపము, సమస్తము తానే అయినది, ఆత్మస్వరూపము...."అగు ఆత్మజ్యోతి అనుభవరూపముగా క్రమక్రమంగా ప్రకాశమానము కాగలదు. |
| **12. సకృత్ ఉచ్చారిత మాత్ర<br>స ఏష ఊర్ధ్వమ్<br>ఉన్నామయతీతి<br>'ఓం' కారః॥** | ఉచ్చరించిన మాత్రము చేతనే అట్టి ప్రణవము ఆ సాధకుని ఊర్ధ్వరూపమగు పరమపదమునకు, ఉత్తమస్థానమునకు తీసుకొని పోవుచున్నది కాబట్టియే 'ఓం'కారము....అని అనబడుచున్నది. |

| | |
|---|---|
| **13. ప్రాణాం తు సర్వాన్ ప్రలీయత-**<br>**ఇతి 'ప్రళయః'।**<br>**ప్రాణాం తు స సర్వాన్ పరమాత్మని**<br>**ప్రణామయతి -**<br>**ఇత్యేతస్మాత్ 'ప్రణవః'।**<br>**చతుర్ధ అవస్థిత ఇతి**<br>**సర్వ దేవ వేద యోనిః**<br>**సర్వ వాచ్య వస్తు ప్రణవాత్మకమ్।** | **ఓం = ప్రళయము, ప్రణవము, తారము, తురీయము, విష్ణు, బ్రహ్మ, ప్రకాశము, వ్యాపీ, మహేశ్వరః అదియే ఆత్మ.**<br>**ప్రళయము:** అట్టి ఓంకార సంజ్ఞయందు ప్రాణతత్త్వముతో సహా సమస్తము లయించినది అగుచున్నది. కాబట్టి ప్రణవమును 'ప్రళయము' అని కూడా పిలుస్తున్నారు.<br>**ప్రణవము:** ఓంకారోచ్చారణ సకల ప్రాణములను, ప్రాణులను పరమాత్మయందు చేర్పించుచున్నది కాబట్టి → ప్రణామయతి ప్రణవమ్...అని వర్ణించబడుచున్నది.<br>(జాగ్రత్ - స్వప్న - సుషుప్తి - తురీయములనబడే) 4 అవస్థలను ఆస్వాదించుచున్నట్టిది - కాబట్టి ప్రణవము.<br>సర్వ దేవతలకు, సర్వ వేదములకు (తెలియబడే సర్వ విషయములకు) యోనిస్థానము (లేక) ఉత్పత్తిస్థానము అయి ఉన్నది. సర్వ వాక్ విషయ (వాచ్య) వస్తువులకు ప్రణవాత్మకమైనది. కాబట్టి ప్రణవము. |
| **14. దేవాశ్చ ఇతి సంధత్తాం,**<br>**సర్వేభ్యో దుఃఖ భయేభ్యః సంతారయతి**<br>**ఇతి తారణాత్ 'తారః'॥** | **తారమ్:** సమస్త దేవతలు 'ఓం' (ప్రణవ) స్వరూపులే!<br>సర్వ దుఃఖ - భయములనుండి శాశ్వతముగా తరింపజేస్తున్నది కనుక తారము. **"సంతారయతి ఇతి తారణాత్ తారమ్".** |
| **15. సర్వే దేవాః సంవిశంతి ఇతి విష్ణుః।**<br>**సర్వాణి బృంహయతి ఇతి బ్రహ్మా (బ్రహ్మ)।**<br>**సర్వస్య అంతః స్థానేభ్యో**<br>**ధ్యేయేభ్యో ప్రదీపవత్**<br>**ప్రకాశయతి - ఇతి "ప్రకాశః"।** | **'ఓం' కారము - వర్ణన**<br>**విష్ణుః:** సర్వ దేవతలు కూడా ఎక్కడ-సంవిశంతము- విశ్రామము - ప్రశాంత పొందుచున్నారో ఆ స్థానమే **'విష్ణు'** అనబడుతోంది. ఓంకారమే విష్ణువు.<br>**బ్రహ్మ:** సకల ప్రాణులు ఎక్కడ మరల సృష్టించబడుచున్నారో, ఆ స్థానమే **'బ్రహ్మ'! ఓంకారమే బ్రహ్మదేవుడు.**<br>**ప్రకాశము:** సకల ప్రాణులయొక్క (జీవులయొక్క) హృదయస్థానము నందు ధ్యాన పరాకాష్ఠ అయిన పరమాత్మ - దీపమువలె సర్వదా ప్రకాశించుచుండుటచేత, 'ఓం' తత్త్వము **'ప్రకాశము'** అని అంటున్నారు. |
| **16. ప్రకాశేభ్యః 'సత్-ఓం'**<br>**- ఇతి అంతఃశరీరే విద్యుత్వత్**<br>**ద్యోతయతి ముహుర్-ముహుర్**<br>**- ఇతి విద్యుత్వత్ ప్రతీయాత్**<br>**దిశం దిశం భిత్వా**<br>**సర్వాన్ లోకాన్ వ్యాప్నోఽతి,**<br>**వ్యాపయతీతి వ్యాపనాత్ వ్యాపీ మహాదేవః॥** | **విద్యుత్:** 'ఓం సత్' స్వరూపంగా సమస్త ప్రకాశకములకు ప్రకాశకమై సర్వదేహములలోను మరల మరల ద్యోతకమగుచు ప్రకాశించుచుండటం చేతను...., (యోగాభ్యాసులగు యతుల అంతరంగ దృష్టికి) మెరుపువలె ప్రకాశించుచుండుటచేతను **'విద్యుత్'** అని వర్ణించబడుతోంది.<br>**వ్యాపీ-మహాదేవ:** సర్వదిక్కులయందును అంతర్యామిగా ప్రవేశించినదై, సర్వలోకములందు వ్యాపించి ఉండటంచేతను, సర్వమును వ్యాపింపజేస్తూ ఉండటంచేతను (వ్యాపకత్వమును వ్యాపింపజేయుచుండటచేతను)- **'మహాదేవుడు'** అని అభివర్ణించబడుచున్నది! |
| **17. పూర్వ అస్య-మాత్రా జాగర్తి జాగరితం,**<br>**ద్వితీయా స్వప్నం। తృతీయా సుషుప్తిః।**<br>**చతుర్థీ తురీయం।** | **(మాత్ర = State, Phase, స్థానము, దశ) ఓం = ఆత్మ**<br>ఓంకారముయొక్క మొదటి మాత్ర → జాగరిత రూపమగు జాగృత్,<br>రెండవ మాత్ర → స్వప్నము,<br>మూడవ మాత్ర → సుషుప్తి,<br>నాలుగవ మాత్ర → (చ) తురీయము. |
| **మాత్రా మాత్రాః ప్రతిమాత్రా గతాః**<br>**సమ్యక్ సమస్తానపి**<br>**పాదాన్ జయతి-ఇతి, స్వయంప్రకాశః**<br>**స్వయం బ్రహ్మ భవతీతి ఏష సిద్ధికర**<br>**ఏతస్మాత్ ధ్యాన - ఆదౌ ప్రయుజ్యతే॥** | ఒక్కొక్క మాత్ర తదితర మాత్రలయందు లయించుచున్నది. లయకారి అగు ఆత్మ స్వయం ప్రకాశకము. దానిని ప్రకాశింపజేయునది మరొకటేదీ లేదు! ఆత్మయే త్రిపాదములకు ఊర్ధ్వమున ఉదయించు పురుషుడు. **స్వయంబ్రహ్మ స్వరూపము.** అట్టి 'ఓం'కార ధ్యానము **'పూర్వ-తత్పూర్వ స్వస్థానము'**ను సిద్ధింపజేయగలదు. అందుచేత సిద్ధికరము.<br>ఓంకారము ఈ కారణముగా ధ్యాన సమాధులందు వినియోగించబడుచున్నది! |

**18.** సర్వకరణ ఉపసంహారత్వాత్
ధార్య - ధారణాత్
బ్రహ్మ **"తురీయమ్"**।
సర్వ కరణాని మనసి
సంప్రతిష్ఠాప్య ధ్యానం **"విష్ణుః"**॥

**తురీయము:** సర్వ ఇంద్రియ - ఇంద్రియ విషయములు ఉత్పన్నమగుచున్న, (మరియు) ఉపసంహరించబడుచున్న సంస్థానము అవటం చేతను, సమస్తము తన ధారణ కావడం చేతను-బ్రహ్మమును **'తురీయము'** అని కూడా అంటూ ఉన్నారు.

**విష్ణువు:** ఈ స్థూల దేహముయొక్క పంచ జ్ఞానేంద్రియములనూ పంచ కర్మేంద్రియములను మనస్సునందు ప్రతిష్ఠింపజేసి, మనస్సుచే చేయు ఆత్మధ్యానముయొక్క రూపమే/విషయమే ధ్యానమే విష్ణువు. **ఆ ధ్యాని కూడా విష్ణువే.**

---

**19.** ప్రాణం మనసి సహకరణైః సం ప్రతిష్ఠాప్య
ధ్యాతా రుద్రః। ప్రాణం మనసి సహకరణైః
నాదాంతే పరమాత్మని
సంప్రతిష్ఠాప్య ధ్యాయీత్
ఈశానం ప్రధ్యాయితవ్యగ్ం॥

ప్రాణములను, మనస్సును ఇంద్రియములతో సహా ఆత్మయందు స్థాపించు ధ్యాసగలవాడే రుద్రుడు. అధ్యాసయే శివధ్యానము

ప్రాణ - మనో - ఇంద్రియములలో నాదముయొక్క చిట్టచివర వేంచేసియున్న పరమాత్మ యందు సంప్రతిష్ఠితుడైయున్న ఈశానుని ధ్యానము చేయుదురు గాక! విశేషంగా అట్టి ఈశానుని ధ్యానము చేయుటచే ఆ ధ్యాని ఈశానుడు అగుచున్నాడు.

---

**20.** సర్వమ్ ఇదమ్ బ్రహ్మ, విష్ణు, రుద్ర -
ఇంద్రాః। తే సంప్రసూయంతే।
సర్వాణి చ ఇంద్రియాణి
సహ భూతైః న కారణం।
కారణానాం ధాతా। ధ్యాతా కారణం తు।
ధ్యేయః। - సర్వైశ్వర్య సంపన్నః సర్వేశ్వరః
శంభుః ఆకాశ మధ్యే।

ఓ పైప్పలాద (మరియు) తదితర మునీంద్రులారా! ఇది వినండి! బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఇంద్రుడు...వీరందరు కూడా (ఒకానొక జీవుని ధారణా-ఔన్నత్యమే కనుక)...పుట్టుక గలవారు సకారణులు. ఈ సర్వ ఇంద్రియములకు భూత సృష్టికి మునుముందే ఉన్నట్టి ఓంకార సంజ్ఞాత్మతత్త్వమునకు పుట్టుకయే లేదు. అకారణము ఈ విధంగా సమస్త కారణములకు కారణమైనవాడు, సర్వస్రష్టులు తనయొక్క సంపదయే అయినవాడు, సర్వేశ్వరుడు, శంభుడు, ఓంకారుడు అగు పరమాత్మయే ధ్యేయవస్తువు.
**ఆయనయే భావాభావముల మధ్యగా ఆకాశ స్వరూపుడై సమస్త జీవులందు,** సమస్త జీవులుగా సర్వదా వేంచేసి ఉన్నవారు.

---

**21.** ధ్రువం స్తబ్ధాధికం
క్షణమేకం, క్రతుశతస్యాఽపి
చతుస్సప్తత్యాయత్ ఫలం
తత్ అవాప్నోతి॥

ఈ విధంగా **సర్వాత్మకుడు, సర్వతత్త్వస్వరూపుడు అగు పరమాత్మను ఒక్క క్షణము ధ్రువముగా ధ్యానించువాడు** - వంద క్రతువులను 74 సార్లు నిర్వర్తించిన ఫలము లభించగలదు. **అట్టి మహత్ ఫలమును సముపార్జించుకుంటున్నాడు.**

---

**22.** కృత్స్నమ్ 'ఓం' కార గతిం చ
సర్వధ్యాన యోగజ్ఞానానాం
యత్ ఫలమ్ 'ఓం'కారో వేద పర ఈశోవా॥

ఓంకార ధ్యానము చేయువాడు సమగ్రముగా ప్రణవస్వరూపమును ఎరుగుచున్నాడు. సకల ధ్యాన - యోగ - జ్ఞానముల అంతిమ ఫలము ఓంకార ధ్యానముగా పొందబడుచున్నాయి.

---

**23.** శివ ఏకో ధ్యేయః, శివంకరః
సర్వమ్ అన్యత్ పరిత్యజ్య,
సమస్త అథర్వ శిఖా ఏతామ్ అధీత్య
ద్విజో గర్భవాసాత్ విముక్తో విముచ్యత।
- ఏతామ్ అధీత్య,
ద్విజో గర్భవాసాత్ విముక్తో విముచ్యత।
ఇతి 'ఓగ్ం' సత్యమ్।
<u>ఇతి ఉపనిషత్</u>
<u>అథర్వ శిఖోపనిషత్ సమాప్తా॥</u>

ఓ ముని శ్రేష్ఠులారా! బ్రహ్మమానస పుత్రులారా! సర్వమును త్యజించి ఏకస్వరూపుడగు (జీవో శివః - శివో జీవః రూపమగు) శివపరమాత్మనే ధ్యేయముగా కలిగి ఉండెదరు గాక!

**ఈ సమస్తము ఓంకార స్వరూపమే అని త్రోవచూపు ఈ అథర్వ శిఖోపనిషత్ పఠించి అర్థం చేసుకొను ద్విజుడు జనన - మరణ - గర్భవాస దుఃఖములనుండి విముచ్యుడు అగుచున్నాడు.**

అట్టి రెండవ (ఉత్తర) జన్మ (ఆత్మ ధ్యాస) పొందుచున్న ద్విజుడు గర్భవాస దుఃఖము మరల పొందక, కైవల్యము పొందుచున్నాడు.

**<u>ఓం సత్యమ్। 'ఓం' ఏవ సత్యమ్।</u>**

**<u>ఇతి అథర్వశిఖోపనిషత్॥</u>**

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 1 అథర్వ శిఖోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము

- **'ఓం'కారము యొక్క పరమార్థము అయి ఉన్నవారు,**
- **ఓంకారము యొక్క అగ్రముగా (పరాకాష్ఠగా) ప్రకాశించువారు**



- **తురీయమునకే తురీయముగా త్రిపాదులైనట్టి వారు అగు ఆత్మారాముని శరణు వేడుచున్నాము.**

ఒకప్పుడు మునిశ్రేష్ఠులగు (దేవతలకు వజ్రాయుధము సిద్ధించటానికై, తన భౌతికదేహమును సమర్పించిన 'త్యాగమూర్తి' అగు దధీమహర్షి మనుమడు, పిప్పలాదమహర్షి కుమారుడు అగు) పైప్పలాదుడు, బ్రహ్మ మానసపుత్రులగు అంగీరస సనత్కుమారులు – ఆత్మజ్ఞానాధ్యయన సముత్సాహులై ధ్యానము గురించి విశేషాలు వినాలనే ఉద్దేశ్యంతో, భక్తి – ప్రపత్తులతో కూడిన శిష్యోఽహమ్ భావనతో, **ప్రజ్ఞావంతుడు – మహనీయుడు అగు అథర్వణ మహర్షిని** సమీపించారు. హృదయపూర్వక ప్రదక్షిణ – నమస్కారములు సమర్పించారు.

ఇట్లు ప్రశ్నించారు!

తండ్రీ! భగవన్! అథర్వణమహర్షీ! సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు సృష్టికి ముందుగా దేనిని ధ్యానం చేసి సృష్టికి ఉపక్రమించారు?

– 'ధ్యానము' అనగా ఏమి?

– మేము ధ్యానమునకు ఉపక్రమిస్తూ ఏది ధ్యేయముగా కలిగి ఉండాలి? ఎట్లా ధ్యానించాలి?

– ధ్యానమునకు 'సాధనము' ఏది?

– ధ్యాత అగు మేము మా గురించి, ఏమని **ఎరిగి**, ఎవ్వరమని గ్రహించి **"ధ్యానము"** కొనసాగించాలి? ఈ **ధ్యాత** ఎవ్వరు?

అదంతా విని అథర్వ మహర్షి చిరునవ్వు చిందిస్తూ ఇట్లు సమాధానము చెప్పసాగారు.

**అథర్వణ మహర్షి:**

<u>మొట్టమొదట సృష్టికి ముందే ఏది సత్‌స్వరూపమై (కేవలమగు 'ఉనికి' రూపమై), అఖండమై ఉన్నదో:-</u>

- అదియే ధ్యానరూపము.
- ధ్యానింపబడవలసిన ధ్యేయము అదే.
- **ధ్యానించువాడు కూడా అదియే.**
- అద్దానికి వేదములు 'ఓం' అను సంజ్ఞతో పిలుస్తూ, అద్దాని గురించి ఉపదేశిస్తున్నారు.
- సత్యమును ధ్యానముచే దర్శిస్తున్న బ్రహ్మజ్ఞులచే మొట్టమొదటగా ఉపదేశించబడినది – **'ఆత్మతత్త్వార్థ సంజ్ఞ'** అగు ఈ **'ఓం'కారమే!** అదియే ధ్యాన వస్తువు.
- అదియే **'ప్రణవోపాసన', 'ఆత్మోపాసన'** కూడా!
- ఇప్పుడు నిర్వర్తించబడవలసినది అట్టి ప్రణవోపాసన – **ధ్యానములే.**

**మరల చెప్పుచున్నాను –**

'ఓం' అను శబ్దముచే ఉపాసించబడునది–మీయొక్క, నాయొక్క, సమస్త జీవులయొక్క **స్వస్వరూపము, సహజరూపము** అగు **ఆత్మయే!**

- ఈ దేహ–దృశ్య–విషయాదులు నశించుచున్నప్పటికీ ఏది నశించటమే లేదో,... అట్టి ఆత్మ అక్షరము. అనగా, మార్పు – చేర్పులు (క్షరము) లేనట్టిది. మృతము లేనిది। అమృతస్వరూపము.
- ధ్యాన వస్తువై ఉండతగినది, ఉండవలసినది – అట్టి స్వస్వరూప–సమస్త స్వరూప **ఆత్మభగవానుడే।**
- నాటకంలోని పాత్రకు ఆ నటించువాడు **వేరే** అయి ఉన్నట్లుగా, నవలా రచయిత నవలలోని సర్వ సంఘటనలకు **వేరుగా** ఉన్నట్లుగా,... **ఈ సర్వమునకు వేరై – పరమై ఉన్నట్టి పరబ్రహ్మమే ధ్యాన – ధ్యేయ విషయము. ధ్యానముచేయువాడు** కూడా **పరబ్రహ్మ స్వరూపుడే।**
- ఇంద్రియములకు, ఇంద్రియ విషయములకు, దేహముల రాకపోకలకు ఆవల మహత్తరమై వేంచేసియుండటంచేత అది **పరబ్రహ్మము.** అట్టి పరబ్రహ్మముతో సమానమైన, పరబ్రహ్మమును **మించిన ధ్యేయవస్తువు** ఎక్కడా **ఏదీ లేనే లేదు.**

అట్టి పరబ్రహ్మమునకు – **అస్య పాదాత్ చత్వారో వేదా!**

ఋక్‌వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదము – *4 వేదములు నాలుగు పాదములు.*

నాలుగు వేదములు 'ఓం' అను ఉచ్చారణను ప్రసాదిస్తున్నాయి.

ప్రణవమునకు (ఓం) శబ్దపూర్వకంగా నాలుగు పాదములు (అ+ఉ+మ +అర్థమాత్ర) కలిగి ఉన్నది. ఇది గ్రహించి ఓంకారమును ధ్యానిస్తూ ఉపాసించాలి.

ఇంకా కూడా, అట్టి ప్రణవముయొక్క చతుష్పాదములగురించి వివరించుకుంటున్నాము.

నాలుగు మాత్రలు. జాగ్రత్–స్వప్న–సుషుప్తి–తురీయ మాత్రలు – అని కూడా గ్రహిస్తూ, అప్పుడు ఆశ్రయిస్తూ ఉండాలి.

***ప్రణవము యొక్క (ఓంకారముయొక్క) మొదటిపాదము (లేక) మాత్ర (అ–ఉ–మ–అర్థమాత్రలలో మొదటిది)। "అ"***

- 'ఓం' లోని **'అ' కారోచ్చారణా రూపము.**
- ఇద్దాని భౌతిక రూపము **పృథివి.** (Zone of Matter).
- ఈ 'సత్' స్వరూపమగు అకారము **ఋగ్వేదసారముగా గమనించబడుతోంది.** ఋక్కులతో కూడి ఉండటం చేత ఇది ఋగ్వేదరూపము. (ఋక్కులు = సత్యద్రష్టలు గానం చేస్తున్న పరమాత్మయొక్క తత్త్వము. ఋగ్వేదాంతర్గతములు)
- ఇద్దానికి ఉపాసనా రూపము (లేక) అధి దేవత → సృష్టికర్తయగు **బ్రహ్మ!** **(తత్సవితుః బ్రహ్మాత్మనే)**
- 'అ' కారముయొక్క పితృ దేవతలు → **అష్టవసువులు.** పౌరాణికనామములు : (అవుడు, ధ్రువుడు, సోముడు, అధర్వుడు, అనలుడు, ప్రభాసుడు – అను జీవనశక్తులు)
- ఇద్దాని ఛందస్సు → **గాయత్రి** (గాతయత్ త్రాయతే యస్మాత్ గాయత్రీత్యభిదీయతే)
- ఇద్దాని అగ్ని (యజ్ఞాంతర్గత అగ్ని) → **గార్హపత్యాగ్ని** [యజ్ఞమునందు వేదికకు గుండ్రని గుండముగా ఉండు అగ్ని. శ్రౌతాగ్నులలో (త్రేతాగ్నులలో) మొదటిది] (శ్రౌతాగ్ని = వేదములచే విధించబడినది)

***ప్రణవముయొక్క రెండవ పాదము (లేక) మాత్ర : "ఉ"***

- 'ఉ' కారోచ్చారణ.
- ఇద్దాని భౌతిక రూపము – **అంతరిక్షము (లేక) ఆకాశము** (Zone of Space).
- ఇది యజ్ఞవిధులతో కూడినది. యజస్సులతో కూడినది. అందుచేత **యజుర్వేదరూపము.**
- ఇద్దాని ఉపాసనారూప అధి దేవత → **విష్ణువు. (వరేణ్యం విష్ణవాత్మనే)।**

**(పౌరాణిక నామములు** : అజుడు, ఏకపాదుడు, అహిర్బుధ్న్యుడు, హరుడు, శంభుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, ఈశానుడు, త్రిభువనుడు, త్వష్ట, రుద్రుడు)".

- ❖ ఇద్దాని పితృదేవతలు → **ఏకాదశరుద్రులు.**
- ❖ దీని ఛందస్సు → **త్రిష్టుప్.**
- ❖ ఇద్దాని యజ్ఞాజ్ఞి పేరు → **దక్షిణాగ్ని.** (యజ్ఞవేదికకు దక్షిణముగా ప్రజ్వలించబడు అగ్నిగుండము).

***(ఏకాదశరుద్రులు పాఠాంతరములు***

***బ్రహ్మవైవర్త పురాణము : మహత్తుడు, మహాత్మా, మతివంతుడు, భీషణుడు, భయంకరుడు, ఋతధ్వజుడు, ఊర్ధ్వకేశుడు, పింగళాక్షుడు, రుచి, శుచి కాలాగ్నిరుద్రుడు.***

***భారతము : అజపాదుడు, అహిర్బుధ్నుడు, త్ర్యంబకుడు, వృషాకపి, శంభుడు, జపాలి, దైవతుడు, హరుడు, బహురూపుడు, ఉగ్రుడు, విశ్వరూపుడు).***

***ప్రణవము యొక్క మూడవ పాదము / మాత్ర : 'మ'కారము. "మ"***

- ❋ ఇద్దాని లోకము **స్వర్గము. ద్యులోకము.** అభౌతిక (మనో సంబంధమైన) భావనా ప్రపంచము. (Zone of Thought).
- ❋ ఇది గాన రూపము. సామగానములతో కూడిన – **సామవేద రూపము.**
- ❋ ఇద్దాని అధిదేవత → **రుద్రుడు. (భర్గో దేవస్య రుద్రాత్మనే).**
- ❋ దీని పితృదేవతలు / ఋషులు → **ద్వాదశాదిత్యులు. 12 మంది సూర్యులు. (పౌరాణిక నామములు : ధాత, మిత్రుడు, అర్యముడు, శుక్రుడు, వరుణుడు, అంశుమంతుడు, భగుడు, వివస్వంతుడు, పూషుడు, సవిత, తృష్ట, విష్ణువు)**
- ❋ దీని ఛందస్సు → **జగతి.**
- ❋ ఇద్దాని యజ్ఞాగ్ని → **ఆహవనీయాగ్ని.** (త్రేతాగ్నులలో ఒకటి).

((త్రేతాగ్ని = యజ్ఞ వేదికకు తూర్పు దిక్కుగా నాలుగు మూలలు కుండలలోనికి ఆహ్వానించే త్రి–అగ్నులు. యజ్ఞమునందు ఆహుతులు సమర్పించటానికి మునుముందుగా ఋత్విక్కులు త్రేతాగ్నులను ఆహ్వానించి ప్రతిక్షేపించేవి).

***ప్రణవము యొక్క చివ్వరి – నాలుగవ మాత్ర : అర్ధమాత్ర–మ్ (నిశ్శబ్దము) "అర్ధమాత్ర"***

- ❋ ఇద్దాని లోకము → **సోమలోకము.** (Zone of Experiencing).
- ❋ ఇది 'ఓం' కారోచ్చారణగా అంతటా నిండి ఉన్నట్టిది. కనుక **ఓంకార రూపము.**
- ❋ ఇది అథర్వణ మంత్రముల సారము. **అథర్వణవేద రూపము.**
- ❋ ఇద్దాని యజ్ఞాగ్ని → **సంవర్తకాగ్ని. (అగ్నిగుండమునకు ఆవలగా స్థాపించు అగ్ని)**
- ❋ ఇద్దాని పితృదేవతలు → **మరుత్తులు. వాయుతరంగదేవతలు ఏడుగురు. (మరుద్గణము) (దితి – కశ్యప సంతానము).**
- ❋ దీని ఋషి → **ఏక ఋషి, (భాస్వతి అను పేరుతో పిలువబడువారు).**
- ❋ దీని రూపము → ఈ **విరాట్ రూప బ్రహ్మాండము.**

ఇది అకార – ఉకార – మకారములకు ముందు – మధ్య – చివ్వర కూడా ప్రకాశిస్తూ నాదరూపమైయున్నది.

**నాద బిందు – కళాతీతమై కూడా ఉన్నది.**

-----

అంతేకాదు! **'ఉపాసన'** కొరకై ఈవిధంగా 'సూచన' చేయబడుతోంది.

***ప్రథమమగు 'అ'కార మాత్ర :***

రంగు → రక్తపీతము, ఎరుపు.

కాంతి → స్వర్ణము.

అధిదేవత → మహత్ బ్రహ్మము / బ్రహ్మదేవుడు.

***రెండవదగు 'ఉ'కార మాత్ర :***

రంగు → కృష్ణము, నలుపు.

కాంతి → విద్యుత్ మెరుపు కాంతి.

అధిదేవత → విష్ణుదేవుడు.

**మూడవదగు 'మ'కారమాత్ర :**

రంగు → తెలుపు.

రూపము → శుభాశుభవానుభవ రూపము. శివము.

అధిదేవత → రుద్రభగవానుడు.

**నాలుగవది, చివరగా ఉన్న అర్ధమాత్ర :**

రంగు → విద్యుత్‌మతి ఎరుపు. లక్ష్మీరూపము. (రంగు) సర్వవర్ణ – సర్వవర్ణాశ్రయా.

అధిదేవత → జీవాత్మ నియామకుడగు పురుషుడు. ***పరమపురుషుడు. స్వస్వరూపాత్మ.***

ఈ విధంగా....వేద – వేదాంత – వేదాంగములు ఉపాసనకొరకై అర్ధసహితంగా సూచిస్తున్న ప్రణవము లేక ఓంకారమును ఈ ఈ లక్షణములను ఎరిగి ఉచ్చరిస్తూ ఉపాసించుదురు గాక। (ఆత్మయే ఆ ఉపాసన వస్తువు).

**ఆత్మయే = ప్రణవము. ఓంకారము.**

**చతురక్షరః =** అ + ఉ +మ + అర్ధమాత్ర అనబడే 4 అక్షరముల సమగ్రరూపముగాను

**చతుష్పాదః =** జాగ్రత్ – స్వప్న – సుషుప్తి – తురీయములనే నాలుగు సంచార స్థానములుగా గలదిగాను,

**చతుశ్శిరః =** మనో – బుద్ధి – చిత్త – అహంకారములనబడే నాలుగు శిరస్సులు కలిగియున్నట్టిదిగాను,

**చతుర్‌రూపములు :** స్థూలము – హ్రస్వము – దీర్ఘము – ప్లుతము (మూడు మాత్రలకాలము గల స్వరము)
(లేక) స్థూలము – సూక్ష్మము – కారణము – కేవలసాక్షిగాను

**ఓం ఓం ఓం ఇతి :** పైన చెప్పబడుచున్న వివరణలు దృష్టిలో కలిగి ఉంటూ **ఓం ఓం ఓం త్రి ఉచ్చారణచే ఉపాసించబడుగాక!**

ఈ విధంగా....

అకార – ఉకార – మకారములు త్రిరుక్తములను, నాలుగవదగు కేవల శబ్ద మాత్రమగు 'మ్.....' నిశ్శబ్దములతో కూడినది – అగు ప్రణవమును.....,

- సమస్తము ప్రణవస్వరూపముగాను,
- ప్రణవము నుండి ఉత్పత్తి – స్థితి – లయము – మౌనము కలిగి ఉన్నట్టిదిగాను,
- పరమ శాంతము, సమస్తము – ఆత్మస్వరూపము గాను,

అవగాహనతో ఓం కారమును ఉచ్చరిస్తూ – ఉపాసిస్తూ ఉండగా....**సర్వము జ్యోతి స్వరూపముగా అనుభవమునందు ఆవిష్కరించబడ గలదు.**

**'ఇదంతా మమాత్మయొక్క తేజోరూపమే'** అని అనిపించటము ప్రారంభమవగలదు.

ప్రణవము ఉచ్ఛరించుచుండగా తత్సమయంలోనే ఆ సాధన – సాధకుని క్రమంగా **<u>పరమపదము</u>**నకు, **<u>ఆత్మోన్నతస్థానమునకు</u>** చేరుస్తోంది. ఉన్నామయతి! (It is uplifting జీవాత్మ to the state of పరమాత్మ). అదియే ప్రణవముయొక్క శబ్దార్థము.

అందుచేత, అట్టి అర్థమును ఉద్దేశ్యిస్తూ **'ఓంకారము'**గా చెప్పబడుతోంది. 'ఓం' ఉచ్చారణలో ప్రభవమగు ఊర్ధ్వనాదము జీవుని ఊర్ధ్వముఖం చేస్తూ ఈశ్వరస్థానమునకు, ఈశ్వరత్వమునకు చేరుస్తోంది. అందుకే 'ఓంకారము'గా వర్ణించబడుతోంది! **ఏష ఊర్ధ్వమ్ ఉత్‌నామయతి – ఇతి ఓంకారః।**

## ప్రాణాం తు సర్వాన్ ప్రలీయతే ఇతి ప్రలయః

**"శక్తి"** ప్రాణరూపమును దాల్చినదై, ప్రాణ – అపాన – వ్యాన – ఉదాన – సమాన – సప్రాణ రూపములతో ఈ జగత్తులకు ధారణగా, – ఆధారముగా అగుచున్నది. **అట్టి ప్రాణశక్తి ఆత్మయందే బయల్వెడలి, తిరిగి ఆత్మయందే ప్రలయము** (Disolved) **పొందుతోంది.** అందుచేత ఆత్మను ఊర్ధ్వముగాగల 'ఓం' కారముగాను, ప్రణవముగాను **'ప్రలయము'** (That in which Prana Sakthi desolves) అని కూడా పిలుస్తున్నారు.

**ప్రాణాంతు స సర్వాన్ పరమాత్మని ప్రణామయతి ఇత్యేతస్మాత్ 'ప్రణవః'।**

ఓంకారణోచ్చారణ – సకల ప్రాణులను పరమాత్మయందు చేర్పించుచున్నది. అనగా **'సకల ప్రాణులు నాయొక్క ఆత్మరూపమే'** అని అనుభూత పరచుచున్నది. అందుచేత **ప్రణామయతి – ప్రణవః।** ఆత్మయందు **సర్వము ఏకము చేస్తున్నదగుట చేత కూడా 'ఓం' కారమును ప్రణవము** – అని పిలుస్తున్నారు.

**చతుర్ధావస్థిత ఇతి ప్రణవః।**

ఏది జాగ్రత్‌కు, స్వప్నమునకు (అట్లాగే) సుషుప్తికి కూడా కేవల సాక్షియో, అద్దానిని అనుక్షణికానుభవంగా ప్రసాదిస్తోంది. కాబట్టి – ప్రణవము అని చెప్పబడుతోంది. [చతురీయము = తురీయము = ప్రణవము].

**సర్వదేవ - వేదయోని - కారణేన ప్రణవః।**

– సర్వదేవతలు, 4 వేదములు....వీటన్నిటియొక్క ఉత్పత్తి స్థానము అయి ఉండటంచేత కూడా 'ప్రణవము' అని చెప్పబడుతోంది.

**సర్వ వాచ్య వస్తుః ప్రణవాత్మకమ్।**

వాక్‌కు విషయమగు సర్వశబ్దములు, వాటి అర్థములు 'ఓం' కారము నుండి బయల్వెడలుచు, ఓంకార రూపములే అయి ఉన్నాయి.

అందుచేత ఈ సర్వము ఓంకార రూపమే! **ప్రణవాత్మకమే! ఆత్మాత్మకమే।**

ఇది ఉచ్చారణ – ఉపాసనలచే ఆత్మానుభూతమౌతోంది. కాబట్టి 'ప్రణవము' అని చెప్పుకుంటున్నాం!

**ఇంకా కూడా : –**

సర్వదేవతలు ఓంకార స్వరూపులే! ప్రణవాత్మకులే! అందుచేతనే ఏ దేవతా ఉపాసన అయినా సరే....'ఓం' అను ప్రణవోచ్చారణతో ప్రారంభిస్తున్నాము.

అంతే కాదు.

## తారమ్

**ప్రణవం - సర్వేభ్యో దుఃఖ-భయేభ్యః సంతారయతి। ఇతి తారణాత్ 'తారః'।**

సర్వ దుఃఖ – భయములనుండి సర్వదా సర్వత్రా తరింపజేస్తోంది. కనుక 'ఓం'....శబ్ద బ్రహ్మ ప్రణవమును 'తారమ్' ⟶ తరింపజేయునది (తారకమ్)....అని వర్ణించుచున్నారు.

**సర్వే దేవాః సంవిశంతి ఇతి 'విష్ణుః'।**

సర్వదేవతలు ప్రణవమునందు ప్రవేశించి ప్రశాంతతను ఆస్వాదిస్తున్నారు. అందుచేత ప్రణవమే విష్ణువు. విష్ణువు ప్రణవస్వరూపుడే అయి ఉన్నారు. అందుకే...,

- శాంతాకారమ్, భుజగశయనమ్।
- శాంతానందమయమ్ విష్ణుః।
- విశ్వమ్ విష్ణుః।

ఇత్యాది వర్ణనలతో ప్రణవమే విష్ణు రూపముగా, విష్ణు తత్త్వముగా చెప్పబడుతోంది.

**<u>సర్వాని బృంహయతి ఇతి బ్రహ్మ।</u>**

సకల ప్రాణులు ఎందులోంచి బయల్వెడలి, వృద్ధిని పొందుచున్నారో, ఆ స్థానమే ప్రణవము. అందుచేత ప్రణవమే బ్రహ్మము. (మరియు) సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు ప్రణవస్వరూపుడే అయి ఉన్నారు. **ఆయన యొక్క సృష్టి కూడా బ్రహ్మ స్వరూపమే।**

ఇతి → పరబ్రహ్మయేవ ప్రణవః। ప్రణవమునుండియే సృష్టికర్త, సృష్టి బయల్వెడలుచున్నాయి.

# ప్రకాశము

**సర్వస్య అంతః స్థానేభ్యో ధ్యేయేభ్యో ప్రదీపవత్ ప్రకాశయతి…ఇతి ప్రకాశః।**

ప్రణవము 'ప్రకాశము' అని కూడా పిలువబడుతోంది. సర్వప్రాణుల యొక్క (సర్వజీవుల యొక్క) హృదయ స్థానములో నిశ్చల దీపమువలె ప్రకాశించుచున్న ఆత్మయే ప్రణవార్థము. అందుచేత ప్రణవమును **"ప్రకాశము (మరియు) సర్వ ప్రకాశకము కూడా" –** అని అంటున్నారు. **"నేను నేను" అను ఆత్మజ్యోతి ప్రకాశరూపమే ప్రణవము.**

(ప్రకాశము అనగా 'భౌతికమైన వెలుగు' అని పరిమితంగా అర్థంగా తీసుకోకూడదు. మరి?) ఈ ప్రణవతత్త్వమగు ఆత్మ సర్వశరీరాలలోను అంతరంగా – విద్యుత్ (తేజో–వెలుగు) శక్తిగా ప్రకాశిస్తోంది. సమస్తమును తెలివి (Enlightenment) చే అనుభవముగా రూపమవ్వటంచేత ప్రకాశము అట్టి ప్రకాశమే 'ప్రణవము'.

ఈ సర్వ దేహాలలోను

- **'సత్'** స్వరూపంగాను (నేను ఉన్నాను అనే రూపముతో కూడిన **'ఉనికి'** స్వరూపంగాను)
- ఓం (సత్ – చిత్ – ఆనంద – అనుభవి) రూపంగాను

సర్వదా ప్రకాశిస్తున్నదియే ప్రణవము. యోగులకు ధ్యానములో సర్వతత్త్వస్వరూపముగా కనబడు ప్రకారమే ప్రణవము.

"మెరుపు తీగవలె మరల మరల జగత్తంతటా, సర్వభౌతిక దేహాలలోను ద్యోతకమగుచున్నదే ప్రణవము" – అనే అవగాహన, భావనను జోడించి ప్రణవోచ్చారణ చేయాలి! మెరుపువలె ప్రకాసిస్తోంది కాబట్టి 'వైద్యుతము' అని ఓంకార సంజ్ఞయగు ఆత్మ గురించి (ప్రణవము గురించి) చెప్పుచున్నారు!

***<u>అట్టి ప్రణవము (లేక) ఓంకారము (లేక) ఆత్మచైతన్యము –</u>***

- విద్యుత్‌వలె (మెరుపువలె) ప్రకాశిస్తూ….,
- సర్వ దేహముల యందును, అణువణువునందు, ఈ దృశ్యమునందు సర్వ దిక్కులందు తనయొక్క చైతన్య ఘన స్వరూపముతో నింపి ఉంచుతూ….,

***<u>సర్వాన్ లోకాన్ వ్యాప్నోతి, వ్యాపయతీతి –</u>***

**సర్వ లోకములందు సర్వదా ఆక్రమించుకొని ఉన్నది.**

ఆభరణములలో బంగారమువలె, తరంగములలో జలమువలె, శిల్పములో శిలవలె సర్వత్రా ఆత్మయే వ్యాపించినదై ఉన్నది. ఈ దృశ్యానుభవరూపమైనదంతా అన్నివైపులా వ్యాపింపజేస్తూ ఉన్న **ఆత్మయే ప్రణవము.**

# మహాదేవుడు

**వ్యాపనాత్ వ్యాపీ ఇతి "మహాదేవః"।** ప్రణవ స్వరూప ఆత్మయే – తాను అంతటా చైతన్యరూపమై, పూర్ణమై ఉంటూనే ఈ జగత్ రూపంగా కనిపింపజేసేదంతా ప్రదర్శిస్తోంది. తనయొక్క వ్యాపకత్వమును సర్వే సర్వత్రా వ్యాపింపజేయుచున్నది కాబట్టి ఆత్మను "మహాదేవుడు"….అని అంటున్నాం!

ఇంకా ఓంకారము లేక ప్రణవము యొక్క మాత్రల విషయమై ఆత్మజ్ఞుల (మరొకతీరైన) దర్శన, ఉపాసనల గురించి చెప్పుకుంటున్నాము – వినండి.

## ప్రణవము యొక్క.....,

**మొట్టమొదటి మాత్ర → జాగరితము.** విశ్వవిన్యాస రూపము. ఈ జాగృత్ రూపముగా ప్రదర్శనమగుచున్నదంతా కూడా పూర్వమాత్ర! ఆత్మయొక్క **"జాగర్తి - వర్తన"** రూపమగు **జాగ్రత్**. ఇది భౌతికమైన ఇంద్రియానుభవము. ('విశ్వుడు' - అను ఆత్మ పురుషుని పురుషకారము). ఇంద్రియములతో బాహ్య విషయ సంబంధరూపము (లేక) అనుసంధానము.

**రెండవ మాత్ర → స్వప్నము :** స్వప్నాంతర్గమైనదిగా అనుభూతమగుచున్నదంతా ఆత్మయొక్క ద్వితీయ విన్యాసస్వరూపము. ఆత్మయొక్క స్వకీయ ఊహాకల్పనారూప ఇంద్రియ భావనా విన్యాసము. ఆత్మపురుషుని స్వకీయ కల్పనయే 'తేజసుడు' అను హృదయాకాశభావనా నిర్మిత, (స్వప్న) విషయ - సంబంధరూపము.

**మూడవ మాత్ర → సుషుప్తి :** సర్వ ఇంద్రియానుభవములను, (ఆవేశ-కావేశ-ఆశ-అభిప్రాయాది ప్రదర్శనములను), (అట్లాగే) ఊహా విన్యాసానుభవములను - తనయొక్క **'మౌనము'** అనే విభాగములో (అంతరమున) దాచి ఉంచి, ఇక నిర్విషయానందముతో ద్వితీయ రహితంగా (అద్వితీయంగా) ఉండి ఉంటున్నట్టి ఆత్మ యొక్క ఒక విన్యాసము. స్వకీయ విషయ రహిత నిశ్శబ్ద - మౌన - జడ ధారణరూపము. (ఆత్మయొక్క 'ప్రాజ్ఞ' - పురుషకారము).

**నాలుగవ మాత్ర→తురీయము:** జాగృత్ మాత్రను, స్వప్నమాత్రను, సుషుప్తిమాత్రను **స్వయంకృతముగా కల్పించుకుంటూ ఉన్నట్టిది.** వాస్తవానికి తాను యథాస్థానమునందే ఉండి ఉంటున్నప్పటికీ..., ఏది జాగ్రత్ - స్వప్న - సుషుప్తులలోనికి నడచివెళ్ళి - వస్తూ ఉన్నదో అట్టి త్రిమాత్రా సంచార కేవల ప్రజ్ఞారూపము.

- అదియే తురీయము। ((చ)తురీయము)। నాలుగవది।
- అదియే ఆత్మయొక్క స్వకీయ సమస్త సందర్భాతీత - కేవల పురుషకారము।

***'ప్రణవము'గా అభివర్ణించబడే ఆత్మ....***

- స్వయం ప్రకాశకము. 'ఓం' తత్త్వము. తనకు తానే ప్రకాశమానము. మరొకటేదీ అద్దానిని ప్రకాశింపజేయటం లేదు!
- స్వయం పరబ్రహ్మ స్వరూపము.
- స్వయం పూర్ణము. స్వయం ప్రతిపత్తి కలిగినది. (The 'SELF' is independent by itself)

**అట్టి అప్రమేయ - అఖండ - స్వయం ప్రకాశకమగు ఆత్మయే మనందరి సహజ - స్వస్వరూపము.** 'ఓం' శబ్దముతో (ప్రణవము ద్వారా) ఉచ్చరించబడుతూ, ఉపాసించబడుచూ రాగా మనకు (సాధకునికి) అట్టి ఆత్మత్వము సిద్ధిస్తోంది. అందుచేతనే, **'ప్రణవోపాసన'** - ఆత్మస్థాన సిద్ధికరముగా చెప్పబడుతోంది.

"అ-ఉ-మ' ల సమగ్రమగు 'ఓం' కారమే ప్రణవము. **ఆత్మయే ప్రణవము.** అందుచేతనే ధ్యానమునకు, దేవతా ఉపాసనకు, సమాధి నిష్ఠకు, సర్వ సాధనలకు మొట్టమొదట 'ఓం' అనే శబ్దోచ్చారణతో అవన్నీ ప్రారంభించటము, ఉపక్రమించటము జరుగుతోంది.

బ్రహ్మమే ఓంకారార్థము. 'తురీయము' అని విష్ణు - బ్రహ్మ - రుద్ర - ఇత్యాది దేవతా రూపమని ఎందుకు అంటున్నారో, ఇంకొక విశేషము వినండి!

ఓంకారము యొక్క ఉపాసనచే ఈ సాధకుడు తురీయుడుగా, సర్వాత్మకమగు విష్ణువుగా, రుద్రుడుగా, ఈశానుడుగా అగుచున్నాడు.

**తురీయ రూపము: సర్వ కరణ ఉపసంహారత్వాత్ ధార్య-ధారణాత్ ఇతి బ్రహ్మ తురీయమ్ :** సర్వ ఇంద్రియ విషయములను ఉపసంహరించ బడినప్పటికీ,...అప్పటికీ కూడా **"ధారణ చేయువాడు - ధారణ"** రూపమై సర్వత్రా ప్రకాశించుచుండటం చేత ప్రణవమే తురీయము. అదియే ఆత్మ! ఈ జీవుడు వాస్తవానికి సహజమగు తురీయ స్వరూపుడే. ఇందులో ఎవ్వరిపట్లా ఎప్పుడూ కూడా సందేహించవలసిన పనియేలేదు.

## విష్ణువు

స్థూలదేహము యొక్క పంచ జ్ఞానేంద్రియములను, పంచ కర్మేంద్రియములను మనస్సునందు ప్రతిష్ఠింపజేసి, ఇకప్పుడు ధ్యానము నిర్వర్తించెదరు గాక। అట్టి ఆ ధ్యానమునకు ఏది ధ్యేయమైయున్నదో (That which is becoming there as subject for chanting / adoring) .... అదియే విష్ణువు. అట్టి ఆ విష్ణు ధ్యానము చేయు జీవుడు విష్ణువే అగుచున్నాడు.

**సర్వకరణాని సం ప్రతిష్ఠాప్య ధ్యానమ్ – విష్ణు।** 'విష్ణువే' అయి ఉన్న ఈ జీవుడు తిరిగి తన విష్ణుత్వమును ధ్యేయముగా కలిగి, ధ్యానము చేసి తిరిగి 'విష్ణువే' అగుచున్నాడు.

## రుద్రుడు

**ప్రాణం మనసి సహకరణైః సంప్రతిష్ఠాప్య, ధ్యాతా – రుద్రః।** ఎవ్వరైతే ఓంకారోపాసనా ప్రభావంచేత ప్రాణములను, ఇంద్రియములను, మనస్సును కూడా ఆత్మయందు ప్రతిష్ఠింపజేస్తాడో, ఆతడే రుద్రుడు అయి, రుద్రస్థానము చేరి, రుద్రలోకము నందు స్థిరనివాసులగుచున్నాడు. **రుద్రుడైనవాడే రుద్రుని అర్చిస్తూ రుద్రత్వము తిరిగి పొందుచున్నాడు** (నా రుద్రో రుద్రమర్చతి)।

## ఈశానుడు

**ప్రాణం మనసి సహ కరణైః నాదాంతే పరమాత్మ సంప్రతిష్ఠాప్య, 'ధ్యాయీ'త్ 'ఈశానం' ప్రధ్యాయితవ్యగ్ం।** ప్రాణము, మనస్సు, ఇంద్రియములు, ఇంద్రియ విషయములను 'ఓం' కారోపాసన ద్వారా నాదాంతము (The other end of sound)నకు జేర్చి, ఆవల (పరమ్)గల ఆత్మయందు (లేక, పరమాత్మయందు) సర్వమును లయింపజేస్తూ నిర్వర్తించే మార్గమే **ఈశానము.** సమస్తము ఈశానునిలో ప్రదర్శనమై, ఈశానునియందే 'లయము' అగుచున్నది. ఈ జీవుడు తన ఈశానత్వమును తిరిగి ధ్యానముచే సంతరించుకుంటున్నాడు. "ఈ సమస్తము నాయందే (జలంలో తరంగములవలె) **బయల్వెడలి**, నాయందే **'ఉనికి'**ని కొనసాగిస్తూ, చివరికి నాయందే **లయిస్తోంది"** – అను భావనను **"ఆశ్రయించటము, ఉపాసించటము, నిశ్చలమవటము"**లకు చేయు ప్రయత్నమే "ఈశానవ్రతము" అనబడుతోంది.

అట్టి ఈశానమే ధ్యాన వస్తువు. జీవుడు జేరవలసినది అట్టి ఈశానత్వమునకే!

ఈ జీవుడు అట్టి కేవలాత్మధ్యానముచే 'ఈశానుడు' అగుచున్నాడు.

- ఈ సమస్తములో నేను = **'జీవుడు'।**
- నాయందున్న ఈ సమస్తము = **'ఈశానుడు'।**

ఉభయము ఈశానాత్మదేవ ప్రదర్శనములే.

**ఓ పైప్పలాది మొదలైన మునిసత్తములారా! ఇంకా కూడా ఇది శ్రద్ధగా వినండి! ఇక్కడ ఒక ముఖ్యమైన విశేషము మీ ముందుంచుచున్నాను.**

బ్రహ్మ–విష్ణు–రుద్ర–ఇంద్ర....ఇవన్నీ ఒకానొక జీవునియొక్క బ్రహ్మోపాసనచే చేరుచున్న స్థానములు. ధారణయొక్క ఔన్నత్యముచే సముపార్జించుకోగల ఔన్నత్యములు. అయితే...., బ్రహ్మ – విష్ణు – రుద్ర – ఇంద్రులు కూడా పుట్టుకగలవారేనని గ్రహించండి.

ఈ సర్వభూత – ఇంద్రియ సృష్టికి ఆవల ప్రకాశమానమై వెలుగొందుచూ, ఈ సమస్తముగా వెలుగొందుచున్నట్టి 'ఓం'కారతత్త్వము అనబడు సంజ్ఞారూపమగు ఆత్మకు పుట్టుకలేదు. **అదియే పరమాత్మ.** 'జీవుడు' అనునది అద్దాని ఒక అంశ.

ఈ కారణం చేత....

> **– సర్వకారణ – అకారణములకు కారణమైనవాడు,**
> **– సర్వ సృష్టులు తన సంకల్ప స్వరూపముగా కలిగి ఉన్నట్టివాడు...,**
> **– సర్వము తనయొక్క సంపదగా కలిగియున్నట్టివాడు....,**
> **– సర్వేశ్వరుడు....,**
> **అగు స్వస్వరూప భగవానుడే ధ్యేయ వస్తువు! ఆయనయే 'శంభుడు' అని, బ్రహ్మ – విష్ణు – మహేశ్వరులు అని కూడా ఉపాసించ బడుచున్నారు.**

బిడ్డలారా! **మీ స్వస్వరూపాత్మయే ఓంకారార్థము.**

జలము నుండి బయల్వెడలి జలములో సంచరించి, జలమునందే లయము పొందే తరంగము జలము కానిదెప్పుడు?

ఆత్మనుండే సర్వము బయల్వెడలుతోంది. సర్వము ఆత్మగానే ఉంటోంది. ఆత్మయందే (జ్ఞానదృష్టిచే) లయిస్తోంది. ఇదంతా ఇట్లా కనిపిస్తూ ఉన్నా కూడా, ఇదంతా ఆత్మగాని క్షణమే లేదు. "నీవు, నేను, – మనమంతా జీవాత్మ సంప్రదర్శనములు, మన మన జీవాత్మానుభవములు" – ఇవన్నీ కలిపియే – **'ఆత్మ'** అని, **'ఆత్మయొక్క విన్యాసము'** అని 'ఓం' అని గ్రహించినవారై ఉండండి.

ఓ పిప్పలాద, అంగీరస, సనత్కుమారులారా! తదితర శ్రోతలారా! ధ్యానము చేయువాడు తనయొక్క ధ్యాస చేతనే దృశ్యమును పొందుచున్నాడు. అంతకుమించి దృశ్యమునకు కారణము లేదు. అనగా ధ్యాసయే జగత్ రూపము. దృష్టియే సృష్టి.

- కనుక ఈ నా దృశ్యరచనకు నేనే కారణము గాని మరొకరు కాదు.
- సర్వైశ్వర్య సంపన్నుడు, సర్వేశ్వరుడు, శంభుడు...అయి ఉన్నది స్వస్వరూపాత్మయగు నేనే।

**→ అను సందర్శనమును నిర్వివాదాంశము, నిశ్చలము చేసుకోండి.**

అట్టి **ఆత్మపురుషుడు** – ఆలోచన–ఆలోచనల మధ్య ఆకాశ స్వరూపుడై, ఆకాశ మధ్యస్థానుడై, నిర్వికారుడై చైతన్యస్ఫూర్తిగా వేంచేసి ఉన్నారు. ఆయననుండి బయల్వెడలు ఆలోచనలు ఆయనను బంధించటమేమిటి? ఒక నవలా రచయిత యొక్క రచనలోంచి బయల్వెడలిన ఏదో దృశ్యవర్ణన ఆ రచయితను బంధించటము జరుగుతుందా? ఎట్లా జరుగుతుంది?

> **అట్టి ఆత్మ పురుషుడే నీవు। తత్ త్వమ్ అసి।**
> **నేనే ఆతడు। సోఽహమ్।**
> **ఆతడే ఈ సర్వము. తదేవేదమ్ – తదేవ ఇదమ్।**

మనమంతా అనునిత్యంగా ఓంకారానంద ఆత్మస్వరూపులమే!

'కాదు' అంటే జీవులము. 'అవును' అంటే **'అప్రమేయ ఆత్మానంద'** స్వరూపులము.

ఇంతకుమించి వేరే ఏదో ఎక్కడో ఎన్నడో మరొకటి అయి లేదు.

## ఫలశ్రుతి

ఈ విధంగా **సర్వాత్మ స్వరూపుడు – స్వస్వరూపమునకు అభిన్నుడు, ఓంకారార్ధమాత్రుడు** అగు పరమాత్మను ఒక్క క్షణం ధ్యానించినా కూడా ఈ జీవాత్మ మహత్తరఫలములను పొందగలడు.

అట్టి **'ఆత్మాహమ్'**ను ధ్రువముగా ఒక్క క్షణం ధ్యానించినవాడు....

- వంద క్రతువులను 74 సార్లు నిర్వర్తించిన ఫలమును నిర్విరామముగా పొందుచున్నవాడగుచున్నాడు. మహత్ ఫలములను సిద్ధించుకుంటున్నాడు.

ఓంకార స్వరూపమును ధ్యానించు యోగి సమస్త జీవులయొక్క ప్రణవస్వరూపమును ఎరిగినవాడగుచున్నాడు.

సకల ధ్యాన – యోగ – జ్ఞానముల అంతిమ ఫలము **ఒక్క ఓంకార ధ్యానముచే పొందబడుచున్నది.**

కనుక ఓ మునులారా! సమస్త ముముక్షువులారా!

సర్వమును దేహముతో నిర్వర్తిస్తూనే, మనస్సుతో త్యజించినవారై ఉండండి. ఒక్క 'ఏక–స్వ' స్వరూపుడగు శివపరమాత్మనే ధ్యేయముగా కలిగి ఉండండి.

**అనేకముగా ఇదంతా కనిపిస్తూ ఉన్నప్పటికీ, ఒక్కటిగా ఏకముగా అనిపించటమే ఓంకార ధ్యానము యొక్క ధ్యేయము!**

ఈ అథర్వ శిఖోపనిషత్ ప్రతిపాదిస్తున్న ఓంకార ధ్యానముయొక్క అంతిమాశయమును అర్థము చేసుకొను ద్విజుడు ఇక జనన – మరణ – గర్భవాసములను పొందడు. వాటినన్నిటినుండి 'విముచ్యుడు' (EVER RELIEVED) అగుచున్నాడు.

***తనయొక్క కేవలీ (Absolute) స్వరూపమును సర్వత్రా దర్శించుచున్నవాడై, ఆత్మధ్యాసచే కైవల్యము పొందుచున్నాడు.***

జన్మ – కర్మలకు అతీతము, కేవలసాక్షి అయి – ఈ సర్వమును పరమానందాత్మ స్వరూపముగా ఆస్వాదించుచున్నాము.

**ఇతి 'ఓగ్ం' సత్యమ్। సత్యమేవ జయతే।**

*ఇతి అథర్వశిఖోపనిషత్*
*ఓం శాంతిః। శాంతిః। శాంతిః।*

అధర్వణవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 2 అథర్వశిరోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ అథర్వ శిరసాం,
అర్థం–అనర్థం వ్రాత సూచకమ్।
సర్వాధారం, అనాధారమ్
స్వమాత్రం, త్రైపదాక్షరమ్॥



ఈ అథర్వ శిరోపనిషత్ - జగత్ దృశ్యముయొక్క అర్థ-అనర్థములను వ్రాతసూచికంగా విశదీకరించుచున్నది. ఈ కనబడే సమస్తమునకు ఆత్మ తానే ఆధారమై, తాను మాత్రము దేనిపైనా ఆధారపడనిదై ఉన్నట్టిది. త్రైపదమునకు ఆవల రూపమగు అక్షర పరబ్రహ్మమును- "నిత్యోదిత స్వస్వరూపము"-గా నిరూపించి చూపుచున్నది.

### శాంతి పాఠము

ఓం

భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః।

భద్రం పశ్యేమ అక్షభిః యజత్రాః।

స్థిరైః అంగైః తుష్టువాగ్ంసః తనూభిః।

వ్యశేమ దేవహితమ్ యత్ ఆయుః॥

స్వస్తిన ఇన్ద్రో వృద్ధశ్రవాః।

స్వస్తి నః పూషా విశ్వ వేదాః॥

ఓ పరమాత్మా!

మీచే ప్రసాదించబడి, మీ సొత్తు అయినట్టి ఈ మా చెవులు ఎల్లప్పుడు ఆత్మజ్ఞాన శ్రేయోదాయకమైన, భద్రమైన విషయములనే వినుచుండును గాక!

యజ్ఞ కార్యక్రమమునకు సంసిద్ధులమై యున్నట్టి మాయొక్క కళ్ళు భద్రమగు ఆత్మసందర్శనమునకై ఎల్లప్పుడూ సంసిద్ధపడుచుండును గాక!

బలము స్థిరము (Strong) అగు ఈ అవయవములతో ఆరోగ్యవంతులమై ఉంటూ మిమ్ములను కీర్తిస్తూ, సేవిస్తూ - మాకు విధించియున్న ఆయుష్కాలమును గడుపుచుండెదము గాక!

పురాతనుడు, త్రిలోకపాలకుడు, గొప్ప వినికిడితో శాస్త్ర విచారణ - విమర్శనలు కలిగియున్న వారు - అగు **ఇంద్రభగవానుడు మాకు స్వస్తి - శాంతి - శుభములు కలుగజేయును గాక!**

సర్వజ్ఞులు, విశ్వమును ఎరిగినవారు అగు సూర్య భగవానుడు మాకు శుభ - శాంతి - స్వస్థతలను సర్వదా ప్రసాదించుదురు గాక!

---

స్వస్తి నః తార్క్ష్యోః అరిష్టనేమిః।

స్వస్తి నో బృహస్పతిః దధాతు।

ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥

మిక్కిలి వేగవంతుడగు గరుడ దేవుడు మాయొక్క అల్ప - పాపదృష్టులు - అనే సర్పపాశములను తొలగించి మమ్ములను కాపాడుదురు గాక! (వేగ సమన్వితులగు వాయుదేవుడు మాకు స్వస్తిని అనుగ్రహించెదరు గాక)

భగవంతుడు, లోకగురువు - అగు బృహస్పతి మాయొక్క ఆధ్యాత్మిక కార్యక్రమములను, గుణసంపదను పరిరక్షించుచుండెదరు గాక! మమ్ములను ప్రసాదము (పవిత్రము) చేయుదురుగాక।

**ఓం శాంతిః శాంతిః శాంతిః॥**

## ప్రథమ ఖండః

ఓం

దేవా హ వై స్వర్గలోకం అగమం।

తే రుద్రమ్ అపృచ్ఛన్:

"కో భవాన్?" ఇతి!

సో ఽబ్రవీత్ "అహమ్ ఏకః ప్రథమమ్

ఆసం। వర్తామి చ। భవిష్యామి చ।

న అన్యః కశ్చిత్ మత్తో వ్యతిరిక్త।"

– ఇతి॥

ఓంకార రూపుడగు పరమాత్మకు నమో వాక్కులు!

ఒకానొక సందర్భములో దేవతలంతా కలసి స్వర్గలోకమునుండి రుద్రలోకం వచ్చి రుద్రభగవానుని దర్శించారు. భక్తితో నమస్కరించారు. (ఆత్మజ్ఞాన జిజ్ఞాసులై, పరతత్త్వమును వినే ఉత్సాహముతో) జగద్గురువగు రుద్రభగవానుని ఇట్లా ప్రశ్నించారు.

"స్వామీ! మీరెవరు? ఎట్టివారు? మీ తత్త్వమేమిటి?"

(మీ తత్త్వమేమిటో తెలుసుకుంటేనే కదా, మాకు మాయొక్క 'శివోఽహమ్' తత్త్వము ఏమిటో తెలియబడేది।).

రుద్రభగవానుడు : బిడ్డలారా! వినండి!

(I am the beyond and the Begining of all this) ఈ సృష్టి అంతటికి మొట్టమొదటగా, మునుముందుగా, ప్రప్రథమంగా **నేను** మాత్రమే ఏకరూపుడనై ఉండి ఉన్నాను. అనగా, ఈ సృష్టి లేనప్పుడు కూడా నేను ఉన్నాను. వర్తమానంలో కూడా (యథాతథంగా) ఉన్నాను.

భవిష్యత్‌లో కూడా నేను ఎప్పటికీ ఉండియే ఉంటాను. నాకు భిన్నమైనది - అన్యమైనది (వేరైనది), వ్యతిరిక్తమైనది అంటూ ఎప్పుడూ. ఎక్కడా ఏ కాలమందునూ ఏదీ లేనే లేదు! (అంతటా, అన్నిటా సర్వదా నేనే అయి 'ఉన్నాను'!) అదీ నేను! (అహం నిత్య సత్ స్వరూపోఽస్మి। శివాత్ పరతరం నాస్తి।). (రచయితకు వేరుగా ఆతని రచనలో ఏదీ ఉండదు కదా)।

---

2 సో అంతరాత్ అంతరం ప్రావిశత్,

దిశశ్చ అంతరం ప్రావిశత్ –

సోఽహమ్! నిత్య – అనిత్యోఽహమ్!

బ్రహ్మోహమ్।

ప్రాంచః। ప్రత్యంచోఽహమ్।

దక్షిణాం చ। ఉదం చ అహమ్।

అధశ్చ – ఊర్ధ్వంచ – దిశశ్చ – విదిశ్చ అహమ్॥

ఏదైతే ప్రతి ఒక్క జీవుని యొక్క అంతరాంతరములలోను, సర్వదిక్కులందు సర్వదా వేంచేసియున్నదో, - అది నేనే। సోఽహమ్। (కల అంతటా - 'కల తదైనవాడు' నిండి ఉన్న తీరుగా)

ఈ సర్వజీవుల సహజరూపము ఏదై ఉన్నదో...అట్టి పరబ్రహ్మమే నేను! ఈ కనబడే సమస్తములోని నిత్యమైనది - అనిత్యమైనది కూడా నేనే! సృష్టికి కర్తయగు బ్రహ్మగా ఉన్నది నేనే! **సృష్టికి ముందు - సృష్టి తరువాత - సృష్టిగాను నేనే ఉన్నాను.** ఇంద్రియాధారుడను - ఇంద్రియములకు అనుభవమగుచున్న దృశ్యమును కూడా నేనే! ఈ ఇంద్రియములకు ముందున్నవాడిని, వీటిని ఉదయింపజేస్తున్నవాడిని నేనే! నేనే వాక్ - చక్షు-శ్రోత్ర-స్పర్శ - రస - మనో ఇంద్రియ రూపములుగా అగుచున్నాను. క్రింద - పైన (10) దిక్కులలోను, దిశలు లేని (శూన్య) స్థానముగాను కూడా ఉన్నది 'నేనే'। సమస్త జీవుల నిజరూపమై ఉన్నవాడను.

---

పుమాన్ అపుమాం స్త్రియశ్చ అహమ్।

గాయత్ర్యహమ్! సావిత్ర్యహమ్! సరస్వత్యహమ్।

త్రిష్టుప్ – జగతి – అనుష్టుప్ చ అహమ్।

ఛందోఽహమ్। గార్హపత్యోఽహమ్।

దక్షిణాగ్నిః, అహవనీయోఽహమ్।

సత్యోఽహమ్। 'గౌః' అహమ్। గౌర్యహమ్।

జ్యేష్ఠోఽహమ్। శ్రేష్ఠోఽహమ్। వరిష్ఠోఽహమ్।

ఆపోఽహమ్। తేజోఽహమ్।

ఋక్–యజుః–సామ–అథర్వ అంగిరసోఽహమ్।

నేనే పురుష - స్త్రీ - నపుంసక ఉపాధులుగా ఉండగా, ఇదంతా నాచే ఆస్వాదించ బడుతోంది. గాయత్రి - సావిత్రి - సరస్వతీ రూపాలుగా ఉపాసించబడుచున్నది నేనే!

త్రిష్టుప్-జగతి- అనుష్టుప్ ఛందస్సులు నేనే! యజ్ఞక్రియలోని గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని - ఇవన్నీ నాయొక్క వివిధ తేజో రూపములు.

నేనే సత్-స్వరూపమగు సత్యమును। గోరూపముగా (శ్రేష్ఠుడుగా) ఉన్న వాడను! గౌరీదేవి నా రూపమే! ఈ సర్వమునకు జ్యేష్ఠుడను। శ్రేష్ఠుడను। వరిష్ఠుడను। జలము - తేజస్సు కూడా నేనే! చతుర్వేదములచే ఉద్దేశ్యించ బడే సారవస్తువు నేనే!

ఋగ్వేదములోని ఋక్కులు, యజుర్వేదంలోని యజస్సులు, సామ వేదములోని సామ గానములు, అథర్వణ వేదములోని అధ్యయనములు అంగిరసములు (ముఖ్యప్రాణోపాసనలు) - ఈ విభాగములన్నీ నాగురించియే పలుకుచున్నాయి.

అక్షరమహమ్। క్షరమహమ్।
గోప్యోఽహమ్। గుహ్యోఽహమ్।
అరణ్యోఽహమ్। పుష్కరమహమ్।
పవిత్రమహమ్।

ఇక్కడ మార్పు చెందనిది (I) - మార్పు చెందేది (My) ...ఈ రెండూ కూడా నేనే! (I am the Constant/Fixed Factor as well as Varying / Changing Factor).

**రహస్యము :** అనేకుల ఇంద్రియ దృష్టిలో లేనట్టి వాడనై, వారందరిలో కూడా రహస్యముగా వేంచేసి ఉన్నవాడను. (I am the 'Being' of all while not being seen by all).

నిర్జనారణ్యము - బహుజన ప్రదేశము కూడా నేనే! ఎట్టి దోషములు స్పృశించజాలనట్టి పరమపవిత్ర స్వరూపుడను. నిర్మలుడను.

---

అగ్రంచ, మధ్యంచ, బహిశ్చ, పురస్తాత్,
దశసు దిక్ చ అవస్థితమ్ (దిక్ష్వవస్థితమ్)।
అనవస్థితమ్ చ, జ్యోతిః ఇతి అహమ్।
ఏకః సర్వే చ మామేవ।

ఈ సమస్త జగత్తు యొక్క పైభాగము, మధ్యభాగము, బాహ్యము, వెనుక, ముందు, 10 దిక్కులు నాచేతనే ఆక్రమించబడినవై ఉన్నాయి..

దశ దిక్కులందు నిండి ఉన్నది నేనే అయినప్పటికీ, నేను దిక్కుల మధ్య చిక్కిఉన్నవాడను కాదు! అంతా నాయందే। అంతా నేనే।

జ్యోతి (Enlightening నిర్మలకాంతి) స్వరూపుడను. సర్వదా ఏకస్వరూపుడనై ఉన్నాను. అనేకముగా అగుచుండటం లేదు కానీ అనేకంగా అగుపిస్తున్నది 'నేనే'।

---

మాం యో వేద, సర్వాం దేవాన్ వేద।
గాం గోభిః బ్రహ్మణాన్ బ్రాహ్మణేన।
హవీగ్ంషి, హవిషాయుః, ఆయుషా
- సత్యగ్ం సత్యేన,
- ధర్మం ధర్మేణ-
తర్పయామి - స్వేన తేజసా।

ఓ దేవతలారా! నన్ను తెలుసుకుంటే సర్వదేవతలను, సమస్తమును ఎరిగినట్లే! (మట్టిగురించి తెలిస్తే, మట్టి బొమ్మలగురించి ఇంకా తెలియవలసినదేమున్నది?)

(గో = భూమి). నేనే - ఈ భూమినంతటినీ సూర్యకిరణముల చేతను, బ్రాహ్మణుల వేదాధ్యయన - వేద శబ్ద నినాదముల చేతను, హవిస్సు - ఆజ్యము చేతను, జీవుల జీవిత కాల ప్రదర్శనముల చేతను పరిపోషిస్తున్నాను. సత్యమును సత్యముతోను, ధర్మమును ధర్మముతోను తర్పణము చేస్తూ ఈ భూమిని నా తేజస్సుచే రక్షిస్తున్నాను.

---

తతో దేవా రుద్రం న అపశ్యం।
తే దేవా రుద్రం ధ్యాయంతి।
తతో దేవా ఊర్ధ్వబాహవః స్తున్వంతి॥

ఇట్లా పలుకుతూ అంతర్ధానమైనారు. ఆ రుద్రభగవానుని అక్కడెక్కడా దేవతలు ఎదురుగా చూడలేకపోయారు. అప్పుడు వారు చేతులు పైకి ఎత్తి ఉంచి రుద్రభగవానునికి ఇట్లా స్తోత్రములు సమర్పించారు.

---

## ద్వితీయ ఖండః - రుద్రాత్మకమిదం సర్వమ్।

ఓం
1. యో హ వై రుద్రః
స భగవాన్।
యశ్చ బ్రహ్మ భూర్భువస్సువః (భూ-భువః-సువః)
తస్మై వై నమో నమః।
శీర్షం జనపద 'ఓం'
విశ్వరూపోఽసి। - యశ్చ విష్ణుః॥

**దేవతలు : రుద్రుడుగా మనకు ప్రత్యక్షమైనవారే భగవంతుడు!**

వేద - వేదాంత శాస్త్రములచే 'రుద్రుడు - భగవంతుడు'గా ఎవ్వరు కీర్తించబడుచున్నారో, ఎవ్వరైతే భూ - భువర్ - సువర్ - మహర్ - తపో లోకములను, సృష్టికర్తయగు బ్రహ్మను తనయొక్క తేజోరూపంగా కలిగి ఉన్నారో, అట్టి రుద్రపరమాత్మకు భక్తితో నమస్కరిస్తున్నాము. అత్యున్నతమగు ఓంకార రూపుడవు, విశ్వరూపుడవు నీవే అయి ఉన్నావయ్యా! సమస్తము పరిపోషిస్తూ, సర్వము తానే అయి ఉన్న 'విష్ణువు'వు కూడా నీవే।

---

2. (యథా ప్రథమ మంత్ర ఉక్తావా
ఆది-అంతౌ తథా
సర్వ మంత్రేషు ద్రష్టవ్యౌ)।

(ఇది మొదటిగా చెప్పి, ఈవర్ణనను ఇక చెప్పుకోబోవుచున్న నామములతో జతచేర్చి మంత్రోపాసన చేయబడును గాక। సమన్వయమగును గాక).

| = 2 నుండి 32 = | |
|---|---|
| యశ్చ విష్ణుః,<br>యశ్చ మహేశ్వరః,<br>యా చ ఉమా।<br>యశ్చ వినాయకః<br>యశ్చ స్కందః<br>యశ్చ ఇంద్రః | (అంతటా నిండి ఉండుటచే) నీవే విష్ణువువు। మహేశ్వరుడవు, ఉమా (శక్తి) స్వరూపుడవు। వినాయకుడు। స్కందుడు, ఇంద్రుడుగా మేము ఉపాసిస్తున్నది నిన్నే. |
| యశ్చ అగ్నిః<br>యా చ భూః<br>యశ్చ భువః<br>యశ్చ సువః<br>యశ్చ మహః<br>యశ్చ జనః<br>యత్ చ తపః<br>యచ్చ సత్యమ్ | నీవే అగ్నిరూపుడవు! భూ - భువః - సువః - మహః - జనః - తపః - సత్య....అనే సప్త ఊర్ధ్వ లోకములు నీయొక్క సంప్రదర్శనా చమత్కారమే! |
| యా చ పృథివీ<br>యశ్చ ఆపః<br>యచ్చ తేజః<br>యశ్చ వాయుః<br>యచ్చ ఆకాశమ్ ॥ | ఈ జీవులకు ఆహార ప్రసాదిస్తున్న భూమి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము....ఇవన్నీ నీయొక్క వివిధ రూపాలే!<br>(దీపము యొక్క తేజస్సు అనేక రూపములను వెలిగించురీతిగా, - ఇవన్నీ నీయొక్క తేజో ప్రదర్శనా చమత్కారములే। మేమంతా మీ సంప్రదర్శనములమే।). |
| యశ్చ సూర్యః<br>యశ్చ సోమః<br>యాని చ నక్షత్రాణి<br>యే చ అష్టౌ గ్రహాః<br>యశ్చ ప్రాణః<br>యశ్చ కాలః<br>యశ్చ యమః<br>యశ్చ మృత్యుః<br>యచ్చ అమృతమ్। | ఓ రుద్ర భగవాన్! పరమాత్మా!<br>సూర్యుడుగా ప్రకాశిస్తున్నది, చంద్రుడుగా ఓషధులు అందిస్తున్నది, నక్షత్రములు, అష్టదిక్పాలకులు, ప్రాణశక్తి, కాలము, సంహారకశక్తియగు యముడు, మృత్యువు, అమృతము...ఇవన్నీ మీ చమత్కార విశేషములే। |
| యచ్చ భూతం – భవ్యం – భవిష్యత్<br>యచ్చ విశ్వం<br>యచ్చ కృత్స్నం<br>యచ్చ సర్వం।<br>యచ్చ సత్యం॥ | త్రికాలములలో అంతటా ఉన్నది మీరే।<br>ఈ విశ్వరూపము, ఇక్కడ సమగ్రము, ఈ సర్వము, సత్యము, ఈ కాలంతర్గత కల్పన, కాలసాక్షి..., హే రుద్రభగవాన్! నీవేనయ్యా ఇదంతా! నీకు నమస్కరిస్తున్నాము? |

## తృతీయ ఖండః

ఓం

1. **ఆదౌ, మధ్యే భూర్భువస్సువః (భూ–భువః–సువః) అంతే శీర్షం జనత్ 'ఓం' విశ్వరూపోఽసి, బ్రహ్మైకత్వం।**

2. **ద్విధా – త్రివిధ – ఊర్ధ్వమ్ – అధశ్చ। త్వం శాంతిశ్చ। త్వం పుష్టిశ్చ। త్వం తుష్టిశ్చ।**

తండ్రీ! రుద్రభగవాన్! నీవు నీయొక్క సమగ్రత్వ, సర్వత్వ, సకలత్వ, సత్‌స్వరూప చమత్కారముచే ప్రణవస్వరూపుడవు.

"ఓం భూర్భువ స్సువస్స్వాహా జనదోమ్" (ఓం భూః భువః స్వాహా జనత్ 'ఓం') - అను గాయత్రీ మంత్రార్థమువు!

ఆదిలో **'ఓం'** మధ్యలో **'భూ-భువః -సువః'** అంతములో **'స్వాహాజనదోమ్।'** సమస్తమును జనింపజేయువాడవు అయినట్టి ఓ ప్రణవ స్వరూపా!

నీవు విశ్వరూపుడవు! విశ్వేశ్వరుడవు! విశ్వాతీతుడవు!

- అద్వితీయమగు బ్రహ్మము నీవు।

- '2'గా (జీవాత్మ - పరమాత్మగా), '3'గా (ద్రష్ట - దర్శనము - దృశ్యముగా)....ఉన్నది నీవేనయ్యా!

- మంత్రముయొక్క ఊర్ధ్వభాగములోను, మధ్యలోను, అధోభాగములోను ఉండి ప్రతి ఒక్కరికి చెందినవాడవై ఉన్నావు। నాకు కూడా చెందినవాడవు। నేనై ఉన్నవాడవు. 'నీవు'గా అనుభవమగుచూ ఉన్నవాడవు కూడా।

- శాంతివి నీవు! ప్రవృద్ధరూప పుష్టివి। సంతోషరూప తుష్టివి।

---

**త్వం హుతమ్ – అహుతమ్।**
**విశ్వం – అవిశ్వం।**
**దత్తం – అదత్తం।**
**కృతమ్ – అకృతమ్।**
**పరం – అపరం।**
**ప(పా)రాయణం చ ఇతి।**

- సమర్పించువాడు - సమర్పించబడుచున్నది కూడా నీవే!

- నీవే విశ్వరూపుడవు! విశ్వ సహితుడవు! విశ్వరహితుడవు!

- మాచే ఇవ్వబడుచున్నది, ఇవ్వబడకున్నది కూడా నీవే!

- నిర్వర్తించబడుచున్నది - నిర్వర్తించబడనిది నీవే!

- ఆవల గల పర స్వరూపము - ఈవల గల ఇహ (అపర) స్వరూపము నీవే! పరమాత్మవు - జీవాత్మవు కూడా నీవే।

- పారాయణము చేయబడుచున్నదంతా కూడా నీ గురించే!

---

3. **అపామ సోమమ్ (అపామ్ అసోమమ్) అమృతా అభూమ్ ఆగన్మ జ్యోతి రవిదామ దేవాన్,**

జలములో చంద్రబింబమువలె మేము నీయందు ఉనికి కలిగి ఉన్నాము. విశ్వేశ్వరుడవగు నిన్ను దర్శించి ధన్యులమగుచున్నాము. బ్రహ్మ విద్యా స్వరూపిణియగు ఉమాదేవి నీకు అభిన్నము కనుక, ఉభయము పొందినవారమై అమృతానందము పొందుచున్నాము! ఆనంద జ్యోతిస్వరూపులమగుచున్నాము.

---

**కిం నూనమ్ అస్మాన్ కృణవత్ అరాతిః**
**కిము ధూర్తిః అమృత మర్త్యస్య?**

ఇంద్రియముల స్వరూపము గ్రహించాము. మీయొక్క సామీప్యతచే ఇక ధూర్తములు, అనర్థకారకములు అగు ఇంద్రియ - ఇంద్రియ విషయ పరంపరలు.... మా అమృత స్వరూపమునకు కలగజేయగల ఆపద ఏమున్నది? మీరు మాలో ఉండగా, మేము అమర్త్యులము. (చేతః కుహరే పంచముఖోఽస్తి। మే కుతో భీః)

---

**సర్వం జగద్ధితం వా**
**ఏతత్ అక్షరం**
**ప్రాజాపత్యం। సూక్ష్మం।**

మీయొక్క అక్షర - ప్రణవ స్వరూపము సర్వలోకహితము. నశించనిది. ప్రజాపతిచే (సృష్టికర్తయగు బ్రహ్మచే) ఎల్లప్పుడూ దర్శించబడుచూ - సేవించబడుచూ ఉన్నట్టిది.

ఇంద్రియ - మనో - ప్రాపంచక బుద్ధులకు విషయము కాదు. కాబట్టి, మీ స్వరూపము - **అత్యంత సూక్ష్మము.**

సౌమ్యం పురుషం। అగ్రాహ్యం।
అగ్రాహ్యేణ వాయుం।
వాయువ్యేన సోమం।
సౌమ్యేన గ్రసతి!
స్వేన తేజసా తస్మాత్ ఉపసంహర్త్రే
మహాగ్రాసాయవై నమో నమః॥

హే పరమాత్మా! రుద్రభగవాన్ మీయొక్క స్వరూపము పరమ శాంతము. సౌమ్యము. పరిపూర్ణమైనది. మనో-వాక్కులచే గ్రహించుటకు వీలు లేనిది। గ్రహించశక్యము కానిది। స్వీయ తేజస్సుతో వాయుత్వము ద్వారా వాయువును, సౌమ్యత్వముచే చంద్రుని చైతన్యపరచుచున్నట్టిది, సర్వమును ప్రదర్శిస్తూ, ఉపసంహరిస్తున్నట్టిది. సర్వమును దిగ్రమింగునట్టి ఓ మహాగ్రాసా! పరాత్మకా! మహా రుద్రదేవా! ప్రణవ స్వరూపా! నమో నమో నమః। నమో నమః। నమో నమః॥

---

## చతుర్థ ఖండః

1. హృదిస్థా దేవతాః సర్వాః।
హృది ప్రాణాః ప్రతిష్ఠితాః।
హృది త్వమసి యో నిత్యం
తిస్రో మాత్రాః పరస్తు సః।

హే రుద్ర దేవాదిదేవా!

ఈ సర్వదేవతలు, సర్వప్రాణులు, మానవులు, సమస్త ప్రాణులు కూడా మీ హృదయము నందు ప్రతిష్ఠితులమై ఉన్నారు.

మాలో ప్రతి ఒక్కరియొక్క హృదయములో సూత్రాత్మ స్వరూపులై, (భౌతిక, మానసిక, జీవాత్మక) మూడు మాత్రలకు పరమై, కేవలాత్మ స్వరూపముగా మీరు వేంచేసినవారై ఉన్నారు. మేమంతా మీకు అభిన్నులము.

---

2. తస్య ఉత్తరతః శిరో। దక్షిణతః పాదౌ।
య ఉత్తరతః, స 'ఓం' కారో।
య ఓంకారః, స ప్రణవో।
యః ప్రణవః స సర్వవ్యాపీ।
యః సర్వవ్యాపీ సో అనంతో।

ఓ మహా రుద్ర పరమాత్మా!

ఉత్తరము - నివృత్తి మార్గమే మీ శిరస్సు!

దక్షిణ - (ప్రవృత్తి) మార్గము (సంసారము) మీ పాదములు!

- ఏది ఉత్తర (నివృత్తి) స్థానమో, అదియే ఓంకారము!
- ఏది 'ఓం' కారమో, అదియే ప్రణవము!
- ఏది ప్రణవమో, అదియే సర్వవ్యాపకము.
- ఏది సర్వవ్యాపకమో, అది అనంతము!

---

యో అనంతః తత్ తారం।
యత్ తారం, తత్ సూక్ష్మం।
యత్ సూక్ష్మం తత్ శుక్లం।
యత్ శుక్లం తత్ వైద్యుతం।
యత్ వైద్యుతం తత్ పరంబ్రహ్మేతి।
స ఏకః స ఏకో రుద్రః।
స ఈశానః।
స భగవాన్! స మహేశ్వరః।
స మహాదేవః॥

ఏది అనంతమో అది తరింపజేయగల తారము.

ఏది తారమో...అది సూక్ష్మము.

ఏది సూక్ష్మమో, అది శుక్లము. నిర్మలము, పవిత్రము.

ఏది శుక్లమో, అదియే తేజోరూపమగు వైద్యుతము. వేదముల సారము.

అట్టి వైద్యుతమే పరబ్రహ్మము!

అట్టి పరబ్రహ్మము సర్వదా ఏకము!

ఏకమగు రుద్రతత్త్వము!

సర్వముగా విస్తరించియున్నదే ఈశానుడు. ఈశానుడే భగవంతుడు, మహేశ్వరుడు, మహాదేవుడు. మీరే అట్టి మహాదేవుడు, స్వామీ!

[తత్త్వమ్! అగ్ని నుండి విస్ఫులింగములవలె మేమంతా మీనుండి (మీకు అనన్యమై) ప్రదర్శనమగుచున్నాము].

## పంచమ ఖండః

| | |
|---|---|
| (1) **అథ కస్మాత్ ఉచ్యత్ 'ఓం' కారో?**<br>**యస్మాత్ ఉచ్చార్యమాణ ఏవ**<br>**సర్వగ్ం శరీరం ఊర్ధ్వమ్**<br>**ఉన్నమయతి, (ఉత్ నమయతి) తస్మాత్**<br>**ఉచ్యత 'ఓం'కారః॥** | హే రుద్ర-సర్వాత్మకా!<br>**మీరు ఓంకార స్వరూపులుగా ఎందుచేత చెప్పబడుచున్నారు?**<br>'ఓం'కారమును ఉచ్చరించుచుండగానే ఈ జీవుడు సంసారము నుండి పైకి మీచే లేవదీయబడుచున్నాడు. మిమ్ములను తలచుటచే ఉద్ధరించ బడుచున్నాడు. (వ్యష్టిగతమగు జీవత్వము నుండి ఈ జీవుడు శివత్వము సంతరించుకుంటున్నాడు). అందుకే **మీరు ఓంకారస్వరూపులు!** |
| (2) **అథ కస్మాత్ ఉచ్యతే "ప్రణవో?"**<br>**యస్మాత్ ఉచ్చార్యమాణ ఏవ**<br>**ఋచో, యజూగ్ంషి, సామాని,**<br>**అథర్వ, అంగిరసశ్చ యజ్ఞే బ్రహ్మ చ బ్రాహ్మణేభ్యః**<br>**ప్రణామయతి, – తస్మాత్ ఉచ్యతే "ప్రణవః"॥** | **ఎందుచేత మీరు "ప్రణవ స్వరూపులు" అని అనబడుచున్నారు?**<br>ఏ ఓంకార రుద్రతత్త్వమును ఉచ్చరించటం చేత ఋక్ - సామ - యజు అథర్వ - అంగిరస (ప్రాణోపాసన) యజ్ఞ = షడంగముల యోగసిద్ధి ప్రయోజనమైనట్టి బ్రహ్మ యజ్ఞముచే - బ్రహ్మము పొందింపజేస్తూ ఉన్నారు. ఈ కారణం చేత మీరు ప్రణవస్వరూపులు - **ప్రణవతీతి ప్రణవః (ఆత్మత్వమును) పొందింపజేస్తున్నారు కాబట్టి ప్రణవస్వరూపులు!** |
| (3) **అథ కస్మాత్ ఉచ్యతే "సర్వవ్యాపీ"?**<br>**యస్మాత్ ఉచ్చార్యమాణ ఏవ**<br>**సర్వాన్ లోకాన్ వ్యాప్నోతి స్నేహో**<br>**యథా పలల పిండం శాంతమూలం**<br>**ఓతం ప్రోతం అనుప్రాప్య సర్వం వ్యతిశిష్టః,**<br>**తస్యైవ అనువిద్ధం వ్యతిశిష్టః, –**<br>**తస్మాత్ ఉచ్యతే 'సర్వవ్యాపీ'॥** | **మీరు "సర్వవ్యాపి" అని ఎందుకు చెప్పబడుచున్నారు?**<br>నువ్వుపిండి ముద్దలోను, మాంసపు ముద్దలోను అంతరంగా నూనె ఉ ంటుంది కదా! ఆ రీతిగా రుద్రనామోచ్చారణచే అంతటా వ్యాపించి ఉ న్నట్టి శాంతరూపమగు మీయొక్క ఓత - ప్రోత స్వరూపానుసంధానముచే ఈ జగత్తులో జరామరణములు లేనివారమై (అమర్త్యులమై) వెలయగలము. మీ సర్వవ్యాపకత్వము మేమూ ఆస్వాదించగలం. అందుకే మిమ్ములను 'సర్వవ్యాపీ' అని అంటున్నాము. మా అందరి బాహ్య-అభ్యంతరములలో సమస్తముగా వ్యాపించి ఉన్నది మీరే। |
| (4) **అథ కస్మాత్ ఉచ్యతే 'అనంతో"?**<br>**యస్మాత్ ఉచ్చార్యమాణ ఏవ**<br>**ఆద్యంతం నోపలభ్యతే (న–ఉపలభ్యతే)**<br>**తిర్యక్, ఊర్ధ్వమ్, అధస్థాత్–**<br>**తస్మాత్ ఉచ్యతే అనంతః॥** | **మిమ్ములను 'అనంతుడు' అని ఎందుచేత చెప్పుకుంటున్నాము?**<br>ఏ తత్త్వమును ఉచ్చరించటం చేత (**'ఓం నమః శివాయ'** అనటం చేత) మీయొక్క "ఆద్యంత రాహిత్యము" తెలియవస్తోందో, క్రింద - పైన - ప్రక్కలా అంతటా అనుభవమగుచున్నావో...అట్టి మీ 'అనంతత్వము కారణంగా మిమ్ములను **అనంతుడు**' అని అంటున్నాం! ఆత్మగా మీరు ఆద్యంతరహితులు. |
| (5) **అథ కస్మాత్ ఉచ్యతే "తారం"?**<br>**యస్మాత్ ఉచ్చార్యమాణ ఏవ**<br>**గర్భ జన్మ వ్యాధి జరా మరణ**<br>**సంసార మహత్ భయాత్**<br>**సంతారయతి, తస్మాత్ ఉచ్యతే 'తారమ్'॥** | మిమ్ములను 'తారమ్' అని ఎందుకు అంటారు?<br>ఏ రుద్ర భగవానుని నామోచ్చారణ మాత్రం చేత జీవులంతా కూడా 'గర్భస్థ - జన్మ - వ్యాధి - జరా - మరణ - సంసార మహత్ భయము నుండి తరిస్తున్నారో,....ఆ కారణం చేత 'తారయతేతి రుద్రః తారమ్".....అని చెప్పుకుంటున్నారయ్యా! మీ శివానందతత్త్వము యొక్క మననముచే మేము సంసారబంధములనుండి తరించగలము. |
| (6) **అథ కస్మాత్ ఉచ్యతే "సూక్ష్మం"?**<br>**యస్మాత్ ఉచ్చార్యమాణ ఏవ**<br>**సూక్ష్మో భూత్వా పరశరీరాణ్యేవ**<br>**అధితిష్ఠతి, తస్మాత్ ఉచ్యతే 'సూక్ష్మమ్'॥** | **మిమ్ములను 'సూక్ష్మము' అని అనటం ఎందుకు?**<br>మీ నామము స్మరించటం చేత బుద్ధి సూక్ష్మమై ఈ జీవుడు తన పరతత్త్వమును అధిరోహిస్తున్నాడు. అందుచేత మీరు 'సూక్ష్మము' అన తగినవారు! అట్టి సూక్ష్మతత్త్వము మా బుద్ధికి ప్రసాదించగలవారు మీరు. |

(7) అథ కస్మాత్ ఉచ్యతే "శుక్లం"?
యస్మాత్ ఉచ్చార్యమాణ ఏవ
క్లందతే - క్లామయతే,
తస్మాత్ ఉచ్యతే 'శుక్లమ్'॥

ఓంకార స్వరూపులగు మిమ్ములను 'శుక్లమ్' అని అనటమెందుకు?
మిమ్ములను ఉచ్చరిస్తే అంతరంగములోని సంసార సంబంధమైన గుసగుసలు తొలుగుతాయి. హృదయం నిర్మలమౌతుంది. అందుకని మిమ్ములను 'శుక్లమ్' అంటున్నాం! మా హృదయాలు ఆత్మభావనచే తెల్లనౌతాయి.

---

(8) అథ కస్మాత్ ఉచ్యతే "వైద్యుతం"?
యస్మాత్ ఉచ్చార్యమాణ ఏవ
మహతి తమసి సర్వం శరీరం
విద్యోతయతి, తస్మాత్
ఉచ్యతే వైద్యుతమ్॥

మిమ్ములను 'వైద్యుతమ్' అని అనటమెందుకు?
తమయొక్క ప్రణవనామోచ్చారణచే గాఢాంధకారము తొలగిపోయి, దేహమంతా ఆత్మజ్ఞానమనే వెలుగుచే ప్రకాశవంతమౌతుంది కాబట్టి- మిమ్ములను **'వైద్యుతము'** అని సంభాషించుకుంటున్నాము. జ్యోతి స్వరూపా! తమసోమా జ్యోతిర్గమయ।

---

(9) అథ కస్మాత్ ఉచ్యతే "పరంబ్రహ్మ"?
యస్మాత్ ఉచ్చార్యమాణ ఏవ
బృహతి - బృంహయతి-
తస్మాత్ ఉచ్యతే - "పరంబ్రహ్మ"॥

మిమ్ములను 'పరంబ్రహ్మ' అని చెప్పుకోవటమెందుకు?
మేము మిమ్ములను ఆశ్రయించి అజ్ఞానదశ నుండి జ్ఞానైశ్వర్యము వైపుగా వృద్ధి పొందుచున్నాము. తదితరులను కూడా వృద్ధి పొందింప జేయ గలుగుచున్నాము. 'ఇహము' నుండి 'పరము' చేరటానికి మీరే మార్గము. అందుచేత మీరు 'పరబ్రహ్మ'. ఆవలగల మా కేవలస్వరూపాను భావమునకు మీరు మాకు మార్గము కాబట్టి పరబ్రహ్మ.

---

(10) అథ కస్మాత్ ఉచ్యత "ఏకో"?
యః సర్వాన్ లోకాన్
ఉద్గృహ్ణాతి, అజస్రం
సృజతి, విసృజతి, వాసయతి-
తస్మాత్ ఉచ్యత - 'ఏకః'॥

మిమ్ములను 'ఏకో' అని అనటమెందుకు?
ఒకప్పుడు ఈ లోకాలన్నీ మీయందు లీనమౌతున్నాయి. మీరే సర్వమునకు సృష్టి - స్థితి - సంహారకర్త. ఏకమై....అనేకమును సృజియిస్తున్నారు కాబట్టి 'ఏకః' అని అంటున్నాం. ఏకోసత్। తత్ సత్ త్వమేవ।

---

(11) అథ కస్మాత్ ఉచ్యత "ఏకో రుద్రః"?
ఏక ఏవ రుద్రో। న ద్వితీయాయతస్థే,
య ఇమాం లోకాన్ ఈశత, ఈశనీయుః,
జననీయుః। ప్రత్యంజనాః తిష్ఠత।
సంచుకో చ అంతకాలే సంసృజ్య,
విశ్వా భువనాని గోప్తా,
తస్మాత్ ఉచ్యత 'ఏకోరుద్రః'॥

మిమ్ములను మేము 'ఏకోరుద్ర' అని అనటమెందుకు?
ఈ అనేక భేదములతో కూడి ఈ సమస్త సృష్టి మీయందే, మీ చేతనే కల్పించబడి, పొందబడుతోంది. వాస్తవానికి ఏకరుద్రస్వరూపులగు మీరు మాత్రమే ఉన్నారు. మీకు ద్వితీయమనునదే లేదు. అట్టి తురీయస్వరూపులు. మీరే సమస్తమును నియమించు నియమశక్తి ప్రదర్శకులు. అంతటా వేంచేసి ఉన్నవారు. యజమాని అయి, ఈ లోకాలన్నీ జనింప జేస్తున్నవారు! పరిపాలిస్తూ, పరిపోషిస్తూ లయింపజేసు కొంటున్నారు. ఉపసంహారము (Withdraw) చేస్తున్నారు. అందుచేత 'ఏకో రుద్రులు'. ఏక ఏకాదశో రుద్రా!

---

(12) అథ కస్మాత్ ఉచ్యత "ఈశానో"?
యః సర్వాన్ లోకాన్ ఈశత
ఈశానీభిః జనభిః పరమశక్తిభిః
అభిత్వా శూరనోనుమో। (శూరనోఅనుమో)॥

మిమ్ములను ఈశానుడు అని అనటమెందుకు?
ఈ సర్వ స్థావర - జంగమ జగత్తుకు అచింత్యములై, భావనోపేతము, అవిద్యాభూతము అగు నియమశక్తులచే నియమించువారు మీరే. పరాశక్తి స్వరూపులు! స్వయంప్రకాశానంద స్వరూపులు. మిమ్ములను స్తుతిస్తున్నాము! ఫలితాలు కోరికాదు.

---

అదుగ్ధా ఇవ ధేనవః।
ఈశానమ్ అస్య జగతః
సువః దృశమ్, ఈశానమ్ ఇంద్రతస్థుషః
తస్మాత్ ఉచ్యత ఈశానః॥

పాలు పితకకుండా పూజించబడే గోవులవంటివి ఈ మాస్తోత్రములు!
మా ఇంద్రియములు మీచే నియమించబడినవి. ఇవన్నీ మీ సంపద! అందుచేత మీరు ఈశానుడు. మీ ఈ స్తుతులన్నీ మీరు మీగురించి వర్ణించుకొను స్వకీయ స్వస్వరూప గానములు. అంతటా, అన్నిటా వెలయుచున్నారు కాబట్టి - 'ఈశానులు'. మాయందు మేముగా ఉండి, మాకు 'జీవితము'ను ప్రసాదించుటచే **ఈశానులు.**

**(13) అథ కస్మాత్ ఉచ్యతే "భగవాన్"?**
**యః సర్వాన్ భావాన్ నిరీక్షత్యా(త్వా)త్।**
**ఆత్మజ్ఞానం నిరీక్షయతి,**
**యోగం గమయతి, స ఏవ,**
**తస్మాత్ ఉచ్యతే 'భగవాన్'॥**

**మిమ్ములను 'భగవాన్' అని ఎందుకంటున్నాము?**
- సర్వమును 'ఎరుక' అను అగ్నితేజస్సుచే వెలిగించువారు కాబట్టి,
- సర్వ దర్శకుడవటంచేతను, సర్వత్రా భావనా స్వరూపులై వెలయుచుండటం చేతను,
- ఆత్మజ్ఞానము ప్రసాదించువారు అవటం చేతను,-యోగీశ్వరులుకాబట్టి,
- యోగ పరాకాష్ఠకు త్రోవచూపువారు అవటంచేతను, మీరు '**భగవాన్**' అయి ఉన్నారు.

---

**(14) అథ కస్మాత్ ఉచ్యతే "మహేశ్వరో"?**
**యః సర్వాన్ లోకాన్ సంభక్షః, సంభక్షయతి**
**అజస్రం సృజతి – విసృజతి, వాసయతి,**
**తస్మాత్ ఉచ్యతే 'మహేశ్వరః'॥**

**మరి మహేశ్వరుడు ఎందుకయి ఉన్నారు?**
ఈ లోకాలన్నీ మీకు ఆహారము. సర్వము స్వీకరిస్తున్నది మీరే! మీరు ఎల్లప్పుడూ లీలా వినోదంగా సృజిస్తున్నారు. **ఇదంతాగా నివసిస్తున్నారు.** మరొకప్పుడు ప్రశాంతంగా లయింపజేసుకొంటున్నారు. అందుచేత మీరు **మహేశ్వరులు!**

---

**(15) అథ కస్మాత్ ఉచ్యతే "మహాదేవో"?**
**యః సర్వాన్ భావాన్ పరిత్యజ్య**
**ఆత్మజ్ఞాన యోగైశ్వర్యే మహతి మహీయతే**
**తస్మాత్ ఉచ్యతే – మహాదేవః॥**

మిమ్ములను 'మహాదేవుడు' అని ఎందుకంటున్నామంటే...,
సర్వభావములను పరిత్యజించి, ఆత్మజ్ఞానయోగైశ్వర్యులై మీ మహత్త్యముతో ఈ సమస్తముగా ప్రకాశిస్తున్నారు. అందుచేత మీరు మహాదేవులు! ఈ జీవునికి చెందిన మహత్స్వరూపులు కాబట్టి కూడా 'మహాదేవులు'. మేమంతా మీ మహాన్ స్వరూపమై ఉండటంచేత - మహాదేవులు.

---

**(16) తదేతత్ రుద్రచరితం।**
**ఏష హి దేవః ప్రదిశో ను**
**సర్వాః పుర్వో హి జాతః**
**స ఉ గర్భే అంతః।**
**స ఏవ జాతః। సః జనిష్యమాణః।**

పై విశేషమంతా రుద్రస్తోత్రంగాను, రుద్రచరితంగాను చెప్పబడుతోంది!
ఓ సమస్త జనులారా!
రుద్రభగవానుడే సమస్త దిక్కులలోను సమస్తమునకు మునుముందే ఉన్నట్టి ఆత్మ తత్త్వము! ఈ బ్రహ్మాండగర్భమున ఉన్నట్టి దివ్యతేజోమూర్తి!
ఈతడే **పుట్టినవాడు – పుట్టబోవువాడు – పుట్టనివాడు కూడా**।

---

**ప్రత్యన్ (క్) జనాః తిష్ఠతి విశ్వతో ముఖః।**
**విశ్వతః చక్షుః ఉత విశ్వతో ముఖో।**
**విశ్వతో బాహుః, ఉత విశ్వతః పాత్**
**సం బాహుభ్యాం ధమతి సంపత**
**త్రైః ద్యావా భూమీ జనయన్దేవ ఏకః॥**

ఈయన ప్రత్యక్ స్వరూపుడు. విశ్వతోముఖుడు.
విశ్వమంతా నేత్రములు, ముఖములు కలవాడు.
ఈ విశ్వమంతా తన బాహువులుగా, కాళ్ళుగా కలవాడు. (పాదో అస్య విశ్వా భూతాని).
తమయొక్క బాహువులచే అనేక శబ్దములను పుట్టించుచున్నవారు. పంచభూతములు ఈయనయొక్క సంపద. త్రిలోకములు ఈయన సంచార ప్రదేశములు.
**స్వామీ! మేమంతా మీ సంపదయే।**
ఈ స్వామియే → ఆకాశము, భూమి యొక్క పుట్టుకకు కారకుడై, అద్వితీయుడై, ఏకరూపుడై సర్వత్రా మా అందరుగా ప్రకాశించుచున్నట్టివారు.

---

**(17) తత్ ఏతత్ ఉపాసితవ్యం,**
**యత్ వాచో వదంతి,**
**తదేవ గ్రాహ్యం।**
**అయం పంథా వితత**
**ఉత్తరేణ యేన దేవా,**
**యేన ఋషయో,**
**యేన పితరః**
**ప్రాప్నువంతి**
**పరమపరం(దం) పరాయణం చ ॥ఇతి॥**

అట్టి ఈ మనందరి ఆత్మస్వరూపుడగు రుద్రభగవానుడే సర్వదా ఉపాసించతగినవారు.
ఏది వేద వాక్కులచే చెప్పబడుతోందో, అట్టి **తత్** (తత్త్వ) **శివరూపమే** బుద్ధితో గ్రహించబడవలసినది. ఈయనయొక్క సచ్చిదానంద స్వరూపమే అందరికీ అత్యంత సామీప్యము.
ఏ ఉపాసనా, ఆరాధనా మార్గమును అనుసరించినవారై (పారాయణులై) ఋషులు, పితృదేవతలు చివరికి ఏ స్థానము ప్రాప్తింపజేసుకుంటున్నారో, ఆ పరమపదము, ఆ పారాయణమే ఈ **రుద్రపరమాత్మ స్థానము!**

| | |
|---|---|
| **(18) వాలాగ్రమాత్రం,**<br>**హృదయస్య మధ్యే,**<br>**విశ్వం దేవం, జాతవేదం వరేణ్యమ్।,**<br>**తమ్ ఆత్మస్థం**<br>**యే అనుపశ్యంతి ధీరాః**<br>**తేషాం శాంతిః శాశ్వతీ, నేతరేషామ్।**<br>**(న ఇతరేషామ్।)** | **ఆ శివభగవానుడు :-**<br>కేశము (వెంట్రుక) యొక్క అగ్రభాగమువలె అత్యంత సూక్ష్ముడు! సర్వహృదయ మధ్య స్థానమున ఉన్నట్టివారు!<br>విశ్వరూపుడు! విశ్వేదేవుడు! స్వయంప్రకాశకుడు!<br>వేదములకు జన్మస్థానమైనవాడు! సర్వశ్రేష్ఠుడు! అంతఃకరణ నివాసి! అట్టి ఈ రుద్రతత్త్వమును ఎక్కడ ఉన్నదని, ఎక్కడకు వెళ్ళి చూడాలి? ఏ తెలివిగలవారు (ధీమంతులు) తమయందు, 'స్వస్వరూపము'గాను, బాహ్యమునందు సమస్త జీవులరూపము (తత్త్వమ్) గాను ఆ రుద్రభగవానుని చూచుచున్నారో, అట్టివారు మాత్రమే శాశ్వతమగు పరమశాంతిని పొందుచున్నారు!<br>సర్వమును రుద్ర పరమాత్మగా దర్శించని తదితరులు శాశ్వత సుఖ-శాంతులను పొందుచుండటం లేదు! |
| **(19) యో యోనిం యోనిం అధితిష్ఠతి ఏకో,**<br>**యేన ఇదం పూర్ణం**<br>**పంచవిధం చ సర్వమ్,**<br>**తమ్ ఈశానం పురుషమ్**<br>**దేవ మీడ్యం (నిధాధ్యాయాత్) నిచాయ్యేమాం**<br>**(తారం) శాంతిం అత్యంతమ్ ఏతి॥** | ఏ పరమాత్మ ఏకరూపుడై సర్వదేహములందూ సమముగాను, అఖండుడుగాను వెలయుచున్నారో...,<br>ఎవరు అంతటా పూర్ణుడై సచేతనుడై నిండియుండటంచేతనే పంచవిధములుగా (పంచభూతమయు) ప్రపంచము ఇక్కడ వర్తితమౌతోందో....<br>అట్టి ఈశానుడు, పరమపురుషుడు, దేవదేవుడు, సర్వాధారుడు - అగు రుద్ర దేవుని 'నిధి ధ్యాస'చే ఏకాగ్ర దర్శనం చేయుచున్నాము. ఆత్యంతికమగు 'శాంతి'ని సిద్ధించుకుంటున్నాము. |
| **(20) ప్రాణేష్వ అంతర్మనసో**<br>**'లింగమ్' ఆహుః,**<br>**యస్మిన్ క్రోధో యా చ**<br>**తృష్ణా, క్షమా చ।**<br>**తృష్ణాం ఛిత్వా హేతుజాలస్య మూలమ్**<br>**బుద్ధ్యా సంచింత్య స్థాపయిత్వాతు రుద్రే।** | ఇంద్రియములు **ప్రాణశక్తిచే** కదలుచున్నాయి. ప్రాణముల అంతరమున **మనస్సు** ఉన్నది. అట్టి మనస్సుయొక్క అంతరమున **లింగశరీరమున్నది.** అట్టి లింగ శరీరంలో క్రోధము, తృష్ణ, క్షమారాహిత్యము (ఓర్పు లేకపోవటం) ఇవన్నీ ఉన్నాయి. సర్వ దోషములకు తృష్ణయే మూలము. **అట్టి తృష్ణను జయించి బుద్ధితో లింగ దేహమునందు పరమపురుషుడగు రుద్ర భగవానుని స్థాపించుచున్నాము.** |
| **(21) రుద్ర ఏకత్వమ్ ఆహుః।**<br>**రుద్రం శాశ్వతం వై పురాణమ్ ఇష,**<br>**మూర్జం తపసా నియచ్ఛత।**<br>**వ్రతమ్ ఏతత్ పాశుపతమ్॥** | ఏక స్వరూపుడు, శాశ్వతుడు, పురాణపురుషుడు అగు రుద్ర భఘవానుని లింగదేహము నందు (బుద్ధి యందు) తపస్సుతో ప్రతిక్షేపించటమే **పాశుపత వ్రతము.**<br>సర్వము రుద్రరూపముగా నిర్మలమైన బుద్ధితో ఆశ్రయించటమే పాశుపతవ్రత ముఖ్య ఆశయము, సంసిద్ధి కూడా. |
| **(22) అగ్నిరితి భస్మ। వాయురితి భస్మ।**<br>**జలమితి భస్మ। స్థలమితి భస్మ।**<br>**వ్యోమేతి భస్మ। సర్వగ్ం హవా ఇదం భస్మ।**<br>**మన ఇతి ఏతాని చక్షూంషి భస్మాని।**<br>**అగ్నిః ఇత్యాదినా - భస్మ గృహీత్వా,**<br>**నిమృజ్య అంగాని సంస్పృశేత్।**<br>**తస్మాత్ వ్రతమ్ ఏతత్ 'పాశుపతమ్'।**<br>**- పశుపాశ విమోక్షాయ॥** | **ఈ పాశుపత వ్రతోపాసకుల భస్మధారణయొక్క ఉద్దేశ్యము?**<br>అగ్నియే భస్మము. వాయువు, జలము, స్థలము, వ్యోమము....అన్నీ కూడా భస్మరూపమే! (భ + స + మమ్ = భగవానుని సర్వత్రా వేంచేసియున్న 'సమ' స్వస్వరూప తేజస్సు).<br>మనస్సు, దృష్టి, కళ్ళు, సర్వము భస్మ స్వరూపమే! **అగ్నిరితిభస్మ - వాయురితి భస్మ-జలమితి భస్మ-స్థలమితి భస్మ-వ్యోమ ఇతి భస్మ-అహమితి భస్మ।** ఈ ఏడు మంత్రములతో భస్మమును గ్రహించి దేహముపై పూసుకుంటూ సర్వాంగాలను సుస్పృశించాలి!<br>ఇది పాశుపత వ్రతము. **ఇది పశు పాశ విమోచకం కనుక 'పాశుపతము'** అని, <u>'పాశుపతవిద్య'</u> - అని లోకప్రసిద్ధము. ఇది జ్ఞానార్థులగు జీవులను అజ్ఞానకార్యముల నుండి విరమింపజేయగల <u>'పాశుపతవ్రతము'.</u> |

**(23)** యో అథర్వశిరసం బ్రాహ్మణో
నిత్యమ్ అధీతే, సో అగ్నిపూతో భవతి।
స వాయుపూతో భవతి।
స ఆదిత్యపూతో భవతి।
స సోమపూతో భవతి।
స సత్యపూతో భవతి।
స సర్వపూతో భవతి।
స సర్వేషు తీర్థేషు స్నాతో భవతి।
స సర్వేషు వేదేషు అధీతో భవతి।
స సర్వ వేద చర్య అనుచరితో భవతి।

ఏ తత్త్వోపాసకుడు నిత్యము ఈ అథర్వ శిరోపనిషత్‌ను అధ్యయనము చేస్తాడో, అట్టివాడు బ్రహ్మయజ్ఞవిథుడు అయి, అగ్నివలె పవిత్రుడగుచున్నాడు.

వాయువు వలె, ఆదిత్యునివలె, చంద్రునివలె, స్వయంగా, స్వాభావికంగా నిర్మలుడగుచున్నాడు. సత్యముచే సర్వదా సర్వత్రా పునీతడగుచున్నాడు. (ఆతనియొక్క దేహ-గుణ-దృశ్య-దేహ-జన్మ జన్మాంతర) సందర్భములన్నీ పవిత్రత సంతరించుకోగలవు.

సర్వతీర్థములలోను స్నానము చేసిన ప్రయోజనము పొందుచున్నాడు. **"చతుర్వేద పారాయణ, సమస్త ధర్మాశ్రయ"** ప్రయోజనం పొందుచున్నాడు. వేద - వేదాంగ అధ్యయన శ్రవణ ఫలములను సంపాదించు కుంటున్నాడు!

---

సర్వైః దైవైః (ఏవైః) జ్ఞాతోభవతి।
స సర్వయజ్ఞ - క్రతుభిః ఇష్టవాన్ భవతి।
తేన ఇతిహాస - పురాణానాం
రుద్రాణాం శత సహస్రాణి జప్తాని భవంతి।
గాయత్ర్యాః శత సహస్రం జప్తమ్ భవతి।
ప్రణవానామ్ అయుతం (ప్రణవ నామయుతం) జప్తం భవతి।
రూపే - రూపే దశ పూర్వాన్ పునాతి।
దశ - ఉత్తరాన్ ఆచక్షుసః
పక్తిమ్ పునాతి।
ఇతి ఆహ భగవాన్
అథర్వ శిరో, అథర్వ శిరః॥

ఈ అథర్వశివమును అధ్యయనము చేయువాడు. సర్వదేవతలయొక్క తత్త్వమును తెలుసుకొన్నవాడగుచున్నాడు.

సమస్త యజ్ఞ - క్రతు - ఇష్టా పూర్తములను నిర్వర్తించినవాడగుచున్నాడు. "ఈ సర్వము తమరు ధరించే భస్మస్వరూపమే" అనుభవముతో, "హృదయములో పేరుకుంటున్న ప్రాపంచిక సర్వవిషయాలు తొలగించి, రుద్రభగవానుని ప్రతిక్షేపించటం" అనబడే 'పాసుపతవ్రతము' యొక్క అనుక్షణిక నిర్వహణమ్ ఇతిహాస పురాణ పఠన ప్రయోజనము. (ఇంకా కూడా) కోటి రుద్రజప ప్రయోజనము లభించగలదు. శతసహస్ర గాయత్రీ జప ఫలము ప్రాప్తించగలదు. ప్రణవోపాసన ఫలము వచ్చి చేరగలదు.

మనము వివరించి చెప్పుకొన్న పాశుపతవ్రతకథనము. ఇటు పది తరములు - అటు పది తరములు పవిత్రులగుచున్నారు.

అట్టివాని కంటికి ఎదురుగాగల పది దిక్కులలోని వారంతా పవిత్రత పొందగలరు. అథర్వశిర-పారాయణము ప్రణవోపాసనయే.

**ఈ విధముగా భగవానుడగు అథర్వముని అథర్వశిరోవాక్యములు పలికారు.**

---

**(24)** స కృత్ జప్త్వా శుచిః పూతః
కర్మణ్యో భవతి।
ద్వితీయం జప్త్వా
గణాపత్యమ్ అవాప్నోఽతి।
తృతీయం జప్త్వా దేవమేవ అనుప్రవిశతి
ఇత్యోగ్‌ం సత్యమ్॥ (ఇతి 'ఓగ్‌ం' సత్యమ్।)॥

ఈ అథర్వ శిరోపనిషత్ ఒకసారి జపిస్తే ఆ పఠించువాడు శుచుడు, పరమ నిర్మలుడు, ఉత్తమ కర్మలు నిర్వర్తించిన వారితో సమానుడు కాగలడు.

రెండవసారి జపిస్తే ఉత్తమగుణములు, మంచివారితో సహవాసము, గణాపత్యము పొందగలడు!

మూడవసారి జపించినప్పుడు దేవతల ఆనంద స్థానమున ప్రవేశించ గలడు. ఇది సత్యము! 'ఓం' యేవ సత్యమ్।

---

**(25)** యో రుద్రో అగ్నౌ, యో అప్సు
అంతర్య ఓషధీః వీరుధ ఆవివేశ,
య ఇమా విశ్వా భువనాని చ అక్లపే
తస్మై రుద్రాయ నమో అస్తు॥
నమోఽస్తు। నమోఽస్తు॥

ఏ రుద్రభగవానుడైతే
- అగ్ని స్వరూపుడై సర్వము **తేజోమయం చేస్తున్నారో.....,**
- రసస్వరూపుడై ఉదకమున ప్రవేశించి **జీవులందరినీ పరిపోషిస్తున్నారో....,**
- అంతర్యామియై సర్వజీవులలోను **వేంచేసి ఉన్నారో.....,**
- భూమియందు ఓషధీస్వరూపుడై జీవులకు **ఆహారము అందిస్తున్నారో,** వీరుధములలో (వృక్షములలో) వ్యాపించి ఫలములు ప్రసాదిస్తున్నారో,
- విశ్వస్వరూపుడై విశ్వ ప్రదర్శనము చేయుచున్నారో,
- చతుర్దశ భువనములను **చాకచక్యముగా విస్తరించియున్నారో....,**
- సమస్త జీవులు **తమయొక్క** ప్రదర్శనమే అయి ఉన్నారో...,

**అట్టి రుద్ర భగవానునికి మరల మరల నమస్కరిస్తున్నాము.**

నమో నమో నమో నమోస్తుతే॥

**(26) అద్య మూర్ధానమస్య సగ్ంశీర్యో**
**అథర్వా హృదయం చ**
**మస్తిష్కాత్ ఊర్ధ్వం ప్రేరయన్**
**పవమానో అథర్వ శీర్షః (శీర్ష్ణః)**
**తత్ వా అథర్వ శిరో**
**దేవకోశః సముజ్ఝితః**
**తత్ ప్రాణో అభిరక్షతు।**

ఈ అథర్వోపనిషత్‌ను ముముక్షువులకు ప్రసాదించిన మహనీయులగు అథర్వమునికి ఆ పేరు ఎట్లా వచ్చిందో చెప్పుకుందాము.

ఒకప్పుడు అథర్వమునిని ఒక సందర్భంలో ఒక మహర్షికి లోకసంబంధమైన సంభాషణలచే కోపం కలిగించారు. ఆ మహర్షి "ఓ అథర్వా! నీ శిరస్సు తెగి హృదయమునకు వేరై క్రిందబడుగాక! నీ హృదయము కూడా నేలకూలును గాక!"....అని శపించారు.

ఆ శాపం వింటూనే అథర్వముని మరుక్షణం తన యోగశక్తితో భౌతిక శరీరము నుండి బయటకు వచ్చి వేశారు. ఇంతలో శిరస్సు తెగిపడింది. ప్రాణోపాసనతో క్రిందగా పడియున్న శిరస్సును, హృదయమును అనుసంధానము చేసి ఆయన తిరిగి శరీరమును పునరుజ్జీవింపజేశారు! అందుచేత ఆ మునీశ్వరుడు "అథర్వశిరుడు, పవమానుడు" అని పిలువబడసాగారు.

---

**శ్రియమ్ అన్నమ్ అథో మనః।**
**శ్రియమ్ అన్నమ్ అథో మనః।**
**విద్యామ్ అన్నమ్ అథో మనో**
**విద్యామ్ అన్నమ్ అథో మనః॥**
**మోక్షమ్ అన్నమ్ అథో మనో।**
**మోక్షమ్ అన్నమ్ అథో మనః॥**
***ఇతి 'ఓగ్ం' సత్యమ్। - ఇత్యుపనిషత్॥***
***ఇతి అథర్వశిరోపనిషత్***
***ఓం శాంతిః శాంతిః శాంతిః॥***

అన్నమ్ = ఇంద్రియానుభవమగు సమస్త జగద్దృశ్యము.

శ్రియమ్ అన్నమ్ = శ్రేయస్సు కలుగజేయగల ఇంద్రియానుభవములు.

విద్యామ్ అన్నము = 'బ్రహ్మవిద్య' అనే ఆహారము.

అథోమనో = శ్రియమైన విద్య అను ఆహారము (ఆలోచన)తో కూడిన మనస్సు.

**మోక్షమ్ అన్నమ్ అథో మనః।** 'నాకు బంధము లేదు' అను మోక్ష స్థితియొక్క అనుభవముతో కూడిన మనస్సు.

అట్టి అథర్వశిర మహామునిచే దివ్యచక్షువులచే దర్శించబడిన మంత్రరాశియే 'అథర్వశిరము' అని పిలువబడుతోంది. ప్రాణప్రదుడగు అట్టి అథర్వశిర మునీశ్వరునికి నమస్కారము. మునీశ్వరుడు మమ్ములను రక్షించుగాక! శ్రేయోదాయకమగు ఆత్మజ్ఞాన ఆహారమును, మా మనస్సుకు ప్రసాదించును గాక! "బ్రహ్మవిద్య" అనే వారి ప్రేరణ - రక్షణ మనకందరికీ లభించును గాక! మోక్షము అనే అన్నమును ప్రసాదిస్తూ మా మనస్సులకు సంసార సాగరమునుండి ఈవలకు తెచ్చెదరు గాక। **రుద్రయోగమే సత్యము!**

**సత్యమేవ జయతే!**

***ఇతి అథర్వశిరోపనిషత్***
***ఓం శాంతిః శాంతిః శాంతిః॥***

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 2 అథర్వ శిరోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

**అధ్యయన పుష్పము**



(సర్వాత్మకుడు, ఏక-అక్షరుడు అగు రుద్రమూర్తియొక్క ఏకాదశమూర్తులైనట్టి అజ, **ఏకపాద, అహిర్బుధ్న్య త్వష్ట, రుద్ర, శంభు, హర, త్ర్యంబక, ఈశాన, త్రిభువన** రూపములకు - అధ్యయనసిద్ధికై నమస్కరిస్తున్నాము).

**"ఓంకార స్వరూపుడు, సర్వాత్మకుడు, సర్వతత్త్వ స్వరూపుడు అగు రుద్రభగవానునికి నమస్కరించుచున్నాము".**

### అథర్వశీర్షి మహర్షి భ్యోన్నమః।

(అథర్వశిరము = అథర్వవేదమునకు శిరస్సు వంటి ఉపనిషత్ సారవిశేషము)

## 1. ప్రథమ ఖండము - రుద్ర తత్త్వము

ఒకానొక సందర్భములో దేవతలు రుద్రభగవానుని దర్శనముకొరకై సువర్ణ-ధామమగు రుద్రలోకమును సందర్శించారు. భక్తి ప్రపత్తులతో జగదీశ్వరుడు, జగద్గురువు, జగత్ ప్రేరణశక్తి స్వరూపుడు అగు రుద్రదేవునికి ప్రదక్షిణ నమస్కారము సమర్పించారు. పారిజాత పుష్పములను స్వామి పాదపద్మములకు ప్రేమతో సమర్పించారు. స్వామికి ఎదురుగా సుఖాశీనులైనారు.

రుద్రభగవానుడు దేవతలను ప్రేమార్ద్ర దృక్కులతో ప్రశాంతంగా చూచారు. "బిడ్డలారా! ఏమి కావాలో కోరుకోండి" అన్న అర్థం వచ్చే ముఖకవళికలతో చిరునవ్వు చిందించారు.

అప్పుడు దేవతలు, **"స్వామీ! భవుడా! శర్వుడా! ఈశానుడా! పశుపతీ! భీముడా! ఉగ్రుడా! మహాదేవా! మీ కరుణాకటాక్ష వీక్షణచే మేము పునీతులము అయ్యాము. మాకు చెందినదంతా సర్వదా మీయొక్క విభవ చమత్కారమే కనుక, ఇక క్రొత్తగా కోరుకోవలసినదేమున్నది? మేమంతా మామా లోకాలలో మీ దయచే సుఖ - శాంత - ఐశ్వర్య - ఆనందములతో వర్థిల్లుచున్నాము!**

**హే భగవాన్! వాస్తవానికి శివతత్త్వజ్ఞానమే వాస్తవమైన సంపద. మిగతాదంతా స్వప్నసదృశమే కదా! అందుచేత** "మీ తత్త్వము ఏమిటి? మీరెవరు? ఎట్టివారు?" **అనునది తెలుసుకొనుటకై మిమ్ములను శరణువేడుచున్నాము.** మీ వాస్తవ స్వరూపము ఏమైయున్నది? మేము ఆత్మానంద స్వరూపులగు మీయొక్క రుద్రతత్త్వమును మీ నుండి విని, మీ గురించిన ఉపాసనాక్రమమును మరింత ప్రవృద్ధపరచుకోగోరుచున్నాము. తద్వారా **'శివోఽహమ్', "నారుద్రో రుద్ర మర్చతి, జీవోశః-శివో జీవః"** రుద్రసూక్త మహావాక్యములను సిద్ధించుకోగలుగుతాము అనునది మా ఆశయము.

అందుచేత, రుద్రతత్త్వ విశేషాలు వివరించమని మిమ్ములను మరొక్కసారి వేడుకుంటున్నాము.

**అంతా విని రుద్రభగవానుడు జీవులందరినీ ఆనందింపజేయునట్లు అలవోకగా చిరునవ్వు చిందించారు. మధురమైన శబ్దములతో రుద్రరూప స్వస్వరూప-ఆత్మతత్త్వమును (లేక) రుద్రతత్త్వమును ఈ విధంగా ప్రవచించసాగారు.**

బిడ్డలారా! వినండి!

**అహమ్ ఏకః ప్రథమమ్ ఆసం వర్తామి చ! భవిష్యామి చ!** ఈ సృష్టికి ప్రప్రథమంగా మునుముందుగా, మొట్టమొదటగా ఉన్నది నేనే! ఈ సృష్టి లేనప్పుడు – ఉన్నప్పుడు కూడా యథాతథ పూర్ణానంద నిర్గుణ స్వరూపుడను! **అందుచేత సనాతనుడను.**

→ సృష్టికి ముందే నేనున్నాను.

→ సృష్టి సమయంలోనూ ఉన్నాను. నా త్రిగుణవిశేషమే ఈ సృష్టి! గుణములకంటే మునుముందుగా 'గుణి' ఉండి ఉండాలి కదా! అట్లాగే ఈ 'సగుణ సృష్టి'కి ముందుగా నిర్గుణుడనై, ఆ తరువాత 'గుణి'నై ఉంటున్నవాడను నేనే।

→ భవిష్యత్‌లో (సృష్టి లయించినా కూడా) నేను ఉండియే ఉంటాను. **అహమ్ సత్ ఆనంద స్వరూపః।**

అందుచేతనే **'సదాశివ'** శబ్దముయొక్క శబ్దార్థమై సర్వదా, **సర్వత్రా శివస్వరూపముగా ప్రకాశించుచున్నాను.**

మరొక విషయం! **న అన్యః కశ్చిత్ మత్తో వ్యతిరిక్తః। – ఇతి।** కల గనేవానికి వేరైనది – వ్యతిరిక్తమైనది (ఆతడు వద్దనుకొన్నది) కలలో ఏదైనా ఉంటుందా? ఉండదు, అట్లాగే, నాకు భిన్నమైనది, అన్యమైనది (వేరైనది), వ్యతిరిక్తమైనది అంటూ ఈ సృష్టిలో ఎక్కడా ఏదీ లేదు. ఉండదు. ***(మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి। మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ। – భగవద్గీతాచార్యులవారు)***

- ఏదైతే ప్రతి ఒక్క జీవునియందు అంతరాంతరమునందు (In the Inner Recess of Heart) ప్రవేశించినదై ఉన్నదో...

- బాహ్యమున – అంతరమున కూడా సర్వదిక్కులందు (స్వప్నద్రష్టయొక్క స్వప్న చైతన్యమే స్వప్నమంతా నిండిఉండు తీరుగా) నిండి ఉన్నదో, అట్టి సర్వజీవుల సహజరూపమగు పరబ్రహ్మమును. సోఽహమ్! సోఽహమ్! నాకు వేరై ఎక్కడైనా ఏదైనా కనిపిస్తూ ఉంటే, అదంతా కూడా సందర్భమాత్ర స్వయంకల్పిత – ఊహాభావన మాత్రమే. నాకు వేరై ఎక్కడా ఏదీ లేదు. **శివాత్ పరతరం నాస్తి।**

- ఈ సృష్టిలో తారసబడుచున్న నిత్య – అనిత్యములు (That which is permanent and that which is Temporary) – ఉభయము కూడా నేనే! ఈ సమస్తము నాయొక్క బ్రహ్మీ తేజో విలాస విన్యాసమే।

→ ఈ సృష్టికి భావనను, భావించువాడిని, కర్తను, రచయితను, ఆస్వాదించువాడను కూడా నేనే! బ్రహ్మగా ఉన్నది నేనే! సృష్టికిముందు, సృష్టిగాను, సృష్టి తరువాత... సర్వదా, సర్వత్రా సర్వముగా కనబడుచున్నది నేనే. ఈ సృష్టికి సంబంధించిన కనబడని **అవ్యక్తమును** కూడా నేనే! **ప్రాంచః, ప్రత్యంతోఽహమ్!** సమస్తముగా ప్రకాశించువాడను. సమస్త ప్రకాశములకు ఆవలివాడను కూడా! అహమ్ ప్రత్యంచో।

ప్రాచః = ముందుగా, ప్రత్యంతః = ఆ తరువాత కూడా నేనే.

సృష్టి యొక్క అనుభూతి – అనుభవములకు ఆధారభూతుడను. ఇంద్రియ విషయరూపమగు దృశ్యము కూడా నేనే। ఇంద్రియములకు మునుముందే ఉన్నవాడిని. ఇంద్రియములను ఉదయింప జేస్తున్నవాడిని! వాక్ – చక్షు – శ్రోత్ర – స్పర్శ – రస – మనో – ఇంద్రియ రూపములుగా కనబడుచున్నవాడను. అవన్నీ నాయొక్క కళలు. (I am the Artist while they are all my Arts).

క్రింద – పైన తదితర 8 దిక్కులలోనూ....దశదిశలా (దశ దిక్కులకు) స్థానభూతుడను! అవన్నీ నాయందే ఉన్నాయి. వాటియందు అంతటా ఉన్నవాడను కూడా నేనే।

ఈ దృశ్యములో పురుష – స్త్రీ – నపుంసక ఉపాధులుగా ఏమేమి కనిపిస్తున్నాయో, అవన్నీ కూడా నాయొక్క చిదానంద కళా ప్రదర్శనమే! నేనే! నాటకంలో కనిపించే పాత్రలన్నీ నాటకరచయిత యొక్క కల్పనా చమత్కారములేకదా! నేనే రచయితనై ఇదంతా ఆస్వాదిస్తున్నాను.

**గాయత్ర్యహమ్ : (గాయంతం త్రాయతే యస్మాత్ గాయత్రీ తేన కథ్యతే)**....గానము చేయువానిని (లేక) మననము చేయువానిని రక్షించు అర్థముగల గాయత్రీ స్వరూపుడను! (త్రి–గాయ = జాగ్రత్–స్వప్న–సుషుప్తులు నావైన తురీయ రూపుడను నేను. గాయత్ + ఋత్ = పరమసత్యమగు ఆత్మతత్త్వ గానమును కూడా నేనే।).

**'ఓం'।** ....ప్రణవ వేదమంత్రమును. **భూర్భువస్స్వః** – మహావ్యాహృతుల స్వరూపుడను.

| | |
|---|---|
| **తత్ సవితుః వరణ్యేం** | **8** |
| **భర్గో దేవస్య ధీమహి** | **8** |
| **ధియో యోనః ప్రచోదయాత్** | **8** |

........ *24 అక్షరముల స్తోత్రమును*

గాయత్రీ మంత్రము ద్వారా ఉపాసించబడుచున్నట్టివాడను. ముముక్షువులు శరణు వేడుచూ "మా యొక్క బుద్ధిని వికసింపజేయుండి".... అని ఉద్దేశ్యిస్తున్నది నన్నే!

**సావిత్ర్యహమ్** : సవిత్రుడను. సత్ విత్ రతః। సత్–విత్‌లను వెంట నిడుకొని రతించువాడను. కాబట్టి సావిత్రీ తత్త్వము–నేనే।

**సరస్వత్యహమ్** : నాదస్వరూపమగు (వాక్‌స్వరూపమగు) తత్త్వముగా ఉపాశించబడుచున్నది నేనే. [స+రసత్+వతీ సమస్తముయొక్క రస (Artistic) స్వరూపుడను]. ఈ 'విశ్వము'నకు రస స్వరూపుడను. రసాస్వాదన చేయువాడను కూడా. స–రసత్‌వతుడను.

**ఛందోరూపమును:** వేద – మంత్ర – శాస్త్రములలో విశేషంగా వినబడు త్రిష్టుప్ – జగతి – అనుష్టు ఛందస్సులు **నాయొక్క సారస్వత ప్రదర్శనమే!** నా గురించిన వాక్ గమకములే!

**యజ్ఞస్వరూపుడను** : యజ్ఞ విధిలో కనిపించే
→ గార్హపత్యాగ్నిని।
→ దక్షిణాగ్నిని।
→ ఆహవనీయాగ్నిని।

**నేనే!**
**నా యొక్క తేజోవిభవమే!**

యజ్ఞభావనతో (With a sense of understanding that my function is part of whole) – తమ విద్యుక్త ధర్మములు ఆశ్రయించువారికి నేను సులభ – సాధ్యుడను. వేదాంత విజ్ఞానములోని సత్యము (యమ్ సత్)ను నేనే। గోరూపముగా ఉన్నవాడను. **సర్వరక్షకుడను। ఈ దృశ్యమంతా నా పరిరక్షణలోనే పర్యవేక్షించబడుతోంది.**

- ప్రకృతి నా ప్రదర్శనమే। గౌరీదేవి నా రూపమే। నాయొక్క అర్ధనారీశ్వరతత్త్వమే – ప్రకృతి–పురుషుల ఏకత్వ–దిత్వ చమత్కారములై వెలయుచున్నాయి.
- సర్వమునందు (ప్రతి దేహమునందుగల) శ్రేష్ఠ స్వరూపుడను। జ్యేష్ఠుడను (మనో–బుద్ధి–చిత్త–అహంకారముల కంటే మునుముందే ఉన్నవాడను)। సృష్టికర్తకు – సృష్టికి మునుముందే ఉన్నవాడిని కాబట్టి **వరిష్ఠుడను.।**

ఇక్కడి జలము – రసము, అగ్ని – తేజస్సు, వాటి వాటి ధర్మములు...నేనే!

ఋక్ వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము అంగిరసము (ప్రాణతత్త్వము) – నాకు చెందినవే। నన్నే ఉద్దేశ్యిస్తున్నాయి. తెలియబడేదంతా 'నేనే' కాబట్టి నా స్వరూపమే! **వేద స్వరూపుడను!** నాలుగు వేదముల పాండిత్యమును సముపార్జించువాడను కూడా నేనే! వేదార్థములను తెలుసుకొంటున్నది నేనే! **వేదాంత స్వరూపుడను** కూడా! తెలియబడే సమస్తమునకు ఆవల **"తెలుసుకుంటూ ఉన్నవాడిని"** – నేనే।

తెలుసుకొంటూ ఉన్నవాడిని తెలుసుకొంటూ ఉన్నట్టి **"వేదాంత పురుషుడను". (I am the knower of the knower).**

మార్పు – చేర్పులు లేనట్టివాడను. అక్షర స్వరూపుడను. అయితే మార్పు – చేర్పులన్నీ నాకు చెందిన వినోద చమత్కారములే. (కథారచయిత తాను వేరుగాను, యథాతథముగాను ఉంటూనే కథలో అనేక మలుపులు కల్పిస్తున్నట్లుగా) – ఈ జగత్తంతా నాయొక్క రచనా చమత్కార వినోదమే!

బంగారము వివిధ ఆభరణములుగా మారిందా? లేదు. అయితే వివిధ ఆభరణములుగా కనిపించేది ఏది? బంగారమే కదా! ఆ రీతిగా అక్షరుడను। క్షరుడను కూడా। క్షరమగు దేహ–గుణ స్వభావాదులు నేనే! మార్పు చెందని ఆత్మను నేనే! **క్షరాక్షరోఽహమ్।**

ప్రతి జీవునిలోనూ పరమ సత్యమైనట్టి (నామ–రూప–గుణ–క్షరాక్షరములకు, స్వభావములకు ఆవల వేంచేసి యున్న) **సత్–చిత్–ఆనంద (ఉనికి–ఎరుక–వినోద)** స్వరూపుడను. ఈ జీవులు ఒక సహజీవుడిని చూస్తూ "ఈతడి నామ – రూప – గుణ – స్వభావములు

ఇట్టివి"... అని అనుకుంటున్నాడేగాని, **"ఈతడు సర్వ విశేషములకు పరమైనట్టి నిర్గుణ – నిరాకార శివస్వరూపుడేకదా!"**....అను తత్త్వదృష్టిని ఆశ్రయించలేకపోతున్నారు. వాస్తవానికి చూచేవానిలోను, చూడబడేవానిలోను ఏకమైయున్న నిత్యసత్యము నేనే।

అజ్ఞానదృష్టి (గుణదృష్టి) ఉన్నంతవరకు తత్త్వదృష్టి అలవడదు. తత్త్వదృష్టి ఉన్నచోట గుణములు స్వయం–ఊహాకల్పితములు మాత్రమే!

ఈ విధంగా అత్యంత – పరమ రహస్యమై అందరియందు నేనే వేంచేసి ఉన్నాను. **గోప్యోఽ హమ్!**

అంతా నేనే అయి కూడా, **"ఇదంతా నాకు వేరు కదా!"** – అను (లేక) **"ఇదంతటిలో నేను ఒక మూలగా ఉన్న వాడిని కదా!"**....అని భావనలో నిమగ్నమై ఉన్నప్పుడు, నా సర్వాంతర్యామిత్వము, సర్వతత్త్వస్వరూపము నాకు తెలియనిదై, నాకు తెలియబడవలసినదై ఏదో తెలియని రహస్యమువలె ఉండిపోతోంది! (దృష్టాంతము = స్వప్నము తనదైనవాడు స్వప్నములో కనబడని తీరుగా) రహస్యస్వరూపుడనై ఉండటంచేత – **గుహ్యోఽ హమ్।**

జనుల మధ్య ఉంటూనే జనరహిత (నిర్జన) స్థానమును ఆస్వాదిస్తూ ఉన్నవాడను! ఏకాంతుడను.

→ జనారణ్యమునందు ఏకాకినై ఉన్నట్టివాడను.

→ నిర్జనారణ్యములో కూడా నిండుగా అనేకముతో కూడి ఉన్నట్టివాడను।

పరస్వరూపుడగు నేను దేహములలోను, గుణములతోను ఉండవచ్చు గాక! అయినాకూడా, – సర్వదా నిర్వికారుడను! ఈ దేహ – మనో – బుద్ధి – చిత్త – అహంకారములకు సంబంధించిన ఏ దోషముచేత కూడా స్పృశించబడనివాడను. పరమపవిత్రుడను. **పవిత్రమహమ్!**

**అగ్రంచ : ఈ దేహములకు మునుముందే ఉన్నవాడను.** జగత్తుకు మొదలే ఉండి, ప్రకాశించుచున్న ప్రప్రథముడను। అంతటికీ మహోన్నతుడను। పంచ భూతదేహమునకు, మనో–బుద్ధి–చిత్త–అహంకార– అవ్యక్తాదులకు ఆవల అగ్రస్థానముగా ప్రకాశించువాడను. అందుచేత అగ్రము అయి ఉన్నవాడిని. **సనాతనుడను. (I am the top most of all also).**

**మధ్యంచ** : ఆవలయే కాదు. ఈవలగా ఉన్నది కూడా నేనే! (అహమ్ ఆదిర్హి మధ్యంచ భూతానామ్ అంతయేవచ). ప్రతి ఒక్క జీవుని మొదలు – మధ్య – చివర కూడా నేనే! కనుక మధ్యగా ఉన్నది, ఉంటున్నట్లు భావించబడుచున్నది, భావించుచున్నట్టి వాడు కూడా నేనే! "మధ్య" అంతా నేనే! **ఆది మధ్య అంతములు నాలోని నేనైన స్వయం ప్రదర్శనములే. (I myself am occupying the in-between-as well).**

**బహిశ్చ :** ఈ జీవునియొక్క (ద్రష్టయొక్క) బాహ్యముగా కనిపించే పంచభూత జగత్తు, జాగ్రత్ – స్వప్న – సుషుప్తానుభవములు, సంబంధ అనుబంధ బాంధవ్య విశేషములుగా కనిపిస్తున్నది – ఇదంతా నాయొక్క స్వరూపమే. **స్వకీయ క్రీడా వినోద విన్యాసములే. (I am the beyond. Iam the outward).**

**పురస్తాత్ :** వెనుకగాను, అంతరముగాను ఉన్నది నేనే! ఈవల ఉన్నది నేనే! **(I am behind all this).**

– ముందు–వెనుక, ఆవల–ఈవల, బయట – లోపల, ముందుగా–తరువాత–అటు తరువాత – ఆవల... అంతా నా స్వరూపమే.

**దశ దిక్ చ అవస్థితమ్ – అనవస్థితమ్ :**

- దశ దిక్కులలోను, దశదిక్కులుగాను ఉన్నది – కనిపించేది నా స్వరూపమే। దిక్కులన్నీ నాలో ఉన్నప్పటికీ, నేను దిక్కులలో చిక్కుకొని లేను. అందుచేత **'అనవస్థితుడను'**. ఎట్లా అంటే,....

స్వప్నమంతా నిండి ఉన్నది నేనే అయినప్పటికీ,

→ స్వప్నములో నేను లేను (అట్లా అయితే, స్వప్నముతో నేను ముగిసిపోవాలికదా!).

→ స్వప్నమంతా ఉన్నది నాలోనే! స్వప్నములోని 10 దిక్కులు నేనే, నాలోనే, నావే కూడా!

అట్లాగే, ఈ జాగ్రత్‌లోని దశ దిక్కులు, వాటిలో కనిపించేదంతా నాలోనే ఉన్నది. దానియందు నేను లేను. (మయా తతమ్ ఇదమ్ సర్వమ్ జగత్ అవ్యక్తమూర్తినా। మత్‌స్థాని సర్వభూతాని! న చ అహం తేషు అవస్థితః। – భగవద్గీత)

– ఇదంతగా కనిపిస్తూ కూడా...ఇదంతగా నేను అవను. ఇదంతా నా యందు లేదు. నేను ఇద్దానియందు లేను. **న చ అవస్థితమ్!**

**జ్యోతిరిత్యహమ్** : నేనున్నాను కాబట్టే సర్వము ఈ రీతిగా నాయొక్క వెలుగులో ద్యోతకమౌతోంది. జ్యోతి వెలుగు గదిలోని అన్ని వస్తువులను వెలిగింపజేయుచున్నది కదా! మనో బుద్ధి చిత్త అహంకారాలతో సహా ఈ సర్వము వెలిగింపజేయుచు, ఉనికిని ప్రసాదించు జ్యోతిస్వరూపుడను। పరంజ్యోతినై అంతా వెలుగొందుచున్న వాడను. తేజో రూపుడుగా సర్వత్రా వేంచేసినవాడనై ఉన్నవాడను.

**ఏకస్సర్వేచ మామేవ** : ఇక్కడి ఏకము, అనేకము మొదలైనదంతా కూడా నేనే! అనేకముగా కనిపిస్తూ ఏకముగా అనిపించటమే **శివతత్త్వ జ్ఞానము!**

- బంగారు లోహము - అనేక ఆభరణములు...ఉభయము బంగారమే కదా! నాయొక్క ప్రదర్శనమే ఏకము - అనేకము కూడా!

**మాం యో వేద....సర్వాన్ దేవాన్ వేద।** : ఓ దేవతలారా! దేవతాశ్రేష్ఠులారా! దిక్-జ్యోతిర్మండల దేవతారూపులారా! ఇది వినండి. నేను ఎవ్వరో, ఏమిటో, ఏ రీతిగా సర్వస్వరూపుడనో, స్వస్వరూపుడను కూడానో,... తెలుసుకున్నవాడు - (నన్ను ఎరిగితే) సర్వదేవతలను ఎరిగినవాడగుచున్నాడు సుమా! ఎందుకంటే నేనే సర్వదేవతా స్వరూపుడను. ఎవ్వరు ఏ దేవతను ఆరాధించినా, ఉపాసించినా కూడా నన్ను ఆరాధిస్తున్నట్లే! నన్ను చేరే ప్రయత్నమే అదంతా కూడా. **(సోఽపి మామేవ యజంతి।)**

మట్టిని తెలుసుకొంటే మట్టి బొమ్మల గురించి వేరుగా తెలుసుకోవలసినదేముంటుంది? ఒకే మట్టి అన్ని మట్టి బొమ్మలుగా అయి ఉన్నది కదా! **నేనే సర్వదేవతా స్వరూపుడను! (మృత్తికేవ సత్యమ్)।**

**ఈ జీవుడు "నన్ను తెలుసుకోవటము" అనగా - తనను తాను తెలుసుకోవటమే అగుచున్నది సుమా!**

**గాం - గోభిః బ్రాహ్మణాన్ - బ్రాహ్మణేన, హవీగ్ంషి - హవిషా, ఆయుషా** : నేనే ఈ భూమినంతటినీ సూర్యకిరణములచేతను, వేదాధ్యయన - వేదననినాదములచేతను, వేదములను గానం చేస్తున్నట్టి బ్రహ్మజ్ఞులగు భూదేవతలగు బ్రాహ్మణుల చేతను, అగ్నికి సమర్పించబడే హవిస్సు - ఆజ్యము (నేయి) చేతను, సర్వజీవుల జీవితాంశల ప్రదర్శనములచేతను నింపి ఉంచుచున్నాను!

నేనే బ్రహ్మజ్ఞులయందు బ్రహ్మజ్ఞానముగాను, హవిష్షు సమర్పించువారియందు సమర్పితభావముగాను, ఆయుష్మంతుల ఆయుష్షుగా ప్రదర్శనమగుచున్నాను.

- సత్యమును సత్యమునందు,
- ధర్మమును ధర్మమునందు ఏకం చేస్తూ...,

సత్యయజ్ఞ ధర్మములతో ఈ భూమిని రసమయము, రసవత్తరము చేస్తున్నది నేనే!

ఓ దేవతలారా! నేనే మీ అందరి రూపము కూడా! శుభమగు గాక!

ఈ విధంగా పలుకుచూ ఆ రుద్ర భగవానుడు క్రమంగా తేజోరూపుడై, తేజోమయుడై.... దేవతలు చూస్తూ - చూస్తూ ఉండగా.... చిరునవ్వులు చిందిస్తూనే **అంతర్ధానమయ్యారు.**

దేవతలు అప్పుడు **"స్వామి ఎక్కడ?"** అని పరికించి చూచినప్పటికీ, వారికి భౌతికమైన కళ్ళకు కనిపించనే లేదు!

అప్పుడు ఆ దేవతలు ఆ రుద్రతత్త్వాన్ని ధ్యానం చేయసాగారు. ఒక్కచోట నిలబడి ఊర్ధ్వబాహువులు కలవారై (రెండు చేతులు పైకి ధారణ చేసినవారై) పరమేశ్వరుడు - సర్వాంతర్యామి అగు ఆ రుద్రభగవానునికి ఈ విధంగా స్తుతించటం ప్రారంభించారు!

## 2. ద్వితీయ ఖండము - దేవతల రుద్రస్తుతి

**దేవతలు :** వేద - వేదాంగ - వేదాంత శాస్త్రములచే ఎవ్వరైతే **"రుద్రుడు, భగవంతుడు"** అని (తత్ శం యో ఆవృణీ మహే, గాతుం యజ్ఞాయ, గాతుం యజ్ఞపతయే - అని) కీర్తించబడుచున్నారో,

ఎవ్వరైతే సృష్టికర్తయగు బ్రహ్మదేవుని, సృష్టి విశేషములైనట్టి భూ-భువర్-సువర్-మహర్-ఇత్యాది పేర్లుగల 7 + 7 = 14 లోకములను (ఊర్ధ్వ = **భూ, భువర్, సువర్, మహర్, జనో, తపో, సత్య** లోకములు,

అధో = **<u>అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల</u>** పాతాళ లోకములు) తన తేజోరూపంగా విలసిల్లి ఉన్నారో....,

**అట్టి రుద్ర పరమాత్మకు భక్తిపూర్వకముగా నమస్కరించుచున్నాము.**

ఓ రుద్రభగవాన్! పరమశివా!!

వేదములకు శిరోరూపమగు ఓంకార రూపుడవు, తెలియబడే ఈ ఎదురుగా ఉన్న **విశ్వరూపుడవు కూడా నీవే। తెలియబడుచున్నదంతా నీవే।** మాలో వేంచేసియుండి **"తెలుసుకొనుచున్నవాడు"** కూడా నీవే!

ప్రప్రథమ మంత్రమగు 'ఓం' కారము యొక్క ఉపాసనచే ఏది ఆత్యంతికమై తెలియవస్తోందో, సర్వ దేవతల మంత్రములచే కూడా ఆ ఆత్యంతిక విశేషమే అగుచున్నది. **యథా ప్రథమంత్రమ్ ఉక్త్వా, ఆద్యం, తే తథా సర్వమంత్రేషు ద్రష్టవే!** అందుచేతనే సమస్త దేవతా ఉపాసనలు 'ఓం' – ప్రణవముతోనే ప్రారంభించబడుచున్నాయి.

*(పై వర్ణనములన్నీ ఈ క్రింది వాక్యములకు కూడా స్తుతి వచనములు అగుచున్నాయి).*

- ❖ అంతటా నిండి ఉండుటచేత మీరే <u>విష్ణువు.</u>
- ❖ ఇహ పరతత్త్వములు మీకు చెందినవే కనుక, మీ లీలా ప్రదర్శనమే కనుక మీరే <u>పరమేశ్వరుడు.</u>
- ❖ ఈ 'అహమ్–మమ' రూపములతో కూడిన ప్రకృతి మీకు చెందివే కనుక మీరే <u>ఉమ.</u>
- ❖ మీరు కానిది ఎక్కడా ఏదీ లేదు. కనుక, దీనినంతటినీ, నడిపిస్తున్న నాయకత్వము మీకు చెందినదే. కనుక, మీరే <u>వినాయకుడవు.</u>
- ❖ దైవీ సంపత్తికి రక్షకుడు మీరే కనుక, దేవసైన్య నాయకుడగు <u>స్కందుడవు.</u>
- ❖ ఇంద్రియములకు అధిపతివై సర్వ దేహములలో సర్వదా వేంచేసి ఉండటము చేత <u>ఇంద్రుడవు.</u>
- ❖ మీ తేజస్సుచే సర్వమును వెలిగిస్తూ (హవ్య వాహనుడవై) సమర్పించబడుచున్నదంతా దేవతలకు అందించుచున్నారు. కాబట్టి మీరే <u>అగ్నివి.</u> హవ్యవాహనుడవు.
- – భూ– భువర్–సువర్–మహర్–జనో–తపో–సత్య (ఊర్ధ్వ) లోకములన్నీ నిండి ఉన్నది మీరే। అధోలోకములలో కూడా నిండి ఉన్నది మీరే।
- – పంచభూతమయుడవు కూడా నీవే। పృథివి, అప్పు (జలము), తేజో, వాయు, ఆకాశములు నీయొక్క రూపాలే!

***హే రుద్రభగవాన్! దేవాదిదేవా।***

సూర్యుడుగా సర్వము తేజోమయం చేస్తూ దివారాత్రములను (Day and Night) కల్పించుచున్నది, చంద్రుడుగా రసస్వరూపులై భూమిపై ఓషధులను ప్రవేశింపజేస్తున్నది కూడా మీరే.

ఆకాశంలో కనిపించే పాలపుంతలు, నక్షత్ర మండలములు, నవ గ్రహములు మీరే. ప్రాణశక్తి మీ రూపమే.

మీరే కాలస్వరూపుడు. కాలముచే నియమితమగుచున్నది కూడా మీరే. కాలముతో నశించే మృత్యుతత్త్వము, ఆ మృత్యువుకు నాయకుడగు యముడు కూడా మీరే.

- – కానీ కాలమునకు సంబంధించనివాడవు. కాలః కాలుడవు. కాలమును నియమించువాడవు.
- – మార్పు చెందేది – మార్పు చెందనిది, – మృతము – అమృతము కూడా మీరే.
- – భూ–భువర్–సువర్– లోకములలో ఇక్కడ ఉన్నది, ఇప్పుడు ఉన్నది, భవిష్యత్‌లో ఉండబోయేది మీరే! మీరు సర్వదా సర్వత్రా సత్ స్వరూపులు!

ఈ విశ్వము, ఈ సర్వము, ఈ సర్వ విశేషాలు, వీటన్నిటికీ ఆధారమై వెలుగొందు శివానందస్వరూపులు మీరు. మీరు ఎక్కడ ఉన్నారు? మరెక్కడో లేరు! **<u>మాయందే మాకు సర్వస్వమై, అభిన్నమై, అద్వైతరూపులై సర్వదా, సర్వేసర్వత్రా వేంచేసియే ఉన్నారు!</u>**

(సాంబ యేవ స్పహాయః – అను ఆర్యవాక్యానుసారంగా) – మిమ్ములను సర్వదా శరణు వేడుచున్నాము.

## తృతీయ ఖండము - అంతా నీవేనయ్యా!

తండ్రీ! రుద్ర భగవాన్! నీవు సర్వస్వరూపుడవు! సకలతత్త్వమయుడవు! కేవలుడవు! ప్రణవ స్వరూపుడవు!

**(ఆదౌ) ఓం (మధ్యే) భూ - భువర్ - సువర్ (అంతే శీర్ష్) "ఓం" జనతి**

**ఓం భూర్భువస్సువః జనతి 'ఓం'.....** అను గాయత్రీ మంత్రము యొక్క మంత్రదేవత – మనన స్వరూపము – ఆశయము, తత్-పఠకుడు (గురువు) ....అంతా నీవేనయ్యా!

(1) ఆదిలో...'ఓం', (నిర్విషయానంద) – **కేవలము.**

(2) మధ్యలో...."భూర్భువస్సువః" (సలోక-విషయానందము) – **సృష్టి – స్థితులు.**

(3) అంతములో....స్వాహాజనత్ 'ఓం' (ప్రపంచలయానందము) – **లయము.**

అయినట్టి ఓ ప్రణవస్వరూపా!

నీవు "విశ్వరూపుడవు! విశ్వేశ్వరుడవు! విశ్వాధారుడవు! విశ్వాస్వాదుడవు! విశ్వత్యాగుడవు! అవిశ్వుడవు! ఇవన్నీ ఒక్కసారే అయి ఉన్నావు. **అద్వితీయమగు బ్రహ్మము నీవే!**

❖ ❖ ❖

| | | |
|---|---|---|
| **ద్వివిధంగా** | → | జీవాత్మ + పరమాత్మగా, |
| **త్రివిధంగా** | → | ద్రష్ట, దర్శనము, దృశ్యముగా, |
| **ఊర్ధ్వమ్‌గా** | → | ఆకాశమునకు ఆవల, సహస్రారమునకు ఆవలగల నిర్విషయచైతన్యాత్మగా...., |
| **అధశ్చ** | → | ఈవల గల పంచభూత + పంచతన్మాత్ర + పంచకర్మేంద్రియ–పంచజ్ఞానేంద్రియ–శబ్దస్పర్శాది దృశ్య విషయములుగా...., |
| **శాంతిశ్చ** | → | పరమశాంతము – వృత్తిరహితము – సర్వసాక్షి అగు ఆత్మదేవునిగా...., |
| **పుష్టిశ్చ** | → | సర్వజీవులకు పరిపోషణకర్తగా (పోషితమ్ ఇతి పుష్టిః), సంరక్షకుడుగా, సమృద్ధి ప్రసాదించువాడవుగా, |
| **తుష్టిః** | → | ఆహ్లాదకరుడుగా, ఆప్యాయత–ఆనందము–ఆకర్షణ–ఆమోదము–ఉత్సాహము – ఉత్తేజము – ఉల్లాసము కలిగించువాడుగా ఉన్నది నీవే! సర్వాత్మకుడుగా ప్రకాశిస్తూ ఆయారీతులుగా అనుభూతమగుచున్నదంతా శివస్వరూపమగు నీ మహిమయే! |

- సమర్పిస్తున్నది నీవు! స్వీకరించుచున్నది నీవు! సమర్పించబడుచున్నది కూడా నీవే! హుతమ్ – ఆహుతమ్ – త్వమేవ! సమర్పించబడనిది కూడా నీవే!

- విశ్వము నీవే! విశ్వుడవు నీవే! విశ్వమేలేనట్టి అవిశ్వస్థానములో ఉన్నది కూడా నీవే! నీకు నీవే సత్ స్వరూపుడవు! అసత్ స్వరూపుడవు కూడా నీకు నీవే!

- **దత్తమ్ – ఆదత్తమ్**....ఇచ్చువాడు, ఇవ్వబడునది...కూడా నీవే! అదత్తమ్ – ఇవ్వబడనిది కూడా నీవే!

- **కృతమ్ – అకృతమ్**....నిర్వర్తించబడునది – నిర్వర్తించబడజాలనిది, కర్మలచే పొందబడునది – కర్మలకు (సాక్షిగా) సంబంధమేలేనిది కూడా నీవే!

- **పరమ్ – అపరమ్** : ఆవల **పరమై** ఉన్న పరమాత్మవు – ఈవల క్షేత్ర రూపమై ఉన్న దృశ్య – ద్రష్టల రూపమగు **అపరమువు** కూడా నీవే! ఆవలి 'పర' – ఈవలి 'ఇహ (జీవ)' స్వరూపములన్నీ నీకే చెందినవై, నీయొక్క కల్పితానందములే! ఈ రెండూ నీవే అయి ఉండికూడా, నీవు సర్వదా **'ఏక–అక్షరుడవు'!**

మిమ్ములను మాయందు సర్వదా దర్శిస్తూ పవిత్రులమవటానికి ఈ వర్ణనమంతా మేము (మీగురించి) పారాయణము చేస్తూ ఉంటామయ్యా!

మా పారాయణ వస్తువు మీరే!

**ఈ పారాయణము జరుగుచున్నది మీ గురించి, మీ కొరకై, మీ వలన, మీ చేతనే।**

**అపాం – ఆనందసాగరుడవు।** అట్టి విశ్వేశ్వరుడువగు మీ దర్శనముచే, మీ తత్త్వమును ఈ రీతిగా యోచన చేయుచుండుటచే ధన్యులమగుచున్నాము.

మీరే ఉమా (ఉ = అనుభూతి, మ = అనుభూతి పొందువాడు, ఉమ = ప్రకృతి, శక్తిస్వరూపిణి, అమ్మవారు)....స్వరూపులు! ప్రకృతి స్వరూపులు! అందుచేత మీ స్మరణ – దర్శన – కీర్తనలచే ఇహము – పరము (This side = అమ్మవారు, That side = అయ్యవారు) లేక 'అమ్మయ్య'ను పొందుచున్నవారమగుచున్నాము. భౌమ–అభౌమానందమును పొందుచూ – అమృతస్వరూపులము అగుచున్నాము. ఆనందజ్యోతి స్వరూపులమగుచున్నాము. ఆత్మయొక్క సామీప్యముచే ధూర్తము – అనర్థకారకము అగు ఇంద్రియ విషయములను సాక్షిత్వభావనచే జయించి వేస్తున్నాము. అమృత స్వరూపులగు మిమ్ములను పొందిన తరువాత ఇక ఈ ఇంద్రియ విషయ జగత్తు – జన్మ – మృత్యువులు మమ్ములను సమీపించలేవు! తాకలేవు! ఓ మృత్యుంజయా! నమో నమః।

క్షరము లేని మీ యొక్క అక్షర – ప్రణవ స్వరూపము సర్వలోక హితకరము. శివము. శాంతము. శివానంద ప్రదము. అట్టి మీయొక్క అక్షరపరబ్రహ్మ స్వరూపమే **ఎల్లప్పుడూ ప్రజాప్రతి (సృష్టికర్తయగు బ్రహ్మ) చే దర్శించబడుతోంది.**

మీయొక్క తత్త్వము ఇంద్రియ–మనో–ప్రాపంచకమైన బుద్ధి విభాగములకు విషయము కాదు కాబట్టి అత్యంత సూక్ష్మము అయి ఉన్నది.

మీ స్వరూపము పరమశాంతము. సౌమ్యము. పరిపూర్ణము. మాయొక్క అంతరంగ చతుష్టయమును ఉపయోగించి మీ స్వరూపము తెలుసుకొనేది కాదు!

తెలుసుకొనుచున్నట్టి మేమే మీ స్వరూపము. ఇక అది తెలియబడుదానిలో నిర్వచించి ఏం వెతుకుతాం? (What is the use of searching for 'I' in all that being known?) అందుకే మిమ్ములను 'అగ్రాహ్యము' అంటూ ఉన్నాము.

మీరే స్వీయ తేజస్సుచే 'మేము'గా ఉన్నారు.

స్వీయ తేజస్సుచే మీయొక్క...

- వాయుత్వము ద్వారా వాయువును,
- తేజోతత్త్వముద్వారా అగ్నిని,
- సౌమ్యత్వముచే చంద్రుని–

చైతన్యపరచుచున్నారు। ఉత్తేజపరుస్తున్నారు।

సర్వమునకు ఆవల ఉండి....,
సర్వమును ప్రదర్శించుచూ.....,
సర్వమును ఉపసంహరిస్తున్నది....మీరే!

ఒకానొకప్పుడు సర్వమును దిగమింగుచున్నట్టి ఓ మహాగ్రాసా! సర్వాత్మకా! ప్రణవస్వరూపా! మమస్వరూపా! మమాత్మస్వరూపా! హే రుద్రభగవాన్!

*నమో నమః*
*నమో నమో నమః॥*
*నమో నమో నమో నమః॥।*

## చతుర్థ ఖండము - ఈశానాయ నమో నమః।

**<u>దేవతలు - ఇంకా ఇట్లా గానం చేయసాగారు.</u>**

హే రుద్ర భగవాన్! మీరు మాయొక్క హృదయ స్వరూపులు.

అట్టి మీ హృదయమునందే (అంతర హృదయ ఆభ్రాంతమధ్య హృదయాంతరంగమునందే) సర్వదేవతలు ప్రతిష్ఠితులై ఉన్నారు! సర్వప్రాణులు మీ హృదయమునందే ప్రవర్తమానులై ఉంటున్నారు.

అంతేకాదు ప్రాణులమగు మా అందరియొక్క హృదయపద్మములో సూత్రాత్మస్వరూపులై, త్రిమాత్రలగు జాగ్రత్ - స్వప్న - సుషుప్తులకు వేరై, పరమై..., తురీయాత్మ స్వరూపులై (సర్వసాక్షి అయి) పరమాత్మస్వరూపులుగా వేంచేసి ఉన్నారు!

ఈ విధంగా మీరు అద్వితీయులు। మేమంతా మీకు అభిన్నులము।

హే రుద్రపరంధామా!

ఉత్తర దిక్ సంజ్ఞయగు నివృత్తి (పర) స్థానమే మీ శిరస్సు.

దక్షిణ దిక్ సంజ్ఞయగు ప్రకృతి (ఇహ) స్థానమే మీరు సంచారము చేయుచున్న ప్రదేశము.

**ఉత్తరము శిరస్సు** **దక్షిణము పాదములు** → **జగత్తు**
**(- కేవలము)** **(- సందర్భము)**

- ఏది మీయొక్క నివృత్తి స్థానమగు ఉత్తరమో, అదియే **'ఓం'కారము.**
- ఏది <u>ఓంకారమో,</u> అదియే **ప్రణవము (లేక) శబ్దబ్రహ్మము. ఉద్గీథము. గానరూపబ్రహ్మము.**
- ఏది <u>ప్రణవమో,</u>....అదియే (కలలోనిదంతా ఆ కల కనేవాని స్వప్నచైతన్య విస్తారమే అయిన విధంగా) జాగ్రత్ - స్వప్న - సుషుప్తులలో **<u>సర్వవ్యాపకము.</u>**
- ఏది సర్వవ్యాపకమో, అది (స్వప్నద్రష్ట యొక్క స్వప్న చైతన్యము ఒక స్వప్నముచే పరిమితము కాని విధంగా)....**<u>అనంతము!</u> అపరిమితము! స్వప్న దృశ్యము దృష్ట్యా - స్వప్నము తనదైనవాడు అనంతుడే కదా।**
- ఏది <u>అనంతమో</u> అది "నేను జీవాత్మను. అందుచేత పరిమితుడనుగదా!"...అనే పరిమిత భావననుండి తరింపజేయునది కాబట్టి **<u>తారము</u>** (తారయితేతి తారమ్)
- ఏది <u>తారమో</u> అది **<u>సూక్ష్మము</u>**. ఇంద్రియములకు కనిపించేదంతా స్థూలము. ఇంద్రియములను వెలిగించేది? అది ఇంద్రియ విషయము కాదు. సూక్ష్మ బుద్ధి (To sharp common sense) చేత మాత్రమే గమనించబడేది! **<u>అతిసూక్ష్మము.</u>**
- ఏది <u>సూక్ష్మమో</u> అది విషయదోషములకు అతీతము. కాబట్టి **<u>శుక్లము. నిర్మలము. పవిత్రము.</u>**
- ఏది శుక్లమో అది నిర్మలబుద్ధిచే మాత్రమే ఆస్వాదించబడగలిగేది. కనుక **<u>వైద్యుతము.</u>**

- ఏది <u>వైద్యుతమో,</u> అది **<u>పరబ్రహ్మము!</u>**

ఈ విధంగా దృక్ - ద్రష్ట - దర్శనము - దృశ్యము, సర్వజీవుల సహజరూపము పరబ్రహ్మమే!

ఆ పరబ్రహ్మము ఏకముగానే ఉన్నదిగాని, అనేకముగా అవటము లేదు.

ఆ ఏక స్వరూపుడే ఈ రుద్రభగవానుడు!

సర్వములోను, సర్వముగాను విస్తరించి ఉండటంచేత ఓ రుద్రదేవా! మీరే **ఈశానుడు!**

ఈ సర్వము ఈశ్వరస్వరూపమే! ఈశానమే! ఈశ్వరుడే! మీరే మహాదేవుడు! మహేశ్వరుడు!

స్వామీ! మీరే ఆ దేవదేవుడు। శరణు। శరణు। నమో నమో నమో నమః॥

ఈ ఈశానునిచేరి ఈశానత్వము సముపార్జించుకోవటానికే **అధ్యాత్మశాస్త్రము, శబ్దబ్రహ్మశాస్త్రము ప్రవచనమౌతోంది.** అట్టి ఆత్మశాస్త్ర రుద్రగానము గురించి మనము ఇప్పుడు శబ్దనిర్వచన పూర్వకంగా కొన్ని విషయాలు చెప్పుకొంటున్నాము.

**(1) ఆత్మానంద స్వరూపుడగు రుద్రభగవానుని ఎందుచేత 'ఓం'కార స్వరూపుడుగా, చెప్పుకుంటున్నాము? అథ కస్మాత్ ఉచ్యతే 'ఓం'కారో?**

*'ఓం' అని ఉచ్ఛారణ చేస్తున్నంత మాత్రముచేత, రుద్రస్వరూపులగు మిమ్ములను తలచినవాడై ఈ జీవుడు 'నేను శరీరమును' అనబడే శరీర భావము నుండి మీచే లేవతీయబడుచున్నాడు. మిమ్ములను 'ఓం' అని తలచినంత మాత్రము చేతనే మేము సముద్ధరించబడుచున్నాము. అందుచేత ఓంకార స్వరూపులుగా చెప్పుకుంటున్నాము! 'ఓ' అను పిలుపుచే పలుకుతారు. వేదములు స్తుతించే 'ఓం'కారము శివతత్త్వ స్వరూపులగు మీగురించే.*

**(2) ఎందుచేత మీరు ప్రణవస్వరూపులుగా, ప్రణవముగా చెప్పబడుచున్నారు? అథ కస్మాత్ ఉచ్యతే ప్రణవో?**

*మీ నామమును (ఓం రుద్రాయ నమః । ఓం నమః శివాయ।)....ఉచ్ఛరించిన మాత్రముచేత ఋక్-సామ-యజో-అధర్వణ వేద, అంగిరస (ప్రాణతత్త్వములు), [శిక్ష (పాణిని), వ్యాకరణ (పాణిని), ఛందస్సు (పింగలముని) నిరుక్త (యస్కముని), జ్యోతిష, కల్పములనబడే వేద] - షడంగములు శ్రద్ధతో నిర్వర్తించిన ప్రయోజనమును పొందుచున్నాము! బ్రహ్మయజ్ఞము (లేక) ఆత్మయజ్ఞము నిర్వర్తించిన వారమగుచున్నాము. మీ నామోచ్ఛారణచే మీరు బ్రహ్మమును పొందింపజేస్తున్నారు. మీరు సహజంగానే ప్రణవస్వరూపులు।* ***ప్రణవతీతి ప్రణవః।*** **పొందింపజేస్తున్నది కాబట్టి ప్రణవము.** *మీరు మమ్ము బ్రహ్మస్వరూపులుగా తీర్చిదిద్దుచున్నారు కాబట్టి ప్రణవస్వరూపులు! ప్రణయత్వత్ ప్రణవమ్ - జ్వలింపజేయునది కాబట్టి ప్రణవము. మాలోని సముత్సాహము మీరే కాబట్టి, మీరు మాకు ప్రణవస్వరూపులు.*

**(3) మిమ్ములను 'సర్వవ్యాపి' అని ఎందుకు అభివర్ణిస్తున్నాము? అథ కస్మాత్ ఉచ్యతే 'సర్వవ్యాపీ'?**

*నువ్వుగింజలన్నిటిలోను, మాంసపు ముద్దలోను అంతటా నూనె ఉంటుంది కదా! ఆ విధంగా రుద్రతత్త్వము, సర్వజీవులయందు, సర్వమునందు ఓత-ప్రోతమై ఏర్పడి ఉన్నది. రుద్రనామోచ్ఛారణ చేత మేము ఆత్మయొక్క సర్వ వ్యాపకత్వమును, సర్వాంతర్యామిత్వమును ఎరుగుచున్నాము. అందుచేత మిమ్ములను 'సర్వవ్యాపి'గా చెప్పుకొంటూ ఉపాసిస్తున్నాము.*

**(4) కస్మాత్ ఉచ్యతే ఆనంతో?** 'అనంతుడు' అని మిమ్ములను ఎందుకంటున్నాం?

*మీ నామోచ్ఛారణ చేత మీయొక్క అద్యంతరాహిత్యము మాకు తెలియవస్తోంది.* ***"స్వస్వరూపాత్మకు బాహ్య అంతరంగములకు సంబంధించిన ఆద్యంతములు ఏవీ లేవుగదా!"*** *అనునది మేము గమనించుచున్నాము. అందుచేత* ***"ఓం అనంతాయ నమోనమః"*** *అని ఉచ్ఛరిస్తూ మిమ్ములను భజిస్తున్నాము!*

**(5) అథ కస్మాత్ ఉచ్యతే తారమ్?** తారమ్ (తారుడు) అని పిలుస్తున్నాము ఎందుకని?

*మీ నామోచ్ఛారణ చేత మేము తల్లి గర్భంలో ఉన్నప్పుడు పొందే శోకము నుండి (మరియు) జన్మ - వ్యాధి - ముసలితనము - మరణ - పునః జన్మ సంసార మహత్ భయములనుండి విడివడుచున్నాము!* ***"మేము ఆత్మస్వరూపులమేగాని, భౌతికరూపమాత్రులము కాదు"*** *అని గ్రహిస్తూ, శివతత్త్వాత్మత్వమును ఆశ్రయిస్తున్నాము.* ***"చిదానంద రూపమ్ - శివోఽహమ్! శివోఽహమ్"*** *అను అనుభూతిలో ప్రవేశించగలుగుచున్నాము. (సర్వం వ్యర్థం మరణసమయే, సాంబ ఏకః సహాయః). మిమ్ములను నామస్మరణ సహాయంతో శరణువేడుచున్నాము.*

***మమ్ములను మీ నామస్మరణ సంసార దుఃఖములనుండి తరింపజేస్తోంది కనుక 'తారము' అని చెప్పుకొంటున్నాము.***

**(6) అథ కస్మాత్ ఉచ్యతే సూక్ష్మమ్?** మిమ్ములను సూక్ష్ముడు అని ఎందుకంటున్నాం?

*మీ నామము ఉచ్ఛరిస్తూ ఉండగానే మా యొక్క బుద్ధి స్థూలత్వమును అధిగమించి సూక్ష్మత్వమును పొందుచున్నది. సూక్ష్మత్వముచే సూక్ష్మాతిసూక్ష్మమగు* ***ఆత్మత్వమును, శివత్వమును*** *సమీపించగలుగుచున్నాము. అందుచేత మిమ్ములను 'సూక్ష్మము-సూక్ష్ముడు' అని శ్లాఘిస్తున్నాము.*

**(7) అథ కస్మాత్ ఉచ్యతే శుక్లం?** 'శుక్లము' అని పిలుస్తున్నాం. ఎందుకు?

*క్లందతే క్లామయతే – మీ నామమును మేము ఉచ్ఛరిస్తూ ఉంటే మాయందలి సంసార సంబంధమైన రుసరుసలు, గుసగుసలు, బుసబుసలు తొలగుతూ వస్తున్నాయి. హృదయము నిర్మలమగు తెల్లరూపుగా (స్వాత్వికంగాను, ఆనంద ఉత్సాహపూర్వకంగాను) ప్రకాశమానమగుచున్నది. అందుచేత 'శుక్లము' అని చెప్పుకుంటూ వస్తున్నాం!*

**(8) అథ కస్మాత్ ఉచ్యతే 'వైద్యుతమ్'? మిమ్ములను వైద్యుతము అని ఎందుకు ఆరాధిస్తున్నాం?**

*ఏ రుద్రనామము (లేక) శివనామము (లేక) ప్రణవము మేము ఉచ్ఛరిస్తూ ఉంటే, వెలుగు విరజిమ్ముతూ అజ్ఞాన గాఢాంధకారము తొలగిపోతోందో, తత్ఫలితంగా దేహమంతా ఆత్మానందప్రకాశవీచికలచే నిండిపోతోందో–ఆకారణం చేత మిమ్ములను **'వైద్యుతమ్'** అని స్తోత్రం చేయటం జరుగుతోంది.*

**(9). అథ కస్మాత్ ఉచ్యతే పరబ్రహ్మమ్? మిమ్ములను 'పరబ్రహ్మము' అని ఎందుకు పిలుస్తున్నాము?**

*మీ నామోచ్చారణకు సంతోషించినవారై, మమ్ము మీరు అజ్ఞానమగు **'ఇహము'** అనే పరిమితము జ్ఞానానందమగు **'పరము'** వైపుగా తోలుకొనిపోయి, మీయందు లయింపజేసుకొంటున్నారు. అందుచే మిమ్ములను 'పరంబ్రహ్మము' అని, **"మాయొక్క పర(ఆవల) స్వరూపము"** అని ఎలుగెత్తి చాటుకుంటున్నాము.*

**(10) అథ కస్మాత్ ఉచ్యతే ఏకో?** మిమ్ములను 'ఏకము' అని కదా, స్తుతిస్తున్నాం! ఎందుకు?

*ఏక స్వరూపులగు మీనుండి అనేక రూపములగు ఈ 14 లోకములు, లోకాంతర్గతములు కూడా క్రీడావినోదంగా బయల్వెడలుచున్నాయి. మీ సంకల్పముచే కల్పనా రూపాలుగా వెలువడే ఈ లోకాలు మరల మీయందు లయిస్తున్నాయి. అనగా మీ లీలావినోద సంకల్పమే ఈ సర్వలోకముల – జనుల **సృష్టి, స్థితి, సంహారము** కూడా। అనేకములను సృష్టిస్తూ, ఏకరూపులై ఉంటున్నారు కాబట్టి **ఏకో ఏకః – ఏకో అనేకః**అని మిమ్ములను గురించి చెప్పుకొంటూ శాంతిని పొందగలుగుచున్నాము. ఏకమగు మీరు అనేకముగా ప్రదర్శనమవటము మాయొక్క ఆనందచమత్కారము.*

**(11). అథ కస్మాత్ ఉచ్యతే ఏకో రుద్రః?** "ఒక్క రుద్రుడు మాత్రమే"... అని మిమ్ములను గురించి ఎందుకనుకుంటున్నాం?

*వాస్తవానికి రుద్రభగవానులగు మీరే అన్నిటా అంతటా అన్ని రూపాలుగా అయి, ఏకమాత్ర స్వరూపులై ఉంటున్నారు. వేరువేరుగా కనిపిస్తున్న ఇదంతా ఏకరూపులగు మీరే అయి ఉన్నారు. మట్టి బొమ్మలన్నిటిలో మట్టి మాత్రమే వాస్తవానికి ఉన్నది. మిగతా 'ఈ జంతువుల మట్టి బొమ్మ – ఆ ఈ ఆకారముల మట్టిబొమ్మ'...ఇటువంటి వన్నీ కల్పనా మాత్రమే కదా! మీకు ద్వితీయమనబడేది ఎక్కడా లేదు. జాగ్రత్ – స్వప్న – సుషుప్తులకు ఆవల గల తురీయస్వరూపులు మీరు! అద్వితీయులు. మా రూపముగా ఉన్నది మీరే। (సోఽహమ్ భవతీతి।) మేమంతా మీ స్వరూపులమే.*

- లోకాలన్నీ విస్తరించి ఉండటంచేత ఈశతో – ఈశానః....ఈశత్వముచే **ఈశానులు.**
- ఈ సర్వ దేహ సంపదలకు యజమానులు. **జననీయః।**
- ఈ లోకాలన్నీ వ్యావృత్తిగా జనింపజేస్తున్నట్టివారు. **ప్రత్యంజనాః!**
- ఈ లోకాల రూపంగా ఉన్నది మీరే। **తిష్ఠతి!**
- ఇవన్నీ పరిపాలిస్తూ, ఎప్పుడో ఇదంతా ఉపసంహరిస్తున్నది కూడా మీరే! **ఉపసంహరతి!**
- వీటన్నిటికీ మరొకప్పుడు మీచే ఉపసంహరించబడటంచేత మీయందే లయిస్తోంది. అందుచేత లయకారులు కూడా।
- సర్వజీవులలో హృదయాంతర్గత స్వరూపులై అతి రహస్యంగా దాగి ఉన్నది మీరే!
- ఈ భువనమంతా మీరు "ఏకోరుద్రః" అని సర్వదా నిర్హేతుక జాయమాన కరుణా స్వరూపులుగా ఉద్దేశ్యించబడుచున్నారు!

**(12). అథ కస్మాత్ ఉచ్యతే ఈశానో?** ఎందుకని మిమ్ములను 'ఈశానుడు'గా చూస్తున్నాం? అంటున్నాం? అచింత్యము – మహావైభవోపేతము అగు మీయొక్క నియమశక్తి చేతనే అవిద్యారూపమగు ఈ స్థావర – జంగమ జగత్తు రూపనామములతో సహా నియమితమగుచున్నది. జగత్తుకంతటికి స్వస్వరూప సంకల్ప విస్తరణచే ఈశానులు. ఈ ఇన్ని రూపాలు మీరే కాబట్టి ఈ దృశ్య

జగత్తుకు ఈశానులు. మీరే పరాశక్తి – అపరాశక్తి స్వరూపులు.

మీరు స్వయం ప్రకాశానంద స్వరూపులు! మిమ్ములను అనేక విధాలుగా స్తుతిస్తున్నాము! ఏవైనా లౌకిక – ప్రాపంచక – దృశ్య సంబంధమైన సంపదలు కోరుకొనియా? కాదు!

**పాలు పితికే ఉద్దేశ్యము లేకుండానే గోవుకు సమర్పించే పూజలవంటి మా స్తోత్రములును మీ పాదపద్మములకు భక్తితో – ప్రేమగా సమర్పించటమే మహత్‌భాగ్యముగా భావిస్తున్నాము!**

మా ఇంద్రియములు విషయములను పొందుచున్నాయి. అయితే మా ఇంద్రియములు మావి కావు. వీటి ఈశ్వరుడుగా – నియామకుడుగా....ఇవన్నీ వీటి – వీటి విషయ – విషయపరంపరలతో సహా – మీవే! మీకు చెందినవే!

ఇక మోమో? మేమంతా మీకు చెందినవారము. మీరు అద్వితీయులు కాబట్టి, మేము మీకు అభిన్నులము.

మా మనో – బుద్ధి – చిత్త – అహంకారాలన్నీ మీకు చెందిన తోట లోనివి. మీ సొత్తు అయినట్టి వనపుష్పాలు. అందుకే మిమ్ములను **'ఈశానుడు'**, మాయొక్క **'ఈశ్వరుడు'** అని భావిస్తున్నాం!

**(13). అథ కస్మాత్ ఉచ్యతే 'భగవాన్'?** <u>మిమ్ములను మేము 'భగవానుడు' అని చెప్పుకోవటం ఎందుకు?</u>

- మీరు ఈ సమస్తము వెలిగించు 'భగ' స్వరూపులు కాబట్టి, సందర్శకులై ఉండటంచేతను,
- ఆత్మ జ్ఞానము ప్రబోధించే జగద్గురువు కాబట్టి,
- యోగమార్గంలో యోగులంతా చిట్టచివ్వరికి, చేరుచున్నది మిమ్ములనే అగుటచేతను,
- సమస్త జీవులు జ్యోతిస్వరూపులై ఉండగా, – మీరు **"జ్యోతికేజ్యోతి, ఆత్మజ్యోతి, శివోస్మ్యహమ్"** స్వరూపులై ఉండటముచేత,
- సర్వమును **'తెలివి – ఎరుక'** అనే జ్ఞానాగ్ని – **జ్యోతి శిఖలచే వెలిగించుచున్నారు** కాబట్టి....

మిమ్ములను భగవంతుడు – అని సంభాషించుకుంటున్నాము. సేవించుకుంటున్నాము. పూజించుకుంటున్నాము.

**(14). అథ కస్మాత్ ఉచ్యతే మహేశ్వరో? "మీరు మహేశ్వరుడు" అని ఎందుకని అంటున్నాం?**

*కళాకారుడికి కళా ప్రదర్శనమే ఆహారము. సంగీత విద్వాంసునికి సంగీతమే ఉపాహారము. అట్లాగే ఈ లోకాలన్నీ మీయొక్క ఉపాహారము. మీనుంచి బయల్వెడలి మీకే ఇవి భక్ష్య పదార్థములు (Food - Stuff for consumption) అగుచున్నాయి. (All this is coming out of your artistic way of enjoyment).*

*జన్మరహితులై కూడా లీలగా సృజిస్తున్నారు. క్రీడగా విస్తరిస్తున్నారు. వినోదంగా ఆనందిస్తున్నారు. విశ్రాంతి కొరకై వీటిలో విశ్రమిస్తున్నారు. విసుగు వస్తే చిన్నపిల్లవాడి చేష్టవలే మీలో లయింపజేసుకుంటున్నారు.* **అజస్త్రం సృజతి – విసృజతి – వాసయతి।** అందుచేత 'మహేశ్వరుడు' అని ఆరాధిస్తున్నాం। <u>(అజస్త్రం = ఎల్లప్పుడు).</u>

**(15). కస్మాత్ ఉచ్యతే మహా దేవో?** మిమ్ములను 'మహాదేవుడు' అని ఎందుకని అంటున్నామంటారా?

*సర్వభావాలకు ఆవల 'భావన చేయువారు' అయి మా అందరియందు సర్వదా వెలయుచున్నారు. ఆత్మజ్ఞానయోగీశ్వరులై మాపై ఆత్మజ్ఞానామృతమును కురిపిస్తున్నారు. మహత్తరమైన మహత్యముతో అన్నివేళలా, అన్నివైపులా, ప్రజ్ఞానంద జ్యోతిస్వరూపులై ప్రకాశిస్తున్నారు. విజయం చేస్తున్నారు.*

*దేవతలకు దేవతలై ఉన్నారు. అసలు, మీ భావసారూప్యములే 'మేము' అయి ఉన్నాము.*

*అందుచేత* ***'మహాదేవుడు'*** *అని* ***'దేవాది దేవుడు'*** *అని మీరు మాచే స్తోత్రము చేయబడుచున్నారు.*

***<u>ఇది రుద్ర చరితము!</u>***

రుద్రభగవానుడే అన్ని దిక్కులలో నిండియున్నారు. సర్వమునకు మునుముందుగా ఉండి ఉన్నట్టి చైతన్యమూర్తి। చైతన్యస్ఫూర్తి। ఆయనయే ఈ బ్రహ్మాండగర్భమున ప్రజ్వలించు దివ్య తేజోతత్త్వము। ఆయనయే – నేను, నీవు మొదలైన సర్వనామములన్నీ కూడా.

**రుద్రభఘవానుడే...**

అన్నిచోట్లా పుట్టియున్నవాడు. పుట్టుబోవువాడు. పుట్టుకయే లేనివాడు కూడా।

జన్మ సహితుడు – జన్మ రహితుడు ఈతడే. జన్మలకు ముందువాడు, జన్మలప్పటివాడు, జన్మలకు ప్రత్యక్ స్వరూపుడు. తదనంతరము వాడు కూడా. సర్వదా సర్వమునకు వేరైన వాడు కూడా ఆయనయే!

విశ్వమంతా ఆయన ముఖప్రదేశమే. విశ్వతోముఖుడు.

**విశ్వతః చక్షుః, ఉత విశ్వతోముఖో।** విశ్వమంతా చక్షువులు, ముఖములు కలవాడు।

విశ్వమంతా చేతులు – కాళ్ళు కలవాడు।

అసంఖ్యాక బాహువులతో అసంఖ్యాక చిత్ర – విచిత్ర శబ్దములను పలుకుచున్నది, పలికిస్తున్నది ఈ రుద్రభగవానుడే। ఈ సర్వాత్మస్వరూపుడే!

పంచభూతములు, వాటి వాటి ధర్మములు....ఈయనయొక్క భౌతిక సంపదయే. మనో – బుద్ధి – చిత్త – అహంకారాలు, రుద్రునికి చెందిన అభౌతిక సంపద। మనమంతా ఈయనకు చెందిన సంపదయే।

త్రిలోకములు ఈయన యొక్క సంచార ప్రదేశములు.

ఈ రుద్రభగవానుడే ఆకాశము – భూమియొక్క ఉత్పత్తి స్థానమై, వాటియందంతటా ప్రేరకమూర్తిగా చెన్నొందుచున్నారు.

ఆ రుద్రమూర్తియే త్రిమూర్తి స్వరూపుడు ఆయనయొక్క మూర్తులమే మనమంతా కూడా! అనేకంగా కనిపించే ఏకరూపుడు.

**అనేకంగా కనిపిస్తూ కూడా మనమంతా సర్వదా ఏకరూపులమే। రుద్రోఽహమ్। రుద్రస్త్వమ్। రుద్రమిదమ్। సర్వమిదం రుద్రమయమ్! రుద్రుని అర్చించే మనమంతా రుద్ర స్వరూపులమే!**

## రుద్ర భగవాన్! సర్వాత్మకా!

మనందరి కేవలాత్మస్వరూపుడగు రుద్రభగవానుడే సర్వదా ఉపాసితవ్యుడు. ఉపాసించవలసినవాడు. నమో నమః ॥ ఉపాసించ తగినవాడు. ఉపాసించబడుచున్నవాడు. ఉపాసించుచున్నవాడు.

ఏది వేదవాక్కులతో, వేదవాఙ్మయముచే 'శివతత్త్వము'గా చెప్పబడుతోందో, అదియే మనము బుద్ధితో గ్రహించవలసియున్న మహత్తర విశేషము.

ఏ మార్గమును అనుసరించినవారై ఋషిపుంగవులు, పితృదేవతలు, అంతిమంగా ఏది సిద్ధింపజేసుకుంటున్నారో....

- ఆ పరమ పదమే పారాయణ స్థానము।
- అదియే రుద్ర పరమాత్మత్వము। రుద్రోఽహమ్ ధామము।

ఈ రుద్ర భగవానుడు ఆత్మస్వరూపముగా ఒక వెంట్రుక యొక్క చిట్టచివరి భాగముకంటే కూడా అతిసూక్ష్మాతి సూక్ష్ముడు!

సర్వుల హృదయములే ఆయనను మనం సులభంగా గమనించగల నివాసస్థానము.

విశ్వరూపుడు। విశ్వేశ్వరుడు। విశ్వదేవుడు। స్వయం ప్రకాశకుడు। వేదములకు జన్మస్థానమైనవాడు। వరేణ్యుడు। సర్వశ్రేష్ఠుడు। అంతఃకరణ నివాసి।

✠ ✠ ✠

ఏ ధీమంతులైతే (సూక్ష్మ బుద్ధితో) తమయొక్క బాహ్య – అభ్యంతరములలో అట్టి రుద్రభగవానుని అనన్యభావులై చూస్తున్నారో....

– అట్టి వారు మాత్రమే శాశ్వత శాంతిని సముపార్జించుకొనుచున్నారు. **తేషాం శాంతిః శాశ్వతమ్ నేతరాషామ్!** ఆ పరమాత్మను అన్యముగా – **"ఇక్కడ లేరు. మరెక్కడో ఉన్నారు. ఎప్పటికోగాని సిద్ధించరు"** – అను అవగాహనతో దర్శించువారి శాంతి శాశ్వతత్వము సంతరించుకోవటము లేదు. **అశాంతి తొలగుటలేదు.** దర్శించువారి శాంతి శాశ్వతత్వమును సంతరించుకోవటము లేదు. అశాంతి తొలగుటలేదు.

**ఏ పరమాత్మ :**

- సర్వ దేహములందు ఏకము – సమము – అఖండము అయి వెలయుచున్నారో....,
- పూర్ణులై ఉండగా ఆతని మహిమచే పంచవిధములైన పంచభూతముల సమ్మేళనమై ఈ ప్రపంచము వర్తించటం జరుగుతోందో,

– అట్టి సర్వాధారుడగు పరమపురుషుని, దేవదేవుని ఆశ్రయిస్తున్నాము. అత్యంతిక శాంతికొరకై....నిదిధ్యాస చే ఏకాగ్రదర్శనం (Nothing else than that) చేస్తున్నాము! అనుకుంటూ అనుకుంటూ ఉండగా **"అనిపించటము"** అను **"నిదిధ్యాస"**ను మాకు ఆ జగన్నాయకస్వామి ప్రసాదించెదరు గాక।

- ఈ **<u>ఇంద్రియాలు</u>** తమంతట తామే కదలుచున్నాయా? లేదు. స్వతఃగా చూస్తే ఇవి జడములు. ఇవి **<u>ప్రాణశక్తిచే</u>** కదల్చబడుచున్నాయి.
- ప్రాణముల అంతరమున మనస్సు ఉన్నది. మనస్సుచే ప్రాణములు చైతన్యవంతములగుచున్నాయి. **<u>ప్రాణములను మనస్సు కదలిస్తోంది!</u>**
- అట్టి మనస్సుయొక్క అంతరమున లింగశరీరము (లేక) సంస్కార దేహమున్నది. ఆ లింగదేహములో....క్రోధము, తృష్ణ, క్షమ లేకపోవటం, ఇతరులపై విసుగు, ఆశా భయములు, నిరాశా నిస్పృహలు మొ॥న....ఇవన్నీ ఉన్నాయి. లింగదేహము మనస్సును కదలుస్తోంది. అట్టి లింగ (లేక) సంస్కార దేహములో అజ్ఞానముచేత రూపము పొందుచున్నది. సర్వ ద్వేషములకు, భయములకు తృష్ణయే మూలము. అట్టి తృష్ణను బయటకు వెడలగొట్టి లింగదేహమునందు సర్వతత్త్వస్వరూపుడు – చిదానందస్వరూపుడు అగు రుద్ర భగవానుని స్థాపించుచుండెదము గాక। అప్పుడే నిజమైన శాంతి. ఆయనను అనునిత్యంగా హృదయమునందు స్థాపిస్తూ ఉండటమే మనము నిర్వర్తించే అనునిత్యోపాసన! అదియే "సోఽహమ్ శివః – శివతత్త్వ" జ్ఞానము కైవల్యము, మోక్షము కూడా।

## పాశుపత వ్రతము

ఏక స్వరూపుడు, శాశ్వతుడు, పురాణపురుషుడు అగు రుద్రభగవానుని హృదయమునందు (లేక) లింగ దేహమునందు తపస్సుచే అలంకరించబడిన బుద్ధికుశలతచే ప్రతిక్షేపించటమే <u>'పాశుపత వ్రతము'.</u>

స్వస్వరూపముతో సహా ఈ సమస్తము రుద్రరూపంగా నిర్మలము – సునిశితము **అయినట్టి బుద్ధితో అనునిత్య సందర్శనమే** – 'పాశుపతవ్రతము' యొక్క అంతిమ లక్ష్యము, ఆశయము, విధి–విధానము, స్థానము కూడా!

రుద్రుడు ధరించే భస్మమే అంతా కూడా! భస్మధారణయొక్క ఉద్దేశ్యము అదే!

**భస్మోపాసన : ( భ + సమమ్ = ఇదంతా మమాత్మయొక్క సమ స్వరూప తేజో విలాసము**

**సత్ + మమ + భః = నాయొక్క సత్ స్వరూప తేజస్సు)**

భస్మమే...... **అగ్ని.**

భస్మమే.... **వాయువు.**

భస్మమే..... **జలము.**

భస్మమే..... **భూమి.**

భస్మమే....**ఆకాశము / స్థానము / స్థలము.**

పంచ భూతములన్నీ.....**రుద్రభస్మ రూపమే.**

– మనస్సు – ఆలోచన – భావనోద్వేగము... **భస్మమే.**

– ఈ కళ్ళు – చూపు – దృష్టి......**రుద్రభస్మ రూపమే.**

ఈ విధంగా....

| **"అగ్నిరితి భస్మ! వాయురితి భస్మ! జలమితి భస్మ! స్థలమితి భస్మ! వ్యోమేతి భస్మ! సర్వగ్ం హవా ఇదగ్ం భస్మ! మన ఇతి ఏతాని చక్షూంసి భస్మాని!" అగ్నిరితి ఆదినా!** |
| --- |

ఈ మంత్రము (7 స్తోత్రములతో) భస్మమును గ్రహించి రుద్రభస్మముగా ఉపాసన చేస్తూ దేహమునకు పూస్తూ ఆయా సర్వాంగాలను స్పృశించాలి! **ఇది పాశుపత దైనందికవ్రతములోని అంతర్విభాగ క్రియ!**

ఏ బ్రహ్మతత్త్వోపాసకుడైతే నిత్యము ఈ అథర్వశిరోపనిషత్‌ను అధ్యయనము చేస్తూ ఉంటాడో....అట్టి వాడు రుద్రోపాసకుడే. ఆతడు అగ్నివలె క్రమంగా పరమపవిత్రుడగుచున్నాడు. వాయువువలె, ఆదిత్యునివలె, చంద్రునివలె నిర్మలుడగుచున్నాడు. సత్యమువలె పునీతుడగుచున్నాడు.

- సర్వతీర్థములందు స్నానము చేసినట్టి ఉత్తమోత్తమ ప్రయోజనము పొందుచున్నాడు.
- చతుర్వేద పారాయణ ప్రయోజనమును అందిపుచ్చుకొనుచున్నాడు.
- వేదమంత్రములను శ్రద్ధాభక్తులతో వింటున్నట్టి ఫలమును సముపార్జించుకుంటున్నాడు.
- వేదములలో చెప్పబడిన యజ్ఞ - యాగాదులు నిర్వర్తించినవాడగుచున్నాడు.
- సర్వ దేవతా తత్త్వ రహస్యములను ఎరిగినవాడగుచున్నాడు.
- సమస్త యజ్ఞ - క్రతు - ఇష్టా - పూర్తములను నిర్వర్తించినవాడగుచున్నాడు.
- సమస్త ఇతిహాస - పురాణ పఠన పుణ్యములను ప్రాప్తించుకొంటున్నాడు.

ఓ రుద్రభగవాన్! ఈ సర్వము మీరు ధరించే భస్మ స్వరూపమే.

హృదయములోని దుష్టభావాలను తొలగించి రుద్రభగవానుని ప్రతిక్షేపించు పాశుపత వ్రతముచే

→ కోటి రుద్ర జప ప్రయోజనము సిద్ధించగలదు.

→ శత సహస్ర గాయత్రీ జపఫలము ప్రాప్తించగలదు.

→ ప్రణవోపాసన ఫలము త్వరగా సిద్ధించగలదు.

అట్టి పాశుపత వ్రత నిర్వర్తి యొక్క - ఇటు 10 తరములవారు, అటు 10 తరములవారు - పుణ్యలోకములు పొందుచున్నారు! అట్టివాడు ఎటువైపు చూస్తూ ఉంటే, అటువైపు పరమ పవిత్రత పొందగలదు.

**ఇతి ఆహ భగవన్‌।**

**అధర్వ శిరో, అధర్వ శిరః॥**

ఈ అధర్వ శిరోపనిషత్ ఒకసారి జపిస్తే (పఠిస్తే), ఆ పఠించినవాడు శుచిమంతుడు, నిర్మలుడు, ఉత్తమకర్మలు నిర్వర్తించినవాడు కాగలడు!

రెండుసార్లు పఠిస్తే (పారాయణం చేస్తే, జపిస్తే) ఉత్తమ గుణములు (దైవీ సంపత్తి, జ్ఞాన గుణములు) ఆతనిని వచ్చి చేరుతాయి. మంచివారితో, విజ్ఞులతో, బ్రహ్మజ్ఞానులతో సహవాసము లభించగలదు. అట్టివాడు గణాపత్యము (Leadership qualities) పొందుచున్నాడు.

మూడుసార్లు ఉపనిషత్తులు పారాయణం చేస్తూ అర్థమును మననము చేస్తే, ఆతడు దేవతలు ఉండే ఆనంద స్థానమునందు ప్రవేశించగలడు.

ఇంకా అధికంగా పఠిస్తూ ఉంటే రుద్ర భగవానునితో సామీప్యమును, సాలోక్యమును, సాయుజ్యమును సముపార్జించుకొంటున్నాడు.

## ఇతి ఓగ్ం సత్యమ్

ఇది సత్యమును జేర్చు యోగమార్గము. జ్ఞానమార్గము. భక్తిమార్గము.

***ఏ సర్వాత్మకుడగు పరమాత్మ అయితే....,***

- అగ్ని స్వరూపుడై బాహ్య జగత్తులను, సర్వదేహములను తేజోమయం చేస్తున్నారో, తేజోరూపులై ప్రదర్శనమగుచున్నారో
- ఆపః స్వరూపులై తమయొక్క రసతత్త్వముచే జీవుల దేహములలో ప్రవేశించి పరిపోషిస్తున్నారో, వృక్ష జంతు జాతులను వృద్ధింపజేస్తూ - పరిరక్షించుచున్నారో...
- భూస్వరూపులై ఓషధరూపంగా ఆహార శక్తిని అందిస్తున్నారో,.... భూమియందు ఓజోశక్తిచే ఓషధరూపులై ఆహారమును తయారుచేస్తున్నారో.....,ఓజోరూపులై భూతత్త్వముగా వేంచేస్తున్నారో,
- అంతర్యామియై జీవాత్మ చైతన్యముగా సర్వ జీవులలోను వేంచేసి ఉంటున్నారో, వైశ్వానరులై జీవుడు - జీవత్వములను ప్రకటనపరచుచున్నారో,
- విశ్వస్వరూపులై ద్రష్ట - ద్రష్టల మధ్యగా దృశ్యానుభవరూపంగా ప్రదర్శితమగుచున్నారో....
- చతుర్దశ (14) భువనములను చాకచక్యముగా విస్తరించి ఉన్నారో...
- సమస్త జీవుల జాగ్రత్ - స్వప్న - సుషుప్తుల, దేహ - దేహాంతరముల సంధృశ్యమంతా పర్యవేక్షిస్తున్నారో,

***అట్టి రుద్ర భగవానునికి మరల మరల నమస్కరిస్తున్నాము.***

## అథర్వశిర ఆఖ్యాయిక

ఈ ఉపనిషత్ ఉపదేష్ఠ అగు అథర్వ శీర్‌ష్ణ మహర్షి గురించి ఒకానొక విశేషము.

ఒక సందర్భములో అథర్వమునిపై ఒక మహర్షికి ఏదో సందర్భము - సంఘటన కారణంగా కోపం వచ్చింది. ఆ మహర్షి అథర్వమునిని "ఓ అథర్వా! నీతల తెగి హృదయమునకు వేరై నేలపడునుగాక!" అని శపించారు.

ఆ శాపము వింటూన్న క్షణమే అథర్వముని ప్రాణోపాసనకు ఉపక్రమించి శరీరము విడచిబయల్వెడలారు. మరుక్షణం శిరస్సు వెంటనంటి, తెగుచున్న తన శిరస్సును "ప్రాణశక్తి" అనే ఉపకరణముతో హృదయమునకు అనుసంధానం చేస్తూ ఆ మహర్షియొక్క పాదాలపై భక్తితో వ్రాలారు. ఆ విధంగా శరీరమును పునరుజ్జీవనం చేసుకొని మహర్షియొక్క క్షమచే ఆశీర్వాదం పొందారు! అప్పటి నుండి అథర్వముని "అథర్వశీర్ష్ణుడు, పవమానుడు" అని పిలువబడుచున్నారు.

అట్టి అథర్వశీర్‌ష్ణ మహాముని తనయొక్క దివ్యచక్షువులచే దర్శించబడిన మంత్రరాశియే **"అథర్వశీర్‌ష్ణము"** అని పిలువబడుతోంది!

ప్రాణసమానుడు - ప్రియాతిప్రియుడు - ప్రాణప్రదుడు - మంత్రశ్లోక ద్రష్ట యగు అథర్వశీర్‌ష్ణ మహాముని యొక్క వాత్సల్య దృక్కులు మనపై ప్రసరించును గాక! మనకు శ్రేయోదాయకమగు ఆహారము, మనస్సు ప్రసాదించుదురు గాక! బ్రహ్మవిద్యచే మనము పునీతులమయ్యెదము గాక!

**"మోక్షము"** అనే **"అన్నము"** మాకు ప్రసాదించబడునుగాక! పరబ్రహ్మస్వరూపమగు అన్నముచే మా మనస్సులు నిండియుండునుగాక! (తస్మాత్ అన్నమయమ్ మనః। అన్నం బ్రహ్మ)।

**శ్రీ రుద్రయోగము సత్యయోగము! సత్యమే జయించగలదు. {సత్యమేవ జయతే। న అనృతః}**

***ఇతి అథర్వశిరోపనిషత్***
***ఓం శాంతిః। శాంతిః। శాంతిః।***

అథర్వణ వేదాంతర్గత

# 3 అన్నపూర్ణోపనిషత్

## ప్రథమోధ్యాయః

శ్లో॥ "సర్వ అపహ్నవ సంసిద్ధ
బ్రహ్మమాత్ర త్రయోజ్జ్వలమ్
త్రైపదం శ్రీరామతత్త్వం
స్వమాత్రమ్"–ఇతి భావయే॥



బ్రహ్మతత్త్వానుభవమును కప్పి ఉంచుచున్న "సత్త్వ-రజో-తమో త్రిగుణమాయ"ను తొలగించు కోవటానికి, "జాగ్రత్-స్వప్న-సుషుప్తిల సాక్షీ త్రై పదము" సిద్ధించు కోటానికి - శ్రీ ఆత్మారామమును భావనా పూర్వకంగా ఆశ్రయిస్తున్నాము.

### ప్రథమోధ్యాయః - అన్నపూర్ణానుగ్రహమ్ - అధ్యయనమ్

**1. ఓం నిదాఘో నామ యోగీంద్రో
ఋభుం బ్రహ్మవిదాం వరమ్
ప్రణమ్య దండవత్ భూమౌ, వుత్థాయ
స పునః మునిః॥**

'ఓం' సంజ్ఞార్థ పరమాత్మకు నమస్కరిస్తూ।
నిదాఘుడు అనే యోగీంద్రుడు ఒకరోజు బ్రహ్మతత్త్వజ్ఞుడు, తద్విద్వరేణ్యుడు అగు ఋభుమహర్షిని దర్శనం చేసుకొన్నారు. సాష్టాంగ దండ ప్రణామములు సమర్పించారు. 'ఆత్మోద్ధరణ' కొరకై ఇట్లు అభ్యర్థన సమర్పించారు.

**నిదాఘో వాచ :**
**"ఆత్మతత్త్వం అనుబ్రూహి।" - ఇతి
ఏవం పప్రచ్ఛ సాదరమ్।
కయా ఉపాసనయా, బ్రహ్మన్! ఈదృశం ప్రాప్తవాన్ అసి-
తాం మే బ్రూహి మహావిద్యాం, మోక్ష సామ్రాజ్య దాయినీమ్॥**

**నిదాఘుడు** : మహాత్మా! దయతో నాకు ఆత్మతత్త్వమును ఉపదేసించండి.
హే బ్రహ్మన్! ఏ ఉపాసనచే మీరు ఇట్టి ఆత్మానంద స్థానమును సిద్ధించుకొన్నారో, మోక్షసామ్రాజ్యదాయిని అగు స్థితిని సంపాదించున్నారో - అది నాకు దయచేసి సాదరంగా బోధించండి.

**ఋభౌవాచ :**
**నిదాఘ! త్వం కృతార్థో అసి।
శృణు విద్యాం సనాతన(నీ)మ్.
యస్యా విజ్ఞానమాత్రేణ జీవన్ముక్తో భవిష్యసి॥**

**ఋభుమహర్షి** : ఓ నిదాఘా! బ్రహ్మతత్త్వము తెలుసుకోవటానికై అడగటం చేత నీవు కృతార్థుడవయ్యావయ్యా.
అట్లాగే చెప్పుకుందాము. ఏ సనాతన విద్య (జన్మ-కర్మలకు మునుముందే ఉన్న స్వస్వరూప విద్య) తెలుసుకున్నంతమాత్రం చేతనే ఈ జీవుడు 'జీవన్ముక్తుడు' అవగలడో, అట్టి 'ఆత్మవిద్య' గురించి చెప్పుతాను. శ్రద్ధగా వినెదవు గాక!

**2. మూల శృంగాట మధ్యస్థా, బిందునాద కళాశ్రితా,
నిత్యానందా, నిరాధార (వి)ఖ్యాతా (ప్ర) విలసత్ కచా।**

- మూల శృంగాటకము [నాలుగు త్రోవలు కలసినట్టి మూలస్థానము. (Four Road) యొక్క మధ్యగా వేంచేసి ఉన్నట్టిది].
-'బిందు'-నాద-కళ" ఈ మూడిటిచే ఆశ్రయించబడుచున్నట్టిది,
- నిత్యానంద స్వరూపిణి,
- తనకు అన్యమైన దేనినీ ఆధారముగా కలిగి ఉండనట్టిది, (independent by itself),
- మిలమిల మెరుయుచున్న కవచములచే, ప్రకాశించుచున్నట్టిది, కేశ సౌందర్య సమన్వితము అగు ఒకానొక మహత్తరమగు మంత్రము ఉన్నది.

| | |
|---|---|
| "విష్టపే శ్రీ మహాలక్ష్మీ కామస్త్రారో నతిః తథా।"<br>"భగవతి అన్నపూర్ణేతి, మమ అభిలషితం తతః"।<br>"అన్నం దేహి", తతః, "స్వాహా" మంత్రసార-ఇతి<br>విశ్రుతా- సప్తవింశతి (27) వర్ణాత్మా యోగినీగణ సేవితా। | (1) విష్టపము (పీఠము) - మహాలక్ష్మీ బీజము - **"ఐం హ్రీం సౌః"**<br>(2) కామబీజము - **"శ్రీం క్లీం ఓం"**<br>(3) 'నమ' - పదము **('నతి')**<br>(4) 'భగవతి'<br>(5) అన్నపూర్ణ (ఇతి)<br>(6) 'మమ' (7) 'అభిలషితం' (తతః)<br>(8) "అన్నం దేహి" (9) (తతః) "స్వాహా"<br>ఈ విధంగా 9 × 3 = '27' అక్షరములచే యోగినీ గణముచే జగజ్జనని యగు శ్రీ అన్నపూర్ణాదేవి ఈ మంత్రముచే సేవించబడుచున్నది. |
| "ఐం హ్రీం సౌః శ్రీం క్లీం (ఓం) నమో భగవతి అన్నపూర్ణే మమ అభిలషితం అన్నం దేహి స్వాహా ॥<br>(27 అక్షరములు)<br>ఇతి పిత్రా ఉపదిష్టోఽస్మి। | ఐం హ్రీం సౌః 3<br>శ్రీం క్లీం (ఓం) 2<br>నమో భగవతి అన్నపూర్ణే 10<br>మమ అభిలషితం 6<br>అన్నం దేహి 4<br>స్వాహా। 2<br>27<br>ఈ మంత్రమును నా పితృ దేవులు (బ్రహ్మభగవానుడు) నాకు నా బాల్యంలో 'సాధన' కొరకై ఉపదేశించారు. |
| తదాది నియమః స్థితః,<br>కృతవాన్ స్వ - ఆశ్రమ ఆచారో,<br>మంత్ర - అనుష్ఠానం అన్వహమ్॥ | మా నాన్న గారు నాకు ఈ మంత్రమును అభ్యసింపజేసినప్పటినుండి నేను (బ్రహ్మచారి-గృహస్థ-వానప్రస్థ) ఆశ్రమాచారపూర్వకంగాను, అత్యంత శ్రద్ధాభక్తులతోను అనుష్ఠానము చేయటం ప్రారంభించాను. |
| ఏవం గతే బహుదినే<br>ప్రాదురాసీత్(న్) మమ అగ్రతః,<br>అన్నపూర్ణ విశాలాక్షీ స్మయమాన ముఖాంబుజా। | ఈ విధంగా అనేక రోజులు గడచిపోయినాయి.<br>ఒక శుభ సమయంలో చిరునవ్వులు చిందిస్తున్న సుందరముఖముతో విశాలాక్షియగు - జగజ్జనని అన్నపూర్ణాదేవి నా ఎదురుగా పద్మము వికసించు తీరుగా ప్రత్యక్షమైనది. |
| తాం దృష్ట్వా దండవత్ భూమౌ<br>నత్వా ప్రాంజలిః ఆస్థితః,<br>(అన్నపూర్ణోవాచ :)<br>అహో వత్స! కృతార్థోఽసి।<br>వరం వరయమ్ అచిరమ్॥ | ఆ అన్నపూర్ణ - అమ్మవారిని చూచి నేను నేలపై వ్రాలి సాష్టాంగపూర్వకంగా నమస్కరిస్తూ ప్రాంజలి ఘటించాను. ఆ తల్లి మాతృవాత్సల్యం కురిపిస్తూ వికసిత వదనంతో ఈ విధంగా పలికింది.<br>"వత్సా! నీవు సప్త వింశతి 27 (అక్షరముల) వర్ణాత్మక యోగినీగణ మంత్రము మననము చేసి కృతార్థుడవయ్యావు. ఏదీ? నీకు ఏమి కావాలో త్వరగా వరము కోరుకోవయ్యా |
| ఋభుమహర్షి<br>3. ఏవం ఉక్తో విశాలాక్ష్యా<br>మయోక్తం, మునిపుంగవ!<br>"ఆత్మ తత్త్వం" మనసి మే ప్రాదుర్భవతు పార్వతి। | ఓ మునిపుంగవా! నిదాఘా! ఆ అన్నపూర్ణాదేవి ఆ విధంగా అడుగగానే, నేను ఈ విధంగా వరమడిగాను.<br>"అమ్మా! పార్వతీ దేవీ! దేవదేవీ! నా మనస్సుకు ఆత్మతత్త్వము స్ఫురించును గాక। ఇదే నేను కోరుకొనే వరము. |

| | |
|---|---|
| **"తథైవ అస్తు!" ఇతి మాం ఉక్త్వా, తత్ర ఏవ అంతరధీయత।** | అప్పుడు ఆ అమ్మ - మాతృవాత్సల్యం కురిపిస్తూ చిరునవ్వుతో **"తథైవ అస్తు. అట్లే అగుగాక"!** అని సుమధురముగా పలికి అంతర్ధానము అయింది. |
| **తదా మే మతిః ఉత్పన్నా జగత్ వైచిత్ర్య దర్శనాత్।** | అప్పుడు నాకు సృజనాత్మక విచారణశీలమగు **పవిత్ర బుద్ధి** సిద్ధించి, ఈ జగత్తుయొక్క వైచిత్ర్యమంతా సుస్పష్టమై కనబడసాగింది. |
| **భ్రమః పంచవిధో భాతి। తత్ ఏవ ఇహ సముచ్యతే।** | "భ్రమ" అనునది 'ఐదు (5)' విధములుగా ప్రవర్తిస్తున్నట్లు తెలియరాసాగింది. అదంతా ఇప్పుడు వివరించుకుందాము. |
| **(1) "జీవ-ఈశ్వరౌ భిన్న రూపౌః" ఇతి, - ప్రాథమికో భ్రమః।** | (1) **'జీవుడు- ఈశ్వరుడు' - వీరు ఇరువురు భిన్నరూపులు** - అనునది మొదటి భ్రమ. (ఈశ్వరుడే జీవుడుగా కనిపిస్తున్నారు.) |
| **(2) "ఆత్మ నిష్ఠం కర్తృగుణం వాస్తవం" వా -ద్వితీయకః।** | (2) ఆత్మ ఈ జగత్తు విషయంలో **కర్తృత్వ నిష్ఠ నిజంగానే కలిగియున్నది** - అనేది రెండవ భ్రమ. (ఆత్మకు కర్తృత్వమే లేదు - సర్వదా 'అకర్త') |
| **(3) "శరీరత్రయ సంయుక్త జీవః సంగీ" - తృతీయకః।** | (3) **"జాగ్రత్ స్వప్నసుషుప్తి శరీరములతో (త్రి-పురుషకారములతో) ఈ జీవుడు సంగము** (Attachment) **నిజంగానే కలిగియున్నాడు. వాటికి బద్ధుడు కూడా!"** - అనునది మూడవ భ్రమ. (ఈ జీవుని వాస్తవ - సహజ స్వరూపము జాగ్రత్ - స్వప్న - సుషుప్తులకు పరిమితమైనది కాదు) |
| **(4) "జగత్ కారణరూపస్య వికారిత్వం" - చతుర్థకః॥** | (4) **"నాకు వికారములు కలగటానికి ఈ జగత్తు కారణము అగుచున్నది"** - అనునది నాలుగవ భ్రమ. (భ్రమలు స్వకీయమనోకల్పితాలు. అంతేగాని జడమగు జగద్దృశ్యముచే కల్పించబడటంలేదు) |
| **(5) "కారణాత్ భిన్న జగతః సత్యత్వం" - పంచమో భ్రమః॥** | (5) **"ఆత్మ 'అనన్యము' అయి ఉండగా, అట్టి కారణముకంటే వేరుగా కార్యరూపమగు ఈ జగత్తు సత్యత్వము కలిగియున్నది। సత్యమే।"** అనునది ఐదవ భ్రమ. (ఈ కనబడే జగత్తు - దీనికి కారణమగు ఆత్మకు భిన్నము కాదు) |
| **పంచభ్రమ నివృత్తిశ్చ తదా స్ఫురతి చేతసి॥** | ఈ ఐదు భ్రమల నివృత్తి నాయొక్క బుద్ధియందు ఈవిధంగా స్ఫురించసాగాయి. '5' భ్రమలు తొలగటానికై '5' దృష్టాంతాలు సహకరించసాగాయి. |
| **(1) "బింబ ప్రతిబింబ" దర్శనేన భేదభ్రమో నివృత్తః।** | (1) నీళ్లలో ఒడ్డునగల వృక్షముయొక్క ప్రతిబింబము కనబడినంత మాత్రంచేత నీటిలో వృక్షము ఉన్నదా? లేదు. అద్దంలో ముఖము (ప్రతిబింబిస్తూ) కనబడినా కూడా అద్దంలో ముఖము లేదు కదా। ఈ **విధమైన బింబ-ప్రతిబింబ దర్శనముచే జీవ-ఈశ్వరుల భేదభ్రమ నివృత్తి కాసాగింది. బింబమే ప్రతిబింబముగా కనబడుచున్నట్లుగా, ఈశ్వరుడే జీవుడుగా అగుపిస్తున్నాడు.** |
| **(2) "స్ఫటిక లోహిత" దర్శనేన పారమార్థిక కర్తృత్వ భ్రమోః - నివృత్తః॥** | (2) ఎర్రటి రంగు గల దీపపు వెలుగువద్ద స్ఫటికమును ఉంచితే తెల్లటి స్ఫటికము ఎర్రగా కనిపించినంతమాత్రంచేత - ఆ ఎర్రగా కనిపించే కర్తృత్వము స్ఫటికము నకు ఆపాదించలేము కదా. ఈ విశేషమును చూచి "ఆత్మకు కర్తృత్వము ఉన్నది" అనే పారమార్థిక కర్తృత్వ భ్రమ నివృత్తమవసాగింది. 'అకర్త' అగు ఆత్మయొక్క సమక్షంలో కర్తృత్వ-భోక్తృత్వలు వచ్చిపోతున్నాయి. |
| **(3) "ఘట-మఠ ఆకాశ" దర్శనేన సంగీ- ఇతి భ్రమో నివృత్తః।** | (3) ఇది కుండలోని ఆకాశము, ఇది మఠములోని ఆకాశము - అని అన్నప్పటికీ **ఆకాశము సర్వదా సర్వత్రా ఏకమేకదా!** ఈవిధమైన విచారణచే ఆత్మకు దేహములచే సంగము పొందునది అను భ్రమ నివృత్తమైపోతోంది. భౌతికాకాశమునకు దేనితోనూ సంగము లేనట్లే, ఆత్మాకాశమునకు దేనితోనూ 'సంగము' లేదు. |

| | |
|---|---|
| **(4) "రజ్జు సర్ప" దర్శనేన**<br>**"కారణాత్ భిన్న జగతః**<br>**సత్యత్వ" భ్రమో నివృత్తః।** | **(4)** ఒకానొకడు - ఒక నూతి ప్రక్కనో (లేక) బాట ప్రక్కనో పడి ఉన్న త్రాడును చూచి పాము అనుకొని ఎగిరి గంతులు వేస్తుంటే, అందుకు కారణం త్రాడుయా? కాదు కదా? అట్లాగే **"ఈ జీవుని భ్రమానుభవములకు జగద్దృశ్యము కారణము కదా!"**- అనే భ్రమ-(తత్ దర్శనముచే) తొలగసాగింది. త్రాడును చూచి 'పాము' అని అనుకుంటున్నట్లే, 'స్వస్వరూపాత్మ'యే అనేక భేదములతో కూడిన 'జగత్తు'గా అనుకోబడుతోంది. |
| **(5) "కనక రుచిక" దర్శనే**<br>**వికారిత్వ భ్రమో నివృత్తః।**<br>**(రుచిక = ఆభరణము)** | **(5) 'బంగారపు ఆభరణము'** అను దానిలో బంగారము ఆభరణముగా అగుచున్నదా? లేదు. బంగారమునకు ఆభరణత్వము ధర్మమే అయి ఉండలేదు కదా! ఆభరణము బంగారము కాని క్షణమే లేదు. అట్లాగే జగత్తుకు ఆత్మకారణముకాదు. జగత్తుకు కారణములేదు - అని గమనిస్తున్నాను. ఆత్మకు జగద్వికారధర్మము నాచే తిరస్కరించబడుతోంది. ఆత్మ-ఆత్మగానే ఉన్నది గాని, జగత్తు అనబడుదానిగా అవటమే లేదు. |
| **తదా భ్రమతి మత్ చిత్తం బ్రహ్మాకారం**<br>**అభూత్ స్వయమ్। నిదాఘ! త్వం అపీత్థం**<br>**హి తత్త్వజ్ఞానం అవాప్ను హి।** | ఓ నిదాఘా! ఈ విధంగా ఆయా భ్రమలు పొందుచున్న నా చిత్తము స్వయముగా బ్రహ్మాకారము అవధరించసాగింది.<br>**నీవు కూడా ఆ విధంగానే తత్త్వజ్ఞానము పొందవచ్చునయ్యా।** |
| **4. నిదాఘః ప్రణతో భూత్వా**<br>**ఋభుం పప్రచ్ఛ సాదరమ్।**<br>**"బ్రూహి మే శ్రద్ధధానాయ**<br>**బ్రహ్మ విద్యాం అనుత్తమామ్।"** | అప్పుడు నిదాఘుడు లేచి నిలుచుని, నమస్కరిస్తూ ఋభుమహర్షికి హృదయపూర్వక ప్రణామములు సమర్పించి, మరల ఈ విధంగా సాదరంగా ప్రార్థించాడు.<br>**నిదాఘుడు:** స్వామీ! ఋభూ! ఉత్తమమగు బ్రహ్మవిద్యను మరికొంత వివరంగా ప్రసాదించ వేడుకొనుచున్నాను. శ్రద్ధావంతుడనై వినటానికి సంసిద్ధుడుగా ఉన్నాను. |
| **తథా ఇతి ఆహ (తథేత్యాహ) ఋభుః :-**<br>**"ప్రీతః తత్త్వజ్ఞానం దదామి తే।"** | **ఋభువు** : ప్రీతిపూర్వకంగా తత్త్వజ్ఞానము చెప్పుకుందాము. ముచ్చటించుకుందాము. వినండి. |
| **"మహాకర్తా", "మహాభోక్తా", "మహాత్యాగీ" భవ, అనఘ।**<br>**స్వ స్వరూప అనుసంధానం ఏవం కృత్వా సుఖీ భవ।** | ఓ పాపరహితుడా! నిర్మలుడా! అనఘా! నిదాఘా!<br>**మహాకర్తవు, మహాభోక్తవు, మహాత్యాగివి - అగుము.**<br>సహజము, కేవలము, నిర్మలము అయినట్టి స్వస్వరూపము యొక్క అనుసంధానముచే సుఖవంతుడవై ఉండుము. |
| **"నిత్యోదితం, విమలం, ఆద్యం, అనంత రూపం,**<br>**బ్రహ్మోస్మి। న ఇతర కల - అకలనం హి కించిత్।"** | **నేను... ఎవరు?** Who Am I?<br>"- నిత్యోదితము (Ever Dawning).<br>- విమలము (దోషరహితము).<br>- సమస్తమునకు మునుముందుగానే ఉండిఉండటంచేత 'ఆద్యము'.<br>- దృశ్య, మనో, బుద్ధి, చిత్త, అహంకారములచే పరిమితము కానట్టిది.<br>-కాబట్టి **"అనంతము"** - అగు బ్రహ్మమే నేను అయి ఉన్నాను. మరింకే కలన - అకలనములు నిజానికి కించిత్ కూడా నాపట్ల ఉండజాలవు". |
| **ఇత్యేవ (ఇతి ఏవ) భావయ, నిరంజనతాం ఉపేతో,**<br>**నిర్వాణమే హి సకల అమల శాంత వృత్తిః॥** | **→ అని భావన చేయుము.**<br>నిరంజనుడవై (ఏ దోషము చేతను స్పృశించబడనివాడవై సకల అమల (మలరహిత) శాంతవృత్తిని ఆశ్రయించి ఉండుము. |
| **"యత్ ఇదం దృశ్యతే కించిత్, తత్ తత్ నాస్తి" - ఇతి భావయ।** | "ఏదేది ఇంద్రియములకు దృశ్యమానమై కళ్ళకు ఎదురుగా కనిపిస్తోందో, అట్టి ఇదంతా మొదలే లేదు" - అని భావన చేయుము. |
| **యథా గంధర్వనగరం,**<br>**యథా వారి మరుస్థలే,** | ఓ మునీ! ఏ విధంగా గంధర్వనగరము (A Township in illusion) మొదలే లేదో, ఏ విధంగా మరుభూమిలో (మృగతృష్ణలో) జలము ఉండదో, |

| | |
|---|---|
| **యత్తు నో దృశ్యతే కించిత్, యన్ను కించిత్ ఇవస్థితమ్,<br>మనః షష్ఠేంద్రియ అతీతం, తన్మయో భవ వై, మునే!** | అదే విధంగా..<br>**"శబ్ద - స్పర్శ - రూప - రస - గంధ పంచేంద్రియములుగానీ, ఆరవ ఇంద్రియమగు మనస్సుగాని కించిత్తు కూడా స్వతఃగా లేనే లేవు"** - అని గమనిస్తూ, వాటికి అతీతుడవై, వాటికి ఆవల గల **కేవలాత్మతో తన్మయుడవై ఉండుము.** |
| **"అవినాశి చిత్ - ఆకాశగ్ం,<br>సర్వాత్మకమ్, అఖండితమ్।<br>నీరంధ్రం భూరి వా శేషం,-<br>తత్ అస్మి" - ఇతి విభావయ॥** | **"అవినాశనము, 'చిదాకాశము'** అని చెప్పబడుచున్నట్టిది, సమస్త జీవులలో సమరూపమైయున్న **సర్వాత్మకము,** (జీవుడు - ఈశ్వరుడు నీవు - నేను అను భేదములు లేనిదగుటచే) **అఖండితము, నీరంధ్రము** (ఆకాశము వలె రంధ్రము లేనిది), **భూరి** (అత్యంత గొప్పది) - అగు ఆత్మకు ఆవల ఏదీ శేషించి ఉండలేదు. కాబట్టి **నిశ్శేషము - అగు ఆ పరమాత్మయే నేను"** - అని భావన చేయుము. |
| **యథా సంక్షీయతే చిత్తం అభావ<br>అత్యంత భావనాత్,<br>చిత్ సామాన్య స్వరూపస్య,<br>"సత్తా సామాన్యతా" తథా।** | దృశ్య విషయములపట్ల <u>నమ్మకముతో కూడిన ఇష్టము (లేక) ప్రియమే చిత్తము యొక్క రూపము.</u> భావనచే రూపుదిద్దుకుంటున్న చిత్తము అభావనచే క్షీణించగలదు.<br>చిత్తము క్షీణించిన మరుక్షణము "చిత్ సామాన్య, స్వరూపసత్తా రూపము" అగు ఆత్మ అనుభవము కాగలదు. |
| **నూనం చైత్యాంశ రహితా,<br>చిత్ యత్ ఆత్మని లీయతే।<br>అసత్ రూపవత్ యచ్చా<br>సత్తా సామాన్యతా తదా॥<br>దృష్టిః ఏషా హి పరమా,<br>సదేహా, అదేహయోః సమా॥** | చిత్తము చైత్యరహితము (బాహ్య విషయానుభవరహితము) అయిన మరుక్షణం ఈ చిత్తము చిదాత్మయందు లీనము కాగలదు. అప్పుడు చిత్తము **"చిత్ స్వరూపమే"** అగుచున్నది.<br>ఏది అసత్ అనబడుచున్నదో, అదంతా కూడా - విచారణచే - సత్తాసామాన్యము యొక్క 'ఏకోసత్' నందు అనన్యత్వముగా రూపుదిద్దుకొనుచున్నది. అనన్యత్వమును సంతరించుకోగలదు.<br>అట్టి పరమాత్మ దృష్టి (లేక) సోఽహం పరమమ్ - పరమహంస దృష్టిచే దేహము మొదలే లేనిదై, **అదేహము** అగుచున్నది. **"దేహికి దేహము ఐహికమైన మోహము మాత్రమే"** - అను ఆత్మతత్త్వ దృష్టి వెల్లివిరియుచున్నది. అట్టివానిపట్ల, "దేహము ఉన్నదా? లేదా?" అనేది విషయమే కాదు. దేహము ఉన్నప్పుడు కూడా దేహరహితునివలె ఉంటాడు. |
| **5. ముక్తయో సంభవతి ఏవ,<br>తుర్యాతీతపర- అభిధా<br>వ్యుత్థితస్య భవతి ఏషా<br>సమాధిః తస్య చ, అనఘ!** | ఓ అనఘా! నిదాఘా!<br>ముక్తి అనగా ఏమి? **విను.**<br>**ఎవరి దృష్టి - జన్మ మృత్యు దృశ్య - మొదలైన సమస్తముయొక్క రాకపోకలతో సహా 'బంధము' అని కించిత్‌గా కూడా అనిపించని స్థితి పొందినదో- ఆతడే ముక్తుడు.** అట్టివాడు సమస్తమునకు కేవలము సాక్షి అయిన **"తుర్యాతీతము", "పరము"** అను స్థానము అవధరించి ఉంటాడు. ఆతడు వ్యవహారములేవీ లేనట్టి సమాధియందున్నా, (లేక) వ్యవహారములలో వ్యుత్థానుడు (participating in situations) అయి ఉన్నా కూడా ముక్తుడే. 'ముక్తి' అనేది బుద్ధికి సంబంధించినది. అంతేగాని - భౌతికమైనది, మనోసంబంధమైనది, ప్రాపంచక సంబంధమైనది కాదు. |
| **జ్ఞస్య కేవలం అజ్ఞస్య<br>న భవతి ఏవ బోధజా।<br>అనానన్ద - సమానన్ద<br>ముగ్ధ ముగ్ధ ముఖ ద్యుతిః।** | కేవల స్వరూపముయొక్క జ్ఞానము చేతనే ఆనంద - అనానందములకు వేరైన, సమాధి ఉత్థానములకు సంబంధించని ఆత్మయొక్క బోధ లభించగలదు. అజ్ఞానము కారణంగానే ఆత్మబోధ స్ఫురించటం లేదు. జ్ఞానముచే స్వానుభవముగా (సహజ రూపంగా) ఆత్మ స్ఫురించగలదు. |

| | |
|---|---|
| **చిరకాల పరిక్షీణ మనన - ఆది పరిభ్రమః,<br>పదమ్ ఆసాద్యతే పుణ్యం,<br>ప్రజ్ఞయైవ ఏకయా తథా,<br>ఇమం గుణ సమాహారం అనాత్మత్వేన పశ్యతః<br>అంతః శీతలయా యా అసౌ 'సమాధిః' - ఇతి కథ్యతే॥** | చిరకాల ప్రయత్నముచే దృశ్య సంబంధమైన మననమునకు సంబంధించిన పరిభ్రమణము క్షీణించుచుండగా, పుణ్యప్రదమగు, కేవలమగు - **"ప్రజ్ఞాసంస్థితి"** రూపుదిద్దుకోగలదు. అట్టి నిశ్చల ప్రజ్ఞ (లేక) నిశ్చల-అచంచల నిర్మల **"బుద్ధి స్థితి"**యే **'సమాధి స్థితి'** అనబడుతోంది. అది అంతః శీతల స్థితి. (Inwordly Undisturbable Peace) |
| **అవాసనగ్ం స్థిరం ప్రోక్తం<br>మనో ధ్యానం తత్ ఏవ చ, (తదేవ చ),<br>తత్ ఏవ, కేవలీ భావగ్ం<br>శాంతతా ఏవ చ తత్ సతా॥** | వాసనలచే రూపుదిద్దుకున్న మనస్సు ఆత్మభావనా - మననములచే స్వయంగా సన్నగిల్లుచుండగా, **పరమశాంతమగు పదము** లభించగలదు. ప్రశాంతమగు **స్వస్వరూపాత్మ** అనుభవమవగలదు.<br>కేవలాత్మగా ఉండి ఉండటమే భావశాంతత! [భావము శాంతించగా ఈ జీవుడు **'భవుడు'** (లేక) **శివుడు**గా శేషించుచున్నాడు]. |
| **తను వాసనమ్ అత్యుచ్చైః<br>పదా యోద్యతమ్ - ఉచ్యతే॥<br>అవాసనం మనోవక్త్ర పదం<br>తస్మాత్ అవాప్యతే।** | **"ఈ దేహమే నేను. ఈ దేహమునకు నాకు అవినాభావసంబంధము. దేహము చేతనే, దేహము ఉంటేనే నేను సుఖిని"** - అనునదే **'తను - వాసన'** (The Tendency in relation to physical Body). అట్టి 'తనువాసన'ను అధిగమించటం చేత **'పదా-యో-ఆద్యతము'** అను ఉత్తమ పదము (The State of Basic Begining) లభించగలదు. భౌతిక దేహవాసనను జయించటం చేత **"అవాసన మనోవక్త్రము"** (The Face of thought sans Tendencies) సిద్ధిస్తోంది. |
| **ఘనవాసనం ఏతత్తు చేతః కర్తృత్వ భావనమ్-<br>- సర్వ దుఃఖ ప్రదం।** | వాసన (Tendency) యొక్క ఘనీభూతము (Solidnes) చేతనే **"నేను కర్తను! నేను భోక్తను"** అను కర్తృత్వభావన జనిస్తోంది. **'ఆద్యతన ఆత్మ పదము'**చే (కవి-ఆతని రచనలోని పాత్రయొక్క ప్రవర్తన-సంబంధము వలె) ఆకర్తృత్వ భావన స్వాభావికమౌతుంది.<br>వాసనలవలననే జీవునికి సర్వ దుఃఖములు సంప్రాప్తిస్తున్నాయి. |
| **తస్మాత్ వాసనాం తనుతాం నయేత్।<br>చేతసా సం పరిత్యజ్య, సర్వభావ<br>ఆత్మభావనామ్, సర్వం ఆకాశతాం ఏతి<br>నిత్యం అంతర్ముఖ స్థితేః।** | అందుచేత సర్వ అన్య వాసనలను బుద్ధిపూర్వకంగా - ప్రియపూర్వకంగా సంపరిత్యజించుము. అనగా, **"సర్వత్రా ఆత్మయే ఈ ఈ రీతిగా ప్రదర్శనమగుచున్నది"** - అను మననమును ఆశ్రయించుము.<br>**"సమస్తము ఆత్మాకాశమే"** అను సమన్వయముతో నిత్యము **అంతర్ముఖస్థితుడవై** ఉండుము. |
| **యథా విపణగా లోకా విహరంతో<br>అపి అసత్ సమాః,<br>అసంబంధాత్ తథా జ్ఞస్య<br>గ్రామోఽపి విపినా ఉపమః॥** | ఏవిధంగా అయితే విపణము (Market) లో అనేక మంది జనులు తిరుగుచూ ఉంటున్నప్పటికీ అది మనకు విషయమే కాదో, ఏ విధంగా వారందరినీ పట్టించుకోమో.... (మనము కొనుక్కోవలసినవి మాత్రమే ఆలోచిస్తూ ఉంటామో) అదే విధంగా →<br>- నీవు స్వగ్రామములో కూడా బంధుజనులు మొదలైనవారిపట్ల **"వ్యాపార స్థలములో నాకు సంబంధించని జనుల వంటివారు"** అనుభావన అంతరమున కలిగి ఉండుము. బయటకు మాత్రము నాటకంలోలాగా వ్యవహరించుము. |
| **6. అంతర్ముఖతయా నిత్యగ్ం<br>సుప్తో బుద్ధో వ్రజన్, పఠన్,<br>పురం జనపదం గ్రామం<br>"అరణ్యమ్ ఇవ"** పశ్యతి। | ఎవ్వడైతే నిదురిస్తున్నప్పుడు, జాగ్రత్‌లో ఉన్నప్పుడు, బాటలలోనడుస్తూ ఉన్నప్పుడు, పురములోగాని - జనపదము(Town)లోగాని, అరణ్యములో గాని ఉన్నప్పుడు - సర్వ సంబంధములలో, సర్వసహజీవులలో అంతరమై యున్న ఆత్మనే దర్శిస్తూ ఉంటాడో, ఆతడే **'అంతర్ముఖుడు'**. |

| | |
|---|---|
| **అంతః శీతళతాయాం తు,**<br>**లబ్ధాయాం శీతళం జగత్,**<br>**అంతః తృష్ణ ఉపతప్తానాం**<br>**దావ దాహమయం జగత్।**<br>**భవతి, అఖిల జంతూనాం**<br>**యత్ అంతస్థః తత్ బహిః స్థితమ్।** | ఎవ్వడైతే 'అంతఃశీతలము' సిద్ధించుకుంటాడో, అట్టివానికి ఈ జగత్తంతా ప్రశాంతముగా, శీతళముగానే (Very Peaceful and Cool) గానే అగుపిస్తుంది.<br>ఎవ్వరైతే అంతరమున తృష్ణ (Urge to get something) కలిగి ఉండి, పరితప్తుడై (Highly Worried) ఉంటాడో, అట్టివానికి ఈ జగత్తు సలసల అగ్నివలె, దాహముతో కూడిన నదివలె అనిపించగలదు.<br>ఈ విధంగా ఈ జీవులంతా కూడా - అంతరమున ఏవిధంగా ఉంటే, అదియే బాహ్యమున వారిపట్ల స్థితి పొందినదిగా అగుచున్నది. |
| **యస్తు ఆత్మరతి రేవ అంతః**<br>**కుర్వన్ కర్మ - ఇంద్రియైః క్రియాః,**<br>**న వశో హర్ష శోకాభ్యాగ్ం**<br>**స "<u>సమాహిత</u>" ఉచ్యతే॥** | సమాహితుడు : ఎవ్వరైతే ఇంద్రియములను, సమస్త కర్మలను నిర్వర్తిస్తూ కూడా అంతరమున సమస్తమును ఆత్మయొక్క ప్రదర్శనముగా దర్శిస్తూ, ఆత్మయందు రమిస్తూ ఉంటాడో, ఇక్కడి హర్ష - శోకములకు, సుఖ దుఃఖములకు కించిత్ కూడా వశమై ఉండడో, అట్టివానిని **"సమాహితుడు"** అని పిలుస్తున్నారు. |
| **ఆత్మవత్ సర్వభూతాని, పరద్రవ్యాణి లోష్టవత్,**<br>**స్వభావాత్ ఏవ, న భయాద్యః పశ్యతి**<br>**(స) - స పశ్యతి॥** | ఎవ్వరైతే - సర్వభూతజాలమును (సర్వజీవులను) ఆత్మవలె చూస్తూ,<br>- ఇతరుల ద్రవ్యములను మట్టితో సమానంగా భావిస్తూ<br>- స్వభావతః ఎట్టి భయమును కలిగి ఉండడో....<br>అదియే సరి అయిన సందర్శనము. |
| **అద్యైవ మృతిః ఆయాతు,**<br>**కల్పాంత నిచయే న వా,**<br>**న అసౌ కళంకం ఆప్నోతి**<br>**హేమ పంకగతం యథా।** | బంగారము బురదలో పడినంత మాత్రంచేత ఆ బురద బంగారములోనికి ప్రవేశించి, దోషము కలిగించదు కదా! బంగారము విలువ లేకుండా పోదుకదా! అట్లాగే, అంతర్ముఖుడు, అంతఃశీతళుడు, సమాహితుడు అగు జ్ఞాని : -<br>→ ఇప్పటికిప్పుడు మరణిస్తూ ఉన్నప్పుడుగాని,<br>→ లేక, కల్పాంతమువరకు జీవిస్తూ ఉన్నప్పుడు గాని<br>ఎటువంటి కళంకము పొందడు. |
| **"కోఽహమ్? కథం ఇదం?**<br>**కిం వా? కథం మరణ జన్మనీ"? -**<br>**విచారయ అంతరేవ**<br>**ఇత్థం మహత్ తత్ ఫలం ఏష్యసి।** | ప్రియ నిదాఘా!<br>❊ **నేను ఎవ్వరు?** (ఈ భౌతిక శరీరమునా? ఆలోచననా? తెలివినా? ఇష్టాయిష్ట రూపుడునా? 'అహం' రూపుడునా? ఈశ్వరుడునా? కేవలాత్మనా? అన్నీనా?)<br>❊ ఈ జగద్దృశ్యము నాకు ఎట్లా ప్రాప్తిస్తోంది? (ఎవరో బలవంతంగా కల్పించారా? స్వకీయకల్పనయేనా?)<br>❊ ఈ సమస్తము వాస్తవానికి ఏమై ఉన్నది?<br>❊ ఈ జననమేమిటి? మరణమేమిటి? 'పుట్టుక'తో పుట్టి, మరణముచే లేకుండా పోతున్నానా?<br>ఈ ఈ విషయాలన్నీ మనకు మనమే ఇప్పటికిప్పుడు విచారణ చేసామా, - ఇక మహత్తరమైన ఆత్మజ్ఞాన ప్రయోజనమును మనము తప్పకుండా పొందగలము. |
| **విచారేణ పరిజ్ఞాత స్వభావస్య సతః తవ।** | విచారణ (అధ్యయనము, Analysing) చేస్తూ వుంటే, ఏది మన సహజస్వభావ స్వరూపమో, ఏది సందర్భ మాత్రమో గ్రహించగలము. మన సత్ స్వభావము మనకు అవగతమౌతుంది. |

**మనః స్వరూపం ఉత్సృజ్య**
**శమం ఏష్యతి విజ్వరమ్।**
**విజ్వరత్వం గతం చేతః తవ సంసారవృత్తిషు।**

'ఇదంతా ఆత్మయే' అను ఆత్మ మననము చేబట్టి, క్రమంగా దృశ్యమనన-మనోస్వరూపమును, అది కలిగించే జ్వరములను (వేదనలను) పాముకుబుసమువలె విసర్జించి **"ఆత్మమేవాఽహమ్"** నందు సునిశ్చలుడవు అయ్యెదవు గాక!

హే బ్రహ్మన్। ఆత్మతత్త్వ నిశ్చలచేతచే సంసారవృత్తులవలన కలిగే సమస్తవేదనలు తొలగినట్టి **'కేవల - తత్ స్వరూప నిర్మలబుద్ధి'** పొందగలవు.

---

**న నిమజ్జతి తత్, బ్రహ్మన్!**
**గోష్పదేషు ఇవ వారణః।**
**కృపణం తు మనో, బ్రహ్మన్!**
**గోష్పదే అపి నిమజ్జతి॥**

సమస్తమును స్వస్వరూపాత్మ దృష్టితో చూచు దర్శనమునచే గోపాదజలమునందు వారణము (ఏనుగు) మునగని తీరుగా, ఈ సంసారమునందు మునుగవు. కృపణుడవు (బేలవు) కావు.

హే బ్రాహ్మీ స్వరూపా! స్వయం బ్రహ్మానంద స్వరూపా! ఆత్మబుద్ధి లేని మందబుద్ధిగలవాడు దృశ్యతాదాత్మ్యముచే గోష్పాదజలములో కూడా పుటుక్కున మునుగగలడు.

అందుచేత కృపణుడవు. (లోవి, మందుడవు, అజ్ఞానివి, జాలి కోరువాడవు) - కావద్దు.

---

**7. కార్యే గోష్పదతో యేఽపి**
**విశీర్ణో మశకో యథా,**
**యావత్ యావత్, మునిశ్రేష్ఠ! స్వయం**
**సంత్యజ్యతే అఖిలమ్,**
**తావత్ తావత్ పరోలోకః**
**పరమాత్మ ఏవ శిష్యతే।**

ఓ మునిశ్రేష్ఠా!

దోమ గోష్పాదజలముపై మూగి (వ్రాలి) తన ఆహారం పొంది, అటుపై తిరిగి ఎగిరిపోతుందేగాని, గోష్పాదజలములో మునగదు కదా!

అదే విధంగా, వివేకి అయిన జ్ఞాని జగద్విషయములపై ఇంద్రియ పూర్వకంగా వ్రాలుచూ కూడా ఈ దృశ్య సంసారములో ఏమాత్రము మునగక మనుగడ సాగించగలడు. ఎంతెంతవరకు ఈ జీవుడు విషయములతో మునుగనివాడై ఉంటాడో, అంతంతవరకు సమస్త లోకములకు 'పరము' అయినట్టి పరమాత్మగానే శేషించగలడు.

---

> **యావత్ సర్వం న సంత్యక్తం,**
> **తావత్ ఆత్మా న లభ్యతే॥**

సమస్తము మొదలంట్లా బుద్ధితోను, మనస్సుతోను **"ఇది కల్పనా మాత్రమే! సందర్భమాత్ర సత్యమే"** - అను భావన - అవగాహనలచే సరిత్యజించనంత వరకు ఆత్మ అనుభవమునకు రాదు. ఎంతెంత వరకు దృశ్య జగత్తు జయించబడదో, అంతంత వరకు 'ఆత్మానందము' అందని ద్రాక్షవలె దూరవస్తువుగానే ఉంటుంది.

---

**సర్వవస్తు పరిత్యాగే**
**శేష "ఆత్మ" ఇతి కథ్యతే।**
**'ఆత్మ అవలోకనార్థం తు**
**తస్మాత్ సర్వం పరిత్యజేత్।**

దృశ్య - దేహ - మనో - బుద్ధి - చిత్త - అహంకార - జాగ్రత్ - స్వప్న - సుషుప్తి ఇత్యాది సమస్త వస్తువులను పరిత్యజించగా, (దాటిపోగా) అప్పటికీ, శేషించియే ఉండేదే 'ఆత్మ' అను శబ్దముచే ఉద్దేశ్యించబడుతోంది.

"ఆత్మయొక్క అవలోకము" అను ఉత్తమ ప్రయోజనము కొరకై, తదితరములైన సమస్తము త్యజించటమే ఉత్తమ ఉపాయము. అంతకు మించి వేరుత్రోవలేదు.

---

**సర్వం సంత్యజ్య దూరేణ యత్ శిష్టం**
**తన్మయో భవ॥**
**సర్వం కించిత్ ఇదం దృశ్యం**
**దృశ్యతే చేత్ జగత్ గతమ్,**
**చిత్ నిష్పంద అంశ మాత్రం తత్।**
**న అన్యత్ కించన శాశ్వతమ్॥**

ఓ నిదాఘా! సమస్తము త్యజించినవాడవై, అప్పటికీ శేషించిన స్వస్వరూపాత్మతో తన్మయుడవై ఉండుము.

ఏ కించిత్ దృశ్యము ఇక్కడ 'జగత్తు' రూపముగా కనిపిస్తూ ఉన్నదో, అట్టి ఈ దృశ్య జగద్దృశ్యమునకు రెండు ముఖ్య లక్షణములు.

(1) ఇదంతా నిష్పందమగు చిదాత్మయొక్క ఒకానొక స్పందాంశ మాత్రమే.

(2) ఈ దృశ్యములో 'ఇది శాశ్వతము' అని చెప్పతగిన ఏదీ కించిత్ కూడా లేనట్టిది. (వచ్చి పోయేది. లేని-పోనిది).

సమాహితా నిత్యతృప్తా
యథా భూతా అర్థ దర్శినీ,
బ్రహ్మన్! 'సమాధి' శబ్దేన -
"పరా ప్రజ్ఞ" ఉచ్యతే బుధైః॥

**హే బ్రహ్మన్! "సమాధి-పరాప్రజ్ఞ" అనగా ఏమి?**

(1) సమాహితమైనది (సర్వాత్మ సమ స్వరూపమైన స్వస్వభావము)

(2) ''ఇంకా ఇదేదో కావాలి'' అనునది ఏమాత్రము లేనట్టిది. నిత్యతృప్తమైనది.

(3) సమస్త జీవుల సహజ రూపమగు అఖండాత్మ దర్శనదృష్టి కలిగి ఉన్నట్టిది. (ఉన్నది ఉన్నట్లుగా చూచు దృష్టి). అట్టి పరాప్రజ్ఞ (The Awareness of the Beyond) అయినట్టిదే 'సమాధి' అను శబ్దముచే చెప్పబడుచున్నది. **పరాప్రజ్ఞయే సమాధి.**

---

అక్షుబ్ధా నిరహంకారా
ద్వంద్వేషు అననుపాతినీ,
ప్రోక్తా 'సమాధి' శబ్దేన
మేరోః స్థిరతరా స్థితిః॥

క్షుబ్దము (Disturbance) ఏమాత్రము లేనట్టిది, నిరహంకారమైనది, ద్వంద్వదోషము యొక్క అనుపాతము (Eventuality) లేనట్టిది, మేరుపర్వతమువలె అత్యంత నిశ్చలమైనది - అగు స్థితి - **'సమాధి'** అని చెప్పబడుచున్నది.

---

నిశ్చితా విగత అభీష్టా,
హేయ ఉపాదేయ వర్జితా,
బ్రహ్మన్! "సమాధి" శబ్దేన
పరిపూర్ణా మనోగతిః॥

జ్ఞాన-విజ్ఞానములచే ఆత్మపట్ల **సునిశ్చితుడు**, సమస్త అభీష్టములను (Desires/Expectations), **హేయ** (వదలవలసినవి) - ఉపాదేయములను (స్వీకరించవలసినవి), **దాటి ఉన్నవాడు,** పరిపూర్ణ మనోగతిని **సిద్ధించుకున్నవాడు సమాధినిష్ఠుడు.**

---

కేవలం చిత్ ప్రకాశాగ్ంశ
కల్పితా స్థిరతాం గతా॥

ఈ సమస్తము చిత్‌ప్రకాశముయొక్క స్వయం కల్పిత వస్తు సంబంధము వంటిదై స్థితిపొందుచున్నది. ఇక్కడి జాగ్రత్-స్వప్నముల స్థితగతులు మొదలైనదంతా చిత్ ప్రకాశ పరికల్పనా చమత్కారమే.

---

8. తుర్యా సా ప్రాప్యతే దృష్టిః
మహద్భిః వేదవిత్తమైః।
అదూర గత సాదృశ్యా
సుషుప్తిః సో అపి లక్ష్యతే॥

ఇక్కడి జాగ్రత్ స్వప్న జగత్తులు చిత్ ప్రకాశముచే కల్పించబడి స్థిరత్వము పొందినట్లు, గతిస్తున్నట్లు కనబడుచుండగా, వేదవేత్తలగు మహనీయులు జాగ్రత్ - స్వప్న - సుషుప్తులకు పరమై, సాక్షి అయి ఉన్న 'తుర్యక్ దృష్టి'ని ప్రాప్తించుకొన్నవారై ఉంటున్నారు.

ఈ జీవునికి దూరముగా ఉండనట్టి (సమీపమునందే ఉన్నట్టి) సుషుప్త స్థితి వంటి - తుర్యక్ స్థానము జాగ్రత్‌లో కూడా ఆత్మజ్ఞులచే అనుభవసిద్ధము చేసుకోబడుతోంది.

---

మనో అహంకార విలయే
సర్వ భావాంతర స్థితా,
సం-ఉదేతి 'పర-ఆనందా'
యా తనుః పారమేశ్వరీ॥

మనస్సు, అహంకారము విలయము పొందుచున్నప్పటి ఏ భావాతీత స్థితి ఉన్నదో, అట్టి పరమేశ్వరీ స్వరూపమే పరానందరూపము.

అదియే "పరమేశ్వరీ స్వస్వరూప తనువు" (అహమిత్యేవ విభావయే భవానీ)

---

మనసైవ మనః ఛిత్వా,
సా స్వయం లభ్యతే గతిః।
తత్ అను(తదను) విషయ వాసనా
వినాశః, తత్ అను (తదను) చిత్తః
పరమస్ఫుట ప్రకాశః।

- మనస్సుతో మనస్సు ఛేదించబడగా, అట్టి తుర్యక్ - పరమాత్మ స్థానము స్వయముగా సిద్ధిస్తోంది. **అదియే నాయొక్క సహజ - కేవలీ -అనునిత్య స్వరూపము). అదియే నీయొక్క, ప్రతి జీవుని యొక్క సహజరూపము.**

అట్టి సిద్ధిచే విషయవాసనలు (Tendencies) వినాశనము పొందుచున్నాయి. చిత్తము చిత్ ప్రకాశము పొంది, పరమస్ఫుట తేజో విలాసముగా అనుభవమవగలదు. ఈ జగత్తంతా ఆత్మతేజో విలాసమై వినోదింపబడ గలదు.

**తదను చ సమతా వశాత్ స్వరూపే-**
**పరిణ మనం మహతాం అచింత్యరూపమ్,**
**అఖిలం ఇదం అనంతం ఆత్మతత్త్వం**
**దృఢ పరిణామిని చేతసి స్థితో అంతః।**

"ఈ జగత్తు యొక్క వాస్తవరూపము సర్వసమతా స్వరూపమగు ఆత్మయే" అను మననముచే క్రమంగా మనస్సు అచింత్యము, మహత్తరము అగు **ఆత్మరూపము** దాల్చుచున్నది.

అప్పుడు ఈ సమస్తము బుద్ధికి ఆవలగల అనంతము, అఖండము అగు ఆత్మతత్త్వము యొక్క ప్రదర్శనముగా **స్థితబుద్ధిరూపము** పొందగలదు. స్థితబుద్ధి గలవాడే స్థితప్రజ్ఞుడు.

---

**బహిః ఉపశమితే చర – అచర ఆత్మా (చరాచరాత్మా)**
**త్వయం (స్వయం) అనుభూతయత ఏవ దేవదేవః।**
**అసక్తం నిశ్చలం చిత్తం**
**యుక్తగ్ం సంసార్యపి స్ఫుటమ్।**
**సక్తం తం దీర్ఘ తపసా**
**ముక్తమ్ అప్యతి బద్ధవత్।**

బాహ్యధ్యాస ఉపశమించగా, అప్పుడు ఇక **చరాచరాత్మకమగు ఆత్మ-దేవదేవుని** సందర్శనము అంతరమున **అనుభూతమవగలదు.**

అసక్తునికి (Non inquisitive, Non-expecting చే) చిత్తము నిశ్చలము కాగలదు. సంసారము ఉన్నప్పటికీ అసక్తము, నిశ్చలము అగు చిత్తముచే ఆత్మ ప్రస్ఫుటమౌతోంది. అందుచేత, దృశ్యముతో సక్తమైన చిత్తమును సుదీర్ఘమగు తపనరూపమగు తపస్సుతో స్వాధీనము చేసుకోవాలి. దృశ్య సంబంధమైన సక్తత (Attachment) ను సుదీర్ఘమగు తపస్సుతో జయించాలి. త్యజించివేయాలి.

---

**అంతః సంసక్తి నిర్ముక్తో**
**జీవో మధుర వృత్తిమాన్,**
**బహిః కుర్వన్, న కుర్వన్వా**
**<u>కర్తా భోక్తా నహి క్వచిత్ ।</u>** **ఇతి।।**

<u>**ఇతి ప్రథమో అధ్యాయః**</u>

ఈ జగద్దృశ్యముతో అంతరమున సంబంధము కలిగి ఉండని సంసార నిర్ముక్తుడగు జీవుడు - మధురమైన వృత్తి కలిగి ఉంటాడు. ఆపై బాహ్యమున సమస్త కర్మలు నిర్వర్తిస్తూ ఉన్నప్పటికీ **అకర్తయే** అయిఉండ గలడు. దేనికీ కించిత్ కూడా **'భోక్త'** అవనివాడై ఉంటాడు.

<u>ఇతి ఒకటవ అధ్యాయము</u>

## ద్వితీయోధ్యాయః :: సంగ-బంధ-మోక్షములు

నిదాఘౌ వాచ :

1. "సంగః" కీదృశ "ఇతి" ఉక్తః?
కశ్చ బంధాయ దేహినామ్?
కశ్చ "మోక్షాయ" కథితః? కథం తు ఏష చికిత్స్యతే?

నిదాఘుడు : గురుదేవా! ఋభుమహర్షీ! "సంగము" (The Sense of Relatedness)అని చెప్పబడుచున్నదేది? దేహధారులకు ఇదంతా ఎట్లా 'బంధము'(The Sense of Bondage)గా అగుచున్నది.

బంధము ఎందుకు ఏర్పడుతోంది? మోక్షమునకు (The Sense of Independence and Relief) సహకరించగలవి ఏవేవి? బంధము ఏ రీతిగా చికిత్స చేయబడగలదు? దయతో వివరించండి.

---

ఋభౌవాచ :

'దేహ-దేహి' విభాగేన
పరిత్యాగేన భావనా,
దేహ మాత్రే(ణ) హి విశ్వాసః
సంగో బంధాయ కల్పతే॥

ఋభుమహర్షి : ఈ జీవుడు రెండు విభాగములుగా ప్రదర్శనమగుచున్నాడు. (1) "దేహి" (2) "దేహము" ఈతడు - 'నేనుదేహిని। దేహమును ఉపయోగించుచూ, దేహమునకు వేరై ఉన్నాను కదా!'' - అనునది ప్రక్కకు పెట్టి "నేను ఈ దేహమాత్రుడను. అవినాభావుడను. దేహముతో పరిమితుడను" - అను విశ్వాసముతో కూడిన **సంగము** ఏర్పరచుకొని ఉంటున్నాడు. ఇందుచేతనే **"బంధము"** కలుగుతోంది.

---

"సర్వం ఆత్మ ఇదం। అత్ర అహం
కిం వాంఛామి? త్యజామి కిమ్?"
ఇతి "అసంగస్థితిం" విద్ధి
'జీవన్ముక్త తను' స్థితామ్॥

"సర్వం ఖలు ఇదమ్ బ్రహ్మ" - అను వేద వేదాంత మహావాక్యమును అనుసరించి ఈ సర్వము ఆత్మయే కదా! నేను ఆత్మస్వరూపుడనై యుండి ఆత్మయే అయి వున్న ఈ దృశ్యములో కోరుకోవలసినదేది? వదలవలసినది ఏముంటుంది?'' - అనునదే "అసంగస్థితి''. **అసంగము చేతనే ఈ జీవుడు జీవన్ముక్త స్థితిని సంతరించుకుంటున్నాడు.**

---

న అహం అస్మి। న చ అన్యో అస్మి।
న చ అయం। న చ నేతరః (న - ఇతరః)
సో "అసంగ" - ఇతి సంప్రోక్తో - "బ్రహ్మాస్మి"
ఇతి ఏవ సర్వదా। (ఇత్యేవ సర్వదా)॥

**నేను ఆత్మకు అన్యమై లేను. అట్లాగే మరింకొకరెవ్వరూ ఆత్మకు అన్యము కాదు. నేను మరొకటేదో అయి ఉండలేదు. 'ఇతరుడు' అనునది నాకు లేదు. నాకు 'నేను' లేదు. 'తదితరుడు' - అనునది (ఆత్మగా) లేదు. నాకు నేనుగా, నీకు నీవుగా, వారికి వారుగా ఉన్నది ఏకముగు బ్రహ్మమే।**

- **"నేను బ్రహ్మమునే!"** - అను ఈ విధమైన సంప్రోక్తముచే ఈ జీవుడు **'అసంగుడు'** అగుచున్నాడు.

---

న అభినందతి నైష్కర్మ్యం,
న కర్మసు అనుషజ్జతే,
సు సమో యః పరిత్యాగీ,
సో "అసగ్ంసక్త" ఇతి స్మృతః॥

అట్టివాడు "నేను కర్మలను చేయనేకూడదు" అనే నైష్కర్మ్యమును ఆశ్రయించడు. "ఈ ఈ కర్మలు నిర్వర్తిస్తేనే నాకు గతి" - అనే **'అనివార్యత్వకర్మభావన'**ను కూడా కలిగి ఉండడు.

సమస్త భేదములను అధిగమించి, సర్వత్రా సమదృష్టిని సిద్ధించుకొన్న వానిని **'అసంసక్తుడు'** - అంటారు.

---

సర్వకర్మ ఫల ఆదీనాం
మనసైవ న కర్మణా,
నిపుణో యః పరిత్యాగీ, -
- సో 'అసగ్ంసక్త' ఇతి స్మృతః।

ఎవ్వడు కర్మలు చేస్తూ ఉన్నప్పటికీ సమస్త కర్మఫలములను పరిత్యజించి, కర్మఫలములతో **"సంగము లేని నైపుణ్యము"** (A Stand beyond relatedness to the outcome of functions) కలిగి ఉంటాడో, ఆతడే **'అసంసక్తుడు'**. కర్మలవలన బంధము లేదు. **మనస్సులో కర్మఫలములతో గల సంబంధమే 'బంధము'గా అవుతోంది.** మనస్సు కనుక కర్మలను త్యజించినదై ఉంటే, అప్పుడిక బంధమే ఉండదు.

---

అసంకల్పేన సకలాః చేష్టా
నానా విజృంభితాః।
చికిత్సితా భవంతి ఇహ,
శ్రేయః సంపాదయంతి హి॥

సంకల్పములచే విజృంభిస్తున్న మానసికమైన "నానావిధ చేష్టలను, కర్మ సంగ వ్యవహారములను "అసంకల్పము" అనే దివ్యౌషధముతో చికిత్స చేసుకొన్నవాడు శ్రేయమును సంపాదించుకున్నవాడగుచున్నాడు. అనగా, "అఖండము, ఏకము, సమస్తము అయి ఉన్న ఆత్మయే నేను"-అను శ్రేయస్సు సిద్ధించగలదు.

న సక్తమ్ ఇహ చేష్టాసు, న చింతాసు।
న వస్తుషు। న గమ – ఆగమ చేష్టాసు।
న కాల కలనాసు చ।
“కేవలం చితి” విశ్రమ్య,
కించిత్ చైత్య అవలంబ్యాపి,
సర్వత్ర నీరసమ్ ఇహ
తిష్ఠతి ఆత్మరసం మనః॥

భార్య-భర్త-పుత్ర మొదలైన సాంఘిక విషయములపట్ల ‘సక్తత’ కలిగి ఉంటున్నప్పుడుగాని, చేష్టలు -చింతనలు నిర్వర్తిస్తూ - కలిగి ఉన్నప్పుడు గాని, ఆయా దృశ్య వస్తువుల, రాకపోక చేష్టలందుగాని, కాల-కలన (కల్పన) సందర్భములందుగాని, ఆత్మదర్శనమునకు వేరైన అసక్తిని దరిజేరనీయక, **కేవలమగు చిత్‌ను ఆశ్రయించి, చిత్ నందే విశ్రాంతిని అవలంబించి ఉండుము.** సమస్త విషయ రహితత్వమును కొంచము కొంచముగా అభ్యసిస్తూ క్రమంగా విషయరాహిత్యత యొక్క అనుక్షణికతను సిద్ధించుకొనెదవు గాక।

ఓ నిదాఘా! ఈ మనస్సు ఆత్మ రస స్వరూపమే. కానీ, ఇది ‘కేవలచిత్’ను కించిత్ ఏమరచి చైత్యము (దృశ్యము) అవలంబించినంత మాత్రముచేత నీరసమగు (దృశ్యములో) బంధము తెచ్చిపెట్టుకుంటోంది.

---

**2.** వ్యవహారం ఇదగ్ంం సర్వం మా కరోతు,
కరోతు వా, అకుర్వన్ వా అపి, కుర్వన్ వా
జీవః స్వాత్మ రతి క్రియః।

ఓ నిదాఘా! నీవు ఇక్కడి ఆయా లోక సంబంధమైన వ్యవహారములు నిర్వర్తిస్తూ ఉన్నప్పుడు (లేక) నిర్వర్తిస్తూ ఉండనప్పుడు కూడా, ఈ దేహముతో జీవించి ఉన్నప్పుడు (లేక) దేహము లేనప్పుడు కూడా - ఆత్మయందు ఎల్లప్పుడు రమించువాడై, సర్వత్రా ఆత్మనే దర్శించువాడవై ఉండాలి. జన్మ-జీవన్-మృత్యు-మృత్యు తదనంతరములతో సహా సర్వత్రా సర్వదా సమస్తమును **స్వస్వరూపాత్మగా, ఆత్మకు అభిన్నంగా అనుక్షణము దర్శిస్తూ ఉండటమే ఆత్మయందు రమించటము. (రమయతేతి రామః)।**

---

అథవా తమ్ అపి త్యక్త్వా, చైత్యాగ్ం
సగ్ంశాంత చిత్‌ఘనః,
జీవః తిష్ఠతి సగ్ంశాంతో
జ్వలన్ మణిః ఇవ ఆత్మని।

(లేదా) సర్వ వ్యవహారములు వదలి **శాంత-చిత్ఘన చైతన్యమును** ఆశ్రయించుము. పరమశాంతమైయుండి సర్వమును వెలిగించు వెలుగువలె ఆత్మను దర్శిస్తూ ఉండుము. గొప్ప మణియొక్క ప్రకాశమువలె జగత్తును ఆత్మయొక్క తేజస్సుగా భావనచేస్తూ, జీవాత్మను పరమాత్మత్వము నందు సశాంతింప జేయుము. అన్యముగా కనిపించే సమస్తము పట్ల మౌనము వహించి ఉండుము. అంతరమున సర్వదా ‘పరమశాంతము’ను ఆశ్రయించి ఉండుము.

---

చిత్తే చైత్య దశాహీనే
యా స్థితిః క్షీణ చేతసామ్,
సోచ్యతే (స ఉచ్యతే) ‘శాంత కలనా’
జాగ్రత్ ఏవ సుషుప్తతా।

**“శాంతము” వహించి ఉండటమంటే?**

చిత్తము చైత్య (దృశ్య వ్యవహార దశ) రహితంగాను, జాగ్రత్ స్వప్నములను కల్పనా మాత్రంగాను దర్శించు స్థితియే **“శాంతస్థితి”**. అది - జాగ్రత్‌పట్ల **‘సుషుప్తస్థితి’** వంటి మౌనరూపంగా ధారణ కలిగి ఉండటము.

---

ఏషా, నిదాఘ! సౌషుప్తి
స్థితిః అభ్యాస యోగతః,
ప్రౌఢా సతీ ‘తురీయ’ ఇతి
కథితా తత్త్వ కోవిదైః।

ఓ నిదాఘా! జాగ్రత్ స్వప్నముల సందర్భములలో గాఢనిద్రలోవలె నిర్విషయ, **“సాక్షిమాత్ర-జాగ్రత్, సుషుప్తి స్థితి”** అనే ఆత్మస్థితి - **అభ్యాసము చేతనే సిద్ధించగలదు.** ('Mere Witness' is a state that comes out of practice only)

పెద్దవారు చిన్న పిల్లల ప్రవర్తనమును ఆవేశ-భావోద్వేగరహితంగా చూచువిధంగా “ఈ జగత్తును క్రీడవలె, బాలాలీలావినోదముగా నిర్విశేషంగా” చూచు స్థితిటయే **‘తురీయము’** అని తత్త్వకోవిదులు వివరిస్తున్నారు.

---

అస్యాం తురీయ అవస్థాయాగ్ం
స్థితిం ప్రాప్య అవినాశినీమ్,
ఆనందైకాంత శీలత్వాత్
అనానంద పదం గతః॥

అట్టి తురీయావస్థ వినాశనము (నశించటము) అను ధర్మమే లేనట్టి స్థితి. అది అన్యము అనునదే అనుభవమవనట్టి “ఏకాంత పదము” అని చెప్పబడుతోంది. ఆట్టి ఆనందపదము - **అనునిత్య పరమ - ప్రశాంత అంతః - శీల స్థితి.**

అనానంద, మహానంద,
కాల–అతీతః తతో అపి హి,
"ముక్త" ఇతి ఉచ్యతే యోగీ,
తుర్యాతీత (తుర్య అతీత) పదం గతః॥

<u>తుర్యగ - అతీతుడు</u>

ఇట్టి యోగ యుక్తుని ముఖ్యమైన విశేష లక్షణములు నాలుగు.

**(1) అనానందుడు** : లౌకికానందముల పరిధులు, ఆనంద విషయ సంబంధములు లేనివాడు.

**(2) మహానందుడు** : "సమస్తము స్వస్వరూపముగా భావించు మహత్ - ఆనందుడు.

**(3) కాలాతీతుడు** : త్రికాలముల పరిధులను దాటి, సర్వదా యథాతథుడు.

**(4) ముక్తుడు** : బంధము ఏమాత్రము ఉండజాలని స్థితిని సిద్ధించుకున్నవాడు.

---

పరిగళిత సమస్త జన్మ పాశః
సకల విలీన తమో – మయ అభిమానః
<u>పరమ రసమయః పరాత్మసక్తో (పర–ఆత్మ సక్తో,)</u>

- జన్మలకన్నా మునుముందే "చైతన్య స్వరూపమే నేనైన నేను"ను గమనిస్తూ, జన్మ -మృత్యు పాశములకు బద్ధుడు అవనివాడై ఉంటాడు.

**- మాయ - అభిమాన** - ఇత్యాది తమస్సులను (చీకట్లను) తనయొక్క ఆత్మ తేజస్సునందు విలీనము చేసుకొని ఉంటాడు.

- పరమాత్మయందు మాత్రమే పరమరసమయుడై అన్యములుగా కనిపించే సమస్తమును తన రస స్వరూపమునందు లయింపజేసివేసి పరాత్మసక్తుడై ఉంటాడు.

---

<u>జలగత సైంధవ ఖండవత్, మహాత్మా।</u>
జడ – అజడ దృశోః మధ్యే
యత్ తత్త్వం <u>పారమార్థికమ్,</u>
<u>అనుభూతి మయం,</u> తస్మాత్ సారం –
'బ్రహ్మ' ఇతి కథ్యతే॥

- నీటిలోకి జార్చబడిన ఉప్పుగడ్డవలె తన స్వరూప - స్వభావములన్నీ కూడా సదా "ఆత్మమేవాఽహమ్, సదాశివోఽహమ్" భావనయందు లయించినవాడై (తురీయాతీతుడై) ఉంటారు. మహాత్ముడై ఉంటాడు.

జడ - అజడముల మధ్యగా (In between Passive Voice & Active Voice) పరమార్థక స్వరూపుడై విరాజిల్లుచూ ఉంటాడు.

**"ఈ సమస్తము నేనై, ఈ సమస్తము నాయందు ఉండి ఉంటున్న నేనైన నేను" - అను మహత్ సార భావనా రూపమే 'బ్రహ్మము' - అని పిలువ బడుతోంది.**

---

**3.** దృశ్య సంవలితో బంధః।
తత్ ముక్తౌ "ముక్తిః" ఉచ్యతే।
దృశ్య (ద్రవ్య) దర్శన సంబంధే
యా అనుభూతిః అనామయా,
తామ్ అవష్టభ్య తిష్ఠత్వగ్ం
సౌషుప్తిం భజతే స్థితిః॥

దృశ్యముచే చుట్టుకొనబడి ఉండటమే (Blockings the entire attention in what is being outworldly seen) (సంవలితమే) బంధము.

అట్టి దృశ్యమునుండి విడివడి ఉండటమే ముక్తి! (దృశ్యమునకు ఆవల స్వస్వరూపముతో ఆక్రమించుకొని ఉంటున్నవాడే నిత్యముక్తుడు).

దృశ్యము - దర్శనముల సంబంధమునకు ఏ అనామయమైన (వేరైన) అనుభూతి కారణమగుచున్నదో, అట్టి 'కేవలానుభూతి'ని అవధరించి, గాఢనిద్రలో ఉన్నవానివలె అతీతుడవై ఉండుము. **సుషుప్త పురుషస్థితిని దృశ్య-దర్శన సందర్భములో అవధారణ చేసినవాడవై ఉండుము.**

---

సైవ(సఏవ) తుర్యత్వం ఆప్నోతి,
తస్యాం దృష్టిగ్ం స్థిరాం కురు।

అట్టి నిర్విషయ సుషుప్త స్థితిని దృశ్య దర్శన సందర్భములో ధారణగా కలిగి ఉండటముచే దృష్టి నిశ్చలమౌతుంది. దృష్టి యొక్క సుస్థిరతచే 'తుర్యగము' అను 'జాగ్రత్-స్వప్న-సుషుప్త సాక్షీ స్థితి'ని పొందగలవు. తత్ ఫలముగా స్వస్వరూపాత్మానుభవము అనుభవైక వేద్యము కాగలదు.

| | |
|---|---|
| **ఆత్మా – స్థూలో న చ। ఏవ అణుః న।**<br>**న ప్రత్యక్షో। న చ ఇతరః।**<br>**న చేతనో, న చ జడో।**<br>**న చ ఏవ అసత్। న సత్ మయః।** | **'ఆత్మ' అనునది ఎటువంటిదని వర్ణించగలము?**<br>- అది ఈ భౌతికమైన కళ్ళకు ఎదురుగా కనిపించగల ఒక పాంచభౌతికమైన స్థూల వస్తువా? కాదు.<br>- అణువు వలె సూక్ష్మరూపమా? లేదు.<br>- ప్రత్యక్షమై ఎప్పుడో, ఎన్నడో, ఎక్కడో కళ్లకు ఎదురుగా కనిపించేదా? కాదు.<br>- అప్రత్యక్షమునకు వేరై మరెక్కడో ఉన్నట్టిదా? కానే కాదు.<br>- అది చేతనము (కదులునది) కాదు. జడము (కదలనిది) కాదు. అసత్తు (లేనట్టిది) కాదు. సత్తు (ఉన్నది) కాదు. |
| **న అహం। న అన్యో। న చ ఏవ ఏకో।**<br>**న చ అనేకో। అద్వయో। అవ్యయః॥**<br>**యత్ ఇదం దృశ్యతాం ప్రాప్తం**<br>**మనః సర్వ ఇంద్రియాస్పదమ్,** | - అది జాగ్రత్ - స్వప్నములలో కనిపించే "అహమ్-నేను" రూపమా? కాదు.<br>- అహమ్‌కు వేరైనట్టి మరొకటేదోనా? కాదు.<br>- ఏకము కాదు. అనేకము కాదు. ద్వితీయము కాదు. వ్యయము కాదు. అవ్యయము కాదు.<br>అద్వయము, అవ్యయము అగు ఆత్మకు ఏ ఈ దృశ్యము ప్రాప్తిస్తోందో,..... అట్టి వ్యవహారమంతా - మనస్సుచే ఇంద్రియాస్పదంగా స్వయంకృతంగా ప్రాప్తించేదే. అంతేగాని, మరొకరు కల్పిస్తున్నది కాదు. |
| **దృశ్య దర్శన సంబంధే యత్ సుఖం పారమార్థికమ్,**<br>**తత్ అతీతం పదం యస్మాత్,**<br>**తత్ న కించిత్ ఇవైవ (ఇహైవ) తత్॥** | పారమార్థిక ఆత్మసుఖము అనబడు ఆనందసాగరముయొక్క కించిత్ ప్రదర్శనము - ఇక్కడి **"దృశ్య, దర్శన సంబంధముల మధ్య"**గా స్ఫురించటం జరుగుతోంది। పరమాత్మ - జీవాత్మల - సంబంధము కళాకారునికి - కళాఖండములోని విశేషాలకు గల సంబంధము వంటిది. |
| **న మోక్షో నభసః, పృష్ఠే।**<br>**న పాతాళే న(చ) భూతలే।**<br>**సర్వ ఆశా సంక్షయే, చేతః క్షయో**<br>**'మోక్ష' ఇతి ఈష్యతే।** | 'మోక్షము' అనునది ఆకాశమునకు ఆవల ఎక్కడోగాని, (లేక) మరెక్కడో క్రింద పాతాళములోగాని, (కాక) భూతలముపైగాని లేదు.<br>ఈ చిత్తము దృశ్యముపట్ల కలిగి ఉంటున్న సర్వ ఆశలు ఉపశమించగా (లేక) క్షయించగా, ఇక **అప్పటికే శేషించి ఉన్న చిత్తము యొక్క కేవల నిర్మలానుభవమే 'మోక్షము'**. అది మోక్షము పట్ల కోరిక కూడా లేని స్థితి. |
| **"మోక్షో మే అస్తి" – ఇతి చింతా**<br>**అంతర్జాతా (అంతః జాతా) చేత్, ఉత్థితం 'మనః',**<br>**మనన ఉత్థే మనస్య, ఏష బంధః**<br>**సా–సాగ్ంసారికో దృఢః॥** | **మోక్ష సన్న్యాసము**<br>"నేను బద్ధుడను. ఇప్పుడు నాకు మోక్షము (బంధరాహిత్యము) సిద్ధించాలి" - అనే చింతన చిత్తమునందు బయల్వెడలిందా, ఇక ఆ క్షణమే మననరూపమగు మనస్సు తిరిగి బయల్వెడలుతోంది. **నిత్యాజుకఖిజుగు ఆత్మకు వ్యకౌతఖిగ్బ్రాక్షజు వ్యపఖాదింఛద్విజుచు? పీందుకు?**<br>'అన్యము' యొక్క మననముచే మనస్సు బయల్వెడలుతోంది.<br>- అదియే సాంసారిక రూపమగు 'దృఢబంధము'గా రూపము దిద్దుకొంటోంది. అట్టి మనస్సు తిరిగి తిరిగి వచ్చి ఆత్మయందే లయిస్తోంది. **మననము యొక్క ఆవల గల 'చిత్తము' యొక్క మనన రహితానుభవమే 'మోక్షము'**. దృశ్యము గురించిన **'ఇది బంధము - అది మోక్షము'** అను మననమే భవబంధము (లేక) సంసారబంధము. **సమస్త కల్పనా జగదనుభవములకు ఆవల కేవలమైయున్న 'నేనే' ఆత్మ**-అని గమనించి ఉండు. ఆత్మకు బంధమెక్కడిది? లేనే లేదు. నీవు ఆత్మస్వరూపుడవే అయి ఉన్నావు. |

4. ఆత్మ వ్యతీతే సర్వస్మాత్
సర్వరూపే అథవా తతే।
కో బంధః? కశ్చ వా మోక్షో?
నిర్మూలం మననం కురు॥

ఈ కనబడే సమస్త దృశ్య ప్రపంచమునకు, అంతరంగ చతుష్టయమునకు కూడా ఆత్మ- 'అతీతము' అయి ఉన్నది.

అయితే, ఈ సమస్తము ఆత్మరూపమే. ఈ సమస్తముగా (దృశ్యముగా, అంతరంగ చతుష్టయముగా) ఆత్మయే వ్యాపించి ఉన్నది.

(నీవు, నేను, వారు, వీరు, లోకములు, జాగ్రత్, స్వప్నము, సుషుప్తి, ఈశ్వరుడు, కేవలడు మొదలైన) సమస్తము ఆత్మయే అయి ఉండగా ఇక బంధము ఎవరికి? మోక్షము ఎవరికి?

ఓ నిదాఘా! అన్యదృష్టి నిర్మూలన రూపమగునదే ఆత్మదృష్టి. అందుచేత, **"ఇదంతా సర్వదా ఆత్మయే"** అను మననమును (అనన్యదృష్టిని) ఆశ్రయించి ఉండుము.

---

అధ్యాత్మరతిః అశ్రాంతః
పూర్ణ పావన మానసః।
ప్రాప్తాన్ ఉత్తమ విశ్రాంతిః
న కించిత్ ఇహ వాంఛతి॥

"ఈ సమస్తము నాయొక్క ఆత్మానంద సంప్రదర్శనమే" అను ఆధ్యాత్మభావనయందు ఎల్లప్పుడు విశ్రాంతి తీసుకొన్నట్టివాడు- సంపూర్ణము - పవిత్రము అగు మనన రూప మనస్సును పొందగలడు. మనస్సు విశ్రాంతి పొందగలదు. అట్టి విశ్రాంతి పొందిన మనస్సుగల ప్రశాంత మనస్కుడు ఇక్కడ **"ఇంకా ఇది పొందాలి! అది కావాలి. ఏదో తొలగాలి"** - మొదలైన ఏ రూపమైన వాంఛ కలిగి ఉండడు. దేనినీ వాంఛించడు, ద్వేషించడు.

---

సర్వ అధిష్ఠాన సత్‌మాత్రే
నిర్వికల్పే చిత్ ఆత్మని,
యో జీవగత స్నేహః,
స "జీవన్ముక్త" ఉచ్యతే॥

ఈ సమస్తమునకు అధిష్ఠానము(Main Raw-Material, That with which all this is made up of) అగు 'కేవలసత్'ను ఆశ్రయించి, "ఆత్మకు అన్యము" - అనే సమస్త కల్పనలు త్యజించి, నిర్వికల్పమగు చిదాత్మను ఆశ్రయిస్తూ, సమస్తమునకు ఆధారమైన ఆత్మవస్తువును సర్వే సర్వత్రా దర్శిస్తూ ఉంటాడో - ఆతడే **"జీవన్ముక్తుడు". ఆత్మతో మాత్రమే స్నేహము కలిగి ఉంటాడు.**

---

న అపేక్షతే భవిష్యత్ చ।
వర్తమానే న తిష్ఠతి।
న సంస్మరతి అతీతం చ।
సర్వమేవ కరోతి చ॥

అట్టివాడు -
"భవిష్యత్తులో ఏదో స్థితి పొందాలి, ఇంకా ఎప్పుడో ఏదో సిద్ధించాలి" - అని అపేక్షించడు.
- ఈ వర్తమానంలో కనిపించే దేనిలోను తిష్ఠించుకొని ఉండడు.
- జరిగిపోయిన విషయములను జ్ఞాపకం చేసుకొంటూ భూతకాలములో ఉండడు.
అన్నీ నిర్వర్తిస్తూనే త్రికాలములకు అతీతుడై, ఆత్మసంభావనుడై ఉంటాడు.

---

అనుబంధపరే జంతావ(త్) సగ్ంసర్గమనాః సదా,
భక్తే భక్త సమాచారః। శఠే శఠ ఇవ స్థితః॥
బాలో బాలేషు। వృద్ధేషు వృద్ధో।
ధీరేషు ధైర్యవాన్।
యువా యౌవన వృత్తేషు।
దుఃఖితేషు సు-దుఃఖధీః।

<u>**అట్టి జీవన్ముక్తుని మరికొన్ని స్వాభావిక లక్షణములు**</u>

సహప్రాణులతో (జీవులతో) సంబంధము (సర్గము) కలిగి ఉంటూనే, సమస్తము ఆత్మగా భావన చేస్తూ, ఆత్మకు వేరైన విశేషాలతో అనుబంధాతీతుడై ఉంటాడు.

- భక్తులతో భక్తి సమాచారము కలిగి భక్త సంబంధము ప్రదర్శిస్తాడు.
- శఠులతో (మూర్ఖులతో) శఠునివలె ఉంటాడు.
- బాలురతో బాలుని వలెను,
- వృద్ధులతో వృద్ధుని వలెను,
- ధీరులతో ధైర్యవంతుని వలెను,
- యువకులతో యౌవనోత్సాహుడు వలెను,
- దుఃఖితులలో దుఃఖము ఉన్న వానివలెను, సుఖవంతులతో సుఖివలెను.

**బాహ్య ప్రవర్తనము ప్రదర్శిస్తూనే ఆత్మభావన వీడక ఉంటాడు.**

| | |
|---|---|
| ధీర ధీః ఉదిత ఆనందః।<br>పేశలః పుణ్యకీర్తనః।<br>ప్రాజ్ఞః ప్రసన్న మధురో।<br>దైన్యాత్ అపగత ఆశయః। | ధైర్యముతో కూడిన బుద్ధి కలిగి ఆనంద, ఉత్సాహ, ఉత్తేజములు కలిగి, పుణ్యకార్యములందు అభిరుచి కలవాడై ఉంటాడు. అన్నీ తెలిసియే, - ప్రసన్నమైన ప్రవర్తన, మధురమైన వృత్తి కలిగి ఉంటాడు. సర్వలౌకికమైన ఆశయములను అంతరమున విడనాడి ఉంటాడు. సర్వే సర్వత్రా సమదర్శనము చేస్తూ "నేను అధికుడను కాను"- అను అణకువ (Humbleness) కలిగి ఉంటాడు. |
| అభ్యాసేన పరిస్పందే<br>ప్రాణానాం క్షయమ్ ఆగతే।<br>మనః ప్రశమం ఆయాతి।<br>నిర్వాణమ్ అవశిష్యతే॥ | ప్రాణాయామ యోగాభ్యాసి అయి ప్రాణముల (లేక-చిత్త-ఇష్టముల) పరిస్పందనమును వశము చేసుకొని ఉంటాడు. ఆతనిపట్ల మనస్సు స్వస్వరూపాత్మయందు ఉపశమించినదై ఉంటుంది. అట్టి స్వానుభవము ఆత్మకు అనన్యభావనారూపమగు మనః ప్రశమనము. నిశ్చల వాయువుతో నిశ్చలవాయువువలె అచ్యుతస్థానము. |
| యతో వాచో నివర్తంతే వికల్ప కలనాన్వితాః,<br>వికల్ప సంక్షయాత్ జంతోః<br>పదం తత్ అవశిష్యతే॥ | మనస్సు సశాంతించగా, ఈ సమస్తము తనయందు అనన్యముగా స్వాభావికం చేసుకున్న 'అఖండాత్మ రూప నిర్వాణము' యొక్క అనుభవం ఎట్టిది? తత్-అనుభవం గురించి చెప్పటానికి మాటలు చాలవు. మాటల వలన అసలైన అఖండాత్మానుభవం గురించి చెప్పబోయి,ఏదో చెప్పి కలనము(Illusion) పొంది వెనుకకు మరలుతాయి. ఆత్మ గురించిన అధ్యయనము చేస్తూ ఉండగా సంకల్ప-వికల్పములు సంక్షయించి, ఈ జీవుడు తనకు తానే అఖండ - అమృత - అప్రమేయాత్మరూపముగా శేషించుచున్నాడు. అప్పుడిక మాటలతో అవసరమేముంటుంది? |
| అనాద్యంత అవభాసాత్మా-<br>'పరమాత్మ' ఇహ విద్యతే।<br>= ఇతి ఏతత్ నిశ్చయం స్ఫారం<br>'సమ్యక్ జ్ఞానం' విదుః బుధాః॥ | స్వస్వరూపమగు ఆత్మయే ఆద్యంత రహితముగాను, 'పరమాత్మ'గాను తెలియబడగలదు. అట్టి నిశ్చయసారమే **'సమ్యక్ జ్ఞానము'** - అని ఆత్మజ్ఞులగు బుధులు ఎరిగినవారై, ఇక 'ఇది' అని చెప్పలేక, వాక్కుకు (వ్యాఖ్యానములకు) అవిషయంగా ఎరిగి ఉంటున్నారు. సర్వత్రా సమరూపమగు 'పరమాత్మ' యొక్క జ్ఞానమే **'సమ్యక్ జ్ఞానము'**. |
| **5.** యథా భూత-"ఆత్మ దర్శిత్వం"<br>ఏతావత్ భువనత్రయే,<br>యదా "ఆత్మ ఏవ (ఆత్మైవ) జగత్ సర్వం"<br>ఇతి నిశ్చిత్య పూర్ణతా,<br>సర్వం ఆత్మైవ। కౌ దృష్టౌ భావ-అభావౌ?<br>క్వ వా స్థితౌ? | అట్టి నిర్వాణ (తరంగరహితవాయుస్థితివంటి) నిశ్చలానుభవము పొందినవాడు - ఈ అనుభవమయ్యే త్రిభువనములను (మర్త్య-పాతాళ-స్వర్గలోకములను) యథాతథమగు ఆత్మస్వరూపముగాను, ఆత్మకు అనన్యముగాను దర్శించుచున్నాడు.<br>ఎవ్వరైతే "ఈ సమస్త జగత్తు (నాతో సహా) అఖండమగు ఆత్మ స్వరూపమేకదా!" అను నిశ్చయపూర్ణుడై ఉంటాడో, ఈ జగత్తును చూస్తూ ఉన్నప్పుడు ఆత్మదృష్టిని ఏమాత్రము విడువడో, అట్టివాడు ఇక భావ-అభావముల మధ్య పరిమితుడౌతాడా? అవడు. అంతా ఆత్మయే అయినప్పుడు భావాభావదృష్టుల మధ్యగా చిక్కుకునే ప్రసంగమెక్కడిది? |
| క్వ బంధ మోక్ష కలనే?<br>బ్రహ్మ ఏవ ఇదం విజృంభతే।<br>సర్వం ఏకం పరం వ్యోమ కో మోక్షః?<br>కస్య బంధతా?<br>బ్రహ్మేదం ('బ్రహ్మ' ఇదం) బృంహిత ఆకారం<br>బృహత్ బృహత్ ఇవ స్థితమ్। | బ్రహ్మమే ఈ సమస్తముగా విజృంభిస్తూ ఉండగా, **"ఇది బంధము - అది మోక్షము"** అను వాక్ - కల్పన ఎక్కడిది?<br>సర్వము ఏకమే అయి ఉన్న పరమాకాశమే అయి ఉండగా మోక్షమెవరికి? బంధమెవరికి?<br>**"బృహత్ : మహత్తరమై సర్వదా వ్యాపించి ఉన్నది"** అని వర్ణించబడుచున్న అగు 'బ్రహ్మము' అను బృహత్ సర్వదా బృహత్తరముగానే ఉన్నది. |

| | |
|---|---|
| **దూరాత్ అస్తమిత ద్విత్వం,<br>భవ ఆత్మైవ త్వమ్ ఆత్మనా।** | ద్విత్వము (Duality) అనునది సుదూరంగా అస్తమించగా, ఇక ఆత్మయే శేషించుచుండగా, **అట్టి ఆత్మయే స్వయముగా నీవై ఉండుము.** |
| **సమ్యక్ ఆలోకితే రూపే<br>కాష్ఠ పాషాణ వాససామ్।<br>మనాగపి న భేదో అస్తి।<br>క్వ అసి సంకల్పన ఉన్ముఖః?** | ఓ నిదాఘా! కొంచము వివేచనతో కూడిన 'సమ్యక్' దృష్టితో పరిశీలించి చూస్తే (అవలోకిస్తే) - మట్టి, రాయి, ఇల్లు, బట్ట మొదలైనవన్నీ ఏమీ భేదమైనవి కావని తెలియబడగలదు. మరిక భేద దృష్టితో సంకల్పములు కలిగి ఉండవలసిన పనేమున్నది? (Everything is manifestation of Energy which is always constant-Physics). |
| **ఆదావంతే చ సగ్ంశాంత-<br>స్వరూపం అవినాశియత్,<br>వస్తూనాం ఆత్మనశ్చ ఏతత్<br>తన్మయో భవ సర్వదా॥** | ప్రియమిత్రమా! ఇక్కడి వస్తు సముదాయమునకు, ఆత్మకు కూడా ఒకానొక సారూప్యత, సాయుజ్యత ఉండటం గమనించు. ఆత్మకు, ఇక్కడి వస్తు జాలమునకు మొదటి నుండి **"శాంతము, అవినాశనము"** అను ధర్మములు కలిగియే ఉంటున్నాయి. (Energy is always constant). అందుచేత, అటువంటి శాంతము - అవినాశనము అగు ఆత్మయే సర్వదా నీవై ఉండుము. (ఆత్మవలెనే దృశ్యము కూడా శాంతానంద స్వరూపమే). |
| **ద్వైత – అద్వైత సముద్భేదైః<br>జరామరణ విభ్రమైః,<br>స్ఫురతి ఆత్మభిః ఆత్మైవ<br>సిద్ధేః అబ్ధి ఇవ వీచిభిః॥** | సముద్ర జలంతో తరంగములు బయల్వెడలి, జలంలోనే సంచరిస్తూ తిరిగి మరొకప్పుడు జలమునందే లయిస్తున్నాయి కదా! అదే విధంగా ద్వైత - అద్వైత భేద విశేషములు, జరా - మరణ విభ్రమములు (Illusions) ఆత్మయందే స్ఫురించి, (ప్రతిబింబించి), ఆత్మయందే సిద్ధిని (లయమును) పొందుచున్నాయి! |
| **ఆపత్ కరంజ పరశుం పరాయా నిర్వృతేః పదమ్-<br>శుద్ధం ఆత్మానం ఆలింగ్య<br>నిత్యం అంతఃస్థయా ధియా,<br>యః స్థితస్తం క 'ఆత్మ' –<br>ఇహ భోగో భాధయితుం క్షమః?** | "ఆపదలు" అనే ముళ్ళపొదలకు గొడ్డలి వంటిది, నిర్వాత (నిశ్చలమైన వాయువు) వంటిది - అగు కేవలాత్మ స్వరూపమును ఎల్లప్పుడు ఆలింగనముచేసుకొని అంతస్థ బుద్ధినిర్మలుడై స్థితించి ఎవడు ఉంటాడో, అట్టి వానిని ఇక్కడి ఈ భోగరూపమగు జగత్ విశేషములు, మాటలు ఏమి చేయగలవు? ఏమీ చేయలేవు. బాధించజాలవు. |
| **కృతస్ఫార విచారస్య మనోభోగాదయో అరయః<br>మనాగపి న భిందంతి,<br>శైలం మంద అనిలా ఇవ॥** | పిల్లగాలులు కొండను కదల్చగలవా? లేదు కదా! అట్లాగే, చక్కగా ఆత్మ గురించి విచారణ చేయుచున్న వానియొక్క మనస్సును ఇక్కడ కనిపిస్తున్న ఇంద్రియ విషయములు, ప్రాపంచకభోగములు కించిత్ కూడా ఖేదమును కలిగించలేవు. |
| **నావాత్వమ్ అస్తి కలనాసు<br>న వస్తుతో అంతః।<br>నానావిధాసు–సరసి ఇవ జల ఆది, న అన్యత్॥** | సరస్సులో అసంఖ్యాక తరంగములు కనబడుచూ ఉండవచ్చుగాక! అట్టి తరంగములన్నీ కూడా జలమే అయి ఉండగా, ఆయా తరంగములకు పరస్పరం భేదమేముంటుంది? జలము దృష్ట్యా ఏకమే కదా!<br>అట్లాగే, ఇక్కడ కలనము (లేక) భావన చేత జీవులలో పరస్పరము భేదము కనిపిస్తూ ఉన్నప్పటికీ వస్తుతః (ఆత్మదృష్టిచే) భేదమే లేదు. |
| **ఇతి ఏక నిశ్చయమయః పురుషో "విముక్త" –<br>ఇతి ఉచ్యతే। సం అవలోకిత "సమ్యక్ అర్థ" ఇతి॥** | ఇట్టి నిశ్చయముగల పురుషుడు (జీవుడు) 'విముక్తుడు' అనబడుచున్నాడు. 'సమ్యక్ అవలోకనము' చేటయమే 'సమ్యక్-అర్థము' అని కూడా అంటారు. |

**ఇతి ద్వితీయోఽధ్యాయః**

***ఇతి 2వ అధ్యాయము***

# తృతీయోఽధ్యాయః - విదేహముక్తేః కిం రూపమ్?

<u>నిదాఘౌవాచ :</u>

1. విదేహముక్తేః కిం రూపమ్?
(తత్ వాన్) కోవా? మహామునే!
కం యోగం సం ఉపాస్థాయ
ప్రాప్తవాన్ పరమం పదమ్?

<u>నిదాఘుడు :</u> హై మహామునీ! "విదేహముక్తి" యొక్క రూపమేమిటి? ఏ మహానుభావుడు అట్టి విదేహముక్తిని సిద్ధించుకున్నారు? వారు ఏ యోగాభ్యాసమును ఆశ్రయించి అటువంటి విదేహముక్తి-పరమ పదమును ప్రాప్తించుకున్నారు?

స్వామీ! ఋభూ! దయతో వివరించండి. మేము కూడా మార్గాన్వేషణ చేస్తాము.

---

<u>శ్రీ ఋభౌవాచ :</u>

సుమేరోః వసుధా పీఠే మాండవ్యో నామ వై మునిః।
కౌండిన్యాత్ తత్త్వం ఆస్థాయ, జీవన్ముక్తో భవతి అసౌ।

ఋభుమహర్షి : సరే। వినండి. ఇందుకుగాను ఒక మహనీయుని గాథ చెప్పుకుందాము.
సుమేరు పర్వత పీఠముపై 'మాండవ్యుడు' అనే మునీశ్వరుడు ఉండేవారు. 'కౌండిన్యుడు' అను తమ గురు దేవులనుండి తత్త్వ విచారణను పొంది, క్రమంగా ఆతడు జీవన్ముక్తుడు అయ్యారు.

---

జీవన్ముక్తి దశాం ప్రాప్య
కదాచిత్ బ్రహ్మ విత్తమః,
సర్వ ఇంద్రియాణి సంహర్తుం
మనః చక్రే మహామునిః॥

ఆ బ్రహ్మవేత్తకి జీవన్ముక్త దశ ప్రాప్తించుకొన్న తరువాత, "ఇప్పుడు ఈ సమస్త ఇంద్రియములను జగద్విషయముల నుండి ఉపసంహరించెదనుగాక!" అని సంకల్పించారు. అందుకు ఆ మహాముని ఉపక్రమించసాగారు.

---

బద్ధ పద్మాసనః తిష్ఠన్, అర్థ–ఉన్మీలత లోచనః,
బాహ్యేన – అభ్యంతరాం చ ఏవ
స్పర్శాన్ పరిహరం శనైః,
తతః స్వమనసః స్థైర్యం మనసా విగత ఏనసా।

- పద్మాసనము అవధరించారు. కనులు సగము మూసుకొని అర్ధ నిమీలితనేత్రులు అయ్యారు.

బాహ్య - అభ్యంతరముల స్పర్శను నెమ్మదిగా ఉపసంహరించారు.

ఇకప్పుడు స్థైర్యము, నిర్దోషము గల మనో విభాగములతో (నిశ్చల మనస్సుతో) -చంచలమగు మనస్సును గమనించసాగారు.

---

"అహో! ను! చంచలం ఇదం।
ప్రతి–ఆహృతం (ప్రత్యాహృతం) అపి స్ఫుటమ్,
పటాత్ ఘటం ఉపాయాతి,
ఘటాత్ శకటమ్ ఉత్కటమ్!

## మనోచాంచల్యము

<u>మాండవ్య మునీశ్వరుడు :</u> ఆహా! ఈ చంచల మనో విభాగము ఏమి సంచలము కలిగి ఉంటోంది! దీనిని (నిశ్చల మనోవిభాగముతో) ప్రత్యాహరించటము (ఉపశమింపజేయము) కొరకు ప్రయత్నిస్తున్నప్పటికీ, ఇది -

పటము (వస్త్రము) నుండి - ఘటము వరకు,

ఘటము (నుండి) - శకటము వరకు

ఎక్కడెక్కడికో పరుగులు పరుగులు తీస్తోందే! ఎట్లా దీనిని నిరోధించటం? చంచల మనస్సును నిశ్చలపరచటం కుదిరేది ఏవిధంగా?

---

2. చిత్తం అర్థేషు చరతి పాదపేషు ఇవ మర్కటః।
పంచద్వారాణి మనసా, చక్షుః ఆదీని అమూన్యలమ్।
బుద్ధి ఇంద్రియ అభిధానాని, తాని ఏవ (తాన్యేవ)
అవలోకయామి అహమ్।
హత ఇంద్రియ గణా!
యూయం త్యజత ఆకులతాం శనైః॥
(యూయం త్యజత వ్యాకులతాం శనైః॥)

అరెరె! కోతి చెట్టు కొమ్మలపై దూకుతూ పరుగులు తీస్తున్న విధంగా చిత్తము అసంఖ్యాక విషయములపై గంతులేస్తోందే! ఏ ఒక్క విషయముపై ఏ కొద్దిసేపు కూడా ఆగటమే లేదు!

మనస్సుతో కళ్ళు - చెవులు మొదలైన పంచేంద్రియముల ద్వారా విషయములపై వ్రాలుటము - ఇక చాలు.

మనస్సును దాటి, బుద్ధితో ఇంద్రియములను మాత్రమే చూస్తూ, వాటి వ్యవహారమంతా ఇప్పుడు గమనించెదను గాక!

ఓ పాడు ఇంద్రియగణములారా! ఇక నెమ్మదిగా మీ **కలనము** (కలవరము, వ్యాకులత)ను వదలిపెట్టండి.

| | |
|---|---|
| **చిదాత్మా (చిత్ ఆత్మా) భగవాం తు**<br>**సర్వ - సాక్షిత్వేన స్థితోఽస్మి అహమ్।**<br>**తేన ఆత్మనా బహుజ్ఞేన నిర్జ్ఞాతాః**<br>**చక్షుః ఆదయః।** | ఓ ఇంద్రియ విషయ ధ్యాస సమూహములారా! సద్దు చేయకండి. ఇప్పుడు నేను చిత్ - ఆత్మ భగవాన్ సాక్షిస్థితిని ఆశ్రయించు ప్రయత్నము చేయుచున్నాను.<br>ఈ చక్షువులను ఉపయోగించుచూ దృశ్యమును తెలుసుకొనుచున్నది ఎవరు? సర్వజ్ఞము, జ్ఞానాతీతము అగు ఆత్మయే। ఆత్మయే అయి ఉన్న నేనే కదా! |
| **పరి నిర్వామి శాంతో అస్మి।**<br>**దిష్ట్యాస్మి విగత జ్వరః।**<br>**స్వ-ఆత్మని ఏవ అవతిష్ఠే అహం**<br>**తుర్య రూపపదే అనిశమ్।।** | ఆత్మను - ఇంద్రియములకు, ఇంద్రియ విషయములకు వేరుచేసి చూస్తూ ఉన్నప్పుడు మాత్రమే - విగతజ్వరుడను (మనోదోషములు తొలగినవాడను) అగుచున్నాను. తుర్యక్‌రూపపదము (జాగ్రత్-స్వప్నసుషుప్తులకు ఆవలగల 4వ పదము) నందు అన్నివేళల అవధరించుచు స్వ-ఆత్మయందే అవతిష్ఠుడను అయ్యెదనుగాక!<br>**ఆ మాండవ్యమహర్షి ఈ విధంగా మననస్సును సుదీర్ఘకాలము సముదాయించసాగాడు.** |
| **అంతరేవ శశామాస్య (సశామ్యస్య)**<br>**క్రమేణ ప్రాణ సంతతిః।**<br>**జ్వాలా జాల పరిస్పందో, దగ్ధ ఇంధన ఇవ అనలః।**<br>**ఉదితో అస్తంగత ఇవ, హి అస్తంగత ఇవ ఉదితః।**<br>**సమః సమ రసాభాసః**<br>**తిష్ఠామి స్వచ్ఛతాం గతః।।** | క్రమంగా అతనియొక్క ప్రాణ - అపాన - ఇత్యాది సంతతి (పంచ వాయువుల సముదాయము) లోపలనే శమించసాగింది.<br>జ్వాలలుగా మండుచున్న కట్టెలు, అవి అగ్నిచే కాలటం పూర్తి కాగానే, ఆ అగ్నీ శమిస్తుంది కదా! అట్లాగే ప్రాణాగ్ని ఆత్మయందు శమించసాగింది. ఇంకా కూడా ఆ మహర్షి ఈవిధంగా ధ్యానించసాగారు.<br>ఉదయించినవాడు అస్తమించునట్లు, అస్తంగతుడై మరల ఉదయించినట్లుగా, (కానీ) సూర్యుడు ఉదయ - అస్తమయములు తాను పొందక యథాతథమై ఉండు తీరుగా,<br>మనస్సు స్వచ్ఛము అగు సమరస ప్రకాశమునందు జనించి శమించుచుండగా, నిత్యప్రకాశకుడనైన నేను ఆత్మయందు సుతిష్ఠితుడనై ఉండెదను గాక! |
| **ప్రబుద్ధో అపి సుషుప్తిస్థః। సుషిప్తిస్థః ప్రబుద్ధవాన్।**<br>**తుర్యం ఆలంబ్య కాయాంతః**<br>**తిష్ఠామి స్తంభిత స్థితిః।**<br>**సబాహ్యా-అభ్యంతరాన్ భావాన్**<br>**స్థూలాన్ సూక్ష్మతరాన్ అపి,**<br>**త్రైలోక్య సంభవాం (సం) త్యక్త్వా సంకల్ప ఏక వినిర్మితాన్।** | మెలకువలో ఉన్నప్పుడు గాఢనిద్రలో ఉన్నవానివలెను, గాఢనిద్రలో (సుషుప్తిలో) ఉన్నప్పుడు మెళకువలెను ఉండెదనుగాక!<br>తుర్యక్ (4వ) అవస్థను అవలంబించినవాడనై శరీరము అధిగమించి స్తంభించిన స్థితిని ఆశ్రయిస్తాను. శరీర రాహిత్యమును స్వాభావికం చేసుకుంటాను.<br>బాహ్య - అభ్యంతరములు అయినట్టి స్థూల - సూక్ష్మ భావములన్నీ సంకల్పమాత్రంగా త్యజిస్తూ, ఈ మూడు లోకములలో సంకల్పములచే నిర్మితమగుచున్న, సంభవిస్తున్న సమస్తమును త్యజించినవాడవై ఉంటాను. |
| **సహ ప్రణవ పర్యంత దీర్ఘ నిస్స్వన తంతునా,**<br>**జహావ ఇంద్రియ తన్మాత్ర జాలం,**<br>**ఖగ ఇవ అనిలః।** | ఏ స్థూల (బాహ్య), సూక్ష్మ (అభ్యంతర) భావజాలముల చేత(లేక) సంకల్పములచేత ముల్లోకములు (పక్షియొక్క గాలిలో ఎగరటం - వ్రాలటం వలె) రాక - పోకలు ఆగకుండా జరుగుతూ పోతున్నాయో, వాటిని నిరోధించటానికై చిత్తముయొక్క సంచారములు నిరోధించాలి.<br>అందుకొరకై పక్షి గాలిని విడుచు రీతిగా ప్రణవపర్యంతము పంచతన్మాత్ర జలమును యోగాభ్యాసముతో త్యజిస్తాను. (శబ్ద స్పర్శ రూప రస గంధములను వదలటము - అనే దీర్ఘ నిస్వనము (గాలి వదలటం) ప్రాణాయామము చేస్తాను. |
| **తతో అంగ సంవిదం స్వచ్ఛాం**<br>**ప్రతిభాసమ్ ఉపాగతామ్,**<br>**సద్యోజాత శిశుజ్ఞానం**<br>**ప్రాప్తవాన్ మునిపుంగవః।।** | ఈ విధంగా తలచిన మహానుభావుడగు ఆ మాండవ్య మహాముని పంచ ఇంద్రియాల తన్మాత్రలను (పక్షి గాలిని విడచినట్లు) మనస్సుతో నిస్స్వనము (వదలటము) చేయసాగారు.<br>ఆ మునిపుంగవుడు అప్పుడే పుట్టిన పసిబిడ్డయొక్క కేవలేంద్రియ జ్ఞానమువలె నిర్మలమగు స్వచ్ఛమగు అంగజ్ఞానము పొందారు.<br>అనగా శబ్దస్పర్శరూప రసగంధముల కేవల జ్ఞానము ఉన్నదే గాని, (వాటికి **సంబంధించిన) విషయములతో సంయోగము ఏమాత్రము లేదు.** |

| | |
|---|---|
| **3. జహౌ చిత్తం చైత్య దశాగ్ం,<br>స్పందశక్తిం ఇవ అనిలః।<br>చిత్ సామాన్యం అథా ఆసాద్య<br>సత్తా మాత్రాత్మకం తతః।<br>"సుషుప్తి పదం" ఆలంబ్య<br>తస్థౌ గంధం ఇవ అనిలః<br>సుషుప్తి స్థైర్యం అసాద్య<br>తుర్యరూపం ఉపాయయౌ,** | క్రమంగా వాయువు స్పందశక్తిని వదలి కదలక 'నిశ్చలము'గా ఉండు విధంగా, చిత్తము స్పందమును త్యజించింది. చైత్య దశ (చిత్తము విషయములను కలిగి ఉండటము)ను పరిత్యజించింది. ("Interestedness" remained as 'STILL', while discarding what ever is interesting)<br>చిత్తము విషయములను వదలినప్పుడు కేవల చిత్ (లేక) చిత్ సామాన్యము (Absolute Form of Awareness) (లేక) సత్తా-మాత్రాత్మకము (Absolute Presence) అనబడురూపము సంతరించుకొన్నది.<br>అది వాసనలు వదలిన గాలితో పోల్చతగినది. అట్టి **'జాగ్రత్‌లో సుషుప్తి'** అను **"తుర్యక్ పదము"**ను పొందసాగింది. |
| **నిరానందోఽపి, సానందః,<br>సత్ చ అసత్ చ బభూవ సః।<br>తతః తత్ సంబభూవ అసౌ,<br>యత్ గిరామపి అగోచరః।** | అది ఆనంద - నిరానంద, సత్, అసత్- అతీత పదము. నిరానందుడు **కూడా ఆనందుడు, సత్ కూడా అసత్** అయి ఉన్నట్టిపదము తుర్యక్‌రూప ఉపాయముచేత **సుషుప్తిలో** ఉండే **ధైర్యమును** ఆతని చిత్తము పొందింది.<br>అట్టి **"చైత్యరహిత చిత్త, కేవల చిత్ - సుషుప్తి"** స్థైర్య రూపముచేత ఆ మాండవ్య మహాముని కేవలాత్ముడు అయినాడు.<br>- నిరానందుడై కూడా ఆనందభరితుడుగాను,<br>- సత్తు అయి ఉండియే అసత్ స్వరూపుడుగాను,<br>- కొండవలె కనబడుతూ ఉండి కూడా అగోచరుడుగాను- తనను తాను దర్శించసాగారు. |
| **యత్ శూన్యవాదినాగ్ం - 'శూన్యం',<br>'బ్రహ్మ'-బ్రహ్మ విదాం చ యత్<br><u>'విజ్ఞానమాత్రం'</u> - విజ్ఞానవిదాం,<br>యత్ అమలాత్మకమ్॥** | **ఆ మాండవ్యునియొక్క విషయ రహిత చిత్త - చిత్ స్వరూపము ఇంకా కూడా ఎటువంటిదంటే -**<br>- శూన్యవాదులచే 'శూన్యము' గా చెప్పబడువాడుగా రూపుదిద్దుకున్నారు. విజ్ఞానవాదులు ఆతని నిర్మల కేవల స్వరూపమును **"విజ్ఞాన మాత్రము"** అంటున్నారు. |
| **'పురుషః'। - సాంఖ్య దృష్టీనాం।<br>'ఈశ్వరో' - యోగవాదినామ్।<br>'శివః' శైవ। ఆగమస్థానాం।<br>'కాలః' కాలైక వాదినామ్।** | సాంఖ్య దృష్టి గల సాంఖ్యులు **'పురుషుడు'** అను పేరుతో పిలుస్తున్నారు.<br>యోగవాదులు 'ఈశ్వరుడు' అంటున్నారు.<br>శైవులు **'శివుడు'** అంటున్నారు.<br>వేదాధ్యయనులు **'ఆగమస్థానము'** అంటున్నారు.<br>కాలవాదులచే **'కాలపురుషుడు'** అనబడుచుండసాగారు. |
| **యత్ 'సర్వశాస్త్ర సిద్ధాంతం',<br>యత్ సర్వ హృదయానుగమ్,<br>యత్ సర్వగ్ం సర్వగం వస్తు,<br>యత్ తత్త్వం తత్ అసౌ స్థితః।** | - ఏది సర్వశాస్త్రముల అంతిమ సిద్ధాంతార్థమో, ఏది సర్వదా సమస్త జీవరాసుల హృదయానుగతమై ఉన్నదో, (అనుగమనించినదై హృదయరూపంగా ప్రకాశిస్తోందో), ఏది సర్వత్రా వ్యాపించి ఉన్నదో (సర్వగ్ం), సర్వ వస్తువులుగా ప్రదర్శనమగుచున్నదో,<br>**అదే తానుగా అయినారు.** |
| **యత్ అనుత్తమ నిష్పందం - దీపకం తేజసాం అపి,<br>స్వానుభూత్య ఏకమానం చ<br>(స్వ-అనుభూత్యైకమానం చ )<br>యత్ తత్త్వం తత్ అసౌ స్థితః॥** | - ఏది చలనము లేని దీపము యొక్క తేజస్సు వలె (స్పందరహితదీపంగా) సమస్తమును తన వెలుగులో వికసింపజేస్తూ ఉన్నదో...,<br>- ఏ తత్త్వము తనయొక్క అంతరముననే అనుభూతిగా అగుచున్నదో,<br>- ఏది ఏకమే అయినప్పటికీ అనేకముగా అగుపిస్తూ ఉన్నదో...., |

| | |
|---|---|
| **యత్ ఏకం చ అపి - అనేకం చ ।**<br>**సాంజనం చ నిరంజనమ్।**<br>**యత్ సర్వం చ అపి అసర్వం చ**<br>**యత్ తత్త్వం తత్ అసౌ స్థితః।** | ఏది దోషములు కలిగియున్నట్లు కనిపిస్తూ కూడా, నిర్దోష - నిరంజన రూపమో,<br>- సమస్తము అయి ఉండి కూడా అన్యముగా ఏదీ కాకయే ఉన్నదో, అట్టి తత్ స్వరూపుడై, స్వానుభవమునకు స్వస్వరూపాత్మయే అయి ప్రకటనమవసాగారు. |
| **అజమ్ అమరమ్ అనాద్యమ్,**<br>**ఆద్యమ్ ఏకమ్ పదం అమలగ్ం**<br>**సకళం చ నిష్కళం చ,**<br>**స్థిత ఇతి స తథా నభః,**<br>**స్వరూపాత్ అపి విమల స్థితిః**<br>**ఈశ్వరః క్షణేన।। ఇతి।।**<br><br>**-ఇతి తృతీయోఽధ్యాయః-** | ఆ మాండవ్య మహర్షి ఇంకా కూడా తన స్వస్వరూపము గురించి ఈ-ఈ విధంగా అభివర్ణితము పొందసాగాడు.<br>- జన్మరహితము. అమరము (మరణమనునదే లేనిది)<br>- అనాది (ఆది లేనిది). సనాతనము.<br>- ఆద్యం - మొట్టమొదటే ఉన్నట్టిది.<br>- ఏక పద స్వరూపమైనది. (అనేకము అనునది కించిత్ కూడా లేనట్టిది)<br>- 'ఓం' అను ఏకపద సంజ్ఞ. ఏకమై, సమగ్రమై ఉన్నట్టిది.<br>- మలము లేనిది. దోషరహితము.<br>- సమస్తము - ఉండీ ఏదీ లేనట్టిది.<br>(బంగారమునకు ఆకారము ఉన్నప్పటికి 'ఇది' అనగలిగిన ఆకారము ఏదీ లేదు కదా?!) ఈ విధంగా సకలము - నిష్కళము అగు ఆకాశము యొక్క స్వరూపము కంటే కూడా అత్యంత సూక్ష్ముడు, నిర్మలుడు, కేవలుడు - అగు ఆత్మగా అనుక్షణికుడు అయినారు.<br>ఓ నిదాఘా! ఈ మనము చెప్పుకున్నదే అనిర్వచనీయమగు 'విదేహముక్తి' (పరిమిత) వాక్యవర్ణనము. అట్టి నిర్వికల్పము (లేక) 'విదేహముక్తి' గురించి ఎంతగా చెప్పుకున్నా కూడా, అది అనుభవైకవేద్యము మాత్రమే।<br><br>**-ఇతి 3వ అధ్యాయము-** |

# <u>చతుర్థః అధ్యాయః - జీవన్ముక్తుడు - అష్టసిద్ధులు</u>

| | |
|---|---|
| <u>నిదాఘౌవాచ :</u><br>**1. జీవన్‌ముక్తస్య కిం లక్ష్య (క్ష్మ) హి ఆకాశ గమన ఆదికం?**<br>**తథా చేత్, ముని శార్దూల! తత్ర నైవ ప్రలక్ష్యతే?** | నిదాఘుడు : హే భగవాన్! మునిశార్దూలా? ఋభుమహర్షీ! జీవన్ముక్తిని యొక్క ముఖ్యమైన లక్షణములు ఏమిటి? ఆకాశగమనము మొదలైన) (అష్టసిద్ధులవంటి) విశేష ప్రత్యేక లక్షణములా? అట్లా అయితే (తమవంటి) జీవన్ముక్తులుగా చెప్పబడేవారిలో కొందరిలో అవి కనబడటం లేదే? వారికి ఆ ఆశయం (ప్రలక్ష్యము) ఉంటుందా? అష్టసిద్ధులు లక్ష్యముగా కలిగి ఉండవచ్చునా? తద్వారా ఆత్మానుభవము (లేక) జీవన్ముక్తి సిద్ధిస్తుందా? |
| <u>శ్రీ ఋభౌవాచ :</u><br>**అనాత్మవిత్ అముక్తో అపి**<br>**నభో విహరణ ఆదికమ్,**<br>**ద్రవ్యమంత్ర క్రియా కాల శక్త్య**<br>**ఆప్నోతి ఏవ, స ద్విజః॥** | **ఋభుమహర్షి :** ఓ నిదాఘ మునీ! ఒకానొకడు ఆత్మగురించి ఎరుగక ముక్తుడు కాకపోయినప్పటికి కూడా, అట్టివాడు ద్రవ్య - మంత్ర - క్రియా - కాలశక్తులను అనుసరించిన ప్రయత్నముచే 'ఆకాశగమనము' మొదలైన సిద్ధులు పొందినవాడై ఉండటము జరుగవచ్చు. సిద్ధులు కలిగి ఉన్నంత మాత్రంచేత జీవాత్మ-పరమాత్మల అనన్యత్వము సిద్ధించుకొన్న 'సద్విజుడు' అయి ఉంటాడని అనలేము. జీవన్ముక్త లక్షణములైనట్టి 'జీవాత్మత్వము నాకు బంధము కాదు'' అను ద్విజత్వము సిద్ధించుకొన్నట్లు సిద్ధాంతీకరించ లేము. అనగా అవి సద్విజ సహజ లక్షణములు కాదు. |
| **న ఆత్మజ్ఞస్య ఏష విషయః**<br>**ఆత్మజ్ఞో హి ఆత్మమాత్రదృక్।**<br>**(ఆత్మజ్ఞానో ఆత్మమాత్ర దృక్।)** | (ఇంకా కూడా చెప్పాలంటే) ఆత్మజ్ఞుని దృష్టిలో ఆకాశగమనము (అణిమ-గరిమ-లఘిమ- మహిమ-వశిత్వ-ఈశ్విత్వ-(ప్రాకామ్య-ఇచ్ఛా) అష్ట సిద్ధులు ఆత్మజ్ఞానమునకై విషయమే కాదు. ఆతని దృష్టిలో దృక్ స్వరూపుడగు ఆత్మయొక్క కేవల - వాస్తవ స్వరూపము మాత్రమే **(1) అధ్యయనం చేయటాని, (2) దర్శించటానికి, (3) తానే అయి** ఉండటానికి - విషయము. |
| **ఆత్మన ఆత్మని సంతృప్తో**<br>**న అవిద్యాం అనుధావతి।**<br>**యేయే భావాః స్థితాలోకే,**<br>**తాన్ 'అవిద్యామయాన్' – విదుః॥** | జీవన్ముక్తుడు ఆత్మయందే ఆత్మను దర్శిస్తూ సంతృప్తుడై ఉంటాడు. అవిద్యా విషయముల గురించి పరుగులు తీయడు.<br>లోకములోని ''బాహ్యమైనట్టిదేదైనా పొందాలి'' అను రూపముగల భావములన్నీ **అవిద్యయే.** లోకజనులు ఏఏ అవిద్యాస్థితి- గతులు, భావములు ఆశ్రయిస్తూ ఉంటున్నారో, అవన్నీ జీవన్ముక్తుని దృష్టిలో అవిద్యామయములుగానే అనిపిస్తూ ఉంటాయి. |
| **త్యక్త అవిద్యో మహాయోగీ**<br>**కథం తేషు నిమజ్జతి?** | **లోకములన్నీ ఎందులో కల్పనారూపంగా ఉన్నాయో- అట్టి ఆత్మయే విద్య.**<br>**''ఈ దృశ్యము వాస్తవమే'** అను మూర్ఖత్వము, మూఢత్వమును ఆశ్రయించి అల్పబుద్ధితో సిద్ధజాలమును కోరుకొను అవిద్యయందు మునుగు స్థితిని మహాయోగులగు ఆత్మతత్త్వజ్ఞులు కోరుకొంటారా? లేదు. అభిలషించరు. ఆత్మయోగులు అవిద్యయొక్క పరిధులను అధిగమించువారై ఉంటారు. |
| **యస్తు మూఢో అల్పబుద్ధిర్వా**<br>**సిద్ధి జాలాని వాంఛతి,**<br>**స సిద్ధి సాధనైః యోగైః, తాని సాధయతి క్రమాత్।**<br>**ద్రవ్య మంత్ర క్రియాకాల యుక్తయః సాధు సిద్ధిదాః,**<br>**పరమాత్మ పద ప్రాప్తౌ**<br>**న ఉపకుర్వంతి (నోపకుర్వంతి) కాశ్చన॥** | ఏ యోగి అయితే ఆయా సిద్ధులకొరకై మంత్రతంత్ర యోగ శాస్త్రములో చెప్పిన సాధనలకు ఉపక్రమిస్తాడో, ఆయా క్రమంగా, ఆసిద్ధులు ఆతడు పొందగలడు.<br>ద్రవ్య-మంత్ర-క్రియా కాల-కాలయుక్త సాధనలచే లభించే సిద్ధులు లభించినంతమాత్రంచేత అవన్నీకూడా, అంతమాత్రం చేత ఎవ్వరికీ కూడా **కొంచము కూడా 'పరమాత్మ పదప్రాప్తి'**కి ఉపయోగపడేవి కావు. ఆత్మభావనకు కావలసిన అవగాహనయే వేరు. |

యస్య ఇచ్ఛా విద్యతే కాచిత్ స సిద్ధిగ్ం
సాధయతి, అహో।

ఆయా సిద్ధులన్నీ కూడా ఇచ్ఛ చేతను, యోగాభ్యాసమునకు సంబంధించిన సిద్ధి కొరకై అట్టి ఆశయము కలిగియుండి చేయు పరిశ్రమ చేతను సిద్ధిస్తున్నాయి. ఆత్మభావన సిద్ధించటానికి భౌతిక సిద్ధులతో పనేముంటుంది?

---

నిరిచ్ఛోః పరిపూర్ణస్య న ఇచ్ఛా సంభవతి క్వచిత్।
సర్వ ఇచ్ఛాజాల సంశాంతాః
ఆత్మ లాభో భవేత్, మునే!

“ఆత్మస్వరూపభావనాసిద్ధి” అనేది సర్వ ఇచ్ఛలకు ముగింపు. అట్టి వానికి ఆకాశగమనము, మాయమవటము, వస్తువులను సృష్టించటము మొదలైన వాటిపై ఇచ్ఛయే ఉండదు. ఇక అందు కొరకై ప్రయత్నములు ప్రసక్తి ఎక్కడిది? అట్టి అష్టసిద్ధులు కలిగి ఉండటానికి, కలిగి ఉండకపోవటానికి - సర్వాత్మ ఆత్మభావనకు సంబంధమే లేదు.

ఓ మునీ! సమస్త ఇచ్ఛాజాలములు సంశాంతించినప్పుడే ఆత్మలాభము లభించగలదు. (ముని = సర్వ ఇంద్రియ విషయములపట్ల అంతరంగమున మౌనము వహించినట్టివాడు. “ఇవి ఎట్లా ఉంటేఏమి? సమస్తమునకు పరమైయున్న ఆత్మస్థానమే నా మహదాశయము!” - అను జగత్ విషయ మౌనమును, ఆత్మవిషయ ధ్యానమును ఆశ్రయించువాడు).

---

**2.** స కథం సిద్ధి జాలాని,
కథం వాంఛతి అచిత్తకః?

ఆత్మతత్త్వ ధ్యానమును ఉపాసించువానికి చిత్తము - ‘అచిత్తము’ అయి, చిత్ స్వరూపము సంతరించుకొంటోంది. ఇక అట్టి అచిత్తసిద్ధునికి చిత్తముయొక్క ప్రదర్శనారూపములగు దృశ్యవస్తు-సంఘటనా సంబంధమైన సిద్ధులు కోరుకోవలసిన పనేముంటుంది?

---

అపి శీతరుచాః అర్కే,
సుతీక్ష్ణే పి ఇందుమండలే,
అప్యధః ప్రసరం త్యక్త్వా,
జీవన్ముక్తో న విస్మయీ।

“సూర్యమండలము చల్లబడిపోయింది” అన్నప్పుడుగాని, “చంద్రుడు సుతీక్ష్ణుడై ప్రకాశిస్తున్నారు” - అన్నప్పుడు గాని, అవన్నీ జీవన్ముక్తునికి ఆశ్చర్యముగాని, వినోదముగాని కలిగించవు. ఆతడు సర్వ మనో ప్రసరణలు త్యజించినవాడై ఉంటాడు.

---

అధిష్ఠానే పరే తత్త్వే
కల్పితా రజ్జు-సర్పవత్।
కల్పిత-ఆశ్చర్య జాలేషు
న అభ్యుదేతి కుతూహలమ్॥

**“ఈ జగద్దృశ్యములో ఆశ్చర్యంగాను సామాన్యంగాను కనిపిస్తూ ఉన్న విశేషాలన్నీ కూడా - త్రాడులో పాము యొక్క లక్షణాలు కనిపిస్తున్న తీరుగా కల్పితమైన వ్యవహారజాలములే కదా!”** - అని గ్రహించి జగద్దృశ్యముపట్ల కల్పనామాత్రంగా సునిశ్చితుడైనట్టివాడే **ఆత్మతత్త్వజ్ఞుడు.** అట్టి వానికి ఇక్కడి విషయాలేవీ కుతూహలము ఏమాత్రము కలిగించ జాలవు.

---

యది విజ్ఞాత విజ్ఞేయా,
వీతరాగా మహాధియః
విచ్ఛిన్న గ్రంథయః సర్వే
తే స్వతంత్రాః తనౌ స్థితాః।

ఆత్మతత్త్వమును సిద్ధించుకున్న తత్త్వజ్ఞులు - తెలుసుకొనవలసినది తెలుసుకొనియుండి, రాగమును త్యజించినవారై ఉంటారు. మహత్తరమగు బుద్ధికలవారై, హృదయగ్రంథులన్నీ ఛిన్నము కాగా, .... సర్వత్రా స్వతంత్రము గల రూపము కలవారై ఉంటారు. దేనికీ బద్ధులుకారు. పరిమితులుకారు. స్వతంత్రమగు ఆత్మ భావనాదేహులై ఉంటారు.

---

సుఖ-దుఃఖ దశా ధీరగ్ం
సామ్యాత్(న్) న ప్రోద్ధరంతి యమ్,
నిశ్వాసా ఇవ శైలేన్ద్రం
చిత్తం తస్య <u>మృతం</u> విదుః॥
ఆపత్ కార్పణ్యం ఉత్సాహో

తత్త్వజ్ఞులపట్ల సుఖ - దుఃఖ దశలు బుద్ధిచే సమత్వము పొందినవై ఉద్వేగము, ప్రేరణత్వము సంతరించుకోవు. (అవి వారి దృష్టిలో స్వల్ప విషయములవలె అగుచున్నాయి). గొప్పకొండ ఒకని నిశ్వాసము (గాలిని ముక్కు నుండి వదలటము) వలన ఉన్న చోటి నుండి కదలదు కదా! ఆ తీరైన విధంగా వారి పట్ల చిత్తము నిస్పందనము పొందినదై “మరణించినవానిలోని చిత్తరాహిత్యము” వలె అగుచున్నది. ఆతడు అంతరమున “పరమప్రశాంత”ను సంతరించుకొని ఉంటున్నాడు.

| | |
|---|---|
| **మదో (మందో) మాంద్యం మహోత్సవః**<br>**యత్ న యంతి న వైరూప్యం**<br>**తస్య నష్టం మనో విదుః।**<br><br>**ద్వివిధః చిత్త నాశో అస్తి,** | ఆపద సందర్భములోను, కార్పణ్యము (మమకారముతో కూడిన ఆదుర్దా) ఏర్పడుచున్నప్పుడు, ఉత్సాహ సంఘటనలప్పుడు, మందము - మాంద్యములు కలుగుచున్నప్పుడు, (ఇంకా ఆయా సందర్భములలో) మహోత్సాహము కలుగుచున్నప్పుడు కూడా - ఎవ్వడైతే ఏదీ పొందనివాడై, **ఏ మార్పు అంతరమున కలిగి ఉండడో, ఎట్టి వైరూప్యము పొందడో** (వికారము పొందడో) - అట్టి వానిపట్ల మనస్సు నశించినదే అగుచున్నది. |
| **సరూపో, అరూప ఏవ చ।**<br>**జీవన్ముక్తౌ సరూపః స్యాత్,**<br>**అరూపో దేహముక్తిగః। (విదేహముక్తిగః)**<br>**'<u>చిత్త సత్త</u>' ఇహ దుఃఖాయ।** | చిత్తనాశనము రెండు రకములుగా ఏర్పడటం జరుగుచున్నది.<br>(1) సరూపము (2) అరూపము<br>జీవన్ముక్తుని విషయములో **'సరూపచిత్తనాశనము'**, విదేహముక్తుని విషయంలో **'అరూప చిత్తనాశనము'** సిద్ధిస్తూ ఉంటాయి. |
| **'<u>చిత్తనాశః</u>' సుఖాయ చ॥**<br>**చిత్త సత్తాం క్షయం నీత్వా**<br>**చిత్త నాశం ఉపానయేత్।**<br><br>**3. మనస్తాం మూఢతాం విద్ధి** | చిత్తము ఉన్నంతవరకు ఈ జీవుని పట్ల దుఃఖము (Worry and meloncholy) అనివార్యము. చిత్తము నశించటముచే సుఖప్రదమే కాగలదు. అందుచేత ఎంతగా ప్రయత్నించైనా సరే, - చిత్తమును క్షయింప జేసుకోవాలి. చిత్తనాశనమును ఏదో ఒక ఉపాయముతో సిద్ధించుకోవటము - అత్యంత ఆవశ్యకము. (దృశ్య విషయములపై ఇష్టముచే ఆధారపడి ఉండటమే చిత్తముయొక్క రూపము) |
| **యదా నశ్యతి స, అనఘ!**<br>**చిత్తనాశ అభిదానగ్ం హి**<br>**తత్ స్వరూపం ఇతి ఈరితమ్।** | ఓ అనఘా! నిదాఘా!<br>మరి "చిత్తము నశించటము" అనగా ఏమిటి?<br>ఈ చిత్తము, మనస్సు - "ఈ ఎదురుగా సంగతి - సందర్భము - **సంబంధము అనుబంధము - బాంధవ్యము మొ॥ వాటితో కూడిన దృశ్య వ్యవహారము నిజము నిత్యము! సత్యము** (Original Permanent and true) "- అనే కల్పన/భ్రమ (misconceived notion illusinally) కలిగి ఉన్నది. అట్టి మూర్ఖత్వమును ఈ మనస్సులో నశింపజేయటమే 'చిత్తనాశనము' - అనబడుతోంది. చిత్తము నశిస్తే, ఇక ఈ మనస్సు 'తత్' (కేవల) స్వరూపమే అగుచున్నది. అదియే ఆత్మసాక్షాత్కారము, తత్త్వసిద్ధి కూడా. |
| **మైత్ర – ఆదిభిః గుణైః యుక్తం**<br>**భవతి ఉత్తమ వాసనమ్।**<br>**భూయో జన్మ వినిర్ముక్తం**<br>**జీవన్ముక్తస్య తత్ 'మనః'। (తన్మనః)।**<br>**సరూపో అసౌ మనోనాశో**<br>**'జీవన్ముక్తస్య విద్యతే।** | అహంకారం, బలం, దర్పం, క్రోధం, పారుష్యం, మమకారము - మొదలైనవన్నీ ఈ జీవునికి శత్రువులు. ఎందుకంటే అట్టి శత్రు (లేక) అసురీ వాసనలు పునర్జన్మ పరంపరలకు కారణము అగుచున్నాయి. మైత్రి, అద్వేష్టా సర్వభూతానామ్, నిర్మమకారము, కరుణ, క్షమాగుణము - మొదలైనవి ఉత్తమ వాసనలు, ఎందుకని? అవి **భూయోజన్మ వినిర్ముక్తములు.** అనగా, పునర్జన్మ దుర్వ్యసనము నుండి ముక్తిని ప్రసాదిస్తాయి. 'మనోనాశనము'నకు సహకరిస్తాయి. [అట్టి భగవద్గీతలో గీతాచార్యుల వారిచే ప్రవచనము చేయబడిన దైవీగుణములు (12వ అధ్యాయము), జ్ఞానలక్షణములు (13వ అధ్యాయము), గుణాతీత ధారణమార్గములు (14వ అధ్యాయము), దైవీగుణములు (16వ అధ్యాయము) ] ఆశ్రయించటం చేత జనించే ఉత్తమ వాసనల సహాయం చేత ఎవ్వరి మనస్సు నశించినదై ఉంటుందో, ఆతడే జీవన్ముక్తుడు. |

**నిదాఘ! రూప నాశస్తు వర్తతే దేహ ముక్తికే।**
**విదేహ ముక్త ఏవ అసౌ విద్యతే నిష్కళాత్మకః॥**

ఓ నిదాఘా! జీవన్ముక్తుడైన తరువాత ఇక ఆపై జీవన్-మృత్యు సంఘటనలు కూడా వాస్తవానికి లేనివగుచున్నాయి. **"ఈ దేహము, జీవాత్మ మొదలైన పరిమితములు నా రూపము కాదు. ఈ విశ్వమే నా రూపమై, నేను ఆవల రూపరహితుడనై ఉన్నాను"** - అను అనుభవముచే ఈ జీవుడు **"విదేహముక్తుడు"** అగుచున్నాడు.

- జీవన్ముక్తుడు -**కళాత్ముడు- 'ఇదంతా నాకు లీలయేగాని, బంధము కాదు।"**
- విదేహముక్తుడో - **నిష్కళాత్ముడు - "ఇదంతా నేనే!"**

---

**సమగ్ర అగ్ర్య గుణ ఆధారం అపి సత్త్వం ప్రలీయతే।**
**విదేహ ముక్తౌ విమలే పదే పరమపావనే।**

**"నేను ఈ జీవాత్మ - జగత్తులుగా భాసిస్తూ, ఈ ఉభయము కూడా నా తేజోరూపముగా కలిగి ఉన్నాను"** అను సమగ్ర గుణాధారుడై జీవన్ముక్తుడు ఉంటాడు. అట్టివాడు (**క్రమంగా** గుణములకు, జగద్దృశ్యమునకు సమగ్రమగు ఆధారుడై, సత్త్వ (కేవలమగు ఉనికి) ప్రదర్శనుడై **విమలము, పరము** (Pure & Beyond) **అగు "విదేహముక్తి స్వారాజ్యుడు" అగున్నాడు.**

---

**విదేహముక్తి విషయే తస్మిన్ సత్త్వక్షయ ఆత్మకే,**
**చిత్త నాశే విరూపాఖ్యే, న కించిత్ ఇహ విద్యతే।**

విదేహముక్తుని విషయంలో

(1) అట్టి వానిపట్ల సత్త్వగుణము కూడా క్షయించినదై (ఒక నాటక రచయిత పాత్రలు గుణములకు వేరై ఉండు తీరుగా) గుణాతీతత్వము,

(2) నామరూపములకు అతీతమగుచుండటము,

(3) చిత్తము అరూపము పొందటము ...... **ఇవన్నీ స్వాభావికములౌతాయి.**

అట్టి వానికి "ఇక్కడ - ఇది, అక్కడ-అది" అనునదే ఉండదు. ఇహము రహితమై ఆతని బుద్ధి పరస్వరూపమునందు, నిశ్చలమగుచున్నది. ఈ సమస్తము తనకు అనన్యత్వము సంతరించుకొంటుంది.

---

**న గుణా। న అగుణాః తత్ర। న శ్రీః। న అశ్రీః।**
**న చ ఏతా। (నచ అనేకతా)। (న చ ఉభయో)॥**
**న చ ఉదయో। న అస్తమయో।**

**<u>విదేహముక్తుని రూపము వర్ణనాతీతము</u>**

- అది గుణముల స్వరూపము కాదు, గుణరహితము (అగుణము) కాదు.
- ఈ విశ్వము అను శ్రీ (సంపద) కాదు. విశ్వరాహిత్యము అనబడు 'అశ్రీ' కాదు.
- ఏకము కాదు. అనేకము కూడా కాదు.
- ఆతని స్వరూపము ఉదయించునది కాదు. అస్తమించునది కాదు.

---

**న హర్ష - అమర్ష సంవిదః।**
**న తేజో। న తమః కించిత్ ।**
**న సంధ్య ఆది। న రాత్రయః।**

- ఆతని పట్ల హర్షము (Happy) గాని, అమహర్షము (Non-Happy) గాని ఉండవు. ఆనందమును తెలుసుకొనువాడు (సంవిదుడు) కాదు.
- ఆతడు తేజస్సుగాని, చీకటి గాని, కించిత్ గాని, బృహత్‌గాని కాదు.
- తేజో - చీకటిల మధ్యగా సంధ్యా స్వరూపుడుగాని, రాత్రి స్వరూపుడుగాని కాదు.

ఆతని పట్ల తేజస్సు, తమస్సు, సంధ్య, రాత్రి మొదలైని సరూపములు కావు. అరూపములు కావు.

**న సత్తా। న అపి చ అసత్తా।**
**న చ మధ్యగ్ంం హి తత్ పదమ్।**
**యే హి పారంగతా బుద్ధేః**
**సగ్ంసార ఆడంబరస్య చ,**
**తేషాం తత్ ఆస్పదగ్ం స్ఫారం**
**సవనానాం ఇవ అంబరమ్॥**

**ఇంకా కూడా - విదేహముక్తుని కేవల స్వస్వరూపపదము గురించి :**

- సత్త (Presence) కాదు. అసత్త (Non-Presence) కాదు. ఆ రెండిటి మధ్యలో సత్-అసత్ (ఉన్నది-లేనిది మధ్యగా) కాదు.

ఆతని బుద్ధి సంసార సాగర ఆడంబరమంతా దాటివేసిన స్థానములో సుస్థిరముగా ఆక్రమించుకొన్నదై ఉంటుంది.

ఆకాశంలో నిశ్చలమై, అస్పందమైయున్న వాయువుతో పోల్చతగిన విధంగా అన్యమైనదంతా ఆతని అనన్య - కేవలము నందు నిస్పందమై ఉంటుంది.

ఆకాశంలో నిశ్చలవాయువువలె, ఆతనియందు జగత్ విశేషమంతా నిశ్చలము, స్వస్వరూపాత్మ రూపము సంతరించుకొంటుంది.

---

**4. సగ్ం శాంత దుఃఖం అజడాత్మకం**
**ఏక సుప్తం, ఆనంద మంథరం**
**అపేత రజః తమో యత్,**
**ఆకాశకోశ తనవో, అతనవో, మహాంతః**
**తస్మిన్ పదే గళిత చిత్తలవా భవంతి।**

**ఆతని స్వాత్మానందానుభవము ఎట్టిది?**

- సర్వ దుఃఖములు (All worries) సంశాంతించినట్టి స్థానము.
- అది జడస్థితి కాదు. అనగా గాఢనిద్రవంటిది కాదు. అజడాత్మకం. కానీ, గాఢ నిద్రలో పొందు ఆనందము కలిగి ఉన్నట్టిది.
- రజో తమోగుణములను ధరించినట్టిది కాదు. వదలి ఉన్నట్టిది కాదు.

వారు ఆకాశకోశదేహులు, దేహరహితులు, మహాంతదేహులు కూడా. వారియందు 'చిత్తము' లవలేశము కూడా శేషించి ఉండక, చిత్తము చిత్‌స్వరూపమై విరాజమానము అగుచున్నది. చిత్తరహిత చిత్‌స్వరూపులై ఉంటారు. వారిపట్ల "చిత్తు-నేను-జగత్తు-నీవు ఇవన్నీ వేరువేరు కాదు. ఏకత్వము, అఖండత్వము సంతరించుకొని ఉంటాయి.

---

## నిర్వాసన మనో

**హే నిదాఘ! మహాప్రాజ్ఞ!**
**నిర్వాసన మనా భవ।**
**బలాత్ చేతః సమాధాయ**
**నిర్వికల్ప మనా భవ॥**

## మనోజయము - వాసనా జయము

అందుచేత ఓ నిదాఘ మహాశయా! నీవు సమస్త దృశ్య వాసనలను త్యజించుటలో ప్రయత్నశీలుడవై, నిర్వాసన (Sans Tendencies) యందు మనోసమన్వితుడవు అగుము.

అందుకుగాను అనేక పరస్పర సానుకూల - ప్రతికూల్య దృశ్య విషయ పరంపరలపై వ్రాలుచూ ఉన్న ఈ చిత్తమును వివేకముతో బలవంతముగా సమాధానపరచి, **నిర్వికల్పము (State of Witness to Thought) నందు ప్రవేశింపజేయాలి సుమా!**

---

**యత్ జగత్ భాసకం భావం**
**నిత్యం భాతి స్వతః స్ఫురత్,**
**స ఏవ జగతః సాక్షీ,**
**సర్వాత్మా విమల - ఆకృతిః।**
**ప్రతిష్ఠా సర్వభూతానాం**
**ప్రజ్ఞాన ఘన లక్షణః॥**

ఓ నిదాఘ మునీ! ముఖ్యంగా ఒకానొక విషయము గమనించు.

- ఏదైతే ఈ జగద్దృశ్యమంతా భాసింపజేస్తోందో (That which is enlightening the entire worldly scenary)
- ఏది ఈ జగత్తు రూపముగా భాసిస్తోందో (That which is formulated as wordly scenary)

అదియే జగత్తుకు సాక్షి కూడా (It is also a mere witness to all this) . అదియే నిర్దోషము, సర్వాత్మకము, సర్వస్వరూపము అగు నీ ఆత్మ! నీవు, నేను అట్టి ఆత్మ స్వరూపులు **సహజముగానే** అయి ఉన్నాము. అన్యమైనదంతా సందర్భ కల్పితము, భ్రమాత్మకము.

అట్టి ఆత్మయొక్క ప్రజ్ఞానము (ఎరుక) అను ఘనీభూతలక్షణము చేతనే సర్వభూతజాలము ప్రతిష్ఠ పొందుచున్నది.

| | |
|---|---|
| **తత్ విద్యా విషయం బ్రహ్మ<br>సత్య జ్ఞాన సుఖ అద్వయమ్<br>ఏకం 'బ్రహ్మోహం అస్మి' –<br>ఇతి కృతకృత్యో భవేత్ మునిః** | ఓ విదాఘ మునివర్యా!<br>**"అటువంటి సత్యము, జ్ఞానము, సుఖము, అద్వయము"** అగు బ్రహ్మమునే నేను - అను మననము కలిగి ఉండుము.<br>- **"అది ఏకము, అఖండము"** అని ముందుగా ఎరుగుము. **"అట్టి బ్రహ్మమే నేను. నేను బ్రహ్మమే అయి ఉన్నాను. నేనే బ్రహ్మమును"** - అను అహం బ్రహ్మాస్మి భావనను సిద్ధించుకొని మునులు కృతకృత్యులగుచున్నారు. మనము ఆ రీతిగా కృతకృత్యులము అయ్యెదము గాక! |
| **సర్వ అధిష్ఠానం అద్వంద్వం<br>పరం బ్రహ్మ సనాతనమ్,<br>సత్ చిత్ ఆనందరూపం తత్<br>అవాక్ – మానస గోచరమ్॥** | **అట్టి అఖండమగు మనయొక్క స్వస్వరూప-కేవలాత్మ ఎట్టిదంటే:**<br>✠ సర్వ ఆభరణములకు బంగారము, సర్వ తరంగములకు జలము, మట్టి కుండలన్నిటికీ మట్టి అధిష్ఠానము అయి ఉన్న విధంగా,.. **ఈ సమస్తమునకు, సర్వమునకు అధిష్ఠానము.**<br>✠ జీవాత్మ-పరమాత్మ మొదలైన ద్వంద్వము మొదలే లేని **అద్వంద్వము.**<br>✠ సమస్తమునకు మొట్టమొదటే చైతన్యరూపమై ఏర్పడి ఉండటం చేత **సనాతనము, సనాతన పరబ్రహ్మము.**<br>✠ సత్ - (ఉనికి) చిత్ (ఎరుక) ఆనందము (అనుభూతి)ల రూపము. అది వాక్కుకు, ఆలోచనకు - విషయమే కాదు. చూపుకు ఆకాశమువలె **ఆత్మకు - వాక్కు - ఆలోచన స్వయం ప్రకాశ ప్రదర్శనములు.** అంతేగాని వాక్కు - మనస్సులచే ఆత్మ లభ్యమవదు. **చూచేవాడు చూపుకు కనిపించడు కానీ, తెలియవస్తున్నాడు కదా! ఆత్మకూడా అట్టిదే.** |
| **న తత్ర చంద్ర అర్క వపుః ప్రకాశతే।<br>న వాంతి వాతాః। సకలా దేవతాశ్చ–<br>స ఏష దేవః కృతభావ భూతః,<br>స్వయం విరుద్ధో విరజః ప్రకాశతే॥** | **అట్టి ఆత్మతత్త్వానుభవ స్వస్వరూప స్థానమునందు (విదేహముక్తునిపట్ల) :-**<br>- ఈ జాగ్రత్ జగత్తులో కంటికి కనిపిస్తున్న సూర్యచంద్రులు ప్రకాశమానులై ఉండరు. వాయువు చలనము కలిగి ఉండదు. దేవతలు సవిషయములై ఉండరు. ఆత్మప్రకాశముచే తానే అవన్నీగా భాసిస్తున్నవౌతాయి.<br>స్వయం ప్రకాశకుడగు ఆ ఆత్మ దేవాది దేవుడే "నేను భూతజాలముగా ప్రకాశించెదనుగాక!''....అను స్వకీయ (కృత) భావనచే, తనకు విరుద్ధమైనదంతా (అన్యమైనదంతా) తాను వేరై ప్రకాశింపజేస్తూ, ఆ ప్రకాశమానమైనదంతా "తానే'' అయి ఉంటున్నారు. |
| **5. భిద్యతే హృదయ గ్రంథిః<br>ఛిద్యంతే సర్వ సంశయాః<br>క్షీయంతే చ అస్య కర్మాణి<br>తస్మిన్ దృష్టే పరావరే॥** | అట్టి ఆత్మ భగవానుని బాహ్య - అభ్యంతర (నిర్మల - కేవల సదానంద) స్వస్వరూపమును దర్శించు దృష్టి ప్రవృద్ధమగుచుండగా,<br>✠ హృదయములోని సృష్టి - స్థితి - లయ సంబంధమైన (బ్రహ్మ-విష్ణు-రుద్ర) గ్రంథులన్నీ (చిక్కుముడులన్నీ) విడిపోతాయి.<br>✠ సర్వసంశయములు తొలిగిపోతాయి.<br>✠ సమస్త కర్మబంధములు తెగినవైపోతాయి.<br>**ఆతని దృష్టి ఇహమంతా దాటివేసి, పరావరత్వము పొందుచున్నది.** |

**ద్వా సుపర్ణౌ శరీరే అస్మిన్,**
**"జీవ – ఈశ" ఆఖ్యౌ సహస్థితౌ।**
**తయోః జీవః ఫలం భుంక్తే కర్మణో।**
**న మహేశ్వరః॥**

<u>**జీవ-ఈశ్వరులు:**</u>

ఈ దేహము అనే గొప్ప వృక్షముపై రెండు పక్షులు సహజీవనం చేస్తూ ఉన్నాయి. అవి

(1) జీవుడు (2) ఈశ్వరుడు (లేక) మహేశ్వరుడు. ఆ రెండిటిలో జీవుడు (ఇహస్వరూపుడు) కర్మల ఫలములను అనుభవముగా పొందుచున్నాడు. 'మహేశ్వరుడు' అనబడు రెండవ పక్షికి (పరస్వరూపుడు) కర్మలు లేవు. కర్మఫలములు ఆస్వాదించదు. (నాటకదీపమువలె) సాక్షీభూతుడు మాత్రమే.

---

**కేవలం సాక్షి రూపేణ వినా భోగేన వర్తతే।**
**(భోగ మహేశ్వరః) ప్రకాశతే।**
**(స్వయం భేదః కల్పితో – భోగేన వర్తతే॥)**

ఈశ్వరుడు - కేవలము 'సాక్షి' రూపంగా ఏదీ భోగించక (చూస్తూ) ఉన్నారు. జీవుడేమో కల్పితమగు దృశ్య విషయ భోగి, ఈశ్వరుడు స్వయంభోగి. 'జీవుడు' అను దానిని ఈశ్వరుడు తన ("కల్పితమగు ఆనందించురూపము"గా కలిగి ఉన్నవాడు. ఈ ఇద్దరు ఎల్లప్పుడు కలిసియే ఉంటున్నారు.

---

**ప్రాతిభాసిక జీవస్తు**
**కల్పితో మాయయా తయోః।**
**చిత్ చిదాకారతో భిన్నా,**
**న భిన్నా చిత్త్వ హానితః।**

ఒకడు ఇంటిలో యజమాని, ఉద్యోగము చేసేచోట ఉద్యోగి, బంధువుతో బంధువు అయిన తీరుగా ఈశ్వరుడు జీవుడుగా కనబడటమనేది ఒక సందర్భమాత్రమగు మాయాకల్పిత ప్రాతిభాసికము. (Attributedly created reflective context /confined incident).

నిరాకారమగు చిత్తు సాకారమగు ఈశ్వర - జీవాత్మ - జగత్ కల్పనలను కలిగి ఉంటున్నప్పటికీ, (నవలలోని సంఘటనలు, పాత్రలు రచయితకు వేరుకానట్లు, మరియు రచయిత అవిగా అవనట్లు) - చిత్త ప్రపంచ రచనవలన చిత్‌తత్త్వమునకు ఎట్టి హాని గాని, చ్యుతిగాని లేదు.

---

**తర్కతశ్చ ప్రమాణాత్ చ,**
**చిత్ ఏకత్వ వ్యవస్థితేః**
**చిత్ ఏకత్వ పరిజ్ఞానే**
**న శోచతి। న ముహ్యతి॥**

తర్కముచేత, శాస్త్ర ప్రమాణలముచేత చిత్‌యొక్క **"ఏకత్వము - సర్వత్రా వ్యవస్థితము"** లు సిద్ధాంతీకరించబడి చెప్పబడుచున్నాయి. అంతా చిదేకరసమే.

(1) ఇక్కడి జగత్తుగా, (2) ఆ జగత్తును అనుభవముగా కలిగి ఉన్నట్టి జీవుడుగా (3) ఆ జీవుని తన కల్పనయందు కలిగిఉన్నట్టి 'ఈశ్వరుడు'గా (4) ఆ ఈశ్వరునికి సాక్షిమాత్రమైనట్టి **కేవలముగా** - ఈ విధంగా (వేరువేరై) కనిపిస్తున్నది - **చిత్ - ఏకరస రూపమే!**

అట్టి చిదేకత్వమును చక్కగా, స్వానుభవంగాం ఎరిగిన యోగి ఇక దేనికి శోకించడు. మోహము పొందడు.

---

<u>**"అధిష్ఠానం సమస్తస్య జగతః సత్య**</u>
<u>**చిత్ ఘనమ్ – "అహం అస్మి"**</u> **– ఇతి నిశ్చిత్య**
**వీత శోకో భవేత్ మునిః॥ (మునే!)॥**

**"ఈ సమస్త జగత్తునకు అధిష్ఠానము** (Root/Basic Raw-material) **అయినట్టి - సత్య చిత్ ఘనీభూత స్వరూపము నేనే! ఈ సమస్తము నాయందే (స్వప్నములో వలెనే) ఉన్నట్టిది"** - అను నిశ్చయమును సంసిద్ధింపజేసుకొన్న తత్త్వాభ్యాసి ఇక దేనికీ శోకము చెందక, మౌనము వహిస్తూ 'ముని' అయి ఉంటాడు. (ఆత్మపట్ల మాత్రమే జాగరూకుడై ఉంటాడు)

---

**స్వ శరీరే స్వయంజ్యోతిః**
**స్వరూపగ్ం సర్వ సాక్షిణమ్,**
**క్షీణ దోషాః ప్రపశ్యంతి।**
**న ఇతరే (నేతరే) మాయయ ఆవృతాః॥**

ఓ నిదాఘ మహాశయా! మనము అనేక శబ్దములలో సుదీర్ఘంగా చెప్పుకోవలసినది ఏమున్నది? ఆత్మతత్త్వమును ఆశ్రయించువానికి శబ్దములు క్రోడీకరించి సుదీర్ఘంగా చెప్పుకోవటము - అది కూడా వాచా విగ్లాపన దోషమే అవుతుంది సుమా! ఎవ్వరి దోష దృష్టులు-భక్తి, జ్ఞాన, క్రియా, దైవీ సంపదాయోగములచే-క్షీణించుచూ ఉంటాయో, అట్టివాడు ఆ (ఈ సమస్తము అగుచూ కూడా ఇద్దానికి ఆవలే ఉన్న) పరమాత్మను తన శరీరమునందే **స్వయంజ్యోతి స్వరూపుడుగాను, సర్వసాక్షి గాను - "ప్రపశ్యంతి"** - సుస్పష్టముగా చూడగలడు.

| | |
|---|---|
| తమేవ (తమ్ ఏవ) ధీరో విజ్ఞాయ<br>ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః।।<br>**నానుధ్యాయాత్ బహూం చ శబ్దాన్।<br>వాచో విగ్లాపనగ్ం హి తత్।।** | మహదాశయుని, ప్రయత్నశాలుని బుద్ధికి శరీమునందే "ఆత్మ" అనుభవమవగలదు.<br>మాయచే ఆవరించబడుటచే అప్రయత్నశీలురగు వారలు అది (తమయందు) దర్శించటము లేదు. బాహ్యమున ఎక్కడెక్కడో వెతకుచున్నారు.<br>ఆత్మను అధ్యయనము చేయుచున్నవారు తమ బుద్ధితో, స్వకీయ ప్రజ్ఞతో తమ అంతరముననే ఆత్మదర్శనము చేస్తూ '**బ్రాహ్మణులు**' అని పిలువ బడుచున్నారు. (బ్రహ్మ-అహమ్-ఇతి బ్రాహ్మణః) |
| **6.** బాల్యేన ఏవ హి తిష్ఠాసేత్,<br>నిర్విద్య బ్రహ్మ వేదనమ్,<br>బ్రహ్మ విద్యాం చ బాల్యం చ,<br>నిర్విద్య మునిః ఆత్మవాన్। | ఓ నిదాఘా! మానవజన్మ ఈ జీవునిపట్ల మహత్తరమైన అవకాశము అయి ఉన్నది. అందుచేత బ్రహ్మము గురించి తెలుసుకొను అభ్యాసమును బాల్యమునుండియే ప్రారంభము చేయుటము శుభప్రదమయ్యా. "అవిద్య-బ్రహ్మవిద్య"ల అంతరమును, వాటి వాటి విషయ-విశేష-ప్రత్యేకత లను బాల్యమునుండే అధ్యయనము ప్రారంభిస్తే, అట్టివాడు ముని అయి, ఆత్మవంతుడుగా ప్రకాశించగలడు. స్వస్వరూపాత్మ పట్ల నిదురలేవగలడు. |
| అంతర్లీన సమారంభః<br>శుభాశుభ మహాంకురమ్,<br>సంసృతి వ్రతతేః బీజం<br>శరీరం విద్ధి భౌతికమ్।। | లేదా, సంసార బీజములు బాల్యము నందే రూపుదిద్దుకొని ప్రవృద్ధము కాగలదు. ఎందుకంటే ఈ జీవుడు శుభ-అశుభ మహాబీజములతో జన్మను స్వీకరించుచున్నాడు కనుక.<br>ఈ "జన్మ" అనునది శుభ - అశుభములకు అంకురము (విత్తనపుమొలక) వంటిది. సంసారము అను పూలతకు బీజమువంటిదిగా ఈ భౌతిక దేహమును ఎరుగుము. దేహమే దేహిక ఐహిక మోహము. |
| భావ-అభావ దశా కోశం<br>దుఃఖరత్న సముద్గతమ్।<br>బీజం అస్యశరీరస్య,<br>చిత్తమ్ ఆశా వశానుగమ్।। | "భావించటము-అనుభవించటము" లకు ఈ శరీరము ఒక కోశము (గర్భము) వంటిది. దుఃఖములు అనే రత్నములు దాచి పెట్టబడి ఒక భోషాణము (పెట్టె) కూడా.<br>అనేక ఆశలు తనయందు నిండుగా కలిగియున్న చిత్తమే ఈ శరీరమునకు బీజము. |
| ద్వే బీజే చిత్తవృక్షస్య<br>వృత్తి వ్రతతి ధారిణః।<br>ఏకం ప్రాణ పరిస్పందో।<br>ద్వితీయో దృఢ భావనా।। | **"వృత్తులు (Avocations) "**అనే **చిత్త వృక్షము** రెండు బీజములు కలిగియుండి, అనేక తీగలతో చుట్టుకొనబడి ఉంటోంది.<br>(1) ప్రాణపరిస్పందము (ప్రాణము ప్రియము యొక్క రూపము)<br>(2) దృఢమైన భావన (యత్ భావం తత్ భవతి). |
| యదా ప్రస్పన్దతే ప్రాణో<br>నాడీ సంస్పర్శనా ఉద్యతః,<br>తదా సంవేదనమయం<br>చిత్తం ఆశు ప్రజాయతే।<br>సా హి సర్వగతా సంవిత్<br>ప్రాణస్పందేన బోధ్యతే। | I. ఎక్కడైతే ప్రాణశక్తి నాడుల స్పర్శచే ఉద్యమిస్తుందో, [ప్రియత్వము బహిర్గతమవసాగుతుందో]- అక్కడ సంవేదనమయమైన (1.The Experience regarding what is being known. 2. The incident of that being known)] రూపముగా 'చిత్తము' జనిస్తోంది.<br>II. ఎక్కడ చిత్తము ఉంటుందో అక్కడ సర్వగతమైన సంవిత్ (సత్, విత్ = ఉనికి, ఎరుక) లేక ఆత్మ ఆయా సందర్భగతము, వస్తుగతము అగుచూ, పరిమితత్వము ఆపాదించబడి, జీవాత్మగా అగుచున్నది.<br>సర్వగతము = సంవిత్, పరమాత్మ<br>వస్తు విషయ గతము = జీవాత్మ |

| | |
|---|---|
| **సంవిత్ సంరోధనం శ్రేయః<br>ప్రాణాది స్పందనం పరమ్।** | III. సంరోధనము = అడ్డుపడటము, అణచటము, ఆటంకము.<br>ప్రాణము - చిత్తముల స్పందనను అనుసరిస్తున్న సంవిత్‌ను (జీవాత్మ)ను ఆ ప్రాణములు మొదలైన వాటి స్పందనానుసరణము నుండి నిరోధించి, విరమింపజేసి ఆవలగల కేవలమగు సంవిత్‌నందు (పరమాత్మయందు) ఏకము, లయము చేయటము పరమ శ్రేయస్కరము. |
| **యోగినః చిత్త శాంత్యర్థం<br>కుర్వంతి "ప్రాణరోధనమ్"।** | IV. సర్వాత్మకమగు సంవిత్ స్వరూపము సంతరించుకోవటానికై యోగి 'చిత్తమును శాంతింపజేయటము' అను యోగాభ్యాసమునకు ఉద్యుక్తుడు అగుచున్నాడు. అట్టి చిత్తము (చిత్‌నందు) సశాంతించటానికై యోగులు ప్రాణరోధనము (స్వాభావిక సంచలనము ప్రదర్శిస్తున్న ప్రాణశక్తిని అస్పందనమువైపుగా నిరోధించటము)ను నిర్వర్తించుచున్నారు. **ఇది చిత్తశాంతి కొరకై ముఖ్యమైన ఒక ఉపాయము.** |
| **ప్రాణాయామైః, తథా ధ్యానైః,<br>ప్రయోగైః యుక్తి కల్పితైః,<br>చిత్త ఉపశాంతి ఫలదం<br>పరమం విద్ధి కారణమ్।<br>సుఖదం సంవిదః స్వాస్థ్యం<br>ప్రాణ సంరోధనం విదుః॥** | V. చిత్తశాంతి లభించటానికై (1) ప్రాణాయామము (2) ధ్యాసను నియమించు రూపముగల ధ్యానము (3) యుక్తి (జ్ఞానవిచారణ) ఈ మూడు 'పరమగు చిత్తవిశ్రాంతి' అనే ఫలప్రదాతలు.<br>VI. ప్రాణ సంరోధనము (ప్రాణ నిరోధము) అను ప్రాణాయామాభ్యాసము సంవిదము (ఆత్మ) లేక జీవునికి సుఖము, స్వాస్థ్యము ఇవ్వగలదు. |
| **7. దృఢ భావనయా, త్యక్త<br>పూర్వా - పర విచారణమ్,<br>యదా దానం పదార్థస్య,<br><u>'వాసనా'</u> సా ప్రకీర్తితా।** | <u>**వాసనలు**</u><br>ఈ జీవుడు స్వతఃగా సర్వగతమగు సంవిదాత్మ స్వరూపుడే. దృశ్య-దేహ-మనో-బుద్ధి-చిత్త-అహంకార ఇత్యాది విశేషములకు బద్ధుడు, పరిమితుడు కానే కాదు.<br>కానీ **"నేను జీవుడను. పరిమితుడను"** అను స్వయంకల్పిత పరిధులకు స్వస్వరూపము పరిమితమైనట్లు ఈతనికి అనిపించ సాగుతోంది. అప్పుడు అఖండాత్మ → జీవాత్మగా అనిపించుకొంటోంది. ఎందుచేత? అందుకు కారణం? వాసనలు.<br>వాసనలు అనగా? ఈ దృశ్యములోని వస్తువులు, సందర్భములు, సహజీవులు, సంబంధములు మొదలైనవాటి పట్ల - **"నీటి పూర్వరూపం ఏమిటి? ముందు ముందు ఏరూపము పొందబోవుచున్నాయి"** - అని విచారణ చేయకుండా, ఎట్లా ఇంద్రియములకు కనిపిస్తూ ఉంటే, అట్లాగే (స్వకీయ దృశ్య సంబంధ భావనా దర్పణములో నుండి) స్వీకరించటము (లేక) పొందటమునే **'వాసనలు'** అంటున్నారు. |
| **యదా న భావ్యతే కించిత్<br>హేయ ఉపాదేయ రూపి యత్<br>స్థీయతే సకలం త్యక్త్వా,<br>తదా చిత్తం న జాయతే।** | ఇక్కడ "స్వీకరించాలి - వదలాలి" - అనునది కించిత్ కూడా భావించకుండా సమస్తమును మనస్సుతో దాటివేసి, అప్పటికీ శేషించియున్న స్థితిని ఆశ్రయిస్తే, ఇక అప్పుడు 'చిత్తము' యొక్క ఆనవాలు కూడా లేకుండా పోగలదు. దృశ్యముపట్ల **ఇష్టావేశము, ఆత్మయొక్క** ఏమరపు - ఈ ద్వంద్వమే చిత్తరూపము. |
| **అవాసనత్వాత్ సతతం<br>యదా న మనుతే మనః,<br>అమనస్తాత్ తత్ ఉదేతి<br>పరమ ఉపరమప్రదా।<br>(పరమోపరమప్రదా)।** | <u>**అమనస్కము**</u><br>ఇక్కడ వస్తువుల పూర్వాపరములను (Previously how are they? later what are they going to be?) విచారించి వాటి వర్తమానంగా కనిపించే రూపముపై నమ్మకము వదలి ఉండటమే చిత్తశాంతి. అట్టి వాసనలు తొలగటానికై వాటి గురించి మననము చేయకపోవటమే ఉపాయము. 'ఆత్మమననము' అను మార్గం ఆశ్రయించి, ఇందలి విషయములగు దృశ్య సందర్భమననమును జయిస్తూ ఉండగా -పరమోపరమ ప్రదము (Finest state of sense of Absolute Self) రూపమగు <u>అమనస్కము</u> సిద్ధించగలదు. |

| | |
|---|---|
| **యదా న భావ్యతే భావః క్వచిత్ జగతి వస్తుని, తదా హృత్ అంబరే శూన్యే కథం చిత్తం ప్రజాయతే?** | ఓ నిదాఘా! జనిస్తూ - జరుగుతూ - గతిస్తూ ఉండే స్వభావముగల జగత్ (జ + గత్)వస్తువుల పట్ల - "అవి లేకపోతే ఎట్లా?" అనే 'అవినాభావ' సంబంధము ఎట్లా ఏర్పడుతోంది? 'భావన' చేయటం చేతనే. ఆ విధంగా **భావనచే ఏర్పడుచున్న సంబంధమే బంధము (లేక) సంసారము.** అదియే చిత్తము కూడా. మరి తొలగేది ఎట్లా? భావనలచే ఏర్పడే చిత్త జనిత సంసారము 'అభావన' చేతనే తొలగుతుంది. ఎప్పుడైతే హృదయంలో భావములను భావించమో, ఇక అప్పటి శూన్య హృదయాకాశములో చిత్తము ఎట్లా ప్రదర్శనమౌతుంది? అవదు. |
| **యత్ అభావనం ఆస్థాయ, యత్ అభావస్య భావనమ్, యత్ యథా వస్తు దర్శిత్వం తత్ 'అచిత్తత్వం' ఉచ్యతే॥** | <u>అచిత్తత్వము</u><br>- ఎప్పుడైతే నీవు 'జగత్‌వస్తు భావనను జయించాలి' - అను ప్రయత్నమునకు ఉద్యమించి 'వస్తుభావన' ను ఉపశమింపజేస్తూ ' అభావన'ను భావిస్తూ ఉంటావో, (అంతా ఆత్మ లీలా ప్రదర్శనముగా అనుకుంటూ ఉంటావో)...,<br>- ఎప్పుడైతే 'అభావన' యందు సంస్థితుడవై భావనలను ఉపకరణములుగా మాత్రమే ఉపయోగించుచూ వస్తు దర్శనము చేస్తూ ఉంటావో,<br>- ఆత్మ దర్శనమును సహజముగా కలిగి ఉండి, వస్తు దర్శనము సందర్భమాత్రంగా గమనిస్తూ ఉంటావో....<br>అది **'అచిత్తత్వము'** అనబడుతోంది. |
| **సర్వమంతః పరిత్యజ్య శీతళ ఆశయవర్తి యత్, వృత్తిస్థం అపి తత్ చిత్తం 'అసత్‌రూపం' ఉదాహృతమ్॥** | <u>**చిత్త-అసత్ రూపం**</u><br>ప్రశాంతమగు ఆశయము (సమస్తము స్వస్వరూపమునకు అనన్యముగా దర్శించు మహదాశయము) కలవాడవై, అన్యముగా కనిపించే / అనిపించే దృశ్యభేద జగత్తును అంతరంగమున పరిత్యజించి, ఆత్మగా దర్శించు వృత్తిని కూడా ఆత్మానుభవమునందు అనుక్షణికంగా ఏకము చేయు స్వభావివై ఎప్పుడు ఉంటావో, అప్పుడిక **'చిత్తము యొక్క అసత్'** (చిత్తము లేనిదే) స్వాభావికంగా సిద్ధిస్తోంది. |
| **భ్రష్ట బీజ ఉపమా యేషాం, పునః జనన వర్జితా, వాసనా రసనా హీనా 'జీవన్ముక్తా' హి తే స్మృతాః॥** | ఉడకబెట్టిన బీజము మరల చిగురించదు కదా! ఆ విధంగా 'పునర్జన్మ' కలిగించు స్వభావముగల దృశ్య విషయ వాసనలను పరిత్యజించి, వాటిని జయించువాడే **'జీవన్ముక్తుడు'**. ఆతడు **ఉత్తరోత్తర ఉపాధుల పట్ల స్వాతంత్రుడై ఉంటాడేగాని, ఇక పారతంత్రుడు కాడు.** |
| **సత్త్వరూప పరిప్రాప్త చిత్త – అస్తే జ్ఞాన పారగాః 'అచిత్తా' ఇతి కథ్యంతే దేహాంతే వ్యోమ రూపిణః॥** | చిత్తము సత్త్వరూపము (కేవాలత్మ రూపము) సంతరించుకొన్నదై, ఆత్మజ్ఞాన - ఆత్మభావనలను ఆశ్రయిస్తూ ఉంటే అది అచిత్తమే. వారు దేహమునకు ఆవల ఆత్మాకాశము నందు ఆత్మానంద స్వరూపులై విహరించు వారగుచున్నారు. 'అచిత్త సిద్ధులు' అగుచున్నారు. |
| **8. సంవేద్య సంపరిత్యాగాత్ ప్రాణస్పందన వాసనే, సమూలం నశ్యతః క్షిప్రం మూలచ్ఛేదాత్ ఇవ ద్రుమః॥** | ఎత్తుగా పెరిగిన ఒక చెట్టును మొదలులో నరికితే అది ఎండి, వాడి నశించిపోతుంది కదా! అట్లాగే ఇంద్రియములకు తెలియబడుచున్న ఇంద్రియ విషయపరంపరా వ్యవహారరూపమగు 'సంవేద్యము'ను పరిత్యజించుచూ ఉండగా, (ప్రాణస్పందనలు, వాసనలు (Responsive-ness to wordly events and Tendencies) - కూడా మొదలు నరికిన చెట్టువలె తమకు తామే నశించగలవు. అనగా **ప్రాపంచక విషయములు ఆలోచించక - భావించక ఉంటే ప్రాణ స్పందన స్వవశమౌతుంది.** వాసనలు తోక ముడుస్తాయి. |

పూర్వ దృష్టం అదృష్టం వా
యదస్యాః ప్రతిభాసతే,
సంవిదః తత్ ప్రయత్నేన
మార్జనీయం విజానతా।
తత్ అమార్జన మాత్రం హి
మహా సంసారతాం గతమ్।
తత్ ప్రమార్జన మాత్రం తు
'మోక్ష' ఇతి అభిధీయతే॥

కలలో కనిపిస్తున్న విశేషాలను తెల్లవారిన తరువాత పట్టుకు వ్రేలాడుతామా? లేదు కదా? అదే విధంగా ఇంతకుముందుచూచిన - చూడనివన్నీ (కలలో కనిపించిన గొప్ప - దృశ్యము వలె) ప్రతిభాసక భావనతో (Just things that reflect in water or mirror) - వాటిని తెలివైనవాడు "కడిగివదిలించుకోవలసిన దుమ్ము-ధూళి- బురదవంటివి' - అని ఎరిగి ఉంటాడు. వివేకముతో త్యజించివేస్తాడు. (He will be in himself right now sans all worldly events)

లోకసంబంధమైన విషయములను వదలక, మరల మరల జ్ఞాపకముగా కలిగి ఉండి హృదయమును **'పరిశుభ్రము'** చేయనందు వల్లనే అది 'మహాసంసారము'గా రూపుదిద్దుకొంటోంది. త్యజించివేసినందువల్లనో? అది 'మోక్షమే' అవుతుంది.

---

అజడో అగళిత ఆనందః
త్యక్త సంవేదనో భవ।

ఇంతవరకు వినిన-చూచిన-వినని-చూడని దృశ్య విషయములను హృదయమునుండి కడిగివేసి వాటికి అతీతుడవై, సాక్షివై ఉండటమే 'మోక్షము' అని చెప్పబడుతోంది.

అందుచేత ఓ నిదాఘ మహాశయా! సంవేదనము (The details of the worldly knowing) హృదయమునందు లేనివాడవై, అజడుడవై, అనిర్వచనీయ ఆత్మానంద స్వరూపుడవై ఉండుము.

(Wash out all that being impressively influencing you by Indrias. Leave the mildness. Please fill up your inner-recess with un-definable happyness of your own sense of Self).

---

సంవిత్ వస్తు వశ ఆలంబః
సా యస్య ఇహ న విద్యతే,
సో "సంవిత్ అజడః" ప్రోక్తః,
కుర్వన్ కార్య శతాని అపి,
సంవేద్యేన 'హృత్' ఆకాశే మనాగపి న లిప్యతే।

ఈ జగత్తులో అనివార్యముగా చేయవలసి వస్తున్న ఆయా కర్మ - క్రియావిశేషాలు ఆత్మానుభవానికి అడ్డంకులుగా ఉన్నాయా? లేదు. ఎవ్వడైతే ఇక్కడి వస్తు విషయ-వశ-ఆలంబనములు సంవిత్ (ఆత్మ) భావనతో గమనిస్తూ ఉంటాడో,... అట్టివాడు 'అసంవిత్-అజడుడు' అనబడుచున్నాడు. అట్టివాడు వందరకములైన పనులు నిర్వర్తిస్తూ ఉన్నప్పటికీ, ఇక్కడి సంవేద్యముచే (తెలియబడే ఈ జగత్ విశేషములచే) కించిత్ కూడా మూలదోషము పొందడు.

---

యస్య అసావత్ అజడా సంవిత్
'జీవన్ముక్తః' స కథ్యతే।

ఎవ్వడైతే అజడా-సంవిత్ అయి, **"సంవిత్‌ధారణ"** కలిగి ఉంటాడో, ఆతడు **జీవన్ముక్తుడే। (సంవిత్ = సత్ + విత్ ల కేవలీరూపము).**

---

యదా న భావ్యతే కించిత్ నిర్వాసనతయా ఆత్మని,
బాల మూక ఆది విజ్ఞానం ఇవ చ స్థీయతే స్థిరమ్,
తదా జాడ్య వినిర్ముక్తం అసంవేదనం ఆతతమ్।

ఎప్పుడైతే ఈ జీవుడు 'నిర్వాసన'ను అధిరోహించినవాడై కించిత్ కూడా బాహ్య జగత్ విషయమై భావన కలిగి ఉండడో,

బాలునివలె ఈ జగత్తు తనయందు లేని వాడై మూగవానివలె జగతబీచ్ విషయములు ఆసక్తితో సంభాషించనివాడై ఆత్మస్వరూప భావనా-రూప విజ్ఞానదృష్టియందు సుస్థిరుడై ఉంటాడో,

అప్పుడిక ఆతడు సంవేదనము (ఇంద్రియములచే తెలియబడే ఇంద్రజాలము) అనే జాడ్యము వదిలించుకొన్నవాడగుచున్నాడు.

---

ఆశ్రితం భవతి ప్రాజ్ఞో
యస్మాత్ భూయో న లిప్యతే।
సమస్తా వాసనాః త్యక్త్వా
నిర్వికల్ప సమాధితః,
తన్మయత్వాత్ అనాద్యంతే
తదపి అంతః విలీయతే॥

అట్టి ప్రాజ్ఞుడు మరల దోషము పొందనట్టి స్థానమును ఆశ్రయించినవాడై ఉంటున్నాడు.

సమస్త వాసన-అవాసనల ప్రహసనమంతా త్యజించి వేసి ఆత్మతత్త్వజ్ఞుడు నిర్వికల్ప సమాధియందు నిష్ఠ పొందుచున్నాడు. ఆద్యంతరహితుడై, ఈ సమస్తము ఆత్మయందు విలీనము చేసుకొని తనకు **ఇదంతా** తన్మయముగాను, అనన్యముగాను, తాను ఇద్దానికి అనన్యముగాను దర్శిస్తున్నాడు.

| | |
|---|---|
| **9. తిష్ఠన్ గచ్ఛన్ స్పృశన్ జిఘ్రన్ అపి<br>తత్ లేప వర్జితః<br>అజడో అగలిత ఆనందః<br>త్యక్త సంవేదనః సుఖీ॥<br>ఏతాం దృష్టిం అవష్టభ్య<br>కష్ట చేష్టాయుతో - అపి సన్,<br>తరేత్ దుఃఖ-అంబుధేః పారం<br>అపార గుణసాగరః॥** | <u>అసంవేదనుడు - సంవేదనము (తెలియబడేది) లేనట్టివాడు</u><br>ఎవ్వడైతే కూర్చున్నప్పుడు, వెళ్ళుచున్నప్పుడు, నడుస్తున్నప్పుడు, స్పృశిస్తున్నప్పుడు, వాసన చూస్తున్నప్పుడు కూడా ఆయా దృశ్యముల లేపనము (Paste) తనయందు ఏమాత్రము లేనివాడై, అజడుడై, ఆత్మసంతృప్తుడై దృశ్యమును త్యజించినవాడై ఉంటాడో, అట్టివానికి మాత్రమే ఈ తెలియబడే సమస్తము - సుఖ స్వరూపమవగలదు. దృశ్యము హృదయమునందు రహితము చేసుకొన్నవాడే సుఖి! పడవ నీళ్లలో ఉన్నప్పటికీ, పడవలో నీళ్లు ఉండవు కదా!<br>ఎంత కష్టముతో కూడుకొని ఉన్నప్పటికీ ఎవ్వడైతే దృశ్యాతీత-ఆత్మతన్మయ దృష్టిని అవలంబించువాడై ఉంటాడో, అట్టివాడు మాత్రమే ఈ విస్తార దుఃఖ సంసార సాగరమును దాటివేయగలుగుతాడు. |
| **విశేషం సం పరిత్యజ్య<br>సత్‌మాత్రం యత్ అలేపకమ్,<br>ఏకరూపం మహారూపం<br>సత్తాయాః తత్ పదం విదుః॥** | ఇక్కడి సమస్త దృశ్యవిషయ-విశేషములను సంపరిత్యజించివేసి, అప్పటికీ శేషించియుండే స్వాభావికమైన-అలేపకమైన కేవల'సత్తమాత్రము' (దృశ్య-ద్రష్టాతీత దృక్‌రూపము) శేషించుచున్నదో, అట్టి వ్యవహారమగు స్వకీయ స్వరూపమే తత్ పదము అని గమనించెదగవుగాక! |
| **కాలసత్తా కలాసత్తా వస్తు సత్తేయం ఇతి అపి,<br>విభాగ కలనాం త్యక్త్వా '<u>సత్</u>' మాత్ర ఏకపరో భవ॥** | (1) కాలసత్తా (2) కలాసత్తా (3) వస్తు సత్తా ఈ మూడు కలన సత్తాలను (కల్పనలను) త్యజించగా, ఏ '<u>**కేవలసత్త**</u>' శేషించుచున్నదో, - అదియే నీవై ఉండుము. |
| **సత్తా సామాన్యం ఏవ ఏకం భావయన్ కేవలం విభుః<br>పరిపూర్ణః పర ఆనందీ తిష్ఠాపూరిత దిగ్భరః॥** | సమస్తముగా విస్తరించి సంప్రదర్శనమగుచున్న కేవల సత్తా సామాన్యము (That which is at present and All pervading while being one's own Absolute Self) ను మాత్రమే భావన చేస్తూ, తదితర భావనలను ఏక సత్తాభావనయందు ఏకము చేసివేసెదవుగాక! |
| **సత్తా సామాన్య పర్యంతే<br>యత్ తత్ కలనయోత్ జ్ఝితమ్। (యోజ్ఝితం) (పదం)॥** | అట్టి పరిపూర్ణము, పరానందము అగు సత్తా సామాన్యము సిద్ధించేవరకు అపూరితమగు కలనములను (All attributions and individuals perceptions) జయించుటయందు ప్రయత్నశీలుడవ్వాలి. |
| **పదం ఆద్యం అనాద్యంతం (అనాది-అంతం)<br>తస్య బీజం న విద్యతే।<br>తత్ర సంలీయతే సంవిత్, నిర్వికల్పం చ తిష్ఠతి॥** | <u>**స్వస్వరూప కేవలము.**</u> (ఈ దేహ-లోక-మనో-బుద్ధి-చిత్త-అహంకారాలకు మునుముందే ఉండి ఉండటంచేత) ఆద్యము. ఆది - అంత రహితము. అద్దానికి **బీజము** లేదు. అట్టి కేవలానంద స్వరూపమగు సంవిత్ (సత్+విత్) (లేక) జీవాత్మ-సంలీయము పొంది స్థితించటమే 'నిర్వికల్పస్థితి'. |
| **భూయో న వర్తతే దుఃఖే,<br>తత్ర లబ్ధపదః పుమాన్॥** | అట్టి అఖండ -అప్రమేయ ఆత్మపదము లభించిన తరువాత ఇక దృశ్యము గురించిన దుఃఖము(Worry) శేషించదు. |
| **తత్ హేతుః సర్వ భూతానాం।<br>తస్య హేతుః న విద్యతే॥** | సర్వభూతజాలమునకు కారణము అట్టి నిత్య సత్యమగు ఆత్మయే. అయితే, అట్టి ఆత్మకు మరొక కారణము ఏదీ లేదు. అది అకారణము. తనకు తానే కారణము. |
| **10. స సారః సర్వ సారాణాం<br>తస్మాత్ సారో న విద్యతే॥** | ఈ జీవాత్మ-జగత్తు మొదలైన సమస్తమునకు సారము ఆత్మయే. అట్టి ఆత్మకంటే వేరైన సారము మరింకేదీ లేదు. అది మరొకదేని సారమూ కాదు. |
| **తస్మిన్ చిత్ దర్పణే స్ఫారే<br>సమస్తా వస్తు దృష్టయః॥** | అట్టి "చిత్" అనే దర్పణములో ఇక్కడి సమస్త వస్తు సముదాయము (అద్దములో దృశ్యమువలె) ఏర్పడినదై ఉన్నది. |

| | |
|---|---|
| **ఇమాస్తాః ప్రతిబింబంతి**<br>**సరసీవ తట ద్రుమాః**<br>**తత్ అమలం అజరం। తత్ ఆత్మ తత్త్వమ్।**<br>**తత్ అవగతా ఉపశాంతిం ఏతి చేతః।** | ఒడ్డునగల వృక్షము సరస్సుయొక్క జలములో ప్రతిబింబించు తీరుగా ఈ సమస్తము ఏ ఆత్మయందు ప్రతిబింబిస్తుందో, అట్టి ఆత్మ మలరహితము (నిర్మలము). జరామరణములు లేనట్టిది. అట్టి ఆత్మతత్త్వము ఎరిగిన తరువాత ఇక చిత్తము తనకు తానే (ఆత్మయందు, ఆత్మకు అనన్యమై) ఉపశమించగలదు. |
| **అవగత విగతా-ఏక, తత్ స్వరూపో**<br>**భవ భయ ముక్త పదో అసి సమ్యక్ ఏవ।** | అట్టి నీ స్వస్వరూపము నీకు అవగతమై 'అన్యము' అను భావననుండి విగతుడవై, సర్వభయములు - వేదనలు త్యజించి వేయుము. సమ్యక్‌భావము మాత్రమే సుస్థిరీకరించుకున్నవాడవై ఉండుము. |
| **ఏతేషాం దుఃఖబీజానాం**<br>**ప్రోక్తం యద్యత్ మయోత్తరమ్।**<br>**తస్య తస్య ప్రయోగేణ**<br>**శీఘ్రం తత్ ప్రాప్యతే పదమ్॥** | **"ఈ దృశ్యముతో స్వయముగా ఏర్పరచుకొన్న చిత్తసంబంధము"** అని నేను ఏది దుఃఖబీజముగా చెప్పుకుంటూ వస్తున్నానో, అదంతా కూడా ఆత్మతత్త్వ ధ్యాన భావనలచే ప్రయత్నిస్తూ ఉండగా - తరిగిపోగలదు. క్రమంగా అతిత్వరలో ఆత్మపదము నీకు ప్రాప్తించగలదు. దీపము వెలిగించిన తరువాత చీకటికి చోటెక్కడిది? చీకటి ఎటుపోతుందో ఏమని చెప్పగలం? |
| **"సత్తా సామాన్య కోటిస్థేద్రాగి"**<br>**ఇత్యేవ పదే యది,**<br>**పౌరుషేణ ప్రయత్నేన**<br>**బలాత్ సంత్యజ్య వాసనామ్॥** | "నాకు అట్టి సత్తాసామాన్య స్థితి త్వరత్వరగా సిద్ధించాలి" - అని భావించి, ఔత్సాహికుడవు అయి ఉంటే, అది సిద్ధించే మార్గము - ఒక్కటే ఒక్కటి! **"బలముతో కూడిన పురుషకార ప్రయత్నములతో వాసనలు త్యజించటమే!"** అందుచేత "దృశ్య విషయములపట్ల రాగమును జయించటం" అనునదే ముఖ్య ఆశయము. వేటివేటి పట్ల **ఆశ, కోపము, రాగము,** ఉండవో, అవి జయించబడినట్లే. (ఇవియే కామ-క్రోధ-లోభములు). |
| **స్థితిం బధ్నాసి, తత్త్వజ్ఞ!**<br>**క్షణమపి (క్షణం అపి) అక్షయాత్మికామ్।**<br>**క్షణే అస్మిన్నేవ తత్**<br>**'సాధుపదం' ఆసాదయసి అలమ్।** | హే తత్త్వజ్ఞా! వాసనలు జయిస్తూనే, నీవు ఒక్క క్షణమైనా అక్షయాత్మికమగు ఆత్మపదమునందు స్థితిని సిద్ధించుకోగలిగావా, తత్‌క్షణమే మహత్తరమగు ఆత్మపదము (సాధుపదము) సిద్ధించుకోగలవు. వాసనలు జయించావా, క్షణంలో అట్టి సాధు పదమును ఇప్పుడే, ఇక్కడే పొందగలవు. క్రమంగా స్వాభావికం కాగలవు. |
| **సత్తా సామాన్యరూపే వా**<br>**కరోషి స్థితిమ్ ఆదరాత్,**<br>**తత్ కించిత్ అధికేన ఇహ**<br>**యత్నేన ఆప్నోషి తత్ పదమ్॥** | **"సత్తా సామాన్య పదము"**ను రోజుకు కొంచము సేపు ఇష్టముగా, ఆదరముగా, ఆప్యాయముగా, అభ్యాసము చేస్తూ ఉంటే...ఆ విధంగా కొంచము కొంచము అధికం చేసుకొని ఉండు ప్రయత్నముచే **'తత్ పదమును'** అలంకరించగలవు.<br>[సత్తా సామాన్యము = **"ఈ జగత్తంతా నాయొక్క సామాన్య (స్వాభావిక) సత్తాస్వరూపమే"** - అను **స్వాభావిక భావనా నిశ్చలత్వము.**] |
| **11. సంవిత్ తత్త్వే కృతధ్యానో,**<br>**నిదాఘ! యది తిష్ఠసి,**<br>**తత్ యత్నేన అధికేన ఉచ్చైః**<br>**ఆసాదయసి తత్‌పదమ్।** | ఓ నిదాఘా! సంవిత్‌తత్త్వము అనగా **"ఏకము, అఖండము, నిత్యము అగు ఆత్మయే నేను - నీవు - ఈ జగత్ దృశ్యము కూడా"** - అని అనుకుంటూ ఉండటమే సంవిత్ (కేవలమగు ఉనికి-ఎరుక) తత్త్వముయొక్క ధ్యానము చేయుటయందు నీవు ఈమాత్రము నిమగ్నుడవై ఉండటములో కష్టమేమున్నది-చెప్పు?<br>అట్టి **"అనుకుంటూ-భావిస్తూ"** ఉంటున్న సాధన అధికమగుచుండగా అత్యుత్తమమగు సంవిత్ పదమును అధిరోహించగలవు. బ్రహ్మముగా ఈ సమస్తమును మననము చేస్తూ ఉండగా బ్రహ్మమే అవగలవు. ఎందుకంటే, **నీవు సర్వదా 'తత్ స్వరూపుడవే' అయి ఉన్నావు కాబట్టి.** |

## దృశ్య మననము - ఆత్మ మననము

వాసనా సం-పరిత్యాగే
యది యత్నం కరోషి భో,
యావత్ విలీనం న మనో,
న తావత్ వాసనాక్షయః॥

**నక్షీణా వాసనా యావత్,**
**చిత్తం తావత్ న శామ్యతి।**

'జగత్ దృశ్య మననము' అనే సాంసారికాభ్యాసము" చేతనే వాసన ప్రవృద్ధమగుచూ దేహ-దేహాంతర భ్రమలకు కారణమగుచున్నాయి. 'దృశ్యమననము' స్థానమును 'ఆత్మమననము' ఆక్రమించివేయును గాక! అనగా దృశ్య వాసనలు ఆత్మమననముచే జయించాలి.

బిడ్డా! నిదాఘా! వాసనలు ఎట్లా తొలగుతాయి? మననమును ఉపశమించటం చేతనే! వాసనలు పరిత్యజించబడక, మనస్సు మొదలంట్లా ఆత్మ భావనయందు విలీనము కానంత వరకు వాసనలు క్షయించవు. మనస్సు లయించదు.

వాసనలు క్షీణించనంతవరకు చిత్తము శమించదు. మనస్సు తన చాంచల్యము త్యజించదు.

---

యావత్ న తత్త్వ విజ్ఞానం,
తావత్ చిత్త శమః కుతః?

"త్వమ్ తత్ శివేతి" - అను తత్త్వవిజ్ఞానము దృఢం కాకుండా, "నేను వేరు! నీవు వేరు! ఈశ్వరుడు వేరు! జీవుడు వేరు! జ్ఞాని వేరు! అజ్ఞాని వేరు" అను భేదదృష్టిని తత్త్వదృష్టి ఆక్రమించి వేయకుండా ఉంటే - చిత్తము ఎట్లా శమిస్తుంది? భేద దృష్టిని త్యజించనంతకాలము చిత్తము కొనసాగుచూనే ఉంటుంది.

---

యావత్ న చిత్త - ఉపశమో
న తావత్ తత్త్వ వేదనమ్।
యావత్ న వాసనా నాశః
తావత్ తత్త్వ ఆగమః కుతః?

ఎంతవరకు చిత్తము ఉపశమించదో, అంతవరకు ఆత్మజ్ఞానము, తత్త్వదృష్టి (లేక) ఆత్మదృష్టి సిద్ధించదు. "ఇదంతా మమాత్మయే" అని అనిపించదు.

వాసనలు ఎంతవరకు నశించవో, (కొనసాగుచూనే ఉంటాయో) అంతవరకు 'తత్త్వమసి' అను నిశ్చలబుద్ధి రూపమగు తత్త్వసిద్ధి ఎట్లా ప్రాప్తిస్తుంది? ప్రాప్తించదు.

---

యావత్ న తత్త్వ సంప్రాప్తిః
న తావత్ వాసనా క్షయః।
తత్త్వ జ్ఞానం, మనో నాశో
"వాసనా క్షయ ఏవ చ"

"త్వమ్‌గా (నీవుగా) కనిపిస్తున్నది - తదేవ. తత్ బ్రహ్మేమేవ! త్వమ్ బ్రహ్మ-అసి!" - అను తత్త్వము సంప్రాప్తించనంతవరకు (సంసిద్ధించ నంతవరకు) వాసనలు క్షయించవు.

'తత్త్వజ్ఞానము' అనగా? (దృశ్య భేద మనన రూపమగు) మనస్సు నశించగా (భేదదృష్టి తొలగగా) ఏర్పడు వాసనాక్షయమే 'తత్త్వజ్ఞానము'.
**అంతేగాని, శాస్త్రజ్ఞానము తత్త్వజ్ఞానము కాదు. "తత్‌త్వమ్' అనునది తెలిస్తే సరిపోదు. అనిపించాలి. అనిపించాలంటే, అనుకుంటూ ఉండాలి.**

---

మిథః కారణతాం గత్వా
దుస్సాధాని స్థిత అన్యతః॥

ఈ విధంగా (1). దృశ్య మనన త్యాగము (2) వాసనా క్షయము (3) చిత్తనాశనము (4) తత్త్వచింతన (5) తత్త్వభావన (6) తత్త్వానుభూతి (7) సోఽహమ్ స్వానుభవము - ఇవన్నీ కూడా పరస్పరము ఒకదానికి మరొకటి కారణముగా అగుచున్నాయి. ("తత్త్వమ్" = "అదియే నీవు")

---

భోగ ఇచ్ఛాం దూరతః త్యక్త్వా,
త్రయం ఏతత్ సమాచార।

ఈ ఇంద్రియములు భోగములవైపుగా ఎల్లవేళలా ప్రయాణిస్తూ ఉన్నాయి. కాబట్టి నిదాఘా! భోగేచ్ఛను దూరంగా త్యజించి వేసి **(1) వాసనాక్షయము (2) మనో నాశనము (3) తత్త్వజ్ఞానము** అను ఈ మూడిటిని బాగుగా అభ్యాసము చేయి.

---

వాసనాక్షయ విజ్ఞాన మనోనాశా,
మహామతే। సమకాలం (చిరకాలం) చిర అభ్యస్తా
భవంతి ఫలదా మతాః।

ఓ మహామతే!

ఈ (1) వాసనాక్షయ (2) విజ్ఞాన (3) మనో (మనన) నాశనము ఒక్కసారిగా చిరకాలము అభ్యసించాలి. అనగా ఒకదాని తరువాత మరొకటి అభ్యసించటము కాదు. ఒక్కసారే ఈ మూడు అభ్యసిస్తే అది మహత్తరంగా ఫలప్రదము కాగలదు - అని నా అభిప్రాయము.

| | |
|---|---|
| త్రిభిః ఏభిః సం అభ్యస్తైః<br>హృదయ గ్రంథయో దృఢాః।<br>నిశ్శేషం ఏవ త్రుట్యంతి<br>బిసత్ ఛేదాత్ గుణా ఇవ॥ | ఈ వాసనాక్షయ-విజ్ఞాన-మనోనాశనములు ఒక్కసారే అభ్యసిస్తూ ఉండగా, - తామరకాడ త్రెంచినప్పుడు లోని దారములు కూడా తెగిపోవు విధంగా - (1) ఈ దృశ్యము సృష్టించబడింది (2) ఇది కొనసాగుతోంది (3) ఇది లయిస్తోంది'' అనబడే హృదయగ్రంథులు (చిక్కుముళ్ళు) మొదలంట్లా నిశ్శేషంగా తొలగుతాయి. (బ్రహ్మ-విష్ణు-రుద్రగ్రంథులు విడివడతాయి). |
| వాసనా సంపరిత్యాగే<br>సమం ప్రాణనిరోధనమ్<br>విదుః తత్త్వవిదః।<br>తస్మాత్ తత్ అపి ఏవం<br>సమాహరేత్। (సమాచరేత్)॥ | (దృశ్యములో భేదదర్శనరూపమగు) వాసనలను పరిత్యజించటానికై ప్రాణనిరోధము (లేక) ప్రాణాయామము ఉపాయము - అని తత్త్వ విదులు - **(తత్త్వవేత్తలు - తత్త్వమేవ అని ఎరిగిన తత్త్వ విద్వాంసులు)** - ఎలుగెత్తి చెప్పుచున్నారు. అందుచేత "ప్రాణనిరోధ-అభ్యాసము" - వాసనలను త్వరగా తేలికగా హరించివేయగలదు.<br><br>✐ ప్రాణాయామముచే వాసనలను త్యజించటము సులభమౌతుంది.<br>✐ వాసనాపరిత్యాగముచే ప్రాణచలనము సమత్వము పొందగలదు. |
| వాసనా సంపరిత్యాగాత్ చిత్తం గచ్ఛతి అచిత్తతామ్।<br>ప్రాణస్పంద నిరోధాచ్చ।<br>యథా ఇచ్ఛసి తథా కురు॥ | వాసనాత్యాగముచే చిత్తము అచిత్తత్వము సంతరించుకోగలదు. అట్లాగే ప్రాణాయామాభ్యాసముచే ప్రాణ స్పందము నిరోధించబడినదై, అది అచిత్తత్వము ప్రసాదించగలదు.<br><br>(1) వాసనా పరిత్యాగము (2) ప్రాణాయామము (3) విచారణ .... ఈ మూడిటిలో ఏది ఇష్టమో, ఆ మార్గాన్ని అనుసరించు. (లేదా) ఈ మూడిటిని సందర్భ యుక్తంగా ఆచరించు. **చివరికి ఈ మూడిటిని ఏకరూపము చేయి.** |
| **12.** ప్రాణాయామ దృఢ అభ్యాసైః<br>యుక్త్యా చ గురుదత్తయా<br>ఆసనాశన (ఆసన-అశన) యోగేన<br>ప్రాణస్పందో నిరుధ్యతే। | (1) దృఢమైన ప్రాణాయామ యోగాభ్యాసము<br>(2) గురుముఖతః తత్త్వజ్ఞానము శ్రవణము చేసి తత్త్వ దృష్టి కొరకై యుక్తిని సంపాదించటము.<br>(3) ఆసన జయము (స్వాభావికము, సానుకూలము అగు 'ఆసనము'ను సుసుఖము చేసుకోవటము).<br>**(4) ఇంద్రియములతో ఏది ఎంతవరకు ఎందుకొరకై స్వీకరించాలి, (మరియు) త్యజించాలి?** - అని ఎరిగి నిర్వర్తించు అసనయోగము, ఆహార నియమము -<br>వీటన్నిటి అభ్యాసముచేత ప్రాణస్పందన నిరోధము (వశమై ఉండటము) - సామర్థ్యము అవగలదు. సాధ్యపడగలదు. |
| నిస్సంగ వ్యవహారత్వాత్ భవ భావన వర్జనాత్। | ఈ ప్రపంచములో నిస్సంగము (Non-Attachment. Sense of beyondness) తో వ్యవహరిస్తూ ఉండగా భవభావము (ఈ జగత్తు యొక్క భేదములతో కూడిన ప్రత్యక్షరూపము నిజమే - అని తలచుభావన) తొలగుతోంది. |
| శరీర నాశ దర్శిత్వాత్ వాసనా న ప్రవర్తతే। | **"ఈ భౌతిక శరీరము నశించబోయేదే, శరీరిని అగు నేను నశించను" -** అను భావనచే వాసనలు ఇక ప్రవర్తించటం మానివేస్తాయి. |
| యః ప్రాణ పవన స్పందః<br>"చిత్తస్పందః" - సయేవ హి।<br>ప్రాణస్పంద జయే యత్నః<br>కర్తవ్యో ధీమతోఽచ్చకైః॥ (ధీమతా ఉచ్చకైః)॥ | ఏది ప్రాణస్పందమో అదియే చిత్తము యొక్క స్పందము కూడా. ఉత్తమ బుద్ధితో ప్రాణస్పంద జయమునకు ఉపక్రమించుచుండెదవు గాక. ధీమంతులు ప్రాణస్పందనజయముచే చిత్తమును పూర్తిగా వశం చేసుకొని ఉంటున్నారు. |

**న శక్యతే మనో జేతుం**
**వినా యుక్తిం అనిందితామ్।**

ఓ నిదాఘా! అనిందితమైన (దోషభూయిష్టము కానటువంటి) **యుక్తిని** (ఉపాయమును) ఆ(శ్రయించకపోతే మనస్సును జయించటము తేలికేమీ కాదు. సాధ్యం అవదు. ఎందుకంటే, ఈ మనస్సు అనేక జన్మలుగా సుదీర్ఘమైన (ప్రత్యాకర్షణ - అభ్యాసములచే రూపుదిద్దుకొన్నది కాబట్టి.

---

**శుద్ధాం సంవిదం ఆ(శిత్య**
**వీత రాగః స్థిరో భవ।**

అందుచేత నీవు శుద్ధ సంవిత్తు **(కేవలమగు స్వరూపాత్మ, ఉనికి-ఎరుక తనదైన నిత్యస్వరూపము)**ను ఆ(శయించు. 'అన్యము' ను త్యజించు. **సర్వ(త్రా అనురాగముతో కూడిన విరాగము కలవాడవై ఆత్మయందు సుస్థిరుడవు అగుము. సర్వ(త్రా అనురాగము విరుగమే.**

---

**సంవేద్య వర్జితం, అనుత్తమం, ఆద్యం**
**ఏకం సంవిత్ పదం**
**వికలనం కలయన్, మహాత్మన్!**
**హృతి ఏవ తిష్ఠ కలనా రహితః (క్రియాంతు,**
**కుర్వన్ న కర్తృపదం**
**ఏత్య శమోదిత శ్రీః।**

హే మహాత్మన్! సంవిత్ పదమును (కేవలాత్మతత్త్వమును) ఆ(శయించుము.

- సంవేద్య (తెలియబడే సమస్తమునకు) వర్జితము (అతీతము) అయి,
- ఉత్తమోత్తమమై,
- సమస్తమునకు మొదలే ఉన్నట్టిదై,
- కల్పనా రహితమై, (వికలన - కలయమై), **హృదయమునందేగల ఆ సంవిత్తును దర్శిస్తూ కర్మలు నిర్వర్తించుము.**

దేనికీ కర్త కానివాడవై, శమముచే ఉదయించిన శ్రీకరమగు ఆత్మనే అంతటా దర్శించుము.

---

**మనాగపి విచారేణ**
**చేతసః స్వస్య ని(గహః**
**పురుషేణ కృతో యేన**
**తేన ఆప్తం జన్మనః ఫలమ్। ఇతి॥**

ఎవ్వడైతే కొంచమైనా విచారణ చేసి ఈ చిత్తము యొక్క పోకడలను ని(గహించటమును నిర్వర్తిస్తాడో, అట్టి పురుషుడు కృతార్థుడే. మానవుడుగా జన్మించినందుకు కృతార్థుడై ఉత్తమఫలము (ఆత్మతత్త్వానుభవఫలము) పొందుచున్నట్లే.

> ***చిత్తమును నిరోధించే (ప్రయత్నము చేయనివానికి, అందుకొరకై కొంచమైనా ఉపాయములు ఆ(శయించనివానికి -మానవజన్మ అను మహత్తరమగు అవకాశము వృథా అగుచున్నట్లే సుమా!***

**ఇతి చతుర్థోఽధ్యాయః**

***ఇతి 4వ అధ్యాయము***

# పంచమోధ్యాయః - అవిచారో హి మృత్యుః

1. ఓం। గచ్ఛతః తిష్ఠతోవ అపి,
   జాగ్రతః స్వప్నతోఽపి వా,
   న విచారపదం చేతో,
   యస్య అసౌ 'మృత' ఉచ్యతే॥

ఎవ్వడైతే తాను నడుస్తున్నప్పుడు, కూర్చున్నప్పుడు, (మరియు) జాగ్రత్ - స్వప్న సందర్భములలోను - ఆత్మవిచారపరమైన చిత్తము కలిగియుండడో, ఆతడు అంతవరకు మరణించిన వానితో సమానమే! ఆత్మవిచారణ లేకపోవటమే మృతి. (ఎవ్వడు ఆత్మ - విచారణ చేస్తూ ఉంటాడో, అట్టివాడే అమృతుడు)

---

సమ్యక్ (జ్) జ్ఞాన సమాలోకః
పుమాన్ జ్ఞేయ సమః స్వయమ్,
న బిభేతి, న చ ఆదత్తే వైవశ్యం న చ దీనతామ్।
అపవిత్రమ్ అపథ్యం చ
విష సంసర్గ దూషితమ్,
భుక్తం జరయతి జ్ఞానీ
క్లిన్నం నష్టం చ మృష్టవత్॥

ఏ పురుషుడైతే సమ్యక్ - (Equally and independently placed through out what is being seen) జ్ఞానముతో ఈ సమస్త లోక దృశ్యములను సమాలోకనము చేస్తూ, స్వయం సమస్వరూపముగా ఎరుగుచూ ఉంటాడో **- అట్టివాడు దేనికీ భయము పొందడు. ఎట్టి వికారములు కలిగి ఉండడు. దేనికీ వివశత్వముగాని, దీనత్వమునకు గాని లోనుకాడు.**

అట్టి జ్ఞాని - అపవిత్రమైనది, తినగూడినది, విషముతో కూడి దూషితమైనది మొదలైనవి పొందవలసి వస్తున్న సందర్భములలో కూడా - మధురమైన ఆహారమువలె (మృష్టాన్నము వలె) స్వీకరించుచూ ఉండగలడు.

---

**సంగ త్యాగం విదుః 'మోక్షం'।**
**సంగత్యాగాత్ 'అజన్మతా'।**
**సంగం త్యజ త్వం భావానాం,**
**'జీవన్ముక్తో' భవ, అనఘ!**

హే నిర్మల భావుడా! పుణ్య స్వభావుడా! అనఘా! నిదాఘ మునీ!

- సంగము (Attachment with all aspects of worldy scenareo) ను త్యజించి ఉండటమే **మోక్షము.**

- అట్టి "సంగ అసంగమే" (Detached Attachment) జన్మ-రాహిత్యము కూడా.

అందుచేత భావనాపూర్వకంగా సమస్తసంగము (Relatedness) లను త్యజించి జీవన్ముక్తుడవు అగుము.

---

భావ అభావే పదార్థానాం,
హర్ష-అమర్ష వికారదా,
మలినా వాసనా య ఏషా (యైషా)
సా 'సంగ' ఇతి కథ్యతే॥
(నిర్వాసనా 'అసంగ' ఉచ్యతే।)

**సంగము అనగా?**

ఈ దృశ్య పదార్థముల పట్ల భావ-అభావములతో కూడిన సంతోష-దుఃఖములు కలుగజేయగలిగే మలిన వాసనలు కొనసాగించుచూ ఉండటమే **'సంగము'** అనబడుతోంది. అరిషట్వర్గముతో కూడిన **మమకార-అహంకా రూప భావనలు హృదయంలో కలిగి ఉండటమే సంగము. వాసనా రాహిత్యమే 'అసంగము'.**

---

జీవన్ముక్త శరీరాణాం
అపునః జన్మకారిణీ,
ముక్త-అహంకృతిః అభ్యాసాత్
శాంతా భవతి వాసనా॥

మమకార-అహంకార, సుఖదుఃఖ నిర్వచనములు - మొదలైన భావములు హృదయమునందు కలిగియుండుటయే వాసనల యొక్క రూపము. అట్టి వాసనలు రెండు రకాలు. **(1) శుద్ధ వాసనలు (2) మలిన వాసనలు.**

శుద్ధవాసనలు - అగ్నిలో కాల్చబడిన విత్తనమువలె పునర్జన్మ హేతువులను రహితం చేస్తాయి. అందుచేత

ఓ నిదాఘా! (నేను-నాది రూపమగు) 'అహంకృతి'ని శమింపజేయు అభ్యాసముచేతనే వాసనలు శమిస్తాయి. జీవన్ముక్తుని విషయంలో పునర్జన్మను లేకుండా జేయు, అహంకార బంధము తొలగించివేయు సాత్విక **వాసనల** అభ్యాసముచే మలినవాసనలు శాంతించగలవు.

దుఃఖైః న గ్లానిం ఆయాసి।
హృది, హృష్య సి నో సుఖైః।
ఆశావై వశ్యం ఉత్సృజ్య, నిదాఘ!
అసంగతాం వ్రజ॥

ఓ నిదాఘా! పునర్జన్మ కారకములగు మలినవాసనలు తొలగాలంటే ఎట్లా? ఉపాయములు చెప్పుచున్నాను. విను.

(1) దుఃఖములకు క్రుంగకు. గ్లాని పొందవద్దు.

(2) సుఖములకు పొంగకు. నావే - అని ఆనందము పడవద్దు.

(3) దృశ్యంలో ఏదో 'ఆశించటము' అనే దానికి వశం కావద్దు.

(4) దేనితోను సంగము (Attachment) పెట్టుకోవద్దు. సంగరహితుడవై ఉండు. ("ఇది నాకు చెందినది. నేను దీనికి చెందినవాడను. ఇది నాకు అనివార్యము. అది నాకు తొలగాలి" అనునదే సంగము యొక్క రూపము). సంగరహితుడవై ప్రశాంత చిత్తముతో భూమిపై చరించు.

---

దిక్ కాలాది అనవచ్ఛిన్నం
అదృష్ట-ఉభయకోటికమ్,
చిత్-మాత్రం, అక్షయం, శాంతం,
ఏకం బ్రహ్మాస్మి। నేతరత్॥
(ఏకం 'బ్రహ్మ' అస్మి। న ఇతరత్)।

"దృశ్యములో ప్రతిది నశించబోతోంది. మరి నేనో? ఆత్మనగు నేను నశించు స్వభావము కలవాడను కాదు. దిక్కుకాలముల సరిహద్దులచే పరిమితముకాని వాడను. అవిచ్ఛిన్నుడను. అదృష్టమగు (దృశ్యముగా కనబడని) అభయ స్వరూపుడను. కేవల చిత్ స్వరూపుడను. అక్షయము, శాంతము, ఏకము, అఖండము అగు బ్రహ్మమే అయి ఉన్నాను. మరింకొకటేదీ అయి ఉండనేలేదు" - అని సుస్పష్టముగా, నిర్దుష్టముగా తలచుచున్నవాడవై ఉండుము.

---

2. ఇతిమత్వా '<u>అహం ఇతి</u>', (య)
అంతర్ముక్తా ముక్తవపుః పుమాన్
ఏక రూపః ప్రశాన్తాత్మా
<u>"మౌనీ-స్వాత్మ సుఖో"</u> భవ॥

ఈ విధంగా **"సహజము శాశ్వతము, బంధరహితము అగు ఆత్మయే నేను। సోఽహమ్।"** అని గ్రహించి అంతరమున బంధరహితుడవై, నిత్యముక్తుడవై ఉండుము. <u>**"బాహ్యమున బంధము** కనిపిస్తున్నప్పటికీ, **(జీవాత్మ**గా నిత్యము బద్ధుడను - అయి ఉండి కూడా), **పరమాత్మ**గా నిత్యముక్తుడను"</u> అని గమనిస్తూ ప్రశాంతాత్ముడవగుము. బాహ్య సమస్త విషయములపట్ల మౌనము వహించినవాడవై - మౌనివై - సర్వదా ఆత్మ సుఖివై ఉండుము. (జగత్ మౌనమ్, ఆత్మజాగ్రత్ -ఇతి మునిః)

---

నాస్తి చిత్తం। న చ అవిద్యా।
న మనో। న చ జీవకః।
'బ్రహ్మ' ఏవ ఏకమ్ అనాది - అంతమ్
అబ్ధివత్ ప్రవిజృంభతే॥

నిత్యము సముద్రజలంలో అసంఖ్యాక తరంగాలు బయల్వెడలి, తిరిగి లయిస్తూ ఉండవచ్చు గాక! జలమునకు వేరుగా తరంగాలు లేవు. తరంగముల క్షోభ జలమునకు ఉన్నట్లు కాదు. సముద్రంలో సర్వదా జలము మాత్రమే ఉన్నట్లు అవుతోంది. అట్లాగా - ఇక్కడ ఏకము, ఆద్యంతరహితము అగు బ్రహ్మము మాత్రమే ఉన్నది. అదియే జీవుని వాస్తవ - ప్రశాంత - సహజరూపము. ఇక చిత్తము లేదు. అవిద్యలేదు. మనస్సు లేదు. జీవనము లేదు. మరణము లేదు.

---

దేహే యావత్ అహం భావో,
దృశ్యే అస్మిన్ యావత్ ఆత్మతా,
యావత్ 'మను' 'ఇదం' ఆస్థా
తావత్ చిత్తాది విభ్రమః॥

ఏకము, అనంతము, ప్రశాంతము అగు ఆత్మకు వేరుగా ఏదైనా ఉన్నట్లు అనిపిస్తే అది చిత్తము యొక్క విభ్రమము (Illusion) మాత్రమే.

- ఎంతవరకైతే ఈ దేహముపట్ల అహంభావము, దృశ్యము పట్ల 'నాకు చెందినది' అను మమత్వము ఉంటాయో, ఎంతవరకైతే అహంకారము, మమకారము ఈ జీవుడు కలిగి ఉంటాడో....

అంతవరకు చిత్తము విభ్రమము పొందుచూనే ఉంటుంది. అట్టి విభ్రమమునకు 'అంతు' లేదు. కొనసాగుతూనే ఉంటుంది.

అంతర్ముఖతయా సర్వం
చిత్‌వహ్నౌ త్రిజగత్ తృణమ్,
జుహ్వాతో అంతర్ నివర్తంతే
మునే! చిత్తాది విభ్రమాః॥

ఓ మునీ! ఇంద్రియములతో విషయములు పొందుచున్న సందర్భములో కూడా, సర్వదా అంతర్ముఖుడవై ఉండు. **"చిదాత్మ గురించిన జ్ఞానము"** అనే అగ్నియందు ఈ త్రిలోకవిశేషములను తృణప్రాయంగా (గడ్డి పరకలతో సమానంగా) వ్రేల్చివేయుము. ఎవ్వడు తత్త్వజ్ఞానాగ్నిలో ఈ త్రిజగత్తులను ఆవిధంగా దహించివేస్తూ ఉంటాడో, అప్పుడిక అంతరంగములో చిత్తము **మొదలైన విభ్రమములు** -అగ్నిలో వ్రేల్చిన గడ్డిపరకలవలె **దహనమైపోగలవు.**

---

చిదాత్మాస్మి (చిత్ ఆత్మా అస్మి), నిరంశో అస్మి-
పర-అపర వివర్జితః,
రూపం స్మరన్ నిజం స్ఫారం
మా స్మృత్యా సమ్మితో భవ॥

ప్రియ నిదాఘా!

- **"నేను సర్వదా కేవలము, అనంతము"** అగు చిదాత్మ స్వరూపుడను.
- **ఈ దృశ్య - దేహ - మనో - చిత్త - అహంకారములచే నిరోధించ బడువాడను కాను. నిరంశుడను. 'జీవాత్మ' అనే అంశగా అగుచున్నవాడను కాను.**
- **"ఇహ-పర (జీవాత్మ-పరాత్మ) భేదములు ఏమాత్రము లేనట్టివాడను"**

ఈ విధంగా సర్వే సర్వత్రా విస్తరించియున్న స్వస్వరూపమును స్మరించుచున్నవాడవై ఆత్మస్వరూపమును ఆస్వాదిస్తూ సమాధానశీలుడవు అగుము. (ఇవియే ప్రతి జీవుని సహజస్వరూపముయొక్క విశేషణములు)

---

అధ్యాత్మ శాస్త్ర మంత్రేణ
తృష్ణా విష విషూచికా,
క్షీయతే భావితేన అంతః
శరదా మిహికా యథా।

నీయొక్క స్వస్వరూపము గురించి అధ్యాత్మ శాస్త్రము ఏవిధంగా ఎలుగెత్తి గానం చేస్తూ ప్రవచిస్తోందో, అట్టి పరమార్థమును **శ్రవణం చేయి. అధ్యాత్మ శాస్త్ర ప్రబోధములను మననము చేయి.** అంతే, అప్పుడేమోతుంది? శరత్ కాలములో మంచు (మిహిక) కరిగిపోతుంది చూచావా? ఆ విధంగా ఆత్మభావనచే తృష్ణా విషయ భావనలు తమకు తామే క్షీణిస్తాయి.

---

పరిజ్ఞాయ పరిత్యాగో
వాసనానాం, య ఉత్తమః,
సత్తా సామాన్య రూపత్వాత్
తత్ 'కైవల్యపదం' విదుః॥

ఆత్మయొక్క ఔన్నత్యము, సర్వాతీతత్వము ఎరుగుచూ, అట్టి పరిజ్ఞాన తేజో వీచికలకచే దృశ్యవాసనలు పరిత్యజించివేయి. అప్పుడు ఉత్తమమగు "ఆత్మసత్తాభావనా వాసన" - అనబడు శుభవాసన మాత్రమే శేషించగలదు. అట్టి కేవలమగు **"ఆత్మయేవాహమ్"** లేక **"సోఽహమ్-తత్త్వమ్"** భావన అచంచలమై శేషించియుండటమే 'కైవల్యము' లేక 'ఆదిశేష్యము' కూడా! అట్టి కైవల్యస్థితిలో శుభాశుభ ఉభయ వాసనలు సశాంతించినవవగలవు.

---

3. యత్ర అస్తి వాసనా లీనా
తత్ 'సుషుప్తం' న సిద్ధయే।
నిర్బీజ వాసనా యత్ర
తత్ తుర్యం సిద్ధిదమ్ స్మృతమ్॥

నిదాఘుడు : హేగురువర్యా! గాఢనిద్రా సమయంలో వాసనలన్నీ లయిస్తాయి కదా! అది మోక్షస్థితియేనా? మోక్షస్థితి అట్టిదేనా?

ఋభుమహర్షి : ప్రియ నిదాఘా! గాఢనిద్ర (సుషుప్తి) సమయములో జగదృశ్య సందర్భ-సంబంధములు లయించినట్లు కనబడినప్పటికీ, **'బీజములో అంకురము'** దాగి ఉన్న రీతిగా **పునఃప్రదర్శనమునకు సంసిద్ధత** కలిగియే ఉంటాయి. కొంచము సేపు మాత్రమే దాగి ఉంటాయి. అందుచేత అది 'సిద్ధి' కానే కాదు. వాసనలన్నీ నిర్బీజము పొందటమే (తిరిగి చిగురించు ధర్మమును మొదలంట్లా లేనివై ఉండటము చేత మాత్రమే) - అది **'తుర్యక్'** అనబడు సిద్ధి - అని గ్రహించాలి సుమా!.

| | |
|---|---|
| వాసనాయాః తథా వహ్నేః<br>ఋణ వ్యాధి ద్విషామ్ అపి,<br>స్నేహ వైర విషాణాం చ<br>శేషః స్వల్పో అపి బాధతే। | ఏవిధంగా అయితే అగ్ని, ఋణము, వ్యాధి, స్నేహము, శత్రువు, విషము - ఇవన్నీ కూడా కొంచము శేషించియున్నా కూడా, క్రమంగా తిరిగి వృద్ధి చెందగలవో, ఆ జీవుని బాధించగలవో, ఆ తీరుగా దృశ్య సంబంధమైన వాసనలు కొంచెము శేషించి యున్నా కూడా అది సంసార సాగరమును త్వరత్వరగా కల్పించగలవు. (తరంగాలు పి ఇమే సముద్రా జాయంతే) |
| నిర్దగ్ధ వాసనా బీజః<br>సత్తా సామాన్యరూపవాన్,<br>స-దేహో వా, వి-దేహో వా,<br>న భూయో దుఃఖభాగ్ భవేత్॥ | ఎప్పుడైతే "ఆత్మతత్త్వ జ్ఞాన-ధ్యానములు" అనే అగ్నిచే సంసార రూప వాసనల బీజములు ఉడకబెట్టబడతాయో, అవి మరల చిగురించవు. అప్పుడు నీవు సత్తాసామాన్య రూపము **(Al-present universal self)** సంతరించుకోగలవు.<br>అట్టివాడు సహదేహముక్తుడైనప్పటికీ (లేక) విదేహముక్తుడైనప్పటికీ మరల సంసార దుఃఖములకు లోనుకాడు. |
| ఏతావదేవ అవిద్యాత్వం "న ఇదం బ్రహ్మేతి" నిశ్చయః॥<br>ఏష ఏవ క్షయః, తస్యా<br>"బ్రహ్మ ఇదం" (బ్రహ్మేదం) ఇతి - నిశ్చయః॥ | **"ఈ ఎదురుగా కనబడేదంతా బ్రహ్మము కాదు. బ్రహ్మము మరెక్కడో ఉన్నది. అద్దాని కొరకు వెతకాలి" - అనునదే అవిద్య. అట్టి అవిద్యను "ఈ సమస్తము బ్రహ్మమే"** - అను భావనతో క్షయింపజేయాలి. సమస్తము బ్రహ్మమే - అను నిశ్చయముతో ద్వైతమును త్యజించగలుగుతావు. |
| బ్రహ్మ చిత్। బ్రహ్మ భువనం।<br>బ్రహ్మ భూతపరం పరా। బ్రహ్మాహం।<br>బ్రహ్మ చిత్ శత్రుః।<br>బ్రహ్మ చిత్ మిత్ర బాంధవాః॥ | మనలోని చిత్ ('ఎరుక') (The knowing) బ్రహ్మమే! ఈ భౌతికంగా కనిపించేదంతా బ్రహ్మమే। నేను బ్రహ్మమునే। నాచే తెలియబడుచున్నదంతా బ్రహ్మమే। నాకు సంబంధించినవారై కనిపిస్తున్న శత్రువులు, స్నేహితులు, బంధువులు కూడా సర్వదా బ్రహ్మమే అయి ఉన్నారు. |
| "బ్రహ్మ ఏవ సర్వం ఇతి" ఏవ<br>బాధితే బ్రహ్మవై పుమాన్।<br>సర్వత్ర అవస్థితం శాంతం<br>చిత్ బ్రహ్మ - ఇతి అనుభూయతే ॥ | ఇదంతా సర్వదా బ్రహ్మమే। బాధించునది బాధింపబడునది కూడా బ్రహ్మమే. నేను బ్రహ్మమే! నాకు బాధ కలిగించేవారు కూడా బ్రహ్మమే!<br>'ఎరుగుట' అను చిత్ రూపముతో బ్రహ్మమే సర్వత్రా శాంతముగా అవస్థితమై, బ్రహ్మమే - 'అనుభమము' రూపముగా అగుచున్నది. అనుభవమగుచున్నదంతా బ్రహ్మమే। |
| అసంస్కృత అధ్వగా లోకే<br>మనసి అన్యత్ర సంస్థితే॥<br>యా ప్రతీతిః అనాగస్కా<br>"తత్ చిత్ బ్రహ్మాస్మి సర్వగమ్"॥ | ఈ మనస్సు 'ఆత్మజ్ఞానము' అనే ఔషధము (మందు)తో సంస్కరించబడనప్పటి స్థితిలో కూడా అట్టి ఏఏ విషయాల గురించి ప్రతీతి (Driven and placed) పొందుచున్నదో, అదంతా కూడా నాయొక్క బ్రాహ్మీ స్వరూపమునందే ఆ విధంగా అగుచున్నది. **నేనే బ్రహ్మముగా సర్వే సర్వత్రా విస్తరింపజేస్తున్నా కూడా సర్వముగా సర్వదా విస్తరించి ఉన్నాను కూడా."** |
| ప్రశాంత సర్వ సంకల్పం<br>విగత అఖిల కౌతుకమ్,<br>విగత-అశేష సంరంభం,<br>చిదాత్మానం (చిత్-ఆత్మానం) సమాశ్రయ॥ | ఓ నిదాఘా!<br>ఈ విధమైన **"సర్వగతమగు బ్రహ్మమే నేను"** - అనే ఇష్టాపూర్వకమైన భావన - ప్రజ్ఞలతో సర్వ సంకల్పములను ప్రశాంతింపజేయి. సర్వకౌతుకములను (All types of Inquisitiveness) త్యజించివేయి. సర్వసమారంభములను దాటివేయి. చిదాత్మను ఆశ్రయించి ఉండు. |

"సమస్తము నేనైన నేను" అను ఉపనిషత్
ఉద్యానవనము నందు విహరించుము.

| | |
|---|---|
| ఏవం పూర్ణధియో ధీరాః<br>సమా నీరాగ చేతసః,<br>న నందంతి, న నిందంతి–<br>జీవితం మరణం తథా। | అట్టి పూర్ణమగు, వివేచనపూర్వకమగు బుద్ధితో సర్వ సాంసారిక రోగములు త్యజించినట్టి చిత్తము కలవాడు..., ఇక -<br>- దేనికీ పొంగిపొరలడు. దేనిని చూచీ క్రుంగడు.<br>- దేనినీ నిందించడు. శ్లాఘించడు.<br>**<u>జననముతో ఏదీ పొందడు. మరణముతో ఏదీ పోగొట్టుకోడు. ఆ రెండిటికి సాక్షియగు ఆత్మయందు మౌనానందమును వీడడు.</u>** |
| ప్రాణో అయం అనిశం, బ్రహ్మన్!<br>స్పందశక్తిః సదాగతిః।<br>స బాహ్య అభ్యంతరే దేహే<br>ప్రాణో అసా ఊర్ధ్వగః స్థితః॥ | హే బ్రహ్మన్! పంచ ప్రాణములలోని ప్రాణశక్తి ఎల్లవేళల స్పందశక్తి కలిగి ఉండి, సదా 'గతి (movement from one point to another) కలిగి ఉండటము - అద్దాని స్వభావము. అది ఈ భౌతిక దేహములోపల - వెలుపల కూడా ఊర్ధ్వగతమై (manifesting forward movement) ఉంటుంది. |
| **4.** అపానో అపి అనిశం, బ్రహ్మన్!<br>స్పందశక్తిః సదాగతిః।<br>స బాహ్య – అభ్యంతరే దేహే<br>అపానో అయం అవాక్ – స్థితః। | హే నిదాఘా! అపానశక్తి కూడా అదేవిధంగా స్పందనశక్తితో ఎల్లప్పుడు గతి (movement) కలిగి ఉండటము సహజము.<br>అపానప్రాణము బాహ్య అభ్యంతరములలోను, దేహములోపల, దేహములోని కొన్ని క్రిందవిభాగములలోను ఉండి, సంచలన శీలమై ప్రదర్శనమౌతోంది. |
| జాగ్రతః స్వపతశ్చ ఏవ<br>ప్రాణాయామోఽయమ్ ఉత్తమః<br>ప్రవర్తతే హి అభిజ్ఞస్య తత్ తావత్ శ్రేయసే శృణు॥ | జాగ్రత్‌లోను, నిదురిస్తూ ఉన్నప్పుడు కూడా ఏ ప్రాణాయామము ప్రవర్తనశీలమమై ఉంటుందో, అట్టి అద్దాని యోగసార విశేషాలు కొన్ని, యోగాభ్యాసుల శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని చెప్పుతాను! వినండి! |
| <u>పూరకము</u><br>ద్వాదశ అంగుళ పర్యంత బాహ్యం ఆక్రమతాం తతః,<br>ప్రాణానాం అంగ సంస్పర్శో<br>యః, స 'పూరక' ఉచ్యతే॥ | బయట 12 అంగుళముల పర్యంతము ప్రాణశక్తిని విస్తరించి ఆక్రమింపజేసి, అట్టి శక్తితో తిరిగి అంతర్-దేహాంగములను కూడా (ప్రాణశక్తితో) స్పృశిస్తూ ఉండటమును '<u>పూరకము</u>' అని అంటారు. |
| అపానః చంద్రమా దేహం<br>ఆప్యాయయతి, సువ్రత!<br>ప్రాణః సూర్యో అగ్నిః అథవా<br>పచతి అంతరిదం వపుః॥ | సువ్రతా! 'అపానము' అనే చంద్రమసము దేహమును ఆప్యాయముతో నింపుతోంది.<br>పంచప్రాణములలోని మొట్టమొదటిది అగు 'ప్రాణము' అనే సూర్యుడు (లేక) అగ్ని దేహమును పచనము చేస్తూ, వెచ్చగా ఉంచుచున్నది. శరీరములో పచనశక్తి (Heating Energy) ప్రదర్శించుచున్నది. (ఇతి వైశ్వానరో) |
| ప్రాణక్షయ సమీపస్థం<br>అపాన ఉదయ కోటిగమ్,<br><u>"అపాన ప్రాణయోః ఐక్యం"</u><br>చిత్ ఆత్మానం సమాశ్రయ॥ | ఓ ప్రియ నిదాఘా!<br>❃ ఏ బిందుస్థానములో ప్రాణము (Air that is entering the Body) క్షయించినదై అట్టి ప్రాణక్షయ స్థానమునకు అత్యంత సామీప్యమో,<br>❃ అపాన ప్రాణమునకు (Air that is pushing out)కు ప్రారంభస్థానమో,<br>❃ అట్టి ప్రాణ - అపానముల ఐక్యస్థానములో (మధ్యగా) (ప్రాణ కదలికలు శమించినచోట) వేంచేసినదైయున్న చిదాత్మను సమాశ్రయించి ఉపాసించు చుండెదవుగాక. |
| అపానో అసంగతో యత్ర<br>ప్రాణో న అభ్యుదితః క్షణమ్,<br>కలా కళంక రహితం<br>తత్ "చిత్ తత్త్వం" (చిత్తత్త్వం) సమాశ్రయ॥ | ❃ ఏ స్థానంలో అపానము అసంగతమై, ముగిసినదిగా అగుచున్నదో,<br>❃ ప్రాణము ఇంకను అభ్యుదితము అయి ఉండక ఉన్నదో...<br>కళంకరహితమైనట్టి (A Place where illusionary ideations do not accompany) - అట్టి **చిదాత్మతత్త్వమును సమాశ్రయించుము.** |

| | |
|---|---|
| న అపానో అస్తంగతో యత్ర,<br>ప్రాణశ్చ అస్తం ఉపాగతః,<br>నాస-అగ్ర గమనా వర్తం, తత్<br>చిత్ తత్ త్వం (తత్ చిత్తత్త్వం) ఉపాశ్రయ॥ | ఎక్కడ అపానము అస్తమించదో, ప్రాణము ఉదయించదో అట్టి స్థానమును ముక్కుకు పై స్థానమున గమనావర్తమైనట్టి భృకుటీఆకాశములోని (In between two Eye Brows) **"చిత్ తత్త్వము"**ను ఉపాసించుము. |
| అభాసమాత్రమేవ ఇదం<br>న సత్, న అసత్ జగత్ త్రయమ్॥<br>ఇతి అస్య కలనా త్యాగం<br>"సమ్యక్ జ్ఞానం" విదుః బుధాః॥ | అట్టి స్థానము నుండి చేయు దర్శనము ఎట్లా ఉంటుందంటే - ఈ త్రిజగత్తులు "సత్తు" కాదు. "అసత్తు" కాదు. ఇదంతా అభాస (Misconception) మాత్రమే.<br>ఈ రీతిగా జగత్తును భేదదృష్టితో కాకుండా చిత్‌తత్త్వ దృష్టితో చూస్తూ కల్పనా వ్యవహారమగు దృశ్యమును త్యజించి ఉండటమే **'సమ్యక్ జ్ఞానము'**. |
| **5.** అభాసమాత్రకం, బ్రహ్మన్!<br>చిత్త ఆదర్శ కళంకితమ్,<br>తతః తత్ అపి సంత్యజ్య<br>నిరాభాసో భవ ఉత్తమ॥ | హే బ్రహ్మన్! ధూళితో కప్పబడిన అద్దములో దృశ్యముయొక్క ప్రతిబింబము అస్పష్టముగా కనిపిస్తుంది చూచావా? ఈ జగద్దృశ్యము చిత్తము [అనే కళంకితమైన (దోషసంస్కారములు, వాసనలతో కూడిన) అద్దంలో] కనిపించే ఆభాస (Refration) వంటిది. అందుచేత అటువంటి ఆభాసమాత్ర (made up of illusions and misconcaptions) దృశ్యమును మొదలంట్లా సంత్యజించు. ఆభాసలేనివాడవగుము - (1) జగద్దృశ్యము, (2) అది ప్రతిబింబిస్తున్న చిత్తము- ఈ రెండిటిని త్యజించి నిరాభాసుడవై ఉండుము. |
| భయప్రదం అకల్యాణం<br>ధైర్యసర్వస్వ హారిణమ్,<br>మనః పిశాచం ఉత్సార్య<br>యోఽసి సోఽసి స్థిరో భవ॥ | **'సుదీర్ఘకాలంగా దృశ్య వస్తువుల గురించి భేద దృష్టులతో కూడిన మననము చేయటము"** - అనే మూల పదార్థముచే నిర్మితము అవుతున్న ఈ 'మనస్సు' అనే పిశాచము భయప్రదమైనది. అశుభ ప్రదాత అయి ఉంటోంది. ధైర్యమును సడలించి పిరికితనమును కలిగిస్తూ ఉంటోంది. ఇది గమనించు. అట్టి మనో పిశాచమును పారద్రోలివేయి. మనస్సు రహితం చేయగా (మననమును ఆపివేయగా) అప్పటికీ ఏది అయి ఉన్నావో - **'అది'గా (కేవలాత్మగా)** ఉండి ఉండెదవు గాక! అదియే నీ-నా వాస్తవమగు (సహజ) రూపము. |
| చిత్ వ్యోమా ఏవ కిల అస్తి ఇహ,<br>పర-అపర వివర్జితమ్।<br>సర్వత్ర అసంభవత్ చైత్యం<br>యత్ కల్పాంతే అవశిష్యతే। | ఓ నిదాఘా! ఇక్కడ (1) సమస్తము తెలుసుకొనుచూ ఉన్న చిత్తు (Perceiver) (2) తెలియబడుచూ ఉన్న చైత్యము (That being parceived) అనబడే రెండు కనబడుచున్నాయి కదా! వాస్తవానికి అద్దంలో దృశ్య వస్తువే లేనివిధంగా ఇక్కడ చిదాకాశము మాత్రమే ఉన్నది. అద్దానికి పరము లేదు. అపరములేదు. (ఆవల ద్రష్ట లేదు. ఈవల దృశ్యము / క్షేత్రము లేదు). సర్వకల్పనలు ముగిస్తే అప్పటికీ **కల్పించువాడు'** శేషించి ఉంటాడు కదా! అట్టి కల్పాంతము తరువాత కూడా శేషించే చిత్ స్వరూపుడు మాత్రమే ఇక్కడ ఇప్పుడు ఉన్నాడు. అద్దంలో వస్తువు లేనట్లే, - చైత్యము(That being perceived) మొదలే లేదు. |
| వాంఛా క్షణేతు యా తుష్టిః<br>తత్ర వాంఛ ఏవ కారణమ్।<br>తుష్టిస్తు అతుష్టి పర్యంతా<br>తస్మాత్ వాంఛాం పరిత్యజ॥ | వాంఛ (దృశ్యములో ఇంకా ఏదో పొందాలి) అనునది తీరటములో ఏ ఆనందము కొరకై ఈ జీవుడు వాంఛిస్తున్నాడో, అట్టి కోరిక తీరినప్పుడు లభించే ఆనందమునకు (తుష్టికి) కారణము ఏమిటి? వాంఛించటమే. **వాంఛ తీరిందనుకో** - ఆ ఆనందము కూడా తొలగిపోతుంది. అనగా **'తుష్టి'** అనేది అతుష్టి ఉన్నంతవరకే ఉంటుంది. అతుష్టి వలన దుఃఖము కొనసాగుతుంది. అందుచేత ఓ నిదాఘా! **వాంఛలన్నీ పరిత్యజించినవాడవై ఉండు. అప్పుడిక అతుష్టికి చోటే ఉండదు.** |

ఆశా యాతు నిరాశా త్వం,
అభావం యాతు భావతామ్।
అమనస్త్వం మనో యాతు
తవ అసంగేన జీవతః॥

**ఇక్కడ** - (1) "ఏదో కావాలి" అని ఆశించటము, (2) ఆశించిన దానిని గురించి మననము చేయుటము, (3) అట్టి మననమే మనస్సుగా రూపొందటము **జరుగుతోంది.**

అట్టి మననము చేతనే అసంఖ్యాక ఉపాధులు (జన్మపరంపరలు) వచ్చి పడుచున్నాయి. ఫలితంగా ఈ జీవుడు స్వస్వరూపముయొక్క ఔన్నత్యమును ఏమరిచి 'జీవదశ'ను దాటివేయలేక, బద్ధుడగుచున్నాడు. అందుచేత నీవు అసంగుడవై (Non-Concerned, Non-Confined) జీవిస్తూ ఉండు. అప్పుడు ఆశ నిరాశత్వముగాను, భావము అభావముగాను, మనస్సు అమనస్సుగాను అవగలవు. (నిరాశత్వము = ఆశించని స్థైర్యము).

---

వాసనా రహితైః అంతరింద్రియైః
ఆహరన్ క్రియాః,
న వికారం అవాప్నోషి,
ఖ వత్ క్షోభ శతైః అపి।

ఇక్కడి సాకారములైనట్టి అసంఖ్యాక వస్తువుల ఉత్పత్తి, వినాశనములచే ఆకాశము (Space) ఏమైనా పొందిన (లేక) కోల్పోయిన క్షోభ (Pain, Meloncholy, Disturbance) పొందుతోందా? లేదు కదా! అట్లాగే, ఎవ్వడైతే (దృశ్య) వాసనా రహితుడై, వాసనలను దాటివేసినవాడై ఉంటాడో - అట్టివాడు ఇంద్రియములతో వ్యవహరిస్తూ ఉన్నప్పటికీ కూడా దృశ్య సంబంధములైన (జనన-జీవన్-మరణాదులు, ఉత్పత్తి-ఉనికి-వినాశనములు ఇత్యాది) వికారములేవీ కించిత్ కూడా పొందడు.

---

చిత్త ఉన్మేష-నిమేషాభ్యాం
సంసార ప్రళయ-ఉదయౌ
వాసనా ప్రాణ సంరోధాత్
అనున్మేషం మనః కురు।

చిత్తము కళ్ళు తెరిస్తే సంసారము ప్రభవిస్తోంది. అదే చిత్తము - కళ్ళు మూస్తే ప్రళయము. అందుచేత (1) 'ప్రాణాయామము' (2) వాసనలను త్యజించటము - అను రెండు ప్రక్రియలను ఆశ్రయించి చిత్తమును, మనస్సును అనున్మేషముగా (కనులు తెరువనిదిగా) చేసివేయి.

---

ప్రాణ ఉన్మేష-నిమేషాభ్యాం
సంసృతేః ప్రళయ-ఉదయౌ।
తం అభ్యాస-ప్రయోగాభ్యాం
<u>ఉన్మేష రహితం</u> కురు॥

ప్రాణముల ఉన్మేషము (వికాసము, చలన ప్రదర్శనము), నిమేషము (అప్రదర్శనము)ల వలన - సంసృతి (దృశ్య-ఆశ్రయము సంసారము) యొక్క **వికాసము, ఉపశమనము** (ఉదయము/ప్రళయము) జరుగుతోంది. అందుచేత ప్రాణయోగాభ్యాసముచే సిద్ధించు అభ్యాస, ప్రయోగములచే ప్రాణములను ఉన్మేషరహితము (కళ్ళు తెరవనిది, నిశ్చలత్వము, ఆత్మతో అనన్యము) చేయి.

---

**6.** 'మౌర్ఖ్య' ఉన్మేష నిమేషాభ్యాం
కర్మణాం ప్రళయ - ఉదయౌ।
తత్ విలీనం కురు బలాత్
గురు శాస్త్రార్థ సంగమైః।

మూర్ఖత్వము యొక్క ఉన్మేష నిమేషము (The Opening and the closing of ignorance) లచే కర్మల ప్రళయ-కర్మల ఉదయములు ఏర్పడు చున్నాయి.

అందుచేత 'గురుబోధ శ్రవణము - శాస్త్రార్థమననములతో సత్‌సంగమును ఆశ్రయించి, తద్వారా, మూర్ఖత్వమును బలవంతముగా ఆత్మభావనయందు/ఆత్మతత్త్వ దర్శనమునందు) విలీనము చేసివేయి.

---

అసంవిత్ స్పంద మాత్రేణ
యాతి చిత్తం అచిత్తతామ్।
ప్రాణానాం వా నిరోధేన
తదేవ పరమం పదమ్॥

అసంవిత్తు (సత్-చిత్‌ల ఏమరపు) యొక్క కించిత్ స్పందము చేత ఏ చిత్తము రూపు దిద్దుకుంటోందో, అట్టి అద్దానిని సత్-చిత్‌స్మరణచే (స్పందనచే) **"అచిత్తము"** చేయి. 'ప్రాణాయామము' (లేక) ప్రాణ నిరోధముచే చిత్తమును అనుక్షణికంగా అచిత్తము చేసివేయవచ్చును.

**అట్టి అచిత్తత్వమే పరమపదము.**

**దృశ్య దర్శన సంబంధే**
**యత్ సుఖం పారమార్థికమ్,**
**తత్ అంతా ఏకాంత సంవిత్యా**
**బ్రహ్మ దృష్ట్వావలోకయ॥**

దృశ్య-దర్శన (That being perceived - and perception) ముల సంబంధములచే అనిపిస్తున్న సుఖమును పారమార్థిక దృష్టితో (ఆత్మదృష్టితో) అధిగమించివేయి. ఆ రెండిటికీ ఆవల **సంవిత్ ఏకాంతము** (mere presence & Knowing in relation to Alone Self) అగు బ్రహ్మీదృష్టితో అవలోకించుము. అప్పుడు లభించగల బ్రహ్మానందమును సిద్ధింపజేసుకో.

---

**యత్ర న అభ్యుదితం చిత్తం,**
**తత్ వై సుఖం అకృత్రిమమ్।**
**క్షయ అతిశయ నిర్ముక్తం**
**న ఉదేతి। న చ శామ్యతి।**

ఎక్కడ చిత్తము అభ్యుదితము (Blossom up) అవదో, అక్కడ మాత్రమే అకృత్రిమమగు సుఖము ఉంటుంది. అందుచేత చిత్త సహాయముచే అనుభవమయ్యే సుఖము కృత్రిమము (Artificial) . ఒకప్పుడు ఉండేది - మరొక క్షణంలో ఉండనిది అగుచున్నది. అచిత్తరూపమగు ఆత్మసుఖమో? అట్టి అకృత్రిమ ఆత్మ సుఖమునకు క్షయము ఉండదు. అతిశయము ఉండదు. అది ఉదయించదు, అస్తమించదు.

---

**జ్ఞస్య చిత్తం న చిత్తాఖ్యం,**
**చిత్తం చిత్తత్త్వం ఏవ హి।**
**తత్ ఏవ "తుర్య" అవస్థాయాం**
**తుర్య అతీతం భవత్యతః॥**

ఆత్మతత్త్వము ఎరిగినట్టి తత్త్వజ్ఞునియొక్క చిత్తము 'అచిత్తమే' అని చెప్పబడుతోంది. స్వస్వరూప - ఆత్మ యొక్క స్వరూప స్వభావములు దృష్టిలో లేనివారి భావన-అవగాహనలతో కూడిన చిత్తము మాత్రమే 'చిత్తము' అనిపించు కుంటుంది.

ఆత్మజ్ఞుని చిత్తము ఇహములో ప్రవర్తిస్తున్న జాగ్రత్-స్వప్న-సుషుప్తుల పరిధులను దాటివేసి, ఆ మూడిటిని 'తనవి'గా కలిగియున్న **తురీయము వైపు సంధించబడి ఉంటుంది.** అట్టి తురీయ చిత్తముచే నిర్వర్తించు **అతీత యోగాభ్యాసముచే** ఆ యోగి **'తురీయాతీతుడు'** అగుచున్నాడు.

---

**సన్న్యస్త సర్వ సంకల్పః,**
**సమశ్శాంత మనా మునిః**
**సన్న్యాస (సత్‌న్యాస) యోగయుక్తాత్మా**
**జ్ఞానవాన్, మోక్షవాన్ భవ॥**

ఓ నిదాఘా! సమస్త సంకల్పములను సన్న్యసించినవాడవై. సర్వత్రా సమమగు, సశాంతించినదగు మనస్సుతో **'మునివి'** అయి ఉండుము.

ఈ విధంగా సమస్త సంకల్పములను త్యజించినవాడవై సర్వత్రా సమమగు, ప్రశాంతించినదగు మనస్సుతో అంతరమున **మౌనము** వహించి ఉండుము.

ఈ మార్గముగా సన్న్యాసయోగయుక్తాత్ముడవు, ఆత్మతత్త్వజ్ఞానివి, ("నాకు బంధమే లేదు" అను ఎరుకచే) అయి - **మోక్షవంతుడవు** గా ప్రకాశించ గలవు. (దృశ్య దేహములు నాకు బంధము కాజాలవు - అను నిస్సందేహత్వమే మోక్షము)

---

**సర్వ సంకల్ప సంశాంతౌ,**
**ప్రశాంత ఘన వాసనమ్,**
**న కించిత్ భావన ఆకారం యత్,**
**తత్ బ్రహ్మ పరం విదుః॥**

✠ సర్వ సంకల్పములు సశాంతించగా (సంకల్పరహితుడవై ఉండగా),
✠ సర్వ దృశ్య సంబంధమైన (బాహ్య అంతర) ఘనవాసనలు (The solidity of Tendencies) అంతరంగమునందు ప్రశాంతత్వము సంతరించుకోగా,
ఏ కించిత్ భావనాకారమూ కూడా లేనట్టి **"స్వస్వరూపమే"** (లేక) **"తత్త్వరూపమే" - పరంబ్రహ్మము.**

---

**సమ్యక్ జ్ఞాన అవరోధేన**
**నిత్యం ఏక సమాధినా,**
**సాంఖ్య ఏవావ బుద్ధా యే,**
**తే సాంఖ్యా యోగినః పరే॥**

<u>సాంఖ్యయోగి</u>

- సమ్యక్ జ్ఞానముచే భేదదృష్టి అంతా నిరోధించబడగా

- సర్వత్రా ఏకమగు ఆత్మను దర్శించటమే సమాధి. అభ్యాసము వలన ఎవరిలో బుద్ధి సాంఖ్యయోగము - జ్ఞాననిష్ఠ కలిగి ఉంటాయో, అట్టివారే <u>'సాంఖ్యయోగులు'.</u> పరానందము సిద్ధించుకున్నట్టివారు.

ప్రాణాది అనిల సంశాంతౌ
యుక్త్యా యే పదమ్ ఆగతాః,
<u>'అనామయం' 'అనాద్యంతం'</u>
తే స్మృతా యోగ యోగినః॥

ప్రాణము, అపానము మొదలైన వాయువులను శాంతింపజేయు యుక్తిచే ప్రాణాభ్యాస క్రియా యోగులు ఏ పదమును చేరుచున్నారో, అదియే - **"అనామయము, అనాద్యంతము" అగు యోగయోగి పదము.**

ప్రాణయోగులు, చిత్తనిరోధకులు కూడా అది సిద్ధించుకుంటున్నది ఆయోగ-యోగి పదమే।

---

**7.** ఉపాదేయం తు సర్వేషాగ్ం
శాంతం పదం అకృత్రిమమ్,
ఏక అర్థ అభ్యసనం ప్రాణ రోధ,
చేతః పరిక్షయః।

అట్టి ఏకార్థమును ప్రసాదించునది (అనేకార్థమంతా రహితము చేయునది), ప్రాణాయామముచే పరిక్షయింపజేయబడు **చిత్త** రూపము కలిగియున్నట్టిది, పరమశాంతరూపమైనట్టి, అకృత్రిమము అగు పరమపదము కొద్దిమందికి మాత్రమే సాధ్యమా? లేనేలేదు. **అందరికి అభ్యాసవశంచేత ఆచరణ సాధ్యమే! ఉపాదేయమే! చదువుకున్నవారందరికీ చదువు వస్తుందికదా!**

---

ఏకస్మిన్ ఏవ సంసిద్ధే
సం సిధ్యంతి పరస్పరమ్,
అవినాభావినీ నిత్యం
జంతూనాం ప్రాణచేతసి॥

(1) ప్రాణాయామ యోగము (2) చిత్తనియమమార్గ చిత్తనిరోధాభ్యాసము ఈ రెండిటిలో ఒక్కటి ఆశ్రయిస్తే రెండవది దానంతట అదే స్వాభావికంగా (Automatically) సిద్ధించగలదు. అవి పరస్పరము సహకరించునవి. ఎందుకంటే, జీవులపట్ల ప్రాణ-చిత్తములు అవినాభావముతో సంచారము కలిగి ఉంటున్నాయి కాబట్టి.

---

ఆధార-ఆధేయవత్ చ ఏతే
ఏకభావే వినశ్యతః।
కురుతః స్వ వినాశేన
కార్యం మోక్షాఖ్యం ఉత్తమమ్।

[ (మేఘము -మేఘముయొక్క ఆకారము ఈ రెండు కూడా (వర్షించునప్పుడు) ఒకటి నశిస్తే రెండవది కూడా నసిస్తుంది కదా)]. అధార-ఆధేయములలో ఒకటి నశిస్తే రెండవది కూడా నశిస్తుంది.

**చిత్త-ప్రాణచలనములలో ఒకటి తొలగితే రెండవది కూడా స్వవినాశనము పొందుతూ 'మోక్షము'** అనే ఉత్తమ కార్యమును సిద్ధింపజేస్తాయి.

---

సర్వం ఏతత్ ధియా త్యక్త్వా
యది తిష్టసి నిశ్చలః,
తత్ అహంకార విలయే
'త్వమ్' ఏవ పరమం పదమ్।

**పరమపదము:** అన్యరూపములగు బాహ్య-అంతరంగములను బుద్ధితో త్యజించగా ఏ స్వస్వరూపము నిశ్చలమై (త్యజించవీలుకానిదై) శేషిస్తుందో, ... అట్టి అహంకారము కూడా విలయము పొందినప్పటి నీయొక్క ఆదిశేష్య స్వరూపమే - **'పరమపదము'.**

---

'మహాచిత్' ఏక ఏవ ఇహ అస్తి,
'మహాసత్' ఏతి యోచ్యతే। (య ఉచ్యతే)॥

ఇక్కడ సర్వే సర్వత్రా సర్వదా సర్వ జీవులలో అఖండము - ఏకము అయి ఉన్న 'మహాచిత్'యే ప్రదర్శనశీలమై ఉంటోంది. అదియే **'మహాసత్'** అనబడు **'నేను ఉన్నాను కదా'** అను రూపముగా సర్వ దేహములలోను ప్రకాశమానము అగుచున్నది.

---

నిష్కళంకా సమా శుద్ధా నిరహంకార రూపిణీ।
సకృత్ విభాతా విమలా నిత్య ఉదయవతీ సమా।
(నిత్యోదయవతీ సమా)।
సా బ్రహ్మ 'పరమాత్మ' ఇతి నామభిః పరిగీయతే॥

అట్టి 'మహాచిత్' మరియు 'మహాసత్' యే పరమాత్మ (ఆవల ప్రకాశమానమైయున్న ఆత్మరూపము)గా సర్వదా సర్వత్రా వేంచేసినదై యున్నది. సమస్తమును వెలిగించునదై (Enlightening), విమలమై (pure), నిత్యోదయమై (Ever blossoming) **'పరబ్రహ్మము' అను శబ్దమునకు పరమార్థమై వెలుగొందుచున్నది.**

---

<u>సైవాహమ్ ("స ఏవ అహం")</u> ఇతి నిశ్చత్య
నిదాఘ! కృతకృత్యవాన్।

అట్టి "పరమాత్మ" - మహత్ పదార్థంగా పరిశీలిస్తూ గమనిస్తే, → ఎక్కడ ఉన్నది? ఓ నిదాఘా! అదియే నీలో 'అహమ్' (నేను)' అను రూపముగా వెలుగొందుచున్నది - అని దర్శిస్తూ కృతార్థుడవు అయ్యేదవు గాక! నీవే పరమాత్మవు అయి ఉన్నావు. **"తత్త్వమసి।"**

న భూతం, న భవిష్యత్ చ
చింతయామి కదాచన।
దృష్టిం ఆలంబ్య తిష్ఠామి
వర్తమానం మహాత్మనా॥

అట్టి పరమాత్మ నీయందుగాని, నాయందుగాని - "ఒకప్పుడు ఉన్నది" - (It was in the past) అనుకోవలసినది కాదు. "భవిష్యత్తులో ఆయా ప్రయత్నముల అనంతరము లభించబోతోంది' (To be gained in the future) అనే మాట కూడా యుక్తియుక్తం కాదు.

మరి? "అట్టి మహాత్మత్వము ఇప్పుడే ఇక్కడే మనకు అనన్యమై ఉన్నది" అని చింతన చేయవలసినట్టిది సుమా!

---

**8.** ఇదం అద్యమయా లబ్ధం
ఇదం ప్రాప్స్యామి సుందరమ్-
న స్తౌమి। న చ నిందామి।
ఆత్మనో అన్యం నహి క్వచిత్॥

అట్టి 'పరమాత్మ' సర్వదా నాలో నేనై ఉండగా ఇంక అద్దానికి సమయా సమయములు ఎక్కడివి? ఇప్పటికీ ఎప్పటికీ అందరికీ లభించియే ఉన్నది అందుచేత, ఇప్పుడే అట్టి ఆత్మసౌందర్యము సందర్శిస్తున్నాము.

**"లభించియున్నదేకదా!"** - అని స్తుతించటము లేదు. **"అందరికీ లభిస్తోంది కాని, నాకు ఇంకా లభించటము లేదే?"** - అని నిందించటము లేదు. **"నాకు వేరుగా పరమాత్మ ఎక్కడో లేడు"** అని గమనిస్తూ ఆత్మానందము ఆస్వాదిస్తున్నాను. సమస్తము మమాత్మయే అయి ఉండగా, ఇంక నేను ఎవరిని స్తుతించాలి? ఎవరిని నిందించాలి?

---

న తుష్యామి శుభప్రాప్తౌ।
న ఖిద్యామి అశుభాగమే।

**సమస్తము, సర్వదా నాయొక్క ఆత్మానంద స్వరూపమే - అయి ఉన్నది కదా!** అందుచేత

- శుభముల ప్రాప్తికి తుష్యించటము (సంతోషముతో పొంగటము) లేదు.
- అశుభప్రాప్తులకు ఖేదము చెందటములేదు.

---

ప్రశాంత చాపలం వీతశోకం,
అస్త (స్త) సమీహితమ్।

ఓ మునీశ్వరా! "ఆత్మతత్త్వ-ఆత్మసోఽహమ్' జ్ఞానముచే నా మనస్సు చపలత్వమును త్యజించి, శోకమును వదలివేసి ప్రశాంతము పొందినదై ఉంటోంది. "ఏదో పొందాలి. ఇంకా ఏదో కావాలి" అను రూపముగల సర్వ కోరికలు అస్తమించినవై ఉంటున్నాయి. సమస్తమునకు అంతమున (ఆవల) నన్ను నేను దర్శిస్తూ ఆస్వాదిస్తున్నాను.

---

మనో మమ, మునే! శాంతం
తేన జీవామి అనామయః॥

శాంతము పొందిన నా మనస్సు ఎట్టి మానసిక రోగము, దుష్టభావములు లేనిదగుచున్నది. ఈ జీవితమును, ఆయా సర్వ-సందర్భములను హాయిగా చూస్తూ కాలము గడుపుచున్నాను. వేరుగా ఉండియే సమస్తమును యథాతథంగా ఆస్వాదిస్తున్నారు.

---

అయం బంధుః, పరః చ (పరశ్చ) అయం
మమ అయం। మయమ్ అన్యకః।
ఇతి బ్రహ్మన్। న జానామి
సగ్ంస్పర్శం న దదామి అహమ్।
వాసనామాత్ర సంత్యాగాత్
జరామరణ వర్జితమ్॥

హే బ్రహ్మన్!
- వీరు నా బంధువులు. వారు కాదు. - వీరు (నా జాతి, దేశము, భాష మొదలైన వివరములు కారణంగా) నావారు. వారు నావారు కాదు. నేను వారికి చెందినవాడను. వారికి చెందినవాడను కాను".
ఈఈ మొదలైన సంసార స్పర్శలు నన్ను ఏమాత్రము సమీపించలేకపోతున్నాయి.
'వార్ధక్యము, మరణము' మొదలైన సమస్త వాసనలు మొదలంట్లా సంత్యజించినవాడనై ఉంటున్నాను. దేహ-మనో అతీతుడినై ఉంటున్నాను. **దేహధర్మములు 'దేహి'ని అగు నావి ఎట్లా అవుతాయి?**

---

'స వాసనం' మనో "జ్ఞానం"।
"జ్ఞేయం" నిర్వాసనం మనః॥

ఇప్పుడు నా మనస్సును రెండు భాగములుగా నాచే విభాగించబడుచూ...
- సవాసనతో కూడిన మనస్సును 'జ్ఞానము'గాను.
- నిర్వాసనమయమైన మనో విభాగమును జ్ఞేయము (తెలుసుకోవలసినది) గాను దర్శనము చేయు విభాగినై ఉంటున్నాను.

**మనస్సు**

| నిర్వాసన మనస్సు | సవాసన మనస్సు |
|---|---|

చిత్తే త్యక్తే లయం యాతి
ద్వైతం ఏతత్ చ సర్వతః।

అయితే ఏ ద్వైత-జ్ఞానవిభాగము మనస్సునకు అనుభవమౌతోందో, అట్టి ద్వైతమంతా కూడా చిత్తలయముతో స్వయముగా లయము అగుచున్నది.

---

శిష్యతే పరమగ్ం శాంతం
ఏకమ్ స్వచ్ఛం అనామయమ్,
అనన్తం, అజం, అవ్యక్తం, అజరగ్ం
శాంతం, అచ్యుతమ్,

**మనస్సు లయించగా శేషించియుండు మమాత్మ ఎట్టిది?** పరమశాంతము. ఏకము. స్వచ్ఛము. అనామయము (దేనిచేతను కప్పబడజాలనిది). అనన్తము. అజము (జన్మ-అను ధర్మము లేనట్టిది), (సమస్తమును వ్యక్తీకరిస్తూ ఉన్నట్లు అగుపిస్తున్నప్పటికీ, తాను) అవ్యక్తము అయినట్టిది. అజరామరమైనది. శాంతము. స్వయం-స్థానము నుండి ఏమాత్రము చ్యుతి (Distraction) లేనట్టిది.

---

అద్వితీయం అనాద్యంతం
యత్ ఆద్యం ఉపలంభనమ్
(తెలుసుకొనుచున్నట్టిది అనుభూతరూపము)
ఏకం, ఆద్యన్త రహితం, చిత్‌మాత్రం,
అమలం తతమ్।

(స్వస్వరూపమునకు-త్వమ్‌నకు- జగద్దృశ్యమునకు ద్వితీయము కాదు కాబట్టి) అద్వితీయమైనట్టిది, ఆద్యంతరహితము.

మొట్టమొదటే చైతన్యరూపమై ఉండి సర్వమునకు స్వయముగా ప్రత్యుత్సాహ రూపంగా ప్రదర్శనము అగుచున్నదే - **మమాత్మ**. అది సర్వదా ఏకము. ఆద్యన్తరహితము. నిర్మల ఎరుక రూపము (చిన్మాత్రం అమలమ్) కూడా.

---

ఖాదపి అతితరాం సూక్ష్మం
తత్ బ్రహ్మాస్మి। న సంశయః।।

సర్వత్రా విస్తరించియున్నది, సర్వముగా వేంచేసి ఉన్నది మమాత్మయే! **ఆకాశముకంటే అత్యంత సూక్ష్మమగు ఆత్మయే నేనై ఉన్నాను. ఇందులో అనుమానమే లేదు.**

---

దిక్ కాలాది అనవచ్ఛిన్నగ్ం
స్వచ్ఛం నిత్యోదితం తతమ్,
సర్వార్థమయం ఏకార్థం
"చిన్మాత్రం అమలం" భవ।।

అట్టి ఆత్మ నీవే అయి ఉన్నావు. అందుచేత ఓ నిదాఘా! దిక్కు-కాలములచే విభాగము పొందనిది, స్వచ్ఛము - నిత్యోదితము, సర్వత్రా విస్తరించి ఉన్నది, ఏకార్థమే అయి, సమస్త పదార్థములుగా ప్రదర్శనమగుచున్నది - అగు **"నిర్మలాత్మ" నీవై అయి ఉండెదవు గాక! తత్ త్వమ్ అసి!** అదియే నీవై ఉన్నావు సుమా! ఈ విషయంలో నిస్సందేహుడవు అగుము.

---

**9.** సర్వం ఏకం ఇదగ్ం శాంతం
ఆది-మధ్య-అంత వర్జితమ్,
భావ-అభావమ్, అజం, సర్వం
ఇతి మత్వా సుఖీభవ।।

**"మమాత్మయే ఈ సమస్తము అయినదై, సర్వదా ఏకమై, ఆదిమధ్యాంతరహితమై, భావ-అభావస్వరూపమై, అజమై, సర్వము అయి వెలుగొందుచున్నది" - అను ఆత్మభావన** ను స్వీకరించుము. ఇంకేమున్నది? సర్వ ఆదుర్దాలను జయించి సుఖవంతుడవు కాగలవు.

---

న బద్ధో అస్మిన। ముక్తోఽస్మి।
'బ్రహ్మ' ఏవ అస్మి నిరామయమ్,।
ద్వైతభావ విముక్తః అస్మి (విముక్తోఽస్మి),
సత్ చిత్ ఆనంద లక్షణః।।
ఏవం భావయ యత్నేన "జీవన్ముక్తో" భవిష్యసి।

ఎప్పుడైతే ఈ జీవుడు →

- **ఆత్మగా నాకు బంధము లేదు. ముక్తి లేదు.**
- **సర్వదా నిరామయమగు** (Clean and unclouded) **బ్రహ్మమే అయి ఉన్నాను.**
- **సమస్త ద్వైతభావములనుండి సర్వదా విముక్తుడనే అయి ఉన్నాను.**
- **నాయొక్క స్వరూపము సత్ - చిత్ - ఆనంద లక్షణ సమన్వితము మాత్రమే!"**

- అని ప్రయత్నపూర్వకంగా భావన చేయువాడై ఉంటాడో, - ఆతడు **"జీవన్ముక్తుడు"** అనబడుచున్నాడు.

---

పదార్థ బృందే దేహాది,
ధియా సంత్యజ్య దూరతః।
ఆశీత శాంతః కరణో
నిత్యమ్ ఆత్మపరో భవ।।

ఈ భౌతికదేహము మొదలుకొని సమస్త పదార్థముల పట్ల సమస్త **అవినాభావ సంబంధములను బుద్ధితో దూరంగా త్యజించివేయి.**

అతఃకరణమునందు ఆసీనుడవై ఉండుము. **నిత్యము ఆత్మపరుడవై ఉండు.** అంతేగాని దృశ్యపరుడవుగానో, దేహపరుడవుగానో అయి ఉండవద్దు. (Be your own 'self' by duly discarding all Scenery related Barriers).

**ఇదగ్ం రమ్యం, ఇదం న ఇతి (నేతి)**
**బీజం తే దుఃఖ సంతతేః।**

“ఇదిగో, ఇది నాకు రమ్యమైనది. నా దృష్టిలో అందమైనది. అది నాకు రమ్యము కాదు'' - అనునదే నీయొక్క అనేక దుఃఖసంతతికి (దుఃఖపరంపరలకు) బీజము. అట్టి బీజమును నిర్బీజము చేసివేయి. ఏది ఎట్లా ఉన్నా కూడా, ఒకే తీరై ఉండునదే స్వస్వరూపాత్మ.

---

**తస్మిన్ 'సామ్య' అగ్నినా దగ్ధే,**
**దుఃఖస్య అవసరః కుతః?**

అటువంటి రమ్య-అరమ్య భేదభావలన్నీ 'సర్వత్రా సమదర్శనము' అను సామ్యాగ్నిచే దగ్ధం చేస్తే, ఇక ఆపై నీవు దేనికైనా సరే - దుఃఖము పొందవలసిన అవసరము ఏముంటుంది?

---

**శాస్త్ర సజ్జన సంపర్కైః**
**ప్రజ్ఞాం ఆదౌ వివర్ధయేత్।**

**(1) శాస్త్రముల అధ్యయనము, (2) సజ్జనులతో సత్సంగము, (3) స్వకీయమైన వివేకములచే ఆత్మసంబంధమైన ప్రజ్ఞను** ముందుగా వృద్ధి చేసుకో.

> **ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ**
> **సర్వ సంసార భేషజం॥**

> **ఈ సంసార భేషజముయొక్క వాస్తవరూపము - ఋతము (మహనీయుల స్వానుభవము), సత్యము (సత్‌స్వరూపము) అగు పరబ్రహ్మమేగాని మరొకటేదీ కాదు.**

---

**అత్యర్థం అమలం నిత్యం**
**ఆదిమధ్యాంత వర్జితమ్,**
**తథా స్థూలం అనాకాశం**
**అసగ్ంస్పృశ్యం అచాక్షుషమ్।**
**న రసం, న చ గంధాఖ్యం,**

ఓ సువ్రతా! ఆత్మ ఎట్టిదంటే - **అత్యంత అమలము** (నిర్మలము). **నిత్యము.** ఆది (Begining), మధ్య (Inbetween), అంతములు (The End up) - కించిత్ కూడా లేనట్టిది.

✠ అయినా కూడా, స్థూలమగు ఆకాశము వంటిది (శూన్యము) కాదు.

✠ స్పర్శకు చక్షువులకు విషయము కాదు. నాలుకకు రుచిగాని, ముక్కుకు గంధముగాని కాదు.

---

**అప్రమేయం అనూపమమ్।**
**ఆత్మానగ్ం సచ్చిదానందం**
**అనంతం-బ్రహ్మ, సువ్రత!**

ఓ సువ్రతా!

✠ సమస్తమునకు అప్రమేయమైనట్టిది [దేనితోను ప్రమేయము (Relatedness) కించిత్ కూడా లేనట్టిది) ]

✠ అనూపము (దేనిచేతను ఆక్రమించబడనట్టిది Unccupiable by anything)

✠ సత్ చిత్ ఆనందము (ఉనికి, ఎరుగుట - సమస్త కల్పనము తన ఆనందము కొరకే) అయినట్టిది.

✠ దేనిచేతను పరిమితము కానట్టిది. కాబట్టి అనంతము.

---

**10. 'అహమ్ అస్మి' ఇతి అభిధ్యాయేత్,**
**ధ్యేయ-అతీతం విముక్తయే,**
**సమాధిః సంవిత్ ఉత్పత్తిః**
**పర-జీవ ఏకతాం ప్రతి॥**

**“నేను దృశ్యములో ఒకానొక భౌతిక వస్తువు వంటివాడను కాదు. సర్వదా ఆత్మయే అయి ఉన్నాను”** - అను ధ్యానముచే నీవు **ధ్యేయము** (ధ్యానము చేయబడుచున్న సమస్త దృశ్యము) నకు అతీతుడవై ఉండగలవు. ధ్యేయము నుండి (ఇంద్రియ విషయములనుండి) విముక్తుడవు అవగలవు.

జీవాత్మ మరియు పరమాత్మ (కేవలము, సాక్షి)ల ఏకమేవానుభవమే **'సంవిత్‌స్వరూప' సమాధి.**

---

**నిత్యః సర్వగతో హి ఆత్మా**
**కూటస్థో దోష వర్జితః**
**ఏకః సంభిద్యతే భ్రాంత్యా**
**మాయయా, న స్వరూపతః॥**

ఆత్మ నిత్యము. సర్వగతము (సర్వత్రా విస్తరించినదై ఉన్నట్టిది). ఆభరణమునకు బంగారమువలె, తరంగమునకు జలమువలె, మట్టి బొమ్మకు మట్టివలె) మూలము. సర్వకాలములలో ఒకేరూపము కలిగి ఉండుటచే **కూటస్థము. ఏకమే అయి ఉండి కూడా,** భ్రాంతిచే - అట్టి “ఆత్మయే స్వస్వరూపము”గా అగుపించక ఉన్నది. “దేహమే నా స్వస్వరూపము?” - అను భ్రమ కలిగి ఉంటోంది.

(అట్టి ఏమరుపు ఆత్మకు స్వయం కల్పిత లీలా-క్రీడా వినోదమువంటిది మాత్రమే స్వయంకల్పిత 'సంబంధ' నిర్మిత 'బంధన' చమత్కారము).

| | |
|---|---|
| తస్మాత్ 'అద్వైత' ఏవ అస్తి<br>న ప్రపంచో। న సగ్ంస్సృతిః। | అందుచేత అద్వితయమగు ఆత్మయే ఉన్నది. ఇంతకుమించి మరొకటి (ద్వితీయము) లేదు. ప్రపంచము లేదు. సంస్పృతి లేదు. |
| యథా ఆకాశో 'ఘటాకాశో'<br>'మహాకాశ' ఇతి ఈరితః,<br>తథా భ్రాంతైః ద్విధా ప్రోక్తో హి<br>ఆత్మా 'జీవ-ఈశ్వర' ఆత్మనా। | ఒకే ఆకాశము.<br>(1) ఘటాకాశము (కుండలోని ఆకాశము) - (ఇంటిలోగల కుండ)<br>(2) మఠాకాశము (ఇంటిలోని ఆకాశము) - (ఇల్లు)<br>(3) బాహ్యాకాశము (4) మహాకాశము (ఇల్లు, తదితర సర్వ ప్రదేశములు, భూమి, సూర్యుడు, నక్షత్ర మండలములు చోటుపొందుచున్న ఆకాశము) - అని పేర్లతో చెప్పుకుంటూ ఉన్నప్పుడు కూడా - ఆకాశము సర్వదా ఏకము, అవిభాజ్యము (United and indivisble) అయి ఉన్నది కదా!<br>- అట్లాగే ఇక్కడ ఆత్మాకాశము దృష్ట్యా అద్వితీయమగు ఆత్మయే ఉన్నది. అందుకు ద్వితీయముగా కనిపించే ప్రపంచము లేదు. అద్దానితో బంధ రూపమగు సంసృతి (కల్పనాబంధము) లేదు. జీవుడు లేడు. బంధమే లేనప్పుడు, అది తొలగవలసిన అగత్యము ఎక్కడిది?<br>అయితే భ్రాంతి తొలగటానికై, అట్టి భ్రాంతిగలవారికి బోధించటము యొక్క ప్రారంభదశలో అపరిపక్వ బుద్ధులకు 'జీవుడు-ఈశ్వరుడు' అనే ద్వైతము కల్పించబడుతోందేగాని వాస్తవానికి ఆత్మకు జీవ-ఈశ్వర భేదము ఉన్నదని ముఖ్యోద్దేశ్యము కాదు. |
| యదా మనసి చైతన్యం<br>భాతి సర్వత్రగం సదా,<br>యోగినో అవ్యవధానేన<br>తథా సంపద్యతే స్వయమ్॥ | చైతన్యము నుండే ఆలోచన జనిస్తోంది. ఏవిధంగా అయితే సర్వగతమగు చైతన్యమే మనస్సుగా కూడా సర్వత్రా భాసిస్తోందో, అదే విధంగా యోగులు అనుభవమును అనుసరించి "ఏకమగు ఆత్మయే జీవుడు - ఈశ్వరుడు, పరమాత్మలుగా స్వయముగా తన అఖండత్వము వీడకుండానే భాసిస్తోంది."<br>ఆ తీరుగా భాసిస్తూ కూడా ఆత్మ మూడుగా అవటంలేదు. |
| **యదా సర్వాణి భూతాని**<br>**స్వ-ఆత్మన్యేవ హి పశ్యతి,**<br>**సర్వభూతేషు చ ఆత్మానం**<br>**బ్రహ్మ సంపద్యతే తదా॥** | బ్రహ్మము స్వానుభవముగా అయ్యేది ఎట్లా?<br>ఎప్పుడైతే సర్వభూత జాలము కూడా "స్వ-ఆత్మయే। నా ఆత్మయే।" అని దర్శించబడుతోందో,<br>"సర్వభూతజాలమునందు నా ఆత్మ వేంచేసియే / ఏర్పడియే ఉన్నది. సర్వ భూతజాలము నా ఆత్మయందే ఆత్మకు అభిన్నమై యున్నది"....అనిపించసాగుతోందో,<br>అప్పుడు ఇక ఆత్మ ఇప్పుడే, ఇక్కడే అనుభవమై సిద్ధించగలదు. అదియే సమాధి స్థితి. |
| యదా సర్వాణి భూతాని<br>సమాధిస్థో న పశ్యతి,<br>ఏకీ భూతః పరేణ అసౌ<br>తదా భవతి కేవలః॥ | ఎప్పుడైతే తాను సమాధిస్థితుడై అన్యమునంతా తన స్వరూపమునందు అంతర్ చమత్కారముగా దర్శించబడుచున్నాడో, ఇక్కడ భూతజాలము చూడక, ఆత్మను మాత్రమే దర్శిస్తాడో...<br>అట్టివాడే **ఏకీభూతుడు.**<br>ఆతడే **పరమాత్మస్వరూపుడు.**<br>ఆతడే **కేవలుడు.** ఆతని స్థితియే **కైవల్యము.** (కేవలానుభవేతి కైవల్యమ్)। |
| సప్తభూమికలు<br>శాస్త్ర సజ్జన సంపర్క<br>వైరాగ్య రసరూపిణీ,<br>ప్రథమా భూమికా ఏషా<br>ఉక్తా **"ముముక్షత్వ"** ప్రదాయినీ॥ | **సప్తభూమికలు**<br>అటువంటి అఖండాత్మాత్వము ఆత్మసాక్షారముగా బుద్ధికి సిద్ధించటానికై అధ్యాత్మ శాస్త్రముచే సప్తభూమికలు (Seven Steps) చెప్పబడుచున్నాయి.<br>**(1) ముముక్షుత్వ ప్రదాయినీ భూమిక**<br>(1) శాస్త్రములు చెప్పేదే అధ్యయనము చేయటము, (2) సజ్జనులతో (ఆత్మతత్త్వజ్ఞులతో) సత్సంగపూర్వక సంభాషణా - సంపర్కము (3) దృశ్య విషయములపట్ల రాగము తొలగినప్పటి వైరాగ్యము-ఈ మూడు |

| | |
|---|---|
| | రసరూపముగా **(ఇష్టము)** కలిగినట్టిదే (అభ్యాసరూపమే) ప్రథమ భూమిక. అధ్యయన - సత్సంగ - వైరాగ్యములచే ప్రథమభూమికయగు **"ముముక్షుత్వము"** అను రుచి లభిస్తుంది. |
| **11. 'విచారణా' ద్వితీయా స్యాత్।** | **(2) ద్వితీయభూమిక = "విచారణ" :** బాహ్యారంగము, అంతర్ - రంగము, జీవుడు - ఈశ్వరుడు - పరమాత్మ, జన్మ, మృత్యువు, ముక్తి, మోక్షము, జన్మరాహిత్యము-ఇత్యాదుల గురించిన విశేషాలతో కూడిన **'ఆత్మవిచారణ'.** |
| **తృతీయా "సాంగ భావనా"॥** | (3) తృతీయ భూమిక - "సాంగభావనా" : దేహి - దేహము, స్థూల సూక్ష్మ కారణ కేవల శరీరముల గురించిన అవగాహన. ఈ దృశ్యమాన మగుచున్న సమస్తమును ఆత్మయొక్క (ఆత్మకు) అంగముగా భావన చేయటము. "ఆత్మయే అంగముల ప్రదర్శనముగా అగుచున్నది" - అను అవగాహనము ఆశ్రయించటము. |
| **"విలాపినీ" చతుర్థీ స్యాత్,**<br>**వాసనా విలయాత్మికా।** | (4) నాలుగవ భూమిక - విలయాత్మికా - దృశ్యమునకు సంబంధించిన వాసనలను (All type of Tendencies) ఆత్మభావనయందు లయింపజేయు యత్నము, కార్యక్రమము. దృశ్యమును ఆత్మకు అనన్యముగా చూడటము → దీనిని 'విలాపినీ భూమిక' - అని కూడా అంటారు. ఇదియే విలయాత్మికము. |
| **"శుద్ధసంవిత్" మయ**<br>**ఆనంద రూపా**<br>**భవతి పంచమీ।**<br>**అర్థ సుప్త ప్రబుద్ధాభో**<br>**"జీవన్ముక్తో" అత్ర తిష్ఠతి॥** | (5) పంచమ భూమికి - "శుద్ధ సంవిత్‌మయ ఆనందా" : "ఎరుక (knowing) +ఎరుగబడునదీ - అను వాటిలో ఎరుగబడుదానిని ప్రక్కకు పెట్టితే, అప్పటికీ శేషించేదే శుద్ధ సంవిత్. అద్దాని అనుభవమే **శుద్ధ సంవిదానంద రూపము.** కేవల ఎరుక రూపదర్శనము. అట్టివాడు అర్ధసుప్త (Half sleeing) ప్రబుద్ధుడు. అట్టివాడు జీవాత్మబంధము లేనివాడై, జీవన్ముక్తుడై ఉంటాడు. **"జీవుడుగా ఉండి కూడా, నాకు బంధము లేదు"** అను భావన కలవాడు - జీవన్ముక్తుడు. |
| **"అసంవేదన" రూపా చ**<br>**షష్ఠీ భవతి భూమికా।**<br>**ఆనంద ఏక ఘనాకారా**<br>**సుషుప్త సదృశీ స్థితిః।** | **(6) ఆరవ భూమిక - "అసంవేదన" :** తెలియబడే సమస్తము అన్యముగా లేకుండా, ఆత్మకు అనన్యముగా స్వానుభవమగు (తెలియబడు) స్థితి. దృశ్యము ఆనందముగాను, ఏకముగాను, ఘనీభూత సుషుప్తితో సమానముగాను అనిపించునట్టి దశ. సుషుప్తిలో ఉన్నవానివలె అన్యమంతా లేనిదవటము. |
| **'తుర్య' అవస్థ ఉపశాంతా సా**<br>**ముక్తిః ఏవ హి కేవలా!**<br>**"సమతా స్వచ్ఛతా సౌమ్యా"**<br>**సప్తమీ భూమికా భవేత్।** | **(7) ఏడవ భూమిక "తుర్యక్" అవస్థ** - సమస్తము స్వస్వరూపమునందు ఉపశాంతించినప్పటి స్థితి. అదియే ముక్తస్థితి, కేవలస్థితి - అని కూడా పిలువబడుతోంది. జాగ్రత్ స్వప్న సుషుప్తులు - స్వకీయ కల్పిత సంచారస్థలములుగా అనిపించు స్థితి.<br>ఈ 7వ భూమికలో **సర్వత్రా సమభావన, ఆత్మగా సౌమ్యభావన-స్వాభావికముగా, అనుక్షణికముగా అగుచున్నాయి.** |
| **"తుర్య–అతీతా" తు యా అవస్థా**<br>**పరా, "నిర్వాణరూపిణీ"।**<br>**సప్తమీ సా పరా ప్రౌఢా**<br>**విషయో నైవ జీవతాం।** | తరంగమును త్యజించిన వాయువువలె నిశ్చలము. "నిర్వాణరూపము". అనబడుచున్నది. **"ఈ సమస్తము సర్వదా నేనే అయి ఉన్న నేను"** - అను కేవల పరతత్త్వస్థితి.<br>పరాకాష్ఠ-తుర్యాతీతము. అది పరాప్రౌఢ (Maturity of that self which is always beyond). ఎవ్వరికి ఈ దేహముపట్ల, జీవితముపట్ల అభిమానము, అభినివేశము ఉంటుందో వారికి తుర్యాతీతము విషయ అగుటలేదు. **తుర్యాతీతునికి జగత్తు విషయమే కాదు. జగత్తు స్వస్వరూపమునకు 'అభిన్నము' అగుచున్నది.** |

| | |
|---|---|
| **పూర్వ అవస్థాత్రయం తత్ర**<br>**"జాగ్రత్"–ఇత్యేవ సంస్థితమ్।**<br>**చతుర్థీ <u>స్వప్న</u> ఇతి ఉక్తా**<br>**"<u>స్వప్నా</u>భం" య<u>త్ర వై</u> జగత్।** | మొదటి మూడు భూమికలు అయినట్టి ముముక్షుత్వము (శుభేచ్ఛ), విచారణ సాంగభావనలు - ఇక్కడి జాగ్రత్ అవస్థావిషయముల వంటివి.<br>నాలుగవ భూమిక అగు వాసనా విలయరూప విలాసినీ-స్వప్నము వంటిదిగా పోల్చబడుతోంది. |
| **ఆనందైక ఘనాకారా**<br>**'సుషుప్త్య'–ఆఖ్యాతు పంచమీ।**<br>**అసంవేదన రూపా తు**<br>**షష్ఠీ "తుర్యపదాభిధా"।** | ఇక ఐదవదగు "శుద్ధసంవిత్ మయారూపము" - సుషుప్తితో సమానము అనబడుతోంది. ఇది ఘనీభూతమైన ఏకానందరూపము.<br>"అసంవేదనము" - ఆరవదగు ఏడవదగు 'తుర్యక్ పదము' - అను తెలియబడేదంతా తెలుసుకుంటున్న చిత్ నందు ఏకత్వము పొందటము. **అసంవేదనము** లేక అనన్యత్వము సిద్ధిస్తోంది. |
| **"<u>తుర్య–అతీత పద</u>" అవస్థా**<br>**సప్తమీ భూమికో<u>త్త</u>మా।**<br>**మనో వచోభిః అగ్రాహ్యా।**<br>**<u>స్వప్ర</u>కాశా, సదాత్మికా॥** | ఆపైగల తుర్యాతీతపదమగు పరాకాష్ఠ అత్యంత ఉత్తమోత్తమమైన అవస్థ. అది మనస్సు చేత కూడా గ్రహించబడేది కాదు. **అది ఆత్మయొక్క సత్ ప్రకాశాత్మకమైనది. స్వాభావికమగు సమగ్రత్వము.** |
| **అంతః ప్రత్యాహృతి (ప్రతి ఆహృతి) వశాత్,**<br>**<u>చైత్యం</u> చేత్ న విభావితమ్।**<br>**ముక్త ఏవ న సందేహో –**<br>**మహా సమతయా తయా॥** | అంతరంగమునకు సంబంధించిన ప్రత్యాహారము యొక్క అట్టి అభ్యాసముచే ఇక చైత్యము (తెలియబడునది) స్వాభావికంగానే (స్వస్వరూపమునకు వేరుగా) ప్రకాశించదు.<br>ఆతనిది 'మహాసమత్వస్థితి'. కాబట్టి అది 'ముక్త' స్థానమే. ఇందులో సందేహమే లేదు. |
| **న మ్రియే। న చ జీవామి।**<br>**న అహం సన్ ఆపి అసన్మయః, (సన్న్యాప్యసన్మాయః)**<br>**అహం న కించిత్ చిత్ –**<br>**ఇతి మత్వా ధీరో న శోచతి॥** | "నేను మరణించువాడను కాను. జీవించి ఉన్నవాడిని కాను. సత్-న్యాసుడను కాను. అసత్‌న్యాసుడను కాను. మరింకేమీ కాదు. "సర్వాత్మస్వరూపమగు కేవలాత్మయే నేను. ఇక్కడ తెలియబడుచున్నదేదీ నేనై ఉండలేదు" - అని గ్రహించి ఆ తురీయాతీత ధీరుడు ఇక దేనికీ శోకించడు. సర్వము తానై వినోదిస్తాడు కూడా. సమస్తముతోను ఏకరూపుడౌతాడు. |
| **12. అలేపకో అహమ్। <u>అజరో</u>।**<br>**నీరాగః శాంతవాసనః।**<br>**నిరంశో౽స్మి చిత్ ఆకాశం, –**<br>**<u>ఇతి మత్వా న శోచతి</u>।** | "అఖండాత్మానంద - సమస్త స్వరూపుడను" - అగు నేను.<br>- ఎట్టి లేపనము [జీవాత్మ- ఈశ్వరాది లేపనములు (outer pastings)] లేనివాడను.<br>- జరామరణ రహితుడను.<br>- సమస్తము నేనే అయి ఉండటంచేత రాగరహితుడను. శాంతమగు స్వభావము కలవాడను.<br>- అంశరహితమగు **చిదాకాశ స్వరూపుడను.**<br>అని తనను గురించి తాను ఎరిగినవాడు ఇక దేనికీ శోకించడు. |
| **అహం మత్వా విరహితః**<br>**శుద్ధో బుద్ధో అజరో అమరః,**<br>**శాంతః శమనం ఆభాస –**<br>**<u>ఇతి మత్వా న శోచతి॥</u>** | " నేను భావాతీతుడను. 'అహం'భావనకు మునుముందే భావన చేయుచున్నవాడను. దేనిపట్ల విరహము (అవినాభావము/ Dependence) లేనివాడను. శుద్ధుడను. కేవల బుద్ధి స్వరూపుడను. జన్మ - మరణములు లేనివాడను. పరమశాంతుడను. అన్యముగా కనిపించిందంతా ఆభాస (Refraction) మాత్రమే. అదంతా సర్వదా శమించినట్టివాడను" - అని ఎరిగినవాడు ఇక ఆదుర్దాలేవీ లేనివాడగుచున్నాడు. |

తృణాగ్రేషు అంబరే భానౌ
నర, నాగ, అమరేషు చ।
యః తిష్ఠతి "తత్ ఏవ అహం" -
<u>ఇతి మత్వా న శోచతి।</u>

"ఒక గడ్డి పరక యొక్క చిట్టచివరగా ఉన్నది నేనే. ఆకాశమంతా నిండి ఉన్నాను కూడా! సూర్యునియందు, నరులయందు, నాగముల (పాములయందు) దేవతలందు ఏ ఆత్మ సుతిష్ఠించినదై ఉన్నదో - ఆ తత్ ఆత్మయే నేను!" - అని గ్రహించిన తరువాత ఇక వేదన ఎందుకుంటుంది? ఉండదు.

---

భావనాం సర్వభావేభ్యః
సం ఉత్సృజ్య సముత్థితః
అవశిష్టం <u>పరంబ్రహ్మ కేవలో౽స్మి</u> -
ఇతి భావయ।

అందుచేత ఓ నిదాఘా! నీయొక్క సమస్త భావములకు సంబంధించిన 'భావన'ను త్యజించి - **"భావములకావల, భావించటానికి మునుముందే** ఉన్న కేవలమగు పరబ్రహ్మమే నేను! బ్రహ్మమే 'నేను'గా ఉన్నది నేనే! నేను బ్రహ్మమే అయి ఉన్నాను" - అని భావించవయ్యా!

---

వాచాం అతీత విషయో
విషయ ఆశాదశ ఉత్ జ్ఘతః (ఉజ్ఘతః)
పరానంద రస అక్షుబ్ధో
రమతే స్వాత్మని (స్వ ఆత్మన) ఆత్మని।

**ఎవ్వడైతే** -

ఇంద్రియ విషయములపట్ల ఆశించు స్వభావమును జయించివేసి వాక్కుకు అతీతమైయున్న అక్షుబ్ద (చంచలరహిత) పరానంద సాగర స్వరూపుడై స్వ-ఆత్మయందు ఆత్మగా రమిస్తూ ఉంటాడో,

---

సర్వకర్మ పరిత్యాగీ, నిత్యతృప్తో నిరాశ్రయః-
న పుణ్యే, న చ పాపేన,
న ఇతరేణ (నేతరేణ) చ లిప్యతే।

సర్వకర్మలు మొదలంట్ల పరిత్యాగముచేసి ఉంటాడో, 'ఆత్మతో ఆత్మను దర్శిస్తూ' ఉంటాడో - దేనికీ ఆశ్రయముకాక, దేనినీ ఆశ్రయించక ఉంటాడో, - అట్టివాడు పుణ్యముచేతగాని, పాపముచేతగాని, మరింకే విశేషము చేతగాని దోషము పొందడు.

---

స్ఫటికః ప్రతిబింబేన
యథా నాయాతి రంజనమ్,
తన్ జ్ఞః కర్మఫలేన అంతః
తథా నాయాతి రంజనమ్॥

ఒక తెల్లటి స్ఫటికములో ఎదురుగా ఉన్న వస్తువు ఏదోరంగుతో ప్రతిబింబించినంత మాత్రంచేత ఆ వస్తువు యొక్క రంగు, దోషము మొదలైనవి స్ఫటికమునకు అంటుతాయా? అంటవుకదా! అట్లాగే, ఆత్మతత్త్వము యొక్క వాస్తవికత ఎరిగిన మహనీయుని అంతరమును కర్మఫలములు ఏమాత్రము రంజనము (ధూళి, దోషము) కలిగించలేవు.

---

**13.** విహరన్ జనతా బృందే
దేహ కర్తన పూజనైః,
ఖేద అహ్లాదౌ న జానాతి ప్రతిబింబ గతైః ఇవ।
నిస్తోత్రో, నిర్వికారశ్చ పూజ్య-పూజా వివర్జితః।

నీళ్ళలో కనబడే ప్రతిబింబమునకు నీళ్ల యొక్క కదలికచే లాభముగాని, నష్టముగాని ఉండదు కదా!

అట్లాగే ఆత్మజ్ఞుడు జనసమూహంలో విహరిస్తున్నప్పుడుగాని, ఈ దేహము పూజింపబడుచున్నప్పుడుగాని, ఖేద - ఆహ్లాదములు పొందుచున్నప్పుడుగాని - దేనికీ సంబంధించనివాడై, ఏదీ పొందనివాడై, అవేవీ తెలియరానట్టివాడై ఉంటాడు. అన్నీ నిర్వర్తిస్తూనే ఏమీ చేయనివాడై ఉంటాడు.

**పూజించబడుచున్నప్పుడు, పూజిస్తూ ఉన్నప్పుడు కూడా...ఆ రెండిటిని వదలినవాడై, స్తోత్రరహితుడై, నిర్వికారుడై ఉంటాడు.**

---

సంయుక్తశ్చ, వియుక్తశ్చ,
సర్వాచార నయక్రమైః।
తనుం త్యజతు వా <u>తీర్థే,</u>
<u>శ్వపచస్య గృహే</u> అథ వా,
జ్ఞాన సంపత్తి సమయే
ముక్తో అసౌ విగత ఆశయః॥

ఆచార వ్యవహారములపట్ల స్వీకరిస్తూనే స్వీకరించనివాడై ఉంటాడు.

ఈ భౌతిక దేహము ఒక తీర్థ ప్రదేశములో వదలుచున్నప్పుడుగాని, కుక్కమాంసము తిను శ్వపచుల ఇంటిలో త్యజించు సందర్భము ఏర్పడినప్పుడుగాని - ఎవ్వడైతే ఆత్మ జ్ఞానసంపన్నుడై **"అమృత-ఆత్మానంద స్వరూపో౽హమ్ భావనతో సర్వ లోక సంబంధములు త్యజించి ఉంటాడో"** ఆతడు ముక్తుడే!

| | |
|---|---|
| **సంకల్పత్యాగం హి బంధస్య కారణం।**<br>**తత్ (సంకల్పత్వం) పరిత్యజ॥** | నిదాఘుడు : గురువర్యా! ఋభుదేవా! అట్టి ఆత్మయే సహజస్వరూపముగా కలిగియున్నట్టి మాకు బంధము ఎక్కడి నుండి వచ్చిపడుతోంది?<br>**ఋభుమహర్షి** : ఓ నిదాఘ మహాశయా! 'సంకల్పించుము' అనే మనో వ్యవహారము చేతనే బంధము ఏర్పడుతోంది. అందుచేత ఆత్మకు అన్యమైనట్టి సంకల్పము పరిత్యజించుము. రుగ్మతలన్నిటికీ అదే ఉపాయము. |
| **మోక్షో భవేత్ అసంకల్పాత్।**<br>**తత్ (అసంకల్పాత్) అభ్యాసం ధియాకురు।**<br>**సావధానో భవ త్వం చ,**<br>**గ్రాహ్య గ్రాహక సంగమే॥** | అసంకల్పమాత్రం చేతనే ఈ జీవునికి మోక్షము లభించగలదు. అందుచేత **'ఉత్తమ, నిర్మల, సునిశిత, విశాల'** బుద్ధితో **'సంకల్పించకుండటము'** అనే అభ్యాసమునకు ఇప్పుడే ఉపక్రమించు.<br>గ్రాహ్య (**గ్రహించటము**) గ్రాహక (**గ్రహించువాడు**) ములకు ఏర్పడుచున్న అవిజ్ఞాత - అభ్యాస పూర్వక పరస్పర సంబంధముపట్ల జాగరూకుడవై, సావధానుడవై ఉండెదవుగాక! సమస్త సంబంధములనుండి వేరైనవాడవై ఉండుము. |
| **అజస్రమేవ సంకల్ప దశాః**<br>**పరిహరన్ శనైః॥** | అజస్రముగా (ఎల్లప్పుడు, ఏమాత్రము ఎడతెరిపిలేకుండా) చోటుచేసు కుంటున్న సంకల్పములనుండి విడివడి, **"సంకల్పించక పోవటము"**ను అభ్యాసము చేయి. నెమ్మదిగా **"సంకల్పించుచూ ఉండటము"** అనే దశను ఉపసంహరించు. ఉపశమింపజేయి. |
| **మా భవ గ్రాహ్య భావాత్మా।**<br>**గ్రాహకాత్మా చ మా భవ॥** | గ్రాహ్య భావుడవు కావద్దు. (దృశ్యభావుడవు కావద్దు). గ్రాహక భావుడవు (ద్రష్ట భావుడవు) కావద్దు. ఆ రెండిటికీ ఆవలగా ఉండి, మౌనంగా చూస్తూ ఉండు. |
| **భావనాం అఖిలాం త్యక్త్వా**<br>**యచ్ఛిష్టం (యత్ శిష్టం) తన్మయో భవ॥** | సమస్త భావములు త్యజించి, అటుపై ఏది నీ స్వరూపముగా శేషించియుంటున్నదో, అట్టి **'భావరహిత పరాత్మ రూపము'**తో తన్మయుడవై ఉండియే ఈ దృశ్యమునందు సంచరించుము. |
| **కించిత్ చేత్ రోచతే తుభ్యం**<br>**తత్ బద్ధోఽపి భవస్థితౌ।**<br>**న కించిత్ రోచతే చేత్ తే**<br>**తత్ ముక్తోఽసి భవస్థితౌ॥** | ఈ దృశ్యములో ఏ కించిత్ వస్తువునుగాని, విషయమునుగాని - **"నాకు చాలా యిష్టము"** అను అవినా-భావన కలిగి ఉంటే, అది 'భవబంధము'గా రూపము దిద్దుకొని ఉండగలదు. **భావబంధమే భవబంధము.**<br>దృశ్యములో ఏదీ కోరుకోకపోతే (లేక రుచించకపోతే) అప్పుడు నీవు ముక్తుడవై ముక్తిత్వమునందు సుస్థితి పొందుచున్నట్లే. |
| **అస్మాత్ పదార్థ నిచయాత్**<br>**యావత్ స్థావర జంగమాత్**<br>**తృణాదేః దేహ పర్యంతాత్**<br>**మా కించిత్ తత్ర రోచతామ్॥** | అందుచేత ఒక తృణము (గడ్డిపరక) నుండి ఈ దేహము వరకు ఈ స్థావర జంగమ పదార్థము ఏదీ కూడా నీకు 'రుచించునది' అయి ఉండకుండుగాక! ఆత్మ మాత్రమే **'రుచి'** అగును గాక! అద్దాని సమస్తత్వ అప్రమేయత్వములు అభిరుచికి నీకు విషయమగు గాక! |
| **14. అహంభావ – అనహంభావౌ**<br>**త్యక్త్వా సత్–అసతీ తథా,**<br>**యత్ అసక్తం సమం స్వచ్ఛం**<br>**స్థితం తత్ "తుర్యం" ఉచ్యతే॥** | <u>తుర్యగము :</u> అహంభావము - అనహంభావములను, (అట్లాగే) సత్-అసత్‌లను త్యజించినవాడవై, అప్పటికీ ఎటువంటి...<br>- ఆసక్తి రహిత,<br>- సర్వత్రా సమస్వరూప,<br>- దోషరహిత - స్వచ్ఛ స్థితి ఉన్నదో - అదియే **'తుర్యము'.** |
| **యా స్వచ్ఛా సమతా శాంతా, జీవన్ముక్త వ్యవస్థితిః।**<br>**'<u>సాక్షి</u>' అవస్థా వ్యవహృతా**<br>**సా '<u>తుర్యకలన</u>' ఉచ్యతే॥** | ఏది స్వచ్ఛము, సమతము, శాంతము, జీవన్ముక్తముగా వ్యవస్థితమైనట్టిదో, 'సాక్షి-అవస్థ'గా వ్యవహృతమైనదో - అదియే **'తుర్యకలనము'** అని చెప్పబడుచున్నది. |

| | |
|---|---|
| **నైతత్ (న ఏతత్) జాగ్రత్। న చ స్వప్నః।<br>(కింతు) సంకల్పానాం అసంభవాత్।** | అట్టి ఆత్మతత్త్వానుభవము జాగ్రత్ వంటిది కాదు. స్వప్నము వంటిది కాదు. ఎందుకంటే జాగ్రత్ స్వప్నములు సంకల్పములచే సంభవిస్తాయి. ఆత్మయో? నిర్విషయము. అద్దానియందు 'సంకల్పము' అనే అన్యమైనది అసంభవము. సమస్త సంకతల్పములను మనముందే ఉన్న - ఆ సంకల్పించువాని స్వస్వరూపానందము. (జీవన్-మరణములు కూడా భావనామాత్ర అనుభవములే). |
| **సుషుప్తి భావో, నోప్యేత<br>అభావాత్ జడతా స్థితేః** | ఆత్మానుభవము సుషిప్త్యనుభవము వంటిదా? కాదు. ఎందుకంటే సుషుప్తి **- అభావన రూపమగు జడస్థితి మాత్రమే.** భావములు ఉండియే వర్తమానంలో నిశ్శబ్దత పొందినవై ఉంటాయి. **ఆత్మయో సుషుప్తికి కూడా ఉనికి స్థానము.** |
| **శాంతః సమ్యక్ ప్రబుద్ధానాం<br>యథా స్థితం ఇదం జగత్, –** | సమ్యక్ (సర్వత్రా సమస్వరూపమును సిద్ధించుకొన్న) ప్రబుద్ధులకు (అసత్ నుండి ప్రబుద్ధము సిద్ధించుకొన్న వారికి) **యథాస్థితమగు ఈ దృశ్య జగత్తంతా కూడా పరమశాంతరూపమై గోచరిస్తూ ఉన్నది.** |
| **విలీనం 'తుర్యం' ఇతి ఆహుః–<br>అబుద్ధానాం స్థితం స్థిరం॥** | అబుద్ధులకు ఈ దృశ్యమంతా స్థిరమై ఘనీభూతముగా కనిపిస్తూ ఉంటే, సమ్యక్ సిద్ధి పొందిన ఆత్మజ్ఞులకు ఇది తుర్యము (సాక్షి) యందు సర్వదా విలీనమై యుండియున్నట్లు అగుపిస్తోంది. |
| **అహంకార కలా త్యాగే<br>సమతా యాః సముద్గమే<br>విశరారౌ కృతే చిత్తే<br>తుర్యావస్థా ప్రతిష్ఠితే॥** | అహంకారకలనము (భ్రమ) త్యజించబడగా, సర్వత్రా సమదృష్టి బయల్వెడలుచుండగా, చిత్తమునందు 'అన్యము' అయినదంతా తొలగిపోవుచుండగా - అట్టి వాని చిత్తము అనన్యమగు **'తుర్యక్'** అవస్థ యందు ప్రతిష్ఠితము అగుచున్నది. |
| **సిద్ధాంతో అధ్యాత్మ శాస్త్రాణాం<br>సర్వ అపహ్నవ ఏవ హి।** | ఓ నిదాఘా! ఆత్మతత్త్వానుభవము సిద్ధించిన తరువాత ఇక శాస్త్రములతో కూడా పని ఉండదు. (శాస్త్రాన్యపి సంత్యజతి). ఎందుకంటే అధ్యాత్మశాస్త్ర సిద్ధాంతాలన్నీ కూడా ఒక రకంగా పరతత్త్వానుభవమును కప్పిపుచ్చి ఉంచేవే. (అపహ్నవఏవ). మఱుగున ఉంచేవే! అనుభవం నుండి శాస్త్రం వస్తుంది. శాస్త్రం నుండి అనుభవము కాదు. శాస్త్రములు అనుభవమునకు దారిచూపి, ఇక ఆపై తమ స్థానమునుండి తొలగిపోతాయి. |
| **న అవిద్యాస్తి ఇహ। నో మాయా।<br>'శాంతం బ్రహ్మ' ఇదం అక్లమమ్।<br>శాంత ఏవ చిత్ ఆకాశే,<br>స్వచ్ఛే శమ – శమాత్మని॥** | ఇక్కడ అవిద్యలేదు. మాయ లేదు. క్లమము లేని (శ్రమలేని, బడలిక లేని) శాంతమగు బ్రహ్మము మాత్రమే ఉనికి కలిగియున్నది.<br>అట్టి చిదాకాకాశము స్వచ్ఛము శమమునందు శమించినట్టిది. పరమశాంతము. ఈ జీవునియొక్క - **"సమస్తము తనయందు (ఆత్మదర్శనముచే) శమింపజేసుకొన్న - సశాంతస్వరూపము".** |
| **సమగ్ర శక్తి ఖచితే<br>'బ్రహ్మ' ఇతి – కలితాభిధే।<br>సర్వం ఏవ పరిత్యజ్య<br>"మహామౌనీ" భవ, అనఘ!** | ఓ నిదాఘా! సమగ్రశక్తి రూపమగు 'బ్రహ్మము' అను తత్త్వమునందు సమస్తమును జారవిడచినవాడవై, సర్వము బ్రహ్మమునకు అనన్యముగా ఏకము చేసివేయి. **నీవే బ్రహ్మమై ఉండుము.**<br>సమస్త భేదములను (ఆత్మకు అన్యముగా మనోభ్రమచే అనిపించే సమస్తమును) త్యజించి వేయుము. ఓ అనఘా! పాపరహితుడా. **'మహామౌని'** వై ఉండుము. |
| నిర్వాణవాన్ నిర్మనసః<br>క్షీణ చిత్తః ప్రశాంత "ధీః"॥ | సంచలనములన్నీ అధిగమించి : -<br>❊ నిర్వాణవంతుడవగుము.<br>❊ మనోరహితుడవై, అతీతుడవై ఉండుము. మనస్సుకు (ఆలోచనలకు) సాక్షివై చూస్తూ ఉండుము.<br>❊ 'ప్రియము' రూపమగు చిత్తమును క్షీణింపజేయుము. ఆత్మానందమునందు ఏకము చేసివేయుము.<br>❊ సంశాంతించిన ప్రశాంత బుద్ధితో విరాజిల్లుము. |

| | |
|---|---|
| **15. ఆత్మన్యేవ అస్య శాంతాత్మా,<br>(ఆత్మన ఏవ అస్య శాంత-ఆత్మా)<br>మూక అంధ బధిర ఉపమః॥** | జగద్విషయ పరిచయములందు (సమస్త ఇంద్రియార్థములందు) - చెవిటివానివలెను (వినీ విననివాడివలెను),<br>- చూస్తూ కూడా చూడని వానివలెను (అంధునివలెను),<br>- మాట్లాడుతూ కూడా మూగవానివలెను (మాట్లాడనివానివలెను) - అగుచూ, **ఆత్మయందు సశాంతించిన శాంతాత్ముడవు - అయి ఉండుము.** |
| **నిత్యం అంతర్ముఖః స్వచ్ఛః<br>స్వాత్మనాంతః ప్రపూర్ణ ధీః॥** | స్వాత్మయందు పరిపూర్ణమగు బుద్ధి వెంటనంటియుండగా, నిత్యము అంతర్ముఖుడవు, స్వచ్ఛుడవు అయిఉండుము. అందరిలోను, **అందరిగాను ఆత్మను దర్శించుము. (అందరిలోను అంతరాత్మను మాత్రమే దర్శిస్తూ, ఉపాసించువాడు - "అంతర్ముఖుడు").** |
| **జాగ్రత్ ఏవ సుషుప్తస్థః<br>కురు కర్మాణి వై, ద్విజ!<br>అంతః సర్వ పరిత్యాగీ,<br>బహిః కురు యథా గతమ్** | జాగ్రత్‌లో కూడా సుషుప్తునివలె, దేనిచేతనూ స్పృశించనివాడవై కర్మలు నిర్వర్తించుము. బాహ్యమున కర్మలు నిర్వర్తిస్తూనే అంతరమున సర్వము పరిత్యాగము చేసినవాడవై ఉండుము. నిద్రాళువులె - ఏదీ ఏమాత్రము పట్టనట్లుగా - అంతరమున ఉండుము. |
| **చిత్త సత్తా పరం దుఃఖం।<br>చిత్త త్యాగః పరం సుఖమ్।<br>అతః చిత్తం చిత్ ఆకాశే<br>నయ క్షయం అవేదనాత్।** | ఓ నిదాఘా!<br>❖ చిత్తముయొక్క ఉనికియే పరమ దుఃఖము.<br>❖ చిత్తముయొక్క త్యాగమే పరమ సుఖము.<br>(కాబట్టి) అట్టి చిత్తమును ఎటువంటి వేదన లేకుండా చిదాకాశమునందు లయము చేసి వేయుము. |
| **దృష్ట్వా రమ్యం అరమ్యం వా<br>స్థేయం పాషాణవత్ సదా।<br>ఏతావతా(త్) ఆత్మయజ్ఞేన<br>జితా భవతి సంసృతిః॥** | **ఇక 'సంసృతి' లేక 'సంసారము' మాటేమిటంటావా?**<br>రమ్యమైన (మరియు) అరమ్యమైన వస్తువులుగాని, విషయములుగాని రూపములుగాని కనిపించినప్పుడు ఒక శిలవలె అంతరమున ఆత్మ భావనతో నిశ్చలుడవై ఉండు.<br>ఈ మాత్రము భావనయే ఆత్మయజ్ఞము. అట్టి ఆత్మయజ్ఞముతో ఈ సంసారము (లేక) సంసృతిని జయించినవాడవు కాగలవు. |
| **<u>నియమః</u><br>వేదాంతే పరమం గుహ్యం<br>పురా కల్ప ప్రచోదితమ్।<br>న అప్రశాంతాయ దాతవ్యం<br>(నా) పుత్రా (యా) శిష్యాయ వై పునః।<br>(న అపుత్రాయ, అశిష్యాయ వై పునః)** | ఓ ప్రియ నిదాఘమహాశయా! సమస్త కల్పనలకు మునుముందే ఉండి, సమస్తమును ప్రభోదితము (Inspiring Directing) చేస్తున్న పరమరహస్యమగు వేదాంత (తెలుసుకొనుచున్నవానిగురించిన) శాస్త్రమును నీకు ఇప్పుడు బోధించాను. ఇతఃపూర్వము బోధించబడినదే ఇప్పుడు నీకు వర్ణించి చెప్పాను. ఇది నీవు అర్హతగల వారికి బోధించు. అయితే<br>- ఎవ్వరు ప్రశాంతమనస్కులై ఉండరో<br>- ఎవ్వరు "తండ్రీ!" - అను పుత్రభావము వహించరో, శిష్యభావము కలిగి ఉండరో, అట్టి వారు బోధకు అర్హులు అవజాలరు. |
| **<u>ఫలశృతి</u><br>అన్నపూర్ణ ఉపనిషదం యో అధీతే<br>గురు అనుగ్రహాత్<br>స జీవన్ముక్తతాం ప్రాప్య<br>బ్రహ్మైవ ('బ్రహ్మ' ఏవ) భవతి స్వయమ్॥<br><u>*ఇతి ఉపనిషత్॥*</u><br><u>*(అన్నపూర్ణోపనిషత్ సమాప్తా)*</u>** | ఎవ్వరైతే గురుదేవుల అనుగ్రహం పొంది ఈ అన్నపూర్ణోపనిషత్ అధ్యయనము చేస్తారో...<br>- వారు స్వయముగా బ్రహ్మమే అగుచున్నారు.<br>**(బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి)**<br>**<u>*ఇతి అన్నపూర్ణోపనిషత్*</u>**<br>**<u>*ఓం శాంతిః శాంతిః శాంతిః*</u>** |

అథర్వణవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 03 అన్నపూర్ణోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము

### కొన్ని పౌరాణిక విశేషములు

---

**ఋభుమహర్షి :** సర్వశ్రీ సనక, సనంద, సనత్కుమార, సనస్సుజాత, దేవర్షి నారద మొదలైనవారివలెనే **బ్రహ్మమానస పుత్రులలో ఒకరు**. నిదాఘునికి గురువు.

ఒకరోజు ఒకరాజు ఒక ఏనుగును ఎక్కి ఎటో పోవుచూ ఉన్నారు. అప్పుడు ఋభుమహర్షి నిదాఘుని పిలచి, అది చూపించి, **"శిష్యా! నిదాఘా! వీరిలో ఎవరు రాజు? ఎవరు ఏనుగు?"** – అని ప్రశ్నించారు.

అప్పుడు నిదాఘుడు ("గురువుగారు సరదాగా అడుగుచున్నారులే!" అని తలచి), కించిత్ ఎగతాళిగా, "గురువర్యా! మీవలే అడుగుచున్నది "ఏనుగు" నావలే సమాధానము చెప్పుచున్నదేమో "రాజు" – అని పలికారు.

ఆ సమాధానము విన్న ఋభుమహర్షికి కించిత్ కూడా కోపము రాలేదు. పైగా చిరునవ్వు నవ్వారు.

**"ఓ నిదాఘా! ఇప్పుడు నీకు "రాజు-ఏనుగుల అభేదము"ను బోధిస్తాను. పద" అని పలికారు.**

**"అద్వైత సిద్ధాంతము"**ను ప్రబోధించారు. నిదాఘుడు అదంతా శ్రద్ధాసక్తులతోను భక్తిగాను, విని ధన్యుడైనారు. గురుపాదములపై వ్రాలి నమస్కరించారు. – [విష్ణుపురాణము (మరియు) మార్కండేయపురాణము]

---

వేద రహస్యములయినట్టి **"తత్ త్వమ్ – సోఽహమ్ – త్వమేవాఽహమ్"** – త్రయీ (3) మహావాక్యములచే ఉజ్వలమగుచున్నట్టిది, సమస్తమునకు మరుగున (Hidingty) ఉన్నట్టిది – అగు త్రైపద (జాగ్రత్ స్వప్న సుషుప్త) సాక్షీ స్వరూప "రామతత్త్వము' – మాయొక్క **"స్వస్వరూపమే"** అయి ఉన్నది. అట్టి శ్రీరామతత్త్వమును శరణువేడుచున్నాము.

నిదాఘుడు అనే మహనీయుడు. పులస్త్యుని కుమారుడు (విష్ణుపురాణము). ఆయన యోగాభ్యాసముచే **'యోగీంద్రుడు'**గా ప్రసిద్ధి. ఆయన ఒక సందర్భములో బ్రహ్మవిదుడగు తన గురువు శ్రీ ఋభుమహర్షిని దర్శించుకొన్నారు. భూమిపై సాష్టాంగ పూర్వకంగా దండ ప్రణామములు సమర్పించారు. వినమ్రుడై, గురువుకు ఎదురుగా నిలుచున్నారు.

⌘

**ఋభుమహర్షి :** వత్సా! నిదాఘమునీ! సుస్వాగతము సుఖాసీనుడవు కమ్ము. ఏమి ఈ విధంగా మన ఆశ్రమానికి అనుకోకుండా వచ్చావు? ఏమిటయ్యా, విశేషాలు?

**నిదాఘముని :** గురువర్యా! **'తత్త్వజ్ఞానము'**నకు మించిన విశేషమేముంటుంది? దయతో ఆత్మతత్త్వమును నాకు బోధించవలసినదిగా వేడుకుంటున్నాను. హే బ్రహ్మన్! మీరు మోక్ష సామ్రాజ్యమును సొంతము చేసుకొని ఉన్నారని మిమ్ములను మునిలోకము ప్రస్తుతించుచుండటము వింటూ ఉన్నాము. అయితే స్వామీ! ఏ మోక్ష ప్రదమగు మహావిద్యను అధ్యయనము చేసి, అట్టి **'మహావిద్య'**చే ఆత్మవిద్యను ప్రాప్తింపజేసుకొనుచున్నారో – అద్దానిని బోధించండి. నాకు మోక్ష సామ్రాజ్య ప్రదాయిని అగు 'విద్య'ను ప్రసాదించండి.

**ఋభుమహర్షి :** బిడ్డా! నిదాఘా! ఇట్టి ప్రశ్న అడగటంచేత నీవు కృతార్థుడవయ్యావయ్యా! ఏది విజ్ఞాన (తెలుసుకున్నంత) మాత్రంచేత జీవన్ముక్తుడవు కాగలవో, అట్టి **సనాతన విద్య**ను విశదీకరిస్తాను. శ్రద్ధగా వినిదెవు గాక! మనము ఇప్పుడు చెప్పుకుంటున్నది – ఈ జీవునియొక్క **"జన్మలన్నింటికంటె మునుముందే ఏర్పడినదై ఉన్నట్టి స్వస్వరూపము"** గురించి కాబట్టి – **'సనాతన విద్య'**గా లోకప్రసిద్ధము.

ముందుగా నాయొక్క బాల్యములోని కొన్ని విశేషాలు చెప్పుతాను విను.

నీవు ఇప్పుడు నన్ను అడుగుచున్న విధంగానే – నేను చిన్నప్పుడు విద్యార్థి దశలో ఉండగా నా పితృదేవులగు బ్రహ్మదేవులవారిని ఆత్మవిద్య బోధించవలసినదిగా అభ్యర్థించాను. వారు నన్ను ఈ విధంగా ఆజ్ఞాపించారు.

**"బిడ్డా! నీవు ముందుగా బుద్ధిని సునిశితము, నిర్మలము, సువిశాలము చేసుకుంటేనే ఆత్మవిద్యను అర్థము చేసుకొని, హృదయస్థము చేసుకోగలుగుతావు. అందుకొరకై జగన్మాతయగు అన్నపూర్ణ దేవిని ఉపాసించు".**

అప్పుడు నేను మా నాన్నగారు సూచించిన విధంగా నిత్యోపాసనకు సంసిద్ధుడనయ్యాను. ఉపాసనకు త్రోవచూపించవలసినదిగా అడిగాను. అప్పుడు నాకు ఈ విధంగా (ఉపాసన) ను బోధించారు.

"నాయనా! ఋభూ। ఉపాసనకొరకై నీకు '27' అక్షరముల రూప బీజశబ్ద సమన్వితమగు మంత్రమును ఉపదేశిస్తున్నాను!" ఈ విధంగా పలికి – శ్రీ అన్నపూర్ణా సప్తవింశతి (27) అక్షర మహామంత్రమును ఉపదేశించారు.

**భగవతి అన్నపూర్ణ సప్తవింశతి బీజమంత్రము**

**1. ధ్యానశ్లోకము** (అన్నం = బ్రహ్మము, పూర్ణ = బ్రాహ్మీ తత్త్వముచే పూర్ణానందస్వరూపిణి)

| | |
|---|---|
| **మూలశృంగాట మధ్యస్థా।**<br>**బిందునాద కళాశ్రితా।**<br>**నిత్యానందా। నిరాధారా।**<br>**విఖ్యాతా (ప్ర) విలసత్కచా॥** | = "జాగ్రత్-స్వప్న-సుషుప్తి-తురీయ" నాలుగు త్రోవల మధ్యగల మూల స్థానమునందు వేంచేసియున్నట్టిది,<br>= బిందు (Point) నాద (Sound) కళ (Manifestation) లను ఆశ్రయించి ఉన్నట్టిది. (ఆకాశ - శబ్ద - అర్థముల దేవత),<br>= సర్వదా ఆనందస్వరూపిణి.<br>= దేనిపై ఆధారపడక, - స్వతఃసిద్ధమైనట్టిది.<br>= ఉత్తమమైన మెఱుపుతో కూడిన మేఘమాలిక ధరించనదిగా వర్ణించబడునది అగు - **అన్నపూర్ణాదేవిని స్మరిస్తున్నాను.** ఆ తల్లి లోక విదిత। జగన్మాత। సమస్త జీవులు ఆ తల్లి యొక్క బిడ్డలే। ఆహారము ప్రసాదించు మాతృమూర్తి. |
| **విష్టపే శ్రీ మహాలక్ష్మీః।** | జగత్ సంపదగా విలసిల్లు శ్రీ మహాలక్ష్మి రూపిణి, (మహాలక్ష్మీ బీజరూపిణి)। |
| **కామః తారోనతిః తథా।**<br>**(కామస్తారో నతిస్తథా)।** | కామబీజముగా, తారా బీజముగా ఎల్లప్పుడు యోగులచే నమస్కరించబడునది. (అన్నపూర్ణాదేవి ఇచ్ఛారూపమే ఈ సమస్తము). |
| **భగవతి అన్నపూర్ణేతి** | తేజోరూపిణి అన్నపూర్ణాదేవిని **భగవతి = సమస్తము వెలిగించునదిగా**-తలచి నమస్కరిస్తున్నాను. |
| **మమ అభిలషితం తతః।** | నా అభిలషితము (కోరుకొనునది) ప్రసాదించుటకై వేడుకొనుచున్నాను. |
| **అన్నందేహి తతః**<br>**స్వాహా - మంత్ర సార ఇతి విశ్రుతా॥** | ఆ దేవి ఆహుతులు స్వీకరించి బ్రాహ్మీ ప్రసాదము ఇచ్చుటకై "అన్నందేహి" మంత్రసారముగా విస్తరించియున్నది. (అన్నం బ్రహ్మ)। |
| **సప్తవింశతి వర్ణాత్మా।**<br>**యోగినీ గణ సేవితా।** | '27' అక్షరములు మాలికగా యోగినీ గణముచే సేవించబడుచున్నది. |

**అట్టి జగజ్జనని, లోకపావనికి నమో నమో నమః**

**2. సప్త వింశతి (27) అక్షర బీజమంత్రము**

| | |
|---|---|
| **ఐం హ్రీం సౌః శ్రీం క్లీం** | **(5)** |
| **(ఓం) నమో భగవతి అన్నపూర్ణే!** | **(10)** |
| **మమాభిలషితమన్నం** | **(8)** |
| **దేహి స్వాహా॥** | **(4)** |
| | **27** |

ఓ నిదాఘా! ఈ మంత్రమును భక్తితో, శ్రద్ధతో గురుతుల్యులగు నాన్నగారి (బ్రహ్మదేవునివద్ద) వద్ద స్వీకరించాను. ఉపదేశం పొందాను. ఇక అప్పటి నుండి ఆచార-నియమములను పాటిస్తూ సుదీర్ఘకాలము 'మంత్ర-అనుష్ఠానము' ఆచరించాను. ఈ విధంగా చాలా రోజులు గడచిపోయినాయి. ఒకానొకరోజు **చిరునవ్వులు చిందించు సుందరముఖముతో విశాలాక్షియగు జగన్మాత అన్నపూర్ణాదేవి నా కళ్ళకు ఎదురుగా ప్రత్యక్షమైనది.** వెంటనే లేచి నిలుచుని సాష్టాంగ దండ ప్రణామములు చేశాను. ప్రదక్షణ పాదాభివందనములు సమర్పించాను.

అప్పుడు ఆ జగదాంబ **"బిడ్డా! నీ ఉపాసనకు సంతోషించానయ్యా! నీ అభిలషితము (ఇష్టమైనది) ఏమిటో - అడుగు. త్వరగా! వరముగా ప్రసాదిస్తాను।"** - అని మధురాతి మధురమైన స్వరములో పలికింది.

అప్పుడు నేను **"అమ్మా! విశాలాక్షీ! అన్నపూర్ణాదేవీ! పార్వతీ! త్రిలోక పాలినీ! జగదీశ్వరీ! సదానంద రూపిణీ!- ఆత్మ తత్త్వం మనసి మే ప్రాదుర్భవతు।** "ఆత్మతత్త్వము నా మనస్సునందు పరిఢవిల్లును గాక! ఈ వరమును ప్రసాదించు, తల్లీ!"- అని (వరముగా) కోరాను.

అప్పుడు జగత్ సృష్టి స్వరూపిణియగు శ్రీ అన్నపూర్ణాదేవి **"తథైవ అస్తు! అట్లే అగుగాక!"** - అని కరుణతో దీవించి అంతర్ధానమైనది.

ఆ అన్నపూర్ణాదేవి అనుగ్రహంచేత నా అంతరమున బుద్ధి వికసించగా, విచారణచే **'వాస్తవానికి నాకు బంధమే లేదు'** - అను ముక్తస్థితి రూపుదిద్దుకోసాగింది. **"పరమాత్మగా నేను నిత్యముక్తుడను"** అని ఎరుగనారంభించాను. ఈ జగత్తు యొక్క వాస్తవ విచిత్ర స్వరూపమేమిటో ఎరుగగల మతి ప్రవృద్ధమైనది. **తదా మే మతిః ఉత్పన్నా జగత్ వైచిత్ర్య దర్శనాత్।**
ఆ క్రమంగా ఈ విధంగా విచారణ చేయసాగాను.

## పంచవిధ భ్రమలు

ఇంద్రియములకు విషయముల రూపంగా ఈ జీవునికి ప్రాప్తిస్తున్న ఈ జగత్తు యొక్క దర్శనమునకు సంబంధించి '5' విధములైన భ్రమలు ప్రవర్తిల్లుచున్నాయి.

**(1) జీవ-ఈశ్వరౌ భిన్న రూపాః ఇతి ప్రాథమికో భ్రమః :** (1) శరీరాభిమాని - శరీరధారియగు ఈ జీవుడు. (2) అనేక దేహములతో అనేక దేహములు విషయముగా కలిగియున్న ఈశ్వరుడు - వీరిరువురు వేరువేరైనవారు. ఒక్క తీరువారు కాదు. ఏకస్వరూపులు కాదు - అనునది **మొదటి భ్రమ.**

**(2) ఆత్మనిష్ఠం కర్తృగుణం - వాస్తవమ్ - వా ద్వితీయకః :** "ఆత్మయే - ఒకానొక నిష్ఠగా కర్మలు, జన్మలు మొదలైనవాటికి కర్త అయి ఉన్నది. త్రిగుణములు ఆత్మ కలిగి ఉంటోంది" - అనునది **రెండవ భ్రమ.**

**(3) (జీవః) శరీరత్రయ సంయుక్త - సంగీ తృతీయకః। : "**ఈ జీవుడు స్థూల, సూక్ష్మ, కారణ దేహములకు చెందినవాడు. (1) పంచభూత నిర్మితమైన **భౌతిక (స్థూల) దేహము** - (2) వినికిడి, చూపు, స్పర్శ మొదలైనవి ప్రదర్శించునట్టి - **సూక్ష్మదేహము,** (3) సంస్కారములు, వాసనలతో కూడిన) **కారణ దేహము-** కలిగి ఉన్నాడు. వాటికి ఈతడు బద్ధుడు. అట్టి బద్ధుడైన ఈ జీవుడు ముక్తిని సంపాదించుకోవాలి. అట్టి మూడు దేహములతో ఆతనికి సంగము (Attachment) ఉన్నది. అట్టి సంగము (Attachment) - అనేక ప్రయత్నములతో తొలగవలసి ఉన్నది" - అనునది **మూడవభ్రమ.**

**(4) జగత్ కారణరూపస్య వికారిత్వం - చతుర్థకః :** ఈ జగద్దృశ్యము కారణంగానే ఈ జీవుడు అనేక వికారములు పొందుచున్నాడు. దృశ్యము లేకుంటే వికారములు పొందడు. జగత్తు స్వయముగా తనకు తానే కామ - క్రోధ - లోభ....ఇత్యాది దోషములు కలిగిస్తూ ఉండగా, ఈ జీవుడు నిస్సహాయుడై, బద్ధుడగుచున్నాడు. **జగత్తే లేకపోతే బంధమే ఉండేది కాదు** - ఈ తీరైనది **నాలుగవ భ్రమ.**

**(5) కారణాత్ భిన్న జగత్ సత్యత్వం - పంచమో భ్రమః :** ఈ జగత్తుకు కారణము ఆత్మయే అయి ఉండి, ఆ తదనంతరము ఈ జగత్తు కూడా ఆత్మవలెనే 'సత్యమే' అయి ఉన్నది - అనేది **ఐదవ భ్రమ.**

ఈ విధంగా ఈ చిత్తమును (1) భిన్నత్వము (2) కర్తృత్వము (3) సంగము (4) వికారిత్వము (5) సత్యత్వము అనబడే '5' భ్రమలు ఆవరించి ఉన్నాయి.

> (1) జీవుడు ఈశ్వరుడు వేరు వేరు. (2) ఆత్మకు కర్తృత్వ - భోక్తృత్వములు ఉన్నాయి. (3) జీవాత్మకు స్థూల సూక్ష్మ కారణ శరీరాలు ఉన్నాయి. అవి దాటాలి. (4) ఈ జగత్తు కారణరూప వికారములు కలుగజేస్తోంది. జగత్తు లేకుంటే బంధము ఉండేది కాదు. (5) కారణరూపమగు ఆత్మకు కార్యరూపమగు ఈ జగత్తు భిన్నము - **ఇవి పంచభ్రమలు.**

పంచ భ్రమలు నివృత్తి అయితే, ఆ మరుక్షణం చిత్తమునకు 'చిత్' ప్రకాశము స్ఫురించగలదు. ఈ పంచభ్రమలను కడిగివేసి, బుద్ధిని పరిశుభ్రం చేసుకొని - ఈ జీవుడు **'సోఽహమ్-తత్త్వమ్'** భావనను సిద్ధించుకోవటానికై తత్త్వజ్ఞులగు మహనీయులు స్వానుభవమంతా రంగరించి, అందుకు ఉపాయాలుగా మనకు సూచిస్తున్నదే - **<u>తత్త్వశాస్త్రము.</u>**

## నివారణోపాయములు

**(1) జీవుడు వేరు - ఈశ్వరుడు వేరు అను జీవేశ్వర భేద, భ్రమ నివారణోపాయము→ <u>బింబ - ప్రతిబింబదర్శనము :</u>** ఆకాశంలో సూర్యుడు ప్రకాశించుచున్నారు. ఆ సూర్యబింబము తటాకములోని జలంలో ప్రతిబింబిస్తూ కనబడుతోంది. జలములోని తరంగాల కదలికలచే ప్రతిబింబము కదలుచున్నట్లుగా అగుపిస్తోంది. కనుక **"సూర్యబింబము తటాక జలములోని కదలికలు పొంది, తద్వారా తాను చంచలత్వము అనుభవిస్తోంది! నిశ్చలతను కోల్పోతోంది"** - అని అంటామా? అనము కదా!

**"అట్లా కాదనుకోండి! ఆకాశములో సూర్యబింబము వేరు. జలములో ప్రతిబింబము వేరు. అవి వేరు వేరు ధర్మములు కలిగి ఉన్నాయి. ఆకాశంలో సూర్యుడు నిశ్చలుడు అయిన మాట నిజమే! జలములో ప్రతిబింబము కదలుచున్నమాట కూడా నిజమే!"- అను వాక్యములు నిజమా?**

తరంగములలో ప్రతిబింబించే సూర్యబింబమునకు మాత్రం చాంచల్యము ఉన్నది - అని అన్నప్పుడు, అది ఒప్పుకుంటామా? లేదు. సూర్యుడు → బింబ, ప్రతిబింబములనబడే రెండు స్థితులు స్వధర్మముగా కలిగిలేడు. నీటిలో ప్రతిబింబసూర్యునికి 'ఉనికి'యే లేదు. ఉనికియే లేనివానికి చాంచాల్యము ఉండటమేమిటి? ఆ చాంచల్యము తొలగించే ప్రసక్తి ఎక్కడిది?

| | | |
|---|---|---|
| ఈశ్వరుడు (పరమాత్మ) | - బింబము | వస్తుతః ఉనికి (సత్) కలిగి ఉన్నది. |
| జగద్దృశ్యము | - తటాక జలము | 'కథ'వలె కల్పన వంటిది. |
| జీవాత్మ | - ప్రతిబింబము | వస్తుతః స్వకీయమైన ఉనికి లేనట్టిది. ఈశ్వరునికి వేరు కానిది. ఈశ్వరునియొక్క ఒక 'అంశా' చమత్కారము. |

పరమాత్మ స్వరూపుడే అయి ఉన్న ఈ జీవుడు దృశ్యములో జీవాత్మగా ప్రతిబింబించినంతమాత్రముచేత తనయొక్క పరమాత్మత్త్వమునకు **చంచలత్వము మొదలైనవేవీ స్పృశించవు।** → అను దర్శనము పూజ్యులగు ఆత్మతత్త్వజ్ఞులు ప్రసాదిస్తున్నారు.

ఈ విధమైన **'బింబ - ప్రతిబింబ దర్శనము'** అనే ఔషధము సేవిస్తూ ఉంటే **'జీవ-ఈశ్వర భిన్నరూప భ్రమ'** - అనే మొదటి భ్రమ తొలగిపోసాగింది.

2. **(ఆత్మకు కర్తృత్వ-భోక్తృత్వాలు ఉన్నాయి అను) పారమార్థిక కర్తృత్వభ్రమ - నివారణోపాయము → <u>స్ఫటిక లోహిత దర్శనము :</u>** ఒక తెల్లటి స్ఫటికమునకు ఎదురుగా ఎర్రటి వస్తువును ఉంచితే, అప్పుడు ఆ తెల్ల స్ఫటికము - ఎర్రగా కనిపిస్తుంది. ఆ వస్తువును అక్కడి నుండి తీసివేస్తేనో? ఆ స్ఫటికము తిరిగి తెల్లగా కనిపిస్తుంది.

- ⌘ స్ఫటికము ఎర్రగా కనిపించటము,
- ⌘ తిరిగి తెల్లగా కనిపించటము,

అనే కర్తృత్వమును స్ఫటికమునకు ఆపాదిస్తామా? వాస్తవానికి ఆ స్ఫటికము ఎల్లప్పుడు తెల్లటి కాంతులతో ప్రకాశించునదే కదా! **ఆత్మకూడా నిత్యనిర్మలము.**

మరొక రీతిగా చూద్దాం

ఇంద్రనీలమణి నీలపు కాంతులు వెదజల్లుచుండగా, ఆ సమీపంలో ఉన్న వస్తువులు నీలపురంగుగా కనిపిస్తాయి. "ఈ వస్తువులు నీలంగా చూపుచున్న కర్తృత్వము ఇంద్రనీలమణి నిర్వర్తిస్తోంది" – అవి మణికి కర్తృత్వము ఆపాదిస్తామా? లేదు కదా! పోనీ వస్తువులు స్వకీయంగా నీలంగా అగుపించాలని – అట్లా కనిపిస్తున్నాయా? ఎవరిదీ కర్తృత్వం లేదు. ఈ జగత్తుకు కర్తృత్వము లేదు.

**మరొక దృష్టాంతము :**

**– సూర్యకిరణాలు ప్రసరిస్తూ ఉంటే** – ఆ వేడికి లోకములోని నీరు ఆవిరి అయి, చేపలన్నీ చచ్చిపోయాయనుకోండి. అప్పుడు, **"చేపలను చంపిన కర్తృత్వము సూర్యకిరణములదే"** – అని సూర్యునికి, సూర్య కిరణములకు కర్తృత్వము ఆపాదిస్తామా? ఆపాదించము కదా!

"నిప్పు ముట్టుకుంటే కాలింది కాబట్టి, నా చేతిని కాల్చింది నిప్పుయే! కనుక దోషము నిప్పుదే – అని నిప్పుకు వ్రేలు కాల్చిన కర్తృత్వము అంటగట్టము కదా!

అదేవిధంగా – **"స్ఫటిక లోహిత దర్శనము"** అనే ఉపాయంచేత జీవాత్మయొక్క సహజస్వరూపమగు **పరమాత్మకు** సందర్భ మాత్రమే అయినట్టి ఈ జీవాత్మయొక్క బంధము, దుఃఖము, అల్పత్వము, అజ్ఞత్వము మొదలైనవి ఆపాదించజాలము. ఈ విధంగా **"ఆత్మనిష్ఠ-కర్తృత్వగుణం వాస్తవమే"** అనే రెండవ భ్రమను **"స్ఫటిక లోహిత దర్శనము"** అనే సమన్వయమును తొలగించుకోసాగాను.

**(3) (జీవాత్మకు స్థూల సూక్ష్మ కారణ దేహములు ఉన్నాయి–అనే) – శరీరత్రయ సంయుక్త జీవ-సంగీ (స్థూల–సూక్ష్మ–కారణ దేహములకు 'జీవుడు' బద్ధుడై ఉన్నాడు) – అను భ్రమ – నివారణోపాయము → <u>ఘట మఠాకాశ దర్శనము.</u>**



(1) కుండ – **ఘటాకాశము** – Space of the Pot.

(2) ఇల్లు / మఠము – **మఠాకాశము** – Space in the House / Asramam.

(3) బాహ్యము – **బాహ్యాకాశము** - Space out - side.

(1) కుండలోని ఆకాశము

(2) మఠము (Shut, House) లోని ఆకాశము

(3) బయట ఆకాశము (Outside the House) – అని ఆకాశమును మూడుగా వర్ణించుకోవచ్చు.

అయితే మూడుగా చెప్పుకున్నప్పటికీ కూడా, ఆకాశము సర్వదా **ఏకము – అఖండము** అయి ఉన్నది. అద్దానికి **'ఇంటిలోని – ఇంటిబయట'** భేదములు ఉండవు.

ఆకాశము ఎప్పుడైనా – **'కుండలో'** అని గాని, **'ఇంటిలో'** అని గాని, **'ఆరుబయట'** – అని గాని దేనితోనైనా సంగము పొందుతుందా? లేదు. గాలి బూరలో నిండి ఉండటంచేత బూరతో లోపలి గాలి బూరతో **సంగము** (Relatedness, Belongingness) పొందదు కదా!

అట్లాగే పరమాత్మ కూడా

- **స్థూలదేహము** (Material/Physical Body) **తో గాని,**
- **సూక్ష్మదేహము** (The aboslute senses of Touch, Sound, Seeing, Forming, Tasting) **తో గాని,**
- **కారణదేహము** (Body of Tendencies) **తో గాని,**

**సంగము పొందటము లేదు.** ఈ జీవుని వాస్తవ స్వరూపము సర్వదా **'అప్రమేయము'** అయినట్టి **పరతత్త్వ స్వరూపమే** అయి ఉన్నది.

అట్టి కేవల స్వరూపము – (1) దృశ్యము – జీవుడుగాగాని, దృశ్యపరంపరలు – ఈశ్వరుడుగా గాని సంగము (Attachment) పొందదు. కేవలమగు ఆత్మ నాలోను, జీవులందరిలోను సర్వదా 'కేవలము'గానే ఉన్నది.

ఈ విధమైన దృష్టాంతముల యొక్క అవగాహనచే **"శరీరత్రయయుక్త జీవః సంగీ"** – అనే భ్రమను **'ఘట మఠాకాశదర్శనము'** అను దృష్టాంతముచే **<u>నేను తొలగించుకొన్నాను.</u>**

**(4) "మనో వికారములకు జగత్ దృశ్యమే కారణము" అనుభ్రమను - రజ్జు సర్ప దర్శనేన - కారణాత్ భిన్న జగత్ సత్యత్వభ్రమో"** నివృత్తః। <u>**త్రాడులో పాము చూడటానికి త్రాడు కారణం కాదు**</u> - అను ఎరుకయే దృష్టాంతపూర్వక-భ్రమ నివృత్తి.

**వివరణ** → ఒకానొకడు మసక చీకటిగా ఉన్నప్పుడు బాటలో నడిచి వస్తూ ఒక నూతికి ప్రక్కగా వున్నచోట ఒక పెద్ద త్రాడును చూచి "పామేమో?" అని భ్రమ పొందాడు. భయముతో 'అమ్మ బాబోయ్' అని కేకలు వేయనారంభించాడు. కాళ్ళు – చేతులు బిగదీసుకుపోయాయి. నోటమాటరావడం మానివేసింది.

ఇటువంటి వికారములన్నీ రావటానికి కారణము? త్రాడా? పామా? త్రాడును చూడటమువలన 'పాము' అను భ్రమ కలిగినప్పటికీ "నేను పాముగా కనిపించాలి" అనే ఉద్దేశ్యము త్రాడు కలిగి ఉన్నదా? లేదు.

- 'జడము మాత్రమే' అయి ఉన్న తాడుకు 'పాముగా కనిపించాలి' అనే యోచనగాని, ఉద్దేశ్యముగాని, ప్రయత్నముగాని ఎక్కడ ఉంటుంది?
- బాట అందరూ నడవటానికి ఉపకరణము. అట్టి బాటకు పామును చూపించే అవసరమేముంటుంది?
- పాము కారణమా? అక్కడ 'పాము' అనబడేదే లేదు. మరి పాము కారణమవటమనే మాటకు అర్థమే ఉండదు. **మరి అసలైన కారణం**?

ఆ బాటసారి త్రాడును చూచాడు. **"అది త్రాడా? పామా?"** అని పరిశీలించాలనుకునేలోపే, **"పాము అయి ఉండవచ్చునేమోకదా?"**....అనే అనుమానం బయల్వెడలింది. పాము అయితే? అది కరిస్తే? చచ్చామే! రక్తమంతా విషంతో నిండిపోతుంది! నురగలు క్రక్కుకుంటూ పడిపోతాను. ఎవ్వరైనా చూచేవరకు, నెత్తీనోరూ కొట్టుకోవటమే! త్రాచుపాము కరిస్తే చనిపోయినవారి గురించి విన్నాము కదా! ఇక నా గతీ అంతే! అయ్య బాబోయ్!" అని భ్రమించసాగాడు. భయంతో నెమ్మదిగా ప్రారంభించి, ఆ తరువాత పెద్దగా కేకలు వేయటం ప్రారంభించాడు.

ఎవరో అటు వచ్చి ఈ గొడవంతా గమనించాడు. దీపం వెలిగించి చూచాడు. తీరాచూస్తే అది పాము కాదు. ఎవ్వరో చాంతాడు ముక్కను నూతి ప్రక్కన బాటలో వదలి వెళ్ళినట్లున్నారు. అప్పుడు ఆతడు బాటసారికి చెప్పాడు – "ఇది త్రాడు మాత్రమేనయ్యా! భయమెందుకు?" అని. కానీ ఆ బాటసారి భయమునుండి తేరుకోవటానికి కొంతసేపు పట్టింది.

**ఇది "సర్పరజ్జు భ్రాంతి" అను దృష్టాంతము తత్త్వశాస్త్రజ్ఞులచే ఉపమాన రూపంగా (As a simile) చెప్పబడుతోంది.**

**ఈ ఇంద్రియములకు విషయమగుచున్న భౌతిక దృశ్యము** త్రాడువంటిది. ఇక్కడ ప్రాప్తము అగుచున్న వ్యవహారిక పరస్పరత్వమంతా నాటకములోని పాత్రల పరస్పర బంధత్వములు, మిత్ర – శత్రుత్వ విశేషములు వంటివి. త్రాడును చూచి పాము అనుకొనుతీరుగా, ఇక్కడ ఆత్మత్వము ఏమరచబడి, **"కల్పన అయినట్టిదంతా సత్యమువలే"** (అజ్ఞానదృష్టిచే) అనిపిస్తోంది. ఈ విధంగా **'సర్పరజ్జు భ్రాంతి దృష్టాంతం"** అర్థం చేసుకొని, ఈ జగద్దర్శనములో అంతర్లీనమైయున్న భ్రమ దర్శనమును గుర్తించసాగాను. "త్రాడులో పాము మొదలే లేని విధంగా, **ఆత్మయందు ఆత్మయే ఉన్నది. 'జగత్తు' అనేది భ్రమ మాత్రమే"** అని గమనించసాగాను.

**(5)** కనక-రుచిక దర్శనేన వికారిత్వభ్రమో నివృత్తిః

నిర్మలము, కేవలము, సర్వాతీతము అగు ఆత్మ పట్ల జీవాత్మత్వము, త్రిగుణములు, జన్మ–కర్మలు మొదలైన వికారములు, విభ్రమములు ఎట్లా ఏర్పడుచున్నాయి? ఈ ప్రశ్నకు సమాధానం **"కనక రుచిక దర్శన దృష్టాంతం"** నాకు అందిస్తోంది. **బంగారపు ఉంగరము (ఆభరణము)**

**బంగారము – ఆభరణము వేరు వేరా? కాదు. బంగారము నుండి ఆభరణము విడదీసి చూడగలమా? లేదు. బంగారము 'ఆభరణము'గా అగుచున్నదా? అవటము లేదు. ఆభరణముగా కనిపిస్తున్నది బంగారము కన్నా వేరైనదా?** కాదు.

అట్లాగే

- ✠ పరమాత్మ సదా యథాతథము।
- ✠ పరమాత్మ జీవాత్మగా అవటములేదు।
- ✠ కానీ జీవాత్మగా కనబడుచున్నది పరమాత్మయే।
- ✠ జీవాత్మత్వము పరమాత్మకు సంబంధించిన సందర్భ సత్యము.
- ✠ పరమాత్మత్వము జీవాత్మకారణంగా 'చ్యుతి' పొందునది కాదు.

ఈ విధంగా పరమాత్మకు – (జన్మ – జరా – మరణ, సత్త్వ – రజో–తమో, భూత–వర్తమాన–భవిష్యత్, దేహ – జీవ – బంధ – ఇత్యాది) – వికారములు మొదలే లేవని గమనించసాగాను. అట్టి సర్వాతీతమగు **'కేవలాత్మ'యే నా సహజ నిజ స్వరూపము"** – అను ఉపాసన, మననములను ఆశ్రయిస్తూ ఉన్నాను.

✠

ఓ నిదాఘా! ఈ విధంగా '5' దృష్టాంతపూర్వక సమాధానములచే నా చిత్తము స్వయముగా **'చిత్–ఆకారము'** లేక **'బ్రహ్మాకారము'** సంతరించుకోసాగుతోంది. నీవు కూడా ఇట్టి విచారణచే తత్త్వజ్ఞానము సంపాదించుకొనెదవు గాక.

---

# "మహాకర్త - మహాభోక్త - మహాత్యాగి"

**నిదాఘుడు** సద్గురవగు ఋభు మహర్షికి ప్రణతుడై (శరణాగతుడై) సాదరముగా మరల ఈ విధంగా అడుగసాగారు.

✠

**నిదాఘుడు :** గురుదేవా! శ్రద్ధతో మిమ్ములను అర్థిస్తున్నాను. ఉత్తమోత్తమమని మీరు భావించుచున్న విధంగా నాకు దయతో ఇంకా కూడా **'బ్రహ్మవిద్య'**ను బోధించండి.

**ఋభుమహర్షి :** నిదాఘా! నీవు శ్రద్ధతో కూడినవాడవు. గురువు పట్ల అచంచలమైన గురి, భక్తి కలవాడవు. ఓ అనఘా! సంతోషము. ఇప్పుడు **'తత్త్వజ్ఞానము'** గురించిన ఆయా కొన్ని విశేషాలు చెప్పుకొందాము. విను. **(తత్ త్వమేవ – ఇతి తత్త్వజ్ఞానమ్)**

ఓ అనఘా! **'మహాకర్త', 'మహాభోక్త', 'మహాత్యాగి'** వి అగుము – అని తత్త్వజ్ఞులు సూచిస్తున్నారు.

**మహాకర్త :** సమస్తమునకు కర్త (Doer) ఆత్మయే। ఆత్మయే నేను. కనుక సమస్తమునకు కర్తను. <u>మహాకర్తను</u> నేనే!

**మహాభోక్త :** సమస్తమునకు భోక్త (The one who is experiencing) ఆత్మయే। సోఽహమ్ వేదవాక్యానుసారం నేనే ఆత్మను. కనుక సమస్తమునకు **నేనే భోక్తను.**

**మహా త్యాగి :** I. ఈ సమస్తము ఆత్మ నుండియే బయల్వెడలుతోంది. ఆత్మయొక్క త్యాగనిరతియే ఇదంతా. **నేను ఆత్మను.** అందుచేత.

- ✠ ఇదంతా ఆత్మయొక్క సమర్పణయే కాబట్టి,
- ✠ నేను ఆత్మ స్వరూపుడనే – కాబట్టి, ఈ
- ✠ సమస్తమునకు మహాత్యాగిని నేనే!

II. **ఈ జగత్తు త్యజించబడగా, అప్పటికీ శేషించే ఆత్మ అస్మత్ సహజరూపము అయి ఉన్నదని** ఋషివాక్కు. వేదవాక్కు. సమస్తము త్యజించగా శేషించునది నేనే అయి ఉన్నాను. కనుక **మహాత్యాగిని.**

ఓ ప్రియ నిదాఘా! ఈ విధంగా **స్వస్వరూపానుసంధానము**ను నిర్వర్తిస్తూ, **ఆత్మభావనచే స్వాభావికంగానే సుఖవంతుడవు అగుము.**

**నిత్యోదితమ్:** సూర్యబింబమునకు స్వతఃగా ఉదయ –అస్తమయములు ఉంటాయా? ఉండవు. అట్లాగే నేను (అనుక్షణము ఉదయించు సూర్యునివలె) నిత్యోదితమగు ఆత్మను. జాగ్రత్ స్వప్న సుషుప్తులు, జన్మ–జన్మాంతరములు నా 'కళా ప్రదర్శనము' అయి ఉండగా, వాటియందు నేను ఉదయించటమేమిటి? అస్తమించటమేమిటి?

**విమలమ్ :** నాటక దీపమునకు నాటకములో పాత్రలయొక్క ఉచిత – అనుచితములు, మంచి – చెడులు ఏమాత్రము అంటవు కదా! అట్లాగే నేను మనస్సు, బుద్ధి మొదలైన వాటి దోషములచే మలమును పొందువాడను కాను. <u>సదా నిర్మలుడను.</u>

**ఆద్యమ్ :** జన్మచే ప్రారంభమవను. మరణముచే ముగియను. జన్మ–కర్మలకంటే మునుముందే 'ఆది' యందే ఉన్నవాడను. <u>సమస్తమునకు మొట్టమొదట నేనే ఉన్నాను. ఆద్య స్వరూపుడను.</u> (I am the begining of every thing else all).

**అనన్తరూపమ్ :** ఈ శరీరము, మనస్సు, చిత్తము, తెలివి, అహంకారము, దృశ్య ప్రపంచము మొదలైనవాటిచే ముగియవాడను కాను. అంతమే లేనివాడను. ఈ దేహము అంతము కలిగి యుండవచ్చు గాక! 'దేహి'గా నేను ఒక భౌతిక వస్తువు వంటివాడను కాను. **అనన్తరూపుడను.**

**నేతర (న ఇతర) కలా కలనం హి కించిత్ :** ఆత్మనగు నాకు ఎట్టి కల్పనగాని, కలన (మాయ / దోషము) గాని కించిత్ కూడా లేదు. అంటదు.

ఈ విధంగా 'ఆత్మభావన'ను ఆశ్రయించి ఉండుము. ఆత్మగా సర్వదా నిర్మలుడవే సుమా! నిరంజనుడవై, సర్వత్రా పరమప్రశాంతమగు 'వృత్తి' కలవాడవై నిర్మాణ స్వరూపమును అవధరించుము. **యత్ ఇదమ్ దృశ్యతే కించిత్, తత్ తత్ నాస్తి - ఇతి భావయ।** ఇక ఇక్కడ ఏదేదైతే పంచేంద్రియములకు విషయములుగా దృశ్యమానమై కనిపిస్తోందో, అదంతా 'మొదలే లేనిది'గా భావించి ఉండుము. (ఉదా : కథలోనో, నవలలోనో, నాటకములోనో కనబడే విశేషములు సత్యము (నిజంగా ఉన్నవి) ఎట్లా అవుతాయి? ఈ దృశ్యమానమగుచున్న జగత్తు కూడా అట్టిదే).

✠ కలలో కనిపించిన వస్తుజాలములు నిజంగా ఉన్నాయా?

✠ గంధర్వనగరంలో (ఊహలో కల్పించుకొని చూస్తున్న నగరంలోని వీధులలో) నిజంగానే భవనాలు ఉన్నాయా?

✠ ఎడారిలో కనిపించే ఎండమావులలో నిజంగానే జలము (నీరు) ఉన్నదా? ఉండదు.

అదే విధంగా **"ఇంద్రియములకు ఎదురుగా కనిపిస్తున్న ఈ దృశ్యము ఆత్మయందు కించిత్ కూడా మొదలే లేదు"** – అని భావన చేస్తూ ఉండు. కనులు, చెవులు, నోరు, ఘ్రాణేంద్రియను, చర్మేంద్రియము (పంచేంద్రియములు), 'ఆరవ ఇంద్రియము' అనబడుచున్న 'మనస్సు'లను దాటివేసి, వాటన్నిటికీ ఆవలగల ఆత్మచైతన్యముతో తన్మయుడవై, తత్–భావికుడవై ఉండుము. **"అవినాశి చిదాకాశగ్ం సర్వాత్మకమ్, అఖండితమ్, నీరంధ్రం, భూరి వా శేషం (భూరివ అశేషం) తత్ అస్మి" – ఇతి విభావయ।**

ఎద్దానికైతే – 'నాశనము' అనే ధర్మము కించిత్ కూడా లేదో,

భూతాకాశము – చిత్తాకాశములకు ఆవల <u>అవినాశి</u> అయి **'చిదాకాశము'** గా సర్వదా ప్రకాశమానమై యున్నదో, – **అదియే నేను।**

– నాటకంలో పాత్రలన్నిటికీ రచయితయే 'ఆత్మ' అయి ఉన్నట్లుగా, కలలో కనబడే అనేకమంది జనులకు కల తనదైనవాడు– ఆత్మ అయినట్లుగా,....

**ఈ త్రిలోకములకు, ఈ సమస్త విశ్వమునకు, ఇందలి సర్వ జీవులకు ఎవ్వడు** సర్వాత్మకుడో, ఆతడే నేను.

– ఎవ్వడు 'దేహము–జీవుడు–ఈశ్వరుడు' మొదలైన **ఖండితములుగా ఏ క్షణమందు అవక సర్వదా** అఖండితమైయున్నాడో, తనయందు తనకు అన్యమైనదేదీ లేకపోవుటచే నీరంధ్రుడో, (సందు రంధ్రము లేనివాడో) – **అట్టి ఆత్మపురుషుడను నేనే।**

– సముద్రంలోని తరంగములన్నిటిలో సముద్రజలంవలె సమస్తము ఆక్రమించి ఉండటంచేత ఎవరు 'భూరి' (Magnum) అయి ఉన్నారో,– అట్టి ఆత్మస్వరూపుడను.

## "తదస్మి। అదియే నేను।"

అను భావనచే విభావుడవై (ప్రకాశించువాడవై) ఉండు.

✠

ఓ నిదాఘా ఎప్పుడైతే నీ చిత్తము 'బాహ్య విషయ అభావన' చేతను, 'అంతరాత్మ భావన' చేతను (అందరియొక్క, తనయొక్క విషయరహితమగు అంతరాత్మను దర్శించుచుండు అభ్యాసముచేతను) సంసిద్ధమౌతుందో, అప్పడిక **చిత్ సామాన్యము, సత్తా సామాన్యము** (Equally Placed Enlightenment and All equally placed presence), యొక్క అనుభవము సిద్ధించగలదు. క్రమంగా <u>**'చైత్యాంశ'**</u> ను (That being known experienced, seen, touched, smelt, tasted etc.,) **'చిత్'** నుండి ప్రక్కకు పెట్టుబడగా, అప్పుడు శేషించు **'చిదంశ'** (The absolute Experiencer factor) - **'చిదాత్మ'** యందువిలీనము అగుచున్నది.

Experiences (+) Experiencing = జీవుడు. **'చైత్యంశ'.**

Experiencer sans Experiencing = **చిదంశ.**

Absolute Experiencer - When Gets united with the <u>Macro, Universal, as well as ALL - Pervading EXPERIENCER</u> = **చిదాత్మ.**

**ఏ సత్తా సామాన్యము** (All present myself) వర్తమానంలో "అట్టిది లేదేమో" అని అనిపిస్తోందో – అట్టి **"సమస్తము నాలోని నేను"** అగు స్థితి – ఆత్మదృష్టిచే ఇప్పుడే, ఇక్కడే లభించగలదు. విషయ దృష్టితో కూడుకొని ఉన్న 'చిత్‌సత్త' (లేక) సత్తా సామాన్యము (All-pervading one's own Presence) **దృశ్య విషయ దృష్టిని త్యజించిన మరుక్షణం – సర్వాత్మకముగా వికాసము పొందగలదు.** అట్టి చిదాత్మానుభవము (లేక) సదాత్మానుభవమునకు – ఈ శరీరము ఉండటము, (లేక) ఉండకపోవటము విషయమే కాదు. **దృష్టి = ఏషాహి పరమా సదేహా అదేహయోః సమా!** అట్టి **"అఖండాత్మ అహమేవ"** – అను దృష్టి శరీరము ఉన్నా లేకున్నా కొనసాగగలదు.

- **తురీయము** : జాగ్రత్ స్వప్న సుషుప్తులు నావై యున్న "నేను"
- **తురీయాతీతము:** జాగ్రత్ స్వప్న సుషుప్తులను స్వానుభవముగా పొందుచున్నట్టి కేవలసాక్షి నైన <u>"నేను"</u>. ఈ సమస్తము నాకు అనన్యమైయున్నట్టి (లేక) నాకు వేరు కానట్టి "నేను"

అటువంటి తుర్యాతీత, పరస్థానమునందు ముక్తులు స్వాభావికంగానే విహరిస్తూ ఉంటున్నారు.

**'వ్యుత్థానము'** (Extroversion) చే జగత్తునందు, **'సమాధి'** (Introversion) చే కేవలమునందు సర్వదా వారు ముక్తస్వరూపులై ప్రదర్శితులు అగుచున్నారు.

**'ఇహము'లో సందర్భములందు, 'పరము' నందు "కేవలము** (The Absolute)" నందు ఒకసారి సంప్రవర్తితులు అగుచూనే, సర్వదా యథాతథులై ఉంటున్నారు.

ఈ జీవునికి తనయొక్క "కేవల స్వరూపము" – సర్వదా సిద్ధించినదే అయి ఉన్నప్పటికీ, అది అనుభవమవటము లేదు. ఆనందమునకు కూడా ఆవల అనాన్దమైనట్టిది, సర్వత్రా ముగ్ధ ముగ్ధ సమానందము అయినట్టిది అగు **"సహజాత్మ స్వరూపము" – ఆత్మగురించిన జ్ఞానము కలవానికే అనుభవము** అవుతోంది. అజ్ఞానిపట్ల అఖండాత్మ అనుభవమవటం లేదు. **చిరకాల పరిక్షీణ మననాది పరిభ్రమః, పదమ్ ఆసాద్యచే పుణ్యం ప్రజ్ఞయైవ ఏకయా తథా!**

ఓ నిధాఘా!

చిరకాల ప్రయత్నములచేతనే ఈ దృశ్యమనన పరిభ్రమణము పరిక్షీణము (Wel subside) అవగలదు. దృశ్య మనన త్యాజ్యముచేతను, పుణ్య కర్మల ఫలముగాను **ప్రజ్ఞచే అఖండాత్మ అనుభూతమౌతోంది.** అప్పుడు ఈ త్రిగుణ నిర్మితమగు మనస్సు ఆత్మత్వము పొందినదై ఆత్మతో మమేకమవగలదు.

**సమాధి** : బాహ్యముగా వ్యవహారములలో ఉంటున్నప్పటికీ కూడా, అంతరమున పరమశాంతము, శీతలము (Calmness and coolness) అగు ఆత్మభావన కలిగియుండటము సమాధినిష్ఠుని స్వాభావిక లక్షణము.

**భావశాంతత** : దృశ్య సంబంధమైన వాసనలు త్యజించబడగా, మనస్సు చంచలత్వము త్యజించి, స్థిరత్వము పొందుతుంది. అట్టి– సమస్తమును కేవలమగు ఆత్మగా భావన చేయు ధ్యానస్థితియే **'శాంతము'** అనబడుతోంది. ఓ నిదాఘా! తను వాసనను (దేహవాసనను) త్యజించి, **పర శ్రేష్ఠమగు ఆత్మ వాసన**ను మాత్రమే ఆశ్రయించుము. అది **'పదయో ఆద్యతము'** (యో ఆద్యతమ్ పదమ్. సమస్తమునకు మునుముందటి పదము) అనబడుతోంది. తను వాసన అతి నీచమైనది. **తను వాసనమ్ అత్యుచ్చైః**

"ఈ దేహము లేకుంటే నేను లేను" – అనురూపంగా సిద్ధించుకొన్న భ్రమ శమించటమే భావశాంతరూపమగు **'అవాసనము'.**

అవాసనము (వాసనాత్యాగము, నిర్వాసనము) అగు మనస్సు మాత్రమే ఆత్మయొక్క వక్త్రము (ముఖము)ను పొందగలదు.

ఆత్మ సర్వదా అకర్త. అభోక్త. కానీ జీవునికి (1) 'ఇది నేను చేస్తున్నాను' అను **కర్తృత్వము,** (2) "ఇదంతా అనుభవముగా పొందుచున్నాను" అను **భోక్తృత్వము** – అనుక్షణం అనుభవమౌతోంది. ఎందుచేత? **ఘనవాసనమ్ ఏతత్తు చేతః కర్తృత్వ భావనమ్।** చిత్తము ఇంద్రియ విషయ రూపమగు దృశ్య వ్యవహారముతో మననము పొందుతోంది. సంగమును – అభిలషించటము చేస్తోంది. లాభించు – లాభించని ఆయా సందర్భములలో ఉత్సాహ నిరుత్సాహములు కలిగి ఉంటోంది. ఇటువంటి అనేక ఉపాధులలో సంబంధము – అనుబంధముల కొనసాగింపు కారణంగా "**<u>వాసనలు Tendencies</u>**" బయల్వెడలుచున్నాయి.

**ధ్యాస – ధ్యానము – సంగము – కామము – క్రోధావేశము – మోహము – సంస్కారములు – వాసనలు**

అట్టి దృశ్యముతో ఏర్పడిన **వాసనలవలననే ఈ జీవునికి కర్తృత్వ – భోక్తృత్వభావములు ఘనీభూతమగుచున్నాయి.** అట్టి వాసనలే – "నేను బద్ధుడను. పరిమితుడను. సంకుచిత స్వభావుడను – అను వ్యష్టిత్వముగా ఏర్పడి, చివరికి అదంతా కూడా ఈ జీవునిపట్ల అనేక దుఃఖముల (Series of worries) కు కారణమౌచున్నది. అందుచేత అట్టి వాసనలను నెమ్మదిగా (నయాన) త్యజించివేయటానికి ఉపక్రమించాలి. చిత్తముతో (లేక) బుద్ధితో దృశ్యము వలన ఏర్పడే అవినాభావ రూపమైన భావనాసంబంధములను క్రమంగా మొదలంట్లా పరిత్యజించివేయాలి. అందుకుగాను సమస్త భేదభావములను వదలి, అభ్యాసపూర్వకంగా **"ఇదంతా ఆత్మయొక్క సంప్రదర్శనమే"** అను సందర్శనమును బలపరచుకొనుచూ, ఆత్మభావనను స్వాభావికం చేసుకోవాలి.

> ***ఆత్మభావన అనగా?*** ఇక్కడి జగద్దృశ్యము, లోకములు, భూమ్యాకాశములు, "నావారు–నీవారు– అయినవారు–కానివారు" మొదలుగా కనిపించే సకల జనులు, సమస్త జీవజాతులు, ఇక్కడ కదిలే చేతనములు, జడములు, అంతరంగ విభాగములగు మనో– బుద్ధి–చిత్త–అహంకారములు, ఇక్కడి జ్ఞానులు–అజ్ఞానులు–సుజ్ఞానులు–దుర్జ్ఞానులుగా చెప్పుకోబడేవారు – మొదలైనదంతా కూడా ఆత్మాకాశమే! బాహ్యమున ఏది ఎట్లా ఉన్నట్లు కనిపించినా అంతరంగా కేవల చిదాకాశమే।

ఈ విధమైన **"అంతరాంతర దృష్టి"** (లేక) **"ఆత్మగా భావన"** కలిగి ఉండటమే అంతర్ముఖదృష్టి. ఆత్మభావనయే **"అంతర్ముఖ స్థితి".**

**నిదాఘుడు :** హే గురువర్యా! ఇక్కడ అనేకమంది ఇష్ట-అయిష్టజనులు, గురువులు, శిష్యులు మొదలైనవన్నీ ప్రతిరోజు అనేక రూపాలుగా, అనేక విధములుగా తారసపడుతూ ఉంటే, మీరు చెప్పిన **'అంతర్ముఖదృష్టి'** సిద్ధించటము సులభమా? మేము ఎట్లా సిద్ధించుకోవాలి? సర్వత్రా సమభావన నాకు లభించేది ఎట్లా?

**ఋభు మహర్షి :** నిజమే। "ధ్యాస-సంగము-కామము-క్రోధము-లోభము-మోహము - స్మృతిభ్రంశము" మొదలైన జన్మజన్మల అభ్యాసము కారణంగా ఏర్పడిన 'వాసనలు' కారణంగా - "అంతా అఖండము, అప్రమేయము, అమృతరూపము, అతీతము అగు ఆత్మగా అనిపించటము" - అనేది ఈ జీవునికి దుస్సాధ్యమే అవుతోంది. కారణం? మనస్సుచే ఏర్పాటు అగుచున్న 'భేదదృష్టి' చేతనే.

**"భేదదృష్టిని త్యజించటము తేలికయా?"** - అను ప్రశ్నకు, **"ఎందుకు కాదు? కొన్ని చోట్ల మనము భేదదృష్టి ఏమాత్రము లేకుండానే మననము కలిగి ఉంటూనే ఉన్నామే"**.....అనేది విజ్ఞులచే (దృష్టాంత పూర్వకంగా) గుర్తు చేయబడుతోంది.

*ఉదాహరణగా.....*

ఒకడు తన గ్రామం వదలి సుదూరంగా ఉండే ఏదో కొత్త ప్రదేశంలో ఒక వీధిలో ఉన్నప్పుడు, అక్కడ కనబడుచున్న అనేక జనులతో ఏమాత్రము సంబంధము లేకుండానే వారందరిమధ్యగా నడచివెళ్లుతూ ఉంటాడు కదా! **అసంబంధాత్ తథా జ్ఞస్య గ్రామోఽపి విపిన-ఉపమః!** అదేవిధంగా ఆత్మజ్ఞాని (సమస్తము ఆత్మయే అని ఎరిగియున్నవాడు) తాను నివసించే గ్రామములోని వీధులలో నడుస్తూ ఉన్నప్పుడు - **"ఈ నా బంధువులు, మిత్రులు మొదలైన వారంతా సహజదృష్టిచే మమాత్మానంద స్వరూపులే! ఇక సందర్భానుచితంగా కనిపించే బంధుత్వము సంబంధత్వము సందర్భకల్పితము. వస్తుతః అవాస్తవము. నాటకములోని పాత్రల పరస్పర సంబంధము వంటిది"** - అని సుస్పష్టముగా ఎఱిగియే ఉంటున్నాడు. ఓ నిదాఘా! **"నేను ఈ దేహముచే పొందుచున్న సమస్త జగద్దృశ్యము నాకు - కొద్దిసేపు నేను ఉండిపోయే సుదూర పట్టణములోని ఒక వ్యాపార (వ్యవహారిక) స్థలము వంటిది"**..... అని ఎందుకు అనుకుంటూ ఉండరాదు? ఇక్కడ కాలానుగతంగా అన్నీ కూడా మార్పు - చేర్పులుగా జరుగుచున్నాయి- అనునది ఎల్లప్పుడు అందరికీ అనుభవమే కదా। తత్ఫలితంగా సర్వాత్మీయమగు ఆత్మదృష్టి రూపుచెందగలదు.

**<u>అంతర్ముఖుడు:</u> అంతర్ముఖతయా నిత్యగ్ం సుప్తో బుద్ధో, వ్రజన్, పఠన్, పురం జనపదం గ్రామం - అరణ్యమ్ ఇవ పశ్యతి।** బాహ్యదృశ్యములను బాహ్యముననే అట్టేబెట్టివేసి, ఎవ్వడైతే సహజీవులను, **"కేవలమగు ఆత్మయే వీరంతా!"** - అను దృష్టితో చూస్తూ ఉంటాడో - అట్టి వానిదే **"ఆత్మదృష్టి"**. ఆత్మజ్ఞాని సర్వదా అంతర్ముఖుడై ఉంటాడు. ఆతడు మెలకువగా ఉన్నప్పుడు, నిదురిస్తూ ఉన్నప్పుడు, ప్రబుద్ధుడై (సాలోచనగా) ఉన్నప్పుడు, స్నేహితులతోను-బంధువులతోను కలిసి వీధులలో నడుస్తూ ఉన్నప్పుడు, ఏదో పఠిస్తూ ఉన్నప్పుడు" ఆత్మదృష్టిని వీడడు. అనేకమంది జనులతో కనిపిస్తున్న గ్రామమును, పట్టణ ప్రదేశమును కూడా - <u>నిర్జనమగు (జనమే కనిపించని) అడవిలో తానున్నట్లే</u> అదంతా దర్శిస్తూ ఉంటాడు. ('జనారణ్యము' - అను భావన వీడడు).

**<u>లోపలి ఏముంటే అదే బయటగా...కనిపించటము</u>** : ఒకరి హృదయంలో (అంతరంగములో) ఏదేది ఏ విధంగా ఉంటే, అదియే బాహ్యమున జగత్తుగా (అదేవిధంగా) అనుభవమై సిద్ధిస్తోంది. (యత్ భావమ్ - తత్ భవతి, ఇహ, ఇతి)।

ఈ జీవుడు కర్మలు నిర్వర్తించకతప్పనే తప్పదు. అనివార్యం అయితే...

| | |
|---|---|
| **అంతఃశీతళతాయాం తు లబ్ధాయాం శీతళం జగత్।** | అంతరంగము ప్రశాంతము, శీతలముగా ఉండినప్పుడు ఈ ప్రపంచముగా శాంతముగా, చల్లగా (Pleasantly cool) అనుభవమవగలదు. |
| **అంతః తృష్ణ ఉపతప్తానాం దావదాహమయం జగత్** | ఒకవేళ అంతరంగము తృష్ణ (Desires and expectations) ఉంటే, ఈ జగత్తు కూడా ఆశా మోహములుచే దాహమయంగా అనిపించసాగుతుంది. |
| **భవతి అఖిల జంతూనాం యత్ అంతః బహిః స్థితమ్।** | జీవులందరికీ కూడా అంతరంగంలో ఏదేది ఏవిధంగా ఉంటే, అదియే 'జగత్తు' రూపంగా (ఆవిధంగానే) అనుభవమౌతోంది. |

## సమాహితుడు

అందుచేత ఓ నిదాఘా! మనము **సమాహితులము** అయి ఉండాలి సుమా!

నిదాఘుడు : గురుదేవా! సమాహితము అనగా? మనము సమాహితులము అయ్యేది ఎట్లా?

**ఋభుమహర్షి : యస్తు ఆత్మారతిరేవాంతః, కుర్వన్ కర్మేంద్రియైః క్రియాః న వశో హర్ష శోకాభ్యాగ్ం, స 'సమాహిత' ఉచ్యతే।** ఇంద్రియములతో ఆయా విహిత, అవిహిత-ఇత్యాది కర్మలు నిర్వర్తిస్తూ కూడా హర్ష-శోకములకు వశుడు కాకుండా ఉండువాడు సమాహితుడు.

"సమస్తము సర్వదా సర్వసాక్షియగు ఆత్మయొక్క తత్త్వమే కదా! నేను ఆత్మకు అనన్యుడను కదా!" – అను భావనతో ఆత్మయందే రమిస్తూ ఎవడు ఉంటాడో, అట్టివానిని 'సమాహితుడు' అని శాస్త్రము నిర్వచిస్తోందయ్యా!

- సర్వజీవులను ఆత్మగా దర్శిస్తూ,
- ఇతరులకుచెంది–తనది కానట్టి వస్తువులను, ద్రవ్యమును లోష్టము (మట్టి గడ్డి)తో సమానంగా చూస్తూ (భావిస్తూ) ఉంటాడో,
- స్వభావంగానో, భయముచేతనో, ఇష్టదైవము గురించిన పరాభక్తి చేతనో పరమాత్మమయమే ఇదంతా ("రామమయమే। కృష్ణ తత్త్వమే। గురువిలాసమే। శివానందమే") – అను భావనను ఎల్లప్పుడూ ఆశ్రయించి ఉంటాడో...

**యః పశ్యతి – సపశ్యతి।** ఆ తీరైన దర్శనమే 'సత్యము' అయిన, 'సరి' అయిన దర్శనము. అట్టి **'సమస్తము ఆత్మయే'** అను భావన (తత్త్వభావన) సునిశ్చయం చేసుకొని, ఈ జగత్తులో కర్మలు చేస్తూ ఉండగా, ఇక ఆతనికి ఎట్టి సంసారదోషము అంటదు. ఆత్మానుభూతికి లోటు ఉండదు. ఇక ఈ భౌతిక శరీరము కలిగి ఉండటము గురించి, ఇది బంధముగా అవటము గురించి ఏమంటావా? **"నాకు, నాకు చెందినది, నీది, నీకు చెందినది, 14 లోకాల ద్రష్టలు - వారివారికి చెందినది - సమస్తము అఖండమగు ఆత్మయే"** అను దృష్టిని (లేక) ఆత్మసాక్షాత్కారమును సిద్ధించుకొన్న యోగీశ్వరునికి (లేక) యుక్తునికి

**అద్యైవ మృతిః ఆయాతు। కల్పాంత నిచయే నవా, న అసౌ కళంకమ్ ఆప్నోతి।**

ఈ భౌతిక శరీరము ఇప్పుడు ఈ క్షణంలో నశించినాసరే! లేదా, ఇది కల్పాంతము వరకు కొనసాగినా సరే....ఆతనికి ఎట్టి కల్పనాదృష్టి సంబంధమైన దోషము అంటదు. ఎక్కడ ఎప్పుడు ఏది ఎట్లా ఉన్నా (లేక) పరిణమించినా కూడా, ఆతడు **"నిత్యసత్యమగు బ్రహ్మమే (లేక) ఆత్మయే ఇదంతా"** అను బుద్ధి నుండి చ్యుతి పొందడు. వదలడు. **న అసౌ కళంకమ్ ఆప్నోతి హేమ పంక గతం యథా।** బంగారము బురదలో పడినంతమాత్రం చేత బంగారములోనికి బురద ప్రవేశిస్తుందా? అద్దాని విలువ తగ్గుతుందా? లేదు కదా! అట్లాగే ఆత్మభావునిలో ఇక్కడి జన్మ–కర్మ వ్యవహారములు ప్రవేశించలేవు. ఆతని ఆత్మత్వమునకు లోటు కలిగించలేదు. **ఆత్మకు ఎప్పుడూ కూడా దోషము లేదు. లోటు లేదు. అట్టి నిశ్చలమగు 'ఆత్మమేవాహమ్' 'ఆత్మయేవ ఇదగ్ం సర్వమ్'**– అని భావన చేయి.

**నిదాఘుడు** : అట్టి ఆత్మభావన సుస్థిరీకరించుకోవటము ఎట్లా?

**ఋభుమహర్షి** : ఓ నిదాఘా! **కోఽహమ్? కథమ్ ఇదమ్, కిం వా? కథం మరణ జన్మనీ? విచారయ।** – నేనెవరు? ఇదంతా ఇట్లా ఎందుకు జరుగుతోంది? మరణిస్తే ఏమౌతోంది? జన్మకు ముందు నేనెవరిని? – ఈఈ విషయములు కొంచము విచారణ (Analysing) చేయవయ్యా। **వేత్థం, మహత్ తత్ ఫలము ఏష్యసి।** ఈమాత్రము విచారణచే నీయొక్క తత్ (సహజము, సత్యము, నిత్యము) అగు స్వరూపము గురించిన ఎరుకచే మహత్తరమైన ప్రయోజనము పొందగలవు. విచారణ చేసినంతమాత్రంచేత, నీవెవరో, నీ అసలైన స్వభావమేమిటో, ఈ జన్మ–మరణముల మధ్యగా కనిపించేదంతా ఎందుకు **సందర్భ పరిమిత సత్యము మాత్రమేనో**–తెలుసుకోగలవు.

**మనోరూపమిదగ్ం సర్వమ్।** ఈ జగత్తుగా అనుభవమయ్యేదంతా నీ మనోరూపము మాత్రమే! మనస్సు అనగా నీ ఆలోచనా పరంపరల చమత్కారమే! ఎప్పుడైతే **"నేను ఎవ్వరు? ఈ జన్మమృత్యువులు ఏమై ఉన్నాయి?"** అనే పరిశీలనచే నీకు సంబంధించి విచారణకు ఉపక్రమిస్తావో, ఇక నీవు నీయొక్క మనోపరిమితత్వమును అధిగమించి వేయగలుగుతావు. పాము తన కుబుసమును త్యజించి, అక్కడి నుండి బయల్వెడలి హాయిగా అటూ ఇటూ తిరుగుతుంది చూచావా? ఆ విధంగా, మనోస్వరూపమును త్యజించి, నీయొక్క అంతరింద్రియ ఆధిపత్య రూపమగు **'శమము'** (పరమశాంతము)ను ధారణ చేస్తూ ఆత్మభావనను స్వాభావికం చేసుకో. విజ్వరుడు (Getting rid of all kinds of worries) అగుము. సంసార వృత్తులను (Avocations that are forming while using Eye, Ears, etc.,) త్యజించి, నిర్మలము – అతీతము అగు బుద్ధిని పొందుచూ ఉండగా, అప్పుడిక నీ చిత్తము సంసార వృత్తులలో (Avocations pertaining to what is being seen, felt and heard in the scenario) నిమజ్జనము పొందదు. ఆత్మవృత్తినే ఆశ్రయించగలదు.

హే బ్రహ్మన్! నీ బుద్ధి బ్రహ్మము నందు మాత్రమే ఉన్నదగుగాక. అప్పుడు ఇక ఇక్కడ 'సంసారసాగరము' అని చెప్పబడేదంతా గోష్పాదము (కొంచెము నీరుగల – ఆవుడెక్క – ముద్ర – గుంట) దాటటము వంటిది అవగలదు. గోడెక్కముద్ర జలములో కీటకము చిక్కుకుంటుందేమోగాని, ఆత్మతత్త్వము ఎరుగుచున్న విజ్ఞాని కాదు.

**ఆత్మ నిశ్చయుడు విషయ సంసారమున మునుగడు.**

(గోష్పాదజలంలో మూగిన దోమలు మునగకుండానే పైపైనే వ్రాలి, కొంతసేపైన తరువాత ఎగిరిపోతూ ఉంటాయి. చిన్న గులకరాయి ముక్క అయితే మునిగిపోతుంది. అట్లాగే ఆత్మ సమాచారముపట్ల నిశ్చలుడు సంసారమునందు మునుగడు).

ఓ మునిశ్రేష్ఠా! నిదాఘా!

ఎవ్వడైతే ఈ సమస్త దృశ్యరూప సంసారమును స్వయము మొదలే విడచినవాడై ఉంటాడో, – **యావత్ యావత్, మునిశ్రేష్ఠ! స్వయం సంత్యజ్యతే అఖిలమ్, తావత్ తావత్ పరో లోకః పరమాత్మైవ శిష్యతే। – అంతంత వరకు పరమాత్మత్వమును స్వయం – సంసిద్ధించుకున్నవాడు** అగుచున్నాడు.

ఎంతెంతవరకైతే – **యావత్ సర్వం న సంత్యక్తం తావత్ ఆత్మా న లభ్యతే।** – ఈ జీవుడు దృశ్య విషయాలలో సంబంధ – అనుబంధ – బాంధవ్యములను మంకుపట్టుతో పట్టుకొని, వదలకయే ఉంటాడో,.... **అంతంత వరకు ఈతనికి ఆత్మభావన లభించదు.**

## త్యాగేనైవతు కైవల్యమ్

**సర్వ వస్తు పరిత్యాగే శేష ఆత్మేతి కథ్యతే।** ఈ బాహ్య సంబంధమైన సర్వ వస్తు జాలమును మనస్సుచే – **"ఇది నాకు సంబంధించినది కాదు. నేను దీనికి సంబంధించినవాడిని కాదు"** – అను భావనాపటిమతో సంపరిత్యజించుచుండగా, అట్టివాడు – **అప్పటికీ శేషించియుండే ఆత్మయే తానగుచున్నాడు.** అందుచేత ఆత్మావలోకనము (ఆత్మసాక్షాత్కారము) కొరకై ఈ ఇంద్రియ దృశ్య సంబంధమైన సమస్తమును మనస్సుతోను, బుద్ధితోను పరిత్యజించి ఉండెదవుగాక! **ఆత్మావలోకనార్థం తు తస్మాత్ సర్వం పరిత్యజేత్। సర్వం సంత్యజ్య దూరేణ యత్ శిష్టం, తన్మయో భవ।** సమస్తము త్యజించినవాడవైన – తరువాత, అప్పటికీ ఏది విశిష్టమై శేషించియే ఉంటుందో **అట్టి ఆత్మయే నీవై ఉండుము.**

## యత్ దృశ్యమ్। తత్ అశాశ్వతమ్। తత్ నశ్యమ్।

ఓ నిదాఘా! నీటిలో ఆవర్తములు (సుడులు), తరంగములు కనబడి, ఇంతలోనే మాయమగుచూ ఉంటాయి. అటువంటి సుడులు, తరంగాలు శాశ్వతము – అని అంటామా? అనము. తరంగాల దృష్ట్యా జలము మాత్రమే ఎప్పటికీ ఉంటుంది. అట్లాగే, **సర్వం కించిత్ ఇదం దృశ్యం దృశ్యతే చేత్ జగత్ గతమ్, చిత్–నిష్పందాంశమాత్రమ్. తత్। న అన్యత్ కించన శాశ్వతమ్।** ఏదేదైతే జగత్ గతమై (జనిస్తూ, గతిస్తూ ఉన్నదై). దృశ్యరూపముగా అగుపిస్తూ ఉన్నదో....అదంతా **చిత్‌యొక్క కించిత్ స్పందనమాత్రమే.** ఈ సువిశాల విశ్వమంతా కూడా దృశ్యముగా శాశ్వతము కాదు. నశ్వరము. అట్టి ఈ దృశ్యము ఆత్మదృష్టితో చూస్తేనో? ఆత్మస్వరూపంగా శాశ్వతం – (తరంగాలు జలమునందు ఎప్పటికీ ఉండి ఉండుతీరుగా). **"తరంగాలు జలమును బంధిస్తున్నాయి"** – అని అంటామా? అనము. అట్లాగే **జీవాత్మ ప్రదర్శనము పరమాత్మత్వమును బంధించజాలవు.**

## సమాధి స్థితి - పరాప్రజ్ఞ

హే బ్రహ్మన్। ఎవరి అవగాహనా రూపమగు ప్రజ్ఞ అయితే...

- సర్వత్రా సమరూపంగా తిష్ఠించినదైయున్న అఖండాత్మనే సందర్శిస్తూ సమాహితమై ఉంటుందో –
- సర్వ అసంతృప్తులను మొదలంట్లా త్యజించివేసి సర్వదా సంతృప్తి, పరానందము కలిగి ఉంటుందో, –
- సర్వభూతజాలమును పరమాత్మయొక్క సంప్రదర్శనా–చమత్కారంగా అన్వయించుకొంటూ, ఆస్వాదిస్తూ ఉంటుందో,–

అదియే 'పరాప్రజ్ఞ'. అదియే బుధులచే (విజ్ఞులచే) **'సమాధి'** అని కూడా అనబడుతోంది. అట్టి సమాధిస్థితి ఏ కారణాలవలనను, ఎట్టి క్షోభ పొందనట్టి **"అక్షుబ్ధస్థితి"**. 'అహమ్–మమ' శబ్దార్థములచే స్పృశించబడనట్టిది. కాబట్టి <u>నిరహంకారమైనట్టిది.</u> ఎటువంటి ద్వంద్వములలో ఏమాత్రము మునగనట్టిది. మేరు పర్వతమువలె సమస్తము ఆత్మగా దర్శించటములో నిశ్చలమైనట్టి స్థితి. ఆత్మగా భావనచేయుటలో సునిశ్చతమైనట్టిది. సర్వలోక సంబంధమైన అభీష్టములకు(Wishes, desires and expectations) అతీతమైనట్టిది. **"ఇది హేయము (వదలవలసినది) - ఇది ఉపాదేయము (స్వీకరించవలసినది, నిర్వర్తించవలసినది)"** – అను పరిధులను దాటివేసియున్నట్టి అంతర్-మనోస్థితి. మనస్సు యొక్క ఆత్మతో ఏకరూపమగు పరిపూర్ణత్వము సిద్ధించుకొన్నట్టి స్థానమే సమాధి. **"సూర్యుని నుండి బయలుదేరిన కిరణము దేనిపై ప్రసరిస్తూ ఉన్నప్పటికీ అది సూర్యతేజస్సుకు అభిన్నమే కదా! అట్లాగే నేను, సహజీవులు కూడా చిత్ ప్రకాశముయొక్క కల్పితాంశములై, చిదాత్మకు అనన్యులము"** అను స్థిరబుద్ధి సిద్ధించుకొన్నప్పటి స్థితియే <u>**సమాధి.**</u>

# తుర్యక్ దృష్టి

జీవుల పట్ల – **(1) 'జాగ్రత్ దృష్టి, (2) స్వప్నదృష్టి, (3) సుషుప్తి దృష్టి'** – అను మూడూ కూడా ఒకదాని తరువాత మరొకటి ఏర్పడినవై – మనోగతమై ఉండటము స్వాభావికము. సర్వత్రా సామాన్యము. అయితే వేదవిత్తములు (వేదహృదయము తెలిసినవారు) అగు మహనీయులు తుర్యస్థానమును ప్రాప్తించుకున్నవారై ఉంటున్నారు.

**తుర్యక్ స్థానము** : **"ఈ జాగ్రత్–స్వప్న–సుషుప్తులు నేను కల్పించుకొని, ప్రవేశించి, తిరిగి మరలి వచ్చుచున్న భూమికలు. నేను వాటికి వేరై, వాటికి ఆధారమై సాక్షీభూతుడను"** – అని దర్శిస్తూ ఉండటమే **'తుర్యక్‌స్థాన ప్రాప్తి'** అని చెప్పబడుతోంది. అది జాగ్రత్ స్వప్న సుషుప్తులకు దూరగతం కాదు (వేరైనది కాదు), 'ఆ మూడూ నావి' అను దృష్టియే తుర్యక్. అది సుషుప్తివలె జాగ్రత్–స్వప్న విషయరహితము – అయినప్పటికీ సుషుప్తివలె జడస్థితికాదు. ఎందుకంటే **'సుషుప్తి'** అనేది మనస్సు, అహంకారము మౌనము వహించినట్టి స్థితిమాత్రమే. సుషుప్తి నుండి జాగ్రత్‌కో, స్వప్నములోనికో బయల్వెడలటానికి సిద్ధము అవుతూ ఉండగానే, తత్‌క్షణమే మనస్సు – అహంకారములు – తమ తమ వర్తమాన ప్రాపంచక దృశ్య సంచారములతో సహా – జూలు విదల్చుకొని బయల్వెడలుచున్నాయి. తుర్యక్ స్థితియో? అటువంటిది కాదు. మరి? **మనో అహంకార విలయే, సర్వభావ అంతర స్థితా।** మనస్సు అహంకారము ఆత్మయందు విలయము (Melting) పొందగా, సర్వభావములయొక్క అంతరముగా (ఆభరణములలో బంగారమువలె) స్థితి కలిగి ఉన్నట్టిది. **'తుర్యక్' అను అనుభవము సమస్తమునకు ఆవల (పారమ్) ఆత్మానంద (లేక) పరానంద సాగరములో ప్రదర్శనమగు ఈశ్వరీ సంబంధమైనది.**

అట్టి సర్వమునకు పరమైయున్న కేవలానంద – అకారణానంద స్థితికి మార్గము – **ఎవరికివారే మనస్సుతో మనస్సును జయించి స్వయముగా** లాభించుకోవలసినట్టిది. చిత్తము తనయొక్క సమస్త వాసనలు (All Tendencies towards outward 'Indriya' contexts) నశింపజేయగా పరమస్ఫుటముగా ఈ జీవునికి తనయందే తురీయము ప్రకాశమానము అవగలదు. సర్వత్రా సమదర్శనముచే (సర్వత్రా– ఏకము–అఖండము అగు ఆత్మగా దర్శనముచే), స్వస్వరూపానుభవముగా పరిణామము పొందగలదు.

అట్టి స్వస్వరూపాత్మ మహత్తరమైనది. అచింత్యమైనది. **అఖిలమ్ ఇదమ్ అనంతమ్, ఆత్మతత్త్వమ్ దృఢ పరిణామిని చేతసి స్థితో అంతః। "ఈ కనబడే సమస్తము కూడా అనంతమగు ఆత్మతత్త్వము యొక్క పరిణామమే కదా!"** – అని చిత్తమునకు సంబోధన చేస్తూ, చిత్తమునకు ఆవలగల **"చిత్‌తత్త్వము"** నందు స్థితిని కలిగి ఉండటమే **తుర్యక్‌స్థితి.** చరాచరాత్మకమైన ఈ ప్రపంచము, – భేద రూపములతో కనిపించేదంతా – భావాతీతము నందు ఉపశమించగా, చిత్తము ఆసక్తిరహితము, నిశ్చలము అవగలదు. 'సంసారము' అనే భేద దృష్టితొలగిపోయి, **దేవదేవుడగు ఆత్మ భగవానుని స్వరూపముగా ఈ సమస్తము అనుభవ మగుచూ ఉండటమే తుర్యక్‌స్థితి విశేషము.** దీర్ఘ **తపస్సు** (తపనతో కూడిన ప్రయత్నముచే, క్రమముగా ఇదంతా 'ఆత్మగా అనుకోవటము'), సుదీర్ఘభావనా యత్నము, సర్వభేదములపట్ల 'అనాసక్తి' అధికమగుచుండగా – **చిత్తముయొక్క** దృశ్యముతో సంబంధము కారణంగా ఏర్పడిన బంధము తొలగిపోతోంది.

ఒకడు దృశ్యము పట్ల సక్తుడు (Attached) అయి ఉన్నంతకాలము దీర్ఘతపస్సుచేసినా, యోగాభ్యాసము నిర్వర్తించి 'యుక్తుడు' అయినా కూడా – బద్ధుడే అవుతాడు.

అంతరమున సంసక్తి నిర్మూలించుకొన్నవాడు స్వాభావికంగానే మధురమైన వృత్తి కలవాడు అవుతాడు. అట్టి అసంసక్తుడు అంతఃసంసక్తి (Inward attachment) ని జయించివేస్తూ ఆత్మ తత్త్వ మాధుర్యము సిద్ధించుకొన్నవాడు బాహ్యమున కర్మలు చేస్తూ కూడా, **బహిః కుర్వన్, న కుర్వన్ వా, కర్తా భోక్తా నహి క్వచిత్-ఇతి।** – అంతరమున దేనికి కర్తగా గాని, భోక్తగా గాని అవనివాడే అయి ఉంటాడు.

**(తుర్యక్ = తురీయము = చతురీయము = జాగ్రత్ స్వప్న సుషుప్తులు తనవి అయి ఉన్న ఆవల గల ఈ జీవుని స్వస్వరూపము).**

-----

# 2వ అధ్యాయము
## (సంగము; బంధము; మోక్షము; చికిత్స)

**నిదాఘుడు :** గురువర్యా!

| | |
|---|---|
| **సంగః కీదృశ ఇత్యుక్తః?** | 'సంగము' అనేది ఏ రూపమైనట్టిది? |
| **కశ్చ బంధాయ దేహినామ్?** | – ఈ దేహికి ఏది బంధము? ఈ జీవునిపట్ల బంధము ఎవరి వలన, ఎందుకు, ఎట్లా వచ్చిపడుతోంది? |
| **కశ్చ మోక్షాయ కథితః?** | – ఏది 'మోక్షము' అనబడుతోంది? |
| **కథం తు ఏష చికిత్సతే?** | – ఈ బంధము తొలగటానికై ఈ జీవుడు ఆశ్రయించవలసిన చికిత్స ఏది? |

## సంగము – బంధము

**ఋభుమహర్షి :**

**శ్లో॥ దేహ-దేహి విభాగేన పరిత్యాగేన భావనా,**
**దేహ మాత్రే హి విశ్వాసః సంగో బంధాయకల్పతే॥**

ఈ జీవుడు దేహముతో కూడి ఉంటున్నాడు కదా! దేహము – ఉపయోగించబడేది. దేహియో? దేహమును ఉపయోగిస్తూ ఉన్నట్టి వాడు. ఒకడు ఒక వస్తువును (వస్త్రమునో, కలమునో, వంటపాత్రనో, ఒక వాహనమునో) ఉపయోగిస్తూ ఉంటే ఆ ఉపయోగించేవాడు (one who is using) - తాను ఉపయోగిస్తున్న ఉపకరణము (That being used) నకు దాసుడుగా అవుతున్నాడా? అవనే అవడు. కానీ ఈ జీవుని పట్ల అట్లా జరగటంలేదు. **"ఈ దేహమును నేను ఉపయోగించేవాడిని. దీనికి వేరుగా 'దేహి'ని అయి ఉన్నాను"** అనే విషయమే ఏమరుస్తున్నాడు. **"ఈ దేహము లేకపోతే నేను లేను. ఇది నశిస్తే నేను ఏమౌతానో కూడా నాకు తెలియదు. ఇది ఉంటేనే నేను ఉంటాను"** – అను **"దేహముతో అవినాభావ మనో సంబంధమే"** బంధముగా అగుచున్నది. ఈ దేహమునకు దేహి – దాసుడుగా అగుచున్నాడు. ఎంతటి చమత్కారం!

"నేను ఈ దేహమే।" అనే విశ్వాసము దట్టముగా కలిగి ఉంటున్న దౌర్భగ్యముచేతనే ఆతనిపట్ల బంధము కల్పించబడినది అవుతోంది. ఒకవేళ ఈ భౌతిక దేహము గురించి ఈ జీవునికి **"ఇది నశిస్తే నేను నశిస్తాను. లేదా ఏమౌతానో నాకు ఏమీ తెలియదు" – అనే మూర్ఖభావనను త్యజిస్తేనో?** అప్పుడు ఈ జీవునికి బంధము ఉండే ప్రసక్తియే లేదు. ఎందుకంటే, **ఈతనిపట్ల ఇకప్పుడు సహజమగు స్వాత్మభావనయే శేషించగలదు కాబట్టి! అట్టి స్వాత్మభావన జీవన్ముక్తికి దారితీయగలదు.**

**జీవన్ముక్త స్థితి : "సర్వమ్ ఆత్మ ఇదమ్, అత్ర అహం కిం వాంఛామి? త్యజామి కిం?" "నాతో సహా ఇక్కడి సమస్తము 'ఆత్మ'యే అయి ఉండగా, ఇక కోరుకోవలసినది ఏముంటుంది? త్యజించవలసినది మాత్రం ఏముంటుంది?"** – అను రూపముగల **'అసంగస్థితి'**యే **"జీవన్ముక్తత"** (శరీరముచే బంధము కలుగనట్టి) స్థితి.

## అసంసక్తుడు

**నాహమస్మి।** ఆత్మకు వేరుగా 'నేను' లేను. **న చ అన్యోఽస్మి। న చ అయం। న చ నేతరః।** ఆత్మకు వేరై మరొకరు లేరు. వీరు లేరు. వారు లేరు. నేను సర్వదా బ్రహ్మమునే। నీవు, ఇతరులు బ్రహ్మమే।" – అని భావించటమే "అసంగస్థితి".

అట్టి అసంగస్థితి సిద్ధించుకొన్నవాడు **"నేను కర్మలు చేయను"** – అను **'నైష్కర్మ్యము'** గాని, **'కర్మలు చేయాలికదా'** అనే కర్మలలో తదాత్మ్యముగాని పొందడు. కర్మలు చేయవలసి వస్తున్నా, (లేక) చేయలేకపోయినా కూడా 'సమత్వము' వీడక ఉండువాడే **అసంసక్తుడు.** కర్మలు చేస్తూ ఉన్నప్పుడు కూడా సమస్త కర్మఫలములను మనస్సుతో పరిత్యజించు నిపుణత (Efficiency) ఉన్నవాడిని 'అసంసక్తుడు'గా చెప్పుతారు.

ఈ జీవుని పట్ల 'ఏదో చేయాలి! ఇంకా చేయాలి!' అనే రూపంగా రజోగుణము ప్రవర్తిస్తూ ఉంటోంది. అట్టి 'రజోగుణము' వలన కామ-క్రోధములు విజృంభించి, అవి కాస్తా ఈ జీవునికి శ్రమలు, పాపదృష్టులు, అల్ప భావములు - మొదలైనవన్నీ మూటగట్టి తెచ్చిపెడుచున్నాయి. కర్మలకు అంతెక్కడిది? అటువంటి అనుక్షణము విజృంభిస్తున్న చేష్టలన్నిటినీ **'సంకల్పించకపోవటము'** అను **అసంకల్పన**యే చికిత్స. జీవుడికి సంకల్పములవలన బంధము. అంతేగాని, కర్మల వలన కాదు సుమా! అందుచేత, అసంకల్పనయే శ్రేయోదాయకమైయున్నది. **(సంకల్పోహి బంధాయ। నిస్సంకల్పోహి మోక్షయే।)**

| దేహి | సంకల్పము | దేహము |
|---|---|---|

'సంకల్పము' ఎక్కడి నుండి వస్తోంది? సక్తత (Attachments) వలన. అందుచేత ఓ నిదాఘా! ఇక్కడి ఆయా చేష్టలందు (జగద్దృశ్యములో జరుగుచూ ఉన్న వ్యవహార పరంపరలయందు) గాని, ఇక్కడి సంబంధ-అనుబంధ-బాంధవ్యములు మొదలైనవాటితో ఏర్పడే చింతనలయందుగాని, ఇల్లు మొదలైన వస్తు సముదాయమునందుగాని, "అక్కడికి పోవాలి - ఇక్కడికి రావాలి" అనురూపమగు రాక-పోకలయందుగాని, "ఇది కల్పన-అది నిజము. ఇది గొప్ప - అది కాదు" మొదలైన కలన - అకలనములందుగాని - **"సక్తత"** లేకపోవటమే **అసంసక్తత.** అవి ఏ తీరుగా ఉన్నాకూడా ఒక్క తీరుగా చూడటమే అది. వాటియొక్క సంకల్పములను అంతరంగములో త్యజించి ఉండటమే **'అసంసక్తత'**కు సుమార్గము.

ఈ దృశ్యము యొక్క అనుభవమునకు ఆవల 'ఎరుక' రూపమగు **'కేవలచిత్'** (Knowing at its Absolute Form) వేంచేసినదైయున్నది. అటువంటి చిత్ స్వరూపము యొక్క మాధుర్యము ఎరుగుచున్నప్పుడు, ఆపై మనస్సు వ్రాలుచున్న దృశ్య వస్తు సముదాయముల గురించి అరసము (Distaste) స్వాభావికమవగలదు. ఈ మనస్సు - ఇంద్రియములకు ప్రియంగా కనిపించేవన్నీ దాటివేసి, స్వాభావికమగు ఆత్మానందమునందు దృష్టి పెట్టగలదు కూడా. ఈ జీవునికి వాస్తవమైన ఆనందము ఇంద్రియ - ఇంద్రియ విషయములలో లేదు. ఇంద్రియానందము వ్యాజ (Avocations and 'IFs' and 'BUTs') రూపమైనది. **ఆత్మయందే ఆత్మజ్ఞానానంద రూపముగా వేంచేసి ఉండగా, ఆనందము కొరకు ఇంద్రియ జగత్తులో ఎంత వెతికి ఏమి ప్రయోజనము? వెతకవలసిన అగత్యము ఏమిటి?**

**నిదాఘుడు :** పితృదేవా! మేము ఈ ప్రాపంచకమైన అత్యవసరముల దృష్ట్యా అనివార్యంగా అనేక **'కర్మలు నిర్వర్తించక తప్పటంలేదు. వాటిలో కొన్ని చేయవలసినవి'**... అని తెలిసి కూడా చేయలేకపోతున్నాము. కొన్ని **'చేయకూడదు'** అని తెలిసి కూడా చేస్తూనే ఉంటున్నాము. ఈ విధంగా కర్మలకు దాసులము (Slakes) అగుచున్నాము. కర్మలను జయించి 'ఆత్మభావన' యందు ప్రవేశించేది ఎట్లా? ఎన్నటికి?

**ఋభుమహర్షి :** బిడ్డా। నిదాఘా! **వ్యవహారమ్ ఇదగ్ంం సర్వం మా కరోతు, కరోతు వా, అకుర్వన్ వాపి కుర్వన్వా, .....జీవః స్వాత్మ రతి క్రియ ః।** నీవు కర్మలు చేయి. లేదా చేయకపో. చేస్తూ ఉన్నా, చేయకుండా ఉన్నా కూడా.... ఆత్మయందు (ఆత్మగా ఈ సమస్తమును భావించుటయందు) ఇష్టము కలిగియుండెదవు గాక! అన్యభావనలను ఆత్మపట్ల ఇష్టాపూర్వకంగా త్యజించి ఉండు. ఇందులో కష్టమేమీ లేదు. "అంతా పరమాత్మ చమత్కారమే" - అని అనుకోవటంలో కష్టమేమున్నది? నాటకంలో నటిస్తూ ఉన్నవాడు - ఎంతో నటిస్తూ ఉన్నప్పటికీ, - "ఇది నాటకమే" - అని మరవటం లేదు కదా మరి?

అన్ని వదిలివేసి ప్రశాంతముగా ప్రకాశము వెదజల్లు 'మణి' వలె - చైత్యము (అనుభవమయేదంతా) సశాంతించినట్టి చిత్తముతో ఘనీభూతమగు **'స్వస్వరూప-సమస్తస్వరూప'** ఆత్మభావనను ధారణ చేస్తున్నవాడవై ఉండు.

**జాగ్రత్‌లో సుషుప్తి :** జాగ్రత్‌లో ఉంటూనే నీ చిత్తము చైత్యరహితము (పంచేంద్రియ విషయములపట్ల కామక్రోధ లోభ రహితము) అయి ఉంటున్నప్పుడు, ఇక ఆపై అంతరమునకు పరమశాంతమగు స్థితి ఆరూఢమవగలదు. అట్టి స్థితిని **"జాగ్రత్ సుషుప్తి"** అంటారు. అట్టి జాగ్రత్ సుషుప్తి యొక్క స్థిరమైన అభ్యాసముచే ఏర్పడే ప్రౌఢస్థితి (matured state) **"తురీయ స్థితి"** అనబడుతోంది. "అది అవినాశనము. మార్పు - చేర్పులు లేని అమృతస్వరూపము అగు **తురీయము** - అని తత్త్వ కోవిదులచే శబ్దార్థపూర్వకంగా చెప్పబడుతోంది. అది ఏకాంత (ద్వితియమేకాని) ఆనందశీలత్వముతో కూడిన ఆశ్రయమము కాబట్టి **'ఆనందపదము'.** (పంచకోశములలోని) ఆనందమునకు కూడా ఆవల ఉన్న సాక్షీతత్త్వము కాబట్టి **'అనానందము'** కూడా.

**తురీయాతీతము :** జాగ్రత్ – స్వప్న – సుషుప్తులను తనయొక్క పురుషకారముచే నిర్మించుకొని విహరించు స్వస్వరూపస్థితి విభాగము తురీయము. **అట్టి తురీయమునకు కూడా సాక్షి అయి ఉన్నట్టి స్వస్వరూపస్థానము – 'తురీయాతీతము'.**

**ఆనంద ఏకాంత శీలత్వాత్ :** అది – లోకములు, లోకానుభవములు, లోకానుభవి కూడా తనకు అన్యము కాని స్థితి కాబట్టి – **'ఏకాంతానందము'** అనబడుతోంది.

**అనానందపదం గతము :** అది పంచకోశములలోని ఆనంద కోశమునకు కూడా ఆవలది కాబట్టి **'అనానందపదంగతము'** – కూడా!

**మహానంద స్వరూపము :** అద్దాని ఆనంద వీచికలే 14 లోకములు, లోకపాలకులు, సృష్టి – లయములు, కల్ప – కల్పాంతరములు కూడా! కనుక 'మహానందస్వరూపము'.

**అవినాశినీమ్ :** అది వినాశనము యొక్క ఊసు కూడా ఉండనట్టి అవినాశనమగు **అమృతస్వరూపము.** ఓ ప్రియ నిదాఘా! సమస్త శ్రోతలారా! మనమంతా సర్వదా అట్టి అవినాశ, అమృతరూపము అగు 'ఆత్మయే' అయి ఉన్నాము సుమా! కనుక అది బాహ్య సంచారములు విరమించి స్వగృహమునకు చేరటమువంటిది.

## తుర్యాతీతపదము – ముక్తుడు

**'ముక్త' ఇతి ఉచ్యతే యోగీ తుర్యాతీతపదం గతః।** అట్టి తుర్యాతీతపదమును తనయొక్క స్వాభావిక – అనునిత్య స్వరూపముగా గమనిస్తూ, ఆస్వాదించుచున్న యోగి – **'ముక్తుడు'**. ఆతడే – **'తుర్యాతీతపదంగతుడు'.**

## బ్రహ్మము

అట్టి ముక్తునికి కాలాతీతమై, స్వాభావికమై అనుభవమగుచున్న తుర్యాతీతానుభవమునే **'బ్రహ్మము'** అని కూడా అంటున్నారు.

**పరిగళిత సమస్త జన్మపాశః। సకల విలీన తమోమయాభిమానః । పరమరసమయః పరాత్మసక్తో। జలగత సైంధవ ఖండవత్ మహాత్మా। జడ–అజడ దృశోర్మధ్యే – యత్ తత్త్వమ్ పారమార్థికమ్, అనుభూతిమయం తస్మాత్ సారం 'బ్రహ్మ' ఇతి కథ్యతే।**

అట్టి 'బ్రాహ్మీస్థితి' ఎటువంటిదంటే...

**పరిగళిత జన్మపాశః** జన్మలు నా నుండి స్వప్న – స్వప్నాంతరముల వలె (ఒక 'కల' తరువాత మరొక 'కల' వలె) బయల్వెడలుచూ, నాయొక్క 'క్రీడా–లీల" గా నన్ను ఆనందింపజేస్తున్నాయి. నేను కంటున్న 'కల' – నన్ను బంధించదు కదా। అట్లాగే నా లీలావినోద – స్వయంకల్పితమగు 'జన్మరూప' స్వప్నములు నన్ను బంధించటమేమిటి? **"ఒక రచయిత వ్రాసిన నవలలోని కొన్ని పాత్రలు బయటకు వచ్చి ఆ రచయితను బంధిస్తున్నాయి"** – అనే వాక్యం ఎంతగా హాస్యాస్పదమో, **"జన్మలు నన్ను బంధిస్తున్నాయి"** అనునది అంతటి నవ్వు వచ్చే వార్త!

ఈ విధంగా ఎరుగుచున్న **'బ్రాహ్మీదృష్టి'** గల యోగికి ఇక జన్మ – కర్మబంధములు ఎక్కడుంటాయి? ఉండవు.

**విలీన తమోమయాభిమానుడు : "సమస్తము నేనే అయి ఉండగా ఇక దేని గురించి మాన – అభిమాన తమస్సు (చీకటి) శేషిస్తుంది? అవన్నీ నా బ్రాహ్మీ స్వరూపమునందు విలీనమగుచున్నాయి. నేను సర్వదా బ్రాహ్మీ స్వరూపుడనై విరాజిల్లుచున్నాను"** – అని బ్రహ్మతత్త్వానుభవి, నిత్యానుభవి – అయి ఉంటున్నాడు.

(1) **పరమ రసమయః పరాత్మసక్తో :** తనయొక్క నటనాకళ (Art of Acting) ను వినోదముగా కలిగియుండి, అనేక నాటకములలో అనేక పాత్రలు నటించేవానికి (The character Actor) తాను ఒక సందర్భములో ఒక నాటకములో ఒక పాత్ర యొక్క స్వరూప స్వభావములకు బద్ధుడౌతాడా? లేదు కదా! నటునికి ఆవల (నటనా కళకు కూడా ఆవల) తాను సర్వదా ఉండి ఉంటున్నాడు కదా! బ్రాహ్మీభావము సిద్ధించుకున్నవాడు – తనయొక్క కేవలము, అఖండము, అప్రమేయము (The Absolute, The Indivisible, The unconcerned with worldly scene) – అగు బ్రహ్మీస్వరూపమునందే రుచికలిగియుండి, బ్రాహ్మీరసమయుడై ఉంటాడు.

**జలగత సైంధవ ఖండవత్ :** ఒక ఉప్పు బొమ్మ సముద్రముయొక్క లోతు గురించి అధ్యయనము చేయటానికి సముద్ర జలంలో ప్రవేశించింది. అప్పుడు ఆ ఉప్పుబొమ్మ యొక్క నామరూపాలు ఏమౌతాయి? సముద్రజలంలో కరిగిపోయి, ఏకమైపోతాయి. అట్లాగే, బ్రహ్మముగురించి తెలుసుకునుచున్న యోగి బ్రహ్మమే తానై ప్రకాశించుచున్నాడు. **నామరూపములను తనయందు ఏకము చేసుకొన్న సచ్చిదానందమే బ్రహ్మము.**

**మహాత్మ :** అట్టి తురీయాతీతుడు-బ్రహ్మమే తానగుచు, దేహాత్మత్వమును సం-విస్తరింపజేస్తూ,... **ఈ సమస్త విశ్వమును తన శరీరముగా భావిస్తూ, విశ్వరూప - సందర్శనుడై, విశ్వమునకే ఆత్మ అగుచూ 'మహాత్మ'** అను స్థానము పుణికిపుచ్చుకొంటున్నాడు.

**జడ-అజడ దృశోః మధ్యే యత్ తత్త్వమ్ - పారమార్థికమ్**

**జడము = కదల్చబడునది.** (దేహము, ఆలోచనలు, తెలివి, ఇష్టము, అహంకారము, జీవాత్మ మొదలైనవన్నీ కూడా).

**అజడము = కదల్చుచున్నట్టిది.** (పైవన్నీ చేతనము చేస్తున్నట్టి ఆత్మచైతన్యము).

అట్టి జడ - అజడ సందృశ్యముల మధ్యగా పారమార్థికమగు కేవల చైతన్యముగా ఏర్పడి ఉన్న స్వస్వరూపమే బ్రహ్మము.

**అనుభూతిమయం :** అది చెప్పగలిగేది కాదు. కానీ, అనుభవమునకు ఇప్పుడే, ఇక్కడే సర్వదా సంసిద్ధమై ఉన్నట్టిది.

***అట్టి సారమే బ్రహ్మము.***

# బంధము - మోక్షము

'దృశ్యము'తో అవినాభావసంబంధము కలిగి ఉండటమే 'బంధము'. అట్టి సంబంధము నుండి ముక్తుడుగా (Always wel - relieved) తనను తాను గమనించి ఉండటమే మోక్షము. ఇంతకుమించి ఇక్కడ ఎవ్వరికీ కూడా బంధము లేదు. మోక్షము లేదు.

ఓ నిదాఘా! ఈ జీవులందరు విషయరహితమగు 'సుషుప్తి' నుండే 'జాగ్రత్'కు రావటం జరుగుతోంది కదా! ఇది గుర్తెరుగుతూ, నీవు ఈ 'జాగ్రత్'లోను, 'స్వప్నము'లోను కనిపిస్తున్న, అనుభూతమగుచూ ఉన్న

| ద్రవ్యము<br>Matter లేక దృశ్యము<br>(object of perception) | ═ | దర్శనము<br>Perceiving |
|---|---|---|

***ద్రవ్య-దర్శన సంబంధములన్నింటినీ నీయొక్క 'సుషుప్తస్థానము' (లేక) సుషుప్త శక్తి యందు లయింపజేసి యథాతథుడవై ఉండెదవు గాక!***

అట్టి **'సుషుప్తశక్తి'** యందు 'జాగ్రత్ దృశ్యధారణ' చే నీకు, అదృశ్యస్వరూపమగు తుర్యత్వము సిద్ధించగలదు. అదియే - **'ఆత్మయందు 'దృష్టిని సుస్థిరీకరించటము'** అని కూడా అంటారు. అట్టి - నీవు నీ దృష్టిని ఏకాగ్రము చేసి సంస్థాపించవలసియున్న ఆత్మ - ఎట్టిది?

- **న స్థూలో** : అది ఇంద్రియములకు స్థూలముగా అనుభవమయే వస్తువు వంటిది కాదు.
- **న చైవ అణుః** : ఏదో సూక్ష్మమైన అణువు (Atom) వంటిది కూడా కాదు.
- **న ప్రత్యక్షో** : ఆత్మ (లేక) బ్రహ్మము కళ్ళకు ఎదురుగా ఒక వస్తువువలె ప్రత్యక్షమై కనిపించేదేదీ కాదు.
- **న చ ఇతరః** : ఈ ప్రత్యక్షమైయున్న సమస్తమునకు వేరై మరెక్కడో ఉన్నట్టిది కూడా కాదు.
- **న చేతనో** : చేతనమై కదులుతూ ఉన్నది కాదు,
- **న జడో** : జడమైనది కూడా కాదు.
- **న చ ఏవ అసత్** : మొదలే లేనిదై 'అసత్' కాదు.
- **న 'సత్' మయః** : 'సత్' (ఉన్నది) ఏదీ కాదు.
- **న అహమ్** : 'నేను' అను స్వరూపమైనది కాదు. ('నేను' - అని ఇప్పుడు అనిపిస్తున్నది జాగ్రత్ పరిమితము కదా।).
- **న అన్యో** : 'నేను'కు వేరై 'అన్యము'గా ఉన్నది కాదు. (జాగ్రత్ స్వప్న సుషుప్త దేహ దేహాంతరములు నావై ఉన్నట్టి 'నేను' - అది).
- **న చ వై ఏకో** : ఏకము కాదు.
- **న అనేకో** : అనేకము కాదు.
- **న అద్వయో। (న) అవ్యయః** : 'అద్వయము కాదు. అవ్యయము కాదు. (It is beyond the range of Relativity).

ఇక్కడ ఏది దృశ్యరూపముగా ప్రాప్తిస్తుందో, అట్టి ఇదంతా కూడా (రంగుల కళ్ళజోడులోంచి కనిపించే దృశ్యమువలె) - మనస్సు

యొక్క ఇంద్రియాస్పదమైనది మాత్రమే। అంతేగాని **ఆత్మకు సంబంధించిన వివరణ కాదు.** అట్టి ఇంద్రియ – కల్పిత దృశ్యము వలన ఆత్మకు బంధమెక్కడిది? మోక్షమెక్కడిది? మరి, బంధమెవరికి? మనస్సుకా? నాకా?

**శ్లో॥ న మోక్షో నభసః పృష్ఠే। న పాతాళే। న (చ) భూతలే।**

'మోక్షము' అనునది ఎక్కడో ఆకాశంలో లేదు. దిక్కులలో లేదు. పాతాళంలో లేదు. భూమిమీద లేదు. మరి?

**సర్వ ఆశా సంక్షయే చేతః క్షయో – 'మోక్ష' ఇతి ఈష్యతే॥**

ఈ చిత్తము సమస్త దృశ్య వ్యవహారములపట్ల, సందర్భములపట్ల **'ఆశించటము'** అనునది సంక్షయించినప్పుడు అట్టి చిత్తముయొక్క స్వరూపమే **'మోక్షము'.**

చిత్తము స్వాభావికంగా ఆశ–నిరాశలను త్యజించినప్పుడు అదియే మోక్షము. అంతేగాని, **"నాకు మోక్షము లభించాలి"** అనునది కొనసాగేంతవరకు, (మనస్సులో చింత అంతరంగా ఉన్నంతవరకు). అది మనస్సుకు బంధమే అగుచున్నది. (**'మోక్షము కావాలి'** అని ఆశించటము కూడా–**సంసారము కొనసాగిస్తున్నట్లే**–అని చెప్పబడుతోంది). *(భగవద్గీతలో 18వ అధ్యాయము–మోక్ష సన్న్యాస యోగము).*

ఆత్మ సర్వదా సమస్తమునకు అతీతము (It is beyond all else). సమస్తము ఆత్మయే అయి ఉండగా, మనస్సు మొదలైనవాటిచే ఆత్మకు బంధము ఏర్పడే ప్రసక్తి ఎక్కడిది? ఆత్మకు ఏ క్షణమందు బంధమే లేనప్పుడు ఇక 'మోక్షము పొందాలి!' అనే ప్రసంగముతో పనిఏమి? అందుచేత **"నాకు మోక్షము సిద్ధించవలసియున్నది"**– అను భావనను కూడా **వదలివేసి ఉండు**. ఇష్ట–అయిష్టముల గురించిన చాంచల్యము త్యజించినప్పుడు లభించే ఉత్తమ విశ్రాంతియే మోక్షము. అట్టి పరమ విశ్రాంతి పొందిన మనస్సు ఇక్కడ దేనినీ స్వాభావికంగానే వాంఛించదు.

**"నాకు ఆత్మగా 'బంధము' అనునది మొదలే ఉండజాలదు"** – అను నిస్సందేహ నిర్ణయమే "మోక్షము".

## జీవన్ముక్తుడు

సమస్తమునకు (సర్వజీవులకు, దృశ్యజగత్తుకు) ఆభరణమునకు బంగారమువలె – ఏది అధిష్ఠానము అయి ఉన్నదో, సర్వ సంకల్పములకు ఆవలన ఏది నిర్వికల్ప స్వరూపమో, అట్టి చిదాత్మయందు – స్నేహము, ప్రియము ఎవ్వడైతే కలిగి ఉంటాడో, – ఆతడే జీవన్ముక్తుడు. అట్టివాడు (జీవుడు – జీవితమును ప్రేమించుచున్నట్లు) 'ఆత్మ' పట్ల ప్రియుడై ఉంటాడు.

- 'నాకు భవిష్యత్తులో అదీ – ఇదీ లభించాలి' అని గాని, "ఇతఃపూర్వము ఇది జరిగింది. అది ఉన్నది. ఏదోలేదు" అనిగాని....
  ఏమాత్రము తిష్ఠించకయే – **అన్నీ నిర్వర్తిస్తూ ఉంటాడు.**
- అందరితో అన్ని సంబంధాలు కలిగియే – ఏసంబంధము లేనివాడై ఉంటాడు.

భక్తులతో భక్తి సమాచారములు సంభాషిస్తూ ఉంటాడు. శఠులలో (మూర్ఖులమధ్యగా) ఉన్నప్పుడు **మూర్ఖులలో ఒకడివలెనే** ఉంటాడు. బాలురలో **బాలుడై అల్లరి చేస్తూ,** కేరింతలు కొడుతూ ఉంటాడు. ముసలివారి మధ్య ముసలివాడువలె, ధీరుల మధ్య **ధైర్యవంతుడుగాను,** యువకుల మధ్య **యౌవన వృత్తులు కలిగియున్నవానివలెను, దుఃఖితుల మధ్య దుఃఖము పొందినవానివలెను** ఉంటాడు.

స్వాభావికంగానే **ధీరధీః** – ధైర్యముతో కూడిన **ధీశక్తి కలవాడుగాను**, అనుక్షణము ఉదయిస్తున్న (నిత్యోదయ) **ఆనందము కలవాడుగాను, మృదుస్వభావుడుగాను, పుణ్యకార్యములు చేయువాడుగాను,** నిత్యానిత్యవివేకముగల **ప్రాజ్ఞుడుగాను,** ప్రసన్నమైన–**మధురమైన సంభాషిగాను** అయి ఉంటాడు. పైకి దైన్యముగా (తక్కువవాడు అయినట్లు) ఉంటాడు. సర్వ ఆశయములు శమించినవాడై ఉంటాడు. అభ్యాసపూర్వకంగా ఆతని ప్రాణములు శాంతిని ఆశ్రయించినవై ఉంటాయి, వేదనములు లేని ప్రాణములు ధారణచేయువాడై ఉంటాడు. మనస్సు ఆత్మయందు శమించినదై, నిర్వాణస్థితి (కదలని గాలి వంటి స్థితి) ధరించి ఉంటాడు. ఆతని వాక్కు సర్వ క్షుబ్ధ–క్రూర–పరుష వాక్యములు త్యజించి, వికల్పములు లేనిదై, స్వాభావికంగానే మధురంగా ఉంటుంది. సర్వవికల్పములు సంక్షయించినట్టి పదమును ఆశ్రయించి ఉంటాడు. **"ఆద్యంతరహితుడుగు పరమాత్మయే నాకు ఎదురుగా అన్నిమూలలా, అంతటా, సమస్త నామరూపములుగా సర్వదా వేంచేసియున్నారు"** అను ఎరుకతో సమస్తము సందర్శిస్తూ ఉంటాడు. ఇట్టి నిశ్చయజ్ఞానమే **'సమ్యక్‌జ్ఞానము'** – అని విజ్ఞులు ప్రకటిస్తూ ఉన్నారు.

# బంధ-మోక్షములు ఎక్కడివి?

ఈ సృష్టి కల్పనకంటే మునుముందే "ఆత్మ" ఉన్నది। ఈ త్రిలోకములు ఆత్మ యొక్క స్వరూపమే। ఈ జగత్తు సర్వదా పూర్ణమగు ఆత్మస్వరూపమే। **(పూర్ణమదః। పూర్ణమిదమ్)** సమస్తము అఖండమగు ఆత్మయే అయి ఉండగా...,

- 'ఇది నాకు బంధము' అని చూస్తున్నదెవరు?
- భావ అభావములు ఎక్కడివి?
- బంధమెవ్వరికి? మోక్షమెవరికి? కలనము (దోషము) ఎవరిది?

**అవన్నీ ఆయా రీతులుగా బ్రహ్మమే విజృంభిస్తోంది.** సర్వము ఏకమగు పరాకాశమే అయి ఉండగా ఎవరివలన ఎవరికి బంధము? ఎవరి వలన ఎవరికి మోక్షము ప్రసాదించబడగలదు?

| | | |
|---|---|---|
| **బ్రహ్మము** | = | సర్వత్రా వ్యాపించి ఉన్నది – బృహత్ ఇదం। |
| | = | బృహత్ ఆకారమ్। అన్నిటి కన్నా పెద్దది. |

**బ్రహ్మేదం బృంహితాకారం బృహత్ – బృహత్ ఇవ స్థితమ్।** బృహత్ బృంహితాకారమగు బ్రహ్మము బృహత్‌గానే సం-స్థితమైయున్నది. సమస్తము బ్రహ్మమే అయి ఉండగా బ్రహ్మమునకు బంధము కలిగించగలిగేది ఎవ్వరు? బ్రహ్మము అనన్యముకదా!

అందుచేత ఓ నిదాఘా! ఆత్మచేతనే ఆత్మను దర్శించు. సమస్త ద్వైతములను విసర్జించు. కలలో కనిపించే వివిధ వస్తువులకు ఒకదానితో మరొకదానికి ఏమి భేదము నిర్వచించి, నిర్ణయించి చెప్పగలం? అట్లాగే ఇక్కడ కాష్ఠము (కొయ్య), పాషాణమునకు (రాయికి)– పరిశీలించి చూస్తే – **"పరాకాష్ఠ"** దృష్టితో చూస్తే – భేదమేమీలేదు.

సంకల్పించుట చేతనే భేదము కనిపిస్తోంది. అందుచేత **భేదమును సంకల్పించటము మానివేయి.**

"స్వప్నద్రష్ట యొక్క ఊహయే స్వప్నములోని ఏకానేక రూపములుగా కనబడుచున్నట్లు, – ఇక్కడ **పరమశాంతము, అవినాశియగు ఆత్మయే భావనచే అనేక (వేరువేరైన) వస్తు రూపములుగా కనిపిస్తోంది"** – అని గమనించి, ఆత్మనే భావిస్తూ, ఆత్మతోనే తన్మయుడవై ఉండు. అంతేగాని, ఇక్కడ స్వసంకల్పితంగా ఇంద్రియ దృష్టికి కనిపిస్తున్న భేదములతో తన్మయుడవు అనవద్దు. సముద్రంలో ఒకే జలము అసంఖ్యాక తరంగాలుగా ప్రదర్శనమౌతోంది చూచావా? 'అనేక తరంగాలు' అనేది జలమునకు (సాకారంగా చూస్తే) – **వేరు వేరు,** (జలం దృష్ట్యా చూస్తే) **ఏకము** కూడా కదా! అట్లాగే ఏకమగు ఆత్మయందు జరామరణము మొదలైన అనేక భేదాభేదములు, ద్వైతాద్వైతములు–విభ్రమములుగా సంసార దృష్టికి అగుపిస్తున్నాయి. అదంతా కూడా–దర్పణములో ప్రతిబింబిస్తూ, కనిపిస్తూ ఉన్న ఏవేవో వస్తువులవంటిది.

**సర్వభేద దృష్టుల పర్యవసానములగు దుఃఖములకు (For all worries) 'ఆత్మదృష్టి'యే ఉపాయము.**

అందుచేత ఓ నిదాఘా! 'ఆపదలు' అనే ముళ్ళ పొదలకు పరశువు (గొడ్డలి) వంటిది – **"నిర్వృతరూపమగు పరతత్త్వమే!"** శుద్ధమగు అట్టి ఆత్మనే అంతరమున ఉత్తమమగు వివేకముతో (ధియా) ఆలింగనము చేసుకున్నవాడవై ఉండు. అట్టి బుద్ధితో ఎవ్వడు ఆత్మనే ఆశ్రయించిఉంటాడో, అట్టి వానిని ఇక్కడి భోగములు మొదలైనవి బాధించ జాలవు. చిరుగాలులు పర్వతమును తాకుచున్నప్పటికీ, ఆ పర్వతమును కదలించగలవా? ఎవ్వడైతే ఆత్మవిచారణయందు నిమగ్నుడై ఉంటాడో, అట్టివానిని ఇక్కడి భోగములు కొంచము కూడా ఆకర్షించజాలవు. వికర్షించలేవు.

సరస్సులో తరంగాలన్నీ ఏకమగు జలమే అయి ఉన్న తీరుగా, ఇక్కడ – **నానాత్వమస్తి కలనాసు। న వస్తుతో అంతరః నానా విధాసు।** – కల్పన చేతనే నానాత్వము కనిపిస్తోంది. వస్తుతః నానాత్వమనేది లేనే లేదు.

ఈ విధంగా సమ్యక్ అర్థముతో సమవలోకనము (Par-seeing) చేయుపురుషుడు–(భేద దృష్టిని త్యజించిన ద్రష్ట)– సర్వదా విముక్తుడే!

***నీవు సమస్త నానాత్వములనుండి విముక్తుడవై అఖండాత్మ స్వరూపుడుగా విరాజిల్లుము.***

# 3వ అధ్యాయము - విదేహముక్తి

**నిదాఘుడు** : పితృదేవా! ఋభు భగవన్! 'విదేహముక్తి' యొక్క రూపమేమిటి? అట్టి విదేహముక్తి సిద్ధించుకొన్నట్టి ఎవ్వరైనా మహనీయుని గురించి దృష్టాంతంగా చెప్ప ప్రార్థన. అట్టి పరమపదమును ఆ మహనీయుడు ఏ యోగము అభ్యసించి సముపార్జించుకున్నారు?

**శ్రీ నిదాఘమహర్షి** : ఒక మహనీయుని గురించి 'విదేహముక్తి'కి దృష్టాంతంగా చెప్పుకుందాము.

సుమేరు పర్వతముపైగల ఒకానొక భూపీఠముపై **'మాండవ్యుడు'** అనే మహాముని నివసిస్తూ, యోగ – ధ్యాన – తపస్సులు నిర్వర్తిస్తూ ఉండేవారు. వారు తమ సద్గురువులగు కౌండిన్యమునీంద్రుల వారి వద్ద 'తత్త్వము'ను శ్రవణం చేసి జీవితము నాకు బంధము కాదు" అను రూపముగా – జీవన్ముక్తులు అయ్యారు. ఆయన ఆ విధంగా జీవన్ముక్తి దశ ప్రాప్తించుకొన్న తరువాత, ఒక సమయంలో "బ్రహ్మవిత్ – తమము" అను శాస్త్ర ప్రవచితమైన విదేహముక్తి స్థితి సిద్ధించుకోదలచారు. **"మనఃచక్రమును నిశ్చలము చేసి నిలిపి ఉంచటానికై సర్వేంద్రియములను ఉపసంహరించుకొనెదను గాక!"** – అని నిర్ణయించుకొని, అందుకు ఉపక్రమించసాగారు (started the process).

పద్మాసనమును ధరించారు. కనులు సగము మూసుకొని, ఇక బాహ్యా – అభ్యంతరములలో (Outside and Inside) ఇంద్రియ విషయములనుండి (శబ్ద–స్పర్శ–రూప–రస–గంధ అనుభవములనుండి) మెల్లగా ధ్యాసను వెనుకకు (మనస్సులోనికి) మరల్చ ప్రారంభించారు.

ఇక మనస్సును నిరోధించటానికి సిద్ధపడ్డారు. **నిర్మలమైన మనస్సుతో** చంచలమనస్సు యొక్క **చాంచల్యమును** నిరోధించటానికి యత్నశీలులైనారు. అప్పుడు – **మనస్సుయొక్క చాంచల్యమును గమనించసాగారు.**

**అహో ను! చంచలమ్ ఇదమ్। ప్రత్యాహృతమపి స్ఫుటమ్ ।**
**పటాత్ – ఘటమ్ ఉపాయాతి, ఘటాత్ – శకటమ్ ఉత్కటమ్॥**

ఆహాఁ! ఏమి ఈ మనస్సుయొక్క చాంచల్యము! ఇది ఆపినా ఆగకుండా పటము (వస్త్రము) నుండి ఘటము (కుండ) వరకు, కుండ నుండి బండి (శకటము) వరకు, – ఆపినా ఆగకుండా పరుగులు తీస్తునే ఉన్నదే! నేను దీని పరుగులు ఆపలేకపోతున్నానే! **చిత్తమ్, అర్థేషు చరతి పాదపేషు ఇవ మర్కటః॥** కోతి ఒక కొమ్మనుండి ఇంకొక కొమ్మపైకి దుముకుతూనే ఉంటున్న తీరుగా, ఈ చిత్తము అసంఖ్యాక విషయములపై వ్రాలుచూనే ఉన్నదే।

ఓ "చెవులు–చర్మము–కనులు–నోరు–ముక్కు" అనబడు పంచేంద్రియ ద్వారములారా! ఓ మనస్సా! బుద్ధీంద్రియమా! మీమీ వ్యసనపూర్వక, సంచారములను ఇప్పుడు అంతా గమనిస్తున్నాను. ఇక చాలు। ఓ హత (పాడు) ఇంద్రియగణములారా! **యూయం త్యజత ఆకులతాం శనైః॥** ఇక మీరు నెమ్మదిగా మీ ఆకులతలు (ఆదుర్దాతో కూడిన బహిర్–సంచారములు) ఆపండి. సకలేంద్రియములారా! సద్దు చేయవద్దు. ఇప్పుడు నేను **సర్వసాక్షి** అగు **చిదాత్మభగవానుని స్థితిని** ఉపాసిస్తూ, సుస్థిరం చేసుకుంటున్నాను.

అట్టి చిదాత్మ భగవానుని స్వస్వరూపముగా ధారణ చేస్తున్న ప్రయత్నములో – నాకు ఒక క్రొత్త విషయం తెలియవస్తోంది. కళ్ళు మొదలైన ఇంద్రియములకు విషయముల (దృశ్యము) రూపముగా తారసబడుచున్నదంతా అనేకములుగా కనిపిస్తూ కూడా – వాస్తవానికి **ఏకమే। ఏకమగు ఆత్మస్వరూపమే।** సత్యము, నిజము అగు ఆత్మ సర్వత్రా వేంచేసి ఉండి కూడా, 'ఇంద్రియదృష్టి' అనే అజ్ఞానపూర్వక దర్శనముచే 'అది వేరు – ఇది వేరు' అను రూపంగా మనస్సుచే అనుభవము పొందబడుతోంది. ఇప్పుడు ఇక మనోదృష్టి దోషములను తొలగించుకొని, ఆత్మదృష్టిని ఏకాగ్రం చేసుకోవటానికి సిద్ధపడుచున్నాను. గురు–శాస్త్ర ప్రవచనములన్నీ నా కళ్ళకు కప్పిన పొరలను తొలగిస్తున్నాయి. నిశ్చలవాయువువలె పరినిర్వాణుడను (చంచల రహితుడను) అగుచున్నాను. మనో దోషములు తొలగి విగతజ్వరుడను. జాగ్రత్ – స్వప్న– సుషుప్తులను 'తనవి'గా కల్పించుకొని ఆ మూడు ప్రదేశములలో విహరిస్తున్న 4వదగు – 'తుర్యక్ పదము'ను అవధరిస్తున్నాను. "సర్వాంతర్యామి, సర్వతత్త్వస్వరూపి' – అగు స్వాత్మ (My own Al-Pervading and Al-Present SELF) యందు అవతిష్ఠుడను అగుచున్నాను. 'అన్యము' అనబడు కల్పితమైన (visualized and created) సమస్తమును స్వకీయ కల్పనా వినోదంగా చూస్తూ ఆనందిస్తున్నాను.

కౌండిన్య మహాముని ప్రియశిష్యుడగు మాండవ్య మహర్షి ఆ విధంగా మనస్సును సముదాయించారు. ఆత్మయందు ఆత్మగా 'అహమ్-త్వమ్'తో సహా సమస్తమును చిద్విలాసంగా దర్శించటము అభ్యాసము చేయసాగారు. క్రమేణా ప్రాణచాంచల్యము, అద్దాని ప్రదర్శనారూపములగు ప్రియాప్రియభావముల రూపంతో కలిగే చాంచల్య స్వభావమును త్యజించసాగారు. ఆతని అంతరమున పంచప్రాణములు శాంత స్వభావముగా సంతరించుకోసాగాయి. **అంతరేవ శశామాస్య (సశామ్యస్య) క్రమేణ ప్రాణసంతతిః।** ఇంధనము (కట్టెలు) తగలబడటం పూర్తి అయిపోతూ ఉండగా అగ్నిజ్వాలలు క్రమంగా శమిస్తున్నట్లుగా, సూర్యుడు అస్తమిస్తూ ఉండగా వేసవి వేసటలు చల్లబడుచున్నతీరుగా, సూర్యుడు ఉదయిస్తూ ఉండగా చీకట్లు తొలగిపోవు విధంగా-**ఆతని సాంసారిక భేదభావావేశములు శమించసాగాయి.**

"ఈ సమస్తము నందు నేను - ఈ సమస్తము నాయందే" అను దర్శనముతో కూడిన ఆత్మానుభవము స్వాభావికం కాసాగింది.

**"ఆహాఁ! సమః సమరసాభాసః తిష్ఠామి స్వచ్ఛతాం గతః। - రసాభాస అంతా గతించిపోతూ ఉండగా సర్వత్ర సమత్వభావనయందు తిష్ఠితుడను అగుచు, శాంతమగు ఆత్మస్వరూపము దర్శించుచున్నాను. అట్టి శాంతామగు 'ఆత్మ' అనగా నేనే।"**-అని గానం చేయసాగారు. ఇంకా ఇట్లా అనుకోసాగారు.

## మండవ్య - ఆత్మ సంగీత గానము

**ప్రబుద్ధోఽపి సుషుప్తిస్థః** - (జాగ్రత్‌లో) మెలకువగా ఉండియే గాఢనిద్రయందు సంస్థితుడనై కాష్ఠమౌనంగా జాగ్రత్‌ను దర్శిస్తున్నాను.

**సుషుప్తిస్థః ప్రబుద్ధవాన్।**-నిద్రలో ఉన్నప్పుడు కూడా ప్రబుద్ధుడనైయున్న నన్ను నేను గమనిస్తున్నాను. ఈ విషయముల మధ్యగా ఉండి కూడా, విషయములేవీ కించిత్ కూడా లేనివాడవై ఉంటున్నాను. గాఢ నిద్రలో ఉన్నప్పుడు కూడా నన్ను నేను విడవటము లేదు.

**'తుర్యగ'** (4వది) అగు (జాగ్రత్ స్వప్న సుషుప్తులకు ఆవల ఉన్న) అవస్థను అవలంబించి, సర్వ మనోచాంచల్యములను వదలి' స్తంభితస్థితిని అవధరించుచున్నాను. **నాయొక్క 'స్వకీయ' సంకల్పములచేతనే** (By Virtue of my own Assumptions and presumptions) నిర్మితమైనట్టి (made up of) - **స్థూలసూక్ష్మభావ రూప (స్వర్గ మర్త్య పాతాళ) త్రిలోకములు మొదలైనవన్నీ - కల్పించబడుచున్నాయి** - అను సందర్శనము కలిగి ఉంటున్నాను.

ఈ విధంగా సమస్తమును తనయందు తానే తనచేత తన వినోదంగా తానే కల్పించుకుంటున్నట్లు దర్శించసాగారు.

ఒక పక్షి "ఉఫ్" అని గాలి వదలుచున్నది చూచారా! ఆ విధంగా ఆ మహనీయుడగు మాండవ్యముని ప్రణవముతో కూడిన **దీర్ఘనిస్వనముతో** (చాలాసేపు **గాలిని వదలుచు**) - శబ్ద స్పర్శరూప రసగంధములనే తన్మాత్రలను బయటకు వదలసాగారు. గాలితోబాటు శబ్ద స్పర్శ మొదలైనవి కూడా వదలి, దాటివేస్తున్న భావనను అభ్యాసము చేయసాగారు. క్రమంగా ఆయన అంగభావములన్నీ స్వచ్ఛత పొందగా, ఇక **"ఇప్పుడే పుట్టిన పసిబిడ్డ"** వలె కేవలమగు జ్ఞానస్థితిని (తెలుసుకుంటున్నవన్నీ త్యజిస్తున్న తెలివిని) స్వాభావికానుభవంగా పొందసాగారు. అనగా

| | |
|---|---|
| ***చూపు (శక్తి) ఉన్నది*** | - కానీ, ఇతఃపూర్వము చూచిన వస్తువుల ఆకార సంస్కారములు సమసిపోసాగాయి. |
| ***వినికిడి (శక్తి) ఉన్నది*** | - కానీ, ఇంతకుముందు విన్న ప్రాపంచక శబ్దములన్నీ 'లేనివి' అవసాగాయి. |
| **రుచి ఉన్నది** | - కానీ, ఆయా పదార్థముల రుచి - జ్ఞాపకములు తొలగిపోసాగాయి. |
| **స్పర్శ ఉన్నది** | - కానీ, స్పర్శకు సంబంధించిన ఇతఃపూర్వపు అనుభూతులు రహితమైపోసాగాయి. |
| **వాసన ఉన్నది** | - వాసన సంస్కారములు లేనివే అవసాగాయి. ఇవన్నీ తన సహజ కళలుగా దర్శిస్తూ, సందర్భవిశేషాలన్నీ పరిగణలో లేని స్థితిని నిశ్చలం చేసుకోసాగారు. |

గాలి వీచటం మాని నిశ్చలమై ఉన్న తీరుగా ఆతని చిత్తము చైత్యము (అన్యమగు లోక-ఇంద్రియ విషములను) త్యజించి **కేవల స్పందన శక్తిని** మాత్రమే అవధరించినదయ్యింది. సుగంధ పుష్ప సువాసనలతో నిండుగా ఉండే వాయువువలె ఈ దృశ్య-ఇంద్రియ వ్యవహారములు తనయందు కలిగి ఉండి కూడా, వాటికి వేరుగా ఉండసాగారు. జగత్‌దృశ్యము పట్ల గాఢనిద్రలో ఉన్నవానివలె సత్తా సామాన్యము (Al-present throughout all that being seen-including all beings) అవధరించి 'చిత్‌సత్త' యందు ప్రశాంతులైనారు.

జాగ్రత్ - స్వప్న - సుషుప్తుల సాక్షిస్థానమును ధారణచేస్తూ, - సుషుప్తి మౌన రూపమైన ఆత్మ స్థైర్యము ఆత్మ ఏకాంతమును, ఆత్మానందమును అవధరించారు.

ఇప్పుడు ఆయన....

- ✠ ఆనందమునకు కూడా ఆవలివాడై ఉండి కూడా సానందుడై, ఆనందాతీతుడై కూడా ప్రకాశించుచున్నారు. తానే ఆత్మానందరూపుడు. తనకు ఆనందమెందుకు?
- ✠ ఆయన సత్, అసత్ రూపుడు కూడా. ఉనికియే ఆయన స్వరూపమై యుండగా, జాగ్రత్తులోని ఒక వస్తువు యొక్క ఉనికి లేములకు పరిమితుడెట్లా అవుతాడు? తానే సమస్తముయొక్క 'సత్త'గా రూపుదాల్చువాడయ్యారు.
- ✠ ఆయన యొక్క సంభవము తత్త్వశాస్త్ర ప్రాజ్ఞులకు కూడా వర్ణనాతీతము. **తత్ సంబభూవ అసౌ యత్ గిరామపి అగోచరః।**

- ☙ శూన్యవాదుల దృష్టిలో → అది **"శూన్యము"।**
- ☙ బ్రహ్మవాదుల వాఙ్మయములో → అది **'బ్రహ్మము'।**
- ☙ విజ్ఞానవాదుల ప్రవచనములలో → అది **'విజ్ఞానస్వరూపము'।**
- ☙ సాంఖ్యవాదుల సిద్ధాంతానుసారము → అది **'పురుషుడు'।**
- ☙ యోగవాదుల భాష్యమువనుసరించి → అదియే **'ఈశ్వరుడు'**
- ☙ శైవాగమముల బోధ ప్రకారం → అది **'శివస్థానము'**
- ☙ కాలైకవాదుల ప్రకారము → అదియే **'కాలము'**

- ☙ భక్తులకు ఇష్టదైవము ఆయనయే।
- ☙ జ్ఞానులు ఆత్మగా నిర్వచించేది ఆయననే।
- ☙ యోగుల అఖండాత్మతో ఏకత్వము-ఆయనతో ఏకత్వమే।
- ☙ వేదాంతవాదుల "తెలియబడేదానికి ఆవల-తెలుసుకుంటూ ఉన్నవాడు"-ఆ తురీయాతీత స్వరూపమే।
- ☙ అది జీవునియొక్క స్వాభావిక కేవల స్వరూప సంబంధమైనది కాబట్టి - **"కైవల్యస్థానము".**

- ఏదైతే "తత్త్వమ్-సోఽహమ్-త్వమేవాఽహమ్" - మొదలైన సర్వ సిద్ధాంతముల సారమైయున్నదో...,
- ఏది సర్వుల హృదయములో సర్వదా సమానముగా ప్రకాశమానమై యున్నదో...,
- సమస్త వస్తువుల వాస్త తత్త్వము ఏమైయున్నదో - **అట్టి కేవలీతత్త్వము తానై ప్రకాశించసాగాడు.**

**యత్ ఏకంచాపి అనేకం చ।** (ఒకే బంగారము - అనేక బంగారు ఆభరణములులాగా, ఒకే జలము - అనేక తరంగములవలె) - ఏదైతే 'ఏకమే' అయి కూడా, అనేకముగా కూడా అయి ఉన్నదో..., (ఏకోసత్ విప్రాబహుధా),

**సాంజనం చ విరంజనం।** అనేక జీవాత్మలుగా ఉన్నప్పటికీ ఏకస్వరూపుడే అయి ఉన్నారో, అన్యమంతా తానే అయి కూడా అనన్యుడు కూడానో, దోషములన్నీ తనకే ఆపాదితము న్యాయమే అయి ఉండి కూడా సర్వదా దోషరహితుడో....,

**యత్ సర్వంచాపి అసర్వంచ ।** (రచయిత-ఆయన వ్రాసిన నవలవలె) సర్వము తానే అయినప్పటికీ...అదేదీ ఆయన కాదో....,

**యత్ తత్త్వం తత్ అసౌ స్థితః।** అట్టి ఏ తత్త్వమో, (ఆత్మతత్తమో, బ్రహ్మతత్త్వమో) - అది ఆ మాండవ్యుడు 'తానే' అయినారు. 'ఈశ్వరుడు' అనబడునది తానే అయినారు.

- జన్మరహితము (అజరమ్)। మరణ రహితము (అమరమ్)।
- మొదలే లేనట్టిది (అనాద్యమ్)। సమస్తమునకు ప్రారంభముతోనే అయినట్టిది (ఆద్యమ్)।
- ఏకపదమైనట్టిది। అనేకముగా కనబడునది కూడా।
- దోష రహితమైనది (అమలగ్ం) దోషములన్నీ ఆపాదించబడుచున్నట్టిది కూడా!
- సమస్తము తన కళాస్వరూపమే అయి ఉన్నట్టిది (సకళమ్)। ఎట్టి కళలు లేనట్టిది (నిష్కళము)। జగత్కళాసహితము (సకళమ్) జాగత్కళారహితము (నిష్కళమ్)।

**అనునదంతా తానే అయి ఉన్నట్లు, గుర్తించసాగారు!**

ఆకాశం కంటే కూడా అత్యం నిర్మలుడైనాడు. పాత్రయొక్క గుణములు పాత్రధారునికి అంటని తీరుగా "ఈశ్వరుడు" అని వేదవాఙ్మయముచే చెప్పబడు స్వరూపుడైనాడు।

***ఆ మాండవ్యుని విదేహముక్త్యనుభవము అనిర్వచనీయము. మాటలకు అందని అనుభవైక వేద్యము.***

# 4వ అధ్యాయము...జీవన్ముక్తుడు - కిం లక్షణమ్?

**నిదాఘుడు** : మునిశార్దూలా! ఋభుమహర్షీ! జీవన్ముక్తస్య కిం లక్ష్యహి 'ఆకాశగమనాదికమ్'? జీవన్ముక్తునికి లక్షణములు ఏ ప్రత్యేకత కలిగి ఉంటాయి? 'ఆకాశగమనము' మొదలై ఆయా సిద్ధులు ఆయన కలిగి ఉంటారా? ఒకవేళ ఆవిధంగా జీవన్ముక్తులు సిద్ధులు కలిగి ఉంటారనుకొంటే, అప్పుడు "జీవన్ముక్తులు కావాలంటే ముందుగా సిద్ధులు సాధించుకోవాలి।" – అనే సూత్రము శాస్త్రములు ఎక్కడా చెప్పటం లేదనుకుంటున్నాను. జీవన్ముక్తులలో అష్టసిద్ధులు తప్పక ఉంటాయని అనుకోవచ్చా? జీవన్ముక్తి కొరకై అష్టసిద్ధుల ఆవస్యకత ఏమైనా ఉన్నదా? (**అష్టసిద్ధులు:** అరిమ, గరిమ, లఘిమ, మహిమ, ఈశత్వ, వశిత్వ, ప్రాకామ్య, ఇచ్ఛా) –

**ఋభుమహర్షి** : ఓ ద్విజుడా! నిదాఘా! **నీవు చెప్పే అష్ట సిద్ధులు సిద్ధించుకోవటమునకు, – జీవన్ముక్తత్వమునకు సంబంధమే లేదు.** ఒకానొకడు జీవన్ముక్తుడు కాకపోయినప్పటికీ కూడా, **"ఆకాశవిహరణము"** మొదలైన సిద్ధులు కొన్ని ద్రవ్యముల సముపార్జన (Permitations and combinations of certain materials from nature) చేతను, సిద్ధులు లభించాలనే ఆశయముతో ఆశ్రయించే మంత్రోపాసనల చేతను, ప్రాణ కుంభకము మొదలైన ఆయా క్రియలచేతను, కొన్ని సందర్భములలో కాలమహిమ చేతను, భౌతికమైన శారీరక సాధనలు – శక్తి వృద్ధి చేసుకోవటం చేతను కూడా లభిస్తూ ఉంటాయి.

**న ఆత్మజ్ఞస్య ఏష విషయ। ఆత్మజ్ఞా హి ఆత్మమాత్ర దృక్।** ఆత్మజ్ఞుల దృష్టిలో అష్టసిద్ధులు కూడా ఆత్మజ్ఞానసంబంధమైన విషయములే కాదు. **ఆత్మజ్ఞానమే ఆత్మజ్ఞుల దృష్టిలో 'విషయము'**. ఆత్మయందు ఆత్మదర్శనమచేత మాత్రమే అజ్ఞానము తొలగుతుంది. ఆత్మచే ఆత్మ సంతృప్తి పొందినవాడు మాత్రమే అవిద్యను త్యజించగలడు. **ఆత్మన్ ఆత్మని సంతృప్తో న – అవిద్యామ్ అనుధావతి!** ఎవ్వడైతే ఆత్మయందు ఆత్మను ఎరిగి ఆత్మానందము అభ్యసిస్తూ ఉంటాడో (లేక, ఆశ్రయిస్తూ ఉంటాడో) – అట్టివాడు అవిద్యావిషయముల కొరకై పరుగులు తీయడు.

ఓ నిదాఘా! ఏఏ భావపరంపరలు లోకమునకు (దృశ్య ప్రపంచమునకు) పరిమితమై ఉంటాయో అవియే **"సంసారము". "దృశ్యములో ఇప్పటివరకు ఏమి పొందాను? ఇంకా ఏమేమి పొందవలసియున్నది"** – ఇటువంటి గ్రాహ్య-త్యాజ్య వ్యవహారములచే ధ్యాసలు పరిమితమై ఉంటాయో – అట్టిదంతా అవిద్యయేగాని, మరింకేమీ కాదు. జీవన్ముక్తుడు మహాయోగి అయి ఈ దృశ్య వ్యవహారమంతా మొదలంట్లా త్యజించి ఉంటాడు. అట్టివాడు "దృశ్య సంబంధమైనవి మాత్రమే" అయినట్టి అష్టసిద్ధుల వ్యవహారాలలో ఎట్లా నిమజ్జనం (sinking) పొందుతాడు? పొందడు.

"నాకు సిద్ధులు ఎట్లాగైనా కావాలి!"– అని ఎవరు కోరుకుంటారో, అట్టివారు ఇక యోగశాస్త్రానుసారంగా యోగాభ్యాసానికి ఉపక్రమిస్తే, క్రమమైన ప్రయత్నముచే సరి అయిన సమయంలో అష్టాంగయోగములలోని కొన్ని గాని, అన్నీగాని తప్పక పొందగలరు. అయితే అట్టి ఆశయమే జీవితపరమావధిగాను, మహాదాశయముగాను భావించి 'జీవితము' అనే అవకాశమును (కాలము, శక్తి – యుక్తులను) ఉపయోగించువాడు – **'అల్పాశయుడు, మూఢుడు, అల్పబుద్ధికలవాడు' అని చెప్పబడుచున్నాడు.**

ద్రవ్య-మంత్ర-కాలయుక్తంగా అవి లభించినాసరే, అవన్నీ కూడా 'పరమాత్మపదప్రాప్తి'కి ఏమాత్రము పనికివచ్చేవి కావు. **ద్రవ్య మంత్ర క్రియా కాల యుక్తయః సాధు సిద్ధిదాః, పరమాత్మ పద ప్రాప్తౌ నోపకుర్వంతి కాశ్చన।** ఎందుకంటే, ఎవడికి అష్టసిద్ధుల పట్ల ఇచ్ఛ ఉంటుందో, అట్టివాడు మాత్రమే వాటికై ప్రయత్నిస్తాడు.

**శ్లో॥ నిరిచ్ఛేః పరిపూర్ణస్య నేచ్ఛా సంభవతి క్వచిత్।**
**సర్వేచ్ఛా జాల సంశాంతావ ఆత్మలాభో భవేత్ మునే!**

సర్వఇచ్ఛాజాలములు (The fisher - Nets of Desires and Expectations) సశాంతించినప్పుడే 'ఆత్మతత్త్వానుభవము' లభించగలదు. నిరిచ్ఛ(Desirelessness)చే పరిపూర్ణుడైతేనే జీవన్ముక్తుడు. అట్టి జీవన్ముక్తునికి "నాకు మానవాతీత శక్తులు కావాలి" అనే కోరిక శేషించి ఉంటుందా? ఉండదు. ఒకవేళ ఉంటే, ఆతడు జీవన్ముక్తుడు కాలేడు.

ఓ నిదాఘా! దృశ్యజగత్తులో "సంపదలు, గౌరవాలు, గుర్తింపులు పొందాలి। కొన్ని సిద్ధులుపొంది అధికారములు చెలాయించాలి" – మొదలైన ఇచ్ఛలు, ఆశయములు కలిగి ఉండటానికి కారణము చిత్తమే। జీవన్ముక్తుని విషయంలో – ఆయన చిత్తమును జయించివేసి ఉంటారు. అనగా చిత్తమాలిన్యములు తొలగించుకొని, **'చిత్తమును అచిత్తముగా చేయటము'** అనబడు ఆత్మస్థితిని సంతరించుకొని ఉంటారు. **స కథం చిత్తజాలాని కథం వాంఛతి అచిత్తకః?** చిత్తమే చిత్స్వరూపమై ప్రకాశించు జీవన్ముక్తునికి – చిత్తజాలములైనట్టి అధికారము, ఇతరులపై పెత్తనము, ఇతరులకంటే అధికమైన స్థితులవంటి భౌతిక సిద్ధులు మొదలైనవాటిపై వాంఛ ఎట్లా ఉంటుంది? ఉండదు.

జీవన్ముక్తుని స్థితి ఎట్టిదంటే,... స్వప్న దృశ్యమువలె, ఊహాసౌధమువలె, ఈ జగత్తు ఏవిధంగా మొదలే కల్పితమో – సుస్పష్టంగా, నిర్దుష్టంగా కరతలామలకం అయి ఉంటున్నట్టిది. అందుచేత –

**"ఏమండోయ్! సూర్యుడు ఈరోజు ఆకాశంలో మంచుగడ్డలాగా చల్లబడిపోతారు చూడండి!"**అని చెప్పినా,

**"అయ్యా! రేపు పున్నమిచంద్రుడు ఈ అర్ధరాత్రి వేడిమిసెగలు గ్రక్కబోవుచున్నారు, తెలుసా?"** అని చెప్పినా కూడా – ఆతడు ఆశ్చర్యపడడు. దృష్టిని సారించడు కూడా!

**(దృష్టాంతంగా :** "మిత్రమా! నాకు కలలో కోటి రూపాయలు ఒక్కసారి ఇంటికివచ్చి బడ్డాయి!" అని ఎవ్వరైనా చెప్పితే, "అయ్యా! అందులో రెండు వేలు నాకు అప్పుగా ఇప్పించరూ?" – అని అడుగుతామా?)

అయినా ఈ దృశ్యము ఎటువంటిది? **అధిష్ఠానే పరే తత్త్వే కల్పితా రజ్జు సర్పవత్, కల్పిత ఆశ్చర్య జాలేషు న అభ్యుదేతి కుతూహలమ్।** ఒకడు త్రాడును చూచి 'పాము' అని భ్రమించి భయము–ఉద్వేగము–ఆవేశముతో చిందులువేయటము ఎటువంటిదో, – అధిష్ఠానమగు ఆత్మపై 'జగద్దృశ్యము' అనే ఆపాదన (Attribution) (లేక) కల్పన చేసి – "ఇందులో అది పొందాను। ఇంకా ఇది పొందాలి।" – అని అనుకోవటము అటువంటిది.

# సమదృష్టి

బిడ్డా! నిదాఘా।

**విజ్ఞాతవిజ్ఞేయుడై :** తెలుసుకోవలసిన ఆత్మగురించి తెలుసుకొన్నవాడై....,

**వీతరాగా :** దృశ్యకల్పనలో తారసబడుచున్న సమస్త రాగములు – ద్వేషములు (కథలోని సంఘటనలవలె) మొదలంట్లా త్యజించినవాడై,

**మహాధియః :** మహత్ ఆశయము, సూక్ష్మదృష్టిగల బుద్ధితో, ధీశక్తి కలవాడై,

**విచ్ఛిన్న గ్రంథ యః సర్వే :** ఈ దృశ్యమునకు సంబంధించిన **"జనించింది। ఉన్నది తొలగాలి।"** అను రక్తి రూపమగు (బ్రహ్మ–విష్ణు–రుద్ర) గ్రంథులన్నిటినీ త్రెంచి వేసుకొని, సర్వస్వతంత్రుడై.... **జీవన్ముక్తుడు అంతరమున పూర్ణ–సంప్రకాశమానుడై** ఉంటున్నాడు. అట్టి ధీరునకు సుఖ–దుఃఖ, సామాన్య–అసమాన్య దశలను **"సమదృష్టి"**తో చూడగలడు. ఉచ్ఛ్వాస–నిశ్వాసలు లేని కొండలాగా ఆతనిపట్ల చిత్తము మరణించినదై, చంచలము లేనిదై ఉంటుంది.

ఎవరిపట్ల అయితే – **ఆపత్తు, కార్పణ్యము** (జాలితో ఏర్పడే దీనత్వము), 'ఏదోచేయాలి–పొందాలి' అనే **ఉత్సాహము, గర్వము** రూపమగు **'మదము', మాంద్యము** (బద్ధకము), ఆయా సందర్భ–అసందర్భములపట్ల **నిరుత్సాహముగానీ, మహోత్సాహముగానీ** – ఉండవో, **యత్ నయంతి న వై రూప్యం తస్య నష్టం మనో విదుః।** ఆతనిపట్ల 'మనస్సు' అనే త్రాచుపాము చచ్చిపడినట్లే.

– ఎవరికి వైరూప్యము, రూపముల మార్పు ఉండవో **అట్టివాడు జీవన్ముక్తుడు**. గుణములు, స్వభావములు, సంగతులు మొదలైనవాటిని చూస్తూ, అమృతమగు ఆత్మనే అందరిలో గమనిస్తూఉండటంచేత రూప–అరూపముల మార్పు–చేర్పులు జీవన్ముక్తుని భ్రమింపజేయలేవు.

# చిత్తనాశనము

చిత్తనాశనము రెండు తీరులైనవి

**(1) సరూప చిత్తనాశనము** – ఇది జీవన్ముల లక్షణమై ఉంటుంది. వీరు ఈ జగత్తుగా కనిపిస్తున్నదంతా ఆత్మతో అనుసంధానము చేసుకొంటూ ఉంటారు.

**(2) అరూపచిత్తనాశనము** : ఇది విదేహముక్తుల స్వభావము. వీరి దృష్టిలో దృశ్యము–మొదలే లేదు. అఖండమగు ఆత్మమాత్రమే సర్వే – సర్వత్ర సర్వదా ఉన్నది. 'జగత్తు' అనబడేదే లేదు. **" 'జగత్తు' అనబడేదంతా ఆత్మ అనే దర్పణంలో ప్రతిబింబించే భావనావైచిత్ర్యము మాత్రమే!** దర్పణముతో వస్తుజాలము ఏమాత్రమూ లేనట్లు, ఆత్మయందు జగత్తు ఎప్పుడూ కూడా లేనిదే. జగత్తు ఆత్మయందూ లేదు. మరింకెక్కడా లేదు. **'దర్పణంలో ముఖము ఉన్నది'** అనే మాట నిజమెట్లా అవుతుంది?" – అను నిశ్చలావగాహన కలిగి ఉంటారు.

**ఓ నిదాఘా!**

**చిత్త సత్త ఇహ దుఃఖాయ** – చిత్తము ఉన్నదా, ఇక్కడ దుఃఖములు అనివార్యము.

**చిత్త నాశః సుఖాయ చ** – చిత్తనాశనము – మహత్ సుఖప్రదము.

అందుచేత చిత్తము యొక్క సత్త (ఉనికి) క్షయింపజేసి, నశింపజేసే అన్ని ఉపాయములకు, ప్రయత్నములకు ఈ జీవుడు ఉపక్రమించాలి

సుమా! సమస్త సాధనలు చిత్తముయొక్క – 'చిత్' యందు – లయము కొరకే। **స్వతఃగా లేనివై, కాలముచే మార్పు–చేర్పులు చెందే (వచ్చి–పోయే) వస్తు–విషయ–సంబంధ–బాంధవ్యములపట్ల ఏర్పడే ఇష్టాద్వేషములే 'చిత్తము'యొక్క రూపము.**

# చిత్తము నశించేది ఎట్లా?

**ఓ అనఘా! నిదాఘా!**

ఈ మనస్సు ఆయా ప్రాపంచక సందర్భములపై, సంఘటనలపై వ్రాలుచూ ఉన్నప్పుడు, **"ఇదంతా సత్యమే। నిజమే। నిత్యమే।"** అను రూపంగా మూఢత్వము వహించి ఉంటోంది. అట్టి మూఢత్వము కారణంగా అరిషట్వర్గము (కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య వర్గములు) జయింపరానివై ఉంటున్నాయి. ఎప్పుడైతే మనస్సు అటువంటి మూఢత్వము వీడుతూ వస్తుందో, అప్పుడిక చిత్తము **"చిత్స్వరూపము"**ను సంతరించుకోసాగుతుంది.

## సదేహముక్తుడు

ఆతనియందు మైత్రి, ఆప్యాయత, మధురభావములు, నిగర్వము, లోక శ్రేయోభిలాష మొదలైన ఉత్తమ వాసనలు స్వాభావికమవసాగుతాయి. ఆతడు పునర్జన్మకారణములన్నీ నశింపజేసుకుంటూ **'జీవన్ముక్తుడు'** అవుతాడు. అట్టివాడు **'తత్స్వరూపుడు'** అని కూడా పిలువబడుతూ ఉంటాడు. **సాత్త్విక వృత్తులచే దుర్వృత్తులు తొలగిపోగా** ఏర్పడుచున్న చిత్త – నాశనము సిద్ధించుకున్నవాడు **"సరూప – జీవన్ముక్తుడు"** అగుచున్నాడు.

## విదేహముక్తుడు

విదేహముక్తుని యందు సత్త్వగుణంతోసహా త్రిగుణములన్నీ లయించగా, ఆతడు **గుణాతీత స్థితి** కలిగి ఉంటున్నాడు. చిత్తము నశించగా, ఆతనికి ఇక్కడ ఆత్మ తప్పితే మరింకేమీ ఎక్కడా ఉండదు. గుణములు ఉండవు. అగుణములు ఉండవు. సంపద ఉండదు. ఆపద ఉండదు. **న శ్రీః। న అశ్రీః। న చ ఏకతా।** ఆతని దృష్టిలో జగత్తే లేనప్పుడు సంపద ఏమున్నది? ఆపద ఏదై ఉన్నది?

**విదేహ ముక్తుని దృష్టిలో** – 'ఉనికి' ఉండదు, 'లేమి' ఉండదు. ఏకత్వము లేదు. ద్విత్వము లేదు. జగత్తుయొక్క ఉదయము లేదు. అస్తమయము లేదు. తేజస్సు లేదు. చీకటి లేదు. సంధ్య లేదు. దినము (Day Time) లేదు. రాత్రి (Night Time) ఉండదు. **న సత్తా। న చ అపి అసత్తా। న చ మధ్యగ్ం హి తత్పదమ్।** విదేహముక్తుని తత్ పదము – సత్తా (Presence, ఉనికి) కాదు. అసత్త (Non-Presence, లేమి) కాదు. ఉనికి–లేముల మధ్యగా ఉండీ – లేని మధ్యస్థితి కూడా కాదు. అది సంసారాడంబరమంతా కూడా జయించి వేసినట్టి స్థితి. ఆకాశము, వాయువుల లక్షణమువలె **సువిశాలమై, సర్వత్రా వ్యాపించి, అంతటా ఉనికిని కలిగియుండి, సమస్తమునకు సాక్షిగా కూడా** అయి ఉన్నట్టిది.

- దుఃఖములన్నీ (All the worries) సశాంతించిన స్థితి.
- అది జడస్థితి కాదు. అజడాత్మకమైనట్టిది. (చైతన్య కేవలీ రూపము).
- సమస్త శబ్దజాలము తనదే అయి ఉండియే, సుప్తము (Thick silence) అయినట్టిది.
- అవ్యాజమగు స్వయమానంద స్వరూపమైనట్టిది. (Independent of worldly affairs).
- రజో తమో గుణములు నిశ్శబ్దము వహించిన స్థితి.
- ఆకాశకోశము (The Recess of space) తన శరీరముగా (తనువుగా) కలిగి ఉన్నట్టిది.
- ఆద్యంతములు లేనిదై – మహాంతము అయినట్టిది.

**తస్మిన్ పదే గళిత చిత్తలవా భవంతి।** అట్టి విదేహముక్తుని పదములో 'చిత్తము' అని చెప్పుకోబడుదానికి లవలేశముకూడా స్థానము దొరకదు. లవలేశమంత చిత్తము కూడా గళితము (నశించిపోయినది) అగుచున్నది.

✠

అందుచేత, హే నిదాఘా! మహాప్రాజ్ఞా! **నిర్వాసన మనా భవ।** మనస్సును నిర్వాసనము చేసివేయి. విషయములు ధ్యానిస్తూ – జగద్దృశ్యమును, జగద్విశేషములను, సహజీవులను – చూస్తున్న ఈ మనస్సులో **"ఆత్మనే ధ్యానిస్తూ, ఆత్మగానే అవన్నీ చూడటమునందు అలవాటు చేయటమే" – మనస్సును నిర్వాసనము** (Sans Tendencies) చేయటము సుమా! **బలాత్ చేతః సమాధాయ నిర్వికల్పమనా భవ।** ఈ చిత్తమును నయాన భయాన కూడా–బలవంతంగా సమాధానపరచి **"ఆలోచనలకు కూడా సాక్షిత్వము వహించు స్థితి"** – అనబడు **"నిర్వికల్పమనస్కుడవు"** – అగుము. మనస్సుతో ఆత్మనే మననము చేయి. ఆత్మకు అన్యముగా ఎక్కడెక్కడ ఏది. కనిపిస్తూ ఉన్నా, అదంతా **"ఆత్మకు అన్యము కాదు"** – అని **అనిపించేవరకు మనస్సుతో అనుకుంటూ ఉండు.**

## ఏకం బ్రహ్మోహమస్మి। ఏకమగు బ్రహ్మమే నేను।

- ✠ **యత్ జగత్ భాసకమ్।** ఏదైతే ఈ సమస్త జగద్దృశ్యము ప్రకాశింపజేస్తోందో (That which is enlightening all this being known)..,
- ✠ **యత్ జగత్ భావమ్।** ఈ జగత్తంతా ఎద్దానికి భావముమాత్రమే (Idea) అయి ఉన్నదో ...,
- ✠ **నిత్యం భాతి స్వయం స్ఫురత్।** ఏదైతే తనకు తానై ఈ సమస్త జగత్తు రూపమై స్వయముగా స్ఫురిస్తోందో...,

  – అదియే ఈ జగత్తుకు **'సాక్షి' (Mere witness)**.

  – అది సమస్త జగత్తులకు, **సర్వజీవులకు ఆత్మ. అది సర్వాత్మకము.**

అట్టి సత్య జ్ఞానానంద (సుఖ) అద్వయమగు బ్రహ్మము–**తాను అవిషయమై యుండియే**–ఈ సమస్తము **తానే** అయి ఉంటోంది. "అట్టి బ్రహ్మమే నేను" అని ఎరిగినవారై ముని కృతకృత్యుడు అగుచున్నాడు. కనుక ఓ నిదాఘ మహాశయా। నీవు అట్టి మునివి అయి ఉండు.

మనందరి అఖండాత్మ (లేక) బ్రహ్మము ఇంకా ఎటువంటిదంటే....,

- ⌘ ఆభరణములకు బంగారమువలె, తరంగములకు జలమువలె, సర్వజీవులకు, సర్వమునకు – **సర్వాధిష్ఠానము।**
- ⌘ అది ఈ సమస్తమునకు ద్వితీయమైనది (వేఱైనది) కాదు – **అద్వంద్వమ్।**
- ⌘ అది మొట్టమొదటే ఉండి ఉన్నదై, సర్వమునకు పరమై పరాకాష్ఠ అయి ఉన్నట్టిది – **పరంబ్రహ్మ సనాతనమ్।** ఇప్పటికే ఉన్నది. ఎప్పటికీ ఉంటోంది.
- ⌘ అది వాక్కుకు, మనస్సుకు గోచరమగు విషయముల వంటిది కాదు – **అవాక్–మానస గోచరమ్।**

ఈ భౌతికాకాశంలో వెలుగుచూ ఉన్న సూర్యచంద్రులు ఆత్మాకాశములో భాసించువారు కాదు. ఇక్కడి వాయువు ఆత్మయందు వీచదు. లోకపాలకులగు దేవతలు అక్కడ పాలించరు. ఆ ఆత్మదేవుడే సూర్యచంద్రులుగా (వారి ప్రకాశముగా), వాయువుగా (వాయువీచికలుగా), దేవతలుగా – **స్వయంకృతులై ప్రకాశిస్తున్నారు.** ఆయనయొక్క భూతభావనయే సమస్త భూతములు (జీవజాలము) కూడా। స్వయముగా జ్ఞానాతీతుడై, – ఎట్టి అజ్ఞాన దోషములు అంటకుండానే – ప్రకాశించుచున్నారు. సర్వమును ప్రకాశింపజేస్తూ, తాను స్వయం ప్రకాశకుడై వెలుగొందుచున్నారు.

**అట్టి ఆత్మయే తెలుసుకోవలసిన మహత్తర వస్తువు॥**

**మం॥ శ్లో॥ భిద్యతే హృదయగ్రంథిః। ఛిద్యంతే సర్వ సంశయాః।**
**క్షీయంతే చ అస్యకర్మాణి। తస్మిన్ దృష్టే పరావరే।**

**అట్టి పరావరమగు ఆత్మదృష్టి సిద్ధించుకోనంతవరకు** – సృష్టి స్థితి లయమునకు సంబంధించిన 'నిజమే' అను రూపమగు హృదయ గ్రంథులు (బ్రహ్మ విష్ణు రుద్రగ్రంథులు) తెగవు. 'ఇదంతా నిజమే' – అను భవబంధము కొనసాగుచూనే ఉంటుంది.

- **"నేనెవరు? ఈ జగత్తు ఏమై ఉన్నది? నీవు ఎవరు? ఇదంతా ఎందుచేత, ఎవరివలన, ఎంతవరకు?"** మొదలైన ప్రశ్నలకు సంబంధించిన సంశయములు వదలవు.
- **"కర్మలు – కర్మఫలములు – కర్మ బంధములు – కర్మోపాయములు"** – అనురూపముగా ఏర్పడియున్న కర్మ వ్యవహార పరంపరలు క్షీణించవు.

ఆత్మభగవానుని సందర్శనముచే పైవన్నీ చక్కబడతాయి. హృదయ గ్రంథులు తెగిపోతాయి. సంశయాలన్నీ తొలగిపోతాయి. కర్మబంధాలన్నీ 'లేనివి'గా వీగిపోతాయి.

## జీవుడు – ఈశ్వరుడు

పంచ జ్ఞానేంద్రియములు, వాటివాటి పంచ ప్రజ్ఞలు, పంచ కర్మేంద్రియములు, వాటివాటి పంచ వ్యవహారములు, పంచప్రాణములు, పంచ ఉపప్రాణములు, మనో–బుద్ధి–చిత్త–అహంకారములనబడే అంతరంగ చతుష్టయము – మొదలైనవన్నీ కుటుంబ సభ్యుల సమావేశ ప్రదేశమువలె ఈ 'శరీరము' అనే గూడు (గృహము, ఇల్లు)–కనబడుతోంది. (The Physical Body is like a Conference Hall)

అట్టి ఈ దేహములో ఏర్పడిఉన్న ఇద్దరు ముఖ్యులయొక్క ఒక గొప్ప సమావేశము గురించి వృక్షము – దృష్టాంతపూర్వకంగా ఈ విధంగా వర్ణించి చెప్పబడుతోంది.

✠

ఈ శరీర వృక్షముపై రెండు పక్షులు అనంతకాలంగా నివసిస్తూ ఉన్నాయి. (1) జీవుడు (2) ఈశ్వరుడు.

**(1) జీవుడు :** ఆ వృక్షముపై నివసిస్తూ ఫలములను – Fruits (కర్మఫలములము) ఎల్లప్పుడు అనుభవిస్తూ ఉన్నాడు (He is the Experiencer - one who is experiencing). ఈతడు దర్పణంలోను, జలములోను ప్రతిబింబించు వస్తువు వలె (అసలైన వస్తువు కాని తీరుగా) **'ప్రాతిభాసిక స్వరూపుడు** (Reflective Form), **'మాయాకల్పితుడు'** అనబడుచున్నాడు.

**ఈశ్వరుడు :** కేవలసాక్షి. **న కర్మణో భుక్త భోగ।** కర్మలయొక్క 'భోగించటము' (Experiencing/Enjoying) అనే స్వభావమునకు ఆవలివాడు. మునుముందువాడు. కర్మల అనుభవము తాను ఏమాత్రము పొందనివాడు.

(జీవేశ్వరులు– (1) నటుని నాటకములోని పాత్ర (2) అనేక నాటకములలో నటిస్తూ ఉండే **కళాకారుని బాహ్య–సహజరూపము వంటివి.**

ఈ జీవుడు దృశ్య జగత్తులో చిదాకాశమునకు వేరుగా కనిపిస్తూ ఉన్నప్పటికీ, చిత్తము లయిస్తున్న సందర్భములో ఈశ్వరుడే। శాస్త్రములచేత తర్కముచేత, మహనీయుల స్వానుభవముచేత 'చిత్' అనునది ఏకరసమేనని నిరూపించబడుతోంది. ('ఓం' ఇతి ఏక – అక్షరం 'బ్రహ్మ'). కనుక జీవాత్మ ఈశ్వరునికంటే భిన్నము కాదు.

**చిదేకత్వ పరిజ్ఞాతే నశోచతి, న ముహ్యతి।** ఎప్పుడైతే జీవాత్మ తనయొక్క చిదేకరూపమగు ఈశ్వరత్వము గురించి తెలుసుకుంటుందో – ఇక అప్పటి నుండి ఏ దుఃఖము (worry) గాని, మోహము(Illusion) గాని ఇక పొందదు. ఈ సమస్త జగత్తు యొక్క సత్య – చిత్ ఘనీ భూత అధిష్ఠానము 'నేనే' – అను నిశ్చయముచే అట్టి ముని శోకరహితుడగుచున్నాడు. (చూస్తున్న–వింటున్న–ఆఘ్రాణిస్తున్న–రుచిచూస్తున్న–ఆలోచన చేస్తున్న **"ఎరుక"** – ఒక్కటే అయి ఉండటమే **'చిదేకరసము'** అను మాటకు దృష్టాంతము).

## పరమాత్మ ఉన్నదెక్కడ? దర్శించటమెట్లా!

**ఋబు మహర్షి :** మం॥ శ్లో॥ స్వశరీరే స్వయంజ్యోతిః స్వరూపగ్ం సర్వసాక్షిణమ్
**క్షీణదోషాః ప్రపశ్యంతి। నేతరే (న ఇతరే) మాయయ ఆవృతాః॥**

ఆ పరమాత్మ స్వ–శరీరమునందే స్వస్వరూపుడై, స్వయంజ్యోతి స్వరూపుడై (తనను వెలుగించుటకు, ప్రదర్శించుటకు మరొక బాహ్య వస్తువుయొక్క అవసరము ఏమాత్రము లేనివాడై), సర్వ జగదనుభవములకు కేవలము సాక్షి అయి వెలుగొందుచున్నారు. అట్టి ఆత్మస్వరూపుడగు పరమాత్మ మరి, అనుభవమవటం లేదేమి? ఎందుకంటే, స్వస్వరూపముయొక్క కేవల సాక్షీ – స్వయంజ్యోతీ స్వరూప ఔన్నత్యము – మనస్సులోని దోషములు తొలగిపోగా, బుద్ధిలోని దృశ్యధ్యాసలు శమించగా – **ఈ జీవునికి తనయందే సందర్శనమవగలదు.** ఇక ఎవ్వరైతే మనోదోషములు కొనసాగిస్తూ ఉంటారో, అట్టివారు మాయ (కల్పన, అన్యభావన, భావావేశములు)చే కప్పబడి ఉంటున్నారు. ఫలితంగా తమయందు తామే అయి ఉన్న 'ఆత్మ' – అనుభవమునకు రావటం లేదు. అందుచేత ఓ నిదాఘా! నీవు ధీరుడవై (సునిశిత బుద్ధి కలవాడవై) ఆత్మను తెలుసుకొని 'బ్రాహ్మణుడవు' అవాలి. అట్టి శబ్దార్థము పుణికిపుచ్చుకోవాలి. ఆత్మ అనుభవైక వేద్యము. అట్టి ఆత్మను అనేక శబ్దములతో చెప్పుకుంటే సరిపోదు. అదంతా **వాచోవిగ్లాపనము** (Confusion by virtue of too much of Terminology) అవుతుంది కూడా.

జగత్ భావనములను ప్రక్కకు నెట్టి, **ఆత్మభావనతో ఆత్మయందు ఆత్మను దర్శించటమే ఆత్మసాక్షాత్కారము.**

**ఋభుమహర్షి :** ఓనిదాఘా! బాల్యమునుండే అవిద్యను జయించి, బ్రహ్మవిద్యను అభ్యసిస్తూ బ్రహ్మతత్త్వమునందు సుతిష్ఠితుడు అవాలి. బాల్యమునుండే బ్రహ్మవిద్యను ఆశ్రయించుచూ ఉండగా అవిద్యను జయించి అచిరకాలంలో 'ముని–ఆత్మవాన్' అగుము.

**నిదాఘుడు :** మహాత్మా! ఋభు మహర్షీ! అనేక చిత్ర–విచిత్రములతో కూడిన ఈ భౌతిక శరీరము ఎట్లా నిర్మితమౌతోంది?

**ఋభుమహర్షి :** **<u>చిత్తమే ఈ భౌతిక శరీరమునకు బీజము.</u>**

- అంతర్లీనంగా అనేక కల్పనల సంరంభము కలిగియున్నట్టిది....,
- అనేక సుదీర్ఘమైన శుభ–అశుభ కార్యక్రమముల పరంపరలకు బీజమైనట్టిది,...,
- అనేక సంబంధ–అనుబంధముల పరంపరలకు ప్రవర్తనము ప్రదర్శించునది....,

అగు చిత్తమే ఈ భౌతిక శరీరమునకు కారణ–కారణము.

అట్టి చిత్తము 'ఆశ' (ఆశించటము) అనే స్ఫురణ నుండి బయల్వెడలుతోంది. దేహమునకు నిజస్వరూపమైనట్టి ఈ చిత్తము 'ఆశ' అను

దాని నుండి అంకురిస్తోంది. భావ-అభావముల దశలకు **కోశము, దుఃఖములు** అనే రత్నములను తనయందు **కలిగి ఉన్నట్టిది** - అగు ఈ శరీరములో - చిత్తము 'ఆశ' అను దానికి వశమై ప్రవర్తిస్తోంది.

ఈ 'చిత్తము' అనే వృక్షమునకు రెండు బీజములు ఉండి, చిత్తవృత్తుల రూపంగా ప్రదర్శితమౌతోంది.

(1) ప్రాణ పరిస్పందనము (2) దృఢభావన

ఎప్పుడైతే జడమగు శరీరము నందు ప్రాణశక్తి ఉద్యమించి నాడులను స్పృశిస్తుందో, అప్పుడు సంవేదనమయము (Inspiration of knowing and Feeling) రూపమగు చిత్తము బయల్వెడలుతోంది. అప్పుడిక సర్వగతమైన సంవిత్ [(సత్ + విత్ → present సత్ (Being) - Al- present (Knowing)] ప్రాణస్పందనచే 'భావన-అనుభూతి'ల దిశగా మేల్కొంటోంది.

| ప్రాణస్పందన | → | చిత్తము | - | సంవేదనము | - | సంవిత్ (ఆత్మ) |
|---|---|---|---|---|---|---|
| Energy | → | Liking | - | Knowing | - | Absolute self |

ఈ విధమైన '4' టిలో సంవిత్ ఆత్మ (ఉనికి + ఎరుకల కేవల స్వరూపము) - **పరాకాష్ఠ అయినట్టిది.**

అందుచేతనే యోగులు సంవిత్ ఆత్మయొక్క సంవేదనము (స్వానుభవము) కొరకై - చిత్తమును సంశాంతింపజేయటంలో ప్రయత్నశీలురు అగుచున్నారు. అనేక దృక్కోణములతో జన్మజన్మలుగా రూపము సంతరించుకొని, అనేక దుర్భావ-సద్భావముల మిశ్రమముగా నిర్మితమైన ఈ 'చిత్తము' అనే మహారాక్షసుని వశం చేసుకోవటం తేలికైన పనికాదు. అది కొద్దిసేపు శాంతించినట్లే, కనబడుచూనే, మరొకవైపుగా అప్రతిహతంగా, దుర్జయముగా విజృంభిస్తూ ఉంటుంది. అటువంటి చిత్తమును మెడలు వంచి జయించేది ఎట్లా?

అందుకు యోగులు ఒక గొప్ప ఉపాయమును స్వానుభవమునుండి రంగరించి, సాధన రూపముగా తీర్చిదిద్ది మనకు అందిస్తున్నారు. ఆ ఉపాయమే → **ప్రాణ స్పందన నిరోధయోగము లేక ప్రాణాయామాభ్యాసము.**

(1) ప్రాణాయామాభ్యాసము చేతను, (2) యుక్తి (ఉపాయము) చేతను - చిత్తము ఉపశమించినదై **"పరమాత్మతత్త్వ భావన"**గా రూపుదిద్దుకొంటూ ఉండగా, 'త్వమ్' పట్ల **తత్‌భావన** బలవత్తరము కాగలదు.

> ***త్వమ్ ఆత్మయేవ*** *(నీవు ఆత్మస్వరూపుడవే!)। నేను అట్టి ఆత్మస్వరూపుడనే! (సోఽహమ్ తత్)। ఈ దృశ్య జగత్-స్వరూపమంతా ఆత్మస్వరూపమే (ఆత్మయేవ ఇదగ్ం సర్వమ్)। - అను అసంశయ సునిశ్చయమే* ***ప్రాణాయామాభ్యాసము****లో కూడా అంతర్లీనమైయున్న ముఖ్యాశయము. ప్రాణనిరోధము వలన ఈ జీవునకు స్వస్థత సిద్ధించగలదు.*

ఈ చిత్తము యొక్క **చాంచల్యము**, ఇంద్రియ విషయములపట్ల **నమ్మకముతో కూడిన ధ్యాస, మనో దురభ్యాస వ్యసనములైనట్టి క్రోధావేశము, పరుషభాషణము** మొదలైనవి శమించటానికై ఆశ్రయించవలసిన ఉపాయములు -

(1) 'గురువు'ను ఆశ్రయించటము. వారిని పరమాత్మ - భావనతో దర్శించటము. వారు బోధించు **తత్త్వమసి** పాఠములను శ్రవణము చేయటము,

(2) ఆ తరువాత మననము, ముఖ్య పాఠ్యాంశములను గుర్తు (జ్ఞాపకము) కలిగి ఉండటము.

(3) 'ఇష్టదైవము'ను మనస్సుతోను వాక్కుతోను ఆలోచన - మాటల ద్వారా **'ఆరాధన'** చేయుచుండటము. మంత్రమును శబ్ద-అర్థ పూర్వకముగా మననము చేయటము. సమస్తమును ఇష్టదేవతా ప్రదర్శనముగా భావించటము. మననము చేయటము.

(4) ఇష్టమైన వారిపట్ల, అయిష్టమైన వారిపట్ల తదితరులపట్ల కూడా **"ఆ పరమాత్మయే ఇన్ని రూపములలో, ఇన్ని రూపములుగా ఉన్నారు"** అను **జ్ఞాపకమును మననము** చేస్తూ ఉండటము.

(5) "ఇతరుల తప్పులు ఎన్నటముకన్న, నా తప్పులు గమనించటము ముఖ్యము కదా!" - అను **ఆత్మవిమర్శ.**

(6) "జీవుడన్న తరువాత తప్పులు, లోపములు బహుశః ఉండక తప్పవు. నాలోను ఉంటాయి" అను **ఓర్పు. తితిక్ష.**

(7) "ఇతరుల పట్ల బాధ్యతతో మెలగటము నావంతు, **నా గురించిన బాధ్యత పరమాత్మదే"** - అను అంతరంగ **సునిశ్చితభావన.**

ఈ విధంగా వేద-పురాణ-ఇతిహాస-(మహనీయుల) చరిత్రలు అనేక ఉపాయములు గుర్తు చేస్తున్నాయి. వాటిని గ్రహించి, అనువర్తిస్తూ ఉండటమే **'యుక్తి'**.

## ప్రాణయోగాభ్యాసము

**(1) రేచక - పూరక - కుంభకముల అభ్యాసము. (2) స్వాభావిక (సహజ) కుంభకము** (3) దేహములోని (కాలు బొటనవ్రేలు నుండి - శిరో ఉపరిభాగము వరకు) ఆయా స్థానములందు, షట్ చక్రములందు, నవరంధ్రములందు సహజ (స్వాభావిక) కుంభకము. ఇట్టి ప్రాణాయామ - యోగాభ్యాసము ఈ జీవునికి అనిర్వచనీయమగు 'స్వస్థత' చేకూర్చగలదు.

## వాసనలు (Tendencies that take form because of Repeated physical and mental Acts)

**వాసనల నిర్వచనము**

**మం॥ శ్లో॥ దృఢ భావనయా త్యక్త పూర్వా పర విచారణమ్,**
**యదా దానం పదార్థస్య "వాసనా" సా ప్రకీర్తితా॥**

ఒక వ్యక్తి యొక్క, వస్తువు యొక్క సందర్భము యొక్క రూపనామములు మొదలైనవాటిపట్ల **"ఇతఃపూర్వము ఇది ఏమైయున్నది? ఇంక ముందుముందు ఇది ఏమికానున్నది?"** – అనే పూర్వాపర విచారణ చేయకుండానే, → ఆ పదార్థము – వ్యక్తి – సంఘటన మొదలైన వాటిని ఆశ్రయించి పరిమితమగు, సంకుచితమగు 'దృష్టి'ని వీడక ఉద్వేగము పొందుచుండటమే **'వాసన'** అనబడుచున్నది.

అట్టి వాసనలే చిత్తము యొక్క మూలపదార్థము (Raw-material). 'వాసన' అనునది భావన చేతనే ఏర్పడుతోంది. 'భావన' అనేది రెండు రూపములు కలిగి ఉంటోంది.

**(1) హేయము =** ఇది వదలాలి. వదిలితేగాని సుఖము లేదు. మోక్షము లేదు. బంధము తొలగదు.

**(2) ఉపాదేయము =** ఇది ఆశ్రయించాలి. ఆశ్రయిస్తేగాని సుఖ–మోక్షములు లభించవు. బంధము అనివార్యము. ఇది కావాలి. పొందకపోతే బ్రతుకు వృథా। పొందటమే నా గొప్ప।

ఓ నిదాఘా!

ఎప్పుడైతే నీవు – పై రెండు రూపములైనట్టి హేయము (That is yet to be left off) – ఉపాదేయము (That which is to be yet followed / adopted) లకు సంబంధించిన **ప్రాపంచక – పాదార్థిక – వ్యష్టిగత** పరిమితమగు ఉభయ భావనలు త్యజిస్తావో,

హేయ–ఉపాదేయ (leaving/taking) భావనలు లేకుండానే వస్తువులను, వ్యక్తులను చూడగలుగుతావో, అప్పుడిక **చిత్తము మొదలంట్లా రహితమైనట్లే!**

ఆ ఉభయము ఎల్లప్పుడూ వదలుచూ ఉండగా వాసనలు తొలగుచుండగా, ఇక మనస్సు మనుగడ కలిగి ఉండదు. మనస్సు లయించుచుండగా **పరతత్త్వస్వరూపము** పరమప్రదమై ఈ జీవునిపట్ల ప్రకాశించగలదు. స్వానుభవమవగలదు.

ఓ నిదాఘా! **యదా న భావ్యతే భావః క్వచిత్ జగతి వస్తుని, తదా హృదంబరే శూన్యే కథం చిత్తం ప్రజాయతే?** ఎప్పుడైతే నీవు జగత్తులోని ఏ వస్తువునుగాని, విషయమునుగాని, పాంచభౌతిక నామరూపములుగాని నీ హృదయాకాశంలో భావనయే చేయక, హృదయమునందు జగత్తును 'రహితము' చేస్తావో, అప్పుడిక **ఆ శూన్యహృదయములో చిత్తమునకు 'స్థానము' ఎక్కడ ఉంటుంది? ఉండనే ఉండదు.**

## అచిత్తత్వము అనగా ఏమి?

ఎప్పుడైతే భావనను భావనయే చేయనివాడవై అభావనయందు సంస్థితుడవై ఉంటావో (అభావనను ధారణచేస్తావో), అభావనా స్థానమును సిద్ధించుకుంటావో, ఆ స్థితి నుండి ఈ జగత్తులోని సమస్త వస్తువులను అభావనాధారుడవై దర్శిస్తూ ఉంటావో, – అట్టి స్వయం అభావనాస్థాన సంస్థిత – భాహ్య జగత్ దర్శనమే **"అచిత్తత్వము"** అని చెప్పబడుతోంది.

## చిత్తము యొక్క అసద్రూపత్వము

**శ్లో॥ సర్వమ్ అంతః పరిత్యజ్య శీతళ – ఆశయ వర్తి యత్, వృత్తిస్థమపి – తత్ చిత్తం "అసద్రూపం" – ఉదాహృతమ్।** ఓ నిదాఘా! భేదముతో కూడిన జగత్ – విశేషములన్నీ బాహ్యమందే ఉంచివేసి, అంతరమున ప్రశాంత – పూర్ణత్వములతో కూడిన నిర్విషయత్వమును అనువర్తిస్తూ, విషయములకు సంబంధించిన వృత్తులన్నీ (All avocations) సశాంతింపజేసి, శరత్కాలంలో తటాకంలాగా ప్రశాంతముగా తీర్చిదిద్దిన చిత్తము – **"అసద్రూప చిత్తము"**(As it not there) – అనిపిలువబడుతోంది. భ్రష్టము అయిన బీజము (ఎండిపోయిన, వేయించిన బీజము) ఇక మరల చిగురించదు కదా! అట్లాగే, అసద్రూపచిత్తము ఇక **పునర్జన్మ–అనివార్యత్వము**ను పొందదు. ఆతడు **'పునర్జన్మరహితుడు'** అవుతాడు. అనగా పునఃజన్మ తన వశమై ఉంటుందేగాని, కర్మలవశము, త్రిగుణములవశము అయి ఉండదు. తనను తాను జన్మలకు వేరైన స్వరూపముగా దర్శించగలడు.

అట్టి వాసనారస రాహిత్యము సిద్ధించుకొన్నవాడు జీవన్ముక్తుడే। సత్త్వ (సాత్విక) రూపము బాగుగా ప్రాప్తించుకొన్న ఆత్మజ్ఞాన పారగుల యొక్క చిత్తము – **"అచిత్తము"** అనబడుతోంది.

| | | |
|---|---|---|
| **బాహ్యమున**<br>సాపేక్ష చిత్తము | } { | చిత్త సహితుడు – ప్రాపంచక సందర్భానుసరణీయ, ధర్మానుసరణీయ దర్శనము గల "సాపేక్ష-చిత్తము". |
| **అంతరమున**<br>కేవల చిత్తము | } { | చిత్త రహితుడు. **'సమస్తము సర్వదా బ్రహ్మమే'** – అను బ్రాహ్మీదృష్టిగల కేవలీ చిత్తము (లేక) "చిత్‌చిత్తము" (లేక) "అసద్రూపచిత్తము" |

***ఇవియే చిత్త రహిత (లేక) చిత్త జయ లక్షణములు.***

అచిత్తుడు (లేక) కేవలీచిత్తుడు (లేక) అసద్రూప చిత్తుడు దేహ – మనో – చిత్త – జీవాత్మలను ఆత్మ దృష్టిచే దాటిపోయి, వాటికి సాక్షి అయి, పరిమితమగు జీవాత్మత్వమును అధిగమించి, **"సమస్త జీవులలో వేంచేసియుండి, జాగ్రత్ స్వప్న సుషుప్తులకు కూడా సాక్షి, కారణుడు, ప్రేరకుడు, ప్రేక్షకుడు అయి ఉన్న సర్వాత్మకమగు ఆత్మయే నేను।"** – అను భావనతో **ఆత్మాకాశ స్వరూపుడై విరాజిల్లుచున్నాడు.**

## చిత్తశుద్ధికి ఉపాయములు

**నిదాఘుడు : గురుదేవా! ఋభుమహర్షీ! "చిత్తమును-బాహ్యముననే అట్టేబెట్టివేసి, అంతరమున చిత్ దృష్టితో చిదాకాశస్వరూపములమై అనునిత్య స్వయమాత్మ-ప్రకాశము సంతరించుకోవటము"** – అనే మీరు ప్రసాదిస్తున్న వర్తమాన బోధనా పాఠ్యాంశము అమోఘం. అనుసరణీయమే కూడా. అయితే, **"ఈ చిత్తము యొక్క ప్రాపంచకత్వమును తొలగించి అంతరమున చిత్‌స్వరూపంలా తీర్చిదిద్దటము ఎట్లా?"** – అను ప్రశ్న మాకు కొనసాగుచూనే ఉన్నది. అందుచేత చిత్తమును అంతరమున అసద్రూపంగా (లేక) అచిత్తంగా చేసివేసుకోవటానికి కావలసిన **ఉపాయములు, విధివిధానములు** దయచేసి వివరించండి.

**ఋభు మహర్షి :** ఓ నిదాఘా! ఈ దేహములో 'పంచేంద్రియములు' ఏర్పడినవై ఉన్నాయి కదా! దేహి (User of the Body) అయి ఉన్న నీవు – ఒకానొకప్పుడు 'శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములు' అనబడే పంచేంద్రియ విషయములు ఆస్వాదించు ప్రయోజనము కొరకై, – పంచ జ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు – ఇవన్నీ సార్థకమౌతున్న ఈ భౌతిక శరీరమును "ఉపకరణము (Instrument)"గా స్వీకరించుచున్నావు. 'శరీరి'గా అట్టి భౌతికదేహము స్వీకరిస్తున్నప్పుడు 'జననము' అనబడుతోంది. ఇది త్యజించబడుచున్నప్పుడు 'మరణము' అని చెప్పుకోబడుతోంది.

**(కనబడుచున్న, వినబడుచున్న, స్పర్శించబడుచున్న, రుచిచూడబడుచున్న, వాసన చూడబడుచున్న)** విషయ సమూహములు– **"సంవేద్యము-(తెలియబడునవి)"** – అని అనబడుచున్నాయి.

తెలియబడేవి, అనుభతమయేవి, అనుభవములుగా పొందబడేవి --- **"సంవేద్యత్వము'** (That being experienced)

తెలుసుకొంటున్నవాడు, అనుభూతపరచుకొంటున్నవాడు
అనుభవముగా పొందుచున్నవాడు --- **సంవిదత్వము** (The State of experiencer)

> ఈ జీవుడు ఇంద్రియములను ఉపయోగించి విషయములను పొందుచున్న సందర్భములలో "ఇష్ట-అయిష్టములు" ఆశ్రయించుచున్నాడు. అవియే"ప్రియ-అప్రియములు, సుఖ-దుఃఖములు"గా రూపుదిద్దుకుంటున్నాయి. అభ్యాసములుగా ప్రారంభమయి, క్రమంగా సంస్కారములుగా అయి, (ఆపై) వాసనలుగా రూపము పొంది – ఈ అసంఖ్యాక జన్మపరంపరలకు కారణమగుచూ, జీవుని వెంటనంటి కొనసాగుచున్నాయి.

అట్టి 'సంఘటన-సందర్భములు' పట్ల ఏర్పడుచున్న చిత్తమును ఇప్పుడు కొంచము కొంచము విరమిస్తూ – **సంవేద్యత్వము** (అనుభవముగా పొందబడుచున్నవి) నుండి **సంవిత్‌తత్త్వము** (అనుభవములకు వేరైన నీరూపము) వైపు ధ్యానము చేయనారంభించాలి.

సంవేద్యము నుండి → అనుభవి → నుండి కేవలమగు **'సంవిత్‌స్వరూపము'**
(What ever being experienced) → (The Experiencer) → (The Absolute All – present SELF)

**సంవేద్యము నుండి → సంవిత్ వైపుగా।** (లేక)
**దృశ్యము నుండి → కేవల ద్రష్టవైపుగా।**

ఓ నిదాఘా! ఎప్పుడైతే ధ్యానముచే నీ ధ్యాస 'సంవేద్యము' (That being experienced) నుండి మరలి, క్రమంగా "దేహి-ఆలోచించువాడు-భావించువాడు" రూపుడగు (User of the Body / Thinker / Feeler) "సంవిత్తు" నందు సుతిష్ఠతము అవుతుందో, ఇక ఆపై, శ్రవణము – జ్ఞానవిచారణల యొక్క కొంచెము ప్రయత్నము చేతకూడా 'తత్' పదము (లేక 'ఆత్మపదము') సులభముగా సిద్ధించుకోగలవు.

**నిదాఘుడు:** జన్మజన్మలుగా పేర్చుకొంటూ తెచ్చిపెట్టుకుంటున్న వాసనలను వదలించుకొని, 'సంవేద్యము' నుండి మేము 'సంవిత్' వైపు అడుగులు వేస్తూ, నిశ్చలత పొందటము - తేలికేనంటారా? (Is it easy to get back to the state of the 'knower' by withdrawing from the influence of all 'That being known?)

**ఋభు మహర్షి :** అవును। కష్టమే। అయితే సాధనచే సాధ్యమే. అందుకు సంవిత్ వైపుగా ధ్యాసను మరల్చుధ్యానము ఒక్కటే మార్గము. అట్టి మార్గములను నీవు అన్వేషించవలసిందే, ఆచరించవలసిందే! ఎవ్వరికీ కూడా వేరే మార్గం లేదు.

**మం॥ శ్లో॥ వాసనా సంపరిత్యాగే యది యత్నం కరోషి భో,**
**యావత్ విలీనం న మనో, న తావత్ వాస నాక్షయః॥**

**ఆత్మభావనా దృష్టి కొరకై వాసనా పరిత్యాగము** ఒక్కటే ఉపాయం. **"అనుకోవటము"** అను బీజమునుండి మొలచినవే వాసనలు. ఎంతవరకు ఉపాయములు ఆశ్రయించాలి? **అంతరంగ వాసనలు పూర్తి రహితమయేవరకు ఉపాయాలు, సాధనలు కొనసాగించాలిసిందే.** జబ్బు తగ్గే వరకు మందు వాడవలసిందే కదా! వేరే త్రోవలేదు. ఎందుకంటే మనస్సు వస్తు దృష్టిని వదలి ఆత్మదృష్టియందు పూర్తిగా లయించేవరకు వాసనలు తేలికగా క్షయించవు. తిరిగి మొలకలెత్తుతూనే ఉంటాయి. వాసనలు మొదలంట్లా క్షీణించనంతవరకు చిత్తము శమించే ప్రసక్తియే లేదు. నీవు తత్త్వజ్ఞానము ఆశ్రయించి, బుద్ధిని ఆత్మదృష్టిచే నిశ్చలం చేసుకోనంతవరకు - చిత్తము వెనుకకు మరలదు.

**యావత్ న తత్త్వ సంప్రాప్తిః న తావత్ వాసనా క్షయః॥**

'త్వమ్'గా కనిపించే ఈ సమస్తము సర్వదా ఆత్మయే - అనునదే తత్త్వస్థితి. అది లభించేంతవరకు వాసనలు క్షయించవు

**తత్త్వజ్ఞానం మనోనాశో -**
**వాసనా క్షయ ఏవ చ** }

(1) **తత్త్వజ్ఞానము** చేతనే మనోనాశనము.
(2) **మనోనాశనము** చేతనే - తత్త్వభావన.
(3) **వాసనాక్షయము** చేతనే మనోనాశనము.

ఈ మూడు పరస్పరము (ఒకదానికి మరొకటి) కారణములగుచూ, అభ్యాసముచేతనే సిద్ధించగలవు. అందుచేత ఓ మహామతీ! (1) తత్త్వజ్ఞాన (2) మనోనాశన (3) వాసనాక్షయములు - ఈ మూడిటికీ ఒకేసారి నీవు ప్రయత్నశీలుడవు కావాలి. "ఇంద్రియ విషయములను భోగించటము' - అనే భోగేచ్ఛను దూరంగా వదలివేసి, ఈ మూడిటిని శ్రద్ధతో ఆచరించెదవుగాక! ఈ మూడు ఒక్కసారిగా అభ్యసిస్తేనే ఉత్తమ ప్రయోజనం, (ఒకటి తరువాత మరొకటి కాదు)

**మం॥శ్లో॥ వాసనా క్షయ, విజ్ఞాన, మనోనాశా, మహామతే!**
**సమకాలం చిరాభ్యస్తా భవంతి ఫలదా మతాః॥**

సుదీర్ఘకాలం ఆ మూడు (ఒక్కసారిగా) అభ్యాసం చేస్తే మహత్తరమగు ప్రయోజనం సిద్ధించగలదు. తామరకాడను ముక్కలుగా త్రెంపితే, అందులోని తంతువులు (దారములు) కూడా తెగిపోతాయికదా! అట్లాగే, తత్త్వజ్ఞాన-మనోనాశన-వాసనాక్షయములచే - సృష్టి స్థితి లయ - దృశ్యానుభవమునకు సంబంధించిన త్రిగంథులు (బ్రహ్మ-విష్ణు-రుద్ర గ్రంథులు) తమకు తామే తెగిపోగలవు.

(1) వాసనా త్యాగము (2) ప్రాణాయామపూర్వకంగా ప్రాణనిరోధము (3) తత్త్వజ్ఞానము

ఈ మూడూ ఎల్లప్పుడూ అభ్యసిస్తూ ఉండాలి - అని తత్త్వవేత్తలు బోధిస్తున్నారు. అందుచేత ఓ మహాశయా! ఆ మూడూ దైనందికంగా అభ్యాసం చేయి.

※ వాసనలను పూర్తిగా పరిత్యజించటమువలన చిత్తము అచిత్తమైపోగలదు.

※ ప్రాణాయామయోగాభ్యాసముచే వాసనలు తేలికగా పరిత్యజించబడగలవు.

※ ఆత్మతత్త్వ జ్ఞాన - అధ్యయనములచే వాసనలపట్ల అనురక్తి తొలగగలదు.

ఈ మూడిటిలో ఏది ముఖ్యమని భావిస్తూ, ప్రాముఖ్యత ఇస్తూ ఆచరిస్తావో - **అది నీకు ఇష్టమైనట్లు ఆచరించు.** కానీ, అన్నిటినీ కొంత కొంతగానైనా అభ్యసించు. క్రమ క్రమంగా నీయొక్క **"స్వస్వరూప స్వాభావికానందము"** సులభతరము కాగలదు.

## వాసనలు ప్రవర్తించకుండా ఉండాలంటే ఏమి చేయాలి?

(1) దృఢమైన ప్రాణాయామ యోగాభ్యాసము.

(2) మనస్సును నిరోధించటానికి సద్గురువులచేతను, శాస్త్రములచేతను సూచించబడుచూ ఉన్న యుక్తులు (లేక) ఉపాయములు.

(3) సుఖాసనము సహాయముతో ధారణ.

(4) ఆహార నియమములు.

(5) పరమాత్మతో మనస్సుయొక్క సంయోగము.

**వీటిచే ప్రాణస్పందన నిరోధించబడగలదు. అప్పుడు చిత్తము తనకుతానే వశమై ఉండగలదు.**

**నిస్సంగవ్యవహారత్వాత్ భవ భావన వర్జనాత్।** "సంబంధము, అనుబంధము, మమకారము, బెంగ, ఆధారపడియున్న భావన" – మొదలైన ప్రాపంచక వ్యవహారములతో నిస్సంగము (Non-Relatedness) చేత "ఈ దృశ్యము నిజమే! నిత్యమే!" – అను **"భవభావనా బంధము"** – తొలగిపోగలదు.

**ఇంకా వాసనలు నశించటానికి మరొక ఉపాయం విను. (జన్మమృత్యు జరావ్యాధి దుఃఖ దోషాను దర్శినమ్) శరీర నాశ దర్శిత్వాత్ వాసనా న ప్రవర్తతే।**

ఈ శరీరము కాలముచే జనించి, కాలముచే రూపురేఖలు దిద్దుకొంటూ, కొంచము సేపు సుందరంగా కనబడుచూ, క్రమంగా కాలముచే శిథిలమగుచూ, ఎప్పుడో కాలముచే మ్రింగివేయబడుతోంది. ఇట్టి శరీరమును మహనీయులు మొదలే 'నశించిన వస్తువు'గా చూస్తూ, గమనిస్తూ ఉంటారు. ఈశరీరమును నశించే (లేక) నశించిన వస్తువుగా దర్శిస్తూ ఉండటంచేత ఇక వాసనలు ప్రవర్తించటము క్రమంగా సన్నగిల్లగలవు.

## ప్రాణస్పందమే చిత్తస్పందము కూడా!

**యః ప్రాణ పవన స్పందః → చిత్త స్పందః స ఏవ హి।** ఏది ప్రాణస్పందనయో, అదియే చిత్తస్పందన కూడా. చిత్తము విషయములకు స్పందనము పొందుతూ ఉంటే – ప్రాణము కూడా స్పందన పొందటం జరుగుచూ ఉంటుంది. ఉదాహరణకు, – ఒకడు కోపమో, భయమో పొందటము చిత్తముచే జరుగుతోంది. అది ప్రాణస్పందమునకు కారణమై శరీరంలో ప్రాణవాయు కదలికలకు 'అసమత్వము' కలిగిస్తూ ఉండటం అందరికీ అనుభవమేకదా! ప్రాణ–చిత్త స్పందనలు అన్యోన్యత్వము కలిగి ఉంటున్నాయి. అందుచేత ఓ నిదాఘా! **మోక్షమార్గమును ఆశ్రయిస్తున్న ముముక్షువులకు ప్రాణస్పందన జయము, కర్తవ్యము (తప్పక ఆశ్రయించవలసినది)గా సూచించబడుతోంది.**

✠

ఓ నిదాఘా! **న శక్యతే మనోజేతుం వినా యుక్తిం అనిందితామ్।** అనిందితము (ఇతరులకు ఇబ్బంది కలుగనట్టి – సశాస్త్రీయమైన) యుక్తి (ఉపాయము)ను ఆశ్రయించకపోతే మనస్సును జయించటం అంత తేలికైన పనికాదు. శాస్త్ర–గురు సూచకమైన ఉపాయములను ఆశ్రయిస్తూ, తద్వారా సంవిత్ స్వరూపమగు ఆత్మను మనస్సుతో ఆశ్రయించు. క్రమంగా సమస్త విషయముల పట్ల రాగమును త్యజించివేయి. ఓ మహాత్మా! సంవేద్యము (The object of Experience) ను ప్రక్కకు నెట్టి, కలనములను జయించి, **ఆద్యము ఏకము అగు ఆత్మతో కర్మరహితుడవై ఉండుము.** (కర్మలు చేస్తూ చేయనివాడవై ఉండు). నీ హృదయమునందు నీవే ఆత్మస్వరూపుడవై వెలుగొందుము. శమము మొదలైన అష్టాంగ యోగములు అభ్యాసముతో బాహ్యమంతా నీ ఆత్మస్వరూపముతో నింపివేయుము.

మానవజన్మ మహత్తరమైన అవకాశముగా చెప్పబడుతోంది. మరి వృథా చేసుకోకూడదు.

చిత్తము యొక్క నిగ్రహమును సిద్ధింపజేసుకుంటూ, ఆపై ఆత్మయొక్క స్వరూప స్వభావముల గురించి, ఔన్నత్య లక్షణముల గురించి కొంచము విచారణ చేసినా కూడా, జన్మసార్థకము అయినట్లే. **అఖండాత్మ యొక్క అనుభవము త్వరగా స్వాభావికమై సిద్ధించగలదు.**

⌘ ⌘ ⌘

# 5వ అధ్యాయము - అవిచారోహి మృత్యుః।

**ఋభుమహర్షి :** ప్రియపుత్రా! 'మృత్యువు' అనగా ఒక దేహము నశించి, మరొక దేహము వచ్చు సంఘటన మాత్రమే. అది ఒక వస్త్రము విడచి మరొక వస్త్రము ధరించటము వంటిది. (లేక) జాగ్రత్ నుండి నిద్రలోకి వెళ్ళి మరల జాగ్రత్‌లోకి రావటముతో సమానమైనది.

అవ్యాజప్రేమాస్పద స్వరూపులగు తత్త్వజ్ఞుల దృష్టిలో - **స్వస్వరూపమగు ఆత్మయొక్క సమగ్రత్వము, నిత్యత్వము, అఖండత్వము, అప్రమేయత్వము** (Non confineed) **వంటి మహత్తర విలక్షణ - లక్షణములను ఏమరచి ఉండటమే మృత్యువు.**

అందుచేత, మహదాశయా! నిదాఘా! నీవు నడుస్తూ ఉన్నప్పుడు, ఒకచోట కూర్చుని ఉన్నప్పుడు, మేల్కొని ఉన్నప్పుడు, నిదురిస్తున్నప్పుడు- కూడా ఆత్మయొక్క నిత్యత్వము, సత్యత్వము, అన్యముగా కనిపించే దానియొక్క అనిత్యత్వము, అసత్యత్వము, దృశ్యముయొక్క సందర్భమాత్ర పరిమితత్వము - ఇవన్నీ జ్ఞప్తితో కలిగియే ఉండుము. **'అహమ్ - త్వమ్ - ఇదమ్"-లకు ఆత్మకు అనన్యముగా భావనను ఆశ్రయించినవాడవై ఉండుము.**

ఆత్మను జ్ఞాపకము పెట్టుకొని ఉండటమే - **"అమృతత్వము"**

ఆత్మయొక్క 'తత్త్వమ్-సోఽహమ్' రూప ఔన్నత్యము, కేవలత్వము ఏమరచటమే - **"మృతము"**

## ఆత్మజ్ఞానమే అమృతము - అజ్ఞానమే మృతము।

ఆత్మతత్త్వము మననము చేయువాడు ఈ భౌతిక దేహముతో పుట్టడు. దీనితో చావడు. జన్మ-మృత్యువుల పరిధులను దాటి, ఆత్మస్వరూపము ధారణచేసి, అన్యమైన సమస్త వ్యవహారములను వీడక, సాక్షి అయి చూస్తూ, ఆస్వాదిస్తూ ఉంటాడు. బ్రహ్మానందమును స్వాభావికం చేసుకొని ఉంటాడు. ఈ సమస్త జాగ్రత్‌ను **'గడచిపోతూ ఉండే స్వప్నము'**తో సమానముగా, **లీలా వినోదము**గా దర్శిస్తూ ఉంటాడు.

**సమ్యక్ జ్ఞానము** : సమస్తము పరమాత్మ స్వరూపంగాను, తనప్రియమైన పరమాత్మ సర్వ జీవులలో సమముగా వేంచేసియున్నట్లుగాను దర్శించటమే **సమ్యక్ జ్ఞానము**. ఎవ్వడైతే 'నా ఇష్ట దైవమే నాకు ఇన్ని రూపాలుగా అగుపిస్తూ, అనేకంగా కనిపిస్తూ, సర్వదా ఏకమే అయి ఉన్నారు" అను సమ్యక్ దృష్టిని అభ్యాసం చేస్తూ, ప్రవృద్ధం చేసుకుంటూ ఉంటాడో, అట్టివాడు - **జ్ఞేయమగు ఆత్మను ఎరిగి స్వయముగా జ్ఞేయస్వరూపుడు (బ్రహ్మమే) అగుచున్నాడు.** అట్టి జ్ఞేయసముడు (విజ్ఞేయుడు) (తెలుసుకోవలసిన ఆత్మగురించి తెలుసుకొని అఖండాత్మత్వము పుణికుపుచ్చుకున్నవాడు) - ఇక దేనికీ భయము పొందడు. దేనిపట్ల **ఆదత్తుడు అయి ఉండడు (దేనినీ తనదిగా కలిగి ఉండడు). దేనికొరకూ వివశుడు కాడు. దేనిని చూచి దీనత్వము పొందడు. "ఇది అపవిత్రము. ఇది తినరానిది. ఇది విషము వలె దూషితము"** - అనునదేదీ లేనివాడై సమస్తము స్వీకరించగలడు. భుజించగలడు. సమస్త ఇంద్రియ విషయములను ఇష్టాన్నము భుజించు రీతిగా చూస్తూనే, అసంబంధితుడు అయి ఉంటాడు.

**సంగ త్యాగము :** ఆత్మజ్ఞేయుడు దేనితోను సంగము (Relatedness, confinement, Attachment) కలిగి ఉండడు. ఓ నిదాఘా! అనఘా!

**మం।। శ్లో।।** **సంగ త్యాగం విదుర్మోక్షమ్। సంగత్యాగాత్ అజన్మతా।**
**సంగం త్యజ 'త్వం' భావానామ్, 'జీవన్ముక్తో' భవ। అనఘ!**

అన్యముగా కనిపించే సమస్తముతో సంగము (Attachment with sense of dependence) కలిగి ఉండక, స్వస్వరూపమగు ఆత్మయొక్క స్వాతంత్ర్యము (Independence) గురించిన అవగాహన, ఎరుక కలిగి ఉండటమే **'మోక్షము'**. అదియే **'జన్మరాహిత్యము'** కూడా! బిడ్డా! నీవు భావనారూపంగా సంగము త్యజించి, **'జీవన్ముక్తుడవు'** అగుము.

**సంగము అనగా?** : పదార్థములతో ఏర్పడుచున్న భావ అభావములతో (పొందటము - పొందకపోవటముతో) హర్షము గాని, అమర్షము (విషాదము) గాని పొందటము, మలినవాసనల కారణంగా వికారములు పొందటమునే **'సంగము'** అంటున్నారు. **భావాభావ పదార్థానాం హర్షామర్ష వికారదా, మలినా వాసనా యైషా సా 'సంగ' ఇతి కథ్యతే।।**

**నిదాఘుడు** : గురుదేవా! జీవన్ముక్తులలో వాసనలు, సంగము ఏమాత్రము శేషించి ఉండవు కదా?

**ఋభుమహర్షి** : వాసనలు రెండు రకములు (1) పునర్జన్మ కారణ-ప్రవృద్ధములు (2) పునర్జన్మ కారణ - నాశకములు. వాసనల కారణంగానే ఆత్మస్వరూపుడగు ఈ జీవుడు ఉపాధులను ఒక పరంపరగా (Like a serial) పొందటం జరుగుతోంది. జీవన్ముక్తులు 'భక్తి జ్ఞాన యోగ' ఇత్యాది సాధనమార్గములచే **"ఈ జీవితము అనే సందర్భమునకు బద్ధుడు కాను. సర్వదా ఆత్మస్వరూపుడను"** - అను

స్థితిని సిద్ధించుకొని ఉంటున్నాడు. అందుచేత ఆతనియందు భక్తి-జ్ఞాన-వైరాగ్య-యోగాభ్యాస-కర్మ ఫల సమర్పణ సంస్కారములు, అష్టాంగయోగ సంబంధమైన 'సాత్విక' వాసనలు మాత్రమే ఉంటాయి. అవి కూడా "కర్తవ్యానీతి మే। **"ఇవి నాకు కర్తవ్యములు మాత్రమే। అంతేగాని, ఆత్మగా నేను చేస్తున్నవి కావు"** - అని ఎరిగియే ఉంటాడు.

**మలినవాసనలు** - పునః పునః జన్మ జన్మాంతర కారకములు.

జీవన్ముక్తుని వాసనలు (Tendencies) - అపునర్జన్మ కారకములు (పునర్జన్మకు కారణములు తొలగించునవి) అయిఉంటాయి. **'నాది -నేను'** రూపముల **'అహంకారము'**ను జయించి, ముక్తాహంకృతులు (Relieved of limited Individual sense of Ego) అయి ఉంటారు. **అహంకారము త్యజించు అభ్యాసముచే వారు పరమశాంతిని సిద్ధించుకొని ఉంటారు.**

అందుచేత ఓ నిదాఘా! దృశ్యములో దుఃఖసంఘటనలు చూచినప్పుడు గ్లాని (Meloncholy, క్రోధ-ఆవేశములు) పొందవద్దు. క్రుంగవద్దు. సుఖ సంఘటనలు చూస్తూ పొంగవద్దు. ఆశ-నిరాశలకు లొంగి ఉండి ఉండవద్దు. ప్రాపంచక సంగతుల పట్ల అసంగివి (Non attached) అయి ఉండెదవుగాక! అనంతమగు ఆత్మస్వరూప లక్షణములను అవలంబించి, దిక్కు-కాలముల హద్దులకు పరిమితము కానివాడవై ఉండుము. ఆ రెండిటి మధ్య, మననస్వరూపుడవై, ఆత్మస్వరూపుడవై, కేవలమగు ఎరుకయే స్వరూపముగా కలవాడవై (చిన్మాత్రుడవై) ఉండుము. **"అక్షయము"** (That which does not have even a blink of decay), **"శాంతము"** [(undisturbed by all events including change of Bodies or Lokams (లోకములు)] సంతరించుకొని ఉండుము. **(సమస్త తరంగములలోని జలమువలె) ఏకము అగు బ్రహ్మమే నేను. మరొకటేదీ కాదు"** - అను సునిశ్చితత్వమును సుసంపన్నము చేసుకొని ఉండెదవుగాక!

**అంతర్ముఖత్వము** : "ఈ సమస్తము నాయొక్క ఆత్మప్రదర్శనమే" అను అంతర్ముఖత్వము వహించి ముక్తపురుషుడవు అగుము.

- **"ఈ సమస్తము నేనైన నేనే నేను" అను ఏకరూపుడవగుము.**
- **"నా ఆత్మయే సమస్త జీవులలో ఆత్మగాను, సమస్త జీవులుగాను ప్రదర్శితులు"** - అను యోగయుక్తత్వమును ఆశ్రయించి ఉండుము.
- నదీజలము సముద్రజలములో ప్రవేశించి తన ఇతః పూర్వపు (ప్రవాహ ఇత్యాది) స్వభావములను సశాంతింపజేసుకొను విధంగా - సమస్త జగత్ చాంచల్యములు నిశ్చలమగు ఆత్మయందు సశాంతించగా, **సర్వాతీతాత్మ స్వభావుడవై పరమశాంతిని వహించి ఉండుము.**
- ఈ దృశ్యము ఎట్లా ఉన్నా, ఎట్లా ఉండకపోయినా కూడా ఆత్మనిశ్చలత్వము ఏమాత్రము వదలక, ఈ దృశ్యముపట్ల సమరసభాన చెదరని స్థితియే **'మౌనము'**. అట్టి మౌనము సంతరించుకొని **'ముని'**వి అయి ఉండుము. ఆత్మ భావనానుండి అచ్యుతడవై ఉండుము.

## ఆత్మానందసాగరము - మనో బుద్ధి చిత్త - అహంకార తరంగములు

సముద్రములో తరంగాలు, సుడులు, బుడగలు, ఆవృత్తములు బయలుదేరి, తిరిగి సముద్రజలంలోనే లయమౌతూ ఉంటాయి కదా! తరంగములు మొదలైనవాటికి - (జలమునకువేరైన) ఉనికి ఎక్కడున్నది? అట్లాగే, ఆత్మానంద సాగరంలో చిత్తము లేదు. అవిద్య లేదు. జీవుడు లేదు. **బ్రహ్మైవ ఏకమ్ అనాద్యంతమ్ అబ్ధివత్ ప్రవిజృంభతే।** మహాసముద్రములో సముద్రజలంవలె బ్రహ్మమే **'ఏకము-అద్యంతరహితము'** అయి సర్వే సర్వత్రా సమస్తముగా విజృంభించుచున్నది.

**చిత్తభ్రమ** : ఎంతెంతవరకైతే **"ఈ దేహము మాత్రమే నేను. ఈ దృశ్యములో కనబడే ఒక వస్తువు వంటివాడను. ఈ దృశ్య జగత్తులో కొన్ని కొన్ని నాకు చెందినవి. నేను వాటివాటికి చెందినవాడను"** అను భావనలు వదలవో, అంతవరకు చిత్తము మొదలైన వాటియొక్క **విభ్రమము** వదలదు, ఆగదు. కొనసాగుతూనే ఉంటుంది. అందుచేత ఓ నిదాఘా! నీవు సమస్తమునకు ఆధారమైయున్న అంతరాత్మనే - జగద్దృశ్యమునందు, తదితర జీవులందు, నీయందు దర్శించువాడవై ఉండుము. ఇక్కడి త్రిజగత్ (స్వర్గ-మర్త్య-పాతాళ) సంభ్రమములను తృణప్రాయంగా (గడ్డిపరకతో సమానంగా) చూస్తూ, జ్ఞానాగ్నిచే బాహ్యదృష్టులన్నీ దగ్ధం చేసివేయి. అప్పుడు చిత్తము మొదలైన విభ్రమములన్నీ అంతరమున వాటికవే **'రహితము'** అయిపోతాయి.

**నేను** □జీవాత్మ, మొదలైన అంశలకు చెందనివాడను (అంశరహితుడను). **నాకు వేరుగా పరముగాని, అపరము అనబడేది గాని ఏదీ లేదు. సర్వదా నిర్మలము, కేవలము అగు చిదాత్మనందస్వరూపుడను"** - అని నీ నిజస్వరూపము గురించి స్మరించుచూ అన్యము పట్ల గుర్తించటము లేనివాడవై ఉండుము. **"అనేక ఆభరణములకు బంగారంవలె, అనేక తరంగాలకు జలమువలె - ఈ సమస్తమునకు నేనే ఆధ్యాత్మను"** - అనే "ఆధ్యాత్మశాస్త్రమంత్రము"ను మనోబుద్ధులతో జపిస్తూ, సదా తత్-మననము కలిగి ఉండుము. అప్పుడు

శరత్కాలంలో మంచు కరిగిపోవుతీరుగా నీయందు "ఏదో పొందాలి! కావాలి। సిద్ధించాలి। చేయాలి। ఎప్పటికో, ఎన్నటికో గాని మోక్షము సిద్ధించదు!"- మొదలైన అనేక రూపములుగా చిత్తములో ప్రవేశించియున్న దుర్వాసనలు, విషవాయువులు తమకు తామే క్షీణించిపోతాయి.

**కైవల్యపదము** : నీవు నీయొక్క కేవలీ ఆత్మస్వరూపము పట్ల 'ధారణ'ను ఎట్టి స్థితి-గతులలోను విడువవలసిన పనియే లేదు. అదియే ***"కైవల్యపదము".***

**పరిజ్ఞాయ పరిత్యాగో వాసనానాం య ఉత్తమః, సత్తా సామాన్య రూపత్వాత్, తత్ "కైవల్య" పదం విదుః॥**

స్వస్వరూము, నిజరూపము అగు ఆత్మయొక్క తత్త్వమును ఎరిగినవాడవై, దృశ్య సంబంధమైన సమస్త వాసనలు - సాత్వికవాసనలతో సహా త్యజించివేయి. సత్తా సామాన్యరూపము (That Form of SELF which is equally present in all beings and in all that is being seen and experienced) అవధరించి ఉండటమే - **'కైవల్యపదము'.** అంతేగాని కైవల్యమనగా ఎక్కడిగో ప్రయాణించి వెళ్ళుట కాదని గమనించెదవు గాక! వాసనలపట్ల పూర్ణ సుషుప్తుడవై ఉండు ధారణయే కైవల్యస్థితి. అది ధ్యాన-త్యాగములచే ఇక్కడే, ఇప్పుడే సిద్ధించుకోవాలి.

## సుషుప్తి - కైవల్యపదము

**నిదాఘుడు** : గురుదేవా! ఈ జీవుడు ప్రతిరోజు నిర్విషయరూపమగు 'సుషుప్తస్థితి'ని పొందుచూ ఉన్నాడు కదా! అట్టి స్థితిలో జాగ్రత్ యొక్క స్మరణయే ఉండదు కాబట్టి, అది కైవల్యపదమునకు సంబంధించినదని అనవచ్చునా?

**ఋభుమహర్షి** : ప్రతిరోజు జీవుడు పొందే సుషుప్తస్థితి జడవిశ్రాంతి స్థితి మాత్రమే। అంతేగాని వాసనారహిత నిజరూపానుభవము కాదు. **సుషుప్తస్థితిలో వాసనలు జయింపబడలేదు. దాచిపెట్టబడినవై మాత్రమే ఉన్నాయి.** వాసనలయందు (In the Tendencies of Assumptions and pressumptions as well as craving for getting or leaving) ఉండనే ఉన్నప్పుడు - వాసనాత్యాజ్య సుషుప్తస్థితి సిద్ధించగలదా? సిద్ధించజాలదు. గాఢనిద్రలో ఉన్న వానిలో వాసనాబీజములు ఉండనే ఉన్నాయి. మెలకువ రాగానే అవి శరవేగంతో అంకురించటానికి సిద్ధమయే ఉంటాయి. ఎప్పుడైతే వాసనలు నిర్జీవమై, వేయించిన విత్తనములవలె మరల అంకురించటానికి అశక్తమై ఉంటాయో - అట్టి స్థితియే **'తురీయ సిద్ధి'** అని అనిపించుకుంటుంది.

ఓ నిదాఘా! ఒక ముఖ్య విషయం గుర్తుంచుకో.

**మం॥ శ్లో॥ వాసనా యాః తథా వహ్నేః ఋణ వ్యాధిః ద్విషామపి**
**స్నేహ వైర విషాణాం చ శేషః స్వల్పోఽపి బాధతే॥**

అగ్ని, ఋణము, వ్యాధి, ఆయా విషయములపట్ల - వ్యవహారముల పట్ల స్నేహ-వైరములు (మిత్రత్వ-శత్రుత్వములు), విషము - ఇవన్నీ కూడా కొంచము మిగిలి ఉన్నా, ఈ జీవుని బాధిస్తూనే ఉంటాయి కదా! అట్లాగే వాసనలు (Attachments or detatchments with worldly events, persons, contexts etc.,) అంతరముగా కొంచము మిగిలి ఉన్నప్పటికీ -అవి అపార సంసారసాగరముగా రూపుదిద్దుకోగలిగియే ఉంటాయి. ఎప్పుడైతే వాసనలు వేయించిన బీజమువలె ఆత్మజ్ఞానాగ్నిచే దగ్ధమైనవై ఉంటాయో, అప్పుడు ఈ జీవుడు **'సత్తాసామాన్య స్వరూపము'** సంతరించుకోగలడు. ఎప్పుడైతే వాసనా బీజములు "సర్వేసర్వత్రా ఆత్మదర్శనము" - అనే దర్శనాభ్యాసముచే నిర్బీజమైపోతాయో, (పునః అంకురించజాలవో) - అట్టివాడు దేహము ఉన్నా, లేకున్నా కూడా - దుఃఖవంతుడు కాడు. (All worries vanish when all Tendencies become ineffective to be reproductive)

## అవిద్య

**నిదాఘుడు :** స్వామీ! 'అవిద్య' అనగా ఏమి? అద్దాని రూపు రేఖలు ఎటువంటివి?

**ఋభుమహర్షి :** "నీవు, నేను, ఈ జగద్దృశ్యము, ఈ సమస్తము బ్రహ్మమే - **సర్వంఖల్విదం బ్రహ్మ**" - అని వేద-వేదాంగముల ప్రవచనసారము. సమస్తము బ్రహ్మమే అయి ఉండగా, "బ్రహ్మము సిద్ధించాలి। అది ఎన్నటికో మరి?" - అను వేదనకు అర్థమేమున్నది? **ఏతావత్ ఏవ అవిద్యాత్వం నేదం బ్రహ్మేతి నిశ్చయః।** "ఇది బ్రహ్మము కాదు. బ్రహ్మము ఎప్పటికో, ఏదో ప్రయత్నముచేత మాత్రమే సిద్ధించుకోవలసియున్నది" - అను నిశ్చయము కలిగియుండటమే **"అవిద్య". ఏష ఏవ క్షయః, తస్యా 'బ్రహ్మేదమ్' - ఇతి నిశ్చయః।** "ఇది బ్రహ్మము కాదు" అనే భావనను 'సమస్తము బ్రహ్మమే కదా!" అనే నిశ్చయము యొక్క వీచికలచే కడిగివేయాలి.

**బ్రహ్మ చిత్** - తెలియబడేది - తెలుసుకొనేది - తెలివి- **అంతాబ్రహ్మమే।**

**బ్రహ్మ భువనమ్** – భూమి – ఆకాశము మొదలైన వాటితో కూడిన ఈ భువనమంతా (Total Physical Field) బ్రహ్మమే।

**బ్రహ్మ భూత పరంపర** – ఇక్కడి భూతజాలమంతా, జీవరాసులంతా, పంచభూతములతో సహా **బ్రహ్మమే।**

**బ్రహ్మోహమ్** – నేను బ్రహ్మమునే। బ్రహ్మము కాని క్షణమే లేదు.

**బ్రహ్మ శత్రుః। బ్రహ్మ చిత్ మిత్ర బాంధవాః।** – నాయొక్క శత్రువులు, స్నేహితులు, బంధువులు – అందరూ కూడా చిన్మాత్ర బ్రహ్మస్వరూపులే। పరబ్రహ్మ స్వరూపులే।

**'సమస్తము బ్రహ్మమే'** – అనుభావనచే అన్యమనిపించేదంతా బాధించబడగలదు. (తొలగగలదు).

భేద దృష్టి అనునది 'అనుకోవటము' వలననే రూపుదిద్దుకుంటోంది. **'సమస్తము అస్మత్ బ్రాహ్మీ స్వరూపమే'** – అని అనుకుంటూ ఉంటే క్రమంగా బ్రహ్మముగా అనిపించటము స్వాభావికం కాగలదు. అనుకోవటమే – **సాధన.** అందుకొరకు అనేక ఉపాయాలు అనిపించటమే **సిద్ధి.** బ్రహ్మమును తెలుసుకొని, సమస్తము బ్రహ్మముగా దర్శించు అంతరహృదయాభ్యాసికి క్రమంగా–**సర్వత్ర అవస్థితం శాంతం చిద్బ్రహ్మేతి అనుభూయతే।**–సర్వత్రా ఏర్పడినదై యున్న పరమశాంతమగు చిదానంద బ్రహ్మమే అనుభూతమవగలదు.

# సమస్తము బ్రహ్మమే కదా।

**నిదాఘుడు :** మహాత్మా! మీరు నిర్ద్వంద్వంగా సిద్ధాంతీకరించి చెప్పుచున్న **'సమస్తము బ్రహ్మమే'** – అనేది నిర్వివాదాంశమే. అది వేద హృదయము, ఆత్మజ్ఞుల గానలహరి కూడా–అని నేను ఒప్పుకుంటున్నాను. అయితే, మా ఈ మనస్సు పరిపరివిధములైన దృష్టులను కలిగి ఉంటోందే గాని, సర్వే సర్వత్రా సమమై వేంచేసియున్న బ్రహ్మమునకు సంబంధించిన **'బ్రాహ్మీదృష్టి'**ని కలిగి ఉండటమేలేదే?

**ఋభుమహర్షి :** అవును. మనస్సు యొక్క నైజము అట్లా ఉంటున్నమాట నిజమే! అయితే మాత్రం ఏం? ఏ మనస్సైతే సంస్కరించబడనిదై, బ్రహ్మజ్ఞాన సంస్కారములు ఆశ్రయించని కారణంగా, జగత్ దర్శన రూపంగా (భేదదర్శనరూపంగా) ప్రతీతమైయున్నదో, ఆ విధముగా ఉన్నది మాత్రం బ్రహ్మము కాదా? ఎందుకు కాదు? "సమస్తము బ్రహ్మమే।" – అనునది మూల సిద్ధాంతము కదా। **"సర్వగతమైన చిద్బ్రహ్మమే జగత్తుగా కనిపిస్తోంది కాబట్టి, నేనే 'బ్రహ్మము' అయి ఉన్నాను. కనుక ఈ సమస్తము నేనే"** – అను భావనను ఆశ్రయించియే నీవు ఉండుము. "అయ్యో! మనస్సు ఇట్లా ఉన్నదే?" అనే కౌతుకమును వదలివేయి. **"చాపక్రింద నీరువలె, సమస్త కెరటములలో జలమువలె, సమస్త భావనలలో స్వకీయ భావ చైతన్యము వలె – మమాత్మ సర్వగతము. సర్వత్రా ఈ సమస్తముగా విస్తరించి ఉన్నది"** – అను మననమును ఆశ్రయిస్తూ ఉండు. అన్యరూపములగు సర్వ కుతూహలములను, కర్మలకు సంబంధించిన సమస్త అంతర్గత సంరంభములను బ్రాహ్మీదృష్టియందు ఏకం చేసి వేయి. సర్వదా చిదాత్మ (The self which is knowing)ను సమాశ్రయించినవాడవై ఉండు. ఈ విధంగా పూర్ణమగు (అన్నపూర్ణస్వభావమగు), రాగరహితమగు బుద్ధిని సిద్ధించుకొన్న ధీరుడు జీవితమును నిందించడు. స్తుతించడు. మరణమును నిందించడు. స్తుతించడు. **"ఏది ఏ తీరుగా ఎప్పుడు ఉన్నా – సమస్తము బ్రహ్మమే। మరి నేను బ్రహ్మమును కాకుండా ఉంటానా? ఉండను"** అని ఎరిగి ఉంటాడు.

ఈ విధంగా **"ఈ సమస్తము నేనే" – అను బుద్ధిని బుద్ధిమంతులు సుస్థిరీకరించుకొని – జీవన్ – మరణములను బ్రహ్మములతో ఏకము చేసి సర్వదా నిశ్చింతులై ఈ భూమిపై చరిస్తున్నారు.**

# ప్రాణ నిరోధ – అభ్యాస ఉపాయము

**ఋభుమహర్షి :** దృశ్యభావనలను సంస్కరించి, బాహ్మీభావనను నిశ్చలము, స్వాభావికము చేసుకోవటానికి 'ప్రాణనిరోధము' – మహత్తరమైన ఉపాయంగా తత్వజ్ఞులచే ప్రబోధించబడుతోంది. అట్టి **'ప్రాణ నిరోధము'** గురించి కొన్ని విశేషాలు చెప్పుకుంటున్నాము. శ్రద్ధగా విను.

# ప్రాణము – స్పందనశక్తి

హే బ్రహ్మన్। ఈ జడదేహములో 'ప్రాణదేవత' ప్రవేశించినదై దేహముయొక్క అణువణువు చేతనముగా చేస్తోంది. అట్టి ప్రాణశక్తి స్పందనము (Activation) కలిగియుంటోంది. ఎల్లప్పుడు ప్రాణ గతి (Move) దేహమంతటా ఏర్పడినదై ఉంటోంది. అట్లాగే అపానము కూడా ఎల్లప్పుడు స్పందన – గతి కలిగి ఉంటోంది. (**ప్రాణశక్తి** = Emergising inward pull of Air **అపానశక్తి** = Energising outward push of Air )

ఈ విధంగా అపానము బయటనుండి దేహములోనికి, దేహము నుండి బయటకు నిత్యము కదలిక కలిగినదై అంతటా ఏర్పడి ఉంటోంది. ఏ ప్రాణశక్తి అపానముతో కూడి (మెలకువగా ఉన్నప్పుడు, నిదురిస్తూ ఉన్నప్పుడు కూడా) స్పందనశక్తి – గతిని ప్రదర్శిస్తోందో

–అట్టి ప్రాణ చలనముయొక్క ఉపాసనయే – **చిత్తమును, మనస్సును నిరోధించి, నియమించటానికి ఉత్తమోత్తమమైన ఉపాయము.** అట్టి **ప్రాణనిరోధమును** (ప్రాణోపాసనను) అభిజ్ఞులు (యోగవేత్తలు) ఏ విధంగా ప్రవర్తింపజేస్తూ సాధనగా మలచుచున్నారో, అట్టి ప్రాణాయోగాభ్యాసము గురించి కొన్ని విశేషాలు విను.

**పూరకము : ద్వాదశాంగుళ పర్యంతం బాహ్యం ఆక్రమతాం తతః, ప్రాణానాం అంగ సంస్పర్శో యః, స 'పూరక' ఉచ్యతే॥** బాహ్యమున 12 అం॥ వరకు విస్తరించియున్న ప్రాణశక్తిని గమనించి, ఆకర్షించి, (ముక్కులోపలికి స్వీకరించి) లోని అంగములను సంస్పర్శింపజేయటము **పూరకము.** (గాలిని బయట నుండి లోనికి పీల్చి గుండెలో నిలపటము పూరకము).

**"అపానము"** – అను చంద్రమసశక్తి దేహములో తృప్తి, చల్లదనము, సుఖము కలుగజేస్తూ ఉంటుంది. "ప్రాణము" – అనుశక్తి (సూర్యుడు–అగ్నిరూపుడై) దేహమును ఉష్ణముగా ఉంచుతూ ఆహార–పచనక్రియ నిర్వర్తిస్తూ ఉంటుంది. ప్రాణము (లోపలికి వచ్చు ప్రాణశక్తి) క్షయము పొందుచుండగా అపానము ఉదయిస్తూ చల్లదనము కలుగజేస్తూ ఆయా కార్యక్రమములను నిర్వర్తిస్తూ ఉన్నది.

## ప్రాణము – అపానము

I. ఓ నిదాఘా! ప్రాణ – అపానములను సమస్థితికి తెచ్చి మధ్యగా వేంచేసినదైయున్న **'చిదాత్మ'**ను ఉపాసన చేయి. సమాశ్రయించు. అనగా, **'ప్రాణము'** యొక్క ప్రసరణము ఉపశమించగా, **'అపానము'** ఇంకా ప్రారంభము అవని – **"ప్రశాంత సంధిస్థానము"** ఏర్పడి ఉండే **"నిశ్చల సత్–చిత్ తత్త్వము"**ను ఆశ్రయించి ఉండు. ఉపాసించు.

II. అట్లాగే – ఎక్కడ అపానము అసంగతము చెందుతుందో (శమిస్తుందో), ప్రాణము ఇంకనూ ఉదయించదో – **అట్టి అపాన – ప్రాణముల మధ్యస్థానమునగల నిర్మలమగు చిత్–తత్త్వమును సమాశ్రయించు.**

అనగా,

III. ఎక్కడ అపానము ఇంకనూ అస్తమించక ప్రాణమును పొందుతూ ఉంటుందో అట్టి ప్రాణపానముల కలయికల స్థానంలో (లేక) ఆ రెండిటి లయ స్థానములో (లేక) ప్రాణ–అపానముల సంధిస్థానంలో సర్వదా ఏర్పడి ఉన్న నిశ్చల సత్–చిత్ తత్త్వమును ఆశ్రయించి ఉండు. **నాసాగ్రంగా ప్రాణ–అపానముల రాకపోకల మధ్యగల కేవలచిత్ నందు ధ్యాసను నిలిపి ఉంచు. ఉపాసించుము.**

***అట్టి ప్రాణ–అపానముల మధ్య గల నిశ్చల సత్–చిత్ తత్త్వమే ప్రాణోపాసకుల ప్రాణేశ్వరాత్మ భగవానుడు.***

ఇక ఈ దృశ్యము గురించి ఏమిటంటావా? ఇదంతా అభాసమాత్రంగా (Like a Reflection in water or mirror. Not as original Truth) గా దర్శించు. అట్టి కలనగా (కల్పనగా) దర్శనమే జ్ఞానము. చిత్తముయొక్క విషయములను దర్శించకపోవు వ్యవహారము కూడా 'అభాస' (Illusion) యే। అట్టి చిత్తము – చిత్తము చేస్తున్న దర్శన / అదర్శనములు – ఉభయము బాహ్యముననే వదలివేసి, అంతరమున **"నిరాభాసుడవు"** – అయి ఉండుము.

## మనస్సుకు ఆవల – ఆత్మ స్వరూపము

ఓ నిదాఘా! అనేక భయములు ప్రసాదించునది, అనేక అశుభములకు (అకల్యాణములకు) ఆలవాలము, ధైర్యమంతా హరించివేసేది అగు 'మనస్సు' అనే పిశాచమును దూరంగా పారద్రోలి, అటుపై ఇక ఏది శేషిస్తోందో, అట్టి మనో – అతీత ఆత్మస్వరూపుడవై ఉండుము.

**సర్వశేష్యము : "పర – అపర భేదము** (Beyond and Before Difference) **లేనట్టిది"** అగు చిదాకాశమే సర్వత్రా విస్తరించినదైయున్నది. ఇక ఏ "చైత్యము" (ఇంద్రియములకు అనుభూతమగుచున్నట్టిది, తెలియబడేది అగు సమస్తము- That being known) కల్పాంతమువరకు ఉంటుందో–అదంతా లయించినాకూడా చిదాకాశము శేషించియే ఉంటుంది. ('I' does not end up even after "my" absolves).

## బంధమునకు కారణం? వాంఛ। (సంతుష్టి – అసంతుష్టి।)

**నిదాఘుడు** : హే మహానుభావన్! ఈ జీవుడు సర్వదా ఆత్మస్వరూపుడే కదా! ఆత్మ వాస్తవానికి నిత్యముక్తము కదా! మరి ఈ జీవునికి 'బంధము' అనబడేదంతా ఎట్లా, ఎందుచేత ప్రాప్తిస్తోంది?

**ఋభుమహర్షి** : ఆత్మస్వరూపుడే అయి ఉన్నట్టి జీవునికి ఈ కల్పితమగు దృశ్యము పట్ల 'వాంఛ' చేతనే బంధము భావనారూపంగా ఏర్పడినదై ఉంటోంది. **వాంఛా–క్షణేతు యా తుష్టిః, తత్ర వాంఛైవ కారణమ్॥**

*ఒకడు ఒక వస్తువును కోరుకుంటున్నాడనుకో. అది ఒక సమయంలో లభించగానే, ఆ క్షణంలో ఆతని తుష్టి (Satisfaction) లభిస్తోంది. ఇప్పుడు చెప్పు! ఆ తుష్టి వస్తువు వలన వచ్చిందా? కోరుకోవటము వలన వచ్చిందా?*

**నిదాఘుడు** : కోరుకోవటం వలన, అది సిద్ధించటం వలన ఆతనికి తుష్టి లభించిందని నాకు అనిపిస్తోంది.

**ఋభుమహర్షి** : బాగా చెప్పావు! అనగా? అది వస్తువు నుండి లభించలేదు. **అనగా కోరుకోవటము వలన అతుష్టి, లభించితే 'తుష్టి' వస్తున్నాయి.** ఇంతవరకు బాగానే ఉన్నది. మరి....

ఒక వస్తువు వలననో, సందర్భము వలననో, సంఘటన వలననో దుఃఖం ఎందుకు వచ్చింది? దానిపట్ల గల 'వ్యతిరిక్తేచ్ఛ' వల్ల కలిగిందే గాని, వస్తువు వలన గాని, సంఘటన వలన గాని దుఃఖము కలగలేదు.

**తుష్టిస్తు అతుష్టి పర్యంతా।** అతుష్టి (Dis-satisfaction) (లేక అసంతుష్టి) ఉన్నంతవరకు మాత్రమే తుష్టి (లేక సంతుష్టి) ఉంటుంది. **అనగా ప్రపంచంలో అనుభవమయే తుష్టికి మూలము – అతుష్టియే। అట్టి అతుష్టి తొలగనంతవరకు ఈ జీవుడు తన స్వాభావికానందమయ ఆత్మస్వరూపమును ఆస్వాదించజాలడు.**

అనగా "నాకు సంతుష్టి (Happyness) ప్రపంచంలో ఎక్కడ లభిస్తుంది?" – అనే వెతుకులాట అసంతుష్టి ఉండటంచేతనే బయల్వెడలుతోంది. **అట్టి మూలరూపమగు 'అసంతుష్టి'కి ఉపాయం వెతకకుండా, తుష్టి కొరకై జన్మలవెంట, కర్మలవెంట పరుగులు తీసి ఏమి ప్రయోజనం?** అది– "మూలవ్యాధి"కి మందువాడకుండా, బాహ్యాడంబరములకొరకై యాచించటము వంటిది. 'గాయము' తగ్గటం ముఖ్యంగాని, గాయము కనబడకుండా దాచుకోవటం ముఖ్యం కాదు కదా।

- వాంఛయే మొదలంట్లా పరిత్యజించివేయుము. **తస్మాత్ వాంఛాం పరిత్యజ।** (Wash out all Desires and Expectations).
- వాంఛకు మూలకారణం? సంకల్పము. అందుచేత నీవు వస్తువు గురించి, విషయముల గురించి, సంబంధముల గురించి (మరియు) సమస్త బాహ్య విశేషముల గురించి **<u>'సంకల్పించటము'</u>** అనే వ్యసనమును విరమించు. **'అసంకల్పము'**ను సాధన వస్తువుగా చేసుకో.
- అందుకుగాను ప్రాణాయామాది అభ్యాసములచే సంకల్పములను, తద్వారా జనిస్తున్న అతుష్టిని, అట్టి అతుష్టి నుండి తుష్టి కొరకై భావన చేయటమును – **రహితం చేయు ప్రయత్నము చేయి.**

## సంగము

ఎప్పుడైతే ఈ జీవుడు సంగము(Relatedness) ను మనన (లేక) సంకల్పపూర్వకంగా ప్రారంభిస్తాడో...ఇక క్రమంగా

| | | |
|---|---|---|
| నిరాశ (Non expectation) నుండి | → | 'ఆశ'కు |
| అమనస్కము నుండి | → | మనోవ్యసనమునకు |
| అభావ స్థితి నుండి | → | భావించు స్థితికి |

(ఆత్మస్థితి నుండి → సందర్భ స్థితికి) దిగజారటము జరుగుతోంది.

ఆకాశములో అనేక సంఘటనలు జరుగుచున్నప్పటికి, వందలాది క్షోభలు ఏర్పడుచున్నప్పటికీ ఆకాశము ఏమాత్రము ఏ వికారము పొందదు కదా! అట్లాగే, నీవు అంతరంగమునందు వాసనారహితుడవై, బాహ్యమున మాత్రం ఇంద్రియములను నియమిస్తూ, ఆయా క్రియలు నిర్వర్తిస్తూ ఉండు. నిర్వహిస్తూ ఉన్నప్పటికీ కూడా – (ఆకాశమువలె) నీవు ఎట్టి క్షోభను పొందవద్దు. నిర్వర్తించుచున్నట్టి – నిర్వర్తించనట్టి – సమస్త కర్మలను క్రీడా వినోదంగా మాత్రమే దర్శిస్తూ ఉండు.

## చిత్తము

**చిత్త ఉన్మేష – నిమేషాభ్యాం సంసృతేః, ప్రళయోదయౌ।** చిత్తము యొక్క కనులు తెరవటమే సంసారము (లేక) సంసృతి. చిత్తము యొక్క కనులు మూయటమే ప్రళయము. (అంతేగాని, సృష్టి ప్రళయములనగా ఈ ఎదురుగా కనిపించే ప్రకృతి దృశ్యము యొక్క ప్రారంభ –వినాశనములు కావు).

అందుచేత ఓ నిదాఘా! ఈ మనస్సును ఆత్మపట్ల ఉన్మేషము (కనులు తెరవటము) చేయటమే **సంసార (లేక) సంసృతి దోషనివారణము**నకు మార్గము. అందుకు రెండు విధి – విధానములు (Two simulteneous Approaches)

(1) వాసనలను (Tendencies) త్యజించుచూ ఉండటము (2) ప్రాణ నిరోధము.

(చిత్తము వలెనే) **ప్రాణ ఉన్మేష - నిమేషాభ్యాం సంసృతేః ప్రళయ ఆదయోః।** ప్రాణముయొక్క ఉన్మేష (కనులు తెరవటము - వికాసము) - నిమేషములు (సంకోచము, లయము) - ఇవియే సంసృతి - ప్రళయములు కూడా! కనుక **'ప్రాణనిరోధాభ్యాసము'**ను నిర్వర్తించు. ప్రాణమును ఉన్మేషరహితము చేయి (నిత్యప్రాణశక్తి స్వరూపుడవై విరాజిల్లు)

(**ఉన్మేషము** = కనులు విచ్చుట, వికాసము, ప్రకటనము, అభివృద్ధి **నిమేషము** = కనులు మూయుట, సంకోచము)

## మౌర్ఖ్యము (మూర్ఖత్వము)

**మం॥ శ్లో॥ మౌర్ఖ్య ఉన్మేష నిమేషాభ్యాం కర్మణాం ప్రళయ - ఉదయౌ।**
**తత్ విలీనం కురు బలాత్, - గురు శాస్త్రార్థ సంగమైః॥**

మూర్ఖత్వము యొక్క నిమేషమే వృద్ధియే - **కర్మల ప్రళయము. (కర్మ రాహిత్యము). (నిమేషము = కనులు మూయుట).**

మూర్ఖత్వము యొక్క ఉన్మేషమే సంకోచమే - **కర్మల ఉదయము. (కర్మబంధము). (ఉన్మేషము = కనులు తెరవటము).**

నీవు గురు, శాస్త్ర నిర్ణయ, శాస్త్రార్థముల, స్వావగాహన, స్వానుభవముల సహాయంతోను, యోగాభ్యాస బలంతోను (భక్తి జ్ఞాన యోగాభ్యాసములతోను) కర్మల ప్రళయము (కర్మరాహిత్యము) సిద్ధించుకో. **సమస్త కర్మలను కర్మరహితమగు ఆత్మయందు దర్శించు.**

**అసంవిత్ స్పందమాత్రేణ యాతి చిత్తమ్ - 'అచిత్తతామ్'।** చిత్తము అనగా ఏమి? సర్వదా సర్వత్రా నిశ్చలమైయున్న నీ సంవిత్ (సత్-విత్) స్వరూపము ఇంద్రియ దృశ్య - సంగతి, సందర్భ, సంబంధ, సంఘటనలకు స్పందించటముచే **'చిత్తము'** అని అంటున్నారు.

**<u>"అసంవిత్ స్పందనము"</u>** (Non responsiveness by being beyond to worldly events) పొందినమాత్రంచేత చిత్తము అచిత్తత్వము సంతరించుకోగలదు. ప్రాణనిరోధము స్వాభావికమవగలదు. పరమపదము సిద్ధించ గలదు. **"ఏది ఎట్లా ఉన్నా కూడా నేను సర్వదా యథాతథమగు పరాత్మానంద స్వరూపుడనే" -** అను చెదరని నిశ్చల నిశ్చయానుభవమే **అస్పందము (లేక) అచిత్తము.**

ఓ నిదాఘా! (1) దృశ్యము - దర్శనముల పరస్పర సంబంధముచేత **ఏ సుఖము లభిస్తున్నదో, అద్దాని సుఖము** (2) దృశ్యమునకు ఆవలగల సంవిత్‌తత్త్వము (లేక), సత్-విత్ **ఆత్మతో మమేకమగుటచే లభించు సుఖము -** ఈ రెండిటిని సరిపోల్చి చూచుకో. అటు తరువాత - దృశ్య - దర్శన సంబంధమును బ్రాహ్మీదృష్టితోనే చూచెదవుగాక। సాంసారిక (భౌతిక) దృష్టితో చూడకుండెదవుగాక!

**యత్ర న అభ్యుదయం చిత్తం, తద్వై సుఖం అకృత్రిమమ్।** దృశ్య విషయములచే చిత్తము పొందే సుఖము కృత్రిమమైనది మాత్రమే. ఎక్కడైతే చిత్తము అభ్యుదయము (వృద్ధి) పొందదో, అక్కడ మాత్రమే అకృత్రిమము అగు సుఖము (Natural - Non Artificial Happyness) లభించగలదు. ఎప్పుడైతే చిత్తము క్షయము గాని, అతిశయము గాని (Neither decay nor opening up) పొందదో, అక్కడ మాత్రమే నిజమైన ప్రశాంతత. ఆత్మజ్ఞానియొక్క చిత్తము - చిత్తము కాదు. 'అచిత్తమే' అనబడుతోంది. అదియే తురీయ, తురీయాతీత అవస్థలతో సంలీనమగుచూ 'సత్త్వము' (సత్+త్వమ్) అనబడుతోంది.

అందుచేత ఓ నిదాఘా! నీయందు నీవు పూర్ణానుభావుడవై ఉంటూనే ఈ జగన్నాటకంలో నటించువాడవై ఉండు. నీయొక్క నిశ్చల పరస్వరూపానుభవమును ఏమరువవద్దు.

## "జ్ఞానవాన్-మోక్షవాన్"

మునీ! ప్రియ నిదాఘా! సర్వ సంకల్పములు(All Visualizations, Presumptions and Assumptions with regard to wordly events, happenings etc) **సన్న్యసించి, అంతరమున సమము - శాంతము అగు మనస్సును కలిగి ఉండుము. సన్న్యాస - యోగాత్మువవదవు కమ్ము.** సర్వత్ర శాంత స్వభావముచే విరాజిల్లు అంతరంగము కలిగి ఉండుము.

- ఆత్మయొక్క ఔన్నత్యము తెలుసుకొని - <u>'జ్ఞానవాన్'</u> - అగుము,
- **"ఆత్మస్వరూపుడనగు నాకు ఎప్పుడూ కూడా బంధమే లేదు"** అను బుద్ధి యొక్క నిస్సందేహమైన అవగాహనతో, మనస్సుయొక్క సర్వత్రా ఆత్మ దర్శనముచే <u>'మోక్షవాన్'</u> అగుము.
- బాహ్యమగు సర్వ సంకల్పములు **"సమస్తము ఆత్మగా భావించుట"** - యందు సశాంతించగా **<u>"ప్రశాంత ఘనవాసనుడవు"</u>** - అగుము
- 'భావన' యొక్క ఆకారము (The Form of Thinking and Feeling) కించిత్ కూడా స్వీకరించని **స్వస్వరూప ధ్యాన అభ్యాసముచే - బాహ్యములగు నామ-రూప పరిమిత దృష్టిని అధిగమించి "సమస్తము సర్వదా పరబ్రహ్మమే"** అను నిశ్చయానుభూతి కలిగి ఉండుము.

# సాంఖ్య యోగులు - యోగ యోగులు

**సాంఖ్యయోగులు : సమ్యజ్ జ్ఞాన అవరోధేన నిత్యమ్ ఏక సమాధినా, సాంఖ్య ఏవ అవబుద్ధా యే, తే 'సాంఖ్యా యోగినః పరే"॥**

**తరంగములు** అనేకమైనప్పటికీ - **జలము** ఏకమే కదా!

**ఆభరణములు** అనేకంగా కనబడుచున్నప్పటికీ - **బంగారము** ఒక్కటే కదా!

**సూర్యకిరణములు** వేరువేరు చోట్ల ప్రసరిస్తున్నప్పటికీ - **సూర్యుడు** ఒక్కడే కదా!

**వాయు వీచికలు** వేరువేరైనప్పటికీ - **వాయువు** అంతటా ఒక్కటే కదా।

"అనేకముగా కనిపిస్తున్నప్పటికీ, ఈ సమస్త జీవులు సర్వదా ఏకమగు ఆత్మస్వరూపులే" అని ఏ విచారణ - విచక్షణలచే నిర్ణయమౌతుందో, - అదియే **సాంఖ్యయోగము**. అట్టి **"అనేకముగా చూస్తూ కూడా ఏకముగా అనిపించటము"**ను సిద్ధించుకొన్నవారే **'సాంఖ్యయోగులు'**. సమస్తమునకు పరమగు ఆత్మగా **"అహమ్-త్వమ్-తత్"** లను ఏకమగు ఆత్మ - దృష్టికి జేర్చి దర్శించువారే - సాంఖ్యయోగపరులు. **ఇది విచారణ మార్గము.**

**యోగయోగులు: ప్రాణాది అనిల సంశాంతౌ యుక్త్యా యే పదమ్ ఆగతాః, అనామయమ్, అనాద్యంతమ్-తే స్మృతా 'యోగయోగినః"।**

- పూరక-కుంభక-రేచకముల అభ్యాసముచే క్రమంగా ఆయా ఉపాయములతో సహజకుంభకము సిద్ధించుకోవటము. దేహములోని నవరంధ్రములలోను, షట్ చక్రములలోను, నాడులందు **"ప్రాణనిశ్చలాభ్యాసము"** నిర్వర్తిస్తూ ఉండటము.
- ప్రాణవాయు చలనమును ప్రాణశక్తి యందు, ప్రాణశక్తిని ప్రాణేశ్వరుడగు ఆత్మయందు యుక్తితో సశాంతింపజేయటము.
- యోగాభ్యాసపూర్వకంగా అనామయము, ఆద్యంత రహితము అగు ఆత్మ పదమును సిద్ధింపజేసుకోవటము.

అట్టివారు యోగయోగులు. **ఇది యోగ మార్గము.**

**నిదాఘుడు** : మహాత్మా! అట్టి (1) సాంఖ్యయోగులు (2) యోగయోగులలో - ఎవరు యోగవిత్-తములు (లేక) అధిక శ్రేష్ఠులు? ఏ మార్గము త్వరితముగా ఫలప్రదము?

**ఋభుమహర్షి :** సాంఖ్యాయోగులు, యోగయోగులు (జ్ఞానమార్గపరులు, యోగమార్గపరులు) - ఇరువురు చేరేది ఒక్కచోటికే. ఇరువురు అకృత్రిమమగు శాంతపదము సిద్ధించుకొనుచున్నారు. రెండు మార్గములు ఒక్కచోటికే దారితీస్తూ ఉండగా...ఇందు "ఒకటి తక్కువ, మరొకటి ఎక్కువ" - అనే ప్రసక్తి ఎక్కడిది? ఎవరికి ఏది రుచియో, వారు ఆ మార్గములో **"అఖండాత్మమేవాహమ్"** - స్థానమును తప్పక సిద్ధించుకోవచ్చును.

అంతేకాదు. ఆ రెండు కూడా **"పరస్పర సిద్ధి న్యాయము"** కలిగి ఉన్నాయి. అనగా, వాటిలో యోగి ఒకటి సిద్ధింపజేసుకొంటూ ఉండగా, రెండవది స్వాభావికంగానే ఆతనిపట్ల సంసిద్ధమగుచూనే ఉంటుంది.

**(1) ఏకార్థ-అభ్యసనము :** ఏకము, అక్షరము, పరమార్థము అగు ఆత్మగురించిన శ్రవణ-మనన-నిది ధ్యాస - సమాధి రూపమగు - అభ్యాసము. క్రమంగా సర్వత్రా స్వస్వరూప-అఖండాత్మ దర్శనము.

**(2) ప్రాణ నిరోధము :** (1) పూరక - రేచకముల మధ్యగా వాయు కుంభకము, (2) దేహముయొక్క బాహ్య - అంతరములలో పూరక-రేచక (లేక) స్వాభావిక/సహజకుంభకాభ్యాసము, (3) ప్రాణముల కదలికలను దర్శిస్తూ మూలరూపమగు నిశ్చల ప్రాణశక్తిని ఉపాసించటము, (4) ప్రాణశక్తి సహాయంతో ప్రాణేశ్వరోపాసన. (5) క్రమంగా అఖండాత్మ సందర్శనము.

**(3) చిత్త పరిక్షయము :** ఈ చిత్తము ఏఏ సందర్భములందు, సంఘటనలయందు, నామ-రూపాదులయందు అరిషట్ వర్గరూపంగా ఇష్టాయిష్టములు పొందుచూ తగులుకొని ఉంటోందో - అది **గమనించటము.** అట్టి చిత్తమునకు **బ్రహ్మభావనను అలవరచుచూ, సర్వే సర్వత్రా అఖండాత్మ దర్శనముచే చిత్తమును సత్త్వస్థితికి తీసుకురావటము.**

ఈ మూడు కూడా - **(1) ఏకార్థాభ్యసనం, (2) ప్రాణరోధః (3) చేతః పరిక్షయః- ఏ కస్మిన్ ఏవ సంసిద్ధే, సంసిద్ధ్యంతి పరస్పరమ్॥...** (మూడిటిలో) ఒకటి నీవు సిద్ధింపజేసుకొంటూ ఉండగా, తక్కిన రెండు స్వాభావికంగానే నీ పట్ల సంసిద్ధమౌతూ ఉంటాయి.

*అందుచేత "ఇది ఎక్కువ, ఇది తక్కువ" మొదలైనవి ఉత్తమయోగులు - చర్చకు విషయముగా ఏమాత్రము పరిగణించరు. విజ్ఞులు ఈ మూడు ఒక్కసారిగా ఆశ్రయించువారై ఉంటారు. అంతేగాని వేరువేరు దృష్టితో చూడరు.*

## ప్రాణ-చిత్తముల అవినాభావసంబంధము

**అవినా భావినీ నిత్యం జంతూనాం ప్రాణ-చేతసీ।**

(1) ఎక్కడ కుంభకముచే ప్రాణశక్తిని నిరోధించి ఉంచుతామో, అక్కడ చిత్తము కేంద్రీకృతం కాసాగుతుంది. ఎక్కడ చిత్తమును తెచ్చి ఏకాగ్రం చేస్తామో, అక్కడిక ప్రాణశక్తి కేంద్రీకృతం అవుతూ వస్తుంది.

(2) ఈ చిత్త-ప్రాణముల అంతర్లీన గానము 'ఇష్టము' లేక ఇచ్ఛాశక్తియే।

(3) ఈ రెండు 'భావన'చే నిర్మితమైనవే।

అందుచేత చిత్త-ప్రాణములు అవినాభావ సంబంధములు కలిగి ఉంటాయి. అనగా ఒకటి ఉన్నచోట రెండవది భావనాత్మకమై, అనుభూతిరూపమై వచ్చి చేరుతుంది. ఒకటి ఉండనిచోట, రెండవది కూడా ఖాళీ చేసి వెళ్ళిపోతుంది.

అంతేకాదు.

ఆధార-**ఆధేయవత్ చ ఏతే, ఏకభావే వినశ్యతః॥**

ఈ చిత్త - ప్రాణములు రెండిటికీ ఆధార-ఆధేయ సంబంధము (Mutually dependent. The Relationship of one being dependent upon the independence of the second one)- ఉన్నది. ఒకటి తనను తాను త్యజించి రెండవదానితో ఏకత్వము సంతరించుకోగలదు.

**ఒకచోట కొంత మట్టితో చేసిన గుఙ్ఞము సాకారముగా ఏర్పడి ఉన్నది.**

- అక్కడినుండి ఆ మట్టిని ఎక్కడికో తొలగిస్తున్నాము. మట్టితోబాటు గుఙ్ఞము కూడా తొలగుతుంది కదా!
- ఆ మట్టి గుఙ్ఞమును ఎవరికో బహుమతిగా ఇచ్చి వేస్తున్నాము. అనగా మట్టి కూడా గుఙ్ఞముతో బాటే బహుమతిగా ఇచ్చివేయబడుచున్నట్లే కదా।

అంతేగాని **"మట్టిని అట్టే బెట్టండి. గుఙ్ఞమును మాత్రమే ఇచ్చివేయండి"** - అనునదిగాని, (లేక) **"గుఙ్ఞమును అట్టే బెట్టండి. మట్టిని మాత్రమే ఇచ్చివేయండి"** - అనునది గాని ఏమాత్రము కుదరదు కదా।

అట్లాగే చిత్తము - ప్రాణములు విడదీయరాని బంధము కలిగి ఉన్నాయి.

ఇంతేకాకుండా...

**ఈ చిత్త - ప్రాణములు ఒకేసారి నశించినవై (సాధనలు సిద్ధించిన తరువాత శాంతము వహించినవై) (లేక) యోగభావనయందు సంయోగము పొందినవై - ఆ యోగికి మోక్షము ప్రసాదించుచున్నాయి.**

## పరమం పదమ్

**నిదాఘుడు :** మహనీయా! 'పరమపదము' అని తత్త్వశాస్త్రము మహదాశయముగా చెప్పు స్థితి మాకు సిద్ధించేది ఎట్లా?

**ఋభుమహర్షి :**

**శ్లో॥ సర్వమేతత్ ధియా త్యక్త్వా యది తిష్ఠసి నిశ్చలః,**
**తదా అహంకార విలయే - త్వమేవ పరమం పదమ్॥**

బిడ్డా! మహాశయా! నిదాఘా! ఎప్పుడైతే నీకు 'అన్యము' అని అనిపించేదంతా నీయొక్క 'బుద్ధి'తో త్యజించి, మనస్సును నిశ్చలం చేసి ఉంటావో...అట్టి స్థితిలో అహంకారము స్వయముగా ('ఉష్ణజలంలో ఉంచిన మంచుగడ్డ'వలె) ఆత్మజ్ఞానాగ్ని యందు కరిగిపోయి, ఆత్మతో అనన్యత్వము సంతరించుకోగలదు. అప్పుడు నీవు **'పరమం పదము'**ను సిద్ధించుకొన్నట్లే। **నీవే అది (తత్ త్వమ్) అగుచున్నావు.**

## ఆత్మఏవ మహాచిత్ -మహాసత్త

ఇక్కడ మహాచిత్ (The Factor of 'knowing' that is at present in all beings) మాత్రమే ఉనికిని కలిగి ఉన్నది. అదియే "మహాసత్త" (Al- pervading - BEING) - అని కూడా వర్ణించబడుతోంది. (Al-pervading Knowing & Al- pervading BEING)

అట్టి ఆత్మకు "మనో బుద్ధ చిత్త అహంకార-దృశ్య-జన్మ-మృత్యు-మొదలైన సంబంధమైన ఏ దోషము కించిత్ కూడా అంటజాలదు. కాబట్టి అది **నిష్కళంకము**. సర్వత్రా సమస్వరూపమై ఉన్నది కాబట్టి **'సర్వసమము'**. సర్వదా **పరిశుద్ధము**. అహంకారమునకు కూడా ఆవలది కాబట్టి **నిరహంకార స్వరూపము**. అద్దాని విభవమే ఈ సంద్రృశ్యమగుచున్నదంతా। కాబట్టి **సకృత్ విభాతము**. అట్టి ఆత్మను నిర్మలదృష్టి చేతనే గమనించగలము కాబట్టి **విమలము**. సూర్యగోళమువలె **స్వయం ప్రకాశక - నిత్యోదితము।** (Ever Blossoming).

అట్టి ఈ జీవుని సహజము, కేవలము (Original and absolute) అగు స్వస్వరూప తత్త్వమే **'బ్రహ్మము'** అని, **'పరమాత్మ'** అని, **'పరబ్రహ్మము'** అని, **'శివము'** అని, **'విష్ణుతత్త్వము'** అని – ఇంకా ఇంకా అనేక పేర్లతో శాస్త్రములచే శ్లాఘించబడుతోంది.(శివతత్త్వ = త్వమ్ తత్ శివేతి).

ఓ నిదాఘా! **"అట్టి పరమాత్మ (లేక) పరబ్రహ్మమే నేను" (సోఽహమ్ తత్త్వమ్)** – అని నిర్ణయించుకొని, కృతకృత్యుడవు అయ్యెదవుగాక!

## సోఽహమ్

* ఏది **బ్రహ్మము, పరబ్రహ్మము, శివము, అనంతము, స్వయము, ఆది, కేవలము, నిజస్వరూపము** మొ॥న మహత్ శబ్దములతో వాఙ్మయముగా తత్త్వజ్ఞులచే గానము చేయబడుతోందో– అది "నేనే" అయి ఉన్నాను. **అది నేను కాని క్షణమే లేదు. ఉండబోదు.**
* (ఆత్మ స్వరూపుడనగు) నేను భూత – భవిష్యత్ రూపమగు కాలమునకే అతీతుడను. వర్తమానమునందే పై 'పరార్థము'గా సంస్థితుడను. కాలాతీతుడను. కాలనియామకుడను. కాలభావికుడను. **కాలఃకాలుడను.**
* ఆత్మకు 'అన్యము' అనునది ఎక్కడా ఏదీ లేదు. నేను నిజస్వరూపంగా 'పరమాత్మ'నే అయి ఉన్నాను. అందుచేత **"ఇదమద్య మయా లబ్ధం। ఇమం ప్రాప్స్యామి సుందరం।" – న స్తౌమి। న చ నిందామి। – (కింతు) ఆత్మనో అన్యం నహి క్వచిత్॥** సమస్తము ఆత్మయే అయి ఉండగా "ఇదిగో! ఇంతవరకు నాచేత పొందబడింది. ఇంకా ఈ సుందరమైనవి నాచే పొందబడవలసి ఉన్నది. మోక్షము కొరకై ఇంకా ఇంత నేను నిర్వర్తించవలసియున్నది?" – మొదలైనవేవీ నాపట్ల ఏమాత్రమూ లేనేలేవు.
* **న తుష్యామి శుభ ప్రాప్తౌ। న భిద్యామి అశుభాగమే।** నాకు శుభము ప్రాప్తించింది కదా అని సంతోషించవలసినవి లేవు. అశుభములు వస్తాయేమోనని భయపడవలసినవి లేవు. ఆత్మనగు నేను శుభాశుభములకు విషయమునే కాను.
* మమాత్మ సౌందర్యమును, ఆత్మయొక్క ఔన్నత్యమును గుర్తించుచూ, – ఎటువంటి చాపల్యములు లేనివాడనై, శోకరహితుడనై ప్రశాంతమైన ముఖమును అవధరిస్తున్నాను.
* **మనస్సు 'నాది' కాని, 'నేను' కాదు.** అట్టి నాచే నియమితమైన మనస్సుచే అనామయుడనై (అద్దములో వస్తువులు కనబడుతున్నప్పటికీ, అద్దములో ఏ వస్తువు లేని విధంగా), పరమశాంతముగా **'జీవితము' అనే ఒక స్వయంకల్పిత సందర్భమును ఆస్వాదిస్తున్నాను.**
* 'సమస్తము' అయి ఉన్న ఆత్మను నేనే అయి ఉండగా, ఇక నాకు నా బంధువులెవరు? నాకు పరులు (వేరేవారు) ఎవరు? నాది అయినదేమున్నది? నాది కానిదేమున్నది? హే బ్రహ్మన్! సమస్తమునకు సంస్పర్శ (Touch) ను ప్రసాదిస్తున్నది నాకు నేనుగా నేనే। మమ అఖండాత్మ స్వరూపమే। సర్వదా నేను బ్రహ్మానంద స్వరూపుడనే।

## ద్వైతము జయించేది ఎట్లా?

ఓ నిదాఘా! ద్వైతబుద్ధివలననే వాసనలు జనిస్తున్నాయి. వాసనలు త్యజించివేస్తే ఇక జరామరణ రహితమగు ఆత్మయే సర్వదా శేషించినది అగుచున్నది. మనస్సుయొక్క వాసనలు కలిగియుండు సందర్భంలో (సువాసనం మనః)...(అది "జ్ఞానరూపమగు – మనస్సు వాసనారహితమై యున్నప్పుడు) ఆ మనస్సు **"జ్ఞేయమగు ఆత్మస్వరూపమే"** – అగుచున్నది.

**నిదాఘుడు :** మహర్షీ! 'ఆత్మ అఖండము' అని మేము అధ్యయనము చేస్తూ ఉన్నప్పటికీ మాపట్ల "నేను వేరు – నీవు వేరు – ఇష్ట దైవము వేరు" మొదలైన అనేక భేదరూపములుగా వర్తమానానుభవము అనివార్యము, అప్రతిహతము, దాటుటకు కష్టతరము అవుతోందే। ఎందుచేత? అట్టి ద్వైత భావనను మేము అధిగమించేది ఎట్లా?

**ఋభుమహర్షి :** జన్మ–జన్మల కర్మ సంబంధమైన అభిమానములు ఈ జీవునిపట్ల వాసనలు (Tendencies) గా రూపు దిద్దుకుంటున్నాయి. అట్టి వాసనలే (వస్త్రమునకు దారమువలె) చిత్తముయొక్క మూల రూపము అయి ఉంటున్నాయి.

**చిత్తే త్యక్తే లయం యాతి ద్వైతమ్ ఏతచ్చ సర్వతః॥** అట్టి వాసనా నిర్మితమగు చిత్తము త్యజించబడిందా, అప్పుడిక ద్వైతము పూర్తిగా లయము పొందగలదు.

> వాసనలు → సంస్కారములనుండి, సంస్కారము → అభ్యాసములనుండి, అభ్యాసములు → ఇంద్రియ–మనో సంబంధమైన కర్మ సందర్భములనుండి రూపుదిద్దుకుంటున్నాయి.

ఎప్పుడైతే చిత్తము లయిస్తుందో (లేక) శమిస్తుందో, అప్పుడిక **శేషించే పరబ్రహ్మతత్త్వమే** స్వస్వరూపముగా సహజరూపముగా ఉపహితము (స్వానుభవము) అవుతుంది. అట్టి నీయొక్క సహజము, కేవలము అగు స్వరూపము ఎట్టిదంటే...

**పరమగ్ం :** ఈ సమస్త దృశ్య వ్యావహారమునకు ఆవల - పరమై ఉన్నట్టిది.

**శాంతమ్ :** పరమ శాంత స్వరూపమైనట్టిది.

**స్వచ్ఛమ్ :** ఎట్టి దోషములు ఆపాదించబడజాలనిది.

**అనామయమ్ :** జగత్ విశేష వ్యవహార రహితమైనది.

**అనన్తమ్:** పంచభూతములచేత గాని, మనో - బుద్ధి - చిత్త అహంకారములచేత గాని, దేహ - దేహాంతరములచేత గాని పరిమితము కానట్టిది.

**అజరగ్ం :** తరగటం, వార్ధక్యము మొదలైనవి ఏమాత్రము లేనట్టిది.

**శాంతమ్ :** సర్వదా ప్రశాంత స్వరూపము.

**అచ్యుతమ్ :** దేహముల రాక - పోకల చేతగాని, జ్ఞాన - అజ్ఞానముల చేతగాని 'స్వ-స్థితి' నుండి ఏమాత్రము చ్యుతి (Distraction, Displacement) పొందనట్టిది.

**అద్వితీయమ్ :** జగత్తు, జీవాత్మ, ఈశ్వరుడు, జాగ్రత్ - స్వప్న - సుషుప్తులు మొదలైన సమస్తము తనకు ద్వితీయము కానట్టిది.

**అనాద్యంతము :** మొదలుగాని, చివరగాని కానట్టిది, లేనట్టిది.

**యత్ ఆద్యమ్ :** సమస్త జీవులకు ఆది స్వరూపము. ఈ జీవునికి సంబంధించి - మొట్టమొదటయే ఉన్న **చైతన్యస్వరూపము.**

**ఉపలంభనమ్ :** సమస్తము తనయొక్క "అనుభవము" అను కల్పనయందు కలిగి ఉన్నట్టిది.

**ఏకమ్ :** ఏమాత్రము కూడా అనేకముగా అవనట్టిది.

**ఆద్యన్తరహితమ్ :** "ఇదిమొదలు - ఇది చివర" అని చెప్పటానికి ఏమాత్రము వీలుకానట్టిది.

**చిన్మాత్రమ్ :** కేవలమగు ఎరుక (Absolute knowing) రూపము. కేవలమగు తేజోరూపము (The Absolute Form of Englightenment)

**అమలమ్ :** ఏ దోషము ఆపాదింపబడజాలనట్టిది.

**తతమ్ :** సర్వత్రా విస్తరించి ఉన్నట్టిది.

**ఖాదపి అతి తరాం సూక్ష్మం :** ఆకాశము కంటే కూడా అత్యంత సూక్ష్మాతి సూక్ష్మము.

**అట్టి బ్రహ్మమే నేను। తత్ 'బ్రహ్మ' అహమస్మి**
**ఇందులో సందేహమే లేదు। న సంశయః॥**

ఓ నిదాఘా! - "ఏది దిక్, కాలము మొదలైనవాటిచే విచ్ఛిన్నము (Breakup) కానట్టిదో, అత్యంత స్వచ్ఛమో, నిత్యోదితమో (Ever-Blossoming Ever Dawn), సర్వత్రా ఈ సమస్తముగా విస్తరించినదై యున్నదో, సర్వత్రా సర్వార్థమయమై (Multi-purpose, Multi Faceted) అయి కూడా ఏకార్థమే (unity in the Diversity) అయి ఉన్నదో, కేవల ఎరుక - తేజోరూపమైన 'చిన్మాత్రమో' - అమలమో **అట్టి బ్రహ్మమే నేను"** అను మననముచే **బ్రహ్మమే నీవు కాగలవు.**

**స్వరూప-స్వభావతః నేను**

- సర్వము అయి ఉన్నాను.
- సర్వదా ఏకమే అయి ఉన్నాను.
- పరమశాంత స్వరూపుడను.
- ఆదిమధ్యాంత రహితుడను.
- భావాభావములకు మునుముందే ఉండి, ఆ ఉభయము నేనే అయి ఉన్నవాడను.
- ఈ సమస్తము సర్వదా నేనే -

అను అవగాహనను ఆశ్రయించి సుఖస్వరూపుడవై ఉండుము.

*నాకు బంధము లేదు। ముక్తిలేదు। సర్వదా ఆకాశమువలె నిరామయమగు బ్రహ్మమే అయి ఉన్నాను। సర్వదా - "నాకు ఏదో వేరుగాఉన్నది" - అను ద్వైత భావము నుండి సదా విముక్తుడను. సత్ - (ఉనికి), చిత్ (ఎరుక), ఆనందము (అనుభూతి) స్వాభావికమైయున్న సచ్చిదానంద లక్షణుడను.*

ఇట్టి భావనను ప్రయత్నపూర్వకంగా ఆశ్రయిస్తూ ఉన్నావా - ఇక నీవు **జీవన్ముక్తుడవు** అయినట్లే. ఇంతకుమించి జీవన్ముక్తత్వమునకు మరొక అర్థముగల నిర్వచనమేమీ లేదు.

## పదార్థే సంత్యజ।

**శ్లో॥ పదార్థబృందే దేహాది ధియా సంత్యజ్య దూరతః,**
**అశీత శాంతఃకరణో నిత్యమ్ ఆత్మపరో భవ॥**

బుద్ధితో - ఈ భౌతిక దేహమును, (అట్లాగే) సమస్త పదార్థములను దూరంగా త్యజించివేసి, నిత్యము శాంత-అంతఃకరణము కలవాడవై ఆత్మస్వరూపుడుగా ఉండుము. ఆత్మసింహాసనముపై అధిష్ఠించినవాడవై ఉండుము.

## దుఃఖమునకు మూలకారణము
## (THE ROOT CAUSE OF WORRY)

**ఋభుమహర్షి :** ఓ నిదాఘా! ఆత్మానందస్వరూపుడే అయి ఉన్న ఈ జీవుడు అసంఖ్యాక దుఃఖపరంపరలకు లోను కావటానికి కారణమేమిటి? విను.

**మం॥ శ్లో॥ ఇదగ్ం రమ్యమ్ ఇదం నేతి బీజం తే దుఃఖ సంతతేః।**
**తస్మిన్ సామ్యాగ్నినా దగ్ధే - దుఃఖస్య అవసరః కుతః?**

దుఃఖపరంపరలన్నిటికీ మూలకారణము ఏదై ఉన్నది? **"ఇది నాకు రమ్యము. ఇష్టము. నచ్చుతుంది. అది నాకు రమ్యము కాదు. ఇష్టం లేదు. నచ్చదు"** - అను హృదయాంతర్గతంలో గల బీజమే ఈ జీవునిపట్ల రూపుదిద్దుకుంటున్న దుఃఖములన్నిటికీ మూలకారణం (Root cause). అట్టి కారణ బీజమును **"సామ్యము (సమదృష్టి, సమమగు ఆత్మభావన)"** అనే అగ్నిచే దగ్ధం చేసి వేయి. ఇక దుఃఖము (Worry)నకు కారణమేముంటుంది? ఏదీ ఉండదు.

బిడ్డా! సజ్జనులతో సంభాషణ - సత్సంగములచేతను, శాస్త్రములచే బోధించబడుచున్న మహదాశయముయొక్క నిరతి చేతను "ప్రజ్ఞ (The Intelectual Ability / Sharpness of Brain in properly interpreting and assimilating)" ను అలవరచుకో. తెలివిని వివర్ధము (shaping up the sharpness) చేయి.

***నీతో, నాతో సహా - ఈ సమస్తము అయి ఉన్న పరబ్రహ్మము ఇంకా ఈఈ విశేషములతో వర్ణించబడుతోంది.***

<u>**ఋతము**</u> - తత్త్వజ్ఞుల స్వానుభవము.

<u>**సత్యము**</u> - కల్పనలు లేనట్టి నిజరూపము (సత్‌స్వరూపము). 'ఉనికి' అను విశేషము సంప్రదర్శించునది (యమ్-సత్).

ఈ సంసార భేషజమంతా బ్రహ్మముయొక్క సంప్రదర్శనా చమత్కారమే।

✠ (ఇంకా కూడా) పరమార్థమైనట్టిది. అమలము. నిత్యము. ఆది మధ్యాంతరహితము అయినట్టిది - బ్రహ్మము.

✠ స్థూలము కానట్టిది, శూన్యము కానట్టిది. ఆకాశము కానట్టిది. స్పర్శకు వినటమునకు, రుచికి, వాసన (మొదలైన వాటికి) విషయమే కానిది. దేనితోను ప్రమేయము లేనట్టిది. ఉపమానములతో చెప్పజాలనిది - **అఖండాత్మస్వరూపము.**

ఓ సువ్రతా! ఆత్మ సర్వదా సచ్చిదానందము, అనంతము కూడా. అట్టి బ్రహ్మమే నీవు. **అట్టి బ్రహ్మము గురించియే సర్వదా** మననం చేస్తూ క్రమంగా - **"బ్రహ్మమే నేనై ఉన్నాను"** - అని ధ్యానం చేస్తూ, ధ్యేయమునకు (ధ్యానము చేస్తూ ఉన్న నామ-రూప-శబ్ద తత్త్వమంతటికీ) అతీతుడవు అగుము. సర్వ సంసార బంధములనుండి అప్పుడు విముక్తుడవు అవగలవు. **"సమస్తము సంవిదాత్మ అగు పరతత్త్వమునుండే జీవాత్మ-ఈశ్వరతత్త్వములు (జలంలో తరంగాలవలె) ప్రదర్శనమగుచున్నాయి"** అనునది **'సంవిత్ సమాధి'** అనబడుతోంది.

## నిత్యః సర్వగతో హి ఆత్మా కూటస్థో దోషవర్జితః

| | |
|---|---|
| రచయిత కథ వ్రాసి ముగించినంత మాత్రాన అంతటితో ముగింపు పొందుతాడా? పొందడు. | *అట్లాగే, ఆత్మ నిత్యమైనదే గాని దేశ- కాల-వస్తువులచే ముగియునది కాదు. జన్మ-కర్మ మొదలైన వాటి ముగింపుచే తాను ముగియదు.* |
| రచయిత యొక్క రచనా కళా విన్యాసమే - ఆతడు రచించిన కథ (లేక నవల) మొదటి నుండి చివరి వరకు నిండియున్నది కదా। | *అట్లాగే ఆత్మ తాను పొందుచున్న దృశ్య వ్యవహారమంతా తానే మొత్తమంతా నిండియుండి, "సర్వగతము" అయి ఉన్నది. ఆత్మయే రచయిత, రచన, పాఠకుడు కూడా!* |
| ఒక నవల (లేక) కథకు మూలము రచయిత యొక్క కల్పనయే। కల్పనకు కూటస్థము (Its Root of Presence) - రచయితయే | *జగత్తుగా దర్శించబడేదంతా ఆత్మస్వరూపుడగు ద్రష్ట యొక్క స్వకీయ కల్పనా విశేషమే। అట్టి కల్పనకు కూటస్థము (The origin where it is originally existent) ఆత్మయే।* |
| ఒక నవలలోని ఆయా పాత్రల 'సుగుణములుగాని, దుర్గణములుగాని, స్వరూప-స్వభావములుగాని రచయితకు ఆపాదించలేము. కానీ అవన్నీ రచయిత నుండియే కథా కల్పితంగా వచ్చాయి. మరెక్కడి నుండో కాదు. అయినాకూడా **రచయిత దోషవర్జితుడు.** పాత్రల మంచి-చెడులు ఆతనివి కావు. | *ఒక ద్రష్టగా జగన్నాటకమునకు రచయిత అయి ఉన్నప్పటికీ, ఈ జీవుని ఆత్మ స్వరూపమునకు ఇక్కడి - జీవాత్మ జగత్ విశేషముల స్వరూప స్వభావములు ఆపాదించలేము. కానీ అవన్నీ కూడా దృక్ స్వరూపుడగు (లేక) చైతన్య-స్వరూపుడగు ఆత్మపురుషుని స్వయంకల్పితం. అనగా జగత్తు ఆత్మచే స్వయంరచన, స్వయం ఆస్వాదన కూడా। జగత్తు ఆత్మయొక్క ప్రదర్శనా స్వరూపమే।* |
| కథా రచనలో ఎన్ని రకాల పాత్రలు ఉన్నప్పటికీ, కథా రచయిత మాత్రం సర్వదా ఒక్కడే. | *ఆత్మ సదా దోషవర్జితము. స్వానుభవ జగత్తు నందు జీవాత్మగా ఎన్ని అన్యస్వభావములు చూస్తూ ఉన్నప్పటికీ, పరమాత్మగా సర్వదా ఏకమే. అనేకముగా అవడు.* |

అయితే, ఈజీవుని పట్ల భ్రాంతి కొనసాగుచున్నంతవరకు ఆత్మయొక్క పర-కేవలీ స్వరూపము ఆతనికి అనుభవముగా సిద్ధించటమే లేదు.

అందుచేత ఓ నిదాఘా। నీవు ముఖ్యంగా గమనించవలసినది.

**మం॥ శ్లో॥ తస్మాత్ అద్వైత ఏవ అస్తి। న ప్రపంచో। న సగ్ంసృతిః।**
**యథా ఆకాశో ఘటాకాశో మహాకాశ ఇతీరితః॥**

నాటక రచయిత - నాటకములో పాత్ర రెండు వేరు వేరా? నాటకమే కల్పన. అందులో ఒక పాత్రకు స్వతః సిద్ధమైన ఉనికి ఎక్కడిది? ఇక్కడ వాస్తవానికి రచయితకు మాత్రమే ఉన్నాడు. ఆతనికి వేరుగా నాటకమునకుగాని, పాత్రలకుగాని స్వకీయమైన ఉనికి లేదు. అట్లాగే ఇక్కడ 'నేను' రూపముగా విరాజిల్లుచున్న 'ఆత్మ' మాత్రమే ఉన్నది. ఆత్మకు వేరుగా జగన్నాటకము స్వకీయమై లేదు. జీవాత్మ లేదు. ఆతనికి అనుభవమగుచున్న తదితర (అన్య) జీవులు (జీవాత్మలు) లేదు. సర్వదా **"అద్వైతము"** (అద్వితీయమగుఆత్మ) మాత్రమే ఇక్కడ ఉన్నది. ఇక 'ప్రపంచము' అనబడునది లేదు. సంసార బంధరూపముగా చెప్పబడే సంసృతి లేదు. ఈహాలో నిజమేముంటుంది?

**ఘటాకాశము** = Space in the pot
**బాహ్యాకాశము** = Space out side the pot

"కుండలోని ఆకాశము, బయటగల ఆకాశము" అని రెండు ఉన్నాయా? లేదు. కుండకు (ఘటమునకు) లోపల - బయట ఉన్నది ఒక్కటే ఆకాశము. అట్టి మహాకాశమునకు బాహ్య - అభ్యంతరములనబడే విభాగములే లేవు.

అట్లాగే 'ఆత్మకు - (1) జీవాత్మ (2) పరమాత్మ - అనబడే రెండు వేరువేరైన ప్రత్యయములు సహజము కాదు. ఆత్మబోధ కొరకై ఆపాదితము మాత్రమే! **సర్వదా అఖండమగు ఆత్మయే సర్వేసర్వత్రా ఉనికి కలిగియున్నది.**

అందుచేత - **భ్రాంత్యైః ద్విధా ప్రోక్తా, జీవ-ఈశ్వర ఆత్మనా।** భ్రాంతి చేతనే - **"ఇది జీవాత్మ। ఇది ఈశ్వరుడు।"** - అని రెండు విభాగములుగా చెప్పబడుచున్నప్పటికీ, వస్తుతః వాస్తవానికి ఆత్మ సర్వదా ఏకమే గాని, - విభాగయుతము (partitionable) కాదు.

ఈ భేదములతో కూడిన దృశ్యము యొక్క వ్యవహారమంతా మనోకల్పనయే. అంతేగాని భేదము దృశ్యములో వాస్తవమై ఉండి ఉన్నట్టిది కాదు. **ఎప్పుడైతే విచారణచే, యోగాభ్యాసాది ఉపాయములచే, మనస్సు నిర్మలమై, అట్టి నిర్మల మనస్సుకు సర్వత్ర సమస్తముగా విస్తరించినదైయున్న ఆత్మ - మననము అవుతుందో, అట్టి యోగికి ఆత్మ సాక్షాత్కారము స్వయముగా సిద్ధించగలదు.**

**ఆత్మ అనగా ఏమి?**

జాగ్రత్‌లోని 'నేను' యా? - అంతమాత్రమే కాదు.

జాగ్రత్ -స్వప్న-సుషుప్తులలోని 'నేను'యా? - ఆ మాత్రమే కూడా కాదు.

వ్యష్ఠిగతమైనదా (It is it Individualistic)? ఆ మాత్రమే కూడా అయి ఉండలేదు.

మరి?

**మం॥శ్లో॥ యదా సర్వాణి భూతాని స్వాత్మన్యేవ హి పశ్యతి,**
**సర్వ భూతేషు చ ఆత్మానం, బ్రహ్మ సంపద్యతే తదా।**

ఓ నిదాఘా! నీ-నా ఆత్మ ఒక దేహ - దేహి పరిమితమనుకుంటున్నావా? లేదు. ఆత్మ సర్వదా సర్వగతమై, అఖండమై సర్వత్రా ప్రదర్శనమానమై, ప్రకాశమానమైయున్నది. ఎప్పుడైతే నీవు **"సమస్త జీవులు మమాత్మానందస్వరూపమే। మమాత్మయే।"** - అని **"నావలెనే ఆత్మస్వరూపులే"** - అని బుద్ధితో దర్శిస్తావో, అప్పుడు నీవు బ్రహ్మమునే పొందుతావు. బ్రహ్మమే అవుతావు. **అట్టి సర్వత్రా ఆత్మను, ఆత్మయందే సమస్తమును దర్శించటమే 'సమాధిస్థితి' అనబడుతోంది.**

**శ్లో॥ యదా సర్వాణి భూతాని సమాధిస్థో న పశ్యతి,**
**ఏకీభూతః పరేణ అసౌ తదా భవతి కేవలః॥**

అట్టి సమాధిస్థుడవై "జీవులు వేరు - ఈశ్వరుడు వేరు" మొదలైన వేరువేరులుగా కనిపించేదంతా ఏకీభూతం చేసివేస్తావో, అప్పుడు నీవు కేవలము - పరము అగు పరబ్రహ్మస్వరూపుడవు అవుతావు. ఏకమగు బ్రహ్మముగా సమస్తమును దర్శించువాడై - సమాధిస్థుడు.

## సప్తభూమికలు

అట్టి బ్రాహ్మీదృష్టి 'సోఽహమ్ బ్రహ్మ స్వాభావతః'ను సిద్ధించటానికి ఆత్మజ్ఞులచే త్రోవచూపబడుచున్న సప్తభూమికల గురించి ఇప్పుడు చెప్పుకుందాము. (1) వైరాగ్యముముక్షుత్వా (2) విచారణా (3) సాంగభావనా (4) విలాపినీ - వాసనావిలయాత్మికా (5) శుద్ధసంవిన్మయానందరూపా (6) అసంవేదనారూపా (7) తురీయావస్థ - ఉపశాంతా।

I. **<u>పూర్వావస్థ / జాగ్రత్ సంబంధమైనవి: (పూర్వావస్థాత్రయ। జాగ్రత్ సంస్థిమ్।)</u>**

**(1) ముముక్షుత్వము (2) విచారణ (3) సాంగభావన**

II. **<u>స్వప్న సంబంధమైనది: (స్వప్నాభం యత్ర వై జగత్।)</u>**

**(4) విలాపినీ - వాసనావిలయాత్మకమైనది.**

III. **<u>సుషుప్తి సంబంధమైనవి:</u>**

**(5) శుద్ధ సంవిన్మయానంద రూపము / అర్థ సుప్త ప్రబుద్ధము - జీవన్ముక్తము**
**ఆనందైక ఘనాకార - సుషుప్తా।**

IV. **తురీయ సంబంధనమైనది (తుర్యపదము)**

**(6) అసంవేదన రూపము.**

V. **తురీయాతీత సంబంధమైనది - తురీయ అవస్థ - ఉపశాంతి।**

**(7) ఆనందైక ఘనాకారము - (మనో వాచోభి అగ్రాహ్యమ్। మహా సమత। ముక్తి। పరా నిర్వాణ రూపిణి।)**

## (1) ప్రథమ భూమిక - వైరాగ్య రస రూపిణీ।

**మహనీయుల మహదాశయ ప్రసంగము వింటూ వింటూ,**

**"తినుతూ, త్రాగుతూ, అనవసరమైన ప్రసంగములు చేస్తూ నేను ఎందుకు 'జీవితము' అనే మహత్తరమైన అవకాశమును వృధా చేసుకొంటున్నాను? శాశ్వతమైన ప్రయోజనములను ఉద్దేశ్యించకుండా, అల్పమైన విషయములపట్ల అల్పమైన ఆశయములు కొనసాగిస్తూ కాలగతికి 'ఎఱ' అగుచున్నానే! లేదు. ఇది ఉపాయం కాదు"** - అని వైరాగ్యము పొందుచున్నాడు. ఇక - **"శాశ్వతమగు ఆనందము ఎక్కడ?"** అనే ప్రశ్నకు వచ్చి, సమాధానము కొరకై వెతకటం ప్రారంభిస్తున్నాడు. ఇది శాస్త్ర అధ్యయనము, సజ్జనులతో సంపర్కము, వైరాగ్యము అను రసములతో కూడినదై, జీవునకు ముముక్షుత్వములో ప్రవేశమును ప్రసాదిస్తూ ఉన్నది. ('పూర్వవస్థ' / జగత్ సంబంధమైన మూడు భూమికలలో మొదటిది).

## (2) ద్వితీయ భూమిక - విచారణా।

ప్రథమ భూమిక నుండి శాస్త్రార్థములు విచారణ చేయటము, తత్త్వజ్ఞులతో సంభాషించటము, అనుమానములు నివృత్తిజేసుకొనే ప్రయత్నము...ఇవన్నీ **<u>విచారణాభూమిక</u>**లో ప్రవేశము, ప్రవృద్ధము - అగుచున్నాయి. ఇది పూర్వావస్థలలో రెండవది. ఇది కూడా జాగ్రత్ నందు సంస్థితమై యున్నది. ఈ స్థితిలో తత్త్వవేత్తలగు గురువులను ఆశ్రయిస్తున్నాడు.

## (3) తృతీయ భూమిక - సాంగభావనా।

ఆపై క్రమంగా భక్తి గుణములగు **<u>"అద్వేష్టా సర్వభూతానాం, మైత్రః, కరుణఏవచ, నిర్మమో నిరహంకారో"</u>** - మొదలైనవి, **<u>"అమానిత్వమ్, అదంభిత్వమ్, అహింసా, క్షాంతి (ఓర్పు), ఆర్జనమ్ (త్రికరణ శుద్ధి) మొదలైన జ్ఞానలక్షణములు,</u>** "న ద్వేష్టి సంప్రవృత్తాని, నివృత్తని కాంక్షతి, ఉదానవత్ ఆసీనో, అసక్తః తేషుకర్మేషు" మొదలైన **<u>త్రిగుణాతీతాభ్యాసములను</u>**, కర్మసమర్పణ - ఇటువంటి మోక్షాంగములు ఆశ్రయిస్తూ ఉంటాడు. ఇది పూర్వావస్థలోని మూడవ భూమిక. ఇది కూడా జాగ్రత్‌లో సంస్థితమైయున్న భూమికయే.

## (4) చతుర్ధ భూమిక - విలాపినీ (స్వప్న సంబంధమైన భూమిక)

**<u>సమస్త భూమికల ముందటి స్థితి - "వాసనా నిర్మాణము" (వాసనలు రూపము పొందుచున్న రీతి):</u>**

దృశ్య విషయములను ఇష్టాఇష్ట దృష్టులుతోను, "కావాలి-కావద్దు"....అను భావనారూపంగాను ఆశ్రయిస్తూ ఉండగా వస్తు - విషయరూప-నామములపట్ల (ధ్యానము కాస్తా) **ధ్యాస**గా వృద్ధి చెందుతోంది. ఆ **ధ్యాస** వలన క్రమంగా **అభిప్రాయాలు** దృఢపడుచూ, ఆయా వస్తువులతో **సంగము** (Relatedness) ఏర్పడుతోంది. "ఇవిలేకుంటే నేనెట్లా? నేను లేకుంటే ఇవి ఎట్లా?"...అను మననమే సంగము. అట్టి సంగము అవినాభావరూపము దిద్దుకొని **"కావాలి। తప్పక పొందాలి।"** - అనే **కామము** దృఢపడుతోంది. అది **క్రోధము**నకు దారితీస్తోంది. క్రోధముకాస్తా 'ఆవేశము(Emotion)'గా సంతరించుకొని వివేకమును కప్పివేసి, విచక్షణను బలహీనపరచి 'నాకు అనిపిస్తుందే నిజం। ఇక ఎవ్వడు ఏది చెప్పినా, సూచించినా అది నిజం కాదు. నేను లెక్క చేయనక్కర్లేదు" - అనే భ్రమస్థితి (మోహము) ఏర్పడుతోంది. అది సమ్మోహనరూపంగా మారి ఇక తెలివి ఏమాత్రం వికసించనిదై, (పర్యవసానము ఏమిటి? ఇందువల్ల పొందుచున్నదేమిటి? ఎంతకాలం ఉంటాయి? పోగొట్టుకొనుచున్నదేమిటి? అవిపోవటం చేత ఏమేమి కోల్పోతాము? - మొదలైన విశ్లేషణా రూపమైన) - **<u>'స్మృతి'</u>** <u>కోల్పోబడుతోంది.</u>

అప్పుడు ఆ జీవుడు తన ఆత్మయొక్క సహజమగు విస్తారమగు, స్వభావము, ఆనందరూపము ఏమర్చి జన్మకర్మ పరంపరల చక్రములో చిక్కుకొని పడరాని పాట్లు పడుచున్నాడు. తనను గురించి తానే తెలుసుకోలేని అజ్ఞానభూమికలలో తిరుగాడుచున్నాడు.

ఈ విధంగా భావన, ధ్యాస, ధ్యానము, కామము, క్రోధము, మోహలోభములు, వివేకానాశనము - వాటికి సంబంధించిన అభ్యాసములు అలవాట్లుగాను, అలవాటు సంస్కారముగాను, సంస్కారము వాసనలుగాను హృదయంలో గూడుకట్టుచున్నాయి.

## వాసనా విలయ స్థితి

ఇప్పుడు ఇక వైరాగ్యపూర్వముముక్షుత్వము, విచారణ, సాంగభావనల సుదీర్ఘమైన అభ్యాసముచే వాసనలు క్రమంగా విలయము పొందుచూ "విలాపినీ (లేక) విలయాత్మికము" **అనబడే 4వ భూమికలో** ముముక్షువు ప్రవేశము పొందుచున్నాడు. ఇది మానసికమైన ప్రాధాన్యము కలిగి యున్నట్టిది. కాబట్టి "స్వప్నసంబంధ" (లేక) "స్వప్నానుభవ సంబంధిత" భూమికగా చెప్పబడుతోంది.

## (5) పంచమ భూమిక - శుద్ధసంవిన్మయ ఆనందరూపా। ఆనందైక ఘనాకారా। సుషుప్త్యా।

ఈ '5'వ భూమికలో - **శుద్ధ సంవిన్మయా రూపా భవతి పంచమీ, అర్ధ సుప్త ప్రబుద్ధాభో - జీవన్ముక్తో అత్ర తిష్ఠతి।** ఇది **'సగము నిద్ర-సగము మెలకువ'** - స్థితిరూపము. ఈ భూమిక జీవన్ముక్తమునందు సుతిష్ఠింపజేయుచున్నది. ఇందులో జాగ్రత్ **<u>"మొదలే లేనిది. నాటకము చూస్తున్నప్పుడు అందులో నిజము, శాశ్వతము ఏదీ ఉండదుకదా! అట్లాగే జాగ్రత్ మొత్తము కల్పనాతుల్యమే"</u>** - అను పరాదృష్టిచే చూడబడుతోంది. కాబట్టి **<u>'సుషుప్తి సమాన భూమిక'</u>** అని కూడా పిలువబడుతోంది.

## (6) ఆరవ భూమిక - "అసంవేదన రూపా" - తుర్యపద।

ఇది ఆనంద - ఏక - ఘనాకార (ఘనీభూతమైన ఏకానంద) భూమిక (State). ఇది **సంవేదనము**-(తెలియబడేదంతా)- **<u>తెలుసుకుంటున్న</u> వాని రూపము మాత్రమే అయి ఉంటున్న భూమిక.** కాబట్టి **అసంవేదనా భూమిక**గా పేరుపెట్టబడింది. **ఇది సుషుప్తి సమానమైన**

**భూమిక।** ఇది జ(గత్ – స్వప్నములకు ఆవలరూపమైయున్నది. (సంవేదనము = All That being Experienced).

అసంవేదనము = Looking at all that being experienced as merely the extension of the Experiencer himself.

ఇది తెలియబడేదంతా ఉపశాంతించినప్పటి కేవలీ స్థితి. ముక్త స్థితి. ఇందులో... జగత్తు – స్వస్వరూపమునకు 'అనన్యము'గా అభ్యాసము చేయబడుచున్నది.

## 7వ భూమిక – తుర్యావస్థ

**తుర్యావస్థ ఉపశాంతా సాముక్తిదేవహి కేవలా।**

కేవలమగు ఆత్మ అనుభవమగుచున్న స్థితి. ఇది స్వయముగా ముక్తి రూపమే.

**సమతా** – సర్వత్రా స్వస్వరూపాత్మయే గమనించు స్థితి. ("సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్"). సర్వత్రా సమత్వము సందర్శించు స్థానము.

**స్వచ్ఛతా** – నిర్మల ఆత్మ తత్త్వ భావన। **"నిర్దోషం హి సమం బ్రహ్మ"** అనబడు సర్వత్రా నిర్మలమగు ఆత్మను మాత్రమే సునిశ్చిత భావనతో చూచుచుండు భూమిక.

**సౌమ్యతా** – ఎల్లప్పుడు ప్రశాంతమును వీడనట్టి ఆత్మీయ స్థితి.

సమత, స్వచ్ఛత, సౌమ్యత స్వాభావికమై ఉంటాయి. ఇది అసంవేదనరూపము (తెలియబడే సమస్తము అధిగమించిన స్థితి – సంవేదనాతీత, **సంవేదనాత్ పర, సంవేదనాంత స్థితి**). తెలియబడేదానికి ఆవలగల **"తెలుసుకొనువానిని మాత్రమే"** దర్శించు భూమిక.

**తెలియబడేదంతా తెలుసుకొనేవానికి అనన్యముగా అనుభవమగు భూమిక.**

## తుర్యాతీతపదాకారము

ఇది పరానిర్వాణము (సమస్తమునకు ఆవల నిశ్చలవాయువుతో పోల్చతగిన) రూపము. **తుర్యాతీత పదావస్థా సప్తమీ భూమికోత్తమా। నిర్వాణ రూపేణా।** తుర్యాతీతము పరాకాష్ఠ అయినట్టివి. తురీయమునకు ఆవలిది.

**మం॥శ్లో॥ మనో వచోభిః అగ్రాహ్యా। స్వప్రకాశా। సదాత్మికా।**
**అంతః ప్రత్యాహృతివశాత్ చైత్యం చేత్ న విభావితమ్॥**

ఇది మనస్సు చేతను, వాక్కు చేతను గ్రహింప (తెలుసుకో) వీలులేనిది.

**"నేను స్వయంప్రకాశకుడను. అంతేగాని బాహ్యమగు మరొక వస్తువుతో వెలిగించబడుచున్నవాడను కాను".** – అను ఆత్మజ్యోతీ – స్వయం జ్యోతీ స్వానుభవము.

సూర్యునికి దర్శించటానికి ఒక దీపం ఎందుకు? అట్లాగే **స్వప్రకాశ–స్వయంప్రతిపత్తి సమన్వితములగు ఆత్మయొక్క స్వరూప – స్వభావములు స్వాభావికమైన వాడను"** – అని తుర్యాతీత సంస్థితుడు గమనించుచున్నాడు. సర్వదా సదానంద స్వరూపుడై ఉంటున్నాడు. "నా చేతనే తెలియబడుచున్నదంతా భావించబడుచూ, నాయందే నాకు వేరు కానట్టి చైత్యము (అనుభవమగుచున్నదంతా) నా చైతన్మాత్మ స్వరూపమే" – అను నిశ్చల భావన పుణికిపుచ్చుకుని ఉంటున్నాడు. "నీవు గాను, జగద్దృశ్యముగాను నేనే స్వాభావికంగా ఉండి ఉన్నాను – స్వప్న ద్రష్టకు వేరైనదేదీ స్వప్నములో ఉండజాలని తీరుగా" – అని ఎరిగి ఉంటున్నాడు.

ఈతడు **"మహాసమతత్వము"**ను అనునిత్య ధారణగా కలవాడై – నిత్యముక్తుడు అయి ఉంటున్నాడు. "ఆత్మగా నేను నిత్యముక్తుడను" – అను ఎరుక వీడటము లేదు.

**"నేను చచ్చుట లేదు. పుట్టటం లేదు".**

**"నేను సత్‌ను కాదు. అసత్‌ను కాదు".**

**"నేను నేనే గాని, నేను ఏమియు (జీవుడు, దృశ్యము మొదలైనవిగా) అవటమేలేదు"**

అని గ్రహించి ఉన్నవాడు – తురీయాతీతుడు.

**ఇతి మత్వా ధీరో న శోచతి।** ఇది స్వస్వరూపము గురించి ఈ విధంగా ఎరిగిన అట్టి తురీయాతీతుడు – ధీరుడై (బుద్ధిసామ్యతకలవాడై), ఇక దేనికీ శోకించడు. (He does not worry about any thing)

## తురీయాతీతుని "కోఽహమ్? - సోఽహమ్" నిర్వచనములు

ఇంకా కూడా...తురీయాతీతుని స్వకీయ స్వరూపనిర్వచనములు, స్వానుభవములు ఈ విధంగా ఉంటాయి. (ఇవి స్వానుభవం చేసుకొన్నవాడు ఇప్పుడే ఇక్కడే తురీయాతీతుడు)।

**(ఇతిమత్వా న శోచతి)**

**అలేపకోఽహమ్**-పంచకోశములవంటి ఎట్టి లేపనములు (పూతలు) లేని అలేపకుడను. నాయొక్క ఆత్మస్వరూప స్వయం ప్రకాశక ఔన్నత్యమును జగత్తులు, గుణములు మొదలైనవి కప్పి ఉంచజాలవు. అనంతాకాశమును మేఘములు ఎట్లా కప్పిఉంచగలవు? ఇదీ అట్టిదే.

**అజరో** : దేహసంబంధమైన జరామరణములు ఆత్మనగు నాకు సంబంధించినవి కావు. (నిత్యోదిత్య-నిత్య యౌవనస్థః)।
ఒకడు ఒకప్పుడు వస్త్రము ధరించి, మరొకప్పుడు విడచినంతమాత్రంచేత, ఆతడు ఆ వస్త్రధర్మములకు చెందినవాడు అవుతాడా? కాడు కదా!

**నీరాగ** : దేనిపట్లా ఎటువంటి రాగము లేనివాడను. "సమస్తము నేనే అయి ఉండగా - నన్ను ఆకర్షించగలిగినది ఏముంటుంది?".

**శాంతవాసనః** : సమస్త వాసనలు శాంతించగా శేషించు కేవలాత్మ స్వరూపుడను. "నేను వాసనలు మొదలైన వాటికి మునుముందే ఉన్న పరమశాంత స్వభావుడను! 'మనస్సు' మొదలైనవాటికి చెందిన వాసనల పరిధులకు సర్వదా ఆవలివాడను.

**నిరంశోఽస్మి** : "జీవాత్మ, జగత్తు" మొదలైన అంశలు ఏవీ లేనివాడను. నిరంశుడను. "కొడుకు। కూతురు। తల్లి। తండ్రి। మిత్రుడు। భార్య। భర్త। మిత్రుడు। శత్రువు" - అని నా గురించి అనుకుంటూ ఉండేవన్నీ నన్ను వేరు వేరు అంశలుగా చేయగలవా? లేదు కదా! ఈ విధంగా అంశరహితుడను. *( I am beyond all 'Roles')*

**చిదాకాశోఽస్మి** : చైతన్య స్వరూపమగు చిదాకాశ స్వరూపుడను.

*ఇది గమనిస్తూ సర్వదా శోక (Worry, meloncholy) రహితుడై ఉంటాడు. ఇట్టి స్వభావము స్వాభావికం చేసుకొన్న వాడు ఎవ్వడైనా - విదేహముక్తుడే।*

ఇంకా కూడా ఈఈ విధంగా సునిశ్చితుడు అగువాడు - విదేహముక్తుడు.

**అహం మత్వా విరహితః** : 'నేను నాది' అనే పరిమితము - లేవీ ఏమాత్రము లేని వాడను (రహితుడను). ఆకాశంలో మేఘాలవలె - నేనుంటేనే ఏవైనా కూడా ఒకప్పుడు ఉండటం, మరొకప్పుడు ఉండకపోవటం జరుగుతోంది.

**శుద్ధో బుద్ధో అజరో అమరః** : శుద్ధబుద్ధి స్వరూపుడను. జరామరణములకు సంబంధించినవాడనే కాను. ఆకాశానికి భూ-అగ్ని-జల-వాయు ధర్మాలు అంటవు కదా! నేను **ఆత్మాకాశ స్వరూపుడను.** నన్ను ఏదీ అంట జాలదు.

**శాంతః, శమన అభాసః** : సర్వ ఆభాసలు (Reflections ప్రతిబింబములపట్ల, అభినివేశధ్యాసలు) శాంతించినట్టివాడను. **సర్వదా ప్రశాంత - ఆత్మానంద-అద్వయస్వరూపుడను।**

## ఇతి మత్వా, న శోచతి

గడ్డిపరకయొక్క చిట్టచివ్వరయందు, ఆకాశమునందు, సూర్యునియందు, నరులయందు నాగుల (పాముల) యందు, సమస్త దేవతలయందు ఏ పరబ్రహ్మతత్త్వము అంతటా ఆక్రమించి యున్నదో అట్టి దివ్య ఆత్మతత్త్వమే - నేను।

**విదేహముక్తుడు - ఇట్టి భావనలు, అవగాహనలు పుణికిపుచ్చుకొని ఉంటున్నారు.**

ఓ నిదాఘా!

> *సర్వభావములయొక్క భావనను వదలగా, భావనలకు మునుముందే ఉన్న భావకునియొక్క ఏ **'పరబ్రహ్మ కేవలీస్వరూపము'** వెలుగొందుచున్నదో - అట్టి పరమానంద, ఆత్మను నేనే - అని భావన చేయుచుండెదవుగాక। అప్పుడు నీవు విదేహముక్తుడవే।*

<u>అట్టి తురీయాతీతుని అఖండమగు పరబ్రహ్మతత్త్వము</u>

- వాక్కుకు అతీతమైన విషయము.
- విషయములను, ఆశలను అధిగమించినట్టిది.

- తురీయాతీతుడు పరానంద రసమునందు నిండుగా మునిగియున్నవాడై, సమస్త జగత్తును స్వాత్మరసభావనతో చూస్తూ – స్వాత్మయందు ఆత్మానందస్వరూపుడై రమిస్తూ ఉంటాడు.

ఆతనికి "జగత్ సంచారము, దేహముల రాకపోకలు, సమస్త సంఘటనలు" – మొదలైనవన్నీ 'ఆత్మ' అనే ఉద్యానవనములో, తానే ఆత్మస్వరూపుడై (ఒక చక్రవర్తి తన ఉద్యానవనంలో సంచరించురీతిగా) – చేయు వినోద, విహారములు.

- సర్వకర్మ వ్యవహారముల ప్రభావములను దాటివేసినవాడై, సర్వత్రా ఆత్మభగవానుని జగత్ – ప్రదర్శనమును స్వకీయ లీలా వినోదముగా చూస్తూ, **'సర్వకర్మ పరిత్యాగి'** – అయి ఉంటాడు.
- ఆత్మభావనచే, సర్వత్రా స్వస్వరూపాత్మ సందర్శనము చేస్తూ నిత్యతృప్తుడై ఉంటాడు.
- సమస్తము ఆత్మగా చూస్తూ ఆనందిస్తూ ఉంటాడు. 'అన్యము' అను భావనతో దేనిని ఆశ్రయించనివాడై ఉంటాడు. **"తరంగాలన్నీ జలమే అయినట్లు, మట్టి బొమ్మలన్నీ మట్టియే అయినట్లు – ఈ సమస్తము బ్రహ్మము కాని క్షణమే లేదు"**– అను అనన్యత్వమును, తన ఆత్మస్వరూపముతో అబేధత్వమును స్వాభావికం చేసుకొని ఉంటాడు.
- ఆతనిది ఆత్మదృష్టి మాత్రమే! జగత్తులో పైపైన కనిపిస్తున్న పుణ్య–పాపద్వంద్వములు, తదితర గొప్పవారు–కానివారు, జ్ఞానులు–అజ్ఞానులు, అయినవారు–కానివారు, చెందినవారు–చెందనివారు, పండితులు–పామరులు, గొప్ప తక్కువ కులమతములవారు, స్వదేశ–విదేశీయులు, దేవతలు–రాక్షసులు, మంచివారు–చెడ్డవారు మొదలైన – ఇవేవీ ఆతని ఆత్మదృష్టికి ఏమాత్రము భేదమును కల్పించజాలవు. ఆతడు ఆయా విషయములచే దోషము పొందడు. భేదదృష్టితో చూడడు. ఆత్మదృష్టితో చూస్తాడు. **("అహం సర్వస్య ప్రభవో) – అన్నిటినీ ప్రభవింపజేస్తున్నది నేనే"** – అను స్వస్వరూప భావన కలిగి ఉంటాడు.
- తెల్లటి ప్రకాశముగల స్ఫటికమునకు ఎదురుగా ఏ రంగు ఉంటే అదే అద్దానియందు ప్రతిబింబిస్తున్నప్పటికీ, అట్టి ప్రతిబింబదోషము స్ఫటికముయొక్క తెల్లటి రంగును మార్చగలదా? లేదు కదా! అట్లాగే – ప్రాపంచక విషయములు విషయములుగా ప్రతిబింబిస్తున్నప్పటికీ ఆతని **"బుద్ధి – స్ఫటికము"** యొక్క **"ఆత్మసమన్వయ–అవగాహనలకు"** రంజనము కలిగించలేవు. ఆతడు సర్వదా నిరంజనుడు. నాటక రచయితవలె **సర్వము తానై, ఏదీ కానివాడై** ఉంటాడు.

ఒక దర్పణములో (అద్దములో) ఎదురుగా ఉన్న దృశ్య సంబంధమైన సంఘటనలు ప్రతిబింబిస్తూ ఉన్నంత మాత్రంచేత – ఆ సంఘటనలకు సంబంధించిన మంచి – చెడులు ఆ అద్దమునకు అంటుతాయా? అంటవు కదా!

**తజ్ఞః (తజ్జ్ఞః) కర్మఫలేన అంతః తథా నా యాతి రంజనమ్।** ఆత్మతత్త్వము ఎరిగి, అఖండాత్మయే తానై వెలుగొందుచున్న తురీయాతీతుడు – కర్మలు, కర్మఫలములు మొదలైనవాటిచే రంజనము (దోషము) పొందడు. జన్మలు, కర్మలు మొదలైనవన్నీ ఉన్నప్పుడు, ఉండనప్పుడు కూడా, సదా 'స్వస్థుడు' అయి ఉంటాడు.

| ఓ నిదాఘా! పై వర్ణనములను అభ్యాసపూర్వకంగా ఆశ్రయిస్తూ ఉండగా, నీవే **"విదేహముక్తుడవు"** అవుతావని గ్రహించు. గమనించు. **అంతేగాని, విదేహముక్తుని (పైన చెప్పిన) లక్షణములను స్తుతిస్తూ ఊరుకోవద్దు.** |
|---|

## నియమావళి

**నిదాఘుడు** : మహాత్మా! ఋభుగురుదేవా! అట్టి తురీయాతీతుడు జనులమధ్య నుండి బయల్వెడలి ఏకాంత ప్రదేశమును నివాసస్థలముగా ఎన్నుకొని, జనుల పరస్పర సంసార వ్యవహారములకు దూరముగా వెళ్ళి ఉంటారా? ఆతని నివాస, వస్త్రధారణ, ప్రవర్తన మొదలైనవాటికి సంబంధించి **'నియమావళి'** ఏమైనా ఉంటుందా? ఆతని నివాసమేది? ఎక్కడికివెళ్ళితే తురీయాతీతుని దర్శనభాగ్యము మాకు లభించగలదు?

**ఋభుమహర్షి**

> **శ్లో॥ విహరన్ జనతా బృందే దేహకర్తన పూజనైః।**
> **ఖేద ఆహ్లాదౌ న జానాతి ప్రతిబింబగతైః ఇవ।**

"ఆతడు జనుల మధ్యలో ఉంటారు. (లేక) ఉండరు"– మొదలైన విధి – నిషేధములేవీ తురీయాతీతుని పట్ల లక్షణములుగా ఉండవు. జనబృందముల మధ్య (In between groups of people) విహరిస్తూ ఉన్నప్పటికీ **'ప్రతిబింబన్యాయము'** సంతరించుకొని ఉంటాడు. ప్రతిబింబమునకు జలములో ఉన్నప్పుడుగాని, (లేక) భూమిపై (సూర్యకాంతిచే) ఏర్పడినదై రహదారిలో పడుచున్నప్పుడుగానీ – ఆయా జల, రహదారుల ధర్మములు తాను పొందుతుందా? పొందదు. వస్తువు ప్రతిబింబముగా అవదు. ప్రతిబింబము వస్తువే కాదు.

- ఈ దేహము పూజించబడుచున్నప్పుడుగాని, ఖండించబడుచున్నప్పుడుగాని తాను ఏదీ పొందని పరాత్మ (లేక) కేవలాత్మ స్వభావుడై ఉంటాడు.
- స్తోత్రములకు సంబంధించనివాడై, వికారములేవీ పొందనివాడై, పూజించటము – పూజించబడటము రెండిటికీ వివర్జితుడై ఉంటాడు. **నిస్తోత్రో, నిర్వికారశ్చ పూజ్య పూజా వివర్జితః।**

ఇక శాస్త్రములను అనుసరించిగాని, సంఘ నియమములను ఉద్దేశ్యించిగాని ఏర్పడియున్న ఆయా ఆచారములను "శ్రద్ధగా నిర్వర్తించువాడు – వదలివేసియున్నవాడు" – కూడా (ఒకే సమయంలో) అయి ఉంటాడు. **విధి–నిషేధములకు ఆవలివాడై ఉంటాడు.**

- ఆతనికి ఈ శరీరమును పవిత్ర తీర్థములో విడచుచుండటముగాని, (లేక) ఒక మురికివాడలో విడవకుండటముగాని – ఒక్కటే। **'ఇది పవిత్రము – అది కాదు' అనే చక్రములో ఇరుక్కొని ఉండడు.**
- జ్ఞాన విశేషములు అధ్యయనం చేస్తూనే "నాకు ఎప్పుడూ కూడా బంధము లేదు" అని ఎరిగియుండి, **సదా ముక్తుడై ఉంటాడు.**
- "ఇది పొందాలి! అది తొలగాలి। వీరు ఇట్లా ఉండాలి. వారు అట్లా ఉండకూడదు" – మొదలైన ఆశించు స్వభావములను అధిగమించి – **"విగతాశయుడు" అయి ఉంటాడు.**

**పైనంతా మనము చెప్పుకుంటూ వస్తున్న - ఆయా విశేష లక్షణములచే ఎవ్వడైనా సరే, విదేహముక్తుడు కాగలడు. 'విదేహముక్తి' అనునది బుద్ధియొక్క వికాస పరాకాష్ఠకు చెందినదేగాని, శరీరముల స్థితి-గతులకు, గృహస్థుడు మొదలైన ఆశ్రమములకు, నివాసప్రదేశములకు, వస్త్రధారణలకు చెందినదే కాదు.**

## సంకల్పము - బంధము

**ఋభుమహర్షి : ఓ నిదాఘా!**

అసలు ఈ జీవునికి బంధము ఎట్లా ఏర్పడుతోంది? దృశ్య విషయములతో అవినాభావ సంబంధము కలిగి ఉండటము చేత. ఎందుచేత కలిగి ఉంటున్నాడు? 'సంకల్పించటము' అనే క్రియావిశేషము చేత. **సంకల్పత్యాగం హి బంధస్య కారణం। తత్పరిత్యజ।** నీవు 'సంకల్పించటము'ను త్యజించివేస్తూ ఉండు. **మోక్షో భవేత్ అసంకల్పాత్। తత్ అభ్యాసం ధియా కురు।** నీవు సంకల్పించక పోయినంతమాత్రంచేతనే సర్వస్థితి–గతులకు ఆవలగల ఆత్మానుభవరూపమగు మోక్షము లభించగలదు. అందుచేత **'సంకల్పించకుండటము'** అనే అభ్యాసమును బుద్ధితో ఆశ్రయించి ఉండు.

సంకల్పించకుండా ఉండటము ఎట్లా సాధ్యమంటావా? ఇక్కడ 'గ్రహించబడుచున్నది – గ్రహించువాడు' – ఈ రెండిటి మధ్య ఒకానొక 'సంబంధము' ఏర్పడుచూ ఉన్నది. నీవు గ్రహిస్తూ (Receiving matters) ఉన్నప్పుడు కూడా సావధాన చిత్తుడవై అసంకల్పమును వీడక (కొనసాగిస్తూనే), **అసంకల్పన సింహాసనము**ను అధిరోహించియే గ్రాహ్య – గ్రాహక సంబంధములను స్వీకరించు. లేక, స్వీకరించనివాడవై ఉండు. సంకల్పదశలను నెమ్మదినెమ్మదిగా పరిహరిస్తూ (విడచి ఉంటూ), క్రమంగా సర్వత్రా ఆత్మను మాత్రమే గ్రహించి ఉండటమును అభ్యాసము చేస్తూ ఉండు. నీవు దేనికీ గ్రహించబడువాడవు అయి ఉండవద్దు. **మా భావ గ్రాహ్యభావాత్మా।** 'గ్రహించువాడువు' కూడా అయి ఉండవద్దు. **గ్రాహకాత్మా చ మా భవ।**

## భావనాం అఖిలం త్యక్త్వా యచ్ఛిష్టం తన్మయో భవ।

సమస్త భావనలను వదలి, అప్పటికీ ఏ నీ స్వరూపము శేషించినదై ఉంటుందో – అట్టి నిర్మలాత్మ స్వరూపుడవై ఉండుము.

**'భావన'**ను కలిగియుండు సందర్భములలో కూడా, – "ఇది ఇష్టము – అది ఇష్టము కాదు" అను ఇష్టా–అయిష్టములను తొలగించుకొని **'భావశుద్ధి'**ని కలిగి ఉండుము.

**బద్ధము = కించిత్ చేత్ రోచతే తుభ్యం, తత్ బద్ధోపి భవస్థితౌ।** ఈ దృశ్యములోని దేనిపట్లైనా కొంచము నీకు **'ఇష్టము'** అని అనిపిస్తూ ఉంటే, నీవు బంధమునందే ఉండిపోతావు. **'అయిష్టము'** అయినాకూడా – అది బంధరూపమే.

**ముక్తము = న కించిత్ రోచతే చేత్ తత్ముక్తో౽సి భవస్థితౌ।।** ఈ దృశ్య ప్రపంచములో నీకు ఏదీ 'ఇది ఇష్టము' అనునది ఉండదో, అప్పుడు నీవు 'మోక్షాకాశము' నందు ప్రవేశము పొందగలవు.

ఇక్కడ ఎదురుగా కనిపిస్తూ ఉన్న స్థావర – జంగములగు ఒక గడ్డి పరక నుండి – ఈ భౌతికదేహము వరకు దేనినీ కూడా కించిత్

కూడా **'ఇది నాకు చాలా ఇష్టము'** అనే ధ్యాసయే పెంపొందించుకోవద్దు. అయిష్టము కలిగి ఉండవద్దు. ఇష్టాయిష్టములు కలిగియుండటమే 'అహం' భావము. అట్టి అహంభావమును **"నాహమ్" (నాది కాదు. నేను కాదు)"** – అను భావనతో జయించివేసి, 'సత్–అసత్'లకు సర్వదా అతీతుడవై ఉండుము.

## తుర్యము

**యత్ అసక్తం సమం స్వచ్ఛం స్థితం, తత్ 'తుర్యమ్' ఉచ్యతే॥**

ఏ నీ స్వరూపము సర్వదా స్వాభావికంగానే అసక్తము(Non attached) ఆశ్రయించినదై, సర్వత్రా సమస్వరూపమై, సర్వదా స్వచ్ఛమై, సర్వదా సంస్థితమై యున్నదో – అట్టి నీ కేవలానంద రూపమే **"తుర్యము".**

**జీవన్ముక్తము: యా స్వచ్ఛా సమతా శాంతా (స) జీవన్ముక్త వ్యవస్థితిః॥** "స్వచ్ఛము, సమతము, శాంతము" అగు ఆత్మ స్వరూపముతో "అహమ్–త్వమ్"ల ఏకత్వమును ధరించి ఉండు. అట్టి స్వాభావిక బుద్ధినిశ్చలత, హృదయస్వాదనయే **జీవన్ముక్తత్వము. 'జీవితము'** అను సందర్భము సహజమగు మమాత్మానందస్వరూపమునకు బంధము కాజాలదు – అను నిశ్చలావగాహనయే జీవన్ముక్తత్వము.

**తుర్య కలనము: సాక్ష్యవస్థా వ్యవహృతౌ సా 'తుర్యకలన' ఉచ్యతే॥** సమస్త జగత్ వ్యవహారమునకు సాక్షిత్వమును వీడకయే, జగద్వ్యవహారమునందు (పాల్గొనడమో/పాల్గొనకపోవటమో) – నిర్వర్తించటము – **'తుర్యకలనము'** అనబడుతోంది.

**సంకల్పాతీత తురీయము** : తుర్యగము (తురీయము) అనునది **సంకల్పములకు మునుముందే ఉన్నట్టి సంకల్పించువాని సంకల్పాతీత తేజో–చైతన్య స్వరూపము.** అట్టి తురీయము–జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థల రూపము కాదు. అది ప్రతి జీవునిపట్ల వాస్తవికమగు స్వాభావికమే అయి ఉన్నది. తుర్యక్ స్థానము :-

✐ **జాగ్రత్ కాదు.** ఎందుకంటే జాగ్రత్ – అనునది సంకల్పములచే నిర్మితమై ఉంటున్నట్టిది.

✐ **స్వప్నము కాదు.** స్వప్నము కూడా 'సంకల్పములు' అనే దారముతో నిర్మితమగు వస్త్రము వంటివి.

✐ **సుషుప్తి కాదు.** సుషుప్తితో సంకల్పములు సంకల్పించకపోతున్నప్పటికీ, అవి **'సంస్కారములు'** రూపంగా తిరిగి తలెత్తటానికి సిద్ధము అయే ఉంటాయి. అది భావములు ప్రవర్తించని (కాసేపు నిశ్శబ్దము వహించిన) జడస్థితి మాత్రమే. అంతేగాని **'అజడాస్థితి' కానేకాదు.**

*ఈ జగత్తు యథాస్థితమై యుండి కూడా, ఇది శాంత–సమ్యక్–ప్రబుద్ధరూపమగు ఆత్మస్వరూపమై స్వాభావికంగా స్వానుభవమవటమే (లేక) ఆత్మయందు విలీనమై ఆత్మగా అనిపించటమే తురీయస్థితి. అనగా బుద్ధికి సమస్తము ఆత్మగా అనిపించు 'సుస్థిరమగు' **'అబుద్ధస్థితి'**.*

**సమతా : అహంకార కలా త్యాగే యాః సముద్గమే। విశరారౌ కృతే చిత్తే తుర్యావస్థా ప్రతిష్ఠితే।** సందర్భమాత్రంగా బయల్వెడలే వ్యష్టిగత – అహంకారత్యాగము చేసి, సమిష్టిగత మహాహంకార స్వరూపమును సంతరించుకొని –

***ఈ సమస్తము అస్మత్ ఆత్మ స్వరూపమే। అందరిలోని నేనైన నేనే నా సహజాహంకార స్వరూపము।***

***ఈ సమస్తము నాయందు ఉన్న నేనే ఉన్నాను।***

– ఇదియే 'సమత'. శత్రుత్వభావన లేనట్టి సమరస–ఆత్మభావనను **'సమత'** అని పిలుస్తున్నారు. అట్టి స్వచ్ఛ, సమతా–శాంతా–సాక్షీ–జాగ్రత్ స్వప్న సుషుప్తాతీత–అజడ–అహంకారత్యాగ–సర్వత్రా విస్తరిత "స్వస్వరూప భావనాస్థితుడు" – **తుర్యావస్థయందు** స్వాభావికంగా సుప్రతిష్ఠితుడు అగుచున్నాడు. ఓ నిదాఘా। అట్టి తురీయాతీతమే నీపట్ల స్వాభావికమై సిద్ధించునుగాక।

**అధ్యాత్మశాస్త్ర సిద్ధాంతములు** : అధ్యాత్మ శాస్త్ర చర్చలు, సిద్ధాంతాలు – ఇవన్నీ శ్రవణం అవసరమే. అయితే అవన్నీ కూడా అనునిత్యమగు ఆత్మానుభవమును కొంత కప్పియే ఉంచుతాయి కూడా. **సిద్ధాంతో అధ్యాత్మ శాస్త్రాణాం సర్వ అపహ్నవ ఏవహి।** అందుచేత, ఓ నిదాఘా! అధ్యాత్మశాస్త్ర సిద్ధాంతములను శ్రవణం చేసి, క్రమంగా ఆత్మభావనను (సమస్తము స్వస్వరూపాత్మగా) **అనుకుంటూ** – అనిపించేవరకు (ఆ అనుకోవటమును) కొనసాగించు. క్రమంగా 'ఆత్మ'గా చెప్పబడేది నీవే అయి ఉండాలి. 'ఆత్మానుభవము సమక్షములో శాస్త్రచర్చలన్నీ కూడా **ముగిసినవి'** అవుతాయి.

## మహామౌనస్వరూపము

**వాస్తవానికి : 'అవిద్య'** లేదు. **'మాయ'** అనేదీ లేదు. **ఈ కనబడేదంతా నీయొక్క దోషరహితమగు శాంతాత్మస్వరూపమే।** చిదాకాశము సర్వదా శాంతము, స్వచ్ఛము, (సమస్తము తనయందు) శమించినట్టిది – అయి ఉన్నది. నీవు సర్వదా చిదాకాశస్వరూపుడవే అయి ఉన్నావు. ఇందులో సందేహమే లేదు. కనుక సమస్త శక్తి స్వరూపమగు బ్రహ్మముగానే సమస్తము దర్శించుము. ఓ అనఘా! అన్యమైన సమస్తము బుద్ధితో మొదలంట్లా పరిత్యజించివేసి, **'మహామౌనస్వరూపము'** వహించి ఉండుము.

ఇక ఇక్కడి "అన్యము, బంధము, జన్మకర్మభావములు" – ఇవన్నీ కూడా నీ ఆత్మైకత్వము యొక్క కించిత్ ఏమరపు చమత్కారములు మాత్రమే!

ఇది గమనిస్తూ, క్రమంగా **"నిర్మనసత్వము"**ను అవధరించి ఉండుము. చిత్తము చిత్‌నందు క్షీణించగా, నిశ్చలమగు వాయువువలె **నిర్వాణస్వరూపుడవగుము. సంశాంతించిన బుద్ధికలవాడవగుము.**

**భక్తి – జ్ఞాన – యోగ – ధ్యాన – సమర్పణ – ఇత్యాది శాస్త్రసూచిత, ఆర్యసూచిత మార్గములన్నీ కూడా నీ నిర్మల – కేవల స్వరూపముయొక్క సమగ్రత్వ ఆనందత్వముల గుర్తింపు, ఆస్వాదన కొరకే సుమా!**

## నేను – అన్యజగత్తు

**హే నిదాఘా!** ఆత్మయందు శాంతాత్మస్వరూపము సిద్ధించుకొన్నవాడు ప్రాపంచక భేద విషయములపట్ల :-

**ఒక మూగవానివలె** – పరిమిత – అల్పకాలిక – అల్పాశయ విశేషముల పట్ల.., **ప్రాపంచక విషయములు మాట్లాడటానికి సిద్ధపడనివాడై ఉంటాడు.**

**ఒక చెవిటివానివలె** – ప్రాపంచక గుణదోషముల సంభాషణలు, ఇతరులను దూషించు వాక్యములు, తప్పు పట్టుకొను మాటలు – విననివాడై – ఉంటాడు.

**అంతరమున : "సమస్తము ఆత్మగా దర్శించటము"** అను అంతర్ముఖత్వము వహిస్తూ, స్వచ్ఛమగు 'స్వాత్మ'చే పరిపూర్ణుడై ఉంటాడు. (అంతర్ముఖ సమారాధ్యా। బహిర్ముఖ సుదుర్లభా। – లలితా సహస్రము)

**బాహ్యమున** : అంతా తెలిసియే అందరిలోను, అందరిలాగాను, అందరితోను, అందరివలెను, అందరి మధ్య లీలా – క్రీడా వినోది అయి ఉంటాడు.

ఓ ద్విజా! జాగ్రత్‌లోను, గాఢనిద్రలోను ఉన్నవానివలె (సుషుప్తునివలె, దేనికీ చెందనివాడవై, ఏదీ నీకు చెందనిదై) విద్యుక్తము, శాస్త్రీయము, దైనందికము, నైమిత్తకము, వ్యావహారికము, సాంఘికము అగు రీతిగా ఉంటూనే, – ఆత్మానందస్వరూపుడవై సమస్తమునకు ఆవల ఏదీ అంటనివాడవై, అంటరానివాడవై ఉండుము. ఇందులో కష్టము ఏమున్నది?

## "అంతః సర్వపరిత్యాగీ। బహిః కురు యథాగతమ్"

బాహ్యమున ఆయా కర్మలు నిర్వర్తిస్తూనే, అంతరమున సమస్తము పరిత్యజించి ఉండుము. ఒకనటుడు నాటకరంగముపై సంబంధ–బాంధవ్య–సంపద–ఆపదలు "తనకు చెందినవే" – అన్నట్లు వేషభాషలు కలిగి ఉన్నప్పటికీ, – అంతరమున అవేవీ కించిత్ కూడా లేనివాడే అయి ఉంటాడు కదా! ఆ తీరుగానే ఈ జగన్నాటకరంగములో **'జీవించటము'** అనే నటనా కౌశలముతో ప్రవర్తిస్తూ ఉండెదవు గాక! "అది కష్టము కదా?" అనే భావనను దగ్గిరకు రానీయకు, నాటక పాత్రకు వేరై ఉండియే నటుడు నటించగలిగినప్పుడు, మనందరికీ, **"జగదనుభవమునకు వేరైన ఆత్మతత్త్వము ఆశ్రయించి ఉండటము"** ఎందుకు సాధ్యం కాదు?

## చిత్తము – "సుఖ దుఃఖములు"

**"నేను ఆత్మను ఇదంతా సందర్భకల్పిత చమత్కారము"** – అనుదాని ఏమరుపే – చిత్తముయొక్క రూపము.

**చిత్తసత్తా పరం దుఃఖమ్।** చిత్తము యొక్క ఉనికి కలిగి ఉండటమే పరమ దుఃఖము.

**చిత్తత్యాగః పరం సుఖమ్।** చిత్తము (ఇష్టాఇష్టములను) త్యజించి ఉండటమే **"పరమ సుఖము".**

**ఇంతకుమించి ఈ జీవునకు సుఖము లేదు. దుఃఖము లేదు.** అట్టి ఈ చిత్తమును ఆవేదన (స్వాభావిక) పూర్వకంగా చిదాకాశము (సమస్తము అయి ఉన్న ఆత్మాకాశము) నందు లయింపజేయి. (మంచుగడ్డ యొక్క కరిగిపోయినప్పటి ఆకారమువలె) – క్షయింపజేయి. **దృష్ట్వా రమ్య, అరమ్యంవా స్థేయం పాషాణవత్ సదా।** ఇక ఆపై, రమ్యమైన, అరమ్యమైన (Things you like or you do not like)

ఆయా వస్తు – విషయ – సాకారాదులను చూస్తూ ఉన్నప్పుడు **ఆత్మధ్యానివై, ఆత్మభావివై, ఆత్మాకారివై ఒక బండరాయిలాగే నిశ్చలుడవై** ఉండుము. ఈ మాత్రము కొంచెము కొంచెము ప్రయత్నము చేతనే నీవు గొప్ప శత్రువు వంటి సంసృతి ( The sense of deep relatedness to the every minute - changing groups of scenario - factors) – ని జయించి వేయగలవు. ఈ మాత్రము ప్రయత్నశీలుడవు అవకుండా **"అది కష్టము. ఇది నష్టము"** అని అనుకుంటూ కాలము వృథా చేసుకొని ఏమి ప్రయోజనము?

❊ ❊ ❊

**ఋభుమహర్షి** : ప్రియపుత్రా! నిదాఘా! నీవు నన్ను బ్రహ్మతత్త్వము గురించి వివరణ కోరియున్న ఈ సందర్భములో మనము చెప్పుకున్న ఈఈ విశేషాలన్నీ చెప్పుకున్నాము.

మనము ఇప్పుడు చెప్పుకున్న **ఆత్మజ్ఞాన ఆత్మోన్నత్య** విశేషాలు ఎటువంటివంటే...

**ఋతమ్** : "నేను ఎవరు?" అను ప్రశ్నకు సమాధానమునకై తపో – ధ్యాన – యోగ – అధ్యయనములు చేసి, మహనీయులు స్వానుభవముగా పొంది ప్రకటించినది. కాబట్టి **ఋతము,**

- **వేదాంతే** – వేదముల శిరస్సువంటి ఉపనిషత్ వాఙ్మయముగా స్వానుభవులగు తత్త్వజ్ఞులచే ప్రకటించబడినట్టిది.
- **పరమమ్** : మహత్తరమై, సమస్తమునకు పరమై, పరాకాష్ఠ పాఠ్యాంశమైయున్నట్టిది.
- **గుహ్యమ్** : అది మహనీయుల హృదయగుహలలో దాగియున్న ఆత్మయొక్క విన్యాసము గురించి కాబట్టి పరమగుహ్యమైనట్టిది.
- **పురాకల్ప ప్రచోదితమ్** : ఇతఃపూర్వమే అనేక కల్పములలో నిర్వచించి చెప్పబడియున్నట్టిది. అంతేగాని ఇప్పటికిప్పుడు మనము కల్పించి చెప్పుకొనుచున్నది కాదు సుమా। రోజూ కొంతసేపు అధ్యయనము చేసినంతమాత్రంచేత ముక్తి ప్రసాదించగలిగినది.

## బోధకు అర్హత

బిడ్డా। అతిరహస్యమగు ఈ **"అన్నపూర్ణోపనిషత్"** ఆత్మజ్ఞానమును మహదాశయముగా కలవారికి సవివరంగా, మధురంగా బోధించు.

అయితే, ఆవేశ – కావేశములతో అప్రశాంతంగా ప్రవర్తించువారికి, మాతా పితృ భక్తి లేని వారికి, గురు శుశ్రూష, గురుభక్తి లేనివారికి ఇది బోధించటానికి నిషిద్ధమని ఆర్యవాక్యము. వారు కూడా యత్నశీలురై, సంసిద్ధపడుచూ శ్రవణమునకు అర్హత పొందుదురుగాక।

ఎవ్వరు శ్రద్ధ, ఆసక్తి, ఉత్తమాశయము, లోకశ్రేయోభిలాష కలవారో – అట్టివారంతా లింగ, మత, దేశ భేదములను లెక్కచేయక చక్కగా విశదీకరించెదవుగాక! శ్రవణము చేయువారు మునుముందుగా బుద్ధిని ధ్యాన – యోగాభ్యాస – నిస్వార్థ లోక సేవలచే సుసంపన్నము చేసుకొని, మహత్తరమగు ఇందలి విషయములు వినటానికి సంసిద్ధులై, తమయొక్క 'ఆస్థి'యే అయి ఉన్న 'అస్థి' రూపమగు ఆత్మయొక్క స్వాభావికసత్యమును గ్రహించెదరు గాక.

## ఫలశ్రుతి – ఫలితార్థము

**మం॥ శ్లో॥ అన్నపూర్ణోపనిషదం యో అధీతే గుర్వనుగ్రహాత్**
**స జీవన్ముక్తతాం ప్రాప్య బ్రహ్మైవ భవతి స్వయమ్।**

***ఈ "అన్నపూర్ణోపనిషత్' ఎవ్వరైతే గురు – అనుగ్రహ పూర్వకంగా అధ్యయనము చేస్తారో – అట్టివారు 'జీవన్ముక్తి'ని ప్రాప్తించుకొన్నవారై స్వయం పరబ్రహ్మ స్వరూపులై విరాజిల్లగలరు.***

*ఓం శాంతిః। శాంతిః। శాంతిః।*

*ఇతి అన్నపూర్ణోపనిషత్*
*ఓం శాంతిః। శాంతిః। శాంతిః।*

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 4 ఆత్మోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ యత్ర అనాత్మ ప్రపంచోఽ యమ్ అపహ్నవ పదం గతః।
ప్రతియోగి వినిర్ముక్తః "పరమాత్మ" అవశిష్యతే॥



అజ్ఞాన-అవిచారములవశంగానే - బాహ్య అన్య భేదరూపమగు అనాత్మక ప్రపంచ భావన ఈ జీవుని ఆత్మ దృష్టిని అపహ్నా పరచుచున్నది. (మరగుపరచుచున్నది. కప్పి ఉంచుచున్నది). అట్టి ఆ"వరణ దృష్టి దోషము తొలగిపోగా, ఇక అప్పటి నిర్మల దృష్టికి, - సర్వే సర్వత్రా, సర్వదా ఈ సమస్తమూ" <u>"అమృత-అఖండ స్వస్వరూప పరమాత్మానుభవము"</u> అయి - అవశేషించగలదు.

ఓం

<u>'ఓం'కార సంజ్ఞార్థుడగు పరమాత్మకు నమస్కరిస్తూ...</u>

**1. <u>అథ అంగిరాః (అంగిరసముని వరేణ్యులు):</u>**

***<u>త్రి విధః పురుషో అజాయత,</u>***

**(1) ఆత్మా (బాహ్యాత్మా)**

**(2) అంతరాత్మా**

**(3) పరమాత్మా చ ఇతి।**

**<u>అంగిరస మహర్షి (ప్రవచనము):</u>**

సమస్తము తన పురుషకారముగా కలిగియున్న (పరమ) లేక (ఉత్తమ) **పురుషుడు** (The Absolute 'I' of prior to all else) మూడు విధములైన రూపములు దాల్చుచున్నాడు.

(1) ఆత్మ (బాహ్యాత్మ), (2) అంతరాత్మ (3) పరమాత్మ

---

**(1) <u>(అథ బాహ్యాత్మా నామ)</u>**

**త్వక్ చర్మ మాగ్ంస**

**రోమ అంగుష్ఠ అంగుల్యః**

**పృష్ఠ వంశ నఖ గుల్ఫ ఉదర నాభి**

**మేఢ్ర కటి ఊరు కపోల**

**శ్రోత్ర భ్రూ లలాట బాహు పార్శ్వ శిరో అక్షిణి -**

**భవంతి, - జాయతే, మ్రియతే -**

**ఇతి ఏష "బాహ్యాత్మా" ॥**

**బాహ్యాత్మ (భౌతికము)** : ఇది ఈ జీవునియొక్క పుట్టుక - జీవనము - మరణము అనబడే ధర్మములు కలిగి ఉన్నట్టి పురుషాకార విభాగము. ఇదియే **"బాహ్యాత్మ"** అనబడుతోంది.

ఇది భౌతిక సంబంధమైనది. త్వక్కు (తోలు), చర్మము, మాంసము, వెంట్రుకలు, బొటనవ్రేలు, తదితర వ్రేళ్ళు (Fingures), వీపు, వెన్నెముక, చీలమండలము, పొట్ట, బొడ్డు, మేఢ్రము, మూత్ర విసర్జనావయము, నడుము, తొడలు, చెక్కిలి, చెవులు, (రెండు కనుబొమ్మల మధ్యగల) భ్రూమధ్యము, నుదురు, చేతులు, భుజములు, శిరస్సు, కళ్ళు గల ఈ భౌతిక రూపము- **"బాహ్యాత్మ"**. (Physical side of the Functioner)

---

**2. <u>అథ "అంతరాత్మా" నామ।</u> :-**

**పృథివి ఆపః తేజో వాయుః ఆకాశమ్।**

**- ఇచ్ఛా ద్వేష సుఖ దుఃఖ కామ మోహ**

**వికల్పన - ఆది,**

**స్మృతి లింగ, ఉదాత్త అనుదాత్త**

**హ్రస్వ దీర్ఘ ప్లుత స్ఖలిత గర్జిత**

**స్ఫుటిత ముదిత నృత్త గీత వాదిత్ర**

**ప్రళయ విజృంభిత - ఆదిభిః ...,**

**<u>అంతరాత్మ :</u>**

పంచభూతములు (భూమి, జలము, తేజస్సు, /అగ్ని, వాయువు, ఆకాశము)- (Sold, Liquid, Light / Fire, Vapour, Space)

**మనో వికల్పములు** : ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, కామము, మోహము మొదలైన మనోవికారముల పురుషకారము,

స్మృతి = జ్ఞాపకము, ఎరుక, స్మరించు విషయములు పురుషకారము,

లింగము = ప్రకృతి, మూలప్రకృతి రూపము, స్వభావము,

శ్రోత్ర శ్రవణము (Hearing): = హ్రస్వమైన (చిన్న), దీర్ఘమైన స్వరములను, జాలువారు (మరియు) బిగ్గర గర్జనలను, స్పష్టమైన శబ్దములను, సంతోషముతో కూడి నృత్య గీత వాద్యములను, ప్రళయ విజృంభిత శబ్దములను, నినదములను వినునది, అనుభవములుగా పొందునది.

| | |
|---|---|
| శ్రోతా, ఘ్రాతా, రసయితా, నేతా, బోద్ధా,<br>కర్తా, విజ్ఞానాత్మా, పురుషః<br>పురాణ న్యాయ మీమాంసా ధర్మశాస్త్రాణి ఇతి,<br>– శ్రవణ ఘ్రాణ ఆకర్షణ కర్మ విశేషణం<br>కరోతి – ఏషో "అంతరాత్మా"। | వాసనానుభవి. రసానుభవములను పొందునది. ఇంద్రియములను నియమించునది. బోధించునది. కర్మలకు కర్తృత్వము వహించునది. సర్వ విషయములను తెలుసుకొనుచున్నట్టిది. పురాణ - న్యాయ - ధర్మశాస్త్రముల విశేషములకు పురుషకారము వహించుచున్నది. సర్వము వినునది, వాసన చూచునది, కర్మ విశేషములచే ఈడువబడునది - ఇది **"అంతరాత్మ".** |
| **3.** అథ పరమాత్మా నామః–<br>యథా అక్షర ఉపాసనీయః।<br>స చ ప్రాణాయామ ప్రత్యాహార<br>ధారణా ధ్యాన సమాధి యోగాత్,<br>అనుమాన–ఆత్మ చింతక । | **పరమాత్మ : ఇంద్రియములకు విషయముయే వస్తువు వంటిది కాదు. మనస్సుకు అనుభవముయే విషయము వంటిది కాదు.**<br>క్షరము (హెచ్చుతగ్గులు) లేనిది. **(1) యమ, (2) నియమ, (3) ఆసన, (4) ప్రాణాయామ, (5) ప్రత్యాహార, (6) ధారణ, (7) ధ్యాన, (8) సమాధి అనబడే అష్టాంగ యోగములచేతను,** అనుమాన (By differentiation) ప్రత్యక్ష ప్రమాణములచేతను, చింతన చేయబడుచున్నట్టిది. |
| వటకణికా వా, శ్యామాక తండులో వా,<br>వాలాగ్ర శత సాహస్ర వికల్పన – ఆదిభిర్వా<br>స లభ్యతే।<br>న ఉపలభ్యతే।<br>న జాయతే। న మ్రియతే।<br>న శుష్యతి। న క్లిద్యతే। ..., | వట బీజములో రహస్యంగా దాగిన అంకుర శక్తివలెను, శ్యామ (తండుల) ధాన్యపు గింజ యొక్క చిట్ట చివరి భాగముయొక్క - వెయ్యో వంతువలె సూక్ష్మాతి సూక్ష్మము. సమస్త సంకల్ప-వికల్పనలకు మును ముందుగా ఏర్పడినదై ఉన్నట్టిది. సంకల్ప - వికల్పనలలో లభించనిది. ప్రయాణించి పొందవలసినది కాదు.<br>అట్టి పరమాత్మ జన్మించదు, మరణించదు, శుష్కించదు, తడుపబడదు. జాగ్రత్-స్వప్న- సుషుప్తులలోను, జన్మ-జన్మాంతరములలోను 'నేను' - అను ఉపకరణమును వెంటనిడుకొని సంచారములు చేస్తూ ఉన్నట్టిది. |
| న దహ్యతే। న కమ్పతే।<br>న భిద్యతే। న స్విద్యతే।<br>నిర్గుణ సాక్షీభూత శుద్ధో<br>నిరవయవాత్మా।<br>కేవలః సూక్ష్మో। ..., | అట్టి "నేను" రూపి అగు పరమాత్మ యొక్క స్వరూపము దహించబడదు, (కాలదు). కంపనము పొందదు. ఖండించబడదు. భేదించబడదు. (భౌతికదేహము వంటిది కాదు).<br>గుణములకు ముందే ఉన్నట్టిది కాబట్టి **"నిర్గుణము"**. (దృశ్యమునకు ద్రష్టవలె) సమస్తమునకు **"సాక్షీభూతము"**. ఏ దోషములు అంటవు. 'పరమశుద్ధము'. అవయవములను కదిల్చునట్టిదేగాని అవయవ రూపము కాదు. **"నిరవయవి"**.<br>సమస్త సందర్భములకు ఆవల కేవలసత్యమై ఉన్నట్టిది. ఇంద్రియములకు అవిషయము కాబట్టి **సూక్ష్మాతి సూక్ష్మము.** |
| నిర్మమో। నిరంజనో। నిర్వికారః। ...,<br>శబ్ద స్పర్శ రూప రస గంధ వర్జితో।<br>నిర్వికల్పో, నిరాకాంక్షః।<br>సర్వ వ్యాపీ।<br>సో అచిన్త్యో।<br>అనిర్వర్ణ్యశ్చ।<br>పునాతి అశుద్ధాని, అపూతాని।<br>నిష్క్రియః।<br>తస్య సగ్ంసారో నాస్తి।।<br>(తత్ – ఆత్మ సంజ్ఞః)। | 'నాది' కి సంబంధించని కేవలసాక్షియగు **'నేను'** స్వరూపము కాబట్టి **నిర్మమము.** దోషములు అంటవు. **నిరంజనము.** ఎట్టి వికారములు లేనట్టిది. **నిర్వికారము.** ఇంద్రియార్థములైనట్టి శబ్ద స్పర్శ రూప రస గంధముల సంబంధము కలిగి ఉండనట్టిది. **'ఇంద్రియార్థ వివర్జితము.'**<br>సంకల్పములకు మునుముందే ఉన్నట్టిది. **నిర్వికల్పము.**<br>ఒకడు - తన రాత్రి కలలో కనిపించిన ఒక వస్తువును కాంక్షిస్తూ తెల్లారి బద్దుడై పోతాడా? పోడు. అట్లాగే దృశ్యము ఆత్మకు స్వకీయ కల్పిత స్వప్నమువంటిదే కాబట్టి ఆకాంక్షలు లేనట్టిది.<br>- (కథా రచయిత కథలోవలె) పరమాత్మ **సర్వవ్యాపి.** ఆలోచనలు అద్దానివేగాని, ఆలోచనలకు (మనస్సుకు) అందనిది. వర్ణించి చెప్పబడజాలనిది కాబట్టి అనిర్వర్ణ్యము. అట్టి పరమాత్మయొక్క జ్ఞానము అశుద్ధుని శుద్ధిగాను, అపవిత్రుని పవిత్రునిగాని చేయునదై ఉన్నది. కర్మలచే పరిమితము కాదు. నిష్క్రియము. పరమాత్మకు సంసారము అనే బంధము గాని, పరిమితముగాని లేవు. **"అపరిమితము. అప్రమేయము".** |

**4. ఆత్మసంజ్ఞః :-**

**ఆత్మయొక్క సంజ్ఞ ఇంకా ఎట్టిదంటే...,**

శివ శుద్ధ ఏకఏవ
అద్వయః సదా।
(సదా) బ్రహ్మరూపతయా
బ్రహ్మ కేవలం ప్రతిభాసతే →
"జగత్" రూపతయా – అపి,
ఏతత్ బ్రహ్మైవ ప్రతిభాసతే।

శుభప్రదము. శివము. శుద్ధము. ఆదియందు, ఆ తరువాత కూడా ఎల్లప్పుడు **ఏకము, అద్వయము** అయి ఉన్నట్టిది. (It is always **AS IT IS**).

బ్రహ్మమే సర్వదా బ్రహ్మమునందు ప్రకాశించుచున్నది. అద్దానియందు ఊర్ధ్వ అథోలోకములు మొదలైనవి లేవు. (అద్దములో అద్దమే ఉంటుందిగాని, వస్తు జాలములు ఉండవు కదా)!

ఈ జగత్తు ఆత్మయందు (దర్పణములో దృశ్యమువలె) ప్రతిబింబిస్తోంది. అయితే బ్రహ్మమే బ్రహ్మమునందు జగత్ - రూపంగా (దృష్టియందు) ప్రతిబింబిస్తోంది.

---

విద్య – అవిద్యాది భేదేన,
భావ – అభావాది భేదతః,
గురు – శిష్యాది భేదేన →
బ్రహ్మైవ ప్రతిభాసతే।

విద్య - అవిద్య మొదలైన భేదరూపములుగాను, భావము - అభావము మొదలైన రూపములుగాను, గురువు - శిష్యుడు అను భేదములుగాను - పరమాత్మయే (లేక) బ్రహ్మమే ప్రతిభాసిస్తోంది.

---

బ్రహ్మైవ కేవలం శుద్ధం
విద్యతే తత్త్వదర్శనే।
న చ విద్యా। న చ అవిద్యా।
న జగత్ చ। న చ అపరమ్।

తత్త్వదర్శనముచే (తత్ త్వమేవ - అను నిర్మల ఆత్మదృష్టిచే) సర్వత్రా శుద్ధమగు బ్రహ్మమే అనుభూతమవగలదు. తత్త్వజ్ఞుల అనుభవములో సమస్తము ఆత్మయే।

(కలలో వాస్తవానికి ఏ వస్తువు లేని తీరుగానే) ఇక్కడ విద్యలేదు. అవిద్య లేదు. జగత్తు లేదు. పర-అపరములనబడే రెండు వేరైనవి లేవు.

---

సత్యత్వేన జగత్ భాసం (నం)
సంసారస్య ప్రవర్తకమ్।
అసత్యత్వేన భానం తు
సంసారస్య నివర్తకమ్।

(కలలో కనిపించిన ఇల్లు, వస్తువులు సత్యమా? కాదు కదా! అట్లాగే) **"ఈ జగత్తు సత్యమే"** అని భాసించటమే 'సంసారము' అనబడుదాని ప్రవర్తనము (Appearence). అదియే భవ బంధము కూడా। **(భవమివ బూసతియేన, తత్సంబంధమితి భావబంధః)॥**

(కథలోని కొండల వర్ణనవలె) ఈ జగత్తు సత్యముకాదు. అసత్యము అని భాసించటమే (తెలియటమే) **సంసారము**యొక్క నివర్తకము.

---

"ఘటో అయమ్" ఇతి విజ్ఞాతుం
నియమః కో అన్వపేక్షతే?
(కో ను అపేక్షతే?)

'కుండ'గా ఉన్నదంతా మట్టియే. కానీ మట్టిలో 'కుండ' అనునది ఏదీ లేదు. "మట్టికుండ" అనుదానిలో మట్టికి వేరై 'కుండ' అనబడేదీ లేదు. ఈ విషయాలు తెలుసుకోవటానికి నియమము, నిష్ఠల అవసరము ఏముంటుంది? పరమాత్మను తెలుసుకోవటానికి యజ్ఞము, వ్రతము, ఉపవాసము మొదలైన నిష్ఠలతో పని ఏమి?

---

వినా ప్రమాణ సుష్ఠుత్వం యస్మిన్ సతి పదార్థ ధీః,
అయమాత్మా నిత్య సిద్ధః ప్రమాణే సతి భాసతే॥
న దేశం, న అపి కాలం వా,
న శుద్ధిం వాపి అపేక్షతే।

మట్టి గురించి తెలుసుకొన్న తరువాత ఇక "కుండ మట్టికి వేరైన పదార్థము" అనునది ఏమాత్రము ధీమంతునిపట్ల (తెలివికలవానిపట్ల) శేషించి ఉండదు కదా!

ఆత్మ నిత్యశుద్ధము (Even Established) అని ప్రమాణముల సహాయంతో బుద్ధికి భాసించిన తరువాత, ఇక ఆపై **"దేశ-కాల ప్రమాణములు కావాలి. బుద్ధి శుద్ధి అవాలి."** అనే అపేక్షలు (Pre-Conditions) శేషించవు.

---

'దేవదత్తో అహమ్' ఇతి ఏతత్
విజ్ఞానం నిరపేక్షకమ్,
తద్వత్ బ్రహ్మవిదోఽపి
అస్య "బ్రహ్మోహమ్"
ఇతి వేదనమ్॥

'దేవదత్తుడు' అనువాడు ఉన్నాడు. ఆతనిని పిలచి, "నీవే దేవదత్తుడవు" - అని ఎవరైనా ప్రమాణములతో నిరూపించి చెప్పవలసిన అవసరమున్నదా?

'నేను ఉన్నాను' అని నాకు మరొకరు శాస్త్ర ప్రమాణములతో నిరూపించి చెప్పాలా? నేను ఉన్నానని నాకు తెలియదా?

అట్లాగే బ్రహ్మవేత్తకు, (బ్రహ్మము గురించి శ్రవణం చేసినవానికి) "నీవే బ్రహ్మము" అని ఎవరైనా వచ్చి చెప్పవలసిన పనేమున్నది? 'బ్రహ్మము' అనునది - ప్రతి జీవునియొక్క సహజ-స్వాభావికమైనట్టిది, సర్వదా స్వస్వరూపమే అయినట్టి **'నగ్న సత్యము'**. దానిని "నిరూపిస్తేనే నమ్ముతాను" - అనుమాటకు అర్థమేమున్నది.

| | |
|---|---|
| **5. భానునేవ జగత్ సర్వం**<br>**భాస్యతే యస్య తేజసా,** | సూర్యుడు ఆకాశంలో ప్రకాశిస్తూ ఉండగా అట్టి సూర్య ప్రకాశ తేజస్సుచే ఈ దృశ్య జగత్తు (కళ్లకు) ప్రకాశమానమై ఉంటుంది కదా! |
| **అనాత్మకమ్, అసత్ - తుచ్ఛం, -**<br>**కిం ను తస్య అవభాసకమ్।**<br>**వేద శాస్త్ర పురాణాని భూతాని**<br>**సకలాన్యపి, యేన అర్థవంతి,**<br>**తం కిం ను విజ్ఞాతారం ప్రకాశయేత్।** | అట్లాగే ఆత్మయొక్క ప్రకాశము చేతనే అనాత్మకము, అసత్-స్వరూపము అగు జగత్తు ప్రకాశమానము అవుతోంది. ఆత్మయే లేకపోతే జగత్తును తెలుసుకొనేది ఎవరు? తెలియబడుచున్నదంతా ఆత్మయొక్క సంద్రర్శనమే! **జగత్తును తెలుసుకొనుచున్నట్టిదే ఆత్మ!**<br>వేద శాస్త్ర పురాణములు, సమస్త భూతజాలము దేనిచేత ఆయా రీతులుగా అర్థవంతముగా (As meaningful) తెలుసుకోబడుతోందో, ఆ తెలుసుకుంటూ ఉన్నట్టిదే 'ఆత్మ-ప్రకాశము'. **విజ్ఞాతము-విజ్ఞాని కూడా ఆత్మస్వరూపమే।** |
| **క్షుధాం దేహవ్యథాం త్యక్త్వా**<br>**బాలః క్రీడతి వస్తుని,**<br>**తథైవ విద్వాన్ రమతే,**<br>**నిర్మమో నిరహం సుఖీ।** | ఒక పిల్లవాడు ఆకలి, దేహబాధలను కూడా మరచిపోయి ఆటవస్తువులతో ఆడుకుంటూ ఆనందిస్తూ ఉంటాడు చూచారా? ఆ విధంగా ఆత్మతత్త్వము తెలిసిన విద్వాంసుడు మమకారము - అహంకారమును వదలి ఈ జగత్తులో (క్రీడా మైదానంలోలాగా) ఆనందంగా ఆడుకుంటూ ఉంటాడు. |
| **కామాన్ నిష్కామరూపీసన్**<br>**చరతి ఏకచరో మునిః।**<br>**స్వాత్మనైవ సదా తుష్టః**<br>**స్వయం సర్వాత్మనా స్థితః॥** | (జగద్విషయములపట్ల **నిశ్శబ్దము** ఆవహించి, ఆత్మసంగతి పట్ల మాత్రమే **సశబ్దుడైనవాడు - ముని**). అట్టి **ముని** సమస్త ఇంద్రియ విషయములపట్ల **నిష్కామి** అయి, ఆత్మపట్ల మాత్రమే **ఏకాంత సకామియై,** 'స్వాత్మ' చేతనే **సదా తుష్టుడు**(Completely satisfied) అయి, స్వయముగా **'అందరిలోని నేనైన నేను'** గా సర్వాత్మత్వమునందు "స్థితి" పొందినవాడై ఉంటాడు. |
| **నిర్ధనోఽపి సదా తుష్టో।**<br>**అపి అసహాయో మహాబలః।**<br>**నిత్యతృప్తస్తు అభుంజానోఽపి।**<br>**అసమః సమదర్శనః।**<br>**కుర్వన్నపి న కుర్వాణశ్చ।**<br>**అభోక్తా ఫలభోగ్యపి।** | <u>**ఆత్మదర్శనముచే ఆత్మయందు సంతుష్టుడైనట్టి తత్త్వజ్ఞుడు:-**</u><br>- పేదవాడైనా కూడా సర్వ సంపదలచే సంతుష్టి పొందినవాడితో సమానుడై, **"జగత్-జీవిత వినోది"** అయి ఉంటాడు.<br>- నిస్సహాయుడు అయికూడా, (ఎవ్వరి సహాయము పొందనివాడైనప్పటికీ), (మనస్సునందు) **'మహాబలవంతుడు'** అయి ఉంటాడు<br>- సర్వకర్మలు నిర్వర్తిస్తూ కూడా, ఏ కర్మ చేయనివాడై - **అకర్త** - అయి ఉంటాడు.<br>- కర్మఫలములు అనుభవిస్తూ కూడా సమస్త కర్మఫలములకు **'అభోక్త'** అయి ఉంటాడు. (Neither the subject and predicate, nor the object for all events of the world) |
| **6. శరీర్యపి అశరీరి ఏషః।**<br>**పరిచ్ఛిన్నోఽపి సర్వగః।**<br>**అశరీరగ్ం సదా అనంతం**<br>**ఇమం బ్రహ్మవిదం క్వచిత్।** | బ్రహ్మవేత్త బ్రహ్మముతో మమేకమగుచు, అప్పుడిక శరీరము కలిగియుండి కూడా శరీరము లేనివానివలెనే ఉంటాడు.<br>✠ పరిచ్ఛిన్నుని (Bifurcated) వలె ఉండి కూడా సర్వగతుడై (సర్వులకు అంతర్యామి అయి, అంతటా నిండినవాడై, ఏకస్వరూపుడై) - ఉంటాడు.<br>✠ సర్వదా అశరీరుడై. దేహ మనో బుద్ధి చిత్త అహంకార దృశ్యములచే పరిమితుడు కాక, - **'అనంతుడు'** అయి ఉంటాడు. |
| **ప్రియ - అప్రియే న స్పృశతః**<br>**తథైవ చ శుభ - అశుభే।**<br>**తమసా గ్రస్తవత్ భానాత్**<br>**అగ్రస్తోఽపి (అగ్రస్థా అపి) రవిః జనైః,**<br>**'గ్రస్త' ఇతి ఉచ్యతే భ్రాన్త్యా**<br>**హి అజ్ఞాత్వా వస్తులక్షణమ్॥** | ✠ప్రియ - అప్రియములచే, అవి కలిగించే శుభ - అశుభములచే స్పర్శించబడనివాడై ఉంటాడు. నిర్లిప్తుడై ఉంటాడు.<br>సూర్యుడు సర్వదా స్వయం ప్రకాశకుడై ఉండగా "అప్పుడు సూర్యుడు అస్తమించి చీకటిలోకి వెళ్లాడు. ఇప్పుడు ఉదయించి వెలుతురుకు వస్తున్నాడు" - అని అనుకుంటూ ఉంటారు. భ్రాంతి చేతమాత్రమే సూర్యునికి చీకటి వెలుగులు ఆపాదించ బడుచున్నాయి. నిత్య-స్వయం ప్రకాశకుడగు సూర్యుడు చీకటిలోకి వెళ్లటమేమిటి? సూర్యునికి స్వతఃగా ఉదయాస్తమయములు ఉండవు కదా! |

**తద్వత్ దేహాది బన్ధేభ్యో**
**విముక్తం బ్రహ్మవిత్తమ్।**
**పశ్యంతి దేహివత్ మూఢాః**
**శరీర - అభాస దర్శనాత్।**
**అహి నిర్ల్వయనీవ అయం**
**ముక్త - దేహస్తు (స్తు) తిష్ఠతి।**

ఉదయాస్తమయములు లేని స్వయంప్రకా సూర్యునివలె- బ్రహ్మవేత్త బ్రహ్మమే తానై ప్రకాశించుచున్నాడు. ఇక ఆత్మ - 'దేహి'గా అగుచున్నట్లు దేహము పొందుచున్నట్లు, ఆ దేహముచే విషయములు పొందుచున్నట్లు అవి బంధములు అగుచున్నట్లు- మూఢుడు, మాత్రమే ఆత్మకు ఆపాదించుచున్నాడు. బ్రహ్మము ఎరిగినవానికి దేహము బంధమే అవటంలేదు.

పాము ఏవిధంగా కుబుసమును విడచి వేస్తుందో ఆ విధంగా ఆత్మజ్ఞాని దేహభావము విడచి దేహియొక్క సహజరూపమగు "ఆత్మభావము" నందు తిష్ఠితుడై ఉంటున్నాడు. దేహముయొక్క దృశ్యముయొక్క రాక - పోకలు అతనిపట్ల విషయమే కాదు.

---

**ఇతస్తతః (ఇతః తతః) చాల్యమనో**
**యత్ కించిత్ ప్రాణవాయునా**
**స్రోతసా నీయతే దారు**
**యథా నిమ్న - ఉన్నత స్థలమ్।**
**దైవేన నీయతే దేహో**
**యథా కాల ఉపభుక్తిషు।**

గంగాజలము వేగముగా ప్రవహిస్తూ ఎత్తుపల్లములను సమానముగా చేసివేస్తోంది కదా। ఆ విధంగా యోగాభ్యాసి, తత్త్వవేత్త పట్ల - ప్రాణశక్తి సర్వత్రా ప్రవహిస్తూ ఎక్కువ - తక్కువలన్నీ ఏకము చేసివేస్తోంది.

ఇక, దైవికంగా సంప్రాప్తించిన ఈ దేహము జన్మ-జరా-మరణములను యథాకాలముగా పొందుచూ ఉండవచ్చుగాక! ఉపభుక్తుడు (అనుభవి) అగుచుండవచ్చు గాక।

---

**లక్ష్య - అలక్ష్య గతిం త్యక్త్వా**
**యః తిష్ఠేత్ కేవలాత్మనా,**
**శివ ఏవ స్వయం సాక్షాత్,**
**అయం బ్రహ్మవిత్ ఉత్తమః॥**

ఈ దేహ దృశ్య లక్ష్య - అలక్ష్య (Targets, Non Targets) ములన్నీ వదలి (సందర్భములను దాటివేసి) **కేవలము, సహజము అగు ఆత్మయందు తిష్ఠితుడై** ఉండువాడు-స్వయం - సాక్షాత్ శివుడే! ఆతడే ఉత్తమమగు బ్రహ్మవిదుడు। బ్రహ్మవేత్త। బ్రహ్మమే ఆతడు।

సమస్తమును "సమము, ఏకము" చేసివేసి - సమస్వరూపమగు "సాక్షాత్ శివోఽహమ్"ను ఉత్తమ బ్రహ్మ-తత్త్వవేత్త ఇక్కడే సిద్ధించుకుంటున్నాడు.

---

**7. జీవన్ ఏవ సదా ముక్తః**
**కృతార్థో "బ్రహ్మవిత్తమః"।**
**ఉపాధి నాశాత్ - బ్రహ్మైవసన్**
**బ్రహ్మాప్యేతి నిర్ద్వయమ్।**

"బ్రహ్మమే నేను" అని ఎరిగిన బ్రహ్మవిత్తముడు (బ్రహ్మవిత్-తముడు) - ఈ దేహము ఉన్నప్పుడే కృతార్థుడై "సదా ముక్తస్వరూపుడు" - అయి ఉంటున్నాడు.

ఆతని భావన - ఉపాధి పరిధులను, దృశ్యపరిధులను, లోక పరిధులను, త్రిఅవస్థల పరిధులను దాటివేసినదై ఉండటముచేత - ఆతడు ఈ ఉపాధిని నశించిన వస్తువుగా దర్శిస్తూ, బ్రహ్మమునందే వసించుచున్నాడు. ద్వంద్వ రహితమగు బ్రహ్మమును పొంది ఉంటున్నాడు. ఆతడే బ్రహ్మచారి.

---

**శైలూషో వేష సద్భావ (శైలూషి=ఆటకత్తె స్త్రీ పాత్రధారి)**
**అభావయోశ్చ యథా పుమాన్,**
**తథైవ "బ్రహ్మవిత్ శ్రేష్ఠః"**
**సదా బ్రహ్మైవ నాపరః। (న-అపరః)।**

విశిష్టతగల ఒక నటుడు నాటకములో శైలూషి (స్త్రీ) వేషము ధరిస్తూ, స్త్రీయొక్క హావ-భావములు ప్రదర్శిస్తూ కూడా "నేను పురుషుడను" అను ఎరుక పోగొట్టుకోడుకదా! అట్లాగే "బ్రహ్మవిత్ శ్రేష్ఠుడు" - ఈ జగన్నాటకములో 'శరీరి' పాత్ర ధరిస్తూ కూడా **"నేను సదా బ్రహ్మమునే! మరొకటేదీ కాదు"** - అని ఎరిగియే ఉంటాడు.

---

**ఘటే నష్టే యథా వ్యోమ**
**వ్యోమైవ భవతి స్వయమ్,**
**తథైవ ఉపాధి విలయే**
**బ్రహ్మైవ "బ్రహ్మవిత్ స్వయమ్"।**

కుండ కుండగా ఉన్నప్పుడు, ఆ కుండ పగిలినప్పుడు కూడా ఘటాకాశము - బాహ్యాకాశము ఏకముగానే ఉంటుంది కదా! అట్లాగే ఈ ఉపాధి ఉన్నా (లేక) ఇది నశించినా కూడా, **బ్రహ్మవేత్త 'బ్రహ్మము'** గానే (తన గురించి, తదితరులగురించి) **ఎరిగినవాడై ఉంటున్నాడు.**

---

**క్షీరం క్షీరే యథా క్షిప్తం**
**తైలం తైలే జలం జలే,**
**సంయుక్తం ఏకతాం యాతి**
**తథా ఆత్మని "ఆత్మవిత్ మునిః"।**

'పాలు' లో 'పాలు' పోస్తే అంతా కలిపి ఒకేపాలు అవుతుంది. నూనెలో నూనె పోస్తే అంతా ఒకే 'నూనే' అవుతుంది. అట్లాగే ఆత్మవిత్ ముని జీవాత్మను పరమాత్మయందు ఏకం చేసి ఏకాత్మ స్వరూపుడై ఉంటాడు. (వ్యష్టి - సమిష్టి - కేవలాత్మలను ఏకంచేసి అఖండాత్ముడై ఉంటాడు).

| | |
|---|---|
| **ఏవం విదేహ కైవల్య**<br>**సన్మాత్రత్వమ్ అఖండితమ్,**<br>**బ్రహ్మభావం ప్రపద్య ఏష**<br>**యతిః నావర్తతే పునః॥ (న ఆవర్తతే పునః)॥** | అట్టి "అఖండాత్మతో ఏకత్వము"చే తాను అఖండితమగుచున్నాడు. **'విదేహ కైవల్యము'** అనబడే **"కేవల సన్మాత్రత్వము"** ను సిద్ధించుకొన్న ఆత్మవేత్త - జీవాత్మత్వము, దృశ్యానుసంధానము మొదలైన ఎట్టి పరిమిత దృష్టులను పొందడు. అంతా స్వకీయ కల్పనగా చూస్తూ ఉంటాడు. (సమస్తము తానే అయి ఆస్వాదిస్తూ ఉంటాడు). |
| **'సత్' ఆత్మకత్వ విజ్ఞాన**<br>**దగ్ధ అవిద్యాది వర్ష్మణః**<br>**అముష్య బ్రహ్మభూతత్వాత్**<br>**బ్రహ్మణః కుత ఉద్భవః?** | తనయొక్క సత్ - ఆత్మకత్వమును సుస్పష్టముగా, నిర్దుష్టముగా, నిస్సందేహముగా ఎరిగినవాడై సమస్త తదితర అన్యశాస్త్ర విద్యల భ్రమలను అవిద్యా విషయ సమూహములను ఆత్మజ్ఞానాగ్నిచే దగ్ధము చేసినవానికి, - ఇక **ఐహిక - ఆముష్యముల తేడా ఏముంటుంది?** అట్టి బ్రహ్మస్వరూపుడు మరల జన్మించటమనే ప్రసక్తి ఎక్కడిది? ఆతనికి వర్తమాన జన్మ కూడా 'లేనిదే' అగుచున్నది. |
| **మయా క్లప్తౌ బంధమోక్షౌ**<br>**న స్తః స్వాత్మని వస్తుతః।**<br>**యథా రజ్జౌ నిష్క్రియాయాం**<br>**సర్పా భాస వినిర్గమౌ।**<br>**ఆవృతేః సత్ అసత్త్వాభ్యాం**<br>**వక్తవ్యే బంధమోక్షణే।** | అట్టి వానికి ఆత్మపట్ల వస్తుతః బంధము, మోక్షము మొదలైనవి "మొదలే లేనివి" అగుచున్నాయి.<br>"ఇది పాము కాదు. త్రాడు మాత్రమే" అని తెలుసుకొన్న తరువాత, ఇక ఆపై అంతకు ముందటి (పాముగా అనుకున్నప్పటి) వికారములు ఉంటాయా? ఉండవు. **"సమస్తము మమాత్మస్వరూపమే"** అని తెలుసుకొన్న తరువాత సత్ - అసత్, బంధ - మోక్షముల ఆవృత్తులు ఇంకెందు కుంటాయి? ఉండవు. |
| **(న ఆవృతిః) నావృతిః బ్రహ్మణః కాచిత్**<br>**అన్య – అభావత్ అనావృతమ్।**<br>**'అస్తి' ఇతి ప్రత్యయో యశ్చ**<br>**యశ్చ 'నాస్తి' ఇతి వస్తుని?**<br>**బుద్ధేరేవ గుణావేతౌ న తు నిత్యస్య వస్తునః।**<br>**అతస్తౌ మాయయా క్లప్తౌ**<br>**బంధమోక్షౌ న చ ఆత్మని।** | - "ఇక్కడ భౌతికంగా కనిపించే వస్తు సమూహములు ఉన్నాయి! లేవు" - అనునవన్నీ బుద్ధియొక్క త్రిగుణమాయా లక్షణములు.<br><u>బ్రహ్మభావనయందు అన్యమే ఉండదు.</u> అన్యమే లేనప్పుడు బ్రహ్మమును పదార్థ (వ్యావహారిక) ఆవృత్తులు ఆవరించుచున్నాయనే ప్రసక్తి ఎక్కడిది? దృశ్య బుద్ధికి కనిపించే వస్తుజాలము ఆత్మయందు ఆత్మకు వేరై లేనేలేవు. "మాయ"చే ఏర్పడే బంధమోక్ష వ్యవహారములు బుద్ధికి చెందినవేగాని (బుద్ధియొక్క స్వకీయ కల్పనయేగాని) వాస్తవానికి ఆత్మకు బంధమే లేదు. బంధమే లేనిదానికి మోక్షమెక్కడిది? |
| **నిష్కళే నిష్క్రియే శాంతే**<br>**నిరవద్యే నిరంజనే,**<br>**అద్వితీయే పరే తత్త్వే**<br>**వ్యోమవత్ కల్పనా కుతః?** | ఆకాశములె ఆత్మాకాశము సర్వదా నిష్కళంకము. నిష్క్రియము. పరమశాంతము. దేనిచేతను జయింపబడజాలనిది, దోషరహితము (నిరంజనము). తనకు ద్వితీయమే లేని అద్వితీయము కూడా। అట్టి కేవల పరతత్త్వ స్వరూపమునకు 'జీవాత్మ' మొదలైన కల్పనలు ఎక్కడ ఉంటాయి? కనుక ఆత్మకు వేరుగా 'జీవాత్మ' లేదు. జగద్దృశ్యము లేదు. |
| **న నిరోధో న చ ఉత్పత్తిః**<br>**న బద్ధో న చ సాధకః।**<br>**న ముముక్షుః న వై ముక్తః।** | - ఆత్మను నిరోధించగలిగేది ఏదీలేదు.<br>- ఆత్మను ఉత్పత్తి చేయగలిగేదీ లేదు. బద్ధుడు లేడు. సాధకుడు లేడు.<br>- ఆత్మకు ముక్తి కలిగించాలనే ముముక్షువు లేడు. (ఆ ముముక్షువు ఆత్మయే అయి ఉన్నాడు)<br>- ఆత్మకు బంధమే లేదు.<br>- బంధమే లేని దానికి ముక్తి ఎక్కడిది? |
| **<u>ఇత్యేషా పరమార్థతా॥</u>**<br>**<u>ఇతి ఉపనిషత్</u>**<br>**<u>ఆత్మోపనిషత్ సమాప్తా॥</u>**<br>***<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః।</u>*** | **పరమార్థముగా** - మన కేవల స్వరూపము **'నిత్యముక్తము'**. సందర్భ స్వరూపము వచ్చి- సహజమగు ఆత్మను ఎట్లా బంధించగలదు?<br>స్వకీయకల్పన ఉన్నప్పుడుగాని, లేనప్పుడు గానీ, - **"ఆత్మగా మనమంతా నిత్యముక్తులము"**<br>***ఇతి ఆత్మోపనిషత్***<br>***ఓం శాంతిః। శాంతిః। శాంతిః।*** |

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 4 ఆత్మోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము

(బ్రహ్మ మానస పుత్రాయ బ్రహ్మజ్ఞే అంగిరసాయ నమః)



**ఎక్కడైతే 'అనాత్మ' అనునదిగాని, "ప్రపంచము" అనుబడునిదగాని, ఆత్మను కప్పిపెట్టి ఉంచ గలిగినది (అపహ్నవపదము) – ఏవీ మొదలే లేవో, – అట్టిచోట ఇక వాదించటానికి, వ్యతిరేకించటానికి విషయముగా ప్రతియోగి శేషించదు. సర్వత్రా పరమాత్మయే శేషించినదై ఉంటుంది.**

ఒకానొక సందర్భములో ఆత్మతత్త్వజిజ్ఞాసులు, తపోధనులు అగు మునీశ్వరులు కొందరు, అంగిరసమహర్షి ఆశ్రమానికి వచ్చి వారికి హృదయపూర్వక నమస్కారములు సమర్పించారు.

*[శ్రీ అంగిరసుడు బ్రహ్మమానస పుత్రులలో ఒకడు. ఆయనకు (1) బృహస్పతి (2) ఉతథ్యుడు (లేక) సంవర్తుడు అను పేర్లు గల ఇద్దరు కుమారులు. ఆయన కుమార్తె పేరు యోగసిద్ధి. ఆ యోగసిద్ధి అష్టవసువులలో ఒకరైన ప్రభాసునికి ధర్మపత్ని. యోగసిద్ధి – ప్రభాస దంపతుల కుమారుడు – దేవశిల్పి అయినట్టి విశ్వకర్మ(!) – **దేవీపురాణము**]. 20 మంది ప్రజాపతులలో అంగిరసులవారు కూడా ఒకరు (భారతము).*

⌘

**అంగిరస మహర్షి** : తపోధనులగు మునివర్యులారా! వేంచేయండి. సుస్వాగతము. మా శిష్యగణముచే మీకు అతిథిదేవపూజగా సమర్పించబడుచున్న ఈ ఈ పండ్లు, ఫలహారములు, పానీయములు మొదలైనవి దయచేసి స్వీకరించండి. సుఖాసీనులవండి.

ఇప్పుడు చెప్పండి. ఊరకరారు మహాత్ములు. ఏమి పనిమీద వచ్చారు?

**మునులు** : మహాత్మా! బ్రహ్మమానసపుత్రా! బృహస్పతీ పితృదేవా! తత్త్వదర్శీ! బ్రహ్మజ్ఞుడుగా మునికులముచే కీర్తించబడువాడా! అంగిరస మహామునీ! మేము కొన్ని ఆత్మతత్త్వ విశేషాలు మీవద్ద శ్రవణం చేసి తెలుసుకోవాలని వచ్చాము. సమిత్పాణులమై (యజ్ఞపరికరముల చేబూని) గురుతుల్యులగు మీకు సమర్పిస్తూ ఆధ్యాత్మిక విద్యాధ్యయనులుగా మీవద్ద ఆత్మ గురించి శ్రవణం చేయవచ్చాము. దయతో మమ్ములను అనుగ్రహించండి.

**అంగిరసమహర్షి** : అట్లాగా! చాలా సంతోషము. సత్సంగము సర్వులకు శుభప్రదముకదా! అడగండి. నాకు స్వానుభవమై తెలిసి ఉన్నంతవరకు ప్రవచనము చేసుకుందాము.

**మునులు** : గురువర్యా! **'పురుషుడు'** అనగా ఎవరు? **'ఆత్మ'** అనగా ఏమి? ఈ రెండు విశేషములు మాకు విశదీకరించండి.

**అంగిరసమహర్షి** : మునీశ్వరులారా! మీరు అడిగిన విశేషములు – పితృదేవులగు బ్రహ్మదేవుని బోధ, వేదోపనిషత్‌సారము, మహనీయుల ప్రవచనములు, స్వానుభవము రంగరించుకొని **వక్త, శ్రోతల సౌలభ్య – మననపూర్వకంగా** మనము చెప్పుకుందాము.

⌘

**పురుషుడు** = ఎవ్వరైతే తనకు అన్యమైనదంతా (జాగ్రత్ స్వప్న సుషుప్తులను, జన్మ-జన్మాంతరములను, లోక-లోకాంతరములను) తనయొక్క పురుషకారము చేతనే సిద్ధింపజేసుకొని లీలగా, క్రీడగా ఆస్వాదిస్తూ ఉన్నట్లు గమనించువారై ఉన్నారో - అట్టి ఎరుకగలవానిని (ఆత్మవిద్యా శాస్త్రజ్ఞులు) **'పురుషుడు'** అనే పేరుతో పిలుస్తున్నారు.

ఆత్మపురుషుడు స్వతఃగా అన్యమును తానే కల్పించుకొనుచూ, తనయొక్క పురుషకారముగా అన్యమైనదంతా కల్పించుకొనుచున్నాడు. అట్టి పురుషుడు మూడు రూపములు ధరిస్తున్నాడు.

**త్రివిధః పురుషో అజాయత।**

(1) బాహ్యాత్మ (2) అంతరాత్మ (3) పరమాత్మ

ఈ మూడుగా మూర్తీభవిస్తూ ఆత్మభగవానుడే **'త్రిమూర్తి'** గా అనబడుచున్నారు. ఈ మూడిటి గురించి ముందుగా వివరించుకుందాము.

## (1) బాహ్యాత్మ (భౌతికమైనది) :

ఈ పురుషుడు ఈ భౌతిక శరీరమును ఒక ఉపకరణమువలె ఇచ్ఛానుసారంగానో, అభ్యాసవశంగానో, కర్మఫలంగానో స్వీకరించుచున్నాడు. బాహ్యాత్మ దేహమును స్వీకరించి 'దేహి' అగుచున్నది.

బాహ్యమగు విశేషాలను విషయములుగా పొందుచుండటంచేత ఈ శరీరము **'బాహ్యాత్మ'** - అని పిలువబడుతోంది. అట్టి సారూప్యమైన ఆత్మయొక్క (పురుషునియొక్క) బాహ్యాత్మగురించిన లక్షణములు ఏవేవో చెప్పుకుందాము.

బాహ్యాత్మ → తోలు, చర్మము, మాంసము, వెంట్రుకలు, కాళ్ళు, చేతులు, బొటనవ్రేళ్ళు (Thumb). తదితర వ్రేళ్ళు (Other Fingures) నడుము (Back), వెన్నెముక, గోళ్ళు, చీలమండలము, పొట్ట, బొడ్డు, లింగావయవము, నడుము, తొడలు, చెక్కిలి, ముక్కు భ్రూమధ్యము, లలాటము, భుజములు, శిరస్సు, కళ్ళు, చెవులు, మొదలైనవన్నీ కలిగి ఉంటోంది. సాకారంగా ప్రకృతిలో దృశ్యమానమై కనిపిస్తూ ఉన్నట్టిది.

**జాయతే మ్రియాతే చ ఇతి।** ఇది ఒకప్పుడు జనించి, మరొకప్పుడు మరణించు ధర్మము కలిగియుండి, **"పురుషునియొక్క బాహ్యాత్మ"** - అని పిలువబడుతోంది. **"పురుషుడే బాహ్యాత్మ స్వరూపుడై ప్రదర్శనమగుచున్నాడు"** - అనునది సూక్ష్మార్థము.

## (2) అంతరాత్మ (సూక్ష్మదేహము / మనోశరీరము)

పురుషుడే అంతరాత్మ స్వరూపుడై కూడా వెలయుచున్నాడు. (ఆత్మస్వరూపుడగు ఈ జీవుని పురుషకారమే అంతరాత్మ).

<u>అట్టి అంతరాత్మ (సూక్ష్మ శరీరము) : - ఈ క్రిందివన్నీ తనయందు కలిగి ఉంటోంది.</u>

- **సూక్ష్మభూతరూపములు** : భూమి - జల - అగ్ని - వాయు - ఆకాశముల సూక్ష్మభూత రూపము ధరించునది. (అపంచీకృతములగు పంచభూత రూప ధారణ).
- **స్మృతులు**: జ్ఞాపకములు. అవి → ఇచ్ఛ-ద్వేషములుగాను, సుఖ - దుఃఖభావనలుగాను, కోరికలు (కామము)గాను, మోహము (లేనిది ఉన్నట్లు ఉన్నది లేనట్లు దర్శించునది)గాను, స్త్రీ-పురుష-నపుంసక లింగ భేదభావ దృష్టులు మొదలైనవిగా ఉంటున్నాయి.
- లింగ సంస్కార శరీర విభాగము కలిగి ఉంటోంది. (THE PSYCHOLOGICAL BODY OF TENDENCIES)
- **అనుభూతులు** : హ్రస్వ దీర్ఘ అనుభూతులు, రస భావములు ఆశ్రయించునదై ఉంటోంది.
- **శబ్దానుభవములు** : బిగ్గర, నెమ్మది, ప్లుతములు (స్వరములు), స్పష్ట శబ్దములు కలిగి ఉన్నట్టిది. ఉదాత్త (పైన) - అనుదాత్త (క్రింద) శబ్దోచ్చారణలు.
- **కళాత్మిక** : నృత్య గీత వాద్య విద్యలు చూచి ఆనందించటము ప్రదర్శించునది.
- విజృంభిత : ప్రళయము తరువాత కూడా విజృంభించునట్టి స్వాభావికత. సందర్భ సంఘటనలకు ప్రతిస్పందనములు చేయునది.
- శ్రోతా : వినికిడికి ముందే ఉండి సమస్తము శ్రవణము చేయునది.
- ఘ్రాతా : 'వాసన' (Smell) ను అనుభవముగా పొందుచున్నట్టిది.
- రసయితా : రసానుభవానందము (Taste) పొందునట్టిది.
- నేతా : ఇంద్రియములకు నాయకురాలు, నియమించునది. తన కొరకై ఉపయోగించుకొనునది.

- **బోద్ధా** : బోధింపబడగలిగినది. బోధస్వరూపమైనట్టిది. (Form of Enlightenment)
- **కర్తా** : సమస్తమునకు 'కర్త' అయి ఉన్నట్టిది. కర్తృత్వ – భోక్తృత్వ భావనా విశేషము కలిగియున్నట్టిది.
- **విజ్ఞానాత్మ పురుషః** : సమస్తమునకు విజ్ఞతగా (తెలుసుకొని) అనుభవరూపము పొందు పురుషకారము.
- **పురాణ మీమాంసాది ధర్మ శాస్త్రాని విజ్ఞాత పురుషః** : పురాణములను, మీమాంసలను, ధర్మశాస్త్రములను తెలుసుకొను పురుషకారము కలిగినట్టిది.
- సమస్తము వినటము, పుష్పము మొదలైనవి వాసన చూడటము, విషయములకు పట్టుబడటము, విడవబడటము, కర్మ విశేషణములను భావించటము – ***ఇవన్నీ, అంతరాత్మ (సూక్ష్మాత్మ) వ్యవహారములు.***

## 3. పరమాత్మ (కేవలాత్మ / సాక్షీ ఆత్మ)

పురుషుడు పురుషకారముగా కలిగియున్న మూడవ రూపము **'పరమాత్మ'**।

ఈ రూపము మార్పు చేర్పులు (క్షరము లేని) **అక్షరము**. మొదటిదగు బాహ్యాత్మ, రెండవదగు అంతరాత్మ మార్పు–చేర్పులు పొందుచున్నట్టివి అయి ఉండగా, **పరమాత్మ సమస్తమునకు పరమై (ఆవల ఉండి), మార్పు చేర్పులు పొందనిది** అయి ఉన్నవి.

అట్టి పరమాత్మ స్వరూపము ఇంద్రియములచే అనుభవముగా విషయమయేది కాదు. మరి అనుభవమవదా? తప్పక అవగలదు. "యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన సమాధులు" – అనే అష్టాంగ యోగాభ్యాసముల చేతను, ప్రమాణ – అనుమాన – విచారణల (స్వకీయ విచార విమర్శనల) చేతను, బుద్ధికి తెలియబడేది. బీజములోని అంకురశక్తివలె **అత్యంత సూక్ష్మము.** ధాన్యపుగింజ యొక్క చిట్టచివరి బిందువులో వెయ్యవవంతువలె **సూక్ష్మాతి సూక్ష్మము.** సంకల్ప – వికల్పములకు విషయముకానిది. **(వికల్పనాదిభిర్వా న లభ్యతే)**। దృశ్యములో రూపమాత్మకంగా ఉపలబ్ధమయేదికాదు. అయితే, బుద్ధికి తెలియవచ్చేది. భౌతిక శరీరమునకు జనన మరణాలు ఉండవచ్చుగాక! పరమాత్మయో? శరీరియొక్క 'నేను' అను రూపములో ప్రదర్శనమగుచున్నట్టిది. **అట్టి పరమాత్మ స్వరూపమునకు జనన – మరణాలు లేవు.** ఈ జీవుని సహజరూపము పరమాత్మత్వమే।

ఈ జీవుని పరస్వరూపము – ఎండకు ఎండదు. శుష్కించదు. అగ్నిచే **దహించదు. కంపనము** (Shaking) **పొందదు.** కదిలించబడేది కాదు. భేదించబడదు. అట్టి పరమాత్మ స్వరూపము గుణములకు ముందే ఉండి ఉండటంచేత, గుణములకు బద్ధము కాదు. అది **'నిర్గుణము'.**

*ఇంకా కూడా : ఆత్మ ఎట్టిదంటే...,*

- **సాక్షి :** జగత్ – జీవాత్మ మొదలైనవాటికి కేవల సాక్షీభూతము. (Mere unparticipative witness).
- **భూతభావన :** భావనలకు మునుముందే ఉండి 'భావన' చేయునట్టిది. అద్దాని "భావన" నుండియే భూతజాలము "ఉనికి" పొందుచున్నది.
- శుద్ధము : ఆత్మకు గుణదోషములు అంటవు.
- నిరవయవాత్తు : (శక్తికి – ఇదే 'అవయవము' అనేదేమీ ఉండనితీరుగా), ఆత్మ **నిరవయవి.**
  ఆత్మయొక్క చైతన్యశక్తిచే అవయవములు కదులుచున్నాయి.
- కేవలము : జీవుని సహజ, అనునిత్య, సందర్భాతీత, 'కేవలీ' స్వరూపము.
- సూక్ష్మము : బాహ్యాత్మ, అంతరాత్మలకంటే సూక్ష్మాతిసూక్ష్మము.
- మమకార రహితము : సమస్తము ఆత్మయే కాబట్టి పరమాత్మకు 'ఇది నాది' 'ఇది నాది కాదు' – అనురూపమైన **మమకారము లేనట్టిది.**
- నిరంజనము : కేవలాత్మ నిత్య నిర్మలము. దోషములు అంటనిది.
- నిర్వికారము : మనోధర్మమైన వికారములు పరాత్మకు లేవు.
- ఇంద్రియార్థరహితము : కేవలాత్మ శబ్ద స్పర్శ రూప రసగంధ రహితమైనట్టిది. అవన్నీ తనయొక్క ప్రదర్శనములై, తాను వాటన్నిటికీ వేరై ఉన్నట్టిది.
- నిర్వికల్పా : వికల్పనలు (Attributions, Tendency of Assumptions and presumptions) లేనట్టిది.
- నిరాకాంక్ష : ఈ సమస్తము ఆత్మకు వేరైనది కాదు కాబట్టి, ఆత్మ ఎటువంటి ఆకాంక్షలు (Expectations) దేనిపట్లా ఉండనట్టిది. (స్వప్నద్రష్ట స్వప్నములో దేనినీ ఆకాక్షించకుండానే (without direction) స్వప్నము కలిగి ఉంటాడు కదా।)

- **సర్వవ్యాపీ :** నవలా రచయితయొక్క కల్పనా సృష్టియే నవల అంతా నిండి ఉన్న తీరుగా, తరంగములన్నీ జలము చేతనే వ్యాపించి ఉన్నట్లుగా, **ఆత్మయే → శరీర, దృశ్యములందు అంతరంగ – బహిరంగములందు, దేహ – దేహాంతర స్థితి గతులందు మౌనముగా వ్యాపించినదై ఉన్నది.**
- అచింత్యో : లౌకిక విషయములవలె పరమాత్మ చింతన చేయగలిగేది కాదు. సమస్త చింతనలు తనవే అయిఉంటూనే, చింతలన్నిటికీ ఆవల ఉన్నట్టిది.
- అనిర్వర్ణ్యశ్చ : పరమాత్మ → వర్ణింపజాలనిది. వర్ణ – కుల – మత – జీవజాతి – లోక భేదములు కించిత్ కూడా లేనట్టిది. సమస్త దేహములలలో ఏకస్వరూపమై వెలయుచున్న ఆత్మకు "జాతి కుల మత" ఇత్యాది భేదములు ఎట్లా ఆపాదిస్తాము?
- **పునాతి** అశుద్ధాని : పరమాత్మ స్వరూపము నిత్యశుద్ధము. అంతరాత్మ మనోరూపము కాబట్టి భావ ఆలోచనా సమన్వయ దృష్టి దోషాలు భేద భావనలచే ఏర్పడినవై ఉండవచ్చు. సమస్తజీవుల సమస్వరూపమగు పరమాత్మ జ్ఞానము అట్టి దోషములన్నీ కడిగివేస్తుంది. సర్వత్రా పరమాత్మభావనను అభ్యాసము చేయువారియొక్క సమస్త అశుద్ధలములను తొలగించి వేయగలదు. ఆతనిని **పునీతుని** (పవిత్రుని) **చేయగలదు.**
- నిష్క్రియా : ఈ జీవునియొక్క (పురుషునియొక్క) **పరమాత్మస్వరూపమునకు** – జన్మించటము, కర్మలు నిర్వర్తించటము మొదలైన ధర్మములు లేవు.

  దీపపుకాంతి వెలుగుచుండగా ఆ వెలుగులో జనులు ఆయా కార్యక్రమములు నిర్వర్తిస్తూ ఉన్నప్పటికీ, అట్టి కాంతి ఆయా క్రియలు నిర్వర్తిస్తూ ఉన్నట్టిది అవుతుందా? అవదు కదా। అట్లాగే పరమాత్మ తేజోమయమై ఉండగా, విశ్వములు ఆవిర్భావ తిరోభావములు జరుగుచున్నాయి. అయినా కూడా పరమాత్మ **"ఏమీ చేయనివాడు, నిష్క్రియుడు"** అయి ఉన్నారు. సమస్తమునకు సాక్షి అయి ఉండగా, తన తేజస్సుయొక్క చైతన్య శక్తి చేతనే దేహి, దేహము, అంతరంగమగు మనో బుద్ధి చిత్త అహంకారములు, బాహ్యరంగమగు జగద్విషయాలు చేతనమై ప్రవర్తిస్తున్నాయి.

  అట్టి ఈ పురుషుని (జీవుని) పరాత్మ స్వరూపమునకు 'సంసారబంధము' అనునది ఉండే ప్రసక్తియే లేదు. **తస్య సగ్ంసారో నాస్తి।** (సంసార బంధమంతా మనసుకు సంబంధించి ఉన్నట్టిది మాత్రమే।)

---

## "ఆత్మ' – గురించిన ఇంకా కొన్ని విశేషాలు :

**అంగీరస మహాముని :** ఇప్పుడు మనము 'ఆత్మ' గురించిన ఆయా మరికొన్ని విశేషాలు చెప్పుకుందాము.

**ఈ జీవుని ఇహము లోని రూపము** – "ఇహస్వరూపము" – నాటకములో పాత్రవంటిది.

**ఈతని ఆవలి రూపము** – పర స్వరూపము. శివ స్వరూపము. నటుని సహజరూపము వంటిది.

ఇహపర స్వరూపము ఎద్దానివో అదియే 'ఆత్మ'. అట్టి ఈ జీవుని సహజస్వరూపమే – **శివస్వరూపము** అని **'శివుడు'** అని **'పరమాత్మ'** అని **'పరాత్మ'** అని – వర్ణించబడుతోంది.

### *ఆత్మ (సహజమగు కేవలాత్మ) ఇంకా కూడా ఏతీరైనదంటే :*

శివః : **'జీవుడు' – 'శివుడు'** అను సందర్భ – కేవల స్వరూపములలో కేవలస్వరూపము (Absolute "I") 'శివుడు' అయి ఉన్నది. (చిదానందరూపం, శివోఽహమ్। శివోఽహమ్।). (సందర్భ రూపము – 'జీవుడు'గా పిలువబడుతోంది). పరమాత్మయే **'శివస్వరూపము'**గా చెప్పబడుతోంది.

**శుద్ధము:** అట్టి (ప్రతి ఒక్క జీవుని) శివస్వరూపము **నిత్యశుద్ధము.** అద్దానిని మనో, ఇంద్రియ సంబంధమైన ఏ దోషములు అంటజాలవు.

**ఏక ఏవ। అద్వయః సదా। :** సమస్త దేహములలోని ఆత్మ సర్వదా ఏకము. అద్దానికి ద్వితీయమై ఏదీ లేదు. జీవుడు, – బహిరంగము (బాహ్యాత్మ), అంతరాత్మ (అంతరంగము), దృశ్యజగత్తు మొదలైనవిగా చెప్పబడేవన్నీ **ఆత్మభగవానునికి వేరై ఉండలేదు.** సమస్తము **ఆత్మయొక్క సంప్రదర్శనా, విశేషణా చమత్కారమే।**

### "బ్రహ్మ రూపతయా బ్రహ్మ కేవలం ప్రతిభాసతే।"

దర్పణము (Mirror) లో దర్పణమే ఉన్నది గాని, ప్రతిబింబిత వస్తువులేవీ వాస్తవానికి లేవు కదా!

- బ్రహ్మమునందు బ్రహ్మమే సదా (జగద్దృశ్యముగా) ప్రతిభాసిస్తోంది (Reflecting / Refracting). ఈ విధంగా జగత్తు రూపంగా ప్రతిభాసించేదంతా బ్రహ్మమే అయి ఉన్నది.
- విద్య - అవిద్య మొదలైన భేదములుగాను, భావ - అభావములు మొదలైన ఆయా వివిధ విశేషములుగాను, గురువు - శిష్యుడు మొదలైన విశేషములతోను- **(ఆయా భేదరీతులుగా) బ్రహ్మమే** ప్రతిభాసిస్తోంది.

**"తత్ త్వమ్ - నీవుగా కనిపించేది తత్ బ్రహ్మమే।"** అను దృష్టిని సిద్ధించుకొన్న తత్త్వదర్శనముచే ఈ జగత్తు **శుద్ధమగు ఆత్మ స్వరూపముగా అనుభవమౌతోంది.**

ఇక్కడ విద్య లేదు. అవిద్య లేదు. ఆత్మకు వేరై జగత్తు (జనించి గతించేది) అనబడేది ఏదీ లేదు. "మరి మాకు జగత్తు అనుభవమౌతోంది కదా?" అని ప్రశ్నిస్తారా? **సత్యత్వేన జగత్ భానం సంసారస్య ప్రవర్తకమ్।** కంటికి, తదితర ఇంద్రియములకు అనుభవమగుచున్న ఈ జగత్తు 'సత్యమే' అని అనిపిస్తూ ఉండటమే 'సంసారము' యొక్క ప్రవర్తనము (రూపము). **అసత్యత్వేన భానంతు సంసారస్య నివర్తనమ్।** "స్వప్నములో దృశ్యము ఊహాజనిత కల్పితమే అయి ఉంటున్న తీరుగా ఈ ఇంద్రియ విషయ జగత్తు వస్తుతః అసత్యము" అను జ్ఞానము ప్రకాశించుచుండగా **'సంసారము'** అనునది నివర్తకము (withdrawn) అగుచున్నది. "ఈ జగత్తు నిజంగానే ఉన్నది"- అనునదే భవబంధము. *(భవము = ఉన్నది, బంధము = ఉన్నది కాబట్టి నాకు బంధమగుచున్నది).*

ఇదంతా వ్యావహారరీత్యా - సంసారముగా భావనామాత్రమై సత్యమువలె అనిపించటం జరుగుతోంది. పారమార్థికంగా చూస్తే కథలోని పులివలె, కలలోని బండరాయివలె **"మొదలే లేనిది"** అగుచున్నది (అసత్యమే అగుచున్నది).

**ద్రష్టయే సత్యమై, నిత్యమై ఉన్నాడు. దృశ్యమంతా మనో కల్పితానుభవమే।**

## ఆత్మోపాసన

**ప్రమాణం తత్ న అపేక్షతే। 'మట్టి కుండ'** అను దానిలో ఉన్నదంతా మట్టియే అయినప్పటికీ మట్టియొక్క ఒక ఆకారమునకు 'కుండ' అను పేరుతో చెప్పుకుంటున్నాము. అంతేగాని - "మట్టివేరు. కుండవేరు. మట్టి కుండగా మారింది" అని మన ఉద్దేశ్యము కాదు. మట్టిని కుండను వేరు వేరు చేసి, వేరువేరైన ఇద్దరికి ఇచ్చి పంపగలమా? లేదు. "మట్టి, కుండ ఒక్కటే. మట్టియే కుండగా (ఘటముగా) కనిపిస్తోంది" - అను దానికి ఎవ్వరైనా నిరూపణ అడగరు కదా। **"ఘటో అయమ్" ఇతి విజ్ఞాతుం నియమః కోన్వపేక్షతే?**

**"ఈ సమస్తము ఆత్మయే"** అని నిరూపించటానికి అటువంటి వేరే **ప్రమాణము** ఏదీ లేదు. అవసరం కూడా లేదు. **ప్రమాణము**నందు కూడా ఆత్మయే ఆ రీతిగా ప్రకాశమానమై ఉన్నది. ఆత్మను తెలుసుకోవాలంటే, **"అది ఎక్కడో, ఎన్నటికో శుద్ధబుద్ధిచేతగాని తెలియదు"** అని అనవలసినదేమున్నది? ఆత్మగురించి తెలుసుకోవటానికి (నేను ఆత్మను - అని ఎరుగటానికి) వేరే దేశ - కాల - వస్తు ప్రమాణములతో పనేమున్నది?

**దేవదత్తోఽహమ్" - ఇతి ఏతత్ విజ్ఞాననం నిరపేక్షకమ్।** ఒకనిని పిలిచి **"ఎవరునువ్వు?"** - అని మరొకాయన అడిగారు. అప్పుడా రెండవవాడు **"నేను దేవదత్తుడను"** అని చెప్పాడు. అప్పుడు మొదటివాడు ఆ రెండవవాడిని **"నేవు దేవదత్తుడవేనని - నీవు ఏ ప్రమాణముల చేత గ్రహించావో నాకు చెప్పు"** - అని అడిగాడు. అప్పుడు ఆ రెండవవాడు **"నేను దేవదత్తుడనని నాకు తెలియటానికి మరొక సాక్షిక ప్రమాణమెందుకు? నాకు నెనెవరో తెలియదా? ఎవరైనా వచ్చి "నీవు దేవదత్తుడవే" అని నాకు నిరూపించి చెప్పాలా?"** అని తిరిగి ప్రశ్నించాడు.

**తద్వత్ బ్రహ్మ విదోఽపి అస్య "బ్రహ్మాహమ్" ఇతి వేదనమ్।** అదే విధంగా బ్రహ్మము గురించి శాస్త్ర - గురు పాఠ్యాంశములు అధ్యయనము చేసిన బ్రహ్మవేత్త **"ఆహా! నేనే బ్రహ్మమును"** అని తెలుసుకొంటాడు. అందుకు మరొకరి సాక్ష్యము గాని, ఎవరో నిరూపించి చెప్పవలసిన ప్రమాణములు (Explanation with examples) గాని ఇక అవసరము ఉండదు. **"ఆ సిద్ధాంతము, ఈ ప్రమాణము"** - మొదలైనవి **"నేను ఆత్మను"** అని తెలుసుకోవటానికి - అవసరమే లేదు.

## ఆత్మతేజస్సు - ఆత్మదర్శి (తత్త్వదర్శి)

ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తూ ఉండగా భూమిపై వస్తువులు ప్రకాశమానమై కనిపిస్తూ ఉంటాయి. చీకటిలో ఆయా వస్తువులు సరిగ్గా కనిపించవు.

అట్లాగే ఆత్మయొక్క తేజస్సుచేతనే అనాత్మకమైన, తుచ్ఛమైన జగద్దృశ్యము అనేక రూపములుగా, నామములుగా అగుపిస్తోంది. ఆత్మయొక్క ఉనికి చేతనే **'జగదనుభవము'** ఏర్పడినదగుచున్నది. ఆత్మయే అయి ఉన్న నేనే - లేకపోతే జగదనుభవము ఎవరికి?

సకల వేద శాస్త్ర పురాణములు, తదితరమైన సమాచారము మొదలైనవన్నీ అర్థవంతములై **ఏద్దాని ప్రకాశము** (Feature of Enlightenment)**చే తెలియవస్తున్నాయో అదియే మనందరి స్వస్వరూపమగు 'ఆత్మ'.**

ఒక పిల్లవాడు "అమ్మ దగ్గరకు వెళ్ళి ఏమైనా తినుబండారములు అడిగి తినాలి, త్రాగాలి" అని ఇంటికి బయలుదేరాడు. ఇంటికి వస్తూ ఉండగా ఆతనికి త్రోవలో కొన్ని చిత్ర విచిత్రములైన ఆటవస్తువులు అగుపించాయి. ఇంటికి వెళ్ళుచున్నవాడల్లా రహదారి పక్కకు వెళ్ళి ఆ ఆటవస్తువులతో (ఆకలి దప్పికలు మరచి) ఆడుకోసాగాడు. అక్కడివారితో హుషారుగా గంతులు వేయసాగాడు. ఆ పిల్లవాడిలాగానే..., **ఆత్మ గురించి తెలుసుకొన్న విద్వాంసుడు, జగత్తులో ఏదోపొంది రమించాలనుకోవటము ఆపివేసి (ముని) - ఆత్మయందే రమించుచున్నాడు.**

మమకార, అహంకారములన్నీ బాహ్యముననే వదలివేసి, ఆత్మ యందు 'సుఖి' అయి ఉంటున్నాడు.

ప్రాపంచక సంగతి - సందర్భ - సంబంధములపట్ల మౌనము వహించినవాడై ('ముని' అయి) - **"సమస్తము మమాత్మానంద స్వరూపమే"** అను ఆత్మానందైక రసమును అవిఘ్నంగా, అవ్యాజముగా ఆస్వాదించుచున్నాడు.

- ఆత్మయందే రమిస్తున్నాడు.
- ఆత్మయందే సంచారములు చేస్తున్నాడు.
- <u>నిర్మమో నిరహం సుఖో।</u> మమకార అహంకారములు వదలివేసి ఆత్మ సుఖి అగుచున్నాడు.
- <u>కామాన్ నిష్కామ రూపీసన్ చరతి ఏకచరో మునిః।</u> సమస్త లోకసంబంధమైన, బాహ్య సంబంధమైన కోరికలను అంతరమున త్యజించి, మౌని అయి, నిష్కామ రూపి అయి సర్వత్రా సమదర్శి అయి ఉంటున్నాడు. బాహ్యమున మాత్రం సందర్భానుసారంగా అందరివలెనే వర్తిస్తున్నాడు.
- స్వాత్మ స్వరూపుడై సర్వత్రా ఆత్మనే దర్శించుచు, సంతుష్టుడై స్వయముగా సర్వాత్మస్థితుడై ఉంటున్నాడు.

***అట్టి అఖండాత్మానుభవి :-***

- <u>నిర్ధనోపి సదా తుష్టో।</u> ధనరహితుడైనప్పుడు కూడా - సర్వసంపదలతో తులతూగుచున్న ఆనందము కలిగి ఉంటాడు.
- <u>అసహాయో మహాబలః।</u> ఇతరులనుండి పొందవలసియున్న సహాయము పొందలేక పోతున్నప్పుడు కూడా (అసహాయుడై ఉన్నప్పుడు కూడా) మహా బలవంతుడివలె మనస్సు కలిగి ఉంటాడు.
- <u>నిత్యతృప్తస్తు అభుంజానోఽపి।</u> తినకపోయినా మధుర పదార్థములు తిన్నవానివలె తృప్తిని వీడక ఉంటాడు.
- <u>అసమః సమదర్శనః।</u> అనేక భేదములలో కూడి ఉండవలసి వస్తున్నా కూడా, - **సమదర్శి** అయి ఉంటాడు.
- <u>కుర్వన్నపి న కుర్వాణః।</u> సమస్త కర్మలు నిర్వర్తిస్తూ కూడా, - ఏ కర్మలు చేయనివాడై **'అకర్మిష్ఠుడు'** అయి ఉంటాడు.
- **<u>అభోక్తా ఫలభోగ్యపి।</u>** కర్మ ఫలములన్నీ అనుభవిస్తూ కూడా, - 'అభోక్త' అయి ఉంటాడు. కర్మలచేతగాని, కర్మ-ఫలములచేతగాని స్పర్శించబడక ఉంటాడు.
- **<u>శరీరపి అశరీరేషు।</u>** ఆ బ్రహ్మవేత్త శరీరము కలిగి ఉంటూ ఉండి కూడా, - అశరీరి (శరీరరహితుడు) అయి ఉంటాడు.
- <u>పరిచ్ఛిన్నోఽపి సర్వగః।</u> 'జీవుడు' అనబడు పరిచ్ఛిన్నత్వము (Bifurcation) కలిగి ఉండి కూడా, - సర్వత్రా ఏర్పడి ఉండి, సర్వగతుడై ఉంటాడు. సర్వత్రా సర్వాత్మకుడై సమస్తమును ఆస్వాదిస్తూ ఉంటాడు. అపరిచ్ఛిన్నత్వము వీడకయే పరిచ్ఛిన్నునివలె అగుపిస్తాడు.

***బ్రహ్మవిదుడు - అనంతుడై, అశరీరుడై ఉంటాడు.***

ఆత్మభావనచే సర్వత్రా తన స్వరూపమును దర్శిస్తూ ఉంటాడు. సదా అశరీరుడై, శరీరపరిమితములు లేనివాడై (ఆత్మశరీరి అయి) ఉంటాడు. వర్తమానములోను, భవిషత్‌లోను, ఆయా జన్మ-జరా-మరణ సందర్భములలోను **"సాక్షిత్వమును, పూర్ణత్వమును"** వీడక ఉంటాడు.

ప్రియ - అప్రియములచే శుభ - అశుభములచే స్పృశించబడనివాడై ఉంటాడు.

సూర్య తేజస్సు ఆకాశంలో సర్వత్రా వ్యాపకము (Extended), నిత్యము స్వయంప్రకాశకము అయి ఉండి కూడా, భూమిపైగల జనులచేత **"ఇప్పుడు సూర్యుడు అస్తమించాడు. చీకట్లు కమ్ముకున్నాయి. అప్పుడు సూర్యుని మేఘములు కప్పివేశాయి. ఇంకొకప్పుడు తిరిగి తేజోరూపుడై ఉదయిస్తున్నాడు"** – మొదలైన వాక్యములన్నీ లోకప్రసిద్ధమై ఉంటున్నాయి కదా! ఆత్మగురించిన సమాచారము పరిశీలించక, ఆత్మస్వరూపమేమిటో ఏమరచినప్పుడు జనులు దృశ్య విషయములచే భ్రమలు పొందుచూ, **"ఇవి సత్యము. నిత్యము"** – అని విభ్రమము చెందుచున్నారు. "నేను దేహముచే బద్ధుడను. దృశ్య సంబంధములలో చిక్కుకున్నవాడను. ఎవరైనా వచ్చి, నాకు మోక్షము ప్రసాదించెదరు గాక" – మొదలై **"ఆధారపడియున్న** (Dependent) **భావములు"** జన్మజన్మాంతరములుగా కొనసాగిస్తున్నారు. బ్రహ్మతత్త్వము అధ్యయనము – అభ్యాసము చేయువాడో? బ్రహ్మవిత్తముడై దేహాదిబంధముల నుండి 'విముక్తుడు' అగుచున్నాడు. **"సర్వదా ఆత్మస్వరూపుడనగు నేను సర్వదా బంధరహితుడను. సమస్త సందర్భములకు ఆవలగల ఆత్మయే నా నిజ స్వరూపము"** అని గ్రహించి ఉంటున్నాడు. (He is getting convinced of his own "Independence" Vis-a-Vis all - else).

**మూఢుని దృష్టి :** అభాస అయినట్టి శరీరముతో సంబంధము పెట్టుకొని **"నేను దేహిని। దేహమాత్రుడను।"** అని తలుస్తున్నాడేగాని **"సమస్త భావములకు ఉత్పత్తి స్థానమగు భావాతీత కేవలసాక్షీ ఆత్మస్వరూపుడను"** – అని గమనించటము లేదు.

**జ్ఞానదృష్టి :** పాము కుబుసము విడచిన తీరుగా ఆత్మజ్ఞాని దేహభ్రాంతిని విడచివేసి, సర్వదా **"ఆత్మమేవాహమ్"** భావనను సిద్ధింపజేసుకొని ఉంటున్నాడు.

**ప్రాణము :** గంగాజలము ప్రవహిస్తూ ఎత్తు – పల్లవ ప్రాంతములను ఏకము చేసి వేస్తుందికదా। అట్లాగే, ప్రాణవాయువు సర్వత్రా సంచరిస్తూ సమస్తమును ఏకము చేయుచున్నది. ఇంక వ్యష్టి ప్రాణము, ఆ ప్రాణమును కాపాడుకొంటూ బ్రతుకుచున్న జీవుడు – మొదలైనవన్నీ ఆత్మకు వేరై ఎక్కడున్నాయి?

– ఈ దేహము ప్రకృతి సిద్ధము. (ప్రకృతి కల్పితము). **జగన్నాటకంలో దైవవశంగా రూపుదిద్దుకుంటోంది. మరల నాటకీయంగానే నశిస్తోంది. ఆత్మకు ఈ దేహముల రాకపోకలతో సంబంధమే లేదు. అనుబంధమూ లేదు. ఇక బంధమెక్కడిది?**

బ్రహ్మవేత్త ఈ దేహముయొక్క, దృశ్యముయొక్క లక్ష్య – అలక్ష్యములను, రాక – పోకలను విడచివేసి కేవలమగు ఆత్మస్వరూపమును ధారణ చేస్తూ ఉండి ఉంటున్నాడు.

అట్టి ఉత్తమ బ్రహ్మవిదుడు స్వయముగా సాక్షాత్ శివుడే। శివోఽహమ్। **శివ ఏవ స్వయం సాక్షాత్ అయం బ్రహ్మవిదుత్తమః।**

## బ్రహ్మవిత్ - తముడు

(బ్రహ్మవిత్ = బ్రహ్మము ఎరిగినట్టి, తముడు = శ్రేష్ఠాతి శ్రేష్ఠుడు (Superlative Degree)

**జీవన్ ఏవ సదా ముక్తః కృతార్థో బ్రహ్మవిత్తమః।** బ్రహ్మమును సర్వశ్రేష్ఠముగా, స్వయం ప్రకాశముగా, స్వస్వరూపముగా ఎరిగినవాడు జీవించి ఉండగానే – నిత్యముక్తుడు.

**ముక్తుడు : "ఈ జగత్తు, దేహము మొదలైనవి – ఆత్మస్వరూపుడనగు నాకు బంధములు కావు. అవన్నీ నేను చూస్తున్న క్రీడ–లీల–కథ–నాటకములోని సంఘటనలు వంటివి"** – అని దర్శించువాడు ముక్తుడే। ఆత్మస్వరూపుడునగు నాకు బంధము అనునది ఎన్నడూ లేదు" – అని నిర్ద్వంద్వముగా ఎరిగియున్నవాడు – ముక్తుడు.

**కృతార్థో :** పొందవలసినది పొందినవాడు – అయి ఉంటాడు.

ఆతని దృష్టిలో ఈ ఉపాధి (భౌతిక శరీరము) సర్వదా నశించినదే అయిన వస్తువు. ఈ భౌతికదేహమును జడవస్తువుగా దర్శించు అభ్యాసముచేత ఆతడు నిర్ద్వయము (ద్వితీయమే లేనట్టి) బ్రహ్మమును పొంది, తాను 'బ్రహ్మమే' అయి ఉంటున్నాడు.

**మునులు :** మహాశయా! అంగీరసమునీంద్రా! జీవిస్తూ ఉండగానే మేము బ్రహ్మము ఎట్లా సిద్ధించుకోగలుగుతాము? దేహము ఉన్నంత వరకు మేము ఇంద్రియ విషయములలో ప్రవర్తించటము అనివార్యము కదా? సంబంధ – అనుబంధ – బాంధవ్యములవంటి ఆయా విషయములు మమ్ములను వదులునవి కావు కదా?

**అంగీరస మహర్షి :** మునివర్యులారా! ఇందులో విశేషమేమున్నది? దేహముంటే మాత్రం బ్రాహ్మీస్థితి ఎందుకు సిద్ధించుకోరాదు? ఒక దృష్టాంతము ద్వారా ఈ విషయము చెపుతాను. వినండి.

### నటుడు - స్త్రీ పాత్రధారణ: శైలూషో వేష సద్భావ-అభావయోశ్చ యథా పుమాన్। -

ఒక పురుషుడు (Male Actor) నటుడై స్త్రీగా ఒక నాటక పాత్ర ధరిస్తూ (స్త్రీ వేషము ధరించి) రసయుక్తంగా స్త్రీ యొక్క ముఖకవళికలు, సుదిమెత్తని స్వరము, స్త్రీ సంబంధమైన హావభావములు (కూచిపూడి-భామాకలాపము - శ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మగారి వలె) ప్రదర్శిస్తూ ఉన్నాడనుకోండి. 'నేను పురుషుడను' అని మరచిపోతాడా? **"నేను స్త్రీని అయ్యాను" - అని భావిస్తాడా? లేదు కదా!**

తథైవ బ్రహ్మవిత్ శ్రేష్ఠః సదా బ్రహ్మైవ నాపరః। అట్లాగే బ్రహ్మవిత్ శ్రేష్ఠుడు కూడా దేహి - దేహము - దృశ్యము కలిగి ఉన్నప్పటికీ, **"ఇదంతా సందర్భ సత్యము మాత్రమే"** అని ఎరిగియున్నవాడగుచున్నాడు. **తనయొక్క, తదితర సమస్త జీవులయొక్క సహజరూపమును బ్రహ్మముగా ఎరిగి, బ్రహ్మమునందే రమిస్తూ, సమస్తమును తనకు అనన్యమగు బ్రహ్మముగా దర్శిస్తూ ఉంటున్నాడు.**

### ఘటాకాశ - మఠాకాశ - మహాకాశ దృష్టాంతము :

ఒకచోట ఒక ఘటము (కుండ) ఉన్నది. అందులో ఆకాశము (Space) ఉన్నది. బాహ్యమున గృహాకాశము, మహాకాశము ఉన్నాయి. ఇప్పుడు ఆ కుండ పగిలినప్పుడు లోపల గల ఆకాశము ఏమౌతోంది? నశిస్తోందా? నశించదు. గృహాకాశంలో కలుస్తుంది. అట్లాగే దేహభావన తొలగినప్పుడు అట్టి బ్రహ్మవిత్ తముడు (బ్రహ్మవిత్ శ్రేష్ఠుడు) బ్రహ్మముతో మమేకమౌతున్నాడు. ఉపాధి నిలయము పొందినప్పుడు కూడా ఆ బ్రహ్మవేత్త (బ్రహ్మవిత్) బ్రహ్మమే అయి ఉంటాడు. **తథైవ ఉపాధివిలయే బ్రహ్మైవ బ్రహ్మవిత్ స్వయమ్।** (అనగా) బ్రహ్మవేత్త తాను బ్రహ్మమే అయి ఉండటానికి దేహము ఉండటము-ఉండకపోవటము, దృశ్యము ఉండటము- ఉండకపోవటము, జాగ్రత్ స్వప్న సుషుప్తులు కలిగి ఉండటము - ఉండకపోవటము మొదలైనవి **అపేక్షలు - సాపేక్షలు** కానేకావు.

ఎందుకంటే ఈ జీవునియొక్క బ్రహ్మీస్వరూపము సర్వదా సహజము, కేవలము, అనునిత్యము, స్వాభావికము అయి ఉన్నది. తనకు అన్యమగు దేనిపైనా ఆధారపడి లేదు.

సర్వత్రా **'తత్త్వమ్'** - దృష్టితో, ఈ దృశ్యమును సమస్త సహజీవులను, సమస్త సంగతి - సంఘటన - సందర్భములను అంతర్ - మనన పూర్వకంగా మననము చేయువాడు తానే - 'బ్రహ్మము' (**సోఽహమ్**) అగుచున్నాడు.

**క్షీరం క్షీరే యథా క్షిప్తం** : గ్లాసుడు పాలు తెచ్చి బిందెలోని పాలలో పోస్తే మొత్తము ఏకమగు పాలు (క్షీరము) అగునట్లు బ్రహ్మముతో ఏకమై, సర్వాత్మకమగు బ్రహ్మమే తానై **"బ్రహ్మమునకు అభిన్నుడు"** అగుచున్నాడు.

**తైలం తైలే, జలం జలే. సంయుక్తమ్ ఏకతా యాతి** : నూనె నూనెతో కలిస్తే ఏకమగు నూనె అగునట్లు, జలమును జలములో పోసినప్పుడు ఏకజలమగునట్లు, ఆత్మతో ఆత్మ ఏకమై ఏకాత్మత్వము ఆ మునిచే (ఆత్మోపాసకునిచే) పొందబడుచున్నది.

## విదేహముక్తి

ఓ మునీశ్వరులారా! 'తత్త్వభావన'ను ఆశ్రయించుచున్నవాడు క్రమంగా - అఖండాత్మానందము అనుభవించుచు విదేహముక్తుడై (కేవలాత్మస్వరూపము నందు దేహ మనోబుద్ధులతో సహా, పాంచభౌతిక దృశ్యముతో సహా) - బ్రహ్మముతో **అనన్యము** అగుచున్నాడు. అనగా **తన సహజమగు బ్రాహ్మీస్వరూపముతో అనన్యత్వము యొక్క స్వానుభవి అయి ప్రకాశించుచున్నాడు.**

అట్టి **"విదేహకైవల్యము"** అనబడే అఖండితమగు (జీవ - బ్రహ్మముల అభేదమగు) సన్మాత్రత్వమును (కేవల సత్ స్వరూపము) (లేక) (బ్రహ్మ భావమును) ఉపాసించువాడు - **ఏష యతిః న ఆవర్తతే పునః।** మరల జీవాత్మ భావనకు, దృశ్యాంతర్గత సాంసారిక బంధములకు తిరిగిరాడు. **సర్వత్రా సర్వదా సమస్తమునకు పరమైన బ్రహ్మమే తానై ఉంటాడు.**

### బ్రహ్మమునందు బంధ మోక్షములు లేవు

**మునీశ్వరులు** : అంగీరస పరబ్రహ్మమూర్తీ! ఈ జగత్తు మాకు బంధము కాకుండటానికి ఉపాయము ఏది?

**అంగిరస మహర్షి** : ఒకడు మసకచీకటిలో త్రాడును చూచి 'పాము' అని అనుకోవటము వంటిదే - **'ఈ జగత్తు నాకు బంధము' అని తలచటము.** 'ఇది త్రాడు మాత్రమే' అని తెలుసుకొన్నతరువాత ఇక 'పాము' అని భావించిన సందర్భమునకు చెందిన వికారములు మిగులుతాయా? మిగలవు. సర్వ అభాసలు (All Illusions) వినిర్గమము (withdrawn) అవుతాయికదా। సత్ - అసత్తులు, బంధ - మోక్షములు మొదలైనవన్నీ వృత్తులు (Illusionary Avocations) మాత్రమే. అంతేగాని 'అన్యము' అనునదే లేని అనన్యమగు ఆత్మయందు అన్యమగు వస్తు-సంఘటన-సందర్భ వ్యవహారములు ఎట్లా ఉంటాయి? ఉండవు.

**మునీశ్వరులు** : పదార్థముల గురించిన ఆవృత్తులు (Thick Avocations) మా బుద్ధియందు తొలగేది ఎట్లా?

అంగీరసమహర్షి :

శ్లో॥ అస్తీతి ప్రత్యయో యశ్చ, యశ్చ నాస్తీతి వస్తువి
బుద్ధేరేవ గుణావేతౌ। న తు నిత్యస్య వస్తునః॥

**"పదార్థములు ఉన్నాయి - లేవు"** అనునదంతా బుద్ధియొక్క నిర్వాహక (ప్రవర్తన) లక్షణములు (Functional Features). అవి బుద్ధియొక్క గుణవిశేషాలేగాని నిత్యవస్తువగు ఆత్మకు సంబంధించినవి కావు.

ఇక "ఆత్మకు బంధము కలుగుతోంది. ముక్తి లభిస్తోంది" – అని చెప్పు వాక్యములన్నీ కూడా మాయా కల్పితము. (మాయ = యామా = వస్తుతఃగా లేదు. కల్పనచే ఉన్నట్లు అగుపించునది). అయితే అవన్నీ కూడా **శిష్యుని ఉద్ధరించటానికి గురువులచే ఉపాయములుగా ఆశ్రయించబడు పాఠ్యాంశములు**. ముముక్షువులను ముక్తికి జేర్చటానికై శాస్త్రములు కొంత కల్పన కలిగి ఉంటాయి.

**"ఆత్మకు స్వతఃగానే ఎప్పుడూ కూడా బంధమే ఉండజాలదు"** - అనునదే ముక్తస్థితి.

<u>*సమస్త జీవుల అఖండాత్మ ఎట్టిదంటే...*</u>

- **నిష్కళము :** కలనము లేనిది.
- **నిష్క్రియము :** నాటక దీపమువలె తాను ఏ హావ – భావములు ప్రదర్శించదు. వాటికి లోనుకాదు.
- **శాంతే :** పరమశాంతస్వరూపము.
- **నిరవద్యే :** అవద్యము ఆరోపణలు లేనిది. "జీవాత్మ–ఈశ్వరుడు"–ఇత్యాది విభాగములుగా ఏమాత్రము రూపములు పొందనట్టిది.
- **నిరంజనము :** వక్రత లేనిది. దోషరహితమైనది.
- **అద్వితీయే :** తనకు వేరైనది, ద్వితీయమైనది ఎక్కడా ఏదీ లేనట్టిది.
- **పరేతత్త్వే :** సమస్తమునకు పరము (ఆవల)గా ఉన్నట్టిది. "నీవు"గా కనిపించేదంతా 'తానే' అయినట్టిది. ఈ జగత్తును తన అనుభవముగా పొందుచున్న జీవాత్మయొక్క కేవలస్వరూపమునకు చెందిన తత్త్వమే **"అఖండాత్మతత్త్వము"**.

ఆకాశమునకు ఆకారము లేనట్లే ఆత్మాకారమునకు (ఆత్మతత్త్వమునకు) "కల్పన" అనబడే జగత్, జీవాత్మ మనో కల్పనలు మొదలైనవి ఎక్కడుంటాయి? ఉండవు.

అందుచేత...

- ఆత్మను నిరోధించునది ఏదీ లేదు.
- ఆత్మను ఉత్పత్తి చేయునదీ ఏదీ లేదు.
- ఆత్మను బంధించగలిగినది ఏదీ లేదు.

ఈ జీవుడు స్వయముగా ఆత్మస్వరూపుడే అయి ఉండగా....

- "బద్ధుడు" ఎవడు?
- ఆ బంధము తొలగించుకోవలసిన సాధకుడెవడు?
- మోక్షమునకు ప్రయత్నశీలుడై ఉండే ముముక్షువు ఎవరు?
- ముక్తుడెవరు?

పరమార్థముగా అవన్నీ లేవు. ఆత్మయే ఉన్నది. అది మాత్రమే 'సత్'. తదితరమైనదంతా స్వతఃగా లేనిది కాబట్టి, సందర్భ కల్పిత స్వర (శబ్ద) విశేషాలే। అసత్తు మాత్రమే। మాటవరుసకు చెప్పుకోబడేవి మాత్రమే! ప్రాజ్ఞులచే అజ్ఞానులకు 'ఆత్మ' గురించి బోధించటానికై శాస్త్రముల రూపంగా "బద్ధుడు, ముక్తుడు, మోక్షము, మనస్సు" మొదలైనవన్నీ కల్పించి చెప్పబడేవి మాత్రమే।

**ఆత్మ సర్వదా స్వస్వరూప, సర్వస్వరూప, సహజస్వరూప ఆది స్వరూపము–అయి ఉన్నది. జగత్ స్వరూపము కూడా అయిఉండి ఉన్నది.**

**అట్టి సమస్తమునకు అప్రమేయము** (unconcerned) **అయిఉన్న పరమాత్మ భగవానునికి నమస్కారము.**

**అట్టి అఖండాత్మానంద స్వరూపుడనగు నాకు నేనే నమస్కరించుచున్నాను.**

*ఇతి ఆత్మోపనిషత్*

*ఓం శాంతిః శాంతిః శాంతిః*

అథర్వణ వేదాంతర్గత

# 5 కృష్ణోపనిషత్

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ యో రామః కృష్ణతాం ఏత్య సార్వాత్మ్యం ప్రాప్య లీలయా,
అతోషయత్ దేవమౌని పటలం, తం నతోఽస్మి అహమ్॥
(తం నతోఽస్మ్యహమ్।)॥

ఏ శ్రీరామచంద్రుడైతే శ్రీకృష్ణుడుగా అవతరించి సర్వాత్మత్వము ప్రదర్శించుచు లీలామానుష వేషధారి అయినారో, దేవతలకు-మునులకు-సమస్త జీవులకు పరమానందము కలుగజేసారో, అట్టి శ్రీరామ, శ్రీకృష్ణావతారములకు నమస్కరిస్తున్నాము.

## ప్రథమఖండః - బృందావన సంచారార్థము

| | |
|---|---|
| 1. ఓం<br>శ్రీ మహావిష్ణుగ్ం సచ్చిదానంద<br>లక్షణగ్ం-రామచంద్రం దృష్ట్వా,<br>సర్వాంగ సుందరం - మునయో<br>వనవాసినో, విస్మితా బభూవుః | శ్రీమాన్ మహావిష్ణు అవతారుడు, సచ్చిదానంద సౌందర్య లక్షణుడు, సర్వాంగ సుందరుడు అగు శ్రీరామచంద్రుని మూర్తీభవించిన ప్రకృతి గత విభవమును చూచిన వనవాసులగు మునులు విస్మిత - అత్యంత ఆశ్చర్య చకితులు అయారు. వారి మనస్సు శ్రీరామచంద్రుని మూర్తీవిభవముతో 'తన్మయము' పొందసాగింది. |
| <u>తగ్ం హోచుః (హ ఊచుః) :</u><br>నో అవద్యం అవతారాన్ వైగణ్యంతే।<br>ఆలింగామో భవంతమ్ ఇతి। | **వనవాసులగు మునులు:** శ్రీరామచంద్రా! వైగణ్యమగు (గణించలేనంతటి అగు), నిర్దుష్టము అగు మీ ఈ రామావతార సౌందర్యము చూచి, పరవసించి, ఆలింగనము కోరు కొంటున్నామయ్యా! మాకు ప్రసాదించండి. (పుంసాం మోహన రూపాయ)। |
| <u>శ్రీరామౌవాచ :</u><br>భవాంతరే కృష్ణావతారే యూయం<br>గోపికా భూత్వా మామ్ ఆలింగథ॥ | **శ్రీరామచంద్రుడు :** ప్రియమునులారా! నేను కూడా మీ భక్తికి ఆకర్షితుడనే. (ద్వాపరయుగంలో) రాబోవు నా శ్రీకృష్ణావతారము సందర్భములో మనము ఆలింగనముచే ఆనందిద్దాము. మీరంతా కృష్ణావతారము సమయములో గోపబాలురుగాను, గోపికలుగాను జన్మలు స్వీకరించండి. |
| <u>మునయౌ ఊచుః :</u><br>అన్యే యే అవతారాః తే హి<br>గోపాన్ నః, స్త్రీః చ (స్త్రీశ్చ) నో కురు।<br>అన్యోన్య విగ్రహం ధార్యం<br>తవ అంగ స్పర్శనాత్ ఇహ॥ | **మునులు :** శ్రీరామబ్రహ్మసౌందర్యమూర్తీ! రాఘవా! మీరు మాకు మాట ఇస్తున్నతీరుగా మమ్ములను గోపబాలురుగాను, గోపికా స్త్రీలుగాను పుట్టించండి. మనకు అన్యోన్య విగ్రహ - ఆలింగనములు సిద్ధించును గాక. మీయొక్క అంగస్పర్శ యొక్క పరమానందమును మేము పొందుతాము. |
| శశ్వత్ స్పర్శయితా అస్మాకం<br>గృహ్ణీమో అవతారాన్ వయమ్।<br>(గృహ్ణీమోఽవతారాన్) | (తమలోతాము)<br>"మనము మరల జన్మించి గోపీ - గోపికలుగా శ్రీకృష్ణుని అంగస్పర్శచే ద్వాపరయుగములో పులకితులమయ్యెదము.<br>(ద్వాపరయుగము చివరివరకు) వేచి ఉందాము. |

| | |
|---|---|
| <u>రుద్రాదీనాం వచః శ్రుత్వా-</u><br><u>ప్రోవాచ భగవన్ స్వయమ్:</u><br>"అంగ సంగం కరిష్యామి।<br>భవత్ వాక్యం కరోమి అహమ్"। | <u>రుద్రాది దేవతల, మునుల మనోభావములను గమనించిన భగవానుడగు</u><br><u>శ్రీరాముడు ఇంకా కూడా ఇట్లా పలికారు :</u><br>"మీ వాక్యములు కృష్ణావతారములో తప్పక సిద్ధింపజేస్తాను". మనము అంగాంగముల పరస్పరస్పర్శ ఆస్వాదిద్దాము. |
| మోదితాః తే సురాః సర్వే "కృతకృత్య అధునా వయమ్"॥<br>యో నందః పరమానందో । యశోదా ముక్తి గేహినీ। | అది విని దేవతలు, మునులు, మోదము, సంతోషము పొందారు. "మేము కృతకృత్యులమైనాము" - అని తలచారు.<br>నందుడే పరమానందము। యశోదయే ముక్తికాంత। (పరమానందమే నందుడుగాను, ముక్తికాంత యశోదగాను రూపుదాల్చారు). |
| <u>మాయా సా త్రివిధా ప్రోక్తా : -</u><br>సత్త్వ రాజస తామసీ। ప్రోక్తా చ సాత్త్వికీ రుద్రే।<br>భక్తే బ్రహ్మణి రాజసీ। తామసీ దైత్య పక్షేషు<br>మాయా త్రేధా హి ఉదాహృతా॥ | **<u>మాయ త్రివిధములుగా గమనించబడుతోంది।</u>**<br>(1) సత్త్వము (2) రజోగుణము (3) తమోగుణము.<br>రుద్రభగవానునియందు సాత్త్విక తేజస్సు, బ్రహ్మదేవుని యందు రాజసతేజస్సు ఏర్పడి ఉన్నాయి. తామసము దైత్యుల వెంటనంటి ఉంటోంది. ఈ విధంగా మాయ '3' రూపములై ఉంటుంది. |
| అజేయా వైష్ణవీ మాయా, జప్యేన సా అజితాపురా।<br>దేవకీ బ్రహ్మపుత్రా సా<br>యా వేదైః ఉపగీయతే॥ | **వైష్ణవీమాయ** అజేయమైనది. అది జప తపాదులచేత కూడా తెలియబడరాదు।<br>వేదములచే గానము చేయబడుచున్న **బ్రహ్మ పుత్రికయే - దేవకి।** |
| **3.** నిగమో వసుదేవో యో।<br>వేదార్థః కృష్ణ, రామయోః।<br>స్తువంతి సతతం యత్ మే (యన్మే)<br>సో అవతీర్ణో మహీతలే॥ | - నిగమములే (వేదములే) **వసుదేవుని రూపము** దాల్చాయి.<br>- వేదములు స్తుతించు వేదార్థ స్వరూపులు - రామ, కృష్ణులు. వేదముల పరాకాష్ఠార్థములే శ్రీకృష్ణ బలరాముల రూపములు దాల్చి భూమిపై లీలావినోదముగా అవతరించాయి. **'సోఽహమ్', 'తత్త్వమ్', 'అహంపర్వస్య ప్రభవో'** మొదలైన మహావాక్యాలు రామ-కృష్ణులుగా అవతరించాయి. |
| వనే బృందావనే క్రీడన్<br>గోప గోపీ సురైః సహ<br>గోప్యో గావ ఋచః తస్య।<br>యష్టికా కమలాసనః॥ | "బృందావనము" దేవతల మునుల అవతారులగు గోప-గోపికల క్రీడా వినోద మైదానము. అక్కడి గోవులు పరమాత్మ మహిమ గురించిన స్తుతి మంత్రగానముల రూపములగు ఋక్కులు.<br>ఆ గోవులను కట్టి ఉంచుచేతికర్ర (యష్టికము) కమలాసనుడు. (సృష్టికర్త అగు బ్రహ్మ భగవానుడు). |
| వంశస్తు భగవాన్ రుద్రః।<br>శృంగమ్ ఇంద్రః ।<br>సఖా సురః।<br>గోకులవనం వైకుంఠం।<br>తాపసాః తత్ర తే ద్రుమాః॥ | వెదురుకర్ర (వంశము / వేణువు / పిల్లనగ్రోవి) - భగవానుడగు రుద్రుడు। ఆ బృందావనములోని కొండ శిఖరము ఇంద్రుని రూపము. చిన్ని కృష్ణుని సఖులందరు సురులు (దేవతలు).<br>**ఆగోకులవనమే వైకుంఠము. అక్కడి లతలన్నీ తపోసంపన్నులగు మునివరేణ్యులు.** |
| లోభ క్రోధ భయా దైత్యాః।<br>కలికాలః తిరస్కృతః।<br>గోపరూపో హరిః సాక్షాత్,<br>మాయా విగ్రహ ధారణః॥ | అక్కడికి వచ్చి బాలకృష్ణుని చేతిలో మరణము పొందిన దైత్యులు (రాక్షసులు) ఎవరు? కలికాల స్వాభావికములగు - లోభ - క్రోధ - భయ గుణములు. వాటి తిరస్కారము. **అక్కడి గోపబాలుని రూపము - మాయా విగ్రహధారుడగు సాక్షాత్ విష్ణుదేవుని అవతారము.** |
| దుర్భేధం కుహకం తస్య,<br>మాయయా మోహితం జగత్।<br>దుర్జయా సా సురైః సర్వైః<br>యష్టి రూపో భవేత్ విధిః॥ | వైష్ణవీమాయ అత్యంత చమత్కారమైనది. దుర్భేద్యమైనది. అది దృశ్యజగత్ రూపమున ప్రదర్శనమగుచు అందరిని జయించివేస్తోంది. దేవతలంతటి వారినే మోహింపజేస్తోంది. అట్టి కల్పితమగు దృశ్యమాయకు కర్రరూపముగా (కట్టుకొయ్య రూపంగా) సృష్టికర్త అగు విధి (బ్రహ్మదేవుడు) ప్రదర్శితులగుచున్నారు. |

| | |
|---|---|
| రుద్రో యేన కృతో వంశః<br>తస్య మాయా జగత్ కథమ్?<br>బలం జ్ఞానగ్ం సురాణాం వై<br>తేషాం జ్ఞానగ్ం హృతం క్షణాత్। | ఏ విష్ణుమాయలో తన్మయులై రుద్రదేవుడంతటి వారు లీలామానుష వేషధారులగు శ్రీకృష్ణ భగవానుని చేతిలో వేణువు (పిల్లనిగ్రోవి) అయ్యారో, అట్టి మాయా జగత్తును శ్రీకృష్ణ కృపలేనిదే మనము దాటగలమా? లేనేలేదు. అక్కడి కృష్ణమాయలో దేవతలంతటివారు తమ (అనన్య) జ్ఞానమును హృతము (హరించబడినది) కాగా, సర్వము ఏమరిచి - క్షణంలో గోప గోపికా బాలలుగా అగుచున్నారే! |
| శేషనాగో భవేత్ రామః।<br>కృష్ణో బ్రహ్మైవ శాశ్వతమ్॥<br>అష్టావష్ట సహస్రే ద్వే<br>శతాధిక్యాః స్త్రియః తథా। | ఆదిశేషుడు అక్కడ బలరాముడు అయ్యారు. ఇక శ్రీకృష్ణుడే శాశ్వతమగు పరబ్రహ్మస్వరూపము. అట్టి పరబ్రహ్మమే వినోద కల్పిత రూపమై - 16,108 స్త్రీల రూపములు గాను, కృష్ణుని అష్టభార్యలుగా కూడాను రూపము దాల్చుచున్నది. సమస్తము అగుచున్నది. |
| **5.** ఋచో ఉపనిషదః తావై।<br>బ్రహ్మరూపా ఋచః స్త్రియః।<br>ద్వేషః చాణూర మల్లో౽యం।<br>మత్సరో ముష్టికో అజయః। | ఋుక్కులే **ఉపనిషత్తులు.** అట్టి బ్రహ్మరూపమగు ఋుక్కులే గోపికాస్త్రీలు.<br>చాణూరమల్లుడు **"ద్వేషము"**. సామాన్యులకు అజేయుడైన ముష్టికుడే - **"మత్సరము"** (ఇరువురిని కంస సభ ప్రవేశించే ముందు బాలకృష్ణ-బలరాములు సంహరించారు) |
| దర్పః కువలయాపీడో।<br>గర్వో రక్షః ఖగో బకః।<br>దయా సా రోహిణీ మాతా।<br>సత్యభామా 'ధర' ఇతి వై। | కువలయపీడయే **"దర్పము"**. కొంగరూపముగల బకుడే **"గర్వము"**.<br>రోహిణియే (వసుదేవుని భార్యయే) ఈ జగత్తు రూపంగా ప్రదర్శన మగుచున్న - జగన్మాత.<br>"భూదేవత" యే (ధరయే) అష్ట భార్యలలో ఒకరగు సత్యభామ. |
| అఘాసురో మహావ్యాధిః।<br>కలిః కగ్ంసః స భూపతిః।<br>శమో మిత్రం 'సుదామా' చ।<br>సత్యా అక్రూరః। ఉద్ధవో దమః। | అఘాసురుడు - మానసిక - శారీరక మహావ్యాధులకు ప్రతీక. కలిపురుషుడే ఆ కంస భూపతి.<br>శ్రీకృష్ణుని మిత్రుడు సుధాముడే **"శమాగుణము"**. **"సత్యము"** అక్రూరుడుగా అవతరించింది. 'దమము' ఉద్ధవుడు రూపము. (శమము సుధాముడుగా, సత్యము అక్రూరుడుగా రూపుదాల్చాయి. |
| **6.** యః శంఖః సః స్వయం విష్ణుః,<br>లక్ష్మీ రూపో వ్యవస్థితః।<br>దుగ్ధ సింధౌ సముత్పన్నో<br>మేఘ ఘోషస్తు సంస్మృతః॥ | "పాలసముద్రంలో పుట్టిన మేఘగర్జనను నినదించుచూ సమస్త పాపభావములను సంస్కరించు 'శంఖము' లక్ష్మీరూపమగు విష్ణువే". - అను విష్ణుతత్త్వము ఎఱిగిన వారు ఎరిగి స్మరించుచున్నారు. |
| దుగ్ధ ఉదధీకృతః తేన, భగ్నభాండో దధి గ్రహే।<br>క్రీడతే బాలకో భూత్వా పూర్వవత్ చ మహోదధౌ,<br>సగ్ంహారార్థం చ శత్రూణాం<br>రక్షణాయ చ సంస్థితః।<br>కృపార్థే సర్వభూతానాం<br>గోప్తారం ధర్మం ఆత్మజమ్॥ | చిన్ని కృష్ణుని లీలలలో విశేషమై పాల్గొనుచున్న పాలకుండలే పాలసముద్రము. పాలసముద్రంలో క్రీడలు ఆడిన మహావిష్ణువే - బృందావనములోను, వ్రేపల్లెలోని పాలభాండములను గోపికల ఇళ్లలో పగలగొట్టుచున్నారు.<br>పాలకుండలను పగలగొట్టుచూ, తోటి గోపబాలురకు పాలు, వెన్న పంచి సంతోషింపజేయురీతిగా **"దుష్కృతులను శిక్షించి సాధుగుణులను సంరక్షించి కృపారసము కురిపింప జేయుదును"** - అను ప్రతిజ్ఞ చేయుచున్నారు. సర్వభూతములను ఆత్మజులవలె రక్షించుచున్నారు. |
| **7.** యత్ సృష్టమ్ ఈశ్వరేణ ఆసీత్<br>తత్ చక్రం బ్రహ్మరూప ధృత్,<br>జయంతి సంభవో వాయుః, చామరో ధర్మ సంజ్ఞితః।<br>యస్య అసౌ జ్వలనా భాసః<br>ఖడ్గ రూపో మహేశ్వరః॥ | ఈశ్వరునిచే ఏ చక్రమైతే (విష్ణుచక్రమైతే) సృజించబడినదో - అది బ్రహ్మ దేవుని రూపమే। (బ్రహ్మయే ఈశ్వరునిచే 'చక్రము'గా నిర్మితులైనారు).<br>జయంతి (విష్ణుచిహ్నమగు పతాకము) జగత్తులో వాయువుగా సంభవించుచున్నది. చామరము (వింజామరము, దండము) - 'ధర్మము'నకు సంజ్ఞ (చామరమే ధర్మ దేవత). జ్వలిస్తున్న (మెరుస్తున్న) - ఖడ్గమే - **"మహేశ్వరుడు"**. |

**కశ్యపో లూఖలః ఖ్యాతో।**
**రజ్జుః మాతా అదితిః తథా।**
**చక్రగ్ంం శంఖం చ సగ్ంసిద్ధం**
**బిందుం వై సర్వ మూర్ధని।**

శ్రీకృష్ణుని బాల్య లీలలో కనిపించే రోలు (యశోద రోలుకు కట్టటము, రోలుతో వృక్ష శాప విమోచనము) కశ్యపుడు (మరీచికి కళ వలన పుట్టి ప్రజాపతి స్థానము అలంకరించినవారు. (దేవతలకు, రాక్షసులకు కూడా తండ్రి).

"త్రాడు" - అదితి (దేవతల తల్లి). **చక్ర - శంఖములు** శ్రీకృష్ణుని మూర్ధమున (ముఖశిఖర స్థానములో) బిందురూపమున (చుక్కబొట్టుల రూపంగా) ఏర్పడి ఉన్నాయి.

---

**యావంతి దేవరూపాణి**
**వదంతి విబుధా జనాః।**

దేవతలంతా శ్రీకృష్ణుని సర్వ అలంకారములు. దేవతలు వేంచేసియున్న స్థానము బృందావనము, బాలకృష్ణునితో ఆడి - పాడి గడిపిన వారంతా ఆయా దేవతల అవతారములుగా విబుధులు చెప్పుతూ ఉంటారు.

---

**నమంతి దేవరూపేభ్య**
**ఏవం ఆది, న సగ్ంశయః।**
**గదా చ కాళికా సాక్షాత్,**
**సర్వశత్రు నిబర్హిణీ।**

బృందావన కృష్ణుని సాకారరూపములను, బృందావనములోని ఆయా విశేషములన్నీ దేవతారూపములుగా భావించి, నిస్సంశయముగా నమస్కరిస్తున్నాము.

శత్రుసంహారము చేయు స్వామివారి ఆయుధమగు 'గద'ను సాక్షాత్ కాళికాదేవి రూపముగా నమస్కరిస్తున్నాము.

---

**ధనుః శార్ఙ్గం స్వమాయా చ।**
**శరత్కాలః - సుభోజనః।**
**అబ్జకాండం జగత్ బీజం,**
**ధృతం పాణౌ స్వలీలయా।**

కృష్ణ స్వామివారి చేతిలోని ధనస్సు 'స్వమాయ' యొక్క రూపము. కాలస్వరూపులగు శ్రీకృష్ణస్వామి యొక్క శరత్కాల ప్రదర్శనయే అక్కడి ఆహార (భోజన) రూపము. స్వామి తన చేత ధరించిన తామరకాడ జగత్తుకు బీజరూపంగా నమస్కరిస్తున్నాము.

---

**గరుడో వట భాండీరః**
**సుదామా నారదో మునిః॥**

ఏ వటవృక్షము క్రింద (మఱ్ఱి వృక్షముక్రింద) బాలకృష్ణుడు చల్దులు ఆరగించారో అదియే గరుడుని రూపము.

బ్రహ్మర్షియగు నారదుడే శ్రీకృష్ణుని బాల్యమిత్రుడగు సుదాముడు.

---

**బృందా భక్తిః, ప్రియా బుద్ధిః -**
**సర్వ జంతు ప్రకాశినీ।**
**తస్మాత్ న భిన్నం, న అభిన్నం- అభిర్భిన్నో**
**న వై విభుః।**
**భూమా ఉత్తారితం సర్వం**
**వైకుంఠం స్వర్గవాసి నామ్॥**

'భక్తి'యే అక్కడి బృందాదేవి. "ప్రియమగు బుద్ధి"యే బృందావనములో సర్వ జంతువులుగా ప్రకాశము (ప్రదర్శనము).

✍ పరమాత్మకు భిన్నమైనది లేదు. అంతా ఆయన ప్రత్యక్ష ప్రదర్శనమే.

✍ పరమాత్మ సర్వదా సమస్తమునకు పరము (Beyond) అయి ఉన్నారు కనుక ఆయనకు భిన్నమైనది లేదు. అభిన్నమైనది (భిన్నము కానిది) లేదు.

- కొంత భిన్నము, కొంత భిన్నము కానిది కూడా ఏదీ లేదు. విశేషముగా త్రిభిన్నమైనదీ ఏదీ లేదు. ఎందుకంటే, అంతా ఆ పరమాత్మయే.

- వైకుంఠమే బృందావనమునకు దిగివచ్చింది. అందుచేత దేవతలందరు అక్కడ బృందావనవాసులై ఉండసాగారు.

**- ఇత్యుపనిషత్-**
***(ప్రథమ ఖండః)***

**= ఇత్యుపనిషత్ = ఇతి ప్రథమఖండము**

**ఇతి కృష్ణతత్త్వ సమీప్య, సంస్పర్శలు.**

# ద్వితీయఖండః - ఏకము నుండి అనేకము

| | **<u>వాసుదేవుడు</u>** |
|---|---|
| 1. శేషో హ వై వాసుదేవాత్<br>'సంకర్షణో' నామ బీజ ఆసీత్।<br>సో అకామయత →<br>"ప్రజాః సృజేయేతి।" | సమస్తమునకు మునుముందే (సృష్టికి మునుముందు) - ఏకము, సర్వశేష్యము సమస్తమునకు ఆవలిది అగు 'కేవలసత్త' స్వరూపుడు మాత్రమే (One existent prior to all else) ఉండి ఉన్నారు. ఆయనయే "వాసుదేవుడు'' అనబడుచున్నారు.<br>అట్టి వాసుదేవుని నుండి (అనుభూతి-సంకల్పముల రూపుడగు) సంకర్షణుడు అను పేరుగల బీజతత్త్వాత్ముడు లీలగా బయలుదేరారు. ఆయన ఏకత్వమునుండి అనేక జీవాత్మలను (ప్రజలను సంకల్పించుకొనెదను)- అనే ఇచ్ఛ పొందారు. |
| తతః 'ప్రద్యుమ్న'<br>సంజ్ఞక ఆసీత్। తస్మాత్-<br><u>అహంకార</u> నామా, 'అనిరుద్ధో'<br>- హిరణ్యగర్భో అజాయత॥ | ఆ విధంగా ఆదిశేష కేవల కృష్ణ చైతన్యపురుషుడు → 'సృష్టి' యొక్క ఇచ్ఛచే **సంకర్షణుడు** అయ్యారు. సృష్టించటము ప్రారంభించి 'సంకర్షణుడు' గా అయి , అటుపై సృష్ట్యనుభవముకొరకై 'అనిరుద్ధుడు' అనబడు 'అహంకార' (sense of I ) రూపము దాల్చారు. ఆ తరువాత సృష్ట్యభిమానియగు హిరణ్యగర్భ (రేతస్సు, 'అస్తి' నామాంతర) రూపుడైనాడు. |
| తస్మాత్ దశ ప్రజాపతయో మరీచి - ఆద్యాః<br>స్థాణు దక్ష కర్దమ ప్రియవ్రత<br>ఉత్తానపాద వాయవో వ్యజాయంత తేభ్యః। | అక్కడినుండి (హిరణ్యగర్భ సృష్ట్యభిమానమునుండి) దశ (10) ప్రజాపతులు మరీచ్యాదులు - <u>మరీచి, స్థాణువు, కర్దముడు, ప్రియవ్రతుడు, ఉత్తాన పాదుడు,</u> వాయువు మొదలైనవారంతా) - గా జనించారు. (వారంతా 'సృష్టి'లో పాల్గొను వివిధ కళాకారులు) |
| (తేభ్యః) సర్వాణి భూతాని చ।<br>తస్మాత్ శేషాత్ ఏవ (శేషాదేవ)<br>సర్వాణి చ భూతాని సముత్పద్యంతే।<br>తస్మిన్ ఏవ ప్రలీయంతే। | (కేవల పరమాత్మయగు) అట్టి మొట్టమొదటి ఆదిపురుషుడగు కృష్ణుని నుండి సూక్ష్మ పంచభూతములు (Place, Vibration, Heat, Liquid, Solid) ఏర్పడు చున్నాయి. ఆ ఆదిపురుషుని నుండియే సమస్త జీవజాలము ఉద్భవించి (జలంలో తరంగాలు లాగా) తిరిగి మరొకప్పుడు ఆయనయందే లీనమగుచున్నది. |
| స ఏవ బహుధా జాయమానః<br>సర్వాన్ పరిపాతి। స ఏవ<br>కాద్రవేయో వ్యాకరణ జ్యోతిష ఆది<br>శాస్త్రాణి నిర్మిమాణో బహుభిః। | ఆ ఆదిశేషుడగు పరమాత్మనుండే ఈ జీవులంతా అనేక విధములుగా పుట్టుచున్నారు. సర్వులు ఆ ఆది పురుషునిచేతనే పరిపోషింపబడుచున్నారు. అట్టి కాద్రవేయుని నుండే (ఆదిశేష సర్ప రూపమునుండే) శబ్దము, పలుకు, మాటలు, వ్యాకరణము, జ్యోతిష్యము మొదలైన శాస్త్రములన్నీ నిర్మించ బడుచున్నాయి. |
| (బహుభిః) ముముక్షుభిః ఉపాస్యమానో।<br>అఖిలాం భువం ఏకస్మిన్ శీర్ష్ణి సిద్ధార్థవత్ ధ్రియమాణః।<br>సర్వైః మునిభిః సంప్రార్థ్యమానః। | అట్టి ఆదిశేష స్వరూపుడే సమస్త భువనములను ధ్రియామాణుడు. (ధరించుచున్నట్టి వారు). జగత్తు విషయముల పట్ల మౌనము వహించి, ఆత్మవిశేషము పట్ల వికసితమగుచిత్తముగల మునులకు ఆయనయే "ప్రార్థింపబడువారు" అగుచున్నారు. |
| సహస్రశిఖరాణి మేరోః<br>శిరోభిః అవార్యమాణాన్<br>మహావాయుః అహంకారాన్ నిరాచకార। | మేరుపర్వత శిఖరములవలె ఆయనయొక్క వేయి ఫణములను (పడగలను) కించిత్ కూడా కదల్చలేక వాయువు తన అహంకారము త్యజించి మౌనము వహించుచున్నది. (ప్రాణాయామములకు ఆవల మౌనస్వరూపమై నిశ్చలాత్మగా ప్రాణాయామ యోగాభ్యాసులకు సందర్శనము అగుచున్నది). |
| స ఏవ భగవాన్ భగవంతం బహుధా విప్రీయమాణః-<br>అఖిలేన స్వేన (స్వ ఏన) రూపేణ యుగే యుగే,<br>తేన ఏవ జాయమానః స ఏవ సౌమిత్రిః ఇక్ష్వాకః। | భగవంతుడే ఆదిస్వరూపుడు. సహస్రశీర్ష - [వేయి పడగల (శీర్షముల)] ఆదిశేషుడు పరమాత్మయొక్క ప్రీతికొరకై, సర్వభూత రక్షణ కొరకై యుగయుగాలుగా పరమాత్మతో బాటే అవతరిస్తున్నారు.<br>ఆ ఆదిశేషుడే ఇక్ష్వాకు కులము (వంశము)లో సుమిత్రా తనయుడగు సౌమిత్రిగా (లక్ష్మణస్వామిగా) అవతరించారు. |

| | |
|---|---|
| **2. సర్వాణి ధానుష శాస్త్రాణి,<br>సర్వాణి అస్త్ర శస్త్రాణి, బహుధా<br>విప్రీయమాణో రక్షాంసి సర్వాణి వినిఘ్నం (చ) ।<br>చాతుర్వర్ణ్య ధర్మాన్ ప్రవర్తయామాస।<br>స ఏవ భగవాన్ యుగసంధికాలే<br>శారదాభ్రసన్నికాశో రౌహిణేయో వాసుదేవః॥** | ఆయన సర్వధానుష శాస్త్రమును (ధనుర్వేదమును) అనేక రీతులుగా రచిస్తున్నారు. రాక్షస స్వభావులను శిక్షించుచున్నారు. చాతుర్వర్ణ్య ధర్మములను రక్షించి, ప్రవర్తింపజేయుచున్నారు.<br>**బలరామ ప్రసంశ** - ఆ ఆదిశేష భగవానుడే ద్వాపర - కలియుగ సంధి కాలములో శరత్కాల మేఘమువంటి తెల్లని శరీరముతో రోహిణీ - వసుదేవుల కుమారుడై బలరాముడుగా అవతరించారు. |
| **సర్వాణీ గదా ఆది ఆయుధ శస్త్రాణి<br>వ్యాచక్షాణో నైకాన్ రాజన్య మండలాన్<br>నిరాచికీర్షుః, భూభారమ్ అఖిలమ్ నిచ ఖాన।** | అనేకమంది రాజులకు ఆ బలరాముడు గదావిద్యను బోధించారు. గదాధారులై (జరాసంధుని దండయాత్రల సందర్భములో) అనేకమంది దుష్టస్వభావులగు రాజులను మట్టికరిపించారు. భూభారమును తగ్గించారు. |
| **స ఏవ భగవాన్ యుగే<br>తురీయే అపి బ్రహ్మకులే జాయమానః,<br>సర్వా ఉపనిషదః ఉత్ దిధీర్షుః।<br>సర్వాణి ధర్మ శాస్త్రాణీ విస్తారయిష్ణుః।<br>సర్వాన్ అపి జనాన్ సంతారయిష్ణుః।** | ఆ భగవానుడు నాలుగవదగు కలియుగములో బ్రహ్మ కులమునందు పుట్టి (సాధనల అంతిమఫలమగు 'సోఽహమ్', 'తత్త్వమ్'లను ప్రకటించు) ఉపనిషత్తులను ఉద్ధరించటానికై ఉద్దేశ్యించుచున్నారు. ధర్మశాస్త్రమును పరమార్థములను విస్తరించటానికై, జనులను తరింపజేయటానికై అవతారము స్వీకరిస్తున్నారు. **(బుద్ధావతారము)** |
| **సర్వాన్ అపి వైష్ణవాన్ ధర్మాని<br>విజృంభయన్, సర్వాన్ అపి పాషండాన్ నిచఖాన।<br>స ఏవ జగదంతర్యామీ। స ఏష సర్వాత్మకః।<br>స ఏవ ముముక్షుభిః ధ్యేయః। స ఏవ మోక్షప్రదః।** | పరమాత్ముడగు భగవానుడే అవతారుడై - సర్వ వైష్ణవ పరాకాష్ఠ ధర్మములను విజృంభింపజేస్తున్నారు. పాషండుల పరిమిత అవగాహనలను ఖండించి వేస్తున్నారు. (పాషండులు = పూజ, ప్రాణాయామము, ధ్యానము మొదలైన సాధనలను చేస్తూ కూడా "భగవంతుడు అన్యుడు, అనన్యుడు కాడు"- అను మూర్ఖ భావమును ఆశ్రయించి ఆచార వ్యవహారములకు మాత్రమే పరిమితులైనవారు)<br>**బుద్ధావతారము** = జగదంతర్యామిత్వము నిదురలేపి, "నేను బద్ధుడను కాను'' అను భావనను చిగురింపజేసి **జనులను మోక్షప్రదులుగా తీర్చిదిద్దుతున్నారు**. వారి బోధలు ముముక్షువులకు వివేక ప్రసాదితములగు ధ్యేయములు. |
| **ఏతం స్మృత్వా సర్వేభ్యః పాపేభ్యో ముచ్యతే।<br>తత్ నామ సంకీర్తయన్ విష్ణు సాయుజ్యం గచ్ఛతి,-<br>తత్ ఏతత్।** | అట్టి బుద్ధావతారము స్మరించినంతమాత్రంచేత ఈ జీవుడు సర్వపాపముల నుండి విముక్తుడు కాగలడు.<br>ఆ సంకీర్తనముచే విష్ణు సాయుజ్యము జనులు పొందగలరు. |
| **దివా అధీయానః రాత్రికృతం పాపం నాశయతి।<br>నక్తమ్ అధీయానో దివసకృతం పాపం నాశయతి।<br>తత్ ఏతత్ వేదానాం రహస్యం।<br>తత్ ఏతత్ ఉపనిషదాం రహస్యం।<br>ఏతత్ అధీయానః సర్వక్రతు ఫలం లభతే॥** | ఈ ఉపనిషత్తు పగలు చదివితే రాత్రి చేసిన పాపములు, రాత్రి అధ్యయనము చేస్తే పగలు చేసిన పాపములు **తొలగిపోగలవు.**<br>ఈ ఉపనిషత్తులో సమస్త వేదముల సారము నిక్షిప్తమైయున్నది.<br>ఈ ఉపనిషత్ అంతరార్థమును (రహస్యార్థమును) అధ్యయనము చేయువారికి సమస్త క్రతువులు నిర్వర్తించిన ఉత్తమ ఫలము లభించగలదు. |
| **శాంతిమేతి। (శాంతిం ఏతి) మనశ్శుద్ధిమేతి।<br>సర్వతీర్థఫలం లభతే।<br>య ఏవం వేద,<br>దేహబంధాత్ విముచ్యతే॥ - "ఇత్యుపనిషత్"।<br><u>ఇతి కృష్ణోపనిషత్ సమాప్తా॥</u><br><u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥</u>** | అట్టి రహస్యార్థ ఉపాసకునికి, ముముక్షువునకు **"ఆత్మస్వరూపమే వాహమ్"** రూపమగు పరమశాంతి లభించగలదు. మనస్సు నిర్మలము, ప్రశాంతము కాగలదు. సర్వతీర్థములలో స్నానము చేసిన ఫలము లభించగలదు. ఇందలి పరమార్థము తెలుసుకొన్నవాడు దేహబంధమునుండి విముక్తుడవగలడు. **"నేను సర్వదా దేహరహితుడను. సర్వాత్మకుడను. కేవలీస్వరూప అవతార లీలావినోదిని"** అని గ్రహించగలడు.<br>**<u>కృష్ణోపనిషత్ సమాప్తా</u>**<br>***<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥</u>*** |

అథర్వణ వేదాంతర్గత

# 5 కృష్ణోపనిషత్

## అధ్యయన పుష్పము

### 1వ ఖండము - బృందావన సంచార రహస్యార్థము

**ఏ శ్రీరామచంద్రుడైతే శ్రీకృష్ణుడుగా అవతరించి, లీలావినోదంగా "స్వస్వరూప సర్వాత్మత్వము"ను సంప్రకటన చేయుచు మౌనిపటలమును బ్రహ్మానందపరచారో - అట్టి శ్రీరామ - శ్రీకృష్ణ భగవానునికి నమస్కరిస్తున్నాము.**
**[లోకోరమయతేతి రామః। కృష్ణస్తుభగవాన్ స్వయమ్]**

ఒక సందర్భములో కొందరు మునివరేణ్యులు దండకార్యణములో ఆశ్రమవాసము నిర్వర్తిస్తూ ఉన్న శ్రీరామచంద్రమూర్తిని దర్శించాలనే అభిలాష కలిగినవారై, ఎక్కడెక్కడి నుండో వచ్చి సమావేశమై, శ్రీరాముడు పరివేష్ఠితులై ఉన్నచోటికి వచ్చారు. మునుల రాకను గమనించిన రామచంద్రుడు గబగబలేచి మునుల పాదపద్మములను పన్నీటి జలముతో కడిగి శిరస్సుపై దాల్చి, వారందరినీ ఒక ప్రశాంతమైన ప్రదేశములో సుఖాసీనులుగా చేసారు.

అయితే ఆ మునివరేణ్యులంతా ఆత్మారామానంద స్వరూపుడగు శ్రీరాముని సౌందర్యము చూచి తన్మయులు కాసాగారు. బాహ్య దృష్టులన్నీ వదలి శ్రీరామచంద్రుని చూస్తూ **"పుంసాం మోహన రూపాయ। పుణ్య శ్లోకాయ మంగళమ్"** అని పలుకుచూ, శ్రీరాముని **"వర్ణనాతీత పరబ్రహ్మానంద సౌందర్యమును"** తిలకిస్తూ అనిర్వచనీయానందము పొందసాగారు.

శ్రీరామచంద్రుడు ఆ మునిసత్తములందరినీ ఒక్కొక్కరుగా కుశల ప్రశ్నలు అడుగసాగారు. మునులు మాత్రం రామచంద్రుని సౌందర్య సందర్శనామృత మాధుర్యములోనే మునిగితేలసాగారు.

**మునులు :** శ్రీమహావిష్ణు అవతారమూర్తీ! మూర్తీభవించిన ఆత్మారామానందస్వరూపా! నీయందు మాకు అనుభూతమగుచున్న వేద-వేదాంగ ప్రవచితమైనట్టి సత్-చిత్-ఆనంద సౌందర్యము చూచి మేము మన్మథుని చూచిన రతీదేవివలె తన్మయులమగు చున్నామయ్యా! వనవాసులమగు మేము మీ సర్వాంగ సుందరము చూచి విస్మితులమగుచున్నాము. మీ ఈ మూర్తితో ఆలింగనము ప్రసాదించమని వేడుకొనుచున్నాము. **అవద్యమ్ అవతారాన్ వైగణ్యంతే - ఆలింగామో భవంతమ్ - ఇతి॥**

**శ్రీరాముడు :** ప్రియ మునీంద్రులారా! మీ భక్తికి నేను సంతోషము పొందుచున్నాను. భక్తవశడును కదా! అయితే, **భవాంతరే కృష్ణావతారే యూయం గోపికా భూత్వా మామలింగథ।** రాబోయే నా కృష్ణావతారములో మీరు నాతోను, నేను మీతోను శారీరకమగు (ప్రకృతిపరమగు) - ఆలింగనానందము పొందుచూ మమేకమగుదుము గాక.

**రుద్రుడు, మునీశ్వరులు : అన్యే యే అవతారాః తే హి గోపా నః స్త్రీశ్చ నో కురు। అన్యోన్య విగ్రహం ధార్యం తవాంగ స్పర్శనాది హ। ఆత్మసౌందర్యా!** శ్రీరామ భగవాన్। మీ తరువాతి అవతార సందర్భములో మమ్ములను వ్రజ గోపబాలురుగాను, వ్రజగోపికాస్త్రీలుగాను జన్మలు ప్రసాదించండి.

శ్రీరామచంద్రా! మనము అంగ స్పర్శకొరకై అన్యోన్యము ప్రియులమై ఉందాము. మీరు శ్రీకృష్ణుడుగా అవతరించినప్పుడు మరల మరల మమ్ములను అంగాంగం స్పృశించాలి సుమా! అందుకొరకై మేము వ్రజ గోపి-గోపికాజనముగా జన్మలు ఆనందంగా స్వీకరిస్తాము.

**శ్రీరాముడు : అంగ సంగం కరిష్యామి। భవద్వాక్యమ్ కరోమి అహమ్।** ఓ మునులారా! రుద్రాది దేవతలారా! మీరు అభిలషిస్తున్నట్లుగా "అంగసంగము" తప్పక పొంది ఆనందించెదము గాక.

ఆ మాటలు విని దేవతలు, మునులు "ఆహా! మేము కృతకృత్యులము" అని సంతోషించి, శ్రీరామచంద్రుని సమక్షంలో కొంతసేపు గడిపి తృప్తిగా తమతమ స్థానములకు తిరోముఖులు అయ్యారు.

⌘

వారంతా ద్వాపరయుగములో శ్రీకృష్ణునితో బాటుగా వ్రజగోపబాల-గోపికా స్త్రీలుగా జన్మలు స్వీకరించారు.

| | | |
|---|---|---|
| **పరమానందదేవత** | → | నందుడుగాను |
| **ముక్తిదేవత** | → | యశోదగాను జన్మలు పొందారు. |

⌘ ⌘ ⌘

**మాయ** – సత్త్వ రజో తమో గుణములుగా చెప్పబడుతోంది. రుద్రునియందు సత్త్వము, బ్రహ్మయందు రాజసగుణము, తామసగుణము దైత్యుల వైపుగా ఉంటుంది.

ఈ విధంగా మాయ '3' విధములైనదిగా చెప్పబడుతోంది. అట్టి విష్ణుమాయ అజేయమైనది. జప-తపములు మాత్రం చేత కూడా తొలగేది కాదు. అందుకుగాను – పరంధాముడగు శ్రీకృష్ణోపాసనయే శరణ్యము.

⌘

**దేవకి :** వేదములచే వర్ణించబడు బ్రహ్మపుత్రికయే దేవకి. (బ్రహ్మ భావనయే ప్రకృతిపరంగా "దేవకి" అయినది).

**వసుదేవుడు:** వేదములు (నిగమములు) వసుదేవుని రూపము.

**కృష్ణ-రాములు :** వేదములలోని కర్మ – ఉపాసన – జ్ఞానవిచాణ తత్త్వమే వసుదేవుడు. వేదమహావాక్యములగు 'సోఽహమ్, తత్త్వమ్'ల పరమార్థానుభవమే → భూమిపై కృష్ణ – బలరాములుగా అవతరించారు. **"మత్తః పరతరం నాన్యాత్ కించిదస్తి", "అహం సర్వస్య ప్రభవో", "మయాతతమిదం సర్వం జగదవ్యక్త మూర్తినా"** – మొదలైన మహావాక్యాలు భగవద్గీతాకృతంగా జాలువారాయి.

**బృందావనము:** వనే బృందావనే క్రీడన్ గోప-గోపీస్సురై సః। దేవతలు, ఋషులు, మునులు గోపబాలురుగా అవతరించి క్రీడించు స్థలము.

**గోపికలు, గోవులు: = మునులు, శ్రుతులు**

| | |
|---|---|
| గోప్యోగావ ఋచః। | ఋగ్వేదములోని ఋక్కులు, గోపికలు→ గోవులుగా రూపము తీసుకున్నాయి. |
| యష్టికా కమలాసనః। | చేతికర్ర (కట్టెకర్ర) (ఆవులను మేపునప్పుడు గోపబాలురు ఉపయోగించు కర్ర) గోపగృహముయొక్క **బ్రహ్మదేవుడు.** |
| వంశస్తు భగవాన్ రుద్రః | బాలకృష్ణుడు ఉపయోగిస్తున్న వంశీ (పిల్లనగ్రోవి) – భగవానుడగు **రుద్రుడు.** |
| శృంగం ఇంద్రః। | బృందావనములోని గోవర్ధనగిరి శిఖరము **ఇంద్రుడు.** |
| సఖా సురః। | దేవతలు – శ్రీకృష్ణుని ప్రియ స్నేహితులు, సఖులు. |
| గోకులవనం వైకుంఠం। | ఆ గోకులవనము – **వైకుంఠము.** |
| తాపసాః తత్ర తే ద్రుమాః। | అక్కడి చెట్లు, లతలు తాపసులగు మునులు. |

**లోభ క్రోధ భయా దైత్యైః కలికాలః తిరస్కృతః।** కలికాల స్వాభావికములైన లోభ క్రోధ భయాదులు-దైత్యులు (రాక్షసులు). అక్కడ తిరస్కారము పొందువారు. బాలకృష్ణునిచే సంహరించబడిన 'పూతన' మొదలైన అసురులంతా అరిషట్వర్గ ప్రతీకలు.

గోపరూపో హరిః సాక్షాత్ మాయా విగ్రహధారిణః। వైకుంఠవాసుడగు శ్రీహరియే బృందావనములో గోపబాలుడగు **శ్రీకృష్ణ గోపాలుడు**. సాక్షాత్ హరియే మాయా మానుషవేషధారి అయి బృందావనములో బ్రహ్మానందము ప్రసాదిస్తూ లీలలు ప్రదర్శిస్తున్నారు.

⌘

**వైష్ణవమాయ - దురత్యయము** (దాటరానిది), దుర్బోధ్యము (అర్థము కానిది). **దుర్భేధ్యము** (బేధింపజాలనిది) కూడా! ఈ జగత్తంతా మాయామోహితమై కుహకము (లోతైనగోయివలె) అయి వర్తిస్తోంది. దేవతలకు కూడా **దుర్జయము** (జయింపరానిది) .

- విధి (బ్రహ్మదేవుడు) అంతటివాడు బృందావనంలో వెదురు కర్ర రూపము దాల్చుచున్నారు.
- రుద్రుడంతటివాడు వెదురు నిర్మితమైన మోహనమురళి రూపము ధరించి శ్రీకృష్ణస్పర్శపొంది ఆనందిస్తున్నారు.
- మహర్షులు, మునులు, దేవతలు - అంతటివారు బాలకృష్ణుని మోహనమురళీగానము వినటానికి బృందావనములో పరుగులు ఎత్తుచున్నారు.
- మాయాజగత్తును ఎవరు మాత్రం జయించగలరు? మాయచే దేవతలంతటి వారి అనన్య-జ్ఞానము కూడా క్షణంలో హరించబడుతోందే! అట్టి మాయను జయించే ఉపాయమేమిటి? మాయ (మాయ తనదైనట్టి) బాలకృష్ణుని శరణువేడుచూ, శరణాగతిని ఆశ్రయించటమే।
- **శేషనాగో భవేత్ రామః** - ఆదిశేషుడే (సర్వము లయించగా అప్పటికీ శేషించియుండు ఆదిగా శేషించువాడే) - బలరాముడుగా అవతరించారు.
- **కృష్ణో బ్రహ్మైవ శాశ్వతమ్।** శాశ్వతమగు పరబ్రహ్మమే శ్రీకృష్ణుడు.
- **ఋక్కులు, ఉపనిషత్తులు**→ గోపికా స్త్రీలుగా అవతరిస్తున్నారు. గోపికా స్త్రీలు బ్రహ్మము గురించి గానము చేయు 'ఋక్' రూపులే।

| | | |
|---|---|---|
| ద్వేషము | → | చానూర మల్లుడు। |
| మత్సరము | → | ముష్టిక మల్లుడు। |
| దర్పము | → | 'కువలయపీడ' అనే ఏనుగు। |
| గర్వము | → | బకాసురుడు [ఖగ (కొంగ) రూప రాక్షసుడు]। |
| దయ | → | రోహిణీమాత। |
| ధర (భూమి) | → | సత్యభామ। |
| మహావ్యాధి | → | అఘాసురుడు। |
| (వదలలేకపోతున్న మానసికమైన రుగ్మతలు) | | |
| కలిపురుషునిదే | → | కంసుడు। |
| శమము | → | కృష్ణమిత్రుడైన సుదాముడు। |
| సత్యము | → | అక్రూరుడు। |
| దమము | → | ఉద్ధవుడు। |

⌘

**శంఖముగా రూపుదాల్చినది ఏది? లక్ష్మీరూపముగా వ్యవస్థితుడై యున్నది విష్ణువే. సః స్వయం విష్ణుః లక్ష్మీ రూపో వ్యవస్థితః।**

పాల సముద్రమే వ్రజగోపికా గృహములలోని పాలకుండల రూపము. బాలకృష్ణుడు గోపికల ఇళ్లలో పగలగొట్టిన పాలు - పెరుగు కుండలే - **"మహావిష్ణువు యొక్క పాలసముద్రములోని బాలా - లీలా - క్రీడా వినోదములు."**

సమస్త జనుల సంసార భాండములను పగలగొట్టటమే శ్రీకృష్ణుని - సాధురక్షణ, దుష్టశిక్షణ. అదంతా జీవుని దోషములు తొలగించు చమత్కారము. ఆయన ధర్మ రక్షకుడై ఉండటమనేది సర్వభూతములపై దయాకటాక్షవీక్షణము (ఆర్తజనులను రక్షించటము). దుష్టత్వమును తొలగించటము, సాధుత్వమును సముత్సాహపరచటమే - శ్రీకృష్ణావతారముఖ్యోద్దేశ్యము.

**చక్రము :** ఈశ్వరునిచే బ్రహ్మయే 'చక్రము'గా సృష్టించబడ్డారు.

**(బృందావనములో) వాయువీచిక శబ్దములు :-** పరమాత్మకు 'జయమగుగాక' అని జేజేలు పలికే నాదములు. **జయంతి సంభవో వాయుః।**

**చామరము** → ధర్మదేవతకు సంజ్ఞ (ధర్మో రక్షతి రక్షితః – అని గుర్తు చేయు సంజ్ఞ).

**ప్రజ్వలించు ఖడ్గము** → మహేశ్వరుడు – **యస్య అసౌ జ్వలనా భాసః, ఖడ్గ రూపో మహేశ్వరః।** (మహా – ఈశ్వరుడు = సమస్త జగత్తుగా విస్తరించియున్న స్వస్వరూప విస్తారణ ప్రదర్శనము). అజ్ఞానమూలములను ఖండించునది – ఖడ్గము.

**అక్కడి రోలు** → కశ్యప ప్రజాపతి। కశ్యపో లూఖలః ఖ్యాతో।

**కృష్ణయ్య నడుముకు కట్టిన త్రాడు** → అదితి। **రజ్జుః మాతా అదితిః।** ('పుత్ర' ఇత్యాది మమకార బంధము).

'తత్త్వమ్' – 'సోఽహమ్' మహావాక్యములకు ప్రతీకలు.

**మోక్షమునకు సంసిద్ధతయే** – చక్ర, శంఖములు (బంధము ఎందుకు లేదో విశ్లేషించి చెప్పే ఉపనిషత్ వచనములు).

**బిందువు** → కృష్ణుని మూర్ధస్థానము (Point of foreface) (సమస్తము తనయందు దర్శించు స్థానము).

**"ఇవన్నీ దేవతారూపములే"** అని తత్త్వజ్ఞులగు విబుధజనుల (Inteligent Beings) యొక్క సమన్వయ వచనములు. అట్టి దేవతా రూపములకే అందరు నమస్కరిస్తున్నారు. సంశయరహితంగా కృష్ణుని అలంకారములలో సర్వదేవతారూపములను దర్శిస్తున్నారు.

| | | |
|---|---|---|
| **స్వామి చేతిలోని గద** | – | సాక్షాత్ అరిషట్‌వర్గ శత్రు సంహారి యగు కాళికాదేవి। |
| **స్వమాయయే** | – | 'శారఙ్గము' అనబడే ధనుస్సు. |
| **అక్కడి శరత్కాలము** | – | భోజనము। మధుర ఆహార రూపము. |
| చేతిలో ధరించుచున్న తామర కాడయే | – | 'జగత్' అనే వృక్షమునకు "బీజము"–అనే సంజ్ఞ। స్వకీయ కల్పనలన్నిటికీ ఉత్పత్తి స్థానమగు స్వస్వరూపము. |
| వటవృక్షము | – | గరుడుడు। |
| నారదుడే | – | సుదాముడు। |
| బృందాదేవి | – | భక్తి స్వరూపము। |

**బృందా భక్తిఃప్రియా బుద్ధి, సర్వజంతు ప్రకాశినీ।** – సర్వజీవులలో బుద్ధిరూపముగా వెలయుచు ప్రియస్వరూపిణిగా ఉన్నదియే బృందావనము.

> సమస్తము కృష్ణపరమాత్మయే। ఆయనకు భిన్నమైనదేదీ లేదు. భిన్నముగా కనిపిస్తున్నదంతా అభిన్నుడగు కృష్ణతత్త్వమే। గోపస్త్రీలు, బృందాదేవి మొదలైనవారికెవ్వరికీ కృష్ణుడు భిన్నము కాదు. శ్రీకృష్ణుడు ఎవ్వరికీ భిన్నుడు కాడు. అభిన్నుడు. **మనమంతా శ్రీకృష్ణ చైతన్యప్రభునిత్యానందస్వరూపులమే॥**

***స్వర్గవాసులు వైకుంఠమును కోరుకోగా, అప్పుడు వైకుంఠమే బృందావనమునకు దిగివచ్చింది. దేవతలంతా పరమానందముగా వైకుంఠతుల్యమగు బృందావనములో గోపబాల – గోపికా – గో – పుష్ప – వృక్షములుగా అయి, సర్వాత్మకమగు శ్రీకృష్ణపరబ్రహ్మ తత్త్వమును వినోదించసాగారు.***

*ఇత్యుపనిషత్ – ప్రథమాధ్యాయః॥*

## 2వ ఖండము - ఏకమునుండి అనేకము

[వాసుదేవ–సంకర్షణ–ప్రద్యుమ్న–అనిరుద్ధ–హిరణ్యగర్భ–ప్రజాపతీ–భూతజాలయో]

మెట్టమొదట జగదతీత – జగత్ రహిత కేవలస్వరూపుడగు **వాసుదేవుడే ఏకస్వరూపుడై అఖండుడై సర్వత్రా వేంచేసియున్నారు.** ఆయన కేవల – నిర్విషయ – ఏకాంత – అనన్య – ఆనందాత్మ స్వరూపుడు.

- ఆయననుండి 'సంకర్షణుడు' అనే బీజము ఆవిర్భవించింది. (బలరాముడు సంకర్షణ బిరుదాంకితుడు. **అన్యము యొక్క అభిరుచి రూపమే సంకర్షణము).** (ప్రప్రథమ సంకల్ప పురుషకారము)

- **ఆ సంకర్షణుడు :** "నేను ప్రజలను (అనేక చమత్కారములను) సృష్టించెదనుగాక।" అనే కోరిక పొందారు.

- **ప్రద్యుమ్నుడు :** అప్పుడు కృష్ణపరమాత్మ నుండి **'ప్రద్యుమ్నుడు'** అను **'సంజ్ఞకము'** సత్‌రూపమై సృష్టికల్పనారూపమై బయల్వెడలింది.

(ద్యుమ్నము = బలము, ధనము, సంపద. **ప్రద్యుమ్నము = సృష్టి సంపద)**

- **అనిరుద్ధుడు :** ఇంకా 'అహంకారము' అనురూపమగు **అనిరుద్ధుడు** ఆయననుండి బయల్వెడలారు. ఆయనయే హిరణ్యగర్భుడు (సమస్త సృష్టి తనయందు ఇచ్ఛామాత్రంగాను, ప్రకాశమాత్రంగాను కలవారు)

**(అహంకార నామా అనురుద్ధో హిరణ్యగర్భో అజాయత।)** (అనిరుద్ధ = Unstoppable).

ఆయన నుండి దశ (10) ప్రజాపతులు, మరీచి, స్థాణువు, దక్షుడు, కర్దముడు, ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు, వాయువు మొదలైనవారు జనించారు. వారి నుండి సమస్త భూతజాలము జనించింది.

- [ **ప్రజాపతులు (21) :** (భారతము, భాగవతము, దేవీ భాగవతము).

1. బ్రహ్మ 2. స్థాణువు 3. మనువు 4. దక్షుడు 5. భృగువు 6. ధర్ముడు 7. యముడు 8. మరీచి 9. అంగిరసుడు 10. అత్రి 11. పులస్త్యుడు 12. కర్దముడు 13. క్రతువు 14. వసిష్ఠుడు 15. పరమేష్ఠి 16. సూర్యుడు 17. సోముడు 18. కర్దముడు 19. క్రోధుడు 20. అర్వాకుడు 21. ప్రీతుడు ]

- **ఆదిశేషునినుండి సర్వభూతములు జనించటము, తిరిగి ఆయనయందే లీనమవటము (జల-తరంగన్యాయంగా) జరుగుతోంది.**

**స ఏవ బహుధా జాయమానః సర్వాన్ పరిపాతి।** కేవలుడు, ఆదిస్వరూపుడు, ఆద్యంత రహితుడు అగు పరమాత్మ అనేక విధములుగా పుట్టుచు, సమస్తము తన యొక్క ధారణయందు కలిగి ఉంటున్నారు.

**స ఏవ కాద్రవేయో వ్యాకరణ జ్యోతిషాది శాస్త్రాని నిర్మిమానో।** - ఆ ఆదిశేషుడే భాషలు, వ్యాకరణము, జ్యోతిషము మొదలైన శాస్త్రములను నిర్మించి సృష్టియందు ప్రతిక్షేపించుచున్నారు.

**(స ఏవ) బహుభిః ముముక్షుభిః ఉపాస్యమానో। అనేకమంది ముముక్షువులు ఏ పేరుతోనైనా ఉపాసిస్తూ ఉన్నది ఆ కృష్ణ చైతన్యతత్త్వమునే।**

**సర్వత్రా సర్వులు అఖండమగు ఆత్మనే ఉపాసిస్తున్నారు. అఖిలాం భువమ్ ఏకస్మిన్ శీర్ష్ణి సిద్ధార్థ వద్రియమాణః।** శ్రీకృష్ణ పరమాత్మ సమస్తభూరూపమును (Entire solid) తన సహస్రాది సువిస్తార శిరస్సులలోని ఒక శిరస్సుపై నిలిచిన ఆవగింజంతఁగా) ధరించుచున్నారు.

**సర్వైః మునైః సంప్రార్థ్యమానః।** సర్వ మునులచే సర్వాత్మకుడుగా ఆ శ్రీకృష్ణపరమాత్మయే అనేక నామరూపములతో సంప్రార్థించబడుచున్నారు.

## ఆదిశేషుడు

హేమపర్వతముయొక్క వేలాది శిఖరములవలె ఉన్న ఆ పరమాత్మయే ఆదిశేషుడు. ఆదిశేషుని శిరస్సులలో ఒక్కదానినైనా కూడా - వాయువు కించిత్ కూడా కదల్చజాలక సిగ్గుతో వెనుకకు తిరిగి తన అహంకారమును పోగొట్టుకొనుచున్నది. అట్టి ఆదిశేషుడు, అద్యంత రహితుడు - అగు పరమాత్మకు ఆనందము కలుగజేయటానికై యుగయుగములుగా పరమాత్మతోబాటే అవతరించుచున్నారు.

**స ఏవ సౌమిత్రిః ఐక్ష్వాకః।** ఆయనయే ఇక్ష్వాకు వంశములో **'లక్ష్మణుడు'**గా శ్రీరామచంద్రునికి తమ్ముడై అవతరించారు.

ఆ నిర్వికారుడు, నిర్వికల్పుడు అగు పరమాత్మాంశయే సంకర్షణుడై (బలరాముడై) సమస్త 'ధనుష శాస్త్రము'ను, సర్వ అస్త్రశస్త్రముల విశేషములను బహువిధములుగా రచిస్తున్నారు. వాటిని ఉపయోగించి రాక్షస సంహారము నిర్వర్తిస్తున్నారు. ధర్మరక్షణను లీలగా నిర్వర్తిస్తూ బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - శూద్ర చాతుర్వర్ణ్య ధర్మములను ప్రవర్తింపజేయుచున్నారు.

**బలరామావతారము : సయేవ భగవాన్ యుగసంధికాలే శరదాభ్ర సన్నికాశో రౌహిణేయో వాసుదేవః ।**

అట్టి పరాత్పరుడగు ఆదిశేషుడే యుగసంధికాలంలో (ద్వాపర – కలి యుగ సంధి సమయములో) శరత్కార మేఘమువంటి తెల్లటి సమమైన శరీరముతో రోహిణీ వసుదేవుల కుమారుడు 'బలరాముడు'గా జన్మించారు. గద మొదలైన ఆయుధవిద్యను అనేకమంది రాజులకు నేర్పించారు. మధురపై దండయాత్ర చేసిన అనేకమంది రాక్షస స్వభావులగు రాజులను నిర్జించారు. భూభారమును తగ్గించారు. దుష్టశిక్షణ – శిష్ట రక్షణ నిర్వర్తించారు.

## బుద్ధావతారము

**స ఏవ భగవాన్ యుగే తురీయేఽపి బ్రహ్మకులే జాయ మానః సర్వా ఉపనిషదః ఉద్దిధీర్షుః** ఆ పరంధాముడే (నాలుగవదగు) కలియుగములో బ్రహ్మకులమున పుట్టి జనులను తరింపజేయటానికై యజ్ఞము మొదలైన కర్మమాత్ర పరిమితములను ప్రశ్నిస్తూ ఉపనిషత్తులను పునరుద్ధరింపజేయుచున్నారు. సర్వజనులకు రక్షణ కల్పిస్తున్నారు. వైష్ణవ ధర్మములను విజృంభింపజేస్తూ పాషండమతములను జల్లెడపట్టుచున్నారు. (పరమాత్మను అన్యునిగా నమ్మచూపు వాదోపవాదములను, **"జీవాత్మ మాత్రమేవాఽహమ్"** – పరిమిత భావములను – **"పాషండము"** అని ఇక్కడ ఉద్దేశ్యము.

## పరమాత్మ!

- అట్టి పరమాత్మయే సమస్త జగత్తుకు అంతర్యామి। పరమాత్మయే శ్రీకృష్ణ–ప్రకృతిగత రూపధారుడై జగద్గురువుగా విలసిల్లుచున్నారు.
- స ఏష సర్వాత్మకః। ఆయన సర్వజీవుల ఆత్మస్వరూపుడు. సర్వాత్మకుడు.
- ముముక్షువులందరికీ ఆ సర్వాత్మకుడగు భగవానుడే ధ్యేయవస్తువు.
- ఆయనయే జీవులకు సమస్త బంధములను తొలగించు మోక్షప్రదాత। (తరతి శోకమ్ ఆత్మవిత్).
- అట్టి పరమాత్మయే, పరాత్పరుడే–**ముముక్షు–ధ్యేయస్వరూపుడు**. మోక్షప్రదాత. సర్వాంతర్యామి అగు ఆ పరమాత్మను స్మరిస్తూ ఉండగా ఈ జీవుడు సర్వపాపకర్మల నుండి, దోష దృష్టులనుండి విముక్తుడు కాగలడు. **ఏతం స్మృత్వా సర్వేభ్యః పాపేభ్యో ముచ్యతే।**
- **తన్నామ సంకీర్తయన్ విష్ణు సాయుజ్యం గచ్ఛతి।** అట్టి పరమాత్మను సంకీర్తనము చేయుచుండగా ఈ జీవుడు విష్ణుసాయుజ్యము **(సర్వత్రా సర్వదా స్వాత్మయగు విష్ణు సందర్శనము)** పొందగలడు. **'విష్ణుతత్త్వ జ్ఞాని', "విష్ణు సోఽహమ్ స్వానుభవి"** కాగలడు.

## ఫలశ్రుతి

**అట్టి శ్రీకృష్ణ పరబ్రహ్మముయొక్క స్మరణ – కీర్తనలచే,**

పగలు స్మరణచే రాత్రి పాపములు తొలగగలవు. రాత్రి స్మరణచే – పగలు పాపములు ప్రక్షాళనమవుతాయి.

మనము ఈ ఉపనిషత్తులో చెప్పుకొన్న వేదోపనిషత్ రహస్యము యొక్క అధ్యయన – ఉపాసనలచే సర్వక్రతువులు చేసిన ఫలము లభించగలదు.

మనశ్శుద్ధి, మనశ్శాంతి లభించగలదు.

సర్వతీర్థముల స్నానఫలం పొందగలరు.

ఇందలి తత్త్వము తెలుసుకోవటంచేత "దేహబంధము" (ఈ దేహమే నాకు బంధము – అను స్వయంకల్పిత భావన) నుండి విముక్తుడు కాగలడు.

**ఇతి శ్రీకృష్ణోపపనిషత్**
**ఓం శాంతిః శాంతిః శాంతిః**

అథర్వణ వేదాంతర్గత

# 6(I) గోపాల పూర్వ తాపిన్యుపనిషత్

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ గోపాలతాపనం కృష్ణం యాజ్ఞవల్క్యం వరాహకం
శాట్యాయని హయగ్రీవం దత్తాత్రేయం చ గారుడం॥

గోపాల తాపనము (బృందావనము)నకు, కృష్ణునికి యజ్ఞవల్క్యునికి వరాహస్వామికి, శాట్యాయనునికి, హయగ్రీవులవారికి, దత్తాత్రేయులవారికి, గరుడ దేవునికి, ఉపనిషత్ అర్థసిద్ధికై – నమస్కారము.



భక్తి, యోగ-ధ్యాన-ముక్తి ప్రదాతలగు (1) గోపాల తాపినీ (2) కృష్ణ (3) యజ్ఞవల్క్య (4) వరాహక (5) శాట్యాయని (6) హయగ్రీవ (7) దత్తాత్రేయ (8) గరుడ-ఉపనిషత్ మాతలకు నమస్కారము.

ఈ '8' ఉపనిషత్తులు శ్రీకృష్ణపరమాత్మయొక్క అష్టభార్యలుగా - "స్తుతి"॥

## శాంతి పాఠము

శ్లో॥ ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః।
భద్రం పశ్యేమ అక్షభిః యజత్రాః
స్థిరైః అంగైః తుష్టువాగ్ంసః తనూభిః।
వ్యశేమ దేవహితం యత్ ఆయుః।
స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః।
స్వస్తి నః పూషా విశ్వవేదాః।
స్వస్తి నః తార్క్ష్యో అరిష్టనేమిః।
స్వస్తి నో బృహస్పతిః దధాతు॥

ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥

*ఓ దేవతలారా! మేము జ్ఞానప్రకాశయుక్తులమై, ఈ చెవులతో భద్రమగు ఆత్మసంబంధిత విశేషములనే వినెదముగాక। యజన–యాగదీక్షాపరులమగు మేము శుభప్రదమైన ఆత్మ విశేషమునే చూచుచుండెదముగాక!*

*స్థిరమైన, బలముతో కూడిన అంగములతో స్వస్థితి – ఆరోగ్యము కలిగియున్నవారమై ఇంద్రియ ప్రజ్ఞా – సామర్థ్య ప్రదాతలగు మిమ్ములను స్తుతించుచూ, మాకు మీచే విధించబడిన ఆయుష్కాలము సద్వినియోగపరచుకొనెదము గాక।*

*సర్వజీవులకు – సర్వేంద్రియ నియామకుడు, ఇంద్రియశక్తులను ప్రసాదించువారు, ఈ ఇంద్రియములకు కనిపిస్తున్న జగత్తులకు మునుముందే ఉండి ఉన్నట్టివారు, దివ్యప్రజ్ఞా చైతన్యమూర్తి, సూక్ష్మగ్రాహ్యములగు పెద్ద చెవులు కలవారు – అగు **ఇంద్రభగవానుడు మాకు 'స్వస్తి' 'శుభము' 'శాంతము' 'ఆనందము'లను కరుణతో ప్రసాదించెదరు గాక!***

*ఈ విశ్వరహస్యమగు విశ్వేశ్వరుని తత్త్వము ఎరిగిన విశ్వవేదులగు పూషుడు (సూర్యభగవానుడు) మాకు స్వస్తి - శుభమును ప్రసాదించెదరు గాక! మిక్కిలి వేగము గలవారు, వాయువేగ సమన్వితులు అగు తార్క్ష్యుడు (గరుడ భగవానుడు (లేక) వాయుదేవుడు) మాలోని ఆధ్యాత్మిక సంబంధమైన అరిష్టములను, దోషములను, అడ్డంకులను తొలగించి, మాపట్ల - శుభప్రదాత అయ్యెదరు గాక! మాకు స్వస్తి ప్రసాదించెదరు గాక!*

*బుద్ధికి పరాకాష్ఠ, దేవతల గురువు అగు శ్రీ బృహస్పతులవారు మాకు* ***సునిశితము, నిర్మలము, ప్రశాంతము, విస్తారము*** *అగు బుద్ధిని ప్రసాదించి మాకు స్వస్తిని అనుగ్రహించెదరు గాక!*

**ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥**

(మాయొక్క ఆధిభౌతిక (Matter Related), ఆధిదైవిక (Incidents Related), ఆధ్యాత్మిక (Self Impressions Related) తాపములు **ఆత్మానందము** నందు సశాంతించును గాక। మా జాగ్రత్ - స్వప్న - సుషుప్తులు కేవలాత్మ యందు లయమైయుండును గాక)

**శ్లో॥ శ్రీమత్ పంచపదాగారం స విశేషతయోజ్జ్వలమ్।**
**ప్రతియోగి వినిర్ముక్తం నిర్విశేషం హరిం భజేత్॥**

(జాగ్రత్-స్వప్న-సుషుప్తి-తురీయములకు ఆవలిదగు) **పంచమపద - తురీయాతీత సాక్షీస్థానము తనదైనవారు, సమస్త జగత్ - విశేషములుగా ప్రకాశించువారు,** వాదోపవాదములకు **పట్టుబడనివారు,** సమస్త విశేషములకు ఆవల **నిర్విశేషులై ఉన్నవారు** - అగు **శ్రీహరిని భజించుచున్నాను. స్తుతించుచున్నాను.**

-----



## కూచిపూడి భాగవతుల (నృత్య సంబంధమైన) రాజగోపాలస్తుతి। (శ్రీ సిద్ధేంద్రయోగి విరచితము)



**సౌరాష్ట్ర - ఆదితాళమ్**

**రాజగోపాలం - రాధాలోలం**
**రాజగోపాలం - భజే మమజీవనం**
**రాధా లోలం భజే । మమ జీవనం రాధా లోలంభజే॥ రాజ॥**

**అ॥వ॥ అఖిలాండ కోటి - బ్రహ్మాండనాయకం**
**రాజగోపాలం భజే, మమ జీవనం**
**రాధా లోలం భజే॥ మమ జీవనం - రాధాలోలం భజే॥**

(1) శృంగార మోహనం - మంగళ ప్రదాయకం। ॥రాజగోపాలం భజే॥
(2) చాణూరమర్దనం - సాధులోక పాలనం। ॥రాజగోపాలం భజే॥
(3) నీలమేఘశ్యామలం - బాలనీలకోమలం। ॥రాజగోపాలం భజే॥
(4) అక్రూర వరదం - శక్రాది వినుతం। ॥రాజగోపాలం భజే॥
(5) నందగోప నందనం - నవనీత చోరకం। ॥రాజగోపాలం భజే॥
(6) బర్హే బర్హే కౌస్తుభం - పద్మపత్ర లోచనం। ॥రాజగోపాలం భజే॥
(7) పూతనాది భంజనం - పురుహూత వందితం। ॥రాజగోపాలం భజే॥
(8) సిద్ధేంద్ర విరచితం - శ్రీపతి కామితం। ॥రాజగోపాలం భజే॥

**రాజగోపాలంభజే మమ జీవనం। రాధా లోలంభజే॥**

## కూచిపూడి నృత్యాంతర్గత కైవారములు
## (సిద్ధేంద్ర విరచిత - భామాకలాపము)

(1) శ్రీమత్ సకల గీర్వాణ సంస్థూయమాన -
అనంత శుభచరితా। - పరాకు । బహుపరాకు॥



(2) సదానంద సందోహ - సనక సనందనాది
మునివర - భ్రమర బృంద ఝుంకార
రంజిత పాదకమలా। - పరాకు। బహుపరాకు॥

(3) మహాక్రూర కంసప్రయోగ విపడ్గాఢాభ్ర
జంఝూ ప్రభంజనా। - పరాకు। బహుపరాకు॥

(4) దుష్ట దైత్యేయ శిరః కందుకా ఖేలా। -
పరాకు। బహుపరాకు॥

(5) అనంతకోటి సూర్యప్రకాశ కిరీట
కుండలాలంకృతా। - పరాకు - బహుపరాకు॥

(6) కనక మణికుండల ద్యుతి ఛటాభోగ
గండభాగా। - పరాకు। బహుపరాకు॥

(7) కందర్పసుందరాకార విరాజితా।
పరాకు। బహుపరాకు॥



(8) శ్రీ లలితకళాసంస్థాన కూచిపూడి ఎస్టేటు
రాజా। శ్రీశ్రీశ్రీ రాజగోపాలా। - పరాకు। బహుపరాకు।

(9) రాధావధూటీ కఠిన కుచకుంభ
సంభరిత హస్తా। - పరాకు। బహుపరాకు॥

(10) దేవకీ గర్భ పయోధి సంపూర్ణ చంద్రోదయా।
పరాకు - బహుపరాకు॥

(11) యదు వంశ మూర్ధన్యా। శ్రీశ్రీశ్రీ రాజగోపాలా!
పరాకు - బహుపరాకు॥

**ఇక మనము (పూర్వ) గోపాల
తాపిన్యుపనిషత్‌లో ప్రవేశిస్తున్నాము**

| | |
|---|---|
| **1. ఓం। సచ్చిదానంద రూపాయ। కృష్ణాయ అక్లిష్టకారిణే<br>నమో వేదాంత వేద్యాయ। గురవే బుద్ధి సాక్షిణే॥**<br>**(వేదాంత వేద్యుడు** = One who is knowing the knower in all) | ఓం॥ సత్-చిత్-ఆనందస్వరూపులు, అక్లిష్టకారులు, (దుఃఖము, బాధ, కష్టములు తొలగించు స్వభావులు), వేదాంతములగు ఉపనిషత్ వాఙ్మయముచే తెలియబడువారు, జగద్రక్షకులు, సర్వజీవులలోని 'బుద్ధి'కి సాక్షి అయి వేంచేసి ఉన్నవారు, జగద్గురువులు - అగు శ్రీకృష్ణ పరబ్రహ్మమునకు - నమో నమో నమో నమః। |
| <u>మునయోఽహ వై బ్రాహ్మణమ్ ఊచుః :</u><br>**కః పరమో దేవః? కుతో మృత్యుః బిభేతి?<br>కస్య విజ్ఞానేన అఖిలం విజ్ఞాతం భవతి?<br>కేన ఇదం విశ్వం సగ్ంసరతి-ఇతి?** | మునులు : ఓ ఆత్మతత్త్వజ్ఞులగు బ్రహ్మభగవాన్! **దేవతలకే దేవుడు, దేవాది దేవుడు, మీకు కూడా దేవుడు, పరమో దేవుడు ఎవరు?**<br>ఈ జీవులగు మేమంతా మృత్యువును చూచి భయపడుతూ ఉండగా, **మృత్యువు ఎవ్వరిని చూచి భయము పొందుతోంది?**<br>జీవులకు 'అమృతప్రదాత' ఎవరు?<br>ఎవ్వరి గురించి తెలుసుకొన్న తరువాత, ఇక ఆపై ఈ సమస్త దృశ్యము యొక్క, 14 లోకముల యొక్క, జన్మ-కర్మలయొక్క **ఆను-పానులేమిటో** తెలిసిపోతాయి?<br>ఈ విశ్వమంతటినీ ఇంతటి విధి విధానంగా, చమత్కారంగా నడుపుచున్న నావికుడు ఎవరు? |
| <u>**తదు హోవాచ బ్రాహ్మణః :**</u><br>**కృష్ణో వై పరమం దైవతమ్।<br>"గోవిందాత్" మృత్యుః బిభేతి।<br>"గోపీజనవల్లభ" జ్ఞానేన ఏతత్ విజ్ఞాతం భవతి।<br>"స్వాహా" ఇదగ్ం విశ్వగ్ం సగ్ంసరతీతి॥** | బ్రహ్మజ్ఞుడగు బ్రహ్మదేవుడు : సర్వాత్మకుడగు శ్రీకృష్ణ భగవానుడే దేవాది దేవుడు. ఆ గోవిందునికి మృత్యువు కూడా భయపడుతుంది. నేను ఎల్లప్పుడు అట్టి **శ్రీకృష్ణచైతన్య తత్త్వము**నే ఉపాసిస్తున్నాను.<br>**గోపీజనవల్లభాయ** : గోపీజన వల్లభుని గురించిన జ్ఞానముచే దృశ్యజగత్తు, జీవాత్మల రాకపోకలతో సహా ఈ సమస్తము **'తెలియబడునది'** (Wet known) అవగలదు.<br>స్వాహా: 'స్వాహా' (స్వ-అహ, సోఽహమ్) చేతనే ఈ విశ్వమంతా నడిపించ బడుతోంది. |
| <u>**తదుహోచుః!। (తదు హ ఊచుః):**</u><br>**కః కృష్ణః? గోవిందశ్చ కోసావితి?<br>గోపీజనవల్లభశ్చ కః?<br>కా స్వాహా - ఇతి?** | మునులు : ఈ కృష్ణుడు ఎవరు? ఎందుకు 'గోవిందుడు ' అని పిలుస్తున్నాము? గోపీజన-వల్లభుడు ఎవరు? 'స్వాహా' - అనగా ఏమిటి? **మరికొంత వివరించండి?** |
| <u>**తానువాచ బ్రాహ్మణః :**</u><br>**పాపకర్షణో గోభూమి వేదవిదితో<br>గోపీజన విద్యా కలాపీ। ప్రేరకః।<br>తత్ మాయా చ ఇతి।<br>సకలం పరబ్రహ్మైవ తత్॥** | **హిరణ్యగర్భుడు (బ్రహ్మదేవులవారు)** : మునులారా! శ్రీకృష్ణ భగవానుని ఆశ్రయించినంత మాత్రంచేతనే - ఈ జీవుల సమస్త పాపకర్మల ఆకర్షణను తొలగించుకోగలరు. ఆయన వేదములకే జననస్థానమగు గోభూమిని ఏలువాడు. వేదవిదితులు. (జగత్తులన్నిటికీ జననస్థానముగా కలవారు) శ్రీకృష్ణుడు. గోపీజనుల జీవన్-బ్రహ్మైక్య విద్యయందు - అటు, ఇటు కూడా క్రీడించువారు. ఈ జగత్తులోని అణువణువును ప్రేరేపించు చైతన్యస్ఫూర్తి. ఈ జగద్దృశ్యమంతా ఆయన మాయయే! ఇదంతా కూడా ఆ శ్రీకృష్ణ చైతన్య-పరబ్రహ్మతత్త్వమే। |
| **యో ధ్యాయతి రసతి భజతి,<br>సోఽమృతో భవతి-ఇతి॥<br>(సో అమృతో భవతి - ఇతి)।** | అట్టి కృష్ణపరమాత్మను ఎవరు ధ్యానిస్తారో, ఇదంతా కృష్ణ చైతన్యస్వరూపంగా రసాస్వాదన చేస్తారో, ఈ విశ్వమంతా కృష్ణతత్త్వముగా భజిస్తారో, అట్టివాడు మార్పు - చేర్పులతో కూడిన మృత్యుపరిధిని దాటివేసి - **అమృతస్వరూపుడు** కాగలడు. **"జన్మ-మృత్యువులకు ఆవల నేను సర్వదా యథాతథంగా కృష్ణ చైతన్యానంద స్వరూపుడను"** అని గమనిస్తూ తన్మయుడై ఉండగలడు. |
| <u>**తేహోచుః : (తే హ ఊచుః) :**</u><br>**కిం తత్ రూపం? కిగ్ం రసనం?<br>కిమాహో తద్భజనమ్? (కిమ అహో తత్ భజనమ్)?<br>తత్సర్వం వివిదిషతామ్ ఆఖ్యాహి। ఇతి॥** | మునులు : హే బ్రహ్మజ్ఞా! ఆ కృష్ణ చైతన్యభగవానుని రూపము ఏమిటి? ఆయన రసతత్త్వము ఎట్టిది? 'ఆయనను భజించటము' అనగా ఏమి? ఎట్లా? ఇదంతా తెలుసుకోవాలనే ఉత్సుకత మాయందు పొంగిపొరలుతోంది. స్వామీ! దయచేసి వివరించి చెప్పండి. |

| | |
|---|---|
| **తదు హో వాచ :**<br>**హైరణ్యో। గోపవేషమ్।**<br>**అభ్రాభం తరుణం।**<br>**కల్పద్రుమాశ్రితం॥ -**<br>**తదిహ శ్లోకా భవంతి।** | హిరణ్యగర్భుడు : బంగారు ఆభరణములన్నిటికీ బంగారమే అధిష్ఠానము కదా! అట్లాగే ఈ సమస్త సృష్టికి, ఇందలి సమస్త జీవులకు శ్రీకృష్ణ పరమాత్మయే హిరణ్మయుడు. ఆయనయే లీలామానుషంగా గోపాలబాల వేషధారుడు కూడా. వారు-వర్షధారలు ప్రసాదించి భూమిని సేద్యవంతము చేయు మేఘమువంటివారు. జీవులపై అమృతధారలు కురిపించువారు. కాలమునకు ఆవలివారు కాబట్టి - తరుణుడు (నిత్యయౌవనుడు). జీవులను తరింప జేయువారు. కల్పవృక్షమును ఆశ్రయించి ఉన్నవారు. ఇట్టి **'కృష్ణతత్త్వవర్ణన'**ను గురించి ఇంకా గానం చేస్తూ శ్లోకములు చెప్పబడు చున్నాయి (శ్లోకించబడుతోంది). |
| **సత్పుండరీక నయనం**<br>**మేఘాభం వైద్యుతాంబరం।**<br>**ద్విభుజం। జ్ఞాన ముద్రాఢ్యం**<br>**వనమాలినమ్ ఈశ్వరమ్॥**<br>**గోపగోపీ గవావీతగ్ం**<br>**సురద్రుమతల (లత) ఆశ్రయమ్॥** | - పుండరీకాక్షుడు. తెల్లటితామరపూవులవంటి కనులతో ప్రకాశించువారు. కేవలమగు సత్-చిత్ ఆనంద దృష్టి సంపన్నులు.<br>- మేఘపు మెరుపులవంటి వస్త్రములు ధరించినవారు. జగత్తులను అలంకార వస్త్రములుగా ధరించినవారు.<br>- (యోగ - జ్ఞానములను) రెండు భుజములుగా కలవారు.<br>- (చిన్ముద్ర 'తత్త్వమ్‌అసి' అను రూపముగల) జ్ఞానముద్రను సదా ధరించినవారు. 'సాక్షాత్ తత్ త్వమ్ అసి'' అను బోధతో సంభాషించువారు.<br>- వనమాలను ధరించినవారు. 'బ్రహ్మాండములు' అనే వనమును పాలించువారు. సమస్త జీవులను పుష్పమాలవలె ధరించుచున్నవారు.<br>- సమస్తమును నియామకము చేయు ఈశ్వరులు. సమస్తమునందు సమస్తముగా విస్తరించి ఉన్నవారు.<br>- గోప-గోపీజనమధ్యగా విరాజిల్లువారు. ఆశ్రిత జనులతో (వ్రజగోపికలతో) - ఆత్మానందము అనే బృందావన/ఉపనిషత్ వనములో విహరించువారు.<br>- భక్తుల పాలిటి కల్పవృక్షమై సమస్తము ప్రసాదించువారు. |
| **దివ్యాలంకరణోపేతం।**<br>**రత్న పంకజ మధ్యగమ్।** | - దివ్యమైన ఆభరణములు ధరించినవారు. దివ్యత్వము ప్రదర్శించువారు.<br>- రత్నమధ్యగా (విశ్వమునకు నాభి అయి) వేంచేసియున్నవారు. |
| **కాళిన్దీ జల కల్లోల సంగి,**<br>**మారుత సేవితమ్।**<br>**చింతయన్ చేతసా కృష్ణం**<br>**ముక్తో భవతి సంసృతేః। ఇతి॥** | - కాళిందీ నదిలోని తరంగములను తాకుతూ వస్తున్న పిల్లగాలులను ఆస్వాదించువారు.<br>అట్టి శ్రీకృష్ణ రూపమును మనస్సుతో చింతన చేయువాడు **సమస్త సంసార బంధములనుండి విముక్తుడు కాగలడు.** |
| **2. తస్య పునా రసనమ్ ఇతి -**<br>**జల భూమి ఇందు సంపాతకామాది।**<br>**'కృష్ణాయ' ఇతి ఏకం పదం।**<br>**'గోవిందాయ' ఇతి ద్వితీయం।**<br>**'గోపీజన' ఇతి తృతీయం।**<br>**'వల్లభాయ' ఇతి తురీయగ్ం।**<br>**'స్వాహా' ఇతి పంచమమ్। ॥ఇతి॥** | ఇంకా కృష్ణ **"నామామృత-తత్త్వామృత"** రసము ఈ విధమైనది. ఆయన రస స్వరూపమే జలమునందు, భూమియందు, చంద్రునియందు, పక్షులయందు, సర్వజీవులందు, వారి ఆశ్రయములందు విస్తరించి ఉన్నది. ఆయనయే **విశ్వరస స్వరూపుడు.**<br>**కృష్ణతత్త్వ మనన-స్తుతి మంత్రము**<br>**'కృష్ణాయ'** - ఇది మొదటి పదము.<br>**'గోవిందాయ'** - ఇది రెండవ పదము.<br>**'గోపీజన'** - ఇది మూడవ పదము.<br>**'వల్లభాయ'** - ఇది తురీయము. (చతురీయము - నాలుగవ పదము)<br>**'స్వాహా'** - ఇది ఐదవ పదము (తురీయాతీతము).<br>**- 'ఓం'తో కలిపి - అష్టాదశాక్షరీ -** |

| | |
|---|---|
| **పంచపదం జపన్ - పంచ అంగమ్**<br>**ద్యావా భూమీ సూర్యా చంద్రమసౌ**<br>**తత్ రూపతయా**<br>**బ్రహ్మ సంపద్యతే।**<br>**బ్రహ్మసంపద్యత ఇతి॥**<br>**తత్ ఏష శ్లోకః॥** | ఈ పంచ-అంగములను 'పంచపదమంత్రము'గా జపిస్తూ "ఆకాశము, భూమి, సూర్యుడు, చంద్రమసము (చంద్రబింబము) - ఇవన్నీ శ్రీకృష్ణబ్రహ్మస్వరూపమే" - అను భావన, ఉపాసనలచే - **బ్రహ్మమును ఎరిగినవాడై ఈ జీవుడు బ్రహ్మమే అగుచున్నాడు.**<br>ఇంకా ఈ విధంగా శ్లోకయుక్తంగా గానం చేయబడుతోంది. |
| **3. 'క్లీం' ఇతి ఏతత్ ఆదావాదాయ**<br>**"కృష్ణాయ గోవిందాయ గోపీజన వల్లభాయేతి"**<br>**బృహత్ భానవ్యా (భావవ్యా)**<br>**సకృత్ ఉచ్చరేత్॥** | "క్లీం" అని మొదటగా మధ్యమ స్వరంతో ప్రారంభము చేసి, అప్పుడు **"కృష్ణాయ గోవిందాయ గోపీజన వల్లభాయ"** అను బృహత్ ప్రదర్శనముగా పలుకుచూ, ఒక్కసారిగా 'స్వాహా' అని (పై స్వరంగా) ఉచ్చరించాలి.<br>**("క్లీం" కృష్ణాయ గోవిందాయ గోపీజనవల్లభాయ స్వాహా")** |
| **యోఽసౌ గతిః తస్య అస్తి**<br>**మంక్షు నాన్యాగతి (న అన్యాగతి)స్య**<br>**అస్యాత్ ఇతి భక్తిరస్య**<br>**భజనం తత్ ఇహ-ఆముత్ర**<br>**ఉపాధి నైరాశ్యేన**<br>**ఆముష్మిన్ మనః కల్పనమ్॥** | ఏ స్థితి-గతిలో ఉన్నప్పుడైనా కూడా పైన చెప్పిన అష్టాదశాక్షరమంత్రము పఠించెదరుగాక। **"ఇక దేనినీ ఆశ్రయించవలసిన పనిలేదు. వేరే గతి లేదు"** - అని నమ్మి భక్తితో ఈ మంత్రమును అభ్యాసం చేయుదురుగాక. భూలోకంలో లభించే ఇహ ఫలముల పట్ల, 'స్వర్గలోకము' మొదలైన ఆముష్మిక ఫలములపట్ల కూడా నైరాస్యము వహించి, నిష్కామంగా పై కృష్ణమంత్రమును జపించెదరుగాక! మనఃకల్పనలన్నీ జయించి, మనస్సును కేవలాత్మస్వరూపమగు కృష్ణతత్త్వమువైపుగా మాత్రమే నియమించండి. |
| **ఏతదేవ చ "నైష్కర్మ్యమ్"॥** | ఇదియే నైష్కర్మ్యస్థితి. 'నాకు ఇది కావాలి' అని కోరకుండా మంత్రమును జపించువానికి ఏది కావాలో అది పరమాత్మయగు శ్రీకృష్ణులవారు ప్రసాదించగలరు. (అడిగినవారికి అడిగినది, అడగనివారి 'కావలసినది' - ప్రసాదించువారు). |
| **'కృష్ణం' తం విప్రా**<br>**బహుధా యజంతి।** | వేద-ఉపనిషత్‌ల హృదయము తెలిసిన విప్రులు - శ్రీకృష్ణపరమాత్మను అనేక విధాలుగా (సహస్రనామములతో, తాత్త్విక వివరణలతో, శ్రీకృష్ణ బాల్యలీలల ఆధ్యాత్మికార్థములతో) స్తుతిస్తున్నారు. |
| **'గోవిందగ్ం' సంతం**<br>**బహుధా ఆరాధయంతి।**<br>**'గోపీజన వల్లభో' భువనాని దధ్రే।**<br>**'స్వాహా' శ్రీతోజగద్దైజత్సు రేతాః।**<br>**('స్వాహా' ఇతోజగత్ ఐజత్ సురేతాః)** | సంతలు (మహర్షులు) ఆ పరమాత్మను గోవిందా మొదలైన పేర్లతో బహువిధములుగా ఆరాధిస్తూ ఉన్నారు. "గోవిందా! గోవిందా! గోవిందా!" అని పలుకుచు బంధములను అధిగమిస్తున్నారు.<br>ఆ గోపీజన వల్లభుడే సమస్త భువనములను ఆభరణములవలె ధరించు బ్రహ్మానందమయులు, 'స్వాహా' అను శ్రీ (సిరి) శబ్దము ఆయన జగత్తులను వృద్ధి చేయు చమత్కారము. ఈ శబ్దము సమస్త సంపదలకు ఆలవాలము. |
| **వాయుః యథా ఏకో భువనం ప్రవిష్టో**<br>**జన్యే జన్యే పంచరూపో బభూవ, -**<br>**కృష్ణః తథా ఏకోఽపి జగద్ధితార్థగ్ం (జగత్ హితార్థగ్ం)**<br>**శబ్దేన అసౌ పంచపదో విభాతి - ఇతి॥** | వాయువు సర్వదా 'ఒక్కటే అయి ఉండి కూడా భూమిపై ప్రవేశించి ప్రతి ప్రాణియందు (ప్రాణ అపాన వ్యాన ఉదాన సమాన) పంచప్రాణముల రూపము ఏ విధంగా వహిస్తోందో, (అదేవిధంగా) **శ్రీకృష్ణ భగవానుడు తాను ఏకమే అయి ఉండి, ఈ జగత్ నిర్మాణము కొరకై శబ్ద స్పర్శ రూప రస గంధములుగా, పంచపదములుగా** (దృశ్యము, దేహములు, ఇంద్రియములు, జీవుడు, ఈశ్వరుడుగా), పంచభూతములుగా ప్రకాశిస్తున్నారు. |

| | |
|---|---|
| **<u>తే హ ఊచు (తే హోచు) :</u>**<br>**ఉపాసనమ్ ఏతస్య పరమాత్మనో గోవిందస్య**<br>**అఖిలాధారిణో బ్రూహి ।ఇతి।** | మునులు : హే బ్రహ్మన్! అట్టి - ఈ సమస్తము తానే ధారణ చేస్తున్న పరమాత్మ అగు గోవిందుని ఉపాసనా విధానము దయచేసి వివరించండి. |
| **<u>తానువాచ (తాన్ ఉవాచ) :</u>**<br>**యత్తస్య పీఠగ్ం హైరణ్యాష్ట పలాశమంబుజం**<br>**తదంతరాళిక అనల అస్త్రయుగం।**<br>**తదంతరాళాత్‌వర్ణాఖిల బీజం।**<br>**'కృష్ణాయ నమ' ఇతి బీజ-ఆద్యగ్ం।**<br>**స బ్రహ్మాణమ్ ఆదాయ**<br>**అనంగ-గాయత్రీం యథావత్ వ్యాలిఖ్యా**<br>**భూమండలగ్ం శూలవేష్టితం కృత్వానం।** | బ్రహ్మభగవానుడు : ఆ గోవిందుని యొక్క పీఠము హిరణ్మయమైనది. అష్టదళ పద్మము. అట్టి పద్మముయొక్క అంతరాళముగా అనలాస్త్ర (అగ్ని) యుగము. అట్టి అగ్నిశిఖయందు - సమస్తము యొక్క బీజము (విశ్వబీజము). అంతరాళమున "కృష్ణాయనమః" - అను అఖిలవర్ణ బీజము. అట్టి కృష్ణాయనమః తత్త్వమునందు -<br>- బ్రహ్మతో కూడిన "అనంగగాయత్రి"ని లిఖించాలి.<br>- భూమండలమును శూలవేష్టితము (శూలముపై ఉన్నట్లు)గా భావించి,<br>**(అనంగ గాయత్రి =**<br>**శ్రీకృష్ణాయ విద్మహే, గోవిందాయ ధీమహి।**<br>**తన్నో గోపీజనవల్లభాయ ప్రచోదయాత్॥)** |
| **వాసుదేవాది, రుక్మిణ్యాది**<br>**స్వశక్తిం, నందాది, వసుదేవాది,**<br>**పార్థాది, నిధ్యాదివీతం**<br>**యజేత్ సంధ్యాసు**<br>**ప్రతిపత్తిభిః ఉపచారైః**<br>**తేన అస్య అఖిలం భవతి।**<br>**అఖిలం భవతీతి॥**<br>**<u>తత్ ఇహి శ్లోకా భవంతి॥</u>** | - అట్టి అంతరహృదయ బీజములో రుక్మిణీసమేత వాసుదేవుని స్వశక్తిని ఆహ్వానించాలి.<br>నంద, వాసుదేవ, పార్థ, నిధి (లక్ష్మీ / రుక్మిణీ) సహితంగా ఆ మూలశక్తిని ఉపాసించాలి.<br>- ఉదయ - మధ్యాహ్న - సాయంత్ర సంధ్యలతో వాసుదేవ, రుక్మిణీ , నంద, పార్థ, వసుదేవ, నిధి-ఆదిశక్తికి ప్రపత్తులు సమర్పించాలి.<br>- షోడశోపచారములతో పూజించాలి.<br>అట్టి ఉపాసనచే సమస్తము లభించగలదు. అట్టి వాసుదేవోపాసన గురించి ఇంకా ఈ విధంగా శ్లోకములు ఉన్నాయి. |
| **4. ఏకో వశీ సర్వగః కృష్ణ ఈడ్య**<br>**ఏకోఽ పిసన్ బహుధా యో విభాతి,**<br>**తం పీఠగం యోఽ ను భజంతి ధీరాః**<br>**తేషాగ్ం సిద్ధిః శాశ్వతీ।**<br>**నేతరేషామ్॥ (న ఇతరేషామ్)॥** | ఏకస్వరూపుడు, సమస్తమునందు వశించువాడు, సర్వగతుడు - అగు కృష్ణుడే స్తుతింపతగినవాడు.<br>ఎవ్వరైతే - ఏకమే అయి ఉండి కూడా, అనేకముగా ప్రదర్శనమగుచున్నారో, అట్టి శ్రీకృష్ణ భగవానుని ఏ ధీరుడైతే హృదయ పీఠమునందు ప్రతిష్ఠించి ఎల్లప్పుడూ భజిస్తూ, స్తుతిస్తూ ఉంటాడో - అట్టి అనన్యోపాసకుడు శాశ్వతమగు ఆత్మతత్త్వమును సిద్ధించుకోగలడు. అన్య దేవతా ఉపాసకులు శాశ్వత బ్రహ్మమును సిద్ధించుకోలేరు. |
| **నిత్యో నిత్యానాం, చేతనః చేతనానామ్**<br>**ఏకో బహూనాం**<br>**యో విదధాతి కామాన్,**<br>**తం పీఠగం యేఽనుభజంతి ధీరాః**<br>**తేషాగ్ం సుఖగ్ం శాశ్వతం।**<br>**నేతరేషామ్॥ (న ఇతరేషామ్)॥** | నిత్యమైనదానిలో నిత్యుడు, కదలికలన్నిటిలో కదిలించువాడు, ఏకమే అయి కూడా అనేకముగా ప్రదర్శనమగువాడు, సర్వజీవుల కోరికలు సిద్ధింపజేయువాడు - అగు ఆ శ్రీకృష్ణభగవానుని, గోపాలకృష్ణుని ఏ ధీరులైతే (తెలివిగలవారైతే) తమ హృదయపీఠమునందు ప్రతిక్షేపించుకొని భజిస్తూ ఉంటారో - అట్టి వారి సుఖమే శాశ్వతము. తక్కినవారి సుఖము శాశ్వతమైనది కాదు. (సందర్భములకు పరిమితమైనది మాత్రమే). |

| | |
|---|---|
| ఏతత్ విష్ణోః పరమం పదమ్<br>యే నిత్యా ఉద్యుక్తాః తం యజంతే,<br>న (స) కామాత్, తేషామ్ అసౌ గోపరూపః ప్రయత్నాత్,<br>ప్రకాశయేత్ ఆత్మపదం తదేవ। | ఎవరైతే అట్టి విష్ణు పరమపదమునకు నిత్యము ఉద్యుక్తులై, సమస్త బాహ్యమైన కోరికలను త్యజించి, ఆ **'శ్రీకృష్ణ చైతన్యతత్త్వము'**నందే కామము, (విరహము) కలిగి ఉంటారో, అట్టి ప్రయత్నశీలురు గోపరూపులగుచున్నారు. వారికి ఆత్మపదము స్వకీయముగా ప్రకాశమానము అవగలదు. (గోపము = ఆత్మభావనను రక్షించుకొంటూ ఉండటము). |
| యో బ్రహ్మాణం విదధాతి పూర్వం,<br>యో విద్యాం తస్మై గోపయతిస్మ కృష్ణః,<br>తగ్ం హ దేవమ్ ఆత్మబుద్ధి ప్రకాశం -<br>ముముక్షుః శరణం వ్రజేత్॥ | ఏ పరమాత్మ - సృష్టికర్తయగు బ్రహ్మదేవుని కూడా సృష్టికి పూర్వమే సృష్టికొరకై సృష్టించినవారై యున్నారో, ఏ కృష్ణ భగవానుడైతే వేదములకు, బ్రహ్మవిద్యకు రక్షకులై యున్నారో - అట్టి ఆత్మదేవుడు బుద్ధికి ప్రకాశమానుడవటానికి ఏది ఉపాయం? 'ముముక్షువు' (మోక్షార్థి) అయి, ఆ గోపాలకృష్ణుని శరణు వేడటమే ఉపాయము. వేరే ఉపాయం లేదు. |
| 'ఓం'కారేణ అంతరితం యే జపంతి,<br>గోవిందస్య పంచపదం మనుమ్,<br>తేషామ్ అసౌ దర్శయేత్ ఆత్మరూపం।<br>తస్మాత్ ముముక్షుః అభ్యసేత్ నిత్య శాంత్యై॥<br>ఏతస్మా ఏవ పంచపదా అభూవన్<br>గోవిందస్య మనవో మానవానామ్॥ | 'ఓం' కారార్థమై యున్న గోవిందపంచమంత్రము **(క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీజనవల్లభాయ స్వాహా)**ను ఎవ్వరు ఎల్లవేళల జపిస్తూ ఉంటారో, వారికి ఆత్మరూపము సులభముగా దర్శనమవగలదు. అందుచేత ఈ జీవులు మోక్షేచ్ఛగల ముముక్షువులై గోవింద పంచమంత్రమును జపించి, శాంతిని సముపార్జించుకొనెదరుగాక!<br>ఈ విధంగా గోవింద భగవానుని **పంచపదమననము** మానవులకు మననశీలమగు మహత్తర మంత్రరాజము. |
| **5.** దశార్ణాద్యాస్తేఽపి సంక్రందనాద్యైః<br>అభ్యస్యంతే భూతికామైః యథావత్।<br>తే పప్రచ్ఛుః। | **మునులు :** హే భగవాన్! "కోరికలన్నీ దాటివేసినట్టి (భూరికాములు) అగు సంక్రందనుడు (ఇంద్రుడు) మొదలైనవారు దశార్ణవ (దశాక్షర) మంత్రము **(గోపీజన వల్లభాయ నమః మంత్రమును)** జపించినవారై - కోరికలతో ఉపాసించి కోరికలే లేని వారయ్యారు" - అని (దృష్టాంతంగా) లోకప్రసిద్ధము. దయతో ఎట్లాగో వివరించండి. |
| <u>తదు హో వాచ :</u><br>బ్రహ్మసదనం చరతో మే<br>ధ్యాతః స్తుతః పరమేశ్వరః,<br>పదార్ధాంతే సోఽబుధ్యత -<br>కోపదేష్టా మే పురుషః పురస్తాత్ ఆవిర్బభూవ। | **బ్రహ్మభగవానుడు :** ఒకానొకప్పుడు నేను బ్రహ్మలోకములో సంచరిస్తూ పరమేశ్వర సందర్శనముకొరకై ధ్యాసగా (ధ్యానిస్తూ) స్తుతించసాగాను.<br>నాకు ఉపదేష్ట అగు ఆ పరమపురుషుడు పదార్థాంతంగా మేలుకొని నా బుద్ధికి ప్రత్యక్షమైనారు. పదార్థమునకు - (శక్తికి) ముందే ఉన్న ఆయన తత్త్వము నా బుద్ధికి అనుభవమవసాగింది. |
| తతః ప్రణతో, మయానుకూలేన హృదా<br>మహ్యమ్ అష్టాదశార్ణం<br>స్వరూపగ్ం సృష్టయే దత్వా, అంతర్హితః॥ | నేను ఆ జగన్నాధస్వామికి భక్తి - జ్ఞాన - వైరాగ్య పూర్వకంగా ప్రణతులు సమర్పించాను.<br>అప్పుడు నాకు వారు బ్రహ్మతత్త్వము అణుక్షణికంగాను, స్వాభావికంగాను, నిత్యానుభవమయే నిమిత్తంగా సాధనకొరకై **"అష్టాదశ వర్ణమంత్రము"**ను, అద్దాని **"స్వరూప మహత్మ్యము"**ను చెప్పి, సృష్టి సామర్థ్యము కొరకై ఉపదేశించి, అంతర్ధానమైనారు. |
| పునస్తే సిసృక్షుతో మే<br>ప్రాదురభూత తేషు అక్షరేషు।<br>విభజ్య <u>"భవిష్యత్ జగత్ రూపం"</u><br>ప్రకాశయన్। | "నేను సృష్టించాలి? మరి ఎట్లా" - అని తపన చెందుచుండగా, మరల ఆ పరమాత్మ నా ఎదురుగా, నేను ఉపాసిస్తున్న **"క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీజనవల్లభాయ స్వాహా"** అను అష్టాదశ (18) అక్షరములలో అక్షరస్వరూపులై (అష్టాదశపురాణ స్వరూపులై) బుద్ధియందు వికసితులైనారు.<br>ఆ పరమాత్మయొక్క సంకల్పానుసారంగా నాకు భవిష్య జగత్ స్వరూపము యొక్క విభజనము తెలియరాసాగింది. |

**తత్ (ఇహకాత్) ఆకాశాత్। ఆకాశాత్ పృథివీ।**
**అతో అగ్నిః బిందోః**
**ఇందుః తత్ సంపాతాత్**
**తత్ అర్క ఇతి**
**క్లీం కారాత్ – అజస్రం।**

ఆత్మ సంజ్ఞయగు 'క్లీం' - నుండి సమస్తము జనిస్తున్నాయి. మునుముందుగా ఆత్మనుండి ఆకాశము, ఆకాశము నుండి పృథివి. పృథివి నుండి అగ్ని, అగ్ని నుండి బిందువు, బిందువు నుండి ఇందువు (చంద్రుడు). తత్ సంపాతము వలన సూర్యుడు. **ఇతి "క్లీం" కారము!**

---

**కృష్ణాత్ ఆకాశం। ఖాత్ వాయుః।**
**ఉత్తరాత్ సురభీ విద్యాః।**
**ప్రాదుః ఆకర్ష మకార్షమ్ ఇతి।**
**తత్ ఉత్తరాత్ స్త్రీ – పుమాది భేదగ్ం।**
**సకలమ్ ఇదగ్ం। సకలమ్ ఇదమ్॥ ఇతి॥**

సృష్టికర్తనై ఇకప్పుడు, - కృష్ణ చైతన్యమునుండి ఆకాశము ఆకాశమునుండి వాయువు, వాయువు నుండి సురభి విద్య (సృష్టివిద్య) నిర్వర్తించ నారంభించాను.

అట్టి కృష్ణచైతన్యము కర్షక (కర్తృత్వ) కారణము, కర్తృత్వము లేనిది కూడా! కృష్ణ చైతన్యమే సమస్తమునకు కర్త అయి ఉండగా, అది దేనియొక్క కర్తృత్వము కాదు. (Independent by it self)

అట్టి ఆకర్షణ - సంకర్షణ తత్త్వము నుండి స్త్రీ - పురుష విశేషములతో కూడిన , ఈ అనేక భేదములుగా కనిపిస్తూ ఉన్న - ఈ కల్పనామాత్ర సృష్టి జనిస్తోంది.

---

**ఏతస్యైవ యజనే**
**చంద్రధ్వజో గత మోహమ్, –**
**ఆత్మానం వేదయతి।**
**'ఓం' కారాళికం మనుమ్ ఆవర్తయేత్**
**సంగ రహితోఽ అభ్యానత్।**

ఓ మునులారా! అట్టి కృష్ణచైతన్య - కేవలీతత్త్వమును "ఈ సమస్తము అదే'' - అని ఉపాసించండి. (దృష్టాంతంగా) చంద్రధ్వజుడు (మనో నిశ్చలుడు) మోహము తొలగగా, ఆత్మను ఎరుగుచున్నాడు. లోకములకు ఆత్మతత్త్వము తెలుపుచున్నాడు. లోకములన్నీ అతనికి ఆత్మస్వరూపమై స్వానుభవమగుచున్నాయి.

అట్టి 'ఓం'కార స్వరూపమగు కృష్ణతత్త్వమును సమస్త అసత్ విషయములతో సంగము రహితము చేసుకొంటూ, శ్రద్ధగా అనువర్తించాలి.

---

**తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యంతి సూరయః,**
**దివీవ చక్షుః ఆతతమ్। తస్మాత్ ఏనం నిత్యమ్ ఆవర్తయే।**
**నిత్యమ్ ఆవర్తయేత్ – ఇతి॥**

సంసార భావనలను జయించి, వశము చేసుకొన్న సూరులగు మహనీయులు (The Winners) - దివ్యమైన చక్షువులను (ఆత్మదృష్టిని) సంపాదించుకొని, ఈ సమస్త దృశ్యమును కృష్ణానందమయస్వరూపంగా నిత్యము దర్శిస్తూ అనుభూతము పొందుచూ, మమేకమగుచున్నారు.

---

**తదాహుః ఏకే – యస్య ప్రథమపదాత్ – 'భూమిః'।**
**ద్వితీయ పదాత్ – 'జలం'। తృతీయపదాత్ – 'తేజః'।**
**చతుర్థపదాత్ –'వాయుః'। చరమపదాత్ 'ఓం' ఇతి॥**
**వైష్ణవం పంచవ్యాహృతి మయం।**
**మంత్రం కృష్ణావభాసకం,**
**కైవల్యస్య సృత్యై సతతమ్ ఆవర్తయేత్॥**
**సతతమ్ ఆవర్తయేత్॥ ఇతి॥**

"క్లీం కృష్ణాయ గోవిందాయ, గోపీజనవల్లభాయ స్వాహా"॥ అను ఏకమగుకృష్ణతత్త్వమే - అనేకముగా అగుచూ ఉన్నది.

అద్దాని నుండి = ప్రథమ పదము - భూమి. రెండవ పదము - **జలము**. మూడవపదము - తేజస్సు. నాలుగవ పదము - **వాయువు**. ఆఖరిది - **ఆకాశము "ఓం"**।

ఈ ఐదుగా విస్తారమగుచున్నది. **'వైష్ణవము'** అనబడు ఈ పంచపద మంత్రము కృష్ణతత్త్వమును ప్రకాశింపజేసి **'కైవల్యము'** ప్రసాదించగలదు. అందుచేత ఈ పంచపద మంత్రమును పరమార్థపూర్వకంగా ఉపాసించెదరు గాక। ఉపాశ్రయించెదరు గాక।

---

**6. తత్ అత్ర గాథాః – యస్య ప్రథమ పదాత్ "భూమిః"।**
**ద్వితీయ పదాత్ – సలిల–ఉద్భవః।**
**తృతీయాత్ తేజః – ఉద్భూతం। చతుర్థాత్ గంధ వాహనః।**
**పంచమాత్ అంబరోత్పత్తిః।**
**తమేవ ఏకగ్ం సమభ్యసేత్॥**

**పై విషయము మహనీయులచే ఈవిధంగా చెప్పబడుతోంది.**

ప్రథమ పదము నుండి భూమి, రెండవ పదము నుండి సలిలము (నీరు/ జలము), మూడవ పదము నుండి తేజస్సు, నాలుగవ పదము నుండి గంధవాహనమగు **వాయువు**, ఐదవ పదము నుండి **ఆకాశము**.

అనుభవములు అనేకమైనప్పటికీ, 'అనుభవి' ఏకస్వరూపుడే।

ఆట్లాగే - ఇవన్నీ కూడా ఒకే కృష్ణతత్త్వమునుండి బయల్వెడలి, విశ్వరూపంగా ప్రదర్శనమగుచున్నాయి. అందుచేత ఈ సమస్త జగత్ దృశ్యమును ఏకమగు కృష్ణతత్త్వముగా, కృష్ణచైతన్య ప్రదర్శనంగా ఉపాసించెదరు గాక।

| | |
|---|---|
| **చంద్రధ్వజోఽ గమత్ విష్ణోః<br>పరమం పదమ్-అవ్యయమ్।** | చంద్రధ్వజుడు (నిశ్చలమనస్సు పొందినవాడు) అట్టి అవ్యయమగు విష్ణుపదమును పంచపదమంత్రోపాసనచే సిద్ధించుకున్నారు. మీరందరూ కూడా మనస్సుతో అట్టి మంత్రోపాసనచే సిద్ధించుకోగలరు. |
| **తతో విశుద్ధం, విమలం, విశోకం,<br>అశేషలోభాది నిరస్తసంగమ్,<br>యత్తత్పరం (యత్ తత్ 'పరం') పంచపదం।<br>తదేవ స వాసుదేవో।<br>న యతో అన్యత్ అస్తి॥** | అట్టి విష్ణుపదము విశుద్ధమైనది. సర్వసాంసారిక దోషములు స్పృశించనిది. విమలము. సర్వ ప్రాపంచక వేదనలకు చరమగీతమగు విశోకము. లోభము, మోహము మొదలైన అరిషట్ వర్గములు శమించగా, నిరస్తరంగ (తరంగములు శాంతించిన) జలమువంటి - స్థితి. పంచపదమంత్రోపాసనచే సిద్ధించు పరమపదమే **వాసుదేవము** (ఈ సమస్తము నాయందు ఈ సమస్తము నందు నేను వసించు "నేనైన నేను") . అద్దానికి ఆవల ఇంకేమీ పొందవలసినది శేషించదు. |
| **తమ్ ఏకం గోవిందగ్ం<br>సచ్చిదానంద (సత్ చిత్ ఆనంద) విగ్రహమ్।<br>పంచపదం బృందావన<br>సురభూరుహ – తల ఆసీనగ్ం<br>సతతం మరుద్గణోఽ హం<br>పరమయా స్తుత్యా స్తోష్యామి॥** | - అట్టి ఏకస్వరూపుడగు శ్రీగోవిందుని - సర్వాత్మకుడగు సత్-చిత్-ఆనంద విగ్రహుని,<br>- పంచపదుని,<br>- బృందావన దేవతాభూ విహారిని,<br>- బృందావన కల్పవృక్ష నివాసిని,<br>- మరుత్ గణముతో కూడినవానిని,<br>**పరానంద స్వరూపునిగా స్తుతిస్తూ స్తోత్రములు సమర్పిస్తున్నాము.** |
| **ఓం నమో విశ్వ రూపాయ।<br>విశ్వస్థిత్యంత హేతవే।<br>విశేశ్వరాయ। విశ్వాయ।<br>గోవిందాయ। నమో నమః॥** | హే!శ్రీకృష్ణా! గోపాలా! ఈ విశ్వమంతా 'స్వరూపముగా కలవాడా! ఈ విశ్వముయొక్క సృష్టి - స్థితి - లయములకు కారణమైయున్న స్వామీ! ఈ విశ్వనియామకుడవగు ఈశ్వరా! విశ్వమంతా నిండి ఉన్న స్వామీ! గోవిందా! **నమో నమః॥** |
| **నమో విజ్ఞాన రూపాయ।<br>పరమానంద రూపిణే।<br>కృష్ణాయ గోపీనాథాయ,<br>గోవిందాయ నమో నమః॥** | తెలియబడేదంతా 'నీవే' అయి ఉన్న విజ్ఞానరూపాయా! పరమానంద స్వరూపా! హే శ్రీకృష్ణ భగవాన్! రుక్మిణీనాథా। గోపీవల్లభా।<br>ఈ ఇంద్రియ జగత్తులను స్వకీయానందముగా కలిగియుండు గోవిందుడా!<br>సర్వము కైంకర్యముగా స్వీకరించు గోవిందా! **నమో నమః॥** |
| **నమః కమల నేత్రాయ।<br>నమః కమల మాలినే।<br>నమః కమలనాభాయ।<br>కమలాపతయే నమః।** | కమలములవంటి కనులు కలవాడా! కమలములకు (జ్ఞానపాత్యాంశములకు) తోటమాలీ!<br>కమలము గర్భమున ధరించి, సృష్టికర్తకు జననస్థానముగా కలవాడా! కమలాపతీ! **నమో నమః।** |
| **బర్హా పీడాభిరామాయ।<br>రామాయ అకుంఠమేధసే।<br>రమా మానస హగ్ంసాయ।<br>గోవిందాయ। నమో నమః॥** | నెమలిపింఛము ధరించినవాడా! అభిరామా! మొక్కవోని మేధస్సుచే వెలుగొందువాడా! రమాదేవి (లక్ష్మీదేవి) యొక్క మనస్సు - అనే సరోవరంలో సంచరించు హంసస్వరూపా! గోవిందా! **నమో నమః।** |
| **కంస వంశ వినాశాయ।<br>కేశి చాణూర ఘాతినే।<br>వృషభధ్వజ వంద్యాయ।<br>పార్థసారథయే నమః॥** | క్రూరమైన స్వభావముగల కంసుని వంశమును నశింపజేసినవాడా।<br>కేశి, చాణూరుడు మొదలైన రాక్షసులను సంహరించిన స్వామీ!<br>వృషభధ్వజముచే సేవించబడు దేవా! అర్జునుని రథమునకు దుష్టశిక్షణకై సారధి అయిన స్వామీ!<br>**మీకు నమస్కారము.** |

| | |
|---|---|
| **7. వేణునాద వినోదాయ,<br>గోపాలాయ అహి మర్దినే।<br>కాళిందీ కూలలోలాయ<br>లోలకుండల ధారిణే॥** | వేణునాదముతో వినోదిస్తూ లోకములకు ఆనందము ప్రసాదించుస్వామీ!<br>(ఇంద్రియములనే) గోవులను పాలించు గోపాలా! మాలోని దుష్ట - అల్పభావాలను తొలగించు అహి (సర్ప) మర్దనా!<br>కాళిందీ నదిలోని కాళీయుడు అను పేరుగల విష సర్పమును శిక్షించి, నదీ జలముయొక్క విషత్వము తొలగించిన పావనమగు పాదములు కలవాడా! పొడవైన కుండలములు ధరించిన కృష్ణయ్యా నమస్కారము. |
| **వల్లవీ వదనాంభోజ<br>మాలినే, నృత్తశాలినే। (వృత్తశాలినే)।<br>నమః ప్రణత పాలాయ<br>శ్రీకృష్ణాయ నమోనమః॥** | గోపికా స్త్రీల ముఖములనే పద్మములను వికసింపజేయు సూర్యభగవానుడా! జగన్నాటకమును నడిపించు నృత్తశాలీ! నట్వాంగా! జగత్‌వృత్తుల రచయితా! నమస్కరించువారిని ప్రియముగా పాలించువాడా! శ్రీకృష్ణప్రభూ! నమస్కారము! (వల్లవి = గొల్లది). |
| **నమః పాప ప్రణాశాయ, గోవర్ధన ధరాయ చ।<br>పూతనా జీవితాంతాయ। తృణావర్తాసు హారిణే॥** | మాలోని పాపములను, పాపదృష్టులను నశింపజేయు స్వామీ! గోపజనులను రక్షించటానికై గోవర్ధనగిరిని చిటికినవేలుపై నిలిపినట్టి కృష్ణభగవాన్! పాపస్వభావులగు పూతన, తృణావర్త మొదలైన రాక్షసులను సంహరించినవాడా! నమస్తే! |
| **నిష్కళాయ। విమోహాయ। శుద్ధాయ। అశుద్ధవైరిణే।<br>అద్వితీయాయ మహతే। శ్రీకృష్ణాయ నమో నమః।** | కళంకము లేని నిష్కళంకా! మోహమునకు ఆవల ఉండి మోహమును తొలగించు స్వామీ! శుద్ధ స్వరూపా! అశుద్ధగుణములకు శత్రువుల వంటివాడా! మహత్‌స్వరూపుడా! అద్వితీయుడా! హే శ్రీకృష్ణభగవాన్! నమో నమః॥ |
| **ప్రసీద పరమానంద। ప్రసీద పరమేశ్వర।<br>ఆధి వ్యాధి భుజంగేన దష్టం మామ్ ఉద్ధర ప్రభో।<br>శ్రీకృష్ణ రుక్మిణీకాంత గోపీజన మనోహర।<br>సగ్ంసార సాగరే మగ్నం మామ్ ఉద్ధర జగద్గురో!** | హే పరమానందస్వరూపా! పరమేశ్వరా! ఆధి వ్యాధులనే (మానసిక-శారీరక రుగ్మతలనే) - పాపములను తొలగించువాడా! ఆదిస్వరూపా! మాపట్ల ప్రసన్నులవండి. ప్రభూ! మమ్మ సముద్ధరించండి।<br>హే శ్రీకృష్ణా! రుక్మిణీకాంత యొక్క, గోపీజనముయొక్క మనస్సులను దొంగిలించినట్టి మనోహరా! స్వామీ! జగద్గురూ! సంసార సాగరంలో చిక్కుకున్న మిమ్ములను సముద్ధరించమని వేడుకుంటున్నాను. |
| **కేశవ। క్లేశహరణ। నారాయణ। జనార్ధన।<br>గోవింద। పరమానంద। మాం సముద్ధర। మాధవ!** | హే కేశవా! క్లేశములు హరించువాడా! నారాయణా! జనార్దనా! గోవిందా! పరమానందా! మాధవా! దయతో మమ్ములను సముద్ధరించండి. |
| **అథైవగ్ం స్తుతిభిః ఆరాధయామి।<br>తథా యూయం పంచపదం జపంతః,<br>శ్రీకృష్ణం ధ్యాయంతః సగ్ంసృతిం<br>తరిష్యథేతి।<br>హో వాచ - హైరణ్యగర్భః॥** | **బ్రహ్మభగవానుడు :** ఓ మునులారా! నేను ఎల్లప్పుడు శ్రీకృష్ణభగవానుని పైన చెప్పిన విధంగా ఆరాధిస్తూనే, ఆయన సంకల్పానుసారంగా ఈ త్రిజగత్ - సృష్టిని కొనసాగిస్తూ ఉన్నాను.<br>అట్లాగే జనులు కూడా మనము చెప్పుకున్న **"క్లీం కృష్ణాయ గోవిందాయ గోవిందవల్లభాయ స్వాహా"** - అను శ్రీకృష్ణ - గోపాలపంచపద మంత్రమును ధ్యానిస్తూ క్రమంగా సంసృతి (సంసారము) నుండి తరించెదరుగాక! - అని హిరణ్యగర్భుడగు బ్రహ్మదేవుల వారు మునులకు సంబోధిస్తూ బోధించారు. |
| **అముం పంచ పదం<br>మనుమ్ ఆవర్తయేద్యః।<br>స యాతి అనాయాసతః<br>కేవలం తత్ పదం తత్॥ (యత్)।** | ఎవ్వడైతే ఈ 'పంచపదము'ను జపిస్తూ ఉంటారో, అట్టివాడు **సునాయాసంగా కేవలమగు 'తత్' పదమును సిద్ధించుకోగలడు.** సందర్భ సత్యములు మాత్రమే అయినట్టి - జీవాత్మ, అంతరంగ చతుష్టయము మొదలైన పరిధిలన్ని దాటివేసి - **కేవలమగు స్వస్వరూపములో ప్రవేశించి ఆత్మానంద సాగరుడు కాగలడు.** |

| | |
|---|---|
| **అనేజత్-ఏకం। మనసో జవీయో<br>నైనద్దేవా ఆప్నువన్<br>పూర్వమర్షత్ ఇతి॥** | ఓ సమస్త జనులారా! దేవతలంతటివారు కూడా దోషరహితము, ఏకము, మనస్సుకంటే కూడా అత్యంత సూక్ష్మము అగు పరమాత్మపదమును పొందలేక పోవుచున్నారు సుమా!<br><br>ఉత్తమ సాధనచేత మాత్రమే ఈ జీవుడు <u>'ఇంద్రియ విషయపంజరము'</u> నుండి విడవడి, <u>'ఆత్మసౌందర్యము'</u>ను ఆస్వాదించగలడు. |
| **తస్మాత్ కృష్ణ ఏవ పరమో దేవః<br>తం ధ్యాయేత్।<br>తగ్ం రసయేత్। తం। యజేత్। తం భజేత్॥<br>"ఓం తత్ సత్।" ఇతి ఉపనిషత్॥<br><u>ఇతి గోపాల పూర్వతాపిన్యుపనిషత్</u><br><u>ఓం శాంతిః శాంతిః శాంతిః॥</u>** | అందుచేత శ్రీకృష్ణ అష్టాదశాక్షరీ మహామంత్రోపాసనను అర్థపరమార్థ పూర్వకంగా ఉపాసించండి.<br><br>ఓ మునులారా! శ్రీకృష్ణ భగవానుడే పరమో దైవము. ధ్యానించబడవలసిన వాడు. ఈ జగత్తంతా నిండి ఉన్నది → ఆ శ్రీకృష్ణ చైతన్య ప్రభు నిత్యానంద రసతత్త్వమే!<br><br>ఆయన యొక్క తేజో విభవమే ఇదంతా!<br><br>మనమంతా కూడా ఆయనయొక్క సచ్చిదానంద విభవులమే!<br><br>ఓం తత్ సత్। - ఇతి - ఉపనిషత్.<br><br>***<u>ఇతి గోపాల పూర్వతాపిన్యుపనిషత్</u>***<br><br>***<u>ఓం శాంతిః శాంతిః శాంతిః॥</u>*** |

అథర్వణవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 6(I) గోపాల పూర్వ తాపిన్యుపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘



## అధ్యయన పుష్పము



శ్లో॥ శ్రీమత్ పంచపదాగారం
సవిశేషతయోజ్జ్వలమ్।
ప్రతియోగివినిర్ముక్తం
నిర్విశేషహరిం భజేత్॥

**గోపాలతాపినీ, కృష్ణ, యాజ్ఞవల్క్య, వరాహ, శాట్యాయని, హయగ్రీవ, దత్తాత్రేయ, గారుడ ఉపనిషత్ దేవతలకు నమస్కరించుచున్నాము.**
**బృందావనమునకు, శ్రీకృష్ణునకు, యజ్ఞవల్క్యునికి, వరాహస్వామికి, హయగ్రీవునికి, దత్తాత్రేయులవారికి, గరుడ దేవునికి - నమస్కారము.**

## స్తుతి

సమస్త జీవులలో **'ఉనికి - ఎరుక - ఆనందము'** అగు సత్ చిత్ ఆనంద స్వరూపులై వేంచేసియున్నవారు......,

జీవుల వేదనలు, దుఃఖములు తొలగించు అక్లిష్టకారులు (క్లిష్టములు తీసివేయువారు), వేద-వేదాంగములచే అభివర్ణించబడుచున్న సర్వాత్మక వేదాంతపురుషుడు.

**'తెలుసుకొనబడుదానికి'** (వేదమునకు) ఆవల వేంచేసియున్న **"తెలుసుకొనుచున్నవానిని"** (వేదాంతము The knower) గురించి తెలియున్నవారు, - మాకు తమ బోధచే తెలియజేయువారు...

- జగద్గురువులు, - సమస్త జీవులలో బుద్ధికి సాక్షి అయిఉన్నవారు,

అగు **శ్రీకృష్ణభగవానునికి ప్రణమిల్లుచున్నాము.**
**(వేద = ఈ తెలియబడే సమస్తము. వేదాంత = ఈ తెలియబడే దానికి ఆవల గల "తెలుసుకుంటూ ఉన్నవాడు).**
**(వేదాంత వేద్యుడు = తెలుసుకుంటున్న "నేను" ఎట్టిదో తెలిసియున్నవారు).**

ఒకానొకరోజు కొందరు మునులు లోకాలన్నీ సంచరిస్తూ సత్యలోకము ప్రవేశించారు. సృష్టికర్త, లోకకళ్యాణమూర్తి అగు బ్రహ్మభగవానుని దర్శించారు. భక్తిప్రపత్తులతో శరణాగతిపూర్వకంగా నమస్కరించారు.

**బ్రహ్మదేవుడు** : మునిశ్రేష్ఠులారా! ఏమిటి విశేషం?

**మునులు** : భగవాన్! జగత్ సృష్టి దురంధరా! పితామహా! బ్రహ్మదేవా! నమో నమో నమో నమః। మేము **'దైవోపాసన'** గురించి మీ సూచనలు పొందాలని సముత్సాహులమై పరమపవిత్రమగు తమ దర్శనానికి వచ్చాము.

**కః పరమో దేవః?** దేవతలకే దేవుడైన దేవాది దేవుడు, పరంధాముడు ఎవరు? సృష్టికర్త అగు మీరు కూడా ఉపాసిస్తున్నారా? ఎ'రిని ఇష్టదైవముగా ఆరాధిస్తున్నారు?

**కుతో మృత్యుః బిభేతి?** 14 లోకములలోని జీవులంతా మృత్యువుకు భయపడుతూ ఉంటారు కదా! అట్టి మృత్యుదేవతకు కూడా భయముంటుందా? ఏ దేవదేవుని చూచి మృత్యువు భయపడుతూ ఉంటుంది?

**కస్య విజ్ఞానేన అఖిలం విజ్ఞాతం భవతి?** ఏ తత్త్వము తెలుసుకున్న తరువాత, ఇక ఆపై ఈ సృష్టి – సృష్టికర్త, స్థితి – స్థితికర్త, లయము – లయకర్తలతో సహా సమస్తము సుస్పష్టముగా 'తెలియబడినవి' అవగలవు?

[(యత్‌జ్ఞాత్వా తృప్తోభవతి, స్తబ్ధోభవతి, ఆత్మారామోభవతి। = నారదభక్తిసూత్రములు). ఏది తెలుసుకొన్న తరువాత జన్మకు ముందు, జన్మ, జీవితము, దేహానంతరము మొదలైనవన్నీ సుస్పష్టముగా వివేకపూర్వకంగా పూర్ణముగా తెలిసిపోయినవి అవుతాయి?]

**కేన ఇదగ్ం విశ్వం సగంసరతీతి?** ఏ నావికునిచే ఈ 'విశ్వము' అనే నావ నడిపించబడుచూ ఉన్నది?

**అట్టి ఈఈ విశేషముల గురించిన మహత్తర సత్యమును మాకు బోధించండి. మేము శ్రద్ధగా శ్రవణం చేసి పవిత్రులమయ్యెదము.**

**బ్రహ్మదేవుడు**: మీరు అడిగిన ప్రశ్నలకు సమాధానము **"శ్రీకృష్ణభగవానుడే।" కృష్ణోవై పరమం దైవతమ్।**

**గోవిందాత్ మృత్యుః బిభేతి।** (గో)। ఇంద్రియములను భావనామాత్రంగా కల్పించుకొని ఆనందించు శక్తిస్వరూపుడగు గోవిందుని చూచి మృత్యువు కూడా భయము కలిగి ఉంటోంది.

ఆ గోపీజనవల్లభునికి చెందిన బ్రహ్మతత్త్వ జ్ఞానము చేతను, కేవల స్వరూపుడగు ఆ పరమాత్మ గురించిన అనుభవముచేతను, **"దృశ్యము, జీవుడు, ఈశ్వరుడు, పరమాత్మ"** మొదలైన చమత్కారములతో కూడిన ఈ సమస్తము **తెలియబడినది** – అగుచున్నది.

**స్వాహా – ఇదగ్ం సగ్ం సరతి।** "సమస్తము పరమాత్మకు సర్వదా స్వాభావికంగానే సమర్పితమైయున్నది" అను 'స్వాహా' జ్ఞానముచే ఈ సమస్తము యొక్క సరళి సుస్పష్టమవగలదు. (స్వ–అహమేవ, సోఽహమేవ ఇతి 'స్వాహా')

**మునులు** : పితామహా! 'కృష్ణుడు' అనగా ఎవరు? ఎవరు 'గోవిందుడు' అని అభివర్ణించబడుచున్నారు?

– 'స్వాహా' యొక్క పరమార్థము, గూడార్థము ఇంకా కూడా ఏమై యున్నది? దయతో వివరించి చెప్పండి.

**బ్రహ్మదేవుడు** : మునులారా! వినండి! ఈ సమస్త లోకములుగా కనిపించేదంతా శ్రీకృష్ణ చైతన్యానందతత్త్వమే। అట్టి శ్రీకృష్ణభగవానుని స్మరించినంతమాత్రంచేతనే సమస్త పాపములు, పాపదృష్టులు కడిగివేయబడగలవు. ఆయన వేదములకు జననస్థానమగు **గోభూమిని** పాలించువారు. వేద హృదయుడు. వేద విదితుడు. వేదముల సారము ఆయనయే. గోపికాజనులను జీవబ్రహ్మైక్య విద్య యందు ప్రేరేపించుచూ క్రీడించువారు. ఈ జగత్తంతా కృష్ణతత్త్వమే. సమస్త జీవుల సహజ – వాస్తవ – స్వాభావిక స్వరూపము – **శ్రీకృష్ణచైతన్యానందమే. అట్టి శ్రీకృష్ణుని సాకారరూపమును ఉపాసించెదము గాక.**

**"సమస్తము శ్రీకృష్ణార్పణమస్తు"** – అను భావనయే **"స్వాహా"** – అనబడుతోంది.

ఎవ్వరైతే అట్టి శ్రీకృష్ణుని సాకారరూపమును సర్వాంతర్యామిగాను, సర్వతత్త్వస్వరూపునిగాను

- **ధ్యాయతి** – సర్వదా తమ ధ్యాసయందు నిలుపుకొని ఉంటారో...,
- **రసతి** – రస స్వరూపముగా దర్శిస్తూ 'ప్రేమ' రసము కలిగి ఉంటారో....,
- **భజతి – ("శ్రీకృష్ణ చైతన్య ప్రభు నిత్యానందం। హరే రామ హరే కృష్ణ రాధే గోవిందమ్॥"**

  **"హరే రామ హరే రామ రామ రామ హరే హరే।**
  **హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే॥" )**

మొదలైన భజనలు చేస్తూ) ఆ కృష్ణ సాకార రూపమును భజిస్తూ ఉంటారో, అట్టి వారు మార్పు – చేర్పుల పరిధులను దాటివేసి, నిత్యానందమగు **'అమృతస్వరూపము'**ను సంతరించుకొనగలరు.

**మునులు** : బ్రహ్మభగవాన్! పితామహా! శ్రీకృష్ణుని రూపము ఎట్టిది? 'రసతి' అను రసనము ఏ తీరుగా భావించాలి? శ్రీకృష్ణుని భజన చేయు శ్రేష్ఠమైన మార్గము ఏది? ఏ విధంగా ఉపాసించాలి? ఈ ఈ విషయాలన్నీ మాకు సవివరంగా బోధించండి.

**బ్రహ్మదేవుడు** : శ్రీకృష్ణ దేవ దేవుని సాకార తాత్త్విక నిజ విశేషముల గురించి కొన్ని విశేషాలు చెప్పుకుంటున్నాము. వినండి.

**హైరణ్యో** : బంగారు ఆభరణములన్నిటికీ బంగారమే అధిష్ఠానము కదా! అట్లాగే 'ఈ సమస్త జగత్తుకు, సమస్త జీవులకు–అంతర్యామి, అంతరాంతర – అనునిత్య స్వరూపుడు – శ్రీకృష్ణ పరమాత్మయే। ఆయన ఎవ్వరికీ అన్యుడు కాడు కనుక **'అనన్యుడు'.**

**హి + అరణ్యో : "సమస్తము ఆయనయే అయి సమస్తమునకు వేరైన"** శ్రీకృష్ణుని దర్శిస్తూ స్తుతించుచుండెదరు గాక.

సమస్తలోక – లోకపాలకులను తన ఆభరణములుగా ధరించిన శ్రీకృష్ణరూపము తలచుకొనుచుందురు గాక!

**గోపవేషమ్** : లీలామానుష గోపబాలవేషధారుడు. పిల్లన గ్రోవి ధరించి అల్లరి చేస్తూ గోపబాలురను వెంట నిడుకొని గోవులను అరణ్యమునకు త్రోలుకొనిపోయి పరిపోషించువారు.

– ఇంద్రియములనే గోవులను పాలించువారు. (అంతేగాని ఇంద్రియములచే, ఇంద్రియ విషయములచే పాలించబడేవారు కాదు).

– నామ రూపాత్మకమైన సమస్త జగత్తును వస్త్రముగా ధరించినవారు.

**అభ్రాజమ్** : మేఘములవంటి నల్లనిరంగువాడు. 'బోధలు' అనే మేఘములనుండి **'అమృతవాక్కులు'** (ఈ జీవునియొక్క – మార్పు చెందని సహజాత్మ స్వరూపము గురించి గుర్తుచేసే వచనములు) అనే వర్షము కురిపించి మనందరినీ అమృతస్వరూపులుగా తీర్చిదిద్దువారు.

**తరుణమ్** : ఉదయ కిరణములను లోకమంతా ప్రసరింపజేయువారు. అజ్ఞాన చీకట్లను తొలగించువారు.

**కల్పద్రుమాశ్రితమ్ :** భక్తుల పాలిట కల్పవృక్షమై భక్తజనులకు సమస్తము ప్రసాదించు స్వభావులు. భక్త పరాధీనులు.

**<u>అట్టి శ్రీకృష్ణ సాకార – పరతత్త్వముల గురించి ఇంకా ఈ విధంగా భక్తులచే స్తుతించబడుతోంది.</u>**

ఆ స్వామి పుండరీకాక్షుడు. **'జ్ఞాననేత్రము'** అయినట్టి తెల్లటి తామరపూవులవంటి నయనములతో ప్రకాశించువారు. సర్వజనులకు **'జ్ఞానదృష్టి'**ని ప్రసాదించువారు. చల్లని చూపులతో **"ఆత్మ బలము – ఆత్మ నమ్మకము"** చేకూర్చువారు. 'సత్' ఆనందులు. సత్ పుండరీకనయనులు. మేఘమువలె నీలిమేఘశ్యాములు. మేఘములు, మెఱుపులు ప్రదర్శించు సౌందర్యమువలె ప్రకాశమానమగు వస్త్రములు ధరించినవారు. **మేఘాభాం, వైద్యుతాంబరం।**

- యోగ – జ్ఞానములు, ఇహ – పరములు ఇరువైపులా భజములుగా కలవారు. **ద్విభుజమ్।**
- "ఈ సమస్తము నేనే। నాకు వేరై ఏదీ లేదు" అను భావసమన్వితమగు జ్ఞానముద్ర ధరించినవారు. **"అదియే నీవు–తత్ త్వమ్ అసి"** అని సూచించు (బొటనవ్రేలు – చూపుడు వ్రేలు ఒకచోటికి తెచ్చిధరించు) **చిన్ముద్రధారులు. జ్ఞానముద్రాఢ్యం।**
- సకల జీవులను, సమస్త బ్రహ్మాండములను పూలదండగా ధరించినవారు. **వనమాలినమ్।**
- సమస్తముగా విస్తరించి ఉన్నవారు. **ఈశ్వరమ్।**
- గోపాల – గోపికా జనము మధ్యగా ఆభరణములో రత్నమువలె ప్రకాశించువారు. సమస్త హృదయములలో పూదండలోని దారమువలె వెల్లి విరియువారు. **గోప గోపీ గవావీతగ్ం।**
- 'దేవతలు' అనే పూతీగలు ఆశ్రయించిన మహావృక్షము అయి ఉన్నవారు. **సురద్రుమ లతాశ్రయమ్।**
- ఈ **"అంతరంగ, బహిరంగములన్నీ"** కూడా తనయొక్క దివ్యమైన అలంకారములుగా కలవారు. సుందరమైన ఆభరణములచే అలంకృతులైనవారు. **దివ్యాలంకరణోపేతమ్।**
- రత్నపద్మము మధ్యగా సంప్రకాశించువారు। **రత్నపంకజ మధ్యమమ్।** సమస్త జీవుల హృదయాంతరములలో సర్వదా వికసించి ఉన్నవారు.
- కాళిందీనదీ తరంగములనుండి (జలకల్లోలములనుండి) వీచు వాయు వీచికలచే సేవించబడుచున్నవారు, **కాళిన్దీజల కల్లోల సంగి – మారుత సేవితమ్। 'కాళీయుడు' అను సర్పరాజ విషమును తొలగించి కాళిందీనదీజలమును మధురముగా చేసి ప్రసాదించినవారు.**

అగు **"శ్రీకృష్ణపరమాత్మ"**ను చిత్తముతో సేవించువారు – సంసృతి (లేక) సమస్త సంసారబంధములనుండి విముక్తులు కాగలరు.

**పవిత్రమగు అట్టి శ్రీకృష్ణానందరసమే ఈ సమస్తము। ఇక్కడి జలము, భూమి, చంద్రుడు, పక్షులు, సర్వజీవులు సమస్త జీవుల ఆశయములుగా సంప్రదర్శనము – ఇదంతా కృష్ణ చైతన్యానందమే। శ్రీకృష్ణ–ఆత్మానందతత్త్వమే।**

**మునులు** : పితామహా! బ్రహ్మదేవా! అట్టి శ్రీకృష్ణతత్త్వమును మేము దర్శించి, **"అనన్యత్వము"** సిద్ధించుకోవటానికై ఉత్తమమైన మంత్రరాజము ఏదో, అది దయతో ప్రకటిస్తూ, మాకు ఉపదేశించండి.

**బ్రహ్మదేవుడు :** మునులారా। ఒకానొక మంత్రరాజమున్నది. అది వివరిస్తున్నాను. వినండి.

**<u>(క్లీం) కృష్ణాయ గోవిందాయ గోపీజన వల్లభాయ స్వాహా।</u> ఇది పంచపదము. పంచ-అంగములు కలిగి ఉన్నట్టిది.**

| | | | |
|---|---|---|---|
| మొదటి పదము | : | **"కృష్ణాయ"। - ఇతి** | **'కృష్ణాయ' - ఇత్యేకపదమ్।** |
| రెండవ పదము | : | **"గోవిందాయ"। - ఇతి।** | **గోవిందాయేతి ద్వితీయమ్।** |
| మూడవ పదము | : | **"గోపీజన"। - ఇతి।** | **గోపజనేతి తృతీయమ్।** } |
| నాలుగవ పదము | : | **"వల్లభాయ"। - ఇతి।** | **వల్లభాయేతి తురీయగ్ం।** } |
| ఐదవ పదము | : | **"స్వాహా"। - ఇతి।** | **స్వాహాయేతి పంచమమ్। ఇతి।।** |

ఈ పంచపద, పంచాంగముల మంత్రము జపిస్తూ "ఆకాశము, భూమి. సూర్యుడు, చంద్రమసము ఆ కృష్ణ చైతన్యసాకారరూపమే" - అను భావనతో శ్రీకృష్ణభగవానుని ఉపాసించువారు బ్రహ్మమును సిద్ధించుకోగలరు. బ్రహ్మమే తామై ఉండగలరు.

<u>ఈ విశేషము గురించి ఇంకా కూడా - ఈ విధమైన శ్లోకములచే గానము చేయబడుచున్నది.</u>

-----

## మంత్రము ఉచ్ఛరించే విధానము

- **క్లీం**ccccc అని మొదటగా మధ్యమ స్వరంతో దీర్ఘంగా పలకాలి.
- **"కృష్ణాయ గోవిందాయ గోపీజనవల్లభాయ"** - అని బృహత్ భావనచే - పై స్వరంతో అనుచూ,
- **"స్వాహా"** - ఒక్కసారిగా క్రింద నుండి పై స్వరంగా ఉచ్చరించాలి - సకృత్ ఉచ్చరేత్।

**యో అసౌగతిః తస్యాస్తి మంక్షు న అన్యాగతిస్యాత్ ఇతి।** ఎప్పుడు ఎక్కడ ఏ స్థితి - గతులలో ఉన్నప్పుడు కూడా **"నాకు ప్రాపంచికమైన గతి"** (Move with in the scenary from one to another) తో పనిలేదు, **ఈ మంత్రము న్యాసము చేయుటకంటే వేరైన ఉత్తమగతీ లేదు"**- అని భావించి, ఈ అష్టాదశాక్షరీ మంత్రమును ఉపాసించెదరు గాక.

**భక్తిరస్య భజనం।** పరమాత్మను ఆశ్రయించటానికి భక్తి ఒక్కటే (జ్ఞాన-యోగ మొదలైన) సమస్త మార్గములకంటే కూడా సులభము, శ్రేష్ఠము కూడా। భక్తితో కూడిన భజనను ఆశ్రయిస్తూ ఇక తదితరములైన జ్ఞాన-యోగాదులు భక్తిరస సమన్వితంగా శ్రీకృష్ణ భగవానునికి అవ్యాజముగా (As Non-business like) సమర్పించబడును గాక। అట్టి కృష్ణ భక్తియే నిష్కామకర్మ రూపమగు నైష్కర్మ్యము.

**తం విప్రా బహుధా యజంతి।** ఆ "కృష్ణ" చైతన్యమునే వేదార్థములు తెలిసిన విప్రులు ఆయా అనేక (సమస్త) దేవతల రూపముగా ఉపాసిస్తున్నారు. ఆ 'గోవిందు'ని అనేక భావనలతో ఆరాధించుచున్నారు.

(గోవిందేతి సదా జ్ఞానం। గోవిందేతి సదాజపమ్। గోవిందేతి సదా ధ్యానం। సదా గోవింద కీర్తినమ్)

ఆ **"గోపీజన వల్లభుడే"** సమస్త లోకములను ధారణ (Wearing) చేయుచున్నట్టివారు. "స్వాహా" రూపుడై జగత్తులన్నీ వృద్ధి చేయున్నట్టివారు.

వాయువు దేహములో ప్రవేశించి "ప్రాణ-అపాన-ఉదాన-వ్యాన-సమానములు" అనే పంచప్రాణముల రూపముగా వేరువేరైన ధర్మములు (Functions) నిర్వర్తిస్తోంది కదా! అట్లాగే శ్రీకృష్ణ చైతన్యుడు సర్వదా ఏక - అక్షర - అఖండ స్వరూపుడు అయి ఉండియే 'జగత్తు' అనే ప్రాంగణమును కల్పిస్తున్నారు. జగత్తులో ప్రవేశిస్తున్నారు. శబ్దము (concept of sound), స్పర్శ (Touch), రూప (Forms), రస(Taste), గంధములు (Smell) అనబడే పంచశక్తి ప్రదర్శనములు చేయుచున్నారు. అంతేకాకుండా ఈ జగద్దృశ్యములో "దృశ్యము - దేహము - ఇంద్రియములు - జీవుడు (The experiencer) - ఈశ్వరుడుగాను, అనేక దేహముల ధారుడు" **గా ప్రకాశమానులగుచున్నారు.**

## ఉపాసన

**మునులు** : బ్రహ్మ భగవాన్! అట్టి శ్రీకృష్ణపరమాత్మను మేము ఏఏ విధములుగా 'ఉపాసన' చేయవచ్చునో దయతో వివరించండి. ఆయన సాకార రూపమును ఎట్లా ప్రతిక్షేపించుకోవాలి? ప్రతిమ, పీఠము ఎట్లా ఉండాలి? శ్రీకృష్ణుని ఉపాసనా ప్రతిమ ఉంచవలసి పీఠముపై ఏ విధమైన విశేషములు ఉండాలి? ఏఏ బీజాక్షరములు అక్కడ రచించబడాలి? ఏఏ విధంగా పీఠం ప్రతిక్షేపించాలి? ఏఏ

దివ్యతత్త్వములను (శక్తులను) ఆ పీఠముపై సాంగ-సపరివార-సాయుధ యుక్తంగా ఆహ్వానించాలి? ఎట్లా పూజించాలి? ఇవన్నీ దయతో వివరించండి.

**బ్రహ్మదేవుడు :** దేవతలారా! చక్కటి ప్రశ్న అడిగారు. ఎందుకంటే కేవలం కృష్ణతత్త్వం శ్రవణం చేసినంతమాత్రంచేత ఈ జీవుడు అనుభవము పుణికిపుచ్చుకోలేడు. అందుకుగాను **"శ్రద్ధతో కూడిన కార్యక్రమరూపమగు ప్రయత్నము"** అత్యవసరము.

**(1) మొదటిగా - శ్రవణము :** కృష్ణతత్త్వముగురించి శాస్త్రములు (వేదోపనిషత్తులు) చెప్పుచున్నది వినటము.

**(2) అటుతరువాత మననము** - (i) మనస్సుతో మననము చేయటము. మనస్సును, బుద్ధిని **'అనుకోవటము'** నందు నియమించటము.

అందుకుగాను ఇంద్రియములను ఉపయోగిస్తూ జగద్దృశ్యమును, శరీరమును **'కృష్ణతత్త్వ ధ్యానము'** కొరకై నియోగించటము.

(ii) అట్టి "నియమము" లేక "దీక్ష" కొరకు శ్రీకృష్ణుని సాకారరూపమును పీఠము - ప్రతిమగా నిర్మించుకొనెదరుగాక। (అందుకు బీజాక్షరములు = **క్లీం కృష్ణాయ-గోవిందాయ-గోపీజన వల్లభాయ - స్వాహా।**)

(iii) ఆ పీఠముపై శ్రీకృష్ణ విగ్రహము. ఆయన కళాస్వరూపములైన సాంగములు, సపరివారములు దివ్యశక్తుల రూపముగా చిత్రించుకొంటూ ప్రతిక్షేపించటము.

(iv) మంత్రముల సహాయంతో పూజాది క్రమము నిర్వర్తించటము.

- ఇవన్నీ అవసరము. అవును. సాధనాక్రమము లేనిదే ఈ జీవునికి తన మనస్సును, బుద్ధిని సర్వాంతర్యామి, సర్వతత్త్వస్వరూపుడు అగు 'శ్రీకృష్ణపరమాత్మ' తో (నదీజలం సముద్రంలో ప్రవేశించి సముద్రజలంతో మమేకమైనట్లు) ఏకము చేయటమనేది తేలిక కాదు. అందుచేత "పీఠము - పీఠముపై రచించవలసిన విశేషాలు - బీజాక్షర రచన - కృష్ణాంశల ఆహ్వాన - ప్రపత్తులు, కృష్ణ విగ్రహము, ఉపచారములు గురించి చెప్పుకుందాము. **"విగ్రహము నిగ్రహము కొరకు। నిగ్రహము సోఽహమ్ కృష్ణతత్త్వసిద్ధికొరకు!"।**

**(1) యత్ తస్య పీఠగ్ం హైరణ్యం** - ముందుగా పీఠము తయారుచేసుకోవాలి. అది బంగారు రంగుగా ఉండటము శ్రేష్ఠము.

**(2) అష్ట పలాశం అబుజం।** - దానిపై '8' దళములు గల పద్మము.

**(3) తత్ అంతరాళిక అనలాస్త్రయుగము** - అంతరాళికంగా (మధ్యగా) అగ్నిశిఖలు (అనలాస్త్రయుగం) చిత్రించబడుగాక।

**(4) తత్ అంతరాళాత్ వర్ణాఖిల బీజమ్। 'కృష్ణాయ నమ' ఇతి బీజాద్యగ్ం।** - ఆ పద్మము యొక్క అంతరంగా (ఆ అగ్ని శిఖ-ఆకారముల మధ్యగా) సర్వవర్ణముల బీజాక్షరములు. **"క్లీం కృష్ణాయ నమః" "శ్రీకృష్ణాయ నమః"** - అని రచించబడు గాక।

**(5) స బ్రహ్మాణమ్ అదాయ అనంగగాయత్రీం యధావత్ వ్యాలిఖ్యా** - మధ్యలో సృష్టికర్తయగు బ్రహ్మతో కూడిన అనంగ గాయత్రీ (గాయత్రీ హృదయము)తో కూడి బ్రహ్మదేవుని రూపము లిఖించాలి. (వేదాత్మనాయ విద్మహే, హిరణ్యగర్భాయ ధీమహి। తన్నో బ్రహ్మ ప్రచోదయాత్ - అని రచించుకోబడుగాక॥

**(6) భూమండలగ్ం శూల వేష్టితమ్।** - భూమండలమును "ॐ" లిఖించాలి. శూలవేష్టిత్వము (మూలలతో కూడినదిగా) చిత్రించాలి.

**వాసుదేవాది, రుక్మిణ్యాది, స్వశక్తిం, నందాది, వసుదేవాది, పార్థాది, నిధ్యాది వీతం యజేత్ సంధ్యాసు ప్రతిపత్తిభిః ఉపచారైః**

రుక్మిణీ మొదలైన అష్ట అంశలతోను నంద, వసుదేవ, పార్థ ఆదిగాగల సపరివార సమేతంగాను (వారంతా శ్రీకృష్ణుని అంశలుగా నమస్కరిస్తూ) సర్వాంతర్యామి (అందరిలోనూ సర్వదా వేంచేసిఉన్నవారు) అగు **వాసుదేవ స్వరూప శ్రీకృష్ణ పరమాత్మను,** త్రిసంధ్యలలోను షోడశోపచారములతో పూజించాలి.

**ప్రతిపత్తిభిః ఉపచారైః - తేన అస్య అఖిలం భవతి। అఖిలం భవతీతి।** ఈ విధమైన శ్రీకృష్ణ సాకార రూప ప్రతిపత్తి, షోడశోపాచార సమర్పణ, ధ్యానములచే సమస్తము లభించగలదు. ఇట్టి పూజావిధిచే - శ్రీకృష్ణ తత్త్వమగు సర్వాత్మత్వము, అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకత్వము సిద్ధించుకోగలరు.

> శ్లో॥ **ఏకో వశీ సర్వగః కృష్ణ ఈడ్య, ఏకోఽపి సన్ బహుధా యో విభాతి।**
> **తం పీఠగం యోఽను భజంతి ధీరాః, తేషాగ్ం సిద్ధిః శాశ్వతీ। నేతరేషామ్॥**

ఓ దేవతలారా! ఏ శ్రీకృష్ణానంద చైతన్యమైతే సర్వదా ఏకమే అయి ఉన్నదో, సమస్త జీవులందు సర్వదా సర్వత్ర వశించుచున్నదో, సర్వజనులచే అనేక విధములుగాను, పేర్లతోను, ఆకారములుగాను పూజింపబడుచూ ఉన్నదో – అట్టి శ్రీకృష్ణపరమాత్మను పీఠముపై భావన చేసి ఎవ్వరైతే భజిస్తారో అట్టి ధీరుని (ఉత్తమ బుద్ధి, అవగాహన కలవాని) సిద్ధియే శాశ్వతము. అందుచేత।

***నేను చూస్తున్న ఈ విగ్రహముతో "ఏక – వశీ – సర్వగః – ఏకోఽపిసన్ బహుధా విభాతుడు" అగు పరమాత్మ ఆహ్వానితుడై వేంచేసి సుఖాసీనుడై ఉన్నారు. నాపై మైత్రి, అనుగ్రహము, ప్రేమ, వాత్సల్యము, కురిపిస్తున్నారు।***

అను ఎరుకతో పూజ నిర్వర్తించాలి. అంతేగాని "ఈయన ఒక వ్యక్తి" అను భావనతో కాదు. **"సమస్తము ఈయనయే సిద్ధింపజేయువారు"** = అను భావనతో ఉపాసించువారు సమస్తము సిద్ధించుకోగలరు.

<u>**నేను భజిస్తున్న ఈ శ్రీకృష్ణ భగవానుడు ఎట్టివాడంటే –**</u>

- **"నిత్యో–అనిత్యానాం" :** జనించి గతిస్తూ ఉండే ఈ అనిత్య విశేషములుగల జగత్తులో అంతరంగా, ఆధారంగా (జలంలో తరంగాలవలె) నిత్యుడై వెలుగొందుచున్నారు. (తరంగములు నిత్యముకాదు. జలము నిత్యము)

  **"నిత్యోనిత్యానామ్"** – (అని పాఠాంతరము) – నిత్యమైన దానిలో నిత్యస్వరూపులు.
- **"చేతనః చేతనానామ్" :** కదిలే ఈ సమస్త చేతనములలో కదిల్చువారై ఉన్నారు.
- దేహాలన్నిటిలో దేహాలు ధారణ చేస్తూ ఉన్న 'దేహి'గా ఉన్నారు.
- వచ్చి పోయే ఆలోచనలకు ఆధారమై **'ఆలోచించువారు'** గా ఉన్నారు.
- బుద్ధి చిత్త అహంకారముల అంతరంగా అవన్నీ తనవై, తాను కదలక, వాటిని కదిలుస్తూ ఉన్నారు.

**ఏకో బహూనామ్ యో విదధాతి కామాన్** – ఏకస్వరూపుడే అయి ఉండియే తనయొక్క ఇష్టముచే లీలగా, క్రీడగా, వినోదముగా అనేక రూపములుగా విస్తరించి ఉంటున్నారు.

| ***అట్టి సమస్తము తానే అయి, తన ఇష్టమే అయి వినోదించు శ్రీకృష్ణపరమాత్మను ఇక్కడ ఈ పీఠముపై బుద్ధినిశ్చలత కొరకై, శ్రీకృష్ణునితో తాదాప్య – మమైక్యములకొరకై ఆహ్వానించి పూజిస్తున్నాము.*** |
|---|

అని భావించి ఎవ్వరు పూజిస్తారో, వారిది మాత్రమే శాశ్వతమగు ఆత్మసుఖము. అంతేగాని "ఈయన నాకన్నా అన్యము। ఎక్కడో ఉన్నారు. ఒక వ్యక్తి వంటివారు" – అను భావనతో పూజించువారి సుఖము → సందర్భ పరిమితమేగాని, శాశ్వతము–అవ్యాజము కాదు. (సద్యోముక్తిగా) సంసార శృంఖములను త్రెంచేది కాదు.

అట్టి అఖండాత్మానంద స్వరూపమగు విష్ణుపదమును ఎవ్వరైతే అనునిత్యంగా సముత్సాహవంతులై, ఉద్యుక్తులై (నిత్యోద్యుక్తులై), నిష్కాములై (ప్రపంచంలో ఏదో నామరూపాత్మక దృశ్య సంబంధమైనది పొందాలి అనే వేదన లేకుండా) – సేవిస్తారో – అట్టివారిపట్ల **'ఆత్మపదము'** తనకుతానే వికసితము, సుస్పష్టము అవగలదు!

***"ఆత్మపదము" అనగా సమస్తము స్వస్వరూపాత్మగా దర్శించటమే।*** అంతేగాని అది ఏదో ప్రదేశమో, బాహ్యాశయమో కాదు.

ఓ సమస్తజనులారా!

**యో బ్రహ్మాణం విదధాతి పూర్వం,** – ఎవ్వరైతే సృష్ట్యభిమాని, సృష్టికర్త అగు బ్రహ్మను ఈ సృష్టికి ముందుగా సృష్టి కొరకై వినోది అయి విలాసంగా సృష్టించినవారై ఉన్నారో,

**యో విద్యాం తస్మై గోపయతి స్మ కృష్ణః –** ఎవ్వరైతే బ్రహ్మకు 'సృష్టి' అనే విద్య (పిల్లవాడికి తండ్రి ఆడుకోవటం నేర్పుతీరుగా) నేర్పియున్నారో, అట్టి శ్రీకృష్ణపరమాత్మను శరణువేడుచూ **"ఆత్మబుద్ధిప్రకాశము"**ను మనము వేడుకొనుచున్నాము.

## "ఓం గోవిందాయ నమః"

ఎవ్వరైతే భక్తిశ్రద్ధలతో 'ఓం' కారముతో ప్రారంభమగు **"ఓం గోవిందాయ"** అను పంచపదమంత్రమును నిత్యము జపిస్తూ ఉంటారో, వారికి ఆత్మ తన స్వరూపమును వికసితము చేయగలదు. అందుచేత ఓంకారముతో కూడిన పంచపదమును నిత్యము శాంతముగా అభ్యసించెదరుగాక. ఐదవదగు (తురీయాతీత) స్థానము ప్రసాదించటానికే 'ఓం'కార పంచపదము నిర్మితమైనది.

# "ఓం గోపీజన వల్లభాయ నమః"

దశాక్షరమంత్రము సంక్రందనుడు (ఇంద్రుడు) మొదలైన మహనీయులచే సమస్తకామములు జయించటానికై భజింపబడుతోంది.

**మునులు** : భగవాన్! పితామహా! బ్రహ్మదేవా! తమరు మహత్తరమగు ఈ సృష్టి సామర్థ్యమును ఎట్లా పొందగలిగారు?

**బ్రహ్మ భగవానుడు** : నేను ఈ సృష్టికి ముందుగా ఒకప్పుడు – **"నిర్విషయము, నిరాకారము"** అగు **"బ్రహ్మాకాశము"** నందు సంచారము చేస్తూ ఉండగా, **"ఇప్పుడు నేను ఏమిచేయాలి?"** అనే జిజ్ఞాస, ఉత్సుకత పొందసాగాను. పదార్థమునకు ఆవలగల పరబ్రహ్మము గురించి ధ్యాతనై (ధ్యానము చేయువాడనై) బుద్ధితో స్తుతించసాగాను. **కో ఉపదేష్టా మే పురుషః**? నాకు ఉపదేష్ట అయి ఏమి చేయాలో చెప్పగల పురుషుడు నా బుద్ధికి ప్రత్యక్షమగునుగాక – అని తపనతో వెతుక సాగాను. **తపనయే తపస్సు.**

అప్పుడు నా బుద్ధికి ఎదురుగా ఒక పురుషుడు ప్రత్యక్షమైనారు. నా హృదయంలో ఆ పురుషుని సందర్శిస్తూ నమస్కరిస్తూ, **"ఓ పరమపురుషా! నేను ఇప్పుడు ఏమి చేయాలి? బోధించండి"** అని ప్రార్థనాపూర్వకంగా అభ్యర్థించాను. అప్పుడా పురుషోత్తముడు నాకు "అష్టాదశాక్షర మహామంత్రము" **(క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీజన వల్లభాయ)**లోని ఒక్కొక్క అక్షరము యొక్క మహదర్థము బోధించి **"సృష్టి యేతత్।"** (సృష్టిని సృష్టించుము) అని పలికి అంతర్థానము అయినారు.

ఇక సృష్టించటం కొరకై ఉద్యుక్తుడనయ్యాను. అష్టాదశమహామంత్రము ఉచ్ఛరించటం (పైకి పలకటం) ప్రారంభించాను. అప్పుడు నాకు ప్రతిఒక్క అక్షరములోను ఆ పరమాత్మ సంకల్పశక్తి తేజో స్వరూపమై బుద్ధికి ప్రత్యక్షము కాసాగింది.

**పునస్తే సిసృక్షతో మే ప్రాదుః అభూతే తేషు అక్షరేషు।** ఆ అక్షరాలన్నీ – **విభజ్య, భవిష్యత్ జగద్రూపం ప్రకాశయన్।** – నా బుద్ధికి సృష్టి గురించి బోధగా నేర్పించసాగాయి. సృష్టిలో ఏవేవి ఎక్కడెక్కడుండాలో స్ఫురించసాగింది. వేరు వేరు అక్షరముల సమన్వయముతో (Permitation and Combination) సృష్టి నా దృష్టికి రూపము పొందసాగింది.

**"ఆత్మ"** నుండి (లేక) పరమాత్మనుండి (అక్షరముల నుండి) అఖండము, నిర్విరామము అగు "ఆకాశము".

**"ఆకాశము"** నుండి – "పృథివి" (పృథివి ఎక్కడ ఉండాలో, ఆచోటు)

**"పృథివి"** వలన – తేజోరూపమగు "అగ్ని"।

**అగ్ని** వలన – బిందువు.

**బిందువు** వలన – చంద్రుడు.

తత్ సంపాతాత్ – (బిందు చంద్రుల కలయికచే) – సూర్యుడు.

ఇంకా కూడా ఈ విధంగా....

"క్లీం" కారము నుండి – కృష్ణ చైతన్యత్వము

కృష్ణ చైతన్యము నుండి – ఆకాశము (కృష్ణాత్ ఆకాశమ్)

ఆకాశము నుండి – వాయువు (ఖాత్ వాయుః)

వాయువు నుండి – సురభి విద్య (గాలి వీచికలు / ప్రకంపనములు)

ఇవన్నీ కల్పించాను. సురభి (సృష్టి కల్పనా విద్య) నుండి ఆకర్ష – మాకర్షములు (ఉద్వేగ – అనుద్వేగములు) బయల్వెడలాయి. అటు తరువాత **"భేదము"** అనే చమత్కారము బయల్వెడలింది. అట్టి భేదము (Different from each others) నుండి స్త్రీ – పురుష ((Female, Male) ....మొదలైన సకలనములు బయల్వెడలాయి. **అట్టి అనేక విశేషములతో కూడినవే ఈ సమస్త జగత్తులు.**

ఈ వివరములు గ్రహించిన 'చంద్రధ్వజుడు' అనే ముముక్షువు సర్వ మోహములనుండి విడివడినారు. మోహరహితుడై 'ఆత్మ' యొక్క స్వరూపము గ్రహించినవాడై లోకములకు ప్రవచించారు.

ఓ మునులారా! **'ఓం' కారాళికం మనుమావర్తయేత్ సంగరహితో అభ్యానత్.** దృశ్యమునకు సంబంధించిన సమస్త సంగము దాటి – **"ఏకము, అక్షరము, సమస్తము"** అయి ఉన్న ఆత్మకు అక్షర సంజ్ఞయగు 'ఓం' కారమును ఉచ్చరిస్తూ ధ్యానము చేయండి. జపించండి. ఆత్మనే మననము చేయండి. సమస్తమును **"స్వస్వరూపాత్మకము – సర్వాత్మకము"** అగు కృష్ణ చైతన్య పరమాత్మగా దర్శిస్తూ, సమస్త భేదములకు ఆవలి దృష్టిని అభ్యాసించువారై ఉండండి.

**తద్విష్ణోః పరమమ్ పదగ్ం సదా పశ్యంతి సూరయః దివీచక్షురాతతమ్।**

నిత్యానిత్య వివేకులగు సూరులు (పండితులు) సర్వత్రా సర్వదా **పరమపరమగు తత్ విష్ణు చైతన్యముచే** (అఖండాత్మనే) దివ్యమైన చక్షువులతో సందర్శిస్తున్నారు. సర్వదా అట్టి ఆత్మనే నిత్యము జపించుచున్నారు. – **నిత్యమ్ ఆవర్తయేత్। నిత్యమ్ ఆవర్తయేత్।**

దీనిని గురించి కొందరు ఈ విధంగా అభివర్ణిస్తున్నారు.

**కృష్ణ భాసకము యొక్క**

ప్రథమ పదమునుండి – భూమి। – **ప్రథమపదాత్ భూమిః।**
ద్వితీయ పదము నుండి – జలము।
తృతీయ పదము నుండి – తేజస్సు।
చతుర్థ పదము నుండి – వాయువు।
పంచమ పదము నుండి – ఆకాశము। – జనిస్తున్నాయి.

అట్టి వైష్ణవ పంచవ్యాహృతమును **"క్లీం కృష్ణాయ...."** – మంత్రముచే జపించెదరు గాక। అట్టి 'ఏకము–సర్వాత్మకము' అగు పరమాత్మ తత్త్వమును ఉపాసించినవారై చంద్రధ్వజుడు అవ్యయపదమును సిద్ధించుకున్నారు. (చంద్రధ్వజం = మనో నిశ్చలము సిద్ధించుకొన్న మహనీయుడు).

ఆత్మపదము "విశుద్ధము, విమలము, విశోకము, లోకములతో సంగము లేనట్టిది" – అయి ఉన్నది. అది **'పంచమపదము'**.

- (జాగ్రత్–స్వప్న–సుషుప్తి–తురీయములకు ఆవల గల) **తురీయాతీత పదము** – అని కూడా పిలుస్తూ ఉంటారు.
- అట్టి సర్వజీవులలో సాక్షిగా వేంచేసియుండి, సమస్తమునకు **"కారణకారణుడు"** అయిన పరమాత్మయే **"వాసుదేవుడు".**

(వాసనాత్ వాసుదేవస్య వాసితంతే జగత్రయమ్)। వాసుదేవునికి వేరైనది ఎక్కడా ఏదీ లేదు కాబట్టి ఆయన 'అనన్యుడు', **స వాసుదేవో న యతో అన్యత్ అస్తి।**

❖

ఓ మునులారా! నేను ఎల్లప్పుడు అట్టి గోపాలకృష్ణుని –

**తమ్ ఏకం గోవిందగ్ం** : ఏకస్వరూపుడైయున్న గోవిందుని గాను,

**సచ్చిదానంద విగ్రహమ్** : మూర్తీభవించిన సత్–చిత్–ఆనంద విగ్రహుని గాను,

**పంచపదం।** : జాగ్రత్ – స్వప్న – సుషుప్తులకు, తురీయునికి కూడా సాక్షి అయి ఉన్న **తురీయాతీత పదము** తనదైన వానిగాను, సందర్శించుచున్నాను.

**బృందావన సురభూరుహ తలాసీనగ్ం।** – బృందావన వటవృక్షపు కొమ్మపై కూర్చుని గోపాలురకు, గోపికలకు వేణునాదము వినిపిస్తున్న వానిని **"అస్మత్ సహజాత్మస్వరూప పరమాత్మ"**గా స్తుతిస్తూ ఉన్నాను. ఉపాసిస్తున్నాను.

❖

**ఓం నమో విశ్వరూపాయ :** ఓంకార స్వరూపులై ఈ సమస్త విశ్వముగా కనిపిస్తున్న శ్రీకృష్ణునకు నమస్కారము.

**విశ్వస్థిత్యంత హేతవే।** – ఈ విశ్వముయొక్క ఉత్పత్తి – స్థితి – అంతములకు హేతువైన కృష్ణా! నమోనమః॥

**విశ్వేశ్వరాయ।** – (స్వప్నమంతటా – స్వప్నద్రష్టవలె) – ఈ విశ్వమంతా విస్తరించియున్న ఈశ్వరా!

**విశ్వాయ।** – ఈ విశ్వము మీరే అయి ఉన్న విశ్వస్వరూపా! విశ్వశరీర ధారీ!

**గోవిందాయ।** – జగత్తులకు ఆనందము కలుగజేయు స్వామీ! **నమోనమః।** జీవులందరికీ ఇంద్రియములను, ఇంద్రియ విషయలౌకికానందమును ప్రసాదిస్తున్న గోవిందుడా! నమస్కారము.

**విజ్ఞానరూపాయ।** – సమస్త జనులలో 'తెలుసుకోవటము' అనే రూపముగా వేంచేసియున్న విజ్ఞాన స్వరూపీ।

(One which is present as "The Knower" in all the beings)

**పరమానందరూపిణే** – పరమ ఆత్మానంద స్వరూపా! (The "SELF" manifesting, in every body beyond all that being experienced)

**గోపీనాథాయ।** – గోపికలకు నాథుడు అయి ఉన్న నాథా!

<u>**గోవిందాయ నమో నమః**</u>

**నమః కమలనేత్రాయ!** – పద్మముల వంటి నేత్రములు గలవాడా!

**నమః కమలమాలినే।** – ఓ కమలముల తోటమాలీ! 'జగత్తులు' అనే తోటకు తోటమాలీ!

**నమః కమలనాభాయ।** – బొడ్డునందు కమలము ధరించినవాడా!

**కమలాపతయే నమో నమః ।** – కమలములకు అధిపతివగు శ్రీకృష్ణా! గోవిందా।

**నమస్తే। నమస్తే। నమస్తే। నమో నమః।।**

**బర్హాపీడాభిరామాయ।** – శిరస్సుపై నెమలిపింఛములు ధరించిన చిన్నకృష్ణయ్యా! అభిరామా!

**రామాయ ।** – జీవ-బ్రహ్మైక్య స్వరూపుడవగు రామా! (రా = పరాత్మ; మ = జీవాత్మ)

**అకుంఠమేధసే।** – ఆత్మభావన నుండి అకుంఠితమైన (చెదరని) మేధస్సు గలవాడా!

**రమా మానస హగ్ంసాయా।** – లక్ష్మీదేవి 'మనస్సు' అనే సరోవరములో క్రీడించు హంసరూపా!

<u>***గోవిందాయ నమో నమః***</u>

**కంస వంశ వినాశాయ।** – రాక్షస స్వభావుడగు కంసుని వంశమునకు వినాశనము కలిగించినవాడా!

**కేశి చాణూర ఘాతినే।** – కేశి, చాణూరుడు మొదలైన దుష్ట స్వభావులను శిక్షించినవాడా!

**వృషభధ్వజ వంద్యాయ।** – వృషభము (ఎద్దు) ధ్వజముచే సేవించబడువాడా! శివునిచే స్తుతింపబడువాడా!

<u>***పార్థసారధయే నమః***</u>

**వేణునాద వినోదాయ।** – వేణునాదముచే సమస్త జీవులకు వినోదము కలుగజేయువాడా!

**గోపాల।** – గోవులను పాలించువాడా! ఇంద్రియ-ఇంద్రియార్థ జగత్తులను పరిపాలించువాడా!

**అహి మర్దనే।** – సర్పరూపము దాల్చిన రాక్షసుని మర్దించినవాడా!

**కాళిందీకూలలోలాయ।** – కాళిందీ నదిలో 'కాళీయుడు' అనే సర్పముయొక్క శిరస్సుపై నృత్యభంగిమలు చూపినవాడా! గర్వమును అణచినవాడా!

**లోలకుండల ధారిణే।** – కుండల లోలములను చెవులకు ధరించినవాడా!

**వల్లవీ వదనాంభోజ మాలినే।** – గోపికలు ముఖపద్మములను పాలించు సూర్యుడా!

**నృత్తశాలినే।** – అంగ ప్రత్యంగములచే హావభావములు తెలుపు భంగిమములు చూపువాడా!

**వృత్తశాలినే** : సమస్త ప్రవృత్తులను (నాటకరచయితవలె) పాలించువాడా!

**నమః ప్రణత పాలాయ।** – ప్రణతులను సమర్పించువారిని (నమస్కరించువారిని) రక్షించువాడా!

<u>***శ్రీకృష్ణాయ నమోనమః ।।***</u>

**నమః పాపప్రణాశాయ। – మా పాపములను తొలగించువాడా!**

**గోవర్ధనధరాయ చ।** – గోవర్ధన పర్వతమును చిటికిన వ్రేలుపై ధరించినవాడా!

**పూతనా జీవితాంతాయ।** – పసిపిల్లల ప్రాణములు తీయు స్వభావముగల పూతనయొక్క జీవితమును అంతము చేసినవాడా!

**తృణావర్తాసు హారిణే।** – తృణావర్తుని సంహరించినవాడా!

**నిష్కళాయ। విమోహాయ।** – నిర్మలమైన, మోహరహితమైన హృదయుడా!

**శుద్ధాయా। అశుద్ధవైరిణే।** – శుద్ధస్వరూపుడా। అశుద్ధ స్వభావులకు శత్రువైనవాడా।

**అద్వితీయాయ।** – జీవుడు – జగత్తు మొదలైనవన్నీ మీకు వేరుగా లేనివాడా! ద్వితీయమే లేనివాడా! అద్వితీయా!

## శ్రీకృష్ణాయ నమో నమః

**ప్రసీద పరమానంద। ప్రసీద పరమేశ్వర।** – పరమానంద స్వరూపా! పరమేశ్వరా! – పాహిమాం। రక్షించమాం। నాపట్ల ప్రసన్నులుకండి!

**ఆధివ్యాధి భుజంగేన దష్టం మామ్ ఉద్ధర ప్రభో।** – ప్రభూ! **"మానసిక దోషముల (ఆధుల) శారీరక రుగ్మతల"** (వ్యాధుల)– పాముకాటుల నుండి నన్ను సముద్ధరించండి!

**శ్రీకృష్ణా! రుక్మిణీకాంత, గోపీజన మనోహరా! రుక్మిణియొక్క, గోపికలయొక్క** మనస్సులను హరించినవాడా!

**స్వామీ! సగ్ంసారసాగరే మగ్నం మామ్ ఉద్ధర జగద్గురో! సంసార సాగరంలో ఉన్న నన్ను సముద్ధరించండి।**

ఓ మునులారా! ఈ విధంగా నేను ప్రతిక్షణము ఆ శ్రీకృష్ణ పరమాత్మను నేను వర్ణించి చెప్పినవిధంగా స్తుతిస్తూ ఆరాధిస్తూ ఉంటూనే, ఆయన సంకల్పమగు ఈ సృష్టి కార్యమును సమర్పితభావంతో నిర్వర్తిస్తూ ఉన్నాను.

**తథైవ యూయం పంచపదం జపంతః।** మీరు కూడా ఆ తీరుగానే 'పంచపదము'ను జపించుచూ ఉండండి. ఆ శ్రీకృష్ణ పరమాత్మను ఎవ్వరు 'ధ్యాస'తో ధ్యానిస్తూ ఉంటారో అట్టివారు సమస్త సంసార బంధములనుండి స్వాభావికంగానే విముక్తి పొందగలరు।

ఈ విధంగా హిరణ్యగర్భుడు (బ్రహ్మదేవుడు, జగత్–పితామహుడు) మునులకు గోపాలకృష్ణ తత్త్వము గురించి బోధించారు.

దేవతలు **"దోషరహితము, ఏకము, మనోవేగము తనదైనట్టిది"** అగు **ఆత్మతత్త్వము**ను ఇతఃపూర్వం పొందలేకపోయారు. ఇప్పుడో? పితామహుని సర్వజన శ్రేయోదాయకమగు "శ్రీకృష్ణ చైతన్యప్రభు నిత్యానంద తత్త్వము"ను శ్రవణం చేసి, ఉపాసించారు. అఖండము, అప్రమేయము అగు ఆత్మతో మమేకము సంపాదించుకున్నారు.

**తస్మాత్** – అందుచేత →

**శ్రీకృష్ణ ఏవ పరమో దేవః।** శ్రీకృష్ణుడే పరాత్పరుడగు దేవాదిదేవుడు.

**తం ధ్యాయేత్।** అట్టి శ్రీకృష్ణునే మనసా వాచా కర్మణా ధ్యానించెదము గాక.

**తగ్ం రసయేత్।** – ఆ కృష్ణతత్త్వమునే సేవించి ఆనందించెదము గాక।

**తం యజేత్।** – శ్రీకృష్ణ పాదపద్మములను యోగాభ్యాసులమైనప్పుడు కూడా ఉపాసించెదము గాక।

**తం భజేత్।** – ఆ శ్రీకృష్ణునే భజించి తరించెదము గాక।

**ఓం తత్ సత్।**

*ఇతి గోపాలపూర్వతాపిన్యుపనిషత్*
*ఓం శాంతిః। శాంతిః। శాంతిః।*

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 6(II) గోపాల ఉత్తర తాపిన్యుపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ ఏకో దేవః - సర్వ భూతేషు గూఢః।
సర్వవ్యాపీ। సర్వభూత అంతరాత్మా!
కర్మాధ్యక్షః, సర్వభూత అధివాసః।
సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ॥



"సర్వదా ఏకమే" అయి ఉన్న ఆ ఆత్మదేవాది దేవుడు సర్వజీవుల యందు సమముగా రహస్యరూపులై, వేంచేసి ఉన్నారు. ఆయన సర్వత్రా వ్యాపించి ఉన్నట్టి వారు. సమస్త కర్మలకు అధ్యక్షుడు ఆయనయే. సర్వభూతములుగా ఉన్నవారు. సర్వసాక్షిగా, బుద్ధి రూపముగా కేవలుడై, గుణములకు ఆవలివాడై, నిర్గుణుడై ఉన్నారు. అట్టి ఆ ఆత్మ దేవునికి నమస్కారము.

"ఓం"
ఏకదా హి వ్రజస్త్రియః
సకామాః శర్వరీమ్ ఉషిత్వా
**సర్వేశ్వరం గోపాలం కృష్ణమ్ ఊచిరే।**

ఒకానొకరోజు వ్రజ గోపికలు **"ఏమైనా సరే, మేము సంకుచిత సంసార భావాలన్నీ జయించి, సర్వాత్మకుడగు శ్రీకృష్ణ పరమాత్మతో - (సాగర జలంలో తరంగం ఉపశమించుతీరుగా) మమేకమవాలి"** - అను కామోత్కంఠతలు పొందారు. వ్రతం ప్రారంభించారు. రాత్రంతా జాగరణం చేస్తూ ఉపవాసములు ఉన్నారు. ఆ తరువాత సర్వేశ్వరుడగు గోపాలకృష్ణుని సమీపించారు. "స్వామీ! ఈ 'వ్యష్టిత్వము' అనే జాడ్యము తొలగించుకొని, సమష్టిత్వము కూడా అధిగమించి, మీయొక్క **'సర్వేశ్వర్వత్వము'**తో మమేకమవటము ఎట్లా? చెప్పండి'' - అని అభ్యర్థించారు.

---

<u>ఉవాచ తాః కృష్ణ :</u>
ఆముకస్మై బ్రాహ్మణాయ
భైక్షం దాతవ్యమ్ ఇతి। దుర్వాసస ఇతి।
(దుర్వాసుడు అత్రి - అనసూయలకు రుద్రాంశగా పుట్టిన కుమారుడు. త్రి-సోదరులగు సోముడు, దత్తాత్రేయుడు, దుర్వాసుడు, బ్రహ్మ - విష్ణు - రుద్రుల అంశలు- అని పౌరాణిక ప్రవచనము)

శ్రీకృష్ణభగవానుడు : ప్రియ వ్రజగోపికలారా! మీ వ్రతము, ఉపవాసముల ప్రయోజనము సిద్ధించి నాయొక్క సర్వాత్మత్వముతో (జలములో ప్రవేశించిన ఉప్పుబొమ్మవలె) - మమేకము ఎట్లా అవాలో - ఒక ఉపాయము వినండి.

యమునా నదికి ఆవల వేంచేసి యున్న దూర్వాస మహర్షికి 'భిక్ష' సమర్పించి పునీతులవండి.

సర్వజ్ఞుడు, తత్త్వవేత్త అగు ఆ మహనీయునికి 'భిక్ష' సమర్పించటంచేత - మీ వ్రతఫలముయొక్క సర్వ విఘ్నములు తొలగగలవు.

---

<u>(వ్రజస్త్రీ ఉవాచ :)</u>
కథం యాస్యామో జలం తీర్త్వా
యమునాయా యతః
శ్రేయో భవతి కృష్ణా? ఇతి॥
<u>(భగవాన్ శ్రీకృష్ణోవాచ:)</u>
"బ్రహ్మచారీ।"
ఇతి ఉక్త్వా।
= మార్గం వో దాస్యతి॥

వ్రజ గోపికలు : ఓ! తప్పకుండ, మేము యమునానదికి ఆవలవడ్డున ఉన్న భగవాన్ దూర్వాసమహర్షికి భిక్ష సమర్పించటానికి అన్నీ సిద్ధమే. అయితే మాకు ఒక క్రొత్త చిక్కు వచ్చిపడింది. యమునానది అత్యంత వేగంతో కూడిన నదీ తరంగాలుతో పరవళ్ళు త్రొక్కుతోంది. మరి మేము నదిని దాటటమెట్లా? దుర్వాసమహర్షిని సమీపించి 'భిక్ష' సమర్పించటమెట్లా? ప్రేమతో మాకు ఉపాయం చెప్పండి, కృష్ణయ్యా!

శ్రీకృష్ణభగవానుడు : చెపుతాను. వినండి. **"ఓ యమునా నదీ దేవీ! మా కృష్ణయ్య బ్రహ్మచారి. ఇది నిజమైతే - మేము ఆవలివడ్డుకు చేరటానికి నీవు మాకు త్రోవ ప్రసాదించు"** - అని ప్రార్థించండి. అప్పుడు యమునా నదీమతల్లి మీకు త్రోవ ఇస్తుంది.

2. యం మాగ్ం స్మృత్వా
అగాధా గాధా భవతి। -
యం మాగ్ం స్మృత్వా
<u>అపూతః పూతో భవతి। -</u>
యం మాగ్ం స్మృత్వా
<u>అవ్రతీ (స)వ్రతీ భవతి। -</u>
యం మాగ్ం స్మృత్వా
<u>సకామో నిష్కామో భవతి। -</u>
యం మాగ్ం స్మృత్వా
<u>అశ్రోత్రియః శ్రోత్రియో భవతి। -</u>
యం మాగ్ం స్మృత్వా
అగాధతల స్పర్శ రహితాపి
సర్వా సరిద్గాధా భవతి॥

<u>"నాయొక్క సర్వాత్మక కేవల సాక్షీ -స్వాభావికానంద స్వరూపము" స్మరిస్తూ ఉండగా,,,</u>

- లోతైన అగాధములు కూడా (గోష్పాదజలముతో సమానంగా) గాథలు (చిన్నిగుంటలు వంటివి) అవుతాయి.
- అపూతుడు (అపవిత్రుడు) కూడా పవిత్రత సంతరించుకొని - పూతుడు (పవిత్రుడు) అవుతాడు.
- ఏ వ్రతము చేయనివాడు కూడా వ్రతములన్నీ చేసిన ఉత్తమ ప్రయోజనము పొందగలడు. (అవ్రతుడుకూడా సువ్రతుడు అవుతాడు),
- "దృశ్యంలో ఇంకా ఏదో పొందాలి" అను రూపముతో కూడిన 'సకాముడు' కూడా 'నిష్కాముడు' కాగలడు.
- శ్రుతులు (వేదములు) శాస్త్రీయంగా పఠించనివాడు కూడా వేద హృదయము తెలుసుకొని శ్రోత్రియుడు అవుతాడు.

అగాధములతో కూడిన (లోతైన గుంటలతో కూడిన), దాటటానికి కూడా వీలుగాని సుడులలో కూడిన సంసార నదీ ప్రవాహము కూడా దాటటానికి సులభమైపోతుంది.

అట్టి నా నామ-రూపములు ఆశ్రయించండి. ఇది రౌద్రమంత్రము.
**నన్ను స్మరించండి. భవసాగర తరంగములను తేలికగా దాటివేయగలరు. ఇక యమునా నదీ ప్రవాహములు ఎందుకు దాటలేరు?**

---

శ్రుత్వా తత్వాక్యగ్ం హి వై
రౌద్రగ్ం స్మృత్వా, తద్వాక్యేన తీర్త్వా,
తత్సౌర్యాగ్ం హి వై గత్వా,
శ్రమగ్ం పుణ్యతమగ్ం హి వై నత్వా,
మునిగ్ం శ్రేష్ఠ తమగ్ం హి వై రౌద్రం చ - ఇతి॥

ఆ వ్రజ గోపికలు కృష్ణయ్య చెప్పిన రౌద్రమంత్ర - మంత్రార్థమును జపిస్తూ, రుద్రమగు తరంగములుగల యమునానదిని దాటి ఆవల ఒడ్డును చేరారు. **శ్రమతో గట్టు, ఇసుక తిన్నెలు దాటారు.** పుణ్యపరాకాష్ఠనిష్ఠుడు, పుణ్యతముడు, రుద్రాంశ సంభూతుడు అగు - దుర్వాస మహర్షి ఆశ్రమం చేరి, మహర్షికి నమస్కరించారు. (దుః = At a Distance)

---

దత్వాస్మై బ్రాహ్మణాయ క్షీరమయం,
ఘృతమయమ్, ఇష్ట తమగ్ం
హి వై మృష్ట తమగ్ం హి।
తుష్టః స్నాత్వా భుక్త్వా
హిత్వా ఆశిషమ్।
ప్రయుజ్యాన్నం జ్ఞాత్వాదాత్॥

ఆ దుర్వాస మహర్షులవారికి క్షీరమయము (పాలతో చేసిన వంటకములు), ఘృతమయము (నేతితో చేసిన మధురములు), రుచిగా ఉండేవి, తినటానికి హాయిగా ఉండేవి - మొదలైన వాటితో కూడిన మృష్టాహారము (రుచికరమైన భోజనము) సమర్పించారు.

దుర్వాస మహర్షి ఎంతో సంతోషించారు. స్నానం చేసి వచ్చి వారు సమర్పించిన మధురమగు ఆహారపదార్థములు భుజించారు. ఆశీర్వదించారు. ఆ వ్రజగోపికలను ప్రేమగా, ఆశీర్వాదపూర్వకంగా శేషాన్న పదార్థములను ప్రసాదంగా ఇచ్చారు.

---

<u>తా ఊచుః :</u>
కథం యాస్యామో తీర్త్వా సౌర్యామ్?

వ్రజగోపికలు : హే దుర్వాసమహర్షీ! ఇక మాకు శెలవు ఇప్పించ ప్రార్థన. అయితే యమునానది అత్యంత వేగవంతమగు తీవ్ర తరంగములతో ప్రవహిస్తోంది. మేము నదిని దాటటానికి తగిన సామర్థ్యము ప్రసాదించండి.

---

<u>స హో వాచ మునిః :</u>
దూర్వాశినమ్ (దూర్వ-అశినమ్) - మాగ్ం
స్మృత్వా, వో దాస్యతి ఇతి మార్గమ్।

దుర్వాసమహర్షి : దూరముగా వసిస్తూ, అశనమునకు (తినటానికి) దూరంగా ఉండి, ఏమాత్రము ఏమీ తిననట్టి నన్ను స్మరిస్తూ యమునను దాటి వేయండి. నేను ఏమీ తినని మాట నిజమైతే యమునా నదీ దేవత మీకు మార్గము (త్రోవ) ప్రసాదిస్తుంది.

---

<u>తాసాం మధ్యే హి శ్రేష్ఠా, గాంధర్వీ హి ఉవాచ :</u>
తగ్ం హి వై తాభిరేవమ్? (వైత అభిరేవం)?
కథం కృష్ణో బ్రహ్మచారీ?
కథం దూర్వాశనో (దూర్-వ-అశనో)
మునిః తాగ్ం హి?

వ్రజ గోపికలలో శ్రేష్ఠురాలు, పెద్దావిడ అగు గాంధర్వి : అది ఎట్లా అవుతుంది? అష్టభార్య సమేతుడగు మా శ్రీకృష్ణుడు 'బ్రహ్మచారి' అనునది నిజము ఎట్లా అవుతుంది? మీరు ఏమీ తినక, తినటానికి దూరంగా ఉన్నవారు (దూర్-వ-అశనో) ఎట్లా అవుతారు?

ముఖ్యాం విధాయ పూర్వమను
కృత్వా తూష్ణీమ్ ఆసుః॥

తక్కిన వ్రజ గోపికలు **"పెద్దావిడ గాంధర్వి అడుగుచున్నారు కదా! మహర్షి ఏం చెపుతారో విందాం।"**- అని నిశ్శబ్దంగా వినసాగారు.

---

శబ్దవాన్ ఆకాశః।
శబ్ద – ఆకాశాభ్యాం భిన్నః।
తస్మిన్ న ఆకాశః తిష్ఠతి,
ఆకాశే తిష్ఠతి।
సహి ఆకాశః తత్ న వేద।

**స హి ఆత్మా అహమ్।,**
**కథం భోక్తా భవామి?**

దుర్వాసమహర్షి : కొన్ని దృష్టాంతముల సహాయంతో "నేనేమీ తినలేదు" - అను సత్యము యొక్క అంతర్లీన రహస్యమేమిటో - చెపుతున్నాను. ఓ ధన్యులగు వ్రజగోపికలారా! శ్రద్ధగా వినండి!

ఆకాశము నుండి శబ్దము పుడుతోంది. అయినా కూడా నిశ్శబ్దమగు ఆకాశము శబ్దముగా అవుతోందా? అవటంలేదు. శబ్దము కంటే ఆకాశము ఎప్పుడూ భిన్నమే. సర్వదా నిశ్శబ్దమే. శబ్దములో ఆకాశము ఉండదు. ఆకాశములో శబ్దము ఉండదు. (ఎవరైనా దూషిస్తే 'ఆకాశం దూషించింది' అనము కదా!)

ఆకాశము శబ్దములో ప్రవేశించి, శబ్దములో అంతర్భాగమౌతోందా? లేనే లేదు. ఆకాశము ఆకాశములోనే ఏర్పడి ఉన్నది కదా! అదేవిధంగా నేను సర్వదా నిశ్శబ్దమగు ఆత్మస్వరూపుడను. నానుండి భోక్త (అనుభవము పొందువాడు) అనే శబ్దరూపము (సశబ్దము) బయలుదేరవచ్చుగాక. అంతమాత్రంచేత ఆత్మస్వరూపుడునైయున్న నేను భోక్తను అవుతానా? అవను. సర్వదా వేరుగానే ఉంటాను.

---

**3.** స్పర్శవాన్ వాయుః–
'స్పర్శ' వాయుభ్యాం భిన్నః।
తస్మిన్ వాయుః తిష్ఠతి। వాయౌ తిష్ఠతి।
వాయుస్తం (వాయుః తమ్) న వేద।

**స హి ఆత్మాహమ్!**
**కథం భోక్తా భవామి?**

వాయువు నుండి 'స్పర్శ' అనే గుణము బయల్వెడలుతోంది. అయితే, స్పర్శ వాయువుకంటే భిన్నముగా ప్రదర్శనమౌతోంది. స్పర్శయందు వాయువు ఉండదు. వాయువు స్పర్శానుభవము పొందటము లేదు. వాయువు సర్వదా వాయువునందే ఉంటోందిగాని, స్పర్శయందు ప్రవేశించునదై ఉంటోందా? లేదు. స్పర్శకు వాయువు తెలియదు. **"వాయువు శబ్దానుభవముగా దిగివస్తోంది"** - అని అనము కూడా!

నేను సర్వదా ఆత్మనే అయి ఉండగా, **"ఈతడు భోక్త అయ్యాడు"** - అని మీరు ఎట్లా అంటారు? భోగము (The Experiencing) యొక్క చర్యలు నావి ఎట్లా అవుతాయి?

---

రూపవత్ ఇదం తేజో –
రూప అగ్నిభ్యాం భిన్నః।
తస్మిన్ అగ్నిం తిష్ఠతి।
అగ్నిః తం న వేద। (అగ్నిస్తం న వేద)

**స హి ఆత్మాహం,**
**కథం భోక్తా భవామి?**

తేజస్సు 'రూపము'గా ప్రదర్శనమౌతోంది. అయితే వెలుగు వేరు. ఆ వెలుగులో కనిపిస్తున్న వస్తువు యొక్క సాకారమంతా-వేరు. **"వెలుగు తాను వెలిగిస్తున్న ఆకాశములో రూపాత్మకమై ఉంటోంది"** - అని అంటామా? అనము కదా! అగ్ని ఎప్పుడు అగ్నిలోనే ప్రతిష్ఠితమై ఉంటుందిగాని 'రూపము'లో తిష్ఠించదు. రూపమునకు తేజస్సు గురించి తెలియదు.

అట్లాగే 'జీవుడు' అనునది సంకల్పితము, ఆపాదితము కూడా. నేను సమస్తమును వెలిగించు ఆత్మనేగాని నామ రూపాత్మకమైన జీవుడు, ఆతని అనుభవములు నేనవను. అవన్నీ నాయందు ఉండవు కూడా.

---

రసవత్ య ఆపో –
రసాద్భ్యాం భిన్నః।
తాసు అప్సు తిష్ఠతి। ఆపః తిష్ఠంతి।
ఆపః తత్ న విదుః।

**స హి ఆత్మాహమ్।**
**కథం భోక్తా భవామి?**

జలము నుండి 'రుచి' అనే ధర్మము బయల్వెడలుతోంది. అయితే 'రసము' (లేక) రుచి కంటే జలము భిన్నమైనది. జలమునందు (త్రాగుచున్నప్పుడు) రుచి ఉండవచ్చు గాక! అయినా కూడా జలము జలమునందే ఉన్నది. రుచికి జలము గురించి తెలియదు. రసములో జలము లేదు. జలమునందే రసము ఉన్నది. 'జలము' రుచి అనే అనుభవమేదీ పొందటము లేదు. ఇక రుచికి జలము బద్ధము ఎట్లా అవుతుంది.

ఆత్మనగు నేను భోక్తకు వేరై ఉన్నాను. భోక్త (జీవుడు The Experiencer)కు ఆత్మయగు నా గురించి తెలియదు. జీవాత్మయొక్క 'రుచి' అనే అనుభవమునకు నేను బద్ధుడనయే ప్రసక్తి ఎక్కడిది?

---

గంధవతి ఇయం భూమిః।
గంధ భూమిభ్యాం భిన్నా। తస్యాం,
భూమౌ తిష్ఠతి। భూమిః తిష్ఠతి।
భూమిస్తం (భూమిః తం) న వేద।

**స హి ఆత్మాహం।**
**కథం భోక్తా భవామి?**

భూమి గంధము (Smell) అను వాసనను కలిగి ఉంటోంది. అయితే కూడా, గంధము భూమికి వేరై ఉన్నది. గంధము భూమియందే ఉన్నప్పటికీ గంధమునందు భూమిలేదు. భూమియందు భూమియే ఉన్నది.

నాయందు భోక్త ఉన్నప్పటికీ, భోక్త నాయందు లేదు. భోక్త యొక్క గుణములుగాని, లక్షణములుగాని ఆత్మనగు నాపట్ల ఆపాదించవీలు లేదు. నేను ఆత్మనేగాని, గంధమునకు భోక్త మాత్రుడను కాను.

ఇదగ్ంం హి మన ఏవ-ఇదం మనుతే।
తాన్ ఇదగ్ంం హి గృహ్ణాతి।
యత్ర సర్వమ్ ఆత్మైవా అభూత్,
తత్ర వా కుత్ర మనుతే?
కథం వా గచ్ఛతి? ఇతి।

'మననము' చేతనే మనస్సు నిర్మితమౌతోంది. మననమునకు ముందే మననము చేయుచున్నట్టి - 'నేను' ఉండనే ఉన్నాను. ఈ మనస్సు ఆయా విషయములపై వ్రాలుతూ ఉండవచ్చుగాక! అయినా నేను విషయరూపముగా అవటం లేదు. మనస్సు సంచారము చేస్తూ విషయములు స్వీకరిస్తూ త్యజిస్తూ ఉన్నప్పటికీ నేను ఎక్కడినుండి ఎక్కడికీ వెళ్ళటం లేదు.
సమస్తము ఆత్మయే అయి ఉండగా, మరి మనస్సుకు నాకంటే వేరే స్థానం ఎక్కడుంటుంది? మనస్సు ఎక్కడికి వెళ్ళగలదు? (తరంగము జలమును విడచి ఎటూ వెళ్ళదుకదా!)

---

స హి ఆత్మాహమ్।
కథం భోక్తా భవామి?

"నేను ఆత్మను." నేను భోక్తగా అవటమనే ప్రసక్తి ఎక్కడిది. [దర్పణం (అద్దం)లో దృశ్యము కనబడుచున్నప్పటికీ, ఆ కనబడే వస్తుజాలము దర్పణములో లేనట్లే] - నేను సర్వదా నిర్విషయుడను.

---

అయగ్ంం హి కృష్ణో,
యో హి శ్రేష్ఠః,
శరీర ద్వయ కారణం భవతి।

ఏది నాయందు కేవలము, పరము అగు ఆత్మఅయి ఉన్నదో, అదియే నాయొక్క కృష్ణతత్త్వము. ఆయనయే **నాలోని కృష్ణుడు. ఆయనయే శ్రేష్ఠుడు.** ఆయనయే స్థూల-సూక్ష్మ శరీరములకు, జీవాత్మ-పరమాత్మ ద్వయమునకు కారణమగు చున్నాడు. ఆయనయే నాయందలి నాయొక్క ఇహ-పర స్వరూపుడు. సమస్తమునకు కారణమగు శ్రీకృష్ణుడే జీవాత్మ-పరమాత్మలుగా (ద్వయముగా) సర్వత్రా అగుచున్నారు.

---

**4.** ద్వౌ సుపర్ణౌ భవతో బ్రహ్మణో ఉ హగ్ంం సంభూతః।
తథా ఇతరో 'భోక్తా' భవతి।
అన్యో హి 'సాక్షీ' భవతి। ఇతి।
- వృక్ష ధర్మే తౌ తిష్ఠత।

బ్రహ్మమగు నేను **రెండు పక్షులు** గా ఈ దేహవృక్షముపై ఏర్పడి ఉన్నాను. అందులో ఒక పక్షి సర్వదా భోక్త. ఇంకొక పక్షి సర్వమునకు 'సాక్షి'. ఆ ఇద్దరు ఒకే (శరీర) వృక్షములో సంతిష్ఠితులై (నివాసము కలవారై) ఉన్నారు. (జలము-తరంగము, బంగారము-ఆభరణము, మట్టి-ప్రతిమలవలె దేహగృహంలో నివాసము కలిగి ఉన్నారు)

---

అతో 'భోక్త' 'భోక్తారౌ' పూర్వోహి 'భోక్తా' భవతి।
తథేతరో (తథా ఇతరో) భోక్తా కృష్ణో భవతి। ఇతి।
యత్ర విద్య అవిద్యే న విదామో,
విద్యా అవిద్యాభ్యాం భిన్నో,
విద్యా మయో హి
యః సః కథం విషయీ భవతి? ఇతి॥

అట్టి భోక్తృత్వము భోక్తించు (The Experiencer of the Experiences) **సాక్షి - భోక్త**లకు వేరుగా ఇరువురుకి మహాభోక్తగా నాయందు మూడవవాడై శ్రీకృష్ణభగవానుడు సర్వత్రా బాహ్య-అభ్యంతరములలో వేంచేసి ఉన్నారు. ఎక్కడ విద్య - అవిద్యలు ఉభయము ఉండవో, విద్య - అవిద్యలు - రెండిటికీ ఎవడు భిన్నుడో, సర్వము ఎరుగుచూ విద్యామయుడో, అట్టి ఆత్మభగవానుని సమక్షంలో విషయములకు చోటెక్కడ ఉంటుంది? విషయ ప్రపంచమునకు స్థానము ఎక్కడిది? నేను సదా నిర్విషయుడను. సమస్త విషయములను ఆవలివాడను. శ్రీకృష్ణ చైతన్యమే నా సహజరూపము.

---

యో హ వై కామేన కామాన్
కామయతే, స "కామీ" భవతి।
యో హ వై తు అకామేన
కామాన్ కామయతే సో, "అకామో" భవతి।

ఎవ్వడైతే సకాముడై (కోరికలు కలవాడై) కోరికలు (తన కొరకై) కలిగి ఉంటాడో, అట్టివాడు 'కామి' లేక **'సకామి'** అగుచున్నాడు.
ఎవ్వడైతే 'అకామి' అయి (కోరికలు లేనివాడై) కోరికలు (లోక కళ్యాణము కొరకై మాత్రమే) కలిగి ఉంటాడో - ఆతడు **'అకామి'** యే। నేను 'అకామకామి'ని.

---

జన్మ జరాభ్యాం భిన్నః, స్థాణుః।
- అయమ్ అచ్ఛేద్యో।
- అయమ్ యో అసౌ సూర్యే తిష్ఠతి।
- యో అసౌ గోషు తిష్ఠతి।
- యో అసౌ గోపాన్ పాలయతి।
- యో అసౌ సర్వేషు దేవేషు తిష్ఠతి।
- యో అసౌ సర్వైః దేవైః గీయతే।
- యో అసౌ సర్వేషు భూతేష్వా
విశ్య, భూతాని విదధాతి
స వో హి స్వామీ భవతి॥

- ఎవ్వడైతే జన్మ - దేహము - వార్ధక్యము మొదలైనవాటికి భిన్నులో,
- ఎక్కడి నుండి ఎక్కడికి కదలక స్థాణువు (unmoved) అయి ఉన్నారో,
- జీవాత్మ - ఈశ్వరుడు - నీవు - నేను - జగద్దృశ్యము - మొదలైన వాటిగా ఏమాత్రము విభాగము పొందటమే లేదో,
- ఎవ్వరైతే సూర్యబింబమునందు, గోవులందు, సమస్త దేవతలందు సర్వదా సమస్వరూపులై వేంచేసి ఉన్నారో,
- సర్వదేవతలు ఎవ్వరిని అనునిత్యము గానము చేస్తూ ఉన్నారో,
- ఎవ్వరు సమస్త జీవులందు ప్రవేశించి సమస్త జీవులుగా అగుచున్నారో, ఈ విశ్వమంతా తన స్వరూపముగా కలిగియున్నారో, **వారే మన శ్రీకృష్ణ స్వామి సుమా!**
అట్టి దర్శనముచే ఈ జీవుడు స్వయముగా తాను 'స్వామి' - అగుచున్నాడు.

(సాహోవాచ) సా హ ఉవాచ గాంధర్వీ :
కథం వా స్వస్మాసు జాతో,
గోపాలః కథం వా
జ్ఞాతో అసౌ, త్వయా మునే?

గాంధర్వి (వ్రజగోపికలలో పెద్ద) : హే దుర్వాసమునీంద్రా! మామధ్యలో పుట్టి పెరిగియున్న మా గోపాలుడు మీచేత మీరు వర్ణించబడినవాడుగా మీకు ఎట్లా తెలియవస్తూ ఉన్నారు? మీరెట్లా మీరు చెప్పుచున్నవిధంగా తెలుసుకోగలిగారు?

---

కృష్ణః కో వా? అస్య మంత్రః (కిం)?
కిం స్థానం? కథం వా దేవక్యాం జాతః?
కో వా అస్య జాయా గ్రామో భవతి?
కీదృశీ పూజా-అస్య గోపాలస్య భవతి?

మావాద్దై, మా వ్రజ గోపికలలో - గోపాలబాలురలో ఒకడుగా ఉన్న మా ప్రియ శ్రీకృష్ణుడు అసలు ఎవరు? ఆయనకు సంబంధించిన మంత్రమేమిటి? ఆయన ఉన్న అసలైన స్థానము ఏది? మా దేవకికి ఎట్లా వచ్చి జన్మించి మామధ్యే 'కృష్ణ' నామధేయంతో వెలుగొందుచున్నాడు? ఆయన భార్యలెవరు? వారెక్కడినుండి వచ్చారు! ఆ గోపాలుని ఎట్లా పూజించితే ఆయనకు మేము ప్రియము అవుతాము? - ఈ విషయాలు సద్గురువై మాకు దయతో బోధించండి.

---

సాక్షాత్ ప్రకృతిపరో అయమాత్మా
గోపాలః కథం తు
అవతీర్ణో భూమ్యాగ్ం హి వై?
- సా గంధర్వీ మునిమ్ ఉవాచ :-

కేవల- ఆత్మపురుషుడగు ఆ పరాత్పరుడు -ప్రకృతికి 'పరుడు' (Beyond) అయిఉండికూడా. భూమిపై గోపాలుడుగా, మా శ్రీకృష్ణుడుగా ఎవరి కొరకై ఎందుకు అవతరించారు?

మహాత్మా! ఈఈ విశేషాలన్నీ దయతో వివరించండి.

---

5. సహోవాచ (దుర్వాసౌ వాచ) :
తాగ్ం హి వై పూర్వం నారాయణో
యస్మింల్లోకా ఓతాశ్చ - ప్రోతాశ్చ।
తస్య హృత్ పద్మాః జాతో
అబ్జయోనిః తపః తప్త్వా,
తస్మై హ పరం దదౌ స మమ ప్రశ్నమేవ వవ్రే -
తగ్ం హస్మై దదౌ।

శ్రీ దుర్వాస మహర్షి : వ్రజగోపికలారా! వినండి. వస్త్రములో దారములాగా ఎవ్వరైతే ఈ సమస్త లోకములకు ఓత - ప్రోతమైయున్నారో, ఈ లోకాలకు మునుముందే చైతన్య స్వరూపులై ఉన్నారో - అట్టి శ్రీమన్నారాయణుడే ఈ మన శ్రీకృష్ణుడు.

సమస్తమునకు మునుముందే ఉన్న ఆ నారాయణుని హృదయపద్మము నుండి ముందుగా లీలా -క్రీడా-వినోదంగా **సృష్టి- అభిమాని యగు బ్రహ్మదేవుడు** పుట్టారు. ఆయన తపస్సు చేయగా నారాయణుడే ఆయనను సృష్టి కాముడుగా తీర్చిదిద్ది, ఆ తరువాత ఆ బ్రహ్మదేవునికి సృష్టి కల్పనా సామర్థ్యము ప్రసాదించారు. అట్టి సృష్టియందు శ్రీమన్నారాయణుడే క్రీడా - లీలా వినోదంగా అవతరిస్తున్నారు.

---

స హోవాచ (గాంధర్వ వ్రజగోపికా వాచ) :
అబ్జ యోనిర్యో వా అవతారాణాం
మధ్యే శ్రేష్ఠో - అవతారః కో భవతి?
యేన లోకాః తుష్టా భవంతి?
యగ్ం స్మృత్వా ముక్తా అస్మాత్ సంసారాత్ భవంతి?
కథం వా అస్య అవతారస్య బ్రహ్మతా భవతి?

గాంధర్వ వ్రజగోపిక : మహర్షీ! బ్రహ్మ సృష్టిలోని పరమాత్మయొక్క అవతారములలో - శ్రేష్ఠ అవతారములు ఏవి? ఏ ముఖ్యావతారముచే లోకములు 'అసంతృప్తి'ని త్యజించి తృప్తి, తుష్టి - పొందగలవు? ఎవరిని స్మరించినప్పుడు సృష్టిలోని జీవులు సంసార బంధములనుండి విముక్తులు కాగలరు? ఆ అవతారములకు అట్టి బ్రహ్మత్వము ఎట్లా కలిగింది? ఈ వివరాలన్నీ తెలియజేయండి.

---

స హోవాచ (దుర్వాసౌ వాచ) :
తగ్ం హి వై నారాయణో దేవః స కామ్యో।
మేరోః శృంగే యథా "సప్తపుర్యో" భవంతి, -
తథా నిష్కామ్యాః, సకామ్యా
భూగోళచక్రే సప్తపుర్యో భవంతి।
తాసాం మధ్యే సాక్షాత్ బ్రహ్మ గోపాలపురీ భవతి।
సకామ్యా నిష్కామ్యా దేవానాగ్ం
సర్వేషాం భూతానాం భవతి।
అథ అస్య భజనం భవతి॥

శ్రీ దుర్వాసమహర్షి : సమస్తమునకు మునుముందే నారాయణ పరతత్త్వమే ఉన్నది. అట్టి నిర్విషయ ఆదిస్వరూపము, ఏకము, కేవలము - అయి ఉండి కూడా కల్పనకు సంబంధించి 'సకామి' అయింది.

(మేరుపర్వతముపై శిఖరములు ఏర్పడి ఉన్న తీరుగా- శిఖరములవంటి సప్త (7) పురములు సకామకల్పనయందు ఏర్పడుచున్నాయి.

ఈ భూగోళచక్రములో నిష్కామ్యమైనవి, సకామ్యమైనవి అగు భూతజాలమునకు, దేవతలకు - ఆ **సప్తపురములు** నివాసస్థానము.

వాటి మధ్యగా బ్రహ్మ - గోపాల పురము. అట్టి గోపాలపురములో నిష్కామ్య దేవతలు, సకామ్యులగు దేవతలు పరమాత్మను భజించువారై - సృష్టి సంకల్పానుసారముగా నివాసులై ఉన్నారు.

యథా హి వై సరసి పద్మం తిష్ఠతి,
తథా భూమ్యాం తిష్ఠతి,
చక్రేణ రక్షితా మధురా।

సరస్సులో పద్మము ఉండి ఉంటున్న తీరుగా ఈ భూమి జలములో ఉన్నది. అందు చక్రముచే రక్షించబడే మధురానగరము.

---

తస్మాత్ గోపాలపురీ భవతి।
బృహత్ బృహత్ వనం। (బృహద్వనం)।
మధోః మధువనం।
తాళః తాళవనం।
కామ్యం కామవనం।
బహుళా బహుళవనం।
కుముదః కుముదవనం।
ఖదిరః ఖదిరవనం।
భద్రో భద్రవనం।
– భాండీర ఇతి॥

అందులో గోపాలపురము ఉన్నది.

**ఆ గోపాలపురములో వనములు**

బృహత్ - బృహత్ వనము.
మధో- మధు వనము.
తాళం: - తాళ వనము.
కామ్యము - కామ్య వనము.
బహుళా - బహుళ వనము.
కుముదః - కుముద (తామర) వనము.
ఖదిర - ఖదిర (పోకచెక్క) వనము.
భద్ర - భద్ర వనము.
ఈ విధంగా అవి భండారము (బిందె) ఆకారముగా ఆ గోపాలపురంలో ఉన్నాయి.

---

6. భాండీరవనగ్ం శ్రీవనం
లోహవనం బృందావనం
ఏతైః ఆవృతా పురీభవతి।
తత్ర తేషు ఏవ గగనేషు ఏవం దేవా,
మనుష్యా గంధర్వా నాగాః
కిన్నరా గాయంతి, నృత్యంతి – ఇతి॥

(చిదాకాశ (లేక) ఆత్మాకాశ సమానమగు) ఆ గోపాలపురము - భాండీర వనము, శ్రీవనము, లోహవనము, బృందావనములచే ఆవరించబడి ఉన్నది.

అక్కడ ఆ గగనము నందు (చిదాకాశమునందు) సమస్త దేవతలు, మానవులు, గంధర్వులు, నాగులు (నాగదేవతలు), కిన్నరులు కేవలాత్మానంద స్వరూపమగు కృష్ణతత్త్వము గురించి గానము చేస్తూ, నృత్యము చేస్తూ ఉంటారు.

---

తత్ర–ద్వాదశాదిత్యా, ఏకాదశరుద్రా,
అష్టౌ వసవః, సప్త మునయో,
బ్రహ్మా, నారదశ్చ పంచవినాయకా,
విశ్వేశ్వరో, రుద్రేశ్వరో అంబికేశ్వరో,
నీలకంఠేశ్వరో, గోపాలేశ్వరో,
భద్రేశ్వర ఇతి। –
అష్టౌ అన్యాని లింగాని।
– చతుర్విగ్ంశతి (24) (చ) భవంతి।

అట్టి గోపాలపుర స్థానములో (ధాత, మిత్రుడు, అర్యముడు, శుక్రుడు, వరుణుడు, అంశుమంతుడు, భగుడు, వివస్వంతుడు, త్వష్ట, పూషుడు, సవిత్తు, విష్ణువు-అనబడు) **ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు,** (బ్రహ్మ మానస పుత్రులగు అజుడు, ఏకపాదుడు, అహిర్బుధ్యుడు, హరుడు, శంభుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, ఈశానుడు, త్రిభువనుడు, త్వష్ట, రుద్రుడు - అనబడే) ఏకాదశరుద్రులు; (అవుడు, ధ్రువుడు, సోముడు, అధర్వుడు, అనిలుడు, ప్రభాసుడు- అను), **అష్టవసువులు,** (మరీచి, అత్రి, అంగీరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు అను) **సప్త ఋషులు** (సప్త బ్రహ్మేతి), సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు (ప్రజాపతి), దేవర్షి నారదులవారు, పంచ వినాయకులు, విశ్వేశ్వర -నీలకంఠేశ్వర, గోపాలేశ్వర -భద్రేశ్వర (ఈశ్వర) ప్రదర్శనములు, తదితర అష్టలింగములు, (పంచ ప్రాణ, పంచ భూత, పంచ ఇంద్రియ, పంచ ఉపప్రాణ, అంతరంగ చతుష్టయములనే) 24 తత్త్వములు వెల్లివిరుస్తున్నారు.

---

ద్వే వనే స్తః – కృష్ణవనం, భద్రవనం॥
తయోః అంతరః ద్వాదశ వనాని–
పుణ్యాని, పుణ్య తమాని।
తేషు ఏవ దేవాః తిష్ఠంతి॥

అక్కడ (ఆగోపాలపురములో) 2 వనములు.

(1) కృష్ణవనము (2) భద్రవనము

ఆ వనముల అంతరముగా (లోపలగా) పుణ్యములు, శ్రేష్ఠ పుణ్యములు (పుణ్యతమములు) అయినట్టి '12' ఉపవనములు వాటియందు అనేక మంది దేవతలు వేంచేసి సుస్థితులై ఉన్నారు.

| | |
|---|---|
| **సిద్ధాః సిద్ధిం ప్రాప్తాః।** | అక్కడ సిద్ధయోగులు [ఈ జాగ్రత్ - స్వప్న - "**సుషుప్తులు, ఈ దేహములు, ఈ లోకములు - ఇవన్నీ కూడా శ్రీకృష్ణ చైతన్యానంద పురుషుడనగు నేనే నా పురుషకారముచే సిద్ధించుకొంటున్నాను**" - అని ఎరిగినవారై, సిద్ధిని ప్రాప్తింపజేసుకొంటున్నారు. |
| **తత్ర హి :-**<br>**రామస్య రామమూర్తిః।**<br>**ప్రద్యుమ్నస్య ప్రద్యుమ్న మూర్తిః।**<br>**అనిరుద్ధస్య అనిరుద్ధమూర్తిః। కృష్ణస్య కృష్ణమూర్తిః।**<br>**వనేషు ఏవం మధురా సేయం**<br>**ద్వాదశ మూర్తయో భవంతి॥** | అక్కడ (గోపాలపురములో) బలరాముని రామమూర్తిత్వము, ప్రద్యుమ్నుని యొక్క ప్రద్యుమ్నమూర్తీ విభవము, అనిరుద్ధుని యొక్క అనిరుద్ధమూర్తీ వైభవము, శ్రీకృష్ణభగవానుని శ్రీకృష్ణమూర్తీ మహదత్వము మూర్తీభవించినవై ఉంటున్నాయి. **సాకారముగా కొలువబడుచున్నాయి.**<br><br>అక్కడి వనములలో శ్రీకృష్ణ పరమాత్మయొక్క "12" మూర్తులు ఉన్నాయి. అవన్నీ అక్కడ ఉపాసించబడుచూ ఉన్నాయి. |
| **ఏకాగ్ంం హి రుద్రా యజంతి।**<br>**ద్వితీయం బ్రహ్మా యజతి।**<br>**తృతీయాం బ్రహ్మజా యజంతి।**<br>**చతుర్థీం మరుతో యజంతి।**<br>**పంచమీం వినాయకా యజంతి।**<br>**షష్ఠీం వసవో యజంతి।**<br>**సప్తమీం ఋషయో యజంతి।**<br>**అష్టమీం గంధర్వా యజంతి।**<br>**నవమీం అప్సరసో యజంతి।**<br>**దశమీవై హి "అంతర్ధానే" తిష్ఠతి।**<br>**ఏకాదశీతి - "స్వపదానుగా।"**<br>**ద్వాదశీతి - భూమ్యాం తిష్ఠతి।** | అట్టి శ్రీకృష్ణ భగవానుని ద్వాదశ (12) మూర్తులలో : మొదటి మూర్తిని **రుద్రులు** పూజిస్తున్నారు. రెండవదానిని **సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు** పూజిస్తూ ఉన్నారు. మూడవమూర్తిని **బ్రహ్మమానసపుత్రులు అగు సనక. సనంద సనత్కుమార సనస్సుజాతాదులు**, బ్రహ్మతత్త్వజ్ఞులు పూజిస్తున్నారు. నాలుగవ 'మూర్తి'ని **మరుత్తులు** ఉపాసిస్తున్నారు. ఐదవది **వినాయకుడు** సేవిస్తున్నారు. ఆరవ రూపము (మూర్తి)ను **వసువులు,** ఏడవ మూర్తిని **సప్తఋషులు,** ఎనిమిదవ మూర్తీ వైభవమును **గంధర్వులు** - తొమ్మిదవ రూపమును **అప్సరసలు** ధ్యానిస్తున్నారు.<br><br>శ్రీకృష్ణ భగవానుని యొక్క 10వ మూర్తి - అంతర్ధానమైనదై (ఇంద్రియములకు అవిషయమై) ఉంటోంది.<br><br>11వదిగా మూర్తీభవించినట్టి రూపము స్వపదానుగా, "తనయొక్క, తదితర సమస్త జీవులు యొక్క ఈ దృశ్య జగత్తు యొక్క సహజమగు స్వస్వరూపముగా బృందావన కృష్ణులని తెలుసుకొంటూ ఆరాధించునది. "స్వపదానుగా" అను ఉపాసన. స్వస్వరూపముతో సహా - సమస్తముగాను మూర్తీభవించిన శ్రీకృష్ణపరమాత్మ వైభవోపాసన. (ఇది అన్నిటికీ పరాకాష్ఠ)<br><br>ఇక '12వ' మూర్త్యుపాసన **"ఈ సమస్తము నాయొక్క ఆత్మవిన్యాసమే"** అను **'భౌమాభావన'** యందు స్వాభావికంగా తిష్ఠించటము "ఇది సప్తమ భూమిక" లేక "భూమ్యాతిష్ఠతి" అనబడుతోంది. **అనన్యోపాసన.** |
| **7. తాగ్ంం హి యే యజంతి,**<br>**తే మృత్యుం తరంతి।**<br>**ముక్తిం లభంతే।** | ఎవ్వరైతే అట్టి **"ఈ సమస్తము నా ఆత్మయందే ఉన్నది. ఈ సమస్తము నందు మమాత్మయే ఏర్పడినదై ఉన్నది** - (సర్వభూతస్థం ఆత్మానం! సర్వభూతానిచ ఆత్మని) - అను సప్తమభూమిక యందు ప్రవేశము పొందినవారై ఉంటారో, - అట్టివారు, **"మృత్యువు నా సమక్షంలో జరిగే ఒక స్వాభావిక దైనందిక సంఘటన"** అను దృష్టిచే జన్మమృత్యు చక్రపరిభ్రమణభావననుండి తరించుచున్నారు. **అమృతత్వము సిద్ధించుకుంటున్నారు.** వారి దృష్టిలో ఇక్కడి జన్మ-కర్మలు స్వతఃగా లేనివి, కల్పనచే మాత్రమే ఉన్నవి అవుతాయి. వారు ముక్తిరూపులు. |
| **గర్భ జన్మ (కర్మ) జరామరణ**<br>**తాపత్రయాత్మక దుఃఖం తరంతి।**<br>**తదపి ఏతే శ్లోకా భవంతి॥** | అట్టి శ్రీకృష్ణుని -సమస్తముగా మూర్తీభవించినట్టి మూర్తీవిభవమును ఉపాసించువారు గర్భనరక - జన్మ - కర్మ - జరామరణరూపములగు శారీరక దుఃఖములను, (ఆధిభౌతిక-ఆధి దైవిక, ఆధి-ఆత్మికములు అనబడే) మానసిక దుఃఖరూపమగు తాపత్రయములనుండి తరించగలరు.<br><br>అట్టి గోపాలపురములో వేంచేసిన శ్రీకృష్ణమూర్తి రూపము శ్లోకములుగా వర్ణించబడుచున్నది. (అవి చెప్పుకుంటున్నాము) |

| | |
|---|---|
| శ్లో॥ సంప్రాప్య మధురాగ్ం రమ్యాగ్ం<br>సదా బ్రహ్మాఽది వందితామ్।<br>శంఖ చక్ర గదా శార్ఙ్గ రక్షితాం ముసలాదిభిః।<br>యత్ర అసౌ సంస్థితః కృష్ణః, స్త్రీభిః శక్త్యా సమాహితః।<br>రమ అనిరుద్ధ ప్రద్యుమ్న రుక్మిణ్యా సహితో విభుః॥ | మధురలో రమ్యముగా వేంచేసియున్నవారు, బ్రహ్మ మొదలైన దేవతలచే ఎప్పుడు నమస్కరించబడువారు, శంఖ-చక్ర-గదా-విల్లు-ముసల సాయుధులు, శ్రీకృష్ణావతారులై గోపికా స్త్రీలతోను, ఆదిశక్తితోను (ఆదిలక్ష్మితోను) వెంటనంటి ఉన్నవారు, రమ అనిరుద్ధ ప్రద్యుమ్న రుక్మిణీ సహితులు, - అగు 'సర్వాత్మక-పరమాత్మ'కు నమస్కారము. |
| చతుః శబ్దో భవేత్ ఏకో హి "ఓం" కారస్య ఉదాహృతః।<br>తస్మాత్ ఏవ పరోరజసేతి।<br>"సోఽహమ్" - ఇతి అవధార్య<br>"ఆత్మానం గోపాలోఽహమ్"<br>ఇతి - భావయేత్, స మోక్షమ్ అశ్నుతే॥ | నాలుగు వేదముల హృదయమగు 'ఓం'కారముగా చెప్పబడు ఏక-అక్షర పరమార్థ అత్మానందస్వరూపులు అగు-**శ్రీకృష్ణ స్వామియే సమస్త జీవుల పరస్వరూపులై విరాజిల్లుచున్నారు.**<br>ఆయన అనన్యులు కాబట్టి అట్టి గోపాలుడే మామాత్మ స్వరూపులు.<br>**"ఆత్మగా నేను ఆ గోపాల స్వరూపుడనే"** - అని భావనను ఆశ్రయించువారు ఇప్పుడే, ఇక్కడే మోక్షము సిద్ధించుకోగలరు. అట్టి భావనయొక్క ఆశ్రయముచేతనే మనమంతా పునీతులు కాగలము. |
| స బ్రహ్మత్వమ్ అధిగచ్ఛతి।<br>స 'బ్రహ్మవిత్' భవతి।<br>స గోపాన్ జీవాన్ ఆత్మత్వేన<br>సృష్టి పర్యంతమ్ ఆలాతి -<br>స గోపాలో భవతి హి॥ ॥ఓం॥ | అట్టివాడు 'జీవత్వము' నుండి విడివడి, 'బ్రహ్మత్వము' సిద్ధించుకుంటున్నాడు. ఆతడు 'బ్రహ్మవేత్త' అగుచున్నాడు. (బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి)<br>ఈ జీవులంతా గోవులు. వీరందరినీ తనయందు సృష్టించుకొని లీలా క్రీడా వినోదంగా **తనకు అనన్యముగా సృష్టిపర్యంతము కలిగియున్న అఖండాత్మయే గోపాలుడు.**<br>గోవులనబడే ఇంద్రియములను, జీవులను తన పరిపాలన యందు కలిగి ఉన్నవారవటంచేత గోపాలుడు. అట్టి గోపాలకృష్ణుని గానము చేయువాడు తానే గోపాలుడు అగుచున్నాడు. |
| ఓం తత్ సోఽహమ్<br>పరంబ్రహ్మ కృష్ణాత్మకో<br>నిత్యానందైక స్వరూపః। | సమస్తమునకు పరమైయున్న కేవలమగు 'అహం' రూపంగా - నిత్యానందైక స్వరూపుడగు శ్రీకృష్ణ పరబ్రహ్మమే నాయందు సర్వదా వేంచేసి యున్నారు. సమస్తము ఆయనయే కాబట్టి 'నేను'గా వేంచేసియున్నది ఆయనయే। అనన్యమగు శ్రీకృష్ణతత్త్వమునకు అన్యమై నేనెక్కడ ఉంటాను? |
| సోఽహమ్ ఓం<br>తత్ సత్ గోపాలో అహమేవ -<br>పరగ్ం సత్యమ్ అబాధితం<br>సోఽహమ్। ఇతి -<br>ఆత్మానం ఆదాయ<br>మనసః ఐక్యం కుర్యాత్। | **"సమస్త జీవాత్మలు తానే అయి ఉన్న తత్-సత్ (కేవలుడు, సమస్తముగా ఉన్నవాడు) అగు గోపాలుడను నేనే! సమస్తమునకు పరమై, సమస్త కల్పనలకుఆవల సత్ స్వరూపుడై, జన్మ-జీవన్-మరణ-మనో-బుద్ధి- చిత్త-అహంకారములచే స్పృశించబడనివాడై, అబాధితుడైనట్టి శ్రీకృష్ణపరమాత్మను నేనే! 'నేను'గా ఉన్నది ఆయనయే"** - అని స్వస్వరూపమును దర్శిస్తూ మనస్సును సమస్త భేదముల నుండి వెనుకకు మరల్చాలి.<br>**"సర్వాత్మకుడగు శ్రీకృష్ణపరమాత్మను నేనే। 'నేను'గా ఉన్నది ఆయనయే"** - అని స్వస్వరూపమును దర్శిస్తూ మనస్సును సమస్త భేదములనుండి వెనుకకు మరల్చి సర్వాత్మకుడగు శ్రీకృష్ణ పరమాత్మతో ఏకం చేసివేయుచుండెదము గాక। |
| "ఆత్మానం గోపాలోఽహమ్"<br>- ఇతి భావయేత్॥ | **"ఆత్మగా గోపాలుడనే నేను"** అని భావన చేయుదురు గాక। [గోపికలు ఒకప్పుడు ఉద్ధవునితో **"మాకు గోపాలుడు వేరు కాదు కదా! ఎట్లా ఉపాసిస్తాము?"** - అని ఎదురితిరిగి ప్రశ్నించటమనే - గోపికా తన్మయ అనన్యానందము।] |
| స ఏవ అవ్యక్తో అనంతో<br>నిత్యో గోపాలః॥ | ఎవరైతే సమస్త జీవులందు **అవ్యక్తుడై** (సమస్తమును వ్యక్తీకరిస్తూ తాను వేరుగా ఉన్నవారై), **అనంతుడై** (జన్మలచేతను, 14 లోకములచేతను పరిమితుడు కానివాడై), (మూడు కాలములలో ఒకే స్వరూపము కలవాడవటం చేత) **నిత్యుడై**, (మనందరిలో సర్వదా మనకు వేరుకానివాడు కాబట్టి) **అనన్యుడై** వేంచేసి ఉన్నారో, - ఆయనయే గోపాలుడు. ఆయనయే మన శ్రీకృష్ణపరమాత్మ। అంతేగాని, ఆయన ఒక వ్యక్తి కాదు. ఇదంతా ఆయనయొక్క లీలామానుష వేషధారణ. |

## శ్రీకృష్ణ ప్రియ వచనములు

8. మధురాయాగ్ం స్థితిః, బ్రహ్మన్!
సర్వదా మే భవిష్యతి।
శంఖ చక్ర గదా పద్మ వనమాలా ధరస్య వై।
విశ్వరూపం పరం జ్యోతిః।
స్వరూపగ్ం। రూపవర్జితమ్।

**శ్రీకృష్ణ భగవానుడు** : ఓ బ్రహ్మదేవా! శంఖ చక్ర గదా పద్మ వనమాలా ధారుడనై శ్రీకృష్ణావతారుడనై మధురలో సర్వదా వేంచేసి ఉంటున్నాను. మమానందస్వరూపులగు సమస్త ఆప్త - ఆశ్రితజనులారా! వినండి.

ఈ సమస్త విశ్వము నా రూపమే అయి ఉన్న విశ్వరూపుడను. సమస్త రూపములు నాకు చెందినవే కాబట్టి రూపవర్జితుడను కూడా.

---

మధురా మండలే యస్తు జంబూద్వీప స్థితోఽపి వా,
యో అర్చయేత్ ప్రతిమాం మాం చ,
స మే ప్రియతరో భువి।

మధురామండలములో శ్రీకృష్ణుడనై అవతరించినవాడను అగు నన్ను - జంబూద్వీపస్థితుడను అయి ఉండియే ఎవ్వరైతే, ఎక్కడైనా సరే - నా ప్రతిమను మమాత్మభావనతో అర్చిస్తారో అట్టివారు నాకు ప్రియాతి ప్రియులగుచున్నారు.

---

తస్యాం అధిష్ఠితః కృష్ణరూపీ
పూజ్యః త్వయా సదా,
చతుర్ధా చ అస్య అవతార
అభేదత్వేన యజంతి మామ్।
యుగానువర్తినో లోకా
యజంతి ఇహ సుమేధసః।

నా తత్త్వము ఎరిగిన బుద్ధిమంతులు సర్వమునందు అధిష్ఠితుడు (welplaced comprehensively) గాను, నాలుగవదగు జాగ్రత్-స్వప్న-సుషుప్తులకు 'సాక్షి' అగు తురీయునిగాను (4వ వానిగాను), తమకు అనన్యుడుగాను ఆరాధిస్తున్నారు. ఉపాసిస్తున్నారు. పూజిస్తున్నారు.

నా ప్రతిమను సహకారికంగా తీసుకొని, నన్ను యుగముల రూపముగా అనువర్తించువాడుగాను (విస్తరించు వాడనుగాను) భావిస్తున్నారు. నిర్మలము, సునిశితము, విస్తారము, సమగ్రముతో కూడిన బుద్ధితో ప్రార్థనలు సలుపుచున్నారు.

---

గోపాలగ్ం స-అనుజం కృష్ణగ్ం
రుక్మిణ్యా సహ తత్పరమ్।

**బలరామునితోను** (ఆదిశేష స్వరూపముతోను), (శ్రీకృష్ణావతార విజయము తప్పించే మరేకాంక్ష లేనట్టి) **రుక్మిణితోను** - కూడుకొనియున్న వాడను, సమస్త జీవాత్మలను పాలించు గోపాలుడనగు నన్ను - **'తత్'** గాను **'పరమ్'** గాను - **తత్పరుడు**గాను భావిస్తూ 'ప్రతిమ'ను ఉపాసించుచున్నారు.

---

గోపాలోఽహమ్ అజో నిత్యః।
ప్రద్యుమ్నోఽహమ్ సనాతనః।
రామోఽహమ్।
అనిరుద్ధోఽహమ్।
ఆత్మానం చ అర్చయేత్ బుధః।

**శ్రీకృష్ణ చైతన్యానందోపాసన** = జన్మకర్మాదులు లేనట్టివాడను, నిత్యుడను. గోపాలుడను. గోపాలపుర శ్రీకృష్ణుడుగా ఉన్నది నేనే (విష్ణుమూర్తియే).

సమస్త జన్మలకు మునుముందే ఉన్నట్టి సనాతన ప్రద్యుమ్న స్వరూపుడను. "సర్వజీవులలోను, సర్వజీవులుగాను ప్రకాశిస్తున్న ఆత్మారాముడనే నేను" (అని బలరాములవారిని భావించుచున్నారు).

దేనిచేతనూ నిరోధింపబడజాలని అనిరుద్ధుడను అని అర్చిస్తున్నారు - (తెలివితో కృష్ణతత్త్వమును, జగత్ రూపమును ఎరిగిన - బుధులు సమస్తమును అర్పించుచున్నారు).

---

మయోక్తేన (మాయా ఉక్తేన) సధర్మేణ
నిష్కామేన విభాగశః
తైః అహం పూజనీయో వై
భద్ర కృష్ణ నివాసిభిః।

నేను వివరించి చెప్పుచున్న స్వస్వరూప స్వాభావిక ధర్మమును-నిష్కాములు (ఎట్టి ప్రాపంచిక కోరికలు లేనివారు), జగత్తు నుండి తమ స్వరూపమును విభాగించి చూచువారు - అగు కృష్ణతత్త్వోపాసనకులు "భద్రకృష్ణనివాసి"గా నన్ను (తమయందు భద్రముగా సారూప్యుడనై ఉన్నవానిగా) దర్శిస్తూ, భావిస్తూ ఉపాసిస్తున్నారు.

---

తద్ధర్మ గతి హీనా యే
తస్యాం మయి పరాయణాః
కలినా గ్రసితా యే వై
తేషాం తస్యామ్ అవస్థితిః॥

తత్ బ్రహ్మాండాత్మస్వరూపుడనగు నాయొక్క తత్‌ధర్మము పట్ల శ్రద్ధతో మత్‌పరాయణులై ఉండనట్టి వారికి, గతి తెలియని వారికి కలికల్మష దోషములచే గ్రసితులైనవారికి - **దుఃఖ బంధ నివారణకొరకై నేను సాకార-శ్రీకృష్ణావతారుడనై ప్రదర్శితుడను అగుచున్నాను.** ఆశ్రితులగు సంసార దోషజనుల సముద్ధరణ కొరకై సంకల్పితమైనట్టిదే (మధుర-వ్రేపల్లె-ద్వారకలలోని) నాయొక్క ప్రకృతి సిద్ధమగు (లేక) ప్రకృతిగతమగు గోపాలకృష్ణావతారము.

| | |
|---|---|
| యథా త్వగ్ం సహ పుత్రైస్తు,<br>యథా రుద్రో గణైః సహ,<br>యథా శ్రియ అభియుక్తో౽హం<br>తథా భక్తో మయి ప్రియః। | ఓ బ్రహ్మదేవా! మీకు మానసపుత్రులగు నారదుడు, భృగు, సనకుడు సనందనుడు, సనత్కుమారుడు, సనస్సుజాతుడు మొదలైనవారంతా ఎంత ఇష్టమో,<br>ఒక తండ్రికి ఆతని సంతానమంటే ఎంతగా ఇష్టమో, రుద్రభగవానునికి రుద్రగణమంతే ఎంతగా ప్రియమో,<br>'నేను ఎంతగా లక్ష్మీదేవిని హృదయమున కలిగి ఇష్టపడతానో,<br>అంతగానూ భక్తులంటే నాకు ఇష్టము, ప్రియము కూడా. |
| స హోవాచ అబ్జ యోనిః।<br>చతుర్భిః దేవైః కథం<br>ఏకో దేవస్య, యత్<br>ఏకమ్ అక్షరం యత్-<br>విశ్రుతమ్, అనేకాక్షరం<br>కథం సంభూతమ్? | బ్రహ్మదేవుడు : హే శ్రీకృష్ణ పరబ్రహ్మమూర్తీ! ఒక చిన్న సందేహం. పరమాత్మ అగునీవు సర్వదా ఏకము, అక్షరము అయి ఉన్నావు కదా! అట్టి నీయొక్క ఏకాక్షరతత్త్వము - అనేకముగాను, క్షరవిభాగముతోను కూడుకొన్నదిగా - ఎట్లా, ఎందుకు అవుతోంది?<br>{(జన్మకర్మరహితుడగు) **గోపాలుడవు**, (సనాతునుడవు అగు) - **ప్రద్యుమ్నుడవు**, (సరమస్తమును రమిస్తున్న) **రాముడవు**, నిరోధము ఉండజాలని **అనిరుద్ధుడవు** అగు} - నాలుగు దేవతా రూపములు ఎట్లా ఎందుకు పొందుచున్నావు? |
| **9.** స హోవాచ :<br>హి తం (తం హి) పూర్వమ్<br>"ఏకమేవ అద్వితీయం బ్రహ్మ" అసీత్।<br>తస్మాత్ - 'అవ్యక్తమ్' 'ఏకాక్షరమ్'।<br>తస్మాత్ అక్షరాత్। - 'మహత్'।<br>మహతో - అహంకారః।<br>తస్మాత్ అహంకారాత్<br>పంచ తన్మాత్రాణి।<br>తేభ్యో - భూతాని।<br>తైః ఆవృతం అక్షరమ్। | విష్ణు భగవానుడు : సమస్తమునకు మునుముందుగా (అన్యములు అనునదేదీ లేనట్టి స్థానము నందు) **ఏకము, అద్వితీయము అగు కేవలమే** ఉండి ఉన్నది।<br>అట్టి కేవలమునుండి ఏకాక్షరరూపమగు (ఏకము, అక్షరము అగు) **'అవ్యక్తము'** జనించింది. వ్యక్తీకరణను చేయగల, వ్యక్తీకరణమునకు మునుముందే గల - "ధర్మము" - అవ్యక్తము.<br>అట్టి అక్షరము నుండి **సమస్తము తానే కల్పించు స్వభావమగు'మహత్'** బయల్వెడలింది. అట్టి మహత్ నుండి అహంకారము రూపుదిద్దుకొన్నది.<br>అట్టి అహంకారము నుండి **"శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములు' అనబడే అనుభూతి రూపములగు "పంచతన్మాత్రలు"** పుట్టుకొచ్చాయి.<br>పంచతన్మాత్రలనుండి పంచ సూక్ష్మ భూతములు - (స్థూల - ద్రవ - ఉష్ణ-చలన-స్థాన తత్త్వములు) - బయల్వెడలాయి.<br>అవన్నీ కూడా 'అక్షరము' చేతనే ఆవృతము (Encompassed) అయి ఉంటున్నాయి. |
| అక్షరో౽హమ్।<br>ఓంకారో౽హమ్।<br>అజరో। అమరో।<br>అభయో। అమృతో। | - ఓ బ్రహ్మదేవా! నేను అక్షరుడను. కేవలుడను.<br>- వేదములలో 'సంజ్ఞ'గా చెప్పబడుచున్న **'ఓం'** కార స్వరూపుడను.<br>- జరామరణ ధర్మములు లేనట్టివాడను.<br>- అభయుడను। అమృత స్వరూపుడను। |
| బ్రహ్మో చ। -<br>యం హి వై, స ముక్తో<br>అహమస్మి।<br>అక్షరో౽హ మస్మి।। | - సృష్టియొక్క అభిమాని, కర్త అగు బ్రహ్మదేవుడనునేనే। త్వమేవాహమ్।<br>అక్షరుడనగు నేను నా సంకల్పమునుండి బయల్వెడలుచున్న సృష్టి ధర్మముచే బద్ధుడనుకాను. నిత్యముక్తుడను. దృశ్యాతీతుడను. సృష్టి, క్షర ధర్మములు కలిగి ఉండియున్నప్పటికీ సర్వదా కేవలుడను. సృష్టికి సాక్షిని. అక్షరుడను. |
| సత్తా మాత్రం,<br>చిత్ స్వరూపం,<br>ప్రకాశం వ్యాపకం తథా। | - 'నేను ఉన్నాను' అను కేవల భావముతో కూడిన సత్తామాత్రుడను.<br>- ఎరుగబడుచున్న సమస్తమునకు ఆవల "కేవల ఎరుక" (Absolute knowing) స్వరూపుడను.<br>- సమస్తము ప్రకాశింపజేయువాడను.<br>- సమస్తముగా విస్తరించుచూ సర్వవ్యాపకుడను. |

| | |
|---|---|
| ఏకమేవ అద్వయం బ్రహ్మ<br>మాయయా చ చతురష్టయమ్। | బ్రహ్మము సర్వదా ఏకము, అక్షరము అయి ఉన్నది. అయితే మాయచేత (1) ఈశ్వరుడు, (2) జీవుడు, (3) పంచతన్మాత్రలు, (4) దృశ్యము అనబడేవిగాను, జాగ్రత్-స్వప్న-సుషుప్త-తురీయ పురుషులుగాను - '4' రూపములు దాల్చుచున్నాను. |
| విశ్వుడు : రోహిణీ తనయో "విశ్వ"।<br>'అ' కారాక్షర సంభవః॥ | (1) రోహిణీ దేవికుమారుడగు బలరాముడు విశ్వుడు "ఓం" మొదటిదగు 'అ' కార అక్షరమునుండి సంభవించుచున్నారు. (జాగ్రత్ పురుషుడు). |
| తైజస : తైజసాత్మక 'ప్రద్యుమ్న'<br>'ఉ' కారాక్షర సంభవః॥ | (2) తైజసాత్ముడగు ప్రద్యుమ్నుడు 'ఓం'లోని రెండవదగు 'ఉ'కారము నుండి రూపము దిద్దుకొనుచున్నారు. (స్వప్న పురుషుడు). |
| ప్రాజ్ఞ : ప్రాజ్ఞాత్మకో 'అనిరుద్ధో' అసౌ,<br>'మ' కారాక్షర సంభవః॥ | (3) ఆత్మయొక్క ప్రాజ్ఞత్వమే అనిరుద్ధడై 'మ' కారమునుండి సంభవించుచున్నారు. (సుషుప్తి పురుషుడు). |
| అర్ధమాత్ర: అర్ధమాత్రాత్మకః 'కృష్ణో',<br>యస్మిన్ విశ్వం ప్రతిష్ఠితమ్॥ | (4) ఎవరియందైతే ఈ సమస్త విశ్వము ప్రతిష్ఠితమైయున్నదో అట్టి అర్ధమాత్ర స్వరూపుడే శ్రీకృష్ణుడు. (తురీయ పురుషుడు). |
| కృష్ణాత్మికా జగత్ కర్త్రీ<br>మూల ప్రకృతి - రుక్మిణీ। | ☙ కృష్ణాత్మికము, జగత్‌కర్త్రి యగు మూల ప్రకృతి రూపిణియే **రుక్మిణీదేవి.** |
| వ్రజ స్త్రీ జనసంభూత<br>శ్రుతిభ్యో బ్రహ్మసంగతః। | ☙ **వేదములలోని,** వేద ఉపాంగములగు **ఉపనిషత్తులలోని 'బ్రహ్మతత్త్వము'** గురించిన మహావాక్యాది ఆయా వివరణ విశేషములే **వ్రజగోపికలు.** |
| ప్రణవత్వేన ప్రకృతి 'త్వం'<br>వదంతి బ్రహ్మవాదినః। | 'త్వం' రూపముగా ('నీవు' అనుభావనాసిద్ధిగా) కనిపించేదంతా ప్రకృతిరూపప్రణవమే. ఓంకారము యొక్క ప్రకృతి (**ప్ర**కాశ +**కృ**త +**తి**రోగమన) రూపమే ఇదంతా - అని బ్రహ్మతత్త్వజ్ఞుల ప్రవచనము. |
| తస్మాత్ 'ఓం' కార సంభూతో<br>గోపాలో విశ్వ సంస్థితః | ❍ 'ఓం'కార స్వరూపుడు, ఓంకార సంభూతుడు అగు గోపాలకృష్ణుడే "విశ్వము" రూపముగా "సంస్థితుడు" అయిఉన్నాడు. |
| 'క్లీం' 'ఓం'కారస్య ఏకతత్త్వం (ఓంకారస్యైకతత్త్వం)।<br>వదంతి బ్రహ్మవాదినః।<br>మథురాయాం విశేషణ మాం ధ్యాయన్ మోక్షమ్ అశ్నుతే। | **"క్లీం" "ఓం"**కారముల పరమార్థము - ఆత్మయొక్క ఏకత్వ స్వరూపముగా బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు. |
| **10.** అష్టపత్రం వికసితం<br>హృత్ - పద్మం తత్ర సంస్థితమ్।<br>దివ్య ధ్వజ ఆతపత్రైస్తు<br>చిహ్నితం చరణద్వయం। | **సాకారోపాసన** : (ఆత్మయే సహజస్వరూపముగా గలిగినట్టి) ఈ జీవునిలో '8' దళములు గల హృదయ పద్మము ఉన్నది.<br>అట్టి హృదయములో దివ్యమైన "ధ్వజ, ఛత్రము"ల చిహ్నములుగల రెండు పాదములు కలిగి ఉన్న పురుషుడు వేంచేసినవారై ఉన్నారు.<br>ఆతపత్రము (గొడుగు, ఛత్రము) - ధ్వజముగా కలిగి ఉన్నారు. |
| శ్రీవత్స లాంఛనం హృత్‌స్థం।<br>కౌస్తుభం ప్రభయా యుతమ్ | అట్టి హృదయస్థ శ్రీకృష్ణ చైతన్య భగవాన్ రూపము శ్రీవత్సలాంఛనము (రొమ్ముపై మచ్చ)తో కూడుకొని ఉన్నట్టిది. కౌస్తుభమణితో అలంకరించబడి ఉన్నట్టిది. ఆ మణి తేజోప్రభలు వెదజల్లుచున్నట్టిది. |
| చతుర్భుజమ్। శంఖ చక్ర<br>శార్ఙ్గ పద్మ గదాన్వితమ్।<br>కేయూరాన్విత సద్బాహుం।<br>కంఠమాలా సుశోభితమ్। | (జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయములుగా చెప్పబడే) చతుర్భుజుడు. 4 భుజములు కలిగి ఉన్నట్టిది. శంఖము, చక్రము, విల్లు, పద్మము గదలచే సాయుధ సాలంకృతమైనది.<br>(చతుర్భుజముల మరొక అర్థం - సత్త్వ - రజో - తమో-అహంకారములు)<br>కేయూరములు ధరించిన బాహువులు కలిగియున్నట్టిది, కంఠమునందు కౌస్తుభ మాలను అలంకరించుకున్న రూపము. |

| | |
|---|---|
| **ద్యుమత్ కిరీటం, అభయం,<br>స్ఫురత్ మకర కుండలమ్,<br>హిరణ్మయం సౌమ్యతనుం<br>స్వభక్తాయ అభయ ప్రదమ్। -<br>ధ్యాయేత్ మనసి మాం నిత్యం<br>వేణుశృంగ ధరం తు వా॥** | కాంతిపుంజములు వెదజల్లు కిరీటము ధరించినది, సమస్త భయములు తొలగించునది, మెఱయుచున్న కుండలములు ధరించనట్టిది-అగు కృష్ణసారూప్యము - ఉపాసించబడుగాక।<br>బంగారు రంగుతో వెలుగుచున్న సౌమ్యమగు శరీరము కలది, భక్తులకు అభయ ప్రదము అగు రూపము,<br>**వేణుశృంగ (చేతిలో పిల్లనగ్రోవి) ధరించినది -అగు నా రూపము హృదయము నందు భావించెదరు గాక!** |
| **మథ్యతేతు జగత్ సర్వం బ్రహ్మజ్ఞానేన యేన వా<br>మత్ సారభూతం యద్యత్స్యాత్ మథురా సా నిగద్యతే॥** | ఈ 'జగత్తు' అనే పెరుగును 'బ్రహ్మజ్ఞానము' అనే కవ్వముచే మధించగా, ఈ జగత్తుయొక్క సారముగా సర్వాత్మకమగు **'ఆత్మమాధుర్యము'** అనే వెన్న లభిస్తోంది. |
| **అష్టదిక్పాలకైః భూమిం పద్మం వికసితం జగత్<br>సంసారార్ణవ సంజాతం సేవితం మమ మానసే॥** | అష్టదిక్పాలకులచే పాలించబడు 'భూమి' అంతర్విభాగమై, 'సంసార జలము'లో (సంసార సముద్రజలములో) పుష్పమువలె పుట్టి వికసించినట్టి ఈ జగత్తు - **పరమాత్మనగు నాయొక్క మనోకల్పిత చమత్కారముగా ఎరుగబడు గాక।** |
| **చంద్ర సూర్య త్విషో దివ్యా।<br>ధ్వజా మేరుః హిరణ్మయః।<br>ఆతపత్రం బ్రహ్మలోకం।<br>తత్ ఊర్ధ్వం చరణం స్మృతమ్॥<br>శ్రీవత్సం చ స్వరూపం చ।<br>వర్తతే లాంఛనైః సహ<br><u>"శ్రీ వత్సలక్షణం"</u><br>తస్మాత్ కథ్యతే బ్రహ్మ వాదిభిః॥** | <u>శ్రీవత్సలక్షణము :</u><br>- సూర్యచంద్రుల తేజస్సుతో దివ్యమై వెలుగొందుచున్నట్టిది.<br>- హిరణ్మయమైన మేరుపర్వత స్వరూపమైనట్టిది.<br>- బ్రహ్మలోకమే గొడుగుగా (ఆతపత్రముగా) కలిగినది.<br>- అట్టి ఈ విశ్వమునకు ఆవల (పైన) నా చరణములు సమస్త శుభములు కలుగజేయు స్వరూపము. శ్రీవత్సలాంఛనము కలిగియున్నట్టిది,<br>సమస్త లాంఛనములు అలంకారముగా కలిగియున్నట్టిది - కాబట్టి 'శ్రీవత్సలక్షణము' అని బ్రహ్మజ్ఞులచే అభివర్ణించబడుతోంది. |
| **యేన సూర్య అగ్ని వాక్ చంద్ర తేజసా<br>స్వస్వరూపిణా, వర్తతే "కౌస్తుభ" ఆఖ్యం<br>మణిం వదంతి ఈశమానినః॥** | <u>కౌస్తుభమణి :</u><br>ఏ స్వరూపముయొక్క విభవముచే సూర్య, చంద్ర, అగ్ని, వాక్, తేజస్సులు వెలుగొందుచున్నాయో - అట్టి ప్రకాశమును ఈశ్వర తత్త్వవేత్తలు - **"అదంతా కౌస్తుభ మణి <u>వర్ణనమే</u>"** - అని స్తుతిస్తున్నారు. |
| **"సత్త్వం" "రజః" "తమః" - ఇతి<br>"అహంకారః" చతుర్భుజః।** | **<u>చతుర్భుజములు :</u>**<br><u>'సత్త్వము, రజము, తమము, అహంకారము'</u> - ఇవియే - శ్రీకృష్ణ చైతన్య - చతుర్భుజములుగా (వేద-ఇతిహాస పురాణములచే) వర్ణించబడుచున్నాయి. |
| **పంచతన్మాత్రకం శంఖం<br>కరే రజసి సంస్థితమ్।** | శంఖము : హస్తములో అలంకరించబడియున్న శంఖము → రజోరూపమగు "శబ్ద స్పర్శ రూప రస గంధములు"-అనే పంచతన్మాత్ర చమత్కారము. |
| **బాలస్వరూపమ్ ఇత్యంతం<br>"మనశ్చక్రం" నిగద్యతే।** | చక్రము : మనస్సు యొక్క బాలచాపల్యమువంటి పరిభ్రమణ చమత్కారమే చేతిలో ధరించబడే **'విష్ణుచక్రము'.** |
| **ఆద్యా మాయా భవేత్ శార్ఙ్గం॥<br>పద్మం విశ్వకరే స్థితమ్॥** | శార్ఙ్గము : ఆది స్వరూపిణి, అనాది యగు "మాయ"యే చేతిలోని ధనస్సు.<br>పద్మము : ఈ విశ్వనిర్మాణ చమత్కార-సౌందర్యమే నాచేతిలోని పద్మముయొక్క సంజ్ఞ.<br>**(మాయాంతు ప్రకృతిం విద్ధి మాయినంతు మహేశ్వరః)** |

| | |
|---|---|
| **11.** ఆద్యా విద్యా గదా వేద్యా<br>సర్వదా మే కరే స్థితా॥ | గద : ఎల్లప్పుడు చేతిలో సంస్థితమైన గదయే-ఆత్మ విద్య. వేద - ఉపనిషత్ - ఇతిహాస - పురాణములలో వర్ణించబడుచున్న "ఆత్మవిద్య" (బ్రహ్మవిద్య)- యొక్క చిహ్నము - "గద". |
| ధర్మ అర్థ కామ కేయూరైః<br>దివ్యైః దివ్యమయేరితైః।<br>కంఠం తు నిర్గుణం ప్రోక్తం। | **కేయూరములు** : స్వామి భుజములపై ధరిస్తున్న దివ్యాతి దివ్య కేయూరములు - (భుజకీర్తులు) - **ధర్మ - అర్థ - కామములు.**<br>**కంఠము** : నిర్గుణ (త్రిగుణాతీత సాక్షీస్వరూప) సంజ్ఞ. |
| మాల్యతే ఆద్యయా అజయా।<br>మాలా నిగద్యతే, బ్రహ్మన్!<br>తవ పుత్రైస్తు మానసైః॥ | **మాల** : మాల (వనమాల/పుష్పమాల) అజేయమగు **"ఆది"** స్వరూప చిహ్నము. ఓ బ్రహ్మదేవా! (సనత్కుమార, సనస్సుజాత, సనక, సనంద, నారద, వసిష్ఠాదులు) మీ మానసపుత్రులే నాకు మాలలు. |
| కూటస్థం సత్త్వరూపం చ<br>కిరీటం ప్రవదన్తి మామ్।<br>క్షీరోత్తరం ప్రస్ఫురంతం<br>కుండలం యుగళం స్మృతమ్। | **కిరీటము** : కిరీటము సత్త్వగుణమునకు, 'కూటస్థరూపము'నకు సంజ్ఞ - (A symbol of 'sath' and root of "SELF").<br>**కుండలములు** : క్షీరసముద్రముగా ప్రస్ఫురించే తత్త్వమే (భావనలకు ఆవలి తత్త్వమే) చెవుల కుండలములు. భావన చేయువాని (ఆత్మ) తత్త్వము- కుండలముల సంజ్ఞ. |
| ధ్యాయేత్ మమ ప్రియం నిత్యం<br>స మోక్షమ్ అధిగచ్ఛతి।<br>స ముక్తో భవతి।<br>తస్మై స్వాత్మానం తు దదాతి వై। | పై విశేషములతో నా రూపము (సారూప్య శ్రీకృష్ణ ప్రతిమ - విగ్రహము)ను పైన చెప్పబడిన భావనలతో కూడి అర్చించువాడు **<u>"ఆత్మ స్వరూపుడనగు నేను దేనిచేతనూ బద్ధుడనుకాను"</u>** - అను మోక్షము సిద్ధించుకోగలడు. అట్టివాడు 'ముక్తుడు' అగుచున్నాడు. పై విధమైన శ్రీకృష్ణతత్త్వోపాసకునికి నేను అఖండ స్వాత్మానంద సిద్ధి ప్రసాదించుచున్నాను. |
| ఏతత్ సర్వం మయా ప్రోక్తం<br>భవిష్యత్ వై, విధే! తవ।<br>స్వరూపం ద్వివిధం చ ఏవ –<br>సగుణమ్, నిర్గుణాత్మకమ్। | ఓ విధీ! సృష్టికర్తా! ఇప్పుడు మీకు చెప్పిన "శ్రీకృష్ణ ప్రతిమ - భావనోపాసన" మనము చెప్పుకొన్న ఫలశృతి తప్పక సిద్ధించగలదు.<br>ఓ బ్రహ్మదేవా! నాయొక్క స్వరూపము రెండు విధములైనవిగా ఉంటోంది. (1) సగుణము (2) నిర్గుణము |
| <u>సహో వా చ అబ్జయోనిః॥</u><br>వ్యక్తీనాం మూర్తీనాం ప్రోక్తానాం<br>కథం త్వ ఆభరణాని భవంతి?<br>కథం వా దేవా యజంతి?<br>రుద్రా యజంతి?<br>బ్రహ్మో యజంతి? బ్రహ్మజా యజంతి?<br>వినాయకా యజంతి?<br>ద్వాదశాదిత్యాః యజంతి?<br>వసవో యజంతి?<br>గంధర్వా యజంతి?<br>సపదానుగా అంతర్ధానే తిష్ఠంతి?<br>కాం మనుష్యా యజంతి? | **బ్రహ్మదేవుడు** : స్వామీ! నారాయణావతారా! శ్రీకృష్ణా! నాదొక సందేహము, వ్యక్తులకు, మూర్తీభవించిన వారికి అన్వయమయే విశేషములు మీయొక్క శరీరభాగములు, ఆభరణములు (చతుర్భుజములు, శంఖము, చక్రము, విల్లు, పద్మము, గద, భుజకీర్తులు, కంఠము, కుండలములు, మొదలైనవి) వాటికి ఎట్లా సమన్వయము అవుతాయి? రుద్రుడు, బ్రహ్మ, బ్రహ్మమానస పుత్రులు, వినాయకుడు, ద్వాదశాదిత్యులు, వసువులు, గంధర్వులు, మానవులు ఏ విధంగా ఉపాసించుచున్నారు? 'సపదానుగా' అయి, అంతర్ధానరూపమై ఉంటున్నది ఏది?<br>మీరు అనేక దేవతలుగా, రుద్రుడుగా, బ్రహ్మదేవునిగా, సరస్వతిగా, వినాయకునిగా, ద్వాదశాదిత్యులుగా, అష్టవసువులుగా, గంధర్వులుగా, అవ్యక్తులుగా, మనుష్యులుగా కూడా ఎట్లా ఉపాసించబడుచున్నారు? |

**12. స హోవాచ**

**తం హి వై నారాయణో దేవః -**

**ఆద్యా వ్యక్తా ద్వాదశమూర్తయః,**

**సర్వేషు లోకేషు, సర్వేషు దేవేషు**

**సర్వేషు మనుష్యేషు తిష్ఠంతీతి॥**

**నారాయణావతార శ్రీకృష్ణుడు :** ఏకోనారాయణుడే దేవాది దేవుడు.

కేవలుడు, ఏకాక్షరుడు, నిర్విషయుడు అగు నా శ్రీమన్నారాయణ తత్త్వమే ద్వాదశ (12) మూర్తులను (రూపములను) ధరించి సమస్త లోకములలోను, సమస్త వేదములలోను, సర్వ మానవులందు, సమస్త జీవులందు సుతిష్ఠితము (wel seated) అయి ఉన్నది.

---

**రుద్రేషు "రౌద్రీ"। బ్రహ్మణి "బ్రాహ్మీ"।**

**దేవేషు "దైవీ"। మనుష్యేషు "మానవీ"।**

**వినాయకేషు "విఘ్న వినాశనీ"।**

**ఆదిత్యేషు "జ్యోతిః"।**

**గంధర్వేషు గాంధర్వీ।**

**అప్సరః స్వ-ఏవం 'గౌః'। (స్వేవం గౌ)।**

**వసుషు ఏవం కామ్యా॥**

**అంతర్ధానేషు-అప్రకాశినీ।**

**ఆవిర్భావ - తిరోభావాః**

**<u>స్వపదే తిష్ఠన్తి।</u>**

**<u>అట్టి నాయొక్క శ్రీకృష్ణ చైతన్య కేవల ఆత్మానందమే</u>**

- ఏకాదశ రుద్రులలో (సమస్తము రౌద్రముచే శమింపజేయు) - రౌద్రీతత్త్వమై యున్నది.
- సృష్టి సంకల్పుడగు బ్రహ్మదేవునియందు బ్రాహ్మీ స్వరూపముగా ప్రకటనమౌతోంది.
- దేవతలలో ఆశ్రితులకు శుభము కలుగజేయు దివ్యమగు దైవీ స్వరూపముగా వేంచేసి ఉన్నది.
- మానవులలో మానవత్వమైయున్నది.
- ఆదిత్యునియందు (సూర్యునియందు) తేజస్సుగా వెలుగొందు చున్నది.
- గంధర్వులయందు గాంధర్వ (గాన) రూపమై ఉంటోంది. పాట, వాక్కు, భాష స్వరూపమై ఉంటోంది.
- అప్సరసలయందు 'గౌః' (సత్యమును చూపు రూపము)గా ఉన్నది. సౌందర్య రూపమైయున్నది. సర్వము ప్రసాదించు గో- రూపమై యున్నది.
- (అష్ట) వసువులలో - (ప్రియమగు) వసించటము (Being) అను చమత్కారమై యున్నది. (యత్ భావం తత్ భవతి - అను) కామ్యరూపమై ఉన్నది.
- అంతర్ధానమునందు సమస్తము ప్రకాశింపజేయుచు, తాను అప్రకాశమానమై ఉన్నది. అట్టి నా శ్రీకృష్ణ పరతత్త్వము ఈ దృశ్యము యొక్క రాక - పోకలకు ఆవల స్వస్థానమునందే ఏర్పడి ఉన్నది.

---

**తామసీ రాజసీ సాత్త్వికీ**

**మానుషీ విజ్ఞానఘన ఆనంద**

**సత్ చిత్ ఆనంద ఏక రసే, భక్తియోగే తిష్ఠతి॥**

**<u>ఓం ప్రాణాత్మనే।</u>**

**<u>ఓం తత్ సత్ భూః భువః సువః (భూర్భువ-స్సువః)</u>**

**<u>తస్మై "ప్రాణాత్మనే" నమో నమః॥</u>**

**<u>ఓం శ్రీకృష్ణాయ గోవిందాయ</u>**

**<u>గోపీజన వల్లభాయ</u>**

**<u>ఓం తత్సద్భూర్భువస్తస్మై వై నమో నమః॥</u>**

**<u>(ఓం తత్ సత్ భూః భువః సువః తస్మైవై నమో నమః)</u>**

తామస - రాజస - సాత్త్విక త్రిగుణాత్ముడను. మానుషీ (Manhood) స్వరూపుడను. ఘనీభవించిన ఎరుకరూపుడను. విజ్ఞాన ఘనుడను, స్వయమానందస్వరూపుడను. సత్-చిత్-ఆనంద ఏకరసుడను.

శ్రీకృష్ణ పరమాత్మను అగు నేను భక్తియోగమునందు వేంచేసియుండి భక్తులకు వశుడనై ఉంటాను. భక్తుల ప్రేమ హృదయమునకు దాసుడనై ఉండటము - నా స్వభావము.

**దూర్వాసుడు:** అట్టి పంచ ప్రాణాది స్వరూప పరమాత్మకు నమస్కరిస్తున్నాను.

ఓంకార స్వరూప ప్రాణాత్మస్వరూపా! సమస్తమునకు ఆవల 'తత్' స్వరూపమై సమస్తము తానే అయి ఉన్న సత్ స్వరూపా! మీ ప్రాణాత్మ స్వరూపమునకు వందన సహస్రములు. 'ఓం' పరమాత్మ- స్వరూప శ్రీకృష్ణా! గోవిందా! గోపీజన వల్లభా! భూ భువ సువ త్రిలోకములు నిండియున్నవాడా! సమస్తము నీవే అయి ఉన్నవాడా! నమో నమః॥

| | |
|---|---|
| **"ఓం అపానాత్మనే"।**<br>**ఓం తత్సత్ భూర్భువస్సువః**<br>**తస్మై అపానాత్మనే నమో నమః**<br>**ఓం శ్రీకృష్ణాయ అనిరుద్ధాయ**<br>**ఓం తత్సద్భూర్భువస్సువః**<br>**తస్మై వై నమో నమః॥** | ఓంకార - **అపానప్రాణాత్మస్వరూపా।** తత్ (That) సత్ (At Present Entity) భూ (Matter) భువః (Thought) సువః (self) స్వరూప **అపానప్రాణాత్మకుడనైన** నీకు నమస్కరిస్తున్నాను.<br>దేనిచేతనూ నిరోధించబడజాలనివాడా! అనిరుద్ధా! భూర్భువస్సువ త్రిలోకస్వరూపా! అట్టి నీకు నమో నమః। |
| **"ఓం వ్యానాత్మనే।"**<br>**ఓం తత్ సత్ భూర్భువస్సువః**<br>**తస్మై వ్యానాత్మనే నమో నమః।**<br>**ఓం శ్రీకృష్ణాయ రామాయ**<br>**ఓం తత్ సత్ భూర్భువస్సువః**<br>**తస్మై వై నమో నమః॥** | ఓ వ్యానప్రాణ స్వరూపా। వ్యానాత్ముడవై భూ-భువః - సువర్ (భౌతిక మానసిక ఆధ్యాత్మిక) లోకములన్నీ నిండియున్న **వ్యానాత్మదేవా!** నమో నమః।<br>"భగవాన్ స్వయమ్" అగు హే కృష్ణా! అవతారమూర్తివగు బలరామా! తత్ (ఆవల) సత్ (అంతటా ఉనికి-ప్రేరణ) - భూ భువర్ సువర్లోకములలో (Matter, Sense and self in all) స్వయంప్రకాశమానుడవై ఉన్నవాడా। అట్టి నీ తత్త్వమునకు నమో నమః। |
| **"ఓం ఉదానాత్మనే"।**<br>**ఓం తత్ సత్ భూర్భువస్సువః**<br>**తస్మై ఉదానాత్మనే నమో నమః।**<br>**ఓం శ్రీకృష్ణాయ దేవకీనందనాయ**<br>**ఓం తత్సత్ భూర్భువస్సువః**<br>**తస్మై వై నమో నమః॥** | ఓంకార ఉదాన ప్రాణాత్మకా!<br>తత్ (కేవల) సత్ (సత్య-నిత్య) స్వరూపుడవై భూ-భువ-సువర్లోకములలో (పాతాళ-భూ-స్వర్గలోకములలో) సర్వప్రేరకుడవైనవాడా నమో నమః।<br>హే శ్రీకృష్ణభగవాన్! దేవకీనందనా! త్రిలోకధారుడా!<br>భూ భువః సువః లోకములు తమకు అనన్యమైనవాడా! నమో నమః॥ |
| **"ఓం సమానాత్మనే।"**<br>**ఓం తత్ సత్ భూర్భువస్సువః (భూః భువః సువః)**<br>**తస్మై సమానాత్మనే నమో నమః।**<br>**ఓం శ్రీ గోపాలాయ నిజస్వరూపాయ**<br>**ఓం తత్సత్ భూర్భువస్సువః**<br>**తస్మై వై నమో నమః॥** | ఓ సమానప్రాణాత్మ భగవాన్! 'ఓం' కార, తత్స్వరూప, సత్ స్వరూప భూ-భువర్-సువర్ స్వరూప సమానాత్మ ప్రాణదేవా! నమస్తే।<br>ఇంద్రియములనే గోవులను కల్పించి, నియమించి, పాలించు పరబ్రహ్మ 'ఓం' కారమా! సమస్త జీవుల నిజస్వరూపమా! (The original Self of All) ! ఓం తత్ సత్ భూ భువర్ సువర్లోక ఆనంద స్వరూపుడవైన నీకు - నమో నమః॥ |
| **ఓం యోఽసౌ ప్రధానాత్మా గోపాల।**<br>**ఓం తత్ సత్ భూః భువః సువః (భూర్భువస్సువః)**<br>**తస్మై వై నమో నమః॥** | సమస్త జీవులలో ప్రధానాత్ముడవై (The sole main self) సమస్తమును కల్పించి, పాలించుచున్న గోపాలస్వామీ। మీయొక్క ఓంతత్సత్ భూర్భువస్సువ సమగ్ర స్వరూపమునకు నమో నమః॥<br>**(సప్రాణాత్మకా! నమస్తే।)** |
| **ఓం యోసౌ**<br>**ఇంద్రియాత్మా గోపాల।**<br>**ఓం తత్సత్ భూర్భువస్సువః**<br>**తస్మై వై నమో నమః॥** | సమస్త జీవులను, వారి వారి పంచేంద్రియములను కల్పించి సమస్తమున పాలించువాడా! 'ఇంద్రియములు' అనే ఆవులకు 'దృశ్యము' అనే ఆహారమును ఇచ్చి మేపువాడా! జీవులకు ఇంద్రియములను విషయములను ప్రసాదించి పాలించువాడా! ఓంకార తత్ - సత్ స్వరూప - భూర్భువస్సువ స్వరూపా! నమో నమః॥ |
| **ఓం యోఽసౌ భూతాత్మా గోపాల।**<br>**ఓం తత్ సత్ భూః భువః సువః**<br>**తస్మై వై నమో నమః॥** | భూ-జల-అగ్ని-వాయు-ఆకాశ (Solid - liquid - Fire - Air-spacing) - పంచ భూతములకు ఆత్మ స్వరూపుడవగు భూతాత్ముడా! వాటిని పాలించు గోపాలుడా! ఓం తత్ సత్ భూర్భువ స్వరూపములు ప్రదర్శించు శ్రీకృష్ణస్వామీ! నమో నమః॥ |

| | |
|---|---|
| **ఓం యో౽సౌ (యో౽సా)**<br>**ఉత్తమ పురుషో గోపాల।**<br>**ఓం తత్ సత్ భూర్భువస్సువః**<br>**తస్మై వై నమో నమః॥** | - సమస్త జీవులలో "నేను-నేను" (I am, I am) అను స్ఫురణగా వేంచేసియున్న ఉత్తమ పురుషా! (The First person in all beings)! పురుషోత్తమా! అట్టి ఉత్తమ పురుషత్వముచే 'భూభువర్‌సువర్' సమస్త లోకములను నింపుచుచున్నవాడా! అట్టి నీకు నమో నమో నమః [నాలోని 'నేను' అయి, సమస్తము 'నేను'గా అగుచున్నవాడా! నమస్కారము।] |
| **ఓం యో౽సౌ**<br>**బ్రహ్మో పరంవై బ్రహ్మ।**<br>**ఓం తత్ సత్ భూః భువః సువః**<br>**తస్మై వై నమో నమః॥** | సృష్టికి అభిమాని, కర్త అయిన బ్రహ్మదేవ స్వరూపా! (పాత్రకు ఆవలగల నటుని స్వరూపమువంటి) <u>**"పరమ్"**</u> - బ్రహ్మమూర్తీ! **ఓంకారనంద తత్‌సత్ భూర్భువస్సువ స్వరూపుడవై ప్రదర్శనమగుచున్న శ్రీకృష్ణానందస్వామీ!** మీకు నమస్కారము। నమస్కారము। నమస్కారము। |
| **ఓం యో౽సౌ సర్వభూతాత్మా గోపాల।**<br>**ఓం తత్ సత్ భూః భువః సువః**<br>**తస్మై వై నమో నమః॥** | ఏ పరాత్పర స్వరూపుడైతే సమస్త జీవులలో కేవలుడుగా, <u>అఖండుడుగా , అంతరాత్ముడుగా విరాజిల్లుచున్నారో</u> - అట్టి **ఓం తత్‌సత్ భూర్భువస్సువ** స్వరూప సర్వభూతాత్మ గోపాలునికి నమో నమో నమో నమః |
| **ఓం జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయ - అతీతో,**<br>**అంతర్యామీ గోపాల**<br>**ఓం తత్ సత్ భూః భువః సువః**<br>**తస్మై వై నమో నమః॥** | ఎవ్వరైతే జాగ్రత్ - స్వప్న - సుషుప్తులకు ఆవలివాడై, వాటికి జననస్థానమై, ప్రేరకుడై, అంతర్యామిగా వ్యవహరిస్తూనే - సమస్తమునకు అతీతుడై ఉన్నారో - అట్టి **ఓం తత్సత్ భూర్భువస్సువ శ్రీకృష్ణ** పరబ్రహ్మమునకు నమస్కారము! నమో నమో నమో నమః॥ |
| **13. ఏకోదేవః - సర్వభూతేషు గూఢః।**<br>**సర్వవ్యాపీ। సర్వభూతాంతరాత్మా।**<br>**కర్మాధ్యక్షః సర్వ భూతాధివాసః।**<br>**సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ॥** | (అన్ని దీపములలోను ఒకే అగ్ని వలె, నాటకములోని అగ్నిపాత్రల భావికుడు - ఒకే రచయిత అయి ఉన్నతీరుగా)<br>ఒకే దేవాది దేవుడు సమస్త జీవులలో గూఢముగా వేంచేసి ఉన్నారు.<br>ఇంద్రియములకు అవిషయుడు కాబట్టి 'రహస్య స్వరూపుడు'గా వర్ణించబడుచున్న ఆ అధి దేవుడు ఏకమేగాని అనేకముగా అగుటలేదు.<br>(నవలారచయిత నవల అంతా విస్తరించి ఉన్న తీరుగా) ఆ పరమాత్మ సర్వవ్యాపి। సర్వ జీవరాసుల అంతరాత్మ ఆయనయే।<br>ఆయన సమస్త కర్మలకు అధ్యక్షుడు. (Presides over all Functions of total creation ). సర్వభూతములలో అధివాసుడు (Dwells in all ).<br>(నాటకదీపమువలె) సర్వమునకు సాక్షి. కేవల బుద్ధిస్వరూపుడై వెలుగొందుచున్నవాడు. త్రిగుణములకు కారణకారణుడు. త్రిగుణములకు ఆవల నిర్గుణుడై ప్రకాశించుచున్నవారు. |
| **ఓం రుద్రాయ నమః।**<br>**ఓం ఆదిత్యాయ నమః।**<br>**ఓం వినాయకాయ నమః।**<br>**ఓం సూర్యాయ నమః।**<br>**ఓం విద్యాయై నమః।** | ✠ సమస్తమున తన చైతన్య స్ఫూర్తితో ఉత్సాహపరచు ఆత్మ స్వరూప రుద్రునికి నమస్కారము. (Inspires all).<br>✠ సమస్తమునకు ఆది (The Basic Begining) అయి వెలుగొందు ఆ ఆదిత్యునికి నమస్కారము.<br>✠ సమస్త జగదంతర్గత గణములకు విశేషనాయకుడగు ఆ వినాయకునికి నమస్కారము (The Group leader of all Groups).<br>✠ సమస్త జీవులు తన కిరణములుగా కలిగియున్న ఆత్మసూర్యునికి నమస్కారము.<br>✠ సర్వవిద్యలకు అధిష్ఠానము అయి ఉన్న విద్యాదేవీ స్వరూప (సరస్వతీస్వరూప) ఆత్మ భగవానునికి నమో నమః, 'తెలుసుకోవటము, తెలియబడటము కూడా తానే అయి ఉన్న స్వామికి నమో నమః॥<br>(స రసత్ వతీ స్వరూప దేవదేవీ నమః) |

ఓం ఇంద్రాయ నమః।
ఓం అగ్నయే నమః।
ఓం యమాయ నమః।
ఓం నిరృతయే నమః।

✠ సర్వేంద్రియ - ఇంద్రియ విషయ పరిపాలకుడగు ఇంద్రభగవానుని రూపముగా వేంచేసియున్న కృష్ణపరమాత్మకు నమస్కారము.

✠ సమస్తమునకు తన ఉష్ణశక్తి ఉనికిని ప్రసాదిస్తున్న అగ్నిదేవరూప ఆత్మ భగవానునికి నమస్కారము.

✠ సమస్తమును తన చేతనముచే లయింపజేయు యమభగవాన్‌రూప ఆత్మకు నమస్కారము.

✠ దక్షిణ - పశ్చిమముల నడిమి దిక్ స్వరూపుడు, చతుర్దిక్పాలకుడుగా ఉన్న నిర్పతి ఆత్మభగవానునికి నమస్కారము.

---

ఓం వరుణాయ నమః।
ఓం వాయవే నమః।
ఓం కుబేరాయ నమః।
ఓం ఈశానాయ నమః।
ఓం సర్వేభ్యో దేవేభ్యో నమః।

✠ బల-వర్షదేవత, ద్వాదశ ఆదిత్యులలో ఒకడు అగు వరుణాత్మ స్వరూప శ్రీకృష్ణ భగవానునికి నమస్కారము.

✠ సమస్త జీవుల త్రాణఅయి, ప్రచేతనము (Basic Ignition) ప్రసాదిస్తున్నట్టి శ్రీకృష్ణ స్వరూప వాయుదేవునికి నమో నమః

✠ అష్టదిక్పాలకులలో ఒకడు, ఉత్తర (దిక్ పట్టణ అలంకారపురీ పాలక, చిత్రలేఖాపతి, ఐశ్వర్యదేవత అగు) కుబేర-ఆత్మ శ్రీకృష్ణ భగవానునికి నమస్కారము.

✠ (ఈశాన దిక్‌పతి, సమస్తమునకు అధినేత, ఐశ్వర్యశీలుడు, సమస్తముగా విస్తరించువాడు, శివుని ఐదు ముఖములో ఒకటైనవాడు అగు) ఈశాన ఆత్మ శ్రీకృష్ణ భగవానునికి నమస్కారము.

✠ ఓంకార స్వరూపులై లోకపాలకులై యున్న సమస్త దేవతలకు, ముక్కోటి దేవతా స్వరూప శ్రీకృష్ణపరమాత్మకు నమస్కారము.

---

దత్వా స్తుతిం పుణ్యతమాం
బ్రహ్మణే స్వస్వరూపిణే।
కర్తృత్వం సర్వ భూతానామ్
అంతర్ధానే బభూవ సః॥

స్వస్వరూపమే అయి ఉన్న శ్రీకృష్ణ పరబ్రహ్మమునకు పుణ్యాకార్యక్రమములు, పుణ్యతమమైన స్తుతులు సమర్పిస్తున్నాను.

సర్వభూతజాలమునకు కర్త అయి, తాను అప్రత్యక్షుడు (అంతర్ధాన స్వరూపుడు), ఆశ్చర్యము కలిగించువారు - అగు పరబ్రహ్మమూర్తికి ఆశ్చర్యపూర్వక నమస్కారము.

---

బ్రహ్మణే బ్రహ్మపుత్రేభ్యో
నారదాత్తు శ్రుతం మునేః

**శ్రీ దుర్వాసమహర్షి** : ఓ గోపికలారా! ఈ విధంగా శ్రీమన్నారాయణుని నుండి బ్రహ్మదేవుడు శ్రీకృష్ణ పరబ్రహ్మతత్త్వము శ్రవణం చేసారు. బ్రహ్మ దేవుడు బోధించగా బ్రహ్మ మానసపుత్రులగు శ్రీ నారదుడు మొదలైనవారు శ్రవణం చేశారు. మునులు విన్నారు. వారి వద్ద మేమంతా శ్రవణం చేశాము.

---

తథా ప్రోక్తం తు గాంధర్వీ
గచ్ఛ త్వం స్వాలయాంతికమ్। ఇతి॥

**గోపాలోత్తర తాపిన్యుపనిషత్ సమాప్తా॥**

**ఓం శాంతిః। శాంతిః। శాంతిః।**

ఓం గాంధర్వీ! భక్తిరస పారవశ్యులగు మీ వ్రజగోపికలంతా ధన్యులు.

నేను చెప్పినదంతా విన్నారు కదా!

ఇక మీరు తిరిగి యమున దాటి బృందావనమునకు వెళ్ళండి. మీ వ్రతఫలము లోకకళ్యాణార్థం శ్రీకృష్ణ భగవానుని పాదపద్మములకు హృదయపుష్ప సమేతంగా సమర్పించి ధన్యులు అయ్యెదరు గాక।

మీ హృదయాలయములలో శ్రీకృష్ణునితో అభేదత్వము సిద్ధించుకొనెదరుగాక।

***ఇతి గోపాలోత్తరతాపిన్యుపనిషత్।***

***ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥***

అథర్వణవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 6(II) గోపాల ఉత్తర తాపిన్యుపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



## దుర్వాస మహర్షి – కొన్ని పౌరాణిక విశేషాలు / వృత్తాంతములు

**మార్కండేయ మహా పురాణము :**

అత్రి – అనసూయ దంపతులు త్రి–అంశల పుత్రులు కావాలని త్రిమూర్తులగురించి తపోనిష్ఠులు అయినారు. అప్పుడు బ్రహ్మ–విష్ణు–మహేశ్వరులు ప్రత్యక్షమై **"మేము ఏకాంశులమే గాని వేరు వేరు కాదు. అందుచేత మూడు అంశల ఏకరూపుడుగా మీకు ఒక కుమారుని ప్రసాదిస్తున్నాము"** అని అనుగ్రహించారు. ఆ బిడ్డయే **దత్తాత్రేయుడు.**

దత్తాత్రేయుడు గర్భమున ఉన్నప్పుడు 'హైహయుడు' అనే రాక్షసుడు అనసూయాదేవి గర్భమునకు నిరోధములు కలిగించసాగాడు. అది గమనించిన శివభగవానుడు హైహయుని నిర్దగ్ధుని (నిర్వీర్యుని) చేయటానికై తానే అనసూయా గర్భములో ప్రవేశించి ఆమెకు జన్మించారు. ఈవిధంగా దుర్వాసుడు శివావతారుడు.

**భాగవతము :**

త్రిమూర్తుల అంశలుగా – (1) సోముడు (బ్రహ్మదేవుని అంశ), (2) దత్తాత్రేయుడు (విష్ణు అంశ), (3) దుర్వాసుడు (శివాంశ) – అను ముగ్గురు కుమారులు జన్మించారు.

**భారతము :**

శివుడు త్రిపురాసురులను సంహరించిన తరువాత, వారిని చంపిన బాణములను ఒక బాలుడు తన చంకనబెట్టుకొని తేసాగాడు. దేవతలు – "ఈ మహాతేజోవిలాసుడగు బాలుడు ఎవరు?" అని ఆశ్చర్యపడుచూ ఉండగా, **"ఈతడు నా అంశ అగు దుర్వాసుడు"**– అని శివభగవానుడు దేవతలతో పలికారు.

**బ్రహ్మాండ పురాణము :**

ఒక సందర్భములో గంధ మాదన పర్వతముపై దుర్వాసమహర్షి ప్రశాంతముగా తపస్సు చేసుకుంటూ ఉన్నారు. అప్పుడు అక్కడ తిలోత్తమ–సాహసికుడు అనువారు ఆహ్లాదంగా ప్రణయ సంచారములు చేయసాగారు. దుర్వాసుని ఏకాగ్రతకు భంగమైనది. ఆయన కోపగించి "మీరు రాక్షసులు అవండి!" – అని శపించారు. ఆ సాహసికుడే 'గార్ధభాసురుడు".

అయితే ఇక అప్పటినుండి దుర్వాసునికి సంసారవాంఛ జనించింది. ఇది తెలుసుకొని, 'ఔర్వుడు' అనే ఆయన తన కుమార్తె అగు 'కందళి'ని తెచ్చి దుర్వాస మహర్షికి వినయముతో ఇచ్చి వివాహం చేసారు. ఆమెతో మహర్షి కొన్నాళ్లు క్రీడించారు. అయితే ఆ కందళికి కోపము చాలా ఎక్కువ. **కోపము చూపించటం చాలా తేలిక. కానీ, కోపం భరించటము చాలా కష్టము కదా!**

దుర్వాస మహర్షి ఆ కోపమును భరించలేక, ఇక ఆమెను విడచి తపస్సు ప్రారంభించారు. కానీ కందళి భర్తవెంటనే ఉండసాగింది. కొన్నాళ్లకు, ఒక బ్రాహ్మణ బాలుడు వచ్చి, దుర్వాసునివద్ద వేద-వేదాంత విశేషాలు శ్రవణం చేయసాగాడు. ఒకరోజు "గురువుగారూ! భార్య అర్ధాంగి కదా! అమ్మగారు కందళిని తిరస్కరించటము ఉచితమా? అట్లా అయితే ఈమెయే జనన్మాంతరాలుగా భార్య అవుతుందని శాస్త్రము కదా!" అని పలికారు. అది విని చిరునవ్వుతో "ఓ కందళీ! నీకు కోపము తొలగుగాక! నీనుండి భూలోకములో కదళీజాతి (అరటిచెట్లు) ఏర్పడి పూజింపబడునవి అగు గాక!" ... అని వరము ఇచ్చారు.

**భారతము :**

దుర్వాసుడు ఒకసారి కుంతిభోజుని రాజ్యమునకు వెళ్లారు. ఆయన కుమార్తె కుంతీదేవి సమర్పించిన సేవలకు సంతోషించి – 'నీకు ఒక మంత్రము ప్రసాదిస్తాను. ఈ మంత్రము ఉపాసిస్తే, ఏ దేవుడు కోరితే, – ఆతడు వచ్చి నీకు తన అంశతో కూడిన పుత్రుని సద్యోగర్భంగా ప్రసాదించగలరు" – అని చెప్పి మంత్రము ఉపదేశించారు.

ఇది సూర్యపుత్రుడగు కర్ణుని జన్మకు కారణమైనది.

**విష్ణు పురాణము :**

ఒకసారి దుర్వాస మహర్షి లోక సంచారము చేస్తున్నారు. మార్గమధ్యంలో ఒక విద్యాధర స్త్రీ ఎదురుపడి, దుర్వాసునికి పాదాభివందనము చేసి, భక్తి ప్రపత్తులతో ఒక పుష్పమాలికను సమర్పించింది. అది స్వీకరించిన ఆ మహర్షి, ఆ విద్యాధర స్త్రీని ఆశీర్వదించి, తన ప్రయాణం కొనసాగిస్తూ, స్వర్గలోకములో ప్రవేశించారు. ఆ సమయంలో ఇంద్రుడు సపరివారంగా ఐరావతముపై విహరిస్తున్నారు. అప్పుడు దూర్వాసుడు, **"ఓ త్రిలోకాధిపతీ! నీ సౌందర్యమును చూచి ఆనందిస్తున్నానయ్యా!. ఇదిగో! ఈ పుష్పమాలను స్వీకరించు"** ... అని చేతికి ఇచ్చారు. అది చేత ధరించిన ఇంద్రుడు – "ఇటువంటివి నా దగ్గర ఎన్ని లేవు?" ... అని తలచుచూ ఐరావతముపై విసరివేసారు. ఆ ఏనుగు దానిని క్రిందిపారవేసింది. అది చూచి ఇంద్రుడు, ఆయన పరివారములోని దేవతలు నవ్వుకోసాగారు. అది చూచి **"నేను దండ ఇస్తే అవమానించావు కదా! ఇదే నా శాపము. నీ సిరి అంతా సముద్రములో పడిపోవు గాక!"** ... అని శపించారు. అప్పుడే అమృతము మొదలైనవన్నీ సముద్రములో పడిపోయాయి.

**భాగవతము :**

నాగభాగుని కుమారుడు అంబరీషుడు. గొప్ప విష్ణు భక్తుడు. ఆయన ద్వాదశీ వ్రతము చేస్తూ ఉండగా, ఆతని గృహము దుర్వాసుడు ప్రవేశించారు. అంబరీషుడు అర్ఘ్యపాద్యములు సమర్పించి **"గురుదేవా! మా ఆతిథ్యము స్వీకరించండి. దయచేసి త్వరగా స్నాన-సంధ్యలు ముగించుకొని రమ్మని ప్రార్థన. ద్వాదశీ ఘడియలు ఇంకా మిగిలి ఉండగా మనము భోజనము స్వీకరించాలి!"** – అని పలికారు.

అంబరీషుడు నదీ స్నానానికి వెళ్ళి ఎంతసేపైనా రాకపోవటము చేత... "వ్రతఫలము – అభ్యాగతిసేవ"లను దృష్టిలో పెట్టుకొని ద్వాదశి ఘడియలు ముగియకముందు జలము  పానము చేసారు. అప్పుడే వచ్చిన దుర్వాసుడు అది చూచి కోపగించి అంబరీషఉని శపించసాగారు. (చేప-తాబేలు- పంది-శింహ శిరస్సు గల మానవుడు – పొట్టివాడు – రాజసము గల బ్రాహ్మణుడు – అజ్ఞాని అగు రాజు – రాజ్యయోగము లేని రాజు – కర్మల తిరస్కారి – క్రూరుడగువాడు – అగు) పది జన్మలు ఎత్తవలసినదిగా శపించారు. విష్ణుమూర్తి అడ్డుగా నిలచి ఆ శాపాలన్నీ తన భక్తుడగు అంబరీషుని తరఫున తానే స్వీకరించారు. **అవే దశావతారములు.**

ఇంకా కూడా శపించబోవుచుండగా, విష్ణుచక్రము ప్రత్యక్షమై దుర్వాసమహర్షి వెంటబడింది. అప్పుడు దుర్వాసుడు త్రిమూర్తులలో ఎవ్వరినీ శరణువేడి, ప్రయోజనములేక, చివరికి భక్తుడగు అంబరీషుని శరణువేడి విష్ణు చక్రమునుండి రక్షణ పొందారు. ఈవిధంగా భక్తుని ప్రభావాన్ని గురించి విష్ణుభగవానుడు లోకాలకు చాటిచెప్పారు.

**భాగవతము :**

ఒకసారి **"ఈ శ్రీకృష్ణుని మహిమను నేను పరీక్షించెదను గాక!"** అని అనుకుంటూ దుర్వాసమహర్షి తలచి ద్వారకానగరము ప్రవేశించారు. శ్రీకృష్ణుడు మహర్షిని భక్తితో పూజించి పంచభక్ష్య పరమాన్నములు సమర్పించారు. ఇక దుర్వాసుడు ఒకసారి "తింటాను" అని, ఇంతలోనే 'తినను' అని పలుకుచూ సుముఖత, విముఖత ప్రదర్శించసాగారు.

**'ఓ శ్రీకృష్ణా! పాయసము తీసుకొచ్చి నావంటి నిండా పూయి'** – అని దూర్వాసుడు పలుకగా, శ్రీకృష్ణుడు **"మహర్షీ! తమ ఆజ్ఞ!"** అని పలికి అట్లాగే చేసారు. ఆ పాయసమును దుర్వాసుడు రుక్మిణీదేవిని పిలచి, ఆమె దేహమునకు పూసారు.

కృష్ణుడు ఏమాత్రము కోపగించలేదు. చిరునవ్వు, భక్తి చెదరలేదు.

అప్పుడు దూర్వాసుడు ఒక రథమును అడిగి తెప్పించి, రుక్మిణీ దేవిని రథమునకు బంధించి కట్టారు. అయినాకూడా శ్రీకృష్ణుడు చిరునవ్వు వీడక, మహర్షిని సేవిస్తూనే ఉన్నారు.

అప్పుడు శాంతించి దూర్వాసుడు –

- శ్రీకృష్ణా! నీసేవకు మెచ్చుకుంటున్నానయ్యా.
- నీవు నావంటికంతా పాయసమును పూసావు. కానీ, అది కాళ్లకు పూయలేదు.
- అందుచేత, నీ అరికాళ్లకు తగిలే వ్రేటుచే ప్రాకృతమగు ఈ శ్రీకృష్ణ – అవతారము చాలించగలవు.

అని పలికి, శ్రీకృష్ణుని స్తుతించి, అక్కడినుండి బయల్వెడలారు.

**రామాయణము :**

అనేక సంవత్సరములు శ్రీరామ పాలన వైభవముగా జరిగిన తరువాత ఒకరోజు యమధర్మరాజు ఒక బ్రాహ్మణుని రూపములో రామావతార ప్రాకృతిక ఉపసంహారము గురించి సంభాషించటానికి శ్రీరాముని అంతఃపురమునకు వచ్చారు. శ్రీరాముడు లక్ష్మణుని పిలచి **"ప్రియ లక్ష్మణా! అంతఃపుర ద్వారము వద్ద నిలచి ఉండు. ఎవ్వరూ లోపలకు రాకూడదు సుమా! ఎవ్వరైనా వచ్చారా, – నగర బహిష్కరణ తప్పదు"** – అని ఆజ్ఞాపించారు.

కొంత సమయమైన తరువాత దుర్వాసుడు శ్రీరామ దర్శనముకోసమై రామాంతఃపుర ద్వారము సమీపించారు.

**"మహర్షీ! క్షమించండి. ఇప్పుడు అంతఃపుర ప్రవేశము రామాజ్ఞానుసారము నిషేధము. కొంచముసేపు ఆగండి"** – అని లక్ష్మణుడు పలికారు. అది విని దుర్వాసుడు కోపగించి **"ఏమి లక్ష్మణా! నేను ఆకలిగొన్న బ్రాహ్మణుడను. భిక్ష ఇవ్వాల్సిందే! నీవు వెళ్ళి శ్రీరామచంద్రునికి నా రాక తెలియజేయి. లేదా నేను నిన్ను, శ్రీరాముని, అయోధ్యావాసులను శపిస్తాను"** – అని పలికాడు. అప్పుడు లక్ష్మణుడు లోనికి వెళ్ళి బ్రాహ్మణరూప యమునితో సంభాషిస్తున్న శ్రీరామునితో దుర్వాసముని భిక్షకై రాక గురించి, శపిస్తానన్న బెదిరింపు గురించి తెలియజేసారు. అప్పుడు శ్రీరాముడు లక్ష్మణునితో "లక్ష్మణా! రాజాజ్ఞను ఉల్లంఘించి నీవు అంతఃపురములో ప్రవేశించావు. నియమానుసారముగా నీకు నగర బహిష్కరణను విధిస్తున్నాను. ఇదంతా విధి చిద్విలాసమని నీకు తెలుసుకదా!" – అని శ్రీరామచంద్రుడు పలికారు.

ఈవిధంగా రామావతార ప్రాకృతిక (ప్రకృతి సంబంధమైన) అవతార పరిసమాప్తికి దుర్వాస మహర్షి 'నాంది' పలికారు.

⌘

- ఓ గురుదేవాయ శ్రీ దుర్వాస మహర్షిభ్యోన్నమః।
- శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః।

**ఇక మనము "గోపాలోత్తరతాపిన్యుపనిషత్" – అధ్యయనములో ప్రవేశిస్తున్నాము.**

# గోపాలోత్తరతాపిన్యుపనిషత్

## అధ్యయన పుష్పము

ఒకప్పుడు మునిజన అవతారులగు వ్రజగోపికలు **“ఈ ప్రియ గోపాలకృష్ణునితో చ్యుతి** (Distraction) **లేనట్టి అనునిత్య ఏకత్వము”,** సిద్ధింపజేసుకోవాలని **కామ సంకల్పులైనారు.** సమస్త మనోచాంచల్యములు జయించి అనునిత్యము, అనుక్షణికము అయినట్టి శ్రీకృష్ణ సాంగత్యమును సిద్ధింపజేసుకోవాలనే ఆశయము వారిలో దృఢపడసాగింది. **“సాంసారిక దోషములను తొలగించుకొని శ్రీకృష్ణ సాయుజ్యము పొందటమెట్లా?”** – అనే ప్రశ్నించుకొని సంభాషించుకోసాగారు. ఎంతో చర్చించుకోవటము, వాదించుకోవటము మొదలైన ప్రయత్నములు చేసి కూడా అట్టి **‘నిష్కళంక సాయుజ్యస్థితి’**కి సరి అయిన ఉపాయములు వారికి లభించలేదు.

అప్పుడు గోపికలు వ్రతదీక్ష స్వీకరించినవారై, రోజంతా ‘ఉపవాసము’ ఉన్నారు. కృష్ణునిపట్ల ఉపాసన కలవారయ్యారు. ఆ మరునాడు ఉదయము శ్రీకృష్ణుని మందిరమునకు వెళ్లారు.

**శ్రీకృష్ణుడు :** ప్రియ గోపికలారా! ఏమిటి ఇటు వచ్చారు? అంతా కుశలమే కదా?

**వ్రజగోపికలు :** కృష్ణయ్యా! ఏమి చెప్పమంటారు? నీవా, అఖండాత్మానంద స్వరూపుడవు. మేమేమో ఈ ‘వ్యష్టి’ పంజరములలో చిక్కుకుని ఉన్నాము. అన్యమగు సమస్తమును త్యజించి నీతో **అనన్యత్వమును మేము అనుక్షణికం చేసుకోలేకపోతున్నాము.** జగద్దృశ్యములో సంబంధము వలన ఏర్పడే దుఃఖ–సుఖ–వేదనలతో కూడిన **“అవినాభావ సంబంధములు”** త్రెంచుకోలేకపోతున్నాము.

అందుచేత వ్రతదీక్ష పూనాము. దయచేసి నీతో మమేకమవటానికై ఏమి చెయ్యాలో చెప్పు. ఈ జన్మ–కర్మ పరంపరలతో కూడిన పంజరము నుండి విడివడేది ఎట్లాగో దారిచూపు.

**గోపాలకృష్ణుడు :** గోపికలారా! **మీయొక్క ఆశయము మహత్తరమైనది.** అయితే, అట్టి పరమాత్మ స్వరూపుడనగు నాతో **అనన్యత్వ** సిద్ధికై **గురు–ఆశ్రయము** అత్యంత శ్రేయోదాయకము. అది సులభమార్గదర్శకము. సమస్త సంశయములను తొలగించునది కూడా! అందుకు ఉపాయము, మార్గము చెపుతాను వినండి.

(1) బ్రహ్మజ్ఞులగు బ్రాహ్మణుని గురుదేవా భావనతో దర్శించండి. (మహాపురుష సంశ్రయము).

(2) వారికి భిక్ష ప్రదానంగా సేవ, సమర్పణలు చేసి వారికి సంతోషము కలుగజేయుడి. (సర్వసమర్పణ).

(3) భక్తిశ్రద్ధలతో కృష్ణ చైతన్యతత్త్వము (లేక) ఆత్మారామతత్త్వము గురించి శ్రద్ధ–ఆసక్తి–భక్తిలతో **“శ్రవణం”** చేయండి. **(వినటము).**

(4) శ్రవణం చేసిన కృష్ణానంద ఆత్మతత్త్వమును ‘మననము’ చేయండి **(“మననము”).**

(5) మననము చేస్తూ, సమస్త అన్య సాంసారిక స్వభావములను జయించివేసి సర్వే సర్వత్రా కృష్ణతత్త్వదర్శనమును నిశ్చయము చేసుకోండి. నాకంటే అన్యము దర్శించు చంచలత్వమును త్యజించివేయండి. **(“నిదిధ్యాస”).**

(6) సమస్త బేధములు జయించి, **అట్టి మమాత్మానంద కృష్ణతత్త్వమే మీరై,** సోఽహం బ్రహ్మానందమును, పరబ్రహ్మతత్త్వమును **స్వాభావికం చేసుకోండి.** ఆముష్మిక సుఖము సిద్ధించుకోండి. ప్రయత్నించిన వారికి అది సులభసాధ్యమే। ఎవ్వరికైనా సాధ్యమే। మరి ఇంతటి ప్రేమ – భక్తి తత్పరులగు మీకెందుకు సిద్ధించదు చెప్పండి?

**గోపికలు :** అంతేనా? అయితే ఇప్పుడు మమ్ములను ఏమి చేయమంటావు?

**శ్రీకృష్ణుడు : ఆముకస్మై బ్రాహ్మణాయ భైక్షం దాతవ్యమ్ ఇతి।** ఐహికమైన దృష్టి – ధ్యాసలు బంధముల నుండి విడివడి, “ఇదంతా కృష్ణానందతత్త్వమే” – అని చెప్పబడే “ఆముష్మికత్వము” కొరకై ఆముకముతో (తీవ్ర ప్రయత్నముతో) బ్రహ్మజ్ఞుడగు బ్రాహ్మణుని దర్శించి, వారి అనుగ్రహం పొందండి. వారికి ‘భిక్ష’ సమర్పించండి. (భి = అంధకారము; క్ష = క్షయింపజేయు ఆశ్రయము). అట్టి ‘భైక్షదానవ్రతము’ ఆచరించండి.

**గోపికలు :** ఓహో! ఇప్పుడు మేము బ్రహ్మజ్ఞుడగు బ్రాహ్మణుని దర్శించి భిక్ష సమర్పించు ఉపాయం ఆశ్రయించమంటావా! ‘భైక్షవ్రతము’ నిర్వర్తించమంటావా? బాగానే ఉన్నది. నీవు చెప్పినట్లే చేస్తాము. కానీ, అట్టి మహనీయుడు మాకు ఎక్కడ లభిస్తాడు? మరి అది కూడా నీవే సూచించాలి కదయ్యా! ఏదారిని వెళ్ళమంటావో చెప్పు.

శ్రీకృష్ణుడు : అదీ నేనేచెప్పాలా! సరే! నేను గోపీజనమానసలోలుడను కదా! చెపుతాను, వినండి. **యమునానదికి ఆవల ఒడ్డున ఒక మహనీయుడు అగు 'తత్త్వదర్శి' వేంచేసి ఉన్నారు.** ఆయనయే దుర్వాసమహర్షి ఆయన మీ **'భైక్ష్యవ్రతము'** నకై **'భిక్ష'** స్వీకరించటానికి, మీ వ్రతము దిగ్విజయము చేయటానికి అర్హులైన మహామహితాత్ములు. వారిని శరణువేడి భిక్షములు సమర్పించి పునీతులవండి.

**గోపికలు** : ఓం! అట్లాగే! ఇప్పటికిప్పుడే బయలుదేరుతాము.

ఈ మాట చెప్పి గోపికలు తమ తమ ఇళ్లకు చేరారు. బ్రహ్మతత్త్వజ్ఞుడగు బ్రాహ్మణునకు భిక్ష సమర్పించు **'భైక్షదానవ్రతము'** నిర్వర్తించటానికి ఉద్యుక్తులైనారు. దీక్ష స్వీకరించారు. జున్ను, వెన్న, పాలు, పెరుగు, నెయ్యి మొదలైన పదార్థములతో కూడిన మధురమగు వంటకములు ఎవరికివారే తయారుచేసి పాత్రలలో నింపుకున్నారు. (మౌళిస్త కుంభ పరిరక్షణ ధీర్నటీవ" వలె) పాత్రపై పాత్రలు తలపై ధరించాలి. యమునా నదిని సమీపించారు.

యమునానది నిండు నీరు – ప్రవాహములతో పరవళ్ళు త్రొక్కుతోంది.

**అయ్యో బాబోయ్! ఈ వేగంగా ప్రవహించే తరంగములుగల ఈ యమునను దాటి ఆవలకు వెళ్ళటమెట్లాగా? అడుగు పెట్టగానే మన తలలపై దాల్చిన మధుర పదార్థములతో నిండిన కుంభములు (కుండలు) కదిలి నేలపడిపోతాయేమో కదా?**.... అని ఆదుర్దా పొందసాగారు. ఆలోచించి, ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చారు. శ్రీకృష్ణునే ఉపాయం అడగ తలచారు. శ్రీకృష్ణ మందిరమునకు వెళ్ళి పరివేష్టితులైయున్న శ్రీకృష్ణుని సమీపంగా నిలుచున్నారు.

శ్రీకృష్ణుడు గోపికలవైపు సమస్త జీవరాసులను మోహింపజేయు చిరునవ్వు చిందిస్తూ చూచారు.

-----

**శ్రీకృష్ణుడు** : ప్రియ గోపికలారా! మళ్లా వచ్చారేమిటి? ఇంకా భైక్ష దాన వ్రతము ప్రారంభించలేదా?

**గోపికలు** : ప్రారంభించాము. జున్ను, వెన్న, నెయ్యి, పెరుగు, పాలు, చల్లలలోను, తదితర మధుర పదార్థములతోను అనేక వంటకములు చేసి, సద్గురువులగు శ్రీ దుర్వాసులవారి దర్శనమునకై బయలుదేరాము.

**శ్రీకృష్ణుడు** : ఓహోం! అవన్నీ దుర్వాస మహర్షుల వారికి సమర్పించారు కూడానా?

**గోపికలు** : లేదు. లేదు ఇంతలో ఒక చిక్కు వచ్చి పడింది.

**శ్రీకృష్ణుడు** : చిక్కు (Hurdle) వచ్చిందా? ఏమిటా చిక్కు?

**గోపికలు** : యమునా నదికి వెళ్ళాము. అయితే యమునా తరంగాలు చాలా వేగంగా ప్రవహిస్తున్నాయి. నదిని దాటాలి. కానీ, తలపై పదార్థములు నింపిన కుంభములు నిలిచి ఉండేటట్లు కనబడటం లేదు. పైగా, మేమే కొట్టుకుపోతామేమో కూడా। మేము ఏమి చేయాలి? ఏమి పాలుపోక, నీదగ్గరకు వచ్చాము. **కథం యస్యామో జలం తీర్త్వా యమునాయా యతః శ్రేయో భవతి? కృష్ణా। ఇతి॥** మేము క్షేమంగా యమున ఆవలి వడ్డుకు చేరటమెట్లా? **'భైక్షదాన వ్రతము'** నిర్వర్తించి నీతో మమేకమవటమనే శ్రేయస్సు పొందటమెట్లా? = తెలియక నిన్ను శరణువేడుచున్నాము.

**శ్రీకృష్ణుడు** : అదా సంగతీ? అయితే ఒక పని చేయండి. **కృష్ణేతి 'బ్రహ్మచారి' ఇతి ఉక్త్వా, మార్గంవో దాస్యతి। 'మాకృష్ణుడు బ్రహ్మచారి'** – అని యమునానదీ దేవికి గుర్తుచేసి చెప్పండి. అప్పుడు ఆ దేవి మీకు మార్గం ప్రసాదిస్తుంది.

**వ్రజ గోపికలు** : కృష్ణా! ఏమిటీ? అష్టభార్యలున్న మాకృష్ణుడు **"బ్రహ్మచారి"** అని త్రోవ ఇవ్వటానికి యమునానదికి విన్నవించాలా? ఏమి చెప్పుచున్నావు. నిన్ను ఏమని అర్థం చేసుకోవాలి?

**శ్రీకృష్ణుడు** : **యం మాగ్ం స్మృత్వ అగాథా గాథా భవతి।** అప్రమేయము (unattached), నిత్య సత్యము అగు నన్ను స్మరించటంచేత లోతైన అగాథములు గాథములు (లోతులేనివి) కాగలవు. **అపూతో పూతో భవతి।** అపవిత్రమైనవన్నీ పవిత్రముగా అవగలవు. **సకామో నిష్కామో భవతి।** కోరికలన్నీ నిష్కామములు – (దృశ్యముపై ఆధారపడకపోవటము) అవగలవు. **అశ్రోత్రియః శ్రోత్రియో భవతి।** శ్రుతులు (వేదములు) తెలియనివాడు కూడా వేదహృదయము, వేదసారము తెలిసినవాడు అగుచున్నాడు. నన్ను తలచుచూ ఉండగా అగాథముల స్పర్శలు కూడా – తేలికగా దాటి వేయగల సరిర్గాధలు (తక్కువ నీళ్ళున్న సెలఏళ్ళుగా, గోష్పాదముగా) – మారగలవు. కనుక ఓ వ్రజగోపికలారా! మీరంతా కూడా క్షేమంగా వెళ్ళి మహానుభావుడగు దుర్వాసమునిని సందర్శించుకొని, మీమీ

బ్రాహ్మణ భైక్షదానవ్రతములను దిగ్విజయంగా నిర్వర్తించుకున్న వారై, లాభంగా తిరిగి రండి. ఇది 'రుద్రవాక్యము'గా స్మరించుచూ నది దాటండి. రుద్రాంశుడే ఆ దుర్వాసమహర్షి

అది విని వ్రజగోపికలు యమునా నదీతీరం చేరారు. **"అమ్మా! నదీ దేవీ! నమస్తే! మాకృష్ణుడు బ్రహ్మచారి। ఇది రుద్రవాక్యం"** అని రుద్రవాక్యముగా స్మరిస్తూ పలికారు. వెంటనే యమునా జలము విభాగమై వ్రజగోపికలు ఆవలి వడ్డుకు వెళ్ళటానికి త్రోవ ఇచ్చింది. వారు ఆవలి వడ్డు చేరగానే మరల యమునానదీ జలము యథావిధిగా ప్రవహించసాగింది. ఆవలివడ్డుకు చేరిన గోపికలు కృష్ణుడు చెప్పిన రుద్రవాక్యములను మననం చేస్తూ హుషారుగా ఆవలి గట్టున బసచేసియున్న దుర్వాసమహర్షి ఆశ్రమమునకు వెళ్ళారు. పుణ్యతముడు (మహత్తరమైన పుణ్యకార్యములు నిర్వర్తించియున్నవారు), శ్రేష్ఠతముడు, రుద్రాంశ సంభూతుడు అగు దుర్వాసమహర్షిని సమీపించి ప్రణతులు సమర్పించారు.

**వ్రజగోపికలు :** మహర్షీ! **నమో నమః।** మేము వ్రజగోపికలము. మా కృష్ణుని సూచనను అనుసరించి **"భైక్ష దానవ్రతము"** చేబట్టాము. వ్రత విధానుసారము మేము బ్రహ్మతత్త్వము స్వానుభవముగా కలిగియున్న మహనీయునికి (బ్రాహ్మణునకు) భిక్షాదానం సమర్పించాలి. మా కృష్ణయ్య మిమ్ములను భిక్షా స్వీకారము కొరకై అభ్యర్థించవలసినదిగా చెప్పారు. అందుచేత మిమ్ములను శరణువేడుచున్నాము. మాపై దయతో మా సమర్పణలను అంగీకరించండి. మేము పాలు – పెరుగు – వెన్న – నేయి – జున్నులతోను, తదితర అనేక రుచికర పదార్థములతోను స్వయముగా పాకము చేసి తెచ్చాము. మేము తెచ్చిన ఈ ఈ మధురమైన ఆహార పదార్థములను మాపై అనుగ్రహముతో స్వీకరించండి. మా వ్రతమును సువ్రతము చేయండి.

**దుర్వాసమహర్షి** : ఓ వ్రజ గోపికలారా! శ్రీకృష్ణ ప్రేమచే మీరు పునీతులు. మీరు తెచ్చిన పదార్థములన్నీ నేను శిష్య సమేతంగా భుజించగలము. మీరు చక్కగా విస్తర్లు పరచండి. కొద్ది నిమిషములలో మేము స్నాన–అనుష్ఠానములను నిర్వర్తించుకొని వస్తాము.

ఇట్టి ప్రియవచనములు పలికి దుర్వాసమహర్షి శిష్యసమేతంగా యమునానదికి వెళ్ళి, స్నాన–అనుష్ఠానములు ముగించుకొని వచ్చారు. గోపికలు ప్రేమపూర్వకంగా సమర్పించిన ఆహార పదార్థములన్నీ తృప్తిగా తిని ఆనందించారు. గోపికలకు ఆశీర్వాదవచనములు పలికారు.

మహర్షి చిరునవ్వుతో సంతోషముగా ఆశీర్వదించిన తరువాత – ఇకప్పుడు గోపికలు మహర్షికి నమస్కరిస్తూ ఇట్లా పలికారు.

**వ్రజ గోపికలు** : మహర్షీ! శలవా మరి? మేము తిరిగి యమునానదిని దాటి మా నందనందుని దర్శనం చేసుకుని వ్రతఫలము సమర్పిస్తాము.

**దుర్వాసమహర్షి** : శుభమగుగాక! వెళ్ళిరండి.

**వ్రజగోపికలు** : మహాత్మా! మేము శ్రీకృష్ణ – బ్రహ్మచారి రుద్రమంత్రము చదువుతూ ఉండగా యమునానది త్రోవ వచ్చింది. ఇప్పుడు తిరిగి వెళ్ళాలంటే, తరంగములు అత్యంత వేగంగా ప్రవహిస్తున్నాయే। మహర్షులగు మీరే దిక్కు–మాకు. ఆవలి వడ్డు క్షేమంగా జేరటానికి ఏదైనా 'మంత్రము' ఉపదేశించండి.

**దుర్వాసమహర్షి** : మంత్రమా? సరే। ఒక మననము చెపుతాను. **(మననాత్ త్రాయతే ఇతి మంత్రః)**. మునిః దూర్వ–అశినమ్ **మాగ్ం స్మృత్వా, వో దాస్యతీతి మార్గమ్। ఏమాత్రము కొంచము కూడా ఆహారము స్వీకరించనట్టి** ఈ దూర్వాసుని స్మరిస్తూ వెళ్ళండి. అప్పుడు మీకు యమునా నదీమతల్లి "నిజము చెప్పారు" – అని సంతోషించి మీకు త్రోవ ఇవ్వగలదు.

ఆ మాటలు విని ఇక గోపికలు శ్రీకృష్ణుని ధ్యానిస్తూ, గానం చేస్తూ బయలుదేరారు.

**గోవిందా...జయగోవిందా...! గోకుల నందన గోవిందా।**
**ఘనఘననీలా గోవిందా। బాలముకుందా గోవిందా।**
**హే ఘన శ్యామా గోవిందా। గోకులనందన గోవిందా।**

అని అడుగులు వేయసాగారు. నాలుగు అడుగులు వేసారో, లేదో...గోపికలకు ఒక అనుమానం వచ్చింది.

గోపికలు : ఇదేమిటి? అక్కా! **దూర్వ-అశనమ్? నేను తినటానికి దూరంగా ఉండి, ఈ మహర్షులవారు తిననివాడనైతే!**"... అని అంటారేమిటి? మనము తెచ్చి మధుర పదార్థములు, తినుబండారములు మనముందే ఈయన తిన్నారుగాం?

**గోపికల శ్రేష్ఠులగు గాంధర్వి :** అవును. మీరు అన్నది నిజమే. **"ఏమీ తినని వాడనైతే"**...అని అంటారేంటి? అయితే మహర్షులు అబద్ధము, అల్పశబ్దము పలుకరు. ఇందులో మనము గ్రహించవలసిన గూడార్థమేదో ఉండి ఉంటుంది. మనకు ఏదో సందేహం రానే వచ్చింది కదా। తీర్చుకునే వెళ్దాము. ఈ విషయం ఆ మహాత్ముడినే అడుగుదాం.

**ఇట్లా అనుకున్న తరువాత ఆ వ్రజగోపికలు మరల మహర్షిని సమీపించి నమస్కరించారు.**

---

**దూర్వసమహర్షి :** బిడ్డలారా, శ్రీకృష్ణ భక్తపారవశ్యులు అగు వ్రజగోపికలారా! ఏమిటి తిరిగి వచ్చారు? ఏమికావాలి?

**వ్రజగోపికలు :** స్వామీ। మాకు ఏదో చిన్న సందేహము। మీరు అనుగ్రహిస్తానంటే అడుగుతాము.

**దూర్వసమహర్షి :** సందేహమా! సంతోషం. శ్రీకృష్ణప్రియస్వరూపులగు వ్రజగోపికలతో కొంతసేపు సంభాషించటము మాయొక్క తపోఫలమే। మీరంతా సుఖాశీనులవండి. ఇక ఇప్పుడు అడగండి. మీకొచ్చిన అనుమానమేమిటి?

**గోపికలలో శ్రేష్ఠురాలు, పెద్దవయసుగలది అగు గాంధర్వి అడగటం ప్రారంభించారు. తక్కిన గోపికలు నిశ్శబ్దము వహించి శ్రవణమునకు (వినటానికి) సంసిద్ధులైనారు.**

**గాంధారీ గోపిక :** బ్రహ్మతత్త్వజ్ఞా! దుర్వాసమహర్షీ! మేము అమాయకులైన వ్రజగోపికలము. శాస్త్రజ్ఞానము, తత్త్వజ్ఞానము తెలియనివారము. తెలిసీ, తెలియక ఏమైనా అమాయకపు ప్రశ్నలు అడిగితే క్షమార్హులము. మాకు రెండు సందేహాలు వచ్చాయి. అవి రెండూ మీ సమక్షంలోఉంచుతాము. మాకు మీ వివరణ ప్రసాదించండి.

**(1) కథం కృష్ణో బ్రహ్మచారీ?** మా కృష్ణునికి అష్టభార్యలు ఉన్నారు. **"నేను బ్రహ్మచారిని – అని పలకండి"** అని మా కన్నయ్య ఎట్లా చెప్పారు? ఆ వాక్యము యమునా దేవి ఎట్లా అంగీకరించి మాకు త్రోవ ప్రసాదించింది?

**(2) కథం దూర్వ అశనో మునిస్త్వగ్ం?** "మీరు ఏమీ తినక మౌనము వహించి ఉన్నారు" – **"దూర్వ – ఆశనమ్"** అని అంటున్నారే? న-అశనులు ఎట్లా అవుతారు? మేము తెచ్చిన పదార్థములను మా విన్నపమును అంగీకరించి తినియే ఉన్నారు కదా? ఇందులోని రహస్యము ఏదో ఉండి ఉంటుంది. దయతో మాకు వివరించి చెప్పండి.

**దుర్వాసమహర్షి :** ఓహో! ఇదా మీ సందేహం? అయితే ఇందలి తాత్త్విక సత్యమును కొన్ని దృష్టాంతముల సహాయంతో చెపుతాను. అందరూ శ్రద్ధగా వింటారా మరి?

---

**దుర్వాసమహర్షి :** ఆకాశము నుండి 'శబ్దము' – అనే తత్త్వము (లేక) గుణచమత్కారము జనిస్తోంది. అయితే శబ్దము ఆకాశమునకు వేరై వినబడుతోంది కదా! ఆకాశములో శబ్దము లేదు. శబ్దములో ఆకాశములేదు. శబ్దముల కర్తృత్వము ఆకాశమునకు లేదు. ఆకాశము ఆకాశము నందే ఉన్నదిగాని శబ్దములో చిక్కుకున్నదని అంటామా? అనము కదా। శబ్దమునకు ఆకాశము గురించి తెలియదు. "ఆకాశము మాటలు పలుకుతోంది" అని కూడా ఎవ్వరూ అనరు.

అట్లాగే, **నేను సర్వదా ఆత్మాకాశ స్వరూపుడను.** మరి నేను నా నుంచి (ఆకాశమునుండి శబ్దతత్త్వమువలె) జనించిన జీవాత్మ ఏదైనా అనుభవిస్తే – **నేను అనుభవించినవాడిని. ఎట్లా అవుతాను? స హి ఆత్మా౽హం కథం 'భోక్తా' భవామి? కనుక నేను దూర్వాశి (దూర్య-అశి) గా అనుభవించక, దూరముగా ఉన్నవాడిని మాత్రమే। దేనికీ భోక్తను కాను। కర్తను కాను। అకర్తాహమ్। అభోక్తాహమ్।**

- **వాయువు** నుండి 'స్పర్శ' అనే అనుభూతి (ఇంద్రియార్థము/ ఇంద్రియ విషయము) జనిస్తోంది. అయితే 'స్పర్శ' అనే అనుభవము వాయువు కంటే వేరై, వాయువుకు భిన్నమై – ఉంటోంది. స్పర్శయందు వాయువు లేదు. వాయువు నందు స్పర్శ లేదు. స్పర్శానుభవమును వాయువు పొందటము లేదు. **ఆత్మనగు నేను జీవాత్మయొక్క అనుభవం ఎట్లా పొందుతాను? పొందను. సర్వాత్మనగు నాకు సందర్భమాత్రమగు జీవాత్మ యొక్క అనుభవములన్నీ సంబంధితమైనవి కావు.**
- **తేజస్సు** వలన కళ్ళకు రూపం కనిపిస్తోంది. అయితే, **రూపము** → అగ్ని (తేజము) కంటే భిన్నమయ్యే ఉంటోంది. (Form of an article in quite different from the light). రూపము అగ్ని (తేజస్సు) వలననే కనిపించటం జరుగుచున్నప్పటికీ – తేజస్సు

రూపముయొక్క అనుభవి – కాదు. మరి నేను మాత్రం జీవాత్మ యొక్క రూపానుభవం ఎందుకు పొందుతాను? రూపములను వెలిగిస్తున్నంత మాత్రము చేత వెలుగు రూపముల ఆకారముగా అవనట్లే – **నేను జీవాత్మ పొందుచున్న సాకారానుభవములకు భోక్తను కాను నాయొక్క ఆత్మ తేజస్సులో జీవాత్మ అనుభవములు స్వీకరిస్తున్నప్పటికీ, అవన్నీ నాకు చెందవు.**

- భూమి – గంధవతి అయి ఉంటోంది. భూమి నుండి అనుభవమయే గంధము (Smell) కంటే భూమి సర్వదా వేరే కదా. భూమి వలన గంధమున్నప్పటికీ, భూమి భూమిగానే ఉంటుంది. (భూమి గంధమునకు వేరుగా ఉంటుంది).

  ఆత్మనగు నేను జీవునియొక్క గంధానుభవమునకు వేరై, ఆత్మధర్మము వీడక ఉన్నాను. భూమికి గంధముయొక్క అనుభవము లేనట్లే, **'జీవాత్మ' యొక్క కర్తృత్వ – భోక్తృత్వములు (ఆత్మగా నేను) లేనట్టివాడను.**

- సమస్తము ఆత్మయే అయి ఉండగా – (1) ఇది మననము చేయునది, (2) ఇదేమో మననము చేయబడునది – అను రెండు వేరువేరైనవి ఎక్కడ ఉన్నాయి? అంతా నేనే అయి ఉండగా (స్వప్నము తనదైనవాడు వలె) నేనుఎక్కడినుండి ఎక్కడికి వెళ్తాను? కథ వ్రాయువాడు కథలో చెప్పబడిన ఒక ఊరి నుండి (తాను వ్రాస్తున్న కథలోని) మరొక ఊరికి వెళ్ళుతాడా? వెళ్ళడు. **నా నుండి జగదనుభవి అయినట్టి జీవాత్మ నా కల్పిత స్వరూపమే అగు జగత్తులో సంబరాలు చేస్తూ, ఆయా క్రియలు నిర్వర్తిస్తూ ఉంటే అవన్నీ చేయువాడు నేనెట్లా అవుతాను? అవను.** కథలోని పాత్రలు నిర్వర్తిస్తున్న పనులను రచయితయే చేస్తున్నట్లు ఆపాదించము కదా!

  అట్లాగే, **మనస్సు నిర్వర్తిస్తున్న మననముల వ్యవహారమునకు (ఆత్మనగు) నేను కర్తను కాదు. భోక్తను కాదు.**

- మనస్సు ఏదేది అనుభవిస్తూ ఉంటే, అదంతా మనస్సుకు అనుభవమేగాని, మనస్సుకు ఆవల కారణ–కారణుడనై ఉన్న నాకేమి సంబంధము? మనస్సు పొందుచున్న విషయాలకు కూడా ఆత్మనగు నాకు కర్తృత్వము లేదు, భోక్తృత్వము లేదు.

**అట్టి ఆత్మ స్వరూపుడే మన శ్రీకృష్ణుడు.** ఆయనయే రెండు శరీరములకు కారణభూతుడు (1) ఆత్మ (2) జగదనుభవి

[ (1) Individual Self (2) Experiencer of the worldly things]

ఒక కొమ్మకు రెండు ఆకులు ఉన్నతీరుగా, బ్రహ్మమే స్వరూపముగాగల నన్ను ఆశ్రయించి రెండు సుపర్ణములు (రెక్కలు)

(1) భోక్త (2) సాక్షి

ఇద్దరు ఈ 'శరీరము' నందు ప్రత్యక్షమైయున్నారు.

**"భోక్త"**→ భోక్తారమునకు (భోగించబడుదానికి) **మునుముందే** ఉన్నట్టివాడు. (The Experiencer has been there prior to the event of experiencing). కనుక ఆతడు భోక్త, అభోక్త కూడా అయి ఉన్నాడు. భోక్తతత్త్వమునకు వేరైన జీవునికి చెందిన సాక్షీతత్త్వమే కృష్ణతత్త్వము.




యత్ర (ఎక్కడైతే) ....,

**విద్య-అవిద్యే న విదామో, –** తెలుసుకోవటము. తెలియకపోవటము అను ఉభయములకు స్థానము లేదో,

**విద్య-అవిద్యాభ్యాం భిన్నో।** **విద్య అవిద్య**లకు భిన్నమైనట్టిదో, (ఆ రెండిటికి సంబంధించనిదో),

**విద్యామయో హి। –** "ఎరగటము" యొక్క కేవలస్వరూపమే– (The Absolute Form of knowing)–అయి ఉన్నదో,

– అట్టి 'ఆత్మ' – విషయముల రూపము పొందుతుందా? పొందదు.

**ఇక మన కృష్ణుడు ఎట్టివాడో చెపుతాను వినండి.**

(1) **యో హ వై న కామేన కామాన్ కామయతే, స'కామీ'। భవతీ।** ఎవ్వరైతే కోరికలు కలిగి ఉండి కోరికలు కోరుకుంటూ ఉంటారో 'వారే 'కామి' (సకామి) అవుతారు.

(2) **యో హ వై తు "అకామేన" కామాన్ కామయతే - సో "అకామీ"** భవతి॥

ఎవరైతే అంతరమున కోరికలు లేని వారై బాహ్యమున కోరికలు కలిగి ఉంటారో, వారు అకాములే।

మన కృష్ణయ్య అంతరమున నిర్విషయ ప్రశాంతాత్మానందులు. కోరికలు లేనివారై బాహ్యమున కోరికలు ప్రదర్శిస్తూ ఉండువారు. కాబట్టి అకామియే. **'అకామకామి'** - అనబడుచున్నారు.

***శ్రీకృష్ణుని స్వాభావికమగు స్వానుభవము ఎట్టిదంటే...,***

- జన్మ జరా మరణ వ్యవహారములకు సర్వదా భిన్నమై (వేరై), ఆవలగా ఉన్నట్టిది. (All-Beyond)
- మార్పు చేర్పులకు విషయమే కానట్టిది. సర్వదా **నిశ్చలము. స్థాణువు.** (Always 'As it is')
- జీవ - ఈశ్వర భిన్నము లేనట్టిది. **అఖండితమైనది.** (Indivisible/unpartitionable)
- సూర్యునియందు కూడా తేజోస్వరూపమై ప్రకాశించుచున్నట్టిది. (All Enlightening)
- గోవులయందు గోతత్త్వముగా వేంచేసి ఉండినట్టిది. (The basic sense of Experiencing)
- గోవులను పాలించునట్టిది, గోపబాలురయందు కూడా ప్రకాశించునది. (The Rular of 'Indriams' and Jeevathma)
- సర్వ భూతములయందు ప్రవేశించి విశ్వమంతా తన స్వరూపముగా కలిగి ఉన్నట్టిది. (Manifesting as all this)

ఆయనయే మన స్వామి శ్రీకృష్ణుడు।

**గాంధార్వీ** వ్రజగోపిక : మా కృష్ణుడు సమస్త జీవులలో ఉనికి గలవాడై విశ్వమంతా తన స్వరూపముగా కలిగి ఉన్నట్టివాడా? ఆశ్చర్యం! మా గోపబాలురలో ఒకడుగా పుట్టి పెరిగి, మా మధ్యలో మాతో క్రీడిస్తూ మాకు ఆనందము కలుగజేస్తున్నాడే। మా మధ్యలో పుట్టి, పెరిగిన మా కృష్ణుని గురించి మీరు ఆయా మీరు చెప్పుచున్న విశేషాలుగా మీరు ఎట్లా తెలుసుకొన్నారు? మాకే తెలియదే, మీరు చెప్పే విశేషాలు?

సరేఁ! ఈ విషయాలు చెప్పండి।

**కృష్ణకోవ అస్య మంత్రః।** దేవాది దేవుడని మీరు వివరించి చెప్పే మా కృష్ణుని తెలుసుకొనే మంత్రమేది?

**కిం స్థానమ్?** ఈ కృష్ణుడు ఏ స్థానము లోనివాడు? ఎక్కడి నుండి మా మధ్యకు వచ్చాడు? అసలు ఈయన ఎవరు?

**కథంవా దేవక్యాం జాతః।** మా దేవకీదేవి గర్భంలో ఎందుకు ఎట్లు జన్మించాడు?

**కోవా అస్య జాయో గ్రామో భవతి?** ఆయన భార్యలు ఎవరెవరై ఉన్నారు? వాళ్ళు ఎక్కడెక్కడివాళ్లు?

**కీదృశీ పూజా అస్య గోపాలస్య భవతి?** అట్టి **పరమునకే పరమని** మీరు చెప్పుచున్న మా గోపాలకృష్ణుని మేము ఏవిధంగా **పూజించాలి, ధ్యానించాలి?**

**దుర్వాసుడు** : మన కృష్ణుడు **ప్రకృతికి** పరమైనవాడు. **ప్రదర్శన-కృత-తిరో**గమనములకు ఆవలివాడు. అంతేగాని, ప్రకృతిలోని వాడు కాదు.

**గాంధర్వీగోపిక** : మహర్షీ! ఈఈ వివరాలన్నీ మేము మీవద్ద వినాలనుకుంటున్నాము. దయచేసి చెప్పండి. ప్రకృతికి పరుడైనట్టి పరమాత్మ గోపబాలుడై భూమిమీద ఎందుకు జనించారో కూడా చెప్పండి.

**దుర్వాసమహర్షి** : ఓ గాంధర్వీ గోపికా। తదితర వ్రజగోపికలారా! వినండి. చెపుతాను. **తాగ్ం హి వై పూర్వం నారాయణో యస్మింల్లోకా ఓతాశ్చ - ప్రోతాశ్చ।**

- ఆభరణములన్నిటిలో బంగారమే ఓత ప్రోతమై ఉన్నట్లు, వస్త్రములన్నిటిలో ప్రత్తిదారమే ఓతప్రోతమై ఉన్న తీరుగా - **ఎవనిలో ఈ సమస్త లోకములు ఓతప్రోతమై ఉన్నాయో,**
- **ఏ సర్వాత్మకుడు సమస్త జీవులలో పూలదండలో దారమువలె అంతర్గతుడై ఉన్నారో,..** ఆయనయే మన **శ్రీకృష్ణుడు.** ఆవిధంగా పరమాత్మయగు శ్రీమన్నారాయణుడే శ్రీకృష్ణావతారుడు. ఆయనయే ఈ ఇంద్రియములకు కనిపించే సమస్తమునకు ఓతప్రోతమై ఉన్నారు.

ఈ సమస్త లోకములు, లోక దృశ్యములు నారాయణ కల్పితములు. అనగా జగత్ - కల్పనలకు మునుముందే నారాయణుడు కల్పనారహిత చైతన్యస్వరూపుడై ఉండి ఉన్నారు.

- నారాయణుడే నిర్వికల్ప - నిరాకార - నిర్విషయ కేవలానంద స్వరూపుడై ఉన్నారు.
- అట్టి కేవల సత్ - చిత్ - ఆనంద స్వరూపుడగు నారాయణుని హృదయపద్మమునుండి ఏకారణము లేకుండానే (లేదా) లీలా క్రీడా వినోద సంకల్పనా భావన కారణంగా, - సృష్ట్యభిమానియగు బ్రహ్మదేవుడు జనించారు. **తస్య హృత్ పద్మాత్ జాతో అబ్జయోనిః।** నారాయణ హృదయము (లేక) యోని నుండి **'సృష్టించెదనుగాక' అనే భావనాపురుషుడు** (లేక) సృష్ట్యభిమానిగా జనించారు.
- అట్టి భావనా కల్పనా రూపుడగు బ్రహ్మదేవుడు (లేక) హిరణ్యగర్భుడు **"నేనిప్పుడు ఏదో ఒకటి చేయాలి। ఏమి చేయాలి?"** అను తపన పొంది, ఇక **తపన రూప తపస్సు** చేయనారంభించారు.

అట్టి బ్రహ్మదేవుడు లోకములను, జీవులను, వారి వారి బహిరంగ - అంతరంగములను కల్పించారు.

**ఈ లోకములన్నీ** - క్రీడారంగములు (Amusement Parks) వంటివి.
**జీవులందరు** - ఆ క్రీడారంగములో ఆడుకునే బాలురవంటివారు.

అట్టి బ్రహ్మదేవుడు జీవులంతా క్రీడా వినోదులవటం, క్రమంగా ఆ క్రీడా వినోదములో పరిమిత సంబంధ - బాంధవ్యములు కలిగి ఉండటము, వాటిచే సుఖ దుఃఖములు, మృత్యు - జన్మ - జన్మాంతరములు పొందటం గమనించారు. సృష్టిలోని జీవుల దుఃఖములు చూసి వారి హృదయము ద్రవించింది. అప్పుడు జీవుల దుఃఖములు తొలగటానికై శ్రీమన్నారాయణుని ఉపాసించగా ఆ **"కేవల-నిర్వికార-సర్వకారణ-సాక్షీ"** స్వరూపుడగు నారాయణుడు అనేకసార్లు లోకములలో అవతరిస్తూ ఉండసాగారు. ఆయా భక్తవత్సలుడు. భక్త పరాధీనుడు.

## శ్రీమన్నారాయణ ప్రవచనము

ఓ గోపికలారా! ఇప్పుడు కొన్ని విశేషములతో కూడిన - **'నారాయణ ప్రవచనము'** గురించి చెపుతాను. వినండి.

ఒక సందర్భములో స్వకీయ ఉపాసనగా బ్రహ్మదేవుడు శ్రీమన్నారాయణుని దర్శనముకొరకై భక్తితో తపస్సు చేయగారు. శ్రీమన్నారాయణుడు ఆయన ముందు ప్రత్యక్షమైనారు.

**శ్రీమన్నారాయణుడు** : కుమారా! బ్రహ్మదేవా! ఏమికోరి నన్ను స్మరించారు? అడగండి. ప్రసాదిస్తాను.

**బ్రహ్మదేవుడు** : స్వామీ! నాపై, నేను సృష్టించిన జనులపై అవ్యాజమైన ప్రేమతో మా సంసార దుఃఖములు తొలగించటానికై

**(పరిత్రణాయ సాధూనాం, వినాశాయచ దుష్కృతమ్। ధర్మసంస్థాపనార్థాయ, సంభవామి యుగే యుగే భగవద్గీతా వాక్యానుసారము...)**

సృష్టికి ఆవల తేజోరూపులై ఉన్న మీరు నా 'సృష్టి' అనే దృశ్యములో ప్రకృతిరూపులై అవతరిస్తున్నారు. అవన్నీ నాకు, నాచే సృష్టించబడుచున్న సమస్త జీవులకు ఉపాస్యములగుచున్నాయి. అయితే పరమాత్మా! ఇప్పుడు నేను అడుగుచున్న ప్రశ్న :

**యోవా అవతారాణాం మధ్యే శ్రేష్ఠోవతారః కో భవతి?** మీ అవతారములన్నిటిలో శ్రేష్ఠమైనది ఏది? ఎందుచేత? ఏది ఉపాసించుటచే మేమంతా సంసార దుఃఖములన్నీ తేలికగా జయించివేయవచ్చును? ఏ అవతారముచే లోకములన్నీ తుష్టి (తృప్తి) పొందుచున్నాయి? ఏ అవతారము స్మరించినంతమాత్రము చేతనే సమస్త జీవులకు మోక్షము లభించగలదు?

అట్టి అవతారము యొక్క కథనము (sequence) ఎట్టిది? దయతో వివరించండి.

**శ్రీమన్నారాయణుడు** : బ్రహ్మదేవా! వినండి, చెపుతాను.

నిష్కాముడను, నిర్విషయుడను, సర్వాత్మకుడను, ఆత్మానారాయణుడును అగు నేను ఒకానొకప్పుడు లీలగా, క్రీడావినోదంగా **'సకాముడను'** అగుచున్నాను.

**మేరో శృంగేః యథా సప్తపుర్యోభవంతి, తథా నిష్కామ్యాః సకామ్యా భూగోళ చక్రే సప్త పుర్యో భవంతి।** అట్టి మేరు పర్వతశిఖరముపై సప్త (7) పురములు (Seven Townships) ఉన్నతీరుగా - సకామ - నిష్కామ క్షేత్రములు (లేక) సప్త **భూగోళచక్రము.** ఆ సప్తపురముల మధ్యలో సాక్షాత్ **'బ్రహ్మగోపాలపురము'.** అట్టి గోపాలపురములో ఆ గోపాలపురిలో సకాములు, నిష్కాములు అగు జీవులు, దేవతలు, సమస్త భూతజాలము నివాసము కలిగి ఉంటున్నారు.

**అథ అస్య భజనం భవతి** : ఆ గోపాలపురములో పరమాత్మయే ఎల్లప్పుడు భజించబడుచున్నారు.

**యథా హి వై సరసి పద్మం తిష్ఠతి** – ఏ విధంగా అయితే సరస్సు నందు పద్మము ప్రదర్శనమై ఉంటోందో...

**తథా భూమ్యాం తిష్ఠతి।** – ఆ విధంగా భూమి.

**చక్రేణ రక్షితా మధురా తస్మాత్ 'గోపాలపురీ' భవతి।** – స్వర్గలోకంలో అమృతము విష్ణుచక్రముచే రక్షించబడుతీరుగా ఆ (గో)భూమిపై 'గోపాలపురము'. ఆపురము సర్వదా దేవతలచే రక్షించబడుచూ ఉన్నది.

**ఆ గోపాలపురములో అనేక వనములు** (Public Gardens)

= బృహత్తు అయినట్టి **బృహద్వనము (సువిశాలమైనది).**

= మధువు గురించిన **మధురవనము.**

= తాళవృక్షములతో కూడిన **తాళవనము.**

= కుముదము (తెల్లకలువలతో కూడిన) – **కుముదవనము.**

= ఖదిరములతోకూడిన – **ఖదిరవనము.**

= భద్రములతో కూడిన – **భద్రవనము.**

= భాండీరము – **భాండీరవనము.**

ఇంకా శ్రీవనము, లోహవనము, బృందావనము...ఇవన్నీ గోపాలపురమును ఆవరించి ఉన్నాయి.

ఆ గోపాలపుర గగనము (ఆకాశము)లో దేవతలు, గంధర్వులు, కిన్నెరులు మొదలైనవారు నృత్యము, గానము చేస్తూ ఉంటారు. ఇంకా అక్కడ

(I) ద్వాదశ (12) ఆదిత్యులు। (II) ఏకాదశ (11) రుద్రులు। (III) అష్ట (8) వసువులు। (IV) సప్త (7) ఋషులు।

(V) బ్రహ్మ। నారదుడు। పంచ (5) వినాయకులు।

విశ్వేశ్వరుడు। రుద్రేశ్వరుడు। అంబికేశ్వరుడు। నీలకంఠేశ్వరుడు। గోపాలేశ్వరుడు। భద్రేశ్వరుడు। అష్టలింగములు – ప్రదర్శనమగుచున్నాయి.

## "పౌరాణిక – వర్ణనలు"

### ద్వాదశ ఆదిత్యులు

**ఆదితియందు కశ్యప ప్రజాపతికి కలిగిన కుమారులు.**

**ధాత, మిత్రుడు, అర్యముడు, శుక్రుడు, వరుణుడు, అంశుమంతుడు, భగుడు, వివస్వంతుడు, పూషుడు, సవిత, త్వష్ట, విష్ణువు.** *(ఇవన్నీ సూర్యునికి నామాంతరములు కూడా!)*

### ఏకాదశ రుద్రులు

**బ్రహ్మ మానస పుత్రులు – (1) అజుడు (2) ఏకపాదుడు (3) అహిర్బుధ్న్యుడు (4) హరుడు (5) శంభుడు (6) త్ర్యంబకుడు (7) అపరాజితుడు (8) ఈశానుడు (9) త్రిభువనుడు (10) త్వష్ట (11) రుద్రుడు** – వీరంతా జగద్రచనను పర్యవేక్షిస్తూ ఉంటారు.

### అష్ట వసువులు

**భారతములో చెప్పి ఉన్న ప్రకారము – వీరు ప్రజాపతి కుమారులు.**

**ధరుడు, ధ్రువుడు, సోముడు, అహుడు, అనిలుడు, అగ్ని, ప్రత్యూషుడు, ప్రభాసుడు. ఆఖరివాడగు ప్రభాసుడు వసిష్ఠ హోమ ధేనువు దొంగిలించిన కారణంగా శపించబడి – భీష్ముడుగా జన్మించారు.**

| అష్ట మూర్తులు | | | |
|---|---|---|---|
| (బ్రహ్మయొక్క భ్రూమధ్యము నుండి వెలువడిన రుద్రునియొక్క రూపములు) | | | |
| **నామము** | **స్థానము/రూపము** | **భార్య** | **పుత్రుడు** |
| **భవుడు** | **జలము** | **ఉష** | **శుక్రుడు** |
| **శర్వుడు** | **మహి** | **సుకేశి** | **అంగారకుడు** |
| **ఈశానుడు** | **వాయువు** | **శివ** | **హనుమంతుడు** |
| **పశుపతి** | **వహ్ని** | **స్వాహా** | **స్కందుడు** |
| **భీముడు** | **ఆకాశము** | **దిశ** | **స్వర్గము** |
| **ఉగ్రుడు** | **స్వధర్మనిష్ఠుడైన బ్రాహ్మణుడు** | **దీక్ష** | **సంతానుడు** |
| **మహాదేవుడు** | **సోముడు** | **రోహిణి** | **బుధుడు** |
| **రుద్రుడు** | **సూర్యుడు** | **సువర్చల** | **శనైశ్వరుడు** |

## సప్త ఋషులు

1. **మరీచి, అంగీరసుడు, పులహుడు, వసిష్ఠుడు, అత్రి, పులస్త్యుడు, క్రతువు**
2. **కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వసిష్ఠుడు**

ఈ విధంగా చతుర్విగ్ంశతి (24) తత్త్వములు ఆ గోపాలపురములో వేంచేసి ఉన్నాయి.

అందులో ఇంకా రెండు వనములు (1) కృష్ణవనము (2) భద్రవనము. వాటిలో పుణ్యములు, పుణ్య శ్రేష్ఠములు (తమములు) అయినట్టి 12 ఉపవనములు.

వాటియందు దేవతలంతా ఉన్నారు.

**మూర్తములు : –**

బలరామునియొక్క – బలరామమూర్తి,
ప్రద్యుమ్నుని – ప్రద్యుమ్నమూర్తి,
అనిరుద్ధుని – అనిరుద్ధమూర్తి,
కృష్ణుని – కృష్ణమూర్తి –

మూర్తీభవించినవై ఆ వనములలో ఉపాసించబడుచున్నాయి. ఆ వనములలో – **వనేష్వేవం మధురా సేయం ద్వాదశమూర్తయో భవంతి।** మధుర అని పిలువబడుచూ, ద్వాదశ (12) మూర్తులు కలిగి ఉన్నది.

> **మొదటి మూర్తిని <u>రుద్రులు</u>, రెండవ మూర్తిని <u>బ్రహ్మ</u>, మూడవ మూర్తిని <u>బ్రహ్మజ్ఞులు</u>, నాలుగవ మూర్తిని <u>మరుత్తులు</u>, ఐదవ మూర్తిని <u>వినాయకులు</u>, ఆరవమూర్తిని <u>వసువులు</u>, ఏడవమూర్తిని <u>సప్తఋషులు</u>, ఎనిమిదమూర్తిని <u>గంధర్వులు</u>, తొమ్మిదవమూర్తిని <u>అప్సరసలు</u> <u>పూజిస్తూ</u> ఉన్నారు.**

**10వ మూర్తి** – నిరాకారమై, అంతర్ధాన (Disappeared) రూపముగా ఉంటుంది. మూర్తీభవించి కనిపించే సమస్తమునకు ఆధారమైయున్న తేజోరూపము.

**11వ మూర్తి** – స్వపదానుగా (స్వస్వరూపధ్యానరూపము)

**12వ మూర్తి** – "భూమి" **(గోభూమి)** అని అంటారు.

అట్టి మూర్తులను పూజించువారు కేవలమును (Changeless form of SELF) సంతరించుకొంటున్నారు. <u>"ఆత్మస్వరూపుడునగు నాకు దేనిచేతను బంధము మొదలే లేదు"</u>....అను ముక్త స్థితిని సిద్ధించుకుంటున్నారు.

గర్భవాసము, జనన, వార్ధక్య, మరణ, తాపత్రయ (ఆధి భౌతిక - ఆధి దైవిక - ఆధ్యాత్మిక) దుఃఖములనుండి తరించుచున్నారు.

అట్టి గోపాలపురములో శ్రీకృష్ణుడు వేంచేసి ఉన్నారు.

**సంప్రాప్య మధురాగ్ంం రమ్యాగ్ంం, సదా బ్రహ్మాది వందితమ్ ।**
**శంఖ చక్ర గదా శార్ఙ్గ రక్షితాం ముసలాదిభిః ।**
**యత్రాసౌ సస్థితః కృష్ణః స్త్రీభి శక్త్యా సమాహితః।**
**రమా అనిరుద్ధ ప్రద్యుమ్న రుక్మిణ్యా సహితో విభుః॥**

అట్టి మధురా నగరం రమ్యాతి రమ్యము. బ్రహ్మదేవుడు మొ॥వారిచే నమస్కరించబడునది. శంఖ-చక్ర-గద-బాణ-ముసలములచే పరిరక్షించబడు స్థానము. అక్కడ కృష్ణుడు రమా-అనిరుద్ధ, ప్రద్యుమ్న - రుక్మిణీ సమేతంగా విభుడై ఉన్నారు.

ఆ శ్రీకృష్ణుడు 'ఓం' కార స్వరూపుడు

అట్టి 'ఓం' = అ + ఉ + మ + అర్ధమాత్ర-గా శ్రీకృష్ణుడు చతుశ్శబ్దీయుడు.
(జాగ్రత్ - స్వప్న - సుషుప్తి - తురీయ)

**చతుశ్శబ్దో భవేత్ ఏకోహి 'ఓం' కారస్య ఉదాహృతః।** 'ఏకరూపుడే' అయినప్పటికి ఆ శ్రీకృష్ణుడు చతుశ్శబ్దములుగా (4 శబ్దములుగా) ప్రదర్శనమగుచున్నారు. ఆయనయే 'పరోరజసుడు' ప్రతి ఒక్క జీవుని పర (సాక్షీ - Beyond) స్వరూపుడు.

ఓ బ్రహ్మదేవా! అట్టి గోపాలపురములోని శ్రీకృష్ణుని **"సోఽహమ్" - ఇతి అవధార్యాత్ ఆత్మానం "గోపాలోఽహమ్" - ఇతి। - నాలో సమస్తమునకు పరమై, కేవలమై వేంచేసి యున్నవారే ఆ గోపాలకృష్ణుడు. ఆపరస్వరూపమే నేను. నేను ఆగోపాలకృష్ణ స్వరూపుడనే।"** - అని అంతరముగా భావనను ఆశ్రయించి ఉపాసించెదరుగాక। అట్టి వాడు -

- మోక్షము పొందగలడు.
- అట్టివాడు బ్రహ్మత్వము సిద్ధించుకోగలడు.
- అట్టి అంతరంగ ఉపాసనచే బ్రహ్మవిత్ అగుచున్నాడు. బ్రహ్మవిత్ - బ్రహ్మమే అగుచున్నాడు. బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి॥

## గోపాల బ్రహ్మోపాసన

**స గోపాన్ జీవాన్ ఆత్మత్వేన సృష్టిపర్యంతం ఆలాతి - స 'గోపాలో' భవతి॥**

*ఎవ్వరైతే - **"సృష్టి పర్యంతము (సృష్టి ఉన్నంతవరకు) ఆత్మపురుషుడనై, - జీవాత్మ అనబడు గానము చేయుచున్నాను. ప్రకృతియందు జీవాత్మత్వమును ప్రదర్శించుచున్నాను"** అను భావన కలిగి ఉంటాడో, ఆతడు గోపాలుడు (జీవాత్మలను పాలించు వాడు) అగుచున్నాడు.* (The Ruler of Individual Self-related all)

ఓం తత్ సోఽహమ్ పరబ్రహ్మ కృష్ణాత్మకో
నిత్యానందైక స్వరూపః। సోఽహమ్॥

*నేను 'ఓం' అను సంజ్ఞతో చెప్పబడు పరబ్రహ్మమగు కృష్ణాత్మకుడను। నిత్యానంద స్వరూపుడను। ఆ కృష్ణ స్వరూప ఓంకారమును నేనే అయి ఉన్నాను।*

ఓం తత్ సత్ గోపాలో అహమేవ।
పరగ్ంం సత్యం అబాధితం సోఽహమ్।

*నాలో నేనై ఉన్న ఆ తత్-సత్ గోపాలుడను నేనే! ఈ సమస్తమునకు వేరై ఉన్న (జన్మ-కర్మ-మనో-బుద్ధి-చిత్తములచే) బాధింపబడజాలని పరమ సత్యమగు శ్రీకృష్ణ తత్త్వమే నేను!*

ఓ బ్రహ్మదేవా! ఓ సమస్త శ్రోతలారా! తత్త్వజ్ఞాన అధ్యయనులారా। మీరంతా ఈ విధంగా **"కృష్ణాత్ముడను। నిత్యానంద స్వరూపుడను"**- అను తత్వార్థంగా స్వస్వరూపాత్మ గురించి తెలుసుకొని, మనస్సుతో మమేకమై ఉండెదరుగాక। **"తత్ గోపాలోఽహమ్"** అను భావనను

శ్రవణ – మనన – నిధిధ్యాసలచే ఊపాసించండి. శ్రీకృష్ణుడై వేంచేసియున్న మీ **"కేవలమగు–స్వస్వరూపుడు"** అవ్యక్తుడు, నిత్యుడు, అప్రమేయుడు. గోపాలుడు. **మీకు అట్టి శ్రీకృష్ణతత్త్వమే ధ్యానస్తువగును గాక।**

ఓ బ్రహ్మదేవా! **మధురాయాగ్ం స్థితిః, బ్రహ్మన్! సర్వరామే భవిష్యతి।** నేను ఎల్లప్పుడు మధురలో స్థిర నివాసుడనై ఉంటాను. శంఖ–చక్ర–గదా–పద్మ–వనమాలలు ధరించి, విశ్వరూపుడనై పరంజ్యోతి స్వరూపుడనై, రూపవర్జితుడనై సంచరించువాడను. ఎవ్వరైతే మధురలోగాని, జంబూద్వీపమునందుగాని నాయొక్క పవిత్రమగు **ప్రతిమను అర్చిస్తూ** ఉంటారో, అట్టివారు నాకు ప్రియాతి ప్రియులు అగుచున్నారు.

మధురలో అధిష్ఠితమై యున్న శ్రీకృష్ణావతార రూపము మీకు (ఎల్లప్పుడు) సదాపూజ్యము (పూజింపతగినది). కాలచమత్కారము ఎరిగిన సుమేధులగు జనులు – నాయొక్క చతుర్థావతారముగా (పూర్ణావతారముగా) – శ్రీకృష్ణావతారమును తెలుసుకొని ఉపాసించుచున్నారు.

- నేనే గోపాలబాలకులతో కూడిన గోపబాలుడను।
- శ్రీకృష్ణానంద స్వరూపుడను। అనుజుడు (అన్న) అగు బలరామునితో కూడుకొని ఉన్నవాడను.
- నాయొక్క తత్ స్వరూపిణియే రుక్మిణి।
- జన్మ రహితుడు, నిత్యుడు అగు గోపాలుడను। సనాతనుడగా ప్రద్యుమ్నుడను। ఆత్మారాముడను। అనిరుద్ధుడను।

ఈ విధంగా నన్ను తెలుసుకొని అర్చించెదరు గాక।

పైన చెప్పుకొన్న ధర్మములు (Features) విడివిడిగా భావిస్తూ నిష్కాములై (దృశ్యములో ఏదో పొందాలనే తపనతో కాకుండా ఆత్మభావనా సిద్ధికై) ఎవరు పూజిస్తారో, అట్టివారు శ్రీమన్నారాయణుడనగు నన్ను 'భద్రకృష్ణనివాసి'గా పూజించుచున్నట్లు – అగుచున్నది.

ఎవ్వరైతే ధర్మము ఆచరించక కలిధర్మమునకు తలవంచి (దురభ్యాసములచే) జీవితము గడిపియున్నారో, వారికి ఇప్పటికైనా శ్రీకృష్ణావతారుడనగు నన్ను శరణువేడెదరుగాక। వారికి నేనే శరణాగతిని అయి ఉన్నాను.

ఓ బ్రహ్మదేవా! నీకు ఏ విధంగా నారదుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు (సనకుడు, సనందనుడు) మొదలైన వారంతా ప్రియమైన మానస పుత్రులో, ఏ విధంగా అయితే గణపతి రుద్రభగవానునికి ప్రియమైనవాడో, ఏవిధంగా నాకు హృదయేశ్వరి అగు లక్ష్మీదేవి ప్రియమో, అంతంతగా **తథా భక్తో** మయి ప్రియః। భక్తులంటేనాకు అంతప్రియము.

**బ్రహ్మదేవుడు** : పితృదేవా! ఆదినారాయణా! **చతుర్భిః దేవైః కథమ్ ఏకో** దేవస్స్యాత్। నలుగురు దేవతలు ఏవిధంగా 'ఏకదేవుడు' (ఒకే దేవుడు) అవుతారు? ఏకము, అక్షరము అగు తత్త్వము అనేకాక్షరముగా ఎట్లా అవుతోంది? **ఏకమ్ అక్షరం యత్ విశ్రుతమ్ అనేకాక్షరరం కథం సంభూతమ్?** ఏకము అనేకముగా అవటము గురించి (సంభవించటము గురించి) నాకు దయతో బోధించండి.

**శ్రీమన్నారాయణుడు** : బ్రహ్మదేవా! చెప్పుచున్నాను. వినండి. **పూర్వమ్ ఏకమేవ అద్వితీయం బ్రహ్మాసి।** – మొట్టమొదట ఏకము, తనకు రెండవదంటూ ఏదీ లేనిది – అగు 'బ్రహ్మము' మాత్రమే ఉన్నది.

- **తస్మాత్ అవ్యక్తమ్ ఏకాక్షరమ్।** అద్దాని నుండి అవ్యక్తమగు → **'ఏకాక్షరము'** ప్రదర్శనమయింది.
- **తస్మాత్ అక్షరాత్–మహత్।** అట్టి ఏకాక్షరమునుండి → **'మహత్'**
- **మహతో–అహంకారః।** మహత్ నుండి → **'అహంకారము'।**
- **తస్మాత్ అహంకారాత్ పంచతన్మాత్రాణి।** అట్టి అహంకారము నుండి → శబ్ద – స్పర్శ – రూప – రస గంధములు అనబడే **"పంచతన్మాత్ర–తత్త్వములు"** .
- **తేభ్యో భూతాని।** తన్మాత్రల నుండి → **సకల జీవజాతులు.**
- **తైః ఆవృతమ్ అక్షరమ్।** వీటన్నిటితో ఆవరించబడినదే **'అక్షరము'.**

- నేనే **'అక్షరమగు ఓంకారమును.**
- జరామరణములు లేనివాడను. **అజరుడను. అమరుడను.**
- ఆత్మకు ద్వితీయమే లేదు కనుక **అభయుడను. (ద్వితీయం వై భయం భవతి)।**
- మార్పు చేర్పులు లేని **అమృత స్వరూపుడను.**
- అహంబ్రహ్మాస్మి। **బ్రహ్మము** – అని వేదోపనిషత్తులచే చెప్పబడేది **'నేనే' అయి ఉన్నాను.**
- జన్మ– కర్మ– కర్మఫలములుగాని, జాగ్రత్ – స్వప్న – సుషుప్తులుగాని, పుణ్య–పాపకర్మవ్యవహారములుగాని, మనో – బుద్ధి – చిత్త– అహంకారాదులు గాని ఆత్మను బంధించలేవు. అందుచేత **నిత్యముక్తుడను।**
- **'క్షరము'** అనునది లేని 'నేను' – కేవలమగు **ఆత్మస్వరూపుడను. అక్షరస్వరూపుడను.**
- **"నేను ఉన్నాను** (I Exist)" అను విశేషణము స్వాభావికమైయున్న 'సత్తా' మాత్రుడను (Absolute form / sense of "I am present"). **సత్ స్వరూపుడను.** (Form of 'BEING').
- **'ఎరుగుట'** (లేక) **'తెలుసుకొనుట'** అనునవి స్వాభావిక లక్షణములుగా కలవాడను. **చిత్స్వరూపుడను.** (Form of 'KNOWING').
- సర్వము బుద్ధి – మనస్సులచే అనుభవముగా మూర్తీభవింపజేయు **ప్రకాశ** (Enlightenment) **మాన స్వరూపుడను.**
- (నవలా రచయితయే నవల – అంతా వ్యాపించి ఉన్న తీరుగా, స్వప్న ద్రష్టయొక్క స్వప్నచైతన్యమే స్వప్నమంతా నిండి ఉన్న తీరుగా) – సమస్తముగా విస్తరించియున్న **సర్వవ్యాపకుడను.**
- **ఏకము, అద్వితీయము** అగు **బ్రహ్మమును.** మమస్వాభావికములగు సత్ – చిత్ – ప్రకాశములకు అన్యమైనదంతా నా యొక్క **మాయా చమత్కారమే।**

ఓ బ్రహ్మ దేవా! **తత్త్వత్। త్వమేవాహమ్। అహమేవ ఇదమ్ – సర్వమ్।** అట్టి ఏకాక్షరమగు ఆత్మ అనబడే 'తత్'యే నీవు. నీవుగా ఉన్నది నేనే। ఈ సమస్తముగా ఉన్నది నేనే। కనుక, ఈ సమస్తముగా ఉన్నది నీవే కూడా!

అది విని బ్రహ్మదేవుడు ఆత్మానందానుభవులయ్యారు.

**వ్రజగోపికలు** : మహర్షీ! మీవంటి మహనీయులు అగు మునీశ్వరులు మొదలైనవారు కృష్ణతత్త్వమును ఏరీతిగా ఉపాసిస్తున్నారు?

**దుర్వాసమహర్షి** : ఓ వ్రజ గోపికలారా। మన శ్రీకృష్ణ తత్త్వమును సాంగ – సపరివారపూర్వకంగా మునులమగు మేము ఏవిధంగా ఉపాసనా – భావములచే ఆరాధిస్తూ ఉన్నామో చెప్పుకుందాము.

| | | |
|---|---|---|
| రోహిణీ కుమారుడగు బలరాముడు<br>రోహిణీ తనయో వికార అకారాక్షర సంభవః। | } | **"విశ్వుడు"** (జాగ్రత్ అభిమాన పురుషుడు).<br>**'అ' కారాక్షర సంభవుడుగా భావిస్తున్నాము.** |
| ప్రద్యుమ్నుడు | – | **'తేజసాత్మక'** – పురుషుడు, (స్వప్నాభిమాన పురుషుడు) **'ఉ' కారాక్షర సంభవుడు.** |
| అనిరుద్ధుడు | – | **ప్రాజ్ఞాత్మక** (సుషుప్తాభిమాన) పురుషుడు। **'మ' కారాక్షర సంభవుడు.** |
| శ్రీకృష్ణుడు | – | ఎవనియందు ఈ విశ్వమంతా ప్రతిష్ఠితమైయున్నదో అట్టి **అర్థమాత్రాత్మకుడు.** |
| రుక్మిణీదేవి<br>**(కృష్ణాత్మికా, జగత్కర్త్రీ మూలప్రకృతిరూపిణీ।)** | } | కృష్ణాత్మిక। జగత్తుకు కర్త। మూలప్రకృతి స్వరూపిణి। |
| **వ్రజగోపికా స్త్రీలు (వ్రజ స్త్రీజన సంభూత శ్రుతిభ్యో బ్రహ్మసంగతః)** | – | బ్రహ్మమునకు సంబంధించిన మహావాక్యముల **రూపులు.** శ్రుతుల సవివరణ రూపులు. |

**ప్రణవత్యేన ప్రకృతి = 'త్వం' వదంతి బ్రహ్మవాదినః।** బ్రహ్మతత్త్వజ్ఞులు ప్రణవము గురించి వివరించి చెప్పేటప్పుడు "త్వం"-యొక్క అనుభవమే ప్రకృతి అని చెప్పుతూ ఉంటారు. కాబట్టి 'ఓం'కార సంభూతుడైన మన కృష్ణుడు విశ్వమంతా అహం-త్వం స్వరూపమై ఉన్నవారు ("ఓం త్వం ప్రకృతి" - తఇతి మంత్రః॥).

క్లీం = 'ఓం'కారముతో ఏకత్వమే 'క్లీం' అని బ్రహ్మవాదులు పలుకుచున్నారు.

'మధుర'లో వేంచేసిన క్లీంకార రూపుడగు శ్రీకృష్ణ భగవానుని విశేషముగా ధ్యానించటము చేత ఈ జీవునకు మోక్షము సిద్ధించగలదు.

(**మధుర =** ఈ కనబడే సమస్తము పరబ్రహ్మముయొక్క మాధుర్య స్వరూపమే (The Taste of the Divinity) - అను భావనను ఉపాసించటము).

## సాకారధ్యానము

**గాంధారీ వ్రజగోపిక :** మహర్షీ! అఖండాత్మ స్వరూపమగు శ్రీకృష్ణ చైతన్యతత్త్వము అనిర్వచనీయము, మనోవాక్ - అగోచరము కదా!

**దుర్వాసుడు :** అవును. ఆ విధంగా వేద - ఉపనిషత్తులు అభివర్ణిస్తున్నాయి కూడా।

**గాంధర్వీ వ్రజగోపిక :** అట్టి మనస్సుకు అందని శ్రీకృష్ణ బ్రహ్మతత్త్వమును మేము ఉపాసించటానికి ఉపాయము ఏమిటి?

**దుర్వాసుడు :** ఓ గాంధర్వీ! ఓ వ్రజ గోపికలారా। వాస్తవానికి మీరంతా ధన్యులు. మీరు కృష్ణ ప్రేమతో మునిగి తేలుచున్నారు. మీవంటి భక్తి పారవశ్యులకు (లేక) కృష్ణునితో **"సమాగమ - విరహము"** కలవారికి సిద్ధించగల కృష్ణతత్త్వము గొప్ప తపోధనులగు మాకు కూడా లభించేది కాదు. అయినా **'ఉపాసించేది ఎట్లా?'** అని ప్రశ్నించారు కాబట్టి **'సాకారధ్యానము'** ఎట్లా చేసి కృష్ణతత్త్వము సిద్ధించుకోవచ్చునో చెపుతాను. వినండి।

**ఒకప్పుడు శ్రీమన్నారాయణుడు బ్రహ్మదేవునితో ఇట్లా చెప్పసాగారు.**

శ్రీమన్నారాయణుడు : ఓ బ్రహ్మదేవా! భక్తజన ఉపాసనా సౌలభ్యము కొరకై సాకార ప్రకృతిగతమగురూపమును ఈ విధంగా దాల్చినవాడనై ఉంటున్నాను.

## సాకార రూప వర్ణన

- **అష్టదళములతో (8 రెక్కలతో) వికసితమైనట్టిది.** (1) పంచమహాభూతములు, (2) పంచ జ్ఞానేంద్రియములు (3) పంచ జ్ఞానేంద్రియార్థములు (విషయములు) (4) పంచకర్మేంద్రియములు (5) పంచ కర్మేంద్రియార్థములు (6) పంచప్రాణములు (7) పంచ ఉపప్రాణములు (8) అంతరంగ చతుష్టయముల కళల హృత్ పద్మము.

  - (అష్టవిధ ప్రకృతి = దృశ్యము; దేహము; ఇంద్రియములు; జీవాత్మ; ఈశ్వరుడు; మనస్సు; బుద్ధి; చిత్తము)

  **అష్ట పత్రం వికసితం హృత్పద్మం - తత్ర సంస్థితమ్।** ఆ **అష్టదళ వికసిత-హృదయ పద్మము** గలది.
- **దివ్యమైన ధ్వజ - ఛత్రముల** చిహ్నములుగల పాదములు కలిగియున్నట్టిది,
- **శ్రీవత్స లాంఛనము** కలిగియున్నట్టిది,
- హృదయముపై **కౌస్తుభమణి** ధరించినట్టిది, ఆ మణితో విరాజిల్లు హృదయస్థానము కలిగిఉన్నట్టిది,
- (కర్మ భక్తి యోగ జ్ఞానములు అనే) **4 భుజములు** కలిగి ఉన్నట్టిది,
- **శంఖ - చక్ర - శార్ఙ్గ (ఖడ్గ) - పద్మ - గదలను** ధరించినట్టిది.
- **బాహువులపై 'కేయూరములు' అనే ఆభరణములు** ధరించినట్టిది.
- **పుష్పమాల** ధరించిన **కంఠముతో** శోభితమైనది,
- కాంతి పుంజములు వెదజల్లు **కిరీటము** ధరించినట్టిది,
- అభయము ప్రసాదించు **హస్త ముద్రిక** కలిగియున్నట్టిది,
- **చెవులకు మకర కుండలములు** ధరించినట్టిది,



- బంగారు రంగుతో శోభిల్లు **సౌమ్యమైన తనువు (శరీరము)** కలిగియున్నట్టిది.
- భక్తులకు **అభయము** ప్రసాదించునది,
- చేతులందు **వేణుశృంగమును** (పిల్లనగ్రోవి) ధరించునది,

**– అగు నా శ్రీకృష్ణావతారరూపమును ధ్యానించెదరు గాక!**

ఈ సర్వ జగత్తు యొక్క సారభూతము బ్రహ్మజ్ఞానము. అట్టి బ్రహ్మజ్ఞానముయొక్క మాధుర్యమే మధుర. **నారాయణతత్త్వసారమే మధుర.** అష్టదిక్పాలకులతో పరివేష్టితమైన ఈ జగత్తంతా నా **మధురా రూపమే! అస్మత్ కృష్ణ చైతన్యానందమే! అందుచేత ఈ ప్రపంచమును 'మనస్సు' అనే సరోవరములో వికసించిన పద్మముగా సేవించెదరు గాక!**

ఓ బ్రహ్మదేవా!

నాయొక్క నారాయణ–శ్రీకృష్ణ సాకార ఉపాసనారూపములోని కొన్ని కొన్ని విశేషముల గురించి వివరణలు చెప్పుకుందాము. వినండి.

**జగత్తు :** ఈ జగత్తును బ్రహ్మ జ్ఞానముచే బ్రాహ్మీదృష్టిచే దర్శించెదరుగాక! **అష్టదిక్పాలకుల పరిరక్షణచే** ప్రదర్శనమగుచున్న ఈ భూమిని నా **మనోసరోవరము**లో వికసించిన పద్మ పుష్పముగా భావించండి.

## {అష్ట దిక్పాలకులు} (పౌరాణిక విశేషయుక్తంగా)

| పాలించువారు | | దిక్కులు | | సపత్నీ |
|---|---|---|---|---|
| ఇంద్రుడు | – | తూర్పు | (East) | శచీదేవి |
| అగ్ని | – | పూర్వ దక్షిణము (ఆగ్నేయము) | (South-East) | స్వాహాదేవి |
| యముడు | – | దక్షిణము | (South) | శ్యామలాదేవి |
| నిర్రృతి | – | దక్షిణ – పశ్చిమము (నైర్రృతి దిక్కు) | (South-West) | దీర్ఘాదేవి |
| వరుణుడు | – | పడమర | (West) | శూనాదేవి |
| వాయువు | – | పశ్చిమోత్తరము (వాయువ్యము) | (North-West) | అంజన |
| కుబేరుడు | – | ఉత్తరము | (North) | చిత్రలేఖ |
| ఈశానుడు | – | పూర్వోత్తరము (ఈశాన్యము) | (North - East) | ఈశ్వరి |

**సంసార సముద్రంగా కనిపించే ఈ జగత్తును పద్మనాభుడనగు నాయందు వికసిత పద్మముగా చూడండి.**

**చరణములు :** నా పాదపద్మములయందు సూర్యచంద్ర కాంతులు. మేరువులవంటి బంగారు ధ్వజములు. బ్రహ్మ లోకము గొడుగు (ఆతపత్రము) వంటిది. బ్రహ్మలోకముపై నాచరణములు భావించండి. సర్వాలంకారయుక్తంగా భాసిస్తూ ఉన్నట్లు (ఈ విశ్వమంతా శ్రీవిష్ణు పాదముల అలంకారమగు పారాణి).

శ్రీవత్సము : శ్రీవత్సం చ స్వరూపం చ వర్తతే లాంఛనైః సహ, శ్రీవత్సలక్షణం - తస్మాత్ కథ్యతే బ్రహ్మవాదిభిః। సమస్త లాంఛనములతో, శ్రీవత్స (ప్రేమ, కరుణ, మైత్రీ ఇత్యాది) లక్షణములతో భాసిస్తున్నది కాబట్టి "శ్రీవత్సాంకితుడు" – అని పరమాత్మనగు నా నారాయణ స్వరూపమును బ్రహ్మవేత్తలు స్తుతిస్తున్నారు. శ్రీ విష్ణు భగవానుని రొమ్ముపై మచ్చ – శ్రీవత్సము).

**కౌస్తుభమణి : యేన సూర్య అగ్ని వాక్ చంద్ర తేజసా స్వస్వరూపిణా,** వర్తతే కౌస్తుభాఖ్యం మణిం వదంతి ఈశమానినః। ఏదైతే సర్వజీవులలో సూర్య – అగ్ని – వాక్ – చంద్ర తేజస్సులతో కూడి **'స్వస్వరూపముగా'** ప్రకాశిస్తోందో, అట్టి ఆత్మప్రకాశిని కాబట్టి ఈశ్వర సేవ చేయువారు **'కౌస్తుభమణి'**ని నా అలంకారంగా వర్ణిస్తున్నారు. (కౌస్తుభమణి = సముద్రములో పుట్టి శ్రీవిష్ణు భగవానుని వక్షస్థలము అలంకరించిన మణి. భూమిని నిలిపి ఉంచు విష్ణు తేజము).

**చతుర్భుజములు : సత్త్వం రజః తమః - ఇతి అహంకారః చతుర్భుజః।** ప్రకృతి విశేషములగు సత్త్వ రజ తమో త్రిగుణములు, అహంకారము – ఈ '4' నాయొక్క చతుర్భుజములు. (స్థూల–సూక్ష్మ–కారణ–మహా కారణములని, ప్రకృతి–పురుష–మహాపురుషులని కూడా వర్ణించి చెప్పబడింది).

**శంఖము : పంచభూతాత్మకం శంఖం కరే రజసి సంస్థితమ్।** చేతిలో ఉన్న శంఖము పంచమహాభూతములకు (భూమి–ఆపో–

తేజో-వాయు-ఆకాశములకు), వాటివాటి ధర్మములకు (Functions) - సంజ్ఞగా భావిస్తున్నారు. (శం = ఈ సృష్టి మొత్తానికి సమన్వయము కలుగజేయు, ఖం = ఆకాశము).

చక్రము : మనస్సుకు సంజ్ఞ। బాల స్వరూపం ఇత్యంతం 'మనః' చక్రం నిగద్యతే। బాలకృష్ణుని లీలా వినోదములు "మనఃచక్ర చమత్కారములు"గా చెప్పబడుచున్నాయి. (సుదర్శన చక్రము = సమస్తమును దర్శించుచున్న మనస్సుకు సంజ్ఞ).

**శార్ఙ్గము :** (ధనస్సు) **ఆద్యా మాయా భవేత్ శార్ఙ్గమ్।** మాయ యొక్క ప్రథమోత్పత్తి - చమత్కారమునకు ధనస్సు ప్రతీక. జీవులను కల్పనయందు రమింపజేస్తూ, 'ఏమరుపు' కలిగిస్తూ ఉన్నట్టిది.

పద్మము: పద్మమ్ విశ్వకరేస్థితమ్। ఈ సమస్త విశ్వముయొక్క ధారణయే-శ్రీమన్నారాయణ ప్రతిమయొక్క చేతిలో ధరించిన పద్మము. ***పరమాత్మ అనే సముద్రంలో విరిసిన పద్మమే ఈ విశ్వ దృశ్యము.***

గద: ఆద్యా విద్యా గదా వేద్యా। ఆది విద్యాయగు ఆత్మవిద్యయే 'గద' - అని స్తుతించబడుతోంది. 'అవిద్య' అనే భీకరమైన (అడ్డుగా ఉన్న) శిలను పగలగొట్టి "పొడి" చేసివేయునది.

**కేయూరములు : ధర్మ-అర్థ-కామములే** భూజాలంకారములగు కేయూరములుగా దర్శించబడుచున్నాయి.

**ఆభరణములు** : దివ్యమయమగు గుణసంపదలు.

**కంఠం : కంఠం తు నిర్గుణం ప్రోక్తం।** నిర్గుణ బ్రహ్మము కంఠము, కంఠాభరణములుగా చెప్పబడుతోంది. (లింగము = నిర్గుణ బ్రహ్మము. నిర్గుణ స్వరూపము). (గుణములకు మునుముందే ఉన్నట్టి - ఈ జీవునియొక్క - కేవల చైతన్యరూప సౌందర్యము).

**మాల్యం : మాల్యతే ఆద్యయా అజయా।** మాయాలంకారమే 'మాల'. 'ప్రకృతి, మాయ' అనే ఆత్మయొక్క అలంకారమే 'మాల'.

**మాల - మాలా నిగద్యతే, బ్రహ్మన్। తవ పుత్రైస్తు మానసైః।** ఓ బ్రహ్మదేవా! తమ మానస పుత్రులగు నారదుడు మొదలైనవారు నాయొక్క 'మాలాంకారము'గా (Decoration of Garlands) స్తుతించబడుచున్నారు. సనక-సనంద-సనత్కుమార-సనత్కుమార-సనస్సుజాత-వసిష్ఠాది బ్రహ్మమానస పుత్రులు నాకు మాలలు.

**కిరీటము :** సత్త్వ (The Presence) రూపమగు కూటస్థునికి గుర్తు. **'సత్'కు సంజ్ఞ.**

**కుండలయుగళము :** బ్రహ్మమానస సాగరము, క్షీరోత్తరము నాకు కుండల ద్వయము. (ఇహ-పరములు నాకు రెండు కుండలములు).

ఎవ్వరైతే నాయొక్క సాకార ప్రతిమను పైవిధములుగా భావించి ధ్యానిస్తూ ఉంటారో, అట్టివారు నాకు ప్రియులు. వారికి మోక్షము కరతలామలకము కాగలదు. అట్టివాడు ముక్తుడు అగుచున్నాడు. **ఇక్కడి దృశ్య - దేహ - జగత్ - అంతరంగము మొదలైన ఆయా సమస్త విషయములు ఆతనికి బంధములు కావు. పైగా, అలంకారప్రాయములు అవుతాయి.** అట్టివారికి నాయొక్క అఖండాత్మస్వరూపము సంప్రకటితమౌతూ ఉంటుంది.

ఓ విధీ। బ్రహ్మదేవా। నేను మీయొక్క భవిష్యత్ సృష్టిరచనకై ఉపాసనరూపంగా పై విషయాలు చెప్పుకుంటూ వస్తున్నాను.

-----

**బ్రహ్మదేవుడు :** పరమాత్మా! శ్రీమన్నారాయణా! మీ అసలైన రూపము ఎట్టిది? సగుణమా? నిర్గుణమా?

**శ్రీమన్నారాయణుడు:** స్వరూపం ద్వివిధంచైవ-సగుణమ్, నిర్గుణాత్మకమ్। నాకు రెండు రూపములు ఉన్నాయి. (1) సగుణరూపము (2) నిర్గుణరూపము. (సాకారమగు బంగారు ఆభరణము, నిరాకారమగు బంగారమువలె, సాకారమగు తరంగములు, నిరాకారమగు జలమువలె)।

**బ్రహ్మదేవుడు:** మీరు వాస్తవానికి నిరాకారులే అయి ఉండగా, తమ సాకార ఉపాసనారూపమును, అట్టి సారూప్యముయొక్క శంఖచక్ర కిరీటాది ఆభరణముల అంతరార్థములు చెప్పారు. చాలా సంతోషము. అయితే నాకు ఇక్కడ ఒక సందేహము మనస్సులో జనిస్తోంది. నిర్గుణ, నిరాకార, అమూర్త, నిరాలంబులగు మీకు - (వ్యక్తులకు ఆభరణములుగా అగుచూ ఉండునట్టి) కిరీటము, భుజకీర్తులు మొదలైనవి ఆభరణములుగా ఎట్లా అవుతాయి?

ఇంకొక ప్రశ్న. మిమ్ములను బ్రహ్మ, రుద్రుడు, మొదలైన దేవతలు ఏవిధంగా ధ్యానిస్తూ ఉంటారు? సాకారంగానా? నిరాకారంగానా?

జీవులలో బ్రహ్మజ్ఞులు, శివపార్వతుల సంకల్ప జనితులగ గణపతి, ద్వాదశాదిత్యులు మిమ్ములను ఏఏ రీతులుగా ఉపాసిస్తున్నారు?

ఈ వివిధ దేవత - మానవ మొదలైనవారి ఉపాసనలు ఏఏ తీరులైనవి? ఇంకా వసువులు, గంధర్వులు, ఎట్లా పూజిస్తున్నారు?

సపదానుగ అయి (జగత్తును ఆశ్రయిస్తూనే) అశరీరులై ఉండే సూక్ష్మ స్వరూపులగు దేవతలు, మహర్షులు మొదలైనవారు ఎట్లా ఆరాధిస్తున్నారు?

ఈ ఈ విశేషాలు నాకు తెలియజేయండి.

శ్రీమన్నారాయణుడు : నారాయణుడగు నేను **సమస్త సాకార-గుణ-సారూప్య తత్త్వములకు మునుముందే తేజో-చైతన్యకేవలరూపుడనై** ఉన్నాను. అది నాయొక్క నిర్గుణ, నిరాకార విశేష చమత్కారము. **అది ఎప్పటికీ చెక్కుచెదరనిది.**

అట్టి నిరాకరరూపమే **వ్యక్తీకరణము** (Manifestation) అనే 'లీల' ను స్వీకరించి ద్వాదశమూర్తులుగా (ద్వాదశాదిత్యులుగా) మూర్తీభవమగుచున్నాను. సమస్త రూపములు, గుణములు నావే కాబట్టి నేను రూప -గుణరహితుడనని చెప్పబడుచున్నాను. సమస్త రూపములు నావే అయినప్పుడు ఏరూపము నాదని చెప్పగలరు? ఆభరణములన్నీ బంగారమే అయి ఉండగా, బంగారమునకు 'ఇది' అనే ఆకారమేముంటుంది?

**అట్టి నా అవ్యక్తము యొక్క వ్యక్తీకరణమే :-**

- సర్వలోకములుగా - సర్వలోకములలో,
- సమస్త దేవతలుగా - సమస్త దేవతలలో,
- సర్వ మానవులుగా - సర్వమానవులలో,
- సర్వ జీవులుగా - సర్వజీవులలో, వారి జీవనముగా - జీవనములలో

సంతిష్ఠితమై ఉన్నది. (placed in all). రుద్రులందు **రౌద్రీస్వరూపుడను।** బ్రహ్మయందు **బ్రాహ్మీ స్వరూపుడను.** దేవతలలో **దివ్య-దైవీ స్వరూపుడను।** మనుష్యులలో **మానవత్వమును.** వినాయకునిలో **విఘ్నవినాశనిని।** ఆదిత్యుని (సూర్యుని)యందు **తేజో (జ్యోతి) స్వరూపుడనై ఉన్నాను.** గంధర్వులలో **గాంధర్వీరూపుడను।** అప్సరసలలో 'గో' స్వరూపుడను। వసువులలో కామ్యస్వరూపుడను। కళ్ళకు కనబడని అంతర్ధాన జీవులలో ప్రత్యక్షము కాగల **ప్రకాశమాన** (Art of manifesting) **తత్త్వమై ఉన్నాను!**

సమస్తము ప్రకాశింపజేయువాడనై ఉన్నాను. సమస్తమైన ఆవిర్భావ (Generatings), తిరోభావములు (withdrawing Distributions, De-Generatings) నాయందే ఏర్పడుచున్నవై ఉండగా, నేను **స్వపదము** నందు ప్రకాశమానమై ఉన్నాను.

**దుర్వాసమహర్షి :** ఒక రచయిత యొక్క రచనా కళా విశేషమే (The Art of Writing pertaining to a Novelist) కథారచనలో అనేక మంచిచెడు (Hero and Villan) పాత్రలు గుణగణములు, సంభాషణలు కల్పిస్తోంది కదా! అట్లాగే పరమాత్మయగు శ్రీకృష్ణభగవానుడే చైతన్యరూపుడై తామసులలో **తామసగుణి గాను, రాజసులలో రాజసగుణి గాను, సాత్వికులలో సాత్వికుడి గాను, మానవులలో మానవుడు గాను, భక్తయోగులలో భక్తిరసముగాను** ప్రతిష్ఠితుడై ఉన్నారు.

ప్రాణాత్మకుడుగా భూః-భువ-సువర్ లోకములలో విస్తరించి ఉన్నట్టి ఓం తత్ సత్ ప్రాణాత్మకునకు నమస్కరించుచున్నాము.

I. ఓం ప్రాణాత్మనే నమో నమః

> ఓం ప్రాణాత్మనే, ఓం తత్సద్భుర్భువస్సువః, తస్మై ప్రాణాత్మనే నమో నమః।
> ఓం శ్రీకృష్ణాయ గోవిందాయ గోపీజనవల్లభాయ
> ఓం తత్సత్ భూర్భువః తస్మైవై నమో నమః

భూ-భువ-సువ స్వరూపుడై, తత్-సత్ స్వరూపుడైన శ్రీకృష్ణా! గోవిందా! గోపీజనవల్లభా! **నమోనమః।**

II. ఓం అపానాత్మనే నమో నమః

> ఓం అపానాత్మనే ఓం తత్సత్ భూర్భువస్సువః తస్మై అపానాత్మనే నమో నమః

ఓం భూర్భువస్సువ త్రిలోకములుగా విస్తరించినవారైనట్టి ఓంతత్ సత్ స్వరూపుడు, అపానాత్మ అనిరుద్ధ స్వరూపుడు - అగు శ్రీకృష్ణునకు **నమస్కారము.**

> **ఓం శ్రీకృష్ణాయ అనిరుద్ధాయ। ఓం తత్సత్ భూర్భువస్సువః తస్మై వై నమో నమః।**

ఓం తత్సత్ స్వరూపుడై త్రిలోకములుగా ప్రదర్శనమగుచున్న అనిరుద్ధ స్వరూప శ్రీకృష్ణునికి నమస్కారము.

III. ఓం వ్యానాత్మనే నమః॥

> ఓం **"వ్యానాత్మనే" ఓం తత్సత్ భూర్భువస్సువః తస్మై వ్యానాత్మనే నమో నమః॥**

వ్యానాత్మ స్వరూపుడగు పరమాత్మకు నమస్కారము.

| ఓం శ్రీకృష్ణాయ రామాయ ఓం తత్సత్ భూర్భువస్సువః తస్మై వై నమో నమః |
|---|

'తత్సత్ ఓం' స్వరూపులకు కృష్ణ బలరాములకు, వారి త్రిలోకములుగా వ్యాపించిన రూపమునకు **నమస్కారము.**

IV. ఓం ఉదానాత్మనే నమో నమః॥

| ఓం "ఉదానాత్మనే" ఓం తత్సత్ భూర్భువస్సువః తస్మై ఉదానాత్మనే నమోనమః<br>ఓం శ్రీకృష్ణాయ దేవకీనందనాయ। ఓం తత్సర్భూర్భువస్సువః తస్మైవై నమో నమః॥ |
|---|

త్రిలోకవ్యాపియై ఉదానప్రాణస్వరూపుడుగా త్రిలోకములు వ్యాపించిన ఉదానాత్మ భగవానునకు **నమస్కారము.**

V. ఓం సమానాత్మనే నమః।

| ఓం సమానాత్మనే ఓం తత్సత్ భూర్భువస్సువః తస్మై సమానాత్మనే నమో నమః |
|---|

తత్ స్వరూప సమానాత్మ ప్రాణస్వరూపుడై **త్రిలోకములలో విస్తరించి ఉన్న పరమాత్మకు నమస్కారము.**

VI. ఓం నిజస్వరూపాయ నమః॥

| ఓం గోపాలాయ నిజస్వరూపాయ। ఓం తత్సత్ భూర్భువస్సువః తస్మైవై నమోనమః॥ |
|---|

**సమస్త జీవులలో నిజస్వరూపుడై ఓం తత్సత్ త్రిలోకములుగా ప్రదర్శనమగుచున్న పరమాత్మకు నమస్కారము**

VII. ఓం ప్రధానాత్మ గోపాలాయ నమో నమః॥

| ఓం యోఽసౌ ప్రధానాత్మా గోపాల। ఓం తత్సత్ భూర్భువస్సువః తస్మై వై నమో నమః। |
|---|

'ఓం తత్సత్' అని పిలవడు ఏ ముఖ్యప్రాణాత్ముడు త్రిలోకస్వరూపుడై ఉన్నారో- **అట్టి పరబ్రహ్మమునకు నమస్కారము.**

VIII. ఓం ఇంద్రియాత్మా గోపాలాయన నమోనమః॥

| ఓం యోఽఅసౌ, ఇంద్రియాత్మా గోపాల। ఓం తత్సత్ భూర్భువస్సువః తస్మై వై నమో నమః॥ |
|---|

ఏతత్సత్ ఇంద్రియాత్మగా త్రిలోకములలో రూపధారణ చేయుచున్నదో - అట్టి ఆత్మబ్రహ్మమునకు నమస్కారము.

IX. ఓం భూతాత్మా గోపాలతనయో నమో నమః॥

| ఓం యోఽఅసౌ భూతాత్మా గోపాల। ఓం తత్సత్ భూర్భువస్సువః తస్మై వై నమో నమః॥ |
|---|

పాంచ భౌతికములగు భూతాత్మ (జీవాత్మ) తానే అయిఉన్నట్టి, త్రిలోకములు ఆక్రమించి ఉన్నట్టి **గోపాల ఓం తత్ స్వరూపునికి నమస్కారము.**

X. ఓం ఉత్తమ పురుషగోపాలాయ నమః

| ఓం యోఽఅసౌ ఉత్తమ పురుషో గోపాల। ఓం తత్సత్ భూర్భువస్సువః తస్మై వై నమో నమః॥ |
|---|

(ఉత్తమ పురుష = "నేను" / మధ్యమపురుష = నీవు / ప్రథమ పురుష = ఆతడు)

ఏ ఓం తత్ సత్ స్వరూప గోపాలుడైతే భూ-భువ-సువః - త్రిలోకములలో సమస్త జీవులలో 'నేను' 'నేను' రూపముగా ప్రకాశమానమగుచున్నారో అట్టి **ఉత్తమపురుష గోపాలునికి నమస్కారము.**

XI. ఓం బ్రహ్మే పరంవై నమోనమః॥

| ఓం యో అసౌ బ్రహ్మే పరం వై బ్రహ్మ ఓం తత్సత్ భూర్భువస్సువః తస్మై వై నమో నమః |
|---|

ఏ ఓం తత్ సత్ భూర్భువస్సువ స్వరూపుడైతే సృష్టికర్త అగు బ్రహ్మదేవుని కూడా సృష్టించువారై, పరబ్రహ్మమూర్తి అయి ఉన్నారో, అట్టి **కృష్ణపరబ్రహ్మమునకు నమస్కారము.**

XII. ఓం సర్వభూతాత్మాయ నమః

| ఓం యోఽసౌ సర్వభూతాత్మా గోపాల। ఓం తత్సత్ భూర్భువస్సువః తస్మై వై నమో నమః। |
|---|

సర్వజీవులలో ఆత్మగా వేంచేసినవారై యున్న తత్‌సత్ ఓం – త్రిలోక స్వరూప కృష్ణ పరమాత్మకు నమస్కారము.

### XIII. ఓం సర్వభూతాంతరాత్మనే నమః।

| ఓం జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయ, తురీయాతీతో అంతర్యామీ గోపాల। ఓం తత్‌సత్ భూర్భువస్సువః తస్మై వై నమో నమః। |
|---|

ఏ "ఓంతత్‌సత్ స్వరూప త్రిలోకాంతర్గత గోపాలుడైతే" జాగ్రత్ – స్వప్న – సుషుప్తుల సాక్షి యగు (4వ వాడగు) తురీయమునకు ఆవల తురీయాతీత – అంతర్యామి అయి ఉన్నారో అట్టి గోపాలకృష్ణ అంతరాంతరునకు నమస్కారము.

శ్లో॥ ఏకోదేవః సర్వభూతేషుగూఢః! సర్వవ్యాపీ। సర్వభూతాంతరాత్మా!
కర్మాధ్యక్షః। సర్వభూతాధివాసః।, సాక్షీ చేతా। కేవలో నిర్గుణశ్చ॥

ఓ వ్రజ గోపికలారా। **ఒకానొక పరమ – ఆత్యంతిక సత్యమును మనము ఎలుగెత్తి గానము చేస్తున్నాము. వినండి.**

ఆ దేవాదిదేవుడు సర్వదా ఏకస్వరూపుడు. ఆయన సర్వజీవులలో రహస్యముగా (బాహ్య దృష్టిచే కనబడనివారై) ఉన్నారు. (తరంగాలలో జలమువలె, ఆభరణములలో బంగారమువలె, స్వప్నములో స్వప్నద్రష్టవలె, కథలో కథా రచయితవలె) సర్వత్రా వ్యాపించిన వారై ఉన్నారు. సర్వజీవులలో అంతరాత్మ అయి ఉన్నారు.

ఆయన సమస్త కర్మలకు సాక్షియేగాని కర్మ – కర్మఫలములలోకి దిగివచ్చువారు కాదు. (నవల చదివేవాడు నవలలో ప్రవేశించడుగదా। దృశ్యము చూచే ద్రష్ట దృశ్యములో ప్రవేశించడు కదా)।

(చక్రవర్తి సభను అధ్యక్షత వహించు తీరుగా) ఆయన సమస్త జగత్ కార్యక్రమములకు, వాటి పరంపరలకు అధ్యక్షుడు. (He presides over every thing else).

ఆయన సర్వజీవులయొక్క ఆది (The begining) స్వరూపుడై మునుముందే వసించువారై ఉన్నారు.

- ఆయన బుద్ధికి కూడా సాక్షి అయి ఉన్నారు.
- సర్వదా కేవలుడై ఉన్నారు (The Absolute of ourselves)

ఆయన గుణములకు ఆవల 'గుణి' స్వరూపుడు। నిర్గుణ స్వరూపుడు. గుణములకంటే ముందే ఉన్నవారు.

శ్రీకృష్ణ భగవానుడు బ్రహ్మమే. కాబట్టి నిర్గుణుడు అయి ఉన్నారు. బ్రహ్మమునే ఆచరణముగా కలిగి ఉండటంచేత బ్రహ్మచారియే।

*ఆయనయే నీవు।*
*ఆయనయే నేను।*
*అట్టి శ్రీకృష్ణానంద పరమాత్మకు నమో నమః।*

***గుణుడు – నిర్గుణుడు కూడా అయినట్టి – శ్రీకృష్ణుని రూపాత్మకములు (మరియు) రూపాంతరములు అయినట్టి...***

| **రుద్రాయ నమః। ఆదిత్యాయ నమః। వినాయకాయ నమః। సూర్యాయ నమః। విద్యాయై నమః। ఇంద్రాయ నమః। అగ్నయే నమః। యమాయ నమః। నిరృతయే నమః। వరుణాయ నమః। వాయవే నమః। కుబేరాయ నమః। ఈశానాయ నమః। సర్వేభ్యో దేవేభ్యో నమః।** |
|---|

ఓ వ్రజగోపికలారా! ఈ విధంగా శ్రీమన్నారాయణుడు పుణ్యతమమైన స్తుతిని – స్వస్వరూపి, సర్వభూతసృష్టికర్త అగు బ్రహ్మదేవునికి అనేకరీతులుగా బోధించి, శ్రీమన్నారాయణుడు – ఆ తరువాత అంతర్ధానమైనారు.

ఈ విషయాలన్నీ బ్రహ్మదేవుడు నారదునికి వినిపించారు. నారదుడు మునిలోకానికి విశదపరచారు.

ఓం గాంధర్వీ! ఓ వ్రజ గోపికలారా! సర్వాంతర్యామి, సర్వతత్త్వ స్వరూపుడు అగు శ్రీకృష్ణ భగవానునికి నమస్కారము. ఆయనకు ప్రియత్వముచే అనన్యులైన మీకు నమస్కారము. ఇక మీరు క్షేమముగా వెళ్ళిరండి.

వ్రతఫలములములన్నీ శ్రీమన్నారాయణావతారుడగు శ్రీకృష్ణ పరమాత్మకు సమర్పించి, ఆ శ్రీకృష్ణునితో అనన్యానందము సిద్ధించుకొనెదరు గాక!

***ఇతి గోపాలోత్తరతాపిన్యుపనిషత్***
***ఓం శాంతిః। శాంతిః। శాంతిః।***

అధర్వణ వేదాంతర్గత

# 7 గణపత్యుపనిషత్

## (అధర్వగణపతి శీర్షోపనిషత్)

### శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ యన్నత్వా మునయః సర్వే నిర్విఘ్నం యాన్తి "తత్పదమ్"
'గణేశోపనిషత్' వేద్యం తత్ బ్రహ్మైవాహమస్మి సర్వగమ్॥



ఎవరికి నమస్కరిస్తూ మునిగణము 'తత్‌పదము' జేరు మార్గములో సర్వ విఘ్నములు జయిస్తున్నారో, అట్టి 'గణేశోపనిషత్' అధ్యయనము చేయుచున్నాను. "సర్వగతమగు బ్రహ్మమే నేను" - అను సిద్ధికై శ్రీమత్ గణపతి భగవానునికి నమస్కారము.

---

1. ఓం। లం।
నమస్తే గణపతయే।
(త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి।)
త్వమేవ ప్రత్యక్షం తత్త్వమసి।
త్వమేవ కేవలం కర్తాసి।

'ఓం। లం' - అను బీజాక్షరములతో ఉపాసించబడుచున్న ఓ గణపతి దేవా! మీకు నమస్కరిస్తున్నాను. ఈ కనబడుచున్న సమస్తము మీరే। మీరు బ్రహ్మము యొక్క ప్రత్యక్షరూపులు. ప్రత్యక్షముగా కనబడుచున్న తత్త్వ (త్వమేవ తత్) - ఆనంద స్వరూపులు.

ఈ బాహ్య- అంతరంగములుగా కనిపిస్తున్న సమస్తమునకు కేవల స్వరూపులగు మీరే కర్త।

---

త్వమేవ కేవలం ధర్తాసి।
త్వమేవ కేవలం హర్తాసి।
త్వమేవ సర్వం ఖలు ఇదం బ్రహ్మాసి।
త్వం సాక్షాత్ ఆత్మాసి నిత్యం।
ఋతం వచ్మి। సత్యం వచ్మి।

ఈ సమస్తము మీ యొక్క ధారణయే అయి ఉన్నది. (విష్ణురూపులై) సమస్తము ధరిస్తున్నారు.

(రుద్రరూపులై) సమస్తము హరిస్తూ ఉన్నది కూడా మీరే! ఈ సమస్తము తిరిగి మీయందే లయిస్తున్నది। ఈ కనబడేదంతా మీ యొక్క పరబ్రహ్మ స్వరూపమే। ద్రష్ట-దర్శనము - దృశ్యములుగా కనిపిస్తున్న సమస్తము మీ స్వరూపమే।

మీరు స్వయముగా **సాక్షాత్తు నిత్యాత్మానందస్వరూపులు। నిత్యానందులు.**

స్వానుభవులగు **సత్యద్రష్టలు.**

ఋక్కులు చెప్పు **'ఋతము'**, సత్యద్రష్టలు వర్ణించు **'సత్యము'** మీరే అయి ఉన్నారు.

---

అవ త్వం మామ్। అవ వక్తారమ్।
అవ శ్రోతారమ్। అవ దాతారమ్।
అవ ధాతారమ్।
అవ అనూచానమ్ అవశిష్యమ్।
అవ పురస్తాత్। అవ దక్షిణాత్తాత్।
అవ పశ్చాత్తాత్। అవ ఉత్తరాత్తాత్।
అవ చ ఊర్ధ్వత్తాత్। అవ అధరత్తాత్।

స్వామీ! సంసారము నందు మునిగితేలుచున్న) నన్ను మీరు రక్షించండి. నాకు పరమ సత్యమును తెలుపుచూ ఉన్నట్టి సద్గురువులగు వక్తారులను కూడా రక్షించ ప్రార్థన. (వక్తారులు = ఆత్మతత్త్వవక్తలగు గురువులు)

ఆత్మతత్త్వము గురించి వినిపించువారు, సమస్తము ప్రసాదించునది, సమస్తమునకు ధాత (సృష్టికర్త) కూడా మీరే। ఈ జగత్తు ధరిస్తున్న విశ్వదేవతలను కూడా అనుగ్రహించెదరు గాక।

వినయుడనై మీకు శిష్యుడను అగుచున్నాను. మీరు నాకు గురువు.

స్వామీ! మీ భక్తుడనగు నన్ను ముందు, వెనుక, తూర్పు, పడమర, దక్షిణ, ఉత్తర, ఊర్ధ్వ, అథో స్థానముల నుండి రక్షించండి.

| | |
|---|---|
| **సర్వతో మాం పాహి। సర్వతో మాం పాహి।**<br>**పాహి సమంతాత్‌।** | <u>ఓ మహాగణపతి భగవన్‌!</u><br>అన్నివైపులా అంతటా నన్ను దయతో కాపాడండి. ఎల్లప్పుడు అన్ని వేళలా మీరే నాకు శరణ్యము. నాయొక్క సమదృష్టిని (లేక) ఆత్మ దృష్టిని (చిట్టచివరి వరకు) పరిరక్షించండి. |
| **త్వం వాఙ్మయః।**<br>**త్వం చిన్మయః।**<br>**త్వం ఆనందమయః।**<br>**త్వం బ్రహ్మమయః।**<br>**త్వం సచ్చిదానంద-అద్వితీయోఽసి।** | మీరు సమస్త వాక్కులతో కూడిన వాఙ్మయ స్వరూపులు. చిన్మయులు. చిత్‌-(ఎరుక) అను విన్యాసము సమస్త జీవులలో ప్రదర్శించువారు. **ఆత్మానందమయులు. బ్రహ్మమయులు.**<br>మీరు **అద్వితీయమగు** (ప్రతిజీవుని స్వస్వరూపమునకు అన్యముకానట్టి) **సత్‌-చిత్‌-ఆనంద స్వరూపులు.** |
| **త్వం ప్రత్యక్షం బ్రహ్మాసి।**<br>**త్వం జ్ఞానమయో విజ్ఞానమయోఽసి।**<br>**సర్వం జగత్‌ ఇదం త్వత్తో జాయతే।**<br>**సర్వం జగత్‌ ఇదం త్వత్తః తిష్ఠతి।**<br>**సర్వం జగత్‌ ఇదం త్వయి లయమ్‌ ఏష్యతి।** | ఈ సమస్త జగత్తుగా ప్రత్యక్షమైయున్న బ్రహ్మమే మీరై ఉన్నారు.<br>(పరాత్మ సంబంధమైనట్టి) జ్ఞాన విజ్ఞాన (Theoritical as well as Applicational) స్వరూపులు.<br>ఈ జగత్తంతా కూడా మీ వలననే, మీ యందే, మీ స్వరూపమే అయి జనిస్తూ, (జలంలో తరంగంలాగా) మీయందే ఉన్నదై, చివరకి - మీయందే లయిస్తోంది. |
| **2. సర్వం జగత్‌ ఇదం త్వయి ప్రత్యేతి। (ప్రతి యేతి)**<br>**త్వం భూమిః ఆపో అనలో అనిలో నభః।** | ఈ జగత్తంతా మీ వైపుగానే ఎక్కుబెట్టబడి, (తరంగము జలములో లయమగునట్లు) మిమ్మే జేరుచున్నది.<br>మీరు అనన్యులు. అందుచేత, భూ-జల-అగ్ని-వాయు ఆకాశములనే పంచభూతములు మీరే అయి ఉన్నారు. వాటివాటి ధర్మములు మీయొక్క తేజోవిభవములే। |
| **త్వం చత్వారి వాక్‌ పరిమితా పదాని।**<br>**త్వం గుణత్రయ-అతీతః।**<br>**త్వం దేహత్రయ-అతీతః।**<br>**త్వం కాలత్రయ-అతీతః।**<br>**త్వం మూలాధారే స్థితోఽసి నిత్యమ్‌॥** | - అ - ఉ - మ - అర్ధమాత్రలు, జాగ్రత్‌ - స్వప్న - సుషుప్తి - తురీయ శబ్దార్థములు మొదలైన చత్వారి (4) వాక్‌ పరిమితములు మీరే. తురీయాతీతమగు వాక్కుకు అందని పరమ సత్యము కూడా మీరే!<br>సత్త్వ-రజో-తమో గుణత్రయమునకు ఆవల గుణి (లేక) గుణాతీత స్వరూపులు. సగుణులు, నిర్గుణులు కూడా మీరే!<br>స్థూల-సూక్ష్మ-కారణ త్రిదేహములకు ఆవల దేహత్రయాతీతులు. త్రిదేహములకు 'దేహి' - స్వరూపులు.<br>- భూత-వర్తమాన-భవిష్యత్‌ త్రికాలాతీతులు, త్రికాల స్వరూపులు కూడా. మూడు కాలములయందు యథాతథమై ఉన్నవారు.<br>- మూలా ధారములో నిత్యస్వరూపుడవై వేంచేసిఉన్నవారు. |
| **త్వం శక్తి త్రయాత్మకః।**<br>**త్వాం యోగినో ధ్యాయంతి నిత్యమ్‌।**<br>**త్వం బ్రహ్మా। త్వం విష్ణుః। త్వం రుద్రః।**<br>**త్వం ఇంద్రః। త్వం అగ్నిః। త్వం వాయుః।**<br>**త్వం సూర్యః। త్వం చంద్రమాః।**<br>**త్వం బ్రహ్మ <u>భూర్భువస్సువరోమ్‌।</u>**<br>**<u>(భూః భువః సువః ఓం)</u>** | (ఇచ్ఛా-జ్ఞాన-క్రియా) త్రయాత్మక శక్తి స్వరూపులు. ఆ త్రి-శక్తులన్నిటికి → శక్తి తనదైనవారు మీరే.<br>యోగులు సర్వదా ధ్యానిస్తూ ఉన్నది, చివరికి సంయోగము పొందేది, అఖండానందమగు (కేవలమగు) మీ స్వరూపమునందే।<br>నీవే (సృష్టికర్తయగు) **బ్రహ్మవు.** (ఈ సమస్త దృశ్యమును స్థితింపజేయుచున్న) **విష్ణువువు.** కాలక్రమంగా సమస్తము లయింపజేయుచున్న **రుద్రుడవు.** (సమస్త ఇంద్రియములకు అధినేతవగు) **ఇంద్రుడవు.** సమస్తము తేజోమయము చేస్తున్న **'అగ్ని'వి.** సంచాలన శక్తిచే సమస్తము చలింపజేయుచున్న **వాయు స్వరూపుడవు.** జగత్తంతా వెలిగించుచున్న **సూర్యుడవు.** (ఓషధి- ఆహార ప్రదాత అగు) **చంద్రమసుడవు.** భూ-భువః - సువర్లోకములను సంప్రదర్శనము చేయు **బ్రహ్మమువు.** సర్వము తానై, సమస్తమునకు సాక్షిగా వేరైన బ్రహ్మమే మీరు. |

'గణ' (గం) ఆదీన్ పూర్వమ్ ఉచ్చార్య।
వర్ణాదీన్ తదనంతరమ్।
అనుస్వారః పరతరః
అర్ధేందులసితం (అర్ధ ఇందు లసితం) తథా।
తారేణ యుక్తమ్ ఏతదేవ
తవ మను స్వరూపమ్।

**ఓం "గం"॥**
"గణ"। ఆది (మొదట)గా। 'గ్' ఉచ్చారణ। (గ్)
తర్వాతి వర్ణాది = **'అ'**రూపము-**"గ" (గ్ + అ=గ)**
ఆపై అనుస్వారము = '0' **(గ + ం = గం)**
అటు తారువాత అర్ధేందులసితము (అర్ధచంద్ర ప్రకాశము) - 'మ్'। (అర్ధమాత్ర) = "మ్...'. తారయుక్తంగా (సుషిరగవాద్యయుక్తంగా) పలకటము. ఇది మీ మూలమంత్ర మనన స్వరము.

---

(1) 'గ్' కారః పూర్వ రూపమ్।
(2) 'అ' కారో మధ్యమ రూపమ్।
(3) 'అనుస్వారః'(ం) అంత్య రూపమ్।
(4) 'బిందుః' ఉత్తర రూపమ్।
(5) 'నాదః' సంధానమ్।
'సంహితా' సంధిః।

'గ్'కారము - పూర్వరూపము
'అ'కారము - మధ్యమరూపము (గ)
'0' - అనుస్వారము - అంత్య రూపము (గమ్)
బిందువు - తరువాతి రూపము "మ్..." ("గమ్"....)
నాదము - ఆత్మతో అనుసంధానము "ఓం గమ్ ...."
**సంహిత - సంధి.** ఆత్మయందు సంధించుటము చేకూర్చబడటము ('గమ్మ్...') - ("గరిష్ఠమగు ఆత్మయే నేను" - అను మమేకత్వము).

**వర్ణసంయోగము**

***ఇది గణపతి మూలమంత్ర ధ్యానము***

---

సైషా (స ఏషా) గాణేశీ విద్యా।
'గణక' ఋషిః।
'నృచత్ గాయత్రీ' ఛందః।
శ్రీ మహాగణాధిపతిః దేవతా।
"ఓం గం గణపతయే నమః'

ఏకదంతాయ విద్మహే
వక్రతుణ్డాయ ధీమహి।
తన్నో దంతిః ప్రచోదయాత్।

దీనినే **"గణపతి"** విద్య అని కూడా అంటారు. (గాణేశవిద్య)
ఋషి - **గణకుడు.**
ఛందస్సు - **నృచత్ గాయత్రీ**।
"ఓం **।గం।** గణపతయే నమః।
ఓం గం గణపతీ! నీకు ప్రణామములు.
ఏకదంతుడు (ఏకత్వము ప్రసాదించువారు) వంక్రతుండుడు (తొండముతో వక్రములను / దోషములను పీల్చివేయువారు) అయిన దంతి (గణపతి) యొక్క మహిమను ధ్యానించుచున్నాము. (మా ఈ ధ్యానము స్వీకరించి) ఆయన మా బుద్ధిని వికసింపజేయుదురు గాక।

---

3. ఏకదంతం చతుర్హస్తం
పాశమ్ అంకుశ ధారిణమ్।
రదంచ వరదం హస్తైః
బిభ్రాణం మూషికధ్వజం॥

**(అన్యపాఠము)**

ఏకదంతం చతుర్హస్తం
బిభ్రాణం పాశమ్ - అంకుశమ్।
అభయం వరదం హస్తైః
దధానమ్। మూషిక ధ్వజమ్॥

***మంత్రముతో గణపతి యొక్క ఉపాసనాస్వరూపము ధ్యానించటము.***
- ఒకే దంతము గలవారు. (ఏకాక్షర స్వరూపులు),
- నాలుగు చేతులు (హస్తములు) కలవారు,
- ఒక చేతితో పాశము, మరొక చేతితో అంకుశము ధరించినవారు,
- మిగిలిన రెండు చేతులతో అభయముద్ర, వరద (వరప్రదాత) ముద్ర ధరించినవారు,
ఎలుక (మూషికము) ధ్వజముగా ధరించినవారు అగు గణపతిని ఉపాసిస్తున్నాము.

***ఏకదంతము కలవారు, 4 హస్తములు కలవారు, పాశ-అంకుశములు ధరించువారు, అభయము-వరప్రసాదము అగు హస్తాభినయము (చేతిముద్రలు) ధరించినవారు, మూషిక ధ్వజము కలవారు - అగు గణపతికి నమస్కారము.***

---

రక్తం లంబోదరం। శూర్ప సుకర్ణం రక్తవాససమ్,
రక్త గంధ-అనులిప్తాంగమ్।
రక్త పుష్పైః సుపూజితమ్।
భక్త అనుకంపినం దేవం।
జగత్ కారణమ్। అచ్యుతమ్।

ఎర్రటి రక్తవర్ణము కలవారు, పెద్ద బొజ్జ-పెద్దచెవులు కలవారు, ఎర్రటి వస్త్రములు ధరించినవారు, శరీరమంతా రక్తచందనమును పులుముకొన్నవారు, ఎర్రటి పుష్పములతో పూజించబడు గణేశుని ఆరాధిస్తున్నాము.
ఆయన → భక్తులపై కరుణ, అనుగ్రహము ప్రసాదించు దివ్య స్వరూపులు.
జగత్తుకు కారణులు - ఆత్మభావనమండి చ్యుతి లేనివారు. **అచ్యుతులు.**

| | |
|---|---|
| **ఆవిర్భూతం చ సృష్ట్యాదౌ**<br>**ప్రకృతేః పురుషాత్ పరమ్।**<br>**ఏవం ధ్యాయతి యో నిత్యం**<br>**స యోగీ యోగినాం వరః॥** | సృష్టియొక్క అవిర్భూతమునకు మునుముందే ఆది స్వరూపులై ఉన్నవారు. స్రష్ట మీ స్వరూపము. **సృష్టి మీ స్వభావము.** అయితే, మీరు ప్రకృతికి సర్వదా 'పరము' (Beyond) అయినట్టివారు. ఈ సమస్తము తమయొక్క పురుషకారము కలిగియున్నట్టి, - ప్రకృతి - పురుషులకు ఆవలగల **'పరమ పురుష స్వరూపులు'.**<br>ఏ యోగి అయితే అట్టి గణపతిని పరమపురుష తత్త్వముగా ధ్యానిస్తాడో - అట్టివాడు యోగులందరిలో శ్రేష్ఠుడు. |
| **నమో వ్రాతపతయే।**<br>**నమో గణపతయే।**<br>**నమః ప్రమథపతయే।**<br>**నమస్తే అస్తు లంబోదరాయ,**<br>**ఏకదంతాయ, విఘ్న వినాశినే,**<br>**శివసుతాయ వరదమూర్తయే**<br>**నమో నమః॥** | హే వ్రాతపతీ (The Authority of all writings)! సృష్టికి ఆవల సమష్టి స్వరూపులై ఉన్న స్వామీ! వ్రాత = సమూహమునకు పతి!<br>ఓ గణపతీ (The Head of all Groups of this Universe)!<br>ఓ ప్రమథ గణమునకు నాయకుడా! భక్తి-యోగ జ్ఞాన వైరాగ్య గణ నాయకా! పెద్దపొట్ట గలవాడా! లంబోదరా! బొజ్జనిండా విద్యలు కలవాడా! ఏకత్వమును ప్రసాదించు ఏకదంతా! విఘ్నములన్నీ తొలగించు విఘ్ననాశా!<br>శివకుమారా! వరప్రసాదుడా! సమస్తము ప్రసాదించు వరదా।<br>నమస్తే। నమస్తే। నమో నమః॥ |
| **ఏతత్ అథర్వశిరో యో అధీతే, -**<br>**స బ్రహ్మ భూయాయ కల్పతే।**<br>**స సర్వతః సుఖమ్ ఏధతే।**<br>**స సర్వ విఘ్నైః న బాధ్యతే।**<br>**స పంచమహాపాతక- ఉపపాతకాత్ ప్రముచ్యతే।** | **"అథర్వ మహర్షి స్వాత్మ సంబంధమై పొందిన దివ్యానుభవము"** అగు ఈ **"గణపతి అథర్వ శీర్షము"**ను అధ్యయనము చేయువాడు సమస్తమునకు పరాకాష్ఠ అగు **బ్రహ్మమును పొందగలడు.**<br>సమస్త సుఖములు వాటికవే ఆతనిని చేరగలవు. ఇక ఏ విఘ్నములు ఆతనిని బాధించవు. ఇతఃపూర్వము పంచమహాపాతక - ఉపపాతక దోషముల దుష్ఫలములు కూడా ఆతని పట్ల తొలగగలవు. |
| **సాయమ్ అధీయనో**<br>**దివసకృతం పాపం నాశయతి।**<br>**ప్రాతః అధీయానో**<br>**రాత్రి కృతం పాపం నాశయతి।** | ఈ గాణేశ విద్యను సాయంకాల అధ్యయనము చేస్తే (పఠిస్తే) ఉదయము చేసిన పాపములు తొలగగలవు.<br>ప్రాతఃకాలంలో (ఉదయము) అభ్యసిస్తే రాత్రి చేసిన పాపములు తొలగగలవు. |
| **సాయం ప్రాతః ప్రయుంజానో అపాపో భవతి।**<br>**ధర్మ అర్థ కామ మోక్షం చ విందతి।**<br>**ఇదమ్ అథర్వ శీర్షమ్**<br>**అశిష్యాయ న దేయమ్।**<br>**యో యది మోహాత్ దాస్యతి,**<br>**స పాపీయాన్ భవతి।**<br>**సహస్ర ఆవర్తనాత్**<br>**యం యం కామమ్ అధీతే**<br>**తం తం అనేన సాధయేత్॥** | ఉదయము, సాయంకాలము కూడా ఈ ఉపనిషత్‌ను అధ్యయనము చేయుటచే, అట్టివాడు అపాపి (పాపపు ధ్యాసలు తొలగినవాడు పుణ్యవంతుడు) కాగలడు. చతుర్విధ పురుషార్థములైనట్టి ధర్మ-అర్థ-కామ-మోక్షములు సిద్ధించుకోగలడు.<br>ఈ - "గణపతి అథర్వ శీర్షము" గురించిన బోధను శిష్యుడు కానివానికి చేయకూడదు. (చెప్పరాదు).<br>ఎవరైనా - మోహము కారణంగా అర్హత లేనివారికి ఈ బోధను ఇచ్చితే, - ఆబోధించినవాడు తప్పు (పాపము) చేసినట్లు.<br>వేయిసార్లు దీనిని పారాయణము చేసినవాడు - తాను ఏదేది కోరుకొంటే - అవన్నీ సిద్ధించగలవు. |
| **4. అనేన గణపతిమ్ అభిషించతి,**<br>**స వాగ్మీ భవతి।**<br>**చతుర్థ్యామ్ అనశ్నన్ జపతి।**<br>**స విద్యావాన్ భవతి।** | ఎవ్వరైతే **"గం గం గం గణపతియేనః"** - అను గణపతి గాయత్రీ మంత్రము మొదలైన వాటితో గణపతికి అభిషేకము చేస్తారో, అట్టివారు ఉత్తమ వాక్కు గల వక్తలు కాగలరు.<br>ఎవరు ఇంద్రియాహారములను వదలి ఏకాగ్రతతో రోజుకు 4 సార్లు జపిస్తారో, వారు విద్యావంతులు కాగలరు. జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయములకు ఆవల తురీయాతీత విద్యావంతులగుచున్నారు.<br>**ఇది అథర్వణ మహర్షి వాక్యము.** |

| | |
|---|---|
| **ఇతి అథర్వణ (వేద) వాక్యమ్॥**<br>**బ్రహ్మాది ఆచరణం విద్యాత్,**<br>**న బిభేతి కదాచన - ఇతి॥** | గణపతి అథర్వ శిరోమంత్రమును (**నమో వ్రాత పతయే। నమో గణపతయే। నమ ప్రమథ పతయే। నమస్తే అస్తు లంబోదరాయ। ఏకదంతాయ। విఘ్నవినాశినే। శివసుతాయ। వరద మూర్తయేనమః॥** మొదలైన మంత్రముల) ఆచరణను ఎరిగినవారై, బ్రహ్మ మొదలైనవారు కూడా సర్వభయముల నుండి విముక్తులగుచున్నారు. "బ్రహ్మము" నందు ఆచరణసిద్ధి పొందుచున్నారు. |
| **యో దుర్వాంకురైః యజతి,**<br>**స వైశ్రవణోపమో భవతి।**<br>**యో లాజైః యజతి**<br>**స యశోవాన్ భవతి।**<br>**స మేధావాన్ భవతి।** | శ్రీ గణపతి యొక్క సాకారరూపమును దూర్వార అంకురములతో పూజించువాడు కుబేరునితో సమానమైన సంపదలు పొందగలడు.<br>ఎవ్వరైతే లాజములతో (వట్టివేరు, పేలాలు, నానబియ్యములతో) పూజిస్తాడో, అట్టివాడు యశోవంతుడు, మేధావంతుడు కాగలడు. |
| **యో మోదక సహస్రేణ యజతి,**<br>**స వాంఛిత ఫలమ్ అవాప్నోతి।**<br>**యస్సాజ్య (యః స ఆజ్య) సమిద్భిః యజతి,**<br>**స సర్వం లభతే।**<br>**స సర్వ లభతే।** | ఎవడు గణపతిని వేయి మోదకపుష్పములతో పూజిస్తాడో, ఆతడు తాను కోరుకున్న ఫలము పొందగలడు.<br>ఎవడు నేయితో తడిపిన సమిధలతో **'గణపతి హోమము'** నిర్వర్తిస్తాడో, అట్టివానికి సర్వము లభిస్తుంది. ఆతడు సమస్తము పొందగలడు. ఇహ-పరములలో సిద్ధించుకోవలసినదంతా సిద్ధించుకోగలడు. |
| **అష్టౌ బ్రాహ్మణాః సమ్యక్**<br>**గ్రాహయిత్వా 'సూర్యవర్చస్వీ' భవతి।**<br>**సూర్యగ్రహణే మహానద్యాం**<br>**ప్రతిమా సన్నిధౌ వా జప్త్వా**<br>**స సిద్ధమంత్రో భవతి॥** | ఎనిమిది బ్రాహ్మణులతో (బ్రాహ్మణములతో) కూడి గణపతి యజ్ఞము నిర్వర్తించువాడు. సూర్యవర్చస్సుతో శోభిల్లగలడు.<br>**(8-బ్రాహ్మణములు-తాత్త్వికార్థము తత్త్వమ్। తదిదమ్। తదహమ్। తత్త్వః। తత్‌మమ। తత్సర్వమ్। తత్‌సత్। సోఽహమ్॥)**<br>సూర్యగ్రహణ సమయమునందు -, (మరియు) పవిత్ర నదుల వద్ద, గణపతి మహామంత్రమును ఎవడు జపిస్తాడో, అట్టివాడు - మంత్రసిద్ధుడు కాగలడు. |
| **~ మహావిఘ్నాత్ ప్రముచ్యతే।**<br>**~ మహా దోషాత్ ప్రముచ్యతే।**<br>**~ స సర్వవిత్ భవతి। →**<br>**~ స సర్వవిత్ భవతి। →**<br>**య ఏవం వేద॥**<br>***<u>ఇతి గణపత్యుపనిషత్</u>***<br>***<u>ఓం శాంతిః శాంతిః శాంతిః॥</u>*** | ***<u>ఈ అథర్వగణపతి శీర్షము పఠించువాడు-</u>***<br>సర్వవిఘ్నముల నుండి ప్రముచ్యుడు (Relieved) కాగలడు.<br>సర్వదోషముల నుండి విముక్తుడు అగుచున్నాడు.<br>- య ఏవం వేద = సమస్తము ఎరిగినవాడై ఆత్మదర్శి అవగలడు.<br><br>***<u>ఇతి గణపత్యుపనిషత్</u>***<br>***<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః।</u>*** |

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

7

# గణపత్యుపనిషత్

## (అథర్వగణపతి శిరోపనిషత్)

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

### అధ్యయన పుష్పము

### శ్రీ గణపతి మహామంత్రము

"ఓం గం గం గం గణపతయే నమః"

### శ్రీ గణపతి గాయత్రీ మంత్రము

| "ఏక దంతాయ విద్మహే, వక్రతుండాయ ధీమహి।<br>తన్నో దంతిః ప్రచోదయాత్॥" |
|---|
| "తత్పురుషాయ విద్మహే, వక్రతుండాయ ధీమహి।<br>తన్నో దంతిః ప్రచోదయాత్॥" |

### శ్రీ గణపతి ప్రాతః స్మరణము (శ్లోకత్రయము)

శ్లో॥ ప్రాతస్సరామి గణనాథం అనాథ బంధుమ్।
సిందూర పూగ పరిశోభిత గండయుగ్మమ్।
ఉద్దండ విఘ్న పరిఖణ్డన చణ్డ దణ్డమ్।
ఆఖణ్డలాది సురనాయక బృంద వంద్యమ్॥

శ్లో॥ ప్రాతర్నమామి చతురానన వన్ద్యమానమ్।
ఇచ్ఛానుకూలమఖిలం చ వరం దదానమ్।
తం తున్దిలం ద్విరసనాధిప యజ్ఞ సూత్రం।
పుత్రం విలాస చతురం శివయోశ్శివాయ॥

శ్లో॥ ప్రాతర్భజామి అభయదం ఖలు భక్తశోక –
దావానలం గణవిభుం వరకుంజరాస్యం।
అజ్ఞానకానన వినాశన హవ్యవాహం।
ఉత్సాహవర్ధనమ్ అహమ్ సుతం ఈశ్వరస్య॥

శ్లోకత్రయమిదం పుణ్యం సదా సామ్రాజ్య దాయకం
ప్రాతరుత్థాయ సతతం యః పఠేత్ ప్రయతః పుమాన్॥

# <u>శ్రీ గణపతి ప్రార్థన</u>

**(1) గణానాం త్వా గణపతిగ్ం హవామహే**
**కవిం కవీనామ్ ఉపమ శ్రవస్తవమ్।**
**జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత**
**ఆనః శ్రుణ్వన్నూతిభిస్సీద సాదనమ్॥**
**ఓం శ్రీ గణాధిపాయ నమః॥**

విఘ్న వినాశకుడవు, గణాధిపతివి అగు ఓ గణేశ్వరా! మీరు పరిపూర్ణ జ్ఞానసంపన్నులు. సర్వజ్ఞులు. ఘనుడవైన మిమ్ములను శరణు వేడుచున్నాము. మీరు చక్రవర్తులందరికీ చక్రవర్తి. సాక్షాత్ పరబ్రహ్మమువు. వేదమంత్రములచే మీ యొక్క ఘనతను కీర్తిస్తున్నాము. స్తుతిస్తున్నాము. మాకు సత్-సంకల్పములను సిద్ధింపజేయగల సమర్థుడవు. సమస్త నిధులకు పెన్నిధివి. ఐహిక - ఆముష్మిక ఉభయములను ప్రసాదించువాడవు. మీకు ప్రణామములు । నమో నమో నమో నమః।

**2. ప్రణోదేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ। ధీనామవిత్ర్యవతు।**
**శ్రీ గణేశాయ నమః। శ్రీసరస్వత్యై నమః। శ్రీ గురుభ్యో నమః। హరిః ఓం॥**

వాగ్దేవి అగు సరస్వతిని స్తుతిస్తున్నాము. వేద హృదయమును ఎరుగుచు, వేద మంత్రములను చక్కటి ఉచ్చారణతో పఠించుటకై మా బుద్ధిని వికశింపజేయమని శ్రీ సరస్వతీ దేవికి వినతి సమర్పిస్తున్నాము.

***శ్రీ గణేశునకు, శ్రీసరస్వతీ దేవికి, గురుదేవులకు, ఓంకార స్వరూపుడగు శ్రీహరికి నమస్సుమాంజలులు.***

# <u>ఘనపాఠము</u>

***గణానాం త్వాత్వా గణానాం గణానాం త్వాగణపతిం త్వా గణానాం గణానాం, త్వా గణపతిం।***
***త్వా గణపతిం గణపతిం త్వాత్వా గణపతిగ్ం హవామహే హవా మహే। గణపతిం త్వాత్వా గణపతిగ్ం హవామహే।***
***గణపతిగ్ం హవామహే హవామహే।***
***గణపతిం గణపతిగ్ం హవామహే। కవింకవిగ్ం హవామహే।***
***గణపతిం గణపతిగ్ం హవామహే। కవిమ్ గణపతిమితిగణ- పతిమ్॥***

*ఓం శ్రీ గణపతిభ్యోం నమః*

## <u>ఉపనిషత్ ప్రారంభం</u>

**స్తుతి : యన్నత్వా మునయస్సర్వే నిర్విఘ్నం యాతి తత్పదమ్।**
**'గణేశోపనిషత్' వేద్యం తత్ బ్రహ్మైవాస్మి సర్వగమ్।**

మునులంతా కూడా ఎవరికి నమస్కరించి **'తత్‌పదము'** చేరటానికై సమస్త విఘ్నములను **"నిర్విఘ్నము"**గా చేసుకోగలుగుచున్నారో, అట్టి **"గణేశోపనిషత్"**ను అధ్యయనము చేస్తున్నాము. ఈ అధ్యయనముచే **"సర్వగతమగు బ్రహ్మమే నేనై ఉన్నాను"** - అని అవిఘ్నముగా స్వానుభవము చేసుకొనగలము.

-----

**ఓమ్...। ఓం లం। నమస్తే గణపతయే।** = సమస్త లోకములలోని గణములకు పతి (The Main Leader of all Groups) అయిన మీకు నమస్కారము.

ఈ జగత్తు రూపంగా కనిపిస్తున్నది మీరే కనుక నాకు "త్వమ్-నీవు"గా కనిపించేదంతా మీరే। **త్వమేవ ప్రత్యక్షం తత్త్వమసి।** ఈ జగత్తంతా కలిపి మీ స్వరూపమే అయి ఉన్నది. **తత్ త్వమ్ అసి॥**

- మీరు కేవల (Absolute) స్వరూపులై ఈ జగత్తులన్నిటికీ కర్త (The worker of the Universe) అయి ఉన్నారు.
- ఈ లోకాలన్నీ ధారణ చేయుచున్నట్టి "ధర్త" మీరే। ధరించువాడవు (All this is your ornament).
- ఈ సమస్తము ఒకానొకప్పుడు మీయందే లయమౌతోంది. కాబట్టి దీనికంతటికీ లయకారులు కూడా మీరే। (It disloves in you only)
- ఈ సమస్తము బ్రహ్మమే అయి ఉండగా, అట్టి బ్రహ్మము మీరే అయి ఉన్నారు. **త్వమేవ ఖల్విదం బ్రహ్మాసి।**
- మీరు **సాక్షాత్తు ఆత్మస్వరూపులు।**

బ్రహ్మజ్ఞులగు మహనీయుల స్వానుభవమగు ఋతమును, సత్యమును గమనించి–**"మీరు మాత్రమే నిత్యము। త్రికాలములలో సర్వదా సర్వత్రా వేంచేసినవారై ఉన్నారు"** – అని ఎలుగెత్తి గానము చేస్తున్నారు.

స్వామీ! గణపతి దేవాదిదేవా। ఈ సంసార కూపము నుండి, భవబంధముల నుండి నన్ను రక్షించండి. అట్లాగే మాకు ప్రవచనములు ప్రవచించి, మా 'అజ్ఞానము' – అనే దుమ్ము దులుపుచున్న వక్తారులను (మాకు ఆత్మబోధ ప్రసాదిస్తూ ఉన్న గురువులను) కూడా కరుణతో రక్షించండి. ఆత్మ ప్రవచనములు వింటున్న శ్రోతలగు మమ్ములను రక్షించండి. అధ్యయనులగు వేదమును ధారణ చేయుచున్న సహ–శిష్య జనులందరిని రక్షిస్తూ ఉండండి.

గణపతి భగవాన్! మీకు ముందునుండి, వెనుకనుండి, ఎడమ నుండి, కుడినుండి, పశ్చిమ–ఉత్తర వైపుల నుండి, పై నుండి, క్రింద నుండి, – అన్ని వైపుల నుండి నమస్కరిస్తున్నాము. అన్ని వైపులుగా, సర్వదిశ–ఉపదిశల నుండి మమ్ము కాపాడండి. (సంసారసాగరము నుండి) రక్షించ వేడుకొంటున్నాము. సాంసారిక భ్రమలు అన్నివైపులా విస్తరించి మమ్ములను లాగుచున్నాయి కదా మరి? మీరే మాకు దిక్కు!

హే విఘ్న వినాయకా! మహాగణపతీ! వాక్ స్వరూపడవు. వాక్కుగా విస్తరించియున్నది మీరే! వాఙ్మయుడవు. వాక్కుకు అధినేతవు.

సమస్తము మీ యొక్క **'ఎరుక** (Knowing)**'** అను విశేషము నుండియే విస్తరిస్తోంది కాబట్టి చిన్మయ – స్వరూపులు. ఆనందమయులై ఈ సమస్త లోకములను కల్పించుకొని మీకు మీరే వినోదిస్తున్నవారు.

'బ్రహ్మము' స్వరూపము కలవాడవై బ్రహ్మమయుడవు. "ఉనికి – ఎరుక – అనుభూతి" ("Presence - Awareness - Experience" Absolutely) స్వరూపుడవు, సర్వ జీవులలో అట్టి సచ్చిదానంద స్వరూపులై, సమస్త జీవుల సహజ స్వరూపమై వేంచేసి ఉన్నారు కాబట్టి సమస్తము మీకు ద్వితీయము కాదు. మీరు అద్వితీయులు. **ఓం అద్వితీయాయ నమః।** "అహమ్–త్వమ్–ఇదమ్"లతో కూడిన ఈ సమస్తము మీకు అనన్యము.

**త్వం ప్రత్యక్షం బ్రహ్మాసి।** ఈ సమస్తము మీ జగత్ రూప చమత్కారమే. ఈ సమస్త జగద్దృశ్యము మీ యొక్క **ప్రత్యక్ష పరబ్రహ్మ స్వరూపమే।** ఇక్కడ సందర్భపడుచున్న, **"ద్రష్ట–దర్శనము–దృశ్యము"** – మీయొక్క **సంప్రదర్శనమే।**

"తెలుసుకొనువాడవు – తెలియబడుచున్నదీ" కూడా అయి, జ్ఞాన విజ్ఞానమయులై ఉన్నది మీరే. జ్ఞానముగా తెలుసుకొనుచున్నది, విజ్ఞానముగా తెలియబడుచున్నది కూడా మీరే!

**ఓ సృష్టి స్థితి లయ కారకా! పరిపోషకా!**

**జలంలో తరంగం బయల్వెడలి, జలములోనే స్థితి కలిగి ఉండి, జలములోనే లయించు తీరుగా** – ఈ సమస్త జగత్తు మీనుండే ఉదయిస్తోంది. మీయందే స్థితి కలిగిఉంటోంది. మీయందే లయిస్తోంది కూడా। **సర్వం జగదిదం త్వత్తో జాయతే। సర్వం జగదిదం త్వత్తః తిష్ఠతి। సర్వం జగదిదం త్వయి లయమ్ ఏష్యతి।।** ఇదంతా మీచేతనే పరిపోషించబడుతోంది. **సర్వం జగదిదం త్వయి ప్రత్యేతి।** ఈ జగత్ వ్యవహారమంతా మీపై ఆధారపడినదై ఉన్నది. మీరు మాయొక్క **'పరస్వరూపమే'** అయి ఉన్నారు. మేమంతా మీ అభ్యంతరరూపులమే! మేమంతా మీరే అయి ఉన్నాము, స్వామీ!

## పాంచ భౌతిక రూపాయ।

**త్వం భూమిః ఆపో అనలో అనిలో నభః।** మీరే భూ–జల–అగ్ని–వాయు–ఆకాశ పంచభూత సంప్రదర్శనులై వేంచేసి ఉన్నారు.

**త్వం చత్వారి వాక్ పరిమితా పదాని।** మీరే చతుర్విధ (4) రూపకమైన వాక్కు స్వరూపులు.

**చత్వారివాక్కులు : –**

1. కంఠమునుండి వెలువడే వాక్కు **(భాష)**, (వైఖరి. వాక్యరూపమునగల వాక్కు స్వరము కంఠధ్వని. 'అ' కారాది 'క్ష' కారాంతము. శబ్దముయొక్క ఆరోహణ–అవరోహణక్రమములు)
2. **అంతకుముందే** మనస్సునందు జనించు **ఆలోచన।**
3. **ఇంకా అంతకుముందు** భాషాతీతమైన, భావరూపకమైన వాక్కు **(భావన)**,
4. **అంతకుముందే సంకల్ప రూపమగు వాక్కు (సంకల్పము) –**

మాలోని భాష – ఆలోచన – భావన – సంకల్ప → చతుర్వాక్కు రూపములు మీరే అయి ఉన్నారయ్యా!

**త్వం గుణత్రయాతీతః।**

త్రిగుణములు మీయొక్క స్వభావ చమత్కారములు. అయినప్పటికీ కూడా, – సత్వ రజో తమో గుణములకు ముందే ఉన్న "గుణి", 'గుణి'కి ముందే ఉన్న **"నిర్గుణి"** స్వరూపులు. **గుణత్రయాతీతులు.**

**త్వం అవస్థాత్రయాతీతః।**

జాగ్రత్ స్వప్న సుషుప్తులు లీలగా కల్పించుకొనుచూ ఆస్వాదించువారు. ఆ మూడిటిని సిద్ధింపజేసుకొనే సిద్ధపురుషులు. ఆ మూడు తమ సంచార స్థలములుగా కలిగియున్న **తురీయ స్వరూపులు.** అంతేకాకుండా **'కేవలసాక్షి'** అగు తురీయాతీతులు కూడా।

**త్వం దేహత్రయాతీతః।**

మీరు భౌతికమగు **స్థూలదేహమునకు**, భావనరూపమగు **సూక్ష్మదేహమునకు**, అభ్యాసనిర్మితమగు సంస్కార–వాసనల రూపమగు **కారణదేహము**నకు ఆవలివారు. ఆ మూడు దేహములను (జడవస్తువులను కదల్చు చేతన శక్తివలె) చైతన్య పరచు ఆత్మాకాశ స్వరూపులు. జగత్–వస్తువులను కనిపింపజేయు విధంగా – త్రిదేహములు మీయొక్క **ఆత్మతేజస్సు**నందు వెలుగొందు వస్తువులు.

**త్వం కాలత్రయాతీతః।**

హే గణేశ్వరా! మీరు భూత–భవిష్యత్–వర్తమానములకు (త్రికాలములకు) ఆవలివారు. అంతేగాని కాలములోనివారు కాదు. కాలబద్ధులు కారు. కాల నియామకులు (స్వప్నములోని కాల గతికి కాలనియామకుడు – స్వప్నము తనదైన వాడే కదా!). కాలః కాల స్వరూపులు! త్రికాలములలోను యథాతథ స్వరూపులు.

**త్వం మూలాధారే స్థితోఽసి నిత్యమ్।**

మీరు ప్రతి జీవుని మూలాధార చక్రములో వేంచేసినవారై, యోగాభ్యాసకులకు మార్గదర్శకులు, గురువులు అయి ఉన్నారు. సమస్తమునకు మూలాధారులు (The Basic Holding) అయి ఉన్నారు.

(భూః–భువః–సువః) – త్రిలోకములకు మూలాధారులై, కళ్యాణ స్వరూపులుగా వాటిని ప్రదర్శిస్తున్నారు. **(మూలాధారే హుత వ హ కళా, విశ్రుతాః 'బూర్భువః స్సువః।)** త్రిలోకములు మీనుండి ప్రదర్శనమగుచు, సమస్తమునకు 'ఆధారుడు' అయి ఉన్నారు.

**త్వం శక్తిత్రయాత్మికః।**

జగన్నిర్మాణమునకు త్రయీ శక్తులగు ఇచ్ఛా–జ్ఞాన–క్రియా శక్తుల ఆత్మ స్వరూపులు మీరే! (తత్ దైవీస్వరూపములగు సరస్వతీ – లక్ష్మీ–పార్వతీ) శక్తిశ్వరూపులై ఉన్నారు. సమస్త జీవులకు శక్తిత్రయమును ప్రసాదించువారు.

**త్వం యోగినో ధ్యాయంతి నిత్యమ్।**

సర్వాత్మకుడవు. పరమాత్మవు అగు మీ గురించియే యోగాభ్యాసులు, యోగసిద్ధులు నిత్యము ధ్యాసతో ధ్యానించుచున్నారు. **మీయొక్క ఉపాసనచే ఈజీవుడు పరమాత్మతో సంయోగము పొందగలడు.**

**మీరే** – సృష్టికర్త అగు **బ్రహ్మ।** పరిపోషకులు, సంరక్షకులు అగు **విష్ణువు।** లయకారులగు **రుద్రుడు।** ఇంద్రియములకు అధినేత అగు **ఇంద్రుడు।** సర్వమును దహించుచూ, దేహములను రక్షించు **అగ్నిహోత్రుడు।** సమస్తమునకు చలనము కలిగిస్తున్న **వాయువు।** కిరణములతో సమస్తము తేజోమయము, జీవన్మయము చేస్తున్న **సూర్యుడవు।** జీవులకు ఓషధి– వనస్పతి (ఆహార) ప్రదాత అగు **చంద్రమసుడవు।**

**త్వం బ్రహ్మ భూర్భువః స్వః' ఓం**

భూ-భువ-సువర్లోకముల రూపము దాల్చిన ఓంకార సంజ్ఞార్థమగు 'బ్రహ్మము' మీరే అయి ఉన్నారు.

# గణేశ విద్య (అథర్వమహర్షి విరచితము)

"గం గం గం గణపతయే నమః"

| "గం" లో = |
|---|

**'గ్'** కారము పూర్వ విభాగము। - 'గ్'

**'అ'** కారము మధ్యమరూపము। - "గ్ + అ = గ"

**'ం'** అనుస్వారము - అంత్యరూపము। - "గ + ం = గం"

**'మ్'** బిందువు ఉత్తరరూపము। - 'మ్......'।

**'ఉమ్'**... నాదము - అనుసంధానము. సంహిత - సంధి (ఆత్మతో ఏకము చేయటము)।

'గం' అనే పదమునకు ప్రణవమంత్రము (ఓం)ను ముందుగా చేర్చి (**'ఓం - గమ్....'**) - మంత్రమును ఉచ్చరిస్తూ ఉండగా, అట్టి మంత్రోపాసనకు (అభ్యాసికి) గణేశుని సాక్షాత్కారము లభించగలదు.

ఋషి → గణకుడు।
ఛందస్సు → నృచత్ గాయత్రీ ఛందస్సు।
దేవత → శ్రీ మహాగణపతి।

| **ఓం గం గణపతయే నమః।**<br>**ఏకదంతాయ విద్మహే వక్రతుండాయ ధీమహి, తన్నో దంతిః ప్రచోదయాత్॥** |
|---|
| **ఓం గం గణపతీ। (గణకమహర్షికి లభించిన మంత్రదేవతయగు) మీకు ప్రణామములు।**<br>(అని మహాగణపతికి సాష్టాంగ నమస్కారము సమర్పించుచున్నాము). |
| **ఏకదంతము, వక్రతుండము కలిగియుండి, జగత్ప్రభువు అగు శ్రీగణేశభగవానుని మహిమను ధ్యానిస్తున్నాము. ఆయన మాకు జ్ఞాన సంపదను ప్రసాదించి, మా బుద్ధిని వికసింపజేయుదురు గాక।** |

**ఏక దంతాయ:** జన్మజన్మలుగా వృద్ధి చేసుకుంటూ వస్తున్న 'అనేకము' (Multiplicity) అనే వ్యసనము పొందియున్న మా బుద్ధికి, అట్టి జాడ్యము తొలగించి, **'ఏకత్వము'** ప్రసాదించుస్వామి. ఒక్క దంతమేగల ఏకదంత- గణపతి. అనేకముగా కనిపిస్తున్న ఈ జగద్దృశ్యమును ఏకముగా అనిపించగలుగు మనో - బుద్ధులను ప్రసాదించగలుగు దేవాది దేవుడు శ్రీ మహాగణపతి। అందుచేతనే ఏకదంతుడు।

**"ఓం ఇతి ఏకాక్షరం బ్రహ్మ"। - "ఇదంతా ఏకము-అక్షరము అగు బ్రహ్మమే"-** అను స్థానమునకు మార్గము చూపువారు. ఏకదంతుడు.

**విద్మహే।** శ్రీ గణపతి యొక్క మహిమను ఎరుగుచున్నాము.

**వక్రతుండాయ :** "ఓం" - ప్రణవస్వరూపుడు. సర్వాత్మకుడు. 'తత్త్వమ్' సంజ్ఞాస్వరూపుడు.

'ఓం' కార సంజ్ఞ అగు ఆకారముతో కూడిన తుండముతో ఈ సమస్తమైన 'అన్యము'ను అనన్యములోనికి పీల్చివేయువారు.

**ధీ మహి :** ఆయన మహిమను బుద్ధితో ధ్యానించుచున్నాము.

**తన్నో దంతిః ప్రచోదయాత్ :** 'ప్రజ్ఞ'కు సూచకమగు ఏనుగు శిరస్సును కలిగియుండి, 'తత్' స్వరూపుడగు శ్రీ గణపతి మా బుద్ధులను **'తదాత్మజ్ఞానము'** వైపు **ప్రేరేపించెదరు గాక। ప్రత్యుత్సాహపరచెదరు గాక।**

-----

నిరాకారుడు, సమస్త నామరూపములు తానే అయినవాడు అగు మహాగణపతి ఆశ్రితవత్సలుడు. ఆరాధించువారి పట్ల గల అవ్యాజమైన ప్రేమచే సాకారరూపము ధరించి బాహ్య-అభ్యంతర- హృదయాంతర్గతములలో సాక్షాత్కరిస్తున్నారు.

**అట్టి ఉపాస్య సాకార గణపతి రూపమును అభివర్ణించుకుంటున్నాము.**

**ఏకదంతమ్ :** (తన రెండు దంతములలో ఒకదానిని పెరికి లోకకంటకుడగు మూషికాసురుని సంహరించి లోకకళ్యాణము ప్రసాదించి) ఒక దంతము కలిగియున్నవారు (ఏకత్వము ప్రసాదించువారు). మ-ఉషికేతి మూషికః **"నాది-నాకు చెందినది"** - అను మమకారమును వశము చేసుకొని, **ఈ జీవునియొక్క మమకారమును ఆత్మభావనకు వాహనమాత్రంగా తీర్చిదిద్దువారు.**

**చతుర్హస్తం :** నాలుగు చేతులు కలవారు - భక్తి యోగ జ్ఞాన వైరాగ్యహస్తులు. (కర్మ-భక్తి-జ్ఞాన-ముక్తులు చేతులుగా కలవారు)

**పాశమంకుశ ధారిణమ్ :** ఒక చేతితో పాశము **(ప్రేమపాశము)** ధరించినవారు. రెండవ చేతితో దుష్టగుణములు తొలగించు **అంకుశము** చేబూని ఉన్నవారు. (Loving and correcting).

**వరదం హస్తైః బిభ్రాణం (దధానం) :** మిగిలిన రెండు చేతులతో వరద (వరప్రసాద) - అభయ (భయమునుపోగొట్టు) ముద్రలను ధరించువారు.

**మూషక ధ్వజమ్ :** మూషిక(ఎలుక) ధ్వజము కలిగియున్నవారు. సమస్తము ప్రసాదించు ప్రకటన కలవారు.

**రక్తం :** ఎర్రటి ఛాయగలవారు. (కార్యక్రమములందు ఉత్సాహము కలిగియుండు సంజ్ఞగా వేంచేయువారు).

**లంబోదరం :** (సమస్త విద్యలు గల) పెద్దపొట్ట గలవారు.

**శూర్పకర్ణకం :** పెద్ద చెవులు కలవారు. (చక్కటి శ్రవణ శక్తిని మాకు ప్రసాదించువారు).

**రక్త వాససమ్ :** ఎర్రటి వస్త్రములు ధరించినవారు.

**రక్త గంధానులిప్తాంగమ్ :** శరీరమంతా ఎర్రచందనము పులుముకొని యున్నవారు.

**రక్త పుష్పైః సుపూజితమ్ :** భక్తులచే మందారము మొదలైన ఎర్రటి పుష్పములతో పూజింపబడువారు. స్వధర్మ పుష్పములు స్వీకరించి **'ముక్తి'**ని ప్రసాదించువారు.

**భక్తానుకంపినమ్ దేవమ్ :** భక్తులపై అనుగ్రహము కురిపించు ఆదిదేవుడు.

**జగత్కారణమ్ :** జగత్తు యొక్క పుట్టుకకు కారణభూతులు. ఈ సమస్త దృశ్యము యొక్క జనన-గతి-లయములకు కారణము, ఆధారము కూడా అయి ఉన్నవారు.

**అచ్యుతమ్ :** సమస్తమును ఆత్మస్వరూపముగా దర్శించుటయందు 'చ్యుతి' (Distraction) ఏ మాత్రము లేనట్టివారు. సర్వదా పరబ్రహ్మస్వరూపులు. అచ్యుతత్వము భక్తజనులకు ప్రసాదించువారు.

**ఆవిర్భూతం చ సృష్ట్యాదౌ :** సృష్టికి మునుమందే ఉన్నట్టివారు. లీలావినోదులై 'సృష్టి' రూపంగా ఆవిర్భవించువారు.

**ప్రకృతేః పురుషాత్ పరమ్ :** ప్రకృతికి ఆవల పురుషుడై వెలుగొందువారు. స్వభావమునకు 'స్వభావి'గా ప్రకాశమానులు.

**ఏవం ధ్యాయతి యో నిత్యం స యోగీ యోగినాం వరః॥** అట్టి మహాగణపతిని ఎవరు నిత్యము ధ్యానిస్తూ ఉంటారో,... అట్టి వాడు యోగులలో 'శ్రేష్ఠుడు' అవుతాడు.

వ్రాతపతీ! (సమూహనాయకా!) (Group Leader)! దేవతలకు అధిపతీ! గణపతీ! ప్రమథ గణపతీ! లంబోదరా! ఏకదంతా! విఘ్ననాశా! శివసుతా! వరప్రదాతయగు వరదమూర్తీ! నమో నమో నమో నమః॥

## అథర్వశిరోగణపత్యు పాసన- ఫలశ్రుతి

అథర్వ మహర్షి సందర్శితమైనట్టి ఈ **"అథర్వ శిరము"**ను అధ్యయనము చేయువాడు **"బ్రహ్మతత్త్వము"** నందు ప్రవేశించగలడు. అంతటా సుఖవంతుడు కాగలడు. ఆత్మసుఖి కాగలడు. **స సర్వ విఘ్నైః న బాధ్యతే॥** అట్టివాడు విఘ్నములుచే బాధించబడడు. తలపెట్టిన కార్యక్రమములను నిర్విఘ్నముగా నిర్వర్తించగలడు.

తత్త్వార్థమును ఎరిగి గణపతిని ఉపాసించువాడు పంచ మహాపాతకముల దోషముల నుండి కూడా విముక్తుడు అవుతాడు. పగలు చేసిన పాపము రాత్రి (గణపతి) ధ్యానము చేతను, రాత్రి చేసిన పాప దోషము పగలు చేసిన ధ్యానముచే తొలగగలవు. పాపబుద్ధులు

తొలగిపోగలవు. శమించగలవు. వ్యతిరిక్త భావాలు సమసిపోగలవు. అట్టివాడు ధర్మ-అర్థ-కామ-మోక్ష చతుర్విధ ఫలములు సిద్ధించుకోగలడు.

ఉదయ- సాయంకాలములు ఇందలి మంత్రములతో గణపతిని ఉపాసించువాడు **'అపాపి'** అగుచున్నాడు. సమస్త పాపదృష్టులు ఆతనిని విడచిపోగలవు. పుణ్యకర్ముడు, పుణ్యమనస్కుడు కాగలడు.

-----

ఈ 'అథర్వశీర్షము' శిష్యుడు కానివానికి (ఆత్మగురించిన అధ్యయన, అభ్యాస దృష్టిలేనివానికి) గురువులు బోధించరు. మోహము చేత (లౌకిక ఉద్దేశ్యములను, ప్రయోజనములను దృష్టిలో పెట్టుకోవటం చేత) - శిష్యలక్షణము లేనివానికి ఇందలి తాత్త్విక రహస్యములను బోధించటము దోషమే - అని చెప్పబడుతోంది.

ఈ ఉపనిషత్‌లో చెప్పబడిన గణపతి మంత్రములను వేయిసార్లు ఉపాసించువాడు కోరుకొన్నది సిద్ధించుకోగలడు.

ఈ అథర్వశిరములోని మంత్ర-ధ్యాన-ఉపాసనా విశేషములతో గణపతిని అభిషేకించువాడు గొప్ప వాక్‌చాతుర్యము పొందగలడు.

అనశ్నుడై (ఉపవాసి అయి, ఆహారము స్వీకరించక) రోజులో నాలుగుసార్లు అధ్యయనము, తత్-జపము నిర్వర్తిస్తూ ఉండగా, ఆతడు అధికాధిక విద్యావంతుడు కాగలడు.

**ఇతి అథర్వణ వాక్యమ్‌।**

**అథర్వణ మహర్షి ప్రవచనము చేసిన మంగళాశాసనము॥**

గణపతి బ్రహ్మము యొక్క ఆచరణ విద్య తెలుసుకొనియున్నవాడు ఇక దేనికీ భయపడడు. అభయుడౌతాడు.

ఎవడు శ్రీ వరసిద్ధి గణపతిని దూర్వార (గరిక) అంకురములలో పూజిస్తాడో, ... అట్టివాడు వైశ్రవణునితో (విశ్రవోబ్రహ్మకుమారునితో /కుబేరునితో) సమానుడౌతాడు.

లాజలతో (వట్టివేర్లు, పేలాలు, నానబియ్యముతో) హోమము చేయువాడు గొప్ప యశోవంతుడు, మేధావి కాగలడు.

వేయి మోదక పత్రములతో (తాములపాకులతో) పుష్పములతో గణపతిని పూజించువాడు కోరుకొన్న ఫలము పొందగలడు.(మోదకము = కుడుము అని కూడా అర్థము కలదు)

నేయిలో తడిపిన సమిధలతో గణపతి హోమము చేయువాడు సమస్తము పొందగలడు.

ఎనిమిది మంది బ్రాహ్మణులతో (లక్షపత్రితో కూడిన) గణపతి హోమ నిర్వహణచే సమ్యక్‌గ్రాహి (ఆత్మ గురించిన జ్ఞానము), సూర్యునితో సమానమైన తేజస్సు పొందగలరు.

సూర్యగ్రహణ సమయంలోను, పవిత్ర నది ఒడ్డున, ప్రతిమా సన్నిధియందు జపము చేయువాడు - **మంత్ర సిద్ధి పొందగలడు**. సమస్త విఘ్నములనుండి విముక్తుడు కాగలడు. దోషము లెటువంటివైనా సరే తొలగిపోతాయి. సమస్తము ఎరిగినవాడు కాగలడు.

గణపతి యొక్క యోగాత్మతత్త్వము ఎరిగినవాడు స్వస్వరూపాత్మతత్త్వమును స్వానుభవముగా ఎరుగగలడు.

**తత్త్వమ్ - సోఽహమ్ భావములను స్వాభావికము, అనునిత్యము చేసుకోగలడు.**

*ఇతి గణపత్యుపనిషత్*

*ఓం శాంతిః। శాంతిః। శాంతిః।*

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 8 గారుడోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ విషం బ్రహ్మ–అతిరిక్తం స్యాత్।
అమృతమ్ బ్రహ్మసూత్రకమ్।
బ్రహ్మాతిరిక్త విషహృత్।
బ్రహ్మమాత్ర ఖగేడహమ్॥



పరబ్రహ్మముగా కాకుండా వేరైనదిగా (అన్యముగా) తెలియబడేదంతా 'విషము'తో సమానమే. "బ్రహ్మమునకు వేరుగా అనిపించే విషమునకు విరుగుడు "బ్రహ్మసూత్ర గారుత్మంతమే" - అని పలుకు గరుత్మంత భగవానుని తోడు వేడుకొనుచున్నాము. శరణువేడుచున్నాము.

(గ = సర్వ శ్రేష్ఠమైనట్టి, ఋుత్‌మంతమ్ = ఆత్మానుభవమంతులు-పరమ సత్యమగు ఆత్మానుభవులు)

1 ఓం
గారుడ బ్రహ్మ విద్యాం ప్రవక్ష్యామి –
– యాం బ్రహ్మవిద్యాం నారదాయ ప్రోవాచ।
నారదో బృహత్సేనాయ।
బృహత్సేన ఇంద్రాయ।
ఇంద్రో భరద్వాజాయ।
భారద్వాజో జీవత్కామేభ్యః।
శిష్యేభ్యః – ప్రాయచ్ఛత్॥

**సద్గురువు :**

**'ఓం' - ఏకాక్షర స్వరూప పరమాత్మకు నమస్కరిస్తూ...**

ప్రియ శిష్య - మమాత్మ స్వరూపులారా! ఇప్పుడు మనము **"గారుడ బ్రహ్మవిద్య"** చెప్పుకుంటున్నాము.

అనాత్మ దృష్టి అనే విషమునకు 'విరుగుడు' అయినట్టి గారుడాత్మక-అమృతాత్మకమగు-ఈ మహావిద్య- ఒకప్పుడు నారద మహర్షికి బ్రహ్మభగవానునిడు బోధించారు. శ్రీనారద మహర్షి - బృహత్సేనులకు వారికి, బృహత్సేనులు ఇంద్రదేవులకు, ఇంద్రుడు భరద్వాజుల వారికి, భరద్వాజులు జీవత్కామేభ్యులకు, ఆయన తన శిష్యులకు, ఆపై పరంపరగాను బోధింపబడుచూ వస్తోంది.

---

అస్యాః "శ్రీ మహాగరుడ బ్రహ్మవిద్యాయా"।
బ్రహ్మ – ఋుషిః।
గాయత్రీ – ఛ్ఛందః।
శ్రీ భగవాన్ మహాగరుడో – దేవతా।
శ్రీ మహాగరుడ ప్రీత్యర్థే
మమ సకల విష వినాశనార్థే
జపే వినియోగః॥

ఈ "శ్రీ మహాగరుడ మహావిద్య"

**"ఓం ఈం ఓం నమో భగవతే మహాగరుడాయ।**
**పక్షీంద్రాయ। విష్ణు వల్లభాయ।**
**త్రైలోక్య పరిపూజితాయ।**
**ఉగ్ర భయంకర కాలానల రూపాయ నమో నమః॥**

*ఈ మహాగరుడ విద్యకు:*

ఋుషి→ సృష్టికర్త, జగత్ పితామహుడు అగు బ్రహ్మభగవానుడు।

ఛందస్సు - గ్రాయత్రీ! శ్రీ మహాగరుడు భగవానుడు → దేవత।

అట్టి శ్రీ గరుడభగవానుడు ప్రీతి చెందినవారై మా యొక్క (ఇంద్రియ విషయములనే) విషసర్పముల విషము తొలగించుటకై, అమృతత్వము సిద్ధింపజేయుటకై-మంత్రోపాసన (జపము) చేయడానికి సిద్ధపడుచున్నాము. ['దృశ్యవిషయములు' అనే విషసర్ప బంధనములనుండి (నాగబంధనముల నుండి) విడిపించి, మాకు "ఆత్మయేవాஉహమ్" - అను అమృతమును అందించెదరు గాక।]

| | |
|---|---|
| **కరన్యాసము**<br>"ఓం నమో భగవతే" - అంగుష్ఠాభ్యాం "నమః"<br>"శ్రీ మహాగరుడాయ" - తర్జనీభ్యాం "స్వాహా।"<br>"పక్షీంద్రాయ" - మధ్యమాభ్యాం 'వషట్'।<br>"శ్రీ విష్ణువల్లభాయ" - అనామికాభ్యాం 'హుం'।<br>"త్రైలోక్య పరిపూజితాయ"-కనిష్ఠికాభ్యాం "వౌషట్'।<br>ఉగ్ర భయంకర కాలానల రూపాయ -<br>కరతల -కర - పృష్ఠాభ్యాం - 'ఫట్'।<br>ఏవం హృదయాది న్యాసః | **అంగన్యాసము - (ఏవం హృదయాదిన్యాసః)**<br>**ఓం నమో భగవతే** - హృదయాయ **'నమః'**।<br>**శ్రీమహా గరుడాయ** - శిరసే **'స్వాహా'**।<br>**శ్రీ పక్షీంద్రాయ** - శిఖయాయ **'వషట్'**।<br>**శ్రీ విష్ణువల్లభాయ** - కవచాయ **'హుం'**।<br>**త్రైలోక్య పరిపూజితాయ** - నేత్రత్రయాయ **'వౌషట్'**।<br>**ఉగ్ర భయంకర కాలానల రూపాయ** - అస్త్రాయ **'ఫట్'**।<br>(→ హృదయాయ నమః। శిరసే స్వాహా। శిఖయాయ వషట్। కవచాయే హుమ్। నేత్ర త్రయాయవౌషట్। అస్త్రాయఫట్।) |
| భూర్భువస్సువరోమ్<br>(భూః భువః సువః 'ఓం')<br>ఇతి దిగ్బంధః | → భూ-భువర్-సువర్ -లను గరుడ భగవాన్ రూపముగాను, ఆత్మ సాక్షాత్కారముగాను (ప్రత్యక్షరూపంగా) భావిస్తూ - (మనో-వాక్-కాయములను, బుద్ధి-చిత్తములను) - దిగ్బంధనము చేయుచున్నాము. (చాంచల్యములను నిరోధిస్తున్నాను) |
| **2 ధ్యానమ్**<br>'స్వస్తికో' దక్షిణం పాదం।<br>వామపాదం తు 'కుంచితమ్'।<br>ప్రాంజలీకృత దోర్యుగ్మం।<br>గరుడం హరివల్లభమ్।<br>అనంతో వామకటకో।<br>యజ్ఞసూత్రం తు 'వాసుకిః'। | కుడిపాదమును స్వస్తికాసన విధిగా మడచి, తొడపై భాగమును తాకిస్తూ, ఎడమ పాదమును కుంచితము (ముడుచుకున్నట్లు) గాను ధరించి రెండు హస్తములతోను శ్రీహరికి నమస్కరిస్తూ ఉన్నట్టి - గారుడాయ నమః। శ్రీహరికి అత్యంత ప్రియుడగుచున్నట్టి - **శ్రీమన్ గరుడ భగవానునికి హృదయపూర్వక నమస్కారము. సమస్తము విష్ణుతత్త్వముగా దర్శిస్తూ ఆనందిస్తున్న శ్రీమత్ గరుడస్వామికి నమస్కారము.**<br>**మహాసర్ప భూషణాయ నమః**<br>అనంత సర్పమును ఎడమ భుజముపై అలంకారముగా కలవారు. వాసుకిని యజ్ఞసూత్రముగా ధరించినవారు. |
| 'తక్షకః' కటి సూత్రం తు,<br>హారః 'కార్కోట' ఉచ్యతే।<br>'పద్మో' దక్షిణ కర్ణేతు<br>'మహాపద్మ'స్తు వామకే।<br>'శంఖః' శిరః ప్రదేశేతు।<br>'గుళిక'స్తు భుజాంతరే। | - తక్షక మహాసర్పమును మొల సూత్రముగా కలిగియున్నవారు,<br>- కర్కోటక మహాసర్పమును హారముగా ధరించుచున్నవారు,<br>- పద్మునిని కుడి చెవిని, మహాపద్ముని ఎడమచెవికి, శంఖవలె సర్పమును శిరోప్రదేశమునందు, గుళికుని భుజస్కంధములపైన<br>ఆయాసర్పములను ఆభరణముగా ధరిస్తున్న గరుడుని సేవించుచున్నాము.<br>**మహాసర్ప భూషణాయ నమో నమో నమో నమః॥** |
| 'పౌంద్ర కాళిక' నాగాభ్యాం।<br>చామరాభ్యాం సువీజితమ్।<br>'ఏలాపుత్రక' నాగాద్యైః।<br>సేవ్యమానం ముదాన్వితమ్॥ | పౌంద్ర కాళిక నాగులను (సర్పములను), చామరములు వీచువారుగాను, ఏలాపుత్రక నాగము మొదలైన సర్పములు సేవకులుగాను, - కలిగియున్న ఆనందస్వరూపులగు గరుడ భగవానుని స్తుతిస్తున్నాము. |
| కపిలాక్షం గరుత్మంతం<br>సువర్ణ సదృశ ప్రభమ్।<br>దీర్ఘబాహుం బృహత్ స్కంధం<br>నాగాభరణ భూషితమ్॥ | కపిల వర్ణ (ఎర్రటి) కనులుగలవారు, బంగార రంగుతో ప్రకాశించువారు, దీర్ఘమైన బాహువులతో, ఎత్తైన భుజములతో పాములను ఆభరణములుగా కలిగి వర్తించువారు - అగు **గరుడ భగవన్। నమో నమః॥ రక్షమాం। పాహి మాం।** |

**ఆజానుతః సువర్ణాభమ్**
**ఆకట్యోః తుహిన ప్రభమ్।**
**కుంకుమారుణమ్ ఆకంఠం**
**శతచంద్ర నిభాననమ్।**
**నీలాగ్ర నాసికా వక్రం**
**సుమహత్ చారు కుండలమ్।**
**దంష్ట్రా కరాళ వదనం, కిరీటమకుటోజ్వలమ్।**
**కుంకుమారుణ సర్వాంగ కుందేందు ధవళానన।**
**<u>విష్ణువాహా! నమస్తుభ్యం।</u>**
**<u>క్షేమం కురు సదా మమ॥</u>**

మోకాళ్ళ నుండి బంగారు రంగుగా మెరయువారు, కటి (మొల) వద్ద తెల్లటి ప్రభలతో వెలుగొందువారు,
కంఠము వరకు కుంకుమ రంగుతో ప్రకాశించువారు,
శతపూర్ణ చంద్రకాంతులతో ప్రకాశించు ముక్కు గలవారు,
నీలముగా వెలుగొందు ముక్కు తుది (చివర) కలవారు,
ఉత్తమమైన మహత్ గల (సుమహత్) - మహిమతో కూడిన అందమైన దీర్ఘకుండలము కలవారు,
కోరలతో భీకరమైన వదనముతో కిరీటధారులై, జాజ్వల్యమానులు,
కుంకుమ రంగుతో సర్వాంగ సుందరులు, మల్లెమొగ్గలవలె పూర్ణచంద్రునివలె ముఖము కలవారు,-
అయి **విష్ణువాహనమగు శ్రీగరుడ భగవాన్। మీకు నమస్కారము. దయతో మాకు క్షేమము కలుగజేయ ప్రార్థన.**

---

**ఏవం ధ్యాయేత్ త్రిసంధ్యాసు**
**గరుడం నాగభూషణం।**
**విషం నాశయతే శీఘ్రం**
**తూలరాశిమ్ ఇవ అనలః॥**

ఈ విధంగా త్రిసంధ్యలలోను నాగాభరణులగు గరుడ భగవానుని ఉపాసించుటచే - పెద్ద దూదికుప్ప అగ్నికణముచే భస్మమైపోవు విధంగా - **(సాంసారిక దృష్టుల వలన కలుగు)** విషము అతి శీఘ్రంగా నశించిపోగలదు. తులారాశి ప్రవేశించగానే శీలాకాల ప్రారంభంచేత మంచువర్షంచే యండ యొక్క ఉష్ణముచే మంచుకరగిపోవునట్లు - శమించువిధంగా ఇంద్రియ (విషయపరంపరా రూప) విషము తొలగగలదు. అగ్ని కరణముచే దూది భస్మము అగునట్లు మాపట్ల విషము నశించగలదు.

---

**ఓం ఈం ఓం నమో భగవతే।**
**శ్రీ మహాగరుడాయ, పక్షీంద్రాయ।**
**విష్ణు వాహనాయ (వల్లభాయ)। త్రైలోక్య పరిపూజితాయ।**
**ఉగ్ర భయంకర కాలానల రూపాయ।**
**వజ్ర నఖాయ। వజ్ర తుండాయ।**
**వజ్ర దంతాయ। వజ్ర దంష్ట్రాయ।**
**వజ్ర పుచ్ఛాయ। వజ్ర పక్షాలంకృత శరీరాయ।**
**ఓం ఈం ఏహి ఏహి॥**

ఓ గరుడ దేవాదిదేవా! భగవతే।
**'ఓం ఈం ఓం'** బీజాక్షరములచే పలుకబడుచున్న నీ దివ్య భవగవత్ ఐశ్వర్యమునకు నమస్కారము!
శ్రీ మహాగరుడదేవా! పక్షీంద్రా! విష్ణువాహనా! త్రిలోకవాసులచే పూజింపబడువాడా! కాలాగ్నివలె ఉగ్ర భయంకర రూపా! వజ్రమువంటి గోళ్ళు (Nails), తుండము, దండము, దంష్ట్రములు (పలు చివరలు,), తోక గల స్వామీ! వజ్రము వంటి పక్షిశరీరాలంకృతుడా!
'ఓం ఈం ఓం' - బీజాక్షరములతో సమర్పించు మా ఈ హృదయ-కైంకర్యమును స్వీకరించి మమ్ములను రక్షించండి.

---

**శ్రీ మహాగరుడ అప్రతిహత శాసన!**
**అస్మిన్ ఆవిశావిశ। విశావిశ। దుష్టానాం**
**విషం దూషయ దూషయ।**
**స్పృష్టానాం విషం నాశయ। నాశయ।**
**దంద శూకానాం విషం దారయ। దారయ।**
**ప్రలీనం విషం ప్రణాశయ। ప్రణాశయ।**
**సర్వ విషం నాశయ। నాశయ।**

ఓ మహాగరుడ భగవాన్! మీరు శాసించనిదే ఎవ్వరూ మీ మాయను దాటలేరు. మీరు దాటబడ జాలరు కాబట్టి **"అప్రతిహత శాసనులు"**.
స్వామీ! మా హృదయమందు మీరు మీ తేజస్సుతో ప్రవేశించండి. మేము దుష్టమైన (చెడు మాట్లాడటము, చూడటము, భావించటటము మొదలైన) **'విషయములు'** అనే విషజ్వాలలో చిక్కుకున్నాము. భీతిల్లి ఉన్నాము. దండ శూక (రెండు తలలపాము-ద్వంద్వ భావముల) విషము వదిలించండి. మమ్ము తాకుచున్న ద్వంద్వ మోహ విషయములు నశింపజేయండి.
రెండు తలల పాముల విషమును (మమ్ము పట్టుకొన్న ద్వంద్వ మోహమును) చీల్చివేయండి.
మా శరీరములోను, రక్తములోను, (మనోబుద్ధులలోను) ప్రలీనమై లోతుగా కలిసిపోయి ఉన్న (విషయ) విషప్రభావములను త్రోసివేయండి. విషమునంతా తొలగించివేయండి. మీ స్మరణచే మాలోని విషమంతా విరిగి పోవును గాక। అమృతదృష్టి అలవడును గాక। అమృతము వర్షించును గాక!

| | |
|---|---|
| హన। హన। దహ। దహ।<br>పచ। పచ।<br>భస్మీకురు। భస్మీకురు।<br>హుం ఫట్ స్వాహా॥ | విషయ విషవాసనలను విషసర్పములను చంపి వేయండి. హననము చేయండి. దహించివేయండి. మసి చేయండి। (మాలోని మూర్ఖత్వమును) పచనము చేసి వేయండి. వండివేయండి. (మాపాప దృష్టులను) భస్మము చేసివేయండి. భస్మము చేయండి. బూడిదగా చేసివేయండి.<br>మీయొక్క 'హుమ్' అను ధ్వనిచే మా విషదోషములన్నీ పారిపోయేట్లు చేయండి.<br>'ఫట్' శబ్దముచే మా మొండితనమును పగులగొట్టండి. 'స్వాహా' శబ్దపూర్వకంగా మా వినతులు స్వీకరించండి। |
| **3.** చంద్రమండల సంకాశ!<br>సూర్యమండల ముష్టిక!<br>పృథ్వీమండల ముద్రాంగ!<br>శ్రీ మహాగరుడ!<br>విషం హర హర।<br>హుం ఫట్ స్వాహా।<br>ఓం క్షిప స్వాహా। | - చంద్రమండలము వలె ప్రశాంత స్వరూపా! **"దేహమనోరోగ ఓషధీ"** సంప్రసాదా!<br>- సూర్య మండలము వంటి ముష్టిక (సమృద్ధి) స్వరూపా!<br>- భూమండలమంతా చిన్ముద్రగా ధరించినవాడా!<br>- శ్రీమహాగరుడ భగవాన్! మాలోని విషబీజములను హరించివేయండి. 'హుం' శబ్దముతో, 'ఫట్' శబ్దముతో దుష్టత్వము తొలగించి మా ప్రార్థనలు స్వీకరించండి.<br>మమ్ములను క్షిపించి (ప్రేరేపించి) ఉత్సాహపరచుటులకై మేము సమర్పిస్తున్న ఈ ఆహుతులను స్వీకరించండి. |
| ఓం ఈం స చరతి। స చరతి।<br>తత్కారీ మత్కారీ। విషాణాం చ<br>విష రూపిణీ। విష దూషిణీ।<br>విష శోషిణీ। విష నాశినీ।<br>విష హారిణీ। హతం విషం।<br>నష్టం విషమ్ అంతః ప్రలీనం।<br>విషం ప్రణష్టం। విషం హతం।<br>తే బ్రహ్మణా విషం హతం-<br>ఇంద్రస్య వజ్రేణ స్వాహా॥ | 'ఓం'కార 'ఈం'కార స్వరూపుడై ఆ గరుడభగవానుడు తన తేజస్సుచే ప్రదర్శనమగుచున్నారు. సర్వత్రా చేతనులై చలనము కలిగి ఉన్నారు. సమస్తమునకు కర్త ఆ మహాగరుడ భగవానుడే! ఆ సర్వాత్మకుడే. -<br>సమస్తమునకు కార్య కారణ కర్త! విషమునకే విషము వంటివాడు. సమస్తము ఆ గరుడ స్వామికి అనన్యము కాబట్టి విశ్వరూపి! విషమును దూషింప జేయువారు! విషమును ఎండింపజేయువారు! విషమును నశింపజేయువారు! విషమును హరించువారు. అట్టి శ్రీమన్ గరుడస్వామిని స్మరించుచున్నాము. ఆయన యొక్క స్మరణచే సర్వదోషముల ప్రభావము తొలగిపోగలదు. విషము విషహరుడగు గరుడినిలో కరిగిపోగలదు.<br>ఆ గరుడ దేవుని స్మరణచే, ఇంద్రుని వజ్రము కొండలను పిండిచేయు విధంగా, - మాలోని దుర్బుద్ధిరూపమగు విషము నశించిపోగలదు. ఆయన ప్రసాదించు బ్రాహ్మీ దృష్టిచే విషముయొక్క విషత్వము తొలగి, ఈ సమస్తము అమృతత్వము సంతరించుకోగలదు. |
| "ఓం నమో భగవతే మహాగరుడాయ।<br>విష్ణువాహనాయ। త్రైలోక్య పరిపూజితాయ।<br>వజ్రనఖ వజ్రతుండాయ।<br>వజ్రపక్షాలంకృత శరీరాయ ఏహ్యేహి। (ఏహి ఏహి)।<br>మహాగరుడ। విషం ఛింధి। ఛింధి।<br>ఆవేశయ। ఆవేశయ।<br>హుం ఫట్ స్వాహా"॥ | ఓంకార స్వరూపా! భగవంతుడా! మహాగరుడ దేవా! విష్ణు భగవానుని వాహనమా! త్రిలోకములచే భక్తి ప్రపత్తులతో పూజింపబడువాడా! నమో నమః।<br>వజ్రము వంటి గోరులు, వజ్రము వంటి ముక్కు, వజ్రము వంటి రెక్కలచే అలంకృతమైన శరీరము ధరించిన స్వామీ! సుస్వాగతము! దయచేయండి. ఓ మహాగరుడా! మా (విషయ భ్రమలరూప) విషమును ఛేదించి వేయండి. మీ జ్ఞాన భక్తి ప్రజ్ఞలతో మా మనో బుద్ధులను ఆవేశించి ఉండండి. **హుం ఫట్ స్వాహా!** |
| సుపర్ణోఽసి గరుత్మాన్<br>త్రివృత్తే శిరో గాయత్రం। | ఓ గరుత్మంత భగవాన్! మీరు మీ గొప్ప రంగులతో కూడిన రెక్కలతో మెరుస్తూ ఉన్న సువర్ణ-సుపర్ణులు. మీ శిరస్సు - త్రివృత్ గ్రాయత్రీ మంత్ర హృదయము.<br>(త్రివృత్తులు = దృశ్యము, ద్రష్ట, సాక్షి). |

| | |
|---|---|
| చక్షుః స్తోమ, ఆత్మా సామ,<br>తే తనూః వామదేవ్యం<br>బృహద్రథంతరే పక్షౌ। (బృహత్ రథంతరే పక్షౌ)। | మీ చక్షువులు చల్లటి చూపులు గల చంద్రబింబ సమానము (సోమము). మీ ఆత్మయే సామవేదము! మీ తనువు (శరీరము) వామదేవ (శివ) స్వరూపము. మీ రెక్కలు బృహద్రథంతరములు (అంతరమగు బృహదాత్మ స్వరూపము). |
| యజ్ఞా యజ్ఞియం పుచ్ఛం।<br>ఛందాంసి అంగాని।<br>ధిష్ణియాః శఫా యజూంషి నామ।<br>సుపర్ణోఽసి గరుత్మాం<br>దివంగచ్ఛ సువః పత। | మీ పుచ్ఛము (తోక) యజ్ఞాయ యజ్ఞీయము (యజ్ఞ పురుష స్వరూపము) వేదములు (ఛందస్సులు) మీ అంగములు.<br>యజుర్వేదము మీరు అంకుశముతో వేంచేసియున్న గృహము.<br>హే గరుత్మన్! మీరు సుపర్ణులు। గొప్ప అందమైన, బలమైన రెక్కలతో సువర్లోకము వరకు ఎగురుచు మమ్ములను ఉద్ధరించగలిగినట్టివారు. |
| ఓం ఈం బ్రహ్మ విద్యామ్<br>అమావాస్యాం పౌర్ణమాస్యాం పురోవా చ।<br>స చరతి। స చరతి। తత్కారీ। మత్కారీ।<br>విష నాశినీ। విష దూషిణీ। విష హారిణీ। హతం విషం।<br>విషం నష్టం। విషం ప్రణష్టం।<br>విషం హతం। ఇంద్రస్య వజ్రేణ విషం హతం। | 'ఓం'కార 'ఈం'కార స్వరూపులగు మీరు మమ్ములను అమావాస్య -పౌర్ణమిలకు (కాలమునకు) ఆవల **ఆత్మ ప్రసంగులై** మాకు సిద్ధించండి.<br>ఆ గురుడ భగవానుడే సర్వజీవులలో ఆత్మస్వరూపులై చరిస్తున్నారు. సమస్తమునకు కారణమగు తత్ స్వరూపులు. 'మత్' ('నేను' 'నేను' అను రూపంగా) సర్వజీవులలో వేంచేసివున్నారు. విషమును నశింపజేయువారు, తొలగించువారు, విషప్రయోగములను వినష్టము చేయువారు. స్మరణచే ఇంద్రుని వజ్రమువలె విషమును హతము చేయగలుగువారు. |
| తే బ్రహ్మణా విషమ్ ఇంద్రస్య<br>వజ్రేణ స్వాహా। తతః త్రయమ్ (తతస్త్రయమ్)।<br>యది అనంతక దూతోఽసి<br>యదివా అనంతకః స్వయమ్,<br>స చరతి। స చరతి।<br>తత్కారీ। మత్కారారీ। విషనాశినీ।। | ఇంద్రుని వజ్రము వలె 'విషమును తొలగించి బ్రహ్మజ్ఞానము ప్రసాదించు మీకు ఈ త్రి- ఆహుతులు సమర్పిస్తున్నాము. (నేయి యజ్ఞములో వేయాలి). మీరు త్రిమూర్తి స్వరూపులు. అనంతుడగు పరమాత్మకు దూత!<br>మీరే స్వయముగా అనంతులు (అనంత స్వరూపులు). ఇక-అనంతకసర్ప దూతగాని, స్వయముగా అనంతకసర్పముగాని మీస్మరణచే మారు సానుకూల్యమవుతారు. మాకు హాని చేయదు.<br>ఆ గరుడాత్మ భగవానుడే సర్వత్రా సర్వరూపి అయి చరిస్తున్నారు. వారే తత్‌గా సమస్తమునకు కర్త! నాలో నేనై ఉన్నవారు ఆయనయే! 'విషయములు' అను విషములను (ఆత్మకు అన్యభావములను, ఇంద్రియాకర్షణలనే విషయములను) నశింపజేయ గలవారు. అట్టి గరుడ దేవా! నమో నమః! |
| విషదూషిణీ, హతం విషం, నష్టం విషం,<br>హతమ్ ఇంద్రస్య వజ్రేణ విషం హతం తే<br>బ్రహ్మణా విషమ్ ఇంద్రస్య వజ్రేణ స్వాహా। | ఓ గరుడ దేవాది దేవా!<br>మీరు విషదూషిణి అయి విషమును హతము చేయండి. ఇంద్రుని వజ్రము కొండలను ఖండించు తీరుగా మాలో విషబీజములు తొలగించండి. విషభావములను సంస్కరించి, బ్రాహ్మీ భావములను చిగురింపజేయండి. ఇంద్రుని వజ్రము వలె మాలో దుష్ట సంస్కారములు ఖండించివేయుటకై (మేము చేయు కర్మఫలములను) ఆహుతులుగా మీకు సమర్పిస్తున్నాము. (నేయి అగ్నిలో వేయాలి). |
| **4.** యది వాసుకి దూతోఽసి, -<br>యదివా వాసుకిః స్వయం - స చరతి। స చరతి।<br>తత్కారీ। మత్కారీ।<br>విష నాశినీ। విష దూషిణీ।<br>హతం విషం నష్టం।<br>విషం హతం ఇంద్రస్య వజ్రేణ।<br>విషం హతం తే బ్రహ్మణా, విషమింద్రస్య వజ్రేణ స్వాహా। | నన్ను సమీపించు (విషయ) విష సర్పములు వాసుకీ సర్పము యొక్క దూత అయినప్పటికీ, (లేక) సాక్షాత్తూ వాసుకీ సర్పమే అయినప్పటికీ కూడా, అది మీ నామస్మరణచే నన్ను వదలిపోగలదు. అది తత్కారి, మత్కారి అయి (నాలో తత్-మత్ ఏక స్వరూపిణి అయి) విషనాశని, విషదూషిణి అయి విషమును పోగొట్టుకోగలదు. వాసుకీ సర్ప విషము కూడా ఇంద్రుని వజ్రము వలె మీ స్మరణచే హతమై పోగలదు. బ్రహ్మీభావులగు మీ సామీప్యముచే బ్రాహ్మీభావములు ఉదయించుటకై - ఆహుతులు సమర్పిస్తున్నాము. (నేయిని అగ్నిలో సమర్పిస్తున్నాము). |

**యది తక్షక దూతో౽సి, యదివా తక్షకః స్వయమ్,-**
**స చరతి। స చరతి।**
**తత్కారీ। మత్కారీ।**
**విష నాశినీ। విష దూషిణీ।**
**హతం విషం నష్టం విషం**
**హతమ్ ఇంద్రస్య వజ్రేణ విషం హతం।**
**తే బ్రహ్మణా విషమ్ ఇంద్రస్య వజ్రేణ స్వాహా।**

తక్షక సర్పదూత అయినా, (లేక) సాక్షాత్ తక్షకుడే అయినా, "**తత్**కారి, **మత్**కారి" అగు మీ స్మరణచే చరించిపోగలదు. మీ అనుగ్రహముచే ఆ పరమాత్మ నాలోని "తత్‌కారి-మత్‌కారి" అయి- వెలుగొందగలరు.

ఓ తత్కారీ! మత్కారీ! విషనాశనీ! విషదూషణీ! బ్రహ్మదేవ సంకల్పముచే విషము హతమై వినష్టమైపోగలదు. ఇంద్రుని వజ్రఘాతము వలె విషమును తొలగించగలదు. మీకు ఇంద్రవజ్రస్వరూపులగు ఈ ఆహుతులు సమర్పిస్తున్నాము. విషయమునకు వ్యతిరిక్తమగు బ్రహ్మభావము మాకు ప్రసాదించెదరు గాక. (నేయిని అగ్నిని సమర్పిస్తున్నాము). ఈ హోమద్రవ్యములు స్వీకరించండి. "స్వాహా"!

---

**= యది కర్కోటక దూతో౽సి-**
**యది వా కర్కోటకః స్వయమ్, -**
**స చరతి। స చరతి। తత్కారీ। మత్కారీ।**
**విష నాశినీ। విష దూషిణీ।**
**హతం విషం। నష్టం విషం।**
**హతమ్ ఇంద్రస్య వజ్రేణ విషం హతం।**
**తే బ్రహ్మణా విషమ్ ఇంద్రస్య వజ్రేణ స్వాహా।**

కర్కోటక దూత అయినా, (లేదా) స్వయముగా కర్కోటక మహాసర్పము అయినాకూడా, మీ స్మరణచే విషభావములు వీడగలరు. సచరతి! బ్రహ్మాత్మకమగు తత్కారి, మత్కారి, విషనాశనీ, విషణదూషిణి, విషము తొలగించునది కాగలదు. ఇంద్రుని వజ్రమువలె వేంచేసి మీయొక్క నామస్మరణము-మమ్ములను బాధించు విషమును హతము చేయగలరు.

విషమునకు ఇంద్ర వజ్రఘాతము వంటి మీ నామమును స్మరిస్తూ ఆహుతులను సమర్పిస్తున్నాము. "స్వాహా"!

---

**యది పద్మక దూతో౽సి-**
**యది వా పద్మకః స్వయమ్। -**
**సచరతి। సచరతి। తత్కారీ। మత్కారీ।**
**విషనాశినీ। విషదూషిణీ। హతం విషం। నష్టం విషం।**
**హతమ్ ఇంద్రస్య వజ్రేణ విషగ్ం హతం।**
**తే బ్రహ్మణా విషమింద్రస్య వజ్రేణ స్వాహా।**

అది పద్మక దూత అయిన విషసర్పము కావచ్చు, (లేక) స్వయముగా పద్మకమహాసర్పమే కావచ్చు గాక। మీ నామస్మరణచే ఇక్కడి నుండి చరించగలదు. (వెళ్ళిపోగలదు). బ్రహ్మదేవుని కృపచే తత్కారి, మత్కారి, విషనాశని, విషదూషిణి, విషహతి, విషనష్టి అవగలదు. ఇంద్రుని వజ్రాయుధము వంటి గరుడ నామస్మరణ - బాహ్మీ దృష్టి భావన, బ్రహ్మత్వము ప్రసాదించగలదు. అట్టి మీకు ఆహుతులు సమర్పిస్తున్నాము. "స్వాహా"!

---

**= యది మహాపద్మక దూతో౽సి, -**
**యది వా మహాపద్మకః స్వయమ్, -**
**స చరతి। స చరతి। తత్కారీ। మత్కారీ।**
**విష నాశినీ। విష దూషిణీ।**
**హతం విషం। నష్టం విషం।**
**హతమ్ ఇంద్రస్య వజ్రేణ విషం హతం।**
**తే బ్రహ్మణా విషమింద్రస్య వజ్రేణ స్వాహా।**

మమ్ములను (సంసారిక విషయములలో గాయపరచటానికి వచ్చిన) మహాపద్మక సర్పదూత అయినా, లేక మహా పద్మక మహాసర్పమే స్వయముగా అయి ఉన్నప్పటికీ, మీ నామము రక్షించగలదు. విషనాశి, విషదూషిణి, వజ్ర సమానము అగు మీ మంత్ర మననముచే విషము హాని కలిగించక, ప్రక్కకు వెళ్ళిపోగలదు. **మాలో నిరాటంకముగా బ్రాహ్మీదృష్టి ఏర్పడుటకై మీకు హోమద్రవ్య ఆహుతులు సమర్పిస్తున్నాము. "స్వాహా"!**

---

**= యది శంఖక దూతో౽సి,**
**యది వా శంఖకః స్వయమ్,**
**స చరతి। స చరతి। తత్కారీ। మత్కారీ।**
**విషనాశినీ। విషదూషిణీ। విషహారిణీ।**
**హతం విషం। నష్టం విషం।**
**హతమ్ ఇంద్రస్య వజ్రేణ విషం హతం,**
**తే బ్రహ్మణా విషమ్ ఇంద్రస్య వజ్రేణ స్వాహా।**

శంఖక సర్పదూత అయినా, స్వయముగా శంఖక మహాసర్పమే అయినా కూడా - వజ్రతుల్యమగు మీ నామస్మరణచే వాటి విషము తొలగిపోగలదు. తత్కారి, మత్కారి, విషనాశిని, విషదూషిణి, విషహారిణి అగు మీరు విషమును హరించివేయగలరు. ఇంద్రవజ్రము వలె విషభావావేశములను మాలో తొలగించి బ్రహ్మతత్త్వము రూపుదిద్దుకోవటానికై మీకు ఆహుతులను సమర్పిస్తున్నాము. మీ అనుగ్రహముచే సృష్టికర్త అగు బ్రహ్మ తోడవగలరు. భక్తితో హోమద్రవ్యములు సమర్పిస్తున్నాము. "స్వాహా"!

**= యది గుళిక దూతో௨సి, -**
**యదివా గుళికః స్వయమ్, -**
**స చరతి। స చరతి।**
**తత్కారీ। మత్కారీ।**
**విషనాశినీ। విషదూషిణీ। విషహారిణీ।**
**హతం విషం । నష్టం విషం।**
**హతం ఇంద్రస్య వజ్రేణ విషం హతం।**
**తే బ్రహ్మణా విషమింద్రస్య వజ్రేణ స్వాహా॥**

గుళిక మహాసర్పము యొక్క దూత అయినప్పటికీ, స్వయముగా దుళికమహాసర్పమే అయినప్పటికి అది, మీ నామస్మరణచే మాకు సానుకూలము అయి చరించగలదు. మేము బ్రహ్మదేవుని కృప కూడా పొందగలము.

ఇంద్రవజ్రము వంటి గరుడ భగవానుని కృపచే విషము హతము, వినష్టము కాగలదు.

తత్కారీ - మత్కారీ అగు గరుడ భగవానుని చల్లటి చూపుచే ఇంద్రియ విషయరూపములగు విషములు తొలగి బ్రహ్మతత్త్వము ఇంద్రుని వజ్రమువలె మాయందు ప్రకాసించగలదు.

---

**= యది పౌంద్రకాళిక దూతో௨సి, -**
**యదివా పౌంద్రకాళికః స్వయమ్, -**
**స చరతి। స చరతి। తత్కారీ। మత్కారీ।**
**విషనాశినీ। విష దూషిణీ। విషహారిణీ।**
**హతం విషం। నష్టం విషం, హతమ్**
**ఇంద్రస్య వజ్రేణ, విషం హతం।**
**తే బ్రహ్మణా విషమింద్రస్య వజ్రేణ స్వాహా॥**

అట్లాగే ఫౌంద్రకాళిక సర్పము యొక్క దూతగాని, స్వయముగా పౌంద్రకాళిక మహాసర్పముగాని తత్కారీ-మత్కారీ స్వరూపులగు గరుడ దేవాదిదేవుని మననముచే - వారి విషము నశించగలదు. విషమంతా దూషనము పొందగలదు. వినష్టమై హతమై పోగలదు. మాయందు ఇంద్రుని వజ్రమువలె బ్రహ్మతత్త్వము తేజోవంతమవగలదు.

---

**= యది నాగక దూతో௨సి, -**
**యదివా నాగకః స్వయమ్, -**
**స చరతి। స చరతి। తత్కారీ। మత్కారీ।**
**విష నాశినీ। విషదూషిణీ। విషహారిణీ।**
**హతం విషం। నష్టం విషం।**
**హతమ్ ఇంద్రస్య వజ్రేణ**
**విషం హతం తే బ్రహ్మణా**
**విషమింద్రస్య వజ్రేణ స్వాహా॥**

అదేవిధంగా నాగసర్పము యొక్క దూతగాని, స్వయముగా నాగక మహాసర్పముగాని మీ నామస్మరణముచే, మా మనస్సు మీ యందు చరించుచున్నప్పుడు విషము వినష్టము కాగలదు. బ్రహ్మదేవుని కృప వలె, ఇంద్రుని వజ్రము వలె మాయందు బ్రాహ్మీతత్త్వ భావన ఘనీభూతమవగలదు. ఆహుతుల సమర్పిస్తున్నాము. స్వాహా!

---

**5. = యది లూతానాం, ప్రలూతానాం, -**
**యది వృశ్చికానాం, యది ఘోటకానాం,-**
**యది స్థావర జంగమానాం -**
**స చరతి। స చరతి। తత్కారీ, మత్కారీ।**
**విషనాశినీ। విషహారిణీ। విషదూషిణీ।**
**హతం విషం। నష్టం విషం।**
**హతమ్ ఇంద్రస్య వజ్రేణ విషం హతం,**
**తే బ్రహ్మణా విషమ్**
**ఇంద్రస్య వజ్రేణ స్వాహా॥**

సాలె పురుగు విషమైనా, రాక్షస సాలెపురుగు విషమైనా, తేలు, ఘోటకము (గుర్రము) స్థావర జంగమముల విషము కూడా గరుడ భగవానుని స్మరణచే - సచరత్వము పొందగలదు. **'తత్కారి-మత్కారి'** అయిన గరుడునికి నమస్కరించగా విషము నాశనము కాగలదు. హరించుకుపోగలదు. వజ్రఘాతమునకు కొండవలె విషము విషత్వము కోల్పోగలదు. ఇంద్ర వజ్రము వంటి బ్రాహ్మీ తత్త్వమును గరుడోపాసనచే మేము పొందగలము. స్వామీ! మేము సమర్పిస్తున్న ఈ ఆహుతులను స్వీకరించండి. ప్రేమతో మాకు రక్షకులై ఉండండి.

| | |
|---|---|
| **అనంత వాసుకి తక్షక కర్కోటక**<br>**పద్మక మహాపద్మక శంఖగులిక**<br>**పౌండ్రకాళిక నాగక ఇత్యేషాం**<br>**(ఇతి ఏషాం) దివ్యానాం మహానాగానాం**<br>**మహానాగాది రూపాణాం విషతుండానాం**<br>**విష దంష్ట్రాణాం విషాంగానాం విషపుచ్ఛానాం**<br>**విశ్వచారాణాం, వృశ్చికానాం,**<br>**లూతానాం, ప్రలూతానాం మూషికాణాం,**<br>**గృహ గౌళికానాం గృహగోధికానాం**<br>**ఘ్రుణాసానాం, గృహ-గిరిగహ్వర**<br>**కాలానల వల్మీకోద్భూతానాం,** | అనంత, వాసుకి, తక్షక, కర్కోటక, పద్మక, మహాపద్మక, శంఖగులిక, పౌండ్ర, కాళిక, నాగక మొదలైన దివ్యసర్పముల, విషతుండుల, మహా విషనాగుల, విషపుచ్ఛుల, విశ్వచారుల, త్రేళ్ల, సాలెపురుగుల రాక్షస సాలెపురుగుల వలన, బెరడుల, బంక (జిగురుల), ఆకు-ఎలుకల, గృహ గోళికల, గృహ గొధికల (బల్లుల). పురుగుల, ఘ్రుణాసాసుల (గాలిలో విషము విడచు జంతువుల) ఇల్లు-కొండ-గుహ-అగ్ని-పుట్టలో పుట్టిన వాటివలన కలుగు విషభయము మా పట్ల మీ అనుగ్రహము వలన తొలగగలదు.<br>మిమ్ములను స్మరిస్తూ, మేము అమృత - తుల్యులము అగుచున్నాము. |
| **తార్ణానాం, సార్ణానాం,**<br>**కాష్ఠ దారు వృక్ష కోటర లతానాం,**<br>**మూల త్వక్ దారు నిర్యాస పత్ర**<br>**పుష్ప ఫల-ఉద్భూతానాం,**<br>**దుష్ట కీటక కపి శ్వాన**<br>**మార్జాల(ర) జంబుక వ్యాఘ్ర వరాహాణాం,**<br>**జరాయుజ అండజ ఉద్భిజ స్వేదజానాం,**<br>**శస్త్ర బాణ క్షత స్ఫోట**<br>**వ్రణ మహావ్రణ కృతానాం,** | గడ్డిపురుగులవలన, (గొంతెమ మొదలైన) చెట్టు ముళ్ల వలన, కట్టెలవలన, దారువుల(దేవదారు మొదలైన చెట్ల వలన), చెట్టు తొర్రల వలన, లతల వలన, - వాటి యొక్క మొదలు - బెరడు - రసము (జింక) - ఆకు-పుష్ప ఫలముల, కాయలలో పుట్టెడి వాటి వలన, మీ అనుగ్రహముచే **'మాకు విష బాధ కలుగుకుండునుగాక।**<br>విష పురుగులు, కోతులు, కుక్క, పిల్లి, నక్క, పులి, పందుల వలన, విష-హాని బాధలు కలుగకుండుగాక!<br>మావి (గర్భము) నుండి పుట్టే మానవులు, జంతువులు, అండజములు ((గుడ్డు నుండి పుట్టే పక్షులు), నేల నుండి పుట్టే పురుగులు, చెమట నుండి పుట్టే సూక్ష్మక్రిములు మొదలైన జీవుల వలన బాధ మీ దయచే మాకు ఉండకుండు గాక!<br>శస్త్రములచే బాణములచే కలిగే దెబ్బలు, స్ఫోటకము, వ్రణముల - (రాచపుండు వంటి) మహారణములు కలుగజేయు బాధల నుండి విడివడుదుముగాక. |
| **కృత్రిమాణాం అన్యేషాం**<br>**భూత బేతాళ కూశ్మాండ.**<br>**పిశాచ ప్రేత రాక్షస**<br>**యక్ష భయప్రదానాం**<br>**విషతుండ దంష్ట్రాణాం**<br>**విషాంగానాం విషపుచ్ఛానాం**<br>**విషాణాం విషరూపిణీ విషదూషిణీ**<br>**విషశోషిణీ విషనాశినీ విషహారిణీ**<br>**హతం నష్టమ్। విషమ్ అంతః।**<br>**ప్రలీనం విషం। ప్రణష్టం విషం। హతస్తే బ్రహ్మణా।**<br>**విషమ్ ఇంద్రస్య వజ్రేణ స్వాహా॥** | ఇతరులచే హానికలిగించే (పెట్టుడు మందుల) విష ప్రభావముల వలన, భూత, బేతాళ, కూశ్మాండ (కుష్మాండ), పిశాచ, ప్రేత, రాక్షస యక్ష - మొదలైన భయప్రదమైన వాటివలన మీ స్మరణ రక్షణ ప్రసాదించుటకై మిమ్ములను శరణువేడుచున్నాము.<br>విషముతో కూడిన ( పిచ్చికుక్కల వంటి) దంష్ట్రముల (కొరకుట, గోరుట) వలన, కలుగు విషములకు బాధలకు -<br>- విషశోషిని, విషనాశని, విషహారిణి, విషనష్టిని అగు వజ్రము వంటిది ఈ శ్రీ గారుడస్తుతి. శ్రీగరుడ భగవానుని స్మరించినంత మాత్రం చేత దోషములు తొలగ గలవు. విషజంతువులు కూడా హాని చేయు ఉద్దేశ్యము మాపట్ల త్యజించగలవు. |

**య ఇమాం బ్రహ్మ విద్యాం**
**అమావాస్యాం పఠేత్**
**శృణుయాద్వా,**
**యావత్ జీవం**
**న హింసంతి సర్పాః।**

ఈ గారుడోపాసన, బ్రహ్మ విద్యకు సంసిద్ధము చేసి అట్టి ఉపాసకుని బ్రహ్మమును ప్రసాదించగలదు. ఎవ్వరైతే ఈ బ్రహ్మ విద్యను అమావాస్యనాడు పఠించటంగాని, శ్రవణంగాని చేయనారంభిస్తారో, - అట్టివారు జీవించి ఉన్నంతకాలము వారిని సర్పములు మొదలైన విష-హింసక జీవులు హింసించవు.

---

**అష్టౌ బ్రాహ్మణాన్ గ్రాహయిత్వా**
**తృణేన మోచయేత్।**
**శతం బ్రాహ్మణాన్ గ్రాహయిత్వా**
**చక్షుషా మోచయేత్।**
**సహస్రం బ్రాహ్మణాన్ గ్రాహయిత్వా**
**మనసా మోచయేత్।।**

శ్రీ గారుడ వ్రతముగా '8' బ్రాహ్మణులకు తృణపూర్వకంగా (గడ్డిపరకలతో) తాంబూలము, సంభావన ఇచ్చి గౌరవించెదరు గాక!

100 మంది బ్రాహ్మణులను కళ్లతో దర్శించి నమస్కరించెదరుగాక!

'1000' మంది బ్రాహ్మణులను మనస్సుతో తలచుకొని నమస్కరించెదరుగాక!

---

**సర్పాన్ జలే న ముంచంతి।**
**తృణే న ముంచంతి।**
**కాష్ఠాన్ న ముంచంతి।**
**ఇతి ఆహ భగవాన్ బ్రహ్మా।।**

**<u>ఇతి గారుడోపనిషత్ సమాప్తా</u>**

**<u>ఓం శాంతిః శాంతిః శాంతిః</u>**

అట్టివారు సర్ప-జల గండములనుండి విమోచనము పొందగలరు. గడ్డి మొదలైన వాటి నుండి విమోచనులవగలరు. కాష్ఠముల నుండి బాధలు ఉండవు.

ఈ విధముగా **'గారుడోపనిషత్తు'** ను బ్రహ్మదేవుడు సమస్త జీవుల క్షేమము కోరి ప్రసాదించారు.

***ఇతి గారుడోపనిషత్!***

***ఓం శాంతిః శాంతిః శాంతిః***

అధర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 8 గారుడోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



**శ్లో॥ విషం 'బ్రహ్మ' అతిరిక్తంస్యాత్। అమృతం బ్రహ్మసూత్రకమ్।**
**బ్రహ్మ – అతిరిక్త విషహృత్–బ్రహ్మమాత్ర ఖగేదహమ్॥**

*'విషము' అనగా ఏమి? ఈ దృశ్య వ్యవహారమంతా బ్రహ్మమునకు అన్యముగా (వేరుగా) అనిపించటమే విషముతో సమానము. ఈ దృశ్య విశేషములను కూడా బ్రహ్మమునకు వేరుగా చూడటమే - **'మృతము'**. సమస్తము **'బ్రహ్మసూత్రము'**గా దర్శించటమే **'అమృతము'**. అట్టి **'బ్రహ్మమునకు వేరుగా అనిపించటము'** అనే విషమును తొలగించి, **'సమస్తము బ్రహ్మమే'** అను రూపమగు పాత్ర్యాంశమును **అమృతముగా దివ్యలోకముల** నుండి **తెచ్చి ప్రసాదించు** కార్యము నిర్వర్తించు **శ్రీగరుడ జగద్గురు భగవానునికి నమస్కరిస్తున్నాము.***

---

**బ్రహ్మభగవానుడు : 'ఓం'॥** ఓ నారదాది సమస్త మునిజనులారా! సమస్త జీవులారా! ఇప్పుడు 'అనేకము' అనే విషమునకు ఔషధముగా సమస్త విషములను ఖండించు, దూషింపజేయు, నశింపజేయు **"గారుడ బ్రహ్మవిద్య"**ను బోధిస్తున్నాను.**"అన్యము, మృత్యువు"** అనే **విషము**నకు **విరుగుడు** అయినట్టి **"అనన్యము, అమృతము"**లను ప్రసాదించు గారుడ మంత్రరూప **మహాగారుడోపాసన** గురించి వినండి.

⌘

ఈ విధంగా బ్రహ్మవిద్య అగు 'గారుడవిద్య'ను పితామహులగు బ్రహ్మ భగవానుడు బ్రహ్మ మానసపుత్రులగు శ్రీమన్ నారద, సనక, సనందన, సనత్కుమార సనత్సుజాతాది బ్రహ్మ మానసపుత్రులకు, మునులకు, ఋషులకు కూర్చోబెట్టి బోధించారు. అట్టి గారుడోపనిషత్‌ను నారదమహర్షి బృహత్సేనునికి, బృహత్సేనుడు త్రిలోకాధిపతి అగు ఇంద్రదేవునికి, ఇంద్రుడు భరద్వాజమునికి, భరద్వాజుడు తనను (తమ ఇంద్రియ విషయ విషముల నుండి విముక్తి కొరకై) ఆశ్రయించిన జీవత్ కామేభ్యునికి, వారి శిష్యగణమునకు–బోధించటం జరిగింది. ఆ విధంగా ముముక్షువులకు **"శ్రీమహాగరుడ బ్రహ్మవిద్య"**– బ్రహ్మము గురించిన సిద్ధికై సాధనగా – **'పరంపర'** అయి, **తత్త్వ వాఙ్మయ – తత్త్వసాధన** లలో ప్రసిద్ధమైయున్నది.

⌘

<u>**శ్రీ మహాగారుడ బ్రహ్మవిద్య**</u>

అస్యాః శ్రీ మహాగరుడ విద్యాయా...,
'బ్రహ్మ' ఋషిః। గాయత్రీ ఛందః ॥

<u>శ్రీ భగవాన్ గరుడో దేవతా। - "శ్రీ మహాగరుడ ప్రీత్యర్థే" మమ "సకల విష వినాశనార్థే" జపే వినియోగః॥</u>

*('ఇంద్రియ విషయములు' అనే 'అన్యము' రూపమగు 'విషయ విషము' (The Poison of Bondage because of irresistable relatedness with worldly scenary, events, contexts, relationships, expectations etc.,) విరుగుటకై గరుడ మంత్రమును ఆశ్రయిస్తున్నాము. ఋషి 'బ్రహ్మగాను, ఛందస్సు గాయత్రీ గాను, దేవత - భగవంతుడు శ్రీ గరుడ భగవానునిగాను - శ్రీ మహాగరుడుని ప్రీతికొరకై వినియోగిస్తూ ధ్యానము ప్రారంభిస్తున్నాము) :*

| | | | |
|---|---|---|---|
| **ఓం నమో భగవతే।** | **అంగుష్ఠాభ్యాన్నమః।** | **ఓం నమో భగవతే।** | **హృదయాయ నమః** |
| **శ్రీ మహా గరుడాయ** | **తర్జనీభ్యాం స్వాహా।** | **శ్రీ మహా గరుడాయ** | **శిరసే 'స్వాహా'।** |
| **పక్షీంద్రాయ** | **మధ్యమాభ్యాం 'వషట్'** | **పక్షీంద్రాయ** | **శిఖాయ 'వషట్'।** |
| **శ్రీ విష్ణువల్లభాయ** | **అనామికాభ్యాం 'హుం'।** | **శ్రీ విష్ణువల్లభాయ** | **కవచాయ 'హుం'।** |
| **త్రైలోక్య పరిపూజితాయ** | **కనిష్ఠికాభ్యాం 'వౌషట్'।** | **త్రైలోక్య పరిపూజితాయ** | **నేత్రత్రయాయ 'వౌషట్'।** |
| **ఉగ్రభయంకర కాలానల రూపాయ** | **కరతల కర పృష్ఠాభ్యాం 'ఫట్'।** | **ఉగ్రభయంకర కాలానల రూపాయ** | **అస్త్రాయ 'ఫట్'।** |

**<u>భూర్భువస్సువః 'ఓం' ఇతి-దిక్ బంధః। (దిగ్బంధః)</u>**

"భూ భువ సువర్లోకములు ("Matter, Thought, Sense of Self" Zones) - ఈ మూడూ కూడా ఓంకారమగు ఆత్మ విన్యాస ప్రదర్శనమే" అని - మననము చేయుచు, - దిక్కులను బంధించి (Sans Distractions) ఉపాసన ప్రారంభిస్తున్నాము (Commencing the concentration).

**ధ్యానము : శ్లో॥ స్వస్తికో దక్షిణం పాదం। వామపాదం తు కుంచికమ్।**
**ప్రాంజలీకృత దోర్యుగ్మం। గరుడం హరివల్లభమ్॥**

కుడిపాదము 'స్వస్తికము' గాను, ఎడమ పాదము 'కుంచితము'గాను (మడచి) ఉంచి శ్రీహరికి రెండు చేతులతో నమస్కరించుచున్నవారు, ఆ శ్రీహరికి బహు ఇష్టమైనవారు అగు **శ్రీ గరుడ భగవానుని ధ్యానించుచున్నాను.**

- **అనంతో వామ కటకో।** - 'అనంత' మహాసర్పమును తమ ఎడమ చేతికి కంకణము (కడియము)గాను,
- **యజ్ఞసూత్రం తు వాసుకిః।** - 'వాసుకి' మహాసర్పమును యజ్ఞసూత్రముగాను, (జేందెము, యజ్ఞోపవీతముగాను),
- **తక్షకః కటి సూత్రం తు।** - 'తక్షక' మహాసర్పమును మొలత్రాడు (కటిసూత్రము)గాను,
- **హారః కర్కోట ఉచ్యతే।** - 'కర్కోట' మహాసర్పమును హారముగాను,
- **పద్మో దక్షిణ కర్ణేతు।** - 'పద్మ' మహాసర్పమును కుడిచెవి చుట్టుగాను,
- **మహా పద్మస్తు వామకే।** - మహాపద్మమహాసర్పమును ఎడమ చెవి ఆభరణము (లేక చుట్టు) గాను,
- **శంఖః శిరః ప్రదేశేతు।** - 'శంఖు' మహాసర్పమును తలపైన,
- **గుళికస్తు భుజాంతరే।** - 'గుళిక' మహాసర్పమును భుజముల మధ్యగాను,
- **పౌంద్ర కాళిక నాగాభ్యాం చామరాభ్యాం సువీజితమ్।** - 'పౌంద్ర' కాళిక సర్పములను చామరములు వీచువారుగాను,
- **ఏలా పుత్రక నాగాద్యైః సేవ్యమానం ముదాన్వితమ్।** - 'ఏలా పుత్రక' మొదలైన మహానాగులచే సేవించబడువారు,

**బ్రహ్మానందమును ముఖమునందు చిందించువారు (ముదితానందులు)-అగు గరుడ భగవానుని దివ్య సాకారమునకు నమస్కారము.**

---

- **కపిలాక్షమ్।** - గోరోజనము (కపిల) రంగు కళ్ళు కలవారు,
- **గరుత్మంతమ్।** - (గ) సర్వ శ్రేష్ఠమైన, (ఋత్) పరమ సత్యమును స్వానుభవముగా గలవారు,
- **సువర్ణ సదృశ ప్రభమ్** - బంగారు కాంతులతో ప్రకాసించువారు,
- **దీర్ఘ బాహుమ్।** - పొడవైన బాహువులు (రెక్కలు) కలవారు,
- **బృహత్ స్కంధమ్।** - పెద్ద స్కంధములు (మూపులు) కలవారు,
- **నాగాభరణ భూషితమ్।** - నాగాభరణ భూషితులు (పాములను ఆభరణములుగా ధరించినవారు),
- **ఆజానుతః సువర్ణాభమ్।** - బంగారు రంగులో మెరయుచున్న మోకాళ్లు కలవారు,

- **ఆకట్యోః తుహిన ప్రభమ్।** – తెల్లగా మెరయుచున్న మొల కలవారు,
- **కుంకమారుణమ్ ఆకంఠం।** మెరుస్తున్న ఎర్రటి కంఠము కలవారు,
- **శరత్‌చంద్ర నిభాననమ్।** – శరత్‌కాల పూర్ణ చంద్రుని వలె ముఖము కలవారు,
- **నీలాగ్రనాసికా వక్రమ్।** – నీలము రంగుతో ప్రకాశించు ముక్కు చివర వంకరగా కలవారు,
- **సుమహత్ చారుకుండలమ్।** – సుమహత్‌గా (అందముగా) ప్రకాసించు దీర్ఘమైన కుండలములను ధరించినవారు,
- **ద్రంష్ట్రా కరాళ వదనమ్।** – కోరలతో భీకరమైన నోరు కలవారు,
- **కిరీట మకుటోజ్జ్వలమ్।** – కిరీటముతో ప్రకాశమానగుచున్న నుదురు కలవారు,
- **కుంకుమారుణ సర్వాంగమ్।** కుంకుమవలె ఎర్రటి సర్వాంగములు కలవారు,
- **కుందేందు ధవళాననమ్।** – తెల్లటి తామర వంటి ప్రకాశమానమగు ముఖము కలవారు,
- **విష్ణువాహః।** విష్ణు భగవానునికి వాహనమైనవారు,

అగు ఓ గరుడదేవా! గురుదేవా! మీకు నమస్కారము : **విష్ణు వాహన నమస్తుభ్యం। క్షేమం కురు యదా మమ।** స్వామీ! నమస్కారము. నాకు క్షేమమును ప్రసాదించమని ప్రార్థిస్తున్నాను. రక్షించమని వేడుకుంటున్నాను.

❖ ❖ ❖

ఈ విధంగా త్రి సంధ్యలలోను నాగభూషణుడగు గరుడ భగవానుని ధ్యానించువారి పట్ల – తూలా రాసిలో (మంచు దట్టముచే) అగ్నిశిఖలు శమించు తీరుగా– **(ఇంద్రియ విషయములు అనే) విషము యొక్క ప్రభావము శమించగలదు. "దృశ్యము నిజమే"** అనే భవబంధరూప విషానుభవము ఖండనమవగలదు.

> **'ఓం' ఈం। ఓం నమో భగవతే। శ్రీ మహాగరుడాయ। పక్షీంద్రాయ।**
> **విష్ణువల్లభాయ। త్రైలోక్య పరిపూజితాయ। ఉగ్రభయంకర కాలానలరూపాయ।**
> **వజ్ర నఖాయ। వజ్ర తుండాయ। వజ్ర దంతాయ। వజ్ర దంష్ట్రాయ। వజ్రపుచ్ఛాయ। వజ్రపక్షాలంకృత శరీరాయ।**
> **ఓం। ఈం। ఏహ్యేహి। ఓం ఈం ఓం। భగవతే।**

*శ్రీమహాగరుడ స్వామీ! పక్షీంద్రా! విష్ణు వల్లభాయ। స్వర్గమర్త్య పాతాళములలో పూజింపబడువాడా! ఉగ్రభయంకరమైన కాలాగ్ని స్వరూపా! వజ్రము వంటి – గోళ్ళు, తుండము, దంతములు, కోరలు (దంష్ట్రము), నుదురు (పుచ్ఛము), రెక్కలు (పక్షములు) మొదలగు విశేష లక్షణములు గల గరుత్మంతుడా! 'ఓం' కార సంజ్ఞా పరమార్థమగు సర్వాత్మక – పరమాత్మక– స్వస్వరూపాత్మక స్వరూపా! 'ఈ' సమస్తము నీవే అయి ఉన్న 'ఈం' స్వరూపా!*

**ఏహి**= ఇక్కడ మేమున్నచోటికి, మా హృదయములలోకి – **(ఏహి)** = వేంచేయండి!

**ఓం మహాగరుడా** = సర్వజీవులలో సంప్రకాశరూపముగాను, ఆరూఢముగాను, నిశ్చలముగాను, పరాకాష్ఠగాను వేంచేసియున్న 'గరుడుడవు'. (గ – శ్రేష్ఠమగు సత్యస్వరూపుడవు). మహత్ స్వరూపుడవై (ఇంద్రియములు అనుభూతులు, అనుభవములు మొదలైన) సమస్తము నీ మహత్ స్వరూపముగా కలిగియున్నవాడవు. ఓ మహాగరుడా! విష్ణు వాహనా! నమో నమః॥

**అప్రతిహత శాసనాస్మిన్**: ఆత్మస్వరూపుడవై సమస్తమును అప్రతిహతంగా (Unstopably, Irresistably) శాసించువారై, వాటిని మీయందే కలిగి యుండువాడా!

**నః అవిశావిశ :** మాయందు ప్రవేశించండి. మా హృదయమును ఆవేశించి ఉండండి.

**దుష్టానాం విషం దూషయ। దూషయ। :** శ్రీమాన్ గరుడ స్వామీ! మాలోని దుష్ట స్వభావములగు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యవర్గములచే మాలో కలుగుచున్న విష స్వభావములను తొలగించండి। 'దుష్టత్వము' అనే విషమును దూరం చేసివేయండి.

**స్పృష్టానాం విషం నాశయ। నాశయ।** ఓ గరుడాత్మ దేవా! మేము ఈ ఇంద్రియములచే స్పర్శిస్తున్న వస్తు – సంగతి – సందర్భములతో ఏర్పరచుకొంటున్న **దుష్ట సంబంధముల వలన అనేక భేదదృష్టులను, విషభావములను** తెచ్చిపెట్టుకొని, వాటి ఫలితంగా **నికృష్ట దాస్య**

**బంధనములు తెచ్చి**పెట్టుకొంటున్నాము. ఆ విధంగా మాయందు పేరుకొనియున్న విష స్వభావములను, దుష్ట వాసనలను, విష సంస్కారములను-నశింపజేయండి. శారీరక-మానసిక-బుధ్యాత్మక దుష్ట అభ్యాసములను, వ్యసనములను నాశనము చేసివేయండి. రహితము చేయండి.

**దందశూకానాం విషం దారయ। దారయ।** దందశూకముల (రెండు తలల విషపాముల) దందశూకల (రాక్షస స్వభావుల) - (మాలోని స్వభావ)-విషమును చీల్చివేయండి.

**"ద్వంద్వమోహము"** అనే రెండు తలల పాము యొక్క విషమును మా హృదయములనుండి పిండివేయండి.

**ప్రలీనం విషం ప్రణాశయ। ప్రణాశయ।** మాలో జన్మజన్మలుగా జీర్ణించుకొని, మనోబుద్ధి చిత్త అహంకారములలో పేరుకొనియున్న దుష్టరూపములగు దోష సమన్వయరూప విషమును (Poisonous interpretation) మొదలంట్లా నశింపజేయండి.

**సర్వ విషం నాశయ। నాశయ।** మాలోని సమస్త విషబుద్ధి - భావన - యోచనలను నశింపజేయండి. మాలోని - మమ్ము స్పృశించే విషమును **హన** - హరించివేయండి. (హననము చేయండి, చంపివేయండి). **దహ**-దహించివేయండి. **పచ** - మూర్ఖ ఘనీభూత అల్ప, విష భావనలన్నీ పచనము చేసివేండి. వండి వేయించివేయండి.

**భస్మీకురు :** మాలోని నీచ - ద్వేష - పాప వ్యసన దృష్టి - సంకల్పములను భస్మీభూతము చేయండి. కాల్చి, భస్మము చేసివేయండి.

-----

హే ప్రభూ! చంద్రమండలము వలె జీవులకు ఓషధి-ఆహారములను ఇచ్చి సమస్తము ప్రశాంతపరచువాడా! సూర్యమండలము వలె స్వయం ప్రకాశ - సమస్త ప్రకాశక స్వరూపా! అజ్ఞానాంధకారము వలన ఏర్పడిన విష స్వభావమును ఖండించివేయు ముష్టికము (కత్తిపిడి) వంటివారా! ఈ సమస్త పృథివి మీ యొక్క అంగముగా కలిగియున్నట్టి ముద్రాంగా! శ్రీ మహా గరుడ భగవాన్

**విషం హర** - మాలో ఏర్పడి ఉండి మమ్ములను గాయపరుస్తున్న ఆధిభౌతిక-ఆధిదైవిక-ఆధ్యాత్మిక విషమును హరించివేయండి.

**హుం ఫట్ స్వాహా!** మీ యొక్క "హుం"కార శబ్దోచ్చారణతో విషమును "ఫట్" శబ్దోచ్చారణతో దులిపి వేయుచూ, - మాలో దైవీ సంపత్తిని ప్రేరేపించండి.

**ఓం క్షిప స్వాహా।** మేము ఆత్మభావము నుండి అనుక్షణము విక్షేపణము (ఎగురవేయటము) పొందుచున్నాము. మాలో దైవీగుణములను ప్రేరేపించి సువర్లోక మార్గము చూపండి. **స్వాహా।** మా మనస్తత్వమును దివ్యలోకములకు జేర్చండి. (క్షిప = ప్రేరేపించటము. ఎగురవేయటము)

**ఓం ఈం।** 'ఓం' కార పరమాత్మ స్వరూపుడగు శ్రీమన్ గరుడ భగవానుడే **ఈ** సమస్తముగా ప్రకాశమానుడగుచున్నారు.

**స చరతి। స చరతి :** ఈ సర్వముగా చరిస్తున్నది ఆ శ్రీ గరుడాత్మ భగవానుడే।

**తత్కారీ :** శ్రీ గరుడ గురుదేవ భగవానుడు మమ్ములను 'తత్త్వమ్' వాక్యార్థముచే అమృతాత్మానంద స్వరూపులుగా, తత్ స్వరూపులుగా తీర్చిదిద్దుదురు గాక। "త్వమ్-నీవు" - నందు "తత్ (ఆత్మ)" దృష్టిని నిదురలేపెదరు గాక। **'పర' సుఖము ప్రసాదించెదరుగాక।**

**మత్కారీ :** నాకు సమస్తము ప్రసాదించువారు. సమస్త జీవులలో "మత్-నేను" స్వరూపులై ఉన్నవారు. మాలోని 'నేను'ను సమస్త జీవులలోని **"మహత్ నేను"**గా తీర్చిదిద్దెదరు గాక! **ఇహ సుఖ-సంపదలను కూడా అనుగ్రహించెదరుగాక।**

(మతకము = మాయ. మాయాలీలా రూపధారులు. మా కొరకై ఈ సమస్తము ప్రసాదించుస్వామీ మీరే!)

**"విషమునకే విషము"** అయిన అమృత రూపధారులు। విషమునకు దూషిక (కుంచె) వంటివారు. విషమును శోషింపజేయువారు. విషమును హరించువారు।

ఓ గరుడ దేవా! మీ స్మరణచే విషము హతమగుచున్నది. విషము వినష్టమగుచున్నది. విషము **అంతమై ప్రలీనము** (విశేషముగా కరిగిపోవటము) జరుగుచున్నది. విషము **ప్రణష్టమగుచున్నది.** మీ స్మరణచే సృష్టికర్తయగు బ్రహ్మదేవునిచే లీలగా కల్పితమగు విషయ పరంపరలు విషరూపముగా అవటమనేది తొలగించబడగలదు. మీ గురించిన భావనచే అమృతము (జన్మరాహిత్యము) లభించగలదు. ఇంద్రుని వజ్రము మాకు తోడై సమస్తము మా పట్ల "స్వాహా"। (సువర్లోకస్థానము, దివ్యత్వము సంతరించుకోగలదు)।

**ఓం నమో భగవతే। మహాగరుడాయ। విష్ణువాహనాయ। త్రైలోక్యపరిపూజితాయ। వజ్రనఖ వజ్రతుండాయ। వజ్ర పక్షాలంకృత శరీరాయ। ఏ హ్యేహి। మహా గరుడ। విషం ఛింధి। ఛింధి। ఆవేశయ। ఆవేశయ। 'హుం' 'ఫట్' 'స్వాహా'।**

*భగవానుడు, మహాగరుడుడు, స్వయముగా విష్ణు భగవానుని వాహనము, త్రిలోకములచే విశేషముగా పూజించబడువారు, వజ్రము వంటి గోళ్లు (నఖములు), తుండము గలవారు, వజ్రపు రెక్కలతో అలంకృతమైన శరీరము కలవారు-అగు శ్రీ గరుడస్వామి మేమున్నచోటికి వేంచేసెదరు గాక! వారి రాకతో విషము ఛింధము (ముక్కలు) కాగలదు. స్వామీ। మా దృశ్య-దేహ-మనో-బుద్ధి-చిత్త-అహంకారములలో ఆత్మానంద స్వరూపులై ఆవేశించండి. 'హుమ్' "ఫట్" దివ్యధ్వనుతో మాకు సువర్లోకము ప్రసాదించెదరు గాక. విష్ణువాహనులగు మీరు – మా వద్దకు **"విష్ణుతత్త్వము"** అనే అమృతమును తెచ్చి మాకు అందించండి.*

(**విష్ణు తత్త్వము** = All - Present and Alpervading Self of "My Self")

**సుపర్ణో౽సి గరుత్మాన్।** ఓ గరుత్మంతుడా। మీరు సుపర్ణులు. గొప్పరెక్కలు కలవారు. కనుక విష్ణు తత్త్వానుభవమును తెచ్చిపెట్టగల సమర్థులు.

**త్రివృత్తము** (Tri-Circular) **అగు మీ శిరస్సు** – గాయత్రము। (గాయత్రీ స్వరూపము)।

**మీ చక్షువులు** – సోమము చంద్రరూపము. (చల్లటి చూపులు కలవారు)।

**ఆత్మయే** – సామవేదము (The song of Athman).

**మీ శరీరము** – వామదేవము (సమస్తమగు 'ఇహ' స్వరూపము)।

**రెక్కలు** – బృహత్ రథంతరము (ఈ బృహత్ సృష్టి చక్ర స్వరూపములు) (The main wheels of this entire creation).

**మీ పుచ్ఛము (తల పుఱ్ఱె/నుదురు)** – యజ్ఞా – యజ్ఞీకములు (The Totality - work of the universe).

**మీ అంగములు** – ఛందస్సులు (Disciplines).

**ధిష్ణియాః శఫాః యజూంషి నామ** – యజుర్వేదము మీరు అంకుశముతో సహా వేంచేసియున్న గృహము.

ఓ గరుడ దేవాదిదేవా! గొప్ప అందమైన రెక్కలతో సపర్ణులై మీరు (భూలోకమునుండి) భువర్-సువర్లోకము వరకు యథేచ్ఛగా సంచరించగలుగువారు. అమావాస్య – పౌర్ణమిలను దాటించి, సమస్తమునకు మునుముందే ఏర్పడియున్న "ఓం ఈం" అను అక్షర సంజ్ఞయగు బ్రహ్మవిద్యనుప్రసాదించ సమర్థులు. కనుక మాకు **'బ్రహ్మవిద్య'ను ప్రసాదించి అనుగ్రహించండి.**

**తత్కారీ :** 'తత్' కార స్వరూపులు. తత్ స్వరూపమును ప్రసాదించువారు.

**మత్కారీ :** సమస్త జీవులలో 'నేను'గా వేంచేసి ఉన్నవారు. "నేను-నాది"ల ఏకస్వరూపులు.

ఆ గరుడ పరమాత్ముడే సమస్తమునందు సంచరిస్తూ, సమస్తము నిర్వర్తిస్తూ ఉన్నారు. ఇదంతా నిర్వర్తిస్తున్న ఆ స్వామి నాకు బ్రహ్మ జ్ఞానము కలుగజేయుదురుగాక! ఆయన విషనాశి। విషదూషిణి। విషహారిణి। ఆస్వామిని ఒక్క క్షణం స్మరించినంతమాత్రం చేత విషము హతమగుచున్నది.

ఇంద్రుని వజ్రము వంటి శ్రీమన్ గరుడ భగవానుని స్మరణము – విషనాగుల విషము కూడా హతము చేసి వేయుచున్నది.

ఆయన **'బ్రాహ్మీదృష్టి'** అనే 'అమృతము'ను (మృతస్థితికి అతీతత్వమును) ఆశ్రితులమగు మనకు తెచ్చిపెట్టుటలో సిద్ధహస్తులు.

ఆ గరుడభగవానుడు – అమృతమును మనకు తెచ్చిపెట్టుటలో ఇంద్రవజ్రముగాని, గొప్ప సర్పజాలములుగాని నిరోధములు కలిగించజాలవు. విష్ణు వాహనాయ! శ్రీమన్ గరుడభగవాన్। శరణు। శరణు।

మమ్ములను 'మృతము' అనే జనన మరణ చక్రము నుండి తప్పించుటకై సువర్లోకము నుండి అమృతము తెచ్చిఇచ్చుటలో పరమాద్భుత శక్తి సంపన్నులగు ఆస్వామిని నిరోధించగల శక్తి ఏదీ లేదు. **అట్టి గరుడునికి భక్తి-ప్రపత్తులు సమర్పిస్తున్నాము.**

**యది అనంతక దూతోఽసి**
**యది వా అనంతకః స్వయమ్, –** *అది అనంతక మహాసర్పముయొక్క 'దూత' అయినా (లేక) స్వయముగా అనంతక మహాసర్పమైనాకూడా,*
**యది వాసుకి దూతోఽసి,**
**యది వా వాసుకిః స్వయమ్, –** *వాసుకి మహాసర్పముయొక్క 'దూత' అయినా, (లేక) స్వయముగా వాసుకి అయినా కూడా,*
**యది తక్షక దూతోఽసి,**
**యది వా తక్షకః స్వయమ్, –** *తక్షక మహాసర్ప 'దూత' అయినా, (లేక) స్వయముగా తక్షకమహా సర్పమయినా,*
**యది కర్కోటక దూతోఽసి,**
**యది వా కర్కోటకః స్వయమ్ –** *కర్కోటక మహాసర్ప 'దూత' అయినా, (లేక) స్వయముగా కర్కోటక మహాసర్పమైనా..,*
**యది పద్మక దూతోఽసి,**
**యది వా పద్మకః స్వయమ్, –** *అది పద్మక మహాసర్పమునకు చెందిన 'దూత' అయినా, (లేక) స్వయముగా పద్మక మహాసర్పమే అయినా కూడా,*
**యది మహాపద్మక దూతోఽసి,**
**యది వా మహాపద్మకః స్వయమ్ –***అది మహా పద్మకసర్ప దూతఅయినా, (లేక) స్వయముగా మహా పద్మకసర్పమైనా,*
**యది శంఖక దూతోఽసి,**
**యది వా శంఖకః స్వయమ్, –** *అది శంఖక సర్పదూత అయినా, (లేక) స్వయముగా శంఖక మహాసర్పమైనా,*
**యది గుళిక దూతోఽసి,**
**యది వా గుళికః స్వయమ్, –** *అది గుళిక సర్పదూత అయినా, (లేక) స్వయముగా గుళిక మహాసర్పమే అయినా కూడా..,*
**యది పౌండ్ర కాళిక దూతోఽసి,**
**యది వా పౌండ్ర కాళికః స్వయమ్,–***అది పౌండ్రకాళిక సర్పదూత అయినా (లేక) స్వయముగా పౌండ్రకాళికా మహాసర్పమైనా కూడా,*
**యది నాగక దూతోఽసి**
**యది వా నాగకః స్వయమ్...,** *అది నాగక దూత అయినా, (లేక) స్వయముగా నాగకమహాసర్పమైనా కూడా...,*
**అట్లాగే.., అది :–**

సాలె పురుగు విషమైనా, రాక్షస సాలెపురుగు విషమైనా, తేలు విషమైనా, స్థావర–జంగముల సంబంధమైన ఏ విషమైనా కూడా – మహాగరుడ మంత్ర స్మరణచే గరుడ భగవానునికి భక్తితో నమస్కరించుటచే – **అమృతత్వము పొందుటలో మమ్ము నిరోధించలేవు.**

**అట్టి విషము :**

**తత్కారీ, మత్కారీ, విషనాశనీ విషదూషినీ విషహారిణీ హతం।** 'తత్' కారకుడు, 'మత్' కారకుడు విషము నశింపజేయువాడు, విషమును హరించువాడు అగు గరుడ భగవానుని స్మరణచే హతమయిపోగలదు.

**ఇంద్రస్య వజ్రేణ విషం హతమ్।** తన మాతృదేవత అగు వినతయొక్క దాస్యమును తొలగించటానికి అమృతమును దివ్యలోకము నుండి తెస్తున్నప్పుడు ఇంద్ర వజ్రమును కూడా జయించివేసినట్టి గరుడ దేవునిచే (విషయ రూప) విషము హతమవగలదు.

**తే బ్రహ్మణా విషమింద్రస్య వజ్రేన స్వాహా।** బ్రహ్మదేవుని చేతను, ఇంద్ర వజ్రముచేతను, ఆ విషము తొలగించబడి, గరుడ భగవానునిచే అమృతమగు సువర్లోకము ప్రసాదించబడగలదు.

అనంత, వాసుకి, తక్షక, కర్కోటక, పద్మక, మహాపద్మక, శంఖగుళిక, పౌండ్ర కాళిక, నాగక, మొదలైన దివ్యనాగుల వలన, మహానాగుల, విషతుండుల, విషనాగుల, విషదంష్ట్రుల, విషాంగుల, విషపుచ్ఛుల, విశ్వచారుల, తేలుల, సాలెపురుగుల, రాక్షస సాలె పురుగుల, ఎముకల, బల్లుల, చిన్నపురుగుల, విషవాయువుల వలన గాని, ఇల్లు – కొండ– పుట్ట గుహ–అగ్ని మొదలైన వాటిలో నివసించే విష జీవుల వలనగాని; కట్టె–గడ్డి–చెట్టు, – చెట్టుతొర్రలలో ఉండే విష పురుగుల వలన గాని, చెట్టు మొదలు – బెరడు, బంక (జిగురు), ఆకు – పువ్వు–కాయ–పండులలో పుట్టుచున్న విష–చెడు పురుగుల విషము వలనగాని, కోతి – కుక్క – పిల్లి – నక్క – పెద్దపులి –

అడవి పంది మొదలైన క్రూరజంతువుల విషము నుండి గాని కలుగు **ఆపదలను, విషమును విరుగుడు చేయగలుగునది – శ్రీ భగవాన్ గరుడోపాసనామంత్రము.**

ఉద్భిజముల నుండి – (నేల నుండి పుట్టే వృక్షజాలము మొ॥ వాటి నుండి),
జరాయుజముల నుండి – ('మావి' నుండి పుట్టే మానవులు, జంతువులు మొ॥వాటి నుండి),
అండజముల నుండి – (గ్రుడ్డు నుండి పుట్టే పక్షులు మొదలైనవాటి నుండి),
స్వేదజములు – (చెమట నుండి పుట్టే సూక్ష్మజీవుల నుండి) –

ఏర్పడే విషము – ప్రమాదముల నుండి గరుడ భగవానుడు కాపాడుదురుగాక! స్వామీ! గరుడదేవా! గొప్ప రెక్కలుగల మీరే కాపాడగలరు! మమ్మ్మలను 'విషము' నుండి 'అమృతము'నకు జేర్చండి. మా పట్ల మృత్యువును అమృతముగా తీర్చిదిద్దండి.

⌘ బాణము మొదలైన ఆయుధముల దెబ్బల నుండి,

⌘ స్ఫోటకము – వ్రణము (పుండు) – మహావ్రణము (రాచపుండు) వలన కలిగే బాధల నుండి,

⌘ పెట్టుడు – మందుల విషము నుండి,

⌘ భూత–బేతాల–కూష్మాండ పిశాచ–ప్రేత–రాక్షస–యక్ష మొదలైన భయంకారాకారుల వలన వచ్చిపడే భయ–బాధల నుండి,

⌘ విషతుండముల కాటుల నుండి, విషాంగుల నుండి, విష పుచ్ఛల నుండి–మీ గరుడమంత్రము కాపాడగలదు.

స్వామీ! మీరు విషములకే విషము। విషమును దూరము చేయువారు। శరీరములో ప్రవేశించిన విషమును శోషింపజేయువారు. నశింపజేయువారు। హరింపజేయువారు। విషమును వినష్టముచేయుటలో విషము పట్ల వజ్ర ఘాతము వంటివారు.

గరుడ భగవానుని తలచినంతమాత్రముచేతనే – శరీరములోని, అంతరంగ చతుష్టయము, బాహ్యములోని విషము, విషభావములు, విషము వలన ప్రమాదములు సమసిపోగలవు. అవి ఇంక హాని కలిగించలేవు.

**గరుడమంత్రము జన్మజరా మరణ రహితమగు అమృత ప్రదాత।**

⌘⌘⌘

ఎవరైతే ఈ ఉపనిషత్‌లోని – **"విషమునకు వ్యతిరేకమైనట్టి 'అమృతము' (జన్మరాహిత్యము, మోక్షరహస్యము)"** ను తెలుసుకుంటారో,..., వారు సర్వత్రా సిద్ధి పొందగలరు.

ఈ జీవులు శారీరక–మానసిక–బుద్ధి చాంచల్య బాధలు పొందుచున్నప్పుడు, అట్టివారు అమావాస్యనాడు ప్రారంభించి ఈ ఉపనిషత్ పఠిస్తే, అధ్యయనము చేస్తూ ఉంటే..., అట్టివానిని – ఆతడు జీవించి ఉన్నవాళ్లు సర్పములు హింసించవు. **దైనందికంగా పఠిస్తూ ఉంటే, వర్ణనాతీతములగు శుభములు చేకూరగలవు.**

**మహాగారుడమంత్రోపాసకులకు వ్రతమునకు సంబంధించిన కొన్ని విధులు**

| | |
|---|---|
| **అష్టౌ బ్రాహ్మణాన్ గ్రాహయిత్వా తృణేన మోచయేత్।** | *'8' మంది బ్రాహ్మణులను స్పృశించి తృణములను, ప్రపత్తులను సమర్పించాలి. (తాంబూల దానము చేయాలి)* |
| **శతం బ్రాహ్మణాన్ గ్రాహయిత్వా చక్షుషా మోచయేత్।** | *'100' మంది బ్రాహ్మణులను స్పృశించి కళ్లతో నమస్కరించాలి.* |
| **సహస్రం బ్రాహ్మణాన్ గ్రాహయిత్వా మనసా మోచయేత్।** | *'1000' మంది బ్రాహ్మణులను మనస్సుతో తలచుకొని ఉపాసించాలి.* |

జలము నుండి, గడ్డి నుండి, కట్టె నుండి, కర్రపుల్ల నుండి అట్టివాడు గండములు పొందక విముచ్యుడౌతాడు. సంసార విషము అవిషమై, ***ఆతని పట్ల అమృతత్వము సుప్రకాశమవగలదు.***

ఈ విధంగా భగవంతుడగు బ్రహ్మదేవుడు **"బ్రహ్మసూత్రగారుత్మంతము"** – నారదాది మహర్షులకు, తదితర బ్రహ్మమానసపుత్రులకు, మునులకు, ఆశ్రితులగు భక్తజనులకు బోధించటము జరిగింది.

*ఇతి గారుడోపనిషత్*
*ఓం శాంతిః శాంతిః శాంతిః*

అథర్వణ వేదాంతర్గత

# 9 దత్తాత్రేయోపనిషత్

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ దత్తాత్రేయ బ్రహ్మవిద్యా
సంవేద్య ఆనందవిగ్రహమ్।
త్రిపాద్ నారాయణాకారం
'దత్తాత్రేయమ్' ఉపాస్మహే॥



బ్రహ్మవిద్యా పారాయణులు, ఆనంద విగ్రహులు, త్రిపాద శ్రీమన్నారాయణాకారులు అగు **శ్రీ దత్తాత్రేయ జగద్గురువును, దత్తాత్రేయ ప్రవచిత బ్రహ్మవిద్యను** మనోవాక్కాయాత్మకంగా ఉపాసించుచున్నాము.

### ప్రథమ ఖండః - తారకమ్

ఓం।

1. ఓం। సత్యక్షేత్రే, బ్రహ్మా నారాయణం:-
"మహాసామ్రాజ్యం
కిం తారకం?
తన్నో (తత్-నో) - బ్రూహి।"
ఇతి ఉవాచ।

ఒక సందర్భములో సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు సత్యక్షేత్రమునకు వేంచేసిన శ్రీమన్నారాయణుని సమీపించి, ప్రణిపాతులై, - ఆ తరువాత ఈ విధంగా అడుగసాగారు.

స్వామీ! శ్రీమన్నారాయణా! సర్వత్రా వేంచేసియున్న విష్ణు భగవన్! ఆత్మ సామ్రాజ్యమును సిద్ధించుకోవటానికై సమస్త జీవులకు 'తారకము' ఏదై ఉన్నది? స్వామీ! అట్టి తారకము ఏమిటో దయతో అనుగ్రహించండి.

(తారకము = తరింపజేయునది. తెప్ప. కష్టకాలములో తోడగునది)

---

భగవాన్ ఇత్యుక్తః :-
సత్యానంద చిదాత్మకం, సాత్త్వికం,
మామకమ్ ధామ ఉపాస్వ।

**శ్రీమన్నారాయణ భగవానుడు** : ఓ బ్రహ్మదేవా! కేవలమగు సత్ (ఉనికి) - చిత్ (ఎరుక) - ఆనంద (అనభూతి / భావన) = ఆత్మకమైనట్టిది, పరమ సాత్త్వికమైనది-అయినట్టి నాయొక్క **"ధామము** (State)" ఏదైతే ఉన్నదో - అదియే ఆత్మ సామ్రాజ్య సిద్ధికై ఉపాసించవలసినట్టిది.

---

- ఇతి ఆహ,
"సదా దత్తోఽ హమస్మి।"
ఇతి ప్రత్యేతత్ సంవదంతి యే,
న తే సంసారిణో భవంతి।

ఇంకా వినండి. ఎవరైతే "నేను సదా దత్తుడను" అని స్వస్వరూపతత్త్వమును ఎరిగినవారై ప్రియముగా సునిర్ణయులై పలుకుతారో వారు ఇక 'సంసారులు'। అయే ప్రసక్తియే ఉండదు.

(దత్తమ్ = "ఇదంతా నాచేతనే కల్పనా మాత్రము" అను స్వస్వరూపాత్మ గురించి 'ఎరుక') - **"దత్ తమ్"**

---

నారాయణేన ఏవం వివక్షితో, బ్రహ్మా
"విశ్వరూపధరం, విష్ణుం,
నారాయణం, దత్తాత్రేయం"
ధ్యాత్వా సద్వదతి॥

ఈ విధంగా శ్రీమన్నారాయణునిచే బోధించబడినవారై బ్రహ్మదేవుడు : "ఈ సమస్త విశ్వమును **తన రూపముగా ధరించినవాడు,** సర్వత్రా సర్వదా విస్తరించి సమస్తము తానే అయి వేంచేసి ఉండటంచేత ఈయన **"విష్ణువు".** అన్ని తరంగములు సర్వదా జలమే అయి ఉన్న తీరుగా సమస్త జీవులు వాస్తవ స్వరూపము తానే అయి ఉండటం చేత ఈయనయే **"నారాయణుడు"** - అని స్మరించసాగారు.

మనన-నిదిధ్యాసలకొరకై సర్వాత్మకుడగు శ్రీ దత్తాత్రేయులవారిని ధ్యానించుచూ ఇట్లా పలుకసాగారు.

'దమ్' - ఇతి హంసః।

'దామ్' - ఇతి దీర్ఘమ్।

తత్ - బీజమ్।

'నామ' - బీజస్థం।

"దామ్" - ఇతి ఏకాక్షరం భవతి।

'తత్' - ఏతత్ తారకం భవతి।

'తత్' - ఏవ (తదేవ) ఉపాసితవ్యమ్।

- విజ్ఞేయమ్।

- 'గర్భ' - ఆది తారణమ్।

గాయత్రీ ఛందః।

సదాశివ ఋషిః।

దత్తాత్రేయో దేవతా।

**"దత్తాత్రేయ అష్టాక్షరీ" (8)**

| **ద+తత్ + తరేయో = దత్తాత్రేయో।** |
|---|
| **దత్ + తత్ + త్రయో = దత్తాత్రేయో।** |

"దమ్" - ఇది "హంస" (జీవాత్మ)।

"దామ్" - ఇది "దీర్ఘము"।

"తత్" - ఇది "బీజము"।

నామ - బీజముగా ఉన్నది "బీజస్థము"।

"దామ్" - ఇది "ఏకాక్షరము"।

ఏకము = అనేకము కానిది. అక్షరము = క్షరములేనిది అగు 'ఆత్మ'కు సంజ్ఞ (Indication). **తారేయో** = తరింపజేయునది. కేవలము. సర్వాత్మకత్వము - అయి ఉన్నట్టిది.

| ఈ జీవుని సర్వాత్మకత్వ స్వరూపమే 'తత్' "సర్వభూతస్థం ఆత్మానమ్। సర్వాభూతానిచ ఆత్మని - అందరిలోని నేనైన 'నేను'। అందరు నాలో ఉన్న నేనైన నేను - అనునదే తత్"। |
|---|

అట్టి "తత్"యే ఉపాసించవలసినట్టిది. అట్టి సర్వాత్మక భావనయే తెలుసుకోవలసినట్టిది. అది **జన్మకర్మల చక్రభ్రమణమునుండి తరింపజేయునది.**

**"ఓం దత్తాత్రేయాయ నమః"**

ఛందస్సు - "గాయత్రీ"

ఋషి - "సదాశివ"

దేవత - "దత్తాత్రేయస్వామి"

| **"ఓం దం దత్తాత్రేయాయ నమః"** **(అష్టాక్షరీ)** |
|---|

---

**2.** "వట బీజస్థమ్" - ఇవ

దత్త బీజస్థం సర్వం జగత్।

ఏతదేవ 'ఏకాక్షరం'

వ్యాఖ్యాతమ్।

('దామ్' వ్యాఖ్యాతమ్।)

వ్యాఖ్యాన్యే 'షట్(6)-అక్షరమ్। (బీజాక్షరములు)

'ఓం' ఇతి ప్రథమం। 'శ్రీం' ఇతి ద్వితీయం।

'హ్రాం' ఇతి తృతీయం। 'క్లీం' ఇతి చతుర్థం।

'గ్లౌం' ఇతి పంచమం। 'ద్రాం' ఇతి షష్ఠమ్।

షడక్షరో అయం భవతి॥

| ఓం శ్రీం హ్రాం క్లీం గ్లౌం ద్రాం |
|---|

"షడక్షరీబీజ"

(షట్ బీజ అక్షర సంపుటము)

ఒక మర్రి విత్తనములో మహావృక్షము యొక్క వ్రేళ్ళు, కాండము, కొమ్మలు, రెమ్మలు, ఆకులు, కాయలు, పునఃబీజము ఉన్న తీరుగా, - ఈ దృశ్యమానమగుచున్న సమస్త విశ్వము "దత్త" (According, Giving) అను బీజముయొక్క అంతర్గతమై (దాగినదై) ఉన్నది.

దత్తాత్రేయ షడక్షరీ బీజ

అట్టి 'దత్త' అను శబ్దము ఏకము, అక్షరముఅగు ఆత్మతత్త్వము గురించిన వ్యాఖ్యానము. "దాం" అను అక్షరము గురించి వ్యాఖ్యానించుకుంటున్నాము. (దాం = One who giving all this : ఇచ్చువాడు)

అట్టి 'దత్త' శబ్ద వ్యాఖ్యానమునకు (ఏకమే అయి ఉన్న దానికి) 'అ' బీజాక్షరముల సమన్వితము. ('అ'కారంహి శివాత్ కేవలమ్)

(1) ఓం
(2) శ్రీం
(3) హ్రాం — ఇది ఏకాక్షర, షట్ బీజాక్షర, 'దత్త' శబ్దానుసరణము.
(4) క్లీం
(5) గ్లౌం
(6) ద్రాం

| **"ఓం శ్రీం హ్రాం క్లీం గ్లౌం ద్రాం"** **(షడక్షరీ బీజమంత్రము)** |
|---|

(అక్షరమగు ఆరు బీజములు)

సర్వ సంపత్ వృద్ధికరో భవతి।
యోగానుభవో భవతి॥
(యోగ-అనుభవో భవతి)॥

| ఓం శ్రీం హ్రాం క్లీం గ్లౌం ద్రాం | 6 |
|---|---|
| దత్తాత్రేయాయ నమః | 6 |

ఈ షడక్షరీ (6) బీజ మంత్రముయొక్క అర్థపూర్వకమైన ఉపాసనచే సర్వసంపదలు (భక్తి, జ్ఞాన, వైరాగ్యములు) వృద్ధి చెందగలవు. సర్వాంతర్యామి అగు పరమాత్మతో యోగానుభవము (మమేకత్వము) సిద్ధించగలదు.

---

గాయత్రీ ఛ్ఛందః।
సదాశివ ఋషిః।
దత్తాత్రేయో దేవతా।
ద్రమ్ - ఇత్యుక్త్వా,
'ద్రామ్' - ఇత్యుక్త్వా వా
<u>"దత్తాత్రేయాయ నమః।" (7)</u>
<u>(ద్రం / ద్రాం దత్తాత్రేయాయ నమః)</u>
ఇతి అష్టాక్షరః।

## అష్టాక్షరీ దత్తాత్రేయ మంత్రము

"గాయత్రీ" - ఛందస్సు।
"సదాశివ" - ఋషి
"దత్తాత్రేయ" - దేవత।
"<u>ద్రం</u> - దత్తా త్రేయాయ నమః" అనికాని
"<u>ద్రాం</u>-(ద్రం+అ) = దత్తాత్రేయాయ నమః"-అని గాని ఉపాసించబడుగాక।

| ద్రం/ద్రాం దత్తాత్రేయాయ నమః |
|---|

ఇది "అష్టాక్షరీమంత్రము" అవుతుంది.

---

దత్తాత్రేయాయేతి।
"సత్యానంద చిదాత్మకం నమ" - ఇతి।
పూర్ణనందైక విగ్రహమ్।

## దశ-ఏకాదశాక్షరీ-దత్త

"దత్తాత్రేయాయ" - ఇది సత్ ఆనంద చిదాత్మకమగు పూర్ణానంద విగ్రహుడగు సత్య - ఆనంద - చిదాత్మకమునకు నమస్కరించటము.

**సత్యానంద చిదాత్మకం నమః (8+2 = 10)**
**ఓం సత్యానంద చిదాత్మకం నమః (1+8 +2 = 11)**

---

<u>గాయత్రీ</u> - ఛ్ఛందః।
<u>సదాశివ</u> - ఋషిః।
'దత్తాత్రేయ' - దేవతా।
దత్తాత్రేయా - ఇతి కీలకం।
'తత్' ఏవ (తదేవ) - బీజం।
నమః శక్తిః - భవతి॥

## "దత్తాత్రేయ నవాక్షరమ్"

"గాయత్రీ" - ఛందస్సు।
"సదాశివ" - ఋషి
"దత్తాత్రేయ" - దేవతా।
దత్తాత్రేయ - కీలకమ్।
'తత్' ఏవ - బీజమ్।
'నమః' - శక్తి
**'ఓం దత్తాత్రేయాయ నమః॥ (8)**
**ఓం శ్రీదత్తాత్రేయాయ నమః॥ (9) - మంత్రము**

---

'<u>ఓం</u>' ఇతి ప్రథమం। '<u>ఆం</u>' ఇతి ద్వితీయం।
'<u>హ్రీం</u>' ఇతి తృతీయం। '<u>క్రోం</u>' ఇతి చతుర్థం।
'ఏహి' ఇతి తదైవ వదేత్ -
దత్తాత్రేయేతి। స్వాహేతి।
మంత్ర రాజోఽయం
<u>"ద్వాదశాక్షరః"</u>॥

| (ఓం) "ఆం హ్రీం క్రోం ఏహి | - (5) |
|---|---|
| దత్తాత్రేయేతి స్వాహా" | - (7) |

మంత్రరాజోఽయం।
"ద్వాదశాక్షరః (12)।"

## దత్తాత్రేయ ద్వాదశాక్షరమ్

**"ఓం ఆం హ్రీం క్రోం**
**"దత్తాత్రేయేతి" స్వాహేతి**

| | |
|---|---|
| ఓం | మొదటిది |
| ఆం | రెండవది |
| హ్రీం | మూడవది |
| క్రోం | నాలుగవది |

| | |
|---|---|
| <u>(ఓం) ఆం హ్రీం క్రోం</u> | <u>3</u> |
| <u>ఏహి</u> | <u>2</u> |
| <u>దత్తాత్రేయేతి</u> | <u>5</u> |
| <u>స్వాహా</u> | <u>2</u> |
| | <u>12</u> |

**(ఓం) ఆం హ్రీం క్రోం**
**ఏహి దత్తాత్రేయాయ స్వాహా (12)**
**- ఇది ద్వాదశాక్షరమంత్రరాజము.**

జగతీ – ఛందః।
సదాశివ – ఋషిః।
దత్తాత్రేయో – దేవతా।
“ఓం” ఇతి బీజం।
‘స్వాహా” – ఇతి శక్తిః।
“సంబుద్ధిః” – ఇతి కీలకమ్।
“ద్రమ్” – ఇతి హృదయే।
“హ్రీం క్లీం” – ఇతి శీర్షే
“ఏహి”–ఇతి – శిఖాయాం।
దత్త – ఇతి కవచే।
ఆత్రేయ – ఇతి చక్షుషి।
స్వాహా – ఇతి అస్త్రే।

తన్మయో భవతి, య ఏవం వేద।

**దత్తాత్రేయ షోడశాక్షరీ మంత్రము**
**ఓం సంబుద్ధిః ద్రమ్ హ్రీం క్లీం**
**ఏహి దత్తాత్రేయాయ స్వాహా।**

‘జగతీ’ - ఛందస్సు।
‘సదాశివ’ - ఋషి
‘దత్తాత్రేయ’ - దేవత।
‘ఓం’ - బీజము।
‘స్వాహా’ - శక్తి।
‘సంబుద్ధిః’ - కీలకమ్।
‘ద్రమ్’ - హృదయే।
‘హ్రీం క్లీం’ - శీర్షము।
‘ఏహి’ - ఇతి శిఖాయు।
‘దత్త’ - కవచము।
ఆత్రేయ - చక్షువులు।
స్వాహా - అస్త్రే।

| | |
|---|---|
| ఓం సం బుద్ధిః | 4 |
| ద్రం హ్రీ క్లీం | 3 |
| ఏహి | 2 |
| దత్తాత్రేయాయ | 5 |
| స్వాహా | 2 |
| | 16 |

ఈ షోడశాక్షరీ మంత్రమును ఎరిగినవాడు ‘‘తత్’’చే మయుడు (తన్మయుడు) కాగలడు. తత్ - ఆనందస్వరూపుడై ప్రకాశించగలడు.

---

**“షోడశాక్షరం వ్యాఖ్యాసే” (16)**
“ప్రాణం” దేయం।
“మానం” దేయం।
చక్షుః దేయం। శ్రోత్రం దేయం।
షట్ దశ (షడ్దశ) శిరః ఛినత్తి।
షోడశాక్షర (16) మంత్రో న దేయో భవతి।
అతిసేవాపర భక్త గుణవత్ శిష్యాయ వదేత్।

**“షోడశ (16) అక్షర వ్యాఖ్యానము**

అర్హత లేనివానికి ఈ షోడశాక్షరీ మంత్రమును అనుష్ఠింపజేయరాదు.

ప్రాణమైనా, మానమైనా, చక్షువులైనా, చెవులైనా ఇవ్వవచ్చునేమో।

16 సార్లు శిరస్సును నరికి ఈయవచ్చునేమో। అంతేగానీ - అర్హత లేకపోతే షోడశాక్షరీ మంత్రము ఇవ్వరాదు.

సేవానిరతిగలవాడగు భక్తునికి, సద్గుణవంతుడు అగు శిష్యునికి మాత్రమే - ఈ షోడశాక్షరీమంత్రము ప్రసాదించబడుగాక।

---

‘ఓం’ – ఇతి ప్రథమం భవతి।
‘ఐం’ – ఇతి ద్వితీయం।
‘క్రోం’ – ఇతి తృతీయం।
‘క్లీం’ – ఇతి చతుర్థం।
‘క్లూం’ – ఇతి పంచమం
‘హ్రాం’ – ఇతి షష్ఠం।
‘హ్రీం’ – ఇతి సప్తమం।
‘హ్రూం’ – ఇతి అష్టమం।
‘సౌః’ – ఇతి నవమం।
“దత్తాత్రేయాయ” – ఇతి – చతుర్దశ। (14)
‘స్వాహా’ ఇతి షోడశ। (14+2 = 16)

(1) ఓం
(2) ఐం
(3) క్రోం
(4) క్లీం
(5) క్లూం
(6) హ్రాం
(7) హ్రీం
(8) హ్రూం
(9) సౌః

**శ్రీ దత్తాత్రేయ బీజరూప షోడశాక్షరీ మంత్రము**

| | |
|---|---|
| (ఓం) ఐం క్రోం క్లీం క్లూం | 5 |
| హ్రాం హ్రీం హ్రూం సౌః | 4 |
| దత్తాత్రేయాయేతి | 5 |
| స్వాహా। | 2 |
| | 16 |

దత్తాత్రేయేతి (5) । స్వాహా (2)। “9+5+2 = 16’’

గాయత్రీ ఛ్ఛందః।
సదాశివ ఋషిః।
దత్తాత్రేయో దేవతా।
ఓం - బీజం।
స్వాహా - శక్తిః।
చతుర్థ్యంతం - కీలకం।
'ఓం' - ఇతి హృదయే।
'క్లాం క్లీం క్లూం' - ఇతి శిఖాయాం।
'సౌః। - ఇతి కవచే।
చతుర్థ్యంతం చక్షుషి స్వాహా-ఇతి - అస్త్రే।
యో నిత్యం అధీయానః
సచ్చిదానంద సుఖీ మోక్షీ భవతి॥

## శ్రీ దత్తాత్రేయ చతుర్దశాక్షరీ

| | |
|---|---|
| గాయత్రీ | ఛందస్సు। |
| సదాశివ | ఋషి |
| దత్తాత్రేయ | దేవతా। |
| ఓం | బీజం। |
| స్వాహా | శక్తి। |
| చతుర్థ్యంతం | కీలకం। |

| | | |
|---|---|---|
| ఓం క్లాం క్లీం క్లూ సౌః | 5 |
| చతుర్థంతం చక్షుషి | 7 |
| స్వాహా | 2 |
| | 14 |

| | |
|---|---|
| ఓం | ఇతి హృదయాయనమః। |
| క్లాం | శిరసే స్వాహా। |
| క్లీం క్లూం | శిఖయాయ వషట్ |
| సౌః | కవచాయు 'హుమ్'। |

**చతుర్ధ్యంతం చక్షుసి స్వాహా ఇతి అస్త్రే। - నేత్రత్రయాయ వౌషట్।**
ఈ విధంగా - ఎవరు నిత్యము ఉపాసిస్తారో, - అట్టివాడు సచ్చిదానంద సుఖి, మోక్షి అగుచున్నాడు.

---

"సౌః" ఇత్యంతే - 'శ్రీవైష్ణవ' ఇతి ఉచ్యతే-
తత్ జాపీ 'విష్ణురూపీ' భవతి॥
అనుష్టుప్ - ఛందః
వ్యాఖ్యాస్యే, "సర్వత్ర సంబుద్ధిః
ఇమాని" - ఇతి ఉచ్యంతే।

"సౌః" అను అక్షరమున చివర (అర్ధమాత్రగా) 'శ్రీవైష్ణవ' అనబడుతోంది.
దీనిని జపించువాడు 'విష్ణురూపి" అగుచున్నాడు.
ఛందస్సు - అనుష్టుప్।
సర్వత్ర సత్‌భావనా బుద్ధి - వ్యాఖ్యానము.
బ్రాహ్మీబుద్ధియే "దత్తాత్రేయము"గా చెప్పబడుతోంది।

| | |
|---|---|
| ఓం క్లాం క్లీం క్లూ సౌః | 5 |
| శ్రీవైష్ణవ చక్షుషి | 7 |
| స్వాహా | 2 |
| | 14 |

---

దత్తాత్రేయ హరేకృష్ణ
ఉన్మత్తానంద దాయక, దిగంబరమునే
బాలపిశాచ జ్ఞానసాగరేతి॥
ఇతి ఉపనిషత్

## మంత్రము

**దత్తాత్రేయ హరేకృష్ణ ఉన్మత్తానందదాయక** 4+4+8=16
**దిగంబరమునే - బాలపిశాచ జ్ఞాన సాగరాత్।** 6+16= 32
ఇది పరమాత్మ సమీప్యరూపమగు ఉపనిషత్

---

అనుష్టుప్ - ఛందః।
సదాశివ - ఋషిః।
దత్తాత్రేయో - దేవతా।
దత్తాత్రేయేతి - హృదయే।
హరేకృష్ణ - ఇతి శీర్షే
ఉన్మత్తానందేతి - శిఖాయామ్।
దాయకమ్ - ఇతి కవచే।
దిగంబర-ఇతి-చక్షుపి।
పిశాచజ్ఞానసాగర - ఇతి అస్త్రే।
అనుష్టుభో అయం మయా అధీతః-
ఆబ్రహ్మ-జన్మ దోషాశ్చ ప్రణశ్యంతి।
సర్వోపకారీ మోక్షీ భవతి-
<u>య ఏవం వేద॥</u>
<u>ఇతి ఉపనిషత్</u>

## శ్రీ దత్తాత్రేయ షోడశ బీజాక్షరీ స్వాహామంత్రము

'అనుష్టుప్' - ఛందస్సు।
'సదాశివ' - ఋషి
'దత్తాత్రేయ' - దేవతా।
దత్తాత్రయేతి - హృదయే।
హరేకృష్ణ - ఇతి శీర్షమ్।
ఉన్మత్తానంద - ఇతి శిఖాయ।
దాయకమ్ - ఇతి కవచమ్।
దిగంబర - ఇతి చక్షుపి।
పిశాచజ్ఞానసాగర - ఇతి అస్త్రే।
శ్రద్ధగా అనుష్ఠించబడు ఈ అనుష్టుభ్ యొక్క ఉపాసనచే - పుట్టినప్పటి నుండి చేసిన దోషములు నశించగలవు.
మంత్రార్థమును తెలుసుకున్నవాడు సర్వులకు శ్రేయోభిలాషి అగుచున్నాడు. మోక్షము సిద్ధించుకోగలడు.
షోడశాక్షర మహామంత్రము-బీజాక్షర సమన్వితము

| | | |
|---|---|---|
| ఓం ఐం క్రోం క్లీం క్లూం హ్రాం హ్రీం | 7 | |
| హ్రూం సౌః దత్తాత్రేయాయ స్వాహా। | 9 | = 16 |

ఇతి ప్రథమఖండః -ఇత్యుపనిషత్-

# ద్వితీయ ఖండః

| | |
|---|---|
| 'ఓం<br>1. 'ఓం' ఇతి వ్యాహరేత్।<br>'ఓం నమో భగవతే దత్తాత్రేయాయ'<br>స్మరణమాత్ర సంతుష్టాయ।<br>మహాభయ నివారణాయ। | 'ఓం' అని ముందుగా సర్వాంతర్యామి, సర్వతత్త్వస్వరూపుడు-అగు పరమాత్మను స్మరిస్తూ<br>**ఓం నమో భగవతే దత్తాత్రేయాయ (12)**<br>హే భగవాన్! దత్తాత్రేయాయ। స్మరించినంతమాత్రం చేత సంతుష్టుడు అగు స్వామీ।<br>- మహాభయమును తొలగించి నివారణము చేయు **దేవా।** |
| మహాజ్ఞాన ప్రదాయ।<br>చిదానందాత్మనే।<br>బాల-ఉన్మత్త-పిశాచ వేషాయేతి<br>మహాయోగినే అవధూతాయేతి। | - మహత్ - ఆత్మగురించిన జ్ఞానము ప్రసాదించు **దేవాదిదేవా।**<br>- (కేవలమగు ఎరుకను) ఆనందస్వరూపముగా కలిగియున్న **చిదానంద స్వరూపా।**<br>- బాహ్యానికి **బాలునివలె, పిచ్చివానివలె, పిశాచివలె వేషము** ధరించి అజ్ఞానులగు మమ్ములను భ్రమింపజేయువాడా।<br>**- మహాయోగీ। అవధూతా।** |
| అనసూయానంద వర్ధనాయ<br>అత్రి పుత్రాయేతి।<br>సర్వకామఫలప్రదాయ। | - తల్లి అనసూయకు పుత్రానందము కలిగించువాడా।<br>- అత్రిమహర్షి కుమారా।<br>- సమస్త కోరికలు సిద్ధించు అవధూతా! నమో నమః |
| 'ఓం' - ఇతి వ్యాహరేత్ -<br>భవబంధ మోచనాయేతి। | 'ఓం' అను వ్యహరించుటచే (ఉచ్చరించుటచే) ఈ జగత్తు నిజమే - అనే బంధము నుండి విమోచనమునకై ఉచ్చారణా-సంసిద్ధతకు పూనుకొను చున్నాము. **(భవ బంధ విమోచనాక్షరము)** |
| 'హ్రీం' ఇతి వ్యాహరేత్ -<br>సకల విభూతిదాయేతి। | "హ్రీం" - పలుకుటచే - సమస్త విభూతులు - తనవైన పరమాత్మస్మరణము.<br>- దృశ్య-దేహ-మనో-బుద్ధి-చిత్త-అహంకారముల ప్రదాత అగు దత్తస్వామికి నమస్కారము. **(పరతత్త్వస్మరణము)** |
| 'క్రోం' ఇతి వ్యాహరేత్ -<br>సాధ్యాకర్షణాయేతి। | "క్రోం" శ్రేష్ఠమైన ఆకర్షణవంతుడు, సమస్తము తనవైపు ఆకర్షిస్తున్నవాడు అగు సర్వాత్మకునకు నమస్కారము. **(పరమాత్మవైపుగా చిత్తనియామకము)** |
| 'సౌః' ఇతి వ్యాహరేత్ -<br>సర్వమనః క్షోభణాయేతి। | 'సౌః' - సర్వజీవుల మనస్సులనుక్షోభణాయుతము చేయు పరంధామునకు నమస్కారము. **(విషయములనుండి మనోఉపసంహరణము)** |
| 'శ్రీం' ఇతి వ్యాహరేత్।<br>సర్వ సంపత్ ప్రదాయేతి। | 'శ్రీం' - అను వ్యాహృతిచే సర్వ సంపత్ ప్రదాత. |
| మహ ఓం (మహోమ్) ఇతి వ్యాహరేత్<br>చిరంజీవినే। | 'మహత్ ఓం' వ్యాహరణముచే చిరంజీవ స్వరూపమగు, ఆత్మానంద స్వరూప- దత్తాత్రేయునకు నమస్కారము.<br>ఓ దత్తాత్రేయ స్వామీ! 'మహ ఓం' అను మీ శాశ్వత మహత్ తత్త్వమునకు ప్రణామములు. |
| వషట్ ఇతి వ్యాహరేత్<br>వశీకురు। వశీకురు। | వషట్ వ్యాహృతి ఉపాసనలచే మా సమస్తము మీకు సమర్పిస్తున్నాము. వషట్ వ్యాహృతి స్వీకరించి మమ్ములను వశము చేసుకోండి. వశము చేసుకోండి. మా మనస్సుకు వశము చేసుకోండి. బుద్ధికి ప్రత్యక్షమయెదరు గాక। |

| | |
|---|---|
| 'వౌషట్' ఇతి వ్యాహరేత్<br>ఆకర్షయ। ఆకర్షయ। | స్వామీ! 'వౌషట్' అను వ్యాహృతి (వచనము) చే మమ్ములను అజ్ఞానంధ కారము నుండి ఈవలకు ఆకర్షించండి. ఆకర్షించండి. |
| 'హుం' ఇతి వ్యాహరేత్<br>విద్వేషయ। విద్వేషయ। | 'హుం' వ్యాహృతి స్వీకరించుచు (మాకు అరిషట్ వర్గముపట్ల, మా అజ్ఞాన అభ్యాసములపట్ల) విద్వేషము కలుగచేయండి. |
| 'ఫట్' ఇతి వ్యాహరేత్<br>ఉచ్చాటయ। ఉచ్చాటయ। | "ఫట్" వ్యాహృతిచే (పలుకుచే) మాలోని అల్పభావములను మొదలంట్లా వ్రేళ్ళతోసహా పెకలించివేయండి. |
| "ఠఠేతి" (ఠ ఠ-ఇతి) వ్యాహరేత్<br>స్తంభయ। స్తంభయ। | ''ఠఠ'' వ్యాహృత్ (వచనము)చే (మాలోని మనోచాంచల్యమును) స్తంభింపజేయండి. |
| "ఖఖేతి" (ఖ ఖ - ఇతి) వ్యాహరేత్<br>మారయ। మారయ। | 'ఖేఖే' అను మా వ్యాహృతి (పలుకలను) అనుసరించి (మాలోని దుష్ట అభ్యాసములను) నశింపజేయండి. |
| నమః సంపన్నాయ। -<br>నమః సంపన్నాయ స్వాహా।<br>పోషయ। పోషయ। | ఓ దత్తాత్రేయా!<br>ఈ సమస్త జగత్తు మీ సంపదయే। సంపన్నాయా। సమస్తము సంపదగా కలవాడా। మా దైవీ సంపదను పరిపోషించండి. |
| పరమంత్ర పరయంత్ర<br>పరతంత్రాం ఛింధి ఛింధి। | మాకు భేదము కలిగించగల అన్యత్వము కలుగజేయు మంత్ర యంత్ర తంత్ర దోషములను మమ్ములను బాధించకుండా ఖండించండి. (ఛింది = నరకటము) |
| గ్రహాన్ నివారయ। నివారయ।<br>వ్యాధిం నివారయ। నివారయ। | హే దత్తాత్రేయా! మేము సమర్పించు కర్మ-జ్ఞాన-యోగ ఉపాసనలను అభ్యాసములుగా స్వీకరించి<br>❖ మాపట్ల గ్రహదోషములను నివారించండి.<br>❖ శారీరక మానసిక వ్యాధి, ఆధులను తొలగించండి। |
| దుఃఖం హరయ। హరయ।<br>దారిద్ర్యం విద్రావయ। విద్రావయ।<br>దేహం పోషయ। పోషయ।<br>చిత్తం తోషయ। తోషయ। | ❖ మాయొక్క దుఃఖములను (worries) హరించి వేయండి.<br>❖ దారిద్రమును విద్రావయము (పారిపోయేటట్లు) చేయండి.<br>❖ ఈ మా శరీరములను పరిపోషిస్తూ రక్షించండి.<br>❖ మా చిత్తమును సంతోషింపజేయండి. ఆత్మభావన వైపు తరలించండి. |
| సర్వమంత్ర సర్వయంత్ర సర్వతంత్ర<br>సర్వపల్లవ సర్వ రూపాయేతి<br>ఓం నమః శివాయేతి॥<br>(ఓం నమశ్శివాయ)<br>ఇతి ఉపనిషత్ | సర్వమంత్ర యంత్ర తంత్ర పల్లవ (చిగురించు) సర్వరూపాయ। ఓం నమశ్శివాయ। ఓం నమశ్శివాయ।<br>నమో నమః। నమో నమః। - ఇతి ద్వితీయ ఖండః।<br>ఇతి-ఉపనిషత్ |

## తృతీయ ఖండః - అష్టమూర్తి ఫలశ్రుతి।

యఏవం వేద
అనుష్టుప్ - ఛందః
సదాశివ - ఋషిః।
దత్తాత్రేయో - దేవతా।
'ఓం' - ఇతి బీజం।
'స్వాహా'-ఇతి-శక్తిః।
ద్రాం - ఇతి కీలకం।
అష్టమూర్తీ అష్టమంత్రా భవంతి।

**దత్తాత్రేయ - అష్టమూర్తి - అష్టాక్షరీ అష్ట మంత్రము**

| | |
|---|---|
| **"ఓం దత్తాత్రేయాయ స్వాహా।"** | **(8)** |
| **"ద్రాం దత్తాత్రేయాయ స్వాహా।"** | **(8)** |

ఛందస్సు - 'అనుష్టుప్'।
ఋషి - సదాశివ।
దేవతా - దత్తాత్రేయో। 'ఓం' - ఇతి బీజము। 'స్వాహా'-ఇతిశక్తి।
ద్రాం - ఇతి కీలకం।
ఇవి అష్టమూర్తి యొక్క అష్టమంత్రములు అగుచున్నాయి.

---

యో నిత్యమ్ అధీతే -
వాయుః అగ్ని సోమ ఆదిత్య
బ్రహ్మ విష్ణు రుద్రైః పూతో భవతి।
గాయత్ర్యాః శతసహస్రం జప్తో భవతి।
మహారుద్ర శత సహస్ర జాపీ భవతి।
ప్రణవాయుత కోటి జప్తో భవతి।
శతపూర్వాన్ శత ఉత్తరాన్ పునాతి।

ఎవరు ఈ దత్తాత్రేయోపనిషత్ నిత్యము పఠిస్తారో - అట్టి వారు వాయు, అగ్ని, సోమ, ఆదిత్య, బ్రహ్మ, విష్ణు, రుద్ర తేజస్సులచే పవిత్రులు అగుచున్నారు.
శతసహస్ర (లక్షలసార్లు) గాయత్రీ జపము చేసిన ఫలము లభించగలదు.
లక్షసార్లు మహారుద్రమంత్రము జపించినవారు అగుచున్నారు.
అట్టివారు వంద కోట్ల సార్లు ప్రణవము జపించిన వానితో సమానము.
ఆతడు ఉన్నచోట వెనుక 100 మంది ముందు 100 మంది పవిత్రులు కాగలరు.

---

సపంక్తి పావనో భవతి।
బ్రహ్మహత్యాది పాతకైః ముక్తో భవతి।
గోహత్యాది పాతకైః
ముక్తో భవతి।

అట్టి వారు ఏ పంక్తి (వరుస)లో ఉంటే ఆ పంక్తి పావనము అవగలదు.
బ్రహ్మహత్య వంటి మహా పాతక దోషములనుండి ముక్తులు అగుచున్నారు.
గోహత్య వంటి ఘోర పాతకముల దోషములనుండి కూడా విమోచనము పొందగలరు.

---

తులా పురుషాది దానైః
ప్రపాపానతః పూతో భవతి।
అశేష పాపాన్ ముక్తో భవతి।
అభక్ష్య భక్షణ పాపైః ముక్తో భవతి।
సర్వమంత్ర యోగ పారీణో భవతి।
స ఏవ బ్రాహ్మణో భవతి।

ఈ ఉపనిషత్తు పారాయణము-అధ్యయనము చేయువారికి **తులాపురుష** (తులాభారదానము - తాను ఉన్నంత బరువుగా బెల్లముగాని, వెండి - బంగారములు వంటివిగాని) **దానము,** సమర్పణము చేసిన ఫలము లభించగలదు. తనను తానే పరమాత్మకు సమర్పించిన ప్రపన్న పుణ్యఫలము పొందగలడు. పవిత్రుడవగలడు.
అంతులేని పాపములను చేసియున్నా కూడా మిక్కిలి విడివడినవాడు అగుచున్నాడు. తినకూడనిది తినిన పాపమునుండి విమోచితుడు కాగలడు.
సర్వ మంత్రములను అనుష్ఠించినవానితో, సర్వయోగములను అభ్యసించిన వానితో సమానుడుకాగలడు.
బ్రహ్మమును అధ్యయనము చేసి, ఎఱిగి, బ్రహ్మమే తానని గమనిస్తున్న 'బ్రాహ్మణుడు' అగుచున్నాడు.

---

తస్మాత్ శిష్యం, భక్తం
ప్రతిగృహ్ణీయాత్ -
సో అనంత ఫలమ్ అశ్నుతే।
సజీవన్ముక్తో భవతి॥

శిష్యుడైనవానికి, భక్తిగలవానికి ఈ దత్తాత్రేయోపనిషత్ పరమార్థమును బోధించుటచే - ఆ స్వీకరించినవాడు, ఆ గురువు కూడా ఉత్తమ ఫలములు పొందగలరు.
ఈ ఉపనిషత్ పఠించుటచేత, పారాయణము చేయుటచేత - అట్టివాడు సాక్షాత్ **'జీవన్ముక్తుడు'** కాగలడు.

---

ఇతి ఆహ భగవాన్ నారాయణో బ్రహ్మాణమ్॥
*దత్తాత్రే యోపనిషత్ సమాప్తా॥*
*ఓం శాంతిః శాంతిః శాంతిః॥*

ఈ విధంగా భగవంతుడగు శ్రీమన్నారాయణుడు - సృష్టి సంకల్పి, సృష్టికర్త అగు బ్రహ్మదేవునికి వివరించి బోధించారు.
***ఇతి దత్తాత్రేయోపనిషత్***
***ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥***

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 9 దత్తాత్రేయోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



## పౌరాణిక విశేషాలు

అనసూయాదేవి - అత్రిమహర్షుల అనువారు పుణ్యదంపతులు. వారి కుమారుడు శ్రీదత్తాత్రేయ అవధూత।

**అనసూయాదేవి (మార్కండేయ పురాణము):**

దేవహూతి - కర్దముల కుమార్తె.

అత్రి మహర్షి భార్య, మహాపతివ్రత. భర్తనే పరమాత్మగా పూజిస్తూ వారివద్ద జ్ఞానోపదేశము పొందియున్నారు. (పంచమహాపతివ్రతలు = సీత, సావిత్ర, అనసూయ, ద్రౌపతి, దమయంతి)

ఒక సందర్భములో బ్రహ్మ-విష్ణు-మహేశ్వరులు తమ తమ వాహనములైనట్టి హంస-గరుడ-నందీశ్వరులపై అధిరోహించినవారై ఆకాశంలో మేరుపర్వతము వైపుగా పోవుచూ ఉన్నారు. ఒకచోట వారి వాహనములు ఆగిపోయాయి. ఎంతగా ప్రయత్నించినప్పటికీ ముందుకు సాగలేదు. గరుడుడు అది గమనించి, జ్ఞానదృష్టితో విషయము ఏమిటో తెలుసుకొన్నారు. త్రిమూర్తులతో - "హే త్రిమూర్తి దేవాది దేవులారా! ఇచ్చటనే అత్రి మహర్షి ఆశ్రమము. వారి ధర్మపత్ని అనసూయాదేవి మహాపతివ్రత. ఈ మార్గములో మనము దాటజాలము. ఆ తల్లి పాతివ్రత్యమహిమ అటువంటిది" అని విన్నవించారు. అది విని వారు వెనుకకు వచ్చి వేరే మార్గంగా మేరు పర్వతము వైపుగా ప్రయాణించారు.

ఆ తరువాత త్రిమూర్తులు **"మనము అనసూయాదేవి పాతివ్రత్యమును పరీక్షించి, పాతివ్రత్య మహిమ ఎట్టిదో త్రిలోకములకు దృష్టాంతంగా చూపుదాము. తద్వారా ధర్మముయొక్క ఔన్నత్యము కూడా జనులకు పాఠ్యాంశము కాగలదు"** - అని నిర్ణయించుకున్నారు.

త్రిమూర్తులు బ్రాహ్మణరూపులై అత్రిమహర్షి ఆశ్రమము ప్రవేశించారు. అనసూయ-అత్రి దంపతులు ఆ ముగ్గురు బ్రాహ్మణులను అతిథులుగా లోనికి ఆహ్వానించి ఆతిధ్యమిచ్చారు. ముగ్గురు స్నానానికి వెళ్లబోతూ, **"ఓ అత్రిమహర్షీ మాముగ్గురికి భోజనము వడ్డించు స్త్రీ దిగంబరిఅయి ఉండాలి. ఇది మా వ్రతము. ఇది కుదరకపోతే చెప్పండి. మాకు శలవు ఇప్పించండి. వెళ్లివస్తాము"** - అని పలికారు.

ఆ మాటలు విని అత్రిమహర్షి ప్రశాంతముగా ధర్మపత్ని అనసూయవైపు - **"ఇప్పుడు ఏమి చేద్దాము?"** అన్నట్లుగా చూచారు. అనసూయాదేవి **"స్వామీ! సరే! అట్లాగే ఆతిధ్యము పూర్తి చేద్దాము"** - అని పలికారు.

ముగ్గురు బ్రాహ్మణులు స్నానము చేసివచ్చి పీటలమీద భోజనానికై కూర్చున్నారు. అనసూయ ఆ అతిథులకు నమస్కరించి, వారిపై మంత్రాక్షతలు, జలము చల్లారు. అంతే! ఆ ముగ్గురు అప్పుడే పుట్టిన శిశువులవలె అయిపోయారు. అప్పుడు భోజనము వడ్డించి, ఆ తరువాత ముగ్గురు శిశువులపై మంత్రాక్షతలు, జలము చల్లారు. తిరిగి ఆ ముగ్గురు బ్రాహ్మణ రూపములు పొందారు. వారింక భోజనము చేయసాగారు.

భోజనము చేసిన తరువాత ఆ దేవి వారిపై మరల మంత్రాక్షతలు, జలము చల్లి పసిబిడ్డలుగా మార్చి తన ఆశ్రమములోనే ఆడిస్తూ, మాతృవాత్సల్యముతో ఆనందించసాగారు.

అప్పుడు సరస్వతి, లక్ష్మి, ఉమలులు తమతమ భర్తలను వెతుక్కుంటూ రాగా, మరల ఆ ముగ్గురిపై మంత్రజలము చల్లి తిరిగి అభ్యాగత బ్రాహ్మణరూపులుగా చేసారు.

అది చూచి మెచ్చుకొన్న త్రిమూర్తులు తమ నిజస్వరూపము చూపించి వరము కోరుకోమన్నారు. అనసూయ "త్రిమూర్తులారా। మాకు సంతానము లేదు! మీతో సమానమైన పుత్రులను ప్రసాదించండి" అని ప్రార్థించారు.

అట్టి త్రిమూర్తుల అవతారములే -

బ్రహ్మ అంశగా - చంద్రుడు.

విష్ణు అంశగా - దత్తాత్రేయుడు. (వీరు త్రిమూర్తుల అంశ కూడా).

శివాంశగా - దుర్వాసమహర్షి.

జన్మించారు. వారు ముగ్గురు లోకకల్యాణమూర్తులైనారు.

**రామాయణము :**

పూర్వము ఒకప్పుడు భూమిపై క్షామము సంభవించింది. భూమిపై వృక్షములు ఫలములు ఇవ్వలేకపోయాయి. జీవులంతా ఎంతో దుఃఖితులైనారు. అప్పుడు భూదేవతయొక్క, మహర్షులయొక్క అభ్యర్ధనను అనుసరించి, తనయొక్క పాతివ్రత్యమహిమతో అనసూయ భూమిపై ఏర్పడిన క్షామమును నివారించారు. అప్పుడు వృక్షములు తిరిగి పుష్పించటము, ఫలములు ప్రసాదించటము నిర్వర్తించసాగాయి.

వనవాసము సందర్భములో సీతారామలక్ష్మణులు అత్రిమహర్షి ఆశ్రమును సందర్శించారు. అప్పుడు అనసూయాదేవి స్త్రీలకు మోక్షప్రసాదమగు 'సతీధర్మములు' గురించి బోధించారు. ఆ విధంగా బోధించిన "భారతనారీ ఉత్తమలక్షణములు, అర్ధాంగి - ధర్మపత్ని - సహధర్మచారిణి - గృహిణి - శబ్దార్థములు, పాతివ్రత్య ధర్మములు, స్త్రీలు నిర్వర్తించి సిద్ధిపొందగల అనేక వ్రతములు" - మొదలైనవన్నీ భారత దేశములో అనుసరణీయములై కొనసాగుచూ ఉన్నాయి కూడా! భారతీయ సంస్కృతిలోను, కుటుంబ వ్యవస్థలోను అంతర్లీనమై, - ప్రపంచమంతటికీ ఆదర్శప్రాయమగుచున్నాయి.

## అత్రిమహర్షి (భాగవతము) :

సప్తర్షులలో ఒకరు - బ్రహ్మమానసపుత్రుడు. సంతానము కొరకు ధర్మపత్ని అనసూయాదేవితో కూడి తపస్సు చేయగా త్రిమర్తులు వరప్రసాదంగా - వారి ముగ్గురి ఏకాంశగా దత్తాత్రేయుడు కుమారుడుగా కలిగారు. ఆయన ఆత్మజ్ఞాన ప్రకాశముచే **అవధూత** అయినారు.

**భారతము :**

ఒకప్పుడు అత్రిమహర్షి తపస్సుకొరకై పోబోవుచుండగా, అనసూయాదేవి "నాథా! మరి మన బిడ్డలకు రక్షణకై ఎవరుంటారు?" అని విన్నపము చేసారు. అప్పుడు అత్రి **"రాజుయొక్క బాధ్యత అది"** అని పలికి, పృథుమహారాజు దగ్గిరకు వెళ్లారు. "నీవు విధాతవు। ఇంద్రుడవు" అని పలికారు. అది విని, అక్కడ ఉన్న గౌతమహర్షి "ఈ పృథుమహారాజు - విధాత ఇంద్రుడు ఎట్లా అవుతారు? మీరు ముఖస్తుతి మాటలు ఎందుకు చెప్పుచున్నారు?" అని ప్రశ్నించారు. అప్పుడు వారి ఇద్దరి మధ్య సనత్కుమారుని సమక్షంలో వాదోపవాదములు జరిగాయి. ఆ వర్ణన - యుక్తియుక్తిమే - అని అత్రిమహర్షి వాదనను సనత్కుమారుడు ఆధ్యాత్మికార్థంగా ఒప్పుకున్నారు. అప్పుడు పృథువు అత్రికి ధనము, కుటుంబ రక్షణ సమర్పించారు.

**బ్రహ్మాండపురాణము:**

ఒకప్పుడు రాహువు సూర్యుని మ్రింగటానికి సమీపించసాగారు. అప్పుడు సూర్యుడు గజగజ వణుకుచు, క్రిందపడిపోసాగారు. లోకాలన్నీ చీకటి క్రమ్మసాగాయి. అది గమనించిన అత్రిమహర్షి సూర్యుని సమీపించి **"నీ యథాస్థానమునకు భయమెక్కడిది? నీయొక్క స్వయంప్రకాశమునకు లోటేమున్నది? రాహువు యొక్క రాక - పోకలు కాలచమత్కారము మాత్రమే. నీవో, నిత్యాత్మ సూర్యోదయుడవు"** - అని ఆత్మతత్త్వపరంగా బోధించారు. "జీవోబ్రహ్మేతి" అను శాస్త్రార్థం పలికారు.

అది విని సూర్యుడు స్వస్వరూపజ్ఞాని అయి, తేజోవంతుడుగా ఆకాశమున స్వస్థానమునకు చేర్చారు.

**బ్రహ్మపురాణము** : ఒక సందర్భములో అత్రిమహర్షి బ్రహ్మ కూడా అయి, బ్రహ్మస్థానమున ఉండటం జరిగింది.

**దత్తాత్రేయుడు:**

త్రిమూర్తుల ఏకాంశగా అనసూయ – అత్రిమహర్షులకు దత్తాత్రేయుడు కుమారుడై జన్మించారు. విష్ణుమూర్తి ఒకప్పుడు అత్రిమహర్షికి ప్రత్యక్షమై, "మీ తపస్సుకి మెచ్చి, మీకు దత్తుడను అగుచున్నాను" అని పలికి ఉండటంచేత – ఈయన "దత్తాత్రేయులు" అని పిలువబడ్డారు.

విష్ణ్వంశతో పుట్టిన దత్తాత్రేయుల వారి భార్య పేరు లక్ష్మి. దత్తాత్రేయులవారు ఒకప్పుడు ప్రహ్లాదునకు, వైరాగ్యము పొందియున్న అలర్క మహారాజుకు ఆత్మజ్ఞానము బోధించారు.

దత్తాత్రేయులు అవధూత. ఆయనను తత్త్వజ్ఞానము కొరకై ఆశ్రయించినవారికి పరీక్ష చేస్తూ ఉంటారు. సాంసారిక దృష్టి కలవారికి ఆయన ఉన్మత్తునివలె (పిచ్చివానివలె) స్త్రీలోలునివలె, వ్యసనపరునివలె కనిపిస్తారు. పట్టుదలతో సేవించినవారికి ఆత్మబోధ ప్రసాదిస్తారు. నాలుగువేదములలోని **"పురుషోత్తముడు, పరమాత్మ"** లక్షణములు స్వాభావికం చేసుకొన్న మహనీయులు.

**మార్కండేయపురాణము:**

ఒకప్పుడు కొందరు మునికుమారులు దత్తాత్రేయుని సేవించటానికై ఆయనను సమీపించారు. ఆయనకు అనేక పరిచర్యలు చేయసాగారు. దత్తాత్రేయులవారు ఒంటరిగా ఉండదలచి, ఒక కొలనులో ప్రవేశించారు. ముని కుమారులు కొలను ఒడ్డున వేచి ఉండసాగారు. అప్పుడు దత్తాత్రేయులు ఒక సుందరమైన స్త్రీని వెంటనిడుకొని, ఆమెతో సరసాలు ఆడసాగారు. అయినా కూడా, ఆ మునికుమారులు స్వామిని వీడలేదు. అప్పుడు ఆ మునికుమారులు చూస్తూ ఉండగానే, – ఆ స్త్రీతో దత్తాత్రేయులవారు సంభోగించసాగారు. అది చూచి ఆ మునికుమారులు **"ఈయన మనకు ఆత్మబోధ ఏమి చెపుతారు?"** – అని తలచి ఆయనను విడచి తమతమ ఆశ్రమములకు వెళ్ళిపోయారు. (ఆత్మజ్ఞానబోధకు అర్హత పొందలేకపోయారు)

**భాగవతము / మార్కండేయపురాణము :**

వింధ్య పర్వతసమీపంగా ఉండే మహిష్మతీపుర –హైహయవంశపురాజు, కృతవీర్యుని కుమారుడు – కార్తవీర్యార్జునుడు. ఈతడు 'గర్గుడు' అను రాజపురోహితునిచే బోధింపబడినవాడై దివ్యశక్తులకొరకై దత్తాత్రేయులవారిని శిష్యుడుగా ఆశ్రయించారు. ఆయనను సేవించసాగారు. ఒకరోజు..

దత్తాత్రేయుడు : కార్తకీర్యార్జునా! నీవు మహిష్మతీపుర రాజువు. ఇక నేనో? పిచ్చివాడినని జనులంతా అనుకుంటూ ఉంటారు. ఎక్కడో ఏకాంతంగా 4 కుక్కలను వెంటబెట్టుకొని తిరుగుతూ ఉంటాను. పైగా స్త్రీలోలుడను. నాకు మంత్రాలు రావు. తంత్రాలు రావు. నన్నెందుకయ్యా 'శిష్యుడిని' అని చెప్పుకొని ఆశ్రయిస్తావు? మీ రాజ్యాలలో ఆశ్రమవాసులైన రాజగురువులను పట్టుకో. వాళ్లు నీకు కావలసినవేమైనా ఉంటే – అవి ఇస్తారు. నేను త్రాగుబోతును. స్త్రీలోలుడను. నాకు సేవచేస్తే నీకేమి లాభం?

**కార్తవీర్యార్జునుడు** : స్వామీ! మా దేశములోని వేద పండితులందరూ "వేదములు కుక్కల రూపంగా దత్తాత్రేయుల వారిని ఆశ్రయించి ఉంటాయి" – అని చెపుతారు. మిమ్ములను ఆశ్రయించవలసినదిగా మా పెద్దల ఆజ్ఞ. మేము 'దృశ్యభావన' అనే వ్యసనముచే 'మాయ' అనే మత్తు ఎక్కి ఉన్న దౌర్భాగ్యులము. మీరో? సాక్షాత్ విష్ణు భగవానుని అవతారపురుషులు. మీరు "అవధూత" అని మా పండితుల నిర్ణయము.

(అవధూత = "జగత్తు" అను వ్యవహారమంతా ఆత్మ తత్త్వమునందు త్రోసివేసి, సమస్తమును స్వాభావికంగా ఆత్మానందమునందు ఏకము చేసి ఉండు మహాయోగి / యోగయోగీశ్వరుడు.

అందుచేత మిమ్ములను మనసా, వాచా, కర్మణా సేవించుటయే భక్తి–జ్ఞాన–యోగ–సర్వసమర్పణాభ్యాసముగా నిర్ణయించుకున్నాము. కనుక మీ సేవను నాకు అనుగ్రహించండి.

కొన్నాళ్ళు గడిచాయి. ఒకరోజు దత్తాత్రేయులవారు కార్యవీర్యార్జునిని పిలిచి, "ఏదీ! నీ భుజములు చూపించు" – అని పలికారు. తనయొక్క అపాన వాయువుచే ఆతని భుజములను నల్లగా కాల్చివేసారు. అయినా కూడా ఆ విధంగా నల్లగా మాడిపోయిన భుజములతోనే దత్తాత్రేయుల వారిని సేవించటము కొనసాగించారు.

అప్పుడు కార్తవీర్యార్జుని సేవానిరతి, భక్తి, స్తుతులకు మెచ్చుకొని ఈ విధంగా పలికారు.

**దత్తాత్రేయుడు :** కార్యవీర్యార్జునా! నిన్ను మెచ్చుకుంటున్నానయ్యా! ఏమి వరం కావలో కోరుకో. అది ప్రసాదిస్తాను.

**కార్తవీర్యార్జునుడు :** గురువర్యా! దత్తాత్రేయా? మీరు వరం ఇస్తానన్నారుకనుక, మీ భక్తుడనై మిమ్ములను కోరుకుంటున్నాను.

(1) అత్యంత బలోపేతమైన వేయి బాహువులు (భుజములు, చేతులు)

(2) రాజ్యాధికారము

(3) అరివీర భయంకరమైన బల-పరాక్రమములు-అనుగ్రహించ ప్రార్థన.

**దత్తాత్రేయులవారు :** తథాస్తు। అట్లే అగుగాక। ముల్లోకములలో నీతో సమానమైన బలవంతుడు మరెవ్వరూ ఉండరు. విష్ణు అంశ తప్పితే నిన్ను ఎవ్వరు జయించలేకుండునుగాక। ఇక వెళ్ళిరా! వేయిచేతులతో శివభక్తుడవై శివాభిషేకములు నిర్వర్తించుము.

ఈ విధంగా దత్తాత్రేయుడు కార్తవీర్యార్జునిని సంతోషపరచి పంపివేసారు.

అట్టి దత్తాత్రేయులవారు జ్ఞాననిధి. కరుణాసముద్రుడు. "శరణన్నవారిని కాపాడుటము" అనే అంతర-హృదయదీక్ష కలవారు. తలచుకొని మనస్సులో నమస్కరిస్తే చాలు, - ఆధ్యాత్మిక భావాలు ప్రసాదించగల జగద్గురువు.

ఈ విధంగా కొన్ని పౌరాణిక విశేషాలు దత్తాత్రేయులవారి గురించి ముచ్చటించుకున్నాము.

***ఇక మనము "దత్తాత్రేయోపనిషత్" అధ్యయనములో ప్రవేసిస్తున్నాము.***

---

"శ్రీ గురుదత్త - బీజాక్షర బ్రహ్మవిద్య" చే తెలియబడువారు, "ఆనంద విగ్రహులు" - అగు శ్రీపాద నారాయణాకార-శ్రీమన్ -దత్తాత్రేయ స్వామివారిని ఉపాసించుచున్నాము. శరణు వేడుచున్నాము.



(దత్-తత్-త్రేయః = 'తత్' సహజ ఆత్మ స్వరూపమును ఎలుగెత్తి ప్రకటించు జగద్గురువు।
త్రేయః = త్రిగుణమునకు ఆవలి తత్ దత్ స్వరూపుడు. ('తత్' స్వరూపము బోధించువారు).
దత్ (జీవాత్మను) తత్ - రేయః = ఈ సమస్తమునకు స్వకీయమగు 'తత్' యొక్క కిరణముగా కలవారు)
అత్రి మహర్షికి విష్ణుభగవానునిచే దత్తమైనవారు.

## మంత్రరాజములు

### సదా దత్తోఽహమస్మి మంత్రము

| సదా దత్తోఽహమస్మీతి ఓం। ఓం సదాదత్తో ఽహమస్మి। |
|---|

### సర్వసంపత్ వృద్ధికర షడక్షర (6) దత్తాత్రేయ

**'ఓం' ఇతి ప్రథమం। 'శ్రీం' ఇతి ద్వితీయం।**
**'హ్రాం' ఇతి తృతీయం। 'క్లీం' ఇతి చతుర్థం।**
**'గ్లౌం' ఇతి పంచమం। 'ద్రాం' ఇతి షష్ఠమ్।**

| ఓం శ్రీం హ్రాం క్లీం గ్లౌం ద్రాం |
|---|

**మంత్రము** - | (ఓం) శ్రీం హ్రాం క్లీం గ్లౌం ద్రాం। భగవతే। దత్తాత్రేయాయ నమః।। **5 + 4 + 5 - 2** | (16)

### దత్తాత్రేయ అష్టాక్షరీ మంత్రము

**(అష్టమూర్తి - అష్టమంత్రా)**

| ద్రం/ద్రాం "దత్తాత్రేయాయ నమః"। **(8)** |
|---|

| **ద్రం దత్తాత్రేయాయ నమః। (8)** |
|---|
| **ద్రాం దత్తాత్రేయాయ నమః। (8)** |

దత్తాత్రేయ సత్యానంద చిదాత్మక మంత్రము

| ఓం దత్తాత్రేయేతి సత్యానంద చిద్మాతకం నమః 1 + 5 + 4 + 4 - 2 | 16 |
|---|---|

దత్తాత్రేయ బీజాక్షర ద్వాదశాక్షర మంత్రము (12)

| ఓం నమో భగవతే దత్తాత్రేయాయ॥ (12) |
|---|

| (ఓం) ఆం హ్రీం క్రోం ఏహి దత్తాత్రేయేతి స్వాహా | 12 | 5 + 7 = 12 |
|---|---|---|

దత్తాత్రేయ "బీజ" షోడషాక్షరీ మంత్రము (16)

| ఓం ఐం క్రోం క్లీం క్లూం హ్రాం హ్రీం హ్రూం సౌః (9) దత్తాత్రేయేతి స్వాహా (7) | 9 + 7 = 16 |
|---|---|

దత్తాత్రేయ బీజాక్షర చతుర్దంత షోడశాక్షరీ।

| (ఓం) క్లాం క్లూం సౌః దత్తాత్రేయ చతుర్థంతం చక్షుపి స్వాహా / స్వాహేతి॥ | 11 + 5 = 16 |
|---|---|

దత్తాత్రేయ హరేకృష్ణ మహామంత్రము

| (ఓం) దత్తాత్రేయ హరేకృష్ణ ఉన్మత్తానందదాయక॥ | 16 | 32 |
|---|---|---|
| దిగంబరమునే బాల పిశాచ జ్ఞాన సాగరాత్॥ | 16 | |

– ఇతి ఉపనిషత్–

॥ఓం నమో భగవతే దత్తాత్రేయాయ నమః ॥

**దత్తాత్రేయ**–"తత్" స్వరూపులై జీవాత్మను ప్రకృతిని – "దత్" = పరమాత్మకు సమర్పించు బోధ ప్రసాదించువారు.

- తత్ సహజాత్మస్వరూపమును ఆశ్రితజనులకు – (తత్–దత్) – అనుగ్రహించువారు.
- 'త్రేయ' – త్రిగుణములకు ఆవల 'తత్' స్వరూపులై సమస్త బ్రహ్మాండములను 'దాత్' – ఇచ్చివేయువారు.
- త్రిగుణములకు అవలగల తత్‌దత్ స్వరూపులు. **దత్ (జీవాత్మ) – తత్ (పరమాత్మ) – త్రిగుణాత్మక స్వరూపులు.**
- 'ఓం' కార – సర్వాత్మక, సర్వతత్త్వ, సర్వసాక్షి స్వరూపమునకు నమస్కారము.
- 'ఓం' సమగ్రము, సత్యము, నిత్యము అగు ఆత్మ భగవానునికి నమో నమః।
- విష్ణునా అత్రి–దత్త → దత్తాత్రేయాయ నమః

# 1వ ఖండము – తారకమ్

ఒకానొక సందర్భములో భక్తజన పరాయణుడగు శ్రీమన్నారాయణుడు లీలా వినోది అయి, సత్యక్షేత్రము (సత్యలోకము, బ్రహ్మలోకము) నకు విజయం చేశారు. నారాయణ భగవానుని రాకను బ్రహ్మానందభరితులైన బ్రహ్మదేవుడు స్వామికి స్తుతి, ఆవాహన, సింహాసన, అర్ఘ్య, పాద్యాదులను సమర్పించి పరమభక్తితో ఆత్మనివేదన నిర్వర్తించారు.

**శ్రీమన్నారాయణుడు :** కుమారా! సృష్టికర్తా! బ్రహ్మదేవా! బహుకళాత్మకంగా మీచే సృష్టించబడుచున్న విశ్వరచన, అందలి ప్రియస్వరూపులగు జీవులు – సమస్తము క్షేమమే కదా?

**బ్రహ్మదేవుడు:** తండ్రీ! ఆదినారాయణా! పరబ్రహ్మమూర్తీ! తమరు సర్వజ్ఞులు. మీకు తెలియనిదేమున్నది? మీరు అన్నట్లు – శోభాయమానంగాను, కళాత్మకంగాను మీరు ప్రసాదించిన 'సృష్టిశక్తి'చే కల్పించుచున్నాను. అయితే, నా కల్పన అగు సృష్టి సామ్రాజ్యములో ప్రవేశించిన జీవులు **మీ మాయచే తమ సహజరూపమును ఏమరుచుచున్నారు.**

ఇంద్రియములకు ఎదురుగా కనిపిస్తున్న దృశ్యముతో తన్మయులై, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య పాశములను తమకుతామే కల్పించుకొని బద్ధులగుచున్నారు. జన్మ కర్మ చక్రములో తగుల్కొని బహుదుఃఖితులు అగుచున్నారు. ఈ జీవుల జనన–మరణ–గర్భశోకాది సంసార దుఃఖములను చూస్తూ ఉన్నప్పుడు నా హృదయము ద్రవిస్తున్నది. స్వామీ! మేమంతా అట్టి **సమస్త దుఃఖములనుండి** (From all kinds of worries) **తరించి ఆత్మానారాయణ మహాసామ్రాజ్యములోనికి ప్రవేశించగల ఉపాయమేమిటి?** మేమంతా తరించగల 'తారకము'ను ఉపదేశించమని ప్రార్థిస్తున్నాను.

**శ్రీమన్నారాయణ భగవానుడు :** ప్రియ సృష్టి ప్రజ్ఞానంద స్వరూపా! బ్రహ్మదేవా! **సత్యానంద చిదాత్మకం సాత్త్వికం మామకం ధామ ఉపాస్వ – (ఇతి ఆహ)।** సమస్త సంసార దుఃఖములకు తరుణోపాయము – సత్య – ఆనంద – చిదాత్మకము, పరమ సాత్త్వికము (సత్ ఆత్మికము) అగు నాయొక్క ధామము (లేక) స్థానము సిద్ధించుకోవటమే – ఉపాయము. ఎవ్వరైతే **"జీవాత్మరూప తృష్ణ – దృశ్య–సంబంధములతో సహా ఇక్కడి సమస్తము కేవలాత్మ స్వరూపుడునగు నాచేతనే దత్తము (ఇవ్వబడటము, ప్రదర్శించబడటము) జరుగుచున్నది"** – అను అర్థమును కలిగియన్న – **"సదా దత్తోఽహమస్మి"** అను మంత్రార్థసిద్ధిని పొంది, అనునిత్య, స్వాభావిక ఆత్మభావన కలిగి ఉంటారో,– (A sense that I am the generating and disolving source of what all being externally experienced):-

**న తే సంసారిణో భవంతి। –** అట్టి ఆత్మతత్త్వ మనన రూప మంత్రోపాసన చేయువారు సంసార బంధము కలిగియుండే ప్రసక్తియే ఉండదు.

ఈ విధంగా ఆత్మానారాయణుడగు శ్రీమన్నారాయణునిచే వివరణగా బోధించబడి, బ్రహ్మదేవుడు "విశ్వరూపధరుడు, విష్ణువు అయినట్టి శ్రీమన్నారాయణుని శ్రీమత్ దత్తాత్రేయ పరతత్త్వస్వరూపముగా ధ్యానించసాగారు. ఈ విధంగా దత్తాత్మిక–త్రిమూర్త్యంశ రూపమును భావనాత్మకంగా ఉపాసించసాగారు.

### *దత్తాత్రేయ నామములో*

"దమ్" – ఇతి "హంస"। (జీవుడు / జీవాత్మ) (The Relative Self) (ఒక సందర్భము నాదైన – 'నేను').

'దామ్' – ఇతి దీర్ఘము। (ఈశ్వరుడు)। (The All pervading self) (సమస్త సందర్భములు నావైన 'నేను').

తత్ – బీజము (కేవలమగు ఆత్మ) (The Absolute Self) **సమస్త సందర్భములకు సంబంధించక, ఆవలగా ప్రకాశించు నేనైన 'నేను'.**

బీజస్థమగు 'దామ్' – ఇది ఏకము, అక్షరము అగు పరమాత్మ (The All inclusive / comprehensive self)

(That SELF which is encompassing all else while being also beyond).

**'దత్తాత్రేయము'** అనునది తరింపజేయు **'తారకము'**. అట్టి దత్తాత్రేయతత్త్వమే ఉపాసించవలసినట్టిది. **(ఉపాసితవ్యం).** తెలుసుకోవలసినట్టిది **(జ్ఞేయమ్).** 'జన్మ' మొ॥న గర్భశోకముల నుండి తరింపజేయునది. **(గర్భాది తారణమ్।)**

***'దత్తాత్రేయ జపమంత్రమునకు'***

ఛందస్సు – **గాయత్రీ।** దేవత – **దత్తాత్రేయుడు**

ఒక చిన్న **"మర్రి విత్తనము (వటబీజము)"**లో – ఆ వటమహావృక్షముయొక్క సుదూరముగా భూమిలో విస్తరించు వ్రేళ్లు, అతి పెద్దదగు కాండము, విస్తారమైన కొమ్మ–ఉపకొమ్మలు, ఆకులు, పుష్పములు, మర్రికాయలు, వాటి వాటియొక్క భౌతిక (Physical) మరియు రసాయనిక (Chemical) వస్తు ధర్మములు, పునఃగా చిగురించటము – ఇవన్నీ కూడా – **మౌనరూపంగా** దాగి ఉంటాయి కదా!

అట్లాగే... **'దత్త'** బీజములో – (దత్–తత్–జగత్తు. జగత్తులలోని జీవుని రూపము – ఆ రెండిటికి ఆధారమైన 'తత్' మొదలైన) విశ్వవిశేషములన్నీ దాగి ఉన్నాయి.

అట్టి అక్షరమై (శాశ్వతమై) దాగి ఉన్న ద్రష్ట – దర్శన – దృశ్యముల మూలము గురించి వ్యాఖ్యానించుకొంటున్నాము.

అట్టి వ్యాఖ్యానము షట్ (6) అక్షరాంశములుగా చెప్పబడుతోంది. (ఒకే అక్షరము ఆరు అక్షర విభాగములుగా వివరించుకుంటున్నాము)

## దత్తాత్రేయ షష్టాక్షరీ - బీజ॥

| **(1) ఓం (2) శ్రీం (3) హ్రాం (4) క్లీం (5) గ్లౌం (6) ద్రాం** భగవతే దత్తాత్రేయాయ నమః। |
|---|

ఈ ఆరు → **"ఏకాక్షర దత్తాత్రేయ - షట్ బీజాక్షరములు"**

ఈ '6' బీజాక్షరములను **"నమో** భగవతే దత్తాత్రేయాయ" అని 'చివరగా ' కలిగి ఉండి జపించువారికి ఈ బీజాక్షరసహిత దత్తాత్రేయ మహామంత్రము భౌతిక - మానసిక - అధ్యాత్మికమైన సర్వ సంపదలను (దైవీగుణములు మొదలైనవాటినన్నిటినీ) సిద్ధింపజేయగలదు. యోగము యొక్క "అఖండాత్మతో మమేకము" అను యుక్తస్థితి ప్రసాదించగలదు.

- ఓం - అంగుష్టాభ్యాం నమః।
- శ్రీం - తర్జనీభ్యాం నమః।
- హ్రాం - మధ్యమాభ్యాం నమః
- క్లీం - అనామికభ్యాం నమః
- గ్లౌం - కనిష్ఠికౌభ్యాం నమః
- ద్రాం కరతలకర పృష్ఠాభ్యాం నమః

- ఓం - హృదయాయ నమః
- శ్రీం - శిరసేస్వాహా।
- హ్రాం - శిఖాయ వషట్।
- క్లీం - కవచాయ హుం।
- గ్లౌం - నేత్రత్రాయాయ వౌషట్ ।
- ద్రాం - అస్త్రాయ ఫట్।

**ఫట్ - భూర్భువస్సురాః ఇతి దిగ్బంధం.**

## దత్తాత్రేయ అష్టాక్షరీ - బీజ॥

ద్రం (లేక) ద్రాం దత్తాత్రేయాయ నమః '8' అక్షరముల మంత్రము.

| | | | |
|---|---|---|---|
| ద్రమ్ | = | దారమ్ - ప్రసాదించునది | **ద్రం / ద్రాం దత్తాత్రేయాయ నమః॥** |
| ద్రామ్ | = | దారమ్ - ఏకము చేయునది. | |
| దత్తాత్రేయ - ఇతి | = | సత్య ఆనంద చిదాత్మకము | |
| నమ - ఇతి | = | జీవన్ బ్రహ్మైక్య / దృశ్య ద్రష్టైక్య **'పూర్ణాత్మకార్థము'.** | |

**"జీవాత్మతో కూడుకొని, నాయొక్క దృశ్యానుభవముతో సహా పరమాత్మ స్వరూపుడనగు పూర్ణాత్మరూపమే"** - అను అర్థము)

## దత్తాత్రేయ ద్వాదశాక్షరీ - బీజ

**"గాయత్రీ"** ఛందః। 'సదాశివ' - ఋషిః। **"దత్తాత్రేయో"** - దేవతా।
**"దత్తాత్రేయ"** - ఇతి కీలకమ్। తదేవ బీజం। నమః శక్తిః।

**భజవతి। -**

| | |
|---|---|
| **(1) ఓం (2) ఆం (3) హ్రీం (4) క్రోం** | |
| **దత్తాత్రేయాయ స్వాహేతి** | **— 4 + 8 = 12** |

ఇది ద్వాదశీ మంత్రరాజము. (12) అక్షరములు కలిగియున్నది.

**'జగతీ' - ఛదః। 'సదాశివ' - ఋషిః। 'దత్తాత్రేయో' - దేవతా**
**'ఓం' ఇతి - బీజం। 'స్వాహా' - ఇతి శక్తిః।**
**"హ్రీ" "క్లీం" - ఇతి శీర్షే 'ఏహి' - ఇతి శిఖాయాం।**
**'దత్త' - ఇతి కవచే। "ఆత్రేయ" - ఇతి చక్షుసి।**
**'స్వాహా' ఇతి - అస్త్రే।**

తన్మయో భవతి య ఏవం వేద।

## దత్తాత్రేయ షోడశాక్షరీ - బీజ

I.

| ఓం సం బుద్ధిః ద్రం హ్రీం క్లీం ఏహి దత్తాత్రేయాయ స్వాహా॥ | — 9 + 7 = 16 |
|---|---|

ఈ షోడశాక్షరీ మహా మంత్రముయొక్క తత్త్వమును ఎరిగి, మంత్రోచ్ఛారణచే దత్తాత్రేయభగవానుని ఉపాసించువారు తన్మయుడు కాగలడు. (తదేవాహమ్‌– ఆ దత్తాత్రేయ తత్త్వమే నేను – అను) **స్వాభావిక సత్యమును సిద్ధించుకొనగలరు.**

## శ్రీ దత్తాత్రేయ షోడాశాక్షరీ మంత్ర వ్యాఖ్యానము

భక్తి, శ్రద్ధ, సేవాభావము, గురుశుశ్రూష లేనివానికి ఈ షోడసాక్షరీమంత్రరాజమును ఉపదేశించరాదు. **ప్రాణం దేయః। మానం దేయం। చక్షుర్దేయం। శ్రోత్రం దేయం। షడ్డంశ శిరశ్ఛినత్తి। షోడషాక్షరమంత్రో న దేయో భవతి।** అర్హతలేనివానికి ప్రాణమానములుగాని, కళ్లు గాని చెవులుగాని ఇవ్వవచ్చునేమో। అంతేగాని షట్‌ దర్శనశిరస్సులను (అరిషట్‌వర్గములను)ఖండించగల షోడశాక్షరీమంత్రము ప్రసాదించరాదు. ఉత్తమసేవాభావన, పరాభక్తి, సద్గుణములు గల శిష్యునికి ఈ షోడశాక్షరీ మహామంత్ర జప రహస్యార్థమును గురువు తప్పక ప్రేమగా ప్రసాదించును గాక। **అది గురు–శిష్యులిరువురికి శుభప్రదము కాగలదు.**

II. **షోడాశాక్షరీ**

| | | |
|---|---|---|
| "ఓం" - ఇతి ప్రథమం భవతి। "ఐం" ద్వితీయం। "క్రోం" తృతీయం। | | ఓం ఐం క్రోం (3) |
| "క్లీం" ఇతి చతుర్థం। "క్లాం" ఇతి పంచమం। "హ్రాం" ఇతి షష్ఠం। | | క్లీం క్లాం హ్రాం (3) |
| "హ్రీం" ఇతి సప్తమం। "హ్రూం" ఇతి అష్టమం। "సౌః" ఇతి నవమం। | | హ్రీం హ్రూం సౌః (3) |
| "దత్తాత్రేయ" - ఇతి - చతుర్దశ। (14) | | దత్తాత్రేయేతి స్వాహా (7) |
| "స్వాహా" ఇతి షోడశ॥ (2) | 14 + 2 = 16 | (16) |

III. **'గాయత్రీ' ఛందః। సదాశివ ఋషిః, దత్తాత్రేయో దేవతా।**
**'ఓం' బీజం। స్వాహా శక్తిః। చతుర్థ్యంతం కీలకం।**

| **'ఓం' ఇతి హృదయే। క్లాం క్లీం క్లూం ఇతి శిఖాయాం।** |
|---|
| **'సౌః' ఇతి కవచే। "చతుర్థతం చక్షుషి స్వాహా" ఇతి అస్త్రే ॥** |

| కరన్యాసము | అంగన్యాసము |
|---|---|
| 'ఓం' అంగుష్ఠాభ్యాం నమః। | ఓం హృదయాయ నమః |
| "క్లాం" తర్జనీభ్యాం నమః। | క్లాం శిరసే స్వాహా |
| "క్లీం" మధ్యమాభ్యాం నమః। | క్లీం శిఖయా వషట్‌ |
| "క్లూం" అనామికాభ్యాం నమః। | క్లూం కవచాయ 'హుం' |
| "సౌః" కనిష్ఠి కాభ్యాం నమః। | సౌః నేత్ర త్రయాయ వౌషట్‌ |
| "స్వాహా" కరతలకరపృష్ఠాభ్యాం నమః | స్వాహా అస్త్రాయ ఫట్‌ |

**భూర్భువస్సువ 'ఓం' – (భూః భువః సువః – ఓం) – ఇతి దిగ్బంధః॥**

| | | |
|---|---|---|
| **(ఓం) క్లాం క్లీం క్లూం సౌః భగవతే** | **(8)** | } |
| **శ్రీ దత్తాత్రేయాయ స్వాహా** | **(8)** | **8 + 8 = 16** |

పై మంత్రములలో ఏదో ఒకటి నిత్యము జపించువాడు **'సచ్చిదానంద సుఖీ, మోక్షీ'** అగుచున్నాడు.

సౌః ఇత్యంతే 'శ్రీవైష్ణవ' ఇతి ఉచ్యతే। తజ్జాపీ విష్ణురూపీ భవతి।

| | | |
|---|---|---|
| (ఓం) క్లాం క్లీం క్లూం సౌః | (5) | } (16) |
| శ్రీ వైష్ణ దత్తాత్రేయాయ స్వాహా। | (11) | |

ఈ మంత్రము జపించువాడు స్వయమ్ విష్ణురూపుడు (Al-present and Al-parvading Self) అగుచున్నాడు.

పై మంత్రములయొక్క పరమార్థమును వ్యాఖ్యానించుకొని, శ్రవణము చేసి అర్థం చేసుకోవటం చేత సర్వత్రా సమదర్శనమును **(సమస్తమునందు స్వస్వరూపాత్మను, సమస్తము స్వస్వరూపాత్మయందు)** ఇక్కడే, ఇప్పుడే ఈ జీవుడు సిద్ధించుకోగలడు.

## హరేకృష్ణ దత్తాత్రేయ మహామంత్రము

| | | |
|---|---|---|
| దత్తాత్రేయ హరేకృష్ణ ఉన్మత్తానంద దాయక। | 16 | |
| దిగంబర మునే బాల పిశాచ జ్ఞానసాగరాత్॥ | 16 | 16 + 16 = 32 |

***ఈ మంత్రమునకు -***

అనుష్టుప్ - ఛందస్సు।
సదాశివ - ఋషి।
దత్తాత్రేయో - దేవతా।

| **మంత్రము** | | **కరన్యాసము** | | **అంగన్యాసము** |
|---|---|---|---|---|
| "దత్తాత్రేయ" | - | అంగుష్ఠాభ్యాం నమః। | - | ఇతి హృదయే (హృదయాయ నమః) |
| "హరేకృష్ణ" | - | తర్జనీభ్యాం నమః। | - | ఇతి శీర్షే (శిరసే స్వాహా) |
| "ఉన్మత్తానంద" | - | మధ్యమాభ్యాం నమః। | - | ఇతి శిఖాయామ్ (శిఖాయ కషట్) |
| "దాయకమ్" | - | అనామికాభ్యాం నమః। | - | ఇతి కవచే (కవచాయ హుం) |
| "దిగంబరమ్" | - | కనిష్ఠికాభ్యాం నమః। | - | ఇతి చక్షుపి (నేత్రత్రయాయ వౌషట్) |
| "పిశాచజ్ఞానసాగర" | - | అనుష్టుభో౽యం | - | ఇతి అస్త్రే (అస్త్రాయ ఫట్) |
| (అనుష్టుప్ ఛందః) | - | మయా౽ధీతః। - ఇతి దిగ్బంధః॥ | | |

ఈ హరేకృష్ణ దత్తాత్రేయ మహామంత్రము ఉపాసించువారి యొక్క ఆ బ్రహ్మ-జన్మపర్యంతము (బ్రహ్మ నుండి జన్మ వరకు) దోషములు నివారణము అవగలవు. లోక శ్రేయోభిలాషి కాగలడు (సర్వోపకారీ). సమస్త బంధములు విడివడినవై మోక్ష స్వరూపుడు కాగలడు. ఇందలి అర్థముయొక్క అధ్యయనము మోక్షమును ప్రసాదించగలదు.

- ఇతి ఉపనిషత్-

## ద్వితీయఖండము - స్మరణమాత్ర సంతుష్టాయ

**విష్ణుభగవానుడు (శ్రీమన్నారాయణస్వామీ!)**

**'ఓం'** అని ఎలుగెత్తి పలికెదరు గాక। వ్యాహృతము నిర్వర్తించెదరుగాక। (ఓం ఇతి వ్యాహరత్)

### "నమో భగవతే దత్తాత్రేయాయ"

ఓం నమో భగవతే శ్రీదత్తత్రేయాయ। స్మరణ మాత్ర సంతుష్టాయ। మహాభయనివారణాయ। మహాజ్ఞానప్రదాయ। చిదానందాత్మనే। బాలోన్మత్తపిశాచ వేషాయేతి। మహాయోగినే అవధూతాయేతి। అనసూయానంద వర్ధనాయ। అత్రిపుత్రాయేతి। సర్వకామ ఫలప్రదాయ॥

శ్రీ దత్తాత్రేయ స్వామి → 'స్మరణ' మాత్రముచేతనే సంతోషించువారు. సంసార మహాభయమునకు నివారణోపాయము. చిదానంద స్వరూపులు. బాల - ఉన్మత్త పిశాచవేషములు ధరించువారు. మహాయోగి వరేణ్యులు. 'అవధూత' అయినట్టి వారు. మాతృదేవత అగు అనసూయాదేవికి ఆనందము కలిగించువారు - అత్రి మహర్షి కుమారులు. సమస్త కోరికలను భక్తులకు నెరవేర్చువారు.

# బీజాక్షర ఫలశ్రుతి

**"ఓం" కారముతో కలిపి(పై) "దత్తాత్రేయ" అభివర్ణనము (మంత్రము పలుకుట) వలన (వ్యాహరన్) బంధములన్నీ తొలగగలవు.**

- **"ఓం"** అను వ్యాహరణము (పలుకు)చే భవబంధమోచనము కాగలదు. **('ఓం' - ఇతి వ్యాహరేత్ భవబంధ మోచనా యేతి)।**
- **'హ్రీం'** – అను వ్యాహరణముచే సకల విభూతులు – ప్రసాదించబడగలవు. **(హ్రీం - ఇతి వ్యాహరేత్ సకల విభూతి దాయేతి)**
- **'క్రోం'** – అను వ్యాహరణము (పలుకుట)చే సాధ్యాకర్షణము లభించగలదు. **('క్రోం' - ఇతి వ్యాహరేత్ సాధ్యాకర్షణాయేతి)।** అందరికీ ఆకర్షితుడై ఉండగలడు. (Respected and liked by all).
- 'సౌః' అను వ్యాహారణములచే అనేక విధములుగా బాహ్యంగా ప్రసరించు మనస్సును నిరోధించగలరు. **(సౌః ఇతి వ్యాహరేత్ సర్వమనః క్షోభయేత్).** మనస్సును మధించి, చంచలత్వమును వదిలించి, అద్దానిని ఆత్మయందు స్థాపించగలరు.
- "శ్రీం" – అను వ్యాహరణము (శబ్దము పలుకుట)చే మహత్తరమగు 'ఓంకారము' అని పలుకుట అగుచున్నది. **('శ్రీం' ఇతి వ్యాహరేత్ మహా 'ఓం' ఇతి వ్యాహరేత్)।** జీవునియొక్క శాశ్వతత్త్వము పలకటము అగుచున్నది (చిరంజీవినే)।
- "వషట్" అని పలకటము – **"ఆత్మయొక్క పరమార్థమును మాకు వశము చేయుమని ప్రార్థన"** (వషట్ - ఇతి వ్యాహరేత్ వశీకురు। వశీకురు।)
- "వౌషట్" – అని పలకటముచే **"ఆత్మతత్త్వము నన్ను ఆకర్షించునుగాక। నాకు అన్నిటికంటే ఆకర్షితము (ఇష్టము) అగుగాక।"** అని అనటము **('వౌషట్' - ఇతి వ్యాహరేత్ ఆకర్షయ। ఆకర్షయ।)**
- **'హుమ్'** అనే పలుకుటచే అసూరీసంపత్తి (అహంకారం, దర్పము, క్రోధము, పారుష్యము, అజ్ఞానము మొదలైనవి) తొలగగలవు. (విద్వేషత్వము పొందగలవు). **(హుం-ఇతి) వ్యాహరేత్ విద్వేషయ। విద్వేషయ।)**
- **"ఫట్"** – అను పలుకుటచే (ఆసురీగుణములను, బద్ధకము – అశ్రద్ధవంటి) తమో లక్షణములు మొదలంట్ల పెకలించివేయబడగలవు. **(ఫట్ ఇతి వ్యాహరేత్ ఉచ్చాటయ। ఉచ్చాటయ)**
- **"ఠఠ"** – అను వ్యాహరము (పలుకుట)చే మనోబుద్ధి, చిత్తములయొక్క చాంచల్యమును స్తంభింపజేయటము జరుగగలదు. **(ఠఠేతి వ్యాహరేత్ స్తంభయ। స్తంభయ)**
- **"ఖఖ"** – అని పలుకుటచే అజ్ఞాన తమస్సు (Ignorance) – మర్దింపబడగలదు **(ఖఖేతి వ్యాహరేత్ మారయ। మారయ)।**

---

**ఓం భగవతే దత్తాత్రేయా।** ఈ 'విశ్వము' అనబడే సమస్తము తమ సంపదయే। **సమస్సంపన్నాయ। సమస్సంపన్నాయ** స్వాహా! సమస్తము పరిపోషిస్తూ ఉన్నది మీరే! **పోషయ। పోషయ।**

స్వామీ! నన్ను సంసార (దృశ్యముతో కామక్రోధ పూర్వక) సంబంధ కల్పింత బంధములను, (ఆత్మభావనకు వ్యతిరిక్తమగు) అన్యరూప (పర) మంత్ర – యంత్ర – తంత్రములను ఖండించి వేయండి. **(పరమంత్ర - పరయంత్ర- పరతంత్రాం ఛిందయ। ఛిందయ।).** దుష్ట గ్రహపీడనములను మాపట్ల నివారింపజేయండి **(గ్రహాన్ నివారయ। నివారయ।).**

మానసిక, శారీరక ఆధి వ్యాధులు మమ్ములను బాధించకుండా ఉపశమింపజేయండి. **(వ్యాధిం నివారయ। నివారయ।).** మా దుఃఖములను హరించివేయండి. (దుఃఖం హరయ। హరయ।) స్వామీ! దారిద్ర్యము పారిపోయేటట్లు (నిద్రావణము) చేసివేయండి. (దారిద్ర్యం నిద్రావయా। నిద్రావయ) మా దేహమును తమరు పరిపోషించి రక్షించెదరు గాక। మా చిత్తము పరిశుభ్రమై ఆనందయుక్తమై ఉండునట్లుగా తీర్చిదిద్దండి. దేహం పోషయ। పోషయ। చిత్తం తోషయ। తోషయ।

సర్వ మంత్ర, సర్వ యంత్ర, సర్వ తంత్ర, సర్వ పల్లవ (చిగురుల) 'స్వరూపుడగు పరమశివునకు నమస్కారము.

**ఓం నమః శివాయ। ఓం నమః శివాయ। ఓం నమః శివాయ**

**ఇతి ఉపనిషత్ – "ఇతి ద్వితీయ అధ్యాయః"**

## 3వ ఖండము - అష్టమూర్తి - ఫలశ్రుతి

<u>అష్టాక్షరీమంత్రము</u>

ఓం। ద్రాం దత్తాత్రేయాయ స్వాహా     దం దత్తాత్రేయాయ స్వాహా।

**1   1   5   2   = (8)**

అనుష్టుప్ - ఛందస్సు.

సదాశివ - ఋషి।

'దత్తాత్రేయో' - దేవతా।

ఓం - ఇతి బీజమ్। స్వాహా - ఇతి శక్తిః।। ద్రాం ఇతి కీలకం।

ఈ అష్టాక్షర మంత్రము అష్టమూర్తులతో కూడిన **'అష్టమంత్రము'** అగుచున్నది.

ఈ మంత్రమును అర్థపూర్వకంగా ఉపాసించటముచే - సమస్త బంధములు ముడివీడినవై, - అవన్నీ - ఆత్మ మాధుర్యమును సంతరించుకోగలవు.

(విష్ణు భగవానుడు తనకు తానే అత్రి మహర్షికి సమర్పించుకున్న - విష్ణుతత్త్వ - దత్తాత్రేయము)

ఎవ్వరైతే పైనచెప్పబడిన అష్టమూర్తీ సంజ్ఞా మంత్రమును అష్టాక్షరరూపంగా నిత్యము ఉపాసిస్తూ ఉంటారో - అట్టివారు వాయువు, అగ్ని, చంద్రుడు (సోమ), సూర్యుడు, ఆదిత్యుడు, బ్రహ్మ విష్ణువు, రుద్రులవలె (దోషములన్నీ తొలగగా) **'సోఽహమ్'** భావనను స్వాభావికరూపంగా సిద్ధించుకోగలరు.

దత్తాత్రేయ అష్టాక్షరమహామంత్రము (మరియు) తదితరములైన (ఈ దత్తాత్రేయోపనిషత్‌లోని) దశాక్షర (10), ద్వాదశాక్షర (12), చతుర్దశాక్షర (14), షోడశాక్షర (16) మొదలైన బీజాక్షరములతో కూడిన - మంత్రములు జపించుటచే శతసహస్ర (లక్ష) గాయత్రీ ఉపాసనలతో సమానఫలము పొందగలరు. అది శతమహారుద్రజపము చేసిన ఫలముతో సమానము అవగలదు. ప్రణవమును కోటి జపము చేసిన ఫలముతో సమానము కాగలదు.

ఈ దత్తాత్రేయోపనిషత్‌లోని విశేషములను శ్రవణ- మనన- ఉపాసనలు చేయువారు ఎక్కడ ఉంటే అక్కడ - **వెనుకగల వందమంది,** ముందు గల **వందమంది పునీతులు** కాగలరు.

**వారు ఉన్న పంక్తిలోని వారందరు పావనులు కాగలరు.**

గోహత్య, బ్రహ్మహత్య వంటి పాపములు చేసినవారు కూడా ఈ ఉపనిషత్తులో చెప్పబడిన బీజాక్షర - దత్తమంత్ర ఉపాసనచే అట్టి దోషములనుండి విముక్తులు కాగలరు. తులాభార వ్రతము సమర్పణ చేసినవారితో సమానమైన పవిత్రత సంతరించుకోగలరు. తినకూడనివి తినిన దోషముల నుండి నిర్మలులు కాగలరు. సూర్య మంత్ర - యోగ పారీణులు (నిర్వర్తించినవారు) కాగలరు. **బ్రహ్మమును ఎరిగి బ్రహ్మమే తామై ప్రకాశించగలరు.** (బ్రాహ్మణుడు కాగలడు).

<u>**భక్తుడైన శిష్యునికి బోధించటంచేత గురు-శిష్యులు ఇరువురు అనంత ఫలము పొందగలరు. జీవన్ముక్తులు కాగలరు.**</u>

ఈ విధంగా భగవానుడగు శ్రీమన్నారాయణుడు బ్రహ్మదేవునికి శ్రీ దత్తాత్రేయతత్త్వమును బోధించారు. విశదపరచారు.

***ఇతి దత్తాత్రేయోపనిషత్***

***ఓం శాంతిః శాంతిః శాంతిః***

అధర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 10 దేవ్యుపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ శ్రీదేవి ఉపనిషత్ విద్యా వేద్య
అపార సుఖాకృతీ।
త్రైపదం బ్రహ్మచైతన్యం
రామచంద్రపదం భజే॥



శ్రీ దేవి ఉపనిషత్ అధ్యయనముచే ఏ అపారమైన 'ఆత్మసుఖము' ప్రాప్తించగలదో, ఏ బ్రహ్మ చైతన్య త్రైపదము లభించగలదో, - అట్టి అత్యుత్తమ ఫలప్రాప్తికై శ్రీరామచంద్రుని భజించుచున్నాము.

హరిః ఓం!

1 సర్వే వై దేవా
దేవీమ్ ఉపతస్థుః।
"క్వాసి త్వం మహాదేవి?"

*ఓంకార - (సచ్చిదానంద స్వరూపిణి - అగు) జగజ్జననికి నమస్కారము.*

ఒక సందర్భములో దేవతలు జగజ్జనని, లోకమాత అగు దుర్గాదేవిని సమీపించారు. నమస్కరించి ఇట్లు ప్రశ్నించారు.

ఓ మహాదేవీ! నీవు ఎవరు? ఎవరై ఉన్నావు? (జగత్తుకీ, సమస్త జీవులకు జననివని ఆరాధించబడుచున్న) - నీయొక్క వాస్తవ రూపము ఏమిటి? నీ రూపము ఏదై ఉన్నదని మేము ఆరాధించాలి? (సాకరమా? నిరాకారమా? స్త్రీ - పురుష ఇత్యాది ఏదైనా రూపమా?)

---

సా బ్రవీత్:
అహం బ్రహ్మస్వరూపిణీ।
మత్తశ్చ సంప్రవర్తతే - (ఇదం)
ప్రకృతి - పురుషాత్మకం జగత్-
శూన్యఞ్చ - అశూన్యఞ్చ॥

త్రిలోకపావని, జగదీశ్వరి అగు దుర్గా మహాదేవి ఈ విధంగా సమాధానంగా చెప్పసాగారు.

బిడ్డలారా! దేవతలారా? నా యొక్క వాస్తవ రూపమేమిటో తెలుసుకో దలచుకొన్నారా? అయితే శ్రద్ధగా, అత్యంత సూక్ష్మ-వివేక దృష్టితో వినండి.

**1. నేను స్వయముగా 'బ్రహ్మమే' స్వరూపముగా కలిగియున్నదానను. అహం బ్రహ్మాస్మి।**
**2. ప్రకృతి-పురుషాత్మకముగు ఈ సమస్త జగత్తు నా వలననే ప్రవర్తన శీలము అవుతోంది.**
**3. నేను సమస్తమునకు మునుముందే సమస్తమునకు పరమైయున్నాను.**
**4. ఈ సమస్తము నేనే అయి ఉన్నాను. కనుక పూర్ణ (అశూన్య) స్వరూపిణిని. నాయందు ఎప్పుడూ ఈ జగత్తులనబడేవేవీ లేవు కాబట్టి-శూన్య స్వరూపిణిని కూడా!**

---

అహమ్ ఆనన్ద - అనానందౌ।
అహం విజ్ఞాన - అవిజ్ఞానే।
అహం బ్రహ్మ బ్రహ్మణీ వేదితవ్యే। =
= ఇతి ఆహ అథర్వశ్రుతిః॥

- ఆనంద స్వరూపిణిని. అయితే నా ఉనికి చేతనే 'ఆనన్దము' ఉనికి కలిగియున్నది కాబట్టి ఆనందమునకు ఆవలి స్వరూపినికాబట్టి 'అనానన్దము'ను కూడా! 'ఆనందము' - నానుండి బయల్వెడలే ఒకానొక విలక్షణ లక్షణము.

- విజ్ఞానము (తెలియబడేదంతా) నేనే! తెలియబడనిది కూడ నేనే। తెలియబడేది, తెలియబడనిది కూడా నా 'తెలివి'యొక్క ప్రదర్శనా చమత్కారములే! అట్టి 'తెలివి' నాయొక్క ప్రదర్శనమే।

- **బ్రహ్మము నేనే!** ఆ బ్రహ్మమును తెలుసుకొంటున్నదీ నేనే। బ్రహ్మముగా తెలియబడేదీ నేనే. బ్రహ్మము గురించి ఏ మాత్రము తెలియనివాడు కూడా నేనే! నేనే బ్రహ్మమై ఉండగా నాకు బ్రహ్మము తెలియబడటమనే ప్రసక్తి ఎక్కడిది?

**ఈవిధంగా అథర్వణ శ్రుతి (అథర్వణవేదము) నాగురించి స్తుతించుచున్నది.**

| | |
|---|---|
| **2. అహం పంచభూతాని - అపంచభూతాని।**<br>**అహమ్ అఖిలం జగత్।** | భూమి - జలము - అగ్ని - వాయువు - ఆకాశముగా ఉన్నది నేనే! అపంచ భూతములైనట్టి దేహి-మనో-బుద్ధి-చిత్త-అహంకారములు కూడా నేనే! ఈ జగత్తుగా కనబడేదంతా నా స్వరూపమే। ఈ జగత్తంతా నేనే। |
| **వేదోఽహమ్। అవేదోఽహమ్।**<br>**విద్యాహమ్। అవిద్యాహమ్।**<br>**అజాహమ్। అనజాహమ్।** | (కథ-కథా రచయితకు వేరుకానితీరుగా) -తెలియబడేదంతా నేనే! అయితే తెలియ బడేదానికి సంబంధమే లేనిది నా స్వరూపము. అందుచేత తెలియబడేదాని పరిమితము కాదు. **తెలుసుకుంటున్న స్వరూపమే నేనై ఉండగా-తెలియబడేది నేనెట్లా అవుతాను? నాటకంలో ఒక పాత్రకు తెలిసినది, తెలియనిది కూడా రచయితకు చెందినదే కదా!**<br>విద్యను నేనే! అవిద్యను నేనే! తెలియనివాడు కూడా నా రూపము కాని క్షణమే లేదు. **విద్య - అవిద్యా స్వరూపుణిని।**<br>**నాకు జన్మలే లేవు. జన్మరహితను. కానీ, జన్మలన్నీ నాకు చెందినవే కాబట్టి అనజాస్వరూపినిని - జన్మసహితను కూడా!** |
| **అథశ్చ ఊర్ధ్వశ్చ తిర్యక్ చ అహగ్ం।**<br>**(అహగ్ం) రుద్రేభిః వసుభిః చరామి।**<br>**అహమ్ ఆదిత్యైః ఉత విశ్వదేవైః।**<br>**అహం మిత్రా వరుణా ఉభౌ బిభర్మి।** | ఈ సమస్త జగద్దృశ్యమునందు పైన, క్రింద, వెనుక, ముందు అంతటా నిండిఉన్నది నేనే. ఏకాదశ రుద్రులతో, అష్ట వసువులతో కూడి ఈ లోకములన్నీ సంచారములు చేస్తూ ఉంటున్నాను.<br>నాకు ఏమాత్రము అన్యము కానట్టి - ఆదిత్యునితోను, విశ్వేదేవునితోను, మిత్రా వరుణులతోను (సూర్య జలరూపములతో) కూడి లోకములన్నీ పాలిస్తూ, ఉన్నదానను. వీరందరిని ధారణ చేస్తూ భరిస్తూ ఉన్నట్టిదానను. |
| **(అహమ్) ఇంద్ర-అగ్నీ, అహమ్ అశ్వినా ఉభే।**<br>**అహగ్ం సోమం త్వష్టారం**<br>**పూషణం భగం దధామి అహమ్।**<br>**(అహం) విష్ణుమ్ ఉరుక్రమం**<br>**బ్రహ్మాణమ్ ఉత ప్రజాపతిం దధామి।** | ఇంద్ర, అగ్ని, అశ్వినీ దేవతలుగా ఉన్నది నేనే। అవన్నీ నా స్వరూపమే।<br>సోముని (చంద్రుని), త్వష్టను, పూషణుని, భగుని ధరించుచున్నట్టిదానను.<br>అట్లాగే ఆత్మస్వరూపిణిగా నేనే - విష్ణువును. ఉరుక్రమునిని (త్రివిక్రముని, వామనుని). బ్రహ్మను. ప్రజాపతిని. అస్మత్ స్వరూపములుగా నన్ను నేనే ప్రదర్శించు చున్నట్టి దానను.<br>నా ధారణ (Holding Activity) యొక్క సంప్రదర్శనా - విశేషములే వారంతా। |
| **అహం దధామి ద్రవిణగ్ం**<br>**హవిష్మతే సుప్రావ్యేయే**<br>**యజమానాయ సున్వతే।**<br>**అహగ్ం రాష్ట్రీ సంగమనీ వసూనామ్।** | యాగము నిర్వర్తించటానికి సిద్ధపడుచున్న యజ్ఞకర్తకు యాగఫలము, సంపదలు - ఇవన్నీ హవిష్మంతనగు నాచేతనే ప్రసాదించబడుచున్నాయి. రాష్ట్రిని. లోకములన్నిటికీ యజమానిని. అష్టవసువులకు సంగమనీని నేనే!<br>వస్తువులన్నీ సంగమము (Get Lost into) పొందునది నాయందే! |
| **అహగ్ం సువే పితరమ్ అస్య మూర్ధన్।**<br>**మమ యోనిః అప్సుః అన్తః సముద్రే।**<br>**య ఏవం వేద, స దేవీపదమ్ ఆప్నోతి।** | పిత్రులోకములోని పిత్రుదేవతలందరినీ నా యొక్క మూర్ధము (ముఖము యొక్క ఊర్ధ్వభాగమునందు-నుదురు నందు) కలిగియున్నదానను.<br>నా గర్భమునందే సప్త సముద్ర జలము ఏర్పడి ఉన్నది.<br>ఎవరు ఈ విధంగా నన్ను తెలుసుకుంటారో అట్టివారు "దేవీపదము"ను పొందగలరు. |
| <u>**తే దేవా అబ్రువన్:**</u><br>**నమో దేవ్యై। మహాదేవ్యై। శివాయై - సతతం నమః।**<br>**నమః ప్రకృత్యై భద్రాయై, నియతాః ప్రణతాః స్మతామ్।।** | <u>**దేవతలు అమ్మతో ఇట్లా పలికారు.**</u><br>మహాదేవి, శివానందిని - అగు దేవికి సతతము (ఎల్లప్పుడు) నమస్కరిస్తున్నాము. ప్రకృతి స్వరూపిణి అయి, మాకు భద్రము కలిగించగల 'భద్ర' అయినట్టి దేవదేవికి నియతముగా, నిష్ఠతో ప్రణామములు సమర్పిస్తున్నాము. మాలోని ఆ భద్రస్వరూపిణికి నమస్కారము. |
| **3 తామ్ అగ్నివర్ణాం తపసా జ్వలంతీం,**<br>**వైరోచనీం కర్మఫలేషు జుష్టామ్।**<br>**దుర్గాం దేవీగ్ం శరణమ్ అహం ప్రపద్యే**<br>**సుతరాం నాశయతే తమః।।** | అగ్నివర్ణముతో వెలుగొందుచున్నట్టిది, తపోశక్తిచే ప్రకాశించుచునది, తన పట్ల తపన గల తాపసుల హృదయములలో ప్రకాశించునది, కర్మ ఫలములములను స్వీకరించి ఆత్మజ్ఞానము రోచనము (ప్రకాశమానము) చేయునది, అజ్ఞానాంధకారమును మొదలంట్లా (పూర్తిగా) పటాపంచలు చేసి జ్ఞానజ్యోతిని మా యందు వెలిగించునది - అగు **శ్రీ దుర్గాదేవిని స్తుతిస్తూ శరణువేడుచున్నాము. తరింపజేయు తల్లీ! నమస్కారము.** |

| | |
|---|---|
| **దేవీం వాచమజనయంత**<br>**దేవాస్తాం విశ్వరూపాః**<br>**పశవో వదంతి।**<br>**సా నో మంద్రేషమ్ ఊర్జం దుహానా**<br>**ధేనుః వాక్ అస్మాన్ ఉపసుష్టుతైతు।** | మాతా! దేవతలు నిన్ను 'జన్మరహిత' గాను, 'విశ్వరూపిణి'గాను దర్శిస్తూ స్తుతిస్తున్నారు. ఓ దేవీ! నీవు అవాఙ్మానస గోచరమై (మాటకు యోచనకు అందనిదానివై) ఉండి కూడా, - **వాక్కుకు జనన స్థానమై, వాక్కుగా ప్రదర్శన మగుచున్నావు**. పశువులము (జీవులము) అగు మేము నిన్ను దేవతలకు నివాస స్థానముగాను, సమస్త దేవతా స్వరూపిణిగాను, విశ్వరూపిణిగాను దర్శించు చున్నాము. నమస్కరిస్తున్నాము.<br>మంద్రము (గంభీరమైన స్వరము)తో వాక్ ధేనువువై వేగముగా రమ్ము. మేమున్న చోటికి వచ్చి ఆశీనురాలవై మాకు ఆప్తవాక్కు వినిపించెదవుగాక। మాచే ఉత్తమ వాక్కు పలికించెదవు గాక! |
| **కాళరాత్రిం బ్రహ్మస్తుతాం**<br>**వైష్ణవీగ్ం స్కందమాతరమ్।**<br>**సరస్వతీం అదితిం**<br>**దక్ష దుహితరం నమామః, పావనాగ్ం శివామ్।** | కాళరాత్రిదేవిగా, బ్రహ్మదేవునిచే కూడా స్తుతించబడుదానివి, విష్ణు స్వరూపిణివి (వైష్ణవి), దేవతా సేనాని అగు స్కందునికి తల్లివి - అగు నీకు నమస్కారము.<br>సరస్వతి అయి విరాజిల్లుచున్నట్టి దానివి, దేవతలకు తల్లి అగు అదితివి, దక్షప్రజాపతి యొక్క పుత్రికవు (దాక్షాయణివి), శివానందస్వరూపిణివి, మమ్ము పావనము చేయుదానివి - అగు దుర్గాదేవీ! నమో నమః। |
| **మహాలక్ష్మీం చ విద్మహే**<br>**సర్వ సిద్ధాశ్చ ధీమహి।**<br>**తన్నో దేవీ ప్రచోదయాత్।** | అమ్మా! ఈ విశ్వమంతా నీదే! నీవే! ఈవిదంగా నీ యొక్క మహాలక్ష్మీ స్వరూపమును, మహిమను ఎరుగుచున్నాము. కీర్తిస్తున్నాము. సర్వసిద్ధి ప్రదాతవగు నిన్ను బుద్ధితో ధ్యానిస్తున్నాము.<br>**అట్టి దేవి మా బుద్ధిని వికసింపజేయును గాక!** |
| **అదితిః ఇహ జనిష్ట దక్ష యా**<br>**దుహితా తవ।**<br>**తాం దేవా అన్వజాయంత**<br>**భద్రా అమృత బంధవః।** | (దేవతలకు జనని అగు) అదితి నీకు కూతురుగా పుట్టి, ఆ తరువాత దేవతలగు మాకు జనని అయి - మాకు జననము ప్రసాదించినది. అట్టి మాతామహివగు నీకు నమస్కరిస్తున్నాము.<br>భద్ర, అమృత, లోక బాంధవి, దేవతలకే దేవత, దేవతలను సృష్టించు దానివి - అగు నీకు నమస్కారము. త్రిలోక బాంధవీ! త్రిలోక పావనీ! నమో నమః) |
| **కామో యోనిః కామ కలా**<br>**వజ్రపాణిః గుహా హస**<br>**మాతరిశ్వ అభ్రం ఇంద్రః।** | - ఈ సమస్తము ఎవరి 'ఇష్టము' నుండి జనిస్తోందో అట్టి '**కామయోని**'కి నమస్కారము.<br>- కళాస్వరూపిణి అగు '**కామకల**'కు నమస్కారము. ఈ జగత్తులన్నీ నీ ఇష్టములోనుంచి పుట్టినవే!<br>- వజ్రపాణి స్వరూపిణివై, సర్వహృదయ స్వరూపిణివై, వాయు స్వరూపిణివై, మేఘస్వరూపిణివై, మేఘనాధుడగు ఇంద్రునివై విరాజిల్లుచున్న జననీ। నమోనమః। |
| **- పునః గుహా సకలా మాయయా చ।**<br>**- పునః కోశా విశ్వమాతాది**<br>**విద్యోమ్ (విద్ య ఓం)।** | సమస్త జీవుల హృదయగుహలలో మాయాస్వరూపిణివై నీవు ప్రత్యక్షమైయ్యే ఉన్నావు.<br>- (అన్నమయ - ప్రాణమయ - మనోమయ - విజ్ఞానమయ - ఆనందమయ) పంచకోశములలో వేంచేసియున్న దానవు. విశ్వమాతవు. సమస్తమునకు ఆది స్వరూపిణివి. విత్ (ఎరుక) స్వరూపిణివి. ఓంకార స్వరూపిణివి। అట్టి దేవికి నమస్కారము. |
| **ఏష ఆత్మశక్తిః। ఏషా విశ్వమోహినీ।**<br>**పాశ - అంకుశ-ధనుర్బాణ ధరా।**<br>**ఏషా శ్రీ మహావిద్యా।**<br>**య ఏవం వేద, స శోకం తరతి॥** | ఈ దేవాది దేవియే సర్వజీవులలోని ఆత్మశక్తి। ఆత్మోన్నత్య స్వరూపము।<br>తన విశ్వరూపముతో జీవులందరినీ మోహింపజేయు దేవి।<br>అట్టి ఆత్మశక్తి స్వరూపిణి, విశ్వమోహిని, పాశ-అంకుశ ధనుర్బాణములు ధరించినది అగు దేవీ। నీకు నమస్కారము. నీవే మహా విద్యాస్వరూపిణివి.<br>**అట్టి ఈ దేవీతత్త్వము తెలుసుకొన్నవాడు సమస్త శోకముల నుండి తరించగలడు. (Gets relieved of all worries)** |

| | |
|---|---|
| **4. నమస్తే అస్తు భగవతి**<br>**భవతీ। మాతః అస్మాన్**<br>**పాతు సర్వతః।**<br>**సైషాష్టౌ(స ఏషా అష్టౌ) వసవః।**<br>**స ఏషా ఏకాదశ రుద్రాః।**<br>**స ఏషా ద్వాదశాదిత్యాః।**<br>**స ఏషా విశ్వే దేవాః।** | **'న'** = పరమాత్మవై , **'మ'** = జీవాత్మగా కూడా **అస్తే** = ఉన్నదానా!<br>నమస్తే = తే నమః। అట్టి జీవాత్మగా కూడా ఉన్న దేవికి నమస్కారము సమస్తమును వెలిగించు ఓ భగవతీ। సమస్తముగా ప్రదర్శనమగుచున్న ఓ భవతీ! మాతా! నమోనమః। అట్టి ఈ తల్లి నన్ను అన్నివైపుల నుండి రక్షించునుగాక।<br>(అపుడు, ధ్రువుడు, సోముడు, అధ్వరుడు, అనిలుడు, ప్రత్యూషుడు, అనలుడు, ప్రభాసుడు అను పేర్లు గల) అష్టవసువులుగా ఉన్నది - ఈ దేవదేవియే।<br>(అజుడు, ఏకపాదుడు, అహిర్బుధ్న్యుడు, హరుడు, శంభుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, ఈశానుడు, త్రిభువనుడు, త్వష్ట (విశ్వకర్మ), రుద్రుడు - అనుపేర్లుగల) **ఏకాదశ రుద్రులు**గాను, వరుణుడు, అంశుమంతుడు, భగుడు, త్వష్ట, సవిత, విష్ణువు, ఇంద్రుడు - అను పేర్లుగల **ద్వాదశాదిత్యులు గాను** వెలుగొందుచున్నది ఈ మహాదేవియే.<br>సర్వతత్త్వ స్వరూపిణి అగు ఈ దేవియే విశ్వేదేవుడు. (The Design Engineer of the Universe) రూపమును దాల్చి విశ్వమును రచించుచూ నడిపిస్తోంది. |
| **సోమపా అసోమపాశ్చ।**<br>**స ఏషా యాతుధానా అసురా,**<br>**రక్షాగ్ంసి పిశాచా యక్షాః సిద్ధాః।**<br>**స ఏషా సత్త్వ రజః తమాగ్ంసి।**<br>**స ఏషా ప్రజాపతి, ఇంద్ర, మనవః।** | యజ్ఞమునందు సోమము పానము చేయు **యజ్ఞకర్త**, సోమపానము చేయని తదిత **అధ్వర్యులు** కూడా ఈ దేవియే। **యజ్ఞరూపిణి** అయి ఆయా **యజ్ఞాంతర్భాగములుగా** వెలయుచున్నది.<br>ఈ దేవియే అసురులుగా, రాక్షసులుగా, పిశాచములుగా, యక్షులుగా, (ఇదంతా నేను సిద్ధించుకొనుచున్నదే కదా!" అను సిద్ధభావన గల) **సిద్ధులుగా** ప్రదర్శనమగుచున్నది.<br>సత్త్వ రజో తమో గుణములు → త్రిగుణాతీత అగు ఈ దేవీ గుణ విశేషములే.<br>ఈ తల్లియే ప్రజాపతి, ఇంద్ర, మనువు రూపములు దాల్చి సృష్టికి కార్యకర్త అగుచున్నది. |
| **స ఏషా గ్రహ నక్షత్ర జ్యోతీగ్ంషి,**<br>**కలా కాష్ఠాది కాలరూపిణీ।**<br>**తామ్ అహం ప్రణౌమి నిత్యమ్,**<br>**తాపహారిణీం దేవీం**<br>**భుక్తిముక్తి ప్రదాయినీమ్।** | ఈ దేవియే జ్యోతిర్మండల రూపిణి అయి గ్రహ, నక్షత్ర పాలపుంతల రూపములుగా విరాజిల్లుచున్నది.<br>కల (మార్పు చెందునది - Changing Factor), కాష్ఠ (మార్పు చెందనిది - Constant Factor) అగు **కాలః కాలస్వరూపిణి** ఈ దేవియే।<br>అట్టి దేవదేవీ! నీకు అనుక్షణికంగా నమస్కరిస్తున్నాము. నిత్య సత్యమగు నీకు నమో వాక్కములు.<br>సర్వతాపములు తొలగించునది. భుక్తిముక్తి ప్రదాయిని అగు దేవాది దేవికి స్తుతులు సమర్పిస్తున్నాము. |
| **అనంతాం విజయాగ్ం**<br>**శుద్ధాగ్ం శరణ్యాగ్ం శివదాగ్ం శివామ్।**<br>**వియదీకార (వియత్ 'ఈ' కార) సంయుక్త**<br>**వీతిహోత్ర సమన్వితమ్।** | అనంత విజయ ప్రసాదిని. శుద్ధ స్వరూపిణి. 'శివా' నామధేయిని. 'శరణు' - అన్నవారిని శివత్వము ప్రసాదించునది! వియత్తు (ఆకాశ) 'ఈ' ఆకారస్వరూపిణి. వీతిహోత్రునితో (అగ్ని, సూర్యునితో) కూడుకొన్నట్టిది. అట్టి జననీ! నమో నమః। |
| **అర్థేందులసితం దేవ్యా బీజగ్ం సర్వార్థ సాధకమ్।**<br>**ఏవం ఏకాక్షరం మంత్రం యతయః శుద్ధ చేతసః**<br>**ధ్యాయంతి పరమానందమయ జ్ఞానాంబురాశయః।** | అర్ధచంద్రునితో అలంకరించబడి ప్రకాశించుదేవి. [అష్టమీచంద్ర విభ్రాజ దళికస్థల శోభితా। - (లలితాసహస్రం)] చతుర్విధ పురుషార్థ సాధకములకు బీజ స్వరూపిణి. **"ఓం! ఇత్యేకాక్షరమ్ బ్రహ్మ"** అను దేవీతత్త్వము - 'శుద్ధము' అయిన బుద్ధి గలవారిచే, తమ పరమానందమయమైన జ్ఞాన గాన జలతరంగములతో ధ్యానించబడుతోంది. |

| | |
|---|---|
| వాఙ్మయీ బ్రహ్మభూః,<br>తస్మాత్ షష్ఠం వక్త్ర సమన్వితమ్।<br>సూర్యో వామః శ్రోత్రబిందుః।<br>సంయతి అష్ట తృతీయకమ్,<br>నారాయణేన సంయుక్తో<br>వాయుశ్చ అధర సంయుతః<br>విచ్చే నవార్ణకో అర్ణస్స్యాత్<br>మహదానంద దాయకః। | ఈ దేవి వాక్కు స్వరూపిణి. వాక్‌మయి. బ్రహ్మము స్వరూపముగా కలిగియున్నట్టిది. అట్టి వాఙ్మయి స్వరూపిణి సృష్ట్యభిమాని యగు బ్రహ్మతోను, భూమితోను '6' (దృశ్య-దర్శన-ద్రష్ట-(జీవ)-ఈశ్వర-తురీయ-తురీయాతీత) ముఖముల సమన్వితమై భక్తుల హృదయాలలో ప్రత్యక్షమగుచున్నది.<br>సూర్యుడు, వామదేవుడు, శ్రోత్ర బిందువు. 3వ రూపముగా అష్టవిధ ప్రకృతి కలిగియున్నది. శ్రీమన్నారాయణునితో కూడుకొని ఉన్నది, వాయువు అధరము (క్రింద పెదవి)గా కలిగియున్నట్టిది. (**"ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే"**- అను) నవార్ణవ మహామంత్రరూపిణి అగు ఆ శ్రీదేవి జీవులకు మహానందప్రదాత అయి ఉన్నది. |
| **5** హృత్ పుండరీక మధ్యస్థాం<br>ప్రాతః సూర్య సమప్రభామ్।<br>పాశ అంకుశ ధరాగ్ం సౌమ్యాం<br>వరదాభయ (వరద అభయ) హస్తకామ్।<br>త్రినేత్రాగ్ం రక్త వసనాం<br>భక్త కామదుఘాం భజే।<br>నమామి త్వాం అహం దేవి<br>మహాభయ వినాశినీమ్॥ | ఓ దేవదేవీ! దేవాది దేవీ! జగజ్జననీ! లోక బాంధవీ!<br>సమస్త ప్రాణుల హృదయ పద్మముల మధ్యగా వేంచేసియున్నట్టిదానవు, ఉదయించుచున్న ప్రాతఃకాల సూర్యునితో సమానంగా కాంతిపుంజములు వెదజల్లుదానవు.<br>పాశము - అంకుశము ధరించుదానవు. పరమ శాంతమగు సౌమ్య స్వరూపిణివి. భయమును పోగొట్టి వరద ప్రదానము చేయు అభయ హస్తముద్ర కలిగి ఉన్నట్టిదానవు. త్రినేత్రములు కలిగినట్టిదానవు, ఎర్రటి వస్త్రములు ధరించినట్టిదానవు. సంసార మహా భయము నుండి మమ్ములను కాపాడగల గౌరీదేవీ! **నమామి త్వాం అహందేవీ।** నీకు నేను నమస్కరిస్తున్నాను. **నమో నమో నమో నమః॥ సమస్త జీవులలో 'నేను'-రీపంగా ఉన్న దేవీ! నమో నమః॥** |
| మహాదుర్గ ప్రశమనీం<br>మహాకారుణ్య రూపిణీమ్।<br>= యస్యాః స్వరూపం బ్రహ్మాదయో<br>న జానంతి, తస్మాత్<br>ఉచ్యతే "అజ్ఞేయా"।<br>= యస్యా అంతో న విద్యతే,<br>తస్మాత్ ఉచ్యతే "అనంతా"। | (అజ్ఞాన కారణంగా మాపైకి వచ్చి పడుచున్న) బహు కష్టములు అనబడే మహా దుర్గములను (ఆపదలను) ప్ర-శమింపజేయు దేవీ దుర్గా!<br>గొప్ప కరుణను వర్షింపజేయు మహాకారుణ్య స్వరూపిణీ! నమస్కారము!<br>**ఓం అజ్ఞేయా!** : ఈ దేవి యొక్క సర్వాత్మకానంద స్వరూపము - బ్రహ్మ మొదలైన వారికికూడా 'తెలియనిదే' అగుచుటచేత ఆ తల్లి 'అజ్ఞేయా' అనబడుచున్నది.<br>**ఓం అనంత దేవీ స్వరూపిణీ!**<br>ఆది - అంతములు లేనట్టిది కాబట్టి **"అనంతా।"** - అనబడుచున్నది. |
| = యస్యా గ్రహణం నోపలభ్యతే,<br>తస్మాత్ ఉచ్యతే "అలక్ష్యా"।<br>= యస్యా జననం న ఉపలభ్యతే, (నోపలభ్యతే)<br>తస్మాత్ ఉచ్యత "అజా"।<br>= ఏకైవ సర్వత్ర వర్తతే<br>తస్మాత్ ఉచ్యత "ఏకా"। | **ఓం అలక్ష్యా!** దేవి యొక్క కేవల రూపము ఇంద్రియములకు విషయమే కాదు కనుక "అలక్ష్యా!" - అని పిలుస్తున్నాము.<br>**అజా !** 'ఆ దేవి యొక్క జననము ఇది' అనునది అలభ్యము కాబట్టి అజా! (జన్మకర్మలకు ఆవల పరమశాంతమై స్వస్వరూపముగా వేంచేసియున్నది).<br>**ఏకా !** ఏకమే అయి ఉండి సర్వత్రా (అనేకముగా) వర్తిస్తూ ఉండటం చేత **"ఏకా"** అని పిలువబడుచున్నది. |
| = ఏకైవ విశ్వరూపిణీ<br>తస్మాత్ ఉచ్యతే "అనైకా"।<br>అత ఏవ ఉచ్యతే →<br>అజ్ఞేయా అనన్తా అలక్ష్యా చ<br>ఏక అనైక–ఇతి॥ | **అనేకా!** అనేకముగా కనిపిస్తున్నదంతా ఆ దేవీ స్వరూపమే కాబట్టి ఆ దేవి విశ్వరూపిణిగా 'అనేకా' అనబడుతోంది.<br>ఈ విధంగా దేవి గురించి "అజ్ఞేయా, అనన్తా, అలక్ష్యా, ఏకా, అనేకా" -గా చెప్పబడుచూ ఉండగా, ఆ మహాదేవికి అవన్నీ సార్థకనామములు అగుచున్నాయి. ఆ దేవియే మనందరి రూపముగా- **"వినోదిని"** అయి వేంచేసి ఉన్నది. |

| | |
|---|---|
| **మన్త్రాణాం మాతృకా దేవీ।**<br>**శబ్దానాం జ్ఞానరూపిణీ।**<br>**జ్ఞానానాం చిన్మయాతీతా।**<br>**శూన్యానాగ్ం శూన్య సాక్షిణీ।**<br>**యస్యాః పరతరం నాస్తి,**<br>**సైషా (స ఏషా) "దుర్గా" – ప్రకీర్తితా।** | ఓ దేవీ! సమస్త మంత్రములకు నీవు మాతృకవు. మాతృదేవతవు.<br>సమస్త - శబ్దముల అర్థము, ఆ అర్ధముతో తెలియవచ్చే పరాకాష్ఠజ్ఞాన రూపము నీదే। జ్ఞానములన్నిటికీ చిన్మయాతీతవు (తెలియటమునకు ఆవల తెలుసుకొనుచున్నవాని రూపము) నీవే।<br>శూన్యమునకు కూడా (ఆలోచనా రాహిత్యమునకు, భావనారాహిత్యమునకు) **సాక్షి** అయి వెలుగొందుచున్నట్టిదానవు. నమో నమః।<br>దేనికైతే ఇంక ఏదీ శేషించి లేదో, అట్టి పరతరమగు - 'దుర్గ' అని ఆత్మతత్త్వజ్ఞులచే బహుకీర్తించబడుచున్నది. ఎద్దానికి 'వేరు' అనునది ఏమాత్రము లేదో, అదియే దుర్గాదేవి। |
| **దుర్గాత్ సంత్రాయతే యస్మాత్**<br>**దేవీ దుర్గేతి కథ్యతే॥**<br>**ప్రపద్యే శరణం దేవీం**<br>**'దుం'–దుర్గే**<br>**దురితం హర।** | దుర్గమముల నుండి (కష్టతర సందర్భముల నుండి) ఎవరైతే తరింపజేయగలరో (Solving at its core), వారే **"దేవీ దుర్గ"** అని మాచే పిలువబడుతోంది.<br>**'దుం'**। దుఃఖములను, దురితములను హరింపజేయు దుర్గాదేవిని స్తుతిస్తున్నాను. శరణువేడుచున్నాము. |
| **6** **తాం దుర్గాం దుర్గమాం దేవీం**<br>**దురాచార విఘాతినీమ్।**<br>**నమామి భవభీతో అహగ్ం**<br>**సంసారార్ణవ తారిణీమ్।** | అజ్ఞానము చేత అనేక దురాచారములు నిర్వర్తించిన మేము, ఆ దుష్ట-సంస్కారములు జయించలేక దుర్గమమైన దురాచార నివారణార్థమై, ఈ దుర్గాదేవికి నమస్కరిస్తున్నాము.<br>**"ఈ జగత్తు నిజముగానే ఉన్నది"** అను భవభీతిరూప దుర్వ్యసనముచే ప్రాప్తించిన భవరోగమునకు భయభీతులమై సంసార సాగరమును దాటించగల నిపుణత గల దుర్గాదేవికి నమస్కారము చేస్తున్నాము. |
| **ఇదం అథర్వశీర్షం యో అధీతే,**<br>**స పంచాథర్వణశీర్ష (పంచ – అథర్వణశీర్ష)**<br>**జపఫలం అవాప్నోతి।** | ఈ 'అథర్వశీర్షము' ఎవరైతే అధ్యయనము చేసి అంతరార్థమును ఎరుగుచున్నారో - అట్టివారు **'పంచాథర్వణశీర్ష జపము'**ను చేసిన ఫలమును పొందగలరు. |
| **ఇదం అథర్వశీర్షం జ్ఞాత్వా**<br>**యో అర్చాగ్ం స్థాపయతి,**<br>**శతలక్షం ప్రజప్త్వాఽపి,**<br>**సో అర్చాసిద్ధిం చ విందతి॥** | ఈ అథర్వ శీర్షము' యొక్క పరమార్థమును తెలుసుకొని ఎవరైతే ఆ దేవదేవి యొక్క అర్చనా ప్రతిమను (విగ్రహమును) స్థాపించి అర్చిస్తారో, వారు శత లక్షసార్లు జపించినవానితో సమానముగా 'అర్చనసిద్ధి'ని పొంది ఆనందరూపి అగు దేవదేవితో మమేకమై ఆనందించగలరు. |
| **శతమ్ అష్టోత్తరం చ అస్యాః**<br>**పురశ్చర్యావిధిః స్మృతః।**<br>**దశవారం పఠేద్యస్తు**<br>**సద్యః పాపైః ప్రముచ్యతే।**<br>**మహాదుర్గాణి తరతి**<br>**మహాదేవ్యాః ప్రసాదతః।** | ఈ అథర్వ శీర్షదేవీ ఉపనిషత్ - 108సార్లు పునశ్చరణ విధిగా, (108 సార్లు అర్థ పూర్వకంగా చదవటము) - ఉపాసనకై ఉపాయముగా చెప్పబడుతోంది.<br>10 సార్లు ఈ ఉపనిషత్తును పఠనము చేసినవాడు సర్వపాపముల నుండి **సద్యోముక్తుడు** (Relieved here and now) కాగలడు.<br>ఈ "దేవ్యుపనిషత్"ను ఉపాసించువారు మహాదేవి యొక్క కరుణచే భయానక మహాదుఃఖముల నుండి, పెద్దకష్టముల నుండి తరించగలరు. |
| **ప్రాతః అధీయానో**<br>**రాత్రికృతం పాపం నాశయతి।**<br>**సాయమ్ అధీయానో**<br>**దివసకృతం పాపం నాశయతి।** | ఉదయము యొక్క అధ్యయనముచే రాత్రి చేసిన పాపములు నశించగలవు.<br>సాయంకాలము చేయు అధ్యయనముచే పగలు చేసిన పాపముల దుష్టఫలములు సమసిపోగలవు. |

| | |
|---|---|
| **తత్ సాయం ప్రాతః**<br>**ప్రయుంజానః పాపో అపాపో భవతి।**<br>**నిశీథే తురీయ సన్ధ్యాయాం**<br>**జప్త్వా వాక్ సిద్ధిః భవతి।**<br>**నూతన ప్రతిమాయాం జప్త్వా**<br>**దేవతా సాన్నిధ్యం భవతి।** | ఉదయము సాయంకాలముల దేవ్యుపనిషత్ ఉపాసనలచే పాపి కూడా పాపదృష్టుల నుండి విడివడి "అపాపి" కాగలడు.<br>తురీయ సంధ్యయందు [ 6 am; 12 Noon; 6 pm; 12 Midnight లయందు] దేవీ మహాత్మ్యము చెప్పుకొంటూ ఈ ఉపనిషత్ జపించటం చేత 'వాక్సిద్ధి' లభించగలదు. వాక్కు శుద్ధి పొందగలదు.<br>క్రొత్తగా తయారైన ప్రతిమకు ఎదురుగా జపించటం చేత **శ్రీ దేవీ దేవతా సాన్నిధ్యము** పొందగలరు. |
| **ప్రాణప్రతిష్ఠాయాం జప్త్వా**<br>**ప్రాణానాం ప్రతిష్ఠా భవతి।** | దేవీ ప్రతిమ (లేక) విగ్రహము వద్ద 'ప్రాణప్రతిష్ఠ' సందర్భములో ఈ దేవీ ఉపనిషత్తును పారాయణము చేస్తే, విగ్రహము (లేక) ప్రతిమయందు దేవీ ప్రాణప్రతిష్ఠ దిగ్విజయంగా జరుగగలదు. మహత్తరమగు మహిమగల విగ్రహము రూపొందగలదు. |
| **భౌమ అశ్విన్యాం మహాదేవీ**<br>**సన్నిధౌ జప్త్వా,**<br>**మహా మృత్యుం తరతి। –**<br>**– య ఏవం వేద॥**<br>***<u>ఇతి శ్రీ దేవ్యుపనిషత్॥</u>***<br>***<u>ఓం శాంతిః శాంతిః శాంతిః॥</u>*** | భౌమవారము (మంగళవారము), అశ్వనీ నక్షత్రము (మొదలైన) పరవడి రోజులలో ప్రారంభించి - ఈ ఉపనిషత్ తాత్పర్యమును ఎరుగుచూ ఎలుగెత్తి మహాదేవీ విగ్రహము సమక్షములో జపించటంచేత, అట్టివాడు **'మహామృత్యువు'** నుండి తరించగలడు.<br>***<u>ఇతి శ్రీ దేవ్యుపనిషత్</u>***<br>***<u>(అథర్వశ్రుతి - అథర్వశీర్షము।)</u>***<br>***<u>ఓం శాంతిః శాంతిః శాంతిః॥</u>*** |

అథర్వణ వేదాంతర్గత

# 10 దేవ్యుపనిషత్

## (శ్రీ దుర్గాదేవ్యుపనిషత్)

### అధ్యయన పుష్పము



ఈ దేవ్యుపనిషత్ తెలియజేయు ఆత్మ సుఖాకృతి రూపమగు **"బ్రహ్మానంద-రామచంద్రపదము"** లేక **"ఆత్మారామ పదము"**ను సేవించుచున్నాము.

---

ఒకానొకరోజు దేవతలు కైలాసంలో ఏకాంతంగా ఉన్న శ్రీ దుర్గా జగన్మాతను సందర్శించి, "జగజ్జననీ! నమోనమః।" అని త్రిప్రదక్షిణములు చేసి పాదాభివందనములు సమర్పించారు.

---

**దేవి :** బిడ్డలారా! దేవతలారా! రండి. సుఖాసీనులు కండి. దేవలోకంలో మీరంతా సుఖముగా ఉన్నారు కదా?

**దేవతలు :** అమ్మా! **అమ్మదయ ఉంటే అన్నీ ఉన్నట్లే.** నీ కరుణ చేత మేమంతా స్వర్గలోకంలో సుఖంగా ఉన్నాము.

**దేవి :** సంతోషము. ఇంకేమి విశేషాలు? నన్ను దర్శించటానికి వచ్చిన ప్రత్యేకమైన కారణము ఏదైనా ఉన్నదా?

**దేవతలు :** మాతా! ఒక కారణము చేత మిమ్ములను దర్శించుకుంటున్నాము.

**దేవి :** ఏమిటా కారణము?

**దేవతలు :** మీరు శివభగవానుని అర్ధాంగి అని, **"అర్థభాగము చోటుచేసుకొని, శివానందమును ఆస్వాదించుచున్నారు"** అని - పురాణ ద్రష్టలు వర్ణిస్తున్నారు.

సతీదేవి, పార్వతి మొదలైన మీ జన్మల గురించి కొందరు వర్ణిస్తూ మిమ్ములను ఉపాసిస్తున్నారు.

ప్రకృతి స్వరూపిణిగా మిమ్ములను కొందరు భావిస్తున్నారు.

సమస్త సృష్టికి జననివని కొందరు అంటున్నారు.

కొందరు దుర్గాసురాది రాక్షస సంహారివని, **'కాళి'**గా భయంకరాకారివని అంటూ ఉంటారు కూడా!

**"వరప్రదాతవు"** అని కొందరు, **"శివునికి జేర్చు జగద్గురువు"** అని మరికొందరు, నామరూపముల కావల గల **"ఆదిశక్తి"**-వని ఇంకొందరు, వాస్తవానికి నీవు రూపరహితవని, ఈ జగత్తంతా మీరూపమేనని, - అంటూ ఉంటారు.

ఆయా ఉపాసకులచే దేవివగు మీ గురించి ఈఈ విధాలుగా అభివర్ణించబడుచూ ఉన్నది.

కొందరైతే **"యోగమయి"**వని, **"అవ్యక్త"**వని 'పరాత్పర' అని, సమస్తము నీవేనని - ఈ విధంగా అనేక విధాలుగా స్తుతిస్తున్నారు.

అమ్మా! నీవు అసలు ఎవరు? రూపరహితవా? రూపసహితవా? గుణివా? నిర్గుణివా? నీ యొక్క అసలైన వాస్తవమైన స్వరూప-స్వభావ తత్త్వములు ఎట్టివి?

ఈ విషయము మీ వద్దనే శ్రవణం చేయాలని మేమంతా జగన్మాతవగు మిమ్ములను సమీపించాము.

దయతో వివరించమని అర్థిస్తున్నాము.



## -- దుర్గాదేవి ఉవాచ --



**దేవి :** ఓహో! నా వాస్తవ తత్త్వమేమిటో తెలుసుకోవాలని ఉత్సాహపడుచున్నారా? మంచిది. ఓ దేవతలారా! మీరంతా దైవీ సంపత్తి కలవారు. మీ రహస్యకర్మలచే లోకములను ప్రేమగా సేవించువారు. భక్తితో నన్ను సమీపించుచున్నారు. అందుచేత మీరు అడిగిన ప్రశ్నకు తప్పక సమాధానము చెపుతాను.
బిడ్డలారా! శ్రద్ధగా, ఆసక్తిగా, అధ్యయన దృష్టితో వినండి.

## అహం బ్రహ్మ స్వరూపిణీ।

చతుర్వేదములు దేనిని **'బ్రహ్మము'** అని అభివర్ణించి చెప్పుచున్నాయో, **అట్టి బ్రహ్మమే నేను.**

## మత్తశ్చ సంప్రవర్తతే ప్రకృతి - పురుషాత్మకం జగత్।

ఈ దృశ్యము కనిపిస్తున్న – **పురుషుడు** (The Experiencer) - ప్రకృతి (All that being experienced), (లేక) దేహి – దేహము, (లేక) క్షేత్రజ్ఞుడు–క్షేత్రము = రెండూ కూడా/(అనగా)/(ప్రకృతి– పురుషాత్మకమైనదంతా) – **నావలననే ప్రవర్తించుచున్నది. దీపపు కాంతితో వస్తువులు మెరుస్తున్నట్లు–నా ఉనికిచే అవి చేతనమగుచున్నాయి.** (ప్రకృతి = The functions పురుషుడు = The functioner).

## అహమానంద - అనానందౌ।

**ఈ జగత్ సృష్టి – స్థితి – లయ వ్యవహారమంతా కూడా నా చేతనే, నా వినోదము కొరకై** కల్పించుకొనబడుతోంది. నేను సహజముగానే **ఆనంద స్వరూపిణిని.** ఆనందమునకు కూడా సాక్షిని కాబట్టి **అనానంద స్వరూపిణిని** కూడా.

**"ఇది ఆనందము – ఇది దుఃఖము"** – అనునది నా క్రీడా వినోదాంతర్గత విశేషాలు మాత్రమే. నాటక రచయిత నుండి పాత్రలు, వాటి వాటి సుఖదుఃఖాలు రచించబడినవైనప్పటికీ కూడా, పాత్రల యొక్క గుణములు రచయితకు చెందినవై ఉండవు కదా! ఈ జగత్తులన్నీ నా కల్పనయే అయిఉండి కూడా, **ఇందులో విశేషములేవీ నా యొక్క ధర్మముగాని, స్వభావముగాని కాదు.**

## "శూన్యన్చ - అశూన్యన్చ।"

ఒక కథ వ్రాసేవాడు కథలోని పాత్రలు, సంఘటనలు, పరస్పర సంబంధములు – ఆతని కథా రచనా కల్పన/భావన నుండియే వెలువడుచూ ఉంటాయి. కానీ ఆ పాత్రలు ఆతని యందు లేవు. ఆతడు పాత్రలలోను లేడు. అట్లాగే, ఈ బ్రహ్మాండములన్నీ నానుండే వెలువడుచున్నప్పటికీ, ఇందలి లోకములు, లోకపాలకులు, లోకపాలితులు మొదలైనవన్నీ **"ఆత్మస్వరూపిణి", "బ్రాహ్మీస్వరూపిణి"**నగు నాయందు లేనేలేవు. అందుచేత నా స్వరూపమును **'శూన్యము'** అని వర్ణిస్తున్నారు. అయితే ఈ బ్రహ్మాండములన్నీ నా నుండే వెలువడచుండగా నేను శూన్యమునెట్లా అవుతాను?. కాబట్టి – **పూర్ణస్వరూపిణిని** కూడా! అందుచేత **"అశూన్యస్వరూపిణి"** – అని కూడా చెప్పబడుచున్నాను.

## ఎందుకు వెలువడుచున్నాయి?

ఈ ప్రకృతి, పురుషుడు, జీవులు వారివారి అంతరంగ బహిరంగములు–ఇవన్నీ కూడా **"స్వయముగా సహజముగా బ్రహ్మమే"** అయి ఉన్న నా నుండే వెలువడుచున్నాయి. **ఎందుకు?** ఈ ప్రశ్నకు సమాధానము వినండి.

**సమాధానము: "అది నా క్రీడ ఆనందము వినోదము"** – అనబడుతోంది. అందుచేత **"నీవు ఎవరు?"** అను ప్రశ్నకు **"నేను ఆనంద స్వరూపిణిని"..** అనునది సమాధానమగుచున్నది. ఇదంతా నా 'ఇష్టము'లో నుండే బయల్వెడలుతోంది. కాబట్టి, **'కామాక్షీ'** – అని చెప్పుకోబడుచున్నాను.

అయితే, అట్టి ఆనందమునకు మునుముందే నేను 'ఆనందించువాడు' – రూపమున ఉండి ఉండాలి కదా!" **"ఆనందము నాది! నేను ఆనందమునకు పరమై ఉన్నాను"** అనునది కూడా యుక్తియుక్తమే. అందుచేత నేను **"అనానందస్వరూపిణి"**ని కూడా!

## "అహం విజ్ఞానా! అవిజ్ఞానే!"

మరి నేను తెలియబడేది ఎట్లా? ఈ తెలియబడే సమస్తము నాయొక్క రూపమే. అనగా, **మీకు దృశ్యముగా ఇంద్రియములకు తెలియబడేదంతా నేనే!** ఈ విధంగా సమస్త జీవులకు తెలియబడుచూనే ఉన్నాను. కాబట్టి **"విజ్ఞానా!"** అని పిలువబడుచున్నాను.

అయితే ఒకడు వ్రాసిన నవల చదివి ఈ మాత్రం చేత–**"ఆ రచయిత నాకు తెలుసు"** అనునది కొంతవరకే నిజము. ఇది– యుక్తియుక్తమే అయినప్పటికీ, నవలలోని విషయాలు **"రచయిత యొక్క స్వభావము ఇటువంటిది"**–అని నిర్ణయించగలవా? లేదు. అట్లాగే, ఈ సృష్టి అంతా నా స్వరూపమే అయినప్పటికీ ('దేహము'నకు 'దేహి' వలె) దీనికి ఆవల బ్రహ్మము రూపముగా వెలుగొందుచున్న నేను సృష్టియొక్క సంగతి–సందర్భములచే తెలియబడజాలను. ఇంద్రియములకు విషయమే కాను. అందుచేత **"అవిజ్ఞానే!"**–అనబడుచున్నాను.

అయితే బ్రహ్మము గురించిన జ్ఞానముచే నా యొక్క (సమస్తమును ఆక్రమించుకొనియున్న) **ఉనికి (సత్)** రూపము విశ్వేశ్వరీ దృష్టిచే (Common sense) **స్వానుభవముగా లభిస్తూనే ఉన్నాను.** అందుచేత నేను **విజ్ఞాతను, అవిజ్ఞాతను** కూడా!

సృష్టికి రూపము ఉన్నప్పటికీ, నేను రూపరహితను.

## "అహం బ్రహ్మా! బ్రహ్మణీ వేదితవ్యే!"

ఈ జగత్ కల్పనను, కర్తను నేనే. కనుక సృష్టికర్తయగు బ్రహ్మదేవుడను నేనే।

అంతేకాదు. **"(1) తెలుసుకొంటూ ఉన్నది, (2) తెలియబడుచూ ఉన్నది"** – ఈ రెండూ కూడా నేనే! ఈ విధంగా జగత్తుగా తెలుసుకొంటున్నది, జగత్తుగా తెలియబడుచున్నది, 'బ్రహ్మము'గా **తెలుసుకొంటున్నది,** బ్రహ్మముగా **తెలియబడుచున్నది** కూడా – **అందరిలో 'నేను'గా ఉన్న నేనే!**

## ఇతి హ అథర్వ శ్రుతిః

ఈ విధంగా నేను చెప్పినదంతా **"అథర్వశ్రుతి"** అనే పేరుతో నా గురించి బ్రహ్మజ్ఞుల సభలో, (లేక) తత్త్వవేత్తల పరస్పర సంభాషణలలో సశాస్త్రీయంగా సిద్ధాంతీకరించబడుచూనే ఉన్నది.

ఓ దేవతలారా! ఇంకా కూడా వినండి.

## అహం పంచభూతాని। అపంచ భూతాని।

ఋగ్వేదము, తదితర వేదములు కూడా **"ఆత్మాత్ ఆకాశమ్। ఆకాశాత్ వాయుః। వాయోరగ్నిః। అగ్నిః – ఆపః। ఆపః పృథ్వీ"** – అని చెప్పుచూ, – **"మమాత్మానంద స్వరూపము నుండే పంచభూతములు బయల్వెడలుచున్నాయి"** – అవి సుస్పష్టపరచుచున్నాయి కూడా।

ఈ విధంగా నా యొక్క **"బ్రాహ్మీ"** లేక **"ఆత్మ"** స్వరూపము నుండే పంచభూతములు వెలువడుచున్నాయి. విశ్వముగా చెప్పబడేది పంచభూతాత్మికమే కాబట్టి, ఇదంతా నా నుండే బయల్వెడలుచున్నదగుచున్నది. అందుచేత **"పంచభూతాత్మికా!"** అని వర్ణించబడుచున్నాను. ఈవిధంగా, ఈ **సమస్త పాంచభౌతిక దృశ్య–దృశ్యానుభవమంతా** నాయొక్క స్వస్వరూపమునకు **'అనన్యము'.**

ఈ జగత్తులన్నీ నా పాంచభౌతాత్మిక–కళా విశేషమే అయి ఉండి, (కళాకారుడు కళకు వేరుగా ఉండి ఉన్న తీరుగా),–ఈ సమస్తమునకు వేరుగా, పరముగా, నియామకురాలిగా ఉండి ఉన్నాను. అందుచేత నేను **'అపంచ భూతాత్మిక'**ను కూడా! చిత్రకళ (Painiting) – చిత్ర కళాకారుడు (Painter Artist) వలె ఉభయము నా పట్ల యుక్తియుక్తమే. (The Artist is different from the pieces of Art. But the Piece of Art is the creation of the Artist - himself)

## "అహం అఖిలం జగత్!"

కలలో కనిపించేదంతా కూడా కల తనదైనవాని కళాచైతన్య– భావనావిశేషమే కదా! భావన భావించువానికంటే వేరుకాదు. **నాటకంలోని పాత్రలన్నీ నాటక రచయితకు వేరుకాదు.** ఈ విధంగా ఈ సమస్త జగత్తు నేనే! అందుచేత **"జగదంబికే, జగత్‌మాతృకే, జగదీశ్వరీ"** అని కూడా చెప్పబడుచున్నాను.

ఇంకా కూడా, పరబ్రహ్మస్వరూపిణినగు నేను "జగజ్జనని। లోకబాంధవి। బాలాత్రిపురసుందరి"... అని కూడా స్తుతించబడుచున్నాను. ఈ విధంగా ఈ జగత్తుగా కనిపిస్తున్నదంతా నేనే। **స్వకీయ బాలాలీలా వినోదమే।**

## "వేదోఽహమ్। అవేదోఽహమ్"

[ఒకని యొక్క (సోమరాజు అనబడే వాని యొక్క) 'దేహము' - కంటికి కనిపిస్తోంది. **'దేహి'** కంటికి కనిపిస్తున్నాడా? లేదు. ఆ రెండూ కలిపియే 'సోమరాజు' అనువానిగా చూస్తున్నాము కదా!]

(అట్లాగే) పంచేంద్రియములకు తెలియబడేదంతా (That being known) నేనే! పంచేంద్రియములకు తెలియబడక - పంచేంద్రియముల ద్వారా తెలుసుకొంటూ ఉన్నరూపము (The Knonwer) కూడా నేనే! "తెలుసుకొంటూ ఉన్నవానిని తెలుసుకొనుచున్నది" కూడా నేనే! తెలియబడనిది నేనే! (I am the knower of all that being known. I am all that being not known even).

## "విద్యాహమ్-అవిద్యాహమ్"।

ఆత్మస్వరూపిణినగు నా యొక్క సృష్టి కల్పనా వినోదమే ఇదంతా కూడా! (నాటక రచయితయే పండితుని, పామరుని పాత్రలు కల్పించు తీరుగా) నా కల్పనయగు ఈ జగత్తులో **విద్యాస్వరూపము, అవిద్యాస్వరూపము** కూడా నావే! అందుచేత **"విద్యావిద్యా స్వరూపిణీ"** - అని వర్ణించబడుచున్నాను.

## "అజాహమ్ - అనజాహమ్"

(అజోపిసన్, అవ్యయాత్మా భూతానామ్ ఈశ్వరోపిసన్)। చక్రవర్తి ఉన్నత సింహాసనముపై సుఖాసీనుడై ఉండగా ఆతనికి ఎదురుగా జనులు వచ్చి, విన్నపములు సమర్పించి వెళ్లు తీరుగా నా సమక్షంలో దేహములన్నీ వస్తూ, పోతూ ఉంటున్నాయి. **(దేహేజాతే న జాతోఽసి। దేహే నష్టే న నశ్యసి - అనియోగవాసిష్ఠములో వసిష్ఠమహర్షి శ్రీరామునికి చెప్పుతీరుగా).**

నేను దేహములతోగాని, లోకములతోగాని పుట్టను. అందుచేత నేను 'అజ'ను. 'జన్మించటము' అనే ధర్మము బ్రహ్మమగు నాకు లేనేలేదు.

అయితే ఈ జన్మించినట్లు కనిపించేదంతా నాకు చెందినవే! నాకు వేరై ఎక్కడా ఏదీ జనించదు-నశించదు. **అనన్యను.**

**"ఈ సమస్త జీవులుగా జన్మిస్తున్నదంతా ఆత్మయే"** అనునది యుక్తియుక్తమే కాబట్టి **'అనజా'** కూడా అయి ఉన్నాను.

## "అధశ్చ - ఊర్ధ్వశ్చ - తిర్యక్ చ అహమ్।"

(ఒకడు తన ఊహలో ఒక గొప్ప "దృశ్యము"ను లేక "నగరము"ను, లేక "ఇల్లు"ను కల్పించుకొని చూస్తూ ఉన్నాడనుకోండి. ఇప్పుడు - ఆ ఊహలోని నగరములో (లేక) ఇంటిలో క్రింద, పైన, వెనుక, ముందు ఉన్నది ఆతని ఊహయేకదా! అట్లాగే) ఈ సమస్త దృశ్య జగత్తు నా యొక్క భావనా రూపమే కాబట్టి, ఇద్దాని యొక్క క్రింద - పైన - ప్రక్కల అన్ని వైపులా ఏర్పడి ఉన్నది నేనే!

(బంగారపు ఆభరణములలో లోపల, బయట, ప్రక్కలా-బంగారమే అయి ఉన్నట్లు) - **ఈ జగత్తుకు పది దిక్కులా ఏర్పడి ఉన్నది నేనే!**

[ఒక మహారాజు తన ఉద్యానవనములో మందిమార్బలంతో ఆంతరంగికులతో విహరించుతీరుగా (Just like a king enjoying a trip in his own garden along with own people)] - నేను కల్పించుకొన్న 'విశ్వము' అనే ఉద్యానవనములో - **నేను ఏకాదశ (11) రుద్రులతోను, అష్ట (8) వసువులతోను, ద్వాదశ (12), ఆదిత్యులతోను,** విశ్వేదేవతలతోను **వినోదినై సంచారములు చేస్తూ ఉన్నాను. అట్టి సమస్త రూపములుగా - అగుచున్నది అయిఉన్నది నేనే।**

## ధారణ

మిత్ర (సూర్య) - వరుణులను, ఇంద్ర - అగ్నులను, అశ్వనీ దేవతలను, సోముని (చంద్రుని), త్వష్టను (విశ్వకర్మ-ద్వాదశాదిత్యులలో ఒకడు), పూషను, భగుని (ద్వాదశాదీత్యులలో ఒకడు, వెలుగురూపుడు), విష్ణువును, ఉరుక్రముని (వామనుని), విష్ణు అవతారములను, సృష్టికర్తయగు బ్రహ్మను, (ప్రజాభిమాని అగు) ప్రజాపతిని, వారందరినీ "ధారణ" (Holding) చేయుచున్నది. నేనే ఆభరణములుగా ధరించుచున్నది నేనే. వారంతా నా రూపములే। నేనే!

## హవిష్మతే।

యజ్ఞ యాగములు నిర్వర్తించు యజమానికి యజ్ఞఫలము ప్రసాదిస్తున్న హవిష్మంతను (యజ్ఞపురుషుడను) నేనే. యజ్ఞద్రవ్యము కూడా నా నుండే లభిస్తోంది. ప్రకృతి రూపినిగా జీవులందరికీ కర్మఫల ప్రసాదిని అయి జగత్ పాలన నిర్వర్తిస్తూ ఉన్నాను. సమస్త కార్యముల కార్యకర్తను, కార్యవిధిని, ఫలభోక్తను కూడా నేనే। (I am the Producer, Director, Actor and also spectator for the entire work of THE CREATION).

## నాయకి।

నేనే జగత్తులు అనే సేనకు నాయకురాలిని. వివిధ 'వస్తువులు' అనబడు వేరుతత్త్వములను ఒకచోటికి జేర్చి క్రియాశీలకము చేస్తున్న 'సంగమని'. (Like a Mechanic who assembles the Machine that runs the Manufacturing). పిత్రులోక దేవతలను (The Divinities that maintain structures of Badies in the Mother's womb and also take charge of the maintainence as well as and of Bodies), దేహ పరిపోషకులను – మూర్ధమున (నుదుటన) ధరిస్తున్నదానను. సప్త సముద్రములను గర్భమున దాల్చుచున్నదానను.

అట్టి నా యొక్క **"మహాదేవీ తత్త్వము"** ఎరిగినవారు దేవీస్వరూపులు కాగలరు.

**ఈవిధంగా మృదుమధురంగా పలికి, జగన్మాత అగు దుర్గాదేవి మాట్లాడుచూ, మాట్లాడుచూనే – అంతర్థానమైనారు.**

## "దేవతల దేవీస్తుతులు"

**దేవతలు :** హే దేవీ! మహాదేవీ! శివా! **సతతం నమః** ఓ ప్రకృతి స్వరూపిణీ! రహస్య రూపిణివై ఈ దేహములను, ఈ సృష్టిలోని సమస్తమును సంరక్షిస్తూ ఉన్న భద్రా! సర్వమునకు నియామకురాలా! ప్రణతులు సమర్పిస్తున్నామమ్మా! నమో నమో నమో నమః॥

అగ్నివలె స్వయం ప్రకాశకమైనది, తపశ్శక్తిచే సమస్తము వెలిగించునది, దుష్టకర్మఫలములను ఇచ్చి శిక్షించునది, (వైరోచని) అగు శ్రీ దుర్గాదేవిని – మాలోని, తమస్సు (Darkness, Ignorence) ను తొలగించుటకై – శరణువేడుచున్నాము. స్తుతించుచున్నాము. వినతులు (Our Requests) సమర్పిస్తున్నాము.

ఓ దేవీ! నీ వాక్కు నుండి **వ్యష్టిధారులమగు** (Individual Forms) మేమంతా (లేక) **జీవులమగు మేము** జనించుచున్నాము. ఈ విశ్వమంతా నీ రూపమే! సమస్త జీవులు నీ ప్రదర్శనమే. నీవు గోవుల వంటి జీవులను పాలించు దేవివి, గోపాలవు! **సా నో మంద్రేషమ్ ఊర్జం దుహానా ధేనుః వాక్ అస్మాన్ ఉపసుష్టు తైతు।** నీ గురించిన **మంత్రమగు వేదఋక్కుల గానములు – మహత్ వాక్ ప్రవాహమై మాయందు వేంచేసి ఉండునుగాక! నీ తత్త్వము మా బుద్ధికి విశదమగు గాక। మాలో వేంచేసియే ఉన్న నీవు మా అనుభూతికి లభించెదవు గాక।**

**నీవు కాళరాత్రీ దేవివి!** ఈ సమస్తము లయముకాగా, ఏ **"నిర్విషయ కేవలము"** మాత్రమే శేషించి ఉంటుందో – అదియే నీ **'కాళరాత్రీ స్వరూపము'గా పౌరాణిక వర్ణితము. జగత్ రహితవు, విశ్వరహితవు, ఏక స్వరూపిణివి కాబట్టి "కాళరాత్రీదేవి" – అని కవులచే ప్రసగించబడుచున్నావు.**

| | | |
|---|---|---|
| **బ్రహ్మస్తుతాం** | : | సృష్టికర్త అగు బ్రహ్మచే స్తుతింపబడుదానవు. నీ మానసపుత్రుడే బ్రహ్మ! |
| **వైష్ణవీం** | : | సమస్తముగా సర్వత్రా విస్తరించి ఉన్నట్టిదానవు. విష్ణురూపిణివై సమస్తముగా ప్రదర్శనమగుచున్నావు. |
| **స్కందమాతరమ్** | : | సమస్త దైవీప్రకృతికి, దైవీ సంపత్తికి, దేవతలకు సేనానాయకుడగు స్కందుని – పుత్రునిగా కని, దైవీ సంపత్తికి అధినాయకునిగా ప్రసాదించినదానవు (కుమారస్వామికి తల్లివి). |
| **సరస్వతీదేవివి** | : | "సత్" (కేవలమగు ఉనికి, The Absolute presence) అను–రసస్వరూపిణీదేవివి. (సత్–రసత్–వతి). |
| **అదితిం** | : | దేవతలకు తల్లి అగు అదితిని కన్నదానవు. (అత్–ఇతి = అదితి - "న దత్ ఇతి" = (Beyond all this being seen with physical eyes). అదితిగా ఉన్నది నీ ప్రదర్శనమే. |
| **దక్ష దుహితరం** | : | దక్ష ప్రజాపతి కుమార్తెగా అవతరించిన దాక్షాయణీదేవివి. సతీదేవివి. |
| **పావనాగ్ంం** | : | తలచినంత మాత్రం చేతనే వేంచేసి – మాహృదయములను పావనము చేయుదానవు. |
| **శివాం** | : | శివుని అర్ధాంగిగా ఉన్నదానవు. సమస్త జీవులకు శుభప్రదాతవు. ఇహ–పరస్వరూపిణివి। |

### అట్టి దేవదేవివగు నీకు సమస్కరిస్తున్నామమ్మా! పాహిమాం। రక్షమాం!

**మహాలక్ష్మీం చ విద్మహే సర్వసిద్ధాశ్చ ధీమహి, తన్నో దేవీ ప్రచోదయాత్॥**

ఆ దేవీ మహాలక్ష్మి యొక్క సర్వసిద్ధిత్వమును తెలుసుకొంటున్నాము. ఈ సమస్తము ఆ దేవియొక్క సిరి–సంపదలే. అట్టి దేవి మాయందు తన యొక్క **సర్వాత్మకమగు, కేవలమగు – దేవీతత్త్వమును ప్రేరేపించును గాక!**

అమ్మా! దేవతల తల్లి అగు అదితి నీకు కూతురు. దక్ష ప్రజాపతికి కుమార్తెగా సతీదేవివై అవతరించినదానవు. అట్టి నీ దర్శనముచే మేము భద్రులము (Safe) అగుచున్నాము. అమృత రూపులము అగుచున్నాము.

**కామోయోనిః :** కాముని (మన్మథుని) గర్భమున కలదానవు. ఈ సమస్తము నీ ఇచ్ఛా స్వరూపమే కాబట్టి **'కామకల'**వు.

**వజ్రపాణియగు కుమారస్వామిని** మాకు రక్షగా ప్రసాదించినదానవు. వాయువు, మేఘము, ఇంద్రుడు, గుహుడు (కుమారస్వామి) నీ **నుండి బయలుదేరిన కల్పనా విశేషములే.** నీ యొక్క మాయాకోశ విశేషములే ఈ సమస్తము కూడా!

**విశ్వమాతా ఆది విద్యాస్వరూపిణీ! ఓంకారస్వరూపిణీ!** ఇదంతా నీ ఆత్మశక్తియే। ఈ విశ్వమంతా నీయొక్క మోహన స్వరూపమైయున్న విశ్వమోహినీ! పాశ (Relatedness), అంకుశ (for Punishing the mental Ills), ధనుర్బాణములను (To Protect us all) ధరించిన ఆది శక్తీ! దేవీ! నిన్ను స్మరిస్తూ శరణు వేడుచున్నాము! పాశ అంకుశ బాణధరీ దేవీ! రక్షమాం! మాలోని ఆసురీ స్వభావములను తొలగించి, నిన్ను చేరుటకై 'దైవీ సంపద'ను పరిరక్షించండి!

**ఏషా శ్రీ మహావిద్యా। య ఏవం వేద, స శోకం తరతి।** ఎవ్వరైతే మీ గురించిన ఈ **మహావిద్య**ను తెలుసుకొని, మీ పాదపద్మములను ఆశ్రయిస్తారో, అట్టివారు సమస్త శోకముల నుండి తరించగలరు.

## భగవతీ-జగద్రక్షకీ। భవతీ!

సమస్తమును వెలిగించు (Enlightening) ఓ భగవతీ! సమస్తము నీవే అయి ఉన్న ఓ భవతీ! మాతా! నీకు నమస్కరిస్తున్నాము. మమ్ములను దశ దిక్కుల నుండి (అన్ని వైపుల నుండి) కాపాడెదవు గాక! "సమస్తముగా ఉన్నది నీవే" - కాబట్టి **'భవతి'**వి.

మాయొక్క భవబంధములు తొలగిపోయి, భవతివి (సమస్తము అయి ఉన్నదానివి) అగు నీ పాదపద్మములు మేము ఆశ్రయించెదము గాక।

## స ఏష అష్టవసవః

అట్టి ఈ దేవదేవియే - ప్రజాపతి సంతానమగు (ధరుడు, ధ్రువుడు, సోముడు, అహుడు, అనిలుడు, అగ్ని, ప్రత్యూషుడు, ప్రభాసుడు అను పేర్లు గల) రహస్య సృష్ట్యంతర్గత శక్తులగు) - **"అష్టవసువులు"**గా ఉన్నది.

**స ఏష ఏకాదశ రుద్రః।** ఆ దేవియే ఏకాదశ రుద్రుల రూపము ధరించి సమస్తమును ఉత్తేజ పరచుచున్నది.

**స ఏష ద్వాదశ ఆదిత్యాః।** ఈ జగజ్జననియే ద్వాదశ (12) ఆదిత్యుల రూపముగా వెలుగొందుచున్నది.

**స ఏష విశ్వేదేవాః।** ఆ లోకమాతయే విశ్వేదేవత (The Genetic Engineer of the Whole World) అయి సమస్తమును శుభకరము చేయుచున్నది.

**సోమ పా-అసోమపాశ్చ।** ఆ లోక బాంధవియే సోమప అసోమపములు (సోమపానము చేయు యజ్ఞకర్త, అసోమపానులగు యాజ్ఞికులు కూడా). సృష్టి యజ్ఞము చేయువారు, చేయించువారు (ఆధ్వర్యులు) ఆ దుర్గా జననియే।

**స ఏష యాతుధానా అసురా రక్షాగ్ంసి పిశాచా యక్షాః సిద్ధాః।** ఆ లోకరచయిత యగు దేవియే - యాతుధానులు (ఒక అసురజాతి)గా, (మృత్యుదేవుని భార్య అగు నిర్పతి)గా, అసురులుగా, రాక్షసులుగా, పిశాచులుగా, యక్షులుగా, సిద్ధులుగా కూడా సృష్టికల్పనయందు ప్రదర్శనమగుచున్నది. (నవలలోని ప్రతినాయకుడు కూడా నవలా రచయితయొక్క కల్పనా చమత్కారమే అయి ఉన్నట్లు).

**స ఏషా సత్త్వ రజః తమాగ్ంసి :** ఆ విశ్వస్వరూపిణియే సత్త్వ రజో తమో త్రిగుణ రూప నాటకీయ రస చమత్కారమై, జగన్నాటక ప్రదర్శనకు కారణభూతమగుచున్నది. త్రిగుణాతీత అయి, త్రిగుణధారణచే 'సృష్టి' అనే కథాగమనమునకు రచయిత ఈ దుర్గాదేవియే।

**స ఏష ప్రజాపతి, ఇంద్ర, మానవః।** ఆ జగదంబయే సృష్టికర్తయగు **ప్రజాపతిగాను**, ఇంద్రియాధిపతి - త్రిలోకాధిపతియగు **ఇంద్రునిగాను, మానవులుగాను, సమస్త జీవులుగాను** ఏర్పడి ఉన్నది.

**స ఏషా గ్రహ నక్షత్ర జ్యోతీగ్ంషి।** గ్రహ, నక్షత్రములతోను, పాలపుంతలతోను కూడిన జ్యోతిర్మండలము ఆ దుర్గాదేవి యొక్క విశ్వప్రదర్శినీ -స్వయం కల్పిత వినోద చమత్కారమే।

**స ఏష కలా కాష్ఠాది కాల రూపిణీ।** కల్పన - కాష్ఠము - కాలము అమ్మరూపములే. అట్టి దేవికి నిత్యప్రణామములు సమర్పిస్తున్నాము.

*ఈ జననియే :-*

- ఆధి భౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికమైన సమస్త తాపములు నివారించగలిగినది.
- సమస్త జీవులకు భుక్తి ముక్తి ప్రదాయని - అయి ఉన్నది.
- అంతులేని విజయములు ప్రసాదించునది.
- కేవలమగు శుద్ధాత్మ స్వరూపిణి.
- జీవులందరికీ శరణు ప్రసాదించునది.
- శివత్వమును ప్రసాదించునది. ఈ జీవుని శివ స్వరూపముగా తీర్చిదిద్దగలిగినది.

**ఓ శివాదేవీ! నమో నమో నమో నమః**

- ✠ 'ఈం' వియత్ (ఆకాశ) స్వరూపిణియై సమస్త విశ్వమునకు 'ఆది' అయి ఉన్నది.
- ✠ అగ్ని, సూర్యుడు స్వరూపములచే వీతహోత్రీ దేవిగా సంప్రదర్శనమౌతోంది.
- ✠ ఈ దుర్గాదేవి – అర్ధ చంద్రుని కిరీటమునందు అలంకారముగా ధరించునట్టిది.
- ✠ ఈ జగన్మాతయే – సమస్త జీవుల బీజరూపము.
- ✠ ఈ జగదంబికయే – సర్వార్ధములు ప్రసాదించునది.

అట్టి దేవదేవికి నమస్కరిస్తున్నాము.

## నవార్ణ మంత్రము

**[ "(ఓం) ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే" ]**

ఈ బీజాక్షరపూర్వక దేవీనవార్ణ మంత్రము ఉపాసించువారికి ఇది మహదానంద దాయకము. బంధముక్తిప్రదము.

శ్రీదేవి – బ్రాహ్మీ స్వరూపిణి. అష్టముఖి. '8' ముఖములు కలది. అష్టముఖములతో కూడిననట్టిది. (మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞాచక్రములతోను, బ్రహ్మరంధ్ర – సహస్రార స్థానములతోను ప్రదర్శనమగునది. పంచభూత మనో బుద్ధి చిత్త ముఖములు కలది).

సూర్య – వామ (దేవీ) – శ్రోత్ర బిందు సమన్వితము అగు మాత యొక్క తృతీయ రూపమును నారాయణునితో కూడుకొనియున్నట్టిది. **నారాయణీరూపము**.

వాయువు అధారముగా కలిగినట్టి కుండలినీశక్తిరూపము.

అష్టముఖములతో కూడిన సాలంకృత విగ్రహము. **"ఐం-హ్రీం-కీం చాముండాయైవిచ్చే"** అను మంత్రోపాసనచే ఉపాసించబడుగాక! అది ఆత్మానంద- మహదానంద దాయకమై సిద్ధించగలదు.

## దేవియొక్క ఉపాసనా రూప మననము

**హృత్ పుండరీక మధ్యస్థాం ప్రాతః సూర్య సమప్రభామ్।** ఈ జీవుని భౌతిక శరీరాంతర్గతంగా **"హృదయము"** అను తెల్లతామరపూవు. అట్టి హృదయ పద్మములోపల దేవి తేజోపుంజ సమన్వితమై చిత్-చైతన్య స్వరూపిణిగా ఉన్నది.

**పాశ-అంకుశ ధరాగ్ం సౌమ్యాం, వరదాభయహస్తకామ్, త్రినేత్రాగ్ం రక్త వసనాం భక్త కామదుఘాం భజే।** అట్టి దేవ దేవిని పాశ-అంకుశ ధారిణిగా, సౌమ్య రూపిణిగా, వరద – అభయ హస్తములతో (వరద ప్రదాత-భయము తొలగించునది) కూడిన రూపము కలదిగా – హృదయములో ఉపాసిస్తున్నాము. ఎవరి ఇచ్ఛానుసారము ఈ జగత్తు ప్రవర్తనశీలమగుచున్నదో – అట్టి **"కామదుఘమ్"**నకు నమస్కారము.

ఓ దేవేశ్వరీ! దేవదేవేశ్వరీ! ఈ దృశ్యముతో మాకు ఏర్పడినట్టి అవినాభావ రూపమగు సంసార మహాభయమును మొదలంట్లా నశింపజేయు మాతా! గొప్ప దాటరాని నిరోధములను (Unassailable hurdles) ప్రశమింపజేయుదానా! (one who subsides them). కరుణాసముద్ర రూపిణివగు మహాకారుణ్యరూపిణీ! నమో నమో నమో నమః।

**అజ్ఞేయా!** ఆదిశక్తి స్వరూపిణియగు ఈ దేవి యొక్క రూపము సృష్టికర్తయగు బ్రహ్మ మొదలైన వారికి కూడా తెలియబడనిది కనుక **'అజ్ఞేయ"।**

**అనంతా!** ఈ దేవి యొక్క ఆద్యంతములు (The Begining and The Ending) తెలియబడజాలదు కాబట్టి **"అనంత"।** దేహ మనో బుద్ధి చిత్త అహంకార – జ్ఞానాత్మలచే తను కాలము చేతను పరిమితము కానిది.

**అలక్ష్యా!** 'ఇది' అని ఆ దేవిరూపము గ్రహించలేము, పట్టుకోలేము కాబట్టి అలక్ష్యా! సమస్త జీవుల లక్ష్యములన్నీ ఆ దేవీ కల్పితమే! లక్ష్యము తనదైనవాడుగా ఉన్నది ఆ దేవీ దుర్గయే। (సర్వ భూతాశయ స్థితః)

**అజా! :** ఆత్మ స్వరూపిణియగు ఆదేవి యొక్క జననము ఎవ్వరికీ 'ఇది' అని లభించదు కాబట్టి **'అజా'!** ఆ దేహమువలె ఆ తల్లి జన్మ-కర్మలకు సంబంధించినదే కాదు.

**ఏకా!** ఏకమే అయి ఉండి సర్వత్రా ఏకానేకముగా వర్తిస్తూ ఉండటం చేత 'ఏకా'! ఆ దేవ దేవీ – జీవాత్మగాను, ఈశ్వరుడుగాను, పరాత్మగాను విభజనము పొందటము లేదు.

**అనేకా! :** అనేకముగా కనిపిస్తూ ఉన్నదంతా దేవీరూపమే కాబట్టి **'అనేకా'!** "ఆత్మజ్ఞులు ఆ తల్లిని అనేకముగా కనిపిస్తూ, ఏకముగా అయినట్టిది" – అని దర్శిస్తున్నారు.

మననములన్నీ ఆ దేవినుండే జనిస్తున్నాయి. అందుచేత, ఆ దేవియే మంత్రములన్నిటి జనన స్థానము, అంతిమ సిద్ధిరూపము కూడా. కాబట్టి – **"మాతృకాదేవి"**. సర్వశబ్దముల యొక్క జ్ఞానరూపిణి ఆ దేవియే. జ్ఞానులకు ఆదేవి చిన్మయాతీత (చెలియబడేదానికి ఆవలి స్వరూపిణి). శూన్యమునకు ఆ జననియే సాక్షి. **శూన్యసాక్షిణి.**

**యస్యాః పరతరం నాస్తి సైషా 'దుర్గా' ప్రకీర్తితా।** ఆ దేవికి ఆవల ఇంక శేషించి ఏదీ లేదు. **ఈవలి సమస్తమునకు ఆ దేవియే పరాకాష్ఠ.** అందుచేత **'దుర్గాదేవి'** – అని ప్రకీర్తించబడుతోంది.

**దుర్గాత్ సంత్రాయతే యస్మాత్ 'దేవీదుర్గా' ఇతి కథ్యతే।** దుర్గమముల నుండి (కష్టతరమైన వాటి నుండి) తరింపజేస్తుంది కాబట్టి ఆ దేవిని 'దుర్గ' అని అంటున్నారు. స్తుతిస్తూ ప్రణమిల్లితే, శరణువేడితే దురితములను హరించివేయు దేవి కాబట్టి 'దుర్గ'। **ప్రపద్యే శరణం దేవీం 'దుం' దుర్గే దురితరం హర।** దురితములన్నీ హరించి వేసే దేవి కనుక – **"దుర్గ"**. అమ్మా! దుర్గాదేవీ! శరణు।

సంసార సాగరములో చిక్కి అనేక అల్ప జన్మపరంపరలలో దుఃఖితులమై తిరుగాడుచున్న మేము – జన్మ–కర్మ బంధములకు భీతిల్లినవారమై **తాం దుర్గాం దుర్గమాందేవీం దురాచార విఘాతినీమ్** దుర్గములైన దురాచారములకు విఘాతి అగు – **దుర్గాదేవిని శరణువేడుచున్నాము.**

## ఫలశ్రుతి

**ఈ అథర్వశీర్షము** (లేక) **దుర్గాశీర్షము** (లేక) **దేవ్యుపనిషత్**ను ఎవ్వరు అధ్యయనము చేసి స్వస్వరూపాత్మకంగాను, సమస్త రూపాత్మకంగాను దేవిని తెలుసుకుంటారో.

- **"పంచాథర్వణశీర్ష జపఫలము"**ను పొందగలరు. 5 సార్లు అథర్వణవేద పారాయణము చేసిన సత్ఫలితములు పొందగలరు.
- ఈ అథర్వ శీర్షముచే దేవీ తత్త్వమును ఎరిగినవారై ఎవరు అర్చించువారై ఉంటారో, అట్టివారు శతలక్ష (కోటి) జపము చేసినవారై, అర్చన యొక్క పరాకాష్ఠ సిద్ధిని పొందగలరు.

ఈ ఉపనిషత్ యొక్క అర్థ పూర్వక పారాయణము 108సార్లు పునశ్చరణము – సాధనవిధానముగా చెప్పబడుతోంది.

10 సార్లు చదివినవాని పాపములన్నీ తుడిచిపెట్టుకుపోగా – ఆతడు **సద్యోముక్తుడు** కాగలడు. మహాదేవి యొక్క ప్రసాదముచే సమస్తమైన మహాకష్టముల నుండి (మహాదుర్గముల నుండి) విముక్తుడు కాగలడు.

ప్రాతఃకాలములో ఈ ఉపనిషత్తు (లేక) ఈ అథర్వశీర్షమును అధ్యయనము చేస్తూ పారాయణము చేస్తే – రాత్రి కృతపాపములు తొలగగలవు. సాయంకాలము అధ్యయనము చేసినవాని యొక్క పగలు కర్మల దోషములు తొలగిపోతాయి. ప్రాతఃకాలము, సాయంకాలము కూడా ఉపాసించినవాని యొక్క **సర్వపాపదృష్టులు, దోష సంస్కారములు సమసిపోగలవు. పాపి కూడా 'అపాపి' అవుతాడు.**

నిశీధి యొక్క తురీయ (4వ) సంధ్యయందు [నిర్విషయము యొక్క భావనా పరాకాష్ఠయందు; జాగ్రత్ స్వప్న సుషుప్తులకు ఆవల గల తురీయ– (4వ) స్థానములో)] బుద్ధిని నిలిపి జపించువానికి 'వాక్‌సిద్ధి' లభించగలదు. (అందరికి సామాన్యముగా కనిపించే వాక్యములలోని తాత్త్వికార్థము తెలియబడగలదు).

ఉదయ – మధ్యాహ్న – సాయంకాల – రాత్రి తురీయ '(4)' సంధ్యాసమయములలో జపించువాడు – వివేకముతో కూడిన **'అఖండాత్మవగాహన'** సిద్ధించుకోగలడు. ( 4 A.M. 12 Noon 6 P.M. 10 P.M.)

నూతన ప్రతిమను (దేవీ విగ్రహముగాని, మరే దేవతా, గురు విగ్రహమైనాగాని) ప్రతిష్ఠించినచోట ఈ 'అథర్వణ శీర్షము' అనబడే దేవీ ఉపనిషత్ పఠనము, ప్రవచనము, శ్రవణము చేస్తే ఆ దేవతామూర్తికి దేవతాసాన్నిధ్యము మహత్తరంగా కొద్దిసమయములోనే ప్రవేశితము అవగలదు.

– ప్రతిమకు ప్రాణప్రతిష్ఠ చేస్తున్నప్పుడు ఈ **"దేవీ ఉపనిషత్ పారాయణము"** చేస్తే [(లేక) చేయిస్తే] ఆ ప్రతిమయందు ప్రాణప్రతిష్ఠ విశిష్టమై జరుగగలదు.

**భౌమా అశ్విన్యాం –** మంగళవారము, అశ్వనీ నక్షత్రము మొదలైన శుభవేళల పారాయణము ప్రారంభించెదరు గాక!

మహాదేవీ సన్నిధిలో ఈ ఉపనిషత్ పరమార్థమును జపించుటచే **"మహామృత్యువు"** నుండి తరించగలడు.

ఇందలి పరమార్థమును ఎరుగుటయే – **దేవీ 'తత్త్వజ్ఞానసిద్ధి'** అగుచున్నది.

శ్రీ దుర్గాదేవి అనిర్వచనీయమైన విజయములను ప్రసాదించగలదు.

*ఇతి దేవ్యుపనిషత్ (దుర్గాదేవ్యుపనిషత్)*

*ఓం శాంతిః। శాంతిః। శాంతిః।*

## యజుర్వేదాంతర్గత
# దుర్గా సూక్తము

| దుర్గాసూక్తము | దుర్గాసూక్తము |
|---|---|
| జాత వేదసే సునవామ<br>సోమ మరాతీయతో<br>నిదహాతి వేదః।<br>స నః పర్షదతి దుర్గాణి<br>విశ్వా నావేవ సింధుం<br>దురితా-అత్యగ్నిః॥ | **(అరిష్ట పరిహార మంత్రము)**<br>ఓ జాతవేదా! అగ్నిదేవా! స్వామీ! మేము సోమలతను పిండి, దాని నుండి రసమును తీసి ఆ రసమును మీకు భక్తి-ప్రపత్తులతో సమర్పిస్తున్నాము. మాకు పరమాత్మను ఎరుగటలో తారసబడే అడ్డంకులను కరుణామూర్తులై తొలగించండి.<br>ఏ విధంగా నావ దొరికితే సముద్రంలో మునుగువాడు ఆ నావ ఎక్కి ఒడ్డుకు చేరగలడో, ఆ విధంగా మమ్ములను సమస్తమైన సంసార దోషముల నుండి (మరియు) అన్ని పొరపాట్లు - తప్పిదముల నుండి, క్లేశముల నుండి సంసార సముద్రంలో లభించిన నావ వలె కాపాడదెరుగాక! సర్వ దురితములను తమ తేజో తత్త్వముతో భస్మము చేసివేయ ప్రార్థన. |
| తామ్ అగ్నివర్ణాం తపసా జ్వలన్తీం<br>వైరోచనీం కర్మఫలేషు జుష్టామ్।<br>దుర్గాం దేవీగ్ం శరణం<br>అహమ్ ప్రపద్యే।<br>సుతరసి తరసే నమః॥ | ఓ దుర్గాదేవీ! జగన్మాతా! సర్వత్రా తేజోరూపిణివై, అగ్నివై, అగ్నివర్ణముతో ప్రకాశించుదానా! తపోశక్తి రూపిణివై ప్రకాశించు దేవీ! పరమాత్మ యొక్క శక్తి స్వరూపిణీ! సర్వజీవులకు కర్మఫలములను ప్రసాదించు లోకేశ్వరీ! నమోనమః। దుర్గమములను సుగమంగా చేసే దుర్గాదేవీ! - పాంచభౌతిక పరిమిత భావములచే నిర్మితమైన "సంసారము" (లేక) ప్రాపంచక దుఃఖముల నుండి ఆశ్రితులను తరింపజేసే తల్లివి కదా! నిన్ను శరణు వేడుచున్నాను. సంసార దుఃఖముల నుండి చక్కగా తరింపజేసే నీకు నమస్కరిస్తున్నాను. |
| అగ్నే। త్వం పారయా నవ్యో<br>అస్మాన్ (థ) స్వస్తిభి రతి<br>దుర్గాణి విశ్వా।<br>పూశ్చ పృథ్వీ బహులాన ఉర్వీ<br>భవా తోకాయ తనయాయ<br>శంయోః॥ | ఓ అగ్నిదేవా! నీవు మమ్ములను శ్రీదుర్గాదేవి పాదపద్మములకు జేర్చే సమర్థుడవు. అందుచేత శ్లాఘనీయుడవు. స్వామీ! మమ్ములను సమస్త కష్టముల నుండి, దుఃఖముల నుండి బహిర్గతము చేయండి. 'కష్టములు' అనే దుర్గమారణ్యంలో చిక్కుకున్న మాకు దేవీ పాద పద్మముల వైపుగా త్రోవచూపండి. మేమున్న ఈ స్థలము, ఈ మాతృభూమి, ఈ సమస్త ప్రపంచము-మీ కృపచే బహు సుభిక్షమగుగాక! మా యొక్క పుత్రులకు, పౌత్రులకు శుభములు కలుగజేస్తూ, కష్టములు మాకు దూరమగునట్లు అనుగ్రహించండి. సుఖ ప్రదాత అవండి. |
| విశ్వాని నో దుర్గహా జాతవేదః<br>సింధుం న నావా దురితాఽతిపర్షి।<br>అగ్నే అత్రివన్ (త్) మనసా గృణానో<br>అస్మాకం బోధ్యవితా తనూనామ్। | ఓ జాతవేదా! అగ్నిదేవా!<br>మా ఈ భౌతిక శరీరములలో వేంచేసి అణువణువూ పవిత్రము చేయుచూ సర్వదా కాపాడుచున్నారు కదా! అదేవిధంగా, సముద్ర మధ్యలో చిక్కుకొని కొట్టుమిట్టాడుచున్న వానిని 'నావ' కాపాడువిధంగా సంసార సాగరంలో చిక్కుకొని అనేక దుఃఖములకు (Many worries) లోను అగుచున్న మమ్ములను పవిత్రత అనే నావపై (As a Boat) ఎక్కించి కాపాడండి. ఓ అగ్ని భగవాన్! లోకకల్యాణమూర్తి అయి సమస్త జనుల సుఖ-శాంతి-ఐశ్వర్య-ఆనందముల కొరకై తన తపస్సంతా సమర్పించిన అత్రి మహర్షి వలె ఎల్లప్పుడు మా శ్రేయస్సును దయతో మీ దృష్టియందు కలిగినవారై ఉండండి. మా 'మనస్సు' అనే పుష్పము స్వీకరించి, మా బుద్ధిని పవిత్రం చేయండి. |

| | |
|---|---|
| **పృతనాజితగ్ం సహమానమ్**<br>**ఉగ్రమ్ అగ్నిగ్ం హువేమ**<br>**పరమాత్ సధస్థాత్ (పరమాద్సస్థాత్) ॥**<br>**స నః పర్షదతి దుర్గాణి**<br>**విశ్వాక్షామత్ దేవో**<br>**అతి దురితాఽత్యగ్నిః॥** | హే అగ్నిదేవా! మమ్ములను కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములనే శత్రువులు చుట్టు ముట్టి ఉన్నారయ్యా!<br>మీరు ఉగ్రరూపులై శత్రు సైన్యమును ముట్టడించి భస్మము చేయగల మహత్ సామర్థ్యము కలవారు. అట్టి మిమ్ములను జగత్ సభ యొక్క అత్యున్నత స్థానము నుండి మేము ఉన్న చోటికి వేంచేయమని ఆహ్వానిస్తున్నాము. మా యొక్క సమస్త క్లేశముల నుండి మమ్ములను కాపాడండి. మా యొక్క గొప్ప దురితములను తొలగించండి. దేవా! మా అపరాధములను క్షమించి మమ్ములను రక్షించండి. |
| **ప్రత్నోషికమ్ ఈడ్యో అధ్వరేషు**<br>**సనాచ్చ హోతా, నవ్యశ్చ సత్సి।**<br>**స్వాంచ అగ్నే తనువం**<br>**పిప్రయ స్వాస్మభ్యన్చ**<br>**సౌభగమాయ జస్వ॥** | ఓ అగ్నిదేవా! యజ్ఞయాగాదులలో మీరు ప్రప్రథమ- ఆహ్వానితులుగా కీర్తించబడుచున్నారు. ప్రాచీన కాలము నుండి కూడా ఇప్పటివరకు ఇక ఎప్పటికీ కూడా- నిర్వహించబడు యజ్ఞ-యాగ-క్రతు-పూజా-పితృకార్య విధులలో హవ్య వాహనులై మేము స్వర్గ-దేవతలకు, పితృదేవతలకు సమర్పించు హవ్యములను వారికి జేర్చుచున్నారు. మేమంతా మీ స్వరూపము చేతనే నిర్మితులము. మీకు చెందినవారమే అయి ఉన్న మాకు ఆనందము కలుగజేయండి. మాకు సర్వతోముఖమైన సౌభాగ్యములను, శ్రేయస్సులను ప్రసాదించండి. |
| **గోభిః జుష్టమ్ అయుజో**<br>**నిషిక్తం తవ ఇన్ద్ర విష్ణోః**<br>**అనుసన్చరేమ।**<br>**నాకస్య పృష్ఠమ్ అభిసంవసానో**<br>**వైష్ణవీం లోక ఇహమ్**<br>**ఆదయనన్తామ్॥** | హే భగవతీ! వైష్ణవీ! దుర్గాదేవీ!<br>నీవు సమస్త పాపములకు, దుఃఖములకు సంబంధించక మాయందు కేవల స్వరూపిణివై వేంచేసియున్నావు. ఇంద్ర స్వరూపిణివై సమస్త ఇంద్రియములను పాలించు రాజ్ఞివి. విష్ణు స్వరూపిణివై సర్వత్రా వ్యాపించి ఉన్నావు. ఆకాశమునకు ఆవలగా విస్తరించి ఉన్నావు. సర్వ యజ్ఞ యాగ క్రతువులందు అభిసంవసువై అంతర్లీన గానంగా వేంచేసి ఉన్నావు. పశు ధన ధాన్య సంపదకై, యోగ-మోక్ష సాధనా సంపత్తికై నీ యొక్క సర్వత్రా వెల్లివిరిసియున్న వైష్ణవీ తత్త్వమును శరణు వేడుచున్నాము. వైష్ణవీ జ్యోతివై ఈ సర్వ లోకములుగా, 'నేను'గా వెలుగొందుచున్నది నీవే కదా! |
| **(కాత్యానాయ విద్మహే।**<br>**కన్యకుమారి ధీమహి।**<br>**తన్నో దుర్గిః ప్రచోదయాత్॥)** | శక్తి స్వరూపిణియైన కాత్యాయనీ దేవిని ఎరుగుటకై ఆ కన్యకుమారీదేవిని స్తుతించుచున్నాము. ఈ మా కొంచము స్తుతిని స్వీకరించి ఆ దుర్గాదేవి మా బుద్ధిని వికసింపజేయునుగాక! |
| **ఓం। శాంతిః। శాంతిః। శాంతిః॥** | **ఓం। శాంతిః। శాంతిః। శాంతిః॥** |

అథర్వణవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 11 పరబ్రహ్మోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ పరబ్రహ్మోపనిషది వేద్య "అఖండ సుఖాకృతీ"!
పరివ్రాజక హృత్ - గేయం హరితః త్రైపదం భజే॥



అఖండ - ఆత్మసుఖాకృతీ స్వరూపము, పరివ్రాజక హృత్ గానము, అజ్ఞానమునకు సింహము వంటిది-అగు ఈ **"పరబ్రహ్మోపనిషత్"**చే తెలియజేయ బడుచున్న **"త్రైపద - ఆత్మతత్త్వము"** భజించుచున్నాము. **హరిత్** - దిక్కులన్నీ విస్తరించియున్న పరబ్రహ్మమునకు-**నమస్కరిస్తున్నాము.**

**గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**
**గురుః సాక్షాత్ "పరబ్రహ్మ" తస్మై శ్రీగురవే నమః॥**

ఓం
**1.** అథ హి ఏనం (అథ-హైనం) మహాశాలః
శౌనకో, అంగిరసం -
భగవంతం
పిప్పలాదం...,
విధివత్ ఉపసన్నః
పప్రచ్ఛ :-

ఒక సందర్భములో మహాదాశయుడు, మహావిశాలహృదయుడు, లోక శ్రేయోభిలాషి (గృత్స్యమదుని మనుమడు, శునకముని కుమారుడు అగు) **-శౌనకుడు** తీర్థయాత్రలకు బయల్వెడలారు.

దధీచికుమారుడు, పిప్పలవృక్షము క్రింద **లోపాముద్ర** కు జన్మించినవాడు, (వేదాంగములలో నిష్ణాతుడగుటచే) అంగీరసుడు, బ్రహ్మజ్ఞాని, భగవంతుడు - అగు పిప్పలాద మహర్షిని అనుకోకుండా విధివశాత్తు కలిసారు.

మహనీయులు మహాపురుష సంశ్రయమును వృధాచేసుకోరు కదా! అందుచేత శౌనకుడు పిప్పలాద మహర్షిని సమీపించినవారై, ఈ విధంగా పరిప్రశ్నంచసాగాడు.

---

దివ్యే బ్రహ్మపురే
కే సంప్రతిష్ఠితా భవంతి?
కథం సృజ్యంతే నిత్యాత్మనః॥ -
ఏష మహిమా విభజ్య? ఏష మహిమా
విభుః క ఏషః?

<u>**శౌనకుడు :**</u>
(1) దివ్యమగు 'బ్రహ్మపురము' నందు సుప్రతిష్ఠితులై ఉన్నవారు ఎవరు?
(2) జీవులంతా నిత్యము, ఏకము అగు ఆత్మ నుండి అనిత్యము, అనేకముగా ఎట్లా సృష్టియందు సృష్టించబడుచున్నారు? ఎట్లా ప్రవేశము పొందుచున్నారు?
(3) అట్టి సృష్టికి కారణమగు బ్రహ్మపురము యొక్క మహిమ ఎట్టిది? ఆ మహిమకు విభుడు ఎవరు? ఆ మహిమ ఎవరికి చెందినది?
***దయతో ఈ విశేషాలు వివరించండి.***

---

<u>తస్మై సహోవాచ (పిప్పలాదౌ వాచ):</u>
ఏతత్ సత్యం యత్ ప్ర-బ్రవీమి,
బ్రహ్మవిద్యాం వరిష్ఠామ్।
దేవేభ్యః ప్రాణేభ్యః
పరంబ్రహ్మ పురే విరజన్
నిష్కళగ్ం శుభ్రమ్ అక్షరం
విశోకం విభాతి॥

**పిప్పలాదుడు :** వరిష్ఠము (పరాకాష్ఠ సత్యము, శ్రేష్ఠాతి శ్రేష్ఠము) అగు బ్రహ్మ విద్య గురించియే నీవు అడుగుచున్నావని నేను అనుకుంటున్నాను.

సమస్తమునకు ఆవల పరబ్రహ్మము విరాజమానమై ఉన్నది. అట్టి బ్రహ్మపురము దేవతలను, ప్రాణశక్తిని కూడా ప్రకాశింపజేస్తోంది. అదియే శ్రేష్ఠము. పరాకాష్ఠ కూడా.

అట్టి **'బ్రహ్మపట్టణము'** అనే **బ్రహ్మస్థానము - నిష్కళమై** (విభాగములేనట్టిదై), గుణములచే పరిమితము కానిదై, **శుభ్రమై** (నిర్దోషమై), మార్పు చేర్పులు పొందక, **అక్షరమై, విశోకమై** (వగుచుటయే లేనిదై), **ఆనందమయమై** విరాజిల్లుచున్నది.

| | |
|---|---|
| **2.** స నియచ్ఛతి మధుకరః<br>'శ్యే'వ వికర్మకః,<br>అకర్మాస్వాపీవ స్థితః। –<br>కర్మకరః। | ఆ బ్రహ్మపురమును పాలించు పరబ్రహ్మమే-**ఈ సమస్త జగత్ వ్యవహారమునకు కర్త.**<br>- తేనెటీగవలె తన మాధుర్యముతో ఈఈ జగత్తులను పరబ్రహ్మ పురుషుడే నిర్మిస్తూ ఉన్నారు. ఆయనయే సమస్త కర్మలకు అధికారి. నియామకుడు. (కుక్కవలె) కాపలాకాయుచూ, కర్మరహితుడై కూడా కర్మలన్నీ పర్యవేక్షించుచు, ఈ సమస్తము నిర్వర్తించుచున్నారు.<br>సమస్త సృష్టి చమత్కారము నిర్వర్తిస్తూ కూడా ఆయన కర్మరహితులు. **(నిద్రాముద్రాం నిఖిల జగతీం రక్షణే జాగరూకామ్।)** నిద్రాముద్ర ధరించి ఉండియే జగత్తును పర్యవేక్షిస్తూ రక్షిస్తూ ఉంటారు. |
| కర్మకవత్ ఫలమ్ అనుభవతి।<br>కర్మ మర్మ జ్ఞాత్వా కర్మ కరోతి।<br>కర్మ మర్మ జ్ఞాత్వా, కర్మ కుర్యాత్। | రైతువలె, కర్మలన్నీ నిర్వర్తిస్తూ కర్మఫలములను అనుభవించునది కూడా తానే అయి ఉంటారు. తత్త్వజ్ఞులు (కర్మ రహస్యముతెలిసి, కర్మ-కర్మఫలములు మొదలే లేవని తెలిసియే) 'సృష్టి' అనే లీలా-వినోద-క్రీడను దర్శిస్తూ, వారు కర్మలు నిర్వర్తిస్తూ ఉన్నారు.<br>కలలో జరిగే కర్మ సంఘటనలకు కర్మ-కర్మఫల యుక్తాయుక్తము (Logic) ఏముంటుంది? **జాగ్రత్ కూడా స్వప్నము వంటిదేనని** కర్మ - మర్మము తెలిసియే, **యోగులు కర్మలు నిర్వర్తిస్తూ ఉంటారు.** కర్మ-మర్మము ఎరిగియే మీ అందరిచే కర్మలు నిర్వర్తించబడు గాక! |
| క్షోజాలం విక్షిపేత్ ఏకో।<br>నైనమ్ అపకర్షతి। అపకర్షతి।<br>(నైనమ్ అపకర్షత్యపకర్షతి)<br>ప్రాణ దేవతా చత్వారః।<br>తాః సర్వా నాడ్యః। | ఏకమే అయి ఉన్న ఆత్మయే అనేక రకములుగా అనేక జీవులుగా, అనేకములతో కూడిన జగత్తుగా క్షోజాలమై - సంప్రదర్శనమౌతోంది.<br>చేపలు పట్టే వలకు ఎటువంటి ఆకర్షణలు, వికర్షణలు ఉండవు కదా!<br>అట్లాగే, ఆత్మ దేనినీ ఆకర్షించుటలేదు. తీసుకొనిపోవటము లేదు. ఎవ్వడూ ఆత్మకు దూరమవటములేదు. ఆత్మను మరొకచోటికి లాగటము లేదు.<br>ప్రాణ దేవతలు నలుగురు. (ముఖ్యప్రాణ-ఆపాన-వ్యాన ఉదానములు) వారే ఇడ పింగళ సుషుమ్న-ఇత్యాది నాడి - ఉపనాడుల ద్వారా దేహ కార్యక్రమములు నిర్వర్తిస్తున్నారు. |
| సుషుప్తః శ్యేన ఆకాశవత్<br>యథా శ్యేనః 'ఖమ్' ఆశ్రిత్య,<br>యాతి స్వమ్ ఆలయం కులాయమ్।<br>ఏవగ్ం సుషుప్తం బ్రూత, అయన్న పరశ్చ। | ఈ జీవుడు సుషుప్తి నుండి జాగ్రత్‌స్వప్నములకు వెళ్ళి రావటము జరుగుతూ ఉన్నది. ఒక డేగ తిరిగి తిరిగి వచ్చి తన గూడులో ప్రవేశించి విశ్రాంతి తీసుకుంటున్నట్లు ఈ జీవుడు జాగ్రత్ స్వప్నములలో ప్రవేశించి, నామరూపాత్మకమైన (భౌతికమైన) విశేషాలన్నీ ఆస్వాదించి- తిరిగి **సుషుప్తి** అనే గూటికి చేరుచున్నాడు. **ఇతి భూతం.** ఈవిధమైన రాకపోకలు అనుభవజ్ఞుల గమనిక. స్వానుభవము. |
| స సర్వత్ర హిరణ్మయే<br>పరేకోశే అమృతో హి।<br>ఏష నాడీ త్రయగ్ం సన్చరతి। (సఞ్చరతి)।<br>తస్య త్రిపాదం బ్రహ్మ। | **ఆత్మభగవానుడు** అన్నమయ-ప్రాణమయ-మనోమయ- విజ్ఞానమయ-ఆనందమయ పంచకోశములకు ఆవల పరస్వరూపుడై, అమృతస్వరూపుడై సర్వత్రా అన్నివైపులా అమృతధారలు కురిపిస్తూ ఉన్నారు.<br>ఆయనయే ఇడ-పింగళ-సుషుమ్న త్రినాడులలో సంచరించే కుండలినీశక్తి స్వరూపుడు.<br>ఆ పరమపురుషుడే **"జాగ్రత్-స్వప్న-సుషుప్త" ("భూ-భువర్-సువర్, "జీవాత్మ-ఈశ్వర-పరమాత్మ")** త్రిపాదములు ధరిస్తున్న బ్రహ్మము. |
| ఏషా త్రేష్య తతో అనుతిష్ఠతి।<br>అన్యత్ర బ్రూతాఽ యన్న పరన్చ।<br>సర్వత్ర హిరణ్మయే పరే కోశే। | ఇక్కడి త్రి గుణములు, త్రి లోకములు, త్రి అవస్థలుగా అవతిష్ఠము (Established) అయి ఉన్నది - ఆ పరబ్రహ్మమూర్తియందే. ఆయనయే అయము (ఇహము), పరము (Here and there) కూడా అయి, **సమస్తము తానేగా అగుచూ, సమస్తమునకు వేరై ఉన్నారు కూడా.** ఆయన కిరణములే (చైతన్యమే) పంచ కోశములందు, పంచ ప్రాణ-ఉపప్రాణములందు, పంచేంద్రియములందు **చేతనస్వరూపమై,** అన్నిటినీ **సచేతనము** చేస్తూ వెలుగొందుచున్నాయి. |

| | |
|---|---|
| యథైష దేవదత్తో యష్ట్యాచ<br>తాడ్యమానో నైవ ఇత్యేవమ్<br>ఇష్టా పూర్త కర్మ<br>శుభ – అశుభైః న లిప్యతే। | **దేవదత్తుడు (జీవుడు)** - శుభకర్మలచే శుభము, అశుభకర్మలచే అశుభములు పొందుచూ ఉంటాడు. **ఇష్టములచేతను** (యజ్ఞ, ఉపనయన, ఆతిధ్యము, మొదలైన విహిత కార్యములచేతను), **పూర్తములచేతను** (తటాకములు మొదలైనవి త్రవ్వించటము, గుడి కట్టించటము, అన్న-వస్త్రదానములు చేతను) **శుభ-అశుభ ఫలములు** అనుభవిస్తూ ఉంటాడు.<br>**పరమాత్మయో? శుభాశుభ కర్మలకు నిమిత్తమై ఉండరు. కర్మల దోషములు పొందరు. సమస్త జన్మ-కర్మలకు 'సాక్షి' అయి ఉంటారు.** |
| యథా కుమారకో<br>నిష్కామ ఆనందమ్ అభియాతి,<br>తథైష దేవః (తథా ఏషత్ ఏవ)<br>స్వప్న ఆనందం అభియాతి। | ఒక చిన్నపిల్లవాడు ఏవిధంగా నిష్కాముడై (జగత్తులో ఏదో పొందాలనే ఆశ-దురాశలు లేకుండా) నిష్కామానందము అనుభవిస్తూ ఉంటాడో, ఆ విధంగా ఈ జీవుడు స్వప్నములో - బాహ్యావస్తువులేవీ పొందకుండానే, ఆనందము మొదలైనవి పొందుచూ ఉంటాడు.<br>[ ఆ విధంగా ముముక్షువు జాగ్రత్‌లో కూడా నిష్కారణానందము (ఆత్మ జ్ఞానముచే) పొందు అభ్యాసము కలిగి ఉంటాడు. ఆత్మజ్ఞానముచే శుభ-అశుభ కర్మల, కర్మఫలముల పరిధులను దాటివేసినవాడై ఉంటాడు.] |
| **3.** వేద ఏవం పరంజ్యోతిః।<br>జ్యోతిషామా జ్యోతిః (జ్యోతిషామపి తత్ జ్యోతిః)<br>ఆనంద యత్యేవమేవ।<br>తత్పరం యచ్చిత్తం<br>పరమాత్మానమ్ ఆనందయతి। | ఆత్మ గురించి ఎరిగినవాడు ఆత్మను "జ్యోతికే జ్యోతి"గా అగుచు, సమస్త జీవులను ఆత్మజ్యోతిగా దర్శిస్తూ, **పరమానంద జ్యోతిస్వరూపులై వెలుగొందుచున్నారు.**<br>ఎవరి చిత్తము (పరమగు) పరమాత్మయందు సంలగ్నము అవుతుందో అట్టివాడు సమస్తము తత్పరానందముగా దర్శిస్తూ ఆత్మానందుడగు చున్నాడు. ఈ జగత్తతంతా ఆతనికి ఆత్మానంద-వైభవానుభవమే। (ఆతనిపట్ల ఇక బంధ మోక్షముల ప్రసక్తి ఎక్కడిది?). |
| శుభ్రవర్ణమ్ ఆజాయత ఈశ్వరాత్।<br>భూయః తేనైవ మార్గేణ<br>స్వప్న స్థానం నిగచ్ఛతి। | ఈశ్వరుని నుండి శుభ్రవర్ణమై జనించిన ఈ జీవుడు త్రిగుణములలో ప్రవేశించి తిరిగి అదే మార్గములో (తమో-రజో-సత్త్వ గుణములనుండి) స్వప్నస్థానమును పొందుచున్నాడు. **స్వప్న దృశ్యమును తనకు తానే కల్పించుకొని ఆ స్వప్నములో సంచారములు చేస్తూ స్వప్నానందము (గుణయుతుడై) ఆస్వాదిస్తున్నాడు.** |
| జలూకా భావవత్ యథా కామమ్<br>ఆజాయత ఈశ్వరాత్,<br>తావతా ఆత్మానమ్ ఆనందయతి। | ఒక జలగ పిపాసి అయి జంతువు శరీరమును గట్టిగా పట్టుకొనుతీరుగా ఈ జీవుడు సర్వాత్మకుడగు ఈశ్వరుని దృఢముగా ఆశ్రయించినప్పుడు **ఆత్మతత్త్వము గ్రహించి ఆత్మానందుడు కాగలడు.** |
| పరసంధి యత్ అపరసంధీతి,<br>తత్పరం నాపరం, (నాపరం) త్యజతి।<br>తథైవ కపాల–అష్టకగ్ం సంధాయ<br>య ఏష స్తన ఇవ ఆలమ్బతే। (ఇవాలమ్బతే)।<br>స ఇంద్ర యోనిః (సేంద్రయోనిః)। | ఏది పరము (ఆవల గల పరమాత్మకు) సంధియో, ఏది అపరమునకు సంధియో అట్టి సర్వాత్మకుడు - పర, అపరములు (ఉభయము) తనవై ఉంటాడు. ఉభయము త్యజించడు. అపరతత్త్వమే కపాలాష్టకమును (అష్టవిధ ప్రకృతిని పంచభూతములు, ప్రాణ, మనో చిత్తములను) సంధింపజేయుచు అవి స్తనములవలె ఆత్మగా తానే వాటికి ఆలంబనము అయి ఉంటున్నారు. పర-అపరములు ఆతనికి రెండు స్తనములు (ఎదురు రొమ్ములు) వంటివి. |
| స ఏవ యోనిః ఇతి అత్ర జాగ్రతి।<br>శుభ – అశుభ అతిరిక్తః<br>శుభ–అశుభైరపి కర్మభిః న లిప్యతే।। | అట్టి పరమాత్మయే త్రిలోకాధిపతి అగు ఇంద్రునికి (పంచేంద్రియతత్త్వముల విశ్వాధినేతకు) కూడా యోని (జనన) స్థానము.<br>ఈ సమస్త జాగ్రత్ జగత్తుకు కూడా జననస్థానము అట్టి పరతత్త్వమే। ఆ పరమాత్మయే। ఆ కేవలమగు పరస్వరూపమే।<br>అట్టి పరమాత్మ స్థానము శుభ అశుభములకు ఆవలిదై, శుభ - అశుభకర్మలచే స్పృశించబడనిదై ఉన్నది. **కర్మలదోషములు ఆత్మకు అంటజాలవు.** |

| | |
|---|---|
| య ఏష దేవో అన్యదేవస్య<br>సం(ప్రసాదో అంతర్యామిః।<br>అసంగ చి(ద్రూపః పురుషః। | (బంగారు ఆభరణములన్నిటికీ బంగారమే సం(ప్రసాదము (Root material) అయినట్లుగానే), పరమాత్మయే సమస్త దేవతలయొక్క సం(ప్రసాదుడు. సమస్త జీవులకు అంతర్యామి (The Inner Recess of self of all). అట్టి ఆత్మపురుషుడు బాహ్య - అంతరంగములలో ఏ ఒక్క విశేషమునకు సంగుడు (Attached and bound) కాడు. **సమస్తము ఆ పరమాత్మయొక్క చి(ద్రూప పురుషకారమే।** |
| (ప్రణవహగ్ంసః పరం(బ్రహ్మ।<br>న (ప్రాణహగ్ంసః।<br>(ప్రణవో జీవః।<br>ఆద్యా దేవతా నివేదయతి।<br>య ఏవం వేద,<br>తత్ కథం నివేదయతే?<br>జీవస్య (బ్రహ్మత్వం ఆపాదయతి। | **(ప్రణవస్వరూపుడు** (ఓంకారస్వరూపుడు) అగు పర(బ్రహ్మము సర్వ దేహములలో **(ప్రాణేశ్వరుడు.** అట్టి (ప్రణవమే ఈ జీవుడు కూడా. ఆయనే దేవతలకే ఆదిస్వరూపుడు, దేవాది దేవుడు. అట్టి ఆత్మభగవానుని తెలుసుకొన్నవాడు ఏ బాహ్య (అన్య) దేవతకు సమర్పితుడు అవుతాడు? అన్యోపాసనామా(త్రుడై ఉండడు. సర్వతత్త్వ స్వరూపుడగు పరమాత్మకే నివేదితుడు అవుతాడు. **అనన్యోపాసకుడు అవుతాడు.**<br>**"ఈ జీవుడు - (బ్రహ్మమే"** (జీవో(బ్రహ్మేతినాపరః) అని సిద్ధాంతీకరించ బడుతోంది. (బ్రహ్మముపై 'జీవుడు' అనునది ఆపాదితము మా(త్రమే. |
| **4.** సత్త్వమ్ అథాస్య<br>పురుషస్య అంతః - శిఖ<br>ఉపవీతత్వం (బ్రాహ్మణస్య!<br>ముముక్షోః అంతశ్శిఖ-ఉపవీత ధారణమ్। | **(బ్రహ్మమును-ఉపాసన అధ్యయనము, సర్వ(త్రా సందర్శనము** చేయువాడే- **(బ్రాహ్మణుడు.** (అంతేగాని కుల- జన్మమా(త్రంగా '(బ్రాహ్మణ' శబ్దార్థము పరిమితముకాదు).<br>ఈ జీవునికి సత్త్వమే (పర(బ్రహ్మమే) అంతఃశిఖ. బాహ్యమైన శిఖ (పిలక) సత్త్వము కాదు (సాత్త్వికత కాదు).<br>(బ్రహ్మము గురించి జ్ఞాన, ఉపాసన, భావనలే ఉపవీతము. (బ్రహ్మమే (సమస్త జీవుల స్వస్వరూపమే అయినట్టి (బ్రాహ్మీతత్త్వమే) (బ్రాహ్మణునకు **ఉపవీతము (లేక) (బ్రహ్మసూ(త్రము.**<br>"జీవన్ముక్తి, జన్మరాహిత్యము, ముక్తి, మోక్షము" - అనునది ఆశయముగా కలిగియున్న ముముక్షుత్వమే అంతఃశిఖ, ఉపవీతధారణము కూడా **ముముక్షువు అట్టి అంతఃశిఖోపధారణ చేయటమే ముఖ్యము.** |
| బహిర్లక్ష్యమాణ<br>శిఖా-యజ్ఞోపవీత ధారణం<br>కర్మిణో గృహస్థస్య। | కర్మిష్ఠుడైన గృహస్తుడు బాహ్య లక్షణములగు యజ్ఞోపవీతము, శిఖ ధరించటము కర్మవిధి మా(త్రమే. వాటియొక్క అంతరార్థము మా(త్రము (బ్రహ్మీదృష్టి, సత్త్వగుణమే అని (గ్రహించి, అసలైన శిఖ-యజ్ఞోపవీతములను- ముముక్షువులు ఎరిగి ఉండెదరు గాక! |
| అంతరుపవీత లక్షణం తు<br>బహిః తంతువత్ అవ్యక్తమ్<br>అంతస్తత్త్వమేళనమ్। | **"అంతర్-ఉపవీతము సమస్తము ఏకము - అఖండము అగు (బ్రహ్మమే"** - అనే (బ్రాహ్మీ దృష్టి పెంపొందే ఉపాసన - (బాహ్యమున ధరించే ఉపవీతము వలె) బయటకు కనిపించేది కాదు. అది **అంతరమున ఆత్మజ్ఞానము యొక్క ఉపాసన - అభ్యాసమునకు సంబంధించినది.** భౌతికమైన ఉపవీతము వలె వ్యక్తీకరణమయ్యేది కాదు. (భౌతిక ఉపవీతము 'సంజ్ఞ' వంటిది మా(త్రమే).<br>అనగా ఉపవీతము అంతఃకరణమునకు సంబంధించినదేగాని, బయటకు భౌతికమైన (లేక) శారీరకమైన ఉపవీతము చేత వ్యక్తీకరించబడునది కాదు. |
| న సత్। న అసత్। న సదసత్-<br>భిన్న-అభిన్నం-న చ। ఉభయమ్ (న)। | అట్టి (బ్రాహ్మీభావన, ((బ్రహ్మోపాసన) లేక పర(బ్రహ్మతత్త్వము (అంతర్- ఉపవీతము) ఎటువంటిది?<br>(బ్రహ్మము **సత్తు** (భౌతికంగా ఉనికి కలిగినది) కాదు. **అసత్తు** (లేనిది) కాదు. అది **కొంత సత్, కొంత అసత్** కూడా కాదు. **భిన్నము, అభిన్నము, ఉభయము కూడా కాదు.** ఆత్మకు అన్యమైనదేదీ అందుకు గుర్తువంటిది కాదు. **(స్వస్వరూపము గురించిన నిశ్చలానుభవమే అది).** |

| | |
|---|---|
| న స భాగం। న నిర్భాగం।<br>న చాఽపి ఉభయరూపకమ్। | అట్టి "బ్రహ్మము" అనబడే "పరతత్త్వము" మరొక దేనిలోనో ఒకానొక భాగము కానేకాదు. తాను భాగ - విభాగములుగా (Partitioned) అగుచున్నదా? అవదు. సమస్తము అద్దాని స్వరూపమే కాబట్టి నిర్భాగము కూడా కాదు. (ఏకము, అనంతము, సమస్తము అయి ఉన్నట్టిది). |
| బ్రహ్మాత్మైకత్వ (బ్రహ్మాత్మా-ఏకత్వ) విజ్ఞానాత్<br>హేయం మిథ్యాత్వకారణాత్, ఇతి। | **"అటు తాను భాగము, ఇటు తనలో భాగము"** అను ఉభయము కూడా కాదు. ఇక్కడ కనిపించే అనేకత్వమంతా కలలోని దృశ్యమువలె మిధ్య (Illusion) మాత్రమే. కాబట్టి బ్రహ్మము సర్వదా ఏకమే గాని అనేకముగా అగుటలేదు - అనునదే బ్రహ్మాత్మతత్త్వము (లేక) బ్రహ్మవిద్య. అందుచేత బ్రహ్మమునకు వేరుగా కనిపించే 'అన్యము' - 'మిధ్య'యే కారణముగా కలిగి ఉన్నది. |
| పఞ్చపాద్ బ్రహ్మణో న కించన। | అట్టి ఆత్మ యొక్క పంచపాదములలో ఐదవది తురీయాతీతము. జాగ్రత్ - స్వప్న - సుషుప్తి - తురీయములగు నాలుగింటికి ఆవలగల తురీయాతీత స్వరూపమునకు మరొకటి అన్వయము అనునదే లేదు. |
| చతుష్పాద్ అంతర్వర్తినో,<br>అంతర్జీవ బ్రహ్మణః చత్వారిస్థానాని।<br>నాభి హృదయ కంఠ మూర్ధసు। | అంతర్వర్తి అగు ఆత్మకు నాలుగు పాదములు, (లేక) బ్రహ్మము యొక్క శరీర-అంతర్జీవన తత్త్వమునకు (ఉపాసనకై) నాలుగు ముఖ్య స్థానములు<br>**(1) నాభి (2) హృదయము, (3) కంఠము, (4) మూర్ధము.** |
| జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయావస్థాః<br>ఆహవనీయ గార్హపత్య దక్షిణ సభ్య అగ్నిషు। | ❀ అవస్థలు **4** : (1) జాగ్రత్ (2) స్వప్నము, (3) సుషుప్తి (4) తురీయము.<br>ముఖ్యమైన అగ్నులు - (4)<br>❀ (1) ఆహవనీయాగ్ని (2) గార్హపత్యాగ్ని (3) దక్షిణాగ్ని (4) సభ్యాగ్ని |
| జాగరతే బ్రహ్మా।<br>స్వప్నే - విష్ణుః।<br>సుషుప్తౌ - రుద్రః।<br>తురీయమ్ - అక్షరం చిన్మయమ్। | **<u>అధిదేవతలు</u>**<br>(1) జాగ్రత్‌కు - **బ్రహ్మదేవుడు.** (2) స్వప్నమునకు - **విష్ణుభగవానుడు.**<br>(3) సుషుప్తికి - **రుద్రభగవానుడు.**<br>(4) తురీయమునకు - అక్షర - చిన్మయమగు **ఆత్మపురుషుడు.** |
| తస్మాత్ చతురవస్థా<br>చతురంగుల వేష్టనమ్ ఇవ।<br>షణ్ణవతి (షట్ నవతి-96)<br>తత్త్వాని తంతువత్<br>విభజ్య తదా హితమ్, | ఈ విధంగా చతుర్ (4) అవస్థలు నాలుగు వ్రేళ్ళను చుట్టి ఉన్నట్లుగా ఉంటున్నాయి. (మూడు పేటలు = జాగ్రత్, స్వప్న, సుషుప్తులు)<br>"96" తత్త్వములు 96 తంతువులవలె (96 ధారములవలె) విభజనము కలిగిననై నాలుగు వ్రేళ్లను చుట్టుకొని ఉంటున్నాయి. విభజించి కలుపబడిననై ఉంటున్నాయి. |
| త్రిగుణీకృత్య ద్వాత్రింశత్ (32) తత్త్వ నిష్కర్షమ్<br>ఆపాద్య, జ్ఞాన పూతం త్రిగుణ స్వరూపం॥ | 32 తత్త్వములు - మూడు పేటల గొలుసువలె (ఆత్మచే) ధరించబడిననై ఉంటున్నాయి. (కొందరు బ్రహ్మమును '32' తత్త్వములుగా విభాగిస్తున్నారు) త్రిగుణములు = సత్త్వ రజో తమో "త్రిగుణములు" - జ్ఞానము (ఎరుక) అను దానిచే అంతటా పూతపూయబడి ప్రదర్శనమగుచున్నాయి. **జ్ఞానము త్రిగుణములచే పూత పూయబడి ఉంటోంది.** |

**5.** త్రిమూర్తిత్వం పృథక్ విజ్ఞాయ,
నవ బ్రహ్మాఖ్య, నవగుణోపేతమ్ జ్ఞాత్వా,
నవమానమితః త్రిః,
పునః త్రిగుణీకృత్య,
**(9×3 = 27)**

(నవబ్రహ్మలు - (పౌరాణికంగా)
నవబ్రహ్మ మానస పుత్రులు
సనకుడు, సనందనుడు, సనత్సుజాతుడు, సనత్కుమారుడు, ఋభుష, నారదుడు, హంసుడు, అరుణి, యతి (9)

<u>బ్రహ్మము గురించిన ఉపాసన అధ్యయనము</u>
<u>బ్రహ్మసూత్రము యజ్ఞోపవీతము (ధారణ విశేషములు)</u>

సృష్టియొక్క (దృశ్యముయొక్క) (1) సృష్టి (2) స్థితింపబడటము (3) లయించటము అను బ్రహ్మ - విష్ణు - రుద్ర అధిదేవతా కల్పనా కార్యక్రమ చమత్కారమును ముందుగా గమనించి తెలుసుకొందురు గాక!

సృష్టి కార్యమునకు కారణభూతులగు నవబ్రహ్మ ప్రసిద్ధులు, నవ ప్రజాపతులు (మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, భృగువు, వసిష్ఠుడు, దక్షుల గురించి), నవ ఆత్మగుణములు అగు జ్ఞాన, సుఖ, దుఃఖ, ఇచ్ఛా, ద్వేష, ప్రయత్న, ధర్మ, అధర్మ సంస్కారముల గురించి- **విజ్ఞాయ**- తెలుసుకోబడుగాక। (సత్త్వ-రజ-తమ) 9 తత్త్వములను మరల త్రిగుణీకృతము (9×3=27) చేసి, ముప్పేటగా చేసి ధరించుదురు గాక! **ఇదియే యజ్ఞసూత్ర ధారణము.**

| | |
|---|---|
| **సూర్య ఇన్దు అగ్ని కళా స్వరూపత్వేన**<br>**ఏకీకృత్య**<br>**ఆద్యంతర ఏకత్వమ్-అపి।**<br>**మధ్యే త్రిరావృత్య,** | సూర్యచంద్ర అగ్నుల కళారూపత్వమును (పింగళ, ఇడ, సుషుమ్నలను) ఏకీకృతము (United) చేసి యోగులు ధారణ చేయుచున్నారు.<br>(ఆది - అంతముల ఏకత్వమును ధ్యానిస్తూ, - మధ్యగా త్రిరావృత్యము పింగళ, ఇడ, సుషుమ్నలయందు నిర్వర్తించి ఇడ-పింగళలతో కుండలినీశక్తిని సుషుమ్నానాడిలో ప్రవేశింపజేయుచున్నారు). |
| **బ్రహ్మ విష్ణు మహేశ్వరత్వమ్**<br>**అనుసంధాయ**<br>**ఆద్యంతమ్ ఏకీకృత్య,**<br>**చిద్గ్రంథ - అద్వైత గ్రంథిం కృత్వా,** | సృష్టి స్థితి లయ తత్త్వ స్వరూపులగు బ్రహ్మ - విష్ణు - మహేశ్వరత్వమును అనుసంధానము చేసి,<br>సృష్టియొక్క ఆది - అంతములను, ఏకీకృతము చేసి వేయాలి. మొదలు చివర కలిపివేయాలి.<br>ఆ మూడిటిని ఒక స్థానమునకు తెచ్చి చిద్గ్రంధములను (సృష్టి-స్థితి-లయ-ప్రజ్ఞలను) అద్వైత- (బ్రహ్మమునకు వేరుకాదు అను) స్థితి - అవగాహనలకు తెచ్చి వేయాలి. **అద్వైత గ్రంథిగా** చేయాలి. (ఇదియే యజ్ఞోపవీతము యొక్క 'బ్రహ్మముడి'). |
| **నాభ్యాది బ్రహ్మ బిల**<br>**ప్రమాణం పృథక్ పృథక్**<br>**సప్తవిగ్ంశతి (27)**<br>**తత్త్వ సంబంధం, త్రిగుణోపేతం**<br>**త్రిమూర్తి లక్షణ లక్షితమపి**<br>**ఏకత్వం ఆపాద్య,** | నాభి (బొడ్డు) నుండి - బ్రహ్మబిలము (శిరస్సుయొక్క ఉపరిస్థానమునగల బ్రహ్మరంధ్రము) వరకుగల వేరువేరైన "27" తత్త్వముల సంబంధమును త్రిగుణోపేతము (సత్త్వ రజో తమో త్రిగుణోపేతము - మూడు ప్రోగులు) చేసి త్రిగుణోపేతమైన త్రిమూర్తుల లక్షణములను (సత్త్వరజోతమోములను), సృష్టి-స్థితి-లయములను) వాటివాటి లక్షితములను (బ్రహ్మమునందు) ఆపాదించాలి (Attributions on Brahmam). బ్రహ్మమునకు అద్వితీయముగా దర్శించెదరు గాక। |
| **వామాగ్ంసాది దక్షిణ కట్యంతం విభావ్య**<br>**ఆద్యంత గ్రహసమ్మేళనమ్ ఏకం జ్ఞాత్వా,** | వామ (ఎడమ) నుండి దక్షిణ (కుడి) కటి (మొల) వరకు బ్రహ్మసూత్రము (లేక) యజ్ఞోపవీతమును భావనచేసి (బ్రహ్మముడి నుండి బ్రహ్మముడివరకు) ఆద్యంతము గ్రహసమ్మేళనమును (సూర్య-చంద్ర-అంగారక- బుధ-గురు-శుక్ర-శని-రాహు-కేతువులను) ఏకమగు బ్రహ్మముగా తెలుసుకొంటూ (అనుకుంటూ) ఉండెదరు గాక. |
| **మూలమ్ ఏకగ్ం సత్యం మృణ్మయం విజ్ఞాతగ్ంస్య-**<br>**యత్ వాచాఽ_రమ్భణం,**<br>**వికారో నామధేయం**<br>**'మృత్తిక' - ఇత్యేవ సత్యం।** | మట్టి బొమ్మలో మూలమగు మట్టియే (మృణ్మయము) సత్యము. **'మృత్తికేవ సత్యమ్'**. ఆకారము, దానికి పెట్టిన పేరు సత్యము కాదు. అట్లాగే బ్రహ్మమే సత్యము. (మట్టిబొమ్మలో **'బొమ్మ'** అను విభాగము వాచారంభము. మట్టి యొక్క ఒక ఆకారమునకు (వికారమునకు) పెట్టిన పేరువలె),<br>**"ఈ నామ-రూపాత్మకమైనదంతా బ్రహ్మమే"**. బ్రహ్మమే సత్యమై తదితరమైనదంతా కూడా - వికారోనామధేయము-అని మననము చేస్తూ ఉండాలి. బంగారపు ఉంగరములో బంగారము సత్యమయినట్లు **"జీవుడు-అని కనబడుచున్న దానిలో బ్రహ్మమే సత్యము"** అని గమనిస్తూ ఉండాలి. |
| **"హంస" ఇతి వర్ణద్వయేన**<br>**అంతః శిఖ-ఉపవీతిత్వం నిశ్చిత్య,**<br>**బ్రాహ్మణత్వం బ్రహ్మధ్యాన అర్హత్వం యతిత్వమ్।**<br>**అలక్షిత అంతః శిఖ-ఉపవీత్‌త్వమ్**<br>**ఏవం బహిర్లక్షిత (బహిః లక్షిత)**<br>**కర్మశిఖా జ్ఞానోపవీతం -** | హంసో = అహమ్ + సః-లో - **అహమ్** ఆభరణము వంటిది. **"సో"** బంగారము వంటిది. హంసో (సోఽహం)లో "సః". **"పరమాత్మయే జీవాత్మ-జగత్తుల రూపము"** అనునదే అంతఃశిఖ ఉపవీతములు. యతి బ్రాహ్మమును ధారణ చేసి, '**బ్రాహ్మణుడు**'గా అగుచున్నాడు.<br>బ్రహ్మము యొక్క ధ్యానమే బ్రాహ్మణత్వము. బ్రహ్మభావనయొక్క సిద్ధిచే 'యతి' అగుచున్నాడు.<br>బాహ్యమున ధరించి శిఖ - ఉపవీతములు (జందెము/జందియము) కర్మరూపంగా ధరిస్తూ, భౌతికంగా ధరిస్తూనే - భౌతికంగా లక్షింపక, **జ్ఞాన యజ్ఞోపవీతమే లక్ష్యము (Objective) గా కలిగి ఉండాలి. 'ఆత్మ'గా అయి ఉన్న నేను - ఈ సమస్తమును 'ధారణ'గా కలిగి ఉంటున్నాను-అనునదే నిజమైన "యజ్ఞోపవీతధారణ".** |

గృహస్థస్య అభాస బ్రాహ్మణత్వస్య
కేశ సమూహ శిఖా
ప్రత్యక్ష కార్పాస తంతు కృత ఉపవీతత్వం।
(కార్పస=నూలు/ప్రత్తి)।

ఒక గృహస్థుడు ధరించే ప్రత్తితో చేసిన ఉపవీతము (జందియము) కేశములచే తీర్చిదిద్దుకొనే శిఖాసమూహముపట్ల (**"ఈ దృశ్యమును బ్రహ్మముగా ధారణ చేయటము)** - అనే బ్రహ్మ త్రిసూత్ర దృష్టి కలిగి ఉండాలి. లేకుంటే అది అభాసమాత్రమే .

గృహస్థుడై, అభాసబ్రాహ్మణత్వము వహించువానికి భౌతికమైన శిఖ నూలుప్రోగు ఉపవీతమే పవిత్రము అని అనిపిస్తోంది. జ్ఞానదృష్టితో అంతరార్థము అంతరార్థము తెలిసి ధరించటము - అవసరము సుమా!

---

చతుర్గుణీ కృత్య, చతుర్వింగ్ంశతి (24)
తత్త్వాపాదన తంతు కృత్యం
నవ తత్త్వమ్ ఏకమేవ
<u>**"పరంబ్రహ్మ"।**</u>

ఓ శౌనకా! జాగ్రత్ - స్వప్న - సుషుప్తి - తురీయ చతుర్గుణీయ క్రియలు, '24' తత్త్వములు (పంచమహాభూత, పంచప్రాణి-పంచజ్ఞానేంద్రియ, పంచకర్మేంద్రియ, అంతరంగ చతుష్టయములను) - **ఆత్మతత్త్వోపాసనకు ఉపకరణములుగా అవగలవు** - అని నీవు గ్రహించి ఉండాలి.

ఏకమగు పరబ్రహ్మమే నవతత్త్వములుగా [నవాత్మలుగా - (దృశ్యాత్మ, భూతాత్మ, జీవాత్మ, అంతరాత్మ, పరమాత్మ, నిర్మలాత్మ, శుద్ధాత్మ (కేవలాత్మ), జ్ఞానాత్మ, మహాత్మలుగా] ప్రదర్శనమౌతోంది.

---

**6.** తత్ ప్రతిసరయోగ్యత్వాత్
బహుమార్గ ప్రవృత్తిం
కల్పయంతి।

అట్టి ఉపవీతము [ (లేక) బ్రహ్మసూత్రము (లేక) యజ్ఞసూత్రము లేక జందియము ] యొక్క (త్రిసూత్రముయొక్క) ప్రతి పేట (ప్రతి పోగు) - అనేక మార్గములలో (భక్తి, ప్రపత్తి, యోగాభ్యాసము, అధ్యయనము, జ్ఞాన విచారణ మార్గములో) బ్రహ్మోపాసనకు 'యోగ్యత' అగుచున్నది.

---

| సర్వేషాం బ్రహ్మాదీనాం, దేవర్షీణాం<br>మనుష్యాణాం-ముక్తిః ఏకా। |
|---|

<u>(కింతు) బ్రహ్మమ్-ఏకమేవ। (బ్రహ్మైకమేవ)।</u>
<u>(కింతు) బ్రాహ్మణత్వమ్ (హి) ఏకమేవ।</u>
<u>వర్ణాశ్రమ ఆచార విశేషాః</u>
<u>పృథక్ పృథక్।</u>

ఈ జగద్దృశ్యములో వర్ణ - ఆశ్రమ విధానంగా వేరువేరైన ఆచార విశేషాలు ఉండవచ్చుగాక! సమస్తము 'తానే' అయి ఉన్న బ్రహ్మము ఏకమేగాని, 'అనేకము' కాదు. బ్రహ్మదేవుడు మొ॥వారికి గాని, దేవర్షులకుగాని, మనుష్యులకుగాని - 'ముక్తి', అనునది ఒక్కతీరైనదే. బ్రహ్మము, బ్రాహ్మణత్వము ఒక్కటే! బ్రహ్మతత్త్వభావనయే బ్రాహ్మణము. **అట్టి బ్రహ్మోపాసన జన్మ - జాతి - లోక - ఆశ్రమ - నివాస భేదములకు చెందినది కానేకాదు.**

---

శిఖా వర్ణాశ్రమిణామ్ ఏకైవ।
అపవర్గస్య యతేః - శిఖా।
యజ్ఞోపవీత మూలం
ప్రణవమ్ ఏకమేవ వదంతి॥
హంసః శిఖా, ప్రణవం ఉపవీతం।
నాదః సంధానమ్, ఏష ధర్మో।
నేతరో (న ఇతరో) ధర్మః॥

బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాస చతురాశ్రమములవారికి, చాతుర్వర్ణములవారికి **'అపవర్గము'** (లేక) **'మోక్షము'** ఒక్కటే!
అట్టి మోక్షము గురించిన ఆశయమే శిఖ.

అందరికీ (జాగ్రత్-స్వప్న-సుషుప్తి-తురీయములకు ఆవల సాక్షి అగు-ఆత్మయే అర్థముగా గల) ప్రణవమే → యజ్ఞోపవీతము.

అన్ని ఆశ్రమములవారికి, అన్ని లోకవాసులకు, దేవ-మానవ-జంతు ఇత్యాది అన్ని జాతులజీవులకు కూడా **"హంస-సోఽహమ్'** - అనునదే "శిఖ". కేవలాత్మ యొక్క సంజ్ఞయే - 'ఉపవీతము'

నాదమే ప్రణవము. **ప్రణవమే - ఆత్మతో అనుసంధానము.**

ఆత్మయే అందరికి ధర్మము. (Main Feature). ఆత్మకు వేరైన ధర్మము ఎక్కడా కూడా ఎవ్వరికి ఏదీ లేదు. అఖండమగు ఆత్మభావనయే అందరికి ఉండవలసిన నిష్ఠ అట్టి నిష్ఠయే పరమ ధర్మము.

---

తత్ కథమ్? - ఇతి। ప్రణవో హగ్ంసో;
నాదః త్రివృత్ సూత్రమ్।
హృది చైతన్యే తిష్ఠతి -
త్రివిధం బ్రహ్మ। - తత్ విద్ధి।

అది ఎట్లా? అంటే....(1) ప్రణము (ఓం) (2) హంస (సోఽహమ్) (3) నాదము (అనుసంధానము) - ఇవియే యజ్ఞోపవీత → త్రివృత్-సూత్రము. ఈ మూడు జాతి-మత కుల భేదం లేకుండా (మానసికంగా) ధరించవలసినది. కనుక సర్వవర్గములవారు ధరించవలసిన యజ్ఞ సూత్రము- సర్వత్రా త్రిసూత్రాత్మ దర్శనమే।

| | |
|---|---|
| | ఈ **ప్రణవ హంస నాదములు**గా ప్రతి జీవుని హృదయములోను, ఆత్మచైతన్యమే సర్వదా వేంచేసినదై వెలుగొందుచున్నది. అట్టి త్రివిధ రూపమగు **ఆత్మయే తెలుసుకోవలసిన, చూడవలసిన, ఉపసించవలసిన - బ్రహ్మము, సత్యము, నిజస్వరూపము.** |
| ప్రాపంచిక శిఖ, ఉపవీతం<br>త్యజేత్। స శిఖం వపనం కృత్వా,<br>బహిః సూత్రం త్యజేత్ బుధః।<br>యత్ అక్షరం పరం బ్రహ్మ<br>తత్ సూత్రమ్ - ఇతి ధారయేత్। | ఈ జీవుడు ధారణ చేయవలసినది ప్రాపంచకమైన శిఖ, నూలు యజ్ఞోపవీతము కాదు. బాహ్యమగు శిఖ-(నూలుపోగు) ఉపవీతముల **బాహ్య సంశుద్ధి సంసిద్ధత కొరకు 'శాస్త్రీయ నియమములు' మాత్రమే. అసలైన యజ్ఞసూత్రము అక్షరపరబ్రహ్మ భావనయే।**<br>బాహ్యసూత్రమును బయటనే వదలి "అక్షరపరబ్రహ్మము" అనబడే యజ్ఞసూత్రమును (లేక యజ్ఞోపవీతము, లేక బ్రహ్మసూత్రము)ను అంతరంగా ధరించాలి. |
| పునర్జన్మ నివృత్త్యర్థం<br>మోక్షస్య అహర్నిశం స్మరేత్। | మరల పుట్టకుండా "పునర్జన్మ నివృత్తి" లేక 'జన్మరాహిత్యము' కొరకై, సర్వబంధముల భేదన రూపమగు **మోక్షభావము (లేక) ఆత్మభావము**ను సదా స్మరించాలి. |
| "సూచనాత్ సూత్రమ్"<br>ఇతి ఉత్యుక్తగ్ం<br>సూత్రం నామ 'పరం పదమ్'। | **(1) యజ్ఞసూత్రము అనగా ఏది?**<br>**సూత్రము అనగా సూచన.** దేనిని గురించి సూచన? సందర్భ రూపములన్నిటికీ ఆవలగల కేవల (కైవల్య) రూపమగు పర స్వరూప ధారణయే యజ్ఞోపవీతధారణలోని సూత్రము (లేక) సూచన. 'పరబ్రహ్మము'ను నేను ధారణ చేస్తున్నాను - అనునదే యజ్ఞ సూత్రధారణ. పరబ్రహ్మమై జగత్తును సూత్రముగా ధారణ చేస్తున్నాను- అనునదే 'పరమపదము'. |
| తత్ సూత్రం విదితం యేన<br>- స ముముక్షుః।<br>- స భిక్షుకః।<br>- స వేదవిత్। (స) సదాచారః।<br>స విప్రః పంక్తి పావనః॥ | ఎవ్వరైతే పరమాత్మ స్థానము (లేక) "పరమపదము" అనే వేద ఉపనిషత్తుల సూచన గ్రహిస్తారో, తత్ త్వమ్ **(నీవుగా కనిపించేది బ్రహ్మమే), నేను బ్రహ్మమే** (సోఽహమ్) మొదలైన మహావాక్యముల (లేక) ఆత్మతత్త్వ వాక్యముల ధారణచేస్తూ ఉంటాడో, **ఆతడే - ముముక్షువు. ఆతడే భిక్షకుడు.** (చీకటి తొలగినవాడు)<br>అట్టి ఆత్మగురించిన 'సూచన' అగు ఉపవీతము /(యజ్ఞసూత్రము) ఎరిగినవాడే వేద హృదయము తెలుసుకొన్న వేద విహితుడు. **'సత్'ను ఆచారముగా సిద్ధించుకున్న సదాచారుడు.** అట్టివిప్రుడు ఉన్న పంక్తిలోని జనులంతా పవిత్రులు కాగలరు. |
| **7.** యేన సర్వం ఇదం ప్రోతం<br>సూత్రే మణిగణా ఇవ,<br>తత్ సూత్రం ధారయేత్ యోగీ, -<br>యోగవిత్ బ్రాహ్మణో యతిః। | సంయోగ వియోగాతీత తత్త్వము తెలిసిన యోగి, (బ్రాహ్మణుడు, యతి) అయినట్టివారు ధరించవలసిన సూత్రము ఏది? నూలుప్రోగు సూత్రము కాదు. మరి? **ఈ సమస్త విశ్వము, విశ్వజీవులు, ఏ సూత్రపు త్రాడు (దారము)నకు గ్రుచ్చబడి ఉన్నారో - మణిహారమునకు మణులవలె సకల జీవులు ఏ బ్రహ్మము అను సూత్రము (సూచన)కు అల్లబడిఉన్నారో - అట్టి సూత్రమును నిత్యము ధారణ చేయువారై ఉండాలి.** అదియే వాస్తవమైన ఉపవీతము (లేక) బ్రహ్మసూత్రము. |
| బహిస్సూత్రం త్యజేత్ విప్రో<br>యోగవిజ్ఞాన తత్పరః।<br>బ్రహ్మభావమయం సూత్రం<br>ధారయేత్ యః సముక్తిభాక్।<br>న అశుచిత్వం, న చ ఉచ్ఛిష్టం<br>తస్య సూత్రస్య ధారణాత్। | విప్రుడు (వేదమును అధ్యయనము చేసినవాడు) బాహ్యసూత్రమును త్యజించి యోగవిజ్ఞానతత్పరుడై **(1) "సమస్తము బ్రహ్మమే। (2) నేను బ్రహ్మమే। (3) ఇదంతా నేనే" అనే బ్రహ్మభావమయమైన 'త్రి'-సూత్రమును ధరించును గాక!** అట్టివాడే ముక్తి సిద్ధించుకోగలడు.<br>బాహ్యముగా ధరించే నూలు జందియమును - (అశుచి - మైల వంటి సందర్భములలో మార్చుకోవటమనే ఆచారం ఉండవచ్చుగాక. కానీ బ్రహ్మమే, బ్రహ్మతత్త్వజ్ఞానమే సూత్రముగా ధరించినవానికి 'అశుచి, సూత్రము మార్చాలి' - మొదలైనవేవీ ఉండవు. ఆతడు నిత్యబ్రహ్మసూత్ర (లేక) యజ్ఞసూత్రధారుడై ఉంటాడు. |

| | |
|---|---|
| సూత్రం అంతర్గతం యేషాం<br>జ్ఞానయజ్ఞోపవీతినామ్।<br>యే తు సూత్రవిదో లోకే<br>తే చ యజ్ఞోపవీతినః। | యోగి అయినవాడు - తన హృదయములో- "జ్ఞాన యజ్ఞోపవీతము"నే యజ్ఞసూత్రంగా, జందియముగా ధరించాలి. అట్టి బ్రహ్మసూత్రము ధరించినవాడే "యజ్ఞోపవీతుడు". ప్రత్తిదారపు జందియము ధరించినంత మాత్రంచేత యజ్ఞోపవీతుడు కాడు. (ప్రత్తి సూత్రము సూచక ద్రవ్యము మాత్రమే) |
| జ్ఞాన శిఖినో, జ్ఞాన నిష్ఠా,<br>జ్ఞాన యజ్ఞోపవీతినః।<br>జ్ఞానమేవ పరం తేషాం,<br>పవిత్రమ్ జ్ఞానము ఈరితమ్॥ | ఆత్మజ్ఞానమే శిఖ, నిష్ఠ కూడా. జ్ఞానయజ్ఞోపవీతము ధరించినవానికి ఆత్మగురించిన నిష్ఠ-జ్ఞానములే పరమపవిత్రము. ఆత్మజ్ఞాన-ఆత్మాను సంధానమే పరమాశయము, చేరవలసిన స్థానము. (ఇక కర్మభక్తి జ్ఞాన క్రియా యోగాలన్నీ అందుకు ప్రయాణ పరికరములు). |
| అగ్నేరివ శిఖా, న – అన్యా<br>యస్య జ్ఞానమయీ శిఖా,<br>స శిఖీ–ఇతి ఉచ్యతే విద్వాన్।<br>నేతరే కేశ ధారిణః।<br>(న ఇతరే కేశధారిణః) | అగ్నికి శిఖవలె, ఎవరు జ్ఞానాగ్నియొక్క శిఖయే-శిఖగా కలిగి తమ హృదయములోని అజ్ఞానాంధకారమును పారద్రోలివేస్తూ ఉంటారో - వారే శిఖధారులు. కేశ శిఖ వాస్తవమైన శిఖ కాదు. జ్ఞానాగ్ని శిఖలచే ఎవ్వరైతే ప్రారబ్ద -ఆగామి- సంచిత్ కర్మ - కర్మఫలములనేవన్నీ భస్మము చేసివేస్తారో, వారే విద్వాంసులు (పరమశివుని చితాభస్మధారణ - త్రివిధ కర్మలను జ్ఞానాగ్నిచే భస్మము చేసి త్రిరేఖలుగా ధరించటము). |
| కర్మణి అధికృతా యే తు<br>వైదికే లౌకికేఽపి వా<br>బ్రాహ్మణ–ఆభాసమాత్రేణ<br>జీవంతే కుక్షి పూరకాః।<br>ప్రజంతే నిరయం తే తు<br>పునర్జన్మని జన్మని। | ఎవ్వరైతే వైదికమైన (వేద సూచకమైన) యజ్ఞ - యాగ - మంత్రోచ్చారణ మొదలైనవి - లౌకిక (లోక) ప్రయోజనముల కొరకు(ధన-జన-పేరు ప్రతిష్ఠలకొరకై) మాత్రమే చేస్తారో, (బ్రాహ్మీభావము సిద్ధించుకొనే ఆశయము కలిగి ఉండరో), పొట్టనింపుకోవటమే లక్ష్యముగా కలిగి ఉంటారో - అట్టి వారు **ఆభాసబ్రాహ్మణులే** గాని **బ్రహ్మసూత్రజ్ఞులగు బ్రాహ్మణులు** కారు. వారు **'నిరయము'** అను పేరుగల పునర్జన్మ నరకరూప పరంపరల చక్రమునుండి విడివడలేరు. ఒక దేహము నుండి - మరొక దేహమువైపుగా ప్రయాణాలు చేస్తూ సొలసిపోతూనే ఉంటారు. |
| **8.** వామాగ్ంస దక్ష కట్యంతం<br>బ్రహ్మసూత్రం తు సవ్యతః।<br>అంతర్బహిరివ అత్యర్థం<br>తత్త్వ తంతు సమన్వితమ్।<br>నాభ్యాది – బ్రహ్మరంధ్రాంతం<br>ప్రమాణం ధారయేత్ సుధీః। | ఎడమ భుజము నుండి కుడి మొల వరకు బ్రహ్మసూత్రమును ధరించుచున్నారు. అట్టి సూత్రము "అంతరము నుండి బాహ్యము వరకు, దృశ్యమునుండి - ద్రష్టవరకు, సందర్భము నుండి కేవలము వరకు **సమస్తము పరబ్రహ్మతత్త్వమే**" అను అర్థముతో కూడుకొన్నవారై ధరించాలి. నాభి నుండి (బొడ్డు నుండి, మణిపూరక చక్రమునుండి) - బ్రహ్మరంధ్రము వరకు బ్రహ్మసూత్రమును బుద్ధిమంతుడైనవాడు (యోగి)-**యోగ బుద్ధితో** ధరించుచున్నాడు. (ఆత్మతో సంయోగమే - యోగము). |
| తేభిః ధార్యమ్ ఇదగ్ం సూత్రం<br>క్రియాంగం తంతు నిర్మితమ్।<br>శిఖా జ్ఞానమయీ యస్య<br>ఉపవీతన్చ తన్మయమ్,<br>బ్రాహ్మణ్యగ్ం సకలం తస్య<br>నేతరేషాం తు కిన్చన। (న–ఇతరేషాం తు కిన్చన)। | అట్టివాడు క్రియాంశముగా తంతు నిర్మితమైన సూత్రము ఒకవైపు ధరిస్తూనే, మరొకవైపు నాభి నుండి బ్రహ్మరంధ్రము వరకు ఉపాసన-ధారణలచే బ్రహ్మసూత్ర భావన కలిగి ఉండాలి. అప్పుడే బ్రాహ్మణ్యము అనబడుతోంది.<br>**జ్ఞానమయమైన 'శిఖ', బ్రహ్మజ్ఞాన సిద్ధి కొరకు** క్రియా సూచకమైన సూత్రము ధరించినవాడే అసలైన బ్రాహ్మణ్యుడు. కేవలము భౌతిక శిఖ యజ్ఞోపవీతము లచే **కొంచము కూడా బ్రాహ్మణ శబ్దార్థము అవజాలదు.** |
| ఇదం యజ్ఞోపవీతం తు<br>పరమమ్ యత్ పరాయణమ్,<br>విద్వాన్ యజ్ఞోపవీతీ –<br>సంధారయేత్ యః, స ముక్తిభాక్॥ | అట్టి బ్రహ్మ యజ్ఞోపీతధారణయే పరమము (The Finest). అదియే పారాయణము (That which is to be practised). అట్టి బ్రహ్మసూత్రము ధరించినవాడు ముక్తి (Relived of all worldly shackles) ఇక్కడే సిద్ధించుకో గలడు. |

| | |
|---|---|
| **బహిరంతశ్చ ఉపవీతీ**<br>**విప్రః సన్న్యస్తుమ్ అర్హతి।**<br>**ఏకయజ్ఞోపవీతీ తు**<br>**నైవ సన్న్యస్తుమ్ అర్హతి।** | విప్రుడైనవాడు "భేదదృష్టి"కి సంబంధించిన ఉపవీతమును సన్న్యసించి ఉండటమే ఉచితము, ఉపాయము. అనేకముగా కనిపిస్తున్న ఈ జగత్-దృశ్యమును ఏకమగు బ్రాహ్మీదృష్టితో చూడాలి.<br>("సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్"). అనేకముగా కనిపిస్తూ, ఏకమే అయి ఉన్న దృష్టిచే నిర్మితమగు అంతర్ - యజ్ఞోపవీతమును ఏ క్షణమందు విడచి ఉండరాదు. అదియే అనునిత్య యజ్ఞోపవీతధారణ. |
| **తస్మాత్ సర్వ ప్రయత్నేన**<br>**మోక్షాపేక్షీ (మోక్ష-అపేక్షి) భవేత్ యతిః।**<br>**బహిః సూత్రం పరిత్యజ్య**<br>**స్వాంత స్సూత్రం (స్వ-అంతః సూత్రం)**<br>**తు ధారయేత్।** | అందుచేత ముముక్షువు (1) సర్వభేదములపై 'జయము' సంపాదించాలి. (2) **"నాకు బంధమే ఉండజాలదు"** అని నిర్ణయాత్మకము అగు 'మోక్షము' పట్ల సర్వదా లక్ష్యము కలిగి ఉండు గాక!<br>బాహ్యసూత్రమును త్యజించి "సమస్తము మమాత్మానంద స్వరూపమే" అను "స్వ-అంతఃసూత్రము"ను అంతరమున సర్వదా ధరించి ఉండును గాక! |
| **బహిః ప్రపన్చ శిఖోపవీతిత్వం**<br>**అనాదృత్య**<br>**ప్రణవ హగ్ంస**<br>**శిఖ-ఉపవీతిత్వమ్**<br>**అవలంబ్య, మోక్షసాధనం**<br>**కుర్యాత్।**<br>**ఇతి ఆహ భగవాన్ శౌనకః।**<br>***<u>ఇతి పరబ్రహ్మోపనిషత్ ॥</u>***<br>***<u>ఓం శాంతిః శాంతిః। శాంతిః</u>*** | ఓ శౌనకా!<br>బాహ్యమైన ప్రాపంచక శిఖ- ఉపవీతములపట్ల ఆదరణ కలిగి ఉండట మెందుకు? ముఖ్యార్థమును, (లేక) సూచనను ఎట్లా ఏమరుస్తారు? (1) తత్త్వమ్-ప్రణవ (2) సోఽహంస (3) త్వమేవాహమ్ - అనబడే "శిఖ ఉపవీతము"లను -త్రిసూత్రములను అవలంభించి మోక్షముకొరకై సాధనపరుడవై ఉండుము.<br>ఈ విధంగా భగవంతుడు అంగీరస పిప్పలాదమహర్షి - శునకముని కుమారుడు, పవిత్ర హృదయుడు అగు శౌనకునికి బోధించాడు.<br>***<u>ఇతి పరబ్రహ్మోపనిషత్</u>***<br>***<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥</u>*** |

అథర్వణ వేదాంతర్గత

✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠

# 11 పరబ్రహ్మోపనిషత్

✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠ ✠

## అధ్యయన పుష్పము

అఖండ మండలాకారం
వ్యాప్తం యేన చరాచరమ్।



తత్పదం దర్శితం యేన,
తస్మై శ్రీ గురవే నమః॥

అఖండమైన – అవ్యాజమైన **సుఖాకృతి కలిగినట్టిది, 'సత్'**నందు (స్వస్వరూపమునందు) సమస్తమును న్యాసము (దాచి ఉంచటము) ఎరిగిన సత్–న్యాసకులగు పరివ్రాజకుల అంతర హృదయములో సర్వదా– **నిశ్చలముగా, సుస్థిరముగా స్వయంప్రకాశము–** అయి **వెలుగొందుచున్నట్టిది,** జగదారణ్యములో సింహమువలె పచార్లు చేయుచున్నట్టిది – అగు **త్రైపదము**నకు (జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు నావై, స్వకీయ రచనా వ్యాసంగ – వినోద చమత్కారమైన 'నేను' నకు) నమస్కారము.

## "ముందుగా" – "మహర్షుల స్తుతి"

### శ్రీ శౌనకమహర్షి గురించి కొన్ని పౌరాణిక విశేషములు

**మహాభారతము :** వీతహవ్యుడు 'శర్యాతి' అను పేరుగల వంశములోని వారు. ఒకానొక రాజు. హయహయుడు అనే పేరు కూడా కలవారు. వత్సదేశమును పాలించేవారు.

ఒకానొక సందర్భములో వారి శత్రురాజు (కాశీరాజు) – (దివోదాసుని పుత్రుడు) ప్రతర్దనుడు అనే ఆయన – వత్సరాజ్యముపై దండెత్తాడు. యుద్ధములో వీతహవ్యుని జయించాడు. వీతహవ్యుని సంహరించటానికై సైన్యసమేతుడై వెంటబడ్డాడు. అప్పుడు వీతవావ్యుడు పారిపోయి 'భృగు ఆశ్రయము'లో దాగుకున్నాడు. ఆ ఆశ్రమమునకు ప్రతర్దనుడు సైనికాధికారుల సమేతుడై వచ్చి – **"ఓ భృగుమహర్షీ! వీతహవ్యుడు అనే రాజరికమునకు చెందిన రాజవంశీయుడు, రాజసుడు – పారిపోయివచ్చి ఇక్కడి మీ ఆశ్రమములో దాగుకొన్నట్లున్నాడు. మీ అనుజ్ఞ అయితే ఆశ్రమము ప్రవేశించి బందీగా తీసుకువెళ్ళుతాము"** అన్నారు.

అప్పుడు భృగుమహర్షి, **"నాయనా! మా ఆశ్రమములో రాజసుడు ఎవ్వడూ లేరే? ఇక్కడంతా బ్రహ్మసూత్రధారులే ఉంటారు।"** – అని సమాధానము చెప్పారు. అప్పుడు ప్రతర్దనుడు **"మహర్షీ! నాతండ్రి దివోదాసరాజును యుద్ధములో చంపిన వీతవావ్యమహారాజును చంపి పగతీర్చుకోవాలని వచ్చాను. వీతహవ్య మహారాజు తమ ఆశ్రమములో ప్రవేశించి కూడా, "నేను రాజవంశీయుడను" అని అతడు మీకు చెప్పుకోవటానికి భయపడి ఉంటాడు. "రాజవంశీయుడను" – అని చెప్పుకోలేకపోవటంచేత, ఆతడు రాజసుడుగా మరణించినవానితో సమానము. అతనికి తగిన పరాభవము జరిగినట్లే.** నా పగ తీరినట్లే.

**హే భృగుమహర్షీ! నమో నమః। మాకు శెలవు ఇప్పించండి. దయతో మా ఈ ప్రదక్షిణ నమస్కారము స్వీకరించి, ఆశీర్వాదము ప్రసాదించండి!"** అని పలికి బ్రహ్మమానస పుత్రులగు భృగుమహర్షికి ప్రణామములు సమర్పించారు. ఆశీర్వదించబడినవారై అక్కడి నుండి నిష్క్రమించారు. (వెళ్ళిపోయారు).

అది విన్న వీతహవ్య మహారాజు కొద్దిసేపటికి ఆశ్రమమునుండి బయటకు వచ్చి, మహర్షికి నమస్కరించి ఇట్లా పలుకసాగారు.

**వీతహవ్యుడు** : హే భృగుమహర్షీ! "నేను రాజసుడను కాను" అని మీరు అనియున్న మాటకంటే రాజవంశీయుడునగు నాకు చావే మేలు కదా!

మరొక విషయం. మీరు అసత్యము పలుకరు. మరి, ఎందుకట్లా పలికారు? దయతో వివరించి చెప్పండి.

**భృగుమహర్షి :** నాయనా! వీతహవ్యా! ఇక్కడి రాజవంశములు, రాజ్య పాలనలు, గెలుపు ఓటములు కలలోని విషయములవంటివే కదా! అది మరచావా? ఎవ్వరైనా సరే, బ్రహ్మజ్ఞానము సంపాదించి **"ఈ విశ్వమంతా, ఈ జాగ్రత్ స్వప్న సుషుప్తవ్యవహారమంతా కూడా ఆత్మస్వరూపుడనగు నేను ధారణ చేయు ఉపవీతము వంటిది"** అని భావిస్తే, అట్టివాడు ఏ జాతివాడైనా బ్రాహ్మణుడే అవుతాడు. అందుచేత నీయొక్క బ్రహ్మజ్ఞానము కొరకై "విశ్వయజ్ఞోపవీతుని"గా బోధచేసి తీర్చదిద్ద తలచాను. అప్పుడు నీవు సాత్త్వికుడవేగాని, రాజసుడవు కావు. అందుచేత ప్రతర్ధనునితో అట్లా అన్నాను.

అది విని ఆనంద భరితుడైన వీతహవ్యుడు భృగుమహర్షికి శిష్యుడిగా ప్రకటించుకొని, బ్రహ్మతత్త్వము శ్రవణం చేసి బ్రహ్మజ్ఞానమును సిద్ధించుకున్నారు. **'బ్రాహ్మణుడు'** అయ్యాడు.

అట్టి వీతహవ్యుని కుమారుడు గృత్సమదుడు. ఆయన కుమారుడు **'శునకుడు'.** శునకుని కుమారుడు **'శౌనకుడు'.** అట్టి శౌనకమహర్షి ఒకసారి నైమిశారణ్యములో 12 సంవత్సరముల సత్రయాగము నిర్వర్తించారు. ఆ సందర్భములో పౌరాణికుడగు శూతమునీశ్వరులు ప్రవచనము చేసిన అనేక పురాణగాథలు శ్రవణం చేయటం జరిగింది. అవన్నీ గ్రంథస్తమై, అనేక పురాణములుగా సుదీర్ఘకాలంగా (ఇప్పటికీ) పఠణము, పారాయణము చేయబడుచూ ఉన్నాయి. మానవాళికి మంగళప్రదమౌచున్నాయి.

**సూతుడు –** రోమహర్షణుని కుమారుడు. 'ఉగ్రవసుడు' అనే పేరు కలవారు. శౌనకునితో సహా సత్రయాగము సందర్భంగా పురాణప్రవచనము చేసినవారు.

పై విశేషాలు **భారతములో** చెప్పబడ్డాయి.

*అట్టి శౌనకుడు బాల్యంలో విద్య పూర్తి చేసుకొని, అప్పటి ఆచారములను అనుసరించి లోక జ్ఞానము కొరకై తీర్థయాత్రలకు బయల్వెడలారు. అనేక పుణ్యనదులలో స్నానం చేస్తూ, పుణ్యక్షేత్రాలు దర్శిస్తూ – సంచారములు చేస్తూ ఉండసాగారు. ఆ సందర్భములో ఒకసారి దైవయోగంగా బ్రహ్మమానసపుత్రులగు అంగీరస పిప్పలాదమహర్షి పుణ్యాశ్రమము దర్శించారు.*

## శ్రీ పిప్పలాద మహర్షి గురించిన కొన్ని పౌరాణిక విశేషాలు

***భారతము: (శివపురాణము):***

**దధీచి:** దధీచి ఒక మునీశ్వరుడు. 'చ్యవనుడు' అను వాని కుమారుడు. ఆ దధీచి సరస్వతీ నది ఒడ్డునగల **"సారస్వతము"** అనే పేరు గల తీర్థములో అత్యంత నియమ – నిష్ఠలతో తపస్సు చేస్తూ ఉండేవారు. ఆతని మహత్తరమైన తపో – ఏకాగ్రతను గమనించిన ఇంద్రుడు, "ఈతడు తపస్సు చేస్తున్నది **ఇంద్రపదవి** కోసమేమో?" అని శంకించారు. ఆయన తపస్సుకు భంగం కలిగించటానికై "అలంబుస" అనే అప్సరసను సారస్వత తీర్థమునకు పంపారు. ఆ ఆలంబుసయొక్క అప్సరస సౌందర్యమును క్షణకాలము చూచిన దధీచికి వీర్యము స్ఖలించింది. అది గమనించిన సరస్వతీ నదీమాత **"ఈ మహనీయుని స్ఖలనము నేలరాలటము లోకమునకు శుభప్రదం కావాలి" – అని తలచింది. ఆ స్ఖలనమును స్వీకరించి తన గర్భమున దాల్చింది. కాలానంతరము ఒక కుమారుని కన్నది. ఆతనికి సారస్వతుడు – అవి నామకరణం చేసింది. యుక్తవయస్సు రాగానే ఆతనిని దధీచిమునివర్యునకు ఇచ్చింది. ఇస్తూ సారస్వతుని ముద్దుపెట్టుకొని "బిడ్డా! సారస్వతా! నీవు ఎక్కడ ఉంటే అక్కడ 12 సంవత్సరములు అనావృష్టి కలిగినా కూడా జనులకు ఆపదలు రాకుండు గాక!"** – అని మాతృవాత్సల్యంగా దీవించింది.

ఆ తరువాత కూడా దధీచి తపో–ఆనందమును కొనసాగించసాగారు. ఆయన భార్య లోపాముద్ర. పతిసేవజేస్తూ భర్త తపస్సుకు విఘ్నములు కలుగకుండా సేవిస్తూ ఉండేది.

ఒకప్పుడు దేవతలు, దేవలోక భోగములు అనుభవిస్తున్న సమయములో రాక్షసులు మాయా ఉపాయములతో కపటముగా వారి దివ్యాస్త్రములను దొంగిలించటానికి ప్రయత్నించనారంభించారు. అది గమనించిన దేవతలు తమ దివ్యాస్త్రములను మహాతపశ్శాలి అగు దధీచికి పంపి దాచిపెట్టవలసినదిగా ప్రార్థించారు. అందుకు దధీచి అంగీకరించారు. అప్పటినుండి దేవతలు స్వర్గలోకపు ఆనందములలో, మునిగితేలసాగారు.

ఆ దేవతలు భోగములను అనుభవిస్తూ ఎంతకాలానికీ తిరిగిరాలేదు. సుదీర్ఘకాలము అయిన తరువాత ఆ దేవతల అస్త్రములు కాపలా – తన తపో ఆనందమునకు విఘాతము కలిగిస్తూ ఉన్నదని దధీచి గమనించారు. ఆ దేవతల దివ్యాస్త్రములను అభిమంత్రించి పాయసమువలె పానము చేసివేశారు (త్రాగివేశారు). (అస్త్రములు = మనన రూపమగు మంత్ర బలముచే రూపుదిద్దుకొనే దివ్యశక్తులు).

చాలాకాలము తరువాత దేవతలు స్వర్గలోక భోగక్రీడలను చాలించి తమ అస్త్రములను తిరిగి తీసుకువెళ్ళటానికి దధీచిని సమీపించారు. అప్పటికి లోపాముద్ర గర్భవతి. అప్పుడు దధీచి దేవతలతో ఇట్లా పలికారు.

**దధీచి :** *ఓ దేవతలారా! మీరు మీ అస్త్రములను చాలాకాలం కాపాడాను. కానీ కొద్దికాలములో వచ్చి, అస్త్రములను తీసుకువెళ్ళవలసిన మీరు సుదీర్ఘకాలము రానే లేదు. అందుచేత రాక్షసుల బారిన పడకుండా అవన్నీ అవపోసన పట్టివేశాను.*

**దేవతలు** : మహాత్మా! దధీచీ! అంతటి సుదీర్ఘకాలము మేము రాకపోవటము మా తప్పే. అయితే ఆ అస్త్రములు లేకపోతే మేము రాక్షసులముందు ఏమాత్రము నిలువలేము. అది లోకములకు శుభము కాదు. అందుచేత మీరు అవపోసనపట్టి తాగిన దేవతాస్త్రములను మాకు మీ తపోశక్తిచే తిరిగి మాకు ప్రసాదించక తప్పదు. ఏదో ఉపాయముతో మీరే మాపట్ల కనికరించి తిరిగి మా అస్త్రములను మాకు ప్రసాదించండి.

- అప్పుడు దధీచి తన ప్రక్కనే ఉన్న అర్ధాంగి లోపాముద్రను ఆశ్రములోనికి వెళ్ళవలసినదిగా ఆజ్ఞాపించి, ఆమె లోనికి వెళ్ళిన తరువాత దేవతలతో ఇట్లా పలికారు.

**దధీచి** : ఓ దేవతలారా! నేను అవపోసనపట్టి త్రాగివేసిన అస్త్రములను నేనుగా తిరిగి ఇవ్వలేను. అవి జీర్ణమైపోయినాయి. కనుక తిరిగి ఇవ్వటము నాకు సాధ్యపడేది కాదు. ఎందుకంటే, అవన్నీ నా వెన్నెముకను, ఎముకలను అంతర్లీనంగా ఆశ్రయించి ఉన్నాయి. వాటిని బయటకు తేవటము ఈ దేహమున్నంతవరకు నా వలన కాదు. అయితే మీరు లోక కళ్యాణమూర్తులు కాబట్టి మీ అస్త్రములు మీకు చేరవలసిందే. అది నేను ఒప్పుకుంటున్నాను. అందుకు ఒక్కటే ఉపాయము. నా వెన్నెముకను, ఎముకలను బయటకు తీసి మీమీ అస్త్రములు తీసుకువెళ్ళండి.

**దేవతలు :** హే మహానుభావన్! దధీచీ! మీరు బ్రతికి ఉండగానే మీ వెన్నెముక – ఎముకలను బయటకు ఎట్లా తీయగలుగుతాము?

**దధీచి :** మీరు నన్ను చంపి, నా యముకలను ఆశ్రయించి ఉన్న దేవతా అస్త్రములను తిరిగి తీసుకోవటానికి నేను ఎంతో సంతోషముగా అంగీకరిస్తున్నాను. **"త్యాగే నైవతు కైవల్యమ్"** అను వేదసూత్రానుసారం ఇది నాకు కూడా మోక్షోపాయము. కనుక, మీరు నేను చెప్పినట్లు చేయండి.

**దేవతలు :** అదెట్లా మహర్షీ! మేము బ్రాహ్మణ వధ చేసి పాపము కట్టుకోవటముకన్నా రాక్షసుల చేతులలో మరణమే ఉచితము కదా! మా కొరకై దేహమునే త్యాగము చేయటానికి సిద్ధపడుచున్న మిమ్ములను చంపటము కుదిరేదే కాదు. అందుచేత అందుకు మేము సిద్ధము కాదు. విధివశాత్తు ఏది ఎట్లా జరగాలో అది అట్లాగే జరుగునుగాక. మాకు శలవు ఇప్పించండి.

**దధీచి** : ఓ దేవతలారా! ఆగండి! ఆగండి! మీరుగాని, మహర్షులు – మునులు అగు మేముగాని, యజ్ఞకర్తలుగాని, ఋత్విక్కులుగాని – మనమంతా మన మన దైవీ – తపో – యజ్ఞ కార్యక్రమములన్నీ *"సర్వే జనాః సుఖినోభవంతు! సమస్త సన్మంగళాని సంతు!"* అని పరమాత్మకే సమర్పిస్తాము కదా! **సమస్తము శివమయము, శివప్రసాదము అయి ఉండగా శివునికి చెందినది – శివునికి సమర్పించటానికి వెనుకాట ఎందుకు**? అందుచేత నేను స్వకీయ తపోశక్తిచే యోగాగ్నిని జనింపజేసి ఈ నా భౌతికదేహమును ఆ యోగాగ్నిలో కాల్చివేస్తాను. అప్పుడు బొమికలు మాత్రమే మిగులుతాయి. వెన్నెముకను, తక్కిన యెముకలను భస్మమునుండి బయటకు తీసి మీమీ అస్త్రములను విడదీసుకొని స్వీకరించ ప్రార్థన.

ఈ విధంగా పలికి మహనీయుడు "త్యాగేనేవైవతు కైవల్యమ్" అను వేదవాక్యమును, వేద హృదయమును ఎరిగినవాడు కాబట్టి,

దేవతల సమాధానమునకు వేచి చూడకుండా ఒక్క క్షణంలో 'యోగాగ్ని'ని ఆహ్వానించి తన భౌతిక శరీరమును సమర్పించి వేశారు. ఆ యముకల నుండి దేవతా-అస్త్రములే కాకుండా, బ్రహ్మచక్రము, "వజ్రాయుధము" మొదలైనవి కూడా విశ్వకర్మచే నిర్మితమైనాయి.

**శివపురాణము**

అప్పుడు దధీచి యొక్క ధర్మపత్ని లోపాముద్ర ఆశ్రమము నుండి బయటకు వచ్చింది. తన భర్త యోగాగ్నిలో భౌతికదేహము సమర్పించివేసి, దేవతలకు వారివారి అస్త్రములతోబాటుగా బ్రహ్మాయుధము, వజ్రాయుధము మొదలైనవి కూడా లాభింపజేసినట్లు తెలుసుకొన్నది. వెంటనే తాను చితిని పేర్చి దేహము సమర్పించుటకు సిద్ధమైనది.

అప్పుడు అశరీరవాణి "అమ్మా! లోపాముద్రాదేవీ! నీవు గర్భవతివి! నీ గర్భములో గొప్ప బాలుడు ఉన్నాడు. అందుచేత తొందరపడి చితిలో ప్రవేశించకు!" అని వినిపించింది. అయినాకూడా లోపాముద్ర వెనుకకు మరల లేదు. **లోపాముద్ర చితి ఎక్కుచుండగా గర్భస్థ శిశువు గర్భము నుండి జారి అక్కడ గల ఒక రావిచెట్టు (పిప్పలవృక్షము) క్రింద పడిపోవటం జరిగింది.**

లోపాముద్ర పిప్పల (రావి) వృక్షము క్రింద ప్రసవించటము చేతను, ఆ పిప్పల వృక్ష దేవత చంద్రకిరణములనుండి అమృతమును వేరుపరచి, ఆ బాలునికి పాలుగా ఇచ్చి పెంచటము చేతను - ఆ బాలుడు 'పిప్పలాద" నామధేయుడైనారు. ఆయన తరువాత గొప్ప తపోధనుడు, తత్త్వజ్ఞాని అయి దేవతలకు, మునిలోకమునకు పూజ్యుడు అయినారు. ఆయన అర్ధాంగి 'పద్మ'.

ఈ పిప్పలాద మహర్షి బ్రహ్మమానసపుత్రులగు అంగిరసులలో ఒకరుగా బ్రహ్మవైవర్త పురాణ ప్రవచనము.

పై విశేషాలు భారతమునుండి, శివపురాణము నుండి, బ్రహ్మవైవర్త పురాణము నుండి చెప్పుకున్నాము.

***ఇక మనము బ్రహ్మోపనిషత్ విశేషముల అధ్యయనములో ప్రవేశించుచున్నాము.***

## - పరబ్రహ్మోపనిషత్ -

పిప్పలాదమహర్షి తన ఆశ్రమమునకు వచ్చినట్టి శునక మునీశ్వరుని కుమారుడగు శౌనకుని సాదరముగా తన ఆశ్రమములోనికి ఆహ్వానించి కుశలప్రశ్నలు అడిగారు.

⌘

**పిప్పలాదమహర్షి** : చిరంజీవీ! శౌనకా! పూజనీయులు, భృగమహర్షికి శిష్యులు అగు వీతహవ్యుని వంశజుడా? కుశలమా? ఏమిటి విశేషాలు?

**శౌనకుడు** : గురువర్యా! తమ దయచే సమస్తము శుభప్రదమే. కొన్ని నాలోని ఆధ్యాత్మికమైన సందేహాలకు తమరు వివరణ ప్రసాదించవలసినదిగా వినమ్రుడనై మీపాద పద్మములను శరణువేడుచున్నాను.

**పిప్పలాదుడు** : సుఖీభవ। జ్ఞానసిద్ధిరస్తు। చిరంజీవా! శౌనకా! ఏమి నీ సందేహములు? ప్రశాంత చిత్తుడవై ప్రశ్నించు. శివసంకల్పానుసారము మనకు చేతనైనంతవరకు పరతత్త్వమును సంభాషించుకుందాము.

**శౌనకుడు** : హే భగవాన్! గురుదేవా! అంగీరస పిప్పలాద మహనీయా! మీరు సూచించినట్లే విద్యార్థినైన నేను మీ వివరణకొరకై కొన్ని ప్రశ్నలు మీముందు ప్రదర్శించుకుంటున్నాను. నా సందేహాలు దయతో వినండి.

**దివ్యే బ్రహ్మపురే కే సంప్రతిష్ఠితా భవంతి?** దివ్యమైన (The Devine) బ్రహ్మపురము (The Township of "BRAHMAM" the creator) నందు సంప్రతిష్ఠితులై, శాశ్వతమై (Wel established) ఉన్నది ఎవరు?

**కథం సృజ్యంతే నిత్యాత్మన?** నిత్యమగు ఆత్మనుండి సృష్టించబడేదంతా ఎట్లా బయల్వెడలుతోంది? ఎవరు సృష్టిస్తున్నారు? ఎందుకు సృష్టిస్తున్నారు?

**ఏష మహిమా విభజ్య, ఏష మహిమా విభుః, క ఏషః?** (1) ఈ విభజ్యము (That which is divisible) (2) విభువు (ఈ విభవమంతా తనదే - అయినవాడు) ఎవరు? ఈ జగత్ విభవమంతా ఎవ్వరిది? ఈ సమస్తము ఎవరికి చెందినదై ఉన్నది?

**అంగిరస పిప్పలాదుడు :** ఓ వీత హవ్య ప్రపౌత్రా! శౌనకా! మీరు అడుగుచున్న ప్రశ్నకు సమాధానము విద్యలలో వరిష్ఠము (Greatest, Finest ) అగు **పరబ్రహ్మమే** (లేక) **బ్రహ్మ విద్యయే.** అట్టి **ఆత్మవిద్య** గురించియే చెప్పుకుందాము. అదియే నిత్యమగు సత్యము కూడా।

**విరజము** (రజో తమో గుణ దోషరహితము), **నిష్కళము** (కళంకము లేనట్టిది), **శుభ్రము** (Very pure), **అక్షరము** (మార్పు చేర్పులనునవే లేనట్టిది), **క్షరము** (నాశనము కానట్టిది), **విశోకము** (ఎట్టి దుఃఖములకు చోటులేనిది) – అయి, పరబ్రహ్మము **సర్వత్రా ప్రకాశించుచున్నది.** అట్టి పరబ్రహ్మ పురమునందు జగత్–రచనా దివ్యరూపులు (Divinities) అగు దేవతలు, సమస్త జీవుల ప్రాణశక్తి **వసించుచున్నవై ఉన్నాయి.** సమస్తము అట్టి పరబ్రహ్మమునకు చెందినవే। అట్టి పరమాత్మయే సమస్తము అయి ఉంటున్నారు కూడా. **నీవు–నేను కూడా అట్టి పరమాత్మకు చెందినవారమై, అనన్యులమై ఉన్నామయ్యా!**

ఒక తుమ్మెద తనకు తానే పుష్పములపై వ్రాలటము, తేనె ప్రోగుచేయటము, తేనె తుట్టె నిర్మించటము – ఇవన్నీ నిర్వర్తిస్తోంది కదా! ఒక కుక్క ('తనది' అనునది లేకున్నప్పటికి) తన యజమానిని తాను రక్షించాలని, బయటవారిని అరుపులతో భయపెట్టాలని తనను తానే నియమించుకొని విశ్వాసము, కాపలాగా ఉండటము మొదలైన కర్మలు నిర్వర్తిస్తుంది కదా!

అట్లాగే....

ఆత్మ అకర్మిష్ఠి (కర్మరహితుడు) అయి కూడా, **"జీవాత్మ – జగత్తు – జన్మజన్మాంతరములు"** మొదలైనవన్నీ తనకు తానే, (ఎవరి ప్రమేయము, ప్రోద్బలము లేకుండానే) కల్పించుకుని ఆస్వాదించుచున్నది. కర్మలు, కర్మఫలములు మొదలైనవన్నీ రచించుకొని ఒక వ్యవసాయదారునివలె (కర్షకునివలె) వ్యాపకములతో కూడినదిగా అగుచున్నది.

అట్టి పరబ్రహ్మము గురించి తెలుసుకొని **"జ్ఞాని అయినవాడు"** – జగద్దృశ్యములో వర్తిస్తున్నాడు. **కర్మలు – కర్మఫలములు – ఆత్మ సమక్షములో చిన్నపిల్లవాడు విని ఆనందించే కథా కల్పనలు వంటివి** – అని తెలిసియే విద్యుక్త ధర్మములు నిర్వర్తిస్తున్నాడు.

చేపలుపట్టే వలకు చేపల గురించిన ఏ ఆకర్షణ – వికర్షణలు, సంతోష–దుఃఖములు ఉండవుకదా! అట్లాగే, వాస్తవానికి ఆత్మకు 'జగత్' సంబంధించిన ఎట్టి ఆకర్షణ – వికర్షణలు ఉండవు.

అయితే ఏం? సర్వదా ఏకమే అయి ఉన్న ఆత్మ–జీవాత్మగా అనేక భేదములను అంగీకరించి, వాటియొక్క ఆకర్షణ – వికర్షణలను తాను (కలలో తన కల్పనలకు తానే బద్ధుడు అగు తీరుగా) లోను అగుచున్నది.

తన కల్పనా జగత్తులను తానే వీడలేక **"నేను బద్ధుడను. ముక్తిని పొందేది ఎట్లా?"** అని కూడా తన్నుకులాడుచూ, తన కల్పనయందు తానే అటూ ఇటూ పచార్లు చేయుచున్నది.

***ఇదంతా ఆత్మయొక్క క్రీడా–లీలా–కల్పనా వినోదానందము అనబడుతోంది. ఇంతకుమించి ఇక్కడ మరేమీ కారణమై లేదు.***

⌘

ఈ దేహములో ప్రాణశక్తికి ప్రాణేశ్వరీ – సంబంధించిన దేవత దేహములో నలువైపులా నాడులలో చైతన్యరూపమై సచేతనంగా ప్రసరితమై ఉంటోంది.

ఒక డేగ ఆకాశంలో అనేక చోట్ల తిరిగి తిరిగి గూటిలో ప్రవేశించు తీరుగా ఈ జీవుని మనస్సు సుషుప్తి నుండి బయల్వెడలి, జాగ్రత్ స్వప్నములలో సంచారములు చేస్తోంది. తిరిగి ఆ మనస్సుతో కూడిన బాహ్యత్వముతో సహా **– సుషుప్తియందు 'లీనము' అగుచున్నది.**

అనగా చిత్తము **సుషుప్తి యొక్క ఈవల** నుండి **ఆవలకు, ఆవల** నుండి **ఈవలకు** (లేక) **నిర్విషయ మౌనము** నుండి – జాగ్రత్ స్వప్నములలోని అన్యరూపములగు **విషయ సమూహములకు, విషయ సమూహములనుండి – తిరిగి స్వస్వరూపమునకు చెందిన మౌనము (సుషుప్తి).**

***ప్రయాణములు చేయుచున్నది. పచార్లు సలుపుచున్నది.***

ఆత్మయే హిరణ్మయము (తేజో స్వరూపము) అయి, పంచకోశములకు (అన్నమయ – ప్రాణమయ – మనోమయ – విజ్ఞానమయ – ఆనందకోశములకు) ఆవల ఏర్పడి ఉన్నది. అమృతమయమై వెలుగొందుచూనే (ఇడ – పింగళ – సుషుమ్న అనబడు) త్రినాడులలో (కుండలినీశక్తి సహిత అయి) సంచారములు చేయుచున్నది.

బ్రహ్మముయొక్క త్రిపాదములు **"జాగ్రత్, స్వప్న, సుషుప్తులు"**. (ఆభరణములన్నీ, అంతటా బంగారమే అయి ఉన్న తీరుగా)-సర్వత్రా హిరణ్మయముగా (చైతన్య ప్రదర్శనముగా) ఉన్నదే **"ఆత్మ"** లేక **బ్రహ్మము.**

అట్టి సర్వత్ర తేజో - చైతన్యరూపమై వెలుగొందుచున్న పరమాత్మయే [సర్వత్రా ఏర్పడియున్న వాయువు ఒక బంతి {○} లో ఏర్పడి ఉన్నట్లు) గా], దేవదత్తుడుగా (జీవాత్మగా) అగుచున్నది.

## కర్మఫలానుభవి

ఆత్మ సర్వత్రా సర్వదా అనన్యమే అయి ఉండి కూడా, దేవదత్తుడుగా (జీవుడుగా) - **'కర్మబద్ధుడు'** వలె అగుచున్నది.

**"ఇష్టము"**నకు (యజ్ఞ యాగ క్రతు పూజ ఉపాసనకు) సంబంధించిన కర్మలచేతను, **"పూర్తము"** (బావులను త్రవ్వించటము, సత్రములను కట్టించటము, దానము, ధర్మము మొదలైన) కర్మలచేతను-***శుభప్రదమైన సుఖరూపములైన కర్మఫలములను జీవుడు పొందుచున్నాడు.***

అశుభమగు - సహజీవులను బాధించటము, క్రోధము, లోభము, మదము, మాత్సర్యము, మొదలైన అశుభకర్మలచే - అశుభప్రదమైన, ***దుఃఖ రూపమైన కర్మ ఫలములను*** **- (ఈ జీవుడు) పొందుచున్నాడు.**

**ఈ విధముగా**-ఈ జీవుడు (దేవదత్తుడు) కర్మ బద్ధుడు అగుచున్నాడు. అట్టి కర్మఫలములను అనుసరించి జన్మలు (ఆయా ఉపాధులు) పొందుచున్నాడు. **అయితే ఈ జీవుడు నిజంగానే కర్మ - జన్మలకు బద్ధుడా**? ఈ విషయము మరికొంత విచారణ చేద్దాము.

## ఈ జీవుడు కర్మలకు నిజముగా బద్ధుడా?

[**"జీవో బ్రహ్మేతి నా పరః!"** అనునది **వేదమహావాక్యము.** కనుక] ఈ జీవుడు స్వతఃగాను, సహజంగాను, నిజస్వరూపముగాను **బ్రహ్మమే (పరమాత్మయే) అయి ఉన్నాడు.** బ్రహ్మము నిత్యముక్తము కదా? బ్రహ్మమునకు బంధము ఎక్కడిది? ఈ జగత్ దృశ్యము బ్రహ్మమునకు స్వయం లీలాకల్పిత క్రీడా వినోదమే కదా మరి? అనగా ఆత్మపట్ల (1) నటునుని స్వతఃసిద్ధరూపము (2) నాటకములోని పాత్ర వలె - పర ఇహములు ఏర్పడి ఉంటున్నాయి.

**జీవుడుగా 'నిత్యబద్ధము' అయినప్పటికీ, పరమాత్మ (బ్రహ్మము)గా నిత్యముక్తుడు అయి ఉన్నాడు.**

'జీవుడు' (దేవదత్తుడు) సహజముగా (పరమాత్మగా) నిత్యముక్తుడు. 'జీవాత్మ' అనునది సందర్భ కల్పితము. సందర్భబద్ధము కాబట్టి **'నిత్యబద్ధము'.** ఒక నాటకములో మనము ఒక పాత్రగా నటిస్తూ ఉంటే, ఆ **"పాత్ర (Role)"** కు ముక్తి అనునది ఏమి ఉంటుంది? 'పాత్ర' యొక్క సంగతి - సంబంధ - సందర్భములు నాటకము నిర్ణయిస్తుంది. అంతేగాని నటుడుగా మనము కాదు కదా!

**ఒక కథలోని ఒక పాత్ర బయటకువచ్చి ఆ కథా రచయితకు బంధము కలిగించగలదా**? లేదు. అట్లాగే పరమాత్మయొక్క స్వకీయ రచనా చమత్కార రూపుడగు ఈ **'జీవుడు' - అనబడువాడు జగత్తు నుండి బయల్వెడలి, బయటకు వచ్చి తన ఉత్పత్తి - స్థానమగు పరమాత్మత్వమునకు ఎట్లా బంధము కల్పించగలడు**? లేదు. అయితే, ఈ జీవుడు ఆత్మజ్ఞానముచే **"సర్వాత్మకమగు అఖండాత్మనే నేను"** - అనునది సిద్ధించుకోనంతవరకు **జన్మ - కర్మ పరంపరాబద్ధుడే మరి.**

**యథా కుమారకో నిష్కామానందమ్ అభియాతి।।** ఒక పసిపిల్లవాడు "నాది ఈ దేశము - ఈ జాతి - ఆ కులము - ఈ మతము" మొదలైనవి ఆశ్రయించకుండానే, దేనినీ కోరుకోకుండానే, **నిష్కామానందము (బాలనందము) పొందుచున్నాడు.** పకపకా నవ్వుచున్నాడు. కేరింతలు కొడుచున్నాడు. గంతులు వేస్తున్నాడు. **ఆతనిది అకారణానందము.**

**తథైష దేవః స్వప్న ఆనందమ్ అభియాతి।** అట్లాగే దేవదత్తుడు (జీవుడు) స్వప్నదృశ్యమును తనకు తానే తన ఆనందము కొరకై సుఖ దుఃఖములు కల్పించుకొని ఆస్వాదిస్తున్నాడు. తెల్లవారి లేచిన తరువాత స్వప్నమునకు ముందువలెనే (స్వప్నము ముగిసిన తరువాత) యథాతథము (As it is) గా ఉంటాడు కదా! **"స్వప్నములో సుఖ-దుఃఖ సంఘటనలకు పుణ్యమో, పాపమో కారణము"** అని మనము అనము కదా! ఎందుచేత? **స్వప్నములోని సంఘటనలచే**, స్వప్నానంతరము - స్వప్నముతనదైనవాడు - **స్పృశించబడడు కాబట్టి.**

అట్లాగే,

*జీవాత్మ (జాగ్రత్‌లో కూడా) బాధలు మొదలైనవి పొందినంతమాత్రం చేత, అవన్నీ ఆతనియొక్క* ***"పరమాత్మ స్వరూపము"****ను స్పృశించవు. స్పృశించలేవు కూడా. దోషము కలిగించలేవు.* ***తాద్యమానోనైవ ఇత్యేవమ్ ఇష్టా పూర్వకర్మ శుభాశుభైః న లిప్యతే!*** *జీవాత్మ స్వప్నములలో ఒక వ్యక్తి కనబడు తీరుగా కల్పితమే కాబట్టి జీవాత్మయొక్క (శుభకర్మలగు) ఇష్టాపూర్తముల, (అశుభకర్మలగు) కామ క్రోధముల "మంచి చెడులు" పరమాత్మ స్వరూపమునకు దోషములు కలిగించజాలవు.*

*(ఇష్టము = వ్రతములు, యజ్ఞములు, పూజలు మొదలైనవి. పూర్తములు = సాంఘికసేవలు)*

**అయితే, ఇష్టా పూర్తములు - బుద్ధి నిర్మలత కొరకై ఉపసాధనములు.**

అనేక దీపములు అనేకచోట్ల ఆయా వేరువేరైన వస్తు జాలమును దీపింపజేయవచ్చుగాక. కానీ, సమస్త దీపముల తేజో - అగ్నిస్వరూపము ఒక్కటే. వెలుగులో కనబడే వస్తువుల దోషములు - అగ్ని (వెలుగు)లో ప్రవేశించి, అగ్నియొక్క వెలుగునకు దోషము కలిగించ గలవా? లేదు కదా! అట్లాగే కేవలమగు ఆత్మకు ఏ దోషము అంటదు.

సర్వాత్మత్వము ఎరిగి, ఆస్వాదించువాని దృష్టిలో - జీవాత్మ సంబంధమైన సంబంధములు - **వ్యవహారిక కల్పితమే కానీ పరమాత్మ స్వరూపమునకు సుఖదుఃఖములు కలిగించగలిగినవి కావు.**

అట్టి సమస్త జ్యోతి (దీపము)లలోని (సమస్త జీవులలోని) పరంజ్యోతి (లేక) పరమాత్మ స్వరూపము తెలుసుకొన్న వాని చిత్తము **'జ్యోతిషాంజ్యోతి రానందము"** పొందగలదు. ఆతడు ఇక **దృశ్య విషయానందమునకు బద్ధుడు, పరిమితుడు, ఆశయుడు అయిఉండడు.**

వాస్తవానికి, స్వతఃగా చూస్తే, - **శుభ్రవర్ణము, కేవలస్వరూపము** - అగు ఆత్మనుండి బయల్వెడలిన, కల్పితములగు **జాగ్రత్ స్వప్నములు-** తిరిగి అదే మార్గములో వెనుకకు మరలి, **ఆత్మయందే** (తరంగములు జలమునందువలె) **లయమును పొందుచున్నాయి.**

స్వప్నములోని సంఘటన సందర్భ - సంబంధములచే మెలకువ తరువాత స్వప్నము తనదైన వానికి బంధము కలగనట్లే, జాగ్రత్‌లో ఆయా అట్టి విశేషములచే - (తనయొక్క ఆత్మస్వరూపతత్త్వము ఎరిగిన తరువాత) - బంధము శేషించి ఉండజాలదు.

## ఆత్మతత్త్వమును గట్టిగా ఆశ్రయించాలి!

అందుచే ఓ శౌనకా! **జలూకా భావవత్ యథా కామమ్ అజాయత ఈశ్వరాత్।** ఒక జలగ ఏవిధంగా అత్యంత ప్రియముగాను, పట్టుదలగాను, గట్టిగాను జంతువుయొక్క శరీరభాగమును పట్టుకొని తన ఆహారము సంపాదిస్తుందో, **ఈశ్వరతత్త్వమును, ఈశ్వరదృష్టిని** (ఆత్మతత్త్వమును) ముముక్షువు అంతగట్టిగా ఆశ్రయించాలి సుమా!

**పరము-అపరములను వదలి, ఆ రెండిటికి మధ్యగాగల సంధిని ఆశ్రయించి పరాపరముల ఏకరూపమగు స్వస్వరూపమును ఆశ్రయించువాడు ఆత్మానందమును సిద్ధించుకోగలడు.** పరము-ఇహములు తనవే అయి, భావాభావముల మధ్యగా సుస్థిరమై, నిశ్చలమైయున్న 'ఆత్మ'ను ఆశ్రయించువాడు, అట్టి సంధియందు ఆత్మను దర్శించుచున్నాడు. **మోక్షసిద్ధుడౌతున్నాడు.**

ఈ కపాలాష్టకమును (పూర్యష్టకమును పంచభూత మనో బుద్ధి జీవాత్మలను) **(కపాలాష్టక శరీరమును)** భావ - అభావముల మధ్యగాను, పర-అపరము మధ్యగాను నిశ్చలమైయున్న ఆత్మతో 'సోఽహమ్' కొరకై - 'అనుసంధానం' చేయాలి సుమా! శిశువు తల్లి స్థనములను ఆశ్రయించుతీరుగా ఆత్మస్వరూపమును గురు-శాస్త్ర వచనముల సహాయంతో ఆశ్రయిస్తూ ఉండాలి. (The Physical Body and the circumstances we come across should be used as 'instruments' to know ourselves).

ఏదైతే కర్మేంద్రియ, జ్ఞానేంద్రియాలకు జననస్థానమో, అట్టి ఆత్మయే ఈ విశ్వమునకు, జాగ్రత్-స్వప్న వస్తుతత్త్వములకు **'జననస్థానము'**. **ఆత్మ సర్వదా శుభ-అశుభములకు ఆవలి తత్త్వము.** స్వప్నములోని విషయాలకు స్వప్నము తనదైనవాడు **ఆవలివాడే** (Beyond) కదా! **"అట్టి ఆత్మ** (The Self that is the Absolute Form of Enlightenment) **శుభాశుభకర్మలచే దోషము పొందునదికాదు" -** అని ఆత్మ గురించి ఎరిగినవాడు, ఇక **కర్మబంధములు, కర్మదోషములు పొందడు.**

## అట్టి పరమాత్మ గురించిన ఇంకొన్ని విశేషాలు

**అన్యదేవస్య సంప్రసాదో - అనన్యమగు ఆత్మ** యందు అన్యముగా భావించబడే, స్తుతించబడే **ఇష్టదేవతలు** → అలంకార రూపములు.

**అంతర్యామి** : నాటక రచయితయే నాటకములోని 'పాత్రలు (Roles)' అన్నిటికీ అంతర్యామి" (The Inner Thought, The Inner Recess) అయి ఉన్నట్లుగా, - పరమాత్మయే జగన్నాటకములోని జీవులందరికి అంతర్యామి! **(అహమాత్మా-సర్వభూతాశయ స్థితః।**

భగవద్గీత, విభూతియోగము). **నీకు అనుభవమగుచున్న జగద్దృశ్యమంతటికీ నీవే 'అంతర్యామివి'.**

**అసంగః** : ఒకాయన గొప్ప నాటము రచిస్తూ ఉన్నాడు. అట్టి సందర్భంలో – "నాటకములోని ఒక సందర్భమునకో, సంఘటనకో సంబంధమునకో ఆ నాటక రచయిత బద్ధుడు(Bounded) , సంగుడు (Related) అగుచున్నాడు" అని అనము కదా! అట్లాగే ఆత్మ ఈ దృశ్య జగత్తులో దేనికీ సంగము (Related and attached) కాదు. ఆత్మకు బంధము ఉండజాలదు. (ఈ జీవునికి–దృశ్య జగత్తుకు ఉన్న సంబంధము = ఒక రచయితకు – ఆతను రచిస్తూ, ఆస్వాదిస్తూ ఉన్న "కథ"కు ఉన్న సంబంధమే).

**చిద్రూపః** : ఆత్మ – కేవలమగు ఎరుకను (The knowining of the knower is extending as what all being known. Eg : Dreams) తన రూపముగా కలిగి ఉన్నట్టిది. అట్టి ఎరుకయే **"సమస్తమైన ఎరుగబడినది"** గా కూడా రూపము దాల్చుచున్నట్టిది.

**పురుషః** : జాగ్రత్ స్వప్న సుషుప్తులు మనోబుద్ధి చిత్త అహంకారములు తనయొక్క పురుషకారము గా కలిగినట్టిది – **ఆత్మ.**

**ప్రణవహగ్ంసః** : ఆత్మ →ప్రతిజీవుని స్వాభావికమగు స్వస్వరూపమే హగ్ంసం = హంస = "సోఽహమ్". ప్రణవస్వరూపము (సంజ్ఞ–ఓం) అయినట్టిది. (ప్రణవము = ఓం = **సమస్తము నేనైన 'నేను'కు సంజ్ఞ**).

**పరంబ్రహ్మ** : నటునిపట్ల – (1) నాటకములో పాత్ర, (2) నటనా చాతుర్యము, (3) తనకు తానైన 'తాను' – అను '3' విశేషాలు ఉన్నట్లే, **'జీవాత్మ' – 'ఈశ్వరుడు' 'స్వస్వరూపము'** – అను మూడు విశేషాలు తనయొక్క త్రివిధ దర్శనములుగా కలిగి ఉన్నట్టిది. ఆ మూడిటికి పరము (ఆవలది) ఆత్మ కాబట్టి **'పరంబ్రహ్మము'** అనబడుతోంది.

**న ప్రాణహగ్ంసః** – ప్రాణము జీవుడు కాదు. ప్రాణము జీవునియొక్క శక్తిరూపము. జీవుడో? ప్రాణి, ప్రాణము (లేక) ప్రాణశక్తి తనదైనవాడు. (ప్రాణము జడము. జీవుడు చైతన్యస్వరూపము).

**ప్రణవో జీవః** – ప్రాణము తనదైన వాడుగా ప్రాణేశ్వరుడే ఈ జీవుడు. ఈ జీవుడు ప్రణవ (లేక) ఆత్మ స్వరూపుడు.

ప్రాణము, జీవుడు, దేవతలు కూడా – **పరమాత్మకు చెందినవై, పరమాత్మవైభవమై, పరమాత్మకు సమర్పించబడినవై** ఉన్నట్టివి. అట్టి పరమాత్మ గురించి తెలుసుకొన్నవాడు ఇక **"అయ్యా! మోక్షము నాకు ఇప్పించండి"** – అని నివేదనలు (Appeals) కలిగి ఉండదు. ఎందుకంటే, తనను తాను **"బంధరహితము, ప్రణవస్వరూపము"** అగు ఆత్మగా గమనిస్తూ ఉంటాడు కాబట్టి.

**జీవస్య బ్రహ్మమ్ ఆపాదయతి!** ఈ జీవుడుగా కనిపిస్తున్నది, **'నేను'**గా అనిపిస్తున్నది – సమస్తము పరబ్రహ్మతత్త్వమే" అని ఎరిగి 'ఆత్మతృప్తి'ని పొందుచున్నాడు. **"జీవో శివః। ఈ జీవుడు బ్రహ్మమే। పరబ్రహ్మ స్వరూపుడే"** – అను దర్శనమును వీడకయే, లీలగా ఈ దృశ్య జగత్తులో పాల్గొనుచున్నాడు. అయితే, "బ్రహ్మము జీవుడుగా అగుచున్నది" అని (అజ్ఞానముచే) ఆపాదించబడుతోంది.

## బ్రాహ్మణుడు

**(1) ఆత్మను ఎరిగి, (2) సర్వత్రా ఆత్మను దర్శించుచు, (3) తనకు చెందిన సమస్తము పరమాత్మకు సమర్పించి, (4) తానే 'పరమాత్మ' అయి వెలుగొందువాడు– "బ్రాహ్మణుడు" అని చెప్పబడుచున్నాడు. "నాకు, నీకు, జగత్తుకు ఆత్మ అనన్యము. ఆత్మకు మనము అనన్యము" అను ఎరుకయే "బ్రాహ్మణత్వము".**

**సత్త్వమ్ = "సత్–త్వమ్"। 'నీవు'గా కనిపించేదంతా సత్‌స్వరూపమగు ఆత్మయే"**

→ ఇదియే బ్రాహ్మణునకు అంతఃశిఖ (పిలక).

→ ఇదియే అంతరమగు యజ్ఞోపవీతము (లేక) బ్రహ్మసూత్రము.

**"సమస్తము బ్రాహ్మమే"** అనునదే ముముక్షువు సిద్ధించుకోవలసిన అంతఃశిఖ – ఉపవీతములు.

## బాహ్య శిఖ – యజ్ఞోపవీతములు

కర్మిష్ఠుడగు బ్రహ్మచారి, గృహస్థుడు – బాహ్యంగా ధరించే శిఖ – ఉపవీతము (జందియము) యొక్క అంతరార్థము **"సమస్తము పరబ్రహ్మస్వరూపమే"** అను భావనయే సుమా!

అయితే – **'బ్రహ్మభావన'** అను అంతర్ ఉపవీతము – (బాహ్యమైన ఉపవీతధారణవలె) – బయటకు కనిపించేది కాదు.

దారపు ప్రోగులతో నిర్మితమైన "బ్రహ్మసూత్రము" కళ్లకు కనిపిస్తుందిగాని, బ్రహ్మభావన కళ్లకు కనిపించదు. ఒకనిని చూస్తే, ఆతని అవగాహనలు స్వభావములు మొ॥వి బయటగా – కళ్లకు కనిపిస్తాయా? లేదు కదా।

**బాహ్యమైన దారపు తంతువులచే తయారుచేసుకొని ధరించే ఉపవీతమును – "అంతరబ్రాహ్మీభావన"తో మేళనము చేసి ధరించాలి.** అట్టి భావనలేకుండా త్రిసూత్రపు భౌతిక (ప్రత్తిదారపు) పోగు ధరించి ఏమిప్రయోజనము? అట్టి బ్రహ్మసూత్రధారణచే ముఖ్యముగా – అంతః సత్త్వ ధారణయే ఉద్దేశ్యించాలి.

## బ్రహ్మము ఎటువంటిది?

**న సత్** : అట్టి బ్రహ్మము సత్తు (ఉన్నట్లు)గా కళ్లకు ఒక వస్తువు వలె కనిపించేదా? కాదు. ఇంద్రియములకు 'ఉన్నది'గా కనిపించేదంతా బ్రహ్మముయొక్క స్వకీయ భావనా చమత్కారము మాత్రమే. **(ఉన్నది కాదు).**

**న అసత్ :** ఆత్మయొక్క ఉనికి చేతనే గుణములు, భావములు, అనుభూతులు, అనుభవములు సత్తా పొందుచూ ఉండగా, ఆత్మ **"అసత్తు, లేనిది"** – ఎట్లా అవుతుంది? **(లేనిదీ కాదు).**

**న సద సత్:** ఆత్మకు సంబంధించి – కొంతవరకు **'ఉన్నది'**, మరికొంతవరకు **'లేనిది'** - (Partially existent and partially non-existant) కూడా కాదు.

**న భిన్నం:** ఆత్మ – ఈ సమస్తమునకు వేరే ఎక్కడో ఉన్నది కాదు. **సమస్తము ఆత్మయే అయి ఉండగా ఆత్మ ఎక్కడో ఉండటమేమిటి?**

**న అభిన్నమ్** : ఆత్మ – ఒకానొక దృశ్యము వంటిది కాదు కాబట్టి 'అభిన్నము' అని కూడా అనము. నాకు రూపాత్మకం కాదు.

**న చ ఉభయమ్** : ఏకమగు ఆత్మయే సర్వదా ఉనికి కలిగి ఉన్నది. ఆత్మకు అన్యమైనట్టిదానికి **ఉండటము** అనునదే లేదు. అందుచేత "ఆత్మ–భిన్నము– అభిన్నముకూడా" – అని కూడా చెప్పలేము.

**న స భాగమ్** : **"ఆత్మ, దృశ్యము, దేహము, జీవుడు, ఈశ్వరుడు, పరమేశ్వరుడు – మొదలైన విభాగములతో కూడుకొని ఉన్నది"** అని అనుకోవటానికి వీలులేదు. ఆత్మ అనన్యము – అప్రమేయము (Not different and not related to anything) అనునది మహావాక్యసారము అయి ఉండగా, **"ఆత్మ–విభాగములతో కూడుకొన్నది"** అని ఎట్లా అంటాము?

**న నిర్భాగమ్** : దృశ్య – దేహ – జీవ – ఈశ్వర – పరమేశ్వరులు ఆత్మయొక్క అంతర్భాగములే కాబట్టి – ఆత్మ "భాగరహితము" అని కూడా అనము.

**న చ అపి ఉభయ రూపకమ్** : **"ఏకము, అనన్యము"** అగు ఆత్మ సభాగ – నిర్భాగయుతము (భాగసహితము, భాగరహితము, ఉభయరూపకము) – అని కూడా అనము. అనలేము కూడా!

## మాయ – యామా

సమస్తము బ్రహ్మాత్మైకత్వము (బ్రహ్మ–ఆత్మ–ఏకత్వము) అని ఎరిగిన తరువాత – ఇక్కడ మిథ్యాత్వము (మాయ) అనునది మాత్రం ఎక్కడ ఉంటుంది? ఉండదు. కార్య – కారణ – కర్తృత్వములన్నీ కల్పితములే కాబట్టి 'మిధ్య'గా హేయమే (వదలి ఉండవలసినట్టివే). కలవంటి జాగ్రత్ – స్వప్నవ్యవహారములలో మిధ్య కానిదేది? అంతర్గతంగా, **ఆయా సందర్భ పరిమితంగా చూచినప్పుడు – నిజము కానిది ఏది?**

బ్రహ్మమునందు ('దృశ్యము – దేహి – జీవుడు – ఈశ్వరుడు – కేవలుడు' అను) పంచపాదములు (విభాగములు) కించిత్ కూడా లేనేలేవు. **(ఏకోసత్, విప్రా బహుధావదంతి – అను వాక్యార్థముగా)** బ్రహ్మమునందు ఏకత్వమే సిద్ధిస్తూ ఉండగా శాస్త్రములు బ్రహ్మము గురించి చెప్పటానికై పై **ఐదు పాదములు కల్పిస్తున్నాయి**. ఏకత్వమే అంతిమంగా (Finally) ఎలుగెత్తి బోధించుచున్నాయి. (ద్రష్ట, జీవుడు, ఈశ్వరుడు, పరాత్మ, పరాత్పరుడు).

## చతుష్పాదః బ్రహ్మము

చతుష్పాదః బ్రహ్మము తనయొక్క '4' పాదములతో సమస్త జీవులలోను "అంతర్వర్తి" అయి విరాజిల్లుచున్నది. చత్వారి స్థానములను తనయందు కలిగినదై ఉన్నది.

**ఆత్మకు ముఖ్య చేతన చతుర్ స్థానములు :** I. (1) నాభి (బొడ్డు), (2) హృదయము (3) కంఠము (4) మూర్ధము (శిరస్సు, నుదురు)లలో విశేషమైన ప్రదర్శనా సంస్థితి కలిగియున్నది. (ఇవి ఉపాసనకొరకై సూచించబడుచున్నాయి).

(1) **నాభి** = బొడ్డు. నడిమిప్రదేశము. శరీరములో ముఖ్య మధ్య (నాభి) భాగము. మణిపూరక చక్రస్థానము. సర్వదేహతత్త్వములను తనయందు పూరించుకొని కేంద్రీకృతమై ఉన్న స్థానము.

(2) **హృదయము** = భావనలు, అనుభూతులు, అభిప్రాయములు మొదలైవన్నీ జనించు స్థానము. పరమాత్మ స్థానము. పరమాత్మయే **– హృది సర్వస్య తిష్ఠితమ్** – సమస్త హృదయములలో ప్రకాశమానుడై ఉన్నారు.
మననరూపమగు మనస్సుకు (ఆలోచనలకు) జనన స్థానము – హృదయమే.

(3) **కంఠము** = శబ్దము ఉదయించుస్థానము. వాయువును శరీరమంతా విస్తరింపజేయుచోటు. కంఠాకాశముతో వాయుతరంగముల పరస్పర తాడనత్వముచే శబ్దము జనిస్తోంది.

(4) **మూర్ధము** = పంచ జ్ఞానేంద్రియములకు (కళ్లు, చెవులు, ముక్కు, నోరు, స్పర్శలకు) కేంద్రీకృతస్థానము.

ఈ నాలుగు దేహములో ఆత్మ చైతన్యమునకు విశేష ప్రకటన స్థానములు.

II. **ఆత్మ ఆస్వాదించుచున్న చతుర్ అవస్థలు:**

(1) జాగ్రత్ – ఇంద్రియముల **'బాహ్యవిషయానుభవ ప్రజ్ఞ'.**

(2) **స్వప్న – స్వకీయ అంతర్ భావనానిర్మిత – విషయ కల్పిత ప్రజ్ఞ.**

(3) **సుషుప్తి – "నిర్విషయ మౌన – అనుభవరహిత – నిర్విషయ ప్రజ్ఞ".**

(4) **తురీయ** – జాగ్రత్ స్వప్న సుషుప్తులు **"తనవైయున్న స్వానుభవ ప్రజ్ఞ."**

III. **చతురగ్నులు (యజ్ఞ-యాగములలో చెప్పబడేవి)**

**(1) ఆహవనీయాగ్ని – వేదికకు పూర్వ (తూర్పు) దిక్కున హోమము చేయబడినది.**

**(2) దక్షిణాగ్ని – వేదికకు దక్షిణ దిక్కున ఉండే అగ్ని.**

**(3) గార్హపత్యాగ్ని – వేదికకు పశ్చిమ దిక్కున ఉండే అగ్ని.**

**(4) సభ్యాగ్ని – హోమరహితాగ్ని. వేదికకు ఈశాన్య దిక్కునందు ఉండునది (సభ్య, అవసధ్యోగ్నులు-రెండు హోమ రహితాగ్నులే)**

ఈ అగ్నులు అటు యజ్ఞవాటికలోను, ఇటు భౌతిక దేహము అను వాటికలోను సంప్రదర్శనమగుచున్నాయి.

IV. **చతురవస్థల దేవతాంశలు**

జాగ్రత్‌కు – **బ్రహ్మ।**
స్వప్నమునకు – **విష్ణువు।**
సుషుప్తికి – **రుద్రుడు।**
తురీయమునకు – **అక్షరము, చిన్మయము।**

**ఈ ఈ దేవతాంశలు జీవాత్మను కళాత్మకంగా తీర్చిదిద్దుచున్నాయి.**

ఈ విధంగా 4 అవస్థలు (ఆత్మకు) నాలుగు వ్రేళ్ల వలె, చుట్టుబడి ప్రవర్తిస్తున్నాయి.

ఆయా 4 అవస్థలకు (పంచప్రాణములు, పంచ ఉపప్రాణములు, పంచ కర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములు, మనో బుద్ధి చిత్త అహంకారములు అని) "24" – తత్త్వములు (జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయము) "4".

$24 \times 4 = 96$

96 తత్త్వములు తంతువువలె చుట్టబడినది **'అపర'** తత్త్వము. అవన్నీ సత్వ రజో తమో గుణములరూపమై వర్తిస్తున్నాయి. జ్ఞానపూతమ్। **త్రిగుణ స్వరూపమ్।**

***అట్టి తత్త్వములతో కూడి విశ్వమును ఆత్మస్వరూపుడగు ఈ జీవుడు ధరించటమునకు సూచనయే – త్రిసూత్రధారణ.***

## త్రిసూత్రముల – 3 పేటల (తంతువుల) ఉపవీతము

ఓ మహనీయుడవగు వీతహవ్య ప్రపౌత్రా! వేదవిద్యా పారంగతుడగు గృత్సమద పౌత్రా! తపశ్శాలిఅగు సునకముని కుమారా! ప్రియ శౌనకా!

మనము ఇప్పటిదాకా చెప్పుకున్న 96 తత్త్వముల 'ప్రతీక'యే **'జ్ఞానపూరిత త్రిగుణాత్మక సంజ్ఞ'** యగు **త్రిసూత్రధారణము** (లేక) **'యజ్ఞోపవీతము'** (లేక) బ్రహ్మసూత్రము. **(లేక) జంధ్యము / జందియము.**

**అట్టి యజ్ఞసూత్రములోని '3' ప్రోగులను (దారములను), మధ్యలో ఉండే 'బ్రహ్మముడి' ని ఇంకా ఈ విధంగా ఎరిగి ధారణచేయాలి.**

**బ్రహ్మముడి** : సమస్తము బ్రహ్మముతో ముడిపెట్టి చూడటమే బ్రహ్మముడియొక్క ఉద్దేశ్యము. **"బ్రహ్మమే నేను – నీవు – ఈ జగద్దృశ్యముగా ప్రదర్శనమగుచున్నది"** – అను ఎరుకయే **'బ్రహ్మముడి'.**

**త్రిమూర్తిత్వం పృథక్ విజ్ఞాయ** : బ్రహ్మము నందు క్రీడా – లీలా వినోదముగా – (జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు అనే) – మూడు వేరువేరైన విశేషాలు (జలములో ఆకాశ విభాగములు ప్రతిబింబించుచున్న తీరుగా) ప్రతిబింబించుచున్నాయి. హృదయములో (దర్పణంలోలాగా) త్రివిధమైన దృశ్యములుగా మూర్తీభవించినవై ఉంటున్నాయి.

**<u>నవ బ్రహ్మాఖ్య నవగుణోపేతమ్</u>**

I. (1) సత్త్వ సత్త్వము (2) సత్త్వరజము (3) సత్త్వతమము

II. (1) రజోసత్త్వము (2) రజోరజము (3) రజోతమము

III. (1) తమోసత్త్వము (2) తమోరజము (3) తమోతమము

ఈ విధం నవగుణోపేతములు నవబ్రహ్మాఖ్యములు చెప్పబడుచూ ఉన్నాయి.

వీటి త్రి–నవమానముగా 'సృష్టి' అను కల్పన యొక్క అంతర్ – రంగుల మేళమువలె అగుచున్నాయి.

[ **నవబ్రహ్మాఖ్యములు:** నవప్రజాపతులు నవబ్రహ్మలు పౌరాణికంగా – **మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, భృగువు, వసిష్ఠుడు, దక్షుడు (9)** ]

**నవబ్రహ్మలు = బ్రహ్మ మానస పుత్రులు సనకుడు, సనందనుడు, సనత్సుజాతుడు, సనత్కుమారుడు, ఋభుడు, నారదుడు, హంసుడు, అరుణి, యతి (9)**

అవన్నీ తిరిగి త్రిగుణములుగా చేసి, సూర్య–చంద్ర–అగ్ని కళారూపత్వముతో ఏకీకృతం చేయబడుచున్నాయి. ఆది – అంతములను ఏకీకృతముచేసి త్రి = అవృత్యము (Blossom) చేసి

- బ్రహ్మ – సృష్టి కర్తృత్వాభిమానము.
- విష్ణు – సృష్టి – పరిపోషణాభిమానము.
- మహేశ్వర – లయాభిమానము.

అను త్రి– అభిమానములను ప్రదర్శించు సంజ్ఞగా మూడు ధారములుగా ఉపవీతము తయారుచేయబడుచున్నది.
మూడు కలిపి **'ఏక–ఉపవీతము'**గా దగ్గరకు జరిపి **'ఏకీకృతము'** చేయబడుతోంది.

**<u>ఉపవీతము యొక్క పరిమాణము (Size) విశేషములు</u>**

ఆ త్రి గ్రంథిలను (3 దారములను) బ్రహ్మముడి దగ్గరగా తెచ్చి 'ఏకగ్రంథి'గా తయారుచేయబడుతోంది.

**<u>ఉపవీత యొక్క పొడవు</u>**




9 × 3 (27) తత్త్వముల సంబంధముతో

– **త్రిగుణోపేతముగా** (సత్త్వ రజో తమోగుణోపేతంగా)

– **త్రిమూర్తి లక్షణ లక్షితంగా** (బ్రహ్మ–విష్ణు మహేశ్వర లక్షణ లక్షితంగా, సృష్టి స్థితి లయ లక్షణ లక్షితంగా) **ఆపాదితము** చేసి, భావన చేయబడుగాక।

**వామాగ్ంసా – దక్షిణకట్యంతమ్ విభావ్య।** ఎడమ భుజము నుండి కుడి కటి ప్రదేశము వరకు ఆవరించునట్లుగా యజ్ఞోపవీతము ధరించాలి.

**ఆద్యంతమ్ (ఆది ఆంతమ్ – చివరి కొస వరకు) – గ్రహ సమ్మేళనము ఏకమ్ జ్ఞాత్వా** = బ్రహ్మముడి నుండి బ్రహ్మముడివరకు (సూర్య చంద్ర అంగారక బుధ గురు శుక్ర శని రాహు కేతువులు – అనబడే) నవగ్రహముల ఏకత్వముగా ఉపవీతమును భావించి కళ్లకు అద్దుకోవాలి. బ్రహ్మముడిని స్పృశిస్తూ **"భిన్నత్వములో ఏకత్వము"** అను **ఆత్మభావన అనుసంధానం** చేయాలి.

***ఉపవీతమును (లేక) బ్రహ్మసూత్రము 'బ్రహ్మము' గా భావించబడు గాక।***

# బ్రహ్మమేవ సత్యమ్

> **మూలమ్ – ఏక్గ్ం సత్యం మృణ్మయం విజ్ఞాతగ్ంస్య,**
> **యత్ వాచాఽ_రమ్భణం। వికారో నామధేయమ్।**
> **'మృత్తిక' – ఇత్యేవ సత్యం।**

తరంగములలో జలమే సత్యముగాని, తరంగముల ఆకారము సత్యము కాదు.

అట్లాగే **మట్టితో** – కోతి, కుక్క, మనిషి, దేవత, గుండు, పలక....ఇటువంటివి కొన్ని చేసి ఒకానొకచోట ఉంచామనుకో.

అప్పుడు వాటన్నిటిలో సత్యము ఏది? కోతియా? కుక్కయా? దేవతయా? గుండా? పలకయా?

**శౌనకుడు** : గురువర్యా! మీరు చెప్పిన వేరువేరు వస్తువులన్నీ (లేక) రూపములన్నీ మట్టితో తయారుచేసినవి కదా! అందుచేత – **మృత్తికేవ సత్యమ్।** మట్టితో తయారుచేసిన ఆయా ఆకారములన్నీ సత్యము కావు. **మట్టియే సత్యము.**

**అంగిరస పిప్పలాదమహర్షి** : అవును. మట్టియే సత్యము. మట్టితో ఒక 'మనిషి' ఆకారము నిర్మిస్తే అందులో ముక్కు, నోరు, కళ్లు, నుదురు, తల, చేతులు, కాళ్లు మొదలైనవన్నీ మట్టియే కాబట్టి **'మృత్తి కేవసత్యమ్'** అనేది ఉపనిషత్ వాక్యము.

మరి, మట్టి (బొమ్మ) యొక్క ముక్కు, నోరు, కళ్లు, నుదురు, తల, చేతులు, కాళ్లు మొదలైనవి (అట్లాగే) మట్టితో నిర్మితమైన కోతి, కుక్క, మనిషి, దేవత, గుండు, పలకల మాటేమిటి?

ఏమిటంటే...., **"వాచారంభం। వికారో నామధేయమ్।"**

మట్టి దృష్ట్యా అవన్నీ మాటవరసకు చెప్పుకునేవి మాత్రమే. ఆయా వేరైన ఆకార – వికారములకు మనము కల్పితముగా చెప్పుకొనే నామధేయములు [పెట్టిన పేరులు (Names sake namenalature)] మాత్రమే! అట్లాగే –

> *"సమస్త జీవులలో హంస (ఆత్మ) మాత్రమే సత్యము. కనుక ఆత్మయొక్క జీవ, జగత్తుచేత – రెండవ నామధేయమ్ – (మట్టికి మట్టి బొమ్మలు లాగా) – అంతః శిఖోపవీతము. ఏకమగు ఆత్మకు సంజ్ఞ.*
>
> *జీవుడు – దృశ్యము మొదలైనవన్నీ. 'మనో–భాషాకల్పిత భేదములు' మాత్రమే!".* **ఆత్మయే సత్యము.**

ఇట్టి నిశ్చయము ప్రవృద్ధపరచుకుంటూ, **'బ్రహ్మము'** గురించిన ధ్యానము నిర్వర్తించెదరు గాక।

'బ్రాహ్మణుడు' 'యతి' – బాహ్యమైన శిఖను, నూలుప్రోగు యజ్ఞోపవీతమును లెక్కలోకి తీసుకోకుండా, అంతఃశిఖ, అంతర – యజ్ఞోపవీతమునే ముఖ్యముగా దృష్టియందు నిశ్చయము చేసుకొని ఉంటాడు.

ఇక గృహస్థులు ధరించే బహిర్లక్షితమైన శిఖ, (Outwardly aimed wearing of Marriage–thread) అగు నూలు జందియము (లేక) యజ్ఞోపవీతము ధరించినంతమాత్రం చేత అది బ్రాహ్మణత్వము (బ్రాహ్మణుడు) అవదు. **అది కర్మలకు సంబంధించిన "గృహస్థశిఖ – యజ్ఞోపవీతములు" మాత్రమే. ఆత్మదృష్టి కొరకై ధరించే సూచనారూపములు మాత్రమే।**

అందుచేత గృహస్థుడుగా ధరించేది – **అభాస పూర్వక "కేశ యజ్ఞోపవీతములు"** అని చెప్పబడుతోంది. (They are symbolic to the Absolute Self which is holding all else).

**శిఖ - యజ్ఞోపవీతముల అంతరార్థమును దృష్టిలో కలిగిఉండి - ప్రత్యక్షముగా :**

- నూలుప్రోగులతో చేసినది.
- 96 బెత్తెలు, ముప్పేట (3వరసల) దారమును, మరల 'ముప్పేట'గా చేసి మరల మూడు వరుసలలో కలిపి ముడి (బ్రహ్మముడి) వేయాలి.
- నాలుగు పేటలు చేసినది అగు యజ్ఞోపవీతధారణ చేయాలి.
- 24 తత్త్వములను ఉద్దేసిస్తూ ఉండాలి.
- (**ద్రవ్య / ద్రష్టాత్మ-భూతాత్మ-జీవాత్మ-అంతరాత్మ, పరమాత్మ-నిర్మలాత్మ-శుద్ధాత్మ (కేవలాత్మ) -జ్ఞానాత్మ-మహాత్మ**-లనబడే) **నవతత్త్వములను** ఏకము చేసి,

- పరమాత్మనే ఉద్దేశ్యించాలి.
- పరతత్త్వమునే ధ్యానం చేస్తూ ఉన్నవాడై ఉండాలి.

ఈ విధంగా బ్రహ్మసూత్రము (జందియము/ఉపవీతము) యొక్క 3 పోగులలోని ప్రతి పోగుకు (**బ్రహ్మ-విష్ణు-మహేశ్వర, సృష్టి స్థితి లయ, సత్త్వ రజో తమో, సత్ చిత్ ఆనంద, జీవ ఈశ్వర పరమాత్మ** మొదలైన) ఆయా ఆకారార్థములు ఉద్దేశ్యించబడుచున్నాయి.

'బ్రహ్మముడి'. సమస్తమునకు **"ఆది, జనన, అంతః ప్రతిబింబ"** రూపమగు **'బ్రహ్మము'**నకు సంజ్ఞ. బ్రహ్మము పట్ల 'ప్రవృత్తి' కొరకై ఉపవీతము - ఒకానొక ఉపకరణ వస్తువు. **'బ్రహ్మముడి' = సృష్టి స్థితి లయములను పరబ్రహ్మముతో ముడి పెట్టడము. ఏకము చేయటము.**

**శౌనకుడు :** మహాత్మా! పిప్పలాద భగవాన్! 'ముక్తి' అనగా ఏమి? బ్రహ్మ మొదలైన లోకపాలకులపట్ల, దేవర్షులపట్ల, మనుష్యులపట్ల ముక్తి ఏఏ తీరులుగా ఏర్పడి ఉంటుంది? 'ముక్తి' అనేది - దేవతలకు ఒక తీరుగా, మానవులకు ఇంకో తీరుగా, యక్ష, రాక్షసులకు మరొక తీరుగా, జంతువులకు వేరే తీరుగా ఉంటుందా?

**అంగీరస పిప్పలాదుడు : సర్వేషాం బ్రహ్మాదీనం దేవర్షీణాం మనుష్యాణాం ముక్తిః ఏకా। బ్రహ్మైకమేవ। బ్రాహ్మణత్వమ్ ఏకమేవ॥**

బ్రహ్మ మొదలైన సృష్టి కర్తా దేవతలకైనా, దేవర్షులకైనా, మానవులకైనా ముక్తి ఒక్క తీరైనదా! ఆత్మ ఒక్కటే గాని ఒక్కొక్కరిలో ఒక్కొక్కతీరైన ఆత్మ లేదు. ముక్తి, బ్రహ్మము, బ్రాహ్మణత్వము అందరికీ ఒక్కతీరైనదే।

**"ఈ దృశ్యము, దేహము, సందర్భములు మొదలైనవి - కేవలాత్మ స్వరూపుడనగు నాకు - ఎప్పుడూ కూడా బంధమే కాదు" అను స్వకీయ నిశ్చల నిశ్చయత్వమే"** ముక్తి. అదియే బ్రహ్మము. ఏకమగు బ్రహ్మమే అందరిలో ఏర్పడి ఉన్నది. (**సమం సర్వేషు భూతేషు తిష్ఠతం పరమేశ్వరమ్**)॥

వేదాంత వాఙ్మయానుసారముగా - ఈ జీవుడు "బ్రాహ్మీదృష్టి"చే బ్రాహ్మణుడు అగుచున్నాడు. అంతేగాని జన్మ - జాతి - కర్మల చేత కాదు (వేదవిహిత కర్మలుచేత 'విప్రుడు' మాత్రమే అగుచున్నాడు).

**అందుచేత బ్రహ్మము, బ్రాహ్మణత్వములకు - సమస్త జీవులు (బ్రాహ్మీ భావన సిద్ధించుకోవటానికి) అర్హులే.**

**= [జన్మనా జాయతే శూద్రః। కర్మణా జాయతే ద్విజః।**
**= బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణత్వత్। ఇతి శాస్త్రేషు నిర్ణయః]**

**శౌనకుడు** : మరి వర్ణాశ్రమాచారముల మాట ఏమిటి?

**అంగీరస పిప్పలాదుడు** : అవును. శాస్త్రములు-ఈ జీవులకు (బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - శూద్ర) వర్ణాశ్రమాచారములను, విధి-నిషేధ విశేషములను, లౌకిక ధర్మములను వేరువేరుగా (దేశ-కాల-విధానంగా) చెప్పుచూ ఉన్నాయి. విప్రులకు, కొన్ని వర్గముల వారికి, శిఖ, యజ్ఞోపవీతములు, విధించబడ్డాయి. తదితరుల కొందరికి కూడా ఆ రెండు విధించబడకపోవచ్చుగాక!

కానీ అపవర్గము (మోక్షము) అనునది అందరికీ ఒక్కటే. బ్రహ్మజ్ఞానము చేతనే ఒకడు **'బ్రాహ్మణుడు'** అను శబ్దార్థపూర్వకమైన అర్హత పొందుచున్నాడు. అట్టి బ్రహ్మీదృష్టి సిద్ధించుకొన్న బ్రాహ్మణునకు **ఆత్మకు సంజ్ఞ అగు ప్రణవమే శిఖ, యజ్ఞోపవీతములు. ఇంకా చెప్పాలంటే...,**

- హంస (సోఽహమ్) యే - **శిఖ।**
- ప్రణవమే (ఓం) - **యజ్ఞోపవీతము।**
- నాదమే - **జీవాత్మత్వముయొక్క పరమాత్మత్వముతో "అనుసంధానము"।**

అట్టి **"సమస్తము ఆత్మయే! బ్రహ్మమే!"** – అనునదే అసలైన ధర్మము. **నేతరో ధర్మః।** తదితర వర్ణాశ్రమ ధర్మములు. 'సందర్భానుచిత, సాంఘిక విధులు. అవన్నీకూడా **"పరస్పర సానుకూల్య"** ధర్మములేగాని (వాస్తవమగు, శాశ్వతమగు) **"బ్రాహ్మీ ధర్మము"** కాదు. **సమస్తము బ్రహ్మముగా తలచుచు, "తాను బ్రహ్మమే" అను బుద్ధియొక్క సిద్ధియే** అన్ని ఆశ్రమముల సర్వసారమైనట్టి **"బ్రాహ్మణ ధర్మము".**

ఇంకా కూడా శిఖ ఉపవీతములు పరమార్థ దృష్టిచే ఈ విధంగా సవివరణము చేయబడుచున్నాయి.

- ప్రణవమే (ఓం) – హంస (సోఽహమ్). (హంసోఽహమ్)యే – **శిఖ.**
- నాదమే, నాదానుసంధానమే – త్రివృత్ సూత్రము (మూడు దారముల సూత్రము / జందియము)
- హృదయాకాశమున వెలుగొందు చైతన్యము–సమస్తమును చేతనపరచు ఇచ్ఛ. ఉత్సాహపరచుటయే ఉపవీతముయొక్క సంజ్ఞ.
- **త్రివిధం బ్రహ్మసూత్రము (త్రిసూత్రమ్)** – జాగ్రత్ స్వప్నసుషుప్తులుగాను, త్రిగుణములుగాను, త్రికాలములుగాను ఆత్మప్రదర్శనమే ఉపవీతములోని త్రి–సూత్రములధారణ.

అట్టి బ్రహ్మము గురించి **'జ్ఞాతుమ్'** (తెలుసుకోవటము) **"ద్రష్టుమ్"** (దర్శించటానికి) **'ప్రవేష్టుమ్'** (అదే మనము అయి ఉండటానికి) ఉద్దేశ్యించినదే – నిజమైన (అసలైన) శిఖోపవీతధారణ – అని జ్ఞాపకము కలిగి ఉండెదరు గాక!

ప్రత్తి దారపు ఉపవీత ధారణ ఆశ్రమ కర్మ – **సాంఘిక పరిమితమైన ఆచారమే**గాని ముఖ్య ప్రయోజనము కాదు. **వాటి సంజ్ఞార్థమో? జీవులందరికీ విహితమే.**

ప్రణవ – హంస – హృదయాకాశ – త్రివిధబ్రహ్మార్థము ఎరిగి, **ఈ బాహ్యజగత్తును తాను దర్శించు (ధారణచేయు)** బ్రహ్మసూత్రముగా **భావించువాడు నిజమైన శిఖోపవీతధారుడే అగుచున్నాడు.** అది అందరూ ఆశ్రయించవలసినదే, గాని చాతుర్వర్ణ్యములలోను, చతుర్–ఆశ్రమములలోను ఎవరికో ఒకరికి చెందినది కాదు.

**అందుచేత ఓ శౌనకా! మరొకసారి సమీక్షించి చెప్పుచున్నాను.**

## <u>ప్రాపంచక శిఖోవీతం త్యజేత్।</u>

ప్రాపంచకమైన ఉపవీతము బుద్ధిచే త్యజించబడి ఉండుగాక!

**స శిఖం వపనం కృత్వా బహిస్సూత్రం త్యజేత్ బుధః।**

జుట్టు శిఖను వపనము చేసివేయాలి, (ప్రక్కకుపెట్టివేయాలి, వదలివేయాలి). బాహ్య సూత్రమును బాహ్యముననే ఉంచబడు గాక।

**యత్ అక్షరం పరం బ్రహ్మ**
**తత్ సూత్రమ్ ఇతి।" – ధారయేత్।।**

బాహ్యమైన శిఖ, బాహ్యమైన నూలుపోగు జందియము – దేనికి సంజ్ఞయో, అది సర్వదా గుర్తు పెట్టుకొని ఉండాలి.

| *ఏది – **అక్షరము (మార్పు చేర్పులు లేనిది, క్షరము కానిది)** అయి ఉన్నదో, త్రిగుణములకు, త్రికాలములకు త్రిలోకములకు **'పరము'** (Beyond) అయి ఉన్నదో,–అద్దాని సూచకమే–నేను బుద్ధితో ధారణ చేస్తున్న **బ్రహ్మసూత్రము.** అట్టి ఆత్మజ్ఞాన సిద్ధిచే **'నాకు బంధమే ఉండజాలదు'**– అను ఈ బ్రహ్మ సూత్రమునే పునర్జన్మ నివృత్తి కొరకు ధారణ చేయాలి.* |
|---|

# బ్రహ్మసూత్రార్థము

**శ్లో।। "సూచనాత్ సూత్రమ్" – ఇతి ఉక్తగ్ం – సూత్రం నామ పరంపదమ్।**
**తత్ సూత్రం విదితం యేన, స ముముక్షుః। స భిక్షుకః।**
**స వేదవిత్। సదాచారః। స విప్రః పంక్తి పావనః।**

బ్రహ్మసూత్రము (ఉపవీతము) – అనునది పరమపదము గురించిన సూచన చేసేది, గుర్తు చేసేది, ఆశయము ప్రసాదించేది కూడా। ఎవ్వడైతే బ్రహ్మసూత్రమును **'అఖండము, ఏకము, స్వస్వరూపము, సర్వస్వరూపము'** అను ఎరుకను ఆశయముగా స్పష్టీకరించుకొని ఉంటాడో –

- అట్టివాడే ముముక్షువు (మోక్షాశయమును సంసిద్ధపరచుకొనువాడు).
- ఆతడే భిక్షకుడు. (భి = అంధకారమును, క్ష = క్షయింపజేసుకొనుచున్నవాడు).

❊ **స వేదవిత్।** ఆతడే వేదార్థము సువిదితము చేసుకుంటూ ఉన్నవాడు.

❊ **సదాచారః।** ఆతడే శాస్త్రములు సంబోధిస్తున్న సదాచారము (సత్-ఆచారము) ఎరిగి అనుసరించువానితో సమానుడు. అట్టివాడే విప్రుడు. (వేద పాఠములు తెలిసినవాడు). అట్టివాడు ఏ పంక్తిలో ఉంటే, ఆ పంక్తిలో ఉన్నవారు కూడా పవిత్రమగు ఆత్మభావనపట్ల శ్రద్ధపొందినవారై, **పవిత్రులు కాగలరు.**

## పూలదండ - ధారణ - అలంకారము

అనేక పూలతో తయారుచేయబడిన పూదండ పూలతో అంతరముగా గ్రుచ్చబడిన 'దారము' వలననే - 'ఒక పూదండ' (Garland) రూపము కలిగి ఉంటున్నది.

అట్లాగే ఈ త్రిలోకములలోని జీవజాలమంతా ఏ **"ఆత్మసూత్రము"**చే, పరస్పరమైన (పూదండలోని పూలవలె) ఏర్పడినవై ఉన్నాయో, అట్టి సూత్రమే - యోగ విదితుడగు యోగి, బ్రాహ్మణుడు, యతి - **ధరించవలసిన దండ.** (Garland).

అదియే యోగి, జ్ఞాని, యతులకు పూదండాలంకారము గాని, భౌతికమైన పూదండ అసలైన పూదండ కాదు.

జనన-మరణ-పునర్జన్మ-పునరావృత్తి దోషములతో కూడిన అపార సంసార సముద్రమునుండి 'ముక్తి'ని కోరుకొనువాడు - (ఆత్మగా నాకు బంధమే లేదు - అను) **"స్వావలబంభన స్థితి"**ని సిద్ధింపజేసుకొని ఆత్మానందమును అనునిత్యముగా చేసుకోవాలి. అందుకు **చేయవలసినది ఏమి?** "సమస్తము బ్రహ్మమే" అను **"బ్రహ్మజ్ఞానమయ సూత్రము"** నే ధరించాలి. అట్టి ఆత్మభావన లేక బ్రహ్మభావన చేయటమే **'యజ్ఞ సూత్రము'** (మరియు) **'జ్ఞాన సూత్రము'** కూడా.

## యజ్ఞోపవీత (బ్రహ్మసూత్ర) ధారణా నియమములు

భౌతికమైన (ప్రత్తితంతువులతో తయారుచేయబడిన) యజ్ఞోపవీతము ధరించువారు, 'మైల' మొదలైనవి సంభవించినప్పుడు అప్పటిదాకా ధరించిన ఉపవీతమును మైలపడినదానిగా భావిస్తారు. అశుచి ఉచ్ఛిష్టము (వదలివేయటము) చేస్తారు. యజ్ఞోపవీతము మారుస్తారు. ఆవిధంగా మార్చునప్పుడు

> **యజ్ఞోపవీతం పరమమ్ పవిత్రమ్। ప్రజాపతే యస్సహజం పురస్తాత్।**
> **ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచ శుభ్రమ్। యజ్ఞోపవీతమ్ బలమస్తు తేజః॥**

అనే మంత్రము చదువుచూ నూతన యజ్ఞోపవీతమును ధారణము చేస్తూ ఉంటారు.

అయితే, **"సమస్తము సర్వదా బ్రహ్మమే"** అను భావమును అంతరంగమునందు (మనస్సు, బుద్ధి, చిత్తములందు) బ్రహ్మసూత్రముగా ధరించినవారికి పైన చెప్పబడిన "అశుచి ఉచ్ఛిష్టము" అనే నియమము **వర్తించనే వర్తించదు.** హృదయాంతర్గతంగా జ్ఞానయజ్ఞోపవీతము ధరించిన బ్రహ్మసూత్ర విధులకు అంతా సమయమే। సర్వత్రా పవిత్రమే। వారు **నిత్య జ్ఞానయజ్ఞోపవీతధారులు.** వారిపట్ల మైల-మడి, పవిత్రత - అపవిత్రత, విధి - నిషేధముల నియమములు, ఆశ్రమ నియమములు - ఇవన్నీ 'అనివార్యము' కాదు. ఉద్దేశ్యించబడవు, నిర్దేశ్యించబడటము లేదు.

## ఆత్మజ్ఞానమేవ శిఖాయజ్ఞోపవీత ధారణమ్॥

**శ్లో॥ జ్ఞాన శిఖినో, జ్ఞాన నిష్ఠా, జ్ఞానయజ్ఞోపవీతినః,**
**జ్ఞానమేవ పరం తేషాం పవిత్రం జ్ఞానమీరితమ్॥**

| **భౌతిక - యజ్ఞోపవీతము** | **జ్ఞాన యజ్ఞోపవీతము** |
|---|---|
| భౌతికమైన శిఖ కర్మలకు చెందినదేగాని వేద హృదయము సూచించే అసలైన శిఖ కాదు. | ఆత్మజ్ఞానమే ధారణ చేయవలసిన 'శిఖ' ధారణ అలంకరించుకోవలసిన 'శిఖ' (జ్ఞానశిఖయే 'శిఖ') |
| ప్రాపంచకమైన మైల, మడి, తడి, పొడి బట్టలు కర్మ సంబంధమైన నిష్ఠలుగా చెప్పబడుచున్నాయి. | అన్ని సందర్భములలోను-"ఇదంతా బ్రహ్మమే। **'నీవు, అతడు, ఆమె వారు, వీరు, జంతువులు, దేవతలు, మొదలైనదంతా బ్రహ్మము కాని క్షణమే లేదు"- అనునిష్ఠను, పవిత్ర దృష్టిని వీడకపోవటమే 'జ్ఞాననిష్ఠ'.** |
| భౌతికమైన శిఖ - ఉపవీతముల ధారణ కర్మ యజ్ఞోపవీతమేగాని జ్ఞాన యజ్ఞోపవీతము కాదు. లోకసంబంధమైన (లౌకిక) గుర్తులు నిజమైన జ్ఞానము కాదు. | ఆత్మతత్త్వ జ్ఞాన ధ్యానములచే **"సమస్తమైన అన్యము నాయొక్క స్వయంకల్పిత ధారణావినోదమే"** అను అనన్య భావనయే **"జ్ఞాన యజ్ఞోపవీతము". ఆత్మ జ్ఞానమే వాస్తవమైన జ్ఞానము.** |

శిఖ = అగ్నికి శిఖవలె – **ఎవడికి ఆత్మతత్త్వజ్ఞానమే 'శిఖ'యో** అట్టి జ్ఞానశిఖ కలవాడినే 'కేశధారుడు' అంటారు.

**అంతేగాని వెంట్రుకల శిఖ ఉన్నంతమాత్రాన కాదు.**

ఒకానొకడు ఆత్మజ్ఞాన దృష్టి లేకుండా లోకసంబంధమైన (లేక) యజ్ఞయాగాది వైదిక కర్మల సంబంధమైన మంత్రతంత్రములు నిర్వర్తిస్తూ ఉంటే, అది పొట్టకూటి కోసము మాత్రమే (కుక్షిపూరకాః) అవుతుంది. అట్టివాడు **'ఆభాస బ్రాహ్మణుడు'** మాత్రమే.

బాహ్యమున ఎడమ భుజము నుండి కుండి మొలవరకు సవ్యముగా ధరించు ఉపవీతమును – బాహ్యాభ్యంతరములందు ప్రకాశమానమైయున్న తత్త్వ (త్వమ్ తత్ ఆత్మయేవ) – **"భావ తంతు సమన్వితము"** – అనియే భావించాలి. అట్టి తత్త్వభావనను నాభి (బొడ్డు) నుండి బ్రహ్మరంధ్రము వరకు (**మూలాధార-స్వాధిష్ఠాన-మణిపూరక-అనాహత-విశుద్ధ-ఆజ్ఞా-బ్రహ్మరంధ్రముల** వరకు) ప్రాణాయామ యోగాభ్యాసముచే బుద్ధిమంతులగు యోగులు (సుధీః) అభ్యాసము చేస్తున్నారు. అట్టి బ్రాహ్మీభావనయొక్క ఆలంబన కొరకై అందుకు క్రియాంగముగా మాత్రమే తంతు నిర్మితమైన యజ్ఞోపవీతము ఉపకరణముగా ధరించబడుతోంది.

## బ్రాహ్మీ భావనేన బ్రాహ్మణః।

ఆత్మతో **తన్మయుడు** అయి జ్ఞాన-శిఖ, అఖండాత్మ యజ్ఞోపవీతములను ధరించువారంతా బ్రహ్మణ్యులే। ఆ విధమైన **"జ్ఞానశిఖ", "ఆత్మతో తన్మయ ఉపవీతము"** ధరించనివారు బ్రాహ్మణ్యులు – అనటము ఆభాసయే. శాస్త్రదృష్టిచే బ్రాహ్మణ్యులు కారు. (విప్రులు మాత్రమే). ఆత్మదృష్టిచేతనే ఒకడు 'బ్రాహ్మణుడు' అగుచున్నాడు.

అట్టి **'ఆత్మజ్ఞాన-ఆత్మోపాసన-ఆత్మదర్శన-ఆత్మతో తన్మయ'** యజ్ఞోపవీత పారాయణమే **'పరతత్త్వ ధ్యానయోగము'**. అట్టి జ్ఞానయజ్ఞోపవీత ధారణ చేయటము తెలిసిన యజ్ఞోపవీతుడు ("నాకు బంధము మొదలే లేదు" – అనురూపముగల) **ముక్తిని తప్పక పొందలగడు.**

**బహిరంతశ్చ ఉపవీతీ విప్రః సన్న్యస్తుమ్ అర్హతి।** వేదశాస్త్రములను అధ్యయనము చేసిన విప్రుడు కూడా తనయొక్క బహిః – అంతరములో (బాహ్య అంతరములలో, బయట – లోపల కూడా) **క్రియామాత్ర ఉపవీతమును** విడచి, ఆత్మజ్ఞానోపవీతమునే బుద్ధితో ఆశ్రయించి ఉండును గాక।

**ఏకయజ్ఞోపవీతీ తు నైవ సన్న్యస్తుమ్ అర్హతి।** అనేకముగా కనిపిస్తున్న ఈ కల్పిత జగత్ – దృశ్యముపట్ల ఏకమగు ఆత్మదృష్టిని సిద్ధించుకొన్నవాడు దేనినీ పట్టుకోడు. వదలడు. ఏదీ పట్టుకోనివానికి **దేనినైనా వదలవలసిన పనిఏమున్నది?** ఆతనికి (చతుర్విధ ఆశ్రమములలోని నాలుగవదగు) 'సన్న్యాసాశ్రమము'తో ఇక క్రొత్తగా అవసరము ఉండదు.

అందుచేత ఓ శౌనకా!

> **శ్లో॥ తస్మాత్ సర్వప్రయత్నేన మోక్షాపేక్షీ భవేత్ యతిః।**
> **బహిః సూత్రం పరిత్యజ్య "స్వాంతః సూత్రం"తు ధారయేత్॥**

సర్వ ప్రయత్నములలో మోక్షాపేక్ష కలవాడే **'యతి'.**

ఓ శౌనకా! బాహ్యసూత్రమును త్యజించి ఆత్మతో అనుసంధానపూర్వకమైనట్టి **"స్వాంతః సూత్రము"**ను ధారణచేయుదువు గాక। బాహ్యమున ప్రాపంచకంగా ధరించు దారపు సూత్రమును అనాదరించినవాడవు అగుదువు గాక!

- 'ప్రణవము' (ఓం-సర్వాత్మకము) అను శిఖ – ఉపవీతములను ధారణచేయుదువు గాక!
- మోక్షము కొరకై ఆశయమును ప్రవృద్ధపరచుకొని, బంధరాహిత్యమును సిద్ధించుకొనెదవు గాక।

⌘⌘⌘

*ఈ విధంగా మహనీయుడగు పిప్పలాదమహర్షి శౌనకునికి బోధించారు.*

*ఇతి పరబ్రహ్మోపనిషత్*
*ఓం శాంతిః శాంతిః శాంతిః*

అధర్వణవేదాంతర్గత

# 12 ప్రశ్నోపనిషత్

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ ఓం। గురుదేవ పిప్పలాదాయ నమః।
ఓం। సుకేశాయ భరద్వాజః, శైబ్యశ్చ సత్యకామాయ,
సౌర్యాయణీ గార్గ్యః, కౌసల్యాశ్చ అశ్వలాయనాయ,
భార్గవో వైదర్భిః, కబంధీ కాత్యాయనాయ
ఋషిభ్యో గురుభ్యో మునిభ్యో నమః॥



ఓం నమో బ్రహ్మాదిభ్యో।
బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో।
వంశ ఋషిభ్యో। మహద్భ్యో।
గురుభ్యో నమః।

### మొదటి ప్రశ్న

ఓం నమో పరమాత్మనే నమః।
హరిః ఓం!
– ప్రథమ ప్రశ్నః –

**ఓంకార స్వరూపుడు, సర్వాంతర్యామి అగు పరమాత్మకు నమస్కరిస్తున్నాము.** సర్వమును తానై - సర్వము తనవైపుగా ఆకర్షించుచున్న హరి స్వరూప 'ఓం'కారమునకు నమస్సుమాంజలులు.

---

**1.** సుకేశా చ – భరద్వాజః;
శైబ్యశ్చ – సత్యకామః;
సౌర్యాయణీ చ– గార్గ్యః;
కౌసల్యశ్చ – అశ్వలాయనో;
భార్గవో – వైదర్భిః;
కబంధీ – కాత్యాయనః –
తే హ ఏతే –
బ్రహ్మపరాః। బ్రహ్మనిష్ఠాః।
పరంబ్రహ్మ అన్వేషమాణా
ఏష హ వై "తత్సర్వమ్ వక్ష్యతి" ఇతి।
తే హ
సమిత్పాణయో
→ భాగవంతం పిప్పలాదమ్ ఉపస(ప)న్నాః॥

1. భరద్వాజుని కుమారుడైన (భారద్వాజ) సుకేశుడు, 2. శిబి కుమారుడైన సత్యకాముడు, 3. గార్గ్య గోత్రజుడైనట్టి సౌర్యాయణి, 4. అశ్వలుని కుమారుడైనట్టి కౌసల్యుడు, 5. భృగు (భార్గవి) గోత్రజుడైన వైదర్భి, 6. కత్యుని కుమారుడైన కబంధి (లేక) కాత్యాయనుడు...,

ఈ **ఆరుగురు** బ్రహ్మమే తమ యొక్క **నిష్ఠగా** కలిగి యున్నట్టి మునీశ్వరులు. **బ్రహ్మమే జీవిత పరమార్థముగా గలవారు.**

వారంతా కూడా ఒకానొకప్పుడు **"బ్రహ్మతత్త్వమును అన్వేషించి, తెలుసుకోవాలి!"** అని ఉద్దేశ్యించి సద్గురువు - సత్‌తత్త్వమును ఎరిగినట్టి మహనీయ సందర్శనము కొరకై చేతులలో దర్భలు ధరించి బయల్వెడలారు. **భగవంతుడు, మహనీయుడు ఆత్మజ్ఞుడు-అగు పిప్పలాదమహర్షిని సమీపించారు.**

**"హే మహర్షీ! మాకు బ్రహ్మతత్త్వమంతా కూడా సర్వము ఆమూలాగ్రము బోధించండి!"..** అని అభ్యర్థించారు.

---

**2.** <u>తాన్ హ స ఋషిః ఉవాచ: –</u>
"భూయ ఏవ తపసా – బ్రహ్మచర్యేణ శ్రద్ధయా
సంవత్సరం సంవత్స్యథ।
యథా కామం ప్రశ్నాన్ పృచ్ఛత।
యది విజ్ఞాస్యామ్యః –
సర్వం హ వో వక్ష్యామ" ఇతి॥

అప్పుడు ఆ పిప్పలాద మహర్షి వారితో - ఇట్లా అన్నారు:

**"నాయనలారా! అట్లాగే। అయితే, ఇప్పటి నుండి ఒక సంవత్సర కాలము శ్రద్ధతో తపస్సు, బ్రహ్మచర్యము నిర్వర్తించండి. శ్రద్ధాసక్తులతో బ్రహ్మతత్త్వమును విచారణ చేయండి. అప్పుడు రండి. అప్పటికీ ఇంకా బ్రహ్మము గురించిన మీకు సందేహాలు ఏవైనా మిగిలి ఉంటే చెప్పండి. ఇంకా ఏమి తెలుసుకోవాలో- అప్పుడు యోచించి, ప్రశ్నల రూపంగా అడగండి. మీ ప్రశ్నలకు సమాధానము, నాకు తెలిసినంతవరకు, మీకు పూర్తిగా తప్పక చెప్పుతాను".**

**3. అథ కబంధీ కాత్యాయన**
**ఉపేత్య, పప్రచ్ఛ :-**
**"భగవన్! కుతో హ వా**
**ఇమాః ప్రజాః ప్రజాయంత?"**
**ఇతి!**

**వారంతా గురు ఆజ్ఞ ప్రకారం శ్రద్ధగా తపస్సు చేస్తూ బ్రహ్మము గురించి విచారణ - ధ్యానము చేసారు. మరల గురువును సమీపించారు.**

అప్పుడు మొట్టమొదటగా కత్యుని కుమారుడైన కబంధి (కాత్యాయన) మహాముని- లేచి నిలుచున్నారు. గురుదేవులగు శ్రీ పిప్పలాది మహర్షి నమస్కరించి - ఈ విధంగా తన ప్రశ్నను నివేదించారు!

**"హే భగవన్! పిప్పలాద గురుదేవా నమో నమః। నాకు కళ్లకు ఎదురుగా ఈ జీవులంతా కనిపిస్తున్నారు కదా! ఈ ప్రాణికోట్లంతా ఎక్కడి నుండి పుట్టుకొస్తున్నారు?"**

---

**4. తస్మై స హో వాచ;**
**- ప్రజాకామో వై ప్రజాపతిః।**
**స తపో అతప్యత।**
**స తపః తప్త్వా-**
**స మిథునమ్ ఉత్పాదయతే।**
**"రయిం చ - ప్రాణం చ" ఇతి!**
**"ఏతౌ యే బహుధా ప్రజాః**
**కరిష్యత।".. ఇతి**

**అప్పుడు శ్రీ పిప్పలాద మహర్షి ఇట్లా సమాధానం చెప్పసాగారు.**

సృష్టికి మునుముందే ఉన్నట్టి **ఏకము, కేవలము, చైతన్యస్వరూపము** అయి ఉన్న **సృష్టికర్త - "నేను అనేక రూపులగు - నానాత్వ సమన్వితమైన జీవకోటిని కల్పించుకొని, వినోదినై ఉండెదనుగాక!"..** అను రూపమైన అభిరుచిని, కోరికను పొందారు. అందుకు కావలసిన యోచన రూపమైన తపస్సు చేసి మొట్టమొదటగా ఒక 'జంట' (Dual) ని సృష్టించారు.

(1) పదార్థము (Matter) / రయి (2) ప్రాణము (Energy)

"ఈ రెండు కలిసి నాకు అనేక రూపములగు సంతానమును కల్పించు గాక!".. అని భావించారు. కనుక రయి (Matter) + ప్రాణము (Energy) నుండే ఈ జీవజాలమంతా బయల్వెడలటం జరుగుతోంది.

---

**5. ఆదిత్యో హ వై 'ప్రాణో'।**
**రయిరేవ 'చంద్రమా'ః।**
**రయిర్వా ఏతత్ సర్వం -**
**యత్ మూర్తం చ, అమూర్తం చ।**
**తస్మాత్ మూర్తిరేవ రయిః॥**
**(మూర్తిః ఏవ రయిః)।**

**ప్రాణశక్తి యొక్క రూపము:**

- నిరాకారము (అమూర్తము).

" సూర్యుడు" - బృహత్తరమైన ప్రాణశక్తి కేంద్రము.

**రయిత్వము** = ఆ ప్రాణము యొక్క సాకారము - "చంద్రుడు".

అంతా కూడా నిరాకారమగు శక్తి+ సాకారమగు పదార్థముల కలయికయే!

కనుక

| | |
|---|---|
| సాకారమే → రయి | **'Self' is the origin for Energy** |
| Energy = Formless | **Matter is taking the form of Matter** |
| Matter = Has Form | **Matter is a form of Energy** |

అమూర్తమగు శక్తి యొక్క సాకారమే (మూర్తత్వమే) పదార్థము.
**పదార్థము** = శక్తి రూపమే. అనగా **శక్తి - మూర్తము వేరువేరు కాదు.**

---

**6. అథ ఆదిత్య - ఉదయన్ -**
**→ ప్రాచీం దిశం ప్రవిశతి, తేన ప్రాచ్యాన్**
**ప్రాణాన్ రశ్మిషు సంవిధత్తే।**
**→ యత్ దక్షిణామ్,**
**→ యత్ ప్రతీచీం,**
**→ యత్ ఉదీచీం,**
**→ యత్ అథో, యత్ ఊర్ధ్వమ్,**
**→ యత్ అంతరా దిశో**
**→ యత్ సర్వం ప్రకాశయతి -**
**= తేన సర్వాన్ ప్రాణాన్ రశ్మిషు సన్నిధత్తే॥**

ప్రాణశక్తి రూపమగు ఆదిత్యుడు మొట్టమొదట ఉదయించి → తూర్పు (towards east) వైపు తన యొక్క శక్తితో విస్తరించి తూర్పు వైపు ప్రాణులను ధారణ చేయసాగుచున్నారు.

**అట్లాగే ప్రాణశక్తి స్వరూపుడగు ఆయనయే -**

- దక్షిణ దిక్కుగాను,
- పడమర దిక్కుగాను,
- ఉత్తర దిక్కుగాను,
- క్రిందకు,
- పైకి,
- మధ్యగా- విస్తరించినవారై - అన్ని వైపులా ప్రాణ-శక్తి కిరణములను విస్తరింపజేస్తూ, ఆయా అన్ని ప్రాణ రూపములుగా ఉంటూ, **ఈ సమస్తము తానే ధరించటం నిర్వర్తించసాగుచున్నారు.**

**- ఈ విశ్వమంతా ఒకే ప్రాణశక్తి యొక్క వివిధ రూపములే!**

(Prana Energy is always same and constant. All the beings and non-beings are its manifestations).

| | |
|---|---|
| 7. స ఏష<br>వైశ్వానరో విశ్వరూపః।<br>ప్రాణో అగ్నిః ఉదయతే।<br>తత్ ఏతత్<br>ఋచా (అ)భ్యుక్తమ్।। | ప్రాణము యొక్క రూపము 'అగ్ని'!<br>ఇక మూర్తమగు (సాకారమగు) ఎదురుగా కనిపించే ఈ విశ్వమంతా 'వైశ్వానరుడు'! **వైశ్వానరో విశ్వరూపః।**<br>ప్రాణశక్తిని → అగ్ని రూపంగాను,<br>ఈ సాకార విశ్వమును వైశ్వానరుడుగా → వర్ణనలు, ఉపాసనలు ప్రవచిస్తూ ఋక్కులను (స్తుతులను) ఋగ్వేదము గానం చేస్తోంది. |
| 8. విశ్వరూపం హరిణం<br>జాతవేదసం పరాయణమ్।<br>'జ్యోతిః ఏకం తపంతమ్!<br>సహస్ర రశ్మిః శతథా వర్తమానః<br>ప్రాణః ప్రజానామ్<br>ఉదయతి, ఏష సూర్యః।। | **ఇక ప్రాణశక్తి యొక్క విశేష తత్త్వమును వర్ణిస్తున్నాను. విను.**<br>- ఈ విశ్వమంతా ప్రాణశక్తి యొక్క బాహ్య - పాదార్థిక రూపమే!<br>- ప్రాణ సూర్యుడు అటు అనంత తేజో స్వరూపుడై, ఇటు జీవజాల-కిరణ రూపుడై ఉన్నారు.<br>- జాతవేదసుడై ఈ జీవాత్మల బాహ్య - అభ్యంతర రూపములను ఎరిగిన వాడు అగుచున్నారు. (రచయిత పాత్రల స్వభావాలు ఎరుకయే కదా!)<br>- జ్యోతి-కాంతి స్వరూపుడై సర్వమును తపింపజేయుచు, వేడిని ప్రసాదిస్తున్నారు.<br>- ఆయనయొక్క ప్రకాశమే సహస్ర (వేలాది) కిరణముల స్వరూపము అయి ఉంటోంది.<br>అట్టి ప్రాణశక్తి ఈ జీవులను సృష్టించి, అట్టి స్థావర - జంగమములన్నిటికీ తానే ప్రాణస్వరూపమై ఉన్నది. |
| 9. సంవత్సరో వై ప్రజాపతిః।<br>తస్య అయనే దక్షిణం చ - ఉత్తరం చ।<br>తద్యేహవై (తత్ ఏవ, హవై,)<br>తత్ "ఇష్టా-పూర్తే కృతమ్" ఇతి ఉపాసతే"।<br>(తే) చాంద్రమసమ్ ఏవ<br>లోకమ్ అభిజయంతే।<br>త ఏవ పునః ఆవర్తంతే (పునరావర్తన్తే)।<br>తస్మాత్ ఏతే ఋషయః ప్రజా కామా,<br>దక్షిణం ప్రతిపద్యంతే!<br>ఏష హ వై రయి ర్యః పితృయాణః।। | ఆ ప్రాణ-రయిల సృష్టికర్తయే కాల స్వరూపుడు! సంవత్సర స్వరూపుడు! అట్టి ప్రజాపతికి సంవత్సర (కాల) రూపంగా రెండు ప్రవృద్ధి వర్తమానములు. (1) దక్షిణాయనము (2) ఉత్తరాయనము<br>**అందులో దక్షిణాయనము గురించి :**<br>- ఈదారి వేద ధర్మములు, లోకసంబంధమై ధర్మములు, వాటివాటికి సంబంధించిన కర్మలకు సంబంధించినది. (ఇష్టా-పూర్తములు మొ॥వి).<br>- ఈ దక్షిణాయన మార్గబాటసారి చంద్రలోకము (రయి-పదార్థానుభావలు)ను గెలుచుకొనుచున్నాడు (పొందుచున్నాడు)<br>అయితే **పునరావృత్తి** కలిగి ఉండి, -ఈతడు తిరిగి భౌతిక స్థానములకు మరలుచున్నాడు. అందుచేత వీరు ప్రజాకాములై దక్షిణ దిశ పొందుచున్నారు. ఇదియే పదార్థము! ఇదియే పితరుల దారి!<br>***(కేవలము నుండి - సందర్భములోకి)*** |
| 10. అథ, ఉత్తరేణ తపసా<br>బ్రహ్మచర్యేణ- శ్రద్ధయా - విద్యయా<br>ఆత్మానమ్ అన్విష్యా →<br>ఆదిత్యమ్ అభిజయంతే!<br>ఏతత్ వై → ప్రాణానామ్ ఆయతనమ్<br>ఏతత్ → అమృతమ్, అభయమ్।<br>ఏతత్→ పరాయణమ్।<br>ఏతస్మాత్ (ఏతత్→ అస్మాత్) - న పునరావర్తంత-<br>ఇతి ఏష నిరోధః!<br>తత్ ఏష శ్లోకః।। | **(2) ఇక ఉత్తరమార్గ బాటసారులు.** వీరు తపస్సు - బ్రహ్మచర్యములను శ్రద్ధతో - జ్ఞానముతో ఉపాసిస్తూ (పదార్థత్వమును అధిగమించి), ఆత్మత్వము కొరకై అన్వేషణ ప్రారంభించి, కొనసాగిస్తూ ఉత్తరాయణము ద్వారా సూర్యస్థానమును గెలుచుకొంటున్నారు.(దాటుచున్నారు). అది ప్రాణశక్తికి నిలయము. అభయస్థానము. అమృతానందానుభవప్రదము. అదియే పరాకాష్ఠ! పరాయణము! (పరస్వరూపమువైపుగా ప్రయాణము) పరంధామము.<br>చంద్ర (భౌతిక సంబంధమైన యానము వలె) కాకుండా,- ఈ ఉత్తరాయన మార్గంలో పునరావృత్తి దోషము ఉండదు. ఇది ఆత్యంతికము.<br>**ఈ ప్రాణ మార్గము - ఉత్తరాయణము, మోక్షమార్గము, ఆత్మానుభవ మార్గముగా అభివర్ణించబడుతోంది. (సందర్భమునుండి కేవలమునకు).** |

| | |
|---|---|
| **11.** **పంచ (5) పాదం। పితరం ద్వాదశ (12) ఆకృతిమ్।**<br>**దివ ఆహుః పరే అర్ధే పురీషిణమ్।**<br>**అథ ఇమే అన్య ఉ పరే విచక్షణం –**<br>**సప్త (7) చక్రే – షడర (షట్ – 6) ఆహుః**<br>**అర్పితమ్ ఇతి॥** | కొందరు ఆత్మశాస్త్రవేత్తలగు ఋషులు.. అట్టి జ్ఞాన పరాకాష్ఠయగు సూర్యస్థానమును<br>- 5 పాదాలుగా → (హేమంత - శిశిర ఏకత్వంగా) 5 ఋతువులుగా<br>- 12 ఆకృతులు → 12 నెలలుగాను,<br>-ఆకాశమును ఆక్రమించుకొన్నదిగాను,<br>-వర్షమును ప్రసాదించే పురీషిణముగాను వర్ణిస్తున్నారు.<br>**మరికొందరు ఋషులు..,**<br>- సర్వమునకు ద్రష్టగా (చూచువాడుగా) (లేక) విచక్షుణుడుగా,<br>- ఏడు చక్రములలో కదలువాడుగా, (సప్తాశ్వాలు - సప్తరంగులు ధరించువాడుగా) (సప్తాశ్వరథమ్ ఆరూఢుడుగా)<br>- 6 ఆకులు (ఋతువులు) ప్రకటించువాడుగా... స్తుతిస్తున్నారు.<br>**ఆదిత్యరూపంగా ప్రాణదేవుడు ప్రకటితుడు.** |
| **12.** **మాసో వై ప్రజాపతిః।**<br>**తస్య 'కృష్ణపక్ష' ఏవ రయిః।**<br>**శుక్లః ప్రాణః।** | ఆ ప్రాణప్రదాతయగు ఆ ప్రజాపతి ప్రదర్శనమే - (లేక) ఆయన అవయవములే 12 మాసములు.<br>**అట్టి మాస స్వరూపుడగు ప్రజాపతి యొక్క**<br>→ కృష్ణపక్షము - రయి (పదార్థము)<br>→ శుక్లపక్షము - ప్రాణము (శక్తి) |
| **తస్మాత్ ఏతే ఋషయః**<br>**శుక్ల ఇష్టం కుర్వంతి।**<br>**ఇతర – ఇతరస్మిన్॥** | కనుక మంత్ర ద్రష్టలు, **ద్రష్టాభిమానులు** అగు మహర్షులు శుక్లపక్షము నందు (ఆత్మ) యజ్ఞనిష్ఠులై ఉంటున్నారు.<br>**సృష్ట్యభిమానులగు** ఇతర ఋషులు చంద్రయానమార్గులై కృష్ణపక్షయజ్ఞులు (To gain something in creation)గా నిర్వర్తిస్తున్నాను |
| **13.** **అహో–రాత్రో వై ప్రజాపతిః।**<br>**తస్య అహః ఏవ 'ప్రాణో'। రాత్రిః ఏవ 'రయిః'।**<br>**ప్రాణం వా ఏతే ప్రస్కందంతి। యే దివా రత్యా సంయుజ్యంతే,**<br>**బ్రహ్మచర్యమేవ, తత్–యత్ రాత్రౌ రత్యా సంయుజ్యంతే॥** | పగలు - రాత్రి ప్రజాపతియొక్క ప్రదర్శనా చమత్కారమే।<br>పగలు → ప్రాణశక్తిరూపము<br>రాత్రి → భౌతిక రూపము. చంద్రుడు. అన్నము.<br>- ఎవ్వరైతే పగలు - రతి(మైధునక్రియ) యందు సంపర్కులౌతారో వారు తమ యొక్క ప్రాణశక్తిని వ్యర్థపరచుకొనుచున్నవారౌతున్నారు. రాత్రిపూట రతి బ్రహ్మచర్యముతో సమానము. |
| **14.** **అన్నం వై ప్రజాపతిః।**<br>**తతో హ వై తత్ రేతః।**<br>**తస్మాత్ ఇమాః ప్రజాః**<br>**ప్రజాయంత ఇతి।** | "అన్నము యొక్క తత్త్వమే ప్రజాపతి తత్త్వము.<br>ఎందుకంటే..,<br>అన్నము చేతనే శుక్ల-శోణితములు, తద్వారా ఈ జీవరాసులు కలుగుచున్నాయి కదా?.... అని కొందరు మహనీయులు అభివర్ణిస్తున్నారు! |
| **15.** **తత్ యే (తద్యే) హవై**<br>**తత్ ప్రజాపతి వ్రతం.. చరంతి।**<br>**తే మిథునమ్ ఉత్పాదయంతే।** | ఎవరు ప్రాణ-రయి మిథునమును (ద్వంద్వమును) గ్రహిస్తున్నారో.. అట్టివారు ప్రజాపతి వ్రతధారులై జీవోత్పత్తి కొనసాగటానికై వ్రతంగా ఆచరిస్తున్నారు. |
| **తేషామ్ ఏవ, ఏష బ్రహ్మలోకో**<br>**యేషాం తపో బ్రహ్మచర్యం**<br>**యేషు సత్యం ప్రతిష్ఠితమ్॥** | ఎవరి యొక్క తపస్సు, అవగాహన - **ఇంద్రియ నిగ్రహములతో** కూడుకొని ఉన్నదో, ఎవరి యందు **సత్యమును** ధారణ చేయు బుద్ధి ప్రతిష్ఠితము పొందుతోందో.., వారు బ్రహ్మమును దర్శించ గలుగుచున్నారు. **బ్రహ్మమునందు ప్రతిష్ఠితులు అగుచున్నారు.** |

| | |
|---|---|
| **16. తేషామ్ అసౌ విరజో..**<br>**బ్రహ్మలోకో న యేషు జిహ్మమ్ (జిహ్వామ్)**<br>**అనృతం న మాయా చ। ఇతి॥** | ఎవ్వరియందైతే వంచన, మోసము, అనృతము, మాయాదృష్టి తరుగుతూ, ఇంద్రియ విషయములపై అభినివేశము, జిహ్వాచాపల్యము, అభినివేశము, అభిరుచి తగ్గుతూ ఉంటాయో- అట్టి దోషరహితులకే బ్రహ్మలోకము తమకు చెందినదై ఉండగలదు. అట్టి దోషములు కలవారు జనన-మరణ చక్రములో తిరుగాడుచూనే ఉంటారు.<br>**పరమాత్మనుండే ఈ జీవజాలమంతా బయల్వెడలుతోంది.** |
| **<u>ద్వితీయ ప్రశ్నః (రెండవ ప్రశ్న)</u>**<br>**1. <u>అథ హి ఏనం (అథహైనం)</u>**<br>**<u>భార్గవో వైదర్భిః పప్రచ్ఛ :-</u>**<br>**భగవన్!**<br>**కతి (ఎందరు) ఏవ దేవాః ప్రజాం విధారయంతే?**<br>**కతర (ఎన్ని) ఏతత్ ప్రకాశయంతే?**<br>**కః (ఎవ్వరు) పునః ఏషాం వరిష్ఠ?**<br>**ఇతి॥** | **<u>రెండవ ప్రశ్న</u>**<br>**అట్టి ప్రాణ-రయి తత్త్వాన్నంతా వింటూ అప్పుడు భృగువంశజుడు - విదర్భ నివాసుడు అగు భార్గవుడు (పిప్పలాద మహర్షికి) - లేచి నిలుచుని, తన ప్రశ్నను ఇట్లా విన్నవించుకున్నారు.**<br>'హే భగవాన్! మహాత్మన్! సద్గురూ! పిప్పలాద మహర్షీ! ఈ భౌతిక దేహమును అశరీరులు దివ్య ప్రాజ్ఞులు అగు దేవతలు నిర్మించి, పర్యవేక్షిస్తున్నారు కదా!<br>**- అట్టి ఎంతమంది దేవతలు ఈ జీవుల దేహములను నిలబెట్టుచూ, పోషిస్తూ భరిస్తున్నారు?**<br>- ఎటువంటి తమ తమ యొక్క మహత్త్యములచే ఈ (రయి-భౌతిక) దేహములను ప్రవర్తింపజేస్తున్నారు? అట్టి దివ్యరూపులగు దేవతలలో శ్రేష్ఠులెవరు? వారి ప్రకాశము ఎట్టిది? |
| **2. <u>తస్మై సహ ఉవాచ (సహోవాచ)</u> :**<br>**ఆకాశో హ వా ఏష దేవో।**<br>**వాయుః అగ్నిః ఆపః పృథివీ**<br>**వాక్ మనః చక్షుః శ్రోత్రం చ॥**<br>**తే ప్రకాశ్య అభివదంతి –**<br>**వయం ఏతత్ బాణమ్**<br>**అవష్టభ్య విధారయామః॥** | **అందుకు మహర్షి సమాధానం :** పంచభూతములనబడే ఆకాశము - వాయువు - అగ్ని -జలము - పృథివి.. ఈ ఐదు కనబడే భౌతిక సృష్టికి కారణ పదార్థములు. సూక్ష్మ ప్రాణశక్తి ప్రదర్శనములే ఇంద్రియములను ప్రవర్తింపజేస్తున్నాయి.<br>(1) వాక్కు- పాణి (చేతులు) - పాదములు - పాయువు (మలద్వారం) - ఉపస్థ.. ఈ 5 కూడా **కర్మేంద్రియములు.** (2) త్వక్ (చర్మము) - కళ్ళు- చెవులు - చర్మము - జిహ్వ - ఘ్రాణేంద్రియము - ఈ '5' → **జ్ఞానేంద్రియములు.**<br>**'మనస్సు'** ఆరవ ఇంద్రియము.<br>ఈ 5+5+5+1లో ఒక్కొక్క దానికి వీటి వీటి సొంతదారు అయినట్టి అధిష్ఠాన దేవతలు ఉన్నారు. వారంతా కూడా తమ తమ తత్సంబంధమైన కార్యాకార్యములచే తమ మహత్మ్యమును లోకాలలో ప్రదర్శిస్తున్నారు. ఒకానొక సందర్భములో అవన్నీ ఒకసారి **"మేము ఈ శరీరమును నిలబెట్టుచున్నాము"..** అని గొప్పలు చెప్పుకోసాగాయి. |
| **3. తాన్ వరిష్ఠః ప్రాణ ఉవాచ। –**<br>**"మా మోహమ్ ఆపద్యథ।**<br>**అహమేవైతత్ (అహమ్ ఏవ ఏతత్)– పంచధా**<br>**ఆత్మానం ప్ర విభజ్య –**<br>**ఏతత్ బాణం అవష్టభ్య –**<br>**విధారయామి!" – ఇతి।**<br>**తే అశ్రద్ధ ధానా – బభూవుః॥** | (పంచకర్మ-జ్ఞానేంద్రియములు, పంచభూతములు మనస్సు.. "మేమే ఈ దేహములను నిలబెట్టి ఉంచుచున్నాము కదా!".. అని చెప్పుకొంటూ ఉండగా)..,<br>**ముఖ్యప్రాణము** వారందరిని పిలిచి, ఇట్లా పలికింది.<br>**"మిత్రులారా! మీరు మోహము పొందకండి!**<br>**నన్ను నేనే ఈ ఈ 5+5+5+1గా నన్నునే ప్రవిభజించుచు ఈ 16తో సహా ఈ దేహము పడిపోకుండా నిలబెట్టుచున్నాను"** అని ఎలుగెత్తి పలికింది.<br>అప్పుడు ఆ 16 కూడా **"ఆ! ప్రాణశక్తి ఏమంటే మాకేం! మేమే ఈ దేహమును నిలబెట్టుచున్నాం"** అని తలచాయి. ప్రాణశక్తి మాట విశ్వసించలేదు. ప్రాణదేవత (అగ్నిశక్తి) వాక్యాలపట్ల అశ్రద్ధ వహించాయి. పెడచెవిన బెట్టాయి. |

| | |
|---|---|
| **4. సో అభిమావా(నా)త్ ఊర్ధ్వమ్ ఉత్క్రామత-ఇవ**<br>**(నిష్క్రమించినట్లుగా)**<br>**తస్మిన్ ఉత్క్రామతి అథ ఇతరే సర్వ ఏవ ఉత్క్రామన్తే।**<br>**తస్మిం చ ప్రతిష్ఠమానే సర్వా ఏవ ప్రతిష్ఠంతే॥**<br>**తత్ యథా.... (అది ఎట్లా, అంటే)..,**<br>**మక్షికా (తేనెటీగలు) మధుకర రాజానమ్**<br>**ఉత్క్రామంతం→ సర్వా ఏవ ఉత్క్రామంతే।** | అప్పుడు ముఖ్యప్రాణము అభిమానము పొంది, (దేహము నుండి) పైకి లేచిపో ప్రారంభించింది. అప్పుడా 16 (పంచభూతములు, పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు + మనస్సు) కూడా నిస్సహాయంగా దేహము నుండి బయల్వెడలసాగాయి. ఇంతలోనే ప్రాణము దేహంలో తిరిగి ప్రతిష్ఠ పొందగానే, అవన్నీ కూడా ప్రతిష్ఠ పొందాయి.<br>దృష్టాంతానికి.., తేనేటిగ - రాణి బయలుదేరబోగానే, తక్కిన తేనేటీగలన్నీ తేనె తుట్టి నుండి బయల్వెడలబోతున్న విధంగా జరిగింది. |
| **తస్మిం చ ప్రతిష్ఠమానే, సర్వా ఏవ ప్రతిష్ఠంత॥**<br>**ఏవం (అదేవిధంగా) వాక్- మనః-చక్షుః శ్రోత్రం చ।**<br>**తే ప్రీతాః ప్రాణం స్తున్వన్తి॥**<br>**(ప్రాణమును స్తుతించినవారయ్యారు)** | ప్రాణ ప్రతిష్ఠచే అవన్నీ కూడా తిరిగి ప్రతితిష్ఠత పొందాయి. అప్పుడు ముఖ్య ప్రాణము యొక్క ఔన్నత్యమును గుర్తించి వాక్కు - మనస్సు - చక్షువులు - చెవులు మొదలైనవన్నీ - **"ప్రీతి పూర్వకంగా ప్రాణశక్తిని స్థుతించ సాగాయి".** |
| **5. ఏషో → అగ్నిః తపతి।**<br>**ఏష→ సూర్య।**<br>**ఏష→ పర్జన్యో- మఘవాన్।**<br>**ఏష→ వాయుః।**<br>**ఏష →పృథివీ రయిర్దేవః -**<br>**సత్ - అసత్ చ, అమృతం చ యత్॥** | కాబట్టి మిత్రులారా!<br>- అట్టి ప్రాణశక్తియే<br>→ అగ్నిగా ప్రకాశిస్తోంది.<br>→ అదియే వర్షముగా కురుస్తోంది.<br>→ ప్రాణమే దేవతలకు అధిపతియగు ఇంద్రరూపము కూడా!<br>- అదియే ఈ భూమి యొక్క రూపము. నామరూపాత్మకమైనదంతా కూడా **ప్రాణతత్త్వమే.**<br>- సత్తు - అసత్తుగా, మృత-అమృత రూపంగా, దేవతా-ఉపాసక రూపంగా కనిపించేదంతా సర్వదా **సర్వత్రా ఏకమే అయి ఉన్న ప్రాణశక్తితత్త్వమే!** |
| **6. అరా ఇవ రథనాభౌ**<br>**ప్రాణే సర్వం ప్రతిష్ఠితమ్।**<br>**ఋచో-యజూగ్ంషి - సామాని -**<br>**- యజ్ఞః - క్షత్రం బ్రహ్మ చ॥** | రథచక్రము యొక్క ఇరుసులో 'ఆకులు' ఇమిడి ఉన్నట్లుగా ప్రాణశక్తి యందే ఈ సమస్తము ప్రతిష్ఠితమైయున్నది.<br>→ ఋక్కులు, యజస్సులు, సామములు, యజ్ఞము, క్షత్రియులు (కార్యకుశలురు), బ్రాహ్మణులు (బ్రహ్మతత్త్వఅధ్యయనులు) మొదలైనవన్నీ కూడా ప్రాణశక్తిలోనే ఏర్పడినవై ఉంటున్నాయి.<br>ప్రాణశక్తి తనదైనవాడే ప్రాణేశ్వరుడు (లేక) ముఖ్య ప్రాణము. ఓ ప్రాణేశ్వరా! ముఖ్యప్రాణమా! |
| **7. ప్రజాపతిః చరసి గర్భే**<br>**త్వమేవ ('త్వమ్' ఏవ) ప్రతిజాయసే (మరల జన్మిస్తావు)।**<br>**తుభ్యం, (హి) ప్రాణ -**<br>**ప్రజాస్తి ఇమాః 'బలిం' హరంతి (తెస్తారు)**<br>**యః ప్రాణైః ప్రతితిష్ఠసి॥** | నీవే ప్రజాపతివై సమస్త గర్భములయందు సంచారములు చేస్తూ మరల - మరల జనిస్తున్నావు. ఓ ప్రాణదేవా! ఈ సర్వదేహాలలో ఇంద్రియాలతో నివసిస్తూ ఉన్న నీకు ఈ జీవులంతా (శబ్ద-స్పర్శ-రూప-రస-గంధానుభవాలు అనబడే) కానుకలను (అనుక్షణం) బలి సమర్పణ (Presenting, Gifting) చేస్తున్నారు. |
| **8. దేవానామ్ అసి వహ్ని తమః।**<br>**పితృణాం ప్రథమా స్వధా।**<br>**ఋషీణాం చరితం**<br>**సత్యం అథర్వ అంగీరసామ్ అసి॥** | ఓ ప్రాణదేవా! మీరు దేవతలకు కూడా హవిస్సును చేరవేసే వహ్నిదేవులు. శ్రేష్ఠ దేవాదిదేవులు.<br>- అట్లాగే పితృ దేవతలకు 'స్వధా' రూపమగు పిండాహారము జేరవేయు అగ్నిదేవత మీరే।<br>-ఋషుల యొక్క ముఖ్య సాధన - సాధ్య వస్తువు కూడా మీరే.<br>(అంగీరసుడు మొ॥న మహర్షుల సత్యామార్గము, పరాకాష్ఠ ఆశయము - కూడా మీరే।) |

| | |
|---|---|
| **9. ఇంద్రః త్వమ్, ప్రాణ తేజసా।**<br>**రుద్రో అసి, పరిరక్షితా।**<br>**త్వమ్ అంతరిక్షే చరసి సూర్యః।**<br>**త్వమ్, జ్యోతిషాం పతిః॥** | ఓ ప్రాణ భగవాన్! ప్రాణశక్తిమంతుడగు ప్రాణ దేవతా!<br>త్రిలోకనాధుడగు ఇంద్రునికి కూడా తేజోరూప - రుద్రుడవైనట్టి పరిరక్షకుడవు. ఇంద్రుడవు, రుద్రుడవు కూడా నీవే.<br>ఆకాశంలో సంచరించే సూర్యుడవు నీవు. జ్యోతులకే జ్యోతి స్వరూపుడవు. |
| **10. యదా (ఎప్పుడైతే) త్వమ్ అభివర్షసి**<br>**అథ (అప్పుడు) ఇమాః ప్రాణ తే ప్రజాః।**<br>**ఆనందరూపా తిష్ఠంతి**<br>**కామాయాన్నం (కామా య అన్నం భవిష్యతి)-ఇతి॥** | ఓ ప్రాణశక్తి స్వరూపా!<br>మీరు అభివర్షించటం చేతనే సర్వజీవులు కోరుకొనే ఆహారం పొందిన వారగుచు, ఆనంద భరితులగుచున్నారయ్యా! మీరు జీవింపజేయటంచేతనే జీవులంతా జీవత్వము పొందువారై ఉంటున్నారు. |
| **11. వ్రాత్యః త్వమ్, ప్రాణ।**<br>**'ఏకఋషిః' అత్తా।**<br>**విశ్వస్య సత్పతిః।**<br>**వయమ్ ఆద్యస్య దాతారః**<br>**పితా త్వమ్ మాతరిశ్వనః॥** | ఓ ప్రాణచైతన్యమా!<br>నీవు వ్రాత్యుడవు. (సమిష్టిరూపుడవు). శుద్ధుడవు!<br>అధర్వణుల ప్రతిపాదితమైన 'ఏకఋషి' అనే పేరు గల అగ్ని స్వరూపుడవై సర్వమునకు భోక్తవు.<br>- ఈ విశ్వానికి గొప్ప ప్రభువువు!<br>- మేము మీకు నేయి (హవిస్సులను) సమర్పించుచూ, - మీకు చెందిన యజ్ఞోపాసకులము - అయి ఉంటున్నాము.<br>ఓ మాతారిశ్వా! వాయు దేవ స్వరూపా! మీరు మాకు తండ్రి! (God Father) |
| **12 యా తే తనుః, వాచి ప్రతిష్ఠితా,**<br>**యా శ్రోత్రే, యా చ చక్షుషి।**<br>**యా చ మనసి,**<br>**సంతతా శివాం తాం కురు**<br>**మా ఉత్క్రమీః। (మోత్క్రామీః)॥** | ప్రాణ భగవన్!<br>- ఏ మీ యొక్క తనువు (శరీరము) మా మాటలలోను, మా చెవులలోను, చక్షువులలోను, మనస్సులోను, ప్రతిష్ఠితమైయున్నదో, ఆ- మీ సామీప్యము మా మాటలను - చెవులను - మనస్సును పరమ పవిత్రముగా తీర్చిదిద్దునుగాక!<br>అంతేగాని, మీరు మమ్ములను విడచి ఎటూ వెళ్ళనే- వెళ్లకండి. మా వెంటనంటియే ఉండండి. |
| **13. ప్రాణస్య ఇదం వశే సర్వం**<br>**త్రిదివే యత్ ప్రతిష్ఠితమ్।**<br>**మాతా ఇవ పుత్రాన్ రక్షస్వ**<br>**శ్రీశ్చ ప్రజ్ఞాం చ**<br>**విధేహి నః ఇతి॥**<br><br>**<u>ఇతి ద్వితీయ ప్రశ్నః</u>** | హే ప్రాణతత్త్వమా!<br>ఈ మూడులోకములలో ఎక్కడెక్కడ ఏదేదైతే ప్రతిష్ఠితమై ఉన్నదో.. అదంతా కూడా ప్రాణదేవుడువగు మీవశములోనే ఉన్నది!<br>తల్లి బిడ్డను రక్షించునట్లు మమ్ములను రక్షించండి!<br><u>మాకు సంపద, మేధ ప్రసాదించండి!</u><br>- ఈ విధంగా ఆకాశ-వాయు- అగ్ని- అపః-పృథివీ, పంచజ్ఞాన-కర్మేంద్రియాలు అంతరంగ విభాగాలు లేచి నిలచుని ప్రాణదేవునికి స్తోత్రములు సమర్పించసాగాయి.<br>**అందుచేత ఓ భార్గవో వైదర్భీ! పంచభూత - దశేంద్రియ - మనో విశేషాలన్నీ శరీరములో దేవతలు. ప్రాణము ముఖ్య దేవత।**<br>**ఇతి ద్వితీయ ప్రశ్నః** |

## తృతీయః ప్రశ్నః (3వ ప్రశ్న)

## 3వ ప్రశ్న

| | |
|---|---|
| **1.** అథ హి ఏనం (అథహైనం)<br>కౌసల్యశ్చ అశ్వలాయనః పప్రచ్ఛ :-<br>భగవన్!<br>కుత (ఎక్కడి నుండి) ఏష ప్రాణో జాయతే?<br>కథమ్ (ఎట్లా) ఆయాత్ అస్మిన్ శరీరే?<br>ఆత్మానం వా ప్రవిభజ్య<br>కథం ప్రాతిష్ఠతే?<br>కేన ఉత్క్రమతే? కథం బాహ్యమ్ అభిధత్తే?<br>కథం అధ్యాత్మమ్? ఇతి॥ | **ఆ తరువాత అశ్వల పుత్రుడు అయినట్టి కౌసల్యుడు లేచి నిలుచుని, - నమస్కరించి-ఈ విధంగా పిప్పలద మహర్షిని సంప్రశ్నించారు :-**<br>హే భగవన్! పిప్పలాద మహర్షీ!<br>**ఈ ప్రాణశక్తితత్త్వము ఎక్కడి నుండి పుట్టుచున్నది?**<br>**ఈ సర్వ శరీరాలలోకి ఎట్లా ప్రవేశిస్తోంది (వస్తోంది)?**<br>తనను తానే సర్వరూపాలుగా (ఇంద్రియ - మనో రూపాలుగా) ఎట్లా విభజించుకొన్నదై ఉంటోంది? ఎవని ప్రమేయంగా శరీరాలలో ప్రవేశిస్తోంది?<br>తిరిగి ఎవని చేత దేహాల నుండి బయల్వెడలుతోంది? ఎట్లా వెలుపలినంతా భరిస్తోంది? అధి - దైవికమైన బాహ్య జ్ఞానాన్ని, ఆధ్యాత్మికమైన అంతర్ - జ్ఞానాన్ని ఎట్లా ధరిస్తోంది? దేహములను విడచినప్పుడు ఎక్కడికి వెళుతోంది? |
| **2.** తస్మై స హో వాచ :-<br>"అతిప్రశ్నాన్ పృచ్ఛసి।<br>బ్రహ్మిష్ఠో అసీతి।<br>తస్మాత్ తే అహం బ్రవీమి। (ఇతి॥) | **అందుకు మహర్షి చెప్పసాగారు.** చాలా గొప్ప ప్రశ్న వేస్తున్నావయ్యా! నీవు బ్రహ్మనిష్ఠుడవు కాబట్టే (ప్రాణతత్త్వము గురించి నేను చెప్పిన వివరాలను విచారణతో అధిగమించి) ఇట్లా ప్రశ్నించావు.<br>నాకు సంతోషము. అందుచేత నీకు సమాధానం చెప్పుచున్నాను. విను. |
| **3.** ఆత్మన ఏష ప్రాణో జాయతే।<br>యథైషా (యథా ఏషా) పురుషే ఛాయా।<br>ఏతస్మిన్ ఏతత్ ఆతతం<br>మనో కృతేన ఆయాత అస్మిన్ శరీరే॥ | **ప్రాణము 'ఆత్మ' నుండే** (From the Absolute "SELF") **జనిస్తోందయ్యా!**<br>సాయంకాలపు యండలో నడుస్తున్న బాటసారిని (పురుషుని) నీడ విస్తరించినదై ఉంటోంది చూచావా? ఆ విధంగా ఆత్మపై ప్రాణము విస్తరించినదై ఉంటోంది. అట్టి ప్రాణశక్తి ఈ దేహములోనికి మనస్సు యొక్క చర్యలు కారణంగా ప్రవేశించినదగుచున్నది. |
| **4.** యథా సమ్రాట్ ఏవ<br>అధికృతాన్ వినియుంక్తే ఏతాన్ గ్రామాన్।<br>ఏతాన్ గ్రామాన్ అధితిష్ఠ<br>స్వేత్యేవమ్ ఏవ ఏష ప్రాణః<br>ఇతరాన్ ప్రాణాన్ పృథక్<br>పృథక్ ఏవ సన్నిధత్తే॥ | ఏ విధంగా అయితే ఒక సామ్రాట్టు (చక్రవర్తి) కొందరు అధికారులను నియమించి, **"మీరు మీరు ఈ-ఆ గ్రామాలలో నివసించి, పరిపాలిస్తూ ఉండండి"** అని ఆజ్ఞాపిస్తాడో.., ఆ రీతిగా.., (ఆత్మ నుండి బయల్వెడలిన) ముఖ్య ప్రాణము తదితర అపాన - వ్యాన - ఉదాన - సమాన - సప్రాణములను వాటి వాటి పనులలో వినియోగిస్తోంది!<br>ఆత్మ ఎల్లపుడు ఏకమే। అట్లాగే ప్రాణము (శక్తి) సర్వదా ఏకమే అయి ఉండి అనేకమంతా సంప్రదర్శిస్తోంది. అందుచేతనే ఆత్మజ్ఞులకు-అనేకముగా ఇదంతా కనిపిస్తూ కూడా, 'ఏకమే'-అని అనిపిస్తూ ఉంటుంది. |
| **5.** పాయు- ఉపస్థే→ 'అపానం'।<br>చక్షుః - శ్రోత్రే - ముఖ - నాశికాభ్యాం → 'ప్రాణః'।<br>స్వయం ప్రాతిష్ఠతే మధ్యే తు → 'సమానః'।<br>ఏష హి ఏతత్ హుతమ్ అన్నం సమం నయతి।<br>- తస్మాత్ (దాని నుండి) ఏతాః<br>సప్తార్చిషో భవంతి॥ | (ఒక బాటసారిని నీడ ఆక్రమించుకొన్న రీతిగా ఆత్మను ఆవరించిన ముఖ్యప్రాణము యొక్క ఆదేశానుసారంగా)..<br>- అపానము ⇒ "పాయువు - ఉపస్థ" అనబడే విసర్జనేంద్రియాలలో ఉంటుంది.<br>- కళ్లు - చెవులు - ముఖము - ముక్కులలో స్వయముగా ముఖ్యప్రాణము ఉంటోంది. శరీర మధ్య భాగములో సమాన ప్రాణము ఉన్నదై జీవుడు స్వీకరించిన ఆహారమును ఆయా దేహభాగాలన్నిటికీ సరి సమానంగా పంచిపెడుతోంది. దాని నుండి ఏడు జ్వాలలు (ఏడు జ్ఞానేంద్రియాలు - కళ్ళు - చెవులు - ముక్కు రంధ్రాలు - నోరు) తేజము పొందుచున్నాయి. |

| | |
|---|---|
| **6. హృది హి ఏష ఆత్మా।<br>అత్ర ఏతత్ ఏకశతం నాడీనామ్।<br>తాసాం శతమ్, శతమ్-ఏకైకస్యాం (101)<br>ద్వాసప్తతిః - ద్వాసప్తతిః (72-72 చొప్పున)<br>ప్రతి శాఖానాడీ సహస్రాణి (72000) భవంతి।<br>ఆసు '<u>వ్యానః</u>' చరతి॥** | ఆత్మ హృదయప్రదేశమున ముఖ్యస్థానము కలిగినదై ఉంటోంది. అట్టి హృదయంలో 101 నాడులు - ప్రవేశము కలిగి ఉన్నాయి. (అందులో 100 నాడులు దేహమంతా విస్తరించి ఉన్నాయి. ఒక్కటి మాత్రం బ్రహ్మరంధ్రము ద్వారా ఊర్ధ్వంగా విస్తరించి ఉన్నది).<br>- అట్టి ప్రతి ఒక్కనాడికి నూరు-నూరు 72 → ప్రతిశాఖానాడీ సహస్రములై, (72000) చొప్పున అన్ని కలిపి 72000 నాడీ - ఉపనాడులు ఉంటాయి. వీటన్నిటిలో వ్యానప్రాణము సంచరించటం జరుగుతోంది. |
| **7. అథ ఏకయో ఊర్ధ్వ '<u>ఉదానః</u>'<br>పుణ్యేన పుణ్యం లోకం నయతి।<br>పాపేన పాపమ్।<br>ఉభాభ్యామ్ ఏవ మనుష్య లోకమ్॥** | ఇక ఉదాన ప్రాణము ఉన్నది కదా! అది ఒక నాడి ద్వారా ఉర్ధ్వంగా పుణ్యకర్మలచేత ఈ జీవుని పుణ్యలోకాలు చేరుస్తోంది. పాపకర్మల చేత ఈ జీవుని (ఆ ఉదానప్రాణము) పాపపు లోకాలు చేరుస్తోంది. రెండూ (పాప-పుణ్యాలూ) ఉంటే - మనుష్య లోకం జేరుస్తోంది. |
| **8. ఆదిత్యో హ వై బాహ్యః ప్రాణ ఉదయతి -<br>ఏష హి ఏనం<br>చాక్షుషం ప్రాణమ్ అనుగృహ్ణానః।<br>పృథివ్యాం యా దేవతా<br>సైసా (స ఏషా) పురుషస్య 'అపానం' అవష్టభ్యాం<br>అంతరా యత్ ఆకాశః,<br>స 'సమానో' వాయుః 'వ్యానః'॥** | ఆదిత్యుడే బహిః (బాహ్య) ప్రాణము. ఎందుకంటే ఆదిత్యుడే కళ్లలోని ముఖ్య ప్రాణాన్ని అనుగ్రహిస్తున్నారు. సూర్యకిరణములనుండి భూదేవత ఈ పురుషుని యొక్క అపానమును వశపరచుకొని జీవులకు ఆహారము అనుగ్రహిస్తోంది. **భూమి - ఆకాశముల అంతరాళంలో** సంచరించేది సమానవాయువు. సర్వత్రా సామాన్య రూపంగా ఉన్న వాయువు పేరు **'వ్యానవాయువు'**.<br>(ఈ విధంగా ఈ 'విశ్వము' అనే దేహమంతా పంచప్రాణములు సంచారములు కలిగియుండి, జీవశక్తిని, జీవనశక్తిని ప్రదీపింపజేస్తున్నాయి. ఇదే తతంగము దేహములో కూడా జరుగుతోంది). |
| **9. తేజో హ వా (నిజానికి) 'ఉదానమ్'<br>తస్మాత్ ఉపశాంత తేజాః।<br>పునః భవమ్ ఇంద్రియైః,<br>మనసి సంపద్యమానైః॥** | ఈ జీవులలో జీవిస్తూ ఉండగా కనిపిస్తున్న జీవ తేజస్సు ఉదాన ప్రాణరూపమే!<br>అందుచేతనే "ఉదాన ప్రాణ ప్రదర్శన" అయినట్టి తేజస్సు ఉపశమించి నప్పుడు ఆ జీవుడు (దేహి) ఇంద్రియార్థములతో సహా(శబ్ద స్పర్శ రూప రస గంధ భావనలతో సహా) ఆ దేహము వదలి, మరొక దేహరూపంగా పునర్జన్మ పొందు చున్నాడు. |
| **10. యత్ చిత్తః తేన ఏష<br>'ప్రాణమ్' ఆయాతి।<br>ప్రాణః తేజసా యుక్తః।<br>సహ ఆత్మనా యథా సంకల్పితం<br>లోకం నయతి॥** | ఈ పురుషుడు (జీవుడు) ఎట్టి ఇష్ట-ప్రియ-ఇచ్ఛా రూపమైనటువంటి చిత్తము కలిగి ఉంటాడో,.. ఆ చిత్తమును వెంట ప్రాణము కూడా వెంటనంటి, ఆయా కోరికలకు అనుకూలమగు దేహములో ప్రవేశము పొందుతోంది.<br>ప్రాణము ఉదాన ప్రాణరూపంగా తేజస్సుతో కూడుకొని, చిత్తానుసారము నూతన దేహమును ప్రవేశిస్తోంది. అనగా ప్రాణశక్తి ఆత్మను అనుసరిస్తూ సంకల్పానుసారంగా ఆయా లోకములు ప్రవేశిస్తోందయ్యా! పునర్జన్మ చిత్తానుసారమే ఉంటోంది! (అయితే, ఆత్మపట్ల లోకములు మొదలైనవి స్వకీయ కల్పనలు మాత్రమే!). |
| **11. య ఏవం విద్వాన్ ప్రాణం వేద,<br>నహి అస్య ప్రజాః హీయతే।<br>(స) అమృతో భవతి।<br>తత్ ఏష శ్లోకో భవతి॥** | ఏ విద్వాంసుడైతే ఈ రీతిగా ప్రాణము యొక్క సర్వత్వమును, చిత్తానుసార దేహప్రవేశమును, పంచభూతములను, మనో బుద్ధి చిత్త అహంకారాలను ఉద్దీపింపజేయునదిగాను,- తెలుసుకొని, ప్రాణోపాసనగా ఉపాసిస్తూ ఉంటాడో, ఆతని సంతతి (తదనంతర జన్మలు).. అల్పత్వము - క్షీణత్వము పొందవు. ఇది మహనీయులు ప్రవచిస్తున్న **"ప్రాణతత్త్వ గానము"**. |

12. ఉత్పత్తిం ఆయతిం స్థానం
విభుత్వం చ ఏవ పంచధా।
అధ్యాత్మం చ ఏవ ప్రాణస్య
విజ్ఞాయా అమృతమ్ అశ్నుతే॥
విజ్ఞాయా అమృతమ్ అశ్నుత –
ఇతి॥
<u>ఇతి తృతీయ ప్రశ్నః</u>

ఈ విధంగా ప్రాణతత్త్వము యొక్క →
- ఆత్మ నుండి ఆవిర్భావము,
- రాక (దేహప్రవేశము) - (ఆయతిమ్)
- స్థానము (Placemets) ,
- విభుత్వము (అంతటా వ్యాపించి బాహ్య-అభ్యంతరముల ప్రదర్శనమై ఉండటము (లేక, సప్రాణత్వము),
- 5 విభాగములుగా (ప్రాణ-అపాన-వ్యాన-ఉదాన-సమానములుగా) అగుచుండటము, తెలుసుకొని ఉంటాడో, -

**అట్టి అద్దాని అంతః ప్రకృతిని తెలుసుకొంటున్నవాడు ప్రజ్ఞావంతుడు. మృత్యువును జయించి అమరుడౌతాడు.** అవును! అమరుడే అగుచున్నాడు! కనుక, నిశ్చలమగు ఆత్మయొక్క శక్తి ప్రదర్శనమే - ప్రాణము.

---

## <u>చతుర్థః ప్రశ్నః (4వ ప్రశ్న)</u>

1. ఓం। <u>అథ హ ఏనం సౌర్యాయణీ</u>
<u>గార్గ్యః పప్రచ్ఛ:</u>
భగవన్! ఏ తస్మిన్ పురుషే
కాని (ఏవి) స్వపంతి?
కాని అస్మిన్ జాగ్రతి?
కతర ఏష దేవః స్వప్నాన్ పశ్యతి?
(కస్య) (ఎవరికి) ఏతత్ సుఖం భవతి?
కస్మిన్ను సర్వే సంప్రతిష్ఠితా
భవంతి? ఇతి॥

## <u>4వ ప్రశ్న</u>

**ఇకప్పుడు సూర్యుని మునిమునుమడు (సూర్యవంశజుడు), గర్గగోత్రుడు అయినట్టి సౌర్యాయణి - పిప్పలాదమహర్షికి తన పరిప్రశ్నను విన్నవించారు.**
**భగవన్! పిప్పలాద గురువర్యా!**
- ఈ శిరస్సు - కాళ్ళు - చేతులు మొ॥వి గల ఈ జీవుడు నిద్రిస్తుంటే ఏ ఏ ఇంద్రియములు నిద్రిస్తున్నాయి?
- ఏఏ ఇంద్రియములు మేల్కొనియే ఉంటున్నాయి?
- ఈ జీవుడు నిదురిస్తూ ఉండగా, అప్పుడు కూడా ఉండి, ఏ దేవత స్వపానుభవమును, స్వప్నానుభూతిని ఆస్వాదిస్తోంది? (స్వప్నం చూచే దేవత ఎవరు?)
- స్వప్నానుభవము ఎవరి కల్పన? ఆ స్వప్నానుభూతి యొక్క సుఖమును పొందుచున్నదెవ్వరు? ఎవరికి?
- దేనిపై (కస్మిన్ను) స్వప్న - స్వప్నాంతర్గత విశేషాలన్నీ ఆధారపడినవై ఉంటున్నాయి?

---

2. <u>తస్మై స హోవాచ:</u>
యథా, గార్గ్య! మరీచయో (కిరణాలు)
అర్కస్య – అస్తం గచ్ఛతః (అస్తమించే) సర్వా,
ఏ తస్మిన్ తేజో మండల ఏకీ భవంతి..,
తాః పునః పునరుదయతః ప్రచరంతి..।
→ ఏవం హవై (అదేరీతిగా) తత్ సర్వం
పరే దేవే మనస్య → ఏకీ భవతి॥

**<u>అప్పుడు సద్గురువు యొక్క సమాధానం :</u>**

ఓ గార్గ్యా! వినండి!

సూర్యుడు రోజు అస్తమించటం చూస్తూ ఉంటాము కదా! అట్లా అస్తమిస్తున్నప్పుడు అంతదాకా ప్రసరిస్తున్న సూర్యకిరణాలు ఏమౌతున్నాయి? వస్తువును అంటిబెట్టుకొని ఉంటున్నాయా? లేదు.

సూర్యతేజోమండలముతో ఏకీభూతమగుచున్నాయి. మరల సూర్యోదయం అయినప్పుడు? తిరిగి సూర్యకిరణాలు ప్రసరిత మౌతున్నాయి!

అదేవిధంగా దివ్య-దేవతా స్వరూపములగు ఇంద్రియానుభవములన్నీ కూడా నిద్రపోయినవాని మనస్సుతో ఏకీభూతమౌతున్నాయి.

---

తేన తర్హి (అప్పుడు) ఏష పురుషో..
– న శృణోతి। న పశ్యతి। న జిఘ్రతి।
– న రసయతే। న స్పృశతే। న అభివదతే।
నాఽఽదత్తే। న ఆనందయతే। న విసృజతే।
నేయ ఆయతే। (నేయాయతే)।
(తదా) స్వపితి (నిద్రిస్తున్నాడు) –
ఇతి ఆచక్షతే ॥

**ఆ విధంగా అప్పుడు (తర్హి) గాఢనిద్రలో ప్రవేశించిన ఈ పురుషుడు →**

ఇక ఇంద్రియములతో ఏదీ వినడు. చూడడు. వాసన ఆస్వాదించడు. రుచి చూడడు. స్పర్శ అనుభవించడు. మాటలాడడు. ఏదీ స్వీకరించడు. ఆనందించడు. విసర్జించడు. కదలడు. అవన్నీ ఆత్మస్వరూపుడగు జీవుని మనస్సుతో అస్తమించిన సూర్యుని సూర్యకిరణాల వలె ఏకీభూతమౌతాయి.

(ఇతి) అని విజ్ఞులు సుస్పష్టపరుస్తూ.. **ఆచక్షతే।** చెప్పుచున్నారు.)

| | |
|---|---|
| **3. ప్రాణాగ్నయ ఏవై తస్మిన్ పురే జాగ్రతి!** | (గాఢ నిద్రా పరవశుని ఇంద్రియానుభవములన్నీ మనస్సుతోను, మనస్సు ఆత్మయొక్క నిర్విషయత్వముతోను ఏకీభూతమగుచుండగా) ప్రాణాగ్నులు మాత్రము ఆ శరీరపురంలో మేలుకొనియే ఉంటున్నాయి. |
| **గార్హపత్యో హ వా ఏషో 'అపానో'।**<br>**'వ్యానో' అన్వాహార్య పచనో।**<br>**యత్ గార్హపత్యాత్ ప్రణీయతే,**<br>**ప్రణయానాద (తీసుకోబడినటువంటి)**<br>**ఆహవనీయః "ప్రాణః"॥** | (1) గార్హ పత్యాగ్ని - అపాన ప్రాణము (Out going Air Push)<br>(2) అన్వాహార్యాగ్ని - వ్యానము<br>(3) అన్వాహార్య పచనాగ్ని → ప్రాణము<br>**గార్హపత్యాగ్ని నుండి ప్రాణశక్తి తీసుకొని రాబడుచూ ఉండటం చేత.. ఆ సందర్భంలోని ప్రాణసంచాలనము - 'ఆవహనీయాగ్ని' అని పిలువబడుతోంది!** |
| **4. యత్ ఉచ్ఛ్వాస - నిఃశ్వాసౌ ఏతాః ఆహుతీ (ఏతావాహుతీ)**<br>**సమం నయతి ఇతి స "సమానః"।**<br>**మనో హవావ, "యజమాన"।**<br>**ఇష్టఫలమ్ ఏవ 'ఉదానః'।**<br>**స ఏనం యజమానమ్-**<br>**అహరహమ్ బ్రహ్మ గమయతి॥** | నిద్రపోవువానిలో ఉచ్ఛ్వాసనిః శ్వాసలు అనే రెండు ఆహుతులను శరీరమంతా ప్రాణశక్తి తీసుకుపోతూ ఉండటం చేత **"సమాన ప్రాణము"**.. అని అంటారు. (ఆ సమానమే 'హోత' - అనే బుత్త్విక్కు).<br>అయితే, ఈ సమస్త దృశ్యానుభవ వ్యవహారానికంతటికీ యజమాని ఎవ్వరూ అంటే,.. "మనస్సే". నిద్రలో మనస్సును ప్రాణశక్తి బ్రహ్మమునకు చేరుస్తూ ఉంటుంది.<br>(మనస్సు మౌనము వహించుటచేతనే - ఈ పురుషుడు **"హాయిగా నిద్రపోయాను"** అని అంటాడు). అలా బ్రహ్మమును జేర్చే ప్రాణశక్తియే 'ఉదానము' అని పిలువబడుతోంది. అందుచేత గాఢ నిద్రప్పుడు బ్రహ్మముతో మమేకానుభవానికి **(1) ఉదాన ప్రాణము- వార్తాహరుడు. (2) జీవుడు యజమాని!** |
| **5. అత్ర ఏష దేవః స్వప్నే**<br>**మహిమానమ్ అనుభవతి!**<br>**- యత్ దృష్టం దృష్టమ్ అనుపశ్యతి;**<br>**శృతమ్ శృతమేవ అర్థమ్ అనుశృణోతి;**<br>**దేశ దిక్ - అంతరైశ్చ ప్రత్యనుభూతం**<br>**పునః పునః ప్రత్యనుభవతి।** | (జాగ్రత్‌లో బాహ్య దృశ్యము యొక్క **'మహిమ'** ద్రష్టకు అనుభవమౌతోంది)<br>అయితే, నిద్రించిన ఈ జీవుడు స్వప్న దృశ్య రూపంగా తన యొక్క "మహిమ"నే తాను అనుభూతముగా పొందుచున్నాడు. జాగ్రత్ అవస్థలో నేత్రేంద్రియముతో ఏదిచూచాడో.. అట్టి రీతిగానే స్వప్నములో కూడా చూస్తూ ఉన్నాడు. కానీ ఆ దర్శనము భౌతికమైన కళ్లతో కాదు.<br>- జాగ్రత్‌లో విన్నవే మరల వినుటకై కల్పించుకొని వింటున్నాడు. (కానీ బాహ్యమైన చెవులతో కాదు).<br>- దేశము - దిక్కులు మొ॥వి ఇతః పూర్వము అనుభవించినవే మరల - మరల అనుభవిస్తున్నాడు. |
| **దృష్టం చ- అదృష్టం చ, శ్రుతం చ - అశ్రుతం చ-**<br>**అనుభూతం చ- అననుభూతం చ,**<br>**సత్ చ - అసత్ చ సర్వం పశ్యతి। సర్వః పశ్యతి॥** | - ఈ జన్మలో చూచినవి-చూడనివి, విన్నవి-విననివి, అనుభూతము అయి ఉన్నవి-అనుభూతము అయి ఉండనివి, సత్యమైనవి- యండమావులవలె అసత్యమైనవి.. అన్నిటినీ చూస్తున్నాడు. అన్నీ అనుభవముగా పొందుచున్నాడు. 'నిజమే' అని అప్పటికి భావన చేస్తున్నాడు. |
| **6. స యదా 'తేజసా' అభిభూతో భవతి**<br>**అత్ర ఏష దేవః.., స్వప్నాన్ న పశ్యతి।**<br>**అథ తదై తస్మిన్ శరీర**<br>**ఏతత్ సుఖం భవతి॥** | ఎప్పుడు ఈ పురుషుడు (జీవుడు) ఆత్మ-తేజస్సు చేత ఆచ్ఛాదితుడు అవుతాడో.. అప్పుడిక స్వప్న దర్శనమంతా విరమించి వేస్తున్నాడు. అప్పుడు ఈ శరీరము నందు తాను (విషయరాహిత్య కారణంగా పరమాత్మతో జీవాత్మకు ఏర్పడిన సంబంధం చేత)-**ఆత్మతో ఏకమగు సుఖము** పొందుచున్నాడు. ఇదియే సుషుప్తి అనుభవము. సుషుప్తి సుఖము. |
| **7. స యథా, సోమ్య!**<br>**వయాంసి వాసో వృక్షం**<br>**సంప్రతిష్ఠంతే,**<br>**ఏవం హవై తత్ సర్వం**<br>**'పర ఆత్మని' - సంప్రతిష్ఠతే॥** | బిడ్డా! నాయనా! సోమ్యా! ప్రియదర్శనా! స్ఫురద్రూపీ!<br>పక్షులు అక్కడ - ఇక్కడ తిరిగి తిరిగి, సాయం సంధ్యాసమయంలో తాము గూడుకట్టుకొన్న వృక్షముపైకి వచ్చి ప్రశాంతపడతాయి చూచావా?.. ఆ రీతిగా, తన మనస్సు - కర్మేంద్రియాలతో, జ్ఞానేంద్రియములతో (దృశ్య) విషయములను జాగ్రత్ -స్వప్నాలలో ఆస్వాదించిన పురుషుడు- గాఢనిద్రా సమయానికి పరమాత్మను సమీపించి, పరత్వమును (Beyondness) పొందినవాడగు చున్నాడు. |

→ ఆత్మ నుండి పురుషుడు, పురుషకారము

→ పురుషుని నుండి శబ్ద స్పర్శ రూప రసగంధములనబడే పంచతన్మాత్రలు. మాత్రలు బయల్వెడలుచూ జాగ్రత్ - స్వప్న అనుభవ రూపముగా అనుభూతమౌచున్నాయి.

సుషుప్తిలోనో.. - ఈ దృశ్య విశ్వసంబంధమైన పంచతన్మాత్రానుభవమంతా తిరిగి పురుషునిలోనే లయమౌతోంది.

- పక్షులు గూడు విడచి బయలుదేరి తిరిగి గూటికి చేరుచున్నట్లుగా.. అనుభవాలన్నీ సుషుప్తిలో లీనమై మౌనం వహిస్తున్నాయి.

---

**8. పృథివీ చ – పృథివీ మాత్రా చ।**
**ఆపశ్చ – ఆపో మాత్రా చ।**
**తేజశ్చ – తేజో మాత్రా చ।**
**వాయుశ్చ – వాయు మాత్రా చ।**
**ఆకాశశ్చ – ఆకాశ మాత్రా చ।**
**చక్షుశ్చ – ద్రష్టవ్యం చ।**
**శ్రోత్రం చ – శ్రోత్రవ్యం చ।**
**ఘ్రాణం చ – ఘ్రాతవ్యం చ।**
**రసశ్చ – రసయితవ్యం చ।**
**త్వక్ చ – స్పర్శయితవ్యం చ।**
**'వాక్' చ– వక్తవ్యం చ।**
**హస్తౌ చ – ఆదాతవ్యం చ।**
**ఉపస్థశ్చ – ఆనందయితవ్యం చ।**
**పాయుశ్చ – విసర్జయితవ్యం చ।**
**పాదౌ చ – గన్తవ్యం చ ।**
**మనశ్చ – మంతవ్యం చ।**
**బుద్ధిశ్చ – బోద్ధవ్యం చ।**
**అహంకారశ్చ – అహం కర్తవ్యం చ।**
**చిత్తం చ – చేతయితవ్యం చ।**
**తేజశ్చ – విద్యోతయితవ్యం చ।**
**ప్రాణశ్చ – విధారయితవ్యం చ॥**

జాగ్రత్ అనుభవము లైనట్టి
పృథివి - పృథివీ తన్మాత్ర, (ఇంద్రియానుభవము),
జలము - జలతన్మాత్ర,
వాయువు - ఆకాశ తన్మాత్ర,
కళ్ళు - చూచు కార్యక్రమం (తన్మాత్ర),
నోరు - రుచిచూచే క్రియాక్రమం (తన్మాత్ర),
చర్మము - స్పర్శ,
వాక్ - చెప్పడం,
చేతులు - తీసుకోబడటం,
జననేంద్రియం - ఆనందించటం ,
పాయువు - విసర్జించటం,
మనస్సు - ఆలోచించటం,
బుద్ధి- తెలుసుకోవటం,
అహంకారము - 'నేనే కర్తను' అనుకోవటం,
చిత్తము - జ్ఞాపకం పెట్టుకోవటం, ఇష్టం,
తేజస్సు - విషయములను ప్రకాశింపజేయటము,
ప్రాణములు - దేహ భావధారణ,
ఇవన్నీ పురుషునిలో ప్రవేశించి మౌనం వహిస్తున్నాయి. ఆ పురుషుడు తన సహజ / నిజ రూపమగు **పరమ పురుషునిలో** లీనమై ఉంటున్నాడు.

---

**9.** ఏష హి→ ద్రష్టా; స్ప్రష్టా;
శ్రోతా; ఘ్రాతా; రసయితా;
మంతా; బోద్ధా; కర్తా;
విజ్ఞానాత్మా పురుషః।
స పరే – అక్షరే
ఆత్మని సంప్రతిష్ఠతే॥

ఏ పురుషునిలో పంచభూత తన్మాత్రలు, కర్మేంద్రియ - జ్ఞానేంద్రియాలు ఇవన్నీ తన తమ చర్యలు - సంచారాలు త్యజించి (చెట్టుకు చేరిన పక్షుల వలె) దాగి ఉంటున్నాయో.. ఆ పురుషుడే..,

❊ ద్రష్ట శ్రోత ఘ్రాత (వాసనచూచు) (స్పర్శానుభవము పొందు) స్రష్ట

❊ రుచిచూచువాడు. ఆలోచనచేయువాడు.

❊ తెలుసుకొనువాడు. 'నేను కర్తను' (అహంకర్తా) అని భావించువాడు.

ఆతడే విజ్ఞాన స్వరూపపుడగు పురుషుడు (జీవాత్మ). ఆతడే పరమ పురుషుడు. పరమాత్మ కూడా ఆతడే. **అంతటికీ ఆవల అక్షరుడై ఉంటున్న వాడు.** ఇంద్రియ విషయాలు పురుషునిలోను, పురుషుడు పరమ పురుషునిలోను ప్రతిష్ఠితమై ఉంటున్నాయి. (జ్ఞాని జాగ్రత్‌లో కూడా అట్లే ప్రదర్శిస్తున్నాడు). సముద్రజలంలో తరంగాలవలె క్షరరూపమైనదంతా అక్షరరూపునియందు బయల్వెడలి, ప్రవర్తించి తిరిగి **ఆతని అక్షరమునందే లయమగుచున్నది.**

**10. 'పరమ్' ఏవ అక్షరమ్ ప్రతిపద్యతే,**
**స యో హ వై**
**తత్ అచ్ఛాయ మ శరీరం,**
**అలోహితం, శుభ్రమ్,**
**అక్షరమ్ – వేదయతే..,**
**యస్తు, సోమ్య!**
**స సర్వజ్ఞః సర్వో భవతి॥ –**
**తత్ ఏష శ్లోకః॥**

భౌతిక దేహానికికైతే ఛాయ ఉండవచ్చు గాక! ఆత్మదేహము ఛాయారహితము,
- ఎవ్వరైతే ఆ ఛాయా రహితము, రంగు, రూపు లేనట్టిది, స్వచ్ఛము, అక్షరము అగు (పురుషుడు - జీవుడు స్థానముగా గల) తన యొక్క "పరమ పురుష స్థానమును" - **వేదయితే** → తెలుసుకుంటాడో,
ఆతని **"పరము - అక్షరము"** అగు తన యొక్క **"సహజ స్వరూపము"**ను జాగ్రత్ స్వప్న సుషుప్తి సందర్భములలోను, దేహ దేహానంతర సందర్భములలోను సర్వదా **'స్వానుభవుడు'** అగుచున్నాడో-
ఆతడే అంతా తెలుసుకొనియున్నవాడు.
ఓ సోమ్యా! ప్రియమైన గుణములు కలవాడా!
అట్టి పరతత్త్వమును ఎరిగిన వాడు సర్వజ్ఞుడై - సర్వమును తానే అవుతాడు. (I am all this - అను రూపమగు) **ఏకత్వాసను విడువక ఆస్వాదిస్తూ** ఉంటాడు.

---

**11. విజ్ఞానాత్మా సహ దేవైశ్చ సర్వైః**
**ప్రాణా – భూతాని సంప్రతిష్ఠంతి యత్ర,**
**తత్ 'అక్షరమ్' వేదయతే**
**యస్తు, సోమ్య!**
**స సర్వజ్ఞః సర్వమేవా అవివేశ॥**
**॥ఇతి॥**

ఈ ఈ విజ్ఞానాత్మ (బుద్ధి), సర్వ(జ్ఞానేంద్రియ - కర్మేంద్రియ) దేవతలు, పంచప్రాణాలు - పంచభూతాలు - దేనిలో స్థానము కలిగియున్నాయో, (దేనిలోంచి బయల్వెడలి తిరిగి గాఢ నిద్రా సమయంలో ఉపశమిస్తున్నాయో, జాగ్రత్ సందర్భంలో దేనిలో ప్రవర్తిస్తున్నాయో), -అట్టి

| స్వస్వభావమగు అక్షరతత్త్వాన్ని తెలుసుకొన్నవాడు సర్వము తెలుసుకొన్నవాడగుచున్నాడు. సర్వజ్ఞుడై ఉంటున్నాడు. సర్వమునందు తానే ప్రవేశించి ఉన్నవాడుగా, తనయందే ఈ సర్వముగా దర్శించుచున్నాడు. (ఆత్మజ్ఞుడు - ఆత్మానందుడు అగుచున్నాడు!) |
|---|

ఆత్మయే నిత్య జాగృతము. తదితరమైనదంతా ఆత్మయొక్క కల్పిత విన్యాసము.

---

## పంచమః ప్రశ్నః (5వ ప్రశ్న)

## 5వ ప్రశ్న

**1. ఓం॥ అథ హి ఏనం శైబ్యః సత్యకామః**
**పప్రచ్ఛ: –**
**"స యో హ వై, తత్, భగవన్!**
**మనుష్యేషు ప్రాయణాంతమ్**
**'ఓం' కారమ్ అభిధ్యాయత..,**
**కతమం (ఏ యొక్క) వావ**
**స తేన లోకం జయతి?"**
**ఇతి॥**

| అప్పుడు శిబికుమారుడైన సత్యకాముడు నిలబడి, గురునమస్కారము చేసి,- తన యొక్క ప్రశ్నను పిప్పలాద మహర్షికి ఇట్లా విన్నవించుకున్నారు : |
|---|

స్వామీ! భగవన్! ఏ మానవుడైతే ప్రయాణాంతము (మరణము) వరకు 'ఓం'కారమును ధ్యానిస్తూ - ఉపాసిస్తూ ఉంటాడో.., అట్టి అభిధ్యానము చేత ఆతనిచే ఏ-ఏ లోకములు జయించబడతాయి? (స్థితి-గతిగా) ఏ ఏ లోకములు సిద్ధించగలవు?

---

**2. తస్మై స హో వాచ:**
**ఏతత్ వై, సత్యకామ!**
**పరం చ; అపరం చ→బ్రహ్మ,**
**యత్ 'ఓం' కారః॥**
**తస్మాత్ విద్వాన్ ఏతేనైవ ఆయతనేన**
**ఏకతరమ్ అన్వేతి॥**

**అందుకు శ్రీ పిప్పలాద మహర్షి ఇట్లా సమాధానం ప్రసాదిస్తున్నారు :**
ఓ సత్యకామా! వినండి!
'ఓం'కారమునకు ఇరు పార్శ్వములందు పర - అపరములు ఉన్నాయి.

**పరము – ఓం → అపరము**

అందుచేత 'ఓం'కార తత్త్వోపాసకుడు ఈ పర- అపర బ్రహ్మములలో మొదటి దానిని అందుకుంటూ ఉంటున్నాడు.
రెండవదానిని అధిగమించివేసి, **'పరము'**నందు అపరమును **'ఏకము'** చేసివేయుచున్నాడు. (పర-అపర భేదములను ఓంకారమునందు ఏకము చేసివేయుచునాడు).

3. స యత్ ఏకమాత్రమ్ అభిధ్యాయీత।
స తేనైవ (తేన ఏవ) సంవేదితః తూర్ణం (త్వరగా/వడిగా) ఏవ
–జగత్యామ్ అభిసంపద్యతే।
తమ్ 'ఋచో' మనుష్యలోకమ్ ఉపనయంతే।
స తత్ర తపసా – బ్రహ్మచర్యేణ
శ్రద్ధయా సంపన్నో మహిమానమ్ అనుభవతి॥

**(1) అ-ఉ-మ లలో ఒక్క → (అ) మాత్ర-ఉపాసనకుడు:**
ఆతడు ఒకవేళ్ళ 'అ'కారరూపమగు ఒక మాత్రను మాత్రమే (God as Third person) ఓంకారముగా ధ్యానిస్తూ ఉంటే.. దాని చేతనే ఆతడు సిద్ధిని పొందినవాడై.. ఆ సిద్ధి స్థానము నుండి తిరిగి త్వరగా, (తూర్ణం ఏవ) - రావటం జరుగుతోంది. ఋక్కులు ఆతనిని మనుష్య లోకానికి తీసుకుపోతున్నాయి. ఆతడు అక్కడ తపస్సు- బ్రహ్మచర్యము శ్రద్ధగా నిర్వర్తించినవాడై బ్రహ్మతత్త్వానుభవుడగు చున్నాడు.

---

4. అథ యది ద్విమాత్రేణ
మనసి సంపద్యతే..,
సో అంతరిక్షమ్ 'యజుర్భిః'
ఉన్నీయతే→ "సోమలోకమ్"।
స సోమలోకే విభూతిమ్ అనుభూయ
→ పునరావర్తతే॥

**(2) అ-ఉమలలో ద్వి-'మాత్ర' ఉపాసకుడు:** ఒకవేళ్ళ ఆ ఓంకార ధ్యాత "అ" "ఉ" (పరమాత్మ+ప్రకృతి) అనబడే ద్విమాత్రలను మాత్రమే ఓంకార రూపంగా లేక (ఆత్మ+మనస్సు= పరమాత్మ)గా ధ్యానం చేస్తూ ఉంటే, అది ద్విమాత్ర ధ్యానం (Two out of three) అవుతుంది. అట్టివాడు మరణానంతరము మనస్సుతో ఏకత్వము పొంది యజుస్సుల ద్వారా (ఉపాసనాస్వభావంచే) ఆకాశంలో చంద్రలోకానికి పోయి, ఆ వైభవాన్నంతా అనుభవంగా పొంది తిరిగి మరెప్పుడో మానవ లోకానికి (పునరావృత్తిగా) వస్తున్నాడు.

---

5. యః పునః ఏతం త్రిమాత్రేణ
['ఓం' = (అ+ఉ+మ)] ఇతి ఏతేనైవ
అక్షరేణ "పరం పురుషమ్" అభిద్యాయీత।
స తేజసి సూర్యే సంపన్నః।

**(3) అ-ఉ-మ ల త్రి 'మాత్ర' - ఉపాసకుడు:** ఏ ఓంకారోపాసకుడైతే ఓం యొక్క త్రిమాత్ర రూపంగా (పరమాత్మ+ ప్రకృతి + జీవాత్మ = ఓం - అని భావనతో- **సర్వమ్ ఓంకారమే** - అనే అవగాహనతో) ఓం తత్త్వాన్ని ఉపాసిస్తాడో,... తద్వారా "**అక్షర - సర్వస్వరూప**" పరమాత్మను ధ్యానిస్తూ ఉంటాడో, అట్టివాడు **సూర్య తేజస్సుతో ఏకత్వం పొందుచున్నాడు.**

---

యథా పాదోదరః (పాము) త్వచా (చర్మము)
వినిర్ముచ్యతే, ఏవం హ వై →
→ స పాప్మనా వినిర్ముక్తః।
స 'సామభిః' ఉన్నీయతే, బ్రహ్మలోకమ్।
స ఏతస్మాత్ జీవఘనాత్ పరాత్పరమ్
పురిశయం పురుషమ్ ఈక్షతే॥
తత్ ఏతౌ శ్లోకౌ భవతః–॥

పాము ఏ రీతిగా కుబుసము విడచి హాయిగా ఉంటుందో ఆ విధంగా ఆతడు పాప - అల్ప దృష్టులన్నిటి నుండీ విముక్తుడగు చున్నాడు. అట్టివాడు సామగానాలచేత (బ్రహ్మలోకమునకు తీసుకొని వెళ్ళబడుచున్నాడు. అట్టి హిరణ్యగర్భ స్థానము నుండి ఆతడు - పురిశయం - హృదయస్థుడైనట్టి పరమపురుషుని (పురుషోత్తముని) దర్శిస్తున్నాడు. ఆతని ద్విశ్లోక గానములుగా ఇహ-పరరూపములు అగుచున్నాయి! (జీవాత్మ-పరమాత్మల ఉభయము ఏకరూపమగుచున్నాయి).

---

6. తిస్రో మాత్రా మృత్యుమత్యః
ప్రయుక్తా అన్యోన్య సక్తా, అన విప్రయుక్తాః।
క్రియాసు బాహ్య–అభ్యంతర – మధ్యమాసు
సమ్యక్ ప్రయుక్తాసు
న కంపతే జ్ఞః (జ్ఞాని కంపించదు)॥

'అ-ఉ-మ' మాత్రలను దేనికదే వేరువేరుగా ఉపాసించబడితే (అవి వేరువేరుగా భావించబడితే) అప్పుడు ఆసాధకుడు మృత్యువును అధిగమించడు. అట్టివాడు మృత్యుపరిధిలోనే ఉండిపోతాడు. (ద్రష్ట-దర్శన-దృశ్యముల ఏకత్వోపాసకుడు 'అమృతుడు' కాగలడు).

ఆ మూడిటిని బాహ్య - అభ్యంత-మధ్యస్థానములను ఏకంగా చేస్తూ, శాస్త్రాలు సూచించే కర్మలు నిర్వర్తిస్తూ ఉంటే, ఆతడు జ్ఞాని కాగలడు. ఇక ఈ దృశ్యమునకు, జన్మ-కర్మలకు సంబంధించిన కంపన (Shaking) ఆతనికుండదు.

---

7. ఋక్ భిః→ ఏతం।
యజుర్భిః→ అంతరిక్షమ్।
స సామభిః →యత్ కవయో వేదయంతే।
తమ్ 'ఓం' కారేణ ఏవ ఆయతనేన అన్వేతి విద్వాన్।
యత్ తత్ చ అన్తమ్ అజరమ్–అమృతమ్–
అభయం పరం చ॥ ఇతి॥

మొదటి మాత్రయగు 'అ' ఋక్‌చే - మరల భౌతికత్వం పొందుచున్నాడు

ద్విమాత్ర యగు 'అ' + 'ఉ' 'యజుర్' చేత-అంతరిక్షాన్ని పొంది సూక్ష్మదేహధారియై, చంద్రలోకం ఆస్వాదిస్తున్నాడు.

త్రిమాత్రారూపమగు అ+ఉ+మ = 'ఓంకార - సామతత్త్వాన్ని ఎరిగినవాడు **"ఇహ - పరములకు ఆవల ఉన్నట్టి జరామరణ రహితము, అమృత స్వరూపము, అభయము"**- అగు స్థానము సముపార్జించుకుంటున్నాడు.

## షష్ఠః ప్రశ్నః (ఆరవ ప్రశ్న)

## ఆరవ ప్రశ్న

అప్పుడు భరద్వాజస గోత్రుడైన సుకేశుడు లేచి నిలుచుని పిప్పలాద మహర్షికి నమస్కరించి, - తన ప్రశ్నను ఈ విధంగా విన్నవించుకున్నారు.

**1.** అథ హి ఏనం సుకేశా భరద్వాజః
పప్రచ్ఛ:-
"భగవన్! హిరణ్యనాభః కౌసల్యో
రాజపుత్రో మామ్ ఉపేత్య, ఏతం ప్రశ్నమ్
అపృచ్ఛత।-
'షోడశకలం, భరద్వాజ!
పురుషం వేత్థ (ఎరుగుదువా)"?
తమ్ అహమ్ కుమారమ్ అబ్రువం
-'న అహమ్ ఇమం వేద।
యది అహమ్ ఇమమ్ అవేదిషం-కథం తే
నావక్ష(మ్) (న అవక్ష్యమ్)? - ఇతి।
సమూలో వా ఏష పరిశుష్యతి,
యో అనృతమ్ అభివదతి!
తస్మాత్ న అర్హామి అనృతం వక్తుమ్!
స తూష్ణీం రథమ్ ఆరుహ్య, ప్రవవ్రాజ (వెళ్లిపోయాడు)।
తమ్ త్వా పృచ్ఛామి - క్వాసౌ పురుష? ఇతి॥

"హే భగవాన్! దేవా! పిప్పలాద మహాశయా! **ఈ మధ్య ఒక సంఘటన జరిగింది.**

కోసల దేశానికి చెందిన హిరణ్యాభ రాజపుత్రుడు ఒక సందర్భంలో మా ఆశ్రమానికి స్నేహ పూర్వకంగా వచ్చినప్పుడు ఒక సందేహము వెలిబుచ్చారు. **'షోడశకళల** (16 Arts) **పురుషుడిని నీవు ఎరుగుదువా; భరధ్వాజా?'** అని.

అప్పుడు నేను అన్నానుగదా, - **"నాకు అది తెలియదు. ఒకవేళ నేను తెలుసుకుని ఉన్నట్లయితే నీకు చెప్పనూ? తప్పక చెప్పుతానులే! ఎవడు అసత్యము (తెలియనిది తెలుసునని) చెప్పుతాడో - అట్టివాడు సమూలంగా ఎండిపోతాడు కదా! అందుచే అబద్ధం చెప్పటం నావల్ల కాదు!".**

అప్పుడు ఆ రాజకుమారుడు (ఈ మాత్రం తెలియదా?-అన్నట్లుగా) తూష్ణీభావంతో నన్ను చూస్తూ రథం ఎక్కి వెళ్లిపోయాడు.

అదే మిమ్మలను అడుగుచున్నాను. ఎవరా షోడశ కళా పురుషుడెవ్వడు? ఏమా షోడశకళలు?

---

**2.** తస్మై సహో వాచ:
ఇహైవ (ఇహ ఏవ)-అంతః శరీరే,
సోమ్య! స పురుషో యస్మిన్ను
ఏతాః షోడశకలాః ప్రభవంతి। ఇతి॥

**అప్పుడు పిప్పలాదమహర్షి చెప్పసాగారు.** ఓ సద్గుణుడా! సోమ్యుడా! ఆ షోడశ కళాన్వితుడు నీ శరీరము లోపలే ప్రభవించినవాడై ఉన్నాడయ్యా! అంతేనా! కాదు. నీ సహజరూపమునకు అనన్యుడు కూడా.

---

**3.** స ఈక్షాన్‌చక్రే। (ఆతడు ఆలోచించాడు)।
"కస్మిన్ న అహమ్ ఉత్క్రాంత,
ఉత్క్రాంతో భవిష్యామి?
కస్మిన్ వా ప్రతిష్ఠితే
ప్రతిష్ఠాస్యామి?" - ఇతి॥

ఆత్మ ఆలోచనలలో లేదు. ఆత్మనుండి ఆలోచనలు వస్తున్నాయి. ఆలోచించువానిని ఆలోచనలలో వెతికి ఏం లాభం? మరి?
**ఆలోచనలు తనవైనట్టి ఆలోచించువాడిని మన ఆలోచనలుకు ఆవలనే పట్టుకోవాలి.**
ఆలోచనలన్నీ ఆతనివే! ఆత్మపురుషునివే!
→ "ఎవరు ఈ శరీరము నుండి వెలుపలికి వెళ్లబోవుచుండగా- కూడా 'రాకపోకలన్నీ నావైన నేను'గా తనను ఎరుగుచున్నాడో-అదియే ఆత్మ!
**తనను తాను-సమస్తము యొక్క రాకపోకలకు ఆవలగా ఉన్నట్లు గమనించువాడే ఆత్మను ఎరుగుచున్నవాడు.**

---

**4.** స ప్రాణమ్ అసృజత।
ప్రాణాత్ → శ్రద్ధామ్ →
ఖం, వాయుః, జ్యోతిః, ఆపః, పృథివీ,
ఇంద్రియం, మనః, అన్నమ్।
అన్నాత్→ వీర్యమ్ తపో, మన్త్రాః
కర్మ - లోకాః,
లోకేషు చ నామ చ॥

అట్టి ఆత్మయే ప్రాణశక్తి కూడా. సృష్టికర్త కూడా. **(సృష్టికర్త ఆతని కల్పనయే).** అట్టి ప్రాణశక్తి నుండి ఆకాశమును, వాయువును, జ్యోతి (అగ్ని)ని, ఆపః (జలమును), పృథివిని, మనస్సును -ఒక గానంలాగా సృష్టిస్తున్నది కూడా ఆత్మయే! అంతేకాదు. అన్నము (ఆహారము), అన్నము నుండి వీర్యము, తపస్సు, మంత్ర రూపములగు వేదములు,

→ కర్మలు(యజ్ఞాలు), లోకములు, లోకేసులు - మొదలైన ఇదంతా **ఆత్మయందు ఆత్మకు అద్వితీయమైన ఆత్మకల్పనయే।**

**5. స – యథా ఇమా నద్యః స్యందమానాః**
**సముద్రాయణాః, సముద్రం ప్రాప్యాః**
**అస్తం గచ్ఛన్తి,**
**భిద్యతే తాసాం నామ–రూపే**
**"సముద్ర" ఇత్యేవం ప్రోచ్యతే, =**

నదులు ప్రవహించి ప్రవహించి చివరకు సముద్రంలో ప్రవేశించినవై (తమ నామరూపాలు పోగొట్టుకొని) అదృశ్యము అవుతాయి. ఇకప్పుడు 'సముద్రము' అనబడే ఉంటుందిగాని. నదుల సంజ్ఞలు లేకయే పోతున్నాయి కదా.

---

**= ఏవమ్ ఏవ (ఆ రీతిగానే)**
**అస్య పరిద్రష్టుః ఇమాః షోడశ కలాః**
**పురుషాయణాః పురుషం ప్రాప్య అస్తం గచ్ఛంతి, –**
**భిద్యతే తాసాం నామ–రూపే**
**"పురుష".. ఇత్యేవం ప్రోచ్యతే।**
**స ఏషో అకలో – అమృతో భవతి॥**
**తత్ ఏష శ్లోకః॥**

అట్లాగే పరతత్త్వ ద్రష్ట (సర్వద్రష్ట) స్వరూపుడగు ఈ పరమ పురుషుని పొందినప్పుడు షోడశ కళలు అదృశ్యము అగుచున్నాయి. వాటి నామ-రూపాలు నశిస్తున్నాయి. పురుషుడు మాత్రమే శేషిస్తున్నాయి. ఆతడు (ఆ పరమ పురుషుడనబడే ఆత్మ).. కళారహితుడు (అకలః), కళాసహితుడు కూడా. ఆతడే అమృతుడు! అట్టి పరమ పురుషుని గురించే ఆత్మజ్ఞులు గానం చేస్తున్నారు।

స్వప్నద్రష్ట యందు - స్వప్న దృశ్యము" వలె, షోడశ కళలు కళాస్వరూపుడగు 'ఆత్మపురుషుని' యందే లయము అగుచున్నాయి.

---

**6. అరా ఇవ రథనాభౌ –**
**కలా, యస్మిన్ (ఎవరియందు) ప్రతిష్ఠితాః।**
**తం వేద్యం "పురుషం" వేద..,**
**యథా (దేనివలనైతే) మా వో**
**మృత్యుః పరివ్యథా.॥ ఇతి॥**

రథచక్రము యొక్క ఇరుసులో ఆకుల వలె, ఎవరి యందు షోడశకళలు ప్రతిష్ఠితమైయున్నాయో... **ఆ పురుషుడే నీవు తెలుసుకోవలసినట్టి 'ఆత్మ'. అదియే నీవు.**

ఆ పురుషుని గురించి (తమ యొక్క జీవాత్మకు సాక్షిగా తామే అయి ఉన్న ఆత్మ) గురించి ఎవరు తెలుసుకుంటారో.. ఇకవారు అమృతులౌతున్నారు. వారికి మృత్యువే లేదు!

**ఇది ఆత్మజ్ఞుల గానము.**

---

**7. <u>తాన్ (స పిప్పలాదమహర్షిః)</u>**
**<u>హ ఉవాచః</u> :**
**ఏతా పదేవ అహం ఏతత్ 'పరంబ్రహ్మ' వేద–**
**– నాతః (న అతః) పరమ్ అస్తి॥ – ఇతి॥**

నాయనలారా!

'ఆత్మ ఇట్టిది' అని నేను ఇంత వరకు తెలుసుకున్నాను! "ఇంతకు మించినదై (ఆత్మకు అర్థమై) ఎక్కడా ఏదీలేదు!".. అని అర్థం చేసుకుంటున్నాను!

మీకందరికీ శుభమగు గాక!

---

**8. తే (ఆ ఆరుగురు ప్రశ్నించినవారు)**
**తం అర్చయంతః;**
**<u>"త్వం హి నః పితా,</u>**
**<u>యో అస్మాకం అవిద్యయాః</u>**
**<u>పరం పారం తారయసి"</u> ఇతి॥**
***<u>నమః పరమ ఋషిభ్యో॥</u>***
***<u>నమః ఋషి భ్యః ॥</u>***

అప్పుడా ఆరుగురు (ప్రశ్నించినవారు) లేచి నిలుచుని సద్గురువగు పిప్పలాదమహర్షి యొక్క పాదపద్మములను భక్తిపూర్వకంగా అర్చించారు.

**"స్వామీ! అవిద్యకు పరమునకు (ఆవలి వడ్డుకు) జేర్చి మమ్ములను తరింపజేశారు. అవిద్యను దాటించారు. అందుచేత మీరు మాకు పితృదేవతా సమానులు"** - అని అభివర్ణిస్తూ నమస్కరించారు.

పరమ ఋషులకు నమో నమః। నమస్కార కుసుమాంజలులు।

ఋషులకు నమో వాక్కములు।

ఋషిపుంగవులకు నమస్కరిస్తున్నాము। నమస్కరిస్తూ ఉన్నాము।

***<u>ఇతి ప్రశ్నోపనిషత్ సమాప్తా</u>***

***<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥</u>***

***<u>ప్రశ్నోపనిషత్ సమాప్తము</u>***

***<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥</u>***

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 12 ప్రశ్నోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



## శ్రీ పిప్పలాద మహర్షిని అడిగిన 6 ప్రశ్నలు

| వ.సంఖ్య | అడిగినవారు | ప్రశ్న | ప్రశ్న |
|---|---|---|---|
| 1 | **కబన్ధీ - కాత్యాయనః - (కత్య కుమారః)** | కుతో హవా ఇమాః ప్రజాః ప్రజాయన్త? | ఈ కనబడే జీవులంతా ఎక్కడి నుండి పుట్టుకొస్తున్నారు? |
| 2 | **భార్గవో - వైదర్భిః** | కత్యేవ దేవాః ప్రజాం విధారయన్తే?<br>కతర ఏతత్ ప్రకాశయన్తే?<br>కః పునః ఏషాం వరిష్ఠ? | - ఈ కనబడే జీవుల దేహములను నిర్మిస్తున్న, నిలబెట్టుచున్న ప్రజ్ఞాదేవతలు ఎవరు? ఎందరు?<br>- ఏ దేవతలు ఈ దేహములను ప్రకాశింపజేస్తున్నారు?<br>- వారిలో ముఖ్యుడు ఎవరు? |
| 3 | **కౌశల్యశ్చ - అశ్వలాయనః** | కుత ఏష ప్రాణో జాయతే?<br>కథమ్ ఆయాతి అస్మిన్ శరీరే?<br>ఆత్మానం వా ప్రవిభజ్య కథం ప్రాతిష్ఠతే?<br>కేన ఉత్క్రమతే?<br>కథం బాహ్యం అభిదత్తే కథం అధ్యాత్మమ్? | - ఈ ప్రాణము ఎక్కడినుండి పుడుతోంది?<br>- భౌతిక దేహములో ఏవిధంగా ప్రవేశము పొందుతోంది?<br>- ప్రవేశించిన తనను తాను (పంచజ్ఞానేంద్రియ, పంచకర్మేంద్రియ, పంచప్రాణ ఇత్యాదులుగా) విభాగమై ప్రతిష్ఠత పొందుతోంది?<br>- మరణసమయంలో ఎట్లా ఈ దేహమును వీడుతోంది?<br>- బాహ్యమున (అధిభౌతిక-అధి దైవికంగాను) అంతరమున (ఆధ్యాత్మికంగాను) ఎట్లా ధారణ చేస్తోంది? |
| 4 | **సౌర్యాయణీ - గార్గ్యః** | ఏతస్మిన్ పురుషే కాని స్వపన్తి? కాని అస్మిన్ జాగ్రతి? కతర ఏష దేవః స్వప్నాన్ పశ్యతి?<br>కస్య ఏతత్ సుఖం భవతి?<br>కస్మిన్ను సర్వే సంప్రతిష్ఠితా భవన్తి? | - ఈ జీవుడు నిదురిస్తూ ఉంటే, ఆతని పట్ల మేలుకొనియే ఉంటున్నది ఏది?<br>- స్వప్నానుభవం ఎవరిది? మనస్సుదా ? జీవునిదా ? ఆత్మదా?<br>- నిదురిస్తున్నప్పుడు జాగ్రత్ అనుభవాలు ఏమౌతున్నాయి? మెలకువ వచ్చినప్పుడు స్వప్నానుభవాలు ఏమౌతున్నాయి?<br>- గాఢ నిద్రాసుఖం పొందుచున్నదెవరు? |
| 5 | **శైబ్యః - సత్యకామః** | సయో హవై తత్ మనుష్యేషు ప్రాయణాన్తమ్ 'ఓం'కారమ్ అభిధ్యాయీత, - కతమం వావ స తేన లోకం జయతి? | - పర-ఇహ-దృశ్యము సమగ్రమునకు 'సంజ్ఞ' అయి ఉన్నట్టి, ఓంకారోపాసకుడు దేహానంతరము ఎటువైపుగా ప్రయాణాలు కొనసాగిస్తున్నాడు? |
| 6 | **సుకేశా భారద్వాజః** | షోడశకలం పురుషం.<br>వేత్థ (కిం)? (కిం తత్?) | 'షోడశ (16) కళాపురుషుడు' అనగా ఎవ్వరు? ఎక్కడుంటారు? ఏమి చేస్తూ ఉంటారు? |

**భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః।**

ఆరాధ్యులు, పూజనీయులు, దివ్యదేహులు అగు ఓ దేవతలారా!

మీ యొక్క కరుణారస వీక్షణచే..,

మీచే ప్రసాదించబడిన.... ఈ మా రెండు చెవులతో అన్ని వేళలా శుభప్రదమైన, కైవల్యప్రదమైన, ఆత్మబుద్ధిప్రదమైన **మాటలను – విషయములను – కథనములను మాత్రమే** మేము వినుచుండెదము గాక!

*అశుభమైనవి, ఇతరులకు బాధ కలుగుజేయునవి, కల్పిత సంసార సంబంధమైనవి, అమంగళములైనవి, పరదూషణముతో కూడినవి – అగు మాటల పట్ల–**వినటానికిగాని, శ్రద్ధ వహించటానికిగాని,** – మీచే ప్రసాదించబడిన ఈ రెండు చెవులు **మేము ఉపయోగించకుండెదము గాక!***

**యజత్రాః**

**"యజ్ఞార్థాత్ కర్మణో అన్యత్ర లోకోఽ యమ్ కర్మ బంధనః"..** అవటం చేత.. మేము యజ్ఞకర్మ నిష్ఠులము అయి ఉండెదము గాక! "సృష్టి" – అనే మహత్తరమైన మహా యజ్ఞములో అంతర్విభాగముగా భావించి మేము **'యజ్ఞత్రులము'** అగుచున్నాము.

- శాస్త్రానుసరణము, లోకప్రీతిప్రదము, కృతజ్ఞతాపూర్వకము, సహజీవులకు సానుకూల్యము, ఉత్తమ సమిష్టి ఆశయసిద్ధి పూర్వకము, బుద్ధి బలప్రదము, దైవ సమర్పితము, ఉపాసనా భావ సమన్వితము, నియతము → అగు బుద్ధి, శ్రద్ధలతో, యజ్ఞ భావముతో కర్మలు చేయుటకు మేము సర్వదా సంసిద్ధులమయ్యెదము గాక!
- సంకుచితము, వ్యక్తిగతస్వార్ధము, ఆశా–దురాశా పూరితము, ఇతరులకు బాధ కలిగించునవి–మొదలైన అయజ్ఞ కర్మలు ఆశ్రయించకుండెదము గాక! అయజత్రులము కాకుండెదము గాక।

**భద్రం పశ్యేమ అక్షభిః।**

మీరు ప్రసాదించిన ఈ ఈ కన్నులతో యజ్ఞకర్మ నిష్ఠులమై మేము → శుభప్రదము, లోకకల్యాణ ప్రదము మహదాశయము, పవిత్రము – అగు దృష్టులను మాత్రమే కలిగియుండెదము గాక!

అల్పమైన, దోషపూరితమైన, సంకుచితమైన దృష్టులను దరిచేరనీయకుండెదము గాక!

**స్థిరైః అంగైః తుష్టువాగ్ంసః తనూభిః।**

స్థిరమైన – పరిపుష్టితో కూడిన – ఆరోగ్యవంతమైన అంగములతో కూడిన వారమై, (మీ ప్రసాదితమైన) ఈ శరీరముతో మీకు ఎల్లప్పుడు స్తోత్రవాక్కులు, గానములు పలుకుచుండెదము గాక!

**వ్యశేమ దేవహితమ్ యత్ ఆయుః ।**

(మీ మహిమలను గానం చేస్తూ) ఏ ఆయుష్షు దైవహితమై– దైవప్రసాదితమై ఉన్నదో, అది సద్వినియోగము చేసుకొనెదము గాక!

**స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః। (దధాతు) : (సుః–అస్తి) = "స్వస్తి" = అస్తి స్వస్వరూపేణ = కేవలాత్మయగు స్వస్వరూపమునందు– (అస్తి) = నిశ్చలమగు ఉనికి.**

ప్రాచీన గురువర్యులచే శాస్త్రములందు పురాణ–ఇతిహాసములలో అభివర్ణింపబడినవారు, పెద్ద చెవులతో ఉత్తమమైన శ్రుతము కలిగియున్న వారు, వేదవిహితమైన శ్రవణము ప్రసాదించువారు – అగు **ఇంద్ర భగవానుడు** మాకు **స్వస్థిని,** (మా స్వాధ్యాయము నందు మేము విన్నది అభ్యసించటమునందు), **అభ్యుదయమును** ప్రసాదించెదరు గాక!

**స్వస్తి నః పూషా విశ్వవేదాః (దధాతు) :**

సర్వజ్ఞుడు (విశ్వవేదుడు), లోకపరిపోషకుడు (పూషా) అగు పరమాత్మ మాకు స్వస్తి ప్రసాదించుదురు గాక!

**'స్వస్తి నః తార్క్ష్యో అరిష్టనేమిః (దధాతు)।**

దివ్య విహంగము (తార్క్ష్యుడు), ఆపదల నుండి రక్షించువాడు (అరిష్టనేమి) అగు గరుడ భగవానుడు మాకు స్వస్తి – అభివృద్ధి దయచేయుదురు గాక!

**స్వస్తి నో బృహస్పతిః దధాతుః॥**

(దేవతలకు గురువు, బుద్ధికి అధిదేవత, బ్రహ్మవర్చస స్వరూపుడు) అగు బృహస్పతి మాకు అభ్యుదయ భావములను, సునిశితము – విస్తారము అగు బుద్ధిని ప్రసాదించి రక్షించును గాక!

ఓం శాంతిః శాంతిః॥

❖ ❖ ❖

**ఓం నమః పరమాత్మనే!**
**హరిః ఓం!**

ఒకానొక సందర్భంలో బ్రహ్మ విద్యను కోరుకున్నట్టి బ్రహ్మ నిష్ఠాపరులు, బ్రహ్మతత్పరులు – అగు కొందరు మహనీయులు పరబ్రహ్మము గురించి అన్వేషణ చేయువారై, అధ్యయనులై ఒకచోట సమావేశమైనారు. కొంత 'సత్సంగము' తరువాత వారంతా సద్గురు సాన్నిధ్యమును ఆలోచనచేయసాగారు. వారిపేర్లు :

- → భరద్వాజుని కుమారుడైన **సుకేశుడు.**
- → శిబి పుత్రుడైనట్టి **సత్యకాముడు.**
- → గార్గ్య గోత్రోద్భవుడైనట్టి **సౌర్యాయణి.**
- → అశ్వలాయన పుత్రుడు **కౌసల్యుడు.**
- → విదర్భ దేశీయుడైనట్టి **భార్గవుడు.**
- → కత్యుని కుమారుడైన **కంబంధి. –**

ఆ మునీశ్వరులు బ్రహ్మవేత్త కొరకై వెతుకుచూ **"శ్రీ పిప్పలాద మహర్షి మన ఆధ్యాత్మికమైన సందేహములను, తప్పక తొలగించగలరు కదా!"...** అని అనుకున్నారు. 'సంశయాత్మా వినశ్యతి' అని కదా, పెద్దలు అనుచున్నది! అది దృష్టిలో పెట్టుకొని ఒకానొక రోజు పిప్పలాద మహర్షి ఆశ్రమమునకు వచ్చి, **మహాపురుషుడగు మహర్షిని** సందర్శించారు.

యజ్ఞ సంబంధమైన 'సమిధలు' చేతులతో ధరించి గురు ఆశ్రమమును సమీపించారు.

(ప్రాచీనకాలంలో గురు ఆశ్రమానికి వెళ్లేటప్పుడు యజ్ఞాలకు ఉపయోగబడే సమిధలు తీసుకొని వెళ్లటం ఒక సదాచారము. గురువు వద్దకు, చిన్న పిల్లల వద్దకు, ఆర్యుల వద్దకు ఉత్తి చేతులతో వెళ్లము కదా)॥

**"స్వామీ! మాకు గల ఆధ్యాత్మికమైన సందేహాలు తొలగటానికై బ్రహ్మతత్త్వము విషయమై మీ ప్రవచనమును శ్రవణం చేయాలని మిమ్ములను శరణువేడుచున్నాము.**

**పిప్పలాదమహర్షి :** మునీశ్వరులారా! మీరంతా కలసి తపో–బ్రహ్మచర్య నిష్ఠలను మరొక సంవత్సరకాలము శ్రద్ధ వహించినవారై నిర్వర్తించండి. ఆ తర్వాత మీరంతా కలసి రండి. అప్పటికీ సందేహాలుంటే, – మీమీ ప్రశ్నలు నన్ను అడగండి. నేను మీకు తప్పకుండా నాకు తెలిసినంతవరకు చెప్పుతాను.

❖ ❖ ❖

("గురూపదేశం హృదయంలో నాటుకోవటానికి వీలుగా మునుముందుగా, తపస్సు– బ్రహ్మచర్యములు శ్రద్ధగా నిర్వర్తించటం చేత బుద్ధి సునిశితము, విస్తారము, సుతీక్ష్ణము, నిర్మలము అవుతుంది" – అనునది గురువు యొక్క ఉద్దేశ్యము).

**ఆ మునీశ్వరులంతా గురు ఆజ్ఞను అదేవిధంగా పాటించినవారై, సంవత్సర కాలము తరువాత మరల శ్రీ పిప్పలాదమహర్షిని ఆశ్రయించారు.**

ఆ మునీశ్వరులు గురువును సమీపించి ఇక తమ ప్రశ్నలను ఒక్కటొక్కటిగా అడగటం ప్రారంభించారు.

## మొదటి ప్రశ్న

**కత్యుని కుమారుడైన కబంధిముని :** భగవాన్! నా కళ్లకు ఎదురుగా ఈ జీవులంతా కనిపిస్తున్నారుకదా! నా సందేహము ఏమిటంటే ***ఈ జీవులంతా వాస్తవానికి ఎక్కడి నుండి పుట్టుకొస్తున్నారు?***

## మహర్షి సమాధానము

**శ్రీ పిప్పలాద మహర్షి :** కేవలాత్మానందస్వరూపుడు, సమస్త కల్పనా సమర్థుడు, ఏకాంతుడు అయినట్టి ప్రజాపతి (సృష్టికర్త) ఒకానొకప్పుడు "అనేక మంది ప్రాణులను కల్పించుకొని ఉండెదనుగాక!".. అని వినోదార్థము **'భావన-సంకల్పము'** చేయటం జరుగుతోంది.

అందుకొరకై 'ధ్యాస'ను ఆశ్రయించి ధ్యానము చేస్తూ, తపన (Avocation) రూపంగా తపస్సు చేశారు.

"ఒక జంటను (Duality from the unity) సృష్టించుకుంటాను. – ఆ జంట అనేక విధాలుగా వర్ధిల్లుచు, అనేక దేహములుగా ప్రదర్శనమగు చుండునుగాక!" అని.. భావించారు!

నిద్రించినవాడు తాను ఏకమే అయి ఉండి కూడా స్వప్నంలో తనకు వేరైన – అనేక రూపాలు కల్పించుకొని, నేను-నీవు-అది-ఇది మొదలైనవన్నీ ఆస్వాదిస్తున్నట్లుగా – సృష్టి కల్పనను తననుండి తనకు వేరు – అను రీతిగా ఆరంభించారు.

ఆయన మొట్టమొదటగా సృజియించుకున్న **జంట మిథునము:**

(1) **శక్తి** (ప్రాణము). (అగ్ని). **(The Energy).** (2) **పదార్థము** (రయిం). (భూ). (అన్నము). **(The Matter).** (సాకారము).

ఈ మిధునమును (జంటను) ఎదురుగా తన యొక్క **"తపోశక్తిచే – సంకల్పశక్తిచే – భావనాశక్తిచే"** కల్పించుకొన్నారు. "అవి ఇంకా బహు జీవజాలములను, సంతతిని ఏర్పరచునుగాక!".. అని సంకల్పించారు!

ప్రజాపతి = – హిరణ్యగర్భుడు
– సమష్టి మనస్సును ప్రదర్శించువాడు / ప్రకటించువాడు.
– తన నుండి తానే లీలా వినోదంగా **"శక్తి+పదార్థము"**లను సృష్టించువాడు.

రయిం = అన్నము; చంద్రుడు : భోగించబడునది. సోముడు (Passive).

ప్రాణము = అగ్ని :: భోక్త (Active voice).

అన్నము → (1) చంద్రుని సూక్ష్మ ప్రభావము వలన కలుగుచున్నది. (2) ఐదు ఇంద్రియములకు బాహ్యానుభవ జగత్ దృశ్యము.

చంద్రుడు → భూమిపై రసత్వానికి, ఓషధులకు, ఆహారమునకు ద్రవత్వానికి కారణమగుచున్నట్టిది.

సూర్యుడు → సమస్తమునకు భోక్త. అగ్ని శరీరుడు. భూమికి అగ్నితత్త్వాన్ని తేజస్సును ఇచ్చు ప్రాణశక్తి

జీవుడు = జీవత్వము ప్రదర్శించువాడు. జీవితాభిమాని.

జీవము = ఊపిరి (శక్తి). అన్నము (రయి) ద్వారా వర్ధిల్లునది.

ఓ బిడ్డా! కబంధీ! ఇంకా విను.

| **<u>ప్రాణము</u>** | | | **<u>రయి</u>** | | |
|---|---|---|---|---|---|
| | = | సూర్యుడు | | = | చంద్రుడు. |
| | = | భుజించువాడు | | = | భుజించబడునది. |
| | = | ఆస్వాదించువాడు (experienear) | | = | ఆస్వాదించబడునుది That being Experienced. |
| | = | వెలిగించునది | | = | వెలగించబడునది. |
| | – | అమూర్తము (Formless) (ఇంద్రియములకు గోచరము కానిది | | = | మూర్తివంతమైనది (that with form). |
| | – | ఇంద్రియములచే పనిచేయించునది | | – | ఇంద్రియములు – ఇంద్రియానుభవములు. |
| | – | ఇంద్రియములను ఉపయోగించునది | | – | ఇంద్రియముల క్రియా విశేషములు. |
| | – | ఇంద్రియ ప్రదర్శనములకు ఆధారమైనది | | – | ఇంద్రియములకు విషయమైన జగత్‌దృశ్యము. |

**'శక్తి' – 'రయి'** (Matter) **ల గురించి మరొక్క విషయం : శక్తి నిరాకారము. అట్టి నిరాకారమైనదే సాకారము సంతరించుకొంటోంది. సాకారమైనదంతా స్వతఃగా నిరాకారమే అయి ఉన్నది. ఎందుకంటే, ఈ సమస్తము శక్తియొక్క ప్రదర్శనమే కాబట్టి.**

**ఏతత్ సర్వమ్ యత్ "మూర్తం" చ, "అమూర్తం" చ। తస్మాత్ మూర్తిరేవ రయిః।**

ఏదైతే సాకారముగా కనిపిస్తోందో, ... అదంతా 'రయి' (పదార్థము)యే!

ఏదైతే నిరాకారమైయున్నదో,.. అది కూడా రయియే (పదార్థమే)!

అందుచేత – ఆకారమే 'రయి'! ఆకారము పదార్థమునకు భిన్నము కాదు. పదార్థము స్వతఃగా చూస్తే నిరాకారమగు శక్తియే। (బంగారమునకు 'ఇది' అనే ఆకారమేమున్నది?).

**ప్రాణము :**

సూర్యశక్తిగా ప్రదర్శనమగుచున్నది ప్రాణమే!

సాకారామైన వస్తువులు – నిరాకారమైన వస్తువులు,

స్థూలము – సూక్ష్మము

మూలకము (The root) – ప్రదర్శితము (That being manifested).

అంతా పదార్థమే!

పదార్థమో.... **శక్తి యొక్క ప్రదర్శనమే! శక్తికి అభిన్నం.**

**శక్తి – పదార్థము** = వాటి మధ్య ఏదైనా భేదం అనుభూతమగుచూ ఉంటే.. అదంతా

→ భావనా మాత్రమే। సాపేక్షమైన కల్పనా దృష్టియే।

→ అభి వ్యక్త భేదమాత్రమే! (Multiplicity of Manifestation).

***వాస్తవానికి 'శక్తి-పదార్థము' ఈ రెండూ అభేదమైనవే.***

శక్తియే – **స్థూల దృష్టికి** → పదార్థము గాను,

పదార్థము – **సూక్ష్మ దృష్టికి** → శక్తి గాను – అగుపించటము జరుగుతోంది.

అంతేకాదు! సాధారణ దృష్టికి..,

**పదార్థము** → స్థూలము. జడము. 'స్థలము'ను ఆక్రమించేది. (That which occupies space).

**ప్రాణశక్తి** → స్థూలమునకు కారణమై, తనయందే **'స్థలము – ఆక్రమించుట'**ను కలిగియున్నట్టిది. (That in which space had its place).

సర్వము శక్తిమయమే! శక్తి ప్రదర్శనమే! ఈ సాకారంగా కనిపించేదంతా సహజంగా నిరాకారమగు ప్రాణశక్తియే అయి, సందర్భ సత్యము (In between Truth)గా స్థూలము నందు స్థూలంగా ఆక్రమించినదై కనిపిస్తోంది! సహజముగా ఇదంతా సూక్ష్మరూపమే!

ప్రాణశక్తి యొక్క ప్రదర్శనమే సూర్యబింబము. "అద్దాని చైతన్య స్వరూపుడు సూర్యుడు (లేక) ఆదిత్యుడు". [**యత్–అది–హ(ఇతి) ఆదిత్యః।** ఏది సమస్తమునకు 'మొదలు' అయి ఉన్నదో, ఇదంతా ఎవ్వని పురుషకారమో, ఆతడే 'ఆదిత్యుడు' – అని ఉపాసించబడుచున్నాడు]

***ప్రాణశక్తి స్వరూపుడగు ఆదిత్యుడు...,***

- తూర్పు దిశగా (ప్రాచీందిశే) (ప్రాణశక్తి రూపుడై విస్తరించటం జరుగుచున్నప్పుడు తన కిరణముల రూపంగా తూర్పు దిశ ప్రాణులను (దేహి-దేహములను) ధరించుచున్నవాడగుచున్నారు.

ఎప్పుడైతే తన ప్రాణశక్తిని ఆదిత్యుడు దక్షిణ (దక్షిణ దిశే), పడమర (ప్రతీచీం దిశే), ఉత్తర (ఉదీచీం దిశే), అధః(క్రింది వైపుగా), ఊర్ధ్వమ్ (పై దిశగా), మధ్యగా (అంతరాదిశే) సర్వమును ప్రకాశింపజేస్తూ ఉండటం జరుగుతోందో..,

**అప్పుడు**...., అట్టి ఆ ప్రాణశక్తి స్వరూపుడగు ఆదిత్యుని (సూర్యుని) ప్రాణశక్తులు-కిరణాల రూపంగా శక్తి – పదార్థద్వయమగు అనేక శరీరములను ప్రదర్శించుచున్నవాడగుచున్నాడు. (All beeings are from out of the universal beeing named as **Aditya Purusha**).

ఈ విధంగా సర్వ దిక్కులా సర్వ జీవులుగా ప్రదర్శితమగుచున్నదంతా నిరాకారుడగు ప్రాణభగవానుని యొక్క (ప్రాణేశ్వరుని యొక్క) (లేక) ఆదిత్య ప్రాణశక్తుని యొక్క సాకార సంప్రదర్శనా వినోద - వికాసమే।

| **"నిరాకార'శక్తి' + సాకార నామరూపాత్మకము"** అనే జంటల కల్పనా ప్రదర్శనమే! ప్రాణశక్తి యొక్క ప్రేరణా ప్రదర్శనమే! |
|---|

**అట్టి ప్రాణశక్తి - ఇంకా కూడా ఎటువంటిదంటే** →

(1) ఈ **విశ్వమంతా తనదై యున్నట్టిది.**

(2) ఈ **విశ్వమునకంతటికీ ఆత్మ.**

(3) కిరణరూపమై ఈ విశ్వము యొక్క నామరూపాత్మకంగా సంప్రదర్శితము.

అంతా ప్రాణశక్తియే. ఈ విశ్వమంతటికీ ప్రాణమే త్రాణ ("సర్వమ్ శక్తిమయమ్"।) ప్రాణమే అగ్నిరూపమై వెలుగొందుతోంది.

ప్రాణశక్తియే ఈ విశ్వము తన రూపముగా కలిగియున్నది. **విశ్వముయొక్క సహజరూపము ప్రాణమే.**

ఆ ప్రాణశక్తి పురుషుడే అగ్నిగా ఉదయించుచున్నవారై, ఋక్- వేదమంత్రములచే అభ్యుక్తుడు - అభివర్ణితుడు అగుచున్నాడు. (అగ్నిమీళే పురోహితే।)

మేధావులైన ఋషులు "ఈ కనబడే విశ్వము యొక్క వాస్తవ రూపము ఏమిటి?".. అని అన్వేషించగా...,

- ఈ విశ్వమే తన రూపముగా కలిగినవాడు..,
- జీవులంతా తన కిరణ రూపములుగా ప్రదర్శించువాడు..,
- సకల ప్రాణులకు పరాయణుడు - ఆధారమైనవాడు..,
- జ్యోతిర్మయుడు (కాంతి (జ్యోతి) స్వరూపుడు),
- సృష్టిలో అణువణువుకు వేడిమిని ప్రసాదించుచున్నవాడు,
- సమస్త జీవులలో సహజాత్మ స్వరూపుడై వేంచేసి ఉన్నవాడు -

అగు ప్రాణశక్తుడగు ఆదిత్యుని అనన్యరూపముగా స్తుతులు సమర్పించి మనకందిస్తూ ఉన్నారు. (ఋక్కులు). ఆదియందే ఉండియుండి, సమస్తముగా విస్తరించువాడు (ఆది - ఇతి - యః)।

**(హరీ! హిరణ్మయవపుః)।** సహస్ర (వేలాది) జీవుల రూప కిరణ కాంతులతో ఆ ప్రాణతత్త్వుడే సర్వత్రా సమస్త విశేషాలుగా ప్రకాశిస్తున్నట్లు వారు ప్రకటిస్తున్నారు.

లెక్కలేనన్ని కిరణాలతో అనేక విధాలుగా ఉంటూ (అనేక జీవజాతుల రూపంగా ఉంటూ), ప్రాణశక్తి స్వరూప సూర్యుడే, అన్ని వైపుల ఉదయిస్తూ ఉన్నారు. అస్తమిస్తూ కూడా ఉన్నారు. అయినాకూడా, ఆయనకు ఉదయ- అస్తమయములు లేని స్వయంప్రకాశక నిత్యోదితుడు.

కనుక,

ఈ జీవులంతా ప్రాణేశ్వరుడగు ప్రజాపతియొక్క ఏకత్వంలోంచి ద్విత్వంగా ఏర్పడిన **ప్రాణ(శక్తి)- పదార్థముల (రయి)**ల మిథున (కలయిక) రూపాలే! ఈ దేహి - దేహాలన్నీ ఒకే ప్రాణశక్తి యొక్క వివిధ ప్రదర్శనములు.

ప్రాణమే వైశ్వానరుడు - విశ్వరూపము కూడా.
(జీవుడు/వ్యష్టి) - (సమిష్టి).

❖ ❖ ❖

'సంవత్సరము అనునది ప్రజాపతి కల్పనా రూపమే. కాలము సృష్టికి ప్రారంభమగు మూలము.

**ద్విమార్గములు :** అటువంటి 'సంవత్సర' రూపమును - ప్రజాపతి రెండు మార్గములను జీవులకొరకై కల్పించుచున్నారు.

(1) దక్షిణాయన మార్గము(దారి). (సకామం). చంద్రమార్గము (Towards Matter). ('కేవలము' నుండి 'సందర్భము'వైపుగా)

(2) ఉత్తరాయన మార్గము. (నిష్కామం). సూర్యమార్గము (Towards Prana Cosmic). ('సందర్భము' నుండి 'కేవలము'వైపుగా)

## మొదటిది దక్షిణాయన మార్గము

→ ఇది జీవుని యొక్క నామ రూపాత్మక (రయి)మైన ఆశయముతో కూడినది.

**"దృశ్యములో మరొకటేదో పొందాలి. ఇక్కడనో, (లేక) మరొక లోకంలోనో నామ-రూపాత్మకమైన, ఇంద్రియానుభవ సంబంధమైనదేదో**

**లభించాలి కదా!"** అనే ఉద్దేశ్యముతో నిర్వర్తించే శాస్త్ర-సూకములగు సాధనములు కలిగియున్నట్టిది.
ఎవ్వరైతే..,

**ఇష్టా** = వేదప్రతిపాదితమైన యజ్ఞములు, యాగములు, వ్రతములు, పూజలు ఇత్యాదులను..,

**(అగ్నిహోత్రం, తపః సత్యమ్, భూతానంద అనుపాలనం, ఆతిధ్యం విశ్వసేవశ్చ 'ఇష్టమ్' ఇత్యభిధీయతే॥)**

**పూర్తములు :** లౌకిక సంబంధమైన తటాకములు – బావులు త్రవ్వించటం, దానములు, తీర్ధయాత్రలు, సత్రములు నిర్మించటం – ఇత్యాదులను...,

**(వాపీ – కూప– తటాకాది దేవతాయతనాని చ, అన్నప్రదానం ఆరామః–'పూర్తమ్' ఇత్యభిధీయతే॥)**

("లోకంలో మంచిపనులే శాశ్వతమైన విలువ గలవి. అంతిమాశయం అదే. గొప్ప కర్మలు – పనులు చేస్తేచాలులే! మేము ఆత్మజ్ఞానం గురించి యోచించనవరం లేదులే!... అని అనుకునేవారు).

అటువంటి వారు– వారియొక్క ఉపాసనలకు – కర్మలకు ప్రయోజనంగా **"చాంద్రమస లోకము"**ను సంపాదించుకుంటున్నారు.

అనగా "రయి (Material factors)"లో సమృద్ధి – సుందరము – సుఖమయములను సముపార్జించుకుంటున్నారు.

ఉదాహరణకు.., **"చంద్రమస మార్గము" అనగా?**

| | | |
|---|---|---|
| **"ఇష్టమ్" ఇత్యభిదీయత్** | – 'నేనీ అగ్నిహోత్రము చేస్తున్నాను కదా।<br>– తపస్సు చేస్తున్నాను కదా।<br>– సత్యమును అనుసరిస్తున్నాను కదా।<br>– పక్షులకు– జంతువులకు ఆహారం ఇస్తున్నాను కదా।<br>– పేదవారికి అన్నదాం.. వస్త్రదానం చేస్తున్నానున కదా। | **నాకు సుఖమయమైన స్వర్గలోకాలు, (లేక) సంపదలు, లౌకికమైన సానుకూల్యతలు లభించుగాక!**<br>**భౌతిక సుఖరూపమైన వస్తు–వాహన– గృహాదులు లభించుగాక! చంద్ర లోకంలో సుఖస్థానం లభించాలి! సుఖమయమగు ఊర్ధ్వలోక ప్రవేశము సిద్ధించాలి.** |
| **"పూర్తమ్" ఇత్యభిదీయతే** | – నేను నలుగురుకి ఉపయోగించాలని చెరువులు, బావులు త్రవ్విస్తున్నాను కదా..,<br>– దేవాలయాలకు సంపదను ప్రదానం చేస్తున్నాను కదా।<br>– అన్నదానం, సత్రాలు కట్టించటం చేస్తున్నాను కదా।<br>– ఉద్యానవనాలు నలుగురి కోసం నిర్మింపజేస్తున్నాను కదా। | **– ఇదియే ముఖ్యాసయము నాకు సుఖమయ లోకాలు లభించాలి!** |

ఇటువంటి దృశ్య సంబంధమైన ఆశయాలు కలిగి ఉండటము–బాహ్యమగు సందర్భ సత్యములకు చెందినది. **దక్షిణాయన మార్గము.**

ఈ చంద్రమస మార్గం పదార్థముల వైపుగా (రయి) (లేక) నామ రూపాత్మకమైన ప్రాప్యముల వైపుగా చేయు ఉపాసన.

ఇట్టి వారు సుఖమయలోకములలో ప్రవేసించి పదార్థమయ సంపదాస్థానములను పొందుచున్నారు.

**కాలానంతరం పుణ్యము ఖర్చుకాగా, ఆ తరువాత వారు తిరిగి పునరావృత్తిని పొందుచున్నారు.** *(పునశ్చత్వాం ద్రష్టుమ్ విభువి వహన్)*

ఇది దృష్టిలో పెట్టుకొన్న వారికై (మనువు మొ॥న) ఋషులు సంతానార్థులై దక్షిణ యానమును అనుసరించి పదార్ధ సంపదను పొందువిధి–విధానములు సూచిస్తున్నారు. ఇది **"పితృయాన మార్గము"** అని కూడా పిలువబడుతోంది.

**పితృయానము** జీవితము పట్ల భౌతిక సృష్టికి, ఆత్మ యొక్క జాగ్రత్ – స్వప్న కల్పనలకు చెందిన సుఖమయ మార్గము.

అందుచేత దక్షిణయానమే పదార్థము (Matter) అని కూడా పిలువబడుతోంది. ఇది 'అన్యము'ను పొందటము గురించిన శాస్త్రీయమార్గము. **పునరావృత్తి దోషము ఉండనే ఉంటుంది.** "అనన్యము" నుండి 'అన్యము' వైపుగా ఎక్కుబెట్టబడి, కొనసాగు మార్గము.

## రెండవది: ఉత్తరాయణ మార్గము।

ఇది అనన్యమగు ఆత్మ గురించిన స్థానము చేర్చు మార్గము. సహజ సత్యమగు ఆత్మానుభవమునకు చెప్పబడు శాస్త్రీయ సూచనలు.

ఉత్తరాయణము ద్వారము (మార్గము)లో– **బ్రహ్మము పట్ల నిష్ఠ,** బ్రహ్మచర్యము; **విద్యయా–** జ్ఞానమార్గంలో **ఆత్మ కొరకై అన్వేషించటము** – మొదలైనవన్నీ సూచితమై ఉంటున్నాయి.

ఇట్టి ఉత్తరాయణ మార్గంలో యోగులు ఆదిత్య స్థానము (సూర్యస్థానము)ను సముపార్జించుకుంటున్నారు.

సూర్యుడు ప్రాణశక్తి యొక్క తేజోప్రదర్శనం. ప్రాణశక్తికి నిలయం.

అట్టి ఆదిత్య స్థానము ఆత్మతత్త్వ **స్వభావజము.** అమృతము. మార్పుచేర్పులకు ఆవలిస్థానము. నాశరహితమగు స్థానము. అభయప్రదము. అట్టి సూర్యస్థానము జేరువారికి పునరావృత్తి (Slipping back from the state after once reached) ఉండదు. ఇది ఆత్యంతికము (The final finest) అవటం చేత – **'ఆత్యంతము' 'పరము'** అను శబ్దములతో చెప్పబడుతోంది.

ఇది ఇంద్రియ విషయాలను దాటిపోవటము. ఇది "రయమునకు (నామ-రూపాత్మక పదార్థమునకు)" అతీతము, వ్యతిరిక్తము" అవటంచేత **'నిరోధమార్గము'** అని కూడా అంటున్నారు.

..... ఈ విధంగా విజ్ఞులచే సూర్యమార్గము (ఆదిత్యమార్గము).. గానము చేయబడుతోంది.

ఈ మార్గము జన్మరాహిత్యమునకు (జన్మ-కర్మలకు ఆవలిదైనట్టి స్వస్వరూపాత్మ జ్ఞాన-ధ్యానములకు) త్రోవ.

(**బ్రహ్మసూత్రములచే** → ఇది దేవయానముగా వర్ణించబడుతోంది).

**ఉపనిషత్తులచే** → ఈ మార్గం గుండా (ఆత్మ జ్ఞాన మార్గములో) ప్రయాణించువారు బ్రహ్మలోకానికి ప్రయాణం చేస్తున్నారు. అక్కడ నివసిస్తూ కలాంతములో సృష్టికర్తయగు బ్రహ్మదేవునితో సహా (సముద్రజలంలో నదీజలం లీనమగుచున్నట్లుగా) బ్రహ్మమునందు లీనమగుచున్నారు-అని అభివర్ణనము).

మరికొందరు ఋషులు ఈ సూర్య (ఆదిత్య) మార్గాన్ని ఎట్లా అభివర్ణిస్తున్నారో.. అది కూడా వినండి.

- ఈ సూర్య మార్గంలో చిట్టచివరగా,
- స్వర్గలోకమునకు ఆవల,
- 5 పాదాలుగా (పంచపాదం) → (హేమంత ఋతువు – శిశిర ఋతువు ఒక్కటిగా చెప్పబడినప్పుడే – 5 ఋతువులు సంజ్ఞ) గల కాలస్వరూప స్థానము,
- పితరము → సర్వమునకు ఉత్పత్తి స్థానము,
- 12 రూపాలుగా (ద్వాదశాకృతం) → 12 నెలలుగా, -
- దివ అర్ధే – ఆకాశానికి ఆవల అర్ధ భాగంగా ఏర్పడినదై ఉన్నట్టిది.
- పురీషణము → సర్వము వర్షింపజేయు – ఆదిత్య స్థానము.

**"ఉత్తరాయన – ఆత్మోపాసనము"**గా చెప్పబడుచున్నట్టిది.

ఇక మరికొందరు మహనీయులు ఈవిధంగా కూడా వర్ణిస్తున్నారు :-

**ఆ ఆదిత్య స్థానమును చేరువాడు :**

- **'విచక్షణౌ'** → **కేవలద్రష్టత్వము.** ఆత్మతత్త్వము గురించి విచారణచేసి ఆత్మభావన సిద్ధించుకొనటము. మౌన స్వరూపము. సర్వమును **సాక్షిగా, అతీతంగా, చిద్విలాసంగా** – ఆత్మదృష్టితో చూడటం.
- **సప్తచక్రే** → ఏడు చక్రాలు.. ఏడు రంగులు (ఈ దృశ్యమంతా ఏడు రంగుల చిత్రంగా గమనించటము.
- **షడరఆహు** → ఆరు ఆకులు ఉంచబడినదిగా దర్శించగల స్థానం అని అభివర్ణిస్తున్నారు.

సూర్యుడు కాల విభాగానికి తండ్రి. అట్టి కాలము యొక్క ద్విమార్గములు

→ పదార్థము → శక్తి

## మాస మిథునము (జంట)

మాసమే ప్రజాపతి (కాలస్వరూపుడు)

అందులో..

కృష్ణపక్షము → పదార్థము – **"రయి" – కృష్ణపక్ష ఏవ రవిః"।**

శుక్లపక్షము → "శక్తి – **ప్రాణశక్తి" – శుక్లః – ప్రాణః।**

ఇది దృష్టిలో పెట్టుకొని కొందరు ఋషులు శుక్లపక్షంలోనే ఇష్టము (యజ్ఞ-యాగ-వ్రతాలు) నిర్వర్తిస్తూ ఉంటారు.

**పదార్థాన్ని అధిగమించే ఆశయం కలిగియే – శుక్లపక్షంలో (గా) యజ్ఞయాగాదులు నిర్వర్తిస్తూ ఉంటారు.**

**I.** కొందరు శుక్లపక్షమును (పదార్థానుభవ పరిమితులను దాటివేయు దృష్టిని) ఆశయముగా కలిగి ఉంటున్నారు.

**II.** మరికొందరు కృష్ణపక్షాన్ని ఇష్టముల కొరకై ఎన్నుకొని, పదార్ధత్వాన్ని ఆశయంగా కలిగి ఉంటున్నారు.

ఇట్టి రెండు దృష్టుల సమ్మేళనమే- ఏకత్వములో భిన్నత్వ రూపమైన సృష్టి. (భిన్నత్వములో ఏకత్వ దర్శనమే శుక్లమార్గము).

## అహోరాత్ర మిథునము

రాత్రి + పగలు = 1 రోజు

1 రోజు యొక్క స్వరూపము ప్రజాపతియే!

పగలు → ప్రాణము

రాత్రి → పదార్థము

అందుచేత

**పగలు సమయంలో** → రతిక్రియకు, మైథునానికి (విషయములతో) సంయోగము / సంయజ్యము నిషేధము. అట్లు పొందువారు తమ ప్రాణశక్తిని **న ప్రస్కందంతి** → వ్యర్థము చేసుకొనుచున్నారు

**రాత్రి సమయంలో** → రతికి (మైథునానికి) ఏ దంపతులు సంయుజ్యము పొందుతారో, అది బ్రహ్మచర్యముతో సమానమే! అది ఇంద్రియ నిగ్రహమే అవుతుంది - అని చెప్పబడు

**తాత్త్వికార్థ వివరణము**

| | | |
|---|---|---|
| సహజముగా | ... | సర్వము ఆత్మగా చూస్తూ, |
| సందర్భమాత్రంగా | ... | విషయములతో ప్రాపంచికంగా దర్శిస్తూ ఉండటం. |
| | | **ఇదియే బ్రహ్మచర్యము.** |

## అన్నం వై ప్రజాపతిః

'అన్నము'లోంచి జీవులు వస్తున్నారు. (అన్నము = అతః + నమ్) **"అహమ్ + నమ్"**

→ భౌతిక రూపములు (నమ్ - నామ రూపాత్మకం)

→ 'అహం' రూపము (అత్, అతః)

→ ఈ రెండు అన్నము (ఆహారములో) మిథునమై (కలసియున్నవై) ఉన్నాయి.

ఈ ప్రాణికోట్లన్నీ 'అన్నము' నుండి జనిస్తున్నాయి.

అన్నము → ప్రాణ + పదార్థ **సంపుటము.**

- **"పదార్థము - ప్రాణశక్తుల"** మిథునమే (కలయికయే) = **ఈ జీవుల సృష్టికి మూలపదార్థములు**
- పదార్థము ప్రాణమునకు (శక్తికి) అభిన్నము.

<u>**జీవులంతా సముద్రంలో తరంగాల వలె నిత్య ప్రయాణీకులు.**</u>

- అట్టి ఈ జీవులు (1) భౌతిక మార్గము (2) ఆధ్యాత్మిక మార్గము.. అను రెండు త్రోవలలో ప్రయాణిస్తూ అనేకత్వ రూపంగా అగుపించటం ఇక్కడి లీలావిశేషము మాత్రమే। **ఇక్కడ వాస్తవానికి ఏకమగు ఆత్మయే సర్వత్రా సర్వదా ఏర్పడినదై ఉన్నది.**

<u>**మరణానంతరం ఈ జీవులు పదార్థ - ప్రాణ.. రెండు మార్గములలో ప్రయాణిస్తూ సంచరిస్తున్నారు.**</u>

- అవియే కాల విభాగ సంజ్ఞలై ప్రవర్తిస్తున్నాయి.

- దక్షిణాయణం - ఉత్తరాయణం
- కృష్ణపక్షం- శుక్లపక్షం
- రాత్రి - పగలు
- **పదార్థమార్గము - ప్రాణమార్గము**

Towards sense of one's own **SELF** / and then, unisversal self = **ఉత్తరాయణం**

Towards sensory contexts = **దక్షిణాయణం**

## ఆత్మైవహి ఇదమ్ సర్వమ్:

కాలము ఒక్కటే అయినట్లు, అదియే సంవత్సర ఉత్తరాయణ, దక్షిణాయణ.. ఇత్యాదులు అగుచున్నట్లు

- ఆశయ మిధునాలు  - కర్మల మిధునాలు

.... ఇటువంటి వాటిలో ఈ జీవ సృష్టి అంతాకూడా – సాహిత్యమువలె, కథవలె, లీలగా ప్రజాపతితే కల్పించబటము, వికల్పించబడటము ఇక్కడ (జీవుల సృష్టి రూపంగా) జరుగుతోంది. అయినా కూడా, **ఆత్మ సర్వదా ఆత్మగానే ఉన్నదిగాని, ఆత్మయందు ఏదీ సృష్టింపబడటము లేదు, స్థితింపబడటంలేద, లయింపబడటంలేదు కూడా।**

## <u>ప్రజాపతి వ్రతం</u>

ఈ విధంగా ఎవ్వరైతే..,

- ప్రజాపతి యొక్క సంకల్పమే సృష్టిగాను;
- ప్రధమంగా ప్రాణశక్తి ప్రజాపతి యొక్క ప్రదర్శనంగాను,
- ఈ దృశ్యము 'ప్రాణము + రయి' (Energy + Matter) అను మిధునము (జంట)గాను,
- నిరాకారము–అరూపమగు ప్రాణశక్తి యొక్క ప్రదర్శనమే సాకారము–సరూపము అగు సమస్త పదార్థముల ప్రదర్శనముగాను,
- జీవుల సృష్టి, ప్రాణశక్తి – రయిల మిధునముగాను,
- జీవబాటసారులకు – (1) ప్రాణశక్తి వైపుగా (ఉత్తరాయణ) (2) పదార్ధము(దక్షిణాయణ) మార్గములుగా రెండు ప్రయాణ మార్గాలు కల్పించబడినట్లు..,
- ప్రజాపతియే కాలస్వరూపుడై ద్వివిధ మిధునకర్తగా ప్రదర్శితమగుచున్నట్లు,
- అంతా ప్రాణేశ్వరుడగు ప్రజాపతి ప్రదర్శనమే–అనియు, **సర్వులకీ సద్గతియేనని –**

సందర్శిస్తారో, వారు ప్రజాపతివ్రతులు. వారు కాల నిర్ణయాత్మకంగా (మోక్షసాధనలు అగు) సంతానము పొందువ్రతము చేస్తున్నవారు!

ఎవరి యొక్క తపస్సు – అవగాహన ఇంద్రియ నిగ్రహముతో కూడుకొనియుండి 'కల్పన'ను అధిగమించినదై, సందర్భ సత్యములను దాటివేసినదై, సహజ సత్యమును (వారి తార్కిక బుద్ధి) ఆశ్రయించినదై ఉంటోందో,.. వారే **సత్యవ్రతులు.**

***<u>అట్టి సత్యనిష్ఠులు బ్రహ్మమును దర్శించగలరు.</u>***

ఎవరిలో వంచన, మోసము, అనృతము, మాయాదృష్టి తొలగుతూ వస్తోందో.., అట్టివారు **భక్తి జ్ఞానములతో కూడిన వివేక దృష్టిచే దోషరహితమగు బ్రహ్మలోకమునకు చెందినవారు అగుచున్నారు. వంచన, మోసము, అనృతము, మాయదృష్టి, కామ క్రోధ లోభ మోహములు మొ॥వి కొనసాగించువారు జన్మ–కర్మ–జన్మాంతరముల చక్రములో తిరుగాడువారై ఉంటున్నారు.**

***అయితే, పరమాత్మనుండియే ఈ జీవజాలమంతా బయల్వెడలుతోంది,*** **పరమాత్మయందే లయిస్తోంది – అని విజ్ఞులు గమనిక కలిగి ఉంటున్నారు.**

## రెండవ ప్రశ్న

అక్కడికి వచ్చిన మునిపుంగవులంతా శ్రీపిప్పలాద మహర్షి విశ్లేషిస్తూ చెప్పిన **"ఈ కనబడే జీవులంతా ప్రజాపతి సంకల్పిత చమత్కారమగు ప్రాణతత్త్వము యొక్క అభౌతిక + భౌతిక (సూక్ష్మ+స్థూల) ప్రదర్శనమే!",.. "సృష్టి కల్పన అంతా దక్షిణాయన, ఉత్తరాయన బాటసారుల చమత్కారమే"** – అనునదంతా వింటూ ఉన్నారు.

**అప్పుడు విదర్భ దేశీయుడు–భృగువంశజుడు అగు భార్గవుడు లేచి నిలుచున్నారు. గురు దేవులకు నమస్కరించారు. సాలోచనగా పిప్పలాద మహర్షి ముందు తన ప్రశ్నను ఇట్లా నివేదించారు.**

స్వామీ! భగవన్! సద్గురూ! శ్రీపిప్పలాద మహర్షీ! ఈ పాంచభౌతిక దేహములన్నీ పాంచభౌతిక దేహ స్వరూపులగు జీవులు తమకు తామే నిర్మించుకొనటమూ లేదు. పరిపోషించుకోవటమూ లేదు. ఈ దేహములకు ఆయా విశేష ధర్మములు కల్పిస్తూ (ఉదా : చర్మానికి స్పర్శ, గుండెకు రక్తశుద్ధి, నరములలో రక్త ప్రదర్శనము, పొట్టలో జఠరాగ్ని ఇత్యాదులు) కొన్ని దేవతా ప్రజ్ఞలు పనిచేస్తూ ఈ ఇంద్రియములు క్రియాశీలకమవటానికి కారణమై ఉంటూ ఉండాలి కదా! (అనగా) జన్మలు పొందుచున్న జీవుల అతీతమైన దివ్య ప్రజ్ఞలు ఈ తతంగమంతా నడిపిస్తూ ఉన్నాయి – అని అనిపిస్తూ ఉన్నది.

**ఇప్పుడు నా ప్రశ్న!**

- ఈ దేహములు **భరిస్తూ ఉన్న** దేవతలు (లేక) దేవతా ప్రజ్ఞలు ఎందరు? ఎవరెవరు?
- ఈ దేహము - దేహములో తత్త్వాలను **ప్రకాశమానం చేస్తూ** తమ శక్తులను ప్రకటిస్తున్న దేవతా ప్రజ్ఞలు ఎన్ని? ఏవేవి?
- అట్టి దేవతా ప్రజ్ఞలన్నిటిలో **వరిష్ఠ** (Say, Leader) దేవత ఎవరు? శ్రేష్ఠమైనదేది? (Who is the most predominent?)

## అందుకు మహర్షి సమాధానం

భార్గవీ! మీరు చెప్పుచున్నట్లే - **శరీరులగు జీవుల శరీర నిర్మాణ** కార్యక్రమంలో ప్రకృతిని సేవిస్తున్నట్టి **అశరీరులగు ప్రజ్ఞలు** ఉన్నాయి. అట్టి ప్రజ్ఞవంతులను **"అధిష్ఠాన దేవతలు"** అని అంటారు. "ఈ శరీరమునకు సంబంధించి వేరువేరు అధిష్ఠాన దేవతలు ఆయా దేహ విశేషాలకు **నిర్మాతలు, సొంతదారులు కూడా"** - అని పౌరాణికంగా చెప్పబడుచున్నది. వారంతా కూడా తమ తమ మహత్త్వములచే ఆయా క్రియలను దేహములలో నిర్వర్తించటం జరుగుతోంది.

**కారణ పదార్థములు** - పంచభూతములు (5)

ఆకాశము; వాయువు; అగ్ని; ఆపః (జలము); భూమి (Space - Vapour - Heat - Liquid - Solid)

ఈ ఐదు కూడా ఆయా అధిష్ఠాన దేవతల కార్యక్రమ నిర్వహణా చమత్కారాలే! ఇవి 'పంచ సూక్ష్మ భూత శక్తి దేవతలు' అని కూడా అంటారు కదా! పంచ భూతతత్త్వములే ఈ కనబడే సర్వ చేతన జడ భౌతిక రూపములకు (భౌతిక సృష్టికి) **కారణ పదార్థములు.** పిచ్చుకలగూడుల వంటి ఈ భౌతిక శరీరములన్నీ **కార్యరూపములు. (దేవతలు** = Cause, **దేహములు** = Effects).

**కర్మేంద్రియములు :** వాక్కు - పాణి (చేతులు) - పాదములు (కాళ్ళు) - పాయువు (మలద్వారము) - ఉపస్థ (జననేంద్రియము)

**జ్ఞానేంద్రియములు :** చర్మము (స్పర్శ) - కళ్లు (చూపు) చెవులు (వినికిడి) - జిహ్వ (రుచి) - ఘ్రాణేంద్రియము (ముక్కు -వాసన)

**మనస్సు :** ఇక ఆరవది ఇంద్రియము. **మనః షష్ఠాని. "మనస్సు"**

వీటన్నిటికీ ఒక్కొక్క కార్యక్రమమునకు ఆయా అధిష్ఠాన దేవతయి (దివ్య ప్రజ్ఞలు) కారణముగా అగుచున్నారు. వారంతా సృష్టిలో తమ వంతుగా ఆయా సంబంధిత కార్యక్రమములు నిర్వర్తిస్తూ ఈ శరీరములను పరిపోషిస్తూ ఉన్నారు. నిలబెట్టుచూ ఉన్నారు.

ఒకసారి ఒకానొక చమత్కారమైన సంఘటన యొక్క విశేషాలు ఇప్పుడు చెప్పుచున్నాను. మీరంతా శ్రద్ధగా వినండి. ఈ విశేషాలన్నీ మన ఈ భృగువంశీయుడు - విదర్భ దేశీయుడు అగు భార్గవుని ప్రశ్నలకు సమాధానము అయి ఉన్నది.

## ఇంద్రియ - అధిష్ఠాన దేవతల సమావేశము

ఒక సందర్భంలో ఒకానొక దేహి గాఢ నిద్రకు ఉపక్రమించాడు. అప్పుడు పంచకర్మేంద్రియములు (ప్రజ్ఞా దేవతాంశలు) ఒకచోట సమావేశమైనాయి. ఈ శరీరములలో తమ పాత్ర యొక్క ప్రాముఖ్యత- ప్రత్యేకతల గురించి గొప్పలు చెప్పుకోసాగాయి.

**<u>వాక్కు</u>** → నా వలననే కదా ఈ మానవుడు మాట్లాడటం! మాటలు లేకపోతే ఈ జీవుడి గతి? - మూగయేకదా! నిరర్థకమే. కనుక నా పాత్ర బహు గొప్పది. పైగా, ఈ జీవుడు నా ద్వారానే కదా; ఆహారము తీసుకొనేది! నేను లేకుంటే ఈ దేహము ఒక్కరోజు కూడా నిలువలేదు. కనుక ఈ దేహములో నేనే ముఖ్యం. నేనే ఈ దేహాన్ని కాపాడుచున్నాను. ఇదంతా నా సామర్థ్యమే. నా వాక్-సామర్థ్యము వలననే ఈ జీవుడు వేద-వేదాంగముల ఆశ్రయము, మోక్షము సాధ్యమగుచున్నాయి.

**<u>పాదములు</u>** → ఏం గొప్పలండీ వాక్కు గారూ! గొప్పతనమంతా మాది! నోటితో తిన్న తిండి అరగాలి కదా! మేము నడుస్తున్నాము కనుకనే ఈ దేహమంతా కదులుతోంది. ఈ దేహము కదలకపోతే తిన్నది ఎట్లా అరుగుతుంది? ఈ జీవుడు నడుస్తుంటేనే జీవితం. లేకుంటే జీవితము నిరర్థకమే కదా! కనుక, పాదములగు మేమే దేహంలో ముఖ్య విభాగమై ఉన్నాము. మా వలననే ఈ దేహము ఆయురారోగ్యములతో మనగలుగుతోంది. మేమే ఈ పొడవైన భౌతిక శరీరము మోస్తున్నాము కనుక మేమే శరీరములో శ్రేష్ఠులము.

**<u>పాణి</u>** → ఆహారం ఎదురుకుండా ఉంటే సరిపోతుందా? చేతులము మేము ఉన్నాము కాబట్టి ఈ జీవుడు తిండి తినగలుగుచున్నాడు. పనిచేయగలుగుచున్నాడు. చేతులు లేని దేహము నిరుపయోగమే కదా! కనుక మేమే ముఖ్యము! (అయం హస్తో భగవానః). మేమే ఈ శరీరాన్ని కాపాడుచున్నది! మేము లేకుంటే ఈ దేహము నిరర్థకము.

**<u>పాయువు (మలద్వారము)</u>** → : జీవుడు తిన్న ఆహారము జీర్ణమయిన తరువాత దేహము మలరహితం అవకపోతే? ఎన్నాళ్ళు జీవిస్తుంది ఈ దేహము? కనుక మేము - మేము నిర్వర్తించేదే దేహములో అతిముఖ్యమైన కార్యక్రమము. కనుకనే అన్ని ఇంద్రియముల కంటే కూడా మేమే ఎంతో ముఖ్యం. మమ్ములను కాదని ఈ దేహం జీవించనే లేదు. అందుచేత శరీరములో మేమే ముఖ్యము.

**ఉపస్థ** → : జననేంద్రియమగు మేమే సంతానానికి కారణం. కనుక జీవజాతినంతా నిలబెట్టుచున్నది మేమే! లేకుంటేనో? మేము ఈ దేహ పునరుత్పత్తులకు సేవలందించకుంటే? జీవజాతులు కొద్ది సంవత్సరాలలో ఈ భూమిపై నిలవకుండాపోతాయి. అంతేనా? ఏం కాదు! ఈ జీవులకు శృంగారానందం మా వలననే కదా కలుగుతోంది. మేమే అతిముఖ్యం. మేము లేకుంటే ఈ జీవజాతులన్నీ ఒక తరము మించి భూమిపై నిలువజాలవు. అందుచేత శరీరములో మాదే ప్రాధాన్యము.

**<u>స్పర్శేంద్రియం (చర్మం) :</u>** అయ్యా! ఇక్కడ ఒక్కొక్కరు ఒక్కొక్క మాట మాట్లాడుచున్నారేగాని మా గొప్పతనం గురించి ఎవ్వరూ ఊసెత్తడం లేదేం? అన్ని అవయవాలను కప్పి ఉంచి, పుట్టి - పుట్టకముందు నుంచి - పాడె వరకు ఈ దేహాన్ని రక్షిస్తున్నది మేము. అంతేనా? ఈ జీవుడికి స్పర్శ సుఖం - స్పర్శరక్షణ మేమే కదా ఇస్తున్నది? మమ్ములను కాదంటే ఈ దేహము, ఈ అంతర్వ్యవహారాలు, ఈ రక్త - మాంస విభాగాలు నిలుస్తాయా? మా గొప్పతనం ఎవ్వరికీ రాదు. అసలు ఏ జీవునికైనా - సుందర రూపముగాని, కురూపముగాని ఇస్తున్నది ఎవ్వరు? మేము. అటువంటి చర్మరూపస్పర్శేంద్రియమగు నన్నే మరచి ఏమిటేమిటో గొప్పలు చెప్పుకుంటున్నారే? ఈ దేహంలో మేమే గొప్ప! మా గొప్పతనం ఎవ్వరికో వస్తుందా? రాదు. ఎవ్వరూ మాట్లాడకండి. చర్మమే లేకుంటే ఏ జీవుడైనా జీవనము ఆరంభించగలడా, - చెప్పండి?

**<u>కళ్ళు - చూపు :</u>** ఏమిటేమిటి? ఇంతమంది ఇన్ని మాటలు చెప్పుచున్నారుగాని, మీకందరికీ శాస్త్ర నానుడి ఏమిటో తెలుసా? "సర్వేంద్రియానాం నయనం ప్రధానం".. అని విన్నారా? లేదా? లోచనం (కళ్ళు) లేకపోతే ఆ జీవుడికి లోకాలే లేవు. దేహంలో మేము ఉన్నదే ముఖ్యస్థానము. మా వలననే జీవుడికి జాగ్రత్ - స్వప్న - సుషుప్తులు కూడా! మా వలన పొందిన సమాచారమే దేహానికి నిజమైన ఆహారము. మా వలననే ఈ దేహము నడుస్తోంది. కూర్చుంటోంది. చూస్తోంది, నిద్రిస్తోంది, జీవిస్తోంది. కనుక చూపు రూపంలో కళ్ళలో ఉన్న మేము మీ అందరికన్నా ముఖ్యము. జీవుడికి నిజమైన చైతన్యము మా వలననే వస్తోంది! లేకుంటే దేహము - లోకము - జీవితము జడమే. కళ్లులేని బ్రతుకు ఏమి బ్రతుకు చెప్పండి?

**<u>చెవులు - వినికిడి :</u>** అయ్యా! అయ్యా! అసలు వినికిడియే లేకుంటేనో? శాస్త్రగానాలు, గురు - శిష్య సంభాషణలు, సంగీత ఆస్వాదనలు, పరస్పర సంభాషణలు జరుగవుకదా! పెదవులు కదలితే కూడా దేహములో వినికిడి శక్తి లేకపోతే, ఆ మాటలు ఎందుకు పనికి వస్తాయి? కళ్ళు చూస్తే చూడవచ్చు. వినికిడి లేకపోతే ఏం ప్రయోజనం? ప్రకృతిని ఆస్వాదించే జీవునికి వినికిడి శక్తియే ముఖ్యం. మేమున్నాము కాబట్టే 64 కళలు ఉన్నాయి. అందుచేత అందరు మాటలు కట్టిపెట్టండి. మా గొప్పతనమేమిటో, ఈ దేహములో మా ఔన్నత్యము ఎట్టిదో, అది గమనించండి. అందరికంటేమేమే గొప్ప. అంతే। చెవులే లేకుంటే చేతన మాధుర్యమే అనుభవమవదు.

**<u>జిహ్వా - రుచి :</u>** అయ్యా! ఆహారం స్వీకరించేది నేను. 'రుచి అనే హాయిని ఈ జీవుడికి అందించేది నేను. పలుకులు పలికేది నేను. నేను కార్యక్రమం నిర్వర్తిస్తున్నాను కాబట్టే ఆహారం ఈ దేహంలో ప్రవేశించగలుగుతోంది. ఈ దేహానికి ముఖ్యద్వారము నేనే। జిహ్వయే లేకుంటే ఈ ఈ దేహము జడమైన తోలు తిత్తియే. నాపైన - నా కార్యక్రమంపైన ఈ సర్వదేహ విభాగాలు ఆధారపడి ఉన్నాయి. ఆహారము దేహములోనికి నేను పంపకుంటే? ఆపై ఇక ఈ కాళ్ళు - చేతులు - చర్మము - కళ్ళు - చెవులు పనిచేయగలవా? ఈ దేహయంత్రానికి ఇంధనం నావలననే ప్రాప్తిస్తోంది. కనుక సందేహమే లేదు - ఈ దేహంలో నేనే గొప్ప! నా గొప్పతనం ఎవ్వరు, ఎట్లా కాదంటారో.. చెప్పండి? నేనే నోరుకు శబ్ద శక్తి ప్రదాతను సుమా!

**<u>ఘ్రాణేంద్రియము :</u>** అస్సలు గాలి పీల్చేది నేను. నా కార్యక్రమమే లేకుంటే? ఏ దేహమైన పది నిమిషాలు జీవిస్తుందా? లేనే లేదు. శరీరంలోని అణువణువుకు వాయుశక్తిని అందిస్తున్న నన్ను మీరంతా మరచిపోయి మాట్లాడుతారా?

జీవుడిని నేను లేకపోతే - సువాసన సుఖం తెలిసేదా? లేదు.

నేను పని చేస్తున్నాను కనుక మీరంతా ఉన్నారు. కనుక ఎవ్వరూ నోరు మెదపకండి! ఈ దేహానికి ముఖ్యవిభాగం నేనే! అంతే! ముక్కు మూస్తే మూడు నిముషాలు పట్టదు, అంతా గోల్-మాల్ అవటానికి!

**మనస్సు :** ఓ కర్మేంద్రియములారా? జ్ఞానేంద్రియము లారా? మీరంతా మీ గొప్పలు చెప్పుకొని వాదులాడుకుంటున్నారా? సరే! అసలు మనస్సు ఉంటే కదా జగత్తు! జీవుడి మనన శక్తినైన నేనే ముఖ్యం. మనస్సు ఉంటేనే అన్నీ ఉంటాయి. మనస్సు లేకుంటే జీవుడే లేడు. ఇక దేహం గురించి, మీ గురించి చెప్పేదేమున్నది? మనస్సు లేకుంటే ఏ జీవుడికీ మనుగడయే లేదు. కనుక నన్ను 'షష్ఠేంద్రియం' అని యోగులు, పౌరాణికులు, వేద ప్రవచనాలు ఎలుగెత్తి మమ్ములను పొగుడుతూ ఉంటే, మీరంతా ఏదేదో గొప్ప - గొప్పలు చెప్పుకుంటారే!

***మనస్సే మనిషి! మనస్సే జగత్తు! మనస్సే బంధము. మనస్సే మోక్షము. కాబట్టి నేను గొప్ప! నేనే గొప్ప!***

ఈ విధంగా ఆయా ఇంద్రియములు, మనస్సు ఒకటితో మరొకటి "మేం గొప్ప - మేం గొప్ప".. అంటూ వాదోపవాదాలు చేసుకుంటున్నాయి. కీచులాడుకుంటున్నాయి. పరస్పరము తక్కువగా చేసి మాట్లాడుకుంటున్నాయి.

ఇంతలో...,

**అప్పుడు ఆచోటిలో ప్రాణదేవత ప్రత్యక్షమయింది.**

**ముఖ్యప్రాణము :** ఓ మిత్రులారా! ఇటు రండి! మోహంలో పడకండి! మీరంతా కూడా ముఖ్యమే. నేను కాదనను. అయితే, మీ అందరి రూపంలో ఉన్నదెవ్వరు? నేనే! నన్ను నేనే పంచభూతములుగా, పంచకర్మేంద్రియములుగా, పంచజ్ఞానేంద్రియములుగా.. అన్ని రూప-నామాలుగా, జీవులుగా, జీవరాశులుగా, భావనా తరంగములుగా విభజించుకొని విరాజిల్లుచున్నాను సుమా!

ఆ మాటలు ఇంద్రియాదులు విన్నాయి. మనస్సుతో సహా జ్ఞానేంద్రియ -కర్మేంద్రియములు ఆ మాటలు ఒప్పుకోలేదు. తమలో తాము "ఏమిటి ఈ ప్రాణము గొప్ప? మనందరి రూపంగా తానే ప్రదర్శనమగుచున్నానన్నంత ధైర్యంతో మాట్లాడుతోందే? ఏది ఏమైతేనేం? మనందరమే ఈ దేహాన్ని నిలబెట్టుచున్నాం. మధ్యలో ఈ ప్రాణ శక్తి గొప్పతనం ఏముంటుందట?" - అని చెప్పుకుంటూ గుసగుసలాడుకోసాగాయి.

ముఖ్యప్రాణము ఆ గుసగుసలు, ఆ దెప్పిపొడుపు మాటలు విన్నది. చాలా అభిమానము పొందింది. **"వీళ్ళకు నా సంగతి ఏమిటో విజ్ఞానయుక్తంగా, అనుభవపూర్వకంగా తెలియజేయవలిసిందే!"**.. అని తలచింది.

అప్పుడు..., ఇక దేహము నుంచి చిన్నచిన్నగా బయల్వెడలసాగింది!

ఇంకేమున్నది? ముఖ్యప్రాణము దేహము నుండి బయల్వెడలుతూ ఉంటే,.. క్రమంగా పంచ ప్రాణములు-ఉప ప్రాణములు, కర్మేంద్రియములు.. జ్ఞానేంద్రియములు తాము కూడా దేహము నుండి కదలిపో - ప్రారంభించక తప్పలేదు. బలవంతంగా ఒకటి తరువాత మరొకటి దేహము నుండి బయల్వెడలటానికి సిద్ధం కాసాగాయి.

**"అయ్యయ్యో! కొంపలు మునుగుచున్నాయే? మనం కూడా ఈ దేహాశ్రయం నుండి బలవంతంగా నెట్టివేయబడచున్నామే!"** అని ఇంద్రియములు, మనస్సు బెంబేలుపడసాగాయి. ఒక తేనెతుట్టెలోని రాణి తేనెటీగ బయటకు వెళ్ళుచుండగా మిగతా తేనె టీగలన్నీ ఆ రాణీ తేనెటీగను అనుసరిస్తూ ఉంటాయి - చూచారా? ఆవిధంగా ముఖ్య ప్రాణము యొక్క (దేహము నుండి) కదలికచే సర్వేంద్రియాలు - మనస్సు దేహమును బలవంతంగా వీడసాగాయి. దేహము కట్టెవలె మొద్దుబారిపోవటం ప్రారంభించింది.

అప్పుడు ముఖ్య ప్రాణము...,

> *"ఆహాఁ! ఇప్పుడు నా ప్రాముఖ్యత ఏమిటో ఈ మనో- ఇంద్రియాలకు తెలియవస్తోంది కదా! నేనే నా యొక్క వివిధ శక్తుల రూపాలుగా ఇంద్రియ మనో నామకరణములగా ప్రదర్శితమగుచున్నానని తెలియవచ్చి ఉంటుంది. ఇక ఈ దేహమును అకాలముగా ఎందుకు త్యజించటం? కనుక తిరిగి నేను ఈ దేహములో ప్రాణశక్తి రూపంగా సుప్రతిష్ఠితమయ్యెదను గాక!"*

.... అని తలచింది. తిరిగి దేహములో యథాతథంగా ప్రవేశించి ప్రతిష్ఠ పొందింది. వెనువెంటనే పంచప్రాణములు, పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు ప్రశాంతత పొందినవై తిరిగి దేహములో తమ తమ స్థానములకు చేరాయి. మనస్సు తన స్థానం పొందింది. అప్పుడవన్నీ ఈ భౌతిక దేహములోని ముఖ్యప్రాణము యొక్క **"ఆవశ్యకత, ఔన్నత్యము, ప్రాముఖ్యత"** ఏమిటో గుర్తించాయి. వాక్కు, మనస్సు, చక్షువులు, చెవులు - ఇవన్నీ కూడా ప్రీతిపూర్వకంగా ప్రాణదేవతను స్తుతించటం ప్రారంభించాయి.

కాబట్టి బిడ్డలారా! ముఖ్యప్రాణమే (ప్రాణశక్తియే) ఈ కనబడే స్థూల-సూక్ష్మ శక్తులన్నిటికీ మూలశక్తి, మూల ప్రకృతి కూడా! అట్టి ముఖ్య ప్రాణమే..,

- ప్రకృతిలో అగ్ని (Heat) రూపముగా అయి సర్వమును ఉత్తేజింపజేస్తోంది. ప్రకాశింపజేస్తోంది.
- ప్రాణశక్తియే వరుణదేవరూపుడై వర్షముగా కురుస్తోంది.

- దేవతలకు అధిపతి అగు ఇంద్రుడు ముఖ్య ప్రాణ సందర్శనా వైశిష్ట్యమే!
- భూమిపై కనిపించే నామ-రూపాత్మకమైనదంతా ముఖ్య ప్రాణ ప్రదర్శనమే (Manifestation of prana energy as physical form)

అంతేకాదు సత్తు (That which can be seen by physical Eyes) - అసత్తు (Which is non-Physical-eg.Emotions, opinions, interest etc.) రూపంగాను, **మార్పు-చేర్పులకు ఆవల అమృతరూపంగాను, సర్వ దేవతల రూపంగాను కనిపించేదంతా ప్రాణశక్తితత్త్వమే.**
రథచక్రము యొక్క ఇరుసులో ఆకులు ఇమిడి ఉన్నట్లుగా..



.... ఈ సర్వము ప్రాణభగవానుని యందే ప్రతిష్ఠితమై ఉన్నాయి.

- ఋక్కులు, యజస్సులు, సామములో కనిపించే స్తోత్రములు మంత్రములు, ఉపాసనలు, గానములు.

ఇవన్నీ ప్రాణాగ్నిలోనుండి విస్ఫులింగములవలె బయల్వెడలుచున్నాయి.

- బ్రహ్మతత్త్వవేత్తలగు బ్రాహ్మణుల జ్ఞానశక్తి, క్షత్రియులలో క్షేత్రశక్తి, సమస్త జీవుల పంచేంద్రియశక్తులు ప్రాణశక్తి ప్రదర్శనములే.

***ఇకప్పుడు..,***

**ఇంద్రియ దేవతలు (కర్మేంద్రియాలు - జ్ఞానేంద్రియాలు - మనస్సు) ప్రాణశక్తిని ఈ విధంగా స్తోత్రం చేయసాగాయి.**

***ఓ ప్రాణేశ్వరా! ముఖ్య ప్రాణమా!***

- మీరే ప్రజాపతి అయి, సర్వజీవరాసుల గర్భములందు లీలగా సంచారాలు చేస్తున్నారు।
- మరల మరల దేహాలు స్వీకరిస్తున్నది, వాటిని త్యజిస్తున్నదీ కూడా మీరే।
- ఈ కనబడే సర్వదేహాలతోను, సర్వ అనుభవాలలోను నివసిస్తూ ఉన్న మీకు **ఈ జీవులంతా** - శబ్దానుభవము, స్పర్శానుభవము, రూపానుభవము, రసానుభావము, గంధానుభవము, (ఇంతేకాకుండా) సర్వభావ- ఆవేశములు - ఇత్యాది అనుభవములన్నీ - **కానుకలుగా అనుక్షణం సమర్పించుచున్నారు**. మా మా కార్యక్రమములకు కర్త- భోక్త మీరే.
- మీరు అగ్ని స్వరూపులై సృష్టి అంతా నిండి ఉన్నవారై విరాజిల్లుచున్నారు. ఇంద్రియములను ఉపయోగించి ఈ జీవులు నిర్వర్తించే యజ్ఞ - యాగములలో సమర్పిస్తున్న హవిస్సులను దేవతలకు చేరవేసే వహ్నిదేవుడు మీరే! ఈ విధంగా హవ్యవాహకులై, తద్వారా (దేవతల ద్వారా) జీవులకు శుభములను ప్రసాదిస్తున్నారు. ఇంద్రియములగు మాకు పుష్టిని కలుగజేస్తున్నారు.
- అదేవిధంగా వంశీయులు-పితృదేవతలకు సమర్పించే 'స్వధా' రూపమగు పిండాహార సమర్పణను పితృదేవతలకు చేరవేసి, తద్వారా జాతి-వంశవృద్ధికి సహకరిస్తున్నారు. స్వాధా వాహక దేవత మీరే కదా! సంతానవృద్ధి చేతనే కదా, ఇంద్రియములమగు మేము అనేక దేహాలలో ప్రకాశిస్తున్నాము.
- ఓ ప్రాణదేవా! ప్రాణేశ్వరా! ప్రాణానందస్వరూపా! - ఋషులయొక్క సాధన వస్తువులన్నీ మీ రూపమే। అంతేకాదు 'సాధ్యము' అగు పరమసత్య వస్తువు కూడా మీరే! అంగీరసుడు ఇత్యాది మహర్షులు చూపుచున్న సత్యమార్గము మీరే। పరాకాష్ఠ ఆశయ సిద్ధి కూడా మీరే! అంగీరసములలోని (అగ్నికార్యములలోని) అగ్ని మీరే!
- హే ప్రాణ భగవాన్! త్రిలోకములకు నాధుడు అయినట్టి ఇంద్రుని తేజస్సు మీ రూపమే! రుద్ర తేజస్సు కూడా ప్రాణశక్తి స్వరూపులగు మీరే అయి ఉన్నారు. సృష్టికర్తవు (బ్రహ్మ), సృష్టి రక్షకుడవు (విష్ణువు), సృష్టి సంహారకుడవు (రుద్రుడవు) నీవేనయ్యా!

- ఆకాశంలో సంచారాలు చేస్తున్న సూర్యభగవానుడు కూడా మీరే! జ్యోతులకే జ్యోతివై ఈ లోకములన్నిటినీ తేజోమయం చేస్తున్నది మీరే! జ్యోతిర్జ్యోతిస్స్వయంజ్యోతిః! నమో నమః!
- ఓ ప్రాణశక్తి స్వరూపా! మీరు అభివర్షించటం చేతనే (Because of your devine raining) సర్వజీవులు తాము ఉన్నట్టి స్థానాలలోను, ప్రదేశాలలోను తాము కోరుకొంటున్న (తమకు తగియున్న) ఆహారము పొందుచున్నారు. జీవులందరినీ ఆ విధంగా ఎల్లప్పుడు ఆనందభరితుల్ని చేస్తున్నది మీరేకదా!
- సృష్టికి మూలపదార్థమగు నిర్వికారమగు వ్రాత్యుడవు. ప్రప్రథమ స్వరూపుడవు. సమిష్టి స్వరూపుడవు. సర్వమునకు భోక్త అయినట్టి 'ఏకర్షి' అనే పేరు గల అగ్ని మీరే! (You are the experiencer as well as Enjoyer of what ever all else that is present in the creation. You are the Al-present and Al-pervoding Fire / Heat).
- విశ్వమునకు ఆధారమైయున్న 'సత్' వస్తువు మీరే।
- **వయం ఆద్యస్య దాతారః!** (ఇంద్రియములగు) మేము మీరు భక్షించే పదార్థములన్నీ మీకు అందించేవారము మాత్రమే! వాటిని సంకల్పించేది, ఆస్వాదించేది మీరే!
- సమస్త జీవులను జీవింపజేయుచున్న వాయువుకు కూడా తండ్రి అయి ఉన్నవారు.

ఓ ప్రాణప్రదా! వాక్కులోను, చెవిలోను, నోటిలోను, (తదితర సర్వ ఇంద్రియములలోను) ఇంద్రియశక్తి రూపంగా విస్తరించి ఉన్నది మీరే! మీరు సర్వే సర్వత్రా విస్తరించి, సర్వమును ఉజ్జీవితముగాను, శోభాయమానముగాను, మంగళప్రదముగాను చేస్తున్నారు.

ఆ విధంగా మాయందు విస్తరించియున్నవారై మమ్ములను శుభప్రదంగాను, శక్తియుతముగాను తీర్చిదిద్దుతూనే ఉండటమును దయచేసి కొనసాగించండి.

అంతేగాని..,

**మా ఉత్క్రమీ!** మమ్ములను విడచి వెళ్ళకండి! ఎందుకంటే మాకు త్రాణ-ఉనికి ప్రదాత మీరేనని గమనించాము! ఒప్పుకుంటున్నాము! ఈ మూడు లోకాలలో ఎక్కడెక్కడైతే ఏదేది ప్రదర్శితమగుచూ, ప్రతిష్ఠితమగుచూ కనిపిస్తోందో,... అదంతా కూడా ప్రాణదేవుడవగు మీ వశములో ఉన్నాయనిమేమిప్పుడు శతథా, సహస్రథా గమనిస్తున్నాము. అందుచేత ఓ ప్రాణమహాత్మా! మీకు వేనవేల నమస్కారాలు. మాకు సంపద-మేధస్సు ప్రసాదించండి.

***

**శ్రీ పిప్పలాదమహర్షి:** విన్నారా బిడ్డలారా! ఈ విధంగా పంచభూతములైనట్టి పృథివి - ఆపః - తేజో - వాయుః - ఆకాశములు, పంచకర్మేంద్రియములు; పంచ జ్ఞానేంద్రియములు; మనస్సు → తమ తమ స్తోత్రములను, విన్నపములను ప్రాణదేవునికి సమర్పించినవై, తమను తాము ప్రాణస్వరూపములుగా అవగాహన-అన్వయము కలిగియున్నవై.., తిరిగి యథాతథముగా దేహమునందు తమ తమ క్రియలను నిర్వర్తించటానికి ఉపక్రమించసాగాయి.

కనుక ముఖ్యదేవత ప్రాణశక్తియే! ప్రాణేశ్వరుడే! ఆయనయే సమస్త దేహములలో ప్రాణశక్తిగా వేంచేసి ఉండి, -

- **విధారయన్తే।** - సమస్త ప్రాణులను ధరించుచున్నారు.
- **ప్రకాశయన్తే।** ప్రాణులందరినీ ప్రకాసింపజేయుచున్నారు.

**<u>అన్నిటికన్నా శ్రేష్ఠమైనది - ప్రాణమే।</u> పంచభూత, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, మనో విశేషాలన్నీ శరీరములోని దేవతలు. ప్రాణమే ముఖ్య దేవత।**

## 3వ ప్రశ్న

ఆ తరువాత...,

అశ్వలపుత్రుడు అయినటువంటి కౌసల్యుడు లేచి నిలుచున్నారు. పూజ్యపాదులు, బ్రహ్మర్షి అయిన శ్రీ పిప్పలాద మహర్షి ముందు ఈ విధంగా తన ప్రశ్నను నివేదన చేయసాగారు.

"హే భగవాన్! పూజ్యుడా! ప్రాణదేవుని యొక్క అధినాయకత్వము గురించి చాలా చక్కగా మాకు అర్థమయ్యేటట్లు కథా దృష్టాంతపూర్వకముగా బోధించారు. చాలా సంతోషము.

ఇప్పుడు నా సందేహమేమిటో కూడా, తమ ముందు వినమ్రుడనై, విన్నవించుకుంటున్నాను.

- అట్టి మహత్తరస్వరూపియగు ప్రాణశక్తి (ప్రాణతత్త్వము) ఎక్కడి నుండి జనిస్తోంది?
- ఏ రీతిగా ఈ దేహములలో ప్రవేశిస్తోంది?
- ఎట్లా తనను తాను పంచభూత- పంచకర్మేంద్రియ – పంచజ్ఞానేంద్రియ – మనో రూపాలుగా **ప్రవిభజ్యతే – విభజించుకొనుచున్నది?**
- దేనిచేత మరల మరొకప్పుడు ఈ భౌతిక దేహము నుండి నిష్క్రమిస్తోంది? మరొక దేహము ఎట్లా ఆశ్రయిస్తోంది?
- ఈ బాహ్య ప్రపంచమంతా ఎట్లా ధారణ చేస్తోంది? ఎట్లా భరిస్తోంది? ఆధి భౌతికము – ఆధి దైవికము అగు బాహ్య జ్ఞానమును ఎట్లా కలిగి ఉంటోంది? ఆధ్యాత్మికమగు అంతరంగమును ఎట్లా ప్రదర్శిస్తోంది.
- జీవుడు మరణించినప్పుడు, **"అయ్యో! ఈతని ప్రాణాలు పోయాయిరా!"** – అని బంధువులు అంటారు కదా! ప్రాణములు దేహమును విడచినప్పుడు, – ఎటుపోతున్నాయి?
- జీవుడు ఆధ్యాత్మికమైన అంతర్ – జ్ఞానము ధరించటం ఎట్లా?

**ఈ ప్రశ్నలకు మాన్యుడు – ఆత్మజ్ఞుడు అగు శ్రీ పిప్పలాద మహర్షి సమాధానం చెప్పసాగారు.**

**శ్రీ పిప్పలాద మహర్షి :** ఓ కౌసల్యా! చాలా చక్కటి, అతి ముఖ్యమైన ప్రశ్న వేశారు.

మీరు బ్రహ్మనిష్ఠుడు కాబట్టే ముఖ్యప్రాణము గురించి నేను చెప్పిన విశేషాలన్నీ విని, అట్టి ప్రాణతత్త్వము యొక్క ఉత్పత్తి గురించి ప్రశ్నించారు. మంచిది! నాకు చాలా సంతోషం.

ఓ కౌసల్యాశ్వలాయనా!

బ్రహ్మతత్త్వ జిజ్ఞాసువు కాబట్టి నీ ప్రశ్నకు తప్పకుండా సమాధానం చెప్పుతాను. తదితర శ్రోతలారా! మీరందరూ కూడా శ్రద్ధతో వినెదరు గాక!

-----

**ఆత్మన ఏష ప్రాణో జాయతే। ప్రాణము ఆత్మ నుండే** (From the Absolute Self) **ప్రాదుర్భవిస్తోంది.**

ఒక జీవుడు దీపమునకు అల్లంత దూరంగా నిలబడి ఉంటే, నీడ ఆతనిని ఆవరించి (ఆక్రమించుకొని ఉన్నట్లుగా) ఉంటుంది చూచారా! ఆ విధంగా ఈ ప్రాణము కూడా (నీడవలె) ఆత్మను ఆవరించి ఉన్నదానివలె ఉంటోంది.

ఇక, "ప్రాణము శరీరములో ఎట్లా ప్రవేశిస్తోంది?" అని కదా ప్రశ్న?

**మనస్సు యొక్క చర్యల కారణంగా ప్రాణము శరీరములయందు ప్రవేశించినదై ఉంటోంది.**

ఈ కనబడే సృష్టి అంతా కూడా శక్తి (ప్రాణతత్త్వము) యొక్క సంప్రదర్శనమే. బాహ్యములోని నామరూపములు, అంతరములోని మనో–బుద్ధి–చిత్తాదులు, వాటికి చెందిన అనుభవములు, అనుభూతులూ.. ఇవన్నీ కూడా ముఖ్యప్రాణ ప్రత్యక్ష రూపములే. అయితే 'శక్తి' ఉన్నప్పుడు 'శక్తి తనదైనవాడు' ఉండాలి కదా! మరి ప్రాణశక్తి ఎవరిది?

శక్తిమంతుడు → ఆత్మయే! అట్టి ఆత్మయొక్క చిత్తమే (ఇష్టమే) మనో–ప్రాణశక్తులుగా ఆవిర్భవిస్తున్నాయి.

శక్తిమంతుడు లేకుండా శక్తి ఉంటుందా? ఆత్మ లేకుండా ప్రాణము ఉండదు! ఆత్మయే ప్రాణరూపము దాల్చుచున్నది. ఆత్మ–ప్రాణము పరస్పరము అనన్యము, అవిభాజ్యము కూడా.

ఒకడు ఒకవైపు వెళ్ళుతూ ఉంటే ఆతనిని ఆతని నీడ అనుసరిస్తూనే ఉంటుంది కదా! నీడకు ఆ వ్యక్తి కంటే వేరైన ఉనికి ఉంటుందా? లేదుకదా! అట్లాగే వాస్తవానికి ప్రాణ శక్తికి ఆత్మకంటే వేరైన – ప్రత్యేకమైన అస్థిత్వము లేదు. ఆత్మకు వేరైనట్లుగా చూస్తే శక్తి వేరుగా ఉండజాలదు. "ఒక బలవంతుడగు వానిలో బలము వేరు. ఆతడు వేరు".. అని మనం అంటామా? **ఆతనికి వేరుగా బలమునకు అస్థిత్వము ఉండదుకదా! ఆత్మకు వేరుగా ప్రాణశక్తికి అస్థిత్వము ఉండజాలదు.**

ఆత్మ యొక్క సంకల్ప చమత్కారము చేతనే ప్రాణశక్తికి అస్థిత్వము స్వభావసిద్ధముగా ఆత్మకు అభిన్నమై కలుగుచున్నదని అభివర్ణించబడుతోంది!

**ఆత్మనుండి ఆత్మ యొక్క సంకల్పం చేతనే ఆత్మకు అభిన్నమై, ఆత్మ యొక్క నీడవలె ప్రాణశక్తి బయల్వెడలుతోంది.** అట్టి ముఖ్యప్రాణము ఇక ఇతర ప్రాణశక్తులైనట్టి ప్రాణ–అపాన–వ్యాన–ఉదాన–సమానములను, కర్మ–జ్ఞానేంద్రియాదులను నియమించుతోంది. పర్యవేక్షిస్తోంది

కూడా. (Appointing as well as supervising). ఒక సామ్రాట్టు తనయొక్క పాలనాధికారంచేత-సేవకులను, గ్రామాధికారులుగా నియమించి, వారంతా ఆయా గ్రామాలను పరిపాలిస్తూ ఉంటే తాను మాత్రం వేరుగా ఉండి అంతా పర్యవేక్షిస్తూ ఉంటాడు కదా! పర్యవేక్షకుల ద్వారా, తానే నిర్వహిస్తూ ఉంటాడు. అట్లాగే ముఖ్యప్రాణము సర్వ తదితర ప్రాణశక్తులను పర్యవేక్షించటం జరుగుతోంది. ఇతర తత్త్వాలన్నిటినీ వినియోగిస్తూ ప్రకృతి రచనా లీలను విలాసంగా కొనసాగిస్తోంది. ముఖ్యప్రాణము ఆత్మ యొక్క విన్యాసమే కనుక **<u>అంతా కూడా ఆత్మ విన్యాసమే.</u>**

**"ఆత్మ సర్వదా అనన్యము. ఆత్మకు వేరుగా ఎక్కడా ఏదీ లేదు" - <u>అనునది వేద మహావాక్యము.</u>**

కాబట్టి...,

ఈ దృశ్యరచనా విలాసమంతా ముఖ్య ప్రాణశక్తిదే!

కానీ..,

అట్టి ముఖ్యప్రాణశక్తి ఆత్మకు తన యొక్క నీడవంటిది!

అటువంటి **"<u>ముఖ్యప్రాణశక్తి</u>"..,**

---

**పాయూపస్థే అపానం।**

**పాయువు-ఉపస్థ (లేక) విసర్జన - జననేంద్రియాలలో అపానము** → అపానమును ముఖ్య ప్రాణమే నియమిస్తోంది. అట్టి **అపాన ప్రాణము** (Energy of pushing out), పాయువు, ఉపస్థలందు క్రియాశీలకమై ఉంటోంది.

---

**<u>చక్షుః శ్రోత్రే ముఖ నాసికాభ్యాం ప్రాణః।</u>**

**కళ్లలోను - చెవులలోను - నోరులోను - ముక్కులోను చూపు - వినికిడి - రుచి - వాసన.. శక్తుల రూపంగా పంచ ప్రాణములలో మొదటిది అగు ప్రాణము.** → ఇద్రియార్థములందు స్వయముగా పర్యవేక్షించేది ***ప్రాణము.***

---

**<u>స్వయం ప్రాతిష్ఠతే మధ్యేతు - సమానః।</u>**

**దేహము యొక్క మధ్య భాగములో సమాన ప్రాణము ప్రతిష్ఠితమై యున్నది.**

**<u>ఏష హి ఏతత్ హుతమ్ అన్నం సమం నయతి।</u>**

**<u>తస్మాత్ ఏతః సప్తార్చిషో భవతి।</u>**

**ప్రాణము జఠరాగ్నిగా పొట్టలో ప్రవేశించి 'అన్నము'ను సమ (రస) రూపంగా చేస్తూ ఉన్నది. అట్టి అగ్ని నుండి సప్త (7) జ్వాలలు బయల్వెడలుచున్నాయి.**

→ సమాన వాయువుగా సంచారాలు చేస్తోంది. పొట్ట భాగములో సమాన ప్రాణము జఠరాగ్ని రూపము దాల్చినదై ఆహుతి ఇచ్చిన అన్నమును (జీవుడు తిన్న ఆహారమును) రసరూపంగా మార్చి శరీరములోని అన్ని భాగములకు సర్వ సమానంగా పంచిపెడుతోంది. జీర్ణం చేయటం ద్వారా అన్నము వంటబట్టేడట్లుగా చేస్తోంది. అట్టి ఆహార రసాగ్ని నుండి (కన్నులు - చెవులు-ముక్కు రంధ్రాలు - నోరు - అనబడే) **సప్తార్చిషో భవంతి**-ఏడు జ్వాలలు ఏర్పడినవై (వెలుగుచున్నవై) ఉంటున్నాయి.

---

**<u>నాడులలో వ్యానప్రాణము</u>** - ఆత్మచైతన్యజ్యోతి యొక్క కళ (మరియు) 'అంశ' అగు జీవాత్మ-ప్రతి ఒక్కరి హృదయస్థానములో కట్టెలు లేని అగ్నివలె - తేజోమయమై వెలుగొందుతోంది.

**<u>హృదివి ఏష ఆత్మా।</u>** - అటువంటి దివ్యస్థానము నుండి 101 నాడులు ఆత్మోత్తేజితమై దేహమంతా విస్తరించినవై ఉంటున్నాయి.

**<u>(అత్ర ఏతత్) ఏకశతం (101) నాడీనాం। తాసాం శతం, శతమ్ ఏకస్యాం ద్వాసప్తతిః ద్వాసప్తతిః ప్రతిశాఖానాడీ సహస్రాణి భవస్త్యాసం 'వ్యాన' చరతి।।</u>**

- ఆ 101 నాడులలో ఒక్కొక్క దానిని (100×100గా) 72 ఉపనాడులు (మొత్తం 72,000 నాడి-ఉపనాడులు) దేహము యొక్క ప్రతి అణుప్రాంతము వరకు విస్తరించి ఉన్నాయి.
- ఆ 72000 నాడి - ఉపనాడి - శాఖానాడులలో రాక-పోకలు నిర్వర్తిస్తున్న ప్రాణశక్తిని **"వ్యానవాయువు"** అని పిలుస్తున్నారు.

| | | |
|---|---|---|
| **ఊర్ధ్వంగా (ఉదాన ప్రాణము)**<br>**అథ ఏకయో ఊర్ధ్వ ఉదానః।** | → | ఆ 101 నాడులలో ఒకానొక నాడి ఊర్ధ్వముగా (సహస్రార పర్యంతము) ప్రసరిస్తున్నదై (విస్తరించినదై) ఉంటోంది. జీవుడు-దేహములోని ఊర్ధ్వనాడిలో ఉదాన ప్రాణవాహకుడై బుద్ధితో సంచారాలుపైకి - క్రిందికి నిర్వర్తిస్తున్నాడు. ఈతడు కర్మలననుసరించి ఈ దేహానంతరము కూడా ఉదాన వాయు సమేతుడై 101వ నాడి నుండి ముందు ముందు ప్రయాణము కొనసాగిస్తున్నాడు. |
| **ఉదానవాయు వాహకుడై** | → | పుణ్యకర్మలచే - సుఖమయమగు పుణ్యలోకములకు (స్వర్గం ఇత్యాదులు), |
| **పుణ్యేన పుణ్యం లోకం నయతి।**<br>**పాపేన పాపమ్। ఉభాభ్యాం** | → | పాపకర్మలచే - దుఃఖము, ఆదుర్దాల, అజ్ఞానము వేదనలతో కూడిన పాపపు లోకాలకు, (అధోలోకాలకు), దుఃఖ అవేదన గతులకు, |
| **ఏవ మనుష్యలోకమ్॥** | → | ఉభయ రీతులైన కర్మలు సమానంగా ఏర్పడి ఉన్న సందర్భాలలో → మనుష్యలోకమునకు ప్రయాణిస్తున్నాడు. |

(ఆ ఏక ఊర్ధ్వనాడిని 'సుషుమ్న' అని యోగశాస్త్ర వ్యవహార నామము)

ఇదంతా అంతర ప్రాణతత్త్వవిశేషం. ఇక..,

## విశ్వ-బాహ్య పంచ ప్రాణములు

**బాహ్య ప్రాణః ఆదిత్యో హ వై విశ్వగత ప్రాణః ఉదయతి। ఏషహి ఏనం చాక్షుషం ప్రాణమ్ అనుగృహ్ణానః॥**

- ఆదిత్యుడే (సూర్యుడే) బాహ్య ప్రాణస్వరూపుడు సప్రాణ స్వరూపుడు.

ఎందుకంటే, ఆదిత్యుడే అటు కనబడే సమస్తముపై వెలుగును ప్రసరింపజేయుచు, ఇటు చక్షువులకు దృష్టిని ప్రసాదిస్తున్నారు. చూపును, దృశ్యమును ఒకచోటికి తెచ్చి, ఫలదీకరింపజేస్తున్నారు. అందుచేత సూర్యుడు సృష్టిలో (దృశ్యములో) ముఖ్య ప్రాణ స్వరూపుడుగాను, విశ్వదేవతగాను-యోగులు, ప్రాజ్ఞులు సందర్శిస్తూ, ఉపాసిస్తున్నారు. ఆదిత్యుడే కనులలో చూపుగా వెలుగొందుచున్నారు. ఆదిత్యుడే సూర్యగోళంలో తేజో రూపుడై విశ్వమంతా వెలుగుతో నింపివేస్తున్నాడు.

**విశ్వ అపాన ప్రాణము :**

భూమియందు ఏ దేవతా ప్రజ్ఞలు అనువర్తిస్తున్నాయో, **అవన్నీ పరమ పురుషుని (బాహ్య) అపాన ప్రాణము యొక్క తేజోఅంశలే.** అదే అపానము దేహములో (పూర్వం చెప్పుకున్నట్లుగా), అపాన ప్రాణమై కూడా ఉన్నది. బాహ్య అపానమే దేహములోని అపానమును తన వశంలో (తనయొక్క ఒక కిరణముగా) కలిగి యున్నది. అనగా **విశ్వ అపాన వాయువు దేహములో 'అపాన వాయువు' అనే అంశను/ కిరణమును** అనుగ్రహిస్తోంది. సృష్టిలోని దేవతా ప్రజ్ఞలను సృష్టియొక్క సహకారి కారణాలుగా ముఖ్యప్రాణమే ప్రదర్శిస్తోంది!

**స ఏష పురుషస్య అపానమ్ అవష్టభ్య** - భూమ్యాకాశముల మధ్యను అంతరాళంగాను (విశ్వ)సమాన వాయు సంచారం జరుగుతోంది. విశ్వప్రాణ పురుషుడే సమానప్రాణము. ఆ సమాన ప్రాణమే సర్వ దేహములలో సమాన వాయుత్వముగా ఉండి సర్వమును పర్యవేక్షించటం, నిర్వహించటం జరుగుతోంది! ముఖ్య ప్రాణ భగవానుడే సమానమును ధరించి - వ్యానవాయువుగా ఉన్నారు.

**యత్ ఆకాశః స సమానో। వాయుః వ్యానః।** ఆకాశమే సమాన ప్రాణము. వాయువు ప్రాణపురుషుని వ్యాన ప్రదర్శనము.

**విశ్వ ఉదానము** : తేజో హ వా ఉదానః।

తేజస్సు (అగ్ని)యే విశ్వఉదాన వాయువు.

**తస్మాత్ ఉపశాంత తేజాః పునర్భవమ్ ఇంద్రియైః - మనసి సంపద్యమానైః॥**

దేహము నందు విశ్వ ఉదానవాయు-అంశ రూపమగు అగ్ని సమసిపోతూ ఉన్నప్పుడు, ఇక ఆ జీవుడు దేహములోని మనస్సుచే కేంద్రీకరించబడిన ఇంద్రియములను (ఇంద్రియార్థములను) విరమించుచున్నాడు. మరొక దేహమును ఆశ్రయిస్తూ, పునర్జన్మను పొందినవాడగుచున్నాడు. **ఉపాన ప్రాణ ప్రదర్శితరూప అగ్ని - దేహము నుండి విరమించటమే 'మరణము'. పునః - దేహ ప్రవేశమే 'జననము'.**

## పునర్జన్మ

ఆ విధంగా ఉదాన ప్రాణ రూపమగు అగ్ని (Temparature) దేహములో రహితమగుచూ ఉండగా ఆ దేహము నిస్తేజమై ఆ దేహికి దేహము దృష్ట్యా మరణము సంక్రమిస్తోంది.

ఇక, ఆ తదుపరి..,

ఆ దేహి - నిస్తేజమయిన అప్పటి వరకు సజీవమైయున్న ఆ భౌతిక దేహముతో ఆ మరణ సమయము వరకు ఎట్టి చిత్తము (ఇష్టము+భావావేశము) కలిగి ఉంటున్నాడో-,

ఆ తీరైన మనస్సుతో (ఆలోచన - ఆవేశాదులతో) - **సూక్ష్మమగు ముఖ్యప్రాణమును సమీపిస్తున్నాడు.**

| |
|---|
| స్థూల దేహము → అన్నమయకోశము. |
| సూక్ష్మదేహము → మనోమయ-ప్రాణమయ విజ్ఞానమ-ఆనందమయకోశములు. |
| జీవాత్మ → ఆత్మయొక్క - సందర్భములతో - **తాదాత్మ్య - 'అంశ' రూపము.** |

ప్రాణము తన యొక్క ఉదానతత్త్వమగు అగ్ని (Temparature) తో సహా జీవాత్మతో కూడినదై, ఆ జీవాత్మ యొక్క సంకల్పానుసారము మరొక లోకములోనికి (దేహములోనికి) ప్రవేశించటం జరుగుతోంది. అది జీవాత్మ యొక్క పునర్జన్మ రూపముగా చెప్పుకోబడుతోంది. కనుక ముఖ్యప్రాణము జీవాత్మ యొక్క ఆనందకోశమును (ఇచ్ఛను) సిద్ధింపజేయటం జరుగుతోంది.

అనగా..,

- ఆత్మకు పునర్జన్మ లేదు. మొదటి జన్మయే లేదు. ఇక పునర్జన్మ ఎక్కడిది?
- దేహము జడము కాబట్టి 'మరణము' ఆపాదించలేము.
- దేహములకు ప్రాణ వాహనముతో మనస్సును అనుసరించి రాక-పోకలు కలుగుతూ ఉంటాయి.
- కల్పిత మాత్రము, ఊహా నిర్మితము - అగు మనస్సే = దేహముల రాక-పోకల (లేక) కలయిక-విడిపోవుటలను (లేక) జనన-మరణములను మననముచే పొందుతోంది. అందుచేత మనస్సే బంధము. మనస్సే మోక్షము కూడా.

ఏ విద్వాంసుడు మనం చెప్పుకున్న ప్రాణము యొక్క **"సర్వవ్యక్తత్వము"**ను, **"దేహ-దేహాంతర వాహకత్వము"**ను తన యొక్క ప్రజ్ఞతో గ్రహిస్తాడో.., అట్టివాని యొక్క మనో-కర్మేంద్రియ - జ్ఞానేంద్రియాది సంపద - **'మృతత్వము'**ను అధిగమించినవై **అమృతత్వమును సంతరించుకుంటున్నాయి.**

ఎవ్వరైతే..,

- ఆత్మయందు లీలగా సంఘటితమగుచున్న ముఖ్య ప్రాణోత్పత్తి గురించి, (అంతేకాక)..,
- ఆత్మయే అయి ఉన్న ప్రాణశక్తి యొక్క పంచ ప్రాణవిభూతుల గురించి,
- ఆత్మయొక్క ముఖ్య ప్రాణ విభూతిత్వమును (సర్వత్రా సర్వదా వ్యాపించి ఉండటమును) గురించి,
- ఆత్మ యొక్క **అంతః ప్రకృతిని, బహిర్ -ప్రకృతిని గురించి -**

అనుభవ-అనుభూతి పూర్వకంగా ఎరుగుచున్నాడో, నిత్యానుభవుడు అగుచున్నాడో, - అట్టివాడు అమరుడు (మృత్యురహితుడు) అగుచున్నాడు!

**ఇది ప్రాణశక్తి యొక్క కథనము. నిశ్చలమగు ఆత్మయొక్క శక్తి ప్రదర్శనమే - ప్రాణము.**

## 4వ ప్రశ్న

**అప్పుడు గార్గ్య వంశీయుడైనట్టి సౌరాయణుడు లేచి నిలుచున్నారు. గురుదేవులకు నమస్కరించారు. ఈ విధంగా ప్రశ్నించారు.**

హే భగవాన్! పిప్పలాదమహర్షీ!

ఈ జీవుడు జాగ్రత్- స్వప్న- సుషుప్తులు అనుభవరూపంగా పొందుచున్నాడు కదా! ఒక పురుషుడు (జీవుడు) నిదురిస్తున్నప్పుడు ఆతనిలో ఏఏ విశేషములు నిద్రను అనుభవిస్తూ ఉంటున్నాయి? ఏవేవి మేల్కొనియే ఉంటున్నాయి?

- స్వప్న సందర్భములో కలలు కంటున్నది ఎవరు? (జీవుడా? మనస్సా? ప్రాణశక్తియా? బుద్ధియా? ఇంకెవరన్నానా?)
- నిద్రిస్తున్నప్పుడు సుఖము ఎవరికి? (జీవునికా? దేహమునకా? మనస్సుకా? ప్రాణశక్తికా? ఇంకెవరికికన్నానా?)
- నిదురిస్తున్నప్పుడు జాగ్రత్ అనుభవాలన్నీ ఎక్కడ దాగుచున్నాయి? ఎందులో ఉంటున్నాయి? (జీవునిలోనా? ఆత్మలోనా? మనస్సులోనా? ప్రాణశక్తి యందా? మరింకెక్కడన్నానా?)

**శ్రీ పిప్పలాద మహర్షి సమాధానము :**

ఓ గార్గ్యా! మహనీయులు జాగ్రత్-సుషుప్తులను గమనించినవారై సశాస్త్రీయంగా ఏమని చెప్పుచున్నారో - విను.

"సూర్యుడు ఆకాశంలో ప్రకాశిస్తూ ఉండగా, ఆయనయొక్క అసంఖ్యాక కిరణజాలములు భూమిపై అసంఖ్యాక స్థానములపై ప్రసరిస్తున్నాయి కదా! ఆ సాయంకాలము ఏం జరుగుతోంది?

సూర్యుడు అస్తమించినప్పుడు సూర్యకిరణాలు ప్రసరించటము - ఇళ్ళు, తటాకములు, వీధులు, మొదలైన సమస్త భౌతిక రూపములను ప్రకాశింపజేయుటం - ఇదంతా ఏమౌతోంది? సూర్యకిరణాలు సూర్యునిలో ప్రవేశించుచున్నాయి. ఇక బాహ్యమైనయున్న తదితరమంతా ప్రకాశరాహిత్యము పొందుచున్నాయి కాదా!

మరల ఉదయము సూర్యుడు ఉదయించినప్పుడో? సూర్యకిరణాలు మరల అంతటా ప్రసరిస్తున్నాయి. అన్నీ కూడా ఇతఃపూర్వము వలెనే ప్రకాశమానమగుచున్నాయి! రాత్రి దృశ్యమంతా చీకటిచే కప్పబడినదై కళ్లకు కనబడనిదై ఉంటోంది. సూర్యోదయం కాగానే అంతా వెలుగులో కనబడసాగుచున్నాయి.

అదేవిధంగా..,

ఈ ఇంద్రియ - దేహ-జాగ్రత్-స్వప్న భావ స్వరూప కిరణాలు గాఢనిద్రాసమయంలో దివ్యము అగు ఆత్మకు చెందిన - చంచలరహిత మనో విభాగమునందు ఏకీభూతమగుచున్నాయి.

అందుచేత నిద్రాసమయంలో ఈ దేహి (జీవాత్మ) బాహ్యేంద్రియములతో - ఏదీ వినటం లేదు. చూడటం లేదు. వాసన చూడటం లేదు. రుచి చూడటం లేదు. స్పర్శించటం లేదు. (స్పర్శానుభవము పొందటం లేదు). మాటలాడటం లేదు. ఏదీ తీసుకోవటం లేదు. ఇవ్వటం లేదు. విసర్జించటమూ లేదు.
అయితే, (1) ప్రాణము (2) జ్ఞాపకము చేసుకోకలిగినట్టి సంస్కార స్వభావము - ఈ రెండూ ప్రవర్తనశీలమైయే ఉన్నాయి.

**జీవుడు గాఢనిద్రా పరవశుడై ఉండగా..,**

ఈ దేహ పట్టణంలో 'పంచప్రాణములు' అనే పంచాగ్నులు మాత్రము జాగరూకులై ఉంటున్నాయి. జ్ఞాపకములు దాచబడినవై ఉన్నాయి. **గార్హపత్యోవా ఏషో అపానో::** "అపాన ప్రాణము" అనే గార్హపత్యాగ్ని నాడీవ్యవస్థలోని క్రింది భాగంలో ప్రసరిస్తూ ఉంటుంది. అపానము సర్వవేళలా ఉరకలిడుతూ పనిచేస్తూ ఉంటుంది!

**వ్యానో అన్వాహార్యాపచనో :: వ్యానము అన్వాహార్యపచనాగ్ని!**

- ఆహారమును పచనము చేసి రస స్వరూపంగాను - శక్తి రూపంగాను మార్చి నాడుల పర్యంతము సంపుటకు కారణ మగుచున్న అగ్ని - "అన్వాహార్య పచనాగ్ని".
- ఇది హృదయమునకు ఎడమవైపుగా (దక్షిణ దిక్కుగా) ఉంటుంది. అందుచేత యజ్ఞపరిభాషలో 'దక్షిణాగ్ని' అని కూడా అంటారు.

**<u>అహవనీయాగ్ని</u> → యత్ గార్హపత్యాత్ ప్రణీయతే ప్రాణయానాత్ ఆహవనీయాత్ ప్రాణః -** గార్హపత్యాగ్ని నుండి ప్రాణశక్తి తీసుకొని రాబడుతూ ఉంటుంది. ప్రాణమునకు అపానము నుండి చంచలనము కలుగుతున్నది. కనుక ఇక్కడ సుషుప్తి సమయంలో 'ముఖ్యప్రాణము' అహవనీయాగ్నిగా చెప్పబడింది. సుషుప్తిలో ప్రాణములు నిదురించవు. సంచలనశీలమయ్యే ఉంటాయి.

**<u>సమానాగ్ని</u> → "యత్ ఉచ్ఛ్వాస-నిఃశ్వాసౌ ఏతాః ఆహుతీ సమం నయతి - ఇతి సమానః ::** ఇది 'ఉచ్ఛ్వాస-నిశ్వాస' అనే రెండు క్రియలను నిత్యము ఆహూతి (సమర్పణ) రూపముగా నిర్వర్తిస్తూ దేహమంతా ప్రాణశక్తిని సరిసమానంగా ప్రసరింజేస్తున్నట్టిది-సమానాగ్ని. నిద్రపోయినప్పుడు కూడా సమానాగ్ని తన విధులు నిర్వర్తిస్తూనే ఉంటుంది.

**<u>మనస్సు</u>** → యజమాని మనస్సును ఆత్మవద్ద (గాఢ నిద్రా సమయంలో) ఉంచి, ఆత్మతో ఏకము చేయుచున్నాడు. మెలకువ రాగానే మనసు-మననములు ఆత్మనుండి ఆత్మచేతనే 'అన్యము' అను స్థానమునకు తెచ్చుకు రాబడుచున్నాయి.

**<u>జీవుడు</u> → యజమాన ఇష్టఫలమేవ ఇతి ఉదానః** ఇష్టరూపమైనట్టి ఉదానము → జీవుని ఆత్మవద్దకు కొనిపోతోంది. ప్రతిరోజు నిద్రలో యజమానిని బ్రహ్మమునకు దగ్గరగా జేర్చునది ఈ ఉదానమే. ఉదాన ప్రాణముచే ఈ జీవుడు అన్యమంతా దాటివేసి, ఆవలగల అనన్యమగు ఆత్మతో 'మమేకము' అయి ఆనందము పొందుచున్నాడు.

ఈవిధంగా (1) ఆత్మతో ఏకము (2) ఆత్మకు అన్యము అనబడే నిద్రా–జాగ్రత్‌లను ఈ జీవుడు ప్రతిరోజు "సో అహమ్" అనుభవముగా పొందుచున్నాడు.

## స్వప్నము – మనస్సు యొక్క స్వీయ మహిమ

మనస్సు స్వప్నదశలో తన యొక్క మహిమనే స్వప్నదృశ్యరూపంగా కల్పించుకొని అనుభవిస్తోంది. స్వప్నములో **'వస్తురూప భావన'యే 'వస్తురూపానుభవము'**గా అయి, ఆత్మయొక్క స్వయం కల్పితుడగు **'అనుభవి'** (The Experiencer) చే ఆస్వాదించబడుతోంది.

**యత్ దృష్టం దృష్టమ్ అనుపశ్యతి** – ఈ మనస్సు ఏదేదైతే జాగ్రత్ అవస్థలో చూస్తూ ఉండటం జరుగుతుందో, అట్టివే యగు దృశ్యములను దృష్టిచే స్వప్నానుభవములుగా పొందుతోంది. (అనగా) జాగ్రత్‌లో చూచినదానినే ఈ జీవుడు స్వప్నముగా ఊహించుకొని (లేక) కల్పన చేసుకొని స్వప్న దృశ్యముగా చూస్తున్నాడు.

**యత్ శ్రుతం శ్రుతమేవ అర్థమ్ అనుశృణోతి** – పూర్వము వినినట్టి అర్థమునే మళ్లీ వింటోంది.

**దేశ–దిక్ – అంతరైశ్చ ప్రత్యనుభూతం పునఃపునః ప్రత్యనుభవతి।** – జాగ్రత్ సందర్భముగా వివిధ ప్రదేశాలలో, దిక్కులలో, భూమ్యాకాశ మధ్య స్థానాలలో (అంతరేచ), హృదయ అంతరంగంలో – ఏదేది అనుభవించబడినదో, – అటువంటి వన్నీ మరల మరల అనుభవముగా ఆహ్వానించి అనుభూతిగా కల్పించుకొని ఈ జీవుని మనస్సు స్వప్నానుభవమంతా పొందుతోంది.

వర్తమాన – పూర్వ – తత్‌పూర్వజన్మలలో జ్ఞాపకాలన్నీ స్వప్నంలో పునరావృతమౌతూ ఉంటాయి.

**దృష్టం చ – అదృష్టం చ** → ఒక దృశ్య విషయాన్ని (స్వప్నంలో చూస్తున్నది) – కళ్ళకు విషయం కాకుండానే భావన (feeling)కు ఆహారముగా (అనుభూతముగా) స్వప్న దృశ్యం అగుచున్నది. చూచినది – చూడనిది → ఈ రెండు కూడా స్వప్నములో మనోకల్పనగా సందృశ్యమానమగుచున్నాయి. ఎందుచేత? కళ్ళకు కనిపించే దృశ్యమునకు – మనస్సు **'భావన'**ను **జోడించటం చేతనే!**

**శృతంచ – అశృతంచ :** విన్నది – వినని కూడా స్వప్నంలో మనస్సుచే పూర్వానుభవములలోంచి కొని తేబడుచున్నాయి.

**అనుభూతం చ– అననుభూతం చ:** ఇతః పూర్వము అనుభూతమైనవి – అనుభూతం కానివి కూడా స్వప్నములో మనస్సు కల్పన చేసుకొని పొందుతోంది. స్వప్నములో కొన్ని అప్పటికప్పుడే కల్పన చేయబడుచూ ఉంటున్నాయి. **ఒకప్పటి అనుభవమునకు మరొకప్పటి సందర్భమును జోడించి స్వప్న దృశ్యముగా పొందబడుతోంది.** వేరు వేరు స్వప్నములలో, వేరువేరు కల్పనలు ఈ జీవునియొక్క స్వప్న పురుషకారముచే కల్పించబడి, పొందబడుచున్నాయి.

**సత్ చ– అసత్ చ :** నిజము అయినవి – నిజము కానివి కూడా స్వప్న ద్రష్ట మనోకల్పన చేసుకొని స్వప్న సందర్భంలో దర్శిస్తూ అనుభవించుచున్నాడు. (అనగా ఎప్పుడో జరిగినవి, ఎప్పుడూ జరగనివి కూడా పొందబడుచున్నాయి).

**– సర్వం పశ్యతి** → మనస్సు అన్నిటినీ స్వప్న సమయంలో.. చూస్తోంది!

**– సర్వః పశ్యతి** → ఈ మనస్సు తనను తానే అనేక రూపములుగా (స్వప్నంలో) చూచుకుంటోంది.

అయితే...,

**జాగ్రత్–స్వప్నములు రెండూ కూడా ఆత్మ యొక్క స్వకీయ కల్పనా చాతుర్యములే.** ఇంద్రియాలు గాఢ నిద్రాసమయంలో నిర్విషయత్వమగు మౌనము వహించి, తమ ఉత్పత్తి స్థానమగు మనస్సు యొక్క జాగ్రత్–స్వప్న సంబంధమైన పెట్టెలో దాచబడిన వస్తువుల వలె – దాగినవై ఉంటున్నాయి.

***అయితే ఆత్మ స్వరూపుడగు జీవుడు తనను తానే సర్వత్రా సర్వముగా, జాగ్రత్–స్వప్న–సుషుప్తి స్థానములు తనయొక్క 'కల్పన'గా చేసుకొని చూస్తున్నాడు.***

జీవుడు కొన్ని కొన్ని అనుభూతులకు, అనుభవములకు ప్రాముఖ్యత ఇవ్వటముచే – జాగ్రత్‌లో ఏర్పడిన సంస్కారాలు మనస్సు యొక్క స్వప్నాంశలో ఈ జీవుడు తనకు తానే ప్రవేశింపజేసుకుంటున్నాడు. అనేక విశేషాలు ఒకచోటికి జేర్చి దృశ్యమును స్వప్నసీమలో మనస్సే కల్పించుకొంటోంది. **జాగ్రత్–స్వప్నములకు చెందిన కల్పనాంశ ఈ జీవుడికి చెందినదేగాని, ఇందులో బాహ్యమగు వేరొకరి పాత్ర లేదు.**

**జాగ్రత్ సమయంలో** → జాగ్రత్ యొక్క అంతర్గత సంబంధాలు, సందర్భాలు, సంఘటనలు, దృశ్యములు మొ॥వి **"సత్యమే కదా"** అనిపిస్తున్నట్లే...,

**స్వప్న సమయంలో** → స్వప్నదృశ్యము **"సత్యమేగదా!"** అనియే మనస్సు అనుభవము పొందుతోంది!

జాగ్రత్ సమయంలో **"స్వప్నము కల్పనయేకదా!"** అని భావించబడుచున్నట్లే....,

స్వప్న సమయంలో **"జాగ్రత్ కల్పనయే కదా!"** అని భావించబడుతోంది!

అనేక జ్ఞాపములు గల **'జ్ఞప్తి'** అనే భోషాణము నుంచి.., కొన్ని జాగ్రత్ సమయంలో పాల్గొంటున్నాయి. తిరిగి జ్ఞప్తిలో ప్రవేశిస్తున్నాయి. వేరే కొన్ని స్వప్న సమయంలో పాల్గొంటున్నాయి. తిరిగి జ్ఞప్తిలో ప్రవేశిస్తున్నాయి.

**జాగ్రత్-స్వప్నములలో సందర్భపడుచున్న, (ఏర్పడుచున్న, రూపుదిద్దుకుంటున్న, జరుగుచూ ఉన్న) 'తీరు' అంతా ఒక్కటే। జాగ్రత్ స్వప్నమువంటిదే. స్వప్నము జాగ్రత్ వంటిదే.**

# సుషుప్తి

ఎప్పుడైతే ఈ దేహియొక్క (లేక) ఈ జీవుని యొక్క - (జగద్విషయములపై ఆలోచనల రూపంగా వ్రాలుచున్న) ఈ **మనస్సు** (స్వస్వరూపమైనట్టి ఆత్మ అను) **తేజస్సు**చే ఆక్రమించబడుతోందో,.. అప్పుడిక ఈ జీవుడు జాగ్రత్ దృశ్యమును గాని, స్వప్న దృశ్యమునుగాని దర్శించటం-అనుభవించటం-అనుభూతపరచుకోవటముల నుండి **పూర్తిగా విరమించుచున్నవాడై ఉంటున్నాడు.**

స్వప్నదర్శనము విరమించిన మరుక్షణము ఈ దేహములోనే దివ్యస్వరూపుడగు ఈ జీవుడు **నిర్విషయ గాఢ నిద్రా సుఖమును అనుభవించటం ప్రారంభించుచున్నాడు.**

అనగా **'విషయములు' అను బరువును దించుకొని తనయందు తానై ప్రశాంతపడుచున్నాడు.** మనస్సు స్వయంజ్యోతి స్వరూపము నందు లయమగుచుండగా జీవాత్మ దేవుడు → **"కేవలతేజో స్వరూపము, కేవల దృక్ స్వరూపము. కేవల ఎరుక స్వరూపము"-** ఆస్వాదిస్తూ, ఆత్మతో ఏకత్వానుభూతిని పొందుచున్నాడు.

అట్టి గాఢనిద్రా (సుషుప్తి) సమయంలో మనస్సే (జీవునిచే) రహితం చేయబడుతోంది కాబట్టి **'మనోచంచలత్వము'** అనే శ్రమ ఉండదు. అట్టి సంషుప్త్యనుభవము ప్రశాంతతను, మౌనానందమును సంతరించుకున్నదగుచున్నది. **ఇది సమాధి స్థితి యొక్క ఒకానొక కళావిశేషము వంటిది.**

"ఓ సద్గుణుడా! సౌమ్యుడా! సౌర్యాయణీ! కేవల తేజోరూపమగు సుషుప్తిలో జాగ్రత్ - స్వప్నానుభవాలన్నీ ఏమగుచున్నాయి? ఏరూపంలో ఉంటున్నాయి".. అనే ప్రశ్నలకు సమాధానంగా ఈ ఉపమానం విను.

ఒకానొకచోట కొన్ని పక్షులున్నాయి. అవన్నీ ఒక వృక్షంపై నివసిస్తూ ఉంటున్నాయి. అవి తెల్లవారగానే నిశ్శబ్దమును వీడి, శబ్దము పలుకుచూ, ఆహారం కోసం ఎటో - ఎటో తిరగటం నిర్వర్తిస్తున్నాయి. సాయంకాలము అయ్యేసరికి, చీకటి పడుచుండగా.., మరల చెట్టు మీదికి చేరి నిశ్శబ్దం వహిస్తున్నాయి.

జాగ్రత్ స్వప్నములలో ఈ మనస్సు, కర్మేంద్రియములు, శబ్ద స్పర్శాది జ్ఞానేంద్రియములు - ఇవన్నీ ప్రపంచములో తిరిగి - తిరిగి, సుషుప్తి సమయంలో ఆత్మను చేరుకొని ఆత్మయందు విశ్రమిస్తున్నాయి. వివిధ తన్మాత్రలు తిరిగి ఆత్మయందే ప్రతిష్ఠ కలిగినవై ఉంటున్నాయి. **అన్నీ ఆత్మయందే ప్రతిష్ఠితమై ఉన్నాయి.**

| | | |
|---|---|---|
| పృథివీ (భూమి) | - | తన్మాత్ర। స్థూలానుభవము. |
| ఆపః (జలము) | - | ఆపః తన్మాత్ర। రుచి అనుభవము. |
| అగ్ని | - | అగ్ని తన్మాత్ర। ఆకలి-దప్పికలు. |
| వాయువు | - | వాయు తన్మాత్ర। (స్పర్శ). |
| ఆకాశము | - | ఆకాశ తన్మాత్ర। చోటు-చోటులో ఉన్నదంతా। |
| (చక్షువులు (కళ్ళు-చూపు) | - | చూపు - చూడబడేదంతా। |
| శ్రోత్రం (చెవులు- వినిడికి) | - | వినికిడి - వినబడేదంతా। |
| ముక్కు | - | వాసన చూడటం - వాసన చూడబడేదంతా, **(ఆఘ్రాణానుభవం)** |

| | | |
|---|---|---|
| రుచి | – | రుచి – రుచిచూడబడేదంతా। |
| త్వక్ (చర్మము) | – | స్పర్శ – స్పర్శానుభవమంతా, స్పర్శించబడేదంతా (స్పర్శయితవ్యం చ)। |
| వాక్కు | – | మాట్లాడటం, మాట్లాడే విషయాలు, **వక్తవ్యం చ।** చెప్పబడే విషయములన్నీ। |
| హస్తములు | – | తీసుకోవటం – తీసుకోబడేదంతా। |
| ఉపస్థ (జననేంద్రియము) | – | ఆనందము – ఆనందం కలుగజేసే విషయాలన్నీ। |
| విసర్జనేంద్రియము (పాయుః) | – | విసర్జన – విసర్జించబడేదంతా। |
| రెండు పాదములు | – | నడకగా పోవుచుండే స్థానాలన్నీ। |
| మనస్సు | – | ఆలోచనలు – ఆలోచించుచున్న విషయాలన్నీ। |
| బుద్ధి | – | తెలివి – తెలియబడుచున్న విషయాలు, విశేషాలు, విచక్షించబడేదంతా। (Analysis and all those issues of such Analysis) |
| అహంకారము | – | అహంభావన – "నేను కదా కర్తను".. అనే అభిమానమంతా। |
| చిత్తము | – | జ్ఞాపకశక్తి – జ్ఞాపకము పెట్టుకొనేదంతా। |
| తేజః (కాంతి) | – | కాంతి (ప్రకాశము), ప్రకాశింపజేయటం, ప్రకాశింపబడేదంతా। |
| ప్రాణము | – | ముఖ్య ప్రాణము అద్దాని ధారణా – (ఐదు) రూపాలైనట్టి ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము (మరియు) విశ్వ ప్రాణము (లేక) సప్రాణము, ప్రాణధారణము, ప్రాణ స్వరూపమే అయిన ఈ దృశ్యమంతా। |

***ఇవన్నీ ఆత్మయందే సర్వదా ప్రతిష్ఠితమై ఉన్నాయి.***

– ఆత్మ నుండి బయల్వెడలి ఆత్మయందే ప్రదర్శితమైయున్నాయి. అగ్ని కణాలు అగ్ని కంటే వేరా? సూర్యకిరణాలు సూర్యబింబము (సూర్యుని ఉష్ణత్వము) కంటే వేరా? మట్టి బొమ్మలు మట్టికంటే వేరా? కాదు. అట్లాగే, ఇవన్నీ **ఆత్మకు అభిన్నమే. ఆత్మ నుండి బయల్వెడలి, ఆత్మయందే ప్రవర్తిస్తూ, ఆత్మయందే లయిస్తున్నాయి.**

<u>స్వప్నంలో కనిపించే –</u>

- నామ-రూపాత్మక ప్రదర్శనా రూపమైన **భౌతిక రూపాలు,**
- ప్రాణము, అద్దాని రూపములగు **పంచప్రాణాలు,**
- పంచ కర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములు, వాటి వాటి **అనుభూతులు, అనుభవములు,**
- మనస్సు, అద్దాని **భావనలు, స్పందనలు,**
- బుద్ధి, అద్దాని **యోచనాత్మకమై, విశ్లేషనాత్మకమైన, నిర్ణయాత్మకమై** ప్రదర్శనలు,
- చిత్తము, అద్దాని విశేషాలైన **ఇష్టములు, జ్ఞాపకములు,**
- అహంకారము, అద్దాని విశేషాలైన **"నేను చేస్తున్నాను- వింటున్నాను- దుఃఖిస్తున్నాను – సుఖిస్తున్నాను"..** ఇత్యాది విశేషాలు.

ఇవన్నీ కూడా **స్వప్నము ముగిసిన తరువాత – అవ్యక్తరూపము**(Unmanifested) **రూపం సంతరించుకుని ఆత్మయందు ప్రవేశించినవై, ఆత్మయందు ఏకత్వము పొందుచున్నవగుచున్నాయి.**

అట్లాగే జాగ్రత్‌యొక్క ప్రవేశ నిష్క్రమణములు కూడా ఆత్మయందే ఏర్పడుచు, ఆత్మకు అనన్యమై ఉంటున్నాయి.

**సుషుప్తి :** సమస్తము సుషుప్తిలో మౌనము వహించనవై ఉంటున్నాయి.

*(దృష్టాంతము : ఒక నవలా రచయిత నవలా కథనమంతా వ్రాస్తూ – వ్రాస్తూ "రేపు కొనసాగిద్దాంలే!" అని, కథ వ్రాయటం ఆపి నిద్రకు ఉపక్రమించగానే ఆ కథలోని పాత్రల లక్షణాలు, ఆతని కథా సంబంధమైన ఊహ ఆతనిలో అవ్యక్తత్వము సంతరించుకొని, ఆతని యందు మౌనం వహించి ఉన్నవై, ఆతనితో అభేదత్వము పొందినవగుచున్నట్లుగా..!)*

*ఆ మరునాడు ఉదయం రచన ప్రారంభించగానే, తిరిగి రచనావ్యాసంగ-ప్రవాహము ప్రారంభమగుచున్నట్లుగా।*

సుషుప్తి సందర్భములో ఈ జీవుని అవిద్య – అంతా కూడా అప్రదర్శితమవటం చేత జాగ్రత్ స్వప్నములకంటే అధికంగా ఆతడు ఆత్మయొక్క సామీప్యాన్ని – ఆస్వాదిస్తున్నాడు. గాఢనిద్ర సందర్భములో – ఆత్మ యొక్క మాధుర్యానికి అతిసామీప్యుడై ఉంటున్నాడు. అందుకే నిదురలేచిన తరువాత, **"హాయిగా నిద్ర పోయాను కదా!"**.. అని అనుకుంటూ ఉంటున్నాడు. ఇంతలోనే – (మరుక్షణం) గాఢ నిద్రాసుఖాన్ని ఏమరచి తిరిగి కర్మేంద్రియ– జ్ఞానేంద్రియ – మనో బుద్ధ్యాది విషయాలలో ప్రాణశక్తి వాహకుడై ప్రవేశించుచున్నాడు. అనగా గాఢనిద్రలోని అనుభవమైన 'హాయి'ని పోగొట్టుకొంటున్నాడు.

*ఇక, **ఆత్మజ్ఞాని** గాఢనిద్రలోని 'హాయి'ని జాగ్రత్–స్వప్న సందర్భములో కూడా కొనసాగిస్తూనే, జగద్విశేషాలలో నాటక పాత్ర వలె లీలగా వహించటం మాత్రమే వర్తిస్తున్నాడు. ఆత్మసమాధిత్వమును ధరించియే లీలావినోదంగా జాగ్రత్ – స్వప్నములను సందర్శిస్తూ ఉన్నాడు – (ఒక మగవాడు స్త్రీ పాత్ర ధరిస్తూ, తాను మగవాడినని మరువని తీరుగా).*

**అయితే..,**

ఈ జీవుడు సందర్భంగా జాగ్రత్ జగత్తులో జీవుడుగా ఉండవచ్చుగాక! **స్వతఃగా ఆత్మయే!** ఈ జీవుడే 'పురుషుడు' అని కూడా పిలువబడుచున్నాడు. ఈ జాగ్రత్ – స్వప్నాలలో

## జీవుడు–పురుషకారము

- **'ద్రష్ట'** (దర్శించువాడు–As perceiver)గా,
- **'స్పృష్ట'** (స్పృశించువాడు–Touch-Experiener)గా,
- **'శ్రోత'** (వినువాడు–Listener)గా,
- **'ఘ్రాత'** (వాసన చూచువాడు–As one who smells)గా,
- **'రసయిత'** (రుచి చూచువాడు–As one who tastes)గా,
- **'మంత'** (ఆలోచించువాడు –As thinker)గా,
- **'బోద్ధ'** ( తెలుసుకొనవాడు – As knower)గా,
- **'కర్త'** (కర్మలకు కర్తృత్వము వహించు వాడు – As Doer) గా **విజ్ఞానాత్మగా పురుషకారము వహిస్తున్నాడు.**

**అట్టి ఈ పురుషుడు (జీవుడు) – (ఉపాధిని, పైన చెప్పిన విశేషములన్నిటినీ ఉపకరణములుగా కలిగియున్నవాడు) – ఆత్మయందు ప్రవేశించుచున్నవాడై, ఆత్మకు అద్వితీయుడై, ఆత్మయందు సంప్రతిష్ఠితుడు అగుచున్నాడు. వ్యష్టిత్వమును అధిగమించినవాడై ఆత్మయొక్క సమిష్టితత్త్వముతోను, కేవలత్వముతోను ఏకత్వము అనుభవించువాడు అగుచున్నాడు.**

అట్టి పురుషుని యొక్క పరమాత్మతో ఏకత్వము

- కుంభాకాశానికి – గృహాకాశానికి అనంతాకాశానికి ఉన్న సంబంధము వంటిది (ఆదిశంకరుల వ్యాఖ్యానం). మూడిటిలో ఏకమగు ఆకాశమే ఉండి ఉన్నట్లు, – జీవ–ఈశ్వర–పరమాత్మలలో ఏకాత్మయే వేంచేసియున్నది.
- వివిధ తటాకాలలో ప్రతిబింబించే సూర్యబింబాలకు – ఆకాశంలో ప్రకాశిస్తున్న సూర్యునికి ఉన్న సంబంధము వంటిది. (ఆదిశంకర వ్యాఖ్యానం)

  **కనుక జీవాత్మ పరమాత్మకు వేరైనదని అనిపించటం అభాస** (A Kind of Illusion) **వంటిది.**

---

ఓ సోమ్యా! ఓ తదితర శ్రోతలగు స్నేహితులారా!
మనం చెప్పుకుంటున్న ఆత్మ అభేదము గురించి తెలుసుకొని, బుద్ధితో ఆస్వాదించటానికి ఫలశ్రుతిని చెప్పుచున్నాను. వినండి!
ఎవ్వరైతే.., స్వస్వరూపమగు *'ఆత్మ' గురించి* –
– **అఛాయమ్ :** – నీడ రహితమైనది (That which has no shade); (జీవాత్మగా అవటము – మొదలైన ధర్మములు లేనట్టిది).
– **అశరీరమ్** – దేహాదులు లేనిది;
– **అలోహితమ్** – రంగు –రూపుల పరిమితత్త్వము లేనిది;
– **శుభ్రమ్** – నిత్యనిర్మలమైనది;
– **అక్షరము** – వినాశన రహితము, సర్వదా యథాతథము, మార్పు – చేర్పులు లేనట్టిది;
అని తెలుసుకుంటాడో, ఆత్మదర్శమును – ఆత్మత్వము సంతరించుకుంటాడో.., అట్టివాడు →

| |
|---|
| **సర్వజ్ఞః** → సర్వము ఎరిగినవాడగుచున్నాడు. |
| **సర్వః** → అంతా తానే అయి ఆస్వాదిస్తున్నాడు. |

**'ఇది ఇట్లు'** అని ఆత్మజ్ఞుల, మహర్షుల, ఆధ్యాత్మశాస్త్రము యొక్క ప్రవచనము.

ఓ సోమ్యుడా! ప్రియాత్మస్వరూపుడా! ఆత్మస్వరూపులగు సమస్త శ్రోతలారా!

విజ్ఞానాత్మస్వరూపుడగు ఈ జీవుడు- ఇంద్రియ, ఇంద్రియాధి దేవతలతో సహా, పంచభూతానుభవాలు, ముఖ్యప్రాణశక్తితో కూడుకొని కూడా ఏ ఆత్మత్వము నందు ఉపశమించినవై ఉంటున్నాయో అట్టి అక్షర పరతత్త్వాన్ని ఎరిగినప్పుడు,

- సర్వజ్ఞుడు అవటమే కాకుండా..,
- ఆత్మత్వమునందు ప్రవేశించి తానే **సర్వాత్మకుడై, సర్వతత్త్వమై సర్వము అయి ప్రకాశించుచున్నాడు.**

తానే అన్నీ అయి, సర్వము తనయందే అయి వెలుగొందుచున్నాడు! **ఇతి ఆధ్యాత్మశాస్త్ర ప్రవచనః**

## 5వ ప్రశ్న

అక్కడి శిష్యులంతా శ్రీపిప్పలాదమహర్షి నాలుగు ప్రశ్నలకు సమాధానము విని లేచి నిలబడి మహర్షికి సాష్టాంగ దండ ప్రణామములు సమర్పించారు!

కొద్దిసేపైయ్యేడప్పటికీ గురు-శిష్యులంతా ఆయా స్థానాలలో తిరిగి సుఖాశీనులైయ్యారు. అప్పుడు శిబిపుత్రుడైనట్టి సత్యకాముడు లేచి నిల్చుని, శ్రీ పిప్పలాదమహర్షికి నమస్కరించి తన ప్రశ్నను ఈ విధంగా నివేదించసాగారు.

హే భగవంతుడా! మహర్షీ!

ఈ జీవులలో (మనుష్యులలో) ఎవ్వరైతే దేహము నుండి దేహాంతరమునకు (ఒక దేహము నుండి మరొక దేహమునకు.. మరణానంతరము) ప్రయాణిస్తూ "ఓం"కారము యొక్క శబ్దమును - అర్థమును సముచ్చరణ చేస్తూ మనస్సును నిలిపి ఉంచుతాడో..,

అట్టివారు.., **కతమం వావ లోకం జయతీతి?**

- ఏఏ లోకములను జయిస్తున్నారు? ఏఏ లోకములు త్యజించివేస్తున్నారు?
- ఏ ఏ లోకములను పొందుచున్నారు? (లేక) కలిగిఉంటున్నారు?

**శ్రీ పిప్పలాదమహర్షి :** నాయనా! సత్యకామా! ఓంకారము అనగా బ్రహ్మమే! (ఒక నాణెమునకు రెండు వైపులు ఉన్నట్లుగా) 'ఓం'కార సంజ్ఞారూపమగు బ్రహ్మమునకు రెండు రకములైన ప్రయోజనములు ఉన్నాయి.



| అపరము - సాకారము. | పరము-నిరాకారము. |
|---|---|
| (వ్యక్తరూపము) (హిరణ్యగర్భ సృష్టిరూపము). | అవ్యక్తము-నిర్గుణము. |
| నామరూపాత్మకము. | కేవలము. నామ-రూపములకు అతీతము. |



'ఓం' కార రూపార్థము సర్వ సమగ్రమైనది. అందుచేత ఓంకారోపాసకుడు **సాధన సమయం**లో ఆ పర - అపరములలో ఏదో ఒకదానిని (అన్వేతి) పొందుచున్నాడు.

ఆ సాధనం పరిపక్వత సంతరించుకొన్నప్పుడు.. ఇహ-పరభేదం నశిస్తోంది! **అది ఎట్లాగో చెప్పుతాను. విను.**

**ఓంకారము యొక్క త్రిమాత్రలు (మాత్ర** = Phase, Dimension)

ఓం = అ + ఉ + మ = స్థూల రూపోపాసన + సూక్ష్మరూపోపాసన + సూక్ష్మాతి సూక్ష్మోపాసన

### (1) 'అ' కార ఏకమాత్రోపాసన → భౌతికతతో ఏకత్వము - భౌతిక రూపధ్యానము

ఏ ఉపాసకుడైతే మూడిటిలో ఒక 'మాత్ర'ను మాత్రమే ('అ'కారము, పరమాత్మను సాకారుడుగా) ధ్యానిస్తూ ఉంటాడో, స్థూలరూపోపాసకుడై ఉంటాడో.., ఆతడు పరమాత్మను "ప్రథమ పురుష" (As Third Person= He, She, It)గా ధ్యానించినవాడగుచున్నాడు.

| **"ఓం =** | ఈ జగత్తుకు ఆధారమై, ఆవల ఉండి ఇదంతటికీ కారణమైన వాడుగా ద్వైతోపాసన | 'అ' కారము ప్రథమమాత్ర - ప్రథమ పురుష (Third person) (He, She, It, they them) |
|---|---|---|

(The Dovotee is looking at Divinity as something else than the world as well as himself).

'అ' కార రూప ఏకమాత్రోపాసన నిర్వర్తిస్తున్న ఉపాసకుడు సంవేదితుడై సిద్ధిని పొందినవాడై, కొన్ని సుఖలోకములలో - ప్రవేశించి ఎప్పుడో తిరిగి భూమిపై జన్మలకు వస్తున్నాడు. ('పునరావృత్తి' - అనే ధర్మము ఉంటుంది).

మరల భౌతిక భావనను (అభిసంపద్యతే) పొందుచున్నాడు. మొదటి మాత్ర అయినట్టి 'అ'కార (రూపమైన) ఋక్కులు ఆతనిని **"మనుష్యలోకమ్ ఉపనయంతే।"**.. మనుష్యలోకమునకు తీసుకొని వస్తున్నాయి.

అట్టి మనుష్య లోకములో ఆతడు తపస్సు - బ్రహ్మచర్యము లందు మరింత శ్రద్ధ కలిగినవాడై ఘనత వహిస్తున్నాడు.

అనగా, (ఈతడుమరల ప్రయత్నశీలుడు అగుచున్నాడు.

(ఏకమాత్రోపాసన = పరమాత్మ స్థూలరూపుడుగా పురాణాలలో వర్ణించిన శివ-విష్ణు ఇత్యాది భౌతిక రూపముగా ఉపాసించుటకు పరిమితమవటము).

## 2. ద్వమాత్రోపాసన

### ద్వమాత్రేణ "మనో"

#### మనో రూపముతో ఏకత్వము మనోరూపధ్యానం

తరువాత దశలో ఆ ఓంకారోపాసకుడు స్థూల+సూక్ష్మ = ద్విమాత్రలను ధ్యానము చేస్తున్నవాడై, అదేరీతిగా ప్రయోజనము పొందుచున్నాడు. మనస్సుతో ఏకత్వము పొందుచున్నాడు! 'నేను మనోరూపుడను - సూక్ష్మదేహిని' అను భావనను సంతరించుకుంటున్నాడు!

**(1)** **అ** → ఆధారమైన దైవము యొక్క ఉపాసన

**(2)** **ఉ** → ఈ దృశ్యమంతా ఆ దైవము యొక్క సందృశ్యరూపమే!

అనగా.., - పరమాత్మ వీరిచే **"స్థూల-సగుణ / సూక్ష్మగుణద్వయి"**గా భావించబడుచున్నారు.

ఈతడు రెండు మాత్రలను సమన్వయించుకుంటూ 'ఓం'కార సంజ్ఞగా ఉపాసిస్తున్నాడు.

(1) ఈ జగత్తుకు ఆవల సర్వాధారమైన దైవము (పరమాత్మ) (Third Person - ప్రథమపురుష)

(2) ఈ కనబడేదంతా దైవరూపమే! (Second Person - మధ్యమ పురుష) కూడా

స్థూలము + భావన → ఈ రెండూ ఈతడు ఉపాసనాపరంగా సమన్వయించుకుంటున్నాడు.

అట్టి ద్విమాత్రోపాసకుని మనస్సు ఓంకారముతో ఏకత్వము పొంది యజుస్సులచేత (యజుర్వేద యజ్ఞ శబ్ద తరంగములచేత) దేహానంతరము అంతరిక్షయానముచే చంద్రలోకమునకు తీసుకొనిపోబడుచున్నాడు. అక్కడ చంద్రలోక వైభవాన్ని ఆస్వాదిస్తున్నాడు. కాలానంతరము తిరిగి మర్త్యలోకానికి వస్తున్నాడు. ఇంకా కూడా (ఈతడు) - మనస్సుతో ఏకత్వము ఆస్వాదిస్తూ సూక్ష్మదేహధారి అయి ఉంటాడు.

***(ద్విమాత్రోపాసన = ఈ ఎదురుగా కనిపించేదంతా పరమాత్మరూపంగా ఉపాసించు స్థితి)***

> *'ఓం' కార ఏకమాత్రోపాసకుడు (ఉదా = విగ్రహోపాసన; విగ్రహము నిగ్రహము కొరకే) (పరమాత్మ స్థూలరూపము) - పరమాత్మను స్థూలరూపముగా ఉపాసించువాడు. (శంఖు-చక్ర-గద ధారిగా, చతుర్భుజుడుగా, పన్నగశయనుడుగా, పసుపతి - గంగధారి - త్రినేత్రుడుగా, గజముఖుడుగా.. ఇత్యాదులు ఉపాసనలు సమర్పించువాడు.*
>
> *'ఓం'కార ద్విమాత్రోపాసకుడు (పరమాత్మసగుణుడు) = స్థూల + సూక్ష్మ (మనో) తత్త్వముగా పరమాత్మను నామరూపాత్మకుడుగా + సగుణుడుగా సేవించువాడు. (పరమాత్మను సర్వగుణ సంపన్నుడుగా భావించటము).*

### త్రిమాత్రోపాసకుడు : "సోఽహమ్ తత్త్వోపాసకుడు"।

***త్రిమాత్రోపాసన త్రిమాత్రేణ 'ఓం' - 'ఓం' సంజ్ఞా పరధ్యానం పరమాత్మ ధ్యానము***

త్రిమాత్రోపాసకుడు 'ఓం' కారమును ఉచ్చరిస్తున్న సందర్భంలో
స్థూలము - సూక్ష్మము - కేవలముల సమన్వయోపాసన చేస్తున్నవాడగుచున్నాడు.

= అ + ఉ + మ

= స్థూలము + సూక్ష్మము + సూక్ష్మాతిసూక్ష్మమగు ఆత్మ

= భౌతికము + మానసికము + ఆధ్యాత్మికము

= దేహము + దేహి + సర్వాంతర్యామి

ఈ ఈ మూడింటిని ఉద్దేశ్యిస్తూ ఓంకారోపాసన చేస్తున్నట్టివాడు. **<u>ఇది సమగ్రమైన 'ఉపాసన'</u>।**

ఎవ్వడైతే త్రిమాత్రాత్మకమైనట్టి తత్త్వమును 'ఓం' అను అక్షరోచ్చారణతో అక్షర పరబ్రహ్మమును ఉద్దేశ్యిస్తూ ఉపాసిస్తున్నాడో..., అట్టివాడు → అటువంటి ఉపాసన చేత ఆతడు తేజోరూపమగు, సూర్యశక్తి సంపన్నమగు – ప్రాణతత్త్వమనే **విశేష శక్తి సంపన్నుడు** అగుచున్నాడు. **సూర్యశక్తితో ఏకత్వము పొందినవాడగుచున్నాడు.**

ఒక పాము కుబుసమును విడచివేస్తుంది చూచారా! – **యథా పాదోదరః త్వచా వినిర్ముచ్యతే, (తథా) – ఆ విధంగా ఆ త్రిమాత్రా సమన్విత ఓంకారోపాసకుడు సర్వ పాపదృష్టులను, దోషదృష్టులను (పాము కుబుసంలాగా) విడిచి వేస్తున్నాడు.** ఆతని దృష్టిలో పరబ్రహ్మము మాత్రమే ఉన్నదిగాని, పాపి–పుణ్యుడు మొదలైన భేదములు వాస్తవమై లేవు. సామగానములతో (సామవేదశాస్త్ర సద్గ్రంథ్యములతో) (లేక) ప్రాణశక్తితో 'సత్యలోకము' అనే ప్రసిద్ధమైన పేరుతో పిలువబడే **'బ్రహ్మలోకము' (లేక 'హిరణ్యగర్భలోకము')** ఈతడు చేరుచున్నాడు. అచ్చట జీవఘనత్వము పొందినవాడై "పురిశయంపురుషః – సర్వశరీరములలోని అంతర్గతుడు".. అగు **పరంధాముడిని** (పరమాత్మను, పరతత్త్వమును) – దర్శిస్తున్నాడు.

| **▣ తానుగా ఉన్నది పరమాత్మయే।** **▣ పరమాత్మగా ఉన్నది తానే।** |
|---|
| తానే–పరతత్త్వమై, సర్వాంతర్యామియై, సర్వమునకు బాహ్య–అభ్యంతరములు స్వస్వరూపమయి **సర్వము ఆస్వాదిస్తూ వెలుగొందుచున్నాడు.** |

**ఈ త్రిమాత్రోపాసకుని విషయమై మరికొన్ని విశేషాలు కూడా చెప్పుకొంటున్నాము. వినండి।**

ఈ త్రిస్రోమాత్రుడు (అ+ఉ+మ ఏక శ్లోక భావముగా ఉపయోగించువాడు – ప్రయుక్తుడు) **పర– అపరములు పరస్పరము విడువనివాడై, దేనినీ విడువవలసిన – పట్టుకొనవలసిన అగత్యమే లేనివాడై,** స్వయమాత్మయై ప్రకాశిస్తున్నాడు.

'ఓం'కారము యొక్క మూడు మాత్రల ఉపాసనచే త్రిమూర్తి అయి (అ+ఉ+మ; దృక్+దృశ్య+దర్శనములు; జగత్తు+ జీవాత్మ+పరమాత్మలను ఎరిగి) సమస్తముయొక్క బాహ్య – అభ్యంతములను ఎరిగినవాడై ఉంటున్నాడు. ఇక మధ్య విషయములపట్ల ఆతని అవగాహనము స్వప్న సదృశంగాను, కల్పిత – కథాశ్రవణంగాను అయి ఉంటున్నాయి. ఆతడిక "సుఖ–దుఃఖములు".. మొ॥న ఏ ద్వంద్వములకు ఏ మాత్రము చలించనివాడగుచున్నాడు. కథ చదివేవాడు కథలోని సుఖ దుఃఖములను తాను పొందువాడవడు కదా! ఒకవేళ పొందినాకూడా, అది ఆతనికి ఆనంద వినోదమే కదా!

***(త్రిమాత్రోపాసకుడు = నాతోసహా – నాకు చెందినట్లుగా అనిపించేదానితో సహా సర్వము సర్వదా బ్రహ్మమే!.. అను ఉపాసనచే ఏర్పడు సంభావన స్థితి).***

ఈ విధంగా 'ఓం'కారోపాసకులు →

**(1) ఋక్కులచేత** – ఓంకారము యొక్క ఆకార ఏకమాత్ర ఉపాసనచేత → స్థూల లోకములలోకి ఉత్కృష్టతను,

**(2) యజస్సులచేత** – 'ఓం'కారము యొక్క 'అ+ఉ' కార స్థూల – సూక్ష్మ తత్త్వోపాసనా ఉద్దేశ్యము చేతను,

(3) అంతరిక్ష– (చంద్ర)లోక–స్థూల –సూక్ష్మ ఉత్కృష్ట స్థానమును,

**సామములచేత** మొదటి రెండు + 3వ మాత్రోపాసనోద్దేశ్యమైన అఖండ – అప్రమేయ ఉపాసనచేతను **'బ్రహ్మలోక నివాసము'** అనే ఉత్కృష్టతను–పొందటం జరుగుతోంది.

**తనకు తానే స్వాభావికంగానే సమస్తము అయి వెలుగొందుచున్నాడు.**

ప్రాజ్ఞుడు త్రిమాత్రోపాసకుడై ఓంకారోరపాసనచే బ్రహ్మమును తెలుసుకొని (బ్రహ్మవిత్), బ్రహ్మమే తానై (బ్రహ్మైవ భవతి) – **"అభయము, పరము, అజరము, శాంతము, అమృతము దేహమనోబుద్ధ్యాదులకు ఆవల సాక్షి అయినట్టికి, సర్వాధారము, సర్వాంతర్యామి"** అగు ఆత్మానందస్థానమును సముపార్జించుకొనుచున్నాడు. ఆర్జించుకొని ఊరుకోకుండా, అనుక్షణికంగా, స్వాభావికము చేసుకుంటున్నాడు.

""సృష్టి ప్రారంభ, వర్తమాన, లయాలు!" ఓంకారము యొక్క నిర్విషయ, సవిషయాలే।

**ఈవిధంగా ఓంకారోపాసకుడు – సర్వము పొందినవాడగుచున్నాడు.**

## ఆరవ ప్రశ్న

**ఇకప్పుడు భరద్వాజ గోత్రుడైనట్టి సుకేశుడు సద్గురవగు శ్రీపిప్పలాదమహర్షి సమక్షములో తన ప్రశ్నను ఈ విధంగా మనవి చేసుకున్నారు.**

**సుకేశుడు :** హే పూజ్యుడా! భగవాన్! మహర్షీ!

ఒకానొక సందర్భములో ఒకరు నన్ను అడిగిన ప్రశ్నను మీకు విన్నవించుకొని మీ సమాధానమును అభ్యర్థిస్తున్నాను. ఆ విషయమేమిటో నివేదిస్తున్నాను,

స్వామీ! ఒకసారి కోసలదేశానికి చెందిన రాజకుమారుడు హిరణ్యానాభుడు మా ఆశ్రమానికి వచ్చారు. ఆయన నన్ను ఇట్లా అడిగారు.

**"ఓ భరద్వాజా! మీరు 16 కళల (షోడశకళల) పురుషుని గురించి ఎరిగియే ఉన్నారా? లేదా? "షోడశకలం పురుషం వేత్థ (కిం)?"**

అప్పుడు నేను =

**"నాఽహమ్ ఇమమ్ వేద!** అయ్యా! మీరు చెప్పే ఆ '16' కళల పురుషుడెవ్వరో నాకు తెలియదు, నేను ఆతనిని ఎక్కడా కూడా చూచినట్లు గుర్తు లేదు"– అని పలికాను. అప్పుడాయన "వేదములు ఎరిగిన మీకు ఎందుకు తెలియదు? తెలిసే ఉంటుంది" ఎందుకో చెప్పటం లేదు" – అని అన్నారు.

అప్పుడు **"యది అహం ఇమం అవేదిషం, తే కథం న వక్ష్యమ్?** తెలిస్తే ఎందుకు చెప్పను? ఒకవేళ ఎప్పుడైనా ఈ మీ ప్రశ్నకు సమాధానమేమిటో మహనీయుల వద్ద తెలుసుకోవటం జరిగితే, మీకు తప్పకుండా చెప్పుతానులే!"

ఎవ్వడు అబద్ధము చెప్పుతాడో.., (ఆధ్యాత్మిక ప్రశ్న)కు సమాధానము తెలియకపోయినప్పటికీ ఏదో ఒక్కటి తెలిసినట్లు చెప్పుదాములే.. అని ఏవేవో అబద్ధపు మాటలు చెప్పితే).. అట్టివాడు సమూలంగా ఎండి కృశిస్తాడని పెద్దల నానుడి కదా! అందుకే 'నాకు సమాధానం తెలియదు అని మనవి చేస్తున్నాను."

అని ఆ రాజకుమారుడితో నేను చెప్పటం జరిగింది. అప్పుడు ఆ రాజకుమారుడు హిరణ్యానాభుడు (ఈమాత్రం తెలియదా? అన్నట్లుగా) నావైపు తూష్ణీభావంతో చూస్తూ మా ఆశ్రమము నుండి అప్పటికప్పుడు – వెంటనే రథము ఎక్కి వెళ్లిపోయాడు.

స్వామీ! మహర్షీ! ఇప్పుడు తమకు అదే ప్రశ్నను నివేదిస్తూ మీ సమాధాన వాక్ అమృతాన్ని ప్రసాదించవలసిందిగా నేను వేడుకుంటున్నాను.

ఆ 16 కళల పురుషుడు ఎవ్వడు? ఎక్కడుంటాడు? ఏమి చేస్తూ ఉంటాడు? ఏమా కళలు?

**శ్రీ పిప్పలాదమహర్షి!** ఓహో! బాగున్నదయ్యా, సుకేశా! నీ మిత్రుడు, కోసల రాజపుత్రుడు అగు హిరణ్యానాభుడు అడిగిన ప్రశ్న! సరేc! సమాధానం విను. ఓ స్నేహితులారా! మీరంతా కూడా వినండి.

ఓ సుకేశా!

**ఇప్పుడు ఆ 16 కళల పురుషుడు ఇక్కడే ఉన్నాడు. మనందరివద్ద వేంచేసియే ఉన్నారు. మనలోనే ఉన్నారు. మనమే అయి ఉన్నాము కూడా! ఆత్మగా ఆ 16 కళలు మనయొక్క ప్రదర్శనా విన్యాసమే.**

- నీయందే ఉన్నాడు.
- నీకు అభిన్నుడై ఉన్నాడు.
- నీవే ఆ '16' కళల పురుషుడవు.
- నీయొక్క ఆత్మయే నీ ప్రశ్నకు సమాధానం!

**సుకేశుడు :** ఆ 16 కళల పురుషడు నాయందే ఉన్నాడా? నేను ఆ పురుషునకు అభిన్నుడనా?.. మీరు అంటున్నది ఏ విధంగా యుక్తియుక్తం? నేనే అది ఎట్లా అవుతాను?

**శ్రీపిప్పలాదమహర్షి:** అవును! ఆ షోడశ కళల పురుషుడు మనందరిలోను సర్వదా వేంచేసి ఉన్నారు. ఆ పురుషుని ఎవరికివారు తమ యందు తామే దర్శించుకోవాలి సుమా! నేను – నీవు – ఈ నీ మిత్రులు, మనమందరము షోడశ కళాపురుషులమే! ఆ పురుషుడే మనలో ఆలోచనలను నిర్వర్తిస్తూ ఆలోచనలకు ఉత్పత్తి స్థానము – సాక్షి కూడా అయి, 'ఆలోచనలు నిర్మించువారు' అయి, మనందరిలో ఏకాత్మ స్వరూపుడై వెలయుచున్నారు.

"సప్రాణమ్ అసృజత –.. అట్టి సర్వాంతర్యామియగు ఆత్మదేవుడు తనకుతానుగా, తనకొరకై **విశ్వప్రాణము అను హిరణ్యగర్భతత్త్వమును** సృష్టించుకుంటున్నారు.

అట్లు మన ఆత్మయొక్క సంకల్పముచే లీలా వినోదముగా ఆత్మ నుండి (కారణమగు ఆత్మకు అభిన్నమే అయి) ముఖ్య ప్రాణముగా జనించుచున్నారు. ముఖ్యప్రాణశక్తిని సృష్టి రచనకొరకై హిరణగర్భతత్త్వముగా క్రియాచమత్కారమును ఆత్మపురుషుడే తన వినోదము కొరకై ప్రారంభించుచున్నారు. ఇక ఆపై తదితరములైన (అన్యముగా కనిపిస్తున్న) సమస్తమును సృజిస్తున్నారు.

– మొట్టమొదటగా ఆత్మ నుండి→ ప్రాణశక్తి క్రియాత్మకమగు ప్రాణశక్తియే సృష్టికర్తృత్వమగు **"హిరణ్యగర్భత్వము"**గా సంతరించు కుంటోంది.

అట్టి ప్రాణశక్తి నుండి → "శ్రద్ధ" (Attention / concerntration)

ఆ శ్రద్ధ (Concentration) నుండి →

→ ఖం – వాయుః – జ్యోతిః – ఆపః – పృధివి అనబడే మూల పంచభూతతత్త్వములు;

→ ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు,

**అంతరంగము:**

→ (మనో-బుద్ధి-చిత్త-అహంకారాలు),

→ అన్నము (ఆహారము - దేహపరిపోషకతత్త్వములు) - అన్నము నుండి → వీర్యము

→ తపస్సు, ధ్యానము, ప్రాణాయామము మొదలైన సాధనములు.

→ లోకములు, (వివిధ స్వభావాలు, మనస్తత్వాలు).

ఈవిధంగా నామ రూపాత్మకమై ఈ కనబడే సర్వవిశేషాలు...,

ఇవన్నీ (ప్రాణశక్తియే) అనేక రూపములుగా, విశేషములుగా ప్రదర్శిస్తూ - ప్రదర్శితమగుచున్నది.

వింటున్నారా బిడ్డలారా! మరల వినండి! ఈ విధంగా నిర్వికారమగు ఆత్మపురుషుడు :

1. లీలగా 'చింతన' (Avocation) చేత ప్రాణశక్తి (A Quality of Energic ability) సృష్టించుకోవటం జరుగగా.., - ఆ ప్రాణశక్తియే ఈ తదితరమైనదంతా (పంచభూత మూలతత్త్వములు, దశవిధ కర్మ-జ్ఞానేంద్రియములు, మనస్సు (అంతరంగము), అన్నము రూపములు దాల్చుచున్నది.
2. ఆ 'అన్నము' నుండి ప్రజలు, పరిపోషణ, జనన - మరణాది వ్యవహారములు ప్రదర్శనమగుచున్నాయి.

ఇవన్నీ ఆత్మ యొక్క లీలా వినోదమై, ఆత్మచేతనే ప్రదర్శింపబడుచున్నాయి.

... ఆత్మ అవ్యక్తరూపంగా ప్రవేశిస్తూ, వ్యక్తమగుచూ ఈ చమత్కార దృశ్యజగత్ క్రీడావినోదము పుంఖానుపుంఖంగా నిర్వర్తిస్తోంది. కనుక..,

- ఇదంతా పరమ పురుషుడే।
- నీవు ఆత్మ స్వరూపుడవే।
- షోడశ కళలు ఆత్మస్వరూపుడవగు నీ నుండియే వెడలుచుండటం చేత ఆ షోడశకళలు నీయందే ఉన్నాయి.

అదంతా ఎట్లా జరుగుతోందో చెప్పటానికి.. ఒక దృష్టాంతమును తీసుకుంటున్నాను వినండి.

**"యథా సముద్రాయణాః స్యందమానాః ఇమా నద్యః (నదులు) → సముద్రం ప్రాప్య → అస్తం గచ్ఛంతి..,**

***ఏ విధంగా అయితే..,***

- సముద్రమే తమ గమ్యము (Find Place to reach)గా గల వివిధ నదీ జలాలన్నీ కూడా..,
- సముద్రములో ప్రవేశించినవవై
- తమ యొక్క **"ఈ జలము ఈ నదికి చెందినది"** - అనే గుర్తింపు ఈ షణ్మాత్రంగా కూడా కలిగియుండవు కదా!

అప్పుడు **"ఇది సముద్ర జలము"** అంటామే గాని ఈ తరంగం ఆ పేరు గల నదిది" - అనబడేది ఎక్కడా ఉండదు గదా!

అట్లాగే..

***'కేవల ద్రష్ట' అయినట్టి పురుషుని యొక్క షోడశ (16) కళలు కూడా →***

- ఆ పరమ పురుషుని యందే ఆయా రూపాలుగా జనించి, ప్రదర్శితమగుచూ..,
- అవన్నీ కూడా కేవల పురుషునిలో ప్రవేశించటమే గమ్యముగా కలిగినవై..,
- ఆ పురుషుని చేరుకోగానే **అవన్నీ అస్తం గచ్ఛంతి!** అదృశ్యమైపోతున్నాయి. వాటి యొక్క నామరూపాత్మకమైనదంతా స్వయంగా నశిస్తోంది.

ఏ తత్త్వములో అవన్నీ లయిస్తున్నాయో

- ఆ పురుషుడు మాత్రమే శేషిస్తున్నాడు. సర్వము తానే అగుచున్నాడు.

***ఆతడే షోడశ పురుషుడు.***

అనగా..

అజ్ఞాన దృష్టికి కనిపించే → పంచభూత+ పంచకర్మేంద్రియ + పంచజ్ఞానేంద్రియ + మనోరూప షోడశకలలన్నీ

(5 + 5+ 5+ 1=16) కూడా →

→ ఆత్మజ్ఞాన దృష్టిచే..,

ఆత్మకు అభిన్నమై తెలియవస్తున్నాయి. "అంతా ఆత్మయే".. అని సర్వదా పరమశాంతమై **అనుభూతం అవుతోంది.**

నిర్మలము – స్వయం జ్యోతి స్వరూపము అగు ఆత్మయే అంతా యథాతథముగానే సర్వదా విరాజిల్లుతోందయ్యా!

ఓ బిడ్డలారా! స్వస్వరూపముతో సహా సర్వము ఆ షోడశ కళాత్మక పరమ పురుషుడుగా ఉపాసిస్తూ క్రమంగా మనమంతా సహజంగా ఆ పరమ పరుష స్వరూపులముగా సుస్పష్ట పరచుకోవటమే వేదాంత విద్య!

రథము యొక్క ఇరుసులో ఆకులు అమర్చబడి యున్నట్లు, మనం చెప్పుకున్న షోడశ (16) కళలు ఎవ్వనియందైతే ప్రతిష్ఠితాలై ఉన్నాయో..

**"తతోహి వేద్యం పురుషః"। తదేవాహమ్। తత్ త్వమేవ। తదేవ ఇదగ్ంం సర్వమ్।**

ఆతడే తెలుసుకోవలసిన పురుషుడు. పరమ పురుషుడు. ఆతడే నేను। ఆతడే నీవు। ఆతడే ఇదంతా।

ఆ పరమ పురుషుని స్వస్వరూపునిగా తెలుసుకొన్న తరువాత, ఇక అట్టివానిని మృత్యువుబాధించదు.

**అట్టి పరమ పురుషత్వము సతరించుకోవటమే మన అంతరంగము యొక్క వేదగానము!**

ఓ ప్రియమిత్రులారా!

**అహం చ ఏతావత్ ఏతత్ పరంబ్రహ్మ వేద!**

నేను ఆ పరబ్రహ్మమును ఇంతవరకు ఈ రీతిగా తెలుసుకొనిన వాడనై ఉన్నానయ్యా!

**అతః పరమ్ న అస్తి**

ఇంతకుమించి వేరే ఎక్కడా మరేదీ లేదు – అని తలచుచున్నాను.

ఆ విధంగా సుకేశ– సత్యకామ – సౌర్యాయాణి – కౌసల్య – భార్గవ – కబంధులు ఆరుగురు అడిగిన ఆరు ప్రశ్నలకు శ్రీ పిప్పలాదమహర్షి ప్రసాదించిన తత్త్వజ్ఞాన పూర్వక సమాధానాలను వారంతా శ్రద్ధ–భక్తులతో విన్నారు. ప్రాణతత్త్వము యొక్క వివిధ ప్రదర్శనా చమత్కారాలను, ఆత్మనుండి ఆత్మేచ్ఛచే బయల్వెడలే ఆత్మకు అభేద ప్రాణతత్త్వం గురించి, పరమ పురుషుని యందలి ఆయన యొక్క షోడశ కళల ఆవిర్భావ –తిరోభావ లీలా వినోద విశేషాలను గురించి బుద్ధితో గ్రహించిన వారయ్యారు!

లేచి నుంచుని, మహర్షిని సమీపించి వారిని పూజించారు.

"స్వామీ!

**త్వం హి నః పితా, యో అస్మాకం అవిద్యాయాః పరం పారం తారసీతి!**

మీరే మాకు తండ్రి! ఎందుకంటే మీరిప్పుడు ప్రసాదించిన మీ యొక్క ప్రవచనా రూప బ్రహ్మజ్ఞానపూర్వక సమాధానాలచే మేము అజ్ఞానము యొక్క ఆవలిగట్టు చేరుచున్నాము.

**నమః పరమ ఋషిభ్యో! నమః పరమ ఋషిభ్యః।**

ఆత్మ జ్ఞానదీపము వెలిగించి అజ్ఞానాంధకారము మొదలంట్లా తొలగిస్తున్న ఓ పరమ ఋషులారా! ఋషి పుంగవులారా!

మీకు నమస్కారము! నమో నమః॥ నమో నమో నమో నమః।

**ఓం నమో గురుభ్యో నమః। ఋషిభ్యో నమః। మునిభ్యో నమః।**

ఇతి ప్రశ్నోపనిషత్

ఓం శాంతిః। శాంతిః। శాంతిః।

అధర్వణవేదాంతర్గత

# 13 మాండూక్యోపనిషత్

**(A STUDY OF THE AWAKENED, DREAMY, DEAD-SLEEPY AND TRIO-OPERATOR PHASES/FORMS/STATES)**

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ అద్వైతామృత వర్షాయ।
శ్రుత్యాకాశ విహారిణే।
చిద్ఘనాయ। ప్రసన్నాయ।
శంకరాయ। నమో నమః॥

(జీవ-జగత్-పరబ్రహ్మైక్య రూపమగు) 'అద్వైతామృతము'ను వర్షింపజేయువారు, ('కేవలమగు ఎరుక' - అను) "చిద్ఘనానంద స్వరూపులు" - అగు శంకర భగవానునకు, శంకరభగవత్పాదులకు నమో నమః॥ నమస్కరిస్తున్నాము.

ఓం।
భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః।
భద్రం పశ్యేమ అక్షభిః యజత్రాః।
స్థిరైః అంగైః తుష్టువాగ్ంసః తనూభిః।
వ్యసేమ దేవహితమ్ యత్ ఆయుః।
స్వస్తి నః ఇన్ద్రో వృద్ధశ్రవాః।
స్వస్తి నః పూషా విశ్వ వేదాః।
స్వస్తి నః తార్క్ష్యో అరిష్టనేమిః।
స్వస్తి నః బృహస్పతిః దధాతు।
ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥

ఓంకారార్థ స్వరూపులగు ఓ దేవతలారా! మేము జ్ఞాన ప్రకాశయుక్తులమై, మా ఈ రెండు చెవులతో శుభప్రదమైన శాస్త్రవాక్యములు, వాటి అర్థ ప్రవచనములు వినుచుండెదము గాక!
మేమంతా యజ్ఞ కర్మ నిష్ఠులమై శుభప్రదమైన ఆత్మ-తత్త్వమునే దర్శించుచుండెదము గాక! స్థిరమైన అంగములు - తుష్టి అయిన శరీరములు గలవారమై సత్యతత్త్వ వాక్కులనే గానం చేస్తూ **దేవతా ప్రసాదితమైన ఆయుష్షు శుభప్రదము చేసుకొనెదము గాక।**
- పురాతనుడు, ప్రసిద్ధుడు, విశేష కీర్తిమంతుడు అగు **ఇంద్రభగవానుడు,**
- ఈ విశ్వముయొక్క యదార్థతత్త్వము ఎరిగి నట్టి పూషా-యశశ్వుడగు **సూర్యభగవానుడు,**
- మిక్కిలి వేగవంతులగు **గరుడుడు, వాయువు,**
- ఆధ్యాత్మిక సంపదకు పరిరక్షకుడగు **బృహస్పతి భగవానుడు - మాకు స్వస్తి (ఉత్సాహ సాహస ధైర్యములు) ప్రసాదించెదరు గాక।**

**ఓం శాంతిః శాంతిః శాంతిః॥**

---

**1.** 'ఓం' ఇతి ఏతత్ 'అక్షరమ్'
ఇదగ్ం సర్వమ్।
– తస్య ఉప–వ్యాఖ్యానమ్।
– భూతమ్–భవత్–భవిష్యత్–ఇతి–
<u>సర్వమ్ ఓంకార ఏవ।</u>
యచ్చ (–యత్ చ) అన్యత్ త్రికాలాతీతమ్,
తదపి <u>ఓంకార ఏవ॥</u>

ఈ కనబడుచున్న సర్వ దృశ్య జగత్తు మార్పు-చేర్పులు లేనట్టి అక్షరమగు, **ఓంకార రూపమే! (పూర్ణమగు పరమానంద స్వరూపమే)।**

**<u>అద్దానిని నమీవ్య-స్వానుభవ విశేషముగురించి ఇప్పుడు వివరించుకుందాము. వ్యాఖానించుకుందాము.</u>**

ఇతఃపూర్వం కనిపించింది, ఇప్పుడు కనిపిస్తున్నది, ఇకముందు కనిపించబోయేది - సమస్తము, సర్వము **'ఓం' కారమే!**

ఒకవేళ భూత-వర్తమాన-భవిష్యత్తులకు ఆవల - కాలాతీతంగా ఏదైనా ఉన్నదనిపిస్తూ ఉంటే - **అదంతా కూడా ఓం కారమే! అఖండాత్మ విన్యాసమే।**

---

**2.** సర్వగ్ం హి ఏతత్ బ్రహ్మ।
అయమ్ ఆత్మా బ్రహ్మ।
సోऽయమ్ (సో అయమ్) ఆత్మా చతుష్పాత్॥

అనుక్షణికంగా మార్పు-చేర్పులు పొందుతూ సందర్భంగా మాత్రమే అయి ఉంటున్న - ఈ కనబడేదంతా వాస్తవానికి బ్రహ్మమునకు భిన్నం కాదు బ్రహ్మమే!
సందర్భానుచితంగా ఆత్మగా (జీవాత్మగా) కనిపిస్తున్నప్పటికీ- ఈ జీవాత్మ **సర్వదా-సదా బ్రహ్మమే! పరబ్రహ్మమే! సదాశివమే।**
అట్టి ఈ జీవబ్రహ్మైక్య రూపమగు - ఆత్మ (జీవాత్మ) నాలుగు పాదములు (లేక) నాలుగు అవస్థలు కలిగినదై, ప్రదర్శనమౌతోంది.

3. జాగరిత స్థానో బహిః ప్రజ్ఞః।
సప్తాంగ(7)– ఏకోనవిశంతి(19) ముఖః
స్థూలభుక్ "<u>వైశ్వానరః</u>"
ప్రథమః పాదః॥

**<u>(1) బహిర్ ప్రజ్ఞ-జాగ్రత్ అవస్థ - వైశ్వానరుడు</u>**

**ఆత్మనుండి బయల్వెడలుచున్న బహిర్ ప్రజ్ఞాపురుషుడు.** జాగ్రదవస్థ / స్థానమును సంచార-స్థానముగా కలిగి ఉంటున్నాడు. విశ్వాభిమాని అయి, '**వైశ్వానరుడు**' అని పిలువబడుచున్నాడు.

**<u>సప్తాంగములు:</u> 1. (అశరీర దివ్య ప్రజ్ఞారూపవాసులు నివాసము కలిగి ఉండే) <u>ద్యులోకము</u> - శిరస్సు 2. <u>సూర్యుడు</u> - నేత్రములు 3. <u>వాయువు</u> - ప్రాణము 4. <u>ఆకాశము</u> - దేహమధ్య భాగము 5. <u>జలము</u> - మూత్ర స్థానము 6. <u>భూమి</u> - పాదములు 7. <u>అగ్ని</u> - నోరు - ఇవి విశ్వ దేహి సప్తాంగములుగా వ్యాఖ్యానించబడుచున్నాయి.**

**<u>ఏకోన వింశతి ముఖః (19 ముఖములు).</u>**

**<u>(1) జ్ఞానేంద్రియములు :</u> చెవులు (వినికిడి), కనులు (చూపు), చర్మము (స్పర్శ), నోరు (రసము), ముక్కు (ఘ్రాణము / వాసన). <u>పంచ జ్ఞానేంద్రియములు. - (5)</u>**

**<u>(2) కర్మేంద్రియములు:</u> 1. వాక్కు, పాణి (చేతులు), పాదములు, పాయువు (మలవిసర్జనం), ఉపస్థ (మూత్ర విసర్జనము) <u>పంచ కర్మేంద్రియములు - (5)</u>**

**<u>(3) ప్రాణములు:</u> 1. ప్రాణ - అపాన - వ్యాన - ఉదాన - సమానములు <u>(పంచ ప్రాణములు). - (5)</u>**

**<u>(4) అంతరంగ చతుష్టయము:</u> 1. మనన రూపమగు "మనస్సు", నిశ్చయాత్మక రూపమగు "బుద్ధి", ఇష్ట-అయిష్ట వృత్తుల రూపమగు "చిత్తము", అభిమానరూపమగు "అహంకారము". (4) (5+5+5+4=19)**

ఇవి పరమాత్మ యొక్క '19' ముఖములుగా ఇక్కడ అభివర్ణించ బడుచున్నాయి.

**బహిర్ముఖమైన ప్రజ్ఞాస్వరూపుడు.** '7' అంగములు, '19' ముఖములు కలవాడుగా ఉంటున్నాడు. విశ్వాభిమాని కాబట్టి '**విశ్వుడు**'.

స్థూల **విషయములయొక్క భోక్త** అయినట్టి "**వైశ్వానరుడు**" (విశ్వ సంబధింతుడగు ప్రజ్ఞా సమన్వితుడు)... **ఆత్మయొక్క మొదటి పాదము (లేక మొదటి అవస్థ).**

---

4. స్వప్నస్థానో "అంతః ప్రజ్ఞః"।
సప్తాంగ(7)– ఏకోనవిశంతి(19) ముఖః
ప్ర–వివిక్త భుక్, "<u>తైజసో</u>" ద్వితీయః పాదః॥

**<u>(2). అంతర్ ప్రజ్ఞ - స్వప్నావస్థ - తైజసుడు</u>**

స్వప్నావస్థ (స్వప్న స్థానము) సంచార స్థానముగా కలవాడు. అంతరమైన ప్రజ్ఞ కలవాడు. **భౌతిక వస్తు రహిత - మనోకల్పిత విషయానుభవుడు.**

'7' అంగములు- 19 ముఖములు (నోర్లు) కలవాడు- (వివరణ =పైన చెప్పినవి)

పై 7 + 19 - భావనా నిర్మితంగా ఆస్వాదించు ప్రజ్ఞ - **తైజస పురుషుడు.**

స్వప్న దృశ్యమును తనకు వేరైన దానివలె ఆస్వాదించువాడు- అనుభవించు వాడు..., **తైజసుడు** అనే పేరుతో చెప్పబడుచున్నవాడు. **అట్టి తైజస స్వరూపుడు - జీవాత్మయొక్క ద్వితీయ పాదము లేక రెండవ అవస్థ.**

---

5. యత్ర సుప్తో
– న కంచన కామమ్ కామయతే...,
– న కంచన స్వప్నమ్ పశ్యతి...,
– తత్ "సుషుప్తమ్"।
సుషుప్త స్థాన ఏకీభూతః

**<u>(3). ప్రజ్ఞాన ఘనము-సుషుప్త్యవస్థ - ప్రాజ్ఞుడు</u>**

**<u>ఎక్కడైతే ఈ నిద్రిస్తున్న జీవుడు :-</u>**

- ఎట్టి కోరికలు ఏమాత్రమూ కలిగియుండడో.....,

- ఎట్టి స్వప్న దృశ్యమును చూడనివాడై ఉంటాడో...,

అదియే "సుషుప్త-అవస్థ"। ఈ స్థితిలో అతనికి వేరై ఏదీ ఉండదు కాబట్టి- **<u>"ఏకీభూతుడు".</u>**

ప్రజ్ఞాన ఘన ఏవ,
ఆనందమయో హి, ఆనంద భుక్।
చేతో ముఖః। "ప్రాజ్ఞః" - తృతీయః పాదః॥

అట్టి గాఢనిద్రాపరవశుడు-విషయరహితమగు ఏకాంతమే సంచార స్థానముగా కలవాడు అయి ఉంటున్నాడు. అనేకత్వము లేనివాడై ఉంటున్నాడు. **ఏకత్వానుభూతిపరుడై ఉంటున్నాడు. "ఘనీభూతమైన విషయరహిత ప్రజ్ఞ"** ను మాత్రమే స్వరూపముగా కలిగి ఉంటున్నాడు.

తనయందు తాను, ఆనందరూపుడై, ఆనందమయుడై, ఆనందత్వము మాత్రమే ఆస్వాదిస్తున్నవాడై, దర్శిస్తున్నవాడై, అనుభూతిపరుడై - అనుభవిస్తున్నవాడై ఉంటున్నాడు.

చేతన స్వరూపుడై - కేవల చేతనస్థుడై ఉండే... సుషుప్తిస్థాన సంచారుడు **ప్రాజ్ఞుడు. ఇది జీవాత్మ యొక్క మూడవపాదము.**

---

**6.** ఏష సర్వేశ్వర । ఏష సర్వజ్ఞ।
ఏషో అంతర్యామి।
ఏష యోనిః
సర్వస్య ప్రభవ - అప్యయౌ హి
(సర్వస్య ప్రభవాప్యయౌ హి)
భూతానామ్॥

**<u>సర్వజ్ఞుడు - తురీయావస్థ - తురీయపురుషుడు</u>**

కేవల ప్రజ్ఞాస్వరూపుడు. అట్టి విషయరహిత ప్రాజ్ఞుడే (ఈ జాగ్రత్-స్వప్న - సుషుప్తుల విషయాలన్నిటికీ) సర్వేశ్వరుడు. అన్నిటికీ ఈశుడు. తురీయ పురుషుని స్వకీయ సంచార కల్పనలే - జాగ్రత్, స్వప్న, సుషుప్తులు.

ఆతడు సర్వము (జాగ్రత్ - స్వప్న రూపములేమిటో) ఎరిగినవాడు. ఆతడే (జాగ్రత్-స్వప్నావస్థలలో పొందబడే - దర్శించబడే వాటికన్నిటికీ) అంతర్యామి। యజమాని। నియామకుడు। తనయొక్క జాగ్రత్ స్వప్న సుషుప్తి భూములలో **<u>సంచారి.</u>**

ఆతడే సర్వ అనుభూతజాలములకు ఉత్పత్తి-లయ స్థానము. తురీయ పురుషుడు. (నాలుగవది అయినవాడు).

ఈ తురీయ పురుషుని నుండే జాగ్రత్ (వైశ్వానరుడు) స్వప్న (తేజసుడు) సుషుప్తి (పాజ్ఞ) పురుషులు ఒకప్పుడు బయల్వెడలి - మరొకప్పుడు ఆయనయందే లయించినవారగుచున్నారు.

---

**7.** న అంతః ప్రజ్ఞం।
న బహిః ప్రజ్ఞం।
న ఉభయతః ప్రజ్ఞం।
న ప్రజ్ఞాన ఘనం।
న ప్రజ్ఞం। న అప్రజ్ఞం।
(అదృశ్యమ్) అదృష్టమ్। అవ్యవహార్యమ్।
అగ్రాహ్యమ్। అలక్షణమ్।

**<u>జాగ్రత్ - స్వప్నముల జనన స్థానమగు సుషుప్తి తనదైన (చ) తురీయుడు ఎట్టివాడు? ఆతడు కేవలుడగు ఆత్మపురుషుడే।</u>**

- స్వప్నరూపమైన అంతర్ ప్రజ్ఞ కాదు.

- జాగ్రత్ రూపమైన బహిర్ ప్రజ్ఞ కాదు.

- ఆ ఉభయము కలిపి కూడా కాదు.

(ఆ ఉభయము ఆత్మయొక్క చిత్కలాంశా విశేషాలు మాత్రమే).

- **ఆత్మ**→ సుషుప్తిలో ప్రజ్ఞానఘనము కూడా కాదు. అది కూడా ఆత్మ యొక్క మరొక చిత్కళయే!

- ప్రజ్ఞా రూపము కాదు. అప్రజ్ఞా రూపము కూడా కాదు.

- ఆ తురీయ రూపమగు ఆత్మ - కళ్ళకు కనిపించే నామ- రూపాత్మక మైనదేదీ కాదు.

- వ్యావహారికంగా దేనితోనో సంబంధమును కల్పించి చెప్పగలిగేది, తెలుసుకో గలిగేది కాదు.

- మనస్సుతో **"ఇది అది - ఇట్టిది"** అని చెప్పితే కూడా - అనుభూతానికి వచ్చేది కాదు.

- కొన్ని లక్షణములుగా వర్ణించి చెప్పగలిగేదీ కాదు.

**అంచింత్యమ్। అవ్యపదేశ్యమ్।**

**ఏకాత్మ ప్రత్యయ సారం।**

**ప్రపంచ - ఉపశమమ్।**

**శాంతం। శివమ్। అద్వైతమ్।**

**- చతుర్థం మన్యంతే।**

**స ఆత్మా। స విజ్ఞేయః॥**

- ఊహించి, "ఇది ఇటువంటిది" అని ఊహగా చెప్పగలిగేది కాదు.

- నిర్వచించి - నిర్దేశించగలిగేదీ కాదు. ఒకరికి వివరించి తెలియపరచ గలిగేది కాదు.

- అన్ని అవస్థలలో ఏకమే (ఒక్క తీరే) అయి ఉండి అనునిత్యమై ఉండేది. **సమస్త అవస్థలు తనదైనట్టిది.**

- మహావాక్య ప్రత్యయముల యొక్క సారము. నేను, నీవు, అతడు, ఇతడు, ఆమె, వారు, వీరు, మొ॥ ప్రత్యయములన్నిటికీ సారము (The Essence of it).

- జాగ్రత్ - స్వప్న ప్రపంచాలు ఎందులో ఉపశమిస్తున్నాయో... అయ్యది కూడా అదే!

సర్వము సశాంతించినప్పటికీ శేషించేదికాబట్టి **పరమశాంతము. సర్వశేష్యము. ఆది శేష్యము.**

సర్వ సుఖాలకు ఆలవాలము. శుభప్రదము.

ద్రష్టకు (లేక ఆత్మోపాసకునకు) వేరైనది కానట్టిది. **అనన్యమైనది.**

అది జాగ్రత్ కాదు. స్వప్నము కాదు. సుషుప్తి కాదు. ఆ మూడిటిలో ప్రవేశించి-వెనుకకు మరలేది-అని అనవచ్చు కాబట్టి,- **చతుర్ - 4వది.**

- తురీయం + చ = నాలుగు కూడా అదే అని చెప్పుకోబడుచున్నది.

అదియే మనందరి ఆత్మ! అదియే **(1) తెలుసుకోవలసినది (2) తెలుసు కొంటున్నది, (3) తెలియబడుచున్న ఈ సమస్తము అయి ఉన్నట్టిది, (4) 'తెలివికలవాడు'** అయిఉన్నది - కూడా।

---

**8.** **సోఽయమ్ ఆత్మా....**

**<u>అధ్యక్షరమ్ (అధి-అక్షరమ్)</u> "ఓం"కారో**

**<u>అధిమాత్రమ్</u>**

**పాదా మాత్రా।**

**మాత్రాశ్చ పాదా -**

**'అ' కార- 'ఉ' కార- 'మ' కార ఇతి॥**

**జాగ్రత్ - స్వప్న సుషుప్తి :: వైశ్వానర - తైజస - ప్రాజ్ఞపురుషులు** గాను, చ (తురీయము)గాను మనం ఇప్పటిదాకా చెప్పుకున్న ఆ ఈ ఆత్మ అక్షరముగా చెప్పుకుంటున్నప్పుడు **'ఓం'** కారము.

**<u>మాత్రల రూపముగా వర్ణిస్తున్నప్పుడు:-</u>**

**"అ కారము + ఉ కారము + మ కారము"।**

మాత్రలే → పాదములు.

అ ఉ మ → జాగృత్-స్వప్న-సుషుప్తి-అనబడే త్రి-అవస్థలు తనవే అయి ఉన్నట్టిది కాబట్టి తురీయమే **<u>'ఓం'కారము.</u>**

---

**9.** జాగరితస్థానో - వైశ్వానరో।

- 'అ' కారః।

ప్రథమా మాత్రా, ఆప్తేః - ఆది

మత్వాద్వా ఆప్నోతి హ వై

సర్వాన్ కామాన్ ఆదిశ్చ భవతి,

య ఏవం వేద॥

**<u>జాగ్రత్ అనుభవ పురుషకారమును "వైశ్వానరుడు" అని అంటూ ఉన్నారు.</u>**

జాగ్రదవస్థయందు - జాగ్రదవస్థగా సంచారము గల వైశ్వానరుడే 'అ'కార మాత్రగా చెప్పబడుచున్నాడు. **(విశ్వానుభవి/అభిమాని కాబట్టి వైశ్వానరుడు).**

ఎందుకంటే....,

'అ'కారము - అక్షరములన్నిటిలో విస్తరించి ఉన్నట్లే, జాగ్రత్‌ప్రజ్ఞయే దృశ్య జగత్తంతా విస్తరించినదై ఉండటం జరుగుతోంది.

అనగా,

అవస్థగా → **జాగ్రత్**

మాత్రగా → **'అ'కారము**

అట్టి ఆత్మయొక్క జాగ్రత్ స్వరూప-అకార మాత్రను (లేక) వైశ్వారుని ఎవ్వరు తత్త్వతః (మత్వా) ఎరుగుచున్నాడో...., **అట్టివాడు సర్వలోక సంబంధమైన కోరికలకు ఆవల ఉన్న స్వస్వరూపమునందు ప్రకాశించగలడు.**

| | |
|---|---|
| **10.** స్వప్న స్థానః తైజస<br>**'ఉ'** **కారో..., ద్వితీయా మాత్రా।**<br>**ఉత్కర్షాత్ – ఉభయత్వాత్ వా ఉత్కర్షతి హ వై।**<br>**జ్ఞాన సంతతిం సమానశ్చ భవతి,**<br>**న అస్య అబ్రహ్మవిత్ కులే భవతి, య ఏవం వేద॥** | - స్వప్న స్థానంలో సంచారంచేసే భావనా పురుషుడు **'తైజసుడు'**.<br>- 'ఓం' అక్షరంలో ద్వితీయమాత్ర 'ఉ' సంజ్ఞగా చెప్పబడువాడు.<br>**స్వప్నము** : మనస్సులో అంతరంగా అనుభూతమైయ్యేది, జాగ్రత్-సుషుప్తుల మధ్యగా ఉండేది. (అ కార-మ కారముల మధ్యగా ఉండేది)<br>- కనుక **'ఉ'** కారమని అనుచున్నారు.<br>స్వప్నానుభవముగా నాపట్ల ఏర్పడుచున్నదంతాకూడా - **"నా భావనయే. (లేక) ఊహయే, (లేక) కల్పనయే"** అని ఎరిగినవాడు - **బ్రహ్మకులజాతుడు** అగుచున్నాడు. |
| **11.** సుషుప్త స్థానః ప్రాజ్ఞో –<br>**'మ'** **కారః తృతీయా మాత్రా।**<br>**మితేః అపీతేః వా మినోతి హ వా**<br>**(మితేరపీతేర్వా మినోతి హవా)**<br>**ఇదగ్ం సర్వమ్ అపీతిశ్చ భవతి, –**<br>**య ఏవం వేద॥** | **సుషుప్తి:** సుషుప్త స్థానంలో సంచరించువాడు **కేవల ప్రజ్ఞావిశేష స్వరూపుడగు ప్రాజ్ఞుడు.** తృతీయమాత్రయగు **'మ'**-అక్షరముచే ఉద్దేశ్యించబడి చెప్పబడుచున్నవాడు.<br>**మితే:** మిగతా జాగ్రత్ - స్వప్నములకు మితేః - పరిమాణము (కొలవబడునది) అయిఉన్నది.<br>సుషుప్తిచే జాగ్రత్, స్వప్నములు - **'పరిమితము'** చేయబడుచున్నాయి కాబట్టి **'మితే'** అనబడుతోంది.<br>'మ'కారం 'అ ఉ మ'ల చివ్వరిది కూడా కదా!<br>ఈవిధంగా **'మ'కారము సుషుప్తికి సంజ్ఞగా వర్ధిల్లుచున్నది.**<br>అట్టి సుషుప్తిని ఆత్మయొక్క ఒకానొక విన్యాసంగా ఎవరు ఎరుగు చున్నారో... అట్టివాడు సర్వమునకు చివ్వరివాడై (దాటినవాడై) వెలుగొందుచున్నాడు. |
| **12.** అమాత్రః చతుర్థో అవ్యవహార్యః<br>ప్రపంచ ఉపశమః (ప్రపంచోపశమః)।<br>**శివో అద్వైత –**<br>**ఏవం 'ఓం' కార ఆత్మైవ।**<br>**సంవిశత్ యః ఆత్మన్**<br>**"ఆత్మానం" య ఏవం వేద।**<br>**య ఏవం వేద॥**<br><br>***<u>మాండుక్యోపనిషత్ సమాప్తా</u>***<br>***<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥</u>*** | ***ఆత్మ ఎట్టిదంటే...,***<br>❖ "అ-ఉ-మ - అర్ధమాత్ర" ... ఈఈ **మాత్రలు లేనిది.**<br>❖ **చతుర్థో- 'తురీయా చ।** జాగ్రత్-స్వప్న-సుషుప్తులకు వేరైన- **నాలుగవది.**<br>❖ **"వికారమయ సత్త"** .. అనబడే ఈ ప్రపంచమంతా **ఉపశమించినప్పుడు కూడా శేషించి ఉండేది. నిర్వికారమై వెలుగొందునది. అది సర్వదా నిరాకారమే।**<br>❖ ఎప్పుడూ కూడా ఏ ఆకార-వికారములు పొందనట్టిది.<br>❖ శివము - పరమానందమైనది.<br>❖ అద్దానికి రెండవది లేనిది. అద్వైతము.<br>❖ ఉపాసకుని నిజరూపమునకు (లేక) **సహజరూపమునకు అభిన్నమైనది.**<br>**ఇవి తురీయముయొక్క సహజరూప వర్ణనలు.**<br>**ఈ తురీయము లేక చతుర్థమును తెలుసుకొన్నవాడు 'ఆత్మ'యే తానై ప్రకాశిస్తున్నాడు.**<br>అది తెలుసుకుని సర్వస్వరూపుడై సర్వసాక్షియై సర్వాత్మకుడై విరాజిల్లుచున్నాడు. సమస్తము ఆత్మగా దర్శించు అభ్యాసికి ఆత్మ-తనకు తానై-విశదీకరణమౌతోంది.<br>***<u>ఇతి మాండుక్యోపనిషత్</u>***<br>***<u>మహర్షిభ్యోం నమో-నమో-నమో నమః।</u>***<br>***<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥</u>*** |

అథర్వణవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

**13**

# మాండూక్యోపనిషత్

**(A STUDY OF THE AWAKENED, DREAMY, DEAD-SLEEPY AND TRIO-OPERATOR PHASES/FORMS/STATES)**

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



**ముక్తికోపనిషత్ : శ్రీరామచంద్ర ప్రవచనము**

శ్రీ ఆంజనేయస్వామి: **ఇయం కైవల్యముక్తిస్తు కేన ఉపాయేన సిద్ధ్యతి?**
శ్రీరామచంద్రా! 'కైవల్యముక్తి' సిద్ధించటానికి తేలికైన ఉపాయము ఏది? దయతో చెప్పండి.

శ్రీరామచంద్రుడు : **'మాండూక్యం' ఏకమేవ అలం ముముక్షూణాం విముక్తయే। తథాపి అసిద్ధంచేత్ జ్ఞానం, - -దశోపనిషదం పఠ।** ఓ ఆంజనేయా! ముముక్షువులు జీవన్ముక్తులవటానికి మాండూక్యోపనిషత్ ఒక్కటే చాలు. చాలదని నీకు ఇంకా అనిపిస్తే, 10, [(లేక) 32, 108] ఉపనిషత్తులు అధ్యయనము చేయి.

## శ్రీమత్ భగవత్ పూజ్యపాద శ్రీ శంకరాచార్యకృత మంగళ శ్లోకద్వయము

**1.** ప్రజ్ఞానాంశు ప్రతానైః
స్థిర చర నికర వ్యాపిభిః
వ్యాప్య లోకాన్,
భుక్త్వా భోగాన్ స్థవిష్ఠాన్,
పునరపి ధిషణోః
భాసితాన్ కామ జన్యాన్,

**ఏ కేవల ప్రజ్ఞానంద స్వరూపము:**

"జాగ్రత్"ను ధరించి తనయొక్క ప్రజ్ఞా (The Factor of 'Knowing') స్వరూపముతో 'ఎరుక' అను తన కిరణములచే ఇక్కడి స్థిర - చర (స్థావర-జంగము) వృక్ష జంతురూపములుగా వ్యాపించి, **తనకు తానే ఆస్వాదిస్తోందో,**

అత్యంత స్థూలము (స్థవిష్టము) అగు ఇంద్రియార్థములతో ప్రసరించి (Like Electricity Passing through Electric wires) - బుద్ధి - కామము (ఇష్టము) మొదలైన వాటిచే జాగ్రత్‌నందు భోగముల రూప దృశ్యమును భోజనముగా ఆస్వాదించుచున్నదో?

---

పీత్వా సర్వాన్ విశేషాన్
స్వపితి మధుర భుక్
మాయయా భోజయన్నః,
మాయా సంఖ్యా, 'తురీయం'
పరమ్, అమృతమ్, అజం,
"బ్రహ్మ" యత్
**తత్ నతోఽస్మి॥**

- స్వప్నము రూపము ధరించి తన యొక్క తేజస్సునందు నానా విధములైన కామ - వాసనా విశేషములను త్రాగుచూ ఆనందించుచున్నదో,

- ఇంతలోనే సమస్తము బయటనే వదలి సుషుప్తిలో మౌనము వహిస్తోందో,

తనకు తానే మాయావి అయి (Like a Magician /గారడీవానివలె) జాగ్రత్-స్వప్న-సుషుప్తులకు ఆవల నాలుగవదై (తురీయమై) సమస్తమునకు పరమై, అమృతస్వరూపమై, అజమై (జన్మాదులకు సంబంధించకయే) ఉన్నదో, -

అట్టి పరబ్రహ్మమునకు చేతులెత్తి నమస్కరిస్తున్నాము.

| | | |
|---|---|---|
| **2.** | **యో విశ్వాత్మా విధిజ విషయాన్ ప్రాశ్య భోగాన్ స్థవిష్ఠాన్,** | ఏ పరమపురుషుడైతే-<br>జీవాత్మ స్వరూపుడు అగుచూ, జాగ్రత్ (విశ్వ) పురుషుడై జాగ్రత్ అవస్థను అంగీకరించి, ఈ సమస్త విశ్వమునకు ఆయా విధి - విధానములగు వ్యవహారపరంపరములను-స్వకీయకల్పిత చేతనములగు ఇంద్రియముల ద్వారా - **స్థూలమైనదంతా భుజించుచున్నారో, భోగించుచున్నారో,** |
| | **పశ్చాత్ చ అన్యాన్ స్వమతి విభవాన్ జ్యోతిషా, స్వేన సూక్ష్మాన్, సర్వాన్ ఏతాన్ పునరపి శనైః** | అటు తరువాత 'స్వప్నావస్థ'ను కల్పించుకొని (తైజసపురుషుడై) స్వకీయమగు 'విభవము' అనే జ్యోతి వెలుగులో సూక్ష్మరూపంగా (బాహ్యవస్తురహితంగా) అంతర్వృత్తిచే దృశ్యకల్పనను తనకుతానై రచించుకొని ఆస్వాదిస్తూ ఉన్నారో, |
| | **స్వాత్మని స్థాపయిత్వా,** | మరల ఇంతలోనే సుషుప్త (ప్రాజ్ఞ) పురుషుడై నెమ్మదిగా జాగ్రత్ - స్వప్న కల్పనలన్నీ స్వాత్మయందు స్థాపించుకొని ఉంటున్నారో, |
| | **హిత్వా సర్వాన్ విశేషాన్ విగత గుణ గణః । పాతు అసౌ నః 'తురీయః'।** | సమస్త దృశ్య - త్రిగుణ విశేషాలన్నీ త్యజించి, సమస్తమునకు ఆవలివారై (Beyond All) స్వయం ప్రకాశమానులై విరాజిల్లుచున్నారో....<br>అట్టి స్వాత్మ - స్వస్వరూప - సమస్త స్వరూప తురీయ పురుషుడు మమ్ములను అజ్ఞాన సందర్భములనుండి రక్షించి, కేవలము - స్వాభావికము అగు "స్వస్వరూపానుభవము"ను సిద్ధింపజేయుదురు గాక! |

**నారాయణం, పద్మభువం, వసిష్ఠంశ, శక్తిం చ, తత్పుత్ర పరాశం చ। వ్యాసం, శుకం, గౌడపదం, మహాంతం।**
**గోవింద యోగీంద్రం అథాస్య శ్రీశంకరాచార్యం, పద్మపాదం చ, హస్తామలకం చ శిష్యం,**
**తం తోటకంవార్తిక కారమన్యాం, అస్మత్ గురుం సంతత మానతోఽస్మి॥**
**శ్రుతి స్మృతి పురాణానాం ఆలయం, కరుణాలయం। నమామి భగవత్పాదమ్। శంకరం। లోక శంకరమ్॥**

**మాండూక్యము**

**"కప్ప" = "పరమాత్మ స్వరూపము". "కేవలము".**
**ఆయనయొక్క నాలుగు పాదములు – జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయములు.**

## 1వ మంత్రము

వేదోపనిషత్తుల సారము **"ఓం"।**

- అన్యముగా కనబడేదంతా తానే–తనదే అయి ఉన్న **అనన్య ఆత్మపురుషుని** సంజ్ఞ – **'ఓం' కారము.**
- తెలియబడే (వేద) సమస్తమునకు **అంతమున (ఆవలగా)**గల **వేదాంత పురుషుడు** 'ఓం' – శబ్దార్థులై స్తుతించబడుచున్నారు.

ఎట్టి హెచ్చు తగ్గులు, మార్పు–చేర్పులు ఏ సమయమందునూ ఉండనట్టి అక్షరమగు **ఓంకారమే** ఈ అనుభవమయ్యే **సమస్తము యొక్క వాస్తవ సహజస్వరూపము.**

అట్టి ఓంకార పరమ పురుషుని గురించిన వివరణలు, నామ రూప–ఉపాసనములే– **వేద, వేదాంగ, పురాణ, గీతాదులన్నీ కూడా!**

- – ఇతః పూర్వమే ఉండి ఉన్నదై, ఈ ఇంద్రియ–మనో–బుద్ధి–చిత్త–అహంకారములను తన అనుభవముగా అయి ఉన్నట్టిది,
  – ఇప్పుడు అనుభూతిగా అగుచున్నట్టిది,
  – ఇక ముందు కూడా అనుభవము కాబోవుచున్నట్టిది,
- జాగ్రత్ స్వప్న సుషుప్తులలో తెలియవచ్చునట్టిది,
- దేహా దేహాంతరములుగా విదితము అగుచున్నట్టిది –

***అగు అట్టి అంతాకూడా 'ఓం'కారమే। ఆత్మయే 'ఓం'కారము। కనుక ఈ సమస్తము ఆత్మస్వరూప విశేషమే।***

❀ **యచ్ఛ అన్యత్ త్రికాలాతీతం, కార్య – అధిగమ్యం, కాల – అపరిచ్ఛేద్యం – అవ్యాకృతాది – తదపి ఓంకారమేవ।**

కాలమునకు ఈవల (అంతర్గతమై) కనిపిస్తూ ఉన్నదే కాకుండా, ఏది త్రికాలములకు ఆవల, కార్యకారణములకు ఆవల, అపరిచ్ఛేద్యమై ఉన్నదో, **–అది కూడా ఓంకార స్వరూపమే। ఆత్మయే।** కాలము కూడా–దేనిచే నిర్మితమై ప్రదర్శనమౌతోందో – అదీ ఓం కారవాచ్యార్థమే। **(అది అవ్యాకృతము – అనబడుతోంది. బాహ్యముగా అనుభవము కానిది కాబట్టి అవ్యాకృతము).**

(ఈ భౌతిక శరీరము కాలాంతర్గతము. కేవలమగు మనో బుద్ధి చిత్త అహంకారములు కాలమునకు ఆవలవి).

'ఓం' కారమే బ్రహ్మమును ధ్యానించటానికి, ఉపాసించటానికి, ఆత్మత్వము సిద్ధించటానికి ముఖ్యావలంబనము. 'ఓం' కారముతో ఆత్మానుసంధానము నిర్వర్తించబడు గాక – అని వేద హృదయము. **ఆత్మయొక్క 'వాక్' సంజ్ఞా – రూపము 'ఓం'కారము.**

**దృష్టాంతము** : ఒక బీజములో కొమ్మలు, ఆకులు, పూవులు, కాయలు, పునః బీజములు మొదలైన వృక్ష ధర్మములన్నీ అంతర్గతమై ఉన్నట్లుగా, 'ఓం' కారమునందే (ఆత్మయందే) సమస్తము సంకల్పితరూపములై ఉన్నాయి. ఆత్మయందే ఈ జగద్దృశ్యము యొక్క సృష్టి, స్థితి, లయములు (జలములో తరంగములవలె) ఏర్పడినవై ఉన్నాయి.

## 2వ మంత్రము

**సర్వగ్గ్ం హి ఏతత్ బ్రహ్మ।**

**అయమ్ ఆత్మా బ్రహ్మ। సోయమాత్మా చతుష్పాత్**

- ఈ సమస్తము బ్రహ్మమే।
- బ్రహ్మమే 'నేను'గా జాగ్రత్ స్వప్న సుషుప్తులలోను, తురీయముగాను సంప్రదర్శితమౌతోంది.
- **'నేను'**లో నుండి **'భావన'**, 'భావన' నుండి అనుభూతి, అనుభూతిచే **'అనుభవము'** ఏర్పడుచున్నాయి. సమస్తము స్వకీయానుభవ ప్రదర్శనమే। ఈ జగత్తుయొక్క వాస్తవరూపము **భావనా, అనుభూతిరూప "స్వకీయకల్పన"యే।**
- ఈ విధంగా ఇదంతా ఆ **ఓంకారమే।**

ఆత్మయే దేహములో అత్యంత విశిష్టము, శ్రేష్ఠము కాబట్టి బ్రహ్మము. బ్రహ్మమునే 'ఓం' అని పిలుస్తున్నారు.

**<u>సర్వమ్</u>** – కార్య – కారణములుగా జనించేదంతా, పరిణమించేదంతా – ఆవల, ఈవలతో సహా బ్రహ్మమే।

– కర్తృత్వములుగాను, భోక్తృత్వముగాను పరిదృశ్యమయేదంతా బ్రహ్మమే।

– ప్రత్యక్ష – పరోక్ష – అపరోక్షము (ప్రత్యక్ష పరోక్షములు కానిది) అంతా అదే.

[ ప్రత్యక్షము = Seen with eyes here.

పరోక్షము = Not seen physically here. Is somewhere else.

అపరోక్షము = ఆత్మ ఇంద్రియములకు కనబడేది కాదు. మరెక్కడో ఉన్నది కాదు. ప్రత్యక్ష–పరోక్షములకు అవిషయమైనది. కానీ, **స్వస్వరూపమే అయి ఉన్నట్టిది.** ]

## అయం ఆత్మా బ్రహ్మ

"నేను" అని గుండెలపై అరచేయి పరచి దేనిని చెప్పుకుంటున్నామో, దేనికి మెలకువ – కల – గాఢనిద్ర తనవై ఉన్నవో – అట్టి

**I am** ____ I am existing - **<u>"సత్"</u>**

____ I am knowing = **<u>"చిత్"</u>**

____ I am experiencingly enjoying = **<u>"ఆనందము"</u>** తో కూడిన ఈ జీవాత్మ → **<u>బ్రహ్మమే।</u>**

అట్టి ప్రతి ఒక్కరిలోని "ఆత్మ" బ్రహ్మమే. వ్యక్తిగతంగా చెప్పుకొనేడప్పుడు దేనిని "జీవాత్మ" అని పిలుస్తున్నామో – అది సర్వగతమగు, సర్వాంతర్యామిగా **"పరమాత్మ"**యే. జీవుని పరాకాష్ఠ తత్త్వము కాబట్టి అదియే **'<u>బ్రహ్మము</u>'।**

ఇప్పుడు అట్టి **"నేను"** అను అనుభూతి తనదైన **"ఆత్మ"** గురించి మరికొంతగా విశ్లేషించుకుంటూ **వివరించుకుంటున్నాము. అభివర్ణించుకుంటున్నాము.**

# సో౽ యమ్ ఆత్మా చతుష్పాత్

అట్టి "నేను" అను భావ ప్రకటన తనదైయున్న ఆత్మకు '4' పాదములు (Four Phases / Legs, Four Presentative Appearences)

= '4' పురుషకారములు. (Functional Features).

= '4' అవస్థలు (Four States).

= '4' స్థితిగతులు (Four Placement cum Movements).

ఒక రాజుగారు **రాజసభలోను, అంతఃపురములోను, ఉద్యానవనములోను, దేశమంతటాగీసాధికారంగా** పాల్గొనుచున్న / ఏర్పడి ఉన్న తీరుగా)

[1/4 + 1/4 + 1/4 + 1/4] అంతర్గతమై స్వాభావికమైనట్లు ఆత్మకు నాలుగు పాదములు.

| | | | | |
|---|---|---|---|---|
| (1) | **జాగ్రత్** - | స్థూల పురుషకారము - | బహిర్ ప్రజ్ఞ - | **విశ్వుడు -"వైశ్వానరుడు"** |
| (2) | **స్వప్నము** - | సూక్ష్మపురుషకారము - | అంతర్ప్రజ్ఞ - | **"తైజసుడు"** |
| (3) | **సుషుప్తి** - | మౌన పురుషకారము - | విషయాతీత/నిర్విషయ ప్రజ్ఞ- | **"ప్రాజ్ఞుడు"** |
| (4) | **తురీయ** - | జాగ్రత్ స్వప్న సుషుప్తులు - | తనవైన పురుషకారము. ఈ పురుషుని కేవల ప్రజ్ఞ- | **"తురీయుడు"** |

***ఆత్మయొక్క పై నాలుగు (లేక) పాదములు (లేక) విన్యాసములు (లేక) విశేషములు గురించి ఇప్పుడు వివరించుకుంటున్నాము.***

**3వ మంత్రము మొదటి పాదము (1)**

## ఒకటవ అవస్థ - వైశ్వానర ప్రథమ పాదః

## 1. జాగ్రత్ • బహిర్ - ప్రజ్ఞ • జాగ్రత్ అవస్థ • జాగ్రత్ పురుషకారము • విశ్వుడు • వైశ్వానరుడు (జాగ్రత్ నాదైన "నేను")

**జాగరిత స్థానో బహిర్- ప్రజ్ఞః జాగ్రత్ మాధుర్య ఆస్వాదనకు** - కళ్లు చెవులు ముక్కు నోరు చర్మము మొదలైన ఇంద్రియములన్నీ ఉపకరణములు. వీటిని ఉపయోగించు ఆత్మ బాహ్యమున - అంతరమున వ్యవహారశీలమై ఉన్నది.

**"బాహ్యప్రజ్ఞ"**యే జాగరితము (Awakened state of operation of Indrias) గా 'ఓం' కారము యొక్క (నాలుగిటిలో) మొదటి పాదము. విశ్వము (దృశ్యము) పట్ల అభిమాని కాబట్టి **"వైశ్వానరుడు".** (External Interstedness).

ద్రష్ట అగు తనకు అన్యముగా (దృశ్యముగా) కనిపిస్తూ **'ఉనికి'** ఉన్నట్లుగా తోచేది **'బహిర్ప్రజ్ఞ'** యొక్క ప్రదర్శనము. ఇంద్రియము ద్వారా బాహ్య విషయములగురించిన అనుభూతి. బాహ్యసంబంధములు అభ్యాసవశంచేత బంధములు (Bondings) అయినప్పుడు - అదియే "భవబంధము".

ఈ బహిర్ ప్రజ్ఞ యొక్క (జాగ్రత్ కల్పనకు), (లేక) **'వైశ్వానరుడు'** అను ఆత్మయొక్క అంశపురుషునికి (విశ్వునికి) - అంగములు "7", (సప్తాంగస్య). అవి విశ్వాంగములుగాను, దేహాంగములుగాను పరిఢవిల్లుచున్నాయి.

I. **విశ్వాంతర్గత సప్త :** ***బాహ్యమగు దృశ్యమునకు (లేక) విశ్వమునకు సంబంధించిన విశ్వపురుషుని (జాగ్రత్ పురుషుని) సప్తాంగములు:***

(1) విశ్వ నిర్మాణము, విశ్వ విన్యాసములలో పాలు పంచుకుంటూ ఉన్న దివ్య - అశరీర **పురుషులగు, తేజోరూపదేవతలు**. వారు ఉండే స్థానము - **'ద్యులోకము'.**

(2) సమస్తమునకు వెలుగు **తేజస్సు** ప్రసాదించుచున్న **సూర్యుడు.**

(3) ప్రాణములకు పరిపోషకుడు, సంరక్షకుడు అగు - **వాయువు** (చేతన విశేషుడు).

(4) సమస్తము స్థానము పొందుచున్న **'ఆకాశము'.**

(5) జీవత్రాణ అగు **'జలము'.**

(6) ఆహారప్రసాది అగు **'భూమి'.**

(7) తేజో - ఉష్ణమయమగు **'అగ్ని'.**

II. <u>శరీరాంతర్గత సప్త :</u> *ఈ భౌతిక శరీరమునందు ప్రవర్తనము కలిగియున్న సప్తాంగములు.*

(1) జ్ఞానేంద్రియములన్నీ అమర్చబడిన – **శిరస్సు** (Head).

(2) చూపు స్థానమగు – **నేత్రములు (కళ్లు)** (Seeing).

(3) వాయు ప్రసరణశక్తి రూపమగు – **ప్రాణము** (Energy).

(4) దేహమధ్యగా అంతర్గతమైయున్న – **ఆకాశము** (Space).

(5) దేహములో అధిక విశేషభాగమైయున్న – **జలము** (Liquid).

(6) శరీరమును నడిపింపజేయు – **పాదములు** (Walking Movements).

(7) శబ్దము – ఆహారస్వీకారస్థానమగు – **నోరు** (Mouth).

**వైశ్వానరుడు (విశ్వుడు) – అను (ఆత్మాంతర్గతుడగు) జాగ్రత్ పురుషుని "19" ముఖములు.**

(I) **"పంచ" జ్ఞానేంద్రియములు – (5)**

(1) **శ్రోత్రము** (చెవులు) (2) **చక్షువులు** (చూపుస్థానము) (3) స్పర్శ స్థానమగు **చర్మము** (4) 'రుచి'ని ఆస్వాదించు రసనేంద్రియము (నాలుక) (5) వాసనానుభవము అందించు **ఘ్రాణము** (ముక్కు)

(II) **"పంచ" కర్మేంద్రియములు – (5)**

(1) <u>వాక్కు</u> (మాట్లాడు) <u>నోరు / నాలుక.</u>

2) వస్తువులను ధారణ చేయగల (పట్టుకోగల) <u>చేతులు (ప్రాణి)</u>.

(3) 'నడకను' నిర్వర్తించు <u>కాళ్లు</u> (పాదములు).

(4) విసర్జనను నిర్వర్తించు <u>'పాయువు'.</u>

(5) విసర్జన – కామన ధర్మము నిర్వర్తించు <u>"ఉపస్థ".</u>

(III) **పంచ వాయువులు (లేక) పంచ ప్రాణములు (5)**

(1) ప్రాణము (వాయువుయొక్క శరీర ప్రవేశ వాయుచలనము)

(2) అపానము (వాయువుయొక్క బాహ్యమునకు పోవు వాయు చలనము)

(3) వ్యానము (శరీరమంతా వ్యాపించి ఉండువాయు చలనము)

(4) ఉదానము (కంఠమునందు, పొట్టనందు ఉండి కొన్ని శారీరక ధర్మములు నిర్వర్తించు వాయుచలనము.

(5) సమానము (నాభియందు స్థానము కలిగి, శారీరక – సమన్వయ – సమానత్వములను నిర్వర్తించు వాయువు. సమత్వ చలనము).

***(పై 5×3 = 15) తరువాత***

**(16) మనస్సు** : మననము చేయు విభాగము (Phase of Thinking). ఆత్మయొక్క స్వకీయ భావనా–స్వాభావిక విశేషము. స్వాధికారము చేతను, లీలా క్రీడా చమత్కారమువలనను 'మననము' ఏర్పడినదై ఉంటోంది.

అట్టి అన్య వస్తు విషయ, సంబంధ, సంఘటన, అనుబంధ, బాంధవ్య – ఇత్యాది విశేషములు **మననముచే** కల్పితరూపము పొందిన ఈ మనస్సు – ఆత్మభావనను కప్పివేసి ఉంచుతోంది. అట్టి ఈ మనస్సు ఎంతటి చమత్కారమైనదంటే…,

– తానే ఉన్నట్లు

– ఆత్మ ఏమో లేనట్లు –

తాత్కాలికంగా భ్రమింపజేస్తోంది. (అందుచేత **"మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః బంధస్తు విషయాసక్తిః'** – అని చెప్పబడుచున్నది). ఆత్మస్వరూపుడగు ఈ జీవునిపట్ల (స్వకీయంగా కల్పించబడికూడా) – సంబంధము ఏర్పరచి, 'బంధము' రూపముగా

అగుచున్నది. ఇది **"కథలోని ఒక సంఘటన-ఆ కథా రచయితను బంధింపజేయుచున్నది"** - అను హాస్య కల్పిత వాక్యమువలె ప్రసిద్ధమౌతోంది.

**17. బుద్ధి** : ఇది ఈ జీవునియొక్క నిర్ణయాత్మక విభాగము. విచక్షణ - విమర్శన - అవగాహన ధర్మములు నిర్వర్తించు ముఖము.

అట్టి బుద్ధి ఈ జీవుని స్వకీయ సంపత్తి విశేషమే అయినప్పటికీ - అల్పమైన, కాలబద్ధమైన వస్తు - విషయ మనోసంబంధములను నమ్మకముతో అన్వయించుచున్న కారణంగా-ఆశ్రయించి అల్పత్వము, దోషత్వము కలిగినదై ఉంటోంది. సంకుచితమై ఉంటోంది. (కొన్ని సందర్భములలో) **సమగ్రమగు సదవగాహన**ను కలిగి ఉండటం లేదు.

అట్టి **"బుద్ధిని నిర్మలము, సునిశితము, విస్తారము, ఏకాగ్రము" చేయటమే ఆత్మాఽహమ్ భావనను పునరుద్ధరించు ఉపాయము.** ఇక తదితర 'భక్తి, ధ్యానం, జ్ఞాన, యోగాదులన్నీ కూడా అందుకు సుందరము, ఉత్తిష్ఠము అగు ఉపాయములు".

**(బుద్ధౌ శరణమన్విశ్చ। కృపణా ఫల హేతవః** - సమస్త కర్మల నిర్వహణముల ఉత్తమాశయము బుద్ధి యొక్క ఏకాగ్రతయే. ఇక "దృశ్యములో ఏమి పొందాము?" అను కర్మఫలాశయములు అల్పమైన ఆశయములేగాని, మహదాశయము కాదు. **(భగవద్గీత - సాంఖ్యయోగము)**

(**బుద్ధం శరణం గచ్ఛామి** - బుద్ధి యొక్క ఉన్నతికై ఉద్దేశ్యిస్తున్నాను - **బుద్ధభగవానుడు**).

**(18) చిత్తము** : ఆత్మయొక్క **'ఇచ్ఛాశక్తి'** లేక 'ఇష్టము' అనునదే ఈ 18వ ముఖము. ఇష్టము (చిత్తము)ను అనుసరించే మనోబుద్ధులు వర్తిస్తున్నాయి. 'ఆత్మయే అన్నిటికన్నా ప్రియమైనది. తనంటే తనకు ఎవరికైనా ఎంతో ఇష్టము కదా! అందుచేత ఇష్టము (లేక) చిత్తమును ఆత్మగురించిన సమాచారము కొరకై నియమించుట చేతనే ఆత్మోపాసన, ఆత్మజ్ఞానము, ఆత్మాఽహమ్ భావన, ఆత్మానుభవము లభించగలవు.

**(ఆత్మావా అరే ద్రష్టవ్యః, శ్రోతవ్యో, మన్తవ్యో, నిదిధ్యాసితవ్యో। ఆత్మనోవా అరే దర్శనేన శ్రవణేన, మత్యా విజ్ఞానేన ఇదగ్ం సర్వం విదితమ్।** ఆత్మను తెలుసుకుంటే అంతా తెలిసిపోతుంది - బృహదారుణ్యకోపనిషత్ 6వ అధ్యాయము-పంచమ బ్రాహ్మణము).

**(19) అహంకారము** : **"నేను కర్మలకు సంబంధించిన కర్తను. భోక్తను. ఆధారుడను. పరిమితుడను. బద్ధుడను"** - అను ముఖము. ఇద్దాని నుండి "నేను ఈఈ విశేషములకు చెందినవాడను. ఇవి నాకు చెందినవి" అను పరిమితమగు, సంకుచితమగు స్వస్వరూపముగురించిన నిర్వచనము స్వయం కల్పితంగా రూపము దిద్దుకుంటోంది.

పరిమితము, సంకుచితము అగు అహంకారముచే (ఆత్మస్వరూపుడే అయి ఉన్న) ఈ జీవుడు **'బద్ధుడు'**గా ను, అల్పుడుగాను తనకుతాను అనుభవము అగుచున్నాడు. "అయ్యో! నా గతి ఏమిటి?" అని తలచుచూ, తన గురించి తానే కృపణుడు, జాలిపొందువాడు అగుచున్నాడు.

> ***"ఇదంతా నాయొక్క కల్పనామహిమయే" అను మహదహంకార దృష్టిచే ఈ జీవునిపట్ల సర్వ నిబద్ధతలు తొలగి, "నాకు బంధము మొదలే లేదు" - అను రూపంగా మోక్షభాగుడగుచున్నాడు.***

**స్థూలభుక్** - ఈ విధంగా ఆత్మ సప్తాంగముల (7 అంగములచే) ఏకోనవింశతి (19) ముఖములచే స్థూలము (The Material World) గా **"అనుభూతి అనుభవము"** ను ఆహారము స్వీకరిస్తూ ఉన్నది.

ఆత్మయొక్క ఒక అంశ అగు - **"భౌతిక ప్రపంచానుభవి" (లేక) "స్థూలభుక్"** అనే పురుషుడు **"జాగ్రత్ అనుభవము"** అనే పురుషకారము నిర్వర్తించు సందర్భములో **"విశ్వానుభవి, వైశ్వారుడు"** అని చెప్పుకుంటున్నాము.

(కారును నడుపువానిని "కార్ డ్రైవర్" అని పిలుస్తున్నట్లుగా, విశ్వానుభవి **'విశ్వుడు'** అని పిలువబడుచున్నాడు).

**"జాగ్రత్ అనుభవము"** అనునది ఆత్మయొక్క ఒక పురుషకారమై, ఆ పురుషుని 'విశ్వ-అనం" (విశ్వమును అనుభవిస్తూ) - వైశ్వానరుడుగా చెప్పబడుచున్నాడు.

"ఈ విశ్వమును భుజించటము లేక ఆస్వాదించటము" అనే వైశ్వానరత్వము ప్రధమపాదము (First of the Focus/ Roles / States).

## వైశ్వానరుడు - కొన్ని శబ్దార్థ నిర్వచనములు

- ఇంద్రియ ద్వారముల ద్వారా **"శబ్ద స్పర్శ రూప రస గంధములు"** - అనే స్థూల విషయములు అనుభవిస్తూ ఉండటంచేత - **'వైశ్వానరుడు'**. స్థూల విషయాభిమాని అవటంచే - **'వైశ్వానరుడు'**.
- సమస్త జీవులను అనేకరీతులుగా ఆయా సుఖదుఃఖాది అనుభవఫలములను అందిస్తూ ఈ సమస్త విశ్వమును జరిపింపజేస్తూ ఉన్న విశ్వ-పురుషకారము / పురుషకారుడు - కనుక **'వైశ్వానరుడు'**.
- ఈ విశ్వమంతా ఆత్మకు **'జీవనము'** అనే ధారణ వంటిది కాబట్టి, అట్టి ఆత్మయొక్క విశ్వానుభవ పురుషకారమును **'వైశ్వానరుడు'** అంటున్నాము.
- సర్వజీవులకు (1) ఆత్మగా (2) విరాట్ స్వరూపుడుగా - ఏర్పడి క్రీడించుచుండటంచేత **వైశ్వానరుడు.**

మనము జాగ్రత్‌లో ఉండి జాగ్రత్ - స్వప్న - సుషుప్తి తురీయములను పరిశీలిస్తూ ఉన్నాము. అందుచేత జాగ్రత్ మొదట (ప్రథమ) పాదముగా చెప్పుకుంటున్నాము.

ఈ వైశ్వానరుడే (విశ్వముపరంగా) **"విరాట్"** అని కూడా చెప్పబడుచున్నారు. అట్టి **'విరాట్'** - 'పంచీకృతస్థూలభూతములు (+) కార్యకారణ కర్తృత్వ సమన్వితము" - అయి ఉంటోంది. ఆత్మయొక్క విరాట్ ప్రదర్శనమే ఈ **"విశ్వము (లేక) జగత్తు"**.

---

**4వ మంత్రము**

### రెండవ అవస్థ - తేజసో ద్వితీయ పాదః।
### అంతర్‌ప్రజ్ఞ. స్వప్నావస్థః. స్వప్న పురుషకారము. తేజసము. తేజసుడు. "హిరణ్యగర్భుడు".
### (స్వప్నము నాదైన "నేను". నాయొక్క స్వప్నమాధుర్యము.)

**స్వప్న స్థానో - అంతర్ ప్రజ్ఞః।**

ఈ జీవుడు కొంతసేపు జాగృతానుభవము పొందిన తరువాత, తనయొక్క ప్రజ్ఞను ఇంద్రియ - బాహ్య దృశ్యమానమగు 'విశ్వము' నుండి ఉపసంహరించి, - **అట్టి దృశ్యమువంటిదే అగు, ఊహతో నిర్మితమైన** - దృశ్య వ్యవహారమును అంతరమున కల్పించుకొనుచున్నాడు. అట్టి పురుషకారము **"అంతర్‌ప్రజ్ఞ"** (Inner Visualising Wisdome) అనబడుతోంది.

తన **'ప్రజ్ఞ'** అనే తేజస్సుతో అంతరమున "తనకు వేరా?" అని అనిపించు అనుభవమును 'స్వప్నదృశ్యం'గా కల్పించుకొంటూ, "ఇదియే నిజము" అను అనుభవమునకు పురుషకారుడు అగుచున్నాడు. కాబట్టి "తైజసపురుషకారుడు" - అనబడుచున్నాడు.

- 'జాగ్రత్'లో జాగ్రత్ దృశ్యమే నిజమని, స్వప్నము కల్పితమని (సహజముగా లేనిదని) అనుకున్న తీరుగానే,
- 'స్వప్నము'లో స్వప్నదృశ్యమే నిజమని, జాగ్రత్ కల్పితమని - ఈ పురుషునికి (జీవునికి)

అనిపించసాగుతోంది.

**అయితే, ఉభయ పురుషకారములు ఏకస్వరూపమగు 'ఆత్మ'కు చెందినవే అయి ఉన్నాయి.**

**సప్తాంగ (3) - ఏకోనవింశతి ముఖః (19)।**

"స్వప్నదృశ్యము" అనే ఆహార భోజనము సందర్భములో కూడా జాగ్రత్‌లోలాగానే - **'7' అంగములు, '19' ముఖములు కల్పితమై ఉంటున్నాయి.**

**జాగ్రత్‌లో** - పంచేంద్రియములు ఉపయోగించబడుచున్నాయి. విషయములు బాహ్యముగా పొందబడుచున్నాయి.
**స్వప్నములో** - బాహ్య వస్తువులు లేకుండానే, ఇంద్రియార్థానుభవములు (శబ్ద స్పర్శ రూప రస గంధానుభూతులు) కొనసాగుతూ ఉండగా దృశ్యము కల్పితమై, ఆత్మచే ఆస్వాదించబడుతోంది.

మనస్సే-మనో ప్రపంచముగా అగుచున్నది. స్వప్న జగత్తు - ఆత్మకు ఆహారముగాను, వినోద కాలక్షేపముగాను - స్వయం కల్పితమౌతోంది.

స్వప్నములలో కూడా జాగ్రత్ వలెనే.....అంతరముగా **"బాహ్యత్వము, అన్యత్వము"** అనుభవముగా అగుచున్నది. స్వప్నము సమయములో స్వప్నదృశ్యము, జాగ్రత్ సమయంలో జాగ్రత్ దృశ్యము 'సత్యము'గా అనిపిస్తూ, పరస్పరము (ఒకదానికి దృష్ట్యా మరొకటి) కల్పితమాత్రమే అవుతున్నాయి.

జాగ్రత్‌ను విడచి స్వప్నమును కల్పించిన తరువాత కూడా ఇంద్రియాపేక్ష ఇంద్రియ లోలుత్వము కొనసాగుతోంది. చేతితో తిప్పే చక్రము చేయి, ఆపిన తరువాత కూడా – తిరగడం కొంతసేపు కొనసాగుతుంది కదా! అట్లాగే, దృశ్యానుభవము స్వప్నములో పాల్గొనుచూనే ఉంటోంది.

అయితే ఈ తతంగమంతాకూడా, (జాగ్రత్–స్వప్నములు రెండూ కూడా) – **'అంతరహృదయము'**లోనే జరుగుతోంది. హృదయమనే **తెర** (Screen) **పై ప్రసరితములు అగుచున్న చిత్రప్రదర్శనములే** ఈ జాగ్రత్–స్వప్న దృశ్యములు.

అంతరమున ప్రజ్ఞ కొనసాగుచూ, కల్పితమును ఆశ్రయించటముచేత స్వప్న సందర్భములో ఆత్మను **'<u>అంతః ప్రాజ్ఞఃపురుషుడు</u>'** అని చెప్పుకుంటున్నాము.

బాహ్య విషయములు లేకుండానే కేవల ప్రకాశము (Absolute Manifestation)చే విషయత్వము కొనసాగించటముచేత **"తైజసుడు"** అని పిలుస్తూ ఉన్నాము. [తేజో మాత్రములో (In the mere enlightenment) సాకారము కల్పించుకొను పురుషకారము]

తాత్కాలికంగా మనస్సును మనస్సునందే ప్రకాశింపజేసి స్వప్న – దృశ్య విషయముల 'కర్త'గా అగుచుండటంచేత కూడా స్వప్న పురుషుడు **'<u>తైజసుడు</u>'** అనబడుచున్నాడు.

**విశ్వునికి (<u>వైశ్వానరునికి</u>)**– స్థూలవస్తువులతో సంయోగముచేతను, ప్రజ్ఞ – ప్రేరేపణను స్వీకరించటంచేతను – **భోగములు** (Experiences) కలుగుచున్నాయి.

**<u>తైజసునికి</u> – స్వప్న విశేషములన్నీ కూడా ఎట్లా కలుగుచున్నాయి?** వాసనలను అనుసంధానము చేసి, **భోగములను** (Experiences) **స్వకీయ ప్రజ్ఞచే కల్పించుకొని ఆస్వాదించటము చేతనే కలుగుచున్నాయి.** జాగ్రత్‌లో సంపాదించిన వాసనలే స్వప్నములో ఊహానిర్మితమై ప్రజ్ఞకు అనుభవములుగా అగుచున్నాయి.

**<u>ప్రవిభక్త భుక్</u>** : స్వప్న స్థానము స్వీకరించిన ఆత్మకు భౌతికమైన ఇంద్రియములు ఉపయోగించకుండానే, వాసనా **మాత్రమైన ప్రజ్ఞ– "భోగ్యవస్తువు"గా** అవుతోంది. అనగా, స్థూల విషయములు లేకుండానే, వాసనలే (Tendencies themsleves) నామరూపాత్మకంగా కల్పితమవటంచేత **'ప్రభవిక్త భుక్'** అని **తైజసుడు** పిలువబడుచున్నాడు.

చేతస్సే (visualisation) స్వప్నదృశ్యమునకు ద్వారము అయి స్వప్నానందము అనుభవించబడుచూ ఉండటంచేత స్వప్నపురుషుడగు తైజసుడు – "సూక్ష్ముడు" అని కూడా పిలువబడుచున్నాడు.

తనకు వేరుగా ఇంద్రియానుభవములను భావనచేస్తూ, భుజిస్తూ ఉండటంచేత **'ప్రవిభక్త భుక్'** అగుచున్నాడు.

'జాగ్రత్ నుండి స్వప్నములోనికి' అనునది అందరికీ ప్రతిరోజు అనుభవమౌతోంది. కాబట్టి ఈ **తైజసపురుషుని "ఆత్మయొక్క ద్వితీయ పాదము"** – అని ఇక్కడ చెప్పుకుంటున్నాము.

**5వ మంత్రము**

## మూడవ అవస్థ – ప్రాజ్ఞో తృతీయ పాదః

## {సుషుప్తి – నిర్విషయ ప్రజ్ఞ. ప్రాజ్ఞుడు. సుషుప్తి పురుషకారము. సుషుప్తి పురుషుడు.}

## (సుషుప్తి నాదైన 'నేను' – నాయొక్క సుషుప్తి మాధుర్యము)

సుషుప్తి – **శ్లో॥ యత్ర సుప్తో న కంచన కామం కామయతే,**
**న కంచన స్వప్నం పశ్యతి – తత్ "సుషుప్తమ్"॥**

ఎప్పుడైతే – (వాస్తవానికి ఆత్మస్వరూపుడే అయి ఉన్న) ఈ జీవుడు, అటు 'జాగ్రత్' కానీ, ఇటు స్వప్నమునుగాని పొందక, తనకు తానే తనయందు ఏర్పడినవాడై, తాను **"విషయ రహిత నిశ్శబ్ద మౌనము"** వహించినప్పటి స్థితి – **'సుషుప్తి'** అనబడు మూడవ పాదముగా చెప్పబడుతోంది.

***<u>అట్టి సుషుప్తి సందర్భములో</u>***

- జాగ్రత్, స్వప్నములందువలె కాకుండా, ఏదీ కోరుకుంటూ ఉండడు. దేనిగురించీ ఆలోచించడు. ఆశించడు.
- దేనినీ భావించడు. వేదన చెందడు. అనుభూతి కలిగి ఉండడు.
- **<u>ఏకీభూతః :</u>** ఏకస్వరూపుడై, తనకు అన్యమును ఏమాత్రము కలిగి ఉండని వాడై ఉంటాడు. జాగ్రత్ స్వప్న ప్రజ్ఞలను సుషుప్త ప్రజ్ఞయందు ఏకము చేసివేసి ఉంటాడు.

❖ **ప్రజ్ఞాన ఘన :** 'బంగారపుముద్ద'వలె (ఆభరణత్వము అప్రదర్శితము అయి ఉన్నతీరుగా) కేవలమగు (ద్వితీయమే లేని) 'ప్రజ్ఞానఘన' స్వరూపుడై ఉంటాడు. శిల్పముగా మలచబడని శిలవలె ఘనీభూతుడై, నిర్విషయ విశేషుడై ఉంటాడు.

"తెలివి-తెలియబడేది" అనే ద్వంద్వము నుండి తెలియబడేదంతా త్యజించి కేవలము **"తెలివి (Absolute state of knowing without performing the function of knowing something else / something outside)"** - రూపము సంతరించుకొన్నవాడై ఉంటాడు.

జాగ్రత్-స్వప్న వృత్తులన్నీ ఏకం చేసివేసి ఉంటున్నాడు.

**అంతః ప్రజ్ఞ - బహిర్ ప్రజ్ఞలను 'మౌనప్రజ్ఞ' యందు 'అనన్యము'** చేసివేసి ఉంటాడు. అనేకమంతా దాచివేసి, 'ఏకము'ను మాత్రమే ఆస్వాదించువాడై ఉంటాడు. తాను ఉంటాడు. విషయములన్నీ అప్రదర్శితమై ఉంటాయి.

**ఆత్మానందమయో :** అన్యమే సంకల్పించకపోవటం చేత ఆత్మ (జీవుడు) తనయొక్క 'ఏకతత్వము'చే ఆత్మానందుడై ఉంటాడు.

(అయితే ఇది జాగ్రత్-స్వప్న వృత్తులను దాచుకుని ఉన్న కించిత్ ఏమరచిన స్థితియే గాని, **'వృత్తి రహిత, వృత్తి అతీత కేవలాత్మానందస్థితి"** కాదు).

**ఆనందభుక్ :** జాగ్రత్‌లో భౌతిక రూపనామములు, స్వప్నములో ఊహారూపనామములు భోజనము (Food Stuff) అగుచుండగా, సుషుప్తి సందర్భములో **మౌనానందమే,** (మరియు) **ఆత్మయొక్క సమీప్యానందమే** ఆ జీవునకు "భోజనము" (That being consumed and enjoyed) అగుచున్నది. విషయము కలిగిస్తున్న స్పర్ధలు, వేదనలు ఇక్కడ అప్రదర్శితము. కాబట్టి - 'ఆనంద భుక్' - అని చెప్పబడుచున్నాడు.

**చేతోముఖః** : మనస్సు మౌనము వహించి ఉంటుంది. చేతస్సు (తెలివి)ని ముఖముగా కలిగి, **"తెలివితో తెలివిని మాత్రమే"** చూస్తూ ఆస్వాదిస్తూ ఉంటాడు. **"విషయములపై వ్రాలటము"** అనే శ్రమలేనివాడై ఉంటాడు. దర్శన - అదర్శన వృత్తులు రెండూ తనయందు మరెక్కడో దాచిబెట్టినవాడై, వృత్తిరహిత నిజరూపసామ్యమును, సామీప్యమును ఆస్వాదిస్తూ ఉంటాడు.

జాగ్రత్ స్వప్నముల కంటే - 'సుషుప్తి (మౌనరూపము ధరించుటచే)' కొంత భిన్నమైనది. (ఎందుకంటే) **జాగ్రత్ - స్వప్న - సుషుప్తులలో తన సహజమైనట్టి "ఆవలి (పర) రూపము" - యొక్క సామీప్యత సుషుప్తిలో అధికంగా అనుభవమవటంచేత.**

అయితే, సుషుప్తి కూడా ఒకానొక 'వృత్తి' (లేక) రూపమే. అంతేకాని, జ్ఞాన - ఆనందరూపమగు ఆత్మాస్వాదన కానేరదు, కాజాలదు. **"ఆత్మాహమ్ / సోఽహమ్' స్థానముతో సమానము కాదు.** (ఎందుకంటే, వృత్తులు దాచబడి ఉన్నాయేగాని, 'రహితం' కాలేదు కదా!).

**యత్ర సుషుప్తిః?** ఏ స్థానమునందైతే బాహ్యమగు పాంచభౌతిక దర్శనవృత్తులు, అంతరమగు మనోబుద్ధి చిత్త అహంకార ప్రయుక్త వృత్తులు నిశ్శబ్దము వహించనై ఉంటాయో, అదియే 'సుషుప్తి'. (Dead-Silence. Dead-Sleep).

ఆ స్థానమును ఈ జీవుడు 'సుషుప్తి పాదము'గా ధారణచేయువాడై ఉంటాడు. (It is one Phase).

అది జాగ్రత్ - స్వప్న వృత్తులను తనయందు దాచుకొన్న స్థితియే కాబట్టి 'సుషుప్తి - అవస్థితుడు' అని చెప్పుకుంటున్నాము.

**ఇక్కడ "జీవుడు" ద్వైత జాతమంతా దర్శించడు.**

**ఇది బాహ్య నివృత్తి - అంతర నివృత్తి సహిత పదము (లేక) స్థానము.**

చీకటిలో వస్తుభేదములు కనిపించని రీతిగా గాఢనిద్రలోఉన్నవానికి ఆతని దృష్టిలో భేదభావములు (చీకటిలో ఉన్నవాటివలె) కనిపించనివై ఉంటాయి. అందుచేతనే సుషుప్తిని **'ఏకీభూత స్థితి'** అంటున్నాము. (భేదములన్నీ ఏకమైయున్న స్థితి).

'ప్రజ్ఞ' ఏకరూపమై **"ఏకీభూతప్రజ్ఞ"**గా అగుటచే **"ప్రజ్ఞానఘనము"** అని కూడా పిలుస్తున్నారు. నీరుగడ్డ కట్టినప్పుడు 'జలప్రవాహధర్మము' వీడి ఉన్నతీరుగా, ప్రజ్ఞ - ప్రవహించు ధర్మమును వీడి (విషయత్వము వదలి) ఘనీభూతమై ఉండటంచేత **"ప్రజ్ఞానఘనము"** అనిపించుకుంటోంది.

| ప్రజ్ఞ సర్వసందర్భములలో ఏకమే అయి ఉన్నది (ప్రజ్ఞానమే బ్రహ్మము). అయితే ఈ ప్రజ్ఞ-ఒకప్పుడు **జాగ్రత్** (బాహ్యవృత్తులు), మరొకప్పుడు **అంతర్** (సూక్ష్మ-భావనామాత్ర) **వృత్తులు,** ఇంకొకప్పుడు **వృత్తిరాహిత్యము** (సుషుప్తి) ధారణ చేస్తూ ఉంటోంది. |
|---|

జాగ్రత్ స్వప్నములలో **'అన్యము'** నుంచి వచ్చే ఆనందము దుఃఖ - మిశ్రితము (లేక) దుఃఖ పరిణామ స్వరూపము. వృత్తిరహిత ప్రాజ్ఞుడు సుఖదుఃఖ ద్వంద్వములను దాటివేసిన విషయరహితమగు మౌనానందము, ఆస్వాదించువాడై ఉంటున్నాడు.

**ఆనంద భుక్** : జాగ్రత్ – స్వప్నములలో ఏర్పడుచున్న బాహ్య – అంతర్ (అభ్యంతర) వృత్తుల ప్రదర్శనా – ఆయాసము సుషుప్తిలో ఉండదు. కనుక – సుషుప్తి పురుషుని (ప్రాజ్ఞ పురుషుని) స్థితి (In Relation to Jagruth and swapna) **"ఆనందమయము, ఆనందభుక్ "** – అని అనబడుతోంది. అయితే, అది వృత్తులు వదలకయే, వృత్తి నుండి కాసేపు నివృత్తి పొందిన స్థితి మాత్రమే. అనగా నిత్యానందము బ్రహ్మానందము కాదు – అని మరల గుర్తు చేసుకుంటున్నాము.

**ప్రాజ్ఞుడు** : **ప్రాజ్ఞుడే 'ప్రజ్ఞ' అనే నావ ఎక్కి జాగృత్, స్వప్న స్థానములన్నీ చుట్టి, తిరిగి సుషుప్తి అనే గూటికి చేరుతున్నాడు. ప్ర + ఆజ్ + జానాతి ఇతి ప్రాజ్ఞః? "ఇది నా జాగ్రత్ ప్రదర్శనము. ఇది నా స్వప్న ప్రదర్శనము. ఇది నా సుషుప్తి ప్రజ్ఞ"** – అనురూపముగా సుషుప్తి పురుషునికి మూడిటికి సంబంధించిన ఎరుక ఉండటంచేత (అనగా, సమస్తము తెలిసినవాడు కాబట్టి) – **'ప్రాజ్ఞుడు'** అనబడుచున్నాడు. ఈ ప్రాజ్ఞ పురుషుడు జాగృత్‌లోను, స్వప్నములోను ప్రవేశించి, తిరిగి 'సుషుప్తి' అనే సొంత ఇంటికి చేరుచున్నాడు.

**త్రైకాలిక ప్రాజ్ఞ సిద్ధాంతము:** సుషుప్త సమయంలో మనోబుద్ధి చిత్త అహంకారములు కేవల ప్రజ్ఞయందు లీనమై ఉండటంచేత, సంస్కారములు కూడా **"ప్రాజ్ఞ ఏకత్వము"** వహిస్తూ ఉంటున్నాయి. జాగ్రత్ – స్వప్నములలో ఎదురుపడే భోగ్యకర్మల సంస్కారములు తమ రూపము కోల్పోయి ఉంటాయి.

ప్ర–అజ్ఞః = ప్రదర్శనము విషయములో అజ్ఞుడు అయినప్పటికీ **"హాయిగా నిద్రపోయాను. ఒళ్ళు తెలియనే లేదు"** అని జీవుడు నిదురలేచిన తరువాత అంటున్నాడు. కాబట్టి, సుషుప్తిలో ఆనందము ఎరుగుచున్నవాడే అయి ఉంటాడు. (అనగా) – ఎరగటము. (The feature of / function of 'knowing') - అనునది లేకుండా పోలేదు.

సుషుప్తిలో అన్ని ఆనందములు తెలిసియే ఉంటున్నాడు. కనుక "త్రైకాలిక ప్రాజ్ఞుడు". అంతేగాని 'అజ్ఞుడు' కాదు. (He is aware of all thru states).

**ప్రాజ్ఞ – కేవల స్వరూపజ్ఞాని – అకారణానందుడు :** కేవల స్వరూపము యొక్క సామీప్యతచే ఆత్మయొక్క మౌన – అతీత – అకారణానంద స్థితి అనుభవమౌతుంది. కాబట్టి **"ప్రజ్ఞప్తిమాత్రం, అస్య ఏవ అసాధారణం రూపమితి – ప్రాజ్ఞ"** – అంటున్నారు. జాగ్రత్ – స్వప్నముల కంటే కూడా విశిష్టమైన ఆత్మవిజ్ఞానానందయుతుడు. (అనగా) తనయొక్క స్వస్వరూపముతో సామీప్యము అధికంగా పొందడము చేతనే గాఢనిద్ర అకారణానందమగుచున్నది. (జాగ్రత్–స్వప్నములలోవలె ఆనందమునకు కారణము – ఇక్కడ అవసరముండదు).

అట్టి సుషుప్తానందమును భక్తి – యోగ – జ్ఞానాభ్యాసములచే ఆత్మతత్త్వజ్ఞులు జాగ్రత్ – స్వప్న సందర్భములలో కూడా స్వాభావికంగా తెచ్చి పెట్టుకొనియే ఉండగలుగుచున్నారు. ఈ చంచలజగత్తులో నిశ్చంచలువై, నిశ్చింతులై, నిర్విషయులై, పరానందస్వరూపులై వర్తిస్తున్నారు. 'నాటకంలో నటుడు – తాను పాత్రకు వేరైన తీరుగా, – జాగ్రత్ స్వప్నముల నుండి వేరుపడి, 'ప్రశాంతత' పొందుచున్నాడు.

'బ్రాహ్మీ దృష్టి'చే "చంచలరహిత సుషుప్తి మౌనస్థితి' ముముక్షువుకు జాగ్రత్–స్వప్నములలో కూడా స్వాభావికమై సిద్ధించగలదు.

**6వ మంత్రము**

## నాలుగవ అవస్థ – తురీయ పురుషుడు

**(1)** **జాగ్రత్ నాదైన 'నేను' – విశ్వరుడు / వైశ్వానరుడు**

**(2)** **స్వప్నము వాదైన 'నేను' – తైజసుడు**

**(3)** **సుషుప్తి నాదైన 'నేను' – ప్రాజ్ఞుడు అని అనుకున్నాము కదా!**

**ఇక, జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు "నావైన నేను" – తురీయుడు (చమరీయుడు – 4వవాడు) అగుచున్నాడు.**

**అట్టి "జాగ్రత్ స్వప్న సుషుప్తులకు వేరై, ఆ మూడు నావైన 'నేను' అగు ఈ జీవుని యొక్క (మూడిటికి ఆవలి) నాలుగవ (చతురీయ / తురీయ) స్వరూపము ఎట్టి లక్షణ విశేషములు కలిగి ఉన్నట్టిది? ఇది వివరించుకుందాము.**

**ఏష సర్వేశ్వరః** : చతురీయుడుగా (నాలుగవవాడుగా) 'నేను' అనునది – జాగ్రత్ – స్వప్నసుషుప్తులుగా స్వకీయ కల్పితమాత్రమై విస్తరించి ఉన్నట్టిది. అంతేగాని, ఆ మూడిటిలోని ఒక దానిలో చిక్కుకున్నది కాదు. జాగ్రత్–స్వప్న–సుషుప్తులలో విస్తరించి ఉ ండటంచేత,తురీయుడగు 'నేను' – 'సర్వేశ్వరుడు' అయినట్టివాడు. ఈ జీవుడు స్వతఃగా తురీయుడేగాని, జాగ్రత్–స్వప్న సుషుప్త పరిమితుడు కాదు.

**జాగ్రత్ స్వప్న సుషుప్తులు తనదైనట్టిది.**

ఒక రాజు గారి అధికారము అంతఃపురములోను, ఉద్యానవనములోను, రాజసభయందు, రాజ్యమంతా విస్తరించియున్న తీరుగా మన తురీయ పురుషకారము యొక్క ఆధిపత్య ప్రదర్శనములే జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు. **అనగా తురీయపురుషకారము = "నేనే జాగ్రత్ – స్వప్న – సుషుప్త స్థానములను విహరిస్తున్నాను" – అను స్వకీయ పురుషకారము.**
**ఈవిధంగా తురీయుడనగు నేను – సర్వమునకు (జాగ్రత్ స్వప్న) సుషుప్తులలో కల్పితమగుచూ ఉన్న సమస్తమునకు ఈశ్వరుడను. సర్వేశ్వరుడను – అను ఎరుక ఈ జీవునిలో ప్రకాశమానమైయ్యే ఉన్నది.**

**ఏష సర్వజ్ఞః** : అట్టి (చ) తురీయ పురుషునికి అన్యమైనదంతా స్వయం కల్పితము. "సమస్తమునకు వేరై, సమస్తము నేనే అయి ఉన్నాను" – అను ఎరుక కలిగి ఉన్నట్టిది. ఈవిధంగా తురీయ పురుషుడుగా ఈ జీవుడు 'సర్వజ్ఞుడను'.

> ***"జాగ్రత్ – స్వప్న – సుషుప్త స్వయం కృత లీలా – క్రీడ – వినోద విశేషములే" అని ఈ జీవుని యొక్క తురీయ పురుషుడు ఎరిగియే ఉండటంచేత సర్వజ్ఞుడు అన్నీ ఈతనికి తెలుసు" – అని లక్షణముగా చెప్పబడుతోంది.***

**ఏషో అంతర్యామి** : ఒక నాటకములోని నాయకుడు, నాయకి, ప్రతి నాయకుడు (Hero, Heroin, Villain) మొదలైన పాత్రలు అన్నిటికీ అంతర్యామి ఎవరు? ఆ నాటకరచయితే కదా! రచయిత పాత్రల పరస్పర సంబంధముల మధ్యగా చిక్కుకొని ఉంటాడా? లేదు. నాటక రచన – రచయిత యొక్క కల్పన మాత్రమే.

జాగ్రత్ స్వప్న సుషుప్తులు ఆత్మయొక్క **"నాటక రచనా చమత్కారము"** వంటి సంప్రదర్శనమే. అంతేగాని ఆత్మ వాటిలోని ఒక సందర్భములోనో, సంఘటనలోనో చిక్కుకున్నట్టిది కాదు.

**"నాటక రచనలోని నాయకుడు – ప్రతినాయకుడుల మధ్య నాటక రచయిత చిక్కుకున్నాడు"** అని ఎప్పుడూ అనము కదా!

> అట్లాగే, నేను జాగ్రత్ స్వప్న సుషుప్తులలోని ఒక సంబంధము చేతనో, సంఘటనచేతనో బద్ధుడను ఎట్లా అవుతాను? అవను. అట్టి ఈ ద్రష్ట – దృశ్య – దర్శనానుభవములకు అంతర్యామిని "నేనే" – అను **నిశ్చలావగాహనయే తురీయస్థానము.**

బంగారు ఆభరణమునకు బంగారమువలె, తరంగములకు జలమువలె నేను జాగ్రత్ స్వప్న సుషుప్తులకు (తురీయుడుగా) **అంతర్యామిని.** ఎందుచేత? జాగ్రత్ పురుషుడు, స్వప్నపురుషుడు, సుషుప్తిపురుషుడు (విశ్వుడు/వైశ్వానరుడు, తేజసుడు, ప్రాజ్ఞుడు) అనబడేవి నాయొక్క **త్రివిధ పురుషకారములే కాబట్టి.**

**"పురుషుడు"** = పురుషకారము తనదైన వాడు (The worker)

**పురుషకారము** = The Work of "జాగ్రత్ స్వప్న సుషుప్తి" are nothing else than my own workmanship.
ఒక చిత్రకారుడు (Paints) తయారుచేసిన చిత్రము (Painting) లో కనబడే మనుష్యులకు, జంతువులకు, ప్రకృతి దృశ్యమునకు అంతర్యామి ఎవరు? చిత్రకారుడే కదా!

అట్లాగే, నాకు అనుభవమగుచున్న జాగ్రత్ – స్వప్న – సుషుప్తులకు చిత్రకారుడు (The Painter) నేనే అయి ఉండి, అ అంతటిలో **'అంతర్యామి'ని** అయి ఉన్నాను – అనునదే **"తురీయభావన"।**

**యేష యోనిః :** నాకు అనుభవమయ్యే ఈ జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు ఎందులో జనిస్తున్నాయి? నాయందే! అంతేగాని బాహ్యమున కాదు. కనుక అనుభవమయ్యే సమస్తము యొక్క జనన స్థానము, ఉనికి స్థానము (లేక) ఏర్పడియున్న చోటు (లేక) యోని స్థానము నేనే। ఆత్మనగు నాయందే – సమస్తము ఏర్పడినవై ఉన్నాయి.




> **జాగ్రత్‌లోని 'నేను' = విశ్వుడు.**
> **నాలోని జాగృత్ అయినట్టి 'నేను' = తురీయుడు**
> **స్వప్నములోని 'నేను' = తైజసుడు**
> **స్వప్నము నాలోని 'నేను' = తురీయుడు**

– నేనే విశ్వ – తేజో – ప్రాజ్ఞులుకు 'ఉనికిస్థానము' అయి ఉన్నాను. అందుచేత సమస్తమునకు **'యోని'** నాయొక్క **తురీయ పురుషకారముతో కూడిన నేనే।** = అనునదే తురీయానుభవము।

**సర్వస్య ప్రభవాసి, యయౌహి భూతానామ్** : జలములో తరంగములు బయలుదేరి, జలమునందే ప్రదర్శనమై, చివరికి జలమునందే 'లయము' పొందుతాయి కదా!

నాకు జాగ్రత్ – స్వప్నములలో నాదేహము, తదితర దేహములు, దేహిలు, దృశ్యము – ఇవన్నీ నాకు ఇంద్రియముల ద్వారా అనుభవమౌచున్నాయి. వారంతా ఎవరు? **నాయొక్క భావనా తరంగ రూపములే.**

నేను భావించినప్పుడే ఎవ్వరైనా, నాకు అనుభవమగుచున్నారు. ఏదైనా నాకు అనుభవమౌతోంది. కాబట్టి జాగ్రత్ – స్వప్నములలో కనిపించుచూ, అన్యముగా అనిపించే జీవజాలమంతా. **నాయెక్క ఆత్మసాగర భావనా తరంగ రూపములే!**

అందుచేత నాయొక్క తురీయానంద – ఆత్మ స్వరూపమునందే భూతజాలమంతా బయల్వెడలి, కొంతసేపు ఉనికిని పొంది, తిరిగి – లయిస్తోంది.

నా కల్పన, నాయందే **బయల్వెడలి**, నాయందే **సంచరించి**, నాయందే **లయిస్తున్నట్టి నేనైన నేనే "నేను".** అట్టి నేనైన నేనే **తురీయము.**

"నా గర్భమే ఈ 14 లోకముల ఉనికి–లయస్థానము. ఈ ఇంద్రియములకు తారసబడేదంతా 'నేనే'–యోనిగా కలిగి ఉన్నదై ఉన్నది"– అనునదే తురీయుని అనుభవము.

## ఏక ఏవ త్రిధా స్మృతః
## ఒక్కటే మూడుగా ప్రదర్శనమగుచున్నది

**ఒకడు →**

ఇంటిలో → గృహస్థుడుగా,

పనిచేసేచోట → ఉద్యోగి (లేక) వ్యాపారి (లేక) రైతు మొదలైనవాటిగా,

సాయంకాలము క్రీండించునప్పుడు క్రీడాకారుడుగా → ఉండవచ్చు గాక! ఆ గృహస్థుడు, ఉద్యోగి, క్రీడావినోది **తానుగా ఒక్కడే**గాని 'మూడు'గా అగుచున్నాడా? లేనే లేదు. **ఆతడు ఎల్లప్పుడు 'ఒక్కడే' అయి ఉన్నాడు.** అట్లాగే...

**(1) బహిః ప్రజ్ఞో విభుర్విశ్వః** : నా జాగ్రత్‌లో బాహ్య ప్రజ్ఞచే **విశ్వవిభుడను** (వైశ్వానరుడను / విశ్వుడను) (లేక) **విశ్వపురుషాకారుడను.**

**(2) అంతః ప్రజ్ఞస్తు తేజసః।** నాయొక్క స్వప్నములో తైజసుడను (లేక) తైజసపురుషాకారుడను,

**(3) ఘనప్రజ్ఞ స్తదా ప్రాజ్ఞః** నాయొక్క సుషుప్తిలో ఘనీభూతమైన, ఎటూ ప్రసరించని **ప్రాజ్ఞ పురుషాకారుడను.**

**ఈ మూడు పురుషకారముల సందర్భములలో ప్రజ్ఞ ఏకస్వరూపమేగాని, మూడుగా అవటము లేదు.**

ఆ మూడిటిలో 'నేను' ప్రవర్తిస్తూ ఉండగా, ఆయా సందర్భములలో నేను 'నేను'గానే ఉంటున్నది. (ఉంటున్నాను). మూడు సందర్భములలోను 'ప్రజ్ఞ' ఒక్కటే। మూడుగా అవటము లేదు. **ఏక ఏవ త్రిధా స్మృతాః।**

ఈ విధంగా ఏక ప్రజ్ఞా స్వరూపుడనే గాని మూడు ప్రజ్ఞలు లేవు. మూడు 'నేను'లు లేవు.

***"అట్టి త్రివిధములుగా ప్రదర్శనమగు కేవలప్రజ్ఞాస్వరూపమే – బ్రహ్మము" – అను అర్థమునే "ప్రజ్ఞానం బ్రహ్మ" అను వేదోపనిషత్ మహావాక్యము సూచిస్తోంది.***

***అట్టి ప్రజ్ఞయే బ్రహ్మము। నేనే బ్రహ్మమును। కేవలమగు ప్రజ్ఞయే నేను।***

ప్రజ్ఞ ఎల్లప్పుడు ఏకమే అయి ఉండి తనయొక్క ప్రదర్శనా వినోదముగా జాగ్రత్ స్వప్న సుషుప్తములను నిర్మించుకొనుచూ, తత్ తత్ పురుషకారములను (Respective Workmanships) స్వీకరించుచున్నది. (Is taking up).

**ప్రజ్ఞ = తెలివి:**

తెలివితో అనేక విషయాలు తెలుసుకోవచ్చుగాక! కానీ తెలివి ఎప్పుడు ఒక్కటే! జాగ్రత్ స్వప్న సుషుప్తులను, వాటిలోని అంతర్ విశేషములను తెలుసుకుంటున్న ప్రజ్ఞ – ఏకమేగాని, అనేకము కాదు. అనేకముగా అవదు. దేహ–దేహాంతరములు కూడా– అట్టి **"ప్రజ్ఞ"** యొక్క సమక్షములో జరుగుచున్నవే।

ఒకనికి కళ్లలో 'చూపు' గా ఒక 'తెలివి', చెవులతో 'వినికిడి' గా మరొక 'తెలివి', చర్మములో 'స్పర్శజ్ఞానము'గా ఒకానొక తెలివి, నాలుకపై 'రుచి'గా వేరొక తెలివి, ముక్కులో 'సువాసన'గా మరేదో తెలివి ఉండదు. **తెలివి ఒక్కటే।**

అట్లాగే **"జాగ్రత్ స్వప్న సుషుప్తులలో ప్రజ్ఞ ఒక్కటే. అట్టి ఏకస్వరూప ప్రజ్ఞయే నేనై ఉన్నాను"** – అనునదే తురీయానుభవము.

అట్టి సర్వ అనుభవముల సందర్భములలో **'ఏకమే'** అయి ఉన్న ప్రజ్ఞయే సమస్త జీవులలో కూడా **'ఏకమే'** అయి ఉన్నది. త్రిమూర్తులలోను, ఒక పురుగులోను ఏర్పడినదై ఉన్న అట్టి కేవలమగు 'ప్రజ్ఞ'యే **"బ్రహ్మము".**

---

## 7వ మంత్రము

**త్రివిధములైన పురుషకారములు తనవైన పురుషోత్తముడు (ఉత్తమ పురుషః** The 'I' at its absolute) **ఏదేది కాదో "నేతి నేతి" మార్గంగా వివరించుకుంటున్నాము.**

## ఆత్మయే నేనైన "నేను" → ఏదేది అయి ఉండను? (what I am not becoming as..)

### న అంతః ప్రజ్ఞం।

అంతర్–ప్రజ్ఞ అగు స్వప్నపురుషుడుగా (తేజసుడుగా) నేను అవటము లేదు. సర్వదా ఆవలయే ఉన్నాను.ఒకడు కూరగాయలు అమ్మటానికి వస్తే, **"ఓ కూరగాయల అబ్బాయీ!"** – అని పిలుస్తాము. అంతమాత్రంచేత ఆతడు కూరగాయలు అమ్మువాడుగా మారిపోతున్నాడా? లేదు. అది ఆతని పట్ల ఒకానొక సందర్భము మాత్రమే. ఆతనికి ఇల్లు, భర్త, తండ్రి, కొడుకు మొదలైన పాత్రలు లేకుండా పోతాయా? పోవు.

అట్లాగే బాహ్యమున విశ్వపురుషుడుగా, అంతరమున స్వప్నము పొందుచున్నప్పుడు **"తైజసుడు – స్వప్న పురుషుడు"** గా మనము చెప్పుకొంటున్నప్పటికీ, "నేను నేనైన ఆత్మ" – విశ్వపురుషుడుగా, తైజస పురుషుడుగా, ప్రాజ్ఞపురుషుడుగా అయిపోవటము లేదు. అది ఆత్మకు ఒకానొక ప్రదర్శనా సందర్భము మాత్రమే! కనుక ఆత్మ 'అంతర్ ప్రజ్ఞ' కాదు.

***మనో బుద్ధి చిత్త అహంకారములు నా అంతరంగ చతుష్టయము. అవి 'నావి' కావచ్చునేమోగాని, నేను 'అవి'గా అవటము లేదు. వేరుగానే ఉన్నాను. కనుక నేను అంతర్ ప్రజ్ఞను కాను.***

### న బహిర్ ప్రజ్ఞం।

బాహ్యమున దృశ్యము –ద్రష్ట, దేహము – దేహి, అనుభవము – అనుభవి – ఇవన్నీ కూడా నా ప్రజ్ఞారూప ప్రదర్శనములు కావచ్చుగాక। అంతమాత్రంచేత అవిగా నేను అవటంలేదు. అవన్నీ కూడా (అంతర్ ప్రజ్ఞ వలెనే) **'నావి'** కాని, **'నేను'** కాదు. 'నేను' అనబడు ఆత్మ బాహ్య ప్రజ్ఞగా అవటం లేదు. అవదు. కనుక బ్రహిర్ ప్రజ్ఞ నేను కాదు.

బాహ్యముగా ఉన్న – "తెలివి గలవాడు. అది తెలుసు. ఇది తెలియదు" మొదలైనవి నా గురించిన సందర్భానుచిత వాక్యము–మాత్రమే, నాయొక్క సహజ–స్వాభావిక ప్రజ్ఞ సమస్త విశేషములకు **'కారణ–కారణము'** అయి ఉన్నది.

### న ఉభయ ప్రజ్ఞ।

స్వప్న – జాగ్రత్‌లో రెండింటిలో – ఏ "తెలివి" (ప్రజ్ఞ) వర్తిస్తోందో, అది నేను (ఆత్మ) కాదు. 'తెలివి నాది' అయి ఉండవచ్చునేమోగాని, అంతరంగ – బహిరంగములలోని **'తెలివి'**గా నేను అవటములేదు.

కార్యాలయము (ఆఫీస్)లోను, ఇంటివద్ద నేను ఆయా సందర్భానుచితమైన తెలివితేటలతో వర్తిస్తూ ఉన్నప్పటికీ.... **ఆయా రూపములుగా నేను అగుచుండటంలేదు** – నేను 'వేరే' అయి ఉన్నాను.

ఈవిధంగా ఆత్మ అంతర్ – బహిర్ ప్రజ్ఞలకు **"వేరేనే"** అయి ఉన్నది.

## న ప్రజ్ఞాన ఘనం।

సుషుప్తిలో నేను ఘనీభూతమైన ప్రజ్ఞ (Inteligence wihtout any internal or external factors of what ever being known) కలిగి ఉంటున్నాను. అయినాకూడా అట్టి ఘనీభూతమైన తెలివి (తెలియబడేది ఆశ్రయించనట్టి తెలివి) **"నాది"** అయి ఉండవచ్చునేమో గాని, అట్టి ప్రజ్ఞాన ఘనముగా **"నేను"** అయిపోవటము లేదు. విడిగానే ఉన్నాను. తెలివి నాదైన నేనే నేను.

ఈ విధంగా ఆత్మ ప్రజ్ఞాన ఘనము కాదు.

అంతర్ ప్రజ్ఞ, బహిర్ ప్రజ్ఞ, ప్రజ్ఞాన ఘనములు – ఆత్మయొక్క **"ఒకానొక సందర్భ ప్రదర్శనము"** మాత్రమే. అనగా నాయొక్క ఆయా సందర్భములలోని "విన్యాసములు" – మాత్రమే అయి ఉన్నాయి.

## న ప్రజ్ఞః।

నేను కేవలమగు 'తెలివి'గా అగుచుండటము లేదు. తెలివి **"నాది"** కావచ్చు గాక। అది నాయొక్క చిత్కళ మాత్రమే. కనుక ఆత్మ ప్రజ్ఞారూపము (జాగ్రత్ ప్రజ్ఞ, స్వప్న ప్రజ్ఞ, సుషుప్తి ప్రజ్ఞలలో ప్రజ్ఞగా) అగుచుండటములేదు. ఆత్మయొక్క సలక్షణ విశేషమే – ప్రజ్ఞ. (చిత్, సత్, ఆనందములు కూడా అట్టి సలక్షణ చమత్కారములే! అంతేగాని ఆత్మ వాటివాటిచే పరిమితము కాదు).

## న అప్రజ్ఞః।

సమస్తము నేనే! నేను కానిదేమీ లేదు. విశ్వము–విశ్వుడు, స్వప్నము–తేజసుడు, సుషుప్తి–ప్రాజ్ఞుడు, ఇవన్నీ నాకు వేరై లేవు. ('సర్వం ఖల్విదం బ్రహ్మ"–అను మహావాక్యార్థముగా) ప్రజ్ఞ ఆత్మస్వరూపమునకు వేరు కాదు. కాబట్టి, అప్రజ్ఞను (ప్రజ్ఞారహిత రూపుడను) కాదు. ఆత్మనగు నేను ఆత్మగానే ఉన్నాను. అంతేగాని, ప్రజ్ఞగా అవను. కానీ, 'ప్రజ్ఞ'గా కనిపిస్తున్నది నేనే. అట్లాగే జాగ్రత్, స్వప్న సుషుప్తులుగా కనిపిస్తూ ఉన్నదీ నేనే। నాకు అన్యము లేదు కదా।

**అదృష్టమ్** : "ఇంద్రియములకు నియామకుడను, నిర్మించుకొనువాడను – అగు నేను ఇంద్రియములకు విషయమును కాను.

- కన్నుతో చూస్తున్న నేను కంటికి కనబడే ఒక రూపముకాదు. **నేను చూచువాడను.** కన్ను చూచువానిని చూడలేరు కదా।
- చెవులను ఉపయోగించి వినుచున్న ప్రజ్ఞాస్వరూపుడనగు నేను, **'చెవులకు బయటనుండి వినబడే ఒక శబ్దము'** కాదు. చెవులతో వినువాడను. చెవులు బాహ్య శబ్దములు వినగలవుగాని, వినువానిని వినలేవు.
- స్పర్శించబడేది, రుచిచూడబడేది, వాసనచూడబడేదిగా – నేను అగుచుండుటలేదు. అవన్నీ నాచే నిర్వర్తించబడుచూ, నాచేతనే ఆస్వాదించబడుచున్నట్టివి.

అందుచేత ఈ **దృశ్యము నేను కాదు**. నాయొక్క **స్వయం – కల్పిత ద్రష్టత్వముచే నేను కల్పించుకొను స్వకీయ చమత్కారమే ఈ దృశ్యము**. అట్టి దృశ్యములో నేనెట్లా కనిపిస్తాను? నవలా రచయిత నవలలో ఉండడు కదా! నవలంతా తానై, వేరై కూడా ఉంటాడు. **స్వప్నము తానైనవాడు స్వప్నములో తారసపడడు కదా।**

- *ఈ దృశ్యమంతా కూడా ఆత్మ (ఓంకార) పురుషుడుగా నేను కల్పించుకొనేదే! అందుచేత, ఈ దృశ్యమంతా నేనే అయి ఉన్నాను.* ***ఇదమ్ సర్వమ్ అహమేవ।***
- *అంతేగాని దృశ్యములో ఒక దృశ్య విభాగముకాదు.*
- *కనుక నేను అదృష్టుడను. నేను ఆశ్రయించిన ఈ భౌతిక శరీరము ప్రపంచములో కనబడుచుండవచ్చును గాక! కానీ, ప్రపంచములో కనిపించువాడను కాను. 'ప్రపంచము' అనునది స్వకీయ కల్పనగా కలిగి ఉండి, అద్దానిలో సంచరించువాడను మాత్రమే।*

**అవ్యవహార్యమ్** : ప్రపంచమంతా నాయొక్క కల్పితమే। ఆత్మచే లీలా వినోద కల్పితము. ఆత్మగా ప్రపంచంలో వ్యవహరించువాడను కాను. దృశ్యానుభవమంతా నాయొక్క (ఆత్మయొక్క) ఒక వ్యావహార్యము. నేను దృశ్యమునకు చెందిన ఒక వ్యవహారము (context) వంటివాడను కాను.

– నవలా రచయిత నవలలో ఒకచోట కనిపించేవాడు కాదుకదా! ఒక వ్యక్తివలెనో, వస్తువు వలెనో ఆత్మ కనిపించేది కాదు.

**– దృశ్యమునకు ద్రష్ట వేరై ఉన్నతీరుగా, ఆత్మ–ద్రష్టకు కూడా వేరై ఉన్నది.** ఆత్మ జగత్తులో ఒక వ్యవహారము / సందర్భము కాదు. జగత్తంతా ఆత్మకు వ్యావహార్యమే. (A kind of form of Avocation) కనుక ఆత్మ **అవ్యవహార్యము. ఈ జగత్తు ఆత్మకు (నాకు)– వ్యవహరించు ఒక 'రంగము'** (Stage of Drama) **వంటిది.**

**అగ్రాహ్యమ్** : ఆత్మ బుద్ధికి కూడా విషయము కాదు. ఆత్మ ఇంద్రియములచేతనో, మనస్సుచేతనో గ్రహించబడేదీ కాదు. మరి? అది నిర్మల హృదయమునకు **"స్వస్వరూపమే"**గా అనుభవమగునట్టిది.

అది ఒకరు మరొకరిని గ్రహింపజేసేది కూడా కాదు. ఎవరికి వారే తమ స్వరూప – ఔన్నత్యము గ్రహించవలసినదేగాని, మరొకరు ఎట్లా గ్రహింపజేస్తారు? అది ప్రతి ఒక్కరికి తనయందు సాక్షి అయి – **'తానే'** అయిన స్వస్వరూపము కదా। అయితే– శాస్త్రములు, గురువులు అట్టి ఆత్మగురించి గుర్తుచేస్తున్నారు. శ్రద్ధగలవారు  అది తెలుసుకోగలుగుచున్నారు.

**అలక్షణమ్** : ఆత్మకు సత్ (ఉనికి), చిత్ (ఎరుక), వినోది (ఆనందము)గా (సచ్చిదానంద లక్షణ సమాన్వితముగా) చెప్పుకోబడుచున్నప్పటికీ, **"ఆత్మ"** – దేనియొక్క లక్షణము కాదు. స్వభావికము, స్వాతంత్ర్యము అయినదానిని ఏ లక్షణములతో పరిమితం చేసి చెప్పగలం?

**అచిన్త్యమ్** : చింతనలన్నీ ఆత్మవేగాని, అది చింతనకు విషయము కాదు. (It is a common sense). ఆలోచన చేయువాడు ఆలోచనలలో లభ్యమవడు కదా! అయితే, చింతనలన్నీ ఆత్మయొక్క ప్రదర్శనా చమత్కారమే।

**అన్యపదేశ్యమ్** : ఒకరు మరొకరికి వాక్కు ద్వారా అందించగలిగేది కాదు. శ్రవణము (వింటున్న విశేషములను) మననం చేసి ఎవరికివారే ఆత్మ (The Absoulte Self) యొక్క ఔన్నత్యమును స్వానుభవముగా (నిదిధ్యాసగా) తెచ్చుకోవలసినది మాత్రమే।

**ఏకాత్మ ప్రత్యయ సారమ్।** : భూమి అనేక గ్రామ – పట్టణ – దేశ – ఖండ – ఖండాతరములుగా చెప్పబడుచున్నప్పటికీ – భూమి అంతా ఒక్కటే!

- వాయువు వస్తువులలోను, దేహములలోను, బాహ్యమున – అనేక ధర్మములు నెరవేరుస్తూ ఉన్నప్పటికీ వాయువు ఒక్కటే।
- అనేకచోట్ల జలము ఉన్నప్పటికీ జలమంతా ఒక్కటే.
- దేహి దేహములో – చూడటము, వినటము, స్పర్శానుభవము, రుచి, వాసన – ఇవన్నీ వేరువేరైనవి పొందుచున్నప్పటికీ – అనుభవి అన్నిటికీ, ఎన్నటికీ **ఒక్కటే**.

అట్లాగే...,

ఆత్మ అనేక దేహములలో, అనేక జీవ–జీవజాతులుగా కనబడుచూ ఉన్నప్పటికీ ఆత్మ సర్వదా 'ఏకమే' అయి ఉన్నదిగాని,...అనేకముగా అగుచుండటములేదు. అది సర్వదా అఖండము. జీవాత్మగాను, జగత్తుగాను, అనేక జీవాత్మలుగాను అగుటయేలేదు.

సముద్రంలో ఎన్నితరంగాలు బయల్వెడలినాసరే, సముద్రజలము ఏకమేగాని, 'అనేకము'గా అవదు కదా!

అందుచేత –

(తరంగముగా → **సర్వాభూతస్థమ్ ఆత్మానమ్।** నా ఆత్మయే అన్ని జీవులలోఆత్మగాను,

జలముగా → **సర్వభూతాని చ ఆత్మని।** నా ఆత్మలోనే సర్వ – భూతజాలము.

– **ఈక్షత్ యోగ యుక్తాత్మా** – అనునది గీతాచార్య యోగయుక్తాత్మ నిర్వచనము. ఏకాత్మప్రవచనము.)

అనేకముగా కనిపిస్తూ ఉన్న ఈ దృశ్య జీవులలో ఏకాత్మయే సర్వదా వెలుగొందుచున్నది.

**ప్రపంచోపశమనం** : తరంగాలన్నీ కూడా జలంలోంచే బయల్వెడలి, తిరిగి జలమునందే లయిస్తున్నట్లుగా,... ఈ ప్రపంచము యొక్క ఉపశమ (withdrawl) స్థానము ఆత్మయే అయి ఉన్నది.

**నాచే అన్యముగా అనుభవము చేసుకోబడుచున్న ఈ దృశ్యతరంగ వ్యావహారమంతా (ఆత్మస్వరూపుడనగు) నాయందే బయల్వెడలి, నాయందే స్థానము కలిగియుండి, పునఃగా మమాత్మయందే  ఉపశమించి సశాంతిస్తోంది. (ఓం శాంతిః। శాంతిః। శాంతిః).**

**శాంతమ్** : ఆత్మ స్వాభావికముగానే, సహజంగానే 'పరమ శాంతస్వరూపము'. ఇక్కడి జన్మ–కర్మ–కర్మఫలములుగాని, జన్మ–జీవన్–మరణాదులుగాని, జన్మ–జన్మాంతరములుగాని, 14 లోకములలో జరిగే కార్యక్రమ సంబంధములుగాని, పాప–పుణ్యములుగాని, విజ్ఞాన–అజ్ఞానములు మొదలైనవిగాని – **పరమశాంతమగు 'ఆత్మ' యందు ఏమాత్రము అశాంతి కలిగించలేవు.** ఆత్మయొక్క స్వాభావిక ప్రశాంతత్వమునకు అవరోధములు అవజాలవు.

**శివమ్** : ఆత్మ – సర్వులలో ఆనందస్వరూపమై సర్వదా వేంచేసియే ఉన్నది. శుభ – శాంతి – ఐశ్వర్య – ఆనందముగా అఖండమగు ఆత్మ సర్వదా సంప్రకాశమానమైయే ఉన్నది.

**అద్వైతమ్** : దేనికి **'జీవాత్మ, జగత్తు, లోకములు' మొదలైనవి ద్వితీయము కావో, అదియే ఆత్మ.** ఆత్మకు అన్యము లేదు. **కవియొక్క కల్పనకు వేరై కవిత్వములో ఏమి ఉంటుంది?**

పై విశేషములు కలిగియున్నదే – స్వస్వరూపము, అఖండము, సమస్త భూతముల స్వరూపము అగు → **"ఆత్మ".**

అట్టి ఆత్మయే అధ్యయనము చేసి తెలుసుకోవలసిన అసలైన వస్తువు. తదితర యోగ – భక్తి – జ్ఞాన – సమర్పణ – గుణాతీత మొదలైనవన్నీ అందుకు **సముత్సాహపూర్వక సంసిద్ధతలు. ఆత్మజ్ఞాన–ఆత్మదర్శన–ఆత్మమేవాహమ్ భావనలకు పూజ్యులగు తత్త్వవేత్తలు ప్రసాదిస్తున్న ఉపాయములు.**

**8వ మంత్రము**

## ఓంకార – మాత్రల సమన్వయము

ఈ విధంగా ఓంకారము యొక్క అర్థమగు "ఏక–అక్షరరూప" – ఆత్మగురించిన అధ్యయనము కొరకై జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయ **పురుషకారములు**గాను, **చతురవస్థ**లుగాను, 4 పాదములుగాను చెప్పుకున్నాము. **"ఆత్మ ఏది కాదు? ఏది అయి ఉన్నది?"** అనే విశేషాలు చెప్పుకున్నాము.

ఇంకా కూడా **"అ–ఉ–మ–అర్ధమాత్ర"** అను చతుర్ (4) మాత్రలుగా (ఆత్మయే) వర్ణించబడుతోంది. ఉపాసించబడుతోంది.

### అ–ఉ–మ

***ఓంకారము యొక్క***

| పాదము | పురుష–అధిపతి | అవస్థ | రూపము | |
|---|---|---|---|---|
| (1) ప్రథమ పాదము– **'అ'** కారము | విశ్వుడు. వైశ్వానరుడు. | జాగ్రత్ మాధుర్యము | స్థూలదేహము | జాగ్రత్ ప్రజ్ఞ |
| (2) ద్వితీయపాదము– **'ఉ'** కారము | తైజసుడు. | స్వప్న మాధుర్యము | స్వప్నదేహము సూక్ష్మదేహము | స్వప్న ప్రజ్ఞ |
| (3) తృతీయపాదము– **'మ'** కారము | ప్రాజ్ఞుడు. | సుషుప్తి మాధుర్యము | ఆనందమయ దేహము (కారణదేహము) | మౌనప్రజ్ఞ |
| (4) అర్ధమాత్ర– (**మ్**... కేవలనాదము) | తురీయుడు. | తురీయము (మాధుర్య–ఆస్వాదుడు) | సాక్షీ **(జాగ్రత్స్వప్న సుషుప్తులు తనవైనవాడు)** | కేవల ప్రజ్ఞ |

## (1) జాగ్రత్ పురుషకారము – 'అ'

వ్యాప్తిచే – మొదటిదై ఉండటంచేత జాగ్రత్ మొట్టమొదటి మాత్ర – 'అ'. ఇదియే **'ఆదిమత్'** (మొట్టమొదటిది). జాగ్రత్‌నందే మూడు అవస్థలవిచారణ సుసాధ్యము కనుక. **'ఆదిమత్'** అనబడుతోంది.

జాగ్రత్ పాదము సర్వత్రా దృశ్యమంతా వ్యాపించి ఉన్నట్టిది. ఈ విధంగా సమస్త జాగ్రత్‌ను ఆత్మయొక్క (తనయొక్క) – పురుషకారలక్షణముగా ఎవడు తెలుసుకుంటాడో **ఆతడే జాగ్రత్ గురించి ఎరిగినవాడు.**

స్వకీయ జాగ్రత్ పురుషకార – విశేషమే. **"జాగ్రత్ అనుభవ విశ్వము"** యొక్క రూపముగా తెలుసుకొన్నవాడు –

**య ఏవం వేద, సర్వాన్ కామాన్ ఆప్నోతి।** తాను కోరుకున్నవన్నీ పొందగలడు.

**10వ మంత్రము**

## (2) స్వప్న పురుషకారము – 'ఉ'.

'తేజస' – స్వప్నస్థానము 'ఉ' కారము. అ–ఉ–మలలో ద్వితీయమాత్ర. మధ్యలోది. అంచులు రెండువైపులా ఉండటంచేత, **"జాగ్రత్ – సుషుప్తుల మధ్యగా ఉన్నదై – ఆ రెండిటి ఉత్కర్షరూపము".** ఎవడు స్వప్నమును జాగ్రత్ – సుషుప్తులను ఉత్కర్షించునది (ప్రేరేపించునది)గా తెలుసుకుంటాడో – అట్టివాడు జ్ఞానసంతతిని వృద్ధి చేసుకొనగలడు. అట్టివాడు బ్రహ్మవేత్తల కులములోనే జన్మలు పొందుతాడు. ఆతనికి 'అబ్రహ్మవిత్ కులము'లో (బ్రహ్మము గురించి ఎరుగని వంశములో, పరిసరములలో) జన్మలు పొందడు. బ్రహ్మము గురించి ఎరిగిన మహనీయుల మధ్యమాత్రమే స్థానము పొందినవాడై ఉంటాడు. ఆతని పరిసరములు, సంతానము తత్త్వజ్ఞులు కాగలరు.

**11వ మంత్రము**

## (3) "సుషుప్త పురుషకారము" – "మ" ఈ మూడవమాత్రకు

- మితేతి 'మ'। జాగ్రత్ స్వప్నములను 'మితము' చేయునది. కాబట్టి 'మిత' అనబడుతోంది.
- సమస్తము కొలత కొలిచే 'ప్రజ్ఞ' కలిగి ఉన్నది.
- జాగ్రత్ స్వప్న సుషుప్తులనన్నిటినీ తనకు వెనుకగా దాచి ఉంచగలదు. 'మితము' చేయగలదు.
- సమస్తమును ఒక్కటిగా చేయు ప్రదర్శనము కలిగి ఉన్నది.
- 'మ' ఇతి। జాగ్రత్, స్వప్నములను లేకుండా చేయునది.

'మ'కారము (అ–ఉ–మలో మూడవమాత్ర)గా, సుషుప్తి రూపముగా చెప్పబడుతోంది. (మితి = కాలమానము)

(ధాన్యమును కొలిచే 'మరకము' అనే పాత్రవలె) – జాగ్రత్ స్వప్న సంస్కారములకు, వాసనలకు కొలుచు పాత్రవంటిది సుషుప్తి. జాగ్రత్ స్వప్నములు – సంస్కారములకు, వాసనలకు **ధాన్యము** వంటిది. సుషుప్తియో – **కొలుచు పాత్ర** వంటిది.

అకారముతో, **ప్రవేశము** (రాక) 'ఉ' కారము **నిర్గమించటము**, (పోక) 'మ'కారముతో – **లయము** జరుగుచున్నది. అందుచేత మకారము (లేక) సుషుప్తి – **"అకార, ఉకారములకు స్పర్శించునదై"** ఉన్నది.

**అపీతే** : సుషుప్తి సర్వము ఏకముగా చేసివేయు స్వభావము కలిగి ఉన్నది.

**ఉపరమతే** : విశ్వుడు, తైజసుడు, సుషుప్తిని తమ ఉపరమ (withdrawl) స్థానముగా కలిగి ఉంటారు.

విశ్వుడు, తైజసుడు బాహ్యముగా జాగ్రత్ – స్వప్నములు పొందుచూ ఉంటారు.

విశ్వ, తైజసులు చివరికి ప్రాజ్ఞుని యందు ఉప–రమిస్తున్నారు. (getting withdrawl)

ప్రాజ్ఞుడు 'ఓ–న–మ'లలోని 'మ'కారము వంటివాడు. 'జగత్తు లేనిదే' అనిపించునది ప్రాజ్ఞ – పురుషుని చేతనే కాబట్టి 'అ–క్ష'లకు లయము 'మ'కారమునందు జరుగుతోంది.

| | |
|---|---|
| 'అ' → జాగ్రత్<br>'ఉ' → స్వప్నము<br>'మ' → సుషుప్తి | ఓం |
| మరల సుషుప్తి నుండి జాగ్రత్ తరువాత<br>**"ఓం"** | |

**మరికొంత వివరణగా....**

**'మ'కారమ్ – సుషుప్తి – 'మితే'**

ఓం కారములోని 'అ', 'ఉ' లు చివరికి 'మ' కారముచే ముగింపు పొందుచు, 'మ' కారముచే పరిమితము పొందుచున్నాయి. అందుచేత మకారము అను మాత్ర ముగింపు (లేక) లయ స్థానముగా చెప్పబడుతోంది. మరల జాగ్రత్–స్వప్నములకు ప్రారంభ స్థానము కూడా।

'మ'కారము 'ఓం'కారమునకు ముగింపు. ఆ తరువాత మరల 'ఓం' ప్రారంభమౌతోంది.

[('ఓం' (అఉమ) – మకారము ముగిసిన తరువాత, **తిరిగి 'అ' కారముతో కూడిన 'ఓం' ప్రారంభము)]**.

<u>దీనినే అవస్థల దృష్ట్యాచూస్తే,</u>

జాగ్రత్ – స్వప్న సుషుప్తులలోని (1) అ ఉ మల (లోని) **ప్రథమ పాదమగు** జాగ్రత్ (మ) నకు, **రెండవ పాదమగు** స్వప్నము (ఉ)నకు–

చెందిన "ఆలోచన, భావన, అనుభవము, అనుభూతి, సుఖదుఃఖ నిర్వచనస్వీకారము, అభిప్రాయ – అభిరుచులు మొదలైనవన్నీ కూడా సుషుప్తియందు ఏకీభూతమై **'మౌనము'** వహించుచున్నవగుచున్నాయి. సుషుప్తి నుండి మరల స్వప్న – జాగ్రత్‌లకు నాంది పలుకబడుచున్నాయి.

ఈవిధంగా సమస్త **జాగ్రత్ స్వప్న కల్పితములు** సహజమగు **సుషుప్తిలో ఏకీకృతమగుచున్నాయి.** మరల మరొకప్పుడు **సుషుప్తి నుండి బయల్వెడలుతున్నాయి – అని సుషుప్తి గురించి గమనించబడుతోంది. (శంకర భాష్యము).**

**అనగా**

- సుషుప్తి అనబడు – **'నిర్విషయ, ప్రశాంత ఆత్మసామీప్య, సహజ, మౌన"** ఇత్యాది విశేషములతో కూడిన అవస్థ ఈ జీవునికి స్వాభావికము, సహజముగాను,
- **సవిషయ,** అశాంత, బాహ్య – సుదూర, వ్యావహారికములు మొదలైనవి కలిగియున్న జాగ్రత్ – స్వప్నములు – **అస్వాభావికములు, కల్పితములుగాను, అన్యస్థానములుగాను, అయి ఉంటున్నది.** "సుషుప్తి" ఇల్లు వంటిదైతే, జాగ్రత్ స్వప్నములు – బయటకు వెళ్ళి వచ్చే ఆటస్థలము, బంధుగృహము వంటివి.

అందుకే కొందరు యోగులు యోగాభ్యాసములో **"జాగ్రత్‌లో సుషుప్తి"**ని అభ్యాసముగా నిర్వర్తిస్తూ, సమస్త వ్యవహారములపట్ల **'మౌనత్వము' ను, 'అతీతత్వము'**ను వహించువారై ఉంటారు. 'విషయ రాహిత్యము'ను ధారణ చేస్తూ ఆత్మయొక్క సామీప్యమును అభ్యాసిస్తూ ఉంటారు. (అట్టి అభ్యాసము స్వాభావికము చేసుకొన్నవారిని **'మౌని' 'ముని' 'మనీశ్వరుడు'** – అని అంటున్నాము. (విషయములపట్ల మౌనము, ఆత్మపట్ల ధ్యానము గలవాడు – 'ముని')

అట్టి మౌని స్వాభావికంగానే –

- ప్రాపంచక విషయములపట్ల సుషుప్తిరూపమౌనము (A sense that "Let them be as they would like to be"),
- పరమాత్మవైపుగా జాగ్రత్ (Awareness) –

అభ్యాసముగా కలిగి ఉండి – మౌనభావనను సుస్థిరము, నిశ్చలము చేసుకుంటున్నారు. అట్లాగే – మునులు.

### మినోతి హ వా సర్వమ్ అపీతిశ్చ భవతి।

సుషుప్తియందు జాగ్రత్ – స్వప్నములలోని భేదభావన అంతా తొలగిపోయినదై **'మౌనము' 'విషయరాహిత్యము', 'ఏకీభూతత్వము'** సిద్ధిస్తున్నాయి.

ఈ విధంగా సుషుప్తియందు ప్రాజ్ఞునకు 'ఏకీకరణము' అను సామ్య రూప సామాన్యత్వము ఏర్పడి ఉండటంచేత **"అపీతశ్చ భవతి।"** అనబడుతోంది. సుషుప్తిలో ఉన్నవాడు అపీతుడు (Non Drunkerd, Sans - Experiencer) అగుచున్నాడు.

> ***అట్టి సుషుప్తియొక్క 'స్థాన' ధర్మములను ఎరిగినవాడు – జాగ్రత్ – స్వప్న సందర్భములలో భేదములన్నీ స్వీకరించనివాడు అగుచున్నాడు. సమస్త భేదమును 'తననుండియే' అని గ్రహించి వాటిని తనయందు లయము చేసుకున్నవాడు అయి ఉంటున్నాడు. జాగ్రత్–స్వప్న–సందర్భములలో కూడా నిశ్చల సుషుప్తిని (నిర్విషయ) ధారణను విడువకయే ఉండగలడు. ఇది అభ్యాసముచే సుసాధ్యమే।***

**12వ మంత్రము**

## తురీయము (చతురీయము – 4వ స్థానము)

'తురీయము' యొక్క అనుభవము ఎటువంటిదంటే...,

ఆది – ఓం ⊖ ఓం ల మధ్యస్థానము.

– ఒక ఆలోచన ○ ఆ తరవాత మరొక ఆలోచనల మధ్యగల **"ఆలోచనా రహిత" స్వస్థానము.।**

– భావన ⊖ భావనలమధ్య **భావనారహిత స్వస్థితి.**

అ – ఉ – మ – మాత్రల విభాగము రహితము అయినట్టి (కేవల) స్థానము.

**అవ్యవహార్య** : తురీయము = **తనకు అన్యమైన వ్యవహారములేవీ లేనట్టిది.**

అనగా సమస్త తరంగములను జలము దృష్టితో చూడటమువలె, సమస్త ఆభరణములను, 'బంగారము' దృష్టిగా గమనించటమువలె, సర్వమట్టి బొమ్మలను మట్టి (మృత్తి కేవ సత్యమ్) అను అవగాహన కలిగి ఉండటమువలె ..,

> ***జాగ్రత్, స్వప్న, సుషుప్తులను, అందలి ఆయా విశేష చమత్కారములను (అగ్నియొక్క కణములు అగ్నికి వేరుకానట్లుగా) ఆత్మరూపముగా దర్శించటము, ఆత్మ చమత్కారముగా ఆస్వాదించటము – "అవ్యవహార్య తురీయ దృష్టి.***

**ప్రపంచోపశమనమ్** : మట్టి – జల – తేజో (అగ్ని, Heat Light) – వాయు (vapour) – ఆకాశ (space) రూపములు మిశ్రమ ప్రదర్శనమగు ప్రపంచమును (ప్ర విశేషమైన, పంచమ – "5" వస్తువులను) – **ఆత్మభావనతో, ఆత్మకు స్వస్వరూపమునకు అనన్యముగా దర్శించు ప్రపంచ ఉపశమన స్థానమే 'తురీయము'.**

**శివమ్** : కేవలమగు ఆత్మానుభవ స్థానము అవ్యాజమైన శుభమును, సుఖమును ప్రసాదించునట్టిది.

శవము వంటి పాంచభౌతిక దేహములో సర్వాత్మకమైనట్టి **'ప్రశాంత – సర్వాతీత – పరమానంద – కేవలమగు శివతత్త్వము'** దర్శించుటకు చేసే యత్నమే **"ముముక్షుత్వము"**.

**అట్టి జ్ఞానమయ దృష్టియొక్క సిద్ధియే తురీయసిద్ధి.**

**అద్వైతమ్** : బంగారమునందే సమస్త బంగారు ఆభరణములు ఏర్పడినవై ఉన్నట్లు, శిలయందే శిల్పముయొక్క సర్వ విభాగములు అవ్యక్తీకరణంగా స్థానము పొందియున్నట్లు,

ఈ సమస్త ప్రపంచము, సమస్త జీవులు, మనందరి బాహ్య – అంతరంగములు, **నాలోని నేనైన నేనే।** మనయొక్క జాగృత్-స్వప్న-సుషుప్తుల సాక్షిరూపమగు తురీయమునకు ద్వితీయము కానివై ఉన్నాయి. **అహమ్ తురీయ–అద్వితీయ సహజ స్వరూపమస్మి।**

అందుచేత మన తురీయ స్వరూపము **అద్వితీయము. జగదృశ్యమంతా తానే అయినట్టిది.**

**మనము సర్వదా అట్టి తురీయాత్మానంద స్వరూపులమే. న సందేహః।**

**ఓంకారమ్ ఆత్మైవ।**

- అదియే వేదోపనిషత్తులచే పలకబడుచున్న 'ఓం' కారము.
- అది మనందరిలోని జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు తనవై యున్న **"నేను"!**
- అదియే 'ఆత్మ' అను శబ్దముచేత పలకబడుచున్నది. అదియే **'అహమ్'।** అదియే **'మమ'** కూడా। అదియే **'త్వమ్'।** అదియే **తత్।**
- మన సహజమగు కేవల స్వరూపానుభవసిద్ధియే **కైవల్యము.**

**ఇది తెలుసుకున్నవాడు ఈ కనబడే సమస్తమును "ఆత్మయందే ఆత్మ"గా దర్శిస్తాడు. ఇదియే తెలియవలసినది. తెలిసి, అనునిత్య నిశ్చల – నిశ్చిత స్వాభావకమైనట్టి స్వానుభవముగా సుస్థిరీకరించుకోవలసినట్టిది.**

*ఇతి మాండూక్యోపనిషత్*
*ఓం శాంతిః। శాంతిః। శాంతిః।*

అధర్వణవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 14 ముండకోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ ధనుః గృహీత్వా ఉపనిషదం మహాస్త్రం,
శరం హి ఉపాసా నిశితం సంధధీత,
ఆయమ్య తత్ భావగతేన చేతసా
లక్ష్యం తత్ఏవ 'అక్షరం', సోమ్య! విద్ధి॥



ఓ స్నేహితుడా! సోమ్యా! - ఉపనిషత్ సాహిత్యమును అందిస్తున్న గొప్ప ఆయుధరూపముగు ధనస్సును చేత ధరించు. నిత్యోపాసనారూపమైన (యోగాభ్యాసమనే) పదునైన బాణమును అనుసంధానం చేయి.
- <u>తత్ భాగవతేన</u> → ఆ బ్రహ్మమును గురించిన చింతనయందు లగ్నమైన చేతనము (మనస్సు) అనే త్రాటిని (వింటినారిని) సారించు!
'తత్' - శబ్దార్థము - అక్షరము (అవినాశి) అగు బ్రహ్మమును ఛేదించు. (లక్ష్యముగా కలిగి ఉండుము). అట్టి బ్రహ్మమును ఎరుగుము! అదియే నీవై ఉండుము.

## ప్రథమ ముండకే - ప్రథమ ఖండము- "ఆత్మచేతనే"।

**1.** ఓం। బ్రహ్మా దేవానాం ప్రథమః సంబభూవ,
విశ్వస్య కర్తా। భువనస్య గోప్తా।
స బ్రహ్మవిద్యాం సర్వవిద్యా ప్రతిష్ఠామ్
అథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ॥

సృష్టికర్త అగు బ్రహ్మదేవుడు సమస్త సృష్టి - సృష్టి దేవతలకంటే మునుముందే ఆవిర్భవించియున్నారు.
- ఆయనయే విశ్వముయొక్క కర్త, భువనమునకు (జగత్తుకు)-రక్షకుడు కూడా
- ఆయన సర్వవిద్యలకు ఆశ్రయమైన బ్రహ్మవిద్యను తన మానస పుత్రుడగు పెద్దకుమారుడైన అథర్వునకు బోధించారు.

---

**2.** అథర్వణే యాం ప్ర-వదేత బ్రహ్మా
అథర్వా తాం పురో వాచ అంగిరే బ్రహ్మవిద్యామ్।
స భరద్వాజాయ సత్యవాహాయ ప్రాహ।
భరద్వాజో అంగిరసే పరావరామ్॥

బ్రహ్మదేవులవారు దేనిని అథర్వణునకు చెప్పారో..., ఆ బ్రహ్మవిద్యను అథర్వ మహర్షి ఒకానొకప్పుడు మరొక బ్రహ్మమానసపుత్రుడగు అంగిరసునకు చెప్పారు.

ఆ అంగిరసమహర్షి భరద్వాజ వంశజుడైన సత్యవాహునకు చెప్పటం జరిగింది. సర్వవిద్యలకు పరాకాష్ఠ (అయిన బ్రహ్మవిద్య)ను (లేక) పరంపరగా వచ్చిన ఆ బ్రహ్మవిద్యను భరద్వాజ వంశీయులు అనేకమందికి తెలియచెప్పారు. బోధించారు.

---

**3.** <u>శౌనకో హ వై మహాశాలో అంగిరసం</u>
<u>విధివత్ ఉపసన్నః</u> పప్రచ్ఛ:
"కస్మిన్ ను, భగవో! విజ్ఞాతే
సర్వమ్ ఇదమ్ విజ్ఞాతం భవతి?" ఇతి॥

శ్రీ శునక ఋషిపుత్రుడు-శౌనక నామధేయుడు. ఆయన మహాశయుడు. మహదాశయుడు.
ఆ శౌనకుడు విధివిధానంగా (శిష్యుడు గురువును సమీంచే శాస్త్ర విధిని విధానమును పాటిస్తూ) ఒక సందర్భములో అంగిరసుని సమీపించినవారై ప్రశ్నించారు!

"హే భగవాన్! దేనిని తెలుసుకోవటంచేత ఈ సర్వము తెలియబడినదగుచున్నది?"

---

**4.** <u>తస్మై స హోవాచ :</u> –
ద్వే విద్యే వేదితవ్యే ఇతి హ స్మ యత్
బ్రహ్మవిదో వదంతి।
<u>'పరా'</u> చ ఏవ। <u>'అపరా'</u> చ॥

*<u>ఆతడు (అంగిరసుడు) ఆతనికి (శౌనకునికి)....ఇట్లా చెప్పసాగారు!</u>*

విద్యలుగా తెలుసుకోవలసినవి రెండు అని బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారయ్యా!

**(1) పరావిద్య (2) అపరావిద్య.**

| | |
|---|---|
| **5. తత్ర అపరా ఋగ్వేదో, యజుర్వేదః।<br>సామవేదో, అథర్వవేదః, శిక్షా, కల్పో।<br>వ్యాకరణం, నిరుక్తం, ఛందో, జ్యోతిషమ్-ఇతి॥<br>అథ పరా → యయా తత్ అక్షరమ్ అధిగమ్యతే॥** | వాటిలో **అపరావిద్య** : ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము, శిక్షా (శబ్దశాస్త్రం), కల్ప విధులూ, (కాలవిధులు)<br>వ్యాకరణము, నిరుక్తము (అర్థనిర్ణయ శాస్త్రము), ఛందస్సు, జ్యోతిష శాస్త్రము → మొదలైనవన్నీ కూడా.<br>ఇక దేనిచేత తత్ (బ్రహ్మము) - అక్షరము (మార్పులేనిది) పొందబడుతోందో...అది **పరావిద్య.** |
| **6. యత్ తత్ అద్రేశ్యమ్, అగ్రాహ్యమ్,<br>అగోత్రమ్, అవర్ణమ్,<br>అచక్షుః - శ్రోతం, తత్ అపాణి-పాదమ్।<br>నిత్యం, విభుం, సర్వగతం, సుసూక్ష్మం।<br>తత్ అవ్యయం యత్<br>భూత యోనిం పరిపశ్యంతి ధీరాః॥** | ఏదైతే భౌతికమైన కళ్ళకు కనిపించేది కాదో, చేతులతో పట్టుగోపోతే దొరికేది కాదో...,<br>ఏదైతే దృశ్యజగత్తులో దేనికీ సంబంధించినది కానిదో, రంగు - రూపము లేనిదో వర్ణాశ్రమ ధర్మాలకు సంబంధించినది కాదో...<br>(ఏదైతే) → కళ్ళు - చెవులు లేనిదో (వాటిచే పట్టుబడనిదో), చేతులు - కాళ్ళు లేనిదో (కానిదో)...<br>(ఏదైతే) → ఎల్లప్పుడూ ఉండేదో (నిత్యమైనదో), సర్వమునకు యజమానియో, సర్వత్రా వ్యాపించి ఉన్నదో, అత్యంత సూక్ష్మమైనదో అట్టి ఈ కనబడే సర్వజీవులకు ఉత్పత్తి స్థానమే **"ఆత్మ"**<br>ధీరులు (ప్రజ్ఞావంతులు) అట్టి ఆత్మను సదా సర్వదా సర్వత్రా దర్శిస్తున్నారు. మమేకమౌతున్నారు. |
| **7. యథా ఊర్ణనాభిః సృజతే - గృహ్ణతే చ,<br>యథా పృథివ్యామ్ ఓషధయః సంభవంతి,<br>యథా సతః పురుషాత్ కేశలోమాని<br>తథా అక్షరాత్ సంభవతి-ఇహ విశ్వమ్॥** | ఏ విధంగా అయితే సాలెపురుగు (సాలెగూడు యొక్క దారములను) సృష్టిస్తూ - లోపలికి తీసుకుంటూ (ఇంతలోనే మ్రింగుతూ) ఉంటుందో...,<br>ఎట్లాగైతే భూమిలో ఓషధులు (మూలాధార రసాలు - తత్త్వాలు) ఏర్పడినవై ఉంటున్నాయో....,<br>ఏ రీతిగా జీవునియొక్క శరీరం మీద, తలమీద వెంట్రుకలు ఉద్భవమై పెరుగుచున్నాయో<br>ఆ విధంగా అక్షరమగు దానినుండి (పరబ్రహ్మమునుండి) ఇక్కడ విశ్వము (జగత్తు) సంభవిస్తోంది (లేక) ఉత్పన్నమౌతోంది. |
| **8. తపసా చీయతే బ్రహ్మ।<br>తతో అన్నమ్ అభిజాయతే।<br>అన్నాత్ ప్రాణో మనః సత్యం।<br>లోకాః కర్మసు చ అమృతమ్॥** | ఈ విశ్వము / దృశ్యము బ్రహ్మముయొక్క తపస్సుచే (తపనచే) అభివృద్ధి పొందుతోంది. (బ్రహ్మముయొక్క సృజనాత్మక చింతన నుండే ఆయా విశేషాలన్నీ బయల్వెడలుచున్నాయి.<br>అద్దానినుండి తపస్సు (తపన - తపస్సు నుండి) **అన్నము** (మూల Matter - Raw Material పదార్థము) అభిజాయతే - **జనిస్తోంది.** (అన్నము =అనుభవముగా అగుచున్న సమస్తము).<br>అన్నము (అవ్యాకృతము/ పదార్థతత్త్వము) నుండి ప్రాణశక్తి, మనస్సు, సత్యమువలె (యమ్‌సత్ - ఉనికి Presence స్వరూప) కనిపించే లోకాలు, అమృత స్వరూపులు అగు జీవాత్మలు - అనంతముగాను, అసంఖ్యాకము గాను ఏర్పడుచున్నవగుచున్నాయి. |
| **9. యః సర్వజ్ఞః సర్వవిత్<br>యస్య జ్ఞానమయమ్ తపః,<br>తస్మాత్ ఏతత్ బ్రహ్మ నామ రూపమ్<br>అన్నంచ జాయతే॥<br>*<u>ఇతి ప్రథమముండకే - ప్రథమఖండే।</u>*** | • ఎవ్వడైతే - సర్వజ్ఞుడో (సర్వము తెలిసినవాడో), సర్వవేత్తయో (అంతటా ఎరుక కలిగి ఉన్నాడో),<br>• ఎవనియొక్క జ్ఞానమయమైన తపస్సునుండి సృజనాత్మకమైన చింతన బయల్వెడలిందో...<br>ఆయన నుండియే (1) సృష్టికర్త (2) సృష్టిరూపంగా నామరూపాత్మమై కనిపించే ఈ సమస్తము (దేహాది వస్తువిశేషాలు) (3) అన్నము - కూడా పుట్టుచున్నాయి. (అన్నము = ఆహారము, పంచేంద్రియములయొక్క పంచేంద్రియ విషయములు). |

## ప్రధమ ముండకము - ద్వితీయ ఖండము - "ఆత్మవలననే।"

**1. ఓం తత్ – ఏతత్ సత్యం,**
**మంత్రేషు కర్మాణి కవయో**
**యాని అపశ్యమ్।**
**తాని త్రేతాయాం బహుధా సంతతాని।**
**తాని ఆచరథ నియతం, సత్యకామా,**
**ఏష వః పంథాః సుకృతస్య లోకే॥**

(కవయోః) - విజ్ఞులు, ప్రాజ్ఞులు వేదమంత్రముల చేతను - కర్మలచేతను పరమ సత్యముగా దేనినైతే దర్శిస్తున్నారో,
ఆ సత్యమే (ఋక్-యజుర్-సామ) త్రి-వేదములలోను, ఉపనిషత్తులలోను, అనేక విధాలుగా విస్తరించి చెప్పబడ్డాయి. అదియే పురాణ, ఇతిహాసములలో కూడా ఎలుగెత్తి గానం చేయబడుతోంది.
ఓ సత్యమునే కోరుకొనే సత్యకాములారా! (ఆ త్రివేదములలో గుర్తు చేస్తూ హౌత్రము, ఆధ్వర్యతము, ఔద్గాత్రములుగా చెప్పబడుచున్నట్టి) నియమ - నిష్ఠ - విధి - విధానములను చక్కగా ఆచరించండి! నిర్వర్తించండి! తపోధ్యానములు, సత్కర్మలు వీడకండి.
ఈ లోకంలో మీ సుకృతములే మీకు మార్గదర్శకములై యున్నాయి.
**వేదప్రవచిన ఉపాసనలు వదలకండి! చేయండి।**

---

**2. యదా లేలాయతే హి అర్చిః**
**సమిద్ధే హవ్యవాహనే,**
**తత్ ఆజ్యభాగాః అంతరేణ**
**ఆహుతీః ప్రతిపాదయేత్ శ్రద్ధయా హుతమ్॥**

ఎప్పుడైతే యగ్నగుండమునుండి దేవతలకు హవిస్సును తీసుకొనిపోవు అగ్ని జ్వాలలు అర్చించబడినవై చక్కగా ప్రజ్వలితూ ఉంటాయో...,
ఆ కదిలే అగ్నిజ్వాలల మధ్యలో (**ఆజ్యబాగాః అంతరేణ**) ఆహుతులు శ్రద్ధగా మీచే సమర్పించబడుచూ ఉండును గాక! (మీ మీ అగ్ని (యజ్ఞ) సాధనలు ఆపవద్దు)

---

**3. యస్య అగ్నిహోత్రం అదర్శమ్, అపౌర్ణమాసమ్,**
**అచాతుర్యాస్యమ్, అనాగ్రయణమ్,**
**అతిథి వర్జితం చ,**
**అహుతం అవైశ్వదేవమ్,**
**అవిధినా హుతమానః। (హుతమా)।**
**సప్తమాం తస్యలోకాన్ హినస్తి॥**

ఎవనియొక్క అగ్నిహోత్రక్రియలు సమయ - అసమయాలు అనుసరించి ఉండవో, అమావాస్య - పౌర్ణిమల సందర్భాలలో విధి విధానంగా నిర్వంచబడక అధర్మము (ధర్మకర్మలేనిది), అపౌర్ణిమము (పౌర్ణమిరోజు నిర్వర్తించ బడవలసినవి చేయకుండటము) అయి వుంటోందో...,
- చాతుర్మాస్యవ్రత నియమిత శాస్త్ర విధులను,నూర్పుల సమయంలో చేయవలసియున్న ప్రథమ ఫలతర్పణలు, అతిథిసేవలు, సమర్పణలు లేకయే కార్యక్రమాలు ఉంటున్నాయో.
- శాస్త్ర విధి అనుసరించని ఆహూతులు లేనిది, వైశ్వానర (అన్నదాన) విధి నిర్వర్తించబడనిది (పక్షులకు జంతువులకు ఆహార తృప్తి - సమర్పణ చేయటం జరగనిది) - అగుచున్నదో,
- విధి, ఉద్దేశ్యము, ప్రయోజనములను ఉద్దేశ్యించని, పవిత్రాశయము లేని ఆహుతులు అగుచున్నాయో,
- యజ్ఞార్థాత్ కర్మణః మరియు అగ్నిసంబంధిత క్రియలు ఏమరచ బడుచున్నాయో,
అట్టివారి **పితృ-ఊర్ధ్వసప్తలోక యానములు** ఏడు తరములు నష్టమును పొందుచున్నాయి.

---

**4. కాళీ కరాళీ చ మనోజవా చ।**
**సులోహితా యా చ సుధూమ్రవర్ణాః।**
**స్ఫులింగనీ విశ్వరుచీ చ దేవీ।**
**లేలాయమానా ఇతి సప్తజిహ్వాః॥**

**<u>అగ్నికార్యములు ఈ జీవుని పవిత్రం చేయగలవు।</u>**

(1) కాళీ, (2) కరాళీ, (3) మనోజవ, (4) సులోహిత, (5) సుధూమ్రవర్ణ, (6) స్ఫులింగనీ, (7) విశ్వరుచి-అను పవిత్రమైన పేర్లతో పిలువబడే సప్తజిహ్వలతో (ఏడునాలుకలతో - ఏడు విధములైన జ్వాలలతో) అగ్నిదేవుడు లేలాయమానమై (హవిస్సు, ఆహుతులను స్వీకరించేవారై ప్రకాశిస్తూ ఉంటారు (వారిని సేవించి జీవులు తరించెదరు గాక!)

---

**5. ఏతేషు యః చరతే భ్రాజమానేషు**
**యథా కాలం చ ఆహుతయో హి ఆదదాయన్।**
**తం నయంతి ఏతాః సూర్యస్య రశ్మయో**
**యత్ర దేవానాం పతిః ఏకో అధివాసః॥**

ఎవ్వరైతే దేదీప్యమానమైనట్టి-భ్రాజమానమైనట్టి అగ్నిశిఖలలో యథాకాలము (కాలనియమానుసారం) ఆహుతులు సమర్పిస్తూ ఉంటారో...
వారియొక్క ఆహుతులను - సూర్యరస్మి, సూర్యకిరణాలు దేవతలకు పతియగు పరమేశ్వరుని ధామమునకు -(సమక్షానికి) చేరుస్తున్నాయి.

| | |
|---|---|
| **6. 'ఏహి! ఏహి!' ఇతి।**<br>**తమ్ ఆహుతయః సువర్చసః**<br>**సూర్యస్య రశ్మిభిః యజమానం వహన్తి।** | "రండి! రండి!" (Welcome, Welcome) - అని పలుకుచు సువర్చస్సులో కళకళలాడే ఆ యాగ ఆహుతులు సూర్యకిరణముల ద్వారా ఆ యజ్ఞకర్తను సూర్యమండలమునకు (మనో సంయోగ మార్గంగా) గొనిపోతున్నాయి. |
| **ప్రియాం వాచం అభివదంత్యో అర్చయంతి**<br>**య ఏష వః పుణ్యః సుకృతో బ్రహ్మలోకః॥** | ప్రియమైన వాక్కులు పలుకుతూ ఆతనిని అర్చిస్తూ కూడా ఉంటున్నాయి.<br>సుకృతులు (మంచి పనులు చేసినవారు), పుణ్యాత్ములు చేరు బ్రహ్మలోకమునకు యజ్ఞకర్తలగు మనలను చేరుస్తున్నాయి. "ఇదే ఇటువైపే" - అంటూ దారిచూపుతాయి. |
| **7. ప్లవా హి ఏతే అదృఢా యజ్ఞరూపా**<br>**అష్టాదశ (18) ఉక్తం అవరం యేషు కర్మ।**<br>**ఏతత్ శ్రేయో యే అభినందంతి మూఢా**<br>**జరా మృత్యుం తే పునరేవ అపి యంతి॥** | 18 రకములైన యజ్ఞరూపములన్నీ కూడా వాటివాటి కర్మ విశేషములతో సహా బలహీనమైన పడవల వంటివి. (అంతటితో సరిపోదు). ఎందుకంటే, 'స్వర్గలోకము' వంటి సుఖరూప ఫలాలన్నీ క్షీణించునవే అయి ఉన్నాయి.<br>అవి మాత్రమే శ్రేయోదాయకములని అనుకుంటే, అది తెలివి తక్కువయే! మూఢులే అట్లా అనుకుంటారు ఎందుకుంటే...అవి "పునరపి జననం - పునరపి మరణం" → అను సందర్భములను ఆపలేవు. జన్మమృత్యువులు ఆతనిపట్ల మరల మరల కొనసాగుతూనే ఉంటాయి. |
| **8. అవిద్యాయాం అంతరే వర్తమానాః**<br>**స్వయం ధీరాః పండితం మన్యమానాః।** | అవిద్య - అజ్ఞానము యొక్క మధ్యలో (అంతరమున) ఉన్నట్టివారు "మాకు అంతా తెలుసు ఈ కర్మలు చేయండి! ఆ యజ్ఞాలు చేయండి. మీకు ఆలోకం లభిస్తుంది. ఇది పొందుతారు" - అంటూ "స్వయం, ధీరాః" అని భావన చేస్తూ (స్వర్గాది) కర్మఫలాలగురించే మాట్లాడుతూ ఉంటారు. |
| **జంఘన్యమానాః పరియంతి మూఢాః,**<br>**అంధేన ఏవ నీయమానా, యథా అంధాః॥** | ఆ కర్మఫలమార్గతత్పరులు కూడా ఒకటి తరువాత మరొకటిగా అనేక దుఃఖములు పొందుచూ, జన్మ-పునర్జన్మల చక్రములో తిరుగాడుతూ ఉంటున్నారు. గ్రుడ్డివానిచే నడిపించ బడుచున్న మరొకగ్రుడ్డివానివలె కర్మ - కర్మఫలారణ్యాలలో కొందరు జనులు తచ్చాడుచున్నారు. |
| **9. అవిద్యాయాం బహుధా వర్తమానాః**<br>**"వయం కృతార్థా" – ఇతి అభిమన్యంతి బాలాః।**<br>**యత్ కర్మిణో న ప్రవేదయంతి**<br>**(తెలుసుకోలేరు) రాగాత్,**<br>**తేనా ఆతురాః క్షీణలోకాశ్చ అవంతే॥** | ("యజ్ఞ యాగములే - ఉత్తమ లోకములే పరమాశయము" అని నమ్మి, - నమ్మించయత్నించే) కొందరు - అనేకమైన, అవిద్యావిషయములందు చిక్కుకున్నవారై, "మేము యజ్ఞ యాగాది కర్మలచే కృతార్థులమైనాము" అని బాలురవలె భావిస్తున్నారు.<br>వారు కర్మనిరతులై, కర్మ - కర్మఫలముల పట్ల ఆసక్తి, రాగము, అభినివేశము పెంపొందించుకున్నవారై, కర్మలకు - భోగములకు ఆవల గల పరమ-సత్యమును గమనించటము లేదు.<br>వారు రాగముతో ఆశిస్తున్న స్వర్గాది సుఖలోకాలు 'క్షీణించటం' అనే స్వభావం కలిగినవే! అవి పొంది కాలక్రమేణా చ్యుతిపొందటమే గతానుగతికంగా జరుగుతోంది.<br>***(అందుచేత, కర్మలు రాగరహితమై, ఆత్మజ్ఞానమునకు దారితీసినప్పుడే - ఉత్తమ ప్రయోజనము).*** |

**10. ఇష్టా – పూర్తం మన్యమానా వరిష్ఠం**
**న అన్యత్ శ్రేయో వేదయన్తే ప్రమూఢాః**
**నాకస్య పృష్ఠే తే సుకృతే అనుభూత్వా**
**ఇమం లోకం హీనతరం వా విశంతి॥**

**"ఇష్టములు (వేదోక్త యజ్ఞకర్మలు), మరియు పూర్తములు (లౌకిక సేవా సంబంధమైన బావులు, త్రవ్వించటం మొ॥వి) - ఇవే పరిపుష్ఠమైనవి! గొప్పవి! చాలు. వేరే ఏదో (ఆత్మజ్ఞానరూపమైన) శ్రేయోదాయకమైనదేమీ లేదు"** - అని ఆత్మజ్ఞానాన్ని తిరస్కరించే వారు **ప్రమూఢులు.** అట్టివారు భోగస్థానములగు స్వర్గము మొ॥లోకములలో కర్మఫలములగు సుఖములను (ఇంద్రియ- మనో సంబంధమైనవి) అనుభవించి, (ఆకర్మ ఫలాలు ఖర్చుకాగానే) తిరిగి ఈ భూలోకంలోనో, ఇంకా అధోలోకాలలోనో ప్రవేశము పొందుచున్నారు. (జన్మలు పొందుచున్నారు).

---

**11. తపః శ్రద్ధేయే హి ఉపవసంతి అరణ్యే**
**శాంతా విద్వాంసో భైక్ష చర్యాం చరంతః।**
**సూర్యద్వారేణ తే విరజాః ప్రయాంతి**
**యత్ర అమృతః స పురుషో హి అవ్యయాత్మా॥**

(ఎవ్వరైతే) తపస్సు - శ్రద్ధలతో అరణ్యంలో (Head in the forest) నివసిస్తూ శాంత మనస్కులై, ఆత్మతత్త్వ విద్వాంసులై, భిక్షాటన వ్రత నియమనిష్ఠులై ఉంటారో..., (అట్టివారు) పాపభావ వినిర్ముక్తులై (విరజాః) → సూర్యమార్గంలో, → ఎచ్చట అమృత - **అవ్యయపరమపురుషుడు** ప్రకాశిస్తున్నారో...అచ్చటికి చేరుచున్నారు.

---

**12. పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో**
**నిర్వేదమ్ ఆయాత్ న అస్థి అకృతః – కృతేన।**

("పరాకాష్ఠ, పరమ పవిత్రము, పరానందము" అగు బ్రహ్మమే మహదాశయముగాగల) బ్రహ్మణ్యుడు - యాగకర్మ ఫలములు, సుకృత కర్మఫలములు - అగు స్వర్గము మొ॥న సుఖమయలోకాల (పునరావృత్తి - ఇత్యాది) **దోషములను గమనిస్తున్నాడు.**

పరీక్షగా చూచినవాడై, వాటన్నిటిపట్లా (అట్లాగే), చేయగలుగుచున్నట్టి - చేయలేకపోతున్నట్టి సమస్తకర్మ వ్యవహారములపట్ల నిర్వేదము - వైరాగ్యము కలిగినవాడు అగుచున్నాడు.

---

**తత్ విజ్ఞానార్థమ్ స గురుమేవ అభిగచ్ఛేత్**
**సమిత్ పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్॥**

ఆత్మతత్త్వమును తెలుసుకోవాలనే ఉత్సుకత, ఆశయము కలవాడై ఆత్మజ్ఞుడగు శ్రోత్రియుడు - బ్రహ్మనిష్ఠుడు అగు సద్గురువును సమిధాదులు (దర్భలు) చేతపట్టుకొని సమీపించెదరు గాక।

---

**13. తస్మై స విద్వాన్ ఉపసన్నాయ సమ్యక్**
**ప్రశాంత చిత్తాయ, శమాన్వితాయ।**
**యేన అక్షరం – పురుషం వేద సత్యం**
**ప్రో వాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్॥**

మహదాశయుడగు ముముక్షువు, → ప్రశాంతచిత్తుడు, **శమాన్వితుడు** ఆత్మజ్ఞుడు అగు విద్వాంసుని యథావిధిగా సమీపించి, శరణు వేడుచున్నాడు.

ఆ విధంగా తనను ఆశ్రయించిన సమిత్‌పాణి సమన్వితుడైన (చేత యజ్ఞ దర్భలు ధరించిన) శిష్యునికి ఆ సద్గురువు → **సత్యము, అక్షరము - అవ్యయము అగు ఆత్మతత్త్వమును** - ఆతడు (శిష్యుడు) చక్కగా తెలుసుకొనే రీతిగా బోధించునుగాక।

బ్రహ్మవిద్యను తత్త్వతః సారభూత - సాకల్యమైన వివరణలతో చెప్పాలి. బోధించాలి. బ్రహ్మవిద్యను బోధిస్తూ స్వస్వరూపాత్మయొక్క స్వభావఔన్నత్యములేమిటో సవివరణ పూర్వకంగా దృష్టాంతపూర్వకంగా స్వానుభవమును రంగరించి బోధించునుగాక।

***ఇతి ప్రథమ ముండకము - ద్వితీయ ఖండము.***

## ద్వితీయ ముండకము - ప్రథమ ఖండము - ఆత్మనుండియే....।

1. 'ఓం' 'తత్' ఏత్ సత్యం -
యథా సుదీప్తాత్ పావకాత్ విస్ఫులింగాః
సహస్రశః ప్రభవన్తే సరూపాః
తథా అక్షరాత్ వివిధాః సోమ్య! భావాః,
ప్రజాయంతే తత్ర చ ఏవ అపి యన్తి॥

ఓ సోమ్యుడా! ఆ తత్ స్వరూపసత్యమగు బ్రహ్మమునకు - ఈ అసంఖ్యాక జీవరాసులకుగల చమత్కార సంబంధమేమిటో విను!

**బ్రహ్మమే సత్యము!**

ఏ విధంగా అయితే, ప్రజ్వలించే అగ్ని నుండి అగ్ని రూపమే (సరూపమే) అయి నట్టి వేల వేల విస్ఫులింగాలు (నిప్పురవ్వలు) పుట్టుకొస్తూ ఉంటాయో...

అట్లాగే వివిధ భావికులగు జీవులంతా అక్షరమగు బ్రహ్మమునుండి (విస్ఫులింగాలవలె) బయల్వెడలుచున్నారు. తిరిగే బ్రహ్మమునందే లయిస్తున్నారు.

---

2. దివ్యో హి అమూర్తః పురుషః
స బాహ్య - అభ్యంతరో హి అజః।
అప్రాణో హి అమనాః శుభ్రో హి
అక్షరాత్ పరతః పరః।

పరబ్రహ్మము పరమ పురుషుడుగా వర్ణించబడుచూ, దివ్యమై (స్వయంప్రకాశకమై), నిరాకారమై, సర్వవ్యాపకమై, బాహ్య - అభ్యంతరములను ఆవరించి ఉన్నదై, జన్మ - కర్మలు లేనిదైయున్నదయ్యా! అది ప్రాణ రూపము - మనో రూపము కాదు. ప్రాణ - మనస్సులను **కల్పించుకొనునది, నియమించుకొనునది సుమా! నిత్య నిర్మలము. క్షరాక్షరములకు అతీతమైనది!**

---

3. ఏతస్మాత్ జాయతే ప్రాణో।
మనః సర్వేంద్రియాణి చ।
ఖం వాయుః జ్యోతిః ఆపః పృథివీ
విశ్వస్య ధారిణీ॥

ఆ పరబ్రహ్మతత్త్వము నుండే (ఆ పరబ్రహ్మ స్వరూపమగు నీ నుండే)

ప్రాణము (జీవనము), ఆలోచన (మనస్సు), ఈ సర్వ ఇంద్రియాలు, ఆకాశము, వాయువు, జ్యోతి (అగ్ని), జలము పృథివి జనిస్తున్నాయి.

అట్టి ఈ విశ్వమంతా ధారణ చేస్తున్నది - ధరిస్తున్నది ఆ పరబ్రహ్మమే నయ్యా! అట్టి సహజ - కేవల స్వరూపమే సమస్తమునకు జనన స్థానము.

---

4. అగ్నిః మూర్ధా। చక్షుసీ చంద్ర - సూర్యౌ।
దిశః శ్రోత్రే, వాక్ వివృతాశ్చ వేదాః।
వాయుః ప్రాణో హృదయం విశ్వమస్య
పద్భ్యాం పృథివీ హి ఏష సర్వభూత-అంతరాత్మా॥

అట్టి పరబ్రహ్మతత్త్వానికి అగ్ని (ద్యులోకము - జ్యోతి - దేవలోకము) శిరస్సు. సూర్యచంద్రులు రెండు కన్నులు. ఇక్కడి దిక్కులన్నీ అద్దాని చెవులు. వేదమంత్రములు - గానములు అద్దాని తెరువబడినోళ్ళు.

వాయువు అద్దాని ప్రాణములు - ఊపిరి. ఈ విశ్వమంతా అద్దాని హృదయము.

ఈ భూమియే అద్దాని, పాదాలు. అట్టి ఆ (నీ) తత్త్వమే సర్వజీవులయొక్క అంతరాత్మ!

---

5. తస్మాత్ (దానినుండి) అగ్నిః సమిధో యస్య సూర్యః
సోమాత్ పర్జన్య ఓషధయః పృథివ్యామ్।
పుమాన్ రేతః సించతి యోషితాయాం
బహ్వీః ప్రజాః పురుషాత్ సంప్రసూతాః॥

ఆ పరబ్రహ్మమునుండే అగ్ని. ఆ అగ్నికి సమిధవంటిది సూర్యుడు. ఆ సూర్యుడి నుండి చంద్రుడు. చంద్రుని నుండి మేఘాలు. మేఘాల నుండి వర్షము. ఆ మేఘ జలము నుండి భూమిపై ఓషదుల ఆహారరూపం. ఆహారము స్వీకరించిన పురుషుని (స్త్రీ యోనియందు) రేతః పాతము చేత ఆ పురుషతత్త్వము నుండి అనేక జీవజాతులు - ఇవన్నీ జనిస్తున్నాయి. **(పంచాగ్ని తత్త్వములు :** (1) తేజస్సు (అగ్ని), (2) వర్షమేఘాలు, (3) ఓషధులు, (4) పురుషుడు, (5) స్త్రీ).

**6. తస్మాత్ (ఆ తత్త్వమునుండి) ఋచః సామ యజూంషి దీక్షా**
**యజ్ఞాశ్చ సర్వే క్రతవో దక్షిణాశ్చ,**
**సంవత్సరశ్చ యజమానశ్చ లోకాః**
**సోమో యత్ర పవతే యత్ర సూర్యః॥**

ఆ తత్త్వము నుండి హౌత్రములు, ఋక్కుల (మంత్రముల) రూపమగు **ఋగ్వేదము**, ఔద్గాత్ర-గానముల రూపమగు సామవేదము, యజ్ఞముల రూపములగు యజుర్వేదము, దీక్ష (వ్రత దీక్షలు), అగ్నిహోత్ర రూపములగు యజ్ఞములు, (యూపస్తంభపూర్వకమైన) క్రతువులు, మంత్రగానం చేసే ఋత్విక్కులకు దక్షిణలు, కాలరూపమగు సంవత్సరము, యజ్ఞకర్త (యజమాని), లోకాలు, లోకాలను వెలిగిస్తూ పోషిస్తూ, పవిత్రం చేస్తూ ఉన్న సూర్యచంద్రులు - మొదలైనవన్నీ కూడా జనిస్తున్నాయి.

---

**7. తస్మాత్ చ దేవా బహుధా సంప్రసూతాః**
**సాధ్యా మనుష్యాః పశవో వయాంసి।**
**ప్రాణ - అపానౌ వ్రీహియవౌ తపశ్చ**
**శ్రద్ధా సత్యం బ్రహ్మచర్యం విధిశ్చ॥**

ఆ నిర్గుణ పరబ్రహ్మము నుండే...వివిధ దేవతలు, సిద్ధులు, సాధ్యులు, మనుష్యులు, పశువులు (జంతువులు), పక్షులు, ప్రాణ - అపానములు (ఉచ్ఛ్వాస - నిశ్వాసలు), వరి - గోధుమ మొదలైన ధాన్యములు - కూడా జనిస్తున్నాయి. అంతే కాక,

తపస్సు-శ్రద్ధ-సత్యము(యమ్‌సత్-'ఉన్నాను' అనే ఉనికి), బ్రహ్మచర్యము, విధి నియమములు చెప్పే శాస్త్రములు - ఇవన్నీ సంభవిస్తున్నాయి.

---

**8. సప్తప్రాణాః ప్రభవన్తి తస్మాత్।**
**సప్త - అర్చిషః సమిధః సప్తహోమాః।**
**సప్త ఇమే లోకా యేషు చరంతి।**
**ప్రాణా గుహాశయా నిహితాః సప్త - సప్త॥**

ఆ పరతత్త్వము నుండే →

→ సప్త ప్రాణములు = [పంచేంద్రియాలు, మనస్సు - బుద్ధి, (7)]

→ సప్త జ్వాలలు = గ్రహణశక్తులు (7)

→ సప్త సమిధలు = ఇంద్రియ విషయాలు (7)

→ సప్త హోమములు = (ఆహూతులు - జ్ఞానములు)

→ సప్త ఊర్ధ్వలోకములు → సప్త **అధోలోకములు**

→ హృదయగుహలో సంచరించే సప్త జీవశక్తులు

**ఇవన్నీ సప్త - సప్త ఏడేడుగా జనిస్తున్నాయి.**

---

**9. అతః సముద్రా - గిరయశ్చ సర్వే**
**అస్మాత్ స్యందంతే సింధవః సర్వరూపాః।**
**అతశ్చ సర్వా ఓషధయో రసశ్చ**
**యేన ఏష భూతైః తిష్ఠతే హి అంతరాత్మా॥**

అద్దాని నుండే సప్తసముద్రములు, సప్తగిరులు, ప్రవహించే అన్ని నదీ - నదములు, అన్ని ఓషధులు - ఆహార రసాలు వ్యక్తమగుచున్నాయి.

బాహ్యమున పంచభూతములుగా, సర్వజీవులయొక్క అంతర్ - హృదయ అంతరాత్మలుగా (అంతరంగ చతుష్టయముగా) ఉంటున్నది ఆ పరబ్రహ్మతత్త్వమే!

---

**10. పురుష ఏవ ఇదగ్ం విశ్వం**
**కర్మ తపో బ్రహ్మ పరామృతమ్।**
**ఏతత్ యో వేద నిహితం గుహాయాం**
**సో "అవిద్యా గ్రంథిం" వికిరతి ఇహ, సోమ్య!**
***ఇతి ద్వితీయ ముండకః। మొదటి ఖండమ్॥***

ఈ సమస్తమైన విశ్వము, కర్మ, యజ్ఞ కర్మ, పురుషకారము, తపస్సు - ఇవన్నీ కూడా పరాబ్రహ్మ మృతస్వరూపమేనయ్యా!

ఓ సోమ్య! సర్వత్రా నిహితమై నిబిడాకృతిగా ఉన్న అట్టి పరాకాశ బ్రహ్మమును **హృదయగుహలో ఎవడు సందర్శిస్తాడో, అట్టివాని యొక్క అజ్ఞానగ్రంథుల ఇప్పుడే ఇక్కడే వీగిపోతున్నాయి. విభేదనమైపోతున్నాయి.**

***- ఇతి ద్వితీయ ముండకం - మొదటి ఖండం.***

## ద్వితీయ ముండకే - ద్వితీయ ఖండము - ఇదంతా అదే।

| శ్లోకము | వివరణ |
|---|---|
| **1.** ఓం। ఆవిః సన్నిహితం గుహాచరం నామ<br>'మహత్ పదమ్' అత్ర ఏతత్ సమర్పితం।<br>ఏజత్ ప్రాణన్ నిమిషచ్చ<br>యత్ ఏతత్ 'జానథ' -<br>సత్ - అసత్ వరేణ్యం పరం విజ్ఞానాత్<br>యత్ వరిష్ఠం ప్రజానామ్॥ | ప్రత్యక్షముగా కనిపించేదంతా బ్రహ్మమే! అది ప్రతి ఒక్కరికీ అత్యంత సన్నిహితమైనది (Nearest of the Nearest). సర్వుల హృదయ గుహలలో వేంచేసియే ఉండి, సర్వత్రా సంచారాలు చేస్తున్నది ఆ పరబ్రహ్మమే! ఆ పరంధామము సర్వులకు స్వాభావికమగు ఆశ్రయం. జననస్థానం, లయస్థానం కూడా।<br>ఈ కదిలేవి, శాసించునవి, రెప్పవాల్చేది...ఇవన్నీ బ్రహ్మమునందే అలంకారప్రాయమై అమర్చబడి ఉన్నాయి. అదియే సత్తు. అదియే అసత్తు కూడా. **వరేణ్యం - సర్వారాధ్యం। విజ్ఞానాత్ పరమ్.** తెలియబడేదానికి ఆవల వేంచేసి ఉన్నది అదే!<br>అట్టి బ్రహ్మమును తెలుసుకో! |
| **2.** యత్ అర్చిమత్, యత్ అణుభ్యో - అణు చ,<br>యస్మిన్ లోకా నిహితా లోకినశ్చ।<br>తత్ - ఏతత్ '<u>అక్షరం, బ్రహ్మ పరమమ్</u>' వాక్ - మనః<br>(బ్రహ్మ స ప్రాణః తదు వా మనః)<br>తత్ - ఏతత్ సత్యం! తత్ అమృతం।<br>తత్ వేద్ధవ్యం, సోమ్య! విద్ధి॥ | ఏదైతే (అర్చిమత్) - దీప్తివంతమో, ఏది అణువులకంటే కూడా సూక్ష్మాతి సూక్ష్మమో, ఈ లోకాలు - లోకస్థులు ఎందులో ఇమిడి ఉన్నారో, అట్టి పరమపురుషుడే **ప్రాణము. ఆతడే వాక్ రూపము. మనస్సు కూడా ఆతడే।** అదియే **సత్యము - అమృతస్వరూపము।** ఓ సోమ్యా! మిత్రమా। ఆ తెలుసుకోవలసినది తెలుసుకో। **అక్షరమగు అది నీకు అనన్యము కూడా సుమా! అని నీకు అన్యము కానే కాదు.** |
| **3.** ధనుః గృహీత్వా ఉపనిషదం మహాస్త్రం,<br>శరం హి ఉపాసా నిశితం సంధధీత,<br>ఆయమ్య తత్ భావగతేన చేతసా<br>లక్ష్యం తత్ఏవ 'అక్షరం', సోమ్య! విద్ధి॥ | ఓ స్నేహితుడా! సోమ్యా!<br>- ఉపనిషత్ సాహిత్యమును అందిస్తున్న గొప్ప ఆయుధరూపమగు ధనస్సును చేత ధరించు.<br>- నిత్యోపాసనారూపమైన (యోగాభ్యాసమనే) పదునైన బాణమును అనుసంధానం చేయి.<br>- <u>తత్ భాగవతేన</u> → ఆ బ్రహ్మమును గురించిన చింతనయందు లగ్నమైన చేతనము (మనస్సు) అనే త్రాటిని (వింటినారిని) సారించు!<br>'తత్' - శబ్దార్థము - అక్షరము (అవినాశి) అగు బ్రహ్మమును ఛేదించు. (లక్ష్యముగా కలిగి ఉండుము). అట్టి బ్రహ్మమును ఎరుగుము! అదియే నీవై ఉండుము. |
| **4.** (ఓం) ప్రణవో ధనుః। శరో హి 'ఆత్మా'। →<br>→ 'బ్రహ్మ' తత్ లక్ష్యమ్ ఉచ్యతే।<br>అప్రమత్తేన వేద్ధవ్యం<br>శరవత్ 'తత్మయో' భవేత్॥ | ☙ 'ఓంకారము' అనే ప్రణవమే విల్లు। జీవాత్మయే శరము।<br>☙ బ్రహ్మమే తత్ లక్ష్యము...అని చెప్పబడుతోందయ్యా!<br>అప్రమత్తుడవై బాణము లక్ష్యమును తాకినట్లుగా బ్రహ్మమును తెలుసుకొని బ్రహ్మముతో తన్మయుడవు అగుము. **బ్రహ్మమే అయి ఉండుము.** |
| **5.** యస్మిన్ ద్యౌః పృథివీ చ అంతరిక్షమ్ ఓతం<br>మనః సహ ప్రాణైశ్చ సర్వైః।<br>తం ఏవ ఏకం జానథ<br>ఆత్మానమ్ - అన్యా వాచో విముఞ్చథ<br>అమృతస్య ఏష సేతుః॥ | దేనియందైతే స్వర్గము, భూమి, ఆకాశము, అంతరిక్షము (అంతరాళము) ఇవన్నీ కూడా.... (ఇంకా) - మనో ప్రాణములతో సహా →<br>ఓతము (వస్త్రములో దారమువలె) → అల్లబడి ఉన్నాయో.,<br>అట్టి ఆ **ఏకము - అఖండము అగు స్వస్వరూపాత్మయే** తెలుసుకోవాలి సుమా! ఇక మిగిలిన మాటలన్నీ వదలిపెట్టు. అదియే మృతమునుండి అమృతత్వానికి చేర్చే వారధి. (సేతువు). దేహముల రాక-పోకలకు కూడా అదియే 'సాక్షి' అయినట్టి నీ అమృత రూపమునకు వంతెన. |

| శ్లోకము | వివరణ |
|---|---|
| **6. అరా ఇవ రథనాభౌ<br>సంహతా యత్ర నాడ్యః।<br>స ఏషో అన్తశ్చరతే బహుధా జాయమానః।<br>'ఓం' ఇతి ఏవం ద్యాయథ ఆత్మానం,<br>స్వస్తి వః (మీరు) పారాయ తమసః పరస్తాత్॥** | రథచక్రముయొక్క ఇరుసులో అమర్చబడిన ఆకులవలె - **ఈ నాడుల స్పందనలన్నీ ఎక్కడకు చేరుచున్నాయో అదియే ఆత్మ.**<br>అయ్యది అనేక విధాలుగా రూపములు ఆశ్రయిస్తూ అంతర్ - హృదయంలోనే చరిస్తూ ఉన్నది.<br>అట్టి ఆత్మను 'ఓం' అను శబ్దసంజ్ఞతో ధ్యానము చేస్తూ, అజ్ఞానాంధకారము దాటి పోవుచున్నాము.<br>అజ్ఞానమునకు ఆవలగల ఆత్మభగవానునికి **'స్వస్తి'**। |
| **7. యః సర్వజ్ఞః సర్వవిత్,<br>యస్య ఏష మహిమా భువిః,<br>దివ్యే బ్రహ్మపురే హి ఏష<br>వ్యోమ్న్యా (వ్యోమని) ఆత్మా ప్రతిష్ఠితః॥** | ఏదైతే సర్వజ్ఞమో, సర్వము తెలుసుకొనుచున్నదో,...ఎద్దానియొక్క మహిమయే ఈ దృశ్య చమత్కారమో, ఈ భువి తానే అయి వున్నదో అది 'బ్రహ్మపురి' అనబడే ఆత్మాకాశంలోనే ప్రతిష్ఠితమై ఉన్నది. అద్దానిని దర్శించెదముగాక। మాయొక్క "ఆత్మాకాశము"నందు "పరబ్రహ్మము"గా ప్రతిష్ఠితిమైయున్న ఆత్మదేవుని ఉపాసిస్తున్నాము. |
| **8. మనోమయః ప్రాణశరీర నేతా (నాయకుడు)<br>ప్రతిష్ఠితో అన్నే హృదయం సన్నిధాయ।<br>తత్ విజ్ఞానేన పరిపశ్యంతి ధీరా<br>ఆనందరూపమ్ అమృతం యత్ విభాతి॥** | (అస్య ఏష మహిమా? → ఇదంతా ఎవరి మహిమయో)<br>*అట్టి ఆత్మ* →<br>※ మనోరూపము తనదే అయి ఉన్నది (మనోమయము)<br>※ ఈ ప్రాణ - శరీరములకు నాయకుడు.<br>※ ఈ అన్నమయ శరీరమంతా నిండి ఉడియే ఈ దేహములో హృదయమున ప్రతిష్ఠించి ఉన్నట్టిది.<br>**ఆనంద స్వరూపమై - అమృత రూపమై ఏ ఆత్మ ప్రకాశిస్తోందో, అద్దానిని ధీరులగు బుద్ధిమంతులు తమ విజ్ఞానపు వెలుగులో తమయందే సాక్షాత్కరించుకుంటున్నారు. మనము సాక్షాత్కరించుకుందాము.** |
| **9. భిద్యతే హృదయగ్రంథిః<br>ఛిద్యంతే సర్వ సంశయాః<br>క్షీయంతే చ అస్య కర్మాణి<br>తస్మిన్ దృష్టే పరావరే॥** | అట్టి పర-అపర విజ్ఞాన దృష్టిచే, "సర్వంతరాత్మణీ" యొక్క అనుభూతి - సాక్షాత్కరముచే<br>※ ఆతని బ్రహ్మ-విష్ణు-రుద్ర (సృష్టి-స్థితి-లయ) హృదయగ్రంథులు తెగి తన స్వరూపముపైగల 'అనుమానము' సంబంధమైన చిక్కుముడులు తెగిపోతున్నాయి.<br>※ సర్వసందేహాలు పటాపంచలౌతున్నాయి.<br>※ సర్వ ఆగామి - సంచిత - ప్రారబ్ధకర్మ బంధాలన్నీ ఆతని దృష్టిలో మొదలే నశించినవై ఉండగలవు. |
| **10. హిరణ్మయే పరేకోశే<br>విరజం బ్రహ్మ - నిష్కలమ్।<br>తత్ శుభ్రం జ్యోతిషాం జ్యోతిః<br>తత్ యత్ ఆత్మవిదో విదుః॥** | ***ఇంకా కూడా, స్వస్వరూపమగు ఆత్మ ఎట్టిదంటే...***<br>• సృష్టిరూపముగా ప్రదర్శితమౌతోంది. ఇహమంతా తానై అయి ఉంది.<br>• సర్వమునకు పరము (Beyond All)<br>• పంచకోశములకు ఆవల (పరమై) ఉన్నది<br>• జన్మ-కర్మ-మనో-బుద్ధి దోషములచే స్పృశించబడటం లేదు. విరజము.<br>• నిష్కళంకమైనది. కళంకరహితము.<br>• అత్యంత స్వచ్ఛమైనది. **శుభ్రమ్।**<br>• జ్యోతులకే జ్యోతి అని ఆత్మవిదులు నిర్దుష్టముగా ఆత్మగురించి ఎరుగుచూనే ఉన్నారు. **జ్యోతిషాం జ్యోతిః।** |

**11.** **న తత్ర సూర్యోభాతి।**
**న చంద్ర – తారకం।**
**నేమా (న ఇమా) విద్యుతో భాన్తి।**
**కుతో అయమ్ అగ్నిః?**
**తమేవ భాన్తమ్ అనుభాతి సర్వమ్।**
**తస్య భాసా సర్వమిదం విభాతి॥**

అట్టి ఆ వెలుగులకే వెలుగు 'జ్యోతిర్జ్యోతి' అయిన ఆత్మ సమక్షంలో....

☙ సూర్యుడు ప్రకాశించడు. సూర్యుడు ఉదయించటం, చీకటి తొలగటం...ఇది ఆత్మ సంబంధమైనది, ఆత్మకు సమక్షమైనది కాదు!

- ఈ భౌతిక సూర్య - చంద్ర నక్షత్రాలు ఆత్మవద్ద ప్రకాశించేవి కావు. (ఆత్మజ్యోతి-భౌతికమైన వెలుగువంటిది కాదు).

- అది అగ్నియొక్క వెలుగా? కాదు.

- మరి? ఆత్మ ప్రకాశిస్తూ ఉంటే, అద్దాని ప్రకాశంలో ఇవన్నీ - ఈ సర్వము ఆత్మ తేజస్సులో భాసిస్తున్నాయి. ప్రకాశిస్తున్నాయి.

---

**12.** **బ్రహ్మ ఏవ ఇదమ్ – అమృతం**
**పురస్తాత్ బ్రహ్మ। పశ్చాత్ బ్రహ్మ ।**
**దక్షిణతశ్చ, ఉత్తరేణ।**
**అధశ్చ, ఊర్ధ్వం చ ప్రసృతం**
**బ్రహ్మఏవ ఇదమ్ విశ్వమ్। ఇదం వరిష్ఠమ్॥**
**(బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్)॥**

అంతదాకా దేనికి! ఈ కనబడేదంతా అమృతస్వరూపమగు బ్రహ్మమేనయ్యా!

- ఈ ఎదురుగా - వెనుకగా, తూర్పు - పడమర - దక్షిణ - ఉత్తర దిక్కులలో, క్రింద - పైన - అంతటా బ్రహ్మమే వ్యాపించియున్నది.

- ఈ విశ్వము బ్రహ్మమే! ఈ విశ్వానుభవము నీది-నాది అయినట్టి నీవు - నేను కూడా సర్వదా బ్రహ్మమే।

- బ్రహ్మమే-సర్వదా సర్వత్రా సర్వోత్కృష్టమైయున్నది.

**అంతా బ్రహ్మమే!**
**(సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ)**

<u>ద్వితీయోఽధ్యాయ</u>
<u>ద్వితీయ ఖండమ్ సమాప్తా</u>

**<u>ఇతి – 2వ ముండక –</u>**
**<u>రెండవ అధ్యాయము</u>**

# తృతీయ ముండకే - ప్రథమ ఖండము

**1. ‘ఓం’ ద్వా సుపర్ణా సయుజా సఖాయా**
**సమానం వృక్షం పరిషస్వజాతే।**
**తయోః అన్యః పిప్పలం స్వాద్వత్।**
**య అనశ్నన్ అన్యో అభిచాకశీతి॥**
**(చూస్తూ, గమనిస్తూ ఉన్నది)॥**
**(పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి)**

అత్యంత ప్రియ స్నేహితులై ఎప్పుడూ కలిసియే ఉంటున్నట్టి రెండు పక్షులు ఉన్నాయయ్యా! ఆ రెండు పక్షులు ఒకే వృక్షముపై పరిషస్వజాతులై - ఒకరినొకరు వదలకుండా ఉంటున్నాయి. (పరిష్వంగము = ఒకరినొకరు కౌగలించుకొని, వీడక ఉన్నట్టివి).

ఆ రెండిటిలో ఒకటి చంచలముగా ఆయా ఫలములను రుచులు చూస్తూ (ధ్యాసను ఫలములపైనే ఉంచుతూ), ఉరకలు - గంతులు వేస్తోంది.

ఇక ఆ రెండవ పక్షియో...ఏదీ ఏమాత్రం స్వీకరించక, ఏదీ నిర్వర్తించక - మౌనంగా - చూస్తూ ఉన్నది.

(1) మొదటి పక్షి = జీవాత్మ
(2) రెండవ పక్షి = పరమాత్మ
(3) వృక్షము = ఈ దేహము

---

**2. సమానే వృక్షే పురుషో నిమగ్నో**
**అనీశయా శోచతి ముహ్యమానః।**
**జుష్టం యదా పశ్యతి అన్యమ్ ‘ఈశమ్’,**
**‘అస్య మహిమానమ్’**
**ఇతి → <u>వీతశోకః</u>॥**

ఒకే వృక్షముపై సమానులై వ్రాలినవై ఉన్నప్పటికీ, ఒక పక్షి (జీవాత్మ) అనేక పళ్ళ రుచులు (కర్మఫలములు) రుచిచూస్తూ ఉన్నది. అనుకున్నవి అనుకున్నట్లు లేకపోవటంచేత నిర్వీర్యం పొందుతోంది. దుఃఖిస్తోంది కూడా!

ఆ (జీవాత్మ) పక్షియొక్క వేదనలు తొలిగేది ఎట్లా? ఇంతలోనే స్వల్ప విషయాలకే వినోదము, స్వోత్కర్ష, గర్వము మొ॥నవి పొందుతోంది.

ఎప్పుడైతే తనకు ఆధారము - ఆరాధ్యము, ఈశుడు, తన ప్రభువు అయినట్టి - రెండవ పక్షి (పరమాత్మ) యొక్క **మహిమను** చూడటం జరుగుతోందో, అప్పుడు ఆ మొదటిపక్షి (జీవాత్మ) శోకం పోగొట్టుకొంటోంది.

---

**3. యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం**
**కర్తారమ్ ఈశం పురుషం బ్రహ్మయోనిమ్।**
**తదా విద్వాన్ పుణ్య – పాపే విధూయ**
**నిరంజనః (నిష్కల్మషము), పరమం (సర్వోత్తమము),**
**<u>సామ్యమ్</u> ఉపైతి॥**

ఎప్పుడైతే-జీవాత్మ→ తన ప్రభువగు పరమాత్మను (ఈశ్వరుని): ‘ఋతము’ గాను, సహజసత్యముగాను, బ్రహ్మకు కూడా ‘ఆది’ అయినట్టిదిగాను, సర్వకర్తగాను, విభుడుగాను, ప్రభువుగాను దర్శిస్తుందో, - ఆ మరుక్షణం పుణ్య - పాప ద్వంద్వమును విదళించి వేసి **ఆ రెండవ పక్షియగు పరమాత్మతో సామ్యత్వము** పొందుతోంది. పరము - నిరంజనము అగు ఆత్మ పక్షితో ఏకమై, **జీవాత్మత్వమును అధిగమించి పరమానందిస్తోంది.**

---

**4. ప్రాణో హి ఏష యః సర్వభూతైః విభాతి**
**విజానన్ విద్వాన్ భవతే న అతివాదీ (నాతివాదీ)।**
**ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావాన్,**
**ఏష బ్రహ్మవిదాం వరిష్ఠః॥**

ఏ ప్రాజ్ఞుడైతే - విద్వరేణ్యుడై, సకల జీవులలో ప్రాణ - మనో ఇత్యాదుల ఆది - స్వరూపుడైన ఆత్మను తెలుసుకుంటాడో, సర్వదా సందర్శిస్తూ ఉంటాడో, ఆతడు ఆ ఆత్మయే తానై ప్రకాశిస్తాడు. తదితరమైనదేదీ మాట్లాడడు. (దృష్టిలో కలిగి ఉండడు)

- ఆత్మయందే క్రీడిస్తూ ఉంటాడు. రమిస్తూ ఉంటాడు. ఆత్మ సందర్శనమునందే ఆనందిస్తూ వుంటాడు! అట్టివాడు బ్రహ్మవిదులలో వరిష్ఠుడగుచున్నాడు.

---

**5. సత్యేన లభ్యః తపసా హి ఏష ఆత్మా**
**<u>సమ్యక్ జ్ఞానేన, బ్రహ్మచర్యేణ</u> నిత్యమ్।**
**అంతః శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో**
**అయం పశ్యంతి యతయః క్షీణదోషాః॥**

సత్యముచేత, తపస్సుచేత ‘ఆత్మత్వము’ లభించగలదు. నిత్యము సమ్యక్‌జ్ఞానం చేత, బ్రహ్మచర్యముచేత ఆత్మసంయమయోగులకు (దేహభావము క్షీణిస్తూ ఉండగా) జ్యోతిర్మయము, పరిశుభ్రము అగు ఆత్మ స్వశరీరముగా లభిస్తోంది. (సత్యమ్ = ‘యమ్‌సత్’ = శాశ్వతమగు ‘సత్’ను ఆశ్రయించి ఉండటము. ‘అసత్’ను ఉపేక్షించి ఉండటము)

**6. సత్యమేవ జయతి। న అనృతమ్।**
**సత్యేన పంథా వితతో దేవయానః।**
**యేన ఆక్రమన్తి ఋషయో హి ఆప్తకామా**
**యత్ర తత్ సత్యస్య పరమం నిధానమ్॥**

నిత్యసత్యమగు ఆత్మభావనయే ఎప్పటికైనా (చివరికి) జయించగలదు. అసత్యము - భ్రమాత్మకము అగు దృశ్య భావన ఎప్పటికో అప్పటికి తప్పక వీగిపోగలదు. **సత్యము చేతనే దేవయానమగు మార్గము ఏర్పడినదై ఉన్నది.**

అట్టి ఆత్మపదమును ఆప్తకాములు (కోరికలు జయించినవారు) అగు ఋషులు (ఋత్ → సత్యమునే ఆశయము అనుభవముగా గలవారు) ఆక్రమించుకొని ఉంటున్నారు. 'శృణ్వంతి విశ్వే' - అని మనకు గుర్తు చేయుచున్నారు కూడా.

---

**7. బృహచ్చ తత్ దివ్యం – అచింత్యరూపం**
**సూక్ష్మాచ్చ తత్ సూక్ష్మతరం విభాతి।**
**దూరాత్ సుదూరే తత్ ఇహ అంతికే (చ)**
**పశ్యత్సు ఇహైవ నిహితం గుహాయామ్॥**

ఆ పరమసత్యమగు బ్రహ్మము బృహత్తరమైనది. (అనంత బ్రహ్మాండాలను తనలో ఇముడ్చుకోగల) విస్తారమైనది. తేజోమయమైనది. ఊహకు అందనిది. (ఊహ అద్దానిదే!). సూక్ష్మాతి సూక్ష్మమై విరాజిల్లుచున్నది. దూరమైన అన్నిటికంటే సుదూరమైనది. కానీ అది ఇక్కడే హృదయంలో వేంచేసి ఉండటం చేత, ఆత్మోపాసకుడు ఇక్కడే తన హృదయగుహలోనే ఆత్మ భగవానుని దర్శిస్తున్నాడు.

---

**8. న చక్షుషా గృహ్యతే। న అపి వాచా।**
**న అన్యైః దేవైః తపసా – కర్మణా వా।**
**జ్ఞాన ప్రసాదేన విశుద్ధ సత్త్వః**
**తతస్తు తం పశ్యతే నిష్కలం**
**ధ్యాయ మానః॥**

ఆత్మతత్త్వము చర్మచక్షువులకు కనిపించేది కాదు. వాక్కుచే కూడా లభించేది కాదు. ఇతర దేవోపాసన చేతనో, తపస్సు చేతనో, కర్మల చేతనో కూడా పొందబడేది కాదు.

ఎవ్వరైతే ఆత్మభగవానుని తనయొక్క, సర్వులయొక్క అంతరాత్మగా ఉపాసిస్తారో, విశుద్ధమైన బుద్ధియొక్క జ్ఞానప్రసాదము పొందిన ఆ మహనీయులు అట్టి నిష్కళంక బ్రహ్మమును **ఇప్పుడే, ఇక్కడే సదా సర్వత్రా సమస్తముగా ప్రదర్శనమగుచూ ఉన్నట్లు దర్శించుచున్నారు.**

---

**9. ఏషో అణుః ఆత్మా, చేతసా వేదితవ్యో**
**యస్మిన్ ప్రాణః పంచధా సంవివేశ।**
**ప్రాణైః చిత్తం సర్వమ్ ఓతం ప్రజానాం**
**యస్మిన్ విశుద్ధే విభవతి ఏష ఆత్మా॥**

అట్టి ఆత్మ పరిశుద్ధమగు సూక్ష్మజ్ఞానం (Sharp Assimilation) చేతనే తెలియబడుచున్నదయ్యా!

ఆత్మయే దేహంలో పంచ ప్రాణాల కూపంలో ప్రవేశించి జీవితము యొక్క సమస్త సందర్భముతో ఓతప్రోతమై ఉంటోంది. ఆత్మచేతనే - చిత్తము, ప్రాణము-ఇంద్రియములు **చేతనమై ప్రవర్తిల్లుచున్నాయి.**

ఆత్మచేతనే చిత్తము ప్రాణ - ఇంద్రియ విశేషములచే ఈ దృశ్య జగత్తు అల్లబడుతోంది.

***ఆత్మయొక్క విశుద్ధతత్త్వమే ఇదంతా!***

---

**10. యం యం లోకం మనసా సంవిభాతి**
**విశుద్ధ సత్త్వః కామయతే యాంశ్చ కామాన్।**
**తం తం లోకం జయతే తాంశ్చ కామాం**
**తస్మాత్ ఆత్మజ్ఞం హి అర్చయేత్ భూతి కామః॥**

***ఇతి తృతీయ ముండకః – ప్రథమ ఖండః***

ఆత్మలోనే లోకాలన్నీ ఏర్పడినవై ఉన్నాయి. అందుచేత ఆత్మజ్ఞుడగు ఆత్మోపాసకుడు ఏ లోకంలో ఏ రూపం పొందాలనుకుంటాడో....అది సిద్ధింపజేసుకోగలుగుతాడు. భవిష్యత్ జన్మలు ఆత్మజ్ఞుడు తన అధీనంలో కలిగి ఉంటాడు. అందుచేత అభ్యుదయం కోరువాడు ఆత్మజ్ఞుడై ఆత్మనే అర్చిస్తున్నాడు. (అట్టి 'జన్మ' - ఇత్యాదుల పట్ల స్వకీయ - స్వాతంత్ర్యము (Independence) - **'మోక్షము'** అనబడుతోంది)

***ఇతి 3వ ముండకము – 1వ ఖండము***

## తృతీయ ముండకము - ద్వితీయ ఖండః

| | |
|---|---|
| **1. స వేదై తత్త్రపదమం (స వేద ఏతత్ ప్రథమం) బ్రహ్మధామ<br>యత్ర విశ్వం నిహితం భాతి శుభ్రమ్।<br>ఉపాసతే పురుషం యే హి కామాః<br>తే శుక్రమ్ ఏతత్ అతివర్తంతి ధీరాః॥** | బ్రహ్మముయొక్క అద్వయ-తత్త్వోపాసనలచే ఆత్మసాక్షారము సిద్ధించుకొని ఈ జీవుడు బ్రహ్మధామము చేరుచున్నాడు.<br>ఏ నిర్మలమైన ఆత్మయందు ఈ లోకాలన్నీ అమరియున్నాయో గ్రహించి ఆ పరమ పురుషుడగు ఆత్మను ఉపాసిస్తూ జన్మ - కర్మ - పునర్జన్మల ప్రహసనాన్ని అధిగమిస్తున్నాడు. వాటిపట్ల స్వాతంత్ర్యుడు అగుచున్నాడు. |
| **2. కామాన్ యః కామయతే మన్యమానః<br>స కామభిః జాయతే తత్ర - తత్ర।<br>పర్యాప్తకామస్య కృతాత్మనస్తు<br>ఇహైవ సర్వే ప్ర - విలీయంతి కామాః॥** | ఎవ్వడైతే లోకాంతర్గత విశేషాలను కోరుకుంటాడో, ఆతడు ఆ వాంఛలను అనుసరించి ఆయా స్థానాలలో జన్మలు పొందుచున్నాడు.<br>సర్వకోరికలు త్యజించి పర్యాప్తకాముడై కృతకృత్యుడైనవానికి సర్వకోరికలు ఇక్కడే సమసిపోయి ఇక్కడే ఆత్మత్వము ఆస్వాదిస్తున్నాడు. |
| **3. నాయమ్ (న అయమ్) ఆత్మా ప్రవచనేన లభ్యో।<br>న మేధయా న బహునా శ్రుతేన।<br>యమ్ ఏవ ఏష వృణుతే తేన లభ్యః<br>తస్య ఏష ఆత్మా వివృణుతే తనూం స్వామ్॥** | అట్టి ఆత్మవస్తువు (లేక) ఆత్మత్వభావన ప్రవచనములు చెప్పటం చేతగాని, సొంత తెలివితేటలచేత గాని, ఎంతెంతగానో వింటేగాని, లభించేది కాదు".<br>**ఎవ్వడు ఆత్మతత్త్వాన్ని కోరుకుంటాడో అది ఆతనికి లభిస్తుంది.** ఆత్మ తన స్వరూపమును ప్రకటిస్తున్నదగుచున్నది. "ఈ సమస్తము నాలోని నేనైన నేనే" అను స్థానమును ఎవరు కోరుకొంటాడో, అతనికి సాధన - అనుకోవటముల అభ్యాసములచే అది లభించగలదు. |
| **4. నాయమ్ (న అయమ్) ఆత్మా బలహీనేన లభ్యో।<br>న చ ప్రమాదాత్, తపసోవ అపి అలింగాత్<br>ఏతైః ఉపాయైః యతతే యస్తు విద్వాన్<br>తస్య ఏష ఆత్మా విశతే బ్రహ్మధామ॥** | బలహీనభావాలు కొనసాగించేవానికి, ఆత్మదర్శన విషయంలో బద్ధకించేవానికి అది లభించదు. పరతత్త్వము గురించిన లక్ష్యశుద్ధి లేని తపస్సు చేత అది ఈ జీవుడు పొందలేడు. ఎవడు **ఉపాయంతో ఆత్మ వస్తుతత్త్వాన్ని అన్వేషిస్తాడో, ఆతనిని ఆత్మయే బ్రహ్మ పదంలో ప్రవేశింపజేస్తుంది.** |
| **5. సంప్రాప్య ఏనం ఋషయో జ్ఞాన తృప్తాః<br>కృత - ఆత్మానో వీతరాగాః ప్రశాంతాః।<br>తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరాః<br>యుక్తాత్మానః సర్వమేవా విశంతి॥** | ఆ పరమాత్మతత్త్వాన్ని సముపార్జించుకొన్న సత్యాన్వేషులగు ఋషులు- **- జ్ఞానతృప్తులు, కృతాత్ములు, రాగరహితులు, ప్రశాంతచిత్తులు, సమాహిత స్వభావులు - అగుచున్నారు.** అట్టివారు సర్వము బ్రహ్మముగా దర్శిస్తూ క్రమంగా బ్రహ్మమే తామై **"సర్వతత్త్వ స్వరూపులు"** అగుచున్నారు. |
| **6. వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః<br>సన్యాసయోగాత్ యతయః శుద్ధసత్త్వాః।<br>తే బ్రహ్మలోకేషు పరాంతకాలే<br>పరామృతాః పరిముచ్యంతి సర్వే॥** | - వేదాంత విజ్ఞానముచే సర్వము ఆత్మస్వరూపంగా సునిశ్చితార్థులైనవారు సర్వమును మనస్సుచే సన్న్యసించి, యోగ సాధనచే నిర్మలబుద్ధి పొందుచున్నారు. దేహానంతరము బ్రహ్మలోకములో ప్రవేశించినవారై, పరతత్త్వానుభూతిచే అమృతస్వరూపులై, సర్వదృశ్య విషయముల నుండి విముక్తులగుచున్నారు. |
| **7. గతాః కలాః పంచదశ ప్రతిష్ఠా<br>దేవాశ్చ సర్వే ప్రతిదేవతాసు<br>కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మా<br>పరే - అవ్యయే సర్వ ఏకీ భవంతి॥** | వారియొక్క 5 జ్ఞానేంద్రియములు, 5 కర్మేంద్రియములు, ప్రాణ - మనో - బుద్ధి- చిత్త - దేహ - అహంకారాలు...వాటివాటి యజమానులైన ఆయా అధిదేవతలకు చెందినవిగా భావించబడి వెనుకకు మరలుచున్నాయి. ఆతని కర్మలు, విజ్ఞానమయముగు బుద్ధి - ఇవన్నీ కూడా **పరము, అక్షయము అగు ఆత్మతో ఏకీభూతం చెందుచున్నాయి.** ఆతడు ఈ సమస్త దృశ్యానుభవమునకు ఆవలగల "అవ్యయ-ఏక-కేవల", ద్రష్ట (దృక్) స్థానము సంతరించుకొంటున్నాడు. |

**8.** **యథా నద్యః స్యందమానాః సముద్రే**
**అస్తం గచ్ఛన్తి నామరూపే విహాయ।**
**తథా విద్వాన్ నామరూపాత్ విముక్తః**
**'పరాత్‌పరమ్ పురుషమ్' ఉపైతి దివ్యం॥**

ఏ విధంగా అయితే జలజలపారే నదీ జలం - నదీ సంబంధమైన నామ - రూపాత్మకమైనదంతా త్యజించి మహాసముద్ర జలంలో ప్రవేశించి సశాంతిస్తుందో...

**అదే విధంగా...,**

ఆత్మజ్ఞాన విద్వాంసుడగు ఆత్మయోగి తన వ్యష్టిగత నామరూపాత్మకమైనదంతా త్యజించుచు, దివ్యము - సత్యము అగు పరాత్ - పరమ పురుషత్వములో ప్రవేశించినవాడై ప్రశాంతపడుచున్నాడు.

---

**9.** **స యో హ వై తత్ - పరమమ్ బ్రహ్మ వేద - బ్రహ్మైవ భవతి।**
**న అస్య అబ్రహ్మవిత్ కులే భవతి।**
**తరతి శోకం। తరతి పాప్మానం।**
**గుహా గ్రంథిభ్యో విముక్తో అమృతో భవతి॥**

ఆ విధంగా ఆతడు (గురుము ఖతః, శాస్త్ర పరిశీలన, స్వవిచారణలచే) బ్రహ్మము ఎట్టిదో, ఏమై ఉన్నదో తెలుసుకొనుచు **బ్రహ్మవేత్త** అయి, తత్ఫలితంగా బ్రహ్మమే తానై ప్రకాశిస్తున్నాడు. ఆతని పరిసరములలో (వంశములో) అబ్రహ్మవేత్త ఉండజాలడు.

బ్రహ్మమే తానై - "నేను చూస్తున్నదంతా నన్నే కదా" - అని గ్రహించినవాడై,

- సర్వశోకములు నుండి, సర్వ దోష (బ్రహ్మ వ్యతిరిక్త) భావముల నుండి...తరిస్తున్నాడు. **అమృత స్వరూపుడగుచున్నాడు.**

---

**10.** **తత్ ఏతత్ ఋచా అభ్యుక్తం -**
**క్రియావంతః శ్రోత్రియా బ్రహ్మనిష్ఠాః।**
**స్వయం జుహ్వత ఏకర్షిం శ్రద్ధయంతః।**
**తేషామ్ ఏవ ఏతామ్ బ్రహ్మవిద్యాం వదేత**
**శిరోవ్రతం విధివత్ యేః అస్తు చీర్ణమ్॥**
**(విధి వద్వైస్తు చీర్ణమ్)।**

ఈ పరమసత్యమే గతానుగతంగా - గురుశిష్యపరంపరంగా బ్రహ్మతత్త్వ పరంగా చెప్పబడుచున్నది! చెప్పబడుగాక!

ఎవ్వరైతే ఉత్తమ కర్మ నిష్ఠులో, శ్రోత్రియులో (వేదార్థముల పట్ల శ్రద్ధగలవారో), బ్రహ్మమునందు నిష్ఠగలవారో, అగ్నికార్యములు నిర్వర్తిస్తూ ఉంటారో, ఏకర్షి యజ్ఞశ్రద్ధాపరులో, అట్టి వారికి మీచే ఈ బ్రహ్మ విద్య బోధించబడుగాక! సశాస్త్రీయంగా శిరోవ్రతాన్ని (సహస్ర స్థాన ఉపాసనాది యోగాభ్యాసములు) అనుష్ఠించే వారికి - అటువంటి వారికి...మీరు తప్పక బోధించండి!

---

**11.** **తత్ ఏతత్ సత్యం-**
**ఋషిః అంగిరాః పురోవాచ।**
**న ఏతత్ అచీర్ణవ్రతో అధీతే॥**
**నమః పరమ ఋషిభ్యో!**
**నమః పరమ ఋషిభ్యః!**
**ఇతి తృతీయముండకే ద్వితీయఖండః**
**ముణ్డకోపనిషత్ సమాప్తా**

ఈ పరమసత్యాన్ని ఋషి యగు అంగిరసుడు లోకాలకు ప్రాచీనకాలంలో ఒకానొకప్పుడు బోధించటం - ప్రవచించటం జరిగిందయ్యా! అట్టి గ్రంథ రూపముగా మీ ముందుంచబడుచున్న ఈ సత్యోపదేశము పఠించటానికి వ్రతాచరణ పరుడే అర్హుడగుచున్నాడు! పరమసత్యాన్ని లోకములకు చేతులెత్తి ప్రకటించిన ఋషివరేణ్యులకు నమో నమః

నమో నమో నమః॥

***ఇతి 3వ ముండకము - 2వ ఖండము***

***ఇతి ముణ్డకోపనిషత్ సమాప్తా***

***ఓం శాంతిః శాంతిః శాంతిః॥***

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 14 ముండకోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము

**శ్లో॥ యథా నద్యః స్యందమానాః సముద్రే**
**అస్తం గచ్ఛన్తి నామరూపే విహాయ।**
**తథా విద్వాన్ నామరూపాత్ విముక్తః**
**'పరాత్పరమ్ పురుషమ్' ఉపైతి దివ్యం॥**



ఏ విధంగా అయితే జలజలపారే నదీ జలం - నదీ సంబంధమైన నామ - రూపాత్మకమైనదంతా త్యజించి మహాసముద్ర జలంలో ప్రవేశించి సశాంతిస్తుందో...
అదే విధంగా..., ఆత్మజ్ఞాన విద్వాంసుడగు ఆత్మయోగి తన వ్యష్ఠిగత నామరూపాత్మకమైనదంతా త్యజించుచు, దివ్యము - సత్యము అగు పరాత్-పరమ పురుషత్వములో ప్రవేశించినవాడై ప్రశాంతపడుచున్నాడు.

### శాంతి పాఠము

**ఓం ఓం ఓం**
**భద్రం కర్ణేభిః శ్రుణు యామ దేవాః।**
**భద్రం పశ్యేమ అక్షభిః యజత్రాః।**
**స్థిరైః అంగైః తుష్టువాగ్ం సః తనూభిః।**
**వ్యసేమ దేవహితం యత్ ఆయుః।**
**స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః।**
**స్వస్తి నః పూషా విశ్వవేదాః।**
**స్వస్తి నః తార్క్ష్యో (తార్క్ష్య)అరిష్టనేమిః।**
**స్వస్తి నో బృహస్పతిః దదాతు।**
**ఓం శాంతి శాంతి శాంతిః॥**

**ఈ చరాచర సృష్టిని పరిపోషించుచున్న ఓ దేవతలారా! మా ఈ విన్నపము విని మమ్ములను కరుణించండి!**

మీచే నిర్మించబడినవై, మీ చేతనే సదా సంరక్షించబడుచు – పరిపోషించబడుచు, మీచే ప్రసాదించబడుచున్నవై, మీకు చెందినవే అగు ఈ చెవులు, కన్నులు, ఈ దేహము – ఇవన్నీ మాపట్ల **సద్వినియోగమగును గాక!**

ఈ చెవులతో మేము ఎల్లప్పుడు నిరంతరము – **భద్రము, శుభప్రదము, శాశ్వతమైన ప్రయోజనములు కలిగియున్నవి....,**

అగు **ఆత్మజ్ఞాన – ఆత్మానుభవ** సమన్వితమైన విశేషములనే వినుచూ ఉండెదము గాక!

ఈ కళ్ళకు ఎదురుగా కనబడుచూ ఉన్నట్టి ఈ సృష్టి అంతా కూడా ఒక **"మహాయజ్ఞము"**. మాయొక్క జన్మ – జీవన – మరణ – జన్మాంతర విశేషాలన్నీ కూడా ఆ మహాయజ్ఞములోని అంతర్ – విశేషాలే కదా! అంతర్గత విభాగాలే కదా! అట్టి యజత్రులము, జీవనయజ్ఞనిష్ఠులము అగు మేము కనులతో ఎల్లప్పుడూ కూడా **"భద్రము – అభ్యుదయకారకము"** అగు విశేషములనే దర్శిస్తూ వుండెదము గాక!

మా ఈ భౌతిక దేహములు పుష్టి - బలము కలిగియున్నవై మీకు స్తోత్ర - ధ్యానములు, విధులు, ధర్మములు మొ॥వి సమర్పించు యజ్ఞవిధులలో సద్వినియోగమగుగాక! అట్టి ప్రయత్నములకై సహకరించును గాక!

ఓ దేవదేవా! ఇంద్రభగవాన్! వృద్ధాశ్రవా! పెద్ద చెవులు గల స్వామీ! త్రిలోకములలోని జీవులందరు చేసే శబ్దములు - వాటి సందర్భార్థములు - పరమార్థములు వింటున్నట్టి మహామహనీయా!

- శాస్త్రములు శ్రద్ధగా వినటం।
- వినినవి ఆకలింపు చేసుకోవటం। అర్థం చేసుకోవటం।
- ఆకలింపు చేసుకొన్నవి సక్రమంగా సమన్వయించుకోవటం।
- నిరూపణగా సమన్వయించుకొని నిర్వర్తించుకోవటం! (Bringing great ideas and messages into everyday practice)

అనురూపంగా వృద్ధశ్రవణములు, పెద్ద చెవులు మాకు ప్రసాదించి కరుణించండి! మీచే ఇవ్వబడిన ఏనుగు (పెద్ద) చెవులతో మేము వింటున్నది మాకు మీ దయచే మంగళప్రదములగు గాక! స్వానుభవములై అనుక్షణము వర్థిల్లును గాక!

ఓ విశ్వ దేవతలారా! ఈ జగత్తుల స్థితి - గతులను ఎరిగియుండి, సర్వజీవరాసులను పరిపోషిస్తున్న మీకు నమస్కారము. మాకు స్వస్తిని, ఉత్సాహమును, ఉత్తేజమును, సంతోషమును, ఆనందమును ప్రసాదిస్తూ వుండెదరుగాక!

ఓ తార్క్ష్య దేవా! విజ్ఞాన - వైరాగ్యములను మాకు ప్రసాదించగల **గరుడ భగవాన్!** విశ్వవిహంగమా! మాయొక్క అజ్ఞానం చేత మేము పొందే ఆపదల నుండి మమ్ములను సర్వదా రక్షిస్తూ ఉండండి! మాకు స్వస్తిని ప్రసాదించండి! మా జ్ఞాన - వైరాగ్య సంపదను పరిక్షించండి। పరిపోషించండి। ప్రవృద్ధపరచండి।

ఓ దేవతాలోక గురూ! బృహస్పతి మహాత్మా! మాకు బ్రహ్మవర్చస్సును ప్రసాదించండి। మమ్ములను మీ బ్రహ్మజ్ఞతతో పరిపాలిస్తూ, మా బుద్ధులను పవిత్రం చేయండి. అభ్యుదయము వైపుగా మమ్ములను నడిపించండి!

పరమశాంతి స్వరూపులగు పరమాత్మ - మాయొక్క (జాగ్రత్-స్వప్న-సుషుప్తి-, దృశ్య-జీవ-ఈశ్వర, భూత-వర్తమాన-భవిష్యత్, ఇహ-పర-పరాత్పర) **త్రివిధ స్థితులందు సాక్షాత్కరించును గాక!**

మమ్ములను తీర్చిదిద్దునుగాక!

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః**

## ప్రథమ ముండకము - ప్రథమ ఖండము

### పర - అపర విద్యలు

**(ముండకము = మంగలి కత్తి। అజ్ఞాన క్షౌరము। చురకత్తి। జన్మబంధ పరిమిత భావములను తొలగించునది)**

ఒక కార్యము (A Work / A Task) జరుగుచున్నదీ అంటే - ఆ కార్యమును (లేక ఆ పనిని) నిర్వర్తించువాడు అట్టి ఆ కార్యక్రమమునకు మునుముందే వుండి వుండాలి కదా! కర్త లేకుండా కార్యనిర్వహణ ఎట్లా జరుగుతుంది?

**శ్లో॥ ఓం। బ్రహ్మా దేవానాం ప్రథమః సంబభూవ,**
**విశ్వస్య కర్తా। భువనస్య గోప్తా।**
**స బ్రహ్మ విద్యాం సర్వ విద్యా ప్రతిష్ఠామ్,**
**అథర్వాయ జ్యేష్ఠ పుత్రాయ ప్రాహ॥**

ఈ వివిధ జీవులయొక్క **చిత్ర - విచిత్ర జీవ - జీవన** స్రవంతులతో కనిపిస్తూ, అనేకవై విధ్యములతో కూడిన ఈ 'సృష్టి' అనే కవిత్వాన్ని (లేక) కథనాన్ని రచిస్తున్న - ధారణ చేస్తున్న ప్రప్రథమ ప్రదర్శనమే **సృష్టికర్త। బ్రహ్మదేవుడు।**

(జలం నుండి మొట్టమొదటి తరంగం వలె) వారు సృష్టియొక్క రచన కొరకై **నిర్విషయ - నిష్ప్రపంచ పరబ్రహ్మ పురుషుని** నుండి మొట్టమొదటగా సవిషయ-సప్రపంచాభిమానియగు సృష్టికర్త - బ్రహ్మదేవుడు ఆవిర్భూతులౌతున్నారు. సంప్రదర్శితులు అగుచున్నారు.

వారు దేవాది దేవులు! జగత్‌రచనా కవీశ్వరులు! జగత్ రూప కళాకారులు! దేవతలకే దేవుడు। దేవతల కంటే మునుముందే ఏర్పడివున్నవారు।

అట్టి బ్రహ్మదేవుడు "జీవులు (Experiencers) - విషయములు (Incidents) - వస్తువులు (Matters) " .....అనువాటితో కూడిన వ్యవహారమంతా తన ధారణా ప్రక్రియ ద్వారా సృష్టిస్తున్నారు.

జీవుల జీవన విధానమును నడిపించే శాస్త్రములను కల్పిస్తున్నారు.

అట్టి సృష్టించబడిన జగత్తులలో వివిధ జీవులు (సృష్టికర్త యొక్క సంకల్పానుసారంగా) పంచతన్మాత్రలు (శబ్ద - స్పర్శ - రూప - రస - గంధములు) పొందుచున్నవారై,.....ఆహారము అందింపబడుచూ సంచరిస్తున్నారు! వినోదిస్తూ జీవిస్తూ ఉన్నారు।

అయితే....,

క్రమంగా-ఈ జీవులలో అనేకులు - అజ్ఞాన కారణంగా ఓ దేహం తరువాత మరొక దేహ సందర్భాలలో అనేక మనోవ్యాకులతలు ప్రోగుచేసుకొని దుఃఖితులవటం జరుగుతోంది!

తన బిడ్డలు అజ్ఞానంచేత అనవసరమైన దృశ్య సంబంధ వేదనలు పొందటము (untoward and unnecessary worries) గమనించిన సృష్టికర్త బ్రహ్మదేవుడు **"ఇప్పుడు ఏమిటి ఉపాయం?"** అని యోచించసాగారు.

అప్పుడు బ్రహ్మమానస పుత్రుడు, తన పెద్ద కుమారుడు, శాస్త్ర విద్యాపారంగతుడు అగు **అథర్వణమహర్షిని** పిలిచారు. సర్వవిద్యలకు, శాస్త్రములకు ఆధారభూతమైనట్టి **"ఆత్మవిద్య"** (లేక) **"భౌమావిద్య" (లేక) "బ్రహ్మవిద్య" (లేక) "అధ్యాత్మవిద్య"**ను బోధించారు!

**"నాయనా! అథర్వా! నీవు ఇప్పుడు బ్రహ్మ విద్యను విని, అర్థం చేసుకున్నావు కదా? ఈ బ్రహ్మవిద్యను నీ శిష్యులకు కూడా బోధించు! మీరంతా కూడా ఈ ఆత్మవిద్యను లోకాలలో పరిఢవిల్లేడట్లు చేసెదరు గాక!" -**

అని బ్రహ్మదేవుడు అనుగ్రహించారు. అట్టి అధ్యాత్మవిద్యను విని, గ్రహించి, అవగతం చేసుకున్నట్టి శ్రీ అథర్వ మహర్షి పరమానందము పొందారు. నిజాశ్రమం చేరారు. శాస్త్రవిద్యను నేర్చుకుంటున్న తన శిష్యులకు బ్రహ్మానందదాయకమగు ఆ భౌమా విద్యను బోధించారు. ఆయన శిష్యులలో ఒకడు, కుశాగ్రబుద్ధికలవాడు అగు **'ఆంగిరసుడు'** అనువాడు అత్యంత శ్రద్ధ - ఆసక్తులతో ఆత్మవిద్యను నేర్చుకున్నారు. ఆంగిరసుడు ఒక సందర్భంలో భరద్వాజసగోత్రుడైనట్టి **'సత్యవాహుడు'** అను తన శిష్యునికి, మరికొందరు ఇతర శిష్యులకు విశ్లేషిస్తూ - విశదపరుస్తూ బోధించారు. ఆ సత్యవాహుడు తన శిష్యులకు ఆ భౌమావిద్యను నేర్పారు.

**(అంగిరసుడు (లేక) అంగిరుడు :** బ్రహ్మమానసపుత్రులలో ఒకరు. **బృహస్పతి, 'సంవర్తుడు'**-ఆయన కుమారులు. ఆయన కూతురు 'యోగసిద్ధి'. ఆ యోగసిద్ధి అష్టవసువులలో ఒకడగు ప్రభాసుని పెండ్లాడి, దేవశిల్పి 'విశ్వకర్మ'ను కుమారునిగా కన్నది-భారతము)

ఒకానొకరోజు....,

శౌనకుడు అనే మహానుభావుడు శిష్యగణముతో సహా అంగీరస మౌనీంద్రుల దర్శనార్థమై వచ్చారు. **"యో మహానుభావన్ సేవతే!", "మహాపురుష సంశ్రయః!", "ఉపదేశ్యంతి తే జ్ఞానం జ్ఞానినః తత్త్వదర్శినః।", "సంత్సంగత్వే నిస్సంగత్వం"**....అని కదా ఆర్యవాక్యాలు! బ్రహ్మతత్త్వమును శ్రవణం చేయటానికై శిష్యభావినై శౌనకుడు అంగీరసుని సమీపించారు. శరణువేడారు. శౌనకుడు సునక మహాముని పుత్రుడు, సూతముని ప్రియశిష్యుడు. ప్రాజ్ఞుడు. శిష్యత్వము – శ్రోతత్వము – పౌరాణిక మహత్త్వము సుస్వభావముగా పుణికిపుచ్చుకున్నవాడు.

**శౌనకుడు** : మహాత్మా! అంగీరసమునీంద్రా! తమ పాదపద్మములకు సాష్టాంగ దండ ప్రణామములు! మిమ్ములను శరణువేడుచున్నాను. నాకు గల కొన్ని సంశయములను మీకు విన్నవించుకొని, తమ వద్ద **'బోధామృతపానం'** చేయాలనే అభిలాషతో మిమ్ములను దర్శించవచ్చాను! వినమ్రుడనై మీకు హృదయపూర్వకంగా నమస్కరిస్తున్నాను. మీరు జ్ఞానానంద స్వరూపులు! బ్రహ్మజ్ఞులు! సంసార సాగరంలో చిక్కుకొని కొన్ని సందేహముల మధ్య చిక్కియున్న నన్ను సముద్ధరించవేడుకుంటున్నాను.

**శ్రీ అంగీరసుడు** : నాయనా! శౌనకా! సూతమునీంద్ర ప్రియశిష్యా! మేధావీ! సూక్ష్మగ్రాహీ! పురాణశ్రవణ మననములలో ఉత్తముడవని నీ గురించి విన్నానయ్యా! దీర్ఘాయుష్మాన్ భవ! నీకు సుస్వాగతం! నీ రాకచే మనం ప్రారంభించబోయే సత్సంగ పూర్వక సంభాషణచే లోక కల్యాణమగుగాక। బిడ్డా! ఈ పండ్లు – ఫలములు భుజించు. ఇక ఆపై నీ సందేహము లేమిటో ప్రకటించు. బ్రహ్మ నుండి – మద్గురు సత్యవాహమహాముని పర్యంతముగాను, తదితర గురుశిష్య పరంపరగాను వస్తున్న ఆత్మవిద్య నుండి నేను గ్రహించినంతవరకు నీకు సమాధానములు ఇవ్వటానికి తప్పక ప్రయత్నిస్తాను!

**శౌనకుడు** : హే సద్గురూ!

**కస్మిన్ను, భగవో! విజ్ఞాతే**
**సర్వమిదం విజ్ఞాతం భవతి?**

హే భగవన్! ఈ ప్రపంచంలో తెలుసుకోవటానికి అనేకానేక విశేషాలు ఉన్నాయి. **(అనేకాని చ శాస్త్రాణి। కల్పాయుః। విఘ్నకోటయః। తస్మాత్ సారం విజానీయామ్।)**.... ఈవిధంగా ప్రపంచం గురించి ఎంతెంతగా తెలుసుకుంటూ ఉన్నప్పటికీ...ఇంకా ఇంకా తెలుసుకోవలసినవి ఎన్నెన్నో విషయాలు అతిదీర్ఘంగా మిగిలిపోతూనే వుంటాయి. పైగా....ఈ కనబడేదంతా అనుక్షణం గతిశీలం. మార్పు – చేర్పులు పొందుతూనే వుంటుంది. అందుచేత **"ఈ దృశ్యంలో దేని గురించి ఎంత తెలుసుకొంటే మాత్రం ఏమి లాభం?"**...అని నాకు అనిపిస్తోంది.

ఇదంతా దృష్టిలో పెట్టుకొని ఈరోజు మిమ్ములను సమీపించి శరణువేడుచున్నాను. ఇప్పుడు నా సంశయం ఏమిటో చెప్పుచున్నాను. వినండి!

– ఈ విశ్వమంతా గతి శీలము. సుదీర్ఘము. అనంతము.

(1) ఎదురుగా కనిపిస్తున్న ఈ విశ్వరూప చమత్కారం విషయమై ఏది తెలుసుకొంటే, **పరము, అత్యుత్తమము అగు సత్యము మాకు తెలిసిపోతోంది?**

(2) దేనిని తెలుసుకొన్న తరువాత, ఇదంతా అర్థమై...ఇక, తెలుసుకోవలసినది మరింకేదీ మిగిలి ఉండదు?

**అట్టి విషయమును నాకు బోధించండి!**

**శ్రీ అంగీరసుడు** : చాలా చక్కటి ప్రశ్నతో ప్రారంభించావయ్యా! "విత్ యత్ తత్ విద్యా"....అని కదా! తెలుసుకోవలసింది తెలుసుకునే మార్గమే విద్య. అట్టి విద్య రెండు రకములుగా బ్రహ్మవేత్తలచే చెప్పబడుతోంది!

**(1) అపరా విద్య** **(2) పరావిద్య**

**(1)** అపరావిద్య తెలుసుకోవలసింది తెలుసుకోవటానికి సాధనముల రూపం. (Instruments and techniques to learn) సాధనల గురించి, మార్గముల గురించి వివరించేది.

(2) వ్యష్టి – సంఘశ్రేయస్సు – సహజీవుల పరస్పర సానుకూల్యత–ఐకమత్యములను (కూడా) ఉద్దేశ్యించునది.

❖ జీవులకు దైనందికంగా ఒప్పు – తప్పులకు సంబంధించిన పుణ్యదృష్టి, పాప నిరోధకదృష్టి కలుగజేయునది.

❖ కష్ట సమయములలో ధైర్యము, ఉపశమనము ఉద్దేశ్యించునది. తెలుసుకోవలసినది తెలుసుకోవటం. సాధ్యము గురించి వివరించేది.

అపరవిద్యయొక్క విభజన ఏమిటో ముందుగా మరికొంత చెప్పుకుందాం. గమనిద్దాం.

**అపరావిద్య :**

| చతుర్వేదములు | ఋుక్ – యజుర్ – సామ – అధర్వణ |
|---|---|
| శిక్ష | షట్ వేదాంగములు షడంగములలో ఒకటి శిక్షించటము (Training) విద్యాభ్యాసము. బోధించటము. (పాణిని) |
| కల్పము | కర్మలకు సంబంధించిన విధి విధానములు. వ్రత కల్పములు, నిబంధనములు, న్యాయము, షడంగములలో ఒకటి |
| వ్యాకరణము | భాషా శాస్త్రము. వాక్య విభజనము. (పాణిని) |
| నిరుక్తము | ఒక వేదాంగము – పదముల అవయవార్థ వివరణ. (యాస్కముని) |
| ఛందస్సు | పద్య లక్షణములు చెప్పు శాస్త్రము. (యాస్కముని) |
| జ్యోతిష్యము | జ్యోతిర్మండలము – గ్రహములు – నక్షత్రమండలము ఇత్యాదుల స్వరూప – స్వభావ ప్రభావములు. జాతకము, జ్యోస్యము వివరించునది. ఒక వేదాంగము. (ఆదిత్యుడు మొదలైనవారు). |

వీటియొక్క పఠనము – గొప్ప పాండిత్యము. ఇదంతా విద్యయే! అయితే ఇది **అపరావిద్య!** అవన్నీ ఒక దీర్ఘ ప్రయాణికునికి (Long Traveller) – బహుదూరపు బాటసారి)కి దారిలో లభించే వసతులతో పోల్చవచ్చు. **'భౌమావిద్య'**కు అవి దోహదపడగలవు. సహకరించగలవు. ఆయా అవరోధములను తొలగించుకొనే ధీశక్తిని (Intelectual base) ప్రసాదిస్తాయి. (లేక) సంసిద్ధతను పెంపొందిస్తాయి. అంతవరకే। వాటికవే బ్రహ్మవిద్యకు ముఖ్యసాధనములు (ultimate objectives) కావు. విజ్ఞత గలవారికి అవి తప్పక ముఖ్యసాధనములు కాగలవు. (They are all process but not objective)

**2. పరావిద్య : అథ పరా యయా తత్ 'అక్షరమ్' అధిగమ్యతే!**

ఏ విద్యావిశేషము (లేక, విభాగము) – అక్షరము, అమరము అగు స్థానమును విశదీకరిస్తోందో, సందర్భ స్వరూపమును అధిగమించి సహజ రూపమును (లేక) తత్ రూపమును (లేక) **తత్ త్వమ్** అను మహావాక్యార్థమును విశదపరుస్తోందో...అదియే **పరావిద్య.**

❖

**శౌనకుడు** : పరావిద్యా ప్రయోజనమగు మీరు సూచిస్తున్న పరబ్రహ్మతత్త్వమును మేము సమీపించేది, దర్శించేది ఎట్లా? అది ఎక్కడ ఎట్లా మాకు లభిస్తుంది? అది మాకు చూపండి. మేము అభ్యసించి ధన్యులమౌతాం। దర్శిస్తాము.

**శ్రీ అంగీరసుడు** : అద్దానిని కళ్ళతో ఎట్లా దర్శిస్తాం, సర్వదేహాలలో వుండి చూస్తూ ఉన్నవారి గురించినదే–ఆ పరబ్రహ్మమైనప్పుడు?

**అద్రేశ్యమ్** : పరావిద్యావిశేషము భౌతికమైన కన్నులకు కనిపించే ఒకానొక దృశ్యము వంటిది కాదు. కన్నులకు దృశ్యము కనిపిస్తుందేమోగాని, కళ్ళు ఉపయోగించి చూచుచున్నవాడు కళ్ళకు కనిపిస్తాడా? **సర్వ నేత్రములతో సర్వము దర్శించుచున్నది– పరబ్రహ్మమే।**

**అగ్రాహ్యమ్** : ఒక భౌతిక వస్తువు వలె చేతులతో పట్టుకొని తెచ్చుకొనేది కాదు. **చేతులను కదల్చుచున్నట్టిది.** కదిలే చేతులు కదిలించే తత్త్వమును పట్టుకోజాలదు.

**అగోత్రమ్** : గోత్రము, వంశము, సంతతి మొదలైనవాటికి సంబంధించినదే కాదు.

**అవర్ణమ్** : పరావిద్య – వర్ణాశ్రమ ధర్మము – నియమములకు సంబంధించినది కాదు. రంగు – రూపములచే స్పృశించబడునది కాదు. **"అద్దాని లక్షణములు – గుణములు ఇవి ఇట్టివి"** అని కూడా అనలేం! నవలా రచయితకు నవలలోని పాత్రల యొక్క ప్రదేశముల యొక్క లక్షణములు ఆపాదించలేము కదా।

**అచక్షుః-శ్రోత్రం, అపాణి-పాదం** : ఒక జీవుని వలె పరబ్రహ్మమునకు కళ్ళు, చెవులు, చేతులుస కాళ్ళు లేవు. అవన్నీ ఉపయోగిస్తూ తాను వేరైనది. వాటినన్నిటినీ చైతన్యవంతము చేసేది. (విద్యుత్తు బల్బులను వెలిగించవచ్చుగాక! విద్యుత్‌కు బల్బులున్నాయని,

యంత్రములు వగైరా ఉన్నాయని అనము కదా!) అయితే ఏం? **"జగత్తులోని సర్వ విషయములకు కారణము – కార్యము అదే!"** – అద్దానినే సర్వే – సర్వత్రా తత్త్వజ్ఞులు గమనిస్తున్నారు.

**నిత్యము** : భూత – వర్తమాన – భవిష్యత్తులు కాల సంబంధమైనవి. పరబ్రహ్మమో,**– కాలమును నియమించునది. కాలాతీతమైనది.** కాలమునకు సాక్షి. దేహి–దేహముకంటే మునుముందుగాను, దేహము తరువాతకూడా వుండునది! జాగ్రత్ – స్వప్న – సుషుప్తులకు సాక్షి. నిత్యమైనది. నీవు చెప్పినట్లు, ఈ జగత్తులోని సర్వ విషయములు – విశేషములు గతించేవే. పరబ్రహ్మముమాత్రమే సర్వదా యథాతథము. ఆత్మ నిత్యము, అనునిత్యము కూడా!

**విభుమ్** : సర్వము ఆత్మకు చెందినవే. ఈ ఎదురుగా కనబడేదంతా కూడా ఆత్మకు – అనన్యము. కనుక సర్వమునకు ఆత్మయే **యజమాని**. ఈ దృశ్య లోకములను – ఇంద్రియములను – మనో బుద్ధి చిత్త అహంకారములను నియమించి – పాలిస్తున్నట్టిది. (That which appoints and rules) **– ఆత్మయే.**

**సర్వగతమ్** : (నవలలోని నవలా రచయితవలె) **పరావిద్యాస్వరూపమగు ఆత్మతత్త్వము సర్వగతమైనది.** ఆత్మయే ఇక్కడ వివిధ రూపములుగా సంప్రదర్శనమౌతోంది. స్వప్నచైతన్యమే స్వప్నములో ఆయా వివిధ రూపములుగా అనిపిస్తోంది కదా! ఆత్మయే ఆ బ్రహ్మ – స్తంభ పర్యంతము వివిధ రూపములుగా ద్రష్టచే – దృష్టిద్వారా చూడబడుతోంది.

**సుసూక్ష్మం** : అత్యంత సూక్ష్మ రూపంగా సర్వే సర్వత్రా (విద్యుత్ శక్తి వలె) విరాజిల్లుచున్నది. దేహము స్థూలము. ఆలోచన – వివేకము – ఇష్టాఇష్టము – మమరూప (నాది అనుకొనే) అహంకారం...ఇవన్నీ సూక్ష్మమైనవి. ఆత్మయో, సూక్ష్మాతి సూక్ష్మము.!

**అవ్యయము** : మార్పు – చేర్పులు లేనట్టిది. దేహము మార్పుచేర్పులు, ఉత్పత్తి – వినాశనాలు పొందుతాయి. దేహికి (కదల్చువానికి –ఆలోచనలు చేయువానికి)–మార్పు ఏమున్నది? చేర్పు ఏమున్నది? మార్పుచేర్పులు లేనట్టి 'దేహి స్వరూపమగు' ఆత్మ–**అవ్యయము.**

**యత్ భూత యోనిం పరిపశ్యన్తి ధీరాః** : ఆత్మతత్త్వము ఎరిగియున్న బుద్ధిమంతులు ఆత్మయే సర్వభూత జాలముయొక్క ఉత్పత్తి – ఉనికి – లయస్థానంగా సందర్శిస్తున్నారు. **(యతః సర్వానిభూతాని ప్రతిభాంతి, స్థితానిచ। యత్రైవ ఉపశమం యాంతి॥ – యోగవాసిష్ఠము)**

**యథా ఊర్ణ నాభిః సృజతే, గృహ్ణతే చ:** ఒక సాలె పురుగు తన నుండి దారమును బయల్వెడలదీస్తూ... ఆ దారముల నిర్మాణంలో తానే షికార్లు కొడుతూ, మరల అదంతా మ్రింగుతుంది కదా! అట్లాగే ఆ పరబ్రహ్మము జగత్తులను స్వకీయకల్పనలో నిర్మించుకొని, వాటియందు జీవులరూపంగా సంచారములు సల్పుచున్నది. ఈ విధంగా, (సాలె పురుగు నుండి సాలె దారములతో చిత్ర – విచిత్రములైన సాలె గూళ్ళు బయల్వెడలుచున్నట్లు) – పరమాత్మనుండే ఈ విశ్వమంతా బయల్వెడలుతోంది. తరువాత పరమాత్మచేతనే మ్రింగివేయబడుతోంది.

**యథా పృథివ్యామ్ ఓషధయః సంభవంతి** : భూమి అంతా మట్టిమయమే కదా! అట్టి మట్టిలోంచి మొక్కలకు జీవనాధారమైన, సర్వజీవులకు ఆహారరూపమైన ఓషధులు (ఓజోశక్తి) బయల్వెడలుచున్నాయి. అట్లాగే, ఆత్మ నుండి ఈ విశ్వమంతా బయల్వెడలుతోంది. ఆ పరతత్త్వమునకు చెందిన– **'సృష్టించటం'** అనే ఓజస్సుచే బ్రహ్మదేవుని నుండి ఒక కీటకము వరకు పరిపోషింపబడుచున్నాయి.

**యథా సతః పురుషాత్ కౌశ లోమాని :** ఒక జీవుని శిరస్సుపై వెంట్రుకలు మొలుస్తున్నాయి. పెరుగుచున్నాయి. ఇందులో ఆ జీవుని సంకల్పము ఏదీ లేకుండానే స్వభావసిద్ధంగా ఉండిపోవటము జరుగుతోంది కదా! పరబ్రహ్మమునుండి దృష్టిగాని – ఉద్దేశ్యముగాని – సంకల్పముగాని లేకుండానే ఈ విశ్వములు ఆయన నుండి ఆవిర్భవిస్తున్నాయి.

ఈ విధంగా.....,

సాలెపురుగులోని లాలాజలంలోంచి బయల్వెడలి తిరిగి మ్రింగబడే గూడుదారాలలోని చిత్ర – విచిత్రమైన అల్లికలవలె, భూమిలోని ఓజోరూపమైన ఔషధ శక్తివలె, జీవించియున్నవాని తలపై వెంట్రుకల వలె, జలములో తరంగములవలె –

**– నిర్విషయ పరతత్త్వము నుండి....**

**– ఆ పరతత్త్వము యొక్క సమక్షంలో....**

**ఈ సృష్టి పరంపరలన్నీ** అనిర్వచనీయంగా, అకారణంగా, స్వభావసిద్ధంగా **ప్రదర్శితమగుచున్నాయి.** ఇంతలోనే మటుమాయ మగుచున్నాయి.

మరొక చమత్కారం కూడా

**ఆత్మయే ఒకానొక దృష్టికి సృష్టిగా అనుభూతమౌతోంది!**

ఒకడు తనయందు అనిర్వచనీయంగా, అకారణంగా ఒకానొక సమయంలో **'ఊహ'**ను కల్పించుకొని, ఆ 'ఊహ'లో విహరిస్తూ, ఊహయొక్క రూపము - ఆది మధ్య అంతము కూడా తానే అయి - **తనను తానే విడువకయే వుంటాడు చూచావా?** అట్లాగే ఆ పరబ్రహ్మము కూడా అనిర్వచనీయంగా, అకారణంగా సృష్ట్యనుభవి-సృష్టిల చమత్కారమైన భావనాపరంపరా చమత్కారము" (అనే ధారణను) లీలగా, క్రీడగా అవధరించటం జరుగుచున్నది. ఆలోచించువాడు ఏది ఆలోచించినా, ఆలోచించకున్నా కూడా తాను యథాతథమైనవిధంగా, పరబ్రహ్మము జగత్ భావనా పరంపర చమత్కారం నిర్వర్తిస్తూ (లేక) నిర్వర్తించకున్నా కూడా, తాను యథాతథం.

## సృష్టి చమత్కారము - అన్నమ్

ఆ పరబ్రహ్మము - యొక్క 'సృష్టి' అనే భావనాపరంపర చమత్కారము ఉబుసుపోకగా ధారణ చేసెదనుగాక!" అను భావనచే 'సృష్టి'యొక్క అనుభవము (లేక) అనుభూతి ఏర్పడినదై వుంటోంది. అట్టి 'భావన - ఆలోచన'లే **'సృష్టిరూప యజ్ఞ తపస్సు'**గా చెప్పబడుతోంది. అనగా, అట్టి తపస్సు (లేక) తపన (Sense of Avoctaion) నుండి సర్వ చరాచర సృష్టి అనబడే ఆత్మయొక్క రసాస్వాదన ఉదయిస్తోంది. సంప్లుతోదకమౌతోంది. (ఆత్మయొక్క స్వయం కల్పనయే సృష్టి-సృష్ట్యనుభవము).

అనుభవముగా అగుచున్నదంతా **'అన్నమ్'** అను శబ్దముచే అధ్యాత్మశాస్త్రం ఉద్దేశ్యిస్తోంది. (అన్నం బ్రహ్మ! అన్నం పరబ్రహ్మ స్వరూపమ్! అన్నమిదమ్ సర్వమ్ - ఇత్యాదిశబ్దముల ఉద్దేశ్యార్థం).

**అన్నమ్** → భావార్థము : పరమాత్మయొక్క ఆహారము, **జగత్ భావకల్పనా విశేషం.**

**లక్ష్యార్థం** → ప్రకృతి : స్వభావము : అనుభూతి : అనుభవము.

అద్వితీయమైనదానియొక్క ద్వితీయ కల్పనా వినోదపూర్వకమైన అభిలాష. (A playful inclination towards experiencing of Duality)

నిర్వికల్పము - నిరాధారము
నిస్సంకల్పము అగు బ్రహ్మము (Absolute self) -- నుండి
|
సృష్టికి మూలాధారమగు అన్నము (Inclination) -- నుండి
|
అన్నము నుండి ప్రాణశక్తి -- నుండి
|
ప్రాణశక్తి నుండి మనస్సు - లోకములు - కర్మలు అనబడే '3' చమత్కారాలు -- నుండి
|
కర్మల నుండి
|
వివిధ జాతుల గుణ - రూప విశేషాలు

**దృష్టాంతం** : నిరాకారమగుమట్టిచే మట్టి ముద్దలు , మట్టి రాజు మట్టి మంత్రి - మట్టి గుర్రము మొ॥నవి శత్రు - మిత్ర రాజుల కథాదృశ్యం తయారు అగుచున్నట్లు!

***<u>అట్టి పరబ్రహ్మము.....,</u>***

- **జ్ఞానమును** తపస్సుగా (తపనారూపంగా) కలిగియున్నట్టిది.
- **అన్నము** (అనుభవమగు సమస్తము / స్వభావము)ను భూషణముగా కలిగియున్నది.
- **'ఎరుక'**ను తన తేజోకిరణముల సంప్రసరణ విశేషముగా ప్రదర్శించుచున్నది.
- చిదానంద రూపము, కేవల జ్ఞానస్వరూపము అగు ఆత్మ - తనయొక్క తేజోస్వభావముచే (Through enlightening Feature / Art) చే సర్వమును లీలావినోదంగా కల్పించుకొనుచున్నది.

సృష్టికర్తయగు బ్రహ్మదేవుని, సృష్టికి మూలమైన రజోగుణ చమత్కారమును, అట్టి రజోగుణము నుండి నామ-రూప కల్పనలను, ఆ ఇంద్రియ - ఇంద్రియ విషయములను కల్పన చేసుకొనుచున్నది - **ఆత్మయే।**

- కనులకు దృశ్యము ఆహారము (అన్నము)
- చెవులకు శబ్దము ఆహారము.
- ముక్కుకు వాసన ఆహారము.
- చర్మమునకు స్పర్శ ఆహారము.
- నాలుకకు రుచి ఆహారము.
- మనస్సుకు ఆలోచన ఆహారము.
- బ్రహ్మదేవునికి 'జీవ – అన్న సృష్టి' ఆహారము.

పరబ్రహ్మమునకు సృష్టికర్త – సృష్టి ఆహారము. అయితే...,

- మట్టితో తయారయ్యే బొమ్మలన్నీ మట్టియే కదా!

**ప్రదర్శితమయ్యేదంతా పరబ్రహ్మమే అయి ఉన్నది. సృష్టియొక్క భావన, సృష్టి, ద్రష్ట, దృశ్యము, అనుభూతి, అనుభవము, ఆనందము – దుఃఖము....అంతా పరబ్రహ్మమే. (సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ!)**

→ కనబడేదంతా అదే। వినబడేదంతా అదే।

→ బ్రహ్మము సర్వదా బ్రహ్మముగానే వున్నది. మరొకటేదీ అవటమే లేదు.

జలము నుండి అనేక ఆకారములుగల – అసంఖ్యాక తరంగాలు ప్రదర్శితమగుచుండవచ్చుగాక! జలము జలమే అయి, తరంగాలు కూడా జలమే అయివున్నది కదా!

**జీవుడుగా కనిపిస్తున్నది – జీవుడుగా అనిపిస్తున్నది – జీవుడుగా వున్నది – సత్ చిత్ ఆనందరూపమగు పరబ్రహ్మమే। సదా బ్రహ్మమే। సదాశివమే। సర్వదా బ్రహ్మమే।**

అందుకు వేరుగా కనిపిస్తున్నదంతా ద్రష్టయొక్క మనో కల్పితమాయయే।

(1) కేవల చైతన్యము (2) దృక్ (3) ద్రష్ట (4) దృశ్యము → **సమస్తము బ్రహ్మమే!**

## 2. ప్రథమ ముండకము – ద్వితీయ ఖండము

### కర్మానుష్ఠానము – తత్త్వభావము – గురు ఆశ్రయము

**శ్రీ అంగిరసుడు** : ఓ శౌనకా! తదితర ప్రియశ్రోతలారా! ఈ కనబడే జగత్తంతా మనోదర్పణంలో వివిధ అనేకత్వములతో కూడిన ప్రాతిభాసిక (Reflective) దృశ్యముగాను, వాస్తవానికి పరబ్రహ్మమే అయివున్నట్లుగాను మనం వేద – వేదాంతజ్ఞుల, ఆత్మజ్ఞుల ప్రవచన వాక్యములు చెప్పుకున్నాం. శ్రద్ధగా వింటూ, గమనిస్తున్నారు కదా! జలంలో తరంగాలులాగా,....ఆత్మ మహాసముద్రంలో 'అన్నము' అనే **"చిత్ చైతన్య పరమోత్సాహశక్తి"చే "జీవులు వారి వారి వ్యక్తిగత అనుభవపరంపరలు"** అనే తరంగాలు అనిర్వచనీయంగా – అకారణంగా – ఆత్మకు అద్వితీయంగా ప్రదర్శితమౌతున్నాయి.

అయితే..., **ఇదంతా సర్వదా అఖండాత్మానంద చైతన్యమే।**

ఈ దృశ్యమును పొందుచున్న సందర్భంలో...."**ఇదంతా ఆత్మచైతన్య చమత్కారమే**" – అని ఆశయంగా – సమగ్రంగా అవగాహన అయ్యేది ఎట్లా? సమస్తము ఆత్మగా అనిపించేది ఏ తీరుగా? అందుకు సాధనామార్గంగా వేదములు – శాస్త్రములు కొన్ని కర్మవిధివిధానములను నిర్దేశిస్తూ సూచిస్తున్నాయి.

అటువంటి కర్మసాధనములకు సంబంధించిన కొన్ని వివరాలు ఇక్కడ చెప్పుకుంటున్నాం. వినండి! అటువంటి శాస్త్రప్రవచితమైన కర్మ విశేషాలన్నీ కూడా...

- ఋగ్వేదమునకు సంబంధించిన 'హోత్రము', (యజ్ఞాగ్నిలో సమర్పించతగిన హోమద్రవ్యములు). హోత = ఋగ్వేదము తెలిసిన ఋత్విక్కు)
- యజుర్వేదమునకు సంబంధించిన 'ఆధ్వర్యము' (యజ్ఞోపాసనా యజస్సులు), (అధ్వరుడు = యజ్ఞమునందు యజుర్వేద మంత్రములు నడుపువాడు)

❧ సామవేదమునకు సంబంధించిన 'ఔద్గాత్రము', (స్తుతి ప్రవచనములు)

అను మూడిటి కలయికచే (కర్మసాధనములన్నీ) ఏర్పడినవై ఉంటున్నాయి. వాటియొక్క మరికొన్ని వివరాలు

**హోమము** = దేవతలను మంత్రపూర్వకంగా ఆహ్వానించటం, ఆ దేవతలకు అగ్నిహోత్రము ద్వారా ఆహుతులు ఇవ్వటం.

**ఆహూతి** : దేవతలకు సమర్పించే కొన్ని ఓషధ సమిధలు, ఆవునెయ్యి మొ॥వి.

**హోత్రము** : ఋగ్వేద సంబంధమైన దేవతా – ప్రత్యధి దేవతా మంత్రములు

**ఆధ్వర్యము** : యజుర్వేదంలో వర్ణించబడిన యజ్ఞవిధి – విధానములు.

**ఓద్గాతము** : సామవేద గానములు.

**1. యజ్ఞవిధులు** : ఓ శ్రోతలారా! ఓ శౌనకా! ఆ తీరుగా బ్రహ్మణ్యులచే, వేదవరేణ్యులచే ప్రవచితమై, చెప్పబడిన యజ్ఞకర్మలు మీరు ఇతఃపూర్వం సవివరంగా గురుముఖతః వినియే ఉన్నారు కదా! తపోసంపన్నులు, మహనీయులు, ముముక్షు శ్రేయోభిలాషులు అగు ఏఏ ఋషులు ఏఏ యజ్ఞములను దర్శించి సర్వజనశ్రేయంగా గానం చేసారో, చేస్తూ వున్నారో...అవన్నీ సత్యమే! ఓ సత్యప్రియులారా! సర్వదా సత్యమగు పరమాత్మయొక్క (లేక) పరతత్త్వముయొక్క అనుభూతికి అర్హులు అవటం కొరకై మీరు అవన్నీ అధ్యయనం చేయండి. ఆచరించండి.

మీరు నిర్వర్తిస్తున్న యజ్ఞకర్మలద్వారా ఆహూతులను అగ్నిగుండంలో సమర్పిస్తూ వుండగా, హవ్యవాహనుడగు అగ్నిదేవ భగవానుడు ఆ ఆహూతులను హవిస్సుగా సృష్టిపరిపోషకులగు దేవతలకు అందిస్తూ వుంటారు. ఈ విధంగా లోకకళ్యాణ దృష్టితో నిర్వర్తించండి! మోక్షార్హతకు మార్గములో గొప్ప ఉత్తమ ఉపకరణమైన ఈ మానవదేహము లభించినందుకు ఈ లోకముపట్ల కృతజ్ఞతగా అట్టి యజ్ఞములను, కర్మల త్యాగములను నిర్వహించండి! అత్యంత పవిత్రమగు **ఆత్మదృష్టిని** పొందటానికే ఆ యజ్ఞ నిర్వహణలను మీ అంతరంగంలో ఉద్దేశ్యించండి!

**2. సమర్పిత భావనతో స్వధర్మాచరణము** : ప్రియ ఆత్మానంద స్వరూపులారా! మీరంతా కూడా మీమీ వర్ణ – ఆశ్రమ సమయోచితమైన, (మరియు) శాస్త్రీయ – లోకహితమైన స్వధర్మములు విడువకండి! **"స్వధర్మ (కర్మ) నిర్వహణ"** అనే సంపదను పరివృద్ధి చేసుకోండి. శాస్త్రానుసారంగాను, కాలానుగతంగాను మీరు శ్రద్ధతో నిర్వర్తిస్తున్న కర్మలను విశ్వదేవతలకు ప్రేమతో సమర్పించండి. వారు తిరిగి సానుకూల్యులై, **మీరున్న ఈ సృష్టియొక్క ఉనికికి, మీమీ జీవనస్రవంతులకు తోడ్పడగలరు.**

***మీరు నిర్వర్తించే వర్ణాశ్రమ ధర్మములే – స్వధర్మములే మీకు ముండకము (వెంట్రుకలు తొలగించే పదునైన కత్తి) వంటిది కాగలదు. అట్టి కత్తిని మీయొక్క శ్రద్ధతో కూడిన ధర్మ నిర్వహణచే మీకు మీరే తయారుచేసుకోవాలి సుమా!***

ఒక హెచ్చరిక!

ఎవ్వరి శాస్త్రవిహితమైన – వేదరహితమైన సాధనారూపములగు కర్మలు.. అనబడే అగ్నిహోత్రము మొదలైనవి :

- అమావాస్య – పౌర్ణమి కాలములందు శాస్త్రములచే చెప్పబడిన విధి – విధానములు వారికి దృష్టియందు వుండవో....,
- వర్షాకాలములో విధించబడిన శాస్త్రరీతియగు చాతుర్మాస్యము మొ॥ రూపంగా వారి కర్మ ప్రవర్తనములు శాస్త్ర – లోక సానుకూల్యం కావో...,
- పంటలు పండే కాలంలో (During Harvest time - Income receiving Time) శాస్త్రములచే విధించబడిన ఫలభాగ సమర్పణ విధిని అనుసరించి రూపుదిద్దుకోవో...,
- "అతిథులను – అభాగ్యతులను (అభ్యాగతిః స్వయం విష్ణుః అను నానుడిగా) సేవించటం" అనేది అనుసరించబడదో...
- 'వైశ్వ దేవవిధి' అనబడే **"పక్షులకు, జంతువులకు, తదితర సహజీవులకు ఆహార సమర్పణ చేసి తృప్తి పరచటం"** అనే వ్రతముతో కూడి వుండవో...
- వారికి విధించిన ధర్మములకు సంబంధించిన చేయాలనుకొనే కార్యక్రమములు శాస్త్ర విధులను–లోక క్షేమమును ఉద్దేశ్యించి ఉండవో

అట్టి వారి **ఆత్మజ్ఞానమును చేరే మార్గంలో నిరుపయోగములౌతాయి.** కర్తకు ఉత్తమ ప్రయోజనములు కావు! అల్ప, అశాశ్వత, దుఃఖమిశ్రత ఫలములకు మాత్రమే పరిమితమౌతాయి.

బుద్ధిని నిర్మలం చేసుకోవటానికి – లోకసానుకూల్యత కొరకు కర్మలు నిర్వర్తించాలి.

అంతేకాని, అల్పమైన స్వర్గలోక – భవిష్యత్ సుఖప్రాప్తి ఇత్యాది ఆశయములతో అగ్నికార్యము – యజ్ఞము ఇత్యాది కర్మలు, సధర్మములు నిర్వర్తించటం తెలివితక్కువదనమే! **(కృపణా ఫలహేతవః – భగవద్గీత)**. పైగా లౌకికమైన ఆశయములతో యజ్ఞాదులను ఉద్దేశ్యించేవారికి కర్మఫలానుభవము తరువాత, సప్త ఊర్ధ్వలోకాలు ప్రాతికూల్యమౌతూ వుంటాయి.

**“లోకసంబంధమైన, ఇంద్రియ సుఖ సంబంధమైన”** ప్రతిఫలాపేక్ష మాత్రమే ఆశయముగా కలిగియుండి, అగ్నిహోత్రము, యజ్ఞము, యాగము పూజ ధ్యానము తదితర కర్మలు నిర్వర్తిస్తూ వుండేవారు, (అట్లాగే) లోకహితము - శాస్త్ర విహితము కానట్టి కర్మలు నిర్వర్తించే వారి విషయంలో వారి వారి ఉత్తరోత్తర గతులు **“జ్ఞానమున అనర్థము - ప్రాతికూల్యము”** కాగలవని హెచ్చరిస్తున్నాము.

ఇప్పుడు యజ్ఞము - అగ్ని ఉపాసనల గురించిన కొన్ని విశేషాలు చెప్పుకుందాం.

## యజ్ఞము - అగ్నిఉపాసన (అపరో)

**“అగ్నిః సప్తజిహ్వాః”** - అగ్ని యొక్క సప్తజిహ్వలు

**1. కాలీ** : అగ్నిలోని నలుపురంగు. బద్ధకము - అశ్రద్ధ → ఇటువంటి జ్ఞానార్థతకు సంబంధించిన లోపములను దహించునది.

**2. కరాలీ** : భీకరము - నరకప్రదము అగు పాపదృష్టులను, అల్ప భావనలను (తదితరులపై అల్పమైన - దోషములను ఆపాదించే అభిప్రాయములను - అభ్యాసములను) మాడ్చివేసేది. తొలగించేది.

**3. మనోజవా** : మనస్సుయొక్క సత్ సంకల్పములను అత్యంత వేగంగా దేవతలకు నివేదించేది!

**4. సులోహితా** : ఎఱ్ఱటి వర్ణముతో జడత్వం - మూఢత్వం - మూర్ఖత్వం తొలగించేది. పోగొట్టేది.

**5. సుధూమ్రవర్ణా** : బూడిదరంగు గలది. సాధన - అవగాహనా దృష్టులను పవిత్రం చేసేది.

**6. స్ఫులింగినీ** : మిలమిలా మెరుస్తూ, అజ్ఞాన నిబిడాంధకారములను పోగొట్టేది!

**7. విశ్వరుచి దేవి** : తనయొక్క తేజస్సుతో అంతటా వెలుగుచూ అన్నీ సుస్పష్టంగా కనిపించునట్లు చేయునది.

ఈ విధంగా ఏడు నాలుకలతో అగ్నిగుండంలో అగ్ని భగవానుడు ప్రవేశిస్తూ ఉంటారు.

వెలుగుచున్న అగ్నికి ఆహుతులను సమర్పిస్తూ వుంటే, అట్టివాని ఆ ఆహుతులు సూర్యకిరణాలలో ప్రవేశించి ఆ కిరణాల ద్వారా ఈ సృష్టియొక్క అధిపతికి జేరుతాయి.

ఓ యజ్ఞకర్తా! రండి! రండి! మిమ్ములను ఇంద్రలోకం మేము జేరుస్తాం!”....అని ఆ ఆహుతులు యజ్ఞకర్తకు మనో సంబంధమైన శుభవర్తమానాలు పంపుతూ వుంటాయి.

**ఈ విధంగా యజ్ఞ - యాగాలు, అగ్నికార్యాలు వేద ప్రామాణికములు. ఉత్తమలోకాలు చేరటానికి మార్గాలు. సందేహమే లేదు!**

అయితే...,

- 16 మంది ఋత్విక్కులు + ‘2’ యజమాని దంపతులు = 18
- అగ్ని, అగ్నిగుండము, సమిధలు,
- అహుతులు - నేయి, పాలు, మొ॥వి,
- సంకల్పము, మంత్రము, ఋత్విక్కులు,
- కర్త, భోక్త, విధి, ఆహ్వానము,
- యజ్ఞపశువు, వప, సంభావన...,
- మంత్రము, తంత్రము
- ఋత్విజుడు, ఋత్విక్కు, హోత, గాత, ప్రత్యాఖ్యాత (నిషేధములు చెప్పువాడు), ప్రతివక్త, ప్రతిగృహీత, ప్రత్యాదేసి..., మొదలైన

వీటినన్నిటినీ ఒకచోటికి చేర్చి ఉత్తమలోకాల కొరకై నిర్వర్తించబడే **“అగ్నికార్యముతో కూడిన యజ్ఞ - యాగములు”** ఉత్తమలోకాలను ప్రసాదించవచ్చునుగాక!

కానీ, ఏం లాభం?

కర్మలు - కర్మఫలాలు కాలబద్ధము. అట్టి యాగఫలములన్నీ ఊర్ధ్వ ఇంద్రాది లోకాలలో ప్రవేశించినప్పుడు - సంపాదించుకున్న డబ్బు ఖర్చు అయిపోతూ వున్న సందర్భము వంటిది మాత్రమే.

అందుచేత **“ఉత్తమ లోకములే మన ఆశయం”**...అని అనుకునేవారి ఆలోచనలు మూర్ఖత్వము మాత్రమే. మా ఉద్దేశ్యములో యజ్ఞ - యాగ - ప్రవచనా పాండిత్యమే సర్వస్వమని తలచేవారు అజ్ఞానముయొక్క నట్టి నడుమ వున్నవారే అగుచున్నారు.

శ్లో॥ అవిద్యాయామ్ అన్తరే వర్తమానాః
స్వయం ధీరాః పండితం మన్యమానాః।
జఙ్ఘన్యమానాః పరియంతి మూఢా
అన్ధేనైవ నీయమానా యథాన్ధాః (యథా అంధాః)॥ 8/ (17)

శ్లో॥ అవిద్యాయాం బహుధా వర్తమానాః
'వయం కృతార్థా' ఇత్యభిమన్యన్తి బాలాః।
యత్కర్మిణో న ప్రవేదయన్తి
రాగాత్ తేనా ఆతురాః క్షీణ లోకాశ్చ్యవన్తే ॥ 9/(18)

యజ్ఞములు – యాగములలో మునిగి **"మేము గొప్ప లోకాలు పొందుతాం! కనుక కృతార్థులము!"**....అని బాలులవలె భావించటం ఉచితమా? కాదు. గుడ్డివాడిని అనుసరించే గుడ్డివాడు తాను చేరవలసిన చోటుకు చేరగలడా? లేదు. దృశ్య విషయముల గురించి మోహ – రాగ – ఆశ – దృశ్య తాదాత్మ్యము వున్నంతవరకు అట్టి వారు **స్వస్వరూపముయొక్క ఔన్నత్యమేమిటో వివరించే పరబ్రహ్మతత్త్వజ్ఞానమును గమనించి ఆస్వాదించలేకపోతున్నారు.** తెలుసుకొనవలసిన దాని గురించి తెలుసుకోలేకపోతున్నారు. విదితవేద్యులు కాలేకపోతున్నారు. మరల ఎప్పుడో కర్మఫలభో గానంతరము అథోగతి పాలగుచున్నారు. అవన్నీ దుఃఖమును సమూలంగా తొలగించలేకపోతున్నాయని గుర్తు చేస్తున్నాము.

దుఃఖము (Worry) సమూలంగా తొలగాలంటే? ఆత్మను ఎరిగినప్పుడే దుఃఖం తొలగుతుంది. ఎందుచేతనంటావా? కర్మలు – కర్మఫలములు మాయలోనివే కదా! (తరతి శోకం ఆత్మవిత్)।

**మరొక్కసారి చెప్పుచున్నాను :**

కర్మఫలములపట్ల లౌకిక ఫలంగా మాత్రమే ఆతురత గలవారు – **జ్ఞానమును ఆశ్రయించకపోవటం జరిగితే,....పుణ్యఫలభోగానంతరం మరల క్షీణలోకాలు పొందవలసి వస్తోంది.** యజ్ఞయాగాది కర్మలు → 14 లోకాలలో ఏదో పొందాలనే ఆశయంతో నిర్వర్తిస్తే వాటి ఫలములు కాలబద్ధమే. పునరావృత్తి దోషం చేత మరల మొదటికి రావలసి వస్తోంది.

యాజ్ఞికమైన – స్వధర్మ సంబంధమైన కర్మలన్నీ – ఫలాపేక్షలేని సమర్పిత భావంతో, పార లౌకికాశయంతో నిర్వర్తిస్తే...అవి తప్పక ఆత్మసుఖమునకు దారితీస్తున్నాయి.

కర్మల స్వభావమే అట్టిది మరి!

అందుచేత ఓ బిడ్డలారా! **"యజ్ఞయాగాలు, ఇష్టాపూర్తములు (తనకోసం చేసే ధ్యాన, ప్రార్థనాదులు – ఇతరుల కోసం చేసే నూతులు త్రవ్వించటం మొ॥వి) చేస్తున్నాం! మాకు ఆత్మజ్ఞానం ఎందుకు?"** అని దయచేసి అనుకోకండి.

అనగా....,

యజ్ఞ – యాగ – ఇష్టాపూర్తాలు – ఇవన్నీ చేయండి. అయితే,

- మనస్సును శుద్ధిపరచుకోవటానికై,
- బుద్ధిలోని దోషములు తొలగించుకోవటానికై,
- బుద్ధిని నిర్మలము – సుతీక్ష్ణము – సువిశాలముగా తీర్చిదిద్దుకోవటానికై – ఉద్దేశ్యించండి.

మహదాశయము విడిచిపెట్టకుండానే వుండండి.**"ఆత్మతత్త్వమును ఎరిగినవారమై, దేహ మనో బుద్ధులను అధిగమించి, సర్వత్రా అఖండాత్మ స్వరూపులమై ప్రకాశించెదముగాక!"** అని భావించండి! ఆత్మ భావనకై సుమర్గానువర్తులై ఉండండి.

ఎవ్వరైతే....,

- ఆత్మతత్త్వ విషయమై తపస్సు (తపనయే తపస్సు)ను ఆశ్రయిస్తూ....,
- శ్రద్ధ – ఆసక్తులను ఆత్మతత్త్వ జ్ఞానమునందు ఏకాగ్రపరుస్తూ...,

- **'ఏకము, అక్షరము అగు ఆత్మయే ఇదంతా'** – అనురూపంగా ఏకాంత నిష్ఠులై, అరణ్యవాసులై వుంటూ (Hands in the world while Head in the forest) వివిక్తసేవులై ఉంటారో…,
- ఆవేశకావేశములను మనస్సునుండి పార్రదోలి…శాంత మనస్కులగుచూ ఉంటారో…,
- గురువులు చెప్పే తత్త్వమసి (తత్త్వశాస్త్ర విశేషముల) పాఠ్యాంశములందు పారంగతులగుచు, విద్వాంసులగుచు…., ఇహ దర్శనాభ్యాసులై ఉంటారో.,
- దేహ సంరక్షణార్థమై అవసరమగు ఆహారము పొందటానికి భిక్షాటనముకైనా సరే – సంసిద్ధులగుచున్నారో,
- త్యాగనిరతితో "కర్తవ్యమేవ!" అనుభావనతో సర్వాత్మకమగు పరబ్రహ్మమును ఉపాసించు ఉద్దేశ్యముతో దేశ – కాలానుగతమైన శాస్త్ర – సాంఘికవిహిత–యజ్ఞ, యాగ – ఇత్యాది కర్మలు నిర్వర్తిస్తూ ఉంటున్నారో..,
- శాస్త్రముల ఉన్నతోద్దేశ్యమును గ్రహించి **"నాది అనిపించేదంతా సర్వాత్మకుడగు పరమాత్మదేకదా!"**….అను అవగాహనను, నిశ్చితాభిప్రాయము పెంపొందించుకుంటూ ఉంటున్నారో,
- మనోశుద్ధి – పరిపుష్టికొరకై జపము – తపము ఇత్యాది సాధనలను సదవగాహనతో నిర్వర్తిస్తూ ఉంటున్నారో,
- క్రమంగా పాప – అల్పదృష్టులను హృదయము నుండి బయటకు త్రోలుచూ ఉంటున్నారో,

…. అట్టివారు ఆత్మజ్ఞాన సూర్యనిమార్గంలో ప్రయాణిస్తూ ఉంటారు. **"సర్వుల అంతర్యామి, ఈ సర్వము తనయందు క్రీడగా – లీలగా ధారణ వహిస్తున్నది, సర్వమునకు అప్రమేయమైనది – అగు అట్టి ఆత్మయే నా సహజరూపము. తదితరమైనదంతా స్వకీయ భావనా కల్పితము. మనోకల్పితము"** ….. అని గ్రహిస్తూ – గమనిస్తున్నవారై ఉంటారు. క్రమంగా ఆత్మసాక్షాత్కారము వైపుగా పయనిస్తూ వుంటారు. **"అవ్యయము, అమృతరూపము, పరమపురుషుడు"** అని ఏది వేదములచే గానము చేయబడుచున్నదో, అట్టి అద్వితీయమగు బ్రహ్మమే **"తనయొక్క, తదితరులయొక్క నిత్యసత్యము"**గా నిశ్చలబుద్ధితో జీవితము ఆస్వాదించసాగుచున్నారు! ఆత్మానందమునకు అర్హులగుచున్నారు.

కనుక ఓ శౌనకా!

అధ్యాత్మ చింతన గల నీవంటి ముముక్షువులు ఇహలోక – పరలోక ప్రయోజనములన్నీ "ఎందుచేత పరిమిత విషయములో, ఎందుకు అపరిమితమగు ఆత్మానంద సుఖమును ప్రసాదించజాలవో" గమనిస్తున్నారు. సర్వ ఇహ – పరలోక ప్రయోజనముల, ఆయా లౌకిక ఫలములపట్ల ఉదాశీనులై వుంటున్నారు!

(సర్వంకర్మాఖిలమ్ జ్ఞానే పరిసమాప్యతే!) సమస్త కర్మలయొక్క అంతిమ ఆశయము, అంతిమ సారము, ఆత్మజ్ఞాన–ఆత్మానందములే. కర్మవ్యవహారములన్నీ కూడా ఆత్మానంద సిద్ధిచేతనే పరిసమాప్తి పొందుచున్నాయి.

అందుచేత ఆత్మతత్త్వజ్ఞానమే (లేక) బ్రహ్మజ్ఞానమే జీవులందరికీ సమస్త దుఃఖముల నివారణకై శరణ్యమై యున్నది!

**శ్రీ శౌనకుడు:** స్వామీ! సద్గురూ! అంగిరసమునీంద్రా! అట్టి ఆత్యంతికమైన ఆత్మతత్త్వజ్ఞానం లభించటానికి మార్గమేమిటి?

శ్రీ అంగిరసమహర్షి : ఆత్మ తత్త్వజ్ఞానం అనగా ఏమి?

**త్వమ్** → **తత్** అనగా ఏమి? **"నీవు అదియే అంతేగాని ఇది కాదు"** → అని కదా! అనగా? నీ స్వస్వరూపమే సర్వస్వరూపము, సర్వము అయి ఉన్నది అని. ఆత్మకు లోక వ్యవహారములతో ఏ మాత్రము ప్రమేయము లేదు. శ్రుతి – స్మృతి – పురాణ – వేద – వేదాంతములనీకూడా– ఆయా వాక్య పరంపరలచే **"నీ సహజ స్వరూపము పరమాత్మయే। తత్త్వమసి।"**….అని చెప్పుకుంటూ వస్తున్నాయి. ఈ జీవుడు తనయొక్క లోకసంబంధమైన, మనో – బుద్ధులరూపమైనట్టి **"సుదీర్ఘము, బలవత్తరము, మూర్ఖము"** అగు దృష్టిచే కప్పబడి వుంటున్నాడు. కనుక తత్త్వజ్ఞులగు మహనీయులు విశ్లేషణపూర్వకమైన ఆప్తవాక్యములు జ్ఞానయోగ మార్గములుగా చెప్పుచున్నారు. ఆత్మశాస్త్ర సంబంధమైన వివరణములు, మహనీయుల సోదాహరణములు ఈ జీవునికి **తనశివస్వరూపమును నిరూపించి చూపగలవు.**

**కనుక మహనీయులను శరణువేడి ఆత్మజ్ఞాన సమాచారముల ఉపదేశము పొందటమే ముఖ్యోపాయము.**

**శ్లో॥ పరీక్ష్య లోకాన్ కర్మ చితాన్ బ్రాహ్మణో, నిర్వేదం ఆయాత్ నాస్తి అకృతః కృతేన।**
**తత్ విజ్ఞానార్థం స గురుమేవ అభిగచ్ఛేత్, సమిత్ పాణిః - శ్రోత్రియం బ్రహ్మ నిష్ఠమ్॥**

బ్రహ్మజ్ఞానోపాసకుడైన ముముక్షువు...,

- ఈ కళ్ళకు తదితర ఇంద్రియములకు తారసబడుచున్న 14 లోకముల సంబంధమైన కర్మఫలాభిలాషలలో కూడి - సంచారముల 'పరిమితులు' ఏమిటో ఇందలి పునరావృత్తి దోషములు ఎట్టివో - **గ్రహించుచున్నాడు.**
- మోక్షము కృతాకృతకర్మలచే (చేస్తున్న చేయని కర్మలచే) లభించదని **గమనించుచున్నాడు.**
- వైరాగ్యశీలుడై, రాగము - అనురాగములను **ప్రక్కనపెట్టివేయుచున్నాడు.**
- **బ్రహ్మము**ను (లేక) **తనకు సంబంధించిన పరమసత్యము** (The Finest Truth) ఎరుగాలని నిశ్చయించుకొనుచున్నాడు.

సమిత్పాణి అయి (గురువుకు యజ్ఞమునకై ఉపకరించగల ధర్భలను చేతిలో ఉంచుకొని), ఉత్తమమైన దైవీగుణకర్మలను ఆశ్రయిస్తున్నవాడై ... **శ్రోత్రియుడు - బ్రహ్మనిష్ఠుడు అగు గురువును సమీపించుచున్నాడు.**

గురుదేవులను శరణువేడాలి. బ్రహ్మజ్ఞానము ప్రసాదించవలసినదిగా అర్థిస్తూ,- తనకున్న సంశయములను ఆ గురువు ముందు వుంచాలి. వారు ప్రవచించే ఆత్మజ్ఞానసమాచారాన్ని శ్రద్ధగా వినాలి! విచారణ చేయాలి! పరిప్రశ్నించాలి. హృదయస్థం చేసుకోవాలి!

**"నేనెవరు? ఈ దృశ్యమేమిటి? ఎక్కడి నుండి ఎందుకొచ్చింది? ఏది తొలగాలి? ఏది ఆశ్రయించాలి? దేనిని ఏ రీతిగా సమన్వయం చేసుకోవాలి?"**....ఇత్యాది ప్రశ్నలను శిష్యుడు గురువు ముందుంచాలి?

ఇక....నిత్యానిత్య వివేకియగు గురుదేవుడు → శిష్యునికి,

అక్షరము (మార్పు చేర్పులు లేనిది),

పరమ పురుషము (జగద్భావనకు ఆవల కేవల పురుషకార రూపమై ఉన్నది),

త్రికాలాబాధ్యము (త్రికాలములలో సత్యమైయున్నది),

తత్ - త్వమ్ నిరూపణము →

***అగు బ్రహ్మవిద్యను ప్రవచిస్తున్నారు! బుద్ధిని సంస్కరిస్తూ సర్వ సంశయములు తొలగిస్తున్నారు.***

వారు వివరించి చెప్పుచున్న.....

| | | |
|---|---|---|
| **<u>తత్త్వమ్।</u>** | - | **"పరమపురుషార్థమగు బ్రహ్మమే నీవై ఉన్నావు" అను 'త్వం' పట్ల 'దృష్టి'.** |
| **<u>సోఽ హమ్।</u>** | - | **"అదియే నేను" అను రూపమైన - "సందర్భములకు ఆవలి భావన".** |
| **జీవో బ్రహ్మైఽ తి నాపరః। కాదు"** | - | **"ఈ జీవాత్మ పరమాత్మ స్వరూపుడేగాని, అపరము (దేహ-దృశ్య పరిమితుడు అని "జ్ఞాపకము".** |
| **జీవోశివః। శివోజీవః॥** | - | **(తరంగము జలమే అయినట్లు) ఈ జీవుడు స్వతఃగా-సర్వాంతర్యామి అగు శివుడే. శివుడే క్రీడా వినోదంగా జీవాంశను ప్రదర్శిస్తున్నారు - అను 'విద్య'.** |
| **శివ తత్త్వ జ్ఞానమ్॥** | - | **"థ్వమ్ తత్ శివేతి"-అని సమస్త జీవులను శివస్వరూపంగా అన్వయించుచు "జ్ఞానము".** |
| **మత్తః పరతరమ్ నాన్యత్ కించిదస్తి** | - | **ఈ జగదృశ్యముగా విస్తరించి ఉన్నది నేనే। నాకు వేరుగా ఏదీ లేదు - అను అవగాహన సందర్శనము.** |

ఇత్యాది వేద - వేదాంగ - పురాణాదులు ప్రతిపాదిస్తున్న **"మహావాక్యముల అర్థము"**ను విని - ఆకళింపు చేసుకొని బ్రాహ్మీ దృష్టిని సంపాదించుకోవాలి. మరొకవైపుగా, లోకసంబంధమైన భేదదృష్టిని తొలగించుకోవటానికి ఆ సద్గురువు సూచించే కర్మఫలత్యాగము, ఉపాసనా సంబంధమైన సాధనలు, యోగసాధన ఇత్యాదులను దైనందికంగా ఆశ్రయించి ఉండాలి.

అప్పుడు - **"నేను సర్వదా బ్రహ్మమునే! సదాశివ బ్రహ్మమును!"**....అని గ్రహించిన శిష్యుడు బ్రహ్మమే తానై ప్రకాశిస్తున్నాడు!

# 3. ద్వితీయ ముండకము - ప్రథమ ఖండము

## ఆ పరబ్రహ్మమే నీ హృదయేశ్వరుడు! నీవు సర్వదా పరబ్రహ్మమే।

**శ్రీ శౌనకుడు** : హే భగవాన్! అంగిరసమహర్షీ! ఈ కనబడే అసంఖ్యాక జీవులతో కూడిన ఈ భూ-పాతాళ - స్వర్గ ఇత్యాది 14 లోకాలు, ఈ బ్రహ్మాండములు, పంచభూతములు, ఈ వివిధ జీవుల వేరువేరైన స్వభావములు - **ఇవన్నీ ఎక్కడి నుండి ఉద్భవిస్తున్నాయి?**

**శ్రీ అంగిరసమహర్షి** : అవన్నీ ఎందులో ఆవిర్భవిస్తున్నాయో, ఎందులో వుంటున్నాయో, ఎందులో లయిస్తున్నాయో....అదియే నీ-నా కేవల స్వరూపమగు **పరబ్రహ్మము.** అదియే 'ఓం' 'సత్' 'తత్' అను వేద శబ్దములను సూచిస్తున్న సత్యము. (యమ్ సత్).

ఇక ఈ వివిధ జీవుల చమత్కారమంతా ఏమిటంటావా? ఒక దృష్టాంతం ద్వారా చెప్పుచున్నాను. వినండి!

ప్రజ్వరిల్లుచున్న అగ్నినుండి అనేక విస్ఫులింగాలు (నిప్పురవ్వలు) అసంఖ్యాకంగా పుట్టుకొస్తున్నాయి చూచావా? ఆ విస్ఫులింగాలు మరల విశ్వాగ్నిలో కలిసిపోతున్నాయికదా! అట్టి నిప్పురవ్వలకు ఆకారాలు వుండవచ్చుగాక! అగ్నికి 'ఇది ఆకారము' అనునది ఏమున్నది?

అట్లాగే....

అక్షరము అనిర్దేశ్యము (changeless and undefinable) అగు పరబ్రహ్మమునుండి అనేక జీవులు - జీవరాసులు వాటి - వాటి స్వరూప స్వభావములతో సహా బయల్వెడలుచున్నాయి. పరబ్రహ్మమునందే ఉనికిని కలిగి ఉంటున్నాయి. పరబ్రహ్మమునందే లయిస్తున్నాయి. మట్టితో బొమ్మలు అగుచున్న విధంగానే, **'పరబ్రహ్మము'తోనే ఈ జీవులంతా తయారగుచున్నారు.**

మట్టి చేసిన బొమ్మలో మట్టి అక్షరము - 'బొమ్మ' ఆకారము తొలగించినంత మాత్రాన - "ఆకారము మట్టితో కలిసిపోయింది" - అని అనము కదా! అట్లాగే ఈ జీవుడు స్వతఃగా సర్వదా పరబ్రహ్మమే అయి ఉండగా - "జీవుడు అక్షర పరబ్రహ్మములో కలియుచున్నాడు"- అనే మాటకు చోటెక్కడిది?

**అట్టి అక్షర పరబ్రహ్మము గురించిన కొన్ని చమత్కారమైన విశేషాలు చెప్పుచున్నాను. అందరూ వినండి!**

## అక్షర పరబ్రహ్మము

**దివ్యము** (Devine) : అది స్వయం ప్రకాశమానము. అదియే అన్నిటినీ ప్రకాశింపజేస్తోంది. అద్దానిని ప్రకాశింపజేసేది మరొకటేదీ లేదు! అందుచేతనే - **"పరంజ్యోతి", "ఆత్మజ్యోతి", "అఖండజ్యోతి", "స్వయంజ్యోతి" "జ్యోతిషామపి తత్ జ్యోతి"** - అను విశేషణములతో స్తుతించబడుతోంది.

**అమూర్తః** (Formless) : అన్ని రూపములు అద్దానివే అయి వుండటంచేత అది నిరాకారము. మట్టితో అనేక బొమ్మలు చేస్తే... బొమ్మలకు ఆకారం వుంటుందిగాని, "మట్టికి ఈ ఆకారము ఉన్నది" అని అనగలమా? లేదు కదా! అగ్నికి రూపం లేదు. కాని, ఏ వస్తువును దహిస్తోందో,...అద్దాని రూపంగా కనిపిస్తుంది. **కదిలే దేహమునకు రూపమున్నదిగాని, కదిలించే దేహికి రూపమేమున్నది?** అట్లాగే బ్రహ్మమే ఈ జగత్తుగా కనిపిస్తున్నప్పటికీ (జగత్తులోని వస్తువులకు నామ - రూపాలు ఉన్నప్పటికీ), **బ్రహ్మము నిరాకారము. అమూర్తము.** ఆకారం వుంటే కదా,...పొడవు-వెడల్పులు, ఎత్తు-పొట్టి మొ॥వి)? ఆకారము లేదు కాబట్టి, **బ్రహ్మము అనంతము కూడా. అయితే "ఈ సమస్త ఆకారములు పరబ్రహ్మమునకు చెందినవే" - అని కూడా యుక్తియుక్తంగా గానం చేయబడుతోంది.**

**పురుషః** (That which is making everything to work) : సర్వజీవులలోని పురుషకారము పరబ్రహ్మమే। అద్దాని ఉత్తేజము - ఉద్దేశ్యములే సర్వ జగత్తులలో పురుషకారముగా ప్రదర్శనమవటం జరుగుతోంది. జీవుడుగా కనిపిస్తున్నది అదే।

**బాహ్య - అభ్యంతరోహి** (Manifestation as external and internal) : (దృష్టాంతంగా) ఒకాయన ఏదో కలకంటున్నాడు. ఆతని స్వప్నచైతన్య విశేషమే. →

→ స్వప్న సాక్షిగాను (దృక్‌గాను/దర్శించు చున్నవాడుగాను)....,

→ స్వప్నంలోని స్వప్నద్రష్టగాను....,

→ స్వప్నంలోని అనేక సుఖదుఃఖ - ఇష్ట అయిష్ట - ఉత్సాహం నిరుత్సాహ విశేషాలుగాను,

స్వప్నదృశ్యమంతాగాను - కనిపిస్తోంది కదా!

స్వప్నముయొక్క రచయిత ఎవరు? స్వప్నసాక్షియే కదా!

అదే విధంగా ఆ జీవుని **"జాగ్రత్ చైతన్య విశేషమే"**, (లేక) ఈ జీవుని స్వస్వరూప-జాగ్రత్ ప్రజ్ఞయే →

- జాగ్రత్ సాక్షి (దృక్ - దర్శించువాడుగాను)...,
- జాగ్రత్‌లోని జాగ్రత్ ద్రష్టగాను...,
- జాగ్రత్‌లోని సర్వ అనుభూత విశేషాలుగాను...,

**ఆతనిపట్ల స్వయంకృతంగా ప్రదర్శితమౌతోంది. జాగ్రత్‌యొక్క సాక్షియే జాగ్రత్ సర్వభావ రచయిత కదా! ఇదియే గుహ్యాతమము** ((The secret of the secrets).

**అదే తీరుగా....సర్వాత్మకమగు మహదాత్మయే ఈ విశ్వముయొక్క విశ్వరచయిత!**

**విశ్వములోని సర్వజీవులుగా - సర్వదృశ్యజాలములుగా, 14 లోకాలలోని సర్వ విశేషాలుగా ప్రదర్శితమగుచున్నది పరబ్రహ్మమే!**

ఆత్మయే....

- జీవుల బాహ్యానుభవాలుగాను,
- జీవుని ఇంద్రియాలు - ఇంద్రియ విషయాలుగాను,
- జీవుల అంతరంగ విశేషాలైనట్టి మనో - బుద్ధి - చిత్త -అహంకారాలుగాను,

ప్రదర్శితమగుచూ వున్నది. ఈ విధంగా **ప్రతిజీవుని జగదనుభవము యొక్క బాహ్య - అభ్యంతరములలో ఆత్మయే వేంచేసియున్నది!**

**అజః** : ఈ జగత్తులో కనిపించే ప్రతి వస్తువు ఉత్పత్తి - ప్రదర్శనము - మార్పు చేర్పులు - వినాశనము కలిగియున్నది. ఈ మనందరి భౌతిక దేహాలే వినాశనశీలమని మనమందరము గమనిస్తున్నదే. ఇక తదితర వస్తు సముదాయము గురించి మనం పెద్దగా చెప్పుకోవలసినదేమున్నది.

అట్లాగే మనోబుద్ధి చిత్త అహంకారాలలోని అంతర్గత-బహిర్గత విశేషాలు కూడా మార్పు - చేర్పు చెందుచున్నాయని మనకు తెలుస్తున్న విషయమే! కానీ,.....

**మనందరి స్వస్వరూపమే అయివున్న పరబ్రహ్మమునకు-జనించటం-గతించటం అనే (జ+గత=జగత్) ధర్మము లేదు.**

**అప్రాణో** : అది ప్రాణము కాదు. ప్రాణములను (వాయుతరంగ రూపములను + శక్తిని) తన **ఉత్తేజముచే కదలించునది**. కదలిక యొక్క వేరు వేరు విన్యాసలే ప్రాణ - అపాన - వ్యాన - ఉదాన - సమాన - సప్రాణములు. ప్రాణశక్తి ఆత్మది. అంతేగాని ఆత్మ - అది ప్రాణము కలిగినట్టి ఒకానొకటి కాదు! పరబ్రహ్మమునకు ప్రాణధర్మములు లేవు. విద్యుత్తు యంత్రమును కదల్చుచుండవచ్చు గాక! విద్యుత్తు యంత్రములు కదల్చు స్వభావము రూపము ఉన్నది - అని అనం కదా!

**అమనాః** : జలము నుండి తరంగము ప్రదర్శితమౌతోంది. "తరంగము లేనప్పుడు, ఇక జలమునకు ఉనికి ఉండదు!"...అని అనగలమా? లేదు. అనలేము. మనస్సు లేనప్పుడు కూడా పరబ్రహ్మము ఉన్నది. **జాగ్రత్-స్వప్న-సుషుప్తులకు 'సాక్షి' అయి ఉన్నది.**

⌘ మనస్సుకు ఆత్మ ఆధారం. అంతేగాని మనస్సు ఆత్మకు ఆధారం కాదు!

⌘ ఈ జీవుడు → కోపము, ప్రేమ మొ॥న సర్వ గుణ లక్షణములకంటే మునుముందే - వాటికి వేరుగా, అప్రమేయుడై ఉన్నట్లు గమనిస్తున్నాం కదా. వ్యక్తి వేరు - ఆతని గుణము వేరు కదా। ఆలోచనల రూపమగు మనస్సుకంటే జీవాత్మ వేరుగా ఉన్నది. అందుచేత ఆత్మ **'మనోరహితము' 'అమనస్కము'** అని కూడా చెప్పబడుతోంది! అయితే ఏం? మనస్సుగా కనిపిస్తున్నది ఆత్మయే।.

**శుభ్రో** : ఏ వికారము లేనిది. అవ్యాకృతము సర్వ వికారములకంటే భిన్నమైనది.

**అక్షరాత్ పరతః** : (అక్షరమునకు ఆవల ఉన్నది). జీవాత్మ అక్షరము. తదితరమైన లోక - దేహ - గుణాదులన్నీ క్షరము. సర్వాత్మ జీవాత్మకన్నా విశేషమైనది. సర్వజీవాత్మలు తానై యున్నది - (సర్వతరంగములు జలమే అయినట్లుగా)। బంగారు ఖనిజమే (లోహమే) బంగారు ఆభరణముగా వున్నట్లు - పరమాత్మయే జీవాత్మ। పరమాత్మయే ఈ సమస్తము కూడా। ఆయనయే ప్రతి జీవుని స్వాభావికమగు పురుషోత్తముడు (ఉత్తమ పురుష। "I" in every body).

(యస్మాత్ క్షరమ్ అతీతోఽహమ్ అక్షరాదపి చ ఉత్తమః,
అతోఽస్మి లోకే వేదే చ ప్రదిత "పురుషోత్తమః"!)

[ఒక వ్యక్తికి దేహమే ఉపాధి. ఒక ఉద్యోగికి ఉద్యోగమే (Officer, General Manager etc.,) గుర్తుగా గల ఉపాధి).
అట్లాగే...]
ఆ పరమపురుషునికి **'మాయ'**యే ఉపాధి.

అట్టి **'మాయోపాధి'** నుండి ప్రాణశక్తి (Energy Force), మనస్సు (Thought), ఇంద్రియములు (The Physical organs namely -Ears, Skin, Eyes, Tongue and Nose), ఆకాశము (Space), వాయువు (Vapour), అగ్ని (Heat), జలము (Liquid), పృథివి (Solid) ...ఇవన్నీ బయల్వెడలుచు, **దృశ్యమానమగుచున్నాయి.**

ఓ బిడ్డలారా! ఒక వ్యక్తి → దేహి + దేహము కలిపి కదా, మనకు కనిపిస్తున్నది! ఈ విశ్వమంతా ఒక దేహము → అని...అనుకుంటే...**ఈ విశ్వముయొక్క దేహియే పరబ్రహ్మము. అదియే నీలోని నాలోని - జాగ్రత్, స్వప్న, సుషుప్తి సాక్షియగు 'నేను' కూడా।**
**అట్టి విశ్వస్వరూపుడు - విశ్వేశ్వరుడు అగు పరబ్రహ్మమును విరాట్ రూపుడుగా కవులు వర్ణిస్తూ ఉన్నారు.**

- అగ్ని ఆయన శిరస్సు **(అగ్నిర్ముఖమ్ / అగ్నిర్మూర్థా)।**
- సూర్యచంద్రులు రెండు కన్నులు **(చక్షుషీ చంద్ర సూర్యే)।**
- దిక్కులు ఆయనకు చెవులు. **(దిశః శ్రోత్రే)।**
- వేదవాఙ్మయము ఆయన పెదవుల నుండి అపౌరుషేయంగా జాలువారు శబ్దబ్రహ్మము **(వాక్ వివృతాశ్చ వేదాః)।**
- వాయువు ఆయన ప్రాణవిభవము. **(వాయుః ప్రాణో)।**
- ఈ విశ్వము ఆయన హృదయం **(హృదయం విశ్వమస్య)।**
- ఈ పృథివియే ఆయన పాదాలు. **(పద్భ్యాం పృథివీ)।**
- ఆయన ఆత్మయే సర్వ జీవుల అంతరాత్మ **(ఏష సర్వభూతాంతరాత్మా)।**

అట్టి మూర్తీభవించియున్న **పరబ్రహ్మమునుండి** సూర్యునే సమధ (కట్టె)గా చేసుకొని అగ్ని (Heat) బయల్వెడలుతోంది. సూర్యతత్త్వం నుండి చంద్రతత్త్వం (Cool), చంద్రుని నుండి మేఘాలు, ఆ మేఘాల నుండి ఓషధ రూపమగు భూమి, ఆ ఓషధుల నుండి రేతస్సు, ఆ రేతస్సుకు నుండి స్త్రీ పురుషరూపులగు జీవులు బయల్వెడలుచున్నారు. ఓషధలులోనుండి జీవులను పరిపోషిస్తున్న 'ఆహారము' ప్రసాదితమవుతోంది.

***ఆ పరబ్రహ్మము నుండే →***

- పంచభూతాలు, వివిధ లోకములు.
- ఒక్కొక్క లోకంలో దేవతలు, మానవులు, జంతువులు, పక్షులు, తదితర అసంఖ్యాక జీవ - జంతు జాతులు, వారి వారి ఉచ్ఛ్వాస - నిశ్వాసలు. ఆహారముగా నవ ధాన్యాలు.
- ఆ జీవులకు సంబంధించి తపస్సు, శ్రద్ధ, సత్యము, బ్రహ్మచర్యము, విధులు - నిషేధాలు (Do's and Donts).
- ఋక్ - యజుర్ - వేదములు.
- పరమాత్మను స్తుతించే గానములతో కూడిన సామవేదం.
- సృష్టి తత్త్వమును విశదీకరిస్తున్న అథర్వణవేదము.
- యజ్ఞ విధులు, దక్షిణలు, వివిధ యజ్ఞములు, క్రతువులు, యజమాని.
- కాలరూపమైన సంవత్సరములు. నెలలు, పక్షములు, రోజులు, గంటలు, నిముషములు, సెకనులు.
- పంచాగ్నులు -

  ప్రథమాగ్ని - **ఆకాశము.**
  ద్వితీయాగ్ని - **మేఘములు.**
  తృతీయాగ్ని - **ఓషధులు.**
  చతుర్థాగ్ని - **జీవులు.**
  పంచమాగ్ని - **జీవ సంతతి లక్షణ, విలక్షణములు.**
- సప్త ప్రాణశక్తులు
- సప్త హోమాలు, సప్త లోకాలు

**ప్రాణ – అపాన – వ్యాన – ఉదాన – సమాన – సప్రాణములు. ముఖ్య ప్రాణ–ప్రాణేశ్వరులు.**

- సప్త సముద్రములు.
- సూర్య చంద్రులచే పవిత్రం చేయబడుచున్న అనేక స్థానాలు.
- గుహలు, నదులు, సరస్సులు, తటాకములు, పాతాళజలములు.
- వివిధ అధిష్ఠాన దేవతలు, దిక్ దేవతలు, స్థలదేవతలు, వారి – వారి పరివారములు, వారి వారి లోకాలు.
- తపస్సు – శ్రద్ధ – సత్యము – బ్రహ్మచర్యము – నిష్ఠ –నియమము మొ॥ వాటితో కూడిన కర్మ విధి – విధానములు.
- పర్వతములు, పర్వతగుహలు, నదులు, ద్వీపములు, ద్వీపకల్పములు.

.... ఇటువంటి వర్ణనాతీతమగు వస్తు – విషయ – జీవ సముదాయమంతా (ఆ పరబ్రహ్మమునుండే) అభిన్నమై భయల్వెడలుచున్నాయి. ఈ విశ్వమంతా ఆత్మయొక్క విన్యాసమే! ఆత్మయొక్క భావనా చమత్కృతియే! ఈ విశ్వ నిర్మాణమంతా ఆత్మయొక్క పరివృత (Filled up) మూర్తీభవ విశేషమే! **ఆత్మ దీనినంతటికీ అనన్యం. ఇదంతా ఆత్మకు అనన్యం! ఈ సమస్త విశ్వముగా మూర్తీభవించిన పరమాత్మయే సమస్త దేహములలో 'మూర్తి' అయి వెలయుచున్నారు.**

**శౌనకుడు** : హే భగవాన్! అంగీరస మహర్షీ! అటువంటి పరమాత్మయొక్క ఉనికి ఎక్కడ? అద్దానిని మేము ఎట్లా ఎక్కడ దర్శించగలుగుతాం? అద్దాని ఔన్నత్యమేమిటి? ఇవన్నీ వివరించండి!

శ్రీ అంగీరసమహర్షి :

> **శ్లో॥ పురుష ఏవ ఇదగ్ం విశ్వం కర్మ తపో బ్రహ్మ పరామృతమ్।**
> **ఏతత్ యో వేద నిహితం గుహాయాం**
> **సో అవిద్యాగ్రంథిం వికిరతీహ। సోమ్య!**

ఓ సోమ్యా! శౌనకా! నీకు అనుభవమౌతున్న ఈ విశ్వము, ఇక్కడి సర్వ కర్మ వ్యవహారములు, సర్వజీవులయొక్క తపనలు, (తపస్సులు). అమృతస్వరూపుడగు పరమాత్మయొక్క ప్రత్యక్షరూపమేనయ్యా! పరమాత్మయే ఈ సమస్తము అయివుండి,...మనో దృష్టికి నామరూపాత్మకమైన (మనం పైన చెప్పుకున్న) సర్వవిశేషాలుగా కనిపిస్తోంది! **ఆత్మజ్ఞులకు – ఇదంతా కూడా, అనేకంగా కనిపిస్తూ ఏకమగు పరమాత్మగా అనిపిస్తూ, ఇదంతా తమ హృదయాంతరంగములోనే ఉన్నట్లుగా ఆస్వాదిస్తున్నారు!**

ఎవ్వడైతే....

అట్టి పరబ్రహ్మము తన హృదయ గుహలోనే తనకు సర్వదా అనన్యమై ఉన్నదానిగా తెలుసుకొంటున్నాడో, గమనిస్తున్నాడో, దర్శిస్తున్నాడో, ఆస్వాదిస్తున్నాడో,... అట్టివాడు తనయొక్క – **అజ్ఞానము అనే చిక్కుముడిని (అవిద్యా గ్రంథిని) ఇక్కడికిక్కడే, ....ఇప్పుడే తెగవేసి, ఈ జన్మలోనే ముక్తుడగుచున్నాడు.** (Having been relieved of all bottlenecks for enjoying sense of Divinity).

**"నాకు జగత్తు బంధము కాదు. నేనే సర్వదా జగదాత్మ స్వరూపుడను!"** అను పరమార్థముతో ప్రకాశిస్తున్నాడు!

## 4. ద్వితీయ ముండకే - ద్వితీయ ఖండః

### "అది నీ ఆత్మగానే నీయందు ప్రకాశిస్తోంది!"

**శ్రీ అంగిరసమహర్షి :** ఓ శౌనక మహాశయా! ఇదంతా వింటున్నట్టి బిడ్డలారా! వేదములచే, వేదాంగములచే, వేదజ్ఞులచే, ఆత్మజ్ఞులచే – ఆత్మయొక్క ఉనికి – స్థానము – ఔన్నత్యముల గురించి ఇంకా కూడా ఏమేమని చెప్పబడుతోందో....అట్టి మరికొన్ని విశేషాలు మీ అందరి ముందు ఉంచుచున్నాను. వినండి!

'ఆత్మ'యే స్వరూపముగా గల 'ఓం' సంజ్ఞాయుతమైన ఆ పరబ్రహ్మము మనలోని ప్రతి ఒక్కరికి అత్యంత సన్నిహితమైయున్నది (That is the closet of all to every body of us). అత్యంత సామీప్యమైనది. ఇంకొంచం నిర్దుష్టంగా చెప్పాలంటే....అద్దాని స్వయం ప్రకాశ ప్రదర్శనమే ఈ మనమంతా కూడా! **మనందరి హృదయ గుహలే అద్దానియొక్క ఉనికి – సంచార ప్రదేశము కూడా!** ఆత్మకు

మించినది, ఆత్మకు వేరైనది మరెక్కడా ఏదీ లేదు! అదియే మహత్తరమైనది. ఆ బ్రహ్మమే మనందరికీ కూడా స్వభావసిద్ధమైన నిత్యాశ్రయము. **ఈ ప్రత్యక్ష - అనుభవైక వేద్యమంతా బ్రహ్మమే అయిఉన్నది.**

మనమందరము ఉనికిని (సత్) కలిగియున్నది - ఆ బ్రహ్మమునందే! ఇక్కడ మనకు కనిపించేదంతా బ్రహ్మమే। కదిలేవి, కదిల్చేవి, కదలనివి, ప్రాణము లేనివి, ఉన్నవి (జడ - చైతన్యములు), రెప్పలు వాల్చేవి, రెప్పలు వాల్చనివి (భూ-పాతాళ జీవులు - దేవతా జీవులు) - ఇవన్నీ బ్రహ్మమునందే (బంగారమునందు ఆభరణత్వమువలె) - అమర్చబడినవై ఉన్నాయి. **తెలియబడేది - తెలుసుకుంటున్నది,... ఉభయము పరబ్రహ్మ చమత్కార ప్రత్యక్షరూపమే!**

**యత్ ప్రజానాం వరిష్ఠం** - ఏదైతే జీవులందరిలో, ప్రతి ఒక్క జీవునిలో శ్రేష్ఠాతి శ్రేష్ఠమైనదియో, ఏది సత్తు - అసత్తుగా అనుభూతమౌతూ ఉన్నదో, ఏది వరేణ్యం - సర్వారాధ్యమో, (ఉపాసించబడుచు, ఆరాధించబడుచూ) - ఆస్వాదించబడుచూనే ఉన్నదో.... అదియే -- మనలో సర్వదా వేంచేసియున్న **"అహం-త్వంలను తనయందు అంతర్భాగముగా కలిగియున్న - అతీత అఖాండాత్మ".**

ఏదైతే ....

- సర్వదా దీప్తిమంతమో, స్వయంజ్యోతియో, తదితరమైనదంతా తానే ప్రకాశింపజేస్తోందో....,
- అణువుల కంటే కూడా సూక్ష్మాతి సూక్ష్మమో (Subtle to what is subtle),
- ఎందులో అయితే లోకములు - లోకస్థులు - లోకేశులు (నిహితాః) → అద్వితీయంగా ఇమిడి ఉన్నాయో..,

అదియే **అక్షరము, మార్పు చేర్పులకు అవిషయము అగు బ్రహ్మము.**

ఆ బ్రహ్మమే....

- ప్రాణశక్తి రూపంగాను,
- వాక్ - మనో రూపంగాను - అనుభూతమౌతోంది.

అదియే పరమసత్యము! అమృతస్వరూపము. నాశరహితము. మీ స్వరూపము! నా స్వరూపము! సర్వ స్వరూప సాక్షి!

బిడ్డా! అదియే లక్ష్యముగా లక్ష్యశుద్ధి కలిగి ఉండవలసిన వస్తువు. అదియే మనం సర్వదా తెలుసుకొని ఉండాలయ్యా!

ఓ సోమ్యుడా!

అందుకు మార్గం వివరిస్తున్నాను. విను.

ఉపనిషత్ సాహిత్యం - తత్ - త్వమ్ అసి (నీవు అదియే అయి ఉన్నావు) అనే ఒక మహాస్త్రాన్ని మనందరికి ప్రసాదిస్తోంది. ఆ ధనస్సుతో ఉపాసన (Cogitation - Meditation - Repeated Thought practice - adoration) అనే శరమును పదును చేసుకొంటూ సంధించు.

"ఈ కనబడే జీవులు - సంబంధాలు - అసంబంధాలు పరబ్రహ్మమునకు సదా అద్వితీయం కదా!"....అనే తత్ భావనచే ఏకాగ్ర దృష్టికి పదును పెట్టుకో (Please by interpreting all this as diverse manifestation of Unity).

బుద్ధిని సునిశితం చేయి!

అట్టి **'చింతన'** యందు చిత్తమును లగ్నం చేయి!

**"అవినాశమగు బ్రహ్మమే నేను కదా!"** అనే లక్ష్యమును ఛేదించు. చేరుకో!

తత్త్వ దృష్టిని ('నీవు'గా కనిపిస్తున్నది పరమాత్మయే అను దృష్టిని) **హృదయమునందు పదిలపరచుకొని జగత్తులో నివసించు.**

- పరమాత్మ - జీవాత్మ - జగదృశ్య అ + ఉ + మ అర్థ మాత్ర సంజ్ఞ అయినట్టి **ప్రణవమే నీ ధనస్సు అగుగాక!**
- ఆత్మయే (జీవాత్మయే) (Your own self) బాణము.
- బ్రహ్మమే నీకు లక్ష్యము.

బాణము లక్ష్యమును తాకి ఛేదించినట్లు (1) బ్రహ్మమును ఎరుగటం (2) తన్మయమగుట (3) తత్ అద్వితీయంగా నిన్ను నీవే తీర్చిదిద్దుకోవటం - ఇట్టి కార్యక్రమములో నిత్యము అప్రమత్తుడవై ఉండు. ప్రమత్తుడవై ఉండవద్దు.

## యతః సర్వాని భూతాని।

ఎందులో అయితే...

ద్యులోక (స్వర్గలోకము), భూమి (భూలోకము), అంతరిక్షము (ఆకాశము), సర్వప్రాణులు (సహజీవులంతా), సర్వుల మనస్సులు - మనో విశేషాలు, భూమ్యాకాశాలు, వాటి మధ్యగల అంతరాళము - అమరి ఉన్నాయో, అదొక్కటే నీ లక్ష్యమై ఉండుగాక! **అది నీ ఆత్మ స్వరూపమేనని గ్రహించటమొక్కటే పని!**

ఇక మిగతా వాక్ ప్రవాహమంతా ప్రక్కకు పెట్టు. తదితరమైనదంతా అర్థం చేసుకుంటూ - క్రమంగా త్యజించి వేయి. సర్వము నీ ఆత్మస్వరూపంగా ఆస్వాదించు. అట్టి ఆత్మజ్ఞానమే ఈ సంసారము నుండి అమృతతత్త్వమునకు వారధి (Barriage) అయి ఉన్నది.

❋ రథము యొక్క నాభియందు ఇరుసు నాభివైపుగా - ఆకులు (Designs of leaves) అమరి ఉన్నట్లుగా, నీ దేహములోని నాడులన్నీ హృదయము వైపుగా అనుసంధానము కలిగి ఉన్నాయి.

- అట్టి నీ హృదయం లోపలనే....
- ఆత్మ అనేక రీతులుగా (సర్వజగత్ జీవ -గుణ విశేషాలుగా)....

**లీలా వినోదంగా సంచారాలు సలుపుచున్నది.** అట్టి సర్వాత్మకమగు స్వస్వరూపాత్మను 'ఓం' అనే వేద - వేదాంత ప్రవచిత సంజ్ఞతో ధ్యానించు. ధ్యాసయే ధ్యానం। తద్వారా అజ్ఞానాంధకారాన్ని పటాపంచలు చేసుకో! అట్టి "ఆత్మోపమ్యేవ సర్వత్ర" అను సుస్పష్టత వైపుగా అడుగులు వేస్తున్న నీకు స్వస్తి అగుగాక!

నాయనా! **"నేను అజ్ఞానాంధకారంలో చిక్కుకున్నానే"**....అని దిగులు పడకు. జాగుచేయనూ వద్దు.

- ఆత్మ సర్వజ్ఞుడు. ఆత్మకు అంతా తెలిసియే ఉన్నది.
- ఆత్మను సమగ్రంగా (Comprehensively) తెలుసు (సర్వవిత్). సమస్తము ఆత్మయందే అమర్చబడినది.
- నీవు ఆత్మయే అయి ఉన్నావు.

ఈ కనబడే దృశ్యమంతా, ఈ భూ ప్రపంచమంతా **నీ ఆత్మయొక్క మహిమయే! ఆత్మ వైభవమే!**

హృదయాకాశంలో హృదయాకాశంగా జ్యోతిర్మయమై ప్రకాశిస్తున్నది నీ ఆత్మయే। ఆత్మజ్యోతి స్వరూపుడవై నీవే సమస్త హృదయములలో 'అహం' జ్యోతిగా వెలుగొందుచున్నావు. సమస్త జీవులలో ప్రదర్శనమగుచున్న "పరంజ్యోతి"వి నీవే।

- **మనస్సు అద్దాని వస్త్రము.**
- అట్టి ఆత్మ ప్రాణ - శరీరాలకు అధినేత (Owner).
- ఆత్మయే హృదయంలో వేంచేసి నీ శరీరమంతా విస్తరించియున్నది.

వివేకంచేతను, ఉపాసన చేతను ఆత్మజ్ఞులు - అగు ధీరులు **అట్టి ఆనందమయ ఆత్మతో అవినాభావత్వం** సాక్షాత్కరించుకొని, సర్వే - సర్వత్రా ఆత్మస్వరూపులై వెలుగొందుచున్నారు. నీవు కూడా ఆ మార్గంలో అడుగులు వేయి.

ఈ జీవుని అంతర్గతమైన దిగుళ్ళు తొలగటానికి - ఇది మాత్రమే ఏకైక మార్గము.

ఆత్మస్వరూపుడవై పరాపర దృష్టి విజ్ఞానమయం - అనుభూతమయం చేసుకో.

ఆ విధంగా **"కనబడేదంతా మమాత్మాతేజోవిశేషమే"** అనే పరావరదృష్టి అనుభూతమగుచూ ఉండగా...,

- హృదయగ్రంథి (అజ్ఞానపు ముడులన్నీ) భిద్యతే - తెగిపోతాయాయి. విచ్చుకుంటాయి.
- సర్వ సంశయాలు మొదలంట్లా తొలగిపోతాయి. అనుమానాలన్నీ మటుమాయమౌతాయి. చీలిపోతాయి.
- పూర్వ - వర్తమాన భవిష్యత్ కర్మలన్నీ దృష్టిలో లేకుండాపోతాయి. కర్మ - కర్మ ఫల ఆవరణలను నీవు అధిగమించివేస్తావు.

నాయనా! ఆత్మవేత్తలు ఉన్నారు.

- నిష్కళంకమై - నిర్దోషమై,
- అవిద్యాదోషములచే స్పృశించబడనిదై,
- బాహ్య - అభ్యంతరములలో - దృశ్య, దేహ, మనో, బుద్ధి, చిత్త, అహంకారాలలంతా నిండియున్నదై,
- జ్యోతులకే జ్యోతి స్వరూపమై,

అంతటా అన్నీగా ప్రకాశమానమగుచున్న పరబ్రహ్మము **వారు తెలుసుకొనియున్నారు.** ఆస్వాదిస్తున్నారు. మనపై కరుణతో ప్రవచిస్తున్నారు.

**అట్టి ఆత్మానంద పరవశుల పాత్యాంశాలు జాగరూకడవై మరల - మరల విను!**

ఆత్మస్వరూపమగు పరబ్రహ్మము సమక్షంలో →

- ఈ భౌతిక సూర్యుడు ప్రకాశించలేడు.
- అట్లాగే చంద్రుడు - నక్షత్రాలు - విద్యుత్తు ప్రకాశించటంలేదు.
- ఇక అగ్ని ప్రకాశించటం లేదని వేరే చెప్పాలా?

"వీటన్నిటి ప్రకాశంలోనే ఆత్మను వెతకి దర్శిస్తాను"...అని అనుకోకు!

మరి?

ఇవన్నీ కూడా....

ఆత్మ ప్రకాశములో కాంతులీనుచున్నాయి.

ఆత్మ ప్రకాశం చేత ఇవన్నీ ప్రకాశం పొంది వెలుగుచున్నాయి.

- ఈ కనబడేదంతా అమృతస్వరూపమగు బ్రహ్మమే!
- ఇద్దాని వెనుక - ముందు - ఇటు - అటు - క్రింద - పైన బ్రహ్మమే ప్రకాశిస్తోంది.
- బ్రహ్మమే ఇదంతా ప్రదర్శిస్తోంది.
- సంసారదృష్టికి అనేక రీతులుగా కనిపిస్తున్న ఈ విశ్వమంతా **బ్రాహ్మీదృష్టిచే అద్వైత - అఖండ - ఏక పరబ్రహ్మమేనయ్యా!**
- **బ్రహ్మము మాత్రమే ఇక్కడ - అక్కడ - ఎక్కడైనా విశిష్టమైన వస్తువు.**
- బ్రహ్మతత్త్వమే ఇదంతా!
- నీవు, నేను, వారు, వీరు, మన మన అనుభూతులు, అనుభవాలు, సుఖదుఃఖాలు, జ్ఞాన-అజ్ఞానాలు, జన్మ-జీవన-మృత్యువులు = ***అంతా - ఎప్పటికీ బ్రహ్మమే అయి ఉన్నది!***

## తృతీయ ముండకే - ప్రథమ ఖండః

### "జీవ - ఈశ్వర - ఇహ పర - సందర్భ కేవల"

ఒకానొక పెద్ద వృక్షం!

ఆ వృక్షమును రెండు పక్షులు ఆశ్రయించి ఉంటున్నాయి. ఆ రెండు పక్షులు ఒకదానిని మరొకటి వదలక పరస్పర **'సమక్ష-సందర్శనములు'** కలిగియే ఉంటున్నాయి. అందులో ఒక పక్షి ఆ వృక్షమునకు కాస్తున్న ఫలములను (పళ్ళను) ఎంతో ఆసక్తి - అభిని వేశములతో రుచిచూస్తూ కొమ్మ - కొమ్మలపై ఎగిరెగిరి గంతులేస్తోంది.

ఇక, రెండవ పక్షి తానేమీ తినక, స్వీకరించక, **అతీతంగా - మౌనంగా - ప్రశాంతంగా - ఆనందంగా** అన్నీ గమనిస్తూ ఉన్నది.

ఆ రెండు పక్షులు ఒకే వృక్షంమీద నిమగ్నమై ఉన్నాయి. అయితే మాత్రం ఏం? ఒక పక్షి - (జీవాత్మ...)మోహము, భ్రాంతి పొందుచు కొన్నికొన్నిసార్లు నిస్సత్తువగా దుఃఖిస్తూ ఉన్నది. అట్లా దుఃఖిస్తూ - వేదన చెందుతూ ఎప్పుడో ఒక సమయంలో - తన ఆరాధ్యమూర్తి, ప్రభువు అగు మరొక పక్షిని - (పరమాత్మను), అద్దాని వైభవాన్ని చూడటం జరుగుతోంది. అట్లా మహామహితాన్వితమైన రెండవ పక్షియొక్క (ఈశ్వరునియొక్క) దర్శనమవగానే "ఓహో! నాకేమి లోటు? వీటితో (కొమ్మలతో) నాకేమీ సంబంధము?'....అని ఈ జీవాత్మ పక్షి ప్రశ్నించుకొని ప్రశాంతపడుతోంది. దుఃఖమంతా త్యజించివేస్తోంది. (It is leaving aside all worries at its core).

అనగా...

**ఎప్పుడైతే మొదటి పక్షియగు జీవాత్మ** →

- స్వయం ప్రకాశకమైనది, బంగారు రంగుతో మెరుగుస్తున్నది,
- దృశ్యమునకు - సృష్టికి కర్తయగు బ్రహ్మకు కూడా 'ఆది' అయినట్టిది,
- సకల జగత్తుకు కర్త, ఈసుడు, పరమపురుషుడు, పరమాత్మ - అగు తత్త్వమును - **దర్శిస్తాడో,** అప్పుడిక,-
- పుణ్యపాప ద్వంద్వములను విదిలించి వేసి, ఆ రెండు భావనలనుండి విడిపడినవాడై, విముక్తుడై,

✠ **'నిర్దోషం హి సమంబ్రహ్మ', "ఆత్మ సర్వదా నిర్మలము కదా! నేను – తదితరులు సహజంగా ఆత్మస్వరూపులమే కదా!"**...అను అవగాహన పెంపొందించుకుంటూ నిరంజనుడై,

**సర్వోత్తమమైన సమస్థితిని పొందుచున్నాడు.**

❖

❦ పరమాత్మ ప్రాణస్వరూపుడై సర్వప్రాణులయందు శక్తిప్రదాత అయి విరాజిల్లుచున్నారు.

❦ అట్టి పరమాత్మత్వమే నా సహజ రూపము. తదితరమైనదంతా సందర్భసత్యము. కథలోని పాత్రలవలె కల్పితము.

అని గమనించి, తెలుసుకొనుచున్నవాడు – ఇక 'వేరు – వేరు'కు సంబంధించిన విషయాలు ఎక్కువగా మాట్లాడడు. అతిగా (ఆత్మకు వేరైన విశ్లేషణలు) సంభాషించడు. వట్టి మాటకారి కాడు. **సదా ఆత్మభావనానందమునందు తేలియాడుతూ, తదితర దృశ్య కల్పిత విషయములపట్ల అంతరంగమున మౌనం వహించినవాడై వుంటాడు.**

– ఆత్మయందు రమిస్తూ...,
– ఆత్మయొక్క క్రీడగా ఇదంతా దర్శిస్తూ...,

ఆత్మయందే ఆసక్తి కలిగినవాడై ఉంటాడు. తత్సంబంధమైన జ్ఞాన – ధ్యాన – వైరాగ్య ఇత్యాది కార్యక్రమములందు మాత్రమే అభిరుచి – శ్రద్ధ కలిగి ఉంటాడు.

క్రమంగా బ్రహ్మజ్ఞానులలో అగ్రగామిగా తనను తాను తీర్చిదిద్దుకుంటూ ఉంటాడు.

ఆత్మయందే నిష్ఠగల మహనీయులు క్రమంగా దృష్టియొక్క దోషములను తొలగించుకుంటూ సత్యము, తపస్సు, ధ్యానము, జ్ఞానము – బ్రహ్మచర్యములను చక్కగా – నిరంతరాయంగా సేవిస్తూ...**"నిర్మలము – జ్యోతిస్వరూపము – అఖండము"** అగు ఆత్మను తమ శరీరమునందే (తమయందే) సిద్ధించుకొంటున్నారు. **ఆత్మ మనస్సుచేత మనస్సునందే లభించుచున్నదగుచున్నది.**

**సత్యమేవ జయతి. నానృతం।**

సత్యనిష్ఠులే (యమ్‌సత్ – సత్యరూపమగు ఆత్మపట్ల నిష్ఠగల వారే) – అజ్ఞానభ్రమలను జయిస్తున్నారు. అసత్యమునందు (కల్పిత దృశ్యమునందు) నమ్మకముతో కూడిన ధ్యాస గలవారు **అసత్యవాదులు** అనబడుచున్నారు. వారు ఆత్మత్వమును పుణికిపుచ్చుకోలేకపోతున్నారు.

– ఆప్తకాములు (ప్రపంచంలో పొందవలసినది ఏమీ లేనివారు, కోరికలు జయించినవారు)

– ఋత్‌ను (సత్యమును) ఉపాసించువారు, **పరమపదమును చేరుచున్నారు.** అంతా స్వస్వరూపంగా అనుభూతం చేసుకొని ఆస్వాదిస్తున్నారు.(స్వానుభవమ్ ఋత్ ప్రకటితీతి ఋషిః)

ఓ శౌనకా!

**బృహత్** ⟶ బహువిస్తారము (At Extended) అయినట్టిది.
**దివ్యమ్** ⟶ దివ్యము (Devine) అయినది.
**అచింత్యరూపమ్** – మనోవాక్కులకు అవిషయము.
**సూక్ష్మాత్ సూక్ష్మతరం** ⟶ సూక్ష్మాతిసూక్ష్మమై యున్నట్టిది.
**దూరస్తు దూరే** ⟶ బాహ్యదృష్టిచే దూరాతిదూరమై ఉన్నది.
**అంతికేచ** ⟶ ద్రష్టకు అత్యంత సమీపము – స్వస్వరూపాభిన్నము.

**ఈవిధంగా ఆత్మతత్త్వోపాసకుడగు మహనీయునికి స్వహృదయమునందే అది లభిస్తోంది. ఎందుకంటే ఆత్మయొక్క ఉనికిస్థానము ప్రతిఒక్కని హృదయగుహయే సుమా!** (అంతేగాని, బాహ్యమున ఏదో లోకములో కాదు).

*ప్రియ శౌనకా! ప్రియ శ్రోతలారా!*

ఆత్మ ఎటువంటిదంటే...

❦ అది కళ్ళకు ఎదురుగా ఒక దృశ్యము వలె **కనిపించేది కాదు.** కానీ, కనిపించేదంతా **అద్దానికి అభిన్నము.**

❦ వాక్కుతో (మాటలతో) "ఇది ఇట్టిది" అని నిర్వచించి చెప్పగలిగేదీ కాదు. కానీ **వాక్కులన్నీ అద్దానివే.**

- బాహ్య దేవతలవలన **ఇంద్రియములకు లభించేదీ కాదు. కానీ ఇంద్రియములన్నీ నియమించునది, ఉపయోగించునది అదియే।**
- **కర్మలు – కార్యక్రమములచేత పొందగలిగేదీ కాదు. కానీ సమస్త కర్మలు అద్దానికి చెందినవే। అద్దానివే।**

పరిశుద్ధమగు అంతఃకరణముతో ఆత్మజ్ఞానము చేత **"మమాత్మయే కదా, ఈ కనబడేవారంతా, ఇదంతా"**...అను నిష్కళంక ధ్యానము (ధ్యాస)చే మీరంతా ఆత్మవిశుద్ధ బుద్ధులైతే తప్పక (బుద్ధితో) ఇక్కడ సందర్శించగలుగుతారు. ఇందులో సందేహమే లేదు.

ఏ ప్రాణశక్తి (ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన సమానములనబడే) పంచప్రాణముల రూపంగా ప్రవేశించిందో, అట్టి ఈ శరీరమునందే అణు (సూక్ష్మాతిసూక్ష్మ subtle to subtle) స్వరూపమగు ఆత్మను శుద్ధమైన – సూక్ష్మమైన – నిర్మలమైన చిత్తముతో సందర్శించాలి. ఆత్మయొక్క వైభవమును (వైభవరూపమగు జగత్ దృశ్య వ్యవహారమంతా) అంతరంగమునందే విజ్ఞులు తెలుసుకొనుచున్నారు! గాంచుచున్నారు। ఉపాసించుచున్నారు. ఆస్వాదించుచున్నారు। మమేకమగుచున్నారు।।

**స్వచ్ఛమైన చిత్తమునకు ఆత్మ అంతరంగమునందే పరిలభ్యమగుచున్నది।**

## దుఃఖ పరంపరలు – ఉపశమన ఉపాయములు

దృశ్య విషయములను, అనేకత్వముతో కూడిన విశేషములను, సంబంధ – అనుబంధ బాంధవ్యములను, ప్రాపంచక సంఘటనలను మననము చేయుటచే ఈ జీవునికి వాటిపట్ల అనురాగము, కామ – క్రోధములు, వాటి నుండి కర్మ పరంపరలు ఏర్పడుచున్నాయి.

కర్మల వెంట పరుగిడుచున్న చిత్తము ఇష్టాయిష్టములకు, ఆశ – నిరాశలకు, భయ – ఉద్వేగములకు వశమై ఈ జీవునికి బలవంతముగా జన్మకర్మ పరంపరలను 14 లోకములలో సంప్రాప్తింపజేస్తోంది.

అట్టి జన్మ – కర్మలన్నీ జీవునికి బంధరూపముగా అగుచున్నాయి. జీవుడు వాటికి బద్ధుడై, ఇష్టము లేకపోయినప్పటికీ, బలవంతముగా జన్మ – కర్మ చక్రములో తిరుగాడుచున్నాడు.

అట్టి జీవుడు పొందుచున్న అజ్ఞానరూప దుఃఖపరంపరలకు ఉపశమనోపాయం?

**"బ్రహ్మజ్ఞానము। బ్రహ్మోపాసన। (లేక) ఆత్మజ్ఞానము। ఆత్మోపాసన।"**

- ఎవ్వడైతే – **ఆత్మయందే సర్వలోకములను, సర్వలోకములు ఆత్మస్వరూపంగాను** దర్శించటం అభ్యసిస్తూ,
- అట్టి ఆత్మోపాసనచే విశుద్ధసత్త్వస్వభావుడై పరిశుద్ధ స్వరూపుడు అగు ప్రయత్నమునందు శీలుడై ఉంటాడో....

అట్టివాడు "**స్వాతంత్ర్యుడు**" అగుచున్నాడు. **సిద్ధపురుషుడు అగుచున్నాడు.**

**ఆతడు ఏఏ లోకంలో ఏఏ స్వరూపం పొందాలని మనస్సుతో అనుకుంటాడో, తలుస్తాడో, అవన్నీ ఆతనిపట్ల తక్షణమే సిద్ధిస్తాయి.**

ఆతడు క్రీడా వినోది అయి తన ఇష్టానుసారంగా జన్మలలో సంచరిస్తాడేగాని, జన్మ – కర్మలచే తాను బద్ధుడు కాడు. జన్మలు ఆత్మోపాసకుని నియమించలేవు. ఆతడు "సర్వము ఆత్మస్వరూపమేకదా!" అను సిద్ధిచే జన్మలకు తానే నియామకుడౌతాడు. అవతారమూర్తి అయి, స్వతంత్రుడై జన్మలయందు లీలావినోదిగా సంచారములు సలుపుతాడు. జన్మలు ఆతని ఆధీనంలో ఉంటాయి.

జన్మల ఆధీనంలో ఆతడుండడు. కనుక,

**ఈ జీవునికి బంధ విముక్తికై ఆత్మజ్ఞానము – ఆత్మసాక్షాత్కారము – ఆత్మాహం భావనయే** *"బంధ విముక్తి ప్రదాత। మోక్ష ప్రదాత।*

# తృతీయ ముండకే – ద్వితీయ ఖండః

ఓ శౌనకా! ఓ ప్రియ శ్రోతలారా!

ఇంకా వినండి!

బ్రహ్మజ్ఞాని – ఈ ఎదురుగా దృశ్యమానంగా కనిపిస్తున్న బ్రహ్మాండమంతా బ్రహ్మముపై ఆధారపడి ఉన్నట్లు, బ్రహ్మమునకు అభేదమైనట్లు దర్శిస్తూ ఉపాసిస్తున్నాడు. ఆస్వాదిస్తూ ఆనందిస్తున్నాడు. ఎవ్వరైతే నిష్కాములై అట్టి బ్రహ్మవేత్తను శ్రద్ధతో ఆరాధిస్తున్నారో, సేవిస్తున్నారో, ప్రేమిస్తున్నారో, అట్టివారు కూడా, పరాస్వరూపభావులై **ఈ దృశ్య తతంగమును, జన్మపరంపరా న్యాయమును** అధిగమించి, వాటినన్నిటినీ అతిక్రమించినవారగుచున్నారు.

అట్లా కాకుండా...

ఎవ్వరైతే అత్యంత భోగాసక్తులై **"కామాన్యః కామయతే",** – ఏవేవో బాహ్య వస్తువులను పొందాలని కోరుకుంటూ, అట్టివాడు ఆయా భోగములను **"మరల – మరల పొందాలి, అనుభవించాలి"** అని తలుస్తూ ఉంటే,... దృశ్య సంఘటనలకు, సందర్భములకు దాసులై, **మరల మరల జన్మకర్మలకు బానిస అయి తిరుగాడుచూనే ఉంటున్నాడు.**

ఎవ్వడైతే...

**"ఆత్మయే స్వరూపముగా గల నేను సర్వదా ఆత్మకాముడను. ఆత్మస్వరూపముచే ఎల్లప్పుడు కృతార్థుడనే"** అని ఆత్మత్వానుభూతిని పదిలపరచుకుంటూ సుస్థిరం చేసుకుంటూ ఉండే ప్రయత్నంలో ఉంటాడో,... ఆతని దృశ్యసంబంధమగు కామములన్నీ (All Expectations and Desires) ఆతని **వర్తమాన శరీరమునందే లయించి, రహితమైపోతున్నాయి.**

ఆతనికి దేహ – దేహాంతర సందర్భములపట్ల దృశ్య – వస్తు సంబంధమైన కోరికలు ఇక మిగిలి ఉండవు.

కలిగినా, వాటినన్నిటినీ జగత్తులోనే ఉంచి, సమస్త జగత్తును త్యజించివేస్తున్నాడు. జగత్తు కంటే ఆవల దృష్టిని ఆశ్రయించినవాడై ఉంటున్నాడు.

ఓ శౌనకా!

మనము ఈ సంవాదమును ముగించటానికి ముందుగా, ఇక్కడ మరొక ముఖ్యమైన విషయం అందరికీ గుర్తుచేస్తున్నాను. పట్టుదల – ప్రయత్నమే ఆత్మతత్త్వ సిద్ధికి ఇంధనము సుమా!

> **శ్లో॥ న అయమ్ ఆత్మా ప్రవచనేన లభ్యో।**
> **న మేధయా న బహునా శ్రుతేన।**
> **యం ఏవ ఏషః వృణుతే తేన లభ్యః,**
> **తస్య ఏష ఆత్మా వివృణుతే తనుం స్వాం॥**

- ఆత్మత్వము – ఆత్మ వస్తువు ఎట్లా లభించేది?
- చదివి ప్రవచనాలు చేస్తూ (ఉపన్యాసాలు చెప్పితే) లభిస్తుందా...లేదు.
- తెలివి తేటలయొక్క గొప్పతనంచే ప్రాప్తిస్తుందా? ఉహూం కాదు!
- చాలా చాలా వింటే దొరుకుతుందా? లేదు!
- బలహీనులకు (స్థైర్యము లేనివారికి) అజాగరూకులకు, ఆత్మలక్ష్యశుద్ధి లేని అపస్వులకు అది లభించటం లేదు. ఎవ్వడైతే అద్దానిని "అనుకుంటూ– అనుకుంటూ ఉండటం" ...అని అనిపించేవరకు అభ్యాసిస్తూ ఉంటాడో,...ఆతనిపట్ల ఆత్మ తన స్వ స్వరూపాన్ని ప్రకటించుచున్నది। ఉపాయము తెలిసి, ఉపాసించువానికి తప్పక లభ్యమే! అనుకుంటూ ఉండటమే తపస్సు, సమస్తము ఆత్మగా అనిపించటమే **"ఆత్మతపో సిద్ధి".**
- ఎవ్వడు ఆత్మతత్త్వాని శ్రద్ధా – ఆసక్తులతో మనన పూర్వకంగా, ప్రేమపూర్వకంగా ప్రయత్నిస్తాడో, ఉపాసిస్తాడో,....ఆతడు ఆత్మయే తానై ప్రకాశిస్తున్నాడు.

**(He is becoming as All pervading and All present in the Inner and outer Recess of All)**

ఆత్మజ్ఞానమును సముపార్జించుకొని ఋషులు జ్ఞానతృప్తులై, సర్వ రాగములను తూష్ణీకరించుచున్నవారై, కృతకృత్యులై, ప్రశాంతత్వమును సంతరించుకొని ఉంటున్నారు.

ఓ శౌనకా! ఓ ప్రియ మమాత్మస్వరూప శ్రోతలారా! అట్టి **"ఆత్మానుభూతి, స్వస్వరూపానందము"** మనందరిలోని ప్రతి ఒక్కరికి తప్పక సుసాధ్యమే! అది ప్రతి జీవునికి జన్మహక్కు కూడా! ఎందుకంటే మనమంతా సర్వదా సత్యమగు ఆత్మస్వరూపులమే అయి ఉన్నాము కదా! కనుక ఈ విషయంలో ఎవ్వరూ కూడా నిరుత్సాహపడవలసిన పనిలేదు.

సత్యవ్రతులగు ఋషులు ఆత్మను విని, ఆశ్రయించి, ఆరాధించి సర్వాంతర్యామిత్వమును అనువర్తించి ఆస్వాదిస్తున్నారు. మనపై వాత్సల్యంతో మనకు ప్రకటిస్తున్నారు. అదంతా కూడా వారు మనపై కురిపిస్తున్న అవ్యాజమైన వాత్సల్యము. వారికి మనము కృతజ్ఞులము.

'అది సుసాధ్యమగు జ్ఞానగమ్యము'. **ఇతి ఉపనిషత్ వాణి।**

అందుచేత,

మీ ఆత్మతత్త్వమును గ్రహించి ప్రవేశించి బ్రహ్మముగా ప్రకాశించెదరుగాక। జన్మ, కర్మ, మృత్యుహేలపై యుద్ధము ప్రకటించి, అధిగమించెదరుగాక। "తెలియబడేదానికి ఆవల" గల "తెలుసుకొంటున్నవాని" యొక్క వాస్తవ స్వభావమైనట్టి వేదాంత విజ్ఞానమునందు సునిశ్చితమైన బుద్ధి కలవారై న్యాసయోగముచే పరిశుద్ధ మనస్కులు అయి ఇక్కడ ఆత్మను సుస్పష్టం చేసుకుంటున్నారు : –

- వేదాంతవిజ్ఞానమును సునిశ్చితం చేసుకున్నవారై,
- సర్వమును సన్న్యసించి – పరమాత్మకు చెందినదిగా గమనించి, **సర్వమును పరమాత్మకే సమర్పిస్తూ,**
- ఉత్తమ ప్రయత్నంచే బుద్ధిని నిర్మలం చేసుకొనుచున్నవారై...,

ఈ దేహాదులను అధిగమించి బ్రహ్మపట్టణములో ప్రవేశిస్తున్నారు. బ్రహ్మమునందు ప్రకాశిస్తున్నారు. అమరులై, సదా ముక్తులై ఈ భూమిని పరమపావనం చేస్తున్నారు.

ఇక ఇక్కడి 15 అంశాలైనట్టి

– పంచ ప్రాణాలు,

– పంచేంద్రియ విషయాలు,

– దేహ – మనో – బుద్ధి – చిత్త – అహంకారాలు.

--వాటివాటి యందు అధిదేవతలయందు లీనమై ఉండియే, **బ్రహ్మజ్ఞాని పట్ల ఆభరణములుగాను, సేవకులుగాను** ప్రవర్తిస్తున్నాయి. **వారియొక్క జగదంతర్గత వ్యక్తిత్వము, కర్మలు మొదలైనవన్నీ పరము-అక్షయము అగు పరబ్రహ్మమునందు లీనమైనమై ఉంటున్నాయి.**

**శ్లో॥ యథా నద్యః స్యందమానాః సముద్రే**
**అస్తం గచ్ఛంతి నామరూపే విహాయ,**
**తథా విద్వాన్ నామరూపాత్ విముక్తః**
**"పరాత్ పరమ్ పురుషమ్" ఉపైతి దివ్యమ్॥**

నదులు ప్రవహిస్తూ వెళ్ళి సముద్రంలో కలుస్తున్నాయి. సముద్రజలంలో కలసిపోయిన తరువాత "నేను ఈపేరుగల నదిని"...అని నదులు నామరూపాలు కలిగి వుంటున్నాయా? లేదు.

అట్లాగే,...

ఆత్మవేత్తయగు ఆత్మానుభూతిపరుడు నామ – రూపముల నుండి విముక్తుడై (Having been relieved from Individual Name and Form) **"దివ్యము – పరాత్పరము"** అగు పరబ్రహ్మతత్త్వమునందు లీనమై, బ్రహ్మమే తానై విరాజిల్లుచున్నాడు.

**శ్లో॥ సయో హ వై తత్ పరమమ్ బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి॥**

బ్రహ్మమును ఎఱిగినవాడు బ్రహ్మమే తానై, శోకమును, సుఖ – దుఃఖ, పాప – పుణ్య ద్వంద్వములను అధిగమించివేస్తున్నాడు. హృదయగుహలోని గ్రంథులయొక్క సర్వచిక్కుముళ్ళు - (All perceptual Blackades) విప్పివేసుకున్నవాడై, సర్వపరిమితులను అంతరంగంలో అధిగమించివేసి, ఇక్కడే ఇప్పుడే **అమృతస్వరూపుడగుచున్నాడు. ఆపై ఇక, దేహముల రాక – పోకలకు – దేహ సంబంధములకు కథ వింటున్నవానివలె కేవల సాక్షి అయి విలసిల్లుచున్నాడు.**

ఇక ఆతని వంశంలో అబ్రహ్మవేత్త జన్మించటం లేదు. ఆతడు – **తరతి శోకం! తరతి పాప్మానం! (తరతి శోకమ్ ఆత్మవిత్)**

**"తదేత్ ఋచ అభియుక్తం"**

ఋక్ వేదములలోని (బ్రాహ్మణ విభాగములలోని) మంత్రములచే మనం చెప్పుకొన్న **"ఆత్మోపమ్యేవ సర్వత్ర"** – అను ఆత్మోపాసనయే సారాంశంగా ఎలుగెత్తి గానం చేయబడుతోంది. అదియే మనము ఈ సందర్భములో ఇప్పటివరకు చెప్పుకున్నాము.

ఓ ప్రియ శౌనకాది శ్రోతలారా!

ఆత్మతత్త్వమేమిటో, మీ సహజ స్వరూపము సర్వదా వాస్తవానికి ఆత్మయే ఎందుచేత అయి ఉన్నదో,....అటువంటి మూలసూత్ర విశేషాలు ఇప్పుడు మనం చెప్పుకున్నాం కదా। **దీనిని ధ్యానించండి. ఉపాసించండి. అనుభవైక వేద్యం చేసుకోండి. ఇది "ముండక యోగము" - అని చెప్పబడుతోంది.**

మిమ్ములను ఆశ్రయించి, ఆత్మతత్త్వజ్ఞానము అర్థించిన వారికి అర్హతను అనుసరించి తప్పక విశదపరచండి. ఉపదేశించండి!

అయితే...ఎవ్వరికి అర్హత ఉన్నట్లు?

- ఎవ్వరైతే క్రియావంతులై, స్వధర్మము - వేదరహితకర్మలచే తమను తాము సంసిద్ధం చేసుకుంటూ ఉంటారో....,
- శ్రోత్రియులై, వేదముల పట్ల - భగవత్ విషయములపట్ల శ్రద్ధ - భక్తి కలిగినవారై ఉంటారో...,
- బ్రహ్మము పట్ల **"తెలుసుకోవాలి! అనుభూతం చేసుకోవాలి!"**...అనే నిష్ఠ - పట్టుదలలు ప్రదర్శిస్తున్నవారై ఉంటారో...,
- అనేకత్వములో గురువు చూపించే **ఏక సత్యము** వినటానికి, భేదములను అధిగమించి చూడటానికి సంసిద్ధులై ఏకర్షియజ్ఞ నిష్ఠులై - యజ్ఞార్థాత్ కర్మ (పదిమంది కొరకై కర్మ - తన కోసం కర్మకాదు) నిర్వర్తించు ఉపాసకులై ఉంటారో...,
- సాధనములచే పవిత్రులై, సర్వాత్మకమగు స్వస్వరూపాత్మయొక్క అవగాహనపట్ల ఆసక్తి, పట్టుదల, శ్రద్ధ కలిగి ఉంటారో...,
- ఎవరిచేత యథావిధంగా శిరోవ్రతం - (సహస్రారం స్పృశించే యోగాభ్యాసం) నిర్వర్తించబడుచు, ప్రయత్నశీలత్వము అవధరించబడుతూ ఉంటుందో

**అట్టి వారికి ఈ బ్రహ్మవిద్య ఆదరణ పూర్వకంగాను వివరణ - సోదాహరణల పూర్వకంగాను మీచే బోధించబడు గాక! తప్పకుండా అట్టివారికి విశదీకరించండి! వదేత! అది బ్రహ్మోపాసనతో సమానము.**

**ఓ శౌనకా! వింటున్నావు కదా!**

**ఇప్పుడు నేను చెప్పిన 'జీవోబ్రహ్మేతి' అనునది వాస్తవము. పరమసత్యము - చెదరని నిజము.**

**ఇతి:** పూర్వీకుడగు ఋషి అంగిరస ఋషి - భరద్వాజ సగోత్రుడగు సత్యవాహుడు మొదలైనవారికి బోధించిన **బ్రహ్మవిద్యానిరూప ఋషి ప్రవచనము.** ఉత్తమ వ్రతములు - అభ్యాసములు - ఉపాసనలు నిర్వర్తిస్తున్నవారు, ఉత్తమ ఆశయములు కలవారంతా ఇది వినటానికి ఆశ్రయించటానికి దైనందికం చేసుకోవటానికి అర్హులే! (ఇంతకు మించి జాతి, దేశ, కుల, మత, స్త్రీ, పురుష, ఇత్యాది భేదమేదీ (అర్హతకొరకై) లేదు.

పరమపవిత్రులు, మహనీయులు అగు ఋషిపుంగవులారా!

*మీకు ప్రణామము! సాష్టాంగ దండ ప్రణామములు!*
*కృతజ్ఞతాపూర్వక నమస్సుమాంజలులు!*
*శరణు...శరణు!*

ఇత్యుపనిషత్

**ఇతి ముండకోపనిషత్**
**ఓం శాంతిః శాంతిః శాంతిః**